# దానిని మీకొరకే వినియోగింపుడు

ఉదారులైన అభిమానులకు

మీరు నిలువచేయగలిగిన స్త్రీధనము—
మీ తండ్రి—సోదరుడు—భర్త—పుత్రుడు—
వీరిలో నెవరివద్ద మీ రుంచినను సరే, దానిని
మీకొరకే వినియోగింపుడు.



ఆధనముతో నగలుకొని వానిని మీరు ధరింపుడు.

పురుషు లెల్లపుడును........ ఈసంగతి మీకు బాగుగా తెలిసియే యున్నది. కావున మీకు హక్కుగల స్త్రీధనము బాంకిలోను నమ్మకములేని వాటాలక్రిందను నిలుపబడి యుండగూడదు.

ఆధనము యెల్లపుడును మీకంటి యెదుటనే మీ వంటిమీదనే యుండ వీలగునట్లు, దానితో మీ కొరకు సొగసైన నగలను కొనుడు.

మేము తయారుచేయించిన నగల విలువ యెన్నటికిని తగ్గిపోదు. నగలను అందముగా చేయించుటయే ప్రత్యేకాభిమతము. ఈవిషయమున మేమే అగ్రగణ్యులమనిగూడ సవినయముగ తెలుపుచున్నాము.

మీరు మొదట మావద్ద కొను నట్టి అలంకారము మీకు మిక్కిలి సంతృప్తికరముగా నుండుటకే మేము ప్రయత్నించెదము. అటు పిమ్మట మీ రెల్లప్పుడును మావద్దనే కొనుచుందురు. మీ మిత్రులకు గూడ సిఫార్సు చేయుచుందురు.

## ఉమ్మిడి రామయ్యశెట్టి గురుస్వామిశెట్టి కంపెని,

బంగారు వెండి నగలను తయారుచేయువారు,

25, చైనాబజారు రోడ్డు   చెన్నపురి.   62, గోవిందప్పనాయకవీధి




## మధురమైన విటమిన్ ఆహారము

మాల్టుసారమును, కాంతివంతమైన పాలక్రొవ్వును ఏ. బి. సి. డి. [illegible] విరివిగాగల యితరపదార్థములును, యింగు మిళితమై యున్నవి.

## అమూల్యమైనది

ఎదిగేపిల్లలకు ఆరోగ్యమునిచ్చుటలోను, దంతములను, యెముకలను, చక్కగా నిర్మించుటయందును, అసమానమైనది.

## రేమాల్టు

కృంగి కృశించెడివారికిని, పాండురోగమునకును, సామాన్యదుర్బలత్వమునకును, గర్భిణీసమయమందును, ప్రసవానంతరమును సరియైన పోషణ నొసంగుటకును ఉపయోగించును.

# Bengal Chemical & Pharmaceutical Works, Ltd.,
## CALCUTTA.

మద్రాసు స్టాకిస్టులు:—యన్. వేలాయిగౌండర్ అండు కో., బం: [illegible],

చిల్లర ప్రదర్శనశాల:—హై బజార్ రోడ్డు, రాజా గాంధిప్రతిమకు యెదురుగా.



# భారతి

## సచిత్ర మాసపత్రిక

సంపాదకుడు

కా. నాగేశ్వరరావు

సంపుటము ౯. భాగము ౧.

ఆంధ్రపత్రికా ముద్రాలయము-మద్రాసు.

౧౯౩౨

## చిత్రములు

త్రివర్ణ చిత్రములు:—గజాసురదమనుడు; హారిస్‌వంతెన, చెన్నపురి; మేఘమల్లారరాగము.

సాధారణ చిత్రములు:—విలాసినీ విభ్రమచిత్రములు ౫; చీరముస్తాబు చిత్రములు ౨; ఎమిల్ జాన్నింగ్ అభినయచిత్రములు ౪; కత్తిచిందు; 'రెడీ'; అనంతవిహారము; స్వీకారము; కిరీటి; సెంటు లూయీ ఆపణ భవనము; కోసీద్వీపమున ఒకరాత్రి దృశ్యము; రవీంద్రకవి సార్వభౌముడు; శ్రీ ఏ. రంగస్వామయ్యంగారు; దురదృష్టవంతులు; హరిభజనము-తన్మయత; ఇతర చిత్రములును.



# అభినందనము

లాల సుబ్బారావుగారు, బి. ఏ.

సహ్యజాప్రాంత వాస్తవ్య లీలావతీ
నయనవిస్తార సంధాయకములు
కర్ణాట కామినీ కర్ణావతంసశ్రీ
సాలి కాందోలనాపాదకములు
శ్యామ బర్మాదేశ రామా జనశ్యామ
లాలకాక్షేప సంచాలకములు
వంగ కళింగ సారంగేక్షణాగళో
జ్వాలాహార నాట్యసంవర్ధకములు
ఆంధ్రసీమంతినీ హృదయాంతరాళ
హాస భావ విలాస సంజీవకంబు
ఔర! సర్వాంగసుందరియా నవాబ్ద
భారతీ దివ్య దర్శన భాషణములు.



గజాసురదమనుడు

చిత్రకారుడు: శ్రీ సి. యస్. వెంకటరావుగారు, కుంభకోణం.



చెన్నపట్టణము, జనవరి ౧౯౩౨

సంపుటము ౯ ప్రజోత్పత్తి సంవత్సరము పుష్యమాసము సంఖ్య ౧

# స్వవిషయము

శ్లో. ఉద్ధరే దాత్మనాత్మానం నాత్మాన మవసాదయేత్,
ఆత్మైవ హ్యాత్మనో బంధు రాత్మైవ రిపు రాత్మనః.

మా భారతికి ఎనిమిదేండ్లునిండినవి. తొమ్మి నందు పంచాంగశ్రవణమును జేయునటులు డవ ఏ డారంభమైనపుడు స్వవిషయో నవీన సంపుటారంభమునందును నభీష్టసిద్ధికి ప్రక్రమణముతో నాత్మసంస్మరణమును జేయుట ఫలశ్రుతిని సంస్మరించుట పాఠకులకు నిర్వా యాచారము. నూతనసంవత్సరారంభము హకులకును సహజధర్మము. కార్యఫలము

స్వల్పమైనను కార్యారంభము మహాసంకల్పముతో నుపక్రమించుట మానవధర్మము.

అనంతమైన కాలచక్రమునందు పరార్థములు, కల్పములు, మన్వంతరములు, యుగములు, శకములు, సంవత్సరములు కాలగర్భమునందు లయమును బొందుచు ప్రపంచసంస్కారరూపమునను పరిణమించుచున్నవి. ప్రపంచసంస్కారపరమైన కాలసంకీర్తనముగతాగతముల కనుసంధానమునకు సాధనమై ఆత్మోద్ధరణమునకు మూలాధారముగ నున్నది. ఆత్మోద్ధరణమునకు సాధనభూతమైన ఆత్మసంస్మరణమున నిత్యములైన దేశకాలవాతావరణములందు ఖండరూపములను గోచరంబగుచు నిత్యములైన శాంతశివసుందరస్వరూపముల నాత్మసాక్షాత్కారమునకు సాధనభూతముగ నున్నది. అనంతమైన భారతీయసంస్కారమును నీపరమార్థసిద్ధికై వినియోగపడుచున్నది.

అనంతమైన భారతీయ సంస్కారమును వేదములు, వేదాంతములు, వేదాంగములు, మీమాంసలు, పురాణములు, ధర్మశాస్త్రములు, సాహిత్యములు, వృత్తులు, కళలు, శాస్త్రములు, విశ్వావ్యాప్తములైన ఖండరూపములను ప్రపంచమునకు సువ్యక్తముచేయుచు నాత్మసాక్షాత్కారమునకు వినియోగపడుచున్నవి. సనాతనమైన భారతీయసంస్కారమును భారతీయులయాత్మోపలబ్ధికి ప్రత్యక్షముచేయుటకు భారతి యథాశక్తిని పాటుపడినవిధమును గతసంపుటములు విశదము చేయుచున్నవి. గతకాలమునందువలెను భావికాలమునందును విశ్వకల్యాణమహోత్సవమునకు మంగళహారతులను సమర్పించుటకు భారతీయసంస్కారము భగవదనుగ్రహమును బడయుగాక!

ఆంధ్రసాహిత్యము, కళలు, మతాది సంస్కారములు భారతీయసంస్కారాభ్యుదయమునకు వినియోగపడుచున్నవిధమును ఎనిమిదవ సంపుటమునందలి వ్యాసములు, పద్యములు, పాటలు, కథలు, విమర్శనలు మొదలగు విషయములు విశదము చేయుచున్నవి. సాహిత్యమువలెను శిల్పమును భారతీయసంస్కారాభ్యుదయమునకు వినియోగపడుచున్న విధమును సంపుటమునందలి శిల్పచిత్రకళారచనలు విశదముచేయుచున్నవి. వర్తమానవిషాదయోగావస్థయందు సకలమును తేజోవిరహితమై కార్యసిద్ధికి నిరర్థకముగనున్నది. ఆంధ్రదేశస్వతంత్రములైన రాజకీయసంస్థలు, సాంఘికసభలు, సాహిత్యపరిషత్తులు, కళాప్రదర్శనములు, సత్యాగ్రహాశ్రమములు, పరిశ్రమలు, విద్యాలయములు పరాధీనావస్థయందును యథాశక్తిని స్వధర్మనిర్వహణమును జేయుచున్నను పూర్ణమైన భారతీయసంస్కారాభ్యుదయము దుస్తరమగుచున్నది. మానవధర్మాభ్యుదయము పూర్ణయోగమునందువలెను ప్రత్యేకావరణయోగములందు సాధ్యముగాదు. గాంధిమహాత్ముడుపక్రమించిన సత్యాగ్రహయోగ మీపరమార్థసిద్ధికి వినియోగపడగలదు.

వర్తమానరాజకీయయుగమునందు సకల సంస్థలును రాజకీయపరిస్థితులమీఁద నాధారపడియున్నవి. ప్రపంచమునందంతటను విద్యావిధానములు, సాంఘికపరిస్థితులు, వ్యాపారపరిశ్రమలు, ఆర్థికసంస్థలు రాజ్యాంగపరిస్థితులమీఁద నాధారపడియున్నవి. పరాధీనస్థితియందున్న భరతవర్షమునందు భారతీయసంస్కారమితరరంగములందువలెను సాహిత్యకళారంగములందును మానవ ధర్మాభ్యుదయమునకు నిరుపయోగముగ నున్నది. ఆత్మోద్ధరణమునకు సాధనభూతములైన సాహిత్యకళారచనలు వ్యక్తిత్వమును గలిగి భారతీయాభ్యుదయమునకు మానవకళ్యాణమునకును వినియోగపడుటకు స్వతంత్రకల్పనలు, నిర్మాణములు పరమావసరములు. ఆంధ్రలోకము వర్తమాన విషాదయోగావస్థయందును నీ పరమార్థసిద్ధికి చేయుచున్న ప్రయత్నములు శ్లాఘ్యములు. ఆంధ్రాభ్యుదయమునకు సాహిత్యోపాసకులు, కళాకోవిదులు, గాయకులు, శిల్పులు, భారతీముఖమునను చేయుచున్న ప్రయత్నములు భారతీయసంస్కారాభ్యుదయమునకును, లోకకల్యాణమునకు వినియోగపడుటకు శ్రీ పరమేశ్వరు డనుగ్రహించుగాత!

గతసంవత్సరమునందు భారతికి వ్యాసములను, చిత్రములను దయచేసియు, ఇతర విధముల సహాయప్రోత్సాహముల నొసగియు భారతీనిర్వహణమునకు తోడ్పడిన ఆంధ్రదేశ భాషాసేవకులకు మిగుల కృతజ్ఞతతో నంజలుల నర్పించుచున్నాము.

—సంపాదకుఁడు.

---

# విశ్వామిత్రుఁడు—మేనక

విశ్వనాథ సత్యనారాయణగారు, యం. ఏ.

## ౧. సంయోగము

(ఇంద్రైశ్వర్యరక్షణమునందే బుద్ధికల మేనకచేసిన ప్రేమాభినయములోఁ బన విత్రము పులకితమైన నుకొని)

ఏనాపోయిన యెల్లత్రోవల నిదేమీ! మల్లియల్ సంపెగల్
నానాసూనములై సువాసన లనంత శ్రీగుబాళించెడిన్
లోనేదో నినుఁగూర్చి యూహ కలిగెన్ లోలాలకశ్రీనిధీ
నానూనానసరోచి నాయెడఁదలోనన్ రేకగాఁ దారెఁ గో.

నిను నూహించిన నాయెడల్ వలపులై నిద్దంపు మోహాంగు వా
హినులై చెన్నెసలారు క్రొందళుకులై హేలాచలచ్చాలిన
స్వనసంభారములై లలల్లహరికావల్గత్కళావీథులై
తనికెన్ నాయెద యెంతయున్ కలఁగె నంతర్జృంభితావర్తమై.

శాణవిలేఖితాసితలసచ్ఛవిమన్మఘవాశ్మఖండదే
హానతవల్లి! నీ కొకరహస్యము చెప్పెదనే చెలీ! చెలీ!
మేనకయన్నయచ్చరసుమీ అది యున్న దొకట్టె దాని ప్రా
ణానిల వీచిలోఁ బులక లందిన వస్మదసుప్రతానముల్.

నీయెదయెల్ల నాయెడఁద నిండుకొనంగను, నీశరీరమం
తా యొడలెల్ల నిండుకొన నాకును, నీమతిలో మతిప్రసృ
ణ్ణాయితవైఖరుల్ పులకలై వలపుల్ తలఁపుల్ పెనంగొనం
గా యువరేఖ నీయెడలఁ గానుకపట్టఁగఁ గ్రొత్తక్రొత్తగా:

నాయెదయెల్లఁ బిండికొనినట్టివి నీసొగసారుమేని లేఁ
జాయల నీలిమల్ తలఁపుసంపదలోనఁ బునఃపునః ప్రశ
స్తాయతి తెచ్చెడిన్, మరగినట్టిది నీయెద నీడలారి ఆ
నీ యసితంపుమైతళుకు నించెను వెన్నెల చొచ్చు చీఁకటుల్.

జలజలరాలు చీఁకటులు చాఁదిన యీవినమ్రదహోనిశన్
పిలపిల యూఁదిపోసి వినిపించిన నా సొదచాటువుల్, నవో
త్పలమధుకుల్య నీహృదయభావనలో హసదానమత్కపో
లలలిత నిమ్నతన్ బుడగలైసుడులై పరిణామమందెడిన్.

ప్రాణములందు నీవు బిగఁబట్టి యొసంగిన కౌఁగిలింతలో
రాణివయైతి నా హృదయరాజ్యముపై, మఱి రాణివైతి వం
తే నిలు మాటమీఁద, గొడుగెత్తెద ముత్యములైనభావ సం
తానము కూర్చి ప్రేమరతనాలకిరీటము పాళిఁబెట్టెదన్.

## ౨. వియోగము

(పరిచ్యుత తపోమహిముఁడు పిచ్చి బికారి నిశ్చలమునోదరిద్రాకృతి విశ్వామిత్రుని తూలనాడి తిరస్కరించి పోయిన మేనకాస్థితి ప్రణయవికార మనుకొని)

పచ్చిది కూడఁబెట్టినది పంటది నీవయసెల్లఁ జేతి కం
దిచ్చితి నాదెయన్నటుల నేనును నాదె యటంచు నమ్మితిన్
మ చ్చిడినట్లు నామనసు మాలిమిపొందెను నీకుమాత్రమే
యచ్చును పోసికోని యెదయందున నొత్తిడి లేదుకా చెలీ!

రాచినగుండెలో నెఱుఁగరానివి నీయెదభావముల్ విచి
త్రోచితి వెల్లడించినవహో! ఒక దాష్ట్యములేని గంటలో
ఆఁచినయంద మానడుమునందున నాచను కట్టునందు సిం
హాచలమూర్తి యిప్పటికి నన్మదుదారమనంబు రాచెదన్.

తవిలి యెఱుంగకా నిశలు తాల్చినచేతులయందునుండి జా
ఱవిడుచుకొంటి, గుండియలు రాచిన లోఁతులదాఁక, కోడికూఁ
త వినుచు లేఁతగాలిచలిదారులు తీసినదాఁక, వానిఁ జా
ఱవిడువకుండ నానిశలు రావు దయాపరిపూర్ణమూర్తులై.

తొడతొడ లందుకో నరఁటితోఁటలు పెంచెదనంచు, సెజ్జలో
మెడమెడలానిశంఖములు మెల్చెదనంచును, నూహలూహలో
వడివడిపోయి యందములు వాల్చెదనంచును వైరియాసలం
బడి చనినంత లేద, యెడఁబాటు విచిత్రముగా ఘటిల్లెఁబో.

ఎఱుఁగవుగాక ఓసి సుదతీ! సుమహాఋషిలోకమండల
స్ఫురితవిచిత్రదీధితి విభూతిమదూర్జిత దివ్యతారకా
పరిణతమూర్తినై నననుఁ బట్టిన భాగ్యపురేఖ యెట్టిదో
ఉరగము కాటు నప్రణయయోగ్య తిరస్కృతిఁ జూపితౌఁగదే.

## 3. విరక్తి

(మేనకా యథార్థస్వరూప గోచర మైనతరువాత)

మిగిలి యెన్నాళ్లో పెద్ద నిర్మించుకొన్న-నా తపోభవనమ్ము భగ్నమయిపోయె
చివర కొక గుండెలోఁతు రాచినది లేని-యాకులటమీఁద నెద సమాహితముపొంగ.

వాసించెన్ మధురోహవల్లికలపై వ్యాపించి యావారక
న్యాసౌభాగ్యము నా హృదంతరమునం దా నాదియే తప్ప మి
థ్యా సౌందర్యములో మృషాప్రియవచో ధ్యానంబులో బేలునా-
గా, సీసీ యనిపించుకోఁ దపసు దీర్ఘంబయ్యె హ్రస్వంబుగా.

ఒకవిషయంబు తా నెఱిఁగియుండుటలో ననుభూతిచే దురం
తకము తదర్థమెల్ల నెడఁదన్ నలువంకల సర్వతోముఖ
ప్రకటితవైఖరిన్ విరియఁబట్టుటలోఁగల భేద, మెంత కెం
తకునయియొక్క దాని కొకదానికిఁ జూడ లగింపె లేదు పో!

అదిమి తపస్సుచేసెదను నౌమఱి బ్రహ్మపదంబుకూడ పొం
దెద నది యేమి లెక్క! వితతీకృత దివ్యమహాతపః ప్రభా
స్పద పరివంచితాఖిలవిసాదద విఘ్నమహానిధాన మా
ముదుకఁడె అవ్విశిష్టుఁడె విభుండు సమస్త మనః పథంబులన్.

# విమర్శలేశము

మున్నంగి శర్మ గారు

## భారతము : పునరుక్తులు

తెనుఁగు భారతమునఁ బెక్కుకడల భావ సామ్యములు దోఁచుచున్నవి. మహార్ణవముం బోని యుగ్రంథముల నట్టిసామ్యములు పరిపాటి. భారతమున సమాసములు ననేకములు చర్వితచర్వణములు. పద్యములు నట్లే. కాని యవి సందర్భశుద్ధికిఁ గొఱఁత ఘటింపవు. అట్టి పట్టులను : పద్యములను, కథలను గొన్నింటినిఁ జూపుదును. పెద్దలాలోచింప నధికారులు. ఈ నాయీవిస్మృతియందుఁ దప్పులున్న దిద్దఁగోరుచున్నాను. ఈవిషయము వినోదార్థము గాని తిక్కనాదులవంటి ధీస్వామూలను దప్పఁ బట్టుటకుఁగాఁ దలంపఁగాదు.

వక్త : అర్జునుఁడు ; శ్రోత : ఉత్తరుఁడు.

౧. "కాంచనమయవేదికాకనత్కేతనో
జ్జ్వల విభ్రమమువాఁడు కలశజుండు ;
కనకగోవృషసాంద్ర కాంతి పరిస్ఫుట
ధ్వజసముల్లాసంబు వాఁడు కృపుఁడు ;
సింహలాంగూల భూషితనభోభాగకే
తుప్రేంఖణమువాఁడు ద్రోణసుతుఁడు;
....................................".

—విరాట : ఆ. ౫ - ప. ౪.

వక్త: సంజయుఁడు ; శ్రోత : ధృతరాష్ట్రుఁడు.

౨. "కాంచనమయవేదికాకనత్కేతనో
జ్జ్వలవిభ్రమం బొప్పఁ గలశజుండు ;
కనకగోవృషసాంద్ర కాంతికాంతధ్వజ
విభవవిలాసంబు వెలయఁ గృపుఁడు ;
మణిసింహలాంగూల మహితకేతుప్రభా
స్ఫురణంబు మెఱయంగ గురుసుతుండు;
....................................".

—భీష్మ : ఆ. ౧ - ప. ౮౭.

పై రెంటను ౧-౨ పాదములలోఁ బదములు గొన్ని మాఱినవి. 3వ పాదమునఁ బదముల మార్పు కాని భావమున నెంతయు సామ్యము గలదు. ఈశబ్దముల మార్పువలని ప్రయోజనము స్ఫురింపదు. యథాపూర్వముగ నుండిన నేమి? ఉత్తరగోగ్రహణమున — నర్జునుని పాడిన పద్యపాదములు యథాతథములుగ సంజయున కెట్లు చెప్పఁగలిగెనో! అట సంజయుఁడు లేఁడే!

౧. వక్త: వ్యాసుఁడు; శ్రోత: ధర్మజుఁడు.

షోడశరాజ చరిత్రము :

౨. "సంవర్తుఁ డను మహా..."అని ౧౯౬వ. పద్యము మొదలుగ ౨౧౨-వ పద్యమువఱకు ౧౫ పద్యములు ద్రోణ: ఆ. ౨. ఈ పద్యములే

శాంతి: ఆ.౧-లో ౨౭౯వ పద్యము మొదలుగ ౨౮౮వ పద్యమువఱకు ౧౦ పద్యములు. ఇట కృష్ణుఁడు: వక్త; శ్రోత ధర్మజుఁడే. కాని సమక్షమున నున్న వ్యాసునిఁ జూపి: "వీరి వచనంబుల యేనునుం జెప్పెద నాకర్ణింపుము" అని కృష్ణునిచేఁ బీఠిక జెప్పించి చమత్కరించినాఁడు తిక్కనమంత్రి. ఈ చరిత్రము శాంతిపర్వమున నుంటచాలదా? వ్యాసుని చెప్పిన పదునైదు పద్యములను బార మప్పగించినాఁడు కృష్ణుఁడు!

౧. వక్త : కృష్ణుఁడు; శ్రోత : అర్జునుఁడు.

"ఫలములయెడ బ్రహ్మార్పణ
కలనపరుండగుచుఁ గార్యకర్మము సడసక
వలయుం; దత్త్వజ్ఞానము
తలకొనినం గర్మశమము తానై కలుగున్".

—భీష్మ: ఆ. ౧ - ప. ౨౧౨.

౨. వక్త : భీముఁడు ; శ్రోత : ధర్మజుఁడు.

"ఫలములయెడ బ్రహ్మార్పణ
............................"

యథాక్రమముగ—శాంతి: ఆ. ౧-ప. ౬౯.

పై రెండు చోట్లను పద్యమొకఁడే. అర్జునున కాహవరంగమునఁ గృష్ణుఁ డుపదేశించిన పట్టున భీముఁ డెందుండెను? ఏగతి వినెను? భావము నభిన్నముగ నూఁదవచ్చుఁగాక పద్యమే అప్పగించెనే!- ఇదెట్లు?- ఇది యొక్కచో నుంటచాలదా?

౧. వక్త : పారాశర్యుఁడు; శ్రోత : యుధిష్ఠిరుఁడు.

"పొదలుఁ దఱుఁగుటకై, పొడవొంద ప్రుంగుటకై, కడుం జేరుఁ బాయుటకై, జనించుఁ బొలియుటకున్నై, సుఖంబులఁ బొంద దుఃఖమందుటకున్నై- పదార్థము లెందు నధిప."

—శాంతి: ఆ. ౧-ప. ౧౦౫.

౨. వక్త: కృష్ణుఁడు; శ్రోత: అర్జునుఁడు.

"పొదలుఁ.....................
కై, కడను............ ... ...
.......... ........ ...సుఖంబును...
....................దుఃఖములును".

— అశ్వమేధ : ఆ. ౨ - ప. ౧౬౨.

ఇంచుక శబ్దవ్యత్యయము. ఇదియు నన్ని గింత. దీని నొక్కెడఁ దగ్గింప నీమగును!— ఇట్టి వెన్నేని తోఁచువడును.

అది యట్లుండె-

కథలు: పునరుక్తులు.

* ఈకథఁ జిత్తగింపుఁడు-

మనువంశ సంభవునకు దుర్యోధనాభిధానునకు సుదర్శన పేరి బిడ్డ కన్య కలదు. అగ్ని దేవుఁ డామెను వలచి పెండ్లాడెను. ఈయిరువురకుఁ గొడుకు పుట్టెను. వాఁడు సుదర్శనుఁడు నాఁ బరగె. వీనికి ఓఘవంతుఁడు సుతుఁడు. ఈతనికి ఓఘరథుఁడు కొడుకు, ఓఘవతి

* ఇది పునరుక్తి విషయము కాదు. ధర్మశాస్త్రవిషయము. పునరుక్తి విషయము మాత్రమే వ్యాసమున నుద్దిష్టము. భా. సం.

కూఁతును జనించిరి. అనురూపవరుఁడు దుర్లభమగుట తన నాయనకు సుదర్శనునకు ఓఘవంతుఁడు నిజపుత్రికను (ఓఘవతిని) ఆలినిగఁ జేసె. ఆ దంపతులు అతిథిపూజా పరత్వమున గార్హస్థ్యము నడపుచుండిరి.............

—ఇది యానుశాసనికమందలి కథ. చూ. [ఆ. ౧ ప. - ౪౩-౬౪.

పౌత్రినిఁ బెండ్లాడు నాచారము పూర్వముండెడి దని ఈకథ తెలుపుచున్నది. వైద్య పండితుఁడు తన "ఎపిక్ ఇండియా" (Epic India) - (ఆంగ్ల) గ్రంథమున, ఆర్యసంఘమున ఆదినుండి వివాహసంస్కారము చెందిన పరిణతిం బరామర్శించినాఁడు. త్రేతా-ద్వాపరములందలి వివాహకాండకును, నేటి వివాహతంత్రమునకును గల వ్యత్యాసముం దెలిపినాఁడు. ఏకపత్నీకత్వము, ఏకభర్తృకత్వమును, బహుపత్నీకత్వమును, బహుభర్తృకత్వమును ఆయాయి యుగములయందుఁ బరిపాటిమైయుంటకు భారత - రామాయణాదులనుండి యాకరముల నుదాహరించినాఁడు; కాని పై తాత-మనుమరాండ్ర దాంపత్యము నుదాహరింపఁడు. ఈ దాంపత్యము ధర్మశాస్త్ర చోదితమా? ఇట్టి సాంగత్యములు పురాణ గాథలలో మఱెందేనిఁ జూపట్టునా? ఈ వావి ఏయుగమునఁ బ్రారబ్ధమైనది? ఇది యాచారమునకు దూరమైన కాలము నిశ్చయింప నవకాశము గలుగదా? పురాణేతిహాస పరిశోధకుల కారయఁదగినది.

రెండవది: సువర్ణష్ఠీవి కథ —ద్రోణ: ఆ. ౨-ప. ౧౮౮-౧౯౫.

వక్త: వేదవ్యాసుఁడు; శ్రోత: ధర్మనందనుఁడు. చూ. శాంతి: ఆ. ౧-ప. ౨౩౨ మొదలుగ—

ఇచట వక్త: నారదుఁడు; శ్రోత ధర్మనందనుఁడే. కృష్ణు నాదేశమున నారదుఁడు చెప్పినట్లును, "సృంజయ సూనుండయిన సువర్ణష్ఠీవి జన్మంబును, వాని మృతుండయిన విధంబును వినినది యయినను సువ్యక్తంబుగా వినవలతుం జెప్పవే"యని ధర్మరాజు పునః ప్రార్థనమొనర్చినట్లును కృతిఁగూర్చినాఁడు చతురుఁడు తిక్కనమంత్రి. ఈ పునరుక్తినిఁ దొలఁగించుటచే సంవిధానము కుంచవడునా? ఇట్లే పరశురామ జన్మవృత్తాంతాదికము శాంత్యానుశాసనికములం గలదు. కథల నొక్కట సమగ్రముగఁ జేయుచోఁ బునరుక్తిదోషము తలఁగును గదా? అట్లగుట గ్రంథము నాతిదీర్ఘమగును; ప్రయోజనము నొప్పగును. నిశ్చయము ప్రాజ్ఞుల యధీనము.

— — —

# కవికుమారుడ!

జరమంచి కామేశ్వరరావు గారు

౧

కవికుమారుడ! కలవిహంగమ!
క్రమగానము కలసిమెరసిన
వసురసంధ్యల నార్తిరాగము
నాలపింపకురా!

౨

తేటిపాడే తేనెపాటల
పాటపాడుచు పరువులెత్తుము,
చీకురేకుల చిమ్మివేయుము,
శోకగీతుల సుప్తవీథుల
ముంచెత్తబోకుము రా!

౩

బ్రతుకులోనను పదము లుంచుము
పదములోపల బ్రతుకు నుంచుము
బ్రతుకు పదముల సొదలు రేగిన
వేగిపోదువు రా!

౪

సప్తజలధులు పొంగిపొరలుచు
ప్రళయతాండవ మాడుచుండగ
శోకజలధిని లోక మంటగ
నేల జూతువు రా!

౫

వెతల బాగిలే వైరిహృదయము
కలగబారే కలికిహృదయము
వెకిలిలోకపు వెలితిదారుల
ఏడ్తు వెందులకో!

౬

కవికుమారుడ! కలికిపాటల
నాలకించుచు, సమ్మోద లీలల
ప్రణయ కలశం బందికొనుచుం
తాండవింపుము రా!

౭

పదము లొత్తుచు నటన సేయుము
బ్రతుకు తెరువుల పాటపాడుము
మృదుమనోహర మిహిరగీతుల
తరలి పోవుము రా!

౮

కలికికోయిల, కన్నె భ్రమరము
చికిలిగొంతుల పలుకరింపుచు
తావకీన సుధాజీవికను
పదను పెట్టుము రా!

౯

హృదిని ముట్టడి పాట పాడుము
తేటిపాటల తీయదనముల
తీరుతీయము తీపులెత్తగ
తీగలొత్తుము రా!

౧౦

ప్రియవియోగము ప్రియకరంబగు
కాల మున్నది కడచి వేగును
కవికుమారుడ! కడలిమిన్నులు
కలయు తలమందున్.

---

# తెలుఁగు ముద్రాక్షర విలేఖనము

సూరి రామసుబ్బరాయశాస్త్రి గారు

## (Telugu Type writing)

గత సంచికలో శ్రీయుత యం. యస్. వెంకయ్యగారు తెలుఁగు ముద్రాక్షరవిలేఖన ప్రకరణమును సూచించి, యిదివరలో (Type writing) అన నేమియో తెలియనివారికిని విశదమగునటుల యంత్రమును గూర్చియుఁ బరివర్తనకుంచికా (Shift Key) సహాయమున దాని నుపయోగించువిధమును గూర్చియు విపులముగాఁ దెల్పిరి. శ్రీయుత వెంకయ్యగారీవిషయమునఁ జేసిన వ్యాసంగము మిగులఁ బ్రశంసనీయమైనది. వారు సూచించిన ముద్రాక్షరవిధానమునందు నాకుఁ దోచిన కొన్ని సవరణల వివరించుచున్నాను.

### కుంచికా ఫలకము (Key Board)

నాల్గవ చిత్రమునఁ బరివర్తనకుంచికా (Shift Key) రహితముగ Double Key Board విధానము చూపఁబడినది. ఇందెనిమిది వరుసలును ౧౨౮ కుంచికలును నుండి Yost No. 4 యంత్రముపద్ధతి ననుసరించి యున్నది. ప్రస్తుతము వాడుకనుండి (Double Key Board గల యంత్రము లంతరించుటయే యీ విధానమున నభ్యాసకునకుఁ గలుఁగు కష్టమునకు నిదర్శనము. ఎనిమిది వరుసలుగల కుంచికాఫలకమునకంటె నాల్గువరుసలుగల కుంచికాఫలక మతిసులభమని వేరుగ రుజువుచేయఁ బనిలేదు. కావున దీనిని సంపూర్ణిగా వర్జింపవలసియేయున్నది. ఎట్లయినను దీనిని వాడుకలో ముందుగాఁ బెట్టగలిగినను కొలదికాలమున నిదియును Double Key Board గల యంత్రముల గతినిఁ బొందుననుటకు సందియము లేదు.

ఆరవ చిత్రమునందలి ౪ వరుసలలోని ౬౨ కుంచికలతోడను, ఏడవచిత్రమునందలి ౫౬ కుంచికలతోడను నేకపరివర్తన కుంచికా (Shift Key) సహితముగఁ జతురంగుళీవిన్యాసము (Four Finger Method) వీలగునని వ్రాసిరి. కాని యట్లు తోచుటలేదు. బొటనవ్రేలునకును, చిటికెనవ్రేలునకునుమాత్రము రెండేసి కుంచికలేర్పడవచ్చునుగాని మధ్యవ్రేళ్లకు రెంటికిని నదియసాధ్యమగును. ఎడమచేతి వ్రేళ్లకారును, కుడిచేతివ్రేళ్లకారును మొత్తము ౧౨ కుంచికలకంటె నరుస నెక్కువగా నుండుచో నభ్యాసము వీలుపడదు. కావున ద్విపరివర్తన కుంచికాయుతముగ నెనిమిదవ చిత్రమునఁ జూపిన ఫలకమే యుపయోగింప వీలగునని తోచుచున్నది. అందు ౪౨ అక్షర కుంచికలును, ౪ పరివర్తన కుంచికలును ౧ పూర్వపర్శినీ కుంచికయును, మొత్తము ౪౭ కుంచికలమర్పఁబడినవి. అవసరమగునెడల మొదటి వరుసలోఁ గుడిభాగమునను, రెండవ వరుసలో నెడమభాగమునను నొక్కొక్కకుంచిక నధికముగాఁ జేర్పవచ్చును. ఇప్పుడిది Remington No. 10. యంత్రవిధమున నుండుటచేఁ జతురంగుళీ విన్యాసమున (Four Finger Method నుపయోగింపవచ్చును. కాని త్రిరంగుళీవిన్యాస (Three Finger Method) మవసరములేదు. త్రిరంగుళీవిన్యాసముకంటె Blind System నందుఁ జతురంగుళీవిన్యాసమువలన నధికవేగము కలుఁగఁగలదు. బాలకుఁడు (Operator) కుంచికాఫలకమును (Key Board) జూడఁబనిలేకయే Type రచించు నెడల నధికవేగము కుదురఁగలదు. కావున నందుల కుపయుక్తమగునటుల ౪౮ కుంచికలకంటె నెక్కువగాగల ఫలకము నిరుపయోగమగును. ఈకుంచికలలోని యక్షరముల నెనిమిదవ చిత్రములోని 3, ౪ వరుసలలోఁ జూపినటుల నొకకుంచికలోని వ్యంజనవర్ణములయొక్క యొత్తులను దాని ప్రక్కనున్న కుంచికలో నమర్చుటకంటె వ్యంజనాక్షరమును దాని యొత్తునుగూడ నొకే కుంచికయందుంచిన యెడల నింగ్లీషు యంత్రమునందు పెద్దక్షరములును, చిన్నక్షరములును నొకేకుంచికయందున్న విధమున

నుండును. ఇట్లుండుటవలన నభ్యాసకుఁ డక్షరములకై వెతకుకొను శ్రమతగ్గును. ౬, ౭, పటములలో నీవిధమే గానుపించుచున్నది. ఈకుంచికాఫలకమున నెన్ని కుంచికలుండవలసినదియు నిశ్చయించినపిమ్మట వానియందక్షర క్రమమును నిర్ణయింపవలసియున్నది. అందుఁ దరుచుగా వచ్చు నక్షరముల మధ్యవరుసయందును మొదటిరెండు వ్రేళ్ల క్రిందను నుండునటులను దరితరాక్షరములు వెనుకను, చివరను నుండునటులను నేర్పరచి దీనిని Universal Standard Key Board గా నిర్మింపవలసియున్నది.

## విలేఖనము (Typing)

ఇంగ్లీషులిపియందు ఉరువది యారక్షరములే యుండుటచేతను, నందక్షరముల నొకదానిక్రిందఁగాని పైనఁగాని మరియొకదానిని వ్రాయఁ బనిలేకుండుటచేతను Type writing చాల సులభమైయున్నది. ఈ Type writing యొక్క ప్రయోజనము కేవలము సుందరమగు నక్షరరచనను బొందఁగల్గుటయేగాక చేతివ్రాతకంటె నతివేగముగా బనిజరుగుటయే ముఖ్యమైయుండవలయును. ఇంగ్లీషునందు నిమిషమున కిరువదిమాటలఁ జేతితో వ్రాయగల్గుదుము. రెండుసంవత్సరముల యభ్యాసముతో నిమిషమునకు ౪౦ నుండి ౬౦ మాటలవరకు నీయంత్రముతో వ్రాయఁగలుగుచున్నాము. అట్లే తెలుఁగు ముద్రాక్షర విలేఖనమునందును సాధ్యమగునంతవరకు చేతివ్రాతకు సమానమగు వేగమైనను గలుగుటకు యత్నింపవలసియున్నది. లిపియొక్క సులక్షణములఁ గూర్చియు కాలముకూడి రాఁగల యుపాయములఁ గూర్చియు ౧౪-౫-౧౯౩౪ తేదీ శుక్రవారమున నాంధ్రపత్రికలోఁ బ్రచురింపఁబడిన "ఆంధ్రలిపి సంస్కారము"అను వ్యాసమున విపరించి యుంటిని. శ్రీయుత వెంకయ్యగారి విధానమున నిట్టి సౌలభ్యమేమియు గాన్పించుటలేదు. ఉదాహరణము——'యు'అను నక్షరము కావలసివచ్చినపుడు ముందుగా సున్నయును పిమ్మట కొమ్ము తలకట్టును, పిమ్మట రెండుసార్లు కొమ్మును మొత్తము నాలుగు కుంచికల నుపయోగింపవలసి వచ్చుచున్నది. ఇంతియగాక గుడి ి ఎత్వము ె మొదలగు సంకేతముల వ్రాయుటకుఁ బూర్వపద్ధతి (Back Spacer) కుంచిక నుపయోగింపవలసివచ్చుచున్నది "పి"యను నక్షరము గావలసివచ్చినపుడు ముందుగా ప అను నక్షరమును, పూర్వపద్ధతియు, ఎత్వమును, సంకేతములను గిస్సములను, మొత్తె మైదుకుంచికల నవసరమని నిరూపించిరి. ఇట్టి పద్ధతివలన విశేషముగాఁ ద్వరితగతికి భంగము గలుగుచున్నది. కావున ము, యు, లకుఁ బ్రత్యేకకుంచిక యొకటి కావలయును, "యి" అను నక్షరమునకు నట్టిదియు నవసరమే.

స్వరసర్గసంకేతములను గుడి " ఎత్వము ' మొదలగునానికిఁ బూర్వపద్ధతి నక్షరముల పైఁ బడునట్లును, వ్యంజన సంకేతములను ౦, ౧, మొదలగు వానిని క్రిందికిఁ బూర్వాక్షరముల క్రిందఁ బడునట్లును చేయవచ్చు నను కొన్నారు. ఒక్కొక్క Type Bar నకు రెండు లేక మూఁడక్షరము లున్నను తగిన కుంచిక యొక్క దానిని మాత్రమే ముద్రితముకాగలదు. వాహనము (Carriage) నందు స్తంభిని (Roller) సంద్రమము (Cylindrical) గా నుండుటచే దానిపై Type Bar నిలువునో ఒక ప్రదేశము మాత్రమే తాఁకఁగలదు. పరివర్తనకుంచిక (Shift Key) నుపయోగించినపుడు స్తంభిని పైకిఁబోవుటచే Type Bar చివరనుండు మరియొక యక్షరము దానికిఁ దాఁకుచున్నది. ఇట్లు పరివర్తన కుంచిక నుపయోగించినప్పటికిని నక్షరములు బంతికిఁ గ్రిందను పైనను పడక సమముగా వరుసలోఁ బడుచున్నవి. "గుడి ఎత్వము సంకేతము అక్షరములతో సమానముగనే కనుపించుచున్నది గాని బంతి నుండి విశేషముపైగాఁ నుండుటలేదు. అక్షరముల క్రిందుగా సన్ననిగీతను మాత్రము వ్రాయఁగలుగుచున్నాము. అట్టి స్థితియందు ౦, ౧ మొదలగు సంకేతము లక్షరములకుఁ బైగను, ౦, ౧, మొదలగు వ్యంజనవర్గము లక్షరముల క్రిందుగను వ్రాయునట్లు కుదురుట బహుకష్టమని తోఁచుచున్నది. ౦, ౧ మొదలగు సంకేతములు బంతినుండి కొంచెము క్రిందుగా నుండి తత్పూర్వాక్షరమునకుఁ బ్రక్క నున్నటుల గాన్పించినను ట, ఉ, ణ మొదలగు నక్షరములుమాత్ర మవసరమగునపుడు పూర్వాక్షరము

నకుఁ గ్రింగుగనే వ్రాయఁదగి యున్నవి గదా! ఇంతియు గాక "వాక్స్వాతంత్ర్యము" మొదలగుపదములందు నొక యక్షరముక్రింద రెండక్షరములు వ్రాయవలసివచ్చినపు డీ క్లిష్టత యధికముగ నున్నది. కాని యక్షరము లన్నియు నచ్చునందలి English body యక్షరముల ప్రమాణమునఁ జిన్నవిగానుండి స్తంభిని (Roller) సామాన్య ప్రమాణముకంటె నెక్కువలావుగా నున్నయెడల నీ ప్రక్రియ సాధ్యమగునేమో విచారింపవలసియున్నది.

క్రారవడి, నేయక్షరముక్రిందనైన వ్రాయవలసి వచ్చినపుడు ముందుగానీ క్రారవడిని వ్రాసి పిమ్మట నా యక్షరమును వ్రాయవలసివచ్చుచున్నది. ఇది యాభ్యాసమునకు విపరీతచర్య యగుటచే విలేఖకున కీవిషయమునఁ బొరపాటు కలుగక మానదు. కావున క్రారవడిని సంపూర్తిగా ◡ నిట్టి యాకారమున నక్షరము క్రిందుగా వ్రాయుటకై యుపయోగించునట్లు చేయవలసియున్నది.

### పూర్వస్థలదర్శిని (Back spacer)

ఈపూర్వస్థలదర్శినినిగూర్చి ముందుగాఁ గొంత చెప్పవలసి యున్నది. ఏకుంచిక Key నైన నొక్కినప్పుడు వాహనము (Carriage) తనంతటనే కుడినుండి యెడమకొక డిగ్రీ జరుగును. ఇందులకై మనము ప్రత్యేకముగాఁ జేయవలసిన ప్రయత్నము లేదు. యంత్రమునకు నెడమ పార్శ్వమున వెనుకనున్న ప్రధానధనువు (Main spring) వాహనము నెడమవైపున నెప్పుడును లాగుచుండుటదీనికిఁ గారణము. కాని పూర్వస్థలదర్శి నీ కుంచికను నొక్కినపుడు వాహనము వెనుకకు రావలసియుండుటచే వాహనము బరువునేగాక ప్రధానధనువుయొక్క శక్తినిగూడ వెనుకకు లాగగలిగినంత బలమును వినియోగింపవలసి యున్నది. కావున నిదియు నొక కుంచికాకారమునఁ గాన్పించినను దీని నుపయోగించుట యితర కుంచికల నుపయోగించుటవలె సులభమైనకార్యముకాదు. ఈకారణముననే ఈపూర్వస్థలదర్శిని బహుశీఘ్రముగాఁ జెడిపోవుట చాల యంత్రములలోఁ జూచుచున్నాము. అట్టి పూర్వస్థలదర్శినితో మనకుఁ బ్రతియక్షరమునకును బలివచ్చుటచే గల్గు క్లేశ మత్యధికము. ఇట్లు ప్రతియక్షరమునందును వెనుకకుఁ బోవలసివచ్చుటచే త్వరితగతికి విశేషముగా భంగము గలుగుచున్నదని వేర చెప్పఁబనిలేదు.

పూర్వస్థలదర్శిని నుపయోగింపకయే వాహనము పూర్వస్థలమునకుఁ బోగలుగునుపాయము కలిగిన దను వడంతియే నిశ్చయమైనయెడల శ్రీయుత వెంకయ్యగా రనినట్లు లిక శ్రమయేలేదు. కాని యంతవరకు నిట్టిపరిస్థితిలో నిర్మింపఁబడుయంత్రము Pocket printing set అనఁబడు విధానమునకంటె నేమాత్రము సహాయకారి కాఁజాలదు.

ఈపూర్వస్థలదర్శినీ వినియోగమును తగ్గించుటకుపాయముఁ జెప్పుచున్నాను. ర, ౧, బ, ఊ మొదలగు వ్యంజనాక్షరముల కుంచికల నొత్తినపుడు వాహనము (Carrige) కదలకయుండి ˊ, ా, ి మొదలగు స్వరవర్ణసంకేతముల కుంచిక లొత్తిన పిమ్మట వాహనము కదలు నెడల నీపూర్వస్థలదర్శిని నుపయోగింపవలసిన శ్రమ తగ్గఁగలదు. ఇందులకై యంత్రనిర్మాణమునఁ జేయవలసిన విశేషమును వివరించుచున్నాను. ఏకుంచికనైన (Key) నొక్కినపుడు దాని Key lever అడుగునకుఁ బోయి Key levers క్రిందుగానుండు ప్రధాన శలాక (Universal-bar)ను నొక్కుచున్నది. ప్రధాన శలాకకును (Rocker-Mechanism) నకును గల సంబంధముచే వాహనము(Carriage) కదలుచున్నది. ఈప్రధాన శలాక ( Universal-bar ) హ్రస్వముగానుండి కొన్ని యక్షరముల Key Lever నకుమాత్రమే సంబంధము కలదియైనయెడల దానిసంబంధము లేక, కుడియెడమ లందుండు Levers యొక్క కుంచికల (Keys) నొక్కినపు డక్షరములుమాత్రము ముద్రితములగును గాని వాహనము కదలకుండును. ఇట్టి యేర్పాటును జేయించిన యెడలఁ గొన్నికుంచికల ఫలకమునుండి తగ్గింపఁ బ్రయత్నము చేయవచ్చును.

N. B. తలకట్టును దీర్ఘమునుగూడ పూర్వరూపముననే యుండవచ్చును. ఒత్తులుగా నుపయోగించు వ్యంజనవర్ణ ములకుఁ బైభాగమువ నాగరియక్షరముల వలె (ঘ, ন, ৰ, ত) గీతలుండఁ బనిలేదు. స్వరవర్ణ సంకేతములగు ˊ, ా, ి, మొదలగువాని వ్యంజనవర్ణములపై వ్రాయఁగలుఁగునపు డీ వ్యంజనవర్ణములపై నట్టి గీతలుండ నవసరములేదు. ఆకారసంకేతమగు ా దీర్ఘము మాత్ర మితరస్వర సంకేతములకంటె దీర్ఘముగా నుండవలసివచ్చును. ఇట్లు సాధ్యమగునట్టి సవరణలఁజేసి ప్రస్తుతపు లిపితో సమానముగా నుండునట్లు చేయవచ్చును.

# ఆంధ్రకవుల ప్రతిభ

హరి రాధాకృష్ణమూర్తి గారు

## ౧. వేములవాడ భీమకవి

బంగారుపాలకీ ఎక్కి యిరువంకల సేవకులు దివిటీలు వేయ గ్రామాంతరమునకు భీమకవి దివ్వెవెలుఁగునఁ గోఁతఁబడి కాలిదివ్వెనైన లేనివాని బ్రతుకు నిరర్థకమని వాపోవు కళింగగంగును జూచి జాలి నొంది 'నీ వెవ్వర వేయూ' రని అడుగ కళింగగంగు ——

ఏనొకవ్యక్తి నంతక మహీశుని ప్రోలికి నేగలేక చిం
తానివహంబు నొక్కయెడ దాఁచి పరాన్నము కన్న నన్యమౌ
భోజనముం గాన కీవిధిని బొక్కుచు నీయది పుణ్యమందు క
న్నానిన వారినెల్ల నడియాసను గొల్చెడివాఁడ పుణ్యుఁడా!

ఊరను జెప్ప నేల విబుధోత్తమ, అన్నిట నిండియుండు నూ,
రారయ వంశమా ఘనఘనాశ్రితకోటికి తేవ, యింక నా
పే రడుగం దలంచిన వివేకము గా దది చెప్ప; బంధుల
వైరిహృదంతరంబుల నివాసము గాంచినదంచుఁ దెల్పెదన్.

'ఇన్ని గల్గియు నీ విట్టు లేల కన్న - వారికాళ్లను గీసులఁ బట్టుకొనఁగ'
అని యడిగెదేని వినవో పూర్వార్జితంబు - లైనకర్మంబు యోగంబులనుమాట.

అది వేదాంతము; దానికన్నఁ గందయ్యా, చిత్రచారిత్ర పే
రుదితార్కుండన నొప్పు భీమకవి నా యోగీంద్రుఁ డొక్కండు తా
విదితుండై సకలప్రపంచమున పృథ్వీభాజులన్ చేతిలోఁ
బొదువ న్నేర్చిన వాఁడు విందువె మహాపుణ్యుండు ముప్పేటనున్.

రాజులనెల్ల పూనిక తరాజులఁ జేసెడి శక్తియుక్తుఁ డా
తేజము చూచినన్ మనసు దిగ్భ్రమఁ జెందక నిల్వఁజాల దు
త్తేజిత మామహామహుని దీధితి గర్వితమోహరార్థ మం
చీజను లాడుకొందు రది యేల వృథాయగు నో మహోదయా!

తగుబాల్యమునను విద్యాగంధ మింతేని, అలవడకున్న తానాటలందు
తిరుగుచు తోడిబాలురహేళనములను విసువెత్తి తనతండ్రి వెదకుకొనుచు
భీమేశు నిష్ఠ సంప్రీతునిఁ జేయ నాతండును మెచ్చి యాదరముతోడ
లింగంబు వెలువడి లీలావతారుండై యెన్నెన్నొ వరముల ఎసకమెసఁగ
నొసఁగ నొకటిఁ దాను నుడివిన యదియెల్ల - ప్రాప్తమౌనటన్నవరము నంది
సాటిబాపల నెకసక్కెంబులాడిన - హారునిప్రియతనూజుఁ డనఘు, అతఁడు.

శంభువరప్రసాదమున జన్మము నొందుటచేతనేమొ తా
దంభముఁ జూపి భూపతుల ధార్ష్ట్యము కోర్చి సభాంతరంబునన్
స్తంభము మల్లెసాలగను సాలను స్తంభముగాఁగఁ జేసె; నీ
కుంభిని అట్టివాక్పటిమ కోరినఁ గల్గునె యెట్టివానికిన్ ?

నన్నయ బోలుసత్కవి అనశ్వరమై తనరార భారతం బు
న్నవిధాన ఆంధ్రమున నొప్పగురీతిని వ్రాయఁ బూన తా
విన్నదినంబు నాఁటికిని పెట్టినపాదము లట్లె యుండఁగా
మన్ననఁజేయ నాకవి సమాధికి లోనయెనంట విందువే.

ఈమహితాత్ముఁ డొక్కతరి యే నొకవో వసియించువేళ నా
ధామము కేగుదెంచి పెడదారిని నాకొఱకంప వారి వి
ద్యామహనీయతన్ సుకవితైక్ష్ణ్యము గానఁగలేక యేమొ మా
రామును జేసినానఁట తిరంబగు సంపద వాసిపోవఁగా.

శితికంఠుండసఁజాలు వైరినయినన్ చేకూరఁగా లెక్కచే
సితినా యొక్కఁడనైన ఆతనివిధిన్ చేఁజాఁచఁగా నయ్యొ నా
అతులైశ్వర్యము దూల ఎంతవ్యధ? ఆహా, చెప్ప నోరాడ దీ
బ్రతుకే నైచ్యము దోఁచె మృత్యువును సంప్రాప్తింప దో పుణ్యుఁడా !

ఏమని విన్నవింతు విబుధేశ్వర, రాజుల సర్వసంపదల్
భూములు సైన్యముల్ సుకవిశాపము పొందికచేత నైజమా
గోమును బాయుఁ గావునను కోపిదుఁడైన నృపాలశేఖరుం
డామహనీయుకోపమున కందనియట్లు మెలంగఁగావలెన్.

రాజు లనంగ నేల భువి రాజ్య మొకించుక గల్గినం తనే
రాజులు రాజులంచన పరాక్రమ మెంతయుఁ జూపఁ జేసితా
తేజము చూరఁగొన్న కవిధీరులు గాక ధనాఢ్యనాథులే
రాజులు రాజులే సుకవిరాజులు రాజులు గాక యెన్నఁగాన్.

భీమకవి

రాజు మాకగు దైవంబు, రాజుకన్న - దైవమే లేదనుచు నమ్మి [illegible]
నడిపించెడి సజ్జపురీశులైన - గంగులా మీరు మిసుమఁ [illegible].

కళింగగంగు (భీమకవిని గురితించి)

తప్పొనరించినాను దయ దాసుని మన్నన సేయవే కవీ
కొప్పినది క్కెవంపు? దయ నోముము భీమకవీంద్ర, [illegible]
దప్ప కవీంద్రుపల్కులను తథ్యము నీ విఁకఁ గ్రోవరున్న [illegible]
గప్పము మంట నీవె అట కాలునిసన్నిధి నీ సు[illegible]చెనా.

భీమకవి (కరుణించి)

కవిసత్వాం బెఱుఁగంగఁ గంటి విఁక వీక నీకు [illegible]
భవ మున్నే అలపౌర్ణిమాస్య చనఁగా ప్రాప్తించు నష్టాహము
దు వరంబుంబలె నీదురాజ్యమును సంతోషంబుగాఁ [illegible]
దవినాభావము మేలు రాజులకు వి[illegible].

---

# మా చందాదారులకు

మా కార్యాలయమునకు వ్రాయు ఉత్తరములు మొదలయినవానియందు తమ 'చందాదారు' సంఖ్య వ్రాయువలెను. లేకున్న ప్రత్యుత్తరములు మొదలయిన పనులను జరుపజాలము చందాదారుసంఖ్య భారతి కవరుకాగితముపై తమ విలాసమునకు ముందున్నది. చందాదారులకు భారతి ౧౦-వ తేది లోపల అందకపోయిన యెడల వెంటనే తపాలువారికిని, మా కార్యాలయమునకును తెలుప గోరెదము.

—మేనేజరు, 'భారతి.'

# మృతకవులకు లేఖలు

## ౧. అల్లసాని పెద్దన్న

కొల్లూరు ధర్మరాయ కవి, బీ. ఏ.

తాతగారూ!

నమస్తే—

మీ పేర ఉత్తరం వ్రాస్తే భారతి మీ కంద జేస్తుందనే నమ్మకంచేత వ్రాస్తున్నాను. మీకు తీరికవుంటే తప్పకుండా చదువుతారనే నా ఆశయం.

మీరు ఆంధ్రదేశం విడిచి వెళ్ళినతర్వాత యెన్ని మార్పులు జరిగే యనుకున్నారు? మీ మనుచరిత్ర ఒక మనిషైనా రాసుకోలే దుకదా! ఆ రణాలకి భేషైన అచ్చుప్రతి ఉపోద్ఘాతంతో కూడా దొరుకుతూంది; పుస్తకం సగం, తప్పొప్పుల తడక మరొక సగం, చదవటానికి ఓపికలేని ధనికులు కొనుక్కోదగినవి. టీకతో కూడా అచ్చువేసేరు కొందరు. మొత్తాన్ని మీనాటికంటె నేడు మీ గ్రంథం సర్వజన సులభం అయిపోయింది. టీక, ముట్ట మొదట బ్రౌనుదొరగారు జూలూరి అప్పయ్యపండితులుచేత వ్రాయించేరు. అత నెంత రసజ్ఞుడనుకున్నారు, ఆ దొరగారు? ఆయన చెప్పేరో, లేక అప్పయ్యపండితుల స్వబుద్ధియో, చెప్పలేం కాని, పరిశుభ్రమైన వ్యావహారిక భాషలో తాత్పర్యం సుబోధమయేటట్టుంది ఆటీక. "తురీయాశ్వాసము" అనకుండా "నాలుగో ఆశ్వాసం" అనే వ్రాసేరు. దరిమిలాను వ్రాసిన టీకలలో అమరంనుంచి, యితర సంస్కృత నిఘంటువులనుంచి ప్రయోగాలు కురిపిస్తూ రసపుష్టికి తోడ్పడని పండితవాసననే వెదజల్లేరు భాష్యకారులు. పామరులు మీ గ్రంథం బోధపర్చుకుందికి యీ గ్లేజుకాగితాలమీద అచ్చైన టీకలు యేమీ సహాయభూతంగా లేవు. ఏమైతే నేం? చూడని హిమాలయపర్వతాన్ని జను లెందరు మెచ్చుకోలేదు? మీ గ్రంథాన్ని అంతే.

ఇక, పరిశోధకాగ్రగణ్యులు మీ మనుచరిత్రగురించి యెంత కొట్టుకున్నా రనుకున్నారు! "కుతప" కాలం గురిచి కుండలాల పండితుల గ్రుద్దులాట యిప్పటి కింకా ప్రతిధ్వనిస్తూంది. అది అంతా మీ కావ్యంలో (Unity of time) కాల సంయమనం సుష్ఠుపరచటానికి! మానాటిలఘుబుద్ధులకి మీ రేం జేస్తారు? ఆ చలువమల మీదకి ప్రవరుడుతో కూడా వెళ్లి వ్రాలిన పిమ్మట, కాలచక్రానికి లొంగుతుందా, మీ సృష్టి? పాదలేపనం యిచ్చినవాడు ప్రపంచాతీతుడైన పరమసిద్ధుడు-బయలుదేరినవాడు గార్హస్థ్యనిత్యకర్మలో గుడుగుడుకుంచము లాడుతూ సృష్టివిలోకనం కోసాన్ని రెక్కలు కట్టుకొన్న ఉత్కంఠగల "తరుణాగ్నిహోత్రి"—స్వప్నసీమవలె ప్రౌఢ సూపెనది అంబరచుంబియైన హిమవచ్ఛిఖరి!

అట్టి అమరసన్నివేశము పరిమిత కాలవిభాగ సూచియైన యామగణనమునకు లొంగనీయ టకై విశ్వప్రయత్నం చేసేరు. ప్రవరుడు తర ఫున గంటలవెంబడి డైరీ వ్రాసేరు కొందరు. విశ్వమోహానమైన మీ స్వప్నయాత్రకి రైల్వే గైడ్ మానదండంగా జేసి మట్టిలో గలిపేరు!

మీ కాలికి గండపెండేరం తొడిగిన అపర భోజుడికి ఈ సంశయాలు పొడగట్టలేదూ? లే దనుకుంటాను. ఆ విశ్వసౌందర్య పిపాసువునకు తలదిమ్ము కలిగించే దివ్య మధుపాత్ర ప్రసాదిం చేరు మీరు. ప్రవరుడుతోపాటు రాయలు కూడా మీ అడ్డాలలో శిశువైపోయేరు! లే కుంటే ఆ ప్రభువుకి మీరంటే యెందుకుంటుంది అంతమోహాం? — కాసే — తాతగారూ! నేటి శిథిలమైపోయిన హంపీ సౌభాగ్యం చూస్తే నే మాగుండెలు బరువై మనలి శౌర్యం తో రక్తం వేడి యెక్కుతుంది కదా, ఆనాడు ఆ రామరాజ్యంలో జీవిస్తూ, పొట్నూరుదాక రాజ్యదండం సాగించిన చక్రవర్తిహస్తం మీ పల్లకి యెత్తిననాడు,- ఆ అవ్యయానందంతో మీకు గుండెలు విచ్చిపోలేదూ! ఎలాగు బ్రతి కున్నారండీ "జీవచ్ఛవం"లాగు, అలాంటిప్రభు వు గతించిన పిమ్మట? వాంఛలన్నీ తీర్చటానికి కంకణం కట్టుగున్న ప్రభువున్నప్పుడు మరి మీకు జీవితంలో మధురిమ యెక్కడిది? అం తటి అవ్యయమైన తృప్తిచేతనే మరొకకావ్యం మీరు వ్రాసి ఉండరు. ఏదేనా వ్రాసినవి ఉన్న ప్పటికీ, భద్రగజం మీదికి రాజు చేయూత యివ్వకమునుపే వ్రాసేరని నానమ్మకం. విశ్వ కర్తృ సృష్టి కంటెటికీ హిమాలయాలు మాత్రం ఒక్కటే! దానికి తాజమహలంటే కావ్య సృష్టిలో ఒక్కటేమో మహాప్రభు! తాజమహాలు నిర్మించిన శిల్పి తన సామ్రాజ్ఞి కథ అంతా ధారపోసిన పిమ్మట మరి జీవించి ఉండేను. తాజమహాలు మాత్రం అతని కరిగిపోని చెత్తి ముకురం.

తాతగారూ! మీ కావ్యాన్ని lyric అని కొందరు pastoral అని కొందరు అంటు న్నారు. కాని అది Epic అని నా అభిప్రాయం. అయోనిజము, అమానుషము, అయిన సన్ని వేశమును చిత్రించిన కావ్యమైనా Epic అనిపించుకుంటుంది. అందలి పాత్రముఖ్యులకి దైవికమైన ఒక తేజస్సు ఆపాదించి పురాణంది. ప్రవరుని పరస్త్రీవిముఖత్వము అనువాదలి సామాన్య మానవత్వాన్ని ఉపహరించింది. వరూధిని "మహాన్యాయి దివ్యాంగనను." నేను కాలుపెట్టు మానవులు కాను. ఆమ్రపే మ పిపాసాశాంతికై కాంక్షించిన ఆ ప్రౌఢాయుష్మ అర్థించిన ఆ రాని సముద్ర తరంగము నదులను కౌగిలించి 'గిలిం చింది. అట్టి లోకోత్తర సన్నివేశములకు తా వెక్కడ? మంటికి దూరమై మింటికి చేరువైన శీతశైలంమీద. ఇంతకన్న Epic అనిపించుకునం దుకి కావలసిన దేమిటి?

ఒక్కొక్కప్పుడు మీ గురు ఎవరస్తుశిఖరంమీద కూర్చుని దివ్యలోకాలలో విహారం కావ్యాలు చిత్రించే రేమో అనిపిస్తూవుంటుంది. ఏదండీ మీ సాయం సమయ వర్ణన:— "క్రేంకుల్ గట్టి నభోంత రాళమున బక్వాక్ పక్షులు" — అల్లవిగో

అని ఆ శిఖరంనుండి సూటిగా గంటంతో చూపించి వ్రాసేరనుకుంటాను ఆవాక్యం. "ఉష్ణాంశుపాషాణవ్రాతము కోష్ణమయ్యె"— సూర్యకాంతపురాళ్ల నులివెచ్చదనపు అనుభవం మీకు సమీపమే అయివుంటుంది. "మృగతృష్ణావార్ధు లింకెన్" — రాజపుత్రస్థానపు టిసుక తిన్నెలపై పలచబారుచున్న గాడ్పుపొగలు మీదృష్టి నాకర్షించి వుంటాయి. "జపాశోణంబయ్యె పతంగబింబము"—తన నీరసించిన ప్రచండతతో అస్తంగతుడౌతూన్న సూర్యుడు మీ లేఖినిని తనవైపు మరల్చికొన్నాడు. "దిశాస్తోమంబు శోభాదరిద్రాణంబయ్యె" — అంతకన్న మరేముంది? దివాకరు డస్తమించిన పిదప హిమాలయాన్నత్యంకూడా చీకటి కాటుకలో మాయమవుతుంది. అప్పుడు మీ దృష్టి చెంతనున్న మానస సరస్సుమీద వ్రాలివుంటుంది; "సరోజషండములు నిద్రాణంబులయ్యె" నన్నారు. ఇంత వర్ణనలోను మానవమైన ప్రవృత్తి ఎక్కడా కనిపించదు.

ఒక్కొక్కచోట మీరు పద్యాలతో పంచభూతాల్ని యిచ్చచొప్పున త్రిప్పుకున్నారనిపిస్తూ వుంటుంది.

"మృగమదసౌరభ విభవ
ద్విగుణీకృత సారసాంద్ర వీటీగంధ
స్థగితేతర పరిమళమై"

అని మీరు వర్ణించినమారుతం ఆపద్యంలో చరణాలకంటెను బరువెక్కి అలసగమనం పొందినట్లు తోస్తుంది. తరువాత,

"మగువపొలుపు దెలుపునొక్కమారుత
మొలసెన్"

ప్రవరుణ్ణి సోకిన ఆ లేతగాలి, వీవనతో విసిరినట్లు వచ్చింది ఆ నాలుగోచరణంలో. త్రిమాత్రాగణాలు నాలుగోపాదంలో వెయ్యాలని మీకు తోచిందో, లేక ఆ మరుత్కిశోరమే అలాగు ఒగ్గులు తీర్చిందో మీ పద్యానికి!

ఆ ప్రవరుడు వరూధిని ఉన్న కెలనకు చేరబోతూండగానే, మీరు ప్రబంధసీమ విడిచి నాట్యరంగంలో తెరవెనుకకు చేరేరు; లేక మీరే ప్రవరుడై యుంటారు! "చేరబోయి కనియెన్ విద్యుల్లతా విగ్రహన్"— మీరు సృజించిన వరూధిని మొదటి చూపునకు మీకే మెరపుతీవలాగు మిరుమిట్లు గొలిపింది. "శతపత్రేక్షణ"—అక్కడ, ప్రవరుడిలోనుండి ఆమె నేత్రములలోకి దృష్టి సారించినది మీరే. ప్రవరునిలో యిమిడిన మీ ఆత్మకళ పట్టజాలక వరూధినిలో ప్రవేశించి యుండనోపును; ఆమె మొగము చాటునకు త్రిప్పుకుంది. "చంచరీకచికుర"రాలు మబ్బు క్రమ్మినట్లు తోచేయి. వరూధిని తన కట్టెదుట రూపించిన శృంగార పుంజమును ఒక్కసారి కబళించే లాగు గిరుక్కున మరలి చూసింది కాబోలు, ఆమె "చంద్రాస్య" మప్పుడు కవి హృదయానికి వెన్నెల యిచ్చింది; ప్రవరుని కర్కశతేజస్సు ముందట మాత్రం అవనతమైంది. "చక్రస్తనిన్ నతనాభిన్ నవలాన్" అంటూ పరిపూర్ణమైన అవలోకనం ప్రాప్తించింది అప్పుడు. కాని యింత వరకూ ఆమె సౌందర్యచ్ఛాయ

బద్ధలగునట్లు పలికిన పలుకేమిటి? "No more an empress, but a mere woman!" కాని సర్వము సమాప్తమై, ప్రణయానుబంధము కడపటిసారి బిగిసిపోవునపుడు, ఆ చక్రవర్తినియందు శ్రీరక్తము ఉడుకెత్తి, ఆమెకొక Epic grandeur ఆవేశించింది :—

"Give me my robe, put on my crown; I have
Immortal longings in me ............
I am fire and air, my other elements
I give to baser life."

శిరస్కృతమైన వరూధిని మనఃప్రవృత్తి యింతకు కోటిరెట్లు కల్లోలమై ఉంటుంది. అదియే మా దీక్షితులుగారు ప్రదర్శించినది. ఆయన వరూధిని యేం చేసిం దనుకున్నారు? మీ వరూధిని లాగు మాయాప్రవరుడు చేతుల్లో చిక్కిపోయి, మృషానురక్తికి మోసగిల్లలేదు. వీణాతంత్రులు తెగునట్లు ఘల్లున మ్రోగించి "మానవు లెంత కఠినహృదయులు" అని పాలబాటలో మార్మోగున ట్లాక్రోశించింది. ఆ వాక్యముతో ఆమె మరుత్తత్వము పునరుజ్జీవించింది. హృదయము మాత్రం వీణాతంత్రులతోపాటు భగ్నమైపోయింది. గీర్వాణవధూటి గిరవాటువైచిన శిథిలహృదయమే మా దీక్షితులుగారు ఆంధ్రలోకమునకు ప్రసాదించేరు. * * * *

నేటికాలంలో మీరు జీవించివుంటే, మనుచరిత్ర అట్లాగే వ్రాతురని నానమ్మకం. కాని కావ్యనామంలోని మీ ఉద్దిష్టార్థం వ్యర్థమవుతుంది. స్వారోచిషమనుసంభవం అసంభవమవుతుంది. * * *

తాతగారూ! ఇంతకూ మీరు త్రొక్కిన మార్గం మాకు ఉపాదేయం. అందుచేతనే వ్రాసిన విషయం ఇంత దవ్వు పెరిగింది.

చిత్తగించండి— నమస్కారం—

..........—

---

# మా వ్యాసకర్తలకు

వ్యాసములు చిన్న సైజు కాగితములపై ఒకవైపున మాత్రమే విడిఅక్షరములతో బంతులు దూరదూరముగా, దిద్దుబాట్లు లేకుండ, తిన్నగా వ్రాసి వర్ణక్రమమునను తప్పులు లేకుండ చూచుకొని పంప వేడికోలు. లేకున్న ముద్రణకార్యములయందు మిగుల కష్టము కలుగుటయే కాక తప్పులుకూడ నిలిచిపోవునని మనవి.

సంపాదకుడు, 'భారతి'.



రవీంద్ర కవిసార్వభౌముడు

(7) కడచిననెలలో సప్తతిపూర్తి మహోత్సవము జరిగెనది. (మా. కల.)



శ్రీ ఏ. రంగస్వామయ్యంగారు
హిందూ పత్రికా సంపాదకులు.

'మాలి.'

# మహాభారతము-౧

కేతవరపు వేంకటశాస్త్రిగారు

మహాభారత మత్కృష్టగ్రంథ మని హిందువుల యభిప్రాయము. హిందువులే కాదు, పాశ్చాత్యులుగూడ నట్లే యభిప్రాయపడిరి. నిజమునకంటే, నానావిధధర్మములు, నీతులు, రాజనీతులు, మానవజీవిత ములు, రాజకీయవిషయములు మొదలగునవి, మానవజీవిత మునకుఁ గావలసినవి, యందు వివరింపఁబడినవి. అది కేవ లము ధర్మాదిబోధకమే కాక యత్యుత్తమ క్షత్రియవంశ జాతులగు కురుపాండవచరిత్రమును జెప్పుటచేఁ జదువ రులకు శాస్త్రాదులందువలె విసుఁగు పుట్టింపక యాసక్తిని హెచ్చించు. ఈమహాగ్రంథమును పెక్కురు పండితులు విమర్శించినారు. భారతము మహోత్కృష్ట గ్రంథము కావుననే పండితుల మనస్సుల నాకర్షించి విమర్శ నార్హ మయినది.

గుణదోషములను విమర్శించుట కావలసినదే. కాని నిష్పక్షపాతముగా సంశోధవలెను. అంతియ కాని విమర్శ నము గుణములను కప్పి దోషములను వెల్లడించునదిగా నుండరాదు. మఱియు విమర్శనీయగ్రంథమును పలుమా ఱులు చదివి యందలి సకలవిషయములను గ్రహించి విమర్శనకుఁ బ్రారంభింపవలెను. అది విమర్శక లక్ష ణము.

మహాభారతము వ్యాసకృతమే. కాని యందుఁ బ్రక్షిప్తభాగములు పెక్కులున్నవి. ఆప్రక్షిప్తములు వైశంపాయనాదులచేఁ జేర్పఁబడినవని కొందఱివాదము. అవి హిందూమతద్వేషులచేఁ జేర్పఁబడెనని నావాదము. చదువరుల సులభావగాహనమునకై ప్రశ్నోత్తరరూప ములగు కొన్ని శ్లోకములు వైశంపాయనాదులవి కావ చ్చును. అంతియ కాని పర్యాంతర్గతము లగు భాగములు చేర్పవలసిన యావసరము వైశంపాయనాదులకు లేదు. మఱి యెవ్వరి కట్టి యవసరము? హిందూమతద్వేషులకు. హిం దూమతమ్ముతోఁ బ్రతిఘటించి దానిని ధ్వంసము చేయవలె నని పెక్కుమతములు ప్రయత్నించినవి. కాని యావిష యమున బౌద్ధమత మంత ప్రయాసపడినది వేఱొకటి లేదు. బౌద్ధమతవ్యాప్తికై బుద్ధుఁడును, తచ్ఛిష్యులును, శిష్య ప్రశిష్యులును, తన్మతావలంబులగు మహారాజులును జేసిన పరిశ్రమ వర్ణనాతీతమని సర్వజన విదితము. అప్పటికి భారతదేశమునఁ బాఁతుకొనియున్న మతము హిందూ మతము. అది మిక్కిలి దృఢపడియుండుటచేఁ దానిని పెల్లగింప సాధ్యమైనది కాదు. బౌద్ధులు హైందవమత ధ్వంసమునకు విశ్వప్రయత్నములు సలిపిరి. కాని సఫల మనోరథులు కాలేక పోయిరి. ప్రతిమతమునం దును మతోద్ధారకులును, మతగురువులును మొట్ట మొదట ధర్మయుక్తముగాఁ బ్రవర్తించినను వారి వారి శిష్యులు గురువులంత జ్ఞానవంతులు కాకపోవు టచేఁ దమపట్టుదలలే ప్రధానముగా భావించి వానిని సాధింపఁ బ్రయత్నించి, సాధింపలేనపుడు "అశ క్తా దుర్జనత్వ"మన్నట్లు కుత్సితకార్యములకు దొరఁకొనుట స్వభావము. అందుచే బౌద్ధులు హిందూమతమును ధ్వం సముచేసి తమ మతమును వ్యాప్తినొందింప నీచకృత్యము లకుఁ బ్రారంభించిరి. హిందూమతమునకును, సంప్రదా యములకును విరుద్ధములగు భాగములను గల్పించి హిం దూమత గ్రంథములందుఁ జేర్చుటయే వారి నీచపుఁబను లలో మొదటిది. ఇట్లు నీచకృత్యములకుఁ దొడఁగినవా రొక్క బౌద్ధులే కారు. మన హిందూపండితులుగూడ బౌద్ధమత ధర్మసూత్రములలోఁ దన్మతవిరుద్ధములగునవి పెక్కులు చేర్చినారు. కాని యశోకచక్రవర్తి పండిత సాహాయ్యమునఁ బ్రక్షిప్తములు తొలఁగించి యిట్టి చిక్కులు మఱి రాకుండ శిలాశాసనములు వ్రాయించి నాఁడు. హిందూమతాభిమానియగు చక్రవర్తి మనకు లభింపకపోవుటచే మనగ్రంథములం దవి నిలిచిపోయినవి. అట్టి యంశములు మొదట వ్రాఁతప్రతులందుఁ జేర్పఁబడి

క్రమముగా నిప్పుడు ముద్రితములై శిలాశాసనములకంటెను స్థిరపడిపోయినవి. ఇది జరిగి యెన్నోవందల వత్సరము లగుటచే నిప్పుడు వానిని జెల్లగింప నతికష్టము లగుచున్నవి. మనపండితులు విమర్శింపక, బౌద్ధులు చేర్చిన యసందర్భవిషయములకు సమాధానముల నియ్యఁజాలక వానిని దేవతామహిమలతోఁ జేర్ప నారంభించిరి. అంతియ కాని ప్రక్షిప్తములని త్రోసివేయఁజాలరయిరి. రానురాను పూర్వుల గ్రంథములనుండి యాయాభాగములు తొలఁగించుట ప్రత్యవాయమనికూడ భావించిరి.

వ్యాసకృతమగు భారత మెంతో, ప్రక్షిప్త మెంతో మొదటఁ దెలిసికొనకుండ భారతము నున్నదున్నట్లు విమర్శింపఁబూనుట బుద్ధిమంతుల లక్షణము కాదు. అట్లు సత్యాసత్యభాగము తేర్పరింప నలవి కానప్పుడు విమర్శింప మానుట మంచిది. ఈవిషయ మాలోచింపకుండ భారతమును విమర్శించి వైద్యాదిపండితులు నిందిని పందినిగాఁ జేసినారు. హిందూమత సంప్రదాయములకు విరుద్ధభాగములను సత్యములని నమ్మి విమర్శించి హిందూమతమునకు దుస్సహాకళంకముల నాపాదించినారు. హిందువులకుఁ బ్రధానజీవతయగు కృష్ణభగవానుఁడు జారుఁడు, కుటిలుఁడు నయినాఁడు. ఆర్షమతోద్ధారకుఁడగు వ్యాసుఁడు సంకరజాతివాఁడయినాఁడు. మహిళావర్గమున నుత్తమురాండ్రనఁదగిన కుంతీ ద్రౌపదులు బహుభర్తృక లయినారు. సాంఘు స్మృతరాష్ట్రులు విధవాపుత్త్రులయినారు. పాండవు లంపటులును కుండకు లయినారు. వేదోక్తములగు యజ్ఞాదులకుఁ బ్రధానదేవతయగు నింద్రుఁడు జారుఁడై చోరుఁడై మానవులకంటె నీచాతినీచుఁ డయినాఁడు. భారత మూలగ్రంథ మెంతో సరిగాఁ జేసికొని హిందూసంప్రదాయముల వాసననైనను జూడని ఖండాంతరవాసులుకూడ హిందూమతము నీతి బాహ్యమని యాక్షేపించుచున్నారు. దోషము లున్నచో నిందించుట కూడదని నాయభిప్రాయము కాదు. కాని గుణదోషములను తాఱుమాఱు చేసి దూషింపరాదని నామనవి.

భారతములోఁగొన్ని భాగములు తాఱుమాఱు అయినవనియు, గొన్ని భాగములు ప్రక్షిప్తము లనియు విమర్శకులంపటులను నంగీకరింపవలసియున్నది. ఆయంశములను గిరిచేసి ప్రక్షిప్తములు తొలఁగింప నొక్కటే మార్గము కానవచ్చుచున్నది. దానినిబట్టియే నిజమగు భారతము నరయవలయును. అనాదిసిద్ధముగా వచ్చు నార్షమతమునకును, హిందూసంఘ సంప్రదాయములకును, మానవస్వభావములకును విరుద్ధములగు భాగములు ప్రక్షిప్తములని మనము గ్రహింపవలయును. ఏయుగమునందును, ఏయితరపురాణమునందును లేనియంశము లొక్క భారతమునందు మాత్రమే యుండుట యక్రమము గాదా!

పై నుదాహరించిన సద్గ్రంథములనుబట్టి భారతమును బరిశీలించెదను. ఇందలి సత్యమును గ్రహింపవలెనని పండితులను బ్రార్థించుచున్నాను.

వ్యాసుఁడు.— ఇతఁడు హిందూమతోద్ధారకుఁడు. పురాణములను, భారతాది సద్గ్రంథములను వ్రాసి హిందువులచేఁ బూజింపఁబడుచున్నాఁడు. పెక్కులు వేదాంతగ్రంథములను వ్రాసి జ్ఞానము నభివృద్ధిఁ జేసినాఁడు. ఇతఁడు యమునాద్వీపవాసు లగు సత్యవతీ పరాశరుల కుమారుఁడు. మహాతపశ్శాలి, జ్ఞానసంపన్నుఁడు. ఇతఁడు కౌరవరాజ్యమందే యొకచోట దపస్సు చేసికొనువాఁ డగుటచే రాజులై స్వగ్రామయుక్తముగాఁ బ్రజాపరిపాలనము చేయు శంతను ప్రభృతులను కురురాజులకు శాస్త్రము నుపదేశించి వారిచేఁ బూజింపఁబడుచుండెడివాఁడు. ఎప్పుడును నియమవంతుఁడై ప్రవర్తించి తపోయోగమునందే కాలము పుచ్చుచుండువాఁ డగుటచే నృపశిరోమణుఁడై చిరకాలము జీవించియున్నాఁడు. అతఁడు యోగాదిశాస్త్రములందుఁగూడ గ్రంథములు రచించి ప్రఖ్యాతి వడసినాఁడు. అతఁడు బ్రాహ్మణసంఘముచేతను, నితరసంఘములచేతను మిక్కిలి పూజింపఁబడుచుఁ బురాణాదిసంహితలు రచించి పైలాదిశిష్యవర్గమునకుఁ జెప్పిలోకమున వ్యాపింపఁజేసినాఁడు. అతఁడు మహాతపశ్శాలి, విద్యావంతుఁడు, పరావరజ్ఞాన మెఱిఁగినవాఁడు, నిష్కల్మష ప్రవర్తనుఁడు. అందుచేతనే యతఁడు నేఁటివఱకును సమస్తజనసంఘములచేతను గౌరవింపఁబడుచున్నాఁడు. ఇది నిజమగు వ్యాసచరిత్రము.

వ్యాసుఁ డెక్కడను తనచరిత్రమును తనగ్రంథములందు వ్రాసియుండలేదు. అయినను నతని నామములనుబట్టియు, నతని గ్రంథములను బట్టియుఁ బైచరిత్ర మూహిత మగుచున్నది. ద్వీపమునఁ బుట్టినాఁడు. కావున ద్వైపాయనుఁ డయ్యెను. పరాశరుని కొడుకు కావున పారాశర్యుఁ డయినాఁడు. సత్యవతికొడుకగుటచే సాత్యవతేయుఁ డయ్యెను. వేదవిభజనముచే వ్యాసుఁ డయ్యెను.

వ్యాసునిచరిత్రము భారతాదిపర్వమున నున్నది కాదా యని యడుగవచ్చును. కాని యది సరికాదు. కౌరవవంశముతో నతనికి సంబంధము కల్పించి యతనికిఁ గలంక మాపాదించు మతద్వేషులు చేర్చిన ప్రక్షిప్త భాగము కాని వేఱు కాదు. అది యెట్లున్నదో సంస్కృత భారతమును పరిశీలింతము.

భారతమున వంశావతార పర్వమందు వైశంపాయనుఁడు—

"పారిక్షిత కథాం దివ్యాం పుణ్యాయ విజయాయచ,
కథ్యమానాం మయాకృత్స్నాం శృణు హర్షకరీమిమామ్,
త్రిభి ర్వర్షై స్సదోత్థాయీ కృష్ణద్వైపాయనో మునిః,
మహాభారత మాఖ్యానం కృతవా నిద మద్భుతమ్."

మొదలగు శ్లోకములతో భారతవంశమునుగూర్చి చెప్పఁదలఁచి, శంతను వంశోద్ధారకురా లగు సత్యవతినిగూర్చి చెప్పుటకై తత్కారణ మగు నుపరిచరవసుకథను ప్రారంభించినాఁడు. భారతవంశమును వర్ణించి తత్సంబంధులను జెప్పునప్పుడు వ్యాసమహర్షి జన్మవృత్తమును జెప్ప నవసరము లేదు. వ్యాసునకు విధవాసంగమాది దోషము లంటఁగట్టుటకై మన మతద్వేషులు ప్రక్షిప్తాంశముల నిందుఁ జేర్చినారు. అంతియ కాని యుపచరిరుని కూఁతు రగు సత్యవతి వ్యాసునితల్లి గాదు. పరాశరుని భార్య సత్యవతి వేఱు. శంతనునిభార్య సత్యవతి వేఱు. నామసామ్యము సరిపోవుటచే మతద్వేషులకు మఱింత యనుకూల్యము సంభవించినది. మన మతమువారికి వ్యాసుఁడు కౌరవవంశమునకు సంబంధించియున్నట్లు భ్రమింపఁజేయ నవకాశము కల్గినది. ఈయంశము సత్యమని చెప్పుటకు హేతువు లేమయినఁ గలవాయని ప్రశ్నింపవచ్చును. భారతమందలి వ్యాసావతారఘట్టమునఁ గల యసందర్భములను బట్టియే పైయంశమును నిర్ణయింపవచ్చును.

సత్యవతి యుపరిచరవసు వీర్యమున నద్రికయను నచ్చరకు (శాపవశమున మత్స్యరూపమైన దానికిఁ) బుట్టినట్లు చెప్పఁబడినది. సత్యవతి జన్మకథయం దనేకము లగు నసంభవములు గలవు. ఆవిషయము "ఉపరిచరుఁ"డను నా వ్రాయు వేఱొకవ్యాసమునఁ జూడనగును. ఎట్లయిననేమి, సత్యవతి దాశరాజు వశమునకు వచ్చినది. అతని యింటనే పెరిఁగినది.

"సా కన్యా దుహితా తస్యా మత్స్యా మత్స్యసగంధినీ,
రాజ్ఞా దత్తాచ దాశాయ కన్యేయం తే భవ త్వితి,
రూపసత్వసమాయుక్తా సర్వై స్సముదితై ర్గుణైః,
సాతు సత్యవతీనామ మత్స్యఘాత్యభిసంశ్రయాత్,
ఆసీ త్సా మత్స్యగంధైవ కంచిత్కాలం శుచిస్మితా,
శుశ్రూషార్థం పితు ర్నావం వాహయంతీ జలేచ తామ్,
తీర్థయాత్రాం పరిక్రామ న్నపశ్య ద్వై పరాశరః,
అతీవ రూపసంపన్నాం సిద్ధానా మపి కాంక్షితామ్,
దృష్ట్వైవ సచ తాం ధీమాం శ్చకమే చారుహాసినీమ్,
దివ్యాం తాం వాసవీం కన్యాం రంభోరుం మునిపుంగవః,
సంగమం మమ కల్యాణి, కురుష్వే త్యభ్యభాషత."

'అద్రిక కుమారికయగు సత్యవతిని దాశరాజునకు నీమెను కూఁతునుగా భావింపుమని రాజిచ్చెను. రూప సమన్వితయగు నామెతల్లియగు మత్స్యఘాతి వలన మత్స్యగంధియై కొంతకాల ముండెను. ఆమె తండ్రిని సేవింపఁబోయి తండ్రిగారి నావను నదీజలమున నడుపుచుండెను. తీర్థయాత్రాపరుఁడగు పరాశరుఁ డామెను జూచి మోహించి తనతో సంగమింపఁ గోరెను.'
అందులకు సత్యవతి యిట్లన్నది:

"సాబ్రవీ త్పశ్య భగవన్, పారావారే స్థితా నృషీన్,
ఆవయో ర్దృష్టయో శ్శేభిః కథం తు స్యా త్సమాగమః."

'ఓమునీంద్రా! ఒడ్డున నున్న మునులను జూచితివా? వారు చూచుచుండఁగా మనకు సంగమ మెట్లు?'

" ఏవం తయోక్తా భగవా న్నీహార మసృజ త్ప్రభుః,
యేన దేశః స సర్వస్తు తమోభూత ఇ వాభవత్."

'ముని యామెమాటలువిని యాప్రదేశమంతయును జీఁకట్లు క్రమ్ముకొన్నట్లు చేసెను.' అది చూచి సత్యవతి విస్మితురాలయి, వ్రీడితయై యిట్లనెను:

" విద్ధి మాం భగవన్, కన్యాం సదా పితృవశానుగామ్,
త్వత్సంయోగాచ్చ దుష్యేత కన్యాభావో మమానఘ,
కన్యాత్వే దూషితేనాహ కథం శక్ష్యే ద్విజోత్తమ,
గృహం గన్తు మృషే, చాహం ధీమ, న్న స్థాతుముత్సహే."

'నేను పితృవశనై యున్నదానను. నీసంయోగమువలన నా కన్యాత్వము దూషిత మగును. కన్యాత్వము దూషిత మైనచో నేను జీవింపఁజాలను. ఇంటికిఁ బోఁజాలను.'

అంతటను ముని సంతోషించినవాఁడై,
" ఏవ ముక్తవతీం తాంతు ప్రీతిమా నృషిస త్తమః,
ఉవాచ మత్ప్రియం కృత్వా కన్యైవ త్వాం భవిష్యసి."
'ఓయువతీ! నాకుఁ బ్రియ మాచరించినను నీకన్యాత్వమునకు భంగము రా దని చెప్పి,

"వృణీష్వ వచనం భీరు, యంత్వ మిచ్ఛసి భామిని,
వృథాహి న ప్రసాదో మే భూతపూర్వ శ్శుచిస్మితే!"
'నీకుఁ గావలసిన వరము వేఁడుము. ఇచ్చెదను. ఇంతకుఁ బూర్వము నా దయ వ్యర్థము కాలే' దనెను. దానికి సత్యవతి దేహసౌగంధ్యమును కోరెను. అతఁడు వర మిచ్చెను. ఆవరమును పొంది యోజనగంధి యను పేరు గలదై సత్యవతి

" పరాశరేణ సంయుక్తా సద్యో గర్భం సుషావసా,
జజ్ఞేచ యమునాద్వీపే పారాశర్య స్స వీర్యవాన్,
స మాతర మనుజ్ఞాప్య తపస్యేవ మనో దధే,
స్మృతోఽహందర్శయిష్యామికృత్యేష్వితి చసోఽబ్రవీత్,
ఏవం ద్వైపాయనో జజ్ఞే సత్యవత్యాం పరాశరాత్."

'పరాశరునితో కూడి సద్యోగర్భమునఁ గనెను. ఆపారాశర్యుఁడు యమునాద్వీపమునఁ బుట్టెను. తలఁచుకొన్నప్పుడు వచ్చెదనని తల్లితోఁ జెప్పి తన [illegible] వెడలి పోయెను.'

పిమ్మట వ్యాసుఁ [illegible] చెను. భారతమునఁ గల [illegible] ఆలోచింప [illegible] సందర్భములు గలవు. [illegible] నింద నీయముగా [illegible] శీలింతము.

దాశరాజు [illegible] సత్యవతి [illegible] ముగా స్త్రీలే [illegible] సంశయము.

సత్యవతీ పరాశరుల [illegible] సహజ యందా? లేక [illegible]? "[illegible]" యంత్రి జలే నతా" [illegible] పవలెను. అప్పు డతని [illegible] వలెను. సత్యవతి పరాశరుని [illegible] చున్నదని యనుకొనవలెను. "ఒద్దు నన్ను ఋషులు చూచుచున్నా"రని సత్యవతి యన్న వచనమునుబట్టి పగటి పూట యని స్పష్టమగుచున్నది. సత్యవతిని గామించిన పురుషుఁడు సామాన్యుఁడుకాఁడు. వసిష్ఠుని మనుమఁడు. మహాతపశ్శాలి. జితేంద్రియుఁడు. తీర్థములను సేవింపఁ బోవుచున్నాఁడు. పరాశరుఁడు ధర్మవిదుఁడనియుఁ, తత్త్వవేత్తయనియుఁ బేరొందినవాఁడు. అట్టి ధర్మజ్ఞుఁడు, అట్టి తపశ్శాలి, అట్టిపుణ్యకార్యపరుఁడు, అట్టి పరాశరుఁడు త్రోవలోఁ, బవటిపూట, జనసంకులము నెదుట, సత్యవతిని జూచినంతమాత్రమునఁ గామపరవశుఁ డగునా? ముండలముట్టాతో రమింపఁదగిన వాఁడు కూడ సాహసింప నొల్లని యట్టి దుష్కార్యమునకుఁ గడంగునా? పూర్వము మహామునులు తపోనిష్ఠులై యుండియు నచ్చరలనుగాంచి చంచలులు గాలేదా యని యడుగవచ్చును. అసంఘటనపేటుక ఇదివేఱు. విశ్వామిత్ర మందకర్ణాదు లచ్చరలనుగూడి యెంతోకాలము కాపురము చేసినారు. కాని పరాశరుఁడు సత్యవతితో

వ్యాసుఁ డెక్కడను తనచరిత్రమును తనగ్రంథములందు వ్రాసియుండలేదు. అయినను నతని నామములనుబట్టియు, నతని గ్రంథములను బట్టియుఁ బైచరిత్ర మూహింత మగుచున్నది. ద్వీపమునఁ బుట్టినాఁడు. కావున ద్వైపాయనుఁ డయ్యెను. పరాశరుని కొడుకు కావున పారాశర్యుఁ డయినాఁడు. సత్యవతికొడుకగుటచే సాత్యవతేయుఁ డయ్యెను. వేదవిభజనముచే వ్యాసుఁ డయ్యెను.

వ్యాసునిచరిత్రము భారతాదిపర్వమున నున్నది కాదా యని యడుగవచ్చును. కాని యది సరికాదు. కౌరవవంశముతో నతనికి సంబంధము కల్పించి యతనికిఁ గలంక మాపాదింప మతద్వేషులు చేర్చిన ప్రక్షిప్త భాగము కాని వేఱు కాదు. అది యెట్లున్నదో సంస్కృత భారతమును పరిశీలింతము.

భారతమున వంశావతార పర్వమందు వైశంపాయనుఁడు—

"పారిక్షిత కథాం దివ్యాం పుణ్యాయ విజయాయచ,
కృష్ణా నాం మహాకృత్స్నం ప్రమాణ్యార్ష కరీమిమామ్,
త్రిభి ర్వర్షై స్సదోత్థాయీ కృష్ణద్వైపాయనో మునిః,
మహాభారత మాఖ్యానం కృతవా నిద మద్భుతమ్."

మొదలను శ్లోకములతో భారతవంశమునుగూర్చి చెప్పఁదలఁచి, శంతను వంశోద్ధారకురాలగు సత్యవతినిగూర్చి చెప్పుటకై తత్కారణమగు నుపరిచరవసుకథను ప్రారంభించినాఁడు. భారతవంశమును వర్ణించి తత్సంబంధులను జెప్పునప్పుడు వ్యాసమహర్షి జన్మవృత్తమును జెప్ప నవసరము లేదు. వ్యాసునకు విధవాసంగమాది దోషము లంటఁగట్టుటకై మన మతద్వేషులు ప్రక్షిప్తాంశముల నిందుఁ జేర్చినారు. అంతియ కాని యుపచరిరుని హేతురగు సత్యవతి వ్యాసునితల్లి గాదు. పరాశరుని భార్య సత్యవతి వేఱు. శంతనునిభార్య సత్యవతి వేఱు. నామసామ్యము సరిపోవుటచే మతద్వేషులకు మఱింత యానుకూల్యము సంభవించినది. మన మతమువారికి వ్యాసుఁడు కౌరవవంశమునకు సంబంధించియున్నట్లు భ్రమింపఁజేయ నవకాశము కల్గినది. ఈయంశము సత్యమని చెప్పుటకు హేతువు లేమయినఁ గలవాయని ప్రశ్నింపవచ్చును. భారతమందలి వ్యాసావతారఘట్టమునఁ గల యసందర్భములను బట్టియే పైయంశమును నిర్ణయింపవచ్చును.

సత్యవతి యుపరిచరవసు వీర్యమున నద్రికయను నచ్చరకు (శాపవశమున మత్స్యరూపమైన దానికిఁ) బుట్టినట్లు చెప్పఁబడినది. సత్యవతి జన్మకథయం దనేకములగు నసంభవములు గలవు. ఆవిషయము "ఉపరిచరుఁ"డను నా వ్రాయు వేఱొకవ్యాసమునఁ జూడనగును. ఎట్లయిననేమి, సత్యవతి దాశరాజు వశమునకు వచ్చినది. అతని యింటనే పెరిఁగినది.

"సా కన్యా దుహితా తస్యా మత్స్యా మత్స్యసగంధినీ,
రాజ్ఞా దత్తాచ దాశాయ కన్యేయం తే భవ త్వితి,
రూపసత్వసమాయుక్తా సర్వై స్సముదితై ర్గుణైః,
సాతు సత్యవతీనామ మత్స్యఘాత్యభిసంశ్రయాత్,
ఆసీ త్సా మత్స్యగంధైవ కం చిత్కాలం శుచిస్మితా,
శుశ్రూషార్థం పితు ర్నావం వాహయంతీ జలేచ తామ్,
తీర్థయాత్రాం పరిక్రామ న్నపశ్య ద్వై పరాశరః,
అతీవ రూపసంపన్నాం సిద్ధానా మపి కాంక్షితామ్,
దృష్ట్వైవ సచ తాం ధీమాం శ్చకమే చారుహాసినీమ్,
దివ్యాం తాం వాసవీం కన్యాం రంభోరుం మునిపుంగవః,
సంగమం మమ కల్యాణి, కురుష్వే త్యభ్యభాషత."

'అద్రిక కుమారికయగు సత్యవతిని దాశరాజునకు నీమెను హేతునుగా భావింపుమని రా జిచ్చెను. రూప సమన్వితయగు నామెతల్లియగు మత్స్యఘాతి వలన మత్స్యగంధియై కొంతకాల ముండెను. ఆమె తండ్రిని సేవింపఁబోయి తండ్రిగారి నావను నదీజలమున నడుపుచుండెను. తీర్థయాత్రాపరుఁడగు పరాశరుఁ డామెను జూచి మోహించి తనతో సంగమింపఁ గోరెను.' అందులకు సత్యవతి యిట్లన్నది:

"సా బ్రవీ త్పశ్య భగవన్, పారావారే స్థితా నృషీన్,
ఆవయో ర్దృష్టయో రేభిః కథం తు స్యా త్సమాగమః."

'ఓమునీంద్రా! ఒడ్డున నున్న మునులను జూచితివా? వారు చూచుచుండఁగా మనకు సంగమ మెట్లు?'

# తిక్కన యుద్యోగపర్వము

తాడూరి లక్ష్మీనరసింహారావు పంతులుగారు

వ్యాసుఁడు తన భారతములో నాదిపర్వమందుఁ బ్రథమాధ్యాయములో ౯౮-౯౯ ౯౬-౯౩-౯౭-౯౯ యను నను శ్లోకములలో భారతమును మహావృక్షముతోఁ బోల్చి, యుద్యోగపర్వమును దానిసారమని వర్ణించినవాఁడు. మఱియు వ్యాసభారతమునకు "భారతభావదీపిక" యనుపేర వ్యాఖ్యానము రచించిన నీలకంఠుఁ డుద్యోగపర్వమునకు వ్యాఖ్య రచించుచో—

'భారతే సార ముద్యోగ మితి వృద్ధానుశాసనమ్;
అతో విస్తరత స్తత్ర వ్యాఖ్యాన ముపపద్యతే.'

అని చెప్పి యుద్యోగపర్వమునకు వ్యాఖ్య విస్తరించి రచించినవాఁడు.

౨. నిజ మారయఁగా, నుద్యోగపర్వము భారతమునకు సారమే యగును. ఎట్లంటేని—

భారతకథ సంగ్రహముగా మూఁడు గొప్పభాగములుగా విభజింపఁబడి యున్నది. మొదటిభాగము ధార్తరాష్ట్రులు పాండవులను వంచించి యరణ్యవాసకష్టములను, నజ్ఞాతవాసకష్టములను బెట్టుట. రెండవ దీకష్టానంతరము ప్రతీకారమునకుఁ బాండవు లుద్యోగించుట. మూఁడవది పాండవులు యుద్ధముచేసి కౌరవులను వధించి సంపూర్ణ రాజ్యము వడయుట. ఈమూఁటిలో నడిమిభాగ ముద్యోగపర్వము. ఈమూఁటి పఠనములలో నుద్యోగపర్వపఠనము ముఖ్యము. మొదటిభాగమయిన వంచనాకార్యమెవఁడు పట్టిన వాఁడే చేయఁగలఁడు. అది యసత్కార్యము. మూఁడవభాగమయిన విగ్రహము సాహసకార్యము, నాశనకార్యము. దానియనుబంధము లనుకూలములుగా నుండవచ్చును, బ్రతికూలములుగా నుండవచ్చును, ఒక్కొక్కప్పుడు విరుద్ధముగాఁగూడ నుండవచ్చును. యుద్ధమునకు మున్ను యుద్ధ మవశ్యకర్తవ్యమా కాదా యనునది మొదట నిశ్చయింపవలయును. పిమ్మటఁ దన బలమును బరబలమును నాలోచింపవలయును. తగినప్రయత్నము నేర్పుతోఁ జేయవలయును. లోభ ముండఁగూడదు. బలాబలంబులు తెలిసికొనక గుండె గలిగి సాహసించి యుద్ధము చేసెనేని తాను జెడుటయ కాక తన్ను నమ్మి సాయమువచ్చినవారినిగూడఁ దాను జెఱచును. యుద్ధమునకంటె యుద్ధోద్యోగమందే తెలివియెక్కువ యుండవలయును. నడిమిదయ్యిన యీ యుద్యోగ మెవఁడు పట్టిన వాఁడు చేయఁజాలఁడు. అనుబంధము లనుకూలములుగా నుండునట్లుద్యోగింపవలయును. ప్రతికూలము లయ్యెనేని యయ్యుద్యోగము వ్యర్థము. ప్రపంచమంతయు నుద్యోగముతోనే యున్నది. ఉద్యోగమనఁగాఁ గర్మము. అదియే ప్రవృత్తిమార్గము. కర్మము లేనినాఁడు ప్రపంచమును లేనిదే యగును. కర్మముచేతనే వాయుదేవుఁడు వీచుచున్నాఁడు. కర్మముచేతనే కర్మసాక్షి రేయింబవళ్లు చేయుచు సోమరి గాక ప్రకాశింపఁజేయుచున్నాఁడు. కర్మముచేతనే చంద్రుఁ డెల్లప్పుడు తారాయోగము, మాసపక్షమును బొందుచున్నాఁడు. కర్మముచేతనే సమిద్ధమానుఁడయి యగ్నిదేవుఁ డెల్లప్పుడుఁ గాల్చుచున్నాఁడు. ఈరీతినే నిదుర లేక భూదేవి యీభారం బెల్ల వహించుచున్నది. ఈరీతినే నిదుర లేక సమస్తభూతములకుఁ దృప్తి చేయుచు నేళ్లు ప్రవహించుచున్నవి. ఈరీతినే నిద్ర లేక మేఘుఁడు భూనభోంతరంబు నిండునట్లుఱుముచు వర్షించుచున్నాఁడు. వేయేల? సర్వము కర్మయుక్తమై యున్నది. కావున నుద్యోగపర్వ మన్నింటిలో ముఖ్యము.

మఱియు నన్నయభట్టు తనభారతములో నాదిపర్వ ప్రథమాశ్వాసములో వ్యాసభారత కథాప్రస్తావనము సేయుచో—

సీ. 'ధర్మతత్త్వజ్ఞులు ధర్మశాస్త్రంబని
యధ్యాత్మవిదులు వేదాంతమనియు

నీతివిచక్షణుల్ నీతిశాస్త్రంబని
కవివృషభులు మహాకావ్యమనియు
లాక్షణికులు సర్వలక్ష్యసంగ్రహమని
యైతిహాసికు లితిహాస మనియు
బరమపౌరాణికుల్ బహుపురాణసముచ్చ
యంబని మహిఁ గొనియాడుచుండ
వివిధవేదతత్త్వవేది వేదవ్యాసుఁ
డాదిముని పరాశరాత్మజుండు
విష్ణుసన్నిభుండు విశ్వజనీనమై
పరఁగుచుండఁ జేసె భారతంబు.'

అని వర్ణించినాఁడు. నన్నయభట్టు చెప్పిన ధర్మశాస్త్రంబును, వేదాంతశాస్త్రంబును, నీతిశాస్త్రంబును, ఇతిహాసంబును, కావ్యంబును నను నివియెల్ల యుద్యోగపర్వములోఁ గలవు. ధర్మశాస్త్రము శ్రీకృష్ణవాక్యంబులయందును, ధర్మజువాక్యంబులయందును గలదు. వేదాంతశాస్త్రము సనత్సుజాతాంతరపర్వంబునందుఁ గలదు. నీతిశాస్త్రము ప్రజాగరాంతరపర్వంబునందును, సంజయయానాంతరపర్వంబునందును గలదు. ఇతిహాసములు సేనోద్యోగాంతరపర్వంబునందును, భగవద్యానాంతరపర్వంబునందును, ఉలూకదూతాగమనాంతరపర్వంబునందును గలవు. కావ్యమనునది యుద్యోగపర్వ మంతటియందును గలదు.

౩. ఈ యుద్యోగపర్వము తెనిఁగించునాఁడు తిక్కనసోమయాజి వేదాంతశాస్త్రమును సంపూర్ణముగ దిగవిడిచినాఁడు. నీతిశాస్త్రమును, ధర్మశాస్త్రమును మిక్కిలి సంక్షిప్తము చేసినాఁడు. ముఖ్యమైన యితిహాసములు రాజనీతి నుపదేశించునవి కొన్ని సంపూర్ణముగ దిగవిడిచినాఁడు. ఈదిగవిడిచినవి ధర్మతత్త్వజ్ఞులకును, నధ్యాత్మవిదులకును, నీతివిచక్షణులకును, ఐతిహాసికులకును అమూల్యమైన బోధనలుగల భాగంబులై యున్నవి.

వ్యాసుని యుద్యోగపర్వమునందుఁ బది యంతరపర్వంబులును, నూటతొంబదియేనిమి దధ్యాయంబులును, రెండుతక్కువ యేడువేలు శ్లోకంబులును గలవు. ఈ శ్లోకంబులలో "సంజయ ఉవాచ", "ధృతరాష్ట్ర ఉవాచ" యను నివి లోనుగాఁగల సంభాషణానుసంధానవాక్యలు నూఱులకొలఁదివి యైనవి కలవయ్యెను. నన్నయభట్టు తనకాలమునాఁటికి మూలశ్లోకములు రెండు తక్కువ యేడు వేలని చెప్పెను గాని యిప్పుడు మనకు దొరకిన యచ్చు ప్రతులనుబట్టి శ్లోకసంఖ్య ౬,౬౫౮ మాత్రముగ కనఁబడుచున్నది. ౩౮౮ శ్లోకములు తగ్గినవి. నిజ మిట్లుండఁగా, నిప్పటి యచ్చుప్రతులలో ననేక ప్రక్షిప్తభాగము లున్నవని యిప్పటివారు కొందఱయ్యలు గాలి పోగుచేసి సాహసించి చెప్పుచున్నారు. ఈ విషయమయి యిప్పుడు నేను చర్చచేయను.

తిక్కనయుద్యోగపర్వంబునఁ బద్యంబులును, వచనంబులును, నాశ్వాసాద్యంతస్తవపద్యంబులును, "సంజయ ఉవాచ", "ధృతరాష్ట్ర ఉవాచ" యనునివి లోనుగాఁగల సంభాషణానుసంధానవాక్యలకు సాటియైన "సంజయుఁ డిట్లనియె", "ధృతరాష్ట్రుఁ డిట్లనియె" నను నవి లోనుగాఁగలవియును, మూలమున లేని "మఱియు," "వెండియు," "ననంతరంబ" యనునివి లోనుగాఁగలవియును, తిక్కన కృతికర్త యైనట్లు చెప్పు నాశ్వాసాంతగద్యంబులును, నివి యన్నియుఁ గలసి వేయును నేనూట యాఱువది యాఱు (౧,౫౬౬) గలవు.

మూలంబునకును, తిక్కనయుద్యోగపర్వమునకును గల ప్రమాణతారతమ్యమును వివరముగాఁ గనఁబఱచుచు నొకపట్టిక ప్రక్కపుటలో నిచ్చుచున్నాను జూడుఁడు:

ఈ ప్రకారముగా వ్యాసమూలోద్యోగపర్వములో ౩౨ అధ్యాయములును, ౯౬౨ పద్యంబులును గల రెండంతరపర్వములైన సేనోద్యోగపర్వంబును, సంజయయానపర్వంబు నను వాని కథ తిక్కనయొక్క ౩౭౬ పద్యగద్యంబులు గల మొదటియాశ్వాసములో నున్నది.

వ్యాసమూలములో ౩౯ యధ్యాయములును, ౧,౫౫౪ పద్యంబులును గల మూఁడు నాలుగైదగు నంతరపర్వంబులైన ప్రజాగరపర్వము, సనత్సుజాతపర్వము, యానసంధిపర్వము నను మూఁడంతరపర్వంబులకథ ౩౩౫ పద్యగద్యంబులు గల తిక్కనయొక్క రెండవయాశ్వాసములోఁ గలదు.

| | వ్యాసమూలములో | | | తిక్కన యుద్యోగపర్వములో | |
|---|---|---|---|---|---|
| | అంతరపర్వము పేరు | అధ్యాయముల సంఖ్య | పద్యముల సంఖ్య | ఆశ్వాసముల సంఖ్య | పద్యగద్యముల సంఖ్య |
| 1 | సేనోద్యోగపర్వము | 19 | 594 | ప్రథమాశ్వాసము | 386 |
| 2 | సంజయయానపర్వము | 13 | 368 | | |
| | మొత్తము | 32 | 962 | | |
| 3 | ప్రజాగరపర్వము | 8 | 599 | ద్వితీయాశ్వాసము | 335 |
| 4 | సనత్సుజాతపర్వము | 6 | 181 | | |
| 5 | యానసంధిపర్వము | 25 | 777 | | |
| | మొత్తము | 39 | 1557 | | |
| 6 | భగవద్యానపర్వము | 79 | 2507 | తృతీయాశ్వాసము | 416 |
| | | | | చతుర్థాశ్వాసములో భాగము | 89 |
| | | | | | 505 |
| 7 | సైన్యనిర్యాణ పర్వము | 9 | 304 | చతుర్థాశ్వాసములో భాగము | 340 |
| 8 | ఉలూక దూతాగమన పర్వము | 5 | 300 | | |
| 9 | రథాతిరథ సంఖ్యాన పర్వము | 8 | 225 | | |
| 10 | అంబోపాఖ్యానపర్వం | 25 | 799 | | |
| | మొత్తము | 47 | 1628 | | |
| | మొత్తం మొత్తము | *197 | 6654 | | 1566 |

వ్యాసమూలములో ౭౯ యధ్యాయములును, ౨,౫౦౭ పద్యంబులును గల యాఱవయంతరపర్వమైన భగవద్యానపర్వంబులోని కథ తిక్కనయొక్క ౪౧౬ పద్యగద్యములు గల మూఁడవ యాశ్వాసములోనను, నాలవయాశ్వాసముయొక్క మొదటి ౮౯ పద్యముల లోనను గలదు.

వ్యాసమూలములో ౪౭ అధ్యాయములును ౧,౬౨౮ పద్యములును గల యేడు, ఎనిమిది, తొమ్మిది, పదియు నగు నంతరపర్వములైన సైన్యనిర్యాణపర్వము, ఉలూకదూతాగమనపర్వము, రథాతిరథ సంఖ్యాన పర్వము, అంబోపాఖ్యానపర్వము నను నాలుగంతరపర్వములలోని కథ తిక్కనయొక్క నాలవయాశ్వాసములో ౯౦ మొదలు ౪౨౯ దాఁకఁ గల ౩౪౦ పద్యగద్యంబులలోఁ గలదు.

తిక్కన రచించిన ౧,౫౬౬ పద్యగద్యములలో నాశ్వాసాద్యంతపద్యంబులు, నాశ్వాసాంతగద్యంబులు నిరువదియు, "ధర్మజుం డిట్లనియె", "సంజయుం డిట్లనియె" యనునట్టివి లోనుగాఁగల సంభాషణానుసంధాన వాక్యములు ౧౫౪ ను దీసివేయఁగా, ౧,౩౯౨ పద్యగద్యంబులు మిగులును. మూలములోని ౬,౬౫౪ పద్యంబులలో ౫,౨౬౨ పద్యంబులు విడిచిపెట్టఁబడినవి. అనఁగా నూటికి ౮౦ చొప్పున విడిచిపెట్టఁబడెను. ౨౦ చొప్పున గ్రహింపఁబడెను.

మఱియుఁ దిక్కన రచించిన ౧,౩౯౨ పద్యగద్యంబులలో నెనిమిది పద్యంబులు ప్రాతఃకాలవర్తనము. ఆ యెనిమిదింటిలో నొకదాని భావమును మూలంబున లేదు. మూలంబునఁ దత్ప్రాతఃకాలవర్తనమే లేదు. ఆవర్తన ధృతరాష్ట్రునకు సనత్సుజాతునివలని యధ్యాత్మబోధ యయినతోడనే తిక్కనసోమయాజి తెచ్చిపెట్టినాఁడు. అమూల్యమై పవిత్రమైన యధ్యాత్మబోధ గల నూటయేఁబదియొక్క పద్యముల గ్రంథమయిన సనత్సుజాతపర్వము సంపూర్ణముగ దిగవిడిచి, దానిబదులు——

* కొన్ని అచ్చుపుస్తకములలో మూలములోని రెండధ్యాయములు కలసి యొక్కయధ్యాయముగా నున్న పోవుటచే మొత్తము ౧౯౭ యధ్యాయముల బదులు ౧౯౬ అధ్యాయములుగా గ్రంథము కనఁబడుచున్నది.

# చిరకాలమునుండి బాధించుచున్న మూత్రవ్యాధులకును శగ (గనేరియా) వ్యాధికిని క్రొత్తగా కనిపెట్టబడిన దివ్యౌషధము.




## గనోకిల్లర్ (రిజిష్టర్డు)

ఈయౌషధము శ్రేష్ఠతమము. ఇంగ్లీషు మందులను దేశీయములగు నౌషధములను పుచ్చుకొనినను గుణము కలుగనియెడలను, యింజక్షనులనైనను వాక్సినులవలనను గూడ లాభము లేకపోయినయెడలను కడపటిప్రయత్నముగా మా గనోకిల్లరునుగూడ పుచ్చుకొనిచూడుడు. పెక్కుయేండ్లనుండియున్నను లేక క్రొత్తగా కలిగినను ఏరకము శగసంకటమైనను మరెట్టి మూత్రవ్యాధులనైనను స్త్రీలకైనను పురుషులకైనను గనోకిల్లరు తప్పక కుదుర్చును. మూత్రము ఝూరీగా వెడలును. మూత్రముపోవుచున్నపుడును కలుగుమంట తగ్గిపోవును. మూత్రనాళము నందలి వాపు తీసిపోవును. శగవ్యాధి (గనోకోకసు) వలన మూత్రము బొట్లుగా పడుట, మేహరోగమువలన మూత్రద్వారమునుండిపోవు తెలుపు, యూరెత్రిటిసు, ప్రోస్టాటిటిసు, సిస్టిటిసు, లుకోరియా, మున్నగువ్యాధులన్నియును స్త్రీలకును పురుషులకునుగూడ గనోకిల్లరువలన కుదురును. వీర్యము (సెమను) పోవుట, స్త్రీలు గర్భవతులుగానున్నపుడు కలుగు మూత్రవ్యాధులు మున్నగునవిగూడ దీనివలన కుదురును. 50 మాత్రలుగల సీసా ఖరీదు రు. 3-0-0 వీ. పీ. చార్జి ప్రత్యేకము. ఒక్కసారి 3 సీసాలు తెప్పించుకొనిన వీ. పీ. చార్జి మేమే భరించెదము.

అడ్రసు:— డాక్టర్ డి. యన్. జసాని, 137 కికావీధి, గులాల్ వాడి, బొంబాయి 4.

Tel. Add. "GONOKILLER" Dr. D. N. JASAN1, I37 Kika Street, Gulalvadi, Bomday, 4.

మద్రాసు సిటి ఏజెంట్లు దాదా అండు కంపెనీ, 52, నైనియప్పనాయకవీధి, మదరాసు.

---

స్వల్పధర ! ఫల మధికము !! పూర్తి తృప్తి!!!

100 కి 100 గురు సంతృప్తిచెందియున్నారు

## లోకామయహర కస్తూరి మాత్రలు




పిల్లలుమొదలు ముసలివారివరకు అందరి మందము, మలబద్ధము, పడిసెము, దగ్గు, [illegible], శీతలముచే కాళ్లులాగుట, కడుపుబ్బరము, కడుపునొప్పి, పక్కలయందునొప్పి, ఆహారజీర్ణకాలమందును తలనొప్పి, చలిజ్వరము, జ్వరము, ప్లేగు, ఇన్ఫ్లూయంజా ఇంకను అనేకవ్యాధులను గుణపరచును. స్త్రీలు ప్రసవించిననాడు, స్నానమునాడు (కస్తూరికి బదులుగా) ఈ మాత్రలు 4-5 ను, 2-3 తమలపాకులలో నమలి మ్రింగవలెను. సాంక్రామికరోగులతో నుండవలసినవారు, దినము 1-2 మాత్రలను సేవించిన ఆరోగ్యదృఢాంగులగుదురు. ఈమాత్రలసీసాతోగల అనుపానపత్రమును చూడుడు. 300 మాత్రలు గల సీసా 1 కి 4 అణాలవంతున ప్రతిచోటులోపలను దొరకును. పోస్టుమూలకముగా 6 సీసాలు రు.1-8-0, 12 సీసాలు రు. 2-12-0, 25 సీసాలు రు. 5-8-0.

సారస్వతాసవం :— మెదడుకు బలమును కలిగించి, జ్ఞాపకశక్తిని వృద్ధిచేయును గావున, మెదడు దుర్బలమువలన గలిగియుండు సమస్తవ్యాధులను పరిహరించి నరములకు మంచిత్రాణను, శక్తివృద్ధిని కలుగజేయును. సంగీతపాఠకుల కంఠస్వరమునకు మృదుమధురత్వము నిచ్చును. పాడను పాడను ఉత్సాహము నింపును. బలహీనలైన స్త్రీలకు నెత్తినడుము (నెత్తినోరు చాల మెత్తగా వుండుటవలన) మాట్లాడను నడువనుకాని పిల్లలకు సంజీవివంటిది.

6 ఔన్సుల సీసా 1కి రు. 1-0-0. పోస్టుఖర్చులు ప్రత్యేకము.

శ్రీ సీతారాఘవ వైద్యశాల, మైసూరు.

"సనత్సుజాతుం డధ్యాత్మవిషయంబులను వివిధ వాక్యంబులు సోపానక్రమంబున నంతకంతకు సూక్ష్మంబులగు నర్థంబులు సమర్థించుచు నందుఁ బ్రజ్ఞాచక్షుం డెయ్యది యేర్పడ నడిగె నది యెల్ల వివరించుచు హృద్యపుష్కరకలితంబగు పరతత్త్వంబు ప్రసాదించునట్టి గూఢోక్తు లనుగ్రహించె"

ననిమాత్ర మొక్కముక్క చెప్పి, "య ట్లనుగ్రహించుచుండఁ బ్రభాతం బయ్యె"నని తత్ప్రాతఃకాలవర్ణనము చేసినవాఁడు. పవిత్రంబును, దివ్యంబును నైన యధ్యాత్మబోధ దిగవిడిచి క్రొత్తగాఁ దెచ్చిపెట్టిన యాప్రాతఃకాలవర్ణనములో శృంగారరసవర్ణనము చేసినాఁడు. విరహమును, సురతక్రియమునుగూడ నందు వర్ణించినాఁడు. ఆ వర్ణన యీపట్టునకుఁ దగు ననునది చింత్యముగాఁగూడఁ దోఁచుచున్నది. (తిక్కన సోమయాజి విడిచిపెట్టిన సనత్సుజాతపర్వము మాహాత్మ్యము చూడుఁడు: ఆపర్వము మూలము ననుసరించి నేను దెనిఁగించి ౧౯౧౦ యవ సంవత్సరములో నచ్చువేయించినవాఁడను.)

౪. తిక్కన యుద్యోగపర్వరచనాకార్య మీరీతి జరగిన కారణముచే నాతనియుద్యోగపర్వము సంక్షేపోద్యోగపర్వ మని చెప్పవచ్చును. ఆతఁడు గ్రంథసంక్షేపణములోఁ దనయిష్టము వచ్చినట్లు పోయినాఁడు. మూలగ్రంథ మామూలాగ్రముగాఁ జదువనివారును, జదివియును బూర్వకవులవిషయమై యభిప్రాయపడుటలో సామర్థ్య ముండి యేమి, లేక యేమి, 'గతానుగతికో లోకః' యన్నట్లు స్వతంత్రులు గాక పరతంత్రు లైనవారును దిక్కన యధ్యాత్మభాగములు మాత్రము విడిచినాఁడనియును, సర్వజనులకు పఠనీయములు కాఁగూడదని విడిచినవాఁ డనియు నందురు. అది పొరపాటు. వేదపారాయణము స్త్రీశూద్రులకు నిషిద్ధ మనుకారణముచేత సర్వజనులకు నుపయోగ మగునట్లు వేదార్థంబులు భారతములో నిమిడ్చి భారతమునకుఁ బంచమవేదమని వ్యాసుఁడు పేరుపెట్టినాఁడు. వ్యాసభారతము సంస్కృతములో రచింపఁబడుటచేతను, సంస్కృతభాష సర్వజనులకు గ్రాహ్యము కాదు కావునను దానిని దేశభాషలోనికిఁ దెచ్చుట యభ్యర్థనీయమే గాక యావశ్యకము కూడ నయ్యున్నది. అదియును గాక, తిక్కన విడిచిన భాగములు వేదాంతభాగములు మాత్రమే కావు. మూలమున ౭౦౦ పద్యములతో నున్న విదురనీతి గల ప్రజాగరపర్వము ౨౩ పద్య గద్యములలో నాతఁడు సంక్షేపించినాఁడు. ఈప్రజాగరపర్వము రాజనీతి గాని వేదాంతభాగము కాదు. గొప్ప రాజనీతి యుపదేశించు విదులాపుత్రానుశాసనము మొదలగు నితిహాసములుకూడఁ దిక్కన దిగవిడిచినాఁడు. ౧౪౯ పద్యములు గల విదులాపుత్రానుశాసనమువలని బోధ యింత యంత యని చెప్ప నలవిగాదు. అది చదివినఁ గాని తెలియదు. అది చదివెనేని రాజవంశమునఁ బుట్టిన యెల్లవాఁడును యుద్ధమునకుఁ బోయి పోరెదనని గంతులు వైచును.

౫. వేయేల, తిక్కన యుద్యోగ పర్వము సంక్షిప్తము. అతఁడు మూలము చూచి తెనిఁగింపఁడయ్యెననియు, నాశువుగా రచించెననియు, నాతఁడు చెప్పినచొప్పునఁ గుమ్మర గురవయ్య లేఖకుఁడుగా నుండి వ్రాసినవాఁడనియును దేశములోఁ బ్రతీతి గలదు. ఈ ప్రతీతి యనునది పూర్వకాలములోఁ గవులు దివ్యజ్ఞానము గలవారనియును, వారు దివ్యసమానులనియును బ్రకృతిజనులకుఁ గల విశ్వాసమునుబట్టి పుట్టినది కాని మఱియొకటి కాదు. ఇది గాక, సంస్కృతమున భారతము వ్యాసుఁడు రచించినప్పుడు విఘ్నేశ్వరుఁ డాతనికి లేఖకుఁడుగా నున్నాఁడు. ఈకథ భారతములోనే యున్నది. దీని ననుసరించి తిక్కనసోమయాజికిఁగూడ నొక లేఖకునిఁ దెచ్చిపెట్టిన బాగుగ నుండునని తలంచి కుమ్మర గురవయ్యసంగతి లోకులు చొనిపినారు. సంక్షేపణకార్యకరణపరీక్ష (precis writing test)లోఁ బ్రశ్నపత్రమును జదివి కన్నులయెదుట నునిచికొని పరీక్ష్యుఁ (examinee) డైన విద్యార్థి సంక్షేపణకార్యమును జరపి ప్రత్యుత్తరము లెట్లు వ్రాయునో యట్లు తిక్కనయును వ్యాసభారతోద్యోగపర్వమును దనకన్నులయెదుట నునిచికొని సంక్షేపణకార్యము తెనుఁగున రచించినాఁడు. మూలమున నున్న పద్యమునకు మాఱుగాఁ బ్రత్యేకాంధ్రపద్యము చేసినచోటనయినను మూలము ననుసరింపక మూలములోని కొంతభాగముమాత్రము తనపద్యములలో

పెట్టి తనపద్యము పూర్తికావున్న దక్కినతోనపద్యభాగములలో వ్యర్థపుమాటలు పెట్టినాఁడు. కొన్నిచోటుల నమ్మాటలనర్థములుఁగూడ నయినవి. ఈదిగువపద్యములు చూడుఁడు:—

వ్యాసభారతోద్యోగపర్వములోఁ బ్రజాగరపర్వములో ముప్పదినాలవయధ్యాయములోని నలువదిరెండవ పద్యము.

"య ఈర్ష్యుః పరవిత్తేషు రూపే వీర్యే కులాన్వయే;
సుఖ సౌభాగ్య సత్కారే తస్య వ్యాధి రనంతకః."

అనియును, దీనికిఁ దిక్కనతెనుఁగుపద్యము

"పరుల ధనమునకు విద్యా
పరిణతికిం దేజమునకు బలమునకు మనం
బెరియఁగ నసహ్యపడు న
న్నరుఁడు తెవులు లేనివేదనం బడు నధిపా."

అనియును గలవు. తిక్కన యీతెనుఁగుఁబద్యము నాచిన్నప్పుడు "సటీక నీతిసంగ్రహ"మని పేరుపెట్టి యప్పటియేలికలు పాఠశాలలో బాలవిద్యార్థులకు నేర్పించిన పుస్తకములోఁ గలదు. విదురనీతిలోనిపద్యము లాపుస్తకములో నింకనుం గొన్ని గలవు. ఆపుస్తకములో నున్నప్రకారముగాఁ జిన్ననాఁటనే పద్యములు వల్లించి పదచ్ఛేదమును టీకయును దాత్పర్యంబును గూడ వర్ణించియుండుటచేఁ గొంచెముకంఠవలి పద్యములు మిక్కిలి యింపుగా నుండును. ఈనడుమ నీ 'పరులధనమున' కనుపద్యము ప్రస్తావవశముచే నేను జదువుటయు, మారాజమహేంద్రములోఁ గవియైన నామిత్రుఁ డొకఁడు "ఓహో యెంత బాగున్న దీపద్యము" అనియెను. బాల్యపరిచయము గల వస్తువు లెల్ల నెట్లున్నను మనకుఁ బ్రీతికరముగాఁ దోఁచును గదా! అనేకవ్యాఖ్యానములు గలిగి యాకారణము చేతనే సామాన్యముగా నెల్లవారిచేతను బఠింపఁబడుచున్న వ్యాసభాగవత వాల్మీకిరామాయణములవలెఁ గాక వ్యాసభారతము కర్కశశైలి గలిగి సుగమవ్యాఖ్యాన రహితమై యునికిం జేసి సామాన్యముగా నెల్లవారిచేఁ బఠింపఁబడని కారణముచే నందలి శ్లోకములు సామాన్యులకింపుగాఁ గానఁబడకపోవచ్చును. ఇందుఁ జూడుఁడు,

వ్యాసమూలము యొక్క [illegible] ప్రకారము

'పరుల కుల-గోత్ర-సౌ[illegible]-
రూప-సత్కార-[illegible]
సౌభాగ్యలేకరం [illegible]
మందు లేనట్టి వ్యాధి [illegible].'

అనియై యున్నది.

ఇది యిట్లుండఁగాఁ దిక్కన పద్యమునందు [illegible] యొక్క ధనము-విద్య-తేజము-బలము [illegible] గుణంబులుమాత్రము వర్ణింపఁబడెను. [illegible] కొన్ని మూలభాగములు లేవు. [illegible] వర్ణించిన [illegible] లేని వేదన పడునని తిక్కన చెప్పినాఁడు. [illegible] రస్య మేమి గలదు? తెవు లున్న వేదన [illegible] ప్రసిద్ధముగా నుండుండఁగాఁ దెవులు లేని వేదన [illegible] వున నవ్వేదన నివారింపఁ దగ్గదియే [illegible]. తిక్కన వానికిఁ దెవులు లేదనియే చెప్పుచున్నాఁడు. [illegible] ప్రాయము వ్యాసునిమూలమునకు [illegible]. వ్యాసుఁడు [illegible] మందు లేని [illegible] కుందు ననుచున్నాఁడు. దీనిసారస్యము [illegible].

మఱియొక యుదాహరణ. మి[illegible]. [illegible] వులు శ్రీకృష్ణుని రాయబారమునకుఁ [illegible] ను, ద్రౌపదియును గొన్నిమాటలు చెప్పినారు. అందు ద్రౌపది చెప్పినమాటలు వ్యాసుఁడు [illegible] పద్యములలో వర్ణించినాఁడు. అం.ఎ.—

తదిదమ్,

౧. 'దుశ్శాసనభుజం శ్యామం సంఛిన్నం పాంసుగుంఠితం
యద్యహం తం న పశ్యామి కా శాంతిర్హృదయస్య మే.'

౨. 'త్రయోదశహి వర్షాణి ప్రతీక్షన్త్యా గతాని మే,
నిధాయ హృదయే మన్యుం ప్రదీప్తమివ పావకమ్.

3. 'విదీర్యతే మే హృదయం భీమవాక్శల్యపీడితమ్,
యోఽయ మద్య మహాబాహుః ధర్మమే వానుపశ్యతి.'

అను నీయూఁడును గడపటిశ్లోకములు. ఈశ్లోకముల తాత్పర్య మేమనిన—

'నాతలవెండ్రుకలు పట్టి యీడ్చిన దుశ్శాసనుని చేతులు ముక్కముక్కలుగా ఖండించినం గాని నామనస్సు శాంతి పొందదు. నాకోప మగ్నివలె మండుచున్నది. మంచిదినములు మనకు వచ్చు నను నాసచే నీపదుమూఁడేఁడు లాకోపమును మనస్సునందు నిల్పియుంచితిని. ఇట్లుండ సంధి చేయుమని భీముఁడు చెప్పుచున్నాఁడు: వానివాక్యములు ములుకులవలె నా గుండెఁ బగులఁగొట్టుచున్నవి.'
అని యై యున్నది.

ఈశ్లోకములు తెనిఁగించుచోఁ దిక్కన—

'నెట్టన యిట్టియల్క మది
నిల్పితి రక్కసతాల్మిఁ జిచ్చొడిం
గట్టినయట్లు పెద్దయును
గాలము దీనికి నాఁబు లెన్నఁడుం
బుట్టదు దుష్టనిగ్రహము
పూని జగంబులు కాచునట్టి తోఁ
బుట్టువు నీవుఁ దేజమునఁ
బొల్చిన భర్తలుఁ గల్గ నచ్యుతా!'
అని చెప్పినాఁడు.

ఇందుఁ దిక్కనయుపమానవాక్యము నాకు సమంజసముగా లేదు. ఒడిలోఁ జిచ్చు గట్టికొనుట సహజము కాదు. అట్టిపని వెఱ్ఱివాఁడు చేయును. అట్టిపని తన్నుఁ జేసినవానినే నాశము చేయును. ఇక్కడ ద్రౌపది యగ్నివలె మండుచున్న తనకోపమును సమయము వచ్చినప్పుడు కౌరవులమీఁదికిఁ బంపి వారిని మాఁడ్చివేయవలయు ననుకోరికతోఁ జలపట్టి మనస్సులోఁ బెట్టికొని యున్నది. భీముఁడు సంధికి మెత్తపడుచుండుటచేఁ దన కోరిక యీడేఱుటకు సమయము రాదోకో యని విచారించుచున్నది. ఒడిలోఁ జిచ్చు కట్టికొనుట యవశమైన పని గాని వశమైనపని గాదు. చలముచేత మనస్సులోఁ గోపమును నిలిపికొనుట వశమైనపని. ఇది గుణములోఁ జేరినది. బుద్ధిపూర్వకముగా నొడిలోఁ జిచ్చు కట్టికొనుట దోషము కాని గుణము కాదు. 'ఒడిలోఁ జిచ్చు కట్టికొనుట' యనుసామెత కొఱవిపెట్టి నెత్తి గోఁకికొనుట యనుసామెతవలె నసదర్థమందుఁ బ్రయోగింతురు గాని సదర్థమందుఁ బ్రయోగింపరు. అది కర్తయొక్క మౌఢ్యమును దెలుపుటకుఁ బ్రయోగింతురు. ఇక్కడ ద్రౌపది మూఢురాలా ? కాదు, ధీరురాలయి రాచబిడ్డ చేయవలయుపని చేసినది. కావునఁ దిక్కన యుపమ సరియైనది కాదు. ఆతఁడు వ్యాసమూలము నన్వయించికొనుటలోఁ బొరపడినాఁడు. మఱియుఁ దిక్కనపద్యములోని యుత్తరార్థములో వాక్యసంపర్కము సరిగా లేదు. దుష్టముగానున్నది. అది వ్యాసుఁడు ద్రౌపదిచేతఁ జెప్పించిన మాటలుగల కడపటిశ్లోకమునకు సరియైన భాషాంతరీకరణము కాదు. అది తిక్కన స్వతంత్రించి చెప్పించినవాఁడు. అట్లు చెప్పించినవాఁడని మన ముపేక్షింతమన్న నాతనివాక్యములో నవాచికవాక్యదోషము గలదు. ఏలనఁగా, జగంబులు కాచునట్టి తోఁబుట్టువ వీవును, దేజమునఁ బొల్చెడు భర్తలను బ్రదికియుండఁగా నా కోప మెన్నటికిని నాఱదని ద్రౌపది చెప్పిన ట్లున్నది. కృష్ణనిర్యాణ మైనతరువాతను, బకులు మృతులైనతరువాతను దనకోప మాఱునని ద్రౌపదిభావమా? ఓహో, యెంత ప్రమాద మెంత ప్రమాదము! అట్టిభావమే యైనయెడ నవ్వాక్యము తిక్కనకుఁ బరిచితురాండ్రై) కొండవీటిసీమ యువతులలోనొక పల్లెటూరిది యాడఁదగిన మోటుమాట.* అది

* కొండవీటిసీమయువతులు మోటుమాట లాడుదురని పయిని జెప్పియున్నాను. వారిసరసము మోటుసరసము. ఈవిషయమయి యొకచిన్నకథ చెప్పెదను. ఆకథ కిది యస్థానం బని పాఠకులు తలంప కుండ్రుగాత యని వేఁడుచున్నాను. ఒకనాఁడు గుంటూరులో వివాహసంబంధమయిన యుత్సవదినములందుఁ బెండ్లికొడుకువారును, బెండ్లికొమరితవారును గలసి సభఁహాడి సరససల్లాపము లాడికొనుచుండుతఱిని వధువు తెలివి గలదని ప్రస్తావవశమున నొకయువతి పలుకుటయుఁ, దెలివిగలదయినను మగఁడు చెప్పినట్లు నడవదేని మగఁడు చెప్పొకటి తీసికొనువాఁడని వరునితల్లి తాంబూలరసము తనకట్టికొన్న చీరమీఁదఁ గార్చికొనుచు నశుద్ధదంతములు

వరముచే యజ్ఞకుండంబునుండి జనియించినదియు, దివ్య సమానయు, భర్తకుఁ బరిచర్య చేయువిధము రుక్మిణీదేవి కుపదేశించిన మహాపతివ్రతయు, మహాపండితురాలును, గృహభక్తురాలును నగు ద్రౌపదీదేవి యుచ్చరింపఁదగ్గ వాక్యము గాదు. అయ్యును య ట్లుచ్చరించెనని చెప్పి తిక్కన ద్రౌపదీ పాత్రవృత్తౌచిత్యము చెఱచినవాఁడు.

తిక్కనభావ మది కాదనియును, దుష్టనిగ్రహము పూనిన తోఁబుట్టువ వీవును, దేజమునఁ బొల్చెడు భర్తలు ను నా కున్నవారై నను, నాకోప మాఱుట కిప్పటికి నవ కాశము దొరకొనదయ్యెనని ద్రౌపది విచారముతోఁ బలి కినదయ్యెనని యాతనిభావ మని యెవ్వరైన నందురే మో, య ట్లన్న యెడఁ దిక్కన యీభావము స్పష్టముగాఁ దెలుపునట్లు వాక్యము రచింపఁజాలఁడయ్యెనని నేను నొక్కి చెప్పుచున్నాను. ఈభావము స్పష్టపఱచుటకు వానిపద్యములోని రెండవపాదమందలి

"......... దీని కాఱు టెన్నఁడుఁ డన్" అనునది

'దీనికాఱు టింతకుఁ' అనియును, వాని నాలవ పాదములోని కడపటిభాగమైన "భర్తలు గల్గ నన్యుతా!" అనునది 'భర్తలు నుంటి రైననున్' అనియును గూర్చి దిద్ది నట్లయిన బాగుగ నుండును. అప్పుడు పద్యమిట్లుండును:-

ఉ. 'నట్టన యిట్టి యల్క మది నిల్పితి రక్కసతాల్మిఁ
జి చ్చొడిం, గట్టిన యట్లు పెద్దయును గాలము దీనికి
నాఱు టింతకుం, బుట్టను దుష్టనిగ్రహము పూని
జగంబులు కాచునట్టి తోఁబుట్టువు నీవుఁ దేజమునఁ
బొల్చెడు భర్తలు నుంటి రైననున్.'

పద్య మిట్లు మనము దిద్దినను మనకుఁ గనిపించిన తిక్కన యుపమానాసమంజసత్వము నిల్చియేయున్నది.

ఇక్కడ (1) వ్యాసమూలము ననుసరించి తెనిఁ గించుచో శ్లోకము సమన్వయించికొనుటలోఁ బొరపడి మూలమునందలిరసము చెఱచుట తిక్కనపద్యముయొక్క పూర్వార్ధమందును, (2) వ్యాసమూలమున లేని భావ మును వర్ణింప యత్నించి వర్ణింపలేక ప్రత్యేనాయము వచ్చునట్లు ద్రౌపదిచేత నవాగినప్పు పలుకు పలికించుట యను దోషము తిక్కనపద్యముయొక్క స్వకపోల కల్పితమయిన యుత్తరార్ధములోను నెల్లడియగుచున్నవి. పయి నుదాహరించిన మూఁడుసంస్కృతశ్లోకములకు నేను రచించిన తెనుఁగుపద్యములు మూఁడుఁను:-

'అన్న దుశ్శాసనుని దైన శ్యామభుజము
చెండి పచ్చడిపచ్చడి చేసి నాకు
కంటియెదుటను బెట్టినఁ గాక కృష్ణ,
యెక్కడిది శాంతి నాదైనవ్యాపియము సకప.

'మంగిదినములు వచ్చును మనక టనెడు
నాసఁ గపెపితిఁ బదియుమూఁ డైనయేండ్లు
చిచ్చుగతి మండుకోపంబు నిత్తిమందు
నెఱయ నిలిపినదాననై నీరజాక్ష.

'అట్టినాగుండె భీమునాక్ర్యంబు లనెడు
ములుకు లిటు మూఁగఁ బగులఁగా మొదలుపెట్టె
నక్కటా మహాభుజం దైనయాతనిమాపు
ధర్మమునయంప నిచ్చెను దానవారి!'

ప్రమాణంబు లింకను నుదాహరింపవచ్చును గాని గ్రంథవిస్తరభీతిచే నిప్పటికి దీనితోఁ జాలించెదను.

౬. మఱియును బూర్వకవులవిషయమైన యభి ప్రాయములోఁ బెక్కురు పరతంత్రులుగా నున్నారని పయిని చెప్పియున్నాను. పూర్వకవులయెడఁ గల విశ్వాస మెంతవఱకు పోయినదో చూడుఁడు:శబ్దార్థవిషయములోఁ గూడ నన్విశ్వాసముచేఁ గొందఱు భ్రమపడుచున్నా రు. వినుఁడు. "వమ్ము" అనఁగా వ్యర్థమని యెల్లవారికి నెఱుకయేగదా! వ్యాసుఁడు వ్యసనోదయములయిన దోషములను విడువవలయునని విదురునిచేత ధృతరాష్ట్రు

కనఁబడునట్లు హాస్యముచేయుచు మోటుపలుకు పలికినది. ఆపలు కచటి యువతీమండలమునకు మిక్కిలి సరసము గాను, వినోదకరముగాను గాన్పించినది. అక్కడనేయున్న నాకు దుఃఖమును, గోపమును బుట్టినవి. అఱకాలి మంట నెత్తి కెక్కినది. కాని యాఁడువారితోఁ గఠినముగా మాటలాడుట నాస్వభావము కామిచే నాకోప మును, దుఃఖమును జల్లార్చికొని మాఱుపలుకు పలుకక యూఱకుంటిని.

నకుఁ జెప్పెంచుచోఁ బ్రజాగరపర్వమునందు(33) ముప్ప దిమూఁడవ యధ్యాయములో—

"సప్తదోషాః సదా రాజ్ఞా
హాతవ్యా వ్యసనోదయాః;
ప్రాయశో యై ర్వినశ్యంతి
కృతమూలా అపీశ్వరాః.

"స్త్రియో௨క్షా మృగయా పానం
వాక్పారుష్యం చ పంచమమ్;
మహచ్చ దండపారుష్య
మర్థదూషణ మేవచ."

అని రెండు శ్లోకములు రచించినాఁడు. ఇవి 56-57 నగు శ్లోకములు. ఈ రెండుశ్లోకములకును నేను రచించిన నా తెనుఁగుపద్యము లీదిగువ వ్రాయుచున్నాను:—

'కల లేడిల వ్యసనోదయ
ము లయినదోషములు వాని భూపతి విడువన్
వలయుఁ బతి సాదుకొనినను
వలవానిని జెఱచు నిత్య మని యెఱి యంటే.

'వెలఁదియు జూదము వేఁటయుఁ
గలు ద్రావుట ప్రల్లదములు కడుఁ బలుకుట మి
క్కిలి కఠినపు దండనమును
గలధనములు పాడుసేఁత కౌరవవర్యా.'

వ్యాసమూలములైన రెండుపద్యములను దెనిఁగించుచోఁ దిక్కన—

'వెలఁది జూదంబుఁ బానంబుఁ వేఁట పలుకు
ప్రల్లదంబును దండంబుపరుసఁదనము
సొమ్ము నిష్ప్రయోజనముగ వమ్ముసేఁత
యనెడు సప్తవ్యసనములఁ జనదు తగుల.'

అని యొక్కపద్యము రచించినాఁడు. ఈపద్యము చదివికొని యిందు మూఁడవపాదములోని "నిష్ప్రయోజనముగ" నను విశేషణము చూచి "వమ్ముసేఁత" యనఁగా వ్యయముచేయుట యని యర్థముచేసికొని బహుజనపల్లి సీతారామాచార్యులుగారు శబ్దరత్నాకర మను తమ తెనుఁగునిఘంటువులో "వమ్ము" శబ్దమున కర్థము వ్యయమని చెప్పినారు. ఈయర్థమందు వమ్ముశబ్ద మెక్కడను వాడుకలో లేదు. గ్రంథములయందును బ్రయోగింపఁబడి యుండదయ్యెను. ఈయర్థము తిక్కన వ్యర్థపు మాటలు వేయఁ డను గాటమైననమ్మికచేత సీతారామాచార్యులుగారికి స్ఫురించినది. "నిష్ప్రయోజనముగ వమ్ముసేఁత" యని తిక్కన ప్రయోగించినప్పుడు సప్రయోజనముగ వమ్ముసేఁతకూడ నుండునని యాశయము చేసికొని "వమ్ము"నకు వ్యర్థమని యర్థమయ్యెనేని సప్రయోజన మెట్లగునని యాశంక చేసికొని "వమ్ము"న కర్థము వ్యయమని యాతఁడు చెప్పినాఁడు. తనయర్థమున కీపద్యమే లక్ష్య మిచ్చినాఁడు. ఇందు నిష్ప్రయోజనముగ ననువిశేషణము మహాకవియైన తిక్కన యనావశ్యకముగఁ బ్రయోగించుటచే నింతదోసఁగు పుట్టినది.

8. పూర్వకవులయెడఁ గల విశ్వాసముచేఁ గొందఱు లాక్షణికులు ఛందోలక్షణములోఁగూడ భ్రమపడుచున్నారు. ఇటు వినుఁడు—

"జ్ఞానము కేవల కృప న
జ్ఞానికి నుపదేశవిధి ప్రకాశముసేయం
గా నది సకలసరిత్తీ
ర్థానంబులకంటె నధికతరఫలద మగున్."

ఇది తిక్కన భారతశాంతిపర్వములోని పద్యము. ఇందు రెండవపాదములోఁ గాకును జ్ఞాకును యతిమైత్రి పడ్డది. ఈమైత్రి కాధారమైన లక్షణ మెంగును గానిపింపదు. సంయుక్తాక్షరమైన "జ్ఞా" లోని యొకయక్షరమైనను "గా"కు సవర్ణమైనది కాదు. పామరులు మాత్రము జ్ఞాలోని జకారము గకారముగా నుచ్చరించుచున్నారు. "జ్ఞానము"ను "గ్నాన" మని యుచ్చరించుచున్నారు. తిక్కనకు సంస్కృతభాషాపాండిత్యము లేదనియును, జ్ఞానశబ్దములోని సంయుక్తాక్షరము పూర్వము పామరులు వ్రాయుచుండినట్లు "గకారనకారాకారములు"గా నాతఁడుకూడ వ్రాయుచుండువాఁడనియు, నాతనికి సంస్కృతభాషాపాండిత్యము లేదనుదాని కాతని యీపద్యములోని యతిమైత్రి యొక

నిదర్శనమనియును గజపపట్టణవాస్తవ్యులును, సాంధ్ర గీర్వాణమహాపండితులును నగు నామిత్రులు కీర్తిశేషులు కందాళ దాసాచార్యులుగారు నాతోఁ బలికిరి. ఆయనతో నే నేకీభవించుటకు సాహసింపను గాని తిక్కన యీప్రయోగము ప్రమాదవశ మనుచున్నాను. ఈప్రమత్తప్రయోగము ప్రమాణముగాఁ గైకొని యప్పకవి తనలక్షణగ్రంథమైన యప్పకవీయములో

"ప్రౌఢకవులు కొందఱు జ్ఞకారంబునకును
బ్రహ్మవర్గంబు తొలియక్కరములు నాల్గు
నిడుదురు ప్రబంధముల నొక్కయెడ విశేష
వఱు లనుచు సోమయాజులు వాడుకతన."

అని లక్షణము విధించి కకార జ్ఞకారములకు యతిమైత్రి యుండవచ్చు నన్నాఁడు. ఈలక్షణమునకు సోమయాజి యొక్క యీయొక్క ప్రయోగముమాత్రమే లక్ష్యముగాఁ గైకొన్నాఁడు. సంయుక్తాక్షరమున కని ప్రత్యేకము యతిమైత్రి యెక్కడను నుండదు. కకార జ్ఞకారములు భిన్నవర్గములు. పూర్ణబిందుపూర్వకము లయిననే కాని సవర్గము లయిన మొదటినాలుగక్షరములకే కడపటియక్షరముతో యతిమైత్రి లేనప్పుడు భిన్నవర్గాక్షరముల కెట్లుండును? ఉండుననుట 'తుంటిమీఁదఁ గొట్టితే నోటిపండ్లు రాలు' నన్నట్లుండును. అప్పకవిది యెంత మతిభ్రమణమో చూడుఁడు. ఈమతిభ్రమణము పూర్వమప్పయదీక్షితుఁడు కాశిపట్టణములో గంగాఘట్టమున నొకనాఁటి సాయంకాలమునందుఁ గూర్చుండి సాయంసంధ్య వార్చుచుండఁగా నతనియెఱుకను గాక గాలి కాతనిగోఁచి యూడియునికి గాంచి గోఁచి యూడ్చి సంధ్యవార్చుట శాస్త్రీయమని భ్రమసి తాము గోఁచు లూడఁదీసికొని యాతనిసరసం గూర్చుండి సంధ్యవార్చి కొనుచున్న యాతనిశిష్యులకథను నాకు జ్ఞప్తికిఁ దెచ్చుచున్నది. అప్పకవి లక్షణము చేయునాఁటికిఁ దాను జీవించియుండి యాతని లక్షణగ్రంథము చూచెనేని శిష్యులు గోఁచు లూడ్చికొనుటకుఁ గారణ మెఱింగి యప్పయదీక్షితుఁడు వారిని నిందించినట్టులే తిక్కన సోమయాజి యప్పకవిని నిందించును. అప్పు డప్పకవి తన లక్షణపద్యమును తీసిపాఱవైచును.

మఱియు నప్పకవిపద్యములోని "విశేషవఱు లనుచు" ననుదాని కన్వయ "మిడుదురు" నను క్రియతోనా, "వాడుకతన" ననుదానితోనా? అనఁగా విశేషవఱు లన్నవారు సోమయాజులా? అప్పకవిప్రౌఢకవులా? ఇది సందిగ్ధముగా నున్నది. దీనితో నన్వయించునప్పుడు నప్పకవి ప్రమాణము మాఱఁజాలదు. అతనిది వట్టిఊహ— (mere guess).

౭. మఱియును భావకాఠిన్యము గలపట్టులఁ జెక్కుపద్యంబులు మూలములోనివి తెనిఁగింపక తిక్కన దిగవిడిచినాఁడు. అట్లాతఁడు విసర్జించిన పద్యంబుల భావంబులు కొంతవఱకు నీలకంఠీయవ్యాఖ్యానమువలన స్పష్టపడుచున్నవి. కొన్నిపట్టుల నీలకంఠునియన్వయి మతిక్లిష్టముగాఁగూడ నున్నది. గ్రంథవిస్తరభీతిచే నీయర్థంబున లక్ష్యంబు లిప్పు డీయఁగఁ జాలను. ఇదియును గాక, మూలములో శబ్దకాఠిన్యము గల పట్టులను శ్లోకభావకాఠిన్యముగల పట్టులను దిక్కన తెనిఁగింపమియుంగూఁ గల యుపేక్ష (omission) దోషము విషయమై నే నేమియు విస్తరించి వ్రాయఁజాలను.

౮. మఱియు నింకొక్కటి చెప్పెద వినుండు. కొన్నిచోటులఁ దిక్కనభాషాంతరీకరణము న్యాయమునకును, స్వభావమునకును విరుద్ధముగాఁగూడ నున్నది. పాత్రౌచిత్యపోషణములో న్యాయమునకుఁ గల సామగ్ర్యమును, నేర్పును నేయిటఁ గనిపింపలేదు. సంజయుఁడుగాన పర్వములో దూతయయిన సంజయుని కెట్టివిశేషణములు పెట్టెనాఁడో చూడుఁడు. ఈపర్వములో మూలములో మున్నూటయిరువది యేనిమిది శ్లోకములు గలవు. అం దొక్కశ్లోకములోనయినను గుణశ్లాఘనము గాని, ధృతరాష్ట్రుఁడు గాని, వాసుదేవుఁడు గాని దోషము సంజయునిచేఁ జెప్పింపఁడయ్యెను. సంజయుఁడు తనకును ధర్మజునకును జరిగినసంభాషణములోఁ దనయొడయుని పయి నీఁగ వ్రాలనిచ్చినవాఁడు కాఁడు. ధర్మజుఁడు తనతమ్ముల పౌరుషము లుగ్గడించుచుఁ గౌరవుల నెత్తి పొడుచుచు వారిక్షేమము నడిగినప్పుడు సంజయుఁడు కౌరవులు సజ్జనులనియును, వారిని ధర్మజుఁడు నిందించుట క్రౌర్యమనియును బ్రత్యుత్తర మిచ్చెను. దీనికి నిద

ర్శనముగ సంజయయానపర్వములోని యిరువదినాలవ యధ్యాయము మాడుండు. దానికి నాయాంధ్రీకరణ మీదిగువ నగపఱచుచున్నాను:—

'ఎట్టు చెప్పితి వీ వది యట్టివ కురు
వరుల నడిగితి నడిగితి గురుజనంబు
నీ వడిగినట్టికురువీరు లెల్ల మంచి
వారు నేమముతో నున్నవారు వారు.

'ఏను మఱి ధార్తరాష్ట్రక
వృద్ధులు సాధులుఁ బాపులైన వా
రును గల రెల్లవారుఁ బలె ను
ద్ధత శాత్రవు లైనవారి కే
నొసఁగ సుయోధనుం డొసఁగు
చుండును దత్పరతం గదుఁ సిరుల్
గొనకొని బ్రహ్మదాయముల
లోపము సేయు నదేల యట్టిగో.

'జనవర మీకు ద్రోహమును
సల్పనివారిని సల్పినట్టివా
రని వధియింపఁ బూను టది
యక్కట క్రౌర్య మసాధువృత్తి యాఁ
దను మఱఁదా నసాధువయి
తత్ధృతరాష్ట్రుఁడు సాధువృత్తిచేఁ
దనరు మిముం బగం గొనినఁ
దప్పక ద్రోహియె మిత్రకోటికిన్.

'పాపం బించుక యొల్లఁ డా ముసలియో
పాలుండు చిత్తంబునం
దాపం జాలనితాప మొందుచును గం
తాక్రాంతుఁ డై యున్నవాఁ
డో పృథ్వీశ్వర, జ్ఞాతిద్రోహ మిలలో
నుత్కృష్టపాపంబులం
బాపిష్ఠంబని బ్రాహ్మణుల్ తెలుప సం
భావించుచుండుం జుమీ.

'ఇనవర సంగమందు స్మరి
యించుచునుందురు నిన్ యుధిష్ఠిరుం
డనుచును యుద్ధ మైనతటి
నాహవనాయకుఁ డైన సవ్యసా
చిని స్మరియించుచుండ్రు మఱి
చెప్పెద గుండుభీకరంబైశబ్దముల్
విన నసగో స్మరించెదరు
భీము గదాయుధహస్తు భూవరా.

'తలఁతురు రణరంగంబున
నలుదిక్కులఁ బర్వులిడు చనారత మరినే
నల నంపవాన ముంచెడు
నలకవలం దుష్ప్రకంపులను రథివరులన్.

'రేపు తనయదృష్ట మేపాట నుండునో
యధిప యెవ్వఁ డెఱుఁగఁ డని తలంచు
నఖిలసర్మయుతుఁడ వయ్యును బహరాని
పాటు లట్లు పడినవాఁడ వైతి.

'ఐన నీ దైనప్రజ్ఞచే నయ్య దెల్ల
నీవ సరిచేసికొనఁగదే దేవ మఱల
నింద్రసము లైనపాండవు లెన్నఁ డైన
భోగములకయి ధర్మముల్ పో విడుతురే?

'నీవ సరిచేసికొను మిది నేర్పుతోడఁ
బార్థివా ధార్తరాష్ట్రులుఁ బాండవులును
సృంజయులు వీరిఁ గూడిన నృపకు లెల్ల
నెట్లు సుఖ మందఁగలవార లట్లు తండ్రి.

'తానును గొడుకులు మంత్రులు
మానుగ రేఁ గూడి నాకు మనుజేశుం డా
మీనాయన చెప్పిన వ
ర్కే నిదె నుడివెదను వినఁగదే కడు శ్రద్ధన్.'

ఈసందర్భమునందే, మఱియు సంజయుఁడు నీవు చిరకాలము ద్వేషము దాల్చి పాపకర్మమయిన యుద్ధము చేయఁదలఁచికొన్నవాఁడ వనియును, నిష్కారణంబుచే నీకుఁ బదుమూఁడు సంవత్సరము లరణ్యాజ్ఞాతవాసకష్టములు కుడువవలయుట యధర్మము కావనియును, దుర్యోధనుఁడు దోషి కాఁడనియును గూడ ధర్మరాజుతోఁ జెప్పుచున్నాఁడు. సంజయయానాంతగపర్వములో




దురదృష్టవంతులు



హరిభజనము-తన్మయత

‘మాలి’

"చులుకని కార్యము చేయం
దలఁచుట మీయట్టి సర్వధర్మజ్ఞులు శాం
తులు ననఁ బ్రసిద్ధు లగు పె
ద్దలకుం దగ వగునె యెవ్విధంబునఁ జూడన్.

"మఱుఁగుఁజీరయందు మసి దాఁకినట్లు మీ
సత్కులమునఁ గల్మషంబు కౌర
వేంద్రు కతనఁ బొందె నింతయుఁ బాపంగ
నీవ నేర్తు ధర్మనిపుణహృదయ."

అని తిక్కన తనభారతములోఁ దెనుఁగుపద్యములు రచించినాఁడు. వ్యాసమూలములో,—

'మీరు సకలధర్మయుక్తులు, సత్కులులు, దయాసముద్రులు, సత్వగుణ ప్రధానులు, గొప్పవారు. హీనకర్మము, హింస చేయుట మీకుఁ దగదు. యుద్ధము చేసితిరేని మీకుఁ బాపము వచ్చును. మీకుఁ బాపమున్న యెడ నప్పాపము తెల్లనిబట్టమీఁదఁ గాటుక మఱకవోలెఁ బ్రకట మగును.'

అని సంజయుఁడు ధర్మజునితోఁ జెప్పినట్లుండఁగా,

'మీరు ధర్మజ్ఞులు; చులుకనికార్యము చేయుట మీకుఁ దగదు. మీసత్కులమునకు దుర్యోధనునిమూలమునఁ బాప మంటినది. ఆపాపము తెల్లనిబట్టమీఁదను మసి యంటిన ట్లున్నది. ఆపాపము పోఁగొట్టుటకు నీవే నేర్తువు. పోఁగొట్టవలయును—'

అని సంజయుఁడు చెప్పినట్లు తిక్కనసోమయాజి పద్యములలో నున్నది. ఇందుఁ దిక్కన ప్రమాదపడ్డాఁడు. అతనియర్థము మూలమునకు విరుద్ధమును, సంజయుని వర్తనమున కసంబద్ధమును, సంప్రదాయమునకు దూరమును నైయున్నది. పాత్రవృత్త్యౌచిత్యము చెడినది. కథకుఁ బాత్రవృత్త్యౌచిత్యమే ప్రధానముగదా!

అగియును గాక తిక్కనరచన నాకు యుక్తియుక్తముగాఁ గనఁబడదు. అర్థమందుఁ బూర్వపరములకు సందర్భము లేదు. దుర్యోధనుఁడు పాపము చేసినాఁడనియును, మసిచేత మఱుఁగుబట్ట చెడిన ట్లప్పాపముచేఁ గులము చెడిన దనియును, నప్పాపముఁ బాపుటకు నీవే నేర్తు వనియును సంజయుఁడు ధర్మజునితోఁ జెప్పినాఁడని యీపద్యార్థ మయ్యున్నది గదా. దానితరువాతి పద్యములో యుద్ధము చేయవలదని సంజయుఁడు ధర్మజునితో ననును. పృష్ఠ్యంధకరాజ్యములకుఁ బోయి బిచ్చమెత్తికొని బ్రదుకుట మనిషిహడఁ బిమ్మట నాతఁ డనును. దుర్యోధనుఁడు చేసినపాపము ధర్మరాజు యుద్ధముచేయక పృష్ఠ్యంధకరాజ్యములకుఁ బోయి బిచ్చమెత్తికొని బ్రదికినయెడ సంజయునిచేతఁ దిక్కన్న చెప్పించినట్లు పోవునా? ధర్మరా జట్లు చేసెనేని దుర్యోధనునిపాపము మఱియింతస్పష్టముగా నితరరాజ్యములలో సహితముఁ గానఁబడును. ఎంతదురాత్ముఁడే యమ్మా దుర్యోధనుఁడు, కపటద్యూతమున ధర్మరాజు రాజ్య మపహరించి పదుమూఁడేఁడు లరణ్యాజ్ఞాతవాసములచేఁ గష్టపెట్టుటయే గాక, నేఁ డాధర్మమూర్తిచే బిచ్చమెత్తించుచున్నాఁ డని యింటింటను నిల్లాండ్రుగూడఁ జెప్పికొందురు, దానిచే దుర్యోధనునిపాపము తిక్కన భ్రమసినట్లు పోనేరదు సరియ కదా, మీఁదుమిక్కిలి యది ప్రపంచమంతయుఁ బ్రాఁకును.

ఇది గాక, దుర్యోధనుఁడు నీవిషయములో నేరము చేసినాఁడనియును, దద్దోషపరిహారార్థము మహారాజ వైన నీవు విదేశములకుఁ బోయి బిచ్చమెత్తికొనవలయు ననియును మహాత్ముఁ డైనసంజయునిచేత ధర్మరాజుతోఁ దిక్కనమహానుభావుఁడు చెప్పించినవిధము చూడఁగాఁ బంచమహాపాతక కథలు నాకు జ్ఞప్తికి వచ్చుచున్నవి. ఆకథలు నిజము కావనియుఁ బరిహాసమునకుఁ గల్పింపఁ బడ్డవనియు నింతకు ముందు నేను దలంచితిని గాని, రాజాధిరాజులదోషములు సహితముఁ బ్రపంచమునకు వెల్లడిచేయుచు బుద్ధులు చెప్పు భారము వహింపవలయు కవీంద్రులలోఁ జేరిన తిక్కనయొక్క యీనడవడి చూడఁగా నక్కథలు నమ్మఁదగనివి కావని యిప్పుడు నాకుఁ దోఁచుచున్నది.

ఇట్లు వ్యాసమూల మపార్థము చేసి తిక్కన పాత్రౌచిత్యము చెఱిచినదానికి నింకను నెనిమిదిలక్ష్యములు చూపుచున్నాను. రెండవలక్ష్య మేదనఁగా,—

అభిమన్యుని వివాహానంతరము విరాటరాజుసభ లోఁ గృష్ణుఁడు పాండవుల ధర్మవర్తనమును, ధార్తరాష్ట్రుల యధర్మవర్తనమును నుపన్యసించి శాంతిపురుషా ర్థము ననుసరించి రాజ్యము పాండవులకు మరల రావల యుననియు నేతన్నిమిత్తమయి దుర్యోధనునిపాలికి దూతను బంపవలయు ననియు నిశ్చయించెను. ఈకథ యుద్యోగపర్వ ప్రథమాధ్యాయములోనే కలదు. రెండవ యధ్యాయములో బలరాముఁడు పాండవధార్తరాష్ట్రుల వర్తనవిషయమయి కృష్ణునియభిప్రాయమునకు విరుద్ధాభి ప్రాయ మిచ్చెను. అయ్యభిప్రాయమును గనఁబఱచు వ్యాసమూలము చూడుఁడు:—

౧. "సర్వా స్వవస్థాసు చ తే న కోప్యా
 గ్రస్తో హి స్వార్థో బల మాశ్రితై స్తైః,
 శ్రీ యాభ్యుపేతస్య యుధిష్ఠిరస్య
 ద్యూతే ప్రసక్తస్య హృతం చ రాజ్యం.

౨. "నివార్యమాణ శ్చ కురుప్రవీరః
 సర్వైః సుహృద్భి రయమ ప్యతజ్ఞః,
 గాంధారరాజస్య సుతం మతాక్షం
 సమాహ్వయ ద్దేవితు మాజమీఢః.

౩. "స దీవ్యమానః ప్రతి దీవ్య చైనం
 హిత్వాపి కర్ణంచ సుయోధనంచ,
 దురోదరా స్తత్ర సహస్రశోఽన్యే
 యుధిష్ఠిరో యా న్విషహేత జేతుం;
 ఉత్సృజ్య తా న్సౌబల మేవ చాయం
 సమాహ్వయ త్తేన జితోఽక్షవత్యామ్.

౪. "స దీవ్యమానః ప్రతిదేవనేన
 అక్షేషు నిత్యం తు పరాఙ్ముఖేషు,
 సంరంభమాణో విజితః ప్రసహ్య
 తత్రాపరాధః శకునే ర్న కశ్చిత్."

ఈమూలపద్యములయర్థము నాయీదిగువ తెనుఁగుపద్యములలో స్పష్ట మగుచున్నది:—

'ఎన్నఁడు వారి కల్మి యొక
 యింతయుఁ బుట్టఁగఁ జేయ రాదు రా
జోన్నతిచే సు[illegible]
 [illegible] బ్రతిష్ఠ [illegible]
బన్ని [illegible]
 [illegible]
బన్నముచే బరి[illegible]
 [illegible].

'పలుకు సుభి[illegible]
 బంధువులెల్లను [illegible]
ప్పలు [illegible]
 [illegible]
[illegible]
 [illegible]
[illegible]
 [illegible].

'తివిరి సుయోధనున్ [illegible]
 [illegible]
[illegible]
 [illegible]
[illegible]
 [illegible]
[illegible]
 [illegible].

'తెవఁగఁగ నాఁడె [illegible]
 దైవవశంబున [illegible]
సనుపమ[illegible]
 బచ్చున [illegible]
బొసగఁగ నేఁడి పట్టుదల
 పొంపిరివోవఁగ నాఁడి [illegible]
యన యది గావునన్ శకుని
 యందున దప్పొకయింత యున్న దే.'

ఈ పద్యములనుబట్టి బలరామునిమతమందు—

(౧) జూదమాడవలదని తనబంధువులెల్లను జెప్పుచుండఁగా ధర్మరాజు మూర్ఖుఁడై వారి బుద్ధులు వినక

# ఆంధ్రకవిత్వచరిత్రము

([1]రెండవ భాగము)  ప్రాఙ్నన్నయయుగము

కాలము: క్రీ. శ. ౫-వ శతాబ్దము మొదలు ౯౧౫ వఱకు

ప్రజ్ఞావంతులైన చరిత్రకారులును విమర్శకులును రాజరాజనరేంద్రుని పూర్వులైన చాళుక్యరాజులు భాషాభిమానులై యాంధ్రభాషోద్ధరణమునకుఁ బాటుపడి నట్లు వ్యాసములు వ్రాయుచున్నారు; ఉపన్యాసము లిచ్చుచున్నారు. ఈవిషయములో యుద్ధమల్లుని బెజవాడ శాసనపద్యములును, మఱికొన్ని తెనుఁగుశాసనములును వారి కాధారము లగుచున్నవి. మఱియుఁ జాళుక్యరాజన్యు లాంధ్రకవిత్వాభిమానాయత్తచిత్తు లగుటకుఁ దఱచుగ "చన సత్యాశ్రయునిఁ దొట్టిచాళుక్యనృపుల్" అను నన్నెచోడ కవిపుంగవుని పద్యపాదము నిదర్శనముగాఁ జూపఁబడుచున్నది. సత్యాశ్రయుఁ డనఁగా నేడవశతాబ్దమున నాంధ్రదేశముపై దండెత్తివచ్చిన రెండవ పులకేశి యని కొందఱును, దత్సోదరుఁడైన కుబ్జవిష్ణువర్ధనుఁ డని కొందఱును, బేతవిజయాదిత్యుని కొడుకైన సత్యాశ్రయుఁడని కొందఱును బలువురు పలువిధములుగఁ జర్చించిరి. విమర్శకాగ్రేసరులైన బ్రహ్మశ్రీ కా. బ్రహ్మయశాస్త్రి గారీవాదముల నెల్ల ఖండించి సత్యాశ్రయుఁ డనఁ బదునొకండవ శతాబ్దమునాఁటి రాజరాజనరేంద్రుఁడే కాని,తత్పూర్వపుఁ జాళుక్యసత్యాశ్రయులలో మఱియొకఁడు కాఁడని యుక్తియుక్తముగను సప్రమాణముగను రుజువుచేసిరి.[3] చారిత్రక పరిశోధనలయందు సుప్రసిద్ధులైన బ్రహ్మశ్రీ వేటూరి ప్రభాకరశాస్త్రిగారును, మ. రా. శ్రీ బుఱ్ఱా శేషగిరిరావు పంతులుగారును బ్రహ్మయ్యశాస్త్రిగారి వాదమునే యంగీకరించుచున్నారు.

చాళుక్యరాజు లెల్లరు సత్యాశ్రయ బిరుదాంకితులే యగుటచే నన్నెచోడుఁడు చెప్పిన సత్యాశ్రయుఁ డెవ్వఁ డను వాదమున కవకాశము కలుగుచున్నది గాని, సాంఘికరాజకీయ మతవిప్లవములలోఁ దన్నుఁ గన్నెత్తి చూచువారు లేక ద్రవిడభాషలలో నామమాత్రావశి

౧ మొదటి భాగమును వ్రాసి యుపోద్ఘాత సంపుట మను పేరఁ బ్రకటించితిని. ఈ రెండవభాగము ప్రాఙ్నన్నయ యుగముగను, మూఁడవభాగము నన్నయ యుగముగను వ్రాయుచున్నాను.

౨ ఈ గ్రంథమునం దిది రెండవ ప్రకరణ మగును. ౧-వ ప్రకరణమున క్రీ. పూర్వమునుండి క్రీ. ౫-వ శతాబ్దమువఱకును, ౨-వ ప్రకరణమున ౫-వ శ. మొ॥ ౯౧౫ సం. వఱకును, 3-వ ప్రకరణమున క్రీ. శ. ౯౧౫ మొ. ౧౦౪౦ వఱకును గల భాషాచారిత్రాంశములు వివరింపఁబడును.

3 ఆంధ్రపరిషత్పత్రిక, ౧౦-వ సంపు. ౨వ సంచిక.

నసశ్లోకములు సమన్వయించికొనుటలోఁ దిక్కన పొరపడినవాఁడు. తొమ్మిదవశ్లోకములోని "కురుప్రవీరః" అను విశేషణమునకు యుధిష్ఠిరుఁడని యర్థముచేసికొనుటకు బదులు దుర్యోధనుఁడని తిక్కన యర్థముచేసికొన్నాఁడు. మూలములోని పూర్వాపరములు చూచికొనకయుఁ, గథాసందర్భము చూచికొనకయు, వాక్యార్థము చూచికొనకయు, బలరాముఁడు దుర్యోధనపక్షమునఁ బలుకుచున్నాఁడని వ్యాసునితో నేకీభవించి తాను ద్రొక్కినపుంతయైనను జూచికొనకయుఁ దిక్కన తప్పుత్రోవను బడ్డాఁడు. "కురుప్రవీరః," "అయమతజ్ఞః" "ఆజమీఢః," "అయం యుధిష్ఠిరః" "జితః" అనునివి యన్నియు నొక్కనికే విశేషణములు. ఇందు దుర్యోధనుఁడు లేనే లేఁడు. తొమ్మిదియుఁ బదియు నగు శ్లోకములలో "సౌబలం దేవితుం సమాహ్వాయత్" అను వాక్యమునకు సౌబలునిఁ జూదమాడుటకు రమ్మని పిలిచె (challenged) నని యర్థముచేసికొనుటకు బదులు సౌబలుని జూదమాడుటకు నియమించె నని తిక్కన యర్థము చేసికొన్నాఁడు. చేసికొని "సమాహ్వాయత్" అను క్రియకుఁ గర్త నా శ్లోకములలో లేని దుర్యోధనునిఁ దెచ్చిపెట్టినాఁడు. పోనిండు, తిక్కన చేసిన యర్థ మొప్పని యంగీకరింతమన్నను, గద్యవాక్యార్థమునకు భంగము కలుగుచున్నది. మూలశ్లోకము నశించుచున్నది. "జితః" అను విశేషణము మూలములోని "సమాహ్వాయత్" అను క్రియకుఁ దిక్కన దెచ్చిపెట్టిన కర్తయగు దుర్యోధనున కన్వయింపవలయునని భావింపగాను. అట్లు చేయుటకు శ్లోకములో యుధిష్ఠిరుఁడు లేఁడు గాని దుర్యోధనుఁడు లేఁడా? కావునఁ దిక్కనవాక్యము తప్పయినట్లు గానిమొగముమీఁదనే కనఁబడుచున్నది. (సశేషము.)

---

# అవి నా భావము

తురగా వేంకటరామయ్యగారు

## ౧

నాదేనా ఈరూపము?
నీదేనా ఈ జీవము?
నాభావము నీ పాటే
నా, గానము నాదేనా?
ఈ కేళీవన మంతా
నా కొరకా? నీ కొరకా?
నాదేనా...... జీవము

## ౨

పూవులునేనా? కమ్మని
తావులు నీవేనా? ఈ
పూజలు నీ కొరకేనా
పుణ్యము నా కొరకేనా
నాదేనా...... జీవము.

## ౩

ఈ లోకము నాదేనా?
పాలించే దీవేనా?
నీరాధను నేనేనా?
నారాజువు నీవేనా?
నాదేనా...... జీవము

## ౪

నావలపులు నీవేనా?
నీతలపులు నేనే నా?
నేనే కృష్ణుడగానా
నీవే రాధవుగావా?
నాదేనా......జీవము

# ఆంధ్రకవిత్వచరిత్రము

## ([1]రెండవ భాగము) ప్రాఙ్నన్నయయుగము

### [2]చాళుక్యులు : క్రీ. శ. ౫-వ శతాబ్దము మొదలు ౬౧౫ వఱకు

ప్రజ్ఞావంతులైన చరిత్రకారులును విమర్శకులును రాజరాజనరేంద్రుని పూర్వులైన చాళుక్యరాజులు భాషాభిమానులై యాంధ్రభాషోద్ధరణమునకుఁ బాటుపడినట్లు వ్యాసములు వ్రాయుచున్నారు; ఉపన్యాసము లిచ్చుచున్నారు. ఈవిషయములో యుద్ధమల్లుని బెజవాడ శాసనపద్యములును, మఱికొన్ని తెనుఁగుశాసనములును వారి కాధారము లగుచున్నవి. మఱియుఁ జళుక్యరాజన్యులాంధ్రకవిత్వాభిమానాయత్తచిత్తు లగుటకుఁ దఱచుగ "చన సత్యాశ్రయునిఁ దొట్టిచాళుక్య నృపుల్" అను నన్నెచోడ కవిపుంగవుని పద్యపాదము నిదర్శనముగాఁ జూపఁబడుచున్నది. సత్యాశ్రయుఁ డనఁగా నేడవశతాబ్దమున నాంధ్ర దేశముపై దండెత్తివచ్చిన రెండవ పులకేశి యని కొందఱును, దత్సోదరుఁడైన కుబ్జ విష్ణువర్ధనుఁ డని కొందఱును, బేతవిజయాదిత్యుని కొడుకైన సత్యాశ్రయుఁడని కొందఱును బలువురు పలువిధములుగఁ జర్చించిరి. విమర్శకాగ్రేసరులైన బ్రహ్మశ్రీ కా. బ్రహ్మయశాస్త్రిగారీవాదముల నెల్ల ఖండించి సత్యాశ్రయుఁ డనఁ బదునొకండవ శతాబ్దమునాఁటి రాజరాజనరేంద్రుఁడే కాని,తత్పూర్వపుఁ జాళుక్యసత్యాశ్రయులలో మఱియొకఁడు కాఁడని యుక్తియుక్తముగను సప్రమాణముగను ఋజువుచేసిరి.[3] చారిత్రక పరిశోధనలయందు సుప్రసిద్ధులైన బ్రహ్మశ్రీ వేటూరి ప్రభాకరశాస్త్రిగారును, మ. రా. శ్రీ బుఱ్ఱా శేషగిరిరావు పంతులుగారును బ్రహ్మయ్యశాస్త్రిగారి వాదమునే యంగీకరించుచున్నారు.

చాళుక్యరాజు లెల్లరు సత్యాశ్రయ బిరుదాంకితులే యగుటచే నన్నెచోడుఁడు చెప్పిన సత్యాశ్రయుఁ డెవ్వఁ డను వాదమున కవకాశము కలుగుచున్నది గాని, సాంఘిక రాజకీయ మతవిప్లవములలోఁ దన్నుఁ గన్నెత్తి చూచువారు లేక ద్రవిడభాషలలో నామమాత్రావశి

---

౧ మొదటి భాగమును వ్రాసి యుపోద్ఘాత సంపుటమను పేరఁ బ్రకటించితిని. ఈ రెండవభాగము ప్రాఙ్నన్నయ యుగముగను, మూఁడవభాగము నన్నయ యుగముగను వ్రాయుచున్నాను.

౨ ఈ గ్రంథమునం దిది రెండవ ప్రకరణ మగును. ౧-వ ప్రకరణమున క్రీ. పూర్వమునుండి క్రీ. ౫-వ శతాబ్దమువఱకును, ౨-వ ప్రకరణమున ౫-వ శ. మొ॥ ౬౧౫ సం. వఱకును, ౩-వ ప్రకరణమున క్రీ. శ. ౬౧౫ మొ. ౧౦౪౦ వఱకును గల భాషాచారిత్రాంశములు వివరింపఁబడును.

౩ ఆంధ్రపరిషత్పత్రిక, ౧౦-వ సంపు. ౨వ సంచిక.

ష్టమై పడియుండిన యాంధ్రభాషం జేపట్టి, యాంధ్రభారతరచనా మహాకార్యమూలమున శాశ్వతమైనట్టియు, సత్యమైనట్టియు నాశ్రయము నొసంగి తన 'సత్యాశ్రయ' బిరుదమును సార్థకమొనర్చుకొనిన సత్యాశ్రయకులతిలకుండగు రాజరాజే యంధ్రవిషయంబునం దెనుంగు నిలిపిన సత్యాశ్రయుం డనుటలో లేశమును సత్యభంగ ముండదు. గీర్వాణ ప్రపంచమునుండి యాంధ్రలోకమున భారతకవితా గంగావతరణమునకు భగీరథుండైన కారణమున రాజనరేంద్రునందుం గలిగిన యత్యధిక గౌరవాతిశయము తత్పూర్వ చాళుక్య రాజులయందుసైతము నించుకించుక ప్రసరించుచుండుటచే వారెల్లరు భాషోద్ధారకులే యను భ్రాంతి వొడముచున్న దే కాని,యట్టి భ్రాంతిం బరిత్యజించి సత్య మారయం గడంగునెడ, నీచళుక్యకులజుల మాతృభాష యెయ్యదియో, వీరిమత మెట్టిదియో, యాంధ్రభాషతో వీరి కెప్పటినుండి యెట్టిసంబంధము కలిగినదో మున్నగు సంశయములు సమర్థులగువారికిం జర్చింపం దగినవి.

పూర్వచాళుక్యకుటుంబ మేర్పడక మున్న అనఁగా నేడవ శతాబ్దమునకుం బూర్వము చాళుక్యరాజులు పశ్చిమదేశమున వాతాపినగరము (బాదామి) రాజధానిగాం గర్ణాట మరాట రాజ్యములు పాలించుచుండిరి. అప్పుడు వారి పాలనమం దుండిన దక్షిణ మహారాష్ట్ర దేశము, నుత్తరకర్ణాటరాజ్యము నాంధ్ర దేశములోం జేరినవి కాని, యాంధ్ర దేశముతో సంబంధించినవి గాని యెంతమాత్రమును గావు. అప్పటి యాంధ్రదేశపట మీరాజ్యములకు మిక్కిలి భిన్నముగానే చిత్రింపంబడినది. దేశమాంధ్రదేశము గాకపోయినను, ప్రభువు లాంధ్రులై యుండినను, ఆంధ్రభాషాభిమానులై యుండినను మనము కొంత సంతసింపవచ్చును. కర్ణాటరాజ్య మేలిన కృష్ణదేవరాయలు యాంధ్రకవితోద్ధరణము, కడ కాతండు కర్ణాటకుండా యాంధ్రుండా యను సంశయము నేఁటివిమర్శకులకుం గలిగించుచుండలేదా? ఇట్లే యానాఁడు కర్ణాట మహారాష్ట్రములు పాలించిన వాతాపి చాళుక్యు లాంధ్రవాఙ్మయోద్యమమునం బ్రవేశింపకపోయినను వా రాంధ్రులే యనియు వారిభాష యాంధ్రభాషయేయనియు రూఢిపడినయెడం గొంత తృప్తిపడవచ్చును. కాని యీసందర్భమునం గావించు పరిశోధనలవలనం బశ్చిమచాళుక్యులు కన్నడవాఙ్మయమునకుం దోడుపడినట్లు తెలియవచ్చును గాని యాంధ్రులైనట్లు, నాంధ్రకావ్య నిర్మాణమును బ్రోత్సహించినట్లు గానరాదు.

### పశ్చిమచాళుక్యుల మతము

చాళుక్యుల భాషంగూర్చి ప్రసంగించు సందర్భమున నారాజుల మతమునుగూర్చియుం జర్చించుట యప్రస్తుత ప్రసంగము కాఁజాలదు. మతమునకును భాషకును వలసినంత పరస్పర సంబంధ ముండక తీరదు. ఒకానొకజాతియొక్క మతమునుబట్టి తద్భాషను గాని, భాషనుబట్టి మతమును గాని యిది యిట్టిదని చెప్పుటకుం గొంతవఱ కవకాశ ముండకపోదు. ఆదినుండియుం జాళుక్యరాజులు తమతమ చిత్తవృత్తుల

ననుసరించి యొక్కొక్క రొక్కొక్కమతము నవ
లంబించుచుండినవారగుటచే నీవంశస్థులమత మి
దియని నిర్ణయించి చెప్పుటకు వీలు లేదు. కాని
శాసనములఁబట్టి యీరాజులలో ననేకులు
జైన మతాభిమానులని చెప్పవలసి యున్నది.
సాధారణముగఁ గులక్రమాగతమగు మతాచా
రముల నెవ్వరుఁ బరిత్యజింపక పట్టుదలతో
నిర్వహించుచుండుట లోకధర్మము. అట్టియెడ
నీ చాళుక్యరాజు లిట్టి పట్టుదల లేక భిన్నభిన్న
మతముల నవలంబించుచుండుటకు, అప్పటి
దేశ కాల పరిస్థితుల ననుసరింపవలసిన యవస
రమే ముఖ్యకారణమై యుండును.

క్రీ. శ. ౪౮౯ వ సంవత్సరమునఁ జాళు
క్యరాజగు మొదటి పులకేశి తన కాశ్రితుఁ
డైన స్వామియార్యునిచే నిర్మింపఁబడిన జైనాల
యమునకుఁ గొంతదాన మొసంగి నట్లొకశాస
నమునఁ గలదు. వానికుమారుఁ డగు మొదటి
కీర్తివర్మ వినయనంది శిష్యుఁడగు ప్రభాచంద్రు
న కొసంగిన దానశాసనము మఱియొకటి కలదు.
పశ్చిమచాళుక్యులలో [౮]విష్ణువర్ధనుని భార్య
శాంతలదేవిసంతానరహితయై మరణించెనఁట.
ఆ సమయమందే యాకస్మికముగ నామెతండ్రి
యు మరణించెనఁట. ఈ ఘోరమరణములకు
శాంతలదేవితల్లి మాచికాబి (మాచికాంబ)
మిక్కిలి దుఃఖించుచుండ జైనమతస్థుఁడైన విష్ణు
వర్ధనుఁ డామతమునందు విరక్తి నొంది వైష
మత మవలంబించెనఁట. మాచికాబియు నొక
మాసమువఱకు నన్నపానములు ముట్టక
శుష్కించి ప్రాణములు విడిచెనఁట. ఈవృత్తాం
తము శ్రావణ బెళగోల శిలాశాసనములలో
నొకశాసనమునందుఁ జెక్కఁబడినది. ఆదిచా
ళుక్యరాజులు జైనమతస్థులే యని దక్షిణ
హిందూదేశ జైనమత పరిశోధకుని వ్రాఁతలవ
లన మఱింత స్పష్టమగుచున్నది.

[×] "Tho Jain religion seems to have enjoyed considerable patronage at the hands of the early Chalukyas. Pulakesi II patronised a certain Jain poet, Ravikirti. Vinayaditya, the eighth in succession from Jayasimha of the early Chalukyas, had for his spiritual adviser Niravadya Panditha. (Bombay Gazetteer, Vol. I, Part II, p. 19.) We also learn from an inscription, (Indian Antiquary, Vol. VII, p. 197) that Vikramaditya II after repairing a Jain temple gave a grant in connection with it to the great disputant, Vizayapandita .."

### పశ్చిమ చాళుక్యుల భాష

చరిత్రకారుల పరిశోధనలవలనఁ జాళు
క్యరాజుల భాష కన్నడభాషయనియు, వారు
కన్నడవాఙ్మయమును బ్రోత్సహించుచుండిరని
యుఁ దెలియుచున్నది. ఇందుకు నిదర్శనముగ
నీరాజులు వ్రాయించిన కన్నడభాషా శాసన
ము లాదినుండి యంతమువఱకునుగూడఁ గాన
వచ్చుచున్నవి.

---

[౮] Kanarese Literature, Edward P. Rice.

[×] Studies in South Indian Jainism, Part I, page 111, M. S. Ramaswamy Ayyangar, M. A.

పశ్చిమచాళుక్యుల కన్నడశాసనములు :

i. శా. శ. 520. బాదామి (వాతాపి)లోని మంగళేశునిశిలాశాసనము.(Ind. Ant. V.)

ii. శా. శ. 521. బాదామిలోని విజయాదిత్య సత్యాశ్రయుని శాసనము. (ఇందుఁ గన్నడమే కాక సంస్కృతమును గలదు.)

iii. శా. శ. 631. చాళుక్యమహారాజాధిరాజ విజయాదిత్య సత్యనారాయణుని పాలనమున నెనిమిదవయేఁట మూఁడవ నెలయందలి శాసనము. (Ind. Ant. VIII-XIX.)

iv. శా. శ. 651. బాదామిలో మహారాజాధి రాజ విజయాదిత్యుని ప్రియమైన వినపోతిశాసనము. (Ind. Ant. X.)

v శా. శ. 654 - 676.

(౧) రెండవ విక్రమాదిత్యుని శాసనము (Ind. Ant. VIII.)

(౨) కంజివరములోని రెండవ విక్రమాదిత్యుని శాసనము. (Ep. Ind. III.)

(3) విక్రమాదిత్యునిమహారాజ్ఞియైన లోకమహాదేవిశాసనము. (Ind. Ant. X.)

ఈమొ పేరున శాసనము లింకను మఱిమూఁడు గలవు. 7-వ శతాబ్దమునఁ దూర్పుచాళుక్య వంశ మేర్పడిన తరువాతఁ గూడ నీ వాతాపి చాళుక్యుల కన్నడశాసనములు గలవు. ఒక్క కన్నడ దేశమునందే గాక తాము పరిపాలించుచుండిన మహారాష్ట్ర దేశమునందుఁగూడ నీ చాళుక్యులు కన్నడభాషయందే తమ శాసనములు చెక్కించుచుండినట్లు తోఁచుచున్నది.

౬ "Inscriptions manuscripts, local names and other evidences prove, that Kolhapur where the chief language is now Marathi, was once in the Kanares area. Also in Sholapur town and district there are many Kanares inscriptions." E. P. Rice.

ఇట్లు నిరంతరాయముగఁ గన్నడభాషయందు శాసనములు వ్రాయించుచుండుటయే గాక యాదిచాళుక్య ప్రభువులు కన్నడవాఙ్మయమునకు రాజపోషకులై యుండినట్లును తెలియుచుండుటచేత వీరి మాతృభాష కన్నడభాష యనుకొనుట కెట్టిసంశయము నుండదు.

౭ "Kannada poets may be roughly classed as Jains, Virasaivas, and Brahmans. The earliest cultivators of language for literary purposes were the Jains. Down to the middle of the 12th century we have mostly Jain authors. They were patronised by the Gangas, the Rashtrakutas, the Western Chalukyas and the Hosalas."

కన్నడ వాఙ్మయచరిత్రకారులైన E. P రైసుదొరగారుకూడ నీ విషయమునే బలపరచుచుఁ బూర్వకాలమునఁ గన్నడ వాఙ్మయమునకుఁ బ్రధానస్థానములైన పట్టణములను, గన్నడవాఙ్మయమునకుఁ బోషకులైన రాజులను, సంవత్సరక్రమముతోఁ గూడ నీ క్రిందిపట్టికయందుఁ జూపుచున్నారు. ఈపట్టికవలనఁ

౬ Studies in South Indian Jainism, Part II, page 109, B. Seshagiri Rao, M. A.
౭ Narasimhachar, M. A., M. R. A. S.; Karnata Kavi Charitra.

బశ్చిమచాళుక్యరాజుల రాజధానియగు వాతాపినగరము వారికాలమునఁ గన్నడవాఙ్మయమునకుఁ బ్రధానస్థానమైనదనియు, నచ్చటిచాళుక్య ప్రభువు లావాఙ్మయమును సర్వవిధముల నుద్ధరించుచుండిరనియు మఱింత స్పష్టము కాఁగలదు.

" The following table shows the capital cities where the royal patrons of Kanares literature lived in successive periods:—

A. D. 400 - 500. Banavasi (Kadamba); Vatapi (Early Pallavas); Talkad (Gangas).

„ 550 - 820 Vatapi (Chalukyas and Rashtrakutas).

„ 820-1040. Talkad-Manyaketha (Rashtrakutas).

„ 1040-1312. Kalyana (Western Chalukyas)............. "

ఈపట్టికం బట్టి యొక్క పశ్చిమచాళుక్యులే గాక కదంబులు, గంగులు, రాష్ట్రకూటులు మున్నగు రాజులుఁ గూడఁ బూర్వశతాబ్దములలోఁ గన్నడ వాఙ్మయమునకుఁ బోషకులై యుండిరని తెలియుచున్నది. ఇందఱు రాజులచేఁ బోషింపఁబడుటచేతనే కన్నడ కవిత్వమాంధ్రకవిత్వముకంటె ముందు.దలయెత్తఁగలిగినది. శా. శ. 169-వ సంవత్సరములోఁ బశ్చిమ గంగరాజగు అరివర్మయొక్క తంజావూరి శాసనము సంస్కృత కర్ణాట భాషలలో వ్రాయఁబడుటచే, క్రీ. శ. మూఁడవశతాబ్దమునుండియుఁ గన్నడశాసనము లున్నవని చెప్పవచ్చును. మనకు మొదటి తెనుఁగుశాసనము 7-వ శతాబ్దమునందు మాత్రమే గానవచ్చుచున్నది.

క్రీ. శ. 1150-వ సంవత్సరమువఱకుఁ గల కన్నడ కవు లెల్లరును జైనులే యని కర్ణాట కవి చరిత్రమును గర్ణాట వాఙ్మయ చరిత్రమును గూడఁ జెప్పుచున్నవి. కన్నడమునందలి భారతరామాయణాద్యగ్రంథములును, ఛందోవ్యాకరణాది శాస్త్రగ్రంథములును గూడ మొదట జైనులే రచించిరి. మిక్కిలి ప్రాచీనకాలములోఁ బ్రాకృత సంస్కృతాది భాషలలో జైనులు గ్రంథరచన గావించుచుండినను గ్రమక్రమముగా వారు కన్నడమునే స్థాయిభాషగాఁ జేసికొనిరని కన్నడమునందలి జైనకవి రచితగ్రంథబాహుళ్యమువలన నూహింపవలసి యున్నది.

" ..... ...and Jaina literature continues to be prominent for long after. It includes all the more ancient and many of the most eminent of Kanares writings."

ఇట్లు పురాతనమునుండియు జైనులకును గన్నడ వాఙ్మయమునకు నత్యంతమైన యనుబంధ మేర్పడియుండుటయుఁ, బశ్చిమచాళుక్యులు జైనమతాభిమానులగుటయు, వారి శాసనములును గన్నడమునం దనేకము లుండుటయు, నాదినుండియు వారు కన్నడ వాఙ్మయపోషకులై యుండుటయు మున్నగు నంశములెల్లఁ జక్కఁగా నొకదానితో నొకటి సమన్వయింపఁబడి పశ్చిమచాళుక్యుల మాతృభాష కన్నడభాషయే యని నిర్ణయించుచున్నవి. ఇంక నీ పశ్చిమ చాళుక్యులను మనము కర్ణాటచాళుక్యులనియు వ్యవహరింపవచ్చును. (సశేషము.)

# ఆవాహనము

కొంపెల్ల జనార్దన రావుగారు

నా భావిపథముపంచల నెందు నోదఁగుచు
వేచి యుందువో, కాలవిఘ్నచోదనము లెంచి!-
అవతరింపుమి దేవి, ఆవహింపుమి నను,—
నా గుండె విరియు ఈనాఁడె ఆశుభవేళ,
ఓవిజయలక్ష్మి!

ఆకళింతలు మెలఁగి ఆవేశమయి పొంగి,
నీ క్రమపద తపోనిరతిపెంపు వెలింగి,
ఏ ననంతపథాలకే చాఁగికొని నిల్చి,
అల దివ్యవాణి ఆజ్ఞలు మీటుకొన్నాను—
అవతరింపుమి దేవి!......

వింత లా నొక స్వప్నవీథీవిహాయస
ప్రాభవశ్రీలు తంపలు లోన నిలఁబోసి,
యిటు మేలుకొల్పి జాగృతినే హరింపవు:
విశ్వమ్ము నా స్వప్నవిజయమే వరియించు —
అవతరింపుమి ....

నాదు జీవనచేతనావాటి లోఁతుల
బ్రదుకుజల్లులు వీచి, ప్రాభవమ్ములె పూఁచి,
సకలేశు నిచ్ఛాప్రసారమ్ములకు ఓర్మి
పఱపు నింపెడు గురుత్వము నిట్టనిలుపుకో—
అవతరింపుమి......

విశ్వయాత్రికు లాత్మవిభుస్వప్నకలనముల్
నీ తేజమున కరఁగిరి, నవ్యోపహాస్యతముల్:
నా మాధురీధురీణము భావజగతిని
పోషింపుమి నీ ప్రభాతలావణ్యముల్—
అవతరింపుమి......

ఆదిగ్దిగంతమ్ము సవసుళించు రసైక
నిష్ఠాప్రశాంతికాంతితతి, లో నివిడించి,
నా ప్రకృతిమణిహృదగారము సుంభింపుకో,
నా వచస్సుమముల సోనలు సాఁగి ముంచుకో—
అవతరింపుమి......

నా మహేచ్ఛాప్రభాసము నాకె విస్మయము,
విశ్వవారిజము స్వావృతమహాసౌందర్య
పరిధిఅంచులు తాఁక విరిసి, భావికభూతి
విరిసి పో, నాలోన విస్మృతి గుడించుకో
ననతరింపుమి......

నే రవిత్వము వెలింగిన రాపుళుల్ వడి
ప్రకృతిహృత్ప్రణయవైభవము నెద సూత్రించి,
పరిమితుల్ వలచు తత్పరవృత్తి తెఱవిచ్చి
ప్రళయగర్భపథాన వరసృష్టి మలుచుకో
ననతరింపుమి......

---

# మరుద్వృధా

కురుగంటి సీతారామయ్యగారు, యమ్. ఏ.

ఈపద మిప్పుడు కావేరీనదికి సమానార్థకముగా నుపయోగింపబడుచున్నది. కావేరీస్నాన సమయమున నీక్రింది శ్లోకములు సామాన్యముగా కావేరీతీరమునందెల్ల వాడుకలో నున్నవి:

శ్లో. మరుద్వృధే మాన్యజలప్రవాహే
కవేరకన్యే నమతాం శరణ్యే,
కాశ్మీరభూకల్పిత చోళదేశే
కావేరి, కావేరి, మమ ప్రసీద!

మరుద్వృధే, మహాభాగే మలయాచల సంభవే, ప్రమః.
మమ పాపహారే మాతః తస్యై తోయాత్మనే నమ

ఈ పదముల కావేరీనదిని తెలియజేయుదానిగా నుపయోగించుటలో వీరు దాని వ్యుత్పత్త్యర్థముపై నాధారపడినట్లు కన్పట్టుచున్నది. మరుత్తులనగా గాలులు. వానిచే వృద్ధినొందుచున్నందున దాని కానామము వాడబడుచున్నది. సహ్యపర్వతము లనగా సామాన్యముగా పడమటికనుమ లను పర్వతముల నీనది జననమందుచున్నది. దక్షిణ దేశమునకు వర్షములు తెచ్చునవి గాలులు. వీని నాంగ్లమున మన్సూను (Monsoon) లందురు. ఇవి సంవత్సరమునకు రెండుమారులు వచ్చును. ఈ రెండుమార్లు వచ్చు మేఘములను ఈ పర్వతములు మిక్కిలి యెత్తుగుటచే నరికట్టుచున్నవి. అందుచే నా రెండుకాలములందలి వర్షమును చాలాభాగ మీపర్వతములు గ్రహించుచున్నవి. తత్పర్వతముల తన్మరుత్తులవలన వచ్చు వర్షములచే నీనది యభివృద్ధినొంది ప్రవహించుచున్నది. ఈపద మిట్లు కొన్ని శతాబ్దముల నుండి యుపయోగింపబడుచున్నది. 17-వ శతాబ్దము మొట్టమొదట వరలిన తంజావురాంధ్రనాయకులలో నొకడగు రఘునాథనాయక భూపాల సభాంతరాళమున నొక యాస్థానకవీశ్వరుడును, అనేక గ్రంథకర్తయు నగు యజ్ఞనారాయణ దీక్షితుడు తన సాహిత్యరత్నాకర కావ్యమున నీపదము నీసందర్భమున నుపయోగించుచున్నాడు:

శ్లో. నదీషు వారీ ప్యపరాణి పీత్వా
నభస్వతా పశ్చిమదిగ్భవేన,
మరుద్వృధాయా స్త్యజ తాధిపూరం
అహేతుయత్నా దనుగృహ్యతే యః.
(సాహిత్యరత్నాకరము, సర్గ ౧.)

ఇంతకు పూర్వము కూడా, కొన్ని శతాబ్దములకు పూర్వమే, యీపద మీయర్థమున వాడబడుచున్న ట్లీ శ్లోకమువలననే గ్రహింపనగును. యజ్ఞనారాయణు డాకస్మికముగ న ట్లుపయోగించునా? ఈ పద మిదివరకే కావేరీనదికి రూఢమైయుండవలయు. ఏకాలమున దీని కీనామము వాడబడుట ప్రారంభించెనో చెప్పుటకు వలనుపడదు. ఈ పదము వేదభాగములందుకూడా కలదు. కాని యక్కాలమున కావేరీనదికి నామముగా

వాడబడెనని చెప్పుటకు ఎంతమాత్రమును వీలు లేదు. ఈ క్రిందిమంత్రమును చూడుడు:

మం. ఇమం మే గంగే యమునే సరస్వతి శుతుద్రి స్తోమగ్ం సచతా పరుష్ణి యా అసిక్ని యా మరుద్వృధే వితస్తయార్జీకీయే శృణుహ్యా సుషోమయా.

(యజుర్వేదారణ్యకము.)

ఈ మంత్రము యజుర్వేదమునందలి మహానారాయణోపనిషత్తునందు స్నానప్రకరణమున నున్నది. ఇందు కొన్ని నదులు పేర్కొనబడినవి: 1. గంగ 2. యమున 3. సరస్వతి 4. శుతుద్ర 5 పరుష్ణి 6. అసిక్ని 7. వితస్త 8. ఆర్జీకీయా 9. సుషోమ. ఈనదు లన్నియు నుత్తరహిందూస్థానమునందలివి. వీనిలో కొన్నిటికి ప్రస్తుతనామము లిచ్చిన సులభగ్రాహ్యము లగును. గంగా యమునా సరస్వతులు అందరికి పరిచితములే. అవి సంయుక్తరాష్ట్రముల గుండా ప్రవహించి ప్రయాగమున త్రివేణీ సంగమమున కలియుచున్నవి. సుషోమ అనగా సింధునది. అదియు హిమాలయముల జన్మించి సింధుదేశముద్వారా ప్రవహించి కరాచీపట్టణప్రాంతమున సముద్రమున చేరుచున్నది. ఇక మిగిలిన అయిదునదులును పంజాబునందు ప్రవహించి తుదకు సింధువున కుపనదులైనవి. ఆంగ్లమున వీని నీ క్రిందివిధముగా పిలుచుచున్నారు:

వితస్త=Jhelum
అసిక్ని=Chenab
పరుష్ణి=Ravi
శతుద్ర=Sutlej
ఆర్జీకీయా=Beas.

పైన చెప్పిన తొమ్మిదినదులును నుత్తరదేశమునందలివియే యని యిష్టార్థము నాకు స్పష్టము. పరుష్ణీనదికి "ఇరావతి" యనియు, ఆర్జీకీయానదికి "విపాశ్" అనియు నామాంతరము లున్నవి. వీని కేనామము లెందుకు కల్గెనో ముందు మనము చూతముగాక. పై మంత్రమునందలి మరుద్వృధాపదమును వదలివేసితిని. ఏలన: నా మంత్రకాలమునాటికి తత్పదమునకు కావేరి యనిగాని, మరియొకనది యనిగాని యర్థము కాకుండెనని తెలియుచున్నది. క్రీ. పూ 500 సంవత్సరప్రాంతమున వేదషడంగములలో నొకటియగు నిరుక్తమును రచియించిన యాస్కమహాముని పై మంత్రమున కర్థమును వ్రాయుచు ఈ క్రింది విధముగ వ్రాయుచున్నారు:

మరుద్వృధాః సర్వా నద్యః మరుత ఏనా వర్ధయంతి.

ఏతద్వాక్యమువలన తత్పదము ప్రత్యేకనదీనామము కాదనియు, నదీసామాన్యవాచకమనియు తెలియును. తద్వేదభాష్యకర్తలగు భగవద్దుర్గాచార్యులు యాస్కవచనమునకు క్రిందివిధముగ నర్థమును వ్రాయుచున్నారు:-

హే మరుద్వృధే గంగే, యమునే, సరస్వతి, శుతుద్రి, యూయం మమ ఇమం స్తోమం సచత ఆసేవధ్వం; పరుష్ణ్యా సహ మరుద్వృధే ఆర్జీకీయే, త్వమపి అసిక్న్యా, వితస్తయా, సుషోమయా సహ ఆశృణుహి అభిముఖేన స్థిత్వా శృణుహి ఇతి సమస్తార్థః.

(నిరుక్తభాష్యము, పుట 690.)

ఈవిధముగా మొట్టమొదట సమస్తార్థమును వ్రాసి తరువాత విస్తరవాక్య వ్యాఖ్యానములో నిట్లు వ్రాయుచున్నాడు:—

...........ఇరావతీం పరుష్ణీ త్యాహుః' యేయ మిరావతీతి లోకే ప్రసిద్ధా తా మిమాం ఏతస్మిన్మంత్రే మంత్రార్థవిదః పరుష్ణీ త్యాహుః.

......మరుద్వృధాః...వర్ధయంతి (పై యాస్కవచనము) నర్షేణ, తస్మాత్ ప్రత్యేకం నద్యభిధాన మనుషజ్యతే విశేషణత్వేన హే మరుద్వృధే గంగే! హే మరుద్వృధే యమునే! ఇత్యాది..... ...

ఋజీకప్రభవా ఋజీకో నామ పర్వతః, తస్మాత్ప్రభవతీతి తద్ధితేన, 'విపాట్ విపాటనాద్వా' కిమస్యాం వ్యపాస్యంత?

'పాశా అస్యాం వ్యపాస్యంత వసిష్ఠస్య ముమూర్షతః'.

వసిష్ఠః కిల మమ జ్ఞాస్యాం ముమూర్షుః పుత్రమరణశోకార్తః పాశై రాత్మానం బధ్వా, తస్య కిల తే పాశా, అస్యాం వ్యపాస్యంతి వ్యముచ్యంత ఉదకేన తతః ప్రభృతి సా విపాట్ అభవత్.........*

(నిరుక్తభాష్యము, పుటలు 690-692.)

పై యనువాదములో ఆర్జికీయానదికి విపాట్ అను నామాంతర మెట్లు వచ్చెనో రసవంతముగా, సయుక్తికముగా చెప్పబడినది. కాని యది మన కప్రస్తుతము. అందు మరుద్వృధా పదము నదీ సామాన్యవాచకమనియు, అందుచే నాపదము ప్రతి నదీసంబోధన పదమునకు విశేషణముగా నుపయోగింపబడినదనియు కనుగొనగలము. కావున నీపదము కావేరీనదికే కాదు, మరి యేనదికిని సామాన్య వాచకముగా నాకాలమున వాడబడినట్లు స్పష్టము. మరియు నిపనారణ్యకముల కాలమునాటికి ఆర్యు లుత్తరమును దాటలేదనియు చరిత్ర సిద్ధము.

Yet we see that during the whole of this time which lasted from the first beginnings till the last offshoots of Vedic Literatures (Aranyakas and Upanisads), the Indo-Aryan people conquered only the comparatively small stretch of land from the Indus as far as the Ganges, the actual Hindustan.

(Dr Winternitz: History of Indian Literature, Vol. I, p. 303.)

ఆరణ్యకకాలమునాటికి కీ ఆర్యులు దక్షిణమునకు రానట్లు చెప్పుచున్నప్పుడు 'శతే పంచాశ'న్న్యాయమున ఋగ్వేదకాలమునుగూర్చి వేర చెప్ప ననావశ్యకము. ఏతద్విషయము, అనగా నార్యు లప్పటికి దక్షిణదేశము నెరుగరనునది,మన యూహకు బలకరము. అందుచే నీయారణ్యకకాలమునాటికి ఆర్యులు కావేరీనదిని యెరుగరు. అందుచేత తత్పదమునకు కావేరీనది యర్థ మని చెప్పుటకు ఎంతమాత్రమును వలనుపడదు. అంతియే గాక నదీ సామాన్యవాచకమని గ్రహించుటచే నాపదము మరి యేయితరనదికికూడ ఉపయోగింపబడలేదని స్పష్టము. క్రీ. పూ. 500 సంవత్సరములవరకుకూడా తత్పదము నదీసామాన్యవాచకమే యనియు, ప్రత్యేకనదీనామము కాదనియు నిరుక్తవచనము

* ఈమంత్రము ఋగ్వేదములోకూడ ఈవిధముగనే కనపడుచున్నది. దానియర్థముకూడ ఇదియే యని గ్రహింపవలెను.
(ఋగ్వేదము, 8. 3-6.)

దృఢీకరించుచున్నది. కాని యాస్కకాలము నాటికి ఆర్యులు కావేరీనదిని ఎరుగరని చెప్ప వీలులేదు. ఏలన, రామాయణకాలమునాటికే యార్యులు దక్షిణమునకు వచ్చిరనియు, కావేరి వా రెరుగుదురనియు రామాయణములోని యీక్రిందిశ్లోకమువలన తెలియగలదు:

శ్లో. తత స్తా మాపగాం దివ్యాం
ప్రసన్న సలిలాం శివామ్,
తత్ర ద్రక్ష్యథ కావేరీం
విహితా మప్సరోగణైః
(కిష్కింధాకాండము, సర్గ 41.)

తరువాత భారతకాలమునాటికి కావేరీనది బాగుగా పేర్కొనబడినది.

శ్లో. తతో గచ్ఛేత కావేరీం
వృతా మప్సరసాం గణైః,
తత్ర స్నాత్వా నరో రాజన్
గో సహస్రఫలం లభేత్.
(మహాభారతము, 3-85-22.)

ఇక పురాణములకాలమునాటికి చెప్పనవసరము లేదు. వానిలో నెక్కడను మను ద్వైధార్థపద ముపయోగించినట్లు కానరాదు. ఈక్రింది యగ్నిపురాణమునందలి శ్లోకమును చూడుడు:—

శ్లో. గోదావరీ తుంగభద్రా కావేరీ వరదా నదీ,
తాపీ పయోష్ణీ రేవాచ దండకారణ్య ముత్తమమ్.
(అగ్నిపురాణము, 109 అధ్యాయము.)

ఈశ్లోకము తీర్థమాహాత్మ్య ప్రకరణమున చెప్పబడినది. మరియు నందే భరతవర్షమును వర్ణించుఘట్టములో కూడ ఈ పదము నుప యోగించి యుండలేదు. అగ్నిపురాణ మనగా ఆగ్నేయపురాణమునకే మరియొకనామము.* కావేరీమాహాత్మ్య మీపురాణాంతర్గత మని చెప్పుచున్నారు. కాని యీసంగ్రహమముచే నచ్చువేయబడిన యగ్నిపురాణగ్రంథమున నీ భాగము కానరాదు. ఆగ్నేయపురాణభాగము లందులోనివని చెప్పినవి ప్రాచీనగ్రంథములలో కనుపించలేదని డాక్టరు వింటర్నిట్జుగారు చెప్పుచున్నారు.† పురాణకాలము క్రీస్తుశకప్రథమ శతాబ్దమని చరిత్రకారుల యభిప్రాయము. అందుచేత దాదాపు క్రీ. శ. 500 సంవత్సర మునకు ఈపదము కావేరీనదికి గాని మరి యే యితరనదికి గాని ఉపయోగింపబడియుండలేదు.

తరువాత వేదభాష్యకర్త లగు భట్టభాస్కర సాయనుల కాలమునాటికికూడ ఈపదమున కీయర్థము వచ్చినట్లగపడదు. తైత్తిరీయారణ్యకమంత్రమునకు వీరిద్దరును వ్యాఖ్యానము వ్రాసియున్నారు. వీరికాలమునకు కావేరీనది వారికి తెలియదని చెప్పుటకు వీలులేదు. అందును సాయనుడు శ్రీవిద్యానగరరాజ్యస్థాపకు డగు వీరబుక్కరాయల మంత్రివర్యుడు. ఈయనకాలముననే బుక్కరాయల కుమారు డగు కంపరాయలు దక్షిణమును పీడించుచున్న మహమ్మదీయులను పారద్రోలుటకు సాయనునిచే ననుజ్ఞాతుడై చని వారిని సంహరించెను. ఆ కారణమున సాయనుడు కావేరీనది నెఱుగడని చెప్ప వీలులేదు. మరియు నీతడు బహుగ్రంథ

* Dr. Winternitz, Vol. I, p. 566.
† Ibid. p. 566.

ప్రణేతయు సర్వశాస్త్ర వేత్తయు నైయుండెను. వేదభాష్యమును వ్రాయుటకు తగిన షడంగాది సామగ్రీసమగ్రజ్ఞాని. కావున మరుద్వృధాపదము కావేరీనది కుపయుక్తమై యున్న యెడల తప్పక అట్టియర్థము నిచ్చియుండును.

ఈక్రింది వేదభాష్యభాగములను చూడుడు:

హే మరుద్వృధే! మరు ద్వర్ధితే.
(భట్టభాస్కరభాష్యము, ఆరణ్యకభాగము, పు. ౯౧)

హే గంగే, విశ్వనాథరాజధానీ సమీపస్థితే భాగీరథి! హే యమునే, ఆదిత్యతనయే! హే సరస్వతి, నదీరూపేణ విద్యమానే బ్రహ్మపత్ని! హే శుతుద్రే, తన్నామ సరిద్వరే! హే ఆర్జీకీయే, ఏతన్నామసరిద్వరే! హే మరుద్వృధే, ఏతన్నామసరిద్వరే! యూయం మే వ్యత్యయేన మ యేమం మనః పూర్వకం వాచా ప్రస్తూయమానం స్తోమం స్తుతిరూప మంత్రసముదాయం శృణుహి వ్యత్యయేన శృణుత.
(సాయనారణ్యకభాష్యము, పుట ౭౦౯.)

పై భాగములవలన మరుద్వృధాపదము కావేరీనది కుపయుక్తము చేయక యేదోయొక నదికి మాత్రము పేరైనట్లు అర్థమగుచున్నది. నిజముగా కావేరికే వాడబడుచున్న యెడల గంగాదులకు నిర్వచన మిచ్చిన సాయనుడు అట్లు చెప్పియే యుండును. కాని మరద్వృధా యనుపేర నొకనది యున్నట్లు మాత్రము దీని వలన స్ఫురించుచున్నది. అది యెక్కడనో కానరాదు ఇంతవరకు ఈపదముయొక్క యుపయోగమును చూచిన నిది యొక్క కావేరికి మాత్రమే యుపయోగింపబడినట్లు తెలియుచున్నది. ఆపేరుగల మరి యేయితరనది యఖిల భారతమున మరి యెచ్చటను కానరాదు. ఈ సాయనవాక్యమున ఋగ్వేదమునం దీ పదముపయోగింపబడుట ననుసరించియే కాబోలు మానీయరు విలియమ్సుపండితుడు తననిఘంటువున నీపదమున కిట్లు వ్రాయుచున్నాడు:—

Name of a river in the Punjab.
(Dictionary, p. 790.)

ఇది పొరపాటని స్పష్టము. పంజాబున నీ పేరుగల నది లేదు. ఉన్నట్లే చరిత్రకారుడు కాని, వ్యాఖ్యాత కాని చెప్పియుండలేదు. ఋగ్వేదమునను యజురారణ్యకమునను ఇచ్చిన యీపదము ప్రత్యేకనదీనామము గాక నదీసామాన్యవాచకమని యాస్కవచనము వలన స్పష్టము.

ప్లాటుఫారముమీద తేనీరు త్రాగుట



# నీలాలవంటికళ్లు

పిలకా గణపతిగారు

[ఏకాంక రూపకము]

[అది ప్రకృతిని మదింపజేసే వసంత కాలము. శ్రావస్తీనగర సమీపాన్ని ఉన్న ఒకవనంలో—ఓబౌద్ధశ్రమణి ఆవనసౌందర్యాన్ని చూస్తూ, మెల్లగా నడిచి పోతూం టుంది. ఆమె కాషాయవస్త్రాలు ధరించింది. చేతిలో క్రరతో చేయబడ్డ జలపాత్ర. ధగధగ లాడే శరీరసౌందర్యాన్ని కాషాయవస్త్రం కప్పివేయ లేకపోయింది. నీలాల్లా నిగనిగ లాడే కళ్లు. సంపూర్ణయౌవనంలో ఉంది ఆమె. ముఖంలో ప్రశాంతమైన భక్తిభావం. వెనుక ఓపెద్ద జుట్టుముడి. పేరు గోతమి. ఆవనంలో ఓదొంగలనాయకు డున్నాడు. అతడు క్షత్రియు డైనా, చెడ్డసహవాసాలు చేసి దొంగలనాయకు డయ్యాడు. అతన్ని దొంగలనాయకు డంటే ఆశ్చర్యపోతా రంతా. చెట్లు అతనిసౌందర్యం చూచి తల లూచేవి. కోయిల్లు పాడేవి.]

అతడు—[వెనకనుంచి] గోతమీ!

ఆమె—[వెనక్కి తిరిగి చూచి] నాపేరు ఎట్లు తెలుసును అన్నా నీకు? ఎవరు నీవు?

అతడు—నీపేరు ఒకరు చెప్పవలెనా? నీవు ఈవనంలో వనదేవతలా తిరుగుతూంటే, రెప్పపాటు వెయ్యకుండా, నిన్ను చూచి ప్రతి దినం ఆనందిస్తూంటాను. నా అనుచరులు నీచరిత్ర చెప్పగా విన్నాను.

ఆమె—[అదరిపడి మళ్లీ ప్రశాంత భావంతో] అన్నా, మనుష్యులచరిత్రా లన్నీ కాలుష్యపూరితాలు. ఒక్క అర్హతుని [బుద్ధుడు] చరిత్రమే పవిత్రం. అట్టివారి చరితాలు తెలిసికొని నిర్వాణానికి వారి పాదాలు సేవించు.

అతడు—[అంతర్హాసంతో] అర్హతుణ్ణా అనుసరించడం? [కొంత ఆలోచించి] అతడు పరిశుద్ధుడే కావచ్చు కాని గోతమీ, రాజ ప్రాసాదాల్లో మహాసౌఖ్యం అనుభవించే నీవు—అంతసుకుమారశరీరం గల నీవు—ఈ కటికి రాళ్లల్లో, ఈమిట్టమధ్యాహ్నం ఎండలో, తిరగడం-నేను చూడలేకపోయాను. ఆఖరికి సాహసించి నీతో చెప్పడానికి వచ్చేశాను. నన్ను క్షమించు......సూదుల్లాంటి రాళ్లల్లో నీ వొక్కొక్క అడుగు పెడుతూంటే నా హృదయంలో ఒక్కొక్క వజ్రపాతం అయిన ట్టుంటుంది. నామాట విని—ఈ వైరాగ్యవృత్తి మానివేసి......

ఆమె—అన్నా, ఎంత వెర్రివాడవు! ఈ దేహ సౌందర్యమా, విభ్రాంతి పుట్టించింది నీకు! అటు చూడు! ఆమందమారుతానికి ఆ

చిట్టిపువ్వు లెల్లా జలజలా రాలిపోతున్నాయో? ఈపండుటాకులు చూడు, ఎల్లా రాలిపోయి దుమ్ములో పొర్లాడుచున్నవో! ఈచిగుళ్లన్నీ ఇల్లా ధూళిలో పొర్లాడవలసిన వే సుమీ!

అతడు—[కొంత ఆలోచించి] నమ్మలేను. గౌతమీ! నమ్మలేను. ఇంత అందమైన ఈప్రకృతిని, ఈ సుఖాలని, విడిచిపెట్టి కాళ్లతో తన్ని పోవడానికా, ఆ దయామయుడు సృష్టించింది! వెర్రిమాట! అట్లయితే ఈ ప్రపంచమంతా పట్టి ఎడారిగా ఎందుకు పుట్టించలేదు! ఆ చక్కని పూవుల్నీ, ఆ చక్కని సీతాకోక చిలకల్నీ మనుష్యుడు చూచి ఆనందించడానికి ఈశ్వరుడు సృష్టించాడు. పండిపోతే మాత్రం—ఆఆకు లెంత అందంగా పచ్చగా ఉన్నాయో చూడు. ఎందుకు అంత చక్కని శరీరాన్ని అల్లా కృశింపజేస్తావు? చూడు—నీలాలవంటి కళ్లు గలిగిన ఆ నీముఖం ఈమిట్ట మధ్యాహ్నం ఎండలో ఎల్లా కందిపోయిందో! పసుపులాంటి పచ్చనిశరీరం ఎల్లా వాడిపోయిందో! ఆమృదువైన పాదాలకి ముళ్లు గుచ్చుకుని ఎల్లా రక్తం కారుతోందో? అబ్బా... నే చూడలేను.

ఆమె—[కొంచెము నవ్వి] ఎంత ధైర్యహీనుడ వోయీ! ఒక్కసారి నిశ్చలబుద్ధితో అర్హతుణ్ణి మనసులో ధ్యానించి ఈ నశ్వరమైన ప్రపంచాన్ని గురించి ఆలోచించుకో. [అని తన మార్గాన్ని పోతూంటుంది.]

[కోయిల 'కో' అనికూసి యెగిరిపోతుంది. ఆ అడవికి తీగపువ్వులు జలజలా అతనిమీద రాల్తాయి. అతడు ముందుకు వచ్చి]

అతడు—ఆగు—ఒక్క నిమిషం ఆగు. పట్టిది... భ్రమ... ఇల్లాంటివి ఆలోచించడానికి కావలసినంత ముసలితనం ఉంది. అప్పుడు ఇవన్నీ ఉంటాయా! వెళ్లకు. ఆ ముగ్గులుగా ముటగట్టే పల్లనికళ్లు నా ముందు లేకపోతే, ఈ ప్రపంచమంతా అంధకార మయిపోతుంది. భూమి తిరుగుతూంది. [ముందుకు వచ్చి] నీవు ఇట్లు తిరస్కరిస్తే జీవించలేను గౌతమీ! [సభావంతో] నా సర్వస్వము నీపాదాలముందర అర్పిస్తాను. నీచుట్టూ రేయిపవలు తిరుగుతాను. నన్ను మాత్రం తిరస్కరించకు........

ఆమె—నీ ప్రకృతి ఉద్బోధనం అయింది గాని నాకు వైరాగ్యం పుట్టించలేదు. ఈ నీపాప లోకానికి మరి మళ్లను అన్నా!

అతడు—అంతనిర్దయస్వభావము గలదానవా? నీవు!.....నీకు ఆ మానవ సమూహము పట్ల సానుభూతి? నీశరీర మేమి? అనియమా లేమి? నీ జీవనంలో నిరసనలేనిదానా నీవా? నీశరీర మెంత వాడిపోయిందో! ఆ నీముఖం, ఆ నీ నల్లగా నిగనిగలాడే కళ్లు—నల్లకలువల్లా ఎల్లా వాడిపోతున్నాయో...వాటిని చూడకుండా నే ఉండలేను గౌతమీ!

ఆమె—ఇదా నీ విభ్రాంతికి హేతువు?... అన్నా, నీ వీ కళ్లు చూడకుండా ఉండలేవా? అయితే నీకు ప్రియమైన నేత్రాలు నీవే తీసికో...నన్ను అర్హతునిధ్యానానికి పోనీ. [అని బలవంతంగా కళ్లు ఊడబెరకడానికి ప్రయత్నిస్తుంది. కళ్లమ్మట జొటజొటా రక్తం కారుతుంది. ఆమె ప్రయత్నం మానదు.]

అతడు—ఆఁ, ఆఁ—వద్దు! వద్దు! ఎంత క్రూరకృత్యం చేశావు! [అని ఆమెచేయి పట్టుకుని ఒకనిమిష ముండి] ఆఁ, తెలిసినది సత్యము తల్లీ! [అని కాళ్లపై బడి] ఎంత కరుణామయురాలవు నీవు! నన్ను తరింప జేశావు. తల్లీ! నేను మహాపాతకిని, నా పాపాలు పోవడం ఎట్లు? నన్ను క్షమించవా? నీవు కాదు అంధురాలవు! నేను. నాకు సన్మార్గము చూపెంచు.

ఆమె—[ప్రశాంతభావంతో అతన్ని లేవనెత్తి] అన్నా, ఎంతమాట! నిన్ను నేనా క్షమించేది! ఆ బుద్ధభగవానుడే అందర్నీ క్షమించగానికి సమర్థుడు. అంతవర కెందుకు? ఆదయామయుని నామస్మరణమే మానవకోటిని తరింపజేస్తుంది. ఒకసారి అతన్ని భక్తిభావంతో ధ్యానం చేతాము.

ఇద్దరూ—[చేతులు జోడించి భక్తిభావంతో]

*"నమో భగవతో అర్హతో బుద్ధస్స."

[తెర పడును.]

---

# సంధ్యాభావన

శ్రీరంగం శ్రీనివాసరావుగారు, బి. ఏ.

ఓ రమణీయ సంధ్యారాగజలధిలో
తారాసహస్రముక్తామాలలు జనించె,
ఈసాంధ్యరాగప్రభాసౌకుమార్యమ్ము
లో సుధలుమాత్రమే భాసిల్లుచున్నయవి!
ఆనందభావవీచీ నినాదమ్ములో
కానంగరాక దుఃఖమ్ము శ్రుతి కల్పినది!
రోదోంతరాళసంబాధాంధకారాన,
మాధుర్య మేది సంధ్యాదీప్తి వశియించె.
అతివికృతభయదాట్టహాసధ్వనులతోడ
అంతటను దుఃఖమే ఆడి పాడగదోడగె!

ఆయంధకార కుహరాంతరాళములోన
ఏ యేదురంతముల కెవడు సాక్ష్యమువచ్చు!
ఆసాంధ్యరాగమే అనుకొనుదు జీవితము,
భాసిల్లుతారకలె ప్రణయసద్భావములు!
సాంధ్యరాగారామ జనితప్రసూనముల్,
కంధరోదరలబ్ధముక్తామాలికాతతులు!
ఆమనస్యమహోజ్జ్వలాగ్నికీలికలందు
ప్రేమైకదృక్కులే పీయూషశీతములు
నశ్వరాంధధ్వాంతసంప్రజీవిత మెత్తి
శాశ్వతప్రేమతేజంబె ఉన్నతిఖ్యాత్స!

---

* "పూజ్యుడైన బుద్ధునికి నమస్కృతి."

# చచ్చినవాని పగ
(నిజమైన కథ)

తంగిరాల రాధాకృష్ణయ్యగారు, బీ. ఏ., బి. యల్.

నా పేరు వెంకటస్వామి. నేను ఇంజనుడ్రైవరును. ఈనడుమనే మాకంపెనీవారు నన్ను ఎక్స్ప్రెస్సు డ్రైవరుగా నియమించినారు. నానిలువ బెజవాడ. ఇప్పుడు నాలుగు వందలు నాజీతం. నేను కంపెనీలో ప్రవేశించునప్పుడు ఫైరుమేనుగా చేరినాను. క్రమేణా నాకు కలిసి వచ్చి మొదటమొదట యార్డు షంటరుగానున్నూ, క్రమేణా గూడ్సు డ్రైవరుగానున్నూ మెట్టుపైమెట్టు కెక్కుతూవుంటిని. ఇట్లు నాకు పదవులు కల్గుటకు మాకంపెనీలో డ్రైవరు మేటియగు అప్పాజీగారికి నాయందు కలిగిన ప్రేమయే కారణము. తుదకు అతని ప్రేమకు నే నర్హుడను కాకపోయినందుకు నా గుండె లవిసిపోవుచున్నవి............

మరి అప్పాజీగారు చాలా యోగ్యులు. గంభీరులు. వారి ముఖములోనే ఏదోయొక గొప్పవర్చస్సు వుండేది. కాయపుష్టి గలవారు, కొంచెము వయసు మించినా గూడాను. ఆ నెరిసేనెరిసేమీసాలు చాలా అందంగా వుండేవి. ఇంతకూ ఆయనమాటంటే ఎట్లాంటివాడున్నూ లక్ష్యపెట్టే ట్టుండేది. నేను కంపెనీలో చేరినప్పటినుండియు ఆయన నన్ను దగ్గర తీసి, మంచిసెబ్బరలు చెప్పుతూ యథాశక్తి సహాయం చేస్తుండేవాడు. ఇట్లుండగా ఒకనాడు, నేను ఇంకా గూడ్సుడ్రైవరుగానే వున్నాను. అప్పటికి, నన్ను పిల్చి "వెంకటస్వామీ, నేను ఈరోజు వైస్రాయిగారి స్పెషలు నడుపుటకు ఢిల్లీవరకు వెళ్లివలసి వస్తుంది; నాభార్యనూ, చిట్టినీ యిక్కడే వెయిటింగురూములో ఉన్నారు. వారిని తీసుకెళ్లి కొండపల్లిస్టేషను వద్ద మాక్వార్టర్సులో దిగబెట్టి మరి నీవని చూడుకో" అంటూ మళ్లీ నేను జవాబు చెప్పే లోపలనే నాకు సలాము చేసి వెళ్లిపోయినాడు. నేను వెంటనే వెయిటింగురూములోకి వెళ్లి అప్పాజీగారిభార్యను కలిసి, సంగతి యావత్తూ చెప్పాను. చిట్టికి నాలుగు చాక్లెట్టుగొట్టాలు కొనిపెట్టి, చంద్రాయమ్మను చిట్టిని తీసికొని కొండపల్లిలోకలులో ఒకసెకండుక్లాసులో దిగబడ్డాము. చలిగాలి తీవ్రంగా కొట్టడంచేత కిటికీతలుపులు దించివేసి నేను ఆ ప్లాట్ఫారము మీద కొత్తలను పాతలను కలేస్తూ ఉన్నాను. రైలు కదిలేసమయానికి బండ్లోకి వచ్చాను. చంద్రాయమ్మ కిటికీలోగుండా చూస్తూవున్నది. చిట్టి నిద్రపోతూంది. నేను రాగానే చంద్రాయమ్మ "వెంకటస్వామీ, చలిగాలి ఈడ్చి కొడుతూఉన్నది. ఎందుకు పూరాకే అటూ ఇటూ తిరగడం? అసలే నీది సుకుమారమైంది దేహం: లోపలికొచ్చి కూర్చోరాదూ!" అంది.

"ఏదో తెలిసినవాండ్లుంటే మాట్లాడుతున్నాను. పైగా యింతమాత్రం గాలికే భయ

పడితే ఎలా అమ్మ మేము!" అని గొణిగాను నేను.

"అలా అనకు: మొన్న ఈనడుము మావారికి పడిశం పట్టిందని వారంరోజులు పనిలోనికి పోలేకపోయినారు. ముసలాయనకి ఆయని కివి లెక్కా జమా లేదు. వయసువాడివి నీవుగూడా అలా అంటే ఎలా?" అంది చంద్రాయమ్మ, బండి సాగిపోతూంటగా.

నాకు ఏదో కలవరం పుట్టింది. ఏదో లే అని ఒక సిగరెట్టు ముట్టించాను. ఆపిస్సుస్సులో వాడు మరి నల్లమందే పెట్టాడో, మరేమో కాని, నాకుమాత్రం చాలా చాలా ఆలోచనలు పోయినాయి. నాలుగు పీకులు పీకి, ఆసిగరెట్టవతల పారవేసి, ఆంధ్రపత్రికలో బొమ్మలు చూడ్డం ప్రారంభించాను. చంద్రాయమ్మ "ఆ. మావారు, అదేమో లంక చుట్టలు తప్ప తగిలించరు కదా. ముచ్చటకైనా సిగరెట్టు ముట్టించరు." అని ఏదో ఆవలించినట్లు వినబడ్డది. నేనుమాత్రం కిక్కురుమనకుండా పేపరులో బొమ్మలు చూస్తూ, పైకాకితంమీద ఏదో రైల్వే సమ్మెలనుగురించి ఎవరో ఏదో రాస్తే చూద్దామని అనుకోబోతూవున్నాను. "మరి అయితే, పేపరు విశేషా లేవిటి?" అంది చంద్రాయమ్మ. నేనూ ఏదో నాకు తోచింది చెపుతూవుండేటప్పటికి కొండపల్లి స్టేషను వచ్చింది. అక్కడ దిగి క్వార్టర్సుదాకా రిక్షాబండిని మాట్లాడి చంద్రాయమ్మను ఎక్కించాను. చిట్టి ఆవిడే చేతుల్లోనే వుంది. ఆవిడగారు నన్నుకూడా రిక్షాల్లో ఎక్కవలసిందిగా చాలా బలవంతపెట్టింది. నేనూ కొంచెం మొహమాటపడ్డాను. "అల్లా కాదు. లేకుంటే నేనుకూడా నడిచి వస్తా" ననడం మొదలుపెట్టింది ఆవిడ. సరే నని వెళ్లాము. రాత్రి పొద్దుపోయినా మరలా వంట చేయించింది ఆమె. మే మంతా కలిసి కులాసాగా భోంచేశాం. ఆరాత్రి అక్కడే నిద్రించి వేకువనే మరలా బెజవాడ వచ్చేశాను. ఆవిడగారు నన్ను అప్పుడప్పుడూ వచ్చి చూచిపోతూండ వలిసిందనీ, వాండ్లాయన ఎప్పుడూ అటు డిల్లీకో, ఇటు కలకత్తాకో పోవడమున్నూ, ఇంటిసంగతి బొత్తిగా పట్టించుకోడనీ, పిల్లలనీ షికారుకు తీసికెళ్ల వలసినా తను వొంటరిగా పోవలసి వస్తుందనీ, దగ్గిరా దాపూ ఎవరూ వుండరనీ, ఆయన ఒక వేళ వచ్చినా ఏనెలకో రెండునెల్లకో వచ్చి చుట్టంలాగా ఏదో రెండు మెతుకులు కొరికి పోతాడనీ ఏమేమో చాలాదూరం నాతో అంది. నేనూ ఏదో వినినట్లూ విననట్లూ వచ్చేశాను.

అప్పటినుంచీ నేను చంద్రాయమ్మగారి ఇంటికి తరుచుగా వెళ్లుతుండేవాణ్ణి. అప్పాజీగారు ఉన్నా లేకున్నా కులాసాగానే కాలం గడుపుతూ ఉండేవాండ్లము. కొద్దిరోజుల్లో నన్ను గూడ్సింజను డ్రైవరునుండి ప్యాసెంజరు లోకలు డ్రైవరుగా నియమించారు. కొండపల్లినుంచి కాజీపేటవరకూ నేను లోకలును ప్రొద్దుననే తోలుకొని వెళ్లి మళ్లీ రాత్రి తొమ్మిదిగంటలప్పటికి బెజవాడ చేసతూంటాను. కొండపల్లి స్టేషనులో ఈ

లోకలు రైల్వేపనివాండ్లకోసం ఒకగంటసేపు ఆగుతుంది. అది తడవుగా నేను ప్రతిదినం షొయ్యేటప్పుడు వచ్చేటప్పుడూ కొండపల్లిరా గానే దిగి వెంటనే అప్పాజీగారి యింటిదాకా వెళ్లడం, ఎప్పుడైనా వారు వుంటే కుశలప్రశ్న మాలు కొట్టడం, లేకుంటే చంద్రాయమ్మ తోనే ఏదో సర్దాగా మాట్లాడి, పిల్లలతో కాకుంటే కాశేపు ఆడుకొని రావడం మామూలు అయింది. ఇదే మాదిరి అను దినం జరుగుతూండేది. సరిగా కొండపల్లిస్టే షనుకు ముందు ఒక పెద్ద వంపు వుంది రైలు మార్గంలో. అక్కడే ఆ వంపు మధ్యనే ఈ అప్పాజీగారి ఇల్లున్నూ. బెజవాడ బయలుదే రిందంటే శరపరంపరలుగా కొట్టుకరావడం బం డిని, కొండపల్లి చిన్నచక్కదాక వచ్చేటప్పటికి, ఈ వంపు దాటడానికి ఊపు తగ్గించడం: ఇల్లా నెమ్మదిగా వస్తూంటే అక్కడ అప్పాజీగారి ఇల్లు; చంద్రాయమ్మ పాలు పోయించుకుంటు న్నట్లో, పిల్లల్ని ఆడిస్తున్నట్లో, దాసీదాన్ని దబాయిస్తున్నట్లో, ఏదో ఒకమిష పెట్టికొని వాకిట్లో ప్రత్యక్షంకావడం, నేను కాశేపు ఈ రైలుసంగతి, ఆవిడ కాశేపు ఆ కొంపసంగతి మరచిపోవడం: ఇల్లాంటివి తటస్థిస్తూండేది.

౨

అయ్యా, లోకం; ఎం చెప్ప మన్నారు. ఊళ్లో అందరికీ కండ్లు లేవండీ. కొన్నాళ్లకీ ఊళ్లో అమ్మ లక్కలు ఇదంతా చోద్యంగా చెప్పుకోవడం మొదలు పెట్టారు. వా రన్నా రని వీరు. వీ రన్నారని మరొకరు. ఆనోట బడి ఈనోట బడి తుదకు అప్పాజీగారికికూడా అను మానం తట్టింది. తట్టిందో లేదో —అప్పాజీగా రికి నాయందలి అనురాగం మాత్రం పోయింది. కాకుంటే ఏదో నేను పలకరిస్తే పలకడం, మాట కరిమాట జవాబు చెప్పడం. చూచీ చూడనట్లు పోవడం. నన్నేదో తొలిగించుకుంటూండడం. నేనుమాత్రం మర్యాదగానే గురుభావంతో వుంటున్నాను. ఇట్లా ఉండగా ఒకనాడు నేను నాఇంజను తుడుస్తూండగా మా షె డ్డులో, అప్పాజీగారు వచ్చి నాబుజం తట్టి, "ఓయ్" అని నన్ను పలుకరించి నావెంబడి నిలబడ్డాడు. "ఇదిగో, ఇట్లాచూడు: లోకులు కాకులు; నలుగురు నాలుగంటారు. అదేం గాని, నీ కొక్కమాట చెప్పదలుచుకొన్నాను. నీవు ఇంకా పదికాలాలు బ్రతికి బాగుండా లంటే ఈలోకలునుంచి మరోబండికి మార్పిం చుకో. అంతే మాట" అని, నేను మళ్లీ ఎన్నో సంగతులు చెప్పాలని ప్రయత్నిస్తూ వుంటే, ఏమీ వినిపించుకోకుండా పుటిక్కున వెళ్లిపోయినాడు. మళ్లీ నాకు కనుపడలేదు. నేనో ఆరాత్రియే మాకంపెనీ ఏజంటుగారి వద్దకు వెళ్లి ఏదో నాకు తోచింది మనవి చేసుకొని నాకు మార్పు కలిగేటట్లు చేసు కొన్నాను. నన్ను ఆరోజునుంచి ఎక్స్‌ప్రెసు ఇంజను డ్రైవరుగా వేసినారు. బెజవాడ వదలితే కోర్నకలు, కోర్నకలు వదలితే ఖాజీపేట ఖాజీపేటనుంచి మరల తిరుగు ఎక్స్‌ప్రెసులో బెజవాడ, లైను కొండపల్లిమీదుగానే కాని

కొండపల్లిలోమాత్రం ఆగదు. ప్రతిదినం కొండపల్లి వంపుదగ్గరకు వచ్చేటప్పటికి, నేను ఇంజనుకూత వేయించేవాడిని. ఏమో గాని ఆమాయ చంద్రాయమ్మ ఏ కిటికీలోనుంచో, ఏదొడ్డివాకిటినుంచో ఇటు ఇంజనువైపు చూస్తూనేయుండేది. నేను కనుపడగానే ఆముఖంలో ఎక్కడ లేని కళాకాంతులతో కూడిన చిరునవ్వు వెలిసేది. నాకు నిమేషమాత్రం తన్మయత్వం కలిగేది. ఉత్తరక్షణమున ఆవిడ నాకు గాని, ఆవిడకు నేను గాని కనుపడువాండ్లము కాము. వంపు దాటగానే రైలు మేఘాలమీద ఎగిరిపొయ్యేది. తిరుగవచ్చేటప్పుడు రాత్రిపూట ఆమె నాకు ఒకలాందరుతో శలవు ఇస్తూండేది. అయ్యో, ఇట్లా జరిగింది కొన్నాళ్లు కథ. ఆఖరుకు ఒకరోజున నేను ఆవంపుదగ్గరకు వచ్చేటప్పటికి అప్పాజీ యింట్లో ఎవ్వరూ నరమానవులున్నట్లు నాకు కనుపించలేదు. ఏమో ఏమో, అని నాకు ఒకతొందర పుట్టింది. ఏమో ఇల్లేమైనా మార్చారేమో అని నాకు నేనే సరిపెట్టుకొన్నాను. మరి పల్లీ వచ్చేటప్పుడు ఆయింటివైపు చూస్తునుకదా ఆకాశమూ లేదు, శెమ్మా లేదూ. నేరుగా బెజవాడ వచ్చి కొంచెం కాఫీ పుచ్చుకొని తీరికగా "ఆంధ్రపత్రిక" మడత విప్పాను, కాశేపు చూచి పోదామని. ఇటు చూస్తును కదా, ఏముందనుకున్నారు, ఆ పై కాగితంమీద:

"ఘోరమైన హత్య

"కొండపల్లిలో ఇంజనుడ్రైవరు భార్యను, పిల్లలను చంపి తన్ను చంపుకొనుట."

## 3

'వెంకటస్వామీ, వెంకటస్వామీ, ఇదేమిటయా యీచిత్రం! లీవరు నీవు పదిహేను మైళ్లకు పెట్టావుకా మరి. చూడూ, ముప్పయికి తిరిగి వుంది ఇప్పుడు —నమ్ము, నమ్మకపో, అప్పాజీగారు తిప్పుతూవుంటే చూచాను నేను' అన్నాడు మాఇంజనులో ఫైరుమేనుగా ఉన్న రామసింగు. నే నింకా ఎక్స్ప్రెస్సు డ్రైవరునే. పరిగా కొండపల్లివంపుమీద రైలు పోతూంది. ఆవంపుమీద గంటకు 15 మైళ్లకు పైవేగముతో రైలును నడిపించిన రైలుకు ప్రమాదము కలుగుతుంది. నేను ఎప్పటిలాగనే 15 మైళ్లకు లీవరు తిప్పి ఆస్థలమాహాత్మ్యమును స్మరించుకుంటూ వున్నాను. రామసింగుఘూబరాను చూచి ఇటు తిరుగుదును కదా, లివరు 30 మీాద వుంది. రైలో కటకటలాడుతూ సింహగర్జనముతో పరిగిస్తూన్నది. లివరు మరలా 15 కు తిప్పడానికి ప్రయత్నించాను. తిప్పితే తిరగదుగదా! నాశక్తి నంతా పట్టి లాగి లివరును వంపు దాటేవరకు గట్టిగా పట్టుకొన్నాను. 'ఏమిరా ఈగోల' అని రామసింగును అడిగితే, 'అప్పాజీగారు పట్టుకొని 30 మీాదికి లాగారండీ, ఇందాక నేను చూచాను' అంటాడు. 'ఎన్నడో చచ్చిన అప్పాజీగా రేమిటి, లివరు తిప్పడ మేమిటి, నీమొఖం నీవు చూడడ మేమిటి రా' అని నే నంటే,—'ఆఁ, నేను చూచానండీ' అంటాడు. మొత్తానికి వాడు చూచాడో లేదో కాని, లివరుమాత్రం ఎంత గట్టిగా తిప్పినా తిరుగలేదు. మరుదినంకూడా యిదే

మాదిరి జరిగింది. మూడోరోజు రామసింగు, నేనూ, ఇద్దరముకూడా కలిసి లివరును పట్టుకో వలసివచ్చింది. తుదకు నాకు వంపువద్దకు వచ్చే టప్పటికి ప్రాణసంకట మయ్యేది. సరిగా కొండ పల్లివంపుదగ్గరకు వచ్చేటప్పటికి లివరు 15 నుంచి 30 కి తిరగడం; మేము ఎంత పట్టుకొని లాగినా 15 కు ఒకరాగాన రాకపోవడం; ఎవరో బలవ ద్విరోధి లివరును 30 మీదికి లాగుతున్నట్లు మాకు అనిపించడం:—ఎట్లాగా రైలును యీ వంపు దాటించడం అని మాకు గుండెల్లో గుండె లేకుండడం—ఈ తట స్థిస్తుండేది.

౪

మానిలువ బెజవాడనుండి కాజీపేటకు మార్చవలసివచ్చెను. నేను అందుకు సిద్ధుడ నై నాభార్యను పిల్లను కాజీపేటకు తీసుక వెళ్లుతున్నాను. ఇంజను కానుకొని వున్న ఒక చిన్న పెట్టెలో మావాండ్లను ఎక్కించాను. ఆ పెట్టెలో మరెవ్వరూ ఎక్కలేదు. మాఆవిడకు 30 సంవత్సరములు వయస్సు. గొప్పవారి ఇంటి బిడ్డ. సుకుమారి. ఆరోజు ఆవిడయందు నా కెందుకో అంత గౌరవము, అంత ప్రేమ, అంత మమకారమూ కలిగింది. ఇవతల ప్లాటు ఫారముమీదనే నేను నిలుచొని, మూడుసార్లు ఆవిడను ఆకిటికీలో గుండా ముద్దుపెట్టు కొన్నాను. అప్పుడు ఆవిడకండ్లల్లో నాకండ్లు కలిసిపోయినాయి. నా కౌగిలిలో నిమేష మాత్రం ఆమె సర్వావస్థలూ మరిచిపోయింది. నాపిల్లను ఎత్తుకొని వెయ్యిముద్దులు కురిపించి, వదలలేక వదలలేక పిచ్చిపిచ్చిపిచ్చిగా దానితో మాట్లాడుతుండగా, మారైలు బయలుదేరు టకు గంట వినపడ్డాది. ఇంక మురిపెములకు వ్యవధి లేక సరాసరి ఇంజనులోకి వెళ్లి రైలును సాగించాను. తోక త్రొక్కిన త్రాచువలె విప రీతవేగంతో రైలు వెళ్లిపోయినది.

౫

మరునాటి ఆంధ్రపత్రికలో ఈ క్రిందివార్త కానవగును:

"రైలు పట్టాలు తొలగుట

"నిన్నటిదినము బెజవాడనుంచి బయలు దేరిన ఢిల్లీ ఎక్స్‌ప్రెస్సుబండి కొండపల్లివంపు వద్ద పట్టాలు తొలగినవి. ఇంజను డ్రైవరు హాతు డై పోయెను. ఫైరుమేనుకు ప్రాణాపాయకర ములగు గాయములు తగిలినవి. ఇంజనుప్రక్క నున్న చిన్న క్యారేజి ముక్కలుగా ముక్కలై పోయినది. అందులోనున్న ఒక స్త్రీయున్నూ ఒక బాలికయున్నూ చనిపోయిరి. మిగిలిన ప్రయాణీకులకు ప్రమాద మేమియునూ కలుగ లేదు."



హారిస్ వంతెన : చెన్నపురి.

# పడవలో

కపిల కాశీపతిరావుగారు

చీకటిరాత్రి.

"జంబైలే జోతు లంగరి" అని పాడుతూ మన్యమన్య ముక్కుతూ, మూలుగుతూ పడవలాగేవాళ్లు అట్లపాడు రేవులోంచి "ఎదురుపడవ కాసుకో" మని ముక్కానిదగ్గిర సరంగుని హెచ్చరించారు. పాలకొల్లు నరసాపురంకాలువ రహదారిపడవ నిడదవోలు రేవు విడిచిపెట్టి మసకలో సాగుతూఉన్నది. చీకట్లో గట్టుమీద మనుష్యులు కనబడకపోయినా, మువ్వలకఱ్ఱ చప్పుడులో, ఇలకోడికూతలలో, పడవపాటమాత్రం వినబడుతూఉన్నది. పడవ కొంచెం విసురుగా నడవడమువల్ల రెండుపాయలుగా చీలుతూన్న నీళ్లు జలజలమని చప్పుడుచేస్తూన్నవి. పడవలో హాలులో కిరొసెననూనెదీపం సీనారేకు తలుపులుసందా పొగ విడుస్తూ, టాపుకి వేలాడుతున్నది. అటూ ఇటూ ఊగడంలో కీనీడ అణ్ణెంలో బస్తాలమీద, మనుష్యులమీద గంతులువేస్తూ గాసమువూతే దాడుతూన్నది. ఆబస్తాల మీదే కొందరు, అడ్డచెక్కలమీద కొందరు, ఎవరికి దొరికినచోట్లో వారు, ప్రయాణీకు లంతా నిద్ర సేవిస్తున్నారు.

ఎంత జోగినా పడవలో ఒక వైష్ణవులముసలావిడకు మాత్రం నిద్ర రావడములేదు. లేచి కూర్చుని చీకట్లో ఏమిటో చూస్తూ ఆలోచిస్తూన్నది. దూరముగా గట్టుమీద దొరలబంగాళాలో దీపము వెలుగుతూన్నది. దాని ప్రతిబింబమే కాలువలో మెలికలుతిరిగి ఉయ్యాల లూగుతూన్నది. పెద్దతనమువల్ల కునుకు రాక ఆవిడకు ఏమీ తోచడంలేదు. ఎవరైనా మాట్లాడేటందుకు దొరికితే బాగుండు ననుకున్నది. ఆవిడకు దగ్గిరగానే కొంచెంవెడంగా ఒక రెడ్డిచిన్నది తలకింద చిన్నమూట పెట్టుకుని ముడుచుకుని పడుకొన్నది. ఇంతలో అణ్ణెంలో బస్తాలచాటునుంచి "క్యార్ క్యార్" మని చంటిబిడ్డఏడ్పు వినబడినది. నిద్రపోతూఉన్న రెడ్డిమనిషి ఉలిక్కిపడి లేచి కూర్చున్నది. కళ్లు నలుపుకుని, సంరక్షణ లేక రేగిఉన్న తలవెంట్రుకలు అటూ ఇటూ సర్దుకుని నిద్రలో చెదరిన పమిటకొంగు సరిచేసుకొని ఆపక్కా ఈపక్కా చూస్తే ఏమీ లేదు. ప్రయాణీకు లంతా నిద్రాభంగం కావడంవల్ల కొంచెం కదిలి ఆపక్కకు తిరిగో, కాళ్లు ముడుచుకునో మళ్లీ నిద్ర పట్టించుకోవడానికి ప్రయత్నం చేస్తున్నారు. పడవలో కొంచెం అలజడి జరిగినది. ఒకక్షణంలో అంతా నిశ్శబ్దం. పడవ నడుస్తూన్నది. దూరంగా ఉన్న శెట్టిపేట 'వయిరు' హోరు, మువ్వలకఱ్ఱచప్పుడు, ఇలకోడికూత ;—మరేమీ లేదు. పడవపాట ఆగిపోయినది. ఆఅమ్మాయికి ఎదురుగా మేలుకుని కూర్చున్న ముసలమ్మ పడవకిటికీలోంచి చూస్తే చీకట్లో పొడుగ్గా ఎత్తుగా గుబురుగా పెరిగిన నిద్రగన్నేరుచెట్లు గట్టుమీద పెద్ద కొండలలాగ ఉన్నవి. చెట్లఆకుల్లో మిణుగురు పురుగులు మెరుస్తున్నాయి. చల్లనిగాలిలో అప్పుడప్పుడు నిద్రగన్నేరుపువ్వులు వాసనేస్తున్నాయి. ఆమనిషి లేచి కిటికీదగ్గిరకు వెళ్లి నిలుచున్నది. నిర్ఘాంతపోయి, అర్థం లేకుండా అల్లాగే నుంచుని చీకట్లోకి చూస్తున్నది. ఆ మనిషివైఖరీ అంతా చూస్తే ముసలమ్మకు నిద్రలో తెలియకుండా లేచి పరుగెత్తే జబ్బుమనిషిలా కనుపించినది. ముసలమ్మకు మాట్లాడాలని మనసులో వున్నా పలుకరించలేదు. ఇంతలో ఏదో పైనుంచి కాలువలో పడి గుభాలున చప్పుడైంది. రెడ్డిపిల్ల మళ్లీ ఉలిక్కిపడి వెనక్కు తగ్గి, "అమ్మో ? అదేమిటే?" అన్నది. పైన చెట్లలో కీచుకీచు మని చప్పుడు. గబగబా కొమ్మలన్నీ కదలిపోయినవి. నిద్రలో ఉన్న కొమ్మల్లో కోతు లన్నీ మేలుకుని గందరగోళం చేస్తున్నవి. "కోతిపిల్లేమో, నిద్దట్లో పట్టు జారి పడిపోయిం" దన్నది ముసలావిడ. "శివశివా ! పాపం !" అని పడిచెక్కమీద చేతులాని కాలువలోకి వంగి చూసింది తూరుపుచిన్నది. పడవ అప్పుడే ఆచోటు దాటిపోయినది. కాని నీళ్లలో

ఎవరో ఈదుతూఉన్న చప్పుడు వినబడింది. మరి కానే పటికి కోతుల కిచకిచలు, కొమ్మల గలగలలు తగ్గిపో యినవి."

"చచ్చిపోలేదు. ఈదుకుని గట్టెక్కినట్టుంది. పాపం!" అన్నది ముసలమ్మ.

"దాని తల్లెంత ఏడ్చునో నమ్మా, పాపం!" అన్నది రెండోమనిషి.

"అవు నమ్మా! కోతి అయితే ఏం కొంపమునిగి పోతేనేం, ఎవరికడుపు వారిది."

"అదే మనుషు లైతే ఇం కేం వుందండి ఆశ? ఈపాటికే బుడుంగుమందురండి."

"అందుకనే, నోరూ వాయీ లేనిజంతువు కన కనే అన్నిఉపాయాలూ పుట్టుకతోనే పెట్టేశు శ్రీ మన్నారాయణమూర్తి."

"శివునాజ్ఞ లేందే చీమన్నా కుట్ట దన్నారండి" అన్నది, తనుకూడా ఏదో మాటాడాలి గదా అని, రెడ్డి పిల్ల. కానేపు వారు మాట్లాడలేదు. శ్రీరంగనీతులు, శివ పురాణం అంతటితోనే ఆగిపోయినవి. ముసలమ్మగారు ముభావంగా ఊరుకున్నది. ఆకోతిపిల్లసంగతి ఆవిడ ఆలోచించినట్టే లేదు. ఆచిన్నదిమాత్రం నివ్వెరబోయి నది. ఎవరో "కడుపులో చెయ్యెట్టి కలిపేసినట్టు" కల వరపడుతూ ఇంకా నుంచునే చూస్తున్నది. నిద్రపోతూ ఉన్న ప్రయాణీకులికి చచ్చి బతికిన ఆకోతిపిల్లసంగతి ఏందుకు? శివనామం విని విష్ణుజపం చేసుకుంటూన్న ముసలమ్మకుమాత్రం ఎందుకు? ఈపిల్లమాత్రం ఆదృశ్యం మర్చిపోలేకపోయినది. అస లది ఎందుకు జారిపోవాలి. ఏమో తనకి ఏం తెలుసు? ఎవరికిమాత్రం ఏం తెలుసు? చిన్నప్పుడు వాళ్లమ్మమ్మ చెప్పింది, కోతిపిల్ల పట్టు జారి విడిపోతే తల్లి దాన్నింక తాకదని. నిజమేమో. అన డమే గాని ఎవరు చూశారు? అంతవిచిత్రం వుంటుందా ఎక్కడన్నా? ఏమయినా సరే, కన్నతల్లి ఊరుకోలేదు. తనకళ్లముందు ఆపసికూన కీచుకీచుమని ఏడుస్తొంటే ఎంత కోతి అయితేమాత్రం ఊరుకుంటుందా? తీసు కుంటే తక్కిన కోతు లన్నీ పీకి చంపేస్తాయేమో! తన ప్రాణమన్నా యిస్తుంది గాని కన్నపిల్లని చంపుకుం టుందా? అని కుతూహలంగా తర్కవితర్కాలు చేసు కుంటూ నుంచున్నది. ఆమనిషిలో అస్సలు చలనం లేదు. నుడ్డి లాంతరు వెల్తురులో ఆమెనల్లనివళ్లు నిగనిగలాడు తూన్నది. ముతకగా వున్న చీర నమి పైకొంగు నాలుగు ఆవిడనుండే కొట్టుకొంటూన్నది. ఆపిల్లవాళ్ళము చిన్న కెరటంలాగున అలలుగా లేస్తూ ఉన్నది. ముక్కముక్క చేతులతో ఏదో అక్కడ బాగా ఉన్నట్టు నిమురు కొంటూంది. తల కొంచెం అటూ ఇటూ కదిలినప్పుడు ఆముఖంలో కళ్లుమాత్రం దీపం ముందు మిలమిలలాడుతు న్నవి. మాట్లాడినప్పుడు దీనంగా ఉన్నది. కేవలమూ ఏడ్చినట్టుంది కాని, ఏడవటం లేదు. చూడగానే ఆవ్యక్తి దూరప్రయాణం చేసినట్లూ, దుఃఖాల పాలైనట్టు స్పష్టముగా తెలుస్తూన్నది. తెలుపరాని, తెలుపలేని అవ్య క్తపు టుద్రేకములు ఏవో ఆహృదయములో ప్రవేశించుకు పోతూన్నట్టు చూచాయగా తెలుస్తూంది. ఆచిన్నదాని సర్వవైఖరీ సానుభూతికోసం ప్రపంచాన్ని దేవురిస్తోన్న ట్టున్నది. పెద్దవయసులో లేచీకటి గమ్మి ముసలావిడకు కొంచెం ఎల్లాగో ఉన్నా తనయెదుట ఉన్నవ్యక్తి ఒక నిర్భాగ్యురాలని తట్టలేదు. అయినా కొంచెం తోచక, కొంచెం ఎదురుగా మనిషి ఉన్నప్పుడు వూరుకోలేక "ఏ వూరమ్మా" అన్నది. ఆపిల్లకు వినబడలేదు. "ఓ అమ్మాయి, నిన్నే."

"ఏమిటండి?"

"ఏవూరూ అంట."

"ఏవూరని చెప్పమన్నా రమ్మా?"

"నే చెప్పమన్నవూరు చెబుతా వేమిటి? అస లేవూరో అని అడిగాను. వూరుగోత్రగపుడాన్ని, తల్లీ! నా కేమీ చమత్కారాలు చేతకావు."

"చమత్కారం కాదండి పెద్దమ్మగారు. నా గ్రహచారం అని మనవి చేస్తానండి."

"ఇంతచిన్నతనంలో అన్ని కష్టా లెక్కడపడ్డావు, నాతల్లీ? చూస్తే ఇరవై యేళ్లు లేవు. 'నా' అని చెప్పు కునేటందుకు ఇంతప్రపంచంలో ఊరే లేకపోయిందా?"

"'నా' అనేవాళ్లోరుంటే ఊళ్లేలినంత ఫలమండి."

"ఏ అమ్మో, ఏ నాన్నో కని పడేశారు తల్లీ, నిన్నూ? ఇంతమంది ఉండగా నీ ఒక్క ప్రాణమే బరువై పోయిందా అందరికీనీ?"

"................."

"ఏవూరునించొస్తున్నావు?"

"రంగాన్నించండి."

"అదుగో అల్లా జెప్పు. సర్వకష్టాలూ అక్కడే ఉన్నాయి ఈరోజుల్లో. శుభంకోసం వెడితే కష్టం యెదురుగా వచ్చిందిట. ఏదో నాలుగు డబ్బులు చేసుకుందామని అక్కడికి పోతే, వాళ్లకొచ్చింది పోయే కాలం. అయితే వొచ్చేస్తున్నారుటగా అక్కణ్ణుంచి మనవాళ్లంతా?"

"మనిష్ట మేంటండి? ఆళ్లే ఎల్లగొట్టేశారండి. ఏదైనా ప్రాణం తీపుగాదండి, చచ్చినాళ్లు చావగా దక్కినాళ్లు తిరిగొచ్చేశారండి."

"మరి మాఊర్నుంచి పోయినవాళ్లు చాలకాలం కిందే తిరిగొస్తే మీ రింతఆలస్యంగా వొస్తున్నా రేం?"

"మేం ఎవరండి? నే నొక్కదాన్నే నండి" అని చెబుతూ చెప్పలేక ఆపిల్ల పొడిదగ్గు దగ్గింది.

"పోనీ నువ్వే, ఇంతఆలశ్యంగా తిరిగొచ్చా వేం?"

"ఆడే వుండిపోదా మనుకున్నానండి. మ రుండ నియ్యలేదండి. తండ్రి! ఆయన లేరండి, నారాయణ రావుగారు, బలవంతంగా అందర్నీ పంపించేశారండి. అయినా ఇక 'నుంటే కోరింగాళ్లని బతకనిచ్చేటట్టు లేదండాళ్లు."

"అస లెందు కొచ్చిం దీరగడ?"

"ఏం లేదండి, వడ్లగింజలో బియ్యపుగింజండి. ఆదేశపాళ్లంతా సమ్మెకడితే మనోళ్లు తక్కువధరకి పని కెళ్లారండి."

"వీళ్లెడితే వాళ్లకెందుకూ?"

"కూలి నష్టంకాదండి ఆళ్లకి? కూలిసంఘానికి మర్యాద లేదండి? సావుకారికి పనిమనిషి లోకువైతే బతకనిస్తారాండి మళ్లీని? అస లింక రాబోయేరాజ్యమే పనివోళ్లదంటండి. ఇంతకీ మనవాళ్లు చేసిందికూడా బుద్ధి తక్కువేనండి."

"అదేమన్న మాట, పోట్లాటన్నప్పుడు రెండిందాల లోటుపాట్లుంటాయి. మనవాళ్లనిమాత్రం ఏమనంటాం మనం? ఆడవాళ్లకి తెలియనిసంగతులు అనేకం ఉంటాయి."

"మీరు శెలవిచ్చినమాటా నిజమేనండి. కాని ఈ సందర్భంలో ఇంతేనండి. నేనుమాత్రం పనిమనిషిని కానేంవిటండి? అందుకని మనవి జేస్తానండి."

"పోన్లే, ఎవ ళ్లెల్లాపోతే మన కెందుకు? బతుకుంటే బలుసాకన్నట్టు దేశం కాని దేశంలో, ఎక్కడో కాస్త ప్రాణం వాళ్లచేతుల్లో హాకీ అనకుండా, ఎవరింటి పట్టున వాళ్లు కలో గంజో తాగి పడిఉండొచ్చు. పాపిష్టిడబ్బు సంపాదిస్తే ఏం, లేకపోతే నేం. బతికున్న నాలుగురోజులు సుఖం లేకపోయాక?"

"ఇల్లూ వాకిలీ లేనివాళ్లసంగ తేం చెబుతా రండి?"

"అదేంవిటమ్మా మరీ అంతశోద్ధంగా చెబుతావు? ఇల్లే లేకపోతుంది? కట్టుకున్నవాడు నువ్వూ ఎక్కడుంటే అక్కడే ఇల్లు."

"అదుంటే ఈ ఆపశోపా లెందుకండి? అందర్నీ ఆయములాళ్లకే వప్పగించానండి. నాకర్మం..."

ఇంతలో ఆపిల్లకు పొడిదగ్గు వచ్చింది. మాట్లాడ లేకపోయింది. పక్కన ఉన్న బస్తామీద చతికిలబడినది. వెంటనే ఆబస్తామీదే వొరిగిపోయింది. ఆపిల్ల ఏడుస్తోంది. ఇంతవరకు ఈమనిషివిషయమై కొంచెం అపోహలో ఉన్న ముసలమ్మమనస్సు చలించినది. "అయ్యో, పాపం మంచిదే పిల్ల" అనుకున్నది. ఇంక ఊరుకోలేక వోదార్చింది. "అయ్యో! అయ్యో! ఇంతట్లోనే దుఃఖం ముంచుకొచ్చింది. నీ కెన్ని కష్టాలు నెత్తిన బడ్డాయో

నమ్మా? ఊసు పోక కదిలించాను. తలుచుకునేసరికి కడుపు చెరువై పోయింది గావునే తల్లీ ?"

ఆ అమ్మాయికి ఊరడించే సహృదయురాలు కనబడేసరికి మొదటితెర దుఃఖం కొంచెం ఆగింది. కళ్లు తుడుచుకుని గొంతుక సవరించుకుని, "మీ రేం చేశారు దొడ్డమ్మగారు ? ఎవరికర్మని కెవరు కర్తలు ? చెప్పుకుని ఏడ్చేటందుకుకూడా ఎవరూ లేక ఎవరన్నా మాట్లాడితే చాలని నే నున్నా నమ్మగారు మోహాంవాచి. ఒకమాటన్ని కష్టాలు వెళ్లబోసుకుంటేనన్నా బరువు తగ్గుతుంది."

"గుండెనిబ్బరం గలదానవు గనక నెట్టుకొచ్చావమ్మా. ఇదే మా బ్రాహ్మణపిల్లలైతే కడుపుబద్దలై చచ్చేవారు, ఏ నుయ్యో గొయ్యో చూసుకుని."

"కష్టా లొస్తే ఎవరన్నా భరించాలండి. అంతకంటె చేసే దేంటిటండి ?"

"అదీ నిజమేనమ్మా! మళ్లీ నిమిషాని కొచ్చే దేంటిటో తెలియదుగదా!"

"ముమ్మాటికీ నిజంవండి. సరిగ్గా రెణ్ణెల్లక్రితం కష్టం అంటే ఏంటిటో ఎరగనండి. నా కేం ఘరవా అని తలయిసురుగా తిరిగేదాన్నండి. మాయమ్మని, మానాన్నని, యెరగనే యెరగను గదాండి. మాయమ్మమ్మ పెంచి పెళ్లి చేసిందండి."

"ఏవూ రిచ్చా రమ్మా?"

"మా మామయ్యే నండి—పొట్ట నెట్టుకున్నారాయ ములాళ్లు. ఆ రంగంగడ్డలో రాసింది గావున్నండి గండం. బుద్ధెరిగాక మామయ్య నిడిచిపెట్టుండలేదండి. చిన్ననాటినుంచి ఓకంచంలో తిని ఓదిక్కున పడుకున్నామండి. ఈ పోలాలమావాశకి సరిగ్గా మూడేళ్లవుద్దండి రంగాని కెళ్లి. మూడేళ్లబతుకూ మూన్నాళ్లముచ్చటై పోయిందిగదా! పదికెల్లపెల్లాపండి. మళ్లీ తండ్రేనండి, అణ్ణి చూసుకునేటందుక్కూడా ప్రాప్తి లేకపోవాలాండి ?"

"ఎన్నాళ్లు విచారిస్తే ఏం లాభం? పోయినవాళ్లకి మళీ ప్రాణం పొయ్యలేంగదా! ఆర్చేవి తీర్చేవి, ఓ నాటివి, రెన్నాళ్లవి అయితే అనుకోవచ్చు, ఎల్లకాలం బతుకు బతుకంతా ఉండేవాట్ల ఉస్సురని నాపాయ్యపం తప్ప మనం చేసే దేముంది? మరీ అంత విపరీతంగా, కట్టుకున్న మొగుడూ, కడుపున గన్న బిడ్డా ఇద్దర్లో ఒకరన్నా ఉండకుండా పోవాలి?"

ఆసమయంలో ఇంతాకా ఏడ్చిన చంటిపిల్ల ఏడ్పు మళ్లీ వినబడినది. రెడ్డిపిల్ల మళ్లీ ఉలిక్కిపడింది. తెల్లబోయి చీకట్లోకి చూసి ఆలోచిస్తూన్నది. పెద్ద ప్రాణం. అందులో ఆడది. ఈపిల్ల పడే హృదయవేదన ముసలమ్మగారు గ్రహించినది. దిక్కుమాలిన పక్షి, దీన్ని కూవిధంగా వదిలెయ్యకూడ దనుకున్నది.

"ఇదుగో పిల్లా, నీపే రేమిటి అన్నావు?"

"మాణిక్యంవండి."

"అయితే, మాణిక్యం, నివ్విప్పు డెక్కడికి పోదామని ?"

"మాయమ్మమ్మగారి ఊరండి ?"

"మీఅమ్మమ్మ ఉంటే ఇక నే. ఫరవా లేదు, పాపం."

"అమ్మమ్మా లేదు, తాతమ్మా లేదండి. మేం దేశ మిడిచిపోక మునుపే పోయిందండి మాయమ్మమ్మ."

"మరి ఇక నక్కడికి కెందుకు నువ్వు ?"

"నే నెరుగున్న ఊరదీ కాక మరి లేదండి. ఇంకేం చెయ్యనండి?"

"మావూ రొస్తావా తీసుకెళ్తాను?"

"నా కన్నివూళ్లు సమానమేనండి. ఓవూ రెక్కువ లేదు, మరోవూరు తక్కువ లేదు. ఎక్కడుంటేనన్నడిగేవా రెవరండి? ఇల్లాగే ఎక్కడో తల దాచుకుంటే ఎప్పుడు విసుగు పుడితే అప్పుడే వుందండి దారి."

"ఏదారి ?"

"గోదారండి. నాబిడ్డ, నాదేవుడూ ఎక్కడుంటే అక్కడికే నేనూ పోతానండి."

"చిన్నతనంచేత అల్లా అనిపిస్తుందమ్మా. ఆఘాయిత్యపుమాటలు అనుకోకూడదు. దిక్కు లేనివాళ్ళకి దేవుడే దిక్కు. నీ కొచ్చిన ఖరవా ఏమిటో చూస్తాను నాతో రా."

"పెద్దోరు. మీకంటె నా కెక్కువ తెలుస్తదాండి? ఆమాత్రం ధైర్యం చెప్పి సలహా ఇచ్చేవాళ్లు లేక నేనండి నా ప్రాణం అడిలిపోయింది."

చంటిబిడ్డఏడ్పు మళ్ళీ వినబడింది.

ఆఏడ్పుతో ఆచిన్నదానిప్రాణం లేచివచ్చింది. మళ్ళీ వెంటనే ఎక్కడికో పోయింది. ఇరవయిమూడు రోజు లయింది చంటిపిల్లఏడ్పు విని. తనకడుపుని కనుక్కుని ఏటి కేడాది పెంచి గంగలో కలిపింది. పోనీ మొగుడు పోతే అతనిపేరుమీదుగా కొడుకుని పెంచుకుని ఏహలో నాలో చేసుకుని జీవయాత్ర సాగిద్దామనుకుంటే, అదికూడా కరువయిపోయింది. తన కెవరు ప్రపంచంలో ఇంక? ప్రపంచానికి త నెవరు? మాణిక్యం అనేమనిషి ఎందు కింక? ఒక దిక్కు మాలిన ఇల్లాలు, ఒక కడుపుగాలిన తల్లి, చచ్చినావకటే, బతికున్నా వకటే, న వూరు —తనవూ రెక్కడ? వాళ్ళమ్మమ్మ తననీ, తన మామని పెంచిన పల్లెటూరు వెడితే ఆచచ్చిపోయిన కాతర్లని ముసలిదాని రంగమెల్లిన మనుమరాలని ఆదరించేవా రెవరూ? ఆచీకట్లో, ఆనల్లనినీళ్లలో ఎవరికీ తెలియకుండా పడవలోంచి జారిపోతే ఏం? లోకానికి నష్టమేంవిటి? తనకన్నీళ్లు కాల వయితే ఒక కాలువ నష్టం. తనకడుపు చెరు వైతే ఒకచెరువు నష్టం. ఒకదౌర్భాగ్యురాలు లేకపోవడం ప్రపంచానికి లాభం. ఒకదుఃఖం అయితే అనుభవించవచ్చు. గోరుచుట్టుమీద రోకటిపోటన్నట్టు ఒకదానిమీద వకటి. పోనీ, సంసారసుఖం అంతే చా లనుకుంటే కడుపునికని చేతులతో ఏటి కేడాది పెంచి, వళ్లో పాలు తాగే పిల్లాణ్ణి చూసుకునే సౌఖ్యంఅన్నా ఉంచకూడదు? ఇరవయిమూడురోజు లయింది బిడ్డముఖం చూసి, ఆఏడ్పు విని, ఆచిన్నచేతులు తనవంటికి తగిలి, ఆ పళ్లు లేని బోసినోరుతో తనపాలు తాగి. ఇరవయిమూడురోజులనుంచి పొంగిపోయే దుఃఖంతో ఆపాలుకూడా పొంగిపోతున్నాయి. ఎవరికి తెలుస్తుంది ఆబాధ. ఒళ్లో బిడ్డ వాలికిపోయిన తల్లిప్రాణం తప్ప సానుభూతి చూపించడానికి శక్తు లెవరు? ఆకలికి కడుపు ఓర్వలేనట్టు, ఈ వింతఉద్రేకానికి తల్లిప్రాణం ఓర్వలేకపోయింది. మానవప్రపంచంలో ఏయంత్రంవల్ల, ఏతంత్రంవల్ల, ఆలోటు తీర్చగలరు? మనుష్యులు అనుకునేటట్టు మందబుద్ధులయిన పశువు లయితే, ఏ చేత పెయ్యో చేసి తనదూడ అనుకుని అది చేపినపాలు దగా చేసి పితికి మనం తాగెయ్యవచ్చు. కాని బుద్ధిగల ఈమనిషికి మారుమం దేది? ఇంతకష్టం మనకి కలిగించే బుద్ధి ఉండడంకంటె లేకపోవడం సుఖం కాదూ? తనవళ్లో పడుకుని, కాళ్లు ఆడిస్తో, చేతులతో శరీరం నిమురుతో, పమిటకొంగులోంచి దోబూచులాడుతో, పిల్లవాడు తాగవలసిన పాలు, తన చేతులారా పిండి మట్టిపాలు చెయ్యవలసిన అవసరం ఏతల్లి భరించగలదు? లేక తన హృదయంలో ఈపాంసుబాలు దాచుకుని ఆబాధ ఏతల్లి భరించగలదు? పిల్లలతో తల్లుల్ని, తల్లులవళ్లో పిల్లల్ని చూచినప్పుడల్లా ప్రాణం పోతుందే! ఎక్కువైన తల్లి తన కో శిశుదానం చేసుకోకూడదు? అనుకోవడమే గాని ఎవరికిమాత్రం పిల్ల లెక్కువ? అని ఏమేమో ఇదే విధముగా మాణిక్యం మనసులో కుళ్లిపోతూన్నది.

పడవలో పిల్లఏడ్పు ఆగలేదు. అంతకంతకు ఎక్కువైపోతూంది. కడుపు చెక్క లయ్యేటట్టు బస్తాల చాటునుంచి ఏడుస్తోంది బిడ్డ. మాణిక్యం శరీరంలో ఒక్కొక్కఏడ్పు ఒక్కొక్కశూలంలాగున తగులుతూన్నది. సగం ఆపిల్ల అవస్థ చూసి భరించలేక, మరిసగం తనస్వంత అవస్థ జ్ఞాపికి వచ్చి ఆ రెడ్డిపిల్ల మహాక్షోభ అనుభవిస్తూంది.

పడవలో ఎవరికీ నిద్రపట్టడం లేదు. ముసలమ్మగారికికూడ విసుగువేసింది. ఇంక ఊరుకోలేక, "ఎవరమ్మా, మాయమ్మతల్లీ, ఇందాకణ్ణుంచి ఆపరసని ఏడుస్తూంటే ఏం చేస్తోంది తల్లి? అదేమినిద్ర మాయనిద్ర? కాస్త అడ్డాల్లో వేసుకోకూడదూ? ఓమాటు నమలబెడితే ఊరుకోదూ పిల్ల?" అంది.

ప్రయాణీకుల కందరికీ ముసలమ్మ మంచిమాటే అన్న దనిపించినది. కాని ఆమాట ఆతల్లికి వినిపించినట్టు లేదు. వినిపించినా వినిపించకపోయినా, పిల్లో పిల్లాడో ఏడుపుమాత్రం మానలేదు. వెక్కి వెక్కి ఒకటే యేడ్పు.

"ఏగాలో, ఏధూళో నమ్మా. బిడ్డడిలిపోతోంది పాపం!" అన్నది మాణిక్యం.

"అవునమ్మా, ఏదృష్టో, ఏదోషమో! అల్లా ఏడవ కూడదు చంటిపిల్లలు."

"మరి అప్పుడప్పు డల్లా పోరుపెడతారండి పిల్లలు. ఏంచేసినా ఊరుకోరండి."

"కని పెంచిందానవు కనక తెలుసునమ్మా కష్ట నిష్టూరా లన్నీ. అయ్యో! అయ్యో! ఇంకా ఊరుకో దేం, ఆపిల్లో పిల్లాడో? కాస్త తీస్తావు, అవెల్లి రెండు మంత్రంముక్కలు చెబితేనన్నా తగ్గుతుం దేమో?"

"అంతకన్నా నాండి. నేనుకూడా అందా మను కుంటున్నానండి ఆసంగతే. ఊరుకోబెడితిరాంటే మీ పుణ్యాం ఈరాత్రి."

"మనచేతులో ఉన్నదాని కేంలో టమ్మా. పద అదీ చూద్దాం."

"అందరిమనసు అల్లా ఉంటుందాండి మరి? ఎవ రెల్లా పోతే ఎవురికి కావాలండి? మనసు మంచిదవాలండి అసలు."

వారు వెళ్లేసరికి అక్కడ ఒకవింతదృశ్యం. ఇంత వరకుంచి ముసలమ్మగారు మందలించిన తల్లి అక్కడ లేదు. అక్కడే కాదు, ఎక్కడా లేదని నెమ్మదిమీద వాళ్లు గ్రహించారు. కొంచెం దళసరిగా గుబురుగా పెరి గిన పల్లెటూరిక్రాపింగుతో చొక్కా చేతులు పైకి తీసు కుని, కాళ్లమీద పడుకుని ఏడుస్తూన్న పిల్లవాణ్ణి సము దాయిస్తూ ఒకపురుషవ్యక్తి ఉన్నది. ఎంత తంటాలు పడినా పిల్లవాడు ఊరుకోడు. పక్కన రెండుమూడు చిన్నెగిన్నెలు, చెంచా, వేడినీళ్లసీసా, పాలబుడ్డి, వగ యిరా సరుకు లన్నీ పెట్టి ఉన్నాయి. పిల్లవాడు ఒకటే ఏడ్పు. కడు పక్కలించుకుపోయింది. డొక్క లెగరవే స్తున్నాడు. వెళ్లిన ఆడవాళ్లిద్దరూ నోటమాట లేకుండా నిలువబడిపోయినారు. తల్లి ఉన్నదని భావించి, తా నన్నమాట లన్నీ జ్ఞాపకం వచ్చి ముసలమ్మ చిన్నబోయి నది. ముసలమ్మగారి పశ్చాత్తాపముకంటె, పిల్లవాణ్ణి సము దాయించలేక ఆమగవాడు పడే అవస్థకంటె, పిల్లవాడు ఆకలిచేత ఏడుస్తూ పడేబాధకంటె, మాణిక్యంస్థితి కష్టంగా ఉంది. ఆవిడ శరీరములో ఉన్న సర్వరక్త నాళములూ, ఆపాదామస్తకమూ, జల్లుమనిపోయినవి. అని ఊరుకోలేదు. అల్లా అంటూనే ఉన్నాయి. తల బరువై పోయింది. కాళ్లు చేతులు వణికిపోయినవి. పిల్లదుఃఖం తల్లికి తెలుసును. తల్లి లేని పిల్లవాడి కడుపుబాధకంటె పిల్లపోయిన తల్లి కడుపుబాధ అధికం.

పాపం! ఆమగవాడు వీరిని చూసినట్టు లేడు. చూసినా, మగవాడు, ప్రస్తుతస్థితిలో తనంతట తానుగా పరాయస్త్రీలను ఏమని పలుకరిస్తాడు? నిర్వ్యవధానంగా తరువాత ముసలావిడ ధైర్యంచేసి మాటలు ప్రారం భించినది.

"నేను పట్టుకుంటాను నాయనా. నువ్వు పొయ్యి" ఆపురుషుడు తల యెత్తేసరికి ఆవిడ మరింత తెల్లబోయి నది. పూర్వపరిచితుడే.

"మాదిరెడ్డివారి రామన్నవు గాదు నాయనా నువ్వు? విన్నాను నాయనా, విన్నాను. కన్నుల పండువగా ఉండే నీసంసారం ఎంతలో చితికిపోయిందీ! నీప్రారబ్ధమే ఇల్లా కావాలి! నిన్న గాక మొన్న గడ పలో కొచ్చిన పిల్ల అదే పోవాలీ! చిలక, బంగారు చిలక. అంత బుద్ధిమంతురా లుండదమ్మా. పోయింది పోగా నీప్రాణానికి సుఖం లేకపోయింది. ఎంత పెద్దవాడవైనా ఎంత విరోధులైనా, ఇదివర కెంత రాకపోక లేక పోయినా, మేనత్తను తీసుకెళ్ల రాదటయ్యా? చూస్తూ పోయాక, కూతురుబిడ్డకంటె కావలసినవా ళ్లెవరూ?" అని, ఓదార్చడం, సముదాయించడం, సలహా ఇవ్వడం అన్నీ ఒకఉపన్యాసంలోనే చెబుతూంది ఆవిడ. ఈవిడ మాటలతో పసిబిడ్డ ఏడ్పు మానలేదు. రామన్న దుఃఖం తీరలేదు.

"రా ల్లేవూ?"

"పాలు కాదండి, ఇదేదో 'హార్లి'క్సండి. సీసాలో నీళ్లు చల్లారిపోతే ఎల్లాగా కలపడం అని ఆలోచిస్తున్నానండి."

"అయ్యో, పడవలో, చుక్కానిదగ్గిర పొయిలో నిప్పు లుంటాయి. వెచ్చజేసుకుని రా, నాయనా, దబ్బుని; పిల్లాడిప్రాణం అవలిపోతోంది. ఇలా తే, పిల్లాణ్ణి నేను పట్టుకుంటాను." రామన్న గిన్నెలు తీసుకుని చుక్కానిదగ్గిరకు వెళ్ళినాడు. పిల్లవాడు ముసలమ్మ చేతుల్లో ఏడుస్తున్నాడు. మగవాడు అవతలకు జారగానే మాణిక్యం మనసు ఊరుకోలేకపోయినది. గభుక్కుని చటికిలబడి, ఏమీ మాట్లాడకుండానే పెద్దావిడ చేతులో పిల్లవాణ్ణి లాక్కుని వళ్లో వేసుకున్నది. ఇంతసేపటినుంచి అంత గందరగోళంచేసిన ఆచిన్నపిల్లాడు మరుక్షణంలో నిశ్శబ్దం అయిపోయినాడు. తనతల్లి బతికున్నపుడు వళ్లో పడుకుని చన్ను గుడిచి పాలు తాగడానికి అలవాటుపడ్డ ఆచిన్నబిడ్డ ఆత్రంతో పాలు తాగుతున్నాడు. తనబిడ్డ బతికిఉన్నప్పుడు వళ్లో పెట్టుకుని, చన్ను గుడిపి పాలు ఇవ్వడానికి అలవాటుపడ్డ తల్లి ఆత్రంతో పాలిచ్చినది. అరవయిసంవత్సరాలు నిండినా తనయావజ్జీవమూ ఇటువంటిదృశ్యము చూడని ముసలమ్మ నిర్ఘాంతపోయింది. ఎందుకో అమితఆనందం అనుభవించింది. ఇంత విపరీతముగా ఉన్నా ఆదృశ్యంలో అసామాన్యం ఏమీ ఆవిడకు కనబడలేదు. ఎటువంటి వ్యవహారంలోనయినా, ఆలోచించకుండా, అమాంతంగా, అభిప్రాయం వెలిబుచ్చేటటువంటి మనిషి, ఏదో ఆలోచిస్తూ కళ్లప్పజెప్పి చూస్తున్నది. తల్లీబిడ్డ లిద్దరూ వాళ్లలోకంలో వాళ్లున్నారు. వాళ్లకి గొడవే అవుసరములేదు. "నీకోసమే సుమా ఏడ్చాను" అన్నట్టుగా పిల్లవాడు ఊరుకున్నాడు. "నీకోసమే నాయనా, ఇంత ఆవేదనపడ్డాను" అన్నట్టు తల్లి సంతుష్టిగా పాలిచ్చింది.

రామన్న వస్తాడేమో మాణిక్యం సిగ్గుపడుతుందని ముసలావిడ పడిచెక్కదగ్గిరకు వెళ్లి అతన్ని ఆపడానికి నుంచున్నది. ఆ కాచిననీళ్లు కాసిన్నీ తొణికి పోకుండా జాగ్రత్తగా పట్టుకుని రామన్న వచ్చాడు. "ఊరుకున్నాడాండి" అని అడిగినాడు ఆదుర్దాగా. "పోయినతల్లి లేచి వచ్చినట్టుగా ఆ మాయిల్లాలు ఒళ్లో వేసుకుంటే ఊరుకోడు నాయనా?" రామన్న ముఖం విప్పారింది. అతని హృదయంలో ఉన్న బరువంతా జారిపోయింది. పాలక్కడ బెట్టి, "అబ్బ, మీధర్మమండి అవ్వగారు" అన్నాడు. "నే నేం జేశాను నాయనా! అదుగో ఆపిల్ల ధర్మం" అంది ముసలమ్మ. "వెయ్యివేలదణ్ణాలండి. మీ కడుపున పుడతానండి మళ్లీజన్మాన." "దాని కేం గాని ఇదుగో..." అని ముసలావిడ రామన్నతో దీర్ఘంగా ఏవో గుసగుసలు సాగిస్తూంది. అత నంతా వింటున్నాడు. వాళ్లిద్దరూ చాలాసేపు అల్లాగే మాట్లాడినారు. కడుపునిండిన పిల్లవాడు నిద్రపోయాడు. కడుపుబాధ తగ్గిన తల్లీకూడా, తన పోయినబిడ్డ లేచి వచ్చినంత సంతోషపడి పిల్లవాణ్ణి పక్కలో వేసుకుని అక్కడే వొరిగింది. నిద్రబద్ధకంగా ఉన్న ప్రయాణీకులకెవరికీ ఈసంగతి పట్టలేదు. ఏడుపు తగ్గడంతోనే వాళ్లంత నిద్రపోయినారు.

"తమ దయాధర్మభిక్షం అనుకుంటాను దొడ్డమ్మగారు" అన్నాడు రామన్న.

"దయేమిటి నాయనా, చిన్నతనాంనుంచి ఎరుగున్నదాన్ని ఆమాత్రం చెయ్యకూడదూ" అన్నది ముసలావిడ.

తరువాత రామన్న పడవటాపుమీదికి వెళ్లిపోయిగా చుట్ట కాల్చుకుంటూ కూచున్నాడు.

పడవ చాలాదూరం సాగింది. వెన్నెలొడిచింది. చెట్లఆకుల్లోనుంచి లేతవెన్నెల మాణిక్యంమీద, పిల్లవాడిమీద పడినది. చల్లనిగాలి వీచినది. చలి వేస్తే మాణిక్యం కొంచెం మెదిలి పమిటకొంగు పిల్లవాడికి సరిగ్గా కప్పి చెయి వేసుకుని పడుకున్నది. కొంచెం మెళుకువ చూసి ముసలమ్మగారు మాణిక్యందగ్గిర కూర్చుని మళ్లీ ఖబుర్లు వేసినది. మాణిక్యం పడుకునే జవాబు చెబుతున్నది. "మరీ, మాణిక్యం, మీకులంలో, మార్దమనువు లున్నాయి కాదూ?"

"ఓకులాన్ని లేవేంబిటండి, ఈరోజుల్లో ?" అని మాణిక్యం పిల్లవాణ్ణి అటునుంచి ఇటు వేసుకుని ఒత్తిగిలి పడుకున్నది.

"జంభైలే జోతులంగరి" అని పడవవాళ్లు పాడుతున్నారు. మువ్వలకర్ర చప్పుడౌతూంది. ఇలకోడి కూస్తూన్నది. పడవకూడా నడుస్తూనే ఉన్నది.

## ౨

తెల్లవారింది. పడవ అజ్జరం రేవులో ఆగిఉన్నది. పైరగాలి హాయిగా విసురుతూన్నది. వాలుపడవ గనుక లాగ నవసరము లేకుండా తెరచాప విప్పితే గాలివిసురికి నడుస్తుందని సరంగు పెమానుతాడు లాగుతున్నాడు. టాపుమీద కళాసులు డబడబా చప్పుడు చేస్తున్నారు. మాదిరెడ్డి రామన్న కిర్రుచెప్పులజోడు గట్టుమీదికి విసిరి తనొక్కడు ఓఅంగలో గట్టుమీదికి వెళ్లి జోడు తొడుక్కొని ఉంచున్నాడు. అటూ ఇటూ చూసి పడవవెనక వేపు వెళ్లి "ఎవరోయ్, సరంగు? పడిచెక్కమీంచి కాస్త బల్లెయ్యండి, పిల్లలతో ఆడవాళ్లు దిగాలి" అన్నాడు. బల్ల వేసినతరువాత మాణిక్యం పిల్లవాణ్ణి బుజంమీద ఓచేత్తోను, కాళ్లదగ్గిర చీరకుచ్చెళ్లకొంగు మరోచేత్తోను పట్టుకుని దిగింది. రాత్రి అంతా కొంచెం ఇంచుమించు జాగారం జేసిన ముసలమ్మగారికి చల్లగాలిలో అప్పుడే కాస్త కోడికునుకు పట్టినది. కొంత సిగ్గువల్ల, కొంత అభిమానంవల్ల, మరికొంత ఆవిడ నిద్రపోతూన్న దన్న ఆలోచనవల్ల, మాణిక్యం ఆవిడతో చెప్పకుండానే పడవ దిగింది. రెడ్డి రామన్న కొంచెం అటుగా వెళ్లి వేకువజామునే ఎక్కడికో వెడుతూన్న మాదిగవాణ్ణి పిలిచి, "ఆరేయ్, యెంకాయ్, రెండు పలుదోంపుల్లలందుకోరా" అని అవి కోయిస్తున్నాడు. మాణిక్యం చంటిబిడ్డను వళ్లో వేసుకుని గట్టుమీద పడవలోంచి దింపిన సామాన్లలో ఓపెట్టెమీద కూర్చుంది.

తెరచాప లేచినది. పడవ రేవు విడుస్తూండగా ముసలమ్మగారికి మెలుకువ కలిగింది. గట్టుమీద తల్లీ పిల్లవాడు, దూరంగా, వేపచెట్టుకింద మాదిరెడ్డివారి రామన్న కనబడ్డారు. "శలవండి, దొడ్డమ్మగారు" అన్నది మాణిక్యం. ముక్కుమీద వేలు వేసుకుని నిర్ఘాంతపోయి "మంచిది" అన్నది వైష్ణవావిడ.

మాదిగవాడితో బండి ఎష్టసంగతి మాట్లాడుతో గబుక్కుని ఆగి మాణిక్యందగ్గిరకు వచ్చాడు. రామన్న, ఆవిడచుట్టూ ఏదో సామాన్లలో ఏదో వెదికితే కనబడలేదు. చెయి ఝూడించి వేలు కర్చుకుని, "అన్నన్నా, పాలబుడ్డి మర్చిపోయాం" అని మబ్బుల్లో ఉన్నపడవ కేసి పరుగెత్తి వెళ్లిపోయాడు. మాదిగవాడు అమ్మగారికి పలుదోంపుల్లలు అందించి బండికోసం వూళ్లోకి వెళ్లినాడు.

కాలవగట్టుమీద సరుగుడుచెట్లు 'ఉంయ్యి'మని సంగీతం పాడుతున్నాయి. లేతమామిడిపూతవాసనలలో ఎక్కడో కోకిల కూస్తూన్నది. వేలు తాగుతూన్న పిల్లవాడు మానేసి తలెత్తి తల్లికేసి చూసి బుగ్గలు సొట్టపడుతూ బోసినవ్వులు నవ్వబోతాడు.

---




"చుక్కలు రాలినవి" అనువిషయమునుగూర్చి వ్రాయమనగా మా చిత్రకారు డీ చిత్రమును వ్రాసి పంపెను.

---

# కతియవారు ట్రేడింగుకంపెనీ యొక్క—

## సర్వజనాదరణీయమైన తలనూనెలు అండు వివిధపరిమళములుగల అత్తరులు

## కుసుమాల్ హెయిరాయిల్ (రిజిస్టర్డు)

శిరోజములకు, మెదడుకు, తగినటువంటి తలనూనె. సువాసనద్రవ్యములతోను, హీనాపుష్పములతో చేయబడి, సాటిలేనిదై తనరుచున్నది. సంపన్నులు మెచ్చినది. సీసా 1–కి రు. 1. వి. పి. చార్జీ 6 అణాలు ప్రత్యేకము.



## కెటి వైట్ రోజ్ హెయిరాయిల్ నెం. 777 రు (రిజిస్టర్డు)

వెంట్రుకలవృద్ధికిని, కాంతికిని తోడ్పడునట్టి తలనూనె. గులాబీపువ్వుల నిజసౌరభ మిందు గలదు. ఒకసారి పరీక్షించిన మీకే తెలియగలదు.

వెల సీసా 1–కి 14 అణాలు. వి. పి. చార్జీ 6 అణాలు.

## కెటి కోకోనట్ హెయిరాయిల్ నెం. 777 రు (రిజిస్టర్డు)

టెంకాయనూనె తల కుపయోగించునని ప్రతివానికిని తెలియును. కాని ఎట్లు సిద్ధము చేసినచో నది ప్రశస్తమో తెలియదు. ఈ నెం. 777 రులో (రిజిస్టర్డు) చేసిన ఈ టెంకాయ నూనె శుద్ధిచేయబడి దుర్వాసనారహితముగాను సూక్ష్మసువాసనాసంకలితముగాను గావింపబడి నది. అందుచే సామాన్యగృహస్థు లందరి మెప్పు నొందినది.

6 ఔన్సులు గల సీసా 1–కి 14 అణాలు. వి. పి. చార్జీలు 10 అణాలు ప్రత్యేకము.

మరియు జ్ఞప్తియం దుంచుకొనుడు



## కెటి ఒట్టో రోజ్ నెం. 777 రు (రిజిస్టర్డు)

దీనికి సరిసమాన మగు నూనె లేదు. రోజాపువ్వులచే చేయబడినది. పుష్ప వనమునం దున్న తాజా గులాబీపుష్పము లెంతటి పరిమళము యొసగునో యంతటి సౌరభము నిందు బడయగలరు.

అరఔన్సు బుడ్డి 1–కి రు. 1–12–0, పావు ఔన్సు బుడ్డి 1–కి రు. 1–0–0.

## కెటి ఒట్టో జాసిన్ నెం. 777 రు (రిజిస్టర్డు)

మల్లెపుష్పములను తెలియనివా రుండరు. కెటి ఒట్టో జాస్మిన్ (నెం. 777 రు) మల్లెపువ్వులు లేని కాలము లందుకూడ మల్లెపూలవాసన నిచ్చుచు ఆశ్చర్యమును ఆనందమును కలిగించును. ఈ పరిమళము నొక్కసారి యాఘ్రాణించిన, అదిలేక మీ రొక్కఘడియ యుండజాలరు.

అరఔన్సు బుడ్డి రు. 1–12–0, పావుఔన్సు బుడ్డి రు. 1–0–0.

## ఒట్టో మధుకర్ (రిజిస్టర్డు):—

ఒకసారి యీ అత్తరు నుపయోగించినవారు, సర్వదా దీనిని విడనాడలేకున్నారు. మేలైన పుష్పసౌరభమే యిందులకు కారణము. అరఔన్సు బుడ్డి 1–కి రు. 1–12–0. పావుఔన్సు బుడ్డి 1–కి రు. 1–0–0.

వి. పి. చార్జీలు 5 అణాలు ప్రత్యేకము. (ఒక్కొక్కదానికి)

వరా :—మీ గ్రామములందున్న దుకాణములలో కొనునప్పుడు కెటి మరియు నెం. 777 రు అనుపదము లను గమనించుడు. అట్లుచేసిననే శుద్ధమైనవి మీకు దొరకగలవు.

పరీక్షార్థమై రెండు అణాస్టాంపుల నంపి యే రెండు తలనూనెల నమూనాలుగాని, లేక అత్తరునమూనా యొకటిగాని తెప్పించుకొనుడు.

సోల్ ఏజంట్లు:—**ది కతియవారు ట్రేడింగు కంపెనీ,**

ఖేట్వాడి మెయిన్‌రోడ్, బొంబాయి నెం. 4 ,



## మీ శిరోజముల కొరకు టానిక్

వేసవి సమీపించుచున్నది. అప్పుడు మాడు మంటపుట్టి వేడిమి కలిగెంచును. శిరోజములు క్షీణించును. అట్టి సమయములందు మీ వెంట్రుకల కొరకు టానిక్ అవసరము. మీ వెంట్రుకలను కాపాడుకొనుడు. వాటిని

## కామినియా నూనె (రిజిస్టర్డు)

నుపయోగించి పోషింపుడు.

బట్టతల, వెంట్రుకలు రాలిపోవుట, కురుపు వన మెర్పుట, వృద్ధాప్యము రాకముందే వెంట్రుకలు నెరియుట, మున్నగువాటి నాపుటయందు దీని జయము మెరుగగు. చుండ్రును కుదుర్చును. నెత్తిచర్మమును శుభ్రపరచును. వెంట్రుకలు పట్టుకుచ్చువలె పెరుగుటకు తోడ్పడును. ఇవన్నియుగాక, ఘుమఘుమలాడు ధ్రాణి, సుపరిమళము మనస్సున కానందదాయకముగా నుండును. ఇటీవల వచ్చిన యీ దిగువ యోగ్యతాపత్రికల చదువుడు. మిస్టర్ ఆర్. కె. నాయర్, చన్‌కార, నండిపెరియూర్ పోస్టు, (తిరువాన్కూరు) 1-2-1931 తేదీన వారు వ్రాసిన పోస్టుకార్డునం దిట్లు గలదు. రెండునెలల క్రితము మీరు కామినియానూనె నంపినందుకు వందనములు. నేను యీ నూనె నెవరికొరకు తెప్పించితినో, అట్టి మిసెస్ ఈశ్వరపిళ్లె యొక్క శిరోజములకు అద్భుతమైన గుణముల నిచ్చినదని చెప్పుటకు నేను మిగుల సంతసించుచున్నాను. కాబట్టి తిరిగి 12 సీసాల కామినియానూనెను వి. పి. గా పంపకోరుచున్నాను.

వెల సీసా 1-కి రు. 1-0-0 వి. పి. చార్జి 6 అణాలు ప్రత్యేకము.

3సీసాలవెల రు. 2-10-0 వి. పి. చార్జీలు 12 అణాలు ప్రత్యేకము.



OTTO DILBAHAR.

## పుష్పోద్యానవనమును జేబునం దుంచుట

మీ రెప్పుడైనను **ఒట్టో దిల్ బహార్** (రిజిస్టర్డు)

బుడ్లను చూచితిరా. ఈ బుడ్డినుంచి ఒక్కచొట్టు క్రిందపడిన, పుష్పవనములోనుండి తాజాగా తెచ్చిన కొన్నివేల కుసుమముల యింపైన పరిమళము నది యొసంగును. పూర్తినమ్మకము కలుగుటకై, ఉచితముగా నిచ్చెడి నమూనాబుడ్డికొరకు, పోస్టేజి ఖర్చుల నిమిత్తం రెండణాల స్టాంపును పంపుడు. పుష్పోద్యానవనమును జేబునందుంచుకొని నూతనానందము ననుభవింపుడు. అందరికి వీలగునట్లు, వివిధసైజుల సీసాలయందు విక్రయించబడుచున్నది.

అర ఔన్సు సీసా రు. 2-0-0 పావుఔన్సు సీసా రు. 1-4-0 ఒకడ్రాం సీసా 0-12-0 అరడ్రాం సీసా 0-8-0.

వి. పి. చార్జీలు 6 అణాలు ప్రత్యేకము. (ఒక్కొక్కదానికి)

ఒట్టోదిల్ బహార్ నమూనాలు ఒక్కొక్కటి 0-2-0 అణాలు. పరిమళకార్డులు ఒక్కొక్కటి ఒక అణా.

## నొప్పులకు, బాధలకు, గొప్ప ఔషధము



### ఆడమ్సన్స సిప్రెస్-సాల్వ్ (పెయిన్ బాం) (రిజిస్టర్డు)

ఎందుకు బాధపడెదరు? నిద్రపట్టక, అవస్థ యెందుకు? హాయిగా తిరుగుటకు వీలు లేకుండ, మోకాళ్లవాపుపొందనేల? ఇవన్నియు

### ఓడమ్సన్స సిప్రెస్-సాల్వ్ (పెయిన్‌బాం) (రిజిస్టర్డు)

వలన అతిత్వరలో కుదుర్చబడునుగదా? దీనిని కొంచము తీసికొని, బాధగల శరీరభాగమందు బాగుగా మర్దనచేయుడు. వెంటనే మీ బాధలు నివారణయయి, దాని మహిమాతిశయములను మీరు గాంచగలరు.

దీనిగుణములను నిరూపించుటకు నమూనాడబ్బీని ఉచితముగా నంపుదుము. పోస్టేజి ప్యాకింగ్ నిమిత్తము రెండణాల స్టాంపునుమాత్ర మంపుడు. వెల డబ్బా 1-కి రు. 1 0-0, చిన్నసైజు 0-8-0 అణాలు.

వి. పి. చార్జీలు 0-6-0 అణాలు ప్రత్యేకము (ఒక్కొక్కదానికి) నమూనాడబ్బీలు ఒక్కొక్కటికి 0-2-0 అణాలు

సోల్ ఏజంట్లు:—**ఆంగ్లోఇండియన్ డ్రగ్ అండు కెమికల్ కంపెనీ,**

నెం. 285 రు., మార్కెట్, తపాలపెట్టె నెం. 2052. బొంబాయి నెం. రు2.

ఢిల్లీపాదుషా అక్బరు ధర్మప్రభువని పేరు పడ్డాడు. హిందూ ముసల్మాను లనేభేదం లేకుండా ప్రజల నందరిని సమభావంతో చూచేవాడు. బీదసాదలను చూస్తే ఎంతో దయతో ఆదరించేవాడు. ఆయన ఆస్థానంలో బీదలు భాగ్యవంతులు అనేభేదం లేకుండా అందరికీ చోటుండేది.

అక్బరుపాదుషాకి ఒక్కడే కుమారుడు, యువరాజు సలీము. సలీము అంటే అక్బరుకు ప్రాణము. సలీము ఒకనిమిషము కనబడక పోతే అక్బరు ఎంతో ఆదుర్దా పడేవాడు. సలీముకూడ తెలివైనవాడు, బుద్ధిమంతుడు. తండ్రిమాదిరిగానే ధర్మపరిపాలన చేస్తాడని ప్రజలంతా కూడా ప్రేమించేవారు. యువరాజు సలీముకూడా ప్రజలను చాలా ప్రేమించేవాడు. ప్రజల కేదైనా కష్టము వస్తే తనదిగా భావించుకొనేవాడు. అల్లాంటి సలీముకు ఒకనాడు అకస్మాత్తుగా జబ్బుచేసింది. యూనానీ హకీములు, ఆయుర్వేదవైద్యులు మందు లిచ్చారు. ఏమీ నెమ్మదించలేదు. ఒకరోజు యువరాజు సలీము ఇహలోకము విడిచి 'అల్లా' యొద్దకు వెళ్లిపోయినాడు. కోటలో ఎక్కడ చూచినా రోదనధ్వనులే. అప్పు డక్బరు పాదుషా చాలా విచారించాడు. "నా కున్న ఒక్కకొడుకూ చచ్చిపోయినాడే, నారాజ్యం నాతోనే సరా?" అని విచారపడి అక్బరు పాదుషా వైద్యు లందరిని పిలిపించి, "రేపటి లోపల మీరందరు కలిసి యువరాజును బతికించకపోయినట్లయితే మీతలకాయలు తెగగొట్టించి కోటగుమ్మానికి తోరణాలు కట్టిస్తా" నన్నాడు.

అప్పుడు వైద్యు లంతా గడగడలాడిపోయినారు. "బతికించడం మనచేతనైన పనా ? యీపాదుషాకి యీవిచారంలో మతిపోయిన ట్టుంది. అది 'అల్లా' చేయవలసినపని గాని మనవల్ల కా" దనుకొని, ఏమీ చేయటానికి తోచక, "రేపటిరోజున మనమంతా పోవలసిందే గదా" అని మసీదుకు వెళ్లి నమాజు చేస్తున్నారు.

ఇంతలోకే షేక్ ఫరీద్ అనే ఫకీరు 'అల్లా'ను ప్రార్థన చేసికొంటూ ఆదారిన పోతున్నాడు. వైద్యులు అతనిని చూచారు. వెంటనే వాళ్లంతా ఒక్కసారిగా వెళ్లి ఆఫకీరు కాళ్లమీద పడ్డారు. ఫకీరు ఆశీర్వదించి లేవమన్నాడు. 'రక్షిస్తా నంటే గాని లేవ' మన్నారు వైద్యులు. అంత పెద్దప్రమాద మేమీ వుండ దనుకుని, 'రక్షించాను లేవ' మన్నాడు ఫకీరు. ఒక్కసారి వైద్యు లంతా లేచారు. ఏమిటో సంగతి చెప్ప మన్నాడు ఫకీరు. అప్పుడు వైద్యులంతా, "మహానుభావా,

అక్బరుపాదుషాగారి కుమారుడు యువరాజు సలీము చచ్చిపోయినాడు. మా చేత నైన మందు లన్నీ పోశాము. కాని లాభం లేక పోయింది. ఇప్పుడు పాదుషాగారు 'యువరాజుని రేపటిలోపల బతికిస్తేనే బతికించారు, లేకపోతే మీతలలు కొట్టించి కోటగుమ్మానికి కట్టిస్తా' మన్నారు. మా యందరి ప్రాణాలు మీ చేతిలో ఉన్నవి." అని దీనవదనములతో నుంచున్నారు. షేక్ ఫరీద్ నిర్ఘాంతపోయినాడు. "అరెరే, ఎంతమోసం జరిగింది! ఏదో కొద్దిప్రమాదం గదా అని అభయహస్త మిచ్చాను. ఇప్పు డేం చేయను? మాట తప్పగూడదు. సరే, పదండి శవందగ్గిర" కన్నాడు. వైద్యు లందరూ బతికా మనుకుని వెంటనే ఫకీరును సలీముశవముదగ్గరకు తీసుకు వెళ్లారు.

అప్పుడు షేక్ ఫరీద్ 'అల్లా'ని ప్రార్థించి శవముచుట్టు తిరిగి మంత్ర ముచ్చరిస్తూ, "అల్లాకా హుకుంసే వుర్" (భగవంతునియాజ్ఞచేత లేవవలసినది) అన్నాడు. 'అల్లా' ఒప్పుకోలేదు. సలీము లేవలేదు. ఫకీరు రెండుసార్లు మూడుసార్లు ప్రార్థించాడు 'అల్లా'ను. భగవంతునిఆజ్ఞ లేనందున సలీము లేవడాయెను. ఫకీరుకి చాలా కోపము వచ్చింది. మంత్రోచ్చారణ చేస్తూ శవంచుట్టూ తిరిగి, "అల్లాకా హుకుంసే నై వుర్తో మేరే హుకుంసే వుర్" (అల్లాఆజ్ఞచేత లేవకపోతే నాఆజ్ఞచేత నీవు లేవవలసింది) అని శవాన్ని ఒకతన్ను తన్ని ఆజ్ఞాపించినాడు. వెంటనే సలీము నిద్దర మేలుకొన్నవాడికిమల్లె లేచి కూర్చొన్నాడు. అక్బరు చాలా సంతోషించి ఫకీరుకు జాగీరు ఇవ్వబోయినాడు. అప్పుడు షేక్ ఫరీద్ "ఫకీరువాడికి నా కీజాగీ రెందుకు? మీ హకీములకే యివ్వండి" అని పుచ్చుకోకుండా వెళ్లిపోయినాడు. వైద్యులు సలీము బతికినందుకు తమని చాలా గౌరవించి ఏ చక్రవర్తులనో చేస్తా రనుకున్నారు పాపము. కాని అల్లా జరగలేదు. అక్బరు ఫకీరుమీదే భక్తితో వున్నాడు. ఇదంతా వైద్యులకు సరిపడలేదు. "మనము ఫకీరుకాళ్లమీద పడితేనే గదా అతను బతికించాడు. మన్ని గౌరవించకపోవటం ఏమి? ఏపనంచేతనైనా యీ ఫకీరువాడినితన్నించా" లనుకున్నారు. అప్పుడు హకీము లందరూ ఆలోచించుకొని పాదుషా దగ్గరకు వెళ్లి సలాం జేసి, "జహాపనాహ్, యీఫకీరు మొదట అల్లాకా హుకుంసే వుర్ అని ప్రార్థించాడు. కాని అల్లా యువరాజును, బతికించటం యిష్టం లేక వూరుకున్నాడు. అప్పుడు యీ ఫకీరు అల్లాను తిరస్కరించి మేరే హుకుంసే వుర్ అన్నాడు. అల్లా ఆజ్ఞచేత బతికించాలి కాని తనాజ్ఞచేత బతికించట మేమిటి? దీనిక తమరే ఆలోచించండి జహాపనాహ్ అని మొరపెట్టారు. అక్బరుకూడా ఆలోచించాడు. 'అల్లా ఆజ్ఞచేత లేవమనాలి కాని తనాజ్ఞచేత లేవమనటం ఏమి' టని పాదుషాకు కోపం వచ్చింది. తమ మౌల్వీలను (మతగురువులను) పిలిపించి 'అల్లాను తిరస్కరించినవాడికి ఏ శిక్ష వున్నదో ఖురాన్ చూడ' మన్నాడు. అప్పుడు మౌల్వీలు ఖురా

నుచదివి 'అల్లాని తిరస్కరించినవాడిని బతికుం డగానే బల్లాలతో పొడిచి చంపవలసి వుంటుం' దని చెప్పారు. వెంటనే పాదుషా నౌకర్లను పిలిపించి ఆ ఫకీరుని వెతికించి పట్టి తెప్పించి, బల్లెములతో పొడవమన్నాడు. నౌకర్లు వైద్యుల ప్రోత్సాహముతో, బల్లెములతో ఫకీరుని పొడవసాగినారు. అవిఘంగా బల్లెములతో ఎన్నిరోజులు పొడిచారో వాళ్లకే తెలియదు. ఫకీరుమాత్రము చెక్కు చెదరకుండా నిశ్చలం గా ధ్యానిస్తూ నుంచున్నాడు. ఏవిధమైన బాధాలేకుండా నౌకర్లశ్రమే గాని బల్లెములు ఫకీరు శరీరంలో దిగటమే లేదు. నౌకర్ల కాయాస మెక్కు వౌతున్నది. ఫకీరుకు మాత్రం వాళ్లు పడే శ్రమ చూస్తే చాలా జాలి వేసింది. "మీా రెన్నాళ్లు శ్రమపడ్డా నా శరీరాన్నిమాత్రం ఏంచెయ్యలేరు. మీారు పడేశ్రమ చూస్తే నాకు మనస్సు కరిగింది. అందుకని చెబుతున్నాను. నా శరీరం అంతా వజ్రదేహం, మీా రేమీా చేయులేరు. ఎన్నాళ్లు మీారు శ్రమపడ్డా యింతే. నాకుడికాలి బొటనవేలుమాత్రం చిన్నప్పుడు అపవిత్రమై పోయింది. అక్కడ గనక పొడిస్తే నేను చచ్చి పోతా" నని చెప్పాడు ఫకీరు. చెప్పిందే తడ వుగా పొడవండి పొడవండి అని నౌకర్లు ఆ ఫకీర్ని పొడిచి చంపారు. అప్పు డాఫకీరు పేగుల్లోనుంచి 'అనలహాక్' (నేనే భగవంతుడను) అని ప్రతిధ్వనించింది. అప్పుడు వాళ్లు "అరే, యీాఫకీరు చచ్చిపోయికూడా నేనే భగవంతుడినంటూ డేమిటిరా?" అని ఆలోచించి వెంటనే ఫకీరు శవాన్ని తీసుకెళ్లి సమాధి చేశారు. సమాధిలోనుంచి అనలహాక్ (నేనే భగవంతుడను) అని ప్రతిధ్వని వచ్చింది. అప్పుడు నౌకర్లకు చాలా కోపం వచ్చింది. "చచ్చినవాడిని సమాధి చేశాము, యిందులోనుంచి కూడా అల్లాను తిరస్కరించి నేనే భగవంతుడనని అంటున్నాడు. వీడి నేం చేద్దాము రా అనుకుని సమాధిలోనుంచి ఫకీరుశవాన్ని పెళ్లగించి కాల్చి బూడిదచేశారు. ఆబూడిదలోనుంచి కూడా అనలహాక్ (నేనే భగవంతుడిని) అనే శబ్దం వచ్చింది. నౌకర్లకు మరీకోపం వచ్చింది. అప్పుడాబూడిదంతా పోగుచేసి ఎత్తి సముద్రం లో కలిపారు. ఆ సముద్రపుఅలల్లోనుంచి అనలహాక్ (నేనే భగవంతుడి)నని ప్రతిధ్వని వచ్చింది. అప్పుడు నౌకర్లకు పశ్చాత్తాపము కలిగి, "అరే, అల్లాభక్తుడిని చాలా కష్టపెట్టాము; మన కేమి శిక్ష వేసినా యీాపాపం పోదు" అని అప్పుడా ప్రతిధ్వని వచ్చేదిక్కుగా అందరు సాష్టాంగ పడి తమతప్పు క్షమించమని ప్రార్థించారు. అప్పుడు అల్లాకు మనసు కరగి ప్రత్యక్షమై, "అరే మీారు పశ్చాత్తాపపడ్డారు గనుక మీా పాపం పోయింది. షేక్ ఫరీదు చేసిన మేలు మరచిపోవచ్చునా? మీాప్రాణాలు రక్షించాడే. షేక్ ఫరీద్ ఎవ రనుకున్నారు ? నాభక్తుడు! నాభక్తుడు గనుకనే అతనిలో నే నున్నాను. ఇక నెప్పుడు ఇల్లాంటిద్రోహము చేయకండి" అని చెప్పి అంతర్ధాన మైనాడు. షేక్ ఫరీద్ యథాప్రకారంగా లేచి నిల్చున్నాడు. నౌకర్లు సలాములు చేసి తప్పు క్షమించమని వేడు

కొన్నారు. క్షమించా నన్నాడు ఫకీరు. నౌకర్లు పల్లీలబోధకు చాలా విచారించి పశ్చా అక్బరుపాదుషాదగ్గరకు వెళ్లి సంగతంతా త్తాప మొంది ఆరోజునుంచీ ఫకీర్లయందు చెప్పారు. పాదుషా హకీములమోసమునకు, చాలాభక్తి గలిగి యున్నాడట.

---

## జోగి

కుంటుర్తి నరసింహారావుగారు

అది, మహాగ్ని మంటపగోపురాగ్రసీమ
 గంతు లిడఁబోవు ధూమవిగ్రహమురీతి
 యువదినేశనేత్రజ్వాల నూఁదఁబోయి
 దద్దరిల్లుమేఘాల మధ్యాహ్నవేళ,—
 అది, నిదాఘతాపాస్త్రప్రహారబాధ
 బీఁటలూఁదియుఁ గన్నీటియూట లోడ్చు
 గట్టుకావలివారల గారవించు
 నిత్యనిర్మలవాటె, కోనేటిగట్టు,—
 అది, కలంకవిహీనాంత రాత్మవీధి
 మేఁక వన్నెల పులిమాట పోకఁ జూచి
 భ్రమసిపోయి తద్గర్భాంతరమునఁ జొచ్చి
 తెలిసి చీల్చి బయల్వడు తెలుఁగునాడు,—

ఆతఁడు దివ్యగంధ కుసుమావృత
 గాత్రుఁడు, భక్తిమూర్తియై
ఖ్యాతి వహించినాఁడు.— తన
 కంటికి మంటికి నేకధారగాఁ
గాతర మందువాఁ డిపుడు;
 కారణ మెవ్వఁ డెఱుంగువాఁడు ?—పో
నీ, తడియొత్త నొక్కహితు
 నేనియుఁ జేరఁ డిదేమి వింతరా!

ఐనను, సన్న్యసించిన మ
 హాత్మున కిప్పటివేళఁ దోఁచు గాఁ
బూనెడువాఁ డెవం డనుట
 పుట్టినదో తమచిత్తమందు:— నా
జేనెఁడు కండ్లతోఁ గనిన
 చిత్రము సుంతిది: ప్రత్యహంబు నీ
పానిపదాగ్రభాగముల
 మంటిని దిట్టు శిరంబు లెన్నియో!!

ఏమనుకొంటిరో యెఱుఁగ
 నీతఁడు 'పాని' యనంగ మీరు; నా
కీమహనీయుఁడే నొసటియొప్పులతోఁ
 నెఱిఁగించె నున్న;— ది
వ్యామృతవాహినిన్ దఱిసి
 యడ్డము సొచ్చిన యట్లు, మాకు మే
మే మసిఁ బూసుకొంటిమి తు
 మించిన యీతనినాల్కఁ గట్టుటన్;

ఓహో! 'జిహ్వా బిగించినార' మను నే
 వో మంత్రముల్ తంత్రముల్
మాహాత్మ్యపేటికలందు దాఁగెనని యే
 మాత్రంబు మీలోన మీఁ

సాహింపం దగ దయ్యా, చెప్పనది యే
దో సుంత నాపైని నా
స్నేహోత్సాహము లల్లుకొన్న కృతిపై
నిం బ్రీతితో, నమ్మఁడీ!

పాదుకలలోని జాలసవ్వడులతోడ
మొదటమాయూరిపొలిమేరముంచ నిలువ,
బుద్ధి తెలియనిపోకలఁ బోయె నపుడు
దూడ నెక్కిపోయెడి కాఁపువాఁ డొకండు:

"బుద్ధి గలిగి తొలిగిపోర బైరాగయ్య
మంద కడ్డురాకు చిందు లేసి,—
పొగరులేగదూడ పొడిచెనా, నీతాత
మూడునెలలదాక మూల్గి చచ్చు!..."

అప్పటిశాంతమూర్తికి ర
వంతబొమల్ చలియింపలేదు; పైఁ
గప్పిన జింకతో లెడమ
కాలికి మ్రొక్కి, నిరాకరించుచున్
జెప్పినమాటలే మగుడఁ
జెప్పఁదొడంగెను వేయిసార్లు: "మా
యప్పవు, దూడమూఁపు డిగు
మయ్యా! బలిష్ఠుఁడ వీవు చూడఁగన్!

"నీతల నెక్కి త్రొక్కి నొక
నేత గలండని యే నెఱుంగనే,
రాత్రియైన, 'నొక్కపని
రా! మఱి పోదువు, నిల్వు' మన్నచో
బూతులు దిట్టెదే? పొలము
వోయిన నాఁగలి మోయుదాని నీ
లేఁతనరాలలేఁగ యొడ
లిన్ దిగఁద్రొక్కఁగ నేఁ, చెప్పరా!!

"కరుణ యెఱుఁగని నీనోటికాఱుకూఁత
వినిన గుండెల బిగఁబట్టు బెట్టులేమి,
జమునిదండంబు నీచేతిచబుకు చుఱుకు
నోర్చుకొనలేమి, బిడ్డ నిట్టూర్పు నదిగొ!
ఏమి సేయుదు నెఱపేద నిట్టివేళ!
ఏరవంతయు నీనోటి కిచ్చియైన
దీనిమూఁపు కాయలకోఁతఁ దీర్తు నన్న,
చిల్లిగవ్వయు లేదు నాచేత నిపుడు—

"పల్లెల నిల్చువాఁడవు, కృ
పాగుణ ముగ్గున వచ్చు నీకు;
తెల్లనిగడ్డమున్న తల
దించి నమస్కృతు లిచ్చువాఁడవే!— —
చిల్లులువోయనే చెవులు?
చెప్పుట నీకెకదా... రవంత మీ
పల్లియకోమటిం బిలిచి
పప్పులు పెట్టినఁ గాని పల్కవా?..."

అనుచుఁ దడిసినఱొమ్ము చేలాంచలమునఁ
దుడుచుకొనఁబోవు నావింతబడుగువాని
పలుకుఁ దనయెడ సపహాస్యభంగి నెంచి
"మూసికొనిపోర నో"రని మొఱఁగినాఁడు-

మొఱిగి, దూడనదల్చి, యామొద్దుకాఁపు
పరుగువెట్టినక్షణ మెట్టి పాపగణమొ!
అది మొదలుగాఁగ పెదవుల నంటఁగట్టి
ఏటిగట్టున నాజోగి యిట్టు లుండు.

---

# నా యింట్లోకూడా ప్రవేశించిందే

బందా కనకలింగేశ్వరరావుగారు, బి.ఏ.

నారాయణరావుగారు డిప్యూటీ కలెక్టరు పనిలో నుండి సాధ్యమైనంతవరకు దేశ నాయకులను జైలుకు పంపించుదా మన్న ప్రముఖులలో నొకరు అందులో పదెకరముల పొలమో, రావు సాహేబు బిరుదైనా తెచ్చుకోవా లనే కీతుత్తో, సాధ్యమైనంతవరకు సి. క్లాసిస్తూ, రెండేళ్లకు తక్కువ కాకుండా, పెద్దా చిన్నా అనేవ్యక్తిభేదం లేకుండా, నిష్పక్షపాతంగా, ఉదారమానసంతో వడ్డిస్తున్నారు. కావున వీరికి పెద్దకలెక్టరుపనొస్తుందని పిప్పరవంతెనకడ రాజు లనుకొనేమాట అబద్ధ మనుకోఝాని కెలాగు!

విశాలాక్షమ్మమాత్రం తక్కువ తిన్నమని పంటే ఒప్పుకోను. మాయస్వరాజ్యంలో, అల్లుడు జైలు కెళ్లాడని మనింటికి రావద్దని రిజిస్టరీ నోటీ సిప్పించింది, బుద్ధిమంతురాలు. బరువుగా వుంటుందని ఖద్దరుజోలికి పోకుండా బెనారసుచీరలు కడుతోంది. ఖరీదైన ఖద్దరెందుకని కంచిపట్టుచీరలు కొనమంది. అనవసరంగా ముతకచీర లెందుకని ఆగ్రాచీరలు మాత్రమే కొనాలని ఉద్దేశ్యంతో వుంది. అనుకూలదాంపత్య మంటే ఇంతకంటె ఏంగావాలి!!!

సూరీడు చదివేది చిన్నక్లాసైనా చురుకైనవాడు. కాస్తో కూస్తో అల్లరిలోకూడా ప్రవేశం ఉంది. ఒకమాటు దబ్బున శనివారం రాలేదని కేలండరు చింపేసిన బాపతు. పాఠం చదవడం మానేసి బడి కెళ్లి ఆఖరు బెంచిమీద కూర్చొని అందరూ ఒప్పగించాక విని తాను కూడా ఒప్పజెప్పేవాడు. పరీక్షలో ఫస్టుమార్కు. కాబట్టి అల్లరి పిల్లలే తెలివితేటలు గలవారు. అల్లరంటు తెలివి అతిసాలు పొంగిపోతే ఇటు అటు పడే మీగడ!

ప్రతినిత్యం తన స్నేహితుడగు రాముడింటి కెళ్లేవాడు సూరీడు. రాముడు అమ్మ ఇద్దరకూ పాఠాలు చెపుతుండేది. మంచిది. తను రాట్నం వడుక్కుంటూ పనిలో పని పిల్లిద్దరకూ పాటలు కూడా చెపుతుండేది. సూరీడుకు పాఠాలమీద మనస్సు లేకపోయినా పాటలమీద మాత్రం ఉంది. రాముడుకన్న తనకే ముందర రొచ్చేవి పాటలు. అయితే ఆపాటలే ఇంటి కొచ్చి పాడితే అంత అందంగా ఉండవేం అన్న ప్రశ్న వాడిని బాధిస్తోంది. తుదకు రాట్ననాదంలో గాని తనపాట రాణించదని తోచింది. ఎవళ్లింటో చూచినా రాట్నమే!! తనింట్లో మాత్రం లేదని చింతించాడు. ఇంట్లో రాట్నం మాటెత్తితే రాచిప్పతో కొడతారు. గ్రహించాడు సంగతి. ఆలోచించాడు ఉపాయం. తలచుకొన్నాడు త్రొక్కేదారిని. ఏమన్నా సరే, ఎత్తేడు ఎత్తు. పట్టుదలమాత్రం బాగా ఉంది.

విభూది పెట్టుంతా వెతికితే దొరికింది పెంకిజేడ. బజారుకు గిరుక్కున తిరిగేడు. వడ్రంగి అప్ప లస్వామి నడిగితే రూపాయి కిస్తా నన్నాడు రాట్నం. అమ్మ బాబో, ఎక్కడ బేడ ఎక్క డ రూపాయి! ఎలాగైనా రూపాయి సంపాదిం చాలి. అర్ధణాబిళ్లకు పాదరసం రాదా మను కొన్నాడు కాని దానిమీద వెధవ తేలులాంటి బొమ్మొంది. పైగా చుట్టూరా గరుకుగా లేదు. వాడి చిన్న బుద్ధికి ఒకటి తట్టింది. అదే సన్మా ర్గం——సాగేది, సమకూర్చేది.

గ్రామమునసబు వెంకటస్వామి మామి డితోట ఊరవతల ఉంది. కొంచెం చిన్న కాలవ ఒకటి దాటాలి. జహాంగీరు మామిడిపళ్లకు ప్రసిద్ధి. ఈతనితండ్రి కళింకోటలో పనిజేసినప్పు డు తెప్పించాడ టీవిత్తనం. సూరీడుకు మామిడి పళ్ల సంగతి బాగా తెలుసు, ఎక్కడున్నాయో, ఎలా తేవాలో! వాడి మనస్సు ఎలా ఉండా లో అలా ఉంది. వెంటనే తోటకి దారి బట్టేడు. మునసబుతోటకి జేరేడు కేకేసి మునసబుచేతులో బేడ పెట్టి మామిడిప ళ్లివ్వ మన్నాడు. మునసబుకు సమయం దొరికింది. తోటలో పళ్లు ఎన్నిమార్లు రుచి చూడమని పంపినా తిరుగగొట్టేవారు కలెక్టరు గారు. కలెక్టరు గారబ్బాయి వచ్చేడుగదా యని మంచిరకం జాహాంగీరుపళ్లు పిల్లవాడు మోసినన్ని అనగా ఎనిమిదిప ళ్లిచ్చాడు. డబ్బు పుచ్చుకుంటే కాని వద్దంటాడు సూ రీడు. బలవంతాన బేడమునసబుదగ్గిర పడవేసి ఇంటికి మళ్లినాడు.

సూరీడుఆలోచన సామాన్యం గాదు. పట్టలేని ఆనందంతో సరవళ్లుత్రొక్కి పళ్లన్ని అమ్మదా మనుకొన్నాడు. కొనేవా రెవర నూ! చిటికెనవ్రేలు ముడిచి నాన్న ఒకటి, అమ్మ, అక్కయ్య, బావ, తాత-అయిదుపళ్లు. తక్కినవి తహసీలుదారు కొకటి, మేజస్ట్రీటు కొకటి, హెడ్డుగుమాస్తా కొకటి.

ఇంటి కొచ్చేటప్పటికి సాయంత్రం అయి దయింది. ఎనిమిదేళ్ల కుర్రవాడు, అందులో లంచం తీసుకోని కలెక్టరుగారబ్బాయి, పళ్ల మ్మితోంటే ముచ్చట కొక్కటి కొన్నాడు తహసీలుదారు బేడకి. మర్యాదకైనా కొనక పోతే మనస్సులో బెట్టుకు ఏం జేస్తాడో కలె క్టరని కొన్నాడు మేజస్ట్రీటు కలెక్టరుకు కోపం లేకుండా గడిచిందే చాలు ఈజమా బంది, ఎందుకైనా మంచిదని కొన్నాడు హెడ్డు గుమాస్తా!

బావమరదిని చూస్తే ఏ బావకు ముచ్చట కాదు? అందులో అక్కయ్య రెకమండు చేసింది. ఆతాలూకుపండుకు పావలా ముట్టింది సూరీడుకు. ఒక్కడే తమ్ముడు. అందులో పుట్టింటిబుణం తీరి చాలాకాల మైంది. తమ్ము డొచ్చాడనే సంతోషంతో తీసుకుంది ఒక పండు బేడకి. తాతకి పండు బలవంతాన కట్టి తలగడక్రింద బేడ లాగాడు. ఇక్కడికి పదు నాలుగణాలు వచ్చాయి. ఇంటి కెళ్లేటప్పటికి ఏ డయింది. చీవాట్లు చిన్నంగా తగిలాయి గాని కార్యసాధనంకోసం తల్లిదగ్గర జేరాడు

సూరీడు. నారాయణరావుగారుకూడా వంటిం ట్లోకి వచ్చాడు. చూచాడు సూరీణ్ణి. ఎక్కడకు వెళ్లావు వెధవా అని అష్టోత్తరశతంతో ఆరంభించాడు. రెండుపళ్లు తండ్రి కిచ్చి పావలాకు తెచ్చా నన్నాడు సూరీడు. అర్ధరూపాయికు రాని జహంగీరు అర్ధపావలాకు వచ్చిందని జేబులో పావలా చేతి కిచ్చాడు రావు సాహేబు నారాయణరావు.

రాత్రంతా కలలే సూరీడుకు రాట్నం కొన్నట్టు; ఆశబ్దంలో తాను కలిసి 'జయ భారత హే' పాడుతున్నట్టూ వెధవరాత్రి తెల్లవార దే అనుకొన్నాడు. లాంతరు తీసికెళ్లి దొడ్లో చూచాడు తన పేరిటివాడొచ్చాడేమోయని. ఇంకా మకమకలాడుతూ ఉన్నాడుచంద్రుడు. కొంచెం సేపు పడుకున్నాడు తిరిగి వచ్చి. నిద్దుర పట్ట లేదు. సరే తెల్లవారింది. అప్పలస్వామింటికి పరుగెత్తి కెళ్లి రూపాయి బేడ యిచ్చి రాట్నం కదురు ఇవ్వమన్నాడు. అప్పలస్వామి ముచ్చటైన రాట్నానికి పసుపూ కుంకుమ పెట్టి సూరీడు కిచ్చాడు. బుజంమీద పెట్టికొని ఇంటికి పట్టుకువచ్చి మంచంక్రింద దాచాడు దాన్ని జాగ్రత్తగా గుడ్డగప్పి. తహసీలుదారుని, మేజస్ట్రేటును, హెడ్డుగుమాస్తాను పిలుచుకొచ్చాడు, నాన్న రమ్మంటున్నారని నాన్నగార్ని కూడా చెయ్యి పట్టుకు లాక్కొచ్చాడు. రాట్నం ముంద రెట్టాడు. కలెక్టరుగారింటో రాట్నం ఉందని గవర్నమెంటుకు రిపోర్టు చెయ్యనా, ఏకులు కొనిస్తారా అన్నాడు. రాట్నం ముందు పెట్టుకొని త్రిప్పుతూ తద్ధ్వనిలో శ్రుతిచేసి,

'రాట్నమే మనమూట యనుకొనుము'

అని పాడాడు.

నారాయణరావు నవ్వుతూపోయి, "నాయింట్లోకూడా ప్రవేశించిందే" అన్నాడు.

---




భర్త:—(ముద్దుగా) పిల్లా, నేను ముసలివాడ్నైనా, రూపుచెడినా నన్ను ప్రేమిస్తుంటావుగదూ?

భార్య:—మీరు ముసలినా రోతారు కాని యింత కంటె రూపు చెడలేరు.

---



సెంటులూయీ ఆపణభవనము (Mart Building)

(అమెరికా సంయుక్తరాష్ట్రములు)

౨౧ ఎకరముల విస్తీర్ణము, ౨౮ అంతస్తులు గలది. నిర్మాణవ్యయము ౫,౦౦౦,౦౦౦ డాలరులు. ఇంతవము న్నిట్టివి లేవు. ఇచ్చట ఎల్లవిధముల సరకులు సేకరించి యుంచబడును. (6) G. S. A.



కోనీద్వీపమున (న్యూయార్కు నగరము) ఒక రాత్రిదృశ్యము G. S. A.

లూనాపార్కు నుండి చూచిన నిట్టి దృశ్యము పొడకట్టును.

# దానికే మందు

భమిడిపాటి కామేశ్వరరావు గారు, బి. ఏ.

అప్పుడు నా కింకా పాతిక బొటాబొటే. మాబలగం అయిదారుగురం ఉండేవాళ్ళం. కొందరు నల బైయేపడిలో పడ్డవాళ్ళున్నా, ఒకొక్కడు ఓవంప కోతుల పెట్టు. ప్రతీవాడూ ఒక అచ్చాఛడీ, అనగా మరేం లేదు, రాళ్ళు తిని హరాయించుకునే రకం. అచ్చయ్య ఒకడు. అచ్చయ్య పచ్చగా మిసమిసలాడుతూ తాడెత్తున ఉండేవాడు, ఏదేనా వచ్చిందంటే ఎదరవాడి కణతమీద టపాకాయిలాంటి లెంపకాయి పేల్చి మరీ మాట్లాడేవాడు. తరవాత, ఉంగ్రరంముక్కల్లాగ రామయ్య కామయ్య లుండేవారు. వాళ్ళని శ్రావణ భాద్రపదాలని పిలవడంకూడా కద్దు. వాళ్ళిద్దరూ చెరో వామనావతారం అవడంవల్ల, వాళ్ళు ఇతరుల్కి కొట్టిన లెంపకాయలు ఎప్పటికప్పుడు దూసుకు పోతోచ్చినా, దెబ్బలాటల్లోమాత్రం కాళ్ళసందుల్ని ఉడుముల్లాగ దూరిపోయేవారేమో, ఛస్తే అందేవారు కారు. ఆపైని జానికిరామయ్య ఒకడు. జానికిరామయ్యకి భజనంటే సరదా. నాకూను. అయితేం, జానికిరామయ్య చాలా గడసరి. మేం ఇద్దరం కాస్త పై హంసకి ఉండేవాళ్ళం. ఓబయ్య ఓడు. ఓబయ్య స్తబ్ధు, ప్రతీపన్లోనూ జోరబడి, దిగబడి, కూరుకుపోయి ప్రతీపనీ నిప్పక్కర్లేకుండానే తగలపెట్టేవాడు. అందుకని, మాలో ఎవడికి ఎందుకు ఎవడిమీద అక్కస్సు వచ్చినా సరే వాడెళ్ళి అమాంతంగా ఓబయ్యని తనివితీరా తిట్టేవాడు. వాడవన్నీ మహారాజులా నవ్వుతూ పడేవాడు. మాజనం సంకల్పమాత్రంలో కలుసుకునేవారు. ఊళ్లో ఎవళ్ళేనా తమరిదొడ్లో చెట్టున కాసిన దబ్బకాయలు లాంటివి ఊరగాయెట్టుగోడానికి సాయంత్రం పడకుండా ఉప్పు కారం వగైరా రెడీచేసుగుని, మొన్నాడు ఉదయానని కప్పుడే ఊరగాయకుండలో పడ్డట్టు ఊహలూరి రొట్టతేస్తూండేవారనుకోండి! మావాళ్లు ఎల్లానో ఆవాసన తగిలి, పోగై, ఆరాత్రే చెట్టు సమూలంగా దులిపి, తెల్లవారేసరికి చెట్టుకాయలు సరేసరి ఆకులుకూడా ఊడ్చేసి మోడులాగ చేసి, "ఇహాను ఈచెట్టు పట్టిగెళ్లి పోయిలో పెట్టుగోండి", అన్నట్టు అట్టే పెట్టేవాళ్లు. మొన్నాడు యాజమాన్లు, ఆచారప్రకారం, కోసినవాళ్ళని ఎల్లానూ దుమ్మెత్తి పోస్తూండేవారు గనక, ఆ సుముహూర్తానికి మేంకూడా వెళ్ళి యజమాన్లకి మద్దతై, ఉమ్మడితిట్లు తిట్టేవాళ్ళం— (ఓబయ్యని మనస్సులో పెట్టుకుని—పాపాలకల్లా భైరవుడు!). అల్లాంటి పన్లు మావే అయుంటాయి అని జనం అనుకునే వారు గాని, సాక్ష్యం లేకపోవడంవల్ల, ఎవరూ ఏమీ అనలేకపోయేవారు. పైచెప్పిన అర్జెంటుకేసుల్లోనేకాకుండా, ఇతరప్పుడు, అనగా, ఎవర్నేనా ఓ పాం పసికట్టడం అంటే, మరి ఎప్పుడేనా ఊరు అంటుగోడం అంటే, ఏదేనా ఓ బరువు కదిలించడం అంటే, లాంటి ప్రమాదాలలోకూడా కలిసి, మేం జనానికి యథాశక్తి సాయితా అవుతూండడంవల్ల మమ్మల్ని జనం అసలు ఏమీ అనలేక పోయేవారు. ఇల్లాంటి గ్రామ సంబంధమైన స్వల్పాల్లోమాత్రమే కాక, వ్యాజ్యాలూ, సప్తాహాలూ, యాత్రలూ, తీర్థాలూ, లాంటి గ్రామాంతర దండయాత్రలుకూడా మేం కలిసే చేసేవాళ్ళం.

ఓసారి, మమ్మల్ని ఓబయ్య, కురుపు సలిపినట్టు సలపగా, మేం క్షేమగిరియాత్ర బయలుదేరాం. వెళ్ళేది యాత్రగదా అని చెప్పేసి, వీలునుబట్టి, ఎవడికి తోచింది వాడు మూటకట్టుకున్నాడు. నేను అప్పడాలు పుచ్చుకున్నాను, మరోడు అటుకులు పట్టుకున్నాడు, ఇంకోడు పెసరపప్పు తెచ్చాడు, సరి ఓబయ్య ఉప్పు కొనుక్కొచ్చాడు. కాని, మాఊరికి కొన్నిమైళ్లదూరంలోనే ఓ యేరు దాటాలి. అది దాటడంలో చిన్న అవాంతరం ఓటి తప్పిందికాదు. అసలే అది చిన్న డింగీ, ఆవకాయ పెచ్చులాగ. పైపెచ్చు, ఓబయ్య అందులో అడుగున పడుకుంటే తూకంగా ఉంటుందా, ఓవేపు అంచు మీద కూచున్నాడు, మహా. నట్టేట్లోకి వెళ్ళేసరికి, అచ్చయ్య పతనప్రకారం ఉత్తపుణ్యానికి ఓబయ్యని తిట్టుగోడం మొదలెట్టాడు. ఎప్పుడూ లేంది ఓబయ్యకి

కొంచెం కోపం వచ్చింది. ఆపళంగా అచ్చయ్యా డింగీ రెండంచులమీదా రెండుచేతులూ పెట్టి, అది ఈవేపుకీ ఆవేపుకీ ఒరిగేలాగు ఉయ్యాలా ఊగించాడు. డింగీ అల్లానే ఊగుతూ అద్ధరికి అహోరించింది గాని, ఓబయ్యా కూర్చునవేపుకి గోవిందాయిస్వాహా అని చెప్పి పల్టీ కొట్టింది. అంతా ఏట్లో పడ్డారు. ఏమడిగారు అవస్థ! ఓబయ్యా ఊబిలో తల్లకిందులుగా కూరుకుపోయాడు. పాపం వాడికి ముక్కులోకి పాలు దిగాయో లేదో కాని ఇంత బురదమట్టుకు దిగింది. వాణ్ణి కప్పేలు లేకుండా పైకి ఊడదీసేసరికి మాతాతలు దిగొచ్చారు, బస్సుమీద! యాత్రసరుకులికి మారురూపం వచ్చింది. అప్పడాలు కుక్కచెవులులా అయినాయి. ఒక్కొక్క వడియం కంద దుంపలా తయారయింది. ఓబయ్యా ఉప్పు ఏట్లో కలిసి పోయి రూపం లేకుండానే పోయింది. తడిబట్టలే మూట కట్టుగుని, ఒక్కొక్క బట్టమాత్రం పిడిచి ఒంటిమీద వేసు గుని, రాంబందుల్లాగ రెక్కలాడిస్తూ, నడిచిపోయాం. ఓబయ్యాని వెనక్కి వెళ్లమన్నాం. అభ్రాంతమైనా వాడు వెళ్లనన్నాడు. వెనక్కి నిష్క్రమించక, కూడా రాక, ముందుకే సాగక, మమ్మల్ని వాడు కొరుక్కు తిన్నాడంటే నమ్మండి. నాని తగులడ్డ ఆపదార్థాలే మహారుచిగా ఉన్నాయంటూ మావాళ్లు, మొదటిమజిలీ జేరకుండానే, అవన్నీ ఊదిపారేశారు. అలానే, కొంతదూరం నాటునా, కొంతలెక్క రైలుమీదా, కొంత పేర అడివిలోనూ, భోజనానికి సహాళగడ్డీ కరుస్తూ క్షేమగిరి చేరుకున్నాం. అక్కడ సత్రాల్లో ఏదో ఇంత మృష్టాన్నం స్వీకరిస్తూ కొంతకాలంపాటు స్థాయీపడదాం అనుకునేసరికి, ఆప్రాంత్యాన్ని అప్పుడు చాలా జాడ్యాలని మాకు రెండోనాడే తెలిసింది. వెంటనే ఇంటికి దారితియ్యక పోతే ఉరెట్టుగుంటానని కూచున్నాడు, మమ్మల్ని ఇల్లు బయల్దేరగొట్టిన ఓబయ్య! రెండోనాడు మధ్యాహ్నం సత్రాల్లో వంటలవాళ్లు కట్టుకట్టి మానేశారు. ఆరాత్రి మాకు అన్నానికి ఆటంకం తగిలింది. కాని, మాసత్రం పక్కింటి ఇల్లాలు ఆరోజునే నందికేశ్వరుడు నోం చేసు గోడంచేత (పదార్థం చలిమిడి అని తెలిస్తే, ఛీ అని ఊరు కుందుం) నోంవస్తువు గార్లని రూఢికబురు తెలిసి, గార్లు సాయంత్రందాకా చెల్లకపోడం ఏమిటి చెప్మా అని అను మానిస్తూనే అస్తమయం కాకుండా వెళ్లాం. అవి ఉప్పు మయం. కాని ఎం జెయ్యాం? అవే ప్రూటుగా పట్టించి, మర్నాడు బిచాణా ఎత్తేసెయ్యడం ఖాయపరిచాం. రైలుఖర్చుకి జంకి అయితేం, బండీ ప్రయాణంవల్ల ఒళ్లు తిరుగుతుందని చెప్పి అయితేం, రకంమార్చడంలో ఉండే సరదావల్ల అయితేం, వచ్చినదార్నే వెళ్లడానికి మాలో చాలామంది ఇష్టపడలేదు. మరోదారీ ఉంది. కాని, ఆదారిని పడితే, క్షేమగిరినించి యాభైమైళ్లు అడివి తొక్కితేనే గాని కంకర దర్శనం కాదు. ఈదారిలో సింహాలూ గట్రా ఆహ్వానం ఇస్తాయేమో, ఈదారి వద్దని నేను అన్నాను, అనడం. అంటేం! రామయ్యా కామయ్యాలు (వాళ్లు అసలు సింహాపు బొమ్మైనా చూడలేదు!) అందుకు ఒప్పుకోక, ఒకవేళ సింహమే యెదురుపడితే, దాన్నిపట్టుకుగా పట్టుగుని, ఇద్దరూ దానినోరు విడగొట్టి, చెరోదవడా దబాయించి దాన్ని తాటికమ్మ చీరినట్టు చీరుతాం అనిన్నీ, అథవా అట్లా స్వాధీనం కానిపక్షంలో దానినోరు వెలక్కాయి నొక్కినట్టు నొక్కేస్తాం అనిన్నీ భరవసా ఇచ్చారు. అంటే, స్వంతమనుష్యులు నలుగురు కూడా ఉన్నప్పుడు పరాయివాడిమీద ఎగరడంలాంటిదే అనుకున్నారు, సింహంతో పని! ఏమైతేం? నడకదార్నే వెళ్లడం నిరుకు పరుచుగుని, అందర్నీ ఝాంతెల్లారకట్ల ఓబయ్య లేవగొట్టేపద్ధతికి అందరూ ఒప్పుగుని, ఆరాత్రి కునికాం.

గారెలగుణమే గావును, వాటిమొహం ఈడ్వా, మాలో ఒక్కడికీ మళ్లీ స్మారకం లేదు. నేను లేచేటప్ప టికే వెలుగొచ్చింది. నేను అచ్చయ్యాని లేవగొట్టాను. వా డెళ్లి, "ఇదేట్రా, మమ్మల్ని పెంద్రాళే లేవగొట్ట డం?" అని ఓబయ్యాని వీపుకి సరిపడ్డచరుపు చరిచాడు, అట్టు ఊడేట్టు. దాంతోటి వాడన్నమాటేమిటి, అంతా కుడా లేచి కళ్లు నులుముకుంటూ బయల్దేరారు. మేం ఊరవతలికి వెళ్లేసరికి కరకరా సూర్యోదయం అయింది. దారి దక్షిణం వేపుకి ఉంది. అది దొరకపుచ్చుగుని మేం నోరు మూసుగుని నడుచుకుంటూ కొన్ని మైళ్లు వెళ్లే సరికి, ఓ వాగు ఎదురైంది. అక్కడ కాలకృత్యాలు

తీర్చుగుని ప్రయాణం సాగించాం. ఓబయ్యకి భయమో ఏం ఏమోపో, వెనకాల దిగడకుండా మాతో కలసి ఇదవాలని వాడు ఏకపరుగు. అసలు, వేసంకాలం ఓమూలనించి తరుముకొస్తోంది. చరచరా పొద్దెక్కుతోంది, ఎండ పేల్చి పోస్తోంది. తొమ్మిదిగంటలైంది. చాటంతేనా మబ్బు లేదు. ముచ్చెమటలూ పోశాయి. ఒక్క ఓబయ్యకి మాత్రము గొడుగుంది. అది వాడొక్కడూ వేసుగున్నాడు. అచ్చయ్యకి ఓబయ్యని చంపెయ్యాలన్నంత దుద్ధ బయల్దేరింది. అక్కడికీ వాడుకూడా దాన్లోనే దూరాలని చూశాడుగాని, తను మరీ పొడుగవడంచేత బెత్తాల మొనలు తనతలకి గుచ్చుగోడం మొదలెట్టాయి. ఆమట్టున వాడికి కోపం ఎగేసుకొచ్చి, వాడు ఆగొడుగు తాలూకు ఎనిమిది బెత్తాలూ విరిచి, మానలుగురికీ పక్షపాతం లేకుండా రెండేసిచొప్పున పంచిపెట్టి, గొడుగుకామ తనుచ్చుగుని, మరి మిగిలిపోయిన ఆగొడుగు గుడ్డ ఓబయ్యనెత్తికి పాగా చుట్టాడు. ఇంకోడికి లేకపోవడం, తనకి ఉండడం అనుకున్నాడు గావును అచ్చయ్య, అంతటితో శాంతించాడు. ఎవడిమట్టుకి వాడు వొర్రి తోటకూరకాడలాగ వేళ్లాడిపోడం మొదలెట్టాడు. అందులో, పొద్దున్న మంచిమాట చేసుగు ఇదయామా, ఏమన్నానా! ఎక్కడా కనుచూపులో చెట్టు కనపడక ఊరుకున్నారుగాని లేకపోతే ప్రతీవాడికీ సాగారాలని లోపల ఉంది. మేం అరాత్తుగా ఓమలుపు తిరిగేసరికి, అక్కడ, దారి మూడుపాయలకింద చీలిఉంది. ఎటు వెడితే ఎక్కడికెడుతుందో మాలో ఎవడూ ఎరగడు. అచ్చయ్య చుట్టుపక్కలు చూసొస్తానని తూరుపుదిశగా వెళ్లాడు. కొంతసేపు ఆయెండలో మేం అల్లానే పడిఉన్నాం. ఆపళంగా, పడమటి దిక్కునించి ఓసింహగర్జనం వినిపించింది. ఓబయ్య మూర్ఛిల్లాడు. మేం చెల్లాచెదరై దాక్కున్నాం. కాస్సేపటికి అచ్చయ్య గర్జనం వినిపించిన వేపునించే వచ్చి "ఏం రోయ్!"అని కేకేశాడు. మేం వచ్చాం. "ఏరి రామయ్య కామయ్యలూ!" అన్నాడు అచ్చయ్య. అని, "మీకు కనపడకుండా, అల్లా తిరిగి ఈవేపుకివచ్చి నేనేరా కూసిందీ!" అన్నాడు. అప్పుడు రామయ్య కామయ్యలు పడిపోయిన ఓబయ్య కాళ్లకింద దొరికారు. మేం చెవుల్లో కొంతసేపు ఊదగా వాళ్లకి స్పృహ వచ్చింది. మాపని అంతే అనుకున్నాం. జానికిరామయ్య కొన్ని దర్భలు జాగ్రతపడితే ఉత్తరోత్రా నయం అన్నాడు. కాని, దక్షిణాన్నించి ఓగుర్రం మావెంపుకి వచ్చింది. దానిమీద ఓ గిరజాలాయన గొడుగేసుగుని కూర్చున్నాడు. ఆయన మమ్మల్ని సమీపించినా, గుర్రం దిగలేదు, వడి తగ్గలేదు. అవసరం మాదే గనక, నేను రోషం చంపుగుని "ఏదేనా ఊరు త్వరగాజేరడానికి దారి చూపించండి బాబూ!"అని ఆయన్ని కోరాను. ఆయన, ఏం ఆలోచించుగోడానికో ఓలిప్త నిదానించి, మమ్మల్ని తూర్పుగా తిరిగి (దణ్ణంపెట్టమన్లేదు గాని) గబగబా వెళ్లమన్నాడు. ఎల్లానో లేచి మేం తూర్పుకి ఎగడ్డాం. అన్నింటికీ తోడు అప్పుడు ఎదురెండకూడాను. కొంత దూరం వెళ్లేసరికి ఆదారి మాయమైంది. మా కందరికీ నామీదా, గిరజాలవాడిమీదా మంటేసుకొచ్చింది. 'ఆపేసుగుని అడక్కపోయినా తీరిపోను' అనుకున్నాను నేను. నామాట వినడం గోతులో దిగడం అన్నాడు ఓబయ్య. ఈమాటు ఆగిరజాలవాడు కనిపిస్తే నెత్తురు కళ్లే చూస్తానని అచ్చయ్య. వాడిగుఱ్ఱం ఉత్త కోటిపిల్లి తట్టనిన్నీ, దాని నడుం కొడవలిలా ఉందనిన్నీ, అది మరో మైలు వెళ్లేసరికి వాడే దాన్ని మొయ్యాలనిన్నీ, రామయ్య. వాణ్ణి ఈమాటు కలుసుగోడంతోటే చందాపోగుచేసి అదెట్టి వాడు గిరజాలు మంగలిచేత నున్నగా తీయించేస్తానని కామయ్య. "మనికి ఈవేళ దివమందు అన్నప్రాశనముహూర్తం లేదేమో రోయ్!"అని జానికిరామయ్య. ఇల్లాతిట్టుగుంటూ తిమ్మగుంటూ ఉసూరుమంటూ వెనక్కి తిరిగి, కూడలిదగ్గిరికి మళ్లీ వచ్చి, గిరజాలాయన వచ్చినదారి వెంటే మళుపులు తిరుగుతూ కొంతసేపు వెళ్లేసరికి మూడు ఇళ్లు కనిపించాయి. అది తప్పకుండా గిరజాలాయన ఊరనిన్నీ, మేం అంతా తన యింటిమీద దిగితే ఇల్లు తినేస్తాం అనే భయంచొప్పున మమ్మల్ని తప్పుదారి పట్టించడానికి వాడు ఎత్తువేసి ఉంటాడనిన్నీ మాకు స్ఫురించింది.

అప్పటికి మిట్టమధ్యాహ్నం అయింది. మాపటాలం అంతా ఓమాటే కనిపిస్తే, ప్రతిగృహస్థూ వెంటనే అవ

తలకి పొమ్మంటాడేమో, ఒక్కొక్కడే ఊళ్లో ప్రవేశిస్తే బాగుంటుందని జానికిరామయ్యా చెప్పాడు. అది చాలా బాగా ఉందని అందరూ ఒప్పుగున్నారు కాని ప్రతీవాడూ తను ముందు వెడతానని బయల్దేరాడు. అంచేత అంతా ఓమాటే వెళ్లాం. రెండిళ్లు దగ్గిరగా ఉన్నాయి, ఓటి గిరవటేసి నట్టుంది. మొదటి యింటికీ రెండో యింటికీ మధ్య దొడ్డి వుంది, దానికి వీధివేపున చిన్న కోరడు ఉంది. దొడ్లో నూతివగ్గిర ఓ ఆవిడ అంట్లు తోముతోంది. వీథులో చింతచెట్టుతాలూకు నీడ ఉంది, మొదటికొంప తాళంవేసి ఉన్నా అరుగుమీద ఓ ఆయన పడుకున్నాడు. "ఏమండోయ్! స్వామీ! ఇదేవూరు?" అని రామయ్యా ఆయన్ని నిమ్మళంగా అడిగాడు. ఆయన వినిపించుగోక కళ్లు తెరవకుండానే పళ్లు పటపటా కొరుకుతూ అల్లానే పడుకున్నాడు. అచ్చియ్యా వెళ్లి ఆయన్ని నడ్డి విరగదన్నాడు. ఆయన లేవలేదు. తరవాత ఓబయ్యా నడుంకట్టి ఆయన్ని అరుగుమీంచి కిందికి రోల్ని దొర్లించినట్టు దొర్లించాడు. అయినా సరే ఆయన లేవలేదు. తదుపరి రామయ్యా బయల్దేరి ఆయన పిలకపట్టుకుని ఊడేపర్యంతం గుంజాడించాడు. అప్పటికి ఆయనకి మెలుకువ వచ్చి, లేచి, మూతి వంకరగా పెట్టి, "ఆబావాబావ్" అని మొరిగి మళ్లీ వెళ్లి అరుగుమీద పడుకున్నాడు. "ఒరేయ్! పాపం, మూగ మనిషి గావున్నా!" అన్నాను నేను. "ఆమాటమాత్రం చెప్పేవేం వద్దుట్రా?" అంటూ రామయ్యా ఇంకా కోప్పడుతూనే ఉన్నాడు. ఈసమయానికి రెండోయింటి అరుగుమీదకి ఓ ఆయన వచ్చాడు. కోరడుపక్కమ్మటే నడిచి మేం రెండోయిల్లు సమీపించాం. అరుగుమీదికొచ్చినాయన మాంచి వలంగా మాఓబయ్యకంటె పెద్ద పన్నాగా ఉన్నాడు. కొంతసేపు అతగాను ఏమీ చలనం లేకుండా గుడిమీద బొమ్మలా చూస్తున్నాడు. తరవాత దగ్గొచ్చి సకిలించాడు. అంతే గాని వాడిని హెచ్చుకుని వాడు మమ్మల్ని, "ఏం నాయనా! వచ్చారా! ఎండంతా మీపరం అయిందిగదా పాపం, రండి! ఇదిగో కాళ్లు కడుక్కోండి, అదుగో మడికట్టుకుందురు గాని ఉండండి!" అని ఛస్తే అన్లేదు సరిగదా, "మీ రెవరు? ఎందు కొచ్చారు?" అని కూడా అడగలేదు. రామయ్యా రెండిళ్ల మధ్య చెట్టునీడని కూలోపడ్డాడు. అరుగులమధ్య ఉన్న మెట్లలో ఆఖరు మెట్టుమీద నేను కూచున్నాను. అవమానంగాలో అంతా ఒకటోరకం పేచీకోరులే అయినా అప్పటిస్థితినిబట్టి అందరికీ అస్త్రశస్త్రాలుడిగాయి కాని, అచ్చియ్యమాత్రం ఇంకా ముందేకయ్యానికి కాలుదువ్వుతాడేమో అని జానికిరామయ్యా వాణ్ణి కాస్త ఎడంగా లాక్కెళ్లాడు. వాళ్లిద్దరూ వీధులో పచారు చేస్తున్నారు. రామయ్యా ఓబయ్యా ళ్ళు మెట్లెక్కి తిన్నగా అరుగుమీద ఆసామీదగ్గిరికి వెళ్లారు.

కా.—మూగ పోన్నారండి.

ఓ.—మరేనండి.

కా.—(ఓబయ్యతో) ఓగుర్తో! (అని ఒక్క దెబ్బ కొట్టాడు వాణ్ణి.)

ఆయన.—(ఇద్దరికేసీ చూసి ఊగుతున్నాడు.)

కా.—తమరు నిగతోన్న ప్రవాహమని ప్రతీతి.

ఓ.—తమరు కేవలం సప్రతిగృహీతలని కూడా వినికిడి.

కా.—(ఓబయ్యని మళ్లీ కొట్టాడు.)

ఆయన—(ఓబయ్యా మాట్లాడింది ఏదో తిట్టను కుని, ఓబయ్యని కొట్టబోయాడు.)

కా.—తమకీర్తి ఈ అవని దాటి అనేక సీమల వ్యాపించింది.

ఆయన—(పోకచెక్క నోట్లో వేసుకుని టక్కుమనిపించాడు.)

ఓ.—తమరు అతిభవ్యాకార గురుం గుయు.

కా.—(ఓబయ్యని ఓటి కొట్టి) నాకీ తిక్కలన్నీ ఒకానొకరకం పల్ల వచ్చాయంటే, వాడు నాకు తప్పుడు దారి కనపరిచాడు.

ఓ.—వాడు గుర్రంమీదకుడా తగులడ్డాడండి. అది బొత్తిగా బుక్కా గుర్రం.

ఆయన—(గుమ్మంకేసి తిరిగి) రామనిలకా! కాస్త సున్నం తెచ్చిపెట్టు! పోనీలే! వద్దు! నువ్వు ఇవతలకి రామోకు, నేనే తెచ్చుగుంటా!

అని లోపలికి వెళ్లాడు.

ఈసమయంలో ఎవడో మనిషివాడు వీథిగుమ్మం లోకి వచ్చాడు.

మనిషి—చెల్లమ్మగార్ని వంటకి బేగీ రమ్మంటున్నారండి.

నేను—వంటెక్కడ?

మ—కరణంగారింటో తద్దినం అండి.

నే—ఆ పైయిల్లు కరణంగారిదా?

మ—అవును.

నే—ఇప్పుడు వంట మొదలెట్టి చచ్చినవాడికా బతుకున్నవాడికా తద్దినం పెట్టడం? పాపం వారింటో భోక్తలు కుదిరారా? కావాలా?

మ—ఒకాయన ఇందాకానే వచ్చారండి. రెండోఆయన చిన్నకరణంగారండి.

నే—ఆయ నెవడు?

మ—ఈపంతులుగారి పెద్దబ్బాయండి.

అక్కడితో ఇంటాయన ఇవతలికి వచ్చాడు, నేను నిద్రపోతూన్నట్టు ఒరిగాను. ఈలోపులో ఓబయ్య కామయ్యలు ఒకడు చెక్కలడబ్బా ఒకడు తమలపాకుల బుట్టా స్వాధీనపరచుకుని రెండో అరుగుమీద తాపీగా కూచున్నారు. వెంటనే ఆయన వాళ్లదగ్గిర్నించి అవి వసూలుచేసుకున్నాడు. ఆయనికి కొంచెం ఆగ్రహం కూడా వచ్చింది. "మా అబ్బాయిని పిలుస్తా నుండండి, వెధవవేషాలూ మీరూనూ! పొండి! ఆకతాయిరకం! తిన్నగా ఉండలేరు!" అంటూ అయన మొదటి ఇంటి అరుగుకేసి చూశాడు. అక్కడ పడుకున్నవాడు ఆయనకి చిన్నకొడుకని మాకు బోధపడింది. అతణ్ణి మేం సన్మానించడం ఇతడు చూడనందుకు నాకు కొంత సంతోషం వేసింది.

మనిషి—పంతులుబాబుగారండి! చెల్లమ్మగార్ని వంటకి రమ్మంటున్నారండి!

పం—వస్తుంది. దొడ్లో అంట్లు తోస్తోంది. రెండో బ్రాహ్మడు వచ్చాడా?

మ—వచ్చారండి. సిన్నకరణంగారు వచ్చారా అండి?

పం—వస్తాడు. వంట అయేసరికి రాలేకపోతాడా? పైగా, గుర్రానికి వంట్లో సరిగా లేదు.

అని చెప్పి ఆయన తమలపాకుల్లో పడిపోయాడు. ఆమాటలతోటి గిరజాలాయన ఈయనికి పెద్దకొడుకని కూడా మాకు గోచరించింది. వెళ్లిపోతూన్న మనిషివాడితో కలిసి మాట్లాడుతూ జానికిరామయ్య వెళ్లాడు. కరణంగారి యింటిదగ్గిర వాణ్ణి వదిలేసి తను వెనక్కి గబగబా వచ్చాడు. రావడంలోనే తనమూటలోంచి ఏదో తీసి, నీడని కూచున్న రామయ్యదగ్గిరికి పరిగెడుతూ, వాడు నాకేసి చూసి కన్నుగీటాడు. నేనూ వెళ్లాను. ఆపళంగా వాడు ఓజంధ్యాల జత తీసి రామయ్యమెళ్లో చిటికెలో వేసి వాడికి కనుసంజ్ఞ చేశాడు. రామయ్యకీ నాకూకూడా సంగతేమిటో బోధపడలేదు. అచ్చయ్య ఒంటరిగా ఉండలేక తనూ అరుగుమీదికి ప్రయాణం అయాడు. వాడు తిన్నగా ఎక్కడ వెడతాడూ! అల్లరికీనుక్కీ అల్లరి కలిసొస్తుంది. సరిగ్గా ఆసమయానికే వీధిగుమ్మం ఎదటినించి ఒక వరాహం వెడుతోంది. అచ్చయ్య దానిపక్కనించి వెళ్లి అరుగుమీదికి ఎగరబోతూ దాన్ని "హూత్" అని ఝుడిపించాడు. అది అల్లా చక్కాబోతూన్నది పక్కకి తిరిగి ఇంట్లో జొరబడ పోయింది. పంతులు దాన్ని మళ్లియ్యడానికి యత్నించాడు. కాని, అది అతనికంటే బలిసి ఉండడంవల్ల జయించి గడప దాటి ఇంటో పడింది. పంతులు రుద్రుడైపోయి దాన్ని వేటాడా. అచ్చయ్యా వాళ్లూ అరుగుమీద కూచుని తాంబూలం వేసుకుంటున్నారు. అక్కణ్ణించి వాళ్లగొడవలో వాళ్లూ మాగొడవలో మేమూ పడ్డాం. జానికిరామయ్యా నేనూ రామయ్యకి నచ్చచెప్పడానికి కూచున్నట్టు చెరోపక్కా కూచున్నాం.

జా—(గట్టిగా, కొరడువెనకాల దొడ్లో అంట్లు తోమే ఆవిడికి వినబడేలాగు) ఆపక్కింటి అరుగుమీద పడుకున్న మన్మథమూర్తీ నీకు నచ్చకపోతే మమ్మల్ని ఏగంగలో దిగమన్నావ్? ఫెమోరా! తిరిగి తిరిగి మా కాళ్లు అరిగిపోయినాయి. ఇక మావల్ల కాదు బాబూ

ఈతిప్పటా! నీకూతురుపెళ్లికి నీకూ ఓదిణ్ణం. మమ్మల్ని వొదిలిపెట్టు, పోతాం.

నే—ఎమోరా! ఘటన! ఈసంబంధంనమాత్రం ఖాయపడుతుందని ఎవడు చెప్పగలడూ! మనికి ఇంకా ఎన్నాళ్లుందో కాళ్లశని!

రా—(మొహం కొద్దిగా విచారంగా పెట్టి)అక్షీతే ఇంతదూరంగా నా పిల్లదాన్ని పారెయ్యమనా మీ సలహా? మాయింట్లోదాన్తోకూడా చెప్పండీ తాంబూలాలుపుచ్చేసుగోమంటారా? కొంచెంఆగితే నయమేమో!

నే—ఆగితే నయమా? అసలు నువ్వు ఇంటికి వెళ్లేదారిలోనే నువ్వులూ బెల్లం కొనుక్కుని వెళ్లడం మరీ నయం! లేకపోతే, ఇంకా ఆగుతాట్ట, మతి లేక!

రా—అల్లాయితే, ఇచ్చెయ్యమంటారా? ఇది అడివిరా!

జా—అందుకని ఎవడూ రాడు. నయం కాదూ!

రా—వీళ్లు మంచివాళ్లేనా?

జా—ఓరి వెర్రిముండావాడా! అన్నీ విని మళ్లీ మొదటి కొస్తావేంరా! నీకు నచ్చచెప్పలేక చచ్చిపోతున్నాం! వీళ్లమంచి ఇంకా నీకు బోధపడలేదుట్రా! మీవియ్యంకుడికేసి చూస్తేనే తెలిసిపోతుంది ఆయన ఎంత భారీమనిషో! అల్లుడు నిన్ను ఎదిరించడు, అసలు నిన్ను పల్లెత్తైనా ఏమీ అనడు. అతడు ఎంత శాంతకూరుడో నువ్వు ఇందాకా చూడనే చుశావ్, బహుమతీ ఇవ్వనే ఇచ్చావ్!

ఆపళంగా అంట్లు మానేసి చెల్లమ్మగారు, కోరడు దరికి వచ్చి మామాటలు ఆలకించడం మొదలెట్టింది. ఆసంగతి జానికిరామయ్యా నేనూకూడా కీగంట గమనించి పని జరిగేటట్టుందని అనుకున్నాం.

రా—ఇంత పిసినిగొట్టు పీనుగు కొంపలో పిల్లనిగిరవపెయ్య మంటారురా! చచ్చినా పరాయివాళ్లకీ, రెండురఘామలప్పుడేనా రెండుమెతుకులు విదపనిచట్రం?

జా—నిదానించు! అందుకనే, పిల్లని ఇస్తే ఇక్కడే ఇవ్వాలి. ప్రాణంకంటె అధికంగా డబ్బు జాగ్రత్తచేసి నీవియ్యంకుడు నీ అల్లుడికి ఇస్తాడన్నమాట!

నే—నుగోసులూ వినాలి! స్తోత్రం చెయ్యడానికి నే నేమీ బ్రాహ్మణ్ణి గాను. అబద్ధం ఆడవలసిన కర్మం నా కేమీ లేదు. ఎవరైనా ఏం చాటున్నా నేను ఏనాటి కామాటే చెప్పగోవాలి! ఇల్లాంటి వియ్యాపరాలు ఎయ్యోళ్లు తల్లకిందులా బోయినా తినిపించి తపస్సు చేస్తే గొరుకుతుందట్రా, నుగోసులూ! చాలిచాలని జీవితం ఈ అదృష్టం! ఈనుహా లక్ష్మిని చూస్తే అన్నం నీళ్లా కావాలిట్రా, వెర్రినాగా!

జా—ఇహ చెప్పవేంరా! నువ్వా అసంతులు గారూ గనక వియ్యమంటావే, ఆయనెక్క శిష్యకేశవులు వియ్యమందినట్టే. పైన నీయిష్టం నాళ్లిష్టం. మేం ఎల్లానూ మధ్యవాళ్లమే! కాదుట్రా సీతారామయ్యా?

నే—కాకపోడేం!

అంతటితో చెల్లమ్మగారు పెనిటివార్ని ఇంట్లోకి ఒక్కగంతేసింది, అంటచేసులు కడుక్కోకుండానే.

ఈసమయంలో అక్కడ జరిగిన సంగతిసరించి అచ్చయ్యా వాళ్లూ చెప్పినదానిని బట్టి నాకు తరవాత తెలిసింది. ఆ పంది ప్రతీగదిలోకి పోయి సంతులన్నీ కూడా తిప్పిందట. ఇల్లా కొంతసేపు గడిచిన తరవాత, అచ్చయ్యా వాళ్లూ కూడా లోపలికి వచ్చారట. అప్పటికి పంది వంటింట్లో కెళ్లి వండిపెట్టిన అన్నం అల్లరిచిల్లరిగా పడేసి ఉన్న సామాను కొద్ది సపర్యలతో సంస్కరించి, తనయొక్క అవతారజన్మలో సముద్రం లోంచి భూమిని ఎత్తి వంటపాత్రంగా కాపాడినట్టు, ఇప్పుడుకూడా గదిలో ఏర్పడ్డాయిగనుక అందులోంచి మంచాన్ని ఎత్తేసి ముట్టెచివర రక్షించి, తద్వారా "పంగరిమంచం" అనేమాట కొంతవరకు సార్థకపరిచి, ఇవతలికి వస్తోందట. అప్పుడు పంతులుకి కాలుకొచ్చి, అతను చీపురుకట్ట ఓటి పట్టుగుని, "ఇదంతా నీ మహిమలాన్నే, వీడి గుంప తెగా!" అని అచ్చయ్యని కొట్టబోయాడట. వాడు ఇట్టే తప్పించుకుని, ఆయన్ని చచ్చేట్టు ఒక్క తోపు తోశాడట. ఆయన పెళపెళా విరుచుకుని పంది మీద చెట్టులా పడిపోయాడట. అదికూడా కింద పడిపోయి అతణ్ణి కరవబోగా, మావాళ్లు నవ్వుతూ దాన్ని అదరకొయించి అవతలికి కొట్టేశారట. ఇంతలో, పం

తులు లేచి, ఓకత్తిపీట దొరకపుచ్చుగుని అచ్చయ్యని నరికెయ్యడానికి వీధులోకి రాబోతున్నాడట.

చెల్లమ్మగారు ఇంట్లోకి వస్తూనే "రామచిలకోయ్! నీమరిదికి పెళ్లివారు వచ్చారేవ్!" అని కేకేసిందిట. అప్పుడు ఓ చీకటి గదిలోంచి ఒక అమ్మాయి ఇవతలికి వచ్చి, "మామగార్ని ఎవరో కొడుతున్నారు! రండత్తా!" అందిట.

ఇంతలో మేం చెట్టునీడనించి అరుగుమీదికి కదలబోయేసరికి, ఓబయ్యా కామయ్యా వీధిని ఎగడి అడ్డేపోత పోతున్నారు. అచ్చయ్యా కొంతదూరాన్ని ఖణాయించి నిలబడ్డాడు. పంతులు కత్తిపీట బాణాకర్రలా తిప్పుతూ ఇంట్లోంచి వస్తున్నాడు.

పం—ఇప్పుడు రండిరా! మీ మొహాలు మండా!

చెల్లమ్మ—(ఇంట్లోంచి గుమ్మంలోకి వచ్చి) ఇదిగో, మిమ్మల్నే! ఇల్లా రండి! వినిపించుగోరేం! మీ మాటే! మీతో ఓమాట చెప్పాలి మంచిది! ఇల్లా రారేం?

పం—కాస్సేపుండు! సొద! ఇవతల పనిమీద ఉంటూంటేనే! కల్లేమయినాయి?

చె—(పళ్లు బిగించి సంజ్ఞలు చేసి, సెగ్గి, ఆయన తనదగ్గిరికి వచ్చినతరవాత) ఉండండి, ఏమిటా ఆగ్రహం! వచ్చినవా రెవరో చూసుగోడం ఉందా, చూసుగోడం లేకుండానే ఇదవుతారా మీ ఇదవడం మీరూను! మన సుంధరానికి మంచి ఎదిగిన (అని మెల్లిగా అతని చెవులో కొంత మాట్లాడింది).

ఈమంత్రం పంతులుకి కూడా పట్టిచ్చింది. అతడు వడి తగ్గించి కొంచెం సద్దుకున్నాడు. కత్తిపీట తిప్పడం మానేశాడు గాని, అది అసలు పారెయ్యలేదు. "అల్లా చెప్పూ! నాకూ మొదణ్ణించీ అనిపిస్తూనే ఉంది—ఇది వియ్యాలారి హాస్యం కాదుగదా—అని. ఇప్పటికి బోధపడింది." అంటూ ముసిముసి నవ్వు తెచ్చుగుని, మమ్మల్ని "బాబూ, రండి రండి. అరుగుమీద దయచెయ్యండి. సంగతులు క్రమేపీగాని తెలియవు." అని హెచ్చరించాడు. ఓబయ్యా కామయ్యా పారుగూరు ఆవడంచేత జంకి కేకకి అందకుండా పోయారు. వాళ్లనిద్దరా పిలవడానికి వాళ్ల వెనకాల పంతులు కత్తిపీటతో సహా ధౌడు ప్రారంభించాడు. అతనివెనకాలే అచ్చయ్య సాగాడు. ఓబయ్య కామయ్యలు పరిగెత్తలేక పొలిమేరదగ్గిర ఆగి ఎదురుతిరిగి పంతులుతో దెబ్బలాటకి సిద్ధంగా నుంచున్నారు. పంతులు వెళ్లి వాళ్లు రావలిసిందని వాళ్లని కాళ్లట్టుగుని బతిమాలుకోడానికి ఒంగున్న సమయంలో అచ్చయ్య పిల్లిలా వెనకాలే వెళ్లి, ఆయన వాళ్ల కాళ్లు నరకపోతున్నాడనుకుని, ఆయన నడ్డిమీద ఒక్కటిచ్చుగున్నాడు. ఆయన మొర్రో అని, అచ్చయ్యకేసి తిరిగి, "అయ్యా! వియ్యాలారి హాస్యం మరి చాలు. తమరుకూడా వచ్చి నాయిల్లు పావనంచెయ్యండి" అని బతిమాలుకున్నాడట. వాళ్లముగ్గురికీ ఆశ్చర్యంవేసిందిట. వాళ్లూ "ఇదేమిట్రోయ్" అనుకుంటూ వచ్చారు. జానికిరామయ్యా నేనూ వాళ్లకి సంజ్ఞలు చేశాం. వాళ్లు పూర్తిగా గ్రహించలేదు. ఆఖరికంగా జానికిరామయ్య వాళ్లతో "ఏమర్రోయ్! సంబంధం తేలకుండా ఉన్నప్పుడు జరిగినవాటికి బోడ్డుతుమ్మాలు. మనరామయ్య కూతురు సంబంధానికి పంతులుగారు ఒప్పుకున్నారు. ఇక మనమూ వారూ ఒకటి. వారు సిద్ధంగా ఉన్నారు. మనదే ఆలస్యం!" అని కాస్త తెలిగించి చెప్పేశాడు.

అక్కణ్ణించి చూస్కోండి మాదశ. కాళ్లు కడుక్కోడానికి వేణ్ణీళ్లు ఇచ్చారు. జానికిరామయ్య ఓ చుట్ట కావా లన్నాడు. పంతులు ఇంట్లోకి వెళ్లి ఓ అరవీశెడు పొగాకు బొండం తెచ్చి అతనికి ఇచ్చి, "పెళ్లి మనగుడుపులికి వచ్చినప్పుడు మీరు ఓ చుట్టో అరచుట్టో పొగాకు వేసుగు వెడుదురు గాని" అన్నాడు. నిమిషంలో అందరికీ వేణ్ణీళ్లస్నానాలు. అచ్చయ్యమాత్రం మొట్టమొదట బుర్రకి కొంత నూనె పులిమి, అది వదలడానికి కాసినికుంకుళ్లు తెమ్మని, ఆపులుసుతో తలరుద్దుకునేటప్పుడు ఆమురికి వంటిమీద పడడంవల్ల వంటిజిడ్డు వదలడానికి సున్నిపిండి తెమ్మని మొత్తంమీద రెండుమూడు తలంట్లంత స్నానం చేశాడు. చెల్లమ్మగారు శుభమల్లే సంబంధం కలిసిరావడంవల్ల తద్దినంలో దిగడం కూడదని గ్రహించి గావును, వంటకి రావని కబురంపి, మాకు

వంట చెయ్యడానికి మడి కట్టుకుంది. మాకు అగరు నూనె, అత్తరూ వగైరాలు ఇచ్చారు. మాలో కొంత మంది మళ్లీమళ్లీ అల్లాంటి తరుణం దొరకదేమో అని ఆ సీసాలు బోర్లించి పాదాలకికూడా రాచేసు కున్నారు, ఒకళ్లిద్దరు కొంత లోపలికికూడా పుచ్చు కున్నారు— లోపలసమేతూ సువాసన కలగడానికి. ఇల్లంతా ఘుమఘుమ లాడుతూండగా మమ్మల్ని మళ్లీ గట్టిగోమన్నారు. మేం లేవబోతూన్నాం. వీధి సమ్మేంలోకి సుంద్రం వచ్చింది. గిరజాలాయన దిగాడు. సమ్మేంలోకి రాగానే మాబృందం కంట బడేసరికి ఆయన నిశ్చేష్టు డయాడు. సువాసనతగిలేసరికి ఆయనకి మతో యింది. లోపలికి వెళ్లి సంగతి గ్రహించాడు. అతడు మళ్లీ ఇవతలికి వచ్చి ఊరుకోక ఓ చిన్న పేచీ వేశాడు. "తమర్ని నరించి అమ్మా నాన్నా చెప్పారండి. అందులో అమ్మ మహాపట్టు పడుతోంది. సంబంధంవిషయం బాగానే ఉంది. కాని ఒకటి తమరు ఆలోచించలేదు. 'కతికితే అతకదు' అని శాస్త్రం. తమరు ముందుగానే ఇక్కడ భోంచెయ్యడం జయకరం గాదు" అన్నాడు. నోటిదగ్గిర అన్నం లాగి పారెయ్యడానికి వీ డెక్కడ పోగయ్యాడ్రా పేచీరాయుడూ అని మాలో ప్రతీవాడికీ అనిపించింది. పాపం! మా పుణ్యం బాగుండబట్టి, సంబంధం సంగతి జ్ఞాపకం ఉంచుకుని, అచ్చయ్యవగైరాలు లోగడ గిరజా లాయనమీద చేసిన ప్రతిజ్ఞలు ఉపసంహరించుకున్నారే గాని, చెయ్యిచేసుగోలేదు. నేను కొంచెం సకిలించి సం గతి అందుకుని, "ఫరవా లేదండి. మూడుముళ్లూ పడక పూర్వం కన్యాప్రదాత ఒకడుమాత్రం మీయింట్లో కతకకూడదు గాని, కడంవాళ్లకి తప్పు లేదు" అన్నాను. ఈమాట రామయ్యకి మిరపకాయి రాచినట్టుంది. "అల్లా యితే, ఆమూగవాజమ్మకి నాపిల్లని ఇవ్వనే యివ్వను." అంటూ వాడు భాటంగా కోప్పడ్డం మొదలెట్టాడు, అప్పుడే తన ఒక్కడి కూడూ పడిపోతోందని. రంగం చెడేట్టుందని మాకు భయంవేసింది. పంతులు చిరునవ్వు నవ్వి "ఇంతా చేసి మాచిన్నవాడు మూగాడని చూస్తు న్నారా ఏమిటి? ఇంతేటండీ తమగ్రహింపు! వాడు మొదట, కాశీ వెళ్లాడు. తరవాత రామేశ్వర యాత్ర చే

శాడు. చేసి, ఇంటికి వస్తూనే మళ్లీ కాశీ వెడతానన్నా డు. వెళ్లాలిట. కొంచెం కాలూ చెయ్యీ చూసి దీసుకుని వెళ్లవలసిండని వాణ్ణి మేం కోరాం. వాడు కోపించి, మళ్లీ కాశీ మానేవరకూ నేను మాటే ఆణ్ణు" అని భీష్మించి, అది లగాయతు అల్లా మూగాడిల్లా నటిస్తున్నాడు. ఆ దోసెడు తిలంబ్రాలూ వాడి నెత్తిని పడగానే కాశీ వెళ్లి చక్కారమ్మంటాను, వచ్చి బృహస్పతిలా మాట్లాడ తాడు తీరిపోతుంది. సరా?" అన్నాడు. జానికిరా మయ్య ఈలోపులో ఆలోచించుకుని, "అయ్యా! వంట ఎక్కడ చేశారు?" అన్నాడు. 'దొడ్లో పొయ్యిమీద' అని పంతులు చెప్పాడు. "అల్లాయితే, దొడ్లోవంట ఇంట్లో తినడానికి శాస్త్రరీత్యా కన్యాప్రదాతకి ఏమీ ప్రతిబంధకం లేదే? అయినా, పాపపరిహారం నిమిత్త మున్నూ, మీ పెద్దబ్బాయిగారి అనుమాన నివృత్త్యర్థమున్నూ, మా రామయ్యకిమాత్రం భోజనం ఆ అవతల ఇంట్లో పెట్టండి!" అని జానికిరామయ్య సలహా ఇచ్చా డు. అంతా సరే అన్నమీదట మేం భోయినానికి కూచు న్నాం. కరణంగారియింట్లో వంట లేదని తెలిసినా, చిన్నకరణం ఉద్యోగానికి ఏం ముప్పంవస్తుందో అని మడి గట్టుకు వెళ్లాడు. మంత్రానికి పంతులు వెళ్లారు. అక్కడ పాపం వంటా లేదుట, పెంటా లేదుట. ఆ రోండ్లో బ్రాహ్మడే ఇంత అత్తిసరు తగలేశాట్ట, దాంతో అయిందనిపించారట. మాకు చెల్లమ్మగారే వడ్డించింది. రామయ్యకి రామచిలక వడ్డించింది. రెండిళ్లూ కొంత ఎడంగా ఉండడంవల్ల రామచిలక తన గోడవ అంతా రామయ్యదగ్గిర, వెళ్లబోసు కోడంలో, తనకి బాల్యంలోనే ముడెట్టడం, ముడెట్ట గానే అత్తారింటికి తీసికెళ్లడం, అప్పట్నించీ పగలూ రాత్రీకూడా ఒక చీకటికొట్లో పెట్టి తనని తాళం వెయ్య డం, తన స్వజనం వచ్చినా వాళ్లతో తను మంచీ చెడ్డా అనుకోవాలంటే తమరి ఎదటే మాట్లాడా లనడం, వగైరా చెప్పుకు ఏడిచి "మీ అమ్మాయినికూడా ఈకొంపలో పారెయ్యకండి, నాయనా! అసలు మామరిది నిజంగా మూగాడే! ఆ స్థితిలోఖా!" అందిట. అందుకు రామయ్య, "అమ్మా! అనుకుంటున్నాం మరి! పీటలమీద పెళ్లిళ్లీ

అనేకం తేలిపోయినాయి. పీటలమీద తోయినాలు అనేకం పక్కగుంటా పోయినాయి. ప్రాప్తం ఉండాలి దక్కాలి. అవాలి అనుకోవాలి. శుభం!' అన్నాట్ట. మేం భోజనాలై, అరుగులమీద దొర్లుతూంటే, (అప్పటికి నాలుగైంది) పంతులూ పెద్దకొడుకూ తద్దినం తెముల్చుకుని, కరణంగారిని వెంటపెట్టుకుని వచ్చారు. అప్పటిదాకా పెళ్లికొడుకు మొహటియింటి అరుగుమీదే నిద్దరోతున్నాడు. బడలికవల్ల మాకు కొంచెం నిద్రపట్టింది. అయిదింటికి మేం లేచేసరికి పెళ్లికొడుకుని ముస్తాబుచేసి, పంతులు ఇవతలికి వచ్చాడు. జానికిరామయ్య "పంతులుగారూ! తాంబూలాల ఆటంకంకూడా కానిత్తామా?" అన్నాడు. "వాళ్లొచ్చి పిల్లని చూసుగోండే ఎల్లా? పైగా, తాంబూలాలు పెళ్లికూతురుగారి ఊళ్లో పుచ్చుగోవాలి!" అని ఓబయ్య తనని అడిగిందే చెప్పాడు. కొంచెం అయితే అచ్చయ్య పెళ్లి ఓబయ్యపళ్లు గవ్వల్లా రాలకొట్టేదే! కాని, జానికిరామయ్య అచ్చయ్యని ఆగమని సంజ్ఞచేసి, "ఏమంటారు పంతులుగారూ?" అన్నాడు. ఆయన "ఇక్కడా అక్కడా అంటూ నాకు పట్టింపులు లేవు. శుభస్య శీఘ్రం అన్నారు గనక, అల్లానే!" అన్నాడు. సంబంధం ఇన్నాళ్లకి వచ్చింది, ఇది దాటి పోతుందేమో అని ఆయన బెంగ. సరే, తాంబూలాలు అయినాయి. నాకూ, రామయ్యకీ, జానికిరామయ్యకీ జామార్లు ఇచ్చారు. రామయ్యకి ఇవ్వడం జయప్రదం కాదని ఓబయ్య జ్ఞాపకంచేసినా వాళ్లూ విన్లేదు, రామయ్యా విన్లేదు. కడింవాళ్లకివ్వలేదని కోపాలు బయల్దేరాయి. అచ్చయ్య మొహం జేవురించింది. వాడు మాటని పిలవకుండానే రామయ్యని రెక్కట్టుకుని కొంతదూరంగా తీసికెళ్లి, "మీరు ముగ్గురూ జామార్లు లాగేస్తారా? నువ్వు ఉత్తబ్రహ్మచారివనీ, నందిమొహానికి పష్ఠికీ తప్ప ఎందుకూ పనికిరావనీ వాడితో చెప్తాను జాగ్రత్త! నిన్ను కుళ్లబొడుస్తారు!" అన్నాడట. రామయ్య "బాగా చెప్పుకో. చెప్పుకుని నాకు బంగారు చెప్పులు చెయ్యించు." అన్నాడట. అనేసరికి అచ్చయ్య ఫెడీమని రామయ్య దవడ ఊడిపోనాడు. తక్షణం మేం పరిగెట్టాం. పంతులు రాలేదు. సంగతి కనుక్కున్నాం.

జా—ఒకేయి! ఇహకాస్సే వుండేరా, పోదాం.

అ—నాకు జామారు కావాలి.

జా—కట్టంవాళ్లకో?

అ—ఏమో!

జా—పోనీ వచ్చుస్సరం నూ జామార్లు ఆరు పంచెలకిందా ఉత్తరిస్తాం. ఆరుగురం పుచ్చుకుందాం.

అ—నా కల్లా పనికిరాదు.

ఓబయ్య—పోనీ ప్రతీజానూరూ నిలువుగా చీరి సత్తే రెండేసి జామార్లు అవుతుంది. అందరికీ తలోజామారూ వస్తుంది.

అ—అది బాగానే ఉంది.

అని మెచ్చుకోడానికి ఓబయ్యని ఒక్కటి కొట్టాడు. మేం మళ్లీ అరుగులమీదికి వచ్చాం. ఆపొద్దు గాటాయన (అనగా అచ్చయ్య) కన్యాప్రదాతని అమాంతంగా లాక్కెళ్లా రేమిటని పంతులు జానికిరామయ్యని అడిగాడు. అందుకు జానికిరామయ్య "వాడికి కాలినరం ఓటిపట్టు పనుటూంటుందండి. అల్లాంటప్పుడు వాణ్ణి పరిగెత్తిస్తే సర్దుకుంటుంది." అని చెప్పాడు. "ఆ నరానికీ చేతులో ఎదో నరానికీకూడా సంబంధం ఉండి ఉండాలండి. అందుకనే ఆయాన చెయ్యి ఊరుకోదు." అని పంతులన్నాడు. పొద్దుపోకేదాకా మేం అరుగులమీదే కూచున్నాం. మేం లోపాయికారీగా కొత్తయెత్తు ఏదేనా ఆలోచించుగోడానికి వీల్లేకుండా వాళ్లు మమ్మల్ని వదలకుండా పట్టుగున్నారు. ఇంకా ఏమాటమీద ఏం వస్తుందో సమర్థించుగోలేక చావాలని భయం అందరికీ వేసింది. రాత్రి భోజనాపేక్ష ఎవడికీ లేదు. వెళ్లిపోతే బాగుండునని ఉంది. రాత్రి అడవిలో వెళ్లడం భీతిగానే ఉంది. మళ్లీ జానికిరామయ్య ఓయెత్తు వేశాడు. "పంతులుగారూ! తమ ఆస్తివగైరాల దస్తావేజులు ఒక్కసారి కంట పడెయ్యాలి!" అన్నాడు. "అడ్డమా!" అని పంతులు అని తనూ గిరజాలాయనా లోపలికి వెళ్లారు. మేం అంతా మళ్లీ లేవండి అనీ అనకుండానే తిండికి సిద్ధం అవుతాం ఏమో అని గిరజాలాయన భయం. రాత్రి ప్రయాణాలగురించి యింతలో ప్రసంగం

వచ్చింది. వెన్నెలకూడా వచ్చింది. మాకు అల్లాంటి ప్రయాణాలు సరదాయే అన్నాం. అక్కడికి ఓకోసుదూరంలో ఉన్న గూడెం వెళ్లి గిరజాలాయన రెండు బళ్లు కట్టించుకొచ్చాడు. మేం లేచాం. దస్తావేజులు మాట్లాడం అందరూ మరిచినట్టు నటించాం. ఉత్తరం రాస్తాం అని చెప్పి, అందరివద్దిరా సెలవు పుచ్చుకుని బళ్లు ఎక్కి బయల్దేరాం. బళ్లవాళ్లు మళ్లీ మాట జేరవేస్తారేమో అని మేం కిక్కురుమనకుండా పడుకుని నిద్రపోయాం. ఉదయానికి అడివిచివరకి వెళ్లాం. బళ్లతో సహా మావూరుదాకా వెడితే ఇతర చిక్కులుంటాయని చెప్పి వాళ్లని వెనక్కి పొమ్మన్నాం. కష్టం పాలిగ మైళ్లూ నడిచి స్వగ్రామంలో పడ్డాం.

మర్నాడు జానికిరామయ్య పంతులికి ఉత్తరం రాశాడు. దాన్లో వృత్తాంతం ఏమిటంటే? మేం ఇంకా మావూరు జేరుకోక పూర్వమే పెళ్లికూతురు మసీసగం వచ్చి కాలంచేసిందనిన్నీ, ఘటనకి ఏమీ చెయ్యలేం అనిన్నీ, విచారించవద్దనిన్నీ. దానిమీదట, ఆపంతులు, పరామర్శపూర్వకంగా రామయ్యకి వేసిన జవాబులో, "మీకు వచ్చిన ఆపత్తు ఇంతా అంతా కాదు. గుండె నీరై పోయింది. విచారించకండి. నేనే బయల్దేరి మీ ఊరొచ్చి, సౌ॥ అక్కగార్నీ మిమ్మల్నీ సమదాయించిందాకా, నాకు తోచటంలేదు." అంటూ రాశాడు. రామయ్య ఆ ఉత్తరం పట్టిగెళ్లి జానికిరామయ్యకి చూపెట్టి "నువ్వే, ఇదంతా చేశావు! ఆ పీనుగు ఈ ఊరొస్తాడుకదా, ఏమిటి మరి సాధనం?" అన్నాడు. ఆమట్టున, ఊళ్లోకి ఎప్పుడొచ్చి వాకబుచేస్తాడో అనేభయం చొప్పున, ఊరవతల రోడ్డుపక్కనున్న రెస్టుహౌసు లోనే వంటుకు తింటూ రాత్రింబగళ్లు మనిషి విడిచి మనిషి చొప్పున కాసి, ఒకనాడు తెల్లారకట్ట ఒకబండీలో ఆయన వస్తూంటే, బండీ ఆపుచేయించి, ఆయన్ని రెస్టుహౌసులోకి తీసికెళ్లి, ఆయన్ని వెన్నెట్లో కుర్చీలో కూచోబెట్టి, వీళ్లిదరూ చూరుకింద చీకట్లో కూచుని మాట్లాడారట! అక్కడ జరిగిన ప్రసంగం, తరవాత, జానికిరామయ్య నాతో చెప్పాడు.

పం —(రామయ్యతో) మీది మహాచెడ్డచిక్కండీ! రామయ్య బావా!

రా—(సవరించి, నవ్వు ఆపుకుని) ఏం చేస్తాం?

జా—రండి, రాతా! సరుకేది పశువా?

పం— మాపు రేనా అంపలేగు కాపును!

రా—ఈపాపిష్ఠికళ్లకి అనేకూడానా!

పం—ఇక అక్కగారిదుఃఖం చెప్పనే అక్కర్లేదు పాపం!

జా—ఆవిణ్ణి ఆపటం మహాకష్టంగా ఉంటోందండి. కంటికీ మంటికీ ఏకధార!

పం—అస్సట్టా అక్కగారు లోపల ఉన్నారా? ఓమాటు మాట్లాడ్దాం పదండి.

జా—ఆవిణ్ణి ఈవేళే పుట్టింటివారు పరామర్శకి తీసికెళ్లారండి.

పం—ఈయిల్లు ప్రయాణీకుల బసలా ఉంది, మీ రింకులో ఉన్నారేం?

జా—పిల్లపోయిన నక్షత్రం మంచిది కాదండి. పైగా, వాడ త్రిపాదికూడా కాదుట. వాడ వదిలెయ్యాలట. అంచేత చుట్టుపక్కల ఇళ్లు కుదరక, ఇల్లా వచ్చాం.

అని మరి ఆయన్ని మాట్లాడనియ్యక, ఆయన్ని ప్రాతఃకాల స్నానం చెయ్యమని, ఇంత అన్నం వండి పెట్టి, ఆయన్ని ఊళ్లోకి తీసికెళ్లక, తెల్లవారకుండానే ఆయన్ని బండీ ఎక్కించేసి, పంపేశారు. మరిరెండుసెల్లకి ఆయన దగ్గిర్నించి వచ్చిన ఉత్తరంలో, మేం వచ్చిన వేళావిశేషంవల్ల తమ అబ్బాయికి మరో సంబంధం కుదిరి పెళ్లి అయిందనిన్నీ, మేం యాత్రవెళ్లేటప్పుడు అటు వచ్చి పోవలసిందనిన్నీ ఉంది. అది లగాయతు, మేం యాత్రకి వెళ్లేటప్పుడూ వచ్చేటప్పుడూకూడా, అక్కడ నాలుగేసి రోజులు ఆగుతూండేవాళ్లం. వాళ్లు భోజనం పెట్టేవాళ్లు గాని, కాన్నైతే జామార్లుమాత్రం మళ్లీ ఇవ్వలేదు.




## గుఱ్ఱంకథ

పరాత్పరరావుగారు

అనగనగా ఒకవూరు. ఆవూళ్లో ఓ కాపు. ఒకరోజు పొరుగూరుకని గుఱ్ఱంమీద ప్రయాణమయ్యాడు. దారిలో ఒకనక్క కనపడింది. త్రోవ కడ్డంగా నిల్చుండటంవల్ల 'నక్కా! తప్పుకో తప్పుకో' అని డబాయించి పల్కాడు. అందుకు నక్క 'తొందరపడకు. ఎప్పుడైనా నాదగ్గఱకు రావలసినవాడవే' అని ప్రక్కకు తొలిగింది. దారిలో ఒకసత్రం కనపడితే అక్కడ గుఱ్ఱాన్ని కట్టేసి సత్రం అరుగుమీద నిద్రపోతున్నాడు.

తెల్లవాఱింది. ఆసత్రపు యజమానికొడుకు ఎద్దుప్రక్క గుఱ్ఱం ఉండటం చూచి గబగబ లోపలికి పోయి, 'నాన్నా! నాన్నా! మన ఎద్దు గుఱ్ఱాన్ని యీనింది'అన్నాడు. 'ఐతే కట్టెయ్యి'అని అన్నాడు తండ్రి. గుఱ్ఱాన్ని లోపల కట్టేశారు. ఆకాపు చూచేటప్పటికి గుఱ్ఱం లేదు. 'నాగుఱ్ఱం యిస్తారా యివ్వరా' అని అడిగితే, 'పోవయ్యా పో; మాఎద్దు గుఱ్ఱాన్ని యీనింది, దాన్ని యెట్లా యిస్తాము? 'అన్నారు వాళ్లు. ఆ పొరుగూరు కరణంతో చెప్పాడా కాపు! ఏం చెప్పినా యేం లాభం లేకపోయింది. ఆ కరణం ఆసత్రపు యజమాని ఒక్కటయ్యారు. 'సరే. సాక్ష్యం తెచ్చుకొంటాను' అని ఆ కాపు నక్క కోసరం వెతకటం మొదలుపెట్టాడు. పోగా పోగా ఆ నక్క కనపడ్డది.

'కాపు, ఏం ఇట్లా వచ్చావు?' అంది.

'నీతో పని వుండి'—అని జరిగిందంతా చెప్పి ఆ నక్కను బ్రతిమాలి తీసుకవెళ్లాడు. అక్కడ నక్క సముద్రపువైపు తిరిగి యేడ్వడం మొదలుపెట్టింది.

'ఏం, అట్లా యేడుస్తున్నావేం' అని అక్కడ వున్నవాళ్లడిగారు.

'సముద్రం కాలిపోతూంది. అవిగో మంటలు. ఎండ్రకాయలు చేపలు అన్నీ మలమల మాడిపోతే నాతిండి యెట్లా అని యేడుస్తున్నాను.' అని అంది. 'సముద్రం కాలిపోవటం యేమిటి,నీ కేమన్నా పిచ్చియెత్తిందా!' అని అంతా ప్రశ్నించారు. 'అవునవును. అట్లాగే ఉండును. ఎద్దు గుఱ్ఱాన్ని యీనిందంటే చిత్రం లేదు. సముద్రం కాలిపోయిందంటే చిత్రమైందా?' అని యెత్తిపొడిచింది.

అప్పుడు నిజంసంగతి తెలిసివచ్చి అంతా సిగ్గుపడి ఆ కాపు కాగుఱ్ఱాన్ని యిచ్చి పంపారు. నక్క తనత్రోవన తానుపోయింది,తనయుక్తికి ఉబ్బిపోతూ. కథ కంచికీ మనం యింటికి.

# లోకులు చేసే పనులు

శ్రీమతి చీమలకొండ సూర్యకాంతంగారు

ఒకప్పుడొక గ్రామంలో ఒకగొప్ప శాస్త్రులుగా రుండేవారు. ఆయన వేదము శాస్త్రము కూడా బాగా చదువుకొని తనంతవాడు ఆచుట్టుపట్ల యెక్కడా కూడా లేడనిపించుకొన్నాడు. ఆయనంటే అందరికి గౌరవ మెక్కువ. అందుచేత స్వగ్రామంలోనే కాక సమీపగ్రామా లన్నింటిలోను కూడా ఆయన ప్రమాణపురుషు డైపోయాడు.

ఇట్లా ఉండగా ఒకనాడు సూర్యగ్రహణము వచ్చింది. అంతా సముద్రస్నానానికి వెళ్లారు. అందరితోపాటు ఈశాస్త్రిలుగారు కూడా తనరాగిచెంబు చేత పుచ్చుకొని గ్రహ



"గ్రహణస్నానికని సముద్రపుటొడ్డుకు వెళ్లాడు."

ణస్నానానికని సముద్రపుటొడ్డుకు వెళ్లాడు. అచ్చట తొడ తొక్కిడంతా చూచి, ఒడ్డుమీద విడిగా పెడితే తనచెంబు పోతుందేమోనని, ఆయ నేం చేసినా డంటే చెంబొకచోట జాగ్రత్తగా పెట్టి దానిమీద గుర్తుకోసం లింగాకారంగా ఒకఇసుకపోగు చేసి తరువాత సముద్రంలో దిగి స్నానం చేసి జపం ప్రారంభించినాడు.



"చెంబొకచోట......జపం ప్రారంభించినాడు."

శాస్త్రిలుగారు ఇసుక పోగు చెయ్యడం ఆయన్ని యెరిగినవాళ్లంతా చూచారు. ఆఇసుకలింగంక్రింద చెంబు పెట్టినసంగతి మాత్రము వాళ్లు గుర్తించలేదు. అందుచేత చెంబుమీద గుర్తుకోసం ఆయ నాలింగం చేసినాడని వాళ్లు తెలుసుకొనుటకు వీలు లేక పోయింది. అక్కడున్నవాళ్లంతా అనుకున్నారు గదా, "ఈయన స్నానానికి ముందు ఒడ్డున ఇసుకలింగము చేసి పెట్టి మరీ సముద్రంలో దిగాడు. కాబట్టి గ్రహణసమయంలో సముద్రపుటొడ్డున ఇసుకలింగము చేసి స్నానం చేస్తే యేదో మహాఫలితం ఉంటుం"దని అక్కడనుంచి ప్రతివాడుకూడా స్నానానికి ముందు ఒడ్డున ఒకఇసుకపోగు పెట్టడం ప్రారంభిం

చాడు. ఒక్కఘడియలో ఒడ్డంతా ఇసుక లింగాలు తయారయ్యాయి.

ఇంతల్లోకే గ్రహణం పట్టు, విడుపు కూడా అయిపోయింది. అప్పుడు శాస్త్రిలు గారు జపం చాలించి విడుపుస్నానం చేసి ఒడ్డుకు వచ్చాడు. సరే, వచ్చి చెంబు తీసు



"ఎచ్చట చూచినా ఇసుకగుట్టలే కనుపించాయి."

కుందామనేటప్పటికి ఎచ్చట చూచినా ఇసుక గుట్టలే కనిపించాయి. వాటిల్లో పాపం తన చెంబెక్కడ కనిపిస్తుంది? ఎన్నిగుట్టలని వెతుక్కుంటాడు? జరిగినప్రమాద మంతా ఆయన కప్పుడు బోధపడింది. కాని ఏమి చేస్తాడు? "అయ్యో! లోకు లెంత తెలివితక్కువవారు! ఒక డేదో చేసినాడని అంతా ఆ మార్గమే అవలంబిస్తారు కాని, ఒక్కరు, వారు చేసేపని యొక్క ప్రయోజనము తెలిసికొనుటకు ప్రయత్నం చెయ్యరు. గ్రుడ్డితనంగా ఒకని ననుసరించటం తప్ప లోకానికి అసలుసంగతి తెలుసుకుందామన్న కోరికే లేదు. నేను కేవలం గుర్తుకోసం ఇసుకలింగం చేస్తే నాచెంబు పోవటంవరకూ వచ్చిందే" అని విచారిస్తూ,

"గతానుగతికో లోకః న లోకః పారమార్థికః
నేతా సైకతలింగేన నష్టం మే తామ్రభాజనమ్."

అనేశ్లోకంతో ఆఅభిప్రాయం వెలిపుచ్చి ఇంటికి చక్కాపోయాడు.

---

## 'హరయే నమః'

కా. రామనాథదత్తుగారు

అనగనగా, ఓవూళ్లో ఒకబ్రాహ్మడక్షయపాత్రతో కాలక్షేపం చేస్తుండేవాడు. ఓనాడాయన అక్షయపాత్రతో ఊరంతా చుట్టొచ్చి మిట్టమధ్యాహ్నాని కింటిబయట నిల్చొని 'హరయే నమః' అని అరవగానే, లోపల గొళ్లెం వేసుకొని వడ్లని దంచుతూన్న ఆయనభార్య పోటెయ్యటానికి పైకెత్తిన రోకల్నలాగే వదిలేసి, తలుపు తీసి, భోజనం పెట్టి మళ్లీ దంపటాని కొచ్చింది. అందాకా ఆరోకలాట్టే త్రిశంకులాగ నిల్చుంటే దాన్నందుకొని వడ్లని దంపుకొంది. ఇది చూచి ఆమె భర్తకూడా చాలా ఆశ్చర్యపడ్డాడు; భార్య పాతివ్రత్యానికి మెచ్చుకొన్నాడు.

సరిగదా! ఈవిషయం ఊరంతా ప్రాకిపోగానే ఓగయ్యాళిగంప భర్తదగ్గిర కెళ్లి, "రేపు మీరు కచేరీకి శెలవెట్టి, క్రాపునుగొరి

గించి ఆ అక్షయ బ్రాహ్మడివలె కాస్త పిలకనుంచుకొని, అక్షయపాత్ర యెత్తుకుని మిట్ట మధ్యాహ్నాని కింటి కొచ్చి 'హరయేనమః' అని అరచారంటే సరి. లేకుంటే, జరగాల్సింది జరిగేతీరుతుంది" అంది. పాప మాయన తన కల్లాం టిల్లాల్ని కట్టిపెట్టినందుకు లోలోపలనే విధిని దూరుతూ, 'ఇల్లా చేస్తే కాస్తేనా దయ కలుగుతుందేమో, దీనికి?' అనుకోని, మరనటిదినం సిగ్గుచేత, తల వంచుకుని, ఇంటి బయట నిల్చుని, 'హరయే నమః' అని అరచాడు. "ఇంతసేపటికా నే రమ్మనటం? వస్తూన్నాను కాస్త ఓపిక పట్టుంటే చావరు లెండి" అని లోపలవడ్లని దంచుతూన్నా విడకావలసి రోకల్ని పై కెత్తి వదిలేసి తలుపు తియ్యాటానికి రాబోతుంటే ఆరోక లామెనెత్తిన పడి బుఱ్ఱ పగిలింది. నెత్తురు వరదలుగట్టి పారుతోంది. ఇంకావిడని తిడుతూ బ్రాహ్మడు వీధి ఎత్తి పొయ్యేట్టు ఏడుస్తూంటే, ఇరుగుపొరుగు వాళ్లంతా వొచ్చి, ఆయనన్నడిగితే ఆయన జరిగిందంతా చెప్పాడు. ఆ వచ్చినవాళ్లు 'లోప లేం హాడావిడి జరిగిందో' అని తలుపుల్ని బద్దలుగా కొట్టి, రోకలి దెబ్బకి మూర్ఛబడ్డ ఆమెకి కాస్త తెలివొచ్చేలా గుపచారాల్ని చేసి, "ఆ బ్రాహ్మడి పెళ్లాంలా గ పతివ్రత ననిపించుకోవాల్నని, లోపల మొగుణ్ణి చీవాట్లెట్టి, అక్షయపాత్ర చేతి కిచ్చిపంపిందీవిడ. పులిని చూసి, నక్క వాతెట్టుకుంటే వాళ్లు కాలటమే గాని పులౌతుందా?' అని ఒకళ్లకొకళ్లు చెబుతుంటూ, వాళ్లవాళ్లిండ్ల కెళ్లారు. ఆయనగూడా 'ఈనీచపుముండతో సంసారం చెయ్యటానికంటే బైరాగుల్లో కలిసిపోవడంమే' లనుకొని, మూట చంక నెట్టుకొని తక్షణమే బయల్దేరా డెక్కడికో. కొన్నాళ్లకి కాగియ్యాళిగంప, కూటికి గతి లేకపోవటంచేత, 'హరయే నమః' ప్రారంభించి, కాలా న్నెళ్లబుచ్చుకొంది. కథ కంచికీ, మనం యింటికీ.

---

## అతి తెలివి

శ్రీమతి పి. రత్నమాలగారు

ఓ వూళ్లో భార్యాభర్తలు ఉండేవాళ్లు. వాళ్లదగ్గర సుబ్బన్న అనేపనివాడుండేవాడు. ఓనాడు భార్యాభర్త లిద్దరూ రెండు కుర్చీలు వేసుకుని కూర్చున్నారు. ఇంటియజమాని నౌకరుని పిలిచి 'ఒరేయి సుబ్బన్నా, సోడాబుడ్డి కొట్టి తీసుకురా' అన్నాడు. సుబ్బన్న వీధిలోకి వెళ్లి మంచి రాయి ఏరి తెచ్చుకుని సోడాబుడ్డి క్రింద బెట్టి దాన్ని సరిగ్గా రెండుముక్కలు చేసి రెండు గాజుప్లేట్లలో పెట్టి తెచ్చి యజమానికీ, యజమానురాలికీ అందించేడు. వాళ్లది చూచి నవ్వటం మొదలెట్టారు. తరువాత వాణ్ణి దగ్గరకు పిల్చి సోడా కొట్టమంటే యిలా కాదని బుడ్డి తెచ్చి కొట్టి మోస్తరు నేర్పారు.

ఓ రోజున సుబ్బన్న అమ్మగారి దగ్గరకి వచ్చి అంగడికి వెళ్లమంటారా అని అడిగేడు.

ఆవిడ పనిచేస్తూ విసుగ్గా వుంది. దానికి తోడు పెనిమిటి డబ్బు చేతి కివ్వకుండా బయట స్నేహితులతో మాట్లాడుతున్నాడు. అందుకని ఆవిడ 'మీఅయ్యగారు డబ్బు యివ్వనూలేదు, ఏమీ లేదు. నే నేం తెప్పించేది నా మొహం' అంటూ విసుక్కుంది. అంతా విని సుబ్బన్న తిన్నగా అయ్యగారి దెగ్గిరకి వెళ్లి, 'మీకు బుద్ధివున్నదా లేదా? యింట్లో డబ్బు యివ్వకపోతే కూరగాయలు యెలా తెచ్చేది? కొంచెమయినా మీకు బుద్ధి లేకపోతే యెల్లాగ' అంటూ పది మందిలోనూ ఝూడించేడు. యజమాని తెల్లబోయి లేచి యింట్లోకి వెళ్లి, 'నీ విలా అనమన్నావా' అంటూ భార్య నడిగాడు. ఆవిడ 'నేను చెప్పలే' దనింది. యిక నెప్పుడూ యిలాంటి అధిక ప్రసంగములు చెయ్యవద్దని వాణ్ణి మందలించేరు.

కొన్నిదినాలు గడిచినతరువాత వాళ్ల మ్మాయి పుష్పవతయింది. ఆసంగతి బయట కూర్చున్న భర్తగారికి చెప్పి రమ్మంది యింటావిడ సుబ్బన్నతోటి. వాడు మెల్లిగా యేడుపురాగం తీస్తూ అయ్యగారిదగ్గరకి వచ్చేడు. 'ఏం జరిగిందిరా' అంటే చెప్పడు. యేడుపు సాగించాడు. ఆఖరుకి యెంతో కష్టంమీద 'అ-అమ్మాయిగారు' అంటూ వాక్యం పూర్తి చేసేడు. ఇదంతా విని యజమాని 'వొరేయి, యిది శుభవర్తమానం, యిలాంటప్పుడు యేడవకూడదు. పైగా యిక్కడ వున్న వారికి చందనము, పువ్వులూ యిచ్చి మర్యాదచేయా'లని చెప్పేడు.

మళ్లీ కొన్నిరోజులుకి అయ్యగారితల్లి దొడ్లో బావిలో కాలు జారి పడింది. ఆసంగతి పెనిమిటితో చెప్పి త్వరగా పిల్చుకు రమ్మంది అమ్మగారు. ఈసారి పకపకా నవ్వుతూ బయల్దేరాడు. 'ఎందుకు నవ్వుతావురా' అంటే చెప్పడు. ఇలా ఓగంటయిన తర్వాత 'హ హ హ, ముసలమ్మగారు' అని నవ్వటం; ఎలాగయితే నేం వర్తమానం పూర్తిచేసాడు.

యజమాని యింట్లోకి పరుగెత్తాడు. ఇంతట్లోకి చందనము, పువ్వులూ పట్టుకొచ్చి అక్కడ వున్న పెద్దమనుష్యులకి యివ్వటం మొదలెట్టాడు సుబ్బన్న. అక్కడ ముసలమ్మగారి ప్రాణం పోయి వాళ్లేడుస్తూంటే యిక్కడ అందరికీ మర్యాద చేయటం. ఈ అతితెలివిగల పనులన్నీ చూచి వెంటనే తన నౌకరుని పనిలోంచి తీసి పారేశాడు.

కథ కంచికి వెళ్లింది. మనమింటి కొచ్చాం.

---

# పాత పాటలు – ౨

టేకుమళ్ల కామేశ్వరరావుగారు

## (4) ప్రాపంచికోక్తులు (Aphorisms)

ఒంటి పుట్టిం దమ్మ వుగ్రంపుతెగులు
అడివిమందులు తిన్న అది కుదరదాయె. ౧

అమ్మ పెట్టిన్న అన్నమ్ముకన్న
భార్య పెట్టిన్న బలుసాకు మేలు. ౨

పెళ్లామంటే బెల్లమురా
తల్లి అంటే దయ్యామురా. 3

అత్త లేని కోడ లతిముద్దరాలు
కోడలు లేనత్త గుణవంతురాలు. ౪

హింస చేసినవాఁడు హింస తా బొందు. ౫

అడుచుగోను పొడుచుగోను ఆడవారినంతు
కూచుని భోంచెయ్య మొగవారివంతు. ౬

దంచక్క నలగనే ధాన్యరాసుల్లు
వంచక్క వంగరే వనిత కోడల్లు. ౭

ముద్దు చేసిన కుక్క మూతిని నరచు
చనువు చేసిన ఆలి చంకను యెక్కు. ౮




పనివాడు :—ఈవేళ వర్షానికి రోడ్డుమీద జారి తానేపోయని భయపడ్డాను.




"జారిపడగలవు, జాగ్రత్త" అను విషయమును గూర్చి వ్రాయమనగా మా చిత్రకారు డీ చిత్రమును వ్రాసిపంపెను.




## గాజు గొట్టములయు, పూసలయు తెరలు

కొ. నరసింహాచారిగారు

౧

ఇచ్చట గాజు గొట్టములతోను, పూసలతోను సులభముగా తెరలను, తోరణములను కుట్టుట చెప్పబడియున్నది. ఇందులకు నిడుపాటి నాడాయును, పూసలును, గొట్టములును, గట్టి దారమును సూదియు కావలసియున్నవి. అంగడియందు దొరకు గొట్టములు ఒకే పొడవు గలవిగా నున్నను, వాటిని మన ఇష్టాను సారము కోసికొనవచ్చును. (చిత్రము ౧౦.) గొట్టమును కత్తితో గాని, ఆకు రాతితో గాని (file) కొంచెముగా కోసి, విరిచినయెడల తునుక లగును.

ఒక సిమపైన నాడాను దీసికొని, (చిత్రము 1. a b c d) దాని యొకకొననుండి e f అను మధ్యభాగమున దారపువరుస వచ్చునట్లు కుట్టవలెను. గొట్టములను కుట్టుట ముగిసినవెనుక నాడాను e f నకు సరిగా మడిచి (చిత్రము 2) నాడాయొక్క అంచులను కుట్టిన యెడల e f మరుగుపడును.

నాడాయందు కుట్టు పూసల వరుసలు దగ్గర దగ్గరగా నుండినయెడల చిత్రము 3, 4, 5 లందు వలె నానావిధములగు ముగ్గు లేర్పడును.

మొట్టమొదట నొకసూదియందు పొడవగునట్టి దారమును దీసికొని, దారపుకొనను, నాడాయందు (చిత్రము 1. e) ఒకకొనయందు ముడివేసికొని దారమును నాడాకు క్రిందిభాగమున దీసికొనవలెను. పిమ్మట దారముపై (చిత్రము 3 చూడుడు) నొకపూసయు నొక గొట్టము, ఒక పూసయు నొక గొట్టమువంతున దూర్చవలెను. ఈవిధమున మనకు గావలసిన తెరయొక్క నిడివికి కావలసినన్ని దూర్చి [illegible] వరుస పూర్తియైన వెనుక దానికొనయందే దారమును, ముడవేయక ముందు దూర్చబడిన పూసలగుండా వెనుకకు దూర్చుచు ప్రారంభించిన e వద్దకు చేరినయెడల పూసలయందు రెండుదారముల వరుసలు ఏర్పడుట వలన తెరకు బలము నిచ్చును. ఇట్లు చేయుటకు, కడపట దూర్చబడిన పూసను చుట్టి, దారమును, ఆపూసకు వెంబడిగా పైనుండు గొట్టముగుండా దూర్చుకొనవలెను. (చిత్రము 6. f, g చూడుడు.) తర్వాత దారమును e

నుండి పాతిక యంగుళములదూరమున నాడాకు క్రిందుగా దీసికొని, రెండవ వరుసకు గాను మొదట రెండుపూసలు, ఒక గొట్టము,తర్వాత నంతయు ఒక పూసయు ఒక గొట్టము వంతున దూర్చుచు రావలెను. వరుసను ముగించుట, మొదటివరుస విధముననే. మూడవ వరుస యందు మొదట మూడు పూసలును, తర్వాత నంతయు ఒక గొట్టమును, ఒక పూసయు దూర్చుచు రావలెను. నాలుగవ వరుసకు మొదట నాలుగు పూసలును, పిమ్మట ఒక గొట్టము, ఒక పూస వంతున దూర్చుకొనవలెను. అయిదవ వరుసకు మూడవ వరుస



యందువలెనే పూసలను, గొట్టములను దూర్చ వలెను ఆరనవరుసను రెండవ వరుసవలెనున్ను, ఏడవ వరుసను మొదటి వరుసవలెనున్ను కుట్ట వలెను. తక్కిన వరుసల నన్నిటిని మరల మొదటి విధముననే కుట్టవలెను. పూసల యొక్కయు, గొట్టముల యొక్కయు రంగును బట్టికూడ అనేకవిధములగు ముగ్గుల నేర్పఱచ వచ్చును. చిత్రము 4, 5 లందు మఱి రెండు విధములగు తెరలు చూపబడియున్నవి. తెరల కన్న తోరణములు వెడల్పునందు తక్కువగా నుండుటతప్ప వేరు భేదము లేదు. చిత్రములు 6 మొదలు 8 వఱకు, ప్రతివరుసను కొన యందు ఒకటి గాని, మూడు గాని,అయిదు గాని పూసలను పెట్టి ముగించువిధమును చూపును కొనలందు మూడుపూసలు కావలె నన్న, కడ పటి గొట్టమునకు తర్వాత దారమునందు మూడు పూసలను దూర్చుకొని (చిత్రము 7. h) మరల పైగొట్టముగుండా (7. i) దూర్చుచు పైనాడాను చేరవలెను. ఇదేవిధమున అయిదు పూసలు కావలె నన్నను చిత్రము 7. j. k. యందలి విధమున కుట్టవలెను. కొనలయందు పూసలకు బదులుగా, ఉల్లుదారమును కుచ్చు లుగా కట్టవచ్చును. ఉల్లును చిన్నతునుకలుగా కత్తిరించుకొని (9. l. ) వాటినడుమ గట్టిగా కట్టి, (9. m ) కుచ్చుగా చేసికొని, దానిలో, పూసలనుండి వచ్చు దారమును దూర్చి లాగు కొని, ముందు చెప్పినవిధమున కుట్టినయెడల (1. n) కొనయందు కుచ్చు ఏర్పడును. (ఇంకను వేరువిధములగు తెరలను కుట్టురీతులు ముందు ప్రచురించబడగలవు.)

---




"నిలబడుటకు కాళ్లయినా లేవు" అను విషయ మునుగూర్చి వ్రాయమనగా మా చిత్రకారు డీ చిత్ర మును వ్రాసిపంపెను.

("డెయిలీ స్కెచ్చ్" పత్రికయందలి హాస్యచిత్రము ననుసరించి.)

---




న. ౧. రెండుహంసల చిత్రము. మొదటి బొమ్మయందు చూపినరీతి చుక్క లుంచవలెను. రెండుచుక్కలతో మొదలు పెట్టి, రెండవవరుసయందు నాలుగు, మూడవదానియందు ఎనిమిది, నాలుగైదులయందు పంద్రెండు—ఇట్లు పెట్టవలెను. చుక్కలు కలుపుటకు ముందు ౨-వ చిత్రము బాగుగ గమనింపదగును. 3-వ చిత్రమున హంసల ముగ్గు పూర్తియైనది.

న. ౨. ఇది ఒక చిన్నయింటి బొమ్మ. ఇది మొదటివరుసయందు రెండుచుక్కలతో ప్రారంభమై, ఆరవ వరుసయందు పంద్రెండు చుక్కలలో పూర్తి యగును. చుక్కలు జాగ్రత్తతో నేర్పఱచి, స. ౨ లోని రెండవ బొమ్మను భద్రముగ గమనించుచు గీతలు కలుపవలెను. 3 వ చిత్రమున ఇంటి ముగ్గు పూర్తియైనది.

స. 3. ఇది ఒక కొబ్బరిచెట్టు—కల్పక వృక్షము. చుక్కల సాయము లేకుండగనే మరల మరల గీసి అభ్యసింపవలసిన ముగ్గిది. మొట్టమొదటి మెట్టు తెలిసికొనుటకు మొదటి బొమ్మ తోడ్పడును. క్రమాను తొలుత వ్రాసి తక్కినది తరువాత వ్రాయవలయును.

# సతీస్మృతి

మాధవపెద్ది బుచ్చిసుందరరామశాస్త్రిగారు

నాఁడే కాదు సతీవియోగ, మిప్పుడైనన్ జ్ఞప్తికిం బాఱినన్
నాడీ మండల మెల్ల బగ్గుమని మండంజొచ్చుఁ, బ్రాణంబు ల
ల్లాడన్ సాగుఁ, గుఠారధారఁ దల వ్రయ్యన్ వేసిన ట్లుండు, నీ
రేడున్ లోకము లస్తమించిన విధంబై తోఁచుఁ జిత్తమ్మునన్.

నను వంచించెను గాని పాడు నరజన్మం బిచ్చి దైవంబు, మిం
టను బాఱం గలయట్టిపిట్ట నయి యున్నన్ నాబహిఃప్రాణ ముం
డిన లోకంబున కట్టె నే నెగిరిపోనే యెన్నఁడో, యింకఁ బా
ఱిన యీ వ్యర్థపుజీవనం బను నెడారిన్ యాత్ర సాగింతునే?

సతి యన్ దివ్యసువర్ణపక్షముల నీస్థానంబు గుర్తింప, నా
యతమై నాదు మనోవిహంగ మిదె యూహాకాశవీథినము
ద్గత మయ్యెన్ దురదృష్టవాతహతి భంగం బందునో, లేక సం
తత చింతాపరిపాకశక్తిఁ, గృతకృత్యంబౌనో! ప్రాణేశ్వరీ!

జడమై నిర్వికృతిన్ వహించు నొక పాషాణంబ నై యున్నచో
నడలం బోదునె! నే సతీమరణదుఃఖాఘాతపాతవ్యథన్
బడి యీరీతి దినక్రమప్రశమిత స్నానాన్నపానుండ నై
కడ కస్డ్ఢప్పు దివానిశాయుగ విభాగ జ్ఞాన శూన్యుండ నై.

ఉన్నట్లుండి మనం బొకొక్కయెడ విద్యుద్వేగ పూఁచుండు నీ
సాన్నిధ్యమ్మున కేఁగుదెంచుటకునై స్వర్గంబునందైన నీ
వున్నావో మఱి లేవో యంచు నటుపై నుయ్యాల లా గూఁగు, ని
ర్భిన్నం బౌ నొకవేళ, నొక్కపుడు నిర్వేదమ్ము సెందున్ సఖీ!

మెడ పై కెత్తి యొకానొకప్పుడు శరన్మేఘమ్ములం గాంచి, నీ
పొడ నేమే నెఱిఁగించునేమొ యని నే బుద్ధీంద్రియక్షోభతో

నడుగన్ ; చూచెద మెన్నొ చుక్కల ననంతాకాశమందైన నె
క్కడ నీచక్కనిచుక్కఁ గాన మనుసంజ్ఞన్ దెల్లవోవున్ సఖీ!

తెలుపంబోలని యీహృదంతరదహత్తీవ్రాగ్నిహోత్రమ్ము శాం
తిలఁ జేయన్ దిరుమంత్ర మిప్పుడు చితాగ్నిజ్వాలయే గాని, వం
తలునుం జింతలు సుంత గా వనుట తథ్యం "బుష్ణ ముష్ణేన శీ
తల" మన్ వాక్యగతార్థ మిప్పటికి బోధం బయ్యె నాత్మేశ్వరీ!

నిను డేఁ గన్నులఁ జూచుచుండఁగఁ, జితాగ్నిజ్వాలికా మాలికాం
తరతప్తం బొనరించి నీతనుసువర్ణం బందుఁ జెన్నొందు సుం
దర తేజంబు హరించి దైవము శ్మశానక్షోణిలో నిల్పె నా
కొఱకై బూది, హరించె వాయు వదియున్ గోరంత లేకుండఁగన్.

ఆకాలంబు గతించె నాసుఖ మదృశ్యంబయ్యె నా ప్రేమపుం
జోకల్ పోకలు దృగ్విలాసనటనల్ శూలాయమానంబులై
తాఁకం జొచ్చె క్షణక్షణంబు హృదయాంతర్నాళజీవాణు లె
ట్లా కంపించుచునున్నవో యెఱుఁగవా! హా! నామనోవల్లభా!

మరణానంతరమందు నింక నొకజన్మం బెత్తితో మాపయిన్
మఱి నీకుం గల ప్రేమపుం బెఱపెఱన్ మామధ్యనే యెప్పుడున్
దిరుగంజొచ్చితొ లేక యాయొడలితోనే నీవునుం దీఱితో
పరలోకమ్మును జేరితో తెలియుత్రోవం జూపు మాత్మేశ్వరీ!

మురిపెంపుం బసిబిడ్డలన్ విడిచి నీమూలంబునన్ సాగుకాఁ
పుర మధ్వాన మొనర్చి యాదినమునన్ బోలేక పోలేక తీ
వరమా వేదననుండియున్ గనులతో భాషించి యేకోర్కె నా
కెఱుఁగంజేసితి దాని నేమఱతునే యేనాఁటి కాత్మేశ్వరీ!

కడుపుం దీపియు గాఢమైన యనురాగం బేకమై మాటికిన్
విడుప్రత్యశ్రుకణంబునందుఁ బ్రతిబింబింపంగ సంతాన ము
న్నెడకున్ నాయెడ కక్షిగోళముల నీ విట్టట్టులం ద్రిప్పి చూ
చెడు నీయా కథసారిచూపెనను మంచెన్ నేఁటిపర్యంతమున్.

అతి శీఘ్రంబుగ నస్తమించె నొకసంధ్యాకాలపుం జుక్కరుం
బ్రతిమై కన్నులపండువైన మన దాంపత్యంబు కానీ భవ
త్ప్రీతి నగ్నిన్ బైపొర యెల్ల నూడి పడిపోవంజేసి సంపూర్ణాభి
న్నత లేకుండ ననంతమం బెపుడు లీనంబౌచు నాత్మేశ్వరీ!

కుడిచనుబాలు ద్రావు పసికూనను వానియనుంగుఁ దల్లి చా
నెడమకుఁ ద్రిప్పి చన్గుడువనిచ్చుచు నంతటిలోన బిడ్డ యె
వ్వడువునఁ బోరుపెట్టుఁ బ్రతి ప్రాణియు నట్టులె యీప్రపంచముర్
విడి పర మేఁగు నా నడుమవేదనపాలగుఁ గాదె ప్రేయసీ!

---

# టెహ్రీ రాజ్యము

సాగి వెంకటనరసింహం గారు, యం. ఏ

"అస్త్యుత్తరస్యాం దిశి దేవతాత్మా హిమాలయో నామ నగాధిరాజః"

శ్రీ జ్ఞానానందస్వామివారికి నా యందున్న అపారకరుణావిశేషముచే శ్రీవారితో ఈ 'టెహ్రీ'కి రాఁగలిగితిని. ఈ హిమవత్పర్వత మహత్తరదృశ్యములను జూచినతరువాత అవర్ణ్యమును, కేవలాద్వైత పరబ్రహ్మానందసంధాయకమునైన ఈప్రాంతమును గూర్చి లిఖించుటకుఁ జేయాడదు. అయినను నా నేర్చినట్లు వ్రాయుదును.

టెహ్రీ ఘుర్వాల్ రాజ్యము హిమాలయమునందు నేపాలరాజ్యమునకుఁ బశ్చిమమునందున్నది. దీనిప్రస్తుత వైశాల్యము ౪,౦౦౦ చ. మైళ్లు. జనసంఖ్య 3,౬౦,౦౦౦. కొన్నిసంవత్సరముల క్రిందట నేపాలరాజుతో టెహ్రీరాజు యుద్ధము చేయవలసివచ్చినపుడు బ్రిటిషువారు సహాయము చేసినందున ఘుర్వాల్ రాజ్యములోఁ గొంతభాగము బహుమతిక్రింద వారికి లభించినది. ఇట్లు లభించినదానికి బ్రిటిష్‌ఘుర్వాల్ అని పేరు. బ్రిటిష్‌ఘుర్వాలునందు బద్రీనాథ్, కేదార్‌నాథ్, మొదలగు పుణ్యక్షేత్రములు గలవు. టెహ్రీ ఘుర్వాల్ సంస్థానదేశమునందు గంగోత్రి, ఉత్తరకాశి, యమునోత్రి, గోముఖకైలాసము మొదలైన పుణ్యక్షేత్రములు గలవు. ఈరాజ్యము మహారాజావారు, కార్యనిర్వాహక సభ, శాసనసభల సాహాయ్యమువలనఁ బరిపాలించుచున్నారు. మహారాజుగారి పేరు నరేంద్రషా. వీరితండ్రి కీర్తిషా. తాతగారి పేరు ప్రతాపషా. ఈరాజ్యమునకు ముఖ్యపట్టణము టెహ్రీ గంగాతీరమున నున్నది. దీనికిఁ జుట్టు అత్యున్నతములైన పర్వతములు గలవు. ఒకపర్వతముపై ప్రతాపనగరమను పేరుగల మహారాజుగారి వేసవికాలపు విశ్రమస్థానము గలదు. టెహ్రీలో రాజభవనములు, రాజ్యకార్యస్థానభవనములు, అధికారుల భవనములు, ఉన్నత పాఠశాల, క్లాక్‌టవర్, దుకాణములు, తదితర భవనములును గలవు. ఈయూరి కొకవైపున గంగానది, మఱియొకవైపున గంగలోఁ బడుచున్న భిల్లాంగనానదియుఁ గలవు. పాతాళలోకమున నున్నట్లు మిక్కిలి లోఁతున సన్నగా గంగ ప్రవహించుచున్నది. గంగానదిపైన హేంగింగ్ బ్రిడ్జి ఒకటి గలదు. ఇచ్చట మహోన్నత పర్వతములనుండి వచ్చునదులు మహావేగముతోఁ బ్రవహించుచుండును. భిల్లాంగనానదీతీరమున సమాధిగతుఁడై నదియందు నిర్యాణముఁ జెందిన స్వామి రామతీర్థగారినిఁ బ్రస్తుతపు మహారాజుగారి తండ్రిగారు మిక్కిలి పూజించుచుండిరఁట. ఇచ్చటిరాజులు, ఉద్యోగస్థులును, ప్రజలును అతివినయభక్తితాత్పర్యములతో మహాత్ముల సేవఁ జేయుచుందురు. సర్వవిధముల యుక్తస్థానము గనుకనే



శ్రీ జ్ఞానానందస్వామివారు

దీనిని శ్రీజ్ఞానానందస్వామివారు తమ తపోభూమిగ గ్రహించియున్నారు. శ్రీస్వామివారియందుఁ బ్రస్తుత మహారాజుగారత్యంతభక్తి గలవారు. (నరేంద్రషాగారి తండ్రిగారు వీరిచిన్నతనమునందే చనిపోయినందున,

వీరితండ్రితల్లి కొంతకాల మీరాజ్యమును బాలించిన దఁట. ఆమెయే తనభర్త చనిపోయినప్పుడు తనకుమారుఁడు చిన్నవాఁడుగ నున్న సమయమునఁగూడ నీరాజ్యమును బరిపాలించినదఁట.) ఇక్కడ రివిన్యూ మెంబరు, లా మెంబరు మొదలగువారి వినయము, భక్తి, గౌరవము, ఔదార్యములముందర మనదేశములో నున్న ఉద్యోగస్థులగుణములు లెక్కకు రావు.

ప్రజలు మిక్కిలి చక్కనిశరీరచ్ఛాయగలవారు; పొట్టివారు; అమాయకులు; సజ్జనులు. స్త్రీలుకూడ సుందరముగను, పొట్టివారుగను దృఢకాయములు గలవారుగను నుందురు. స్త్రీలు పులులను, ఎలుఁగుబంట్లను రాయి తీసికొని ముఖము పగులఁగొట్టు శక్తిగలవారఁట. ప్రజల జీవనము కడు కఠినమైనది. రిట్టనిడుపుగల వేలకొలఁది అడుగుల యెత్తుగల పర్వతములపైఁ బైరుపంట లేమగునో మీరే యూహింపవచ్చును. అట్లే కష్టించి కొండప్రక్కలను వేలకొలఁది అడుగుల ఎత్తుగల శిఖరములపైనను, వేలకొలఁది అడుగుల లోఁతుగల లోయలయందును కొండవాఁగులకు మడవలుకట్టి సేద్యము చేయుట దుర్ఘటము కదా? ఇంత చేసినను నొక్కవాన వచ్చి పొలమంతయు నొక్కసారి కూలిపోవుచుండును. ఎద్దులు, మేఁకలు మనుష్యులవలెఁ బర్వతశిఖరముల నవలీలగ నెక్కును. అట్టిసమయమున నపాయములుగూడ తటస్థించుచుండును. ఇక్కడ ప్రజలలో మూఁడే జాతులు: బ్రాహ్మణులు, క్షత్రియులు, శూద్రులు. భోజనాభావముచే మొదటి జాతులును మాంసముఁ గూడ భుజించు నలవాటు కలిగియున్నారు. గృహములు దృఢములుగ నుండి రెండు మూఁడంతస్తులు సామాన్యముగ నుండును. క్రిందియంతస్తులోఁ బశువు లుండును. మొత్తముమీఁద ఇక్కడిమనుష్యులు మన కొండజాతులకంటెఁ బెక్కురెట్లు నాగరికత కలవారు, విద్యావంతులు, చక్కనివారు, సజ్జనులునై యున్నారు. ప్రభుత్వ మన్న వారికి భయభక్తులు మెండు. పోలీసువానికి గవర్నరునకు మనము చేయునంత గౌరవము వారు చేయుదురు. పురుషుల కాభరణములు లేవు. స్త్రీలకుఁ జిన్న గట్టి లావు పెండికంటెలు, ముక్కులకుఁ బెద్ద ఉంగరములు నుండును.

మా నడకప్రయాణము 'డేరాడూన్' జిల్లాలోని 'ఋషీకేశ్' దగ్గర ప్రారంభము. కాని 8 మైళ్లదూరమున కొండపై నున్న నరేంద్రనగరమువఱకు మోటారురోడ్డు వేయఁబడియున్నందున మేము మోటారుమీఁద నచటికి వెళ్లినాము మాసామానుమాత్రము మూఁడుకంచరగాడిదెలపైన వచ్చినది. ప్రస్తుతము రాజుగారు నరేంద్రనగరమునే ముఖ్యపట్టణముగఁ జేసినారు. ఇది ౨,౫౦౦ అడుగులయెత్తుననున్నది. మోటారుమీఁద వెంటనే క్రిందిమైదానముల లోనికి వెళ్లుటకు వీలుగనున్నది. ఇచ్చట రాజభవనములు, కార్యాలయములు, డాక్ బంగాళాయును గలవు షాపు లున్నవి. సామాన్యముగఁ బ్రజలయిండ్లు పర్వతములపై నుండును గాని మైదానములోను, ముఖ్యపట్టణములలోను నుండునది దుకాణదారులు, ఉద్యోగస్థులుమాత్రమే యై యుందురు.

శ్రీస్వామివారికి నరేంద్రనగరమునుండి దండీ (పాలకీవంటిది) యేర్పాటుచేయఁబడినది. మేము నరేంద్రనగరము చేరునప్పటికి సుమారు ౧౦ గంటలైనది. మాతోఁగూడ కాశీ విశ్వవిద్యాలయమునుండి వేసవికాలపు సెలవుల కింటికి వచ్చుచున్న లా మెంబరుగారి కుమారుఁడుగారును గలరు. వారికొఱకు నొకగుఱ్ఱ మేర్పాటుచేయఁబడినది. మాతోఁగూడ 'చప్రాసి' (బంట్రోతు) బయలుదేరినాఁడు. ఈయేర్పాటులన్నియు లా మెంబరుగారి యుత్తరువు ప్రకారము చేయఁబడినవి. మే మప్పుడే నరేంద్రనగరమునుండి బయలుదేరవలసివచ్చినది. 'ఋషీకేశ్' నుండి తెచ్చిన పూరీలు కొన్ని తిని, డాక్‌బంగళాయందు అతిథిసత్కారము చేయు ఉద్యోగి యిచ్చిన కాఫీనిగూడ గ్రహించి బయలుదేఱితిమి. 3 గంటలకు 'ఫకోడ్' డాక్‌బంగళాకుఁ జేరి అచ్చటఁ గొన్నిరొట్టెలు తిని సాయంత్రమునకు జాజల్ చేరితిమి. త్రోవలోఁ గొంతదూరము నేను గుఱ్ఱముమీఁద ప్రయాణము చేసితిని. నరేంద్రనగరమునుండి జాజల్ ౧౫ మైళ్లు.

ఇచ్చటి మార్గములు కడు విచిత్రముగ నుండును. ఎదురుగ వచ్చిన మనుష్యుఁడు గాని, పశువు గాని తొలఁగిపోవుట బహుకష్టము. సాధారణముగ ఒకానొక నది ననుసరించి మార్గ- ముండును. కొండప్రక్కన మన

మార్గమునకుఁ గొన్ని వేల అడుగులలోఁతున నదిగాని, వాగో ప్రవహించుచుండును. ఒకప్రక్కన నిట్టనిలువుగ వేలకొలఁది అడుగుల ఎత్తుగల పర్వతము లుండును. ఒకవేళ గుఱ్ఱముగాని, మనుష్యుఁడుగాని, జారిపడినయెడల చేతికి దొరకుట దుర్లభమని వేర చెప్పవలయునా? ఇచ్చటి గుఱ్ఱములు కడుజాగరూకతతో నడచును. తల తిక్కగుఱ్ఱ ముండినచో ఉండదు. ఉండిన ఒక్క క్షణములోనే దానికిని రౌతునకును స్వర్గప్రాప్తి యగును. పర్వతములపైన నెన్నిరకములగు చెట్లుండునో, చూచుట కెంత మనోహరముగ నుండునో, ఎంత చల్లనిగాడ్పులు వీచుచుండునో వాఁగులు పాతాళలోకమునందలి పాములవలె నెంతవింతగ మెలికలుతిరిగి ప్రవహించుచుండునో అనుభవించినఁగాని తెలియదు. ప్రతి క్షణమునందును ఎక్కడ ప్రారంభమగునో తెలియదుగాని మనోహరములగు ఊటకాల్వలు పర్వతములమీఁదినుండి వచ్చుచుండును. ఈ కొళాయిలకు ఆఁగిపోవుట లేనే లేదు. నిరంతరము మధురజలములు స్రవించుచుండును. బాటసారులకు హిమవంతుఁ డెన్నిచలిపందిరులను నిర్మించెనో చెప్ప తరము కాదు. ఇప్పుడే యిట్లున్న వర్షకాలమున నెన్ని విధముల నమృతము వర్షించునోగదా! మేము జాజల్ చేరునప్పటికి ౭ గంట లైనది. ఈప్రదేశములయందు సూర్యుఁడు ౫ గంటలకే కాన్పించకపోయినను వెలుఁగు మాత్రము గం ౮ లవఱకు నుండును. తెల్లవారుటగూడ ఉదయము నాలుగుగంటలకే అగును. పగ లింతదీర్ఘముగ నుండుటచేతను, శీతలముగ నుండుటచేతను బనిచేయఁదలఁచినవారికి నెంతటిపనియైనను నెఱవేఱును. విసుగుండదు. కాని యిచ్చట రైతులు కొంచెముసోమరితనమును వ్యక్తముచేయుదురు. హుక్కాకు వారికి కాలక్షేపమునకుఁ దోడునీడ. వారు పొలమును దున్నుటమాత్రమే చేయుదురు. స్త్రీలు ఎరువువేయుట, కలుపు తీయుట, మొక్కలు నాటుట, పొలము కాపాడుట, కోయుట, కళ్లములను జేసి గింజలనింటికిఁ దీసికొనివచ్చుట వఱకుఁ జేయుదురు. స్త్రీలు ప్రాతఃకాలమున లేచి కొండఊట నుండి జలములు తెచ్చి వంట చేసి భర్తకును, బిల్లలకును భుజింపఁ బెట్టి తాము భుజించి, పశువులు మొదలగు వానిని సవరించుకొని, అడవికిఁ బోయి కట్టెలు, గడ్డి తెచ్చి, మధ్యాహ్నపువంటకము చేసి ముగించి, భోజనము లైనతరువాతఁ బొలముపనిఁ జూచి వచ్చి రాత్రి మరల పాకము, భోజనము సమస్తమును సవరించుటఁ జేసి నిద్రింతురు. ఎక్కువసపాలమున్న పురుషు లెక్కువమంది స్త్రీలను వివాహ మాడుదురు. ఈస్త్రీపురుషుల కందఱకును సాధువులయెడ మిగులభక్తి యని యిదివఱకే చెప్పినాను.

జాజల్ లోయలో నది ప్రక్కన నున్నది ౩,౫౦౦ అడుగులఎత్తు. ఎటు చూచినను నెత్తయినపర్వతములు వృక్షపంక్తులతో నలరారుచు మనోహరముగ నుండును. చీఁకటి పడువఱకు మే మా ప్రకృతిదృశ్యమును గన్నులారఁ జూచితిమి. జాజల్ లో దుకాణము లున్నవి. మేము రాజాగారి అతిథులము గాన మా కొక చిన్న గదిని ఖాళీచేసి యిచ్చిరి. అందు చప్రాసి చేసిన రొట్టెలను భుజించి నిద్రించితిమి. మరల నుదయమున యథాప్రకారము ప్రయాణము. ఇచ్చటి చల్లగాడ్పులు స్నానము చేసినంత ఫలము నిచ్చును గావునను, మంచుకరఁగిన నదులనీళ్లతిశీతలమై అనారోగ్యకారణము గావచ్చును గావునను, వ్యాసులవా రిచ్చటివారికి స్నాన మవసరము లేదని చెప్పినారఁట. మేముగూడ వ్యాసప్రోక్తముగనే కొంతవఱకుఁ బ్రవర్తించుచున్నాము. భగవల్లీలావిశేషమగు సర్కసునందుఁ బ్రకృతివిచిత్ర మను దృశ్యమును జూచుటకుఁ జంచల యగు ధాన్యలక్ష్మి కూర్చుండుటకై యేర్పాటుగావింపఁబడిన మహోన్నతపు గేలరీలవలెనున్న కొండపొలముల నీక్షించుచు ౫ మైళ్లు నడచి అక్కడ కొండకాల్వదరిని రాత్రి మూటగట్టిన రొట్టెలను దిని, మరల "చమ్యా"కుఁ బ్రయాణమైతిమి. జాజల్ నుండి చమ్యాకు మొత్తము పదిమైళ్లు. ఇప్పుడు నడచిన ఐదు మైళ్లుగాక మిగిలిన ఐదుమైళ్లు. కొండ యెక్కుటయే. త్రోవలో నొకపర్వతము ఋషివలె జడలు విరియఁబోసికొని యున్నది. దానిని ఋషియే పర్వతమైనాఁడని చెప్పుదురు. స్వామివా రీపర్వతమును బరీక్షించి, ఇది అగ్ని పర్వతపు "లావా"వలన నేర్పడి యుండవచ్చునని నిర్ణయించిరి. అచ్చటచ్చట జలపాతములుఁ గాన్పించి

నవి. ప్రస్తుత మెండకాలము గావున నవి భయంకరముగ లేక అందముగ మాత్ర మున్నవి. ఇంతటి పుణ్యభూమి యం దుండియు ఒకసమయమున నా మనస్సు గృహాభి ముఖ మైనది. అదే సమయమున మాతో వచ్చుచున్న పోలీసుద్యోగి ఇట్లు గానము చేసెను:

"శుద్ధభూమి గతం తోయం
శుద్ధానారీ పతివ్రతా,
సంతోషం దేహి మే రాజన్
సంతుష్టో బ్రాహ్మణ శ్శుచిః.

అంతట నామన స్సేకాగ్రమైనది. మిట్టలెక్కుటకు మొదలు పెట్టినాము. కూలివాండ్రు గస పెట్టినారు. తుట్టతుదకు షుమారు ౧౦ గంట లగునప్పటికి ౮,౦౦౦ అడుగుల యెత్తున నున్న చమ్మా చేరి పోస్టుమాస్టరుహోదాగూడ వహించియున్న దుకాణదారుని ఇంటిలో విశ్రమించి నాము. బంగాళాలు కొంచెము దూరముగ నుండుటచే బద్ధకించి ఇచ్చటనే యుంటిమి. దుకాణములో నీగ లెక్కు వనుని చెప్పవలయునా? చమ్మాశిఖరము నుండి మాకు గంగోత్రి స్వచ్ఛహిమశిఖరములు గోచరించినవి. ఇక్కడి కవి ౧౨ మైళ్లదూరమున నున్నవి. ఆ పవిత్ర ప్రదేశముల కిక్కడనుండియే పరమభక్తితో నమస్కరించినాము. నాపాపపుదృష్టి వానిమీదఁ బడెఁగూడదని కాఁబోలు తెల్లనిమేఘములు కొంతసేపు వాని నావరించినవి. అయినను కర్పూరమును, పరిశుద్ధక్షీరములను, నవసుగను మించిన ధావళ్యముతో నాకాశశిఖరములు కనఁబడినవి. ౨౧,౧౧౦ అడుగుల యెత్తుననున్న ఆ శిఖరములను చూచినప్పుడు నాభావము లనంతోన్నతము లైనవి. చమ్మాకు సమీపమున ఐరోపామహాసంగ్రామ చిహ్నమొకటి నిర్మింపఁబడి యున్నది. ఆ కట్టడముపైన సేయూరినుండి యెందఱు యుద్ధమునకు వెళ్లినది, ఎందఱు మరణించినది, ఒకానొకరి పరాక్రమమును వర్ణించి వ్రాసినారు. శాసనము ఇంగ్లీషు, హిందీ భాషలలోనున్నది. మధ్యను వీరస్వర్గోత్కృష్టతఁ దెలుపుట కొక శ్లోకమున్నది.

'యస్య శోణితవేగేన వేదీ స్యా త్సంపరిప్లుతా,
కేశమాంసాస్థిసంపూర్ణా స గచ్ఛే త్పరమాంగతిమ్'.

చప్రాసి వండిన సూపసహితమైన వరియన్నము తిని మరల బయలుదేఱినాము. మధ్యాహ్నము ౨౪ గంటల సమయమైనను గాలి చల్లఁగనే యున్నది. నీడనుకూర్చున్నచో చలిగూడ బయలుదేఱును. చమ్మానుండి టెహ్రి ౧౨ మైళ్లు. కొంత దూరము వెళ్లునప్పటికి శ్రీస్వామివారికిఁ బూర్వము కొలఁదికాలము తపోభూమిగ నుండిన మురళీశ్వర శిఖరము కాన్పించినది. తరువాత మఱియొక పర్వతముపై ప్రతాపనగరభవనములు గోచరించినవి ౬ గంట లగుసరికి టెహ్రిపట్టణదర్శనము కన్నులపండు వైనది టెహ్రి చేరఁగనే లామెంబరుగారు మాకద్భుతాతిథ్య మొసంగిరి. వారిదయ యేమని చెప్పను, పి. డబ్ల్యు. డి. భవనములలో కాశ్మీర రత్నకంబళములు పరచిరి. నీళ్లకొళాయిలు, పాకకొట్లు, బల్లలు, కుర్చీలు, మంచములు, పక్కలు, సేవకులు ఇవి యవి యేల, అన్ని సౌకర్యములు మాకు లభించినవి. లామెంబరు గంగాప్రసాద్ గారు షుమారు నడివయస్సును మీరినవారు. చక్కని దేహచ్ఛాయ గలరు. కొంచెము పొట్టిగా నుందురు. స్మితాననము. వినయభూషణము, విద్యావైభవము, సంపద, సంతానము మొదలగు సర్వశుభలక్షణలక్షితులు. మన దేశపు కాయగూరలు లభింపని యీదేశమునకు నుత్తర హిందుస్థానము నుండి వానిని తెప్పించి, పర్వతముల మారుమూలలనుండి సమస్తపదార్థములను దెప్పించి మా కానంద మొనఁగూర్చిరి. వారికుమారులును గుణరూపశోభితులు. వారిహస్తములతోనే మాకు భోజనము వచ్చుచుండునది. రివిన్యూమెంబరుగారుగూడ భక్తిభావమునందు వీరికిఁ దీసిపోలేదు. పళ్లెరములయందు నుంపఁబడిన ఆహారమును రత్నకంబళములపైఁ గూర్చుండి భుజించుట హిందూస్థానాచారము. దేశకాలముల ననుసరించి ఆచారవ్యవహారములను కొంచెము దగ్గుకొనవలసి యుండును.

ఇచ్చట మేఘాచ్ఛాదనము కాఁగానే చలి ప్రారంభమగును. కేవల మెండకాల మగుటచేఁ బ్రస్తుతము చల్లఁగ నున్నది. అంత యెక్కువగ చలిలేదు. ఇక్కడికి ౯ మైళ్లదూరమున ౮,౦౦౦ అడుగులకంటె నెక్కువయెత్తున నున్న ప్రతాపనగరమున చలి మిక్కుటము.

గంగోత్రిప్రాంతములకు అంతకంటె చలి యెక్కువ. గంగోత్రిప్రజలు తమసంబంధములను మిక్కుటముగ చలి లేని దక్షిణదేశములోఁ జేసికొని, చలికాలమునందువచ్చి తమబంధువుల యిండ్లలో కాపురముందురు. స్వామివారి ఆరోగ్యముకొఱకు మేము ప్రతాపనగరము చేరినాము. ప్రతాపనగరము ౮,౦౦౦ అడుగులకంటె నెక్కువ యెత్తున నున్నది. ఇది టెహ్రీమహారాజుగారి వేసవి కాలపు ముఖ్యపట్టణము. ఇచ్చట రాజధానికి వలయు రాజభవనములు, కచ్చేరీభవనములు, బంగాళాలు, ఉద్యోగస్థుల గృహములు, సామాన్యులయిండ్లు మొదలగున వన్నియుఁ గలవు. ప్రస్తుతము మహారాజుగారు తమముఖ్యపట్టణమును నరేంద్రనగరమునకు శాశ్వతముగ మార్చి నందున నిచ్చటికెవ్వరును వచ్చుటలేదు. టెహ్రీపట్టణముగూడ క్షీణించి పోవుచున్నది. శ్రీ జ్ఞానానందస్వామి వారితోఁగూడ నుండవలెనను నుద్దేశ్యముతో ఛీఫ్‌జడ్జి హోదానుగూడ వహించిన లా మెంబరుగారు మహారాజాజ్ఞచే తమకోర్టును ప్రస్తుత మిచ్చటికి మార్చినారు. అందువలన కొలఁదిగమాత్రము జన మిచ్చట కనఁబడుచున్నారు. శ్రీస్వామివారికిఁ బ్రస్తుతనివాసమునకు హుజూరువారి కోర్టుభవనములోని కొన్నిగదులొసంగఁబడినవి.

అమోఘసర్వవిద్యాప్రవీణులగు కీర్తిశేషులైన, కీర్తిషాగారు దీనినిఁ గట్టించిరఁట. రత్నకంబళములు, సోఫాలు, కుర్చీలు, మేజాలు, అద్దములు, దీపములు వెలిఁగించువిచిత్రవిచిత్రపు గాజుసామానులు, చెక్కడపు పనిగల వెండి దంతము కొయ్యసామానులు, పులిచర్మములు, ఇవి యవి యననేల, మహారాజావారి కనుకూలములగు పదార్థము లన్నియు హుజూరుకోర్టుభవనమున నున్నవి. ఇట్టిభవనములలోనిగదుల నిచ్చట వింతగాదు. మహారాజుగారు స్వామివా రెచ్చట నుండఁదలఁచిన నచ్చటనెల్లను ననేకకుటీరములను, భవనములను నిర్మించియున్నారు. నిర్మించుటకు సిద్ధముగకూడ నున్నారు. ప్రస్తుతపురాజధానియందుఁగూడ జ్ఞానానందులపేర నొకభవనము నిర్మించినారఁట. మోక్షసామ్రాజ్యమును జూరఁగొనిన స్వామివారి కీచిన్నరాజ్యము స్వాధీనమగుట లెక్కయా? లా మెంబరును ఛీఫ్‌జడ్జియునగు గంగాప్రసాద్‌గారు సకలవిధములగు సౌకర్యముల నిచ్చట చేసినారు. ఈదేశమున రొట్టె, బంగాళాదుంపలు, ఆకుకూరలు, కొద్దిగ వరియన్నము ముఖ్యాహారములు. హిందూస్థానపద్ధతిని బల్లలమీఁదనే భోజనము. చింతపండు కారము లుపయోగించనే ఉపయోగించరు. ఈప్రదేశమీయెండకాలములోఁ గూడ మిక్కుటముగ చలిగ నుండును గావున స్నానముచేయుట కిచ్ఛ యుండదు. అతిశీతలమైన జలమును ద్రాగుట కంతకంటె నిచ్ఛయుండదు

ఇచ్చట ౧౦ గంటలు దాఁటినతరువాతఁ గొంచెమెండవచ్చును. అప్పుడుగూడ చలి విస్తారముగనే యుండును. కంబళ్లు, ఉన్నిచొక్కాలిక్కడ పరమబంధువులు ఇచ్చట తఱుచు మేఘములు పట్టుచుండును. మేఘము పట్టినతోడనే చలి దుర్భర మగును. మేఘము లింతలో వచ్చి ఇంతలో మాయమయి చిత్రవిచిత్రములు చేయుచుండును. సాధారణముగ నిచ్చటికి స్పష్టముగఁ గనఁబడవలసిన మంచుకొండల నీమేఘములు కప్పివేయుచుండును. ఇవి లేనిసమయము పండుగ. నిర్మలాకాశమునం దుత్తరదిక్కునఁ దెల్లనిగంగోత్రిశిఖరములు కన్నులపండువగును. ఆపర్వతములు చాందినివెండి కరఁగి బహువిచిత్రముగ ననేకత్రిభుజములు పర్వతాకారములుగఁ బోఁత పోసినట్లుండును. ఆమహోన్నతశిఖరముల పైని మంచు కోట్లకొలఁది సంవత్సరములనుండి కరఁగియెఱుఁగదు. ఈప్రాంతముల నరణ్యములు దట్టముగ నున్నవి. ఇక్కడ పెద్దపులులు ఎలుఁగుబంట్లు విస్తారము. ప్రమాదకరములు కావు గాని ఎలుఁగులు మాత్రము బహుక్రూరమైన జంతువులఁట. అవియైనను ఇద్దఱున్నప్పుడు పాఱిపోవుచుండును. ఒక రున్నప్పుడు పైఁబడునఁట. పెద్దపులులు సాధారణముగఁ గాన్పించవు. ఊరకున్న మనుష్యులజోలికి రావు. ఈప్రదేశము తపస్సునకతినిర్మలమైనది, నిర్బాధమైనది, నిరుపమానమైనది.

ఈప్రతాపనగరమునుండి నేనొకఁడనే గంగోత్రికి వెళ్లివచ్చితిని. టెహ్రీనుండి కాని ప్రతాపనగరమునుండి కాని గంగోత్రి సుమారు ౧౦౦ మైళ్లదూర ముండును.

విశ్రమస్థానములలో నాఁగుచు, వంటచేసికొని భుజించుచు వెళ్లవలెను. కొండలు బాగుగ నెక్కఁగలవారు రోజునకు ౨౦ మైళ్లు వెళ్లవచ్చును. టెహ్రీనుంచి 'భళ్యాణ' చట్టి ౧౧ మైళ్లు. చట్టి యనఁగా విశ్రమ స్థానము. ఇచ్చట దుకాణమును సత్రమును నుండును. కాలీ కమ్లీ వాలాసత్రములలో నుత్తరువు పొందిన సన్యాసులకును, బీదలకును స్వయంపాకము లిచ్చెదరు. తదితరులకు వంట పాత్రల నిచ్చెదరు. సత్రములు లేనిచోట దుకాణదారుడే వంటపాత్రల నిచ్చి వసతులను జూపించును.

నాకు లా మెంబరుగారివద్దనుండి యధికార పత్రముండుటచే సత్రాధికారులును, దుకాణదారులును, ఉద్యోగస్థులును ప్రజలును కావలసిన యేర్పాటులను జేయుచుండిరి. అధికారపత్రము లేకున్నను శ్రీజ్ఞానానందులపేరు చెప్పినచో మన కెన్నఁటికి నిచ్చట లోటు లేక సత్కారము జరుగును. స్వామి నెఱుఁగనివారును, సేవింపనివారు నిచ్చట లేరు భళ్యాణనుండి యొకయటవీ శాఖాధికారి నాకు గుఱ్ఱమొసంగినందున మొదటి రోజు నేను టెహ్రీకి ౨౬ మైళ్లదూరమున నున్న "ధరాసు" చేరఁగలిగితిని. 'ధరాసు'నకు ౮౫ మైళ్లదూరమున 'యమునోత్తర'యు, నుష్ణకుండములును గలవు. నే నచ్చటికి వెళ్లక గంగాతీరముననే ధరాసునకు ౧౫ మైళ్ల దూరమున నున్న 'ఉత్తరకాశి' మఱునాడు చేరి డిప్యూటీ కలెక్టరుగారి యాతిథ్యమును స్వీకరించితిని. ఉత్తర కాశియందు గంగ యుత్తరవాహిని. పెక్కురు తపస్వులును గలరు. తపస్వుల కాహారమిడు 'కాలీకమ్లీవాలా' సత్రము గలదు. గంగోత్రి ప్రాంతప్రజ లీ ప్రదేశమున చలికాలమున నివసింతురు. ఉత్తరకాశిలో నున్న మహాత్ములలో జ్ఞానానందగురువు లగు పూర్ణానంద స్వాములొకరు. ఆయనంత తేజోనిధితో సంభాషించు భాగ్యము నాకుఁ గలిగినది.

ఉత్తరకాశినుండి "భట్వాడి" ౧౫ మైళ్లు. మఱునాఁడు సాయంతనము చేరఁగలిగితిని. భట్వాడినుండి బద్రీకేదారములకు మార్గము గలదు. గంగోత్రి వెళ్లిన యాత్రికులు తిరిగి భట్వాడిమీఁదుగ బద్రీకేదారములకు వెళ్లుట యాచారము. భట్వాడినుండి గంగనాణి ౯ మైళ్లు. గంగనాణివద్ద నుష్ణకుండములు గలవు. అతిశీతలమగు గంగాజలములోని కత్యుష్ణమగు గంధకజలములు ప్రవహించుటఁ జూడ చిత్రముగ నుండును. ఇచ్చట నుష్ణకుండములలో సలసల కాఁగు నీటినుండి గోరువెచ్చని నీటివఱకు ననేకరకములు గలవు. అచ్చట నెంతసేపు స్నానము జేసినను దనివి తీరదు.

గంగనాణినుండి "సుక్కి" ౯ మైళ్లు. ఇచ్చట మార్గము దుస్తరమైనది. గంగయొడ్డున కొండలు విఱిగి మార్గమున కడ్డముగఁబడినవి. ఈరాళ్లలోనుండి వెళ్లఁజాలక గంగనీటిమట్టమునకు దిగి మరల కొండల నెక్కవలసివచ్చును. ఒక్కొకచోట గంగపై నంతెనలు సరిగ లేనందున పిడికిటప్రాణము లుంచికొని నడవ వలెనుండును. ఇట్లు ౩ మైళ్లు వెళ్లుసరికి నాకుఁ గొందఱు యాత్రికు లెదురైరి. వారు సుక్కినుండి ౬ మైళ్లు కొండలెక్కివచ్చి యలసియుండిరి. వారిలో నొకయామె నన్ను ముందుచట్టి యెంతదూర మున్నదని యడిగెను. నేను మూఁడుమైళ్లు పర్వత మెక్కుటవలన నలసిపోయి దూరము నిర్ణయించలేక, "౫ మైళ్లు" అంటిని. "అయ్యో! ఇంకను ౫ మైళ్లే! అబద్ధము అబద్ధము" అని యామె యఱచెను. "నిజము నిజము; ౫ మైళ్లు" అని మరల నంటిని. కొంతదూరము పోయి చూచునుగదా ౮ వ మైలు రాయి కనుపడినది. ప్రయాణికుల కొకమైలు తక్కువ చెప్పి ప్రోత్సహించవలెను గాని యెక్కువ చెప్పి నిరుత్సాహపఱచఁగూడదని యప్పటినుండి గ్రహించితిని.

ఎన్నినదులు దాఁటినను, గంగ జన్మస్థానమున కెంతసమీపమునకు వచ్చిన గంగమ్మతల్లి యోంకార నాదము తగ్గదు. ఆ మధుర నాదము ప్రయాణికుల నను క్షణము ప్రోత్సహించుచుండును. మహాపర్వతములనుండి ప్రళయఝంఝానిల ఝూంకరణముతో భయంకర వేగముతో గంగామాత ప్రవహించుచుండ, యాత్రికులు "గంగామాయికీ జై" "గంగోత్రీమాయికీ జై" యని సింహనాదములు చేయుచుఁ బోవుచుందురు. జలకణములతోఁ గూడిన గంగానదిమీఁది మనోహర సుగంధ

శీతలమందవాయువులచే మనశ్రమ మాయమగును. కాళి దాసీవాయువును,

‘ భాగీరథీ నిర్ఝర శీకరాణాం
వోఢా ముహుః కంపితదేవదారుః,
యద్వాయు రన్విష్టమృగైః కిరాతై
రాసేవ్యతే భిన్నశిఖండిబర్హః.’

ఈశీతలప్రాంతముల దేవదారుజాతులు దప్ప తదితర వృక్షములు పెరుగవు. కనుకనే యామహాకవి హిమవద్వర్ణనమున దేవదారువునే విస్తారముగ ప్రశంసించినాడు. ఆ మహాపర్వతములు, ఆ దేవదారువృక్షములు, ఆ హిమశిఖరములు, ఆ గంగాతరంగలాస్యములు చూచుచున్నప్పుడు మన మీభూలోకమును విడిచి స్వర్గభూమియందు ప్రయాణముఁ జేయుచున్నా మనుభ్రమ తప్పక గలుగును.

చివరకు ౯,౦౦౦ అడుగుల యెత్తున నున్న సుక్కి వచ్చినది. శ్రీశైలమార్గమధ్యమున ౧,౫౦౦ అడుగులయెత్తుననుండి ప్రయాణికులకు శ్రమ గలుగఁ జేయు చుక్కలపర్వత మీసందర్భమున జ్ఞప్తికి వచ్చినది. సుక్కినుండి యింగలబోన లేగు సుక్కియందొక “పహాడీ” పర్వతవాసి, ఒక కాశీసేటుగారితో నీక్రింది సంభాషణము గావించెను.

“ సేట్జీ! మీ దేశ ముత్తమమైన దనుచున్నావే? ఇంతకంటె మీది పుణ్యభూమియా? ఎట్లు? మీరు గంగాతీరవాసులని గర్వించుచున్నారా? చూడండీ, ఈ నిర్మల హిమశిఖరములు. ఇట్టి స్వచ్ఛధవళశిఖరము లెప్పుడైన మీజన్మములో మీకు కన్నులపండువు గైనవా? మాకీయానందము నిత్యకృత్యములలోనిది. అమందమగడ్డలిప్పుడే కరఁగి యిదిగో మనప్రక్కనే ప్రవహించుచున్నవి. మేముపయోగించుజల మిది. ఇది యెంత నిర్మలమో వర్ణింపఁగలవా! ఈజలము లెన్ని మలినప్రదేశములలోఁ బారినపిదప మీకాశీగంగ యగుచున్నదో మీ రెఱుఁగరు గాఁబోలు. ఆగంగయే మీకబ్బురము. అది పవిత్రజలము. ఎన్ని జన్మములెత్తినను ఆజలమునకీ మంచునీటిచల్లదనము నూరవభాగము రాఁగలదా? మా కాహారము చాలినంత దొరకదని మీశంక? ఈచెట్లమీఁదనున్న ఆలుబుకారా ఫలములు, “చూ”ఫలములు, ఈయాకుకూరలు, ఈ చీనీ ధాన్యము (కొఱ్ఱలవంటిది) ఎంతరుచిమంతములో మీకుఁ దెలియునా? అటు, చూడుఁడు: కస్తూరి మృగములు మా నంటుయింటి కుందేళ్లు. మీకు వచ్చు కస్తూరియం దెంత మట్టి కలిసినను హిమాలయపు కస్తూరియని భ్రమయుదురేమో? ఇదిగో, స్వచ్ఛమైన శిలాజిత్తు. మా కిది యెక్కడఁ జూచినను దొరకును. మీ కిది యరుదగు మహౌషధము. మీకు కుంకుమపూవు కావలయునా? మెత్తనియున్ని కావలయునా? భూర్జ పత్రములు వలయునా?

ఇచ్చట మాకు స్నాన మావశ్యకము లేదు. ఈ గాలిని రుచిచూచినవాఁడెవఁడును స్నానము నాశింపఁడు. వస్త్రము లుతుకుట లేదనిమీయాక్షేపణ. వస్త్రములకు మలినమెక్కడిది? దేహములకు చెమటయెక్కడ? పోనిండు, మేము మోటుకొండవాండ్రమా? ఇదిగో, యీనాదేహముకంటె నధికమగు స్వర్ణచ్ఛాయ గాని, కోమలత్వముగాని మీలో నెవరివద్ద నైనఁ బ్రదర్శించి నన్ను మోటువాఁ డనుఁడు. మాకు మోసపుమాటలు చేతఁ గావు. ఋషులను సత్కరించుటకుఁ దగిన యుక్తులు మాకుఁ జాలును. మీరు ధనికులని యతిథుల పూజల నెక్కువగఁ జేసెదమనుకొనవద్దు. ఈ యనంత తేజోనిధులు, ఈఋషిశ్రేష్ఠులు, ఈపరబ్రహ్మ స్వరూపులు, ఈయవర్ణ్యప్రభావులు మీసంపదలను, మీయాతిథ్యములను రోసి యిదిగో మే మిచ్చు ముదుక రొట్టెను, చెట్లపండ్లను, పచ్చికూరలను చలినీళ్లను అమృతప్రాయముగ గ్రహించి మాకు వారిసేవఁ జేయుభాగ్యము నిచ్చుచున్నారు. ఆ మహాత్ముల సుఖ మరయనిది మేము నిద్రింపము. ఆ మహామహులు భుజింపనిది మేము ముద్ద యెత్తము. గంగాతీరమునఁ దెల్లని శిలలు వారికి వెండి కంచములు. గుహలు మణిమయ గృహములు. గడ్డిసెజ్జ హంసతూలికాతల్పము. నిత్యానందము వారి జీవనము. వారే మామహారాజులు ‘యథా రాజా తథా ప్రజాః’.

సుక్కినుండి హరిల్ ౫ మైళ్లు. మార్గమున బాలురు కొందఱు వచ్చి “పైసా దేదేవ్” అనిరి. ఏమి వీరి కింత

యధికారము. అవును. వారిదేశములోనికి వచ్చి వారి సుఖములను జూచుకొని, వారిపుణ్యక్షేత్రములఁ దీర్థమాడి వారిప్రదేశముల నపవిత్రము చేయువారము, వారియధికారమునకు లోఁబడి యాపర్వతరాజులకుఁ గానుకలు చెల్లింపవలదా యని, లేవనకుండ నందఱకు కానుక లిచ్చితిని. ఈసమీపమునఁ గొన్ని వందలగజముల వైశాల్యముగల మంచుగడ్డ మార్గముమీఁదికి దిగినది. ఆమంచుగడ్డ మార్గముమీఁదుగ నడచిపోవు నదృష్టము లభించినందు కెంతయు సంతోషముఁ జెందితిని. ఇఁకను చిన్నచిన్న మంచుగడ్డలకు లెక్కయే లేదు. ఇవన్నియు కరఁగుచుండుటవలన నప్పుడే గంగలో మంచువచ్చు లారంభమైనవి. మంచుగడ్డ లడుగునుండి కరఁగి లోపల తొఱ్ఱలవలె నై కూలిపోవుచుండును గాన వానిని జాగ్రత్తగ దాఁటవలెను.

హర్శిల్ నుండి చలికి చేతులు, కాళ్లు కొంగరలు పోవుట యెక్కువ గావున నిత్యాగ్నిహోత్రసేవ అవసరము. హర్శిలులో "కృష్ణాశ్రమము" అనుపేరుగల దిగంబరస్వామి గలరు. ఈయన చలికాలములోఁ గూడ నిచ్చటనే యుందురు. బహుసంవత్సరాభ్యాసమువలనను తపోమహత్త్వమువలనను వీరికి చలిబాధ లెక్కలేదు. శ్రీజ్ఞానానందస్వామివారు హఠాత్తుగ నొక్కసంవత్సరము లోనే దిగంబరులై గంగోత్రిప్రాంతములం దున్నందున శ్రీకృష్ణాశ్రమముగారు వారిసహనమున కాశ్చర్యపడి వారి యం దెంతయు సద్భావముతో నుందురు. వారు మౌనవ్రతులు గాన నేఁజెప్పినది సంతోషముతోను, నంగీకారసూచకచిహ్నములతోను నాలకించిరి. ఈమహాత్ములు మొన్నమొన్న శ్రీమాలవ్యాగారి ప్రార్థనచే హిందూవిశ్వవిద్యాలయమున శివప్రతిష్ఠ గావించిరి. ఇట్టిమహాత్ము లిచట మఱికొందఱును గలరు. వీరిది మౌనివృత్తి. అజగరవ్రతము. మహాతేజోదర్శనము; పరమసాత్త్వికభావము.

ఈప్రాంతములందు హిమశిఖరములపై సూర్యోదయాస్తమయము లత్యద్భుతముగ నుండును. ఒక్కొక్కసారి యొక్కొక్క విచిత్రవర్ణము సినిమాయందువలె వెల్లివిరిసి, సర్వవ్యాప్తమై ధగధగాయమానమై కన్నులు మిఱుమిట్లుగొల్పి మాయమగును. ప్రకృతిదృశ్యములోనివి యీరంగులని, యీరీతినున్నవని వర్ణించుట సాధ్యము గాదు. కిరణముల నాట్యమును ప్రతిబింబించుటయు ననుభవైకవేద్యము.

హర్శిల్ నుండి ముఖువా ౨ మైళ్లు. అచ్చట భూమానందపండాగారు నన్ను గౌరవించి గంగోత్రికి నాతో వచ్చి నన్ను యాత్ర చేయించిరి. ఈ భూమానందపండాగారు శ్రీజ్ఞానానందులతో శీతకాలమున నిచటనుండి వారిని సేవించిన సద్భక్తులు. శ్రీవారు నివసించిన గుహలను, వారిలోకాతీతచర్యలను ఈయన నా కుపన్యసించినారు. ముఖ్యచిత్రము లేవనఁగా ఆవర్ణింపరాని చలిలో స్వామివారిశరీరముపై భూమానందుఁడు తనచేతులను శరీరముతో కాఁచుకొని జీవించువాఁడట. క్రూరమృగములన్నియు నిందుమించుగా స్వామివారి మిత్రములట.

గంగోత్రిక్షేత్రాధికారి శ్రీజ్ఞానానందుల పరమభక్తుఁడు. ఆయనపేరు స్వామి గంగేశ్వరానంద. వారు నన్నతిప్రేమతోఁ జూచిరి. గంగానది మంచుకొండల నుండి బయలుదేరుప్రదేశ సమీపముననున్న మొదటి గంగా పుణ్యక్షేత్రము గంగోత్రి యనఁబడును. దీనినే గంగోత్తరయందురు. గంగోత్రి తరువాతనే కేదారగంగయు, భోట్ గంగయు ముఖ్యప్రవాహములోఁ గలియును. గంగోత్తరతరువాతనే గంగ గౌరికుండములో శివలింగముమీఁదుగఁ బ్రవహించును. ఇచ్చట భగీరథుఁడు తపముఁ జేసినశిలయు, గంగా యమునాదిదేవతలును శంకరాచార్యులచేను బ్రతిష్ఠింపఁబడిన దేవాలయమును గలవు.

ఈదేవాలయమును జయపూరు మహారాజుగారు ౨ లక్షలవ్యయముతో నిర్మించిరి ఇచ్చట చలికాలమున సామాన్యమానవు లుండఁజాలరు గాన గంగ కప్పుడు దేవపూజ జరుగునట. చిన్నచిన్న యాలయములు శివుఁడు, భైరవుఁడు మొదలగు దేవతలవియుఁ గలవు. వీని కన్నిటికి ధర్మకర్తలు టెహ్రీ మహారాజుగారు. పూజారులు ముఖువాగ్రామవాసులైన పండాలు. ఈ ప్రదేశమునకు ౧౮ మైళ్ల దూరమున గోముఖకైలాసము గలదు. ఇచట గోముఖాకారముగ హిమపూరిత పర్వతము లుండును. ఇచట మంచుగడ్డల క్రిందినుండి గంగాజలము వచ్చు

మించును. కాఁబట్టి గంగయొక్క నిజజన్మస్థాన మిదియే కాని యిది సామాన్యుల కసాధ్యస్థలము గాన గంగోత్రియే గంగజన్మస్థలమని యాత్రికులు సేవింపుచుందురు. శ్రీజ్ఞానానందులుమాత్ర మీ స్థలమునకు దిగంబరులుగ వెళ్లివచ్చిరఁట. గంగోత్రియందు నీటిలోఁ జేయిపెట్టిన చేయి నల్లఁబాఱి మొద్దయి,యంతటఁబోక, తీపు పుట్టును. అప్పుడు దానిని కాఁచుటయే శరణ్యము. దీనినే మన పూర్వులు శిలానది యనిరి. ఈ శిలానదియం దెట్లో స్నానముచేసి వచ్చినాను. గంగోత్రిలో వ్రాసికొనుటకు వీలగు భూర్జపత్రములు గలవు. ఇవి భూర్జవృక్షపుబెరడు నుండి తీసిన కాగితములు. వీనిని గూర్చియే కాళిదాసు,

> 'న్యస్తాక్షరా ధాతురసేన యత్ర
> భూర్జత్వచః కుంజరబిందుశోణాః,
> వ్రజంతి విద్యాధరసుందరీణా
> మనంగలేఖక్రియయోపయోగమ్.'

అనెను.

గంగోత్రినుండి కార్యాంతరములవలన సత్వరముగ ప్రతాపనగరమునకు వచ్చి, శ్రీస్వామివారి సెలవంది, లా మెంబరుగారికిఁ గృతజ్ఞతఁ దెలిపి కలకత్తా మీఁదుగ నాంధ్రదేశముఁ జేరితిని. ఈ టెహ్రీరాజ్యము ప్రతియాంధ్రుఁడును చూచి యానందించి తీరఁదగినదని మనవి చేయుచు నింతటితో విరమించుచున్నాను.

---

# ఓ నల్ల మేఘమా!

మండపాక పార్వతీశ్వరశాస్త్రి గారు

[తేనెపట్టునుండి]

ఎందుకే, ఎందుకే, ఓ నల్లమేఘమా,
అందుకోరాకుండ, ఎగిరిపోతావే!
అబ్బాయి, అబ్బాయి, అందుకోబోకుమా,
నను బట్టుకో లేరు నీలాంటివాళ్లు;
ఎక్కడికి పోతావు, ఓ నల్లమేఘమా,
నన్ను నీతోగూడ తీసుకోపోవే!
దూరదేశాలకు పోయివస్తానురా,
అబ్బాయి, నాతోటి నీవు రాలేవు.
దూరదేశాలన్ని నేను చూస్తాను, నీ
వీపుమీ దెక్కించి తసుకోపోవే.
దూరదేశాలకూ నీవు రాలేవురా,
నావీపుమీ దెక్కి కూర్చుండలేవు.
పోనిపోనీ గాని, ఓ నల్లమేఘమా,
ఎక్కడికి పోతావో చెప్పవే నాకు.
అల్లాసముద్రాని కిపుడు పోతానురా,
మంచినీళ్లను త్రాగి మళ్లి వస్తాను.
ఆసముద్రంలోను ఏమేమి ఉంటాయి,
ఆడుకోవచ్చునే వేటితోనైన ?
ఓడలూ, నావలూ అక్కడుంటాయిరా,
ఆడుకోలేవురా వాటితో నీవు.
మానాన్న నాకొక్క ఓడ కొనియిచ్చేడు,
ఓడతో నావతో ఆడుకోగలనె.
వద్దురా, వద్దురా, నీవు రాలేవురా.
వస్తాను వస్తాను తీసుకోపోవే.
రాబోకు, రాబోకు;
వస్తాను, వస్తాను.
వద్దమ్మ—వద్దమ్మ—
వస్తానుసుమ్మ.

---

# భౌతికాధ్యాత్మికశాస్త్రముల అవినాభావసంబంధము

## జనరల్ స్మట్సుగారి యుపన్యాస సారము – బ్రిటిషు అసోసియేషన్ శతవర్ష వర్ధంతి

వేమూరి విశ్వనాథ శర్మగారు, యమ్. ఏ., యల్. టి.

### సృష్టినిర్మాణతత్వము—ప్రకృతిస్వరూపము

మన సంఘమునకు నేటితో నూరేండ్లు నిండినవి. ఈ నూరేండ్లలో మన సంఘసభ్యులు చేసిన శాస్త్ర పరామర్శమునకు మితిలేదు. ఇప్పుడు భౌతికశాస్త్ర పరిశోధనయాత్రలో నొకమజిలీ చేరితిమని చెప్పవచ్చును. రాబోవు ఘట్టము మిక్కిలి ముఖ్యమైనది. పరిశీలనాశయములందును, శాస్త్రీయ సిద్ధాంతములందును గొప్పమార్పులు జరుగనున్నవి. భౌతికశాస్త్రముల గమ్యస్థానమే మారుననుటకు కారణములున్నవి. భౌతికశాస్త్రజ్ఞుల భవప్రపంచమునం దిట్టి విప్లవకరములగు అభిప్రాయములు పొడచూపుటకు మన సంఘసభ్యుల పరిశ్రమయే కారణమని చెప్పవచ్చును. కాని నేనిప్పుడు వారి పరిశీలనోత్కృష్టతను గూర్చి కాని, గత నూరేండ్లలో జరిగిన భౌతికశాస్త్రాభివృద్ధినిగూర్చి కాని యుపన్యసింప తలచుకొనలేదు. భౌతికశాస్త్రముల ప్రస్తుత స్థితినిగురించియు, వివిధశాస్త్రములయొక్క సిద్ధాంతములకు సామరస్యము కుదిర్చినప్పు డవి యెట్టి గమ్యస్థానమును సూచించునో యట్టిసమన్వయమునుగురించియు ముచ్చటించెదను. ఇట్టిపని నిర్వర్తించుట కష్టతరము. నేను భరించలేని భారము. కాని నేటి సభాధ్యక్షపదవి నేను కావలెనని కోరి సంపాదించినది కాదు. నా సామర్థ్యమును గమనించి మీరొసంగినదియు కాదు. కారణాంతరములు పురస్కరించుకొని మీరీగౌరవమును నాకు ప్రసాదించితిరి. కావున నా నుడువులను వాత్సల్యభావముతో నాలకించి నా కర్తవ్యమును నెరవేర్చుటలో మీరు సహాయభూతులై కరుణించెదరని ప్రార్థించుచున్నాను.

ప్రపంచముయొక్క నిజస్వరూప మెట్టిది? భౌతికశాస్త్రములు ప్రకృతిస్వరూప మెట్టిదని నిర్ణయించుచున్నవి? ఇట్టి శాస్త్రపరిష్కృత ప్రపంచజ్ఞానమునకును, అనుశ్రుతముగ మన పెద్దలు నిరూపించిన ప్రకృతిస్వరూపమునకును భేద మెట్టిది? ఈప్రశ్నలు ముఖ్యమైనవని నాయభిప్రాయము. ఏల యన, ఈచరాచరాత్మకమగు ప్రపంచ మెంతవరకు సత్యము? దాని నిజస్వరూప మెట్టిది? జీవుని గమ్యస్థాన మెద్ది? ఈసమస్యలకును మొదట నేను వేసిన రెండుప్రశ్నలకును, పరస్పరసంబంధము గలదు. కేవల భౌతికశాస్త్రజ్ఞానమువలన పైప్రశ్నలకు సంశయనివృత్తి కలుగగలదా? ఈప్రశ్నలకు సమాధాన మిచ్చుటయే నా యుపన్యాసోద్దేశము.

స్థూలదృష్టిని గమనించినప్పుడు భౌతిక శాస్త్రములు (Natural Sciences) మూడు రకము లున్నట్లు కనబడును:—1. పదార్థ విజ్ఞానశాస్త్రము (Physical Science) 2. జీవ శాస్త్రము (Biological Sciences) 3. సాంఘిక మానసిక శాస్త్రములు (Social and Mental Sciences). భౌతికశాస్త్రజ్ఞానము ఇంద్రియ జన్యము. పరిశీలన, ప్రయోగము, అనుమానము (Observation; Experiment; Inference) భౌతికశాస్త్రములకు ఉత్కృష్టప్రమాణములు. పరోక్షజ్ఞానమును—శ్రుతిస్మృత్యాదులు; ఆప్తవచనములు—భౌతికశాస్త్రజ్ఞులకు ప్రమాణములు కావు. కాని ప్రత్యక్షజ్ఞానమూలమున స్థాపించిన సిద్ధాంతములకు సర్వత్ర వ్యాప్తి యుండుటచేత అట్టిజ్ఞాన మవిచ్ఛిన్నమని(Universal)భౌతికశాస్త్రజ్ఞులమతము.* పైని చెప్పిన వివిధ భౌతికశాస్త్రసిద్ధాంతములను పరిశోధించి వాటికి సమన్వయము కుదిర్చినయెడల ప్రపంచముయొక్క నిజస్వరూప మెట్టిదో నిర్ణయించుటకు వీలు కలదని తలచెదను.

ప్రకృతిస్వరూప మిదమిత్థమని నిర్ణయించి చిత్రించుటకు ఏ యుగమువారికిని సాధ్యము కాదు. ఆయా యుగములయం దుండిన తత్త్వవేత్తలు తమతమ యభిప్రాయములనుబట్టి ప్రపంచస్వరూపమును నిర్ణయించుచువచ్చిరి. వారి తరువాత యుగములో శాస్త్ర సిద్ధాంతములు మారినప్పుడు ప్రకృతిస్వరూపముకూడ మారుచుండెను. సృష్ట్యాది యగమ్యగోచరమని మొదట తలంచిరి. తరువాత యుగములో ప్రకృతిదేవతలు, దిక్పాలకులు వెలసిరి. బ్రహ్మాండమునకు (Universe) భూగోళము మధ్య నున్నదనియు, తక్కిన గ్రహములు, నక్షత్రములు భూమిచుట్టు తిరుగుచున్నవనియు కొందరు తలంచిరి. బ్రహ్మాండములో నిమిడి యున్న గోళములన్నియు స్వేచ్ఛావిహారులు గాక తమతమ నిర్ణీతస్థానములయం దుండి విధ్యుక్త ధర్మములను నిర్వర్తించుచున్నవని గెలిలియో, న్యూటను మున్నగు శాస్త్రజ్ఞు లూహించిరి. మన సమకాలీనుడగు ఐన్‌స్టను సిద్ధాంతములనుబట్టి ప్రపంచము గణితశాస్త్ర బద్ధమనియు, గణితములోని సంఖ్యలవలె ప్రపంచముకూడ నొక చిహ్నమనియు, సృష్టియొక్క నిజస్వరూపమును భౌతికశాస్త్ర సిద్ధాంతములచే సాధించవచ్చుననియు తేలుచున్నది. కాని చరాచరాత్మకమగు సృష్టికి ప్రతిసృష్టి నొకదానిని నమూనాగా చేసి చూపుటమాత్ర మసంభవమని యంగీకరించిరి. ఇట్లు ఆయా కాలములయందలి జ్ఞానాభివృద్ధినిబట్టి శాస్త్రవేత్తలు సృష్టితత్త్వమును నిర్ణయించుటకు ప్రయత్నించిరి. ఇప్పటి నవీన ప్రకృతి శాస్త్రజ్ఞానము ప్రకృతిస్వరూప నిర్ణయమున

* ఉదాహరణము—అరటిపండు తియ్యగ నుండును. పరీక్షించి యనుభవించిన యరటిపండ్లు కొలదవైనను, ఏదేశమున నున్నను, ఏకాలమం దున్నను అరటిపండు తియ్యగానే యుండును. అందుచేత "కదళీస్వాదుత్వ" జ్ఞానము దేశకాలావిచ్ఛిన్నమని చెప్పవచ్చును.

కెంతవరకు తోడ్పడునో సూచించుటయే నేటి కర్తవ్యము.

భౌతికశాస్త్రజ్ఞానమునకు అనుభవమే పునాది. అనుభవవేద్యమగు ప్రపంచము షడ్భావవికారములకు లోనైన భిన్నవ్యక్తుల సముదాయము. ఇంద్రియగోచరములగు వికృతులు (భిన్నవ్యక్తులు- separate entities), పంచేంద్రియాతీతములైన ఆకాశము, కాలము, జీవుడు, ఆత్మ అను ఐదుద్రవ్యములు దృగ్గోచరప్రపంచమునం దిమిడియున్నవని సామాన్యజ్ఞానము నిరూపించుచున్నది. ఇవి చాలక సృష్టికార్యమునకు కర్తయుండవలెనని తలంచి యొకవిశిష్టమైన పురుషుని (ద్వైతము) కల్పించిరి. ఈ రీతిని కొన్ని పరిస్థితులు కల్పించుకొని భావప్రేరితమైన యూహా సముదాయము అనుభవసిద్ధమగు సామాన్యజ్ఞానమగును కాని (empirical knowledge) ప్రత్యక్షజ్ఞానజన్యమగు సిద్ధాంతములకు కట్టుపడి సాధించిన శాస్త్రీయజ్ఞానము (scientific knowledge) కాదు. కాకపోయినను అనుభవసిద్ధమగు సామాన్యజ్ఞానమే నిత్యకృత్యములకును మతవిశ్వాసములకును కారణభూతముగ నున్నది. అనుభవసిద్ధజ్ఞానమునకును, శాస్త్రీయజ్ఞానమునకును పరస్పరవిరోధము లున్నవి. పొత్తు కుదరకపోయినను స్థూలదృష్టితో పరీక్షించి సామాన్యజ్ఞానాధారమున నిర్ణయించిన సృష్టితత్వనిరూపణమే జనవిశ్వాసము బడయుచున్నది. ఇట్టి యనుభవైక జనితమగు సృష్టితత్త్వనిర్ణయమును భౌతికశాస్త్రజ్ఞు లెట్లు విమర్శించిరి? ఏవిధముగ మార్చివేసిరి?

నే నిదివరలో చెప్పినట్లు భౌతికశాస్త్రసిద్ధాంతములను స్థాపించుటకు జ్ఞానేంద్రియములే మొదటిమెట్లు. పరిశీలన, ప్రయోగము— ఇవి భౌతికశాస్త్రజ్ఞులకు రాజమార్గములు. వీటి కనుగుణమగు అనుమానమే సిద్ధాంతము. ఇట్టిపునాదులపై భౌతికశాస్త్రజ్ఞానము పెరిగి పెంపొందినది. ప్రత్యక్షప్రమాణములకు వ్యతిరేకములగు ఊహలు, సిద్ధాంతములు పూర్వపక్షము కాబడినవి. శాస్త్రసిద్ధాంతములను స్థాపించుటకు కావలసిన యుపకరణములను పరిగ్రహించి తదితరములను పరిత్యజించిరి. భౌతికశాస్త్రజ్ఞులు గ్రహించిన యుపకరణములలో, కొన్ని యింద్రియాతీతములు కేవలము భావైకవేద్యములు. ఏలయన, ఇంద్రియగోచరము కాకపోయినను వస్తులేశమునకు 'అణువు,' 'పరమాణువు' అనుపేర్లు నిడి చరాచరప్రపంచ మంతయు పరమాణు (atom) సంధానమువలన నేర్పడిన అణుసముదాయమని (aggregates of molecules) కణాదుని సిద్ధాంతమును, ఆరంభవాదమును బలపరిచిరి. సర్వాంతర్యామియగు "ఈథర" అను నొక క్రొత్తద్రవ్యమును నెలకొల్పిరి. 'బలము'నకు (Force) బదులుగ 'శక్తి'ని (Energy) ప్రతిష్ఠించిరి. స్వభావసిద్ధములగు నియమముల ననుసరించి ప్రపంచము నడచుచున్నట్లు గ్రహించి 'గతినిర్ణయసూత్రములను' (Laws of Motion), 'పదార్థనిత్యత్వమును'(conservation of mass), 'విద్యుత్ అయస్కాంత సిద్ధాంతములను' (Laws of Electromagnetism) సప్రమాణముగ

స్థాపించిరి. ఇట్టి నిరంతరకృషివలన భౌతిక శాస్త్రజ్ఞులు వస్తుప్రపంచమును (matrial universe) గూర్చి సర్వజ్ఞత్వమును సాధించిరి. కాని వీరు చిత్రించిన ప్రకృతిస్వరూపమునందు జీవునికి, మనస్సునకు తావు లేదు. జీవుడు, మనస్సు ఇదమిత్థమని నిరూపించుటకు భౌతిక శాస్త్రశరణ్యములగు కొలతిముంతిలు, అడుగు బద్దలు, తూనికరాళ్లు (కేవలము భౌతిక స్వరూపమును నిర్ణయించుట కుపకరించుసాధన ములు) పనికిరాలేదు. అందుచేత వారు జీవుని, మనస్సును అనామతుకాతాన జమ వ్రాసిరి. సృష్టికారణమునుగూర్చియు, సృష్ట్యతీతుడగు కర్తనుగూర్చియు భౌతికశాస్త్రజ్ఞులు అజ్ఞేయ వాదమును గాని, నాస్తికవాదమును గాని యవలంబించిరి.

గతశతాబ్దమునందలి భౌతికశాస్త్రజ్ఞుల పోకడలనుగూర్చి సంక్షేపముగ వర్ణించితిని. వారు నూతనవిషయము లనేకములు కనిపెట్టిరి. యంత్రములను సృష్టించి నాగరకజీవనమును పెంపొందించిరి. ప్రజాసౌకర్యమునకు గావల సిన పరిస్థితు లనేకముగ కల్పించిరి. కాని సృష్టి తత్వ నిరూపణమునందు వీరికిని, మనపూర్వపు శాస్త్రవేత్తలకును విశేషభేదములేదు. అను శ్రుతమగు సామాన్యానుభవ జ్ఞానమునే వీరు ప్రయోగపూర్వకమగు ప్రమాణములు చూపి స్పష్టీకరించిరి. మనపూర్వులు ప్రవచించిన దేశ, కాల, ద్రవ్యములనే వీరును ఖాయపరచిరి. సృష్టితత్వాన్వేషణమున పూర్వులకును వీరికిని ప్రాతిపదికలో గాని, దృక్పథమునందు గాని భేదము లేదని చెప్పవచ్చును.

(సశేషము)

---

## శారదగానము

శ్రీ. కృష్ణారాయశాస్త్రి గారు

శారద నీరదాళు లవె సంతతనీలవినీల భూరిరా
గోరు తళత్తళ ల్మెఱయ నూఁదెదు పిల్లనగ్రోవి మోవికెం
పారినయింపుసొంపు లన హాయన వ్యోమవిహారయానముల్
దారలరోచులం గలుగ దైవము గూర్చునె గోపికాపతీ.

ఒనరుతు నే నోనర్ప నిదియో యదియో యను జంకుగొంకుల్గ
వినుమొగమై ముసుంగువడి విన్నఁదనంబున నున్న నల్లవా
నిని నెఱజాణగా దురము నేర్పరిగా దొరగా నొనర్చునీ
కనికరమైన యావిజయగానము నేయవె పార్థసారథీ.

కూళతనాన భారతుల కోమలి రచ్చకు నీడ్చి నొంచి గ
య్యాళితనంబు సూపినజనాళికి నగ్రము దోఁపఁ బల్కులో
వేళము కొంచినట్టి యల వేడ్కమొగంబున రార నేఁడు స
ర్వోళిత నీలదేహ రుచు లీనఁగ ద్రోవదిఁ బ్రోచు సుందరా.

మలకల వారి మోసములమాటల తేటలు మీటి మేటివై
కలఁగనిపాఁడిపెన్నుదులఁ గందని డెందమునందఁ బాదముల్
నెలకొన నాడినట్టి యల నీయెకిమీనికడాని పల్కులన్
బలుక వదేల మాయెదుర భారతసుందర నందనందనా.

కాటుక కన్గవం దొఱఁగి కాల్వలఁ బాఱెడు కంటిసీటిచే
నాటలఁ బాటలం గలిసి యాడిన పాడిన నిన్ను గ్రేంత లం
తోఁటలఁ జల్లులాడుటలు తోఁచున్ తోఁపవా పాలుమీఁగడల్
దూఁటులు వెట్టి జుట్టుకొను తోరపుబంజ్జ గలంచి వైవదే.

అపు డెది చేసి పాడితివొ యాజగతీ హృదయాభిరామగా
నపటిమ భారతావని వనంబులఁ బట్టనరాజి రాజితా
నుపమవిశాలభూములను నొక్కరతి న్వినిపింపనింపవే
విపులమహార్య హృత్కుహర విస్ఫుట దివ్యవపు ర్విభాంచితా.

లోకాలోకసమాలోకైకాయత దివ్యభావుకాగ్రియ భావా
స్తోకవివేకా వినుము మహాకవికృష్ణార్యకాంక్షితార్థము లోనఁగన్.

—

# హిందూదేశపు బ్యాంకింగుసమస్య:

## బ్యాంకింగు విచారణసంఘు నివేదిక

డా. వెం. హనుమంతరావు గారు, M.A., B. Ed., Fr. R. Econ. S. (Lond.)

### ౧

౧౯౩౧ సం. సెప్టెంబరు ౧౬-వ తేదీని ప్రచురింపబడిన బ్యాంకింగువిచారణసంఘమువారిరిపోర్టు చాల విషయములందు అభివృద్ధిసూచకముగ నున్నది. ప్రస్తుతము హిందూదేశమునందు చాల తక్కువగనున్న బ్యాంకింగు వ్యాపారమును హెచ్చుచేయుటకును, పరిశ్రమలయొక్కయు, వ్యవసాయముయొక్కయు, అభివృద్ధికి బ్యాంకులు ఏవిధముగ తోడ్పడవలెనో సూచించుటయందును, విదేశపుబ్యాంకులు మనదేశమునుండి ప్రతిసంవత్సరము తీసుకొనిపోవుచున్న లాభములను దేశమునందే యుండునట్లు చేయుటకును—ఇట్లనేక దేశీయఆర్థిక సమస్యలను పరిష్కరించువిధులను విధానములను గూర్చియు కమిటీవారు చాలసమంజసములగు సూచనలను చేసియున్నారు. కమిటీవారికి విదేశములందలి బ్యాంకింగు పద్ధతులనుగూర్చి సలహా నిచ్చుటకు పిలిపింపబడిన బ్యాంకింగునిపుణులు వారితో కొన్నిముఖ్యవిషయములందు అభిప్రాయభేదమును వెల్లడించినప్పటికిని కమిటీవారుమాత్రము ఆసలహాలను గుర్తింపక దేశక్షేమమునే తమయెదుట నుంచుకొని ఆవిషయములనుగూర్చి తమకు లాభదాయకములని తోచిన సూచనలను మాత్రమే చేసియున్నారు. అట్టియభిప్రాయభేదము ముఖ్యముగ రెండు విషయములందు వెల్లడియాయెను. అవేవన:—(౧) దేశీయ పరిశ్రమల నభివృద్ధిచేయుటకు అవసరమైనచో రాష్ట్రప్రభుత్వములు రాష్ట్రపారిశ్రామిక సహాయసంఘములను స్థాపించవలెను. దీనినిగూర్చి ముందు కొంత విపులముగ చర్చించెదము. విదేశ-బ్యాంకింగునిపుణులు అట్టిసంఘములు జయప్రదముగ కొనసాగవనియు ప్రభుత్వమువారు అట్టిసంఘములను నిర్మించుటకు పూనుకొనుట కూడదనియు వ్రాసియున్నారు. (౨) ప్రభుత్వసహాయముతో ఒక దేశీయమారకపుబ్యాంకును స్థాపించుట. అట్టిబ్యాంకును ప్రభుత్వయాజమాన్యముక్రింద స్థాపించకూడదని వారు అభిప్రాయమిచ్చిరి.

### ౨

మొట్టమొదట పైన చెప్పబడిన రెండవిషయములలో రెండవదానినిగురించి చర్చించెదము. మనదేశపు విదేశవర్తకపువ్యాపారమునకు కావలసిన సొమ్మునంతను ఇదివరలోను, ఇంతవరకును విదేశ-మారక-బ్యాంకులు (Foreign Exchange Banks) సరఫరా చేయుచున్నవి. ఈవ్యాపారములో వాటికి ప్రతిసంవత్సరము సుమారు ౬ కోట్లరూపాయలు లాభము వచ్చుచున్నట్లు లెక్క తేల్చబడినది. మారకపువ్యాపారముకాకుండ ఈ బ్యాంకులు ఇతరవిధములగు బ్యాంకింగువ్యాపారము సాగించుచు (అనగా ప్రజలనుండి డిపాజిట్లు—deposit—తీసికొనుట, విదేశపరిశ్రమలకు సొమ్ము సరఫరాచేయుట మొదలైనవి. ౧౯౨౮ సంవత్సరాంతమునాటికి ఈ బ్యాంకులయందలి డిపాజిట్లు ౭౯ కోట్లరూపాయిలుండెనని ప్రభుత్వపులెక్కలవలన తేలినది) దేశీయ-జాయింటుస్టాకుబ్యాంకులతోకూడ పోటీసల్పుచున్నవి. హిందూదేశమునం దింతలాభకరమగు వ్యాపారమువి సాగించుచున్నప్పటికిని హిందూదేశపు అభివృద్ధికవి ఎంతమాత్రము తోడ్పడక, వాటి ఆదాయవ్యయపట్టీలనైనను ఎప్పుడును ప్రచురింపక, అవి ఏవిధముగ పనిసాగించుచున్నవో ప్రజలకు తెలియపరచక, దేశీయుల నొక్కరినైనను తమయాజమాన్యములో పాల్గొననీయక,

వాటి ఇష్టమువచ్చినట్లు నడుపబడుచున్నవి. ఈవిషయముల నన్నిటిని గమనించిన ఈసంస్థలను తిసుకట్టుబాట్లలోనుంచి వాటిని హిందూదేశపుబ్యాంకింగునకు సంబంధించిన చట్టములకు లోబడియుండునట్లు చేయుట చాల అవసరమని తేటతెల్లమగును. ఇట్లు వాటిని కట్టుబాట్లతో నుంచుటకు తోడుగా వాటితో సరిసమానమగు సమర్థతతో పనిచేయగలిగి దేశీయుల విదేశవర్తకవ్యాపారమునకు తగుసహాయము చేయగల దేశీయసంస్థ నొకదానిని గాని, వీలైన, అంతకంటె ఎక్కువగాని స్థాపించుట కూడ అవసరమని గ్రహింపవలసియున్నది. విదేశబ్యాంకులపై ఈక్రిందినిషేధముల నేర్పాటుచేయుట ముఖ్యము: (౧) ప్రతిసంవత్సరమును వాటిని తమ ఆదాయవ్యయ, లాభనష్టములపట్టికను ప్రకటించునట్లు చేయుట. (౨) వాటిడైరక్టరులలో కొంతమందిని స్వదేశీయులను చేర్చుకొనునట్లు చేయుట. (3) హిందూదేశములో వారు చేయువ్యాపారమునకు గ్యారంటీగా కొంతధనరూపకమగు నిల్వను కల్గియుండునట్లు చేయుట. (౪) హిందూదేశీయులను వాటిఆఫీసులలో ఎక్కువగా చేర్చుకొనుట. ఇవి గాక అవసరమని తోచినవాటిని ముందు ఏర్పాటు చేయబడబోవు రిజర్వుబ్యాంకువారివద్దనుండి ఫర్మానా (license) లేనిదే పనిచేయకుండునట్లు చేయుటకూడ సమంజసమే.

ఈమార్పులు చేసినతరువాతకూడ విదేశ-బ్యాంకులు తమవైఖరిని, తమపద్ధతులను పూర్తిగ మార్చుకొనునని తలంచుట పొరపాటు. కాన ఆలోటును తీర్చుటకై దేశీయ-మారకపు-బ్యాంకుసంస్థ నొకదానిని స్థాపించుటయే పరమావధి. బ్యాంకింగువిచారణసంఘములో సభ్యులగు సర్ పురుషోత్తమదాస్ ఠాకూర్ దాస్, రామదాసుపంతులు, జమాల్ మహమ్మద్ ప్రభృతులును, మరిముగ్గురును కలసి అట్టిబ్యాంకును వెంటనే స్థాపించవలెననియు, అట్లు స్థాపించకపోయిన దేశమునకు చాల నష్టము కల్గుననియు, ఇదివరకే విదేశవర్తకవ్యాపారమునకును దేశమునందు జరుగువర్తకమునకును సొమ్ము సరఫరా చేయుపద్ధతులలోను అవకాశములలోను చాలవ్యత్యాసము, అన్యోన్యసంబంధము లేకపోవుట మొదలగు లోట్లుండుటచే హిందూదేశపువర్తకవ్యాపారము నష్టపడుట, హిందూదేశఆర్థికస్థితి పెంపొందకుండుట జరుగుచున్నదనియు, వీటినన్నిటిని సరిచేయగల మార్గమ్ము పైన సూచించినమారకపుబ్యాంకుస్థాపనమేయనియు వ్రాసియుండిరి. కాని కమిటీలో అధికసంఖ్యాకులు మాత్రము వెంటనే అట్టిసంస్థ నేర్పాటుచేయుట ముఖ్యావసరము కాదనియు, మొట్టమొదట ప్రస్తుతమందున్న జాయింటుస్టాకుబ్యాంకులు, ఇంపీరియల్ బ్యాంకు మొదలగుసంస్థలు విదేశవర్తకవ్యాపారమునకు తోడ్పడుపనిని నెరవేర్చుచుండవలెననియు, కొంతకాలము అనుభవము సంపాదించినతరువాత ఈపద్ధతి సరిగా పనిచేయుట లేదని తేలినప్పుడె మారకపుబ్యాంకును స్థాపింపవచ్చుననియు తమయభిప్రాయమును వెలిపుచ్చిరి. కాని వారుకూడ అట్టిసంస్థ నేర్పాటు చేయకూడదనికాని, ఎల్లకాలము మన విదేశ-వర్తకసహాయసంస్థలుగ విదేశబ్యాంకులే యుండవలెనని కాని సూచించియుండలేదు. మనదేశపు ఆర్థికపరిస్థితులు బాగుపడవలెననిన పైన సూచించినట్లు మారకపుబ్యాంకును ఏర్పాటు చేయుటయు, దానిని సరియగుపద్ధతులపై ప్రభుత్వయాజమాన్యముక్రింద నడుపుటయు ప్రధానావసరము.

## 3

హిందూదేశపు బ్యాంకింగు పౌధమునకు మూలాధారముగ నుండవలసిన పెద్దబ్యాంకింగుసంస్థ ఇంతవరకును మనదేశమునం దేర్పరుపబడియుండలేదు. హిల్టన్ యంగు కమీషనువారి రిపోర్టు ననుసరించి అట్టిసంస్థను (Reserve Bank) స్థాపించుటకు కొంతప్రయత్నము జరిగినది కాని ప్రభుత్వమువారికిని సామ్రాజ్యశాసనసభవారికిని దానియాజమాన్య మెవరిచేతులలో నుండవలెనను విషయములో భేదాభిప్రాయము వచ్చుటచే ఆప్రయత్న ముపసంహరింపబడెను. ఇప్పుడు మరల బ్యాంకింగు విచారణసంఘమువారు వీలైనంత త్వరలో రిజర్వుబ్యాంకును ఏర్పాటుచేయవలెనని సూచించియుండిరి. హిందూదేశమునందు గల బ్యాంకింగుసంస్థల నన్నిటిని ఒక కేంద్ర-అధికారముక్రిందకు తీసికొనివచ్చి వాటిపద్ధతులను 'కొన్నిముఖ్యసూత్రములపై ఆధారపడునట్లు చేయుటకును,' దేశమునందు ఇప్పుడున్నదానికన్న చాల

విరివిగా బ్యాంకులను స్థాపించుటకును, వాటియందు ప్రజలు తమధనమును గుప్తముచేసికొనునట్లు ప్రోత్సహించుటకును, ప్రభుత్వమువారి ఆర్థికవ్యవహారములను కరెన్సీ మారకపువిధానములను సరియగుపద్ధతులపై నడుపుటకును రిజర్వుబ్యాంకు చాలఅవసరము. ప్రతి ఇతరదేశమునందును ఆయాదేశపు రిజర్వుబ్యాంకులు పైన చెప్పబడినట్టి ప్రధానవిధులను నిర్వర్తించుటకు ఎట్లు తోడ్పడుచున్నవో మనము చూచిన అట్టిసంస్థను మన దేశమందుకూడ వెంటనే ఏర్పాటుచేయవలసిన అవసరము స్పష్టమగును. ఇప్పుడు దేశమంగు పనిచేయుచున్న జాయింటు స్టాకు బ్యాంకులు, కోఆపరేటివ్ బ్యాంకులు, ఎక్స్చేంజి బ్యాంకులు, సాహుకార్లు మొదలగువారందరును ఎవరికి వారే స్వతంత్రముగ తమవ్యాపారమును సాగించుచున్నారు. వీరి నందరను ఒకకేంద్రవిధానమునకు లోనుచేసి అన్నిటికిని అనువర్తించుపాలిసీ (policy) నొకదానిని ఏర్పాటు చేయవలసియున్నది. ఈపని రిజర్వుబ్యాంకువారి అధికారయాజమాన్యములక్రిందనే జరుగవలసియున్నది.

రిజర్వుబ్యాంకినిగురించి ఆలోచించుచున్నప్పుడు దేశీయులగు సాహుకార్లను (indigenous money lenders and bankers) గురించి కొన్ని విషయములను గుర్తించుట ముఖ్యము. ఈతెగకు చెందినవారందరును ఇంతవరకు స్వతంత్రముగ తమవ్యాపారమును సాగించుచున్నారనియు, వారిని ఒకపద్ధతిలోనికి తీసుకొనివచ్చుట అవసరమనియు పైన చెప్పియుంటిమి. మనదేశములో ఈసాహుకార్ల ప్రాముఖ్యము చాల ఎక్కువగానున్నది. వ్యవసాయమునకు, పరిశ్రమలకు మొదలగుపనులకన్నిటికిని కావలసినధనము (credit) ను ఇంతవరకు చాలభాగము వీరే సరఫరా చేయుచున్నారు. వారు పుచ్చుకొనే వడ్డీరేట్లు, వారు అప్పునిచ్చు షరతులు మొదలయిన సంగతులు చూచిన, వారిచేతులలో పడినవాడు తిరిగి కోలుకొనుట చాల కష్టతమమని చెప్పవచ్చును. కార్మిక సంఘమువారును, వ్యవసాయక సంఘమువారును (The Labour and Agricultural Commissions) ఈవిషయమై చాల గట్టిగ వ్రాసి వారిచేతులనుండి బాకీదార్లను కాపాడుటకు మార్గముల నన్వేషించుటయొక్క ఆవశ్యకమునుగూర్చి సూచనలను చేసియుండిరి. వారు చేయుపనివలన ఈవిధముగ ప్రజలకు నష్టమున్నప్పటికిని, వారు లేకపోయినను వారిని పూర్తిగ తొలగించుట కేర్పాట్లుచేసినను కూడ చాల నష్టములున్నవి; వారిస్థానము నాక్రమించి వారు చేయుపనిని, వారు సరఫరాచేయు ధనసహాయమును ఇంకొకవిధముగ ఏర్పాటుచేయుటకు తగుసంస్థలు దేశమందు లేవు. కాన ఇప్పుడు చేయవలసినమార్పు లేమన, ఈదేశీయ-వడ్డీవ్యాపారస్థులను, బ్యాంకరులను ఒకశిక్షణక్రిందకు తీసికొనివచ్చుటయు, రిజర్వుబ్యాంకువారికి వీరిపై అధికారము కలిగియుండునట్లు చేయుటయు, వారు పుచ్చుకొనువడ్డీరేట్లు నూటికి ౯ రూపాయిలకంటె ఎక్కువయుండకూడదనునియమము నేర్పాటుచేసి తీవ్రమైనశిక్షకు పాత్రులుగ చేయుటయు, వారుకూడ ఇతరబ్యాంకులవలెనే తమ వ్యాపారపులెక్కలు, లాభనష్టపుపట్టీలు మొదలైనవి ఉంచుచు వాటిని ప్రభుత్వమువారు సర్టిఫైచేసిన ఆడిటర్లచే తనిఖీచేయబడుట కొప్పుకొనునట్లు చేయుటయు నైయున్నవి. ఈమార్పులలో చాలవరకు వెంటనే ప్రవేశపెట్టవలెనని బ్యాంకింగుకమీషను వారు సూచించియున్నారు శ్రీయుత వేమవరపు రామదాసుపంతులుగారు స్వదేశ – వడ్డీవ్యాపారస్థుల (indigenous bankers) నుగూర్చి వేరే ఒకనివేదికను కమీషనువారి రిపోర్టునందు చేర్చియుండిరి. దానిలో వారిని ఒకపద్ధతిక్రిందకు తీసుకొనివచ్చి వారివ్యాపారమును మర్యాదగల వ్యాపారముగా మార్చుటకుగల అవసరమును వారు సూచించియున్నారు.

౪

మనదేశమునం దిప్పుడు రెండు విషయములలో చాలఅవసరమగు ఏర్పాట్లు చేయవలసియున్నది. ఒకటి, దేశీయపరిశ్రమలకు తగు ధనసహాయము చేసి వాటి నభివృద్ధిచేయుట; రెండు, వ్యవసాయపరిశ్రమకు కావలసిన మూలధనమును సప్లయిచేయుసంస్థల నేర్పాటుచేసి వ్యవసాయదారులకు సహాయముచేయుట. మొట్టమొదటి అవసరమునకు ఏర్పాట్లుచేయుటకు జాయింటు స్టాకు బ్యాంకులును, రెండవవిషయములో సహాయముచేయుటకు

రూరల్ కోఆపరేటివ్ సొసైటీలును తగినట్టిసంస్థలని ఎల్లరు నంగీకరింతురు. కాని ప్రస్తుతసందర్భములలో ఈరెండువిధములగు సంస్థలను వాటివాటిపనులను అవసర మైనంతఎక్కువగను జయప్రదముగను కొనసాగింపుటకు వీలగుపరిస్థితులలో లేవనిపూడ మన మంగీకరింపవలెను. కాన వ్యవసాయపరిశ్రమకు సహాయముగా నుండుటకై వ్యవసాయదారులకు చాలకాలమునకు తీర్చుటకు వీలగు అప్పుల నిచ్చుటకును (Long term credit), భూమితనఖా బ్యాంకులును, పరిశ్రమలకు మూలధనము సహాయము చేయుటకు పారిశ్రామికబ్యాంకులును (Industrial Bank) ప్రత్యేకముగ ఏర్పాటు చేయవలసియున్నది.

మొట్టమొదట పరిశ్రమలవిషయమై ఆలోచించెదము. మనదేశమునందు పరిశ్రమాభివృద్ధి ఇంతవరకు చాల మందముగ నున్నది; దీనికి ముఖ్యమగుకారణము పరిశ్రమలను స్థాపించుటకు కావలసిన మూలధనము తగినంత లేకపోవుటయే. వ్యక్తులు గాని, వ్యక్తులు కొందరు కలసి ఏర్పాటుచేసిన కంపెనీలు కాని పరిశ్రమలను స్థాపించి వాటికి కావలసిన సొమ్మంతయు ప్రజలనుండి సంపాదింపగల్గిన చాల లాభదాయకముగ నుండునని వేరుగ చెప్పవలెనా? కాని మనదేశపరిశ్రమాభివృద్ధికై సుమారు ౫౦౦ కోట్ల రూపాయిలు అవసరమని అంచనావేయ బడినది. ఆసొమ్మంతయు కాని, దానిలో చాలభాగము కాని ప్రజలనుండి రాబట్టవలెననిన అది కష్టతమమగునని. అదియును గాక, జాయింటుస్టాకుబ్యాంకులు ఈవిషయములో సహాయముచేయుటకైనను ఆబ్యాంకులు చేయు డిపాజిట్‌లు తీసుకొనుట, వాటిని కొద్దికాలమునకు తిరిగి ఇచ్చుపద్ధతిని అప్పులిచ్చుట మొదలగుపనులలో అవి చాలకాలమునకు తిరిగి ఈయబడు అప్పుల నిచ్చుటకును, ఆవిధముగ పరిశ్రమాభివృద్ధికి తోడ్పడుటకును అవకాశము లుండుట కష్టము. కాన బ్యాంకింగు కమిటీవారు సూచించినప్రకారము ప్రతిరాష్ట్రమునందును పారిశ్రామిక సహాయసంఘముల (industrial corporations) నేర్పాటుచేసి వాటిమూలముగ పైన చెప్పబడిన లాభమును పొందుటకు ప్రయత్నములు జరుగవలసియున్నది.

జర్మనీదేశములో ఈవిధముగ పరిశ్రమలకు సహాయము చేయుబ్యాంకులు చాల బాగుగ పనిచేయుచున్నవి. కాని అక్కడి పరిస్థితులకును, మనదేశపు పరిస్థితులకును ఒకముఖ్యవిషయములో భేదము కలదు. అక్కడ ఇట్లు పరిశ్రమలకు సహాయము చేయుచున్న బ్యాంకులు చాల వరకు వ్యక్తుల యాజమాన్యముక్రింద నున్నవి; కాని మనదేశమందు ఇంతకు ముందు వ్రాసినట్లుగా వ్యక్తులు ఈవిషయములో పూర్తిగ భారము వహింపగలరని తలంచుట పొరపాటు; మనకు ప్రభుత్వమువారి సహాయము ముఖ్యావసరము. ఈఒక్క భేదమును వదలివేసి ఇతరవిషయములలో ఆదేశపుపద్ధతిని మనదేశమందు ప్రవేశపెట్టుట యుక్తమైనదిగా నుండును. జర్మనీలో పెద్దబ్యాంకు లేవిధముగ పరిశ్రమలకు సులభముగ సహాయము చేయుపద్ధతి ననుకరించవచ్చు. మరియు బ్యాంకులు సహాయముచేయు ప్రతి పరిశ్రమ యాజమాన్యమునందును వాటికి కొంతప్రాతినిధ్య ముండవలెను. ఎట్లనగా ఆపరిశ్రమల డైరెక్టరులసంఘమునందు బ్యాంకు ఉద్యోగులు ఒకరిద్దరు మెంబర్లుగా చేర్చుకొనబడుదురు. దానివలన పరిశ్రమలకును బ్యాంకింగుసంస్థలకును అన్యోన్యసంబంధ మేర్పడుటయే కాక, ఆపరిశ్రమలు సరియగు పద్ధతిపై నడుపబడునట్లు చూచుటకును, అనవసరమైనట్టియు, నష్టము గలిగినట్టియు పద్ధతులు పరిశ్రమాధికారులు అనుసరింపకుండునట్లు చేయుటకును అవకాశము లుండును. తరువాత ఈబ్యాంకులు పరిశ్రమల కప్పుగా నిచ్చుటకు సాధారణముగా డిబెంచర్ల (debentures) అమ్మకమువలనను, చాలకాలమునకు కాని ఈయ నవసరములేని డిపాజిట్ల (lay term deposits) మూలమునను సంపాదించుచుండును. ఈపద్ధతులను మన దేశమునందుకూడ ప్రవేశపెట్టి పనిచేయుటవలన చాల లాభము కల్గుననుటకు సందేహము లేదు. రాష్ట్రీయ పారిశ్రామికసంఘములలో ప్రభుత్వమువారు డిబెంచర్లు కొనియు, ఇతరవిధముల ధనసహాయము చేసియు వాటిని పెంపొందింపవలెను. ఈసహాయమునకై వారికి ఆసంఘములందు తగుప్రాతినిధ్య ముండునట్లు ఏర్పాట్లు చేయవలెను. ఆతరువాత ఈసంఘములు తమ డైరెక్టరులలో

ఒకరిని అవి సహాయముచేయు పరిశ్రమల యాజమాన్యములలో పాల్గొనునట్లు నియమించుచుండవలెను. ఈవిధముగ ఏర్పాటుకాబడిన స్థానిక పారిశ్రామికసహాయసంఘములు జయప్రదముగ పనిచేయుచుండిన కొంతకాలమునకు వీటి కన్నిటికిని మూలాధారముగ నుండు కేంద్రపారిశ్రామిక సహాయకసంఘము (All India Industrial Corporation) ను ఏర్పాటుచేయవచ్చును. బ్యాంకింగు కమిటీ సభ్యు డగు మనుసుబేదారుగారు (Mr. Manu Subedar) వెంటనే అట్టి అఖిలభారతసంస్థను ఏర్పాటు చేయవలసినదని సూచించుచు వేరుగ ఒకనివేదికను తయారుచేసియుండిరి. కాని మొదట, అట్టిసంస్థ నేర్పాటు చేయుటకు కావలసినంతధనమును సేకరించుట కష్టము; రెండవది, ఇదివరలో ఇట్టిపనికే ఏర్పాటుకాబడిన టాటా కంపెనీవారి పారిశ్రామికసహాయపుబ్యాంకు (Tata Industrial Bank) కొద్దికాల మైనతరువాత విఫలమగుటచే మరల అట్టిదానిని అనుభవము లేకుండ స్థాపించుట మంచిపని కాదు.

౫

ఇంక వ్యవసాయపరిశ్రమకు సహాయముచేయు మార్గములనుగూర్చి విచారించిన వ్యవసాయదారునకు కావలసిన ముఖ్యవిషయము, ఇంతకుముందు దాతడు చేసిన అప్పులబరువును తొలగించుటయు, ఇకముందు తనపనిని కొనసాగించుటకు కావలసినసొమ్మును ఆతనికి సప్లయి చేయుటయు నైయున్నది. ఎక్కువకాలము (long term loans—అనగా వెంటవెంటనే తీర్చవలసిన అవసరము లేనట్టియు, అట్లు తీర్చకపోయిన కాంపౌండు రేట్లతో పెరుగనట్టియు అప్పులు) అమలునందుండు అప్పులు అతనికి ఇచ్చుమార్గముల నేర్పాటుచేయుట: మా మూలుపరపతిసంఘములు ఆతనికి తాత్కాలికముగ కావలసిన అవసరములకై సొమ్మును సప్లయిచేయకలవు కాని, అనేకమందితో అనేకవిధములగు పద్ధతులపై వ్యవహరించుసంస్థ లగుటచే అవి పైన సూచించినట్టివిధమగు అప్పుల నీయజాలవు. దానిని సరియగుసంస్థలు భూమితనఖాబ్యాంకులని ఇంతకు ముందే వ్రాసియుంటిమి. ప్రస్తుతము మనదేశములో అక్కడక్కడ ఈసంస్థలు బయలుదేరుచున్నవి; కాని అవి ఏపనులకై ఏర్పాటుకాబడినవో ఆపనిని పూర్తిగ నెరవేర్చుటకు సొమ్ము తక్కువయగుటచే వాటికి వీలు లేకుండపోవుచున్నది. వీటికి ప్రభుత్వసహాయము చాల అవసరమైయున్నది. ప్రతిరాష్ట్ర ప్రభుత్వమువారును ఆయారాష్ట్రములలో రాష్ట్రభూమి తనఖాబ్యాంకుల నేర్పాటుచేసి వాటియందు కొన్నివాటాలను పుచ్చుకొని, వాటి డిబెంచెర్లను కొని ఇంక ఇతరవిధముల వాటికి ధనసహాయముచేసి ప్రోత్సహించుట చాల ప్రాముఖ్యవిషయమై యున్నది. దీనితోపాటు అప్పటిరేట్లను తగ్గించుటకును, ఆరేట్లకు హెచ్చురేట్లు విధింపబడకుండునట్లు కోర్టులకు అధికారముండునట్లు చేయుటకును ప్రతిరాష్ట్రమునందును చట్టరూపకనిబంధనల నేర్పాటుచేయవలెను.

ఈమార్పులు కాక వ్యవసాయపుకమీషనువారు సూచించినపద్ధతిప్రకారము వ్యవసాయపునిర్మాణవిధానమును (constructive agricultural policy) ప్రతిరాష్ట్రప్రభుత్వమువారును ఆయారాష్ట్రముల అవసరమునుబట్టి ఏర్పాటుచేసి దాని నమలునందుంచుటకు తమయావచ్ఛక్తిని వినియోగించుటకూడ చాల అవసరము. గ్రామస్థులకు అనువగువిద్య, గ్రామములు ఆరోగ్యవంతములుగను, నివాసయోగ్యములుగను నుండుటకు తగు సౌకర్యములు, గ్రామములకు తగునీటివసతి, వైద్యసహాయము—ఇవన్నియు ప్రవేశపెట్టుట చాల లాభదాయకమును, అవసరమునునై యున్నవి. మరియు వ్యవసాయపరిశ్రమను లాభకరముగ చేయుటకును, వ్యవసాయములో నవీనశాస్త్రపరిశోధనలయొక్క వివరమును గ్రామస్థులకు విరివిగా తెలియపరిచి వాటి ననుకరించునట్లు చేయుటకును, ఏయేవిధముగ వ్యవసాయదారుల ఆర్థికాభివృద్ధి సమకూడునో ఆలోచించి దానికి తగినవిధానమునుగూర్చి ప్రభుత్వమువారికి సలహా నిచ్చుటకును, వివిధప్రాంతములలో ఆర్థికసలహాసంఘములు (Economic Advisory Councils) ఏర్పాటుచేయబడవలెను. ఈవిధమగుసంఘముల నేర్పాటుచేయుట హిందూదేశపు ఆర్థికాభివృద్ధికి చాల సహాయముగా నుండునని అంతర్జాతీయసభయొక్క ఆర్థికశాఖ ముఖ్యాధికారి (Head of the Finan-

cal Section of the League of Nations Secretariat) అను సర్ ఆర్థర్ సాల్టర్ (Sir Arthur Salter) గారు వ్రాసియుండిరి. ఆసలహానే బ్యాంకింగు విచారణాసంఘమువారు కూడ కొద్ది మార్పుతో ఆమోదించి యున్నారు.

హిందూదేశములో బ్యాంకింగుపద్ధతులు విరివిగా వ్యాపించి అభివృద్ధి పొందవలెననిన, క్రొత్తగా ఏర్పడుచున్న బ్యాంకింగుసంస్థలు జయప్రదముగ పనిచేయవలెననిన, బ్యాంకింగువిషయములలో తగిన అనుభవము కల్గి దానికి కావలసినవిద్యను కలిగినట్టివా రుండుట ముఖ్యము. దానికై బ్యాంకుల నడుపుట, వాటివిధులు మొదలగుసంగతులను బోధపర్చుకళాశాలలు ఏర్పాటు చేయవలసియుండును. ప్రస్తుతము దేశమునందు ప్రబలముగానున్న నిరుద్యోగసమస్యను తగ్గించుటకుకూడ దీనివలన అవకాశ మేర్పడును. విశ్వవిద్యాలయముల బ్యాంకింగ్, కామర్సు (Banking and Commerce) శాఖల నేర్పాటుచేసి బ్యాంకింగునందు నిపుణులను తయారుచేయుటయు, హిందూదేశపుబ్యాంకింగు ఇన్స్టిట్యూట్ (Indian Institute of Bankers) వారి యాజమాన్యముక్రింద బ్యాంకు ఉద్యోగస్థులపరీక్షలు ఏర్పాటుచేయుటయు ఈసందర్భములో జరుగవలసిన ముఖ్యములగు మార్పులు.

౬

బ్యాంకింగ్ విచారణాసంఘమువారు దేశమునందలి ఆర్థికసమస్యాపరిపూర్తికై పైన సూచించినవిధముగా అనేకములగు సూచనలను చేసియున్నారు. మనము రెండువిషయములను జ్ఞాపకముంచుకొనవలయును: ౧. దేశమునందు ఆర్థికముగ అభివృద్ధి కన్పింపవలెనినిన పరిశ్రమాభివృద్ధి, వ్యవసాయాభివృద్ధి ఈరెండింటి వలననే అది చేకూరును. ౨. ఆఅభివృద్ధికి డబ్బు కావలెను: డబ్బు ప్రజల నుండియు, వారు నిల్వచేసియుండిన దాని నుండియు రావలసియున్నది. దేశములో విరివిగా బ్యాంకులు బయలుదేరిన ప్రజలు తమతమనిల్వసొమ్మును వాటియందు డిపాజిట్టుచేయుదురు; అస్సొమ్మును పైవిషయములకు ఖర్చుపెట్టుటకు అవకాశము ఏర్పడును. కాని అన్నింటికిని మూలమైనది బ్యాంకులసంఖ్యయం దభివృద్ధి. ప్రథమమున వాటి నేర్పాటుచేయుటయును, తరువాత అవి సరిగా పనిచేయుచున్నవో లేదో తనిఖీ చేయుటకును అవసరముకూడ కలదు. రిజర్వుబ్యాంకును కమిటీవారు సూచించినట్లు వెంటనే ఏర్పాటుచేసిన ఆబ్యాంకువారు ఈపనులను చేయుచుందురు. ఇతర సూచనలుకూడ వాటివాటిఅవసరమును, యోగ్యతను అనుసరించి ప్రభుత్వమువారు కార్యరూపముగ మార్చుటకు పూనుకొనవలెను. బ్యాంకింగు కమిటీవారు తమసూచన లన్నియు ముందు దేశమునకు బాధ్యతాయుతస్వపరిపాలనపద్ధతి ఏర్పడుచున్నదను ఉద్దేశ్యముతో చేయబడిన వని తమరిపోర్టులో వ్రాసియున్నారు. కాన ముందేర్పడబోవు స్వపరిపాలనాధికారముక్రింద ఈసూచన లన్నియు సఫలములగునని వారి యాశయమని మన మూహింపవచ్చును. ఆప్రభుత్వమువారు తప్పక వాటి నన్నిటిని అమలునం దుంచుటకు మనఃపూర్వకముగ తప్పక ప్రయత్నింపవలసియుండును; ఎందువల్లనన ఆ ప్రభుత్వపద్ధతిక్రింద అన్నిశాఖలును ప్రజాయత్తములగును; మంత్రులందరును శాసనసభలకు బాధ్యులై యుందురు. ఈఆశ తప్పక సఫలమగునను ఆశతో ఈవ్యాసమును ముగించెదము.

# హృదయావేగము

క్రొత్తపల్లి సూర్యారావు గారు

(గీతమాలిక)

డెందమా యెందుఁ బోయెద వెందుఁ బోదు
వెందుఁ బోయెదు డెందమా! యెంత పిలిచి
నను నెదుటఁ బోవుచుండియు వినవు కార్య
గౌరవం బెట్టిదో! యొహో! సారమిత్ర
నీవ! పిలిచితి, వెవ్వరో నే నెఱుఁగని
వారి ధ్వనివలె నున్నది- యూరకుంటి-
నేనె పిలిచితిఁ బిలిచితి నిన్నె, కేలు
తట్టితిని-వింటెఁ-జప్పటుల్ తట్టువారు
గలరె నన్నని మిన్నక వెలలుచుంటి-
డెందమా యంటి, డెందమ, డెందమా య
టంటిఁ, బలుకకయున్నఁ బొమ్మంటి-నయ్యొ
యెంతమాటాడితివి! దృష్టి యిచట లేక
వినియు విననైతి క్షమియింపు. వెఱ్ఱి యెత్తు
చున్నదో మిత్రమా, యెటు లున్న దనిన
నట్టుడికినట్టు లుడుకుచున్నది శరీర
మేమి చేతుఁగ నెక్కడి కేగఁ దోఁప
దెచటఁ గూర్చున్న నచటనే యాడిగఁబ
డెదను నడచుచు నుంటినో కదలకుంటి
నో యెఱుంగను-నేఁ డేమియొక్కొ-యింత
చింతకును గారణము? నేఁటిచింత గాదు
రక్తనాళంబులందు నాంత్రములయందు
నల్లగుండె నస్థుఁ బట్టి నన్ను వేఁపు
కొని తినుచునున్న దీచింత మునుపుఁగోలె
నెన్నఁడును నాకుఁ దెల్పవు నన్ను నన్యుఁ
గాఁ దలంచితి వొక్కొ- నీ కాయమును గ
దయ్యొ! నీ కేమి తెలియు, నీ కంత తెలివి
యేది? డెందము కుదుట లే దెట్లు నేర్తు
వెతఁగికొన-నౌను నీ పృథగ్వృత్తి నన్నుఁ
గట్టివలెఁ జేసినది దాన గ్రహణశక్తి
పోయె; మస్తిష్కవాదులు పొనుఁగుపడిరి.
హృదయము ప్రధానతయె హెచ్చు, మెదడుదాని
చెప్పుచేఁతలలోనిది. చేతమునకు
మెదటికిని జాల సంబంధ మిదియు నదియు
లేక నే నేమి యెఱుఁగుదు, లిప్త యైన
నిన్నుఁ బెడఁబాయనట్టి నా కెన్నఁ డైనఁ
జెప్పవైతివి, నిజమె పో చెప్పినంతఁ
దెలిసికొను తెల్వియే యున్నఁ దెలిసికొననె
ముఖవికారాదులనుబట్టి- మొదటినుండి
యున్నదానికి నేఁ డేమి యొక్కపెట్ట
నిలు వెడలి పోవునంతటి యాతురవశ
భావ మేల కల్గెను నీకుఁ బ్రాణబంధు
నన్నుఁ దోఁకొనిపో విదేన మనమైత్రి
నీవు వెడలినఁ గోలెను లేవలేను
కాళ్లతీఁతలు, పిక్కలకంప, మూరు
చలన మిది యేమొ, సన్మిత్రుఁ దొలఁగుకతనఁ
బుట్టినది మొద లిద్దఱ మిట్టు లుండి
యుండి యుద్ధవిడిని బోవు చున్న నిన్ను
నిల్పలే నగుదును గాని నీకుఁ గల్గు
కష్టము లవేమొ తెల్ప మొక్కగడె నిలిచి
నెయ్యుఁడా చెప్పుటకు నేను నేర, నొకటి

నైన రెండైనఁ జెప్పెద నన్నియును సు
ఖాతిరేకము లే-విను మస్మదీయ
శక్తి తొల్లిటివలె లేదు, చక్కఁ జూడు
మున్న దే మూఁడుపూఁటల నన్నము దిను
నప్పటిబలంబు నీకు నీ నిప్పటులును
నుప్పుపిండులుఁ గాఫీలు, "కప్పఁగప్పు"
గప్పుగప్పునఁ గొనియెడు కారణమున
నున్న దే దేహికిని బుద్ధి మున్ను వలెను-
ఎవ్వ రెది చేయ నది చేయు నెవ్వ రేమి
చెప్ప నది నమ్ము, నెవ్వఁడు చెప్పువాఁడొ
యెవఁడు చేసెడివాఁడొ యీ వివర మెవ్వ
రికిని లే దందఱును నొకనికిని లోఁగ
కాత్మజీవన మొనరింప యత్న మొనరఁ
జేయుచును వారివేషంబు వేయువారె
వారివలె నటియింపను వారిఁబోలె
సంచరింపను, వారియ ట్లెంచఁ బోవు
వారె చూడుమ నెచ్చెలీ! దారి తెన్ను
తోఁపకయు మన దేహంబుతోడి యీాగ్ర
హాస్థుఁ గనవే వెనుకటిచర్యలకు నేఁటి
చర్యలకు నంతరమును, నిస్సారుఁ డితని
వదలిపోవుట తప్పకో ప్రాణమిత్ర !
నీకుఁ దప్పదు నా కేమి-నేనుమాత్ర
మెంత కాలంబు భరియింతు నితనిఁ-గొంత
ముందుగాఁ జెప్పవైతివి మూల మింత.
అయ్య, కనిపట్టుతెల్వి నీయందు లేదు
బుద్ధి లేకయె నేఁ జెడిపోవుచుంటి
టింగురంగా యనుచు నోయి డెందమా మ
ఱొక్కబొందెను జొత్తు-వే నొక్కఁడుఁడనె-
గాను మొదటఁ బయన మయి ప్రాణ మేగు
చున్న దని నీవు గుర్తించుకున్న వాఁడ
వదియు నే నొక్కస్థలముసు నడఁగి పెనఁగి
యున్న వారము తప్ప దన్యోన్యయామాత్ర
నీవు కొంచె మెరుసు మాకు-నీవు చేయు
నేను నీ కగపడుచుంటిఁ గాని నేను
వేఱుపా టేమొ కాని నే నేఱుపడుట
కెంతయును నోపఁ-జెప్పుమీ యింతమాత్ర
మున కె వెడలుదువా, లేరె ముక్కు మూల్గు
వ్యథలు గల వృద్ధు లెందరో-యట్టివారి
విడిచిపోవుచు నున్న వే యెడఁద లుసుఁబు
లేల తొందర మీకు-నీవే యనఁదగు
తొందర పడకుండఁగ నుండ నిగు నివ్వ
నీక చెల్లును. మున్ముందు లోక మెట్లు
లుండునో యెఱుఁగుదువె !-మొఱ్ఱో ! యిదేమి
బెదరు పెట్టుచునున్నారు. బెదరు నీకు
లేనియప్పుడు మేము గల్గింపఁ గలుగు
నొక్కొ !-యది గోము చెప్పరా-యుండలేక
పోవువారిని నిల్పి నీవు బలవంత
పెట్టుచున్న కతంబు న నట్టులో నిగి
చిటిమి-సంగ్రహాముగ విను స్థితిని గొంత.
అందఱిది యన్ని త్రోవలా, నడవు నాజ్ఞ
లుండఁ బో వాఁడుదియుఁ బురుషుండు నెవరి
యంత వా రుండఁ జూతురు-ప్రాణసఖుఁడ
పురుషునుద్యోగమును సతి పొందఁ గోరు.
సతుల యిల్వాడి పురుషులు సంగ్రమింతు-
కులమ దేమను గూటి కెగ్గు గుందొక్కొ
యనును, వావులు మన కేన-యవనులకునో

వారు మనుజులు కారొక్కొ_వారిఁ జూచి
నేర్చుకొను నాగరకతయే, నీకు నాకు-
పూర్వులగు మన పెద్దలు బుద్ధిహీను
లనును-పరశాస్త్రములు నమ్మి యజ్ఞుఁ డగుట
నాత్మశాస్త్రిములను నింద యాచరించు
నెఱుఁగ నేరఁడు భేదమ్ము-నెవరి నేమి
యనినఁ దప్పగు-వారు చేసినది మేలు
మేలనుచుఁ బొగడంగను మెచ్చుకొంద్రు-
కూడ దనువారి నూరిలోఁగూడ నుండ
నీయ రనువైన యపుడెల్ల నేదియైన
హాని యొనరింప నే చూతు-రాత్మకృత్య
మెంత గర్హ్యంబు గాని నోరెత్తరాదు.

స్తవ్యమైనను బరకృతి సరణి కెక్క-
డెవరి నేమన్నఁ దప్పు వా రిచ్చుబడిని
బోవఁ బోనిచ్చుటయె కాని పుత్రునైన
వలదనిన నూరివారలు వచ్చిపడుదు
రెవ్వరైనను నది చేసి రిట్టు లనిన
తప్పు నాదగు, మిత్రమా చెప్ప నేమి
వా ర్మహారాజులే-ధనవంతులిండ్ల
నేమి జరగిన నది వేదహితమె పేద
వార లొనరింప దూష్యంబు-వారిఁ జూచి
చేయు టెట్టులు నిర్ధని స్నేహితుండ!

గట్టిగా మాటలాడకు కానికాల
ముండు గోడలకుఁ జెవు ల్మఱొండు మాట
లాడఁగూడదు, నిర్జీవ మట్టు లెట్టు
లుండవచ్చును మాకు నీ యుర్విలోన
మద్దిఱోలన్న నన్నె మర్మముగఁ బలికెఁ
బుష్టిగా నుంటి నను-గున్న పొన్న యన్నఁ
బొట్టిగా నున్న ననుఁ దిట్టఁబోయె నను.
ధనదుఁ డనరాదు మాటఘోరణిని గూడ
గ్రుడ్డికన్నని నన్ను వ్రాకుచ్చు మిషయు
యనుచుఁ బలుకును నోరెత్తి వ్రాజ్ఞ యొదవు
పేదలకుఁ గాదు లోకము ప్రియావయస్య!
యేటి కీ లోకమున నుండ నింక మీఁదఁ,

గుడిచి కూర్చున్నవాని నీకు నిది జబ్బు
శ్రద్ధ చేయుము మునుముందుఁ బ్రబలమగును
తినుము గ్రుడ్లను, పాలు వ్యాధికిని మూల
మప్పుడప్పుడు ద్రాక్షాసవాదులఁ గొను
మనును బ్రాహ్మణు వైద్యుఁడు-వ్యాధితు నీకు
జబ్బు గా దిది యెల్లప్డుఁ జల్లగాలి
లోనఁ బంపుకొనుము నదీస్నాన మొనరఁ
జేయు మను; దప్పు లిం దేవి చెప్పఁ డనినఁ
బండితుఁ డసూయచే వానివాక్యములను
వినఁడు తీరిక లే దను వీనిలోనఁ
దప్పు లే దనుఁ-దెల్పఁడు-విప్పఁబోకు
నోరు మర్యాద దక్కదు. కూరిమిచెలి
యొద్ద మోసంబుఁ జూపును బెద్దపెద్ద
వర్తకుఁడు-సేవకుఁడు తనప్రభుని మోస
పుచ్చు, నన్నను దమ్ముఁడు మెచ్చుకొనఁడు.
తల్లిమాట కూఁతురు తన తండ్రిమాట
కొడుకు వినఁ, డేల యతనివాక్కు_లె యతనికిఁ
గొన్నినాళ్లకుఁ గా వింపు-సున్నియగును,
క్రైస్తవుండగు, జైనుఁడౌ, నాస్తికుండు
బ్రాహ్మమతగామియౌఁ దనబ్రాహ్మణత్వ
మవలఁ ద్రోయును వేదనింద్యములు పెక్కు-
చేయు నిరసించు నార్యులఁ జెందు నార్య

మతము తన కందు వలయును మంత్రయుక్తి
బ్రాహ్మణుఁడుమాత్ర మెందుఁగారాదు వాఁడు
లోకమున కెగ్గు చేసెను-లోకు లెల్ల
వాని బహిష్కరింపవలయుఁ గేవలముఁ బూర్వ
పదము గాఁగూడ దాబ్రాహ్మ్య మిది విచిత్ర
ముగద మఱి కమ్మబ్రాహ్మణులుగనో నాయి
బ్రాహ్మణులుగనో నుండినఁ బ్రాజ్య ముత్త
రపద బ్రాహ్మణ్య మిపు డెంచరాని శేఖ
రంబువలె నున్న దయ్య యీరంగులెల్లఁ
జూచుచుండంగ నోపక లేదినార
ముండవచ్చునె పక్షపాతోర్వలోన
శబ్దశాస్త్రప్రశస్తభాషణము తప్పు
పిచ్చిపిచ్చిమాటలు జనప్రీతి చేయు
వయసులోఁ బతి లేకున్న పడఁతి భ్రూణ
హత్యదోషంబు తండ్రి కౌ ననుచుఁ, గూఁతుఁ
గన్యగా నుంచుఁ, జదువున కన్యదేశ
ములకుఁ బుత్రుని బంపుఁ గోడలు కృశింప-
విషమునలోఁ బుట్టుపురువులవిధము గాఁగ
నుండువా రుంద్రు గాక యీ యొడలియందుఁ
బట్టి పలుతిండ్లు దిని మమ్ము రట్టుచేయు
దేహి నేరీతిఁ దాల్తుము-దేహధారి
హృదయమును నమ్మఁ డతనికి నింక నెవ్వి
కృత్యములు చూపి చెప్పనో కేవలమును
మమ్ము నొకమూల నుంచి తా మసలఁ బోవు

వాని నెట్టులు భరియింప వలయు, నేమి
మాత్ర ప్రయోజన మున్న దీ మనుజునకును ?
లోక మేరీతిఁ బోవుచు నుండు వలదా
మమ్ము మాటాడనీఁడు మా మనవి వినఁడు
మాపొడయ కిట్టకున్న నీ పాప మమ్ము
నిలువనిచ్చుట లేదు, తేనీళ్లు, కాఫి,
కోడిగ్రుడ్డుల సారంబు కోకో మొదలు
నేఁడి పైకుబ్బి పొంగించు వివిధరసము
లందు ముంచుచు నూపిరి సలుపనీఁడు
పైకిఁ జల్లగ నుండి లోపలను మాఁడ్చు
క్రుమ్ముఁ బోలిన బ్రాందిసారఁ గ్రుమ్మరించుఁ
గారకిల్లీలు నమలి వికారపెట్టుఁ
బామ్మనఁగ లేక పొగపెట్టు పోకిరిగాఁగ
జుట్టపొగ, బీడిపొగ, సిగరెట్ల పొగలుఁ
గాక, క్రొత్తగఁ దెచ్చి గుడాకుపొగను
గుప్పగుప్పన నూఁదర గొట్టమునుండ
నితనిలో నుండఁగలము మనెన్నెన్ని యెంచి
చెప్పఁబోదుము కాలము చెల్లుచుండె
నితనిలో నుండఁజాలము వాతఁ బడుచుఁ
బోయినత్తుము మఱినకు మాయసఖుఁడు
యనినఁ గాయంబు పెళ్లవిల్లుట్లుఁ జల్లఁ
బడియె నిలుచున్నవాఁ డొరఁ బడియె నరుఁడు
సృష్టిలో వచ్చినది కొంత చేసికొన్న
నొక్క—కొంతయు నై కర్మ మొడియ నతని.

# హిందూదేశపు నాణెములు: చలామణి—మారకము

## (Indian Currency and Exchange)

మల్లాది వెంకటరామయ్యగారు, బి. ఏ., బి. యల్.

౧

ప్రౌరుని పౌరధర్మములందు మాతృదేశముయొక్క వివిధపరిస్థితులలో రాజకీయార్థికములను బాగుగ తెలుసుకొనుట ముఖ్యమైనది. దేశముయొక్క రాజకీయార్థికపరిస్థితుల సంపూర్ణజ్ఞానముతో చేసిన దేశసేవ అధికసారవంతముగను, తీవ్రముగను ఉండును. ఈరాజకీయార్థికపరిజ్ఞానములలో రెండవది దేశమునకు ఎక్కువ ప్రధానమైనది. కాని, ఇది సులభసాధ్యము కాదు. ఐనను ఈవిషయమున్న గల శాస్త్రగ్రంథావలోకనమువలనను, వివిధవార్తాపత్రికలపఠనమువలనను ఈజ్ఞానము కొంచెము లభించును. మనదేశములో చదువరులు నూటికి ఎనమండుగురుకూడా ఉండకపోవుట కడు శోచనీయము. చదువరులలో రాజకీయతత్త్వవేత్తలు బహుఅరుదు. ఆర్థికతత్త్వవేత్తలు మరీ అరుదు. మతసాంఘికాదివిషయముల కంటె రాజకీయము లెక్కువక్లిష్టమైనవి. రాజకీయముల కంటెను మరీక్లిష్టమైనవి ఆర్థికములు. ఆర్థికపరిజ్ఞానము జనులలో వ్యాపింపజేయుటకు ప్రత్యేక ఆర్థికసంఘములు దేశమంతటను స్థాపింపబడవలయును. ఆంధ్రమందు అర్థశాస్త్రమును బోధించుగ్రంథములు చాలా తక్కువ. ఆంగ్లమందు దీగ్రంథావళి యున్నను ఆంగ్లభాషాపరిచయము లేనివారికి అందుబాటుగుటకు ఆంధ్రమందు ప్రత్యేకఆర్థికసమస్యలను బోధించు గ్రంథములు వెలువడవలయును. ఈమధ్య బంగారు ధాతుప్రమాణమును (Gold Standard) ఇంగ్లాండుదేశములోను, మనదేశములోను ప్రభుత్వమువారు సవరణచేసి 3 రోజులు బ్యాంకులకును ఆఫీసులకును సెలవు లిచ్చినారు. అందువలన జనులను ఈవిషయము కొంత ఆకర్షించినది గాని, విషయమును బోధపరిచినవారు గాని, బోధపరుచుకొన్న వారు గాని చాలాఅరుదు. ఆర్థికవిషయములను తెల్సుకొనుటకు ప్రయత్నము చేసినపుడు కొంత విసువు కలుగును గాని దేశాభిమానమే ప్రధానముగా నెంచి యీ విషయములందు కొంచెము ఏకాగ్రత గలిగినయెడల ఇవి సుబోధములై వీటియందు అభిలాష వృద్ధియగును.

ఆర్థికవిషయములను తెల్పు శాస్త్రము అర్థశాస్త్రము. శాస్త్రములు ప్రకృతిశాస్త్రములని, సాంఘికశాస్త్రము లని రెండువిధములు. ప్రకృతిశాస్త్రములు ప్రకృతి, లేక, ప్రపంచముయొక్కయు, ప్రకృతిలోని నైసర్గికపదార్థములయొక్కయు తత్త్వమును తెలుపును. భౌతికశాస్త్రము, రసాయనశాస్త్రము ప్రకృతిశాస్త్రములు. సాంఘికశాస్త్రములు సంఘములోని మనుష్యుల వ్యాపారములను, వారి అన్యోన్యసంబంధములను తెలుపును. నీతిశాస్త్రము, అర్థశాస్త్రము సాంఘికశాస్త్రములు. అర్థశాస్త్రము అర్థము, లేక, సంపత్తు, భాగ్యమును గురించి పరిశీలించును. మనదేశములోని దారిద్ర్యమెట్లు పోవును? ఇతరదేశములతోపాటు మనదేశ మైశ్వర్యవంతమై యెప్పుడు తులతూగుచుండును? మన దేశ పరిశ్రమలు, వాణిజ్యము, వ్యవసాయము, వీటి నభివృద్ధిపరచుటకు మనప్రభుత్వ మేమి చేయవలయును? ఏ పన్నులవలన ప్రభుత్వకోశ మేర్పడవలయును? పదార్థముల విలువ నిశ్చయించుటకే ప్రమాణ ముండవలయును? నాణెములు, వీటి చలామణి, మారకము విషయమై ప్రభుత్వవిధాన మెట్లుండవలయును? పై ప్రశ్నలలో నిమిడియుండు సమస్య లన్నిటిని అర్థశాస్త్రము పరిష్కరించును.

మనదేశముయొక్క ప్రస్తుత పరిస్థితులలో అర్థశాస్త్ర ప్రాముఖ్యమును, అవసరమును ఇంతంతని చెప్పుటకు శక్యము కాదు. మన జాతీయ జీవితమునకు అర్థశాస్త్ర జ్ఞానము ప్రధానమని వేరే నొక్కి వక్కాణించ నవసర

రము లేదు. పాశ్చాత్యదేశము లన్నిటిలోను ఆర్థికవిషయములే యిప్పుడు ముందుకు వచ్చినవి. అర్థశాస్త్ర మక్కడ నెక్కువప్రాముఖ్యము వహించినది. గడచిన ఐరోపామహాసంగ్రామమునకు రహస్యకారణములు ఆర్థిక కారణములే. పాశ్చాత్యదేశములందు దమలులో నున్న ఆర్థికసిద్ధాంతములు, ఆర్థిక న్యాయములు మన దేశార్థిక పరిస్థితుల కెంతవరకు వర్తించు నన్న విషయము చిక్కులి వివాదాంశమై యున్నది. అర్థశాస్త్ర మెక్కువగా, నిర్దేశించును, గాని విధించదు. దేశములలో అర్థసంపాదన మెట్లు జరుగుచున్నదో యీశాస్త్రము నిర్దేశించును, అనగా పరిశీలించి చెప్పును. కాని అర్థమును సంపాదించవలెనని విధించదు. అయినను, ఆర్థికశాస్త్రవేత్తలు కొన్ని ఆర్థికసూత్రములను స్పష్టీకరించినారు. కొన్ని ఆర్థిక ప్రత్యేకసమస్యలను విమర్శించుటకు కొన్ని మూల ఆర్థిక సిద్ధాంతములను తెలుసుకొనవలయును. ఒక దేశమున కన్యదేశస్థులు పాలకులైనప్పుడును, పాలితదేశములోని విశిష్ట వస్తుజాలముయొక్క ఉత్పత్తి అపారమైనప్పుడును, పాలకులు తమస్వదేశమును ఆర్థికముగ వృద్ధిపరచుకొనుటకు అన్యదేశపాలనమందుంత రాజనీతిని పాటింపక పోవుటయే కాక పాలితదేశమందు రాజకీయ ఆర్థిక నిబంధనలను చట్టరూపకముగ శాసింతురు. ఇది స్వభావసిద్ధమైనది. ప్రపంచమందు స్వలాభపరాయణత యనుగుణము వశించిన గాని చిన్నపనులను, పెద్దపనులను ఎవరును నిష్కామబుద్ధిని జేయరు. మనదేశమందు మనలో మనము మతసాంఘిక విషయములందు ఎంత తీవ్రాభిప్రాయభేదములను కలిగియున్నను, ఎన్ని జాతిమతవైషమ్యములను కలిగియున్నను, భారతీయు లందరు ఏకగ్రీవముగా ఏకాభిప్రాయమును కేంద్రీకరించి నట్టివిషయ మేమైన నున్నదా యన్నప్రశ్నకు జవాబు దేశముయొక్క ఆర్థిక విషయమే. భారతదేశముయొక్క ఏవిషయమందు భారతీయుల ఏకగ్రీవాభిప్రాయమును, భారతీయుల అభిప్రాయమే గాక భారత ప్రభుత్వాభిప్రాయమునుగూడ ఆంగ్లప్రజలు తమస్వప్రయోజనాభివృద్ధికొరకు కావించిన ఆందోళనముచేత ఆంగ్లప్రభుత్వమువారు తృణీకరించి ఏసమస్యయందు నిరంకుశముగా ప్రవర్తించి రను ప్రశ్నకుగూడ జవాబు భారతదేశార్థిక సమస్యయం దని చెప్పవలయును. ఇంగ్లండులో ప్రతిమనిషికి సగటున ఆదాయము రు 3-0-0కు పైగా నున్నది. మనదేశములో ప్రతిమానవునకు సగటున ఆదాయము ఒక అణా కన్న తక్కువ ఉన్నదీలు. మూడురూపాయి లెక్కడ, పండొమ్మిదవ వంతు లెక్కడ? మనదేశముయొక్క నిజమైన ఆర్థికపరిస్థితులను తెలుసుకొన్న యెడల ప్రతి హైందవుని హృదయము వివాదించుకొనిపోక మానదు. నిజమింత మన ప్రజలు తెలుసుకున్నా రేమనవచ్చునో?

మనము వ్యాసవిషయమునకు వత్తము. అర్థశాస్త్రములోని అర్థపదమునకు భాగ్యము, సంపత్తి అర్థము. ఈశాస్త్రమునందు అర్థోత్పత్తి, అర్థాభివృద్ధి, అర్థవిభజన, అర్థవినిమయము పరిశీలింపబడును. ఈవిషయము లన్నిటితోను ప్రభుత్వము నకు చిక్కులి సంబంధ మున్నది. ఈవిషయములనుగురించి ప్రభుత్వము చేయవలసినకృత్యములను, విధులను ప్రభుత్వపు ఆర్థిక విధు లందురు. అర్థశాస్త్రము పరిశీలించువిషయములనుబట్టి అర్థశాస్త్రభాగము లేర్పడును. అర్థోత్పత్తినిగురించి చెప్పుభాగము ఉత్పత్తికాండము. అట్లే వినిమయకాండ మున్నది. వినిమయ మనగా మార్పు లేక, మారకము. దేశములో గాని, దేశములలో గాని ఉత్పత్తికాబడిన వివిధ సామగ్రులను ప్రజలు తమలో తాము మార్చుకొనవలసియున్నది. అన్నిసామగ్రులు ఒకరిచేత గాని, ఒకదేశములో గాని, ఉత్పత్తి కాబడవు. మనజీవితమునకు మనకు వివిధపదార్థములు కావలయును. నాగరకత వృద్ధియయిన కొలది వాంఛలు వృద్ధియగు నన్నసిద్ధాంతము ఆర్థిక ప్రగమసూత్రము. వాంఛల తృప్తికొరకు పదార్థోత్పత్తి. పదార్థవినిమయము కావలయును. ఒకరు తనపదార్థమును మరియొకని కిచ్చి దానికి బదులుగా మరియొకపదార్థమును తీసుకొనుట వినిమయము. ఇట్టివినిమయము నాణెములు లేనికాలమందుండెడిది. అడవులప్రాంతములను ఏజన్సీలలో అట్టిపద్ధతి ఇప్పుడుకూడ ఉన్నది. ఆపద్ధతి మనకు అంత ప్రస్తుతము కాదు. ఆధునికమందు వినిమయము నాణెములసహాయమున జరుగబడుచున్నది. ఒకడు బట్టలను నేయును, ఒకడు ధాన్యమును పండించును, మరొ

కడు పశువులను పెంచును. ఒకడు గనినుండి లోహమును తీసి తయారుచేయును. ఒకడు విద్య చెప్పును. ఒకడు మందువేయును: కొందరు సామగ్రులను విక్రయింతురు. కొందరు దేహశక్తిని, తెలివిని, పనులను, విక్రయింతురు. నాణెములసహాయమున జరుగు వినియము విక్రయ మన బడును. క్రయవిక్రయములకు పదార్థములవిలువను తెలుసుకొనవలయును. పరివృత్తిలోనైనను ద్రవ్యము మార్పు లేనప్పటికి పదార్థములవిలువ నిర్ధారణ కావలయును. పదార్థములవిలువ వాటిబాహుళ్యమును బట్టియు, వాటి అవసరమునుపట్టియు ఉపయోగమును బట్టియు ఉండును. వాటిఉత్పత్తినిబట్టికూడా ఉండును. గాలి ప్రాణాధారమైనను బాహుళ్యమునుబట్టి విలువకలిగినది కాదు. బంగారము వెండిగనులు అరుదు. తయారుచేయుటకును చాలా వ్యయప్రయాసములు గలుగును. ధాన్యము బంగారముకంటెను ఉపయోగకరమైనను విరివిగా దొరకును. బంగారు తయారుచేయుటకంటె ధాన్యము పండించుట చాలా తేలిక. పదార్థములవిలువ వేర్వేరుకారణములచేత నిర్ణీతమగును. అన్నిపదార్థములవిలువ అందరికి గోచరమగునట్లుండవలయును. ఏదోయొకవస్తువును ప్రమాణముగా ఉంచుకొని తక్కినపదార్థములవిలువ ప్రమాణమైనవస్తువు విలువలోనికి మార్చిన యెడల అందరికిని తెలియును. ఏవస్తువును ఇతరవస్తువులవిలువను తెలియపరచుటకు ప్రమాణముగా ఏర్పాటుచేయవలయును? లోహములా? కాగితములా? లోహములైన ఏలోహము? వెండిధాతువును పరిమాణముగా అంగీకరించితిమని యనుకొందము: అప్పుడు దేశము ఏకధాతుపరిమాణదేశమనబడును —( Monometalism). దేశములో వెండిని బంగారమును రెంటిని పరిమాణముగా గ్రహించినయెడల అట్టిదేశము ద్విధాతుపరిమాణదేశమనబడును— (Bimetalism). ఒకదేశములో ద్విధాతుపరిమాణమున్నయెడల రెండుధాతువులకు, అనగా వాటినాణెములకు ఎట్టిప్రమాణము ఒకదానికొకటికి ఉండవలయును?

ఈసమస్యలన్నియు నాణెముల చలామణికి సంబంధించియున్నవి. ఇవి చలామణి సమస్యలు. మనము విదేశములతో వ్యాపారము చేయవలయును. సరకులు ఎగుమతి యగును. విదేశముల నుండి దిగుమతియగును. మనసొమ్ము విదేశవర్తకులకు చేరునా? విదేశీయులసొమ్ము మనవర్తకులకు చేరునా? చేరనియెడల బాకీలు పరిష్కారమెట్లగును? రెండుదేశములలో వేర్వేరుధాతుపరిమాణము లున్నయెడల ఒకదేశముయొక్క నాణెములకు రెండవదేశము నాణెములకు మారక మెట్లు? ఇట్టి మారకము ఆయా ధాతువుల బజారుకిమ్మత్తునుబట్టి యుండవలయునా? లేక వివిధదేశములందలి వివిధధాతువులమారకమును (Exchange) ప్రభుత్వమువారు జోక్యము కలుగజేసుకొని మారకపురేటును శాసనముచేత నిర్ణయింపవలయునా? ఈసమస్యలన్నియు వివిధధాతువులనాణెముల మారకమునకు సంబంధించినవి. ఇవియే మారకపుసమస్యలు—(Exchange problems).

ఈ వ్యాసములందు ప్రథమభాగమున చలామణిసమస్యలను, రెండవభాగమున విదేశవర్తకమువల్ల తటస్థించిన మారకపుసమస్యలను విమర్శింతుము. ఈ విమర్శనలో మనదేశములోని పై సమస్యల ప్రాచీనచరిత్ర మన కంతగా ప్రస్తుతము కాదు. మనదేశము ఆంగ్లప్రభుత్వములోనికి వచ్చినప్పటినుండియు ఈసమస్యలను ప్రభుత్వమువారు అప్పుడప్పుడు ఏవిధముగా పరిష్కరించినదియు క్లుప్తముగా విమర్శించి, యుద్ధానంతరమునుండి ఈసమస్యలు దేశములో ఎట్లు పరిణమించినదియు, మనప్రభుత్వమువారేమి చేయుచున్నదియు, మననాయకులు ఈసమస్యలవిషయమై ప్రభుత్వమువారిని ఏమి చేయమన్నదియు మనము కొంచెము తబిశీలుగా గ్రహించవలయును. ఈవిమర్శనకు మనము ౧౭౫౭ వ సం|| ఆరంభముగ తీసుకొనవచ్చును. ఈ సంవత్సరమునాటికి ఆంగ్లేయులు చాలామట్టుకు హిందూదేశమును స్వాధీనముచేసుకొని వారిపరిపాలనమును దేశములో స్థాపించిరి. అంతకుముందు దేశములో వేర్వేరుప్రమాణములుగల వివిధములగు నాణెములు నానారకములవి చలామణిలో ఉండెను. మహమ్మదీయపరిపాలనకాలమందు వారి సామంతరాజులందరు స్వతంత్రరాజులైరి. స్వతంత్ర రాజ్యమునకు

ముఖ్యచిహ్నము ప్రత్యేకమైననాణెము. మహారాష్ట్రులు, ఆంధ్రులు, అరవలు, మళయాళీలు—ఇంకా ఇతరుల చిన్న చిన్న రాజ్యములందును ఉత్తరహిందూస్థానమందును వివిధములగు నాణెములు చలామణియందుండెను. ఎన్ని నాణెము లున్నను బంగారునాణెములు దేశమంతటను ప్రాచీనమునుండియు చలామణిలో ఉండినవి. అప్పట్లో మనదేశస్థులు చైనా, టిబెటు, సింహళము, ఆఫ్గనిస్థానము, పెర్షియా, టర్కీ మొదలైన విదేశములతో వర్తకము చేయుచునుండేవారు గాని, ఆంగ్లేయప్రభుత్వములో మనదేశమునకు తటస్థించినచలామణి మారకపు సమస్యలు అప్పుడు తీవ్రముగా ఉన్నట్టు గాని, దేశమునకు నష్టము కలిగించినట్టు గాని తోచదు. అయినను చిన్నచిన్నస్వతంత్రరాష్ట్రము లన్నియు బ్రిటిషుప్రభుత్వములోనికి వచ్చుటవల్ల బ్రిటిషురాజ్యమంతటను ఒకే ఎత్తును, వన్నెయు గల ఒకనాణెము చలామణిలో ఉండు టవసరమాయెను. అప్పుడు, అనగా ౧౮౩౫ సం॥లో ప్రభుత్వమువారు చలామణినిమిత్తము బంగారునాణెమును ముఖ్యమైన నాణెముగా స్థిరపరచుటకు బదులుగా వెండిరూపాయిని ముఖ్యమైన నాణెముగా స్థిరపరిచిరి. ౧౮౦ గింజల ఎత్తుగల నాణెముగా రూప్యమును టంకసాలలో తయారుచేసిరి. ౧౮౦ గింజల ఎత్తులో నున్న ౧౬౫ గింజల ఎత్తుగల మేలిమివెండిన్ని తక్కిన ౧౫ గింజల ఎత్తునకు కలితీలోహమున్ను కలిపి వెండిరూపాయిని తయారుచేసిరి. ఇట్టి రూప్యములను, వీటిలో సగమువంతు అర్ధరూప్యములను, నాలుగవవంతు పావులాలను, ఎనిమిదవవంతు బేడలను, రాగినాణెములను—అర్ధణాలు, కానులు, అరకానులు, పైసలు—దేశములో ప్రచారములో ఉండుటకు ప్రభుత్వమువారు తయారుచేసి చలామణిలో ప్రవేశపెట్టిరి. ఈనాణెములలో రూప్యము, అర్ధరూప్యము శాసనబద్ధములైన నాణెములుగా నిర్ణయింపబడినవి. అనగా ప్రజలు తమలో తాము ఎంతమొత్తమువరకైనను ఇచ్చి పుచ్చుకొనవలయునని శాసింపబడినది. ఇట్టినాణెములే ప్రధాన రాజనాణెములు (legal tender). ౧౮౬౫ సం॥ నాటికి ప్రభుత్వమువారు నోట్లు ముద్రించి చలామణిలో ప్రవేశపెట్టలేదు. అప్పటి మారకపురేటు ఒక బంగారుపౌనుకు ౧౦ వెండిరూపాయీలు.

మన ప్రభుత్వమువారు లండనులో ఉన్న మనప్రభుత్వ ఉద్యోగీయులకు జీతములను ఇంగ్లండుదు నాణెములో చెల్లించవలసివచ్చేది. మన రూప్యములను వారు పుచ్చుకొనరు. ఇంగ్లండులో ప్రమాణముగనాణెము ప్రధానమైన రాజనాణెము కాసు-బంగారునాణెము. అందువలన ఆంగ్లేయుల బంగారునవరసు, లేక కాసునకును మన వెండిరూపాయకును మారకపురేటు, ఇదివరలో బంగారుకాసునకు ౧౫ రూపాయీలని ఏర్పాటు కాబడినది. అందువలన ఇంగ్లాండులో మనము ఒకపౌను, లేక బంగారుకాసును ఇచ్చినను తీసుకొన్నను మన వెండిరూపాయీలు ౧౫ అగును. మన ప్రభుత్వమువారు రూప్యమును ముద్రించి ౧౫ రూప్యములకు ఒకపౌను మారకమని చెప్పుటకు అర్థమేమనగా, ఇంగ్లీషుపౌనులో ఉన్న బంగారము బజారులో అమ్మి ఆబంగారమునకు ఖరీదుకాబడిన వెండి ఎంత వచ్చునో ఆవెండిని ౧౫ భాగములుగ చేసి ఒక్కొక్క భాగమునకు తయారుచేయుటకవసరమగు మట్టునకు మాత్రమే కొంచెము కలితీకలిపి రూప్యమును తయారుచేసిరి. కాబట్టి నిజముగా ఒకరూప్యము పౌనులో ౧౫ వవంతు అయి వుండెను. పౌనులో ౧౫ వవంతు ఎత్తుగల బంగారమును ఒకనాణెముగా చేసినయెడల మిక్కిలి చిన్నదగును. దానికి సరిపోయిన వెండినాణెము పెద్దదగును. పైస్థితినిబట్టి ముద్రించినరూప్యము విషయమై మనము గ్రహించవలసిన ముఖ్యాంశము లేవన: ౧౮౩౫ సంవత్సరము దరిమిలా రేటు—(౧) ఒక ఇంగ్లీషుపౌనులో మన వెండి రూప్యము కిమ్మత్తు ౧౫ వ వంతు. అందువలన వీటి మారకపురేటు పౌనుకు ౧౫ రూప్యములు. (౨)౧౮౩౫వ సంవత్సరము ప్రాంతమందు ఇంగ్లీషుపౌనులోని ౧౫ వ వంతు బంగారు కిమ్మత్తును, బజారుధర ప్రకారము మన రూప్యములోని వెండికిమ్మత్తును సమానము. (౩) పైరెండు విషయములవలన తేలేపర్యవసాన మేమన: పౌనునకును రూప్యమునకును నిర్ణీతమైన మారకపురేటు—అనగా ఒక పౌనుకు ౧౫ రూపాయీలరేటు—పౌనులోఉన్న బంగా

రముయొక్కయు, రూప్యములో ఉన్న వెండియొక్కయు బజారుధరమీద ఆధారపడియున్నది. కాబట్టి బంగారు వెండిధాతువులఖరీదు బజారులో హెచ్చయినను తగ్గినను ఒకపౌనుకు ౧౫ రూప్యముల మారకపురేటు నిలబడజాలదు. వెండిబంగారుధరలు బజారులో మారినప్పుడు మారకపురేటుకూడా మారనియెడల పౌను, రూపాయీ మార్చుకొనుటలో ఎవరికో ఒకరికి నష్టము సంభవించక మానదు. ౧౮౩౫ సంవత్సరము లగాయితు ఇంతవరకును వెండిబంగారముల బజారుధరలు ఏకటాకీని లేవు. ఈవెండిధాతువులబజారుధరలనుపట్టి పౌనుయొక్కయు, రూపాయియొక్కయు మారకము దానంతట దానిని స్థిరపర్చుకోనీయకుండ మనప్రభుత్వము వారు జోక్యము కలుగజేసుకొని ఈధాతువుల బజారుధరలకు విపరీతముగా ఆమారకపురేటును శాసనముచేత స్థిరపరచికొని, నిబంధన లేర్పరచి, వాటిమూలమున శాసననిర్ణీతమైన మారకపురేటును అప్పుడప్పుడు ప్రజాభిప్రాయమునకు వ్యతిరేకముగా మార్చుచు స్థిరపరిచెంచుచుండిరి. ఇందువలన మనదేశమునకు కోట్లకొలది నష్టమును, ఆంగ్లేయులకు, ఆంగ్ల వర్తకమునకు విపరీతలాభమును కలిగినది. ఈమారకపుసమస్య క్లిష్టమగుటచేతనే ప్రభుత్వమువారు ౧౮౯౩, ౧౮౯౮, ౧౯౧౮, ౧౯౧౯, ౧౯౨౬ సం॥లలో ఈవిషయమందు దారితేరిన నిపుణులను మనదేశమందలి ఈసమస్యనుగుఱించి విమర్శించి నివేదికల నిమ్మని కమిటీలుగా ఏర్పరచిరి. ఎన్నికమిటీలు ఏర్పడి, ఎన్ని నివేదికల నిచ్చినను నాణెములచలామణి మారకపుసమస్య ఇంకను తెగలేదు. ఈసమస్య ఈమధ్య మళ్లీ మొదటికి వచ్చినది. ఈవిషయమై మనము విపులముగా గ్రహించవలయును. (సశేషము.)

---

## మనోహితము

పిసుపాటి నారాయణశాస్త్రిగారు

ఉత్కలికా తరంగముల నూఁగుచునుందువు, జన్మకారి సం
పత్కలనాతమఃపటలి ప్రాముట మన్నను మిన్నుఁగాన, వు
ద్యత్కరుణా రసప్రచుర దానవవైరి కటాక్షపాత్రమై
చిత్కళఁ దేలఁ దగ్గకృషి సేయవు చిత్తమ, యేమి యయ్యెదో ?

కలఁగకు మెంతలేసి కడగండ్లకుఁ బాలయినన్, దురాశమై
మెలఁగకు మోపరాని పని మిక్కిద నంచు నహంకరించుచున్,
దొలఁగకు సత్యమార్గము నతుల్యము లౌల్యమునన్, జగంబుపై
నలుగకు మెన్నఁడున్, ముదమునందకు కుందకు, పిచ్చిడెందమా !

మానవు చంచలత్వమును, మాటికి మాటికి మాఱుచుందు, వా
శానిగళంబునం దగిలి సర్వము మ్రింగ యతింతు, "దీననే
మానొకొ మీఁద;" నంచు నిసుమంత విచారముపాలుగా, విసీ !
మానసమా ! నినుం గడచు మానవుఁడే; కడు ధన్యుఁ డిద్ధరన్.

ఆచరణంబుసుం దిడని యట్టిది యెట్టిదియైన నిష్ఫలం
బై చను, నీచరిత్రమున కార్యజనావృతి సంఘటింపఁగాఁ
జూచెదవేని; వాక్పటిమఁ జూపక యోపిక చేసి జ్ఞాన ల
క్ష్మి చితమూర్తిలోఁ గలియఁ జేతమ, చేయుము తగ్గయత్నమున్.

"ధనము గడింపకుండిన వృథా యగు జన్మ" మటంచు నెట్టి కూ
డని పని కైనఁ బోదువు హుటాహుటి లేనిదినాల, భాగ్య మ
బ్బినతటిఁ బిన్నపెద్దయను భేదముమాని, "జగాన నేన నా
కెన"యని విఱ్ఱవీఁగె, దిఁక నేమగుదానవో; నీవు చిత్తమా!

"దండితనమ్ము చూపెదను దానమునం" దని చేత నేమి లే
కుండిన నాఁడు పల్కెద, వహో! పది రూకలు చేరినంత నే
మొండితనమ్మునన్ మిగిలి ముష్టియుఁ బెట్టఁగ నుత్సహింప, వా
దండ ధరోగ్రదండనము తప్ప టదెట్టులు నీకుఁ, జిత్తమా!

పరులన్ మోఱుటకో; పరాపకృతికో; పైవారి మెప్పింపనో;
సరి సంబంధులు గెలిచేతు రనియో; జాయాసుతార్థంబొ; క్ర
చ్చఱ వెచ్చింతువు గాని ద్రవ్యమును, నిష్కాపట్య మేపార నె
త్తఱి నీఁ జాలవు పిల్చి బీదలకు, నీత్యాగం బిదేకా, హృదీ!

పదుగుర సాయముం బడయఁ బాతరలాడెద వాదిలోన, స
య్యది లభియించినంత దురహంకృతి నందఱకన్న మిన్నవై
పొదలెడి కోర్కి దుష్కృతికిఁ బూనెదు, తత్కృత ముగ్గడింప మా
నెదు, పరమార్థచింత యిఁక నెకెటు లబ్బు, మనంబ, చెప్పుమా?

ఇతరుల నమ్మ వీవు, నిను నెల్లరు నమ్మ నటింతు వెప్పుడున్,
గతము దలంచి పొక్కెదవు, కాయ మనిత్య మటంచుఁ బల్కుచున్
బ్రతుకఁగ నాసఁజేసెదు ప్రపంచము నిల్చెడు నంతదాఁక, నీ
గతి యిఁక మీఁద నేవిధము కాఁగలదో కద? మూఢచేతమా!

ఒక్కటి లోఁదలంతువు, మఱొక్కటి పైకిపచింతు, వొక్కనిన్
మిక్కిలి గారవింతువు తమిన్, మఱియొక్కని లెక్క సేయ, వీ

ఫక్కిని సూనృతంబు సమభావము రెండును వీటిఁబుచ్చినన్
దక్కునె, శాశ్వతం బగుపదం బితరంబుగ, మానసంబరో!

"కోపము పాపమూల" మని కోవిదులందురు, దాన నీకు నెం
తే పరిపాటి గల్గె, దురదృష్ట మదేమొ? విచార దీర్ఘ సం
తాపపు టగ్గి క్రమ్మగ్గెదు సతంబును, దర్పవిషయ ప్రవిష్టవై
నాపలు కాలకింప వొకనాఁడును బేకెతనానఁ, జిత్తమా?

వార్యం బెట్లగు నాకు నీదయిన చాపల్యంబు? శ్రీ శంకరా
చార్యుండే; వెఱగంది నీకుఁ గపితో సామ్యంబు చెప్పంగ, దు
శ్చర్యాకోటి గణింపఁగాఁ జడిన తత్సాంగత్యమున్ మాని, నీ
వార్యుల్ మెచ్చఁగ నేకతాభిరత వౌటానందమా, నెమ్మదిన్!

స్పర్ధామూలము నీదుశీల మెపుడున్ వంచింపఁగాఁ జూచు ప్ర
త్యర్థుల్ దోఁపరు నీకు నెందును, ద్వదాయత్తీకృతార్థున్ మహా
నర్థవ్రాతము చుట్టుముట్టికొను, దుష్టార్థప్రదానంబు దా
సార్థక్య మ్మెటు లౌను బుట్టువునకున్, స్వాంతంబ, యోజింపుమా?

అగునని యెన్నఁ డన్కొనని యట్టి మహార్దశ పట్టినప్పుడేన్
దగుగతి సౌఖ్యమొందెడి విధంబు దలంపవు, తుల్యులైన వా
రిఁ గని యసూయపెంపునను రేలుఁ బవల్లుఁ దదేకచింతతో
నొగులుచు నుండె, దార! సుజనుం డెటు నమ్మను నిన్నుఁ జిత్తమా?

"నిరవధికోగ్ర సంసరణ నీరధి భంగపరంపరాహతిం
గరలిచి క్రోధబాడబశిఖిం బడఁద్రోయఁగ, మోక్షరాజ్యసు
స్థిరు నొనరింపఁగా, వలఁతి చిత్తమె" యంచు వచించెఁ దొల్లి శ్రీ
హరి, చెడుచేఁత రోఁతయని యాత్మఁరతిం బదముంచు, చేతమా!

"హితముగఁ దోఁచుధానిని గ్రహించెదఁ బ్రీతిఁ, దదన్యమున్ జగ
ద్ధిత మయినం ద్యజింతు, నెవరేమనినన్ గణుతింప" నంచుఁ ద్వ
త్ప్రతిభను జాటఁ జూచెదవు, బాపురె? యెంతటివెఱ్ఱి; యున్నవే
గతు లిటువంటి మార్గములఁ గాలిడువారికి మూఢచిత్తమా?

కరణ పరంపరన్ నడపఁగల్గిన మేటివి నీవు, నీ నుడిన్
గరచరణాదు లేవు, నటుగావునఁ దత్కృతకర్మ ఫలంబు నిన్
బొరయక మాన దెన్నఁడును బూజ్యపదంబున నున్నవారికిం
బరపతి వోవు కార్యములు భావ్యము లౌనటవే యెడందరో?

కానికిఁ గాని యట్టి యధికారము మేరువుగాఁ దలంచి యె
వ్వానిని జేరికిం గొనవు, పాపము పుణ్యమనంగఁ బోవు, "నే
నే నిఖిలాశ్రయంబ" నని యెంతయు గర్వము చెందె, దద్ది వోన్
దేనికిఁ జేతఁగాక జగతిం జెనుదానవు గావె చిత్తమా?

"తగులం బెట్టుఁడు వేదశాస్త్రముల పొత్తంబుల్, తదాచారముల్
దిగనాడుం" డని రచ్చలన్ మొఱఁగు దుర్ధీకప్రపంచంబుతో
భగవంతుం డెదిరింప నోడునన; నీవా తద్విచారంబునాఁ
గఁగ యత్నించుట? చాలుఁ జాలు మనసా! కైకోకు ముద్రేకమున్.

సుతునకుఁ దల్లిదండ్రులును సుందరికిం బ్రియభర్త, శిష్యసం
తతికి గురుండు, కోడలి కనారత మత్తయు, ఘోరదుర్గుణా
న్వితునకు సద్గుణాన్వితుఁడుఁ, బిన్నకుఁ బెద్దయు, లొంగియుండు నీ
చత ప్రబలెన్, హితాహిత విచార మిఁకెక్కడ నీకుఁ జిత్తమా?

ఆరయ నాఱుచక్రముల కావలఁ గేవల దీప్తితో సహ
స్రారజలేజమందు విలసద్గతి వెల్గు వెలుంగు గానఁగా
నేరక యూరకే తిరుగనేర్తువు, లోపలి చూపు మానె, దే
తీరున నీవు ముందుఁ గడతేఱుము, వయ్యయొ, మూఢచిత్తమా!

హితముగఁ బల్కుకం టెసు హితేతరమార్గము ద్రొక్కకుండు టే
హిత మని చెప్పి గొర్ప్ప, గొకనేమి? శ్రుతి స్మృతిబద్ధ సత్క్రియా
తతి నొనరింపఁగాఁ దగిన దార్ఢ్యము నీకడ లేకయున్న న
న్యతమమతంబులం దగక హాయిగ నీశు భజించు, చిత్తమా!

## మేఘమల్లార రాగము     ప్రజోత్పత్తి సం. పుష్యమాసము



నాచత గావత బీన బజావత స్యామ సరీర సుహావత జోఈ, ఫులకే హార సిగార కీయే బరజే ఘన ప్రీత బఢావన జోఈ
తాల మ్రదంగ లియే రస రంగీ సనీజనసంగీ లసే సుఖ జోఈ, యాబిధ మేఘమల్లార కహావత రాగన మే యహీ చానత కోఈ;

[జయపుర చిత్రము : దివాన్ బహదూరు గోవిందదాసు చతుర్భుజదాసుగారి యనుమతిని.]

# బ్రిటిషు ఆర్థిక విషమస్థితి

మోచర్ల కృష్ణమూర్తిగారు

౧

ప్రపంచమునం దెచ్చట జూచినను ధరలు పడిపోవుటయు, వర్తకమాంద్యమును, కావలసినంత పదార్థసంపత్తి యుండియును క్షామము ననుభవించు చుండుటయును, ఎప్పుడును లేనివిధమున సంవత్సరమున్యమున క్రొత్తపన్నులును, వేతనముల తగ్గింపులును, నేటి ప్రజాజీవితము నల్లకల్లోల మొనర్చుచున్నవి. వీనికి దోడు ఆంగ్లదేశమునను, మనదేశమునను బంగారుప్రమాణ మంతరించె నను ప్రకటన వ్యవహారముల మరింత గడబిడి యొనర్చి ప్రజాసామాన్యమునకు మరింత దుర్గ్రాహ్య మొనర్చెను. అపూర్వమగు నిట్టిఆర్థికవిపత్తునకు గారణ మేమి? బంగారుప్రమాణముయొక్క ఉనికి గాని, పోకడ గాని పరిస్థితులం దెట్టిమార్పుల గలిగించును? అను సందేహములు ప్రతివారిని బాధించుచుండును. ఆవిషయముల నెరింగినచో, ప్రస్తుతఆర్థికక్లిష్టస్థితినుండి భారతీయులును, ప్రపంచమునందలి ఇతరదేశములును గూడ ఎటుల బయటపడవచ్చు ననువిషయముల సులభముగ దెలిసికొనవచ్చును.

## ధరలు పడిపోవుటకు కారణము

ఐరోపా మహాసంగ్రామానంతరము ప్రపంచమంతయు సిరిసంపదలతో తులదూగుచుండ వాణిజ్యము విజృంభించుచుండవలసినది. ప్రపంచ మంతయు గాకపోయినను, విజయ మందిన దేశములైనను అటు లుండవలసినది. కాని అందుకు మారు విజయ మందిన దేశములును ఓడిపోయిన దేశములును గూడ సరిసమానముగనే ఈవిషమస్థితికి గురియైనవి. ప్రపంచమందలి బంగారమునకంతకును కోశాగార మగుచున్న అమెరికాయందును, సంగ్రామవిజయవైభవము నందిన ఆంగ్లదేశమునందును, పరాజయ మంది నష్టపరిహారముల బరువుచే క్రుంగిపోవుచున్న జర్మనీయందును గూడ నిరుద్యోగసమస్య, నిర్వ్యాపారత్వము ఇంచుమించుగ ఒక కేమాదిరిగ తాండవించుచున్నవి. ఇట్టిస్థితి కంతకును ప్రథమకారణము సంగ్రామనష్టపరిహారభారములు, సంగ్రామ ఋణభారములును అని ప్రపంచమున పేరు గల అర్థశాస్త్రజ్ఞు లందరును అంగీకరించియున్నారు. పదార్థములధరలు ముఖ్యముగ రెండు విషయములపై నాధారపడి యుండును. అందొకటి ఉత్పత్తి. ప్రజలకు గావలసినదానికంటె నెక్కువపదార్థమును తయారుచేసి క్రయమున కంపిన యెడల గిరాకి తగ్గి, కొనువారు లేక ధరలు తగ్గును. రెండవది ప్రజలకు గల కొనుగోలుశక్తి. పదార్థములవెల ఎంత సరసముగ నున్నను ఆవెల నొసగుటకు ప్రజలలో శక్తి లేనియెడల కొనువారు లేక తుదకు ధరలను తగ్గింపవలసివచ్చును. ప్రస్తుత మావరించియున్న ఆర్థిక క్లిష్టస్థితి కిందు మొదటికారణము కొంతవరకును, రెండవకారణము చాలవరకును పనిచేసెను. సంగ్రామమునం దోడిపోయిన జర్మనీ మొదలగు రాష్ట్రములు నష్టపరిహారముల రూపమునను, గెలిచిన ఆంగ్లదేశము మొదలగునవి సంగ్రామఋణముల రూపమునను ప్రతివత్సరమును చాలమొత్తములను విదేశములకు చెల్లింపవలసివచ్చుచున్నది. అందుచే నాదేశములందలి ప్రజలు సొంత ఉపయోగముకొరకు కావలసినన్ని వస్తువులను కొనుటకు శక్తి లేనివారగుచున్నారు. అందుచే అట్టి వస్తువులను ఇంతవరకు తయారుచేసెడివారి క్రయములు తగ్గి వారు తమకు గావలసిన వస్తువులను కొనజాలకపోవుచున్నారు. ఈవిధముగనే విషచక్రము సంపూర్తియై తుదకన్ని దేశముల ప్రజలును గూడ ఒకస్థితికి వచ్చి ప్రస్తుత ఆర్థిక విషమస్థితికి గురియైరి. ఆధునిక ప్రపంచమున మానవజాతియొక్క ఆర్థికజీవిత మంతయు పరస్పరాశ్రితమై యున్నది. అందుచే ఒక్కప్రాంతమునకు గలిగిన చిక్కులఫలితములు ప్రపంచమున కంతకును గూడ వ్యాపించుచున్నవి.

## బంగారు ప్రమాణము

పై యార్థికదుఃస్థితి అన్ని దేశములను ఆవరించి యుండగా, ఆంగ్లదేశమును, భారతదేశమును, మరికొన్ని చిన్నరాష్ట్రములును మాత్రము బంగారుప్రమాణమును వీడవలసివచ్చుటకు కారణముల దెలిసికొన యత్నించుటకు పూర్వము, అసలు బంగారుప్రమాణ మన నేమియో గ్రహించు టవసరము. ప్రజ లంతగా నాగరకతను బడసి యుండని ఆదికాలమున నాణెములచలామణి యుండెడిది గాదు. అపుడు ప్రజలు తమకు కావలసినవస్తువులను కొనుటకు గాని, ఇతరులకు బాకీలు తీర్చుటకు గాని, వస్తువులనే మార్చుకొనెడివారట. కాని అట్టి స్థితి గతించి చాలకాల మైనది. నాగరకత వ్యాపించినకొలదిని వస్తువుల మార్పుకొనుటయందలి అసౌకర్యమును తొలగించుకొనుటకుగాను, వెండి, బంగారు మొదలగు లోహములను క్రయవిక్రయాదివ్యవహారములయందు ఉపాధిగ ఉపయోగించుకొనుచుండిరి. అనగా నాయా వస్తువులవెలల నిర్ణయించి తెలుపుట కీలోహములు ప్రమాణముగ నుపయోగించుకొనబడుచున్నవి. కాని వర్తకవ్యవహారముల సమ్మర్ద మధిక మైనకొలదిని నాణెముల నుపయోగించుకొనుటకూడ అసౌకర్యముగ గన్పట్టెను. అందుచే వానికి బదులు కాగితపునోటులును, హుండీలును విశేషముగ వ్యాప్తి గాంచుచున్నవి. మనదేశమునకూడ రూపాయినాణెముల నుపయోగించుపద్ధతి ఎంతో త్వరితముగ తగ్గి, కాగితపునోటుల నుపయోగించుట కలవడుచున్నదియును ప్రతివారికి ననుభవవేద్యము. ఇంగ్లాండు మొదలగు పారిశ్రామికదేశములయందు, నాణెముల యుపయోగము ఇంచుమించు పూర్తిగ నదృశ్యమై వానికి బదులు కాగితపునోటులే ఉపయోగమందున్నవి. నోటులను జారీచేసిన అధికారులు, సదరు నోటులను దెచ్చి రొక్క మడిగిన వారికి వెంటనే చెల్లించెదమని హామీ యొసగుటచేతను, ఆహామీ చెల్లింపబడునని ప్రజలకు నమ్మక ముండుటచేతను, దేశమున సదరునాణెములకు ప్రత్యామ్నాయముగ నానోటులు నిరాఘాటముగ చలామణి యగుచున్నవి. ఈనోటులు కాగితపు చిహ్నములే గాని, స్వయముగ విలువగల నాణెములు గావు. అందుచే క్రయవిక్రయములలో ధరలు నిజముగ బంగారువెండి లోహముల విలువనుబట్టియే నిర్ణయింపబడుచున్నవి. అందుచే వేర్వేరు నాగరకరాష్ట్రము లన్నియును కొన్ని వత్సరములవరకును తమనాణెములయందు ప్రధానమైన వానిని బంగారు వెండిలోహములలో ముద్రించుకొనుచుండెడివి. పిదప గతశతాబ్దమునుండియు వేర్వేరుకారణములచే వెండికి అట్టిప్రాజ్యత తొలగి అన్నిదేశములును బంగారులోహమును మాత్రమే చలామణికి ప్రమాణముగ నేర్పర్చుకొని ఆలోహమున ప్రధానమగు నాణెముల ముద్రించి చలామణి చేయదొడంగెను. ప్రతిదేశమునను ప్రధానమగు నాణెమును, దాని కనుబంధముగ వేర్వేరు లోహములలో వేర్వేరు చిన్ననాణెములును చలామణి చేయబడుచుండును. ఆయాదేశమున నాణెములచలామణికి ప్రధానమగు నాణెము గాని, లోహము గాని ఏది యై యుండునో ఆదేశపుచలామణి కా నాణెము గాని యా లోహము గాని ప్రమాణ మని చెప్పబడును. అది బంగారులోహమైన బంగారుప్రమాణ మందురు. వెండియైన వెండిప్రమాణమందురు. సదరులోహము నిజముగ ప్రమాణమని పేర్కొనబడుటకు మూడుప్రధానలక్షణము లుండవలెను. ౧. సదరులోహమును దేశమునుండి విదేశములకు ఎగుమతిచేయుటకును దిగుమతిచేయుటకును ప్రజలకు స్వాతంత్ర్య ముండవలెను. ౨. సదరు నాణెమును కరగించుకొనుట కధికార ముండవలయును. ౩. సదరులోహమును టంకసాలవద్దకు తీసుకొనివెళ్లి నిరాటంకముగ నాణెములను ముద్రింపించి తెచ్చుకొనుటకు స్వాతంత్ర్య ముండవలెను. ఈమూడు లక్షణములును ఒక్కటే యుద్దేశమును సూచించుచున్నటులు పాఠకులకు దెలియగలదు. చలామణికి ప్రమాణముగ నేర్పరచుకొనబడిన లోహముయొక్క విలువయందు ప్రభుత్వమువారిచే గావింపబడు చర్యలవలన ఎట్టిమార్పును గలుగరాదు. అపుడు గాని అది నిజమైన ప్రమాణము గాజాలదు.

## బ్రిటిషు దేశపు చలామణి

బ్రిటిషు దేశపు చలామణియందు ప్రధానమైనది పౌను. ౧౮౧౬ సం. వరకును ఆంగ్ల దేశమున వెండియే చలామణికి ప్రమాణముగ నుండెను. అప్పుడు ౫, ౪౦౦ గింజలయెత్తు వెండి ఒక పౌనుగ వ్యవహరించెడివారు. అంతకు ఇరువది సంవత్సరముల ౨౮౦ గింజలయెత్తు వెండి నొక నాణెముగ ముద్రించి దానిని షిల్లింగు అని వ్యవహరించుచుండిరి. ౧౮౧౬ సం.న ఆంగ్ల దేశము వెండి ప్రమాణమును వదలి బంగారు ప్రమాణము నవలంబించెను. అపుడు ఒక ఔన్సు బంగారము ౪ పౌ. ౪ షి. ౧౧ పెన్నీలకు సరిసమానమనియు, ఆవిధముగ చలామణి చేయవలెననియు నిశ్చయించిరి. సవరనులు అదివరకే ముద్రింపబడి బంగారు వెల ననుసరించి విక్రయింపబడుచుండెను. ప్రభుత్వమువారు బంగారు ప్రమాణమునకు వచ్చినతోడనే సవరనునందలి బంగారులోహముయొక్క తూకమును ౧౨౩.౨౭౪ గింజలుగ నిర్ణయించి అందలి బంగారును ౧౧౩.౦౦౧౬ గింజలకు తగ్గించి పౌను నాణెమునకు బదులుగా సవరను చలామణి చేయుచుండిరి. ఈవిధముగ చిరకాలము చలామణి చేయగలిగిరి. కాని ౧౯౧౪ సం.న సంగ్రామారంభమున నీచలామణిని నిర్వహించుకొనజాలక బంగారు ప్రమాణమును వదలుకొనిరి. కాని ౧౯౨౫ సం నుండియు తిరిగి బంగారు ప్రమాణమును స్థాపించి, ఈసంవత్సరము సెప్టెంబరు ౨౦ వ తేదీవరకును నిర్వహించుకొనగలిగిరి. కాని నాటినుండి తిరిగి బంగారు ప్రమాణమును వదలివేయవలసినవారైరి.

## బంగారు ప్రమాణమును వదలుట యన నేమి?

బంగారు ప్రమాణమును వదలుట యన నేమియో ఇక పరిశీలింతము. నాణెములకు బదులు కాగితపు నోటులు గూడ సౌకర్యార్థము చలామణి చేయబడుచున్నవని పైన వివరించియుంటిని. ఈపద్ధతి ఎక్కుడు సౌకర్యముగ నుండుటచే విశేషముగ వ్యాప్తి నంది తుద కసలు నాణెముల గూడ తరిమివేయుచున్నది. ఈనోటులందు వానిని దెచ్చి అడిగినవారికి రొక్క మొసగబడు నని వ్రాసియుండును. ఉదాహరణముగ ఆంగ్ల దేశపు పౌనునోటును డీసికొనుకుం. అంచెటు లుండును; "దీనిని తెచ్చినవానికి కోరినపుడు ఒక పౌను సొమ్మును చెల్లించెదను. ఇంగ్లాండు బ్యాంకు గవర్నరు తరఫున (సం) ప్రధాన కోశాధికారి." ఈనోటులు రాజశాసనము ననుసరించి ముద్రింపబడి చలామణి చేయబడు చుండుటచే నాణెములకు ప్రతినిధులుగ ఒక పౌనుగ చలామణి యగును. ఈనోటునకు కావలసిన బంగారము ౧౧౩.౦౦౧౬ గింజలయెత్తుగల సవరను నొసగబడి యున్నది. కాని ఒక్కవిదేశముల కంపవలసినపుడు తప్ప మిగిలిన వ్యవహారములన్నిటియందును నోటు చలామణి యగుచుండును గనుక ఎవరును సాధారణముగ బంగారును గోరుటలేదు. ప్రభుత్వమువారు బంగారు ప్రమాణమును తొలగించినయెడల సదరు నోటులకు బ్యాంకువారు బంగారము నొసగవలసిన బాధ్యత తొలగిపోవును. బ్రిటిషు ప్రభుత్వమువారు సెప్టెంబరు ౨౦ తేదీన బంగారు ప్రమాణమును రద్దుచేయుటవలన సంభవించిన దిదియే. ఆయుత్తరువునకు తోడు, బంగారమును విదేశములకు ఎగుమతి చేయరాదనిగూడ ప్రభుత్వము వారు నిషేధించిరి. నోటు లన్నియు అచ్చువేయబడిన కాగితపుముక్కలుగదా; వానికి బదులు నాణెముల నొసగు హామీ లేనియెడల వాని కేట్టివిలువ యుండును? అని ఆశ్చర్యము గలుగవచ్చును. కాని అటు లాశ్చర్యపడ నక్కరలేదు. సదరు నోటులు బ్రిటిషుదేశమున మామూలుగనే చలామణి యగుచుండును. క్రయవిక్రయాదులందును లావాదేవీలలోను ప్రభుత్వమువారికిని ఇతరులకును బాకీల చెల్లించుటకును సవరునోటులు పనికివచ్చునెడల వానివిలువ కేట్టిలోటు గలుగును? కాని విదేశములకు చెల్లింపవలసి వచ్చినపుడు మాత్రము వారు నోటుల నంగీకరింపరు గనుక కొంతచిక్కు సంభవించును.

## నిలుపుకొన జాలకపోవుటకు కారణములు

జపాను, దక్షిణాఫ్రికా, ఫ్రాంసు మొదలుగాగల దేశము లెన్నియో తమబంగారు ప్రమాణమును నిలుపుకొన గలుగుచుండగా, ప్రపంచములోకెల్ల ధనవంతమగు నాంగ్ల దేశము మాత్రము వదలుకొన వలసివచ్చుట చాల

ఆశ్చర్యకరముగ నుండవచ్చును. కర్మనిమరణమునకువలె ఇంనుకుగూడ పెక్కుకారణములు గలవు. అందు కొన్ని బ్రిటిషుప్రభుత్వమువారియధీనమున లేనివి. మరికొన్ని బ్రిటిషుజాతీయులు ధనార్జనాతురతతో అవివేకముగ దెచ్చిపెట్టుకొనినవి. ఐరోపామహాసంగ్రామముకొరకు గావింపబడిన ఋణములు ఆంగ్లదేశమునకుగూడ దుస్సహముగ నుండెను. ఈవత్సరమాంగ్లదేశము, ప్రభుత్వఋణములనంగీకరించె పౌ ౩౦౭,౯౦౦,౦౦౦లును, అసలుక్రింద పౌ ౫౭,౦౦౦,౦౦౦ లును చెల్లింపవలసివచ్చెను. ౩౧-౩-౩౧ నాటికి ప్రభుత్వఋణము పౌ ౭,౬౬౮,౦౦౦,౦౦౦. దీనికితోడు, ప్రపంచమునందంతటను నరలు మందగించుటచే, వాణిజ్యము తగ్గెను. వాణిజ్యమే జీవనాధారముగ గల బ్రిటిషుదేశమున కిది పెద్దదెబ్బ. వారి దిగుమతులంతగా తగ్గకపోయినను, ఎగుమతులు మాత్రము చాల తగ్గిపోయెను. విదేశీయవాణిజ్యమునందు జర్మనీ మొదలగుదేశములతో సరిగ పోటీచేయజాలక, తమఖాతాదారుల గోల్పోవుచుండిరి. వర్తకము తగ్గుటచే ప్రభుత్వాదాయము తగ్గెను; ఖర్చులు మాత్రము తగ్గలేదు. అందుచే ప్రభుత్వమువారు పరిపాలనావ్యయములకు గూడ ఋణమొనర్పవలసి వచ్చినటు లుండెను. ఎగుమతులకంటె దిగుమతు లధికముగ నుండుటచే వానికి ఆంగ్లదేశము చాల మొత్తముల నితరదేశములకు చెల్లింపవలసినటు లేర్పడెను. ఫ్రాన్సు, అమెరికా మున్నగుదేశములు దిగుమతుల విశేషముగ సుంకములను విధించుటచే నాదేశముల బ్రిటిషుఎగుమతులు తగ్గిపోయెను. గతవత్సరమున ఫ్రాన్సు దిగుమతిసుంకముల నూటికి ౧౬౦ చొ.న హెచ్చించెను. కనుక, ఆదేశములనుండి దిగుమతి చేసుకొనిన వస్తువులకును, ఋణములతీర్మానమునకుగాను వారికి చెల్లింపవలసిన మొత్తములకును, బ్రిటిషువారు వస్తురూపముగ గాక రొక్కరూపముగ చెల్లింపవలసివచ్చెను. ఇంగ్లాండు ఇతరదేశములకు చెల్లింపవలసిన బాకీలస్థితి ఇటు లుండ, ఆంగ్లదేశమునకు జర్మనీ ఆస్ట్రేలియా, బ్రెజిలు మొదలగు నితరదేశములనుండి రావలసిన బాకీలు వసూలుగాలేదు. ఇవన్ని బ్రిటిషుప్రభుత్వమువారి వశమునందు లేనికారణములచే గలిగిన పరిస్థితులు. కాని ఆంగ్లదేశమంత యాకస్మికముగ బంగారు ప్రమాణమును వదలవలసి వచ్చుటకు తుదికారణము లివి గావు. అధిక ధనార్జనాభిలాషచే బ్రిటిషుబ్యాంకులు లొనర్చిన వడ్డీవ్యాపారములు ఆంగ్లదేశము వెంటనే ఆర్థిక విషమస్థితికి పాలుపడుటకు సన్నిహితకారణము. లండనునగరము ప్రపంచమునందలి వ్యాపారముల పరిష్కరించుకొనుటకు కేంద్రస్థాన మనువిషయమెల్ల రెరింగినదే. అందుచే ననేకరాష్ట్రములు తమ వర్తక లావాదేవీలను పరిష్కరించుకొనుటకుగా నచట బంగారమును విస్తారముగ నిలువచేసుకొనుచుండును. వారా బంగారమును వృథగ నుంచుకొను టెందులకని సామాన్యముగ స్వల్పవాయిదాలకు ఇంగ్లాండు బ్యాంకునకు అప్పుగ నొసగుచుందురు. బ్రిటిషుబ్యాంకరు లీయవకాశమును గైకొని స్వల్ప-వడ్డీలకు, స్వల్ప-వాయిదాలకు బదులు దీసుకొని, హెచ్చువడ్డీలకు దీర్ఘ-వాయిదాలకు ఇతరులకు అప్పుగా నొసగుటకు ప్రారంభించిరి. ఈవిధముగ నిధుల జర్మనీ ఆస్ట్రియా దేశములకు పౌ. ౧౦ కోట్లు ఋణమొసగబడెను. ఆదేశముల ఆర్థిక చిక్కు లెల్ల రెరింగినవే. ఆంగ్లదేశపు ఆర్థికస్థితిని జూచి అసలే అనుమానించుచున్న విదేశీయులకు ఈవిషయము తెలిసినతోడనే భయభ్రాంతులై ఇంగ్లండునందు దాము నిలువచేసుకొని యున్న బంగారును వెంటనే తీసుకొనిపో దొడగిరి. ఆంగ్లదేశపు ఋణపత్రములలో నిలువచేసుకొనిన విదేశీయులు స్వదేశీయులును గూడ వెంటనే వానిని విక్రయించి బంగారు దీసుకొని విదేశములలో భద్రపరుచుకొన జొచ్చిరి. ఇందుచే నొకటిరెండు వారములలో ఇంగ్లాండుబ్యాంకులో నిలువయున్న బంగారము పౌ. ౨౦ కోట్లనుండి ౧౩ కోట్లకు తగ్గిపోయెను. ఉన్నదిగూడ ఒకటిరెండువారములలో అదృశ్యమైపోవునటు లుండెను. అందుచే ఆకస్మికముగ సెప్టెంబరు ౨౦ తేదీన బ్రిటిషు ప్రభుత్వమువారు బంగారు ప్రమాణమును ఎత్తివేసితిమని ప్రకటించి నోటులకు బంగారు నొసగు బాధ్యతను తొలగించిరి. బంగారును విదేశములకు ఎగుమతి చేయరాదనిగూడ నిషేధించిరి.

## ఫలితములు

బంగారు ప్రమాణమును వదలుటవలన దేశమునందలి వ్యవహారములలో స్వతహా ఎక్కువ మార్పు గలుగదు ఎందు కనగా పౌనునోటు ఇదివరకువలెనే ఇపుడుగూడ చలామణి యగుచుండును. ఇదివరకైనను, దేశములోని చలామణికి బంగారు విశేషముగ నుపయోగింపబడుట లేదు. వాణిజ్యమునందును, ఇతరవిధములుగను ఇతరదేశముల కియ్యవలసిన నికరపుబాకీలను సరిపుచ్చుకొనుటకు మాత్రమే బంగారు విశేషముగ నుపయోగింపబడుచున్నది. అందుచే ఆప్రమాణమును వదలుటవలన పౌనునోటుయొక్క విలువయందు గలుగు మార్పు చాలవరకు విదేశములతో గల లావాదేవీలవలననే కలుగుచున్నది. ఆంగ్లదేశము బంగారు ప్రమాణము వదలుటవలన గలుగు మొదటిఫలితము, బంగారు ప్రమాణము గల ఇతరదేశముల నాణెములతో పోల్చి చూచినయెడల పౌనుయొక్క విలువ తగ్గిపోవుట. ఇందుకు నిదర్శనముగ బంగారు ప్రమాణము గల అమెరికాసంయుక్తరాష్ట్రముల డాలరు నాణెమును దీసుకొనుడు. డాలరునాణెమునందు ౨౩.౨౨ గింజలబంగా రుండును. ఆంగ్లదేశమున పౌనునాణెమునకు చలామణి యగుచుండిన సవరనునకు ౪.౮౬ డాలరుల నొసగుచుండెడివారు. కాని బ్రిటిషుదేశము బంగారుప్రమాణమును వీడుటతోడనే పౌనువిలువ ౩.౪౫ డాలరులవరకు తగ్గెను. ఇటీవల ౩.౫౦ వరకు గూడ తగ్గుచున్నది. ఇందుకు కారణము దుర్గ్రాహ్యముగ దోచవచ్చును. కావున ఒకయుదాహరణమును దీసుకొనుడు: సత్తిరెడ్డిగారి పిచ్చిరెడ్డి చాల సంపన్నుడు. అతనికి లోకులతో చాల లావాదేవీలు గలవు. కాని అతను వ్రాసిన నోటునకు గాని, చీటికి గాని, ఎప్పుడడిగితే అప్పుడు రొక్కము చెల్లింపగలడు. అట్టినమ్మకమున్నంతవరకు, అతనినోటులను లోకులు రొక్కముతో సరిసమానముగ గౌరవించెదరు. అతనివద్ద సొమ్ము తగ్గిపోయి రొక్కము చెల్లింపజాలక, తనవద్దనున్న వస్తువులనే, ధరలకు తీసుకొని సరిపెట్టుకొనుడని చెప్పననుకొనుడు. అపు డాతనినోటులకు ఇదివర కున్నంత విలువ యుండదు. అతనిసరకులకు గల గిరాకిని బట్టి ఆతనినోటువిలువ మారుచుండును. ఆతడు సరకును బాగుగ విక్రయించుకొని, సొమ్ము సేకరింప గలిగిన యెడల, బాకీమొత్తముల చెల్లించుట కాతనిశక్తి హెచ్చును. లేనిచో తగ్గును. దానితోపాటే, అతను వ్రాసిన నోటులవిలువగూడ హెచ్చుచు తగ్గుచు నుండును. వ్యక్తులకువలెనే గదా దేశములకును? అటులనే ప్రభుత్వమువారు చలామణిలోకి దెచ్చు నోటులవిలువగూడ మారుచుండును. దానినిబట్టియే వాని కొనుగోలుశక్తియు మారుచుండును. పౌనుయొక్క కొనుగోలుశక్తి తగ్గగనే ఇదివరకు ఒకసవరనును కొనుటకు ఒకపౌను నియ్యవలసినచోట నిపు డంతకంటె చాలఎక్కువ చెల్లింపవలసి వచ్చుచున్నది.

ఈవిధముగ చలామణియొక్క విలువ తగ్గుటవలన ముఖ్యముగ రెండుఫలితములు గలుగును. ౧. ఎగుమతులు హెచ్చుట ౨. దిగుమతులు తగ్గుట. ఎటు లనగా: రెండు దేశములందును బంగారుప్రమాణ మున్నపుడు ౪.౮౬ డాలరుల విలువగల సరకును అమెరికావారు ఒకపౌనునకు ఆంగ్లదేశమున విక్రయింపగలిగెడివారు ఇపుడు డాలరుతో పోల్చినయెడల పౌనువిలువ తగ్గి ౩.౭౫ డాలరుల విలువయే నిలిచె ననుకొనుడు అపుడు ౪.౮౬ డాలరుల విలువ గల వస్తువును ౧ పౌ. ౫. షి. ౨. పెన్నీలకంటె హెచ్చువెలకు గాని విక్రయింపజాలరు. ఈవిధముగనే, ఇంగ్లీషు వస్తువులు—ఇదివరకు ధరలప్రకారమే వారు విక్రయించునెడల—బంగారు ప్రమాణము గల దేశములలో చవుకయగును. ఎటు లనగా, పౌను విలువగల ఇంగ్లీషు వస్తువును కొనుటకు అమెరికాదేశీయు డిదివరకు ౪.౮౬ డాలరులు చెల్లింపవలసియుండును. ఇపు డదే వస్తువునకు షుమారు ౩.౭౫ డాలరులు చెల్లించిన జాలును. ధరలలో నీవిధముగ గలుగుమార్పులనుబట్టి ఇంగ్లీషువస్తువులు విదేశములలో చవుక యగుటయు విదేశపువస్తువు లాంగ్లదేశములో ప్రియమగుటయు సంభవించును. దానిని బట్టియే దిగుమతులు తగ్గును. ఎగుమతులు హెచ్చును. దానితో దేశీయపరిశ్రమలును, సంపదయు నభివృద్ధి నందును.

కాని ఈపద్ధతి, బ్రిటిషుదేశమునకు తాత్కాలికముగ దప్ప శాశ్వతలాభకారి గాజాలదు. ఈవిధముగ చవుకచలామణితో, తమపరిశ్రమలతో నక్రమముగ పోటీ చేయుచుండ ఇతరరాష్ట్రము లూరకొనవు అనిగూడ బంగారుప్రమాణమును వదలుకొనుచో అన్ని దేశముల చలామణీలును ఒకటేస్థితికి వచ్చును. కాని అటుల గావించుకొనుటకు వారు సిద్ధపడరు. అందువలన, చవుకచలామణి సహాయముతో పోటీచేయుచున్న రాష్ట్రములనుండి వచ్చు దిగుమతులపై దిగుమతిసుంకముల విధించెదరు. ఫ్రాన్సుదేశ మీపద్ధతి నపుడే అవలంబించి, ఇంగ్లాండు మొదలగు దేశములనుండి వచ్చుసరకులపై ప్రత్యేకసుంకముల విధింప సంకల్పించుకొనినది. అంతియ గాక, ఆంగ్లదేశము తనపరపతికొరకైనను త్వరలోనే తిరిగి బంగారుప్రమాణమునకు రావలసియున్నది. కాని అసలీ చిక్కులకు మూలకారణమగు అంతర్జాతీయఋణముల సమస్య పరిష్కరింపబడువరకును ప్రపంచ ఆర్థికక్లిష్టస్థితి సరిగ పరిష్కరింపబడజాలదు.

---

## హిందూరమ

జి. జాషువ గారు

౧

ఖాదీరాటపు వింతతుమ్మెదలు ఝుంకారించె నీ యింటిలో,
నీ దారిద్ర్యము గోంచిపాతవలెం బన్నెన్ గాంధిబైరాగి, బా
లాదిత్యప్రభతో స్వతంత్రమను సంధ్యాలక్ష్మి రానుండె, నే
దేనీ, తొల్లిటి మందహాసముల మమ్మీక్షింపు, హిందూరమా!

౨

నీ గర్భంబున గాంధి పుట్టినపుడే నీకష్టముల్ చుట్టలై
యేగెన్ గుండ్రపుబల్ల వేగపడిపోయెన్ సీమదేశాన, కా
కే గోసాయిపిసాళిన వ్విటుల మోహింపించె, భూమండలిన్
సాగింపంగల వింత శాంతియుతసంసారంబు, హిందూరమా

౩

తల్లీ ! నీతలమీఁది, శాశ్వతసమాధానంబు ఘోషించు, మే
ల్కొల్లాయిం గని నవ్వుకొన్నజను లాంగ్లుల్ నేఁడు నీపుత్రునిన్
లిల్లీ పూలనలంకరించి, నుడు లాలింపంగ నున్నారు, నీ
ఢిల్లీగుండెల నిబ్బరించుకొని, చాటింపింపు మస్పృశ్యతన్.

---

# కుంఫిణీ-పార్లమెంటు మార్పు

కీ. శే. ప్రతివాదిభయంకరం రంగాచార్యులుగారు

## ౧

ప్రస్తుతం జరిగే భారతదేశ స్వాతంత్ర్యోద్యమంలో ముఖ్యముగా పరస్పర సంఘర్షణకు పాలయ్యే వాదాలు రెండు: 'హిందూదేశానికి స్వాతంత్ర్యం అనుభవించడానికి అర్హత లేదనే వాదం అటు ఇంగ్లీషువారినుండి వచ్చేది; 'మేము స్వాతంత్ర్యం అనుభవించడం మాహక్కు' అనేవాదం ఇటు భారతీయులనుండి వచ్చేది. ఈ రెండువాదాలకూ రెండు పక్షాలనుంచీ వచ్చే ఉపవాదాలు—అంటే, 'అసలు అర్హత భారతదేశానికి లేకపోలేదు. కాని ప్రస్తుతంలో మాత్రం లేదు.' అని ఆపక్షంనుంచీ; 'భారతదేశం స్వతంత్రంగానే ఉండవలెను. కాని బ్రిటిషుసామ్రాజ్యానికి లోబడి ఉండవలసిన స్థితి యెన్నటికీ తప్పదు.' అని యీపక్షంనుంచీ వచ్చే చిల్లరవాదాలు—అనేకంగా ఉన్నవి. అయితే యీ చిన్నచిన్న వాదాలన్నీ నిలిచేకాలం దాటిపోయింది. అందుచేత, ఒకవిధంగా, ఇప్పుడు తేలవలసిన సమస్య భారతదేశం స్వతంత్రంగా ఉండవలెనా లేదా అనేది ఒక్కటే. 1926, 30 సం॥ల నాటి సామ్రాజ్యసభలీ యంశమును మరింత స్పష్టపరుస్తున్నవి.

ఈసందర్భంలో సరిగా, 1858 సం॥లో, "సిపాయి తిరుగుబాటు" అణగిపోయిన తరువాత భారతదేశ పరిపాలనవిధానంలో జరిగిన మార్పు జ్ఞాపకంవస్తుంది. బ్రిటిషు పరిపాలన కాలమున భారతదేశపు రాజకీయ పరిణామానికికల ప్రధాన సోపానాలలో ఈమార్పొకటి. దీని ననుసరించి, హిందూదేశమును పరిపాలించే అధికారం కుంఫిణీవారి స్వాధీనంనుండి పూర్తిగ తప్పిపోయి బ్రిటిషు పార్లమెంటుకే సంక్రమించింది.

ఇప్పుడు, పైన చెప్పినట్లు రాజ్యాంగ పరిణామం విషయంలో ప్రజలకూ ప్రభుత్వం వారికీ ఏవిధమైన అభిప్రాయభేదాలూ, వాదోపవాదాలూ కలుగుతున్నవో, ఆరోజులలో కుంఫిణీవారికీ పార్లమెంటువారికీ ఆవిధమైన అభిప్రాయభేదాలే, వాదోపవాదాలే కలిగినవి. ఇప్పుడు, అటూ ఇటూ కాకుండా, ఏదో మధ్యమార్గం అవలంబించి పోవడం మంచిది అనేవారివలెనే, అప్పుడుకూడా ఇట్టివారు ఆ రెండు పక్షాలలోనూ కొందరుండేవారు. ఇప్పుడీపద్ధతికి చెందినవారి వాదంప్రకారం రాజ్యాంగ విధానం ద్వంద్వ ప్రభుత్వంగా (Diarchy) ఉండవలెను. అంటే, పరిపాలనాధికారాలలో కొంతభాగం అటు బ్రిటిషుపార్లమెంటువారికీ (పార్లమెంటువారిద్వారా బ్రిటిషు ప్రజలకూ), మరికొంతభాగం ఇటు భారతదేశంలోని ప్రజాప్రతినిధుల (Indian represen-

tatives) తో కూడుకొన్న శాసన సభలకూ (ఈశాసనసభలద్వారా భారతదేశప్రజలకూ) చెంది ఉండవలెను. ఈవిధంగా భారతదేశ రాజ్యాంగవిధానం విషయంలో, ఒక వైపు బ్రిటిషుప్రజలును, మరియొకవైపు భారతదేశ ప్రజలును భాగస్వాములుగా గలిగిన అధికార విభజనమే ఈద్వంద్వ పరిపాలనానికి ప్రధాన లక్షణంగా ఉంటుంది. ఆరోజులలోకూడా ఇట్టి అధికారవిభజనం మీాద ఆధారపడి ఉండే ద్వంద్వప్రభుత్వం ఒక టుండేది. దాని కశ్వుడు Double Government అని పేరు. ఈ Double Government విధానా న్ననుసరించి భారతదేశాన్ని పరిపాలించే అధికారం కొంత వరకు కంపెనీవారిదీ, కొంతవరకు పార్లమెంటువారిదీ.

1765 సం॥ లో మొట్టమొదటిసారిగా కుంఫిణీవారు భారతదేశంలో రాజకీయ పరిపాలన ఆరంభించినదిమొదలు, 1858 సం॥లో వారి ఆ పరిపాలనాధికారం పూర్తిగా అంతరించిపోయేవరకూ ఈ Double Government విధానమే అమలులో ఉండేది. క్రమక్రమంగా ఈపద్ధతినిగూర్చి మొట్టమొదటనుంచీ (1765 సం॥ నుంచీ) కూడా, పార్లమెంటువారిలో ఒక విధమైన వ్యతిరేకాభిప్రాయం ప్రబలుతూ వచ్చింది. ఇదే, తుదకు, 1858 సం॥ నాటికి పూర్తిగా విజృంభించి, కంపెనీవారి పరిపాలనాధికారాన్ని తుద ముట్టించివేసినది. ఇట్లు రాజకీయాధికారమే కాకుండా, దానితోపాటు కంపెనీవారి వాణిజ్యాధికారం కూడా, అంటే గుత్తపద్ధతిని (Monopoly) ప్రాచ్యదేశాలతో వర్తకవ్యాపారాలు సాగించుకునే అధికారంకూడా, అంతరించిపోయింది. ఈసందర్భంలో పార్లమెంటువా రవలంబించిన రాజనీతి మిక్కిలి నిశితమైనది; గమనింపదగినది.

మొట్టమొదటిసారి కుంఫిణీవారికి ప్రాచ్యదేశాలతో వర్తకవ్యాపారాలు జరుపుకొనుటకు గుత్తపద్ధతిని ప్రత్యేకాధికారం ఇచ్చినది మొదలు, ఈ గుత్తపద్ధతి ననుసరించి ఒక్క కుంఫిణీవారు తప్ప ఇంగ్లండునుంచి మరియెవరును ప్రాచ్యదేశాలతో వర్తకవ్యాపారాలు సాగించుకొనుటకు అధికారులు కారు— కొంతకొంతకాలమున కొకసారి, ఆ అధికారాన్ని తిరిగీ కంపెనీవారు మరొక కొంత కాలము వరకూ అనుభవించడానికి ఒక అధికారపత్రం (Charter) ద్వారా వారికి పార్లమెంటువారు అనుమతి యిస్తూ ఉండవలసిన ఆచారం ఒకటి ఉండేది. ఈ విధంగా గుత్తవ్యాపారానికి మళ్లీమళ్లీ అనుమతిపత్రం ఇస్తూ ఉండే అవకాశాలలో ఈవ్యాపారపద్ధతి కంపెనీవారి కేపాటి లాభ సాటిగా ఉన్న దనే విషయం పార్లమెంటువారు గమనిస్తూ ఉండేవారు. ఇట్లు 1600 సం॥ మొదలు 1757 సం॥ వరకూ కడచిపోయినది. ఈ నూటయేబది యేండ్ల కాలమూ కంపెనీవారు ప్రధానముగా వర్తకవ్యాపారాలను పెంపొందించుకొనుటకే తమ శక్తినంతనూ వినియోగించిరి.

ఈవిషయంలో 1757 సం॥ నాటివరకూ కుంఫిణీవారికి హిందూదేశంలో రాజకీయాధి

కారం స్థాపించుకుందామనే అభిప్రాయము, ఆశ, ఉండలేదనీ, తరువాతనే, హఠాత్తుగా తలవనితలంపుగా 1757 సం॥ లో ప్లాసీయుద్ధములో తమకు వచ్చిన విజయాన్నిబట్టి ఆ ఆశ వారిలో రగుల్కొన్నదనీ సామాన్యంగా ప్రచారంలో ఉండే అభిప్రాయము. కాని ఆ వెనుకటి స్థితిగతులను జాగ్రత్తగా పరిశీలించినట్లయితే అంతకు చాలా పూర్వమే ఆ ఆశ వారి కుండేదనీ, అందుకువారు ప్రయత్నములు కూడా సాగించినారని తెలుస్తుంది. ఎందుకంటే, 1686 సం॥ లోనే కుంఫిణీవారు చిట్టగాంగ్ (బెంగాల్) పై ముట్టడి సాగించి ఔరంగజేబుతో యుద్ధమునకు డీకొనిరి.

ఈ యంశమును గూర్చియే మెకాలేగారిట్లు నుడివిరి: "1765 సం॥ నాటికి చాలపూర్వమే కంపెనీవారికి నిజమైన రాజకీయాధికారముండేది. అయితే, అవసరమునుబట్టి ఆ అధికారాన్ని ఒక్కొక్కప్పుడు తమ చేతుల లోనూ, ఒక్కొక్కప్పుడు సంస్థానాధిపతుల చేతులలోనూ ఉంచుతూ ఉండడానికి అనుకూలంగా ఉండవలెననే అభిప్రాయంతో క్లైవు, హేస్టింగ్సు లిద్దరును కుంఫిణీవారి అధికారస్వభావాన్ని ఇదమిత్థమని నిర్ణయించకుండా ఉంచారు." (స్ట్రాపేగారి 'ఇండియన్ ఇన్‌స్టిట్యూషన్' నుండి, పుట 14.)

1757 సం॥లో ప్లాసీయుద్ధములో జయము కలిగిన మీదట కొన్ని పెద్దపెద్ద రాష్ట్రములను పరిపాలిస్తూ వాని రాజకీయ యోగక్షేమాలను గమనిస్తూ ఉండవలసిన ప్రత్యక్షమైన పరిపాలనాధికారం పూర్తిగా కంపెనీవారికి లభించినది.

ఈసందర్భంలో ఇప్పటికి ఇంగ్లాండ్ దేశములో, జనసామాన్యములో, కుంఫిణీవారి విషయమై వ్యాప్తిలోఉండిన అభిప్రాయాన్ని గూర్చి కూడా, కొంత చెప్పడం అవసరము. 1600 సం॥లో ప్రాచ్య దేశాలతో వర్తక వ్యాపారాలు ఆరంభించినది మొదలు, ఏదో ఒకటి రెండు పర్యాయములు నష్టము వచ్చినప్పటికీ, సాధారణముగా కుంఫిణీవారి వ్యాపారం లాభసాటిగానే ఉండేది. ఈస్థితి ఇంగ్లాండ్ లోని తక్కిన వ్యాపారస్థుల కన్నెఱ్ఱదనానికి కారణమయింది. ఈ గుత్తపద్ధతి లేకపోయినట్లయితే మన కందరికీ ఈ లాభాలను పంచుకొనడానికి అవకాశం ఉండేది కదా అనే ఆశ ఒకటి వారిలో వ్యాపించింది. ఇట్లు రాజకీయాధికారాలు, స్పష్టమైనవి, లేనికాలంలోనే కంపెనీవారు ఇక్కడివారి ఆదరానికి పాత్రులై లాభములను సంపాదించుకొన గలిగినప్పుడు ఇంక వారి కా రాజకీయాధికారంగూడా లభించినప్పుడు వారి అదృష్టానికి లోప మేమిటి గనుక ?—

ఇట్టి అభిప్రాయం ఒకసారి మొలకెత్తినప్పుడు, వర్తకవ్యాపారాలలో ఆరితేరి, ప్రపంచములో సాధ్యమైనంతవరకు తమ వాణిజ్య సామ్రాజ్యాన్ని పెంపొందించుకోవడానికి నిరంతర ప్రయత్నాలు సాగించడంలో తమ రక్తం ధారపోయడానికి రవ్వంతైనా వెనుదీయని

కుందామని కంపెనీవారు అటు తిరిగి చూచు కొనేటప్పటికి అవికూడా వారిస్వాధీనం తప్పి పోతున్నవి. అంటే, ప్రతి అవకాశంలోనూ, పార్లమెంటువారు పైన చెప్పిన సాకు చూపించి ఒకవైపు కంపెనీవారి గుత్త వ్యాపారాన్ని అంతరింపజేస్తూ, రెండవవైపు కంపెనీవారికి తాము ఇస్తూవచ్చిన రాజకీయాధికారాలలో కొంత కొంత తాముకూడా పంచుకొంటూవచ్చారు. ఇదే ఈవ్యాసం మొదట సూచింపబడిన Double Government పద్ధతి. ఈపంపకం ఇలా 1857 సం॥ము వరకూ సాగినది. క్రమక్రమంగా ఇందులో మొగ్గు పార్లమెంటువైపు హెచ్చిపోతూఉండేది. ఇట్లు కాలం గడచిన కొలదీ, ' ఈ అధికారవిభజనమేమిటి ? అంత అధికారం ఒకచోటే ఉండాలె' అని పార్లమెంటువారు కొత్తదారి ఒకటి తీశారు. ఈవాదంతోనే తుదకు 1858 సం॥లో కంపెనీవారి రాజకీయాధికారం పూర్తిగా అంతరింపజేసి భారతదేశ పరిపాలనాధికారం ప్రత్యక్షంగా పార్లమెంటువారే స్వాధీనపరచుకొన్నారు.

ఈవిధంగా 1757 సం॥ మొదలు 1858 సం॥ వరకూ కంపెనీవారికీ పార్లమెంటువారికీ జరుగుతూవచ్చిన సంఘర్షణకు ఫలితముగా కలిగిన ఆ పరిణామాలునూ, అధికార నిర్ణయాన్నిగూర్చీ, నిర్వచనాన్నిగూర్చీ ఆ రెండు పక్షములవారికీ జరిగిన వాదోపవాదాలనూ దృష్టిలో ఉంచుకొని చూచినప్పుడు, ఆసంఘర్షణకూ, ప్రస్తుత సంఘర్షణకూ స్వభావంలో సామ్యం చాలా కనబడుతుంది. అక్కడ కంపెనీవారినుండి అధికారం లాగుకోవలెననే పార్లమెంటువారి ప్రయత్నం ఏలాంటిదో ఇక్కడ పార్లమెంటువారి స్వాధీనంనుంచి పరిపాలనాధికారం వశపరుచుకోవడానికి భారతీయులు చేసే ప్రయత్నంకూడా అటువంటిదే. కాని, ఇంతమాత్రముచేత ఈ రెండు సంఘర్షణలకూ అసలు భేదమే లేదని అనుకోకూడదు. ఈసందర్భమున గలభేదము లివి :

(1) అక్కడ కంపెనీవారినుండి అధికారం స్వాధీన పరచుకోవడానికి ప్రయత్నించిన పార్లమెంటువారు కంపెనీవారికన్న ఎక్కువ బలమూ, అధికారమూ కలవారు. ఇక్కడ పార్లమెంటు వారినుండి అధికారం స్వాధీనపరచుకోవడానికి ప్రయత్నించే భారతీయులు కేవలం దుర్బలులూ; అధికార రహితులూను.

(2) అది కేవలం ఇంగ్లీషువారికీ ఇంగ్లీషువారికీ జరిగిన సంఘర్షణ. ఇది సర్వవిధములా పరస్పర భిన్నములైన రెండుజాతుల పరస్పర సంఘర్షణ.

(3) ఈ పైనుదాహరించిన రెండు విధముల స్థితిగతులనుబట్టీ, కంపెనీవారిని లొంగదీయడం పార్లమెంటువారికి సులభమయినది. ఇప్పుడు పార్లమెంటువారిని లోగదీయడం భారతీయులకు దుస్సాధ్యముగా ఉన్నది.

కాని, యీభేదా లున్నప్పటికీ పైన వివరింపబడిన అధికారపరిణామంలోనూ, వాదోప

వాదాలలోనూ ఈరెండు సంఘర్షణలకూ ఉన్న సామ్యము, కేవల బలాబలములకు సంబంధించిన పై భేదాలను కప్పివేసి, వీటికి రెంటికీ ఒక పోలికను కల్పిస్తున్నది. ఈ సామ్యమునుగూర్చీ, ఆరంభంనుంచీ దాని పరిణామాన్ని గూర్చీ ముందు వ్యాసాలలో వివరిస్తాను.

[మా రంగాచార్యుల కాకితాలలో ఈ సాఫు వ్రాసిన వ్యాసముకూడా దొరికింది. దీని తరువాతవ్యాసము తాలూకుకూడా కొంత గ్రంథము దొరికింది. ఇంకా దొరకవచ్చు. ఈవ్యాసము సిద్ధమైనదే అయినా, దీనిలోనూ అక్కడక్కడ పార్లమెంటు ఉపన్యాసాలనుంచీ, సర్ జాన్ మాల్కామ్ మున్నగువారి గ్రంథములనుంచి ఉల్లేఖనాలూ, Double Government ను గూర్చి మఱికొంత విపులవివరణమూ చేర్చడానికిగాను సూచనలు వ్రాసిఉన్నవి. అవి లేకపోయినా వ్యాసము అసమగ్రము కాదు. కాని, ఉంటే ఇంకా ఎంత బాగుండునో కదా!—కొం. జ.]

[గురదృష్టవశమున నిపుణుడగు నీవ్యాసకర్త అల్పాయుష్కుడగుటను వ్యాసమునందలి చివరవాక్యము నర్థమెన్నటికిని సార్థకము కాజాలదనుటకు మిగుల వగపగుచున్నది. సం. భా.]

---

## మొగలి

అష్టావధాని గోరుగంతు అచ్యుత సూర్యనారాయణశర్మ గారు

౧

ఘనపటలిం దళుక్కుమని గ్రాలెడి క్రొమ్మెఱుంగేమొ? వేల్పురా
యని రతనాలలోన నలరారెడి మేలిపసిండియేమొ? యం
చనయము నాకులం దెసఁగు నందపు నీమెయిచాయఁ గన్న నె
మ్మనమున నేరికైనఁ బలుమాఱులు సందియ ముద్భవింపదే?

౨

కడు స్పృశియింపరాని కటుకంటకసంవృతభూరుహంబులం
దెడనెడ ఘుమ్ముఘుమ్మ్మ మన నింపగు తావులఁ గ్రుమ్మరించి, పొ
ల్పడరుసువర్ణ భాగ్యమున నందముగా విలసిల్లు కేతకా!
పొడమితి వేక్రియం జెపుమ! బొగ్గులలో రతనంపుఁ బోలికన్.

3

తావులఁ గ్రుమ్మరింతు పలుతావుల; మేలిపసిండిచాయకుం
ద్రోవలఁ జూపు గాత్రము; సతుల్ శిరసారఁగ గారవింత్రు నిన్;
బో విడనాడ వేల, యల ముందరి కంటకవృత్తి? దానిచే
నీవిలసద్యశంబున జనించును బో, యళిదుష్కళంకముల్.

౪

కంటక దుర్గమస్థితిని కామకఠోరతరుప్రశాఖలం
దుంటను నీకుఁగూడ నయయో, యలకంటకితాప్రసిద్ధియే
యంటెను బోలు, వీడు మిఁకనైనఁ దగన్ సహవాసదోషముల్;
గెంటుము కంటకస్థితులఁ, గీరితిఁ గాంచుము, కేతకీసుమా!

౫

నీవిలసత్సువాసనల నెమ్మది నెంతయు సంతసించి ని
న్నేవిధినైనఁ గొందమని యెంచియుఁ దావకగంధలోలు పా
శీవిషభామినీ మణులచేఁ బడినా వయయో యటంచుఁ జిం
తావిల మానసాంబుజుల మైతిమి కేతక సుప్రసూనమా!

౬

చారుసు గంధగంధిల లసత్తర మందసమీరణాంకుర
స్ఫారమిళద్రజోవ్రజ విభాసురమా! లసమానసారమా!
మారుకటారి వౌచుఁ బలుమారు వియోగుల నేఁచనౌన? వి
స్తారసు దృక్ఛిరోమణి విధంబగు కీర్తికి జంకు పుట్టదే?

"పూలతోట"




# భారతీయశిల్పము-మకరము

కొత్తా రామమోహనశాస్త్రిగారు

శ్లో॥ పవనః పవతా మస్మి
రామ శ్శస్త్రభృతా మహమ్,
ఝషాణాం మకర శ్చాస్మి
స్రోతసా మస్మి జాహ్నవీ.

దశమాధ్యాయము, ౩౧వ శ్లోకము.

"మత్స్యములయందు మకర రూపమున నున్నాను" అని భగవానుడు నుడివెను. సాధారణముగ పద్మము లేని చెక్కడముగాని, మకరతోరణము లేని మందిరములు, దేవాలయములు, స్తూపములు గాని భారతవర్షమున నరుదు. ఎల్లెడల సహస్రదళ, షోడశదళ అష్టదళ పద్మములను, సుసౌందర్యమున నలరెడి మకరతోరణములను గాంచి తన్మయుల మగుచుందుము. హిందూ గృహద్వారము పుష్పముల, పచ్చని యాకుతోరణముల విరాజిల్లుచుండు విధమున దేవాలయములు, చైత్యములు, స్తూపములు, జైనమందిరములు, మొదలగునవన్నియు శిల్పకళావైభవమున స్థిరజీవులై, మకరతోరణముల నలరారుచు విశ్వలక్ష్మి కాలవాలమై యలరారుచుండును.

హిందూగృహిణి ఉషఃకాలముననే గృహప్రాంగణము చిమ్మి,నీళ్లు చల్లి,వింత వింతల రంగవల్లికలనిడి, ద్వారబంధమునకుపసుపుపూసి కుంకుమ నలది, పచ్చనియాకు జొంపముల తోరణముల గట్టి గృహలక్ష్మిని పూజించుచునే యున్నది. కళావిహీనమై తేజోరహితమైయున్న భారతవర్షము ప్రాతఃకాలముననేవిశ్వజనని నిష్విధి నాహ్వానించి గృహలక్ష్మిగ బూజించి చరితార్థతకొరకు బ్రయత్నించుచు నున్నదని నుడువునప్పుడు భారతీయ శిల్పముస్థిరజీవి యనుట కెట్టిసందియమును గలుగజాలదు.

భారతీయశిల్పి దేవాలయమును నిర్మించి, తన హృదయకమలమందు విలసిల్లుచుండు ధ్యానరూపము నందుప్రతిష్ఠించి ద్వారములకు చిరయశోమండితము లగు మకరతోరణముల చెక్కుచున్నాడు. ఈమకరతోరణ మద్వితీయ మగు శిల్పసృష్టియని గ్రహించ వలయును.

మకరతోరణమందలి మకరము మొసలివలె నున్నను మొసలికాదు. మొసలి

యొక్క రూపాంతరము, లేక శిల్పి సృష్టియని గ్రహించగలిగిన భారత శిల్పము హృదయంగమ మగును. కావున భారతీయశిల్పమందలి మకరము, మకర తోరణము నిత్యనూతనవైభవమున నలరారుచు, మందిరములు, స్తూపములు, దేవళములు మొదలగువానిని చిరంజీవులుగ నొనర్చుచున్నది.

తొలిచాళుక్యుల అయిహోలు కట్టడమునందలి మకరతోరణము (చి. ౨.) గమనింపదగినది.

ఇందలి మకరముయొక్క పశ్చాద్భాగము నిడుపుగ, విచిత్ర వాలసదృశముగను మిగులనేర్పుతో రచింపబడెను. మరియు పల్లవులనాటి



చి. ౧. మామల్లపురమునందలి దుర్గాదేవాలయము.



చి. ౨. చాళుక్యశిల్పము, క్రీ. ౧౦-వ శతాబ్దము

మహాబలిపురమందలి దుర్గమందిరము (చి. ౧.) మీాద నున్న మకరతోరణములు నేత్రపర్వం బొనర్చుచుండును. ఇవి ఆకృతియందునను, కల్పనా చాతురియందునను, రచనానైపుణ్యమునందునను నద్వితీయములనుట యతిశయోక్తి కాదు.

మధ్యయుగమునాటి సింహళదేశపు చిత్రకళయందు మకరము కాన్పించుచున్నది.

'హూపావళీ' యను సింహళదేశగ్రంథమందు మకర మిట్లు వర్ణింపబడినది. "నడుముక్రింది భాగము ఏనుగునడుమునుబోలియు, పాదములు సింహపాదములవలెను ఉండును. కర్ణములు వరాహకర్ణతుల్యములై యుండును. శరీరము మత్స్యాకృతిని గలిగి దంతము లూర్ధ్వ ముఖములై యుండును. నేత్రములు వానర నేత్రముల బోలి, అత్యద్భుత మగు వాలము తోడ నలరారుచుండును."౧

బర్మా యనబడు బ్రహ్మదేశమందలి క్రీ. శ. 9, 13 శతాబ్దుల మధ్యకాలపుకట్టడములయందలి గవాక్షములు, ద్వారబంధములు మొదలగు వానిమీద మకరచిహ్నచిత్రములు కలవు. కాని వానియందు సాధారణముగ వాలము వదలివేయబడి, ముఖముమాత్రమే చిత్రింపబడియుండును. ఇరువైపుల దంతములు కలిగి నోరు తెరచికొనియుండును. ఇటులు తమ దేశపు శిల్పవైఖరియందు అతికినట్లు సరిపోవు లాగు మార్చుకొనియుందురు.

ఘారియల్ లేక గావియల్ అను జలచరము ఉత్తరహిందూస్థానమందలి బ్రహ్మపుత్ర, సింధు, గంగా, నదులలో కానిపించుచున్నది. ఇదియు దాదాపు మొసలియాకృతినే గలిగియుండును.

దీనినుండియే ప్రప్రథమమున మకరచిహ్నము వచ్చినదని 'గోషు' పండితుని యభిప్రాయము. కాని కావేరి మొదలుగాగల దక్షిణదేశమందలి నదులలోను, ఉత్తరదేశమం దెల్లెడలను కానిపించు మొసలినుండి మకరచిహ్నము వచ్చియుండక గావియల్ నుండియే ఏలవచ్చినదో తెలియకున్నది. ఏలయన: ఇదియొక భారతవర్షమందే కాక సిలోను, జావా



చి. ౩. మధ్యజావాలోని పరాంబనన్ శిల్పము. క్రీ. ౯-వ శతాబ్దమునకు పూర్వము

(చి. ౩.) బర్మాదేశములయందలి దేవళములు మొదలగువాటిమీది చెక్కడము లందు కాన్పించుచు సరిగ మొసలిని పోలియుండుటను గోషుగారి యభిప్రాయము సరియైనదికాదని నుడువవచ్చును.

ఇందు గ్రీకుసంపర్క మున్నదనియు, హూనసులు హిందూదేశమునకు వచ్చి రాజ్యపాలన మొనర్చినకాలమున మకరము తోకవైపున మత్స్యాకృతిని పొందినదని స్టట్టరు హామ్౨ అనునాతని యూహ.

హూనసులరాకకు చాలకాలము పూర్వమునందే యుండిన బార్హూతు (Rails)

౧. ఆనందకుమారస్వామి: Mediæval Sinhalese Art, p. 84

౨. (W. F. Stutterham: Indian Art and letters, 1929.

# ఎమిల్ జానింగ్సు ('Emil Jannnings')

సుప్రసిద్ధ సినీమానటకుడు: వివిధవేషములు, లేక అభినయ విశేషములు



౧. వ్యాపారసూచకుని వేషమున



౨. "The Last Laugh" సంచలిత్రద్ద్వారపాలకునివేషమున



."The Last Command" నందలిరష్యను సేనాపతివేషమున



౪. భ్రాంతియుతు డగు తండ్రివేషమున

## క త్తి చి ం దు



[illegible] కన్యగారు ప్రాచీన యవనవేషమున కత్తిచిందులాడునప్పుడు చూపిన ఒకభంగిక : [illegible].

P. P. A.

(చి. ౪.) నందునను, బేసానగరు స్తంభములమీ



చి. ౪. బార్హుత్ శిల్పము, క్రీ. పూ ౨-వ శతాబ్దము

దను, మథురా (చి. ౫.) మొదలగు నాటిశిల్ప



చి. ౫. మథురా శిల్పము, క్రీ. పూ. ౧-వ శతాబ్దము

ములయందును గానగు మకరములయందు మత్స్యాకృతి తోకలు చిత్రించిరి. అట్టికరి తర్వాత వచ్చిన హంసనుం ప్రతిభావిశేషము ఈ మకరముయొక్క తోకవైపు భాగమునకు కారణము ఎట్లుగునో తెలియకున్నది. [illegible] అమరావతి శిల్పముల యందలి మకరము (చి. ౬.) క్రొత్తసొబగును నిరూపించుచున్నది.



చి. ౬. అమరావతి శిల్పము, క్రీ. ౨-వ శతాబ్దము

ఇందు రెండు సుందరములగు కొమ్ములు క్రిందివైపునకు తిరిగియుండును. ఇట్టికొమ్ము అజంత (చి. ౭.) చిత్తరువులయందును గాన్పించును



చి. ౭. అజంతా శిల్పము, ౧౬-వ గుహ. క్రీ. ౫-వ శతాబ్దము

అమరావతియందలి వాటి భంగిమవిలాసము, రూపలావణ్యము ఆంధ్రకళా ప్రాశస్త్యమునకు చిహ్నమని బర్గెసుమహాశయుడు వ్రాసెను. 'సర్ జాన్ మార్షు' కనుగొనిన తక్షశిలా శిల్పములగు 'సర్ కాప్ సిటీ' యందలి Scythio Parthinian, రెండుకాళ్ల మకరము, మొద్దుగ అమరావతీమకరముల చాయలవలెనున్నవని యాతడు తలంచుచున్నాడు.

గుప్త శకారంభమునం దిది మిక్కిలి నిపుణమగు మార్పుచెందెను. చంపా (Champa) కళాప్రాశస్త్యమును గుర్చి శ్రీ ఓ. సి. గంగూలిగారు వ్రాసిన వ్యాసమున (Rupam, No. July 1923.) ఆకాలమందలి మకరతోరణముల సౌందర్యమును చక్కగ వర్ణించెను.

బౌద్ధచైత్యములయందు కానవగు తోరణముల కిరువైపుల మకరములును పైన సింహముతో కూడిన కీర్తి ముఖమునకు కలుపబడి

యొక వింతరూపమును దాల్చెను. కాని యట్టి మకరతోరణములు పోను పోను శుభచిహ్నములై ప్రతి బౌద్ధ-కట్టడమునను అలరార జొచ్చినవి.

కర్ణాటకదేశమం దివి ఎంతవిస్తారముగ గలవో ఒరిస్సాయం దంత తక్కువ.

క్రీ. శ. 13-వ శతాబ్దినాటి కోనార్క-యందలి అనేకములగు చిన్నచిన్న మత్స్యాకృతి గవాక్షములలోను,విగ్రహములమీదను, కృష్ణుడు-గోపికల పైభాగమందలి లతలలోను చక్కని మకరములు గనిపించుచున్నవి. కాని మాయాదేవి గుడియందలి (కోనార్క-) మకరము మెద్దుగ విపరీతరూపమున నున్నను అది యొక వింత అందమును చూపుచు యున్నది.

కాంచీపురమందలి కైలాసనాథాలయము నలువైపుల వివిధములగు మకరతోరణముల తో కూడిన కీర్తిముఖములు బహు అందమగు నవి గలవు. వరుణ దిక్పాలుని వాహనములలో నొకటియు, గంగాదేవి వాహనమును మకరమై యున్నవి. భోపాలునందలి ఉదయగిరి శిల్పములలోను, బేసానగరు శిల్పములలోను, ఎల్లోరా కైలాస గుహాయందునను గల గంగాదేవి వాహనములయందలి మకరములును గమనింపదగినవై యున్నవి.

---

## మెప్పు

అవ్వారి సుబ్రహ్మణ్యశాస్త్రిగారు

అతివిరక్తుల మెప్పు లందంగఁ గడఁగిన విషయసక్తులు వాని వెట్టి యండ్రు
విషయసక్తుల మెప్పపేక్షించి నడచిన ధనలుబ్ధు లద్దానిఁ దగ దటండ్రు
గొప్ప ధనాఢ్యులమెప్పులకై పోవ ఖ్యాతికాములు వానిఁ గాదటండ్రు
కీర్తికాముల మెప్పు కేవలంబుగఁ గోరఁ జదువరు లద్దాని సరకుగొనరు
మెప్పులే గోర దారులు తప్పుచుండు-నొక్కదారిఁ గృతార్థత నొంద లేక
మానవుఁడు పురుషార్థ విహీనుఁ డగును-మెప్పు లాసించు టెప్పుడు గొప్పతప్పు.

---

# విమానములు

శంకర వేంకటరావుగారు



ప్రపంచమునం గల యన్ని దేశములయందును విమానములు ప్రతిదినము పెక్కు వేలమైళ్లు సుకరముగా ప్రయాణము సాగించుచున్నను, చాలమంది వాయుపథ ప్రయాణమనిన మిక్కిలి యపాయకరమయిన దని యూహించుచున్నారు. అట్టివారు విమాన నిర్మాతలు (Engineers) చేసినకృషియు, ప్రస్తుతము విమానప్రయాణ మెంతవరకభివృద్ధి జెందినదియు దెలిసికొనుట ముఖ్యము.

విమానములు రాత్రింబవళ్లును వర్షమునందును, గాలియందును, పొగమంచునందును నిరపాయముగా బ్రయాణము సాగించుచున్నవి. పెద్దపెద్దపట్టణములందు విమానములు దిగుటకు, నెగురుటకు బ్రత్యేకస్థలములు (Landing grounds) నిర్మింపబడుచున్నవి. అమెరికాలోని చికాగో (Chicago) నగరమునందు 12,000,000 డాలరుల వ్యయముతో నిర్మించుచున్న పోస్టాఫీసునందలి మీది యంతరువు విమానములు దిగుటకు నెగురుటకు వీలగున ట్లేర్పాటు చేయుచున్నారు. అట్లే యికముందు బ్రతిపట్టణమునందును విమానములసౌకర్యముకొఱ కేర్పాట్లు చేయబడునని యూహించుట వింతగాదు.

ఇక, విమానముల నేయేపనుల కుపయో గించుచున్నారో కొంతవర కాలోచింతము. విమానములు ముఖ్యముగా వాయుపథప్రయా ణమునకు (Air-transport), జాబులు మొద లగుటపాలు పంపుటకు (Air mail); గాలిలో నుండి ఫోటోగ్రాఫులు తీయుటకు (Aerial Photography); దేశములయొక్కయు పట్టణ ములయొక్కయు పటములను తయారుచేయు టకు (Map-making); సినీమాబొమ్మలు తీయు టకు (Moving pictures taking); పురుగు పట్టినపంటచేలకు మందు చల్లుటకు, ఎరువులు చల్లుటకు (Crop dusting); గొప్పయరణ్యము లందుపుట్టిన యగ్నిప్రమాదములను పోగొట్టు టకు (Forest fire patrol), లోనికి చొర వీలు కాని యద్భుతమగు నరణ్యములు, కొండలు, నదులు మొదలగునవి చూచి యానందించుటకు (Sight seeing); జ్ఞానాభివృద్ధికొఱకు చూడ ననువులేని ప్రదేశములను చూచుటకు (Educational tours); రైలురోడ్లు ఎలెక్ట్రిక్ తీగెలు, టెలిగ్రాఫ్ తీగెలు మొదలగునవి వేయుటకు (Rail-road and Powerline construction); ఎస్టేట్లు మొదలగువాని నభివృద్ధిచేయు టకై సర్వేచేయుటకు (Estate development survey); ప్రమాదములనుండి ప్రజ లను కాపాడుటకు (Rescue work); మను ష్యులను, సామానులను బహువేగముగా, నిరాతంకముగా దేశదేశముల చేర్చుటకు; ఈ మొదలయిన వివిధకార్యముల కుపయో గించుచున్నవి.

విమానములసౌకర్యముకొరకు సముద్ర మధ్యమునందు పెద్దపెద్ద చదునయినప్రదేశ ములు (Floating Seadromes) కట్టబడు చున్నవి. ఇవి యాకసమునం దెగురుచున్న విమానములు దిగుటకును, ఎగురుటకును ఉపయోగపడును. ప్రస్తుతము న్యూయార్కు (New York) పట్టణమునకు 550 మైళ్లదూర మున అట్లాంటిక్ మహాసముద్రమున 1,200 అడుగులు పొడవును, 400 అడుగులు వెడల్పును గలిగిన ప్రదేశ మొకటి నిర్మింపబడుచున్నది. దానిపై నొక భోజనశాలయు, (Hotel) పెట్రోలు ట్యాంకులును (Gasolene tanks), మరామత్తుచేయు షాపులును (Repair shops), చిన్నచిన్న లైటింటిమొదలైనవి గట్టబడు చున్నవి.

ఇట్టిసంగతులు వినినంతనే యాశ్చర్యము కలుగుచున్నను, నిజముగ జరుగుచున్నవని మన మెరుంగుదుము. అట్టివో విమానములు కొంతవరకు ప్రమాదకరములయిన వయినను మునుముందు కొద్దికాలములోనే, నిరపాయ కరము లగునని తలంపవలెను. కానిచో మన కంటె నెక్కువ మేధావంతు లయినవారు కోట్లకొలది ద్రవ్యము వృథావిమానాభివృద్ధి కై వ్యయముచేయరు.

ఇక, విమానములకు గలుగుచున్న ప్రమాదముల నెట్లు సాధ్యమగునంతవరకు గలుగకుండ జేయవలెననియు, ప్రయాణమున కానుకూల్యము గావింపవలెననియు, శాస్త్రజ్ఞు

లును, విమాననిర్మాతలును జేయుచున్న కృషి కొంతవరకు విచారింతము.

ప్రతివిమానమునకు నింతకంటె మరి తక్కువవేగమున నెగురనేరదని యొకలెక్క యున్నది. చిన్నయంత్రములు గంటకు 40 మైళ్లకంటెను, పెద్దవి గంటకు 60 మైళ్ల కంటెను, విశేషజనులను గొంపోవుగొప్పవి గంటకు 80 మైళ్లకంటెను, దక్కువవేగమున నెగురజాలవు. సాధారణముగ నీనియమము విమానములు గాలిలో నెగురువేగములో సగ మైయుండును. ఈతక్కువవేగము (Stalling speed) తోనే విమానము భూమిపైకి దిగును. అట్టిసమయమున విమానముయొక్క యంత్రము లెగురుచున్నవేగము చాలమిచే, పని చేయక, లొంగుబాటునం దుండవు. ఇదియే విమానములకు సంభవించెడి ప్రమాదము లలో ముఖ్యమైనది. కావున విమాన మెగురు చున్నప్పుడును, దిగుచున్నప్పుడును, ఈ తక్కువవేగము (stalling speed) వరకు విమానములు రానిచ్చినచో, యంత్రము యొక్క ముక్కు క్రిందికి వంగి, గిరగిర దిరుగ ప్రారంభించును. ఇట్టిస్థితిలో విమాన మెంతో యెత్తుననుండి గాని తిరిగి సరియయినత్రోవకు రాదు. ఈప్రమాదములు తరుచుగా దిగు చున్నప్పుడును, ఎగురుచున్నప్పుడును నేదేని యొకగోడను గాని, వృక్షమును గాని దాటవలసి వచ్చినప్పుడు దొందరగా కోలను (Joy stick) వెనుకకు లాగి విమానము నడుపువాడే యిట్టి ప్రమాదములకు కారకు డగుచున్నాడు. ఇట్టి ప్రమాదములు సాధ్యమైనంతవరకు దగ్గించుట కొకానొకవిధమయిన రెక్కల (Slotted wings) నమర్చుచున్నారు. గాలిలో నెగురు వారికిది నిజముగా గొప్పసదుపాయము. ఇప్పు డిట్టిరెక్కలు సర్వసాధారణముగా నన్ని విమానములకు నమర్పబడుచున్నవి. ఈ రెక్కలవలన విమానముయొక్క వేగము నడుపువానిస్వాధీనమం దుండుటయే కాక, విమానము దిగునప్పు డుండువేగము నూటి కిరువది వంతులు తగ్గును. ఈరెక్కలవిధానమువలన దొలగింపబడిన ప్రమాదములు బహుశః ఇన్ని న్నియని లెక్కపెట్ట నలవిగాదు. ఇది విమాన క్షేమాభివృద్ధివిషయమున నిర్మాతలచే గావింపబడు మహద్విశేష మనిపించుకొనబడు చున్నది.

ఇక మరొక్కవిషయమును విచారింతము. విమానములు దిగుటకును, నెగురుటకును నొకవిశాలప్రదేశ మావశ్యకము. అట్టి స్థల మున్నచోట్లు లభింపకపోవుటచే విమాన ప్రాముఖ్యము చాలమట్టుకు తగ్గవలసివచ్చినది. ఈయాతంకము లేకుండజేయుటకయి, విశేషస్థల మాక్రమించకుండ నిలువుగా లేచి నిలువుగా గ్రిందికి దిగువిమానములను విమాన నిర్మాతలు కొన్నింటిని నిర్మించి వానికి "హెలికోప్టరు" (Helicoptor) లని పేరిడిరి. కాని హెలికోప్టరులు మామూలువిమానము లట్లు పనిచేయలేకపోవుటచే నవి యభివృద్ధి లోనికి వచ్చినవి కావు. అందుచే మామూలు విమానమును, హెలికోప్టరును గాని, యింకొక

విధమయిన "ఆటోగైరో" (Autogiro) యను విమానము నిర్మింపబడి పై రెంటికిని సమాధానము కొంతవరకు కుదిర్చినది. "ఆటోగైరో" పై కెగరుటకు మామూలువిమానము వలె కొంతవిశాలమగుస్థలము కావలసినను, నది నిలువుగ నతిక్షేమముగ, కడు తక్కువ స్థలములో దిగగలదు. హఠాత్తుగా దిగవలసి వచ్చినప్పుడు చిన్నస్థలములో సుకరముగా దిగగలదు.

విమానములకు సంభవించెడు మరియొక ప్రమాదము, దానియొక్క యంత్రము (Engine) చెడుట. ఇట్టిప్రమాదములను దొలగించుటకు విమానములకు గలయంత్రసంఖ్య నభివృద్ధిచేయుచున్నారు. మూడు నాలుగు యంత్రములు గలవిమానములకు, ఒకటి, రెండుయంత్రములు చెడినను, మిగిలినవానితో సురక్షితముగా నెగురగలవు. చెడినయంత్రములు బాగుచేసికొనుటకు గావలసిన సామగ్రిని విమానమునం దుంచుకొని చెడిన భాగములను విమానము క్రిందికిదిగకుండగనే బాగుచేసికొనగలుగుచున్నారు. గొప్పవిమానములు, "డార్నియర్ X" (Dornier X) మొదలగునవి 150 మంది మనుష్యుల నెక్కించుకొని వాని కమర్చబడిన 12 యంత్రములలో 8 చెడినను నాలుగింటితో సురక్షితముగా ప్రయాణము సాగించగలుగుచున్నవి.

విమాననిర్మాతలు బహుశ్రద్ధతో యంత్రములను బలముగా జేయుట యొకముఖ్యమయినవిషయము. వారు చేయుచున్న కృషి మిక్కిలి ప్రశంసనీయము. అయిదుసంవత్సరముల క్రిందటికంటె నిప్పుడు తయారగుచున్న విమానములు పదిరెట్లెక్కువ శ్రేష్ఠతరములని చెప్పక తప్పదు: ఎంతవ్యయముతో గూడినదయినను దానిని ధృఢముగా నిర్మించుటయే వారియుద్దేశము. ఈవిధముగా జేయవలసినంతపని చేసి వ్యయప్రయాసములను లక్ష్యపెట్టక దానిసుస్థిరత్వక్షేమమే ముఖ్యముగా దలంపవలసిన విషయమని విమాననిర్మాతలు నిశ్చయించుకొని పనిచేయుచున్నారు.

కాన నిదివరకు వివిధవిమానములకు తటస్థించిన విపత్తులవలన నిస్పృహ జెంది యుండుటకంటె, మునుపటికన్న నిప్పుడు విమానము లెంతటిమార్పును జెందినవో గ్రహించుటయు, సాధ్యమైనంతవరకు విమానాభివృద్ధికి ప్రతిమనుజుడును దోడ్పడుటయు నీసమయమున నవసరమని తెలియుచున్నది.

---

# భల్లటశతకము

చిలకమర్తి లక్ష్మీనరసింహముగారు

[భల్లటుఁ డొకసంస్కృతమహాకవి. ఇతఁడే కాలపువాఁడో యే దేశపువాఁడో తెలియదు. తెలిసికొనుటకుఁ దగినయాధారములు గానరావు. అధర్వణకారికలలో నొకభల్లటునిపే రుదాహరింపఁబడినది. అతఁ డీభల్లటుఁడో మఱియొకఁడో విచారింపఁదగియున్నది. భల్లటుఁడు సంస్కృతమున నొకనీతిశతకము రచియించెను. అదే నేనిప్పుడు తెనిఁగించినభల్లటశతకము. ఇందు నూటపదిశ్లోకములు గలవు. ఈతనికవిత్వము భారవి, మాఘ కవుల కవిత్వములవలె గంభీరమై నారికేళ పాకముగా నుండును. ఇందలినీతి యన్యాపదేశముగా బోధింపఁబడినది. అనగా నేదో యొక వస్తువుమీఁద వంకపెట్టి యితఁడు నీతి బోధించుచుండును. ఎట్లన—

"ఇనుఁ డంతంబును బొందినాఁడనుచు నో
క్కింతేనియుం గుంద, నే
మనఁ గాలం బగునేని నీభువి నెవం
డంతంబునుం బొందఁ? డై
నను వేధించుచునున్న దియ్యది నను
గాటంబుగా, నానభం
బున నే క్రమ్మెను బాడుచీఁకటుల గుం
పుల్ చూడ హేయంబులై."

సూర్యుఁ డస్తమించినాఁడని నేను విచారింపను. కాలము వచ్చినప్పు డీలోకమున మృతి నొందకుండువా రెవ్వరు? కాని నన్నొక్క విషయము బాధించుచున్నది. ఎక్కడ సూర్యుఁడు మహాప్రభలతో వెలిఁగినాఁడో యా యాకాశమునందే చీఁకటులగుంపు లసహ్యముగా వ్యాపించినవి — యని దీని యర్థము.

ఇందలియన్యాపదేశ మేమనఁగాఁ, గాలమాసన్నమైనప్పు డెట్టిమహాపురుషులైన మృతి నొందుదురు. కాని వా రాక్రమించిన మహాపదవులను బరమనీచులుమాత్ర మాక్రమించుట విచారకరము. ఈనీతి సూర్యునిమీఁద వంకపెట్టి కవి బోధించినాఁడు. ఈవిధముగానే యిందలి యన్యాపదేశశ్లోకములను జదువరు లర్థము చేసికొనవలెను. నాయాంధ్రీకరణము యొక్క యోగుబాగులఁ బాఠకమహాశయులే నిర్ణయింతురు గాక.]

శ్రీలభవాని భవానీశకలుషనిచయ - వారణకళావిశారద శారద, సిత
శారదాబ్జసింహాసనశాయిని సిరిఁ - బ్రణుతిఁ జేసెద భక్తితత్పరుఁడ నగుచు.
ఉదయరాగసంపర్కంబు నొందియుండి - దివసజన్మోత్సవములందు దిక్సతీము
ఖముల సిందూరపాటలములటు చేయు-నినుని మొదటివెల్గులు శుభం బిడుత మీకు.

దొంగ బాధింపఁబడి మర్దితుండయి ప్రకృ-తార్థములె కాక పూర్వాహృతార్థములను
నొసఁగునటు మహాకవిసుప్రయుక్తశబ్ద-సమితి ప్రకృతాఽప్రకృతమహార్థముల నిచ్చు.

గాజు మణియంచు సన్మణి గాజటంచుఁ - దలఁచువారి మానవులుగాఁ దలఁపరాదు,
గాజు గాజుగ మణి మణిగా గ్రహించు - బుద్ధిమంతులె జగతిలోఁ బొగడు గాంత్రు.

చిరముగ నుత్తరోత్తరవిశిష్టపదాశ్రయవృత్తి నీకు సు
స్థిరమతి నెవ్వఁడొక్కొ యుపదేశము చేసినవాఁడు, ముందుగా
శరనిధిగర్భమం, దవల శంభునికంఠమునందు, నేఁడు దు
ష్కరులగువారినాలుకలఁ గాఁపురముంటివి కాలకూటమా!

ఆపదయందు ద్రవ్య మయి, యాభరణం బయి యుత్సవంబులన్
మాపులు దీప మౌచు, శరణం బయి భీతి జనించుపట్ల, నా
నాపరమోపకారకరణక్షమమై రతనం బొకం డిలన్
నీపగిదిన్ దనర్చుసుమి నిర్మలవర్తన మానవోత్తమా!

ఏరి సరకుసేయనియభిసారికవలె - ఘనతమోమలీమసవిమార్గములఁ బట్టి
తననగలచప్పుడును సహింపనిది యగుచు - సిరి గుణుల వీడి ఖలులను జేరుచుండు.

కడలిఁ బడుఁగాక, చొచ్చెడుఁగాక వహ్నిఁ, - బోవుఁగాక దిగంతరంబులకు, వ్రాలుఁ
గాక ధరణి, భానుఁడు సర్వలోకరంజ - కంబులగువానిగుణములు క్షయము గనునె?

మంచిచెడ్డలు దెలిసినమాన్యు లెల్ల - నేమి చెప్పుదురో విను మినునిగూర్చి,
కులటలును దొంగలును నాదుపలుకులే ప్ర-మాణమగునేని సూర్యుఁడే మసకు వలదు.

ఇనుఁ డంతంబును బొందినాఁ డనుచు నొక్కింతేనియుం గుంద నే
మనఁ గాలంబగునేని నీభువి నెవం డంతంబునుం బొందఁ? డై
నను వేధించుచున్న దియ్యది నన్ గాటంబుగా, నానభం
బున నేక్రమ్మెను బాడుచీఁకటులగుంపుల్ చూడ హేయంబులై.

సజ్జనులపంక్తిఁ జొచ్చి దుర్జనులు సాధు - లగుదురే సిగ్గుపడి మూల నడఁగియుంద్రు;
భానుదీప్తిచే వెలుఁగునభంబునందుఁ - జంద్రముఖ్యు లుండియు లేనిచాయ గారె?

ఆనలినాప్తుఁ డస్తమయ మంద జగత్త్రియదీప్యమానతే
జోనిధిలేమిఁ దద్విరహశోకము మాన్పు శశాంకుఁడంట, యెం

తే సగుబాటు గాఁగఁ దమ మేర్వ శిఖల్ పయి కెత్తి దీపికల్
ప్రాలినవెంట నాదుమదిలో వ్యథ నెంతయుఁ గల్గఁజేసెదుర్.

ద్యుమణికే తక్క నింకఁ జంద్రునికైన - సార్థకముగాదు ఖద్యోతశబ్ద మవని;
నట్టియెడ నల్పసంతుష్టుఁడౌ నెవండొ - మిణుఁగురుఁ కిచ్చె నాపేరు మీఁదరయక
మట్టమధ్యాహ్న మిది కీటమణిరో! శశియుఁ - దరణికిరణాళి నిష్ప్రభంతరితుఁడయ్యెఁ,
గారుచీఁకటుల్ దశదిశల్ గ్రమ్మునిశిని - మెఱయఁగలవేమొ, యిట నీవు మిట్టిపడకు.

అది సత్యమగుకాంతి యగుఁగాక యారోపితగుణంబు తుచ్ఛమ యగునుగాక,
యెదినైన జనుల మోహింపఁజేయును గాన స్వస్తి యాకాంతిలేశమున కెందుఁ
గాకపోవుత, దానికాంతులు వ్యాపించి, ఖద్యోత మనుకీటకమునఁ జేరఁ,
బ్రజలు జంగమమణిభ్రాంతినాపురుగుచే వంచింపఁబడుచుంద్రు వసుధలోన
వారివోదకపాన దుర్వ్యసనముగల చాతకంబెత్తుగా మెడచాఁచుఁగాక,
అంతమూసలేనిపులుంగు లన్ని దెసలఁ - బడయఁగలవుగా చల్లనిస్వాదుజలము.

వినిశితదంతకుంతముఖభీకరఘాతముల మహాద్రులన్
మొనసి తపింపఁజేయుగజముల్ తెలియందగుఁగాని, కుక్క హు
మ్మనినను నష్టచేష్ట మగునట్టిస్మగాల మెఱుంగునొక్కొ? వ
జ్రనిభమృగేంద్రపాదశతజాత మహాప్రహారోగ్రపీడలన్.

చెవులు చాపలములు జిహ్వా విరుద్ధంబు, - చూడ్కి మదయుతంబు, శూన్యహస్త,
మదియు వారణంబు, మది నెఱింగియు నళీ! - దానిసేవ నీవు మాన వేల?

పాలునీరును వేఱుసేయఁగల యప్రజ్ఞావిశేషంబు, నా
యాలాపంబులు, నామనోజ్ఞపదవిన్యాసంబులు న్లేవు, పో
నీతే, యిం దక వంచి నీమెడ హాయల్ నిండారఁగా మూర్తమా
శాలం బూరక యుండువేనిఁ జెలి! కొంగా! హంస వందుర్ నినుర్.

అభిమాన మతనిలో నధివసింపఁగ నోడు, నుపశమం బంతయు నుపశమిల్లు,
నిలువంగఁ దన కది నెలవు గాదనుసిగ్గు, స్వాతంత్ర్య మెల్లను జచ్చిపోవుఁ,
జీతము లూఁచుచును వేంచేయును ధైర్యంబు, సద్గుణావళి యెల్ల సమసిపోవు,
నాశరో! నినుఁ జేరి యాశ్రయించినదాసు లనుభవించెడుఫలం బదియసుమ్ము

అంతియే కాదు విను మొక్కవింతగూడఁ - బాదములనైనఁ దాఁకఁగఁ బనికిరాని
పరమనీచుండు తనదుపాదములతోడ - శిరసు స్పృశియింపుమన్న స్పృశింపఁ డౌర.

మూఁతలు లేని యాపెరుఁగుముంతను నిర్జనమైన తావునన్
బ్రాఁతిగ గ్రుడ్డికాకి గని, బాగుగఁ గంఠముఁ జాఁచి వింతలౌ
చేఁతల నెన్నియేన్ సలిపెఁ జిత్తమువచ్చినయట్లు గర్వియై
యాతఁడెఁ గాక యింక నెపు డయ్యది చేసెడు నట్టిచైదముల్.

బకబకకర్ణకీలములవంటిధ్వనుల్ పొనరించుకప్ప లెం
దుకు, ననయంబు నన్యులకు దుఃఖముఁ గోరెడు మూఁగకొంగ లెం
దుకు, మధురోక్తు లంచితగతుల్ గలయంచలతోడఁ జేయు పా
యక చెలిమిన్, సరోవరమ! యచ్చపుఁగీరితి నీవు కోరినన్.

విరహిణి చూడ దించుకయు వీనులవిందుగఁ గూయుచిల్క, సుం
దరముగ నాడునెమ్మిఁ, ద్వరితంబుగ మాన్పను వానికృత్యముల్;
తెరువరి యైన భర్తృకథఁ దెల్పునటంచును నింట వ్రాలి ని
ష్ఠురముగఁ గూయువాయసముజోలికిఁ బోవక మేఁతవెట్టెదున్.

కరభమ! కర్ణపీడనముగా నఱవంగఁదలంతు, నీదుకం
ధర మతిదీర్ఘమౌట ధ్వని దబ్బున బైటికి రాదు, మేలు! కం
ధరబిలమార్గ మెట్లయిన దాఁటి బయల్పడునేని దాన నె
వ్వరి కెటువంటిమేలును విపత్తును నీ వొనరింపలేవుసూ.

వెలుపల బహువిధకంటక - ములు, లోన ననేకరంధ్రములు గలదై భా
సిలుతామరతూఁడున కే - వలనం జనియింపకుండు భంగురగుణముల్.

తగ దిఁకమీఁద నొండొరులధామములన్ మన మాక్రమించుటల్,
పగదెగ వేఱువేఱుగ నివాసముచేయుట యొప్పునంచు శ్రీ
యు గుణచయంబుఁ జేసికొనియుండును సంధిని; నందుచేతఁ ది
న్నగ సిరి తమ్మిపూవున, గుణంబులునాళమునందు నుండుటల్.

[సశేషము]

# ఖాదీపరిశ్రమ: శాస్త్రపరిశోధన

మిస్ మెల్లీ శోలింగర్ గారు (స్విట్జర్లాండు)

## ౧. పత్తి

హిందూదేశమునందలి దారిద్ర్యమును, ఆకలిని పారద్రోలుటకుగాను ఖాదీ పరిశ్రమను పునరుద్ధరించుటకు మహాత్మాజీయును పదిసంవత్సరముల క్రిందట ప్రతిజ్ఞ గైకొనిరి. ఈపదిసంవత్సరములకాలములో వేలకొలది క్రొత్తరాట్నములు తమ మధురగీతములను గానముచేయ మొదలిడెను. వందలకొలది మూలబడి బూజు పట్టిన చరఖాలు మరియొకసారి తిరుగసాగెను. పని లేక చెదలుపట్టిన మగ్గములు ఒక్కటొక్కటి ఉపయోగించ బడసాగెను. నూతనఖాదీపరిశ్రమాలయములు, ఉత్పత్తి సంస్థలు దేశమందు అల్లుకొనెను. లక్షలకొలది జనులు ఖాదీని ధరింపసాగిరి. పత్తి నిడుచువారు, దూదేకుల వారు తిరిగి తమకులవృత్తులను అవలంబించిరి. ఖాదీ యనిన ఎగతాళిచేసినవారును, రాట్నబలమును సందేహించినవారును ఖాదీవిజయమును నేడు వేనోళ్ల చాటుచున్నారు. ఇంతటి ప్రబలప్రాముఖ్యమును సంపాదించిన ప్పటికిని, స్వాతంత్ర్యసాధనము జాతీయచిహ్నమై వెలయుచున్నప్పటికిని, వలయునంతటి ఉత్పత్తి గాని, ధరలు చౌకయగుట కాని సంభవింపలేదు. బీదల కనేకులకు ఖాదీధరలు శక్తికి మించియున్నవి. ఉత్పత్తిపద్ధతులందు మార్పులు కడు తక్కువగా కాన్పించుచున్నవి. దూదిని ఏకువిధానములు, నూలు వడుకువిధానములు ఎప్పటివలెనే యున్నవి గాని, అభివృద్ధిని జెందలేదు. వడ్రంగి రాట్నములను చేయుటలో తన తాతముత్తాత లెట్లు చేసిరో, తానుకూడ నట్లే చేయుచున్నాడు కాని నూతనమార్గములను త్రొక్కుటలేదు. ప్రస్తుతము తయారగుచున్న ఖద్దరుబట్టలో మూడువంతులు ఇంకను ముదుకగనే యున్నది. నేత పల్చగా నుండి, నాణ్యము కాని, మన్నిక గాని ఉండవలసినంత హెచ్చుగా నుండుటలేదు. ఖాదీ పరిశ్రమ ఇట్లు వెనుకబడి యుండుటకు కారణములను మనము వెతుకనక్కరలేదు. పరిశ్రమయొక్క వివిధభాగములను శాస్త్రరీత్యా పఠింపకపోవుట, పరిశోధనభావములను వ్యాప్తింపజేయకుండుట, ఉత్పత్తివిధానములయందు ఆర్థిక, ప్రకృతిశాస్త్రముల సంబంధమును గుర్తించక పోవుట—ఇవియే ముఖ్యకారణము లనుటకు సందేహము లేదు.

ఉత్పత్తిదారులయొక్కయు, చరఖాసంఘముల యాజమాన్యముయొక్కయు క్రయవిక్రయములను చేసెడి వర్తకులయొక్కయు—వేయేల, ఖాదీపరిశ్రమతో సంబంధము గల ప్రతివారిదృష్టియు: "మనతండ్రితాతలకంటె మన మెక్కువ తెలిసినవారమా? వారి కేది బాగో మనకు నదియే బాగు" అన్నట్లే యున్నది కాని మనస్వబుద్ధిని వినియోగించి మనతండ్రితాతలకంటె ఎక్కుడు అభివృద్ధిని పొందవలెనని లేదు. ఖాదీపరిశ్రమ ముందుకు రావలెనన్న, ఈదృష్టి మారవలసియున్నది. నూతన సిద్ధాంతముల ననేకములను పరిశ్రమయం దవలంబింపవలసియున్నది. విశ్వవిద్యాలయములందును, పరిశోధనాలయములందును మనము నేర్చుకొనిన విజ్ఞానమును సార్థకమును జేయవలెనన్న, ఆశాస్త్రవిధానములను రాట్నపరిశ్రమయందు హెచ్చుగా నుపయోగింపవలసియున్నది. అట్లు చేసిననే కాని, రాట్నపరిశ్రమ స్థిరమైన పునాదులపై నిర్మింపబడనేరదు. తాత్కాలికముగ బలమును పొందినను శాశ్వతముగ అభివృద్ధిని బడయనేరదు. ఈ వ్యాసములయందు ప్రస్తుతము ఖాదీపరిశ్రమయొక్క సమస్యలను పేర్కొని శాస్త్రపరిశోధనదృష్టితో వాటి నెట్లు ఎదుర్కొనవలసినదియు సంగ్రహముగా నిరూపింపబడును.

## పత్తిసమస్య

ఖాదీసమస్య లన్నింటిలోను ప్రధానమైనది పత్తి సమస్య: వడుకునూలుకు తగిన పత్తిజాతులను ఎంచుట, అట్టిజాతులను పండించుట.

౧౯౧౭ సం. పూర్వము ఈదేశమందున్న వ్యవసాయశాఖాధికారులు దేశమందు సామాన్యముగా పండెడు కురుచరేచులుగల ప్రత్తిజాతులలో (short staple cotton) ఏజాతులను పండించినయెడల రైతునకు లాభకరముగా నుండునో, అట్టిజాతులపంటనే ప్రోత్సహించుచు వచ్చిరి. ఆసంవత్సరమందు గవర్నమెంటు ఈదేశమందున్న ప్రత్తిపంటవిషయమై అన్నివివరములను దర్యాప్తుచేసి కర్తవ్యమును శిఫార్సుచేయుటకు ఒకవిచారణసంఘమును (Indian Cotton Committee) నియమించిరి. వీరిశిఫార్సులు గవర్నమెంటు-ప్రత్తి-విధానమందు తీవ్రమగు మార్పును కలుగజేసెను. ఈదేశమందు పొడుగురేచుల ప్రత్తిజాతుల (long staple cotton) పంటను ప్రోత్సహించుటకును, అందుకు వలయు పరిశోధనలను సిబ్బందిని నెలకొల్పుటకును; ఈవిషయమై శాస్త్రరీత్యా ఆధికరీత్యా గవర్నమెంటుకు సలహాలిచ్చుటకును ప్రత్తికేంద్రసంఘము (Indian Central Cotton Committee) నొకదానిని శాశ్వతముగా గవర్నమెంటు స్థాపించిరి.

ఈనూతనవిధానము ననుసరించి వ్యవసాయశాఖాధికారులు దేశమందు అంగుళముకు మించిన రేచులుగల ప్రత్తిజాతులనే పండించుటకు వ్యవసాయదారులయందు ప్రచారము చేయుచున్నారు. ఒకఅంగుళమునకు మించిన రేచులుగల ప్రత్తితో మిల్లులలో ౬౦ నంబరుకు పైబడిన సన్ననూలు తయారుచేయబడును. హిందూదేశమందున్న మిల్లుయజమానులు ౨౦ నంబరునుండి ౩౦ నంబరునూలు తయారుచేయుటకు సరిపోయెడి సామాన్యపురేచులుగల—అనగా ⅞ నుండి ౧ అంగుళము—ప్రత్తితో (medium staple) సంతృప్తిపడెదరు. పొడుగురేచులప్రత్తిని పండించవలయునా, లేక నడితరపు రేచులప్రత్తిని పండించవలయునా యన్న మీమాంసలో పాపము పల్లెటూళ్లయందు బ్రతుకుచున్న సాలెవానియొక్కయు, నూలు వడుకు ముసలమ్మయొక్కయు, ఏమదుకగుడ్డయో, యేదుప్పటిరేకో, కట్టుకొనుటకు సంతృప్తిపడెడు రైతువానియొక్కయు కష్టసుఖములు విచారింపబడుటలేదు. అమెరికా, ఈజిప్టు, యుగాండా, కాంబోడియా, దేశములందు సహజముగా పండెడు పొడుగురేచులజాతులు ఈదేశమందు పండించినయెడల, అట్టిపంట వ్యవసాయదారునకు లాభకరంబు కాదని డాక్టరు హ్యారిసను, డాక్టరు హౌగ్ మొదలగు ప్రవీణులు ప్రత్తివిచారణసంఘమునెదుట సాక్ష్యమిచ్చిరి. అట్టిపంట జయప్రదముగ నుండుట లేదనుటకు ప్రబలనిదర్శనములును గలవు

## వడుకునూలు : పొడుగురేచులు

ఖద్దరునూలు వడుకుటకు పొడుగురేచులప్రత్తి (exotic variety) బాగుగా ఉపయోగపడదు. ఇందుకు కొన్నికారణములు : ౧. అమెరికను జాతులలో రేణువు గింజకు బహు గట్టిగా అంటుకొని యుండును. వీటిని చేతిచరఖారాటముతో విడదీయుట బహుకష్టము. ౨. కాంబోడియాజాతులను ప్రత్తిరాటములో వడికినయెడల సాధారణముగా గింజ చితికి దూది చెడిపోవుట సంభవించును. ౩. ఈ పొడుగురేచులప్రత్తితో రాటముపై నూలు వడికిన పురి సరిగా పట్టక నూలు బలముగా నుండదు. ౪. ఈ ప్రత్తియొక్క ధరలు చాల హెచ్చుగా నుండి, ప్రపంచపు సరిఖరాలపై ఆధారపడియుండును. ౫. ఈజాతులను పండించుటకు, రైతు ఏసంవత్సరమునకు సంవత్సరము విత్తనములను కొనుచుండవలెను. అట్లుగాక, తన పొలమునుండి వచ్చిన విత్తనములనే వాడిన, పంట క్రమక్రమముగా చెడిపోవును.

స్వయంసాహాయ్యముపై నాధారపడుట ఖాదీయొక్క ముఖ్య-ఆదర్శము. అందుచే, హిందూదేశమందు సహజముగా ఎట్టిప్రత్తిజాతులు సర్వత్ర పండుచున్నవో (indigenous varieties), అట్టిజాతులప్రత్తినే ముదుకు వడుకులకు గాని, సన్నవడుకులకు గాని వినియోగించుట భారతీయులకర్తవ్యము. అయితే, ఈదేశీయజాతులగూర్చి పరిశోధనలు జరుగబడకపోవుటచేతను, వాటిని పఠించుటకు తగుప్రోత్సాహము ఒసంగబడకపోవుటచేతను, వీటినిగూర్చి మనకు బొత్తిగా తెలియుటలేదు. ఈదేశమందలి విద్యాలయములలో వృక్షశాస్త్రమును అభ్యసించుచున్న, ఖాదీయోధుల అభిమానమున్న యువకులు

ఇట్టిపరిశోధనలకు గణింపగిన, తమమాతృదేశౌన్నత్యమును సంపాదించి కీర్తిని బడయగలరు.

## కొండ పత్తి

పరిశోధనావశ్యకములగు దేశీయజాతులలో ముఖ్యముగ నుదాహరింపదగినది కొండజాతిపత్తి. పట్టుశాలి కులమువారీపత్తినే యుపయోగింతురు గాన దీనికి పట్టుశాలిపత్తి అని పేరుగూడ కలదు. గంజాం, విశాఖపట్నం జిల్లాలలోనున్న పట్టుశాలీలు అనాదినుండియు సన్ననూలు వడకుటయందు ప్రసిద్ధి నొందియున్నారు. నేడు అఖిలభారతచరఖాసంఘమువారిచే శ్రీకాకుళంకేంద్రమందు ఉత్పత్తిచేయబడుచున్న సన్నబట్టపైననే హిందూదేశ మంతయు సన్నబట్టసరఫరాకై ఆధారపడుచున్నది. కొండపత్తి ఈ రెండుజిల్లాల మాళువాప్రదేశములలో, పెద్దగిమిడి, పర్లాకిమిడి, ఆంధ్ర, మాడుగుల ప్రాంతములలో అచ్చటచ కొండవారిచే పండింపబడుచున్నది. ఈపత్తిని రెండవపంటగా వేసి ఈపంటవ్యవసాయమందు ఎట్టిశ్రద్ధయును తీసికొనకయున్నారు.

ఈకొండజాతి పత్తియొక్క స్వచ్ఛత (purity) పైనను, పుష్కలముగ పంటపైనను, నేలకొలది వడుకు వారియొక్కయు, నేయువారియొక్కయు భాగోగ్యము లాధారపడియున్నవి. అయినను, అమూల్యమగు నిట్టిపత్తి జాతియొక్క వృక్షశాస్త్ర సంబంధమైన గుణములను గురించి గాని (botanical characters), పారిశ్రామిక లక్షణముల గురించిగాని (technological properties), జీవిత - అవసరముల గురించిగాని (physiological requirements) మన కేమియు తెలియుటలేదు. ఈజాతి పత్తిచెట్టుయొక్క గుణములను పఠించుటయు, తద్వారా ఈజాతిపంటను పరీక్షించి (crop analysis) ఇది స్వచ్ఛమైనజాతియో (pure variety), లేక జాతులమిశ్రమమో (mixture of varieties) నిరూపించుటయు ముఖ్య కర్తవ్యములు. పొలముపైనున్న పంటను పరీక్షించుటకీవ్యాసకర్తకు అవకాశములు లభింపలేదు. కాని, యీ జాతిపత్తియొక్క పలురకముల నమూనాలను పరీక్షించియు, వాటియొక్క దిగుబడి (ginning percentage), రేచులపొడవు (staple length), దూదియొక్క రంగు (colour of lint), దూదియొక్క మెరపు (lustre of lint), మొదలుగాగల గుణములను లెక్కచూచియు, బహుశః కొండపత్తి స్వచ్ఛమైన జాతికి చెందినదనియే ఊహింపవచ్చును. అయినను, ఇదనిశ్చితమని స్థిరపరచుటకు పూర్వము ఈ పత్తియొక్క వంశ స్వభావమును (genetical behaviour) పరిశీలించుట యావశ్యకము.

## దూది దిగుబడి

కొండపత్తి యొక్క లక్షణములలో నొకటి విస్తారము దిగుబడి. పట్టుశాలివారు ఈపత్తిని నిడుచునప్పుడు కర్రదిమ్మపై పత్తిని పెట్టి యినుపకడ్డీతో గింజను నెట్టి దూదిని గింజనుండి వేరుచేయుదురు. ఈవిధానము సరియైనదగుటచే, దూది తునుకలు కాకుండగను, గింజ చితుకకుండగను పత్తి నిడువబడి, దూదిదిగుబడి హెచ్చుగా లభించును. వ్యాసకర్తచే పరీక్షచేయబడిన నమూనాలలో దిగుబడి సగటున నూటికి ౩౦ పైగా ఉండెను. (అనగా: ౧౦౦ వీసెలు పత్తి నిడిచినయెడల ౩౦ వీసెలు దూది, ౭౦ వీసెలు గింజలు లభించును.) నిడిచిన దూదికాక నూటికి సుమారు ౨ వంతులు నీరసపురేచులు ("linters") మిగులును. దిగుబడి విలువ సగటున హెచ్చుగా నున్నప్పటికి (హెచ్చువిలువ-maximum-51%), కొన్నినమూనాలయందు 3౫% వరకు తగ్గుదల కనబడెను. ఒక్కజాతిపత్తిలో, దూదిదిగుబడియందు ఇంత భేదము కనబడరాదు. ఇంత హెచ్చుతేడా కనబడినయెడల, ఆపత్తిజాతికి ఏదో భంగము కలుగుచున్నదని శాస్త్రజ్ఞు లూహించెదరు. ఈసందర్భమున స్కాట్టు లేగర్టు వ్రాసినటుల, విత్తనములయందు వివిధజాతుల విత్తనముల మిశ్రమము సంభవించుటయో (mixture of seed), లేక అసలువిత్తనము క్షీణించుటయో (deterioration of original seed), లేక వ్యవసాయవిధానము పాడగుటయో, విత్తనము చెడుటయో (bad seed), కారణములు కావచ్చును. పట్టుశాలీపత్తియందు దిగుబడి నిజముగా తగ్గుచున్నదో, అటులైన అందుకు కారణములును, వాని నెట్లు వారింపదగునో, ఈవిషయములన్నియు పూర్తిగ పరిశోధించుట మిక్కిలి అవసరము.

ఎకరమునకు ఎన్నిమణుగులు పత్తిపండుచున్నదో, చెట్టుకు ఎంతవఱకు పత్తి లభించుచున్నదో, చెట్టుకు పత్తికాయలసంఖ్య (number of bolls) ఎంతో, కాయలు పెద్దవా చిన్నవా యనునది (size of bolls), ప్రతిబోగయందు రేకుపొడవు (lint length), గింజపై దూది ఎట్లు అమర్చబడియున్నది (distribution of lint on seed) — ఇవి యన్నియు పరిశీలించిననే గాని, కొండపత్తి (మరి యే ఇతరజాతిపత్తి అయినను సరే) క్షీణించుచున్నదియు, లేక అభివృద్ధి చెందుచున్నదియు, తెలుసుకొనజాలము.

## పంట అభివృద్ధి

అఖిలభారతచరఖాసంఘమువారు సన్ననూలు ఉత్పత్తిశాఖను నెలకొల్పినది మొదలు, వారు సన్ననూలు క్రయమందును, సన్నబట్టలనేతయందును చక్కని కట్టుదిట్టములను ఏర్పరచియుండుటచే, సన్ననూలు వడుకుట మిక్కిలి అభివృద్ధిని పొందినది. ఆంధ్రశాఖవారు ఈసంవత్సరము ప్రచురించిన నివేదికప్రకారము (అక్టోబరు ౧౯౨౯–సెప్టెంబరు ౧౯౩౦)వారి పట్టుశాలినూలు (౩౫ నంబరుకు మించిన సన్నము)కొనుగోలు ౧౦ రెట్లు ఇంత హెచ్చుఅయినది. శ్రీకాశీశంకరంవారిని వ్యాసకర్త కోరగా, హాలు సంవత్సరమునకు వారు దయచేయించిన లెక్కలనుబట్టి చూచిన ఆశ్చర్యకరమగు అభివృద్ధి కనబడుచున్నది.

| | | |
|---|---|---|
| ౧౯౨౯–అక్టోబర్— | పట్టుశాలినూలు | పౌన్లు ౨,౩౪౮ |
| ౧౯౩౦–సెప్టెంబర్ | ఉత్పత్తి | రు. ౧౮,౦౦౦ |
| ౧౯౩౦–అక్టోబర్— | పట్టుశాలినూలు | పౌన్లు ౫,౧౯౨ |
| ౧౯౩౧–సెప్టెంబర్ | ఉత్పత్తి | రు. ౩౦,౫౦౦ |

అద్భుతమగు నిట్టిఅభివృద్ధి ఎంతయు సంతోషదాయకము. అయితే నూలువడుకుటయందున్న అభివృద్ధితోపాటుగ పత్తి ఉత్పత్తి యందు కూడా అభివృద్ధి కలుగుచున్నదా యని మనము ప్రశ్నింపవలసి యున్నది. ఏలయన, పట్టుశాలినూలుయొక్క ప్రాశస్త్యమును, పట్టుశాలిబట్టయొక్క వాణ్యమును, పట్టుశాలిపత్తిపై నాధారపడి యున్న దనువిషయము మనముమరువకూడదు. ముడివస్తువునందు కలితీ జరిగినయెడల అందుండి తయారగు నూలు ప్రశస్తముగ నుండజాలదు. వ్యాసకర్తకు సరియగు భోగట్టా దొరకనప్పటికి నూలుఉత్పత్తియందు అభివృద్ధితో సరిగ కొండపత్తిని పండించు భూముల యొక్క విస్తీర్ణమందు అభివృద్ధి గాని (increase in acreage), పంటయందు అభివృద్ధి (increase in yield) గాని, వృక్షముయొక్క ఫలాభివృద్ధి (increase of yield per plant) గాని సంభవించినట్లుల గానరాదు. సరేకదా వ్యాసకర్త అనుభవమునుబట్టి చూడగా, ౧. కొండపత్తితో కలిపియో లేక కొండపత్తికి మారుగనో మధ్యమ తరగతి రేకులుగల (medium staple) పత్తిని పట్టుశాలీలు దినేదినే హెచ్చుగ వాడుకచేయుటయు, ౨. కొండపత్తితాలూకు నూతనపంటనుండి లభించినదానిని (మొదటిపంటకంటె దీనిప్రాశస్త్యము, విలువయు చాలా తక్కువ) వాడుకచేయుటయు, ౩. ఇప్పటికిగొన్నాళ్లలో ౭౦ నంబరుకు మించిన సన్ననూలు దొరకకపోవుటయు —ఈహేతువులను బట్టి కొండపత్తి పంటయందు అభివృద్ధి యున్నట్లుల కాన్పింపదు. (౧౯౨౯ సంవత్సరమందు కొండపత్తి సరిగా దొరకకుండినట్లు పట్టుశాలీలు చెప్పుచున్నారు.)

పూర్వముకంటె సన్నబట్ట ప్రజలచే హెచ్చుగా వాడబడుటయు, అఖిలభారత చరఖాసంఘమువారు సన్నబట్టధరలను తగ్గించుటకు చేయుప్రయత్నములవలనను, మునుముందు సన్ననూలు వడుకులకు ఇప్పటికంటె హెచ్చుప్రోత్సాహము కలుగు ననుటకు ఎట్టిసందేహముండదు. కొండపత్తిపంటను అభివృద్ధిచేసి, వడుకువారికి పత్తిని విరివిగాను సులభముగాను దొరకునట్లు చేసిననే గాని, ధరామతుకు (demand) వలసినంత సరఫరా యుండక కొండపత్తిధరలు పెరిగి) (౧౯౨౯ లో ధర రూపాయికి ౧౦ వీసె లుండెనట), కలితీ మరి వాడుక హెచ్చయి, నూలుయొక్క నాణెము తప్పక చెడిపోవును. హెచ్చుపురి గల నూలును వడుకుట కష్టమగును. నూలు ముదురై, స్నాపును, బలమును తగ్గును.

## ఎంపుడు (Selection work)

సంకరము అభివృద్ధి చేయుట ఎంత ముఖ్యమైనను, విరివిగా సంకర పంటలను సాగుచేయుటమాత్రముననే ప్రత్తియొక్క సుగుణములు క్షీణించుటకు నిర్బంధము యుండునని మనము తలంపగూడదు. కొండప్రత్తియొక్క సుగుణములు క్షీణించుచున్నవేమో యనుసందేహము కలుగుటకు కారణము లేకపోలేదని ముందుగ సూచింపబడెను. నిర్మలమైన యీప్రత్తిజాతిని కాపాడుటకు శాస్త్రపరిశోధనలు సత్వరముగ జరుగవలసి యున్నవి. మొట్టమొదట వృక్షశాస్త్ర పరిశోధనలు (botanical research) క్రింద వివరింపబడిన బాహ్యలక్షణములపై (external characters) జరుగవలెను.

(౧) చెట్టు చిగిరించురీతి (branching habit),

(౨) వేళ్ళవ్యాప్తి (root system),

(౩) ఆకుపైనుండు నూగు (hairiness of leaf)

(౪) పుష్పించుటకు పూర్వము ఎదుగవలసిన కాలము (vegetative period prior to flowering),

(౫) పుష్పముయొక్క రంగు (colour of flower)

(౬) కాయలయొక్క పరిమాణము, ఆకృతి, సంఖ్య (size, shape and number of bolls),

(౭) రేషముపొడవు, సన్నము (length and fineness of lint),

(౮) గింజపై రేషము అమర్చబడినరీతి (distribution of lint on seed),

(౯) దూదియొక్క దిగుబడి (ginning percentage).

ఈలక్షణములను గ్రహించి వీటిని ఆధారముగా జేసికొని, మంచిలక్షణములు గల చెట్లను ఏరుకొనవలెను. ఈచెట్లనుండి వచ్చిన గింజలను ప్రత్యేకముగా నుంచి, వాటినుండి విత్తనములను సేకరించుకొనవలెను. ఈ సేకరించిన విత్తనముల (selected seed) నుండి మొలచిన చెట్లకు సంకరము (cross-fertilisation) సంభవింపకుండునట్లు పూవులపై తెరలు వేసి కాపాడవలెను. ఇట్లు స్వబీజముచే (self-fertilisation) ఉద్భవించిన ప్రత్తి బోగలను తిరిగి పరీక్షించి అంగుళమునకు మించిన పొడవు గల రేషుల గలవాటిని గూడిదిగుబడి ౪౫% తక్కువ కాకుండ నున్నవాటిని ఏరి వాటిగింజలను నాటవలెను. ఎంపుడువిధాన మిట్లు సాగించినయెడల ౪ లేక, ౫ సంవత్సరములలో మంచి స్వచ్ఛమైన రకములను సేకరించుకొని (pure line selection) కొండప్రత్తిని అభివృద్ధి చేయగలము.

## సంధానము (Breeding Work)

కొండప్రత్తిని అభివృద్ధి చేయుటకు బీజనిర్ణయ విధానమే కాక, సంధానమార్గము కూడ నవలంబించ వచ్చును. కొండప్రత్తి స్వచ్ఛమైనజాతి యని యూహించుటకు కారణములు గలవని చెప్పబడియుండెను. ఈజాతి సహజముగ పండెడి కొండప్రదేశములలో వేరొకజాతి ప్రత్తిపంట యున్నట్లు కానరాదు. ఈపంటనుండి వచ్చెడు విత్తనములనే వచ్చేపంటకు ఉపయోగించుటయు, ఒక్క బీజమునుండియే తరతరములనుండియు పంటలు పండుటయు, శతాబ్దములనుండి వ్యవసాయవిధానము ఒకేవిధముగ నుండుటయు, స్వచ్ఛమైన జాతి యొకటి ఉద్భవించుటకు కారణము లగును. అయితే స్వబీజమువలన తరతరములనుండియు వంశాభివృద్ధి సంభవించినయెడల, వృక్షజాతులకును, జంతుజాతులకును, వర్ణసంకరమను ప్రమాదము వాటిల్లకపోయినప్పటికిని, వంశముయొక్క పటుత్వము క్షీణించు ప్రమాదము తప్పక కలుగవచ్చును. కొండప్రత్తికి కూడ ఇట్టిప్రమాదము సంభవించెనేమో యని మనము విచారించవలసి యున్నది.

కొండప్రత్తియొక్క పటుత్వము తగ్గెనా లేదా యనువిషయము పైన వివరించిన పరిశోధనవలననే కాని తేలదు. పటుత్వము తగ్గెనని నిరూపించబడెనేని, మన కర్తవ్య మేమి? సంధానశాస్త్ర (Science of Genetics) సిద్ధాంతములప్రకారము ఏదైనను స్వచ్ఛమైన జాతియొక్క పటుత్వము తగ్గెనేని (loss of vigour), ఆజాతికి దగ్గరసంబంధము గల వేరొకజాతితో సంధానము కలుగజేసినయెడల (crossing with related

variety) దురవస్థలో నున్న జాతికి తొంటిపటుత్వము తిరిగి చేకూరును (restoration of vigour). కొండ పత్తిని అభివృద్ధిపరచుటకు ఈవిధానముకూడ పనికి వచ్చును. ఇట్టిపని—సంధానమార్గములు, దగ్గర సంబంధ ముగల జాతు లెవ్వి, యెట్లు సంధానముచేయుట అన్నది, సంకరము(hybridisation) కలుగకుండ జాగ్రత్తపడుట —శాస్త్రశిక్షణ పొందినవారిచేతనే చేయబడవలెనని వేరుగ చెప్పనక్కరలేదు.

## కొండపత్తిని చదునుభూములందు పండించుట

ఈజాతిపత్తి సహజముగా కొండప్రదేశములందు పండును. పర్వతప్రదేశములపరిస్థితులకు అలవాటుపడిన దగుటచే, అన్యప్రదేశములయందు పండించుటకు ప్రయత్నించినయెడల, పరిస్థితులు క్రొత్త వగుటచేత, అచ్చట వర్ధిల్లదు. కొండపత్తియొక్క విత్తులను చదునుభూముల యందు నాటినయెడల, అవి మొలకలెత్తక పోవచ్చును. మొక్క మొలచినను, పుష్పించునో లేదో. పుష్పించిన గింజకట్టక పోవచ్చును. పత్తి పేలు ననుమాట నిశ్చయము లేదు. పేలినను దూది బహునీరసముగ నుండును. గింజను చల్లినను మొక్క మొలచునో లేదో. ఇట్టి 'సహాయనిరాకరణ' మునకు కారణమేమి? చదునుభూముల పరిస్థితులకు ఈజాతిపత్తి అలవాటుపడకుండుటయే.

పల్లపుప్రదేశములం దెట్లయిన ఈపత్తిని పండించ గలిగితిమేని, ఇక్కడివ్యవసాయము కొండపోళ్లయందు కంటె మంచి దగుటచేతను, సులభసాధ్య మగుటచేతను, రైతులు తెలుగుమీరినవా రగుటచేతను, ఈపంటను ఎక్కుడువిరివిగా పండించవచ్చును. ఇప్పుడు సామాన్యముగా, గంజాంవిశాఖపట్నంజిల్లాల చదునుభూములలో పండేపత్తికంటె కొండపత్తిధర సుమారు ౨ ఇంత లుండుటచే, ఈవిలువజాతిపత్తినే పండించినయెడల రైతునకు మంచిలాభము కిట్టును.

కొండపత్తిని చదునుభూములకు అలవాటుచేయుట (acclimatisation) ఎట్లు? ఈపత్తి తన స్వస్థలమందు ఎట్టిపరిస్థితులయందు పెరుగుచున్నదియు మనము మొదట తెలిసికొనవలెను. అచ్చటి వర్షపాతము (rainfall), నీటిసరఫరా (conditions of water-supply), నేల యొక్క పదును (soil water conditions), నేల యొక్క పదార్థసముదాయము, రసాయనసముదాయము (physical and chemical conditions of soil), నేలయొక్క సత్తువ (soil nutrients), వాతావరణము యొక్క శీతోష్ణము, చెమ్మ(atmospheric temperture and humidity), మొదలగు విషయములను మొదట పరిశోధింపవలెను. ఈస్థితిగతులను తరువాత పల్లపుభూముల యందు నిర్మించిఅప్పుడు కొండపత్తిని ఈభూములయందు పండించుటకు ప్రయత్నించవలెను. రానురాను ఈనూతన ప్రదేశమునకు అలవాటుపడి, స్వదేశమం దెట్లు పండు చున్నదో, అట్లే ఇచ్చటకూడ పండుటకు అవకాశము లేర్పడును. ఇది జయప్రదముగా జరుగుటకు కొన్ని సంవత్సరము లకాలము పట్టును. పరిశోధనలను గావించెడువారు ఇందు వలన విసుగును గాని, నిరాశను గాని పొందెరు. జయము చేకూరెనేని ఖాదీపరిశ్రమకు లాభము నిశ్చయము.

## కురుచరేచుల పత్తి (Short Staples)

కురుచరేచుల పత్తిజాతుల గూర్చి కొంత విచారించ వలసియున్నది. వ్యాసకర్తకు విశాఖ జిల్లాల పరిస్థితులే తెలియును కావున అచ్చటి పత్తిజాతుల గూర్చియే వివరింపబడును. ఈజిల్లాలలో ఈజాతుల పత్తి పంట విస్తారముగా నున్నది. వర్తకులచే "అసకాసల్లి" రకము అని పిలువబడెడు పత్తియొక్క రేచులకొలత (సుమారు) ౩/౮ అంగుళము; దూదిదిగుబడి (సుమారు) ౨౦%. "గజపతినగరం" రకమునందు, రేచులకొలత ౫/౮ అంగుళము; దిగుబడి ౨౫%. "సుబుపురం" రకమందు, రేచులకొలత ౩/౮ అంగుళము; దిగుబడి ౨౫%. "తుని ఎరుపు" రకమందు, రేచులకొలత ౭/౮ అంగుళము; దిగుబడి ౨౫%.

ఇవి కాక, ఈప్రదేశమందు, వర్తకులచే "కాకినాడపత్తి" యని పిలువబడెడు ("Cocanadas") రకము కూడ పండుచున్నది. "కాకినాడ" పత్తిలో ముఖ్యముగా రెండుజాతులపత్తి మిశ్రమమై యున్నది (mixture of types)"గొల్లప్రోలు" పత్తిఒకటి(G. obtusifolium coconada Gammie?) రెండవది "యెర్రపత్తి"

(G. indicum yerrapatti) ఈరెండు జాతులందును, రేమలపొడవు ౬/౮ నుండి ౭/౮ అంగుళము; దినుబడి సుమారు 30%. ఇవి విలువయగుజాతులు. "గొల్లప్రోలు" పత్తినుండి రాటముపై ౪౦ నంబరువరకును సన్నదార మను తీయుదురు. ఈపత్తినే పట్టుశాలీ లిప్పుడు కొండ పత్తికి బదులు వాడుచున్నారు. "ఎఱ్ఱపత్తి" నుండి చక్కనిఎరుపునూలు ౨౦ నంబరువరకు తీయవచ్చును. (గొల్లప్రోలుపత్తిధర ౨౬౦ పౌనులకు సుమారు ౧౭ రూపాయిలు; ఎఱ్ఱపత్తిధర సుమారు ౨౦ రూపాయలు.) అనేకప్రదేశములలో రైతులు ఈరెండుజాతులను కలిపే పండించుచు, కలిపే అమ్మకమును చేయుదురు. ఇట్లు తెల్లపత్తిని ఎఱ్ఱపత్తిని కలుపుట చాలా చెడు అలవాటు. తెలుపురకము ఎరుపురకము కలిపి ఒక్కపొలమందు పండించిన సంకరజాతులు ఏర్పడవచ్చును. రెండవది: రెండురకములును కలిపి అమ్మజూపినయెడల వేర్వేరు అమ్మినకంటె తక్కువధరలు లభించును. ఈవిషయమై ఖాదీ-అభిమానులు శ్రద్ధ చూపవలసియున్నది. కాకినాడ పత్తి విలువగల పత్తి. అయినను వీటివిషయమై ఏమియు పరిశోధనలు జరిగియుండలేదు. పత్తి విచారణసంఘము వారు ఈపత్తిపై పని ప్రారంభింపవలయునని శిఫార్సు చేసినను నేటివరకు అందుపై దఖలు పుచ్చుకొనబడినట్లు కానరాదు.

పైన వివరింపబడిన కురుచరేచుల పత్తి సంగతి ఇంతకంటె అన్యాయముగ నున్నది. ధరలవిషయములో ఇవి చౌకరకము లైనప్పటికిని, (సామాన్యముగా ౧ రూపాయకు ౬ వీసెలు పత్తి,) ఈ జిల్లాఖాదీపరిశ్రమకు ఎక్కువగా వినియోగపడుటచే, ఆర్థికరీత్యా మిక్కిలి విలువగల జాతులనియే చెప్పవలెను. ఈ చౌకయగు పత్తిని, ముడివస్తువగా వినియోగించియే, యీప్రాంతములయందున్న నూలువడుకులపై జీవించుచున్న స్త్రీలలో 3,700 మంది, ఒక్క అఖిలభారత చరఖాసంఘపు ఆంధ్రశాఖవారికే రూ. ౨౨,౦౦౦ విలువగల ముదుకునూలును అమ్మి (౮-౧౦ నంబరు), అందువలన వచ్చెడి కూలిపై జీవనమును గడపుకొనుచున్నారు. ఈ పత్తిజాతులయొక్క దూదిదిగుబడి ౨౦% కంటె మిం చదు. హిందూదేశమందుండెడి కోట్లకొలది బీదలకు వస్త్రధారణమునకుగాను ముదుకు ఖద్దరుకంటె వేరొక గత్యంతరము లేదు. సంవత్సరమున కారునెలలు ఈము దుకునూలిని వడకినసే గాని వేరొకకూలి దొరకదు. అం దుచే చవుకధరలకు లభించెడి యీకురుచరేచులపత్తిజాతులను అభివృద్ధిచేయుటయే ఖాదీపరిశ్రమయొక్క ప్రధాన సమస్య యనుటకు సందేహము లేదు.

## విత్తనములను ఎంచుట (Seed Selection)

కురుచరేచులపత్తి గురించి ఉదాహరించియుండిన పుడు, "అనకాపల్లి" రకమనియు, "గుణుపురం" రకమనియు చెప్పియుంటిమి. వ్యవహారరీత్యా "రకము" అని వాడబడుచున్నదే గాని, శాస్త్రరీత్యా "రకము" అనుశబ్దము వాడుటకు వీలులేదు. "అనకాపల్లి" రకము పండుచున్నటువంటి పొలములోనికి వెళ్లి అచ్చటి పత్తి చెట్లను పరీక్షించి చూచినయెడల, చెట్లయొక్క ఆకారము, ఆకులయొక్క మాగు, పూవ్వులరంగు, రేచుల పొడవు—మొదలుగాగల బాహ్యలక్షణములలోను, వంశ లక్షణములలోను, ఒకదానితో ఇంకొకటి పోలనిచెట్లు అనేకము లుండుట మనము చూడగలుగుదుము. నిజముగా ఒక్కొక్క "రకము" అని పిలువబడెడు పంటలలో ఎన్నోజాతులు (mixture-of varieties) మిశ్రమములై యున్నవి. ఏయేప్రాంతములపంటలలో ఏయే జాతులమిశ్రమము సంభవించుచున్నదో తెలిసికొనుట మొదట ఆవశ్యకము. ఈవివరములను సంపాదించుటకు, ఈప్రాంతములయొక్క "botanical survey" చేయవలయును.

మిశ్రమజాతులను కలిగియున్న పత్తిపంటను త్వరలో అభివృద్ధికి తీసికొనిరావలె నన్న, విత్తనములను ఎంచుపద్ధతిని అవలంబించవలెను. పంటకొరకు వినియోగింపబడెడు విత్తనములను పరిశీలించి, వాటిలో పెద్దవి, బరువైనవి, బాగుగ ఎదిగినవి ఎంచి, అట్టిగింజలనే రైతులకు పంచిపెట్టి, వాటి నీపంటకు చల్లునట్లు చేయవలెను. ఈవిధముగా విత్తనముల ఎంపుడువలన వెంటనే పంట యందు అభివృద్ధి కనబడును. విత్తులయెంపుడుచే క్షల్లిగ్గిన

పంట అభివృద్ధి రైతునకు లాభముగ నుండునప్పటికిని, పత్తిలోకూడా కొంత అభివృద్ధి కనిపించినప్పటికి, ఇది శాశ్వతమైన అభివృద్ధి కాదు. ప్రతిపంటకు ఎంపుడు విత్తనములనే వాడుక చేయవలెను. ఎప్పుడైతే ఎంచిన విత్తనములు చల్లబడక మామూలువిత్తనములే చల్లబడునో, వెంటనే పంట యథాప్రకారముగా పూర్వపుస్థితికి వచ్చివేయును. ఇందుకు కారణ మేమనగా, విత్తనములను ఎంచుటలో బాహ్యలక్షణములే ఆధారముగా చేసికొనబడును గాని, అదృశ్యములగు వంశలక్షణములను గుర్తించుట లేదు. వంశమందు అభివృద్ధి కలిగిననే కాని శాశ్వతమగు అభివృద్ధి కలుగనేరదు. విత్తనముల ఎంపుడు విధానమందు ఇది ఒకలోటు అయినను, పంటను త్వరలో బాగుచేయుటకు ఇది సులభమైన మార్గము.

## స్వచ్ఛమైన రకములను ఎంచుట
## (Selection of pure line)

ఎక్కుడు శాస్త్రీయమైన విధానమును, శాశ్వతమగు అభివృద్దిని కలిగించువిధానమును, స్వచ్ఛమైన రకములను ఎంచుట. విశాఖపట్నంజిల్లా కురుచరేచుల పత్తి పంటలో అనేకములగు జాతులు మిశ్రమములై యున్నవని చెప్పబడియుండెను. ఎంపుడు విధానములో మొదటి పని, మిశ్రమమునుండి వివిధజాతులను విడదీయుట (Isolation). ఒకమచ్చుపంటలో (test crop) సంభవించెడి వివిధములగు జాతులను కంటితో పోల్చవచ్చును. ఒక్కొక్కజాతివిత్తనములనే వేరుగ ప్రోగుచేసి, ఒక్కొక్క పొలములో (ర లేక ౫ సెంట్లు) చల్లవలెను. ఒక్కొక్కజాతియొక్క లక్షణములను పట్టి, ఆ జాతిలో సంభవించెడు వివిధములగు శాఖలను (families) ఏర్పరుపవలెను. ఈశాఖలనుండి తిరిగి ఎంచి, పంటను పండించినతరువాత, ఆపంటనుండి మంచితెగలను (types) విడదీసి, వీటిలో శ్రేష్ఠమయినవాటినే నాటవలెను. ఇదే విధముగా ఒక్కొక్కతెగనుండి మంచి లక్షణములుగల రకములను (lines) ఎంచవలెను. ఇట్లు లభించినరకములు స్వచ్ఛమైనవో, సంకరమైనవో నిర్ణయింపవలెను. స్వచ్ఛమైనరకములనే వేరుపరచి స్వబీజములచే ఫలోత్పాదకశక్తి గలవిధముగా అభివృద్ధిచేసి, వాటివిత్తులనుండి మచ్చుపంటలను పండించవలెను. విత్తులను హెచ్చుగా ప్రోగుచేసిన తరువాత ఆవిత్తులను రైతుల కిచ్చి, వాటినే ఉపయోగించునటుల జాగ్రత్తపెట్టినయెడల, పంటయందు శాశ్వతమైన అభివృద్ధి సంభవించును.

ఈవిధానమువలన స్వచ్ఛములైన రకములు ఉద్భవించును గాన, వాటియొక్క సుగుణములు బీజములందు శాశ్వతముగా నాటుకొని యుండును. అందుచే ఏటేట కేంద్రపరిశోధనశాఖనుండి వచ్చినవిత్తనములను కొనుట అవసరము లేక, తనపంటనుండి వచ్చినవిత్తనములనే రైతు ఉపయోగించుకొనవచ్చును. ఇట్టి విధానములనే వివిధదేశములయందలి వ్యవసాయశాఖలవారు తమదేశములపంటలను బాగుచేయుటకు వినియోగించుచున్నారు. చెన్నపురి వ్యవసాయశాఖవారు కూడా ఇట్టివిధానములనే ఉపయోగించి దక్షిణాదిని పండుచున్న "కరుంగణ్ణి" పత్తిజాతిని (G. indicum) రేచులపొడువును ౹ నుండి అంగుళముకు పైగాను, దిగుబడి ౨౫% నుండి ౩౫% వరకును అభివృద్ధిపరచియున్నారు. (తమిళనాడులో ఖాదీపరిశ్రమకు ఈపత్తి చాలా హెచ్చుగా వాడబడుచున్నది.) ఆంధ్రదేశమందుండు ఖాదీ-అభిమానులు తమప్రాంతములందు సహజముగా పండెడు కురుచరేచులుగల పత్తి జాతులను అభివృద్ధిచేయుటకు ఇట్టిపనినే పూనుకొనవలయును.

ప్రస్తుతము ఈజిల్లాలో పండెడు పత్తి పైస్థలములకు విస్తారముగా ఎగుమతిచేయబడుచున్నది. వీటిరేచులు అతి కురుచవి యగుటచే మిల్లులలో ఎంత తక్కువ నంబరు నూలును ఉత్పత్తిచేయుటకైనను ఈపత్తి పనికి వచ్చుటలేదు. అయినను మిల్లులవారే ఈపత్తిని కొనుచున్నారు. ఈపత్తిని మధ్యమ-రేచులపత్తితో కలిపి, యీనాదాది మిశ్రమమునుండి ముదుకునూలును మిల్లులలో తయారుచేయుచున్నారు. రాట్నముపై ముదుకునూలును వడుకుటకు ఎంతటికురుచరేచులపత్తి అయినను ఉపయోగపడును. రాట్నముయొక్క గొప్పతనము ఇచ్చటనే యున్నది. ఈప్రాంతములలో నుండెడి నూలువడికెడు

వారు ఈరకములసత్తిపైననే ఆధారపడి యున్నారు. కనుక ఈపత్తిజాతులను ఏప్రాంతములలో పండుచున్నవో ఆప్రాంతములలోనే నిలిపి, వాటిని అభివృద్ధిచేసి, అవి పండించుచున్న వ్యవసాయదారులకును, వాటిని ముడివస్తువుగా వాడుకచేయు నూలువడుకు వారికిని సహాయము చేయుట ఖాదీసంస్థలవిధి.

ఈకార్యమును జయప్రదముగాను, శ్రద్ధగాను, హుషారుతోను కొనసాగించుభారము యువకులపైనున్నది. దేశసేవకై తమసర్వస్వము నర్పించిన కొందరు నిరాడంబరుల త్యాగమే ఖాదీఉద్యమముయొక్క ప్రఖ్యాతికి మూలకారణము. అట్టి త్యాగబృందమును కనినందులకేదేశమేని గర్వపడవచ్చును. శాస్త్రపరిశోధన నేడనేక యువకహృదయముల నాకర్షించుచున్నది. ఖాదీపరిశోధన దరిద్రనారాయణునికే అంకితముచేయబడునదగుట, విద్యాలయములలోను, పరిశోధనాలయములలోను శిక్షణ పొందుచున్న యువకులకును, యువతులకును ఇట్టి పరిశోధన మరింత ఆకర్షకముగ నుండు ననుటకు సందియము లేదు. తమదేశమును పీడించుచున్న దారిద్ర్యమును పారదోలి, అన్నవస్త్రములను ప్రసాదించుటకు రాట్నమే తారకమంత్ర మను గాఢవిశ్వాసము—గాంధీమహాత్ముని నాయకత్వముక్రింద చెలరేగుచున్న భారతదేశీయాభ్యుదయమందు తమవిధాయకమును శక్తివంచన లేక నెరవేర్చుచున్నా మను నమ్మిక.—ఇదియే ఇట్టి పరిశోధనలకు గడంగు యువకులకు ఆత్మబలము నిచ్చి పోషించుసంజీవి.

---

# అన్యాపదేశ శతకమునుండి

కోమాండూరు కృష్ణమాచార్యులుగారు

సమదతిమింగిలాది జలసత్వవిఘూర్ణిత సాగరాంతరీ
పముల దురాసదోగ్రవనపంక్తులఁ బుట్టినదయ్యు చందన
ద్రుమము వణిక్కరాహతిఁ ద్రుంగక పోదు; విభీతకాది వృ
క్షములకుఁ జావు లేదు గుణసంగతి దోషము గాదె చూడఁగన్.

వారి విలుప్తమైన యొకవన్యపథంబునఁ బాంథజీవనా
ధారముగా సరోవరము ధన్యుఁ డొకండు ప్రతిష్ఠఁజేసె నీ
ధారుణిపై జలంబులను ద్రావఁగ నోఁచని చాతకంబు త
ద్వారిని గ్రోలదేని విధివంచిత మందురు గాక లోపమే.

భూతలమందు స్వాదు జలపూరము లుండఁగ వారిదంబు నా
చాతకపక్షి వేఁడు టది జాతిగుణం బగు నంతే కాని దాఁ
బ్రీతిని మేఘుఁ డేమయిన వేయిమడుంగులు నీర మిచ్చునే
యేతపమైన సిద్ధిఁ గనునే నిజదైన్యము తెల్లమయ్యెడున్.

కొంగలతోడఁ బొత్తు మదిఁ గోరక తొల్కరివానలందుఁ జ
క్రాంగకులంబు లేగఁగ జరత్కలహంస మొకం డశక్తిమై

నింగిని బాఱలేక కడునీచతఁ గొంగలఁ గూడి నిచ్చ లా
వంగడముల్ నుతించు నిజవంశము దూరును నీతిదూరమై.

అంబుచరంబు లుగ్రబడబానల కీలము లెంతవారిఁ దా
మంబుధిలోనఁ గైకొనునొ యందు శతాంశము నీవు గొందువే
యంబుద! యట్టులైనను జనావనశీలత సర్వముల్ నిరా
డంబరవృత్తి నిచ్చి లవణాబ్ధికిఁగూడ యశంబుఁ గూర్చవే.

పరభృత మద్ది; తద్భరణపాండితి మాయది; మా శరీరముల్
గురుతరముల్; తదీయములు క్షుద్రము లౌ; కలకంఠమందురా?
సురుచిర కాలకంఠులము చూడుఁడు మాకుల మెక్కు డందు వో
కరటమ! పంచమస్వర వికాసము నీగళమందుఁ గల్గునే.

అంచల కెద్ది భోజ్య, మఘ మంటదు వేఁడి భుజింప, నట్టితూం
డ్లించవు కొంగ, కానలువ యెవ్వరికై సృజియించె వానిఁ దా
వంచనఁ బొంచి ప్రొద్దెడలుపట్టునఁ జేపల నొంటి రెంటి భ
క్షించి సుధాశనంబని యశేషముదంబును బొందు నిచ్చలుల్.

జలద మచేతనం బయిన సాగరనీర మొకింతఁ గ్రోలి యా
జలధికిఁ బేరుఁ దెచ్చు ధర శాశ్వతధర్మము నిల్పు; మానులం
దలఘుతపస్వి బ్రహ్మవిదుఁ డాకలశీసుతుఁ డూఁచముట్టుగా
జలధిని బీల్చెఁ గాని యిల సల్పిన మే లొకయింత గల్గెనే.

తెరువరు లేగు మార్గమునఁ దీయనిపండ్లను వంగియున్న సుం
దరతరులుల్; సుదుర్గమపథంబుల నందని పండ్లమ్రాకులుల్
బరఁగువనంబులందు; దవపావకుఁ డేర్చినఁ గాలు నన్నియుల్
వరుసను బుణ్యపాపములు వానికి దక్కును శాశ్వతస్థితిల్.

దళముల కల్మి పాంథసుఖదంబగు నీడయు నిమ్మపం డ్లనం
బొలుచు ఫలంబులుల్ గలుగుభూరుహముల్ మరుభూమిఁ గాంచి త
త్తలమున కధ్వగుం డరిగి దారుణమౌ విషముష్టి చెట్టుగాఁ
దెలిసి యఖండవేగమునఁ దేఱియు చూడక పాఱె భీతుఁడై.

# కీర్తిశేషురాలైన దరిశి అన్నపూర్ణమ్మగారు

డి. వి. నారాయణరావుగారు



కీ. శే. దరిశి అన్నపూర్ణమ్మగారు

౧. ఈమె బళ్లారిలో వైశ్యకులమునందు ౧౯౦౭ సంవత్సరమున జనించెను. ఈమెతల్లిగారు గొప్పవేదాంతిని. ఆమెకు సంఘసంస్కరణమందు ఆసక్తి గలదు. ప్రప్రథమపుత్రికను సంఘసంస్కరణమందు కీర్తి వహించిన దరిశి చెంచయ్యగారి కిచ్చి వివాహ మొన ర్చెను. రెండవకుమార్తెకు రజస్వలానంతరవివాహము చేయుటకు నిలిపి మదనపల్లి కాలేజీయందు చదివించుచు న్నారు. వైశ్యకులమున రజస్వలానంతరవివాహమును ప్రారంభించినది అన్నపూర్ణమ్మగారితల్లియే.

౨. అన్నపూర్ణమ్మగారు పిన్నవయస్సునందే ఆధ్యాత్మికవిషయములందు ఉత్సాహమును జూపుచు, విపులముగా నుపన్యసింపుచు తన ఉపన్యాసములతరువాత ప్రేక్షకుల క్లిష్టమైనప్రశ్నలకు తృప్తికరమైన జబాబు నిచ్చుచుండెడివారు.

౩. ఈమెయొక్క నైపుణ్యమును జూచి, అప్పటిలో థియోసాఫికల్ సొసయిటి ఇన్‌స్పెక్టరుగారగు శ్రీ యం. వెంకటరావుపంతులుగారు తొమ్మిది సంవత్సరముల వయస్సుగల, ఈమెను తనవెంట బెట్టుకొని దివ్యజ్ఞానసభలలో నుపన్యాసము లిప్పించుచుండిరి.

౪. ౧౯౨౨వ సంవత్సరమునందు, సికింద్రాబాదు నగరమున ఈమె విద్యాభ్యాసము గావింపుచు, ఆ పాఠశాల వార్షికోత్సవసమయములో ప్రదర్శింపబడిన "ప్రహ్లాదనాటకము"నందు లీలావతిపాత్రను ధరించి, సుప్రసిద్ధదేశనాయకురాలగు "సరోజిని"భర్తగారగు డాక్టరు నాయుడుగారిచే అమూల్యమైన రజతపాత్రను బహుమానము నొందిరి. ప్రజలకోరికపైన అదే నాటకము మూడుపర్యాయములు ప్రదర్శింపబడెను.

౫. బళ్లారి కాన్‌వెంటు పాఠశాలయందును, తిరువళిక్కేణి బాలికల ట్రెయినింగుకాలేజియందును పఠించిరి. మరియు గుంటూరు శారదానికేతనమునందు, సంస్కృత, ఆంధ్రభాషలను గొప్పపండితులవద్ద పఠించెను.

౬. చెన్నపురిలో ప్రథమ ఆర్యవైశ్య యువజన మహాసభయాజమాన్యమున జరుపబడిన ఆశుధారోపన్యాసములపోటీపరీక్షయందు ప్రథమస్థాన మొంది సువర్ణపతకము నొందెను.

౭. ఈమె యౌవనప్రాయములో, అమెరికాయందు విద్య నభ్యసించి, కృషిపరీక్షయందు విజయ మొంది రాజకీయవిషయములలో నాలుగున్నరసంవత్సరములు బందీకృతులును, సుప్రసిద్ధసంఘసంస్కర్తయు నగు దరిశి చెంచయ్యగారిని వివాహమాడి, భర్తగారిప్రో

త్సాహమువలన, శ్రద్ధా వినయ భయభక్తి ఉత్సాహము లతో, ఆర్థిక రాజకీయ సాంఘిక మతవిషయముల నెన్నిటినో గ్రహించి ఎల్లవిషయములందును ఆయనకు చేదోడువాదోడుగా నుండెను.

౮. బెజవాడ వ్యవహారసమాజమునకును, బెజవాడ నగరమున జరిగిన ఆంధ్రమహాసభకును శ్రీ అన్నపూర్ణాదేవిగారు కార్యదర్శినిగా నుండెను. మరియును బొంబాయిలో ౧౯౨౯ సంవత్సరమున జరిగిన అఖిలభారత మహాసభకు ఆంధ్రదేశపు ప్రతినిధులుగా నెన్నుకొనబడినవారిలో అన్నపూర్ణమ్మగారొకరు.

౯. ఈమెయొక్క తోడ్పాటుతో వీరిభర్తగారగు దర్శి చెంచయ్యగారు ఇటీవల కొన్ని సంవత్సరములలోనే బ్రాహ్మణ వైశ్య కమ్మ విశ్వబ్రాహ్మణ వితంతుబాలికలవివాహములు వేరువేరుమిదిరెటిని జరిపిరి. ఈవివాహముల సందర్భమున ఈపుణ్యదంపతులు కీ. శే. రా. బ. కందుకూరి వీరేశలింగంపంతులుగారిని, వారి సహధర్మచారిణిని పోలుచున్నారు. వీరు ప్రజలనుండి అనేకసన్మానముల నొందిరి.

౧౦. వీరిచే వివాహముగావింపబడిన వితంతువులలో కొందరిని నెలలకొలది వీరు పోషించిరి.

౧౧. వ్యభిచారవృత్తియం దున్న అనేకస్త్రీలను సన్మార్గమునకు మరలింపగా, నొకరు వివాహితయై సుఖముగా నున్నది. కళావంతులసంఘములో వివాహములు చేయుటయందు శ్రీమతి యామినీ పూర్ణతిలకమ్మగారికి వీరు మిక్కిలి తోడ్పడిరి.

౧౧. a. విద్య నభ్యసింపగోరిన వితంతుబాలికల నెందరినో పాఠశాలలలో ప్రవేశపెట్టి, ఉదారస్వభావము గల వారి ద్రవ్యసహాయముచే అట్టిబాలికల కెందరికో సహాయము జేసిరి.

౧౨. నిరాధారులైన వితంతువులను, రాజకీయ బందీకృతులను జాతివిపత్తు లేక, అస్పృశ్యతాపిశాచమును గమనింపక సమస్తరీతుల వారినాదరించుటకు మహామహానుణి భర్తగారికి సర్వకాలములయందును తోడ్పడుచుండిరి.

౧౩. భారతదేశమందు ఆర్థిక రాజకీయనైతిక విషయములలో స్త్రీపురుషులకు సమానహక్కులను స్థాపించుటకు కంకణము గట్టుకొనిన సోదరీమణులలో అన్నపూర్ణాదేవిగా రొకరై.

౧౪. అనుకూలదాంపత్యము లేనిచో, వివాహచ్ఛేదము సంఘమునకు, వ్యక్తులకు శ్రేయస్కరమని చాటుచుండెను. ౧౯౩౦ వ సంవత్సరమున వీరు సహాయనిరాకరణోద్యమమునందు పాల్గొనిరి. వైశ్యసంఘమువారిచే నడుపబడు "వాసవి" మాసపత్రికయందు చక్కని సాంఘికకథలను, వ్యాసములను వ్రాసి వైశ్యులకు నవీన సంప్రదాయములను బోధించిరి.

౧౫. గృహములయందు భార్యలయొక్క సహాయప్రోత్సాహములు లేకపోగా భేదాభిప్రాయములు గలుగుటవల్ల అనేక దేశసేవకులయొక్క ఉద్యమములు కొనసాగకున్నవి. అన్నపూర్ణ చెంచయ్యగార్ల దాంపత్యమట్లు గాక వారు సర్వకాల సర్వావస్థలయందును సంఘసంస్కారము, దేశసేవ, నిమ్నజాత్యుద్ధరణము, సర్వమానవ సోదరత్వము అనువిషయములయందు, నిండుమనంబుతో ఆనందమయులై యుండిరి. కనుక వీరిదాంపత్యము ఆదర్శప్రాయ మనుటకు సందియ మేమి ?

౧౬. నిక్కముగా నీసాధ్వీమతల్లి యొక్క యకాలమరణ మాంధ్రదేశమునకు నొకగొప్పనష్టమును కలిగించినదనుటలో నసత్యం బావంతయును లేదు.

చెన్న రాజధానియందు ౧౯౨౮-వ సంవత్సరము ఏప్రిలు ప్రారంభము మొదలు
జూను తుదవరకు గల మూడునెలల కాలమున ముద్రితములయి ప్రకటితములయిన

# ఆంధ్ర గ్రంథముల పట్టిక*

ఆంధ్రవాఙ్మయ మీ క్రింద పేర్కొనిన వివిధశాఖలతో వెలసియుండుటచేత నీపట్టికయందాయాశాఖల నుత్పన్నములగు గ్రంథము లాయా శాఖలకే చేర్పబడును. గ్రంథముల నామములన్నియు నకారాదిక్రమమున నుండును.

1. అర్థశాస్త్రము, 2. అలంకారశాస్త్రము-నాట్యకళకు సంబంధించిన గ్రంథములు నయిత మీ శీర్షిక క్రిందనే చేర్పబడును, 3. ఆయుధధనుశ్శాస్త్రములు, 4. ఆరోగ్యశాస్త్రము, ఇతిహాసములు- ఇతిహాసములలోని భాగములు, కథలు, మార్పుచేయక ప్రత్యేకముగ ముద్రింపఁబడునవి - యీశీర్షిక క్రిందనే చేర్పఁబడును, 6. కథలు—ఐతిహాసికములు,పౌరాణికములు, 7.—కల్పితములు, 8.—చారిత్రకములు, 9.కల్పము, 10.కామశాస్త్రము, 11.కావ్యములు, 12. గణితశాస్త్రము, 13. గేయములు, 14. చరిత్ర(దేశ), 15. చిత్రలేఖనము,16. చట్టము(Law), 17. ఛందశ్శాస్త్రము, 18. జంతుశాస్త్రము, 19. జీవితములు, 20. జ్యోతిషశాస్త్రము, 21. తర్కశాస్త్రము, 22. దండకములు, 23. ధర్మశాస్త్రము, 24. నవలలు, 25. నాటకములు, 26. నాట్యశాస్త్రము, 27. నిఘంటువులు, 28. నీతి- నీతికథలుకూడ యీ శీర్షికక్రిందనే వచ్చును, 29. పరిశిష్టము, 30. పాకశాస్త్రము, 31. పారిశ్రామికము, 32. పురాణములు- ప్రత్యేకముగ ముద్రింపబడి ప్రకటింపబడు పురాణములలోని భాగములు నయిత మీ శీర్షికక్రిందనే చేర్పబడును, 33. ప్రకృతిశాస్త్రము, 34. ప్రబంధములు- ఆంధ్రసారస్వతమునందు ప్రసిద్ధములగు 'హరివంశము', 'ఆంధ్రచంపూభారతము', 'అచ్చతెలుగు రామాయణము'వంటి పురాణేతిహాసకావ్యములకు సంబంధించినవి, 'పాండురంగమాహాత్మ్యము' వంటి మాహాత్మ్యములు, 'ఆంధ్రమేఘసందేశము'వంటి అనువాదములు, రంగనాథరామాయణము'వంటి ద్విపదగ్రంథములు మొదలయినవి యీశీర్షికక్రిందవచ్చును, 35. ప్రహసనములు, 36. భూగోళశాస్త్రము, 37. భౌతికశాస్త్రము, 38. మంత్రశాస్త్రము, 39. మతము - హిందు, 40.— ఇతరములు (బౌద్ధ, జైన, క్రైస్తవాదిమతములు)- ఇతరమతములకు సంబంధించిన గ్రంథములు— ఏ విషయ విభాగమునకు సంబంధించిన వయినను- ఈశీర్షికక్రిందనే చేర్పబడును, 41. మాహాత్మ్యములు, 42. మీమాంసాశాస్త్రము, 43. యక్షగానములు, 44. యోగశాస్త్రము, 45. రత్నశాస్త్రము, 46. రాజకీయములు, 47. వాస్తుశాస్త్రము, 48. విమర్శనము- ఇందు సారస్వతమునకు సంబంధించిన విమర్శనలు మాత్రముండును, 49. వృక్షశాస్త్రము, 50. వేదవాఙ్మయము- ఉపనిషత్తులు,ఇతర వైదిక గ్రంథములునయిత మిందే చేర్పబడును, 51. వేదాంతము - భక్తి జ్ఞానవైరాగ్య విషయకగ్రంథములీశీర్షికక్రింద వచ్చును, 52. వైద్యశాస్త్రము, 53. వ్యవసాయశాస్త్రము, 54. వ్యాకరణ శాస్త్రము, 55. వ్యాపారము, 56. వ్యాయామము, 57. శకునశాస్త్రము, 58. శతకములు 59. సంగీతశాస్త్రము, 60. సాంఘికములు, 61. సాముద్రికశాస్త్రము, 62. స్వారస్వతము-భాష, 63. స్తోత్రములు, 64. హాస్యకథలు.

---

* ఈ పట్టికయందుగల సంకేతపదముల వివరణము: అ.— అధ్యాయము; అను — అనువాదము; అనువాదకులు. ప.—పద్యము. ప్ర.—ప్రకాశకులు. భా.—భాగము. వ.—వచనము. సం—సంపాదకులు. సటీ.—సటీకము.

## కథలు-ఐతిహాసికములు, పౌరాణికములు

ఆంధ్రవచనభారతము, సభాపర్వము—కే. వీరరాజు

బాలధ్రువోపాఖ్యానము—శేషాద్రిరమణకవులు

భారతకథారత్నములు, అభిమన్యుడు—వి. శ్రీనివాసరావు

భారతకథారత్నములు, చంద్రమతియు దమయంతియును—ఏ. జయరామరావు అండు సి. సుబ్రహ్మణ్యశాస్త్రి

యయాతి—ఏ. వెంకటరామశాస్త్రి

## కల్పితములు

కథామణిప్రవాళముక్తావళి, పుస్తకములు ౧, ౨, ౩—ఆర్. నారాయణరావు

నల్లతంగాళ్ కథ—యం. సుబ్బరాయులు నాయుడు

సంపూర్ణగ్రంథావళి-తొమ్మిదవ, పదియవసంపుటముల కథలు—చిలకమర్తి లక్ష్మీనరసింహకవి

## చారిత్రకము

రణతిక్కనచరిత్ర—యం. వెంకటరత్నకవి

## కల్పములు

ఏకాదశీ గురువార వ్రతకల్పము—చల్లా లక్ష్మీనృసింహశాస్త్రి

తిరునాథస్వామి పూజావిధానము—(ప్ర) జి. యస్. వి. జి. కృష్ణయ్యశెట్టి, విజయనగరము

త్రినాథమేళ—(ప్ర) నిత్యానందత్రిపాఠి అండ్ సన్స్, కాసిబుగ్గ

నందికేశ్వర వ్రతకల్పము—చల్లా లక్ష్మీనృసింహశాస్త్రి

నవగ్రహశాంతి విధానము—చల్లా లక్ష్మీనృసింహశాస్త్రి

## గణితశాస్త్రము

ఆరంభగణితము, భా. ౧—ఏ. జయరామరావు అండు యస్. కృష్ణరావు

ఎక్కములు—(ప్ర) గంజాంస్టోర్స్, బరంపురము

## గేయములు

కీచకవధ (పాటలు)—వి. సత్యనారాయణాచార్యులు

కేశవనామములు, హరిభజనకీర్తనలు—ఏలేశ్వరపు సూరమాంబ

బఫూన్ పాటలు—బొమ్మన గంగస్వామిరెడ్డి

బాలగీతములు—జి. సత్యనారాయణ

భక్తికీర్తనలు—డి. సర్వేశ్వరరావు

భక్తిరసప్రధానమైనకీర్తనలు—పెట్ల ఈశ్వరమ్మ

భక్తివైరాగ్యవిలాసము—పి. వెంకయ్య

భజనకీర్తనలు (శ్రీకృష్ణ)—వి. సత్యనారాయణమూర్తి

భజనకీర్తనలు (సీతా, రావణ)—వి. సత్యనారాయణమూర్తి

రామగీతము—మహావాది వెంకటరత్నం

వెంకయ్య-చంద్రమ్మపాట—కే. గోవిందం

శ్రీఅలిమేలుమంగమ్మ సరసావళి—యం. వి. రుద్రయ్యనాయుడు

శ్రీభక్తాంజనేయరామాయణ భజనకీర్తనలు—ఉట్ల దక్షిణామూర్తి

శ్రీమన్నాటక భజనకీర్తన రామాయణము—కోనూరి భోగలింగదాసు

శ్రీరామగీతపాట—సి. వీరరాజు

శ్రీవేంకటేశ్వర భజనకీర్తనలు—బి. నరసింహదాస్

హరినామసంకీర్తనలు- (ప్ర) పసుపులేటి నాగరత్నం రేలంగి

## చరిత్ర

ఆర్యుల ఆదర్శము—యం. జగన్నశాస్త్రి

గ్రేటుబ్రిటనుచరిత్ర—యం. నరసింహరావు

హిందూదేశచరిత్రము: భా. ౧, ౨, ౩—వి. శ్రీనివాసరావు

## జంతుశాస్త్రము

జంతుశాస్త్రము, భా. ౧, ౩—ఆర్. గోపాలయ్యర్, కే. సూర్యనారాయణ



కి రీ టి

శ్రీమతి దేవకుంజరి కన్య రచించిన చిత్రము.



స్వీకారము

కుందేటిపిల్లలను మూటిని, కుక్కపిల్లలను ఏడిటిని పెంచు కుక్క. సెంటు లూయీ నగరమున డి. ఇ. పార్కన్న అనునాతనియొద్ద నిది కలదు. (5) P. P. A.

## జీవితములు

కాళిదాసు—యం. చిన శేషగిరిరావు

జీవనస్మృతి (దేశిరాజు పెదబాపయ్యగారి)—కే. హనుమంతరావు

పండిత రమాబాయి జీవితచరిత్ర—(అను)యఫ్. యల్. మార్లర్

రామదాసస్వామి—యన్. రామమూర్తి

శ్రీరాణీరావుభావయాంబ—కే. సుబ్బారావు

## దండకములు

ఉమా రామలింగేశ్వరదండకము—కే. రామచంద్రరావు

శ్రీరామదండకము—సి. సర్వేశ్వరుడు

స్తోత్రనీతిపద్యములున్ను భగవన్నామ సహస్రసమేతదండకము—(ప్ర) సి. రాజమన్నార్ నాయుడార్

## నవలలు

అపరిచిత—మాలే రాఘవరావు

ఆటిన్ మణేలా—జొన్నలగడ్డ సత్యనారాయణమూర్తి

ఇంటా బయిటా—(అను) శోభనాదేవి, కే. వైకుంఠరావు

మదనమంజరి—యం. శేషాచారి

రమాసుందరి—వి. సుబ్బారావు

లక్ష్మీకాంతము—భాగవతుల వేంకటశాస్త్రి

విషమరహస్యము—వారణాసి భానుమూర్తి

## నాటకములు

అనసూయానాటకము—సోమరాజు అచ్యుతరావు

కంజాక్షీపరిణయనాటకము—యం. కాశయ్య

గోల్కొండసామ్రాజ్యనాటకము—యం. చయనులు

జానకీపరిణయము—జే. హనుమయ్యచౌదరి

ద్రౌపదీవస్త్రాపహరణము—మల్లాది అచ్యుతరామశాస్త్రి

పల్నాటిపౌరుషము—పి. రామచంద్రరావు

పాండవజననము—రామనారాయణకవులు

పాండవాజ్ఞాతవాసము—రామనారాయణకవులు (నాల్గవముద్రణము)

పాండవాజ్ఞాతవాసము—రామనారాయణకవులు (నాల్గవ పునర్ముద్రణము)

పాదుకాపట్టాభిషేకము—డి. సీతారామరావు

పురూరవచక్రవర్తి నాటకము—రాంపెల్ల బైరాగిపాత్రుడు

పోస్టాఫీస్—(అను) కె. వైకుంఠరావు

ప్రహ్లాదనాటకము—చిల్లర వేంకటేశ్వరకవి

భువనమోహిని—అప్పల వీరవెంకటభోగయ్యశాస్త్రి

మాణిక్యము—జి. సత్యనారాయణ

విజయసేనమహారాజు నాటకము—యం. కాశయ్య

సంపూర్ణగ్రంథావళి: ఏడవసంపుటము: నాటకములు—చిలకమర్తి లక్ష్మీనరసింహాకవి

స్టిల్ మాండ్ మేజస్ట్రేట్—(అను) కె. వైకుంఠరావు

## నీతి

నీతినిధి, భా. ౨—పి. శ్రీరాములురెడ్డి

పిల్లలనీతికథలు—యం. శ్రీపతి

బాలనీతిచంద్రిక—ఆర్. వీరరాజు

భక్తజనహితబోధిని—పుల్లా ఓబులరెడ్డి

## పరిశిష్టము

అభ్యాసోపన్యాసము—యన్. వీరరాజు

అయిదవవాచకపుస్తకము—కె. వీరేశలింగంపంతులు

అవాతాతాయుగసంధిపత్రిక—బోరెడ్డి మల్లితాత

ఆంధ్రులగతి—విష్ణుభట్ల దుర్గశర్మ

ఆపన్మోచనతారావళి—డి. కృష్ణమూర్తిసూరి

ఆరవవాచకపుస్తకము—కె. వీరేశలింగంపంతులు

కథలు, పాటలు, పద్యాలు మొ.—యం. భక్తుల్ జేమ్స్

కలగూరగంప—పి. పరబ్రహ్మం

కావ్యశాఖాగౌరవము—బి. లక్ష్మీపతిశాస్త్రి

కాలజ్ఞానం—నిమ్మరాజు లక్ష్మీనరసింహ యోగానందస్వామి

కావ్యకథాసారము—జి. సోమన్న, పి. చిదంబరశాస్త్రి

కుకవినింద—టి. సూర్యప్రకాశరావు

గండికోట—జె. సుబ్బయ్య

గీతాశ్రయము—ఐ. తిరుపతిరాయుడు
గ్రామపునర్నిర్మాణము—(సం) యస్. వి. శ్రీనివాస రావు
జ్ఞానజ్యోతి—టంగుటూరి రామమూర్తి
పరమగురుచరణసన్నిధి—(అను) సి. రామయ్య
పామరులకు విద్య—యం. రామరావు
పురాణవాచకము, తరగతి ౨—వి. జి. సోమన్న పంతులు
పురాణవాచకము, తరగతి ౫—వి. జి. సోమన్న పంతులు, బి. నారాయణమూర్తిపంతులు
పైడిలేడి; అపవాదము—నాళము కృష్ణరావు
ప్రశ్నదర్శిని—(ప్ర) చల్లా లక్ష్మీనృసింహశాస్త్రి
బాలబోధిని—కాశీ కృష్ణాచార్య
బిడ్డలనుగురించి ఒకపుస్తకము—(ప్ర) ఆల్ ఫ్రెడ్ యంగ్ అండ్ కో., లిమిటెడ్, మదరాసు
భాగవత సుధానిధి, భా. ౧—యస్. శేషాచలశాస్త్రి
భావప్రపంచము—వి. వి. భగీరథి
మృగాంకావలి—(సం) ఇన్నేశ్
రంగడి రత్నమాల—యస్. రంగరావు
విద్యవలన కలుగు లాభములు—క్రిశ్చియన్ లిటరేచర్ సొసైటి, మదరాస్
శతపుష్పాంజలి—యు. జానకిరామ పట్నాయక్
శృంగారసంధ్య—భాగవతుల నృసింహశర్మ
శ్రీ భద్రాచలయాత్ర—ఆర్. రామశాస్త్రి
శ్రీ భాగవతహృదయము(సటీ)—యస్. శ్రీనివాసరావు
శ్రీ రామ ధ్యానము—(ప్ర) పి. త్యాగరాయ అండ్ సన్సు, మదరాసు
శ్రీరామ పాదుకాపట్టాభిషేకము—పులవర్తి వెంకటనారాయణదాస్
శ్రీ స్వామి ఆత్మానంద కంఠార్థములు—(ప్ర) ఆర్. వెంకటరత్నం, బెజవాడ
సంజయరాయబారము (సటీ)—(సం) యస్. వెంకట సుబ్బరామశాస్త్రి
సంతాన రత్నాకరము—(ప్ర) చల్లా లక్ష్మీనృసింహ శాస్త్రి
సంస్కృతప్రవేశినీ—విష్ణుభట్ల దుర్గశర్మ
సంస్కృత బాలశిక్షా—విష్ణుభట్ల దుర్గశర్మ
సంస్కృత శిశుబోధినీ—విష్ణుభట్ల దుర్గశర్మ
సమదర్శిని మొదటి ఉగాదిసంచిక—(ప్ర) పి. సుబ్రహ్మణ్యం శెట్టి
సహకారబోధిని—యస్. సత్యనారాయణ
సిక్కుపాచకము, తరగతులు ౨, ౩, ౪—కే. వి. రామమూర్తిపంతులు
సీతారామ కల్యాణమహోత్సవము—పి. వెంకయ్య
సీసమాలిక—యం. పేరరాజు
సుజ్ఞానదీపము—పి. శంకరరావు

## పురాణము

వామనపురాణము (వ), భా. ౩—(అను) పి. లక్ష్మీనరసమాంబ

## ప్రకృతిశాస్త్రము

తెలుగు ప్రాథమిక ప్రకృతిశాస్త్రము, తరగతి ౫—టి. వీరస్వామిపిళ్లె
పదార్థవిజ్ఞానశాస్త్రము—వి. శ్రీరాములు
ప్రకృతి శాస్త్రవిషయములు, ఫారము ౩—కె. సూర్యనారాయణ
శాస్త్రవాచకపాఠములు, నెం. ౭—యం. సాంబశివరావు
సృష్టిపరిశీలన, వా. ౩—సి. కుమారస్వామినాయుడు అండ్ సన్సు, మదరాసు

## ప్రహసనములు

కాలక్షేపం—బి. కామేశ్వరరావు
నవ్వులగని—చిలకమర్తి లక్ష్మీనరసింహకవి
నిరుద్యోగి ఫార్సు—కే. గోవిందం
నీమగడే నామగడు—టి. ఆదినారాయణ; కే. వీరాస్వామి
మగపోరు—కే. గోవిందం
మొట్టికాయ—బలభద్ర కోటయ్య
రాజరంగేళి—బద్దిరెడ్డి కోటీశ్వరరావు
వేశ్యాదేవత—కే. గోవిందం

### భూగోళశాస్త్రము

చెన్నరాజధాని భూగోళము—పి. అప్పరావు
నూతన భూగోళశాస్త్రము—బి. రామచంద్రరావు
పశ్చిమగోదావరిజిల్లా జాగ్రఫీ—డి. సత్యనారాయణ మూర్తి
భూగోళశాస్త్రము, చెన్నరాజధాని—(ప్ర) మాక్మిలన్ అండ్ కో. లిమిటెడ్, మదరాసు
భూగోళశాస్త్రము, ఫారము ౪—ఆర్. శేషగిరిరావు

### మతము—హిందు

శ్రీవ్రతరత్నము—(అను) కే. వెంకటాచార్య
స్త్రీలవ్రతము—జ్ఞానాంబ

### —ఇతరములు

పూర్వక్రైస్తవ మిషనరీలు—డి. జ్ఞానప్రకాశరావు
రాక్షసునిచంపిన గొల్లపిల్లవానికథ—(ప్ర) క్రిశ్చియన్ లిటరేచర్ సొసైటి, మదరాసు
స్పిరిటుపొందు సర్వేశ్వరునియొక్క సవసనజపము—జె. జె. ఆలన్

### మాహాత్మ్యములు

శివరాత్రిమాహాత్మ్యము—చాగంటి వీరభద్రకవి
శ్రీరామనామ మాహాత్మ్యము—లక్కాకుల వెంకట రత్నదాస్

### యక్షగానము

శ్రీయాళనాటకము యక్షగానము—బి. పరబ్రహ్మకవి

### రాజకీయములు

ఆంగ్లేయరాజ్యపాలనా సౌకర్యములు—జాన్ చౌదరి
ప్రాచీనహిందూదేశ రాజ్యాంగచరిత్ర—కోన వెంకట రాయశర్మ

### వేదాంతశాస్త్రము

అద్వైతానందీయము—బొమ్మన రంగస్వామిరెడ్డి
గురుశిష్యసంవాదము—వై. కృష్ణరావు
జీవబ్రహ్మైక్య రాజయోగసారామృతగ్రంథమును మంజరీద్విపదగా—ప్రతాప వెంకటేశ్వరకవి
జీవబ్రహ్మైక్య రాజయోగసారామృతము—పరమహంస సచ్చిదానందయోగీశ్వరులు
భగవద్గీత—(సం) జె. జగన్నాథశాస్త్రి
శ్రీ తత్వబోధవిచారము—శివరాజస్వామి
శ్రీభగవద్గీత (సటీ)—(ప్ర) భక్తవత్సల కంపెని, మదరాసు
శ్రీమదాంధ్రాధ్యాత్మరామాయణము—(ప్ర) వి. జానకిరాం
శ్రీమద్బ్రహ్మసూత్రభాష్యము (సటీ)—(ప్ర) కే. శ్రీనివాసరావు, విజయనగరము
శ్రీమన్మాండూక్యోపనిషత్కారికా తాత్పర్యబోధిని—కోపూరి పట్టాభిరామశర్మ
శ్రీరామగురుబోధామృతము—అంగిన రామస్వామి
శ్రీరామ గురుబోధామృతాసార తత్వవిచారణ—యం. వెంకటదాస్

### వైద్యశాస్త్రము

అనుభవమూలికా వైద్యము—డి. నారాయణరెడ్డి
గృహవైద్య చికిత్సారత్నము, భా. ౧, ౨—మంగపల్లి రంగయ్య
పశువైద్యము—(అను) నారనార్య
బాలుర ప్రథమచికిత్సయు, రోగుల సంరక్షణయు—జె. రత్నం
బైరాగి చిటికెలు—తాత సూర్యప్రకాశరావు
శ్రీ వైద్యసారామృతానందా లహరి—యం. వెంకటస్వామి

### వ్యాకరణశాస్త్రము

ఆంధ్ర వ్యాకరణపాఠములు—యన్. వెంకటరామానుజాచార్యులు
ఆంధ్ర వ్యాకరణము—శేషాద్రిరమణకవులు

## శతకములు

గాంధి శతకము—భాగవతుల నృసింహశర్మ
గోపబాలక శతకము—కే. రామచంద్రరావు
మహేశ శతకము—చదలవాడ కోటి నరసింహం
రామ శతకము—బాయనమొగ్గన్న
రామశతకము—బి. వీరబ్రహ్మం
లింగశతకము—యస్. పైడయ్య
శ్రీరామప్రభు శతకము—కే. రామచంద్రరావు
శ్రీరామ శతకము—సత్యవోలు రాధామాధవరావు

## సంగీతశాస్త్రము

గానబోధిని—పి. రామస్వామి

## సాంఘికములు

ఇష్టాగోష్టి—నై. వెంకటరత్నము

## స్తోత్రములు

మాతృస్తవ తారావళి—దేవలపల్లి వెంకటరామయ్య
విష్ణునామము—ఆదిభట్ల శ్రీరామమూర్తి
శ్రీ దక్షిణామూర్తి స్తోత్రము (సటీ)—వి. రామస్వామి శాస్త్రులు అండ్ సన్స్, మదరాసు
శ్రీరామ స్తవరాజము—అడపాల నారాయణ
శ్రీసూర్యసప్తతి—దామెర చినవెంకటరాయ
స్తోత్రరత్నావళి (సటీ), భా. ౧—కే. మార్కండేయ శర్మ

---




## అఖిలభారత 'స్వదేశీ' ప్రదర్శనము-మద్రాసు



సర్ ఎం. విశ్వేశ్వరయ్యాగారు

సర్ మోక్షగుండం విశ్వేశ్వరయ్యాగారి సమర్థమగు ప్రారంభోపన్యాసముతో ఈప్రదర్శనము మొదలైనది. ప్రధానముగ వ్యావసాయిక దేశమై, వీలగునంతకైన కృత్రిమములగు విపరీతపరిస్థితులందు తగినగతి గానక, పారిశ్రామికముగ వెనుకపడియున్న మనదేశమున ప్రాముఖ్యము వహించు ఖద్దరు తయారీ వంటి చేతిపరిశ్రమలే ప్రధానముగాగల ఇట్టి ప్రదర్శనము ఒకసిద్ధి కాకపోయిన, ఒక ఆశ, ఒకఉత్సాహము కాకపోదు. ఇందు చేతిపరిశ్రమల అభివృద్ధియు, అవకాశమును ఎంతయు వెల్లడియగుచున్నవి. యంత్రపరిశ్రమలును తగుప్రోత్సాహమున వృద్ధిపొందగల సామర్థ్యమును ఇందు ప్రకటించుకొన్నవి.

శ్రీ విశ్వేశ్వరయ్యాగారు మనదేశమున, ముఖ్యముగ మద్రాసు ప్రాంతమున, ప్రభుత్వముతోడ్పాటు పడయని పరిశ్రమల గతిని, తత్ఫలితముగ ప్రభుత్వమునకు చేపడ్డనష్టమును, ప్రజలకు చేపడ్డ అనుద్యోగము, బీదబ్రతుకు, తిండిలేమి మున్నగు అనర్థములను వివరించి, పరిశ్రమల ప్రాముఖ్యమును తెలిపిరి.

నాగరికదేశములయం దెల్ల వ్యవసాయమువలన వచ్చు లాభములకంటె పరిశ్రమలవలన వచ్చులాభములు చాల హెచ్చుగా నున్నవి. అమెరికా సంయుక్తరాష్ట్రములలోను, జర్మనీ, స్వీడెనులలోను చాలవరకు ఆదాయము పరిశ్రమల మూలకముగానే వచ్చుచున్నది. ఆంగ్లదేశములోకూడ వ్యవసాయమువలన వచ్చు ఆదాయము చాల స్వల్పము. ఐదు గొప్ప దేశములలో వ్యవసాయమువలన నెంత ఆదాయము వచ్చుచున్నదో, పరిశ్రమలవలన నెంతయాదాయము వచ్చుచున్నదో భారతదేశపు ఆదాయములతో పోల్చి చూపెదను.

అమెరికా సంయుక్తరాష్ట్రములయందు వ్యవసాయమువలన ౨౮౭౬ కోట్ల రూపాయలును, పరిశ్రమలవలన ౧,౩౦౦ కోట్ల రూపాయలును వచ్చుచున్నవి. కెనడాలో వ్యవసాయమువలన ౮౬౮ కోట్లు, పరిశ్రమలవలన ౧,౦౮౪ కోట్లు వచ్చుచున్నవి. గ్రేటుబ్రిటనునందు



ప్రదర్శన ప్రారంభికులు సర్. యం. విశ్వేశ్వరయ్యగారు.

వ్యవసాయమువలన ౮౦ కోట్ల రూపాయలు, పరిశ్రమల వలన ౮౦౭ కోట్లు. జపానులో వ్యవసాయమువలన ౮౫ కోట్లు, పరిశ్రమలవలన ౧౨౦ కోట్లు. స్వీడెనునందు వ్యవసాయమువలన ౧౯౮ కోట్లరూపాయలు, పరిశ్రమల వలన ౩౮౭ కోట్లరూపాయలు. భారతదేశమునన్నో, వ్యవసాయమువలన ౬౮ కోట్లు, పరిశ్రమలవలన ౧౩ కోట్ల రూపాయలు.

మద్రాసురాజధాని ఆంగ్లదేశమంత విస్తీర్ణము కలదియు, దానికంటె హెచ్చు జనాభా కలదియునని మనలో నెవ్వరైన జ్ఞాపకముంచుకొనుచున్నారా? ఆంగ్లదేశమునందు ౧౧౦ లక్షల ఇన్సూర్డు ప్రజలు సంవత్సరమునకు తలకు ౨౦౦ పౌనుల వస్తూత్పత్తి గావించెదరని అంచనావేయబడినది. ఈ ఒక్క ఆదాయము వలననే ఆంగ్లదేశమునకు ౨,౨౦౦ మిలియనుపౌనులు వచ్చును. మద్రాసు రాజధానిలో నన్ని బాపతులు కలిపికొనిన ప్రజలఆదాయము ౨౫౦ మిలియను పౌనులకు అనగా ౨౫ కోట్లకంటె హెచ్చుండదు. ఏతన్మూలకముగానే గాక నౌకాయానము, బ్యాంకింగు, వర్తకము మున్నగు పనులలో ఆంగ్లేయులు చాలధనము సంపాదించుచున్నారు. మనము వారి ధైర్యసాహసములను, తెలివితేటలను మెచ్చుకొనవలసినదే కాని, వారిని చూచి నేర్చుకొని హెచ్చు ద్రవ్యమును మనముగూడ సంపాదింప బ్రయత్నింపవలెను.

జపానుదేశములో ౫౦ సంవత్సరముల క్రింద ప్రజల ఆర్జనశక్తి మనదేశమంతయే యుండెను. కాని యిప్పుడు అది నాలుగింతలైనది. ౩౦ సంవత్సరముల క్రింద భారతదేశము జపానుదేశమునకు గుడ్డలను, నూలును ఎగుమతి చేయుచుండెను; ఇప్పుడో స్థితిగతులు మారినవి, మనదేశమునకే వారిసరకులు విస్తారముగా దిగుమతి యగుచున్నవి.

ఇట్టులే కనడా గూడను. ఒకానొకప్పుడు మనదేశమునకంటె వెనుక బడిన కెనడాదేశము మనలను మించి ప్రపంచమునందలి జాతులలో ౫ వ స్థానము పొందినది. కెనడా వ్యావసాయికదేశమైనను పరిశ్రమలనది యెంతమాత్రమును అశ్రద్ధచేయదు. కెనడాలో ఒక కోటి ప్రజలుమాత్రమే కలరు. మనదేశములో (బ్రిటిషు ఇండియాలో) ౨౮ కోట్లు కలరు. కాని సౌభాగ్యమునందు కెనడా మనకంటె మించిపోయినది. కెనడా, జపానుదేశములనుండి మనము నేర్చుకొనవలసిన దెంతయేని కలదు.

నాగరికతకు పరిశ్రమలు అవసరము. మనదేశములోనే పరిశ్రమ లున్నయెడల మనకు కావలసిన వస్తువులను మనమే తయారుచేసికొని, విదేశములకు పోవు ధనమును మనదేశములయందే యుంచుకొనగలము. మనకు రెండువిధముల లాభము కలదు. మనము విదేశములకు మన ధనము పోనిచ్చితిమా అది మరల మనదేశమునకు రాదు. మనదేశములోనే యున్నచో మనపనిపాటలవారికీయబడును. మనదేశమునందు చలామణియై దేశీయ పరిశ్రమలకు లాభకరముగా నుండును. దేశీయపరిశ్రమలు పనిలేనిప్రజలకు పని కల్పించును. దేశమును స్వయంసాహాయ్యకముగా జేయును. మనదేశములో వ్యవసాయమువలన వచ్చిన కొలదిపాటి ధనము విదేశీయ పరిశ్రమలకు ఖర్చగుచుండుట చాల అనర్థదాయకము, జాలిగొల్పునది.

పరిశ్రమలు మన యభివృద్ధికి చాల ముఖ్యములు. వానియభివృద్ధికి మనము తగినంతశ్రద్ధ వహింపకుండుట చాల అవమానకరము.

పిదప పరిశ్రమలనుగూర్చి సర్వజనులును తెలిసికొనదగు కొన్ని ముఖ్యవిషయములను వివరింపబూని, తొలుత పరిశ్రమలను మూడు తరగతులుగ విభజింపవచ్చుననిరి: ౧. పెద్దపరిశ్రమలు, ౨. మధ్య-రకము పరిశ్రమలు, ౩. చిన్నపరిశ్రమలు, లేక గృహపరిశ్రమలు— అని. అందు ఎక్కువధనలాభమును తేగలవి ప్రత్తి, బొగ్గు, ఉక్కు, ఇనుము మున్నగునవి పెద్దపరిశ్రమలలోనికిని; అంతయెక్కువ

కామాటము లేక, ఒకమాదిరి రాబడి తెచ్చుచు దేశమున విరళములై చెదరియుండు కాకితము, చక్కెర, అల్యూమినియము, ఔషధములు, పట్టు, ఉన్ని మున్నగువాని పరిశ్రమలు రెండవ తరగతిలోనికిని; వడుకునేతలు, కుండచేతలు, అగ్గిపుల్లలు, వ్యవసాయపు పనిముట్లు మున్నగు గృహాపరిశ్రమలు మూడవరకములోనికిని జేర్చిరి. ఇందు తుదితరగతిపనులు ఎక్కువ వెలలు తెచ్చునవి కాకపోయినను, పల్లెటూరికి వలయు ప్రధానద్రవ్యములను చేకూర్చుచు, సరకుల మొత్తములకును, సరకుల వివిధత్వమునకును ప్రాముఖ్యము వహించుననిరి. పిదప పాశ్చాత్య దేశముల నుదాహరించుచు, ప్రతినగరమును, పట్టణమును, పల్లెయు పరిశ్రమలవలన తాము పొందగల అభివృద్ధిని పురస్కరించుకొని వానిని పోషించుకొనవలయు నావశ్యకతను తెలిపి, వ్యవసాయపరిశ్రమల అన్యోన్యాభివృద్ధిహేతుత్వమును చూపి, పెద్దపరిశ్రమలు రాష్ట్రప్రభుత్వములు, నగరప్రభుత్వములును చేబూనవలెననియు, మధ్యమ-తరగతి వానిని నగరములును, పట్టణములును నెలకొల్పుకొనవలెననియు, గృహాపరిశ్రమలు పల్లెమొదలెల్లతావుల నుండదగినవనియు బోధించి, పిదప ప్రణాళిని గూర్చియు, ప్రయత్నమును గూర్చియు ముచ్చటించుచు, తొలుత ప్రభుత్వమువారి లోపములను దెలిపి, యిట్లు నుడివిరి:—

సత్వర పారిశ్రామికాభివృద్ధి యగుటకు అన్నితరగతుల పరిశ్రమలనుగూర్చి సంగతిసందర్భములు ప్రచురించుట ప్రథమకార్యము. ఇది సమగ్రముగాను, సంపూర్ణముగాను ఉండవలెను. రెండవది మన కున్న ముడిపదార్థ మెంతో అంచనా వేయవలెను. అనగా, లోహములు, విద్యుచ్ఛక్తి గాక, నూనెదినుసులు, తోళ్లు, ఆటవికపదార్థములు మన కెంత యున్నవో లెక్కవేయవలెను. మూడవది దేశములో నేవస్తువులు తయారగుట లాభకరమో తెలియబరుపవలెను.

ఈమూడును తయారైన పిదప ప్రతి రాష్ట్రీయ ప్రభుత్వమువారును అభివృద్ధికై పద్ధతులను నిర్ణయించుటకు వీలగును.

నాయకులను, ప్రవీణులను తయారుచేయుటకు వలయు విద్యావిధానము ప్రత్యేకముగా నుండవలెను. దీని విషయమై ఆంధ్రవిశ్వవిద్యాలయ పట్టప్రదానసమయమున చెప్పియుంటిని.

## పరిశ్రమాభివృద్ధికి కావలసినవి

పరిశ్రమాభివృద్ధికి చక్కని నిర్వహణసామర్థ్యము, ద్రవ్యము, యంత్రసామగ్రి, పనివారు, పదార్థము, అంగడి ఈ ఆరును అవసరములు. వీనిలో మొదటి మూడు లభించుట కష్టము. కేవలము చదువువలన మాత్రమే నాయకులును, ప్రవీణులు ఉత్పన్నముకారు. వీరు తమ క్రింద పనిచేయుచున్నవారితో అనువుగా నుండి లాభము పొందగల తెలివితేటలు గలిగియుండవలెను. మంచి కార్యనిర్వాహకుల యవసరము చాల హెచ్చుగా నున్నది. ద్రవ్యము అప్పుగా దొరకును. యంత్రసామగ్రి విదేశములనుండి తెప్పించుకొనవచ్చును. పనివారి సంఖ్య యిప్పుడు కొల్ల. వస్తుసామగ్రి యనినచో నదియుకొల్లయే. కావలసినంత ముడిపదార్థము ఇప్పుడు విదేశములకు ఎగుమతియగుచున్నది. అంగడియో గుమ్మము ముందట నున్నది.

ప్రతిదేశము హెచ్చు దిగుమతిపన్నులను విధించుకొనుచున్నది. మనదేశమునకుగూడ దిగుమతిపన్నులు అత్యవసరము. తగిన దిగుమతి పన్నులుండి, ప్రభుత్వ సహాయ ముండినచో, కొలది సంవత్సరములలో ఇప్పుడు విదేశములనుండి దిగుమతియగుచున్న ౧౫౦ కోట్ల రూపా

యుల వస్తువులును మనదేశముననే యుత్పత్తియగుచు. ౧౦ సంవత్సరముల లోపుననే మనదేశము పారిశ్రామికముగ చాలవఱకు పరాపేక్ష లేనిది కాగల్గును.

౫ సంవత్సరముల పద్ధతి

ఇంకొక సందర్భమున రష్యాదేశమునందవలంబించిన పద్ధతి యవలంబించుట యత్యావసరమని చెప్పియుంటిని. విద్యాభివృద్ధికిని, పారిశ్రామికాభివృద్ధికిని అత్యంతము కాంక్షించు మనకు ఈపద్ధతియందు అనుసరింపదగిన దెంతయో కలదు.

ఈపద్ధతి ననుసరించుటకుగాను లెక్కలన్నియు సిద్ధము చేయవలెను. ఎన్ని పరిశ్రమ లున్నవి, వాని యవకాశము లేవి యని మొదట నిర్ణయము చేయవలెను. ప్రతి రాష్ట్రమునకు వేరుగాను, దేశమునకు మొత్తముగాను లెక్కలను తయారుచేయవలెను. ఈ లెక్కలన్నియు కేంద్రపారిశ్రామిక కమిషనుఎదుటను, రాష్ట్రీయసంఘములయెదుటను నుంచబడవలెను. ఈసంస్థలు ప్రపంచ స్థితిగతులను తెలిసికొని ఈ ౫ సంవత్సరములపద్ధతి నెట్లు ఆచరణయందుంచవలెనో తెలుపుదును.

కార్యక్రమము నిర్ణయమైనతరువాత ప్రతిసంవత్సరము ఎంతయభివృద్ధి కోరదలచిరో స్పష్టము చేయవలెను. రాష్ట్రీయసంఘములు పారిశ్రామిక ప్రతిష్ఠాపనల నేర్పరుపవలెను. ఈపద్ధతి అమలులోనికి వచ్చిన తరువాత ప్రతిసంవత్సరము జరిగిన అభివృద్ధి విమర్శించి ప్రతిరాష్ట్రమునకు, దేశముమొత్తమునకు గూడ లెక్కలు తయారుచేయవలెను.

పంచవర్షపద్ధతి యన్నది ప్రసిద్ధవచనము కాన యిచట వాడబడినది గాని, నాల్గువత్సరములైనను, ఆఱువత్సరములైననుకూడ పనికి వచ్చునట. కాని యీదేశమునకు మాత్రము పదివత్సరములవఱకు జరుగుట అతిమాత్రమగునట. ఈ పంచవర్షపద్ధతికి తోడు మఱి రెండుఏర్పాట్లు జరుగవలెననిరి. అందు మొదటిది : ఒక రెయిలువే పరిశ్రమ అని, ఒక సైనికభండారము (Army Stores) అని--ఇట్టివి దేశమున, ఎందులకైన నేమి, నెలకొనలేదు; మఱి దేశపు ధనప్రవాహమును నిలుపుటకు చేతిపరిశ్రమలు తగిన సత్తువ పడయలేదు. ఇట్టివి గమనించి, ప్రభుత్వమువారు ఏదో ఏర్పాటుతో, అన్నిరకముల పరిశ్రమలను, ప్రయోజనము లేకున్న మానె, ఎదురుగా కనపడుచుండుటకైనను, స్థాపింపవలెను. అది చూచి ప్రజలు ఆలోచించెదరు. అందువలన కార్యోత్సాహమేర్పడునని చెప్ప నక్కఱలేదు. ఇక రెండవది : పాశ్చాత్య విశ్వకళాపరిషత్తుల చర్యలను పాఠముగా చూపి, కొంతకాలమునవఱకు మన విశ్వవిద్యాలయములును, ప్రభుత్వపు విద్యాశాఖాధికారులును ప్రజల భౌతికాభివృద్ధికి తోడ్పడుశిక్షలు, ముఖ్యముగా, సంకేతవిజ్ఞానమునకు (Technology), వాణిజ్యమునకు, వ్యవసాయమునకు సంబంధించువానిని, ప్రసాదింప నమకట్టినచో, పట్టభద్రులైనవారు కళాశాలనుండి ఒకకర్మాగారమునకో, ఒకవాణిజ్యనిలయమునకో, ఒక కమతమునకో తిన్నగ దారితీయ గల్గుదురనియు, ఇందుల ప్రజ లెంతయు కృతజ్ఞులగుదురనియు మందలించిరి.

పిమ్మట భావివికాసములగూర్చి యిట్లు సెలవిచ్చిరి:—

భారత ప్రజలు ప్రబోధితులగుటవలన ప్రస్తుతపు అశాంతి దేశమున ప్రబలియున్నది. దేశముయొక్క ఆర్థికదురవస్థను బాపుటకు విద్య, పరిశ్రమలు రెండు మాత్రమే సమర్థములై యున్నవి. పరిశ్రమలలో వ్యాస

సాయము, వ్యాపారముగూడ చేరియున్నవని నా మతము. పారిశ్రామికాభివృద్ధి చాల అవసరమని వేరుగా చెప్ప నవసరములేదు. స్వాతంత్ర్యమునకును, దేశరక్షణమునకును తరువాత దీనినే చెప్పవలెను. భావి కాలములో రాజకీయ సమస్యలకంటె ఆర్థికసమస్యల మనము హెచ్చుగా పరిష్కరింపవలసి యుండును. నాగరిక ప్రపంచముతో మనము పోటీచేయగలిగినవార మగుటకు మిక్కుటముగ పారిశ్రామికాభివృద్ధియు, సాధారణజ్ఞానము, సాంకేతికజ్ఞానము అత్యంత వ్యాప్తిగాం మటయు, ఆవశ్యకము.

నేను సూచించిన ౫ సంవత్సరములపద్ధతి ప్రారంభమగుటకు స్వాతంత్ర్యప్రాప్తి యవసరము. శాంతి స్థాపన మవసరము. కాని ఈమధ్య లెక్కలు తయారుచేసి, దేశమును సంసిద్ధముగా చేయుట కర్తవ్యము.

ఉత్పత్తి మనము వృద్ధిచేయవలెను. మనకు కావలసినంత బలగము కలదు. విద్యవలనను, ప్రచారము వలనను ప్రజలను దార్ఢ్యము కలవారినిగను, ఆత్మవిశ్వాసము కలవారినిగను మనము చేయవచ్చును. ఒకపద్ధతి యేర్పరుచుకొని పనిచేసినచో ధైర్యముతో ముందు రాగలసమస్యల నెదుర్కొన గలుగుదుము.

విద్యావిషయములనుగూర్చి ఆంధ్రవిశ్వవిద్యాలయ పట్టప్రదానసమయమున చెప్పియుంటిని. వాఙ్మయ, విజ్ఞానసంబంధమైన విద్యయే మనకు నేర్పి, పారిశ్రామిక విద్య మనకు చెప్పకుండిరి. జ్ఞానాభివృద్ధి కరమగు విద్యయు, శరీరదార్ఢ్యము కలుగు విద్యయు మనకు కొంత గాకపోయిన కొంతయైనను చెప్ప మండిరి. సౌహార్దమును పెంపొందించు విద్యకుమాత్రము అవకాశములు లేనేలేవు.

కావున, సౌహార్దమును, సమష్ట్యైక్యమమును అలవరుచుకొను ఆవశ్యకము నాటబల్కుటయే నేటి నాకుది యంశము. మనభావి పారిశ్రామిక విజయుల ధర్మసూత్రము 'విభజించి పాలింపుడు' అని కాదు, 'సంధించి సాధింపుడు' అని (not 'divide and rule' but 'unite and conquer'). కొన్ని ప్రధానగుణములను అలవరుచుకొనక యేజాతియు గొప్పది కాలేదు. కావున నేను చెప్పునదిది:—

మీపద్ధతులను ప్రపంచానుభవముమీద నాధారపఱుపుడు. సాముదాయిక కార్యపరత్వమును అభ్యసింపుడు. మీ యాంతరంగిక జీవనమునందును, వ్యాపార జీవనమునందును గూడ నియమోన్నతిని పాటింపుడు. సంఘములో అన్నితరగతులందును శీలసంపత్తిని పెంపొందింపుడు. ఇవి చేసితిరేని భావి ఆర్థికాభివృద్ధినిగూర్చి మీరు భయపడ నక్కరలేదు.

---

## చతుర్థ గాయకమహాసభ - సంగీతపరిషత్తు, చెన్నపురి

సంగీతపరిషత్తువారు చతుర్థ గాయకమహాసభను కడచిన డిసంబరు ౨౫వ తేది మొదలు జనవరి 3-వ తేదివఱకు జరిపిరి. ఈమహాసభకు గాయక శిరోమణి (పలమనేరి) శ్రీయుతులు స్వామినాథ అయ్యరుగారు అధ్యక్షులు.

ఈమహాసభయందు అనుదినము శ్రీయుతులు అరియకుడి రామానుజ అయ్యంగారు, టైగరు వరదాచారియారు మున్నగు గాయక శిరోమణులు, ద్వారం వెంకటస్వామి నాయుడుగారు మొదలగు వాయులీన (Violin) పండితులు, వైణవిక వతంసమగు పల్లడం సంజీవరావుగారు, అళగనంబిగారు మున్నగు మార్దంగికులు, తమతమ కళాకౌశలమును ప్రదర్శించి, సభాస్తారులను శ్రోతలకు మహదానందమును గలిగించిరి. మఱియు సంగీతశాస్త్రప్రవీణులు పలువురు ప్రముఖులు—స్త్రీలు, పురుషులు—ద్రావిడాంధ్రకర్ణాటాది దేశములనుండి సభకు విజయంచేసి శాస్త్రవిషయములగూర్చి యుపన్యసించిరి. వాని సారాంశముల గూర్చి చర్చలుగావించి సిద్ధాంతములుచేసిరి. రాగముల యారోహణావరోహణ లక్షణముల నేర్పాటుచేయుతరి పలువురు విద్వాంసులు ఆయారాగములయందలి కీర్తనలు పాడి గ గసంచారములను సరిగా విచారించిరి.

చర్చలపై నీక్రింది రాగములు పాడవలసిన పద్ధతి యిట్లు తీర్మానింపబడెను.

సంగీతపరిషత్సమావేశ ప్రారంభము, చెన్నపురి (20-12-31)




శ్రీ సి. పి. రామస్వామయ్యరుగారు, సభాప్రారంభకులు; శ్రీ పి. ఆర్. స్వామినాథ అయ్యరుగారు, గాయక శిరోమణి, గాయక మహాసభాధ్యక్షులు.

౧. రేవగుప్తిరాగము:—ఇది ౧౫వ మేళజన్యము.
ఆరోహణము:—స రి గ ప ద స
అవరోహణము:—స ద ప గ రి స

౨. చాళిరాగము:—ఇది ౧౫ వ మేళజన్యము.
ఆరోహణము:—స రి గ ప ద స
అవరోహణము:—స ని ద ప గ రి స

౩. భూపాలరాగము:—ఇది ౮ వ మేళజన్యము.
ఆరోహణము:—స రి గ ప ద స
అవరోహణము:—స ద ప గ రి స
సా-గతో పాడవలెను. ఇది వాడుకలో దక్షిణదేశమున కానము. ఉత్తరదేశమున కలదు.

౪. వసంతరాగము:—ఇది ౧౭ వ మేళజన్యము.
ఆరోహణము:—స గ మ ద ని స
అవరోహణము:—స ని ద మ గ రి స
చ-ద బహులము.

౫. లలితరాగము:—ఇది ౧౭ వ మేళజన్యము.
ఇందును చ-ద బహులముగ వాడబడుచున్నది.
ఆరోహణము:—స రి స మ గ మ ద ని స
అవరోహణము:—స ని ద మ గ రి స

౬. హిందోళము:—ఇది ౨౨ వ మేళజన్యము.
ఇందు చ-ద పాడుట ఎక్కువ వాడుక.
ఆరోహణము:—స గ మ ద ని స
అవరోహణము:—స ని ద మ గ స

౭. హిందోళవసంత:—ఇది ౨౨ వ మేళజన్యము.
గ కొంచవలయును. రి అల్పప్రయోగము. చ-ద వాడబడుచున్నది.
ఆరోహణము:—స గ మ ప ద ని ద స
అవరోహణము:—స ని ద మ గ రి గ స

౮. మార్గహిందోళ:—ఇది ౨౨ వ మేళజన్యము.
శుద్ధధైవతము పాడవలెనని కొందఱు చెప్పిరి. కాని చ-ద ఏ బహులమని ఎంచబడెను. అందుచే చ-ద ఈరాగమున కూడునని పెక్కులు తలంచిరి.

ఆరోహణము:—స రి గ మ ప ద ని స
అవరోహణము:—స ని ద మ గ స

౯. మాంజిరాగము:—ఇది ౨౦ వ మేళజన్యము.
ఆరోహణము:—స రి గ మ ప ద ని స
అవరోహణము:—స ని ద ప మ ప గా రి స
ప స ని స ప్రయోగము కలదు.

౧౦. రీతిగౌళ:—ఇది ౨౨ వ మేళజన్యము.
ఆరోహణము:—స గ రి గ మ ని ద మ ని ద ని స
అవరోహణము:—స ని ద మ గ మ ప మ గ రి స
స ప ని స ప్రయోగము కలదు. ప ద ప మ లో శుద్ధధైవతము కలదు.

౧౧. సారమతిరాగము:—ఇది ౨౨ వ మేళజన్యము.
ఆరోహణము:—స రి గ మ ప ద ని స
అవరోహణము:—స ని ద మ రి గ స
ఇందలి ధైవతము మారినది. శుద్ధధైవతము పాడుచున్నారు. మ గ స ప్రయోగము కలదు.

౧౨. ఆభేరిరాగము:—ఇది ౨౦ వ మేళజన్యము.
ఆరోహణము:—స గ మ ప ని స
అవరోహణము:—స ని ద ప మ గ రి స
ఇందు చతుశ్రుతి ద, శుద్ధ ద లు రెండును వచ్చుచున్నవి.

౧౩. దర్బారురాగము:—ఇది ౨౨ వ మేళజన్యము.
ఆరోహణము:—స రి మ ప ద ని సా
అవరోహణము:—స ని ద ప మ రి గా రి స
స రి గ మ ప్రయోగమును కలదు.

౧౪. నాయకిరాగము:—ఇది ౨౨ వ మేళజన్యము.
ఆరోహణము:—స రి మ ప ద నీ ద ప సా
అవరోహణము:—స నీ ద ప మ రి గా రి స
ఇందు ద రి ప్రయోగము కలదు.

౧౫. కానడ:—ఇది ౨౨ వ మేళజన్యము.
ఆరోహణము:—స రి గ మ ప మ ద ని స
అవరోహణము:—సని ప ద ని ద ప మ గా మ రిస
శుద్ధధైవతము లేదు.

౧౬. ద్విజావంతిరాగము:—

ఇది భాషాంగరాగము. ౨౮ వ మేళజన్యము

ఆరోహణము:— స రి మ గ మ ప ద స

అవరోహణము:— స ని ద ని స ని ద ప మ గ మ రి గ రి స రి ద ని స

ఇందు సాధారణ గాంధారమును కలదు. అల్ప ప్రయోగము. అంతర గాంధారము బహుళప్రయోగము.

౧౭. సురటిరాగము:—ఇది ౨౮ వ మేళజన్యము.

ఆరోహణము:— స రి మ ప ని ద ని స

అవరోహణము:— స ని ద ప మ గ ప మ రి స

మ గ రి స ప్రయోగమును కలదు.

సంగీతశాస్త్రమును గురించి ఇదివరకు ప్రచురింపబడినట్టియు, ఇకమీద ప్రచురింపబడునట్టియు గ్రంథములను పరిశీలించుటకుగాను సంగీతశాస్త్ర ప్రవీణులసంఘమును డి ఒక స్థాయిసంఘమును నియమింపవలెనని ఈ సభవారు సంగీత పరిషత్తువారికి శిఫార్సు చేయుచున్నారు.

ఇట్టి సంఘమునందు ఇతరులనుగూడ సభ్యులుగ జేర్చుకొనుటకు అధ్యక్షునకు అధికారమొసగబడినది. ఈస్థాయి సంఘమువారిచే నామోదింపబడిన గ్రంథముల మాత్రము పఠనీయగ్రంథములుగ నంగీకరింపవలసినదని, పఠనీయ గ్రంథనిర్ణయసంఘమువారిని గోరుచు, అట్టిగ్రంథములను మాత్రము ఉపయోగింపవలెనని ప్రజలకు ఈసభవారు సలహా యొసగుచున్నారు.

ఈమహాసభయందు చివరదినమున శ్రీమతి గౌరి యను నామె భరతశాస్త్రానుసారముగ భావాభినయములను చూపెను.

ఇట్టి మహాసభలయందలి ప్రదర్శనములు కేవలము బుధపోషకే కాక గాననాట్యకళలయందభిరుచిని గలిగించుటకును సహకారులగును. సంగీతపరిషత్తువారు పౌరుల కిట్టి సదవకాశమును గలిగించినందులకెంతయు నభినందింపదగుదురు.

---

కాలిఫోర్నియా (అమెరికా) సముద్రతీరమున స్నానమునకు వచ్చిన యువతులు ఆడిన గడియారపుటాట



చార్లెసు జిరార్డుగారు చిత్రించుచున్న మహాత్ముని చిత్రము



మహాత్ముని ఒక్కమారు చూచినను ఊహించి దీనిని చిత్రించుచున్నారు.

మిస్ క్లారలైటను అను నాంగ్లచిత్రకారిణి రచియించిన మహాత్ముని చిత్రము



ఆల్బనీ ప్రదర్శనమున ప్రదర్శింపబడెను.




చిత్రకారుడు: పి. వి. రామరావుగారు, పోలవరము.

## సహజ శిలా చిత్రములు




ఇవి తాళికోటవద్ద పాఱుచుండెడి డోణ్ (ద్రోణి) నదియందు దొరకెడి పలకగాళ్లపైనుండు సహజ చిత్రములు. ఈ వృక్షచిత్రము లెట్లేర్పడునదియు తెలియదు గాని చూచుటకు ఇంపై ఆశ్చర్యకరముగ నున్నవి.

---

# టైపు యంత్ర చిత్రములు



౭. తుంసీదాను



౮. ద్రాక్షపండ్లు పులుపు



౯. గృహాము

చిత్రకారుడు:—శ్రీ వి. సత్యనారాయణమూర్తి గారు

# రవీంద్రుని సప్తతిపూర్తిమహోత్సవము

గాంధిమహాత్ముని అక్కడ 'బాపూజీ' అంటారు. మనము, పోనీ, 'మహాత్ముడు' అంటాము; లేకపోతే 'గాంధీ' అంటాము, ప్రేమతో. టాగూరును 'గురుదేవ్' అంటారు అక్కడ. 'డాక్టరు—కవిసార్వభౌముడు—గారు' అని గౌరవించుకోవలసిన పదవిమాత్రమే పొంది ఊరుకున్నాడా ఆతను? మనప్రేమ పొదుగుళ్లలో నిండిపోయాడు. అతడు కవి కాక పోయినా సరే ఇంక, 'రవీంద్రు' డైతే చాలు. (మఱి ఏదైనా సరే, వేరుతనములో లీనమైన దైతే చాలు.) మనము తియ్యగా 'రవీంద్రు' డందాము. సరే—రవీంద్రుని...... ......

రవీంద్రుని సప్తతిపూర్తి మహోత్సవము మొన్న డిసెంబరులో వైభవము విరిసింది, కలకత్తా మహానగరములో. సర్ రాధాకృష్ణనుగారు అధ్యక్షత వహించారు. అనేకులు మహామహులు చేరి జయావహాత, జగన్మంగళ తాముద్రలో, కట్టినారు,—తమకే తెలియని సహజోత్సాహము పోసికొన్న మాత్రాన. ఈసంగతి యెవరికి తెలియదు? దానిని 'గుఱించి' చెప్పకుందాము.

ఈమహోత్సవము గౌరవము కోసమా,— వినోదము కోసమా,— చేశారు? ఆలాటిమాటలు మన కెందుకు పోనిద్దూ. రవీంద్రుడు 'మనవాడు'. మనమంటే ప్రపంచమంతాను,— సృష్టిఅంతాను. తక్కిన కారణాల నన్నిటినీ ఎవరైనా దాచేసుకుంటే, ఈ ఒక్క కారణము చాలు, ఇంతమహోత్సవమూ జరిగితీరుతుంది (ఆకారణాలు అసలు ఊడదియ్యడానికి ఎవరితరము కాని).

మనరవీంద్రుడు ఒకచిత్రమైన సృష్టి: కవి; గాయకుడు; చిత్రకారుడు; నటుడు; దివ్యవిగ్రహశాలి; 'సత్యం, శివం, సుందరమ్' అయిన కళావతారము!

ప్రవృత్తినంతనీ తనలో లీనముచేసుకుని గాంధి 'మహాత్ము' డయినాడు. అతనిని 'పూర్ణపురుషుడు' అన్నారు. టాగూరు తనను 'కవి' అంటే పూర్తి కానన్నాడు. ఆతని కవితలోని ప్రధానద్రవ్య మేదో తరిచి దానిలోనుంచి యేమన గలిగినా సరే. తన సకలచైతన్యవాహినులూ ఒక్క అగ్రానికి సాగి 'పురుషు' నిలో (Man) లీనమయినాయట. పరమేశ్వరుని పిలిచినప్పుడల్లా 'పురుషుడే' ఓయన్నాడట, సర్వావస్థలలోను— ప్రవృత్తిలోనూ, నివృత్తిలోనూ.

తనకు ముదిమిలేదన్నాడాయన. మనమేమో ఆయనకు డెబ్బైయేళ్లు నిండినాయని ఉత్సవము చేస్తున్నాము! అంటే, ఈవిధముగా ఒక ఆత్మజ్యోతిరమృతము పిండుగుడుస్తున్నాము! ఇంకొక డెబ్బైయేళ్లకు ఆయనంటే ఉంటగలడు, అందఱూ ఉండగలరా మఱి? కాని చిత్ర మేమిటంటే, ఆలా ఎప్పుడూ ఉండగలిగినవాళ్లే కూడి ఈమహోత్సవము పూనికపట్టారు! వాళ్లకే భాగ్యమనిపించింది: లోకాని కెంతటి భాగ్యపు పంటో!

కొం. జ.

# భారతీయ మహిళామండలి



శ్రీమతి బొడ్డపాటి సీతాబాయిగారు
బెజవాడ గౌరవ-మేజిస్ట్రేటుగా
నియమింపబడిరి.




శ్రీమతి చింతల కనకమ్మగారు



శ్రీమతి వెల్లంకి అన్నపూర్ణమ్మగారు

ఏలూరు పురపాలకసంఘమునకు సభ్యురాండ్రుగ ఎన్నుకొనబడినవారు.




# గ్రంథస్వీకారము

## విజయాశ్వ చరిత్రము

పద్యకావ్యము. గ్రంథకర్త: పురాణం పిచ్చయ్య కవిగారు, నెల్లూరు.

డెమ్మీ సైజు ౨౩౫ పుటలు. వెల రు. ౧-౮ అ.

---

## చింతామణి విషయపరిశోధనము

గ్రంథకర్త: వఝ్ఝలచిన సీతారామస్వామిశాస్త్రి గారు, విశ్వవిద్యాలయాంధ్రభాషావాఙ్మయపరిశోధక సభ్యుఁడు, చెన్నపట్టణ విశ్వవిద్యాలయ ప్రాచ్యవిద్యా పరిశోధనాలయము, చెన్నపట్టణము.

క్రౌను సైజు ౨౧౭ పుటలు. (వెల తెలియదు.)

---

## విమర్శ తరంగిణి

ప్రథమభాగము: విమర్శాదర్శక నడకుదుటి వీరరాజు పంతులుగారిచే అప్పుడప్పు డాయా పత్త్రికలకు వ్రాయఁబడిన విమర్శముల సంపుటము. వలయువారికి: వి. ఎమ్. ఆర్. బుక్ డిపో, పిఠాపురము, తూర్పు గోదావరి. క్రౌనుసైజు ౨౪౯ పుటలు. వెల ౧-౭.

---

## ప్రేమసుందరి

ప్రథమభాగము: నవల. బళ్లారి శ్రీ కృష్ణదేవ రాయ గ్రంథమాల తృతీయపుష్పము. గ్రంథకర్త: హనుమన్తు దేవదానముగారు; క్రౌను సైజు ౧౧౭ పుటలు. వెల ౭ అ. వలయువారికి: కల్లూరు అహోబలరావుగారు, మేనేజరు, భారతీభవనము, కౌలుబజారు, బళ్లారి.

---

## జంతుసంతాపము

ఖండకావ్యముల సంపుటము. కవి: కవితావినోద, డాక్టరు నిడమర్తి ఈశ్వరప్పగారు, బి. ఏ., యమ్. డి. బి., యఫ్. యమ్. హె-్. సి., శ్రీకాకుళము (గంజామ్). క్రౌను ౫౫ పుటలు. వెల ౮ అ.

---

## కావ్యామృతము

ప్రథమభాగము; ఖండకావ్యముల సంపుటము. కవి: అల్లంశెట్టి అప్పయ్యగారు.

క్రౌను ౬౯ పుటలు. వెల ౬ అ.

ప్రతులుదొరకు విలాసము: సైద్యావిద్వాన్ చదువుల నందికేశ్వరరావుగారు, పొందూరు (విశాఖపట్నం జిల్లా).

---

## కార్తీక మాహాత్మ్యము

గ్రంథకర్త: వేదుల సూర్యనారాయణశర్మగారు, కాకరపఱ్ఱు, తణుకుతా., పశ్చిమగోదావరి.

డెమ్మీసైజు ౩౫ పుటలు. వెల ౮ అ.

---

## ఆత్మజ్యోతి

గ్రంథకర్త: ముద్దా విశ్వనాథముగారు. ప్రకాశకులు: వ్యాసకుటీరమువారు, మేలుపాక, యలమంచిలి దగ్గఱ, విశాఖపట్నముజిల్లా.

క్రౌను ౩౨ పుటల సైజు ౧౩౬ పుటలు. వెల ౮ అ. ౬ పై.

---

## సందేశము

'బౌద్ధవాఙ్మయబ్రహ్మ' దుగ్గిరాల బలరామకృష్ణయ్యగారు. ప్రకాశకులు: నందివాడ ఫిర్కా రైతు సంఘము, నందివాడ, గుడివాడతా., కృష్ణాజిల్లా.

క్రౌను 32 సైజు ౭౦ పుటలు. వెల ౧ అ.

## నాయీబ్రాహ్మణ ప్రదీపము

పండిత రేవతీప్రసాదశర్మగారి హిందీగ్రంథమునకు అరిగపూడి వెంకట్రామచౌదరి, పాలడుగు శేషాచలాచార్యగార్లు కావించిన అనువాదము: బ్రహ్మచర్యాశ్రమం, కాటూరు, కృష్ణా.

క్రౌనుసైజు ౪౫ పుటలు. వెల ౫ అ.

## రాఘవశతకము

కృష్ణకుమారమిత్రులు రచించినది; స్నేహలతా కవితాసంఘము, కొల్లాపురం, జటప్రోలు సంస్థానం. వెల ౨ అ.

## సీతాదేవి శతకము

కర్త: రాయవరపు కొండలరావుపంతులు బాబుగారు. వెల ౫ అ. విలాసము: మారెళ్ల అచ్యుతరామశాస్త్రిగారు, ఛత్రపురం, గంజాం.

## అహింస

కీర్తనలు. కర్త: జాలా రంగస్వామిగారు, డెమ్మీసైజు 3౦ పుటలు. వెల ౪ అ. విలాసము జాలా కుప్పుస్వామిగారు, కంబాలచెరువు పేట, రాజమండ్రి.

## గాంధిమహాత్ముని అవతారమహిమ

సమకాలికుల అభిప్రాయములు. ౨౧ క్రౌను పుటలు. సత్యాగ్రహి ముద్రణాలయము, ఏలూరు.

## చర్ఖా గౌరీపూజ

ప్రకాశకులు: వైశ్యమహాసభవారు, బెజవాడ.

## ఆంగీరస పంచాంగములు

౧. బ్ర. శ్రీ. పిడపర్తి చినపూర్ణయ్య సిద్ధాంతిగారి కొమార్లు కల్యాణ వీరభద్ర, సుబ్రహ్మణ్య, కృష్ణమూర్తి, శేషాచల, కామేశ్వర-శాస్త్రులువారలు రచించినది. ప్రకాశకులు: మాదేటి సన్యాసయ్య అండ్ సన్సు, ఆంధ్రా బుక్కు డిపో, రాజమహేంద్రవరము.

౨. జ్యోతిర్విద్వాన్, (ఇత్యాది) ప్రొఫెసర్ గౌరావఝుల వేంకట సుబ్బరాయశాస్త్రిగారు గుణించినది. కారుమంచి, ఒంగోలుతా.

## కష్టజీవి

కవి: తంగిరాల రామనాథశర్మగారు, ఆంధ్ర సాహితీ గ్రంథాలయము, నెల్లూరు.

డెమ్మీసైజు: ౧౦౫ పుటలు. వెల రు ౧.

# పత్రికలు

## వైద్యకళ

మాసపత్రిక సంపుటము ౧, సంచిక ౧. అక్టోబరు, ౧౯3౧ (ప్రజోత్పత్తి సం. ఆశ్వయుజము), డెమ్మీసైజు ౫౨ పుటలు. వార్షికమూల్యము రు 3. విడిపత్రిక ౬ అ. సంపాదకులు: యమ్. అనంతాచార్యులుగారు, పత్తర్‌గట్టి, హైదరాబాదు (దక్కను).

## The Socialst

(రెండునెలల కొకసారి వెలువడునది.) తొలి సంచిక, సెప్టెంబరు-అక్టోబరు, 3౧. రాయలుసైజు ౭౫ పుటలు. సంపాదకులు: యస్. వి. శర్మగారు, ౪3, కృష్ణప్పనాయక అగ్రహారము, జి. టి. మద్రాసు. చందా: సాలుకు రు. ౫. విడిపత్రిక వెల రు. ౧.

## The New Age

అక్బరు ఆశ్రమము, ౧౫, యస్. ఐ. లైన్స్, కరాచీ. సంపు. ౧, సంచిక 3—డిసెంబరు, 3౧. రాయలుసైజు: ౭౧ మొదలు ౧౨౦ వరకు పుటలు. చందా: సాలుకు రు. 3, ఆరునెలలకు రు. ౧-౮అ. విడిసంచిక ౪అ.



బహూనాం జన్మనా మన్తే జ్ఞానవాన్ మాం ప్రపద్యతే;
వాసుదేవ స్సర్వ మితి సమహాత్మా సుదుర్లభః.

శ్రీకృష్ణుని రాయబారమువలెను గాంధి మహాత్ముని రాయబారమును నంతము నొందినది. ధర్మాత్ముల హితోపదేశములు నిరర్థకములైనవి. దుర్యోధనాదుల సంస్కారము సఫలమైనది. లేబరుపక్షనాయకుడైన రామ్సె మాక్డొనాల్డుగారు ప్రధానమంత్రి కవచమును ధరించి భీష్మ ద్రోణాదులవలెను సంగ్రామానలమును ప్రజ్వలింపజేయుట బ్రిటిషుసామ్రాజ్యసంస్కారఫలము. శాంతిప్రియుడైన గాంధి మహాత్ముని నిర్బంధించుట శ్రీకృష్ణపరమాత్ముని దుర్యోధనాదులు నిర్బంధింప దలపెట్టినటు లున్నది. సంగ్రామపరమైన సామ్రాజ్యాభిమానము శాంతిధర్మమునకు పరమశత్రువు.

ఆదికాలమునందువలెను వర్తమానకాలమునందును యుద్ధపర్వములు లేకను శాంతిపర్వము సాధ్యము గాకున్నది. సంగ్రామజ్వరమునందు శాంతిధర్మమునకు సంగ్రామధర్మమునకు గల ప్రతిష్ఠ గలుగకున్నది. శాంతిపూర్వకమైన ఆత్మసామ్రాజ్యస్థాపనమునకు సాక్రెటీసులు, ఏసులు, ప్రహ్లాదులు, ధ్రువులు, రామచంద్రధర్మరాజాదులు, శిబిబలిచక్రవర్తులు, గౌతమబుద్ధాదులు చేసిన బలిదానము లాత్మసామ్రాజ్య స్థాపనమునకు సాధనభూతములు గాజాలకున్నవి.

ప్రపంచశాంతిస్థాపనమున కేర్పడిన శాంతిసభలు, నానాజాతి సమావేశములు, ఆయుధవిసర్జనసభలు సంగ్రామబీజములను పోషించినటులు శాంతిబీజములను పోషింపజాలకున్నవి. ప్రపంచసంపదలును, శాస్త్రకళాపరిశోధనలును మానవధర్మసంహారమునకై వినియోగపడుచు ప్రపంచయాత్రను జీవజాలములకు దుర్భరము చేయుచున్నవి. ప్రపంచావృతమైన ప్రళయావస్థయందు శాంతిస్థాపనాచార్యుడైన గాంధి మహాత్ముని వినయపూర్వకమైన, న్యాయసమ్మతమైన, కార్యసాధనమైన ప్రార్థనలను విల్లింగ్డను ప్రభువు నిరాకరించుటయును ప్రపంచము నావరించిన విధినిర్ణయముగ నున్నది. బలీయమైన విధినిర్ణయమునకు పరిణామమును

కాలగర్భము విశదముచేయగలదు. వర్తమాన రాజ్యాంగవ్యవస్థలందు ప్రజ్ఞావాదమునకు గల ప్రతిష్ఠ ధర్మవాదమునకు గలుగకున్నది.

* * * * *

## ప్రజ్ఞావాదము

వర్తమానయుగమునందు సకలవ్యవస్థలందును, ముఖ్యముగను రాజ్యాంగవ్యవస్థలందు, ప్రజ్ఞావాదము పరమప్రమాణముగ నున్నది. లండనునందు గూడిన రెండవరౌండుటేబిలు సమావేశవ్యవహారము లీవిషయమును విస్పష్టముచేసినవి. ప్రజ్ఞావాదమునం దారితేరిన యాంగ్లేయరాజ్యాంగతంత్రజ్ఞుల ప్రసంగము లీవిషయమును భారతీయ ప్రతినిధులకును లోకమునకును విస్పష్టముచేసినవి. మాయమాటలతోను గాంధిమహాత్మునకు సంతృప్తిని గలుగజేయుటకు జేసినతంత్రములు విఫలములైనవి. సక్రమాందోళన వ్యాజముననను బ్రిటీషుఇండియా ప్రభుత్వ మవలంబించుచున్న నిర్బంధప్రవాహము గలుగజేయుచున్న మహాబీభత్సమునకు ఫలమును వర్తమానదురభిమానావస్థయందు నిర్ణయించుట దుస్తరము. ప్రభుత్వాధికారు లవలంబించుచున్న ప్రచండనిర్బంధవిధానమునకు ఫలము శాంతిస్థాపనమునకు బదులు దౌర్జన్యము సంప్రాప్తమగుట సహజము.

ప్రవృత్తియందు కర్మ కనురూప ఫలము గలుగును గాని వ్యతిరేకమైన ఫలము గలుగజాలదు. ముండ్లగింజ కెంతటి సుక్షేత్రమందైనను ముండ్లపంట్లు ఫలించును. దౌర్జన్య బీజములు శాంతిసస్యములను ఫలింపజేయ జాలవు. పాశ్చాత్యసంస్కారము ప్రసిద్ధమానముచేసిన సంగ్రామక్షేత్రములు మహాప్రళయమునకు సాధనములు గాగల విధమును గతించిన మహాసంగ్రామము లోకమున కనుభవసిద్ధముచేసినను ప్రపంచమునకు జ్ఞానోదయము గలుగకపోవుట ప్రపంచము నావరించిన దురదృష్టము. అహింసాసత్యప్రచారకుడైన గాంధిమహాత్ముని నిర్బంధము భారతీయ శాంతికిని, ప్రపంచశాంతికిని భంగమును గలుగజేయుట సహజము. శాంతిని గోరెడి బ్రిటీషు ఇండియా ప్రభుత్వములును, యూరపియనులును, భారతీయులును శాంతిబీజములను స్థాపించి శాంతిని బడయుట వివేకము. లాన్సుబరి, రస్సెలు గారులు, మాన్చెస్టరు గార్డియను డెయిలి హెరల్డు మొదలగు పత్రికలును చేయుచున్న హితబోధలు దురభిమాన పూరితులకు రుచించునని తోచదు.

* * * * *

## గాంధిమహాత్ముడు, కాంగ్రెసు, భారతీయులు

గాంధిమహాత్ముడును, కాంగ్రెసును భారతీయుల స్థిరసంకల్పమును తెలుపుచున్న విధమును దేశవ్యవహారములు విశదము చేయుచున్నవి. గాంధిమహాత్ముని నిర్బంధము స్వతస్సిద్ధముగను గలుగజేసిన హరతాళములు, విషాదము, సంభ్రమము భారతీయుల స్వాతంత్ర్యాభిలాషను విశదముచేయుచున్నవి. నిర్బం

ధములు గాంధిమహాత్ముని, కాంగ్రెసును నిర్బంధించినను 35 కోట్ల భారతీయులను నిర్బంధింపజాలరు. వర్తమానకాలమునందు అవలంబింపబడుచున్న ప్రచండనిర్బంధదండయాత్ర భారతవర్షమునకును, బ్రిటీషుసామ్రాజ్యమునకును నపాయమైన నష్టమును గలుగజేయుచు శాంతిస్థాపనమును దుర్లభముచేయునని, ప్రాజ్ఞులు గ్రహించినను, విల్లియర్సుగారివంటి దూరదృష్టి లేనివారుపూనిన క్రోధము వారు గ్రహింపజాలరని విశదము చేయుచున్నది. డెయిలి ఎక్స్ప్రెస్సుపత్రిక ప్రవాసశిక్షతోను సంతృప్తిని జెందక మహాత్మునకు ప్రాణదండనమునుగూడ విధింపగోరుచున్నది. ఒక గాంధిమహాత్మునకు ప్రవాసశిక్షను విధింపగలిగినను, 35 కోట్ల ప్రజలకు ప్రవాసశిక్షను, మరణదండనమును విధించుటకు వీలు లేదని వీరు గ్రహింపవలసి యుందురు.

భారతీయస్వాతంత్ర్యమునకును, ప్రపంచశాంతికిని గాంధిమహాత్ముడాత్మబలిదానమును జేయుటకు సిద్ధముగ నున్న విషయము సర్వత్ర తెలిసియున్నది. నిరంకుశాధికారులును, వారి పోషకులును, అనుచరులును నేమి చేసినను, గాంధిమహాత్ముని యాదేశానుసారముగను భారతీయు లందరును వర్తమానవిషమస్థితియందును శాంతికవచమును బూని, క్రోధోద్రేకములను విసర్జించి, భారతీయస్వరాజ్యసిద్ధికిని, ప్రపంచశాంతికిని పాటుపడవలసిన యవసరమును ప్రచండమైన నిర్బంధదండయాత్ర విశదము చేయుచున్నది. గాంధిమహాత్ముడు నిర్బంధింపబడునపుడు తెలిపిన సందేశమును భారతీయు లందరును పరమాపత్సమయమునందును త్రికరణశుద్ధిగ నారాధించి స్వధర్మనిర్వహణమును జేయుదురు గాత!

ప్రియమైన వల్లభభాయి! భగవంతుని ప్రేమ అపారము. సత్యమును, అహింసను ఎంతమాత్రమును ఎన్నడును గూడ వదలగూడదు. స్వరాజ్యముకొరకు అర్ధప్రాణములను సమర్పించుటకు వెనుదీయగూడదు—అని ప్రజలకు తెలుపవలెను.

ఈసారి సత్యాగ్రహము నడిపివేయుటకు దొరతనమువారు అతి కఠినములగు పద్ధతుల నవలంబించెదరు. మీరు వాటిని సహించవలెను. మీరు వెనుకంజవేయగూడదు. మీ పొలములను, ఇండ్లను, పశువులను వశపరుచుకొనగోరినచో సంతోషపూర్వకముగా నిచ్చివేయుడు. చెరసాలలకు వెళ్లుడు. లాఠీదెబ్బలకు తల యొగ్గుడు. తుపాకి గుండ్లకు రొమ్ములను ఎదురొడ్డుడు. మీ రెన్ని కష్టములను పడవలసి వచ్చినను మిమ్ములను బాధించినవారిపైని ఆగ్రహమును చెందకుడు. వారిని తిట్టకుడు. వారికి మేలునే కోరుడు. మీతో చేరనట్టి దేశస్థులకును, మీకు ప్రతికూలురుగా నుండు దేశీయులకును ఎట్టి హానిని కలిగింపకుడు. వారిపట్ల జాలిని బూనుడు. మీమూలముననే వల్లభభాయికి సర్దారుబిరుదము వచ్చినది. ఆ బిరుదమును మీరు భంగపరుపకుడు. మీరే అతనికి సర్దారు బిరుదము నిచ్చితిరి. దానిని దేశీయులందరును ఆమోదించిరి. ఇపుడు వల్లభభాయిగౌరవము మీ చేతులలో నున్నది. భారతదేశముయొక్క గౌరవముగూడ మీ చేతులలోనే యున్నది. సత్యాగ్రహము ప్రకటింపబడిన వెంటనే అన్ని దేశములవారును మీ చర్యలను శ్రద్ధగా గమనించుచుందురు. మీరు నిరంతరమును భగవంతుని ప్రార్థింపుడు.

ప్రజలందరును గాంధిమహాత్ముని సందేశమును పాలించి భగవదనుగ్రహమును బడయుదురుగాత!

Printed and Published by K. Nageswara Rao, at the Andhra Patrika Press, No. 7, Thambu Chetty St., Madras.




## మధురమైన విటమిన్ ఆహారము

మాల్టుసారమును, కాంతిమంతమైన పాలక్రొవ్వును ఏ. బి. సి. డి. విటమినులు పరివిగాగల యితరపదార్థములును, యిందు మిళితమై యున్నవి.

## అమూల్యమైనది

ఎదిగేపిల్లలకు ఆరోగ్యమునిచ్చుటలోను, దంతములను, యెముకలను, చక్కగా నిర్మించుటయందును, అసమానమైనది.

## రేమాల్టు

కృంగి కృశించెడివారికిని, పాండురోగము నకును, సామాన్యదుర్బలత్వము నకును, గర్భిణీసమయమందును, ప్రసవానంతరమును సరియైన పోషణ నొసగుటకును ఉపయోగించును.

# Bengal Chemical & Pharmaceutical Works, Ltd.,

## CALCUTTA.

మద్రాసు స్టాకిస్టులు:—యన్. దెశాయిగౌండర్ అండు కో, బందరువీధి,

చిల్లరప్రదర్శనశాల:—చైనాబజార్ రోడ్డు, రాజాగారిప్రతిమకు యెదురుగా.


భారతి
సచిత్ర మాసపత్రిక
సంపాదకుడు
గన్నవరపు సుబ్బరామయ్య
సంపుటము ౯. సంచిక ౨.
ఆంధ్రపత్రికా ముద్రాలయము-మద్రాసు.
౧౯౩౨



విషయసూచిక

త్రివర్ణచిత్రము: గొల్లడు.

సాధారణ చిత్రములు:—మద్రాసు సేవాసదన చిత్రములు ౮; పెట్రోలు నింపుటకు; బాటసారి; చెరువునుండి; మహారాణా ప్రతాపసింగు; శరన్నాట్యము; మనశ్శీలిని; సుక్కూరు ఆనకట్ట చిత్రములు ౬; ప్రపంచములోకెల్ల పెద్దగడియారము; ఇతర చిత్రములును.



గొల్లఁడు

చిత్రకారుడు: శ్రీ యం. మాఖన్‌దాసుగారు, నరసారావుపేట.




చెన్నపట్టణము. ఫిబ్రవరి ౧౯౩౨

సంపుటము ౯ ప్రజోత్పత్తి సంవత్సరము మాఘమాసము సంఖ్య ౨


# ధర్మపత్ని


విశ్వనాథ సత్యనారాయణ గారు, ఎం. ఏ.


పూర్వజన్మలలోఁ ద్రవ్విపోసుకొన్న - యొక మహాపుణ్యరాశి యి ట్లొరిగెనేమొ
తనయెడంద సర్వస్వ మంతఃప్రణీత - శుద్ధభావనాపూతమ్ము చూఱయొసఁగ.

తనబ్రదుకెల్ల నాకొఱకుఁ దాల్చిన యీపతిపత్నిమూర్తి తాఁ
దన కొకసృష్టి యున్నదని తాన యెఱుంగునో లేదో పాప మీ
అనుభవవీథిలో బ్రదుకు యజ్ఞపశుక్రియ నర్పణంబు సే
యనె చరితార్థతాసరణియంచుఁ దలంచిన దెంతదివ్యమో!

ప్రకటితయజ్ఞమూర్తి యిది భాసురజన్మము నిట్లుగా నలౌ
కికవినియోగరీతికి లగించిన దగ్ధమునందు మూర్తివో
లిక తనమూర్తి యెల్ల నవలీలగ నా తనకోసమైన జీ
విక కొదిగించి క్రొంజివురు విల్చిన దామరశాఖిశాఖికన్.

అతివిషమ మ్మనుయానదుర్ఘటము నాకోర్కి వెంబడి తనకోర్కి మలంచి
అత్యల్పభాగధేయవిదూషితంబు నా బ్రదుకు వెంబడి తన బ్రదుకు సాంచి
జ్యోతిరజ్యోతిరాశుభ్రాంతిహతము నాయాత్మ వెంబడి తనయాత్మం జోపి
గదపూర్ణ మయ్యు దీర్ఘమ్మైన నాదు నాయుస్సుతోం దనదునాయుస్సు తెచ్చి
నామనసు నే నెఱుంగనినాండె నన్ను - నదుముకొని వచ్చి నాజీవితాంతమునకు
నన్ననుసరించుకొంచు వెంటం బడి వచ్చు - నీతపోరాశిచేతం బునీతుండైతి.

భూమిజచే జగత్త్రయవిభుండు రఘూత్తమదివ్యమూర్తి, సౌ
దామనిచేత నీలజలదంబు, మధూజ్జ్వలకుల్యతోడిపాం
దామరచే మధువ్రతవతంసమునట్టుల పూతభావనా
శ్రీమహితాత్మ యీతరుణిచే మఱి నేనును ధన్యుండే సుమీ.

ఒకదేశమ్మని యొక్కదైవమని యేదో ధర్మమం చిట్టు లూ
రక ప్రాణమ్ములు చూఱయిచ్చెదరు వీరశ్రేణి లోకంబునం
దకలంక మ్మనపేతసాహసము నవ్యాజంబు నా నీదుజీ
విక కే నంజలిపట్టెదన్ విభుండ నై విజ్ఞుండ నై యుండియున్

# ఆంధ్రకవిత్వచరిత్రము

భోగరాజు నారాయణమూర్తిగారు,

(రెండవ భాగము) ప్రాఙ్నన్నయయుగము

(వెనుకటి సంచిక తరువాయి) ౭, ౮ శతాబ్దములలో వేఁగిదేశము

మతము, జైనమతమును భాష కన్నడభాషయును గాఁ బశ్చిమదేశమున వాతాపినగర మేలుచుండిన కర్ణాటచాళుక్యులు ౭-వ శతాబ్దప్రారంభమున వేఁగీకళింగదేశములు జయించి యొకకుటుంబమువారు తూర్పుదేశమునందే స్థిరపడిరి. ఈవివరము లన్నియు మఱియొకప్రకరణమునందు వివరింపఁబడును. పిఠాపురము, వేఁగీ మున్నగు పట్టణములు రాజధానులుగాఁ జేసికొనుచుఁ దూర్పుదేశమున స్థిరపడిన చాళుక్యరాజులకుఁ దూర్పుచాళుక్యులను వ్యవహారనామం బయ్యె. మఱియుఁ దత్పరిపాలితదేశ మాంధ్రదేశం బగుటచే నాంధ్రచాళుక్యు లనియుఁ బిలువఁబడుచున్నారు. ఈయాంధ్రచాళుక్యులలో మొదటిరాజు కుబ్జవిష్ణువర్ధనుఁడు. 'అఖిలజలధివేలావలయవలయితవసుమతీవనితావిభూషణం'బై పదునొకండవశతాబ్దమున నాంధ్రకవితాలక్ష్మికి క్షీరసాగరంబైన వేఁగీదేశము, ౭-వ శతాబ్దప్రారంభమునఁ గర్ణాటచాళుక్యుల పరిపాలనములోనికి వచ్చుసరి కెట్టిస్థితియం దుండెనో, తత్పూర్వ మేయేరాజు లెంతకాలమునుండి పాలించుచుండిరో, వారిభాష యెయ్యదియో, వారికతన నాదేశభాషయగు నాంధ్రభాష కేమైన మేలు చేకూరెనో లేదో, యానాఁటి యాంధ్రదేశములో నేయేభాషల కెంతవఱకు స్థానము లుండెనో, యన్యభాషలయం దాంధ్రభాష యెంతవఱకు సంక్రమించి యెట్టిరూపము నొందెనో, యానాఁటిప్రజలలో నేయేమతము లెంతవఱకు వ్యాప్తిచెందియుండెనో మున్నగు నంశము లాంధ్రసాహిత్యవిద్యార్థి ముఖ్యముగా గమనింపఁదగినవి. దేశకాలపరిస్థితులపైనే భాషాపరిస్థితు లాధారపడియుండును. కావున విష్ణువర్ధనుఁడు పట్టాభిషిక్తుఁ డగుసరికి వేఁగీదేశ మెట్లుండెనో తచ్చారిత్రకాంశము లిందు సంక్షేపముగాఁ బొందుపరచెదను.

## అప్పటియాంధ్రదేశస్థితి

ఆంధ్రదేశముతో సంబంధించిన రాజకీయ వాఙ్మయ మత కవితాదివిషయములలో దేనింగూర్చి వ్రాయ సమకట్టినను జరిత్రకారునకు వేఁగిదేశము విస్మరింపరానిది. ఇది తమిళులకు వెంగై దేశము. కర్ణాటకులకు వేంగీదేశము. తెనుఁగువారికి వేఁగిదేశము. ఈవెంగై వేంగీవేఁగిపదములు క్రమముగాఁ దమిళకర్ణాటాంధ్రభాషాపదములు. ఈపేరులను బట్టియే యీదేశమున కీమూఁడుభాషలతోడను సంబంధ ముండియుండునని స్ఫురించును. అయిదవశతాబ్దమునుండి యేడవశతాబ్దమువఱకు నియ్యది పల్లవరాజులపరిపాలనమం దుండెను.

పల్లవచాళుక్యప్రభువులకాలములలో నీదేశము దక్షిణమునఁ గాంచీపురమువఱకును, ఉత్తరమున మహానదివఱకును వ్యాపించినది. క్రీ. శ. ౬౩౩-వ సంవత్సరప్రాంతమున హ్యూనుత్సాంగను చీనాదేశయాత్రికుఁడు వేఁగి దేశమును జూడవచ్చి యప్పటియాంధ్రచాళుక్యప్రభువగు జయసింహవల్లభున కతిథియై తాను జూచిన యంశములను దనగ్రంథమునందు వ్రాసెను. అప్పటివేఁగిదేశమునకు మహాంధ్రదేశ మను పేరు కలదఁట. ఈదేశమునకు వేఁగినగరము రాజధానియఁట. భూమి సారవంతమై సస్యసమృద్ధి వహించియుండె ననియుఁ బ్రజలు చామనచాయగలిగి భయంకరస్వరూపులై యుండినను విద్యాసక్తు లనియు వ్రాసెను. మఱియు గంగులుఁ, గదంబులు, క్రూరులగు చోళులు దేశమును గొల్లగొట్టుచుండిన కారణమునఁ బట్టణముల జనసంఖ్య తక్కువగా నుండినట్లును, బౌద్ధులసంఘారామములు శిథిలములై భిక్షుకశూన్యములై యుండినట్లును గూడ వర్ణించెను.

## పూజ్యపాదుఁడు

ఈమహాంధ్రదేశమున నైదాఱుశతాబ్దములలో జైనమతము, కన్నడవాఙ్మయమును బ్రబలియుండెనని చెప్పఁదగిన నిదర్శనము లనేకములు గానవచ్చుచున్నవి. ౫-వ శతాబ్దాంతమువాఁడైన దేవనందిపూజ్యపాదుఁ డను జైనవిద్వాంసుఁడు రాజులయొక్కయుఁ బ్రజలయొక్కయు సమ్మాన మాశించి యీయాంధ్రదేశమునకు వచ్చెను. ఈపూజ్యపాదుఁ డప్పటి గంగరాజైన దుర్వినీతుని యాస్థానపండితుఁడు. దుర్వినీతునిశాసనములలోఁ బూజ్యపాదునిగూర్చి కొన్ని వివరములు గలవు. కన్నడకవిచరిత్రమును, గన్నడవాఙ్మయచరిత్రమును బట్టి యీజైనపండితుఁడు పాణినివ్యాకరణమునకు 'పాణినిశబ్దావతార' మనుపేర వ్యాఖ్యానము వ్రాసినట్లును, తాను స్వతంత్రముగ 'జినేంద్రవ్యాకరణ' మనుపేర నొకవ్యాకరణమును వ్రాసినట్లును, భారవి కిరాతార్జునీయమునందలి పదునైదవసర్గకు టీక వ్రాసినట్లును దెలియుచున్నది. దుర్వినీతుని శాసనములోఁ బూజ్యపాదుఁడు, "శబ్దావతారకార దేవభారతనిబద్ధబృహత్పథః" అనియు, "కిరాతార్జునీయపంచదశసర్గటీకాకారః" అనియుఁ బేర్కొనఁబడెను.

పూజ్యపాదునియాంధ్రదేశసంచారము వలన నాఁటియాంధ్రదేశమునందు జైనమతాభిమానులును, గర్ణాటభాషాపండితులు ననేకులుండి యుందురని యూహింపవచ్చును. ఒక్కయాంధ్రదేశమునందే గాక యీతఁడు కర్ణాటచోళపాండ్యమండలములయందుఁగూడ సంచరించెను. ఇన్ని దేశములయందును వాని కనేకశిష్యప్రశిష్యు లుండిరి. దిగంబరదర్శన మను జైనమతగ్రంథమునందుఁ బూజ్యపాదుఁడు తన శిష్యుఁడైన వజ్రనందిచే మధురానగరములో నొకతమిళసంగమును స్థాపింపఁజేసెనని చెప్పఁబడినది. ఈతమిళసంగము దిగంబరసమాజము. అప్పటిపాండ్యరాజులసమ్మతి లేకయే వారిరాజధానియందు దిగంబరసమాజస్థాప

నకుఁ బూజ్యపాదుఁడు సాహసించియుండఁడు. కావున నైదవశతాబ్దమునందలి పాండ్యరాజులును జైనమతాభిమానులే యనియు, నారాజులమాతృభాషయగు తమిళభాషయు జైనమతసంపర్కము కలిగియుండెననియుఁ జెప్పవచ్చును. ఒక్కపాండ్యదేశమునందే గాక పూజ్యపాదుఁడు తాను సంచరించిన దేశములయందెల్లఁ బ్రజలకును బ్రభువులకునుగూడఁ బూజ్యుఁడు, గురువు నయ్యె ననుటకు సంశయము లేదు. ప్రభుప్రజావర్గములకుఁ బూజ్యపాదుఁడు మతగురు వగుటచేతనే క్రమక్రమముగాఁ బూజ్యపాదనామము వ్యక్తినామము గాక గౌరవార్థసూచకమై గుర్వర్థమునందు రూఢిమైన దేమో? 'పూజ్యపాదులు,' 'భగవత్పాదులు'ననుపూజ్యార్థకవిశేషణములు నేఁటికిని మతగురువులకు నుపయోగింపఁబడుచున్నవికదా! జైనులు చిరకాలమునుండియు

"ప్రమాణ మకలంకస్య
పూజ్యపాదస్య శాసనమ్,
ద్విసంధానకవేః కావ్యమ్
రత్నత్రయ మిదం స్మృతమ్."

అనుశ్లోకమును దమకుఁ బ్రార్థనశ్లోకముగా నుపయోగించుచుండిరి. ఆంధ్రదేశము చిరకాలము జైనాక్రాంతమై యుండిన కారణమున నీయాచారము మనకు జైనులనుండియే వచ్చియుండు ననుట యాశ్చర్యము గాదు.

పాండ్యరాజులకుంబోలెఁ జోళరాజులకును దమిళభాషయే మాతృభాష. పూజ్యపాదుఁడు చోళదేశమునకుఁగూడఁ బోయినట్లు కర్ణాటకవిచరిత్రము చెప్పుచుండుటచే నతఁడా దేశమునకుఁగూడఁ దనమతమున కధికవ్యాప్తి గావించియుండును. అయిదవ శతాబ్దములో జైనమతమున కత్యున్నతదశ ప్రారంభమయ్యె నని చరిత్రకారులు వ్రాసినవ్రాఁతలంబట్టి యానాఁటిపూజ్యపాదుని మతవిజయములంగూర్చి మనము సంశయింపవలసిన పనిలేదు.

### బౌద్ధబ్రాహ్మణమతములు

ఆనాఁటి జైనమతమునకు బౌద్ధబ్రాహ్మణమతములు పరమశత్రువములై యుండెను. పూజ్యపాదాది మతబోధకులబోధలకు రాజులు వశులై జైనమతాసక్తు లగుచుండినకొలఁది బౌద్ధులు, బ్రాహ్మణులు నిరుత్సాహు లగుచుండిరి. ఈ రెండుమతములును స్నేహభావముతోడనే సంచరించుచు జైనమతము నెదుర్కొని యోడించుటకు విశ్వప్రయత్నములు సేయుచుండెను. కాని ప్రభువులప్రాపకమున జైనమతము దశదిశల వ్యాపించుచుండుటచేఁ దఱుచుగ నీరెండుమతములు పరాజయమే పొందవలసివచ్చుచుండెను. ఏయుగమునందైన సాధారణముగఁ బ్రభుమతమే ప్రజామత మగుచుండును గావున, రాజుల ననుసరించి తత్ప్రజలును జైనమతము నభిమానించి యవలంబించుచుండిరి. ఇట్లనివార్యము, దుర్నిరీక్ష్యము నైన జైనమతప్రాబల్యముచే బౌద్ధమతము క్రమక్రమముగ నిరాశ్రయమై, ౭-వ శతాబ్ద ప్రారంభమునాఁటికే క్షీణించుటచే బౌద్ధమతస్థుఁడైన హ్యూనుత్సాంగునాఁటి బౌద్ధమతపతనమును వర్ణించుటయు, విచారించుటయు జరి

గెను. బౌద్ధమతమునందువలె బ్రాహ్మణమతమునందును, జైనమతమునకుఁ బ్రబలశత్రుభావ ముండినను బౌద్ధమతమునకుఁ గలిగిన క్షీణదశ బ్రాహ్మణ మతమునకుమాత్రము కలుగలేదు. మన మింతవఱకుఁ బ్రసంగించుచుండిన నైదవశతాబ్దమునందలి జైనులు బ్రాహ్మణుల నెట్లు ద్వేషించుచుండిరో యీ క్రిందివాక్యములవలనఁ దెటపడఁగలదు:

* The Jains of the beginning of the 5th century, in their works treated the Brahmans with marked disrespect, saying e. g. that a Chakravarti, a Baladeva or a Vasudeva could not be born in a Brahman or other mean family, but received birth in a noble family, a Kshatriya family, as in the family of Ikshvaku or the Harivamsa. Further proofs of their predilection for the Kshatriyas are Gunavarma's Harivamsa, Pampa's Ramayana, and the quotations from the works of all the old Jaina authors, as they appear in Nagavarma and Kesava (as shown above) in which frequent allusions to Kshatriyas of the Mahabharatha, Ramayana and Southern dynasties occur...........".

పాండ్యచోళప్రముఖులైన భూనేత లనేకులు జైనమతమునకుఁ జేయూఁత యొసంగుచుండ, నాకాలమున బ్రాహ్మణమతాభిమానులైన పల్లవరాజులు విజృంభించి మహాంధ్ర దేశము నాక్రమించిరి. దానంజేసి యంతవఱకు జైనమతముతో ఘోరసంగ్రామ మొనరించుచు నోటమి వాటిల్లుట శంకించుచుండిన బ్రాహ్మణమతము పరాజయభయంబు వాసి నూతనోత్తేజము వహించినది. ఆకాలమునఁ జిన్నచిన్నమండలములు కక్షంతులై తమలోఁ దాము నిత్యము పోరాడుకొనుచుండిన రాజులకలహములకుఁ జరిత్రకారులు రాజకీయ కారణములను మాత్రమే వ్రాయుచుండినను, మతసంబంధములైన కారణములు గూడ నుండియుండవలయును. దీనికి జైనచరిత్రమె మనకుఁ దార్కాణము. జైనులు కేవలము తమమత వ్యవహారములతోఁ దృప్తి వహింపక, రాజ్యాంగవిషయములయందుఁ గూడ జోక్యము కలిగించుకొని తమకు విరోధమతస్థులైన రాజుల నెదిరించుచుండిరి. శత్రుహస్తగతమైన గాంగవాడిరాజ్యమును గంగరాజులకు మఱల నిప్పించినవారు జైనులే యను ప్రాచీనకథ కలదు.

### పల్లవుల చరిత్ర

ఐదవశతాబ్దమునందు మహాంధ్రదేశాధీశ్వరులైన పల్లవరాజుల పరిపాలనము పదునొకండవశతాబ్దమునందలి రాజనరేంద్రుని పరిపాలనముతోఁ గొన్ని విషయముల సరిపోలుచున్నదని యాంధ్రసాహిత్యవిద్యార్థి తెలిసికొనవలసియున్నది. ఆసామ్యము నొకింత గుర్తించుటకే యాకాలమునందలి రాజులు, వారి భాషలు, వారిమతములు మున్నగువిషయముల నీమాత్రము ప్రసంగింపవలసివచ్చినది.

* An Essay on Kanarese Literature, By F. Kittel.

ఆంధ్ర దేశవాఙ్మయచరిత్రమునందును, ఆంధ్ర దేశమత చరిత్రమునందును రాజనరేంద్రుని పాలనమున మనము ముఖ్యముగా గమనింప వలసిన మహత్తరవిషయములు రెండు. మొదటిది యాంధ్రకవితోద్ధరణము. రెండవది బ్రాహ్మణమతప్రతిష్ఠ. ఆంధ్రమహాభారతకావ్యమూలమున నీరెండుమహాకార్యములును రాజరాజుచే సమగ్రముగ నిర్వహింపఁబడినవి. పల్లవరాజుల దానశాసనాదికములఁ బరిశీలించుచో, వారిభాషయు నాంధ్రభాషయే యై యుండినయెడల, రాజరాజునాఁ డాంధ్రకవిత్వమునకుఁ గలిగిన మహోన్నతి నైదవశతాబ్దమునఁ బల్లవులనాఁడే కలిగియుండునని మనకు స్ఫురింపక మానదు. కాని పల్లవులది తమిళభాష. తమిళపురాణగ్రంథములయందు వీరు 'పల్లవార్' అని వ్యవహరింపఁబడుచుండిరి. బ్రాహ్మణమతప్రతిష్ఠయందు మాత్రము వీరు రాజరాజునకు లేశమును దీసిపోరు. ఒక్క విషయమే గాక రాజరాజు తన కిష్టమైనవని చెప్పుకొనిన వెల్లఁ బల్లవరాజులకుఁగూడ 'కరం బిష్టంబు లై' యుండెను.

"ఇవి యేనున్ సతతంబు నాకుఁ గరం
బిష్టంబు లై యుండుఁ బా
యవు భూదేవకులాభితర్పణమహీ
యఃప్రీతియున్ భారత
శ్రవణాసక్తియుఁ బార్వతీపతిపదా
బ్జధ్యానపూజామహో
త్సవమున్ సంతతదానశీలతయు శ
శ్వత్సాధుసాంగత్యమున్."

ఈసందర్భమునఁ బల్లవరాజులచరిత్రాంశము లించుక పరిశీలించునెడ నీవిషయము లన్నియుఁ దేటపడఁగలవు. ఆంధ్రదేశచరిత్రములోఁ బల్లవులచరిత్ర మిక్కిలియగాధమైనది. మఱియుఁ గడు విచిత్రమైనది. వారిపుట్టుపూర్వోత్తరములను దెలుపుటలోఁ జరిత్రకారులు భిన్నాభిప్రాయు లగుచున్నారు. అయిదవశతాబ్దమువఱకు వీరిచరిత్ర మనేకసంశయముల కాస్పదమైయున్నది. అయిదవశతాబ్దము తరువాతఁగూడ సంపూర్ణముగాఁ దెలియునని చెప్పుటకు వీలు లేదు. అయిదవశతాబ్దము వఱకును గల పల్లవశాసనములు ప్రాకృతభాషారచితములు. తరువాతివానిలోఁ గొన్ని కేవలసంస్కృతభాషాకలితములు. కొన్ని సంస్కృత తమిళభాషామిశ్రములు. పల్లవులనియు, విష్ణుకుండినపల్లవులనియుఁ బల్లవరాజులు రెండుతెగలవారు. విష్ణుకుండినపల్లవులు కాంచీపురాధీశ్వరులై యుండిరి. ఈ రెండుతెగలవారును బంధువులనియు, మిత్రులనియుఁ జరిత్రలవలనఁ దెలియుచున్నది. మఱియు వీ రొక్కకుటుంబమువారుగానే వ్యవహరింపఁబడుచున్నారు. ఏకకుటుంబ మను భావముతోడనే పల్లవులచరిత్రాంశములను నే నిందు వ్రాయుచున్నాను.

ఆకాలపురాజులు కొందఱు సూర్యవంశజుల మనియుఁ, గొందఱు చంద్రవంశజుల మనియుఁ జెప్పుకొనుచుండఁ బల్లవులు తాము భారతవీరుఁడైన యశ్వత్థామసంతతివార మని పెక్కుశాసనములయందు వ్రాసికొనిరి. మొ

దట మహావిష్ణునాభికమలమునుండి బ్రహ్మ యుదయించెనఁట. పిమ్మట బ్రహ్మ కంగిరసుఁడు పుట్టెనఁట. అయ్యంగిరసునకు బృహస్పతియు, బృహస్పతికి శంయువు, శంయువునకు శాంయ వుఁడు వరుసగా భరద్వాజుఁడు, వానికి ద్రోణుం డును, ద్రోణున కశ్వత్థామయు, నశ్వత్థామకుఁ బల్లవరాజును గ్రమముగా జనించిరఁట.

'ఆసీ దంబుజనాభనాభికమలా
ద్బ్రహ్మ తతో ప్యంగిరా
స్తస్మా ద్దేవగురు స్తత శ్శుభమతి
శ్శంయు స్తత శ్శాంయవః,
తస్మా త్కుంభసముద్భవః స్మరరిపో
ర్ద్రౌణి స్తతోంశః క్రమా
దస్మా ద్విస్మయనీయకీర్తి రఖిల
క్ష్మావల్లభః పల్లవః.'

ఇట్లు పల్లవులు బ్రాహ్మణవంశజాతు లైనను క్షత్రియధర్మమునే యవలంబించి, తాము క్షత్రియులమనియే చెప్పుకొనుచు, క్షత్రియజాతిసూచకమైన వర్మశబ్దమును దమ నామాంతములయందుఁ జేర్చుకొనుచుండిరి. ఆకాలపురాజులలోఁ బాండ్యరాజులకుఁ బల్లవ రాజులు ప్రబలశత్రువులై యుండిరి. పాండ్య రాజులు తాము పాండవులసంతతివారమని చెప్పుకొనుచుండిరి. అశ్వత్థామసంతతివారును బాండవులసంతతివారును ఆకాలమున ఘో రముగఁ బోరాడుచుండుటచేఁ గ్రీస్తుపూర్వ మేనాఁడో జరిగిన మహాభారతయుద్ధము క్రీ. శ. అయిదాఱుశతాబ్దములలోఁ గూడ జరుగు చుండెనా యని స్ఫురించును. పాండవబల మును నిర్మూలించి యుపపాండవుల సంహరిం చినవాఁ డశ్వత్థామ యగుటచేత, పాండవ వంశజులైన పాండ్యరాజులతోడి శత్రుత్వకార ణమునఁ దా మశ్వత్థామసంతతివారమని పేరు పెట్టుకొనిరే గాని, నిజముగాఁ బల్లవు లశ్వ త్థామసంతతివారు కారని యాంధ్రులచరిత్ర మూవిషయము నాక్షేపించుచున్నది.

* "వీరు (పాండ్యరాజులు) బ్రాహ్మణు లకుఁ బ్రతిపక్షులుగ నుండిరి. కనుక బ్రాహ్మ ణులు తఱుచుగఁ బల్లవులపక్షమున నుండుచు వచ్చిరి. పల్లవులశాసనములను వ్రాసినవారు బ్రాహ్మణులే. తమపక్షమును బూని తమ్ము నాదరించుకొఱకు, వారిని బ్రహ్మకులమని, భారద్వాజగోత్రులని, అశ్వత్థామసంతతియని, పల్లవరాజవంశమని వారల కుల్లాసము గలుగు నట్లుగఁ బొగడి యిట్టి వెన్నియో కల్పించి వారలను వశపఱచుకొనిరి. బ్రాహ్మణులు తమకార్యమును సాధించుకొని లాభమును బొందియుందురు. అశ్వత్థామ యాగ్రహమును జూపి విజృంభించినతోడనే భీమార్జునకృష్ణులు భయంపడి పిఱికిపందలై యాయుధములను విడిచిపెట్టి చేతులు జోడించుకొని నిలంబడిరని కాసకుడితామ్రశాసనమునం దశ్వత్థామపరా క్రమము వర్ణింపఁబడినది. ఇట్టివర్ణన పల్లవు లను సంతోషపెట్టుటకుఁ గాక మఱియెందు లకు ?"

* ఆంధ్రులచరిత్రము, పే. ౨౦౩-౨౦౪.

ఈయూహా యుక్తియుక్తముగను సహేతుకముగను గన్పట్టదు. ఇందువలన నానాఁటి బ్రాహ్మణులు ముఖస్తోత్రపాఠకులనియు, నట్టి స్తోత్రపాఠముల కుప్పొంగుచుండిన పల్లవరాజులు తమ వంశవృత్తాంతమైన నెఱుఁగని యజ్ఞానులనియుఁ జెప్పవలసివచ్చును. "భారతమునుబట్టి యశ్వత్థామ బ్రహ్మచారియని మన మెఱుఁగుదు" మనియు, "అశ్వత్థామకు భార్య లేదు గనుక నప్సరస నొకదానిని ముడిపెట్టి" రనియు నాంధ్రులచరిత్రము చెప్పుచున్నది. అశ్వత్థామ యవివాహితుఁ డగుటచేతనే యప్సరఃకాంతాసందర్శనజాత రేతఃపాతము పల్లవరాజోత్పత్తికి హేతుభూత మయ్యెను గాని, యతఁడు వివాహితుఁడే యైనయెడలఁ బల్లవరాజుతల్లి గీర్వాణి గాక బ్రాహ్మణి యనియే చెప్పఁబడియుండును. అశ్వత్థామతండ్రియైన ద్రోణుఁ డెట్లు జన్మించెను? భరద్వాజుం డొకానొకయప్సరోంగనం గాంచి కామరాగాంతరంగుం డగుటచేతనే కదా తత్కుమారుఁడగు ద్రోణుఁడు కుంభసంభవుఁడు కావలసివచ్చెను! తండ్రియే గాక, యశ్వత్థామతల్లియైన కృపియు, మేనమామయగు కృపుఁడును గూడ బ్రహ్మచారియైన శరద్వంతుని వీర్యమున జనించినవారలే కదా!

భారతము:—

"ఆతరుణికటాక్షేక్షణ
పాతము గౌతమున కపుడు పటుబాణధనుః
పాతిముతోడన రేతః
పాతము గావించె రాగపరవశుఁ డగుటన్.

"దాని నెఱింగి శరద్వంతుం డయ్యాశ్రమంబు విడిచి చని యొండుసోటం దపంబు సేయుచుండె నవ్వీర్యం బొకశరస్తంబంబున ద్వివిధంబై పడిన నం దొకకొడుకును, గూఁతురుం బుట్టిరి."

వీరికే కృపియుఁ గృపుఁడు ననునామంబు లయ్యె. కావున భారతమునుబట్టి యశ్వత్థామ బ్రహ్మచారి యనువిషయ మొక్కటియే గాక యశ్వత్థామవంశమున వానితల్లియుఁ, దండ్రియు మున్నగు ననేకు లప్సరోంగనల సందర్శించిన బ్రహ్మచారులకే జన్మించినవా రను సంగతికూడ మన మెఱుంగవలసినది. అట్టియెడ నశ్వత్థామకుఁగూడ నట్టిసంతానము కలుగుటలో నేమియాశ్చర్య మున్నది? *

---

* ఆంధ్రులచరిత్రమునం దిట్టి యాక్షేపణము గావించినను మ. రా. రా. శ్రీ చి. వీరభద్రరావుపంతులుగారు, రాజరాజనరేంద్ర పట్టాభిషేకసంచికయందుఁ దాము వ్రాసిన 'చాళుక్యుల కులప్రశంస' యనువ్యాసములో, "పల్లవులు భారద్వాజగోత్రీయుఁడైన ద్రోణపుత్రుఁడు అశ్వత్థామకు నప్సరసయందుఁ బుట్టిన పల్లవునియొక్క సంతతివారు" అని యంగీకరించిరి.

# భల్లటశతకము

చిలకమర్తి లక్ష్మీనరసింహము గారు

[ వెనుకటి సంచిక తరువాయి ]

మిగుల సోగలై తెల్లనై మెఱయుగుణము - లబ్జమా! దాఁచ నేటికే? హా! తెలిసెను,
పాములక్ష్మి మోగోనములఁ జూడఁగానె - యడుగు వెట్టదు నీయింట నతిభయమున.

జలవాసవ్యసనంబు లేదు, బురదన్ జన్మంబు నుంబొంద, వు
జ్జ్వలరత్నప్రభఁ జూఱలాడఁగల మైచాయ న్వెలుంగొందు, దో
స్థలపంకేజమ! కాని, పాపువిధి హృద్దౌర్బల్యమున్ మెండుగా
సలిపెన్, నీ కటుగాని దో సిరికి వాసంబీవెట్లై యుండవే.

బాటలోనున్న చెట్టెక్కి - భయము లేక - యీలపురుగు కూయునుగాక చాలసేపు
నిఖిలదిక్కుల శబ్దంబు నిండఁజేయు - శంఖమే మాననీయంబు జనులకెల్ల.

శంఖమన నస్థిభేదమే, జంతువులను - జంపియో చీల్చియో దానిసంగ్రహింతు
రనుచు శంఖమూఁదరు కొంద అయినఁదాన-స్వాదుమంగళస్వనములే వచ్చుచుండు.

చివురుల కనువగుపూవులు, - పువులకు ననువైనసుఫలములు, ఫలములకుం
దవు సులభారోహముగల - యవనీజము లెందుఁబోయె మ్మా, చెప్పుమా.

చందనమహీజమునకుఁ బుష్పములు సేయఁ గా వృథాశ్రమ పడలేదు కమలగర్భుఁ;
డదియ తగు స్వరూపమునకుననువుగాని - పుష్పమేటికిఁ జందనభూజమునకు?

పొడుగుకొమ్మ లాకులు ఫలంబులును గలిగి - భానునిప్పులనాఁపు కల్పతరు వుండ,
నీడఁగోరువాఁ డెవఁడైన నిలుచునొక్కొ! - జీర్ణలతక్రిందఁ; బశువైనఁ జేయదట్లు.

పాము లొండొంటిఁ బెనఁగొని పాదుకొనియె-సంకెలలువోలె జడమగు చందనమున,
సందుచేత నెకాఁబోలు నాకుజమున - లేవు తావులీనెడుపువుల్, లేవు పండ్లు.

లలితవస్తువులకు రక్షవలయుఁ గాన - సైఁపవచ్చును బాములఁ జందనమున
ఖదిరకుజమ! నీయందంబుఁ గావనొక్కొ - ముండ్లుదాల్చితి వారులు నిన్నుముట్టకుండ.

# మద్రాసు సేవాసదన చిత్రములు



౧. సేవాసదన ప్రధానభవనము

ముండ్లతోనిండునామూలాగ్ర మంగంబు, తావియించుక లేదు పూవులందు,
నపనయింపఁగఁజాల దాయాసమును ఛాయ, పండు లాఁకలిదీర్పఁ బనికిరావు,
ఆర్యసంగతియులే దవిమెల్లనటుఁనుంచి తుమ్మచెట్ట! విను నీదుర్గుణంబు
పండినచెట్లఁ గాపాడునెపంబున సిద్ధమయ్యెదవు కంచెవయి నీవు.

అనుచితమైనయట్టికని యవ్విధిపూవులు, పండ్లుఁ జందనం
బున కిడకుంట, నట్టిడకపోవుట కేమికతంబొ, కాని యి
చ్చినయెడ మొగ్గ తోఁచఁగనె చేతులఁబూని మహాకుఠారముల్
జనములు దానిఁ గూల్తురని లజ్జిలుచుంటిమి మేము పెల్లుగాన్.

శ్రమచే పాంథులు తిట్టుచిట్లకును భ్రాంతంబైనయాతాళవృ
క్షము నూరేండ్లకుఁ బండ్లుపండు, నవి మెక్కన్ లాభమేముండు, న
య్యామృతంబుం బలెఁ జావులేనటులఁ జేయంజాలునా, కానివో
నమలంబైనరసాయనంబువలె దీర్ఘాయుస్సుఁ జేకూర్చునా?

కడుదాహమును బొందునెడ మీకుఁ జెలి, చంద నమహీజమయ్యయో! నఱుకఁబడియె,
నద్దానఁ జిరభోగ మనుభవించినమీరు మఱచి యయ్యది, యొందఁబఱచి రపుడు,
క్రూరదంష్ట్రాగ్రిమాగ్నులఁ జెట్టు నఱకిన యన్నిచుఁ గాల్చకయున్న మానె,
ఫణులార! చెట్టుతోఁబాటు తుత్తునియలై మీరును నశియించిపో రదేమి?

ఇదిసంతోషమొ, కాకనాదరమొ - యెంతేలోభమో ద్వేషమో,
మదిచాంచల్యమొ, పాడుదైవమ! యసామర్థ్యంబొ, యేమో, సుఖ
ప్రదపూగందపుమ్రానికిన్ దదనురూపంబైనయాపుష్పసం
పదయున్ సత్ఫలవృద్ధి నీవు కలిగింపంగూడదో చెప్పుమా.

అనుఁగా, చూతమ! సైఁచుకొమ్మెటులొ శాఖాకర్షణక్షోభభం
జనముఖ్యాపదలన్, స్వయంకృతము దోషంబిందు, నీవేటికిన్
జననంబొందితి వాచతుష్పథమునన్, సచ్ఛాయలీ నేల, పం
డ్లను నీవేటికిఁ దాల్పఁ, జేతులకు నంద న్వంగిపోనేటికిన్.

అవని సన్మూలకంబు నత్యున్నతంబు సచ్ఛాయంబు సన్మార్గసంస్థిత! మగు
తరువాశ్రయింపంగఁ దగునంచు విని బాటసారి తాళద్రుమచ్ఛాయఁ జేరె,
మనుజుని తెల్వి యీమాత్రంబ, యది నేఁడె, పండునో, గాకెల్లి పండునో, మఱి
యేనాఁడు పండునో యెన్నఁడుఁబండదో శక్యమే యెఱుఁగ? నీశ్వరుఁడె యెఱుఁగు,

పురుషాయుస్సుగతించెఁ, గాయ మఖిలంబుఁ జీర్ణమైపోయె,దు
ర్భరమీ మేను క్షణంబు నిల్వ,దిఁక మత్ప్రాణంబు నీపాద మా
కరణిం గొల్వ శుభంబునీకుఁ, గనుమింకన్ వృద్ధి, లే దెట్టితోం
దర, మాపుత్త్రులు పౌత్త్రులో ఫలములందన్ వచ్చునో సాలమా!

ఇది స్వల్పంబగుమబ్బు చూతిమట, మొగ్గేమానోయంచున్ గిరుల్
మదమేపార నుపేక్షచేసె, సచివుల్ మాన్యుల్ ప్రబోధింప, న
య్యది నానాఁటికిఁ బెద్దదౌటఁ బిడు గత్యంతోగ్రమై రాలె, నా
పదగల్గెన్, ఘనవైరిచేత దహియింపంగాఁబడెన్ శైలముల్.

ఇది విద్వాంసులకెల్ల ధ్యేయమగు సుమ్మా యోరి యుత్పాతకో
యద! ఈదుష్కరకార్య మన్యుల కసాధ్యంబౌఁ, దగున్ నీకె రా
ల్చెద వెన్నో పిడుగుల్ సుఖప్రదములౌ క్షేత్రాళిపై, ధాత్రి కా
పదగాఁ గానలపై నెడారులపయిన్ వర్షింతు వొక్కుమ్మడిన్.

జలదమ! నీదువృష్టుల నిజంబుగఁ గొన్నిమృగంబులున్ బలుం
గులు మఱికొన్ని జంతువులు గ్రోలె జలంబు, శమించె దాహమున్
ఫలరహితంబు లీచవటిపఱ్ఱులమాట దలంప వెందుచె
మలమల మాడియున్నవిసుమా యవి, మున్పటియట్లె చూడుమా

జలధి! పానాచమనయోగ్యములు జలాశయంబులని రోసి నినుఁ జేరుసతనిమెదుట
నధమకృత్యంబుల కుపయోగ్యంబులైన – నీజలముఁ జూచి పొందవే నీవు సిగ్గు.

ఎఱుఁగుదు రంగనల్ శిశువులేనియు వార్ధిజలం బపేయమై
తఱుగక రక్షితంబయి యథాస్థితి నున్నదటంచు,నట్టిచో
వెఱపులు గొల్పనేటి కిఁక, భీకరదంష్ట్రలుగల్గునట్టివా
శ్చరములతోడఁ గూడుకొని సంద్రము నైజతరంగపంక్తితో.

జలనిధి! నీమహత్త్వమును జాటుకొనంగ మహోగ్రగర్జనల్
సలుపుచుఁ గర్ణపీడనములం బొనరించెదవేల మాటికిన్
కలశమునందుఁ బుట్టినయొకానొకమౌని జలంబు ద్రావరాఁ
గలిగెనె నీరు? వానిచులుకంబును నింపుటకైన నీకడన్.

నేను జగత్త్రియింగలుగునీటికినెల్ల నిధానమంచు నెం
తేనియుఁ బొంగుదో జలధి! యీజలమేగద నీదుశక్తి, య
న్నా! నినుఁగ్రోల్చె వేలగిరినాథుఁడు పెక్కుయుగాలు, దాని దా
వానలమార్పవైతివని యాగిరి యెంతగఁ గుందఁచున్నదో.

అలుగక యాలకించునెడ నంబుధి! ప్రశ్న మొకండువైతు, మా
ర్వలుకక యుత్తరంబిడు, పిపాసను జెందినబాటసారి యా
శలవిడి వేడియూరుపు లెసంగఁగ నీకడ నిల్వ, సప్లు నీ
యలమట యెంత హెచ్చొ బడబానలతాపముకన్నఁ జెప్పుమా.

వినిశితం బగుఁట్టిసాధనముతోఁడ-నంతరముదాఁక భేదింపుమయ్య, నీవు,
జడమయిన యాస్ఫటికమణి శంక లేక-యెంతగా నుండునో దానికాంతిఁ జూడు.

ఓసి చింతామణీ! వంత నొందఁబోకు-తగినప్రభు వౌదలను నిన్నుఁ దాల్పఁడనుచు,
నిఖిలసౌభాగ్యబీజమానిన్నుఁ దాల్చు-పున్నెమునుగన్నమూర్ధంబు పుడమి లేదు,

---

# బసవపురాణము వెల 2-8-0

గ్రంథకర్త:—పాల్కురికి సోమనాథకవి　　　　పరిష్కర్త:— వేటూరి ప్రభాకరశాస్త్రి గారు

పంద్రెండవ శతాబ్దమున వెలసిన శైవమతప్రతిపాదకమగు ద్విపదకావ్యము. ఇందు శైవ మతోద్ధారకు డగు బసవేశ్వరునియు, తత్పూర్వులు, తత్సమకాలీనులు నగు శివభక్తులయు చరిత్రములను సరసముగను, పాఠకులు మనసుకరగి తన్మయులగునట్లుగను కవి వర్ణించినాడు. గ్రంథమున మృదుమధురము లగు జానుదెనుగు పలుకుల జాలువార్చి రచనమున ముద్దులు గుఱిపించినాడు. గ్రంథము భిన్నభిన్న మండలములకు జెందిన పెక్కు తాళపత్రమాతృకలతో సరిచూచి పరిష్కరింపబడినది. పాఠాంతరములు సూచింపబడినవి. పరిష్కర్త రచియించిన అమూల్యమగు పీఠిక (129 పుటలు) ఇందుగలదు. ఆకాలపు టపూర్వసారస్వతచారిత్రకవిశేషముల లెక్కకు మిక్కిలిగ నందు పరిష్కర్త యేర్చికూర్చినారు. విద్యార్థిలోకమునకు, ఆధునిక కవికుమారులకు నిది యత్యంతోపకారకము.

మేనేజరు: ఆంధ్రగ్రంథమాల, నెం. 7, తంబుశెట్టివీథి, జి. టి. మద్రాసు.

## ఉ ప రి చ రుఁ డు

హిందువులకు వేదము ప్రామాణికము; విశ్వాసార్హము. వేదవాక్య మెట్టివారికిని ననుల్లంఘనీయము. వేదాంశముల నంపఱును శిరసావహింపవలసినదే. కాని వేదార్థము సామాన్యముగా దురవగాహము. అది యందఱకును దెలియునది కాదు. వేదార్థమును సకలజాతుల వారును గ్రహింప ననువగువిధమున వ్యాసమహర్షి శ్లోకరూపమున సులభశైలితో సంస్కృతమున భారతమును రచించినాడు. కావుననే "భారతః పంచమో వేదః" యను సూక్తి వ్యాపించినది. హిందువులకు వేదమునందువలెనే భారతమందుఁ బ్రామాణికబుద్ధియు, గౌరవమును జనించినది. వేదవాక్యములవలెనే భారతవాక్యము లనుల్లంఘనీయము లయినవి. భారతము సులభావగాహ మగుటచేఁ బెక్కండ్రు తదర్థమును గ్రహించి యానందించు వారు లేకపోలేదు. రానురాను, హిందూసంఘము వృద్ధిచెందినది. కొంతవఱకు జ్ఞానసంపన్నమైనది. అట్లయినకొలఁదిని, నార్యమతమే కాక యితరమతములు ప్రబలినవి. అందువలనఁ బ్రజలయభిరుచులు మాఱినవి. అనాదిగా వచ్చు నార్యమతమునందు నమ్మకము తొలఁగినది. వారికిఁ గ్రొత్తమార్గములు మాఁపట్టినవి. ఆనూతనమతములందు వారికి నమ్మకము కుదిరినది. మంచివో చెడ్డవో, తాము నేర్చుకొన్న నూతనమతోద్దేశములు లోకమునకు వెల్లడించి ప్రజల నుద్ధరింపవలె నన్న పట్టుదల వారికి హెచ్చినది. కాని వారియుపదేశములు, మతోద్దేశములు చెవిని బెట్టువా రెవ్వరు? సామాన్యముగాఁ బ్రజల కట్టివాని యందు విశ్వాస ముదయించు టెట్లు? తమ యుపదేశములం దెట్లయినను ప్రజలకు నమ్మకము పుట్టింపనిచో వారితలంపు లెట్లు నెఱవేఱును? హిందువులకు నమ్మకము గల్గించుటకై వేదతుల్యముఁ, బ్రామాణికమునగు భారతము నుండియే తమయుద్దేశములు వెల్లడింప నెంచి తమ కిష్టమగు నంశములన్నియు భారతమునఁ జేర్ప నారంభించిరి. భారతమునఁ బ్రక్షిప్తభాగములు చేరుట కిది యొక మార్గము.

లోకము భిన్నరుచులు గలది. కొందఱకు ధర్మరాజునందు భక్తి. కొందఱ కర్జునునందుఁ బక్షపాతము. కొందఱకుఁ గర్ణుఁడు ప్రేమాస్పదుఁడు. ఇట్లు తలంచుట మానవస్వాభావికము. మానవులకంటె దేవత లెక్కుడుమహిమ గలవారు. లోకములోఁ, బూజనీయుఁడగు నుత్తమునితో సాటితెచ్చుకొనుటయు, సంబంధము కల్పించుకొనుటయు మానవుల నైజము. అందుచే భారతపురుషులలోఁ దమ కిష్టుఁడగువాఁడు మహామహిమగలవాఁడని లోకులకు వెల్లడించుటకై వానికి దేవతాసంబంధము గల్పించి తత్సూచకములగు శ్లోకములను భారతమునఁ జేర్పఁదొడఁగిరి. భారతమునఁ బ్రక్షిప్తములు చేరుట కిది యొక మార్గము.

అనాదిసిద్ధముగా వచ్చు నార్యమతమం దభిరుచి లేనివారు ప్రజలకుఁ దన్మతమునందు హేయబుద్ధి పుట్టించుటకై యార్యమతోద్ధారకులందును, దేవతలందును లోపములను గూప నిశ్చయించి యట్టిశ్లోకములను, కథాభాగములను భారతమునఁ జేర్చి యిష్టసిద్ధి పడయ నిశ్చయించిరి. భారతప్రక్షిప్తముల కిది యొకమార్గము.

ఆలోచింప భారతము గొప్పతనమే దాని నిట్లు ధ్వంసముచేయఁ గారణమైనది. భారత మిట్లు ప్రక్షిప్తభూయిష్ఠమై యుండునా యని సందియపడ నవసరము లేదు. ఆర్యమతమును గాని, మతగ్రంథములను గాని సంరక్షించుభారము హిందూప్రభువులకు లేకపోయెను. ప్రజలకా భారము మొదటనే లేదు. ఇఁక నట్టిభారము వహింపవలసినవారు మతగురువులు. శంకరాదు లరిగినపిమ్మట నార్యమతరక్షణభారము వహింపఁజాలిన మతగురువులు లేనే లేరు. మఱియు నాకాలమున వ్రాఁతరూపముగా నున్న మతగ్రంథములందలి ప్రక్షిప్తభాగముల నరయుట

యశక్యము. ఎట్టియడ్డుపాటును లేకపోవుటచే మతేతరులును, తత్సహాయాయులును నిరంకుశులై స్వేచ్ఛాసంచారులై రాచబాటయందువలె భారతమున విహరించిరి.

ఈప్రక్షిప్తభాగము లొకకాలమున నొక్కనిచేఁ జేర్పఁబడలేదు. ఆయాకాలములందు స్వార్థాభిలాషులగు పండితులు తమకుఁ దోఁచినయంశములను భారతమునఁ జేర్చిరి. రానురా నవి ముద్రితగ్రంథములందు స్థిరపడి భారతకర్తయగు వ్యాసభగవానునకు గ్రంథరచనయందసామర్థ్యము, అసంభవవర్ణనాపటుత్వము, పూర్వాపర విరోధము మొదలగులోపములు గల్గించినవి. ప్రక్షిప్తభాగములను వేర్పఱుపకుండ భారతము నున్నదున్నట్లు విమర్శింపఁబూనుట యక్రమము.

ప్రక్షిప్తభాగనిర్ణయము సామాన్యకృత్యము గాదు. పెక్కుపండితులు పరిశ్రమచేసి సాధింపవలసినపని. ప్రక్షిప్తభాగములను దొలఁగించి భారతమును సరిచేయవలసిన భారము పండితులు వహించినఁ గాని నెఱవేఱదు. భారతమునఁగల ప్రక్షిప్తభాగములను సూచించుటయే నాపని. భారతమును సవరించి సరిచేయు భారము పండితులది.

భారతకథకు మొదటిదైన యుపరిచరవసువృత్తాంతము పరిశీలింతము.

జనమేజయుఁడు కౌరవవంశమునుగూర్చి యడుగఁగా వైశంపాయనుఁడు శంతనునితోఁ బ్రారంభించి చెప్పఁదలఁచి కౌరవవంశోద్ధారకురాలగు సత్యవతిజన్మవృత్త మెఱిఁగింప నెంచి, దానికిఁ గారకుఁడగు నుపరిచరుని చరిత్రమును జెప్ప మొదలిడెను. ఇందు వ్యాసుఁడు రచించిన భాగముతోఁ గొన్ని ప్రక్షిప్తములు చేరినవి. సంస్కృత భారతమును సూక్ష్మదృష్టితోఁ జదివినచోఁ బైయంశము బోధపడక మానదు.

భారతమున నాదిపర్వములో, వంశావతారపర్వమందు, అఱువదిమూఁడవయధ్యాయములో "రాజోపరిచరో నామ ధర్మనిత్యో మహీపతి" యనుశ్లోకము మొదలుకొని "రాజోపరిచరేత్యేవం నామ త స్యాథ విశ్రుత" మనుశ్లోకమువఱకును నుపరిచరుఁడు వర్ణింపఁబడెను. అందుపరిచరునిప్రవర్తనము, మహావైభవము మిక్కిలిగా వర్ణింపఁబడినది. ఉపరిచరునిధర్మపరిపాలనము,ధర్మాసక్తి, మహాతపస్సు వర్ణనాతీతములు. ఇంద్రాదిదేవతలచే సంస్తూయమానమగు గుణగణము గలవాఁడు; మహాధైర్యవంతుఁడు; ఇంద్రియజేత. అతఁడు తనసత్ప్రవర్తనముచే దేవతలను మెప్పించి విమానమును, వైజయంతిని మాలను, వేణుయష్టిని బహుమానముగా నొందిన యుత్తమశీలుఁడు. తపస్విజనము మెచ్చుకొనఁదగిన యింద్రియనిగ్రహము గలవాఁడు. ప్రత్యేకవంశములకు మూలకారకులగు నైదుగురుకొడుకులు గలవాఁడు. ధర్మయుక్తముగా రాజ్యమును బాలించి ప్రజానురాగమును బడసినవాఁడు. ఈ భాగమును జదివినచో నుపరిచరుఁ డుత్తమోత్తముఁడని యనక తీఱదు. ఇట్టిమహానుభావుఁడు ముందుముం దెట్టులున్నాఁడో చూడుఁడు.

శుక్తిమతీకోలాహలులచరిత్రము ప్రారంభమైనది. శుక్తిమతీకోలాహలులు నదీపర్వతములా? లేక మానవులా? లేక నదీపర్వతాధిష్ఠానదేవతలా? ఈయంశము చర్చింతము.

మూలమున "పురోపవాహినీం" అని చెప్పుటచే నది యనియే నిశ్చయింపవలయును. కోలాహలుఁ డనుపర్వతము శుక్తిమతీనది నడ్డగింపఁగా నది దేశమును ముంచి పాడుచేయుచుండెను. ఆదేశపాలకుఁడగు నుపరిచరుఁడు మహాబలశాలి గావున నాపర్వతమును గాలితోఁ దూల్చివేసి నది నెప్పటివిధమున, దేశమున కనుపద్రవకరముగాఁ బాఱునట్లు చేసెను. ఇది యుపరిచరునకు విహితకృత్యము. ఇది యుపరిచరునిప్రవర్తనమునకు ఘనతయె తెచ్చినది. కాని యీపక్షమున శుక్తిమతీనది కోలాహలునివలనఁ దనకుఁ గల్గినపుత్రీపుత్త్రులగు గిరికావసుపదులను వసురాజున కిచ్చుట యసంభవము. నదీపర్వతములు మానవులను గనుట ప్రకృతివిరుద్ధము. లోకజ్ఞానసంపన్నుఁడగు వ్యాసుఁ డిట్టి విరుద్ధవర్ణన మాచరింపఁడు. లేక శుక్తిమతి యిచ్చిన దన్నపుడు వేఱొకవిధముగా నర్థము చేసికొనవలెను. వసురాజు శుక్తిమతివలనఁ గల్గినయుపద్రవమును వారించి నివాసయోగ్యమగు నానదీతీరమున నివసించియుండఁగా గిరికావసుపదు లతనికి లభించిరి. శుక్తి

మతీతీరమున లక్షించుటచే నావదియే యిచ్చినట్లు భావించి కొని సమర్థించుకొనవలెను.

నామసామ్యముబట్టి శుక్తిమతీకోలాహల శబ్దములు ఉభయవాచకములు గావచ్చును. మఱియు వారు దంపతులని చెప్పవలయును. వారు దంపతులే గానిచో "తస్యాం నద్యా మజనయ న్మిథునం పర్వతః స్వయం"—అనఁగా నానదియందుఁ గోలాహలుని కిరువురుపిల్లలు పుట్టిరి యనుదాని సమన్వయింపదు.

వారు దంపతులేయని నిశ్చయింతము. అట్లయి నచో, "అకార్షీ చ్చేతనాయుక్తః కామాత్ కోలాహలః కిల" అనఁగాఁ గామముచేఁ జైతన్యవంతుఁడగు కోలాహలుఁడు శుక్తిమతిని నిర్బంధించె నను నది విరోధించుచున్నది. భర్త భార్యను గామమున నిర్బంధించుట యధర్మమగునా? "నిరిం కోలాహలం తంసు పదా వసు రతాడయత్"—అనఁగా వసురాజు కోలాహలుఁడు కావించిన శుక్తిమతీ నిర్బంధమును దెలిసికొని కోలాహలునిఁ గాలితోఁ దన్ని తొలఁగించెనని కదా యర్థము. ధర్మజ్ఞుఁడగు నుపరిచరుఁడు దంపతికలహమునఁ జేయిచేసికొనునా? వారు దంపతు లయినను బరస్పరానురాగము లేనివారన్నచో, "తస్యాం నద్యా మజనయ న్మిథునం పర్వత స్స్వయ" మన్నశ్లోక మెట్లు సమన్వయించును? ఈసమన్వయము నిమిత్తమా దంపతులు కొంతకాల మనురాగవంతులై యుండి పిమ్మటఁ గలహించుకొనిరని చెప్పవలయును. అట్లనుకొన్నను, గోలాహలుఁడు శుక్తిమతి నధికముగా బాధించినట్లు గాని, యామె రాజుసాయము నపేక్షించుట గాని గ్రంథమం దెచ్చటను గానరాదు. అట్లయినప్పుడు దేశమున నెచ్చటనో జరిగిన యాలుమగలకయ్యముతో నుపరిచరునివంటి యుత్తమునకు సంబంధము కల్పించుట యుక్తమా? శుక్తిమతీకోలాహలు లధిష్ఠానదేవతలని దేవతామహిమ నారోపించినను బైవిరోధములు తప్పవు.

ఈరెండుపక్షములందును నొకవిధముగా సమాధానము కుదిర్చికొనవలెను. కోలాహలపర్వతమునకు రాజైన కోలాహలుఁ డొకఁ డుండెను. అతనిభార్య శుక్తిమతి. వారికి గిరికావసుపదులను పుత్త్రీపుత్త్రులు గలరు. కోలాహలుఁడు దుష్టుఁడై భార్యను బాధించుటయే కాక ప్రజలనుగూడ బాధించుచుండెను. దుష్టశిక్షణము రాజునకు విహితము గావున వసురాజతనిని నిర్బంధించెను. హింసా స్త్రీస్వభావమునుబట్టి యపరాధియైనను భర్త క్షంతవ్యుఁడు గాన శుక్తిమతి రాజునకుఁ దనసంతానద్వయమును గానుకగానిచ్చి భర్తను విడిపించుకొన్నది. "తస్మాద్విమోక్షణాత్ ప్రీతా నదీ రాజ్ఞే న్యవేదయత్" అనునప్పుడు కోలాహలునినుండి తన్ను విడిపించినందులకు సంతసించి యనునర్థము గాక, "తస్మాద్విమోక్షణాత్" అవిడుదలవలన ననఁగాఁ దనభర్తను విడుచుటవలన సంతసించి యనునర్థము చెప్పుకొనవలెను. అట్లయినచో వసురాజు ప్రవర్తనమునకుఁ గాని, శుక్తిమతిశీలమునకుఁ గాని యెట్టిభంగమును గలుగనేరదు.

ఇఁక గిరికోపరిచరులవృత్తాంతము పరిశీలింతము. ఇందనేకములగు నసంభవములు గలవు ఇట్టివానిని వ్యాసునివంటియుత్తమకవీశ్వరుఁడు వ్రాయఁబోఁడు.

ఉపరిచరుఁడు గిరికను బత్నిగా స్వీకరించెను. అతఁడు భార్యాయుక్తుఁడై విమానము నధిరోహించి మనోహరములగు తావులందు సంచరించుచుఁ గాలక్రమమున గిరికవలన నొకకుమారికను గనెను. ఆమెయే సత్యవతి. ఈయంశము నే వ్యాసుఁడు వ్రాసియుండును. కాని యల్పజ్ఞులచే విపరీతముగా మార్పఁబడియుండును.

గిరికావివాహ మైనపిమ్మట ఋతుమతియగు గిరికకుఁ బితృనియోగమున మృగమాంసమును బెట్టఁదలఁచి వేటకుఁ బోయి వసురాజచ్చట భార్యను స్మరించుకొనుచు స్ఖలనము గావించుకొనెను. అమోఘమగు నావీర్యమును ఋతుమతియగు భార్యకు వసుఁడు పక్షిచేఁ బంపెను. ఆపక్షి వృక్షపర్ణమున నున్న యావీర్యమును నోటఁ గఱచికొని యెగిరిపోవుచుండఁగా మఱియొకపక్షితో దానికిఁ గలహము సంభవించెను. ఆయుద్ధసమయమున వసువీర్యము నదిలోఁబడెను. శాపవశమున మత్స్యరూపము గాల్చియున్న యద్రిక యనునచ్చర మ్రింగి గర్భము దాల్చెను. గర్భవతియగు నాచేఁప జాలరులకు లభించెను. జాలరులు దానిని జంపకుండఁ గొంతకాల ముంచిరి. పదియవమాసము రాఁగానే యాచేఁప కవలవారిని గనెను. ఆచేఁప జాల

రులచేఁ జంపఁబడి, మానవులను గని శాపమోక్షమును బొందు మను బ్రహ్మవాక్యముచొప్పున స్వస్వరూపముతో వెడలిపోయెను. వసురాజందు మగశిశువును దీసికొనిపోయి యాఁడుశిశువును దాశరాజున కిచ్చెను. మగపిల్లవాఁడు మత్స్యదేశరాజయ్యెను. ఆఁడుపిల్ల దాశరాజుచేఁ బోషితయై పెద్దదయి సత్యవతి యనుపేరితోఁ దండ్రిని సేవించుచుండెను. సంస్కృత భారతమునందున్న కథయిది.

ఇందనేకములగు నసంభవములు గలవు. ఉపరిచరుఁడు మహాతపస్వియై, ధర్మజ్ఞుఁడై, సంతానవంతుఁడై యుండెను. అతఁడు భార్యను స్మరించుకొన్నంత మాత్రమున స్ఖలనము గావించుకొనునంత యధైర్యవంతుఁడు కాఁడు. ఇదివఱకు వర్ణించిన వసురాజునడవడి కిది కేవలము విపరీతము. పక్షితో సంభాషణ మసంభవము. వసు వాని వీర్యమును ఋతుమతియగు భార్యకుఁ బంపుటలో నుద్దేశమేమో తెలియదు. గిరిక యావీర్యము నేమి చేయును? డేగలపోట్లాటవలన నావీర్యము నదిలోఁ బడవచ్చును గాని యద్రిక దానిని మ్రింగి గర్భము దాల్చుట యసంభవము. మఱియు వసురాజునకు వీర్యము నదిలోఁ బడినదని తెలియవచ్చును గాని యద్రిక మ్రింగి పిల్లలను గనునని తెలియుట యసంభవము. అది తెలియనప్పుడు వసురాజు పదిమాసములకాల మచ్చట వేచియుండునా? మఱియు ఋతుకాలములో గిరికకు మృగమాంసము దెచ్చిపెట్టుట కరిగిన వసురాజు పితృనియోగధిక్కారము గావించి యానదీతీరమునఁ బదిమాసములకాల ముండుట యసంభవము. జాలరులవలలకుఁ జిక్కినచేఁప పదిమాసములు బ్రదుకుటయు, మానవశిశువులను గనుటయు మఱియు నసంభవము. వసురాజు తనకుఁ బుట్టినపిల్లలలో నాఁడుశిశువును దాశరాజునకీయ నవసరము లేదు. దాశరాజువసురాజులకుఁ గలసంబంధ మేమి? ఎట్లాలోచించినను నివియన్నియుఁ బ్రకృతికి విరుద్ధములు. వ్యాసమహర్షి వంటిమహాకవి యిట్టివిరుద్ధాంశములను వ్రాసియుండఁడు. మఱి నిజ మేమన—

గిరికయు నద్రికయు వేఱుస్త్రీలు గారు. ఒక్కతెకే గ్రంథకర్త యట్లు వాడియున్నాఁడు. వసురాజు భార్యతో నడవి కేగుటయు, నం దామెతో విహరించుటయుఁ, బదిమాసములకుఁ గవలవారిని గనుటయు నిజము. స్నేహితుఁడగు దాశరాజు కోరికచే వసురాజు స్త్రీశిశువు నిచ్చియుండును. ఈభాగమునందుఁ దరువాతివారు స్వభావవిరుద్ధములగు కొన్నిశ్లోకములు చేర్చియుఁ, గొన్ని మార్చియుఁ బాడుచేసియుందురు. అట్లు చేయుటలో వారి యుద్దేశ మేమందురా? ఏమియును లేదు. సంస్కృతవాఙ్మయమం దనేకములగు నుత్కృష్టమహాగ్రంథములు రచించినవ్యాసుఁడు లోకజ్ఞానము లేనివాఁడని నిందించుటకే! మఱియు నీసందర్భములో నీసత్యవతియే వ్యాసునితల్లి యని తెలియఁజేయుచు, జన్మమునందు వ్యాసుఁడే కాక యతనితల్లియగు సత్యవతి మఱింతనీచురాలని మతేతరులు నిందించుటకుఁ బన్నినపన్నుగడ.

సారాంశము—కోలాహలపర్వత మడ్డుగా నుండుటచే దేశమును ముంచి పాఱి పాడుచేయుచున్న శుక్తిమతిని దేశమున కనుపద్రవకరముగాఁ బాఱునట్లు వసురాజు చేసెను. ఆప్రాంతమున విహరించురాజునకు గిరిక లభించెను. అతఁ డామెను బెండ్లియాడెను. గిరికకే యద్రిక యనునామాంతరము. అతఁడు గిరికవలన నిరువురు పిల్లలను గనెను. స్నేహితుఁడగు దాశరాజు కోరుటచే నాఁడుశిశువు నతని కిచ్చి వసుఁడు మగశిశువును దీసికొని పోయియుండును. ఆబాలికయే సత్యవతి యనుపేరున శంతనుని వరించెను. వసురాజు చంచలత్వము, వీర్యప్రస్థాపనము, మత్స్యరూపయగునద్రిక మానవశిశువులను గనుట మొదలగునవి ప్రక్షిప్తములు.

---




పెట్రోలు నింపుటరు — ఈ క్రొత్తరకపు పెట్రోలు పంపు లండనులో గలదు.

G. S. A.

క్రిందటిమాసపు భారతీసంచికయందు "మరుద్వృధా"పదముయొక్క నిర్వచనము నుగూర్చి చెప్పనప్పుడు ప్రసంగవశమున "ఇరావతీ"పదముకూడ ఉల్లేఖింపబడెను. ఇంకీపదమునుగూర్చి ముచ్చటింతును.

"ఇరావతీం పరుష్ణీ *త్యాహుః, పర్వవతీ, భాస్వతీ, కుటిలగామినీ"

(యాస్కవచనము.)

దీనికి దుర్గాచార్యవ్యాఖ్యానము నీక్రింద వ్రాయుచున్నాను:—

"యేయ మిరావతీతి లోకే ప్రసిద్ధా తామిమా మేతస్మి న్మంత్రే మంత్రార్థవిదః పరుష్ణీ త్యాహుః; సా కస్మాత్? 'పర్వవతీ' కి ముక్తం భవతి? 'కుటిలగామినీ,' ఇతి త దస్యాః పర్వవత్త్వం, యాని కుటిలాని తాని పర్వాణీవ తస్యాః, తై స్తద్వ తీతి." †

ఇందు పర్వవతీ యని పరుష్ణీపదమునకు వ్యుత్పత్తిచెప్పి, అదియే నదియనునిర్వచనమున నేనదిని లోకమున "ఇరావతీ" యని చెప్పుచున్నారో యదియే 'పరుష్ణీ' పదముచే తెల్పబడు చున్నదని పైవాక్యము తెల్పుచున్నది. "ఇరావతీ" యనునదియొకటి బర్మాదేశమునం దున్నది. కాని ఋగ్వేదకాలమున గాని, ఆరణ్యకకాలమునకు గాని ఆర్యులు గంగకు తూర్పున నున్నదేశము నెరుంగనట్లు తెలిసికొనియున్నాము. అందుచేత నీ "ఇరావతీ" పదము బర్మాయందలినదికి పేరని చెప్పుట కెంతమాత్రమును వలనుపడదు. యాస్కకాలమునకుకూడా బర్మాదేశమును ఆర్యు లెరుంగుదురని చెప్పుటకు వలనుపడదు. మఱియు యాస్కకాలమునకే "పరుష్ణీ"నదికి "ఇరావతీ" యని పేరు కల్గినట్లు పైవాక్యమువల్ల నిర్ధారణము. అదివర కీపదము బహ్వర్థకమై, నదీసామాన్యవాచకములలో నొకటియై యుండెను. ఈక్రింది యాస్కవచనమును చూడుడు:

"అవనయః, యవవ్యాః, ఖాః, సీరాః, స్రోత్యాః, ఏన్యః, ధునయః, రుజానాః, వక్షణాః, ఖాదోఅర్ణాః, రోధచక్రాః, హారితః, సరితః, అగ్రగః, నభన్వః, వధ్వః, హిరణ్యవర్ణాః, రోహితః, మసృతః, అర్ణాః, సింధవః, కుల్యాః, వర్యః, ఉర్వ్యః, ఇరావత్యః, పార్వత్యః, స్రవంత్యః, ఊర్జస్వంత్యః, పయస్వంత్యః, సరస్వత్యః, తరస్వత్యః, హారస్వత్యః, రోధస్వత్యః, భాస్వత్యః, అజిరాః, మాతరః, నద్యః, ఇతి సప్తత్రింశన్నదీనామాని."

(యాస్కవచనము, నిరుక్తము, పుట ౧౫౧.)

పైగుర్తుంచిన పదములుకూడా యిందు గలవు. విశేష మేమన, వెనుక మనము యాస్కవచన

---

* The Ravi. † Name of a river in the Punjab now called Ravi.
(Monier Williams' dictionary p. 168.)

మువలన నదీసామాన్యవాచకమని నిర్ధారణము చేసిన "మరుద్వృధా" పదమిందు లేదు. అంత మాత్రమున నాపద మన్యార్థమున నుపయోగింపబడలేదనుటకు వలనుపడదు. అప్పటికింకను తత్పదము తదర్థమున రూఢము కాలేదనియు, బహుస్థలముల తదర్థమున నుపయోగపడకుండుట యది చేర్పబడకుండుటకు కారణమనియు మాత్రమే చెప్పనగును. ఈ "మరుద్వృధా" పదము ఋగ్వేదమున నొకటియొక్కటినందును, యజుర్వేదారణ్యకమునందును మాత్రమే యున్నట్లు మనకు తెలియును. యజుర్వేదారణ్యకమునం దనువదించినది ఋగ్వేదమునందలి ఋక్కే యైనందున వేదమున మొత్తముమీద నొక్కస్థలమునమాత్రమే వచ్చెనని గ్రహింపనగును. ఒక్కమారు తదర్థమున నుపయుక్తమైనపదమును సామాన్యవాచకశబ్దములలో నిచ్చుటకు వీలు లేదు గాన యాస్కుడట్లియ్యలేదు. పై వాక్యమున నదీసామాన్యవాచకముగా నిచ్చిన "ఇరావతీ"పదము యాస్కకాలమునాటికి "పరుష్ణీ" పదమునకు పర్యాయముగా రూఢమైనట్లు తెలిసికొన్నాము. పై వచనమున క్రింద గుర్తుంచబడిన "సింధవః", "సరస్వత్యః" అనుపదములను పరీక్షించిన నీయర్థము మనకు సులభగ్రాహ్య మగును. ఇప్పుడు సింధునదియని చెప్పబడుదానికి వేదకాలమున తత్పద ముపయోగింపబడుచున్నట్లు కానబడదు. సింధునదని చెప్పవలసివచ్చినపుడెల్ల "సుషోమ"పదము నుపయోగించినట్లు కనపడుచున్నది. "శ్రుణుహ్యా సుషోమయా" యని వెనుకటియొక్క మనకు తెలియును. యాస్కకాలమునాటికి మాత్రము తత్పదము తన్నదికి వాడబడుచున్నట్లు "సుషోమా సింధుః" అనునర్థ మిచ్చుటయే సాక్ష్యము. మహాభారతకాలమునాటికి తన్నామ మానదికి ఉపయుక్తమయిన ట్లీక్రిందిశ్లోకమువలన తెలియనగును.

'విపాశా చ శుతుద్రీచ చంద్రభాగా సరస్వతీ,
ఇరావతీ వితస్తాచ సింధు ర్దేవనదీ తథా.'

చంద్రభాగానది పశ్చిమదేశమున పండరాపురమువద్ద నున్నది. మరియు నీకాలము నాటికి నదీనదభేదము పాటింపబడుచున్నట్లు కూడ దీనివలన తెలియగలదు. కాని వేదకాలమునాటికి "సింధు"పదము నదీసామాన్యవాచకముగ నేయుపయుక్తమగుటచేత నే యాస్కుడట్లు తత్పదమును నదీసామాన్యవాచకములలో నిచ్చెను:

"సముద్రా గిరయశ్చ సర్వేఽస్మాత్స్యం
దంతే సింధవ స్సర్వరూపాః."

(యజురారణ్యకము.)

ఇందలి "సింధవః" అను బహువచనమే తత్పదము నదీసామాన్యవాచకముగా నుపయుక్తమైనట్లు చెప్పక చెప్పుచున్నది.

"సరస్వతీ" పదము ఋగ్వేదకాలమునాటికే బహ్వర్థముల నుపయుక్తమగుచున్న ట్లీక్రింది యాస్కవచనమువలన తెలియుచున్నది:

"తత్ర సరస్వతీ త్యేతస్య నదీవ ద్దేవతావ చ్చ నిగమా భవంతి."

(నిరుక్తము, పుట ౧౫౭.)

దీనికి భాష్యము:—

"తత్ర సరస్వతీ త్యేతస్య, తత్ర తస్మిన్ సప్తపంచాశత్కే వాఙ్నామగణే, సరస్వతీ త్యేతస్య నామ్నః నదీవ ద్దేవతావచ్చ నిగమా భవంతి, నద్యర్థయుక్తాశ్చ దేవతార్థయుక్తా శ్చేత్యర్థః.

(పుట ౧౫౭.)

పై వ్యాఖ్యానవాక్యమువలన "సరస్వతీ" పదము నదీవాచకముగానే గాక దేవతావాచకముగాకూడా వేదమున నుపయోగింపబడి నట్లు తేలును. ఈపదము వాఙ్నామముగా కూడా ఉపయోగింపబడినది. కాని వాఙ్నామముగా తద్గణమున యాస్కు డిచ్చియుండ లేదు. పై వాక్యమునందలి "నిగమాః" అను బహువచనము తత్పదము తదర్థముల ననేక స్థలముల నుపయోగింపబడినదని చెప్పును. మరియు వేదకాలమునకు "సరస్వతీ"పదము ప్రత్యేకనదీవాచకముగాకూడ ఉపయోగింప బడినట్లు రాజసూయప్రకరణమునందలి యీ క్రిందిమంత్రమువలన తెలియనగును:

"వరుణస్య వాభిషించమాన స్యేంద్రియా వీర్య మపాక్రామత్, త త్త్రేధాభవత్, భృగు స్తృతీయ మభవ చ్ఛ్రాయంతీయం సరస్వతీ తృతీయం ప్రావిశత్."

ఇందువలన "సరస్వతీ" పదము ప్రత్యేక నదీవాచక మగుట స్పష్టము. అట్లు ప్రత్యేకనదీ వాచకమైనను బహుస్థలముల నాపదము నదీ సామాన్యవాచకముగా నుపయోగింపబడుటచే యాస్కునిచేనమున నుదాహృతము. ఈసందర్భమున సాయణభాష్యము!

"హే సరస్వతి? నదీరూపేణ విద్యమానే బ్రహ్మశక్తి!"

పై "సరస్వతీ"పదమువలెనే "ఇరావతీ" పదముకూడా బహ్వర్థమై యున్నను నదీసామాన్యవాచకముగా బహుస్థలముల నుపయుక్తమగుటచే తత్పదమును యాస్కుడు నదీనామముల నిచ్చెను. బహ్వర్థమని దిఙ్మాత్రము క్రింద చూపుచున్నాను.

"సమూఢ మస్యపాగ్ంసుర ఇరావతీ ధేనుమతీ హి భూతగ్ం సూయవసినీ మనవే యశస్యే వ్యస్కభ్నా ద్రోదసీ విష్ణు రేతే దాధార పృథివీ మభితో మయూఖైః."

(యజుర్వేదసంహిత, ౧. ౨. ౩.)

ఈమంత్రము ద్యావాపృథివీ పరమని యందలి "రోదసీ" పదము తెల్పుచున్నది.

"ద్యావాపృథివ్యౌ రోదస్యౌ."

(అమరకోశము.)

ఇచ్చట వేదభాష్యము లిట్లు వ్యాఖ్యానమును వ్రాయుచున్నవి:

"హే హవిర్ధానాత్మికే ద్యావాపృథివ్యౌ! ఇరావత్యౌ అన్నవత్యౌ, భూతం భవతం,

యజ్ఞసాధనద్వారేణ * * * ధేనుమత్యౌచ భవతం." (భట్టభాస్కరుడు.)

"కించ ఇరావతీ, అన్నవతీ, ధేనుమతీ, ధేను ర్బహుక్షీరా గౌః, తద్వత్యౌ, సూయవసినీ శోభనైర్యవసై రభ్యవహార్యై ర్యుక్తే, మనవే మానవప్రజార్థం యశస్యే యశోనిమిత్తే భవతం."

(సాయణాచార్యుడు.)

ఆకాశము వర్ష మిచ్చిన పృథివి సస్యాఢ్యయై ఫలింపుటయే గాక గోవులకు గ్రాసము లభించి బహుక్షీర లగును. కావున ద్యావాపృథువులు మా కన్నధేనుమతు లగును గాక యని తన్మంత్రార్థము. ఇచ్చట 'ఇరా'పదము 'అన్నము' అనునర్థమున నుపయుక్తమైనది. పైమంత్రమే యరుణమను యజుర్వేదారణ్యక భాగమునకూడా వచ్చుచున్నది. అరుణము సూర్యపరము. అచ్చట యీపద మీక్రింది విధముగా వ్యాఖ్యాతమైనది:

"ఇరావతీతి: త్రిష్టుభేషా; ఇరావతీ, ఇరావత్యౌ ఉదకవత్యౌ, ధేనుమతీ ప్రీణనత్వేన ధేనుస్థానీయైః నిధానైః, తద్వత్యౌ, గోమత్యౌ వా." (భట్టభాస్కరుడు.)

ఇచ్చట 'ఇరా' పదము ఉదక మనునర్థమున నుపయుక్తమైనది. మరియొకమూడవయర్థము నందుపయోగింపబడిన ట్లీక్రిందియుపనిషద్భాగమువలన తెలియగలదు:

"స ప్రాణ, స్తస్య భూతంచ భవిష్యచ్చ పూర్వౌ పాదౌ, శ్రీశ్చేరా చాపరౌ, బృహద్రథంతరే అనూచ్యే........"

(కౌషీతక్యుపనిషత్తు.)

ఇచ్చట 'ఇరా'శబ్దము పృథివీపరముగా నుపయుక్తము. ఇంక ననేకస్థలముల క్షీరాద్యర్థముల నుపయుక్తమైనట్లు కనుగొననగును.

"ఇరా, కామం దదాతీతి ఇరా, తద్వతీ ఇరావతీ." (శబ్దకల్పద్రుమము.)

కోరిక నిచ్చునట్టిగాని, తృప్తిపరచునట్టిగాని యనేకపదార్థజాతమున కీశబ్ద ముపయుక్తము. కావున నీ "ఇరావతీ" పదము "సరస్వతీ" శబ్దమువలె బహ్వర్థమైనను నదీసామాన్యవాచకముగా నుపయుక్తము గాన నదీనామములలో నియ్యబడినదనియు, "సరస్వతీ" పదమువలె వేదకాలముననే ప్రత్యేక నదీవాచకముగాక యాస్కకాలమునకు "పరుష్ణీ" నదికి పర్యాయముగా రూఢమయ్యెననియు, "మరుద్వృధా" పద మొక్కమారే యుపయుక్తమైనందున యాస్కుడు నదీసామాన్యవాచకముగా తద్వాచకపదములలో దానినీయలేదనియు, ఒక్క "సరస్వతీ"పదము దక్క మిగిలిన తద్వాచకములలో ఏపదమును ప్రత్యేకనదీవాచకముగా వేదకాలమున వాడబడియుండలేదనియు పరిష్కారము.

[ఏతద్వ్యాసరచనానంతరము "సింధు" పదము "సింధు"నదికి దాదాపు ఋగ్వేదమున నాల్గుస్థలములను, "సరస్వతీ" పదము "సింధు" పదముగా కొన్నిస్థలములను ఉపయుక్తములైనట్లు కనుగొంటిని. కాని "సింధు"పద మప్పటికి "సింధు" నదియం దన్వర్థము కాకుండుటచే నీవ్యాససిద్ధాంతమును మార్పజాలను.

# ప్రభాత స్తవము

జి. జాషువ గారు

(ఫిరదౌసి నుండి)

ఆగడపుమబ్బుశయ్యల నపరశిఖరి - బుడుతచంద్రుఁడు నిద్దురపోవుచుండె
నీచెఱువునీట నతని కుమ్మెలలు గట్టి - జోలవాడుచు నావంకఁజూడవేమి ?

కులికినస్వాతిమేఘములకుఁ దలయెత్తినకాకిచిప్పలన్
నిలిచినవానచిన్కులు మణిత్వము దాల్చి, సముద్రమందిర
స్థలుల నలంకరించినవి స్వామి! యనూహ్యములైన నీమచేఁ
తలకు నమస్కరింతును కృతజ్ఞుఁడ నయ్యెదఁ గ్రుంగిపోయెదన్.

గొలుసులు గట్టి నీవలనకుం బరువెత్తెడు నాదుఁగనద్ర
క్కుల నెదిరించి వచ్చినవి, కొండలపిండులు కొమ్ము లొడ్డి, లో
యల నిదురించు నీమునురుటంఘతమంబుల, నీపదాంకము
ద్రలు గమనింపఁజాలను పరాత్పర, నాకు శరణ్య మేమిరా ?

ఏమిటి కెక్కువెట్టితివి యింద్రధనుష్షను మింటిచాయ? నా
స్వామి, పయోదమాలికలచాటున సూర్యుఁడు నక్కినాఁడు, తా
నే మపరాధము న్సలిపి, యిట్టివిపత్తును దెచ్చిపెట్టె? నీ
భూములు నిల్చునా భువనమోహన! నీవు పరాక్రమించినన్ ?

సుకము లశాశ్వతంబు లనుచుం బాగరెక్కనకొమ్మకేన్గు వా
రక చెవులూఁచి, తుమ్మెదదోరన్ బెదరించు ననుక్షణంబ దే
సకలచరాచరంబులకు సామ్యములై, నెఱసున్నపోలికన్
నికటజలాశయంబుల జనించినబుద్బుదముల్ నశించెడిన్.

కొండలనుండి క్రిందివఱకున్ దలక్రిందుగఁ జెంగలించి, యీ
యెండినయేటిమీఁదఁ బ్రవహించిన యాసెలయేటినీటిలో
గుండము లప్పుడే కుమురుకొన్నవి పాంథుల నాహరింప బ్ర
హ్మాండవిలాస, నీకవన మద్భుత మర్థగభీర మీశ్వరా!

భూతపంచకమున మునిఁగి తేలుచునున్న - నీయనంతశక్తి నిశ్చయముగ
నాకుఁ బట్టుఁగొమ్మ, నావజ్రకవచము - సిలుఁగు లేమిసేయగలవు నన్ను ?

---

# తిక్కన యుద్యోగపర్వము

(వెనుకటి సంచిక తరువాయి)

తాడూరి లక్ష్మీనరసింహారావు పంతులు గారు

౯. (B) పాండవులక్కు వెఱ్ఱి యనిన: వ్యాస భారత సంజయయానపర్వములో నిరువదితొమ్మిదవ యధ్యాయములో నేబదియేడవ పద్యము—

"స్థితాః శుశ్రూషితుం పార్థాః
స్థితా యోద్ధు మరిందమాః,
యత్కృత్యం ధృతరాష్ట్రస్య
తత్కరోతు నరాధిపః."

అని యున్నది. ఇది శ్రీకృష్ణుఁడు సంజయునితోఁ గపటముఁ జెప్పినమాట. ఈపద్యమునకు నాయాంధ్రీకరణము—

'భక్తులై కొల్వ నున్నారు పాండవులు
నలిపి చంపంగ నున్నారు శాత్రవులయి
పార్థులో నూత, తన కెద్ది పరమశుభమొ
యయ్యది యొనర్చికొను మను మాంబికేయు.'

అని యున్నది.

ఇందు వ్యాసమహర్షి కవీంద్రుఁడు — 'పాండవులు తమ రాజ్యము తమకు నీ విచ్చితివేని నిన్ను భక్తితోఁ గొల్చుటకు సంసిద్ధులై యున్నారు. దానికి నీ వంగీకరింపనినాఁడు మీతో యుద్ధముచేయుటకు సంసిద్ధులై యున్నారు. వాతో యుద్ధముచేసి మమ్మును గెలువఁగలరా యందువేమో, వా రరిందములై యుద్ధముచేయు సమర్థసైన్యులు సుమా! నీవు సంధి కొడఁబడక బుద్ధిహీనుఁడవై యుద్ధమునే కోరుదేని వారు యుద్ధముచేసి మిమ్ము నందఱను మాప్చివేయఁగలరు. కావునఁ దెలివిగలవాఁడవై బాగుగ నాలోచించుకొని నీ కేపని చేయఁదగునో యది చేసికొమ్ము.' అని ధృతరాష్ట్రునితో నయమున భయమునఁ జెప్పుమని సంజయునకు శ్రీకృష్ణునిచేత సామవచనంబులను, దండవచనంబులను జెప్పించుచున్నాఁడు.

ఈశ్లోకమునకుఁ దిక్కన రచించిన తెనుఁగు పద్యము చూడుఁడు—

'పరిచారకులై యుండుదు
రరివర్గ ప్రత్యనీకరమున కడుదురు వీరిన్
సరిఁ దనకొడుకుల మెలఁగిన
తెరువున మెలఁగింపవలదె ధృతరాష్ట్రునకున్.'

అని యైయున్నది. ఇందలియర్థము—

'వీరు పాండవులు తనకు సేవకులై యుందురు. పనిపడ్డప్పుడు తన వైరులతోఁ బోరఁగలరు. వీరిని తన యింట నునిచికొని తనకొడుకులతో సమానముగా ధృతరాష్ట్రుఁడు పనులలోఁ ద్రిప్పికొనరాదా' అని యై యున్నది.

ఇవి దీనాలాపములు. పల్లెటూరియాఁడుదాని మాటలు. ఈదీనాలాపములయందుఁ గలరసమును, వ్యాసునిమూలశ్లోకంబున నున్న సారస్యమును జూడుఁడు. కృష్ణునియట్టిమహావీరునకు, మహాపురుషునకు, మహాయోద్ధకు, నవతారపురుషునకు, నిట్టిదీనాలాపము లనురూపముగా నున్నవా? ఈ శ్లోకమునకుఁ బూర్వమేఁబదియాఱుశ్లోకములలో శ్రీకృష్ణుఁడు యుధిష్ఠిరుని మాటలనుబట్టి సంధి మిక్కిలి దుష్కరమనియును, ధృతరాష్ట్రుఁడును గొడుకులును బాండవులభూమి కాశ మానరైరనియును, దానిచే యుద్ధము కాక తప్పదనియును సంజయునితోఁ జెప్పుచుఁ గౌరవులనుర్ణయమును, దుష్కార్యములును నుగ్గడించినాఁడు. ఆభాగమందుఁగల కొన్నిమూలశ్లోకములు నాతెనుఁగుపద్యముల సహితముం దుదాహరించుచున్నాను జూడుఁడు:—

వ్యాసపద్యములు:—

౧. 'సుదుష్కరం తత్ర శమోహి నూనం
ప్రదర్శితః సంజయ పాండవేన,
యస్మిన్ గృధ్రో ధృతరాష్ట్రః సపుత్రః
కస్మా దేషాం కలహో నావమూర్ఛేత్.'
3-వ పద్యము.

౨. 'తేచే త్పిత్ర్యే కర్మణి వర్తమానా
ఆపద్యేరన్ దిష్టవశేన మృత్యుమ్,
యథా శక్త్యా పూరయంతః స్వకర్మ
తద ప్యేషాం నిధనం స్యా త్ప్రశస్తమ్.'

౨౦-వ పద్యము.

౩. 'ఉతాహో త్వం మన్యసే శామ్యమేవ
రాజ్ఞాం యుద్ధే వర్తతే ధర్మతంత్రమ్,
అయుద్ధేవా వర్తతే ధర్మతంత్రం
తథైవ తే వాచ మిమాం శృణోమి.'

౨౧-వ పద్యము.

౪. 'యదా గృధ్యే త్పరభూతో నృశంసో
విధిప్రకోపా ద్బల మాదదానః,
తతో రాజ్ఞా మభవ ద్యుద్ధ మేత
త్తత్ర జాతం వర్మ శస్త్రం ధనుశ్చ.'

౨౯-వ పద్యము

౫. 'ఇంద్రేణైత ద్దస్యువధాయ కర్మ
హ్యుత్పాదితం వర్మ శస్త్రం ధనుశ్చ,
..............................'

౬. 'తత్ర పుణ్యం దస్యువధేన లభ్యతే
సోఽయం దోషః కురుభి స్తీవ్రరూపః,
అధర్మజ్ఞై ర్ధర్మ మబుధ్యమానై
ప్రాదుర్భూతః సంజయ, సాధు తన్న.'

3౧-వ పద్యము.

౭. 'తత్ర రాజా ధృతరాష్ట్రస్య పుత్రః
ధర్మ్యం హరన్ పాండవానా మకస్మాత్,
నావేక్షతే రాజధర్మం పురాణం
తదన్వయాః కురవః సర్వఏవ.'

3౨-వ పద్యము

౮. 'స్తేనో హరే ద్యత్ర ధనం హ్యదృష్టః
ప్రసహ్యవా యత్ర హరేత దృష్టః,
ఉభౌ గర్హ్యౌ భవతః సంజ యైతౌ
కిం వై పృథక్త్వం ధృతరాష్ట్రస్య పుత్రే.'

33-వ పద్యము.

౯. 'సోఽయం లోభా న్మన్యతే ధర్మమేతం
య మిచ్ఛతి క్రోధవశానుగామీ,
భాగః పునః పాండవానాం నివిష్ట
స్తం నః కస్మా దాదదీరన్ పరే వై.'

3౪-వ పద్యము.

౧౦. 'అస్మిన్ పదే యుధ్యతాం నో వధోఽపి
శ్లాఘ్యః పిత్ర్యం పరరాజ్యా ద్విశిష్టమ్,
ఏతాన్ ధర్మాన్ కౌరవాణాం పురాణా
నాచక్షీథాః సంజయ రాజమధ్యే.'

3౫-వ పద్యము.

౧౧. 'ప్రియాం భార్యాం ద్రౌపదీం పాండవానాం
యశస్వినీం శీలవృత్తోపపన్నామ్,
యదుపైక్షంత కురవో భీష్మముఖ్యాః
కామానుగే నోపరుద్ధాం వ్రజంతీమ్.'

3౬-వ పద్యము.

౧౨. 'తాంచేత్తదా తే సకుమారవృద్ధా
అవారయిష్యన్ కురవః సమేతాః,
మమ ప్రియం ధృతరాష్ట్రోఽకరిష్యత్
పుత్రాణాంచకృత మస్యాభవిష్యత్.'

3౭-వ పద్యము.

౧౩. 'అబుద్ధ్వాత్వం ధర్మ మేతం సభాయా
మధీచ్ఛసే పాండవ స్యోప దేష్టుమ్,
కృష్ణా త్వేత త్కర్మ చకార శుద్ధం
సుదుష్కరం తత్ర సభాం సమేత్య.'

౪౧-వ పద్యము.

౧౪. 'అహాపయిత్వా యది పాండవార్థం
పుణ్యంచ మే స్యా చ్చరితం మహోదయమ్,
శమం కురూణా మపి చేచ్ఛ్రేయం
ముచ్యేరం శ్చ కురవో మృత్యుపాశాత్.'

౪౭-వ పద్యము.

తెనుఁగుపద్యములు:—

'వినవు సంధి యిందు విను
 మక్కట చేకుఱసేర దంచు ని
మ్మానవనాథుమాటలసె
 మాకును నీకును స్పష్టమయ్యెఁ దా
నావరనాయకుండు మఱి
 యాతనిపుత్రులు వీరిభూమికై
మానరు యాళ యెట్టు లిఁక
 మానుసు గయ్యము గాక చెప్పుమా.' 3

'పమపిత్ర్యం బగుకర్మమున్ సలుపుని
 ధర్మాత్ముల న్నాస్వక
ర్మమునున్ శక్తికొలందిఁ జేయుతఱిఁ బి
 న్నాన్యప్రవృత్తిన్ స్వక
ర్మమునం దైవవశంబుచే మరణమున్
 రానైనచో సంజయా
యమరం దన్మరణంబు మేలె యసఁ జూ
 మ్మా వీరికిం జూడఁగన్. ౨౦

'శాంతియే యందువా నీవు క్షత్రియులకు
ధర్మతంత్రంబు యుద్ధ మీ ధరణిలోన
ధర్మతంత్ర మయుద్ధమా ధర్మవిదుఁడ
యేదొ చెప్పుము నీమాట యేను వింద.' ౨౧

'బలియుఁ డగుశాత్రు దైనంబు ప్రాతిహార్య
మునను ఖిలుఁడయి యొరుపామ్మ కొనఁగఁ దలఁపఁ
బుట్టురాజులలో యుద్ధ మట్టిపనికిఁ
గాదె పుట్టెను విల్ శస్త్రకంకటములు.

౨౯-వ పద్యము.

'ఈదస్యువధముకొఱకే
తా దేవేంద్రుండు దురము తగఁ బుట్టించెం
గాదే శస్త్రము విల్ జో
డావిగఁ గలసకలపరికరౌఘముతోడన్.

3౦-వ పద్యము.

'అని దస్యున్ వధియింపఁ బుణ్య మగుఁ జూ
 మ్మా తీవ్రరూపంబ యై
చనువీపోమము ధర్మమూరు లయి న
 చ్చం జెప్పఁగా ధర్మమున్
వినఁగా నొల్లనికౌరవాళి దెస నా
 విర్భూత మయ్యెం గదే
యనఘా మంచిది కాదు వారి కది సు
 మ్మా సంజయా చూడఁగన్. 3౧

'అటు మర్యోధనరాజు పాండవుల ధ
 ర్మ్యం బైనరాజ్యంబు న
క్కట యాకస్మిక మైనయట్టిగతి నో
 గావల్గణీ దోఁచెఁగా
కుటిలుం డై తొలిరాజసన్మనుమును దా
 గోరంత చూడం డ యో
క్కట తక్కుంగలకౌరవుల్ చనుదు ర
 క్కారవ్యదౌ మార్గమే.' 3౨

* * * * *

* * * * *

'కనకుండంగను దొంగ దొంగిలును దా
 గావల్గణీ యొక్కచోఁ
గనుచుండంగ బలాత్కరించి యొకచోఁ
 గ్రౌర్యంబునం దొంగిలుం
గన నియ్యిద్దఱునున్ సమానమగనే
 గర్హ్యుల్ సుమీ ధార్తరా
ష్ట్రునకున్ వీరికి భేద మేమి చెపుమా
 చూడంగఁ దత్వంబునన్.'

33-వ పద్యము.

'ఘన మా క్రోధముచేత నెద్ది వధయం
 గాఁ గల్గె నద్దానినిం
దన దౌ లోభముచేత నాతఁ డకటా
 ధర్మ్యంబ యంచుండుఁ జూ
ఘను లౌ పార్థుల పాలు దాఁచికొనికే
 గాదే తలంపంగ దా
ని నోరుం డెట్లు గ్రహింపఁగాఁ దగు మది
 న్నీ వూహ నేయంగదే.'

3౪-వ పద్యము.



3. సదనవిద్యార్థినులు



౮. రాయవేట ప్రభుత్వవైద్యశాలయందు ధాత్రీశిక్షను బడయుచున్న విద్యార్థినులు

'మాకున్ రాఁ దగుదాని కాల మపగో
మాచావునన్ శ్లాఘ్యమే
పోఁకం గాంచెను నన్యరాజ్యమునకుం
బిత్ర్యంబె శ్రేష్ఠంబు సు
శ్లోక కళ్యాణపురాణసర్శ్మని కరం
బీ వేళ చెప్పంగదే
యీకౌరవ్యమహాసభాంతరమునం
దారాజమస్త్వంబునన్.'

౩౫-వ పద్యము.

'సుసరాలుం బ్రియభార్య పాండవులకుం
గావల్గణీ శీలమం
దును వృత్తంబున సాటిలేనియదియున్
లోకంబులోనన్ యశ
స్విని యా ద్రౌపది ముట్టుతోఁ సభలో
కత్తిల్లి తా సూత యే
డ్వ నుపేక్షించిరి భీష్మముఖ్యులన న
వ్యారైన యీకౌరవుల్.'

౩౬-వ పద్యము.

మానినీవృత్తము——

'అప్పుడు తత్సభయందున యుండిన
యట్టిరు కౌరవు లెల్లరుఁ దా
మొప్పుగఁ బిన్నలుఁ బెద్దలు నప్పని
నొల్లక మాన్పినవా రయిరేఁ
జెప్పెదఁ గాముమ నాకుఁ బ్రియంబును
క్షేమమునుం దనపుత్రునకుం
దప్పక చేసినవాఁడ యగుంగద
తా ధృతరాష్ట్రుఁడు సూతసుతా.'

౩౭-వ పద్యము.

'నాఁడీధర్మము లొక్కటైన సభలో
నం జెప్ప కోసంజయా
నేఁ డీరీతిని బుద్ధు లెన్నొ యిటుఁ గాం
గేయాళికిం జెప్పెదే
చూడంగా నతిదుష్కరంబు మఱియున్
శుద్ధంబు నా కార్యమున్
నాఁడే చేసెను దత్సభాంతరమునం
దా ద్రౌపదీదేవియే.'

౪౧-వ పద్యము.

'పాండవార్థంబు చెడకుండఁ బౌరవాళి
నేను సంధికి దింపంగ నేర్తునేని
ఘనమహాఫలసత్పుణ్యకరుఁడ నగుదు
ముత్తి గాంతురు కౌరవుల్ మిత్తినుండి.'

౪౭-వ పద్యము.

ఈపద్యములయందు మూఁడవపద్యములో నీవ్యవహారములో సంధి కానేరదని యుధిష్ఠిరునిమాటలవలననే కనఁబడుచున్నదనియును, వీరిభూమి కౌరవులు విడువరు, యుద్ధము కాకేల తప్పదనియును సంజయునితోఁ గృష్ణుఁడు చెప్పినట్లు స్పష్టపడుచున్నది.

పాండవులు క్షాత్రకర్మమైన యుద్ధము సేయుచో దైవవశముచే మరణము సంభవించినను వారికి మేలే సుమా యని యిరువదియవపద్యములోఁ గృష్ణుఁడు చెప్పుచున్నాఁడు.

నీవు శాంతిపరుఁడ ననుచున్నావు గదా, క్షత్రియులకు ధర్మతంత్రము యుద్ధమా యయుద్ధమా నీవే చెప్పుమని యిరువది యొకటవపద్యములోఁ గృష్ణుఁ డనుచున్నాఁడు.

బలియుఁ డగురా జొరుసొమ్ము నపహరింపఁ దలఁచెనేని యుద్ధము పుట్టు ననియును, నట్టిపనికే విల్లును, శస్త్రకంకటములును బుట్టె ననియును, దస్యువధకొఱకే యాపరికరముల సహితము యుద్ధమును దేవేంద్రుఁడు పుట్టించినాఁ డనియును, దస్యులను యుద్ధములోఁ జంపుట పుణ్య మనియును, దొంగ మనము చూచుచుండఁగను, మనము చూడకుండఁగను దొంగిలు ననియును, నీ రెండువిధములవారును సమానముగనే గర్హ్యులనియును, వీరికిని దుర్యోధనునకును భేదము లేదనియును, పాండవులు వానియొద్దను దమపాలు దాఁచికొనిరి కాని వాని కర్పణము చేసినవారు కారనియును, యుద్ధము చేసి తమ పాలు వడయుట మేలికార్య మనియును, నిష్పూరాణ ధర్మము కౌరవసభలోఁ జెప్పుమనియును నిరువది

తొమ్మిదిమొదలు ముప్పదిమైదువఱకుఁ గల యేడుపద్యములలోఁ గృష్ణుఁడు చెప్పుచున్నాఁడు.

ద్రౌపదిని సభలోఁ గౌరవు లవమానించినారని ధృతరాష్ట్రుఁ డాపని మాన్పవయ్యెఁ గనుకఁ బ్రియము సవలియు, దుర్యోధనుఁడు బ్రదుకుబడు మార్గ మనని యును గృష్ణుఁడు ముప్పదియేడును ముప్పదియెనిమిదియు నను పద్యములలోఁ జెప్పుచున్నాఁడు.

నాఁడు నోరెత్తకుండి నేఁడు సిగ్గు లేక పాండవులకు ధర్మోపదేశము చేయుచున్నావా యని నలువదియొకటవపద్యములో సంజయుని గృష్ణుఁ డడుగు చున్నాఁడు.

పాండవులభాగము సంపూర్ణముగాఁ బాండవులకు వచ్చెనేని సంధి యగుననియుఁ, గౌరవులు మృత్యువునోటనుండి ముక్తు లగుదురనియు నలువదిరెండవ పద్యములోఁ గృష్ణుఁడు సంజయునితోఁ జెప్పుచున్నాఁడు.

ఈరీతిని సంజయునితో వీరాలాపములు పలికిన కృష్ణుఁడు తిక్కన చెప్పినట్లు మాటికి సద్దకుఁ దృప్తి నొంది పాండవులు దేవీసహితముగా ధృతరాష్ట్రునింబఁ బరిపాటులు చేయఁగలవారని సంజయునితోఁ జెప్పునా? చెప్పఁడు. "స్థితా యోద్ధు మరింపమా" యన్న దానికిఁ దిక్కన సరియైన యర్థము చేసికొనమిచే నిట్టిపొరపాటు సంభవించినది. అతఁడు శ్లోకముయొక్క యుత్తరార్థములోని భావము గ్రహింపఁజాలఁడయ్యెను. అతఁడు శ్రీకృష్ణపాత్రవర్తనౌచిత్యము చెఱచినాఁడు.

౯. (c) ఇంక నాలవలక్ష్యము చూపుచున్నాను జూడుఁడు:

ఇరువదియేడవ యధ్యాయమున రెండవపద్యము వ్యాసమూలములో నిట్లున్నది:—

"నచే ద్భాగం కురవో న్యత్ర యుద్ధా
త్ప్రయచ్ఛేరం స్తుభ్య మజాతశత్రో!
భైక్షచర్యా మంధకవృష్ణిరాజ్యే
శ్రేయో మన్యే నతు యుద్ధేన రాజ్యమ్."

ఇది సంజయుఁడు ధర్మరాజుతోఁ జెప్పినమాట. దీనికి నేను రచించిన తెనుఁగుపద్యము:—

'కయ్యమునఁ గాక మఱియొండు కతమునఁ గౌరవులు పాలు నీకు నీరైర యేని
కయ్యమున గెల్చురాజ్యంబుకంటె మేలు
యాచ్ఞ యంధకవృష్ణిరాజ్యములయందు.'

ఇందలితాత్పర్యము స్పష్టముగా నున్నది. ఈ సందర్భమునఁ దిక్కనచేసిన తెనుఁగుపద్యము చూడుఁడు:

'పాలీక కౌరవులు దు
శ్శీలతఁ జెడఁ దలఁచిరేని చెప్పెద రుధిరా
భీలాన్న మకంటెను గడు
మేలగు భిక్షాన్నమైన మానవపతికిన్.'

ఈపద్యములోఁ బాత్రసంభాషణౌచిత్యము చెడినది. కౌరవదూతయైన సంజయుఁడు కౌరవులకు విరోధియును, దా నెవనియొద్దకు దూతగాఁ బంపఁబడెనో యట్టివాఁడును నయిన ధర్మరాజునకు దౌత్యవాక్కు నివేదించుచో నతనిచేతఁ గౌరవులు దుశ్శీలురని తిక్కన యిట్లు చెప్పించినాఁడు. సంజయుఁ డిట్లు చెప్పెనేని తనయొడయఁడైనదుర్యోధనునిచే వధ్యుఁడు కావలయువాఁడే. ఎట్లంటేని, తాను దుశ్శీలుఁడనని తనవిరోధితోఁ జెప్పుమని దుర్యోధనుఁడు తనదూతతో నెన్నఁడయినను జెప్పునా? చెప్పఁడు. ఒడయఁడు చెప్పనిమాట దూత చెప్పవచ్చునా? చెప్పఁగూడదు. అట్లు గాక దూత చెప్పెనేని దూత తత్క్షణము వధింపఁబడవలయువాఁడే. మఱియు, వక్ష్యమాణంబైన భగవద్యానపర్వములో నెబ్బదిరెండవయధ్యాయములో సంజయయానానంతరంబ సంజయునిదౌత్యవిషయమై మాటలాడుచు యుధిష్ఠిరుఁడు శ్రీకృష్ణునితో నేమనుచున్నాఁడో—

౧. 'శ్రుతం తే ధృతరాష్ట్రస్య
సపుత్రస్య చికీర్షితమ్,
ఏతద్ధి సకలం కృష్ణ,
సంజయో మాం యదబ్రవీత్.'

౨. 'తన్మతం ధృతరాష్ట్రస్య
సోస్యాత్మా వివృతాం వరః,
యథోక్తం దూత ఆచష్టే
వధ్య స్స్యా దన్యథా బ్రువన్.'

—అని యనుచున్నాఁడు. ఇవి వ్యాసమూలములోని మూలపద్యములు. వీనికి నా తెనుఁగుపద్యములు:—

'అయ్య ధృతరాష్ట్రుఁడును వానియనుఁగసూనుఁ
డెగ్గు చేయంగఁ దలఁచి రడెల్ల వింటి
యొయ్యది వచించె సంజయుం డయ్యదెల్ల
మాధవా ధృతరాష్ట్రునిమతమనుమ్మొ.'

'కోవిదా సంజయుఁడు వానికుండెకాయ
యొప్పుగా వానిమది యెల్ల విప్పి చూపెఁ
బనుపఁబడినట్లు దూత తాఁ బలుకుఁ గాక
వహ్యుఁ డితఁడు గాదె యన్యథా పలికెనేని.'

ఈపద్యములలోని కడపటివాక్యమునుబట్టి యొడయఁడు చెప్పినమాట దూత యెదిరితోఁ జెప్పనేని తన యొడయనిచేతనే వధ్యుఁడు కావలయుట స్పష్టమగుచున్నదిగదా! తిక్కనమతమందు సంజయుఁ డట్లు చెప్పినవాఁడయ్యెను. ఆచెప్పుటలోఁ దనయొడయనియందుఁ బాపము సూడ నారోపించినవాఁడయ్యెను. తనయొడయనిఁ జెడమని తిట్టినగూడఁ దిట్టినవాఁడయ్యెను. మారాజు చెడుఁగాక, నీవు బాగుపడు మనియెను. వ్యాసమహర్షి శిష్యుఁడును, మహాపండితుఁడు నైన సంజయుని యట్టిదూత యిట్టియకార్యకరణములు చేయునా? అవాచ్యములు పల్కునా? ఇంతస్వామిద్రోహి యగునా? ధీరపురుషుఁడైనవానిని నిచ్చుకొండిని, కొండెకానిని జేసి వానిచేతఁ దిక్కనసోమయాజి యకార్యకరణములు చేయించినాఁడు. అవాచ్యము లాడించినాఁడు, తిన్నింటి వాసములు లెక్కపెట్టినవానిపోల్కి వానిని స్వామిద్రోహిని జేసినాఁడు. సోమయాజి రాజనీతి మఱచి యిట్లు పాత్రౌచిత్యము చెఱచినాఁడు. సోమయాజి చెప్పినదే నిజమయినయెడఁ బాండవులయొద్దనుండి తాను గౌరవసభకు మఱలిపోయినవెంటనే సంజయుఁడు సుయోధనునిచేత వధింపఁబడును. ఆవెంటనే భారతయుద్ధము ప్రారంభమగును. అప్పుడు మనకు వ్యాసభారతప్రబంధములో నుద్యోగపర్వము సంజయయానాంతరపర్వముతోనే ముగియును. దానివెనుక నిప్పు డున్న మహారాజనీతిబోధకమగు ప్రజాగరాంతరపర్వమును, నమూల్యమయిన మహాత్మ్యబోధకగల సనత్సుజాతాంతరపర్వమును, నుత్కృష్టమైన యానసంధిపర్వమును భగవంతుండైన శ్రీకృష్ణుని దివ్యామృతవాక్యములుగల భగవద్యానపర్వం మనివి మొదలుగాఁగల యానాంతరపర్వంబులును లేకుండును. చూచితిరా పాత్రౌచిత్యము చెఱచుటచేత నెంత దోసఁగు వాటిల్లునో!

౯. (d) ఇంక నేడవలక్ష్యము చూడుఁడు:—

సంజయయానపర్వములో నిరువది మూఁడవ యధ్యాయములో ధర్మరాజు కౌరవుల క్షేమమును వేర్వేర యడిగి బ్రాహ్మణ వృత్తులును, మంత్రివర్గవృత్తులును ధృతరాష్ట్రుఁడును సేవకులును జరపుచున్నారా యని సంజయు నడుగయు, జరపునున్నారని సంజయుఁడు ప్రత్యుత్తర మిచ్చుచో—

'యద్యుష్మాకం వర్తతే సౌనధర్మ్యం
అద్రుగ్ధేషు ద్రుగ్ధవ త్తన్న సాధు,
మిత్రద్రుక్స్యాత్ ధృతరాష్ట్రః సపుత్రో
యుష్మాన్ ద్విషన్ సాధువృత్తా న సాధు.'

అని చెప్పెనాఁడు. ఇది యిరువదినాలవ యధ్యాయములోని మూఁడవపద్యము. దీనికి నా తెనుఁగుపద్యము—

'జనవర, మీకు ద్రోహము
సల్పనివారిని సల్పినట్టివా
రని వధియింపఁ బూను టది
యక్కట క్రౌర్య మసాధువృత్తి యాఁ
దనుజుఁడుఁ దా నసాధు వయి
తత్ధృతరాష్ట్రుఁడ సాధువృత్తిచేఁ
దనరు మిముం బగంగొనినఁ
దప్పక ద్రోహియె మిత్రకోటికిన్.'

అని యున్నది. దీనింబట్టి ధార్తరాష్ట్రులు ద్రోహులు కారనియు, వారియెడ ద్రోహ మారోపించుటచే మీరు గొడ్డును గోసికొని తినెడు కటికవాండ్రనియును,—నిప్పని మీకు లగ్గ గాదనియును, దాను మిమ్ముఁ బగగొనెనేని నారాజయిన ధృతరాష్ట్రునిఁ బుత్రసమేతము మిత్రద్రోహి యనవచ్చుననియును, వారట్టివారు కారనియును సంజయుఁడు ధర్మరాజుతోఁ జెప్పినట్లు స్పష్టమగు

చున్నది. నిజ మిట్లుండ శ్రీసంపర్కుడునఁ దిక్కన సంజయునిచేత నెట్లు చెప్పించినవాఁడో చూడుఁడు:—

"ధృతరాష్ట్ర భూపతికి వృ
ద్ధతకతమునఁ జిత్త మొకవిధము గామి సుతో
ద్ధతి మాన్పఁడ నాఁడు మనః
క్షతి యిపుడం బుట్టి యిపుడు శాంతుం డయ్యెన్.

'ఇట్టిచందంబు లెల్లను నీవు పుణ్య
చిత్తవృత్తిమై సైఁచినఁ జెల్లినచ్చు
నీయజాతశత్రుత్వంబు నిఖిలలోక
విశ్రుతము గాదె ధర్మప్రవీణహృదయ.'

అని యిట్లు చెప్పించినాఁడు. ఇందు—సంజయుఁడు ధర్మజుని ధర్మప్రవీణహృదయా యని సంబోధించుచు, దుర్యోధనాదులు తొల్లి మీయెడఁ బాపము చేసినారనియు, నప్పుడు తాను ముసలివాఁ డగుటచే మతిస్థిరత లేక ధృతరాష్ట్రుఁడు తనకొడుకులతో నేకీభవించినాఁడనియు, నిప్పుడు మనస్సునకు దెబ్బ తగిలి శాంతుఁ డైనాఁడనియు, నాతని యీచేష్ట లన్నియు నీవు సహింపవలయుననియుఁ జెప్పుచున్నాఁడు. దీనిచేఁ దన యొడయఁడు పాపిష్ఠుఁడని సంజయుఁడు సమ్మతించినట్టులే యయినది. ఈవర్తనము దూతకుఁ దగునా? తగదు. తిక్కనచేసిన తెనుఁగునుబట్టి సకలధర్మవేత్తయు, ధర్మచారియు నయినసంజయునివర్తనమున కనౌచిత్యము సంభవించినది. ఇది గాక ధృతరాష్ట్రుఁడు వాదమప్పుడు ముసలివాఁడై యుండి మతి చెడి, వాదమునకు వెనుకఁ బదునాల్గుసంవత్సరములకుఁ బడుచువాఁడై స్థిరమతి గలవాఁ డైనాఁడా? యుధిష్ఠిరుఁడు యుద్ధముచేయునేమో యని భయపడి మాయనతో సంజయుఁ డేమన్నాఁడో చూడుఁడు :

'బలం కస్మా ద్వర్ధ యిత్వా పరస్య
నిజా న్పక్షా త్కర్శయిత్వా సహాయాన్,
నిరుష్య కస్మా ద్వర్ష పూగా న్వనేషు
యుయుత్ససే పాండ వాహీనకాలమ్.'

౨౬-అధ్యా. ౨౦ పద్యము.

ఇందు నాతెనిఁగించినప్రకారము—

'పెరుఁగనిచ్చితి వేల నీయరిబలంబు?
నీసహాయులఁ గృశియింపఁజేసి తేల?
అడవిఁ బెక్కేండ్లు వసియించి తయ్య? యేల
కడచె కాలంబు చివ్వకుఁ గడఁగె దిపుడు.'

అని యనుచున్నాఁడు. పదుమూఁడు సంవత్సరములు ప్రవాసము చేసి వచ్చినంతమాత్రన యువకుఁడైన ధర్మరాజును నీవు ముసలివాఁడ వైతివని యిందు సంజయుఁ డనుచున్నాఁడు. ఇట్లన్న సంజయుఁడు ముసలివాఁడైన ధృతరాష్ట్రుఁ డీపదుమూఁడు సంవత్సరములకే పడుచువాఁ డైనవాఁడని చెప్పునా? చెప్పఁడు. కావున 'ధృతరాష్ట్రభూపతికి వృద్ధతకతమున' నను పద్యార్థము సంజయుఁడు ధర్మజునితోఁ జెప్పినది కాదు. తిక్కన చేసినపని తప్పు.

౯. (e) ఇంక నాయవలక్ష్యము చెప్పుచున్నాను జూడుఁడు.—

యుద్ధము చేయుట పాపమనియు, బిచ్చమెత్తి కొమ్మనియు సంజయుఁడు తనతోఁ జెప్పినమీఁదట ధర్మరాజు వాని నాక్షేపించి యవ్విషయమయి సభలోఁ దనచెంత నున్న మహానుభావుఁడయిన కృష్ణుఁ డుపన్యసింపఁగలఁడని వానితో ననియెను. దానిపయిని గృష్ణుఁడు సంజయునివాదము ఖండించుచు ధర్మజునివాదమును బోషింపుచు సంజయునితోఁ జెప్పిన ధర్మవాక్యము లేఁబదియేనిమిదిపద్యంబులుగల యిరువదితొమ్మిదవయధ్యాయములో వ్యాసుఁడు వర్ణించినాఁడు. ఆయుపన్యాసమధ్యంబున నోరెత్తలేక యుపన్యాసానంతరంబ ధర్మజుని సెలవడిగికొని కృష్ణునకు భక్తిపూర్వకముగ నమస్కరించి సంజయుఁడు హస్తినాపురమునకు మరలిపోయెను. అట్లు సెలవడిగికొన్న మాటలు వినుఁడు:—

"ఆమంత్రయే త్వాం నరదేవదేవ
గచ్ఛామ్యహం పాండవ, స్వస్తి తేఽస్తు,
కచ్చిన్న వాచా వృజినం హి కించి
దుచ్చారితం మే మనసోఽభిషంగాత్."

ఇది వ్యాసుని ముప్పదియవయధ్యాయములో మొదటిపద్యము. దీనికి నా తెనుఁగుపద్యము—

"సెలవు గైకొని పోయెద క్షితిపవర్య,
పాండవా, నీకుఁ గావుతఁ బరమశుభము.
చాలఁ బలికితిఁ జిత్తక్షోభమంగమునను
అందుఁ దప్పాడఁగడు కొంచెమైనఁ దండ్రి."

ఇది యిట్లుండఁ దిక్కన మహాకవిమూర్తుఁడైన శ్రీకృష్ణుని మహోపన్యాసవాగ్ధోరిపూరముమధ్యంబున సంజయునిచే ననుమహానుభావునితో నొకమాట యాడించినాఁడు. అవ్విషయమై కొంచెము చెప్పవలయునది గలదు. వినుఁడు.

కృష్ణోపన్యాసమైన యేఁబది యెనిమిదిశ్లోకములలో రెండుశ్లోకము లుగ్గడించుచున్నాను. అవి యెవ్వియనిన,—

౧. 'ప్రియాం భార్యాం ద్రౌపదీం పాండవానాం
యశస్వినీం శీలవృత్తోపపన్నామ్,
య దుపైక్షంత కురవో భీష్మముఖ్యాః
కామానుగే కోపరుద్ధాం వ్రజంతీమ్.'

౨. 'తాం చే త్తదా తే సుకుమారవృద్ధా
అవారయిష్యన్ కురవః సమేతాః,
మమ ప్రియం ధృతరాష్ట్రోఽకరిష్యత్
పుత్రాణాంచ కృత మస్యా భవిష్యత్.'

అనునవి. ఈశ్లోకంబులకు నా తెనుఁగుపద్యంబులు—

'సుకుమారులం బ్రియభార్య పాండవులకున్
గావల్గణీ శీలమం
దును వృత్తంబున సాటి లేనియదియున్
లోకంబులోనన్ యశ
స్విని యా ద్రౌపది ముట్టుతోడ సభలో
భీతిల్లి తా సూత యే
డ్వ నుపేక్షించిరి భీష్మముఖ్యులగున
వ్వారైన యా కౌరవుల్.'

'అప్పుడు తత్సభయందుల నుండిన
యట్టిరు కౌరవు లెల్లరుఁ దా
మొప్పుగఁ బల్కిఁ జెడ్డ నప్పని
యొల్లక మాన్పిన నారయికేఁ
జెప్పెదఁ జూడుము నాకుఁ బ్రియంబును
క్షేమమునుం దనపుత్రులకుం
దప్పక చేసినవాఁడ యగుం గద
తా ధృతరాష్ట్రుఁడు సూతసుతా!'

అనియై యున్నవి.

ఏఁబదియెనిమిది మూలశ్లోకంబులు గల కృష్ణోపన్యాస మిరువదియైదు పద్యగద్యములలోఁ దిక్కనసోమయాజి తెనిఁగించినాఁడు. అం దిప్పుడు మాపెద రెండు శ్లోకములకు—

'పెట్టిన సభలో నేవుర
కట్టెదుర నరాతితనము గా కుంతేయు వా
రెట్టెకులువలో ద్రౌపది
నట్టుపఁటబది రోరులు నూదమాడెరె యెందున్.'

'అనవుడు సంజయుం డను దేవా నీచిత్తంబున నిడి దీని నింత గొనియాడినఁ గర్జం బోడఁగూడునే యనిన వాసుదేవుం డిట్లనియె.

'అత్తఱి భీష్మముఖ్యులగు
నచ్చటివృద్ధజనంబు లెల్ల నో
రెత్తక యూరకుండిరి మ
హీశ్వరుచిత్త మెఱుంగకున్కిఁ దా
నొత్తి కుమారులం గినియ
నోపఁడ యక్కట మాన్పఁ గన్న నా
చిత్తము గాదు లోకముల
చిత్తము లెల్లను సంతసింపవే.'

అని తెనుఁగు రచించినాఁడు.

తిక్కనవిరచితమైన యీపద్యములలో మూలశ్లోకములభావము సరిగా వచ్చినదా లేదా యనువిషయము నాచదువరులకే యెఱుక కాఁగలదు కావున దానింగూర్చి నేను మాటలాడను గాని రెంటినడుమను గల "అనవుడు సంజయుం"డను వచనవిషయమయి కొంచెము మాటలాడెదను. ఆవచనములోనియర్థము మూలంబున లేదు. అందు "దేవా నీచిత్తంబున నిడి దీని నింత గొనియాడినఁ

నష్టంబగునే" యని తిక్కన సంజయునిచేతఁ గృష్ణునితో ననిపించినమాట లర్థశూన్యంబులై యున్నవి. ఆమాట లిప్పు డుచ్చరింపఁగూడదు. మహానాయకుఁడైన కృష్ణుఁడు మహావేగముతో మహాసభలో మహాగర్వంబు లుపన్య సించుచుండెనని యనఁదగినటు మాటలాడఁగలఁడా? మాటలాడినటు తెలివితేమి గాదా? "అనిన వాసుదేవుఁ డిట్లనియె" నని తిక్కన కల్లమాట చెప్పెనాఁడు గాని యా సంజయునిమాటకుఁ గృష్ణుఁడు ప్రత్యుత్తర మిచ్చి నాఁడా? ఆమాట కృష్ణుఁడు నాటించినాఁడా? ఆమాట కృష్ణుఁడు వినిపించికొన్నాఁడా? తిక్కనరచనప్రకా రము సంజయుఁడు వెఱ్ఱిమొఱ్ఱిమాట లాడినాఁడు. ఆవెఱ్ఱి మొఱ్ఱిమాటలలోఁ గూడఁ దుర్యోధనుఁడు దోషి యని యొప్పుకొనుచున్నాఁడు. మా రాజు దోషములను నాయన వంకవారిదోషములను నీచిత్తమునం దుంచికొనవలయని కృష్ణునితో ననుచున్నాఁడు. చిత్తమునం దుంచికొని కొనియాడవల ననుచున్నాఁడు. ఈ కొనియాడవలయను మాట యియ్యర్థమందు సూక్ష్ముండైన సంజయుఁడు కృష్ణునియట్టి మహానుభావునితో ననఁదగిన దగునా? కొనియాడినఁ గర్ణుం బొడఁగూడకునే యని సంజయుఁ డడుగుచున్నాఁడు. కర్ణ మెద్ది? శుష్కప్రియములతోఁ గూడిన తనదౌత్యమా? అట్టితనదౌత్యము నెఱవేఱుట కృష్ణునకుఁ గావలయునా? కృష్ణుఁడు తనమిత్రుఁడా, తన కీడుజోడువాఁడా! కర్ణ మెడఁగూడునే యని యడుగుటకు? ఇవి చులుకనిమాటలు. చులుకనిమనుష్యు లాడికొనుమాటలు. సంజయుఁడు ధీరపురుషుఁడు. ఇట్టి మాట లెన్నఁడు నాడువాఁడు కాఁడు. ఆతఁ డిట్లాడె నేని నోరు మూసికొమ్మని కృష్ణుఁ డనఁగలఁడు. కృష్ణో పన్యాస మయినపిదప నయినను సంజయుఁ డాయనతో మాటలాడుటకు సాహసింపలేక ధర్మరాజును సెలవడిగి కొని కృష్ణునకు నమస్కారముమాత్రము చేసి తనరాజు నొద్దకు మరలిపోయెను. ఈసందర్భమున సంజయుని విషయములోఁ బాత్రగుణౌచిత్యము తిక్కన చెఱచి నాఁడు. ఈవిషయములో నేఁబదియెనిమిదిశ్లోకములు గల వ్యాసునిమూలమైన యిరువదితొమ్మిదవ యధ్యాయ మును, నేఁబదియెనిమిదితెనుఁగుపద్యములుగల నాయిరు వదితొమ్మిదవ యధ్యాయమును, దిక్కన ప్రథమాశ్వాస ములోని 3౮3-3౮౪-3౮౫-3౮౬ నాలుగుపద్యంబు లును జూడుఁడు. నాయభిప్రాయముయాథార్థ్యము స్పష్టపడఁగలదు. గ్రంథవిస్తరభీతిచే నవి యిం దుద్ధ రింపనైతిని.

౯. (f) ఇంక నేడవలక్ష్యము చూపుచున్నాను:—

మూలములోని యఱువది రెండవ యధ్యాయ ములో మొదటియాఱు శ్లోకములలోను దుర్యోధనునితోఁ గర్ణుఁడు గర్వాలాపములు పలుకుచున్నాఁడు. అందు 'ద్రోణభీష్ములను సర్వమహీపతులను నీయొద్దన యునిచి కొమ్ము. నే నొక్కఁడన పోయి యుద్ధము చేసి పాండ వాదులను వధించి సమస్తలోకములు నీ కిచ్చెదను; నిజ ముగ నిప్పని భారము నాదియే సుమా' యని ప్రతిజ్ఞ చేయుచున్నాఁడు. ఈసందర్భమునకు సంబంధించిన రెండు శ్లోకములకు నా తెనుఁగు పద్యంబు లివె చూడుఁడు:—

'మేలగు నమ్మునీంద్రుదయ
మేకొని సర్వకరూపముఖ్యపాం
చాలురఁ బుత్రపౌత్రయుత
సర్వపృథాతనుజాతజాతముం
గూల నిమేషమాత్రమునఁ
గొట్టి ధరావరశస్త్రరాజిచే
నోలి సమస్తలోకముల
నొక్కట గెల్చి బలే యొసంగెదన్'.

'జనవర, ద్రోణభీష్ములను
సర్వమహీపతులైనవారలన్
గొనకొని నీకడన్నిలిపి
కొమ్మిఁక నాదు ప్రధాన మాబల
మ్మును గొనిపోయి పాండవులఁ
బోరను వేగ వధించి వత్తు నే
నిననిభతేజ నిక్కముగ
నీపనిభారము నాదియే సుమీ!'

ఇవి కర్ణునిగర్వాలాపములు; అఱువది రెండవ యధ్యాయములోని యైదాఱుపద్యములు.

ఇట్లు కర్ణుఁడు పలికినపిమ్మట నైదుశ్లోకములలో భీష్ముఁడు కర్ణుని బీకొట్టుచున్నాఁడు. యుద్ధములోఁ గర్వసహితముగాఁ గౌరవు లందఱును నాశమగుదురనియుఁ, గృష్ణసాహాయ్యముచే నర్జునుఁడు గెల్చుననియు నంటుఁ జెప్పుచున్నాఁడు. దానిమీఁద రోషము పుట్టి కర్ణుఁడు పండ్రెండుఁ బదుమూఁడు నగు శ్లోకములలో భీష్మజీవితావధిగా నస్త్రసన్న్యాసముచేయుచున్నాఁడు. భీష్ముఁడు పడినవెనుక యుద్ధమునకుఁ బోయి తనప్రభావము రాజులందఱకుఁ జోద్యమగునట్లు చూపెదనని ప్రతిజ్ఞ చేయుచున్నాఁడు. పదుమూఁడవ శ్లోకమునకు నా తెనుఁగు పద్య మిందుఁ బొందుపఱచుచున్నాను చూడుఁడు:—

'విడిచితి నస్త్ర మే నిపుడు
భీష్ముఁడు జీవముతోడ నుండఁగాఁ
గడఁకటి యుండువాఁడ సభఁ
గయ్యము పొంతకుఁ బోవనొల్ల నా
తఁడు పడువెన్కఁ జూపెదను
దద్దయు నాదుప్రభావ మెల్ల నీ
పుడమిని నేలువారలగు
భూపతు లెల్లరుఁ జోద్య మందఁగన్.'

ఇట్లు పలికి కర్ణుఁడు సభలోనుండి చయ్యన లేచి యింటికిఁ బోయెను. ఈరెండవప్రతిజ్ఞనుబట్టి భీష్ముఁడు జీవించియున్నంతకాలము యుద్ధములో నెంతకౌరవనాశమయినప్పటికిని, దుర్యోధనుఁడు వధింపఁబడి నప్పటికిని గర్ణుఁడు తాను జూచుచు నూరకుండెదనని చెప్పినట్టులే యైనది. దానిమీఁద భీష్ముఁడు పెద్దనవ్వు నవ్వి యుద్ధభారము తనయొక్కనిదే యని ముందు ప్రతిజ్ఞ చేసి తోడనే యస్త్రసన్న్యాసము చేసినదానికి కర్ణు నపహసించుచు, తమవ్యూహములకుఁ బ్రతిగా భీముఁడు తనవ్యూహము లమర్చి తలలను దునుమాడి లోకక్షయము చేయఁగ మీ రందఱును జూచెదరని దుర్యోధనునితోఁ బది యేనును బదియాఱు నగు శ్లోకములలోఁ జెప్పుచున్నాఁడు. ఈ శ్లోకములకు నా తెనుఁగుపద్యము లివె చూడుఁడు:—

'ఔరా యెంతటిసత్యవాక్కితఁడు తా
నావంత్యచేదిధ్వజుల్
వీరుల్ బాహ్లికుఁడుం జయద్రథుఁడుఁ గా
ళింగుల్ కన న్నే ద్విష
ద్వీరశ్రేష్ఠుల లక్షలక్షల రణో
ర్విం గూల్తు నం చెల్లనాఁ
డారం బల్కను దీర్చు నెట్టులొకొ తా
నాభార మోఘావరా!

'మనవ్యూహములకుఁ బ్రతిగాఁ
దనవ్యూహంబుల నమర్చి తలలను దునుమా
డినవాఁడై లోకక్షయ
మును భీముఁడు సేయఁ గంద్రు పౌరన్ మీరల్.'

ఇట్లు భీష్ముఁడు పలుకుటయు దుర్యోధనుఁడు రోషకషాయితస్వాంతుఁడై భీష్మద్రోణాదులసాహాయ్యము తనకు వలదనియుఁ దా నొక్కరుండ కర్ణదుశ్శాసనుల సాహాయ్యముచేఁ బాండవుల నేవురను వధించెదననియుఁ బలికి భీష్ము నవమానించినాఁడు. దీనికి నిదర్శనముగ నఱువదిమూఁడవయధ్యాయములోని మొదటి యైదుశ్లోకములకు నా తెనుఁగుపద్యంబు లిం దుదాహరించుచున్నాను చూడుఁడు.

'పదురతోడ సమానులుఁ
బదురువలెఁ బుట్టినట్టివారలుఁ బార్థుల్
మది నత్యంతముఁ దలఁచెద
వది యేలా వారె గెలుతు రనుచును దాతా.

'వీను వీర్యమునఁ బరాక్రమ
మున వయసునఁ బ్రతిభ నస్త్రమున శ్రుతమునను
ఘనకౌశలమున వేగం
బున శూరసమృద్ధి నయ్య పూరుషవర్యా.

'సములము వేమును వారును
సమజాతీయులము మర్త్యజన్ములము గదా
యమరుఁను వారికె గెలుపని
యమరనదీపుత్ర, యెట్లు లంటివి చెపుమా.

'కాదు నిను నమ్మి ద్రోణుని గాదు నమ్మి
కాదు కృపబాహ్లికుల నమ్మి కాదు రాజు
లైనయితరుల నమ్మి భీమాహవమున
కేను గడఁగుట విక్రమ మెసక మెసఁగ.

'ఏ నొక్కరుండఁ గర్ణుని
తో నాతమ్ముఁ డనునట్టి దుశ్శాసనుతో
నోసేసి వాఁడియమ్ముల
తో నేవురు పాండవులను దురమునఁ గూల్తున్.'

ఈవిషయములో మహాభారతకర్తయైన వ్యాస మహామునిరచన యిట్లున్నది. గ్రంథవిస్తరభీతిచే నేను మూలశ్లోకము లుదాహరింపక నాతెనుఁగుపద్యములు మాత్ర ముదాహరించినవాఁడను. అధ్యాయసంఖ్యయును, శ్లోకసంఖ్యయును జెప్పినవాఁడను గానఁ బండితులు మూలమును జూచికొనవచ్చును. పద్యమునకుఁ బద్యము చొప్పునఁ దెనిఁగించిన నాయుద్యోగపర్వములోని యధ్యాయసంఖ్యయును బద్యసంఖ్యయును మూలము ననుసరించియే యున్నవి. నాయుద్యోగపర్వము వ్యాస మూలమువలెనే నిర్గద్యముగా నున్నది.

కర్ణుఁ డస్త్రసన్న్యాసమును జేసినంతమాత్రమున బెంగపెట్టికొని యుద్ధము మానవలదనియుఁ, గర్ణునికంటెఁ దాను మేలుగ యుద్ధము చేసి శత్రుసంహారము చేసెద ననియు దుర్యోధనునితో భీష్ముఁడు గర్వాలాపములు పలికిన ట్లిందెందును లేదుగదా! తథ్య మిట్లుండఁగాఁ, దిక్కనరచన యెట్లున్నదో చూతము:—

కర్ణుఁ డస్త్రసన్న్యాసము చేసిన సందర్భమునఁ దిక్కన కవిత్వము:—

'నీకు నాలావుతోడ్పాటు లేకయుండ
వలయు నీతెగునంతకుఁ గలన నిలువ
నాయుధంబులు విడిచితి నంతమీఁద
మెఱసి బలువిక్రమంబులు నెఱపువాఁడ.

'అని యస్త్రసన్న్యాసంబు చేసి కొలువున నిలువ నొల్లక దిగ్గన లేచిపోయె నట్టియెడ శాంతనవుండు నవ్వుచు దుర్యోధనునితో నిట్లనియె.

'అంతకుఁ జాలఁడె కర్ణుం
డింతవు మను బాస యిచ్చి యెన్నఁడు బొంకం
డింతటిమానిసి యలిగినఁ
గౌంతేయుల కెట్లు బ్రదుకఁగా వచ్చు ననిన్.

'అని వెండియు నిట్లను నా
తనిమాటల కెట్లు గడఁగి ధర్మతనయుతో
ననిసేయక తక్కవు నీ
వనుమానము వాయఁజూఁడు మతనిని నన్నున్.

'ఏను బాహ్లికద్రోణ ప్రముఖులు గనుంగొను చుండఁ బ్రతివీరుల ననేకసహస్రంబుల సమయించెదఁ బిదప రాధేయురణంబునం జూచెదవు గాక యనిన విని దుర్యోధనుండు కర్ణపక్షపాతియు, ననినీతుండును నగు టంచేసి సహింపక పితామహుతో నిట్లనియె.'

ఇవి తిక్కన రెండవ యాశ్వాసములోని ౭౯, ౮౦, ౮౧, ౮౨, ౮౩ అను పద్య గద్యములు.

౮౧-వ పద్యములో "నిచ్చి" యనుక్త్వార్థక రూప మేల ప్రయోగింపఁబడెనో తెలియదు. దీని కేమి గాని, యిందుఁ గర్ణుఁడస్త్రసన్న్యాసము చేసినంతమాత్రమున బెంగపెట్టికొనవలవని భీష్ముఁడు దుర్యోధను నూఱడించినట్లును, యుద్ధము మానవలవనియుఁ, గర్ణునికంటెఁ దాను మేలుగ యుద్ధము చేసి శత్రుసంహారము చేసెద ననియు గర్వాలాపములు పలికినట్లును దిక్కనయొక్క—

'అని వెండియు' నను ౮౨ అనుపద్యమువలనను,

'ఏనుబాహ్లికద్రోణప్రముఖులు గనుంగొనుచుండఁగ' నను, ౮౩-వ పద్యమువలనను గనఁబడుచున్నది.

౮౨-వ పద్యముయొక్క యర్థముమాత్రము తేటగా లేదు. పద్యములోనివాక్యరచన యనర్థము (unhappy) గా నున్నది. తిక్కనభావము తెలుపుటకుఁ బద్యము—

'అని వెండియు నిట్లను నా
తనిమాటల కెల్లఁ గడఁగి ధర్మతనయుతో
ననిసేయక తక్కఁడు నీ
వనుమానము వాయఁగొడు మతనిని నన్నన్.'

అని దిద్దితిమేని కొంతవట్టు బాగుగ నుండును.

ఇట్లు భీష్ముఁడు దుర్యోధనుపక్షమున గర్వాలాపములు పలికినట్లు మూలంబున లేదనియు, భీముఁడు కౌరవవధ చేయఁగలవాఁడని యాతఁడు పలికినవాఁడనియుఁ బ్రమాణము చూపుమఁ బయిని నేను జెప్పియున్నాను. బాహ్లికుఁడు కురువృద్ధుఁడు మహారాజు. ఆతఁడు భీష్ముఁడువలెనే పాండవులకు రాజ్యభాగమిమ్మని దుర్యోధనునకు బుద్ధిచెప్పిన పుణ్యాత్ముఁడు. ద్రోణుఁడును కౌరవపక్షపాతియే తానుభోలెనే పాండవులతో సమవ్యథనొందువా రుభయులు మెచ్చునట్లు పాండవుల వధించెదనని భీష్ముఁడు పలికెననుట యవివేకము. ఇంతవెఱ్ఱి యున్నదా? పాండవులతో యుద్ధము చేయుమని దుర్యోధనునితోఁ జెప్పుస్వభావము గలవాఁడా భీష్ముఁడు? కర్ణునికంటెఁ దా నెక్కువవాఁడనని యమ్మహానుభావుఁడు చెప్పికొనుటకుఁ జనియును లేదు. అట్లు చెప్పికొనుటలో నాయనకు గొప్ప లేదు. కర్ణుఁ డాయనకాలిగోరికిఁ బోలఁడు. కర్ణుఁడు తుచ్ఛుఁడు: భీష్ముఁడు మహాత్ముఁడు. కర్ణుఁ డబలుఁడు: భీష్ముఁడు మహాబలుఁడు. కర్ణుఁడు బొంకరి: భీష్ముఁడు సత్యవ్రతుఁడు. కర్ణుఁ డర్ధరథుఁడు: భీష్ముఁడు మహారథుఁడు. కర్ణుఁడు కౌరవులకు భృత్యుఁడు: భీష్ముఁడు కౌరవులకు మేటి. కర్ణుఁడు శిష్యకోటిలోనివాఁడు: భీష్ముఁడు గురుకోటిలోనివాఁడు. కర్ణుఁడు పరశురామునిశిష్యుఁడై యుండియు బొంకరి యనిపించికొని తనధనుర్విద్య తన్ను విడిచిపోవునట్లామహానుభావునిచే శపింపఁబడినవాఁడు: భీష్ముఁడు కర్ణునిగురువును, భూమిమీఁదఁ గల సమస్త క్షత్రజాతంబుల నిఱువదియొక్కమాఱులు పరశుస్ఫారకుఠారధారచేఁ ద్రుంచినమహాయోద్ధయును, విష్ణ్వవతారపురుషుఁడు నైన పరశురాముని జయించిన బల్లిదుఁడు. కర్ణుఁడు పాండవులకు రాజ్యభాగ మీవలవదనియు, వారితో యుద్ధము చేయవలయుననియు దుర్యోధనునకు దుర్మంత్రము చెప్పు దుర్బుద్ధి: భీష్ముఁడు పాండవులకు రాజ్యమియ్య కపహరించుట ద్రోహమనియు, వారితో యుద్ధము చేయవలదనియు దుర్యోధనునకు బుద్ధిచెప్పు మహోత్తమపురుషుఁడు. కర్ణుఁ డుత్తరగోగ్రహణములో నర్జునునిచే నోడిపోయియుఁ దనరాజయిన దుర్యోధనుని గూడ నాతనిచే నోడించియు, ఘోషయాత్రలో వానిని గోలుపోయియు నర్జునుసామర్థ్యము ఖాండవదహనాదులయందుఁ బలుమాఱులు చూచియు, లోకగురువును మహావీరుఁడు, నజయ్యుఁడును, భగవంతుండు నగు శ్రీకృష్ణుఁడు వానికిఁ దోడని యెఱింగియుఁ, బాండవులను వధించి భూచక్ర మెల్ల నేకచ్ఛత్రముగా దుర్యోధనుని చేత నేలించెదనని ఢగ్గులు గొట్టు మూఢుఁడు: భీష్ముఁడు తత్త్వగ్రాహియై పాండవుల గెలువలేమనియు, వారికి రాజ్యమియ్యనియెడ యుద్ధములోఁ జచ్చి నోట మన్ను గొట్టికొనిపోవుట సంభవించుననియు దూరదర్శియై, ధర్మవేత్తయై దుర్యోధనాదులకు బుద్ధిచెప్పిన జ్ఞాని. పాండవులు ద్రుపదపురోహితునిచేఁ గౌరవులకు మొదట సందేశము పంపినప్పుడు వారికి రాజ్య మీయవలదని కర్ణుఁడు చెప్పఁగా నీమారదర్శి పల్కిన వాక్యము వినుఁడు—

'ఇది యీ బ్రాహ్మణుచెప్పిన
యది యీగతిఁ జేయమేని యని వారలచేఁ
దుదిఁ జచ్చి నోట మన్నే
యదిరా కొట్టికొనిపోదు మటు మనమెల్లన్.

ఇది వ్యాసోద్యోగ పర్వమందలి యిరువదియొకటవ యధ్యాయములోని పదియేడవపద్యమైన—

'నచే దేవం కరిష్యామో
యదయం బ్రాహ్మణోఽబ్రవీత్,
ధ్రువం యుధి హతా స్తేన
భక్షయిష్యామ పాంసుకాన్.

అనుదానినిబట్టి నేను దెనుఁగునఁ జేసినపద్యము.

ఇదియును గాక పాండవులను దాను గొట్టఁజాలనని వక్ష్యమాణంబున రథాతిరథసంఖ్యానపర్వములో దుర్యోధనునితో భీష్ముఁడు స్పష్టముగాఁ జెప్పు

చున్నాఁడు. ఈదివఱ నుదాహరించిన ౧౭౩ అను నధ్యాయములోని ౨౧ యను మూలశ్లోకమును నా తెనుఁగుఁబద్యమును జదువుఁడు:—

'సర్వాం స్త్వన్యాన్ హనిష్యామి
పార్థివాన్ భరతర్షభ,
యాన్ సమేష్యామి సమరే
నతు కుంతీసుతాన్ నృప.'

'ఆహవంబున నేఁ దాఁకునట్టి యితర
పార్థివుల నెల్లరం గొట్టువాఁడ నరుడు
నింకొకటి చెప్పెదను నృపా, యిదియు వినుము
కొంతికొడుకుల నెవరినిం గొట్టఁజాల.'

మఱియుఁ దాను బరశురాముఁడును నొండొరులతో యుద్ధమాడుచుండ నయ్యుద్ధము మాన్పించుటకు యుద్ధరంగమున కూర్ధ్వలోకమునుండి వచ్చిన పరశురాముని పితృప్రపితామహులు, భీష్ముఁడు నీచేత వధ్యుఁడు కాఁడనియు, నర్జునునిచేత వధ్యుఁడుగా స్వయంభువు విధించెననియును బరశురామునితోఁ జెప్పిరని దుర్యోధనునితో భీష్ముఁడు ఈనే వక్ష్యమాణంబున నంబోపాఖ్యానములోఁ జెప్పుచున్నాఁడు. ౧౮౬ అను నధ్యాయములోని ౧౮-౨౦ యను నను శ్లోకములు చూడవలయును. వానికి నా తెనుఁగుపద్యము లివె చూడుఁడు:—

తరల—

'తనయ భీష్ముఁడు గంగకుద్భవ
ధారుణీస్థలి శంతనుం
డనునరేంద్రునకుం జనించిన
యట్టిఁడౌ వసు వారయన్
ఘనయశస్కుఁడు నీకు నెట్టులు
గా జయింపఁగ నౌను వా
ని నిఁక నిప్పుడు మానఁగాఁ గదె
నెమ్మియుద్ధము భార్గవా.

'పాండవశ్రేష్ఠుఁడై పరఁగుచుండెడువాఁడు
నింద్రకుమారుఁడై యెసఁగువాఁడు
బలియుఁడై వీరుఁడై వఱలుచుండెడువాఁడుఁ
బూర్వంబు దేవుఁడై పొలుచువాఁడు
సాహ్యంతములు లేక యమరుచుండెడువాఁడుఁ
దొలిప్రజాపతి యాచు వెలయువాఁడు
భార్గవా నరుఁడని పరఁగినట్టిపురాణ
మునివరుం డర్జునుం డనెడువాఁడు
సవ్యసాచి యటంచు నుజ్జగములందు
వినుతి గాంచిన వీరుండు భీష్మున కిలఁ
గాల మగుతఱి మృత్యువుగా విధింపఁ
బడె స్వయంభువుచేత నోవత్స తండ్రి.'

సంగతు లిట్లుండఁగా, మహాపురుషులు నోట వచింపరాని రజ్జులు భీష్మమహాపురుషునినోటఁ బెట్టి తిక్కనసోమయాజి యాయన కపచారము చేసినాఁడు.

'........ ............ఆ
తనిమాటల కెట్లు కడఁగి ధర్మతనయుతో
ననిసేయక తక్కువు నీ
వనుమానము వాయఁ జూడు మాతని నన్నున్.

'ఏను బాహ్లికప్రముఖులు గనుఁగొనుచుండఁ బ్రతివీరుల ననేకసహస్రంబుల సమయించెదఁ బిదప రాధేయు రణంబు చూచెదవు గాక.'

అని భీష్మునిచోటఁ దిక్కన పెట్టిన పలుకుల యర్థము మూలమున లేదు. తిక్కన పలికించిన ట్లేపలుకులు భీష్ముఁడు తనశీలమునకు విరుద్ధముగను, నిజమునకు విరుద్ధముగను పలికియుండెనేని దుర్యోధనుఁడు తాను సంతోషింపవలయుననికి రోషకషాయితస్వాంతుఁడు కానేల? సంతోషించి భీష్ముని బూజింపవలయుననికి నేను యుద్ధమునకుఁ గడఁగుట నిన్ను నమ్మి కావనియు, నీతో సమానముగాఁ బూజ్యులయిన ద్రోణకృపాదుల నమ్మి కావనియు నని భీష్ము నపమానింప నేల? రెండు పరస్పరవిరుద్ధప్రతిజ్ఞలు చేసి యస్త్రసన్న్యాసము చేసిన కర్ణునిని, చినతమ్ముఁడైన దుశ్శాసనునిని బెట్టికొని పాండవ వధ చేసెదనని భీష్మునితో నిష్ఠురము లాడ నేల? అంత వెఱ్ఱివాఁడా దుర్యోధనుఁడు? లక్ష్మి తనంతటఁ దా వచ్చెద నన్న నేవెఱ్ఱివాఁ డడ్డిమను? కావున బాహ్లిక ప్రముఖులు గనుఁగొనుచుండఁ బ్రతివీరుల ననేకసహస్రంబుల సమయించెద నను నివి లోనుగాఁగల పలుకులు భీష్మునివి కావు. అవి కర్ణునివి. కర్ణుని ప్రతిజ్ఞావాక్యాలు

భీష్ముం దుగ్గడించి యెత్తిపొడిచినాఁడు. వ్యాసుని యఱు వదిరెండవ యధ్యాయములోఁ బదియాఱవ శ్లోకమయిన-

'అవంత్యా కాళింగ జయద్రథేషు
చేదిష్వజే తిష్ఠతి బాహ్లికేచ,
అహం హనిష్యామి సదా పరేషాం
సహస్రశ శ్చాయుతశశ్చ యోధాన్.'

అనునది సమన్వయించికొనుటలోఁ దిక్కన పొర పడినాఁడు. తిక్కన వ్యాసమూలమును విడిచి తన త్రోవను బోయినాఁడనియు, భాషాంతరకారుఁ డట్లు పోవచ్చుననియు నందురేమో! ఒకవేళ మూలముకంటె భిన్నముగాఁ గాని, మూలమునకు విరుద్ధముగాఁ గాని భాషాంతరకారుఁడు కథను బుద్ధిపూర్వకముగాఁ గాని, యబుద్ధిపూర్వకముగాఁ గాని మార్చికొనినను మార్చికొన వచ్చును గాని, తనరచనలోనే పూర్వాపరములకుఁ బర స్పరభేద మునుపఁగూడదు. పాత్రవృత్తౌచిత్యము చెఱుపఁ గూడదు. ఇవి మహాదోషములు. ఇక్కడి రెండు దోషములును దిక్కన చేసినాఁడు.

తిక్కనయం దొకదోషము కలదు. అతఁడు తన గ్రంథములోని మహాపురుషులచేత మాటలాడించునపుడు వారి శీలవృత్తములు జాగరూకతతోఁ బరిశీలింపక, ప్రమత్తుఁడై, తన జీవితకాలములోఁ దనకుఁ బరిచితులైన పామరజనుల శీలవృత్తంబులు జ్ఞప్తిలో నుంచికొని యా పామరజనుల కలవడిన స్వల్పపుమాట లొక్కొక్కప్పు డా మహాపురుషులనోటఁ బెట్టును. ఈదోషము మహాకవి యైన వ్యాసమహాముని కెక్కడను లేదు. తిక్కనయొక్క యీదోష మీ నావ్యాసముయొక్క యీ తొమ్మిదవ సంటి (Paragraph) లో నే నిచ్చిన ౧-౨-౩-౪-౫-౬-౭-౮-౯ యను నవలక్ష్యములవలన స్పష్టపడఁగలదు. ఈలక్ష్యములలో వృత్తౌచిత్యము చెఱుపఁబడ్డ మహాపురుషులు సంజయుఁడు, బలరాముఁడు, ధృష్టఁడు, భీష్ముఁడు, నకులుఁడు, సహదేవుఁడు నను నాఱుగురు గలరు.

౯. (G) ఇంక నెనిమిదవలక్ష్యము చూపుచున్నాను:—

పాండవులు శ్రీకృష్ణునిఁ గౌరవసభకు దూతగాఁ బంపునపుడు నకులుఁడు శ్రీకృష్ణునితోఁ జెప్పినమాటలు వ్యాసుఁ డుద్యోగపర్వములో నెనుబదియవ యధ్యాయములోఁ బదునెనిమిదిపద్యములలోఁ జెప్పినాఁడు. నకులునితాత్పర్యము యుద్ధమువిూఁదనే యున్నది గాని సంధిమీఁద లేదు. వ్యాసునిమూలము ననుసరించి నకులుఁడు 'ధర్మరాజును, భీముఁడును, నర్జునుఁడును సంధి చేయుమని నీతోఁ జెప్పిరి. నీవును దదనురూపముగాఁ బలికితివి. ఈసంభాషణ మటుంచి శత్రువులతో మాటలాడి వారియభిప్రాయము విని యప్పటిస్థితినిబట్టి యేది చేసిన బాగుండు నని నీకుఁ దోఁచునో యది చేయుము కృష్ణా' అని కృష్ణునితోఁ జెప్పుచున్నాఁడు. మఱియును గార్యంబులవిషయమయి యభిప్రాయంబులు కాలాను సరణముగ మాఱుచుండుననియును, ముందు మేము వనవాస ముండినప్పుడు రాజ్యకాంక్ష మాకు విశేషముగా లేదనియును నేఁడు నీయనుగ్రహముచే నేడక్షౌహిణుల బలము దొరకుటంజేసి యాకాంక్ష విశేషముగా నున్నదనియును, మాయిప్పటిబలమునను సరించి వైరులు మాతో యుద్ధమాడ వెఱతురనియును గూడ నకులుఁడు చెప్పుచున్నాఁడు. దీనికి నిదర్శనముగా వ్యాసునిమూలపద్యములు పది నాతెనుఁగుపద్యముల సహితే మివె చెప్పుచున్నాను:—

వ్యాసపద్యంబులు:—

౧. 'ఉక్తం బహువిధం వాక్యం ధర్మరాజేన మాధవ'
ధర్మజ్ఞేన వదాన్యేన శ్రుతంచైవేహ తత్త్వయా.

౨. 'మత మాజ్ఞాయరాజ్ఞశ్చ భీమసేనేన మాధవ,
సంశమో బాహువీర్యంచ ఖ్యాపితం మాధవాత్మనః.

౩. 'తథైవ ఫాల్గునేనాపి యదుక్తం తత్త్వయాశ్రుతమ్,
ఆత్మనశ్చ మతం వీర కథితం భవతా సకృత్.

౪. 'సర్వ మేత దతిక్రమ్య శ్రుత్వా పరమతం భవాన్,
య త్ప్రాప్తకాలం మన్యేథాః తత్కుర్యాః పురుషోత్తమ.] .

౫. 'తస్మింస్తస్మిన్నిమిత్తేహి మతం భవతి కేశవ,
ప్రాప్తకాలం మనుష్యేణ క్షమం కార్య మరిందమ.

౬. 'అన్యథాచింతితో హ్యర్థః పున ర్భవతి సోన్యథా,
అనిత్యమతయో లోకే నరాః పురుషసత్తమ.

౭. 'అన్యథా బుద్ధయో హ్యాసన్ అస్మాసు వనవాసిషు,
అన్యత్వే ష్వన్యథా కృష్ణ పృశ్యేషు పున రన్యథా.

౮. 'అస్మాకమపి వార్ష్ణేయ వనే విచరతాం తదా,
న తథా ప్రణయో రాజ్యే యథా సంప్రతి వర్తతే.

౯. 'నివృత్తవనవాసాన్నః శ్రుత్వా వీరసమాగతాః
అక్షౌహిణ్యోహి సప్తేమాః త్వత్ప్రసాదా జ్జనార్దన.

౧౦. 'ఇమాన్ హి పురుషవ్యాఘ్రాన్ అచింత్య బల పౌరుషాన్,
ఆత్తశస్త్రాన్ రణే దృష్ట్వా నవ్యథేదిహ కః పుమాన్.'

నా తెనుఁగుపద్యములు:—

'ఉర్వి ధర్మజ్ఞుఁడును వదాన్యుండు నౌచుఁ
బరఁగు నీధర్మరాజు తా బహువిధములఁ
జెప్పె నీతోడ సంధేని యొప్పు మీఱ
మాధవా వింటి' వీవు నమ్మాట లెల్ల. ౧

'ఘనమైన బాహువీర్యము
తనకుఁ గల దటంచు నృపుమతము చొప్పున సం
ధిన చేయవలయు నంచును
జనార్దనా చెప్పె నీకుఁ జన భీముండున్. ౨

'అట్టె ఫాల్గునుఁ డాడిన
యట్టిపలుకు లెల్ల వింటి వయ్యా నీదై
నిట్టి యభిప్రాయంబును
నట్టిది యని లెస్స చెప్పి తీవును వీరా. ౩

'ఇదియెల్ల నట్టు లుంచుచు
విదితముగా శత్రుమతము విని సర్వము నీ
వెది తఱికిఁ దగిన దని తలఁ
తదియే సేయంగవలయు నంబుజనాభా. ౪

'వివిధకార్యంబులందును వెలయుచుండుఁ
దగ నభిప్రాయములు వివిధంబు లౌచు
జనుఁ డరిందమ, కాలానుసరణముగను
జేయఁ దగునది చేయఁగా సిద్ధి యౌను. ౫

'ఒకవిధముగఁ దలఁచినపని
యొకవిధముగ నౌను గాఁ మఱొక్కప్పుడు దా
నికిని నభిప్రాయములుం
బ్రకటంబుగ మాఱుచుండు మహిఁ బురుషులకున్. ౬

'ఒకవిధము వనమునం దొం
డొకవిధ మజ్ఞాతమందు నొకవిధ మిపుడుం
బ్రకటముగ మాకుఁ గోరిక
లు కృష్ణ వేర్వేరు విధములుగ నయ్యెఁ గుమా. ౭

'అడవులఁ దిరుగుచునుండెడు
నెడ మాకున్ రాజ్యకాంక్ష కృష్ణా విను మి
య్యెడ నున్న యంత పెద్దగ
నెడంద లేదయ్యె నిక్క మెన్నఁడుఁ జువ్వే. ౮

'వనవాసముం జే వచ్చితి
మని విని యి ట్లాలునొక్క యక్షౌహిణులై
చనుబలము నీప్రసాదము
న నిపుడు చేకూడినది జనార్దన మాకున్. ౯

'బలమును బౌరుషమును గడుఁ
గలిగి రణము సేయఁబూని ఘనమౌ శస్త్రం
బులు దాల్చిన యీపుంవ్యా
ఘ్రములఁ గని భయపడఁ డెవండు క్షోణిం గృష్ణా.' ౧౦

ఇది యిట్లుండఁగాఁ దిక్కనసోమయాజి నకులునిచేత శ్రీకృష్ణున కేమని చెప్పుచున్నాఁ డంటే— 'కృష్ణా, ధర్మరాజును భీముఁడు నర్జునుఁడును సంధి చేయుమని నీతోఁ జెప్పుచున్నారు. ఆచెప్పుట వ్యర్థముగాఁ జెప్పుట కాదుసుమా. ఆప్రకారముగా సంధి చేయింపుము. పూర్వము వనవాసము నజ్ఞాతవాసమును జేయుచున్నప్పుడు మేము మిక్కిలి యుత్సాహముతో నుంటిమి. ఇప్పుడు నీప్రసాదమున నేడక్షౌహిణులబలము చేకూడినపిమ్మట దుఃఖమగ్నమనస్కులమై యున్నాము తండ్రీ' యని చెప్పించుచున్నాఁడు.

ఇది యంతయు వ్యాసమూలమునకును, నిజమునకును, న్యాయమునకును విరుద్ధముగా నున్నది. మఱియును గౌరవులు మనలను గష్టపెట్టినను మనము వారితోఁ గ్రూరముగా యుద్ధము చేయఁగూడదనికూడ నకులుని చేతఁ గృష్ణునితోఁ దిక్కన చెప్పించుచున్నాఁడు. అట్లు చెప్పించు కథపట్టునఁ దిక్కన తన కభ్యస్తమైనరీతిని "ఒకఁడు పశువును గొట్టినాఁడని యొకఁడు దూడను గొట్టవచ్చునా" యను నొకసామెతకూడఁ బ్రయోగించి

నాఁడు. ఈపామెత గాని దీనిభావ మిచ్చువాక్యము గాని వ్యాసమూలములో లేదు. ఈసామెత మూలకథకు విరుద్ధముగాఁ గూడ నున్నది. ఇది నకులునిపౌరుషమును జంపివేయుచున్నది. దీనికి నిదర్శనముగాఁ దిక్కన యుద్యోగపర్వ తృతీయాశ్వాసములోని ౯౦-౯౧ యను పద్యంబులఁ దుగ్గడించుచున్నాను జూడుఁడు:—

'అనిన ముకుందుతో నకులుఁ
డెల్లన యిట్లను నీవు ధర్మజుం
డును బవనాత్మజుండు నరుఁ
డుం దగఁ జెప్పుట రిత్తగాదు మా
మనము లరణ్యవాసమున
మత్స్యమహీపతిచాల నున్న య
ద్దినములభంగి గాదు కృపఁ
దీవ్రతఁ గుందినచంపె మయ్యెడున్. ౯౦

'కడవఁగ నొకళ్లు పగరము
నడిచిన నొకళులకుఁ బెయ్య నడుపవలయునే
చెడు తెరు వాకౌరవ్యుల
కడ నిలుచుం గాక మనకుఁ గ్రౌర్యం బేలా.' ౯౧

ఈకథాసందర్భంబున నకులుని శీలవృత్తంబులు తిక్కనసోమయాజి సంప్రార్థముగఁ జెప్పచినాఁడు. తన కన్నులముందరఁ బుట్టి తనకన్నులయందరఁ బెరిఁగిన పాండవకౌరవులకుఁ బితామహుఁడును, వారితోఁ గలసి మెలసి సంచరించుచు వారికిఁ బరిపడ్డప్పుడు బుద్ధులు చెప్పిన జ్ఞానియును, జిరంజీవియును, త్రికాలవేదియు నయిన వేదవ్యాసమహర్షి కవీంద్రునకంటె మొన్నటివాఁడయిన తిక్కనసోమయాజి కెక్కువ తెలిసెను గాఁబోలు నకులుని శీలవృత్తములు!

మహాకవి యైనవాఁడు తనకావ్యమందలి మహాపురుషుల మహాగుణములను మఱవక జ్ఞప్తిలో నునిచి కొనవలయుపనికి మహావీరపురుషుఁడును, క్షత్రియుఁడును, ద్వాపరయుగము నాఁటివాఁడును నయిన నకులుని గలియుగములోఁ దనపరిచితకోటిలోనివాఁడును, బామరుఁడును, బందయు నగు నొకకర్షకుఁడు [పొలము దున్నికొని బ్రదుకువాఁడు] గా నెంచి యాకర్షకున కనుగుణములైన మాటల నమ్మహావీరునిచేతఁ దిక్కనమహాకవి పల్కించినాఁడు. ఇట్లు చేయుట సోమయాజి కభ్యస్తమయిన మహాదోషమని ముందు చెప్పియేయున్నాను. మూలాధారము లేక యీయన ప్రయోగించుసామెతలు తఱచు కృషివ్యవహారముతో సంబంధించినవియు, భోజనవ్యవహారముతో సంబంధించినవియు నగును. కావున నిదియును జనుమవరుల కెఱుంగఁ జెప్పుచున్నాను.

౯. (H) ఇంకఁ గొన్నిమూలవ్యాసము చూపుచున్నాను జూడుఁడు:—

శ్రీకృష్ణుఁడు రాయబారిగాఁ బోవు కథాసందర్భమున సహదేవుఁ డాతనితోఁ జెప్పుమాటలు వ్యాసమూలమునుబట్టి యొట్టిపెట్టుగా నున్నవి.

'ధర్మరాజు సంధిచేయుమని నీతోఁ జెప్పుట సనాతనపుధర్మ మైనప్పటికిని యుద్ధమే కర్తవ్యము. కౌరవులు యుద్ధ మొల్లక సంధి కోరినప్పటికిని యుద్ధమే యగునట్లు చేయవలయును. ఆరీతిని ద్రౌపదిని సభలోని కీడ్వఁగాఁ జూచియుండియు దుర్యోధనుని జంపక విడిచితిమేని నాకుఁ గోప మడఁగదు. ధర్మరాజును భీముఁడు నర్జునుఁడును మువ్వురును ధర్మాత్ము లయినను నేను ధర్మము విడిచిపెట్టి దుర్యోధనునితో యుద్ధము చేయనే కోరుచున్నాను కృష్ణా.'

అని సహదేవుఁడు స్పష్టముగా నతితీవ్రముగా సక్రోధముగాఁ జెప్పుచున్నాఁడు. దీనికిఁ బ్రమాణముగా వ్యాసునిమూలపద్యములును, నారచించిన తెనుఁగుఁబద్యములును జెప్పుచున్నాను జూడుఁడు:—

భగవద్యానపర్వములో ౭౧ యను నధ్యాయములో ౧-౨-౩-౪ యను మూలపద్యములు:—

౧. 'యది తత్కథితం రాజ్ఞా ధర్మ ఏష సనాతనః,
యథాచ యుద్ధమేవ స్యాత్తథా కార్య మరిందమ.

౨. 'యది ప్రశమ మిచ్ఛేయుః కురవః పాండవైస్సహ,
తథాపి యుద్ధం దాశార్హ యోజయేథాః సహైవ తైః.

౩. 'కథంను దృష్ట్వా పాంచాలీం తథా కృష్ణసభాగతామ్,
అవధేన ప్రశామ్యేత మమ మన్యు స్సుయోధనే.

౪. 'యది భీమార్జునౌ కృష్ణ ధర్మరాజ శ్చ ధార్మికాః,
ధర్మ ముత్సృజ్య తేనాహం యోద్ధు మిచ్ఛామి
సంయుగే.'

ఈపద్యములకు నా తెనుఁగు పద్యములు:—

'ఎది రాజు చెప్పె నీక
య్యదియ సనాతనపుధర్మ మైనను విను మో
యదునందన యేవిధమునఁ
గదనం బగు నల్ల విధమ కార్యము సువ్వే.''

'కురుసుతులు పాండవులతో
దుర కొల్లక సంధి కోరుదురయేనియు నా
కురుసుతులతో నవశ్యము
నుర మే యన నట్లు చేయు తోయజనాభా. ౨
'ఆకీతి నాడు ద్రౌపది
నాకీమణి సభకు నీడ్చినం గనియును నా
రారాజుం జంపమే నిక
నేకేతిని గోప మడగు గృష్ణా నాకున్. 3
'జననాథుండును క్షేమమె
ధనంజయుండు మువ్వు రధికధార్మికు లైనం
జన విడిచి యేను ధర్మం
బని బోవంగ గోరువాడ నాతనితోడన్.' ౪

ఇది యిట్లుండంగా దిక్కనయును సహదేవుని మాటలు నాలుగుపద్యములుగానే చెప్పినాడు గాని మూలములోని రస మందుం జేడెయ్యేను. ఆతనినాలుగు పద్యములు నిందు వ్రాయుచున్నాను జూడుడు:—

'దక్కనమాట లాడెదరు
రాజును దమ్ములు వానిలోన నీ
వొక్కటి యైనం గా దనక
యూంకొనుచుండుట యంతకంటె మే
లక్కట యిట్లు వేడికొన
నైనను బోయెదు వో సుయోధనుం
డెక్కడ భూమిలోన సగ
మిచ్చుట యెక్కడ దానవాంతకా.
'తలంపం గూడునె యింతలేసి దొర లీ
దైన్యంబు చుట్టంబులుం
జెలులుం దిట్టరె లాంతిరాజులకు మె
చ్చే యివ్విధం బిట్టిదిం
గలదే వేడంగ ధర్మజుం డడుగంగ బోం
గాం గృష్ణుం డాధార్తరా
ష్ట్రులు పా లీక చలంబునం బెనంగ ని
ట్లుం గూడె తీపయ్యెనే. ౨
'వీరలు ధర్మమార్గము న
విస్తరతం దగ నాడిరేనియున్
వారలు దీని కియ్యకొని
వన్ విను మచ్యుత యట్టిసంధి పెం
పారంగ నేర్చునే యుచిత
మైనది కయ్యమ వంకమాట లే
నేరం గురుప్రవీరుసభ
నిశ్చయ మిట్టిద కాంగం జెప్పుమీ.
'తుది రాజ్యమ్ము సగమ్ము గొమ్మనడియుం
దుం బేరు వంచించియుం
బనుమూండేండులు నీవునుం దిరిగి రా
వా లీకపో వచ్చునే
యది కాదేం దెగి బంటవై యలుము మా
యల్ పన్ను నేర్పింకం జె
ల్లదు సూ నీ కని యాసుయోధనుని యు
ల్లం బుచ్చిపో నాడుమీ.'

ఈనాలుగును మూలములోని యనుష్టుప్పులువోలెం గాక పెద్దపెద్దవృత్తములు. ఇందు రెండవపద్యములో ఛందస్సునకు వ్యాకరణము బలిపడ నియ్యంబడ్డది. ఇవి పెద్దవృత్తములే కాని మొదటిరెండుపద్యములలోను గల భావము మూలమునం దెక్కడను లేదు. మూండవపద్య మైనను మూలము ననుసరింపదు. వీరలు సంధి యడిగినను వారలు సంధి కంగీకరించినను నాసంధి నిలువదని సహదేవుండు భయపడుచున్నట్లు లీమూండవపద్యము చెప్పుచున్నది. దీనిభావము సహదేవునకు సంధిమీందం గోరిక యున్నట్టులే యనుచున్నది. ఇది మూలమునకు విరుద్ధము. ఇంక నాలవపద్య మున్నది. అది సమన్వయించుటకే యనువుగాం గానిపింపదు. అందు వాక్యసందర్భము సుష్ఠుగా లేదు. దుష్టము (unhappy) గా నున్నది. అయినను మొత్తముమీంద నీవు మాభాగ మియ్యవలయు ననియు, న ట్లియ్యవేని బంటవై యుద్ధము చేయు మనియును దుర్యోధనునితోం జెప్పుమని మాత్రము సహదేవుండు కృష్ణునిం గోరినట్లు దానిభావ మైనట్లు కానుపించుచున్నది. ఇదియు సహదేవునకు సంధి యిష్టమయినట్టులే స్పష్టముగాం జెప్పుచున్నది. మూలములోని పౌరుషవాక్యములు సహదేవునినోటం దిక్కన పెట్టనే లేదు. సామవాక్యములతోనే కాలము గడపుచున్నాండు. సహదేవపాత్రవిషయములో గుణౌచిత్యము సంపూర్ణముగాం జెఱచినాండు. మూలముయొక్క రసము గ్రహింపక, పాత్రముయొక్క గుణము గ్రహింపక సంధిసంధి యని యొకటే పాట పాడుచున్నాండు.

౧౦. నేను జేయంగల విమర్శన మింకనుం గలదు గాని గ్రంథవిస్తరభీతిచే నింతటితో నిప్పటికి విరమించుచున్నాను.

---

# కవితాదౌర్బల్యము

తుమ్మపల్లి వేంకటరత్నము గారు

ఇది యొకమల్లితీగె యిది యెంతయుఁ గోమల మిప్పుడిప్డె మొ
గ్గ దొడుగుచుండె, నిద్ది యొకకమ్మనిపూ వపరంజితేనెతోఁ
బదనయినట్టిమాహృదయపాకముపై రుచిపడ్డ మిండతు
మ్మెదలు తుషారమాడుచును మీఁదికిమీఁదికి వచ్చివ్రాలెడున్.

ఈమల్లెమొగ్గ యిం కేముహూర్తపుఁబెండ్లి కూఁతుకీల్జడనుఁ గీల్కొనఁగవలెనో?
ఈమల్లెమొగ్గ యిం కేదాసరికిఁ గొండిసిగ నెన్నడిమిచక్కిఁ జేరవలెనో?
ఈమల్లెమొగ్గ యిం కేబజారుబోజుంగు కంకళమాలలోఁ గలియవలెనో?
ఈమల్లెమొగ్గ యిం కేసభాధ్యక్షుకంఠంపుఁగత్తెరదండ నింపవలెనో?
సందెవెన్నెలలోఁ బూలసజ్జపైని - భ్రమరవల్లభశుభగరుత్పంజరమునఁ
గాఁకచే నీరుగారెడుకన్నులందు - యెప్పు డెక్కడ నుండునో యెవని కెఱుక?

నరుఁడా, నీయదికూడ నొక్కబ్రతుకేనా, పుష్పపాత్రంబులం
దొరపై నిండినతేటతేనియలతో నున్మత్తతం గొన్న, బం
భరసంరంభరసంబు చూఁచితివె, నీపాండిత్యముల్ చాలు చా
లుర, తిర్యక్కులె, కొంతమేలగుట యాలోచింపఁ వెల్లంబగున్.

కరములం బూని నలిబిలి గాఁగ నలిపి-పూలలోపలి వగరుపుప్పొడిదుమార
ముల నెగాదిగఁ బీల్చుట తెలివియగునె! దానిలో తియ్యతేనియ లానలేక.

అట్టివాఁడవు నీవు పూవందుగలుగు - రసముఁ దీసి కషాయము రచన సేసి
యేమిటో కవిత్వ మేడ్చిన నేమిగలదు - యేసరసు డిప్పదార్థంబు నిచ్చగించు.

లేదు నీలోపలను శక్తి లేశమైన - భూమిలోఁ గలవస్త్వనుభూతికొఱకు
అనుభవంబు లతీతంబులైనపిదప - విమలరీతిని, మూర్తీభవించుఁ గైత.

---



బాటసారి

చిత్రకారుడు: శ్రీ వానపాముల సత్యనారాయణ గారు.

# నన్నయయతులు—కొన్నిటీగతులు

నడకుదటి వీరరాజు పంతులుగారు

(అష్టమసంపుట ప్రథమసంచికా శేషము)

### ౪. సరసయతులు

ఏకస్థానజన్యత్వము, ఉచ్చారణబంధుత్వము మొదలగుసరససౌహార్దలక్షణములు గలిగి యుండు హేతువుల నాధారపఱుచుకొని మన పురాతనకవీంద్రులు,

అ,య,హ—ఇవి పరస్పరమును,

ణ, న—ఇవి యన్యోన్యమును,

చ, ఛ, జ, ఝ, శ, ష, స—ఇవి యితరేతరమును

యతిమైత్రిఁ జెందునట్లు తమగ్రంధముల యందు ప్రయోగించియుండుటంజేసి యాంధ్ర లాక్షణికులు వీనికి 'సరసయతులు' అని నామకరణ మొనర్చిరి. విన్నకోట పెద్దన వీనినే "ఇతరేతరవర్గజవళులు" అని వ్యవహరించెను. నామభేదమే కాని కార్య మొక్కటియే. నన్నయభట్టారకునిభారతమునఁ దక్కినగ్రంథములయందుంబోలె సరసయతులు పైలక్షణము ననుసరించియే యున్నవి.

ఆంధ్రకవుల 'యతిమైత్రి' విధాన మేక సూత్రనిబద్ధమై యుండలేదు. అట్లుండుటకును వలనుపడదు. కొన్ని యక్షరములు సావర్ణ్యము హేతువుగా మైత్రి నొందుచున్నవి; కొన్నిటికి సావర్ణ్యము వర్తింపదు. కొన్ని పలుకుబడి చుట్టఱికము గలిగి వెలయుచున్నవి. కొన్ని యితరకారణములచేఁ బొత్తు సేయుచున్నవి. వీనివివరణము వేఱొకవిమర్శమున విపులముగ విశదీకరింపఁబడును.

### ౫. ఏకతరయతులు

ఆంధ్రకవీంద్రులయసామాన్యప్రతిభావిశేషమును వెల్లడించు యతినియమములలో 'ఏకతరయతి' మిక్కిలి ప్రశంసనీయమైనది. ఏమన,—

ఇంతదనుక వివరింపఁబడినరీతిని, భాష యందుఁ గల యక్షరములలోఁ జాలవఱకు (స్వర, వర్గ, సరసయతులక్రింద) రెంటికింబైఁ దక్కువ గాని వర్ణము లొక్కొకగణముగఁ జేరి, పరస్పరమైత్రి నొందుచున్నవి. న, ణ (౨); అ, య, హ (3); ట, ఠ, డ, ఢ (౪); ఇ, ఈ, ఋ, ఎ, ఏ (౫) మొదలగునవి. *

ఇఁక నన్యాక్షరములు వేనితోడను పొత్తు సేయక తమకుఁ దామె విశ్రాంతిసౌఖ్యము నెఱపెకొనునవి

మ, ర, ఱ, ల, వ

అనునైదువర్ణములుమాత్రమే. సనాతన కవిమతమునఁ బ్రత్యేకత్వము నొంది వెలయు చున్నవి. కావుననే వీనికి—ఏకతరయతులు,

* ౪,౫—వీనినిగూర్చి వేఱొకచోఁ జూడనగును.

లేక, ఎక్కటివడులు—అని మనపూర్వులు పేరిడిరి.

కవిజనాశ్రయముద్రితపుస్తకమునఁ గాన వచ్చు

"క. మ్మ,ర,య్య,ల,సము లనునేన
క్కరములు సమతమకె వళ్లు..."

అనుపాఠమును, దానిపాఠాంతరములును లేఖకాదిప్రమాదసంజనితములు. ఏమైన, పై వానిలోని యకారము సరసవడితరగతియందు చేరి, అ, హాలతో విరామమైత్రి నందుచునే యున్నది. అట్టిది యేకతరయత్యక్షర మెట్లును గానేరదు. కావున, "మ,ర,అ,ల,న..."అనియే కవి వ్రాసియుండును.

ఏకతరయతుల నామలక్షణములను బట్టి యాగణమునఁ జేరినయొక్కొక్క యక్కర మును దనకుఁ దానే కాని వేఱొకదానితో యతిమైత్రి నొందరా దనుటయే యాదికవుల-తెలుఁగుకవిత్వము పుట్టినకాలమున దానికి నియమముల నేర్పఱిచికొనిన సనాతన కవుల—మతమైనట్లు స్పష్ట మగుచున్నది. ఇట్టిప్రక్లృప్తనియమము గల యివ్యేకతరయ త్యక్షరములు కాలక్రమమున నుచ్చారణభేద, లేఖనభేద, కవిప్రయోగస్వాతంత్ర్యాద్యనేక హేతువులచేఁ దమ నియమబంధనమునుండి యొక్కటొక్కటిగ జాఱుచు, తుదకు నామ మాత్రావశిష్టము లయ్యెను. వానివివరణము సంగ్రహముగ నీక్రిందఁ దెలుపఁబడుచున్నది:-

మ—దీనికి మకారముతోనే యతి.
"హానితసత్యభాష! యభి-మన్యు..."
నన్నయ, ఆదిపర్వము.

ఇట్లే మకారగుణితాక్షరముల కెల్ల నా యాస్వరమైత్రి గల మకారగుణితాక్షరముల తోనే యతిఁ గూర్పవలసియుండెను. కాని, యీమకారము శృంగసహితమై ప్రప్రథమ మున 'విభక్తిమకార'మనుపేరు దాల్చి పు,ఫు, బు, భు లతోడను, వానిమిత్రము లగు పో, ఫో, బొ, బో...లతోడను మైత్రిసేయ నారం భించినది. *

మఱియు నీమకారము, క్రమక్రమముగా, పూర్ణబిందుపూర్వకము లగు ప, ఫ, బ, భ, య, ర, ల, వ, శ, ష, స, హ— అనునక్షర ములతోసయితము విరతి నొందవచ్చు నను లక్షణము తరువాతికవుల ప్రయోగములనుబట్టి యేర్పడినది! ఏకతరయత్యక్షరముగాఁ దొలు దొలుత నిర్ణయింపఁబడిన మకారమునకుఁ గాలక్రమమున నెంత స్వేచ్ఛ యీయఁబడినదో యాయాలక్ష్య లక్షణములనుబట్టి యెఱుంగ వచ్చును.

నన్నయభట్టారకుని భారతమునమాత్ర మీదృశమగు(రెండవ)మకారయతి గానరాదు.

ర, ఱ—ఆంధ్రకవిత్వ మవతరిల్లిన యాదికాలమునాఁడీయక్షరద్వయమునకు లేఖ నభేదముతోపాటు, ఉచ్చారణభేదము సయి తము స్పష్టముగా నుండినట్లు స్ఫురించు చున్నది. అక్కాలమున వీనికి నేమాత్రపుఁ

* తరువాతఁ గేవలము కారముసయితము విభక్తి మకారము చేసెడికార్యమునే చేయసాగినది!

బలుకుబడి మట్టుతీక ముండియున్నను, ఇతరాక్షరములు వేనితోడను సంబంధము లేని యేకతరయత్యక్షరములలో నివి చేర్పఁబడియుండుటయుఁ, దక్కిన అ, య, హా; న, ణ... మొదలగువానివలె సరసయతులయం దైన నివి చేర్పఁబడకుండుటయుఁ బొసఁగియుండనేరదు. కావున నతిప్రాచీనకాలమున రేఫద్వయమునకు నెట్టి మైత్రియు లేకుండె ననుట స్పష్టము.

శకటరేఫోచ్చారణము, కాలక్రమమున సడలిపోయి, నన్నియభట్టునకుఁ బూర్వము పుట్టిన యుద్ధమల్లునిబెజవాడశాసనమునాఁటికే సాధు రేఫోచ్చారణసామ్యమును జెందినట్టు లాశాసనములోని "చేఁబ్రోలు, చేఁబ్రోఁలు" అను లేఖనమునుబట్టి మనముగ్రహింపవచ్చును. మఱియుఁ బ్రాచీనశాసనములయందు కొన్ని పదము లిట్టిరూపద్వయలేఖనము గలవి గానంబడుచున్నవి. ఈ హేతువువలన నన్నియభట్టారకాదులకు మిక్కిలియుఁ బూర్వమే యీ రెండు రేఫములును బలుకుబడిచేరికను బొందియున్నట్లును, వీని కిట్టిచేరిక గలుగక పూర్వమే యీ యేకతరయతిలక్షణ మేర్పడినట్లును స్పష్టమగుచున్నది.

ఈ రేఫద్వయమునుగూర్చి తరువాతి ఛందోగ్రంథకర్తలు పొందినపాట్లు కడుంగడు శోచనీయములుగాఁ గన్పట్టుచున్నవి. వీనిం గూర్చి "నన్నియప్రాసములు" అనువిమర్శమున విపులముగఁ జర్చించెదను.

భట్టారకమహాశయుని భారతభాగమున యతిప్రాసములపట్టులం దుపయోగింపఁబడిన శకటరేఫయుక్తపదములు ౬౦ మాత్రమే కలవు. వానిలోఁ గేవలయతిస్థానమునఁ బ్రయుక్తమైనది యొక్కటిమాత్రమే చూపట్టుచున్నది:—

"కాఱ్ఱులఁ బెట్టితి వీవు నీచి-ఱుతకాలమునన్."
ఆదిప. చతు. ౨౬౯.

ఆంధ్రకవిత్వలక్షణజ్ఞత కెల్ల రేఫద్వయవిజ్ఞానమే ప్రధానమైనదిగాఁ బ్రాచీనకాలమునఁ బరిగణింపఁబడుచు వచ్చినట్లు గానంబడుచున్నది. కాని, తత్పాటవము కాలక్రమమున శిథిలమైపోయినను వానికలయిక గూడదనునియమముమాత్రము లక్షణగ్రంథములయందు పారంపర్యముగా వచ్చుచుండుట, మనవారికిఁ గల ప్రాచీనలక్షణాభినివేశమును సూచించుచున్నది!

ల—ఆంధ్రకవితాలక్షణము ప్రప్రథమమున నేర్పఱుపఁబడునాఁటికి సాంధ్రాక్షరమాలికయందు ళకారము చేరియుండలేదో, లేక సంస్కృతమర్యాద ననుసరించి లళలకభేదము పాటింపఁబడినదో కాని, లకారముమాత్రమే యేకతరయత్యక్షరముగా మన ప్రాచీనలాక్షణికులచే నిర్ణయింపఁబడినది. మఱియు,

"అగ్ని మీళే పురోహితమ్. ఋగ్వేదము.
"యత్ర విశ్వం భవ త్యేకనీళమ్." యజుర్వే.

ఇత్యాదిగ వేదములయందు ళకారముచ్చరింపఁబడుచున్నను, పాణినిమహాశయుఁడు దానిని బ్రత్యేకాక్షరముగఁ బేర్కొని యుండలేదు. కాని, వరరుచ్యాదులు దానిని

గ్రహించిరి; ఆగమజ్ఞులు ద్రోసివైచిరి. ప్రాకృతభాషయందును, మంత్రశాస్త్రమునందును దాక్షిణాత్యభాషలు కొన్నిటియందును ళకారము గలదు.

పైసంగతులనుబట్టి ళకారము ప్రత్యేకాక్షరముగా దనెడిమత మొక్కటి గలదనుట విస్పష్టము. ఇంతియకాక మన తెలుఁగుబాసయందు,

వెడలు—వెళ్లు, మరలు—మళ్లు, కాలు—కాళ్లు; మొసలులు—మొసళులు, చోడ—చోళ &c. ఇవి మొదలగుపదముల యుచ్చారణాదివిశేషములచేత, ర, ల—వీని స్థానమున ళకారము ప్రవేశించుచున్నది. సంస్కృతభాషయందును,

ఈడే—ఈళే, హేడనమ్—హేళనమ్, &c. (ఉచ్చారణభేదసంజాతములు.)

తరలమ్—తరళమ్, బహులమ్—బహుళమ్, &c. (లేఖనోచ్చారణభేదసంయుక్తములు.)

ఇత్యాదిపదములు గలవు. పైహేతువుల నన్నిటినిబట్టియే మనపూర్వులు ళకారము నన్యాక్షరముగఁ బరిగణింపలేదని తోఁచెడిని. అట్లు గాకున్న నణ లనుంబోలె లళ లను నయితము సరసయతులలోఁ జేర్చియే యుందురు.*

వ—ఛందశ్శాస్త్రమున వకారము జాతివా యనియు, లాఁతివా యనియు రెండు విధములు గలది. పదముతోనే పుట్టినది జాతివా; సంధివశమున 'పకారము'న కాదేశముగా వచ్చినది లాఁతివా. ప్రాచీనకవిమతమున నీరెంఁడువకారములకే పరస్పరయతిమైత్రి లేదు! కావుననే,

"నాలుపడి నిల్చు 'లాఁతివా' ప్రాసమునకు
జాతివాకు సవర్ణమై శంక లేక;
యతికిఁ బంచమవర్గాద్య మపుడుఁజేసి
చెల్లదు పకారమునకు లక్ష్మీభుజంగ!"

అప్పకవీ. ద్వి ౨౪౯ ప

అని యప్పకవి వక్కాణించి యున్నాఁడు. ఇట్టిచో ప, ఫ, బ, భ లకు వకారముతో యతిమైత్రిఁ గలిగించుట సనాతనకవుల కిష్టమైనకార్యము గాదనియు, అట్లు గలిగించుచో, దానియేకతరయతిత్వము వ్యర్థ మగు ననియు స్పష్టపడుచున్నది. మఱియుఁ బురాతనలక్షణగ్రంథము లగు కవిజనాశ్రయ, కావ్యాలంకారచూడామణులందు ప వ లయతి పేర్కొనఁబడలేదు. అనంతామాత్యుఁడు పూర్వలాక్షణికుఁడే. అయిన నాతనిఛందోదర్పణమున,

"ప్రకట పకార వకార
ద్వికమునకును జను నభేదవిరతి నిశాట
ప్రకర మెరిసె రామునిసా
వనశరమున జనకసుత సెపంబున ననఁగన్."

ప్రథ. ౧౨౬ ప.

అనులక్షణము గాననగుచున్నది. ఈపద్యము,

"భర సెక్కటివళ్లయి తను
'లరమణివ'లు........."   ప్రథ. ౧౧౮ ప.

అను నాతనినిబంధనమునకుఁ బూర్వోత్తరవిరోధమును దెచ్చిపెట్టుచున్నది. కావున నీతఁ

* అనేకహేతువులనుబట్టి ళకారమన్యభాషలనుండియే తెలుఁగులోనికి వచ్చినట్లు కన్పట్టుచున్నది.

జిట్టిలక్షణమును వ్రాయుటకుఁ గారణమార యవలసియున్నది. నన్నియకవిభారతములోని

"పల్లభ! తక్షకాసముకె-పంబున" (ఆదిప.)

అను లేఖక ప్రమాదసంజనితపాఠము గల ప్రతి యాతనికి లభియించియుండుటయే యాతనియీలక్షణమునకు హేతువై యుండును. కావుననే యాతఁడు 'నెపము'నే లక్ష్యముగాఁ జూపినాఁడు! అట్లు గాదేని పవలయతిఁ జెప్పిన యక్కవీంద్రుఁడు తనగ్రంథముల (ఛందోదర్పణ, భోజరాజయ, రసాభరణముల)యందొక్కచోటనైన నిట్టియతిని బ్రయోగించి యుండఁడా? ఈ పవ లయతియందుఁ గలసందేహముచేతనే కాఁబోలు ననునట్లు, ఆలక్షణపద్యముక్రిందనే,

"...పూర్వప్రయోగంబు లెఱిఁగి యెవ్వి
బహుళమై తోఁచె నవి యొనర్పంగవలయు."

అని సూచించినాఁడు! కాన యీపవలయతి యనంతునికి సముచిత మిష్టమైనది గాదని యెంచవచ్చును. (లేదా, ఆలక్షణపద్యము ప్రక్షిప్తమైన నై యుండవచ్చును.)

## పవల-యతిమైత్రి

శబ్దశాసనమహాకవి భారతమున పవ లకు విరామమైత్రిని గూర్చె నని కొందఱయాశయము. అట్టియభిప్రాయము వారికిఁ గలుగుటకుఁ గారణమును గలదు. ముద్రితభారతపుస్తకములయందును, గొన్నివ్రాఁతప్రతులయందును నేఁడెనిమిదిచోటుల ప, బ, వ లు వకారముతో విశ్రాంతి నొకదు పాఠములు చూపట్టుచు వారిభ్రాంతికి హేతువులైనవి. కాని, యించుకంత విమర్శదృష్టితోఁ బరిశీలించునెడల, నొక్కనన్నియగ్రంథముననే కాక, యష్టదిగ్గజములగ్రంథములవఱకును గల యాంధ్రకవింద్రకోశములయందును పవలయతికి వైముఖ్యము గోచరింపఁగలదు. లేఖకప్రమాదసంస్కరణాదులు పూర్వగ్రంథములయందు చేరి, కృష్ణరాయలయనంతరము పవయతిని సిద్ధాంతీకరించినవి. ప్రస్తుతము నన్నియగ్రంథమునఁ గానవచ్చు ప, బ, వ-లకుఁ బరస్పరమైత్రి యున్నట్లు దోఁపించుప్రయోగములను గూర్చి విచారించెదను.

(౧)"మహీ, పల్లభ! తక్షకాసముకె-పంబున."
ఆదిప. ప్ర. ౧౨౫

నన్నియకాలమున 'నెవము'వాడుకలో నుండి యంతరించినది. అదియునుం గాక తాటియాకుపాత్రములలోని కొందఱవ్రాఁతయందు ప, వలు న, సలవలెనే విస్పష్టముగా నుండవు. పైహేతువులచేఁ గొన్నివ్రాఁతప్రతులయందు 'నెపంబు' అనుపాఠము దొరలినది. ఛందోదర్పణకారునకు లభియించినది యీపాఠమే యై యుండును. కాని శ్రీనాథునకు 'నెవంబు' అనియున్నప్రతియే చేకూరినది! కావుననే యాతఁడు,

"చివురుఁగెమ్మోవి చిఱుగాటు-నెవము గాఁగ."

అని తనశృంగారనైషధము (ఆశ్వా. ౮, పద్య. ౨౭.)నఁ బ్రయోగించి యాంధ్రకవి పండితవిమర్శకలోకమునకు సందేహము లేకుండ

విడఁగొట్టినాఁడు. ముక్కు తిమ్మనార్యుఁడును దన పారిజాతాపహరణమున (ద్వితీ. ౩౬-౭.)

"తనరి యమార్త్యనాథుపురి కెంపుల నాఁగన"

అని వ్రాసి నన్నియ శ్రీనాథుల ప్రయోగములను బ్రచారముచేసినాఁడు. కావున నన్నియ భట్టారకుఁడు పవ లయతిమైత్రి నొనర్చెనను టకుఁ బై ప్రయోగము సాధనము గాఁజాలదు. (ముక్కు తిమ్మనార్యుని గ్రంథమునను 'పవ' లకు యతిమైత్రి గానరాదు.)

౨. "ధ్యానా,పరతేంద్రియవృత్తి నున్న—వాని శమీకున్"
ఆది. ద్వి ౧౬౮

ఇదియుఁ బై 'నెపము' వంటిదే. లేఖక ప్రమాదమున 'ధ్యానా, పరతేంద్రియ' అను పాఠము కొన్నిప్రతులయం దేర్పడినది. అప రతపదముకంటె, ఉపరతశబ్దము సుప్రసిద్ధ మని యెంచి కాఁబోలు, కొందఱు 'ధ్యానో,పర తేంద్రియ' అని సవరించినారు. అవరత్యుపర తులు సమానార్థకములే కావున, 'ధ్యానా, వరతేంద్రియ' అనియే నన్నియ వ్రాసె నని నిశ్చయ మగుచున్నది. దానంజేసి పవయతి నిదియు సాధింపనేరదని చెప్పనగును.

౩. "సూనృత,వ్రత! యొకనాపి మేలు మఱి—వాపులు——"
ఆది. చతు. ౯౨.

ఇందు 'వాపులు' అనునది విన సొంపుగా లేదని కాఁబోలు, నేమహానుభావులో 'బావులు' అని దిద్దినారు! ఈతప్పుపాఠ మప్ప కవినాఁటికే పుట్టినదో, లేక, యీక్రొత్తపాఠ మునుబట్టి యాతనిగ్రంథమునఁగూడ సవరించి నారో కాని, అప్పకవీయమునందును (తృ. ౮౯) 'బావు' లనియే యుదాహరింపఁబడినవి. నన్నియభారతములోని యీపద్యము,

"శ్లో. వరం కూపశతా ద్వాపీ,
వరం వాపీశతా త్క్రతుః;
వరం క్రతుశతా త్పుత్రః,
సత్యం పుత్త్రశతా ద్వరమ్"

అనుదానికి భాషాంతరీకరణమై యున్నది. కావున వకార మేకతరయత్యక్షరముగా భావించు నన్నియభట్టారకుఁడు మూలమున నున్న వాపీశబ్దమునే యుపయోగించినా డనియు; దీనివలన వబ యతియు స్థిరపడలే దనియుఁ దెలియనగుచున్నది. [సభాప. ప్రథ. ౨౮౭ వ పద్యమునఁగల 'బావు'లనునదియుఁ బైదాని వంటిదే. 'ఆనంద'వారిప్రతి (౧౯౧౨ సం.) యందును, వావిళ్లవారి ప్రతియందును 'వాపు లు' అను పాఠము సూచింపఁబడియేయున్నది.]

౪. "ఆ, వారితశరసమితి నడుమ వారింపంగా."
సభా. ప్ర. ౧౯౭.

ఈపాఠమునకు మాఱుగా 'ఆ,పారశరావలుల' అను పవయతిపాఠము చిత్రముగ నుప్పతిల్లి ముద్రితగ్రంథముల కెక్కినది! కాని వావిళ్లవారుమాత్రము సరియైన పాఠమును జూపియున్నారు.

౫. "కా, ర్పనివారలఁ బగఱవలని—వారల."
సభా. ప. ౪౦

నేను చూచిన—అచ్చు—వ్రాఁత—ప్రతు లన్నిట నీపాఠ మిట్లే యున్నది. కాని, నన్నియమహాకవినాఁటి వ్యాకరణరూపము నూహించినచో దీనికి సరియైనపాఠము బయల్పడఁ

గలదు. ఎట్లన, కూర్చుధాతు వకర్మక మైన ప్పుడు దాని వ్యతిరేకార్థకవిశేషణరూపము 'కూర్వని' అని యగును. ఆర్చు, నేర్చు, ఓర్చు అనునవి యకర్మకము లైనప్పుడు, 'ఆర్వక — ఆర్వని, నేర్వని, ఓర్వని' అనురూపము లెట్లే ర్పడుచున్నవో, అట్లే కూర్చుధాతువునకును (అకర్మక మైనప్పుడు) 'కూర్వని' యేర్పడు చున్నది. కావుననే 'ద్యూతక్రీడకు నేర్తు, ఎం డకు నోర్చు, కూర్తురింతులు మాకు' ఇత్యాది ప్రయోగము లేర్పడినవి. అయిన నేమి? కాల క్రమమున సకర్మక మయినకూర్చుధాతువు వ్యతిరేకరూప మగు 'కూర్పని' యనునది యొకటి యుండుటం జేసి, నన్నయనాఁటి 'కూర్వని' నిజరూపమును గోల్పోయి, తాదా త్మ్యమును జెందెను. దానంజేసి 'కూర్పని' అనురూప మిప్పట్టున నసాధువు. కావున,

"పూ, ర్వనివారలఁ బగఱవలని-వారల"

అనియే నన్నయమహాకవి ప్రయోగించియుండు ననియు, నన్నయనాఁడు పవయతి లేదనియు మన మూహింపవచ్చును.

౬. "పేనోన్న తకుచములో లె-బెడఁగగుదానిన్."
ఆర. తృ. ౨౯౨.

ఈయుక్తమపాఠమునకుఁ బ్రతిగా "వెలిఁ గెడుదానిన్" అనుపాఠ మావిర్భవించినది! వావిళ్లవారియచ్చుప్రతియందుమాత్రము పూ ర్వపుఁబాఠము సూచింపఁబడినది. మఱియు,

"భీమేశ్వరంబున బెడఁ గగుచున్న శ్రీ
పర్వతంబును జూచి..."      అష్ట ౧౩౯.

అని వేఱొకచోట నన్నయార్యుఁడు పర్వ తమునకు బెడంగును గూర్చినాఁడు! కావున 'వెలిఁగెడు' అనుపాఠము ప్రక్షిప్తము.

౭. "కోరి యనేకయుగంబు ల
పారతపోయుక్తు లయిన-వారికి..."
అరణ్య ప్ర. ౩౭౧.

అనేకము లగువ్రాఁతప్రతులయందు నిది యిట్లే యున్నది. ఆంధ్రసాహిత్యపరిషత్కా ర్యస్థానమున నున్నప్రతులలో ౯౭౭ నెంబరు ప్రతియందు "కోరి...ల, వార *" అనియు, ౨౭౨ నెంబరు ప్రతిలో "కోరి... ,వారు" అనియుఁ బాఠములు గానంబడుచున్నవి. ఇవి యంతగా సంతృప్తికరములు గాకున్నను నన్న యభట్టారకుఁ డిచ్చోట వకారయుక్తపదమునే వ్రాసియుండె ననియే స్ఫురింపఁజేయుచున్నవి. యుక్తమగుపాఠమునకై భిన్నదేశపుఁబ్రతులను బరిశీలింపవలసియున్నది.

పైపాఠము నన్నయప్రయోగించినది గా దనుటకు నొక్కకారణమును జూపుచున్నాను. నన్నయభారతభాగమున యతిస్థానమునందు వకారముతోఁ గూడినపదములు ౯౭౧ను, పకారముతోఁ గూడినవి ౭౨౧యు, బకార యుక్తములైనవి ౩౭౧యుఁ గలవు. అన్నిప్ర యోగములలో, నొక్కచోట నైన, పవలకు

*శబ్దశాసనకవి క్కావడి కెచ్చటను యతిఁ గూర్పకపోవుటచేతను, "భాగ్యవంతులైన-భాగవతుల", "శల్యుఁ డట్లు నేలఁ-ద్రెళ్లి"-ఇత్యాదిప్రాసయతులను గూర్చియుండుటచేతను, 'అ, వార్య-' అని వ్రాసెనేమో యనునూ హము పొడకట్టుచున్నది. కాని యిది యింకను ధైర్యమునీఁజాలకున్నది. దీనింగూర్చి మఱియొకప్పుడు వ్రాసెదను.

యతిమైత్రి సంఘటించని నన్నయమహాశయుఁ డీయొక్కచోటమాత్రము ప్రాచీనకవిసమ్మతము గాని యయ్యతిని గూర్చియుండెననుట సమంజసము గాదు. సహృదయు లగువారి కారణ్యపర్వశిథిలావస్థ నీసమయమున జ్ఞప్తికిఁ దెచ్చుచున్నాను.

"ప్రసవముల చేపపూజల ప-
సారజపటంబులఁ జేసి నిష్ఠతో
నతులతపంబు సేసె..."

ఆర. తృ. ౬౮౫.

నాకు లభించినకొన్నిప్రతులయం దీభాగము లేదు. ఉన్నవానిలోఁ బెక్కిటఁ బైపాఠమే యున్నది. కాని, ఆం. సా. ప. కార్యస్థానమున నున్న ౨౬౭౮ సంఖ్య గలప్రతియందు, "...స-పారజలంబులనుండి నిష్ఠతో..."అనియు ఆంధ్రపరిశోధకమహామండలిప్రతులయం దొకదానియందు "......స-వంధ్యజపంబు" అనియు నున్నవి. ఈమార్పులనుబట్టి యాలోచింపఁగా నిచ్చటఁ గవిప్రయుక్తమగు పదముమాత్రము శిథిలమైనట్లును, దానిస్థానమున నెవరికిఁ దోఁచినట్లు వారు సవరించి రనియుఁ దోఁచుచున్నది.

పైపాఠమున ప్రతిశబ్దమొకటి గలదు. నన్నయభారతమున ప్రతి మనుపదము ౫౭ చోట్ల యతిస్థానమునఁ బ్రయోగింపఁబడినది. ఇచ్చటఁదక్క మిగిలినచోటుల నెల్ల వకారముతో యతి గూర్పఁబడినది. ఇన్నిచోట్ల లేని దీ యొక్కచోటనుమాత్రము కవి కక్కుఱితి పడియుండునా?

ఆదేశవకారము (లాఁతివా)

భట్టారకమహాశయుని భారతభాగమున యతిస్థానమునం దాదేశవకారములు ౪౨ గలవు. వానిలో నొక్కటిదప్పఁ దక్కిన వన్నియు, పకారముతోనే యతిమైత్రి నెఱపుచున్నవి. ఆయొక్కటియు (సభా. ప్ర. ౨౨):

"కృష్ణ, వేణి సరస్వతి-వెన్న యైరావతి"

ఇందు వెన్న యనునదియే సంధివశమున వెన్న యైనదికాని, భారతమునం దెల్లయెడల జాతివాకును, లాఁతివాకును విరతిని గూర్చని నన్నయకవీంద్రుఁ డీయొక్కచోమాత్రము గూర్చియుండునా యని విచారింపఁగా, నాగర లిపిగల సంస్కృతమూలమునం దీఘట్టమున, కూర్వనివారలఁ బగఅవలని-వారల"

"కాలిన్దీ, విదిశా, వేణా, నర్మదా, వేగవాహినీ"

ఇత్యాదిశ్లోకము గానవచ్చి మెనలేని యామోదమును జేకూర్చినది. మఱియు, భారతము లక్ష్మీపతిగారివ్యాఖ్యానమునం దీశ్లోకమే 'వేణ్నా'అనుపదముతో నుదాహరింపఁబడినది. కావున, నన్నయకవినాఁటికి నిది 'వేణ్ణా' అనురూపముతో నున్నట్లు తోఁచుచున్నది. దానంజేసి భట్టారకమహాకవి,

"వేణిసరస్వతి-వేణ్ణ యైరావతి"

అని వ్రాసియుండఁగా, పూర్వలేఖనసంప్రదాయము ననుసరించి లేఖకులు తాటియాకులపై 'వేణ్ణ'అనుదానిని 'వేణ్ణా' అని వ్రాయఁగాఁ గాలక్రమమున నదివెన్న యైనది! వెన్నయే పెన్న! లక్ష్మీపతిగారును దమభార

# మీ శిరోజముల కొరకు టానిక్



కేశ సంరక్షణము మున్నది. అప్పుడు మాడు మంచివృద్ధి చేయక గలిగించును. శిరోజములు క్షీణించును. అట్టి సమయములందు మీ వెంట్రుకల కొరకు టానిక్ అవసరము. మీ వెంట్రుకలను కాపాడుకొనుడు. వాటిని

## కా మి ని యా నూ నె (రిజిస్టర్డు)

వుపయోగించి పోషింపుడు.

బట్టతల, వెంట్రుకలు రాలిపోవుట, గడుకువైన సుకుప్పలు, వృద్ధాప్యము రాకమునుపే వెంట్రుకలు నెరియుట, మున్నగునవి నాశముయం ఏమియు మెరుగను. చుండును కుదుర్చును. నెత్తిచర్మమును సంరక్షించును. వెంట్రుకలు పట్టుకుచ్చువలె పెరుగుటకు తోడ్పడును. ఇవన్నియుగాక, ఘుమఘుమలాడు దాని సువాసనము మనస్సుకు ఆనందదాయకముగా నుండును. ఇటీవల వచ్చిన యీ దిగువ యోగ్యతాపత్రికలు చదువుడు. మిస్టర్ ఆర్. కె. నాయర్, చెన్‌కార, నంది పెరియార్ పోస్టు, (తిరువాన్కూరు) 1-2-1931 తేదీన నాకు వ్రాసిన పోస్టుకార్డునం దిట్లు గలదు. "నెందు నెలల క్రితము మీరు కామినియానూనె నంపినందుకు వందనములు. నేను ఆ నూనె నా శిరోజములకు తెప్పించితినో, అట్టి మిసెస్ ఈశ్వరపిళ్లె యొక్క శిరోజములకు అద్భుతమైన గుణముల నిచ్చినదని చెప్పుటకు నేను మిగుల సంతసించుచున్నాను. కాబట్టి తిరిగి 12 సీసాల కామినియానూనెను వి. పి. గా పంపకోరుచున్నాను.

వెల సీసా 1-కి రు. 1-0-0 వి. పి. చార్జి 6 అణాలు ప్రత్యేకము.
3 సీసాలవెల రు. 2-10-0 వి. పి. చార్జీలు 12 అణాలు ప్రత్యేకము.

## పుష్పోద్యానవనమును జేబునం దుంచుట


OTTO DILBAHAR.

మీ రెప్పుడైనను **ఓ ట్టో ది ల్ బ హా ర్** (రిజస్టర్డు)

బుడ్లను చూచితిరా. ఈ బుడ్డినుంచి ఒక్కబొట్టు క్రిందపడిన, పుష్పవనములోనుండి తాజాగా తెచ్చిన కొన్నివేల కుసుమముల యింపైన పరిమళము నది యొసంగును.

పూర్తినమ్మకము కలుగుటకై, ఉచితముగా నిచ్చెడి నమూనాబుడ్డికొఱకు, పోస్టేజి వగైరాల నిమిత్తం రెండణాల స్టాంపును పంపుడు. పుష్పోద్యానవనమును జేబునందుంచుకొని నూతనానందము ననుభవింపుడు. అందరికి కీలగునట్లు, వివిధసైజుల సీసాలయందు విక్రయించబడుచున్నది.

అర ఔన్సు సీసా రు. 2-0-0 పావుఔన్సు సీసా రు. 1-4-0 ఒకడ్రాం సీసా 0-12-0 అరడ్రాం సీసా 0-8-0.
వి. పి. చార్జీలు 6 అణాలు ప్రత్యేకము. (ఒక్కొక్కదానికి)
ఒట్టోదిల్‌బహార్ నమూనాలు ఒక్కొక్కటి 0-2-0 అణాలు. పరిమళకార్డులు ఒక్కొక్కటి ఒక అణా.

## నొప్పులకు, బాధలకు, గొప్ప ఔషధము



### ఆడ్మన్స్ సిప్రెస్-సాల్వ్ (పెయిన్ బాం) (రిజస్టర్డు)

ఎందుకు బాధపడెదరు? నిద్రపట్టక, అవస్థ యెందుకు? హాయిగా తిరుగుటకు వీలులేకుండ, మోకాళ్లవాపుపొందనేల? ఇవన్నియు

**ఓడ్మన్స్ సిప్రెస్-సాల్వ్ (పెయిన్‌బాం)** (రిజస్టర్డు)

వలన అతిత్వరలో కుదుర్చబడునుగదా? దీనిని కొంచము తీసికొని, బాధగల శరీరభాగమందు బాగుగా మర్దనచేయుడు. వెంటనే మీ బాధలు నివారణయయి, దాని మహిమాతిశయములను మీరు గాంచగలరు.

దీనిగుణములను నిరూపించుటకు నమూనాడబ్బీని ఉచితముగా నంపుదుము. పోస్టేజి ప్యాకింగ్ నిమిత్తము రెండణాల స్టాంపునుమాత్ర మంపుడు. వెల డబ్బా 1-కి రు. 1 0-0, చిన్నసైజు 0-8-0 అణాలు.
వి. పి. చార్జీలు 0-6-0 అణాలు ప్రత్యేకము (ఒక్కొక్కదానికి) నమూనాడబ్బీలు ఒక్కొక్కటికి 0-2-0 అణాలు

సోల్ ఏజంట్లు:—**ఆంగ్లోఇండియన్ డ్రగ్ అండు కెమికల్ కంపెనీ,**
నెం. 285 రు, మార్కెట్, తపాలపెట్టె నెం. 2052. బొంబాయి నెం. 2 రు.

ర వ్యాఖ్యానమునఁ, పెన్న—వేణ్ణాశబ్దభవము —అని వ్రాసినారు. ఇంతియ కాక, అప్పకవి నాఁటి కీఘుట్టమున 'పెన్న'శబ్దము లేదనుటకు నాఁటిగ్రంథము (ద్వితీ. ౨౫౧) సాక్ష్య మిచ్చుచున్నది!

“లాఁతి జాతికి వళికి నిల్పఁ దగ దనుచు
సూత్రమునఁ జెప్పలే దని మాతపలను
నన్నయార్యుండు పంచమామ్నాయమునను
నిలుపుల ఁబ్యంబులకు మాటువలుకవశమె?”

మఱియు సహదేవుఁడు దక్షిణదిగ్విజయయాత్ర కేఁగినప్పుడు వేణానదీతీరమున నున్న యధిపతిని జయించినట్లు నాగరలిపియందున్న భారతమునందే కాక, పురాణము హయగ్రీవ శాస్త్రిగారు పరిష్కరించిన (తెలుఁగులిపి గల) సంస్కృతభారతమునందును జెప్పఁబడియున్నది.* కావున నన్నియకవిసింహుఁడు పైపద్య పాదమున వేణ్ణ, లేక వేణ అనుపదమునే ప్రయోగించినాఁ డనియు, 'జాతి లాఁతివా'ల కాతఁడు యతిమైత్రి నొసఁగలే దనియు నిరాఘాటముగఁ జెప్పవచ్చును.

“వీరు వారనకట్టిబుద్ధివి-వేకము” అను (ఆది. అష్ట. ౨౯) పద్యము ముద్రితగ్రంథములందును, పలువ్రాఁతప్రతులందును నుండిన హేతువున, లక్షణగ్రంథములలోని “వీరు... బుద్ధివి-భేదము” అనుపాఠము సరియైనది గాద నియు, వ, భ లయతి నన్నియది గా దనియుఁ జెప్ప నగును.

* తెలుఁగులిపిగల సంస్కృతభారతమున 'వేణ్వా' అని ముద్రింపఁబడినది. అది 'వేణ్ణా' అను వ్రాఁతఁ బట్టి కలిగిన ముద్రాదోష మని తోఁచెడిని.

# ప్రణయస్మరణము

అమరవాది హనుమచ్ఛాస్త్రి గారు, యం. ఏ.

ఆ యమునానగాతటంబులయందలి పచ్చికపట్టులందు ను
చ్ఛ్రాయగతిన్ మనోజ్ఞమయరాగములం జిలికించు వేణువుల్
హాయిగ నూదియూది హృదయమ్మనురాగరసప్రవాహధో
లాయతి నూంచు నాయదుకులాగ్రణి నెన్నఁడు గాంచఁగందునో?

ఆపుప్పటీరమం దలరు వల్లిక రాల్చినపచ్చపుప్పొడుల్
మాపయిఁ బర్వ చిత్తమున లాలసతం బరికొల్ప, చారుస
ల్లాపవచస్తరంగతతులం బడి యిర్వుర మొండొరుల్ భుజా
క్షేపములం గవుంగిటికిఁ జేర్చిననాఁటియదృష్ట మెట్టిదో?

కనులన్ మోడ్చి తదీయరూపమహితాకారమ్ము నే భావవీ
ధి నిరూపించెడివేళ, స్వీయమహిమన్ దివ్యస్వరూపప్రద
ర్శనము న్నాకు ననుగ్రహించు నలకృష్ణస్వామి యేనాఁటి కే
దినమందున్ మరలన్ మదీయనయనోత్సేకంబు గావించునో.

కారున్ మబ్బులసంగడీఁడయిన యాకంజాక్షువక్షోవిభా
గారాద్భామిని మించునై మెఱయు భాగ్యం బున్నదో? లేదా బల్
గారాబం బొలికించు నాదుచెలిమిం గాంక్షించి, తా నింక నన్
జేరన్ వచ్చునో రాఁడో? రాధపయి నిప్పీ ప్రేమకుం దప్పెనో?

---

# పారశీక వాఙ్మయచరిత్ర

మొహమ్మద్ ఖాసింఖాఁ (కవితాసమితి)

## మొదటి ప్రకరణము

### ౧

### విశ్వసాహిత్యమున పారశీకవాణి

ప్రపంచకవిత్వచరిత్రమున పారశీకకవిశేఖరుల దొక యమూల్యాధ్యాయము. సారస్వతశాఖల నన్నింటను పారశీకవాణి సారభించినది. ఐతిహాసికులలో ప్రపంచమున నేసుప్రసిద్ధకవితోనైనను ‘ఫిరదౌసీ’ సమానాసనము పొందగలడు. నైతికకవిత్వమునకు ‘సాదీ’ పెట్టినదిపేరు. ‘హాఫీజ్’ దివ్యకంఠమున భావకవిత్వము భాగ్యవత్తరమైనది. ‘ఉబైదా జకానీ’ హాస్యరసమునకు శాస్త్రీయపద్ధతిని ప్రసాదించినాడు.

సూఫీకవిత్వమున పారశీకులవైశిష్ట్యము జగద్విదితమైనది. క్రీస్తుశకము ఏడవశతాబ్దమున అరేబియాలో అవతరించిన మొహమ్మద్ ప్రవక్త తనజామాతయగు ‘అలీ’ కుపదేశించిన సూఫీతత్త్వబీజములు గురుపరంపరాగతములై పారశీకమున విద్వత్కవులదోహదమున పెరిగి మహావృక్షములై, తమ చల్లని నీడలను మార్గగమనమున డస్సిన పాంథజనుల ఆత్మలకు శాంత్యాతిథ్య మొసగినవి.

పారశీకకవితిలకులు ప్రాగ్దేశములనే కాక పాశ్చాత్యదేశములందును తమకళాదీధితుల నెరపి ఆదేశీయులకావ్యజీవితమున శకారంభమును కావించిరి. పదునేడవశతాబ్దమునాటికే పెక్కు-పారశీకకావ్యములు ల్యాటినులోనికి పరివర్తింపబడెను. జార్మణ్యదేశమున పందొమ్మిదవశతాబ్దమున నూతనోజ్జీవనము నెలకొనగా పలువురు జిజ్ఞాసువు లుద్భవమందిరి. ఒకపండితు డన్నట్లు, ప్రాగ్దేశముల నానాడు ఆంగ్లేయులును, ఫరాసులును రాజ్యాభివృద్ధిని, వాణిజ్యాభివృద్ధిని కాంక్షించి తమశక్తిసామర్థ్యములను యుద్ధరంగములందు వినియోగించుచుండగా, జార్మన్యులు ప్రాచ్యవిజ్ఞానదిగ్విజయయాత్రకు పూనుకొనిరి. హెర్డర్, గతే, షిల్లర్, ష్లెగెల్, లేటెన్, రూకర్ట్, హీన్, బోడెన్‌స్టెడ్ మున్నగు విద్వత్కవిపుంగవులందు సైతము పారశీకులప్రోద్బల మెంతేని కాననగును. అమెరికా, ఆంగ్లదేశములందు సైతము పారశీకులు తమకావ్యరసమును వెల్లిగొల్పిరి. అమెరికాదేశ జిజ్ఞాసువులలో అతిప్రసిద్ధుడగు ఎమర్సన్, హాఫీజ్ నుగూర్చి చెప్పుచు అతడు పిండార్, హూరేస్ అంతటికవులకు కూడ లేని సూక్ష్మమగు అంతర్దృష్టి కలవాడనియు, అతడు కవులకు కవి (the Poet of poets) అనియు శ్లాఘించెను. ఆంగ్లదేశమున ఫిట్‌జెరాల్డ్, వ్రూస్లే, బిక్నెల్ మున్నగు విద్వాంసులచే తమభాషలోనికి పరివర్తింపబడిన పారశీకకావ్యములు బ్రౌనింగ్, టెన్నిసన్ మున్నగు కవులయొక్కయు, కార్లైల్, రస్కిన్ మున్నగు కళాతత్త్వజ్ఞులయొక్కయు భావవికాసమునకు

తోడ్పడినవి. అట్లే భారతదేశమున అమీర్ ఖుస్రూ వంటి మహాకవులకే కాక, సింధుదేశమున ప్రభవించిన సూఫీకవులకును, కబీర్ చిష్తీ వంటి యోగులకును కూడ పారశీకులే గురుస్వాము లైరి.

## ౨

### భాషావికాసము

పారశీకకవిత్వచరిత్రము హిజరీశకము మూడవశతాబ్దమునుండి ప్రారంభమగును. ఇంతకు పూర్వమును పారశీకులు పద్యరచనమును కావించుచుండిరి కాని స్తుతిపద్యములు తప్ప కావ్యము లనదగిన వేవియు రచింపరైరి. ఉమర్ ఖలీఫా మొదలు హుజ్జాజ్ కాలము వరకు ఖలీఫాలు తాము జయించిన ఏదేశమునను దేశభాషలతో జోక్యముకలిగించుకొనరైరి. పారశీకమున పారశీయే రాజభాషగా ఉండెడిది. కాని హుజ్జాజ్ కాలములో అరబ్బీ రాజభాష యైనది. హిందూదేశమున ఉర్దూ వలెనే పారశీకమున పారశీ అరబ్బీభాషలు కలిసి ఒకక్రొత్తభాష ఏర్పడెను. రాజభాష యగుటచే పారశీకవిద్వాంసు లందరును అరబ్బీని చదువ సాగిరి. అరబ్బీలోనే వారు వ్రాసినగ్రంథము లెన్నియో కలవు. అరబ్బీ తెలియనిచో రాజసమ్మానము దుర్లభమగుచుండెడిది.

కొన్నాళ్లవరకు దేశభాషయందు పద్యములను రచించుఉత్సాహమే పారశీకులకు కలుగలేదు. మూడవశతాబ్దమునాటికి అబ్బాసియా ఖలీఫాల సామ్రాజ్యము పతనోన్ముఖము కాజొచ్చెను పారశీకమున ఖలీఫాప్రభుత్వ ప్రతినిధులు అక్కడక్కడ స్వతంత్రరాజ్యముల నేర్పరిచుకొనసాగిరి. దేశమున పెక్కురు స్వదేశరాజులు ప్రబలుటచే ప్రజలలో స్వభాషాభిమానము వ్యక్తము కాజొచ్చెను. ప్రభువులును దానికి దోహద మొసంగుచు వచ్చిరి. మామూన్-అల్-రషీద్ కాలములో అబ్బాస్ అనుకవి ఒకపారశీపద్యమాలను రచించగా మామూన్ అతనికి ప్రతివత్సరము వేయి రూప్యముల నిచ్చునట్లు ఏర్పాటు చేసెను. దీనితో కవులలో మిక్కిలి ప్రోత్సాహము జనించెను. నాటినుండియు పారశీకావ్యములు రచితములు కాజొచ్చెను. ఆంధ్రకవితవలెనే పారశీకవితకూడ అనువాదములతోడను, అనుకరణములతోడను ప్రారంభమాయెను.

## ౩

### సామానీయ కవులు

అబ్బాసియాసామ్రాజ్యము విచ్ఛిన్నమైన యనంతరము పారశీకమున స్వతంత్రరాష్ట్రము లేర్పరిచుకొన్న తాహిరియా, సఫారియా వంశీయులకాలములో పారశీకకవిత్వబీజములు మొట్టమొదట జల్లబడినవి. ఇప్పటి కవులలో మనకు తెలిసినంతవరకు ఖుజలాబాద్ గైసీ మొదటికవి. తర్వాత మహమూద్ విర్రాఖ్, ఫైరోజ్ మషరఖి మున్నగుకవులు ప్రభవించిరి వీరి కావ్యము లంత ప్రశస్తములు కాకపోయినను, అవి పద్యరూపముగా ఛందోనిర్మాణమున కుపకరించినవి.

వీరికి పిమ్మట వచ్చిన సామానీయుల కాలములో ఎన్నదగిన ప్రథమకవులు పల్వురు బయలుదేరిరి. ఈకాలముననే పారశీకకవిత్వ చరిత్రమున వసంతోదయ మైనది. ప్రజల యందు దేశాభిమానము, మాతృభాషాభిమానము ప్రబలెను. ఈకాలమున ప్రభవించిన కవులు ప్రతిభావంతులు. జాతీయతా విజృంభణము వీరికవితయందు చక్కగ ప్రతిఫలించినది. వీరిలో రూదకీ, రాబియా, దఖీఖీ, షహీద్, అబూ షకూర్, ఉమారా, ఖుబాజీ కవులు ముఖ్యులు.

రూదకీ జాత్యంధుడు. అష్టవర్షప్రాయముననే ఖురాన్‌ను సమగ్రముగ కంఠస్థమొనరించిన మేధావి. బహుళకావ్యప్రణేత. "పారశీకకవితా పితామహుడు" అని ఈతని బిరుదము. బాలామీ అను సామానీయప్రధాని 'అరబ్బులలోను, పారశీకులలోను రూదకీ అసమాను'డని పల్కెను. ఇతనిని 'సుల్తానే షాఇరాన్' (కవిసార్వభౌముడు) అని మారూఫీ అనెను. లిరిక్కులను రచించిన ప్రథమకవి. తనపాటలు నీనెడు విపంచిపై మధురముగ పాడెడువాడు. ఇత డనేక నూతనవృత్తములను ప్రయత్నించెను. "కలీలా దమన్" అను కావ్య మీతడు రచించగా ఇతనిని పోషించుచున్న నసర్ ప్రభువు నలువదివేలదిర్హాము లిచ్చి బహూకరించెనట.

ఇతడు లక్షపద్యము(ద్విపాత్తు)లను పైగా రచించెను. ("నేను అతనిపద్యములను పదమూడుసారులు గణించితిని. అవి యొక్కలక్షయుండెను. పరిశోధించినచో ఇంతకంటె ఎక్కువగనే లభించును"—రషీదీ.)

ఉదాహరణముగా రూదకీ రెండుఖండికల అనువాదము నిచ్చుచున్నాము.

౧. కెంపు కరగించి పాత్రిక నింపెదేమొ,
భానుడీ ప్తిలో నొరతీయబడిన చంద్ర
హాసమో యది తెచ్చినా కా మధూళి!
అది గులాబీజలము, వడియంగబట్టి
శుభ్రమైనది—చల్లగా సోకగలుగు
దానిమధురిమ గాఢనిద్రాంజనమ్ము
చిరనిరీక్షాప్రసేకితాక్షిపయిని సోజ!

౨. చరమనిశ్వాస మెగయు నామరణ మపుడు
వ్యయముపడ నాదుకుదికొక్కెక్కుడమె లేక
పడక పరిసి నామట్టిపై పలుకు మిట్లు
'నేను చంపితి నిను: నీస్తు నిపుడు నేను.'

రాబియా కవయిత్రి. ఈమె పారశీకనే కాక అరబ్బీలోకూడ కవిత్వము చెప్పగలిగెడిది. యోగినియైన ఈమె ఒకబానిసను మానసికముగ ప్రేమించెను. ఈనేరమున దుర్మార్గు లీమెను చంపించిరి. ఈమెను సూఫీలు తమతరగతిలో చేర్చుకొందురు. ఈమెపద్యములు గ్రంథరూపమున లేకపోయినను షహీసి తనకవిజీవితములలో పెక్కుపద్యముల నుదాహరించినాడు.

ఈకాలమున పారశీయందు నిండియున్న అరబ్బీపదములను పెక్కింటిని తొలగించి సాధ్యమైనంతవరకు దేశీయపదములనే వాడుచు భాషను శుభ్రపరచినకవి దఖీఖీ నేడు శ్రుతవిశ్రుతమైన షాఃనామా కావ్యమును ప్రారం

భించినకవి ఈతడు. వేయిపద్యములకు పైగా రచించి పరమపదించెను.

ఇతనిపద్యపాదములు కొన్ని :

౧ ఆమెపెదవుల క్రింపి నాట్యమొత్తెర్చు
తారకల కాని తెల్లవారువరకు
లెక్కపెట్టు రేల రాత్రి నే చుక్కలగమి;
జగతిలో అన్నిటం గలసొగసు నింపి
ఆమెగా కానియెడల తప్పేమి కాని
డదియె తలపు నాఆత్మ భాగించుకొనును;
బ్రదుకు చెలి లేక గడపగా వలసెనేని
బ్రదుకునకె దేవ! వాంఛింతు పరిసమాప్తి.

ఒకరాజు నిట్లు పొగడినాడు :

౨. సుదితిరుగుస్వర్గ మాత్రతన్ శ్రుతియొసంగు
నేమొ రాజాజ్ఞ వడి నాలకించుకొరకు;
శని ఇతనిభీతి నధికశోషణముచే వి
శాలగగనసామ్రాజ్యపర్శనము వెరచు.

షహీద్ అరబ్బీ పారశీల రెంటను కవిత చెప్ప నేర్చినవాడు. రూదకీ ఈతనిమరణమునకు విలపించుచు కొన్ని పద్యములు చెప్పెను. షహీదీ భావనాశక్తి నిర్నిద్రము. ఈక్రిందిపద్యములు దిఙ్మాత్రములు.

౧. ప్రేమకేలి రోదించెడురీతి నంబు
వాహ మేష్పు: ప్రేమితవలె వని హసించు!
నావలెనె మారమంను వాపోవు మేఘు
నినవ ముదమాన జాలినే వనరునవుడు.

౨. ధూమమే కల్గియుండెనా దుఃఖమునకు
ఏ నెరుంగను భువి నావరించు నిరులు,
నెతకు మెల్లజగత్తు—దుఃఖితుడు కాని
విజ్ఞుడొకడేని నీకు కాన్పింపబోడు.

తక్కినకవులు నామమాత్రులుగ కవిజీవితములందు కానవచ్చుచున్నారు. వారికావ్యము లంతరసవంతములు కాకుండుటచే ఏవో కొన్నిపద్యములు తప్ప తక్కినవన్నియు కాల గర్భమున మాటుమణగిపోయినవి.

## ౪

### గజనవీయ ఆస్థానము

సామానీయులతర్వాత గజనవీయులు పారశీకరాజ్యసింహాసనము నలంకరించిరి. ఈ ప్రభువులలో మహమూద్ ప్రఖ్యాతుడు. ఇతని భారతదేశపు దండయాత్రలు చరిత్రప్రసిద్ధములు. కాని ఇత డెంతటిరక్తపిపాసియో అంతటి కళాపిపాసి. ఇట్టిసంఘటన చిత్రమే. అయిన చరిత్ర ఇట్టివిచిత్రపురుషుని జీవితముల్లేఖించినది. ఈచక్రవర్తిస్థానమున నాలుగు వందలమంది కవులు నానాదేశీయులు గౌరవ మొందుచుండెడివారు. ఒకనాడీకవికల్పకము కవుల నందరను సమావిష్టుల జేసి ఒక్కొక్కని కిర్వదివేల దర్హము లిచ్చి యెల్లరను బహూకరించెనట. అన్సరీకవి ఒకహృద్యపద్యమును చెప్పగా అతనినోటిని రత్నములతో నించెనట.

మహమూద్ ఆస్థానములో అన్సరీ కవిసార్వభౌముడు. ఎవ్వ రేకావ్యమును రచించినను ప్రప్రథమమున అన్సరీకి చూపిన పిదప గాని ఆస్థానమునకు తీసికొని రాకూడదని మహమూద్ ఆజ్ఞ. తనప్రభువు కావించిన యుద్ధముల నన్నిటిని వర్ణించుచు అన్సరీ ఒకకావ్యమును రచించెను. ఈతడు ముప్పదివేలపద్య

ములు రచించెనని చరిత్రము చెప్పుచున్నను లభించినవిమాత్రము మూడువేలకు మించవు.

షాః నామా కావ్యమును రచించి అమృతయశస్విమైన ఫిరదౌసీ మహమూదు ఆస్థానములోనివాడు. ఈతనిని పాశ్చాత్యులు "పారశీక Homen " అని వ్యవహరింతురు. జీవితమునంతయు షాః నామారచనమునకై వినియోగించి మహోన్నతకళాసౌధమును నిర్మించిన ధన్యు డీతడు. ఈగ్రంధమునకు పిమ్మట ఫిరదౌసీ "యూసఫ్ జులైఖా" అను ప్రేమ కావ్య మొకటికూడ రచించెను.

షాః నా మా పారశీకవీర రాజన్యులచరిత్రము. ఫిరదౌసీకవి ఎందఱో రాజులచరిత్రములు నీమహాకావ్యమున మధురగంభీరముగా నుగ్గడించియున్నాడు. ప్రపంచము నాకర్షించిన సోహ్రాబురుస్తుముల చరిత్రవంటి వీరకథ లెన్నేని కీనిలో కలవు. దీనిలో ౬౦,౦౦౦ ద్విపాత్తులు కలవు.

ఆంధ్రవాఙ్మయమున మహాభారతమునకు గల స్థానము షాఃనామాకు పారశీకసారస్వతమున కలదు. అందును తిక్కనతో ఫిరదౌసీ ఎంతయేని సరి రాదగినవాడు. సంస్కృత దాస్యము నెడల్చుచు తిక్కన దేశ్యపదములతో చక్కనికూర్పు సాగించినట్లు ఫిరదౌసీయును అరబ్బీపదప్రయోగమును తప్పించి దేశీయపదములనే మిక్కుటముగ వాడిన కావ్యశిల్పి.

"ఫల్క్ గుఫ్త్ అహసన్, మల్క్ గుఫ్త్ జహ
ఖజాగుఫ్త్ గేరూ, ఖదర్ గుఫ్త్ దహ"

(ఆకాశముజయ!' అనెను; దేవతలు 'సెబాసు' అనిరి; మృత్యువు 'పట్టుము' అనెను; అదృష్టము 'బహూకరింపుము' అనెను.)

అనుపద్యమున అహసన్ (జయ) అను నది అరబ్బీపదమని ఆక్షేపణ రాగా ఫిరదౌసీ, ఆపదము ఆకాశ ముపయోగించినది కాని తాను వాడినభాష కాదని చమత్కారముగా తప్పించుకొన్నట్లు గల కథ అరబ్బీపదముల కిత డెంత దవ్వున నిల్చునో తెలియజేయ గలదు.

ఉదాత్తనాయకులను చిత్రించుటలో గల భావనాసామర్థ్యము, మనఃప్రవృత్తుల నుల్లేఖించుటలోని అంతర్దృష్టినైశిత్యము, తత్తద్విచిత్ర వాతావరణసృష్టిలో ప్రదర్శించు కళాకౌశల్యమును ఫిరదౌసీకావ్యసింధువున మనకనుల మిరుమిట్లుగొల్పు దివ్యరత్నములు. ఝరీవేగమున కథను నడిపించుచు రసానందము ఘటించుటలో నిత డందెవేసిన చేయి. సౌందర్య మీతని ఆరాధ్యదేవత. అయినను విషయలౌల్యము ఇతనిసౌందర్యసిద్ధాంతములకు దూరము. శృంగారము వర్ణించుపట్ల పారశీకులందే ఎందఱో కవులు నాయికానాయకుల సల్లాపసంభోగవర్ణనలతో కావ్యములను నింపివైచినను, ఫిరదౌసీమాత్ర మీరసమును పోషించుపట్ల సున్నితమగు కళాభిరుచిని చూపించినాడు. షిబ్లీ యనినట్లు, ఈమజ్జనశాలను ప్రవేశించి ఉత్తమకవులు సైతము నగ్నులైపోయిరి; కాని ఫిరదౌసీ ఇట్టిచోట్ల

తలవంచికొని చూచియు చూడనట్లు కదలి పోయెను.

ఏ పుణ్యనగరము ఫిరదౌసీ మహాకవికి జన్మభూమియో అట్టి తౌస్ నగరముననే అనసీ కవి జన్మించెను. షానామా తుదిఆశ్వాసముల నితడు రచించెను. ఆంధ్రమహాభారతమువలెనే షానామాకావ్యముకూడ ముగ్గురుకవులచే నిర్మితమైనది. కావ్యమును ప్రారంభించిన వాడు దకీకి ముప్పదివేలపద్యములు కట్టిన పిదప దానిని సాగించినవాడు ఫిరదౌసీ. మూడవవాడు అసదీ. వృద్ధాప్యమున ఫిరదౌసీ కావ్యసంపూర్తికి వేయిపద్యములు కొదువగా విడుచుటచే అసదీ కవి దానిని పూర్తిచేసి ముందిరువురకున్నంత ప్రఖ్యాతిలో సహాసనమును పొందెను. అట్లు పూరించిన వేయిపద్యములను అసదీకవి తన గురుతుల్యుడగు ఫిరదౌసీకిచదివి వినిపించి తదనుజ్ఞతో వానిని షానామాకు చేర్చెను. అతడు గుర్షాస్పనామా అను వేరొకకావ్యమును వ్రాసి సికందర్ నామా రచించిన ప్రఖ్యాతకవియగు నిజామీకి ఆదర్శప్రాయుడయ్యెను. ఈదిగువ నీతని ప్రసిద్ధగేయ మొకటి ఉదాహృతము.*

గజనవీయులకాలమునాటి ప్రసిద్ధకవులలో మనూ చహారీ చివరివాడు. ఇతడు మహమూదుమరణానంతరము గజనవీసభను దర్శించెను. అప్పుడు మహమూదుకుమారుడు మహమ్మదు ప్రభువు. తండ్రివలెనే మహమ్మదుకూడ కవితాప్రియుడు. ఇతడు మనూ చహారీని ఎంతయు నాదరించి అతని కుచితవేతనము నిచ్చుఏర్పాటు కావించెను. మనూ చహారీ అన్సరీకి శిష్యుడైనట్లుగా తోచుచున్నది.

మనూ చహారీ ప్రకృతిని సజీవముగ వర్ణించుటలో సిద్ధహస్తుడు. మెలకువతో ప్రకృతిని పరిశీలించి సూక్ష్మవివరములను కూడ మనోహరముగా ప్రదర్శించు నేర్పరి ఇతడు. ఇతనిగులాబి మనల నెంత ఆకర్షించునో గడ్డిపోచయు అంతగా ఆకర్షించగలదు. ప్రకృతిలో ఇతడు సౌందర్యమును గ్రహించనితావు లేదు. తానట్లనుభవించిన సౌందర్యామృతకలశమును మహోత్సాహముతో పాఠకుల కీతడందించగలడు.

ఇతడు నౌరోజా (సంవత్సరాది)నాడొనర్చిన ప్రకృతివర్ణనము నిచ్చట ఉదాహరణముగా నీయవచ్చును.

నౌరోజ్ వచ్చినది. కార్మొయిళులు ఆకులను శుభ్రపరిచినవి. గులాబీ అలంకరించుకొనినది. షమ్‌షాద్ చెట్లు తమముంగురులను తీర్చికొనినవి. కొండకొమ్మలనుండి హంసలు కలహాంతముల నొనర్చుచున్నవి. గువ్వలు కుహూకుహూధ్వనులచే వనమును నింపినవి. బుల్బులులు తమ రెపంచికలను సవరించుకొనుచున్నవి. హరిణములు చెవుల రిక్కించుకొని శకుంతగానమును వినుచున్నట్లున్నవి. ప్రియులు తమ అపహృతహృదయములను వెదక నారంభించిరి. పచ్చిపచ్చని మైదానము లప్పుడప్పుడు చిరునీడలను కల్పించి వనమునంతను మనోహరతర మొనరించుచున్నవి.

* "మధువనపశ్చాత్తాపము పొందుచు మధువు గూర్చియే మాటలాడెదను:
వెంకీమూనకముల విస్ఫురితములను ప్రతిమలసోగసే పల్కుచుండెదను:
పెదవితోడ పరితాప మొప్పకొని యెడదలోన రాగిల్లుచుండెను.
దేవా, నాఈచిత్రతపస్సు క్షమింపుము ప్రార్థించెదను..."



౨. నేతపని తరంగతి



౫. అల్లికపని తరగతి

# నా నాటకము

తాళ్లూరి సుబ్బారావు గారు, F. A. U.

౧

నేనొక కవిని, పండితుణ్ణి. ఈకాలంలో కవి కాని వాడెవ్వడు; అందరు కవు లంటారేమో. ఆమాట నిజమే కాని, అందులోకూడ కొన్ని మంచిచెడ్డ లున్నా యని తలచేవారిలో నే నొకణ్ణి. అందరు చిల్లరకవులతో పాటు నన్ను తీసివేయడానికి వీలు లేదు మరి. ఉభయ భాషల్లో పండితుణ్ణి. కావ్యాలు చదివాను. వ్యాకరణము చదివాను. ఛందశ్శాస్త్రము క్షుణ్ణముగా ఏకరువుబెట్టాను. కవిత్వంలోకూడ అచ్చటచ్చట ఆశువు చెప్పి మెప్పొం దాను. అనాదినుండి మమ్ములను గురువులుగా పూజించు చుండిన వర్తకశిఖామణియగు పోలిశెట్టిగారు నా ఆశు వునకు, కవిత్వపటుత్వమునకు మెచ్చి మొన్నమొన్న జరి గిన వారి చిన్నబ్బాయి అక్షరాభ్యాససమయమున సువర్ణ కంకణ మిచ్చి బహూకరించినారు. పుస్తకాల కంపెనీ లకు బాలుర కుపయుక్తముగ సులభశైలిని మృదుమ ధురముగ పఠనీయగ్రంథములను రెండుదినముల కొక్కటి చొప్పున వ్రాసియిచ్చాను. ఇల్లాంటివి యింకా చాలా వున్నాయిలెండి. చెప్పడానికి మచ్చునకు మాత్రము ఒకటి రెండు చెప్పాను ప్రస్తుతంలో ఇల్లా అనేకవిధము లుగా భాషాసేవ చేస్తూ, చదువుకొన్నవాణ్ణి గనుక ఊర కుండలేక, 'కావ్యాంతే నాటకం' అని పెద్ద లన్నారు గనుక, నాటక మొకటి వ్రాసినచో అక్కడికి సంపూర్తి యగునని తలచి మన నవనాగరికులకు నచ్చేలాగున అన్నిరసములను పోషించుచు నాటక మొకటి వ్రాశాను. నాటకం వ్రాయడం అంటె తెలియని కొందరి అభి ప్రాయం కాని మంచినాటకం వ్రాయాలంటె పేగులు తెగిపోతాయి. ఎన్ని వుంటె నాటక మవుతుంది. ఆరు మాసాలు నిద్రాహారాలు లేక కష్టపడి పూర్తిచేశాను. కాని యేమిలాభం. నేను చదువుకొని ఆనందించడమే కాని నలుగురు చూడడానికి వినడానికి ఆనందించడానికి వీలు దొరకడం లేదు. నలుగురూ ఆనందించి రసము గ్రహించుటకంటె కవికి కావలసిన దేమి? ఓదార్చే వాళ్లు లేనప్పుడు ఎంత యేడ్చినా లాభం లేనట్లు ఆనం దించే అవకాశం లేనప్పుడు కవి ఏమి వ్రాస్తే యేమి ప్రయోజనము. అందుచేత నామిత్రులసలహా ననుసరించి దీనిని యేలాగైనా ప్రదర్శనమునకు తేవలెనని యిప్పటికి దాదాపుగ రెండుమాసములనుండి నేను పడుచున్న పాట్లు వర్ణింప నలవికాదు. ఏక్టరన్నవాడి నెల్ల ఆశ్రయించాను. రంగరత్నములు, నాటకసింహములు, నాటకోద్ధారకులు, మార్తాండులు, కళోద్ధారకులు, ఇత్యాదిబిరుదాంకితుల మాటల నిక చెప్ప నేల? వీరిసేవ చేయలేక, చుట్టూ తిరగలేక, ప్రాణాలు విసిగిపోయినాయి. అయినా అభి లాష పోలేదు. ఇంకా సాధిద్దామనే వుంది మనసులో. యేకంపెనీవారికో యిచ్చి ప్రదర్శింపచేద్దామంటె కం పెనీ వుంటుందో వూడుతుందో తెలియదు. మబ్బులో పుట్టి పుబ్బలో మాడేటట్లు చిత్రవిచిత్రాల నామాలతో నాటకసంఘాలు తెల్లవారక మునుపే వీధిగోడలమీద వెలుస్తున్నాయి. నాటకమైన మర్నాడు మటుమాయ మైపోతున్నాయి. నోటీసులు అచ్చువేసిన అచ్చాఫీసు వారు డబ్బుకై రిజిష్టరీ నోటీసు యివ్వగా యిట్టిపేరుగల కంపెనీ మావూరులో లేదని తిరుగురసీదులమీద వ్రాసి వచ్చుచున్న సంగతికూడా నే నెరుగుదును. యిల్లాగ వేసినపేరుతో వేయక, ఆడిననాటక మాడక, వేసిన వూళ్లో వేయక, పేరులు మార్చి, తలలు మార్చి, రేట్లు మార్చి నాటకములు వేయుచున్న కంపెనీలకు యివ్వడా నికి మనస్కరించడంలేదు. ఏదో ఒకకట్టుబాటు ననుస రించి జరుగుచున్న కంపెనీ కిద్దామని అభిలాష. అం దుకె యిన్ని అగచాట్లు పడుచున్నాను. ఏలాగైనా యీ కంపెనీకి—పేరెందుకు లెండి—యిచ్చి ప్రదర్శింప జేసి ఆనందించాలని వుంది. యీకంపెనీలో సమర్థులైన ఏక్టర్లు వున్నారు. స్థావరంగా పనీ చేస్తూవుంది. శిక్షణ జరగనిదే, బాగా నలగందే నాటకం ప్రదర్శింపరట. మంచినాటకమైతేనే గాని ప్రదర్శించడానికి ఆలోచన లోనే పెట్టరట. యింకా చాలాచాలా కట్టుబాట్లు

రూళ్ళు వున్నాయట. అందుచేత యేలాగైనా యీ కంపెనీవారికి నానాటక మిచ్చి ప్రదర్శింపజేయాలని దీక్షతో మూడురోజులనుండి యీహోలుచుట్టూ తిరుగుతున్నాను. కాని యింతవరకు లోనికి ప్రవేశమే కలుగలేదు. రేపు రేపని గేటువద్ద వున్న జవాను జవాబుతోనే సరిపోతోంది. లోనికి ప్రవేశమే కలుగడంలేదు. మేనేజరు దర్శనం అంతకంటె లేదు. యీరోజు ప్రాప్తి యెట్లా వుందో మరి మామూలు 'రేపే' అవునో, లేక 'ఆ రేపు'నకు మరికొందు తోపులే కలుగునో తెలియదు.

౨

షేకు దౌలతు మియ్యా పేషుఫషుసీఫాయి. గేటు వద్ద చాలా జాగ్రత్తగా వుంటాడని యీయనను నియమించారు కంపెనీవారు. మామూలుమాదిరిగా నేను గేటువద్దకు నాగ్రంథము చంకలో పెట్టుకొని మేనేజరు దర్శనానికి వెళ్లాను. సాయిబుగారికి నన్ను చూచిన చూడడంతోనే జాలి కలిగింది కాబోలు, రోజూ వచ్చి తిరిగి పోతూండడంచేత, సాహెబు—"ఏమండీ శాస్త్రుల్లుగారూ! మీకే రోజూ వచ్చి పోతున్నారు. మాకి మిమ్మల్ని చూస్తే జాలి వేస్తుంది. ఎందుకు వచ్చారో, మీపని యేమిటో చెప్పితే ఆలోచనా చేస్తాము" అన్నాడు.

నాకర్మం కాలింది. వీడితో నా పని చెప్పితే వీడు ఆలోచిస్తాడట. యేంకాలం వచ్చిందిరా బాబు. పూర్వం కవులొచ్చారంటె మహామహులు, రాజాధిరాజులు, యెదురుగా వచ్చి సన్మానించి సగౌరవముగా పూజించేవారట. ఆహా కాలమహిమ! అప్పటికి యిప్పటికి యెంతవ్యత్యాస ముంది. ఈసాయెబుగారికి నాపని చెప్పవలెనట. రామ! రామ! అయినా చేయవలసిందీ లేదు. ఎంతటివాడైనా కాలానికి కట్టుబడవలె నన్నారు పెద్దలు. నేను కార్యవాదిని గాని ఖడ్గవాదిని గాను. నాకు పట్టుదలతో నిమిత్తం లేదు—అని మనసులో అనుకొని, "సాహెబుగారూ! నేను కవిని. చదువుకొన్న పండితుణ్ణి. చాలా కష్టపడి మంచినాటక మొకటి తయారుచేశాను. ఇది మీకంపెనీవారిచే ప్రదర్శింపచేయాలని సంకల్పించి మేనేజరుగారిదర్శనం చేయాలని తిరుగుతున్నాను" అన్నాను.

సాయెబు—"అల్లాగా! శాస్త్రుల్లు చెప్పరు. ఏదండి మంచినాటకం వుంది అంటున్నారు కొంత సదివి యినిపించండి మాకి. సూదాము. బాసంటె మేము మీకి సాయంచేస్తాము. సూదాండి"—అన్నాడు.



"పారా జవానువద్ద పాండిత్యప్రకటన"
చేయవలసివచ్చింది.

ఈమాటలు వినేసరికి నా కెక్కడాలేని కోపం వచ్చింది. అయినా యేమి చేయగలను? తలతల కొట్టుకొన్నాను. పారాజవానువద్ద నాపాండిత్యప్రకటన చేయవలసివచ్చిందిగదా అని దుఃఖించాను. వానికోరిక తీర్చక పోతే వీల్లేదు. నాభావికర్తవ్యం వాడిమీద ఆధారపడి వుంది. కవిభాస్కరుడంతవాడు ద్వారపాలకుడైన సాహిణిమారుడికి రామాయణం అంకితంయివ్వగాలేనిదీ నేను యీద్వారపాలకుడికి చదివి వినిపించినంతమాత్రం చేత దోష మేమని సంతృప్తిచెందాను. పూజారి వర మిస్తే గాని దేముడు వర మివ్వడు అన్నారు. ఆత్మగౌరవం చంపుకొని, సగము చచ్చి, సాహెబుగారు

బెంచిమీద కూర్చుండగా ఆగేటువద్ద ఆయనకు యెదురుగా కూలబడి ఒకటిరెండురంగాలు చదివి వినిపించాను. 'ఇంకా చదవండి శాస్త్రుల్లూ చూద్దాం' అంటూ గడ్డం మీసం దువ్వుకొంటూన్నాడు. పూర్తిగా మునిగినవాడికి చలి లేదు. మానాభిమానాలు వదులుకొన్నవాడికి సిగ్గూ లేదు. ఒకటిరెండురంగములు చదివినవాడికి యింకొకటి రెండురంగములు చదువ కష్టంగనకనా ? సాహెబుగారు వద్దనేవరకూ, పండ్లబిగితో, గుక్క త్రిప్పుకొనకుండా చదివేశాను. అర్థం గాకో, లేక నావినుసపల అర్థం అయ్యో చెప్పలేను గాని, 'చాలండీ. బాగా వుంది గాని, మాలాటివాళ్లకికూడా కొంచెం మంజాచేసే టట్టుగా వ్రాయాలి." అంటూ, "మీరు యిక్కడ వుండండి. మేము తిరిగి వచ్చి మీకి లోపలికి పంపుతా" మని చెప్పి వెళ్లాడు లోపలికి.

బ్రతుకు జీవుడా! ఇంతమాత్రంతో వదలిపెట్టాడు. ఇంకా పెద్దవిమర్శన మొదలుపెట్టి, "మీరు యిలాగా వ్రాయండి. యీలా దిద్దుకోండి." అని అంటాడేమో అని, ప్రాణాలు యెగిరిపోయినాయి. ఇల్లా యిరవైనిమిషాలు వోపికబట్టి సాహెబుగారిరాక కెదురుచూస్తూ నిలవబడ్డాను. ఇంతలో సాహెబు వచ్చి, "మేనేజరుగారు యింకా రాలేదు. లోపల యాక్టర్లున్నారు. మీరు లోపలిక్కి అభ్యాంతరంగా వెళ్లి ముందు వీళ్లకి పట్టుకోండి. అక్కడ హీరో (hero) పాత్ర వేసుగొనే వాళ్లలగాయ్తు జవాన్ వేషం వేసేవాడివరకు వున్న గొప్ప యాక్టర్లున్నారు. వెళ్లండి" అన్నాడు. పూర్తిపని జరక్కపోయినా లోపల ప్రవేశం దొరికింది గదా అని సంతోషిస్తూ లోపల ప్రవేశించాను అనుమాన ఆశ్చర్యాలతో, కొత్త గనక.

## 3

హాలు చాలా విశాలంగా వుంది. చిన్నచిన్న గదులుకూడా చాలా వున్నాయి. "మ్యానేజరు ఆఫీసు", "ప్రయివేటు", "కంకక్టరు రూము", "యాక్టర్సు హాలు", "మిస్ ఇందుమతి" అంటూ వ్రాసినబోర్డులు గదిద్వారాలపైన అమర్చబడి వున్నాయి. నాకు చాలా ఆశ్చర్యం వేసింది. అంతా పాశ్చాత్యపద్ధతిలాగ కకిబడ్డది. అందుచేత చాలా కట్టుదిట్టంగా పనిచేస్తోంది కామోసు ననుకొన్నాను. ఇన్నిగదు లున్నాయి. ఏ గదిలోకి వెడితే యేమిచిక్కు వస్తుందో అని అనుకొని మెల్లగా యిటు అటూ చూస్తూ యాక్టర్లహాములోవ వెళ్లాను. అచ్చట సుమారు పదిమందివరకు వుంటారు. అందులో కొందరు పెద్దయాక్టర్లు కామల్ను, అయిదారుగురు చుట్టూ కూర్చొని పేకాట ఆడుతున్నారు. రకరకాలమనుష్యులు. వింతవింతజట్లు. అందులో ఒకడికి అదేదో బుల్ డాగు క్రాపింగుట, యీమధ్య భారతిలో ప్రకటించారే అట్లాంటిది, వుంది. ఒకడికి సంపూర్ణంగా తలనిండా జట్టు; స్త్రీవేషానికి పనికివచ్చేవాడనుకొన్నాను.—మరివకడికి గిరజాలు. చెంప సగము వరకూ వెండ్రుకలే. ఒకడిది బట్టతల. మరివకనికి సుంచుమన్య జట్టుపిలక. ఇట్లాగ ఒకరికి ఒకరు తీసిపోకుండా వున్నారు.

ఇంకా అక్కడ కాల్చి పారవేసిన సిగరెట్లు, బీడీలు, చుట్టలు లెక్కలేనన్ని వున్నాయి. మనదేశంలో వచ్చే అన్నిరకాల చుట్ట, బీడీ, సిగరెట్టుల సాంపిల్లు కావాలంటె అచ్చట దొరకగలవంటె అతిశయోక్తి గాదు. అందులో, కొందరు నన్ను చూసి కామల్ను పేకాట ఆడుతూనే కూనిరాగాలు తీయడానికి మొదలు పెట్టారు—తాము గొప్పయాక్టర్లని నే ననుకోవాలని కావల్ను. ఇక కబుర్లకి తక్కువలేదు. డచ్చీలకు డాబులకి అంతు లేదు. యీవిధంగా కాలక్షేపం అయింది కొంతసేపు. కాని నన్నెవ్వరూ పలకరించా లేదు; కూర్చోండి అన్నపాపాన్నిఅన్నా పోలేదు. వాళ్ల ఆటేమో, పాటేమో, కబుర్లేమో—అంతే. ఒకమూల కొంతమందిపిల్లలున్నారు. పాపం వాళ్లు లోకువ కాబోలు, వారి కేదో పాటలు చెప్పుచూ పాడించుచున్నాడు హార్మోనిస్టు నోట సిగరెట్టుతో. ఈవిధంగా యీచిత్రాలన్నీ చూస్తూ వీరే కాబోలు నటకాగ్రేసరులు, అభినవనాట్యశిఖామణులు; లోకోద్ధరణమునకు నాటకరంగాలపై నభినయించి పండితపామరజనుల కాదర్శప్రాయులగు మహామహులు వీరే కాబోలు ననుకొన్నానాలో నేను. ఇట్లా అనుకొంటూ కొంతసేపు నిల

డ్డాను. ఇంతలోకే మేనేజరుగారు వచ్చారని ఎవరో చెప్పారు. ఆమాట వినేసరికి పేకాట ఆడుతున్నవారిలో ఒకడు లేచి ముక్కలను క్రింద పారేసి గభాలున వెళ్లిపోయాడు. మిగతావారు మామూలుగానే ఆడుతూనే వున్నారు. ఆవెళ్లినవాడు తిరిగి చేతిలో ఓ జరీకండువా, ఓచేతిలో బెత్తం, చెప్పులుజోడు తీసుకొనివచ్చి, "వీటిని మేనేజరు ప్రైవేటురూములో పెట్టి వస్తాను. ముక్కలిప్పి కలపండి" అని చెప్పి వెళ్లిపోయాడు. యీ దృశ్యం చూసేసరికి నా కాశ్చర్యం వేసింది. ఎందుకంటే వీడొక నౌకరనియు, మిగతావాళ్లు యాక్టర్లని నా కప్పుడు తెలిసింది. ఉచ్చనీచాలు లేక ఓ నౌకరుతో కలిసి పేకాట ఆడుతున్న నటకాగ్రేసరులను చూచి ఓవిధమైన రోత పుట్టింది. అయినా యిదో కంపెనీరూలు కాబోలు



కవి:—"ఇచ్చటకూడా పేకాట జోరుగా సాగుతోంది— ఆటకూడా పెద్దదిలాగే వుంది."

నను కొన్నా, గాంధీమహాత్ముడు సర్వమానవసమానత్వం ప్రపంచానికి చాటుతున్నాడు కాబట్టి, మహాత్మునిబోధల్లో ఏవి పట్టుబడక పోయినా యిందులో మాత్రం బాగా పట్టుబడి లోకానికి ఆదర్శప్రాయు లౌతున్నారని అనుకొని, అచ్చట యెంతసేపున్నా లాభం లే దనుకొని మేనేజరుగారి దర్శనం చేసుకొందామని బయటకు వచ్చాను. ఆయన ఆఫీసురూములో వుంటా రనుకొని గదులమీద బోర్డులను ఆధారం చేసుకొని ఒకగదిలో ప్రవేశించాను. లోనికి వెళ్లేసరికి క్రొత్తమనిషిని గనక యెగాదిగా యేకదమ్ముని అక్కడవున్నవాళ్లంతా నావంక చూశారు. ఇదంతా నేను కనిపెట్టుతూనే వున్నా. అంతలో ఒకరు "ఎవరండీ? ఎవరికోసం వచ్చారు?" అనడంతోటే, "చిత్తం. మేనేజరుగారి దర్శనార్థం వచ్చాను" అని చెప్పాను. నాజవాబునకు తిరిగి యేవిధమైనప్రశ్నా రాలేదు. నే నల్లాగే నిలబడ్డాను గదిగుమ్మంలో.

ఇక గదిలోసంగతి మనవిచేస్తా. నామీద కోపం వద్దు. ఉన్న దున్నట్లు చెప్పుతాను. అది నిజమే అనుకోండి, వినోదమే అనుకోండి; ఎల్లా భావించినా సంతోషమే. గదిలో నలుగు రున్నారు. అంతా కంపెనీపెద్దవుద్యోగస్థులలాగ కనబడ్డారు. ఇచ్చటకూడా పేకాట జోరుగా సాగుతోంది. కాని వెనక చూసిందానికి దీనికి వ్యత్యాసం వుంది. ఇక్కడ రవునుబల్ల. అంతా కుర్చీలమీద కూర్చున్నారు. ఆటకూడా పెద్దదిలాగే వుంది. మనిషికి యాభైముక్కలు, డబ్బు మస్తు ప్రోగుపడి, మహాజోరుగా సాగుతోంది ఆట. ఈజోరులో ఏమీ కనబడ్డం లేదు—వారితఆటేమో, వారేమో!! యిల్లాగా సుమారు అరగంటసేపు నిలబడ్డాను. ఈవిధంగా వుండగా అందులో ఒకడు "శాస్త్రుర్లు గారూ! తాము పెద్దలు. తమకు పని చెప్పకూడదు. చూడండి, ఆ ఆల్మైరాలో సీసాను చిన్నగ్లాసూను వుంటుంది. యిల్లా యివ్వండి" అన్నాడు. కార్యవాదిని గనక, అనుగ్రహం సంపాదించాలి గనక, చిత్తం చిత్త మంటూ ఆల్మైరా తెరచి సీసాను, గ్లాసును తెచ్చి యిచ్చాను. సీసాపై లేబిలు చూసి, వుండవలసిన లక్షణా లన్నీ వున్నా యనుకొన్నా నాలో నేనే. ఇంతలోకే అందులో ఒకడు, మానేజరు కాబోలు, "శాస్త్రుర్లుగారూ! తమరు రేపు యింటికి దయచెయ్యండి, మాట్లాడుదా" మన్నాడు. చేసేది లేక చిత్తమని శెలవు తీసుకొని జరిగిందంతా తలుచుకుంటూ, అనేకభావాలతో త్రోవనే నాబసకు చేరుకొవా లనుకొన్న నారోజుకి.

# ౪

"ఏమండీ, శాస్త్రుల్లుగారూ! మీకి వచ్చినపని అయిందా" అంటూ యెదురుపడ్డావిడ నావెంబడి నేటువచ్చిరల్లో, నేను వెళ్లబోతుంటే. వాళ్లి నా వేషనికి నావళ్లు భగ్గున మండింది. నీపాడా యింత కట్టుదిట్టంగా వుండానికి కారణం లోనిపెకాలుగడదా అనుకొని, "అబ్బే యెక్కడివి? రేపు యింటివద్దకు రమ్మన్నారు మేనేజరు గారు రేపు బహుశః నాకార్యం చక్కబడవచ్చు" అన్నాను. "అరే పాపం! నాకు చాలా విచారం వేస్తుంది శాస్త్రి కాని యింకా వకటి చెప్తాను. అది కూడా చేయండి, కష్టంలో కష్టం.ఏం చేస్తారు మరి. మాదికంపెనీలో నాయికాపాత్ర(Heroine)వేసేది ఆడది కాని మొగవాడు కాదు, అందరికంపెనీలలాగా దానికి మీరు తప్పక చూడవాలా మా మేనేజరుగార్కి అది ఆడుపడ్డ. మిసస్ మేనేజరు. తెలిసిందా? వెళ్లండి మీరు, చాలా ప్రొద్దుపోయింది పాపం" అని అన్నాడు. ఆప ట్టున దారిలో జరిగిందంతా తలుచుకొంటూ, జరుగబో యేదానిని ఆలోచించుకొంటూ యింటికి వెళ్లాను.స్నానం వగైరాలు చేసుకొని, కొంతవిశ్రాంతి తీసుకొందా మని, త్వరగా భోజనంచేసి ప్రక్కమీద పరుండేసరికి, "రేపు మేనేజరుగారియింటికి వెళ్లుతున్నాము గదా! యీసా యంత్రమే మిసస్ మేనేజరుగార్ని చూచినట్టయితే మం చిదేమో! ఆలస్యం అమృతం విషం అన్నారు. ఈసాయం త్రమో రాత్రియో వారు కలసినప్పుడు ఒక్కమాట చెప్పితే రేపు కార్యసానుకూలం కావచ్చు"నని తటాలున మన స్సుకు తట్టింది. అంత విశ్రాంతికి స్వస్తిచెప్పి తిరిగి బయలుదేరాను బజారునకు, చంకలో గ్రంథం వుంచు కొని. రిక్తహస్తములతో పోవుట మంచిది కాదని పండ్లు కనబడితే బజారులో కొన్ని కొని తిన్నగా యిందుమతి గారియింటికి వెళ్లాను. నారాక దాసీవల్ల తెలియ జేశాను. లోపలికి రావచ్చునని శలవయిందని దాసీవల్ల తెలియవచ్చింది. అంత లోనికి వెళ్లి వెంట తీసుకువెళ్లిన ఫలములను అమ్మగారివద్ద నుంచి అతివినయవిధేయతలతో నావచ్చినకార్యం నివేదించాను. వెంటనే ఆమె "కూ ర్చోండి" అని ఒక కుర్చీని చూపించి మర్యాదగా మాట్లాడింది. అందువల్ల నాకు చాలా ఆనందమూ కలి గింది. చదువుకొని మా కన్నిమర్యాదలూ తెలుసునసే పురుషులకంటె కూడ స్త్రీయే యుక్తమైనదని తోచింది. నిజంగా మన స్త్రీలవల్లనే మనమర్యాదలు, మంచిచెడ్డలు యింతవరకు నిలవబడుతున్నాయి. మంచికి చెడ్డకి కూడా స్త్రీయే కారకురా లన్నమాట వేదాంతం. ఆమె న న్నెంతో గౌరవించి తప్పక తాను నాకు సహాయము చేయుదుననియు, రేపు మేనేజరుగారిని చూడవలసిం దనియు, తాను యీరాత్రి యీవిషయమై మేనేజరు గారితో మాట్లాడెదననియు చెప్పి తాంబూల మిచ్చి నమస్కరించింది. చిత్తమని శెలవు పుచ్చుకొని నా కార్యం నెరవేరుట కభ్యంతరం లేదని నాలో ననుకొని సంతోషిస్తూ యింటికి వచ్చాను.

ఆరాత్రి సుఖంగా నిద్రపట్టలేదు. ఎప్పుడు తెల్ల వారుతుందో, యెప్పుడు మేనేజరుగారియింటికి వెడ్తానో అన్న ఆలోచనలతోనే సరిపోయింది. ఈఆలోచనల్లో యెప్పుడు నిద్ర పట్టిందో యెఱుగను కాని, వుదయం సుమారు యెనిమిదిగంటలకు మెళుకువ వచ్చింది. ఆల స్యంగా లేచినందుకు కంగారుపడుతూ, విసుక్కొంటూ, పెందలకడనే లేపనందుకు భార్యను కసరుకొంటూ, కాలకృత్యాలు దీర్చుకొని భోజనం చేసి దుస్తులను ధరించి చేతితో పుస్తకం పట్టుకొని మేనేజరుగారి యింటికి వెళ్లాను. మేనేజరుగారుకూడా భోంచేసి విశ్రాంతిగా పడకకుర్చీలో కూర్చొని తాం బూలం వేసుకొంటూ నారాక చూచి నన్నుకూడా కూర్చోమని శెలవిచ్చారు. కొంతవరకూ నామంచిచెడ్డ లను దర్యాప్తుచెయ్యడంలో గడచింది. అంతట నాపని వారితో చెప్పుకొన్నాను. అంతా విని, "అల్లాగా! యేది చదవండి పుస్తకం విందాము" అని శెలవిచ్చారు మేనేజరుగారు. అన్నదే చాలు గదా అని నాగ్రంథం విప్పి చదవడం మొదలుపెట్టాను. నేను చదవడం ఆయన కొంతవరకు "ఊఁ" కొట్టుట జరిగింది. మేనే జరుగారు శ్రద్ధగా వింటున్నారు గదా అని నేను చదు వుతూనే వున్నాను. ఇట్లా కొంతసేపు జరిగింది. తరు వాత ఆ 'ఊఁ' శబ్ద మాగిపోయి ఆస్థానమును 'గుర్రు గుర్రు' శబ్ద మాక్రమించినది. తల పైకెత్తి చూచాను.

ఏమి చెప్పమంటారు! మేనేజరుగారికి శరీరస్మారకం లేదు. మహానిద్రలో ఉన్నారు! ఆదృశ్యం చూచి ఓపెద్ద నిట్టూర్పు విడిచాను. ఇంతవరకూ వృథాగా చదివాను. నాశ్రమంతా అరణ్యరోదన మయింది. చాలా బాగుంది



కవి:—"నా శ్రమంతా అరణ్యరోదన మయింది – చాలాబాగుంది మర్యాద."

మర్యాద! ఈమాత్రానికి నన్నెందుకు చదవమనాలి అనుకొని గ్రంథం మూసి కూర్చున్నా, ఆయన నిద్రపోతోంటే నేను చూస్తూ. ఇల్లా రెండుమూడుగంటలైన తరువాత మేనేజరుగారు లేచారు. లేస్తూనే నావైపు చూచి, "బాగుంది మీనాటకం. దయచేసి ఆపుస్తకం యీబల్లమీద వుంచి మీరు వెళ్లండి. తప్పకుండా ప్రదర్శించడాని కేర్పాటు చేస్తాను. మీరు రెండుమాసము లయినతర్వాత రండి". అని శెలవిచ్చారు. చిత్తమని వారు చెప్పినట్లు బల్లమీద పుస్తక ముంచి శెలవు తీసుకొన్నా. విన్నా వినకపోయినా బాగుందనియు, ప్రదర్శింపచేస్తాననియు శెలవిచ్చాడు, నా కంతే చాలును. భగవంతుడిదయవల్లనో, మిసెస్ మేనేజరుగారి అనుగ్రహంవల్లనో నాకార్యం నెరవేరిందని సంతోషిస్తూ యింటికి వెళ్లాను.

౫

దిన మొకయుగంగా గడిపాను. ఎప్పుడు రెండు నెల్లు అవుతాయా, యెప్పుడు నానాటకం ప్రదర్శింపబడుతుందా అని అని ఉవ్విళ్లూర్తూ రోజులు వెళ్లబుచ్చాను. కష్టపడి నిద్రాహారములు లేక వ్రాసినందుకు కన్నులపండుగగా చూచి ఆనందించెడి భాగ్యం యెన్నడబ్బునా అని తహతహపడ్డాను. ఈవిధంగా ఓపికబట్టి కాలం గడిపి ఆఖరుకు బయలుదేరాను మేనేజరుగారి దర్శనానికి. హాలువద్దకు వెళ్లి గేటుదగ్గిర నిల్చుని నౌకరుచేత "ఏమోయి, మేనేజరుగారితో చెప్పు కవిగారు వచ్చారని" అన్నాను, యేమో మేనేజరుగారువచ్చి గొప్పమర్యాదతో లోనికి తీసుకువెళ్తారనే ఊహతో. నౌఖరు లోనికి వెళ్లి తిరిగి వచ్చి, "కవీ లేదు, గివీ లేదు, వెళ్లు. యిక్కడ వుండడానికి వీలు లేదు వెళ్లిపో. లేకపోతే త్రోసివేయవలసివస్తుంది" అన్నాడు. ఈమాటలు వినేసరికి నా కెక్కడాలేని కోపం వచ్చింది. — "ఆ" అన్నాను. "'ఆ' లేదు, 'ఊ' లేదు, వెళ్లవయ్యా" అన్నాడు నౌకరు. ఆసాటున యేమి చెయ్యనూ తోచింది కాదు. ఉచ్చనీచము లెఱుంగనివానితో పోట్లాడి యేమి లాభం. ఇంతకూ బుద్ధిపొరబాటు నా దనుకొని లెంపలు వేసుకొని యివతలకు వచ్చి హాలుగోడమీద చూతుగదా! ఒక పెద్ద కరపత్రము (wall poster) అతికింపబడి వుంది. అందులో యిట్లా వుంది—

"త్వరలో ప్రదర్శింపబడును. ఆరంభదినమునకై వేచిఉండుడు—

గొప్పనాటకరాజము

నాటకరంగమునందును, నటనాకౌశల్యమునందును మెప్పువడసి అనేకసువర్ణపతకములను, కంకణములను బహుమానము లందిన యీనాటకసంఘపు మేనేజరు మ-రా-రా-శ్రీ.................గారిచే స్వయముగ రచింపబడిన



"ఆ" లేదు "ఊ" లేదు వెళ్లవయ్యా! లేకపోతే త్రోసివేయవలసివస్తుంది.

చిత్ర

అను నాటకమును అతిచిత్రవిచిత్రముగ త్వరలో ప్రదర్శింపబడును'

అన్నీ పెద్ద అక్షరములలో ప్రచురింపబడి యున్నది. అది చూచేసరికి నా ప్రాణాలు నిలువునా పోయాయి. కళ్ళు నుండి వేడినీళ్లు బొటబొట రాలాయి. ఎంత పనిచేశావురా యీ మేనేజరు అనుకొన్నా. చిత్రముగా 'చిత్ర' నాటకమునకు నా పేరు వూరు లేకుండా తానే స్వయంగా రచించాడుట. అప్పరా కాలమహిమ! ఇంత చిత్రం యీ ప్రపంచంలో జరుగుతుం దనుకోలేదు. ఇంకా చేసే దేమున్నది? నెత్తిని గుడ్డ వేసుకొని తూర్పుగా తిరిగి ఒకదణ్ణం పెట్టి అలో, లక్ష్మణా యని యింటికి తిరిగాను. నాదంటే నాది నేను వ్రాశానంటే నేను వ్రాశానని శిగపట్లు పడగాలి. కోర్టులో దావా వేయాలి. నా కేమి సాక్ష్యమా, చుట్టుబం దెలా? ఇంతకంటె కిష్టమాలి నపని వేరే వుందా? కోర్టులోమట్టుకు న్యాయం దొరకుతుంది గనకనా? డబ్బున్నవాడికి కోర్టు గాని నాబోటి బీదవాడికి కోర్టు దేంలాభం అని నిరాశచేసుకొని వూరుకున్నాను. నా సోదరకవులు యిట్లా జరుగుతుందా అని శంకించి చప్పళింపక యికముందు జాగ్రత్తగా నుంటా రనుకొంటే నా 'చిత్ర' చరిత్రం వ్రాసినందుకు నేను ధన్యుణ్ణి అవుతాను.

---

# ప్రభాతము

కోరిమిల్లి వీరసోమ సత్యనారాయణ గారు

నవదిననాయకాభ్యుదయ నాటక మాడఁగ వేగుఁజుక్క యన్
ధవళసుమాంజలిన్ సమయనామకసూత్రధరుండు దాల్చి వై
భవ మెసఁగన్ శకుంతరుతవాక్కుల నాందిఁ బఠింపఁగా నిశా
యవనికవాసె, పూర్వగగనాంచితరంగ మెసంగె శోభతోన్.
అతులితతన్నాటకని-శ్చితవార్తాప్రకటనోపచితకాహళసం
గతిఁ గుక్కుటముల్ త్రివిధ-శ్రుతరవములఁ గూసెఁ "గొక్కొరోకో" యనుచున్.

పొదుగులు క్షీరధారములఁ బొంగఁగ దవ్వుల నున్న క్రేపులన్
గదియఁగ లేక హుమ్మనుచు గట్టిగ నార్చుచు నల్కలైన దో
నువటుఁన ఱిక్కవెట్టి చెవు లొక్కటఁ గట్టుల ద్రెంచునో యనం
బడటునఁ జూచుచుండె యజమానులరాకకు గోసమూహముల్.

వలనుగ వచ్చి కాఁపు లొకప్రక్కను గోవులపాలు దీసి లేఁ
గల విడఁ దల్లులం గదిసి కమ్మనిక్షీరము లాని తృప్తిగా
నలరుచు ముద్దుగా గుబిసియాడుచు సుందరవక్త్రపార్శ్వని
ర్గళితపయఃప్రఫేనములు గాలికిఁ దూలఁ జెలంగు నింపుగన్.

ప్రాకటకీరకోకిల మరాళతతుల్ ఫలజాలపల్లవా
నీకమృణాళికావళుల నెమ్మి భుజింపఁగ కాకు లేమొకో!
వాకిళులందు భుక్త పరివర్జిత లేశతరాన్న ఖండముల్
గైకొనుఁ "గావుకా"వనుచుఁ గాంచఁగ నీదృశు లుత్తమాధముల్

సడలిన కొమ్ముడుల్ సగము జాఱినపయ్యెద లొప్పఁ జేతులం
డిడి కలశంబులన్ పడకటింట్లను వెల్వడి చొక్కపున్నడల్
తడఁబడ పాటుసెంద గృహతామరసాక్షులు దాసికాజనుల్
బడబడ తల్పులం బిలువ "వచ్చెను వచ్చె" నటంచు వేకువన్.

* * * * *
* * * * *
* * * * *
* * * * *

కన్నుల నీరు వెట్టి కులకాంతలు గుందఁ గులాభిమానముల్
మన్నులఁ బూడ్చి ద్రవ్యములు మంటలఁ గల్పి శరీరసౌఖ్యముల్
సున్నలు గాఁగ రాత్రి వెలజోటులకొంపలఁ జేరి వేకువన్
సన్నకసన్న సందులను జాఱుచునుండిరి జారు లిండ్లకున్.

కలువులు దీసి పాళెములు గట్టి లతాతరుపాళికిన్ భుజం
బుల నిడి కావడుల్ సలిలముల్ గొనివచ్చుచుఁ దోఁటకాఁపరుల్
జలజలఁ బోసి వేకువను జక్కఁగఁ బ్రోదియొనర్త్రు కేలికల్
నలినులితెమ్మెరల్ పొలయ వచ్చి కనుంగొని మోదమందఁగన్.

కనుఁగొన రాక పుష్పాళి నిగారము లల్లన మీఁదఁ జల్లి వం
తనమునఁ జేరి పుష్పితలతాలలితాంకులతావ్రలంటి పై
కొని గిలిగింతతో వలరుఁగొమ్మల కెంజిగురాకుకేల్గద
ల్చును వనవీధులన్ మలయలోలకుమారసమీరుఁ డింపుగన్.

శ్రీనిలయాంతికోపవనసీమల వృక్షలతాంబుసేచనా
నూనవినోదపుష్పహరణోత్సుకలై మధురోక్తు లొప్ప మం
దానిలచాలితాలకము లల్లనఁ బై కెగఁద్రోసికొంచు స్వే
చ్ఛానుగతిన్ జరింతు రెలజవ్వను లున్నతభాగ్యశాలినుల్.

నెలకొన మూట తొడలల నేర్పున బిడ్డల నుంచి మూపులన్
మెలఁతలు వెంట రాఁగ, నడి మింటికి వేఁడివెలుంగు సేరి కాఁ
కల నలయింపకుండఁగను గమ్యస్థలంబులఁ జేరిపోవఁగా
వలనుగ సాగిపోవుదురు పాంథులు వేకువ రాచబాటలన్.

మెలఁకువ పొంది వేకువ సమీరముతో నికటస్రవంతికా
జలములఁ దోఁగి సాంధ్యవిధిఁ జక్కఁగఁ దీరిచి నిర్మలోదకాం
జలులను కర్మసాక్షికి నొసంగి నమస్కృతులన్ ఘటించుచున్
వెలయుదు రగ్రహారముల విశ్రుతభూసురు లక్కడక్కడన్.

అతులితానందసూచితమాధురీపూర్ణ విహగనాదములకు వేడ్క పొంది
విహగనాదములతో వీతెంచు చల్లని మొలకతెమ్మెరలకు మోదమంది
మొలకతెమ్మెరలు పై నొలయ వాసన లీను విరిపూలశోభకు మురిసిపోయి
విరిపూలశోభపైఁ బరఁగి కెంజిగి సూపు నీరెండలకు లోన నెమ్మిగాంచి
తనదు లేఖినికై సృష్టితనరఁ బోదు - సృష్టికై తాను వర్ణనల్ సేయఁజాలఁ
డైన నేమేమొ నైజభావానుసరణి - వ్రాసి కొనుచుండుఁ గవియన్నవాఁడు భువిని.

---



చెరువునుండి

చిత్రకారుఁడు: యస్. రాఘవేంద్రరావు గారు, బెంగుళూరు.

# సంక్రాంతికానుక

శ్రీమతి లక్ష్మిగారు

"పద్మా, ఈయేడు బొమ్మలు పెడతావు టోయ్" అంది, ప్రక్కఇంటిలీల.

"ఏం పెట్టకా? యీసారి మాఅన్నయ్యకూడా సాయంచేస్తా నన్నాడు."

"ఏమో లే, నిరుడూ ఇలాగే చెప్పి, మీ మేనమామగారింటికి వెళ్లావు."

"లేదుగా, యీసారి వెళ్లను. చూస్తూ వుండు."

"ఏంబొమ్మలుకొంటావోయ్,యీసారి?"

"ఆ, ఏంబొమ్మలు? అన్నీ వున్నవేగా. మానాన్నగారు కొంటా నంటే, చలవరాతి బొమ్మలు తప్ప ఇంకేమీ కొనను. నువ్వో?"

"నాకు మానాన్నగారు, 'మంచి చీర కొంటాను. బొమ్మలాట్టకొనను' అన్నారు. ఏం చేస్తారో తెలీదు. బొమ్మలనోము నోస్తావా?"

"ఆహా"

"వరహాలుగారింటికి వెళ్లొద్దాము వస్తావా?"

"సరే, పద."

[ఇద్దరూ వెళ్లిపోయారు.

* * * * *

"అమ్మా, బల్లలు అవీ సర్దుతున్నావు భొమ్మలకేనా?" అంది పద్మాసని.

"అవునమ్మా, అన్నయ్య ఇంటికి రాగానే బొమ్మలు పెడుదామని బల్లలు వేయిస్తున్నాను. నువ్వుకూడా ఇంట్లో వుండు. ఎక్కడకూ వెళ్లకు."

"ఉంటాను గాని, బొమ్మలమాట ఏమన్నారు, నాన్నగారు?"

"ఏముంది, కొనటమే."

"అమ్మా, మరే, లీలకు వాళ్లనాన్నగారు మంచి శిల్కుచీరె కొంటారుట. నాకు నాన్నగార్ని కొనమనవూ?"

"ఆలోచిండ్దాలే."

* * * * *

"అమ్మా, బావకు జ్వరం వస్తోందని వుత్తరం వచ్చింది" అన్నాడు, పద్మఅన్నగారు.

"ఏమో చదువుతా విను. 'మీఅల్లుడికి ౧౦౩, ౧౦౪, జ్వరం వస్తోంది. చాలా వుద్దడిగా వుంది. ఇద్దరుడాక్టర్లను పెట్టి, మందు జరుపుతున్నాము. మా కేమీ తోచుట లేదు. మాపద్మాసనిఅదృష్ట మెట్లున్నదో తెలియుట లేదు.' అని వుంది."

"సరే, పులిమీద పుట్రల్లె, ఇదొకటా? ఏదో వకటి, మనస్సు కులాసాగా వుండనివ్వదు. మొన్నటిదాకా పద్మజబ్బుకు దిగులుపెట్టుకోడం సరిపోయింది. ఇప్పుడిది. కానీ, భగవంతు డున్నాడు."

* * * * *

"అమ్మా, బొమ్మలనోము పట్టటం యెల్లుండే కదూ" అన్నది పద్మ తల్లితో.

"అవును గాని, ఇప్పు డెందుకమ్మా? ఓమూల అతనికి జబ్బుగా వుందని వుత్తర మొచ్చిందామెను. మనస్సు స్వస్థతగా లేదు. యీయేటి కొద్దమ్మా."

"కాదమ్మా, నేను నోచుకుంటాను తప్పకుండాను. నువ్వు అడ్డు చెప్పకు."

"నీకు తెలియదు, వెర్రితల్లీ, వూరుకో. వాళ్లు యింటే బాగుండదు. బొమ్మలు పెట్టిం దానికే నాకు కష్టముగా వుంది. యీమాటు వద్దు తల్లీ."

"అమ్మా, నేను చెయ్యక మానను. నువ్వేమీ అనుకోక. ఏం భయం లేదు. నన్ను నోము చేయనీ. దానిఫలం తర్వాత చూద్దువు గాని" అంది, గంభీరంగా పద్మ.

"సరే, నీఇష్టం తల్లీ. నీధైర్యమే నిన్ను కాపాడగలదు."

* * * * *

బొమ్మలనోము రెండుదినా లయింది. మూడోనాడు బొమ్మల నెత్తుదామని అన్నీ సిద్ధంచేసుకుంది పద్మాసని. తల్లికిమాత్రం ఇష్టం లేదు. పద్మ ధైర్యంతో జరుపుతోంది. వెళ్లి, పేరంటాని కందర్నీ పిల్చుకొచ్చింది. ఇంతలోకే మామగారివద్దనుంచి వుత్తర మొచ్చింది: 'ఇంకా నెమ్మది లేదు, అల్లాగే వుం' దని. ఇం కేముందని, అందరూ ఒకటే కంగారు పడుతున్నారు కాని, పద్మమాత్రం నిశ్చింత గానే వుంది. ఆపిల్లధైర్య మేమిటో మనకు తెలియదు. ఎల్లాగో బొమ్మల నెత్తడంకూడా అయిం దనిపించారు. పద్మ ప్రస్తుతం చేసే పనేమిటో తెలుసునా? ఇరువదినాల్లుగంటలు సావిత్రదేవిపూజ, దేవీధ్యానము, దేవీస్తవ ములు. ఇంతే ఆమె చేసేపని. బొమ్మలనోము చివరరోజు వచ్చింది. ఆవేళ అమ్మవారిని వాల లాడింపు. పద్మ హడావిడి పడుతోంది. అటు కులు పెరుగులో నానవేసుకుంది. అమ్మవారి తోకూడా చెరువుదాకా వెళ్లటానికి అన్ని ఏర్పాట్లు చేసుకుంద. తల దువ్వి జడ వేసు కుంటుండగా, వుత్తర మొచ్చిందని తండ్రి చెప్పటానికి వచ్చారు.

"ఏమని వచ్చిందండీ?" అంది వాళ్లమ్మ.

అల్లుడికి వళ్లు నింపాదిగా వుందిట. పథ్యం నిన్ననే పెట్టేరుట."

"ఆచేతులో ప్యాకెటు ఏమిటి?" అన్నది పద్మాసని

"నీకే; మీమామగారు ఆగ్రాచీరె పంపారు. 'అబ్బాయివళ్లు నెమ్మదిగా యుండు ట, మనపద్మ అదృష్టమే కారణము గనుక, ఈచీరె ఆమెకు సంక్రాంతికానుకగా పంపడ మైనది' అనికూడా వ్రాశారు వుత్తరంలో."

"నే చెప్పలేదే అమ్మా! నోముఫలితం. నువ్వే చూద్దువుగానని?" అంది, సంతోషంగా, పద్మ.

"అవునమ్మా, నిజమే. నీధైర్యము, నీదే వీపూజవల్లనే ఇంతవరకు తేలేం. ఆదేవికి మన మీద పరిపూర్ణకటాక్షు మున్నదన్నమాటే."

"అమ్మా, చీరె చూడు. ఎల్లా వుందో!" అని తల్లి చేతి కందించింది.

"అవునమ్మా, బాగుంది. ఇప్పుడు కట్టు కుని, అమ్మవారివాలలాడింపుకు వెళ్లు. నీవు నాన్నగారిని తెచ్చిపెట్టమని కోరావు కదూ అది సావిత్రీదేవి యీవిధంగా ఇచ్చింది?" అన్నది.

# కెప్టెన్ సాహెబ్

శ్రీ శివశంకరశాస్త్రి గారు

(శ్రీ ప్రేమచందు హిందీభాషలో చెప్పినకథకు తెనుగు)

౧

క్వైనా తినమన్నా, కాడ్లివర్ నూనె తాగమన్నా ఎంతయిష్టమో పాఠశాలకు వెళ్లమంటే జగత్సింగుకు అంతే యిష్టము. అతను అస్తమానమూ తిరుగుతూఉంటాడు. అప్పుడప్పుడు జామతోటలలోకి వెళ్లి, పళ్లతోపాటు తోటమాలి తిట్లు కూడా ఉత్సాహముతో తింటూ ఉంటాడు. నదిమీద షికారుచేస్తూ, పడవవాళ్ల డింగీలో అవతలవైపు పల్లెకు వెళ్లుతాడు. తిట్లు తినడము అతనికి సంతోషము. అటువంటిసందర్భము వస్తే చేతిమీదుగా పోగొట్టుకోడు. వెళ్లేగుఱ్ఱము వెనక చప్పట్లు కొట్టడము, ఎక్కాబండిని వెనకనుంచి లాగడము, వృద్ధులనడక అనుసరించడము అతనికి వేడుక పనులు. ముఖ్యమైనపనిమాత్రము చెయ్యడు. వ్యసనాలకు దాసుడు. పైసా లేకుండా వ్యసనాలు సాగవు. వీలయినపుడు జగత్సింగు ఇంట్లోనుంచి రూపాయలు కొట్టివేసేవాడు. డబ్బు చిక్కకపోతే పాత్రలు, వస్త్రాలూ ఎత్తుకుపోవడానికి సంకోచించేవాడు కాడు. ఇంట్లో సీసాలు ఒక్కొక్కటే గుదడీబజారుకు (Second-hand shops) చేర్చేవాడు. వాళ్లయింట్లో యెన్నో పూర్వకాలపు వస్తువు లుండేవి. ఇపుడు ఒక్కటీ నిలవలేదు. ఇతరులకు చాలా ఆశ్చర్యము కలిగేలాగున జగత్సింగుకు ఈకళలో కౌశలము కుదిరింది. ఒకసారి అతను బయటివాడు బయటనే అంచులమీదుగా రెండంతస్తుల మేడమీదికి ఎక్కి పెద్ద యిత్తడిపళ్లెము తీసుకు దిగినాడు. ఇంట్లోవాళ్లకు చప్పుడయినా వినబడలేదు.

అతనితండ్రి భక్తసింగు వాళ్లఊరి పోస్టాఫీసులోగుమాస్తా. ఆపోస్టాఫీసును సక్రమపద్ధతిలో పెట్టడానికని ఆయన్ను ఆఫీసర్లు నియమించారు. ఆయన వచ్చిన ఉద్దేశ్య మేమీ సఫలము కాలేదు; పైగా నష్టముకూడా సంభవించింది. గ్రామాలలో కూరగాయలు, పిడకలు, వంటచెరుకూ ఊరికే దొరికేవి. ఇక్కడ బందు అయిపోయినవి. ఆయన ఎవ్వరినీ మందలించలేడు, ఎవరినీ నొక్కిపెట్టలేడు. ఈదురవస్థలో జగత్సింగు చేసేదొంగపనులు తండ్రికి చాలా వ్యధ కలిగించినవి. ఆయన యెన్నోసార్లు కొడుకును కఠినముగా కొట్టినాడు. జగత్సింగు భీమకాయు డయినా నిశ్శబ్దముగా దెబ్బలు తింటూఉండేవాడు. చెయ్యిపట్టుకొన్నట్టయితే తండ్రి కదపనే లేడు. అయితే కొడుకుకు గుండెనిబ్బరము లేదు. దెబ్బలు, తిట్లు, బెదిరింపులు, అతనిమీద ఏమీ పని చేసేవి కావు.

జగత్సింగు ఇంట్లో అడుగు పెట్టగానే నాలుగువైపులా గోల పుట్టేది. తల్లి చర

చరా వెళ్లిపోయేది. అప్పచెల్లెళ్లు తిట్టేవాళ్లు. ఇంట్లోకి అంబోతు వచ్చిన ట్టయ్యేది. పాపము, నిర్భాగ్యుడు వచ్చినవాడు వచ్చినట్టు కాలికి బుద్ధి చెప్పేవాడు. ఒక్కొక్కసారి రెండు మూడురోజులు అన్నము లేకుండా ఉండేవాడు. అతనిముఖము చూస్తే ఇంట్లోవాళ్లు మండిపడేవాళ్లు. ఈతిరస్కారాలవల్ల అతనికి అభిమానము పోయింది. సిగ్గు విడిచిపెట్టినాడు. ఎక్కడ నిద్ర వస్తే అక్కడ పడుకొనేవాడు. ఏది దొరికితే అది తినేవాడు.

తన దొంగతనపు సాధనాలు ఇంట్లోవాళ్లకు తెలుస్తున్నకొద్దీ జగత్సింగు జాగ్రత్త పడడము ప్రారంభించాడు. ఒకసారి నెలదాకా అతనిఆట సాగలేదు. భంగుదుకాణమువాళ్లకు కొన్నిరూపాయలు బాకీపడ్డాడు. గంజాయి దుకాణమువాళ్లు డబ్బుకోసము నిర్బంధము చెయ్యడము మొదలుపెట్టినారు. మిఠాయీ దుకాణమువాళ్లు కఠినము చేస్తున్నారు. పాపము, జగత్సింగు బయటికి కదలడానికి వీలు లేకపోయింది. రాత్రింబగళ్లు తదేకదృష్టితో ఉండేవాడు. అతనికి మంచి అవకాశము చిక్కనే లేదు. చివరకొకనాడు అతని అదృష్టము పండింది.

భక్తసింగు రెండుజాములకు పోష్టాఫీసు నుంచి వెళ్లేటప్పుడు భీమాచేసిన కవరు చొక్కాజేబులో వేసుకొన్నాడు. హర్కారాగాని, పోష్టుజవాను గాని ఉపద్రవము లేకుండా ఉండేటందుకు అలా చేశాడు. కాని ఇంటికి రాగానే అంగరఖా జేబులోనుంచి కవరు తియ్యడము మరిచిపోయినాడు. జగత్సింగు కనిపెట్టుకొని ఉంటున్నాడు. డబ్బు దొరుకుతుందేమో అని జేబులో చెయ్యిపెట్టేసరికి కవరు దొరికింది. అందులో నోట్లు ఉన్నవని తెలిస్తే అతను కవరు ముట్టుకొనేవాడు కాడు.

దానిమీద కొన్ని అణాలచీట్లు అంటించిఉన్నవి. అతను చాలాసార్లు చీట్లు అపహరించి సగముఖరీదుకు అమ్మేవాడు. చప్పున కవరు తీశాడు. ఆకవరు తెరవగానే నోట్లు బయటపడే సరికి అతను చిక్కన పడ్డాడు. చింపినకవరు నోరు తెరిచి అతని దుష్కార్యాన్ని నిందించసాగింది. పిట్టలను వేటాడడానికి వెళ్లి పొరపాటున మనిషిమీద గురి పెట్టినవాడి స్థితివలె అయింది అతనిస్థితి. చాలా సిగ్గుపడ్డాడు, పశ్చాత్తాపపడ్డాడు, దుఃఖించాడు. కాని ఆప్రమాదానికి జరిగేశిక్ష అనుభవించే శక్తి అతనికి లేదు. నోట్లు కవరులో పెట్టి జగత్సింగు బయటికి వెళ్లిపోయినాడు.

అది వేసంకాలము. మధ్యాహ్నము ఇంట్లో అంతా నిద్రపోతున్నారు. లోకులకు మాత్రము కళ్లు మూతలుపడలేదు. ఈవేళ అతనిచెడుగునకు తగినశిక్ష జరుగుతుంది. అతను ఇంట్లో ఉండడము యుక్తము కాదు; పది పదిహేనురోజులపాటు చల్లగా ఎక్కడికైనా జారడము యుక్తము. అప్పటికీ లోకులకోపము తగ్గదు. ఏదో దూరదేశము వెళ్లి పని లేకుండా ఉంటే బతకడము కష్టము. స్వగ్రామములో ఇన్నాళ్లు అజ్ఞాతవాసము చెయ్యడము కష్ట

మయింది. ఆచోకీ తెలిస్తే పట్టుపడక తప్పదు. దూరప్రదేశానికి వెళ్లుదా మంటే ఖర్చులకు దగ్గర పైసా ఉండాలి. ఆకవరులోనుంచి నోట్లు ఎందుకు తియ్యగూడదు? అలా చేస్తే తానే కవరు తెరిచినట్లు తెలిసిపోతుంది. అందులో నుంచి ఒకనోటు తీస్తే ఏమి నష్టము? తండ్రి వద్ద డబ్బు ఉన్నది కదా. లెక్క చెయ్యకుండా ఇచ్చివేస్తాడు. ఇలా ఆలోచించి జగత్సింగు పదిరూపాయలనోటు ఒకటి బయటికి తీశాడు. ఆక్షణములో క్రొత్తఊహ పుట్టింది. నోట్లు యావత్తూ తీసుకొని పోయి మరోప్రదేశాన దుకాణము పెడితే చాలా బాగా ఉంటుం దని పించింది. ఒక్కొక్కపైసాకోసము చోరీ చెయ్యవలసిన అవసరము ఇం కెందుకుంటుంది? తాను కొన్నాళ్లలో డబ్బు కూడబెట్టి ఇంటికి వస్తే లోకులు ఎంత ఆశ్చర్యపడతారు!

జగత్సింగు కవరు మళ్లీ తీశాడు. అందులో మొత్తము రెండువందలరూపాయల నోట్లు కనబడ్డవి. వాటితో పాలదుకాణము బాగా సాగుతుంది. మురారికొట్టులో రెండుమూడు చంకీసామాన్లు, నాలుగైదు ఇత్తడిపళ్లాలకంటె మ రేమున్నవి? కాని ఎంత పటాటోపముతో ఉంటున్నాడు మురారి? రూపాయి దమ్మిడీకింద వాడుతున్నాడు. రూపాయలు గుప్పుతున్నాడు. లాభము లేకపోతే ఇంతదర్జా ఎలా నిభాయిస్తాడు? ప్రవాహములో కాలు నిలవక కొట్టుకుపోయే మనిషివలె జగత్సింగు మనస్సు స్వాధీనము తప్పిపోయింది. ఆనంద మగ్నుడై అతను కల్పనలు చేస్తున్నాడు.

ఆసాయంకాలమే జగత్సింగు బొంబాయికి బయలుదేరినాడు.

మున్షీ భక్తసింగుమీద కేసు మర్నాడే దాఖలయింది.

౨

బొంబాయిలో ఖిల్లామైదానముమీద బ్యాండు వాయిస్తున్నారు. రాజపుత్రుల రెజిమెంటు తాలూకు చక్కని పడుచువాళ్లు కవాతు చేస్తున్నారు వాయువు మేఘాలకు క్రొత్తక్రొత్తరూపాలు కల్పించి మళ్లీ ఛిన్నము చేసేలాగు సేనాధికారి సిపాయీలతో క్రొత్తక్రొత్తవ్యూహాలు కల్పించి, మళ్లీ విడగొట్టుతున్నాడు.

కవాతు పూర్తికాగానే ఆజానుబాహువైన పడుచువాడు నాయకునికి ఎదటికి వచ్చి నిలబడినాడు.

"పేరేమి?" అన్నాడు నాయకుడు.

ఫౌజుపద్ధతిని సలాం చేసి సిపాయి "జగత్సింగు" అన్నాడు

"ఏమి కావలె?"

"సేనలో నన్ను కలిపి తీసుకుపొండి."

"మరణ మంటే భయం లేదా?"

"లేదు. రాజపుత్రుణ్ణి."

"చాలా కష్టపడవలసి వస్తుంది."

"సరే."

"'అదను'కు (Aden) వెళ్లవలసివస్తుంది."

"సంతోషంతో వెళ్లుతాను."

కెప్టను అతనిసమయస్ఫూర్తి, తీక్ష్ణబుద్ధి, సాహసమూ గ్రహించి వెంటనే ఫౌజులోకి తీసుకొన్నాడు.

మూడోనాడు రెజిమెంటు 'అడను' కు రవానా అయింది. ఓడవ ముందుకు వెళ్లుతున్నకొద్దీ జగత్సింగుమనస్సు వెనక్కు వెళ్లుతున్నది. నేలఅంచు కంటికి కనబడుతున్నంతసేపూ అతను 'డెక్కు'మీద నిలుచుని అనురాగముతో భూభాగముకేసి చూస్తూఉన్నాడు. భూతటము జలరేఖలో లీనమైపోయినప్పుడు నిట్టూర్పు విడిచి, ముఖము మరుగుచేసుకొని రోదనము చేసినాడు. ప్రియజనము జీవితములో మొదటిసారి అతనికి జ్ఞాపకమువచ్చింది. తనగ్రామము, గంజాయిదుకాణము, షికార్లు, స్నేహితులు కళ్లకు కనబడ్డారు. మళ్లీ వాళ్లందరినీ కలుసుకోడము తటస్థిస్తుందో తటస్థించదో? మనస్సు వికలమైపోయి, సముద్రములో దూకుదామా అని అతనికి ఒకసారి అనిపించింది.

## 3

జగత్సింగు 'అడను'లో ఉండగా మూడు నెలలు గడచినవి. మొదట కొత్తవల్లకొన్నాళ్లు అతను నివ్వెరపోయి ఉన్నాడు. తర్వాత పాత సంస్కారాలు మొలకెత్త సాగినవి. ప్రియజనని మధ్యమధ్య జ్ఞాపకము వస్తున్నది. తండ్రికి కోపము వచ్చినప్పుడూ, అప్పచెల్లెళ్లు ఛీ అనేటప్పుడూ, చుట్టాలు తిరస్కరించేటప్పుడూ తల్లి అడ్డుపడుతూ ఉండేది. ఒకసారి అతను జబ్బుపడ్డాడు. బతుకుతాడనేఆశ ఏంతమాత్రమూ లేదు. తండ్రికి గాని, అక్కచెల్లెళ్లకు గాని ఏమాత్రమూ చింత లేకపోయింది. తల్లి అతని తలాపిదిక్కున కూర్చుని తియ్యటిమాటలు చెప్పుతూ బాధోపశమనము చేస్తున్నది. ఆ రోజుల్లో మాతృదేవత నిశ్శబ్దముగా ఏడుస్తూ ఉండడము జగత్సింగు ఎన్నో సార్లు చూచాడు. తాను జబ్బువల్ల చిక్కిపోయింది; కొడుకుకు ఉపచారము చేస్తూ తన కేమాత్రమూ కష్టము లేనట్టు భావించేది. జగత్సింగుకు ఆరోజులు జ్ఞాపకమువచ్చినవి. మళ్లీ తల్లిదర్శనము లభిస్తుందా? ఈక్షుభతో, నిరాశతో, సముద్రముఒడ్డుకు వెళ్లి అనంతజలప్రవాహముకేసి గంటలకొద్దీ చూస్తూఉండేవాడు. ఇంటికి ఉత్తరము వ్రాతామనేకోరిక కొన్నాళ్లకు కలిగింది. కాని సిగ్గువల్ల, బడలికవల్ల ఆకోరిక తిరిగిపోతూ ఉండేది. చివరకు ఒకనాడు ఆగలేక ఉత్తరము వ్రాసి, తన అపరాధము క్షమించవలెనని ప్రార్థించాడు. ఆదినుంచి అంతము వరకూ ఉత్తరము భక్తిపూర్ణముగా ఉన్నది. చివర ఈమాటలతో తల్లిని ఓదార్చినాడు:—

"అమ్మా, నేను చాలా గందరగోళాలు చేశాను. నావల్ల మీకు దుఃఖము సంప్రాప్తించింది. ఆదోషా లన్నింటికీ నిజముగా నేను సిగ్గుపడుతున్నాను. బతికి ఉంటే ఏదో చేసి చూపుతానని నమ్మండి. నేను మీకుమారుడననేమాట ఎన్నడూ మరిచిపోను. నాప్రతిజ్ఞ నెరవేరేటందుకు ఆశీర్వదించండి."



మహారాణా ప్రతాపసింగు

కాశీ హిందూ విశ్వవిద్యాలయమునకు సమర్పించునిమిత్తమై ఖర్గపురనివాసులు శ్రీ అత్తివిల్లి సూర్యనారాయణగారు తయారుచేయించిన పురుషప్రమాణపు స్నిగ్ధవర్ణచిత్రము (life-size oil painting) తాలూకు ఛాయాపటము.

చిత్రకారులు: 'రాణాప్రతాప్', 'ఖిల్జీరాజ్యపతన' గ్రంథకర్తలగు శ్రీ గుండిమెడ వెంకటసుబ్బారావుగారు, ఛత్రపురము.

శరన్నాట్యము



'హల్' నాట్యకర్త్రులు శరదృతువుభావమును కడు రసాంచితముగ నిరూపించుచున్నారు.
(G. S. A.)

జగత్సింగు ఉత్తరము పోష్టులో వేసి ప్రత్యుత్తరముకోసము ఎదురుచూడడము మొదలు పెట్టినాడు. మాసము గడచిపోయింది, కాని జవాబు రాలేదు. అతనికి చాలా ఆందోళన పుట్టింది. ఎందుచేత జవాబు రాలేదు? తల్లికి జబ్బు చెయ్యలేదు గద? కోపము వచ్చి తండ్రి మౌనము వహించలేదు గద? మరేమీ ఆపద రాలేదు గద? క్యాంపులో ఒక చెట్టుకింద కొందరు సిపాయీలు సాలగ్రామము విడిచిపెట్టి వెళ్లినారు. శ్రద్ధాభక్తులు కల సిపాయీలు కొందరు ఆవిగ్రహాముమీద రోజూ అభిషేకము చేస్తూ ఉంటారు. జగత్సింగు వాళ్లను చూచి నవ్వుతూ ఉండేవాడు. కాని ఆరోజు గిరాటుపడ్డవాడిలాగ సాలగ్రామము సన్నిధికి వెళ్లి, చాలాసేపు తల వాల్చి కూర్చున్నాడు. ధ్యానమగ్నుడై ఉండగా అతన్ని ఎవరో పేరు పెట్టి పిలిచారు. అతను డిపార్టుమెంటు నౌకరు; జగత్సింగుపేర ఉత్తరము తెచ్చాడు. ఉత్తరము చేత్తో పట్టుకొనేసరికి అతనిఒళ్లు వణికింది. ఈశ్వరుణ్ణి స్తుతించి జగత్సింగు కవరు విప్పి ఉత్తరము చదివినాడు. అందులో "మీనాయనగారిమీద చోరీనేరము మోపి అయిదేళ్లు శిక్ష వేశారు. ఈదుఃఖము వల్ల మీఅమ్మగారు చనిపోయేటట్టు ఉన్నారు. సెలవు దొరికితే ఇంటికి రండి"అని ఉన్నది.

జగత్సింగు వెంటనే కెప్టనుదగ్గరకు వెళ్లి "హుజూర్, మాఅమ్మగారికి జబ్బుగా ఉన్నది. నాకు సెలవు దయచేయించండి" అన్నాడు.

కెప్టను తీవ్రముగా చూచి, "ఇప్పుడు సెలవు దొరకదు" అన్నాడు.

"అయితే నా రాజీనామా అంగీకరించండి."

"ఇప్పుడు వీలు లేదు."

"ఇక్కడ ఒక్కక్షణముకూడా ఉండలేను."

"ఉండవలె, తప్పదు. మీ రంతా శీఘ్రంగా రెజిమెంటులోకి వెళ్లవలసి వస్తుంది."

"యుద్ధము జరుగుతుందా! అయితే ఇంటికి వెళ్లను. మే మంతా ఇక్కడనుంచి ఎన్నాళ్లలో బయలుదేరుతాము?"

"చాలా త్వరలో—రెండుమూడు రోజుల్లో."

## ౪

నాలుగుసంవత్సరాలు గడిచినవి. కెప్టన్ జగత్సింగువంటి యోధ ఆ రెజిమెంటులో లేడు. కఠినమైన అవస్థలలో అతనిసాహసము మరీ చెలరేగుతుంది. ఏసాహసకృత్యములో అందరి ధైర్యాలూ వెనక్కు తగ్గుతవో, వాటిలో నాయకత్వము వహించడము అతనిపని. ఆక్రమణలలోనూ, సేనాగమనములలోనూ అతను అందరికంటె ముందు ఉండేవాడు. అతను ఎప్పుడూ శాంతదృష్టితో ఉండేవాడు. వినమ్రుడు, గంభీరుడు, శాంతచిత్తుడు అయిన అతన్ని ఆఫీసర్లూ, నౌకర్లూ శ్లాఘించేవారు. అతనికి పునర్జన్మ వచ్చినట్టయింది. అతనంటే

జ్యోతిష్కులకు చాలా విశ్వాసము. [ప్రతివిషయము లోనూ వాళ్ళు అనేనిసంగతి తీసుకొంటూ ఉండే వారు. ఎవరు అడిగినా అతనివీరకృత్యాలు చెపుతారు అతను జర్మనువారి మందుగుండు సామానుల కొట్టులో నిప్పుపెట్టినసంగతి, తన కెప్టన్ను మెషీన్‌గన్‌వాతను పడకుండా బతి కించినవిధము, తన నౌకరునిపొంగాని బాజూ వేసుకొని అగడలోనుంచి ఇవతలికి తీసుకు వచ్చినసంగతి వర్ణిస్తారు. అతనికి [ప్రాణముమీద తీపిలేకపోవడమే కాకుండా మరణము అన్వే షిస్తున్నా డనిపిస్తుంది.

అయితే రాత్రివేళ అవకాశము చిక్కి నప్పుడు జగత్సింగు తనడేరాలో ఒంటరిగా కూర్చుని, తనవారిసంగతులు స్మరించేవాడు. బాష్పబిందువులు అవశ్యము రాలేవి. అతను [ప్రతిమాసమూ తనజీతములో ఎక్కువభాగ ము ఇంటికిపంపేవాడు. అతను తల్లికి ఉత్తరము [వాయనివారము ఉండేదే కాదు. తనదుష్క ర్మవల్ల చెరసాలలో బాధపడుతున్న తండ్రిని గురించిన విచారమే జగత్సింగుకు హెచ్చు. పాపము, ఎప్పటికి అతను తండ్రిపాదాలమీద శిరస్సువాల్చి క్షమాపణ వేడగలుగుతాడో తండ్రి అతని శిరస్సుమీద హస్తముంచి దీవిస్తాడో!

౫.

నాలుగుసంవత్సరాలన్నర అయింది. సాయంకాలము సైనీజైలుద్వారమువద్ద [ప్రజలు గుమిగూడినారు. చాలామంది ఖైదీల శిక్షా కాలము పూర్తి అయింది. వాళ్ళను తీసుకు వెళ్ళేటందుకు వాళ్ళచుట్టాలు వచ్చారు. అయితే ముసలి భక్తసింగు తనగదిలో తల వంచుకొని ఉదాసీనభావముతో కూర్చున్నాడు. అతని నడుము వంగిపోయింది. ఒళ్లు ఎముకలపోగు అయింది; చతురు డైనశిల్పి అకాలపీడిత మానవమూర్తిని చేసినట్టు తోస్తుంది. అతనిశిక్ష కూడా పూర్తిఅయింది. కాని అతనియింటి నుంచి ఎవరూ రాలేదు. ఎవరు వస్తారు? వచ్చేమనిషిమాత్రము ఎవ రున్నారు?

ఉత్సాహముతో ఖైదీ ఒకడు వచ్చి, అతనిభుజము తట్టి, "ఏం భకత్, యింటికాడి నుంచి యెవరైనా వచ్చారా?" అన్నాడు.

"ఇంట్లో ఎవ రున్నారు?" అని భక్తసింగు గద్గదస్వరముతో అన్నాడు.

"ఇంటికి వెళుతారా?"

"నాకు ఇల్లెక్కడిది?"

"అయితే ఇక్కడే ఉండిపోతారా?"

"పంపివెయ్యకపోతే ఇక్కడే పడి ఉంటాను."

అవస్థలు పడి లేచిపోయిన తనకుమారు డిమాట అప్పుడు జ్ఞాపకమువచ్చింది. ఎవడి మూలాన తనపరువు పోయిందో, వంశానికి అపకీర్తి వచ్చిందో, కొంప పోయిందో, వాడి సంగతి అంటేనే అసహ్యము. కాని ఆశ కోల్పోయి, అగాధదుఃఖసముద్రములో మునిగి పోతూ ఉన్న అతనికి ఆగడ్డిపరకే అవలంబన మయింది. పాపము, ఆదీనుడిసంగతి యే

మయిందో? ఎంత పెద్దా కన్నకొడుకు. వంశ మర్యాద ఉన్నది. తాను చనిపోతే కన్నీళ్లు విడిచి తర్పణము విడుస్తాడు. "అయ్యో, ఎన్నడూ అతన్ని తిన్నగా చూడకపోతినే. కాస్త పెంకెతనము చేస్తే యమదూతలాగ మెడలు విరిచేవాణ్ణి. కాళ్లు కడుక్కోకుండా వంటయింట్లోకి ఒకసారి వస్తే శిక్షకింద కోదండము వేశాను. గట్టిగా మాట్లాడితే ఎన్ని సార్లు వాడిలెంపలు వాయగొట్టాను! పుత్ర రత్న మంటె ఆదరించాను కాను. దాని కిదే శిక్ష. అనురాగబంధము సడిలినప్పుడు కుటుంబసంరక్షణ ఎలా జరుగుతుంది!" అనుకొన్నాడు.

## ౬

తెల్లవారింది. ఆశారవి ఉదయించినాడు. ఆవేళ అతని కిరణాలు ఎంత కోమలము, ఎంత మనోహరముగా ఉన్నవి! వాయువు ఎంత సుఖప్రదము, ఆకాశము ఎంత రమణీయము, వృక్షాలు ఎంత పచ్చగా, పక్షుల కలకలము ఎంత శ్రావ్యముగా ఉన్నవి! ప్రకృతి అంతా ఆకాశవర్ణములో రంజితమయినది. భక్తసింగుకు మాత్రము నాలుగుదిక్కులా అంధకారమే. జైలుఆఫీసరు వచ్చినాడు. ఖైదీలు బారుదీర్చి నిలుచున్నారు. జైలరు ఒక్కొక్కరిని పేరువరసన పిలిచి విడుదలచేస్తున్నాడు. ఖైదీలముఖాలు ఆశతో వికసించినవి. పిలుపు వచ్చినవాడు సంతోషముతో ఆఫీసరు దగ్గిరికి వెళ్లి పరవానా తీసుకొని, వంగి సలాం చేసి, కష్టకాలసహవాసులను కౌగిలించుకొని బయటికి వెళ్లుతున్నాడు. వారిచుట్టాలు పరుగెత్తుకు వచ్చి వాణ్ణి కౌగిలించుకొంటున్నారు. కొందరు డబ్బు, కొందరు మిఠాయీలు పంచి పెట్టుతున్నారు. కొంతమంది జైలుఉద్యోగస్థులకు ఇనాము లిస్తున్నారు. యమలోకవిగ్రహాలు ఆనాడు దేవమూర్తు లయినవి.

చివరకు భక్తసింగుపేరు వచ్చింది. అతను తలకాయ వంచుకొని మెల్లిమెల్లిగా జైలరు దగ్గిరికి వెళ్లి, ఉదాసీనభావముతో పరవానా తీసుకొని జైలుదర్వాజావైపు వెళ్లినాడు. ఎదట సముద్రతరంగాలు లేస్తున్నట్టు ఉన్నది. దర్వాజా దాటి అతను నేలమీద చతికిల పడ్డాడు. ఎక్కడికి వెళ్లుతాడు?

ఇంతలో ఒక మిలిటరీఆఫీసరు గుర్రము మీద రావడము చూచాడు. అతను ఖాకీ షర్టు తొడుక్కొన్నాడు. నగిషీపని చేసిన పాగా చుట్టుకొన్నాడు. విచిత్రమైన కళతో గుర్రముమీద కూర్చుని ఉన్నాడు. వెనకాల ఫిటన్‌బండి వస్తూఉంది. జైలుతాలూకు సిపాయీలు ఆఫీసరును చూడగానే బందూకులు ఎత్తి, బారు తీరి, సలాం చేశారు.

"ఏ అదృష్టవంతుడి కోసమో బండీ వస్తున్నది. కొంప అయినా లేని నిర్భాగ్యుణ్ణి నేను" అని భక్తసింగు అనుకొన్నాడు.

మిలిటరీ ఆఫీసరు ఇటూ అటూ చూచి, గుర్రము దిగి, సూటిగా భక్తసింగుఎదటికి వచ్చి నిలబడ్డాడు.

భక్తసింగు నిదానించి చూచి, ఉలికిపాటుతో లేచి, "ఏమిటి! అబ్బాయి జగత్సింగే!" అన్నాడు.

కుమారుడు రోదనము చేస్తూ తండ్రి పాదాలమీద వాలినాడు.

---

౪

వివశము లై స్తంభించిన - నవయవములు నింద్రియంబు లద్భుతగతి, నీ
భువనం బొకచిత్రకళా - భవనంబై నన్ను ముంచివైచెం దరుణీ!
ఇంతసౌందర్యలక్ష్మి త న్నేలుకొనగ - నేలుచున్నది నానయనేంద్రియము॥
నీవసంతప్రభాభాసితావనీత-లంబు మంజులప్రణయానులాలనమున.

తలపై బూవులు, బూలలోన మకరందం బొప్పగా దాల్చి, మా
కల లీనాటికి గాన్పు లయ్యె ననుచున్ గర్వించి, మైవెంచి నీ
లలితారామలతావిలాసవతు లుల్లాసంబుతో, దక్షిణా
నిలవీచీమయలాస్యరంగములపై నృత్యంబు గావించెడిన్.

అదిగో! చూతము గౌగిలించుకొని యొయ్యారంబుగా నూగుచు
న్నది యామాలతి; నీముఖాంబుజముపై నర్తించు వక్రాలకం
బది నామానసవీధి బ్రాకినది; యాహా! విశ్వ మల్లాడుచు
న్నది యామూపులలో నిరంతరము పౌనఃపున్యలీలారతిన్.

మధుపానంబున జేసి మైమరచి ఝుంఝుమ్మంచు నీయామనిన్
కథగా గూరిచి పాడుచున్నవవె లోకం బాలకింపంగ; నీ
మధుపంబుల్ మన పూర్వపుంబ్రణయమర్మక్రీడలన్ సర్వమున్
మధుమాసావసరంబునన్ దివిజమర్మంబుల్ ప్రకాశించె బో!

ఒకవిద్యుత్పరిఘట్టనంబు బలె న న్నూగించె; నాపాదమ
స్తకమున్ ఝల్లున పుల్కరించినది నీసౌందర్యలీలామయాం
బకముల్ నాపయి వాలి నాయెదకు స్తబ్ధత్వంబు నెక్కొల్ప, నీ
ప్రకృతిం జూపి మొఱంగిపోదు విది సంభావ్యంబె లీలామయీ?

విన రెడుగాలిలో, విసరి వేసెడుకోయిలపాటలో, లస
త్ప్రసవదళమ్ములో, సుమపరాగములో, లయ మందిపోయి, నా
యసువులు వీచులై, స్వరములై, పయి నద్దినతళ్కు బెళ్కులై
నుసియయి రాలుచున్నవి, మనోమథనంబున జేసి, ప్రాణమా!

ధ్యేయము తానయై తగునతీంద్రియదృష్టిం గరంగి యొక్కటై
పోయిన యోగసాధకుడువోలె, త్వదీయవసంతహాసశో
భాయుత మాజగత్ప్రకృతియందలి నీకళలో గరంగెదన్
తోయజనేత్రి నేడు, శ్రుతితో జతగూర్చిన రాగముంబలెన్.

ఎవ డాగం గల డీవసంతమున దేవీ! ప్రాగుబోతుల్ మనో
భవపుష్పాస్త్రనిపీడితుల్ సుకవితావ్యామోహలోలాత్ము లీ
భువిపై నీయవతారమున్ గనియు నిన్ బూజించునున్మత్తులం
దెవ డానిగ్రహశాలి? నీమధురమూర్తిన్ నేను బంధించెదన్.

మధువయిపోయె నీస్మరణమాత్రన మామకదేహపాత్రలో
రుధిరము, మర్త్యభావము తిరోహితమై, యమరత్వ మంది, నీ
యధరసుధారసానుభవ మబ్బిననాడు జగంబు లన్నియున్
మధురమరందవారినిధిమగ్నములై నను ముంచి తేల్చవే!

---

# మా వ్యాసకర్తలకు

వ్యాసములు సంపూర్ణముగచిన్నసైజు కాగితములపై ఒకవైపున మాత్రమే విడిఅక్షరము లతో బంతులు దూరదూరముగా, దిద్దుబాట్లు లేకుండ, తిన్నగా వ్రాసి వర్ణక్రమమునను తప్పులు లేకుండ చూచుకొని పంప వేడికోలు. లేకున్న ముద్రణకార్యములయందు మిగుల కష్టము కలుగుటయే కాక తప్పులుకూడ నిలిచిపోవునని మనవి. ప్రకటింపనివ్యాసముల తమకు త్రిప్పిపంపుటకయితపాలుబిళ్లలు పంపవలయును.

సంపాదకుడు, 'భారతి'.




## తాతా—అవ్వ

అనగనగా ఒకవూళ్లో ఒకతాతా అవ్వా వుండేవాళ్లు. తాత యవ్వనంలో సుబేదారు. ఆకాలంనాటిది నూరువరహాలుచేసే గుఱ్ఱం వొకటి వుండి. కాలంగడిచినకొద్దీ యింట్లో గడిచేమార్గం లేక తాత అవ్వతో ఆలోచించి గుఱ్ఱాన్నమ్మటానికి పొరుగూరుసంతకు బయలుదేరాడు.

దారిలో ఒకకాపు ఒకఆవును తోలుకు వస్తూవుండడం చూసాడు. 'అబ్బీ, ఎక్కడికి వెళ్లుతున్నావు?'

'పొరుగూరిసంతకు ఆవు నమ్మటానికి.'

తాతగుండెల్లో పెరపెర లాడింది. ఎల్లాగన్నా ఆవును తీసుకుంటే తనదరిద్రం తీరుతుందనుకున్నాడు. అడిగాడు. వాడూ—వందరూపాయలగుఱ్ఱం చేయదు గనుకనా!—ఒప్పుకుని గుఱ్ఱంతో చల్లగ దాటాడు.

ఇంకా కొంచెందూరం వచ్చేటప్పటికి యింకొక డొక నల్లనికంచెమేకను తోలుకొస్తున్నాడు. తాత వాడితో మొదటిధోరణ్నే బేరమాడి ఆవు నిచ్చి మేక నుచ్చుకున్నాడు. ఇంకొరవ్వంతదూరము వెళ్లేటప్పటి కింకోడు చక్కని కోడిని తీసుకుపోతూంటే దానివలన సంసారం అతితేలికగా గడపవచ్చు ననుకుని యెట్లాగయితేనేం ఘట్టిగా బేరంచేసి కోణ్ని తీసుకుని, యింకా కొంచెందూరం వెళ్లేటప్పటికి ఘుమఘుమ వాసనేస్తున్న వెలగపళ్లని అమ్మకానికి తీసుకెళుతున్న ఒకముసలి దెదురుపడింది. వాటి వాసనచూసేటప్పటికి బేలైపోయి దానికి కోడిపిల్ల నిచ్చి వెలగపళ్లని తీసుకున్నాడు. వస్తూ దారిలో ఒకసత్రంలో ఆగాడు.

ఆసత్రంలో కొందరువర్తకులు మకాం చేసివున్నారు. వాళ్లల్లో కొంచెం నోటిదూల వున్నవాడు 'తాతా, నీదగ్గి రున్న దేమిటి, అంత ఘుమఘుమలాడుతోంది?' అన్నాడు. దాంతో తాత తన తెలివి కంతా సంతోషిస్తారని జరిగిందంతా పూసగుచ్చినట్టు చెప్పాడు. అదివిని ఆవర్తకుడు 'అయితే నీకు ఇంటికి వెళ్లగానే శృంగారకట్టెతో పూజ వున్నదన్నమాటే' అన్నాడు. దాంతో తాత మండిపడి, "ఔరా రా, నువ్వు చూడు, నీమాటలు చూడు; నా పెళ్లామంటే అంత తేలికగా వుందా నీకు? దానంతపతివ్రతాశిరోరత్న మింకోటి లేదు. నే నింటి కెళ్లి జరిగిందంతా చెప్పగానే నాపెళ్లాం నన్ను కౌగలించుకుని 'నువ్వాగా

యింతపని చేస్తేను' అంటుంది" అన్నాడు. అప్పటికీ ఆకోమటిబిడ్డ పూరుకోలేక, "ఆ, చూద్దాం కాదూ" అన్నాడు. దాంతో వాళ్లిద్దరూ పెద్దఘర్షణలుపడి, చివరికి నిజంగా అవ్వగనక తాతను కౌగలించుకునేటట్టయితే పాహు కాపు తాతకు నూరువరహా లిచ్చేటట్టు పందెం కట్టాడు. ఇక సత్రంలో మధ్యవర్తుల కేం తక్కువ? అంతా మధ్యవర్తులై బయలు దేరారు.

'గుఱ్ఱా న్నెంత కమ్మావు?' 'గుఱ్ఱా న్నిచ్చి పూటకు నేరుపా లిచ్చే ఆవును తీసుకున్నాను.' 'ఆ! నేరుపాలిచ్చే ఆవే!! యింకేంవుంది!!! పాలు, పెరుగు, నెయ్యి కావలసినంత. ఒకళ్ల కివ్వొచ్చు,మనం తాగొచ్చు' అని గుక్కతిప్పుకోకుండా ఆదేధోరణ్ణి చెప్పి, 'ఆవేది' అంది అవ్వ. 'ఆవు నిచ్చి మంచి నల్లని కంచిమేక నుచ్చుకున్నాను.' 'ఏమి టేమిటి! కంచిమేకనా!! వెధవ ముష్టిఆవు, దానిమొఘాన్న రోజుకు అర్ధరూపాయి మేత తగలెయ్యాలి. మేకయితే కంచెంబడి పోయి మేసి వస్తుంది. ఏడాదికి పిల్లలైనెడతాయి. ఓ! కావలసినంతమంద. ఏదీ, మేకఏది?'

'మేకనిచ్చి చక్కనికోడిని తీసుకున్నాను.'

'సహ్వా! సెహబాస్!! వెధవమేక యింటినిండా పెంటిక లేస్తుంది. కోడి రోజుకు ఒక గ్రుడ్డు పెడుతుంది. తెల్లవారకట్ల కూస్తుంది. ఏదీ? నాముద్దుకోడి, ఏదీ, నావరాలకోడి?'

'దానికి నువ్వు చాకిరీ చేయలేవని కోడ్నిచ్చి యాఘుమఘుమలాడే వెలగపళ్లని తీసుకున్నాను.'

దాంతో ఆయుష్మాన్ కట్టాయెసంతోష ముతో, 'సహ్వా! నా మొహం కాబట్టి యింత పని చేసేం. ఇంకా పొగిడేస్తున్నావ్ నక్కి గితే రెండువేలైన కష్టానికి మొఘుమొఘాలు చూసుకుంది. దానికి మొఘాన్న కొట్టినట్టు నాలుగుకాయలిచ్చి నన్ను' అని తాత ను కౌగిలించుకుని అంతా చూస్తూవుండగానే ముద్దెట్టుకుంది.



అంతా తెల్లపోయ్యారు. 'గంతకు తగిన బొంతరా!' అనుకున్నారు. వీళ్లసంభాషణ వింటూ వివర్ణవదనుడై వున్న కోమటి కుఱ్ఱోడి చేత నూరువరహాలు కక్కించారు, మళ్లీ ఎప్పటికీ అల్లాంటినోటిదూల లేకుండా వుండేటట్టు. ఎట్లాగయితేనేం, తాత గుఱ్ఱంఖరీదు నూరువరహాలు సంపాదించాడు. కథకంచికి,మనంఇంటికి.

# పోరు నష్టి - పొందు లాభం

మద్దులపల్లి వేంకటసుబ్రహ్మణ్యశాస్త్రి గారు

అనగా అనగా వొహూళ్లో యిద్ద రుండేవాళ్లు. వాళ్లకు చిన్నప్పట్నుంచీ బద్ధద్వేషం. ఆడుకునే కాలంలోనే వాళ్లకీ వొహర్ని మించి వొహ రుండాలని పోరాటం. అంచేత వొహ రేంపని చేసినా వొహరికంటే వొహ రెక్కువగా చేస్తూండేవాళ్లు. ఇలా కొంతకాలం గడిచిపోయింది. ఒహనాడు వాళ్లల్లో వొహడికి రెండోవాడికి తెలియకుండా అడవి కెళ్లి తపస్సుచేసి దేవుణ్ణి మెప్పించి వాడికంటె తా నెక్కువదర్జాలో వుండటానికి వరాలు పొందాలని బుద్ధి పుట్టింది. వెంటనే రెండోవాడికి తెలియకుండా చక్కా అడవి కెళ్లి దేవుణ్ణిగూర్చి తపస్సుచెయ్యటం మొదలెట్టాడు.

రెండోవా డప్పుడే అనుమానపడ్డాడు. మొదటివాడు తపస్సుచేస్తూండటం కనుక్కొన్నాడు. ఒరె వోరే, వీడు నాకు తెలియకుండా తపస్సుచేస్తున్నాడు. నాకంటె తాను మహాగొప్పోడు కావాలని, దేవుణ్ణి మెప్పించి వరాలు పొందటానికి కాబోలు ఈపన్నాగం పన్నాడు—అని తానుగూడా ఆలాగే చేసి వాడికంటె యెక్కువవరాలు పొందాలని అనుకొన్నాడు. వెంటనే వెళ్లి వాడి కెదురూగా కూచుని వాడికంటే నిష్ఠతో తపస్సుచేయటం మొదలెట్టాడు.

వాళ్లమనస్సులోని వుద్దేశాలు కనిపెట్టాడు దేవుడు. వాళ్లకి కలిగిన యీదురుద్దేశాలకీ తగినప్రాయశ్చిత్తం చెయ్యా లనుకొన్నాడు. మొదటివాడిదగ్గఱ ప్రత్యక్షం అయ్యాడు. 'ఒరే, నేను దేవుణ్ణి. నీతపస్సుకు మెచ్చాను. నీ కేంవరం కావాలో అడుగు యిస్తా'నన్నాడు. వాడు చాలా సంతోషించాడు కాని, 'నేనొకవూ రడిగితినా వాడు రెండూళ్లడుగుతాడేమో! నే నొకరాజ్యం యిమ్మంటినా వాడు రెండురాజ్యా లడుగుతాడేమో! దేవుడు ముందే నాదగ్గఱకి వచ్చేశాడు. వాణ్ణడిగిన తర్వాత నన్నడిగుంటే బాగుండేది. ఇప్పుడు బలే చిక్కొచ్చింది. ఏం చెయ్యనా' అని ఆలోచించాడు. చివరకి మంచివుపాయం ఒకటి కనిపెట్టాడు. దేవునితో 'స్వామీ, అదిగో అక్కడ తపస్సుచేస్తూండేవాడి కేమిస్తావో అంతకు రెండింతలు నా కి'మ్మన్నాడు వాడు. సరేనని చెప్పి రెండోవాడిదగ్గఱికి వెళ్లి, 'ఒరే, నేను దేవుణ్ణి; నీతపస్సుకు మెచ్చి వరాలియ్య వచ్చాను. నీ కేం వరం కావాలో కోరుకో' అన్నాడు భగవంతుడు. వాళ్లమనస్సుల్లో వుండే కుట్ర కని పెట్టాడు గనుక అంతటితో పోనీక వాడితో 'వోరే, అదిగో అక్కడ తపస్సుచేస్తూన్నాడే, వాడు నీ వడిగినంతకు రెండంతలు తనకు కావా లన్నాడు. నీ వేం కోరుతావో కోరూ' అని చెప్పాడు. 'ఒరె వోరే, యెంతయుక్తి పన్నాడురా, ఏలాగైతేనేం నేను వాణ్ణి మించేలా వరం పొందటానికి వీలుగాకుండా చేశాడు' అని కొంతసే

పాలోచించాడు. చివరకు తనకి నష్టం అయినా వాడు చెడిపోయే పొక్కువుపాయాన్ని కనిపెట్టి, 'స్వామీ! అలా అయితే, నా కొక్కకన్ను పోయేటట్టు వరం దయ చెయ్యండీ' అన్నాడు. వాళ్ల కోరికలని చూసి దేవుడు తనలో తాను నవ్వుకున్నాడు. ఇద్దరికీ తగిన ప్రాయశ్చిత్తమే అయిం దనుకొని ఆనందించి, 'సరే, అలాగే' అన్నాడు రెండోవాడితో. ఆవరాలిచ్చి అంతర్ధాన మయ్యాడు దేవుడు. రెండోవాడి కొకకన్ను, మొదటివాడికి రెండుకండ్లూ పొయ్యాయి.

కథ కంచికి, మన మింటికీ పొయ్యాము.

---

## అతివాగుడు

దశిక వెంకటరత్నంగారు

ఒకఊళ్లో ఒక బ్రాహ్మణు డుండేవాడు. ఆయన పేరు గంగాధరుడు. ఆయనకు చాలా భాగ్యం ఉండేది. తనపొలములో ఒక చెరువును త్రవ్వించాడు. ప్రతి రోజూ పొలమువెళ్లి సాయంత్రము వరకు ఉండి రాత్రికి ఇల్లు చేరేవాడు. తిరిగి ఉదయమునే వెళ్లేవాడు.



ఉదయమున పొలము వెళ్లేసరికి చెరువు గట్టు గండిపడి వుండేది. దానిని బాగుచేయించి రాత్రికి యిల్లు చేరుతూఉండేవాడు. మళ్లీ వెళ్లి చూచేసరికి గండిపడి వుండేది. తిరుగా బాగుచేయించేవాడు.

కొన్నాళ్లు ఇలా జరిగింది. గంగాధరునకు ప్రాణం విసిగింది. ఈగండి ఎందుకు పడుతోందో కనిపెట్టాలనుకొని ఆరాత్రి అక్కడనే ఉన్నాడు.

ఆరాత్రి ఆచెరువుగట్టుకు ఒకఅందమైన గోవు వచ్చింది. గంగాధరుడు గోవును చూచేడు. ఆగోవు తనకొమ్ములతోను డెక్కలతోను గట్టును గండిచేసింది. ఈఅందమైన గోవునుచూచి గంగాధరుడు పరవశుడై పోయాడు. ఈగోవు ఎక్కడనుండి వచ్చిందో, ఎక్కడకు వెడుతుందో చూడాలని మెల్లగా వెళ్లి దానితోకను పట్టుకున్నాడు.

గోవు ఆకాశమార్గాన్ని పోయి కైలాసం చేరింది. ఒకచోట ఆగింది. గంగాధరుడు ఆతోకను వదలి ఆకైలాసములోని చిత్రములు చూచుటకు బయలుదేరేడు. అంతా తిరిగేడు.

తిరుగగా తిరుగగా గంగాధరునకు ఒకచోట పెద్దపెద్దమిఠాయిఉండలు, మరొకచోట పెద్దపెద్ద సున్నిఉండలు, ఇంకొకచోట పెద్ద పెద్ద అరిసెలు కనపడ్డాయి. వాటిని తినాలని భ్రమ కలిగి కొంచెముకొంచెము తిన్నాడు.

ఇంటికి పోదామని బయలుదేరాడు. గోవు బయలుదేరేచోటకు వచ్చేడు. యథాప్రకారం గోవు వచ్చింది. తిరిగి దానితోకను పట్టుకొన్నాడు. గోవు ఆకాశమార్గాన్ని బయలుదేరి చెరువుగట్టుకు వచ్చి చేరింది. గంగాధరుడు తోకను వదలి యింటికి చేరేడు.

"నేను కైలాసం వెళ్లేను. చెప్పలేనురా బాబూ! ఆకైలాసంలో ఎంతెంత మినపసున్ని ఉండలో, ఎంతెంత మిఠాయిఉండలో, ఎంతెంత అరిసెలో, చూడాలే కాని చెప్పలేను. వాటిని తిననివాళ్లబ్రతుకు ఏందుకు?" అని తన స్నేహితులందరకు చెప్పేడు.

"నీ కేలా కనుపించాయి? అక్కడకు ఏలా వెళ్లేవు?" అని గంగాధరుని అడిగేరు.

గంగాధరుడు జరిగినదంతా చెప్పేడు.

"మమ్మల్నికూడా తీసుకువెళ్లి చూపెంచి పెట్ట"మని గంగాధరుని ప్రార్థించేరు.

"సరే, ర"మ్మన్నాడు.

వారందరు గోవు వచ్చేవేళకు చెరువుగట్టుకు వెళ్లేరు. గోవు వచ్చింది. మొదట గంగాధరుడు ఇదివరకువలెనే రెండుచేతుల గోవుతోకను పట్టుకున్నాడు. వానికాళ్లు ఒకడు, తిరిగి వానికాళ్లు ఇంకొకడు, ఇలా ఒకరికాళ్లు ఒకరు పట్టుకున్నారు.

గోవు బయలుదేరింది. సగందూరం వెళ్లింది. స్నేహితులు ఆసున్నిఉండలు, మిఠాయిఉండలు చూడాలని తొందరపడుచున్నారు. ఓపిక పట్టలేకపోయారు. "సున్నిఉండలు, మిఠాయిఉండలు ఎంతెంతున్నాయో చెప్ప" మని గంగాధరుని తొందరచేశారు. తోకమొదట



"ఇంతంత ఉన్నాయి"

పట్టుకున్న గంగాధరునకుకూడా వాటికి ఎక్కువకోరిక యుండడంచేత రెండుచేతులు వదలి "ఇంతంత ఉన్నా"యని చూపించేడు. గోవు కైలాసం చేరిపోయింది.

గంగాధరుడు చూపినఉండలు స్నేహితులకు బాగా కనుపించాయి. గంగాధరుడు తన స్నేహితులతోకూడ వారిఅతివాగుడుచేత క్రింద పడి యమలోకంచేరేడు. మనం ఇంటికిచేరేము.

# పాత పాటలు—౨

కే. కామేశ్వరరావు గారు, బి. ఏ.

## ౫ ప్రకీర్ణాలు

... ... ... ...

కన్నతల్లిని బోలలేరు చుట్టాలు
పట్టుచీరను బోలలేవు చీరల్లు
పరమాత్మ నిను బోలలేరు చుట్టాలు
వెల్లచీరను బోలలేవు చీరల్లు
వేదమ్ము నిను బోలలేవు చదువుల్లు.

తాతగారింటనే తూతూలపెళ్లి
బూరిము క్కడుగుతే బుగ్గ పొడిచేరు
గారిము క్కడుగుతే కసిరి కొట్టేరు
అరిసిము క్కడుగుతే అదిమి తన్నేరు.

ఏకేకు బార యెల్లుండి సంత

... ... ... ...

రోక లెత్తలేను రో లెత్తలేను
చేమపూకడియంపుచె య్యెత్తలేను.

నో రెంగి లాయెనే చెయ్యొంగి లాయె
చెయ్యి కడుగ నీళ్లియ్యి చెల్లెలమ్మాయి.

కూకుంటె లెగలేడు కూరాకు తెంపలేడు
కొట్టొస్తె డోలప్ప సిగ్గొస్తది,

కూడు తింటావా తమ్మా?
కూకుండే వున్నా నమ్మా.

అంబలి తింటావా తమ్మా?
అమిరే వున్నా నమ్మా.
గడ్డి కోస్తావా తమ్మా?
గడి యుం డొస్తా నమ్మా.

గిద్దె పెసరాపప్పు గిన్నెతోనే వండి
వద్దువ ద్దనగానె వడ్డించి వెళుదు.
పొద్దుటన్నంలోకి పొలములో కెళ్లి

... ... ... ...

చిన్నారి పొన్నారి చిన్నకోవెలవు
చిగురుమామిడికింద చిన్నకోవెలవు.

... ... ... ...

చిమడకే చిమడకే ఓచింతకాయ
నువ్వెంత చిమిడినా నీపుల్ల పోదు.
ఉడకకే వుడకకే ఓవుల్లిపాయ
నువ్వెంత వుడికినా నీకంపు పోదు.

వదినగారలు మీరు వాసి గలవారు
వండబోయినచోట కుండ నాకేరు.
బావగారలు మీరు భక్తి కలవారు
నిండివున్నసభలోను పిండి బుక్కేరు.

... ... ... ...

ఆకలికి వేళాయె అమ్మతలు పాయె
అమ్మగారింటికే పోను బుద్ధాయె.
పనంటె నావొళ్లు భారకిస్తుంది
భోజనమంటె నావొళ్లు పొంగిపోతుంది.

మొండికెత్తినదాన్ని మొగు డేమి చేసు
లజ్జ మాలినదాన్ని రా జేమి చేసు
సిగ్గుమాలినదాన్ని శివు డేమి చేసు.

అమ్మనా డెరగనే ప్రయ్యాల
అబ్బనా డెరగనే వ్రయ్యాల
మొగుడునా డెరగనే మోకులుయ్యాల.

చూచీది కళ్లమ్మ వాచీది మొహం
నీ కేమి కలుగునే నిర్భాగ్యురాల.

ఏకాసి వచ్చింది రాకాసిలాగ
బ్రాహ్మల్లపాలింట పెనుభూత మాయె.
తోడికోడలు నాకు తోడాయె నమ్మ
దొంగతిళ్లకు మాకు నందాయె నమ్మ.

ఊరు మంచిదని వుబ్బకురా అబ్బ
వూళ్లోను దీపమ్ము పెట్టిన్న దాక.
ఆలి మంచిదని వుబ్బకురా అబ్బ
ఆయింటికాపరం చేసిన్న దాక.

సంపత్తుచేతనే చావ తీరాదు
యముడిక్కి చెప్పండి రా తీరదాని.

చుక్క తెల్లవారె తూర్పు తెల్లవారె
తులిసెమ్మ పెనిమిటిని యేమన్ని లేపు.
"కలవలచెర్లోకి నీళ్లు చేరేయి
కాళ్లు కడుగ మీకు వేళాయె లెండి.
మొగ్గల్లచెర్లోకి నీళ్లు చేరేయి
మొహాము కడుగ మీకు వేళాయె లెండి."

బూరుగ పూసింది బారువనంలో
... ... ... ...

కోట సింగరాజు మాటవాసి కైన
గంగమాంబచేత గణుతి కెక్క
గంగమాంబ యెంతో గయ్యాళి యైతేను
సింగరాజు యేమి చేయగలడు.

వంకాయ వండేను వరికూడు వండేను
తినమనీ చెప్పవే తడికా తడికా,
నగలాడిమాటలకు నల్లంతా మండింది
వద్దనీ చెప్పవే తడికా తడికా
... ... ... ...
... ... ... ...
పట్టుచీర తెచ్చేను పెట్టెలోను పెట్టేను
కట్టుకోమని చెప్పవే తడికాతడికా.

గడపలలోకల్ల యేగడప తీరు?
మహాలక్ష్మి వసియించు మాగడప తీరు.
వీధులలోకల్ల యేవీధి తీరు?
విద్వాంసులు నడచిన్న మావీధి తీరు.
అరుగులలోకల్ల యేఅరుగు తీరు?
పండితులు కూచున్న మాఅరుగు తీరు.

వానదేవుడ నీకు వరసచెల్లెలిని
వర్షాలు కురిపించు వరిమళ్లలోను.
కురిసింది మావూర కుంభవర్షమ్ము
పండేయి మాచేలు పల్లంపుభూమి
నూర్పించి తెచ్చేరు నూరుగరిసెల్లు
పండించి తెచ్చేరు పంటకాపుల్లు
ఎక్కలేని గట్టు దిగలేని మెట్టు
చూలింతలు పోసేరు చుక్కల్లపొడుగు
బాలింతలు పోసేరు పర్వతాలపొడుగు
నూనెతో పులగాలు మాయెద్లు మేసె.

పన్నెండుధాన్యాలు వానదేవుడా
పంటమీద పండాలి వానదేవుడా
పన్నెండుధాన్యాలు...
పంటచేలు పండాలి...
పంటచేలు పండాలి...
మాకడుపు నిండాలి...
పేద సాద బతకాలి...
కూలి నాలి దొరకాలి...
పారిపోయిన బావ...
పరిగెడుతు రావాలి...
ఊరి కెళ్లినబావ...
ఉరికురికి రావాలి...
తల్లి లేని బిడ్డల్లు...
తల్లాటపడతారు...
తండ్రి లేని బిడ్డల్లు...
తల్లాటపడతారు...
పసిబిడ్డబాలకులు...
తల్లాటపడతారు...
చేటంత మబ్బు పట్టి...
చెరువంత నిండాలి...
తూరుపున మబ్బు పట్టి...
తుల్లి తుల్లి కురవాలి...
పడమటను మబ్బు పట్టి...
పట్టి పట్టి కురవాలి...
ఉత్తరాన్ని మబ్బు పట్టి...
ఉరిమి మెరిమి కురవాలి...
దక్షిణాన్ని మబ్బు పట్టి...
జల్లుజల్లున కురవాలి...
ఈగతల్లి నీళ్లాడి...
వీధి వీధి నిండాలి...
దోమతల్లి నీళ్లాడి...
దొడ్డెల్ల నిండాలి...
పాముతల్లి నీళ్లాడి...
పంటచేల్లో తిరగాలి...
కప్పతల్లి నీళ్లాడి...
కడవపంచల కుయ్యాలి...
కురవాలి కురవాలి...
కుంభవృష్టి కురవాలి...
డబ్బుకు తవ్వెడుబియ్యం..
మనిషి కిద్దరు పెళ్లాలు...
వానొస్తె వణుకైన...
కురవాలి కురవాలి...
మూడురోజుల యెండ...
ముప్పైరోజుల ముసురు...

[మోచేటి పద్మమ్మనోములోని సాయంకాలవర్ణన]

మోచేటి పద్మమ్మ పట్టేటివేళ
మొగ్గల్లు తామర్లు పూచేటివేళ
బీరాయి పువ్వుల్లు పూచేటివేళ
బిందెల్ల వుదకమ్ము తెచ్చేటివేళ
కాకరాయి పువ్వుల్లు పూచేటివేళ
కడవలతొ వుదకమ్ము తెచ్చేటివేళ

గుమ్మడీ పువ్వుల్లు పూచేటివేళ
గుండిగలతో వుదకమ్ము తెచ్చేటివేళ
ఆనపాయి పువ్వుల్లు పూచేటివేళ
అటికెలతో వుదకమ్ము తెచ్చేటివేళ
చిక్కుడాయి పువ్వుల్లు పూచేటివేళ
చిప్పల్ల గంధమ్ముతీసేటివేళ
ఆవుల్లు గోవుల్లు వచ్చేటివేళ
ఆంబోతు రంకెల్లు వేసేటివేళ
సంధింటి దీపమ్ము పెట్టేటివేళ
చాకింటి మడతల్లు తెచ్చేటివేళ
అన్నల్లు అందలా లెక్కేటివేళ
బావల్లు పల్లకీ లెక్కేటివేళ
తమ్ముల్లు తాంబూలం వేసేటివేళ
మరదుల్లు మరి జూద మాడేటివేళ
కూతుళ్లు గుండిగలు దింపేటివేళ
కోడళ్లు కొటుపసుపు కొట్టేటివేళ
చెల్లెళ్లు చేమంతులు ముడిచేటివేళ
వదినెల్లు వంటల్లు వండేటివేళ.

## రక్కసపొద

సన్నిధానము సూర్యనారాయణశాస్త్రిగారు

క్రూరభావంబుఁ గంటకాకారముగను
వెలికిఁ గ్రక్కుచునసభిగమ్యత వహింతు
వో చెనఁటి రక్కసా! తెల్పఁగదవె? నాకు
అన్నలా, తమ్ములా, నీకు నసురకోటి?

వల్లరీసుందరులు చెఱపట్టఁగఁబడి
తేఁటిరొద కుయ్యివెట్టుచు దెసలఁ బ్రాఁక
బ్రహ్మరాక్షసివలె నున్ననిన్నుఁ గాంచి
భయముమై డాయ రెవ్వరుఁ బ్రాపొసంగ.

మానిసుల కోడి శరణాగతంబులయిన
పాఁపజేండ్లకు నభయప్రదాన మిత్తు
వెల్లపుడు వారిపైని గ్రుడ్లెఱ్ఱఁజేసి
పండ్లమిస మిట్టిమిట్టిచూచెదవు కూళ!

మొరటుఁదనమును దద్దయు మొండితనము
ఎదుగుచున్నది నానాఁడు తలలు వేసి
ఊఁచముట్టుగఁ బెకలించుఁబొ మ్మొకండు
ఎల్లిప్రొద్దుట నీపాగ రడఁగు నంత.




# కమ్మీపని

కొ. నరసింహాచారి గారు

## పూల ఉట్టి

సుమారు రెండడుగులనిడివిగల కమ్మిని దీసికొని దానికొనలను ఉంగరములవలె వంచుకొనవలెను (చిత్రము 1). దానిని చిత్రము 2 నందువలె వలయముగా వంచుకొని కొనలయందలి ఉంగరములను చేర్చి బిగించవలెను.

పిమ్మట సుమారు ఒకఅడుగు నిడివిగల మఱియొక కమ్మిని దీసికొని, మొదటి కమ్మివలెనే దానినిగూడ వలయముగా చేసికొనవలెను (చిత్రము 4 a. a.)

చిన్నవలయపు వ్యాసముయొక్క కొలతకన్న సుమారు ఒకయంగుళము ఎక్కువ కొలతగల కమ్ములను మూటిని దీసికొని వాటి కొనలను చిత్రము 3 నందు జూపినవిధముగ వంచుకొనవలెను. కొనలను వంచినతర్వాత కమ్ములకొలత చిన్నవలయపు వ్యాసమునకు సమానముగా నుండవలెను. ఈమూడుకమ్ములను చిన్నవలయమునకు బండిచక్రపుటాకులవలె బిగించవలెను. (చిత్రము 4.) పిమ్మట కమ్ములనన్నిటిని c వద్ద సన్ననికమ్మితో కట్టవలెను. పిమ్మట సుమారు ఒక్కొక్కఅడుగు నిడివిగల కమ్ములను మఱి ఆఱింటిని దీసికొని వాటికొనలను గూడ ఉంగరములవలె వంచవలెను (చిత్రము 5 a. b.) ఒక్కొక్కకమ్మిని మధ్యభాగమున m వద్ద వంచుకొనవలెను.

తర్వాత ఆరుకమ్ములకొనలను చిత్రము 4 నందలి చిన్నవలయమునకు rs, st, tw, wu, uv, vr, వద్ద బిగించవలెను. తర్వాత నీఆరుకమ్ములను మధ్యవంపులవద్ద (m చిత్రము 5) ఒకయంగుళమువఱకు వెనుకకు వంచవలెను. అట్లు వంచినపిమ్మట ప్రతికమ్మియు ఎదురుగా జూచినప్పుడు (front view) చిత్రము 6 నందలి విధముగను, ప్రక్కకు జూచినప్పుడు (side view) చిత్రము 7 నందలివిధముగను నగపడును.

పిమ్మట పెద్దవలయమునకు ఈయారు కమ్ముల మధ్యవంపులను తగిలించవలెను. (చిత్రము 8). మఱి మూడుకమ్ములను (చిత్రము 8 m n o) దీసికొని వాటికొనలను వంచి ఉట్టియొక్క పైపెద్దవలయమునకు ఉట్టిత్రాళ్లవలె బిగించవలెను. ఈమూడుకమ్ములనిడివి ఎంతయైనను ఉండవచ్చును. వాటి పైకొనలకు




ఒకకొక్కని చేసి (చిత్రము 8 p) తగిలించిన యెడల ఉట్టి పూర్తియగును.

చిత్రము 8 యందలి ఉట్టియొక్క అడుగు భాగము చదరముగా నున్నది. దానిని చిత్రము 10 యందలి ఉట్టియొక్క అడుగుభాగము మధ్య పల్లముగా నుండున ట్లుండవలె నన్న యెడల, అడుగుభాగమున వేసిన మూడుకమ్మ లను చిత్రము 3 నందువలె కాక, చిత్రము 9 యందువలె మధ్య (s) కొంత వంపుగా జేసికొన వలెను. చిత్రము 10 యందు s వద్ద నుండునట్లు పల్ల మేర్పడును.



మనశ్శీలిని (సైకోగ్రాఫ్ - Psychograph)

వాషింగ్టననగరమున ఏడవ వార్షిక పారిశ్రామికశిక్షా ప్రదర్శనమున చూపబడిన మిక్కిలి చిత్తాకర్షకమగు వస్తువులలో నొకటి. దీనిని 'సైకోగ్రాఫ్' అందురు. మనుజుని మానసికములైన శక్తులు, సంస్కారములు యథాతథముగా పరిశీలించి, ప్రత్యేక మొకకాకితముపై వైద్యుతవిధానమున ఎక్కించును. ఇందువలన చాల ముఖ్య విషయములు తెలిసికొనవచ్చును. ఇందు షే 'కాంపియను' కన్యకు ఆయంత్రముతాలూకు తలచట్టము అమర్పబడుచున్నది. త్వరలో ఆమెకు తనసంగతి యంతయు తెలిసిపోవును.

(G. S. A.)

# సుక్కూరు ఆనకట్ట చిత్రములు

(G. S. A.)



ఎగుమట్టమునుండి చూచిన ఆనకట్ట: నడుమ తెఱపులందు బిగించిన పెద్ద ఉక్కు తలుపులు కానవచ్చెడిని



దిగుమట్టమునుండి చూచిన ఆనకట్ట: పైని రాహదారీరోడ్డువంతెన.

# హిందూదేశ పరిపాలనా విధానము — దాని చరిత్ర

(రెండవ భాగము)

చావలి వెంకటహనుమంతరావు గారు, యం. ఏ., బి. ఇ-డి.

౧

పై విషయమును గూర్చిన మొదటివ్యాసములో ౧౮౯౨ సంవత్సరములో ఏర్పాటుచేయబడిన Indian Councils Act వలన వచ్చిన మార్పులను గమనించితిమి. ఆచట్టము ౧౯౦౯ వరకు అమలునందుండెను. తరువాత ౧౯౦౯ లో మింటో మార్లే సంస్కరణములచట్ట మను పేరుతో వ్యవహరింప బడునట్టి చట్టముచే ఏర్పరుపబడిన మార్పులను విచారింప వలసియున్నది. ఈచట్టము పార్లమెంటువారిచే ఆమోదింపబడకపూర్వము దానినిగురించి మూడు సంవత్సరములు తీవ్రమైనచర్చ జరుపబడెను. కార్యనిర్వాహక ప్రభుత్వమునకును, ప్రజలకును మధ్య వీలైనంత ఎక్కువ సంపర్కమును గూర్చు నుద్దేశముతో అనేకవిధములగు విధానము లాలోచింపబడెను. చివరకు అప్పటి కమలు నందున్న చట్టనిర్మాణసభలను పూర్తిగ మార్చి వాటికి ఇదివరలోకన్న ఎక్కువ అధికారముల నిచ్చుట కేర్పాటు చేయుటయే తగినవిధానమని నిశ్చయింపబడెను. ఈనిశ్చయమునకు రాకపూర్వము అట్టిసంపర్కమును సమకూర్చుటకు ఆలోచింపబడినవిధానములలో కేంద్రరాష్ట్రప్రభుత్వములకు ముఖ్యవిషయములందు సలహా నిచ్చుటకై ఒక పెద్దలసంఘము (Council of Notables) నేర్పాటు చేయవలె నను సూచన ఒకటి ముఖ్యమైనది. శాసనసభలకు ఎక్కువఅధికారము నీయవలె ననునిశ్చయమునకు వచ్చినపిదప, దాని ననుసరించి గవర్నరు జనరలు కౌన్సిలులోని ఎన్నికసభ్యులసంఖ్య పూర్వముకన్న చాల హెచ్చు చేయుట కేర్పాటుచేయబడెను. ౧౯౦౯ సంవత్సరములో ఏర్పాటు కాబడినట్టియు, తరువాత ౧౯౧౨ లో మార్పు చేయబడినట్టియు నిబంధనలప్రకారము, కేంద్రశాసనసభయందు గవర్నరుజనరలు, అతనికార్యనిర్వాహకవర్గ సభ్యులు ఏడుగురు కాక, నియమితఅధికారసభ్యులు ౨౮ మందియు, నియమితఅనధికారసభ్యులు ౫ గురును, ఎన్నికసభ్యులు ౨౭ గురు, మొత్తము ౬౯ సభ్యు లుండునట్లు ఏర్పాటు చేయబడెను. అనధికార-ఎన్నికసభ్యులలో ౧౩ గురు రాష్ట్రశాసనసభలయందున్న అనధికారసభ్యులచేతను, ఆరుగురు రాష్ట్రములలోని భూస్వాముల నియోజకవర్గములవారిచేతను, ఆరుగురు రాష్ట్రములలోని మహమ్మదీయులచేతను, ఇద్దరు బొంబాయి, కలకత్తాలయందలి యూరపియన్ వర్తకసంఘములవారిచేతను ఎన్నుకోబడునట్లు నిశ్చయింపబడెను. రాష్ట్రీయశాసనసభలు కూడ పైపద్ధతులపై ఆధారపడియే మార్పుచేయబడి, వాటియందలి సభ్యత్వము పెద్దరాష్ట్రములలో (అనగా మద్రాసు, బొంబాయి, బెంగాలులలో) ౪౫ మొదలు ౫౪ వరకును, చిన్నరాష్ట్రములలో (అనగా మధ్యపరగణాలు, సంయుక్తపరగణాలు, పంజాబు మొదలగు వాటిలో) ౨౫ మొదలు ౨౭ వరకును, హెచ్చు చేయబడెను.

౨

ఈ సంస్కరణములవలన ఏర్పాటుచేయబడిన మార్పులలో ఈక్రిందిముఖ్యాంశములు గమనింపదగినవి. (౧) సామ్రాజ్యశాసనసభయందు గవర్నమెంటువారి అభిప్రాయముల ననుసరించి వోటుచేయుటకై అధికారసభ్యులయొక్కయు, నియమిత సభ్యులయొక్కయు సంఖ్య హెచ్చుగా నుంచబడెను. కాని రాష్ట్రములందుమాత్రము ఇట్టి అధికార-అధికసంఖ్యాబలము (official majority) తొలగింపబడి అనధికారసభ్యులకే హెచ్చుబల ముండునట్లు ఏర్పాటుచేయబడెను. (౨) శాసనసభల యందు

ఎన్నికసభ్యుల సంఖ్య అంతకు పూర్వముకన్న చాల హెచ్చుచేయబడినప్పటికిని, ఆసభ్యులు నేరుగ ప్రజలచే ఎన్నుకొనబడుపద్ధతి (Direct popular election) ఏర్పాటుకాబడలేదు. కొన్ని ప్రత్యేకనియోజకవర్గములు (మహమ్మదీయులకును, యూరోపియన్ వాణిజ్యసంఘములకును) ఏర్పాటుచేయబడి వానికి నేరుగ తమప్రతినిధుల నెన్నుకొను హక్కియబడెననుమాట నిజమే; కాని మొత్తముమీద Indirect election పద్ధతియే అమలునం దుంచబడెను.* దీనిబట్టి మింటో-మార్లే శాసనసభలు కొంతవరకుమాత్రమే ప్రజాప్రతినిధి సభలని పిలువబడుటకు అవకాశము లున్నవనియు, వానివలన కొంతవరకుమాత్రమే ప్రజాప్రతినిధిప్రభుత్వ (Representative Government) సూత్రము అమలులోనికి వచ్చినదనియు తేలును. (3) మహమ్మదీయులకు ప్రత్యేకప్రాతినిధ్య, ప్రత్యేకనియోజకవర్గ సూత్రములు మొట్టమొదటిసారి మింటో-మార్లే సంస్కరణముల సందర్భమునందే ప్రవేశపెట్టబడెను. మార్లే ప్రభువునకు ఈ సూత్రముల నొప్పుకొనుట కిష్టము లేకపోయినప్పటికిని అప్పటిపరిస్థితులలో మహమ్మదీయనాయకులను తృప్తిపరచుటకై దాని నొప్పుకొనక తీరినది కాదు. అప్పుడు ఏర్పాటుచేయబడిన ఈపద్ధతియే ప్రస్తుతము మనదేశమందు ప్రబలుచున్న హిందూమహమ్మదీయ విభేదములకును, వైమనస్యములకును మూలకారణమై మనదేశపు రాజకీయాభివృద్ధికి చాల నాటంకముగ నున్నదని ఎల్లరకు తెలిసినదే.

## ౩

మార్లే శాసనసభల అధికారములను చూచినచో వానికిని, ౧౮౯౨ సం॥ లో ఏర్పాటుచేయబడిన సభలకును చాల భేదములు కాన్పించును. మార్లే శాసనసభలకు పూర్వపు సభల కున్నవానికన్న హెచ్చు అధికారము ఈయబడినది. ౧౮౯౨ చట్టముప్రకారము, శాసనసభ్యులు ప్రభుత్వపు ఆదాయవ్యయపట్టికనుగూర్చిన చర్చయందు పాల్గొని తమయభిప్రాయములను మాత్రము తెలుపవచ్చును. కాని ౧౯౦౯ సం॥ పు చట్టముప్రకారము బడ్జెటునందు మార్పులను సూచించుచు తీర్మానముల నుపపాదించుటకును, ఆతీర్మానములపై వోటు చేయుటకును కూడ అధికార మీయబడెను. ౧౮౯౨ ఆక్టుప్రకారము, శాసనసభ్యులు మొట్టమొదట నోటీసీయబడి ప్రభుత్వమువారిచే అంగీకరింపబడిన ప్రశ్నలనుమాత్రము అడుగుట కవకాశము లుండెను. కాని మార్లే సభలలో ప్రశ్నల నడుగుటకే కాక, తరువాత అవసరమైన ఎడల సప్లిమెంటరీప్రశ్నల నడుగుటకుకూడ వీల్లు కల్పింపబడెను. వీటికన్నటికంటెను ముఖ్యమైనమార్పేమన, ఎన్నుకొనబడిన శాసనసభ్యులు ఏప్రజాహిత విషయములను గూర్చియైనను తీర్మానముల నుపపాదించుటకును, వాటిపై వోటుచేయుటకును అధికార మీయబడుట.

## ౪

పైన సూచించినట్లుగా మనదేశములోని కేంద్ర రాష్ట్రీయశాసనసభలపరిపాల నాధికారములను హెచ్చుచేయుట యనుమార్పు పూర్తిగ జయప్రదముగ కొనసాగినదని చెప్ప వీలులేదు. చట్టములను నిర్మించుటకు పూర్తియగుఅధికార మీయబడి ఆచట్టములను కాని, తీర్మానములను కాని అమలునం దుంచునట్లు కార్యనిర్వాహక ప్రభుత్వవర్గమును బలవంతపెట్టుటకు అధికార మీయబడకుండుటవలన చాల నష్టము వాటిల్లెను. ఒకప్రక్క అధికారవాంఛగల శాసనసభయు, వేరొకవంక బాధ్యతారహితమైన కార్యనిర్వాహకవర్గమును ఏర్పాటుచేయుట వలన ఈపరిస్థితు లేర్పడకుండచేయుట చాలకష్టమైనదని రాజకీయజ్ఞానముకలవా రందరకును తెలియును. ఏలయన శాసనసభవారేతీర్మానము చేసినను అది ప్రభుత్వమువారికి వట్టి "సలహా"గా (Recommendation) మాత్రమే యుండెను గాని వాటి నమలుజరుపు బాధ్యత వారికి లేకుండెను. మరియు అట్టి తీర్మానములను ప్రభుత్వము వారికిష్టములేకపోయిన వాటిని తమఅధికారసభ్యులఓటుల

* మ్యునిసిపాలిటీల యొక్కయు, జిల్లాబోర్డుల యొక్కయు అనధికారసభ్యులు రాష్ట్రీయశాసనసభ్యుల నెన్నుకొనుటకును, రాష్ట్రీయశాసనసభలలోని అనధికారసభ్యులు కేంద్రశాసనసభ్యుల నెన్నుకొనుటకును నియోజకవర్గములుగా ఏర్పాటుచేయబడెను.

నుపయోగించి ఓడించుటకుగూడ వారికి కావలసినన్ని అవకాశము లుండెను. * అధికారసభ్యులపక్షము శాసనసభల యందుండుటవలన వాటియొక్కయు, వాటి కీయబడి నట్టి అధికారములయొక్కయు నుపయోగము చాలవరకు తగ్గిపోవుటయేగాక ప్రభుత్వమువారికిని శాసనసభాసభ్యులకును మధ్య సాధారణముగ భిన్నాభిప్రాయములు ప్రబలుటకుగూడ తోడ్పడుచు వచ్చెను. ప్రభుత్వమువారు శాసనసభ్యులు తమపనులనుగూర్చి ఖండించుచుండుట వలన నష్టము పొందుట కవకాశము లుండెను; శాసనసభ్యులు తమశక్తిలేనితనమును గ్రహించి ఏమియు బాధ్యత లేకుండ ప్రభుత్వచర్యలను ఖండించుట మామూలు సంగతి యాయెను.

## ౫

దీనికి కారణ మేమని మనము గమనించిన, బాధ్యతాయుత ప్రభుత్వవిధానమును ఏవిధమయినదానినైనను ప్రవేశపెట్టుట మింటో-మార్లేచట్టనిర్మాతలయభిప్రాయముకాక పోవుటయే యని నిర్ణయింపనగును. శాసనసభలు ప్రభుత్వముపై ఏవిధమైన యధికారమును గాని కల్గియుండుట కవకాశములు దానియందు ఏర్పాటుచేయబడియేయుండలేదు. "ఈసంస్కరణములు ఏవిధమైనగాని పార్లమెంటరీవిధానమును ఇండియాదేశములో ప్రవేశపెట్టుట కుద్దేశింపబడినవని ఎవరైన తలంచుదురో, వారిది చాలపొరపాటభిప్రాయమని నేను చెప్పుచున్నాను. వారితో నేనెంతమాత్ర మేకీభవింప"నని మార్లేప్రభువు † పార్లమెంటుసభలో నొక్కి చెప్పియుండెను కాని శాసనసభలకు ప్రభుత్వమువారిని తమ తీర్మానములప్రకారము నడుచుకొనునట్లు చేయుట కధికారము లేని సందర్భములలో వాటియుపయోగము దేశమున కేవిధముగ కలుగగలదో, దానివలన వచ్చునష్టము లేవో మార్లేప్రభువు గ్రహింపకుండుట శోచనీయము. సంగతిసందర్భముల నన్నిటినిబట్టి చూచిన, ఆతడు తన యభిప్రాయములో చాల పొరబడెనని చెప్పకతీరదు. మింటోమార్లే సంస్కరణములు దేశమును బాధ్యతాయుతపరిపాలనకు తయారు చేయుటలో చాల తక్కువగ తోడ్పడెనవియు, ప్రజాప్రతినిధులనుగూర్చి కొంతవరకు ప్రభుత్వమువారికి కొంత అనుభవమును కల్గించినవియు ...

చేయుటలో చాల తక్కువగ తోడ్పడెనవియు, ప్రజాప్రతినిధులనుగూర్చి కొంతవరకు ... శాసనసభలు ప్రభుత్వమునకు ... తెలియపరచ ... మనవలసి యున్నది. వాటియుపయోగ మెంతవరకైన, హిందూదేశ ప్రజలకు పార్లమెంటరీవిధానములో కొంతవరకు శిక్షణ కలిగించి అనుభవమును సంపాదించుటలో వారికి కొంత సహాయము చేసినవని చెప్పవలసియున్నది.

## ౬

ఈసందర్భములో హిందూదేశపుకార్యనిర్వాహక ప్రభుత్వమునందు జరిగినమార్పులు కొన్ని గమనింపవలసియున్నవి. ౧౮౬౧లో ఏర్పడినకేంద్రకార్యనిర్వాహకవర్గమునందున్న నలుగురుసభ్యులకును ఇంకొక సాధారణసభ్యుని చేర్చబడెను; ౧౮౭౪ సం॥ లో ఇంకొక సభ్యుని అవసరముగా ఏర్పాటుచేయుటకుగూడ అధికారమొసగబడెను. ౧౯౧౦ లో "విద్యాశాఖ" క్రొత్తగా వేరుచేసి ఏర్పాటుచేయు సందర్భములో ఈ యారవ సభ్యుని పదవి కాయపరుపబడెను. కార్యనిర్వాహకవర్గమునందలి ఆర్గురు సభ్యులలో, సర్వసైన్యాధ్యక్షుడు (Commander-in-chief) ప్రత్యేకసభ్యుడుగా నుండు నట్లును, మిగిలిన ఐదుగురిలో ముగ్గురు ఇండియన్ సివిల్ సర్వీసుశాఖకు చెందినవారును, వేరొక మెంబరు (న్యాయశాఖమెంబరు) ౫ ఏండ్లకు తక్కువకాకుండ అనుభవమున్న బారిస్టరు గాని, వకీలు గాని అయియుండునట్లును నియమింపబడెను. ౧౯౦౯ సంవత్సరములో మింటో-మార్లేసంస్కరణములతోపాటు మొట్టమొదటిసారి ఒకహైందవునికి గవర్నరుజనరలు కార్యనిర్వాహక వర్గములో స్థానమీయబడెను. ఆసంవత్సరములో శ్రీ॥ శే॥ లార్డుసిన్హా (అప్పుడు సత్యేంద్ర ప్రసన్న సిన్హా యని పిలువబడుచుండెను) గారిని న్యాయశాఖమెంబరుగా నియమించిరి. అప్పటినుండియు హిందూదేశస్థుడొకడు గవర్నరు జనరలుసభలో సభ్యుడుగా నుండు టాచారమై

* బెంగాలుశాసనసభవారొకటి రెండుసార్లు ప్రభుత్వమువారికి వ్యతిరేకముగ తీర్మానించిరి కాని అట్టి ప్రభుత్వపరాజయములు చాల తక్కువగా నుండెను. † హిందూదేశపుమంత్రి.

నది. * రాష్ట్ర ప్రభుత్వములందుకూడ పైవిధముగనే కార్యనిర్వాహక శాఖయందు మార్పులు చేయబడెను.† ౧౯౧౨ లో కొన్ని ముఖ్యమైన మార్పులు హిందూదేశ రాజ్యాంగవిధానమందు చేయబడెను. మన దేశపు ముఖ్య పట్టణము అదివరకు కలకత్తాయం దున్నదానిని ఢిల్లీకి మార్చిరి. అది కాక బెంగాలురాజధానిని విభజించి బీహారు, ఒరిస్సాప్రాంతములు ప్రత్యేకరాష్ట్రముగను, తూర్పు బెంగాలును బెంగాలులో కలిపి ప్రత్యేక బెంగాలురాష్ట్రముగను, అస్సాము ప్రత్యేక - ఛీఫ్ కమీషనర్ క్రింద వేరురాష్ట్రముగను ఏర్పరుపబడెను.

పైమార్పులతోపాటు ఇంగ్లండులోని హిందూదేశప్రభుత్వమునకు సంబంధమున్న శాఖలలోకూడ అప్పుడప్పుడు మార్పులు చేయబడుచువచ్చెను. 1858 లో హిందూదేశప్రభుత్వాధికారము రాణీగారిక్రిందికి మార్పు చేయబడినప్పుడు మనదేశవ్యవహారములలో సలహా ఇచ్చుటకు ఒక రాజ్యాంగమంత్రి (Secretary of State) నియమింపబడెను. అతనికి సహాయముగా పదునైదుగురు సభ్యులుగల సంఘ మొకటికూడ అప్పుడే ఏర్పాటుచేయబడెను. హిందూదేశమునందు ఉద్యోగుల నియమించుటకును, హిందూదేశ - ఆదాయవ్యయములను నిర్ణయించుటకును, ఇతర ముఖ్యవిషయములకును ఇండియామంత్రి ఈసంఘము యొక్క సలహా తీసికొనవలసియుండెను. ఈ విషయము లందు గాక ఇతరవిషయములందెల్లను ఇండియాసంఘము (India Council) వట్టి సలహా నిచ్చుసంఘము మాత్రమే; అనగా ఇండియామంత్రి సంఘమువారి సలహాను నిరాకరించవచ్చు నన్నమాట. కాని అట్లు నిరాకరించినపుడెల్లను దానికి కారణముల నాతడు వ్రాతమూలముగ నిరూపింపవలసియుండెను. ఇండియాసంఘపు సభ్యత్వము అప్పుడప్పుడు పరిస్థితులనుబట్టి మార్చబడుచుండెను. 1900 సం. పూర్వము ఆసంఘములో 10 కి తక్కువ కాకుండగను, పదునలుగురికి ఎక్కువ కాకుండగను సభ్యు లుండుచు, వారిలో తొమ్మిదిమంది హిందూదేశమందు అంతకు ముందు అధికారపదవులయందుండి పరిపాలనవ్యవహారములందు అనుభవము కలవారుగా నుండవలెనను ఏర్పాటుండుచువచ్చెను. 1906 లో సాధారణముగ ఇద్దరు లేక, ముగ్గురు సభ్యులు హిందూదేశస్థులై యుండవలెనను నియమముకూడ ఏర్పాటుచేయబడెను.

---

* మాంటేగూసంస్కరణముల ప్రకారము, గవర్నరుజనరలుసభలో ముగ్గురు హైందవ సభ్యు లుండునట్లు ఏర్పాటు కాబడినది. † ౧౯౧౯ సం॥ పు ఇండియన్ కౌన్సిల్సు ఆక్టు ననుసరించి, బెంగాలునందును, ఇతర రాష్ట్రములందును కార్యనిర్వాహకవర్గముల నేర్పాటుచేయుట కనుమతి యొసంగబడెను. మద్రాసు, బొంబాయి రాష్ట్రములలో మాత్రమే అదివరకు కార్యనిర్వాహకవర్గము లుండియుండెను.

---

# మా చందాదారులకు

మా కార్యాలయమునకు వ్రాయు ఉత్తరములు మొదలయినవానియందు తమ 'చందాదారు' సంఖ్య వ్రాయవలెను. లేకున్న ప్రత్యుత్తరములు మొదలయిన పనులను జరుపజాలము. చందాదారుసంఖ్య భారతి కవరుకాగితముపై తమ విలాసమునకు ముందున్నది. చందాదారులకు భారతి ౧౦-వ తేది లోపల అందకపోయిన యెడల వెంటనే తపాలువారికిని, మా కార్యాలయమునకును తెలుప గోరెదము.

—మేనేజరు, 'భారతి.'

# సూర్యారాధనము–విచిత్ర సాదృశ్యములు

తేకుమళ్ల రామచంద్రరావు గారు, యం. ఏ., బి. యల్.

ఆధునిక ప్రపంచమున ననేకమతములు నేనాంశ విధానములు, నాగరకతలు వెల్లికొల్లలుగ నున్నవి. అనేకవేల సంవత్సరములు మానవు లనేకవిధములుగ 'నభివృద్ధి' చెందిచెంది తుట్టతుద కీయాధునిక సంప్రదాయములను నేటి కవలంబించుచున్నారు. 'ప్రపంచము, ప్రపంచరంగమున మానవులు నీప్రకారమే మొదటినుండియు నుండిరా?' యను ప్రశ్నకు చదువుకొన్న ప్రతివాడును ప్రత్యుత్తర మొక్కటేతీరుగనే యొసగును. "లేదు; ప్రపంచ మనాదినుండియు నొకటే తీరుగ లేదు. అనేకమార్పులను చెందిచెంది తుట్టతుద కీ ప్రస్తుతస్థితికి వచ్చినది. ఈమహాపరివర్తన మెప్పటికిని జరుగుచునేయుండును. విశ్వమంతయు నంతమై పోయి నప్పుడే మానవులయూహలు, అభిప్రాయములు, వారవలంబించు విధానములు, వారుచేయు చేతలు పరివర్తనము నందుట మానును." అను ప్రత్యుత్తర మొక్కటియే పై ప్రశ్నకు సరియైన సమాధానము.

లోక మిట్లు లెడతెగక పరివర్తన మగుటలో నెట్టి ప్రోద్బలములకు లోనగునో నిర్ణయించుట సులభసాధ్యము కాదు. ఇప్పటి మనజాతినే తీసికొందము. ఈ జాతి యేయే ప్రోద్బలముల కెప్పు డెప్పు డేయేవిధముల లోనై నేటిస్థితికి వచ్చినదో నిర్ణయించుట కష్టముగదా! ౧ కాని, ఒక్క సంగతిమాత్రము విమర్శన భయము లేక చెప్పవచ్చును. అది యేమనగా: మనజాతివారు స్వయంకృషివలనను, ఇతరజాతులతోడి పరస్పరసంబంధ వ్యవహారాదులవలనను నింతవఱకు పరివర్తనము నందిరి.

కొంతవఱకు నాగరకతనందిన జాతులలో నితర జాతులతోడి వ్యవహారాది సంబంధములవలన పరివర్తనము గలిగినదనుట సహజముగనే కనబడును కాని మానవుల యొక్క నాగరకత ప్రథమావస్థలో నున్న సమయమున పరస్పరసంబంధాదులు ప్రపంచ మెఱుగని సమయమున మానవుల యూహలు, అభిప్రాయములు, విధానములు మున్నగునవి కొన్ని యొకటేరీతిగ నుండుట కేదైన బలవత్తమమగు నొకకారణ ముండియుండవలె ననుట నిర్వివాదాంశము. యూరోపు, అమెరికా, ఆఫ్రికా, ఇండియా, చీనా, ఉత్తరాసియా, ఇండొనేసియా, నైరుతి-ఆసియా వగైరా ప్రదేశములందు నివసించిన మానవులలో నాటి వారి నాగరకతాభివృద్ధియందలి ప్రథమావస్థలలో ననేక సాదృశ్యములు గనబడుచున్నవి. ఇట్లు కనబడుట కేమికారణము?

మానవశాస్త్రజ్ఞులలో కొందఱు ఒకవిధముగను కొందఱు మఱొకవిధముగను పై ప్రశ్నకు సమాధానము నిచ్చుచున్నారు. మొట్టమొదట మానవులందఱును నొకటే చోటున ప్రభవించిరనియు, ఆప్రదేశమునుండి యావన్మానవలోకమునకును సాదృశ్యములు గనబడుచున్న సంగతులన్నియు వ్యాపించెననియు కొందఱందురు. ఆంగ్లమున వీరికి 'డైఫ్యూజనిస్టిక్ స్కూల్' వారను ప్రసిద్ధనామము గలదు. మఱికొందఱు శాస్త్రజ్ఞులు మానవుల యాదిమ నాగరకతాకాలమునందలి సాదృశ్యములకు గల కారణము ఏతన్మానవుల మనఃప్రకృతి, వారి యూహావిధానము ఇంచుమించుగ నొకటేవిధమున నుండుటయే యని తీర్మానించిరి. చీనాదేశీయు డనుకొన్నట్లే యూరోపువాడు గనుకొనెను. వీరిద్దరు ననుకొన్నట్లే ముండాజాతివాడనుకొనెను. ఇట్లే అమెరికాలోని 'మయాఇండియను' తలంచెను. ఈపైప్రకారము కారణము చెప్పు శాస్త్రజ్ఞుల కాంగ్లమున 'ప్రాజెయిక్

* ౧. ఈవిషయమై నేను పరిశోధనగావించుచున్నాను. వీలుకొలది మున్ముందు పాఠకులకు నాపరిశోధన ఫలితముల నందజేయగలను.

స్కాల్' నాదను ప్రసిద్ధనామము గలిగినది. ఈ 'గోమర్‌ఛాటిక్,' 'ప్రాజేయిక్' స్కాల్లరువాదనలలో నెవరిది తప్పు, ఎవరిది సత్యము, అను విషయము మన విద్యామునకు చర్చనీయాంశము గాదు. ఈరెండు వాదన లును ప్రబలియున్నవనుటయందు పాఠకులు జ్ఞప్తియం దుంచుకొన్న చాలును.

ఇప్పటి మానవుల పూర్వీకులయొక్క నాగరకతాభివృద్ధియందలి ప్రథమదశలలో సూర్యచంద్రాదిగ్రహములను గూర్చియు, ఇంకననేకములగు నితరవిషయములను గూర్చియు వారాలోచనలు చేసియుందురని మన మూహించవచ్చును. ప్రపంచచరిత్రము జాగ్రత్తగ మాచినచో మనయూహ సదాధారమైనదని తెలియగలము. మానవు లీగ్రహతారాదులనుగూర్చి వారి నాగరకతారంభకాలమునను, అటుపిమ్మటను నెట్టియభిప్రాయములను గలిగియుండిరి? సూర్యుని దేవుడుగ నెంచి యారాధించిరా? మానిరా? సూర్యు డెట్టిగుణములు గలవాడని వారి యభిప్రాయము? సూర్యునిగూర్చి వా రెట్టికథలను జెప్పుకొనుచుండిరి? అను ననేక ప్రశ్నలీవిషయమున నుద్భవించుచున్నవి. ఈవిషయములందు మానవుల నాగరకతారంభకాలమునుండి నేటివఱకును అనేకనాగరకతలలో ననేకదేశములలో, ననేకకాలములలో గల సాదృశ్యములను గమనించి, వానినుండి పరిశోధనవలన సాధ్యములగు విషయజాలమును పాఠకలోకమునకు సమర్పించుటయే యీవ్యాసముయొక్క యుద్దేశము.

## సూర్యుడు నేత్రదాత

ఆంధ్రవిద్యాధికులలో నొందఱు కాంధ్రభాష యెట్లుద్భవించినదో దెలుపు నొకపూర్వకాలపుకథ తెలిసి యుండవచ్చును. ఇది కీర్తిశేషులగు మహారాజశ్రీ వంగూరి సుబ్బారావుపంతులుగారిచే రచింపబడిన ఆంధ్రవాఙ్మయచరిత్రమున గూడ పొందుపరుపబడి యున్నది.

సీ॥ ఖేచర కిరణాగ్ని దగ్ధలోచనముచె
సత్యభాసడి యింద్రభాసముదర।
అగ్నిమిత్రు డంధకత ఘనడంగ దుమ్ములో
కడి జగ్గి భాస్కరుం మననమొంది।
జాలిని జెరణినిం గడసుడిగొరగించి
కడగ నోచి భాబిందు లడగదొడగె।
అపుగ నాభామణి నవభవకర మొంద్రు
త్సలరించి వరుణకరగా గర్భబడె।

గ్రసమబించు గ్రుఘమ్ముల గరిమ మనడె।
దిఙ్మనిముల రలించు భోగరింద్ర।
భాసమెరయ భాసము బ్బరించె।
వానికంకు.సరు కు॥

క॥ భాసురుభాషాబ్రోమ్మున।
భాసు డిబోమ్మింద్ర బింమల్భాసమునందెన్।
భాబుమ్మభాషవానాంధమున్।
జాతీయ్యగనది నాగ్రమనుంచు బరువడినందెన్॥

ఈ పైరెండుపద్యములతాత్పర్యము కీర్తిశేషులగు వీరేశలింగముపంతులుగారీక్రిందిప్రకారముగా నిచ్చియున్నారు. (ఆంధ్రకవులచరిత్రము, ప్రథమభాగము, 271 వ పుట) "పూర్వ మొకప్పు డెండ యధికమయి యగ్నిపిడుగులుపడి యగ్నిమిత్రునికన్నులు పోయెను. అతడు తనకు కన్నులియ్యవలసినదని సూర్యుని ప్రార్థించగా సూర్యు డతనిభక్తికి మెచ్చి యతని కొకభాష నను గ్రహించెను; ఆభాషాప్రభావమువలనను సూర్యాను గ్రహమువలనను మరల నగ్నిమిత్రున కంధత్వము పోయి కన్నులువచ్చెను; ఆభాష యాతని యంధతను బోగొట్టినందున దాని కాంధ్రభాషయని పేరు కలిగెను." విశ్వేశ్వర భట్టాచార్యులవారు భాషాముకురమను నాంధ్ర గ్రంథమునం దీపైపద్యములను వ్రాసినట్లు ప్రతీతి కలదు. సూర్యుడంధత్వమును పోగొట్టి లోచనపటుత్వము నొసంగగల శక్తిమంతుడనియు, సూర్యుని ప్రభావమున నగ్నిమిత్రునకు గన్నులు మరల గలిగెననియు మనయాంధ్రమున నీగాథ కలదు.

ఇట్టికథయే గ్రీసుదేశపుపూర్వకాలపు కథలలో నొకటి గానవచ్చుచున్నది. ఆకథ యిచ్చట పొందుపరుచుచున్నాను. పూర్వకాలమున నొకగొప్పవేటకాడుండె

డెవాడు. ఆవేటకాడు 'ఓరాయన్' అనుతరుణీమణిని పత్నిగ కముగ ప్రేమించెను. ఏజంతువులను వేటాడినను సరే, ఆ జంతువులలో మెరుగైన వాని నన్నింటిని, మంచివాని నన్నింటిని వేటకాడు తనహృదయేశ్వరికి తెచ్చి యిచ్చుచుండెను. ఈసంగతి చూచి మహోగ్రుడై 'ఈనో'తండ్రి ఆమె నావేటకాని కిచ్చి వివాహ మొనర్చుట కంగీకరించకుండుటయేగాక, వాడుమిక్కిలి వేటకానిని అంధుని గావించెను. ఇట్లుండగా 'ఆరెకిల్'అను' సోదెచెప్పుచోటివా రాయంధుని యంధత్వమును తొలగించుటకుదయభానుడే దిక్కని యుద్ఘోషించిరి. ఆప్రకార మాతడు సూర్యునివలమున నంధత్వమును బాసి క్రీట్ ద్వీపమునకు పోయెను. అచ్చటియడవి పందులను వేటాడుచుండగా ('అపాలో'అను) సూర్యునిచెల్లెలగు 'ఆర్టెమిస్' ఆవేటకానిని ప్రేమించెను. 'అపాలో' కిది యిష్టము లేకపోవుటచే నొకనాడు చెల్లెలితో నాత డిట్లనెను. ఆసముద్రములో నల్లగా కనబడుచున్న దేది? దానిని నీవు బాణముతో కొట్టజాలవు కాదా?. ఆర్టెమిస్ "కొట్టలేనా, ఇదిగో చూడు" అనుచు బాణముతో కొట్టగా, సముద్రమున నల్లగా కనబడుచుండినపదార్థము మనవేటకాడే యగుట నాతడు ప్రేయసి బాణమువలననే మరణించెను. కాని దేవాధిదేవుడగు 'జియస్' వేటకానిమీద కనికరించి ఆకాశమున నొకనక్షత్రముగ నాతని నిలిపెను.

పైరెండుకథలలోను సూర్యునివలమున నంధులు లోచనపటుత్వమును పొందుట గమనార్హమగు విషయము. సూర్యునకును లోచనపటుత్వమునకును గలసంబంధ మిట్టిదనుట క్రిందివిషయములు ముఖ్యములు. వేదములకాలమునాటి ఆర్యులలో సూర్యుడు విశ్వమునకు నేత్రమని చెప్పుకొనుట వాడుక. ఇది ముఖ్యముగ అథర్వవేదమునందు కాననగును. కన్నులకు పసిగరులు అనురోగము వచ్చినప్పుడు సూర్యుని జపించిరోగమును బాపుకొనవలసినట్లు ఋగ్వేదము (౧-౫౦) శ్లోకమునగలదు2 ఈ శ్లోకమునందు పసుపుపచ్చతనమును పసుపుపచ్చనిచిలుకలకును, హారితాలవృక్షములకును ఇచ్చివేయవలెనను వేద ప్రార్థించితిరి. ప్రాచీనకాలమున సూర్యునివలన నేత్రసమునకు ప్రత్యేకముగ నేమున్నను బాధలను ప్రార్థించునంతవరకు పొందవలసినబడియున్నవి. ఇట్లే ఆయుర్వేదమునందలి యొక (౧-౫౭) శ్లోకమునకూడ నేత్రరోగము పోవుటకు మంత్రము కలదు. ఇట్లే ప్రాచీనపర్షియాను గ్రీస్ దేశములందుగూడ సూర్యుడు నేత్రప్రదాత యనునభిప్రాయము ప్రచారములో నుండెడిది.

సూర్యుడు నేత్రదాతయే కాదు. సర్వారోగ్యములకును, సర్వరోగవినాశనమునకును సూర్యుడే అధినాయకుడు. భారతదేశమునందలి అనార్యులలో కోలారియను, ద్రవిడాదిజాతులలో నిట్టియభిప్రాయమే ప్రబలియున్నది. ఇండోనీసియాయందలి, కెమీఆర్చిపెలగోలో నివసించు జాతులవారిలోకూడ రోగములు పోగొట్టుటకు సూర్యుని కొలుచుచుండు నాచారముకలదు.

## సూర్యునిజన్మము

సృష్టిప్రక్రియను గూర్చియు, అందు సూర్యభగవానుని కర్తృత్వమును గూర్చియు కొన్నిగాథలుగలవు. సూర్యపురాణమునందు క్రిందివిధముగా చెప్పబడియున్నది. "ఎనుబదినాల్గులక్షల జీవరాసులును ప్రళయజలములో మునిగియుండగా దట్టమైనచీకటి యీప్రపంచమునంతంతటను వ్యాపించియుండెను. అటులుకొన్ని యుగములు గడచెను. అంతట ఆద్యంతములు లేని ఒకపెద్దగ్రుడ్డు జన్మించెను. అది యెట్లుపుట్టెనో, యెచ్చటనుండివచ్చెనో ఎవరికిని తెలియకుండెను. సువర్ణచ్ఛాయగల ఆయండమునుండి కొంతకాలమునకు గొప్పతేజోరాశియు జగద్బ్రహ్మస్వరూపుడును నగు శ్రీసూర్యభగవానుడు పైకి వెడలెను. ఆయనవలననే ఈప్రపంచమంతయు క్రమక్రమముగాసృష్టి చేయబడెను...."3

ఇట్లే ప్రాచీనకాలపు ఈజిప్టుదేశమున సూర్యుని జన్మమునుగూర్చియు యొకగాథకలదు. అదియందు నైల్ అనుపేరుగలగొప్పజలము దక్క నన్యమేమియును లేదు.

2 "Rising this day, O rich in friends, ascending to the loftier heaven, Surya, remove my heart's disease, take from me this my yellow hue. To parrots and to starrings let us give away my yellowness, or this my yellowness let us transfer to Haritala trees."

3. వేమూరి జగన్నాథశర్మగారిచే రచింపబడిన శ్రీ సూర్యపురాణము 3 వ పుటనుండి.

ఈ జలధ్వాంతపటలమునుండి యొక తామరపూవు పుష్పించెను. ఆపూవుపై చిన్నపిల్లనివలె సూర్యుడు ప్రత్యక్షమాయెను.[4] ఈజిప్టుదేశపు గాథలలో మఱొక్కటి యున్నది. ఆదియందు విశ్వమంతయు జలమయమై యుండెను. దానిలోనుండి యొక పర్వతము పుట్టెను. ఆపర్వతాగ్రమున నొకగూటిలో నొక యండ ముండెను. సూర్యుడాయండమునుండి పైకి వచ్చినప్పుడు మంచూ కాదిబిబిధాకృతులతో సైనమంపును రాదిమరాక్షసులును, నొకగోవును నిలబియుండెను. సూర్యుడుదయించుటతోడనే ఆధేనువు పైన సెక్కి జలములపై నీదులాడెను.

భారతీయులలో ముండాజాతివారను నొకజాతి వారు కలరు. వీరనార్యులక్రింద జేర్చబడుచున్నారు. వీరి సృష్టి చరిత్రమునందును సూర్యభగవాను డధిదేవతగా పేర్కొనబడుచున్నాడు. ఆదియందు భూమియంతయు జలమయమై యుండెను. సూర్యభగవాను డానీటిని చూచి చింతించి చింతించి యొక తాబేటిని, ఒకయెండ్రకాయను, ఒకజలగను సృష్టించెను. ఈజలచరములను జలముల యధోభాగమునుండి కొంతమట్టిని తెమ్మని సూర్యభగవాను డాజ్ఞాపించెను. తాబేలును కర్కటకమును ప్రయత్నించి చేత గాక యూరకొనెను. ఇంతలో జలగ సఫలప్రయత్నమై చనుదెంచెను. సూర్యభగవాను డామట్టితో ప్రపంచమును సృష్టించెను.[6]

భారతీయులలోనే బీర్హరులను అనార్యులలో చేర్చబడినవారు గలరు. ఆదియం దంతయు జలమయమై యుండగా నడుమ నొకతామరపూవు పుదయించెననియు, ఆతామరతూడునుండ సూర్యభగవానుడు పైకివచ్చి కూర్చుండెననియు, తాబేటిని, యెండ్రకాయను, జలగను సృష్టించి మట్టిని తెమ్మనెననియు, జలగ మట్టిని తేగా సూర్యుడు భూమిని నిర్మించెననియు వీరికథ. భూమిని సృష్టించినపిదప మనుష్యుని సృష్టించుటకు గాను మనుష్యవిగ్రహనిర్మాణము గావించి ఆరబెట్టగా రాత్రియగుటచే నెక్కడిదో యొక గుఱ్ఱము వచ్చి ఆబొమ్మను పాడుచేసెను. మఱునాడు సూర్యుడు మనుష్యాకారపు బొమ్మనేగాక, కుక్కనుగూడ చేయగా, కుక్క మొదట ఆరినది. సూర్యుడు దానికి ప్రాణముపోసెను. కుక్క మనుష్యవిగ్రహము ఆరువఱకును కాపలాకాచెను. ఇట్లు మనుష్యు లుత్పన్నులైరి.[7] కుక్కగాక సాలెపురుగు కాపలాయుండె నని ముండాజాతివారు కథ చెప్పుదురు.[8]

సలిలాకీర్ణమైనప్రపంచమున నాదియం దొక్క యండ ముండెననియు, అందుండి సూర్యు డుదయించెననియు భారతీయులలో నిమ్నజాతులనియు అనార్యులనియు నన బడువా రనేకులు కథలు చెప్పుచున్నారు. పైనిచెప్పబడిన నమ్మకములలో నొకదానికి నింకొకదానికిని గలసాదృశ్యమును చదువరులు సులువుగ పోల్చుకొందురు గావున నిట విస్తరించుట యవసరము గాదు.

## సూర్యుడు—గుఱ్ఱములు

సూర్యునకు గుఱ్ఱము లత్యంతప్రీతికరములగు జంతువులు. సూర్యుని సప్తాశ్వుడనియు, సప్తసైంధవుడనియు మనము పేర్కొనుచుందుము. సూర్యునిరథమునకు మంచి వడిగల ఏడుగుఱ్ఱములు పూన్పబడియుండునట్లు మన పురాణములందు చెప్పబడియున్నది. ఇంతేగాక సూర్యునిభార్యయగు సంజ్ఞాదేవి సూర్యుని యుష్ణమును సహింపజాలక ఉత్తరకురుభూములకు పాఱిపోయి బడబా (ఆడుగుఱ్ఱము) రూపముతో నచ్చట తపస్సుచేసెననియు, ఆ

4. ఇట్టికథయే మన సృష్టిప్రక్రియ విషయమున జెప్పబడియున్నది. సృష్టికర్తయగు బ్రహ్మదేవుడు గూడ నిట్లే యుద్భవించెను. ఈజిప్టువాసులతో నీసంగతి యందు సాదృశ్యము కాననగును.

5. A. Erman గారు వ్రాసిన Die agyptische Religion2 32 వపుట.

6. Sarat Chandra Roy: Mundas and their Country, Appendix I pp 5 to 7.

7. Sarat Chandra Roy: The Birhors, pp. 398-402.

8. Journal of the Bihar and Orissa Research Society, ii, pp. 201 sq.

సందర్భమున సూర్యుఁడామెను వెదకికొనుచు పోయి మగగుఱ్ఱమై యామెతో విహరించెననియు, అప్పు డామె కశ్వినీకుమారు లుదయించిరనియు మనపురాణములలో కథ గలదు. కావున మనసంప్రదాయముల ప్రకారము సూర్యునకు గుఱ్ఱములు ప్రీతికరములగు జంతువు లనుట నిర్వివాదాంశముగ తేలినది.

గుఱ్ఱము సూర్యునకు మిక్కిలి ప్రీతికరమగు జంతు వగుటచే కొన్ని దేశములవారు సూర్యు నారాధించునప్పుడు గుఱ్ఱముల నాదేవునకు బలియిత్తురు. ఇట్టిపద్ధతి పారశీకులలో ప్రబలియుండెను. 'క్సెనోఫాన్' అను గ్రీకువాఁడు వ్రాసిన సైరోపీడియా అనుపురాతనపుస్తకమునందు పారశీకులు గుఱ్ఱములను సూర్యునకు బలియిత్తురని వ్రాసియున్నాఁడు. పారశీకదేశపురాజుగారి, గుఱ్ఱపుశాలలకు గాను పెంచబడుచున్న గుఱ్ఱముల ననేకముల నాతఁడు చూచెను. ఒక్కొక్కగుఱ్ఱమును విడిగ బలియిచ్చు నాచారమేగాక పెక్కుగుఱ్ఱముల నొక్కసారిగ నగ్ని దరికొల్పి సూర్యునకు ప్రీతికరముగ కాల్చుట పారశీకులలో నాచారమైయుండెను.

ఇండోనీసియాయం దొకభాగమగు 'టిమర్' అనుద్వీపమునందు నివసించు జనులు సాధారణముగగాక యెప్పుడైన నొకసారి సూర్యభగవానునకు గుఱ్ఱపుబలుల నొసంగుచుందురు. ఇంక మరేదేవునకును గుఱ్ఱమును బలి యొసంగుట అనుమాయితీ కాదు 9

ఇతరదేశీయులును, భారతీయులును గుఱ్ఱపుబలులు చేయువారు కారు. పూర్వము బ్రిటన్‌దేశమున నీయాచారమున్నట్లు తెలియుచున్నది.10 తెల్లని కోడిపుంజులను దున్నపోతులు, పందులు మొదలగువానిని సూర్యునకు ప్రీతికరముగ బలియిచ్చువాడుక కలదు; గాని గుఱ్ఱములను బలియిచ్చుటమాత్రము వాడుకలోనిది కాదు. కాని, ఈసందర్భమున నొక్క ముఖ్య విషయమును మనము గమనించవలసి యున్నది.

మన దేశమునందలి వేదకాలపుపూర్వులలోను, ఆటుపెమ్మట చాలకాలమువఱకును గుఱ్ఱపుబలులు విస్తారముగా జరుగుచుండెడివి. ఈబలులనే అశ్వమేధములని మనవారు పేర్కొనుచుండిరి. ధర్మరాజు, శ్రీరాముడు, పుష్యమిత్రుడు, మొదలగువారు చేసిన అశ్వమేధయాగములు మనకు సుపరిచితములేగదా? ఇంకను వేనవేలుగ ననేక రాజోత్తము లశ్వమేధయాగము లొనర్చి సూర్యునకు సంప్రీతి గావించుచుండిరి. ఒక్కొక్కప్పు డనేకములగు నశ్వమేధయాగములు కూడ గావించుచుండిరి. భారతదేశమున నొకరాజు ఇతరులకంటె నధికుఁడ నని నిరూపించుటకు తెల్లగ నశ్వము నొకదానిని విడిచి పుచ్చుటయు దానినిబట్టిన వారితో పోరాడుటయు భారతలోకమునకు క్రొంగ్రొత్తలు గావు.

ఈగుఱ్ఱపుబలుల యాచారము కెల్టులలోను, పారశీకులలోను, భారతీయులలో వేదపురాణ కాలములనాటి యార్యులలోను విశేషముగ నుండుటయు, ఇతరదేశములలో నెచ్చటనో తప్ప నీయాచారము గానరాకుండుటయు మనము గమనించవలసియున్నది.

## సూర్యుడు—పక్షులు

గుఱ్ఱములు సూర్యునకు ప్రీతికరము లైనట్లే కొన్ని పక్షులుగూడ సూర్యున కత్యంతప్రియతమములు. కాని యాపక్షులను బలియిచ్చుట ఎచ్చటను వాడుకలో నున్నట్లు మనకు తెలియుటలేదు. సూర్యునకు గరుడపక్షి చాలప్రియతమమైనది. గరుడునియన్నయగు అనూరుడు సూర్యునిసారథి. జటాయువు, సంపాతి యనుపక్షులకథలును మనము చక్కగ నెఱిగినవే. సూర్యోపాసనగల అన్నిదేశములలోను, అనగా ఈజిప్టు, గ్రీస్, రోమ్, బాబిలోన్ ఇండియా, ఇండోనీసియా మొదలగుదేశములలో నించుమించుగ నన్నిటను డేగగాని, గరుడపక్షిగాని సూర్యునకు ప్రియమైనదిగా నెన్నబడుచున్నది. సూర్యుని సూర్యనారాయణమూర్తియని మనము పేర్కొనుచున్నాము. శ్రీమ

9 J. S. G. Gramberg's book on the Timrese, published in 1872 pp. 206 to 209.

10 బాబిలోనియన్లును, రోడియన్లును ప్రతిసంవత్సరము ఒక్కరథమును గుఱ్ఱములను సూర్యునియుపయోగార్థమై సముద్రమునఁ బాఱవైచుచుండిరి.

హావిష్ణువు సూర్యుడేయని మన మభిప్రాయపడుచుందుము. శ్రీవిష్ణుమూర్తికి గరుత్మంతుడే సుత్తముకదా. కావున సూర్యునకును నీపక్షిరాజునకును గలసంబంధము సువిదితమగుచున్నది.

## సూర్యుని దినచర్య

సూర్యుడేడు గుఱ్ఱములను పూన్చినరథముపైనెక్కి యాకాశపథమున సాటిలేని వేగముతో పరుగెత్తుచుండును. పారశీకులలోను, బాబిలోనియన్లలోను వేదకాలపు టార్యులలోను, సూర్యుడు రథారోహణ మొనర్చి అనుదినము సేయుచుండు నను నమ్మకము గలదు. క్సెనోఫోన్ అను గ్రీన్ దేశీయుడు సైరోపెడియా అను పుస్తకమున నిట్లు చెప్పియున్నాడు. "జియస్ అను దేవాధిదేవుని యొక్క రథమువెనుక సూర్యునిరథము వచ్చును. ఈరథముకూడ 'జియస్' యొక్క రథమువలె శ్వేతాశ్వములచే లాగబడుచుండును. 'జియస్' యొక్క రథమువలె సూర్యునిరథముగూడ పుష్పమాలాలంకృతమై యొప్పారుచుండును."11 క్వింటస్ కర్టిస్ అనువాడు 'జియస్ యొక్క రథము తరువాత నొకగొప్పగుఱ్ఱము వచ్చును. అదియే సూర్యునియొక్క గుఱ్ఱము' అని వ్రాసియున్నాడు. 12 గ్రీకులు సూర్యునకు నాలుగశ్వములు పూన్చినరథముగలదని నమ్ముచుండిరి. గ్రీక్ లలితాదికళలందును, దేవాలయములందలి ప్రతిమల యందును సూర్యుని నాలుగశ్వములు పూన్చినరథముపై నధిరోహించినట్లు చిత్రించిరి. ఇలియడ్ అను గ్రంథములో గూడ నిట్లే వ్రాయబడి యున్నది. ప్రస్తుతభారతదేశమున మనయూహకూడ నిట్టిదియే. మనము రథసప్తమి యను పేర నొకగొప్పపండుగ గావించి ఆనాడు సూర్యునిరథములు తిరుగునని భావించుచున్నాము. అంతవఱకును సూర్యుని యరదము లేళ్లచే లాగబడి రథసప్తమినాటినుండియు గుఱ్ఱములచే లాగబడునని మహారాష్ట్రీకన్నడదేశములందును హైదరాబాదుప్రాంతములందును నొక ప్రతీతి కలదు.

సూర్యుండిట్లుతురంగములు పూన్చిన రథమున నెక్కి పరుగిడుచుండునని ప్రతీతి యుండగా ఈజిప్టుదేశీయులు సూర్యునకు గుఱ్ఱములుగాని, రథములుగాని లేనట్లు వర్ణించియున్నారు. ఈజిప్టుదేశీయుల గగనాకాశ మొక నదిగా భావింపబడి దానిపై 'ర' 13 (=సూర్యుడు) పడవలపై సంచారము చేయుచుండునని ఈజిప్టువాసుల పూర్వపునమ్మకమైయున్నది. ఒక్కొక్క సందర్భములో ఈజిప్టువాసుల పురాతన సంప్రదాయానుసారముగ చూచుచో గగనమంతయు లోహమయమనియు ఆలోహనిర్మితమైన (దివిజగంగానదివంటి) దేవలోకపు 'నైల్' నది ప్రవహించుచుండుననియు, ఆ నదిమీద పడవలపై సూర్యుడు పయనముగావించుననియు తెలిసికొన గలము. రాత్రిపూటమాత్రము గంటగంటకు వొక్కొక్కపడవ సూర్యునకుగాను అమర్చబడుననియు, రాత్రిపూట సూర్యుడాపడవలపై ప్రయాణ మొనర్చుననియు మనకు తెలియుచున్నది.

సూర్యుని దినచర్యలో ముఖ్యమైనది రథముపైనన్నో, పడవమీదనో ఎక్కి ఎడతెగక ప్రయాణమొనర్చుటయని నిర్ణయించితిమి. ఇక సూర్యుడు పగలు పైనను, రాత్రి అధోలోకమునందును ప్రయాణము చేయునా? లేక మఱియొక విధముగా ప్రయాణముచేయునా? యను ప్రశ్నలకువత్తము. సూర్యుడు భూమిచుట్టును తిరుగుచున్నాడని మన భారతదేశమునసేగాక ప్రాచీనకాలములో నించుమించుగ నన్నిదేశములందును వాడుకగలదు. ఈజిప్టుదేశమునందుసైతము సూర్యుడు పడవలపై పయనము గావించుచు నధోలోకవాసుల లోకములగుండ పయనించి దినమున నొక్కగంటమాత్రము లోకవాసులకు సూర్యరశ్మి నొసంగుచుండునని చెప్పబడినవి. 14

11. 'క్సెనోఫోన్' వ్రాసిన 'సైరోపేడియా' అను పుస్తకమున VIII, 3. పు. ౧౨.

12. 'క్వింటస్‌కర్టిస్' III 3. ౭.

13. ఈజిప్టు 'ర' = సంస్కృతము 'రవి' = సూర్యుడు.

14. A. Wiedmann: Religion of the Ancient Egyptians pp. 23 to 27. Also E. A. Wallis Budge: The Gods of the Egyptians I, pp. 323 to 326

కాని బాబిలోనియావాసులలో నింకొకమాదిరి వాడుక గలదు. ఆకాశ మొకడోము (Dome) వంటిదని వారినమ్మకము. ఆడోముకు తూర్పున నొకటియు పడమట నొకటియు రెండుద్వారములు గలవు. డోము వెనుకనుండి సూర్యు డరుదెంచి తూర్పువాకిలిగుండ లోన బ్రవేశించు నప్పు డుదయాద్రిపై నెక్కి ప్రవేశించును. సాయాహ్నమున పడమటివాకిలిగుండ నావలకు బోవుచు పశ్చిమాచలముపై నెక్కి యస్తమించును. ఇట్టిబొమ్మ కూడ ఒకటి యున్నట్లు మెయిస్నర్, థోర్మగార్లు వ్రాసియున్నారు.

ఈకథనుబట్టి సూర్యుడు భూమిచుట్టును తిరిగి అధోలోకమునుగూడ నప్పుడప్పుడు నిజరశ్మిచే సంతసింప చేయుచు తిరుగక ఆకాశమార్గముననే మనతలలపైననే తిరుగునను సంప్రదాయముగలదని తెలియుచున్నది. ఈ విషయమున గూడ బాబిలోనియన్లకును, మనకును సాదృశ్యము గలదు. మననమ్మకము ప్రకారము సూర్యుడు మేరుపర్వతముచుట్టును తిరుగుచుండుననియు, ఆ పర్వతశృంగమున కీవలకువచ్చినప్పుడు మనకు పగలనియు, నావల కేగినప్పుడు మనకు రాత్రియనియు మనపురాణేతిహాసములందు సుప్రసిద్ధము.

సూర్యుని దినచర్యలో నింకొకవిశేషము గూడ కలదు. సూర్యుం డెల్లప్పుడును మందేహాసురులను రాక్షసులతో పోరాడుచుండునని మన నమ్మకము. కంకంటి పాపరాజప్రణీతమైన యుత్తర రామాయణమున రావణుండు సూర్యజిగీషుండై యరిగినసుట్టమున నిట్లు చెప్పబడినది:

"తపనునిం జేరి మ్రొక్కి యవ
ధారు త్రయీమయ దివ్యమూర్తి శౌ
ర్యపరుండు రావణుండు సమ
రం బొనరింపంగ వచ్చినాండు తో
రపుభుజశక్తి యొప్ప సమ
రంబె యొనర్చెదరో యిఢేల యం
చిపుడు 'జితోఽస్మి' యంచు వచి
యించెదరో యిదియేమి నావుడున్.
ఆహరివశ్వుం డిట్లను ద
శాస్యునితో మన కేటిపోరు? మం
దేహ నిశాటులం దొడరి
నిత్యము బోరెడిపోరు చాలదే
యాహాలికేల యిప్పటికి
నోడితి మన్నను దప్పుగాదు పోం
డాహవకేళి నోడె రవి
యం చను డాయనతోడ నావుడున్."15

ఈమందేహాసురులు చీకటి కథిష్ఠాతలు; చీకటి రక్కసులు. ఇదే సూర్యపురాణమున దైత్యాదిత్యులు సపత్నీపుత్రులగుటచే క్రోధవశులై యుద్ధముచేయుచుండగా దేవత లోడిపోయిరనియు, అంతటిదాక నదితి ఆదిత్యుడగు సూర్యుని జేరి మొరలిడగా నాత డారక్కసుల నణగించెననియు, నప్పుడు దైత్యులు కొందఱు పాతాళమునను, మఱికొందఱు సముద్రములోను దాగిరనియు, తక్కినవారు రణరంగమున నిహతులైరనియు గలదు.16. "నాటివైరమును మఱవక అప్పుడు సముద్రమునదాగియుండిన రాక్షసులు నేటివఱకును సంధ్యాకాలములందు అనగా ఉదయ, మధ్యాహ్న, సాయంకాలములందు దివాకరునిపై పగసాధించుచున్నారు...... వీరికి మందేహాసురులని పేరు."17

ఇట్లే ఈజిప్టుదేశమునందును సూర్యుడు ప్రత్యర్థులతో పోరాడుగాథ కలదు. పూర్వము 'అపెప్' 'అపెపి' 'అపోఫిస్' అనునామములుగల గొప్ప రక్కసు డొక డుండెను. వాడు గొప్పకొండచిలువ రూపముతో సంచరించెడువాడు.18 చీకటి నీరాక్షస

15. కంకటిపాపరాజు: ఉత్తరరామాయణము, IV-42, 43.

16. సూర్యపురాణము, ప్రథమాధ్యాయము.

17. వేమూరి జగన్నాథశర్మగారి సూర్యపురాణము, పుట 5.

18. ఒక్కొక్కప్పుడు మొసలియాకారముగలవాడని యీ రక్కసుని భావించుటయు వాడుకగనుండెను.

రూపముగలవ్యక్తిగా భావించిరని సర్ జార్జి జేమ్స్ ఫ్రేజర్ గారియొక్క సకారణమగు నభిప్రాయమైయున్నది. సూర్యుడును సూర్యునిపడవవాండ్రును గలిసి 'అపెప్' అనుచీకటిరక్కసుడును గొంపచిలువను, వానియనుచరులను కత్తులతో పొడిచిపొడిచి వదేసిగొలుసులతో కట్టివైచి, అగ్నితో కాల్చికాల్చి వారియాత్మలకు నిప్పు దరికొల్పి, నానావిధముల నతిక్రూరముగ చిత్రవధ గావించిరి. 'అపెప్'యొక్కయు, వారియనుచరులయొక్కయు సంతతివారినిగూడ నిట్లే చిత్రవధనాలు గావించిరి. ఈజిప్టువాసులపుస్తకములలో 'అపెప్'ను వధించుకథ యితివృత్తముగగల పుస్తకములు కొన్ని గలవు. వీనినుండియే ముఖ్యముగా మన కీమందేహాసురసంహారము నొకింత పోలు నీకస తెలియుచున్నది.[19]

## సూర్యుడు — సుదర్శనము

సవితృనామకసూర్యాంతర్గతుడగు శ్రీలక్ష్మీనారాయణమూర్తి చేతిది సుదర్శనచక్రము. ఈచక్రముతో శ్రీమహావిష్ణువు శత్రుసంహార మొనర్చువాడని మనకు సునిదితమైనసంగతి. ఈచక్రమునుగూర్చి ఈజిప్టుదేశపుగాథ యొకటి కలదు. అందీక్రిందిప్రకారము చెప్పబడియున్నది. పూర్వము సూర్యుడు న్యూబియా దేశమున ససైన్యుడై సంగ్రామమొనర్చు సమయమున నాతనిశత్రువు లాతనిపై కుట్రలు పన్నసాగిరి. ఆసందర్భమున సూర్యుడిది తెలిసి వారిని నిర్జించుటకై 'హోర్భహుట్టి' అను చిట్టిడేగను వారిపైకి పంపెను. ఆచిట్టిడేగ ఘోరమగు చక్రాకృతినిదాల్చి రెక్కలతో రివ్వురివ్వున వేగి, దుర్వాసుని విష్ణుచక్రము వెంబడించి తరిమినట్లు సూర్యుని శాత్రవులను తరుమసాగెను. ఈచక్రము యొక్క మహాతేజస్సుచే సూర్యునిశత్రులకన్నులు దర్పహీనములై పోయెను. వారు చూడజాలరైరి. వారికి వినెడుశక్తిగూడ అంతరించి పోయెను. ప్రతివాడును మఱొకనిని జంప నారంభించెను. తుద కొక్కశత్రువైనను మిగుల కాయెను. మఱొకప్పుడు సూర్యుడు పడవపై పోవుచుండగా జలములనుండి మొసళ్లును, నీటిసర్పములును వక్త్రములను తెరచికొని సూర్యుని, సూర్యుని సేవకులను మ్రింగుటకై వచ్చెను. గజేంద్రుని వేధించినమొసలిపై విష్ణుచక్రము విజృంభించి తునుమాడినట్లు 'హార్పెహుట్టి' యును సూర్యునిమీదికి వచ్చిన మొసళ్లను, నీటిసర్పములను చెండాడివైచెను. ఈచక్రమెల్లప్పుడును సూర్యునితోనే యుండి సూర్యునకుగాని, లోకమునకుగాని చెరుపు రాకుండ కాపాడుచుండును. ఈకారణముచేతనే ప్రాచీనకాలపు ఈజిప్టుదేశపు దేవాలయములందు సూర్యుని 'రెక్కలచక్రము' యొక్క చిత్తరువును ప్రవేశమున కనువగుద్వారములకడ చిత్రించియుంచెడివారు. దేవాలయములందలి యంతర్గృహములందుగూడ నీచక్రపుబొమ్మలు చిత్రితములై యుండెడివి.[20]

సూర్యునకును, చక్రమునకును నిట్టిసంబంధ ముండుట ఈజిప్టులోనేగాక భారతదేశమునగూడ చూడనగును. సూర్యపురాణమునందు చక్ర మెట్లుపుట్టినదో తెలుపునట్టిగాథ యొకటి కలదు. దాని నీక్రింద పొందుపరుచుచున్నాను.

"సూర్యుడు......(మామగారైన) మయుని యింటికి బోగా మామగా రల్లునిరాకకు సంతసించి గౌరవముతో నాదరించి విచ్చేసినకారణ మడుగగా దివాకరు డిట్లుచెప్పెను, "మామా! మీ కొమార్తె యెచ్చటనున్నది? ఆమెనుగానక యిటు వచ్చితిని." మయు డిట్లు బదులుచెప్పెను. "అల్లుడా! ఆమె నీ తేజస్సు భరింపజాలక యిట విచ్చేసి కొంతకాల ముండెను. పతులను విడనాడి సతులు పుట్టినింట జిరకాల ముండుట పాడిగాదని నేను చెప్పగా కోపముతో వెడలిపోయెను. నిన్ను జేరబోయెనని తలంచితిని. నీవద్దకు రాలేదా?" అని యడుగ లేదనిచెప్పి తనకాంతిని తగ్గింపు

19. A: Erman: Aegypten and aegyptisches Teben in Altertum, pp. 359-362. (Also G. Maspero; R. V. Langone; A. Weidemann; E. A. Wallis Budge; W. Max Muller and other writers).

20. A. Weidmann Religion of the Ancient Egyptians pp. 58 to 78.

వని సూర్యుకు మామను ప్రార్థించెను. అంతట మయుకు అతనితేజమున బదునైదుభాగములు తీసి ఒక్కపాలుమాత్రము మిగులునట్లొనర్చెను. అటుల తీయబడిన భాగములలో నొకటి భూమియందును, మరియొకటి యాకసమున, నింకొకటి ఈశ్వరుని త్రిశూలమున, రెండుభాగములు విష్ణుని సుదర్శనచక్రమున, మరి యొక్కొక్కభాగమును ఇంద్రునివజ్రాయుధమున, కుబేరునిపుష్పక విమానమున చంద్రునియందును గ్రహనక్షత్రములు మొదలగువానియందును ఉండునటుల పంచి పెట్టెను."21

ఈ ప్రకారముగనే చక్రముయొక్క చిహ్నములు బాబిలోన్‌లోను, గ్రీసులోనుగూడ సూర్యసంబంధము గలవై కానవచ్చుచున్నవి. కాని యీ కడపటివానిని సూర్యుని చక్రములే యని నిర్ధారణచేయుటకు తగిన యాధారములు కానవచ్చుట లేదు.

## సూర్యుడు-పుత్రప్రాప్తి

ఇండోనీసియాలో నివాసమొనర్చు కొన్ని జాతుల వారు సూర్యుని పుత్రదాతనుగా భావించి పూజించు చున్నారు. వీరు సూర్యునికి 'ఉపులెరో' అను పేరు పెట్టిరి. గొడ్రాలికైనను పిల్లలు పుట్టించుట సూర్య దేవుని పటుత్వమై యున్నది. ఇండోనీసియాలో చేరిన బాబరు ఆర్చిపెలగోలో పుత్రప్రాప్తి కీక్రిందివిధానము నవలంబింతురు. చాలమంది పిల్లలుగల యొకముసలి వానిని పిలుచుకొనివచ్చి వానిచే సూర్యపూజ చేయింతురు. ఎట్టిప్రత్తితో నొకచిన్న శిశువుబొమ్మను చేతురు. పిల్లలుకావలసిన గొడ్రాలుబొమ్మను స్తనములదగ్గర నుంచుకొని పాలిచ్చుచున్నట్లు పట్టుకొనును. అప్పుడు పూజచేయించు 'బహుకుటుంబీకుడు' కోడి నొక దానిని తెచ్చి దానికాళ్లను గొడ్రాలినెత్తిమీదనుంచుచు నిట్లుప్రార్థించును: "ఓ, ఉపులెరో ఈకోడిని నీవుప యోగించుకొమ్ము, ఒకపిల్లవానిని పడవేయుము. పిల్లని కలిగింపుము; నాప్రార్థన నాలింపుము, ఒక్కపిల్లవానిని నాకొసఁగుము, నాకోరికను బడిదేయుము" ఇట్లు ప్రార్థనచేసి అపిదప గొడ్రాలిని పిలుచును. "ఏమి పిల్లవాడువచ్చినాడా?' అన్న గొడ్రాలు "ఓ, అప్పుడే పాలుత్రాగుచున్నాడు" అని ప్రత్యుత్తర మొసంగును. అటుతరువాత ఆగొడ్రాలి రొమ్ముపై నంత దనుక పట్టుకొని యుండినకోడిని తీసి ఆగొడ్రాలిపెని మిటితలమీద నదేకోడికాళ్లు నానించును. పెనిమిటియు నేదోపలుకులు పలికినతరువాత ఆకోడిని చంపివేయుదురు. ఈబలియైన పిడప, పైగొడ్రాలికి పిల్లవాడుకలిగెన ట్లూరిలో చాటింతురు. ఊరివా రరుగుడెంచి తమసంతసమును వెల్లడింతురు. ఆపిమ్మట గొడ్రాలిపెనిమిటి యొకచిన్నపిల్లలతొట్టెను అరువుగ తీసికొనివచ్చును. ఆతొట్టెలో పైమాదిబొమ్మను పెట్టి సప్తాహోరాత్రము లాగొడ్రాలూపుచుండును 22 ఇది ఇండోనీసియాలో జరుగుచున్న పద్ధతి.

మనతెలుగువారిలో నిట్టిదే యొక పద్ధతి వివాహములందు గానవచ్చుచున్నది. పంచరాత్రవివాహములందో నైదవనాటిరాత్రియు, నేకరాత్రవివాహమందో వివాహానంతరమున నొకరాత్రియు నిట్టిదే యొకయాటజరుగును. ఒకమంచముపై జంపకానాలు, పరుపులు వస్త్రాలు వేయబడును. దానిపై నొకప్రక్క పెండ్లికుమారుడును నాతనికెదురుగ పెండ్లికొమార్తెయు కూరుచుందురు. మధ్య నొకచిన్నబొమ్మ సాధారణముగ కొయ్యతో చేయబడినది ఉంచబడును. పైనుండి యొక క్రొత్తపట్టుపేలికమ జోలెవలె వ్రేలాడదీయుదురు. ఈ జోలెయే తొట్టెగా, బొమ్మయే పిల్లవాడుగా కొంతవడి యూపుదురు. పిమ్మట ఎవరివృత్తి ననుసరించి వారు తాము తమపనికై పోవుచున్నామనియు పిల్లవాని జాగ్రత్తయనియు చెప్పుదురు; అనగా పెండ్లికొడుకు కుటుంబ ముద్యోగముచేయుకుటుంబమందో, పెండ్లికుమారు డీక్రిందిప్రకారముగా నను; "నేనుకచ్చేరికి వెళ్లి వస్తాను; పిల్లాణ్ణిచూస్తూవుండు." అని. పెండ్లికుమారుడాబొమ్మను బహుజాగ్రత్తగ పెండ్లికుమార్తె కిచ్చును.

21. వేమూరి జగన్నాథశర్మగారి సూర్య పురాణము. పుట. ౬౩.

22. J. G. F. Riedel: Papnan Races p. 35.

అటుపిమ్మట పెండ్లికుమార్తె "నే నింట్లోపనిచేసుకో వాలి, కాస్త పిల్లాణ్ణి చూస్తూవుండండి." అనిభర్తకు బొమ్మనందిచ్చును. ఇట్లే కొన్నిసార్లు జరిగినతరువాత నీసంబరము ముగియును.

మన వైవాహికాచారములలో నొక్కటియగు పైసంగతికిని, సూర్యునకును సంబంధ మంతగ గనిపించ కున్నను, ఇండోనేసియావారి 'పుత్రకామేష్టి'కిని మన పద్ధతికిని గల సాదృశ్యమును పాఠకులు గ్రహించగలుగు దురు. గర్భధారణమునకును, పుత్రోదయకాలమునకును సూర్యుఁ డధిపతియను నమ్మకము భారతదేశమునందలి కొలారియన్ ద్రవిడాదిజనులలో నిప్పటికిని ప్రబలియు న్నది.

## సూర్యుని పుత్త్రులు

మన పురాణములప్రకారము సూర్యుని కుమారు లలో శనియు, యముడును మిగులముఖ్యులు. వీరిలో నొకడు సదాక్రూరుడు, సదావక్రి, దురాత్ముడు. ఈ శనియంశమున బుట్టినవాడు శకుని దుర్యోధనునకు దుర్బుద్ధులు చెప్పినవారిలో నొకడు. యముడన్ననో పాపులను నానాబాధలుపెట్టు నరకలోకమునకు రాజు. కాలదండము మృత్యువు పాశము నను భీకరములగు నాయుధములుగలవాడు. దయయనిగాని, కనికరమని గాని తలంచక కింకరులను బంపియు, తాను స్వయముగ నేగియు ఆయువుదీరిన మానవాదులను నిజపురికి గొంపో వుట యమునియుద్యోగము. సూర్యునిపుత్రులలో నిరువు రిట్లు క్రూరులని మనపురాణాదులందు చెప్పబడినది.

గ్రీసుదేశపు ప్రాచీనగాథలలోకూడ సూర్యుని వలన బ్రభవించిన 'ఈటిస్,' 'సర్సి,' 'పాసిఫే' యనువారును, మీడియాయనుపేర బరగిన సూర్యుని మనుమరాలును క్రూరాత్ములు. వీరినిగూర్చి ప్రాచీనగాథ లలో నీక్రిందిప్రకారము చెప్పబడినది.

'ఈటిస్' అనువాడును, వాని తమ్ముడగు 'పెర్సిస్' అనువాడును మిగులక్రూరులని 'డియోడో రస్ సిక్యులస్' అనునాతడు వ్రాసెను. ఈటిస్ కాల్చిస్ అను తావునకురాజు. విదేశీయు లెవ్వరైనను దేశమును చొచ్చి బంగారు ఉన్నిని ఎత్తుకొనిపోయి నచో తనకు చావుమూడునని సోదెచెప్పువారివలన విని విదేశీయులనందరను చంపుట కాతడు దొరకొనెను. 'సర్సి' అనునది సూర్యునికూతురు. మందుమాకులు, మంత్రతంత్రములు మొదలగు దుర్విద్యల కీమెది పెట్టినది పేరు. సమరిటనులరాజును వివాహమై యీదుష్టవనిత విషమిచ్చి యాతనిదెగటార్చెను. ఈమె దుష్టత్వమును గూర్చి యనేకములగుకథలు గలవు. ఈమెచేసిన క్రూర కార్యములు లెక్కింపరానివి. 'పాసిఫే' అనునది సూర్యునికూతుండ్రలో మఱొక్కతె. ఈమెమగనికేదో రోగమువచ్చునట్లుచేసెను. ఎద్దుతో సంగమించెను. దీని కూతురు 'ఫీడ్రా' అనుయువతి తినసవతికుమారుని చిత్రాంగివలె ప్రేమించి వానిని చంపెంచెను. 'మీడియా' యనునది 'ఈటిస్' కూతురు. ఈమె మహాఘోరము లును, క్రౌర్యపూర్ణములును నగు ననేకదుష్కార్యము లాచరించెను.[23]

భారతదేశమునందును, గ్రీస్‌దేశమునను గూడ సూ ర్యునిసంతతి కిట్టిక్రూరత్వము గలుగుటకు కారణ మగ పడదు. కాని, వీరిక్రూరత్వము మాత్రము రెండుదేశము లందును చెప్పకొనబడుచుండును.

## సింగి-సింగడు

ఈజిప్టుదేశమున కొన్నిప్రదేశములందు సూర్యు డు డేగరూపమునను, గరుడునిరూపమునను పూజించ బడుచుండెను. మరికొన్నిప్రదేశములందు సూర్యుడు సింహమురూపమున పూజితుడగుచున్నాడు.[24] సూర్యు డిట్లుసింహరూపమున వ్యవహరింపడుట యింకెచ్చటను

---

23. ఈ కథలు Homer, Diadorus Siculus Apollodorus, Ovid Heti మొదలగాగల గ్రీకులు వ్రాసిన గ్రంథములందు గాననగును.

24 A. Wiedemann: Religion of the Ancient Egyptians, pp. 27 & also E. A. Wallis Budge; The Gods of the Egyptians, I-467.

చూపెదము. కాని భారతదేశమున కొన్ని విచిత్రసాదృశ్యములు గానవచ్చుచున్నవి. ముండాజాతివారును, నింకననేకులగు భారతీయాదిమవాసులును సూర్యుని 'సింగ్ బోంగా' అను నామమున బిలుచుచున్నారు. ముండాజాతివారితోచేరిన బీర్హారువారి భాషలో సూర్యునిపేరు 'సింగి' అనియున్నది. ఒరయను అనునొక తెగవారు ప్రతిసంవత్సరము జరుపుసూర్యుని వివాహోత్సవసందర్భమున వారి గురువు 'సింగని' వేషమును దాల్చును. గురుపత్ని సింగని (సూర్యుని) భార్యవేషమును దాల్చును. ఇట్లు వీరు నాట్యముచేయుదురు. 25

ద్రావిడాంధ్రాది దాక్షిణాత్యభాషలలో 'సింగ' శబ్దమునకు సింహము అనునర్థము గలదు. ద్రవిడభాషకును భారతీయాదిమవాసుల భాషలలో కొన్నిటికిని గల సంబంధబాంధవ్యములను బట్టి యీశబ్దముయొక్క అర్థమును నిర్వచించుట సులభసాధ్యము. కావున బీర్హార్ వారిభాషలోని 'సింగి' కిని, ముండాజాతివారి 'సింగ్ బోంగా' అనుపదమునకును, ఒరయన్ల 'సింగని' వేషమునకును సూర్యుడనునర్థమేకాక సింహము అనునర్థము కూడ ఉన్నదనుట భాషాసాదృశ్యశాస్త్రకోవిదులకు సులభముగ బోధపడు నంశము. ఈదృష్టితో మనము చూచినచో ఈజిప్టులో సూర్యుడు సింహరూపమున పూజింపబడుచుండుటకు కారణము తేటతెల్లమగుచున్నది. భారతదేశమునగూడ సూర్యుడిదివరలో సింహరూపమున బూజింపబడుచుండి యుండవలెను. ఈవిషయమై యింకను పరిశోధన జరిగినచో నేయంశములు బయలుపడునో చెప్పజాలము. కాని పాఠక మహాశయులకీపైనచూపిన సాదృశ్యము చిత్రమై, బలవత్తరమై పరిశోధన కుతూహల సంజనకమై యొప్పునని నాయాశయము.

ముగింపు

ఈవ్యాసమునందలిసాదృశ్యములను జాగ్రత్తగ పరిశీలించుచో కొన్ని క్రొత్తయంశములు మనకు తెలియగలవు. మానవశాస్త్రజ్ఞులలో 'రోమాంటిక్', 'ప్రొజేయిక్' స్కూళ్లను రెండుపృక్షములు గలవని యీవ్యాసమున దెలిపియున్నాను. మనము 'రోమాంటిక్' స్కూల్ వారి మతముచో పైసాదృశ్యములనుబట్టి యీక్రిందివిధముగ మానవుల యాదిమచరిత్రమును వ్రాయవచ్చును.—మొట్టమొదట యెచ్చటనో 26 సకలమానవులకాదిమపురుషులగువారు జనించిరి. అచ్చటనుండి ఈజిప్టునకు భారతదేశమునకు, ఇండొనేసియా మొదలగుదేశములకును వారిసంతతివారు ప్రయాణమై వెడలిరి. ఈకారణముచేతనే ఈజిప్టు ప్రాచీనవాసులకును, భారతీయాదిమవాసులకును, ఇండొనీసియనులకును సూర్యారాధనవిషయమున కొన్ని ముఖ్యములగు సాదృశ్యములు గానవచ్చుచున్నవి. ఆ పిమ్మట కొంతకాలమునకు పైప్రదేశమునుండియే కెల్టులు, గ్రీకులు, బాబిలోనియన్లు, పారశీకులు, వేదకాలపుటార్యులు బయలుదేరి ఆయాదేశముల నాక్రమించుకొనిరి. వీరిలో సూర్యారాధన సాదృశ్యములు కొన్ని గోచరించుటచే నీవ్యాసమున నవి పొందుపరచబడినవి. కావున నొకయాదినివాస మున్నదనియు, అచ్చటనుండి జనులు శాఖోపశాఖలుగ చీలిప్రపంచాక్రమణ మొనర్చిరనియు పాఠకు లూహచేయవచ్చును. ఈయూహ ఎంతవఱకు గట్టిదో ఎంతవఱ కొటిదో యింకను పరిశోధన కౌశలముచే మనము కనుగొనవలసియున్నది.

---

25. Memoirs of the Asiatic Society of Bengal. Vol I, No. 9, pp. 125.

26. ఉత్తరాసియాయందలి తూర్పుభాగప్రాంతములే యీప్రదేశములుకావచ్చునని నేనిదివరలో 'విశ్వాచారాధన మెచ్చటనుండివచ్చెను.' అను వ్యాసమున వ్రాసియుంటిని.

వెంజి

## ౨. మేధావిభట్టు

పెదతిమ్మమహీపాలుఁడు కార్యాంతరమున గ్రామాంతర మరుగుచుఁ ద్రోవలోఁ దారసిల్లిన మేధావిభట్టును ఆతనివాక్యమ్మునఁ గ్రిందఁబడిన తాళవృక్షమును దానియాకుం జీల్చి యేదియో వ్రాయు నతనిం జూచి,—

స్వామీ, దూరమునుండి చూచితిని శాపగ్రస్తమైనట్టు లీ
భూమిన్ గూలెను తాళవృక్ష మహహా వ్యోమోదితానంతస
త్త్వామేయోర్మి సమేతగాంగజలవేగానంతసంరంభమా
సీమాధుర్యకవిత్వవాహినికిఁ దానే యిచ్చెఁ బత్రంబునున్.

ఓజమెయిన్ త్వదీయమహిమోన్నతిఁ గాంచి జడంబె మైన నీ
భూజము సేవఁ జేయఁ దలపోసి యిటు ల్పదమందు వ్రాలె; నీ
రాజులు రారొ ? నీకనికరం బొకయింత దొరంగినంతనే
రాజులు నెల్లరున్ భువి తరాజులు గారొకొ సత్కవీశ్వరా !

ఫలముఁ గోరకయే నన్ను భవదనుగ్రహంబునకుఁ బాత్రునిగఁ జేయునట్టి నీదు
కరుణ గమనింపఁగవులు నిష్కారణముగ నొరులఁ బ్రేమింతురని తోఁచుచున్నదయ్యా.

---



రాజప్రతినిధి రాహదారీవంతెనక్రింది తెలుపినేలను నిలబడి ఆనకట్ట దిగువమట్టము చూచుచున్నాడు



ఎడమగట్టునందలి మూడు పెద్దకలింగలు (Head Regulators—పెద్ద ‘ రెగ్యులేటరు ’ తూములు): ‘రోరీ’ కాలువ, ఖాన్‌పురువైరు కానవచ్చును



ఆనకట్ట, రెగ్యులేటరులు కూడిన కోసు : కుడిగట్టు చివరిరాతికట్టయు, 'దాడు' కాలువ తలయు కానవచ్చును



కుడిగట్టు 'రెగ్యులేటరు' తూములు : ఇక్కడ 'రైసు' కాలువ, 'దాడు' కాలువ కానవచ్చును

(G. S. A.)

# సన్యాసనము

పాటిబండ మాధవశర్మగారు (కవితావిహారము)

ఆశ్రమధర్మనిర్వహణార్థము కాళీపాదు డుద్వహించుకొన్నది మాయ. వేదవేదాంగములందు కూలంకషప్రజ్ఞ గలవాడు కాళీపాదుడు. మాయదృక్కులలోని లౌల్యమును కాళీపాదుడు గుర్తించియుండలేదు. లేకున్న నెట్లుండెడిదో!

* * * * *

సరళ కాళీపాదుని ధర్మపత్ని. ఒక మగశిశువును ప్రసవించి సరళ మరణించినది. పత్నీమరణమున కాళీపాదునకు వైరాగ్యోదయమైనది. శిశువును జాతవేదున కొప్పగించి యాతడు తపతీతీరమునకు తపోఽర్థ మరిగినాడు. జాతవేదుడు కాళీపాదుని ప్రియశిష్యుడు.

* * * * *

తపతీశీతలశీకరములచే నాతని యాశ్రమముద్యానశోభను వహించెను. శుకపికమయూరగానములతో నాతని కిప్పుడు తపస్సు నిర్విఘ్నముగ సాగుచుండుట లేదు. కాళీపాదుడాశ్రమమునకు వచ్చి యొకవర్షము పోయినది. ఈపదునైదేండ్లు నాతడు సిద్ధపురుషులను దర్శించుకొనుటలో పుచ్చుకొనెను. సిద్ధింపనున్న యోగనిష్ఠయు చెదరిపోసాగినది. క్రమముగా నతనికి భక్తియోగము లాభము లేదని తోచినది. కర్మయోగము నవలంబింతునా యనుకొనియెను. కాని ధర్మపత్ని లేదు.

౨

అరుణోదయమునకు పూర్వమే కాళీపాదుడు లేవలేకపోయెను. సూర్యోదయ మగుసరికి అళీకుడు మాయను వెంటబెట్టుకొని వచ్చినాడు. అళీకుడు గురుదేవుని ప్రేవులు లెక్కపెట్టినాడు వీక్షణమాత్రమున. మాయను గురుదక్షిణ స్వీకరించి కృతార్థుని జేయుడని ప్రార్థేయపడినాడు. గురుదేవుడు గంభీరముగా మెత్తబడినాడు.

ప్రక్కన మావిచివుళ్లు తింటున్న పికి పని చేసుకుని కువకువమన్నది. మాయ మందహాసము చేసినది. గురుదేవుడు పాతాళములో నుంచివలె మాయకై యాతురముగా జూచినాడు. మాయ బొమముడితో తల వంచుకున్నది. అళీకుడు మాయచేయి కాళీపాదునిచేతులో బెట్టి గురుదేవుని పాదములపై బడినాడు. కాళీపాదునిజన్మకృతార్థమైనది. మాయజన్మ వ్యర్థము. అళీకునిజన్మ సార్థకమైనది. కాళీపాదుడు బిగుసుకుపోయినాడు. మాయ కంపించినది. అళీకుడు దంపతుల జూచి జలదరించినాడు. చెంత స్వాదుకుశాంకురములు నములుచున్న యాశ్రమ హరిణార్భకమ్ము వచ్చి మాయ పచ్చనిచీరచెఱగు పట్టి లాగినది. మాయ విసుగుకున్నది.

అళీకుడు గురుదేవునివద్ద సెలవు తీసికొన్నాడు. మాయ రహస్యముగా "అన్నా, నేను గూడ వత్తు" నన్నది. అళీకుడు కోపపడినాడు. మాయ యేడ్చినది. కాళీపాదుడు సమాధానము చెప్పుకున్నాడు.

కాళీపాదుడు కందమూలములు తెచ్చి మాయకు తినడం నేర్పినాడు. మాయ కొరికి పారవేసినది. చిక్కనితేనె త్రావించినాడు. పుక్కిలించి యుమిసి తపతిలోని చల్లని నీరు త్రావినది.

కాళీపాదుడు మరల బడి పెట్టినాడు. అళీకుడు శిష్యులను జేర్చుచున్నాడు. మాయకు వనవాసము కఠోరముగా నున్నది. కాళీపాదుడు కర్మయోగమును సాగించుచున్నాడు.

## 3

నిగమునకు పదునారేండ్లు. వ్యాకరణము మట్టునకు చదువుకున్నాడు. జాతవేదుడే జాతకర్మ నామకరణ చౌలోపనయనాలు చేసి యకాలమరణమును పొందినాడు. నిగమునకిప్పుడు గురువు లేడు. గురువు లేని విద్యకు గౌరవము లేదు. గురువు నన్వేషించు కుంటూ నిగముడు బయలుదేరినాడు. పెరుగూ అన్నమూ తినలేదు. గుమ్మపాలు త్రాగి దారిని బడినాడు.

## ౪

మాయ యాశ్రమమునకు వచ్చి సంవత్సర మైనది. అళీకు డొకటి రెండుసార్లు వచ్చి పోయినాడు. మాయ యేదో చెప్పబోగా విని పించుకోకుండా చక్కాబోయెడివాడు. మాయ ప్రతిదినోపవాసములలో కొన్ని కాళీపాదునికర్మయోగమున కుపయోగించుచున్నవి. దైనందినము మాయ కృశించిపోవుచున్నది. దినము దినమునకు మూడునాళ్లుస్నానములు. మాయ నీలాలకురులు కొసలు చిటిలి యెఱ్ఱబడినవి. మృదుకపోలముల గులాబీలోని యెఱుపు కన్నుదామరలలోనికిన్ని, తెలుపు అధరబింబము లోనికిని ప్రాకిపోయినవి.

## ౫

దినమంతయూ ప్రయాణించి నిగముడు చంద్రోదయసమయమునకు కాళీపాదుని యాశ్రమము చేరినాడు. నిగముని బడిలో చేర్చుట కళీకుడు దారిలో దగిలి వెంట వచ్చినాడు. ఆశ్రమమును జూచి నిగము డాశ్చర్యపోయినాడు. అది శరదృతువేమో, వెన్నెలలో నాయుద్యానవనము వెలిగిపోతోంది. మాయ పుష్కరిణిలో స్నానమాడి నీరు తెచ్చుటకు వచ్చినది. కటిదఘ్నజలములో మాయ కూర్చున్నది. చంద్రబింబప్రతిబింబమేమో ననుకున్నాడు నిగముడు.

మాయ ఋతువులు వరుసగా లెక్కపెట్టుకుంటున్నది. శరత్తువెంట హేమంతము రావలయును గదా, యీయకాలవసంతాగమనమునకు కారణ మేమా అనుకున్నది. నిగముడళీకునివెంట వెడుతున్నాడు. మాయ వెలికివచ్చి వెన్నెలలో కలిసిపోయింది. ఎవరో అప్సరఃకాంత గాబోలు ననుకున్నాడు నిగముడు.

౬

అలీకుడు నిగముని కాళీపాదునిముందు నకు నెట్టినాడు. గురుని కటము లదరినవి. ఊపిరి యాడలేదు. నరసినగడ్డములోనుండి యెఱ్ఱని వాడిపోయిన పెదవు ల్లలనాడినవి. నిగముడు సాష్టాంగపడి లేచినాడు. వెనుక రాజహంస కంఠరము వినిపించినది. ససంభ్రమముగా నొక సింహావలోకనము చేసినాడు నిగముడు. మాయ గోచరించినది. తూష్ణీంభావముతో నవనతమ స్తకు డైనాడు. గురుదేవుని కనుబొమలు కలు సుకొన్నవి. చిరుచెమటచే లలాటకుంకుమరేఖ కన్నులలోనికి కరగిపోయినది గాబోలు, నిగము డేమియు జూడనే లేదు.

అలీకుడు సమాచారము చెప్పకొని వచ్చి నాడు. గురుస్వామి యప్పటి కిప్పు డూపిరి త్రిప్పకొని గడ్డము నిమురుకొనుచూ శిరము వంచినాడు. మాయ వచ్చి కాళీపాదుని చెవిలో నేదియో గుసగుసలాడినది. అదే వారిరహ స్యసంభాషణకు తొలి. తుదియని మరి లేదు. గురునికన్నులలోని మెఱుపు తేరుకొన్నది. ఉదాత్తస్వరముతో "వత్సా" యనినాడు. నిగముడు గురుపాదములకన్నుల కద్దికొనినాడు. "ముందా నూనూగుమీసములం డీసివేయుము. అవి లౌకికాలంకారములు" అనినాడు గురువు. మాయ వెనుక నెటికివిరిచిన దెవ్వరికి వినిపించ లేదు. తుఱ్ఱున లోనికి బోయినది.

౭

మాయ కాళీపాదునిభార్య యని నిగము నకు తెలిసినది. ఒకనాడు మాయ ముక్త కంచుక యై నిగమునికంట బడినది. అతడు తల వంచుకొని తిరోహితు డైనాడు. మాయ కిలకిల నవ్విన దాతనికి క్రోధగర్జనమువలె వినిపించినది. తానొక ఘోరపాపము నాచరించితినని యాతడు తలంచెను. అతని మనసు మనసులో లేదు; అతని గుండెగుండెలో లేదు.

మరునాడు నిగమునకు పాఠము రాలేదు. గురువు రెండుదినము లుపవాసము విధించెను. భోజనములకడ మాయ యొకశిష్యు నడిగినది, నిగముడు రాలే దేమని. శిష్యుడు విషయము వక్కాణించెను. మాయ కర్థమైపోయినది. వెడనవ్వుకొన్నది.

రెండుదినములు చదివినను నిగమునకు పాఠము రాలేదు. గురువునకు కోపమువచ్చిన మాట నిజము. "జేపు వప్పగింపనిచో"నని యాతడు చురచురలాడెను.

౮

నిగముడు విశ్రాంతికై పుష్కరిణీతీరము నకుపోయెను. గురుపత్నియొడ తానొనర్చిన మహాపరాధ మాతనిని వేధించుచుండెను. పాఠ మును జదువ నారంభించెను. "త్వం యజ్ఞ స్త్వం వష ట్కార" ఆపై నాతని కంఠరము లగపడ లేదు. గురుపత్ని కిలకిలారవ మాతని బెదురు గుండెలో అశనివలె దాకినది. ఎవరో యాతని కన్నులను చేతులతో మూసివైచిరి. ఆయంధ కార మాతని కన్నులగుండా హృదయము లోనికి క్రమ్ముకొనిపోయెను.

అధ్యయనము నెగవేసి యల్లికాయల దినుచున్న మహిము డది కనిపెట్టి గురువు నొద్దకు పరువెత్తుకొనిపోయెను. కాళీపాదుడు గూడ స్వయముగా నాదృశ్యమును దర్శించెను. అతనిహృదయములోనియగ్ని కన్నుల గుండా గ్రక్కుచుండెను.

*　　*　　*　　*

నిగము డంధుడైపోయెను. గురుదేవుని యాగమనము గ్రహించి సాష్టాంగపడియెను. కాని యాతనిమస్తకము మాయపాదముల మీాదికి దొర్లిపోయెను. మాయ తొలంగి నిల్చి సక్రోధముగా, సగర్వముగా కాళీపాదు నుపలక్షించెను. ఆతీక్ష్ణత కాగలేని కాళీపాదుడు క్రుంగిపోయెను. ఆతని పరిభూతక్రోధము సహస్రగుణీకృతవేగమున నిగమునిపై బడెను. "ఓరీ! గురుద్రోహీ! పశువా! తొలగిపొమ్ము! నీ కీయాశ్రమమున తావు లేదు."

నిగముడు దృష్టిహీనములగు తననేత్రములతో సవినయముగ గురువునకు ప్రణమిల్లి వెడలిపోయెను. తేజోహీనములగు మాయ నేత్రములనుండి కేవలము రెండే రెం డశ్రుకణములు రాలి పైటపై జిటికి క్రింద బడినవి. మాయ కాలికడ బచ్చగడ్డి కగ్గి యంటుకున్నది.

౯

అంధప్రాయుడగు నిగముడు దారి గానక తపతీతరంగిణిలో తల్లక్రిందుగా గూలిపోయెను. మాయాపరిష్వంగసంతప్తమగు నాతని దేహమునకు శాశ్వతశైతల్యము గల్గినది.

*　　*　　*　　*

కాళీపాదుడు సశిష్యుడై తపతీతీర మంతయు గలయ వెదకెను గాని మాయ కానరాలేదు. సంధ్యావందనాదికృత్యములు సైతము వదలుకొని యాతడు మాయను వెదకుచుండెను.

తపతి యందందు కుల్య లేర్పరచుకున్నది.

మధ్యాహ్నమైనది. కాళీపాదుడు ప్రాయశ్చిత్తపూర్వకముగా సంధ్యావందనమైన జేసికొనుటకై తపతిలో దిగినాడు. ఆతనిమనస్సు మంత్రములమీాద లేదు. తారుమారు జేసి యెట్లయిన నేమి చదువుచున్నాడు. కర్మసాక్షికి తర్పణము లిచ్చుటకై యంజలి బట్టినాడు. శరీరమున కేదియో తగిలినది. ఉలికిపడినాడు. నిగముని గతప్రాణగాత్రమును పరిరంభించియున్నది విగతజీవ—మాయ......

౧౦

నురుగులు గ్రక్కుకొనుచూ పరుగెత్తుకొని వచ్చి యరచినాడు మహిముడు, "ఆశ్రమము తగులబడిపోవుచున్న" దని.

తపతీతరంగములపైనుండి మార్తాండమండలము కాళీపాదునినిటాలమున ప్రతిఫలించినది. ఆప్రళయరుద్రమూర్తిం గాంచి కెవ్వన యరచి మహిముడు కాలికొలదిగా పరచినాడు.

కాళీపాదుడు మరల సన్యసించినాడు.

# రవీంద్రునికి—

కొంపెల్ల జనార్దనరావుగారు

నీ వేదప్రభ లాకృతించు కను లున్నిద్రార్థ సంధాన దీ
ప్తా వైదగ్ధ్యము క్రోవి పట్ట, నొకచో చైతన్యముల్ విచ్చి, వి
శ్వావేశమ్ము గుణించుకొఁ దివ్యరుచిత్రాంకమ్ము నాకంప్ల నీ
భావాలోకము, నీకు నాకు ముడిగా, పండించుకొఁ జొచ్చెడిన్.

ఒకలయకట్టు విశ్వమున కూపిరిపట్టు, అది వెన్న తీయనే
సకలకళాతపస్సు లవి జన్మములై చను తత్త్వబోధయూఁ
కకు మది కందళించుక వికాసమువిచ్చు తలంపుతీపు ల
ల్లికవడు నీదుసృష్టి కదలించెడు, రాతను గుండె లేఫుచున్.

నీ చెయి సోఁగు ఒక్కొక విన్నిద్రము రేకకు, కల్పసూత్రముల్
పూచియు ఒక్కపొందిక తప్పల్పఁగలేక తపించుతత్త్వపున్
వీచులు పాయవిచ్చి, తమ వేఁదఱుపొంగుల కాత్మవాటికన్
వీచిన ఆమనుల్ పడి, దవిష్ఠము దారులు కట్టిపోయెడిన్.

ఎన్నియు పూలు విచ్చి తల కిడ్డ కదుల్వడఁబోదు నీదు భా
వోన్నతక్లప్తి: నాకు మది ఊర్చెడి వేఁడితలంపుసోఁగలన్
క్రొన్నిడుచల్వ రేక కొసకోనకు నిల్పక వచ్చు, తానవో
లెన్; నెఱమబ్బువింటను వెలింగెడి చిక్క నిప్రొద్దుచూడ్కి యై.

నీలయకట్టు నాయెడఁద నిండిన, నీ పయనించుత్రోవలఁ
నే లివ పట్టి నీయడుగునీడల నానడ లేలికొందు నన్
లాలస తాఁకి, సక్తి విడు నాతొలుపూనిక యానతుల్ స్మృతిన్
వ్రాలిన, ఐక్యముల్ విరియఁబడ్డవి నా జనురర్థమై చనన్.

---

# దురదృష్టవతులైన స్త్రీలు

దరిశి చెంచయ్యగారు

## ౧

పూర్వాచారముల ననుసరించి యీనాటివరకును గ మందుగూడ స్త్రీలను, భర్తలు గతించగనే వైధవ్యముతో సౌందర్యమును రూపుమాపి బుద్ధిహీనలవలె నొక మూలగూర్చుండబెట్టి హీనగతులపాలుచేయుచున్నారు. ఈ పై దుస్థితు లన్నింటిని తప్పించుకొన్న నాస్నేహితురా లొకరు తనజీవితమును ముఖ్యముగా విద్యావిహీన లైన వితంతువులకు విద్యాగరపుటయందు వినియోగించ నిశ్చయించుకొనెను. ఆమె నన్నొకదినమున నొక ప్రశ్న నడిగెను. వివాహమాడుట స్త్రీలకు ముఖ్యావశ్యకము గాదనియు, స్త్రీలకు వితంతువులైనను, కాకపోయినను, సంఘసేవ చేయుట నేర్పవలయుననియు నామెతాత్పర్యము. నే నామెయుద్దేశ్యమున కెంతయు సంతసమందితిని. తదుపరి నే నామెతో "వివాహమాడవలయునని యున్న వితంతువులకు మనఃపూర్తిగా సహాయము చేయ వలసియుండు" నని చెప్పితిని. పూర్వాచారముల ననుసరించి వితంతువివాహము విరుద్ధమని యసమ్మతి దెల్పుట అన్యాయము. కొందరు వివాహమాడ కోరికగల వితంతువు లున్నారని విని, ఆమె యాశ్చర్యమందెను. నేను నాపూర్వానుభవముల నామె కెరింగింప, ఆమె మిగుల సంతోషమంది యీవిషయమునుగురించిన వ్యాసము నొకదానిని వ్రాసి పత్రికలందు బ్రకటింపగోరెను.

నాకున్న పదివత్సరముల సంఘసేవానుభవములో పదునైదుగురువితంతువులకు వివాహము చేయించితిని; పండ్రెండుగురు పాఠశాలలకు బంపబడిరి; నలుగురు వ్యభిచారమునుండి తప్పింపబడిరి. ఇంకను ఎందరో బాలికలకు పూర్వాచారముల ననుసరించి దుస్థితులకు లోనుగాక ముందే వివాహము చేయించితిని. తగినంతసహాయము నేను చేయగలిగినంతవఱకు, ఎందరో వితంతువులు, వ్యభిచారమునుండి తప్పింపబడిన స్త్రీలు మాయింటనే, మాకుటుంబములోని వారుగా నివసించుచుండిరి. నేను వారినందరిని "విద్య నభివృద్ధిచేసికొని సంఘసేవ చేయు" డని తరచు ప్రోత్సహించుచుంటిని; కాని వారిలో కొందరు తాము వివాహమాడ నిశ్చయించుకొన్నామనియు, ఆవిషయమందు మాత్రము నిరుత్సాహపరచవలదనియు నిర్భయముగా, తేటతెల్లముగా నాతో జెప్పిరి.

అట్టివిషయములలో కొన్ని యాశ్చర్యకరములైన విషయముల నీక్రింద పొందుపరచుచున్నాను.

మొట్టమొదట పునర్వివాహమునకై నావద్దకు పండ్రెండేండ్లవయస్సుగలిగిన బాలికను వెంట నిడుకొని, బాలికతలిదండ్రులు వచ్చిరి. ఆబాలిక తలిదండ్రు లప్పటికే వివాహము నిశ్చయముచేసికొని, వివాహము జయప్రదముగా జరిగింపజేయుటకు నాసహాయము గోరిరి. రేపటిదినమున వివాహ మనగా, ఆఊరియందు మూడువేలకు పైగా జనులు గూడి కొన్ని తీర్మానముల గావించిరి. వాటిలో ముఖ్యమైనది "పైవివాహమహోత్సవమందు పాల్గొనినవారు బహిష్కరింపబడుదు"రని చాటుచుండెను. ఈతీర్మానమును జను లేకగ్రీవముగా నామోదించిరి. ఇటులు తీర్మానించుట పాడిగాదని యసమ్మతిని వెలిపుచ్చినవారిలో నేను తప్ప మరెవ్వరును లేరు. ఇంతియ గాక యాఊరియందలి పూర్వాచారపరాయణులు కొందరు పండ్రెండేండ్ల బాలను ముగ్గురుబిడ్డలతల్లియని యొకవదంతి నూరంతయు వ్యాపించునట్లు చేసిరి. ఎన్ని ఆటంకములు సంభవించినప్పటికిని, ఆబాలికవివాహము, నిశ్చయించిన ముహూర్తమున సంఘసేవాతత్పరుల యెదుట సక్రమముగా జరిగెను.

ఆబాల పండ్రెండేండ్లవయస్సు గలదని జనుల యెదుట నిరూపించుటకును, పూర్వాచారపరాయణులైన కొందరు ప్రజ్వలింపజేసిన వదంతి అసత్యమని తెలియుటకును, ఈసంఘసంస్కారోద్యమమునకు అధికగౌరవము గలుగుటకును, ఈనూతనదంపతు లూరేగింపబడిరి. ఒకానొకచోట ఈనూతనదంపతులను గాంచుటకై దాదాపు

పదునైదువేలమంది జనులు సమకూడి యుండిరి. నే నా బాలికను జనులకు జూపి, ఆమెవయస్సును వారే నిర్ణయించగోరితిని.

వెంటనే జను లానూతనదంపతుల మీదను, తదితరులమీదను రాళ్లవర్షమును గురిపించిరి. ఈవివాహ మింతయలజడిగా ౧౮౮౨లో గుంటూరునందు జరిగెను. అప్పటినుండియు నిట్టివివాహములు ప్రజానురంజకమగునవఱకును పట్టుదలతో పనిచేయుటకు నిశ్చయము చేసికొంటిని.

నేను జరిపించిన వివాహములన్నిటిలో, ౧౮౩౧లో బందరులో జరిగినవివాహ మెక్కువజయప్రదముగా జరిగెను. ఆవివాహసందర్భమున దాదాపు పదునైగు వందలమంది నిరాటంకముగా విందారగించిరి. ఇట్టివివాహము జరుగరాదని యొక్కరుగూడ యసమ్మతిని దెలుపక, విందునందు పాల్గొని, యానూతనదంపతుల నమందానందకందళిత హృదయారవిందుల చేసిరి.

రు...అనువితంతువు తనయమ్మమ్మతో గలిసి నా దగ్గరకు వచ్చెను. ఆబాలిక తాను తిరిగి వివాహమాడవలయునని యున్నదని నా కెరింగించెను. నే నామెను పాఠశాలకు బోయి విద్య నభ్యసించుమనియు, ప్రతివారు వివాహమాడి సౌఖ్యమున దులతూగుట లేదనియు చెప్పితిని. ఆమెకు వివాహమాడి సౌఖ్య మనుభవించుటయం దిచ్ఛ లేదు. ఆమె బిడ్డలను పెంచుటయందు కడుఆసక్తి చెందియున్నది. తనబిడ్డను తనచేతులతో పెంచుకొని ఆనందించవలయునని కోరిక గలదు. ఈకోరిక తనకు వివాహము వలననే నెరవేరగలదని యామెయుద్దేశ్యములలో స్ఫురించినది. ఇట్టికోరికలే చాలమంది స్త్రీలు కోరుచుందురని తరువాత నెరింగితిని. అంతియగాక అట్టికోరిక ప్రతిస్త్రీయందు స్వభావసిద్ధమని నాకు నమ్మకము.

జా...అనువితంతువు తనబావగారితో నావద్దకు వచ్చి, తాను పునర్వివాహ మాడగోరుచున్నానని చెప్పెను. నే నామెనుగూడ పాఠశాలకు బోయి చదువుకొని సంఘసేవ చేయుమని సలహా నిచ్చితిని. కాని యామె దానికి సమ్మతింపలేదు. ఆమెకు పెండ్లిచేసికొనవలెనని ఒకదిసలు పట్టలేదు. వైధవ్యమువలన సంప్రాప్తమైన కష్టములు భరింప శక్యము గాకపోయినందున ఆమె పునర్వివాహ మాడ కోరుచున్నది. తనకు తనసోదరీమణులవలె గాక, పెండ్లిండ్లయందును, ఇతరశుభకార్యములందును అసహ్యముగా, అగౌరవముగా చూచుట భరింపరాని పరాభవమని యామె యుద్దేశ్యము. "నేనుగూడ నాసోదరీమణులవలె పూవులు పెట్టుకొనుటకు, శుభకార్యముల నాచరింపబడుటకు కోరుచున్నా"నని ఆమె నాతో చెప్పెను. ఆమెకు నేను పూవులు తెప్పించి యిచ్చితిని. వాటిని జడ నిండ అలంకరించుకొని, తనమనస్సుకు తృప్తి కలిగేటంత వరకు ప్రతిదినము పూలతో శృంగారించుకొని ఆనందపడెను. మాయింట నున్నప్పుడు ఆమె తనయలంకారముకొఱకు గంటలకొలది కాలమును వెళ్లబుచ్చెడి. ఆమె వివాహమైన రెండువత్సరములతరువాత, ఆమెను వెనుకటివలె అలంకరించుకొనుమని చెప్పగా తనతృష్ణ తీరినదని యామె జవాబిచ్చెను.

కా...అనువితంతువు, వితంతువులు పునర్వివాహములు చేసికొనునెడ సహాయము చేయుమహానుభావులు కొందరున్నారని తెలిసి, నావద్దకు వచ్చెను. పాపమామెకు సహాయము చేసెదమని చెప్పి యెవరో ఒక వత్సరమువరకు చేయక అశ్రద్ధ చేయుటవలన, ఆమె విసుగెత్తి జీవితము దుఃఖభాజనము కాగా ఆత్మహత్య చేసికొని ప్రాణముల విడువ నిశ్చయించుకొనెను. కాని యామె బాగు కోరువారు కొందరు ఆమెను మాయింటివద్ద దింపిరి. ఆమె మాయింటియం దుండుట కిష్టపడే ముందు తా నొకకోరిక గోరెను. తనయిష్టమువచ్చిన, చక్కగా చదువుకున్న వానిని పెండ్లాడుటకు తనకు తగినంత స్వాతంత్ర్య మివ్వవలెనని కోరెను.

న...అనువితంతువు నావద్దకు పునర్వివాహమునకై వచ్చెను. ఆమె బీదతనమున ప్రతిదినము ఆరిండ్లలో వంట వండి జీవించవలసియున్నది. ఆయిండ్లయందలి పురుషు లామె నాకర్షించుకొని, యామెను వ్యభిచారమునకు లోనుగా జేయ మొదలిడిరి. వారిస్త్రీలు మగవారిని చీవాట్లు పెట్టుటకు బదు లామెను బాధింప మొదలిడిరి. ఈపైబాధల ననుభవింపలేక తాను పునర్వివాహమాడ

నిశ్చయించుకొంటి నని చెప్పెను. "దురదృష్టవశమున నాభర్త నన్ననాదరణ చేసినను సహింతును కాని యిట్టి దుఃఖజీవితమును భరింపలేను. నాభర్త దుర్మార్గముగా నన్ను హింసింప ప్రయత్నించినను, ఆయన నాబిడ్డలకు తండ్రి యన్నగౌరవముతో సహింతును" అని చెప్పెను.

మరియిద్దరు బాలికలు భర్తలచే విడువబడి పునర్వివాహమునకై నావద్దకు వచ్చిరి. ఆయిద్దరిలో ఒకబాలికకు పదునాఱువత్సరములవయస్సు. పాప మామెను భర్త తొమ్మిదవవత్సరమున విడిచిపెట్టెను. ఆమె యిప్పుడు కాలేజీలో చదువుకొనుచున్నది. ఆమె తనజీవితమును సంఘసేవ చేయుటకై వినియోగింప నిశ్చయించుకొనెను. రెండవబాలిక తప్పక పునర్వివాహ మాడ నిశ్చయించుకొనెను కాని యామె తిరిగి వివాహమాడుటకు చాల నాటంకములు గలవు. ఆమెభర్త జీవించియే యున్నందున, ఆమె హిందూలాప్రకారము తిరిగి వివాహ మాడరాదు. ఆమె వివాహమాడవలయునన్న, తనమతమును విడిచి యింకొకమతములో గలియవలయును.

మరియు, ఇంకను పలుసురుస్త్రీలు వ్యభిచారము నుండి తొలగింపబడిరి. నేను వారినందరిని సంఘసేవచేయ ప్రోత్సాహించవలయు ననుకొంటినిగాని, వారిలో ముగ్గురివరకు నన్ను సంతృప్తిపరిచినది కాదు. వారిలో ఒకామె నాస్నేహితు నొకనిని వివాహమాడెను. దురదృష్టవశమున ఆమె వివాహమైన కొలదికాలమునకే స్వర్గస్థురాలాయెను. నాస్నేహితుడు ఆమె పరలోకమున కేగిన యేడువత్సరములవఱకు, ఆమె జ్ఞప్తికి వచ్చినప్పుడెల్ల కన్నీరు మున్నీరుగా నేడ్చెను.

కాన ప్రతిస్త్రీయును వితంతువైనను వివాహమాడుట ముఖ్యావశ్యకము అయియున్నది. అతివలకు వితంతువులైనను, సంసారసౌఖ్య మనుభవించి, బిడ్డలను గనుట భగవంతుడు ప్రసాదించినవరము; అది వారిజన్మహక్కు.

ప్రతిమతమందును "దయ", "క్షేమ" అనురెండు సద్గుణము లుండును; అవి లేకున్న అది మతమని పిలువబడదు. అట్టిగుణములు లేనట్టి మతము మానవప్రపంచమందు నిరుపయోగమని సర్వజనవిదితము.

నాజీవితమందు నే నింతసాహసముతో ఇట్టికార్యముల నెరవేర్పగలిగినది నాభార్య అన్నపూర్ణాదేవి సహాయమువలననే. దురదృష్టవశమున కొన్నిదినములక్రిందట ఆమె స్వర్గస్థురాలయ్యెను.

---

## విచిత్రకాలము

అవ్వారి సుబ్రహ్మణ్యశాస్త్రి గారు

వేదంబులో! స్మృతులో! దర్శనంబులో యనుచు ఘోషించుబ్రాహ్మణులతోడ
వైషమ్యమో పరద్వేషమో బ్రాహ్మణద్వేషమో యనెడిశూద్రునుడితోడ
వర్ణాశ్రమంబులో వైదికధర్మమో యనిజపించెడి వృద్ధజనులతోడ
అస్పృశ్యతాదోష మడగుట యెప్పుడో అని వేడ్కపడు యువజనులతోడ
నిమ్నజాత్యుద్ధరణవ్రతనిరతితోడ - వర్ణసంకర ద్వేషభావంబుతోడ
వఱలుఁ జిత్రవిచిత్రరూపంబు దాల్చి - ప్రాతక్రొత్తలసంధిను భరతభూమి.

---



# చిత్రకళ



## హిందూస్త్రీలు; చిత్రరచన

తలిశెట్టి రామారావుగారు బి. ఏ., బి. ఎల్.

౧

కవనము భావోద్రేకమును, సంగీతము భావగభీరతను, చిత్రములు భావసాత్వికమును కలుగజేయునని పెద్దలు చెప్పియున్నారు. మహమ్మదీయక్రైస్తవమతావలంబకులవలె నలుగురితో నొకచోట గాక, నిర్జనప్రదేశమున నెట్టి చిత్తవికారమును లేక యొకటేధ్యానముతో దేవుని ధ్యానించు హిందువులకు భావసాత్వికము ముఖ్యము కాన వారు చిత్రశిల్పరచనలను ప్రోత్సాహపరచుట సహజము. తొలుదొలుత వీరికి విగ్రహము లక్కరలేకపోయినను, వేదాంతాదితత్త్వవిచారణ భారతదేశమున జరిగిననాటికి శిల్పచిత్రరచన లాదరణకు వచ్చెనని మనకు చరిత్రవలన దెలియవచ్చుచున్నది. విగ్రహములతో జోక్యము మొదట కలుగజేసుకొనని బౌద్ధులకును చిత్రములు కావలసివచ్చెను. మతప్రచారము, విగ్రహారాధన మొదలగునవి యీయాదరణకు కారణములైనను భావసాత్వికము కలుగజేయు గుణము చిత్రములం దుండుట వలనగూడ వీరి కీకళాంగము ప్రియమయ్యెను.

విద్యాలయములలో కావ్యములను పరీక్షలకొరకు చదువుకొని తరువాత మరచుటవలన కవనముయొక్క మేలు విశేషము కలుగకున్నది. పూర్వులిటులు గాక పురాణాదిగ్రంథముల నన్నిటిని కావ్యరూపములుగ వ్రాసి కవనమును దైనికజీవనమున బ్రవేశపెట్టిరి. కావ్యపురాణాదిపఠనము సంగీతబద్ధముగ నుండవలెనని నిర్ణయించుటచే సంగీతముకూడ దినచర్య కవసరముగ జేసికొనిరి. ప్రతిపండుగకును గృహముల నలంకరించుకొనవలెనని శాసించి యీకళనుగూడ నాదరించిరి. ఏమ్యూజియములందో, లేక సంవత్సరమున కొకమా రేర్పరుపబడు చిత్రప్రదర్శనములందో చిత్రశిల్పములను చూచి, యానందించి, మరచుటవలన నంతగా లాభము లేదు. చిత్రశిల్పములు కలుగజేయు మేలును మనపూర్వులు గమనించి, ప్రతిగృహమును శిల్పాలంకృతమై యుండవలెననియు, గోడలు చిత్రాలంకృతములై యుండవలెననియు నొకయాచారము నేర్పరచుకొనిరి. ఇప్పటివలె నొకవికారమైన గృహమును నిర్మించుకొని దాని నలంకరించు ప్రయత్నమున చిత్రములను గోడలమీద మేకులకు వ్రేలాడగట్టుటకంటె, గృహములనే చక్కగ గట్టి కళాలయములుగ జేయుట యుత్తమము కాదా? నిదర్శనముగ పూర్వులు కట్టిన ఎల్లోరాలోని కైలాస దేవాలయమువంటియు, ఫ్రాన్సుదేశమునగల నోటరుడేము దేవాలయమువంటియు, తాజ్ మహలువంటియు నిర్మాణములతో నీకాలమున నిర్మింపబడిన భవనములను సరిపోల్చి చూచినయెడల నిప్పటినిర్మాణము లెంతసౌందర్యరహితములో తెలియును. గృహములను చక్కగ గట్టుకొనుటతో తృప్తి చెందక వాటిని ముగ్గులు మొదలగుచిత్రములతో నలంకరించుకొనుట మనవారియాచారమై యుండ, నిండ్లను సుందరముగ నిర్మింపకపోవుటయే కాక, వాటి నలంకరించుటగూడ మానుట మనయాధునిక జీవనముయొక్క నిస్సారతను సూచించును.

హిందువులకు మతము ముఖ్యము కాన వారి[illegible] విషయకకృత్యములందు, వ్యయప్రయాసల కోర్చి చిత్ర

ములను, శిల్పమును చాలా విరివిగ నుపయోగపరచిరి. దేవాలయములయెడ భక్తితో వందరును వచ్చుచుందురు. కావున వాటిని సుందరశిల్పసంపత్తితో నలంకరించి లోకమున నద్వితీయ నిర్మాణములుగ జేసిరి. మన మారాధించు విగ్రహములను చక్కగ నున్నవని విగ్రహారాధనమును నిరసనముగ జూచు పాశ్చాత్యులును గొనియాడుచున్నారు. ప్రతిదేవాలయమును చక్కని చిత్రములతో నలంకరింపబడుచుండెననియు, రాతివిగ్రహములు రంగులతో జిత్రింపబడుచుండెనియు చెప్పుట కిప్పు డాధారములు విశేషముగ కానవచ్చుచున్నవి. హిందూదేవాలయములు కళాలయము లని చెప్పుట సత్యదూరము కానేరదు. రాజులును ప్రజలును కూడ తమయిండ్లగోడలపై చిత్రములను చిత్రింపించుచుండిరి. ఉత్కళదేశమున నిప్పటికిని శుభకార్యములకు చిత్రకారులను పిలిపించి, గోడలపై పురాణగాథలు మొదలగు విషయములనుగూర్చి చిత్రములను వ్రాయించుట కలదు. మనపూర్వులకు ధనముకంటె ఉన్నతజీవనము ముఖ్యము కనుకను, చిత్రము లున్నతజీవనమును బోషించును కనుకను పూర్వము చిత్రరచన యాదరణను బడయుచుండెను.

ఈకాలమున మనము సనాతన నాగరకతను మరచి చిత్రకళ నాదరింపక, దానివలన మనస్సునకు గలుగు మేలును లక్ష్యముచేయకపోయినను, మనస్త్రీలుమాత్రము తమపూర్వసంప్రదాయమును విడకుండుటవలన మరల భారతదేశమున చిత్రకళ తనపూర్వపుస్థానము నలంకరింపగలుట కవకాశము కలదు.

స్త్రీలు గృహమున కధిదేవతలు. వారు సంసారమును నడపుకొనుచు నెంతపని యున్నను తమగృహముల నేదోవిధమున నలంకరించుకొనుచు కళారాధన చేయుదురు. వ్రతములను జేయునపుడెల్ల వారు దేశాచారము ననుసరించి తమయిండ్లగోడలను, నేలను, స్తంభములను అలంకరించెదరు. వారు తులసిపీఠమును, దేవునిగదిని అలంకరించుట చూచినవారికి హిందూస్త్రీల హృదయములందు చిత్రరచన యెట్టిస్థానము నింక నలంకరించియున్నదో తెలియగలదు. ప్రత్యేకవ్రతములకు ప్రత్యేకచిత్రములను (ముగ్గులను) వ్రాయుట పూర్వకాలమునుండియు సంప్రదాయముగ నున్నది. ఈచిత్రము లాధ్యాత్మికభావముల వ్యక్తీకరణములనియు, మంత్రశాస్త్రజనితములనియు పండితులు నిర్ణయించియున్నారు.



వివాహములందు మట్టిపాత్రలకు సున్నమును బూసి రంగులతో నలంకరించుటయు నిప్పటికిని గలదు. పాత్రలన్నియు పూర్వ మటు లలంకరింపబడుచుండినవని యన్నిదేశముల చరిత్రలవలన మనకు తెలియుచున్నది. మనవారు కొంతవరకు పూర్వాచారపరాయణు లగుటవలన శుభకార్యములం దీ యాచారము లింక నాచరణమునం దున్నవి.

హిందూదేశమున స్త్రీలసాంఘికస్థితి దుర్భరమనియు, వారిని మగవారు తూలనాడెదరనియు చెప్పువారి సంఖ్య తగ్గుచున్నది. వీరిస్థితిని బాగుచేయ యత్నించువారితో నాకు కలహము లేదు. స్థితి బాగు కావలసియున్న దనునంతమాత్రమున వీరిస్థితి దుర్భరమని యూహింపదగదు. ప్రపంచమున నెవరిస్థితి బాగు కానక్కరలేదు? హిందూస్త్రీల నణగద్రొక్కుచున్నారని నిందింపబడుచున్న హిందూమగవారిస్థితి బాగుపడనక్కరలేదా? అనాదినుండియు గృహమున కధికారులుగ నున్న స్త్రీలు తమ గృహకృత్యములను నిర్వహింపవలదా? అన్నిగృహములందును సేవకు లున్న నాసేవకులకు సేవకు లెవరు? దీని కంతకును భారతదేశము నావరించియున్న దరిద్రదేవత కారణము కాని వేరు కాదు. భారతస్త్రీలకు తమయిండ్లయందును, సంసారమునందును ప్రేమయు, ప్రేమవలన గలిగిన యానందమును గలవు. మగజాతికి గలుగుశ్రమను దీర్చుటకు స్త్రీ లమృతప్రాయలు. ఈసుధ నర్పించుటయందు హిందూస్త్రీ లద్వితీ

యలు. వీరిసౌకర్యము, నెమ్మది, యలంకార ప్రీతియు పొగడ్త గన్నవి. వీరియందుగల రీవి సౌందర్యములు మరేజాతిస్త్రీకిని లేవని మనలను బరిహసించుచుండిన పాశ్చాత్యవిమర్శకులుకూడ కొనియాడియున్నారు. మనస్త్రీలందు చిత్రకారులు కాన, అలంకరించుకొనుట యందు వీరికి ప్రీతి హెచ్చు. చక్కనివస్త్రములను సుందరముగ ధరించి సాంఘికజీవనమునకు వన్నె దెచ్చుచున్నారు. జాతీయప్రబోధమువలన నూతనముగ లభించుచున్న ఖద్దరుచీరలరంగులును, వాటియంచులయద్దకమును భారతజాతియొక్క చిత్రకళాప్రేమయు, స్త్రీలవలన చిత్రకళ యెటులు పోషింపబడునదియు తెలియజేయుచున్నవి. ఆంధ్రస్త్రీల వస్త్రధారణము, శిరోజముల ధమ్మిల్లపాటు చూచువారి యందరి పొగడ్త నార్జించుచున్నవి. ఈవిషయములను చూడ భారతీయస్త్రీలు చిత్రకళారాధనపరాంగనలనుటయం దెట్టియతిశయోక్తియు లేదని తెలియును. వీరికి "డ్రాయింగు" నేర్పకపోయినను తక్కిన దేశపుస్త్రీల కవిధమున చిత్రకళాభిలాష యందు తీసిపోరు.

భారతపుత్రులగు చిత్రకారులు తమచిత్రములందు స్త్రీలకు మంచిస్థానము నిచ్చిరి. స్త్రీలు లోకము నలంకరించుచున్నారో యనునటులు తమచిత్రములందు వీరు స్త్రీల నలంకారములుగ నుపయోగపరచిరి. అజంతగుహలందు స్త్రీవిగ్రహములన్నియు సుందరముగ నున్నవి. వీరియంగవిన్యాసము మనోహరము. అంగములు కృశించియున్నటులు గాని, వికృతములుగ గాని యెచ్చటను కానరావు. రోగపీడితలైయున్న స్త్రీలయందు కూడ బల హీనత కానరాదు. ఒకనృపునియాజ్ఞవలన మరణమునకు సిద్ధముచేయబడిన యొకకులటయొక్క దుఃఖము నాచిత్రకారులు చూపలేక ముఖమును చేతులందు మరుగుపరచిరి. బాఘ్, సింహగిరి చిత్రములందును, సాంచి, అమరావతి, బరుహుతు శిల్పరాజములందును స్త్రీలకు గల స్థానము నిరుపమానము. మగవారితో వీరు సమానలుగ గణింపబడిరి. మగవారిలో కొందరి కాడువారు కానరాకుండ దను నాచారము సామాన్యమగుటచే, మొగలు చిత్రములందు స్త్రీలు విశేషముగ కానరాకపోయినను, కానవచ్చుస్త్రీల చిత్రములందు వీరికి గౌరవస్థానమే కలదు. శైలియందు వీరి ననుకరించిన రాజపుత్ర చిత్రకారుల కిట్టి యాటంకము లేకపోవుటచే గోపికాకృష్ణుల, యితర పురాణవ్యక్తుల చిత్రములను వ్రాయుటయందు స్త్రీలయెడల తమకుగల ప్రేమను బాగుగ జూపగలిగిరి. నాయికానాయకుల చిత్రములను, రాగిణీచిత్రములను వీరు వ్రాయుటయందు స్త్రీలను శృంగారాద్యనేకరసములందు రచించిరి. కంగ్రా చిత్రకారులు బీదసాదులదైనికజీవనమునుగూర్చి వ్రాయుటయందు, రాజపుత్రచిత్రరచన రాజదర్బారులను వీడి ప్రజాసామాన్యమున బ్రవేశించుటవలన స్త్రీలకష్టసుఖములను రచించుట కవకాశ మేర్పడెను. ఇట్టి చిత్రములందును స్త్రీల కెట్టి యగౌరవమును వారాపాదింపలేదు. తంజావూరు చిత్రములు రాజపుత్రచిత్రములను బోలియున్నవి.

తమ యునికివలన తాము నివసించులోకము నలంకరించుచున్న స్త్రీలు మనఃప్రకృతివలన చిత్రకారులై యుండుట సహజము. భారతదేశమునం దే రాష్ట్రమునకు పోయినను అచ్చటి యాచారమననుసరించి స్త్రీలు తమ గృహములందు చిత్రరచన జేయుట జూడగలము. గుజరాతునందును, బొంబాయిరాష్ట్రమునందును స్త్రీలు రంగోలీయని పిలువబడు ముగ్గులను పెట్టెదరు. తెల్లముగ్గుతో తొలుత చిత్రము నేర్పరచుకొని తరువాత రంగుగుండల నందు వైచి మనోహరములగు చిత్రముల నేర్పరచెదరు. నేలను పేడతో నలికి, యది బాగుగ నారకమునుపే యీముగ్గురంగులను చిత్రాకారముగ వైచి, వ్రేళ్లలో కొంచె మణచినయెడల నేల యెండినపిమ్మట కూడ చిత్రము చెరిగిపోకయుండును. ముగ్గుగుండలను నీట గలిపి దారుఫలకములపై చిత్రములను రచించియుంచుకొనుటయు నాచారముకలదు. ఈప్రాంతమునగల "ప్రభు" జాతిస్త్రీలు చక్కనిచిత్రకారులని పేరువడసిరి. ఉత్తరహిందూదేశమునందంతట నిట్టిచిత్రరచన సర్వసామాన్యముగ నున్నది. వంగదేశమున ఆల్పనాయనియు, ఉత్కళమున జొట్టియనియు నీముగ్గులను పేర్కొనెదరు. కోణార్కము, భువనేశ్వరములందుగల దేవాలయములను నిర్మింపజాలిన యుత్కళజాతి స్త్రీ

రచన నాదరించుటలో వింత లేదు. ప్రతియుత్సవము నకును, శుభకార్యములకొరకును, వీరు తమగోడలపై చిత్రములను వ్రాయుటయో, వ్రాయించుటయో కలదు. ఈ చిత్రశైలి అజంతశైలిని పోలియుండును. కార్తికమాసమున తులసిపూజ చేయునప్పుడు వీరు పీనెచుట్టును రంగులముగ్గుసుంపెలతో చక్కనిచిత్రములను రచించెదరు.


౨

చూచుట కివి ముఖమలు కంబళ్ళములవలె మనోహరముగ నుండును. ఇట్టిముగ్గులలో నొకభాగము నెత్తియిటులు వ్రాసితిని. రంగులు లేకపోవుటచే చిత్రము బాగుగ కానరాకపోయినను విధానముమాత్రము తెలియగలదు.

దక్షిణదేశమున చుక్కలముగ్గులని పిలువబడు చిత్రములు విశేషముగ నాదరణకు వచ్చెను. రంగుల కుంపలను మన దాక్షిణాత్యు లప్పుడప్పు డుపయోగించినను చిత్రములన్నియు రేఖామాత్రములుగ నుండును. చుక్కలనుమాత్ర మాధారముగ గొని రచించుముగ్గులు వీరిచిత్రరచనాకౌశలమును వేనోళ్ల చాటగలవు. ఇతరదేశీయులకు దెలిసినయెడల నివి వారి పొగడ్తను బడయుట నిశ్చయము.

ఈముగ్గులకు చుక్క లాధారముమాత్రమే కాని చిత్రమున వీనికి తావు లేదు. "గ్రాపు" గీయుటయందు అడ్డునిలువురేఖలుకల కాగిత మెటు లుపయోగపడునో యీచుక్క లటులే ఉపయోగపడును. ఒకతీరకముగ చుక్కలను బెట్టి వాటియాధారమున ననేకవిధములుగ వ్రాయుటవలన సుందరమైన ముగ్గు లనేకములయిన నేర్పడును. చుక్కలు లేక వీటిని రచించుట యెంత దుర్లభమో చిత్రరచనయం దేమాత్రము ప్రవేశమున్న వారికైనను తెలియగలదు ఒకవిధముగ చుక్కలతో ముగ్గును పెట్టి దానియందు కొంచెము మార్పు కలుగజేసినయెడల మరియొకవిధమైన ముగ్గు ఏర్పడును. ఇట్టిమార్పుల ననేక విధముల జేయవచ్చును.

చిన్నముగ్గులను కలిపి పెద్దముగ్గుగ జేంచి విచిత్రముగ వాకిలి యంతయు నింపవచ్చును. కొంచెమభ్యాసమున్న చాలును. ఇటుల బెంచుటవలన ఏర్పడిన యీముగ్గునకు రథమనియెదరు. దీనిభాగము లనేక లెగినవియే. 4, 5, 6, 7, 8, 9 వ ముగ్గులను మనలో బాలికలు కూడ రచింపగలరు. కొంచెము బుద్ధిని ప్రవేశపెట్టిన


౩




యెడల యెంతమనోహరమైన (పదవ) ముగ్గేర్పడెనో చూడుడు.

మనము గృహమున వస్తువులయొక్క యాకారములను ముగ్గులుగ బెట్టవచ్చును. ఒకగది నలికి చుట్టు నంచుగ నొకముగ్గును బెట్టి, మధ్య నొక పుష్పాకారముగ ముగ్గును చిత్రించి, దానిచుట్టు నేవో కొన్ని ముగ్గులను బెట్టిన నాగది యెంత సుందరముగ, వాసయోగ్యముగ నుండునో యూహింపవగును.

చుక్కలతో నొకముగ్గును పెట్టి, యొకరేఖను రెండురేఖలుగ దిద్దినయెడల చక్కనిచిత్రము లేర్పడును.



పదవ ముగ్గెటుల ౧౧-వ చిత్రమయ్యెనో చూడుడు. ఇటు లీముగ్గుల ననేకములగు మార్పులతో వ్రాయ వచ్చును. చుక్కలముగ్గులు మనవారిలో నందరికి తెలియును. కాన వాటి నిచ్చట విశేషముగ చూపలేదు.

చుక్కలు కాక రేఖల నాధారముగ గొని ముగ్గులను పెట్టుటయు మనలో సామాన్యముగ గలదు. పాముల ముగ్గులనియు, పారిజాతపు ముగ్గులనియు, ఇతర నామములతోను వీటిని పేర్కొనెదరు. చుక్కలముగ్గుల వలెనే వీని ననేకములగు మార్పులలో చిత్రింపవచ్చును.





చుక్కలముగ్గులనుకూడ నీముగ్గులుగ మార్చవచ్చును. ౧౨-వ ముగ్గున మీదివైపు రెండుతలలును, క్రిందివైపున రెండు తోకలును పెట్టిన పాములముగ్గగును.

ఉత్తరహిందూదేశమునను, బొంబాయి, ఉత్కళ దేశములందును రచింపబడు రంగులముగ్గులవంటివియు నాంధ్రదేశమున ప్రవేశపెట్టిన మనగృహము లెంతయు





నలంకృతములై శోభిల్లగలవు. ౨–వ చిత్రమున గల ముగ్గులవంటివి రచించుట త్వరలో నేర్చుకొనవచ్చును. ఈచిత్రమున తెల్లముగ్గుతో మొదట ఆకారము నేర్పరచుకొని దేహమునకు, వస్త్రమునకు, నగలకు, శిరోజములకు, సేటకు, కండ్లకు, నోరునకు తగురంగులను పరచిన యెడల నెంతయు సుందరముగ నుండును.

ఆచారప్రాయముగ రచింపబడుచున్న రేఖల ముగ్గులనే నవనాగరికతావ్యామోహమున బడి మానుకొనుచుండ క్రొత్తరచనలను ప్రవేశపెట్టజూచుట అడియాసయేమో? "పెంకుటిండ్లకు" ముగ్గు లక్కరలేదను భ్రమ ధనికులకు కలుగుచున్నది. సేవకులచేత వచ్చియు రాని ముగ్గులను బెట్టించుట వీరి కెట్టియవమానమో తెలియదు. ఎవరిగృహములను వారలంకరించుకొనుటవలన గౌరవమునకు లోటు కలుగునా? వీరు చదువులయందు, పాడుటయందు, కాగితములమీద "డ్రాయింగు" వ్రాయుటయందు నియుక్తులు కాలేదా? అక్కరకు రాని యీ "డ్రాయింగు" వ్రాయుట యేల? దీనినే యాచరణమునందు బెట్టరాదా? మనోజ్ఞకళలలో * నొకటగు చిత్రరచనను నీరసదృష్టితో జూచుటవలన జాతీయజీవనమునకును, గృహజీవనమునకును నష్టముకలుగునని మనవారెంతత్వరలో గ్రహించిన నంతలాభము.

బాలికాపాఠశాలలలో కొంతకాలమువరకు ముగ్గు నేర్పుచుండిరి. విద్యాధికారులుగ నున్న పాశ్చాత్యులకును, వారి ననుకరించు మనవారికిని ఈముగ్గులసౌందర్యము నచ్చకపోవుటవలనను ఇట్టిపరిస్థితు లేర్పడినవి. పాఠశాలలలో నేర్పుచున్న కుక్క, నక్క, పిల్లి, ఎలుక బొమ్మల నాబాలిక లెంతవాడుకలో పెట్టుచున్నారో యీయధికారులు కొంచెము చూచినయెడల తాము ప్రవేశపెట్టిన చిత్రరచనా విధాన మెంత యనుపయోగమో వారికి బోధపడగలదు. ఇకనైనను ముగ్గులను పాఠశాల

* "లలితకళ" యనుటకంటె "మనోజ్ఞకళ" యనుట యుత్తమమని తోచును. బ్రహ్మశ్రీ ఆచంట వేంకటరాయసాంఖ్యాయనశర్మగారీపదమును చాల కాలము క్రిందటనే వాడియున్నారు.

లలో నేర్పియు, తమ యిండ్లను ముగ్గులతో నలంకరింపించియు నీజాతీయచిత్రరచన నుద్ధరించుటకు మనవారు పూనుకొనెదరుగాక! రేఖారూపములు కల ముగ్గులతో వీరు తృప్తిచెందనియెడల నేను మీద సూచించినటుల రంగులముగ్గులరచనను ప్రవేశపెట్టిన లాభము చేకూర్తును. పాఠశాలలలో నేర్పు జంతువులబొమ్మల నిటులు ఉపయోగమునకు దేవచ్చును.

తమమగవారి ప్రోత్సాహము లేకపోయినను ఆంధ్ర నారీమణులు ముగ్గులను పెట్టుకొనుచు, చిత్రరచనను వేరువిధముల నభ్యసించుచు, తమబిడ్డలకు నేర్పుచు తాము నివసించుగృహములను వాసయోగ్యములుగ నుంచుకొనెదరుగాక.

---

## బాబీ పుట్టినరోజున

జనమంచి కామేశ్వరరావుగారు

నీచూపు గనినంత !
నీమాట వినినంత !
కలవరించును ఎడద,
పలవరించును బ్రతుకు.

బూడిదబుస్సన్న నై,
కొంటెవెంకన్న నై,
పనిచెరుపుదొడ్డ నై,
ఎప్పు డుంటినో నేను !
ఎప్పు డాడితో నేను !

కాలాహీనన్నిట్లు
కసిగాట్లు చెడ వేసి
పెద్దవానిని చేసె,
సుద్దిబుద్ధులు చెప్పి,
కృష్ణలీలలు మాపి,
వట్టినటకుని చేసె.

పెద్దాకు బాబీ !
ఎల్లప్పుడూ నీవు
అల్లరిసీతమ్మ వై
నీ
చిట్టిచిందులతోటి
ముద్దుమాటలతోటి
మాఎదల ముంచెత్తి
మమ్ము తేలించు.

---

# కొన్ని నాటకసభల వైఖరి









# ప్రాచీన హైందవ స్వరాజ్యము

దివాన్ బహదూర్ యమ్. కె. కృష్ణస్వామి రెడ్డియార్ గారు

భారతదేశమునకు ప్రత్యేకమైన స్వతంత్రమైన విజ్ఞానము నాగరకత అనాదినుండియు ఉన్నదని చారిత్రకపరిశోధకులు చాలమంది వెల్లడించేసినారు. అందు యీదేశము గడించిన గొప్పతనము, వైభవము జీవించియుండుటకు కారణము పూర్వము ప్రతిగ్రామమునందును ఉన్న స్వపరిపాలనాసంస్థలే! ప్రతిగ్రామము సర్వవ్యాపారమునకు కేంద్రముగా నుండెడిది. ఆస్వపరిపాలనాసంస్థలు ప్రజాసామాన్యమునందు పరస్పర సహకారము పెంపొందించి కొన్ని వందలసంవత్సరములు విలసిల్లినవి. ఈదేశములో అనేకరాజకీయవిప్లవాలు కలిగినవి. ఐనను, ఇప్పటివరకు దేశముయొక్క గొప్పతనము వైభవము, విజ్ఞానము, ఏమైనా మిగిలిఉంటే, అట్లుండుటకు కారణము, అంతప్రతికూలపరిస్థితులలోకూడ, చలించకుండా, మంచికట్టుబాట్లు కలిగి, అభివృద్ధిలోనుండే ఆస్వపరిపాలనాసంస్థలే! ఇట్లు దేశమంతటను వ్యాపించి దేశముయొక్క విజ్ఞానమును, నాగరకతను పెంపొందించె చెడి గ్రామసంస్థలను తెలియక కొంత, అశ్రద్ధచేకొంత, నిర్మూలించుటము పూర్వపు బ్రిటిషు పాలనలోని పెద్దలోటులలో ఒకటి అని అందరు అంగీకరించినారు.

ప్రాచీనహిందూదేశమందలి గ్రామసంస్థల ఉపయోగము, సామర్థ్యము అనేకులు ప్రసిద్ధగ్రంథకర్తలు, పరిశోధకులు కొనియాడుచున్నారు. ౧౮౩౨ (క్రీ. శ.) సం.రంలో బ్రిటిషుకామన్సుసభలో "ప్రతిగ్రామము ప్రజాస్వామికమే. దానికి వలసినవాటి నన్నిటిని అదే సంపాదించేది. శుద్ధస్వతంత్రజీవితము గడిపేది. అనంతమైన వ్యాపారములను నెరవేర్చేది. ఎన్నితరములరాజులు గతించినా, ఎన్నివిప్లవాలు వచ్చినా, గ్రామసంస్థకు, దానికార్యక్రమానికి, ఏమీ భంగం కలుగలేదు. కొన్ని గ్రామసంస్థలు కలసి ఒకయూనియన్గా యేర్పడేది. ఒక్కొక్కగ్రామయూనియన్ ఒకచిన్నరాజ్యంలా నుండేది. అన్నివిప్లవాలువచ్చినా దేశాన్నిక్షేమం చేకుంటా ఉండటానికి ఆచిన్నరాజ్యముల రాజ్యాంగపద్ధతియే కారణము అని నానమ్మకము. ఆపరిపాలన ప్రజలకు గొప్పఆనందము, సౌఖ్యము, స్వాతంత్ర్యము కలిగించటానికి ఎంతోఅనుకూలంగా ఉండేది." అని చార్లెస్ మెట్కాఫ్ గారు వ్రాసినారు. ఈఅభిప్రాయమునే "భారతదేశపు చారిత్రాత్మకరూపాలు" అనుగ్రంథములో "భారతదేశము, ప్రపంచములో అన్నిదేశములకంటెకూడ ఎక్కువ రాజకీయ, మతవిప్లవములకు గురియైనది కాని ఆస్థానిక సంస్థలు దేశముయొక్క నాగరకతను, విజ్ఞానమును, వైభవమును ప్రాచీనపంథాగా కాపాడెనని. స్కిథియనులు, గ్రీకులు, ఆఫ్ఘనులు, మంగోలియనులు, మరాఠీలు తమ పర్వతసీమలనుండి ఈదేశముపై అనేకదండయాత్రలు సాగించారు. పోర్చుగీసువారు, డచ్చివారు, ఇంగ్లీషు వారు, ఫ్రెంచివారు, డేన్లు, సముద్రముమీదుగా వచ్చి వారివారిఅధికారము చలాయించారు. కాని ఆవిప్లవత రంగాలమధ్య ఆగ్రామసంస్థ స్థిరముగా కొండవలె నిలిచి దేశముయొక్క ఐకమత్యమును, మతమును కాపాడింది" అని సర్ జార్జి బర్డువుడ్గారు వ్రాసిరి.

## ప్రభుత్వము - సంఘము

ప్రాచీనహిందూదేశములో ప్రభుత్వమునకుసంఘమునకు సంబంధంలేదు. అవిరెండూ స్వతంత్రసంస్థలు. వానికట్టుబాట్లు వేరువేరు; పనులువేరువేరు. పరిణామము కూడ వేరువేరే. సాంఘికాభివృద్ధికి, ఉజ్జీవమునకు, ఆటంకముకానంతవరకే ప్రభుత్వమునకు సంఘమునకు పరస్పర సంబంధం. తక్కిన విషయములలో ప్రభుత్వము సంఘంతో జోక్యం కలిగించుకునేది కాదు. రాజ్యాంగవిషయములు చాలా తక్కువగా ఉండేవి. ప్రజలయొక్క అర్థ

మును, ప్రాణమును, రక్షించడం, అందుకు వలసినధన
మును పన్నుగా వసూలుచేయడం-ఇంతే ప్రభుత్వము చేసేపని. సంఘంతో జోక్యం కలిగించుకోకుండా ఉండడం ముఖ్యరాజ్యాంగసూత్రంగా ఎంచబడేది. కాని ప్రజాసౌఖ్యాభివృద్ధికి ఈరెండుసంస్థలును పరస్పరము తోడ్పడేవి.

కాని పాశ్చాత్యదేశాలలో ఇట్లుకాదు. ప్రభుత్వము, సంఘంతో ఎంతఎక్కువసంబంధం కలిగించుకుంటే అంతమంచిదని, సాంఘికసూత్రములను, రాజ్యాంగసూత్రములలో కలిపివెయ్యాలని ప్రభుత్వమునకు సంఘమునకు భేదంలేకుండా చెయ్యాలని క్రమంగా జీవితమును ఒకేజాతీయముగాగాని, సాంఘికముగాగాని చెయ్యాలనీ ప్రయత్నాలు జరుగుతుండేవి. ప్రభుత్వము మొదట సంఘముయొక్క ప్రాతినిధ్యం సంపాదించి క్రమంగా సంఘానికిఅధికారి అయేది. సంఘం ప్రభుత్వమునకు లోబడి స్వాతంత్ర్యము కోల్పోయేది. ఇట్లు రాజుగాని, రాజప్రతినిధిగాని సంఘానికి ముఖ్యాధికారి అయేవాడు. ఒక్కొక్కప్పుడు దేవస్థానానికికూడా అధికారికావడం కలదు.

ప్రాచీనహిందూదేశంలో రాజు ప్రభుత్వాధిపతేకాని, సంఘానికి అధిపతికాడు. సంఘంలో అతనికి చోటుంది కాని ఆధిపత్యం లేదు. రాజుది ప్రభుత్వచిహ్నమై పూజనీయమైన పదవి. సాంఘికనిబంధనలచే పాలింపబడు ప్రజలయొక్క నిత్యవ్యాపారములకు అతనికి ఏమీ సంబంధం లేదు. ఇట్లు ప్రభుత్వమునకు సంఘమునకు సంబంధం చాలాతక్కువగా ఉండేది. అందుచే ప్రజాసామాన్యము స్వాతంత్ర్య మనుభవించేది.

కాని మనదుర్భాగ్యంచేత మొదట మనదేశమును పాలించిన బ్రిటిషువారు భారతీయజీవితముయొక్క ఈముఖ్యసూత్రమును గమనించలేదు. వారు సాధ్యమైనంతవరకు పట్టణములను అభివృద్ధిచేయడం, వాటిని ప్రజలకు ఆకర్షములుగా చేయడం ముఖ్యసూత్రాలుగా చేసుకున్నారు. మనకు ప్రసాదించిన స్థానికస్వపరిపాలన కూడా పాశ్చాత్యదేశ-సంప్రదాయసిద్ధమైనదే కాని, ఏనాడైనా ప్రజల అనుభవంచేత సమగ్రమైన హిందూదేశసంప్రదాయసిద్ధమైనది కాదు. అందుచేత గ్రామసంస్థలు ప్రజాసామాన్యము వెనకపడిపోయినారు. ఈదేశానికి ఎట్టిస్థానికపరిపాలన ఉండాలో తెలియకుండా పాశ్చాత్యపద్ధతులమీద ఆసంస్థలను స్థాపించడంచేత వచ్చినచిక్కు ఇదే! పాశ్చాత్యదేశాలలో రాజ్యాంగసంస్థలే సాంఘికసంస్థలను స్థాపించి పనిచేయిస్తాయి. ప్రస్తుతము మనస్థానికపాలనాసంస్థలు, పాశ్చాత్యసంప్రదాయానుసారంగా సాంఘికసంస్థలపై అధికారం చలాయిస్తున్నవి. ఆసాంప్రదాయం ప్రతికూలమగుటచేత మనదేశమన్ని విషయములలోను వెనకపడుచున్నది.

## పంచాయతీలు

ప్రస్తుతపుస్థానికసంస్థలు పూర్వమువలె గ్రామంలోఉండే ప్రజలసాహాయ్యంతోటి ఐకమత్యంతోటి ఏర్పడినవి కావు. ప్రజాసామాన్యానికి సంబంధం లేదు. వాటిపరిపాలనపద్ధతి ప్రజాసామాన్యానికి వాటికి తెలియనే తెలియదు. అందుచేత, ఈసంస్థలు జయప్రదంగా పని చేయడానికి తగినప్రోత్సాహం ప్రజలకు లేదు. ఈసంస్థలలో ఇట్టి అసందర్భాలున్నాయని బ్రిటిషురాజ్యాంగవేత్తలు అచిరకాలంలోనే గ్రహించారు. ప్రజాసామాన్యముయొక్క విజ్ఞానం పెంపొందవలెనంటే స్థానికసంస్థలు సమర్థమైనవి కావాలని అవి సమర్థమైనవి కావలెనంటే వాటిపరిపాలన ప్రజాసామాన్యమునకు క్షేమకరము, అభ్యుదయకరము కావాలని కూడా వారు గ్రహించారు.

మరొకవిషయం దేశమును, తక్కినదేశములవలె ప్రజాస్వామికముగా చేయాలంటే తదనుకూలముగా ప్రజలందరిని తర్ఫీదు చేయాలి. వీరు కేంద్ర ప్రభుత్వములోగాని రాష్ట్రీయప్రభుత్వములోగాని ఏదో కొంచెముమంది ప్రతినిధులద్వారా తప్ప వారంత వారు పాల్గొనలేరు అట్లు తర్ఫీదుకావడానికి. అందుచేత ప్రజాసామాన్యమును ఆ విధముగా తర్ఫీదుచేయడానికి గ్రామపాలనసంస్థలే ముఖ్యసాధనములు. ఈఅభిప్రాయమునే ౧౯౦౯ సం॥ రం॥లో (Royal commission on Decentrali-

sation) అని బంపరచారు. ఒకచోట 'ఉత్కృష్టమైన ప్రాచీన హిందూదేశ సంప్రదాయసిద్ధమైన గ్రామపాలనను పునరుద్ధరించుట సంభవించదు.' అని అభిప్రాయపడుతూ 'దేశదినాలలో ప్రజలు వాళ్లంతటవాళ్లు చేయు నానిక స్థానికవ్యవహారాలు పరిష్కరించే పంచాయతీలు స్థాపించి పనిచేయవలసినది. దేశపరిపాలనకు గ్రామపరిపాలనమే పునాది. ప్రస్తుత స్థానికపరిపాలన జయప్రదంగా లేకపోవుటకు కారణము అది పునాది లేకపోవుటే, అని వారు వ్రాసినారు. ఈఅభిప్రాయమునే చాలామంది పెద్దలుగూడా ప్రకటించారు. ౧౯౦౯ సంవత్సరపు సంస్కరణ విధానమునుగూర్చి వారిఅభిప్రాయము తెలుపుతూ అప్పటి ఇండియామంత్రి మోర్లే ప్రభువు 'భారతదేశపు గ్రామము సంఘముయొక్క అసలైన తల్లివేరు. ఎన్నితరములరాజులు గతించినా గ్రామముయొక్క కట్టుబాట్లు స్థిరంగా ఉన్నాయి. అందుచేత భారతదేశపరిపాలన గ్రామపరిపాలనపై ఆధారపడి ఉండేలాగ చేయడం బ్రిటిషువారి ముఖ్యాశయంగా/ధ్యాంగసూత్రంగా చేయాలి' అని వ్రాసినాడు.

## ప్రాచీన గ్రామపరిపాలనా విధానము

పూర్వము గ్రామములు ప్రజాస్వామ్యము చెడకుండా వాటి సర్వవ్యాపారములను నిర్వర్తించేవి. సంఘజీవితము వ్యాప్తంలో ఉండేది. వర్తకులు ఒకసంఘం. చేతిపనివాళ్లు ఒకసంఘం. ఇట్లు ప్రజలందరు కొన్ని సంఘాలుగా ఉండేవారు. ఈసంఘాలు వాటంతట అవి బయలుదేరి కొన్నినిబంధనలు చేసుకొని వాటిని అనుసరించేవి. ఆనిబంధనలను రాజు (కేంద్రప్రభుత్వము) చేత ఆమోదింపచేసేవి. ఏసంఘంలోవారు ఆసంఘనిబంధనలను శిరసావహించేటట్లుచూడడం కేంద్రప్రభుత్వముయొక్క పని. "వ్యవసాయదారులు వర్తకులు పశువులను మేపేవారు, వడ్డీవ్యాపారంచేసేవారు, శిల్పులు వారివారికి సంబంధించినచట్టములు చేసుకొనుటకు వారి కధికారము కలదని క్రీస్తుకు కొన్నివందలసంవత్సరములు పూర్వము గౌతముడు చెప్పెడు. 'అట్లు వారిచే చేయబడిన చట్టములను వారు ఉల్లంఘించకుండా చేయడం సరియైన వ్యవస్థలో కేంద్రప్రభుత్వముయొక్క పని' అని యాజ్ఞవల్క్యుడు వ్రాసినాడు. ఈసంఘములకు కేంద్రప్రభుత్వముతో సంబంధం ఉండేది. నాటి కేంద్రప్రభుత్వము ఏర్పడినది. ప్రాచీనకాలపు ఒకపెద్ద సంస్థయొక్క కార్యనిర్వాహకవర్గం ఏర్పడినట్లుండేవి. ఇవి స్వతంత్రంగా పనులుచేసే సాంఘికసంస్థలు. ఇవి కేంద్రప్రభుత్వమునకు లోబడిన పరిమిత అధికారములు కేంద్రప్రభుత్వముచేత ఆమోదింపబడేవి.

ఈసంఘములతోపాటు ఈ పద్ధతుల మీదనే గ్రామసంఘములు ఏర్పడినవి. ఇవి న్యాయవిచారణ, గ్రామపారిశుద్ధ్యము, మతవిషయక కర్తృత్వము, చేసేవి.

ఒక గ్రామసంఘం ఉండేది. ఇందులో సభ్యులు మతవిషయములందును, న్యాయశాస్త్రమందును పాండిత్యము కలిగి సచ్ఛీలురై కొంతఆస్తి కలిగినవారు కావాలి. ఈసంఘము గ్రామపరిపాలనను కొన్ని చిన్న కమిటీలకు పంచేది. ఈకమిటీలలో సభ్యులుకూడ కొంతపన్ను చెల్లించే భూవసతి కలిగినవారు, స్వస్థలంలో కాపురంచేసేవారు, వ్యవహారజ్ఞానము కలవారు, ౩౫-౭౫ సంవత్సరములమధ్య వయస్సుకలవారు కావాలి. బ్రాహ్మణములు, మంత్రలు తెలిసినవారు కావాలి. గ్రామమును కొన్నిభాగములు చేసేవారు. (ఉత్తరమల్లూరు ౩౦ భాగములు (Wards) ఈభిన్నకమిటీల యేర్పాటుకొరకు ప్రతివార్డులోనిప్రజలు ఒకచోట కూడి వారిస్థానే ఎవరిని ఎన్నుకోతలుచుకుంటారో వారి పేర్లు ఒకచీటీపై వ్రాసేవారు. ఆచీట్లను మడతలుపెట్టి ఒకకుండలో పెట్టి ఒకపెద్దపురోహితుడు గ్రామసంఘముఎదుట పెట్టేవాడు. వాటిలోనుండి ఒకచీటిని ఒక చిన్నపిల్లవానిచేత తీయించేవారు. దానిపై యెవరి పేరుంటే వారు ఎన్నుకొనబడినట్లు ప్రకటించేవారు. ఆమోదించేవారు. ఇట్లే అన్నివార్డులలోను ఎంతెంతమంది కావలెనో అంతమందిని ఎన్నుకొనేవారు. వారు కొన్ని కమిటీలుగా ఏర్పడేవారు. Garden కమిటీ ఒకటి. నీరు సప్లయిచేసే (Tank Committee) కమిటీ ఒకటి. ఆర్థికవ్యవహారములు చూచే (Gold) కమిటీ ఒకటి

Panchwara కమిటీ ఒకటి. (ఇదిచేసేపని తెలియలేదు.) న్యాయవిచారణచేసేకమిటీ ఒకటి. గ్రామసంఘ సమావేశములు చేయుటకు ఎన్నికలు జరుపుచు ఉండెడివి. ఇవిగాక వార్షికసంఘము (Annual Committee) ఒకటి. తక్కిన అన్నిసంఘములకు సరిపోవు ఉండెను. ఇందులకు ఎన్నికైనవారు ఎట్లో పనిచేసినవారు, పండితులు, వృద్ధులు ఇందు సభ్యులు. ఇట్టిపాంచాయత్ సంఘములచేత గ్రామపరిపాలన జరిగెడిది. కేంద్రప్రభుత్వముతో సంబంధం లేకుండా ప్రభుత్వోద్యోగులపై రాజ్యాధికారులతో కేంద్రప్రభుత్వము పైఅధికారిగా ఉండెడిది. ఈసంఘ సంస్థలచే పాలింపబడు ప్రజలయొక్క వ్యవహారములతో సంబంధం లేకుండెను. ఇట్లు గ్రామము సర్వస్వతంత్రంగా ఉండెడిది." అని పూర్వపుగ్రామపాలన పద్ధతినిగూర్చి దక్షిణహిందూదేశములో ఉత్తరమల్లూరులో వైకుంఠస్వామి ఆలయములో ౧౦ వ శతాబ్దమునాటి శిలాశాసనమునుబట్టి డాక్టరు రాధాకుముద ముఖర్జీగారు వ్రాసినారు.

కేవలుగా ప్రాచీనహిందూదేశ సంప్రదాయసిద్ధమైన గ్రామపరిపాలనను పునరుద్ధరించుట సంభవించకపోవచ్చు కాని "ప్రాచీనహిందూదేశ గ్రామపరిపాలన పద్ధతులు, తదాచారములనుబట్టి మార్చగా, ప్రస్తుతమున పాశ్చాత్యసంప్రదాయానుసారమైన స్థానికస్వపరిపాలనయే మనకు ప్రసాదింపబడి యుండెకంటె జయప్రదంగా ఉండియుండెడిది. ప్రస్తుతజిల్లాబోర్డులు మొదలగు సంస్థలయందు అక్కడక్కడ స్థాపింపబడిన గ్రామపాలనసంస్థ లేమైనాయుంటే నిర్జీవమై ఉన్నవి. పునాదులుగా ఉండవలసిన గ్రామసంఘములను మరలకట్టి అమర్చుట సాధ్యంకావలెను చేయు" అని రోనాల్డ్షే ప్రభువు తన 'India, A Bird's Eye view' అను గ్రంథములో వ్రాసినారు. ప్రస్తుతపుస్థానికస్వపరిపాలన శుద్ధఅవకతవకగా ప్రారంభింపబడినది. దేశపరిపాలనకు ఆధారమైన గ్రామసంఘములు జిల్లాబోర్డులు మొదలగు పెద్దసంస్థ శిఖరములపై ఆధారపడే పేరుకుమాత్రమున్నవి.

## చిత్తరంజనుని యాశయము

అస్పృష్టవశంచేత తప్పు తెలుసుకున్నారు. ఆతప్పు సవరించుటకు, ప్రాచీనహైందవ సంప్రదాయసిద్ధమైన గ్రామపరిపాలన పునరుద్ధరించుటకు, ఈమధ్య చాలా రాష్ట్రములలో ప్రయత్నాలు జరిగినవి. మహారాష్ట్రములో సవరింపబడిన స్థానికపరిపాలనచట్టము ననుసరించి గ్రామపంచాయతీలు స్థాపించారు. వానికి కొన్ని అధికారా లిచ్చి, ఆర్థికసహాయాలు చేసి గ్రామపునర్నిర్మాణములలో నిజముగా పాల్గొనునట్లు చేసేరు కాని ప్రభుత్వమువారు ఎంతసదుద్దేశముతో స్థాపించినా ఈ పంచాయతీలకు గల అధికారంతోటి, ఆర్థికసహాయంతోటి, చిరకాలమునుండియు వెనుకబడియున్న గ్రామములలోను, ప్రజాసామాన్యములోను ఏవిధమైన అభివృద్ధియు కలుగదని నానమ్మకము. చిత్తరంజనదాసుగారు చెప్పినట్లు, గ్రామపరిపాలనసంస్థలకును వానికిసంబంధించిన ఇతరసంస్థలకును మంచిస్వాతంత్ర్య ముండినగాని నిజమైనస్వరాజ్యము లభింపదని నాఅభిప్రాయము. ౧౯౨౨ సంవత్సరంలో అఖిలభారతమహాజనసభాధ్యక్షోపన్యాసమందు దాసుగారు "స్వాతంత్ర్యముకల రాష్ట్ర, కేంద్రప్రభుత్వములకంటె స్వాతంత్ర్యముకల గ్రామప్రభుత్వమే గొప్పది. వీనిలో నీ కేదికావలెనో కోరుకొమ్మంటే, నేను అట్టిగ్రామపరిపాలన కోరెదను. స్వాతంత్ర్యము కలవి అనగా పరస్పరసంబంధములేనివని కాదు నాఅభిప్రాయము. వాటిలో ఐకమత్య ముండవలెను. వాటిని సరిగా నడపడానికి ప్రస్తుతము రాష్ట్ర, కేంద్రప్రభుత్వములకు అధికారముకూడ ఉండవలెను. ఈ అధికారమును అవసరమైనపుడే చలాయిస్తూ చిన్న సంస్థలను జాగ్రత్తగా నడపవలెను. ఆచిన్నసంస్థలకే పరిపాలనాధికార మిచ్చి వానిని తీర్చిదిద్దుచేస్తేనే, హిందూదేశము నిజమైనస్వరాజ్యమనుభవించునని నానమ్మకము"నిచెప్పినారు.

ప్రభుత్వమువారును, దేశనాయకులును పైవిషయములలోని సత్యమును అచిరకాలములో గమనింతురు గాక ! యని కోరుచున్నాను.

[అనువాదకుడు: ఇంద్రగంటి వాసుదేవమూర్తి]

# ఆ డు కొం టా ము

మండపాక పార్వతీశ్వర శాస్త్రిగారు

[ తేనెపట్టునుండి ]

౧

తెల్లగా మల్లెలూ పూచేటి చోట,
చల్లగా గాలులూ వీచేటి చోట,
హాయిగా చిలకలూ చదివేటి చోట,
కోయిలలు కోయనీ పాడేటిచోట,
తుమ్మెదలు జుమ్మనీ మూగేటి చోట,
మా అక్కతో నేను ఆడుకొంటాను,
ఆడుకొంటా మమ్మ, ఆడుకొంటాము,
నేను మా అక్కయ్య ఆడుకొంటాము.

౨

పిట్టలు గూళ్లకూ చేరేటి వేళ,
ఆవుల మందలూ వచ్చేటివేళ,
ఎదురుగా దూడలూ పోయేటివేళ,
మా అమ్మ అన్నమూ వండేటివేళ,
మా నాన్న ఇంటికీ వచ్చేటివేళ,
నేను మా అక్కయ్య ఆడుకొంటాము,
ఆడుకొంటా మమ్మ, ఆడుకొంటాము,
మా తోటలో మేము ఆడుకొంటాము.

౩

లక్కబొంగరము మా అమ్మ ఇచ్చింది,
బొమ్మల పుస్తకం నాన్న ఇచ్చేడు,
మోటారుబండి మా తాత ఇచ్చేడు,
అమ్మమ్మ ఇచ్చింది యీ రైలుబండీ,
అక్కయ్యతో నేను ఆడుకొంటాను,
ఆడుకొంటా మమ్మ, ఆడుకొంటాము,
ఆమూల యీమూల ఆడుకొంటాము.

౪

మా అక్కతో నేను ఆడుకొంటాను,
మా తోటలో మేము ఆడుకొంటాము,
అల్లర చేయక ఆడుకొంటాము,
ఆడుకొంటా మమ్మ, ఆడుకొంటాము,
నేను మా అక్కయ్య ఆడుకొంటాము,
చల్లగా మెల్లగా ఆడుకొంటాము,
ఆడుతూ పాడుతూ ఆడుకొంటాము
మా అక్కతో నేను ఆడుకొంటాను.

౫

ఎగురుతూ దుముకుతూ ఆడుకొంటాము,
గిరగిర తిరుగుతూ ఆడుకొంటాము,
దాగుడుమూతలూ ఆడుకొంటాము,
నేను మా అక్కయ్య ఆడుకొంటాము,
మా తోటలో మేము ఆడుకొంటాము,
ఆడుకొంటా మమ్మ, ఆడుకొంటాము,
అల్లర చెయ్యక ఆడుకొంటాము,
నేను మా అక్కయ్య ఆడుకొంటాము.

# ఈశ్వరాస్తిక్యప్రశంస

కీ. శే. శ్రీమన్మహోపాధ్యాయ బ్రహ్మశ్రీ కల్లూరి వేంకటరామశాస్త్రిగారు

శ్లో. "యతో భూతాని జాయంతే
యేన జీవన్తి యస్మిన్ తాన్,
యస్మిన్ ల్లయం ప్రాప్నువంతి
జిజ్ఞాసస్వ త మీశ్వరమ్."
—ఉపనిషత్ప్రాయశ్లోకము.

మనము దాదాపుగా దిన మంతయుఁ బని చేసి విసిగి సాయంకాలమునఁ జల్లగాలి నాఘ్రాణించుటకై యేటి యొడ్డునఁ దారిం గాని పొలమునూర్గమునం గాని వేడుకగాఁ దిరుగఁ దలంచి గ్రామంబు వెడలుదుము గదా! పిమ్మట నూరికి దూరముగాఁ గొంతమట్టుకుఁ బోయి పోయి చక్కని యిసుకతిప్పమీఁద నయినను గొప్ప మిట్టమీఁద నైనను నిశ్శబ్దం బయిన చోటునఁ గూర్చుండి మనచూపు వ్యాపించునంతవఱకు భూమండల మంతయుఁ జుట్టును బరికించి కనుఁగొందుము. అట్లు పరీక్షించి చూచునప్పుడు దూరములో భూమిమీఁదను మిన్ను విఱిగి పడునట్లు తోఁచుటయే కాక యీభూమియంచును నానుకొనియే యాకాశము నిలిచినట్లును దోఁచును. ఆమిన్ను వాలినట్లు కనఁబడిన ప్రదేశంబును గుఱుతుచేసికొని యచ్చటికింగూడ చని చూడఁ బ్రయత్నింతుమేని యప్పుడు సయితము మనకు నావల కొంతదూరములో వెనుకటియట్లాకాశము నేలపై వాలినరీతిం దోఁచి యీభూమి వలయాకారము గానే యగపడును. ఇట్లు పోయి చూచినకొలందిని బూర్వప్రకారముగానే తోఁచుచుండును. మఱియు గుండ్రమైన యాకారము గల యీధరాతల మెంతో బ్రహ్మాండమైన కంచములాగునఁ జూచునతనికిఁ గన్నుల పండువుగా నుండును. ఇంతకంచము చేయునట్టి కర్త మాత్రము మనకన్నుల కెప్పుడును నీవఱలో నగపడి యుండలేదు. వృక్షలతాదులతో నిండారిన యీభూవలయమే మఱియొకరికిఁ జెల్లదొరలబవంతియో! పుష్పముల మొక్కలు పెంచఁబడునట్టి గొప్పతోఁటయో! యన్నట్లు నేత్రానంద మగుచుండును. ఇంతయబ్బురమైన తోఁటని జాగ్రత్తపెట్టిన యాదొరల పైదొర యెవ్వఁడో కాని కింపఁడు. వెండియుఁ బచ్చనిసస్యాంకురాదులతో నిత్య కల్యాణమును బచ్చతోరణము నైన యీధరణీమండలము వివాహాది శుభకార్యములలో నంకురారోపణ మనెడు కర్పంబున నిల్పఁబడి పవిత్రవేదమంత్రంబుల ప్రభావమున నేపుగా మొలచిన నవధాన్యంబుల మొలకల తోఁడఁ గలకలలాడుచున్న మంటిపాలికయో యను లాగున నేతలాకరికిఁ బొడకట్టక మానదు. ఇంత బ్రహ్మాండమైన మంటిపాలికను (మూకుడు) పాలించునట్టి బ్రహ్మాండనాయకుఁ డెవ్వఁడో మనలోచనంబులకు గోచరింపఁడు. మఱియు "దూరస్థాః పర్వతా రమ్యాః" యను వచనంబు ప్రకారమున నున్న నిరాకారము గలిగిన ట్లుండిన నల్లనికొండలగుంపుల నొకానొకప్పుడు మనకన్నులకుఁ గడుదూరములోఁ జూచుచుందుము. అట్టి పర్వతములు పురాణగ్రంథములలో భూదేవతాభారము వహించినట్లుచెప్పఁబడిన దిగ్గజంబులగున్నలు సంచారంబునకు బయలుదేఱెనవో యన్నరీతిగా నానందము గలిగించును. భూమియందుఁ బ్రవహించుచున్న నదీప్రవాహంబులయునికి, నట్టినదులకుఁ బుట్టినిండ్లయిన పర్వతముల స్థితియు, మనసునఁ గొంచెమాలోచించితిమేని మనలను బెంచునట్టి భూదేవతామాతకు మిక్కుటమైన ప్రేమ పిక్కటిల్లఁగాఁ జేఁపు వచ్చి కాలువలై పాఱుచున్న స్తన్యక్షీరంబులో యన్నట్లెంతటి నాస్తికున కైనను లోపలఁ దట్టక మానదు. ఎప్పుడును నుడుగకుండఁ బంటలు పండునట్టియు, ఫలవృక్షవనాళులతో నిండునట్టియు నింత యఖండసుక్షేత్రభూమండలమును నిగర్వచూడామణియై చాటున నుండియే యెవ్వరికిని దెలియ

కుంతీ మఁలకు దానముచేసిన యుదారుఁడైన జమీను దారుఁ డెవ్వఁడో గదా! మఱియు భూగోళమునకుఁ జుట్టును సముద్ర మునిచి యెవ్వనియాజ్ఞచేతనో చెలియలి కట్టను దాఁటక చుట్టుకొనినరీతిగాఁ బ్రపంచమునకు మీఁదుగా నల్లనినీటితో నిండి స్తంభించిన సముద్రమో యన్నట్లు నీలాకాశము నిండియున్నది. అంజలిమబ్బుల నెంచినప్పుడు సముద్రములోని నాఁచు వేరు గల పాచియే యన్న నమ్మకము పుట్టును. మనము సూర్యుని నైపునకుఁ జూచినచో సముద్రములోని బడబాగ్నియే యనిపించును. రాత్రి నక్షత్రంబులను బరికింపఁగా స్వాతివానకుఁ బుట్టి సముద్రములోని నల్లనిలేటనీటినుండి కనఁబడుచున్న ముత్యములేమో యన్నయూహ పుట్టక మానదు. నిండుచంద్రునిచందము చూడఁగాఁ జుట్టు చుట్టుకొన్న తెల్లనిశేషుండే యనిన నిశ్చయము గలుగును. ఆ చంద్రునిలోని నల్లని కళంకమును శ్రద్ధతో నెంచితిమేని పురాణంబులలోఁ జెప్పినచొప్పున సముద్రములో శేషశాయియై పవ్వళించిన శ్రీమహావిష్ణువే యన్న నిశ్చయము పుట్టి యాస్తిక్యబుద్ధి గల హిందువునకు శరీరము భక్తిపరవశమై గగురుపొడువక మానదు. ఇట్టులు మనమనసునకు మహానందంబును గలిగించుచున్న యీవిచిత్రసృష్టికార్యమును లో నెంచి యాలోచించి నప్పుడు దీనిని రచించుటలో గొప్పబుద్ధిని నుపయోగ పఱిచిన మహాకర్త యెవ్వఁడో యొకరుఁ డుండవలె నని యెట్టి వారికిని దృఢనిశ్చయంబు గలుగక తీరదు. ఆ మహాశక్తి గలకర్తకే యీశ్వరుఁ డనుపేరు. కార్యమును జేయుటకుఁ గర్త యుండవలయుంగదా! ఈయర్థమునే వేదములుకూడ చాటుచున్నవి.

"ద్యావాపృథివ్యౌ జనయన్ దేవ ఏకోఽవతిష్ఠతే,
ధాతాసూర్యాచంద్రమసౌ యథాపూర్వ మకల్పయత్."

అని యుపనిషత్తులయర్థంబును దెలుపునట్టి పై వచనంబు వలన భూమ్యాకాశములను సృజించినదేవుఁ డొక్కఁడే యనియుఁ, బ్రతికల్పమునందును వెనుకటి సృష్టిరీతినే సూర్యచంద్రులను సృష్టికర్త సృజించు ననియు స్పష్ట మగుచున్నది.

లోకంబులలో నొకవస్త్రంబును జూచినప్పుడు దానిని నేసిన తంతువాయుండు, ఘటంబును గాంచిన సమయంబునఁ దత్కర్త యగు కులాలుండు, గేహం బును వీక్షించినకాలంబున నిర్మాతయగు తక్షకుండును దలంపునకు వచ్చు యచేతనంబులైన యాపదార్థంబులు తమంత తాము కానేరవు గావునఁ బైనిం జెప్పిన కర్తల చేతనే నిర్మింపఁబడిన వన్ననిశ్చయజ్ఞానము గలిగినట్టులఁ జైతన్యహీనమైన యీప్రపంచభూతమయదేహంబు యొక్క రచనాచాతుర్యమును బరిశీలింపఁగా దీనిని సృజించిన నిరుపమానమైనప్రజ్ఞాశాలి జగదీశ్వరుం డున్నాఁ డన్న విశ్వాసం బుప్పతిల్లక మానదుగదా! ఇట్లు మనము చూచుచున్న సృష్టికిని దీనికిఁ గారణంబైన యీశ్వరుం డున్నాఁ డని యుక్తియుక్తంబుగాఁ దర్కంబుచేత నూహించినయంశంబు సమస్తవేదమతములవారును వద ల్లోఁ డమకు భిన్నాభిప్రాయంబు లేనివారై యేకకంఠ్య ముగా సమ్మతించుచున్నారని విద్యారణ్యమునీంద్రులు వేదాంతపంచదశీగ్రంథంబునందు నట్టివేదములయర్థమును శ్లోకరూపంబున సంగ్రహించి ప్రమాణంబుగా నిట్టులు వ్రాయుచున్నారు :

"మాయాంతు ప్రకృతిం విద్యా
న్మాయినం తు మహేశ్వరమ్,
స మాయీ సృజ తీ త్యాహుః
శ్వేతాశ్వతరశాఖినః."

ప్రకృతికే మాయ యని పేరు. ఈశ్వరుఁడు మాయాశక్తి గలవాఁడు. అట్టి మాయాశక్తి ప్రభావంబు వలన నీశ్వరుండే జగత్తును సృజించునని శ్వేతాశ్వతరోప నిషచ్ఛాఖ నవలంబించినవారు చెప్పుదురు.

"ఆత్మా వా ఇద మగ్రే భూత్స ఈక్షత సృజా ఇతి,
సంకల్పే నాసృజ ల్లోకాన్ స ఏతా నితి బహ్వృచాః"

మొదటను నీయాత్మ యొక్కఁడే యుండెను. ఆతఁడు 'సృష్టిని చేయుదును గాక!' యని చూచి సంకల్పంబున నీలోకము లన్నియు సృజించెను—అని బహ్వృచులు చెప్పుదురు.

“బహు స్యాం ప్రజాయేయేతి కామయ,
స తపస్తప్త్వా సర్వం సృష్ట్వ త్యాం తైత్తిరీ”

ఆత్మవలన నాకాశంబును, నాకాశమువలన వాయువును, వాయువువలన నగ్నియు, నగ్నివలన నుదకంబును, నుదకంబువలన పృథివియు, పృథివివలన నోషధులును, నోషధులవలన నన్నంబును, నన్నంబువలన పురుష్యా గుణదేహంబులును క్రమముగా నుద్భవించెను, బహు వారన్నే తానే యనేకరూపము లగుట కాలోచించి సకలప్రపంచమును సృజించె ననియుఁ గృష్ణయజుర్వేదము వచించును.

“ఇద మగ్రే స దేవాసీ ద్బహుత్వాయ తదైక్షత,
తేజోఽపోఽన్నాండజాదీని ససర్జేతి చ సామగాః.”

మొదటఁ గనుచు చిత్రపటములో చెట్టు మొక్క వద్ద నొందియున్నట్లు నామరూపభేదములతో చెప్పబడ యాకారముఁ బడనట్టి ప్రపంచ మంతయు, సృష్టికిఁ బూర్వమందు సూక్ష్మస్థితిలో నుండి యేక పదార్థము గానే యున్న దనియుఁ, బిమ్మట నట్టి సత్స్వరూపుఁ డైన పరమాత్మ బహువిధంబులుగా సృజింపఁ దలఁచి తేజో జలాదిస్థూల పదార్థములనుగాఁ గావించె ననియు సామవేద మందురు.

“విస్ఫులింగా యథా వహ్నే ర్జాయంతేఽక్షరాత్ తథా,
వివిధా శ్చిజ్జడాభావా ఇత్యాథర్వణికశ్రుతిః.”

ప్రజ్వలించునట్టి యగ్ని వలన మిణుఁగురులు బయలువెడలునట్లే యాపరబ్రహ్మమువలన ననేకములైన చేతనాచేతనపదార్థంబులు పుట్టియున్నవి యని యథర్వవేదము చాటుచున్నది. పైనిం జూపిన కేవలయుక్తులవల ననే కాక హిందూసంతతివారికిఁ బరమప్రమాణంబులుగా ననాదికాలంబునుండి సమ్మతింపఁబడిన వేదముల వలనఁ గూడ సర్వజగంబును సృజించిన యీశ్వరుం డొకఁడు స్వయంభువుగా నున్నాఁడని స్పష్టమగుచున్నది. కాఁబట్టి యీజగంబు తనంత తానే యొకరియపేక్ష లేకుండ నైనదని యని చెప్పుటకు నెంతమాత్రము వీలుపడ కున్నది. లోకంబులో నేదియైనను గొప్పయంశముగాఁ గోరబడినప్పుడు దానిసత్యాసత్యములును, గుణాగుణములును, తెలియవలెనని సమకొనుచుండు తెలివిగల్ల లనేకు లొక్కచోట సభఁ గూడుట సహజముగదా! అట్టిసభలోఁ బ్రాజ్ఞులందఱును దమతమప్రజ్ఞానానుగ్గుణములకొలఁది నట్టివిషయమునుగూర్చి యుక్తిప్రయుక్తులతోఁ జర్చించినప్పుడు అధికసంఖ్యగలవా రేకీభవించినవాక్యము సిద్ధాంతమై యంగీకరింపఁబడియుండు. అల్పసంఖ్యగలవారివాక్య ముపేక్షింపఁబడుచున్నది. సభలో మహాజనులెల్లరును వేఱువేఱుగాఁ గాక యొక్కయభిప్రాయముతోనే యేకీభవించిరేని యట్టియంశము పరమసిద్ధాంత మనియు, విశ్వాసములో నది యవలంబింపఁదగినది యనియు వేఱె చెప్పనేల? కాఁబట్టి యీసృష్టిని జేసినట్టి యీశ్వరుం డొక్కఁ డున్నాఁడని యన్నివేదమతముల వారును, దమతమవేదవాక్యములు విశ్వసించి యేకీభవించుచుండఁగా, నింకను నీశ్వరసత్తను గూర్చి సందేహపడ నవసర ముండదని నిశ్చయింపవలయును. భగవంతుఁ డుండుట సందేహాస్పదమైనయెడల నట్టి సంశయాస్పదపదార్థమును సర్వవేదములును నైకమత్యము గలిగి సమ్మతించుట తటస్థింపదు. ఒకవేళను, “శతాంధాః కూపం ప్రవిశంతి” యన్నవాక్యముచొప్పున నంధులైన వారు నూఱులసంఖ్యకొలఁది నున్నప్పటికిని మంచిమార్గమును గనుఁగొనలేరక నూతిలోఁ బడుటయే తటస్థించును గావున నన్నివేదములును నంధప్రాయంబులై లేని పదార్థము నున్నట్టులు పొరపడి మనకుపదేశింపఁగూడదా యని యెవ్వరైనను మహానుభావులు శంకింతురేని, యటు లనుట భావ్యంబు గాదు. ప్రాచీనులైన మన యార్యులందఱును ననాదినాగరికతాశాలు లనియు, దానంజేసి మనహిందూదేశము పేరుప్రతిష్ఠలను బొంది యిప్పటికింగూడ నితరదేశములచేతఁ గొనియాడఁబడుచున్నది యనియు నన్నివిషయము మనయెల్లరకును దెలిసినదేకదా! ఇప్పటికాలంబునఁ గొందఱుబుద్ధిమంతులు చెప్పుచున్నచొప్పున వేదంబు లన్నియు నంధప్రాయంబులై నమ్మఁదగనివే యైనను, నట్టిశ్రుతులయందు విశ్వాసము గలిగిన మనయార్యులందఱును జడప్రాంధులు కావలసివచ్చును. మఱియు మున్ను తపోనిష్ఠాగరిష్ఠులైన బహుమహర్షులును, నత్యంతనాగరకులని చెప్ప



ఆతపగృహము

(చూ. కలగూరగంప)



ఆరోగ్యగోళము

(చూ. కలగూరగంప)




ప్రపంచములోనెల్ల పెద్దగడియారము

జపానురాజధానియగు టోకియోనగరమున నిది కలదు. పెద్దముల్లు ౨౭ అడుగుల పొడవు

(E. N. P-)

కాలమునందు నుదయించినట్లు స్పష్టమగుచున్నది. కను కనే శారీరకభాష్యంబునం బ్రథమాధ్యాయ తృతీయ పాదమునందు ౨౮ వ సూత్రపు వ్యాఖ్యలో నీక్రింది స్మృతిని శంకరాచార్యులవా రుదాహరించుచున్నారు:—

శ్లో. “అనాదినిధనా నిత్యా
వాగుత్సృష్టా స్వయంభువా,
ఆదౌ వేదమయీ దివ్యా
యతః సర్వాః ప్రవృత్తయః.”

అని యీస్మృతివచనముచేతను ననాదియు ననంతము నైన వేదవాక్కు సృష్ట్యాదియందు బ్రహ్మచేత నియ్యం బడ్డది యనియు, దానిసాధారంబుననే సమస్తలౌకిక వ్యాపారంబులు జరుగుచున్నవి యనియు స్పష్టమగు చున్నది.

ఓం తత్సత్.

# వినతాపరితాపము

అబ్బరాజు నరసింగరాయడు గారు

అమరకులంబునం బ్రభవమందితి; తత్కులమందు వన్నెగ
న్నమునికి బత్నినైతి; సుగుణమ్ములు భూషలుగా ధరించి యీ
క్షమ జనులెల్ల నౌననగ గౌరవ మందితి; నిట్టు లయ్యు నే
మను సెడ చిన్ననాసవతిమాటలకుం దలయొగ్గ నుంటినే!

మొదట పచారుసేయుటకు బోవుటయే యొకతప్పు; పోయినన్
ముదిత సపత్నితో జనకపోయిన నెట్టులు మారియుండునో
గద విధి! తెల్లగుఱ్ఱ మట గన్పడనేల? తదీయవాలమం
దొదవినవర్ణ మేమనుచు నొడ్డగ నేల పణంబు ముందరన్?

పన్నిదమాడి, కద్రువ యుపాయమునం జయమంద గోరి, తా
నున్నవిధం బెఱుంగక, మహోరగసంతతి వక్రగాములం
గన్నకుమారుల న్విషముఖాకృతులం దురగంపుతోకకుం
గ్రన్నన నంటుకో ననిచె గాక ననుం గెలువంగ శక్యమే?

ఆయమ యట్టులే పలుక నా పటు పల్కిన యంతమాత్రనే
చేయుదురొక్కొ పాపమని చింతననేయక పన్నగాళి ఆ
మ్మాయల నే సహించితి కుమారుడు నా కొక డప్పు డున్నచో
కోయకయుండునే ప్రబలకోపముతో నురగాళి నొక్కెడన్.

అప్పుడు లేరు పుత్రులని యందు నదేమిటి వెఱ్ఱిగాక, న
న్నిప్పుడు గాచునే సుతు డిసీ, రవిసూతు డనూరు డయ్యయో!
అప్పసిపాప భూమి బడినప్పుడ యూరువిహీను డయ్యె, నా
ముప్పు ని కెట్లు దీర్చు మది బొక్కుడుగాక మఱేయవృత్తికిన్ !

గరుడుని చూతమన్న కనుగం దటులయ్యును "తల్లి నీకు వే
గిరమున స్వేచ్ఛ గూర్తు; బలికింపుము కద్రువ యేమి గోరునో
అరమర లేక యిత్తు; దివిజాధిపు డడ్డము వచ్చెనేని సం
బరమున గెల్తు" నంచనియె వాడెకదా సుతుడన్న మాతకున్!

అయ్యో! కద్రువబుద్ధికర్కశము!! నిత్యం బేను తత్పుత్రులన్
నెయ్యం బొప్పగ నెత్తికొందునుగదా నీసూను నిట్లీయు మ
క్కయ్యా యం చనబోవ దందుపయి దాస్యం బేను చాలింప నే
మియ్యంగావలె నన్న వేల్పుచవి పేర్మిం గోరె నెట్లిత్తునో?

అమలుడు సత్యసంధుడు దయామతి నాయనుగుం గుమారుడా
యమృతము దెచ్చుటెట్టు లమృతాంధసు లెంద రెదుర్తురో క్రుధన్
నముచిబలాపహర్తయు రణంబున కాతని జీరునొక్కొ యు
ద్ధమున సుతుండు గెల్చునొకొ దాస్యము తీరునె నాకు నెన్నడేన్.

నాదుకుమారు డెంతయు గుణమ్ముల ప్రోవు జలేజనాభు నెం
తే దమినెంచు; నేనును పతివ్రత, బొంకనిదాన గాన, స
మ్మోదముతో సుతుండు జయముం గొనుగావుత; పాపజాతి శా
కోదరపాళికిం భయము గొల్పెడుగాత సుపర్ణశౌర్యముల్.







1 అంబారీ ఏనుగుచిత్రము. మొదటిబొమ్మచుక్క లుంచు పద్ధతిని తెలుపును. రెండవది మొదటిదానిలో చుక్కలు నొకదానితో ఇంకొకటిని కలుపువిధమును చూపును. మూడవది సంపూర్ణచిత్రము. 2 అంబారీ ఏనుగు. అంబారీ చిత్రించుటకు పూర్వము ఏనుగుచిత్రమును ముగించవలెను. చివర ఏనుగుతొండము కొసనున్న కమలములను, తరువాత ఏనుగుమూపుపై గల రత్నకంబళమును చిత్రించవలెను. అపుడు చిత్రము సమగ్రమగును. పి. విశ్వనాథన్.

# సప్తాశ్వతత్త్వము

శ్రీశ్రీశ్రీ విక్రమదేవవర్మ మహారాజులుంగారు

సూర్యునకుఁ గలరథము బంగారుతోఁ జేయఁబడినదనియు, దానికి నొక్కటియే చక్రముండి యేడుగుఱ్ఱములు పూన్పంబడియుండు ననియు మనపురాణములందుఁ గలదు. "సప్త నామస్త్వేకోఽశ్వః" అని యుండుటవలన సూర్యునిరథమునకుఁబూన్పంబడినగుఱ్ఱ మొక్కటియే యనియు, నది సప్తనామములతో నొప్పుననియు మతభేదము.

సూర్యునకు రథము గలదా? అది యున్నదని నమ్మినను, రథము బంగారుతోఁ జేయఁబడునా? ఏడుగుఱ్ఱములు లేక యొక్కగుఱ్ఱ మీడ్వఁగా నేకచక్రరథము చలించునా? అను సందేహములు సామాన్యజనులకుఁ గలుగకమానవు. ఇట్టిసంశయములు గలవారు పురాణకథితవిషయములు బొల్లులందురు; కాని వానితత్త్వముల నెఱుంగుటకుఁ బ్రయత్నింపరు. పురాణకథితవిషయములలోఁ గొన్ని పండితులవలనఁ దెలియందగియుండును. కనుక సందిగ్ధవిషయములను బొల్లులని నిరసింపక పండితప్రవరుల నాశ్రయించి యెఱుంగుట కర్తవ్యము.

సూర్యగోళము చలనము గలది యగుటవలన నది యొకరథముగా నుత్ప్రేక్షితమయ్యెను. ఆగోళము బంగారువన్నె గలదగుట ప్రత్యక్షమేకదా. కనుక సూర్యగోళమే సువర్ణరథముగా వర్ణితమయ్యెను. క్రాంతివృత్తమే యేకచక్రముగా నుపలక్షింపంబడెను. ఇఁక గుఱ్ఱములనుగూర్చి, లేక గుఱ్ఱమునుగూర్చి నుడువుదము. నీటిబుడ్డపైని బ్రసరించుసూర్యరశ్మిచే యింద్రధనువు పొడముచు. అది శ్యామలోహిత పీత హరితపిశంగ ధూమల నీలవర్ణము లను నేడురంగులతో నొప్పుచుండుట సుప్రసిద్ధము. కనుక సూర్యరశ్మి యేడురంగులు గలదని కొందఱమతము. ఏడురంగులు నేకమగునపుడు శ్వేతవర్ణమగుటవలన సూర్యరశ్మి యొకరంగు గలదని మఱికొందఱమతము. "వీతిః"అనుసంస్కృతశబ్దమునకు గుఱ్ఱమనియు, దీప్తియనియు నర్థములు గలవు [వీతి ర్స్త్వోఽశనే గతౌ, ప్రజనే ధావనే దీప్తౌ—ఇతి హైమః.] ఆహేతువువలన నేడురంగులకిరణములు గల సూర్యునకు "సప్తవీతిః" అనునామము మొదటఁ గలిగెను. గోళము రథముగాను, క్రాంతివృత్తము చక్రముగాను వాడఁబడుటవలన వీతిశబ్దముయొక్క యర్థము గుఱ్ఱమే యని నిశ్చయింపంబడి "సప్తవీతిః" అనుపదము పిమ్మట "సప్తాశ్వః" అనుపదముగా మాఱి వ్యవహరింపంబడెను [భాస్వ ద్వివస్వ త్సప్తాశ్వః - ఇత్యమరః]. సూర్యకిరణము లొక్కరంగు గలవే యనుపక్షమువారు ఏకమునకు మాఱుగా "సప్త"పదము స్థూలతః వాడఁబడినను వస్తుతః అది యొక్కటియే యని సమర్థించుకొనిరి. ఏడురంగులును బ్రత్యక్షము

లగుటవలన సూర్యునకు సప్తవీతినామమే జనరంజనము.

సూర్యుని తేజము సాయంసమయము నందు నగ్నిలోఁ బ్రవేశించును [సౌరం తేజస్సాయ మగ్నిం సంక్రమతే—ఇతి శ్రుతిః]. ఇవ్విషయమే యుపమానముగా రఘువంశకావ్యమునందుఁ బ్రయోగింపఁబడెను:—

శ్లో. స రాజ్యం గురుణా దత్తం ప్రతిప ద్యాధికం బభౌ,
దినాంతే నిహితం తేజ స్సవిత్రేవ హుతాశనః.

ఏడురంగులుగల కిరణములు ప్రవేశించుటవలననే యగ్నికి ‘సప్తార్చి’ నామము గలిగెనని తెలియందగును[సప్తార్చి ర్దమునా శ్శుక్రః- ఇత్యమరః].

కనుక సప్తాశ్వశబ్దము సప్తవీతిశబ్దమునకు బదులుగా వాడఁబడి పరిపాటిగలదయ్యెననియు, మొదటిరూపము “సప్తవీతిః” అనియు, నిజకిరణాళి యేడురంగులతో నొప్పుచుండుటవలన సూర్యునకు సప్తవీతినామము గలిగెననియు నెఱుంగఁదగును.

అర్కగోళంబె హాటకస్యందనంబు,
క్రాంతివృత్తంబె యేకచక్రమ్ము సుమ్ము,
సప్తహయములె రాణించుసప్తవర్ణ
కరము లని యింద్రధనువునఁ గనఁబడెడిని.

---

# ఆ రెండే

వేంకట కాళిదాసకవులు (ఆం. గీ. సా. పరిషత్తు)

భావలవనంబు లెరఁగించుజీవకళలె
లలితకోమల కిరణరేఖలపొలుపులె;
అలరు దాఁగిలిమూఁతల విలసనములె;
నేర్పుఁ జూపించు నారెండు నీలమణులె.

రేకుతుదలందు నుదయించు లేనగవులె;
నిండు జాబిల్లి పండువెన్నెలలలోన
విస్తరించిన యామోదవికసనములె;
చెలువ మొలికించు నారెండు కలువపూలె.

కమలసితపత్త్రిముల నాట్యకల్పనములె;
సరసశృంగార విహారణచాపలములె;
సద్గుణత నొప్పు మన్మథచాపరుచులె;
మాధురి వహించు నారెండు మధుకరములె;

తళతళల నీను మెరుపులఁ గలవెలుఁగులె;
అందమగు నీలినీడ చల్లందనములె;
ఎరుకవడని లోఁతుల సుధావ్యాప్తినిధులె;
మరపురాలేని యారెండు చిరుమొయిళులె.

రాగమూర్తుల యోగవియోగములకు
మూలములె, ప్రేమదేవతాభూషణములె,
సూనములె, యావిరహాజీవి శుష్కహృదయ
మలమి ప్రేమించుచున్న వాయంబకములె.

# బులుసు పాపయ్యశాస్త్రిగారు

అడవి శంకరరావు గారు, బి. ఏ., యల్. టి.

ఆంధ్రదేశమున మిక్కిలి ప్రఖ్యాతి గాంచిన పండితుడు బులుసు పాపయ్యశాస్త్రిగారు ౧౮౧౫-వ సంవత్సరమున తూర్పుగోదావరి జిల్లాలో ఐనవిల్లి గ్రామమున జన్మించిరి. వీరి తండ్రిగారు అచ్చయ్యశాస్త్రిగారు. అచ్చయ్యశాస్త్రిగారు శిష్టు కృష్ణమూర్తికవియొక్క శిష్యుడు. ప్రాఁనుదూర గోదావరిజిల్లాలో కలిసికొనిన పండితులలో అచ్చయ్యశాస్త్రులుగారొకరు. పాపయ్యశాస్త్రులు వేదము, శ్రౌతము, పూర్వమీమాంస, ఉత్తరమీమాంస, ధర్మశాస్త్రము, తర్కము, వ్యాకరణములలో గట్టి పండితుడు. ఇందులో వీరు పూర్వమీమాంస దువ్వూరి సూర్యనారాయణసోమయాజులుగారి వద్దను, మిగిలినశాస్త్రములు చాలవరకు తండ్రిగారివద్దను నభ్యసించిరి.

పాపయ్యశాస్త్రులు దేశాటనము ప్రారంభించి ౧౮౪౮ లో మొట్టమొదట మైసూరు సంస్థానమునకు వెడలిరి. వీరిని బరీక్షింపక ముందు తక్కినపండితుల కిచ్చునట్లే వీరికిని పండ్రెండురూపాయలు వార్షికముమాత్ర మివ్వబోయిరట! వీరు పరీక్షింపబడినతరువాత మైసూరుమహారాజగు చామరాజవొడయరు వీరివేదార్థమునువిని, వీరియద్భుతపాండిత్యమును జాల మెచ్చుకొని, వీరిఛాయాప్రతిమ దీయించి తాము పుచ్చుకొని, తమపటము వీరి కిచ్చుటయేకాక, వీరికి వెండిగొడుగును, శాలువలును, వేయినూటపదియార్లు నిచ్చి బహూకరించిరి. పాపయ్యశాస్త్రిగారు మైసూరులో సుమారయిదుసంవత్సరము లుండిపోయిరి. తరువాత వీరు తమ స్వగ్రామమగు ఐనవిల్లి వచ్చేయగా పిఠాపురమున కప్పటి దివానగు పింజమూరి సుబ్బారాయుడుగారు వీరిదర్శనార్థమై వచ్చి వీరియింట మైసూరుమహారాజు ఛాయాప్రతిమను జూచి, మైసూరులో వీరందిన సత్కారములగురించి విని, పిఠాపురమున కప్పటిరాజగు శ్రీ రావు గంగాధర రామారావుగారికి వీరి కీర్తిని, పాండిత్యమును దెలియబరచిరి. కొంత కాలమునకు శ్రీ రావు గంగాధర రామారావుగారే స్వయముగా ఐనవిల్లిగ్రామమునకు రాగా పాపయ్యశాస్త్రిగారు వారి కత్యంత వైభవముగా గొప్ప సత్కారముల జరిపిరి. పాపయ్యశాస్త్రిగారి పాండిత్యమునకు మెచ్చి శ్రీపిఠాపురమురాజాగారు వారి కిరువదిరెండు పుట్ల భూమి నొసంగిరి. తరువాత పాపయ్యశాస్త్రిగారు క్రమముగా బొబ్బిలి, సాలూరు, మాడుగుల, విజయనగరము మున్నగు సంస్థానముల సందర్శించి గొప్పసన్మానముల బడసిరి. ఇట్లే ఉరట్ల, చినకిమిడి, ఉండి మొదలగు జమీందారీలలోగూడ వీరికి గౌరవముజరిగెను.

పాపయ్యశాస్త్రిగా రెంత సంపాదించుచుండిరో అంతకురెండురెట్లు ఖర్చుచేయు స్వభావము గలవారు. అందుచే వీరికి క్రమ

ముగా ఋణ మెక్కువై, ఋణదాతలయొత్తిడి మిక్కుటమయ్యెను. ఈఋణము క్రమముగా లక్షరూపాయలకు మించెను. అప్పటిరోజులలో హైదరాబాదు నవాబువద్ద నుండిన దివాను పండితపక్షపాతిగా నుండెను. ఆదివానుగారి ద్వారా హైదరాబాదునవాబుదర్శనము చేయ వలయునని సంకల్పించుకొని పాపయ్యశాస్త్రి గారు హైదరాబాదులో ఆరుసంవత్సరము లుండిరి. పాపయ్యశాస్త్రిగారికి పూర్వము పాపయ్యశాస్త్రిగారి జనకులైన అచ్చయ్య శాస్త్రులుగారు హైదరాబాదుసంస్థానములో గౌరవింపబడి మూడువేలరూపాయలపారితోషికము పడసియుండిరి. కాని పాపయ్యశాస్త్రి గారికి హైదరాబాదులో నవాబుగారిసందర్శనములభింపలేదు. హైదరాబాదునుండి పాపయ్యశాస్త్రిగారు బొంబాయికి వెడలి ఆప్రాంతమున దేవకీనందనమహారాజను నొకజమీందారునిచే చాల సత్కరింపబడిరి. ౧౮౯౧లో పాపయ్యశాస్త్రిగారు పూనానగరమున కేగగా నచ్చట బాలగంగాధరతిలకుగారు వీరిని చాల గౌరవించిరి. పూనానగరమునం దుండగనే వీరికి చాల జబ్బుచేసి జంబుఖండిలో వీరు పరమపదింపగా బాలగంగాధరతిలకు మున్నగు మహారాష్ట్రమిత్రులు వీరి కంత్యక్రియలు జరిపిరి. అప్పుడు పాపయ్యశాస్త్రిగారితో దేశాటనము వెడలిన బులుసు నరసయ్య యను ఆంధ్రబ్రాహ్మణు డాసమయమున నచ్చట నుండెను.

తమ ముప్పదియవయేట పాపయ్యశాస్త్రులుగారు అవిడికాపురస్థులు ఆకెళ్లకృష్ణమ్మగారి కొమార్తె బంగారమ్మను వివాహమాడిరి. వీరికీమెవలన నిద్దరుకొమారులు,ముగ్గురుకొమార్తెలు గల్గిరి. కొమారులలో మొదటివాడు ప్రకాశశాస్త్రులుగారు. రెండవవాడు అచ్చయ్యశాస్త్రులుగారు. పెద్దకొమారుడైన ప్రకాశశాస్త్రులుగారు కోటిఫలిలో భాగవతుల హరిశాస్త్రులుగారివద్ద వ్యాకరణమును, తొండారములో వెంపరాల దక్షిణామూర్తిశాస్త్రులుగారివద్ద పూర్వమీమాంసయును, పుల్లెల దక్షిణామూర్తిశాస్త్రులు గారివద్ద కొన్ని శాస్త్రములు నభ్యసించిరి. వీరు తండ్రిని మించిన ఖ్యాతి గణింతురని యనుకొను చుండెడివారు. కాని దైవయోగముచే వీరు1891లో తమ యిరువదితొమ్మిదవయేటనే విషజ్వరపీడితులై మరణించుట తటస్థించెను. తొండారములో ప్రకాశశాస్త్రులుగారికి భమిడిపాటి అచ్యుతరామసోమయాజులుగారు సహాధ్యాయులు. ఈ అచ్యుతరామసోమయాజులుగారు ప్రసిద్ధి జెందిన గొప్పపండితులు. ప్రకాశశాస్త్రులుగారు వల్లూరి కాపురస్థులైన ఆకెళ్ల దీక్షితులుగారివద్ద యజుర్వేదమును, తమతండ్రిగారైన పాపయ్యశాస్త్రులుగారివద్ద విద్యారణ్యముగూడ బఠించిరి. పాపయ్యశాస్త్రులుగారి రెండవకొమారుడైన అచ్చయ్యశాస్త్రులుగారు కూడ గొప్పపండితుడే. వీరు 1925లో చనిపోయిరి.

గొప్పపండితకుటుంబమున బుట్టి ఆంధ్రదేశముననే కాక మహారాష్ట్రమునగూడ పేరెక్కిన విద్వాంసులచే సన్మానింపబడిన బులుసు పాపయ్యశాస్త్రినామము నేడును ఆంధ్రపండితలోకమున గౌరవింపబడుచున్నది.

చెన్నరాజధానియందు ౧౯౩౮-వ సంవత్సరము జూలై ప్రారంభము మొదలు సెప్టెంబరు తుదవరకు గల మూడునెలల కాలమున ముద్రితములయి ప్రకటితములయిన

# ఆంధ్ర గ్రంథముల పట్టిక*

ఆంధ్రవాఙ్మయ మీ క్రింద పేర్కొనిన వివిధశాఖలతో వెలసియుండుటచేతనీపట్టికయందాయాశాఖల నుత్పన్నములగు గ్రంథములాయా శాఖలకే చేర్పబడును. గ్రంథముల నామములన్నియు నకారాదిక్రమమున నుండును.

1. అర్థశాస్త్రము, 2. అలంకారశాస్త్రము-నాట్యకళకు సంబంధించిన గ్రంథములు నయిత మీ శీర్షిక క్రిందనే చేర్పబడును, 3. ఆయుధధనుశ్శాస్త్రములు, 4. ఆరోగ్యశాస్త్రము, 5. ఇతిహాసములు-ఇతిహాసములలోని భాగములు, కథలు, మార్పుచేయక ప్రత్యేకముగ ముద్రింపబడునవి - యీశీర్షిక క్రిందనే చేర్పబడును, 6. కథలు—ఐతిహాసికములు, పౌరాణికములు, 7.—కల్పితములు, 8.—చారిత్రకములు, 9. కల్పము, 10. కామశాస్త్రము, 11. కావ్యములు, 12. గణితశాస్త్రము, 13. గేయములు, 14. చరిత్ర(దేశ), 15. చిత్రలేఖనము, 16. చట్టము(Law), 17. ఛందశ్శాస్త్రము, 18. జంతుశాస్త్రము, 19. జీవితములు, 20. జ్యోతిషశాస్త్రము, 21. తర్కశాస్త్రము, 22. దండకములు, 23. ధర్మశాస్త్రము, 24. నవలలు, 25. నాటకములు, 26. నాట్యశాస్త్రము, 27. నిఘంటువులు, 28. నీతి- నీతికథలుకూడ యీశీర్షిక క్రిందనే వచ్చును, 29. పరిశిష్టము, 30. పాకశాస్త్రము, 31. పారిశ్రామికము, 32. పురాణములు- ప్రత్యేకముగ ముద్రింపబడి ప్రకటింపబడు పురాణములలోని భాగములు నయిత మీ శీర్షిక క్రిందనే చేర్పబడును, 33. ప్రకృతిశాస్త్రము, 34. ప్రబంధములు- ఆంధ్ర సారస్వతమునందు ప్రసిద్ధములగు 'హరివంశము', 'ఆంధ్రచంపూభారతము', 'అచ్చతెలుగు రామాయణము' వంటి పురాణేతిహాసకావ్యములకు సంబంధించినవి, 'పాండురంగమాహాత్మ్యము' వంటి మాహాత్మ్యములు, 'ఆంధ్రమేఘసందేశము' వంటి అనువాదములు, రంగనాథరామాయణము' వంటి ద్విపద గ్రంథములు మొదలయినవి యీశీర్షిక క్రిందవచ్చును, 35. ప్రహసనములు, 36. భూగోళశాస్త్రము, 37. భౌతికశాస్త్రము, 38. మంత్రశాస్త్రము, 39. మతము - హిందు, 40.— ఇతరములు (బౌద్ధ, జైన, క్రైస్తవాదిమతములు)- ఇతరమతములకు సంబంధించిన గ్రంథములు— ఏ విషయ విభాగమునకు సంబంధించిన వయినను- ఈశీర్షిక క్రిందనే చేర్పబడును, 41. మాహాత్మ్యములు, 42. మీమాంసాశాస్త్రము, 43. యక్షగానములు, 44. యోగశాస్త్రము, 45. రత్నశాస్త్రము, 46. రాజకీయములు, 47. వాస్తుశాస్త్రము, 48. విమర్శనము- ఇందు సారస్వతమునకు సంబంధించిన విమర్శనలు మాత్రముండును, 49. వృక్షశాస్త్రము, 50. వేదవాఙ్మయము- ఉపనిషత్తులు, ఇతర వైదిక గ్రంథములునయిత మిందే చేర్పబడును, 51. వేదాంతము - భక్తి జ్ఞాన వైరాగ్య విషయక గ్రంథము లీశీర్షిక క్రింద వచ్చును, 52. వైద్యశాస్త్రము, 53. వ్యవసాయశాస్త్రము, 54. వ్యాకరణ శాస్త్రము, 55. వ్యాపారము, 56. వ్యాయామము, 57. శకునశాస్త్రము, 58. శతకములు 59. సంగీతశాస్త్రము, 60. సాంఘికములు, 61. సాముద్రికశాస్త్రము, 62. సారస్వతము- భాష, 63. స్తోత్రములు, 64. హరికథలు.

* ఈ పట్టికయందుగల సంకేతపదముల వివరణము: అ.—అధ్యాయము; అను.—అనువాదము; అనువాదకులు. ప.—పద్యము. ప్ర.—ప్రకాశకులు. భా.—భాగము. వ.—వచనము. సం.—సంపాదకులు. సటీ.—సటీకము.

## అర్థశాస్త్రము

గృహతంత్రపాఠములు, నెం. ౨—గి. వెంకటరామయ్య

## ఆరోగ్యశాస్త్రము

ఆరోగ్యప్రార్థనా నవరత్నమాలిక—శ్రీరాజా, యం. భుజంగరావు

ఆరోగ్యమార్గములు, పా. ౧, ౨, ౩—గి. వెంకటరామయ్య

ప్రజారోగ్యము, పరిశుభ్రత—(ప్ర) స్వాభివృద్ధిసంఘము, నూజవీడు

## కథలు-ఐతిహాసికములు, పౌరాణికములు

అహల్య—కె. సత్యనారాయణరావు

ఆంధ్రప్రవచనమహాభారతము, (సభా.)—కె. వీరరాజు

ఉత్తరరామచరిత్రము—కి సీతారామరావు

చిత్రభాగవతము—కి. సత్యగోదావరిశర్మ

చిరంజీవులు—ఓ. మాణిక్యశర్మ

చ్యవనుడు—కె.రామకృష్ణశాస్త్రి

జాంబవతీయము—ఏ. నీలకంఠసోమయాజి

దివ్యావతారకథలు—వి. జగన్నాథశర్మ

పంక్తిపావనుడు—వి. శ్రీరామశాస్త్రి

పాతాళగంగాపురాణము—వెంకటరామకవి

పావని—జె. సీతారామస్వామి

బాలదేవీభాగవతము (కథలు), భా. ౧, ౨, ౩—వి. జగన్నాథశర్మ

భగీరథుడు—కె. వెంకటరామయ్య

భగీరథచరిత్ర—యస్. పార్థసారథి.

భాగవతకథావళి—చ. యోగానందకవి

భారతకథాలహరి—కి. సీతారామరాజు

భారతమోక్షులు, భా. ౩—చ. వీరభద్రరావు

మహాపతివ్రతలకథలు—యం. శ్రీరామమూర్తి

శ్రీకృష్ణచరిత్రము—కె. సత్యనారాయణరావు

శ్రీమద్రామాయణము, అయోధ్యా—వి. నరసింహకవి

శ్రీరామచరిత్రము—కె. సత్యనారాయణరావు

సావిత్రీవ్రతకథ—కె. వెంకటసుబ్బమ్మ

హరిశ్చంద్ర—యన్. సి. దేశికాచార్లు

## కల్పితములు

కథామంజరి—కి. సీతారామరావు

కాదంబరీకథాసారము—టి. పాపయ్యశాస్త్రి

షేక్స్పియరునాటకకథలు, భా. ౨—కె నరసింహం

## చారిత్రకము

కాళిదాసచరిత్రము—రామనారాయణకవులు

విక్రమార్కునికథలు—(ప్ర) వి. రామస్వామిశాస్త్రి అండ్ సన్స్, మదరాసు

హిందూదేశచరిత్రకథలు, తరగతి ౪—ఆర్. శేషగిరిరావు

## కల్పములు

కూశ్మాండదానవ్రతకల్పము—చ. లక్ష్మీనరసింహశాస్త్రి

వినాయకవ్రతకల్పము, చవితిపద్యము—(ప) జి. జగన్నాథం అండ్ సన్, రాజమహేంద్రవరము

వినాయకవ్రతము—(ప) పద్మాఅండ్ కో. బాపట్ల

సావిత్రీగౌరీవ్రతకల్పము—చ. లక్ష్మీనరసింహశాస్త్రి

## కావ్యములు

ఆంధ్రరామాయణము (ప), భా. ౨—చ. యోగానందకవి

శ్రీ తులసీరామాయణము (ప), అయోధ్యాకాండ—(అను) బి. నరసింహశర్మ

## గణితశాస్త్రము

ఆరంభగణితము, భా. ౨; అనుబంధము—పె. వి. శేషఅయ్యర్, వి. వెంకటసుబ్బయ్య

గణితదీపిక, తరగతి ౧—యస్. రంగరావు, జే. సీతారామసోమయాజులు

గణితము—ఏ. రామకోటిశాస్త్రి

గణితశాస్త్రము—వి. శ్రీనివాసాచారి

## గేయములు

అడవిగోవిందనామములు—(ప) జి. జగన్నాథం అండ్ సన్, రాజమహేంద్రవరము

ఈశ్వరలాలిపాటలు—ఆర్. సోమయాజికవి

కోలాటపుకీర్తనలు—వై. నరసింహకవి
గజేంద్రమోక్షము—కె. వీరయ్య
ఛత్రపురిజావళీలు—సి. యస్. కృష్ణయ్యశెట్టి
తారకభజనకీర్తనలు — (ప) సి. సీతారామస్వామి, ఏలూరు
పరతత్వకీర్తనావళి—ఏ. రంగయ్య
బాలగీతాంజలి, తరగతులు ౧, ౨, ౩—కె. రామకృష్ణశాస్త్రి
బాలగీతావళి, తరగతులు ౧, ౨—వెంకటపార్వతీశ్వరకవులు
భజనకీర్తనలు (కృష్ణ)—వి. సత్యనారాయణమూర్తి
భజనకీర్తనలు (శ్రీరామ)—వి. సత్యనారాయణమూర్తి
భద్రాద్రిరామ వేణుగోపాల తారావళులు—పి. సుందరరావు
మాలపద్ధి—జే. రంగస్వామి
రుక్మిణీదేవిముచ్చట—(ప) ం. జగన్నాథం అండ్ సన్, రాజమహేంద్రవరము
విష్ణులాలిపాటలు—ఆర్. సోమయాజికవి
శ్రీకృష్ణలీల భజనకీర్తనలు—యు. దక్షిణామూర్తి
శ్రీపారిజాతపల్లవి—(ప) జి. జగన్నాథం అండ్ సన్, రాజమహేంద్రవరము
శ్రీరామభజనకీర్తనలు, భా. ౧, ౨—వి. నరసింహకవి
సగుణనిర్గుణతత్వకందార్థపదములు—సి. శివరామబ్రహ్మేంద్రస్వామి
సత్యహరిశ్చంద్రభజనకీర్తనలు—బి. రామరాజు
హరిభజనానందకీర్తనలు—జి. వీరయ్యదాసు

## చరిత్ర

జీర్ణవిజయనగరచరిత్రము—కె. ఈశ్వరదత్తు
హిందూదేశచరిత్ర, భా. ౩—వి. శ్రీనివాసరావు

## చిత్రలేఖనము

శతశిల్పిడ్రాయింగుబుక్కు—యన్. నరసింహం

## జంతుశాస్త్రము

అశ్వలక్షణసారము—మనుమంచిభట్టు

## [illegible]

[illegible]—యన్. కృష్ణస్వామయ్య

## జ్యోతిశ్శాస్త్రము

ఆంధ్రజాతకతత్వము—ఏ. వెంకటశాస్త్రి
జాతకఫలచింతామణి—వి. సీతారామయ్య
జ్యోతిషరహస్యబోధిని—యన్. వెంకటసుబ్బారాయుడు
దైవజ్ఞశిఖామణి—పి. వీరభద్రసిద్ధాంతి
మేషమాలికాశాస్త్రసంగ్రహము—సి.వి. లక్ష్మీనరసింహశాస్త్రి

## దండకములు

ఆంజనేయదండకము—వి. నరసింహకవి

## నవలలు

కమల, భా. ౧, ౨—బి. రామచంద్రరావు
గోపసంపతులు—వి. వెంకటలక్ష్మీనరసింహరావు
చంద్రవదన—యన్. కుమారసూర్యప్రకాశరావు
దోబూచి—ఎ. యస్. పద్మనాభరాజు
నీవేనా—యం. శ్రీరామమూర్తి
నేనే—జి. వెంకటచలపతిరావు
పరిశోధన— జె. వెంకటరాధాకృష్ణయ్య
రూపసుందరి—డి. వెంకటసుబ్బారావు
విద్యార్థివిపత్తు—కె. కృష్ణరావు
వీరభద్రపాల్—కే. రామకృష్ణశాస్త్రి
సువర్ణచూళిక—ఏ. సోమేశ్వరరావు
హాస్యవినోది—కె. కృష్ణరావు

## నాటకములు

అభిజ్ఞానశాకుంతలము (సటీ), భా. ౧—(ప్ర) కె.వ్యాసాచారి, గుంటూరు
కాంతాపహరణము—పి. కృష్ణమాచారి
కోర్టుమజానాటకము—యం. వెంకటరత్నం
గయోపాఖ్యానము—చిలకమర్తి లక్ష్మీనరసింహము
గోవర్ధనోద్ధారణము—శ్రీరాజావెంకటాద్రి అప్పారావు
చిత్రాంగదాపరిణయము—పి. రామానుజాచారి

గేనుకొండవిరాటపర్వనాటకము—డి. వెంకటయ్య
నందునిచరిత్రము—వి. వెంకటాచలయ్య
పాదుకాపట్టాభిషేకము—పుట్టా రామన్న
ప్రద్యుమ్న నాటకము—ఆర్. చినకోటమరాజు
ప్రసన్నరాఘవనాటకము—(అను) యం. భుజంగరావు
భక్తరత్నము—ఆక్కిదాస్‌ జోష
మధుసేవ—నాటకసరస్వతి
ముద్దుకృష్ణనాటకము—కె. జగన్నాథదాసు
యక్షధర్మజసంవాదము—బి. హనుమంతరావు
యాదవసంభవము—చి. యోగానందకవి
రామదాసు—రామనారాయణకవులు
వృద్ధవివాహము—కి. వెంకటరంగాచార్లు
శ్రీఅనుమలవీటి-వారిశ్చంద్రనాటకము—యు. శేషకవి
శ్రీమజ్జీనగరసావిత్రీనాటకము—కె. సీతారామకవి
సంగీతసావిత్రి—కి. కామేశ్వరరావు
సతీఅనసూయ—యస్. రామానుజరావు
సతీతార—ఏ. వెంకటశేషకవి
స్త్రీమిత్రమఅనుచంద్రముఖీవిజయము—సి. చంద్రశేఖర రావు

## నీతి

నీతికథావళి, భా. ౧ మొ. ౭ వరకు—వెంకటపార్వతీశ్వరకవులు
నీతికథావాచకము, తరగతులు ౧, ౪, ౫—యస్. వెంకటప్పయ్యశాస్త్రి
నీతిపదవి, భా. ౧, ౨—జి. శ్రీరామశాస్త్రి
పంచతంత్రసంగ్రహము—నారాయణకవి
పిల్లలకథలు, భా. ౧—టి. భాస్కరశాస్త్రి
బాలసుభాషితములు—కె. వెంకటనారాయణ
వేమనరత్నములు—వేమనయోగి
సతీహితబోధిని—సి. హనుమంతప్ప
సత్కథామంజరి, భా. ౩—జి. శ్రీరామశాస్త్రి

## పరిశిష్టము

అగ్నికులక్షత్రియ మహాసంఘనిబంధనలు—(ప్ర) అగ్నికులక్షత్రియమహాసంఘము, కోరింగ
ఆత్యద్భుతరహస్యరత్నాకరము—టి. సూర్యప్రకాశరావు
అష్టావధానము—పి. శ్రీనివాసరావు
ఆంధ్రకథావాచకము, తరగతులు ౧ మొ. ౬ వరకు—బి. పూర్ణయ్యశర్మ
ఆంధ్రపద్యగద్యముక్తావళి, భా. ౧, ౨, ౭—కె. నరసింహం
ఆంధ్రభారతీతీర్థ—(ప్ర) పి. జగన్నాథరావు, విజయనగరము
ఆంధ్రవాచకము, తరగతులు ౨, ౪—ఏ. జయరామరావు, డి. జగన్నాథశాస్త్రి, కె. నారాయణమూర్తి
కాలజ్ఞానము, భా. ౨—జె. బాలవెంకటసుబ్బారెడ్డి
కావ్యసంగ్రహము, భా. ౧, ౨—(ప్ర) వెంకటరాం అండ్ కో. ఏలూరు
గిరిరాజవిజయము—ఆర్. కేశవరావు
జన్మశాసనము—వై. శ్రీరాములు
తెనుగుఅభ్యాసబోధిని, భా. ౧—ఆర్. వెంకటసుబ్బయ్య
దసరాపద్యములు—చ. యల్లమందనాయుడు
దాంపత్యరహస్యములు—యస్. జి. ఆచార్య "సారథి"
వర్మదాపరిణయము—యస్. గోపాలం
నవ్వులరామాయణము, వచనకావ్యము—వి. రామకృష్ణనాయర్
నాటకకథావాచకము, తరగతులు ౧ మొ. ౫ వరకు—కె. వీరమల్లయ్య
నాలుగవతరగతి క్రొత్తతెలుగువాచకపుస్తకము—యస్. భూషణం
నాల్గవవాచకమునకు నోట్సు—(ప్ర) యం. ఆది అండు కో, మదరాసు
నిర్మలహృదయము—(Mrs) వెస్ట్
పడిపువ్వుత్తిపాట్లు—చ. వీరభద్రదాసు
పదుసేనవ మహాసభాకార్య నివేదికము—(ప్ర) కె. నాగేశ్వరరావు, మదరాసు
పద్యరత్నపేటిక—ఏ. రాఘవరావు
పశులకాపరి—యం. జాన్. రామానుజులు
పితృస్మృతి—యన్. వి. రంగనాథస్వామి

పురాణవాచకము, తరగతులు ౧, ౨—కి. సోమన్న, భ. నారాయణమూర్తి

ప్రభవ—యస్. శ్రీనివాసరావు

ప్రభావతి—వి. భానుమూర్తి

బాలకృష్ణవాచకపుస్తకము, వా. ౧—జి. బాలకృష్ణమూర్తి

భాగవతామృతము—జి. వెంకటసుబ్బారావు

మణిభూషణము, భా. ౧, ౨—(ప్ర) కే. నాగేశ్వరరావు, మదరాసు

మారుతి మొదటివాచకము—ఆర్. సూర్యనారాయణరావు

మూడవతరగతిఅర్థము—(ప్ర) సి. బి. దాస్ అండ్ కో., గుంటూరు

మెట్టువేదాంతము—ఏ. వెంకటేశకవి

మైలవరపు శేషమ్మయొక్క జ్ఞాపకార్థముగ వ్రాయబడిన పద్యములు—శి. రామవదీక్షితులు

యూదజనాంగప్రారంభచరిత్ర—(ప్ర) యస్. పి. సి. కె. డిపో, మదరాసు

రాజభక్తులు—శి. సీతారామరావు

రెండవతరగతిపుస్తకము—యం వెంకటరత్నం, కె. వీరేశలింగం

లలితవాచకము, నెం ౪— యన్. వెంకటనరసింహరావు

విచిత్రగృహము—(ప్ర) క్రిశ్చియన్ లిటరేచర్ సొసైటి, మదరాసు

వివాహనిర్మూలనము—ఆర్. బి. శేషాచారి

శ్రీకన్యకాపరమేశ్వరదేవాలయము— (ప్ర) - యస్. బంగారుశెట్టి, గుడియాత్తం

శ్రీకల్యాణానందయతిగారికి బహిరంగలేఖ—(ప్ర) జె. వి. సుబ్రహ్మణ్యం, బరంపురము

శ్రీమద్భాగవతసారము—(ప్ర) పి. నరసింగరావు, మచిలీపట్టణము

శ్రీరామావతారము—వి. తిమ్మరాజకవి

శ్రీవిద్యారణ్యులమహిమ, హంపి—పి రామచంద్రయ్య

శ్రీశారదాస్మృతి—జి. జానకి

సంసారపద్ధతిపత్రిక—యం. ప్రతాపరెడ్డి

సంస్కృతభాషాదేశచరిత్ర—బి. సుబ్బారావు

సింహాచలయాత్ర—కె. సుబ్బారావు

సివిక్స్‌వాచకము, తరగతి ౫—వి. కే. రామమూర్తి

సీతారామరాజమరణకారణము—ఫింపిల్లి రామారావు

సుకవిసూక్తిసుధానిధి, భా. ౧, ౨—(ప్ర) వెంకట్రామ అండ్ కో., ఏలూరు

సెట్టిబలిజ అష్టమవార్షికమహాసభ ఆహ్వానసంఘాధ్యక్షోపన్యాసము—జి. నారాయణ

సోమశైలేశ్వరీయము—యం. నరసింహశర్మ

## పారిశ్రామికము

గృహపరిశ్రమలు—భ. నారాయణ

ఛాయాగ్రహణతంత్రము, భా. ౨—యన్. గోపాలస్వామినాయుడు

రాటము-మగ్గము—(ప్ర) కే. నాగేశ్వరరావు, మదరాసు

విద్యాసురు, భా. ౨—యన్. గోపాలస్వామినాయుడు

## పురాణములు

విష్ణుపురాణము (వ)—యన్. గురులింగశాస్త్రి

శ్రీరామచరిత్రము, (ప. స.)—(ప్ర) కె. నాగేశ్వరరావు, మదరాసు

## ప్రకృతిశాస్త్రము

జలార్ణవశాస్త్రము—చ లక్ష్మీనరసింహశాస్త్రి

ప్రకృతిశాస్త్రపాఠపుస్తకము, బుక్ ౧; ౧ ఏ—జి. వెంకటరామయ్య

ప్రకృతిశాస్త్రసారములు, ఫారములు ౧, ౨, ౩—జి. వెంకటరామయ్య

ప్రకృతిశాస్త్రపాఠములు, ఫారము ౪—జి. వెంకటరామయ్య, బి యస్. దత్తు, జి సత్యనారాయణ

శాస్త్రవాచకపాఠములు, నెం. 3—యం. సాంబశివరావు

## ప్రబంధములు

శృంగారభల్లాణచరిత్ర—సి. గంగాధరకవి

## భూగోళశాస్త్రము

ఏజన్సీభూగోళవాచకము—యం. కృష్ణమూర్తి

## మతము—హిందు



## — ఇతరములు



## మాహాత్మ్యములు



## రాజకీయములు



## వాస్తుశాస్త్రము



## విమర్శనము



## వేదాంతశాస్త్రము



## వైద్యశాస్త్రము



## వ్యవసాయశాస్త్రము

## వ్యాకరణశాస్త్రము

పరిమితవ్యాకరణము—యం. వెంకటకృష్ణశాస్త్రి

## శతకములు

జానకీవల్లభశతకము—యల్. తమ్మయ్యకవి
నానార్థశివశతకము—యం. రామకోటేశ్వరశాస్త్రి
నీతిశతకము—(ప్ర) వెంకటరాం అండ్ కో., ఏలూరు
నృసింహశతకము—శేషప్పకవి
మల్లికార్జునశతకము—కె. రామబ్రహ్మచార్లు
మానసశతకము—బి. పెదఈశ్వరరెడ్డి
రామశతకము—బి. నరసింహకవి
విశ్వబ్రహ్మశతకము—కె. లక్ష్మణకవి
వెంకటేశశతకము—బి. నరసింహకవి
శ్రీఅనంతపద్మనాభశతకము—కె. జోగరావు
శ్రీకన్యకాపరమేశ్వరీశతకము—డి. వెంకటస్వామిగుప్త
శ్రీపతిశతకము—కె. రామస్వామి
శ్రీవెంకటేశ్వరశతకము—యస్. అనంతాచారి
శ్రీవేణుగోపాలశతకము—బి. నరసింహకవి
శ్రీహరిశతకము—బి. నరసింహకవి
స్వప్రకాశశతకము—యల్. అప్పలాచార్లు

## సంగీతశాస్త్రము

సంగీతవిద్యాబోధిని—వై. జగన్నాథం

## సాంఘికములు

సప్తపదశతకము—పి. శ్రీరామశాస్త్రి

## సారస్వతము—భాష

గీర్వాణవాక్ప్రపంచచరిత్ర—పి. వి. సుబ్రహ్మణ్యశర్మ

## స్తోత్రములు

గురుస్తోత్రము—యం. సుబ్బారావు
మహానందీశ్వరతారావళి—ఏ. వెంకటశేషకవి
శ్రీకృష్ణస్తోత్రామృతము—పి. వెంకటనారాయణయ్య
శ్రీభక్తామృతము—ఏ. కేశవనారాయణ
శ్రీమహాంజనేయస్తోత్రం—(ప్ర) యన్. ఏ. యన్. సుందరాచార్య, చిత్తూరు
శ్రీరామచంద్రనక్షత్రమాల (సటీ)—జి. అనంతాచారి
శ్రీరామతారావళి—పి. కోటిరెడ్డి
శ్రీరామస్తవము (సటీ)—(ప్ర) టి. రామస్వామయ్య, మదరాసు
శ్రీరామస్తుతి—జి. జగన్నాథం అండ్ సన్, రాజమహేంద్రవరము
శ్రీశివస్తోత్రమంజరి—కె. సుబ్రహ్మణ్యంఅయ్య
శ్రీసుబ్రహ్మణ్యస్తోత్రము—ఆర్. వెంకటసుబ్బయ్య

## హరికథలు

గజేంద్రమోక్షము—కె. నారాయణదాసు
వేదవతిచరిత్ర—జి. సత్యనారాయణమూర్తి
సీతాకల్యాణము—కె. వెంకటాచారి

# నటకులకు బిరుదము లిచ్చువారికి సూచనలు






## సుక్కూరు ఆనకట్ట

(Sukkur Barrage)

బొంబాయిరాష్ట్రములోని సుక్కూరులో 'ల్లాయిడు ఆనకట్ట' ఈమధ్య అధికారరీత్యా ప్రకాశనము చేశారు. ప్రపంచములో ఉన్న ఆనకట్టలన్నిటిలోను ఇదే పెద్దమట. అప్పుడు బొంబాయి గవర్నరుగా ఉన్న సర్ జార్జి ల్లాయిడుగారు (ఇప్పుడు ల్లాయిడుప్రభువు) ౧౯౨౩ సం. అక్టోబరు ౨౪ తే. దీనికి పునాది వేశారు. ఈకట్టడము పూర్తి అయేసరికి ఎనిమిదేళ్లు పట్టింది. సింధురాష్ట్రములో ౭౦,౦౦,౦౦౦ ఎకరాలు ఈ ఆనకట్ట ఆయకట్టు;—వస్తుతః సాగుఅయేమేర ౬౦,౦౦,౦౦౦ ఎకరాలేకాని; అంటే ఈజిప్తుదేశపు సాగుబడినేల అంతా కలిపితే, ఇంకా ఇది ౫౦,౦౦,౦౦౦ ఎకరము ఎక్కువ అన్నమాట. ఇది కట్టడానికి ముప్పదియైదులక్షల పౌనులు పట్టింది—'అసుఆన్' డాముకికంటె పదిలక్షలపౌనులు ఎక్కువఅన్నమాట. ఇది సింధునదిమీద రెండుబ్రహ్మాండమైనవంతెనలు లేపింది. ఒక్కొక్కటి దాదాపు ఒకమైలు పొడవు,—లండను వంతెనకుసుమారు ఐదురెట్లు. డాములో ౬౬ అలుగులు (తూములు)ఉన్నవి. ఒక్కొక్కటి ౬౦ ఏసి అడుగుల వెంబ. దానినడుమ పెద్ద పెద్ద ఉక్కుతలుపులు అమరినవి. ఏడుపెద్దకాలువలున్నవి. అందులో మూడు 'సూయజు కాలువ' కంటెను-పెద్దవి. అతి పెద్దదైన రోరీకాలువ ౨౦౫ మైళ్లు పొడుగు; దానిపిల్లకాలువలు, పంటబోదెలు ౨,౩౦౦ మైళ్లు కున్నవి. తల్లి-రైసు-కాలువ (The Central Rice Canal) థేమ్సునది చేసినంతపని చేస్తుంది; దాని కాలువల త్రవ్వపని నాలుగు సూయజుకాలువల పెట్టు, వంచ మహాసూచీఫలకముల (Great Pyramids) సాటి. ఇందుల సామానులు మీదా ౨౦ లక్షల టన్నులదా కృగా, పత్తి పండుతవి. మొత్తము ఖర్చు, కాలువలకూ కలిసి ౧,౫౦,౦౦,౦౦౦ పౌనులు అవుతుందని అంచనా వేశారు.

---

## సయామునందలి మూడు ప్రాచీనవిగ్రహములు

'కోపే' (Kope) సియాందేశములో నొక చిన్న పట్టణము. 'పినాంగు' నుండి అచటికి రెండు రోజులు నదిలోను, బస్సుపైన ఆరుగంటలు అడవిలోను ప్రయాణించవలసినదూరమున నున్నది. ఈ 'కోపే' నుండి విగ్రహములుంచుకొనుటకు ఘాతుకమృగములతో నిండిన అడవియందు నడుమ 'బోబు' పై అర్ధదివసము పోవలెను. కొన్ని శతాబ్దములకుమున్ను ఈస్థలము బక్తియులకు ప్రశస్తతీర్థముగ నుండెడిది. సయామీయుల దండయాత్రవలన నిది పాడువడెను.

విగ్రహములు తొలుత కనుపడినతోడనే 'మ్యూజియము'నకు కొనిపోయి యుంచ నాలుగుమైళ్లమేర సాగించిరి. అంతలో కుంభద్రోణముగా వర్షించి యాప్రాంతములు జలమయ మయ్యెను. అంతవిగ్రహములను గొని పోయి మరల యథాస్థానమున నుంచిరి.

మనుజప్రమాణమున నున్న యీ విగ్రహములను గని యొకపుడొక యడవియేనుగు నడుమనున్న (రామ) విగ్రహమును డీకొనెను. దంతప్రహారముచే విగ్రహముకిరీటమును, శీర్షమున గొంతభాగమును విరిగిపోయినవి. ఏనుగది కాంచి విగ్రహములను పలుమారు ప్రదక్షిణించి యెదుట సాగిలబడి యచటనే తనప్రాణములను విడిచెను.

ఆమేనుపు కపాలమే యట నేటికిని ప్రదర్శింపబడు చున్నది.



ఎన్నిమారులో ఈవిగ్రహములను మరమ్మతుచేయ ప్రయత్నింపబడెను. ప్రతిపర్యాయమును గండుతుమ్మెదలు పంక్తులు పంక్తులుగ ముసురుకొని మరమ్మతు చేయ బోయినవారిని తరిమివేయుచుండినవట. సయామీయు లీ తీర్థము సత్కృతమహిమగలదానినిగా విశ్వసింతురు. దేశమనావృష్టికోప పీడితమయి పంటలు పాడగుచున్న సమయమున శ్రీమంతునిమొదలు భిక్షుకునివరకు గల యెల్ల జనులును ఇచ్చట చేరి ప్రార్థనలు గావింతురు. అపుడు పూజారి యొకశిలాఫలకమును లేవదీసి వెలికిల బడవైచును. దానిపై నేదియో వ్రాతకలదు. అట్లు లేఖనము సూర్యునివైపు త్రిప్పబడినంతనే సూర్యకాంతి మాసి ఆకసమున మబ్బు లలముకొని కొలదికాలముననే ధారాపాతముగ వానకురియునట.

చైనీయు డొకడు జూదమాడి ధనమెల్ల గోలుపోయి యాత్మహత్య గావించుకొన నిశ్చయించు కొని యీ విగ్రహము లున్నచోటికి వచ్చి వానియెదుర పరుండి నిద్రించెనట. అర్ధరాత్రమున దేవుడు వానికి ప్రత్యక్షమయి 'యిటనుండి వెడలిపొమ్మ'నెనట. అతడు 'నేను కదలను. మీయిష్టము చొప్పున చేయు'డని చెప్పెనట. అతనిధైర్యమునకు దేవుడు మెచ్చుకొని మరల నాతని 'జూదమాడు'మని పలుకుచు వానికి పణమునకయి యింట ధనమున్నచోటును గుర్తుచెప్పెనట. ఆత డింటికి పోయి దేవుడుచెప్పినచోట నున్న సొమ్మును పుచ్చుకొని మరల జూదమాడ నాతని కపారధనము లభించెనట. అందు కొంతసొమ్మును వెచ్చించి యాతడు విగ్రహముల చుట్టు గోడను, సోపానములను నిర్మించి వానిపయి శిల్ప చిత్రములను చెక్కించెనట. ఈవిగ్రహములు సీతారామ లక్ష్మణులవని ప్రతీతి.

ఆర్యదాసు.

---

## ఆరోగ్యగోళము

ఇది అరువదినాలుగడుగులు వ్యాసము గలది. ఐదు అంతస్థు లిందు గలవు. ముప్పదియారుగురు రోగుల క్రింద




## 'గాయకసార్వభౌమ"

### బ్ర. శ్రీ పారుపల్లి రామకృష్ణయ్య పంతులుగారు



### జననము — విద్యాభ్యాసము

వీరు వ్యయనామసంవత్సరమున ప్రాచీనాంధ్ర ప్రాజ్యస్థానమగు శ్రీకాకుళమునందు జన్మించి, పెద కళ్లేపల్లివాస్తవ్యులును, విఖ్యాతవాగ్గేయకారక సద్గురువర్యులును నగు బ్రహ్మశ్రీ సుసర్ల దక్షిణామూర్తిశాస్త్రులవారియొద్ద సంగీతవిద్య నభ్యసించి విఖ్యాతయశస్కులయిరి. ఈ దక్షిణామూర్తిశాస్త్రులవారు తంజపురిమండలములోని మానాంజాపడివాస్తవ్యులు, సుప్రసిద్ధాంధ్రులు, విఖ్యాతవాగ్గేయకారకులునగు బ్ర. శ్రీ ఆకుమళ్ల వేంకటసుబ్బయ్యగారిశిష్యులు. శ్రీ వీణ ధర్మదీక్షితులు, పట్నం సుబ్రహ్మణ్య అయ్యరు, మహావైద్యనాథ అయ్యరు లోనగువారెల్లరును ఈ వేంకటసుబ్బయ్యగారి శిష్యగణమునఁ జేరినవారే! త్యాగరాజబ్రహ్మేంద్రుని సమకాలికులును, సుప్రసిద్ధ గాయకశిఖామణులు నగు వేంకటసుబ్బయ్యగారి దగ్గఱ ఫ్లూటు శరభశాస్త్రిగారును, దక్షిణామూర్తిశాస్త్రులవారును గలసి సంగీతవిద్య నభ్యసించిరి. మన రామకృష్ణయ్యపంతులుగారు పండితవతంసమగు శ్రీ దక్షిణామూర్తిశాస్త్రులవారియొద్ద విద్యాభ్యాస మొనర్చునప్పుడే కాకినాడ గానసభలను బరికించుచు గొప్ప పాండిత్య మలవఱచికొని దక్షిణదేశమందుఁ బెక్కు పర్యాయములు సంచారముఁజేసి సుప్రసిద్ధగాయకు లని పేరెన్నికఁ గాంచిరి.

### సమ్మానములు

ఆసంచారసమయముననే తిరువయ్యారు త్యాగబ్రహ్మ ఆరాధనోత్సవమునకుఁ బోయి గోటు కృష్ణమూర్తిశాస్త్రులవారి కచేరియందుఁ దమకుఁగల వాయు

లీనప్రావీణ్యమును గనఁబఱచి మాంగుడి చిదంబరభాగవతులు, తంజపురి పంచాపకేశ భాగవతరు మొదలగు వారిచే నత్యధికముగఁ బ్రశంసింపఁబడిరి. వీరు జంత్రగాత్రములందు నిపుణులు. వేణుగానమునుగూడ నభ్యసించిరి. ౧౯౧౫-వ సంవత్సరమునఁ జెన్న రాష్ట్రాధిపతి యగు శ్రీ పెంట్లండు ప్రభువుగారు తెనాలికి వచ్చినప్పుడు వీరి గానామృతమును గ్రోలి తన్మయం జెంది పురవాలకసంఘమువా రొకబంగారుపతకమును జేయించి శ్రీ పెంట్లండు ప్రభువుగారిచే వీరి కిప్పించిరి. ఇవ్వార్తనాలించి బరోడాయందలి ప్రముఖులు కొందఱు ౧౯౧౬-వ సం॥ రము మార్చి నెలలో వీరి నాహ్వానించి బహూకరించిరి. స్వదేశమునకు వచ్చునప్పుడు బొంబాయి నగరాంధ్రసోదరు లాహ్వానించి మాతృదేశమున కెనలేని గౌరవమును సంపాదించిన ప్రముఖులని వీరి నత్యధికముగ సమ్మానించిరి. ౧౯౨౧-వ సం॥ రము నవంబరు ౨౨-వ తేదీని చెన్నపురి త్యాగరాజగానసభవా రాహ్వానించి గోఖలేహాలులో సభను జేయింప వీరిగానమును విని సంగీత విద్వాన్ కే. వి. శ్రీనివాసఅయ్యంగారు, కీర్తనాచార్య, సి. ఆర్. శ్రీనివాసన్ మున్నగు సుప్రసిద్ధసంగీతవిద్వాంసులు తన్మయులై వీరియశఃకాంతను సమధికాలంకారములతో నలంకరించిరి. ౧౯౨౩-వ సం॥ రమునఁ గాకినాడయందు జరిగిన అఖిలభారత గాయకమహాసభయందును, ౧౯౨౭ వ సం॥రమునఁ జెన్నపురియందు జరిగిన అఖిలభారత గాయకమహాసభయందును, వీ రాహ్వానింపఁబడి యుత్తమతరగతి సమ్మానగౌరవముల నందింపఁబడిరి. ౧౯౨౯-వ సం॥రము మేనెల ౨౯, ౩౦ తేదులందు విజయనగరమున జరిగిన ప్రథమాంధ్రసంగీత పరిషత్సభ కధ్యక్షతవహించి యమూల్యోపన్యాస మొసంగిరి. ౧౯౨౮ వ సం॥రమునఁ గాకినాడ శ్రీరామసమాజము (రిజిస్టర్డు) వారు వీరిగానామృతమును దనివిదీరఁ గ్రోలి బంగారుపతకమును, బంగారుగొలుసును, సమర్పించి ముగ్ధులైరి. ౧౯౩౦-వ సం॥రమున విజయవాడయందు జరిగిన నాల్గవ యాంధ్రగాయకమహాసభకాహ్వానసంఘాధ్యక్షులుగనుండి కచేరిచేయఁగా నం దపురూపరాగములకుఁ జెందిన అహిరిరాగము నంగల తానవర్ణము ఎత్తుగడ యందె విలక్షణమైన సభారంజకత, రక్తి ప్రారంభమయ్యెను. ఆనాఁటి సభికు లెల్లరును వీరి నత్యధికముగఁ బ్రశంసించి గౌరవించిరి. ఇరువదియైదు సం॥ రములక్రితము సంగీతవిద్యావ్యాప్తికయి దివాన్‌బహద్దరు కొమ్మిరెడ్డి సూర్యనారాయణమూర్తి నాయఁడుగారు గానసభ యొకటి నెలకొల్పి సుప్రసిద్ధ గాయకరత్నముల గౌరవించుచుండుట సంప్రదాయముగ నుండెను. తత్సంప్రదాయానుసారముగ విద్వాంసులెందఱో సువర్ణపతకములచే బహూకరింపఁబడిరి. అగ్లె రామకృష్ణయ్య పంతులుగారును సువర్ణపతకముచే బహూకరింపఁబడిరి. ఆంధ్రులలో నిట్టిగమున గౌరవింపఁబడినవారిలోఁ బ్రథములు వీరే!

## "గాయకసార్వభౌమ" బిరుదము

౧౯౩౧-వ సం॥ రమున మార్చినెల ౭, ౮, ౯ తేదులందు నరసరావుపేట యందు జగ్గయ్యపేట వాస్తవ్యులును సుప్రసిద్ధ సంగీత విద్వాంసులును నగు బ్రహ్మశ్రీ పిరాట్ల శంకరశాస్త్రిగారి యధ్యక్షతను జరిగిన ద్వితీయాంధ్ర సంగీత పరిషన్మహాసభయందు వీరి విద్వత్తును మెచ్చుకొని సభికులు వీరికి 'గాయకసార్వభౌమ' బిరుదమొసంగి సమ్మానించిరి.

## విద్యాప్రదానము

విద్వాన్ చిలకలపూఁడివేంకటేశ్వరశాస్త్రులవారు, దాలిపర్తి పిచ్చిహరి, సంగీతవిద్వాన్ అద్దంకి శ్రీరామమూర్తి, నటరత్న పారుపల్లి సుబ్బారావు, సుబ్బయ్యశ్రేష్ఠి మొదలగువా రెందఱో వీరిశిష్యులు. సర్వజ్ఞుండగు నీశ్వరుండు శ్రీరామకృష్ణయ్యపంతులుగారి కిట్లోఽధికాయురారోగ్యైశ్వర్యంబుల నొసంగి సర్వకాలము నాంధ్రలోకంబు నలరింపఁజేయుఁగాత.

కో. వేం. శ.








శ్రీమతి భీమిరెడ్డి అన్నపూర్ణమ్మగారు
సత్తెనపల్లి తాలూకా దొడ్లేరు నివాసులు
భీమిరెడ్డి వెంకటప్పా రెడ్డిగారి కొమార్తె

శ్రీమతి ఉన్నవ వరలక్ష్మమ్మగారు
శ్రీ ఉన్నవ దంపతులకోడలు, గుంటూరు.

వీరిరువురు గుంటూరుపురమునందలి శారదానికేతనమున ఎనిమిదేండ్లు విద్యాభ్యాసముచేసి 'సాహితి', 'విదుషి' పట్టములను గడించిరి. ఇరువురును పదునెనిమిదేండ్లలోపువారు.

వీరికి తెలుగు, సంస్కృతము, హిందీ వీనియందు మంచి ప్రవేశము గలదు. ఇంగ్లీషు నందును జ్ఞానము కలదు. సంగీతము నభ్యసించిరి.



# విమర్శనము



## మేఘదూతము

(ఆంధ్రగ్రంథమాలయందలి పదునారవ కుసుమము.) వెల రు ౦-౧౨-౦.

కర్త: దీపాల పిచ్చయ్యశాస్త్రిగారు (కళానిధి గ్రంథమాల, నెల్లూరు).

ఇది పద్యాత్మకము. ఇందలి యితివృత్తము కాళిదాసునిది. కాని యిది 'తు చ' లు సైతము తప్పకూడదని కావించిన నీరసానువాదము కాదు. మూలమునందలి భావసంపదను కోలుపోవని స్వతంత్రరచనము. మూలముతో దీనిని, దీనితో మూలమును రసికులు పోల్చిచూడ జనను. దేనికది సుందరము. భాషలు ప్రత్యేకలక్షణములు గలవి గదా! ఇట్టిరచనము సహృదయహృదయంగమము. దీనికి కవిస్వాతంత్ర్యము కారణమని రసజ్ఞులు గ్రహింపగలరు. కృత్యవతరణికయందు కవి

ఉ. కమ్మని జాను తెల్గునుడి
కారము జాతియుఁ దోఁప మూలకా
వ్యమ్మనఁ బోల్చు భావము స
మస్తము తేటపడంగ శిష్టమా
ర్గమ్మనఁ గూర్పుమార్పు లల
'రన్ బచరించినచో స్వతంత్ర కా
వ్య మ్మని చెప్ప నొప్పి యను
వాదము మోదము నిచ్చు హెచ్చుగన్.

అని నుడివెను. ఇట్లు స్వాతంత్ర్యమును వహించి నవ్యమార్గమున కృతిని రచియించిన గ్రంథకర్తకు ధన్యవాదములు. పెక్కులు సంస్కృతకావ్యవాటకాదు లిటు లాంధ్రమున వెలయ వలసి యున్నవి.

ఈకృతియం దాంధ్రభాషా స్వరూపస్వభావములు లెస్స హత్తినవి. పదముల కూర్పు, నుడికారము సొంపు, జాతీయముల పెంపు, అన్వయమున తేట, ధారావాహినియై వెలయుచున్న రచనాసౌందర్యమునకు మెరుగులు దిద్దుచున్నవి. రసోత్తరమగు నీకావ్య మాంధ్రవాణికి క్రొంక్రొత్తరకపు సొమ్ము. తెలుగునాటను చిరప్రతిష్ఠను బడసినది శాస్త్రిగారి కవిత. దీనినిగూర్చి యింకను జెప్పుట యతిప్రసంగము. వీరింకను ఇట్టి కావ్యములను రచియించి యాంధ్రవాణి యాశీస్సులను బడయుదురు గాక!

సులక్షణవతియగు నీకావ్యకన్యక సరసుడు, కవి, పండితుడు, సరసకవిపండితపోషకుడునగు జయపురాధీశ్వరుని చేపట్టి ధన్యయైనది.

చవికి:

గీ. ఉపవనస్థిత చంద్రమౌళ్యుత్తమాంగ
చంద్రికా ధౌతహర్మ్యము సకలసంప
దాలవాలము యక్షేశ పాలిత మల
కాపురం బయ్య, జలద, నాకాఁపురంబు. ౧౫,
[పూ. మే.

సీ. "అది విశాలాధీశు నాత్మజాతను నుద
యనుఁడు కైకొనిన సాహసపుఁ జోటు
ఇది 'నళగిరి' కదుమద మెక్కి యాలాన
మును బెల్లగించుక చనిన చోటు,
అచటఁ బ్రద్యోతనుం డతని యంతఃపుర
స్త్రీ లుండు నిలువుటద్దాల మేడ

ఇచటనే పూర్వ మా నృపతి ప్రియంపడి
నాటిన బంగారు తాటితోఁపు"
అనుచుఁ బూర్వపుఁ గథ లెఱింగిన జనంబు
చూడ వేడ్కగ నాయాయి చోట్లు చూపి
నూతనాగతులైన బంధులకు ముద మెు
సంగఁ జెప్పుచు నుందు రుజ్జయని యందు. ౫౯,
[పూ. మే.

గీ. తత్సమాచార వాతపోత ప్రఘాత
తరులతా పుంజ మంజు లోద్యాన మొక్కఁ
డందె చెలువొందు, మాఱాట సంపనంబు;
కొంత నే పందు నిలిచి విశ్రాంతి గొనుము. ౬౪,
[పూ. మే.

సీ. మెఱుఁగారు పలుచని మేనుగల్గిన చాన
యెలజవ్వనపుఁగల్కి నలరుపాలఁతి
కొసలుదేఱిన పల్వరుస గల్గు జవరాలు
తియదొండపండు వాతెఱ నెలంత
పిడికిట నడఁగు నెన్నడుము గల్గిన బోఁటి
జళుకాడు లేడిచూపుల మిటారి
పిఱుఁదు పెక్కువఁ దొట్రు చిఱునడల్ గలలేమ
లోఁతు పొక్కిలి గల్గు నాతిమిన్న
వలుఁద పాలిండ్ల బరువున వంగినటులఁ
గానిపించెడు సతి నీకుఁ గానవచ్చుఁ
జెలువలను గండరించువో నలువ నేర్పు
చెలఁగ దిద్దిన తొలుతటి శిల్ప మనఁగ. ౨౪, ఉ. మే.

గ్రంథమంతయు నిటులేయుండును.

గ్రంథము దొరకుచోటు:—

ఆంధ్రగ్రంథమాల, తపాలుపెట్టె ౨౧౨, ౬, ౪, తంబుశెట్టివీథి, జి. టి. మదరాసు.

---

## శాలివాహనగాథా సప్తశతీసారము

క్రౌను సైజున ౧౨౪ పుటలు. వెల: మేలుప్రతి రు ౧-౮-౦, సాధారణప్రతి రు ౧.

అనువాదకుడు:—రాళ్లపల్లి అనంతకృష్ణశర్మ గారు. మైసూరు మహారాజాకళాశాల, మైసూరు.

దీనిమూలము 'ప్రాకృతభాషలో ఆర్యావృత్తము లలో వ్రాయఁబడినది. ౭౦౦ పద్యములు గలిగి ఏడు శతకములుగా విభాగింపఁబడినది. ఒక్కొక పద్యము స్వతంత్రమై పరస్పర సంబంధము లేనిది. 'ఇట్టివానికి 'గాథలు' అని వ్యవహారము......దీనిని సంగ్రహించినవాఁడు శాల, హాల, సాతవాహన, శాలివాహన, సాలాహణ, ఇత్యాదినామములు గల ఆంధ్రరాజు...... చరిత్రశోధకులు ఇతనిని (క్రీ.) ౧, ౨, ౩, శతాబ్దము లకు వేఱువేఱుగా వేయుచున్నారు. అనేకు లితనిని మొదటిశతకమువాఁడనియే నమ్ముచున్నారు.'

'దీనికి సంస్కృతప్రాకృతములందు ప్రసిద్ధమైన పేరు 'గాథాసప్తశతి'. కాని 'శాలివాహనసప్తశతి' యనియు నాడుకొనగలరు.'

'ఇప్పుడు ప్రకటింపబడిన యేడువందలపద్యముల పైకి సుమారు నాలుగువందలపద్యములకు కర్తలపేళ్లు వ్యాఖ్యానమం దుదాహరింపఁబడినవి. ఒక్కొకఁడు వ్రాసినవి పెక్కుపద్యములు గలవు. అందులో సంగ్రహకర్తయగు హాలభూపతియే వ్రాసినవి పెక్కుగలవు. .........ఈగాథాకవులలో రోహా, రేవా, మాధవీ, అణులచ్ఛీ, అసులద్ధీ, పహాయీ, ససిప్పహా, నాథా అను ఎనమండ్రుస్త్రీలు గలరు.' 'ఇందలి పద్యములలో అనేకములు ప్రస్తావవశముగా చెప్పఁబడిన చాటుపద్యములే యనవలసియున్నది.' 'ఇందలి పద్యములన్నియు ఆంధ్రీకరణములే.' అనువాదకర్త తన 'యభిరుచికి నచ్చినవాని నేఱుకొని మూలభావమును చెడనీయక తెలుఁగులోఁ బెట్టఁ బ్రయత్నించెను.'

గాథాసప్తశతిలో 'విపరీతపుటూహలును, వర్ణనములుఁగూడ నిందు లేవు. విషయములు సహజములు. జీవితమునకు యథార్థములు.' 'పల్లెటూరివారి జీవితము, పొలములప్రక్కన గుడిసెలలోనుండు బీదసాదల మనోహరమైన ప్రేమచర్యలు, గుట్టుదాఁచి నర్మగర్భముగాఁ బలుకు తీపిమాటలు, చిఱునవ్వుతోఁ జేయు హాస్యములు మొదలయినవి.' 'ఇందలి భావములు కోమలములు...... శైలిమధురము; లలితము; రమణీయము.'

అనువాదకర్త 'ఆంధ్రసాహిత్యలోకమున సుప్రసిద్ధులు. సంస్కృతవిద్యావారాశులు, సంగీతకళాకోవిదులు.......రసికత్వమును సంపూర్ణముగ వహించిన ధన్యులు.......వీరు రచించిన గ్రంథములు ఆనంద వాహినీతరంగములు.......భావనా శక్తియందే కాదు విమర్శన క్రియయందును వీరు అసాధారణప్రజ్ఞ కలవారు.' మూలానువాదముల ప్రాశస్త్యమును పేర్కొను ప్రస్తావన, రసికవతంసులు - కట్టమంచి రామలింగారెడ్డిగారు వ్రాసినది, దీని విలువను బహుధాకరించునది.

ఇంపిలిపద్యము లనేకములు భారతియందు, వెనుక కొన్ని సంచికలలో ప్రకటితము లయినవి. 'ఇంకను ఇట్టిగ్రంథముల శర్మగారు వ్రాసి ఆంధ్రలోకమున కొసంగుదురుగాక!

గ్రంథము అనంతపురమున 'సాధన బుక్ డిపో'యందు దొరకును.

---

## శివతత్త్వరత్నాకరము (నాగరిలిపి)

క్రౌను పు. ౫౦౦ గల గ్రంథము.

ఇది సంస్కృత పద్యాత్మకమగు విజ్ఞానసర్వస్వము. ఇందు ధర్మము, వేదాంతము, చరిత్ర, వాఙ్మయము, శాస్త్రము, కళ మొదలగు ప్రాచ్యవిజ్ఞానశాఖల యందలి విషయములు వివరింపబడినది. 'కల్లోలములు' అను పేరున తొమ్మిదిభాగములు గలవు. ఆకల్లోలములు మరల౧౦౭ తరంగములుగ (విభాగముల పేరు) విభజింపబడినవి. (గ్రంథస్థవిషయములనుగూర్చి రాబోవు సంచికయందు వివరింపబడును.)

గ్రంథకర్త: కెళది-బసవరాజు. క్రీ. ౧౬౯౭ మొదలు ౧౭౧౫ వఱకు కర్ణాటదేశమును పాలించినరాజు.

సంపాదకులు: శ్రీ బి. రామరావుగారు, యం. ఏ, యల్.-యల్. బి., చెన్నపురి ప్రధానప్రభుత్వానువాదకుడు (Senior Translator to the Govt. of Madras,now retired), విద్వాన్ పి. సుందరశాస్త్రిగారు, సహాయగ్రంథాలయాధికారి, ప్రభుత్వ ప్రాచ్యలిఖితపుస్తకభాండాగారము,చెన్నపురి(Assistant Librarian, Govt. Oriental Mss. Library, Madras). (ప్రకృతము, క్వీనుమేరీ కళాశాలోపాధ్యాయులు.)

ప్రకాశకులు: మేనేజరు, బి. యమ్. నాథ్ అండు కో. భాస్కరవిలాస్, వేపేరి, చెన్నపురి.

గ్రంథములవెల (అసలు) రు ౨౦-౦-౦.

ఇపుడు తగ్గించినవెల: సగము తోలుబైండు రు. ౧౧-౦-౦, క్యాలికోబైండు రు. ౧౦-౦-౦.

పుస్తకము వి. పి. పంపగోరువారు ఒకరూపాయ అడ్వాన్సుగా పంపవలెను. సొమ్మంతయు పూర్తిగా అడ్వాన్సుగా పంపినయెడల పుస్తకము రిజిస్టరుపోస్టులో పంపబడును. ఈతక్కువవెల ౧౯౩౨ సం. మార్చి ౩౧-వ తేదివఱకు మాత్రమే.

---

## అంతర్జాతీయధర్మశాస్త్రము

గ్రంథకర్త వల్లూరి సూర్యనారాయణరావుగారు, కొవ్వూరు, పశ్చిమగోదావరిజిల్లా. 145 పుటలు, క్రౌను సైజు. వెల 0-10-0. 'ఆ 1914 సంవత్సరములో యూరపుఖండవాసులమధ్య మహాఘోరసంగ్రామము జరుగుచున్నపుడు ఈ అంతర్జాతీయధర్మశాస్త్రములోని ముఖ్యసూత్రములను కృష్ణాపత్రికలో ప్రతివారము ప్రకటించుచుంటి' నని గ్రంథకర్త ఉపోద్ఘాతమున తెలియజేసెను. వానినే కొద్దిమార్పులతో ఈచిన్నగ్రంథముగ వ్రాసితి ననెను. గ్రంథము నాలుగుభాగములుగ విభజింపబడినది. ప్రథమభాగమున అంతర్జాతీయ ధర్మస్వభావమున ఎట్టిరాష్ట్రముల కీశాస్త్రము వర్తించు ననునదియు, అంతర్జాతీయధర్మోత్పత్తి సాధనములు, స్వతంత్రరాష్ట్రముల హక్కులు విధులు, రాష్ట్రములసొత్తుతో సంబంధించిన హక్కులు విధులు, రాష్ట్రాధికారముతో సంబంధించిన హక్కులు విధులు, రాష్ట్రసమత్వముతో సంబంధించిన హక్కులు విధులు, రాష్ట్రసంగ్రామముతో సంబంధించిన హక్కులు విధులు తెలుపబడినవి,

ద్వితీయభాగమున యుద్ధారంభ ప్రయత్నములు, రాష్ట్రవ్యక్తి సత్వముల వైరుధ్యము, శాత్రవశరీరరణనీతి, శాత్రవస్వామ్యరణనీతి, యుద్ధోపకరణములు, యుద్ధధర్మములు, ఉద్ధతుల అవిరోధసంబంధములు సూచింపబడెను.

తృతీయభాగమున తటస్థులయెడ ఉద్ధతుల విధులు, ఉద్ధతులయెడ తటస్థులవిధులు, తటస్థసారుల సామాన్యవర్తకము, సముద్రవతీగపు ముట్టడులు, నిషేధ వస్తువర్తకవిషయములు వ్రాయబడెను.

చతుర్థభాగమున అంతర్జాతీయసమితిని గూర్చి తెలిపిరి.

అంతర్జాతీయధర్మశాస్త్రములు, అంతర్జాతీయ సమితి నిరర్థకము లని తెలుపుటకు ప్రస్తుతము సాగుచున్న చీనా, జపాను పోరాటమే ప్రబల తార్కాణము. ఒకమూల ప్యారిసులో అంతర్జాతీయ సమితివారు చీనా జపాను తగవును నివారించుటకు ఆలోచించుచునే యున్నారు; జపాను వ్యగ్రచర్య నవలంబించరాదని అమెరికాకూడ ప్రకటించెను: ఒకవంక జపాను చీనాపై దండెత్తుచునేయున్నది. ఇంతవరకు ధైర్యముగ జపానును యుద్ధము మానవలెనని అంతర్జాతీయ సమితి వారు చెప్పజాలకున్నారు. అంతర్జాతీయ ధర్మశాస్త్రములు, అంతర్జాతీయసమితి దుర్బలులగు జాతులపట్ల ప్రాభించును గాని బలాఢ్యులగు జాతుల నేమి చేయజాలవు. దీనికి ప్రస్తుతము సాగుచున్న చీనాజపాను పోరాటమే ప్రత్యక్షనిదర్శనమని వేరొకసారి తెలుపనక్కరలేదు.

అంతర్జాతీయశాస్త్రమున నేమో జనసామాన్యమునకే కాక, చారిత్రక విషయమును రాజనీతిశాస్త్రమును పఠనీయగ్రంథములుగ చదువని పట్టభద్రులకుగూడ తెలియని పరిస్థితులందు సూర్యనారాయణరావుగారీ గ్రంథమును ప్రకటించి, అంతర్జాతీయ రాజకీయములందుత్సాహమును జూపువారలకే గాక జనసామాన్యమునకు గూడ ఉపకారము చేసినవారైరి. అంతర్జాతీయపు ఒడంబడికలు, శాసనములు, నియమములు ఎంత నిరర్థకములో జపానుచర్యయే చాటుచున్నది. చీనా జపానుతగాదా సంబంధమున ఈగ్రంథము పఠించినచో ఎంతవరకు ఈ నియమములను ఒడంబడికదారులు మన్నించుచున్నారో తెలియగలదు.

గ్రంథము చిన్నదైనను ప్రధానసూత్రములు సంగ్రహముగ ఎల్లరకు తెలియునట్టుల వ్రాయబడెను. ఇట్టి గ్రంథములు వ్యాప్తి గాంచవలెనన్న తక్కువ వెలను నిర్ణయించవలెను. 0-4-0 వెలనునిర్ణయించిన ఈగ్రంథకర్త కృషి ఫలించునని నమ్ముచున్నాను.

జరుగుమిల్లి సాంబశివరావు, బి. ఏ.

---

## తిబ్బె అక్బర్ షాహి

గ్రంథకర్త—'వైద్యభూషణ', హాకిం డి. రహంతుల్లా బేగ్ సాహెబ్ గారు (రాజమంద్రి). ప్రథమ సంపుటము. వెల ౬-౦-౦ లు.

ఇది యొక ఆంధ్ర యూనానివైద్యగ్రంథము. ఇందు 'యూనానీవైద్యప్రశంస' యనెడిశీర్షిక క్రింద, యూనానీవైద్యచరిత్రము, శిరస్సు మొదలు పాదముల వరకుగల యవయవముల సచిత్రవివరణము, తత్తదవయవ జన్యరోగములు, వాని నిదాన చికిత్సలు, రోగపరీక్షావిధానము మున్నగునవి గలవు. ఈగ్రంథము ప్రాచీన యూనాని వైద్యమతానుసారముగ వ్రాయబడినందున ఆయాగ్రంథకర్తలపేర్లు, వారిమతభేదములుగూడ నావశ్యకములైన స్థలములందు చేర్చబడినవి. 'ఆయుర్వేదపద్ధతి ననుసరించి యూనానిమతానుసారముగ' పంచకర్మలు మొదలైన విందు గలవు. మూలికాదులలో క్వాథ, మాత్ర, లేహ్య, షర్బత్, తైలాదుల తయారుచేసుకొనుపద్ధతి మాత్ర మున్నది. రస, విష, లోహాది రసౌషధముల నిందు వ్రాయలేదనియు, '...ఆంధ్రభాషలో గ్రామ్య పదములతో ఆంధ్రీకరించితిని' అనియు గ్రంథకర్తగారే తమపీఠికలో వ్రాసికొనుచు, నట నేమున్ననుగూడ గోరుచున్నారు. అచ్చుతప్పులు మితిలేక యున్నవి. 'వస్తుపర్యాయపదములు' అనెడిశీర్షిక క్రింద, యూనానీ

వైద్యపరిభాషయందు పారసీ, అరబ్బీ మున్నగుభాషల యందుండునట్టి, ఈగ్రంథమున అచ్చటచ్చట వ్రాయబడిన కొన్ని మూలికలకుమాత్రము తెనుగు, సంస్కృతము, హిందీ మొదలగుభాషలలో పర్యాయపదములు వ్రాయబడియున్నవి. కొన్నిటిని 'ప్రసిద్ధనామము' గల మూలికలలో జేర్చిరి. కొన్నిటిని వేనియందు గూడ జేర్పక యోగములందుమాత్ర ముదాహరించినందున యూనాని 'వైద్యేతరులకు' శ్రమను గల్గించును. ఇంకను కొంతవాక్యములు ముద్రణమునం దున్నవని తెలియుచున్నది గాన, గ్రంథకర్తగారు రాబోవుకూర్పుల యందైన ఇట్టి లోపముల సవరించికొనెదరుగాక. ఈవరకు యూనానీవైద్యగ్రంథము లాంధ్రభాషలో చాల కొద్దిగను,సంగ్రహముగనుమాత్రమే ప్రచురింపబడియుండి నందున, ఆంధ్రదేశమున ఈవైద్యమున కెక్కుడు ప్రచారము లేదు. ఇట్టితరి, గ్రంథకర్తగారు అనేక యూనానీవైద్యగ్రంథముల బరిశీలించి విపులముగ గ్రంథమును వ్రాసి యాంధ్రలోకమున కర్పించినందులకెంతయు బ్రశంసాపాత్రులు.

పై గ్రంథము వలయువారు గ్రంథకర్తగారికే వ్రాసి, వారి చేవ్రాలున్న పుస్తకమును మాత్రమే తెప్పించుకొనవలయును.

'పి.'

---

ఖిల్జీ రాజ్యపతనము
(చరిత్రాత్మకనాటకము)

గ్రంథకర్త: పండిమెట్ట వేంకటసుబ్బరావుగారు, కళాభవనము, ఛత్రపురము, గంజాంజిల్లా. డెమ్మీసైజు; ౧౧౯ పుటలు. వెల రు ౧.

ఈ నాటకమునకు మాతృక నిశికాంతబోసుగారి బంగాళీకృతి. కథ చరిత్రాత్మకమయ్యును ముఖ్యాంశములందు విపర్యాసములు గాన్పించుచున్నవి. పాత్రల నామములు చరిత్రప్రసిద్ధములే కాని శీలము రచయిత యొక్క భావనాపుటమున వేఱొక పాకము బొందినది.

ఆంధ్రీకరణముంగూర్చి, 'ముందుమాట' వ్రాసిన మండపాక పార్వతీశ్వరశాస్త్రిగా రిట్లను చెప్పియున్నారు: 'ఈ నాటకము కేవలాంధ్రీకరణము కాదు. నూతనరచనయును గాదు. వంగభాషలో నున్న యొక నాటకము నాధారముజేసికొని స్వానుభవమున కథకు మెఱుగుపెట్టి కవి యీ నాటకమును వ్రాసియున్నాడు.' ఇదెంతవరకు సత్యమో బంగాళీమాతృకను పఠించినవారే నిర్ణయింప నర్హులు.

నాటకమందలి కథావస్తువు కడుంగడు మెచ్చుకోదగియున్నది. కథల కల్పనలందు బంగాళీలకు పెట్టినది పేరుగదా! అల్లాయుద్దీను ఖిల్జీ గుజరాతు ప్రభువగు కరుణసింగును పాఱద్రోలి, అతని సుతులను తెగటార్చి, రాణిని కమలను చెఱపట్టును. అల్లాయుద్దీను మోహపరవశుఁడై కమలకు బానిసీఁడగును. కాని భర్తృ వియోగమునకును, పుత్రనాశమునకును ప్రతీకారముసేయుటకు కృతనిశ్చయయైన కమల అద్భుతసంవిధానముచే నల్లాయుద్దీను ఆజ్ఞవలన నాతని కుమారుఁడు ఖిజీర్ మడియునట్లును, ఢిల్లీ సేనాని, నమ్మినబంటు, కఫూర్ ఖాఁ వలన నాసమ్రాట్టు తెగునట్లును కార్యము సాధించును. కాని కథలో చిత్తము నాకర్షించుపాత్రలు ఖిజీరును, ఆతని ప్రేయసి, మోతియాయును. ఖిజీరు సౌమ్యుఁడు, సత్యవాది, ఉదారుఁడు. మోతియా రూపు దాల్చిన హృదయానురాగము. స్త్రీబుద్ధి నవిశ్వసించినవాఁడై ఖిజీరు తన్ను నిరాకరించినందులకు, మోతియా అతనిని ఛాయవలె ననుసరించి ఆతనిప్రాణముల కెదురువచ్చినయొగ్గును తా నాహ్వానించి, ఆహుతియై, ప్రియునిపై పగదీర్చుకొన్నదగును. కమల అల్లాయుద్దీనుపై పగదీర్చుకొనుటకును, దీనికిని గలవ్యత్యాసము కథకు మెఱుఁగును గూర్చుచున్నది. మోతియా పాత్రము షేక్స్పియరునాటకములనుండి సంగ్రహింపఁబడినదయ్యు, కృతికర్తృమనమున నొకింతపోషణ మంది విషాదాంతమున కాయత్తమైనది. పాత్రలపటాటోపము నఁగాక మానవత్వముం బర్శించుటవలన నీకృతి ఆదరింపఁదగియున్నది.

ఆంధ్రానువాదమున పద్యములందు భావదారిద్ర్యము లేకున్నను, భాషాసౌష్ఠవమించుక కొఱవడినది. నాటక

ములందు పద్యములయెత్తుగడయే వేఱు. బహుశః ప్రదర్శనోపయోగార్థము, ప్రకృతరంగావసరములంబట్టి అనువాదకులు పద్యములను రచించిరి గావలయు. వచనమునను విజాతీయత కొంతగలదు. వాక్యరచనమున నొక్కొక్క భాష, కొక్కొక్క మర్యాద స్థిరపడియుండును. చిన్న ఉదాహరణము—

"ఇరానీ, ఇది కేవల మొక యకారణమైన సందేహము........"

ఇంతకన్న "నీ సందేహము నిరాధారము" అనుట తెలుఁగున సంభాషణక్రమము ననుసరించుట యగును.

పద్యరచన కుదాహరణము:—

తే. గీ. అపయశంబను నీబహుళాంధకార
బంధురంబగు నరకకూపంబుకంటె
స్వర్గరాజ్యంబునకు ముఖద్వారమైన
మరణగర్భంబు సర్వోత్తమంబు కాదె.

సీ. నేఁడుగా నాయొడల్ నిలువునఁ గాల్చెడు
చటులనారకవహ్ని శాంతిఁగాంచె!
నేఁడుగా నారక్తనేత్ర సంభూతాశ్రు
యాశ్రుధారావర్ష మంతమయ్యె!
నేఁడుగా నాజీర్ణ నిర్జీవదేహంబు
శ్రీమంతమై పునర్జీవ మయ్యె!
నేఁడుగా నాతనూ నిర్ముక్త తేజంబు
కులపయోరాశికిఁ దెలివి గూర్చె!

గీ. నేఁడు గద! శాశ్వతఖ్యాతి నిలుప నెంచి
గర్భవాసంబునందు నన్ గాంచినట్టి
పుణ్యఫల మందె నాజన్మభూమి యహహ!
ధన్యమయ్యె నాజన్మంబు ధన్యమయ్యె!

---

## శ్రీనాథకవి జీవితము

గ్రంథకర్త:—చిలుకూరి వీరభద్రరావు గారు
ప్రకాశకులు: ఆర్యపుస్తకాలయము, రాజమహేంద్రవరము.

ఆంధ్రభారతిని సుమారొక శతాబ్దము తన ముఖసరోజమున నిలిపి ప్రోచిన శ్రీనాథకవి సార్వభౌముని జీవితచారిత్ర మిందుల్లేఖింపఁబడినది. సకల విద్యాసనాథుఁడైన యామహాకవి దక్షిణకర్ణాటాంధ్రరాజాస్థానంబుల నపూర్వములగు మన్ననలంబడసినవాఁడును, అమాత్య వ్యాపారి ముఖ్యులకు, మఠాధిపతులకు ననూనగ్రంథరాజంబుల నంకితము చేసినవాఁడును, దాదాపు ఎనుబది వర్షంబు లిహలోకయాత్ర సల్పినవాఁడును నగుట, నాతని జీవితచరిత్ర మించుమించొక శతాబ్ది ఆంధ్రదేశ చరిత్రముగా పరిణమించినది. అందునను గ్రంథకర్తలు "ఆంధ్రులచరిత్ర" నిర్మాత లగుటవలన నీగ్రంథము ౩౦౦ పుటలకు పెరుఁగుట ఆశ్చర్యము గాదు. శ్రీనాథుని జీవితముం గూర్చిన పూర్వగ్రంథము లన్నింటిని వీరు ప్రస్తావించి, ఆయావాదములను వివరించి విమర్శించి యున్నారు. అట్లు విమర్శకు వచ్చినవారిలో ముఖ్యులు కీ॥ శే॥ కె. వి. లక్ష్మణరావుగారు, కీ॥ శే॥ వీరేశలింగము పంతులుగారు, బ్ర॥ శ్రీ వేటూరి ప్రభాకరశాస్త్రిగారు నై యున్నారు. ఈగ్రంథము తొలుత ప్రకటితమైనపిదప నే శ్రీ ప్రభాకరశాస్త్రిగారి "శృంగార శ్రీనాథము" ప్రకాశిత మయ్యెను. కావున నాగ్రంథములఁగూర్చిన విమర్శ కొంత యీద్వితీయ ముద్రణమునఁ గలదు.

వీరభద్రరావుగారి సిద్ధాంతముప్రకారము శ్రీనాథుఁడు క్రీ॥ శ॥ ౧౩౭౦ సంవత్సరమున జనన మందెను. ౧౩౯౪ సం॥ న మరుత్తరాట్చరితమును, ౧౩౯౭ సం॥న శాలివాహన సప్తశతిని, ౧౪౦౦ సం॥ ప్రాంతమున పండితారాధ్యచరితమును, ౧౪౧౦-౧౫ సం॥ మధ్యకాలమున శృంగారనైషధమును, ౧౪౨౧ సం॥ ప్రాంతమునహర విలాసమును, ౧౪౨౭ సం॥నకు వెనుక అనఁగా ౧౪౩౦ సం॥ ప్రాంతమున భీమేశ్వర పురాణమును, ౧౪౪౦ సం॥ ప్రాంతమున కాశీఖండమును, ౧౪౫౦ సం॥ ప్రాంతమున శివరాత్రీ మాహాత్మ్యమును విరచించి ౧౪౬౦ సం॥ ప్రాంతమున స్వర్గస్థుఁడై యుండవలయును. వల్లభరాయవిరచిత మనంబడు క్రీడాభిరామము ను శ్రీనాథుఁడే రచియించియుండుననిగూడ వీరిదృఢ విశ్వాసము. పల్నాటి వీరచరితము శ్రీనాథకృతము

గాదను నభిప్రాయమును అధోజ్ఞాపికాముఖమునమాత్రమే సూచించి వదలినారు, గాని కారణములను వెలువరింప లేదు.

శ్రీనాథునిజన్మస్థలమగు కాల్పట్టణ మేదో యీ గ్రంథమునను నిశ్శంకముగా నిర్ధారితముగా లేదు. నెల్లూరుమండలమందలి కృష్ణాపట్టణమని తాము పూర్వము చేసిన యూహను వదలుకొని కాళీపట్టణమో, కలపటమో యగునని తలంచుచు, ఇప్పటికి కాళీపట్టణముగానే భావించుచుండవచ్చునని వీరభద్రరావుగారు ఆవిషయమును ముగించినారు. వీరేశలింగముగారు "క్రాల్పట్టణము" అని భావించి క్రొత్తపట్టణము గానోపునని తమ కాలమునాఁటికి నిర్ధారించి యుండిరి. ఖండితముగాఁ జెప్పుట కాధారములు లేనపుడు, శ్రీ నాథుని జన్మస్థలము కాల్పట్టణమనియే స్మరించుకొనుచుందము.

శ్రీ నాథుఁడు తెలుఁగురాయనింగూర్చి కస్తూరికై ప్రార్థించుచు క్రిందిచాటువుసుఁ జెప్పెనని ప్రతీతగదా—

"అక్షయ్యంబగు సాంపరాయని తెలుం
గాధీశ ! కస్తూరికా
భిక్షాదానమునేయరా సుకవి రా
డ్బృందారక స్వామికిన్ ;
దాక్షారామపురీవిహార వరగం
ధర్వాప్సరోభామినీ
వక్షోజద్వయకుంభికుంభములపై
వాసించు తద్వాసనల్".

ఇది శ్రీనాథకృతమే గాదను నొక యభిప్రాయమును వీరభద్రరావుగారు గ్రంథస్థముఁ జేసినారు. కాని దీని రచయిత లెవరని తమయూహయో తెలిపిన బాగుండెడిది. అనామికుఁ డనుట చాలదు. చరిత్రకారుల పరిశోధనలతో సరిపడకపోయిన పద్యములను, గ్రంథములను తల్లిలేనిబిడ్డలం జేయుట తగదు. శ్రీనాథునివాణికిఁ గాక మరొకరి కాపద్యము సాధ్యమగునా? ప్రభాకరశాస్త్రి గారు కాశీఖండమందలి

"ఈక్షోణిన్ నినుఁబోలు సత్కవులు లే
రీనేఁటికాలంబునన్
దాక్షారామచళుక్య భీమవర గం
ధర్వా ప్సరోభామినీ
వక్షోజద్వయ గంధసారఘుసృణ
ద్వైరాజ్య భారంబు న
ధ్యక్షించున్ కవి సార్వభౌమ భవదీ
య ప్రౌఢసాహిత్యముల్."

అను పద్యము నుదాహరించినను వీరభద్రరావుగారికి "అక్షయ్య" పద్య కర్తృత్వము శ్రీనాథునిదని విశ్వాసము పుట్టనపుడు వేఱుతెన్ను లేదు. కాని వీరి అవిశ్వాసమునకు "భిక్షాదానమునేయరా" అను నేకవచన ప్రయోగమే ప్రబలకారణమేని దానికి సమానముగా నీ క్రిందిపద్యమును చదువుకొనవచ్చును—

"ఘుసి మీఱన్ సురథాణి నిండుకొలువై
కూర్చున్నచో నీకరా
భ్యసనంబున్ నుతియించురా యవచితి
ప్పాచంద్ర సారంగనా
భిసముత్పాదిత తాళవృంతపవన.
ప్రేంఖోలనప్రక్రియా
పసరోదంచిత సారసౌరభరస
వ్యాలోల రోలంబముల్."

కోటీశ్వరుండైన యవచితిప్పయను "తిప్పం డల్పుఁడే యిమ్మహిన్" అనుటఁగూడ పరికింపఁదగును. కవుల సంబోధనామర్యాదలను వీరభద్రరావుగా రెఱుంగని వారా!

కర్తృత్వమును శంకించుటయే కాక పద్యమున కర్థము వ్రాయుటలోఁ గూడ వీరు వేఱొక తెన్నుఁ ద్రొక్కి, 'స్వామికిన్' వేఱునేసి దాక్షారామ భీమేశ్వరస్వామికి కస్తూరికా భిక్షాదానమునేయుమని కవి తెలుఁగురాయని హెచ్చరించుచున్నాఁడని యూహించిరి. ఆ పక్షమున 'సుకవిరాడ్బృందారక' అను సంబోధనప్రయోజకత్వము నరయవలసియుండును. దేవునికి కస్తూరిని గానుకనిమ్మనుపుడు, ఆ కస్తూరి వేశ్యాజనవక్షోజములపై వాసించునులేయని మోహపెట్టుట మాత్రము భక్తిని ప్రకాశింపఁ జేయదు.

"అక్షయ్య" పద్య కర్తృత్వార్థములం గూర్చి శంకింపఁబనిలేదు. వేములవాడ భీమకవిచాటు వొకటి యిట్టిదే కలదు.

"సునుఁ డఁ వేములవాడవంశజుఁడ దా
                    క్షారామభీమేశనం
దనుఁడఁ దివ్యవిషామృత ప్రకటనా
                    నాకావ్యధుర్యుండ భీ
మన నా పేరు వినంగఁ జెప్పితిఁ దెలుం
                    గాధీశ! కస్తూరికా
ఘనసారాదిసుగంధవస్తువులు వే
                    గం దెచ్చి లాలింపురా."

ఇరువురు కవులును కస్తూరిభిక్షనే కోరినారు; సంబోధనలో 'రా' వదలలేదు. శ్రీనాథుఁడు భీమకవి నిట్లనుకరించునా యనిన,

"వచియింతు వేములవాడ భీమనభంగి
                    నుద్దండలీల నొక్కొక్కమాటు"

అని యున్నదిగదా!

'దీనారటంకాల తీర్థమాడించితి' పద్యము శ్రీనాథునిదని వీరభద్రరావుగారు నమ్ముచున్నారో లేదో తెలియదు గాని, శ్రీనాథుఁడు సర్వజ్ఞసింగభూపాలుని దర్శించియుండుట సంభవము గాదని, రేచెర్ల వెలగోటి వారి వంశచరితలో కొన్ని పుటలు నింపియున్నారు. శ్రీనాథుఁడు దర్శించిన సర్వజ్ఞుఁడు బేతాళనాయని కేడవతరమువాఁడు గాఁడు; పదవతరము సింగమనాయనికి శ్రీనాథుఁడు పూర్వుఁడు గానోపు; వేటూరి ప్రభాకరశాస్త్రి గారు పోల్చుకొన్న సర్వజ్ఞుఁడు చరిత్రలో లేఁడు—అని వీరి సిద్ధాంతము. ఏదెట్లున్నను, 'దీనారటంకాల' పద్యమునకు సందర్భమును రూపింపవలసిన బాధ్యత చరిత్రకారులకుఁగలదు. శ్రీనాథకృతము గాదని దీనినిగూడ త్రోసిపుచ్చుట పరమసాహసమగును.

మఱియొక లఘు విషయము—వామన భట్టబాణుని వేమభూపాలీయము చివరను

" సుగుణాలంకృతి సుభగా
    సుకృతి రియం భట్టబాణభవదీయా,
అధరయతిని ఘతనఖ ముఖ
    ముఖరిత వీణానినాద మాధుర్యమ్."

అను శ్లోకమును, శ్రీనాథుని హరవిలాసమునందలి

" వాణిజ్యచణున కంత
ర్వాణి ప్రస్తూయమానవాగ్విభవునకున్
వాణీ నఖముఖ ముఖరిత
వీణా నిక్వాణనిభ కవిత్వఫణితికిన్."

అనుపద్యమును, పెదకోమటి వేమవిరచిత సాహిత్య చింతామణిలోని

"వాణీనఖముఖ ముఖరిత
    వీణామాధుర్యధుర్య వాగ్వ్యాప్తిః,
ధన్యాధన్యాన్యాన్యాః
    పెదకోమటి వేమభూపతి ర్జయతి "

అను శ్లోకమును శబ్దసామ్యము, శైలిసాదృశ్యముం గలిగి యుండుటంబట్టి వేటూరి ప్రభాకరశాస్త్రి గారు ఈ మూఁడును శ్రీనాథ కృతములై యుండవచ్చునని శంకించుట వీరభద్రరావుగారికి రుచింపనందున, "సకలవిద్యాసనాథుఁడగు శ్రీనాథుఁడు పెదకోమటి వేమారెడ్డిని, వామనభట్టును, తిప్పయసెట్టిని నొక్కయుయ్యాలలోనే యుంచి యొకటే జోలపాట పాడి జోకొట్టినవాఁడని తేలుచున్నది" అని వ్రాసిరి. పైపద్యశ్లోకరచనము శ్రీనాథునిదని రూఢిగా చెప్ప సమర్థుఁడనుగాను కాని వీరభద్రరావుగారి వాదదార్ఢ్యము నించుక పరిశీలింపఁదగును. పలువురంగూర్చి శ్రీనాథుఁ డొకేరీతి ప్రస్తుతించుట అరుదుగాదు. చూడుఁడు—

"రమ్యసద్గుణనికురంబ రామమాంబ."
                    కాశీఖండము.

"ఉజ్జ్వలద్గుణనికురంబ యొమ్మమాంబ."
                    శివరాత్రిమాహాత్మ్యము.

"భూరిసద్గుణనికురంబ సూరమాంబ."
                    ఫిరంగిపుర శాసనము.

"సరససద్గుణనికురంబ శారదాంబ."
                    "దీనారటంకాల" చాటువు.

ఇదియును ఒకేజోలపాటగాదా?

వీరభద్రరావుగారు శ్రీనాథుని యశశ్చంద్రునకు విషయలోలత్వకళంకంబును తుడిచివైవ నీ గ్రంథమును సంకల్పించితిమని చెప్పి, వీరేశలింగముగారును, ప్రభాకరశాస్త్రిగారును, రామకృష్ణకవిగారును శ్రీనాథునెడ శంకించిన వేశ్యాప్రియత్వమును స్వీకరింప సాహసించి శ్రీనాథుని చాటువుల కెగ్గుదచ్చిరి. "కాశికా విశ్వేశుఁ గలిసె వీరారెడ్డి రత్నాంబరంబు లేరాయఁ డిచ్చు" అను పద్యమును వైలిసందర్భములంబట్టి శ్రీనాథుని కడ మొఱ్ఱియని ఘోషించుచుండుదానిని, కాటికి కాలుఁ జాఁచుకొనియున్న యెనుబదేండ్ల వృద్ధు రత్నాంబరములకు కస్తూరికి దేవులాడె ననుట విశ్వసింపరాదను విమర్శతోఁ ద్రోసిపుచ్చఁజూచిరి. శ్రీనాథుఁ డీపద్యమున తన పూర్వవైభవమును, ప్రకృతదైన్యమును నేకదృష్టిని సమవలోకించి కలియుగజీవనము కష్టమని తలపోసి, స్వర్గాభిముఖుఁడయ్యెనని తలంపవలయును గాని, రత్నాంబరాదులు ప్రకృతావసరములుగా దేవులాడెనని తలంచుట తగదు.

శ్రీనాథుని వేశ్యాప్రియత్వమును వీరేశలింగముగారు ప్రత్యేకాపరాధముగా నెంచిరని నేను తలంపను. భోగలాలసయును, శృంగారపరాయణతయు శ్రీనాథుని దాక్షారామవేశ్యాగృహముల కెలయించియుండిన నుండవచ్చును. ఆకాలమున వేశ్యాలోలతను హీనాంశమంతగా గర్హ్యమస్థితిలో లేదేమోయని వీరేశలింగముగారు శంకించుట పూర్వులపై పాపము వేయుట గాదు. ఒక్కొక్కకాలమున నీతిధర్మములు నెవ్వేఱుప్రమాణములం గలిగియుండును. వేశ్యావిషయముంగూర్చి ప్రకృతులకుండు విముఖత్వము పూర్వము లేకయుండవచ్చును. ప్రక్కప్రక్కనే యయ్యును క్రాంవెలు, రెండవఛార్లెసు కాలములందు ఇంగ్లాండులో జనుల నీతిలో నెంత భేదముండెనో ఆంగ్లచరిత్ర నెఱిఁగిన వారికిఁ దెలియుఁగదా. ఈకాలమున నే యాంధ్రకవియైనను వేశ్యాజన 'వక్షోజద్వయగంధసారఘుసృణ ద్వైరాజ్యభారంబు నధ్యక్షించు' నని తనసాహిత్యము నగ్గించునా, ఇతరు లగ్గించిన హర్షించునా? శ్రీనాథుఁడు వేశ్యాలోలుఁడై యౌవనమున విరివిగా నార్జించిన ధనమును వ్యయముచేసికొని, వార్ధక్యమునఁ గష్టములపాలయ్యెననుట అతని నిందించుట గాదు. స్తుతమతియైన ఆంధ్రకవిధూర్జటికి వారవనితామధురాధరోదితసుధారసధారలవలన కవిత్వమాధురికల్గెనే గాని, కవియనుపూజ్యత చెడలేదు. శ్రీనాథునికిని కవిసార్వభౌముఁడనుపూజ్యత అవినీతికారణమునం జెడదు. రాజులకే గాక కవిరాజులకును వేశ్యలపరిచయ మొక కాలమున పరిపాటియైయుండెనేమో.

వీరభద్రరావుగారి గ్రంథమునం దధిక్షేపధోరణి సరసముగా లేదని వ్రాయుటకు విచారమగుచున్నది. వీరేశలింగముగారి యెడ వీరి యధిక్షేపణలు ప్రతినిష్ఠురములై యున్నవి. ఆంధ్రులచరిత్రను నిర్మించిన వీరభద్రరావుగారివలెనే, ఆంధ్రకవులచరిత్రను నిర్మించిన వీరేశలింగముగారును ఆంధ్రలోకముయొక్క కృతజ్ఞతఁ జూఱఁగొనినవారు గదా. యశఃకాయులైనవారియెడ దూషణభాషణములు విసర్జనార్హములు. చారిత్రకుల సిద్ధాంతములు పరిశోధన లెస్సయైన కొలఁది తాఱుమాఱగుచుండును. అందువలన చరిత్రకారులు మందమతులని చెప్ప సాహసింపరాదు. ప్రభాకరశాస్త్రిగారిని తమమిత్రులని పేర్కొన్నను వారియెడంగూడ రావుగారికలము పోటు దారుణము. 'శృంగార శ్రీనాథము' ను 'చమత్కార ప్రభాకర' మని పరిహసించుట మర్యాద గాదు. తమ గ్రంథనామమున శృంగారము నేతిబీరవంటిదను ప్రభాకరశాస్త్రిగారి వినయోక్తిని పలుమారు ఉద్ఘాటించుటయుఁ బాడిగాదు.

వాద ప్రతివాదముల పెంపకముతో పెరిఁగిన యీ గ్రంథమును సంక్షేపించి, శ్రీనాథుని జీవితమును సంగ్రహముగా వ్రాయుచో వీరభద్రరావుగారు సామాన్యపాఠకలోకమునకు, విద్యార్థిలోకమునకు నుపకారులయ్యెదరు. ప్రస్తుత మిందుండు చరిత్రాంశములు విస్తారమయ్యును, చరిత్రాభిమానులకే ప్రత్యేకపఠనార్హములుగా నున్నవి.

(గు. వెం. సు.)

---

## ప్రభుత్వధనము - మనబీదతనము

అనువాదకులు: శనివారపు సుబ్బారావు, బా లాంత్రపు సత్యనారాయణరావుగార్లు; జాతీయ గ్రంథమాల, పిఠాపురము. క్రౌనుసైజు: ౨౦౦ పుటలు. వెల రు ౦-౧౦-౦.

రాజ్యాంగవిషయములయందు మనదేశ మిదివరకు కంటె నెంతయో ప్రబోధము గాంచియున్నను, సుస్థిరమును నాంధ్రగ్రంథ సముదాయమునందు గాంచవను నూతనప్రచురణములయం దిట్టి పరిణామము విశేషముగ గనుపింపదు. ఏవో కొన్ని గ్రంథములు ప్రకటింపబడినను వానిసంఖ్య బహుస్వల్పము. వీనిలోపమే, ప్రజలలో నిప్పటికంటె నెక్కుడు ప్రబోధము గలిగియుండక పోవుటకు కారణమనికూడ చెప్పవచ్చును. భారతదేశీయుల కెల్లరకును సుపరిచితులగు జె. సి. కుమారప్పగారు మొదట నీగ్రంథమునందలి వ్యాసములను ఆంగ్లమున "యంగు ఇండియా" పత్రికయందు ప్రచురించెను. పిమ్మట వానిని "Public Finance and our Poverty" అను పేరుతో గ్రంథరూపమున ప్రకటించిరి. దాని కీగ్రంథము ఆంధ్రానువాదము.

ప్రభుత్వము లవలంబింపవలసిన ఆర్థిక సిద్ధాంతముల గురించిన శాస్త్రచర్చ కీ గ్రంథ ముద్దేశింపబడలేదు. గత నూరు, నూటయేబదివత్సరములలో మనదేశమున ప్రభుత్వమువా రవలంబించుచున్న ఆర్థికపద్ధతులును, వాని వలన గలుగుచున్న ఫలితములును మాత్రమే సుబోధముగ, సప్రమాణముగ నీగ్రంథమున చర్చింపబడెను. ఈవిషయములు పాఠకుల హృదయములయందు గాఢముగ నాటుకొనజేయుటకుగాను కుమారప్పగారు మొట్టమొదట బ్రిటిషుప్రభుత్వము ప్రారంభకాలమున దేశముయొక్క స్థితిని, పిమ్మట నేటికాలపు స్థితిని కన్నులకు గట్టినటుల వర్ణించిరి. ఇందులకుగాను, గ్రంథకర్త చాలవరకు పాశ్చాత్యప్రముఖుల యభిప్రాయములనే ప్రమాణముగ గైకొనియుదాహరించుటచే నావర్ణనలు పక్షపాతభూయిష్ఠములని తలంచుటకేమాత్రమును వీలులేకుండజేసిరి. ౧౮-వ శతాబ్దాదియందు బిషపు హెబ్బర్టుగారి సాక్ష్యముప్రకారము "నిండు పంటలతో తులతూగెడు మనోహరమగు నీక్షేత్రము"; "చేతిపనులతోను, అనేకవిధములగు పనిపాటులతోను నిండి కనుపించి, హృదయరంజకమగు నాదృశ్యము"; "ఫలవంతములగు వ్యవసాయభూములను, నిరంతరము గష్టపడి పనిజేయుప్రజలను, వాణిజ్యైశ్వర్యములతోను, శాంతిసుఖములతోను వర్ధిలు పట్టణములను చూచునపుడాదేశపు రాజ్యాంగపద్ధతి ప్రజల కమితసుఖము నే చేకూర్చుచున్న"దని తట్టకమానదని లెఫ్టినెంటు కర్నలు మూరుగారు మొదలుగాగల పెక్కుంద్రచే వర్ణింపబడిన భూభాగము భరతవర్షము. ప్రస్తుత మాంగ్లసామ్రాజ్య ప్రధానమంత్రియగు రాంసేమాక్డొనాల్డుగారు "ఈదేశముగుండా మన మెన్నిదినములు ప్రయాణము చేసినను, ఎక్కడ జూచినను దేశప్రజలు ప్రాణావశిష్టములైన తమ శరీరముల నీడ్చుకొనుచు జీవనోపాధికొరకు పాప మెప్పుడు నేదోయొక పనియందే నిమగ్నులై యుండుటనే చూడగలము. హిందూదేశము కటికదారిద్ర్యమునకు వాసస్థానమైనది" అని వర్ణించినది, "గ్రామముతర్వాత గ్రామము చూచుచు పోవునపుడు పురుషులును, అంతకంటె నెక్కుడుగా స్త్రీలును, బిడ్డలును దినమున కొక్కసారియైన తిండి దొరకిన జాలునని యల్లాడుచు పడుబాధలను జూచిన ఎవరికి జాలి వొడమకుండును" అని డాక్టరు జె. ఓల్డుఫీల్డుగారు దుఃఖాశ్రుల రాల్చినది, ౨౦-వ శతాబ్దపు భారతవర్షమువిషయమై. ౧౮-వ శతాబ్దాది నెల్ల సిరిసంపదలతో దులతూగు నీదేశము ఆ శతాబ్దాంతమున కిట్టి దుర్భరమగు పేదరికమున కాలవాల మగుటకు కారణ మేమియో తెలిసికొనవలసియున్నదని కుమారప్పగారి హెచ్చరిక.

ప్రభుత్వమువారు పన్నుల విధింపరాదని కుమారప్పగారివాదన గాదు. కాని, పన్నుల విధించుటయందును, సదరురాబడిని వెచ్చించుటయందును గూడ, ప్రజలసంపద నభివృద్ధిపరచునవియు, ప్రజలసంపదను శిథిలమొనర్చునవియు పద్ధతులు గలవు. భరింప లేనివారిపై పన్ను విధించుచో నాభార మాతనిని శిథిలమొనర్చి ఆతని సంపాదనశక్తి నణతమొందించును, వచ్చిన ఆదాయమును తిరిగి ప్రజోపయోగకరములగు కార్యములకు

నెచ్చింపక, అన్యథాచేసినచో అందువలన గూడ నాదేశీయులు దరిద్రు లయ్యెదరు. కనుక నీరెండుమూలోపముల వలననుగూడ దేశము దారిద్ర్యస్థితికి గురిగావచ్చును.

భారతప్రభుత్వమువారు పన్నుల విధించుటయం దవలంబించుచున్న పద్ధతులును, ఆదాయమును వెచ్చించుటయం దవలంబించుచున్న పద్ధతులును పైరెండువిధములగు ఆక్షేపణలకును గురియగుచున్నవని తెలుపుచు గ్రంథకర్త యీ విషయమును వివరముగ చర్చించెను. ఉదాహరణగ వ్యయమును దీసికొనుడు. హిందూదేశమున ఆదాయములో నూటికి ౯౩.౭ వంతులు ఋణములకు, సైన్యమునకు, ఇతర పరిపాలనశాఖలకు వెచ్చింపబడుచున్నది. అందుచే సంపదను వృద్ధినొందించు పనులపై వెచ్చించుటకు మిగులుచున్న సొమ్ము అత్యల్పము. స్వపరిపాలిత మగు నితరదేశముల జూడుడు. అమెరికా సంయుక్త రాష్ట్రములు ఋణము లాదిగాగల సమస్తములకు నూటికి ౪౮.౧ వంతులుమాత్రమే వెచ్చించుచున్నది. విద్యాభివృద్ధికి ౧౯.౫ ను,మిగిలినది ఇతర అభివృద్ధికార్యములకును వెచ్చించుచున్నది. భారతప్రభుత్వమువారీ విధముగ నొనర్చుచున్న వ్యయపద్ధతుల నాక్షేపించుచు మెక్డొనాల్డుమొదలగుఆంగ్లప్రముఖులు పల్వురు దెలిపిన అభిప్రాయములను గూడ గ్రంథకర్త యుదాహరించెను. ఇది యొక్కటియె గాక, ఆవ్యయము ఎంత ఆక్షేపణీయమైనను, ఆద్రవ్యము విదేశములకు బోక దేశమునందే యుండినచో, దేశము మొత్తమునకు అంత ఎక్కుడు ఆర్థికదుఃస్థితిని చేకూర్పదు. కాని విదేశీయోద్యోగుల పెన్షనులనియు, బత్తెములనియు, మరి ఇతర పేరులతోడను, పైనుదాహరించిన ౯౩.౭ వంతులలో నధికభాగము ప్రతివత్సరము విదేశములకు ప్రవహించిపోవుచున్నది. అది తిరిగి వచ్చుట లేదు. అందుచే దేశము క్రమక్రమముగా కడు దరిద్రావస్థను బొందుచున్నది. ౧౯౧౩ సం॥ న, నెల ౧-కి రు ౧,౦౦౦ లకు మించిన జీతములు గొను నుద్యోగములు నూటికి ౯౬ వంతులు ఐరోపావాసులకును, ఆంగ్లోహైందవులకును ఒసగబడుచున్నవి; నూటికి ౪ మాత్రమే భారతీయుల కొసగబడుచున్నవి. ఉద్యోగశాఖ మొత్తమున సగటున ఐరోపీయునకు రు ౯౩౩ చొ॥నను, భారతీయునికి ౩౭౧ చొ॥నను మాత్రమే యొసగబడుచున్నవి.

రైల్వేలు మొదలగు శాఖలయందును, ఇతరశాఖలయందును అవలంబింపబడుచున్న పద్ధతులుగూడ దేశీయ పరిశ్రమల అభివృద్ధికి అడ్డుదగిలి క్షీణింపచేయునట్టివిగ నున్నవని గ్రంథకర్త నిరూపించెను.

ఈవిషయమున వారొసగిన యుదాహరణలలో, పంచదారపరిశ్రమ యొకటి. ప్రస్తుతము వర్తకవిషయములలో, విదేశీయులగు వర్తకులకును, పారిశ్రామికులకును లాభించువిధాన మనుసరింపబడుచున్నది గాని, ఈదేశీయుల ధనికులుగా చేయుట కుపకరించు నెట్టివిధానమును ఆచరింపబడుట లేదని గ్రంథకర్త అభిప్రాయము.

పన్నుల పద్ధతినిగురించి చర్చించుచు, ధనికులపై కంటె పేదలపై నెక్కుడు భారముగ నుండునటుల విధింపబడుచున్నవని కుమారప్పగారు నిరూపించిరి. దిగుమతి పన్నులరూపమున వచ్చునాదాయము ఉండవలసినంత లేదని తెల్పుచు, అందులకు భారతదేశముపై బలవంతముగ విధింపబడిన "స్వేచ్ఛావాణిజ్య పద్ధతి"యే కారణమని తెలిపిరి. భూమిపన్ను, ఆదాయపుపన్ను, అబ్కారీపన్ను మొదలగు ననేక-పన్నులగురించి చర్చించుచు, వానియం దవలంబింపబడుచున్న పద్ధతులు ప్రజల మరింత నిరుపేదల నొనర్పుట కెటులు కారణభూత మగుచున్నవో సకారణముగ నీగ్రంథమున నిరూపింపబడినది. భారతప్రభుత్వఋణములగురించిన వివరములును, ప్రభుత్వపరిపాలన నివేదికలనుండి అవసరమగు లెక్కలునుగూడ అనుబంధములయం దొసగబడినవి.

భారతప్రభుత్వమువారి ఆర్థికపద్ధతుల స్వరూపమును గురించియు, వానిని ప్రజల కభివృద్ధికరముగ జేయుట కొనర్పవలసిన మార్పుల గురించియు సమగ్రముగ దెలిసికొనగోరువారి కీ గ్రంథము చాల ప్రయోజనకరముగ నుండును.　　　　మో. కృ.

---

# గ్రంథస్వీకారము

## విష్ణుపురాణము

కలిదిండి భావనారాయణ ప్రణీతము. సంపాదకులు కే. రామకృష్ణయ్యగారు, ఎం. ఏ., తెలుగు రీడరు; పి. లక్ష్మీకాంతంగారు, బి. ఏ., తెలుగు ఫెల్లో— ప్రాచ్యపరిశోధనాలయము, మద్రాసు విశ్వకళాపరిషత్తు —ఆంధ్రగ్రంథమాల ౧. రాయలు సైజు: ౨౫౦ పుటలు. వెల రు ౨-౮-౦.

---

## (౧) ఆంధ్రకాదంబరి

పూర్వార్ధము. పద్యాత్మకము. క్రౌనుసైజు ౨౧౫ పుటలు. వెల రు ౧-౪-౦.

## (౨) ద్విపదమేఘదూతము

క్రౌనుసైజు ౪౮ పుటలు. వెల: ౬ అ.

పై రెండిటికి కర్త: పల్లె పూర్ణప్రజ్ఞాచార్యులుగారు, ప్రధానసంస్కృతోపాధ్యాయులు, ఉన్నతపాఠశాల, గుంటూరు.

---

## నయప్రదీపము

డెమ్మీసైజు: ౫౬ పుటలు.

౧౯౩౨ సం. చెన్నపురి విశ్వకళాపరిషత్తున విద్వాను, ఇంటర్మీడియటు పరీక్షలకు పఠనీయగ్రంథము "నయప్రదీపము" నకు విపులవ్యాఖ్యాగ్రంథము. కర్త: పర్వా వెంకటకృష్ణమూర్తిగారు, యమ్. ఏ., తెలుగు లెక్చరర్, థియొసాఫికల్ కాలేజి, మదనపల్లి.

## రఘువంశము

క్రౌను: ౧౪౨ పుటలు. వెల ౧౨ అ.

తెలుగువచనము. రెండవభాగము. కర్త: దీపాల పిచ్చయ్యశాస్త్రిగారు, నెల్లూరు.

---

## శ్రీరాజా వేంకటాద్రినాయుడు

నవల. క్రౌను: ౨౩౪ పుటలు. వెల రు ౧.

గ్రంథకర్త: కీ. శే. పాటిబండ్ల వేంకట్రామయ్య చౌదరిగారు. ప్రకాశకులు: వాసిరెడ్డి వీరవరప్రసాద్‌గారు, వీరులపాడు, నందిగామతాలూకా.

---

## హిందువులపండుగలు

క్రౌనుసైజు: ౩౨౦ పుటలు. వెల రు ౧-౧౨-౦.

గ్రంథకర్త: సురవరము ప్రతాపరెడ్డిగారు, బి.ఏ., బి. యల్. గోలకొండ పత్రికాప్రెస్సునందు ముద్రితము, త్రూపుబజారు, హైదరాబాదు, దక్కను.

---

## శ్రీహరనాథలీల

క్రౌను: ౭౪ పుటలు. వెల ౪ అ.

(ప్రథమభాగము.) ప్రకాశకులు: పి. ఆర్. దాస్‌గారు, శ్రీహరనాథతత్త్వప్రచారిణీసభ, ఆంధ్రబ్రాంచి, సూర్యారావుపేట, కాకినాడ.

---

## జన్మభూమి

(కరుణరసభరితమగు నవ్యనాటిక.)

క్రౌను ౬ సైజు: ౫౨ పుటలు. వెల ౩ అ.

గ్రంథకర్త: ముద్దా విశ్వనాథముగారు. ప్రకాశకులు: వ్యాసకుబేరమువారు, మేలుపాక, ఎల్లమంచిలి దగ్గర, విశాఖపట్నంజిల్లా.

---

## పద్యములు

ఫూల్‌స్కేపు ౮ సైజు: ౧౦ పుటలు.

కవి: చదలవాడ శ్రీరామకృష్ణమూర్తి గారు, ఏలూరు, ప. గోదావరి.

---

## పిల్లల ఆరోగ్యమార్గము

క్రౌను: ౬౮ పుటలు. వెల ౫ అ.

గ్రంథకర్తలు: టి. వి. నటేశన్ గారు, బి. ఏ., యల్. టి.; పి. పద్మనాభపిళ్లెగారు. ప్రకాశకులు: యమ్. పి. రాజన్ అండ్ కంపెని, ౧౨, రంగశాయి నాయడువీధి, పెరంబూరు, మదరాసు.

---

## ఆనందరామశతకము

క్రౌను సైజు ౨౨ పుటలు. వెల ౬ అ.

ఇది 'ఆనందరామా! ప్రభో!' అను మకుటము గల శ్రీరామస్తుత్యాత్మకమయిన వృత్తశతకము. రచయిత: ముత్తనపెద్ది సత్యనారాయణ గారు, సోమవరం. ముద్రణము పట్టాభిరామ ముద్రాక్షరశాలయందు, ఏలూరు.

---

## కుట్టిని

క్రౌను: ౭౨ పుటలు. వెల రు ౧.

గ్రంథకర్త: కోలా జాలరామరావుగారు. ప్రకాశకులు: శ్రీవైష్ణవముద్రాలయాధికారి, పెంటపాడు, ప. గోదావరి.

---

## దురభ్యాసములు: ౧. పొడుము

డెమ్మీ ౮ర సైజు: ౩౬ పుటలు. వెల ౧ అ.

పద్యములు. కావ్యకర్త: వేదుల సూర్యనారాయణశాస్త్రి గారు, సంస్కృతోపాధ్యాయులు, బోర్డు హైస్కూలు, తణుకు.

---

## ఆరోగ్యదీపిక

డెమ్మీసైజు: ౩౬ పుటలు.

ప్రకాశకులు: ది నేషనల్ హెల్త్ & బేబీ వీక్ కమిటీ, కాసింకోట—౧౯౩౨.

---




## మదరాసు సేవాసదనము

సేవాసదనము స్త్రీజాతి అభ్యుదయమున కేరుపడిన సాంఘికసంస్థ. ఇచ్చట స్త్రీలు స్వతంత్రజీవనము చేసికొనుటకు దగిన సామర్థ్యమును పొందుదురు. విద్య, చేతిపనులు మొదలయిన విచ్చట స్త్రీలకు నేర్పబడును. ఇందు సంపన్నులగువారికేకాక భర్తపరిత్యజించినవారికి, తలిదండ్రులు లేనివారికి, విగతభర్తృకలయినవారికి ప్రవేశము కలదు.

ఇచట ప్రకృతము నాలుగవఫారము వరకు విద్య నేర్పబడును. లల్లికపని, కుట్టుపని, నేత, బుటేదారిపని, జిగినీపని, పేముపని, జంత్ర గాత్రసంగీతము ఇచ్ఛానుసారము నేర్పబడును. ధాత్రీవృత్తి (Nursing), మంత్రసానితనము, ఉపాధ్యాయవృత్తి-ఇవి నేర్పబడును. విద్యార్థినులు సేవాసదనముననే నివసించి శిక్షణమును పొందుటవలన వీరియందు మైత్రి, అన్యోన్యసహకారబుద్ధి నెలకొని వీరి భావిజీవితము పరోపకారపరాయణమయి ధన్యమగుటకు అవకాశము గలదు.

ఆదినుండి గౌరవకార్యదర్శిపదము నధిష్ఠించియున్న శ్రీమతి ముత్తా వెంకటసుబ్బరావుసతిగారి కుశలపర్యవేక్షణమున సదనము


శ్రీమతి ముత్తా వెంకటసుబ్బరావు సతిగారు

చక్కగా నిర్వహింపబడుచున్నది. స్వార్థరహితమయిన శ్రీమతిసంఘసేవకు ధన్యవాదములు. స్త్రీజనాభ్యుదయము నాకాంక్షించు పలువురుదారాశయులు చాలినంతసొమ్ము నొసగుచు సదన నిర్వహణమునకు తోడ్పడుచున్నారు.

సేవాసదనము ఎనిమిదిన్నరఎకరముల వైశాల్యముగలిగి ఆరోగ్యవంతమయిన ప్రదేశమున నెలకొనియున్నది. ప్రధానకార్యాలయ

ముగాక ప్రత్యేకభవనములు అయిదు గలవు. ప్రత్యేకభవనముల నొక్కొకదానియందు పండ్రెండుగురు మొదలు పదునైదుగురువఱకు విద్యార్థినులు నివసింతురు. వీరిలో వంతుల ప్రకార మొక్కొక్కరు నిర్వహణము పూని తక్కినవారి సౌకర్యములను సమకూర్చుచుందురు. ఇందువలన వీరికి గృహనిర్వహణ సామర్థ్యము నలవడును. సంఘసేవాపరాయణులు ఐదేసివేల రూపాయల నిచ్చి యీ ప్రత్యేకభవనముల గట్టించియిచ్చిరి. మరిరెండు భవనము లిట్టివి త్వరలో నిర్మింపబడుటకు వాగ్దానము గలదు. ఇది యెంతయు మెచ్చుకొనదగినది.

మూడేండ్లకుమున్ను సేవాసదనమున నేడ్గురు బాలికలుమాత్ర ముండిరి. నేడు నూటపదునల్గు రున్నారు. వీరిలో చెన్నరాష్ట్రమునందలి యెల్లమండలములవారును గలరు. జాతి, మాతృభాష మున్నగువానినిబట్టి వీరి సంఖ్య యీక్రిందిపట్టికలవలన విశదము కాగలదు—

౧—జాతి

| | |
|---|---|
| బ్రాహ్మణులు | ౪౨ |
| వైశ్యులు | ౮ |
| వైశ్యభిన్న బ్రాహ్మణేతరులు | ౪౫ |
| ఆదిద్రావిడులు | ౮ |
| దేశీయక్రైస్తవులు | ౧౧ |
| | ౧౧౪ |

౨—భాష

| | |
|---|---|
| అరవము | ౫౩ |
| తెనుగు | ౪౭ |
| మలయాళము | ౫ |
| కన్నడము | ౪ |
| మహారాష్ట్రము | ౩ |
| కొంకణము | ౧ |
| తుళు | ౧ |
| | ౧౧౪ |

౩—వయస్సు

| | |
|---|---|
| ౧౨ ఏండ్లకు లోబడినవారు | ౨౪ |
| అంతకుపైబడి ౨౦ ,, ,, | ౬౫ |
| ,, ,, ౩౦ ,, ,, | ౨౧ |
| ౩౦ ,, పైబడినవారు | ౪ |
| | ౧౧౪ |

౪—సాంఘికము

| | |
|---|---|
| వితంతువులు | ౩౮ |
| వివాహితలు | ౪౭ |
| అవివాహితలు | ౨౯ |
| | ౧౧౪ |

సేవాసదనమున వివిధశాఖల శిక్షణమును బడసి పరీక్షలయం దుత్తీర్ణలయినవారు ముప్పదియేడ్గు రుద్యోగముల బడసి స్వతంత్ర జీవనమును గడపుకొనుచున్నారు. సేవాసదనమున చేతిపనులను నేర్చినవారు తయారు

చేసిన వస్తువులు ప్రశస్తములు. అవి విక్రయింపబడుచున్నవి. విద్యా పరిశ్రమశాఖల వారు కొంతగ్రాంటు నిచ్చుచున్నారు.

సేవాసదనము ఇంకను చేయవలసిన పని గలదు. పైతరగతుల విద్య నేర్పుటకు యత్నము జరుగవలెను. బీదలగు బాలికలకు ఇంకను ఎక్కుడుమందికి ఉచితభోజనాదుల నొసంగి వారిని సంఘసేవకు తగినవారినిగా జేయవలెను. ఇదియంతయు ధనములేక జరుగదు. మహోదారులగు శ్రీమంతులు, మహారాజులు, జమీందారులు మున్నగువారలు అపారముగ ధనము నొసగి సేవాసదనము సుప్రతిష్ఠిత మగునట్లు చేయదగుదురు.

విద్యయందును, నాగరకత యందును చెన్నరాష్ట్రమున జనసామాన్యము వెనుకబడియున్నది. అందు స్త్రీలమాట చెప్పబనిలేదు. కావున పురుషులకుబలె స్త్రీలకు, విద్య, విజ్ఞానము, నాగరకత నేర్పి వారి నభివృద్ధికిం దేవలసియున్నది. ఇట్టులగుటకు దేశమున పలుచోటుల నిట్టి స్త్రీవిద్యాలయములు బయలుదేరవలసిన యావశ్యకత అధికముగా గలదని వేఱుగ చెప్పబనిలేదు. (సదన చిత్రములుకొన్ని ఈసంచికయందు గలవు.)

* * * *

ఆంధ్రగీర్వాణ విద్యాపీఠము-కొవ్వూరు

కీ. శే. శ్రీ తల్లాప్రగడ సూర్యనారాయణ రావుగారిచే నెలకొలుపబడిన యీ విద్యాపీఠముతాలూకు ౧౯౩౧ వ సంవత్సరపుచరిత్ర యిటీవల వెలువడినది. దీనివలన నీక్రిందివిషయములు తెలియవచ్చుచున్నవి:

"కార్యదర్శియగు వల్లూరి సూర్యనారాయణరావుగారి కృషిచే సాలీనా నూరు రూపాయ లిచ్చు సభ్యులు ఇరువదియిద్దరు చేరిరి. క్రొత్తగా నొకయుపాధ్యాయుడు నియమింపబడెను. సభ్యులచందాలు సరిగా వసూలు కాకపోవుటచేత తరువాతిసంవత్సరమునకు కావలసిన ఆదాయమునుండి నయితము వ్యయింపబడెను.

రాజమహేంద్రవరము-కీ. శే. వాడ్రేవు జోగయ్యమ్మారావు జమీందారిణిగారు ఇరువదివేలరూపాయలు రొక్కము నిచ్చిరి. దాని పయివచ్చు వడ్డీలో సాలునకు వేయిరూపాయలు వెచ్చించి భోజనాదిసౌకర్యములతో విద్యార్థులకు వేదము నేర్పవలెను. కార్యదర్శి వల్లూరి సూర్యనారాయణరావుగారు పండ్రెండువేలురూపాయల నొసగిరి. దీనిపై వచ్చు వడ్డి మొత్తమున కొంతమాత్ర ముపాధ్యాయులవేతనమునకును, తక్కినదంతయు శాస్త్ర విమర్శ, పరిశోధనాదికార్యములకును వినియోగపడవలెను. ద్రోణంరాజు వెంకటచలం పంతులుగారు (పూళ్ల) తమతండ్రిగారి ఉత్తమ గ్రంథసముదాయమును, తదభివృద్ధికై అయిదు ఎకరముల పొలమును ఒసగిరి. ఇంక కొందరు శాశ్వతసభ్యులు చేరి తాము ఏఁటేట చెల్లించవలసిన నూరురూపాయిలు సరిగా చెల్లుచుండుటకు స్థిరాస్తిని తనఖాచేసియిచ్చినారు.

విద్యాపీఠమున విద్య నభ్యసించినవిద్యార్థుల సంఖ్య, పరీక్షలఫలితములు బాగుగానున్నవి. అక్షయసంవత్సరము మొదలు ప్రమోదసంవత్సరమువరకు 'సాహిత్యవిద్యాప్రవీణ'కు చదివిన ఇరువదిముగ్గురిలో Preliminary పరీక్షయందు ఏడుగురు, Final పరీక్షయందు ముగ్గురు జయమును గాంచిరి. ఉభయభాషాప్రవీణకు చదివినవారిలో Preliminary పరీక్షయందు పందొమ్మండ్రు, Final పరీక్షయందు పదుగురు కృతార్థులయిరి. ధనాభావముచే కొన్ని తరగతు లాగిపోయినవి. ముందొకయేడాది కూడ ఇటులే జరుగవలెను: విద్యాపీఠము నందలి యుపాధ్యాయులుకూడ ధనాభావమును గుర్తించి ఒకసంవత్సరము తగ్గుజీతమును పుచ్చుకొనుట కంగీకరించిరి. విద్యాపీఠమునకు దానమొసగబడిన భూములలోని ఆదాయము భూదాతల అశ్రద్ధవలన నిలిచిపోయినది. మూజానిధికి రావలసిన చందాల సొమ్ము దాదాపు పండ్రెండువేల రూపాయలు వసూలు కావలెను. రావలసినసొమ్మును రాబట్టి విద్యాపీఠమును జక్కగా నిర్వహించుటకు పాలకసంఘమువారు పూనుకొని యున్నారు."

సంస్కృతాంధ్రసాహిత్యములను, శాస్త్రములను బోధించుట, సంస్కృతభాషయందు గల శాస్త్రగ్రంథముల నాంధ్రీకరింపజేయుట, ఆర్యమతసంప్రదాయములను బోధించుట మున్నగునవి యీవిద్యాపీఠము నాశయములు, విద్యార్థులభోజనాదులకయి వేతనములుకూడ నొసగబడుచున్నవి. ఈయాశయముల నెరవేర్పు విద్యాపీఠము యథాశక్తిని పాటుపడుచుండుట ప్రశంసింపదగినది. అందును కార్యదర్శిగారి కృషి ప్రత్యేక ప్రశంసార్హము.

ఈకాలమున, ప్రాచ్యవాఙ్మయ విజ్ఞానాభ్యాసము ప్రాచీనపద్ధతుల ననుసరించినది కాదు. అందువలన విద్యార్థుల కెందును గట్టి పాండిత్య మలవడకున్నది. 'విద్వాన్', 'ఉభయభాషాప్రవీణ' బిరుదాంకితుల విద్యాపాటవమును బరికించిన నీవిషయము విశదము కాగలదు. వారికి బ్రసాదింపబడిన విద్యాభ్యాసవిధాన మట్టిది. విద్యార్థులు పూర్వము గురువులయండ జేరి, వారికి శుశ్రూష చేయుచు వారి దయకు పాత్రులై విద్యాసముపార్జనము గావించుచుండిరి. వారికి తాము కరచిన శాస్త్రములయందు నిరుపమానపాండిత్య మలవడుచుండెడిది. వారు నట్లే తమశిష్యులకు ప్రసాదించుచుండెడివారు. ఏమూలచూచిన నప్పుడు విద్వద్బృందములు విలసిల్లుచుండెడివి. వారు నేర్చినవిద్యలు వారిహృదయఫలకముపయి ముద్రితములయి సర్వకాలసర్వావస్థలయందును వారి జ్ఞాననేత్రమునకు ప్రత్యక్ష మగుచుండెడిది. ఆర్యవిజ్ఞానము ఆదినుండియు నట్లే ప్రవర్తిల్లినది. దీనికి మహారాజపోషణము ప్రోదియైయుండెడిది. నేటి కట్టివిజ్ఞానము పోషణములేక కృశింపజొచ్చినది. తదార్జనాసక్తియు సన్నగిల్లినది. ఇటులయినచో మున్ముందు కొన్నాళ్లకు ప్రాచ్యవిజ్ఞానసంపద గగన

కుసుమము కాగలదు. ప్రాచీనపద్ధతుల ననుస రించి విద్య నార్జించి ఆయాశాస్త్రములయందు పరినిష్ఠితమగు పాండిత్యమును సంపాదించిన వార లిప్పుడు కొలదిమందియే కలరు. వారికి దరువాత ఇక నట్టివారు ఎట్లుండగలరు, అట్టి విద్యాసముపార్జనవిధానమున కవకాశమే లేన పుడు ? ఇట్టిది భారతీయభాషలకు, విజ్ఞానము నకు ఇపుడు ప్రాప్తించిన దురవస్థ. దీనిని తొల గించుటకు మరల ప్రాచీనవిధాన మావశ్య కము.

స్వాతంత్ర్యగురుకులములు మన దేశమున పెక్కు వెలయవలసియున్నవి. ప్రాచీనార్య విజ్ఞానము మరల పునరుద్ధరణమును బడసి చిరప్రతిష్ఠితము కావలసియున్నది.

ఈయాంధ్రగీర్వాణ విద్యాపీఠము గురు కులము కావలెనని అపారముగ ధనము కావ లెను. ఆర్యవిద్యాభిమాను లగు నుదార హృదయులెల్లరు నీవిద్యాపీఠము క్రమముగ 'గురుకుల' మగుటకు వలసిన ధనసాహాయ్య మును గావింపదిగుదురు. ప్రకృతము విద్యా పీఠమునకు వాగ్దానముచేసినధనమును వారు వారు చెల్లించి ప్రతిష్ఠాపకుల సదాశయములు, పాలకుల పరిశ్రమ, ఫలవంతములయి విద్యా పీఠము పురోభివృద్ధిని గాంచి శాశ్వతముగ నెలకొనుటకు కారకు లగుదురుగాక !

---

Printed and Published by C. Seshagiri Rao, B.A., at the Andhra Patrika Press, No 7, Thambu Chetty St., Madras
Editor: G. Subbaramayya


లోధ్ర

చనిపోయినవారి వారసులకు ఇచ్చినది   శాస్త్రీయమైన పద్ధతులు   పాలసీదారులసంఖ్య

# రు 1,00,000   "రోజుకు ఒకఅణాపద్ధతి"   18,500

గవర్నమెంటు సెక్యూరిటీలు : రు 72 000

హెచ్చరిక:—ఎవరైనను ఏ కంపెనీ, ఏ పద్ధతిలోనైనను పాలసీదారుగచేరి, దానివలన కలుగు లాభమును పొందవలెనన్నప్పుడు ముఖ్యముగా గమనించవలసిన విషయమేది యని విచారించవలసిన ఆవశ్యకతమునుగురించి సామాన్యముగ భిన్నాభిప్రాయ ముండజాలదు. అట్లు విచారించక, పూర్తివిషయములు తెలిసికొనక, కంపెనీపరిస్థితులు గమనించక, వేరాచనే, కొద్ది మొత్తమును చెల్లించినను కొన్నివేలు రాగలవని ప్రకటించు కొన్ని కంపెనీల ప్రకటనలకు ఆశచెంది పాలసీదారులయినచో, నష్టకష్టములకు సంసిద్ధులై ఉండకతప్పదు. ఏమాత్రమైనను ఆలోచనచేసిన కొద్ది మొత్తమునకు వెయ్యో, లేక కొన్నివేలో రాగలవని భ్రమపడుట నష్టమునకు కారణములను, కావున అట్లు వేలువచ్చుటకు ఎప్పటికి అవకాశములేదని ఖండితముగ తెలియవలయును దీనినిబట్టి కంపెనీ పరిస్థితులు, సదరు కంపెనీ వ్యవహరించు పద్ధతులే పాలసీదారుల లాభనష్టములకు ఉత్తరవాదులు కాగలవని నిర్ధారణ కాగలదు.

కావున, ముఖ్యముగ విచారించవలసిన విషయము లేవన:—కంపెనీ శాస్త్రీయమైన పద్ధతులనే వ్యవహరించుచున్నదా? కంపెనీ పద్ధతులు సామాన్యమైన వారికి కూడ అందుబాటులోనున్నదా? కంపెనీవ్యవహారములు సంతుష్టిగ, నష్టముకలుగకుండ వ్యవహరింపబడుచున్నదా? పాలసీదారులు అప్పుడప్పుడు స్వంతముగా విచారించుకొనుటకు వీలగునట్లు హెడ్డుఆఫీసు అందుబాటులో కలదా? కంపెనీపనులు అనుభవముగలవారిచే నడుపబడుచున్నవా? అను ఇత్యాది పెక్కు విషయములు తెలిసికొనుట ముఖ్యము.

పై విషయములన్నియు సంతుష్టితో ఆచరణలోనికి తేబడి ఈకంపెనీ పనులు వ్యవహరింపబడుచున్నవని నిర్ధారణ చూపు గవర్నమెంటువారి అభిప్రాయముకొరకున్ను, ఆర్థికవిషయములను తెలుపు సంవత్సరలెక్కలకున్ను వ్రాయగోరుచున్నాము. మరియు మా "రోజుకు ఒకఅణాపద్ధతి" అత్యంతోపకరమైన నవీన పద్ధతినిన్ని, ఎన్నో సంవత్సరములో లేక మరణానంతరమువరకు ఫలితముకొరకువేచియుండ నక్కరలేదనిన్ని, అయిదుసంవత్సరముల కొతతూరి చెల్లించిన పైకం అంతయు కొలది మినహాయింపుతో తిరిగి యిచ్చివేయబడుననియు తెలియపరుచును. అనగా నెల 1 కి రు 1—14—0 చొ|| చెల్లించుచూ వచ్చినయెడల సం|| 5 లు పూర్తికాగానే పాలసీదారునికే రు 100 లు తిరిగియివ్వబడును. మరియు రు 100 లు పొందిన కొలదిరోజులకే మరణము సంభవించిన, తిరిగి యింకొక రు 100 లు యివ్వబడును కావున ప్రతి అయిదుసంవత్సరముల అంత్యమందు రు 100 లు పొందుచు, ఎప్పుడు మరణము సంభవించినను సంసారమునకు 100 లు లాభమును చేకూర్చుచున్నవాడగును దీనివలన, కొద్ది మొత్తమును చెల్లించుచు, పాలసదారులున్ను, వారి వారసులును, ఉభయులును ఒకపాలసీవలన లాభమును పొందగలరు.

బ్రాంచీలు:—

| | | | | | |
|---|---|---|---|---|---|
| బొంబాయి, | రంగూన్, | గుంటూరు, | రాజమండ్రి, | కర్నూలు, | తిరునల్వేలి, |
| కలకత్తా, | బెంగుళూరు, | బెజవాడ, | కాకినాడ, | నంద్యాల, | కంజీవరం, |
| లాహోరు, | హనుమకొండ, | నెల్లూరు, | విజయనగరం | కాళహస్తి, | తిరుచినాపల్లి, |
| సిలోన్, | సికింద్రాబాదు, | ఏలూరు, | బళ్లారి, | పాండిచ్చేరి, | తంజావూరు, |
| తెనాలి, | తాడిపత్రి, | క్విలన్, | | | వగయిరా. |

వివరములకు ఒక్కఅణా 3 పైసల బిళ్లలను పంపవలయును.

పూర్తి వివరములకు, ఏజెన్సీపద్ధతులకు :—

## ది స్టార్ ఆఫ్ ఇండియా ఇండస్ట్రియల్
అండ్
## జనరల్ అష్యూరెన్సు కంపెనీ, లిమిటెడ్,

23, సెకండులైన్ బీచ్, మద్రాసు.




# భారతి

## సచిత్ర మాసపత్రిక





సంపాదకుడు

గన్నవరపు సుబ్బరామయ్య



సంపుటము ౯ సంచిక 3

ఆంధ్రపత్రికా ముద్రాలయము-మద్రాసు.

౧౯౩౨




# చిత్రములు

త్రివర్ణ చిత్రములు—గుడి; చింత; పరిచర్య.

సాధారణచిత్రములు—విలాసినీ విభ్రమములు ౬; అమెరికా సంయుక్తరాష్ట్రముల నూతనమంత్రిమండలి; విమానముపై నేటి అమెరికాయువత్తులసముద్రయాత్ర; అయర్ ఇటామ్ దేవాలయ (పినాంగు) చిత్రములు ౮; శ్రీయుత శేషగిరిశాస్త్రులుగారు; మాహివద్ద నౌక సుందరదృశ్యము; (M. K. R.) ఇతరచిత్రములును.



చెన్నపట్టణము, మార్చి ౧౯౩౨

సంపుటము ౯ ప్రజోత్పత్తి సంవత్సరము ఫాల్గునమాసము సంఖ్య 3

## దేవుఁడు

కవిరాజహంస, వోలేటి పార్వతీశము గారు

శ్రీమదనంతకోటి సరసీజభవాండములన్ సృజింపఁగాఁ-ప్రేమపదంబున న్నిలువరింపహరింపఁగఁ జాలి నిత్యశు,
ద్ధామృతమూర్తియై వెలుఁగునట్టి యనంతు,ననాది,దైవత-గ్రామణి నెవ్వ రేవిధముగా భజియించిన నేమి సన్మతిన్!

నెలరేక గుఱుతుంచి నిలిచి "అల్లా" యన్న, మరమేకుఁ గని "యేసుదొర" యఁటన్న
వెలిబూది మెయిఁ బూసి "విశ్వేశ్వరా" యన్నఁ,దిరునామములు వెట్టి"హరి" యఁటన్నఁ
బసుపుఁగుంకుమ వోసి "భద్రకాళీ" యన్నఁ, గుడుము లర్పించి "కొక్కుదొర" యన్నఁ
జలికుండఁ దలఁదాల్చి "సామలమ్మా" యన్న, నవతారములు పాడి "యప్పఁ" డన్న
నెవ్వ రెట్లు నిలిచి యెవ రెట్లు పిలిచిన - నెవ్వ రెట్లు కొలిచి యెంచుకొన్నఁ
జేర్చి తీర్చునట్టి దేవుఁ డొక్కఁడె కాఁడె - ప్రాజ్ఞులైన పరమ భక్తులార!

తల యెత్తి కొండకేకలఁ బెట్టినను గాని, కను మూసి గొణగొణ యనినఁ గాని
కరతాళములఁ గొట్టి గంతులేసినఁ గాని, యుసుఱులు బిగియించి యున్నఁ గాని
మునిప్రొద్దు గంగల మునిఁగి తేలినఁ గాని, నిట్టుపాసములఁ గుందినను గాని
జాతిబొమ్మలఁ గొల్చి జోత లొగ్గినఁ గాని, పెనుమ్రాఁకులకు వలగొనినఁ గాని
యెవరిభక్తి వారిదే యని మన్నింప - వలయుఁ గాని, తప్పు దలఁపరాదు
దేవునకుఁ బ్రియంబు దృఢభక్తియే కాదె - ప్రాజ్ఞులైన పరమ భక్తులార!

---

# తిక్కనకవి ప్రశంస

కవిశేఖర, వడ్డాది సుబ్బారాయుడు గారు

పలుదెఱఁగైన రంగులను భాసిలు పువ్వులు ప్రోగువోసి, య
య్యలరుల నేసుమం బెచట నందము దెచ్చునో యట్లు గ్రుచ్చి, కౌ
శలమున, భక్తిఁ దత్సరము స్వామికి నప్పనసేయు పూజరిం
దలఁచుకొనంగ భారతకథం గవితిక్కన గూర్చెఁ దెల్గునన్.

నన్నయకన్నతండ్రి చనినన్ జిననాఁడయి దిక్కు, పెంచెఁ ది
క్కన్న తెలుంగుబాస; నతఁ డాదట నాదుకొనంగఁ బెద్దదై
కన్నది పెక్కుబిడ్డలను, గాంచుచునున్నది, గాన దాని కా
యన్నయె ముఖ్యుఁడం చతని కార్యు లొసంగిరి తాతసంజ్ఞమున్.

తిక్కన నన్నపార్యు వినుతించె రచించుచు భారతంబు; నా
తిక్కనఁ బాఁపరాజు ప్రణుతించెను రామకథన్ రచించువో;
నెక్కువవారి లక్షణము లివ్వి యశోధనముం గడించుకోఁ;
దక్కువవారి లక్కనము తద్విపరీతము కీరితిం గనన్.

తెలియదు వ్యాసభారతము దెల్గొనరించిన యజ్వకేమి, వే
ల్పుల దగుబాసయంచను ప్రబుద్ధులు నేర్తురు పల్కు, బాహువుల్
గలుగనియాతఁ డీఁదెఁ బెనుకంధి నటం చొకపెద్దలాఁగునన్
వలిమల దాఁటఁజాలెను జవాలునఁ గాళులులేనివాఁ డనిన్.

వ్రాఁతలయందు నచ్చులను భారతపుం బ్రతులన్ విమర్శకుల్
చూతురు పాఠభేదములు; సోమపు తెల్గున కేది మూలమో?
ధాత యటంచు నాంధ్రకవితల్లజు లెల్లరు భక్తియుక్తులై
చేతులు మోడ్చు తిక్కకవి సింహముదూఱుట గేరుసే శివున్.

హరిహరనాథభక్తుఁడ! నుతాంధ్రకవీంద్రుల కాఱువేల భూ
సురులకు మూలపూరుషుఁడ! సోమపుఁడా! యుభయజ్ఞమిత్రుఁడా!
పరమపవిత్ర మౌనికృత పంచమవేద సుధాపయోనిధిం
దరచిన సుప్రమాణవచనా! కవితిక్కన! బ్రహ్మ! మ్రొక్కెదన్.

# కతిపయశబ్దార్థశబ్దస్వరూపవిచారము

శ్రీ॥ శ్రీ॥ వేదము వేంకటాచలముగారు

౨౩ కాత్యాయని – ౨౭ పండితులు

౫-వ వ్యాసము

పారసీకస్థానమునకు పశ్చిమపు సుంటు భూమి గ్రీకుసముద్రములవఱకును, ఆనుని భూగోళ గ్రన్థములలోనేమి, పటములలోనేమి, తురుష్క ఆసియా అను నామముతో నున్నది. ఈసీమయందు పురాతనకాలములలో నొక స్త్రీదేవతను విశేషించి ఆరాధించుచుండిరి. ఆమెకు గొప్ప ఆయతనములు నిర్మితములయియుండినవి. ఆమెకు అయ్యయితావుల నామభేదము లుండినవి గాని మూలప్రకృతి ఒక్కటియే. ఈదేవతయే ఈశిష్ట దేశమందును,అసురులరాజ్యములందును కొలువబడుచుండినది. ఈదేవతారాధనను వీరలవలన ప్రథమము గ్రీకులును, పిమ్మట రోమనులును స్వీకరించియుండిరి. ఈదేవత మన సాంస్కృతికులకును, పారసీకులకును పురాతనకాలమున ఈతురుష్క ఆసియానుండి లభ్యపడినది. తురుష్క ఆసియాలో పశ్చిమసముద్రతీరమున ఎఫీసస్ అను నగరము కలదనియును, అక్కడిదేవతయగు జ్ఞానాంబకు యవనులు అద్భుతమగు నొక ప్రాసాదమును నిర్మించిరనియును ౪-వ వ్యాసమునందు చెప్పితిమి. ఈజ్ఞానాంబ ఈ యవనులకు దత్తు. వారు ఆభూమియందు చేరుటకు రెండువేల సంవత్సరములకు ముందునుంచి అచ్చటనే స్వదేశస్థులచే నెలకొల్పబడి వెంచేసియుండినది.

అక్కడనుండి తూర్పు మిగిలివచ్చుటలో భార్గవులరాజ్యముండినది. (Phryjians). ఆ రాజ్యమునందు ఈదేవతకు సుప్రసిద్ధమైన నామములు పార్వతి-భార్గవి-దుర్గ అను అన్వయముగలవి. ఈరాజ్యమునకు ప్రాచీదిశయందు, కప్పడోకియా అను మండలమునందు 'కోమానా' అను పురమున ప్రసిద్ధమగు దేవీపీఠ ముండినది. ఇచ్చట నామెకు 'మా' అని పేరు. యుద్ధక్రీడలయందు ఆనందించునది. ఈరాజ్యమునకు ఉత్తరమునను, నల్లసముద్రమునకు దక్షిణముగను గల యొకమండలమున నీ 'మా' అను నామముతోడనే యిదేదేవత ఆరాధింపబడుచుండినది. మఱియు కప్పడోకియాసీమను విడిచి తూర్పు పోవుచుండుటలో కామ్యక మండలము(Comagene-Kumukh) తటస్థించుచున్నది.

దీనిసందు యూఫ్రెటీసునది ప్రవహించును. ఈ మాగాణములోని భాగమే కామ్యకవనము. ఇది ద్వైతవనమునకు ఉత్తరముగను పశ్చిమముగను ఉండును.

ఈద్వైతశబ్దమునకు సంస్కృతమున అరణ్యనామము గాని అర్థము లేదు; నిర్వచనము లేదు. ఇది సంస్కృతపదము కాదు. అసురభాషలోది. ఆ భాషలో దీనికి...అని యర్థము. కామ్యకవనమని పేరు గలుగుటకును సంస్కృతమున సమాధాన మేమియు లేదు. కామ్యకమండలమున నారాధింపబడుచుండిన స్త్రీదేవత కామాఖ్యా. ఈకామ్యకవనము నరకాసురుని విషయమైన నదీమధ్య భూమిలో ఉత్తరమున నుండునది. ఈ 'కామాఖ్యాయోని మండలము'ను గుఱించి కాళికాపురాణమునందు విస్తరింపబడియున్నది. నదీమధ్యమునకు ఉత్తరముగ నుండు రమ్యకలేక రమణకవర్షమునందును, పారసీకస్థానమందును ఈదేవి అనాహతా, అనాహితా అనునామములతో ఆరాధింపబడుచుండినది.

తురుష్క-ఆసియాకు దక్షిణభాగమున 'సుర్యా' అనుమండలము గలదు. ఇదియు 'అసుర్యా' శబ్దమే. సుప్రసిద్ధమైన అసుర్యానుండి భేదించుటకు 'సుర్యా' అని యేర్పడినది. ఈ భూమియందు పూర్వయుగమున ప్రసిద్ధమయిన యొకదేవీపీఠ ముండినది (Hierapotes). ఇక్కడి దేవత 'మీనాక్షి'. అమ్మవారి నామము లగు నక్షత్రములు అసాధువులు. కామాఖ్యా,మీనాక్ష్యా

అని యుండవలెను. ఈశబ్దముల కర్థము గాని, కారణము గాని తెలియక అక్ష్యంతముల్గ సవరించినారు. ఆ సీమకు పడమట నున్నది ఫణీకులను అసురులభూమి. వీరే త్రిపురాసులు. అచ్చటి దేవతకు అష్టారార్ అనియును, గ్రీకులమార్పులో అర్తెమిస్, అస్టార్టీ, అనియును నామములు. ఈజిప్టుదేశమునందు జగత్ప్రసిద్ధముగ నీస్త్రీదేవత ఆరాధింప బడుచుండెనది. అచ్చట నామె నామములు 'ఈశీ, సతీ' అని గలవు. ప్రథమసహస్రనామము లేర్పడినది ఈమెకొఱకే. 'నదీమధ్య'మునందలి అసురులస్త్రీదేవత మిక్కిలి ప్రసిద్ధిని గాంచినది. ఆమెకుగల ముఖ్యనామములు ఇష్తర్-నానా అనునవి. ఈ 'నానా' శబ్దము మన సహస్రనామములలో చేరిపోయినది— నానా, నాన్యా, అనన్యా; ఆమెకు లక్ష్మీనామ మిడి, ఆ లక్ష్మికి మన్మథుని కుమారునిగా నేర్పఱచి, అతనికి నాన్యజః, అనన్యజః అని పేర్లుపెట్టి వీటికన్నింటికిని అపార్థములను జెప్పియున్నారు. ఈస్త్రీదేవతలకంతయు మూల రూపము మనభూమికి సంబంధించిన చంద్రగ్రహము. చంద్రనామములు సంస్కృతమున పుంలింగములయ్యును చంద్రుడు జ్యోతిశ్శాస్త్రమునందు స్త్రీగ్రహము. 'రాహ్వేందు శుక్రాః స్త్రియః' అన్నారు. దీనికి కారణము మిక్కిలి పురాతనకాలమున కొన్నిమండలములలో చంద్రుని పురుషగ్రహముగ భావించి ఆరాధించుచుండిరి. ఇతరులు స్త్రీగ్రహముగ భావించిరి. స్త్రీలింగము క్రమేణ ప్రబలినది. గ్రీకులు, రోమనులు మొదలగు యూరోపియనుల కందఱకును చంద్రుడు స్త్రీగ్రహము. శుక్రుని వృత్తాంతము నిట్టులే. స్త్రీత్వమును, పురుషత్వమును కలిగి యుండినవి. క్రమేణ యొకవ్యవస్థ కలిగినది. తూర్పున వేకువజామున నగపడు శుక్రుడు పుమాన్; సూర్యాస్తమయమునకు పిదప నతములో నగపడు శుక్రుడుస్త్రీ. కావున నీ స్త్రీదేవతల యాథార్థ్యమును తెలియజేయుటకు వీరికి ఫాలమున 'చంద్రవంకను' అమర్చుచుందురు. నవగ్రహారాధనాకల్పమునందు— 'చంద్రగ్రహాదేవతాం పార్వతీ మావాహయామి' అని చెప్పుదురు. దీనియర్థము ఇరుగురు నొకరేయనుట. ఈచంద్రకళ అమ్మవారిది గాని అయ్యవారిది గాదు. అర్ధనారీరూపమునందు అమ్మవారికి లాంఛన ముండుటచేత అయ్యవారిరూపము పూర్ణముగా చూపినపుడు ఆచంద్రకళను దొంగిలి వీరికిసూడ నమర్చినారు. అమ్మవారికి చంద్రునితోడి ఐక్యమును తెలియబఱచుచు సహస్రనామములయందు అభిధానములు గలవు.

౧. చంద్రవిద్యా-అనగా చంద్రుడని తెలియవలసిన దేవత-చంద్రమండల మధ్యగా - సౌమ్యా - ఖేచరీ- సింహార రక్తా.

౨. కళానాథా-(షోడశకళలకు అధికారి)సకళా• కళావతీ-ప్రతిపన్ముఖ్యరాకాన్తతిథి మండల పూజితా.

3. షోడశికారూపా-అనగా ౧౬ రూపములు గలది. (ప్రతిదినము జరుగుచుండెడి కళాధిక్య హైన్యముల వలన గలిగినపేరు.) పూర్ణచంద్రికా, పూర్ణిమాత్మికా.

యవనభూములలో కొన్నితావుల నీదేవతకు జరుగుచుండిన బ్రహ్మోత్సవమున ౧౬గురు ముత్తయిదువలు సొంతముగ నొకకోకను నేయుదురు. అదియు ౧౬ మూరల ఆయామమును గలిగియుండును. ఈ కోకను అమ్మవారికి కట్టపెట్టుదురు. అదియును వారి మాసదినములగణనలో ౧౬-వ దినము జరగును.

౪. జ్యోత్స్నా - చంద్రికా - కౌముదీ - చాంద్రీ.

౫. సుధా - సుధారూపా - సుధామయీ - సుధానాథా - సుధాబ్ధింమః - సుధాజ్యోతిః.

ఈ చంద్రాత్మకత ఈదేవతలకు ఆరంభకారణము. ఈవల కొంతకాలమునకు స్త్రీదేవతలను గాని, పురుషదేవతలను గాని గురించిన భావనలు మాఱుపుజెంది ఒక్కొకదేవతను ఈ ప్రపంచమునందలి యఖిలమునకును అధికారస్థానముగా భావించుట యేర్పడి, ఈచంద్రపర్యాయనామములు ఈ స్త్రీదేవతల కేల గలిగెనని తెలియక వీటిని సూర్యపరముగ సవరించి, ఈ దేవతకే 'సూర్యమండలమధ్యస్థా' ఇత్యాదినామములను చెప్పినారు. ఇది కృతకము. ఆధారము లేనిది.

ఈస్త్రీదేవతలకు సంబంధించినభావనలు, పూజాపద్ధతులు, ఆగమములు, ఆచారములు, ఇత్యాది విషయములయందు కొన్ని సామాన్యలక్షణములు గలవు.

1. ఈస్త్రీదేవతలను గోరూపముగల ప్రకృతులనుగ చెప్పుచు వీరిని అయ్యాయిభాషలయందు గోశబ్దవాచ్యములతో నిర్దేశించుట కలదు. సంస్కృతమునందు-శృఙ్గిణీ, అర్జునీ, అఘ్న్యా, రోహిణీ, అని చెప్పుదురు. దీనికి కారణము- శుక్లపక్షమునందు చంద్రునికి రేఖాకారము - దినదినప్రవర్ధమానముగను, కృష్ణపక్షమునందు దినదినక్షీయమానముగను గాంపట్టును. అట్టి యాకృతియందు పార్శ్వములు గోశృఙ్గములను, మధ్యభాగము, గోవుయొక్క కపాలోత్తరభాగమును అనుకరించి, అంతయు జేరి గోశిరస్కరూపముగ నుండును. ఇట్లు గోవులకుగల చంద్రకళానుకృతివలన నీదేవతలకును గోసంజ్ఞ కలిగినదేగాని స్వతంత్రించి కాదు. మనపంచాంగములలో చంద్రోదయమును సుజించి - ఉత్తరశృంగోన్నతిః దక్షిణశృంగోన్నతి—అని వ్రాయుచుందురు.

2. ఈ స్త్రీదేవతలకు వీరి ఆగమపద్ధతులలో పురుష దేవతలతో సంపర్కము లేదు. వీరి దేవళములు వీరికే కేవలము గాని అక్కడ పురుషదేవతల సాన్నిధ్యము లేదు. కావుననే దేవాలయములలో నిప్పటికిని అమ్మవారికి ఆలయము, అర్చన ఇత్యాదికము వేఱు; అయ్యవారికి వేఱు. కొంతకాలము గడచినపిదప 'న స్త్రీ స్వాతంత్ర్య మర్హతి' అని లోకములో పెద్దలకు ప్రబోధ గలిగి మనవారు 'ఇత్యేనం మను రబ్రవీత్' అన్నారు. అంతట నీ స్త్రీదేవతలకు తోడుకాగలందులకు పురుషదేవతలను చొప్పించుచు వచ్చిరి. అప్పటికిని విమానములు వేఱువేఱు. పయినచెప్పిన రాజ్యములయందు పురుషదేవతలును అనేకులు గలరు. వారి స్థానములు వేఱు; వీరివి వేఱు. అమ్మవారిదేవళములలో పురుషదేవతలకు ప్రవేశము లేదు. ఈపరిస్థితి మనకు మధురలో మీనాక్ష్యాంబ చరిత్రములో తెలియును. సోమసుందరుడు మొదట లేదు. పిమ్మట నిల్లఱికముగకు కైలాసమునుండి వచ్చి చొచ్చుకొనినవాడు. పురుషదేవతలకు ప్రవేశము కలుగ జేసినపిదప వివాహగర్భాధాన ప్రస్తావములకును, ఏకాన్త సేవలకును అవసరము కలిగి 'శుభస్య శీఘ్ర'మని ఆరంభించినారు. కానిచో రాత్రివేళల నమన్త్రకముగ, చౌర్యముగ నీదేవతలు ఆకార్యమును నెఱవేఱుచుచుందురు. కల్యాణోత్సవములను బొమ్మలాట జరగినపిదప, ఉభయులను ఒకరథములో కూర్చుండబెట్టి ఊరేగింపు చేయుదురు. అంతదనుక శివస్థలములలో అమ్మవారి రథము వేఱు; అయ్యవారిది వేఱు. ఇది తప్పిపోలేదు. ఏకారణముచేతనో ఈమార్పు జంబుకేశ్వరమునందు పూర్తిగ జరుగలేదు. అచ్చట వేంచేసియున్న అఖిలాండేశ్వరమ్మ ఈశ్వరుని తనదగ్గఱ తెచ్చి పెట్టినను ఒల్లదాయెను. ఆమెకు వివాహము లేదు. కల్యాణోత్సవమును లేదు. గర్భాధానమును లేనట్టే. ఈస్థితివిశేషమునకు సమాధానము చెప్పుటకయి యొక అబద్ధపుస్థలపురాణముకూడ ఏర్పడియున్నది.

3. వీరలకు ముఖ్యమయిన వాహనము సింహవాహనము.

4. వీరల కందఱకును పూజరులు, స్త్రీలును, పురుషులును గలరు. వీరివిషయము కొంత విస్తరించి క్రింద చెప్పబడును.

5. వీరిసేవకులకు అసంఖ్యాకముగ ప్రౌఢస్త్రీలను అంకితముచేయుదురు. క్రింద విస్తరింపబడును.

6. వీరల తృప్తికొఱకు స్త్రీపురుషులు ౨వ వ్యాసమున చెప్పబడిన సేవాపద్ధతులను ప్రత్యక్షమైన వేద్యవిశేషములను ఆచరించుచుందురు.

7. ఖండపరశువు- ప్రాసము- పాశము- భల్లము- ఇత్యాదియుద్ధసన్నాహములో చేరిన శస్త్రవిశేషములు ప్రధానముగ నీ స్త్రీదేవతలవి.

8. ఈ స్త్రీదేవతలు చంద్రకళాధారిణులు.

9. ఈ స్త్రీదేవతలకును మనుష్యజాతిస్త్రీలకు గర్భములు కలుగునట్లు చేయుట - వారికి సుఖప్రసవమగునట్లు చేయుట - ఈ యధికారము కలిగియున్నది. దీనికి కారణము వీరు చంద్రగ్రహదేవతలుగ నుండుట. స్త్రీలకు సహజధర్మమయిన ఋతుకాల సన్నివేశము ప్రతిమాసమును చాంద్రమానము ననుసరించియుండును. వారికి గర్భములు ఆపాదించినపుడు మాసపరిగణనము చాంద్రమానము నవలంబించియుండును. ఈ వీరి గర్భవిషయములను ప్రసవవిశేషములను చక్కజేయు

దేతతలు ఈస్త్రీదేవతలని రెండవ వ్యాసమునందు అవెస్త శ్రుతివాక్యముల నుదాహరించి చూపియుంటిమి.

**10.** ఈస్త్రీదేవతలు నీళ్ల మీదకూడ నధికృతులు. ఇదియును చంద్రగ్రహసంబంధి- నీరు పొంగుటకును- విస్తరించుటకును చంద్రుడు అధికారి.

'హరస్తు కించిత్పరిలుప్తధైర్య
శ్చంద్రోదయారంభ ఇవాంబురాశిః' అని మహాకవి కాళిదాసు. "ముముచే న పతివ్రతౌచితీ ప్రతిచంద్రోదయ మభ్రగంగయా" అని నైషధము. సముద్రమునను, నదీ ముఖద్వారములయందును పాటు, పోటు గల్గుట చంద్రునివలన.

త్రిమూర్తులను సృష్టిచేసిన పిదప వారికి భార్యల నమర్చుటలో- ఈస్త్రీదేవతాకృత్యవిశేషమయిన నీటి పరిపాలనను మూర్తిమంతముచేసి బ్రహ్మదేవునికి భార్యగ సమర్పించినారు. ఆబ్రహ్మ తలవాకిటను మెలంగెడు పాలకుకయయిన కారణమున నామెకు విద్యలమీద నధికారమును కల్పించినారు. అయినను యాథార్థ్యము మఱుగుపడలేదు. సరస్వతి అనగా నీళ్లుగలామె- నీళ్లపై యధికృతురాలనుట. ఈనామమునకును, విద్యలకును ఏమి సంబంధము? సరస్వతీనామమును పైజెప్పిన స్త్రీదేవతలదే. అవెస్తవేదమునందలి అనాహితా సూక్తమునందు ఆదేవత నీళ్లపై ప్రభుత్వముగలామె యని స్పష్టపడును. మన సహస్రనామములయందుగూడ నట్లే తెలియును. మనసరస్వతీదేవికిగల నామములలో ఈపద మొకటి దక్క కడమపదములు వాక్కునకును, భాషకును సంబంధపడి యుండును ; వాగ్దేవికి అట్లుండుట సహజము. సరస్వతీ అనునామ మేల కలుగవలె? సరస్వతీపూజయని పేరు చెప్పి పుస్తకములను దేవతార్చనలోనుంచి పూజచేయుచుండుట యెట్టిది? లక్ష్మీశబ్దము నిట్లే. దీనికి అర్థము కాన్తి-కాన్తిమతియని. ఇవి చంద్రనామములు-తద్ద్వారా చంద్రస్వరూపములగు స్త్రీ దేవతలకెల్ల ఈపేరుతో పార్వతీదేవిగాక, వేఱురూపమును కల్పించి, రెండవమూర్తికి జంటించినారు.

**11.** ఈ స్త్రీదేవతలు ఈభూమియందలి తరుగుల్మలతాదులు - సస్యములు - ఫలపాకాన్తములగు ఓషధులు, ఇత్యాద్యస్యజ్ఞముల మీద సంపూర్ణమయిన యధికారము గలవారు. ఇదియును చంద్రునికారణమున చంద్రుడు పంట పయిరుల యొకిమోదు; ఓషధీశుడును. కొన్ని రాజ్యముల యందు వృక్షములను చంద్రుడు వృద్ధిలో నుండునపుడు ఛేదించుటలేదు. క్షయపక్షమున చేయుదురు. ఆంధ్రదేశమునందు ముఖ్యముగ నుత్తరజిల్లాలలో పడుచులు రెండు వ్రతముల నాచరింపుదురు. అట్లతదియ అని మొదటిది. ఉండ్రాళ్లతదియమని రెండవది. మొదటిది భాద్రపద బ॥ ౩లు, రెండవది ఆశ్వయుజ బ॥౩లుఅని జ్ఞాపకము. వీటిని నుజించిన సంప్రదాయశుద్ధి తెలియక కొన్నితావుల ఉండ్రాళ్లతదియను ప్రథమవ్రతముగను, అట్లతదియను ద్వితీయముగను చెప్పుదురు. ఇది దురాచారము. ఈరెండు దినములయందును గౌరీవ్రతమును చేయుదురు. చంద్రోదయమయిన పిదప చేయవలెను. ఈరెండు గౌరీవ్రతములును చంద్రవ్రతములు. అట్లతదియయందు అట్లు అనగా దోసెలు పోయుదురు. ఇవి నైవేద్యము. వీటిని ఎంత విరివిగలవాటినిగ చేయవచ్చునో అట్లు చేయవలెను. రెండవవ్రతమునందు చేయు ఉండ్రాళ్లను సాధ్యమైనంత లావుగలవాటినిగ చేయవలెను.

ఒకవిషయము చోద్యముగ నుండును. ఈరెండు వ్రతములును అనాదిగ నిప్పటికిని యూరోపు సీమలలో కూడ పెక్కుతావుల జరగుచున్నవి. వీటి కారణమును, అర్థమును ఆరాజ్యములలో యథాస్థితిని తెలిసియున్నవి. మనభూమిలో గౌరిని అడ్డుపెట్టి రూపుమాపినారు.

వీటివిషయము శాస్త్రజ్ఞులు చర్చించి వివరమును జెప్పియున్నారు. చంద్రుడు లోకమంతయు తరుగుల్మలతాదికమునకు అధికారి యంటిమి. మనదేశములో 'ఆషాఢస్సర్వబీజానాం' అన్నారు. పొట్ల బీర కాకర సొర వంగ బెండ ఇత్యాదుల విత్తనములు వేయబడి భాద్రపదము వచ్చువఱకు తీగెలు ప్రసరించుచుండును. ఆతీవల యాకులు ఎంత గొప్పలగునో కాయలును అట్లే యగునని భావన. ఆకులు పెద్దవియగుటకు దోసెలను పోయుట- పెనమునిండునట్లు పోయుట. పిమ్మట చంద్రునికి పూజచేసి నైవేద్యమిచ్చుట. ఇచ్చట చంద్రునికి ప్రత్యామ్నాయముగ గౌరికి పూజ యన్నారు. యూరోపుభూములలో

చంద్రునికే పూజయును, నైవేద్యమును. అనంతరము ఇవి కాయలు కాచు తరుణములో ఉంగ్రాళ్లను చేయుట, పూర్వవత్ పూజయును, నివేదనయును. మఱియు నొక విశేషము: ఈతదియనాడు ఉదయము పడుచులు ఇరుగు పొరుగు ఇండ్లకు ఏడింటికి పోయి అచ్చట వుయ్యేలలపై ఊగుచుందురు. ఈ యాందోళములను సాధ్యమైనంత పైకి ఎగయునట్లు విసరుట అపేక్షణీయము. ఈయాచారము యూరోపులోను, ఇతరతావులయందును కూడ కలదు. దీనియర్థము మెరకపల్లపుపయిర్లు కంబములు మిక్కిలి పొడవుగ వృద్ధిచెంది ఎక్కువధాన్యమును ఈనగలందులకు. ఇదియును చంద్రోపాసనలో చేరినది. ఈ రెండుదినములలోను గౌరీవ్రత మనునది, చంద్రవ్రతము. మఱియు శ్రావణ శుక్రవారమునందు ప్రసిద్ధముగ వరలక్ష్మీవ్రతము నాచరించుచున్నారు. ఇదియును గౌరీవ్రతము. అనగా చంద్రునివ్రతము. లక్ష్మీవ్రతము గాదు. ఈవ్రతమును రాత్రి చంద్రోదయ మయినపిదప చంద్రదర్శనము చేసి చేయవలెను. అవల ఆచారములో ఇట్లే జరుగుచున్నది. ఆంధ్రదేశపుస్త్రీలు రాత్రివఱకు భోజనములేక యుండజాలక గాబోలు పగలు చేయుచున్నారు. ఇది దురాచారము.

* * * * *

పార్వతీదేవికి తల్లి మేనక యన్నారు. ఇది కప్రత్యయముతో జేరిన మేనాశబ్దము.

'మేనాం మునీనామపి మాననీయా
మాత్మానురూపాం విధినోపయేమే.'

ఈ మేనాశబ్దము అనేకభాషలయందు గలదు. చంద్రుడని యర్థము. ఇప్పటికికూడ హిందుస్థానమందు మహీన అనగా మాసమని యర్థము. దీనివికృతి మేనా. చంద్రమాః అనునది జంటమాట, చంద్ర+మాః. ఒక్కొక భాగమునకును చంద్రుడని యర్థము-అమా=చంద్రుడు లేనిదినము; పూర్ణిమా=చంద్రుడు పూర్ణముగ నున్నదినము. తురుష్క ఆసియాఖండమును, యవనభూములయందును పురాకల్పమున అనేకచోట్ల ఈమేనా, మేన్-అను దేవతకు ఆలయములు ఉత్సవములు పూజలును జరుగుచుండినవి. రోమునగరమునందుకూడ గలదు. అచ్చట ఈమె స్త్రీల ఋతుకాలవిషయమున నధికృతురాలని చెప్పుదురు. ఈమె చంద్రగ్రహమని తలచుగ తెలిసియే యుండినది.

తురుష్క ఆసియాలోని భార్గవులరాజ్యమని చెప్పబడిన మండలమునగల దేవత ('పార్వతీ-భార్గవీ-దుర్గా' అనునట్టి నామములతో నుండి నామె) యొక్క తండ్రి పేరు మేనః అని చెప్పియున్నారు. ఇదియును లింగభేదమే గాని వేఱు గాదు. దేవతలచరిత్రములలో ఆమె కౌమారిత యీామె, అతనికుమారుడు ఈతడు-అనుదాని యర్థమును శాస్త్రజ్ఞులు ఇరుగురును ఒకరేయనుట అని చెప్పియున్నారు. ముందొకనామ ముండి కాలక్రమమున మాఱినపుడు పూర్వరూపమును తల్లిగనో తండ్రిగనో చెప్పుట,పరరూపమును దుహితగా లేక పుత్రునిగాచెప్పుట ప్రాచీన సంప్రదాయము. మేనయును, పార్వతియును ఇరువురు నొకరే. పార్వతీదేవికి పూర్వరూపము దాక్షాయణి. ఈమెయును చంద్రగ్రహము. దాక్షాయణి దేహమును విడిచినపిదప ఈశ్వరుడు పిచ్చిపట్టి ఒడలెఱుగక ఆ సతీకళేబరమును బుజముమీద మోచికొని తిరుగుచు ఏడ్చుచు కాందిశీకుడయి పోవుచుండెను. ఇట్లు ఎన్ని దినములో గడచినపిదప దీనికి అంతము లేకపోయినందున, ఆయున్మత్తుని ఎదుర్కొనుట కేమి, సతీశవమును తొలగించుట కేమి బ్రహ్మవిష్ణ్వాదుల కెరికిని ధైర్యము లేక యొకసనుపాయమును జేసిరి.

కాళికాపురాణము, ౧౮-వ అధ్యాయము—
'ఇతి సంచిన్తయన్త స్తే బ్రహ్మవిష్ణుశనైశ్చరాః
సతీశవాన్తర్వివిశు రదృశ్యా యోగమాయయా;
ప్రవిశ్యాథ శవం దేవాః ఖండశ స్తే సతీశవం,
భూతలే పాతయామాసుః స్థానే స్థానే విశేషతః;
దేవీకూటే పాదయుగ్మం ప్రథమం న్యపతత్ క్షితౌ,
ఉడ్డియానే చోరుయుగ్మం హితాయ జగతాం తతః;
కామరూపే కామగిరౌ న్యపత ద్యోనిమండలమ్,
తత్రైవ న్యపత ద్భూమౌ పూర్వతో నాభిమండలమ్;
జాలంధరే స్తనయుగం స్వర్ణహార విభూషితమ్,
అంశగ్రీవం పూర్ణగిరౌ, కామరూపా త్తతశ్శివః;

యావ ద్భ్రమంగతో దేవ స్సమాదాయ సతీశవమ్,
ప్రాచ్యేషు యాజ్ఞికో దేశ స్తావదేవ ప్రకీర్తితః;
అస్యే శరీరావయవా లవశః ఖండితా స్సురైః.

*　*　*　*　*

యత్రైవ పతితం సత్యా శ్శివ స్తత్ర వృషస్వజః,
ఉపవిష్టః——

ఈవిధమున సతీశవము తునుకలుగా నక్కడక్కడ భూమిమీద పడిపోయినది. ఈతునియలు ౧౮ గా నుండి యుండును. మూలము సంపూర్ణముగ లేదు. ఖండములు ౧౮ అయినను, తదధికమైనను ప్రస్తుత విషయమునకు ప్రాతికూల్యము లేదు. ఈ ఖండములు భూమిమీద పడిన తావులయందంతయు దేవీపీఠములు పిమ్మట ప్రసిద్ధములుగ నేర్పడినవి.

మొదటి దేవీపీఠము లివి. పిమ్మట అసంఖ్యాకము లయినవి. ఈచంద్రగ్రహమును గుఱించి ఆయాదేశముల యందలి ప్రాచీన దైవజ్ఞులు వారివారి జ్యోతిర్గణిత సంప్రదాయముల ననుసరించి కొన్ని తావుల ౧౮ కళలుగను, కొన్నితావుల ౧౫ అనియును, కొన్నితావుల ౧౬ గను లెక్కించుచు వచ్చిరి. 'సతీశవమునుండి రాలుచువచ్చిన ఖండములు ఒకటొకటియును ఒక్కొకచంద్రకళాక్షయ పక్షము, సతీచంద్రమసుల ఐక్యమును తెలియచేయును. ఈ సతీవృత్తాంతము ప్రాచీన ఈజిప్టుదేవతల ఇతిహాసములలో లింగభేదముతో పొందుపడియున్నది. దానిని శాస్త్రజ్ఞులు చర్చించి పైన చెప్పిన విధమున అర్థమును తేటపఱచియున్నారు. ఈజిప్టుదేవత చరిత్రము మన వారికి లభ్యపడి దాక్షాయణీవృత్తాంతములోచేరిపోయినది.

ఈ పురాణరహస్యములును ఆచారవిశేషములును పశ్చిమభూములనుండి తూర్పునగల సీమలకు ప్రసరించినవని తెలియబఱచుటకు, పైశ్లోకములలో నొక వాక్యమున్నది. 'యావద్భ్రమంగతో దేవ స్సమాదాయ సతీశవమ్, ప్రాచ్యేషు యాజ్ఞికో దేశ స్తావదేవ ప్రకీర్తితః' అనగా సతీశవమును మోచికొని పడమరనుండి ప్రాఙ్ముఖముగ పోయినాడనుట! ఈజిప్టుగాథలో నాదేవతశవము ౧౪ తునుకలుగా ఖండింపబడినది.

మఱియు చంద్రగ్రహమును పురాతన కాలమున కొందఱు పురుషునిగను ఇతరులు స్త్రీరూపముగను భావించి పూజించుచుండిరని చెప్పితిమి. ఇది యిప్పటికి తెల్లమైయుండును.

పురుషభావనకు సంబంధించిన వ్రతవిశేష మొకటి మనభూమిలో స్థిరపడిపోయియున్నది. మిక్కిలి ఆదరముతో జరుపుచుందురు. ఇదియే అనన్త పద్మనాభచతుర్దశీవ్రతము. ఇది చంద్రునివ్రతము. ఈవివరములవలన నీ స్త్రీదేవతల నిజరూప మిట్టిదయని తేటపడియుండునని నమ్ముచున్నాను. ఇంకను ఇచ్చట విస్తరించుటకు లేదు.

౨౬. కాత్యాయనీ

కాత్యాయనీశబ్దము సంస్కృతమునందు రెండు అర్థములలో వాడబడుచున్నది. ఒకటి పార్వతీదేవిపేరు. రెండవది 'త్రిలక్షణ యుక్తురాలగు స్త్రీ'పేరు. ఈ రెండు విషయములును కోశములయందును, తత్తత్కోశవ్యాఖ్యలయందును పొందుకొనియున్నవి.

అమరః:——౧. 'ఉమా కాత్యాయనీ గౌరీ &c.'
౨. 'కాత్యాయ న్యర్ధవృద్ధా యాకాషాయవసనాధవా'.

శాశ్వతః:—— 'కాషాయవస్త్రావిధవాం ద్వితీయవయసం స్త్రియమ్, కాత్యాయనీం విదు స్సన్త ఉమా కాత్యాయనీ మతా.'

యాదవప్రకాశః——'......విశ్వస్తా విధవాధవా, కాత్యాయనీ ద్వితీయంచే ద్వయః కాషాయ మంబరమ్.'

మేదినీకారః——'కాత్యాయనోవరరుచా విశేషే చమునేః పుమాన్, కషాయవస్త్రావిధవార్ధజరత్యుభయోః స్త్రియామ్.'

భానుజీదీక్షితునిచే ఉదాహృతమయిన యొకశ్లోకపు మూలము ఎక్కడిదని తెలియలేదు: 'కాత్యాయనో వరరుచౌ కాత్యాయనీతు పార్వతీ, కషాయవస్త్రవిధవార్ధవృద్ధమహిలాపిచ.'

అర్థభేదము లున్నను శబ్దమొక్కటియే.

'శ్రీమాతా శ్రీమహారాజ్ఞీ శ్రీమత్సింహాసనేశ్వరీ' అని చెప్పబడిన పరదేవతకును మనుష్యజాతిలోని ముండ

వొఫ్రులకును ఒకటే నామమా? వీరు మనవాడుకలో గంగా భాగీరథీసమానలుగా నున్నారు గాని, లక్ష్మీ పార్వతీసమానులు కారే.

వ్యాఖ్యానములమ హాళమ్ము, ఇవియును చోద్యముగ నుండును.

ఉమా కాత్యాయనీ —

(౧). లింగాభట్టీయము

'కతి అయనాని మోక్షమార్గా స్సన్తీతి విచారయతీతి కత్యయనః; తస్య గోత్రాపత్యం కాత్యాయనీ.'

'మోక్షమార్గంబు లెన్ని గలవని విచారించువాడు కత్యయనుడు; ఆఋషిగోత్రమందు బుట్టినది' అని తెలుగులోకూడ టీక వ్రాసియున్నది.

ఈటీకకు ప్రమాణ మేమని తెలియలేదు. టీకాకారులు చెప్పలేదు. వారు వ్రాసినది నిజమయిన యెడల ఎచ్చట నయినను నిదర్శనప్రమాణము లుండియుండవలెను.

ఈకత్యయనుడు ఒక ఋషి యని చెప్పిరి. ఈతడు ఏకాలపు వాడయినదియు తెలియదు. ఈతని యన్వయమందు పార్వతీదేవి పుట్టుకయైన కారణమున, నీతడు దేవయుగమునకు ముందరివాడని చెప్పవలెను. అప్పటికి సృష్టి ఎంతవఱకు జరగియుండినదియును తెలియదు. అప్పటికే ఈ ఋషికి మోక్షమార్గములను వెదకు బాధ యేల కలిగినది? 'నాన్యః పన్థా అయనాయ విద్యతే' అని యప్పటికి తీఋమానముకాలేదు కాబోలును — కావున మోక్షమార్గములను వెదకుచుండును.

ఈతనికి ఈనామము కొంతవయస్సు చెల్లిన పిదప, ఇతరులు పెట్టినదిగా నుండవలెను. అనుదినము ప్రాచీనావీతియై కూర్చుని 'కత్యయనాని-కత్యయనాని,' అని యఱచుచునుండిన, నీతడు వెఱ్ఱియని యితరులు భావించి యీతనికి కత్యయనుడు అని పేరు పెట్టియుందురు. పుట్టిన వెంబడి ఈతని తల్లిదండ్రులు ఈపేరు పెట్టియుండరు. కనుక ఇతనికి ప్రథమనామ మేమిగ నుండినదని తెలియలేదు. ఈకత్యయనుడు హిమాలయునికి వృద్ధప్రపితామ కూఁతా? హిమాలయుని వంశపూర్వులు ఎవరు? ఈ పార్వతిహిమాలయుని కొమార్త అని తెలియును. ఈకత్యయనుని పేరుతో కవిత్వముచేసి ఈయమ్మవారికి ఈపేరు పెట్టుటకు కారణ మేమి?

(౨) భానుజీదీక్షితుడు

'కతస్యాపత్యం-కాత్యాయనీ-గర్గాదిభ్యోయఞ్'. ఈకతు డెవ్వడని చెప్పలేదు — హిమాలయునికి నామభేదమా? కానిచో నీతనియపత్యమని యెట్లు తెలియవచ్చినది?

(౩) క్షీరస్వామి

'కాత్యశబ్దాత్ - గర్గాదిభ్యోయఞ్ - ఇతి కాత్యాయనీ'. ఈకాత్యు డెవరు?-భానుజీదీక్షితుడు చెప్పిన కతుని కుమారుడా? ఈతని చరిత్రము నెక్కడ చూడవచ్చును?

(౪) మహేశ్వరటీక

ఇది కొంతకాలముక్రింద బొంబయిరాజధాని పాఠశాలలకొఱకు కీర్తిశేషులు రామకృష్ణగోపాల భాండారకరులు ముద్రింపించినది.

దీనియందు అమ్మవారినామమైన కాత్యాయనీ శబ్దమునకు టీక వ్రాయబడియుండలేదు. మంచిపని చేసినారు. కాత్యాయనీశబ్దము సంస్కృతవ్యాకరణము ననుసరించి అపత్యతద్ధితరూపముగ నగపడును. అంతట తద్ధితమును పీడకొట్టి మూలప్రకృతిని సాధించుట సులభము. కోశవ్యాఖ్యాతలు కాత్యాయనీశబ్దమునుండి మూలప్రకృతిని ఊహించి పునరేవ యా మూలప్రకృతినుండి రూపనిష్పత్తి జేసినారు. మూలప్రకృతిని తెలిసియుండి తద్ధితమును మాపుట కాదు. కావుననే మూలప్రకృతిని పలువిధములుగ చూపినారు. కత్యయనః-కతః-కాత్యః &c. వీనిలో నేది నిజము? సంస్కృత విద్వాంసులగు ఇంగ్లీషు నైఘంటికులు ఉపరి చెప్పినటీకలు తప్ప వేఱు ఆధారము లేవియు కానరానందున వాటిపద్ధతినే అవలంబించినారు. విల్సను (Wilson) దొరగారు-కాత్యాయనుడను ఋషియొక్క దుహిత యైనందున పార్వతికి కాత్యాయనీ అని నామ మన్నారు. అట్లయిన హిమాలయుని కూతురు

కాదు. మానియరు విలియమ్సు - (M. M. Williams) దొరగారు-కతి అను నామమునుండి గాని, కాత్య అను నామమునుండి గాని కలిగిన గోత్రాపత్యరూపమునుగా చెప్పినారు.

ఇప్పటికి తెలియవచ్చినవఱకు ఈదేవికి రెండే జన్మములు. పూర్వరూపములో దాక్షాయణి-ఆమెతండ్రి దక్షుడు, ప్రజాపతి. ఆరూపము మానివేయు సమయమున, మేనకను దనగర్భవాసములో నుండుమన్న ప్రార్థించి, దాక్షాయణిపార్వతీరూపమున పునర్జన్మమెత్తినది. 'సతీ సతీ యోగవిసృష్టదేహా, తాం జన్మనే శైలవధూం ప్రపేదే.' ఈ రెండవపుట్టుకయందు తండ్రి 'హిమాలయో నామ నగాధిరాజః'. (౧) కాత్యాయనుడు ఎవడు ? (౨) కత్యయన (3) కతి (౪) కత (౫) కాత్య-అనువా రెవరు? దుర్గాదేవి విషయమై వీరలకు ఒకరొకరికి పితృత్వ మెట్లు కలిగినది? వీటికి సంబంధించి శ్రుతిస్మృతి పురాణేతిహాసముల ప్రమాణవచనము లెక్కడ? అట్టివి లేనిచో ఈవ్యాఖ్యాతలకు వారు వారు వ్రాసిన వ్యుత్పత్తి విశేషము లెట్లు తెలియవచ్చినవి ?

---

# ఆంధ్రకవిత్వచరిత్రము

భోగరాజు నారాయణమూర్తిగారు

(మూడవభాగము)  ప్రాజ్ఞన్నయయుగము

(వెనుకటి సంచిక తరువాయి)  "భూదేవకులాభితర్పణమహీయఃకృతి—"

ఇంక నీప్రసంగ మిట్లుండఁగాక:—రాజరాజునకుఁ గరం బిష్టమైయుండిన భూదేవకులాభితర్పణము, అశ్వత్థామసంతతివారైన పల్లవరాజులకుఁగూడ మిక్కిలి యిష్టమై యుండుట వింత కాదు. చాళుక్యులుఁ జోళులు మున్నగు పెక్కురాజ్యాధీశ్వరులతో వారికి శత్రుత్వ ముండినను పాండ్యరాజులతో నత్యధికశత్రుత్వ ముండుటకుఁ గారణము, ఆరాజులు బ్రాహ్మణద్వేషు లగుటయే. అందుచేఁ బల్లవపాండ్యరాజులకు జరుగుచుండినయుద్ధములు కేవలము రాజకీయములే గాక, మతవిషయికములనియు మన మూహింపవలసియున్నది. పాండ్యరాజులు పట్టుదలతో జైనమతమును వృద్ధి సేయుచుండఁ బల్లవరాజు లంతకంటెఁ బట్టుదలతో బ్రాహ్మణమతమును వ్యాపింపఁజేయుచుండిరి. మఱియు నీరాజులు వేదాధ్యయనసంపన్నులైన బ్రాహ్మణుల నఱవనాడునుండి రప్పించి, వారి కగ్రహారముల నిచ్చి పోషించుచుండిరి. ఇట్లు వేఁగిదేశమునకు రప్పింపఁబడిన బ్రాహ్మణులసంతతివారే వేఁగినాటి శాఖా బ్రాహ్మణు లైయుందురని యాంధ్రులచరిత్ర మూహించుచున్నది.

చుట్టుప్రక్కలఁ గలరాజు లెల్లరుఁ దమకు శత్రువులే యగుటచేఁ బల్లవులకుఁ దఱుచుగ రాజ్యచ్యుతి కలుగుచుండెను. కాని యట్టి దుర్దశలయందుఁగూడ వారు మతమును విడిచిపెట్టలేదు. వారిపరిపాలనమునఁ గాంచీపురము గొప్పబ్రాహ్మణక్షేత్రమైనది.

* "వేదవేదాంగవిదులైన బ్రాహ్మణోత్తము లనేకులు కాంచీపురమును జేరి పల్లవరాజులపోషకత్వమున బరిషత్తులను, వేదవిద్యాలయములను నెలకొల్పి స్వమతవ్యాప్తికై కృషిసేయుచు కృతార్థు లగుచుండిరి. ఈవిషయము హూనుత్సాంగువాక్యముల వలనఁగూడ స్పష్టమగుచున్నది. ఇక్కడనుండి బ్రాహ్మణు లనేకులు పల్లవరాజులచే నగ్రహారములను, సర్వమాన్యభూములను బడసి బ్రాహ్మణులు లేని దేశభాగములకుఁ బంపఁబడుచుండిరి."

ఇట్లు పలువిధముల బ్రాహ్మణమతోద్ధరణమునుగూర్చి పల్లవరాజులు గావించుచుండిన పరిశ్రమయంతయు మూర్తిభవించెనో యన, నేడవశతాబ్దమున మహావిద్వాంసుఁడైన

* ఆంధ్రులచరిత్రము, పే. ౨౮౫.

కుమారిలభట్టు బ్రాహ్మణమతవీరుఁడై యవత రించి శత్రుమతఖండనము గావింపఁజొచ్చెను. ఆంధ్రబ్రాహ్మణుఁడైన కుమారిలభట్టు జైన మతమునకుఁ బ్రబలశత్రువు. జైనులు తమ మతగ్రంథముల నితరులకుఁ జూపరు గావునఁ గుమారిలభట్టు జైనశిష్యవేషధారియై జైనా చార్యుల నాశ్రయించి జైనతత్త్వధర్మముల నెల్ల నేర్చుకొని పిమ్మట నామతమును ఖం డింపసాగెను. జైనధర్మముల ఖండించుచు వైదికధర్మముల వ్యాపింపఁజేయుచుండిన కుమారిలభట్టును జైనులు దూషించుచు నాతఁడు గురుద్రోహియని 'జినవిజయ'మను జైనగ్రంథమున వ్రాసికొనిరి.

భారతశ్రవణాసక్తి

అయిదవశతాబ్దము మొదలు తొమ్మి దవశతాబ్దమువఱకును గల శాసనములను బట్టి పల్లవరాజులు, 'విమలమతిం బురాణ ములు విన్న' రాజనరేంద్రునివలెనే భారత భాగవత రామాయణాది పురాణముల నెల్ల విన్నవారనియుఁ, బురాణకథలయందు గొప్పభక్తివిశ్వాసములు గలవారనియు స్పష్ట మగుచున్నది. తమవంశములోని పూర్వరాజుల చరిత్రాంశములను, వారివిద్యావైభవైశ్వర్యౌ దార్యపరాక్రమాదులను, వారిపట్టపురాణుల గుణవిశేషములను వారికావించిన మహాకా ర్యములను, దూషకోపమానాద్యలంకారయుక్త ముగఁ దమశాసనములయందు వర్ణించుసంద ర్భములలో బ్రహ్మ విష్ణు మహేశ్వరులను, భారతీ రమా పార్వతులను, ఇంద్రాది దేవతలను గూడఁ బేర్కొనుచుండిరి మహావిష్ణువు నర కాసురుని సంహరించి లోకములఁ గాపాడి నట్లనియు, శ్రీరాముఁడు వారిధి కట్టినట్లు నియు, నిట్టి పురాణకథాంశములను దమవర్ణ నాంశములలోఁ దఱచుగా నుపమానము లుగా నుపయోగించుచు శాసనములను వ్రాయుచుండిరి. గ్రంథవిస్తరభీతిచే నాయా శ్లోకముల నిందుఁ జేర్పక విడిచితి.

పల్లవరాజైన రెండవపరమేశ్వరవర్మపరి పాలనము మనుధర్మయుక్తమై యుండెనని నెల్లూరుపాలెముశాసనమునందు వర్ణింపఁబడి నది. దీనింబట్టి పల్లవరాజులు, 'విమలమతిం బురాణములువిన్న'వారలే కాక, రాజరాజు వలె 'ధర్మశాస్త్రములతెఱం గెఱింగిన'వార నియుఁ జెప్పవచ్చును. ఇంక భారతశ్రవణా సక్తింగూర్చి విచారింతము. విజయనందివిక్రమ వర్మయను పల్లవరాజు మున్నూఱుమంద్రు బ్రాహ్మణుల కొకగ్రామము 'బహుభోగ ము'గా నిచ్చిన దానశాసనము కలదు. 'ఏక భోగము 'లనియు, 'బహుభోగము 'లనియు దానశాసనములు రెండువిధములు. ప్రత్యేక ముగ నొక్కనికే యొసంగఁబడునది యేక భోగము. ఒక్కయగ్రహార మనేకుల కను భవింప నిచ్చినది బహుభోగము. విక్రమ వర్మదానశాసనము కొంత భాగము సం స్కృత శ్లోకములతో వ్రాయఁబడినది. మిగి లినభాగమంతయుఁ దమిళభాష.† సంస్కృత

† South Indian Inscriptions, Vol II.

శ్లోకములతో నీదానశాసనప్రశస్తి వ్రాసిన కవిపేరు పరమేశ్వరుఁడు. ఈశాసనములోఁ బ్రతిగ్రహీత లైన బ్రాహ్మణుల పేరులు, వారిగ్రామనామములు, గోత్రములు, గ్రామాదాయములో వారి కీయఁబడినవంతులును గూడఁ బేర్కొనఁబడినవి. అంతు శాసనకావ్యకర్తయైన పరమేశ్వరున కొకవంతని వ్రాయఁబడినది. మఱియు నీదానశాసనమునకు సాక్షులైన ముప్పురు మధ్యవర్తులకును, దేవాలయములోనిదైవమగు మహాశివునకును, దేవాలయము పూజారులకును, ఉత్సవసమయములయందు మంగళధ్వనులు గావించు వాద్యగాండ్రకును, దేవాలయమునందుఁగల 'అంబళమ్'అను విశాలమండపమునకు నీరు తెచ్చు కావటివానికి, అందు దీపములు పెట్టువానికి, అచ్చటివారలయారోగ్యములు గాపాడుచుండు వైద్యునకుఁగూడ నీదానశాసనమున వంతులీయఁబడినవి. ఈవంతుదారులలో ముఖ్యముగాఁ బేర్కొనవలసినవాఁడు పౌరాణికుఁడు. ఈపౌరాణికుఁడు ప్రతిదినమును "అంబళ"మునందు మహాభారతమును జదివి గ్రామస్థులకుఁ జెప్పుచుండవలయును. ఈయుద్యోగమునందామహాభారతకథకునకుఁ గూడ నగ్రహారములో నొకవంతు పేర్కొనఁ బడినది.

చళుక్య పాండ్య గంగ రాష్ట్రకూటాదిరాజులవలెఁ గాక పల్లవరాజు లాదినుండియు వైదికధర్మమార్గానువర్తులై వేదశాస్త్రములయందు విశ్వాసము, శైవబ్రాహ్మణులయందు భక్తియు, బురాణకథలయం దనురక్తియుఁ గలిగి యూరూర మహేశ్వరాలయప్రతిష్ఠాపనములు గావించుచుఁ "పార్వతీపతిపదాబ్జధ్యానపూజామహోత్సవము"లతోడనే తమకాలము వెళ్లఁబుచ్చుచుండిరి.

పల్లవరాజులు తాము గావించుచు వచ్చిన మహేశ్వరాలయనిర్మాణములను, దమ శాసనములయందు మిక్కిలి ఘనకార్యములుగా వర్ణించి వ్రాసికొనుచుండిరి. వీ రెంత శివభక్తులైనను వీరశైవులనిమాత్రము చెప్పుటకు వీలులేదు. పల్లవులనాఁటి కింకను శంకరపూజ్యపాదు లవతరింపనికారణమున శైవమత మప్పటికిఁ బ్రాబల్యము వహింపలేదు. మఱియుఁ బల్లవులు వైష్ణవాలయములనుగూడ నిర్మించి విష్ణుదేవుని బూజించుచు విష్ణుకథలను వినుచు, శివునియందుంబోలె విష్ణువునందును భక్తితత్పరు లగుటచే నద్వైతులనియే చెప్పవలసియున్నది. 'పార్వతీపతిపదాబ్జధ్యానపూజామహోత్సవము' తనకుఁ గరం బిష్టమని చెప్పుకొనిన రాజరాజుసైత మద్వైతమతస్థుఁడే. అందుచేతనే యాతఁడు వ్రాయించిన మహాభారతము ప్రారంభమున నన్నయ, "హరిహరాదిగజాననార్కషడాస్యమాతృ సరస్వతీ గిరిసుతాదికదేవతాతతికి న్నమస్కృతి" చేసి, తనప్రభువున కిష్టమైన దేవతాస్తుతియే కావించెను. ఇంతియె గాక యాశ్వాసాంతములయందు నన్నయ తన ప్రభువును 'రాజనారాయణ', 'శ్రీనాథమూర్తి','విష్ణుసన్నిభ', 'నారాయణమూర్తి', 'పరాక్రమరాఘవ' మున్నగుబిరుదనామము

లతో సంబోధించుటంబట్టి, రాజరా జద్వైత మత్రియుఁ డనుటకు సంశయ ముండదు.

నూతనా గహారము లనేకములు నిర్మించి వానిమూదాయములను వందలకొలఁది బ్రాహ్మణులకుఁ బంచిపెట్టుచు, ఏ దేశములనుండి విద్వాంసుల ననేకులఁ దమరాజ్యమునకు రప్పించి, మాన్యముల నిచ్చి వారలఁ బోషించుచుఁ, దాము వందలకొలఁది నిర్మించిన దేవాలయములలో నొక్కొక్క దేవాలయము నాశ్రయించి వందలకొలఁది కుటుంబములు జీవింపఁగల యేర్పాటులు గావించుచు, భవిష్యద్రాజు లెవ్వరు మా యేర్పాటులను భంగపాటు కలిగింపరాదను శాసనములతో విద్వత్పరిషత్తుల స్థాపించుచు రాజ్యమేలిన పల్లవరాజుల 'సంతతదానశీలతం'గూర్చియు, 'శశ్వత్సాధుసాంగత్యముం'గూర్చియు నింక బ్రసంగింపవలసిన దేముండును? పల్లవ రాజుల విద్వత్పరిషత్తులకు 'ఘటిక'లని పేరు. కాంచీపురాధీశ్వరుఁడైన నరసింహవర్మ కైలాసపర్వతమువంటి యీశ్వరాలయమును, ఒక ఘటికాస్థానమును స్థాపించిన ట్లొకశాసనమున వ్రాయఁబడినది.

"తత్పుత్రసూను ర్నరసింహవర్మా
పునర్వ్యధాద్యో ఘటికాం ద్విజానామ్,
శిలామయం వేశ్మ శశాంకమూళేః
కైలాసకల్పంచ మహేంద్రకల్పః."

ఇట్లెల్లవిధములఁ బరిశీలింప నొక్కభాషా విషయమునఁ దక్కఁ దక్కినవిషయములలో రాజరాజునాఁ డాంధ్రదేశమునకుఁ గలిగిన మహోన్నతి తత్పూర్వము పల్లవరాజులనాఁడే కలిగియుండెనని చెప్పవచ్చును. మఱియు నంతకంటె నధికమైన మహోన్నతి కలిగియుండెనని చెప్పినను జెప్పవచ్చును.

## కళింగము - గాంగరాజులు

దేశచరిత్రములో నాంధ్రదేశ భాగముగాఁ బరిగణింపఁబడుచుండిన కళింగదేశమున నైదాఱుశతాబ్దములలో నాంధ్రవాఙ్మయచిహ్నములు లేశమును గానరా వనుమాట యెంత నిశ్చయమైనను, గడకు భాషాచిహ్నములైన దొరకునేమో యని పరిశీలించుట యవసరము. అట్టిభాషాచిహ్నములుగూడ మనకుఁ గానరానియెడల నాకాలమునఁ గళింగదేశ మంత నిరాంధ్రమై యుండుటకు గారణమైనను సాహిత్యవిద్యార్థి తెలిసికొనవలసి యున్నది.

గంజాంమండలమున మహేంద్రమునుండి కటకమువఱకు నుత్తరకళింగమనియు, మహేంద్రమునుండి దక్షిణముగాఁ బిఠాపురమువఱకు మధ్యకళింగమనియుఁ, బిఠాపురమునుండి కాంచీపురమువఱకుఁ ద్రికళింగమనియుఁ జరిత్రకారు లొకవిధమైన విభాగమును గావించిరి. ఈవిభాగములోఁ గొందఱి కభిప్రాయభేదము లున్నను, మన కాచర్చ యనవసరము. మొదటఁ బల్లవులును, దరువాతఁ జాళుక్యులును వేఁగీదేశముతోఁగూడ నీదేశమును బరిపాలించుచుండినకారణమున మధ్యకళింగ

మాంధ్రదేశభాగముగానేగణింపఁబడుచున్నది. ఉత్తరకళింగదేశమే యుత్కళదేశముతో మనకు సంబంధము లేదు. ఈగ్రంథమునఁ గళింగదేశమని వ్యవహరించుట యీమధ్యకళింగదేశమనియే చదువరులు భావింపవలయును.

ఐదాఱుశతాబ్దములలోఁ గళింగదేశము పల్లవవిష్ణుకుండినులపరిపాలనమునం దుండెనని చరిత్రవలనఁ దెలియుచున్నది. ఈమధ్యకాలములో గాంగు లను నొకతెగరాజులచేఁగూడ నీదేశము పరిపాలింపఁబడుచుండెనని కళింగదేశసంచిక చెప్పుచున్నది. ఏడవశతాబ్దమువఱకుఁ బల్లవులే పరిపాలించినయెడలఁ, బల్లవపాలనమున వేఁగీదేశ మాంధ్రవాఙ్మయశూన్యమై యుండుటకుఁ జెప్పఁబడినకారణములే చాలవఱకుఁ గళింగదేశపక్షమునఁగూడ వర్తింపఁగలవు. కాని గాంగరాజులుకూడఁ బాలించి యుండినయెడల మాత్ర మప్పటిదేశస్థితిని గూర్చి కొంత చర్చింపక తప్పదు. ౭-వశతాబ్దమునఁ బశ్చిమచాళుక్యరాజగు రెండవపులకేశి పల్లవులను జయించియే వేఁగీ కళింగములాక్రమించినవాఁడు గావున నప్పటికిఁ గళింగదేశము పల్లవులయధికారమునందే యుండె ననుటకు సంశయము లేదు. అయిన నైదాఱుశతాబ్దములమధ్యకాలములో గాంగులనురాజులుకూడఁ జెలరేఁగి పల్లవుల నెదిరించుచు నోడించుచు నోడిపోవుచు, నప్పుడప్పుడు తా మాక్రమించుకొనుచుండిన భాగములను బరిపాలించుచుండియుందురు. ఈకాలమునందలి గాంగరాజులశాసనములు కొన్ని గానవచ్చుచుండుటచేత నీమాత్రమైన నూహింపుట కవకాశము కలిగినది గాని, గాంగరాజులే యానాఁటికళింగాధిపతులని నిర్ణయించి చెప్పుట కెట్టియాధారములును లేవు. ప్రతిభావంతులైన కళింగదేశసంచికవ్యాసకర్తలు, 'తివిరి యిసుమునఁ దైలంబు దీసి'నట్లు కళింగగాంగులచరిత్రాంశముల నతిప్రయాసతో నేర్చి సమకూర్చి ప్రకటించి, యాంధ్రదేశచరిత్రమునం దొకనూతనప్రకరణమున కాధారమును గల్పించి మహోపకార మొనర్చిరి. అట్లు గానినాఁ డాంధ్రదేశ మీగాంగరాజులం గూర్చి యీమాత్రమే నెఱుంగక యజ్ఞానమున నుండవలసినదే. కాని విపులమైన యాధారములు లేనికారణమునఁ జారిత్రకపరిశోధనలయందు విఖ్యాతులైన మహామహులవ్యాసములే యిందు గాంగరాజుల కులకాలక్రమనిర్ణయాదులలో, "ఉండవచ్చును"లతోడను, "కావచ్చును"లతోడను నిండియున్నవి. ఇట్టి సంశయార్థసూచకక్రియాంతములైన వాక్యములయందలి విషయముల నాధారముగఁ జేసికొనియే మన మిప్పుడు గాంగరాజులం గూర్చి ప్రసంగింపవలసియున్నది.

ఆఱవశతాబ్దమువఱకుఁ గళింగ మేలిన గాంగరాజులకుఁ బూర్వగాంగు లనువ్యవహారము కలదు. ఏడెనిమిదిశతాబ్దములలో దక్షిణదేశమునందలి గాంగవాడిరాజ్యమునుండి గంగవంశమువారిలోఁ గొందఱు కళింగదేశమునకు వచ్చి పెక్కుశతాబ్దములవఱకుఁ బరిపాలించుచుండినవారగుటచే మొదటిగాంగు

లకుఁ బూర్వగాంగు లనువ్యవహారనామము వచ్చినది. మఱియు నీపూర్వవంశమువారు 'గాంగులు,' తరువాత వచ్చినవారు 'గంగులు.' ఈగంగులు ౭-వ శతాబ్దములోపలఁ గళింగముతో సంబంధించినవారు కానికారణమున నీప్రకరణమున వారిప్రసంగము మనకు లేదు.

పూర్వగాంగులు కళింగదేశమున స్వతంత్రరాజ్యస్థాపనము గావించినకాలము ౫-వ శతాబ్దమందలి నాలవపాదము గాని, యాఱవ శతాబ్దమందలి మొదటిపాదము గాని కావచ్చునని యొకవిధమైన కాలనిర్ణయము గావింపఁబడినది. స్వతంత్రరాజ్యస్థాపనము గావించుటకుఁ బూర్వము వీరింగూర్చి లేశమును దెలియదు. గాంగరాజులలోఁ గొందఱు 'త్రికళింగాధిపతుల'మనియు, 'సకలసామంతనృపతిమండలాధిపతుల'మనియుఁ దమశాసనములయందు వ్రాసికొనిరి. తమ రాజ్యవిస్తీర్ణపరాక్రమాదికములనుగూర్చి తమశాసనములయం దట్టులుత్కర్షగా వ్రాసికొనిరే గాని, వాస్తవముగా గాంగరాజులు నాఁటికళింగాధిపతులైన పల్లవులతోఁ దఱుచుగఁ బోరాడుచు నోడిపోవుచు నోడించుచు, నేడవశతాబ్దమువఱకు సామంతులుగను, స్వతంత్రులుగను గూడఁ గడపియుందురు. ఏడవశతాబ్దప్రథమపాదమున వేఁగిదేశముతోపాటు కళింగదేశమునుగూడఁ బశ్చిమ చాళుక్యు లాక్రమించుకొనుటచేతఁ బల్లవ గాంగరాజుల తగవులు 'పిల్లులతగవు'వలెఁ బూర్తియైనవి.

### గాంగరాజులమతము

స్వతంత్రులుగను, సామంతులుగను నుండిన యీ రెండువందల యేండ్లలో గాంగరాజులు వైదికధర్మప్రియులై సంచరించిరి. వీరు పరమ మాహేశ్వరపాదభక్తులు. మహేంద్రాచలము నందలి గోకర్ణస్వామి వీరి కిష్టదైవము. తమ శాసనములందెల్ల నీరాజులు తమయిలువేల్పును స్తుతించుకొనుచుందురు.

“స్వస్తి సర్వర్తుకరమణీయా ద్విజయ కళిఙ్గనగరా త్సకలభువననిర్మాణైక। సూత్రధారస్య భగవతో గోకర్ణ్ణస్వామిన శ్చరణ కమలయుగళప్రణామా। దపగతకలికలఙ్కో- వినయనయసంపదా మాధారః........”

“...........మహేంద్రచలా। మలశిఖర ప్రతిష్ఠితస్య తస్య చరాచరగురో స్సకలభువన నిర్మాణైకసూత్రధారస్య శశాఙ్కచూడామణే ర్భగవతో గోకర్ణస్వామిన శ్చరణకమల......”

ఇయ్యవి గాంగరాజులు బ్రాహ్మణుల కొసంగినదానశాసనములు. ఇట్టిదానశాసనములు వీరి వింకను గలవు. వేఁగిదేశమునందలి పల్లవులవలెనే కళింగదేశములో గాంగరాజులుఁగూడ మహేశ్వర పాదారాధనాయత్తచిత్తులై వైదికమార్గప్రతిష్ఠకుఁ బాటుపడుచుండినట్లు తోఁచుచుండుటచేత వేఁగిదేశమునందువలెనే కళింగమునందును విరోధమతప్రాబల్యముండి యుండవలయును. ఆలయములయందును, పర్వతప్రాంతములయందును ప్రాచీనకాలపు బౌద్ధ జైనచిహ్నము లనేకములు

గానవచ్చుచుండుటచేఁ గళింగ మొకప్పుడు బౌద్ధ జైన మతాక్రాంతమై యుండవల యునని పరిశోధకులు తెలుపుచున్నారు. మగధచక్రవర్తియైన యశోకుఁడు కళింగ దేశముపై దండెత్తి వచ్చి యాదాడిలో రణరంగమున నొక లక్షకళింగులను సంహరించెను. అంత శత సహస్రకాళింగకళేబరోత్తుంగతరంగమైన మహారుధిరవాహిని మాగధునికంటికి బీభత్సదృశ్యమై తోఁచినంతనే యతఁడు పశ్చాత్తాప తప్తచిత్తుఁడై తత్క్షణమే బౌద్ధమత మవలంబించి యామతమును గళింగదేశమునందును, దనసామ్రాజ్యమునందలి సకలదేశములయందును గూడ వ్యాపింపఁజేసెను. అశోకునితరువాత ఖారవేలుఁడను జైనరాజు విజృంభించి,మగధరాజులను జయించి, వాఁడు గొనిపోయిన జైన విగ్రహములను మఱలఁ గొనివచ్చి కళింగమును జైనమతాకలితము గావించెను. క్రీ. పూ. ౧౫౮-వ సంవత్సరప్రాంతమువాఁడైన ఖారవేలునితరువాతఁ గళింగరాజ్యమున నీమతము నాలుగైదువందలయేండ్లవఱకు మిక్కిలి విజృంభించినది. పిమ్మట క్రీ. శ. ౨౦౦ ప్రాంతమునఁ గాంచీపురవాసియు, బౌద్ధమతస్థుఁడు నగు నాగార్జునాచార్యుఁడు కళింగమునకు వచ్చి జైనమతమునకుఁ బ్రతికూలముగ మహాయన బౌద్ధమతమును బోధింపసాగెను. ఆకాలమందే మాళవరాజగు నింద్రద్యుమ్నుఁడు మహాయన బౌద్ధమతమునకును, బ్రాచీనవైష్ణవమతమునకును విరోధభావములు లేకుండ సంధి గావించి, బుద్ధదేవునిదంతమునకు స్థానమైన పూరీ నగరమును నూతనహిందూమతమునకుఁ గేంద్రస్థానము గావించెను.

నాగార్జునాచార్యులకారణమునఁ గళింగ దేశమున నశోకునినాఁటి బౌద్ధమతవ్యాప్తి మఱలఁ గలిగినది. ఇట్లొకప్పుడు జైనమతము, మఱియొకప్పుడు బౌద్ధమతము విజృంభించుచు నొకదాని నొకటి సంహరింప యత్నించుచుండియు సంహరింపలేక, మొదటిశతాబ్దముల నాఁటి కీరెండుమతములునుగూడఁ గళింగమున నున్నతి వహించియే యుండెను. బౌద్ధమతస్థులు, జైనమతస్థులు నైన కళింగప్రజల కీకాలమున వైదికమతాభిరతులైన గాంగరాజులు ప్రభువు లైరి. రాజు లభిమానించు భాష గాని, మతము గాని సామాన్యప్రజాభిమానము గల భాషామతములకంటె శీఘ్రముగా నధిక ప్రచారము నొందఁగలుగుట స్వాభావసిద్ధమే యయ్యుఁ గళింగమున గాంగరాజులు చేసిన కృషి వేఁగియందుఁ బల్లవరాజులకృషివలె వైదికమతమున కున్నతి ఘటింపలేదు.

గాంగరాజులు పల్లవరాజులవలె విద్వత్పరిషత్తుల స్థాపించినవారు కారు. వేదశాస్త్రపురాణములయందు భక్తివిశ్వాసములు గలవారయ్యు వానిం గూర్చి తగినకృషి చేసినట్లు గానరాదు. వీరిపరిపాలనకాలము రెండునందల యేండ్లలోను వీరు కేవలము స్వతంత్రరాజ్యాధీశ్వరులే యైయుండినయెడల నీరాజులు మతవ్యవసాయ మింతకంటె నధికముగనే గావింపఁ గలిగియుందురు. కాని తమకాలమున నధిక

కాలము ప్రబలులైన పల్లవరాజులతోడి పోరాటములతోడనే గడపవలసినవా రగుటచేత గాంగరాజులు వైదికమతమును సంపూర్ణముగ నుద్ధరింపలేకపోయిరి. ఏ దెట్టు లైనను, వీరు జైనమతమునకు విరోధులై బ్రాహ్మణమతానురక్తులై యుండి రనుటలో సంశయము లేదు. పూజ్యపాదాదులం బోలిన మతబోధకు లాకాలమునఁ గళింగమున సంచరించుచు, జైనమతప్రచారమును గావించుచుండి యుందురు. పదునొకండవశతాబ్దమువఱకును గళింగమున బౌద్ధజైనమతము లడుగంటలేదని చరిత్రకారులు వ్రాయుచుండుటచే గాంగరాజులకాలమున జైనమత మున్నతస్థితియందే యుండవలెను.* "రామతీర్థమునందు దొరకిన జైనప్రతిమలనుబట్టియు, పాండవపంచగుహాయందు పూర్వచాళుక్యలిపితో వ్రాయఁబడిన జైననామములనుబట్టియు, క్రీ. శ. ౫, ౬ శతాబ్దములనుండియును, అంతకు పూర్వమును జైనమతము కళింగమున వ్యాపించెనని తెలియును." పల్లవుల నోడించి స్వతంత్రరాజ్యస్థాపనము గావించుటయు, వైదికమతమును బ్రతిష్ఠించుటయు నను నీరెండుమహాకార్యములును గాంగరాజు లేకకాలమున నిర్వహింపవలసినవారైరి. కాని యం దొక్కటియు సమగ్రముగఁ గొనసాగలేదు. ముఖ్యముగా మతవిషయమునఁ బరాజితులైరనియే చెప్పవచ్చును.

---

# మా వ్యాస కర్తలకు

వ్యాసములు సంపూర్ణముగచిన్నసైజు కాగితములపై ఒకవైపున మాత్రమే విడిఅక్షరములతో బంతులు దూరదూరముగా, దిద్దుబాట్లు లేకుండ, తిన్నగా వ్రాసి వర్ణక్రమమునను తప్పులు లేకుండ చూచుకొని పంప వేడికోలు. లేకున్న ముద్రణకార్యములయందు మిగుల కష్టము కలుగుటయే కాక తప్పులుకూడ నిలిచిపోవునని మనవి. ప్రకటింపనివ్యాసముల తమకు త్రిప్పిపంపుటకయితపాలుబిళ్లలు పంపవలయును.

సంపాదకుడు, 'భారతి'

---

* కళింగదేశసంచిక, పే. ౪౫౭.

## శాంతనుఁడు

చంద్రవంశమునఁ బ్రభవించి కులక్రమాగతమైన కౌరవ రాజ్యపదవి నధివసించిన ప్రతీపభూపాలునకు దేవాపి, శాంతనుఁడు, బాహ్లికుఁడు ననుమువ్వురు పుత్రులు పుట్టిరి. వారిలో దేవాపి చిన్నతనమందే వైరాగ్య మూని రాజ్య భార మొల్లక తపోవనంబున కరిగెను. అందుచేఁ బ్రతీపుని రెండవకుమారుఁడు శాంతనుఁడు తండ్రియనంతరమున రాజ్యపాలనార్హుఁ డయ్యెను.

శాంతనుని చరిత్రము వ్రాయుటకుఁ బూర్వము శాంతనుఁడా, శంతనుఁడా? అనునంశము చర్చింపవలసి యున్నది.

మహాభారతము, ఆదిపర్వమునఁ బూరువంశాను కీర్తనమున శాంతనుశబ్ద మిట్లు నిర్వచింపఁబడినది:—

> "యం యం కరాభ్యాం స్పృశతి
> జీర్ణం స సుఖ మశ్నుతే,
> పున ర్యువాచ భవతి
> తస్మాత్తం శాంతనుం విదుః."

జరావిశిష్టుఁడగు నెవనినెవనిఁ దనచేతులతో స్పృశించునో, వాఁడు వాఁడు సుఖవంతుఁ డగును, మఱియు యౌవనవంతుఁ డగును. ఆకారణమున నతనిని శాంతనుఁడని చెప్పుదురు.

మఱియు భారతమున నాదిపర్వమందు, సంభవ పర్వములోఁ బ్రతీపవృత్తాంతమున శాంతనుశబ్దమునకు వ్యుత్పత్తి వేఱొకవిధముగా నున్నది:—

> "శాంతస్య జజ్ఞే సంతాన
> స్తస్మా దాసీ త్స శాంతనుః."

భారతమునకు వ్యాఖ్యానమును రచించిన నీలకంఠాచార్యులవారు—"శాంతనుశబ్దవ్యుత్పత్తి మాహ–శాంతస్యేతి—శాంతస్య, ఉపరతస్య వంశస్య, సంతానః విస్తారః, ఇతి శాంతతనుః- తలోపేన శాంతనురితి నామ" అని వివరించినారు.

శాంతతను శబ్దములోని తకారలోపమువలన శాంతనుశబ్ద ముత్పన్నమగుటచే శంతనుఁడని చెప్పరాదు. అది యట్లుండనిండు.

ఆదిపర్వమున ౯౫-వ అధ్యాయమున నొకరీతిగాను, ౯౭-వ అధ్యాయమున వేఱొకరీతిగాను వ్యుత్పత్తి నిరూపించుటచే నీరెండధ్యాయములకుఁ గర్తయొక్కఁడుకాఁడని యూహింపవలసియున్నది. పైని వివరింపఁబడినవానిలో రెండవయంశము శాంతనూపాఖ్యానములో నుండుటచే నది వ్యాసకృతమై యుండును. మొదటిది ప్రక్షిప్తమై యుండవచ్చును. మఱియు నది శాంతనుశబ్దనిర్వచనమునకుఁ దగినవిధముగా నుండలేదు. మొదట నే నుదాహరించిన శ్లోకమునకు మాఱుగా భాగవతమున నిట్లున్నది:—

> "యం యం కరాభ్యాం స్పృశతి
> జీర్ణం యౌవన మేవ్యతి,
> శాంతి మాప్నోతిచై వాగ్ర్యాం
> కర్మణా తేన శాంతనుః"

అనియున్నది. శాంతనుశబ్దము నీశ్లోకము నిర్వచించినట్లు వెనుకటిది నిర్వచింపలేదు. సత్యమును పండితులు గ్రహింతురుగాక.

ఎట్లయినను శాంతనుఁడనియే చెప్పవలసివచ్చుచున్నది. శంతనుఁ డనువాడుక యెట్లు వచ్చినదో తెలియదు.

శాంతనుఁడు తండ్రియనంతరమున ధర్మయుక్తముగా ధరాపాలన మాచరించుచుండెను. అతనిభార్య శ్రీ జహ్నుకుమారియగు గంగాదేవి. అతఁ డామెవలన నెనమండ్రు పుత్రులఁ బడసెను. కాని కర్మవశమున మొదటియేడ్వురును బసితనమందే మృతినొందిరి. కడపటివాఁడు దేవవ్రతుఁడు. అతని చిన్నతనమునందే తల్లి గంగాదేవి [illegible]

వగుటచేఁ గాదు. ఇట్లనుకొన్నప్పుడే మానవజాతి యున్నతి వెల్లడికాఁగలదు. అంతియకాని మానవజాతి దేమాత్రము ఘనత గల్గినను నది దేవతాసంబంధముచేతనే కల్గినదని చెప్పరాదు. అట్లు చెప్పుటచే మానవజాత్యుత్కృష్టతను నశింపఁజేసినవార మగుదుము. భారతమును బరిశీలించి చదువఁగా మహామహుఁడగు భీష్ముని వర్తనమందుఁ గొన్ని లోపములు గానవచ్చును. భీష్ముఁడు పాండవపక్షపాతియు, నర్జునపక్షపాతి యని భారతమునం దచ్చటచ్చటఁ గలదు. కాని యదియును సత్యముకాదు.

తన్ను నమ్మికొని యుద్ధముచేయుచున్న దుర్యోధనుని మోసపుచ్చి యతని శత్రువగు ధర్మజునకుఁ దన మృతికారణ మెఱింగించుట భీష్ముని పాండవపక్షపాతము వెల్లడియగుచున్నదని తలంతురు కాని యది సత్యము కాదు. భీష్మునివంటివాఁడు శిఖండిచే మరణించుట లోపముగా భావించి పైకథ కల్పించియుందురు. అంతియె కాని ధర్మరాజువంటి యుత్తముఁడు తమ్మ నింతకాలమును గాపాడిన తాతగారి సన్నిధి కరిగి మృతికారణ మెఱింగింపుమని యడుగునా? అతఁడు చెప్పునా? పాండవుల బలహీనతను, అధర్మమును వెల్లడిచేయుటకు దుర్యోధనపక్షపాతు లెవ్వరో యీ కథాంశములను గల్పించియుండవలెను. శిఖండి మహాపరాక్రమశాలి యైనట్లు భారతయుద్ధపంచకమున ననేకస్థలముల వర్ణింపఁబడినది. అందుచే శిఖండివలన భీష్ముఁ డేల మరణింపరాదు? అంతమాత్రమున భీష్ముని పరాక్రమాదుల కేమి లోపము సంభవించును? ఒకనికిఁ బదుగు రోడుటయు, బలహీనునిచే బలవంతు లొకప్పుడు మడియుటయు సామాన్యధర్మము. ఇది యాలోచింపక భీష్ముని గొప్పతనము కాపాడుటకై యసంభవాంశములు కల్పించుటతగదు. ధర్మరాజు నుత్తమశీలమునకు లోపము లంటఁగట్టుట మఱియుఁ దగదు. భీష్ముఁడు ధనుర్విద్యావిశారదుఁడు, మహాపరాక్రమశాలి, ఉత్తమశీలుఁడు. పదిదినములు ఘోరముగాఁ బోరి పాండవుల కార్తికి కల్గించి దైవవశమున సంగ్రామమరణ మందియున్నాఁడు. అది భీష్మున కెట్టికళంకమును గల్గింపదు. సమరమరణము వీరధర్మము. అట్లుండ, భీష్ముఁడు ధర్మరాజునకుఁ దనమృతికిఁ గారణము లెఱిఁగించెననియు, నందుచే శిఖండిని ముందు నిడికొని యుద్ధవిముఖుఁడైన భీష్ము నెదిరించి యర్జునుఁడు జయించెననియుఁ జెప్పుట మిగుల నసంగతము. అర్జున శిఖండ్యాదుల పరాక్రమమునకును, ధర్మరాజుశీలమునకును గళంక మాపాదింపఁ గౌరవపక్షపాతు లివి కల్పించియుందురు. అంతియ కాని ధర్మరాజు సమరరంగమున భీష్ముని సమీపించుటయు, నతని మృతికారణం బెఱింగింపుమని కోరుటయు సాధ్యమగునా? సముచితమా? కావున నిట్టి సూక్ష్మాంశములు ప్రక్షిప్తములని మన మూహింపఁదగును. సంస్కృతభారతము నిట్లు పరిశీలించి మూల మేదియో, ప్రక్షిప్త మేదియో తెలిసికొనకుండ భారతమును విమర్శింపరాదు. అందువలన సత్యము వెల్లడికాకపోవుటయే కాక హిందూమతసంప్రదాయములకు విరుద్ధాంశములు వెల్లడింపవలసివచ్చును. అసత్యాంశములనుబట్టి మతమునకుఁ గళంక మాపాదించుట మఱియుఁ గూడదు. అందువలన మతమునకును, మతమునుబట్టి సంఘమునకును తీఱనిహాని సంభవించుచున్నది. అట్లని లోపములను గప్పిపుచ్చుటయే న్యాయాభిప్రాయమని యూహింపరాదు. సత్యముగా లోపములు సంభవించినచో నంగీకరించిన దోషము కాదు. కాని కల్పితాంశములవలన దోషారోపణము చేయునప్పుడు దానిని మన మంగీకరింపరాదు.

మఱియు నార్షమతోద్ధారకుఁడగు వ్యాసుఁడు హిందూమతాచారములకు విరుద్ధాంశముల నెట్లు తన గ్రంథమునఁ జేర్పఁదలంచును? సదాచారాభిలాషులగు భీష్మయుధిష్ఠిరాదులు తమ శీలమునకు విరుద్ధముగా వర్తించి రనుటకంటె విపరీతము మఱి యుండదు. అత్యుత్తముఁడని ప్రఖ్యాతి వహించినవాఁ డెప్పుడో యొకస్వల్పాంశము నాసించి తన సచ్ఛీలమునకు విరుద్ధముగా నడిచెననుట విశ్వసింపరాదు. ఇందుల కొకయుదాహరణము చూడుఁడు. ధర్మరాజు ధర్మానురక్తుఁడు; సత్యప్రియుఁడు. అతఁడు చిన్నప్పటినుండి సత్యధర్మములను గాపాడుటకై పలుకష్టము లనుభవించుచున్నాఁడు. ద్యూతకాలమునఁ దా నొనర్చిన సమయమును సోదరులతోను, భార్యతోను వనమునఁ బలుకష్టములతో ననుభ

వించెను. అసత్యము చెప్పవలసినప్పుడు కాని, యధర్మముగాఁ బ్రవర్తింపవలసినప్పుడు కాని ధర్మరాజు తన సకలసంపదలను విడుచుటకైన నిష్టపడుచుండెను, కాని యసత్యమాడ నిష్టపడలేదు. తా నెట్టికష్టములనైనఁ బడ నిష్టపడుచుండెను, కాని యధర్మ మాచరించెడివాఁడు కాఁడు. అందుచేతనే యతఁ డన్నికష్టములను జెందవలసినవాఁ డయ్యెను. చిన్నతనమునుండియు నిట్టి సత్ప్రవర్తనమున కలవాటువడిన ధర్మరాజు, సత్యధర్మములను రక్షింప నడవిలోఁ బదుమూఁడేండ్లు కష్టపడిన ధర్మరాజు, యుద్ధసమయమున ద్రోణునివలనఁ దమ కపజయము సంభవించునని శంకించి తన గురువును, వృద్ధ బ్రాహ్మణుఁడగు ద్రోణుని వంచించి చంపుటకు బదులు ప్రోత్సాహించినంతమాత్రమున "అశ్వత్థామా హతః కుంజర" యని యసత్యమాడ నిష్టపడునా? ధర్మజుని వంటి సత్యశీలుఁ డట్టిఘోరకృత్యమున కంగీకరింపఁ గలఁడా? ఏసత్యధర్మములకై తాను బలుబాము లనుభవించెనో, యేవి యతనికిఁ బ్రాణాధికములై యున్నవో, యట్టివానిఁ దృణప్రాయముగాఁ జూచి కేవల మసత్య మాడెనని చెప్పుటకంటె వింత మఱి గలదా? ధర్మజు స్వభావమునుబట్టి యందలి ప్రక్షిప్తభాగములని యనక తీఱదు. ఇట్లె భారతమందలి సత్యాసత్యములను గ్రహింపఁ బండితులు ప్రార్థితులు. ఇట్లు సత్యాంశములను జర్చించి స్థాపించినపిమ్మటనే భారతము విమర్శనార్హము కాని తత్పూర్వ మందుల కర్హము గాదని నా మనవి. ఇట్లు ప్రక్షిప్తములని తీసివేసినచో భారతమే లేకపోవలసివచ్చునేమో యని సందియ మంద నవసరము లేదు. కొన్నిశ్లోకములు ప్రక్షిప్తము లన్నఁ జాలును. అంతమాత్రమున భారతమునకుఁ గొఱంత రాదు. అట్టి వివేచనము పండితసంఘ మాచరించవలసినది కాని యొకరిద్దఱు పండితులవలన నగునది కాదు. ఈవిషయమునకుఁ దేశమునఁ గల మహాపండితు లభిముఖులు గావలయునని వేఁడుచున్నాను.

---

# మేఘదూత

(ఆంధ్రగ్రంథమాల ౧౬-వ కుసుమము)

కర్త: దీపాల పిచ్చయ్యశాస్త్రిగారు (కళానిధి గ్రంథమాల, నెల్లూరు).

కాళిదాసుని మూలమునందలి భావసంపద కోలుపోవని స్వతంత్ర పద్యరచనము. పదముల కూరుపు, నుడికారము సొంపు, జాతీయముల పెంపు అన్వయసారళ్యము గలిగి, రచనము తేటతేనెవలె నూటలూరించును. సహృదయు లగు పలువు రాంధ్రకవిపండితవర్యులచే 'మేలు మేలు' అని మెప్పు గన్నది. వెల రు. ౦-౧౨-౦.

మేనేజరు: ఆంధ్ర గ్రంథమాల, నెం. 7, తంబుశెట్టివీథి, జి. టి. మద్రాసు.

# ఛందశ్శాస్త్రము

## షట్ప్రత్యయములు

దువ్వూరి సూర్యనారాయణమూర్తిగారు

ఆంధ్ర వాఙ్మయరచనము ౧౧-వ శతాబ్దిని ప్రారంభమైనదని విమర్శకమహాశయుల యాశయము. అందు పద్యప్రబంధరచనమునఁ గల గణ యతి పాదాది నియమములఁ దెలుపుగ్రంథము లాది నున్నట్టు లగపడదు. ౧౨-వ శతాబ్దమున భీమన కవిజనాశ్రయ మను నాంధ్రచ్ఛందోలక్షణమును రచించియున్నాఁడు. ఇందు కొన్ని విశేషాంశములు దప్ప నితరములెల్ల సాంస్కృతికములే గ్రహింపఁబడినవి. భీమన్నపిదపఁగూడ ననేకు లించుక విశేషమును జూపుచు పెక్కులక్షణగ్రంథముల రచించిరి. ఇం దన్నిటను ప్రతిపాదితాంశ మొక్కటియే యైనను నుత్తరోత్తర మించుక వైలక్షణ్యమును జూపసాగిరి. ప్రతిచ్ఛందోగ్రంథమునను విభాగ మొకేరీతిగ నున్నది. అందు ప్రకృతమున షట్ప్రత్యయవిభాగవిషయమును నించుక విమర్శింతము.

ఈషట్ప్రత్యయవిభాగముకూడ సంస్కృతలక్షణముల ననుసరించియే యాంధ్రమునఁ జేర్చిన ట్లగపడుచున్నది. కాని వీనిలోని కొన్నిప్రత్యయములవిషయమున సంస్కృతాంధ్ర లక్షణములకును, నాంధ్రలక్షణములలో వానిలో వానికిని మతభేదము కానవచ్చుచున్నది. అట్లు వచ్చుటకు కారణ మేమో తెలియదు.

సంస్కృతలక్షణకర్తలలో నెల్ల ప్రాచీనుఁడు పింగళమహాముని. ఈతఁడు విశేషముగ వైదికమును సంబంధించినవిషయములఁ దెలుపుచు సూత్రరూపమున తన గ్రంథమును వ్రాసియున్నాఁడు. ఈకవి తనగ్రంథమున నీప్రత్యయవిభాగమును జేసియున్నాఁడు. కాని వాని నారింటిని జెప్పియుండలేదు. సూత్రములఁబట్టి నాలుగే ప్రత్యయములఁ జెప్పినట్లు స్పష్టమగుచున్నది. కాని పింగళుఁడు వృత్తసంఖ్యా విషయమునఁ జెప్పిన "పరే పూర్ణమ్" అనెడు సూత్రమునకు వ్యాఖ్యానకర్తలు విశేషార్థమును తీసి యద్దానిచే మేరులగ్రియనుగూడ గతార్థము చేసియున్నారు. ఈ మేరుప్రస్తారలగ్రియవలన మనకు ప్రయోజన ముంటచే దీనిని గ్రహింతము.

ఈప్రత్యయము లన్వర్థములుగా నున్నట్లు వాని నామములే చెప్పఁగలవు. కాని తెనుఁగులక్షణకర్తలు, సంస్కృత లక్షణకర్తలలో నిటీవలివారు చెప్పిన "అధ్వము" అనునారవప్రత్యయమును, శకటలగ్రియను గూడ నీతఁడు చెప్పియుండలేదు. తక్కిన ప్రస్తారము, నష్టము, మేరులగ్రియ యనునవి యిటీవలి లక్షణకర్తల లక్షణములతో సరిపడియే యున్నవి. ఉద్దిష్టప్రత్యయమునఁగూడ ఫలము సమమే గాని చేయువిధమందు కొంత విలక్షణమును జూపియున్నాఁడు. అది యెట్లన—

UU|U|U—ఈగురులఘు సముదాయ మెన్నవ ఛందమున నెన్నవవృత్త మగునని యడిగిన నాపంక్తిని తుదినుండి చూచునపు డేలఘువు ముందుగా నుండునో దానిపై రెండంకెను వేసి తరువాతిది గురువైన, నారెండంకెను రెట్టించి యందొకటి దీసి మిగిలినసంఖ్య నా గురువుపై నిడుచుచు, తరువాత మరల లఘు వుండెనేని యీ యొకటి తీయఁగా వచ్చిన యంకెనే రెట్టించి యంతయును దానిపై వేయుచుఁ బోవ కొస కెంతసంఖ్య వచ్చునో యదియే యావృత్త మెన్నవదో చెప్పును. గురులఘువుల లెక్కించి ఛందము గ్రహింపవచ్చును.

21. 11. 6. 3. 2.

ఉదా:— U U | U | U; ఆరవ ఛందమున ననఁగా గాయత్రీచ్ఛందమున నియ్యది యిరువదియొకటవ వృత్త మగును.

దీనిని కవిజనాశ్రయుఁడు కించిద్భేదపురస్సరముగ చెప్పియున్నాఁడు. ఎట్లన, గురులఘువులపై మొదటినుండి యేకాదిద్విగుణములుగ నంకెలను వేసి, యందు

లఘువులపైనున్న సంఖ్యలను కూడి యం దొకటి కలిపిన నెంతసంఖ్య వచ్చునో యన్నవవృత్త మగును.

1. 2. 4. 8. 16. 32.

ఉదా:— ∪ ∪ | ∪ | ౧౬...౧౬ + ౪ + ౧ = ౨౧—ఇన్నవవృత్త మగును.

ఇట్లీవిషయమున నిరువురి మతమునను ఫలము సమమే.

ఇఁక వృత్తసంఖ్యావిషయమును పింగళుఁడు నాలుగుసూత్రములచేఁ మూఁడువిధములుగఁ జెప్పియున్నాఁడు.

"ద్విరర్ధే"—౮ అధ్యా. ౨౭ సూ. "రూపే శూన్యమ్"—౨౮ సూ. "ద్విః శూన్యే,"—౨౯ సూ. "తావదర్ధం తద్గుణితమ్"—౩౦ సూ.

అందు మొదటివిధము:—౬-వ ఛందమునఁ గల వృత్త సంఖ్య తెలిసికొనవలె నన, నాయారును అర్ధసితిగాఁ జేయవలెను. (అనఁగా ఆసంఖ్యలో నెంతెంతపరిమితిగల భాగములు రెండున్నవో చూచిన) 3 లభించును. అర్ధసంఖ్య ౨ లభించును. ఈరెండు నొకచో వేరుగ నుంచవలెను. మనకు లభించిన 3 ను అర్ధసితిచేయ వీలులేదు గాన (అనఁగా విషమసంఖ్యగాన), దానినుండి యొకటి తగ్గించి సమసంఖ్యగాఁ జేయవలెను. ఇట్లు చేసినప్పుడు పూర్వము వేరుగా నుంచిన రెండుంక్రింద సున్న నుంచవలెను. మిగిలినరెంటిలో నర్ధసంఖ్యను తెలిసికొనఁగా ౧ మిగులును. రెండర్ధము లట్టివి రెండువఁ గలవు గాన మరల ౨ లభించును. ఈరెండును మరల నిదివర కుంచిన సున్న క్రింద నుంచవలెను. మిగిలిన యొకటి విషమసంఖ్య గాన తీసివైచి మరల నారెంటిక్రింద సున్న నుంచవలెను. అట్లుచేయఁ నిట్లు సిద్ధించును:—

| ఛందస్సు | అర్ధభాగము | సిద్ధములు |
|---|---|---|
| ౬ | ౩ | ౨ |
| ఆమూఁడువిషమముగాన | | ౦ |
| ౧ తీసివేయఁగా | ౨ | ౨ |
| ఆరెంటిలో నర్ధము | ౧ ఇదివిషమముగాన | ౦ |

ఈస్థితిలో సిద్ధస్థానములలో సున్నలస్థలముల (అనఁగా శూన్యస్థానముల) రెట్టింపుచు సంఖ్యాస్థలముల శూన్యస్థానములయొద్ద సిద్ధించిన సంఖ్యనుంచి యంతే సంఖ్యచే దానిని రెట్టించవలెను.

పైసిద్ధములు ౨...౮ × ౮ = ౬౪ ఇది యాఛందమునఁబుట్టు
౦...౪ × ౨ = ౮ వృత్తముల సంఖ్య.
౨...౨ × ౨ = ౪
౦...౨

ఇది స్పష్టపరుచుటవలన నింత విస్తరమైనది గాని తెలిసికొనినవెనుక నంతకష్టముగా నుండదు. ఇట్లే యేఛందమునకైనను వృత్తసంఖ్య చెప్పవచ్చును. ఇంక రెండవ విధము:—ఇన్నవఛందమున నెన్నివృత్తములో తెలిసికొనుటయే గాక ఇన్నవఛందమువఱకుఁ గడిచినవృత్తము లెన్నో తెలిసికొనుటయుఁగూడ పైదానిభేదమే అని చెప్పినాఁడు. "ద్వ్యూనం తదన్తానామ్"-అధ్యా ౮, ౩౧ సూ. ఈసూత్రముచే నద్దానివిధమును స్పష్టపరచినాఁడు. వక్త యేఛందమువఱ కెన్నివృత్తములని యడిగెనో యాఛందమున పుట్టువృత్తసంఖ్య రెట్టించి దానిలో ౨ తీయఁగాఁ గడచినవృత్తసంఖ్య వచ్చును. ఉదా:— ఛందము ౬; దీనిలో వృత్తములు

౬౪ × ౨ = ౧౨౮ − ౨ = ౧౨౬

ఇన్నివృత్తము లాఛందమువరకుఁ గడచినవని తెలియును. మూఁడవవిధము:— పైని ఇనుమడించినవృత్తసంఖ్యలో నుండిరెండును తీయకున్న నెంతసంఖ్య యుండునో యది వక్త చెప్పినఛందముతరువాతిదాని వృత్తసంఖ్య యగును. అనఁగా నేడవఛందమున ౧౨౮ వృత్తము లుద్భవించునని తేలును. ఈవిషయమును "పరే పూర్ణమ్" అనెడి ౩౨-వ సూత్రముచే స్పష్టపరిచియున్నాఁడు. ఈరీతిని వృత్తసంఖ్యాప్రత్యయము మూఁడువిధములుగాఁ జెప్పియున్నాఁడు. మొత్తముమీఁద పింగళచ్ఛందమున నున్న ప్రత్యయములును, కవిజనాశ్రయమునఁ గల ప్రత్యయములును ప్రస్తార నష్ట ఉద్దిష్ట వృత్తసంఖ్యామేరులగ్రియలలో నైక్యము నందియున్నవి. విశేష మేమనఁ, నీతఁడు శకటలగ్రియను గాని, యధ్వప్రత్యయమును గాని చెప్పి

యుంపలేదు. పింగళచ్ఛందమునకు వ్యాఖ్యను వ్రాసిన భట్టహలాయుధుఁడుమాత్రము తనవ్యాఖ్యలో "షష్ఠ ప్రత్యయో అధ్వపరిచ్ఛిత్తి రిత్యేకే, సోత్యల్పత్వా త్పుర షేచ్ఛావిధాయిత్వే నానియతత్వాచ్చ నోక్తః" అని వ్రాసియున్నాఁడు. పింగళునితరువాతి లక్షణకర్తలుగూడ వానిని పేర్కొనియుంపలేదు.

౧. వాణీభూషణమ్ : దామోదరమిశ్రవిరచితము. ఈతఁడు షట్ప్రత్యయవిభాగమే స్పష్టముగాఁ జేయ లేదు. "మాత్రాప్రస్తారః మాత్రోద్దిష్టం మాత్రానష్టం వర్ణమేరుః" అని యింకను కొన్ని విశేషవిభాగములుగా జెప్పియున్నాఁడు. శకటాధ్వములవిషయ మెత్తలేదు. ౨. శ్రుతబోధ : మహాకవి కాళిదాసకృతము. దీనియందు వృత్తములలక్షణములు తప్ప మరేమియు లేవు. ౩. ఛందో మంజరి : గంగాదాసకృతము : దీనియందుఁగూడ నీవిభా గము చెప్పఁబడలేదు. ౪. వృత్తరత్నాకరము : భట్ట కేదారవిరచితము. ఈతఁడు స్పష్టముగ నాప్రత్యయము లనుగూడ చెప్పియున్నాఁడు :

"ప్రస్తారో నష్ట ముద్దిష్ట మేకద్వ్యాదిలగక్రియా,
సంఖ్యాన మధ్వయోగశ్చ" అని.

ఈతఁ డీయాఱింటిని విషమ సమాది భేదములచే ననేకవిధ ములుగా విభజించియున్నాఁడు. అవన్నియు ప్రకృత మున కనవసరములు గాన వానిని చెప్ప పనిలేదు. కవి జనాశ్రయమునను, పింగళచ్ఛందమునను గల వృత్తసంఖ్య యనుప్రత్యయమున కీతఁడు "సంఖ్యానమ్" అని పేరు పెట్టినాఁడు. కాని ప్రక్రియ సమానమే. మఱియు మేరు శకటలగక్రియావిషయమున నించుక చేయువిధమున భేదము చెప్పియున్నాఁడు. ఫలము సమమే. ఆవిధ మంతయును స్పష్టపరుపవలెనన్న గ్రంథవిస్తర మగునను భీతిని వానిస్వరూపములమాత్ర మిందు చూపుచున్నాను. మఱియు, శకటలగక్రియ కీతఁడు "పతాకాప్రస్తారః" అని పేరుపెట్టియున్నాఁడు. దానియాకార మాఱెంటిని అనుకరించుచుండుటచే వచ్చిననామభేద మంత చర్చ నీయము గాదు. చూడుఁడు—

భీమన చెప్పిన శకటచక్రము, ౫ ఛందమునకు—

| | | | | | | | | | | | |
|---|---|---|---|---|---|---|---|---|---|---|---|
| ౧ | సర్వగురువృత్తము. | | | | | | | | | | |
| ౨ | ౩ | ౫ | ౯ | ౧౭ | | | | | | | ఏకలఘుకములు. |
| ౪ | ౭ | ౧౩ | ౨౫ | ౬ | ౧౧ | ౨౧ | ౧౦ | ౧౯ | ౧౮ | | ద్విలఘుకములు. |
| ౮ | ౧౫ | ౨౯ | ౧౪ | ౨౭ | ౨౬ | ౧౨ | ౨౩ | ౨౨ | ౨౦ | | త్రిలఘుకములు. |
| ౧౬ | ౩౧ | ౩౦ | ౨౮ | ౨౪ | | | | | | | చతుర్లఘుకములు. |
| ౩౨ | సర్వలఘువృత్తము. | | | | | | | | | | |

భట్టకేదారుఁడు చెప్పిన పతాక, ౫ ఛందమునకు—

| ౧ | ౨ | ౪ | ౮ | ౧౬ | ౩౨ |
|---|---|---|---|---|---|
| సర్వగురువృత్తము. | ౩ | ౬ | ౧౨ | ౨౪ | సర్వలఘువృత్తము. |
| | ౫ | ౧౦ | ౨౦ | ౨౮ | |
| | ౯ | ౧౮ | ౧౪ | ౩౦ | |
| | ౧౭ | ౭ | ౨౨ | ౩౧ | |
| | ద్విలఘుకములు. | ౧౧ | ౧౬ | త్రిలఘుకములు. | |
| | | ౧౯ | ౧౫ | | |
| | | ౧౩ | ౨౩ | | |
| | | ౨౧ | ౨౭ | | |
| | | ౨౫ | ౨౬ | | |

ఖ్రీ త్రి

ఈరీతి నాయావృత్తములు రెంటను సమానములే.




# చిరకాలమునుండి బాధించుచున్న మూత్రవ్యాధులకును శగ (గనేరియా) వ్యాధికిని క్రొత్తగాకనిపెట్టబడిన దివ్యౌషధము.

# గనోకిల్లర్ (రిజిష్టర్డు)

ఈయౌషధము శ్రేష్ఠతమము. ఇంగ్లీషుమందులను దేశీయములగు నౌషధములను పుచ్చుకొనినను గుణము కలుగనియెడలను, యింజక్షనులవలనను వాక్సినులవలననుగూడ లాభము లేకపోయినయెడలను కడపటిప్రయత్నముగా మా గనోకిల్లరునుగూడ పుచ్చుకొనిచూడుడు. పెక్కుయేండ్లనుండియున్నను లేక క్రొత్తగా కలిగినను ఏరకము శగసంకటమైనను మఱెట్టి మూత్రవ్యాధులనైనను స్త్రీలకైనను పురుషులకైనను గనోకిల్లరు తప్పక కుదుర్చును. మూత్రము ఝారీగా వెడలును. మూత్రముపోవుచున్నపుడును కలుగుమంట తగ్గిపోవును. మూత్రనాళమునందలి వాపు తీసిపోవును. శగవ్యాధి (గనోశోకసు) వలన మూత్రము బొట్లుగా పడుట, మెహరోగమువలన మూత్రద్వారమునుండిపోవు తెలుపు, యూరెత్రిటిసు, ప్రోస్టాటిటిసు, సిస్టిటిసు, లుకోరియా, మున్నగువ్యాధులన్నియును స్త్రీలకును పురుషులకునుగూడ గనోకిల్లరువలన కుదురును. వీర్యము (సెమను) పోవుట, స్త్రీలు గర్భవతులుగానున్నపుడు కలుగు మూత్రవ్యాధులు మున్నగునవిగూడ దీనివలన కుదురును. 50 మాత్రలుగల సీసా ఖరీదు రు. 3-0-0 వీ. పి. చార్జి ప్రత్యేకము. ఒక్కసారి 3 సీసాలు తెప్పించుకొనిన వీ. పి. చార్జి మేమే భరించెదము.

అడ్రసు:—డాక్టర్ డి. యన్. జస్సాని, 137 కికావీధి, గులాల్‌వాడి, బొంబాయి 4.

Tel. Add. "GONOKILLER" Dr. D. N. JASAN1, I37 Kika Street, Gulalvadi, Bomday, 4.

మద్రాసు సిటి ఏజెంట్లు దాదా అండు కంపెనీ, 52, నైనియప్పనాయకవీధి, మదరాసు.

---

స్వల్పధర! ఫలమధికము!! పూర్తి తృప్తి!!!

100 కి 100 గురు సంతృప్తిచెందియున్నారు

# లోకామయహర కస్తూరి మాత్రలు




పిల్లలు మొదలు ముసలివారివరకు అందరి మందము, మలబద్ధము, పడిసెము, దగ్గు, గూరకలు, శీతలముచే కాళ్లులాగుట, కడుపుబ్బరము, కడుపునొప్పి, పక్కలయందునొప్పి, ఆహారజీర్ణకాలమున తలనొప్పి, చలిజ్వరము, జ్వరము, ప్లేగు, ఇన్‌ఫ్లూయంజా ఇంకను అనేకవ్యాధులను గుణపరచును. స్త్రీలు ప్రసవించిననాడు, స్నానమునాడు (కస్తూరికి బదులుగా) ఈ మాత్రలు 4-5 ను, 2-3 తమలపాకులలో నమిలి మ్రింగవలెను. సాంక్రామికరోగులతో నుండవలసినవారు, దినము 1-2 మాత్రలను సేవించిన ఆరోగ్యదృఢాంగులగుదురు. ఈమాత్రలసీసాతోగల అనుపానపత్రమును చూడుడు. 300 మాత్రలు గల సీసా 1 కి 4 అణాలవంతున ప్రతిషాపులోపలను దొరకును. పోస్టుమూలకముగా 6 సీసాలు రు.1-8-0, 12 సీసాలు రు. 2-12-0, 36 సీసాలు రు. 5-3 0.

సారస్వతాసవం:—మెదడుకు బలమును కలిగించి, జ్ఞాపకశక్తిని వృద్ధిచేయును గావున, మెదడు దుర్బలమువలన గలిగియుండు సమస్తవ్యాధులను పరిహరించి నరములకు మంచి త్రాణను, రక్తవృద్ధిని కలుగజేయును. సంగీతపాఠకుల కంఠస్వరమునకు మృదుమధురత్వము నిచ్చును. పాడను పాడను ఉత్సాహము నింపును. బలహీనలైన స్త్రీలకు నెత్తినడుమ (నెత్తినోరు చాల మెత్తగా వుండుటవలన) మాట్లాడను నడువనుకాని పిల్లలకు సంజీవివంటిది

6 ఔన్సుల సీసా 1-కి రు. 1-0-0. పోస్టుఖర్చులు ప్రత్యేకము.

శ్రీ సీతారాఘవ వైద్యశాల, మైసూరు.

భీమన చెప్పిన మేరువు, ౪ ఛందమునకు—



కేదారుఁడు చెప్పిన మేరువు ౪ ఛందమునకు—




ఈరీతిగ నాయాక్రియాభేదములే గాని ఫలితము సమము గానే యున్నది. ఇఁక వృత్తరత్నాకరమందలి ప్రస్తార నష్ట ఉద్దిష్ట వృత్తసంఖ్యలు భీమనమతప్రకారము సరి పడియే యున్నవి. అధ్వవిషయమున నీతఁడు,

"సంఖ్యైవ ద్విగుణైకోనా సద్భి రధ్వా ప్రకీర్తితః,
వృత్తస్యాంగులికే వ్యాప్తి రధఃకుర్యా త్తదాంగులిమ్"

అని చెప్పియున్నాఁడు. అనఁగా నీవృత్తప్రస్తారమున కెంతభూమి కావలసియుండునని యడిగిన వక్త చెప్పిన ఛందోవృత్తసంఖ్యను ద్విగుణించి దానిలో నొకటి త్రోయ మిగిలిన దెంతసంఖ్యయో యన్నియంగుళముల భూమి యాఛందఃప్రస్తారమునకు కావలెనని యర్థము. ఉదా:—ఛందము 3; దానివృత్తములు

౮ × ౨ = ౧౬ − ౧ = ౧౫

ఇన్నియంగుళములభూమి మూఁడవఛందఃప్రస్తారమునకు కావలెనని తేలుచున్నది. ఛందము ప్రస్తరింపవలె నన్న పూర్వులు భూమిపై బూడిద వోసి వ్రేలితో గురులఘువుల వ్రాసి ప్రస్తరించుకొనెడి యాచారము గలదని పెద్దలిప్పటి కిని చెప్పుచున్నారు అందువలననే యీప్రత్యయమును లక్షణకర్తలు చేర్చియుందురు. అట్లనుకొన్నను, ఒక్కొక్క గురులఘువొక్కొక్క చతురపుటంగుళమునఁబట్టెఁజాలును. అట్టియెడ మూఁడవఛందముప్రస్తరింపవలెనన్న 3 అంగుళ ములు వెడల్పు, ౮ అం. పొడవు గలభూమి (అనఁగా ౨౪ చతురపుటంగుళములభూమి) కావలెను పైరీతిని జూడ, ౧౫ అంగుళములభూమిమాత్రము చాలు నన్నట్లు చెప్పిరి. ఈవిషయము భట్టకేదారుం డతిచమత్కార ముగ వ్రాయుచు పూర్వమతముల ఖండించుచు తమ మత మును ప్రతిపాదించినాఁడు. మఱియు ప్రస్తారగురులఘు పంక్తులనడుమ నొక్కయంగుళము విడువవలెనని చెప్పి యున్నాఁడు ఆరీతిఁ జేయువారిరీతిని పై ౧౫ అంగు ళములభూమి మూఁడవఛందఃప్రస్తారమునకు సరిపడును. గాని యాఅంగుళ మెంతవైశాల్యము కలదియో, ఒకొక్క యంగుళమున నెన్నిగురులఘువు లుంచవచ్చునో యయ్యది స్పష్టముగాఁ జెప్పియుండలేదు. ఈతనిమతముప్రకారము 3వ ఛందము ప్రస్తరింప 3 గురులఘువులు పట్టెడియం గుళముసు. ౧౦ వ ఛందముప్రస్తరించునపుడు ౧౦గురుల ఘువులు పట్టునట్టియంగుళమును కావలెనని తేలుచున్నది. అట్లెన్నఁడైన సంభవించునా? అప్పుడు వీరొకసమా ధానము చెప్పుకొందురు. ప్రస్తారార్థ మెంతపొడవుభూమి కావలెనో యద్దానినే చెప్పితిమి గాని చతురమును జెప్పి యుండలేదని. అట్లు చెప్పుటవలన లాభమేమి? ఒకచోట ౨ అంగుళములవెడల్పు ౧౦౨౩ అంగుళములపొడవును కల భూమి యున్నదనుకొన్న దానిలో తమ మతముప్రకా రము ౧౦ వ ఛందము ప్రస్తరింప సరిపడుపొడవు గలదు గదా యని ప్రస్తరింపనెంచిన, వానిలోని వృత్తస్వరూ పము స్పష్టపడునా? స్పష్టపడదు. అట్లయిన క్రియా

"అమర నక్షత్రాది యిన్నిఛందములవలను
నెన్నివృత్తంబు లెఱిఁగింపు మన్న దాని
లెక్క నెట్టించి యందులో రెండుత్రోయ
తక్కినది యధ్వ మను"

అని యీతఁడు విషయమునే మార్చి యితర లక్షణకర్తలకంటె భిన్నముగాఁ జెప్పియున్నాఁడు. ఇతఁడు భూమిగొలఁతలలోఁబడక పింగళుని వృత్తసంఖ్యా విభాగములలో నొకభేదమునే యధ్వముక్రింద వాడి యున్నాఁడు. తక్కినప్రత్యయము లన్నియు సమములే.

౪. అప్పకవీయము: కాకనూరి అప్పకవికృతము.

ఈతఁడే రంగరాట్ఛందమునఁ జెప్పిన యధ్వ క్రియను పింగళునివలె వృత్తసంఖ్యాభేదముగనే చెప్పియున్నాఁడు. మఱియు నీతఁడు ప్రస్తారమున "ప్రస్తారద్విగుణ" మను భేదమును జెప్పియున్నాఁడు. ఇద్దానిని నిదివఱ కెవ్వరును జెప్పియుండలేదు. అదెట్లన, ఏదియో యొక ఛందము ప్రస్తరించినపుడు దానినే పైఛందఃప్రస్తారము చేయవలెనన్న మరల ప్రస్తరించిన ఛందమునే దాని క్రింద వరుసగా ప్రస్తరించి కుడివైపున మీఁదినుండి సగము వఱకు గురువులును, తక్కినసగము లఘువులును వేయ నది పైఛందమగునని చెప్పియున్నాఁడు. దీనివలన నేమియు ప్రయోజనము లేదు. ఏదియో మూఁడవదో, నాల్గవదో ప్రస్తరించుకొనియున్నప్పుడు వక్త దాని పైవృత్తమే కావలెనని యడుగునో, ౯ వ దో, ౧౦ వ దో కావలెనని యడుగునో? మఱియు కొంచె మాలోచించిన నీవిషయ మందఱకు తెలియును గాన నిట్టిభేదముల కల్పించుట యనావశ్యకము. ఇంక నధ్వభాగవిషయమున—

"నంద సుతి యధ్వభాగము
చందస్సంఖ్యయును వృత్తసంఖ్యయు రెంటన్,
పొందుగ గుణించి యొక్కటి
యిందుఁ దిగియ నెన్ని యన్ని యంగుళము లగున్."

అని చెప్పి తానే క్రింద తన యభిప్రాయమును స్పష్టముగా వ్రాసియున్నాఁడు. ఈతనిమతముగూడ భూపరిమితినే చెప్పుచున్నది. ఎన్నవఛందమును గుణించి ప్రష్ట యడిగెనో యాఛందస్సంఖ్యయు, దానివృత్తసంఖ్యయు గూడి యినుమడించి వానిలో నొకటి తీయ నెంతయో అన్ని యంగుళములభూమి యాఛందః ప్రస్తారమునకు కావలెనని చెప్పియున్నాఁడు. ఉదా:—ఛందము ౩, వృత్తసంఖ్య ౮ + ౩ = ౧౧ × ౨ = ౨౨—౧ = ౨౧ ఇన్నని తేలుచున్నది. దీనినిబట్టి చూడ నీఛందఃకర్త లేని యమముగూడ లేకుండ నెవరియిచ్చ వచ్చినట్లు వారు చెప్పినట్లు తోఁచుచున్నది. కొందఱు పొడవు వెడల్పును గూడ జెప్పినారు. కొందఱు పొడవునే చెప్పియున్నారు. కొంద ఱసలీప్రత్యయమునే మానివేసిరి. కొంద ఱీయధ్వభాగమునకు భూపరిమాణార్థమును చెప్పియుండక విషయమునే మార్చివేసినారు. ఎట్లు చూచినను వీరిలో వీరి కైక్యము సిద్ధింపలేను. చూడుఁడు—

| | అం.సు. పొ. | వె. |
|---|---|---|
| ౧. వృత్తరత్నాకరుని మతమున ౩ వ ఛందఃప్రస్తారము. | ౧౫............ | |
| ౨. కవిజనాశ్రయుని మతానుసారము ,, | ౧౪............ | |
| | ౧౫............ | |
| | ౧౬............ | |
| ౩. కావ్యాలంకారచూడామణి మతానుసారము. | ౧౫........ | ౫... |
| | ౨౪............ | |
| ౪. అనంతునిఛందోదర్పణ మతానుసారము | ౨౦............ | |
| ౫. అప్పకవిమతానుసారము | ౨౧............ | |

ఈరీతిగ నీయధ్వభాగవిషయమున లక్షణకర్తల యభిప్రాయములు వేరువేరుగా నున్నవి.

అసలీ షట్ప్రత్యయములు తత్తత్ప్రకరణముల కనుగుణములైన నామములు కలిగియున్నవి. వీనిలో ప్రాచీనులు చెప్పిన ౫ ప్రత్యయములుమాత్ర మత్యంతోపకారకములు. వృత్తరత్నాకరకర్త యింకను తన యధ్వప్రక్రియాసందర్భమున కొన్నియుక్తులను జెప్పి, "ఏకేన త దపాస్తమ్" అని పూర్వమతముల ఖండించియున్నాఁడు. అవి యంతసారవంతములుగా లేవు. అందు ముఖ్యముగా తాను ప్రత్యయప్రకరణమున కంతకును లక్షణసమన్వయము చెప్పుచు గీసి చూపుచు, నీయధ్వమును తాను చెప్పినంతభూప్రదేశమున నాయాఛందముల

నీప్రకారము సరిపడునట్లు వ్రాసికొనుడని యేదియో చిన్న ఛందమును కాకితముపైఁ వ్రాసియున్న చాల బాగుండె డిది. అట్లు చేయకపోవుటకు కారణ మేమో? మఱియు ప్రస్తారగురులఘుపంక్తులనడుమ నొక్కొక్క యంగుళ పరిమితమగుప్రదేశమును విడువవలెనని చెప్పె, ప్రస్తరించిన వరుసలలో నిదెన్నవవృత్త మగునని యడిగిన నావరుసపై నేకాదిద్విగుణములుగ నంకెలను వేసి (అనఁగా ఉద్దిష్ట మనుప్రత్యయము ప్రకారము వేసి) నావృత్త మెన్నవదో చెప్పుట కుపయుక్త మగుననియు, అందులకే కేవలము నాప్రదేశమును విడువవలెననియు యుక్తి చెప్పియున్నాఁడు. ఈయుక్తి నిరుక్తి. ఏమందురా, ప్రస్తారముచేసినవరుసలలో వక్త యెద్దాని నడిగెనో యా చాలును ఈవల నెక్కొటనో వ్రాసికొని పైరీతిని తత్సంఖ్య చెప్పతగదా? ప్రస్తార గురులఘుపంక్త్యభ్యంతరాంగుళప్రదేశమందే యుద్దిష్టము చేయవలయు ననుయుక్తి యేల? అట్లు వేరుగా వ్రాసి తెలిసికొనినను మేము చెప్పిన యనుపపత్తికూడ రానేరదు. ఎట్లన పెద్దపెద్ద ఛందఃప్రస్తారముల (అనఁగా ౪౦, ౫౦, గురు ప్రస్తారముల) పంక్తులనడుమ విడిచినయంగుళప్రదేశమున వక్త చెప్పిన ఛ్ఛందోద్యోతనార్థ మేకాదిద్విగుణితములుగ సంఖ్య వేయునపుడు ఒక్కొక్కగురులఘువుపై రాను రాను లక్షలకరబడి యంకెల వేయవలసివచ్చును. అపుడు వరుసలనడుమనే కాక లఘుగురుమధ్యమందుఁగూడ మూఁడునాలుగంగుళముల అంతరువు విడువవలసివచ్చును. కాన నాతనియుక్తి సరిపడలేదు. మఱియు తా నీవిడువ వలసినందుల కేదియో కారణ మున్నదనియు, నట్లులేనిచో శాస్త్రసిద్ధము గాదనియు, నేనే నియమించి యీయధ్వప్రత్యయమునకు శాస్త్రీయత సిద్ధింపఁజేసితి ననియుఁ గూడఁ జెప్పియున్నాఁడు. చూడుఁడు: "అంగుళన్యూనాధికపరిమాణానాం గురులఘూనా ముద్దిష్టాంకానాంచ లేఖనసంభవేఽపి అననుగత స్యాశాస్త్రార్థత్వా దగుణ మితి, తత్సిద్ధ్యర్థ మంగులనియమనం కృతం, నతు వ్యసని మాత్రతయా" అని చెప్పినాఁడు. అంత యుక్తిపూరమై ముఖ్యముగ ప్రయోజనశూన్యమైన దానిని తా నేల నింత శ్రమించి సమర్థింపవలెనో చదువరులే గ్రహింతురుగాత.

మఱియొకవిషయము. అనంతుని ఛందమునకు పీఠికను వ్రాసిన శ్రీ గిడుగు సీతాపతిగారు కూడ నీషట్ప్రత్యయసందర్భమున నైదింటిని లక్షణ సమన్వయముగఁ జెప్పి యీ యధ్వమునుమాత్రము విడిచిపెట్టినారు. మఱియు నప్పకవీయ పీఠికలోఁగూడ వీ రేమియు నీవిషయమై యెత్తియుండలేదు. కవిజనాశ్రయ పీఠికయందు శ్రీ జయంతి రామయ్య పంతులుగారుకూడ నీవిషయమును త్యజించియున్నారు. మొత్తముమీఁద సంస్కృత ఛ్ఛందఃకర్తలలో పూర్వుఁడైన పింగళుడు దీని చెప్పకుండుటచేతను, దామోదరమిశ్రుఁడు మొదలగువారుకూడ నీవిషయమును తెలుపకునికిని, ఇవేవలి తెనుఁగు ఛందఃకర్తలుగూడ నీయధ్వప్రత్యయవిషయమున నొకయధ్వమున పోకుండుటచేతను రంగరాట్ఛందఃకర్త అసలీయ స్వస్వరూపమే మార్చియుండుటచేతను, నిప్పటికాలమున నిట్టివి తెలిసికొన కాకితములు మొదలగు సామగ్రులుంటచేతను నీయధ్వమును తీసివేయవచ్చునని నాయభిప్రాయము. ఈవిషయమున నా యభిప్రాయభేదమే వెల్లడించితిఁ గాని యన్యథాభావన కాదు. కాన చదువరు లెవరైన నీవిషయమున సరియగు నుపపత్తులను జూపుచు నీప్రత్యయ మావశ్యకమని వెల్లడించిన నాయభిప్రాయమును మార్చుకొందునని మనవి.

---

# దినాలు బాగుంటే


ఎవరి జోక్యమూ
నాకు వద్దు
ఏమిటీ
అల్లరి?
ఇన్నాళ్లూ
తప్పించుకొని
ఆఖరుకు
దొరికావ్
ప్రమాద కరమైన
దొంగను పట్టి
నందుకు నీకు
మెడల్ బహు
మానము
తలిశెట్టి
రామారావు

# ఋజువృత్తి*

విద్వాన్, కటి సాంబమూర్తిశాస్త్రిగారు

ఇది యొక సంస్కృతాలంకారశాస్త్రగ్రంథము. మమ్మటమహాకవి రచించిన కావ్యప్రకాశిక సంస్కృతాలంకారగ్రంథములలో నెల్లఁ బ్రాచీనమైనదని యెల్లరు నెఱింగినవిషయమే. దాని కంటెఁ బూర్వతరములు, పూర్వతమములు నగుగ్రంథము లేవో రెండుమూఁడు మాత్రమే కాని యంత కధికముగా లేవు. మమ్మటుఁడు కావ్యములందలి వివిధవిషయములకును లక్షణముగా సూత్రముల రచించి, వానికి తానే కావ్యప్రకాశిక యను వృత్తిని రచించి సంస్కృతభాషావేదులకు మహోపకార మొనరించియున్నాఁడు. మొన్నమొన్నటివఱకు నాంధ్ర దేశమునందుఁ గావ్యప్రకాశిక యాంధ్రసంస్కృతవిద్యార్థుల కవశ్యపాఠ్యగ్రంథముగా నుండెడిది. ఇంతియ కాక అలంకార శాస్త్రమునందుఁ బ్రాచీనమతము నెఱుంగఁగోరువారికిఁ గావ్యప్రకాశిక మిక్కిలిగ నుపకరించును. కావుననే దీనికిఁ బెక్కురు మహాపండితులు నానాకాలములందు మహావ్యాఖ్యానములు రచించియున్నారు. ఆంధ్ర దేశమునందే మల్లాది లక్ష్మణసూరీంద్రుఁడు కావ్యప్రకాశిక కొక చక్కని వ్యాఖ్యానము రచించియున్నాఁడు. అది ముద్రితమైయున్నది.

బెల్లముకొండ నృసింహపండితుఁడు కావ్యప్రకాశికకుఁ గాక ప్రకాశికామూలసూత్రములకు మాత్రము ఋజువృత్తి యనుపేర నొక వివరణము రచించెను. దానినిగూర్చియే యిపు డీప్రసంగావతరణము.

ఋజువృత్తిరచయిత యగు పండితశిరోమణి బెల్లముకొండ నృసింహపండితుఁ డని మున్నె చెప్పియుంటిని. ఇతనితాత రంగప్రభువు (రాజు); తండ్రి తిమ్మాజిమంత్రి అని తెలియుచున్నది. ఈతఁడు తన తాతతండ్రుల యొక్క కాని, తన యొక్క కాని నివాసస్థలము, గోత్రము, అధికారము మొదలగున వేవియుఁ దెల్పుకొని యుండలేదు. తన తాతతండ్రులు గొప్పసంపన్ను లని మాత్రము తెలుపుచున్నాఁడు. ఈక్రిందిశ్లోకములఁ దిలకించిన నున్నవిషయము లెల్ల విస్పష్టమగును.—

"శ్రీమద్బెల్లముకొండవంశజలధే రాసీ ద్యశఃకౌముదీ,
ధౌతాశేషజగత్తమ శ్శుచిరుచీ రంగప్రభు శ్చంద్రమాః,
తత్సూను ర్గుణరత్నరోహణగిరి శ్శాస్త్రప్రవీణో బుధ
శ్శ్రీమా నర్థిసురద్రుమో విజయతే తిమ్మాజిమంత్రీశ్వరః."

"త స్యాస్తి సూను రమలప్రతిభశ్చ దృశ్య
శ్రవ్యప్రబంధరచనాచతురః కళావాన్,
వక్తా మృషార్త్తిభి రలంకృతిదర్శనానాం
కర్తా పునః కృతిత తే ర్నరసింహనామా."

తా. బెల్లముకొండవంశ మను సముద్రము వలన రంగప్రభుం డనుచంద్రుఁ డుదయించెను. ఆచంద్రుని కీర్తిచంద్రికచే ఎల్లజగముల చీఁకట్లు మాపఁబడినవి. ఆతఁడు శుచియైన రుచి కలవాఁడు. వాని తనయుఁడు బుధుఁడు, గుణరత్నరోహణగిరి, శాస్త్రప్రవీణుఁడు, అర్థికల్పకము నగు తిమ్మాజిమంత్రీశ్వరుఁడు. ఆతిమ్మాజి మంత్రికుమారుఁ డీగ్రంథప్రణేత, దృశ్యశ్రవ్యప్రబంధరచనాచతురుఁడు, అలంకారదర్శనాధ్యాపకుఁడు, కృతితతినిర్మాత యగు నృసింహపండితుఁడు.

కవి యీలేశమాత్రవర్ణనము దక్క స్వవిషయ మేమియుఁ దెలుపకుండుటచే నీతనికాలము గాని, నివాసస్థలము గాని నిర్ణయింప నవకాశము లభింపలేదు. అయినను నాకుఁ దోఁచిన రెండుమూఁడువిషయముల మనవిచేయ సాహసించుచున్నాఁడను.

* ఈ నడుమ నేను కొన్ని తాళపత్రగ్రంథములు శోధించుటలో నపూర్వములగు కొన్నిగ్రంథములు లభించినవి. ఆంధ్రలోకమునకు వానిపరిచయము గలిగించు టుచిత మనుతలంపున నం దొకదానినిగూర్చి యిందించుక వ్రాసికొనుచున్నాఁడను. తక్కినవానినిగూర్చికూడ నచిరకాలముననే యెఱుకపఱచికొందును. —క. సాం. శాస్త్రి.

ఆంధ్రబ్రాహ్మణులలో నియోగులతెగలో బెల్లముకొండవారను నింటిపేరు గలవా రున్నారు కదా! నియోగులలోఁ బక్క నింకెతెగలోను నీయింటిపేరు లేమిచేఁ గవి నియోగిబ్రాహ్మణుఁ డనఁదగును. కవి తాతపేరు ప్రభుఁ డనుటయు, తండ్రిపేరు మంత్రీశ్వరుఁ డనుటయుఁ బైయూహమున కుపష్టంభకము లగుచున్నవి. గుంటూరుమండలమున నొకగ్రామమున శ్రీ బెల్లముకొండ రామరాయామాత్యులను నొకగొప్పపండితులు మొన్నమొన్నటివఱకు జీవించియుండెడివారు. శ్రీరామరావుగారు సంస్కృతాంధ్రభాషలలో గొప్ప వైదుష్యము సంపాదించి యింటికడ ననేకవిద్యార్థుల కన్నవస్త్రము లిచ్చి సంస్కృతాంధ్రవిద్యాదానము చేయుచుండెడివారు. వీరు శతాధికగ్రంథముల రచించుటయే కాక వేదాంతమునం దసమానశేముషీవిభవము గడించి భగవద్గీత కొక్క మహావ్యాఖ్యానము రచించి యున్నారు. వీరిచరిత్రప్రసంగమున వీరిపూర్వు లెల్లరును మహాపండితులు, కవులు, సంపన్నులు నని విని యున్నాను. కావున మనప్రస్తుతకవికూడ వీరివంశము నందలి పూర్వుఁడే యైయుండునేమో? ధనవిద్యాసంపదలంబట్టి యట్లే నమ్మవచ్చును. నృసింహపండితుని వంశమున రామరాయామాత్యులు జనించుట గాని, రామరాయామాత్యులకు నృసింహపండితుఁడు పూర్వవంశ్యుఁ డై యుంట కాని యాశ్చర్యజనకములును, సంశయావహములును గానేరవు. రామరావుగారు గుంటూరుమండలమున నొక చిన్నజమీందారు లని వినికి కావున మన నృసింహపండితుఁడుగూడ నాగ్రామమందె నివసించియుండనోపును. నృసింహపండితునితాత ప్రభువుకదా? ఆగ్రామము నృసింహపండితుని తాతచేతనో, యంతకుఁ బూర్వులచేతనో సంపాదింపఁబడి నేఁటివఱకు వారివంశ్యుల కనుభావ్యముగా నున్నదని యూహింపవచ్చును.

కాలము:—ఏదో రీతిగా నివాసస్థల మూహించినట్లుగానే నివాసకాలముగూడ నూహింతము. నాకడ నున్న ప్రతి మజ్జనకులును, విద్యాగురువులు నగు శ్రీ కత్తి సుబ్బరాయశాస్త్రులవారి విద్యాగురువులగు పేరి అప్పయ్యశాస్త్రిగారు లిఖించినది. ఆప్రతి లిఖించి యిప్పటికి నఱువదినాలుగుసంవత్సరము లయినది.

"నిధివార్ధిభూమితే శుభచతుర్దశ్యా మిందువాసరేఽయమ్,
అప్పయ్యానామవిద్వా నలిఖ దృజువృత్తి మప్రమాదీయః.

కావ్యప్రకాశికాటీకా మృజువృత్తిం సుపుష్కలామ్,
అప్పయ్యాఖ్యో ద్విజశ్రేష్ఠో ఽలిఖ త్పన్నయత్నతః"

అని పైశ్లోకములు లేఖకుఁడు వ్రాసికొన్న స్వవిషయములు. ఈలేఖకులు స్వర్గతులయి యిప్పటికి సుమారిరువదేండ్లు కావచ్చియుండును. కావునఁ బ్రతిలేఖనకాల మిప్పటికి నఱువదినాలుగేండ్లయినది. సామాన్యముగా ప్రసిద్ధమై పఠనపాఠనాదుల నధికప్రచారమున నున్న గ్రంథము కానిచో చదువుకొను విద్యార్థులు వ్రాసికొనుట యుండెనుకదా? లేఖకులు కావ్యనాటకముల ముగించి యలంకారశాస్త్రము నభ్యసించునాఁటికి యీగ్రంథము పల్లెటూళ్లయందు సైతము సరళప్రచార మొందిన దని చెప్పవచ్చును. అట్లు సరళప్రచార మొందుటకు రచింపఁబడినపిదప ముప్పదినలువది యేండ్లయినఁ బట్టును. కాఁబట్టి యీగ్రంథ మిప్పటి కించుమించుగా నూటేండ్లకుముందేరచింపఁబడినదని నిశ్చయింపవచ్చును ప్రయాణసౌకర్యములు లేనియాకాలములో నెక్కడనో గుంటూరుమండలమందలి గ్రంథప్రతి విశాఖపట్టణమండలమందలి మాఱుమూల నున్న శృంగవరపుకోటతాలూకాలోని శ్రీరామపురాగ్రహారమునకు వచ్చుట కల్పకాలము చాలదు.

మఱియుఁ విశాఖపట్టణముమండలమందలి మాడుగుల సంస్థాము నేలు కృష్ణభూపతిదేవుగారును, విజయనగరసంస్థానము నేలు విజయరామగజపతిమహారాజుగారును నాకాలమున విశేషముగఁ బండితగోష్ఠులు జరపి పండితులకు విశేషసత్కారములు గావించెడివారు. ఈ ప్రతిలేఖకుల విద్యాగురువులు వడ్లమాని అన్నయ్యశాస్త్రిగారు తమపాండిత్యాతిశయముచే నాసంస్థానాధిపతుల సత్కారము లొందెడువారు. ఈనృసింహపండితుఁడు కూడ రాజసమ్మానమును, దన గ్రంథప్రచారము నపేక్షించి యీప్రాంతములకు వచ్చియున్నపుడు ఆగ్రంథ

పుత్రిక లీదేశమునఁ బ్రచారమొందియైన నుండవచ్చును. ఇట్లు చూచినను నీ గ్రంథరచనాకాలము నూఱేండ్లకు ముందే యని తెలియనగును. ఇంకను మల్లాది లక్ష్మణసూరియొక్కయు, నీకవియొక్కయు గ్రంథములు రెంటిని జూచినచో నీతని గ్రంథము లక్ష్మణసూరి గ్రంథము కంటె మిగులఁ బ్రాచీన మనునూహ జనించును.

ఈకవి యీగ్రంథమును రచించువఱకు నాంధ్రదేశమునఁ గావ్యప్రకాశికకు లఘువగు వ్యాఖ్యాన మేదియు లేదని యీక్రిందిశ్లోకము నుడువుచున్నది.—

"శ్లో. ప్రాంచత్ప్రౌఢసరస్వతీపరిమళే
ప్రాచాం ప్రబంధే సతి
ప్రీతిః పేశలవాచి మామకకృతౌ
సంఖ్యావతాం జాయతామ్,
నిర్యన్నిష్ఠురరావమేదురరవే
నిస్సాణవాద్యే సతి
న్యక్కారో న హి మంజువాదిని పున
ర్వీణాభిధే వస్తుని."

ప్రౌఢములగు ప్రాచీనుల గ్రంథము లున్నను విద్వాంసులు పేశలమగు నాకృతి నాదరింతురుగాక. శ్రవణదారణమహాభైరవారావం బగు భేరి యున్న దని మంజులస్వనసుభగంబగు వీణాస్వనంబు నెవ్వరును విడువరుకదా యని పైశ్లోకము తాత్పర్యము.

కవి యీగ్రంథమును రచించునాఁటికి కావ్యప్రకాశికా మూలసూత్రములకే కాక కావ్యప్రకాశికకే లక్ష్మణసూరి రచించిన లఘువ్యాఖ్యాన మున్నచోఁ గవి యీవృత్తిని రచించుట కాని, పైశ్లోకమున నట్లు తెల్పుట కాని సంభవించియుండదు. మమ్మటుని కావ్యాలంకారసూత్రములకు నాతఁడు రచించినవృత్తి మిక్కిలి ప్రౌఢమైనది, మూలమున లేని విశేషాంశములను, శాస్త్రీయచర్చలను మాత్రమే యావృత్తియం దాతఁడు ప్రకటించెను గాని మూలమునకు సుగ్రహ మగురీతి సర్వవివరణము గావింపలేదు. కావుననే యావృత్తినే మనకవి భేరీరావముతోఁ బోల్చినాఁడు. పైని జెప్పినవిషయము లన్నింటి వలన నీగ్రంథము ప్రాచీన మైనదే యని తేలుచున్నది. కాని యెంతప్రాచీనమో నిర్ణయింపఁజాలను. నూఱువత్సరములలోపలిదిమాత్రము కానేఱ దని నమ్ముచున్నాను.

గ్రంథవిషయమునుగూర్చి విపులముగాఁ జూపుటకిది తావు కాదని భయపడుచున్నాఁడను. మృదులమును, సరళము నగు పదజాలముతో నీగ్రంథము మనోహరముగానున్నది. కఠినమైన విశేషచర్చ లగపడవు. అవసరమైన విషయము లరఁటిపం డొలిచిపెట్టినట్లగపడును. కవికవితాశైలివలెనే వచోధోరణియు ద్రాక్షాపాకమున నలరారుచుండును. విమర్శనవైఖరి సుగ్రహమైనది. ఇట్టి గ్రంథము ముద్రితము గాకుండుట దుఃఖహేతువే. ఇదియే కాక ముద్రితములైన యాంధ్రకవుల గ్రంథములుగూడ నన్నియు నాంధ్రాక్షరాంకితములే యగుటంజేసి యొక్క యాంధ్రదేశమందే కాక యింకేదేశమందును బ్రచారమొందకున్నవి. నాగరాక్షరములలో ముద్రించినచో మన యాంధ్రుల గ్రంథము లితరదేశములందుఁగూడ నధికగౌరవము నొంది యాంధ్రభూమి కధికగౌరవమును సంపాదింపఁగలవు. ఎవరేని మహానుభావులు ఆంధ్రత్వాభిమానముననో, కేవలము కవియందలి యభిమానముననో, లేక గ్రంథగౌరవముననో యీగ్రంథమును ముద్రింపఁదలఁచిరేని వారికి సాధన్యతావాదవందనములతో నీగ్రంథ మర్పింతుము. గ్రంథపరిమాణము రెండువేలగ్రంథములు మాత్రమే. నాలుగుత్సాహములు; నూఱుపుటలు; పుట కెనిమిదిపంక్తులు; పంక్తికి తొంబదియక్షరములు. గ్రంథము సమగ్రముగా నున్నది. తప్పులు లేవు. ఉదారాశయు లగు నాంధ్రమహాజను లీగ్రంథమును బ్రకటించి యాంధ్రగౌరవమును దేశాంతరముల నినుమడింపఁజేయుదురుగాత.

---

---

విలాసినీ విభ్రమములు



చిత్రము ౩

# విజయవిలాస వ్యాఖ్యానవిధానము

ఆంధ్రవిశారద, తాపీ ధర్మారావుగారు, బి.ఏ.,

## ఒక్క పద్యము

గంగా నదీతీరమున 'హిమకర సైకత సైకతము నం'దుండిన సవ్యసాచిని(జూచి, తలయూ(చి, యులూచి రసోచితంబుగ వర్ణించిన ఘట్టమునం దీపద్యము గలదు.—

"ఊదుకపోవుశంఖము న
హో గళరేఖ, శరాసనంబులన్
వాదుకు(బట్టి కన్బొమల
వైఖరి వంకలుతీరుచున్, కటా
క్షోదయలీల సాయకస
మూహములన్ విషమాస్త్రు గెల్చు( బో,
యేదొరసాటి యీనరున
కెన్న(గ వీరవిలాససంపదన్."

జగద్విఖ్యాతశతావధానులగు తిరుపతి వేంకటేశ్వర విద్వత్కవిశిఖామణుల సాహాయ్యమున( బోలవరము జమీందారులు శ్రీరాజా కె. ఆర్. వి. కృష్ణారావుబహద్దూర్, బి ఏ, వారిచే ౧౯౦౧ లో( బ్రచురితమయిన విజయవిలాసమునందలి పాఠమువకును, బ్రహ్మశ్రీ (తరువాత కళాప్రపూర్ణులు) వేదము వేంకటరాయశాస్త్రిగారు విపుల వ్యాఖ్యానముతోడ ౧౯౧౦ లో( బ్రచురించిన విజయవిలాసమునందలి పై పాఠమునకును గలభేద మత్యల్పము. వేంకటరాయశాస్త్రిగారు పద్యమునందు మూ(డు కామాల నుపయోగించిరి. తిరుపతివేంకటేశ్వరులు వాని( ద్యజించిరి. బ్రహ్మశ్రీ నోరి గురులింగశాస్త్రిగారు ప్రతిపదటీకాతాత్పర్యములతోడ( బ్రచురించిన విజయవిలాసమునం దీపద్యము

"ఊదుకపోవుశంఖము న
హో గళరేఖ శరాసనంబులన్
వాదుకు(బట్టి కన్బొమల
వైఖరి వంకలుదీర్చు నాకటా
క్షోదయలీల సాయకస
మూహములన్ విషమాస్త్రు గెల్చు( బో
యేదొరసాటి యీనరున
కెన్న(గ వీర్యవిలాససంపదన్."

అని యున్నది. తక్కుంగల ప్రచురణము లన్నియు( బై పాఠముల ననుకరించునవియే. పై పాఠముల సాదృశ్యమునుబట్టి వారందఱు నొక్కరీతి యర్థమునే యూహించి రనుట సమంజసము.

వేంకటరాయశాస్త్రిగారు 'పాఠనిర్ణయవ్యాఖ్యారచనాదిపరిక్లేశము వహించి' యీపద్యరాజమున కిట్లు వ్యాఖ్యానమును వ్రాసిరి:

"గళరేఖ = కంఠముయొక్క సౌందర్యము, శంఖమును=(మన్మథుని)శంఖమును, ఊదుకపోవున్ = తిరస్కరించును—(ఊదివేయును) ; కన్‌బొమలవైఖరి = భ్రూవిలాసము, శరాసనంబులన్ = (మన్మథుని) సింగిణివిండ్లను, వాదుకు(బట్టి = వివాదమునకు తలపెట్టి, వంకలుతీరుచున్ = వంపులుదిద్దును—(కుంటు(బో(గొట్టును); కటాక్షఉదయలీల = కడకంటిచూపులు పొడమువిధము, సాయకసమూహములన్ = బాణములమొత్తములతో, విషమాస్త్రున్ = మన్మథుని (ప్రూరములగుబాణములను గలవాని ననియు భా.)...ఈనరునకున్ = ఈయర్జునునకు, వీరవిలాససంపదన్ = వీరుల విలాసములయొక్క భాగ్యమునందు. ఇందు తిరస్కారపదములకు తత్తదుపమానవైసర్గికవృత్తము ధ్వనితమగుట రమణీయముగా నున్నది. —ఊదుక—వాదుకున్ జఘన్యప్రయోగములు."

దీనిని(బట్టి చూచిన నీపద్యమునందు( గవి కొంత చమత్కారము నుద్దేశించెనని విశదమగును.

'ప్రతిపద్యమునందు( జమ
త్కృతి గల్గ(గ( జెప్పనేర్తు...'

వని పండితప్రభువుచే మెప్పు(గాంచిన కవి యట్టుల నుద్దేశించుటయం దాశ్చర్య ముండనేరదు. ఇంక 'నా చమత్కార మెయ్యది? దానిఁ గవి యెట్లు సాధింప(

9. 3- 5 ౮౦౫

గలిగెఁ? నని యారయఁదగును. వేంకటరాయశాస్త్రిగా రనినట్టుల నిందలిసొగసు, ఉపమానములయందును, వాని కనుగుణములగు తిరస్కారపదములయందును గలదని యందఱు నంగీకరింతురు. పైవ్యాఖ్యానమును బట్టి చూచినచో నీపద్యమున: దిరస్కారపదములు మూఁడు కనఁబడుచున్నవి.—(౧) ఊఁదుకపోవున్, (౨) వంకలు తీరుచున్, (౩) గెల్చున్. ఈమూఁడువిధములగు తిరస్కారముల నొనరించుచుండిన వర్ణ్యములు—(౧) గళరేఖ, (౨) కన్బొమలపైసిరి (౩) కటాక్షోదయలీల. ఇంకఁ దిరస్కృతములగు నుపమానము లెవ్వి యనిన (౧) శంఖము, (౨) శరాసనంబులు, (౩) విషమాస్త్రుఁడు ననియే యన వలయును.

మొదటివర్ణనయం దెవ్వరికి నెట్టి విప్రతిపత్తియు, గలుగనేరదు. 'కంఠముయొక్క సౌందర్యము శంఖమును (మన్మథునిదనియేయందుముగాక) ఊఁదివేయును = తిరస్కరించును' అని సరసమగు నర్థము గలుగుచున్నది. వర్ణ్యమగు కంఠమున కుపమానముగఁ గవి యంగీకరించిన 'శంఖమును' దిరస్కరించుట కాశంఖమున కనుగుణమగు 'నూఁదుట' యను పదమునే ప్రయోగించి కవి యీహాయినిఁ గల్గింపఁజాలెను. ఊఁదివైచు, నూఁదికొనిపోవు నని యిప్పుడును దిరస్కారార్థమున వాడుకగలదు.

రెండవయంశము 'శరాసనంబులన్ వాదుకుఁబట్టి కన్బొమలపైసిరి వంకలుతీరుచున్'; అనఁగా 'భ్రూవిలాసము వివాదమునకు తలపెట్టి సింగిణివిండ్లను (ఇయ్యవి గూడ మన్మథునివే కావచ్చును.) వంపులు దిద్దును-కుంటుఁ బోఁగొట్టును.' అని యొకవిధమగు నర్థము గలుగును. ఇట వింటికి వంక యుండవలసినగుణ మగుటచేత 'వంకలు తీరుచున్' అనునప్పుడు 'సరియగు వంపులు కలుగునట్లు చేయును' అని యూహింపవలయునుగాని, వంకలుతీర్చి తిన్నఁగ జేయునని యర్థము చేసికొనరా దనవలయును. వంకలు తీరుచు ననుపదములకు సాధారణముగనున్న జాతీయార్థమును విసర్జించి పై విశేషార్థమును జెప్పవలసి యుండును. ఇట్టిది కావ్యగుణపరిశీలనమునందు దోష మందురుగదా! చేమకూర వేంకటరాజకవి పదముల జాతీయార్థమునకు భంగము రానీయకుండఁ బూనుచు విశేషార్థమును బోషించుచు నలవాటుఁ గలవాఁడని సహృదయు లెఱుంగుదురు. అట్టికవి కిట్టిదోషం బంటఁగట్టుట యెంత వఱకు న్యాయ్యమగునో యోజింపఁదగును.

ఇంక, 'వాదుకుఁబట్టి' యను పదంబులవలని లాభ మెయ్యది? ఈవర్ణనయందు ముఖ్యవిషయము: కన్బొమల పైసిరి శరాసనంబు లను వంకలు తీరుచు నని గదా వ్యాఖ్యాతల యభిప్రాయము? అట్లయినచో నీ'వాదుకుఁ బట్టి' కేవలపాదపూరణమాత్రకమా? ప్రాసస్థానమున నీప్రయోగము గలుగుటచే నీయర్థ మాయభిప్రాయమునే పోషించునుగదా! పాపము! చేమకూరవానిగతి 'ప్రాసకొఱకేడ్చుట' యా! 'వాదుకుఁబట్టి' యన 'వివాదమునకు తలపెట్టి' యనునర్థ మెటులవచ్చును? పట్టి యనిన తలపెట్టి, తలంచి యను సాహసింపఁగలమా? యుద్ధమాడు తలంపు గిలవీరులు తమ సింగిణివిండ్లను సరియగువంపులు గలుగునట్లు సవరించికొనుట యెందైన వర్ణితమయి యున్నదా? మొదటియంశమునం దిట్టి తిరస్కారోద్దేశము ప్రకటితము కాలేదే! ఈ రెండవవర్ణనమునందు దానినిఁ జొన్పి ప్రక్రమమునకు గొంతలోపమును సౌఖ్యమున కింతకొంతయు నీకవి కలిగించునా యని సంశయింపక తీఱదు.

ఇంక మూడవ యంశమును జూతుము:

"..............................

.........................కటా

క్షోదయలీలసాయక స

మూహములన్ విషమాస్త్రు గెల్చుఁబో॥"

పైనిఁ గల వ్యాఖ్యానమును బట్టి 'కడకంటిచూపులు వాఁడిమిగల బాణములమొత్తములతో మన్మథుని (క్రూరములగుబాణములు గలవానిని) గెల్చునుసుమా' యని యర్థమగును. ఇం దుపమేయము కటాక్షోదయలీల; తిరస్కారపదము గెల్చుట; తిరస్కృతమయిన యుపమానము విషమాస్త్రుఁడు. ఇది స్పష్టముగఁ గాననగును. కాని పైరెండువర్ణనలయందును వర్ణ్యములకును, దిరస్కృతవిషయములకుఁ బ్రసిద్ధమగు నుపమేయోపమానసంబంధము గలదు. కంఠమునకు శంఖమును, గన్బొమలకు విండ్లను

గవిజనాంగీకృతోపమానములు, నత్యంతయుక్తములును, కాని, కటాక్షములకును, విషమాస్త్రునకు నట్టిసంబంధము కలదనుట సాహసమగును. ఇంతియగాదు. తిరస్కారపదమును జూచినను గొంతలోపము గానవచ్చును. మొదటివర్ణనమునందుఁ దిరస్కారపద ముప మానోచితవృత్తికి, వేంకటరాయశాస్త్రిగారనినట్టులు, నన్నివిధముల నొప్పియున్నది. రెండవ వర్ణనయందుఁ గల తిరస్కారపదము కొంచెము వ్యత్యాసములోఁ దగినట్లే కనవచ్చును. ఆదృష్టితో నీమూఁడవ యంశమును బరిశీలించిన నేమియుఁ బొసఁగదనుట సత్యము. శంఖమున సూఁదఁబడుటయు, శరాసనంబునకు వంకలు తీర్పఁబడుటయు ననుగుణములుగ నెన్నఁదగిన వృత్తులయినట్లు విషమాస్త్రునకు గెల్వఁబడుట నైసర్గికము గావలసి యుండును. ఇది యనుచితము

ఇంక 'సాయకసమూహములన్' అను పదముల కర్థమేమి? 'బాణముల మొత్తములతో' ననినఁ దాత్పర్యమేమి? కటాక్షములు బాణముల మొత్తముల నాయుధములుగఁ గొని విషమాస్త్రుని గెల్చునని యర్థమా? అట్లయిన నర్జునునికటాక్షముల కీబాణసమూహము లెప్పుడెట్లు లభించెను? అటుఁగాక, యియ్యది విషమాస్త్రుని వేనా? అగుచు, సాయకసమూహములన్, అనఁగా బాణములమొత్తములతో(లేకతోడి-లేకతోనున్న) విషమాస్త్రుని యర్థము చెప్పవలెను. అట్లన్వయించికొని, విషమాస్త్రుని, వానిబాణసమూహములను గెల్చునని యర్థము చెప్పి కటాక్షములకు నీబాణములకు నుపమేయోపమాన సంబంధమును గల్పించి యానందింతుమన్నఁ, బాపము! విషమాస్త్రుఁడు నిరర్థకుఁడగును. అంతమాత్రమే యయినయెడల సాయకసమూహములన్ అనుదానికి బాణముల మొత్తములతో నని తృతీయఁ జెప్పక వేంకటరాయశాస్త్రిగారు బాణసమూహములను అని ద్వితీయఁ జెప్పి విషమాస్త్రునితో జోడించియే యుందురుగదా! ఇంతియ కాదు. బాణసమూహములకుమాత్రము గెల్వఁబడుట నైసర్గికమా? కానిచో నీతిరస్కారపదస్వారస్య మేమి? ఏమయినను బ్రధానస్థానమునఁ గననగుచున్న విషమాస్త్రు నప్రధాను నొనర్చి, యప్రధానస్థానముననున్న సాయకసమూహములను బెద్దఁజేయుట యెట్లు? చేమకూరవాని కవిత్వసౌష్ఠవమును జక్కఁగ నెఱింగినవార లెవరు నిట్టి యన్వయ మాకవి యుద్దేశించియుండునని యంగీకరింపఁ జాలుదురా?

కవికిఁగల ప్రక్రమనియమ మమోఘము, నత్యంత రమణీయమును గదా!

'తా రసపుష్టిమైఁ బ్రతిపదంబున
జాతియు వార్తయున్ జమ
త్కారము నర్థగౌరవము గల్గ
..........................'

ప్రసన్నగంభీరగతిన్ రచించుటకుఁ గవి యెంత యుల్లాసించెనో, ప్రక్రమగుణము నత్యంతనిష్ఠతోఁ బాటింప నంతయుత్సహించును. చూడుఁ డీకవిప్రక్రమ విధానము:

"ధారాధరము వెన్నుఁదన్ని పుట్టినచాయ
నున్నదీబింబాధరోష్ఠివేణి
జక్కవకవ ఱొమ్ముఁద్రొక్కి నిల్చినజాడ
నున్న దీనవలాపయోధరములు
చిన్నిప్రాయపులేడి చెవిపట్టియాడించు
గతినున్న దీరామకన్నుదోయి
నల్లచీమలబారు నడుముదాఁకినవీక
నున్న దీచెలువంపుఁ గన్నెయారు
.........................'

ఆహా! యెంతరమ్యము! ఆరసిచూచిన, (౧) ఉపమానము, (౨) తిరస్కారపదము, (౩) ఉపమావాచకము, (౪) క్రియాపదము, (౫) స్త్రీపర్యాయము, (౬) ఉపమేయము నని యాఱుశీర్షికలక్రింద గీటులను గీచి వ్రాసినయట్లు లాపదములవరుస గన్పించుననిన సత్యదూరముగాదు. అట్టిది మనకవికిఁ గలప్రక్రమనియమము. అయినచో నచట 'వాదుకుఁబట్టి' యనియు నిచట 'సాయకసమూహములన్ విషమాస్త్రు' ననియు వ్రాయునాయని సందేహము గలుగకమానదు.

అది యటు లుండనిండు. ఈపద్యమునందలి శంఖమును, శరాసనములును మన్మథునివని వ్యాఖ్యానమునఁ

గలదు. మన్మథునివలనఁ గలిగిన ప్రయోజనమెట్టిది? మన్మథునివలనఁ జేత వంచమయినవనియు, మోహకారకము లనియు నభిప్రాయము గావచ్చును. కాని, పైవ్యాఖ్యానమునుబట్టి యూఁతవపాదమున మన్మథుఁడే పరాజితుఁ డగుచున్నాఁడు. అంతియకాక 'యేకొరసాటియావరుడ' కనుఁడర్థాపత్తిచేఁ గూడ మన్మథుని విజితు నొనర్పవలసి యున్నది. అర్జునునిచే మన్మథునిశంఖము నూఁదఁగలుగుట మన్మథుఁడు పరాజితుఁడయినయనంతరమే జరుగఁ దగినదేకాని తత్పూర్వము గానేరదుగదా! మన్మథు నోడించినతరువాతఁగాని యర్జునుని కన్బొమలకు మన్మథుని శరాసనములు కైవసము గానేరవు. అట్లు విజయచిహ్నములుగఁ జేఁజిక్కిన మన్మథశరాసనములను నర్జునుని కన్బొమ లేల 'వాఁకుఁబట్టి' వంకలు తీర్పవలయునో యనూహ్యము. ఇంక నవ్వారితోఁ బనిలేదు! ఈధోరణిని విచక్షించినను నీ 'వాఁదుకుఁబట్టి' యనునది యర్థస్వారస్యమునకుఁ బ్రతికూలముగనే యున్నదనవలయును.

ఆంధ్రభాషకుపకారము నొనర్చిన సి. పి. బ్రౌనుదొరగారి దగ్గఱ, వారికి గురుతుల్యులుగ నుండిన మహావిద్వాంసుఁడు జూలూరు అప్పయ్యపండితుఁ డీ పద్యమున శంఖము మన్మథవిజయశంఖమనియే భావించియు, శరాసనములకడకు వచ్చినప్పుడు, 'వాఁదుకుఁబట్టి'ని గుర్తించియే యేమో, మన్మథునిపై దెత్తికయే సింగిణి విండ్లని యర్థము నిచ్చి యూరకుండిరి.

పైవ్యాఖ్యానమునం దిట్టిసంకటము లిన్ని సంప్రాప్తించి యున్నచో నీపద్యమునకు గతియేమి యని యోజింపవలయును. మొదటి వర్ణనయం దెట్టియభ్యంతరమును లేదుగదా. రెండవవర్ణనమునఁగలచిక్కులు రెండు. (౧) వాఁదుకుఁబట్టి (౨) వంకలుతీర్చుట. ఈరెండవచిక్కును గూర్చి యొక్కించుక: ఆహవరంగమునందు విజయము నంద నేగు వీరపురుషునకు వింటివంపులు దిద్దుట శంఖము బూరించునట్లే యుచితవర్ణనయా? సంస్కృతాంధ్ర సాహిత్యములు యుద్ధవర్ణనలతో నిండియున్నవి. ఎందును రణరంగమునందు వీరుఁడు వింటివంకలు తీర్చుచుండినట్లుఁ గానరాఁడు. వంకలుతీర్చుట యనఁగా వంపులు బోఁగొట్టి తిన్నఁగఁ జేయుట యనియే సాధారణార్థముగాని, వింటికి కవశ్యముగ నుండఁదగినవంకను (సరియగు వంకగా) సరిచేయుటయని కాదు. వాదుకయందున్న ప్రసిద్ధార్థమును త్యజించి చేమకూరకవి యిట్టిక్లిష్టార్థమును గ్రహించునాయని సందేహింపకమానదు. కావున వంకలు తీర్చుటయన వంపులు లేకుండఁ దిన్నఁగఁ జేయుటయే యని యెంచవలయును. అట్లయినచో నిది దేని కుచితము? వంకలు లేకుండ నుండవలసినయవి బాణములు. ఏమాత్రము వంకయుండినను బాణములు లక్ష్యమును దాఁకనేరవు. ఇది ప్రకృతిశాస్త్రసమ్మతము; విలుకాండ్రనవరతము నొనరించుకార్యము. బాణమున వంపుండిన యెడల ధనుర్విముక్తమయి యాబాణము తిన్నఁగ లక్ష్యమును జేరక యావంపు ననుసరించియే వలయరేఖను జట్టును. ఈసూత్రము ననుసరించియే 'బూమిరాంగు' అను నొకయాయుధవిశేషము నిర్మితమయ్యెను. ఈ 'బూమిరాంగు' ప్రయోగస్థానమునుండి వలయరేఖాపథమునఁ బోయి మరలఁ బ్రయోగస్థానమున కేతెంచును. కావున ధానుష్కుఁడు దనచేతివాఁడిఁ జూపఁదలంచినప్పుడు తన బాణముల వంకలు లేకుండఁ దీర్చును. ఈయూహయే చేమకూర వేంకటరాజకవికిఁగూడఁ గలదనుట కీవిజయవిలాసమునందే

"పంకేజాతములన్ దిసంతు లఁడఁచున్
బాలామణీపాదముల్
వంకల్దీర్చు మనోజసాయకములన్
వాల్చూపు, లేణాంకునిన్
శంక ల్సేయుమొగంబు, జక్కవకవన్
జక్కట్లుదిద్దున్ గుచా
హంకారంబు, మదాళిమాలికల నూ
టాడించు వేణీరుచుల్."

అని ప్రసన్నగంభీరాభిప్రాయముతో వర్ణించెను. ఇందు మనోజసాయకములనువాల్చూపులు వంకలుతీర్చుచున్నవి. క్రీడాభిరామమునందు శ్రీనాథమహాకవి

'తియ్యనివింటిజోదు రతి
దేవి చనుంగవ నొత్తగిల్లి యొ
య్యొయ్యన వంక చక్కఁబడ
నొత్తెడుఁ జూచితె పువ్వుబాణముల్'

అని యీయూహానే ప్రకటించియున్నాఁడు. కావున బాణములను వంకలుతీర్చుట యత్యావశ్యకమును, శాస్త్రసమ్మతమును, గవిజనాంగీకారమునేకాక, వేంకటరాజునకు స్థిరముగ నభిప్రాయమును. కావున నీవంకలు తీర్చుట యను తిరస్కారపదమును సాయకసమూహములతో నన్వయింపవలయునుగాని శరాసనముతో ముడివెట్టఁ జనదు. కాన 'వంకలుతీరుచుక్ కటాక్షోదయలీల సాయకసమూహములన్' అని చదువవలెను.

అట్లయినచో శరాసనములగతి యేమి? కన్బొమలకు, శరాసనంబులకు, నుపమేయోపమాన సంబంధము గలదుగదా! ఇంక నిచటి తిరస్కారపద మెయ్యది కావలయును? అది వాదుకుఁబట్టుటయే యనవలెను. వాదుకుఁబట్టుట వింటికి ఉచితవృత్తియగునా, కాదా యని యారయఁదగును. మనసారస్వతమునఁగల యుద్ధవర్ణనల యందు ధానుష్కులు శరాసనములను బూనుదురు, ఎక్కునెట్టుదురు, టంకారమొనరింతురు గాని వంకలు తీర్చరు. విల్లెత్తుట విల్ పట్టుటయే సంగ్రామసంరంభసూచన లగును. ఈయభిప్రాయమే చేమకూర వేంకటరాజునకుఁ గలదని పలుకుట కొక్కనిదర్శనము. ఇంద్రప్రస్థపురంబునందలి నాలుగువర్ణములను వర్ణించు సీసపద్యమును దిలకింపుఁడు:

తడఁబాటు గలదు వేదముల నాతని కంచుఁ
    బరమేష్ఠి మెచ్చరు ధరణిసురులు
కడమాటుపగవానిఁ గని చేముఱచె నంచు
    భార్గవు మెచ్చరు బాహుజనులు
పనికిరా కొకమూలఁ బడియె నాతనివస్తు
    వని కుబేరుని మెచ్చ రర్యవరులు
పీటిపాటైన నాగేటిపాటున నేమి
    యని హలాయుధు మెచ్చ రంఘ్రిభవులు

పాడిదప్పక, ధర్మంబు పట్టువిడక,
లక్షులకు, నమ్మఁజాలి నల్గడల భూమి
వరులు మేలనఁ దగి యిట్లు పురిఁ బొలుతురు
చదువు సాముల ధనధాన్య సంపదలను.

ఈపద్యమునందలి యద్వితీయమగు క్రమాలంకారమునకు జోహారు! అయ్యది మహోత్కృష్టమును వర్ణనాతీతమును! అది యటు లుండెనిండు. ఇందు భార్గవుని మెచ్చని క్షత్రియులు చేసిన వీరోచితకార్యము ధర్మంబు పట్టువిడకుండుట. ధర్మంబు (= విల్లు) పట్టియుండుట వీరకార్యమని కవితలంచుట దీనఁ దేటయగును. కావున రణసన్నాహమున శంఖమున హూఁపఁబడుట యెట్టులో, సాయకములకు వంకలు తీర్పఁబడుట యెట్టులో, శరాసనములకు వాదుకుఁబట్టఁబడుటయు నట్టిదియే.

రెండవ చరణము.

'వాదుకుఁబట్టి కన్బొమలవైఖరి వంకలుతీరుచున్ కటా' యందు 'వాదుకుఁబట్టి' యనుటకు 'వాదుకుఁబట్టు' అని సంపూర్ణ క్రియగ నంగీకరింపక తప్పదు. అప్పుడు ఊఁదుకపోవును, వంకలుతీర్చును, అను తిరస్కారపదములతో నీవాదుకుఁబట్టు ననునదియు జోడగును. 'బట్టు' అనునది లేఖకప్రమాదమున బట్టి యగుట సర్వసాధారణమని యంగీకరించువా రనేకు లుందురు. ఈలేఖకప్రమాదము మెలమెల్ల గ్రంథసంపాదకప్రమాదముగను, నయ్యది క్రమముగ విద్వత్ప్రవర్యులగు వ్యాఖ్యాతల ప్రమాదముగనుగూడఁ బరిణమించెను. వ్యాఖ్యానసమయంబున వ్యాఖ్యాత లీవిషయమునఁగల దోషములను బరిశీలింపకయో, పరిగణింపకయో విడిచిపుచ్చిరి. కవితత్త్వమును బాగుగ గుర్తెఱింగినను నీపాఠము దుష్టమని నిర్ధారణ చేసియుందు రను నూహకు గొంత యవకాశ మేర్పడినది. తిరస్కారపదప్రయోగమునందుఁ జమత్కార మున్నదియని వ్యాఖ్యాతలు వ్రాయుటయు నా తిరస్కారపదములే యింతచర్చకు సందు నొసఁగుటయుఁ జిత్రముగఁ గానఁబడునుగదా!

ఇప్పుడీ పద్యపాఠమును * సహృదయులు తిలకింతురుగాక.

"ఊఁదుకపోవు శంఖము న
    హో గళలేఖ, శరాసనంబులన్

* ఈనడుమను కీపాఠమును జిక్కినది.

యర్థము సెప్పెరి) విలాసార్థవాచకములను నిట్టిపదములను ప్రయోగించి యుండుటకు 'విలాససంపదన్' అని వ్రాసిన యప్పుడు దాని నప్రధానముగఁ జేయఁగలమా యని సందేహింపవలెను. ఇట్టిపదములపూర్వ కాకతాళీయముగ సంభవించునది గాఁ జేరదు. వీరోచితకార్యజాలమును వర్ణించుచుండినను గవి విలాసవాచకములను ప్రయోగించుచుండి తొలఁగనీయలేదు. ఈపద్యమునందు వీరభాగ్యమే కాక, విలాసభాగ్యముగూడ వర్ణితమయ్యెనని తేటపడునుగదా! ఈ రెండుభాగ్యములును, శ్లేషవలన, (విషమాస్త్రు) ననుపదమున మిక్కిలి చక్కఁగ వర్తించుచున్నవని సహృదయులు తెలియంగఁగలరు. కరిణములను శస్త్రములుగలవారి నోర్చుట వీరసంపద, మన్మథునోడించుట విలాససంపదయగును. కాని, వేంకటరాయశాస్త్రిగారు 'కటాక్షోదయలీల' యనుటకు 'కనకాంగిచూపులు పొడమువిధము' అని వ్యాఖ్యానమొనర్చిరి. విలాసవాచక ప్రాధాన్యమును గుర్తించి వైఖరికి విలాసార్థము నొసఁగిన శాస్త్రిగారు 'లీల' యనుపదమునకు 'విధము' అని కేవలమగునర్థము నొసఁగుట సహృదయులకుఁ గొంత చింతాకరముగ నుండకపోదు. మూఁడుపదములకును విలాసార్థము నొసఁగుటయే ధర్మమగును, కవియభిప్రాయమును నగును. దానిని మఱచుటయున్నఁ గవి లక్ష్యము నేమఱుటయే.

వైఖరి యనుపదమును విలాసార్థమునఁ గవి ప్రయోగించినను వాగ్రూపమను నర్థమున్నదిగదా, దానినిఁ గవి త్యజించెనా యని ప్రశ్న కలుగఁగలదు. మనకవి యట్టియర్థములను పేర్కొన్నట్టిచోఁ గానము.

'వెల్లిసెగఁజల్లునిసమా
తెల్లనివారఁ కుతికమోవఁ దనిబ్రమకుటు'

యనుపద్యమునఁ 'కుతికమోవ' ననుపదమున రెండు డర్థముల నిమిడ్చి యందమును గూర్చెనో యెఱుఁగుదుము గదా! అట్టికవి 'వైఖరి'యందుఁగల వాగ్రూపార్థమును విస్మరించునా? కన్యలవైఖరి చేసిన దేమని కవివర్ణించెనో చూడుఁడు. "శరాసనంబులన్ వాదుకుఁబట్టు" వైఖరికి (వాగ్రూపమునకు) వాదు వివాదము, (ఇదియు వాగ్రూపమే) ఎంత యనుగుణముగనున్నదో.

"ప్రౌఢిరా
చిలుకను వాదుకున్ గవిత చెప్పఁగఁ దా నియమించి"

యనుపింగళిసూరనార్యుని ప్రభావతీప్రద్యుమ్నములోని 'వాదు' వలన విశేషము గాఁగలదు. శరాసనంబులకుఁ బట్టుట యెట్లుచితమో యట్లునే 'వైఖరికి' 'వాదు' సమంజసమగును. కావునఁ గవి'వైఖరి' యర్థము నేమఱి యుండలే దనవలెను.

పైఁజూపినసూరనార్యుని ప్రయోగ మెట్టయెదుట నుండ 'వాదుకున్' అనుదానిని జనున్యప్రయోగమనుట యెంతయుచితమో పండితులు తెలియంగఁగలరు. ఈపద్యమునందింకనుగల కొన్ని స్వారస్యములను గ్రంథవిస్తరభీతిచే నిట విడిచినాఁడనని మనవి యొనరించుచున్నాను.

---

# ప్రభాకరోదయము

కోరిమిల్లి వీరసోమసత్యనారాయణ గారు

తామరసాప్తబాలకునిఁ దాల్పఁగ గర్భమునందుఁ బ్రాగ్దిశా
కోమలి నీలసంతమసకుంతలముల్ సడలన్ దొడంగె వే
వ్యోమమును వెల్లనయ్యె నిఁక ప్రొద్దులు రాఁగఁ బ్రవాళవిస్ఫుర
ద్ధామము సొచ్చె నంతఁ గ్రమతన్ దలసూపెఁ గుమారభానుఁడున్.

మన తొలిదిక్కు-నెచ్చెలి కుమారరశ్మిఁ గనెనంచు నన్యది
గ్వనితలు మోముదమ్ముల వికాసము లీన, శకుంతనాదసు
స్వనముల నెల్లరం బిలువ బంధురగంధపరాగవారముం
గొనుకొని తెచ్చె మందపవనుండు తదుత్సవవేళయందునన్.

మిన్నులమానికంబు, సిరిమేడల కేలిక, లోకమంతకుం
బన్నెలు వెట్టు కాంతి గలవాఁడు, దినేశుఁడు చక్రవాలనా
భ్యున్నతశాలి, కెంపుజిగిఁ బోలు కరంబులు సాఁచి లీలతోఁ
గన్నుల విందుసేయుచును, గ్రాలెను బ్రాక్సతినోముపంటయై.

విమలనదీతరంగములపైఁ బ్రసరించి కుంకుమపూనీటి కొమరు సూపి
లలితపాండురపుష్పములపైని బ్రసరించి గన్నేరుపూచాయ కడలుకొల్పి
రమణీమణీకపోలములపైఁ బ్రసరించి గోజ్జంగిపూవన్నె కుదురుపఱిచి
ధవళతుషారబిందువులపైఁ బ్రసరించి పవడంపుకాంతుల వరలఁజేసి
లేఁతచిగురాకులకును జేయూఁత లిచ్చి - తళుకుకెందామరలకుఁ గైదండ లొసఁగి
గిరుల జేగురుతటులతో సరసమాడి - చెలఁగె నరుణాతపంబులు కలియఁ బాఱి.

ఆదినరాజు నిస్తులనవారుణదీపితపట్టభద్రమ
ర్యాదల నొప్పభవ్యతరు లాతనిపాదసమర్పణంబుగా
నాదట నిచ్చెఁ బర్ణపిది తాంజలిగుప్తతుషారబిందులం
మేదురమౌక్తికంబుల నమేయలసత్సుమనోవికాసతన్.

శ్రీసముదీర్ణతేజమునఁ జెల్వగ నయ్యుదయాద్రిభద్రసిం
హాసనవర్తియై పిదప నంబరవీధిఁ బ్రశస్తపాదవి
న్యాసముసేసి సర్వభువనాప్తత నేకొని పద్మినీమనో (?)
ల్లాసవిహారి యాచును జెలంగె బ్రభాకరుఁ డంతకంతకున్.

తతహృన్నిధానసద్యఃప్రాప్తభావనాప్రకటసువర్ణాళి పదిలపఱిచి
ఉదితప్రభాతవాయుప్రేరితారుణ పటుదీప్తివహ్నిలో పుటము వెట్టి
తటినీజలాశయ స్ఫటికాంబువుల నార్చి మిసిమిపుప్పొడిచేత మెఱుఁగు గూర్చి
సుమకాయమానరంధ్రములఁ దీఁగలు తీసి కమలాప్తకరసాధనములఁ దోమి
పద్మరాగప్రవాళసంపదలఁ జేర్చి - సలలితాలంకృతుల నాత్మశక్తికొలఁది
భారతికిఁ గూర్చెదరు కవిస్వర్ణకారు - లెలమిఁ గూర్పవె భారతి కెట్టులైన?

---

# కతియవారు ట్రేడింగుకంపెనీ యొక్క—

## సర్వజనాదరణీయమైన తలనూనెలు అందు వివిధపరిమళములుగల అత్తరులు

## కుసుమాల్ హెయిరాయిల్ (రిజిస్టర్డు)

శిరోజములకు, మెదడుకు, తగినటువంటి తలనూనె. సువాసనద్రవ్యములతోను, హీనాపుష్పములతో చేయబడి, సాటిలేనిదై తవరుచున్నది. సంపన్నులు మెచ్చినది. సీసా 1-కి రు. 1. వి. పి. చార్జి 6 అణాలు ప్రత్యేకము.



## కెటి వైట్‌రోజ్ హెయిరాయిల్ నెం. 777 రు (రిజిస్టర్డు)

వెంట్రుకలవృద్ధికిని, కాంతికిని తోడ్పడునట్టి తలనూనె. గులాబీపువ్వుల నిజసౌరభ మిందు గలదు. ఒకసారి పరీక్షించిన మీకే తెలియగలదు.

వెల సీసా 1-కి 14 అణాలు. వి. పి. చార్జీ 6 అణాలు.

## కెటి కోకోనట్ హెయిరాయిల్ నెం. 777 రు (రిజిస్టర్డు)

టెంకాయనూనె తల కుపయోగించునని ప్రతివానికిని తెలియును. కాని ఎట్లు సిద్ధము చేసినచో నది ప్రశస్తమో తెలియదు. ఈ నెం. 777 రులో (రిజిస్టర్డు) చేసిన ఈ టెంకాయ నూనె శుద్ధిచేయబడి దుర్వాసనారహితముగాను సూక్ష్మసువాసనాసంకలితముగాను గావింపబడి నది. అందుచే సామాన్యగృహస్థు లందరి మెప్పు నొందినది.

6 ఔన్సులు గల సీసా 1-కి 14 అణాలు. వి. పి. చార్జీలు 10 అణాలు ప్రత్యేకము.

మరియు జ్ఞప్తియం దుంచుకొనుడు:



## కెటి ఒట్టో రోజ్ నెం. 777 రు (రిజిస్టర్డు)

దీనికి సరిసమాన మగు నూనె లేదు. రోజాపుష్పములచే చేయబడినది. పుష్ప వనమునం దున్న తాజా గులాబీపుష్పము లెంతటి పరిమళము నొసగునో యంతటి సౌరభము నిందు బడయగలరు.

అరఔన్సు బుడ్డి 1-కి రు. 1-12-0, పావు ఔన్సు బుడ్డి 1-కి రు. 1-0-0.

## కెటి ఒట్టో జాసిన్ నెం. 777 రు (రిజిస్టర్డు)

మల్లెపుష్పములను తెలియనివా రుండరు. కెటి ఒట్టో జాస్మిన్ (నెం. 777 రు) మల్లెపువ్వులులేని కాలము లందుకూడ మల్లెపూలవాసన నిచ్చుచు ఆశ్చర్యమును ఆనందమును కలిగించును. ఈ పరిమళము నొక్కసారి యాఘ్రాణించిన, అదిలేక మీ రొక్కఘడియ యుండజాలరు.

అరఔన్సు బుడ్డి రు. 1-12-0, పావుఔన్సు బుడ్డి రు. 1-0-0.

## ఒట్టో మధుకర్ (రిజిస్టర్డు):—

ఒకసారి యీ అత్తరు నుపయోగించినవారు, సర్వదా దీనిని విడనాడలేకున్నారు. మేలైన పుష్పసౌరభమే యిందులకు కారణము. అరఔన్సు బుడ్డి 1-కి రు. 1-12-0. పావుఔన్సు బుడ్డి 1-కి రు. 1-0-0.

వి. పి. చార్జీలు 5 అణాలు ప్రత్యేకము. (ఒక్కొక్కదానికి)

ష రా:—మీ గ్రామములందున్న దుకాణములలో కొనునప్పుడు కెటి మరియు నెం. 777 రు గురుతు లను గమనించుడు. అట్లుచేసిననే శుద్ధమైనవి మీకు దొరకగలవు.

పరీక్షార్థమై రెండు అణాస్టాంపుల నంపి యే రెండు తలనూనెల నమూనాలుగాని, లేక అత్తరునమూనా యొకటిగాని తెప్పించుకొనుడు.

సోల్ ఏజంట్లు:—**ది కతియవారు ట్రేడింగు కంపెనీ,**

ఖెట్వాడి మెయిన్‌రోడ్, బొంబాయినెం. 4,







OTTO DILBAHAR.





# ఓబయ్య

వేలూరి శివరామశాస్త్రిగారు, శతావధాని

౧

మనుగుడుపునకు వెళ్లిన మఱునాఁడే అహోబలుని సంగతి బజారునఁ బడెను. లేఁత లేఁత పెండలపుటాకులు చుట్టి యీయఁగా నతఁడు తమలపుటాకులచిలుకలే యనుకొని నమలి మ్రింగెను. నాలుక పండుటయు పండకుండుటయు నతఁడు గమనింపలేదు. నోరు పుక్కిలించి యుమియను లేదు. అతని కించుకయు సందియము లేదు. సందియములు కలిగించుటకుఁగాని, పోఁగొట్టుటకుఁగాని అతని వెనువెంట తోడిపెండ్లికొడు కెవఁడును రాలేదు. కావున నతఁడు గుర్రుకొట్టి నిదిరించెను.

మఱునాఁ డతఁడు గ్రామమునందలి పెద్దలను దర్శింపఁబోయెను.

బస్తీలో నేయింటి కాయింటి కొకొక్క పల్లె. పల్లెయంతయు నొకకుటుంబము. కావున ఆపల్లెలో నతఁడు బంధువులయిండ్లను, దూరబంధువులయిండ్లను, బంధువులుకానివారియిండ్లనుగూడ క్రొత్తపెండ్లికొడుకు గౌరవమును చూఱఁగొనెను.

అహోబలుఁ డొక అవధానులవారి యింటికి వెళ్లెను. అవధానులవారు భువనేశ్వరీనిముందు కూరుచుండి, ముఖవస్త్రము వేసికొని జపము చేసికొనుచుండిరి. అవధానులవారి కూఁతురు మంగమ్మ, 'మాది చేదస్తపు ఇల్లు, ఇచట కుర్చీలా బెంచీలా? మఱదిగారీపీఁటపయి జాగ్రత్తగాఁ గూరుచుండవలయు' నని ఒక ఓటిపీఁట వయిచెను. అతఁడు ఆపీఁట మీఁదఁ గూరుచుండి అచటఁ గల వస్తువుల నన్నిటిని పరిశీలించుచుండెను. తీఁగలు ప్రాఁకినటు లున్న ముగ్గులును, ముగ్గుమీఁదనున్న పూలపళ్లెరమును, తోమి యుంచిన దేవవిగ్రహములును అతని నొక పవిత్రమగు భావనలోనికిఁ గొంపోయెను.

జర్మనీవారు అథర్వణవేదములోని మంత్రములను జదివికొని జెప్‌లినులను, బెలూనులను, బాంబులను, మరఫిరంగులను తయారు చేసిరని అతఁడు వేదము వల్లెవేసినవారివలన వినియుండెను. అతఁ డావినుకలి నిపుడు కనుకలి చేసికొనుచుండెను.

అతఁ డిటులు పయిమెట్టులో నాలోచించుచు తల పయికెత్తెను. ఎత్తు దూలములపై అడ్డ గడలు, వానిమీఁద మడిబట్టలు! 'ఇవి యింత యెత్తున కెటులు పోయినవి?' అని అతఁ డాశ్చర్యముగా చూడఁదొడఁగెను.

ఇంతలో అవధానులవారు ముఖవస్త్రము తీసి ఆకాశమువంక అదేపనిగా చూచుచున్న క్రొత్తపెండ్లికొడుకును జూచిరి. అవధానులవారు సంతోషప్రియులు. వా రతని వాలక

మును కనిపట్టి కొంచెము దగ్గిరి. వారి దగ్గు సకిలింపునకు సహాధ్యాయి.

అహోబలుఁ డింతవఱకును ఆకాశవిహార మొనరించుచుండెను. హఠాత్తుగా అవధానుల వారి సకిలింపు!

ఈసకిలింపుతో నతఁడు కనులను క్రిందికి దింపునరికి పీఁట కర్ణుని రథమువలె ఒఱుగఁ బడెను. అతఁడు క్రిందఁ బడెను. పీఁటక్రింది కోడు దూరముగాఁ బడెను.

అవధానులవారు వడివడిగా దాపునకుఁ బోయి తలమీఁద చిటుకలు వేయుచు, వేలా డించుచు 'లే నాయనా లే' అను మాటలనే ఊఁత యిచ్చిరి.

అహోబలుఁడు వడివడిగా లేచి కోడు సర్దుకొని కూరుచుండెను.

'వచ్చి యెంత సేపయినది?'

అహోబలుఁ డామాటకు సమాధాన మిడక 'మామగారూ, ఈమడిబట్టలంతయెత్తున నెటు లమరినవి? ఎంత సేపటినుండియో యా లోచించుచుంటినిగాని అంతసులువుగా తేల లేదు. నిచ్చెన వేసికొని వేయవచ్చునుగాని—' అవధానులవా రహోబలునిమాట సమాప్తి చేయనీయక—'రోజును అది యొక పనియా? నిచ్చెన లేక—'

'లేక వే ఉపాయము?'

'అది చెప్పఁ దగినది కాదు. చూపఁ దగినది.'

'దయయుంచి నాకుఁ జూపుదురా?'

'సమయమునకు వత్తువేని నాకు పక్షపాత మిసుమంతయు లేదు.'

అహోబలుఁడు నాఁటికి సెలవు గొనెను. అతఁ డీయాశ్చర్యమును జూచుటలో నిత్తరు లకు పాలీయఁ దలఁపలేదు. పోడవుగా నెదిగి పోవుచున్న యొక మహాపురుషుఁడు రేయుం బవ లతని కనులముందు గోచరించుచు ఒడలు జలదరింపఁజేయుచుండెను. అతఁడు తెలవాఱుజామున నే లేచి స్నాన మొనరిం చెను. వార్చెను; రెండుమూఁడుమాఱు లవ ధానులవారి యిల్లు చూచిపోయెను.

అవధానులవారు చక్కఁగా బట్టల నుతికి కొని తెచ్చి పీఁటమీఁద నిడికొనిరి. అహో బలుఁడు వచ్చి భయభక్తులతో నెదుట నిలువఁ బడెను.

'నీవు తలుపు మూసి మెల్లలోనుం డుము. నేను 'ఊ' అనినపుడు తలు పోరగాఁ దీయుము. నిండారఁ దీయరాదు. తెలిసెనా? ఓరగాఁ దీసి చూడుము.'

'బారలుగాఁ దీసినచో భయపడుదునా?'

'ఆసంగతి నీకే తెలియవలయును. కాని ఓరగాఁ దీసి చూడుము.'

అహోబలుఁడు లోలోపల భయపడెను. 'చిత్తము' అని తలుపుమూసి, మెల్లలోనికి వెళ్లి, తలుపు నానుకొని నిలువఁబడియుండెను.

అవధానులవారు పడమటిదెస తలుపులు సగము మూసిరి. చీఁకటియు వెలుతురును ఇరుచేతులతో నొండొండ కౌఁగిలించుకొనెను.

అవధానులవారు ఒక బట్టతీసికొని, పాతిక పాలు ముద్దగాఁజుట్టి, దాని నొకసన్నని గడ చివరఁబెట్టి పయినున్న గడలలో నొకగడమీఁద నీముద్దను బడవయిచిరి. పిదప నేలవఱకును వ్రేలాడుచున్న వస్త్రమును వెడలుపుగాఁ జేసి తమకు అడ్డముగా నుంచుకొని గడను ఆకాశవీధి కెత్తిపట్టి నిటారుగా నిలువఁబడి 'ఊఁ' యని సంకేతించిరి.

గడగడలాడుచున్న గుండెలను బిగియఁ బట్టికొని అహోబలుఁడు తలు పోరగాఁ దీసెను. బట్టచాటున ధూమలమయిన వెలుఁగులో మసకమసకగా నొకయెత్తయిన పదార్థ మతనికి గోచరించెను. నిన్నటినుండియుఁ దన కనుల వ్రేలుచున్న దీర్ఘపురుషు నిపుడు సాక్షాత్కరింపఁ జేసికొనెను. అతఁడు కెవ్వన కేకవెట్టి మెల్లలో వెనుకవెనుకకు వ్రాలెను.

అవధానులవారు వస్త్రముల నన్నిటిని ఆఱవయిచుకొని మెల్లగా మెల్లలోని కేతెంచిరి. క్రమక్రమముగా కోలుకొనుచున్న అహోబలుఁడు కనులు మూసియు తెఱచియుఁ జూడఁదొడఁగెను. అవధానులవారు లోనికి మరలి పడమటితలుపు చక్కఁగాఁ దెఱచి నిండువెలుఁగులో పొట్టిగాఁ గనఁబడిరి. అహోబలుఁడు నక్కినక్కి చూచి మెల్లగా తేచెను.

'నాయనా! 'తలుపు నిండారఁ దీసినచో భయపడుదునా' యని యంటివే? ఇంటికి వచ్చిన క్రొత్తయల్లుని భయపెట్టితినే! పాపము! ఎంతపని యెంతపని! ఎక్కడను జెప్పకుము.'

ఈబుజ్జగ మహోబలుని బులిపించెను. భయపెట్టి పశ్చాత్తాపము గొనువానికడ లంచముగొనుట కధికారము కలదుగదా!

'అయ్యా! అవధానులవారూ! నాకొక మంచి తేలుమంత్రము—'

'నాయనా! ఆ, మంచిది. ఊరక భయపడితివి. ఈమంత్రమునయినను జెప్పి,—పాపము—నిన్నుఁ బంపుదును. నీవి మడిబట్ట లేనా?'

'శుద్ధ-మడి.'

'అగుచో లోనికి రమ్ము.'

అహోబలుఁడు గడపలో కాలు పెట్టుటకుఁ గొంచెము జంకెను.

'ఇంకను భయమా?'

'లేదు లేదు.'

'ఆపీఁటమీఁదఁ గూరుచుండుము.'

అహోబలుఁడు పీఁటకోడు చేతితో తడుముకొని కూరుచుండెను.

'నిన్న కుంటిపీఁట యనుకొని నేఁడును కుంటిపీఁట యనుకొంటివా?' అని అవధానులవా రతని కెదురుగా మఱియొక పీఁట వయిచుకొని కూరుచుండి భయపడవలదని హెచ్చ

రించి యుత్తరీయ మతనిపయి ముసుగు వయిచిరి.

అహోబలుఁడు కొంచెము గోడ కొఱగఁ జొచ్చెను. అవధానులవారు పట్టుకొని 'ఇదిగో నేను పుట్టినవాఁడనే' అని దాపునకుఁ దీసికొని ముసుఁగునదూజి నొసట విభూతి రాచి చెవికడ నోరుంచి—'హే వృశ్చికరాజ! మమ అక్షఃప్రదేశే దశ దశ' అనుమంత్రమును జెప్పి నూటుమాఱులు చెప్పించి ముసుఁగుదీసి 'నీ వింకఁ బోయి ఇంటిపంచలో ఏకాంతముగాఁ గూరుచుండి బిగ్గఱగా లక్ష జపముచేసి పిదప లెమ్మ'ని యాదేశించిరి.

అహోబలుఁ డత్తింటి కేఁగి వంటయింటి పంచలోఁ గూరుచుండి బిగ్గఱగా జపింపఁ దొడఁగెను.

౨

పెండ్లికూఁతురు వసుమతియు,తండ్రికైలాసరావును, శిష్యుఁడు వాసుదేవరావును ప్రార్థనలను ముగించి గీతాపారాయణ మొనరించి చావడిలోనికి వచ్చిరి. కైలాసరావు కూర్చుండి 'వాసూ! అల్లుని పిలు! వసూ! మీయమ్మను భార్లీనీళ్లు తెమ్మను' అనెను. వా రిరువురును వారివారి పనులకు వెళ్లిరి.

కైలాసరావు భార్య సోమమ్మయు, అవధానులవారి కూఁతురు మంగమ్మయు వంటింట మాటలాడుచుఁ గూరుచుండిరి. వసుమతి లోనికి రాఁగానే వారి సంభాషణ మాఁగిపోయెను. సోమమ్మ మంగమ్మను బంపివయిచి కూఁతును బార్లీ తయారొనరించుటకు నియోగించి తాను మెల్లగా చావడిలోనికి వచ్చెను.

'అల్లుఁ డేఁడీ?'

'ఈకాలమున పెండ్లికూఁతుండ్ర సిగ్గు పెండ్లికొడుకులకు బదలాయింపఁబడినది. ఆయన వంటయింటిపంచలో మకాము. మీరు మీ కూఁతున కేమి పాఠములు చెప్పుదురో కాని నేనూరిలో తలయెత్తుకొనలే కున్నాను. దానికి రవంత సిగ్గు నేర్పుఁడు. ఆఁడుదానికి సిగ్గే లేనిచో కొజ్జా.'

ఈమాటలు కొన్ని సత్యములే కాని సోమమ్మ తన యల్లునిమీఁది కోపము నంతయు కూఁతుమీఁదికి త్రిప్పెను. ఈమాటలకు కైలాసరావు మాటలాడలేదు. సోమమ్మ కొంచె మాఁగి యాలోచించి మెల్లగా నిటు లనెను—'వెదకి వెదకి వేయిరూపాయలు వచ్చునని మంచి యల్లుని దెచ్చినారు! అప్పుడే ఊరిలో నందఱును నామకరణము చేసినారు-ఓ—బ—య్య. ఛీఛీ! కలిపి యుచ్చరింపఁ జాలను.' అని యిటులు చెప్పుచుండఁగా నామె కనులలో నీ రుబికెను.

కైలాసరావు తెల్లఁబోయి చూచుచుఁ గూరుచుండెను. సోమమ్మ యిటు లనెను— 'మీ రెన్నఁడును మాటకు మాట చెప్పరు. నాకు నడుమనడుమ కసి వచ్చును. వేయి మాట లెందులకు? పిల్లదాని గొంతుక కోసి వేసితిరి. నలుగురిలో నాకు తలవంపులు తెచ్చితిరి. మీరు హెడ్మాస్టరుతరువాత

హెడ్‌మాస్ట రంతవారాయె. నూటముప్పది జీతమాయె. బాలురసంగతులు మీకు తెలి యనివికావాయె. కట్నమనిన మీకు తప్పాయె. తెచ్చితి రొక రాతిని. కట్టుకొనుఁడు కంఠము నకు—' అని యిటులు పలుకుచుండఁగా సోమమ్మ కంఠము గద్గదమయి బిగిసికొని పోయెను.

కైలాసరా విటు లనెను—'కన్యావర యతే రూపమ్' అని అమ్మాయికి కుఱ్ఱని జూపితిని. అది సంతసించినటులు కానిపించెను. 'మాతా విత్తమ్' అన్నటులు వేయిరూపా యలు వచ్చునని నీ వేనుఁగును ఎక్కితివి. పెండ్లి జరిగి పట్టుమని పదినాళ్లు కాలేదు. అప్పుడే గోఁజిలుటయా?

సోమమ్మ యిటు లనెను—' పదునాలు గేండ్లపిల్లకు దాని కేమి తెలియును? చదువు రాని సోమమ్మకు నా కేమి తెలియును? తెలివి గలవాఁడని మీరు సంతసించితిరి. అతఁడు వట్టి తెలివితక్కువవాఁడు. ఎందులకును పనికి రానివాఁడు.'

'మనకు తెలియకకాని సృష్టిలో పనికి రాని దేది? మనుష్యుఁడు సృష్టిలో ఒరవడి. దానిలో కుఱ్ఱఁడు మేలుబంతి. అట్టివానినా పనికిమాలినవాఁ డనుచున్నావు?'

ఈమాటలకు సమాధానము చెప్పినను లాభము లేదని కడుపు పగిలి సోమమ్మ చూ చుచు నిలువఁబడిపోయెను. వాసుదేవరావు చావడిలోనికి వచ్చెను. కైలాసరా వేమో యాలకించుచు 'అది తుమ్మెద మ్రోఁతయా యేమి'? అనెను. వాసుదేవరా విటు లనె ను—'కాదు. అల్లుఁడుగారి కెవరో ఇంపోజిషను నిచ్చినటు లున్నారు. ఆయన నామాట వినఁ దలఁచుకొనలేదు.'

కైలాసరా వాలోచించి 'అది కిండర్ గార్టన్ పద్ధతిగాని, మాంటిసోరీ పద్ధతిగాని కాదు. ఫక్తు ప్రాచీన ఆర్యవిద్యాపద్ధతి' అనెను.

నగవును కోపమును ఆఁపుకొనలేక సోమమ్మ 'నానెత్తిపద్ధతి' అని యేమేమో చెప్పఁబోవుచుండఁగా కైలాసరావు 'వాసూ! నీవు పోయి అతనిని కలవరపెట్టక ఆయింపోజిష నును తెలిసికొనిరమ్ము' అని చెప్పఁగా నవ్వుచు వాసుదేవరావు మరల లోనికి వెళ్లెను.

సోమమ్మ యిటు లనెను—'కలవరపెట్టు టయే! రాయయిన కలవరపడునుగాని మీ యల్లుఁ గుఱ్ఱఁడే?'

'సరికాని అతని తెలివితేటలలో లోటేమి కొంచెము చెప్పు!'

'చెప్పవలెనా? అమ్మాయిని అతనిని కూరు చుండఁబెట్టి పరీక్షచేయుఁడు!'

'అది యెటులు? అమ్మాయి మూఁడవ ఫారమాయె; అతఁడు అయిదవ ఫారమాయె. అదియుఁగాక పరీక్షవలన నేమి తేలును? తెలి వికలవా రెందఱెందఱు పరీక్షలు తప్పరో తెలియునా?'

'ఔను. ఎ-మ్మే ప్యాసయిన తరువాత యల్-టి ముమ్మాఱు మీరు తప్పితిరి.

మీారేమి తెలివిమాలినవారా? మీావంటి పంతుళ్లకు మీాయల్లునివంటి బాలుప మేధావులు! సరికాని, ప్యాసగుచో ఫైల్క్లాసులో వేయుచున్నారా, తప్పుచో వేయుచున్నారా?'

'ఆమాట వేఱు.'

'ఈపరీక్షలగోల యేల? అతనికి లోకజ్ఞానమే లేదు.'

'అదియా? నాకు బాలుర యనుభవ మెంత కలదో నీకు తెలిసినదేకదా! లోకజ్ఞానము తక్కువగా నున్నవారికి తెలివిహెచ్చు.'

'ఎందుల కీవాదన? మీాయల్లుఁడు బృహస్పతి!'

వంటయింట నున్న వసుమతి యీామాటల నాలకించుచునే యుండెను. పెండ్లియొప్పు దలలో తనపాలుగూడ కల దనుమాట వసుమతికి లెస్సగా నాటెను. వసుమతి బార్లీ కెటిలుపట్టుకొని చావడిలోనికి వచ్చెను. వెనువెనుకనే వాసుదేవరావు వచ్చెను. అతఁడు నవ్వుచు 'ఆయింపోజిషనుకు అంతుపొంతులు లేవు'అనెను.

అల్లుని తెలివి తక్కువతనము వసుమతి ముందు ప్రచురమగుట కిష్టపడక సోమమ్మ 'వసూ! నేను వచ్చి పాలు కలిపి అందిత్తును గాని నీవు పోయి ఆకెటిలు లోపలనుంచి పాలు పొంగి పోకుండఁ జూచుచుండుము' అనెను.

కైలాసరావునకు భార్యయుద్దేశము తెలిసెను. అతఁడు తొందరతొందరగా నిటు లనెను—'సిన్ ఆఫ్ సీక్రెసీ! రహస్యము పాతకము. పిల్లల కిప్పటినుండియు దాఁపరికము నేర్పుచున్నావు. వసూ! నీవిచటనే యుండుము! వాసూ! ఆయింపోజిషు నేదో చెప్పు!'

సిగ్గుచే, కోపముచే, క్షోభముచే సోమమ్మ తుకతుకలాడిపోయెను. వసుమతిముఖము కొంచె మెఱ్ఱఁబాఱుటచూచి యోర్వఁజాలక 'వసూ! నీవు లోనికిరా' అని శాసించి కూఁతురు తనవెంట వచ్చుటయు, రాకుండుటయు గమనింపకయే రివ్వున లోనికి వెళ్లెను. వాత్సల్యముగుఱియు తండ్రిచూపుల వాగురలో వసుమతి నిలువఁబడిపోయెను.

'వాసుదేవా! ఏ దాయింపోజిషన్?'

'హే వృశ్చికరాజ! మమ అధఃప్రదేశే దశ దశ!'

'ఏమిా? హేవృశ్చికరాజ? అనఁగా తేలురాజా అనికదా! పైని జెప్పు.'

'మమ అధః ప్రదేశే.'

'అనఁగా?'

'నాక్రింది ప్రదేశమునందు.'

'లిటరల్ ట్రాన్సులేషనా?నాముడ్డిమీాఁద అనిచెప్పు.'

వసుమతి పెదవులమీాఁద నొకహాస్యరేఖ యుదయించెను.

కైలాసరా విటు లనెను. 'మంచిది. ఓ తేలురాజుగారూ, నాముడ్డిమీాఁద ఊఁ, పైని?'

'దశదశ.'

'ఇదేమిపట్టము! దశయనఁగా పది. నాముడ్డి మీఁద పది యేమిటి? అర్థసందర్భము లేదు. వాసూ! ఇది యేదో మహామంత్రము.'

'కాదండీ సార్. క్రియలేక వాక్యముండ దుగదా! దశయనున దేదో క్రియ.'

కైలాసరావు తల యూఁపి 'ఆ! దంశ ధాతువయియుండును. ఆ. తెలిసినది. కుట్టు మని యర్థము. ఇపు డంతయు కలుపు'అనెను.

'ఓ తేలు రాజుగారు నా ముడ్డి మీఁద కుట్టుఁడు!'

వసుమతిముఖము సీరా యాయెను. కైలాసరావది గ్రహించి 'వాసూ! నమ్మిక వంటి దిను నీప్రపంచకమున వేఱొకటి లేదు. 'మరామరా' రామరామ యాయెనా లేదా? సరి, మీ రెవరును అహోబలుని కదలింప కుఁడు. జపమయినపిదపనే అతఁడు వచ్చుఁ గాక. వసూ! మీయమ్మను—ఆమె యెందు లకులే! నీవే బార్లీ పట్టుకొని రా' అనెను.

గంభీరమగు ముఖముతో మందమగు గమనముతో వసుమతి లోని కేఁగెను. కూఁతు మొగమును, పిదప నడకను జూచు తండ్రిముఖ మున నగ వంకురించెను. అది దుఃఖమునకే వ్యంజకమో, సుఖమునకే వాచ్యమో యెవరు చెప్పఁగలరు?

## 3

మనుగుడు పాయెను. అహోబలుఁ డింటికి వచ్చి యిరువది రోజులాయెను. నేఁడో రేపో పరీక్షాఫలితములు వచ్చునని తెలిసెను. అతఁడు వెంటనే పంతులుకడకు వెళ్లెను. తిరిగి వచ్చిన నాఁ డన్నము తినక ముసుఁగు పెట్టుకొని పడు కొనెను.

మనుగుడుపయి వచ్చినతరువాత సతఁడు కాఫీ మొదలుపెట్టెను. అహోబలునితల్లి వీర వెంకమ్మ పెత్తనమునకు వెళ్లి యిరుగుపొరు గమ్మలతో 'మాఅబ్బాయికి కాఫీవేళ దాఁటి పోవుచున్నదమ్మా; ప్రొద్దుగ్రుంకునపుడు మరల వచ్చెద'నని వినయమును విన్నవింప మొద లిడెను.

అహోబలుఁ డీనాఁడు తల్లికి తీరికను పనినిగూడ నిచ్చి పడుకొనెను. తనవినయ మును విన్నవించుకొనుట కీనాఁ డవకాశము లేదుకాని 'మావాఁ డీనాఁడు కాఫీ తాగలే దమ్మా!' అనిమాత్ర మొక రిద్దఱతో చెప్పు కొనెను.

పదిగంట లాయెను.

'ఏమిరా నాయనా! ప్రొద్దున కాఫీ త్రాగవయితివి! ఎంతపొద్దెక్కెనో చూచి తివా? లేచి రెండు మెతుకులు గతికి పడుకో'.

అహోబలుఁడు మాటాడలేదు.

'ఎంత పొద్దెక్కి—పోయిం దెంత పొద్దెక్కి— పోయిం. దమ్మమ్మగారూ! న న్నింటికి పం -య్యండి' అని దాసి తొందరపెట్టెను.

'ఇదిగో—అబ్బాయి—ఈపొద్దు కాఫీ తాగ లేదు. ఇంతవఱకు లేవనేలేదు. ఏకముగా గిన్నెలన్నియు మధ్యాహ్నము వేయుదును లే. పోయి తొందరగా పాత్రము రా.'

'ఇంత సేపు ఉట్టినే కూచోఁబెట్టా రెందు కండీ? తలనొప్పికూడా తగిలింది. ఈసంగతి ఇందాఁకే చెపితే యీపాటికి కూలికో నాలికో పోయివ్రుందును. ఆరింట్లో పని చేసుకున్నప్పుడే బావుండేది.'

'అదిగో నీ కదేరోగము. ఆరింట్లో అం ఘావు. ఆరింట్లోకన్న జీతం ఎక్కువ తీసు కుంటూ ఇదేమి మాటంట? అలికిజాతి మొహం మండ!'

"ఏంటండీ? 'ఇథంసెడి యీడిగాణ్ణి సేస్కుంటే సచ్చిందాఁకా సాఁపలు మోయిం చా'డని మీరిచ్చే జీతానికి సతపొద్దూ పడి గాపులాయె."

'సరేగాని మాచీ! ఈవేళ ఆట్టే మాటా డకు. అబ్బాయి కాఫీ తాగలేదని చెప్పలా? నీవే, తొందరగా పోయి రా!'

అహోబలుఁడు కాఫీ ఆరంభించినపిదప తనశక్తిచేనయిన నేమి, వీరవెంకమ్మ యుదా రతచే నేమి మాచికిఁగూడ కాఫీలో వాటా దొరకుచుండెను. నేఁడు పస్తు. దాన తలనొప్పి. కాఁబట్టి మాచి తన యుపవాసకోపమును తగు మాత్ర మమ్మమ్మగారిమీఁదఁ జూపి వెళ్లి పోయెను. పదొకండు గంటలాయెను.

'ఏమిరా నాయనా! రెండుజాములు కావచ్చెను.'

అహోబలుఁడు మాటాడలేదు. కాని కాళ్లు తన్నిపట్టి నిద్ర నీల్గి నారిబెత్తికినవింటివలె సాగి 'మరల' లబ్బరుబెట్టువలె ముడుచుకొనెను.

'నాయనా! సుస్తీగా నున్నదా?'

'ఊ.'

'చెప్పకపోతివి! శివల మల్లయ్యను పిలి పించి యీపాటికి ఉండ వేయించియుందునే. నజ్జు చేసినదేమో! మడిగట్టుకొనియుంటిని. ముట్టుకొనుటకు వీలులేదు నాయనను.'

'ఊ.'

'అయ్యయో. ఇందాఁకనే కనుఁగొనక పోతిని! వట్టి తెలివిమాలినదానను. మతిలేని దానను నాయనా! మాచిని మల్లయ్యకొఱకుఁ బంపినదో నీపాటికి వచ్చియుండును.'

అహోబలుఁడు మఱి మాటాడలేదు. వీరవెంకమ్మ వంటయింటితలుపులను దగ్గఱఁ బెట్టి బడివద్దకు వెళ్లెను. బడిపిల్లలూరివా రందఱకును నవుకరులేగదా!

'ఒరే విస్సాయ్! నీవే నీవే, మాణిక్యం లాటివాఁడవు. నీకే మాఅబ్బాయి-మాఅబ్బా యే-కాఫీ తాగేవేళే-కొంచెం కాఫీ యిస్తాఁ గాని-ఇదిగో ఒక్కసారి పరిగెత్తి-ఒక్కపరుగే-ఒక్కపరుగే-మధ్య ఆఁగకేం—శివల మల్ల య్యని, నేను వెంటనే రమ్మన్నానని వెంటఁ బెట్టుకొని తీసుకొని రా.'

విస్సాయికి కాఫీపేరు స్వర్గములోనిది. ఆయూ రంతటిలో వీరవెంకమ్మగారి యింటనే కాఫీయను దినుసు తయారగునని బడిపిల్ల లం దఱకును దెలియును. బడిపిల్లలు వీరవెంకమ్మ యింటిముందునుండి పోవుచు 'మన మేష్టా



చిత్రము ౫

రుకు కాఫీ తెలియదు. అహోబిళం అన్నకే ఎప్పుడూ కావేరా. అహోబిళం అన్నే మనకు మేష్టారయితేనా ?' అని చెప్పకొనుచుందురు.

విస్సాయి పంతులుగారి దెసఁ జూచెను. ఆయనముఖ మిచ్చట లేదు. విస్సాయి రివ్వున మల్లయ్యయింటికిఁ బరువెత్తెను. 'మానాయనే మానాయనే' యనుకొనుచు వీరవెంకమ్మ యింటికి మరలి యొకసారి కుమారుని బిలిచెను. ప్రత్యుత్తరము రాలేదు. అంత నామె గుమ్మముకడకు వచ్చి వైద్యునికొఱ కెదురు చూచుచు నిలువఁబడెను. విస్సాయి రోఁజు కొనుచువచ్చి 'కాఫీ యియ్యి'అనెను.

'మల్లయ్య యేఁడీ ?'

'అడుగో అడుగో' అని వేలితోఁ జూపి 'ఆలస్యమయితే పంతులు తంతాఁడు. నాకు కాఫీ యియ్యి' అని విస్సాయి వంటయింటి కడకు పరువిడెను.

'ఒరేయ్ బడిగుడ్డలు! ఒకజాతివాళ్లని కాదు. ఆఁగు' అని వీరవెంకమ్మ లోపలికేఁగి 'అహోబలమే—పొద్దున్న—కాఫీ తాగ లేదు. మధ్యాన్నం మూఁడుగంటలవేళే తాగుతాఁడు. అప్పుడు రా.' అనెను.

'ఏం ? ఎందుకు తాగలా?'

'ఇవ్వేళే-జబ్బు-జబ్బుచేసింది.'

'కాఫీతాగేవాళ్లకు జబ్బు చేయదుగా. బలం చేస్తుంది. బలం చేస్తే నేను బడిపెద్దను కొటతానుగా !'

'కాదు నాయనా కాదు. కాఫీ దొరలు తాగుతారు. మధ్యాన్నం రా. పొద్దున్న మాచికిఁగూడా ఇయ్యలా.'

'మాచిగూడా తాగుతున్నదీ ?'

'ఆ.'

విస్సాయి కొంచె మాలోచించి 'నేను మీకాపీగిన్నెలు తోలుస్తాగాని దాన్ని మాని పించి రోజూ నాకు కాఫీ పోస్తావ్రా ?' అనెను. వీరవెంకమ్మ నవ్వెను. 'ఏం ఏం ? పొయ్యాలి పొయ్యాలి' అని విస్సాయి అనుచుండఁగా బడిపెద్ద పంతులుగారి యధికారమును స్వాయముగా మోసికొనివచ్చెను. విస్సాయి తలుపు తెఱచికొని వంటయింటిలోనికి దూఱెను.

'ఒరేఒరే మాలబట్టలు! బయటికి రా, బయటికిరా!' అని వీరవెంకమ్మ యనెను. బడిపెద్ద లోనికి దూఱఁబోయెను. వీరవెంకమ్మ యదలించెను. బడిపెద్ద చూపుడువేలితో బెదరించి వెళ్లిపోవుచుండెను. 'ఒరే రామాయ్ ! విస్సాయిని నేను తీసికోవచ్చానని మీపంతులుతో చెప్పు. మీపంతులు రేపు మాయింట్లోనే వారంలే.' అని వీరవెంకమ్మ యనెను. బడిపెద్ద రుసరుసలాడుచు వెళ్లిపోయెను. ఇంతలో బడిపిల్ల లందఱును పలకలుపుచ్చుకొన్ని యింటికిఁబోవుచుండిరి. విస్సాయి తన పలక పుస్తకముల దెసఁ బోక యాపిల్లలతోఁ గలిసి యింటికిఁబోయెను. ఇంతలో శివలమల్లయ్య వచ్చెను.

'ఏమండీ, పిలిచినారట ?'

'ఔను నాయనా! అబ్బాయి లేవలేదు.'

'గాలిపాటు బాగుగాలేదు. ఎక్కడఁ జూచినను చలిజ్వరములు. కాని అబ్బాయి గారికి మనుగుడుపు బరువుచేసియుండును.'

'రా నాయనా లోపలికి రా!'

మల్లయ్యయు వీరవెంకమ్మయు లోని కేఁగిరి.

'చేయేదీ ?'

'అహోబలుఁడు నిర్రసిల్లెను.'

'ఏఁబలంగారూ, ఏమిటి సుస్తీ ?'

'ఊఁ.'

'మీ దంతయు గొట్టాలవైద్యము. ఏది చేయి ?'

అహోబలుఁడు చేయిచ్చెను. మల్లయ్య చేయిచూచెను. కడుపుమీఁద చేయివేసి చూచెను. అతనికి రోగమేమియో తెలియ లేదు. వేఁడిలేదు. నాడిలో తేడాలేదు. ఊఁ యను మూలుగుగూడ బరువుగా లేదు. ఏమి చెప్పవలయునో వైద్యునకు తోఁచలేదు. వీర వెంకమ్మ 'ఏమి మల్లయ్యా, జబ్బు దాఁగి యున్నటు లున్నదా ?' అనెను.

'ఏఁబలంగారూ! అటులు పడుకొంటి రేమండీ ? ఈపాటికి వసంతకుసుమాకరము, పూర్ణచంద్రోదయము తినుచుండవలసిన రోజులు !'

అహోబలుని కింకను శృంగారరసము తర వాయి. అందులో మందులలోని శృంగార రసముదెస మఱియు మందుఁడు. ఇట్టి యహో బలుఁడు వెంటనే యిటు లనెను—'వసంత కుసుమాకరము, పూర్ణచంద్రోదయము తిని నచో పరీక్ష ప్యాసగుదురా ?'

'అదీ దారి. మంచిది వీరవెంకమ్మగారూ! అబ్బాయికి జబ్బుకాదు. పరీక్షజబ్బు.'

అహోబలుఁడు మాటాడక తలవంచి కూరుచుండెను. మల్లయ్య అహోబలునివంక నొకమాఱును,వీరవెంకమ్మవంక నొకమాఱును జూచి వెళ్లిపోయెను.

పరీక్షలు తప్పినవారు విషమును మ్రింగి మఱి పరీక్ష లీయవలసిన యపాయమును దాఁటుదురని వీరవెంకమ్మ వినియుండెను. ఆమె యాపాదమస్తకము కంపించెను. మెల్లమెల్లగా కొలుకొని 'ఏల నాయనా గుంజాటన ? పరీక్ష తప్పిన నేమి ? చదువుకొనువారు తప్పుదురు గాని యీశివలమల్లయ్యగాని, నేనుగాని తప్పు దుమా ?' అనెను.

'అమ్మా! నే నికఁ జదువను.'

వీరవెంకమ్మ కొంచె మాలోచించెను. ఇటులనెను.:—'మీతండ్రిగారు చదివినారా, మీతాతగారు చదివినారా ? చదువకున్న మగవాని కేమిలోటు ? కాని కోడలు చదు వుల సరస్వతి యఁట గదా! నీకన్న రెండు కళాసులే తక్కువ యఁటగా! అందులకనియే యాలోచించుచున్నాను.'

'అమ్మా! నే నీఁకఁ జదువను.'

'నామాట కొంచెము విను నాయనా! మీపంతులు మనకు చుట్టము; నా మాట దాఁటఁడు. నేను చెప్పి పయికళాసులో పడ వేయింతును.'

అహోబలుఁ డీతూరి మాటాడలేదు.

'నాయనా! ఈయేఁడు జరుగనీ! ఈయేఁడే పెండ్లిఅయినదా; ఈయేఁడే బడిమాను కొన్నచో పెండ్లిచదు వందురు. ఈయేఁడు కోడలిచదువు మానిపింతును. అంతగా నీకు బాగుండనిచో పైయేఁడు మానుకొందువుగాని నేఁడో రేపో పిల్ల కాఁపురమునకు రాఁగలదు. దానితో చిక్కులన్నియు తీఱిపోఁగలవు. లే ఇఁక లే.'

అహోబలుఁడు మొగము చేరెఁడుచేసి కొని 'అమ్మా! నీవు పంతులుగారికడ కెపుడు వెళ్లుదువు?' అనెను.

'రేపు.'

'సారి ఇదా? నాకు అన్నమువలదు.'

'మంచిది సాయంకాలమే వెళ్లెదను. లే! నాయనా! లే!'

## ౪

అల్లున కావాహన విసర్జనము లయిన కొలఁది దినములలోనే యింటిని బంధువుల కప్పగించి కైలాసరావుకుటుంబము కాకినాడఁ జేరెను. వసుమతి పెండ్లిమోజుచే మూఁడవ ఫారము తప్పలేదు. నాలుగవఫారములోఁ జేరెనుగాని యిందుల కొక తంటా వచ్చెను— 'చూచిచూచి యింత యీడువచ్చినపిల్లను బడిలోని కాతల్లి యెటులు పంపుచున్నది? తానిటు లింతయీడు వచ్చినపిదప బడిలోనికి వెళ్లి చదివినదా?' అని వీరవెంకమ్మ కైలాస రావు బందుగుల కొకరికి ఉత్తరము వ్రాయించెను. సోమమ్మ కీవార్త తెలియవలసినరీతిగాఁ దెలిసెను.

సోమమ్మకు తనతప్పిద మిపుడు తెలిసి వచ్చెను. పెండ్లికి ముందు సోమమ్మ స్వయముగా వెళ్లి పెండ్లి కొడుకునకు వేయిరూపాయలు రాఁబడియనియు, వియ్యపురా లమాయకురాలనియు,వియ్యంకుఁడు పదేండ్లక్రిందనే పోయెననియు తెలిసికొని వచ్చెను. వీనిలో నొకవార్తకన్న మఱొకవార్త సోమమ్మ కానందదాయక మాయెను. ఇపు డాయమాయికురాలగు వియ్యపురాలే యింతపని చేసికూర్చుండెను. వీరవెంకమ్మ యిటులు వ్రాయించుట కల్లుఁడు తప్పుటయే ముఖ్యమయిన హేతువయియుండునని సోమమ్మ యనుమానించెను.

కైలాసరావు కంటఁబడఁగనే—'మీయల్లుని పరీక్ష యేమయినదో కనుఁగొంటిరా?' యని సోమమ్మ యడిగెను.

'లేదు.'

'మీ రటు లందురని నాకుఁ దెలియును. ఇఁక నల్లుని నచట నుంచి చదివించినచో లాభము లేదు. కట్టుకొన్నతరువాత మనకుఁ దప్పదు. అల్లునిఁ దెచ్చిపెట్టుకొని యిచటనే చదివింపుఁడు.'

'అది యంత మంచిపనికాదు. అతఁడీచట నున్నచో పరతంత్రుఁ డయిపోవును. బాలుర పెంపునకు స్వాతంత్ర్యమే జీవగఱ్ఱ.'

'మీయుపన్యాసములు లోకులకుఁ గాని మనకుఁ గొఱగావు. మీకుఁ జెప్పె లగ్గు లేదు గాని యిఁక అమ్మాయిచదువునకు విడుదల యొసఁగుఁడు.'

'ఏల?'

'వియ్యపురాలి హుకుము.'

'ఆఁడువారి కేమియుఁ దెలియదు. కాల మిపుడు మాఱుచున్నది, మాఱినది. నే నామెకుఁ జెప్పి యొప్పింతునులే. నీవు గడబిడ పడకుము' అని కైలాసరా వనుచుండఁగా పేదవిద్యార్థు లయిదుగురువచ్చి నమస్కరించిరి. కైలాసరావు ఆశీర్వదించి 'కూర్చుండుఁడు' అనెను. వారు కూర్చుండిరి. వారు ఉత్తరీయములను గప్పుకొనియుండిరి. ఆయుత్తరీయములయు, చొక్కాలయు చిల్లులనుండి పాడువాఱిన చర్మములును, ఎముకలును అచటనచటఁ గానిపించుచుండెను.

'వసూ!'

చదువుకొనుచున్న పుస్తకమున వేలు గుర్తుపెట్టుకొని వసుమతివచ్చి కూర్చున్నవారిని జూచి వెంటనే వెనుదిరిగిపోయి అలమరు తెఱచెను. రాత్రియే తండ్రికి జీతమువచ్చెను. ఇరువదియయిదు రూకలు తెచ్చి యొకొక్కని కయిదేసి యిచ్చెను.

'అమ్మాయీ! క్రొత్తబట్టలమూటలో అయిదుత్తరీయములు తెచ్చి వీరి కిమ్ము.'

వసుమతి లోనికేఁగి తెచ్చి యొకొక్కని కొకొక్కటి యిచ్చెను. సోమమ్మ అదంతయు రెప్పవాల్పక చూచుచుండెను.

విద్యార్థులు మీఁదఁ గప్పుకొని కైలాసరావునకును, సోమమ్మకును నమస్కరించి వెళ్లిపోయిరి.

కైలాసరావునకు వచ్చు జీతమున ఏఁబది రూకలు పోను మిగిలినదెల్లను ధర్మ-ఖర్చు. సోమమ్మ కీవిషయమున ఎన్నఁడును అనంగీకారము లేదు. పైఁగా ఇటులు ధర్మముచేయు భర్తయెడల నామెకు భక్తి కలదు. ఇంతియ కాక మిగిలిన యేఁబదితోడనే యామె సంసారమును చల్లగా సాగించును. ఆమె యేనాఁడును క్రొత్తనగకుఁగాని, క్రొత్తకోకకుఁగాని కోరికగొని యెఱుఁగదు. కూఁతుపెండ్లి యయిన తరువాత జరిగిన మార్పువలన ఈసంసారమునకు రాఁబోవుచున్న చిక్కు ఆమెకు విస్పష్టముగాఁ గానిపించెను. ఆమె తనమనసులోని వేదనను తనమనసులోనే యడఁచుకొని వంటయింటిలోని కేఁగెను.

ఇంతలో వాసుదేవరావు వచ్చి 'పిన్నమ్మగారూ! మీకుఁ గావలసిన బజారుసరుకు లేవియో చెప్పుఁడు!' అనెను.

'నాయనా! కూర్చుండుము, కూర్చుండుము!'

ఈపలుకుబడిలోని కోరికను గనిపట్టి వాసుదేవరావు కూరుచుండెను.

'నాయనా! నీవు రేపే ఊరికి వెళ్లవలయును.'

'బాబయ్యగారు చెప్పలేదే?'

'వారు చెప్పరు, చెప్పరు, చెప్పరు. వారికి వెనుజూపు లేదు. ముందుచూపు మునుపే లేదు. సరి. అల్లుఁడు పరీక్షయిచ్చెనో లేదో నీవు కనుఁగొనిరావలెను.'

'దీనికి ఇంతప్రయత్న మేలండీ? బాబయ్యగా రొకచీటి వ్రాయుచో రేపేపాటికి తిరుగు టపాలో మేష్టరుగారికడనుండి ప్రత్యుత్తరము రాఁగలదు.'

'మీ బాబయ్యగారు వ్రాయరు. అల్లుని పరీక్ష తెలిసికొనుట అనధికారప్రవేశమ్మునం దొకవ్యాసఘట్టము.'

వాసుదేవరావు సమాధానము చెప్పఁబోవుచుండఁగా వసుమతి వచ్చెను. వాసుదేవరావు నోటిలోనిమాట నోటిలోనే యాఁగిపోయెను.

'ధ్యానమునకు వేళ కాలేదా? తీరికగా కూరుచుండి బాతాఖానీ వేయుచున్నావు?' అని వసుమతి యనెను.

కైలాసరావున కేమతమును ఇష్టము లేదు కాని అన్నిమతములును పరమ-ఇష్టములు; భగవంతు నెల్లపుడును ధ్యానించుట తక్క నతనికి మతములలోని సూక్ష్మాంశము లతోఁగాని, వ్యాఖ్యానములతోఁగాని పేచీ లేదు. అతఁ డిదివఱకు సోమమ్మనుగూడ తన ధ్యానపుబడిలోనికి రావింపఁజూచెను గాని శక్యముకాక విడిచిపెట్టెను. అందఱకును అన్నము పెట్టినపిదప తులసికోటముందుగాని ఆమెకు ధ్యానము కుదురదు. అటు లగుటఁజేసి వీరి మువ్వురకే ధ్యానపుబడి. ఈధ్యానపుబడిలో నలువదేండ్ల యీడుగల కైలాసరావు వసుమతితోడను, వాసుదేవరావుతోడను సమానమయిన వయసుకలవాఁ డయిపోయి యానందబాష్పములు రాల్చుచుండును.

'నీవు ముందరవెళ్లు వసుమతీ! వాసు ఇపుడే వచ్చును' అని సోమమ్మ యనెను.

'కలిసియే వెళ్లుదు'మని వసుమతి యనెను.

సోమమ్మకు తల తిరిగినటులాయెను. 'అతనితో నే నొకమాట చెప్పవలసియున్నది. నీవు బయటికిఁ బొమ్ము.' అని సోమమ్మ యనెను.

వసుమతి చిన్నఁబోయి తలవంచుకొని మఱి మాటాడక యటనుండి మెల్లగా వెళ్లిపోయెను.

'ఏమి నాయనా! రేపు నీవు వెళ్లవలెను.'

'బాబయ్యగారి కిది యనధికారప్రవేశమగుచో మనకుఁ గాదాయేమి?'

వాసుదేవరావుకడనుండి యిట్టి ప్రత్యుత్తరము వచ్చుననీ సోమమ్మ తలఁచియుండలేదు. ఆమెయెడ వసుమతి యెంత వినయవతియో వాసుదేవుఁ డంత వినయవంతుఁడు.

ఇట్టి చింతలోఁగూడ ఈపరాయిపిల్లవానిపై కోపపడు దుస్స్వభావ మామె కరిది. ఆమె హృదయమందలి జ్వాల హృదయమందే యడఁగాఱెను. అంతట సోమమ్మ 'నాయనా! మంచిది' అనెను.

వాసుదేవరావుగూడ సోమమ్మకడనుండి యిట్టి ప్రత్యుత్తరము వచ్చునని యనుకొనలేదు. అతఁడు పిడుగుపడునని యెదురు చూచుచుండెను గాని అమృతమును చవిగొనియెను. అతఁ డామెకు నమస్కరించి ధ్యానపుబడిలోనికి వెళ్లిపోయెను. [సశేషము.]

---

## క్రొమ్మావి

అష్టావధాని గోరుగంతు అచ్యుతసూర్యనారాయణ శర్మగారు

గమగమ మించి మించిన నిగారపుఁదావులఁ గ్రేవలందుఁ బెం
పమరఁగఁ జిమ్మి చిమ్మి చెలువారఁగఁ, బారఁగఁ దేనెసోన లం
ద మలరఁ గొమ్మకొమ్మల ముదంబునఁ జిల్కలు వానకోయిలల్
భ్రమరములుం జెలంగి పలుపల్కుల నెన్నవె! నిన్ రసాలమా!
మరునకుఁ బంచప్రాణములమాడ్కి నెసంగును పంచబాణముల్
బరఁగెద వట్టు లయ్యు మరుప్రాణమవో! యనఁ గాముకావళీ
సరససమిద్ధయుద్ధమునఁ జాటున మాటున డెందమందుఁ బ
ల్మరులును గొల్పె దీవ యసమానమ వఁదున మావిపూవురో!
సారసువాసనాంకురలసద్గతి గల్గును గాదె! బంభరీ
వారమనోవినోదకరవైభవమంజుమరందమాధురీ
సారము మీఱుఁ గాదె! యొకచక్కఁదనం బది లేకయున్న "సం
సారికి నంద, మేల" యనుసజ్జనవాక్యము సంస్మరింపుమా!
దేవ్రులె పొందలేరఁట త్వదీయమనోహరసౌరభంబుఁ గ్రొ
మ్మావిరొ! యొక్కమాట వినుమా! సరసస్థితి నింపు మీఱు ని
న్నో వినుతుల్ సెలంగ సుమనోహితబంభరముల్ నుతింపవే!
తావుల నింపవే! సఫలతం గనవే, భవదీయజన్మముల్!

"పూలతోట."

---

# దొరయ్య దురవస్థ

రాయసం వెంకటశివుఁడుగారు, యమ్. ఏ., యల్. టి.

౧

చిన్ననాఁటి చెలికాండ్రను జూచివచ్చుట నాకు మిగుల సంతోషకరము. స్వగ్రామమందలి నా బాల్యస్నేహితులలో దొరయ్య ముఖ్యుఁడు. తన యింటిపేరు స్పష్టముగఁ జెప్పుమని బడిలో పంతులు వానిని బాధించుచుండువాఁడు. దొరయ్య మంచివాఁడు. ఇంటిపేరు సరిగా నుచ్చరింపలేక వాని నాలుక తడఁబడినపుడెల్ల, పంతులవ్యాఖ్యలతో పాటు మాపరిహాసములును జెలరేఁగి వానిని జీకాకుపఱుచుచుండెడివి. ఒక్కొక్కప్పుడు దొరయ్య మానవ్వులకుఁ గోౙించి, "నన్ను దొరయ్యా యని పిలిస్తే చాలును, మాయింటిపేరు మీ యిష్టమువచ్చినట్టు పెట్టుకొండి!" అని దైన్యమునఁ జెప్పివేయుచుండువాఁడు.

దొరయ్య గుణవంతుఁడు. అతనివంశస్థులు సజ్జనులు, స్థితిమంతులు. తీఱికసమయమున మాపంతులు మమ్మఁ జూచి, "పిల్లలారా! ఈరోజున మనము దొరయ్యయింటిపేరు చెప్పించవలెను. ఆలస్యం చేయక చెప్పు దొరయ్యా?" అని యడుగును. స్థూలకాయముతో నంతట దొరయ్య లేచి నిలువఁబడినపుడు, మానవ్వులతో బడికప్పు ఎగిరిపోవునటులగును. పుస్తకములు మూలఁ ద్రోచి, యీమహాసమస్యాపరిష్కారమందు మే మంత కాలము గడపుదుము. దొరయ్యయుచ్చారణమందు తప్పులుపట్టుటయందు నిరక్షరకుక్షులుసయితము చాకచక్యము చాలఁగఁ గనఁబఱచుచుందురు. 'ద్వారము'అని పలుకనేరక, 'దోరం', 'దారం', 'ఉద్దారం'మున్నగు పేళ్లన్నియు దొరయ్య యేకరువుపెట్టుచుండువాఁడు. ఒకపిల్లవాని యాలోచన గైకొని, యొకనాఁడు దొరయ్య తనయింటిపేరు 'ధైర్యం' అని పలుకఁగా, మేమందఱము కడుపుబ్బునట్టుగ నవ్వితిమి.

దొరయ్య రెండుమూఁడుసంవత్సరములలో పల్లెటూరి ప్రాథమికపాఠశాలాఘట్టభద్రుఁడై, కులవృత్తియగు వ్యవసాయమునఁ బ్రవేశించి, సేద్యగాండ్రలో మిన్నయనిపించుకొనెను. అదివఱకె మంచిస్థితి నుండిన యాకుటుంబమున కతని యాజమాన్యమున పాఁడిపంటలు సమృద్ధిగఁ గలిగెను. మంచిపాడుపరి యగుటచేత, దొరయ్యసొమ్ము నిలువచేసి, వడ్డీవ్యాపారముకూడ సాగించెను. ధనికుఁడనని దొరయ్యకు గర్వము లేదు; పాలుమాలిక లేదు. తన యైశ్వర్యమున కాయువుపట్టగు సేద్యము నీతఁడు పట్టువిడువక పిత్రార్జితభూములను బలపఱచుచు, క్రొత్తవానిని గొనుచు, ఆస్తిని పెంపుచేసికొనెను.

స్థితిగతు లెంత సుఖముగ నున్నను, ఒక్కొక్కప్పుడు వానిఫల మనుభవింప మనము నోఁచుకొనకుందుము. దొరయ్య కిటీవలఁ గొన్ని తీఱని నష్టములు వాటిల్లెను. కళత్రవియోగమునకుఁ దోడుగ దృష్ట్యవరోధమును గలిగి కొంతకాలమునుండి యాతఁ డిల్లు కదలుచుండుట లేదు. చేతి కందిన కొడుకులున్నను, వారిరుచులు, ప్రజ్ఞలును పెడత్రోవఁబట్టుటచేత, దొరయ్యపొలము లిపుడు కవుళ్లకీయఁబడినవి. వడ్డీవ్యాపారముకూడ వెనుకఁబడియుండెను. ఒక వేల! పల్లెటూరిభూస్వామి దొరయ్యయిల్లు కళకాంతులు గోలుపోయి, బావురు మనుచున్నది.

౨

స్వగ్రామము విడిచిన చాలకాలమునకు నే నచటి కేగి, నాబాల్యసహవాసునియింటికిపోయితిని. చావడిలోఁ గూర్చుండి, దొరయ్య యేదో పనిచేసికొనుచుండెను. ఎవరో తనను జూడవచ్చిరని విని, కనులచూపు లేక పోవుటచేత, ఆయత్తమైన వీనులతో నావైపున కాతఁడు మొగమెత్తెను. నాబాల్యసఖుని దృష్టి తప్పుటకు నేను ఖిన్నుఁడనైతిని. "బాగా ఉన్నావా, దొరయ్యా!" అని నేను కుశలప్రశ్న చేయఁగా, ఒకనిముస మాతని మోము దీర్ఘాలోచనను సూచించెను. అంతట, "శాస్త్రుల్లా!" అనుపలు కావడినగవ్వారమునుండి వెడలె

వచ్చెను. ఒకత్రుటిలో మేము మిరువురమును సంభాషణా నిమగ్నుల మైతిమి. నా సమాచారము నేను సంగ్రహముగఁ జెప్పివేసితిని. తన దీర్ఘవృత్తాంత మంత దొరయ్య విప్పెను. తాను క్రొత్తభూములు కొనుట, ప్రాంతబంధుగులతో వేరగుట, ఇటీవలఁ గొన్ని యిక్కట్టులపాలగుట మొదలగుసమాచారములు నాకు వినిపించినపుడు, సందర్భానుసారముగ నేను మారుపలికి, "దొరయ్యా! లోకవిశేషము లీరీతిగానే యుంటవి. సుఖదుఃఖములలో నేది సంప్రాప్తమైనప్పుడు అది యనుభవింపక తప్పదు. ఏది యెట్లున్నను, నీకొడుకు లిద్దరూ పెద్దవాళ్లై, ప్రయోజకు లైనారుగదా!" అని పలికితిని.

దొరయ్య:—"ఆహా! మంచిప్రయోజకులే అయినారు! వాళ్లప్రజ్ఞయంతా కంచం మార్చి మట్టెలు చేయించడములోనే! పెద్దవాఁడు ఇంగ్లీషు వెలగబెడతానని పట్నం పంపితే, వాఁడు డబ్బు తగలవేయడం మొదలుపెట్టాఁడు. బాగా లేదని వాఁడిచదువు చాలించాము. అంతటితో వాఁడూరకుంటేగా! తన మిడిమిడి జ్ఞానమునకు మిడిసిపడుతూ వాఁడు నేస్తులు పిలిచినారని రెండుమూఁడుసారులు మద్రాసుషికార్లు సాగించి, తలకు మించిన అప్పులు చేసుకొని వచ్చినాఁడు! చెన్నపట్నం స్నేహితులు సహాయముచేస్తారని వాఁడు మెల్లిగా సైకిలు వ్యాపారం మొదలుపెట్టినాఁడు. నాకళ్లనీళ్లు తుడిచేటందుకు వాఁడికి మొట్టమొదట స్వల్పలాభం కలిగింది. ఈ కాస్తలాభానికే నేను కేరింతాలు కొట్టినాను."

నేను:—"మెల్లి మెల్లిగా అతఁడు ఆర్జనపరుఁడైనాఁడు గదా! నీరొట్టె నేతిలోఁ బడినది—ఇంకా మూలుగుతావేమి దొరయ్యా" అని నాప్రాఁతనేస్తుని నేను ముదలించితిని.

దొరయ్య:—"నీ కెప్పుడూ మాయతొందరే! పూర్తిగా విను శాస్తుల్లూ! ఈసందు చూచుకొని, భీమయ్య మోటారువర్తకంకూడా పెట్టాఁడు. చిన్నముండావాఁడు చిన్నబుచ్చుకుంటాఁడని తొలిసారినష్టాలకు నేనెట్లో కళ్లు మూసుకొన్నాను. బరితెగి వాఁడంతట ఖిరివిగా వ్యాపారం సాగించాఁడు. అప్పటిలాభం కొంచెమైనను ముందుసాలునుండి వందలకొద్ది లాభం వస్తుందని మావాఁడు అంచనావేసుకొన్నాఁడు. ఎక్కడ చూచినా మావాఁడిపేరు మోగిపోయింది."

నేను:—"ఇంకేమి దొరయ్యా, చెప్పవు! నీవు లక్షాధికారి వయిపోతావులే!"

దొరయ్య:—"చివరకంటా విను శాస్తుల్లూ! భీమయ్యపేరుముందు తనప్రభ అణగిపోతున్నదని మా ధర్మయ్య అప్పుడు ఎంతో తొందరపడ్డాడు. అన్న వందలు తెస్తే, తమ్ముడు వేలు లాభం తీయాలంటాడు! అన్నదగ్గరే సరుకు కొని తమ్ముడంతట బస్సులునడిపే వ్యాపారం మొదలుపెట్టినాడు—మాతాడూరురోడ్డు బస్సులన్నీ మావాడివే. తెల్లవారేటప్పటికి, పెద్దాళ్లు చిన్నాళ్లు తండోపతండాలుగా మా చిన్నాడిదర్శనానికి సిద్ధపడేవాళ్లు. పోలీసువాళ్లని మావాడు జేబులో వేసుకొన్నాడు. ఏవేళ చూచినా మా గుమ్మం ముందు 'గుంయి'మను మోటారుకూతలే. పూర్వపు పెద్దపశువుల పాక పీకివేసి, మాచిన్నాడు మోటారుషెడ్డులుకట్టించినాడు. వచ్చేపొయ్యేఉద్యోగస్తులకు మావాడు కాఫీ ఉపమాలు తయారుచేయించేవాడు. కిల్లీలు, సిగరెట్లు, సప్లైలుచేసేవాడు. ఈవిధంగా మావాళ్లిద్దరూ డబ్బు సంపాదించారు. ఐతే నేమి? మూరెడు వెళ్లడము బారెడు కుంగడం అయిపోయింది మా బ్రతుకు."

నేను:—"నీఅర్థమేమిటి దొరయ్యా?"

దొర:—"నాఅర్థం నిరర్థకమనే! వచ్చేలాభం ఎప్పటి దప్పుడు మావాళ్లు నమిలివేసేవారు. ఇంక మిగిలనదంతా, మొదటిపెట్టుబడి నష్టం. తర్వాత మార్వాడీఅప్పు పెరగడం! పొదుపు లేక, స్థితికి తగని అల్లవాట్లు చేసుకొని, వచ్చేసొమ్మంతా మావాళ్లు వ్యయం చేసేవాళ్లు. ఇంతలో మోటారువ్యాపారంలో వాళ్లకు పోటీదారు లేర్పడ్డారు. గుగ్గిళ్లతట్టలో రెండెడ్లు ముట్టెలు పెట్టితే, రెండు కుమ్ముకొని కూలిపోవా? మావాళ్లవ్యాపారాలు క్రమంగా లాభముపోయి నష్టంలో పడ్డవి. బ్రహ్మాండంమీద నాసలహా వాళ్లు విన్నారు. రెండవవాని బస్సులన్నీ పాతవై మూలపడ్డవి. పెద్దవాణ్ణిసదు కెవరూ

మాచూచుచేలేదు! అప్పుడు రూపాయివస్తువు పావలా కమ్మివేశాము. చెపితే నమ్ముతావో, లేదో శాస్త్రుల్లూ! ఈయిద్దరి బస్సులవ్యాపారంలో మాకు నలభైవేలరూపా యిలు నష్టంవచ్చింది. దురవస్థలో దురవస్థ! ఆసమయం లోనే నాపెద్దఅప్పుదారు డొకడు దివాలాతీశాడు. దానితో నారొక్కంపదివేలు నట్టేటగలిసిపోయింది. సంసారం గుట్టు ఎవరిచెవినీ బడకూడదని నేను నోరు మూసుకొని నాసుక్షేత్రసంపదలో ఇరవై యకరాలు అమ్మివేశాను. అవి ధరలు హెచ్చుగా నుండే మహారాజు రోజులుకావడముచేత, దానితో మాఋణం అంతా తీరి పోయింది. అయితే లాభమేమిటి? ఈగొప్పనష్టానికి గుండె పగిలి మాయింటిది మంటకలిసిపోయింది. శిరసుకు దారుణమోహంచేసి, కళ్లుపోయి, నేను కూలబడ్డాను."

## 3

దొరయ్యదురవస్థకు నేనెంతయు దుఃఖపడితిని. తరువాతి వృత్తాంతము చెప్పుమని నేను కోరఁగా అతఁ డదియు వినుపించెను. బస్సులవ్యాపారసందర్భమున నతని కుమాళ్లకు మండలమునను, మద్రాసులోను పెద్దయుద్యోగు లతోఁ బరిచయము గలిగెను. భీమయ్యశర్మయ్య లిపుడు సూక్ష్మములో మోక్షము లభించుమార్గముకొఱకు వెదకిరి. యశోధనములు రెండును సమకూరుసాధన మిపుడు స్వజా త్యభిమానులు వారికిఁ జూపించిరి. బ్రాహ్మణేతరులకు గురుఁడు పండ్రెండింట నుండు నీప్రస్తుతకాలమందు కాఁపులపిల్లలు కాళ్లు పారఁజాఁపుకొని యింటఁ గూర్చుండుట కర్తవ్యము గాదని వారికిని గానఁబడెను. తమసంసారమున కిపుడు గొప్పతాఁకుఁడు గలిగినమాట వాస్తవమే. కాని, చాఁపచినిఁగినను, చదురంతయుండదా? సాహసమున మరలఁ గొంత పెట్టుబడి పెట్టినచో పదిమడుగులు లాభము మూటగట్టవచ్చును. చిన్ననాఁడు తమ తండ్రి తమయింటిపేరు 'ధైర్యం'వారని చెప్పియుండ లేదా? ఈతరుణమున ధైర్యము వహించి, సాహసమున సొమ్ము వ్యయపఱచినచో, ఈమాఱు ధనరూపముననే గాక, కీర్తిరూపమునఁగూడ తమలాభము ద్విగుణీకృతము కాఁగలదని దొరయ్యకొడుకులు తలపోసిరి.

దొరయ్య నాతో నిట్లు పలికెను:—"మాపెద్దవా డంతట నంబరుకి ప్రయత్నించాడు. అది వచ్చినపిదప పెద్దనంబరుకోసం యోగపడ్డాడు. 'జీతం భత్యంలేని యీమాయనంబరువాకకీ నీ కెందుకురా నాయనా? తగవులకు ద్రవ్యనష్టాలకు కారణమౌతుందేమోసుమా! ఒకళ్లని యాచించకుండా మనపొలంపని చేసుకుంటే మళ్లీభాగ్యదశ యొస్తుకుంటుందిరా!' అని నే నెంత బోధించినను మావాడికి నచ్చింది కాదు. మళ్లీ మావాడు మార్వాడీ మశిచ్చంచుచేతులో బడ్డాడు. శాస్త్రుల్లూ, మన చిన్నప్పుడు చిన్నజీతాలవాళ్లే లంచాలకు చేతులు చాచే వాళ్లుగదా. ఇప్పుడో పెద్దాళ్లకు చిన్నాళ్లకు పెద్ద డబ్బుదాహంపట్టుకుంది. పెద్దనంబరుతోపాటు నాకుటుంబానికి పదివేలరుణము మళ్లీ బోణీయైయింది. తనతాహతు నిలబెట్టుకోవాలని కని మావాడు నెలకు నాలుగువందలు తగలబెడుతున్నాడు. ఇప్పుడేనా యీవాడనంబరు మాని వేయరా యని నేను మొత్తుకుంటాను. 'దానికి బెట్టిన డబ్బురాబట్టుకోనియ్యావయ్యా తర్వాత మానుకుందాము' అని నాకుమారుడు నాకు మారుచెప్పుతాడు. ఐతే యిపుడు పదిమంది పెద్దవాళ్లలో మావాడు తిరగడం నేర్చాడు. మర్యాద యిచ్చి పుచ్చుకోవడం గ్రహించాడు. నీకు నిజం చెప్పవద్దూ. మావాళ్లవల్ల మాకు కానాడబ్బు వస్తోంది. ఐతేమి? 'లంకమేత, యేటియీత'లాగున్నది మాసంసారస్థితి. ఇంకా శాసనసభలో నంబరీ మావాడు తనకు కావాలంటాడు. దానికి వేలకొద్దీ గుమ్మరించాలట! మా కీఉద్యోగా లెందుకు శాస్త్రుల్లూ? కాడి పట్టేచేతికి కలం వస్తే యేమవుతుంది? ఈయుద్యోగాలమూలాన నా పొలాలన్నీ పాడైపోయినాయి." అని దొరయ్య విచారించెను.

సొమ్ముబిషయమున తమసంసారస్థితి చక్కఁబడు చున్నది గదా యని నే ననఁగా, "ఏమి చెప్పను శాస్త్రుల్లుబావా! వచ్చేడబ్బు దక్కడం యెప్పడి దప్పుడు నమిలేస్తున్నాము. ఒకమూల మహారణ్యములాగ అప్పు పెరిగి పోతూవున్నది!" అని దొరయ్య మొఱపెట్టెను.

రెండవవానిసంగతి యడిగినపుడు దొరయ్య యిట్లు చెప్పెను:—"అన్నయ్యను మించినప్రజ్ఞ కనబరిస్తేనే

గాని తమ్మయ్యకు సంతుష్టిలేదు. కష్టపడకుండా ధనరాసులు పోగుజేసికోవలె నంటాడు వీడు. తెస్తున్నాడు, తగలేస్తున్నాడు."

ఇతఁడు చేయు ఉద్యోగ మేమని నే నడిగినపుడు, "ఎందుకడిగే, నాపుండుకు మళ్లీ మళ్లీ రేపుతావు శాస్త్రుల్లూ! వెనక నాఅప్పు రాబట్టుకొనడానికి తనధనమంతా నేను వేలం వేయించి అమ్మించిన దీక్షితులు అనేకుష్టుగ్రహము, ఇప్పుడు మా రెండవవానిని పట్టుకొని, వాడికి గుండెకాయ యైపోయినాడు. మావాడికి వీడు నేర్పనిదుర్మార్గ మేమీ లేదు. వీడు నావాలిటిపరమశత్రువై, లోఁగడ నే జేసిన పరాభవానికి పదిరెట్లు హాని చేసి, నా సంసారంమీద పగదీర్చుకుంటూవున్నట్టు కనబడుచున్నది. అన్నిటి కేమి గాని, శాస్త్రుల్లూ, ఎక్కడైనా బ్రాహ్మణింట్లో పుట్టిన వాడినోటికి మద్యమాంసాలు కేలా రుచిస్తవయ్యా? ఈ ముండాకొడుకి సావాసాన మావాడికి పట్టుపడని పాపు చేష్టలు లేవు." అని నారయ్య కంట తడిపెట్టుకొని, "ఎవరూ లేరు గదా, ఇక్కడ!" యని యడిగి, నా చెవిలో కొన్నిమాటలు చెప్పి, గోలుగోలున నేడ్చెను.

నారయ్యవలన వీడుకోలంది, రాత్రి చీకటిలో నే నింటికి వచ్చునపుడు, వాలవంటి తమవంశపు మరియాదలు నీటఁ గలిపి, సిరిసంపదలతోఁ దన్నొంగు సంసారము నప్పులపాలుచేసిన నారయ్యకుమారులను గుఱించి నేను దలపోసితిని. నే నెక్కువగ నెత నొందినది, లంచము లిచ్చిపుచ్చుకొనుచు గౌరవోద్యోగములు సాధించి సాగించెడి పెద్దకొడుకును గుఱించియో, జూదమె జీవనోపాధిగఁ జేకొని దుర్వ్యసనములపాలైన రెండవ వానినిగుఱించియో, కుమాళ్ల దుర్వ్యయములవలన లక్ష రూపాయిల యప్పు పెరిఁగి తనయాస్తి నంతటిని గోలుపోవ సిద్ధమై చక్షువులకు మేఘపటలములు, మనశ్చక్షువునకు దుఃఖపటలమును గ్రమ్మి, దారితెన్నులు గానరాక, అంధకారమునఁ దెరలాడెడి వృద్ధజనకునిగుఱించియో, నాకు బాగుగ జ్ఞాపకము లేదు.

---

## కృషీవలా!

పరుచూరి భువనేశ్వరీ దేవిగారు

మేఘమాలికలలో మెఱుఁగు లేఁదళుకుతోఁ దొలుతగాఁ జిఱునవ్వు తొలకరించె
పోతుటీఁగలలోని పుటుక తేనియతోడ మురువుగా తొలిపల్కు లురిమి కురిసె
ఫణిఫణావళులలో మిఱుకారుమణితోడ దీటుగా దివ్య జ్యోతిస్సు గారె
కాళరాత్రులలోని బాలేందు రేఖతో హాయిగా నార్ద్రత్వ మావహిలఁగ
మండుకశుపులు చల్లార్పఁ బండుపంట - జైలుపాలముల నీ పెంపఁ బెరిఁగినట్టి
స్వేచ్ఛ యనునారు గొని రాఁగ వెడలు మోయి-విశ్వలీలాకృషీవలా వెలుఁగు మాలి.

---



మండలప్రాడ్వివాకుని కార్యస్థానాని కంటి పెక్కుమంది సేవకు లుంటారు. వారి నందజీని సేవకులని పిలువరు. 'కోర్టుబంట్రోతులు' అని వాడుగ్గా అంటారు. అబ్దుల్ ఖాసీమ్ అనే మహమ్మదీయు డొకానొక డారకం పనిలో ప్రవేశించి యిక్కడకు పదేను పదారేండ్లనుండి సర్కారువారి జీతం బత్తెం తింటూవున్నాడు. అతడు ఒడ్డు పొడుగు ఉన్న మనిషి: గడ్డం ఖాజీ ననుసరించి యుంచి నట్లు తోస్తుంది—పొడుగ్గా, కొస లుంగ్రాల మెలి త్రిప్పి:—తలపాగా మొగలాయిఫక్కీగా చుట్టుకుంటాడు. టోపీ పెట్టుకోడు. మెల్లో ఒకకైజా రమేషా ఎప్పుడూ ఉంచుకుంటాడు. బిళ్లడవాలు జందెంలా చొక్కామీద వేసి కొని, ఆడవా లటూ యిటూ బెనక్కుండా నడుం కోకండువా చుట్టేస్తాడు. ఒకతడవ అతణ్ణి చూచినవెనుక మనచూపుల్లో అతడు మఱి మాఱిపోడు.

అతని భార్యపేరు లాల్‌బీబీ. పాతికేళ్లుంటాయి ఆమెకు. ఆమెచెవుల అంచుల్ని వరుసగా అన్నీ కుళ్లే: అంగుళంలో దశాంశమన్నా వుంటుందో ఉండదో కుట్టు కుట్టుకూ ఎడం. ఆమె మణికట్లను గాజులు బంగారపువి, ఈచేతి కోఅయిదు, ఆచేతికో అయిదు ఉన్నాయి. ఆమ్రేలి నొకలోహాపు వుంగరం కలదు. కాళ్లవస్తువులు లంగాచేతను మెళ్లో వస్తువులు వోణీకబ్బాలవల్లను కప్పడి, హరిబ్రహ్మాదులకైనను కనబడవు. పైని వివరించిన ఆభరణాలు మాత్రం చూడ్డానికి సాధ్యమా! బురకా యేమైంది?అని అంటే అన వచ్చును చదువరులు. అవన్నీ ఒక్కసారి ఒక్కచూపుఅచేత ఒక్కప్పుడు చూడబడ్డాయి. ఆచూచినతను ఊరుకోక లోకాని కంతకూ విదితం చేసినాడు. మఱిక దాపరిక మెందుకు?

ఖాసీమ్‌కు కోర్టుబంట్రోతుఉద్యోగం ఈ వేళఉదయం అయి పనిలో ప్రవేశించినా డనుకోండి. ఆరాత్రి లాల్‌బీబీ పులావ్ చేసింది. ఖాసీమ్‌లాల్‌బీబీలు పులావ్ భుజించి, ఆ వెనుక ఖాసీమ్ లాల్‌బీబీతో ముద్దుముచ్చట్లకు దిగడంలో, "మేరీ ప్యారీ బడీ సుల్తానా" అని పిల్చాడు. అంటే తెనుగులో దానిఅర్థము

'నా ప్రియమహారాజ్ఞి' అన్నమాట. అని చెప్పే సరికి లాల్‌బీబీ, "ఈపాడ్దల్లా తోపుడురా అంతా 'బంట్రోతుగారికి ఖ్యా'అని చెప్పి విర సంగా పల్కినప్పుడు, అంతా ఒక్కసారి 'బడీసుల్తానా' అన్నంత మాయమైపోతుందా? బంట్రోతుపుద్యోగం మానేస్తే మంచిది. మనకు వద్దు"అంది. "నీకు తెలీదు. లోకానికి తెలీదు దానికర్జా. నేను రేపీదారినే మాప్రాడ్వి వాకును విహారంగా యిలా తీసికొనివస్తాను. అప్పుడు చూడు, అయనకూ నాకూ ఏమైనా తేడా వుంటుందేమో. బంట్రోతు అంటే రాజాబహద్దర్ అనుకో. బంట్రోతుమానా గలమనిషి అంటే హాకల్. లోకాని కేం తెలుసు? ఏకాడో ఓకాడ ఒక డోపుద్యోగం సద్యోగం సంపాదించుకొని పొట్టపోసికుంటాం లే చూడలేదు. ఏదో చొప్పదంటు అంటించి, చుట్టుకెట్టాలని చూస్తూవుంటారు అందరూ." అని అన్నాడు. కప్పుకల్లినే చిరునవ్వు నవ్వింది లాల్‌బీబీ.

రాత్రి కరిగిపోయింది; తెల్లవారింది. ప్రాడ్వివాక్కుకు ఒకఆ వుంది. ప్రాడ్వివాక్కు ఖాసీమును ఆఆవ్వదగ్గఅ పేడ తీసెయ్య మన్నాడు. ఖాసీమ్ మాఱుమాటాడకుండా తీసి వేసినాడు. ఆనాటిదినంలో ఖాసీమ్ జ్ఞాపకం వుంచుకోదగ్గదని అది వొక్కటే.

సాయంకాల మైదుగంట లైంది. ప్రాడ్వి వాకు ఖాసీమును, క్రొత్తసేవకుడుగదా క్రొత్త దారి చూపిస్తాడు, పాతదారి విసుగు అని, "ఖాసీమ్! మీకా రెటు పోతే బాగా వుంటుంది ఈవేళా" అని అడిగాడు. "ఈలాఅండి" అని ఖాసీమ్ తనవీధినే తీసికొని వెళ్లినాడు. ఖాసీమ్ ముందు తనవేషమంతా వేషంలా వుంచుకొని నడుస్తూన్నాడు. ఆవెనుక ప్రాడ్వివాకు, తల పాగా ఆయనా ఆయనా పామేదాగానే నడు స్తూవున్నాడు. అరుగులమీది ప్రజలు లేచి వందనాలు పెడుతూన్నారు.

ఖాసీమ్ఇంటిసమీపంలోనికి వచ్చేసరికి ఖాసీమ్‌భార్యా చూస్తూవుంది, వీధిగుమ్మానికి వున్న గోనిగుడ్డతెర గాజులచేతులనే ఒత్తి గించి, కుట్టుడు చెవుల పైకి మేలిముసుగు తీసికొని,—



'అదేనండి బాబు మాయిల్లు'

ప్రాడ్వివాక్కు ఈయిల్లు ఆయిల్లు చూచి నట్టుగానే తనయిల్లుకూడ చూచీచూడనట్టు

పెడముఖమై, తనభార్యా క్కనబడకపోతా డేమో అనేభయంకొద్దీ యిల్లుదాటి యీవలకు వచ్చేలో, "అదేనండి బాబూ, మాయిల్లు" అన్నాడు ఖాసీమ్. "ఆ ! చూచాను."అన్నాడు ప్రాడ్వివాకు. విహ్వాతి నానాటిసాయంకాల విశేషం ఖాసీమ్ఇల్లు అనే అనుకోవాలి.

ప్రాడ్వివాకుని వారియింటివద్ద దిగబెట్టి ఖాసీమ్ తనయింటికి తిరిగి వచ్చేసరికి నాడు రాత్రి ఎనిమిదిఘంట లైంది. "ఏం, చూశావా, నన్నూ నాప్రాడ్వివాక్కునూ ?" అన్నాడు ఖాసీమ్ లాల్ బీబీతో. లాల్ బీబీ "చూచినాను. దర్జాగా వుంది"అంది. "అంతే నాపని. అంతే నాపని. దాన్ని బంట్రోతుపని అననియ్యి, బహద్దర్ పని అననియ్యి. విహ్వాతిబయలు దేఱి నప్పుడు నేను ముందు ఆయన వెనుక నడుస్తూ వుంటాం. ఆయనబరువు నే మోసేదిలేదు. నాబరువు ఆయన మోసేదిలేదు. మోటార్ సైకిలుమీద వెళ్లేటప్పుడు ఆయన నన్ను ప్రక్కను గూర్చోమని తానే తొక్కుకుంటాడు బండి. ఇంటివద్ద ఆయన యింట్లో కూర్చుంటే నేను వీధరుగుమీద కూర్చుంటాను. కచేరీలో ఆయనా నేనూ ఒకేపంకా క్రింద వుంటాం. గాలి ఆయన కెంతఎంత చల్లగా కొట్టుతుందో, నాకూ అంతఅంత చల్లగా కొట్టుతుంది" అన్నాడు. "మఱి మన బాబూ లంతా అంతవిడ్డూరంగా చెప్పకుంటారేం ?" అని అడిగింది లాల్ బీబీ. "అయితే ఒకటి వుంది, నీకు తెలియంది: నాకు హృదయం నుంచి మనస్సులో మెదులుతూవున్నది; లో కానికంతకూ బహూశా మనల్ని ఈసడించడానికి కారణభూతమైంది: ఉదయాన్నే ప్రాడ్వివాక్కుగారి పాడియావుకట్టుకర్రదగ్గఱ పేడ పోగేసి శుభ్రంచేయాలు"అన్నాడు ఖాసీము. లాల్ బీబీ వెంటనే "ఆపని ప్రతిఉదయం నేను చేసిపెట్టటట్లాయితేనో"అంది. "నన్ను బంట్రోతు అంటారు గాని నిన్ను బానిస అంటారు, చూచినవాళ్లంతా" అన్నాడు ఖాసీమ్. "ఆ మాత్రానికి 'ప్యారీ బడీ సుల్తానా' అని నన్ను రాత్రి పిలవడం ఎందుకు ?" అంది. "అదో సరాగం" అన్నాడు. ఇరువురూ అప్పటి కప్పడతివినోదంగా వున్నట్టున్నారు. కాని ఇరువురికీ ఆరాత్రి అయోమయాంధకారంలో ప్రాడ్వివాక్కులవారి యింటివద్దఆవు,ఆవులసాల,ఆసాలలోని ఆ ఆవు మూత్రపురీషాదులు పోయడం, వేయడం, అన్నీ మషీలేపము రాసిన రాగిరేకుమీది అక్షరాలల్లే అగపెస్తూనేవున్నాయి.

ఇద్దఱూ తెల్లవాఱగట్ల నాలుగ్గంటలకే యింకా వేగు బాగా విడివడి వెల్లబాఱక మునుపే మేలుకొని యొకఆలోచన చేసికొని యిలువెడలి బయలుదేఱినారు. బీబీ ఒకశాలువా ముసుగు వేసికుంది. తిన్నగా ప్రాడ్వివాకులఇంటికి సేవ కరిగినట్లే వెళ్లినారు.

తూర్పుదిక్కునందు శుక్రనక్షత్రము తెల్లగా ఓమాత్రం వెన్నముద్దంత వుండి గండుకిరణాలు చల్లగా లాల్ బీబిముక్కుబులాకీమీదికీ, ఖాసీమ్యొక్క గడ్డంమీదికి వెదజిమ్ముతూ వుంది. "ఇదే ఇ"ల్లన్నాడు ఖాసీమ్. అప్పటి

కప్పుడే ప్రాడ్వివాక్కులయింటి పాచిచేసే పనికత్తె వీధిగుమ్మం కొబ్బరిపెంక చీపురుతో చప్పుడయ్యేటట్టు ఊడ్చి, నూతికేసి నీళ్లు తెచ్చుకోడానికి వెళ్లిపోయింది. సింహద్వారం బార్లా తెరిచివుంది. సింహద్వారం చేరబడి లాల్ బీబీ ఖాసీమ్ను ఇవస్తూ సింహగుమ్మాన్నే ఆపని కత్తెకు తెలియకుండనే ఆవులసాలలో ప్రవేశించినాడు. పనికత్తె యథాప్రకారంగా తన నీళ్లూ ముగ్గూ తెచ్చుకొని, కళ్లాపు చల్లుకొని, రెండుచారలు గీసి, రెండుచుక్కలు కొట్టి, ఆముగ్గుచెయ్యి ఆవీధిగోడను తట్టి, "అమ్మగారూ! నే వెడుతున్నానండోయి. తలు పేసుకోండి" అని కేకేసి పోయింది.

అమ్మగా రనగా ప్రాడ్వివాకులవారి భార్య. ఆమె నడుం విఱుచుకొని, జడ సరుదుకుని, జడిమ నుడుపుకొని, లేచి వెళ్లబోతూంటే, ప్రాడ్వివాకులు ఆమెను మంచంపట్టినున్న మనిషిని మంచంపట్టి దిగకుండా ఆపి, "ఖాసీమ్ ఈపాటికి వస్తూవుంటాడు. మళ్లీ వాడికి తలుపుతీయడానికి నేను లేవాలి. అలా ఉండనియ్యి తలుపు. తెల్లాఱనియి" అని తిరిగి కన్నుండ జేసినాడు.

పశువులసాలలో లాల్ బీబీ పేడ పోగేస్తూంది. ఖాసీమ్ నూతివద్దకు వెళ్లి, బాల్చీతో బాల్చీడు నీళ్లు తోడుకొనివచ్చి సాలయీవల నుంచున్నాడు. "తెల్లారి పోయిందా ?" అంది లాల్ బీబీ. "అవుతూ అవుతూవుంది" అని ఖాసీమ్ అన్నాడు. సాల యీవలకు వచ్చి నిలుచుంది బీబీ. బీబీచేతుల మీద నీళ్లు పోసి, చేతులు కడుక్కోనిచ్చి, సరిగా శాలువాముసుగు ఎప్పట్లా వేసేసుకోమన్నాడు. లాల్ బీబీ ఎప్పట్లా వేసేసుకొంది.

అప్పటి కప్పుడే ప్రాడ్వివాకూ, ఆయన భార్యా "దాసీది వెళ్లిపోయి చాలాసేపైంది. తెల్లారదా యీపాటి కన్నా" అని గదికిటికీ తలుపులు తెఱచుకొని, వీధిగుమ్మంకేసి చూస్తూ వున్నారు, "ఖాసీమ్ ఇంకా రాలేదేం చెప్మా" అని. ఖాసీమ్ అప్పుడే తనబూబును వీధితల్పు తీసి ఆవల కంపుటకై వీధిగుమ్మంవఱకూ తీసికొని వచ్చి, "ఒక్కర్తెవు ఇంటికి వెళ్లగలవా ?"



'ఒక్కర్తెవు ఇంటికి వెళ్లగలవా'

అని నెమ్మదిగా అనుచున్నాడు. లాల్ బీబీయు తనశాలువ కొంచె మొత్తిగించుకొని, వెనుచూపునే ఖాసీమ్ను చూచి, "వెళ్లగల" అని

వీధితలుపు మూయ లాగుతూ నిష్క్రమిస్తూంది.

నిన్న సాయంకాలం చూచిన తెరమఱుగు బీబీవా అన్నట్లు ప్రాడ్వివాకుని చూపుల్లో మఱోమాఱు మెఱిసినాయి ఆమెయొక్క చెవికుట్లు, చేతికంకణాలు, అన్నీ. ప్రాడ్వివాకునిభార్యా కదేమీ మనసులో లేమి, "ఖాసీమ్! ఆమని ఎవరు? ఎప్పుడు వచ్చినావు నీవు?" అని అడిగింది. ఖాసీమ్ "అది మా యింటి పనిబానిస. మన ఆవుపేడ తీయుటకు దానిని పురమాయించినాను. అది తెల్లవాఱగిట్ల వచ్చి పోగు చేసి పోతుందిలేండి యీ రోజునుంచీ" అన్నాడు. ప్రాడ్వివాకు విన్నాడు. ఖాసీమ్ సగముసిగ్గుపడి, సగము మఱేమీనాలోచక తావినవలసినది పూర్తి కాకుండానేవీధరుగుపైకి వెల్లిపోయినాడు.



'ప్రణయ-బానిస అంటే ఏమిటి............అడిగింది.'

ప్రాడ్వివాకు తనభార్యతో "అది వాని పనిబానిస కాదు, ప్రణయ-బానిస" అన్నాడు.

మఱి ఆనాటినుంచి అబ్దుల్‌ఖాసీమ్‌ను—అబ్దుల్ ఖాసీమ్‌ను అన్నమాటేం, మఱే సర్కారుబంట్రోతును గాని, తనయింటియందలి సొంతపనులు నిర్వర్తించుటకై ఆప్రాడ్వివాకులు నియోగించి యుండలేదు. లాల్‌బీబీ మఱి పొరుగింటికి వచ్చి పనిచేసి మెఱుగదు.

ప్రాడ్వివాకుల్ని ప్రాడ్వివాకుభార్య "ప్రణయ-బానిస అంటే ఏమిటి" అని తరిచి తరిచి అడిగింది. వెంటనే "నీవు నా కెలాంటిదానివో, వానికది అలాంటిది" అన్నాడు ప్రాడ్వివాకు. "మీ కెట్లా తెలుసు వానిభార్యా అది అని" అని అడిగింది. "కనబడలే, చేతుల్ని బంగారు కంకణాలు, చెవుల్ని బంగారుకుట్లూ" అన్నాడు. "అయితే ఖాసీమ్‌యొక్క 'ప్రియమహారాజ్ఞి' అని అనండి, ప్రణయ-బానిస యేమిటి!" అంది ఆమె.

కొంచె మెచ్చుతక్కువగా అట్లనే పిల్చినాడుగా లాల్‌బీబీని ఖాసీమ్, తన కుద్యోగమైన తొలినిశి—"మేరీ ప్యారీ బడీ సుల్తానా!"

# స్రోతస్స్వనము

ఓలేటి సీతారామమూర్తి గారు

౧

నేనిపు డీవనానఁ బయనింపఁగఁ గ్రొన్ననుకావిసంజలో
నీనవమల్లికాకుసుమ హృద్యపరీమళసౌకుమార్యముం
దానిలమందు నాశ్రవణతత్పరతాసుఖశ్రాప్తికై సుధా
గానచయంబు నీసెలప్రకామపుసంగతి నించి వైచెదున్.

౨

గురువులు వాజి క్రొవ్విరుల గుత్తుల నవ్వముఖాలఁ బ్రేమపుర్ణ
సరణిని చుంబనం బిడి ప్రశాంతపురాగము లాలపించి ని
ర్ఝరిణీవిలాసగీతులకు రమ్యగతిన్ శ్రుతి గొల్పి భృంగముల్
మురువుగ నిల్పు నీప్రకృతిముగ్ధమనంబునఁ బ్రేమసౌధముల్.

౩

తీరని ప్రేమవాంఛ వ్రతతీగృహవేదిక విప్రలబ్ధశృం
గారవిధాననాహృదయక్రమవిపంచి రచించుకొన్న శ్లో
కారళగీతికావళి ప్రయాసవిరామము లింత లేకయే
పాఱుస్రవంతి హృత్కుహరభాగమునం దిటు మాఱుమ్రోఁగునా ?

౪

ఈసెలయేటిగీతిఁ బులకింతురు దృక్కుల హాసకాంతితో
సానవపుష్పకోరకలతాంగులు; కూలశిఖావళాంగనా
భాసురనృత్యవైభవము ప్రబ్బెడుఁ; దీయని ప్రేమవాంఛ వి
న్యాసమొనర్చు నీప్రకృతి; హర్షసుధారస మూరు నాయెదన్.

---



(E. N. P)

అమెరికా సంయుక్తరాష్ట్రముల నూతన మంత్రిమండలి

కూర్చున్నవారు —— ఎడమవైపు నుండి – సంగ్రామకార్యదర్శి, పాట్రిక్ జె. హర్లీ; ఉపాధ్యక్షుడు చార్లెస్ కర్టిస్; అధ్యక్షుడు హెర్బర్ట్ హూవర్; ప్రభుత్వ కార్యదర్శి హెన్రీ యల్. స్టిమ్సన్; కోశకార్యదర్శి డబ్ల్యు. మెలన్.

నిలుచున్నవారు —— ఎడమనుండి – వాణిజ్యకార్యదర్శి రాబర్టు పి. లామంట్; దేశీయాంగకార్యదర్శి రే యల్. విల్బర్; పోస్టుమాస్టరు జనరల్ వాల్టర్ యఫ్. బ్రౌన్; ప్రభుత్వ ప్రధాన న్యాయవాది విల్లియం డి. మిచెల్; వ్యవసాయ కార్యదర్శి ఆర్థర్ యం. హైడ్; నావిక కార్యదర్శి చార్లెస్ యఫ్. ఆడమ్స్; కార్మిక కార్యదర్శి విల్లియం యన్. డోక్.




(E. N. P.)
విమానముపై నేటి అమెరికా యువతుల సముద్రయాత్ర



౧

నేనొకరోజు సాయంకాలము కాలేజీనుంచి యింటి కొచ్చేసరికి మాఅమ్మ చాలా కోపంతో యిలా వుపక్రమించింది:—

"వొరే—శంకరం! నే నిహమీ అత్తవారింటి కెళ్లినట్టయిన చెప్పొచ్చు కొట్టు. ఈమాటుతో బుద్ధొచ్చింది నాకు. వాళ్లు నాకు చేసిన అవుమానానికి నాజన్మంలో యిహ వాళ్లగుమ్మం తొక్కమనుందా?"

"యేం! యేం జరిగిందేఁవిటి?"

"వొహమాట కాదు—వొహపలు క్కాదు. అడ్డమైనమాటలూ అన్నారు!"

"యేఁవన్నా రమ్మా?"

"నన్ను వా ళ్లేఁవన్నా నీ కిష్టమే గా!"

"నా కిష్టఁవేఁవిటి! బాగానే వుంది! అయినా సంగతేఁవిటో చెప్పు—విసిగించక."

"చెప్పకేం! అంతా చెబుతాను—విను. పట్టు కెళ్లిన సారెలూ, చీరలూ అన్నీ యిచ్చాను. అ వ్వింకా వాళ్లకి చాల్లేదు కాబోలు—మొహాలు ముణుచుకు పోయినాయి. బంతీ గింతీ అయ్యేదాకా యెల్లాగో నోరు మూసుకునేవుంచున్నా. ఆతర్వాత, నావల్లొచ్చిన తప్పల్లా యిది: 'ఎప్పుడు పంపిస్తారు—పిల్లను?' అని అడిగాను. ఆమాట నే నడిగేసరికి మీద పడి బొకేసింది—మీఅత్త గారు! వా ళ్లన్నమాట లన్నీ నే నేం చెప్పగలనా, యేడవగలనా? 'యీరోజుల్లో అసలు పెళ్లే పదహా రేళ్లొచ్చేదాకా చెయ్యకూడదంటూంటే, యీపిల్ల కింకా వడసారం పదహారేళ్లయినా నిండలేదుగదా, అప్పుడే పంపుమ న్నల్లా అడిగారండీ!' అని నలుగురూ నాలుగు మూల్లా దుయ్యబట్టుకునేటప్పటికి నాకు గజగజా వొణు కొచ్చింది! ఆమాత్రంమాట అడగటానికి నాకు స్వతం త్రం లేదూ?"

"అయినా అప్పుడే యెందు కడిగావు ఆమాట?"

"అడక్కపోతే అల్లా వొదిలెయ్యమంటావా యేమిటి? నీపెళ్లాన్ని యిస్కూలుఫైనలుతోనైనా మాన్పించరట! యింకా రెండేళ్లయినా చదివించాలిట! ఆడపిల్ల నల్లా చదివిస్తే యెందుకైనా పనికొస్తుందా! మొగాళ్లల్లో కలిసి గాడిదలాగు ఆడదానికి చదు వేమిటి—అసహ్యం? అయినా నా కెందుకు లే—నీ కిహ అంటచిప్పలు తోమేరాతే పడుతుంది. నీచే తెల్లాగా తోమిస్తుం దాపిల్ల. ఆమాటా అనేసినట్టే. నీచదు వంతకంతకు అడుగంటుతోందని కూడా అంది—మీ అత్తగారు."

"చదువుకుంటే తప్పే ముంది?"

"ఇంకా చదు వెందుకూ—యీవిడికి? యిక్కడి కొచ్చినతర్వాతకూడా పొస్తకం పట్టుకూర్చుంటే

అన్న—అంతా వేళాకోళం, వెక్కిరింతలూగా వుంటే! యింమకా, యీవేషమంతాను? యెక్కడి కెళ్తావు?

కమ—చల్లగాల్లో కొంచెం అలా వెళ్లొద్దామని. అయినా వేషం మేమీ లేదే, మామూలువేషమే.

అన్న—యేం లేఖ? కళ్ళు మూసి గంత కట్టు తావా యేమిటి? గుర్రానికి దానికిలాగా కాళ్లకి జోడేమిటి?

కమ—వీధుల్లో తిరిగేటప్పుడు కాళ్లకి జోడు లేందే నాన్నగారు తిరగనివ్వరు.

అన్న—నడిచిపోతావా వెళ్తావా యేమిటి?

కమ—నడిచి కావమ్మా, బండీ యెక్కే; యెక్కడైనా నెగిగే కాలికి జోడుంటుంది. దానిలో తప్పేముంది?"

అన్న—యేం అబ్బరంగా వుందీ? జోడు తొడుక్కుని ప్రమాణమైన ఆచారాన్ని నే నెక్కడా చూడలేదు. సెటకాలాని కోరోరసాని కనపడింది!

కమ—ఆడవాళ్లకాళ్లని చర్మంతో చెయ్యలేదా భగవంతుడు? రేం నుప్పుకున్నా పట్టికాళ్లతో నడివ్వల సింపేదీ? అయినా క్లైన్నడైనా జోడు లేంచే గుమ్మం కదులుతారా?

అన్న—ఓ యబ్బో! మే మంతా జోడుతోనే నడిచామా యేమిటి? నాలాంటిదానవు కావూ నువ్వు? నాకాళ్లు చూసా—గొల్లా పనిలావో!

కమ—నీకూ తొడుక్కోండి.

అన్న—నువ్వు చాలక నేనుకూడా తొడుక్కోవాలి—సిగ్గు లేక; మరీ నీళ్ని బడిచేతే నలుగురూ నవ్వుతారు. సద్దనిమిషేళ్లు వొంటిమీదికొచ్చిన నీకు తెలియ్యక్కర్లా! అవతల అత్తగారూ, మామగారూ వున్నారనైనా చూడకుండా షికారు కెళ్లా బయల్దేరావు?

కమ—అస్తమానం గాలి లేకుండా యింట్లో కూర్చుంటే ఆరోగ్యం చెడిపోతుంది. సగంమువ్వాతిక మొగవాళ్లకంటే ఆడవాళ్లు బలహీనంగా వుండటాని కిదే కారణం. అయినా నా కిది కొత్త కాదే—చాలా రోజులనుంచి వెళుతున్నాను.

అన్న—అయితే, యిప్పుడే వనుకున్నా!—యిదెవరికి ముదిరిం పన్న మాట—పాకం. యిన్నాళ్లనుంచీ వెళుతుంటేబట్టేనా యింతబలంగా వుంట? నాకున్న బలంలో నీకు నూరోవంతుందా?

కమ—బాగానే వుంది, లాజిక్కు (logic)! నాశరీరానికి చల్లగాలి తగలకపోతే అసలు వీల్లేదు, యింతకంటె పాడవుతాను. యేదో స్కూల్లో వుండి వుండొచ్చి కాస్సేపైనా షికా రెళ్లకపోతే ఆరోగ్యం చెడిపోదూ? స్కూలు కెళ్లనివాళ్లుమాత్రం అస్తమానం గాలిలేని యిళ్లల్లో కూర్చుంటే మసీదులో యెలకల్లాగ మగ్గిపోరూ?

అన్న—బలం లేనిదానవు, ఆచదువు చదువమని యెవ డేడిచాడు? చదవడ మెందుకు? బలంకోసం అని పేరెట్టి వీథులమ్మట షికా ర్లెందుకు—సిగ్గు లేక? మే మంతా యేమంత మగ్గుతున్నాం? విసినికఱ్ఱతో విసురుకుంటే సరి, మాచక్కా వస్తుంది గాలి.

కమ—విసనకఱ్ఱగాలి మనుష్యుల కేమీ ఉపయోగించదు. బలం కొన్నాళ్లు క్కాకపోతే కొన్నాళ్లకైనా వస్తుంది. వయస్సు మీరితే చదు వెల్లా వస్తుంది?

అన్న—మళ్లీ ఆమాటే మాట్లాడుతావు! అసలు నిన్ను చదవమన్నవా రెవరంట?—ముందు నా కది చెప్పు.

కమ—ఎవరో చెప్పడ మెందుకు! శరీరము వృద్ధిపొందడానికి అన్న మెలా తింటారో బుద్ధి వికసించడానికి చదు వలాగే చదువుతుంటారు. భోజనం చెయ్యటాని కెవరిపర్మిషనైనా పొందుతున్నారా? 'విద్య నిగూఢగుప్తమగు విత్తము'; దానివల్ల యెప్పటికైనా లాభమే గాని నష్టం లేదు.

అన్న—ఆఁ! యేమిటి! మాటలు నేర్పిన కుక్కను వేటకి పంపిస్తే యిసుకలో అంటే యిస్కో

అందిట. అల్లా వుంది నీవరస. అన్నం తినకపోతే చచ్చిపోతారు. చదువుకోకపోతే యేమైపోతారు ?

కమ—ఏమీ అయిపోరు—జ్ఞానంమాత్రం నశిస్తుంది.

అన్న—నీపాటిఆలోచన లేకేనా మనపటివాళ్లు చదువుకోంది ? వాళ్లకేం జ్ఞానం తక్కువైంది ?

కమ—పూర్వకాలంలో అంతఃపురాల్లో వుండే క్షత్రియస్త్రీలుకూడా చదువుకున్న వాళ్లే. ఆకాలంలో ఎవరూ విద్యావిహీనులు లేరు.

అన్న—నే నేమీ చదువుకోలేదు. నాకేం జ్ఞానం తక్కువయింది ? వుత్తరం రానేచదువు చాలు ఆడదానికి.

కమ—సస్కృతు చెయ్యగల అక్షరా లొస్తే యెంతప్రయోజనమో వుత్తరం రానేటం తొచ్చినా అంతే ప్రయోజనం.



అన్న—యేమిరా ! మెద్దులా అల్లా మాస్తూ వూరుకుంటా వేం ?

నేను—ఊరుకోక యేం జెయ్యను—నాచం సబబుగా ఉన్నప్పుడు ?"

అన్న—యేమి ! సబబుగా వుంది ? యెందుకు లే—నీగడ్డి నువ్వు తింటావు. ఆతర్వాత అమ్మ చెప్పింది కదా వినకపోయానని అంగోరిస్తావు. యేమివంటి కుర్చుని—నా కెందుకు ?

నేను— నా కెందుకని నువ్వూరుకుంటే బతికిపోతాం.

కమ—చీకటి పడిపోతోంది, యెప్పుడెళ్లటం ?

అన్న—నీ కేం మతి పోయిందా యేమి టన్నాయి—చెబుతూంటేను ? ఆకట్టేమి టల్లా వుంది ?

కమ—నే నిక్కడికి కొచ్చినప్పట్నుంచీ కడుతున్న కట్టేగా, యిప్పుడు కొత్తే మొచ్చింది?

అన్న— అనుకుదా మనుకుంటూనే వున్నాను. మామూలుగా లేదే ?

కమ—దీనిపేరు పారసీకట్టు. దీని కంతగా లను కోవడ మెందుకు ?

అన్న—అయ్యో ! యిదేం విపరీతమో అన్నా ! నలుగురూ మాస్తే పేర్లెట్టరూ? అసలు తెలుగువారి కోకలు కచ్చా పోసి కట్టవలసిందే. కాని యిల్లాంటిపిచ్చి వేషా లేస్తే నన్ను పొడిచి చంపెయ్యరూ ?

కమ—బాగానే వుండిందీ. కట్టుకూ బొట్టుకూ కూడా లా పాసు (pass) చేస్తే అడిగక్కర్లేదు. మీ కాలంలో ఆకట్టు బాగుంది, మీ రలా కట్టుకున్నారు. నా కది నచ్చక నే నిలా కట్టుకున్నాను. మీరు పేర్లు పెట్టకుండా వుంటే వూళ్లోవా రెవరూ యేమీ అనరు. ఒక వేళ తెలివిహీను లెవరైనా అన్నా మన మంతగా కేర్ (care) చెయ్యనక్కర లేదు.

అన్న—నన్నే లెక్కచెయ్యాలంలేదు, వూళ్లో వాళ్లను లెక్కచేస్తావు నువ్వు ? నాకూ ఆబాధేంతేను.

కమ—మీరూ చెయ్యకండి.

అన్న—నేనుకూడా వినిపించుకోకపోతే, పలానివారి కోడ లిలాంటిదని అపరిదెప్ప రాయండా—నాకు?

కమ—ఏమిటి? ఇంగ్లాంటిపంటే నా కర్థంకావటం లేదు. నాలో దోషం ఏముంది?

అన్న—యింత శా.మిటి నీకు? యిల్లా వుండడమే తప్పు. యెవరో అనాలా యేమిటి?

కమ—మీరు గొడ్డుకుపోబట్టి మీ కది లోకులా కనబడుతూంది. అయినా వుండే సనుకోండి. మీ రనుకుంటారు, వారనుకుంటారు అని జడుసుకుంటూవుంటే యిక సరదా యెల్లా తీరుతుంది?

అన్న—అందుకోసం యిలా హద్దూ పద్దూ లేకుండా మారిపోవటం దేనికి?

కమ—నే నేమీ మారలేదు. ప్రతిస్వల్పవిషయానికీ మీరే రాద్ధాంతం చేస్తున్నారు. అయినా యేమా బాగానే వుంది! నన్నెంగానే మీ మాపనిలా కనబడుతూంది. నే నొచ్చి సరిగా నాలుగైదురోజులు లైందో లేదో, యీనాలుగురోజుల్నుంచీ యేదోనికో ఒకదానికి నన్నొత్తిపొడవడమే! నన్నింతవరకు యెవరూ పేర్లుపెట్టినవారు లేరు. యికనుంచి పని కట్టుకుని పెట్టిస్తే చెప్పలేను గాని.

అన్న—అయ్యో రామా! యీ దిక్కుమాలినపిల్లరా బాబూ! నువ్వనిపిస్తున్నావా—యేమిటది? బెల్లంకొట్టిన రాయిలా మాట్లాడవేమిరా?

నేను—బాగానే వుంది—నన్నేం జెయ్యమంటావు? కట్టుకున్నందుకు నేనుకూడా యికలేని ఫూలు (fool) ననిపించుకోలేదనా—నీవిచారం? ఎవళ్ల యిలా సరదాగా వుంటే అలా వుంటారు. అన్నిటికీ పెద్దవాళ్లు కలగజేసుకోవటమంత ఫూలిష్‌నెస్ (foolishness) మరి లేదు. ఏదైనా తప్పుపని చేస్తే యికలెయ్యొచ్చు.

అన్న—వీటివెంబడి అవీ వొస్తాయి—యెంతో సేపు పడుతుందా? యిలా వుంటే మహారాజులా పాడవుతారు.

నేను—బుద్ధి మంచిదైతే యెన్నటికీ పాడవరు. బుద్ధి వంకరబుద్ధయితే మనసు యెలా వుంచినా సరిగా వుండరు.

అన్న—ఆ కాటుక లేని కళ్లూ—ఆ పొట్టిచేతుల రవికా—పువ్వులు చుట్టిన జడముట్టు—బుజాలదాకా వేళ్లాడే ఆ లోలకులూ—కడియాలు లేకుండా కాళ్లకి జోళ్లూ—బాగానే వుందమ్మాయి వేషం! యివన్నీ మార్చుకోమని చెప్పకుండా చూస్తూ వూరుకోమంటావా?

నేను—కాలాన్ననుసరించి ఫేషన్సు (fashions) మారుతూవుంటాయి. ఎప్పుడెలా వుంటే అలా వుంటారు. దాని కేమంటావు?

అన్న—నే నన్నానా? యిది బాగుందని నేనుకూడా యిల్లా తయారైతే మొహమ్మీద వుమ్మేస్తారు నలుగురూనూ.

నేను—ఉమ్మేస్తారని భయపడుతున్నావా? లేకపోతే నీకు అభ్యంతరం లేదన్నమాట! నాన్న వున్నట్టే నే నున్నానా? నువ్వన్నట్టు కమలమాత్రం యెలా వుంటుంది? నేను పిలక పెట్టుకుంటే నువ్వేగా క్రాపింగు చేయించుకునేదాకా ప్రాణాలు కొరికేశావు?

అన్న—మొగాడెల్లా వున్నా లోకం హర్షిస్తుంది. ఆడది యిష్టమొచ్చినట్టల్లా వుంటే పెద్దవాళ్ల ప్రాణం వొప్పదు. కళ్లనిండా కాటికా, కచ్చాపోసి చీరా, కాళ్లకి కడియాలూ, మొహాన్నిండా పసుపూ, దాని మీద దమ్మిడీఅంత కుంకంబొట్టూ వుంటేనే గాని కేతరాజువారికోడ లనిపించుకోదు. యీతురకబీబీ అల్లా మారితేనే గాని నే నొప్పుకోను.

కమ—నెత్తిమీద పిలకతో సహా గోష్పాదమంత జుట్టూ, బిళ్లగోచి పోసి బట్టా, వేలికి దర్భముడి ఉంగరమూ, ముఖంమీద విభూదిరేఖలూ వుంటేనే గాని బ్రాహ్మలే అనిపించుకోరు. మనవాళ్లా స్థితికొస్తే వాళ్లకు తగ్గట్టు మేమూ మారతాము. ఆడవాళ్లూ మొగవాళ్లూ ఒకలాగే పుట్టారు. ఎక్కువతక్కువ లేమీ లేవు. అందుచేత అయినదానికీ కానిదానికీ కలగజేసుకుని 'నువ్విలా వుండాలి' అని పెద్దవాళ్లు నిరూపించడం బాగుండలేదని నా అభిప్రాయం. నేను మారితేనే గాని ఒప్పుకో నన్నారు గనుక చెప్పవలసొచ్చింది. ప్రతిస్వల్పవిషయానికీ మీరు చెబుతూవుండటం, అది వినలేదని ఒకవిధమైన కోపమేర్పడటం,—ఇదంతా అనవసరం. చూచీ చూడనట్టు వూరుకుంటే యేపోట్లాటలూ వుండవు. మర్యాద నిలుపుకో

పిలచినవారు అలాగే చేస్తారు. నేను మీకంటె చిన్న దాన్నయినా మీకు చెప్పవలసొచ్చింది. మీ రింకో విధంగా అనుకోకండి.

అన్న—మాశావత్రా, మాశావత్రా—యెల్లా చెబుతూందోనూ! యిల్లాంటిదానికి సమాధానం నువ్వేం చెబుతావు, నే నేం చెబుతాను? యిలా వస్తుంటనే గా, నేను చదివించొద్దు నాయనా అని యేడి చింది? అప్పుడు నామాట చెవినిపెట్టావా? యిప్పు డాపిల్ల కేంజవాబు చెబుతావో చెప్పు.

నేను—ఎందుకు—జవాబు చెప్పడం?

అన్న—యేమిటే! చెప్పక యిష్టమొచ్చినట్టల్లా వుండనిస్తావా? నీకు మతేమన్నా పోయిందా యేమిట్రా!

నేను—నాకు కాదు పోయింది. ఎల్లా అయితేం పెళ్లి చేసుకున్నాంగదా అని నీతోగలిసి ప్రతిదానికీ పొడు చుకు తినమంటావా? 'నువ్విలాగ వుండాలీ'అని జ్ఞానం వున్న మగవా డెవరూ రూలు పాస్ (pass) చెయ్యరు. నువ్వూ కమలా యేమనుకున్నా సరే, నేను కలుగజేసు కునేవాడను కాను. నాదగ్గి రిలాంటిసంగతు లేమీ చెప్పొద్దు. ఏవస్తువ జూచినా నీకు పోయింది గనుకనా మమకారం—యిక చిన్న వాళ్ల కెలా పోతుంది?" అని నే నంటూండగా మానాన్నొచ్చారు. ఆయన రావటం తోటే కమల లోపలి కెళ్లిపోయింది.

"ఏమి టే గడబిడ?" అన్నాడు మానాన్న.

అన్న—యేమిటా? యీదొరా, దొరసానీ షికారు బయల్దేరారు. నే నిహ వూళ్లో తలెత్తుకొని తిర గ్గలనా? అంచేత నేను వల్లకాదన్నాను. యిద్దరూ నాలో తగూ పెట్టు కున్నారు. యిదీ జరిగిన సంగతి.

"ఆఁదది షికారెళ్లట మేఁవిటి? యింకా నయం! ఆనావు గనక సరిపోయింది. లేకపోతే వూళ్లో నలు గురూ నన్ను పొకిచి చంపేద్దురు. యివ్వాళ నువ్వడ్డం గలబట్టి నా మర్యాద దక్కింది. అయినా ఆడదాని కైనా సిగ్గుండాలి, మొగాడికైనా సిగ్గుండాలి అదొక వేళ వస్తా నంటే అనుకో, మనవాడి కుండక్కర్లేక జ్ఞానం? ఈదిద్ద మ్మొల్లా సిద్ధమైనాడు, తీసుకెళ్లటానికి?"

అన్న—అబ్బే! వాడి నోట్టిచెవలమ్మని చేక్కూ చోపెట్టిం దీనాలుగురోజుల్లోనూను. ఆపి ల్లెంతంటే అంతే అంటున్నాడు. అయిపోయింది వాడిపని.

"ఏమిరా! బండీ కట్టించింది షికారెళ్లటానికేనా? మాట్లాడ వేమిరా?"

"అవును."

"అయితే దాన్నికూడా వెంటేసు కెళుదా మనేనా?"

"ఇద్దరం వెళ్లొస్తే తప్పేముంది? మీ లుంటే అమ్మకూడా రావచ్చు."

"అయ్యొయ్యో! యిం కెక్కడి కొంప—తగలడి పోయింది! దిక్కుమాలిన సమ్మంధం—వాళ్లు బ్రాహ్మ లవునో కాదో అసలు! ఒకవేళ అయినా, యే బ్రహ్మసమాదిగాళ్లో! మొట్టమొదటినుంచీ అదేఁవన్నాంటే



నేను వినిపించుకున్నాను కాను. వినిపించుకోనందుకు రోగం చెప్పగా కుదిరింది నీపని! ఇంకా నయం బ్రా హ్మణ్య మేఁవిటి నాశ్రాద్ధం! మాలపీనుగు లింట్లో కాలు

పెట్టిం తర్వాత బ్రాహ్మణ్యం ఎల్లా అవుతుంది? అయ్యయ్యో! విశ్వనాథుడెంత విపత్తులో కేర్చాడబ్బా! నాకెర్మిష మిద్దా కాలించి. మిమ్మల్నిమట మింగుడు! ఇహ చాలు కాని, అబ్బాయీ! వాళ్ల పిల్లని వాళ్లదగ్గిర దిగబెట్టరా. మన కుటుంబం యేగోదావరికిస్నానమో చేసి ప్రాయశ్చిత్తమన్నా చేసుకుందాం. ముఖ్యంగా మా వంశపారంపర్యాన్ని నేను నిలుపుకుంటున్నా. నీవు పతితుడవని అఘోరిస్తున్నారు గా? నువ్వు తిరిగి బ్రాహ్మణ్యరూపంతో మాకు కనపడనేలేదు. మేము చూసేది లేదు. నీవారిని నువ్వొళ్లు, నూతిప్పలు కోం పడతాం. అంతే గాని యీపిల్లని మేమింట్లో పెట్టుకున్నామంటే నలుగురు బ్రాహ్మలూ వచ్చి చావగొట్టి వదిలిపెడతారు. ఆ దెబ్బలూ పడిలేము,—అస్తమానం ప్రాయశ్చిత్తం చేసుకోలేము. మాటిమాటికీ ప్రాయశ్చిత్తం చేయించుకుంటే నాలిక పుండయి చక్కాపోతుంది. అంచేత యీగొడవ మట్టు కాపిల్ల కన్నం పిత్తుల్లో పెట్టించి తెప్పొద్దనే వాళ్ల వాళ్లదగ్గిర దిగబెట్టరా. అంతే గాని నలుగురూ చూస్తే వెలేస్తారు. సముద్రంమీద ప్రయాణం చేసి నువ్వు బతికొస్తావన్నమాట సర్వాబద్ధం. సెలవైపోగానే నువ్వెళ్లి ఆ గంగలో దిగు. యిలా మీ జోక్యం మా కక్కర్లేదు—వేడుకుంటున్నాను."

## 3

నాకు చెన్నపట్నం కాపరం బహు కొత్తగా వుంది. నేనింకా సీమ గీమ చుట్టబెట్టి రావటంచేత నా కాస్త తెన్నుకని పంపడంలేదు; గాని మాఅమ్మకీ నాన్నకీ తలణాగకున్నట్టుంది. నాకు కూడా గులకరాళ్ల మీద బండి పోతున్నట్టు దిక్కుమాలిన అరవభాషతో తలమంట పుట్టుకొస్తోంది. కాని యేం జెయ్యను! అయిదారేళ్లు వస్తపడి సంపాయించిన బారిస్టరుబల్లని చిన్న వూళ్లో కడితే డిగ్నిటీ (dignity) కి లోపమొస్తుందేమోనని నాకు సందేహం కలిగింది. ప్రాక్టీసున్న ప్లీడర్లలో ఆళ్లి, "I am an Advocate" అంటూ బాండ్స్ (bands) గొంతుకు కట్టుకు తిరుగుతున్న వకీళ్లకే మాత్రం ప్రాక్టీస్ వస్తుందో మనకూడా అంతకంటె యెక్కువ రాదనుకున్నాను. బారిస్టర్ అని పెద్దపెద్ద అక్షరాలతో రాసి యెంత రెయిల్వే స్టేషనుకు దగ్గిరిగా కట్టినా ఒకమారు చదవటంతోటే చెల్లు కాని లోపల కాలు పెట్టేవాడెవడూ వుంటాడని తోచింది. ఇదల్లా వున్నా చెన్నపట్నంలో ప్రాక్టీస్ పెట్టడానికి ముఖ్యంగా నాస్నేహితుల పట్టేనని చెప్పాలి. నీళ్లు కొత్తచెయ్యటంవల్ల మా వమ్మంగి శయ్యాగతుల మయ్యాం. ఏమిరిరగాలన సాలవల్లో అందరం లేచి తిరుగుతున్నాం కాని మా అమ్మమాత్రం మంచాన్నింకా వదిలిపెట్టలేదు. అల్లా మంచంమీద పడుకునికూడా నన్ను రెండోవివాహం త్వరలో చేసుకోమని బాధిస్తూనే వుంది. మాతల్లిదండ్రు లిద్దరూ కలిసి నా అత్తవారిసంగతేమీ తెలియకుండా జేసేశారు. కాని నాకు కమల మీదనే వుంది మనస్సంతాను. కొంత స్తిమితపడ్డతర్వాత వాళ్ల ఇన్ఫర్మేషన్ శ్రద్ధగా కనుక్కుందామని మనస్సులో నిశ్చయపర్చుకున్నా. మా అమ్మకి జ్వరం తగ్గలేను, పైగా యెక్కువైనట్టు తోచింది. ఇహ డాక్టర్ని రప్పిస్తేనే గాని లాభం లేదని స్నేహితునింటికి కబురంపించాను, డాక్టర్ని పంపించుమని. మానాన్న సంధ్యావందనం చేసుకుంటున్నా డింట్లో. నే నేమో మా అమ్మ దగ్గిరి కొచ్చి యెల్లా వుందని అడిగాను.

అన్న—అంత యెక్కువగా లేదురా. వొళ్లు కూడా అంతవెచ్చగా లేదు. కాని నేను పడిపోయినా, యిల్లుపట్టిన వెధవాడబడు చుంది గనక మనవుచ్చెవుస్తోంది. లేకపోతే మనపాట్లు కనపడును. నే నెన్నిమాట్లు చెప్పినా మావాళ్ల పిల్లని చేసుకోమని, వినిపించుకో వేమిరా? యింటికి పట్టిన కోడ లుంటే యీఅమ్మవారిని గుమ్మంలో అడుగుపెట్ట నిగ్గునా? యింట్లో కోడలు లేకపోబట్టి అవ స్థలాపట్టింది కాని.

"అసలు వా ళ్లెక్కడున్నారో కూడా కనుక్కోండే మనం తొందర పడటం బాగుంటుందిటమ్మా?"

అన్న—అద్దాన్నం, వాళ్లసంగ తెత్తకు. వున్న వూరొదిలిపె ట్టెక్కడికో లేచి పోయారట! వాళ్లు

మనకి కనపడనే కనపడరు. ఒకవేళ కనిపిస్తేమట్టుకు వర్ణ సంకరప్పిల్ల నింట్లో తెచ్చిపెట్టుకుంటావుట్రా ?

"వర్ణసంకర మేమిటి ?"

అన్న—ఆఁ! యేమిటా ? ఆపె ల్లింకా చదువే దుస్తోంటిబ! అలాంటిపిల్లని సుమ్మంలోకి రానిస్తానా ? నాప్రాణం వుండగా!

"ఎక్కడ చదువుతూంవో ?"

అన్న—ఏట్లో! యెక్కడైతే నేం మనకి ? కాని నేను కుదిర్చినపిల్లని చేసుకో.

"ఆతరవాత ఆలోచిద్దాం. కాని యిప్పుడు పెళ్లి మా టెత్తకమ్మా."

అన్న—ఇంకా ఆలోచ నేమిటి,-మావాళ్ల పిల్లని చేసుకోక ?

"ఆయాసపడకమ్మా" అని నే నంటూవుండగా మా నవుకరొచ్చి డాక్టరుగా రొస్తున్నారని చెప్పాడు. గబగబా కుర్చీ వొకటి మంచందగ్గిరిగా లాగి సావిట్లో కెళ్లాను. కారులోంచి దిగుతూ పెట్టె పట్టుకు నొక సర్వెంటూ, లేడీడాక్టరూ ప్రత్యక్షమయ్యారు. జ్వరం వొచ్చింది ఆడవాళ్లకే కదా అనుకొని మాన్నేహితు డీవిడిని పంపించా డనుకున్నాను. ఆవిడా లోపలి కొచ్చింది. 'గుడ్ మార్నింగ్' అని కుర్చీ చూపించాను. ఆవి డాశ్చర్యంతో రెప్ప వాల్చకుండా అయిగారు సెకండ్లు చూసింది నావంక.

—"మాఅమ్మగారికి ఛీవ రొచ్చింది—లోపలికిరండి, చూద్దురుగాని' అని నే నన్నాను. నవ్వుకుంటూ పెదవులకి జేబురుమా లడ్డంపెట్టుకొని లేచింది. ఆడది న న్నిల్లా చూడట మేమిటి, యీనవ్వట మేమిటని నాకు చాలా ఆశ్చర్యం కలిగింది. ఈదేశంలోకూడా ఆడవాళ్లకి జొత్తిగా భయభక్తులు పోయాయే మనుకున్నా. ఇద్దరం రోగిమంచందగ్గిరి కెళ్లాం. ఆవిడ థర్మామెటరు తీసి రోగినోట్లో పెట్టి స్టెతస్కోపుతో లంగ్సుని పరీక్ష ప్రారంభించింది. చూడబోతే యిరవైయూడు యిరవై నాలుగేళ్లకంటె యెక్కువ వున్నట్టు కనిపించలేదు. వేసుకున్నసంతా ఇద్దరు డ్రెస్సు. సౌందర్యానికి బాగానేవుంది— యేకులమో గాని! చెవులకి లోలకులూ, మెళ్లో వొక



సెక్ లేసూ, సన్నపాటి గొలుసూమాత్రం వున్నాయి. కాని న న్నావిడల్లా చూడటానికి కర్థం మాత్రం యెం తాలోచించినా నాకు బోధపడలేదు. స్త్రీలు అసలే చపలలూ. అందులో చిన్నతనం. అందుచే తల్లా చూచుంటుం దనుకున్నాను. ఎగ్జామినేషన్ పూర్తయిం తర్వాత నావైపు తిరిగి,—

డాక్ట—ఛీవ రంత ప్రమాదమైంది కాదు. మరేం భయంలేదు. మీసర్వెంటూ స్తే నేను మెడిసిన్ పంపిస్తాను; రెండుపూటల్లో తగ్గిపోతుంది.

"అలాగే వెంటనే పంపిస్తాను."

డాక్టరు—ఆహారం రొట్టే పాలూ యివ్వండి. అవసరమైతే రేపు మార్నింగు మళ్లీ వచ్చి చూస్తాను.

నేను మానవుకర్ని పిలిచి డాక్టరుగారివెంట వెళ్లి మందు తీసుకురమ్మని చెప్పాను. ఆవిడని నిమ్మళంగా కారుదాకా సాగనంపి కారు కదలిందాకా వుండి యింట్లో

వొచ్చాను. ఆమె తల వంచుకుని కారులో కూచున్నా చూపు నామీదే వున్నట్టు నాకు తోచింది. నోటికి రుమాలడ్డం పెట్టుకున్నా బుగ్గలమీది సొట్టలవల్ల చిరునవ్వు నవ్వుతున్నట్టు బాగా తెలుస్తూనేవుంది. కాని ఆనవ్వు చూస్తే నాకు చెడ్డకోపం వొచ్చింది. ఆడవాళ్లుద్యోగాలు చేస్తే మిడిసిపాటిల్లాగే వుంటుం దనుకున్నాను. ఇల్లాగే అనుకుంటూ కుర్చీలో కూచున్నాను. ఒకఅరగంటలో మందు తీసుకొచ్చాడు మానవుకరు. నే నొకడోసు మాఅమ్మ కిచ్చి సీసా అల్మారులో పెట్టాను. ప్రాక్టీసు లేకపోయినా, కోర్టుకెళ్లడం తప్పను గనుక భోంచేసి కోర్టుకెళ్లాను. ఆరోజెల్లాగో గడిచిపోయింది. ఆమరుచటిరోజుకి ఆవిడిమందువల్లనే తగ్గిందో, తగ్గవలసే తగ్గిందో కాని—మాఅమ్మకి జ్వరం తగ్గింది. ఈసంగతి చీటి వ్రాసి పంపాను. రెండుమూడురోజులకి సరిపొయ్యే మందు పట్టుకొచ్చాడు మానవుకరు. నేను రోజూలాగే కోర్టుకెళ్లి రెండుగంటల కింటికి వొచ్చాను. నే నింటికి వొచ్చి డ్రెస్సు మార్చి యీజీఛెయిరులో కూచున్నాను. కాఫీ తీసుకొచ్చి బల్లమీద పెట్టెళ్లిపోయింది మామేనత్త. అది పుచ్చుకోబోతున్నా. ఇంతలో లేడీ డాక్టరుగారి సర్వెంటొచ్చాడు. ఇప్పుడు వీ డెందు కొచ్చాడో అనుకున్నా. వాడు కవ రొకటి నాచేతి కిచ్చాడు. నే నది తీసుకుని చింపుతుండగా స్ఫురించింది, బహుశా బిల్లయుంటుందని. ఇంతతొందరగా బిల్లు పంపించింది—నే నెక్కడికైనా పారిపోతా ననుకుంది కాబోలని నాకు వొళ్లు మండింది! అయినా ఆవిడి ననవలసిన పనేముంది? 'ధనమూల మిదం జగత్' కదా అనుకున్నా. ఇలా అనుకుంటూనే మడత విప్పాను. విప్పి విప్పటంతోటే నాదృష్టి పైనున్న అచ్చక్షరాల మీద పడ్డది. 'Mrs కె. యస్. కమలా, యమ్. బి., బి. యస్., అసిస్టెంటు సర్జన్, మద్రాస్.'

* * * * *
* * * * *
* * * * *

యస్. కేశరాజ్, బారిస్టరు,
c/o Mrs. కే. యస్. కమలా,
యమ్. బి., బి. యస్., అసిస్టెంటు సర్జన్,
మైలాపూరు, మద్రాస్.

---

# జ్ఞానబుద్ధుఁడు

జి. జాషువకవిగారు

౧

సరవి న్నీకడకంట వెల్గిన యహింసాజ్యోతికిన్ గొండలు
న్గరఁగింపంబడె వెన్నపూసలవలెన్, త్వత్ప్రేమమండలం బెల్ల నీ
చరణాబ్జంబుల ముద్దు గొన్నది మహీశగ్రామణీ! జ్ఞానభా
స్కర! బుద్ధప్రభు! నీసుధోక్తులకు సంస్తంభించె ముల్లోకముల్.

౨

నీ వల రావిచెట్టునకు నేర్పిన భూతదయారసోక్తిలో
భూవలయంబు బాష్పజలపూరితలోచన మయ్యె, బింబిసా
రావనిభృత్సభాభవన మార్ద్రమనస్కతఁ గ్రుంగిపోయె, నీ
పావన బాహుపీఠమునఁ బ్రాణము దక్కిన గొఱ్ఱెపిల్లతో.

౩

పాములు గాలిమేఁత లలవాటొనరించుట నీవు కారణం
బేమొ! త్రిదండిరాజపరమేశ్వర! నీదు పదాంకముద్రలోఁ
జీమయు హాయిగా నిదురఁ జెందిన దెక్కడి దీ యకారణ
ప్రేమ? జొహారు నీనయనవీథులఁ దాండవమాడు శాంతికిన్.

౪

హీనము లైన చూపుల, వధించెడువానికి మ్రొక్కి, "యన్న! నా
కూనల కండ లేదు, కనుఁ గొమ్మని గద్గదనిస్వనంబుతో
లోనఁ దపించి, నాల్గుదెసలుం బరికించుచు, "బుద్ధదేవ! రా
వే! ననుఁ గావవే"యని జపింపనిజంతువు లేదు మేదినిన్.

౫

కటికకసాయివాని చిన్న కత్తియు నెత్తురు చూడలేదు, నీ
చరణరజంబు సోఁకినరసాతలసీమలలోన; నిప్పుడు
ర్వరఁ బెకలించి చూచు ప్రతివానికి నీమహనీయవిగ్రహో
త్కరములు దర్శనం బిడు నఖండతపః పరిపూతమూర్తులన్

౬

పైకొని రెండువేలయిదువందలయేండ్లు వయస్సు వచ్చినన్
నీకమనీయబోధలకు నిగ్గు రవంతయుఁ దగ్గలేదు, 'హిం
సాకరణంబు పాప' మనుశబ్ద మశోకుని జాతిగుండెలన్
దాఁకి యగల్చె; నీధనమునన్ గదలించెడు నష్టదిక్కులన్.

---




## జ్యోస్యమునకు శాపము

ఎఱ్ఱగుంట్ల వైద్యనాథం గారు

బ్రహ్మ విష్ణు మహేశ్వరులు స్వర్గమున ప్రపంచ కాల నిర్ణయము నేర్పరచిరి. వారియిష్టానుసారము నడువగా కొద్దికాలమునకు ప్రపంచమున భరింపలేనిసంగతులు తటస్థించినవి, అప్పుడు వారు నవగ్రహములను పిలిచి, "మీరు ౧౨ సంవత్సరములు వక్రించవలెను. ప్రజ, ధనము, ధాన్యము, జంతువులు నష్టమయినగాని ప్రపంచము సరియైన మార్గమునకు రా"దనిరి.

వేదపండితుడగు ఒక బ్రాహ్మణుడు జోస్యమునందు పరిపూర్ణజ్ఞానము గలవాడై స్వర్గలోకము సంగతులుకూడా కనిపెట్టుచుండెను. ఇక రాబోవు ౧౨ సంవత్సరములు నీళ్లుకూడా దొరకుట కష్టమని తెలిసికొని ఆ బ్రాహ్మణుడు ౧౨ సంవత్సరములకు సరిపోవు నీరు, ధాన్యము మొదలైనవి జాగ్రత్తపెట్టెను. వానిని జూచి ప్రజలందరు నవ్విరి. ఆయనకూడ తాను పిచ్చివానివలెనే ఉండెను.

కరువు ప్రారంభమయ్యెను. మూడు సంవత్సరములు అయేటప్పటికి చాలామంది తిండి లేకచనిపోయిరి. వర్షములు చాలా తగ్గెను. పంటలు లేకుండెను. ఐదుసంవత్సరములకు కొద్దిమందిమాత్రమే ధనాధికులు తిండికిగలవారై నిలిచిరి. అప్పుడు నవగ్రహములు కుతూహలంతో ప్రపంచము పంటలులేక ఐదు సంవత్సరములున్న యెట్లున్నారో అని బ్రాహ్మణవేషధారులై వచ్చిరి. వారు మార్గమున ఈపండితుని చూచి, ఈ బ్రాహ్మణుడు ఎట్లు బ్రదికియుండెనా అని ఆశ్చర్యము నొంది, "అయ్యా, మాకు అన్నము పెట్టింపుము" అనిరి. బ్రాహ్మణుడు తనభార్యతో చెప్పి వారికి భోజనము పెట్టించెను. వీరు పరుండుటకు ఒకగది నిచ్చెను. అందు వీరు సరిగా లేక వక్రించి పండుకొనిరి. వీరు పరుండినపిదప బ్రాహ్మణుడు తనశాస్త్రములను చూచి వీరెవరో కనుగొనలేకున్నను, బ్రహ్మలోకమున నవగ్రహములును లేనట్టును, వారందరును భూలోకసంచారమునకై వెళ్లినట్టును తెలిసికొనెను. 'బహుశః వీరే ఆనవగ్రహములై యుండవచ్చును. ఇట్లు ఈగ్రహములు వక్రించుటచేతనే యిట్టికరువు తటస్థమయినదికదా' అని తనభార్యను మెల్లగా లేపి యిద్దరును కలసి ఈనవగ్రహములను ఒకరిప్రక్కన నొకరిని వరుసగా పండబెట్టిరి. వెంటనే వర్షములు కురిసెను. ప్రపంచమంతయు సంతోషముతో మెలగుచుండెను.

తెలవారి ఈగ్రహములు లేచునప్పటికి ఈ మార్పు వారికి ఆశ్చర్యము కలుగజేసి, 'యిది యీబ్రహ్మణుడు జేసినపని' యని తెలిసికొనిరి. 'ఇట్లు మానవులు విద్యచే మన సమాచారములు తెలిసికొని మనలను వశ్యులుగా జేసికొనిన మనపనులు మనము సాగించుటకు వీలు లేదు'అని బ్రహ్మతో మొరపెట్టగా, 'జోస్యము సరియైనకాలము తెలిసిన గాని అబద్ధ మగుగాక' అని బ్రహ్మ శాప మిచ్చెను. అందుకే సరియైనవేళ తెలియవలెనని అనడము.

---

# అంత్యసేవ

ముద్దా విశ్వనాథము గారు

ఒకాయన కొకగుఱ్ఱ ముండేది. దృఢంగా ఉన్నన్నాళ్లూ ఒడలు దాచుకోకుండా, విశ్వాసంగా పనిచేసింది. కొన్నాళ్లకి పాపం! వృద్ధాప్యం వచ్చి, శక్తి ఉడిగిపోయింది. నిర్దయుడయిన ఆయజమాని, "నిన్ను మేపడం శుష్కదండుగ. సింహంకంటె ఎక్కువబలం కల్గినప్పుడు గాని నిన్ను మళ్లా నాశాల లోనికి రానీయను" అని చెప్పి, తఱిమివేశాడు.

ఏం చేస్తుంది? ఏడుస్తూ అడవులు బట్టిపోయింది. పోగా పోగా ఒకనక్క అగపడింది. "ఏవమ్మా? అట్లా తల వ్రేలవేసికొని విచారంగా ఉన్నా వేం?" అని అడిగింది. స్థితిగతులు వెళ్లపోసికుంది గుఱ్ఱం.

"నీకొచ్చిన భయమేమీ లేదులే, ఖేద పడకు. నేను చెపుతాను ఉపాయం" అంది నక్క. అని, "చచ్చినట్టు నటిస్తూ కాళ్లునిగుడదన్ని పండుకో. నేను నీవీపుపైన తట్టినపుడు పరుగెత్తి పరుగెత్తి నీయజమాని చెప్పింది.

తిన్నగా నక్క ఒకసింహముదగ్గఱకు వెళ్లి, "నీ కీవేళ మంచి ఆహారం దొరుకుతుంది" అని ఊరించి, గుఱ్ఱమున్న చోటికి తీసికొని వచ్చింది. "ఇక్కడ తినడానికి సదుపాయంగా ఉండదు. దానితోకకు నిన్ను కట్టుతాను. నీగుహ కీడ్చుకుపోయి సావధానంగా ఆరగింపవచ్చు" అని చెప్పింది. సింహము ఒప్పుకుంది.

ఆమట్టున సింహంకాళ్లు గుఱ్ఱానికి గట్టిగా బిగియగట్టి గుఱ్ఱంవీపుపైన చప్పట చఱచింది.

అంతే, సంతోషంతో గుఱ్ఱం ఉరుకలు వేసికుంటూ, సింహాన్ని యీడ్చుకొని యజమానివద్దకు పరుగెత్తిపోయింది. ఇది చూడగానే, యజమానికి ఆశ్చర్యంవేసింది. ఆయన అప్పటినుండి ఆ గుఱ్ఱాన్ని దయతో యావజ్జీవము పోషిస్తూవచ్చాడు.

కథ కంచికి — మనం యింటికి.

---

# బూ రె లు

తులసి లక్ష్మీనారాయణమూర్తిగారు

అనగా అనగా ఓవూరు. ఆవూళ్లో ఓబ్రాహ్మణు డుండేవాడు. పాప మాయన చాలా బీదవాడు. ఆదరిద్రానికి తోడుగ బ్రహ్మ ఆయనకు చాలామందిపిల్లల్ని కూడా ప్రసాదించాడు. ఆయన ఎల్లాగో కష్టపడి ఆరోజు కారోజు సంసారం సాగిస్తున్నాడు.

ఇంతట్లో ఒకనాడొకనవాబుగా రొచ్చారావూరు. ఆయన చాలామంచివాడని తెలిసిందా బ్రాహ్మడికి. ఆయనదర్శనం చేద్దా మనుకున్నాడు. ఆనవాబుగా రొకడేరా వేసుకుని ఊరుచివర విడిశారు. నవాబుగారిదర్శనాని కెళ్లేటందుకు ముహూర్తంచూసుకొని బూరెలు చేయించాడు. గుండ్రంగా తయారైన బూరెలొకబుట్టెడు పట్టుకుని నవాబుగారి డేరావద్దకు వెళ్లాడు. నవాబుగారిదగ్గర యెవరూ లేకుండా చూచి లోపలి కెళ్లాడు. బూరెలబుట్టను ఆయన యెదుట పెట్టి, తనఅవస్థంతా విన్నవించేడు. నవాబుగారు బూరెల నెప్పుడూ చూడలేదు. అందుచేత "అవేమిటి? వాని నేమిచేస్తా?" రన్నాడు. బ్రాహ్మణుడు "వానిని తిందు"రని జవాబు చెప్పేడు. నవాబుగా రొకబూరెను తినుట కారంభించారు. మఱొకటి తిన్నారు. ఆయన కాశ్చర్యం ఎక్కువై పోయింది. బూరెలు పైన పిండి ఉండడంచేత చప్పగా వున్నాయి. లోపల తియ్యగా వున్నాయి. ఇదే ఆయనఆశ్చర్యానికి కారణం. మఱోబూరెను తీసి చుట్టూ తిప్పి పరీక్షించాడు. ఆశ్చర్యం మరీ ఎక్కువైంది. "దీనికిపైని యెక్కడా చిల్లి లేదు. లోపలి కీతీపి యెల్లావెళ్లిందో చెప్ప" మన్నాడు. 'మంచిసమయం దొరికిందిరా' అనుకున్నాడు బ్రాహ్మడు. ఈయన కసలు గుట్టు చెప్పేస్తే లాభంలేదని ఆలోచించి, ఆలోచించి, తుద కిట్లా చెప్పేడు: "మహాప్రభూ, ఇది యొక అపూర్వమైనవస్తువు. దీని నెవ్వరూ చెయ్యలేరు. ప్రభువుగారు దయ చేస్తారని తెలిసినప్పట్నుంచీ దీనిని తయారు చేస్తున్నాను. చాలాకష్టపడితే ఇప్పటికి తయారయ్యా యివి. ప్రభువుగారి కందరూ యిచ్చే ఫలహారం యివ్వడం యిష్టం లేక యింత కష్టపడి తయారుచేసే" నని చెప్పేడు. పాప మావెఱ్ఱి నవాబు నమ్మే డిదంతా. తన కోస మింతకష్టపడ్డా డీబ్రాహ్మడని ఉబ్బి పోయాడు. సంతోషం పట్టలేకపోయాడు. అందరికంటే తానే గొప్పవాడి ననుకొన్నాడు. అందుచేతనే యీబ్రాహ్మణుడు నాకోస మింతకష్టపడ్డాడని ఊహించి, బ్రాహ్మణ్ణి కుబేరుణ్ణిగా చేసేద్దామని ఆలోచించి 'నీకేమికావాలో కోరుకో'మన్నాడు. బ్రాహ్మడు 'రొట్టె నేతిలోపడిందిరా' అనుకొన్నాడు. 'అశ్టే కోరుకుంటే అత్యాశపడ్డాడంటారు లోకు' లని తనకుటుంబపోషణకు సరిపడ్డ ఆదాయము వచ్చు భూమినిమ్మని కోరుకున్నాడు నవాబుగారిని. "ఇంతేనా, ఇచ్చాను, పుచ్చుకో" మని తత్క్షణం వ్రాసి యిచ్చేశాడు పర్మానా. బ్రాహ్మణుడు సంతోషం పట్టలేక నవాబుగారికి సలాములు కొట్టి

యింటికి వచ్చేశాడు. అప్పట్నుంచి కుటుంబ 'బూరెలమాన్య'మని వ్యవహరిస్తున్నా రా మును పోషించుకొంటూ సుఖంగా నున్నా డా వ్రార్త్రిజలు. కథ కంచికి వెళ్లింది; మనము బ్రాహ్మణుడు. ఇప్పటికికూడా ఆభూమిని కాళ్లు కడుక్కొని యింటికి వచ్చాము.

---

## ఎత్తుకు పైయెత్తు

ఆలూరి రంగనాధరావుగారు

అనగా అనగా ఒకవూళ్లో ఒకపురోహితుడు. ఆయనకు డజనున్నర పిల్లలు. ఆయనకు మంచిగుమ్మడికాయకూరంటే శానా అపేక్ష. ఒకసంవత్సరము సంకురాత్రిపండగనాడు ఏమి చేశాడంటే మామూలుగానే స్నానము చేసి 'స్వామీ! తండ్రీ! యీ రోజున నా కొక గుమ్మడికాయ దొరికితే నీ కొకకొబ్బరికాయ కొడుతా' నని మొక్కున్నాడు. స్వామిధర్మాన ఆరోజునే ఒకభాగ్యవంతుడు పిలిచి గుమ్మడి కాయ ఆయనకు దానముచేసినాడు. పురోహితుడు 'అదృష్టం కుళ్లిందిరా' అని దానిని చంకలో పెట్టుకొని,యింటికిపోతూ 'యీకాయ ఇంటికి తీసుకుపోతే తలా ఒకబద్దన్నా రాదు. కాబట్టి యీకాయ పొరుగింటి మాచమ్మచేతి కిచ్చి వండించుకొనితిందా'మని అనుకొన్నాడు.

పొరుగింటి మాచమ్మదగ్గరికి వెళ్లి, "మాచమ్మా, మాచమ్మా, యీరోజు మీ యింటికి భోజనానికి వస్తాను. ఈకాయ కూర వండి పెట్టు" అన్నాడు. మాచమ్మ 'సరే' నని కాయ తీసుకొన్నది. పాపము! పురోహితుడు ఇంటికిపోయి స్నానముచేసి మడిగట్టుకొని వచ్చేసరికి, మాచమ్మ గుమ్మడికాయ దాచి, చెంచనకూర వండి విస్తరిలో వేసింది. పాపము! ఆశపోతు బ్రాహ్మణుడు గబగబా రెండు ముద్దలు తిని, "గుమ్మడికాయకూర ఏ"దని అడిగాడు. మాచమ్మ "అయ్యో, నాయనా! గుమ్మడికాయ తరిగి, పొయిమీద పెట్టి, వాకిట్లోకి పోయినాను. గుమ్మడికాయ, చెదరీ, బెదరీ, చెదరీ, బెదరీ, చెదరీ, బెదరీ, చెంచనకూర యిం"దని అన్నది. పురోహితుడు భోజనముచేసి వాకిట్లోకి వచ్చే సరికి, కడముంతొకటి కనపడ్డది. ఆముంత తీసుకుపోయి విస్తరి దగ్గరపెట్టి నాలుగురూపాయల కంచుచెంబు తీసుకొని పోతున్నాడు.

మాచమ్మ దిగాలాపోయి, "ఏమయ్యో, బ్రాహ్మడా, చెంబు ఎత్తుకుపోతావే" మని అన్నది. పురోహితుడు "అమ్మయ్యో, కంచు ముదిరి కడముంతయింది" అని చెంబెత్తుకొని మరి మాటాడకుండా పోయినాడు.

కథ కంచికి, మన మింటికి.

---

# కాకతి ప్రోలరాజు

శ్రీ శేషాద్రి రమణ కవులు

చెదరిపోయిన యాంధ్రసేవారతుల నెల్ల దేశసూత్రమున బంధించినావు
ఆరిపోయిన మహదాంధ్రవిక్రమవహ్ని గురుతరంబుగ రగుల్కొల్పినావు
పటిమ దప్పిన యాంధ్రభావవీథికలలో దేశభక్తిస్ఫూర్తి దిద్దినావు
నిస్స్పృహాత్ముభీతిమా నిఖిలాంధ్రమండలం బేకహేలను నుద్వహించినావు
ఆత్మసామ్రాజ్యసంరక్షణావసరము - సమయ మెఱింగి స్వజాతికి చాటినావు
కాకతీయాన్వయాబ్ధిరాకాశశాంక - భూరికీర్తికలాప శ్రీ ప్రోలభూప!

అనితరదాస్యశృంఖలలయందుఁ దగుల్కొని నైజవిక్రమం
బును మును విస్మరించి చెడిపోయిన యాంధ్రుల నుద్ధరింప నీ
వొనరిచినాఁడ వెన్నియొ మహోద్యమముల్ త్వదుదారధర్మసం
జనితమహాంధ్రరాష్ట్రవిలసత్ప్రభ నెన్నఁదరంబె యేరికిన్?

పలుకుపల్కునఁ జేనె లోలుకుకబ్బంబుల నింపార దెసల వ్రాయించినావు
శాంతవ్రతంబైన జైనధర్మంబును దగునని యాదలఁ దాల్చినావు
ప్రాచీనగౌరవపరిపాటి నెలకొల్పి తెలుఁగునేలకుఁ బేరు దెచ్చినావు
చెదరినయాంధ్రులఁ జేర్చి సామ్రాజ్యంబు స్థాపించి మగఁటిమి చాటినావు
అద నెఱింగి యాత్మజాతి కభ్యుదయ మరసి - దేశసేవావ్రతంబు సాధించినావు
నీమహాత్యాగదీక్షయే నేటియాంధ్ర-భూమి కభ్యుదయకరంబు ప్రోలభూప!

గండశిలల్ పగిల్చి పురకాంతకు భూషణమట్లు కోట నె
న్నండో యొనర్చియుంటివి జనస్తవనీయము గాఁగ, నద్దియుఀ
ఖండిత మైన నేమి యరికంఠవిలుంఠనవిక్రమక్రమా
ఖండలు లైనయాంధ్రులయశం బది యెంతయు హెచ్చరించెడిన్.

అరులకు దుర్గమంబుగఁ బురాంతిక దేశమునందు వారిసం
భరితతటాకరాజములఁ బర్వతపార్శ్వములందు నిల్పి య
చ్చెరువగునాలయంబుల రచించి మహామహితాంధ్రతేజము
న్నెరపితి వెల్లదేశముల నీ కెన యెవ్వరు ప్రోలభూపతీ!

ఘణిం

హింసాదూరము జైనధర్మ మెదలో నెంతేని పాటించి యీ
సంసారవ్రతు లైనయాంధ్రుల నహింసాశీలురం జేసి నీ
యంసద్వంద్వనిరూఢరాజ్యభర మాహా యంచు నానానృపో
త్తంసుల్ పేర్కొన మించినాఁడ విది సాధ్యం బౌనె ప్రోలప్రభూ !
ప్రశిథిలంబయి పూర్వవైభవముఁ దెలుపు - విగ్రహానీకములె కడు వెలుఁగు గూర్చు
మహితభూగర్భకలితసామ్రాజ్యకీర్తి - చిహ్నలరసిన నెంతో యచ్చెరువు గాదె.

ఈశిలాశకలంబు లేరాజమందిర పరిసర వేదికాభాసురములొ
ఈప్రస్తరవ్రాత మేరాజమణిమహా దిగ్విజయస్తంభదీపితంబొ
ఈపవిత్రస్థలం బేనృపాలకదుష్ణ రక్తధారారుచిరంజితంబొ
ఈశల్యసంచయం బేసతీసహగమనవ్రతవహ్నిసంతప్తకంబొ
ఈమహావిగ్రహానీక మేనృపాల - మౌళిమణిగణకాంతిసమ్మానితంబొ
అనుచు నీకోటలోనిప్రత్యణువు లరసి - ముగ్ధు లౌదురు సుకవు లో ప్రోలభూప!

కాలము మాఱినఁ బ్రళయకాలము వచ్చిన చింత లేదు భూ
పాలక *ప్రోలరాజ! యనవద్యభవత్సుయశోఽంక మొక్కటే
చాలును హన్మకొండపురసంపద సాటఁగ; ప్రాక్తనాంధ్రభూ
పాలకవాసభూమి యనుప్రాభవ మన్నిటి కబ్బ నేర్చునే ?

---

* ప్రోలరాజు త్రిలింగసామ్రాజ్యనిర్మాత. తొలుత నీతనిరాజధాని హనుమకొండ. పద్మాక్షిగుడికి ముందుగా నున్న మైదానముచుట్టు నున్న మంటికోటయు, శిలాద్వారములు, సిద్ధేశ్వరాలయాదికము ఈయాంధ్రవిభుని కీర్తిచిహ్నములు. కూలిపోవుచున్న జాతికోటలు రాజమందిరచిహ్నములు. క్రీడాసరోవరములు మాత్రము ప్రాచీన విభవమును పరిశోధకులదృష్టి నాకర్షించుచున్నవి. ఆంధ్రసమాత్యప్రథమ విహారరంగమగు నీపుణ్యభూమిఁ గాంచినం తన ప్రాచీనాంధ్రమహాతేజము గోచరించి రసప్రలుబ్ధుఁడగు వివేకి ముగ్ధుఁడు కాకపోఁడు.




## గాజుగొట్టములయు, పూసలయు తెరలు

కొ. నరసింహాచారి గారు

౨

పుష్యమాసభారతిసంచికయందు గాజు గొట్టములతోను, పూసలతోను తెరలను చేయుటనుగుఱించి వ్రాయబడి యుండెను. ఈ తెరలలో పూసలును, గొట్టములును వేర్వేరు దారములపై దూర్చబడి ఒక్కొక్కదారమును, ఇతరదారములతో జేరక వ్రేలాడు చుండును. కాని ఈవ్యాసమున, అట్టిదారములు ఒక్కొక్కటియు తక్కినవాటితో చేర్చబడి తెరయంతయు అల్లిక గలిగియుండు నట్లు కుట్టువిధము చెప్పబడును. మొట్టమొదట మొదటివ్యాసమున జెప్పినరీతిని ఒకనాడా యొక్క కొనయందు ఒకగట్టిదారము ముడి వేసి దారమును నాడాక్రిందుగా దీసికొనవలెను. దారముపై సుమారు ఇరువదిపూసలను దూర్చుకొనవలెను (చిత్రము A). తర్వాత నొకలోలాకుపూసనున్ను, ఒకసాధారణమగు పూసనున్ను దూర్చుకొని, దారమును మరల వెనుకకు (Reverse direction) పై లోలాకు పూసగుండానున్ను, దానికి పైనుండు సాధారణమగు పూసగుండానున్ను దూర్చుకొనవలెను. తర్వాత మూడుక్రొత్తపూసలను సాధారణమైనవాటిని దారముపై దూర్చుకొని దారమును, మునుపు దూర్చబడినపూసలలో మూడింటిని వదలి నాలుగవ పూసగుండా దూర్చవలెను. మరల దారముపై మూడు క్రొత్తపూసలను దూర్చి ముందు దూర్చబడిన పూసలలో మరలమూటిని వదలి నాలుగవపూసగుండా దూర్చుకొనవలెను. ఈవిధముగా దూర్చుచు నాడావద్దకు చేరి నాడాకు దగ్గరగా నున్న పైపూసగుండా దారమును నాడాలో కుట్టి ముడివేసికొనవలెను (చిత్రము C). చిత్రము B, 1, 2. యందు అడుగుభాగమున మొదటివలయము ఏర్పడువిధము చూపబడియున్నది. ఈవిధమగు వలయములను మఱియొకమార్గమునగూడ కుట్టవచ్చును.

ఒకపెద్దదారమును దీసికొని దానిపై నొకసాదాపూసను దూర్చి నడిమిభాగమునకు దేవలెను (చిత్రము D. X.) పిమ్మట దారము యొక్క రెండుకొనలను చేర్చి ఒకే లోలాకు పూసయందును, ఓకేసాధారణపూసయందును దూర్చుకొనవలెను. మరల రెండుదారములను వేరుగా దీసికొని ఒక్కొక్కదానియందును మూడేసి క్రొత్తపూసలను దూర్చుకొనవలెను.

మరల దారపుకొనలను చేర్చి ఒకేపూస యందు దూర్చి మరల దారపుకొనలను వేరుగా దీసి మూడేసిపూసలను దూర్చవలెను. ఈవిధముగ మనకు కావలసినంతవరకు దూర్చు కొని దారపుకొనలను నాడాకు కుట్టవలెను.

ఇట్లు ఒకవరుసవలయములు వచ్చిన తర్వాత రెండవవరుసవలయములను కుట్ట పిమ్మట దారముపై మూడు క్రొత్తపూసలను దూర్చి అటువెనుక, పూర్వ మేర్పడిన వలయ ములలో రెండవదానియందలి T అనుపూస గుండా దూర్చవలెను. ఈవిధముగనే తక్కిన భాగమును పూర్తిచేయవలెను. ఏయేపూసల లో దారమును రెండుమారులు దూర్చ వలెనో అట్టివి నల్లనివిగా గుర్తించబడి యున్నవి.




వలెను. చిత్రము E యందు 1 అనునది మొదటివలయముల వరుస. రెండవవరుస 2 వద్ద నారంభించి మొదట రెండుపూసలను దూర్చి, దారమును మొదట ఏర్పడినవలయములను S అనుగుర్తుగల పూసలో దూర్చవలెను.

చిత్రము F యందుండు తెరనుకూడ పైన వివరించినవిధముననే చేయవచ్చును. కాని ఒక్కొక్కమారును దూర్చబడు పూసలసంఖ్య ఎక్కువ యైనందున, వలయములుగా కన బడక, కండ్లు, లేక రంధ్రములు చదరములుగా

నేర్పడును. చిత్రము G యందు పూసలకు మారుగా గాజుగొట్టములు దూర్చబడి యున్నవి.

గొట్టములకు మధ్య ఒకటి గాని, ఎక్కువ గాని పూసలను దూర్చవచ్చును.

పైరీతిని జేయబడిన తెరలు వెడల్పు తక్కువగా నుండిన తోరణములుగాను, చాలా వెడల్పు కలవి గుమ్మయెడల తెరలుగాను ఉపయోగపడును.

చిత్రము H యందు ఒంటివరుస తోరణము చూపబడియున్నది. R S అను దారమున L అను లోలాకుపూసను దూర్చి, దానిని నడిమిభాగమునకు తెచ్చుకొని తర్వాత దారపు రెండుకొనలను రెండు వేర్వేరు సాధారణపు పూసలగుండా దూర్చి, మరల రెండుకొనలను ఒకే లోలాకుపూస యందు దూర్చుచు పోయినయెడల తోరణము వచ్చును.

పూసలపనిలో ఓపిక యెక్కువ యుండవలెను. పూసలయొక్కయు, గొట్టముల యొక్కయు సంఖ్యలను మనయిష్టానుసారముగా మార్చుచువచ్చినయెడల చిత్రవిచిత్రములగు రూపములను కుట్టవచ్చును.

---

## పోతరాజు నుద్దేశించి

గోవాడ గోపాలకృష్ణయ్య గారు

మనుపు, సకంబు భాగవతముఁ బఠియించుచునుండు, నోరు నో
వ్వ నుడువుచుండు నీఘనతఁ, బ్రాజ్ఞుఁడు ధన్యుఁడు రెడ్డి సూరనా
ర్యుని కటు నీకుఁ జేయవలె నూడిగ మంచుఁ దలంచుచుండు, నో
యనఘచరిత్ర ! పోయె నిపు డన్నియుఁ, గాలగతుల్ విచిత్రముల్.

---

దినాలు బాగుండకపోతే



# గోవిందదీక్షితుడు—౧

కురుగంటి సీతారామయ్యగారు, యమ్. ఏ.

ఆంధ్రులయభ్యుదయమునకు మూలభూతులగు ననేక మహాపురుషుల నాంధ్రలోకము విస్మరించినది. వారిలో గోవిందదీక్షితు డొకడు. దాదాపు మూడువందల సంవత్సరముక్రిందటివార లీయన యెవరో నేను నెరుంగను. కాని యిప్పు డీమహనీయుని గొప్పదనము నామనోనేత్రములకు గోచరించుచున్నది. ఈయన యాంధ్రప్రపంచమునకు సర్వదా స్మరణీయుండు.

ఈయనను గురించి 'యాంధ్రచరిత్రపరిశోధకత్రైమాసికపత్రిక[1]'యందు శ్రీయుతులగు యన్. కే. వెంకటేశన్, యమ్. ఏ.,గారొక గొప్పవ్యాసమును వ్రాసిరి. అది మిక్కిలి రసవంతమగుచు నుండి యత్యుత్తమవ్యాసశ్రేణిలో నగ్రస్థానము నలంకరించుచున్నది. తదుక్తములైన కొన్నివిషయములు నాచేయబడిన పరిశోధనముల వలన చారిత్రకములు కానట్లు నాకు తోచినందున గోవిందచరిత్రమును వ్రాయుటకు మున్ముందు వానిని చర్చించుట యవసరమని మనవిచేయుచున్నాను. శ్రీ వెంకటేశన్‌గారు తమవ్యాసమునకు గోవిందునివంశీయులును, మైసూరుసంస్థానమున ధర్మాధికారులును నగు బ్రహ్మశ్రీ నరసింహశాస్త్రిగారు చెప్పినట్టియు, పట్టీశ్వరగ్రామప్రాంతముల చెప్పుకొనబడుచున్నట్టియు గాథలును, వంశానుచరితమును నాధారములని వ్రాసియున్నారు. సరియైన చారిత్రకదృష్టికి సరిపోవు వంశచరిత్రములు మృగ్యములై, కాలము గడచినపూర్వులను దైవతములుగా భావించు మనదేశమున నిట్టిగాథ లెంతవిశ్వసనీయములో వేరచెప్ప నవావశ్యకము. చారిత్రకుని యూహలకు తావీజాలనట్టియు, ప్రత్యక్షాదిప్రమాణములకు విరుద్ధములైనట్టియు అనుభవమునకు వ్యతిరిక్తములైనట్టియు, గాథలాదరణీయము లెంతమాత్రమును కాజాలవు. అట్టి గాథల చరిత్రములలో గాక పురాణములలో చేర్చవలసియున్నది. నాకు నాల్గుతరములు మాత్రమే పూర్వుడై సుప్రసిద్ధతార్కికుడై, యనుగమభట్టాచార్యుడను బిరుదమును వహించిన యస్మత్ప్రపితామహుడగు కురుగంటి వెంకట్రాయభట్టాచార్యచరిత్రము—౨ నాకు నిర్దుష్టముగ లభించుటలేదు. అట్టియెడ ౧౬ శతాబ్దమున వరలిన గోవిందదీక్షితచరిత్రమును తద్వంశీయులైనను నృసింహశాస్త్రిగారు సమగ్రముగను, నిర్దుష్టముగను గుర్తెరిగియున్నారనుట కష్టము. వారి వంశములో చెప్పుకొనబడు గాథలు వా రెరింగియుందురని మాత్రము చెప్పవచ్చును. మరియును గోవిందుడు మానవకక్ష్యనుండి దైవకక్ష్య కధిష్ఠించి పూజింపబడుచున్నట్లు శ్రీ వెంకటేశన్‌గారు వ్రాయుచున్నారు. అట్టియెడ నీగాథలను చారిత్రకదృష్టితో పరిశీలించుట యత్యవసర మగుచున్నది. సప్రమాణమగు నీయనచరిత్రమును తెలిసికొనుట యాంధ్రుల కర్తవ్యమైయున్నది.

క్రీ. శ. ౧౬, ౧౭ శతాబ్దములలో చోళమండలమును తంజాపురము రాజధానిగా, విజయనగరరాజ్యమున నొకపరగణాగా విజయనగర రాజకుటుంబముతో సంబంధించిన యొక నాయకరాజకుటుంబమువారు దాదాపు ౧౫౦ సంవత్సరములు రాజ్యముచేసిరనియు, వారికాలమున సంస్కృతాంధ్రవాఙ్మయము లత్యంతాభివృద్ధి నొందినవనియు మున్ముందు తెలిసికొనవలయును. మరియు వారిలో నల్గురు క్రింద చెప్పినసంవత్సరముల ప్రాంతమున నేలిరనియు గూడ తెలియవలెను.

(౧) చెవ్వప్పనాయకుడు.

(క్రీ. శ. ౧౫౩౫—౧౫౬౧)

(౨) అచ్యుతనాయకుడు.

(క్రీ. శ. ౧౫౬౧—౧౬౧౪)

---

[1] Journal of the Andhra Historical Research Society, Vol. II, Parts 3 & 4.

౨. ఈయన పునహా, మైసూరు, తంజావూరు-ఆస్థానముల తర్కశాస్త్రమున జయపత్రముల నొందెను.

(౩) రఘునాథనాయకుడు.

(క్రీ. శ. ౧౬౧౪—౧౬౩౩)

(౪) విజయరాఘవనాయకుడు.

(క్రీ. శ. ౧౬౩౩—౧౬౭౩) ౧

గోవిందదీక్షితుడు కర్ణాటకబ్రాహ్మణుడనుటనిర్వివాదము. శ్రీ వెంకటేశ్వరగారు వ్రాసిన బ్రహ్మశ్రీ నృసింహశాస్త్రిగారే కాక గోవిందునివంశీయు లింకను కలరు. ప్రస్తుతము కుంభకోణమున నున్న కామకోటి పీఠాధిపతులగు శంకరాచార్యస్వాములవా రీయన వంశీయులు. మైలాపురము సంస్కృతకళాశాలయందు మీమాంసావిద్వాంసులుగా నుండి కీర్తిశేషులైన బ్రహ్మశ్రీ రామసుబ్బాశాస్త్రిగారుకూడ నీయన వంశీయులే! ఏతద్వంశీయులగు నితరగ్రంథకర్తలనుగూర్చి ముందు ముచ్చటింతును. శ్రీ వెంకటేశ్వరగారు వ్రాసినవిషయములలో కొన్నిటి నిం దనువదించుచున్నాను.

(౧) చెవ్వప్పనాయకుడు మొదట పేదవాడై పశుపాలకుడుగా నుండెను.

(౨) చెవ్వప్పనాయకునికంటె గోవిందుడు పెద్దవాడు. ఇందుల కుదాహరణముగా చెవ్వప్ప గోవిందుని పశుపాలకుడగు బాలుడుగా నున్న కాలమున గోవిందుడు దర్శపూర్ణమాస లాచరించు గృహస్థుడై యుండెనని చెప్పుచున్నారు.

(౩) చెవ్వప్పకు చోళమండలము నిప్పించినది గోవిందుడు. చెవ్వప్ప కిచ్చుటకు తగినదేశమును వెదకుటకు గోవిందుని అచ్యుతదేవరాయ లంప, గోవిందుడీ చోళదేశము నేరెను.

(౪) కృతజ్ఞుడై చెవ్వప్ప గోవిందుని తనమంత్రిగా నియమించుకొనెను.

పైవిషయము లెంతవరకు సత్యములో విచారింతము. పైయన్నివిషయములకును కొలగఱ్ఱ "చెవ్వప్పకంటె గోవిందుడు పెద్దవా డగుట." దానిని సోపపత్తికముగా కాదని నిరూపించిన పైవిషయము లన్నియు పూర్వపక్షము లైపోవును. చెవ్వప్ప యచ్యుతదేవరాయల తోడియల్లుడు.౨ చెవ్వప్పనియామకము అచ్యుతదేవరాయలకాలములోనే జరిగెను. అచ్యుతుడు క్రీ.శ. ౧౫౪౨-వ సంవత్సరమువరకు రాజ్యముచేసిన విజయనగరచక్రవర్తి. కృష్ణరాయసార్వభౌముని సోదరుడై యీ యన వెనుక రాజ్యమునకు వచ్చెను. కావున చెవ్వప్ప తంజావూరున క్రీ.శ. ౧౫౪౨-వ సంవత్సరమునకు పూర్వము నియమింపబడుట సిద్ధము. 'ఆరవీడువంశచరిత్రము'ను వ్రాసిన హీరాసుదొరగారు క్రీ. శ. ౧౫౪౧-వ సంవత్సరమున నీ నియామకము జరిగియుండవచ్చునని యభిప్రాయపడుచున్నారు.3 అచ్యుతదేవరాయలతరువాత వచ్చిన సదాశివరాయల కాలమున దక్షిణరాజప్రతినిధిగా పంపబడిన విట్ఠలరా జీచెవ్వప్పనియామకమును మార్పకుండుటచే నప్పటికి చెవ్వప్ప జనరంజకముగా రాజ్యముచేయుచు తంజాపురమున పాదుకొనిపోయెనని చెప్పవచ్చును. అందువలన క్రీ. శ. ౧౫౪౨ కు కొన్ని సంవత్సరములకు పూర్వమే యీనియామకమనికూడ గట్టిగా చెప్పనగును. ఏతన్నియామకము క్రీ. శ. ౧౫౩౫-వ సంవత్సరప్రాంతమున జరిగెనని మద్రచితమైన 'తంజావూరాంధ్రరాజులచరిత్రము'న సోపపత్తికముగా నిరూపించియున్నాను. ఈనియామకము నాటికి చెవ్వప్పకు ముప్పదికిమించిన వయ సుండియుండును. బొత్తిగా ముక్కుపచ్చలారని బాలునికి చోళరాజ్యపాలనము నచ్యుత దేవరాయలు హస్తగతము చేయుట యసంభవము. ఇది గాక, మధురయం దేలుచున్నట్టియు, మిక్కిలి పరాక్రమశాలి యని పేరొందినట్టియు విశ్వనాథనాయకుని ప్రక్కను, సమయము

౧. ఈసంవత్సరములు దాదాపని చెప్పనగునేకాని నిష్కృష్టములు కావు.

౨. శ్లో. భార్యాభవ త్తస్య ధరాబలారేః, మూర్త్యంబికా మూర్తిమతీవ కీర్తిః,
ఆఢ్యా గుణై రచ్యుతరాయదేవ్యాః, సహోదరా శ్లాఘ్యగుణస్వభావా.
(రఘునాథాభ్యుదయకావ్యము, సర్గ. ౬, శ్లో. ౧౧.)

3. Aravidu, p. 173.

వచ్చినప్పుడు సామ్రాజ్యపక్షమును "డీ" యనుటకు తగిన వానిగా చెవ్వప్పను నియమించినట్లు తెలియుచున్నది. అందులకు చెవ్వప్ప దేహబుద్ధిబలములు గలవాడని యది వరకే పేరొందియుండవలెను.

ఈ యనవంశానుక్రమణిక నీక్రింద నిచ్చుచున్నాను—

"క. ఆవంశంబున కృష్ణధ
రావరు డుదయించె నిజకరస్థితచక్ర
శ్రీవత్సలాంఛనుం డై
తా నెన్నికకెక్కి దారితపరాఘుండై.

క. ఆకృష్ణక్ష్మాధరునకు
స్వాకృతిమాకారలకు డెసమశరదళితపరా
నీకు డగు తిమ్మనాయడు
ప్రాకటయశు డుద్భవించె ప్రద్యుమ్ను డనఁగ.

క. ఆతిమ్మనృపాలునకుఁ
ఖ్యాతగుణాలంబ గోపమాంబకు తిమ్మ
క్ష్మాతలపతి యుదయించెను
......నాహవమున ప్రద్యుమ్ను డనఁగ."
(మన్నారుదాసవిలాసము ఆ. ౧.)[౧],

తుదిపద్యమునందలితిమ్మప్ప మనచెవ్వప్పతండ్రి. ఈతిమ్మప్పనాయకుడు కృష్ణరాయలకు కుడిభుజమై రాయమూరు ముట్టడిలో నొకదండనాథుఁడై రాయల విజయమునకు ముఖ్యసహకారి యయ్యెను[౧]. నూనిజ్ అను పాశ్చాత్య-బాటసారి రాయమూరుముట్టడినిగూర్చి వ్రాయుచు నీ తిమ్మప్పనాయకుని పేర్కొనియున్నాడు. కావున చిన చెవ్వప్ప తనబాల్యమున గోవిందునియొద్ద గాని మరి యెవ్వరియొద్ద గాని పశుపాలకుడుగా నున్నట్లు చెప్పుట కెంతమాత్రమును వలనుపడదు. మరియు రాజకుటుంబముతో సంబంధముకలిగియుండుటకు వంశమంగును, కుల గౌరవమునందు నీయన రాజకుటుంబము వానితో తుల్యుఁడుగా నుండవలయునుకదా! కావున పైయూహ నిరాధారమనియు, విశ్వసనీయము కాదనియు స్పష్టము.

ఒండొరుల వయసునుగూర్చి విచారింతము. శ్రీ వెంకటేశన్‌గారి వ్రాతవలన గోవిందుడు చెవ్వప్పకంటె పెద్దవాడై యుండవలెను. చెవ్వప్ప నియామకము నాటికే గోవిందుడు విజయనగరాస్థానమున గౌరవపద మలంకరించుచుండెననియు, చెవ్వప్ప పశుపాలక బాలుడుగా నున్నకాలమున గోవిందుడు నిత్యాగ్నిహోత్రమునొనర్చు గృహస్థుడై యుండెననియు చెప్పుచున్నారు. కావున చెవ్వప్ప గోవిందునికంటె కనీసము ౧౫ సంవత్సరములు చిన్నవాడై యుండవలెను. గోవిందుడు క్రీ. శ. ౧౬౨౦ వ సంవత్సరమువరకు రమారమి జీవించియుండెనని తమవ్యాసమునందు శ్రీ వెంకటేశన్‌గారు చెప్పుచున్నారు. క్రీ. శ. ౧౫౪౨ లేక ౧౫౪౪-వ సంవత్సరము చెవ్వప్ప తుదివత్సరమని కూడ వీరు విశ్వసించినట్లు కన్పట్టుచున్నది. అట్టియెడ చెవ్వప్పకంటె ౧౫ సంవత్సరములు పెద్దవాడగు గోవిందుడు ౧౫౪౪-వ సంవత్సరమున మరణమునొందిన చెవ్వప్పకంటె క్రీ. శ. ౧౬౨౦-వ సంవత్సరమువరకు అనగా ౪౩ సంవత్సరము లెక్కువ జీవించియుండుట సమ్మసాధ్యముగాదు. క్రీ. శ. ౧౫౩౫ నాటికి చెవ్వప్పకు ముప్పదివర్షము లుండియుండునని వెనుక చెప్పియున్నాను. అంతకంటె ౧౫ సంవత్సరము లెక్కుడు వయస్సు గల గోవిందుడు క్రీ. శ. ౧౬౨౦ సంవత్సర ప్రాంతమువరకు జీవించియుండె నన్న రమారమి ౧౩౦

౧ కృష్ణభూపతి
|
తిమ్మభూపతి = గోపమ్మ
|
తిమ్మప్పనాయకుడు = బయ్యాంబ
|
చినచెవ్వనాయకుడు.

౧ Journal of the Andhra Historical Research Society, Vol. II; Parts 3 & 4; Page 215.

సంవత్సరములు జీవించియుండవలెను. ఇంత వృద్ధుడగు వరకు గోవిందుడు జీవించియున్నట్లు నిదర్శనములు గానరావని శ్రీవెంకటేశర్ గారే చెప్పుచున్నారు. ఒకవేళ గోవిందుడు చెవ్వప్పతో సమానవయస్కుడని చెప్పినను పైరెండసంభవములును వాటిల్లుచున్నవి. మరియొకచో గోవిందుడు ౭౫ సంవత్సరములు మంత్రిపదవియందుండెనని చెప్పుచు శ్రీవెంకటేశర్ గారు స్వవచనవ్యాఘాతము నొనర్చుచున్నారు. ఎటు చూచినను గోవిందుడు చెవ్వప్పకంటె పెద్దవాడని చెప్పుట యసంభవముగా గన్పట్టకమానదు.

కాని గోవిందుడు దాదాపు క్రీ. శ. ౧౬౨౦ సంవత్సరమువరకు జీవించియుండుట మాత్రము చరిత్ర ప్రసిద్ధము. క్రీ. శ ౧౬౧౪-వ సంవత్సరమున రాజ్యమునకు వచ్చిన రఘునాథుని పట్టాభిషేకమును గోవిందదీక్షితు డొనర్చెను.

శ్లో. "సౌమ్యే భావిని వాసరే శుభదినే
శౌండీర్యముఖ్యై ర్గుణైః,
ప్రఖ్యాతం రఘునాథనాయక మముం
ప్రౌఢాపదానం సుతమ్,
క్షిప్రం తం చతురర్ణవీపరివృత
క్షోణీతలప్రాభవే
కుర్యాః కౌతుకతో ఽభిషిక్త మఖిలై
ర్గోవిందయజ్వాగ్రణీః."
(సాహిత్యరత్నాకరము ౧౦-౧౦౩)

క్రీ. శ. ౧౬౧౬-వ సంవత్సరప్రాంతమున కావేరీతీరమున తోపూరనుగ్రామమున మధుర జింజి లోకప్రక్కను, తంజాపురాదు లొకప్రక్కను పోరిన గొప్ప సంగ్రామ మొకటి జరిగెను.[౧] తత్సంగ్రామమునకు రఘునాథుడు వెడలుచు యావద్రాజ్యభారమును గోవిందమంత్రిపై నుంచి వెడలెను.

శ్లో. "ఇతీరయ న్వచన మిళాబలాహితో
ధరాధురం నిజసచివే[౨] నివేశ్యచ,
సరోహితా త్సదసి సరోష మీక్షణా
దనీకినీ మన సమనీనహ త్క్షణాత్."
(సాహిత్యరత్నాకరము, ౧౩-౨౪.)

విజయము నొంది రాజధానికి మరలిన రఘునాథునకు రాజ్యమిచ్చినతరువాత నెంతకాలమో జీవించినట్లు గానరాదు. క్రీ.శ. ౧౬౧౬-వ సంవత్సరమున యావద్రాజ్యభారమును నిర్వహించుటకు తగిన బుద్ధిదేహబలములు గోవిందున కుండెనన్న శతవృద్ధయి యుండెనని చెప్పుట కెంతమాత్రము వలనుపడదు. కావున నప్పటికి డెబ్బది సంవత్సరములకు దగ్గరి వయస్సుండు ననుకొనవచ్చును. అట్లయిన క్రీ.శ.౧౫౪౬ ప్రాంతమున జన్మించియుండును. 30 సంవత్సరముల వయసున మంత్రి యయ్యెనని చెప్పిన రమారమి క్రీ. శ. ౧౫౭౭-వ సంవత్సర మగును. ఇయ్యది సమంజసమని తోచును. అప్పటికి చెవ్వప్ప సాక్షాత్తుగా రాజ్యకార్యమంతయు నడుపుచుండకపోయినను జీవించి మాత్ర ముండవలెను. ఏలన, గోవిందుడు చెవ్వప్ప నెరుంగును. మరియు క్రీ. శ. ౧౬౧౪-వ సంవత్సరములో రాజ్యమునకు వచ్చిన రఘునాథుడు తనతాతయగు చెవ్వప్ప జీవించియుండగనే పిల్లవాడై బాల్యకాలమున కులమును వెలయించు సూచనల జూపెను.

శ్లో. "పూర్వం సమేతా వయ మత్ర యుష్మ
త్పితామహం చెవ్వమహీమహేంద్రమ్,
ఆశీర్భి రానందయితుం తదగ్రే
త్వ య్యాపదానే ఖురలీషు ఖేలిమ్.
తదా భవంతం స విలోక్య బాల్యా
దస్మా న్ముదా వాచ మిమా మవోచత్,
అస్మాక మేతేన భవే త్ప్రతిష్ఠా
ధర్తుం సమర్థశ్చ స ఏవ రాజ్యమ్."
(సంగీతసుధా)

గోవిందుడు చెవ్వప్పకంటె చిన్నవాడని చెప్పుటకు మరియొక తార్కాణము కలదు. చెవ్వప్పమనుమడగు రఘునాథుడు గోవిందుని జ్యేష్ఠకుమారుడగు

౧. Sources of Vizayanagar History, S. K. Iyengar.
౨. గోవిందమంత్రి.

యజ్ఞనారాయణదీక్షితునికంటె పెద్దవాడై యీయనకు గురువై యీయనను తన యాస్థానకవీశ్వరునిగా నొనర్చెను.

శ్లో. "కావ్యాలంకృతినాటకాదికలనా
పాండిత్య మత్యద్భుతం
సర్వజ్ఞో రఘునాథభూపతిమఖో
య స్యోపనిశ్యా స్వయమ్,
ఆదాతుం గురుపక్షిణా మభిమతా
మర్థో౽ప్యహో దత్తవాన్
కర్ణాలంకరణం నిజంచ పతకం
పాదాంగదం కంకణమ్."

(అలంకారరత్నాకరము, తరంగము౧)

ఇందువలన గోవిందుడు చెవ్వప్పకంటె నొకతరము అనగా ౮౦ సంవత్సరములు చిన్నవాడని తేలుచున్నది. అందువలననే చెవ్వప్ప చనిపోయిన వెనుక షుమారు ౮౩ సంవత్సరము లీయన జీవించెను.

పైయన్నివిషయములనుబట్టి చెవ్వప్పకుటుంబమంతయు పూర్వమే రాజబంధువులుగా నుండుటకు తగిన పరువు గలదనియు, చెవ్వప్ప తండ్రి కృష్ణరాయల దండనాథులలో నొకడనియు, చెవ్వప్ప యచ్యుతరాయల తోడియల్లుడనియు, నాయన తంజావూరున నియమింపబడిన తరువాత వార్ధక్యదశయందు గోవిందుని మంత్రిగా నియమించెననియు, నప్పటి నుండి రఘునాథుని రాజ్యకాలమువరకు నీయన మంత్రిగానుండి రాజ్యము నత్యుచ్చస్థితికి తెచ్చెననియు తేలుచున్నది. వీనితో శ్రీ వెంకటేశన్‌గారు చెప్పిన విషయములు పూర్వపక్షము లగుచున్నవి.

శ్రీ వెంకటేశన్‌గారు క్రీ. శ. ౧౫౮౯-వ సంవత్సరమున సంబంధించిన యొకశాసనమున గోవిందుడు "అయ్యన్" అను పేరుతో పేర్కొనబడినట్లు చెప్పుచు తచ్ఛాసనమును తమ వ్యాసమున ననువదించినారు. దానియందు వెదకినను నాకు "అయ్యన్" అనుపదము పొడకట్టలేదు. ఈపదమునుగూర్చి కొంచెము చెప్పెదను. ఈదేశమున గొప్పవారని పేరొందినవారిని ఈపదముతో పిలుచుట వాడుక. ఈపద మందువలన నొక గోవిందదీక్షితునకే గాక యనేకమందికి నుపయోగపడినట్లు తెలియనగును.

శ్రీ వెంకటేశన్‌గా రనువదించిన క్రీ. శ. ౧౫౪౪-వ సంవత్సరమునకు సంబంధించిన శాసనములో "సెవ్వప్ప నాయకరు అయ్యన్" అనియు "అచ్యుతనాయకరు అయ్యన్" అనియు రెండుమారు లీపద ముపయోగింపబడెను. అందుచే నిది గోవిందున కభిధానము కాదనియు, నాయకరాజులకే విశేషణముగా నుపయుక్త మైనదనియు గ్రహింపవలెను. క్రీ. శ. ౧౬౨౬-వ సంవత్సరమున మధురాపురమున స్మార్తులకును, వైష్ణవులకును భేదముకలిగెననియు, నట్టియెడ "అయ్యాదీక్షితఅయ్యన్" అనునాయన పంచాయతీదారుగా నుండెననియు టైలరు చరిత్రగ్రంథము తెల్పుచున్నది.[౧] ౧౬౨౬-వ సంవత్సరమున గోవిందదీక్షితుడు లేడనుట స్పష్టము. కావున నీఅయ్యాపదము గౌరవవాచకమే గాని కేవలగోవిందదీక్షితుని కొక్కనికే యుపయుక్తము కాదని స్పష్టము. అట్టియెడ తత్పదముతో సంబంధము గల ప్రతివిషయమునకును గోవిందునితో సంబంధము కల్పుట సమంజసము కాజాలదు.

ఈయనతల్లిదండ్రులనుగూర్చి మన మెరుంగము. ఎచ్చటను వారినిగూర్చి యీయన చెప్పుకొనియుండలేదు. ఈయనది ఋక్శాఖ. ఆశ్వలాయనసూత్రము. ఈయన గృహభాష కన్నడము. ఈయనకుమారుడగు వెంకటమఖి తనకీర్తనముల నన్నిటిని కన్నడభాషయందే వ్రాసెను. ఈయనవంశము మొదటినుండి విద్యలకు ప్రసిద్ధికెక్కినది. వైదికకర్మల నాచరించుటలో మిక్కిలి యభినివేశము కల్గియుండెను. ఈయన తంజావూరువచ్చునాటికే దీక్షితుడై యగ్నిహోత్రములతో వచ్చెను. తరువాత సర్వతోముఖాంతక్రతువుల నన్నియు తంజాపురముననే యొనర్చినట్లు కన్పట్టుచున్నది. ఈయన దక్షిణదేశమునకు వచ్చినవెనుక కొంతకాలమునకు మంత్రి యయ్యెనో, మంత్రిగానే విజయనగరమునుండి వచ్చెనో నిశ్చయించుట కెట్టియాధారమును లేదు.

---

౧. Taylor's Oriental Historical Mss Vol. II, 149

# ఆంధ్రకవుల ప్రతిభ

హరి రాధాకృష్ణమూర్తి గారు

## ప్రౌఢకవిమల్లన 3

గుడి అన్ననృపాలుఁడు తనయాస్థానంబు నకుఁ గాలినడక నరుగుదెంచిన మల్లనం గని, 'తా మిట్లు దయచేయ నేల? రాఁ గోరిన హయగజాందోళికలలో దేనినైనఁ బంపనే! కంటకావృత కఠినకర్కశశిలామయం బగు నీమార్గంబు త మ్మెట్టుల బాధించెనో' యనవుడు, మల్లన మార్గమునఁ దన్ను బాధింపఁజూచిన బ్రహ్మదండి ముండ్లస్థితిం దెల్పిన రా జచ్చెరు వొంది,—

రాజులు విఱ్ఱవీఁగెదరు
రథ్య మిభంబులు సైన్యముల్ మహో
రాజులుఁ గల్గు మాకని వి
పర్యయమందున నెన్ని యేనియుం
ద్రాజములైన సత్కవుల
శక్తుల కెందును దీటువచ్చునే
యీజగమందుఁ? గానఁ గవి
యే కలవాఁడు సమస్తసంపదల్.

కాలం గ్రుచ్చిన బ్రహ్మదండిములుకుల్
గన్నార వీక్షించి, ప్రాం
తాల న్నిల్వక యుండునట్టులఁ గటా,
దగ్ధంబు గావించినా
వేలా రథ్యగజాశ్వముల్ ప్రకృతి నీ
యిష్టంబుఁ బాటింప లీ
లాలావణ్యపయోధిఁ గేశవుని లీ
లం ముగ్నె దో సత్కవీ!

అటు గాక నీ విట కరుగుదెంచెడివేళ
పనికిమాలిన కొండపల్లినగరి
పడమట నున్న యాబ్రహ్మదండులు నిన్ను
బాధించు టేమి! ఆపైన నీవు
అలిగి కోపించి పద్యంబునఁ దిట్ట నీ
పదసౌష్ఠవమున నాపాడుముండ్లు
చెట్టులనుండి నిశ్శేషంబుగా రాలి
పడు టేమి! త్రోవను సడక కిచ్చు
టేమి! ఆశ్చర్య మౌర యింకేమి కలదు?
జడములను శాసనముచేయఁ జాలు విద్య
లెచటనైనను గలవె? నా కెఱుకపఱుపు
మనఘ, నేఁగూడ నభ్యాస మొనరఁ జేతు.

---

# రాజరాజు

భావరాజు వేంకటకృష్ణరావుగారు, బి. ఏ., బి. యల్.

(క్రీ. శ. ౧౦౨౨ మొదలుకొని ౧౦౬౩ వరకు)

పూర్వచాళుక్యాన్వయుఁడగు రాజరాజునకు వ్యవహారమున 'రాజరాజనరేంద్రు' డని ప్రసిద్ధనామము గల్గినది. అదియే యెల్లరకు దెలిసినపేరు. అసలాతనినామము రాజరాజు. మాతామహుఁడైన చోళరాజరాజేంద్రునిపే రాతనికి పెట్టిరి. నన్నియభట్టు ఆంధ్రమహాభారతావతారికయందు ఆమహారాజును గౌరవభక్తిసూచకములుగ నుండునట్లు శ్రేష్ఠవాచకమును జేర్చి 'రాజరాజనరేంద్రా!' యని పలుసార్లు సంబోధించినాఁడు. నరేంద్రశబ్దము పేరులోనిదని భావించి అజ్ఞులు ఆమహారాజుపేరు రాజరాజనరేంద్రుఁడని భ్రమపడుచుండిరి. కావున ఆంధ్రులలో రాజరాజుపే రెఱుగనివా రుండరు. తెలుగుబాస జీవించియుండునంత కాలము రాజరాజుపేరు దిగంతములందు మారుమ్రోగునటుల నన్నియభట్టారకుఁడు చేసినాఁడు. ఆంధ్రలోకమున కుభయులును సర్వథా వంద్యులే.

అయినను రాజరాజుయొక్క యథార్థచారిత్రమును, ఆతనికాలమునాటి ఆంధ్రదక్షిణహిందూదేశ పరిస్థితులను పూర్తిగా నెఱిఁగినవారు మిక్కిలి యరిదిగా నున్నారు. ఆంధ్రదేశచరిత్రపఠనమునకు ప్రోత్సాహము లేకపోవుటయు, రచనకు పోషణ లేకపోవుటయు నిందులకు ముఖ్యకారణములు. చరిత్రపరిశోధనమున దెలియవచ్చిన నూతనాంశములను ఆంధ్రులకు విన్నవించుటకై నాకు ఇటీవల దెలియవచ్చిన చారిత్రకవృత్తాంతముల నీ వ్యాసరూపమున బ్రకటించుచున్నాను.

రాజరాజు కావ్యగీతిప్రియుఁడనియు, సర్వదా సుఖవినోదములందు, కవీంద్రసమాజములందు ప్రొద్దుపుచ్చుచుండినవాఁడనియు, మేనమామలు, మేనమఱఁదులు ప్రబలురై, చోళమహీరాజ్యమును దుర్నిరీక్ష్యముగ పరిపాలించుచుండ, వారియండను, నిర్భయముగ శత్రుభీతియొకింతయు లేక, శాంతముగ నలువదియొక్క సంవత్సరములు సుఖముగా రాజ్యపాలనము చేసినవాఁడనియు, నే చీకును చింతయును లేకుండ జీవయాత్ర గడుపగల్గియుండినకారణమున ఆంధ్రభాష నుద్ధరించి, మహాకవుల పోషించి యొకమహాకావ్యమును రచియింపజేసినాఁడనియు నున్నగు అంశములను మున్ను చరిత్ర వ్రాసిన మహామహులగు పండితులు మనకు దెలిపియుండిరి. మరియు వారిలో కొందరు రాజరాజునుగూర్చి నన్నియభట్టారకుఁడు వ్రాసినవాక్యములు అతిశయోక్తులనియు, నంతవిశ్వాసార్హములు గావనియు, కులబ్రాహ్మణుఁడైన కవి తనపోషకుని గొప్పకొలఁది వ్రాసియున్నాఁడనియు నభిప్రాయపడిరి. నన్నియభట్టు నిజప్రభుభక్తిచే తనగ్రంథపాశస్త్యముకొఱకు, కృతిపతికి లేనిపోనివిశేషములు గల్పించి గొప్పచేసినాఁడని సంశయించిరి. నన్నపార్యుఁడు వ్రాసినవ్రాతలు అనృతములయియుండునని మృషావాదముతో బయలుదేరి, యథార్థము నారయకుండుట పూర్వచారిత్రకుల పొరపాటు. ఇపుడు, నన్నపార్యుఁడు వ్రాసినది యథార్థమా యని సంశయించి, యది యంతయు కేవల మతిశయోక్తియా, లేక, ఉన్నదాని నంతయు గప్పిపుచ్చి గంభీరముగ నొకటిరెండుమాటలతో తనమహారాజును నుతించినాఁడా యని విమర్శించు నుద్దేశముతో నీవ్యాసరచనకు గడంగితిని.

రాజరాజు మహామహుఁ డనుటకు ఆవంతయు సందియము లేదు. ఆ మహనీయుని చరిత్ర పూర్తిగ నెఱుఁగని కారణమున మనపూర్వపు చారిత్రక పండితులు నన్నియయొక్క 'నిత్యసత్యవచను' డను బిరుదమును సంయితము శంకించిరి. తమిళులదౌహిత్రుఁడయ్యు, తమిళరాజకన్యను పరిణయమాడినను, తమిళ-చోళరాజవంశము ప్రపంతో ప్రబలమై వేంగీమహీరాజ్యముపై నధికారము చెల్లింపఁదలఁచినను, ఆంధ్రావనీశుఁడగు నారాజన్యుఁ డాంధ్రదేశాభిమా

నముగల్గి, ఆంధ్రభాషకు, మాతృభూమికి మహత్తరమైన సేవను మరవజాలని మహోపకారములను చేసి, దిగంత విశ్రాంతమైన యశమును గడించుకొన్నాడు. తనపూర్వు లెవ్వరును సాహసింపజాలనిమహత్కార్యమును—ఆంధ్ర భాషయందు మహాకావ్యమును రచియింప బ్రోత్స హించుట—మహోదారుడయి, ఆంధ్రావనికి మోదము గలుగునట్లుగా నిర్వర్తించి, తనయాంధ్రత్వమును పూర్ణ ముగా నగ్గడించుకొన్నాడు నన్నయ వర్ణించినట్లు ఒక వంక, "ఉదాత్తరసాన్వితకావ్యనాటక క్రమములు పెక్కులు సూచినాడు; లోకజ్ఞుడని, అనురక్తు" డని నుతికెక్కినాడు. మరియొకప్పుడు "అపరాజితభూరి భుజాకృపాణ ధారాజల శాంత శాత్రవ పరా గుఁడై", "ఘోరాజిముఖోపలబ్ధవిజయ ప్రమదాశ్రిత బాహుదండుఁడై", "నిస్తేజితవైరివీరుఁడై" ప్రసిద్ధి గాంచినాడు. "నిజమహీమండలప్రజఁ బ్రీతిఁ బెంచుచుఁ బరమండలంబుల ధరణిపతుల నదిమి కప్పం బుల ముదముతోఁ గొనుచును, బలిమి నీయనిభూమివల యపతుల నుక్కడగించుచు, దిక్కుల తనయాజ్ఞ వెలిఁ గించుచు" నలుబదియొక్కసంవత్సరము నిరాటంకముగ రాజ్యపాలనము సల్పినాడు.

ఆతనికుమారుడు రాజేంద్రచోడుడు ఆంధ్రుడే యయినను, మాతృభాషను, మాతృభూమిని విడనాడి, ఆంధ్రదేశముపై అభిమానము లేక తమిళదేశమునకు రాజ్యకాంక్షచే వలసపోయినాడు. కావున ఆంధ్రభూ మికి అఖండగౌరవము నార్జించిన చాళుక్యరాజవంశ ములో మనరాజరాజు, కడపటివాడనియు, మహామహు డనియు పరిగణింపదగినవాడు. ఆతనిబోలిన ఆంధ్రభూమి పతులు మున్ను జన్మింపలేదు; ముందు జనింపబోరు.

రాజమహేంద్రవరము రాజధానిగా జేసికొని యాంధ్రభూమిని పాలించిన వేంగిచాళుక్యరాజ వంశ ములో ముమ్మడిభీముడని నామాంతరముగల విమలాదిత్యు డనురాజొకడు గలడు. అతడు క్రీ. శ. ౧౦౧౧ మొదలు కొని ౧౦౨౨ వఱకు, నించుమించుగా పదకొండు సం వత్సరములు* రాజ్యమును పాలించెను. విమలాదిత్యుని కిరువురు భార్యలు. చోళభూపతి రాజరాజుకూతురు, కుంద వాంబామహాదేవి ఆయన కగ్రమహిషి. మధురాంతక దేవుడనియు, గంగైకొండడనియు పెక్కునామములతో ప్రసిద్ధుడైన చోళక్ష్మాపతి రాజేంద్రచోళునకు మన కుంద వాంబ గారాబు చెల్లెలు. చోడాన్వయసంజాత యగు మేడవమహాదేవి రెండవరాణి. మేడవమహాదేవి యేరాజుకుమార్తెయో తెలియదు. కాని, యామె జనకుడు ఆంధ్ర చోడవంశములలోనివాడనియు, పూర్వచాళుక్య రాజవంశమునకు సామంతులుగను, దండనాథులుగను, మాండలికులుగను ఉండి ఊడిగముసలిపిన రేనాటి, వెలనాటి, పొత్తపినాటి, అత్తిలినాటి చోడవంశము లలో నొకదానికి సంబంధించినవాడనియు మాత్ర మూ హింపవచ్చును. † ప్రసిద్ధరాజన్యుడు గానికారణమున నామెజనకునిపే రెచ్చటను తెలుపబడియుండలేదు.

విమలాదిత్యునకు కుండవాంబాదేవివలన రాజ రాజును, మేడవమహాదేవివలన విజయాదిత్యుడును ఇరు వురు కుమారులు గల్గిరి. వీరిరువురిలో రాజరాజు అగ్రజు డైనట్లు, నన్నయ, ఆంధ్రమహాభారతమునందు "విమ లాదిత్యాగ్రతనూజ" ‡ యని సంబోధించుటవలన స్పష్ట మగుచున్నది. విజయాదిత్యుడు పూర్వచాళుక్యాన్వయ చరిత్రమున సప్తమవిజయాదిత్యుడని వ్యవహరింపబడు చున్నాడు.

---

* కొంద రేడుసంవత్సరములే యని వాదింతురు. అట్లనుటకు హేతువు లున్నవి. ఆవిషయము చర్చనీ యాంశము. కాదు గావున నిచ్చట మనకు అప్రస్తుతము.

† సప్తమవిజయాదిత్యుని ర్యాలి శాసనములోని వాక్యము లీయూహకు గారణములు. ఈవిజయాదిత్యుని భార్య మాలవమహాదేవి సూర్యవంశజుడును, చోడాన్వయుడునగు ఆచంటసూరపరాజుతనయ యని తెల్పఁ బడినది. (చూడుము: ఏపీగ్రాపికలు రిపోర్ట్సు, ౧౯౨౪-౧౯౨౩-౨౪ సం॥ తామ్రశాసనము.)

‡ ఆదిపర్వము, ఆశ్వా. ౪, ప. ౭౪.

తండ్రిమరణానంతరము క్రీ. శ. ౧౦౨౨-వ సంవత్సరమున రాజరాజు వేంగిమహీ సామ్రాజ్యమునకు పట్టాభిషిక్తుడయ్యెను. ఆనాడు వేంగిరాజ్యము ఉత్తరమున విశాఖపట్టణమండలములోని చీపురుపల్లి ప్రాంతము వఱకును, పశ్చిమమున నించుమించుగా ఓరుగంటి (ఓరుగల్లు అప్పటికి లేదు) ప్రాంతమువఱకును, దక్షిణమున నెల్లూరిప్రాంతమువఱకును వ్యాపించియుండెను. రాజరాజు పట్టాభిషిక్తుడయిన కాల మీక్రిందివిధముగా నారాయణ కవి నందమపూండి శాసనమున వర్ణింపబడినది. *

"య స్సోమవంశతిలకః శకవత్సరేషు
వేదాంబురాశి నిధివర్తిషు సింహగేఽర్కే;
కృష్ణద్వితీయగురువాసరభాద్రికాయాం
వారే గురో ర్వణిజలగ్న వరేఽభిషిక్తః."

శకవత్సరములు (వేద=౪, అంబు=౪, రాశి=౯)-౯౪౪ కాగా, సింహరాశియందు సూర్యుడున్న (సింహమాసము లేక) సౌరమానశ్రావణమాసమున (ఇది చాంద్రమాన భాద్రపద మగును), కృష్ణపక్షద్వితీయాగురువారమున ఉత్తరభాద్రపదానక్షత్రమున తులాలగ్నమునందు సోమవంశతిలకుడైన రాజరాజు పట్టాభిషిక్తుడయ్యెను. ఈతిథియు, వారమును సరిగా క్రీ. శ. ౧౦౨౨-వ సంవత్సరము ఆగష్టునెల ౧౬-వ తేది గురువారమునకు సరిపోవుచున్నది. అది సౌరమాన శ్రావణమాసము గావున తులాలగ్నము ఇంచుమించుగా పదిగంటల ప్రొద్దెక్కినప్పటికి ప్రవేశించును. కావున రాజరాజుపట్టాభిషేకసమయము ఉదయము ౧౦, ౧౧ గంటలనడుమ అగుచున్నది.

ఈమహారాజు ఎప్పుడు జనన మొందెనో తెలియరాదు. ఇతడు పట్టాభిషిక్తుడయి నలుబదియొక్క సంవత్సరములు పాలించెనని తరువాతిరాజుల శాసనములు వక్కాణించుచున్నవి గావున, సింహాసన మెక్కునాటి కితనికి సుమారు పదునేడు, పదునెనిమిదివర్షముల ప్రాయముండునని యూహింపవచ్చును. ఈయూహకు గావలసిన సాధనసంపత్తి కొద్దిగా నున్నది. రాజరాజు పెదతండ్రి యొదటిశక్తివర్మ రాజ్యపాలన మారంభించినతరువాత చోళులకును, చాళుక్యులకును సంబంధబాంధవ్యములు కలిసియుండును. శక్తివర్మరాజ్యారంభకాలము ఇంచుమించుగా క్రీ. శ. ౯౯౯, లేక ౧౦౦౦ అగుచున్నది. శక్తివర్మచే నోటువడిన చోళరాజరాజు, వేంగీశునితో నెయ్యము, బాంధవ్యముకూడ తనకు శ్రేయస్కరములని యెంచి క్రీ. శ. ౧౦౦౨-వ సంవత్సరప్రాంతముననో, ఇంచుక తరువాతనో తనకూతురు కుందవాంబను యువరాజుగా నున్న విమలాదిత్యుని కిచ్చి వివాహము చేసియుండెను.† అందువలన రాజరాజుజననము క్రీ. శ. ౧౦౦౩, లేక ౧౦౦౪ సంవత్సరప్రాంతమున గావచ్చును.

రాజరాజు మేనత్తకుమార్తెను తండ్రివలెనే చోళరాజకన్యను వివాహమాడెను. ఈవివాహముకూడ పట్టాభిషేకానంతరమే జరిగినట్లు ఊహింపవచ్చును. ఈతని పట్టపురాణి రాజేంద్రచోళదేవుని కూతురు అమ్మంగదేవి.‡

విమలాదిత్యునిమరణానంతరము సడలిపోవుచున్న వేంగిచాళుక్యులతోడిబంధుత్వమునురాజేంద్రచోడుతనూజుడు రాజాధిరాజు రాజనీతిజ్ఞుడు గావున నీవివాహము

* ఎపిగ్రాఫియా ఇండికా, ౪ సంపుటము, పుటలు ౩౦౦. పంక్తులు ౫౪-౫౫. రాజరాజు, నన్నయార్యునికి సహాధ్యాయియు, పరమమిత్రుడును అగు నారాయణభట్టునకు నందమపూండిగ్రామమును సర్వకరపరిహారముగా నగ్రహారము చేసి దాన మిచ్చెను. ఈ శాసనమును రచించినది నన్నయభట్టారకుడు.

† విమలాదిత్యుడు చెఱబెట్టబడినట్లును, చెఱలో నున్నకాలమున చోళరాజకుమారిని పెండ్లియాడినట్లును అపూర్వగాథను కల్పించిన రాయబహదరు వి. వెంకయ్యగారివ్రాతలు అవిశ్వసనీయములు, ప్రమాణరహితములు. వారు పొరబడి యట్లు వ్రాసియుండిరి.

‡ తంజావూరియందు వెలసిన రాజరాజేశ్వరుని (బృహదీశ్వరుడని యిప్పటిపేరు) భార్య పార్వతి యచ్చోట అమ్మంగదేవియని పరగుచున్నది. రాజేంద్రచోడుడు తనకుమారితెరు కులదైవముయొక్క పే రిడినాడు.

చేసి మరల బలపఱచెను. ఇందువలన నాతనికి పశ్చిమ చాళుక్యులతోడి నిరంతరయుద్ధములందు కావలసినంత సాహాయ్యమును, ఏకాగ్రతయు నొక్కసారి కుదిరెను. రాజరాజు సింహాసనమెక్కు నాటికి చోళులు పశ్చిమ చాళుక్యులతో నిదివఱకు సంపాదించుకొన్న గంగవాడి, నోలంవాడి మున్నగువాటిని నిలువబెట్టుకొనుటకు హోరాహోరి బోరాడుచు నెడతెరపి లేకయుండిరి. మహాపరాక్రమశాలియు, మహాబలసంపన్నుడు నగు రాజేంద్రచోళదేవుడు (గంగైకొండడు) నప్పటికి మరణించుటచేపశ్చిమచాళుక్యభూపతి ఇమ్మడిజయసింహుడు మరల నొకసారి విజృంభించి, అపహృతరాజ్యసీమలను అధికారమును సంపాదించుటకు గట్టిగా ప్రయత్నము చేయసాగెను. రాజేంద్రచోళదేవుడు తాను మరణించిన పిదప నెట్లయిన పశ్చిమచాళుక్యులు చెలరేగుదురని భయముగలిగియే, వేంగీశులతో సంబంధమును పదిలపఱచవలచి, తనయుల హెచ్చరించి ప్రాణముల విడిచెను. ఈచాళుక్యచోళసమ్మేళనము చోళుల కత్యంతోపకారియు, వేంగీశులు అనతికాలమున క్షీణించుటకు కారణము నై పరిణమించెను. రాజరాజుమరణానంతరము క్రమక్రమముగా వేంగీదేశమున చాళుక్యుల ప్రాభవము సన్నగిలిపోయెను. వేంగీ చాళుక్యుల సంబంధమున చోళులకు మహోచ్ఛదశ ప్రాప్తించెను. ఈచాళుక్యచోళ సమ్మేళనమువలన పశ్చిమచాళుక్యుల విజృంభణము అరికట్టబడెను. వేంగీశులు తఱచుగా చోళులతో కలిసి పశ్చిమచాళుక్యులపైకి యుద్ధమునకు బోవుచుండినకారణమున వేంగీచాళుక్య రాజ్యము పశ్చిమచాళుక్యులకు ప్రక్కలోని బల్లెమువలె నుండెను.

తాత ముత్తాతలవలె రాజరాజు ప్రకృతిబలసంపన్నుడును, పరాక్రమశాలియు, మహాయోధుడు నై యుండెను. అతడనేక సంగ్రామరంగములందు విజయశ్రీప్రమదాశ్రితుడై కీర్తిగన్నాడు. నన్నపార్యు డీతని పలుసార్లు గంభీరముగా వర్ణించినాడు. ఆతడు "రాజరాజును నిజభుజవిక్రమవిజితారాతిరాజనివహుండు", "అపరాజిత భూరిభుజాకృపాణధారాజలశాంతశాత్రవపరాగుడు", "ఘోరాజిముఖోపలబ్ధవిజయప్రమదాశ్రితబాహుదండుడు", "నిస్త్రింశితవైరివీరుండు", "వీరోగ్రాజివిజయుండు", "ఘోరారి మదకుంభికుంభవిదారణదారుణకృపాణ దక్షిణహస్తుడు", "రిపుప్రళయప్రతాపుడు"అని బహువిధముల ప్రశంసించి సంబోధించియున్నాడు. నన్నియ తనప్రభువును గంభీరముగా నిర్భయముగా పొగడినాడు. కాని బట్టువలె స్తుతిచేసియుండలేదు. నన్నియ వ్రాతలు నిరర్థకములు గావని వెలికివచ్చిన యాకాలపు చారిత్రకాంశములు మనోహరముగ జాటుచున్నవి.

రాజరాజు పట్టాభిషిక్తు డయిననాటికి వివాహము కాలేదు; సంతానము లేదు. కావున చాళుక్యరాజవంశపు మర్యాద ననుసరించి, సవతితమ్ముడు, విజయాదిత్యుని యువరాజుగా పట్టము గట్టియుండవచ్చును. కాని యాయన్నదమ్ముల కిరువురకు నంతగా సౌభ్రాత్రము వర్ధిల్లినట్లు కన్పించదు. ఉభయులనడుమ సౌహార్దము లేకుండపోవుటకు ఉభయు లేకోదరులు గాకపోవుట యొకకారణము కాదు. ఇతరకారణము లెన్నియున్నను రాజ్యకాంక్ష బలవత్తరమై యుండును. తనతమ్మునికి రాజ్యకాంక్ష యుండినట్లు, రాజరాజు అనుమానించి యుండినట్లగపడదు. యౌవరాజ్యాభిషిక్తుడై విజయాదిత్యుడు కొంతకాలము అన్నతో గలిసి ఆంధ్రమహీమండలమును పాలించియుండెను. అంత తలవనితలంపుగ నొకవైపరీత్యము వాటిల్లెను. పట్టాభిషిక్తుడైనదిమొదలు రాజరాజు తఱచుగా పశ్చిమచాళుక్యులమీదికి, చోళరాజులకు సహాయార్థముగా యుద్ధములకు బోవుచుండినట్లగపడును. క్రీ. శ. ౧౦౨౨-౧౦౨౭ సంవత్సరముల నడుమనే చోళులు పశ్చిమచాళుక్యుల యొత్తిడి కాగజాలక సంపాదించుకొన్న గాంగవాడి, నోలంబవాడి రాజ్యములను పోగొట్టుకొనిరి. ఈచోళ-చాళుక్యసంగ్రామములందు రాజరాజు తన బావమఱదులకు సాహాయ్యముగా బోవుచు, వేంగీరాజ్యమును పాలించుటకు యువరాజ విజయాదిత్యుని నియమించియుండునని యూహింపవచ్చును. రాజరాజు దేశమున లేనపుడు, రాజ్యభారమంతయు తనపై నున్నపుడు యువరాజవిజయాదిత్యుని హృదయక్షేత్రమునందు తాను మహారాజు గావలయు

నన్న కోరిక మొలకెత్తి విజృంభించియుండును. వేంగి రాష్ట్రమున గాని, రాజధానియందు గాని తన ప్రయత్నములు కొనసాగవని కాబోలు, విజయాదిత్యుడు దేవరాష్ట్రత్రికలింగరాష్ట్రములందు ప్రయత్నములు చేయసాగెను. ఇందులకు ప్రమాణముగ నిటీవల లభించిన విజయాదిత్యుని పాములవాక తామ్రశాసనములోని యీ క్రిందివాక్యములు గానుపించుచున్నవి.

* ఆంధ్రదేశ చారిత్రకపరిశోధకసంఘమువారి ఇంగ్లీషు త్రైమాసపత్రిక సం. పం.

"తస్య ముమ్మడిభీమ స్యా సుతః కృత
మతి ర్మహారాజ రాజనామా యో
రాజా ద్వాచత్వారింశ ద్ధరాం మపాత్"

"తం రాజరాజనృపతిం నిర్గూాట్య భువం
ప్రసహ్యా విజయాదిత్యభూపః
విమలాదిత్యతనూజస్య ద్వైమాతురో
గృహీ ద్రాజ్యస్.

"శ్రీమా న్నాక్షనధూఛీ సృగిషునిధిమితే
కర్కటేగే కర్కటాంశే
శుద్ధాత్మా శుద్ధపంచమ్యాదితిసుతదినే
సూర్యజాభే శోభయోగ;

కన్యాలగ్నే తి ధన్యో శశికులతిలకో రాజ
మార్తాండ సూను
ర్వేంగీసామ్రాజ్యపట్టం స్వ వహతి విజ
యా దిత్యభూపః ప్రతాపీ"

పైవాక్యములు చిత్రములయిన చరిత్రాంశములను ప్రకటించుచున్నవి. వీటిని మునుపు మన మెఱుగము. "ముమ్మడిభీముడని నామాంతరముగల విమలాదిత్యునకు రాజరాజను కుమారుడు గలడు. అతడు మహారాజపదవితో పంద్రెండువర్షములు ధరాపాలనము గావించెను. పిదప ఆరాజరాజుయొక్క సవతిసోదరుడు విజయాదిత్యభూపతి, అన్నను బలాత్కారముగ దేశమునుండి వెడలగొట్టి రాజ్యము నపహరించెను. ఆవిజయాదిత్యభూపతి శకవర్షములు (దృక్ = ౨, ఇషు = ౫, నిధి = ౯ లు కూడిన) ౯౫౨ కాగా, సూర్యుడు కర్కాటకాంశమును పొందియుండగా, అనగా సౌరమాన ఆషాఢమాసము లేక చాంద్రమాన శ్రావణమాసమున శుద్ధపంచమీ గురువారమునాడు చంద్రుడు హస్తానక్షత్రమం దుండగా, కన్యాలగ్నమందు రాజమార్తాండ (విమలాదిత్యుని) సూనుడును ప్రతాపియు, శశికులతిలకుడు, ధన్యుడు నగు విజయాదిత్యభూపతి వేంగిసామ్రాజ్యమునకు పట్టము గట్టుకొనెను," అని పైశాసనవాక్యములందలి విషయము. శాలివాహనశకవర్షములు ౯౫౨-వ సంవత్సరమునకు సరిగా రాజరాజు సింహాసన మెక్కిన ఎనిమిదవ ఏడగుచున్నది. అట్లయినచో రాజరాజు ఇంకను రాజ్యముచేయుచుండగానే, యాతనివి జయరాజ్యకాలము ఎనిమిదియేండ్లు నిండీనిండక పూర్వము ఆతనిసవతితమ్ముడు విజయాదిత్యుడు అన్నపై తిరుగుబాటొనరించి తానే మహారాజునని, వేంగిసామ్రాజ్యమునకు పట్టాభిషేకము చేసికొన్నాడని స్పష్టమగుచున్నది. ఈ శకవర్షములు ౯౫౨, సౌరమాన ఆషాఢ శుద్ధపంచమీ గురువారము సరిగా క్రీ. శ. ౧౦౩౦ సంవత్సరము జూలయి ౧-వ తేదికి సరిపోవుచున్నది. కర్కాటకమాసమున కన్యాలగ్నము గావున పట్టాభిషేకము ఉదయము ఎనిమిది తొమ్మిదిగంటలనడుమ జరగియుండును.

పైశాసనాంశములబట్టి విజయాదిత్యుడు రాజద్రోహము తలపెట్టి రాజ్యకాంక్షతో పట్టాభిషేకము గావించుకొని యన్నతో నహోగ్రాత్రములు నాలుగేండ్లు పోరాడి యోడించినాడని తోచక మానదు. యువరాజుగా నున్న విజయాదిత్యుడు తిరుగుబాటు గావించి పట్టాభిషిక్తు డయినకాలమందు రాజరాజు పశ్చిమచాళుక్యరాజ్యసీమలందు యుద్ధములు చేయుచు దేశాంతరగతుడై యుండునని యూహింపవచ్చును. తమ్ముని తిరుగుబాటు వినినంతనే రాజరాజు స్వదేశమునకు మరలి, విజయాదిత్యుని శిక్షించుటకు విశ్వప్రయత్నములు చేసియుండును. అంతటనుండి నాలుగేండ్లును యుద్ధములతోడను, జయాపజయములతో గడచి

* విమలాదిత్యునికి ముమ్మడిభీముడని నామాంతరము కలదు.

పోయెను. తుదకు రాజరాజు పరిపాలన సంవత్సరములు పండ్రెండు గతించిన కొద్దిరోజులకు విజయాదిత్యుడు అన్న నోడించి బలాత్కారముగా రాజ్యాధికారమును లాగుకొనెను. ఈతిరుగుబాటునకును, స్వామిద్రోహబుద్ధిని పురికొల్పుటకును, విజయాదిత్యునికి, అదివఱకే యుండిన రాజ్యకాంక్షతోపాటు పశ్చిమచాళుక్యుల ప్రోత్సాహము ప్రధానకారణము గావచ్చును. రాజరాజు వలన ఒత్తిడి కలుగుచుండుటచే పశ్చిమచాళుక్యు లాతని బాధ తొలగించుకొనుటకు విజయాదిత్యుని ఇట్టి రాజద్రోహమునకు బురికొల్పియుందురు. మరియు కొంత సహాయముకూడ చేసియుందురని విశ్వసింపవచ్చును.

విజయాదిత్యుని కీ తిరుగుబాటునందును, పిమ్మట రాజ్యాభిషేకమునందును, రాజరాజును దేశమునుండి వెడలనడచుటయందును, నాగకులభూషణుడును, మలయభాస్కరబిరుదాంచితుడును, మేఘగిరినాథుడును, భీమభూపాలుని తనయుడు నగు చామరాజు తోడ్పడియుండెను. ఆతడు మిక్కిలి స్వామిభక్తిపరాయణుడై కృతక్లేశియై, విజయాదిత్యునకు బాసటయై నిలిచి రాజ్యమును సంపాదించిపెట్టెను. ఈవిషయమును విజయాదిత్యుడు తన పాములవాకశాసనమునందే తెలిపియున్నాడు. పూర్వోదాహృతప్రమాణము. చామరాజు సామంతరాజవంశమునకు జెందిన దండనాయకులలో నొకడు. ఈతనితోపాటు ఇతనితండ్రి భీమరాజుకూడ విజయాదిత్యునికి యుద్ధములందు సాహాయ్యము చేసి, ప్రభువుచే సన్మానము లందకపూర్వమే విధివశుడై మరణించినట్లు పై శాసనవాక్యములందు కన్పట్టుచున్నది. చామరాజ, భీమభూపాలురవంటి సామంతదండాధీశు లెందరో ఈదాయాదులకలహమునందు స్వామిద్రోహియైన విజయాదిత్యుని పక్ష మవలంబించి స్వప్రయోజనపరులై ప్రవర్తించియుందురు. ఇట్టిదాయాదులవైరము, స్వామిద్రోహము పూర్వచాళుక్యరాజచరిత్రమందు క్రొత్త విషయములు కావు. విజయాదిత్యుడు చామరాజు చేసిన సహాయమునకు మిగుల సంతోషించి విజయాదిత్యభూపతి కొంపాలొంగుగ్రామమును సర్వకరపరిహారముగా నగ్రహారము గావించి ఒకానొక ఉత్తరాయణసంక్రాంతినాడు దానముచేసెను. అగ్రహారముతోపాటు పండ్రెండుగ్రామములపై నాధిపత్యము నిచ్చెను.* దత్తగ్రామ మేవిషయములోనిదో తెలుపబడలేదు. కాని శాసనము లభించిన పాములవాక తునికి సమీపమున నుండుటబట్టి యది దేవరాష్ట్రములోనిదని యూహింపవచ్చును. దేవరాష్ట్ర మిప్పటి విశాఖపట్టణమండలమునకు బూర్వపుపేరు. చామరాజు నాగకులభూషణుడని ప్రశంసింపబడియుండుటచేత నాగవంశీయుడనుట స్పష్టము. ఆకాలమున జయపుర, బస్తరు రాజ్యములు త్రికలింగనామమున బరగుచు సింధునాటి వంశీయులని చెప్పుకొన్న నాగకులజులగు క్షత్రియరాజవంశముచే పరిపాలింపబడుచుండెను.† త్రికలింగదేశము మలయప్రాంతమయియుండి మలయమని పిలువబడుచుండెను.‡ చామరాజు మలయభాస్కరుడనియు, మేఘగిరినాథుడనియు, నాగకులభూషణుడనియు వర్ణింపబడియుండుటబట్టి, యతడు త్రికళింగరాజవంశములోనివాడని స్ఫురించుచున్నది. విజయాదిత్యుడు యువరాజుగా నుండినకాలమున కళింగదేశములోని దేవరాష్ట్రాదివిషయములను పరిపాలించుచుండి యవకాశము లభించిన వెంటనే యచ్చటిసామంతమాండలికుల సహాయమున తిరుగుబాటొనరించినట్లు ఈచామరాజువృత్తాంతమునుబట్టి యూహింపవచ్చును.

సవతియన్నతోడి పోరునందు విజయాదిత్యునకు దుర్మతులగు మాండలికులు గాక శత్రురాజులుకూడ సహాయము చేసి పురికొల్పియుందురని యీవఱకే సూచించితిమి. రాజరాజుయొక్క పరాక్రమధాటి కాగజాలక యాతని నెట్లయిన వంచింప నుద్దేశముతోడను, వేంగీకులవలన నింకెప్పటికిని బాధ కలుగకుండ చేసికొను తలంపుతోడను, రాజరాజు తనమీదికి దండెత్తిరాకుండ [illegible] దాయాదుల కులవైరములో బడి క్రుగ్గి

* పూర్వోదాహృతప్రమాణము. †ఎపిగ్రాఫియా ఇండికా, సం. ౯, పుటలు ౧౬౦ మొదలు. ‡ఆప్రాంతమున కిప్పటికి మలయమని వ్యవహారము గలదు.



పరిచర్య

చిత్రకారులు : శ్రీ తలిశెట్టి రామారావుగారు, బి. ఏ., బి. యల్.

పోవుటకును పశ్చిమచాళుక్యభూపతి యిమ్మడివిజయసింహుడు విజయాదిత్యుని మనోదౌర్బల్యమును కనిపెట్టి అన్నపై తిరుగుబాటు చేయుటకు పురికొల్పియుండును. ఈయూహ నిజమైయుండు ననుట కొకయవకాశము కూడ గలదు. అదివఱకె నిమిసంవత్సరములనుండి ప్రజారంజకముగ పాలించుచుండిన రాజరాజనరేంద్రునిపై రాజద్రోహము తలపెట్టుటకు ప్రజలకు గాని, సామంతమాండలికులకు గాని కారణ ముండిన ట్లగపడదు. అసూయావైరానలములచే క్రుంగి కుమిలిపోవుచున్న పరరాజులు పనిబూని రాజరాజువిజయాదిత్యులనడుమ ద్రోహమునకు పురికొల్పియుందురు. ఇట్టి విపరీతవిప్లవము రాజరాజు పరోక్షమందు గాని జరుగజాలదు. దేశమునందు రాజరాజే యుండినచో తమ్ముని రాజద్రోహమును, తిరుగుబాటును సులభముగ నణచివేసియుండును. ఆతడు దేశాంతరగతుడై యుండుట యదనుగా నెంచి విజయాదిత్యుడు తానే మహారాజునని ప్రకటించి పట్టాభిషేకము చేసికొనెను. రాజరాజట్టిద్రోహము తమ్ముడు చేయజాలునని కలనైన తలపబోడు. పశ్చిమచాళుక్యులే యీరాజద్రోహమును బురికొల్పి యుందురనుటకు మరియొక ప్రబలప్రమాణముకూడ కలదు. దక్షిణమున చోళభూపతి రాజాధిరాజు మనరాజరాజునకు మేనమామ. అప్పటికి కొంతకాలముక్రిందటనే యాతడు తనచెలియలు అమ్మంగదేవి నిచ్చి పరిణయము గావించి పూర్వపుబంధుత్వమును పదిలపఱచి రాజరాజుతోడి నెయ్యము నాధారము చేసికొని జాతివైరులగు పశ్చిమచాళుక్యులతో వైరముసాగింప నిశ్చయించుకొనెను. కావున రాజరాజుపై స్వామిద్రోహమును తలపెట్టించి ప్రోత్సహించినది చోళరాజేంద్రదేవుడు కాజాలడు.

మరియు, ఉత్తరమున కళింగమునందు మూడవ వజ్రహస్తదేవుడు – రాజరాజనకు సమకాలికుడు – పరిపాలించుచుండెను. విమలాదిత్యునికాలమువఱకు కళింగాధీశులు వేంగీవల్లభులకు కప్పములు గట్టుచున్నట్లు శాసనములవలన దెలియుచున్నది. విమలాదిత్యుని మరణానంతరమో, రాజరాజు సింహాసన మెక్కిన కొంతకాలమునకో కళింగము వేంగీశ్వరుని ధిక్కరించి కప్పముగట్టుట మానినట్లు గానుపించును. ఆకారణమువలనగూడ కావచ్చును, ముమ్మడివజ్రహస్తదేవుడు స్వార్థపరాయణుడై అన్నపై తిరుగబడుటకు విజయాదిత్యుని ప్రోత్సహించియుండును అని విశ్వసింపవచ్చును. (సశేషము.)

---

## మా చందాదారులకు

మా కార్యాలయమునకు వ్రాయు ఉత్తరములు మొదలయినవానియందు తమ 'చందాదారు' సంఖ్య వ్రాయవలెను. లేకున్న ప్రత్యుత్తరములు మొదలయిన పనులను జరుపజాలము. చందాదారుసంఖ్య భారతి కవరుకాగితముపై తమ విలాసమునకు ముందున్నది. చందాదారులకు భారతి ౧౦-వ తేద లోపల అందకపోయిన యెడల వెంటనే తపాలువారికిని, మా కార్యాలయమునకును తెలుపగోరెదము.

—మేనేజరు, 'భారతి.'

# రవీంద్రుడు

సామవేదం జానకిరామ శర్మగారు

౧

తేనెలసోనలై కవుల తీయని వాగ్ఝరి తాఁ స్రవించె, గం
ధానిలహృద్యమై, సహృదయాంతరమం దొకయింత నాఁడు; నేఁ
డో, నవకావ్యకల్పనఁ గడున్ యశ మ్మంది, సమస్తధారుణిం
బూనికఁ ద్వత్కవిత్వరసపూరనిమగ్న మొనర్చి తింపుగన్.

౨

నీకవితారసంపు హృది నిండిన యీప్రకృతిం దలంచి, యెం
తో కమనీయగీతికలతో నినదించి, రసోచితంబు లా
యాకళలందుఁ జొన్పి, రచనాలఘుపాండితిఁ జిత్రసంపదన్
లోకము కీర్తువంట, బుధలోకము మెచ్చ, రవీంద్ర! వేడుకన్.

౩

పూని, తపస్సు చేసి మును పొందిన మౌనుల జ్ఞానరాశి నీ
లోన జనింప, చిన్నకథలో నిముడంగ రచించునట్లు సం
ధానముచేసె నీకవిత! దాన మహత్తరనీతిమార్గశ్ర
ద్ధానియతిన్ ప్రజాళి సతతమ్ము పఠించు కథాసమూహముల్.

౪

ఓయి కళావిశారద! రవోద్గతమంజులగానశాస్త్రపుం
దీయనిభావజాలములతీరును పశ్చిమఖండవాసు లో
హో యనఁ జెప్పి, భారతమహోన్నతగానకళారహస్యప్ర
జ్ఞాయుతుఁ డన్న పేర్వడసినావు సమస్తదిశాంతభూములన్.

౫

నీ వొకసార్వభౌమగణనీయ మహోన్నతదిగ్విశాలసం
భావనఁ బ్రాచ్యపశ్చిమవిభాగములం దతిమాత్ర మంది, స్వే
చ్ఛావిధి లేక మాటువడసాగిన భారతకీర్తిచంద్రికా
ధావితనవ్యమంగళవితానముఁ గట్టఁగసాగినా వహో!

---

తాతవెల్లి మిరాదార్ వేదము వేంకటరాయన్ గారు

# శ్రీయుత శేషగిరిశాస్త్రులవారు

దక్షిణ హిందూదేశమున పండితులలో నగ్రగణ్యులై పదునెనిమిది భాషలు నేర్చి, 'వీణాగాన కళానారదు' లని ప్రసిద్ధిగాంచి, విద్యార్థి కామధేనువుగా భాసిల్లి, ఫైలాలజీ-ప్రథమప్రవర్తకులై, ఆర్యద్రవిడ-ఫైలాలజీ-గ్రంథ ఆంధ్రశబ్దతత్త్వ తమిళశబ్దతత్త్వ అర్థానుస్వారతత్త్వాది వ్యాకరణకర్తయు, అధిష్ఠిత-మదరాసు ప్రెసిడెన్సీ కాలేజి-సంస్కృత మహోపాధ్యాయత్వ ప్రాచ్యభాషా ప్రవచనాధ్యక్షత్వపదములను అగు శ్రీయుత శేషగిరిశాస్త్రులవారు కరము ప్రశంసనీయులు.

ఉత్తర ఆర్కాడుజిల్లా (ప్రాగ్వము సేలముజిల్లా) లో చేరిన తిరుపత్తూరు తాలూకాలో వేంకటరమణ శాస్త్రులవారని భూస్వాములు (మిరాదారులు) పురూరు గ్రామనివాసులయి యుండిరి. వారిపుత్రులైన శ్రీ శేషగిరి శాస్త్రులవారు ౧౮౪౭ సం॥ మార్చి ౨౦ తేదిన జన్మించిరి. తండ్రిగారు పండితులు, కుమారులను విద్యాధికులంజేయ సకలవిధముల యత్నించుచుండిరి. చిఱుప్రాయమందే శ్రీశాస్త్రులవారు సంస్కృతమహారాష్ట్రాంధ్రద్రావిడ కర్ణాటభాషలలో అసాధారణమగు జ్ఞానము సంపాదించుకొనిరి. వీరు ప్రథమమున ఆంగ్లము నభ్యసింప సులభముగా నియ్యకొనరైరి. నిర్బంధముగా వీరిచే నాంగ్లము చదివింపవలయునని వీరితండ్రిగారు చాల ప్రయత్నించిరి. కాని అది అసాధ్యముగా నుండినందున నాప్రయత్నమును మానుకొనిరి. శాస్త్రులవారికి బాల్యమునుండియు బలీయమగు స్వాతంత్ర్యేచ్ఛ మదిని నెలకొనియుండినందున తండ్రిగారికడనుండిన ఆంగ్లము చదివింతురని తలంచి, ఎవరికిం జెప్పకయే తమగ్రామము వదలి మదరాసునకు విచ్చేసి గీర్వాణవాణీసేవను మఱియు తీవ్రముగ సలుపందొడంగిరి. దీనింగని వీరితండ్రిగారు కుమారుల ఇష్టానుసారము వారికిం దోడ్పడ మదరాసుం జేరిరి. కొంతకాలమునకు శ్రీ శాస్త్రులవారే తమకు ఆంగ్లమునందుంగూడ పాండిత్యమలవడుగాని నదిమఱియు మేలని తలంచి ఆంగ్లము నభ్యసింప మొదలిడిరి. త్వరలోనే మెట్రిక్యులేషన్ పరీక్షయందుత్తీర్ణులైరి. ఈవిధముగా నొకవైపు ఆంగ్లమును, మఱియొకవైపు సంస్కృతాదిప్రాచ్యభాషలను చదువుచుండిరి. అప్పటినుండియు శాస్త్రులవారికి, మాతృభాషను జనులు ఆంగ్లభాషావాహినింబడి మరచుచున్నారనియు, దానిని మాన్ప మాతృభాషావిషయమై తీవ్రప్రయత్నము వలసియున్నదనియు, అందులకు తాము పూనుకొనవలయుననియు గాఢమగు తలంపుండెను. వయసులో చిన్నవారైనను గొప్పవిషయములపై పండితులతో వాదించుచుండువారు.

మెట్రిక్యులేషన్ పరీక్షయయిన పిదప శ్రీ శాస్త్రులవారు, ప్రెసిడెన్సీకాలేజిలో ఎఫ్.ఏ.; బి. ఏ. (౧౮౭౧) పరీక్షలయందుత్తీర్ణులైరి. వారికి సంస్కృతమునందుంగల పాండిత్యముంగని, డాక్టరు ఆపర్టుదొరవారు ఐదునెలలు సెలవుపొందంగానే, వారికిబదులుగా, ఆ స్థానమున సంస్కృతపండితులుగా వీరిని కళాశాలాధికారులు నియమించిరి. అప్పుడు వీరికి వయసు ౨౪ సం.లు. అచ్చట సంస్కృతోపాధ్యాయులుగా నున్న యాయల్పకాలమునందే వీరు పైయధికారుల యభిమానమును సంపాదింపంగల్గిరి. కళాశాలాధ్యక్షులు థాంసన్ దొరవారు శాస్త్రులవారిని సంస్కృత-ప్రొఫెసరుగా నియమించి వేతనము హెచ్చింప పైయుద్యోగస్థులకు వ్రాసిరి గాని అది కొనసాగినదికాదు. శ్రీశాస్త్రులవారు ౧౮౭౨ సం. నవంబరు ౧౮ తేది ఆపర్టు గారికి తమస్థానమును వదలివైచిరి.

కాలవిలంబము నోర్వని శ్రీశాస్త్రులవారు వెంటనే ప్రాచ్యలిఖితగ్రంథపరిశోధనమొదలిడిరి. ౧౮౭౨సం.ము మొదలు అట్టిగ్రంథములను సేకరించుచు ఆసంవత్సరమే అక్టోబరు నెలలో విక్రయార్థమువచ్చిన కొన్నిగ్రంథముల

పై సవిమర్శముగా నొకలేఖను గవర్నమెంటువారికి వ్రాసిరి. దానింగని వారు శాస్త్రులవారిని శ్లాఘించి తగు ప్రోత్సాహ మొసంగ మొదలిడిరి. శాస్త్రులవారు గ్రంథ సముపార్జనముసేయ దీక్షవహించిరి.

శాస్త్రులవారు ఫైలాలజీవిషయమై ఎప్పుడు పరిశ్రమ మొదలిడినదియు చెప్పనశక్యము. వారు వ్రాసిన ఆర్యద్రవిడ-ఫైలాలజీగ్రంథమునందు వ్రాసిన యుపోద్ఘాతముం* బట్టి చూడఁగా విద్యార్థిదశయందుండునపుడే వారికి ఫైలాలజీయం దభిరుచి కలిగినదని తలంపనై యున్నది.

౧౮౭౫ సం. ఫిబ్రవరినెలలో, యమ్. ఏ., పరీక్ష సంస్కృతమందును, ఆంగ్లమునందును చేరిరి. శ్రీశాస్త్రులవారే ఈరాజధానిలో మొదటిసంస్కృత - యమ్. ఏ. ఆతర్వాత శాస్త్రులవారు మళయాళము, ఓఢ్రము, హిందీ, బంగాళీ, కొండు, లాటిను, గ్రీకుభాషలను చదువమొదలిడిరి. థాంసన్‌దొరవారు కడపటి రెండుభాషలను చదువ శాస్త్రులవారికి వలయు సదుపాయముల నెల్ల గావించిరి.

౧౮౭౭ సం॥ ఫిబ్రవరిలో పాఠశాలలపై ఇన్స్పెక్టరుగా నియమింపఁబడిరి. ౧౮౭౯ సం॥ జూన్ ప్రెసిడెన్సీకాలేజీలో ప్రాచ్యభాషాప్రవచనాధ్యక్షత్వపదముం బొందిరి. ఈయుద్యోగమునందు శాస్త్రులవారు పలుభాషలపైన వానివాఙ్మయములనుగుఱించియు, వాని ఫైలాలజీలం గుఱించియు నుపన్యాసముల నిచ్చుచుండిరి. ఈవిధముగా నిరంతరపరిశ్రమచే శాస్త్రులవారు అత్యల్పకాలముననే ‘ఫైలాలజీ-ప్రథమప్రవర్తకు’ లని ప్రసిద్ధిఁగాంచిరి.

౧౮౮౨ సం॥ము ఆపర్టుదొరవారు కొద్దికాలము సెలవుమీఁద స్వదేశమున కరుగఁగావారిస్థానమునశాస్త్రులవారు ప్రెసిడెన్సీకాలేజీ - గీర్వాణభాషామహోపాధ్యాయులుగాను,ప్రాచ్యలిఖితపుస్తకభాండాగారమునకధ్యాక్షులుగాను సంవత్సరకాలము కార్యము నిర్వహించిరి. ఈఅల్పకాలమున శాస్త్రులవారు సర్వజనాదరణీయులై పెద్దల యభినందనములకు పాత్రులైరి. కళాశాలాధ్యక్షులైన డాక్టరు డంకనుగారు శాస్త్రులవారింగూర్చి ప్రశంసించుచు గవర్నమెంటువారికి వ్రాసిరి. గవర్నమెంటువారును కరము ప్రశంసించిరి. అప్పటి గవర్నరుగారికి శాస్త్రులవారింగూర్చి గొప్పయభిప్రాయ ముండెనని.

౧౮౮౫ సం॥ము శాస్త్రులవారు రెండవ సహాయోపాధ్యాయులుగా సంస్కృతమునకు నియమింపఁబడిరి. ఆమఱుసంవత్సరము ప్రధానసహాయోపాధ్యాయులైరి. డాక్టరు ఆపర్టుదొరవారు ౧౮౯౩ సం. ఉద్యోగమునుండి విరామముంబొందఁగానే ఆ స్థానమునకు శాస్త్రులవారిని నియమించిరి. ఈయుద్యోగమునందే శాస్త్రులవారు ఆమరణమును (౧౯౦౧ వరకు) నుండిరి.

శ్రీశాస్త్రులవారియందు విశ్వవిద్యాలయమువారికి అత్యంతగౌరవ ముండెనది. ౧౮౭౬ సం. సంస్కృతమునకు పరీక్షకులుగా నియమింపఁబడిరి. మరల ౧౮౭౯ సం. మొదలు ౧౮౮౩ వరకును ఆ పదవియందే యుండిరి. ౧౮౮౫ మొదలు ౧౮౯౯ వరకు తమిళమునకు పరీక్షకులైరి. ౧౮౯౦ మొదలు తుదివరకును సంస్కృతమునందే యుండిరి. ౧౮౯౦ సం. సంస్కృతపరీక్షకసభకధ్యక్షులైరి. అట్లే పదియేం డ్లుండిరి. ౧౮౮౮ మొదలు ౧౮౯౩ వరకు బి, ఏ. విద్యార్థులకు ఫైలాలజీకి పరీక్షకులుగా నుండిరి. దివాన్‌బహదూర్ ఆర్. రఘునాథరావుగారు సహాయులుగా మహారాష్ట్రమునకు బహుకాలము పరీక్షకులుగా నుండిరి. ౧౮౮౨ సం. విశ్వవిద్యాలయమున ఫెలోగా నెన్నుకొనఁబడిరి. ప్రాచ్యభాషాప్రవచనాధ్యక్షత్వపదమందు శాస్త్రులవారుండు కాలముననే వారి ప్రోత్సాహమువలన బి. ఏ; యమ్. ఏ. తరగతులకు వేద తర్క వ్యాకరణాలంకారశాస్త్రముల ప్రవచనము

* Having seen my taste for linguistic studies, my teacher Mr. Thompson, the late Principal of the Presidency College, recommended to me a comparative study ot the languages and I carried out the advice. This Comparative method gave a fresh impetus to my study of languages and made the otherwise uninteresting and barren investigations of words and grammatical forms and phrases very pleasant and fruitful.

ప్రధానత్వముం బడసెను. విద్యాశాఖయందును గవర్నమెంటువారికి శాస్త్రులవారు బహుతెరంగుల తోడ్పడియున్నారు. సంస్కృతభాషాపరీక్షకసభా సభ్యులుగా నుండియే, తమిళము, ఆంధ్రము, కన్నడము, మళయాళము, మొదలగువాని ఉపసభలలో సభ్యులుగా నుండిరి. గవర్నమెంటువారి పరీక్షలను పెక్కింటిని స్వయముగా విచారించి జరుపుచుండువారు.

శ్రీశాస్త్రులవారి గ్రంథములగురించియు, వారు కావించు నితరకార్యముల గురించియు, మానియర్ విలియమ్సు, పారిస్‌వారైన ఫౌకాక్స్, డా. హోర్నిల్, గ్రయర్సన్, డా. బర్నల్, కొలంబియవారైన జాక్సన్ మున్నగు కొరలు, ప్రాచ్యభాషాపండితులు మిక్కిలి ప్రశంసించియున్నారు.

శాస్త్రులవారు ౧౮౭౮ సం. 'Notes on Aryan and Dravidian philology' అను గ్రంథముయొక్క మొదటిభాగమును ప్రకటించిరి. ఈగ్రంథమునందు వీరు తమ చిరపరిశీలనోపలబ్ధములైన విషయములను వ్రాసియున్నారు. అట్టిపరిశ్రమను అంతతీవ్రముగ సాగించి దానిని స్వరూపమునకుం దెచ్చినవారిలో శ్రీ శాస్త్రులవారే ప్రథములు. శాస్త్రులవారు తమ పరిశ్రమయొక్క ఫలితములను ఇంకను పెక్కుగ్రంథములరూపమున ప్రకటింపదలంచిరి. పైగ్రంథమునుగూడ సమగ్రముగా ప్రకటించుటకుమున్నే ౧౯౦౧ మార్చి ౮ తేదీన మరణించిరి. లోకులకు మొదటిభాగముమాత్రమే దక్కినది.

అప్పుడప్పుడు శాస్త్రులవారు తాము సంగ్రహించిన విషయములను చేర్చి 'తమిళశబ్దతత్త్వము' (Tamil philology) అనుగ్రంథమును ప్రకటించిరి. తర్వాత నాంధ్రశబ్దతత్త్వము (రెండుభాగములు), అర్ధానుస్వారతత్త్వము అనువ్యాకరణగ్రంథములను ప్రకటించిరి. ఈ గ్రంథములు పండితుల యాదరమునకు పాత్రములై యున్నవి.

అరవమునకు వాఙ్మయచరిత్రము ముఖ్యమని తలంచి తాము అప్పుడప్పుడు పత్రికలలో ప్రకటించిన విషయములనన్నిటిని చేర్చి 'Essay on Tamil Literature' అనుపేరున ప్రకటించిరి.

శ్రీశాస్త్రులవారు ఆయానిఘంటువులను ఆయా భాషలకు చెందినవానిని సిద్ధముచేయుచుండిరి. అవి ముగింపునకు రాకుండగా శాస్త్రులవారు గతించిరి. వీరు ౧౮౯౪ సం. ఏప్రెల్ నెలలో ౧౨ తేది జరిగిన ఆంధ్రకవిపండితసంఘమునకు తాము రాలేమికై చింతించుచు శ్రీధర్మవరము రామకృష్ణమాచార్యులవారికి వ్రాసిన లేఖ* యందు తమపరిశ్రమలగురించి నాలుగు పంక్తులు వ్రాసియున్నారు. పైగ్రంథములుగాక శాస్త్రులవారు వ్రాసిన గ్రంథములెన్నియో గవర్నమెంటువారు కోరంగా పాఠశాలలకై పెక్కుగ్రంథముల ననువదించిరి. వారు నిరంతరముపంపుచుండు గ్రంథములపై నభిప్రాయములు వ్రాయుచుండిరి. ప్రాచ్యలిఖితగ్రంథములకు శోధించుచు విమర్శలు వ్రాయుచుండిరి. మిక్కిలి ముఖ్యమైన పౌరాణికసామములగురించి కొన్నివ్యాసములను వ్రాసిరి. డాక్టరు

* "Owing to the pressure of official business and other causes, I have not been able to make up my mind to attend.......:The objects of the conference have my full sympathy and I shall do what I can for it. I have been engaged in a critical and comparative study of Tamil, Telugu, Kanarese, and Malayalam languages for more than twenty years. I wish to publish a philological dictionary for each of these languages and also for Sanskrit. I have published a grammar for Telugu under the designation of ఆంధ్రశబ్దతత్త్వము and a short treatise on the అర్ధానుస్వారము. The Tamil grammar is in the press. By to-day's post I forward to the conference copies of the above books, which I hope the conference will be good enough to accept as my humble quota to the literature and language of the Telugu countries. Any corrections and suggestions from the conference will be most thankfully received."

బళ్ళేలం దొరవారి నిఘంటువునకు వ్యాస మొకదానిని వ్రాసిరి.

శ్రీ శేషగిరిశాస్త్రులవారు సంగీతమందు అపార పాండిత్యముగలవారు. వారికి కర్ణాటకహిందుస్తానీ పారసీకయసంగీతములందు పూర్తియందు సమాన ప్రజ్ఞకలదు. ఆకాలమున (నేఁటికి ముప్పదియైదు సంవత్సరములకు పూర్వము) సంగీతసమాజమొకటి ప్రత్యేకము ఐరోపియ పండితులచే జరుపఁబడుచుండెను. అందు శాస్త్రులవారొకరే హైందవసభ్యులుగా నుండిరి. వీరు పైపూఁటుపద్ధతుల తారతమ్యముల నెఱింగినవారు గావునను, అందు పరిశ్రమ సల్పినవారుగావునను, ఆకాలమునందు విశ్వవిద్యాలయమున సంగీతము లేనందునను గవర్నమెంటువారి తరఫున డైరెక్టరుగారు శాస్త్రులవారిని కోరఁగా శాస్త్రులవారు సంగీతప్రవచనము విశ్వవిద్యాలయమున ప్రారంభించుటకై విషయసంగ్రహాదికములను వ్రాసి గవర్నమెంటువారికి పంపిరి. ఇంతలో నుత్పాతమువలె వారి మరణము ఆయుద్యమము నూఁదివైచెను. వీరి తర్వాత వచ్చిన డాక్టర్ బోరన్‌గారికి ఇందు శ్రద్ధలేమిచే నీయుద్యమము అడుగంటి నేఁటికాలమునకు మరల పైకివచ్చినది. శ్రీ శాస్త్రులవారే ఇంకను కొన్ని సంవత్సరము లుండిరేని నేఁడు ప్రారంభింపఁబడిన సంగీతప్రవచనము విశ్వవిద్యాలయమున నాఁడే ప్రారంభింపఁబడియుండును.

శ్రీ శాస్త్రులవారియింట నిరంతరము విద్యావినోదములు జరుగుచుండెడివి. వీరి కుటుంబములో శాస్త్రులవారి అన్నగారగు శ్రీ కృష్ణయ్యగారును, వారితమ్ములగు శ్రీ రామచంద్రయ్యగారును, వేంకటేశ్వరశాస్త్రిగారును సంగీతవిద్వాంసులు. అందు వేంకటేశ్వరశాస్త్రులవారు శేషగిరిశాస్త్రులవారితో అన్నివిషయముల సమానులు; సంగీతమునందు గ్రంథములువ్రాసి ప్రకటించియున్నారు. వానిలో ప్రస్తుతింపఁదగినది సంగీతస్వయంబోధిని. శేషగిరిశాస్త్రులవారిచే సంగీతవిద్వాంసులేమి, తదితరులేమి నిరంతరము బహూకృతు లగుచుండిరి. నాట్యాదికములలో ఒజ్జలు శాస్త్రులవారిని మొదట మెప్పించిననేగాని సభలలో తమవిద్య చూపువారుకారు. ఇట్టివారిని పరీక్షించుటయందు శాస్త్రులవారి బుద్ధి కుశాగ్రసదృశము. భరతశాస్త్రము వారికి కరతలామలకము. శాస్త్రులవారియింట లక్ష్మీసరస్వతులు కలసిమెలసి వాసముచేయుచుండిరి. ఆగంతుకులు వారియింట నిరంతరము బహూకృతు లగుచుండిరి. లేనివారిని మాసములపర్యంతము తమయింటనే యుంచుకొని పోషించిన దయార్ద్రహృదయులు శాస్త్రులవారు. పెక్కుపండితులకు మార్గదర్శకులై హితోపదేశములం గావించినారు. ఆంధ్రకవిపండితసంఘములలో నొకదాని కధ్యక్షులై, అచ్చటి పండితుల మాత్సర్యముం గని, పండితులు జిజ్ఞాసువులై మెలంగవలయునని సెలవిచ్చిరి.

శ్రీ శేషగిరిశాస్త్రులవారింగూర్చి వారికి ఆప్తమిత్రులును, నిరంతరము వారిగోష్ఠిలో మెలఁగినవారును, అస్మత్పితామహులును అగు బ్రహ్మశ్రీ, కళాప్రపూర్ణ, మహోపాధ్యాయ, వేదము వేంకటరాయశాస్త్రులవారు తమ యుషానాటకమును వారికి అంకితము గావించుచు నిట్లు ముద్రించిన ప్రశంసావాక్యములు — "సంగీతసాహిత్యములను వీణాగానకళానారదులును, సాంగవేదములందు నిష్ణాతులును, సర్వదర్శనములందు దీక్షితులును, సంస్కృత ప్రాకృత ఆంధ్ర ద్రావిడ కర్ణాట మహారాష్ట్రాంగ్లేయ గ్రీకు లాటిను నాగరి ప్రభృతి పదభాషాలక్ష్యలక్షణాభిజ్ఞసార్వభౌములును, ప్రాచీనభాషాశైలాలకీ పర్షన ప్రశ్నప్రవర్తకులును, మదరాసు ప్రెసిడెన్సీకాలేజీ శైలాలకీప్రాక్తనభాషా మహోపాధ్యాయులును, బోధిసత్త్వకల్పులును అగు సద్గుణరత్నంబు తాతవెళ్ళిమిరాదార్ శ్రీయుత శేషగిరిశాస్త్రులు ఎమ్. ఏ గారి కీర్తిమూర్తికి సమర్పించినాఁడను." అని.

ఈవిధముగా నిరంతరము శారదాదేవత నారాధించిన ఈమహనీయుని, అస్మత్పితామహుని నామధేయము నిరంతరము స్మరణీయము.

---




పి. విశ్వనాథన్ గారు.

మొదటి చిత్రమున నొక చతురమున నాలుగు పిచ్చుకలు చిత్రింపబడియున్నవి. ఆచతురమున నిడుపుగను, అడ్డముగను ౧౩ చుక్కలు కలవు; ఒకటవ నంబరు బొమ్మను చూడుడు. రెండవ నంబరు బొమ్మయందు ఆచుక్కలను కలుపు విధానము చూపబడినది.







ఇందు చతురమున నాలుగవ భాగము మాత్రము చూపబడినది. మొదట, నడుమ పుష్పమును చిత్రించవలయును. తరువాత పిచ్చుకయొక్క శరీరము, ముక్కు, రెక్కలు చిత్రించవలయును. ఇట్లు ఈముగ్గును ముగించవలెను.

రెండు మూడు చిత్రములందు రెండు ఆవులు కలవు. అందొకటి నిలుచుకొనియున్నది. మేయుచున్నది. బొమ్మయందు చూపిన చుక్కలను, వానిని కలుపురీతిని బాగుగా గమనించి చిత్రమును ముగించవలయును.



శ్రీ శేషగిరి శాస్త్రులుగారు (తాతవెల్లి మిఠాదార్)

# ఖాదీపరిశ్రమ : ౨

మిస్. మెల్లీ సోలింగరు (స్విట్జర్లాండు)

## పరిశోధనావశ్యకత

ఖాదీ పరిశ్రమకు ఉపయోగపడెడు పత్తిజాతుల విషయమై వెంటనే జరుగవలసియున్న శాస్త్ర పరిశోధనలనుగూర్చి వెనుకటివ్యాసమందు కొంత వివరింపబడియుండెను. ఈవ్యాసమందు ఖాదీ ఉత్పత్తియందు వాడుకచేయబడుచున్న వేర్వేరుపరికరములను,—అనగా పత్తినిడుచురాట్నము, ఏకుబద్ద, వడుకురాట్నము—సాధనములను అభివృద్ధిచేయుటకుగాను ఖాదీ అభిమానులచే జరుపవలసిన పరిశోధనలను క్లుప్తముగా వివరించెదను. హిందూదేశమండలి లక్షలకొలది గ్రామములందు అనాదిగా ఈసామగ్రియు,సాధనములును వాడుకయందున్నవి. నేటి అవసరమును గుర్తించి, యీపరికరములను మార్పుచేయుటయు, విధానములను సవరించుటయు అత్యంతావశ్యకము.

### పత్తిరాట్నము

ఆంధ్రదేశమందు పత్తిని నిడుచుటకు పత్తిరాట్నమును వాడుకచేయుదురు. ఈప్రాంతములయందలి పల్లెటూళ్లను చూచినవా రందరకిని సున్నపుగానుగయొక్క 'సంగీతమును', పత్తిరాటముయొక్క 'కిర్రు'ను ఎన్నటికిని మఱపునకు రావు. మంచిపత్తిరాటమున కుండవలసినగుణము లేవనగా: ౧. గింజకంటియున్న దూదినంతటిని గింజనుండి పూర్తిగా వేరుచేయుట; ౨. గింజ చిదుకకుండునటులను, రేసులు నలిగిపోకుండునటులను, తునుకలు కాకుండగను నిడుచుట; ౩. పత్తిరాటముపై జీవనోపాధికాధారపడెడువారికి కూలి కిట్టుట. ఈమూడు అంశములనుపట్టి విచారించినయెడల సామాన్యముగా వాడుకలోనున్న పత్తిరాటము మిక్కిలి వెనుకబడియున్నదని ఒప్పుకొనక తప్పదు. పల్లెటూళ్లయందు నిడిచిన పత్తిని మనము పరీక్షించినయెడల, (అందు చెత్త చెదారము గాక). నలిగిపోయిన గింజలు విస్తారముగా నుండుట కనపడును. పల్లెటూరివడ్రంగి యీరాటములను ఇంతకంటె చక్కగా చేయలేడు. తెలివిగలవాడైనను అతని పనిముట్లు మోటు అయిన వగుటచే తయారయిన వస్తువుకూడా మోటుగానే యుండును. పత్తిరాటము యొక్క లోపము లన్నిటికిని అది కఱ్ఱతో చేయబడుటయే కారణము. రాటముయొక్క 'రోలర్లు' (Rollers)ను తిరుగుడు (Gear)ను, కఱ్ఱతో చెక్కబడుటచే, రాటమును త్రిప్పునపుడు విస్తారమురాపిడి యేర్పడి పనిచేయుట కష్టముగా నుండును. మరియు, పై 'రోలరు' నకును, క్రింది 'రోలరు' నకును మధ్యనుండు స్థలమును, హెచ్చించుటకుగాని, తగ్గించుటకుగాని సులభముగా వీలుపడకుండుటచేతనే, పత్తిని నిడుచునపుడు, గింజ గింజనూదిరిగానే దూదివైపు పడుటయో, లేక గింజ రేకులతోసహా చితికిపోయి దూదితో కలసిపోవుటయో సంభవించును. ఈనిడుపురాటముయొక్క దిగుబడికూడా మిక్కిలి తక్కువ. సగటున ఒక స్త్రీ దినమునకు పదిగంటలు నిడిచినయెడల ౩ వీశెల పత్తి నిడువగలదు. త్వరగా పనిచేసినను ౪ వీశెలకంటె హెచ్చు నిడువలేదు. (కైలాసపట్నంప్రాంతమందు బాలురు దినమునకు ౪ వీసెలు నిడుచుట . లదు.) వీశకు అర్ధణా చొప్పున, దినమునకు ౨ అణాలకంటె తక్కువకూలే కాని హెచ్చుకూలి కిట్టదు. ఇట్టి బీదవారిసంపాదనలో దినమునకు ఒక్కకాణీయైనను హెచ్చింపగలిగితిమేని మన జన్మము సార్థకమనియే చెప్పవచ్చును.

సుగుణము లన్నిటిని కలిగి, హెచ్చుగా దిగుబడి ఇచ్చునటువంటిదియు, చౌకగా తయారు కాగలదియు అగు ఒకపత్తిరాటమును కీర్తిశేషులైన శ్రీ మగన్‌లాలు గంధీజీగారు కనిపెట్టియున్నారు. ఈరాట్నమందు విశేషము లేవనగా ౧. పైనమర్చబడిన 'రోలరు' ఉక్కుతోను, క్రింద అమర్చబడిన 'రోలరు' కఱ్ఱతోను చేయబడి

యున్నవి. ఇందువలన 'రోలర్లు' త్వరగా వేడియెక్కవు. ౨. 'రోలర్లు'లోహపుబేరింగులలో (bearings) అమర్చబడుటచే, రాటమును అతిసునాయాసముగా త్రిప్పవచ్చును. 3. పైనను రోలరులయొక్క బేరింగులకు 'స్క్రూలు' (Screws) తగిలించియుండుటచే, రోలర్ల మధ్యనుండు స్థలమును ఎప్పటికప్పుడు తగ్గించుటకును, హెచ్చించుటకును వీలగును. ఈ ఏర్పాటువలన గింజలు చితుకుట గాని, రేచులు నలిగి తునుకలగుటగాని జరుగదు. ఈ మాదిరి రాటము లనేకములు ప్రస్తుతము గుజరాతునందు వాడుకలోనుండి బాగుగా ఉపయోగమునకు వచ్చుచున్నవి. వీటితో దినమునకు ఒకమణుపత్తిని నిడుచుటకు వీలగును. అనగా, ఆంధ్రదేశమందు వాడబడుచున్న పత్తిరాటములయొక్క దినుబడికంటె, వీటి దిగుబడి రెండింతలకు పైబడియున్నది. ఆంధ్రదేశమందు గొప్పపత్తిపంట గలదు. ఇది సుమారు ౧౫౦,౦౦౦ బేలు లుండును. అందులో ఉత్తరసర్కారులపంట కనీసము ౪౦,౦౦౦ బేలు లుండును. ఈపత్తి అంతటి లోనూ ఏకొద్దిమొత్తమో (ఏ ౪,౦౦౦ బేలులో అని అంచనావేయవచ్చును.) ప్రస్తుతము ఖద్దరుఉత్పత్తికి వినియోగపడుచున్నది. మిగిలిన దంతయు మిల్లులవారిచే కొనబడి, మిల్లులలో (ginneries) నిడువబడుచున్నది. ఖద్దరు-ఉత్పత్తిదారులు చాలామంది తమకు కావలసిన పత్తిని పల్లెటూళ్లలో నిడిపించుక, మిల్లులలో నిడిచిన మాది బజారులలో కండ్లయెదుట సిద్ధముగా కనపడుచుండుటచే, మరి ఆలోచించక, దానినే కొనుచున్నారు. ఈవిషయమై ఖాదీ-అభిమానులు శ్రద్ధవహించి, ఆంధ్రదేశమందు పండెడిపత్తిని ఆంధ్రదేశములోని బీదలే నిడుచునట్లును, ఆకూలి ఆంధ్రదేశములోని బీదలకే కిట్టునట్లును ఏర్పాట్లు చేయవలెను.

## ఏకువిధానము

దూదిని ఏకుటయందుకూడా చాలాసవరణలను చేయుట కవకాశము గలదు. ఈజిల్లాలలో (గంజాం, విశాఖపట్నం) ఖాదీ - ఉత్పత్తికి కావలసిన దూది యంతయు దూదేకులవారిచేతనే ఏకబడుచున్నది. పట్టుశాలీనూలును, వెలమనూలును వడుకువారు స్వయముగానే ఏకులుచేసుకొనెదరు. ఖాదీ-దీక్షవహించినవారు సైతము—ఎక్కడనో ఒకరో ఇద్దరో తప్ప—ఏకులను స్వయముగా చేయుట నేర్చుకొనక, దూదేకులవారు ఎట్టిఏకులను చేసి ఇచ్చినను వాటిపైననే ఆధారపడుచున్నారు. ఖాదీ-అభిమానులే ఇట్లు చేయుటచే ఈ ప్రాంతమందు దూదిని ఏకువిధానము ఏమాత్రము అభివృద్ధిని చెందక మిక్కిలి వెనుకబడియున్నది. ఈవిషయమై ప్రచారముచేయుట అఖిలభారతచరఖాసంఘము వారి విధియైయున్నది.

దూదేకులవారు ఉపయోగించు విధానముయొక్క మూలసూత్రములన్నియు శాస్త్రసమ్మతములుగానే యున్నవి. అయినప్పటికిని వారుపయోగించెడి ఏకుబద్ద మిక్కిలి బరువుగా నుండుటచేతను, పెద్దదిగా నుండుటచేతను, ముఖ్యముగా వారు దూదిని పనుపుల కొరకు ఏకుటచేతను, వారు చేసెడిఏకులు నూలువడుకుటకు మిక్కిలి అసంతృప్తికరములుగా నుండుచున్నవి. ఏదో యొకమోస్తరుగా ఏకులను చేసి, తమకూలిని సంపాదించుకొనుటయే వారికి కావలెను కాని, తాము చేసెడి ఏకులు నాణ్యమైనవో కావో తెలుసుకొనుటకు కూడా వారు తంటాలుపడరు. వారికి నరకాశాస్త్రమందు అభిరుచిగాని, ఖాదీయందు అభిమానముకాని కొంచెమైనను లేదు. (ఖాదీని ధరించిన దూదేకులవాని నొక్కనిని మాత్రము నరసాపురమందు నేను చూచియుంటిని.) ఇట్టివారిచే తయారుచేయబడిన ఏకు లెట్లు సంతృప్తికరములుగా నుండును? ఈవిషయమై పరిశోధనలను చేయుటకు చాలా అవకాశమును, అవసరమును గలదు. జాగ్రతగా ఆలోచించి సాధనములను కొన్నిటిని తేగలిగితిమేని ఈదూదేకులవారిచేత చక్కని ఏకులను చేయించగలుగుదుము. పరిశోధనావశ్యకములగు విషయములను కొన్నింటిని వివరించెదను.

## దూదిని ఎండవేయుట

ఏకుటకు పూర్వము దూదిని ఎండలో నుంచుట ఆచారమైయున్నది. దూదియందున్న చెమ్మ యిగిరిపోవుటకే ఇట్లు చేసెదరు. ఈకారణ మిట్లుండగా,

గూడని వేడిగానున్నప్పుడు ఏకుట మిక్కిలి సులభము. ఈకారణముచే నీదేశములవారు గూడని బాగ ఎండినతేకాని ఏకుట మొదలుపెట్టరు. కొన్ని స్థలముల యందలి యేకువారందరు, గూడని ఎండలోపడవేసి, గూడని బుగ్గపై ఉంచిన చుట్టునున్నంతవరకుకూడా, గూడని ఎండనిచ్చెదరు. ఇట్టిగూడని ఏకులు చేసినతరువాత పనికిపెట్టుటయందేయెడల మిక్కిలినష్టము సంభవించును. ఈరేషములనుండి వడికిననూలునకు బలము, పురియు చాలా తక్కువగా నుండునని సబర్మతీఆశ్రమమువారు పరిశోధనల ఫలితముగా కొన్ని సంవత్సరముల క్రిందట కనుగొని యుండిరి. గూడనుండి చెమ్మను తీసివేయుట ముఖ్యావశ్యకము. అయినను, ఏకువారికి 'ఎండవేయుట', 'ఎండలోనుంచుట' ఈరెంటికినిగల భేదము తెలియక, గూడనుండి చెమ్మను తీసివేయుటయే కాకుండా, గూడని విస్తారము ఉష్ణమునకు లోనుచేయుచున్నారు.

## రేషముయొక్క సూక్ష్మనిర్మాణము

రేషముతీగలను మనము సూక్ష్మదర్శినిచేత పరీక్షించితిమేని, అవి పొరలుగలుచుట్టిన గొట్టములవలె కనబడును. ఈగొట్టములు 'సెల్యులోస్' (Cellulose) అనెడి పదార్థముతో చేయబడియుండును. గొట్టములు ఖాళీగా ఉండును. గొట్టములలోపలిగోడలయందు అక్కడక్కడ లోహపదార్థము (Mineral matter) లుండును. గొట్టములయొక్క పైభాగమునకు ఒకవిధమగు చమురుగు—మైనముతో కలసిన పదార్థముయొక్క పూత యుండును. రేషములయొక్క నిర్మాణమందు సెల్యులోసు ౮౫% న్ను; లోహపదార్థములు ౧౦% న్ను; మైనము ౫% న్ను కలిసియున్నవి. ఈ మైనపుపూత మిక్కిలి నాజూకుగాను, అల్పముగాను నుండుటచే, ఏమాత్రపు వేడిమికైనను కరగిపోవును. వేడిగానుండు దినములలో ఎండలోనుంచిన యెడల, ఈ మైనము అంతయు కరిగిపోవును. ఈపూత కరగి పోయినటువంటి రేషము మెత్తబడి సులభముగా సాగిపోవును. ఇట్టినష్టము నెండకాలపు దినములలోని శీతోష్ణస్థితులను జాగ్రత్తగా ఎప్పటికప్పుడు కని పెట్టుచునే యుండవలెను. మనము ఏకుటకుముందు దూదిని ఎండలో నుంచినయెడల రేషములయందు బహుశః ఈమార్పే సంభవింపవచ్చునని మనమూహింపవచ్చును. ఇట్టి మార్పే సంభవించినయెడల తప్పక ఈదినుండి తయారగు నూలు త్వరగా పురినిపట్టక మెత్తగాను, నీరసముగా నుండును. దీనిని స్థిరపరచుటకు పరిశోధనలను చేయవలసి యున్నది. రేషములను ఎండలో నుంచుటకుముందును, ఎండ లోనుంచినతరువాతను సూక్ష్మదర్శినిచేత పరీక్షచేయవల యును. అందువలన రేషునకు ఉష్ణమువలన నష్టము కలిగి నదియు లేనిదియు స్పష్టమగును. నష్టముకలుగుటయే స్థిర పడినయెడల, ఎంతకాలము యెండలోనుంచిన చెమ్మ ఇగిరి పోవుటకు చాలునో, ఎంతకాలముంచిన మైనపుపూత కరిగి నష్టము కలుగునో తెలుసుకొనగలము. మరియు ఈమైనపుపూత ఒక్కొక్కరకము పత్తియందొక్కొ క్కడశసరిని కలిగియుండును. ఈవిషయముకూడా పై పరిశోధనయందు గుర్తించవలసియుండును.

## రేషులు మెలికలు తిరిగియుండుట

సూక్ష్మదర్శినిక్రింద పత్తిరేషులను చూచితిమేని అవి 'కార్కుస్క్రూ' వంటి మెలికలు (Spiral twists) కలిగియున్నట్లు మనకు తెలియును. ఇది యొక్కగొప్పవిశేషము. మంచి విలువయగు జాతుల యందు ఈమెలికలు అంగుళమునకు సుమారు ౧౫౦ నుండి ౧౮౦ వరకునుండును. ఈమెలిక లుండుటవలననే గూడకట్టి, పురి, బలము మొదలగు గుణములు కలుగు చున్నవి. వివిధజాతుల పత్తియందు మెలికలసంఖ్య వివిధ ముగా నుండును. నూలుపోగులోనున్న రేషులన్నియు, ఒకదాని మెలికలలో నొకటి అల్లుకొనిపోయి, నూలును మనము త్రెంచుటకు లాగునప్పుడు, రేషులు ఒకదానినుండి వేరొకటి జారిపోకుండ అడ్డునుండును. వేడి దెబ్బ తిన్నటువంటి దూది మైనపుపూత కరిగిపోవుటచే మెత్త బడి సాగిపోవునని చెప్పియుంటిమి. ఇట్లు మెత్తబడిన ప్పుడు యీమెలికలుకూడా సాపు (Flatten) జేరి చాలామటుకు అదృశ్యములగుటకు అవకాశ మేర్పడ వచ్చును. నిజముగా జేసిమిచే ఈ మెలికలు పోయిన యెడల, అట్టిరేషులతో చేయబడినూలు తప్పక పురియం దును బలమునందును విస్తారము తక్కువబడియుండును.

ఈ సంగతి మనము ఊహించి చెప్పుచున్నను, పరిశోధనచే తేల్చవలసియున్నది.

## ఏకునరముయొక్క స్థాయి

మరియొకవిషయము. దూదిని ఏకునప్పుడు జరుగునదేమనగా ఏకుబద్దయొక్క నరముపై దెబ్బకొట్టినపుడు నరమునకు కదలిక (Vibrations) పుట్టును. ఈ కదలికవలన నాదము సంభవించును. నరము కదలినప్పుడు దూదెని వద్దకు తెచ్చితిమేని, కదలికకు చిక్కుపడియున్న రేచులు, ఒకదానినుండి ఒకటి విడిపోవును. ఇదియే ఏకుట. దూదేకులవారు వాడుకచేయునరము మిక్కిలి మోటుగా నుండును. ఇది మేకపేగులనుండి తయారుచేయబడి, సాధారణముగా పది, పన్నెండుపేటలు గలిగియుండును. నరము పురిత్రాడువలె మోటుగా నుండుటచే, దీనియొక్క కదలిక అంత హెచ్చుగా నుండదు. ఇట్టి మోటునరముతో అతడు కురుచరేచుల పత్తిని (ఉదాహరణపూర్వకముగా అనకాపల్లిరకము, ౩/౮ అంగుళము రేచు) బాగుగానే ఏకగలుగును. కాని, ఇంతకంటె పొడుగురేచుల పత్తిని (ఎర్రపత్తి ౬/౮ అంగుళము రేచు) ఏకుటకు మన మతనికిచ్చినట్టయిన, అతనిచే తయారుచేయబడిన ఏకులు ఎంతమాత్రమును సంతృప్తికరముగా నుండవు. ఇందుకు కారణము అతడు తగినంత కష్టపడకుండుట కాదు. అతడు మోటునరము నుపయోగించుటయే ఇందులకు కారణము. అది ఎట్లనగా మోటునరమునకు కదలికయు, స్థాయి (Frequency) యు తక్కువ. అయినను కురుచరేచులను విడదీయుటకు ఈ స్థాయి చాలును. పొడవురేచులను విడదీయుటకు ఈ స్థాయి చాలదు. ఇంతకంటె హెచ్చు సన్నటి నరమును అతడు వాడుకచేసియెడల, సన్నటి నరముయొక్క స్థాయి హెచ్చుగా నుండును. కాన, నరముయొక్క హెచ్చుకదలికకు పొడుగుపాటి రేచుల చిక్కు విడిపోయి, ఏకులు బాగుగా జరుగును. దూదేకులవారు పత్తిరకములు అన్నిటికిని ఒక్కటే నరమును వాడుకచేసెదరు. ఇందువల్లనే, మంచిరకముపత్తిని మనము వారిచే ఏకించినప్పటికిని వారి యేకులు బాగుగా నుండుటలేదు. వారు మోటునరము వాడుకచేయునంతకాలము మనము వారికి ఆఖరురకము కురుచరేచుల దూదినే ఇచ్చి ఏకులుచేయించుకొనిన లాభకరముగా నుండును.

## నరముయొక్క దళసరి-నూలునంబరు

ఈసందర్భమున శ్రీమగన్‌లాల్ శీగారు తమ 'చర్ఖశాస్త్రము'నం దిట్లు చెప్పియున్నారు. "నరము ఎంతమోటుగానుండిన, ఏకుట అంత కష్టముగాను, తక్కువరకముగాను (అనగా సాఫులేనిదై) ఉండును. నరము ఎంతమోటుగా నుండిన, అంతహెచ్చుదూదిని ఏకుటకు వీలుండు ననుమాట నిజమే. నరము ఎంత సన్నముగానుండిన, ఏకులు అంతసునాయాసముగాను, ఏకినదూది అంతఅందముగాను ఉండును. కాని తక్కువ దూదిని మాత్రమే ఏకుటకు వీలుపడును." ఈసిద్ధాంతము ననుసరించి సబర్మతీఆశ్రమమునందు, బ్రోచి (Broach), వార్ధా (Wardha) రకములపత్తిని (రేచులపొడవు ౫/౮ నుండి ౬/౮) ఏకుటకు ౬ పేటలతో చేసినటువంటినరమును, మంచి నవసారి (Navasari), సూరతు (Surat) పత్తిని (రేచులపొడవు ౭/౮ నుండి ౧ అంగుళము) ఏకుటకు, ౮ పేటల నరమును, ఈపత్తినే ఇంకా సాఫుగా ఏకవలెనన్న బార్డోలీఏకుబద్దకు ౩ పేటలతో చేసిన నరమున్ను ఉపయోగించు ఆచారము కలదు. ఇదేవిధముగా విశాఖపట్నంజిల్లాలో దొరకెడిదూదిని ఏకుటకు, సబర్మతీ 'మధ్యమ' తరగతి ఏకుబద్దతో:—

౬ నం. నూలువడుకుటకు అనకాపల్లి, గుంటూరు, గుణుపురం, పత్తి: ౧౦ పేటల నరము,

౬-౧౨ నం. నూలువడుకుటకు గజపతినగరం పత్తి, తుని, కైలాసపట్నంపత్తి....... ౮ పేటల నరము,

౧౫-౨౫ నం. నూలువడుకుటకు ఎర్రపత్తి, గొల్లప్రోలుపత్తి, వెలమపత్తి: ౬ పేటల నరము,

౩౦ నం. నూలువడుకుటకు, బార్డోలీ, వర్ధా ఏకుబద్దలతో ౮ లేక ౩ పేటల నరము,

వాడినయెడల మంచిఫలితములు కలుగునని నాయనుభవము. పట్టుశాలీ, వెలమనూళ్లను వడుకువారు తమ

పోయియుండును. ఇవి కాక ఇంకా దూదిలో తెగిపోయినరేసులు, పొట్టిరేసులు, చిక్కుపడినరేసులు మొదలైనవి సహజముగా దూదిలో నుండును. ఇవియన్నియు కూడా దూది సరిగా ఏకబడకుండా అడ్డుపడి అంతరాయములు కలిగించుచుండును. ఏకునపుడు చెత్త, పొల్లు ఇసుక మొదలగు బరువైనటువంటి కల్తీ చాలా వరకు దూదినుండి వేరుపడిపోవును. వీనితో కూడా సన్నటి నూగు, పొట్టిరేసులు కూడా క్రిందకు పడిపోవును. దూదిని ఏకినతరువాత, మన మెప్పుడైనను దూదేకులవాని చాపను తీసిచూచితిమేని, అదుగున ఈచెత్త అంతయు పడి పలుచటి మేఘములవలెనుండి గాలికి ఎగిరిపోవుచుండును. లేతదూదిని, చిక్కుపడినదూదిని, పక్కు, గింజ మొదలగునవి ఏర్చి పారవేయబడును. ఇవన్నియు లేని యెడల ఏకుట సులభముగాను, త్వరగాను జరిగిపోయి తరుగు చాలా తక్కువగా నుండును. దూదిని కొనుచున్నప్పుడు ఈచెత్తనుకూడా కొనుచున్నాము. అంతేకాక, వీటివలన ఏకుట ప్రియమై, తక్కువఏకులు తయారగును. ఖరీదైన పత్తి రకములందును, జాగ్రత్తగా ఏరినపత్తియందును ఈకల్తీ తక్కువగానుండి, ఏకునపుడు తరుగు తక్కువగా వచ్చును.

ఎంత మేలురకముదూదియైనను ఏకునపుడు కొంత రద్దుకాక మానదు. ఈరద్దుకు మించినతరుగు వచ్చినప్పుడు మాత్రము దూదియందు హెచ్చుగా కలితీ కలుపబడినట్లును, లేదా ఏకువిధానము సరిగా లేనందున కొంత దూది గుండ అయిపోవుచున్నట్లును, లేదా రెండును జరుగుచున్నట్లును మన మూహించవచ్చును. ఈ తరుగు విషయమై మిల్లులలో మిక్కిలిశ్రద్ధ తీసుకొనెదరు. ప్రతిసారి దూదిని కొన్నప్పుడును, ప్రతిదినము ఏకులు చేయునపుడును దూదియందు ఎంతరద్దున్నదియు, ఏకులయందు ఎంతతరుగు వచ్చుచున్నదియు, హెచ్చుతరుగు వచ్చిన యంత్రములలో లోపములను సరిచేయుటయు, కల్తీకి సరిపోయిన తరుగుమాత్రమే వచ్చునట్లు చేయుటకు ఘనమైనలెక్కలను కట్టుచు అత్యంతము జాగ్రత్త తీసుకొనెదరు.

ఖాదీ-ఉత్పత్తియందుకూడా, ఏకునపుడు వచ్చెడి తరుగునుగురించి మనము శ్రద్ధ తీసుకొనవలసియున్నది. మిల్లులవారికి ఇది ఎంత ముఖ్యమైనదో మనకు అంతకంటె హెచ్చుముఖ్యమనియే చెప్పవలసియున్నది. ముదుకునూలు వడుకునిమిత్తము ఒకరకముదూదిని ఏకునప్పుడు వచ్చెడితరుగుకంటె ఆదూదినుండి సన్నటి నూలును వడుకుటకు నిమిత్తము ఏకునపుడు వచ్చెడితరుగు హెచ్చుగా నుండును. ఎందుచేత ననగా, సన్నటినూలును వడుకుటకు ఏకులు కావలెనన్న, దూదిని మరి నాల్గుసార్లు ఏకవలసియుండును. ఎంత హెచ్చు ఏకిన అంత తరుగు సంభవించును. అందుచే నూలు నెంబరునకు, ఏకునపుడు తరుగునకును చాలాసంబంధ మున్నది.

నా అనుభవముప్రకారము, ఈసుట్టు ప్రక్కల దొరకు దూదిరకములనుండి ఏకులు చేయునప్పుడు, తరుగు ఈక్రిందివిధముగా నుండుననిఅంచనా వేయబడినది:—

| దూదిరకము | ఏ నెంబరునూలు వడుకుటకు ఏకబడినది | | | తరుగు |
|---|---|---|---|---|
| అనకాపల్లి | ౪-౯ | ముదుకు | నూలు | ౮% |
| తుని ఎరుపు | ౧౨ | ,, | ,, | ౬% |
| గుంటూరు తెలుపు | ౧౨-౧౫ | ,, | ,, | ౧౦% |
| వార్ధా | ౧౪ | ,, | ,, | ౧౦% |
| గుంటూరు తెలుపు" | ౨౦-౨౨ | సన్నం | ,, | ౧౨-౧౫% |
| తుని-ఎరుపు | ౨౫ | ,, | ,, | ౧౨% |
| వెలమ పట్టుశాలీ | ౩౦-౬౦ | ,, | ,, | ౧౦-౧౫% |

## తరుగు నిర్ణయించు విధానము

ఏకునపుడు సరిగా ఎంతతరుగు వచ్చుచున్నదియు తేలినపుడే, ఖాదీ-ఉత్పత్తి-దారునకు తాను ఉత్పత్తి చేయించుచున్న నూలు ఎంతఖరీదు అగుచున్నదియు, ఆనూలుయొక్క పురి, సన్నమునకు నాణ్యమునకు తగినట్టి దూది ఖరీదు పోను ఎంత కిట్టుచున్నదియు, తాను వాడుకచేయుచున్న దూదిరకము సరియైనదో కాదో

మొదలగు ఉత్పత్తిలెక్క (Costing Accounts) లను సరిగా చేయగలస్థితిలో నుండును. ఇందుకు పైన వేయబడిన అంచనాపట్టికకాక, ఇంతకంటె తరుగును జాగ్రతగా తేల్చుట అవసరము. ఒకవీశెడు నిడిచినపత్తిని తీసి, దానిని పూర్తిగా ఏకి, ఎంతతరుగు వచ్చినదియు, సగము వరకే ఏకి ఎంతతరుగు వచ్చినదియు, తూనికవేసి తేల్చవలయును. మరియొకవీశెడు ఆరకముదానినే హెచ్చు సన్నమునూలు వడుకుటకు వీలగునట్లు ఏకి, అప్పుడు వచ్చు తరుగులెక్క తేల్చవలెను. ఇట్లు ఖాదీపరిశ్రమయందు సామాన్యముగా ఉపయోగించెడు దూదిరకముల నన్నింటిని పరీక్షచేసి, వాటిని ఏకునప్పుడు వచ్చెడి తరుగును నిర్ణయించవలెను. ఇట్టివివరములను ఆధారముగా చేసుకొని ఉత్పత్తిదారుడు తాను వాడుకచేయుచున్న దూది హెచ్చుతరుగు ఇచ్చుచున్నదియు, తక్కువతరుగు ఇచ్చుచున్నదియు, తాను ఉత్పత్తిచేయుచున్న నూలు కొరకు చేయించుచున్న ఏకులు చౌకగా కిట్టుచున్నవో, లేక ప్రియముగా కిట్టుచున్నవో, సులభముగా తెలిసికొనగలడు. పైపట్టికయందు సూచింపబడినతరుగు % తో, అమెరికాదూదిగి (నం॥ ౬౦ రు. నూలుతీయుటకు మిల్లులందు నుపయోగింపబడును) యొక్క తరుగు % ను, పైఘాఁర చేయవచ్చును:—

మంచిరకము M. F. 8%; Good Mid: 10%;

మధ్యరకము Mid: 12%; Low Mid: 15%;

సాధారణముగా మంచిరకము Good Ordinary: 17%;

సాధారణము Ord; 20% (Winterbottom p. 243).

ఏకువిధానమునకు సంబంధించిన పరిశోధనావశ్యకములను విషయము లింకనున్నను రెండు విషయములు మాత్రము సంగ్రహముగా తెలుపబడును.

## రేచుల పొడుగులో తగ్గుదల

దూదిని మనము ఏకుబద్దతో ఏకునప్పుడు, చెత్త, దుమ్ము మొదలగునవి రాలిపోవునని చెప్పియుంటిమి. దూదిరేచులు సులభముగా తెగిపోవు ననుట అందరకు తెలిసినవిషయమే. కొన్నిరకముల పత్తియొక్క రేచులు మరింత అల్పముగా నుండి ఎక్కువసులభముగా తునుకలగును. ఇంతేకాక, రేచులయొక్క చివరభాగములు నడిమిభాగముకంటె ఏమాత్రపు దెబ్బకును నిలువబడలేక అతిసులభముగా విరిగిపోవును. ఇది వృక్షశాస్త్రజ్ఞులకు తెలిసిన విషయమే. ఏకునరముతో మనము దూదిని కొట్టునపుడు నరముయొక్క తాకుడుకు రేచులు తెగిపోయి, వాటియొక్క పొడుగు తగ్గిపోవుచున్నదా యను విషయము తెలిసికొనవలసియున్నది. ఏలననగా పొడుగు రేచుల దూదిరకము నొకదానిని మనము ఖరీదునకు కొని, దానిని ఏకించినతరువాత రేచులు పొట్టివి అయిపోయినయెడల, ఆదూదివలన రావలసినంత సన్నటినూలు రాక మనకు నష్టమగును. ఇది ఇట్లుండగా, సామాన్యముగా దూదిని యేకెడివారు, దూదిని ఎంతగట్టిగా ఏకినయెడల అంతమంచి ఏకులు వచ్చుననియు, ఎన్నిసార్లు ఏకిన అంత సన్నటినూలు వడుకగలుగుదురనియు, తప్పు అభిప్రాయపడి, దూదిని 'తెగఏకెదరు' (Over-Carding). ఇందువల్ల ఏకినదూదియందు "ముడులు" (Knots) యేర్పడి, దూది చెడిపోవును. ఈ "ముడులు" యేర్పడుటను పోల్చుకొనలేక పోవుటచే ఆదూదినుండి చేసిన యేకులతో వచ్చిన నూలు బలములేక సన్నముగా నున్నప్పటికి, సులభముగా తెగిపోవును. అట్టినూలును నేసినప్పుడు విస్తారము రద్దు అయి, బట్టఖరీదు హెచ్చు అయిపోవును. "తెగఏకుట" జరుగునప్పుడు రేచు లెందుచేత ముడిపడునో కారణము తెలియదు. రేచులు తునుకలుగా తెగి, ఆతునుకలు ఒకదానితో నొకటి అల్లుకొని పోవచ్చును. లేదా, విస్తారము దెబ్బతినుటచే కొన్నిరేచులు విస్తారముగా మడతలు పడి ఆవిధముగానే మడతలు పడిన ఇతర రేచులతో చిక్కుకొని ముడిపడవచ్చును. (ప్రస్తుతము పరీక్షచేసినంతవరకు ఆరెండవవిధమే సరియైనకారణమని, నాకు తోచుచున్నది.)

ఈవిషయమునుగురించి కొంతవరకు వివరములు ఈక్రిందిపట్టికలవలన తెలియుచున్నవి:—

| దూదిరకము | రేచులపొడవు( × ౧/౧౬అంగుళము) | | |
|---|---|---|---|
| | ప త్తి | సరిగాఏకిన తరువాత | "తెగ-ఏకిన" తరువాత |
| ౧ కైలాసపట్నం | ౧౧.౨ | ౯.౨ | ౭.౭ |
| ౨ వెలమ "ఎ" | ౧౨ | ౯.౯ | ౯.౨ |
| ౩ వెలమ "బి" | ౧౨ | ౧౧.౨ | ౭.౩ |
| ౪ గుణుపురం | ౯.౪ | ౯.౬ | ౬.౭ |
| ౫ కైలాస పట్నం III | ౧౧౧ | ౯ | ౬.౫ |

వరా: (పైనచెప్పబడిన సంఖ్యయు, పదికొలతలయొక్క దామాషానుండి తేల్చినవి. రేచులకొలత తెలిసికొనుటకు పైనిచ్చిన సంఖ్యలను ౧/౧౬ అంగుళముచే గుణించవలెను. ఉదాహరణ: వెలమ "ఎ" ౧౨ × ౧/౧౬ = ౧౨/౧౬ = ౩/౪ అంగుళము.)

ఈపట్టికవలన ఏకునపుడు రేచులపొడవు తగ్గునని తేలుచున్నప్పటికిని నాజూకైనటువంటి పరికరములను పరిశోధనయం దుపయోగింపబడక పోవుటచే, రేచుల పొడవు తగ్గినట్లు నిశ్చయముగా చెప్పుటకు వీలులేదు. ఈవిషయము ముఖ్యమైనదగుటచే, తగినపరికరములతో పరిశోధన జరుపుట అత్యావసరము.

ఏకులుచుట్టువిధానము

ఏకులుచుట్టువిధానము మిక్కిలి సులభమైనవిధానమైనప్పటికిని, ఇచ్చటకూడా పరిశోధనల కవకాశము గలదు. ఆంధ్రదేశములో ఏకినదూదిని జొన్నపుల్లతో తొడపై చేతితో చుట్టెదరు. ఇట్లు చేయుటవలన ఏకులు ఒకచోట గట్టిగాను, ఒకచోట మెత్తగాను, ఒకచోట సన్నముగాను, ఒకచోట వలముగాను ఉండి వడకుటకు కష్టము కలిగించును ఈవిషయము. ప్రత్యేకగా గమనింపదగినది. ఏకులు ఎంతసాఫుగా నుండిన నంతవరకు నూలు అంత తేలికగా నుండును. ఏకులు ఎంత సొగ్గుగా నుండిన దారముకూడా అంత సొగ్గుగా నుండునని కొంతవరకైనను చెప్పవచ్చును. ఏకులు ఎంత సలవుగా నుండినయెడల వడకుట సులకుగా జరుగును. ఈవిషయమును గురించి, చర్ఖాశాస్త్రసంఘమువారు శ్రీలక్ష్మీదాసుపురుషోత్తం (బార్డోలీ) గారు కొంతవరకు పరిశోధనలను జరిపియున్నారు. ఏరకమువంటి దూదినుండి ఏకులు తయారుచేయవలెనో, ఆఏకులయొక్క గొట్టముపొడవు ఆదూదియొక్క రేచులపొడవుతో సమానముగా నుండవలెనని వారి సిద్ధాంతము. ఈవిషయమై మరికొంతపరిశోధన జరిగించిన లాభకరముగా నుండును.

ఏకు ఆరంభమునుండి చివరవరకును సమానమైన Density కలిగి యుండవలె ననునది మరియొకవిషయము. ఒకఏకును నాలుగుతునకలుగా భాగించితిమేని, అన్ని తునకలయొక్క బరువును సమానముగా నుండవలెను. ఈవిషయమై మిల్లులలో అత్యంతశ్రద్ధ వహించెదరు. ఖాదీపరిశ్రమకు కావలసిన యేకులయందు సమానత్వము మిక్కిలి అవసరము. ఇందునుగూర్చి పరిశోధనలను జరుపుటయే కాక, ఉత్పత్తిదారులయందును, ఏకువారియందును, నూలువడుకువారియందును, తీవ్రప్రచారము సలుపవలసియున్నది.

## మా వ్యాసకర్తలకు

వ్యాసములు సంపూర్ణముగచిన్నసైజు కాగితములపై ఒకవైపున మాత్రమే విడిఅక్షరములతో బంతులు దూరదూరముగా, దిద్దుబాట్లు లేకుండ, తిన్నగా వ్రాసి, వర్ణక్రమమునను తప్పులు లేకుండ చూచుకొని పంప వేడికోలు. లేకున్న ముద్రణకార్యములయందు మిగుల కష్టము కలుగుటయే కాక తప్పులుకూడ నిలిచిపోవునని మనవి. ప్రకటింపనివ్యాసముల తమకు త్రిప్పిపంపుటకయితపాలుబిళ్లలు పంపవలయును.

సంపాదకుడు, 'భారతి'.

# అయర్ ఇటామ్ దేవాలయ (పినాంగు) చిత్రములు



౧. దేవాలయము (సమీపమునుండి)



౨. దేవాలయము (కొండ దిగువనుండి)



౮. మహావిగ్రహ పాలకులు



౯. మహావిగ్రహము

చెన్నరాజధానియందు ౧౯౩౮-వ సంవత్సరము అక్టోబరు ప్రారంభము మొదలు డిసంబరు తుదవరకు గల మూడునెలల కాలమున ముద్రితములయి ప్రకటితములయిన

# ఆంధ్ర గ్రంథముల పట్టిక*

ఆంధ్రవాఙ్మయ మీ క్రింద పేర్కొనిన వివిధశాఖలతో వెలసియుండుటచేత నీపట్టికయం దాయాశాఖల నుత్పన్నములగు గ్రంథము లాయా శాఖలకే చేర్పబడును. గ్రంథముల నామములన్నియు నకారాదిక్రమమున నుండును.

1. అర్థశాస్త్రము, 2. అలంకారశాస్త్రము-నాట్యకళకు సంబంధించిన గ్రంథములు నయిత మీ శీర్షిక క్రిందనే చేర్పబడును, 3. ఆయుర్వేదశాస్త్రములు, 4. ఆరోగ్యశాస్త్రము, 5. ఇతిహాసములు-ఇతిహాసములలోని భాగములు, కథలు, మార్పుచేయక ప్రత్యేకముగ ముద్రింపబడునవి - యీశీర్షిక క్రిందనే చేర్పబడును, 6. కథలు—ఐతిహాసికములు, పౌరాణికములు, 7.—కల్పితములు, 8.—చారిత్రకములు, 9. కల్పము, 10. కామశాస్త్రము, 11. కావ్యములు, 12. గణితశాస్త్రము, 13. గేయములు, 14. చరిత్ర(దేశ), 15. చిత్రలేఖనము, 16. చట్టము(Law), 17. ఛందశ్శాస్త్రము, 18. జంతుశాస్త్రము, 19. జీవితములు, 20. జ్యోతిషశాస్త్రము, 21. తర్కశాస్త్రము, 22. దండకములు, 23. ధర్మశాస్త్రము, 24. నవలలు, 25. నాటకములు, 26. నాట్యశాస్త్రము, 27. నిఘంటువులు, 28. నీతి- నీతికథలుకూడ యీ శీర్షిక క్రిందనే వచ్చును, 29. పరిశిష్టము, 30. పాకశాస్త్రము, 31. పారిశ్రామికము, 32. పురాణములు- ప్రత్యేకముగ ముద్రింపబడి ప్రకటింపబడు పురాణములలోని భాగములు నయిత మీ శీర్షిక క్రిందనే చేర్పబడును, 33. ప్రకృతిశాస్త్రము, 34. ప్రబంధములు- ఆంధ్ర సారస్వతమునందు ప్రసిద్ధములగు 'హరివంశము', 'ఆంధ్రచంపూభారతము', 'అచ్చతెలుగు రామాయణము'వంటి పురాణేతిహాస కావ్యములకు సంబంధించినవి, 'పాండురంగమాహాత్మ్యము' వంటి మాహాత్మ్యములు, 'ఆంధ్రమేఘసందేశము'వంటి అనువాదములు, రంగనాధరామాయణము'వంటి ద్విపద గ్రంథములు మొదలయినవి యీశీర్షిక క్రిందవచ్చును, 35. ప్రహసనములు, 36. భూగోళశాస్త్రము, 37. భౌతికశాస్త్రము, 38. మంత్రశాస్త్రము, 39. మతము - హిందు, 40.— ఇతరములు (బౌద్ధ, జైన, క్రైస్తవాదిమతములు)- ఇతరమతములకు సంబంధించిన గ్రంథములు— ఏ విషయ విభాగమునకు సంబంధించిన వయినను- ఈశీర్షిక క్రిందనే చేర్పబడును, 41. మాహాత్మ్యములు, 42. మీమాంసాశాస్త్రము, 43. యక్షగానములు, 44 యోగశాస్త్రము, 45. రత్నశాస్త్రము, 46. రాజకీయములు, 47. వాస్తుశాస్త్రము, 48. విమర్శనము- ఇందు సారస్వతమునకు సంబంధించిన విమర్శనలు మాత్రముండును, 49. వృక్షశాస్త్రము, 50. వేదవాఙ్మయము- ఉపనిషత్తులు, ఇతరవైదికగ్రంథములునయిత మిందే చేర్పబడును, 51. వేదాంతము - భక్తి జ్ఞానవైరాగ్య విషయకగ్రంథము లీశీర్షిక క్రింద వచ్చును, 52. వైద్యశాస్త్రము, 53. వ్యవసాయశాస్త్రము, 54. వ్యాకరణ శాస్త్రము, 55. వ్యాపారము, 56. వ్యాయామము, 57. శకునశాస్త్రము, 58. శతకములు 59. సంగీతశాస్త్రము, 60. సాంఘికములు, 61. సాముద్రికశాస్త్రము, 62. సారస్వతము-భాష, 63. స్తోత్రములు, 64. హరికథలు.

* ఈ పట్టికయందుగల సంకేతపదముల వివరణము: అ.— అధ్యాయము; అను.— అనువాదము; అనువాదకులు. ప.—పద్యము. ప్ర.—ప్రకాశకులు. భా.—భాగము. వ.—వచనము, సం.—సంపాదకులు. సటీ.—సటీకము.

## ఆరోగ్యశాస్త్రము

ఆరోగ్యసూత్రములు—జి. సోమన్న

## కథలు—ఐతిహాసికములు, పౌరాణికములు

చ్యవనహనుమంతులు—కె. నరసింహశర్మ
త్రిజట—బి. కోటయ్య
బాలదేవీభాగవతము, భా. ౪—కె. వ్యాసాచార్లు
మారుతివిజయము—వి. సుందరరాజశర్మ
మైరావణచరిత్ర—యన్. బసివిరెడ్డి
రామచంద్రరామాయణము—కె. రామచంద్రాయమంత్రి
వత్సల—యస్. సి. దేశికాచార్యులు
శకుంతలావిజయము—ఆర్. లక్ష్మీనరసింహశాస్త్రి
శ్రీ మహాభారత చరిత్రము (వ)— కి. వెంకటసుబ్రహ్మణ్య శర్మ
శ్రీ రామాయణకథాసంగ్రహము—(ప్ర)యన్. వి. గోపాల్ అండ్ కో. మదరాసు
సానందోపాఖ్యానము (ప)—బి. శివరామయ్య

## —కల్పితములు

కలికాలపుకథలు, భా. ౧—కె. సత్యనారాయణ
చమత్కారకథాకల్లోలిని, భా. ౧—సి. వెంకటరామానుజశర్మ
వధూవరుల ఆత్మహత్య—బి. కోటేశ్వరరావు

## చారిత్రకములు

ఉదయగిరిముట్టడి—జె. శేషాద్రిశర్మ
భారతనారీమణులు, తరగతులు ౧, ౨, ౩, ౪, ౫—కె. కృష్ణవేణమ్మ
రాజవాహనచరిత్రము—యస్. లక్ష్మీపతిశాస్త్రి
వీరమతి, భా. ౧—కె. వ్యాసాచార్లు
సతీశిరోమణులు, భా. ౧, ౨, ౩, ౪—యం. వెంకటరత్నం
హిందూదేశచరిత్ర కథలు—యమ్. నరసింహారావు

## కల్పములు

~~సత్యవ్రతీవ్రతము (పటీ)—సి. లక్ష్మీనృసింహశాస్త్రి~~

## గణితశాస్త్రము

గణితదీపిక, తరగతి ౨—జె. సీతారామసోమయాజులు
ప్రాథమికగణితము, భా. ౧—టి. కె. వెంకటరామసన్, యస్. కృష్ణస్వామి
సరస్వతీగణితము, తరగతి ౪—ఆర్. వీరభద్రరావు

## గేయములు

అక్షరహంసలు, భా. ౨—జి. వెంకటసుబ్బారావు
ఒప్పగింతలపాట—కె. అప్పన్నదాసు
కిండర్‌గార్టన్‌పాటలు—(మిసెస్) యస్. చార్లెస్
కీర్తనలు, భా. ౨—వి. సుబ్బారెడ్డి
క్షీరసాగరమథనకథ—కె. వెంకటరాఘవసూరి
జ్ఞానబోధతత్వములు—కి. సుబ్బయ్యదాసు
ప్రహ్లాద—బి. సీతారామరాజకవి
భజనకీర్తనలు—వి. పి కామేశ్వరరావు
భజనకీర్తనలు (శ్రీకృష్ణ)—వి. సత్యనారాయణమూర్తి
భజనకీర్తనలు (శ్రీసీత)—వి. సత్యనారాయణమూర్తి
రామాయణకీర్తనలు—యన్. పి. నరసింహాచారి
రామాయణకీర్తనలు—పి. రామదాసు
శ్రీరామకల్యాణము, అంబరీషోపాఖ్యానము, వామనచరిత్ర (కోలాట కీర్తనలు)—కె. రామకృష్ణరావు, ఏ. సీతారామశాస్త్రి
శ్రీసుబ్బరాడ్గానరామాయణము—వి. సుబ్బారెడ్డి
శ్రీహరికీర్తనమునందలి భజనగీతములు—డి. సర్వేశ్వరరావు
శ్రీహరిభజనకీర్తనలు—జి. అచ్చయాచార్యులు
శ్రీహరిభజనగీతలు—భుజగశయనదాస్
సంపూర్ణరామాయణ భజనకీర్తనలు—స. కృష్ణమూర్తి
సీతాకల్యాణము—కె. రామదాసు
సుజనకల్పవల్లి—(ప) యం. వెంకటస్వామినాయుడు, పెంటపాడు
హరిభజనకీర్తనలు—పి. భోగలింగకవి
హరిభజన సేయు సంగీతమనన శ్రవణానందకీర్తనలు—యం. వెంకటాచార్యుడు

## చరిత్ర (దేశ)

హిందూదేశచరిత్ర—సి. టి. శ్రీనివాస అయ్యంగారు

## జీవితములు

భక్తురాలగు "ఎంవని తెరిసా"—యస్. నరసింహయ్య

భోగరాజు లక్ష్మీనృసింహముగారి జీవితము—బి. పాలన్‌రాజు

మహారాణి ఝాన్సీ లక్ష్మీబాయి—యం. జగన్నకవి

రాయప్రోలు రామలింగసోమయాజులుగారి జీవిత చరిత్రము—సి. రాఘవదీక్షితులు

షిగ్గోజిఋషి జీవితచరిత్రము—నై. సీతారామయ్య

## జ్యోతిషశాస్త్రము

ఇంటిజోస్యము—సి. వెంకటసుబ్బరామయ్య

చమత్కారచింతామణి—(ప్ర) టి. రంగాచారి, మదరాసు

జ్యోతిషరహస్యబోధిని—యస్. సుబ్బరాయుడు

జ్యోతిషామృతము—సి. లక్ష్మీనృసింహశాస్త్రి

ముహూర్తప్రదీపము—(ప్ర) వి. కుప్పుసామిమొదలి, మదరాసు

లఘుజాతకము—(ప్ర) టి. రంగాచారి, మదరాసు

## దండకములు

శ్రీ దత్తాత్రేయదండకము—పి. వెంకట సుబ్రహ్మణ్యశర్మ

## నవలలు

అంతఃపురము, భా. ౧—(ప్ర) ఏ. లక్ష్మణస్వామి నాయుడు, రాజమహేంద్రవరము

ఇంటా బయటా—(అను) యస్. వైకుంఠరావు

కష్టసుఖములు—ఏ. నరసింహమూర్తి

కాలసర్పము—ఐ. సోమేశ్వరరావు

కాశీఘట్టరహస్యములు—డి. వెంకటరమణమూర్తి

ఛత్రపాలుడు, భా. ౧—(ప్ర) వెంకట పార్వతీశ్వర కవులు, పిఠాపురము

మధుర—వెంకటకాళిదాసకవులు

మాయామయి, భా. ౨—కె. రంగయ్య

లతాంగి—ఏ. కృష్ణస్వామయ్య

లాగరాయిపితూరి—డి. వెంకటసుబ్బరావు

విజయస్వరాజము—యం. వెంకటరత్నం

హత్యావిచారము—యస్. రామానుజరావు

## నాటకములు

ఉత్తరరామచరితం, (సటీ) భా. ౨—(ప్ర) కె. వ్యాసాచారి, గుంటూరు

కల్యాణరాధామాధవము—సి. లక్ష్మీనారాయణశాస్త్రి

కాళిదాసుచరిత్ర ప్రకరణము—సి. వెంకటరామానుజశర్మ

కొండవీటి దండయాత్ర—వి. చలపతి సుబ్బరాయుడు

చుక్కలూరు రామనాటకము—నరసింహకవి

ఝాన్సి లక్ష్మీబాయి—చిత్రగుప్తుడు

పాండవాశ్వమేధము—తిరుపతివేంకటేశ్వరకవులు

పాదుకాపట్టాభిషేకము—కె. సత్యనారాయణరావు

భక్తకుచేల—వి. వెంకటకనకయ్య

విషాదవిజయసేన—వి. సదాశివరావు

శివలీల—యం. వెంకటచెన్నకేశవులు

శ్రీకృష్ణజననము—ఐ. యజ్ఞనారాయణ

సావిత్రినాటకము—డి. సీతారామారావు

## నీతి

నీతిబోధిని—సి. వెంకటరమణయ్య

సుభాషితములు, భా. ౧, ౨—పి. సూర్యప్రకాశశర్మ

## పరిశిష్టము

అగ్నికులక్షత్రియమహాసంఘము దశమవార్షికచరిత్ర—(ప్ర) పి. వెంకటనారాయణ, మచిలీపట్టణము

అపాయములు రాకుండ ముందు జాగ్రత—యం. సూర్యనారాయణ

అరవము స్వయముగా నేర్చుకొనుపద్ధతి—యమ్. కృష్ణమూర్తి

ఆంధ్రవాచకము, తరగతులు ౧, ౩—(ప్ర) వెంకటరామ్ అండ్ కో., ఏలూరు

ఆత్మసంయమము—అమితవిద్యాసక్తి—(అను) కె. నరసింహం

ఇంజక్షన్ లేహ్యము—(ప్ర) జర్మన్ ఇంజక్షన్ లేహ్య అండ్ కో., గోడిలంక
కాంత—కె. కోదండరామయ్య
కుశలవపట్టాభిషేకము—సుందరమ్మ
కోటంరాజు నాగేశ్వరదాసు—పి. వీరరాఘవుడు
గ్రామోద్ధారణ—ఐ. కనకాచలం
చిక్కనిచిక్కు—వి. వి. కామేశ్వరరావు
తునిరాజసందర్శనము—యమ్. మల్లిఖార్జునారాధ్య
త్రిలింగపత్రికాతరంగలేఖావిమర్శ—జె. వెంకటరామ రాజు
దసరాపద్యములు—బి. కృష్ణమూర్తి
దసరాపద్యములు—యమ్. జోగన్నభుక్త
దసరాపద్యములు—యమ్. రామచంద్రుడు
దాంపత్యరహస్యములు—యస్. జి. ఆచార్య
దీపావళిపండుగరహస్యము—డి. బాపన్న
దోమ—మనశత్రువు—(ప్ర) క్రిశ్చియన్ లిటరేచర్ సొసైటి, మదరాసు
దోమలు—(ప్ర) క్రిశ్చియన్ లిటరేచరు సొసైటి, మదరాసు
ధర్మకార్యములపరిపాలనరిపోర్టు—యమ్. గంగరాజు
ధర్మరాజుజూదము—(ప్ర) జి. యస్. వి. జి. కృష్ణయ్య శెట్టి, విజయనగరము
పుష్పాంజలి (ప), భా. ౧—వి. దానయ్యచౌదరి
ప్రార్థనపద్యములు—(ప్ర) ఏ. శ్రీనివాసయ్య, తాడిపత్రి
ప్రేమజాబులు—ఏ. సుందరరామయ్య
బాలబోధ—(ప్ర) క్రిశ్చియన్ లిటరేచర్ సొసైటి, మదరాసు
బాలశిక్ష—(ప్ర) సి. దొరస్వామి మొదలియార్ అండ్ సన్స్, మదరాసు
బాలురసిబిక్ష—(ప్ర) ఇండియన్ పబ్లిషింగ్ హౌసు, మదరాసు
భక్తరామోపాఖ్యానము—పి. బాపనయ్య
భట్టరాజపుత్రసూర్యోదయము—జె. సూర్యనారాయణ రాజు
భారతయోధులు, భా. 3—సి. వీరభద్రరావు
భార్గవప్రశ్నశాస్త్రము—(ప్ర) సి. లక్ష్మీనృసింహ శాస్త్రి
మహార్ణవమిపద్యములు—పి. వెంకటరామయ్య
మాక్మిలన్ తెనుగు ఏడవవాచకపుస్తకము—సి. సీతారామలింగం పంతులు
మార్గోపదేశిక, భా. ౨—వి. సి. సీతారామస్వామి
మిస్ మేయోగ్రంథఖండనము—(ప్ర) సి. యస్. శాస్త్రి అండ్ కో., మదరాసు
మురళీగానము—ఐ. యస్. పున్నయ్య
మూడవతరగతి క్రొత్తతెలుగువాచక పుస్తకము—యస్. భూషణం
లఘుపేటికాసముచ్చయము—సి. రామలింగారెడ్డి
లోకజ్ఞానగీతానందము—శి. సన్యాసిరావు
వర్షబుతుపత్రిక—జి. పట్టాభిరామమూర్తి
విజ్ఞానసరోవరము—కృష్ణాజిస్వామి
వివాహకన్యాస్వరూపనిరూపణము—వెంకటరంగరావు
విశ్వకర్మాన్వయనిరూపణము—ఎ. పాపయ్యదీక్షితులు
వేశ్యామృతము—బి. కోటేశ్వరరావు
శంకరాచార్యప్రతిష్ఠ—వి. వెంకటరావు
శిశుబోధిని—కె. సుబ్బరావు
శ్రీకన్యకాపరమేశ్వరి, శ్రీనగరేశ్వరస్వామి, శ్రీజనార్దన స్వామివార్ల ఆలయముల ధర్మకర్తలసంఘము—(ప్ర) సి. మాణిక్యము, గుడివాడ
శ్రీనిత్యానంద—టి. చ. గోవిందరెడ్డి
శ్రీరామరహస్యము—పి. యజ్ఞేశ్వరశర్మ
సంగీతభక్తరామదాసు—యన్. బసివిరెడ్డి
సకలార్థసాగరము—ఒ. వి. యస్. దొరస్వామయ్య
సతీపతి కుతూహలరహస్యములు—(ప్ర) ఆర్యన్ బుక్ డిపో, మదరాసు
సమయోచిత పద్యరత్నావళి—(ప్ర) కె. సుబ్బరావు, బెజవాడ

సరస్వతీవాచకపుస్తకము, నెం. ౨, 3—పి. రాఘవేంద్రరావు

సేలంజిల్లా తీర్పు—(ప్ర) వి. కుప్పుస్వామి మొదలి, మదరాసు

స్త్రీ పురుష ప్రేమపలాస్యములు—బి. టి. నరసింహాచార్యులు

స్వరశాస్త్రము—(ప్ర) టి. రంగాచారి, మదరాసు

## పురాణము

ఆంధ్ర శ్రీవిష్ణుపురాణము (ప)—వి. సూరనార్య

## ప్రకృతిశాస్త్రము

శాస్త్రవాచకపాఠములు, నెం ౨. — యం. సాంబశివరావు

సృష్టిపరిశీలన, వాచకము ౪ — పి. యం. మురుగేశ మొదలియారు

## ప్రబంధములు

గజేంద్రమోక్షవ్యాఖ్యానము—వి. సుబ్బయ్య

శృంగారశాకుంతలము—పి. పినవీరభద్రుడు

శ్రీరంగనాథరామాయణము—(ప్ర) పి. కుప్పుస్వామి మొదలి, మదరాసు

## ప్రహసనములు

పెళ్లి [illegible] ప్రహసనము — జె. వెంకటరామరాజు

స్త్రీ [illegible]—కే. సత్యనారాయణ

మగవా[illegible]త్వనర్తనము — పి. వీరభద్రుడు

## భూగోళశాస్త్రము

అనంతపురంజిల్లాభూగోళము—యస్. వాసుదేవరావు

ఇండియాసామ్రాజ్యసంబంధపు భూగోళశాస్త్రము—సి. మారిసన్

తూర్పుగోదావరిజిల్లా భూగోళము—యమ్. కోటేశ్వరరావు

ప్రపంచభూగోళము — ఇండియా—యమ్. సీతారామరావు

ప్రారంభ భూగోళశాస్త్రము — (మిస్) పి. యస్. డార్లింగ్

భూగోళబోధన—కే. జె. జి. సుందరం

మారుతిభూగోళశాస్త్రము—ఏ. నారాయణమూర్తి

## మంత్రశాస్త్రము

శ్రీసుహాయంత్రచింతామణి—(ప్ర) టి. సూర్యప్రకాశరావు, విజయనగరము

## మతము—హిందు

పునర్జన్మ—పి. వెంకన్న

వివాహనిర్ణయదీపిక — (ప్ర) యం. సుబ్బావధాని, రాజమహేంద్రవరము

శ్రీవైఖానసధర్మశిక్షాసాతృతీయప్రచురణము — (ప్ర) యన్. జగన్నాథాచారి, ముక్తిపురఅగ్రహారము

శ్రీవైష్ణవధర్మాభ్యుదయం— యన్. కె. వకుళాభరణం, మదరాసు

సూర్యనమస్కారములు—(ప్ర) యస్. యన్. సిన్‌హ, బెంగుళూరు

## — ఇతరములు

అర్చ్ ఆగ్నెస్ సమ్మదరిత్రము—జె. ఆలెన్

ఆత్మలో నింపబడుట—(రెవ) ఆండ్రుమర్రె

ఒక్కొక్కరికి సువార్త ప్రకటనజేయువారికి సహాయములు—(రా.) ఆర్. ఏ. టోరి

కీర్తనలు — (ప్ర) ఆంధ్రదేవాంజెలికల్ ల్యూథరన్ చర్చ్ మిషన్, ధవళేశ్వరము

కులాచారపరీక్ష—(రెవ) పురుషోత్తమచౌదరి

క్రిస్మసు సంభాషణ—జి. శామ్యూల్

క్రైస్తవ సత్యమార్గము—(రెవ) సి. యమ్. జేకబ్స్

జగద్రక్షణము—యమ్. డేవిడ్

తెలుగుబైబిలు నిఘంటువు— (ప్ర) క్రిశ్చియన్ లిటరేచరుసొసైటి, మదరాసు

ప్రావులగంప—ఏ. డేవిడ్

ప్రావులగంప—బి. మోసస్

మతబోధ—జేమ్సు, యమ్. భక్తుల్

ములాగ్ మిషన్ చరిత్ర — (ప్ర) ములాగ్ మిషన్ బోర్డు, డార్నకల్

యేసుక్రీస్తుయొక్క నమ్మకమైన సేవకుడు—(మిసెస్) ఇ. ఏ. డబ్ల్యూ. ఏడ్జ్

## మాహాత్మ్యములు

అలంపురీమాహాత్మ్యము—యస్. వి. రాఘవయ్య

బ్రహ్మగుండేశ్వరమాహాత్మ్యము—పి. రామచంద్రయ్య

### రాజకీయములు

దేశీయసామ్రాజ్యము—యన్. నరసింహం

### వాస్తుశాస్త్రము

గృహవాస్తు దర్పణము— (ప్ర) వి. కుప్పుస్వామిమొదలి, మదరాసు

### వేదాంతశాస్త్రము

పురుషతత్త్వప్రకాశిక (సటీ) ఏ. వెంకటసుబ్బరావు
భగవద్గీత (సటీ) — (ప్ర) వి. కుప్పుసామి మొదలి, మదరాసు
భగవద్గీత, అ. ౯ (సటీ)— (ప్ర) యమ్. రామానుజాచారి, చిత్తూరు
రామసాంఖ్యము—యన్. అచ్చమాంబ
వేదాంతడిండిమః (సటీ)—(ప్ర). పి. త్యాగరాయశెట్టి, మదరాసు
శివరామదీక్షితీయము, భా. ౨, ౩—(ప్ర) యం. హనుమంతరావు, సింగరేణి
శుద్ధనిర్గుణతత్త్వద్విపదార్థములు — (ప్ర) వి. కుప్పుసామి మొదలి, మదరాసు
శ్రీకృష్ణావతారతత్త్వము, భా. ౭, ౮, ౯—జె. శేషాద్రిశర్మ
సచ్చిదానందబోధామృతము—(ప్ర) వి. కుప్పుస్వామి మొదలి, మదరాసు

### వైద్యశాస్త్రము

ఆయుర్వేదాంగశారీరశాస్త్రసంగ్రహము—పి. కృష్ణమాచారి
కలరా—(ప్ర) క్రిశ్చయన్ లిటరేచర్ సొసైటి, మదరాసు
గుణాగుణపానపథ్యబోధిని—కె. కె. యమ్. ఏ. రామాచార్యులు
సారూప్యౌషధశాస్త్రము —యల్. రామరావు

### వ్యవసాయశాస్త్రము

వ్యవసాయము, భా. ౧, ౨—యస్. వి. శ్రీనివాసరావు

### శతకములు

కామేశ్వరీశతకము—కె. రామచంద్రాయమంత్రి
దేశికశతకము—జె. హనుమద్దాస్.
బాలగోపాలశతకము—సి. సుబ్బిరెడ్డి
భక్తిరసశతకసంపుటము, భా. ౩—(ప్ర) వి. రామస్వామిశాస్త్రి అండ్ సన్స్, మదరాసు
రుద్రశతకము—యమ్. బ్రహ్మయ్యాచారి
శ్రీచందలూరి మహాలక్ష్మమ్మశతకము—పి. సుందర వెంకటశేషాచలపతిరావు
శ్రీజానకీరామశతకము—జె. బాలవెంకటసుబ్బారెడ్డి
శ్రీనిర్గుణమానసబోధశతకము—కె. ఆదినారాయణ
శ్రీబాలాత్రిపుర సుందరీశతకము—యస్. త్ర్యంబకరావు
శ్రీవెంకటేశ్వరశతకము—కె. విశ్వనాథం
శ్రీశంకరశతకము—కె. రామచంద్రాయమంత్రి
సంతానవేణుగోపాలశతకము—వి. వెంకటరమణామాత్యుడు

### సంగీతశాస్త్రము

ఇంగ్లీషురాగములతో పాడబడిన సంగీతములు—(ప్ర) క్రిశ్చయన్ లిటరేచర్ సొసైటి, మదరాసు
నీలకంఠకృతులు—సి. వీరభద్రకవి
శ్రుతులు—స్వరావళి—వి. వి. నరసింహాచారి

### స్తోత్రములు

భగవన్నుతి—(ప్ర) సీతారామ్ అండ్ కో., తెనాలి
రామనామనక్షత్రమాల—వి. వెంకటరావు
రామనామమాల—వి. వెంకటరావు
శ్రీగౌరీశ్వరనక్షత్రమాల—(ప్ర) యన్. గంగరాజు, గుంటూరు
సద్గురుస్తవస్తబకము—పి. కృష్ణమూర్తి.

### హరికథలు

అంబరీష—కె. నారాయణదాసు
అతిథిపూజామహత్త్వము—జి. వెంకటసుబ్బరాయదాసు
కాటమరాజుచరిత్రము—పి. వెంకటాచలదాసు
పార్వతీపరిణయము—యస్. సుబ్రహ్మణ్యం
సక్కుబాయిచరిత్రము—బి. జానకిరామశర్మ

కలకలలాడుచున్నది జగంబు మహానదిగర్భవీథి ; చం
చంచజ్జలవీచికాతతులసవ్వడి కర్ణరసాయనంబుగా
తల నొడ మోపి యూఁపెడివిధంబున నుయ్యేలలూఁగుచున్నదే,
మలయసమీరహస్తముల మత్తిలి తూఁగు లతాకుమారితో.

వెలవెలఁబోవు సందెయెడ వెన్ను మరల్చి, మనోజ్ఞగౌతమీ
పులినతలంబునన్ నిలిచి, మోములు నిర్మలవారిదర్పణాం
చలములఁ జూచుకొంచుఁ దమసంఘవిశేషము లవ్వి యివ్వి న
వ్వులనడుమం దెమల్చుకొని ప్రొద్దులు పుత్తురు మిత్రు లిద్దఱున్.

అంతలో ప్రతిబింబిత మైన జగతి - చూచి యచ్చెరు వందెడి రాచవారు;
“మనము లో నున్న! నక్షత్రమండలంబు - చేరఁ గల”మని యువ్విళులూరినారు.

ఎడఁదల వెన్నఁ జూపఁ గల రిప్పటి కాలపువారు గారు; గి
ట్టనియెడఁ గాలదూతలయెడల్ గడికండలు సేయఁజాలు క
ట్టడిఁగలవారె కాని, యొకటన్ నిజనేత్రము లెఱ్ఱఁజేయఁబో
యెడి వడి లేనివారు ; జను లెల్లర మెప్పును వారిసొత్తురా !

ఏదో బెత్తెఁడునేలపై పరువుతో నేగంజియో త్రాగి, తా
మై దద్దంగలవారు పో పరులకయ్యా లంతియే గాని, వా
రేదుష్టాత్ముల పాదధూళిఁ గనలేదే పొట్టకై నేఁటికిన్!
లేదే, యెంతటిచిత్రమో, రిపుభయక్లేశంబు రవ్వంతయున్.

ఇవియ వారిగుణంబు, లే నెఱిఁగినంత - చెప్పుకొంటిని వినఁగోరుచలికి నేఁడు ;
ఊరుపేరులతోడ నే మున్న దిపుడు ? - ఏకహృదయాంతరంగులే హితులు వారు.

వెండిగిన్నెలలోన పండుదొన్నెలలోన విడలేని యిక్ష్వాకువీరవరుల,
వెడఁగువియ్యములలో పిడుగుకయ్యములలో చీలని పాండుగోపాల సుతుల,
పడఁతిపేలనలోన చెడుగుపాలనలోన సోలని కురునాథసూతసుతుల,
పండితసీమలో భండనభూమిలో చెదరని వాల్మీకిశిష్యవరుల

స్నేహలత యెంత గట్టిదో చిన్ననాఁడె - నేర్చి విసుగెత్తియున్న పండితుఁడ నీవు,
తమ్ముఁడా! వీరి గాఢమిత్రత్వశక్తి - కాంచెదవు గాక చేరేఁడు కండ్లతోడ.

తాతలనాఁటి నేల కలదా చెఱిబాఱెఁడు, భుక్తికోసమై
కాతర మందఁగాఁ దగినకారణ మేదియు లే దటంటి; వే
కైతలొ చేతఁ బట్టుకొని కాఁపుకులాలకు పుణ్యగాథ లే
వో తనివారఁ జెప్పుకొనుచుందురు పండిన చేలగట్టులన్.

వానలు లేమిచేఁ గలఁకవారినచిత్తము దందడింప, పై
చేనుకు మోటబావి కడు చెంగట నుండుట సైఁపలేక, చేఁ
బూనినకోలతో బెదఱిపోయెడి లేఁగ నదల్చి, బిక్కమో
మూనినకాంతతో చెమట లూడ్చెడి వేసవిపిచ్చికాఁపులన్.

రేపటిమేఁతచే పులకరించినదేహము బద్ధకింప, పై
తాపము తీర్చుకొందమని, దారికి చెంగట నీడ పండులై
తోఁపఁగ, మేను వాల్చ, మడి దున్నెడివేళకు ముల్లుగఱ్ఱతో
కాఁ పదలించినన్ వడఁకి కన్నుల నీ రొలికించులేఁగలన్.

చూచి, దరిఁ జేరి, లేఁదూడచుబుక మెత్తి - గడ్డిపోచలు రెండు నాల్కకుఁ దగిల్చి,
యొడలు నిమిరినఁ దల యూఁచి యుబ్బుదాని - మోముఁ గని యొండొరులఁ జూచి
[మురియువారు.

మోహనగీతికామృతవిముగ్ధహృదంతరసీమతో మహో
త్సాహమునన్ నటించి పెడదారులఁ బోయెడి గౌతమీస్రవం
తీహిమపూరతీరమున, దివ్య లెఱుంగని పుణ్యభూమిలో
స్నేహితు లొక్కపల్లె నివసింతురు తాతలనాఁటినుండియున్.

---




## అజంతకళాలయములు: ౧

తలిశెట్టి రామారావు గారు, బి. ఎ., బి. యల్.,

To me the Sanctuary of Ajanta is quite simply the antechamber to Heaven; and if it is not Heaven itself that is but because all great art holds in its manifestation the hint of something greater yet beyond.
(W. E. Gladstone Solomon in his "Jottings at Ajanta")

" 'అజంతా' లోనున్న (కందరాలయ) పవిత్రప్రదేశము స్వర్గలోకమునకుం బ్రాగ్వంశమని నాకుం దోచుచున్నది. అది స్వర్గలోకము కాకపోయినను సువ్యక్తమగు నుత్కృష్టకళావిన్యాసమున దాని కావలనుండు నుత్కృష్టతరమగు నొకానొక వస్తువిశేషము సూచితమగుచుండును గావున."

(డబ్ల్యు. ఇ. గ్లేడ్‌స్టన్ సోలోమన్‌గారి "జాటింగ్స్ ఎట్ అజంత" అను గ్రంథమునుండి—మహోపాధ్యాయ, ఆనంద వేంకటరాయ సాంఖ్యాయనశర్మగారి యాంధ్రానువాదము.)

అజంత కళాలయములు హైందవనాగరికత యొక్క చిహ్నములు. వీటియందలి శిల్ప చిత్రరాజములను గాంచినవారికి హిందూనాగరికత యంతకు ముందు కొన్ని వేలసంవత్సరములకు పూర్వమే చాల వఖివృద్ధి గాంచెనని గోచరము కాగలదు. పర్షియనువారు మనకు చిత్రరచన నేర్పిరనియు, గాంధారమున యవనులు ప్రవేశ పెట్టిన చిత్రరచనరీతి మన చిత్రరచనకు వన్నెదెచ్చెననియు చెప్పువారికి యీ చిత్రరాజములు శాశ్వతమైన ప్రత్యుత్తరములుగ నుండి, భారతీయచిత్రకళయొక్క ప్రత్యేకవ్యక్తిత్వమును వేనోళ్ల చాటగలవు. ఇట్టి చిత్రాలయములను గూర్చి మదాంధ్రగ్రంథమున ("భారతీయచిత్రకళ" యను గ్రంథమున * క్లుప్తముగ దప్ప) వర్ణన లేకపోవుట విచారకరము.

మనోజ్ఞ కళలు నాగరికతాస్థైర్యమును దెలియజేయును. గ్రీకుశిల్పముల శైలి గ్రీకుల నాగరికతయొక్కయు, చైనా చిత్రశైలి చైనానాగరికతయొక్కయు, ఆంగ్లచిత్రశైలి యాంగ్లనాగరికత యొక్కయు ప్రత్యేకతను వ్యక్తపరచుచున్నవి. మనోజ్ఞకళలు చేయవలసిన మేలు నానాదేశముల చిత్రములలో నత్యుత్కృష్టమైన వన్నియు జేయుచు దేశభేదమును పాటింపనివైనను, శైలియందును, రుచులందును మాత్రము భిన్నములుగ నున్నవి. ఇటులనే యజంతశిల్ప చిత్రములును శైలియందు ప్రత్యేకముగ గానవచ్చుచున్నను, జాతి, మత, దేశ, కాలభేదముల నెరుగని కళాసంపత్తిగ నున్నవి.

అజంతగుహాలయములు బౌద్ధనిర్మాణములు. సాంఖ్యముని హిందూసంఘమున గనిపెట్టిన లోపములను దీర్చుటకు ప్రచురపరుపబడినదియు, హిందూనాగరికతపై నాధారపడినదియు బౌద్ధమతము కాబట్టియు, ప్రత్యేక నాగరికతను బ్రవేశపెట్టవలెనను యుద్దేశము బౌద్ధుల కెప్పుడును లేకపోవుటవలనను,వీటి శిల్పముయొక్కయు,నిర్మాణముయొక్కయు,చిత్రములయొక్కయు శైలి హిందూ

* "భారతీయ చిత్రకళ", ఆంధ్రగ్రంథమాల, చెన్నపురి.

శైలియే కాని వేరు కాదు. కాన నీకళాలయములు హైందవనాగరికతను జాటుచున్నవనుట కెట్టి సందేహము నుండనక్కరలేదు.

వేదకాలమునకు పూర్వమునుండియు భారతదేశమున చిత్రరచన యాచరింపబడెను. అజంతచిత్రములు రచింపబడిననాటికి ధనికుల గృహములు చిత్రాలంకృతములై యుండెను. పూజలు వివాహములు మొదలగు శుభకార్యములందు సర్వసామాన్యముగ నన్నియిండ్లయందు నలంకారార్థము చిత్రములు రచింపబడుచుండెను. దేశమున నిటుల మన్ననబడయుచుండిన యీకళయొక్క యుపయోగమును బౌద్ధులు గ్రహించి తమ మతప్రచారమునకు వినియోగపరచిరి. అశోకచక్రవర్తి మొదలగు ప్రభువుల పోషణక్రింద వీరిమతమును విదేశములందు ప్రచారము చేయునప్పు డాయాదేశముల జనులను జాతకకథలను సూచించు చిత్రములద్వారా యాకర్షించి తమమతమును స్వీకరింపజేయ యత్నించుచుండుటవలనను, దేశసంప్రదాయము ననుసరించి విహారములందును, చైత్యములందును చిత్రములను వ్రాయించుటవలనను ఆకాలమున హైందవచిత్రరచన యనేకవిధముల నభివృద్ధిని జెంది క్రొత్తరుచులను వ్యక్తపరచి యిప్పటికి నద్వితీయస్థానము నలంకరించియున్నది. అజంతగుహాలయములందు గల చిత్రము లీకాలమున వ్రాయబడినవాటిలో కొన్ని, గ్వాలియరునందు గల బాఘ్‌చిత్రములు మరికొన్ని. తక్కిన వన్నియు నశించినవి. కాంచీపురము, సీతన్నవాశలు లందు క్రొత్తగ గానవచ్చిన చిత్రము లజంతచిత్రములను బోలియున్నను, హిందూ జైనమతములకు సంబంధించిన చిత్రములు కాని బౌద్ధమతస్థుల ప్రోద్బలమువలన రచింపబడినవి కావు. ఇతరదేవాలయములందు, విహారములందు, భవనములందు నాకాలమున రచింపబడిన చిత్రము లన్నియు కాలప్రవాహమున గొట్టుకొనిపోయినవి. ఇప్పుడు కానవచ్చు చిత్రములలో నుత్తమోత్తమము లజంతచిత్రములు.

'అజంత' గుహాలని పిలువబడుచున్న కళాలయములు తొలుత - నెట్టిపేరున బిలువబడుచుండెనో తెలియుటలేదు. వీటికి నాలుగుమైళ్లదూరమున నున్న అజంత యను గ్రామమువలన నిప్పుడు నీపేరు వాడుక కలిగెను. నైజామురాష్ట్రమునగల ఫరీదుపురమునకు నాలుగుమైళ్ల దూరమున నున్న వింధ్యాద్రియొక్క కనుమవ్యాసమునను కొండయందు దిని తొలువబడినవి. ఈగుహాలయములను చూడగోరి జి.ఐ.పి.రైల్వేయందు ప్రయాణముచేయువారు జలగాముపద్దనైనను, పహారిపద్దనైనను దిగవచ్చును. గుహాలయములు జలగామునకు 3౭ మైళ్లదూరమునను, పహారిగ్రామమునకు ౧3 మైళ్లదూరమునను గలవు. కలకత్తా, బొంబాయిప్రాంతములవారికి పహారిగ్గమ మనుకూలముగ నుండును. చెన్నపట్నము, హైదరాబాదు, మైసూరుప్రాంతములవారు ఔరంగబాదునందు దిగి బళ్లపై ప్రయాణముచేయవలసియుండును. ఉత్తరమునుండి వచ్చువారు సూరతు, జలగాము లన్నింటి కనుకూలము యుండును. ఫరీదుపురమున నాలుగుగదులుగల బంగళాలు కలవు. కాని పంపరమేగ్యాటులను కలెక్టరుగారి అనుమతులు చేసుకొనవలసియుండును. గుహాలయములలో నీకటి నుండును. కాన ఎలక్ట్రిక్‌దీపములను దీసుకొనిపోవుట మంచిది. చిత్రముల ప్రతులను వ్రాయించి నైజాముగవర్నమెంటువారి యనుమతిని పొందవలెను.

ఈకందరములు, నదువుకొన్నవారును, చిత్రశిల్పముల యాధిక్యమును గ్రహింపగలిగిన యితరులును లేనిచోట గలవు కాన మనకు వీటియాకస్మికముగ వెలికొలది సంవత్సరము లరణ్యమున మరుగుపడియుండినవి. ఏడవశతాబ్దమున బుద్ధభగవానుని జన్మదేశమును భారతదేశమును సందర్శించుటకు వచ్చిన సుప్రసిద్ధ చైనాయాత్రికుడు హుయాన్ త్సాంగ్ ఈనిర్మాణములను జూచి తన గ్రంథమున వ్రాసెను. కాని బౌద్ధమతము జన్మభూమియందు క్షీణించి పరదేశముల నాశ్రయించిననాటినుండియు నీవిహారములను బౌద్ధసన్యాసులు విడిచిపోవుటచేత లోకమంతయును మరచినటు లున్నది. అజంత చిత్రరచనబోలు రచన భారతభూమియందు సామాన్యమై యుండినందు వలనను, అనేకములగు హిందూ దేవాలయములు దేశమునందంతట నుండుటవలనను వీటిని జూచిన హిందువులు నివి ప్రత్యేకముగ నాకర్షింపలేదు. ఏగ్రంథమునందైనను వీటినిగూర్చి వ్రాసినటుల

లేదు. భారతదేశము మహమ్మదీయ ప్రభుత్వముక్రింద నుండుకాలమున క్రొత్తయాలయముల సృష్టి నిలుగలు, రాజపుత్ర, తంజావూరు చిత్రములవైపు నుగలుచుటవలనను, అప్పటికను శాస్త్రీయముగ మార్పు చెలనువా చరుచుటవలనను ఆ కాలమునందు వీటిని ప్రశంసించువారు లేరైరి. ఆంగ్ల ప్రభుత్వమున మరల వీటి ప్రాశస్త్యమును లోకమంతయు గ్రహించినది. ౧౮౧౯–వ సంవత్సరమున నీకళాలయము లందలి చిత్రములను చెన్నపురి ఆంగ్ల సైనికాధికారులు కొందరు చూచినటుల 'రాయలు ఏషియాటికు సొసయిటి' (Royal Asiatic Society) వారు ప్రచురించిన జేమ్సు అలెగ్జాండరు (James Alexander) గారి వ్యాసమున నున్నది. ఇప్పటికిని యీచిత్రముల సొగసు విశేషముగ లోకమునకు తెలియలేదు 'బెంగాలు ఏషియాటికు సొసయిటి' (Bengal Asiatic Society) వారు ౧౮౩౬–వ సంవత్సరమున వీటిని వర్ణించుచు మరియొక వ్యాసమును ప్రచురించిరి. లెఫ్టినెంటు బ్లేకు (Lieutenant Blake) గారు వీటిని కొంతవరకు విపులముగ వర్ణించుచు 'బొంబాయి కొరియరు' (Bombay Couier) అనుపత్రికయందు ౧౮౩౯–వ సంవత్సరమున వ్రాసిరి. ఆసంవత్సరముననే సుప్రసిద్ధశిల్పచరిత్ర పండితులగు జేమ్సు ఫర్గూసన్ (James Fergusson) గారు అజంతకు వచ్చి, చూచి, ౧౮౪౩–వ సంవత్సరమున రాయలు ఏషియాటికు సొసయిటివారికి "రాతియందు చెక్కబడిన భారతీయ గుహాలయములు" అను వ్యాసమును పంపిరి. అప్పటినుండియే యీ గుహాలయముల కీర్తి లోకమున కంతకును వెల్లడియయ్యెను. ఇప్పు డెల్లెడల నీకందిరము లమూల్యములని గణింపబడుచున్నవి.

'అజంతగుహా' లిరువదితొమ్మిది. ఇవన్నియు నొక్క కాలమునకు జెందినవి కావు. ఆస్థలము బౌద్ధమత ప్రపంచమున ప్రసిద్ధిగాంచినకొలది నచ్చట జేరిన బౌద్ధులకు చాలినన్ని 'గుహ' లప్పటప్పటికి తొలువబడినటుల కనబడుచున్నది. ౯, ౧౦ సంఖ్యలు కలవి క్రీ. పూ. మొదటి లేక రెండవశతాబ్దమునాటివనియు, ౧,౨,౨౬ సంఖ్యలు కలవి క్రీ. శ. ఆరు లేక యేడవశతాబ్దమునాటివనియు అర్ష శాస్త్రజ్ఞులు నిర్ణయించియున్నారు. గుహలను వరుసగ సంఖ్యలమూలమున తెలియునటుల చేర్కొనుచున్నారే కాని యీసంఖ్యలకును వాటి నిర్మాణకాలమునకును సంబంధము లేదు. ఇచ్చట ఇరువదియైదు శాసనములు కలవు. ఇందు పదునేడు గోడలపై రంగులతో వ్రాయబడినవియు, తక్కినవి బైట రాళ్లపై చెక్కబడినవియు నైయున్నవి. ౯, ౧౦, ౧౯, ౨౬ సంఖ్యలు కలవి చైత్యములు. తక్కిన వన్నియు విహారములు. ఇవన్నియు జనసంకులమై యున్నకాలమున సుప్రసిద్ధబౌద్ధ వ్యాకరణపండితుడగు దిఙ్నాగుడు (దిన్నాగయని బౌద్ధులు పిలుచుచుండిరి.) ఇచ్చట కొంతకాల ముండెనని ప్రతీతి. ఇచ్చట వెలయుచుండిన సుప్రసిద్ధబౌద్ధవిద్యాలయమున ననేకులు చదువుకొనుచుండిరి. పవిత్రజీవనమును గడపుచు మహోన్నతభావములతో నిండియుండిన బౌద్ధసన్యాసుల యాశ్రమ మొకానొకప్పు డైయుండిన యీగుహ లిప్పుడు గబ్బిలములపాలగుట యందరును జ్ఞాపక ముంచుకొనవలసిన విషయము.

శాస్త్రములు చదివినంతమాత్రమున దేవుని దర్శనము లభింపదు. ప్రేమ, భావోద్రేకము మొదలగు చిత్తవృత్తులవలన అంతరాత్మ పరమాత్మతో గలియు నవకాశము లభించును. దేవునిచే సృజింపబడిన ప్రకృతిని ప్రేమించి, దాని మధ్యను మెలగి, పరమాత్ముడు తన సృష్టియం దెటుల లీల జేయుచున్నాడో కనుగొని, యం దానందము బొందుటవలన పాపచింత దూరమై మనస్సునకు శాంతి కలుగును. రాధ యాపువులయందు గానకళను బోధించు మురళీగానమున భగవంతుడు, వనప్రేమ కాధారభూతుడు నగు శ్రీ కృష్ణుని యంతరాత్మను గ్రహింపగలిగెను. అతడు లేని యా ప్రకృతియంతయు నామెకు శూన్యమనుచుండెను. ఆమెహృదయమును నింపుట కా పరమపురుషుని లీలయే ముఖ్యము. ముక్తిని గోరిన యీబౌద్ధ సన్యాసులకును, వారికిపూర్వము లోకమును బవిత్రముచేసిన ఋషులకును సాంద్రారణ్యమధ్యప్రదేశము లీకారణమువలననే యాశ్రమము లయ్యెను. ప్రాపంచిక విషయములను వర్జించి నిర్జనప్రదేశమున సృష్టికర్త గుణములను కీర్తించుట హిందూదేశమున నాచారమైనది.

ప్రకృతి నింత ప్రేమతోను, గౌరవముతోను జూచిన మనపూర్వికులగు బౌద్ధసన్యాసులు తమ నివాసము జనశూన్యమైన కొండచానువులందు సుందరములగు నడవులమధ్య నీనిర్మాణముల నేర్పరచుకొనుటయందు వింత యేమియు లేదు. బుధు లెట్టిప్రదేశములందు తమ యున్నతభావములను బోషించి, యుపనిషత్తులను, పురాణములను మన కర్పించియున్నారో యట్టి యరణ్యప్రదేశములే యీయజంతప్రాంతములు. ఇచ్చట హిందువులకు పవిత్రమయిన [illegible] లుండుటచే యీపుష్పము [illegible] చున్నవనియు, నీకందరము [illegible] వనియు నచ్చటి ప్రజలు చెప్పుచుందురు. [illegible] "సాత్ కుండ్" అని [illegible] కానందము గలుగజేయును. (చిత్రము ౧) అజంతగో "వాఘూర" మను నేరు వంకరలుగ ప్రవహించును, [illegible] ప్తుని జీవయాత్రవలె [illegible]



చిత్రము ౧

మరియొకవైపున ప్రవహించుచుండును. దీనిదరి నీరు దీర్చుకొనుటకు వచ్చిన వన్యమృగములు కందరములవద్ద నిలువబడినవారికి కనబడును.

మానవులు భగవంతుని చెంత జేరుయత్నమునకు మనోజ్ఞకళ లొక యాధారము కాన, మాయలో బడి ప్రాపంచికానుభవమును బొందుచు దేవునితో లీనమగుటకు ప్రయత్నించుచున్న జీవులు సృష్టికర్త కర్పించు కానుకలలో సుప్రసిద్ధచిత్రము లొక విశేషము. దేవుని యెడల దమకు గల ప్రేమ, గౌరవము మొదలగు భావము లీబౌద్ధచిత్రకారులు చిత్రరూపమున ప్రదర్శింపజూచుటవలననే యివి యింతచక్కగ నున్నవి. ఇట్టి మంచి చిత్రములను జూచినవారికి తమ ప్రస్తుతప్రాపంచికజీవనముపైని, తద్ద్వారా తమకష్టముల యెడలను కొంచెముగనో, గొప్పగనో మరపు కలుగును. ఇట్టిమరపువలన తాను ప్రత్యేకముగ నొకవ్యక్తి యను భావము మరుగుపడి తక్కిన జీవ ప్రపంచముతో నైక్యము చేకూరును. ఈ పరమాత్మజ్ఞానమువలన నవిద్య నశించును. అజంతకందరము లడవులం దుండుటయే కాక, యవి కళాలయములుగ నుండుటవలన సృష్టికర్తను

మార్గ మున్నది. పదునారవ కంధరద్వారమున గల యేనుగుల విగ్రహము లుండుటవలనను, అంగణమునకు ముందుగల మెట్లవద్ద చక్కని నాగరాజవిగ్రహ ముండుటవలనను, దీనియెదుటినుండి చూచినచో నిర్మాణము లన్నియు చక్కగ గనబడుచుండుటవలనను, ప్రకృత్యాది దృశ్యముల నానిర్మాణకర్తలు ముఖ్యముగ గమనించుట వలనను, పూర్వ మిచ్చటనే యీకందరములవరకు నెక్కడిమార్గ ముండినటుల కనబడుచున్నది. నిర్మాణము నందేమి, శిల్పచిత్రరచనలందేమి, ౧, ౨, ౯, ౧౦, ౧౨, ౧౬, ౧౭, ౧౯, ౨౬ కందరములు ప్రసిద్ధి గాంచినవి.

అజంతచిత్రరాజములను మాత్రమే యనేకులు పొగడియుండిరి కాని యీకందరముల యద్భుతనిర్మాణ విధానము కూడ ఇప్పుడిప్పుడు కళాకోవిదుల నాకర్షించు చున్నది. క్రీ. పూ. మొదటిశతాబ్దమున నిర్మాణ మారంభమై, గుప్తుల, చాళుక్యుల యాధిపత్యమునను, తరువాతను, అనగా క్రీ. శ. ఏడవశతాబ్దమువరకు నివి నిర్మింపబడు చుండుటవలనను, చిత్రములు కూడ ఆశతాబ్దములందంతటను చిత్రింపబడుటవలనను నిర్మాణ, శిల్ప, చిత్ర కళల పరివర్తనమును బరిశీలించి, భారతదేశమున నీయీ కళ లెట్టిమార్పులను పొందినవో కనుగొనవచ్చును. గుప్తుల పూర్వమునను, గుప్తుల తరువాతను గల నిర్మాణవిభేదము లని పండితులచే జెప్పబడువాటిలో ననేకము లిచ్చట గానవచ్చుచున్నవి.

చైత్యములు ముఖ్యముగ బుద్ధదేవు నారాధించుటకు నిర్మింపబడినవి. బుద్ధుని నిర్యాణకాలమున సంపాదింపబడిన యాతని యస్థులు, గోళ్లు, శిరోజములు మొదలైనవి యొకచోట నుంచి, వాటిపై దేవాలయాకృతిని నిర్మించి యచ్చట నాతని గుణకీర్తనము జేయుట యాచారమైనది. ఇట్టి స్తూపములు హిందూదేశముననే కాక బౌద్ధమతము వ్యాపించిన యన్నిదేశములందును కానవచ్చుచున్నవి. సుప్రసిద్ధములైన యమరావతి, సాంచి స్తూపము లిట్టివియే. అజంతయందలి చైత్యగృహములు రాతి యందు దొలువబడిన వగుటచే బుద్ధుని దేహభాగము లెవ్వియు వీటియం దున్నటుల లేదు. మధ్యను స్తూపాకారముగ నుంచి, ప్రార్థన సలుపుటకు [illegible] ముందునకు మిగిలియుండునటులను, [illegible] రము నుండుట యనవసరమైనను స్తంభములను చెక్కుటచే వీరికి నిర్మాణములందుగల [illegible]



చిత్రము 3

మున్నది. సమకోణచతుర్భుజాకారము గలిగియున్న యీ చైత్యపు (చి. 3) మధ్యభాగమునకు [illegible], స్తంభములకును గోడకును మధ్య [illegible] పుల నున్న గవాక్షములద్వారాను [illegible], అనుకొనునంత చీకటిగ నివి యుండవు. [illegible] గల కప్పు కఱ్ఱలతో గట్టబడినదానివలె కనబడునటుల చెక్కబడుటయు, ద్వారము, [illegible] జూడ నాకాలమున కఱ్ఱలచే నిర్మింపబడు గృహములనగా నాలనియు, రాతియందిట్టికందరములనుదొలుచుట [illegible] కాలముననో, యంతకు కొంచెము పూర్వముననో ప్రారంభమయ్యె ననియు తెలియును. మొదట నిర్మింపబడిన తొమ్మిదవ సంఖ్యాకల చైత్యము (చిత్రము ౪) నందలి స్తూపముపైని, స్తంభములపైని ఎట్టి యలంకారములును మలచబడలేదు. తరువాత నిర్మింపబడిన పదియవ విహారము పెద్దదిగ నున్నది. దీనియందు దారునిర్మాణముల



చిత్రము ౪



చిత్రము ౫

పోలిక విశేషము కానరాకయున్నది. అప్పటికే రాళ్లతో నిర్మించువిధాన మభివృద్ధి జెందెను. పందొమ్మిదవసంఖ్యకల చైత్యమునకును, తొమ్మిదవసంఖ్యకల చైత్యమునకును గలభేదమును సూచినయెడల కందరనిర్మాణ మెట్టి మార్పు జెందెనో తెలియును. స్తూపమునందును భేదము కలదు. ప్రాంగణమును మెట్లును విశేషములు. తక్కిన



చిత్రము ౬

మార్పులును సుగోచరములు. (చిత్రము ౫) దారునిర్మాణ చిహ్నము లేవ్వియు లేవనియే చెప్పవచ్చును.

ఈగుహాద్వార మద్భుతమైనది. బౌద్ధుల సుప్రసిద్ధనిర్మాణములలో నిది మిక్కిలి చక్కనిదనియు, విధానమున నన్నివిషయముల పరిపూర్ణమైనదనియు పొగడ్తబడినది. ఎదుట నున్న ప్రాంగణము, దాని స్తంభములు, మీద నున్న వలయాకారనిర్మాణము, శిల్పము అన్నియు నతిమనోహరముగ నున్నవి. అజంతనిర్మాణములను జగద్విఖ్యాతములుగ జేయుట కీద్వార మొక్కటియే చాలును. (చిత్రము ౬)



చిత్రము ౭

విగ్రహారాధన కూడదను నియమము బౌద్ధమతమున తొలుత నుండెను. రాను రాను బుద్ధుని సూచించుటకు పాదములు, వైరాగ్యమును జూపుటకు ద్వారము, గుఱ్ఱము, మతబోధను చూపుటకు చక్రము మొదలగు చిహ్నములు వాడుకకు వచ్చెను. హీనయానము, మహాయానము అను రెండుపక్షములుగ బౌద్ధు లేర్పడిన నాటికి విగ్రహములు విరివిగ కావలసివచ్చెను. ఆకాలమునుండియు నిర్మాణకర్త లనేకవిధముల క్రొత్తరుచులను లోకమునకు జూపగలిగిరి. పందొమ్మిదవసంఖ్యకల చైత్యద్వార మిట్టి నూతనశిల్పనిర్మాణమునకు నిదర్శనము.

తొమ్మిదవసంఖ్యకల చైత్యమునకును, ఇరువదియారవ సంఖ్యకల చైత్యమునకును గలభేద మీశిల్పకళాపరివర్తనము (చిత్రము ౭) బాగుగ తెలియజేయగలదు. స్తంభముల యలంకార మింకొకవిశేషము. స్తూపముపై బుద్ధభగవానుని విగ్రహము చక్కనిది కలదు. స్తూపము ననేకవిధముల నలంకరింపబడియున్నది. మీదిభాగమున కిన్నర విగ్రహములు కలవు. ఛత్రమునందును శోభ కలదు. కప్పులోపలిభాగమున దారునిర్మాణవిధానము చక్కగ మలచబడెను. కాని దీని శిల్పమునకును, నిర్మాణమునకును ఐక్యము లేకపోవుటచే నీచక్కని చైత్యము లోపము గలిగియున్నదని కొందరి యభిప్రాయము.

చైత్యముల గోడలపైని జాతకకథల విషయములు మలచబడియున్నవి.



చిత్రము ౮

బౌద్ధసన్యాసులు నివసించుటకును, మతవిషయకచర్చలను సలుపుటకును, తమ్మాశ్రయించియుండిన శిష్యులకు బౌద్ధమతమును నేర్పుటకును, తదితరసద్వ్యాప్తులందు నియమితులై యుండుటకును, కట్టిన నిర్మాణములను, దొలువబడిన కందరములను విహారము లనెదరు. పదునారవ సంఖ్యకల విహారకందర మెంత బాగుగ నున్నదో, యా నిర్మాణకర్తల ప్రవీణత యెంత గొప్పదియో (చి. ౮)

నీచిత్రమున గానవచ్చును. మధ్యాంగణమునకు వెలుతురు విశేషముగ వచ్చునటుల నిర్మింపబడినది. సాధారణ నిర్మాణము వలె కనబడుటకును, సుందరముగ నుండుటకును ఇరువది స్తంభము లేర్పరుపబడెను. సన్యాసులు నివసించుట కిరు వైపుల గదులు కలవు. ముఖ్యద్వారమున కెదురుగ నున్న పెద్ద గది బుద్ధుని కొరకు విడువబడిన పూజాగారము. సాధారణముగ నిందు బుద్ధవిగ్రహ ముండును. చైత్యములందు గల స్తూపముల పైనే కాక యీ విహారమున లోపల గల పెద్ద విగ్రహమును స్పష్టముగ గానవచ్చునటుల వెలుతురు చాలినంత వచ్చుటచే యీనిర్మాణకర్తల చాతుర్యము నందరు బొగడుచున్నారు. అజంతకందరము లన్నిటి నిది మించి యున్నది. దీనిప్రాంగణమున నున్న స్తంభములు విశేషముగ నలంకృతములు కానప్పటికిని, చాల సుందరముగ నున్నవి. ద్వారమున నేమఫల, నాగుని విగ్రహములు



చిత్రము ౧౦

దీని ప్రాముఖ్యమును దెలియజేయుచున్నవి. మధ్యాంగణము పరిమాణము ౭౭ అడుగుల నిడివియు, ౭౫ అడుగుల 3 అంగుళముల వెడల్పును, ౧౫ అడుగుల 3 అంగుళముల ఎత్తును, ప్రాంగణము ౭౭ అడుగుల పొడవును కలది.

పదురెండు, పదుమూడు సంఖ్యలు కల విహారములు పురాతనము లని నిర్ణయింపబడెను. పదురెండవ సంఖ్యకల విహారముయొక్క ప్రాంగణము నశించెను. దీని లోపలిభాగ మెంతయు మనోహరముగ నున్నది. గదులకు పోవు ద్వారములు చక్కగ నలంకరింపబడి యున్నవి (చి. ౯). ఏడవసంఖ్యకల విహారమున చక్కని ప్రాంగణము, ఎత్తయిన గదులు నుండుటవలన తక్కిన విహారములకును దీనికిని భేదము కలదు. ఆరవసంఖ్య కల విహారము రెండంతస్థులు కలది. దీని నిర్మాణ మప్పటి గృహనిర్మాణమును బాగుగ దెలియజేయును. కనుక చరిత్రకారుల నాకర్షించు చున్నది. నాల్గవసంఖ్య కల విహారము అలంకారములు, విగ్రహములు విశేషముగ లేనప్పటికిని చాల చక్కగ నున్నది. (చిత్రము ౧౦) ఇచ్చట గల



చిత్రము ౯

విహారము లన్నిటికం టెనిదియే పెద్దది. పూర్వపు గృహనిర్మాణమును జూచి యేవగించుకొనెడి యాధునిక భారతపుత్రు లీవిహార ప్రాంగణమును జూచి నేర్చుకొనవలసిన విషయము లనేకములు కలవు. విహారము లన్నిటిలోను రెండవ సంఖ్యకల విహారమునందలి బుద్ధుని యాలయమునందు మాత్రము చిత్రముల చిహ్నములు కానవచ్చుచున్నవి. ఒకటవసంఖ్యకల విహారము చాల చక్కనిదనియు, దీని శిల్పరచన యత్యుత్తమ మైన దనియు పండితులు పొగడి యున్నారు. మెట్ల కిరువైపుల నున్న యలంకారము, స్తంభముల పైభాగమున గల స్త్రీలు మొదలగునవి యిరువదియవసంఖ్య కల విహారపు విశేషములలో కొన్ని ఇరువదినాలుగు, ఇరువదియైదు సంఖ్యలు కల విహారములు పూర్తిగ నిర్మింపబడలేదు. పూర్తియైన యెడల ౨౪-వ విహార మద్భుతనిర్మాణమై యుండి యుండును. బౌద్ధసంఘమునకు గలిగిన యెట్టి యాపత్తువలననో, మ రేమార్పులవలననో, పోషణ లేకయో యీకందరము పూర్తి కాలేదు. అజంతసంస్థ క్షీణించుట కదియే ప్రారంభము కాబోలు.

విహారములందు సన్యాసులకొరకు నిర్మింపబడినగదులందు వారు పండుకొనుటకు తగినటుల రాతిదిమ్మలును, తలగడలును కలవు రాతిగోడలందు కఱ్ఱకొయ్యలను దోపి బట్టలను వ్రేలాడగట్టుటకు కన్నములు కలవు. కొన్ని ద్వారములకు తలుపులు తగుల్చుకొనుటకు వీలుగ నుండునట్టి యేర్పాటులు కలవు.

విహారముల, చైత్యముల స్తంభములు మాత్రమే యజంతనిర్మాణములను లోకప్రసిద్ధములుగ జేయజాలును. అలంకారము లున్నను, లేకపోయినను వీటి నిర్మాణ మతిసుందరముగ నున్నది. ఏదో యొకవిధానమును మాత్ర మనుసరించి స్తంభములను నిర్మించు నియమమున









చిత్రము ౨౨

కాశిల్పులు కట్టుబడకపోవుటచే నొకే స్తంభమున ననేకములగు రుచులను జూపజాలిరి. ప్రాచీనసంప్రదాయముప్రకార ముండవలసిన కలశములు, పద్మములు

నిరంత

మొదలైన గృహాకారములను సులభముగ నందు వింతయైన నాశ్చిప్పలను చేసిరి. ఈ గృహాకారములు అన్ని స్తంభములం దును కాననగునట్లు ననుసరించిరి. లేకయుండెను. బుద్ధుని విగ్రహములు, సింహ స్త్రీ విగ్రహములు, తదితర వ్యక్తుల విగ్రహములు కొన్ని స్తంభములందు గలవు. పై చిత్రమున (చి. ౧౧) గాంచిన యజంత స్తంభవిశేషములలో కొన్ని మాత్రము. పశ్చిమదేశపు దేవాలయముల స్తంభములు విగ్రహసమూహములచే నలంకరింపబడిన సొగసుగ లేవనవా రును, ఆధునిక గృహనిర్మాణకర్తలును వీటినుండి యనేక విషయములను నేర్చుకొనవలసి యున్నది.

అజంత కందరములు విహార చైత్యముల నిర్మాణ విధానములు నాకాలపు పరిస్థితులు మొదలగు విషయము లను గూర్చి చర్చించుట దగును. ఇప్పుడు హైందవ పురాతన సంస్థలను గూర్చిన పరిశోధనము పెరుగుచున్నది. కాని ముఖ్యముగ భారతదేశమునను, సయాము, జావా, ఆఫ్ఘని స్థానము, చైనా మొదలగు దేశములందును విరివిగగల ప్రా చీనహైందవ నిర్మాణములను విపులముగ వర్ణించు గ్రంథ ములు వెలువడునను నాశ కలదు. ప్రభుత్వమువారి ఆర్కియాలజికల్ డిపార్టుమెంటువారు ప్రచురించు చున్న గ్రంథములందు వర్ణనలున్నను మనోజ్ఞకళావిధా నముల నీ నిర్మాణము లెట్లు బోధించుచున్నవియో, హైందవకళయొక్క వ్యక్తిత్వాధిక్యము వీటియందెట్లుల గలదో, లోకమున కివి యెట్లుల విలువగలవనియో చెప్పువిషయములు వాటియందు తక్కువ.

## శిల్పము

హైందవశిల్పసంపత్తియు నిట్టి యనాదరణమునే పొందుచున్నది. కొందరు కళాభిలాషులు, విమర్శకులు నీవిషయమును కొంత విపులముగ జర్చించుట కలదు కాని యజంతశిల్పవిన్యాసము నెవరును బాగుగ బరిశీలింప లేదు. ఇచ్చటి చిత్రరచనయు, శిల్పరచనయు నొక్క తరగతికి జెందుటవలన, నీరెండువిధముల రచనలను జేసి నవారొకేవిధమగు మన్నతభావములతో నుత్సాహము కలవారగుటచేతను, శిల్పములును వర్ణచిత్రములవలె సుందరములై యున్నవి. ఏడవశతాబ్దమువరకు మలచ బడిన యీవిగ్రహముల పరీక్షవలన కళాసృష్టియందద్వితీ యమై యాకాలమున చిత్రకళాభిరుచి యెట్టిమార్పులను జెందుచువచ్చెనో తెలియును కాన నీశిల్పచిత్రము లమూల్యములు. బౌద్ధమతము వ్యాపించిన మూడు నాల్గు శతాబ్దములకే యీకందరనిర్మాణ మారంభమై, యామ తము భారతదేశమున క్షీణించినవరకు మలచబడినవి కాన బౌద్ధుల కళానిర్మాణములలో నీచోటు నిరుపమాన మైనది. ఇచ్చట శిల్పసృష్టియందు గల స్వేచ్ఛ, విగ్రహ ముల మార్పు, ఏర్పాటు, సుందరమై యుండ బుద్ధుడు మొదలు కష్టజీవియగు కర్షకునివరకు, ఏనుగు మొదలు పక్షులవరకు, పవిత్రమైన మర్రిచెట్టు మొదలు గడ్డిపూస వరకు గల భేదములు, వాటి కష్టసుఖములు నత్యంత నిపుణముగ నిచ్చట బ్రదర్శింపబడుటవలన వాటియం దొక వింతయైన సానుభూతిని చూపరులందు కలుగజేసి విశ్వమయుని గుణకీర్తనము జేయుచున్నట్టుల నున్నవి.

ఒకటవ సంఖ్య కందరప్రాంగణకుడ్యమున గల శిల్పచిత్రమాలిక యతిమనోహరమైనది. ఇదివరకు దీనిని వర్ణించువారు లేరు.

నాల్గవకందరమున గల 'పద్మపాణి' విగ్రహము యొక్క విన్యాస మాశిల్పాచార్యుల ప్రవీణతను, సనా తన భారత శిల్పౌన్నత్యమును వేనోళ్ల జాటుచున్నది. ఇచ్చటనే యొక గజరాజమును జూచి భయపడి స్త్రీయు బురుషుడు పారిపోవునట్టులను, అప్రక్కనే స్త్రీలో లున్నయున్న పురుషుడును చక్కగ రాతియందు మలచబడిరి. ద్వారమువద్ద వృక్షమునకు చేరబడియున్న మనోహరాంగి మరియొక చక్కని శిల్పచిత్రము.

పందొమ్మిదవ సంఖ్యాకల చైత్యద్వారప్రాంగణ మునగల నాగరాజశిల్పరాజము (చిత్రము ౧౨) ననేకులు పొగడిరి. ఇట్టివి వచ్చట మరికొన్ని యున్నను దీనినిచూచిన దక్కనివెట్టులుండునో కొంచెము తెలియగలదు. నాగులు రాజపుత్రస్థానమునందును, మధ్యపరగణాలయందును క్రీ. పూ. ఏడవశతాబ్దమునాటినుండి క్రీ. శ. సుమారు నాల్గవ శతాబ్దమువరకును రాజ్యపాలనము జేసిరని యూహ. కాన నాకాలమున చిత్రింపబడిన అజంత అమరావతి మొదలగు శిల్పరాజములందు వీరు విశేషముగ కానవచ్చు



చిత్రము ౧౩

చున్నారు. నాగసర్పముయొక్క పడగ వీరికి చిహ్నమై యుండెను. కాని నాగలోకమున నుండు పాములు, జలమున నుండు సగముపాము సగముమనుష్యుల యాకారము గలవ్యక్తులు వీరు కారని గ్రహింపవలెను. పైనున్నచిత్రమును జూచినయెడల నీవిషయము గోచరము కాగలదు. ఈ శిల్ప మిప్పుడు కొంత చెడియున్నను రచనా సౌందర్యము బాగుగ కానవచ్చుచున్నది. వ్యక్తుల కూర్పున నెట్టి లోపమును లేదు. మధ్య నొక యున్నతాసనమున నొక నాగరాజు రాజకీవి నాసీనుడై యుండ, హస్తమున నేదో యొక పుష్పమును బట్టుకొని యాతని రాణి ప్రక్కను కూర్చొనియున్నది. మరియొకవైపున నొక పరిచారిక వింజామరమును వీచుచు నిలువబడియున్నది. నాగరాజుశిరముపై నేడుతలల పడగయు, స్త్రీల తలలపై నొకపడగయు నున్నవి. ఈసర్పము లతిసహజముగ, సుందరముగ జెక్కబడి యున్నవి. వీరు కూర్చొనుటను జూడ నాలోచనమున నిమగ్నులై యున్నారా యని పించును. కాదు; ఈప్రపంచమును మరచి యూబుద్ధ భగవానుని స్మరించుచు తమజీవితములు సామహోత్కృష్టని

యంగు లీనముచేయ జూచుచున్నారు; లేక చైత్యము లోపల గాఢధ్యానాసక్తులు చేయు నాగ్గురుని కీర్తనము నేకాగ్రచిత్తులై వినుచున్నారా? ఇట్టి స్థితియందు నారాజ దంపతులు మగవాని గాంభీర్యమును స్త్రీ తోను, భక్తితోను చూచి యనుసంధించుయత్నమున నున్నది. పరివారిక చెక్కిలిపై నున్న వ్రేలు నారి పరధ్యానభావమును బాగుగ ప్రస్ఫుటితము చేయుచున్నది. మొఘాపరంపరలు మహాచిత్రకారులు తక్కిన నారివలె విశేషప్రయత్నమున గాక యతిసులభముగ నిట్టి భావములను వ్రాయగలరు. అంగములను చక్కగ జేయు ప్రయత్నమున శ్రమపడి శిల్పచిత్ర భావములను మరుగుపరుపక సాధారణముగ చిత్రించుటవలన క్రొత్త సౌందర్యము పొడసూపుచున్నది. అంగములందు గల ప్రతిరోమమును సులభిసంతసూత్రమున లాభ మేమియు లేదు. ఎన్ని వివరములను వ్రాసిన నింతప్రవీణత లేని మరే చిత్రకారుని నిట్టిసుందరమైన యంగవిన్యాసమును వ్రాయలేరు. అజంతశిల్పకారుల కోపిక చాలసని చూపరు ననలేరు. వివరములను రచించు నభిలాష వీరియందు నాకిరీటము, ముత్యాలసరములు, రదతరాలంకారములు నారి యలంకారవివరముల ప్రీతికి సాక్షులు. అలంకరించుటయందు ప్రేమ కలదు. వ్యక్తి సూటమి యతిమనోహరముగ నుండ, నేనై పునుండి చూచిన వెలుగురునీడల యేర్పాటు కళారాధకుల నానందమయులుగ జేయును. ఇది శిల్పరచనాప్రవీణత; అజంత శిల్పముల గొప్పతనము.



చిత్రము ౧౪



చిత్రము ౧౩

‘౨౩’ కందరద్వారమున నిరువురు నాగులుద్వారపాలకులుగ నున్నారు. (చి. ౧౩) ద్వారబంధముగ మలచబడినచోట నీసుందరవిగ్రహములు చిన్నవిగ నుండుటవలన సందర్శకులదృష్టి నాకర్షింపలేదు. వీరియంగ విన్యాసమును, తలపై నున్న యైదుతలలపడగలును భావమును చాల చక్కగ నున్నవి. ఇరువదియారవ సంఖ్యాకల కందరమున నున్న శిల్పసంపత్తి మిక్కిలివిలువయైనది. ఒక గూలయకుడ్యముపై బుద్ధుని నిర్యాణము చెక్కబడి యున్నది. శయ్యపై బుద్ధుడు శాంతభావముతో పడుకొనియుండ, చుట్టు నాతనిశిష్యులు విషణ్ణవదనములతో నిలిచియున్నారు. మరియొకచోట (౧౬ వ గుహ యందు) జల

దేవత కలదు. ఈవిగ్రహమున వ్యక్తివిన్యాసము, ముత్యాల సరులు, భావము మాపదగ్గవి. (చి. ౧౪) ఇట్టి శిల్పరాజము లనేకము లాకందరములందు విరివిగ కలవు. ఈశిల్పసంపత్తిని, ఈకళాసృష్టిని కొనియాడుటయే దుర్లభము. అతిప్రవీణులును, ఉత్సాహపూరితులును, ఆవేశము కలవారును నగు మహాచిత్రకారు లిట్టిశిల్పములను రచింపవలెనే కాని సామాన్యులచేత కాదు. మహాశిలలు గొలిచి, యంతిట్టి విచిత్రచిత్రితభవనముల నిరువదితొమ్మిదింటిని నిర్మించుట కెంతకాలము, ఓపిక కావలెనో సులభముగ నూహింపవచ్చును. వీరి కళానిపుణత గ్రహింపనివారైన నిట్టి మహత్తరకార్యమును నిర్వహించినందులకు ప్రశంసింపక తీరదు. రాళ్లయం దిట్టి సౌందర్యము! సృష్టి!! విశ్వామిత్రుడు సృష్టిచేసెనని యందురు కాని యట్టి ప్రతిసృష్టి యిచ్చట ప్రత్యక్షము. వేలకొలది రూప్యములను వెచ్చించి యొకప్రతిమను జేయించుచూ రజంతగుహానిర్మాణమున కెంతధనము కావలెనో లెక్కవేసి చూచెదరు గాక! రెండువేల సంవత్సరములనుండియు కళాజీవనమును బోషింపుడని భారతపుత్రుల కీకందరములు బోధించుచున్నవి. జాతీయకళను బరిహసించు భారతపుత్రుల నాహ్వానము చేయుచున్నవి.

---

# మ జ ను

పురిపండా అప్పలస్వామి గారు (కవితాసమితి)

ఏను మజనూకుమారుడ నెరుగరేమొ
    నాకలలరాజ్ఞి యామె లైలాకుమారి,
నన్నె పిల్చె శుద్ధాంతకాంతారవాటి
తీపిగళ మెత్తి వెన్నెలతెర సడల్చి.

సైపలే దామె యింత జ్యోత్స్నాపరీమళమ్ము ‘తరుణ-గులాబీల’ రక్తిమమ్ము,
ఇటు విడువకుండ నన్ను వేధింతు రేల?
ఏను మజనూకుమారుడ నెరుగరేమొ!

తరళతారకా దుగ్ధపథమ్ము విడిచి
నాకొరకె నేల పడిన తారాకుమారి
ప్రేయసియె నాకు; భర్తృదారికయె మీకు,
రాలిపడెనేమొ ఆమెనేత్రాల నొక్క
ఊడుకుబాష్పమ్ము! చలియించు నుడుగణమ్ము.

పర్చునెద నాసకియ నిశ్వసించెనేమొ
జలదపటలమ్ము ముసరు జాబిలికుమారు!

వెండిమబ్బునృత్యాలకే వెరగుపడును
ఈప్రళయదృశ్య మయ్యొ! తా నెటు సహించు!
ఇటు నిరోధింతు రేల? నాహృదయమునకు
హృదయ మామె; యుగయుగాల వెదకుకొనిన
జీవనమ్ము, మీదారుణశృంఖలాల
ఎంత సంతాపపడియెనో స్వేచ్ఛకొరకు!

మీ రెరుంగరు జుమ్మాకుమారి నేడు
తనకొరకు నాకొరకు జడాంతఃపురమ్ము
ఈకఠోరవిశ్వమ్ము తృణీకరించు
ఎవరు నాదేవదేవి బంధించువారు!

తావిగా, గాలిగా, కోటద్వార మెడలి
నామనోహారి జాలిగా నాయెడంద
ప్రాలిపడువేళ శర్వరీరాగవీథి
పులకరించు సుధాస్వామికలవిపంచి.

---

# హిందూదేశపరిపాలనా విధానము – దానిచరిత్ర

( మూడవ భాగము )

భా. వెం. హనుమంతరావు గారు, యం. ఏ., బి. ఇడి.

మింటోమార్లే సంస్కరణములు ప్రవేశపెట్టబడిన కొలదికాలములోనే వాటి ఉపయోగమునుగురించియు, ప్రాముఖ్యమునుగురించియు ప్రజలలో ప్రబలిన ఆశలన్నియు భగ్నము లయ్యెను. కాని అవి ఏపరిస్థితులలో ప్రవేశపెట్టబడినవో, వాటివలన చేకూర్చబడిన లక్ష్యము లేవో, వాటినిబట్టి ఆలోచించిన అవి జయప్రదము లనియే చెప్పవచ్చును. వాటి నేర్పాటుచేయునపుడు, వాటిక్రింద ఏర్పాటగు శాసనసభలు ప్రభుత్వముపై ఏవిధమైన నిజాధికారమును చలాయించుట కెప్పుడును ఉద్దేశింపబడియుండలేదు. అవి కేవలము సలహాసంఘములుగామాత్రమే యుండునట్లు వాటిగ్రంథకర్తలు నిర్దేశించియుండిరి. కాబట్టి సలహాసంఘములుగమాత్రమే వాటిపనిని మనము పరీక్షించిన ఆశాసనసభలు బాగుగ పనిచేసినవనియే చెప్పవలసియున్నది. కాని దేశమునందలి ప్రజాభిప్రాయములో అవి మొదటినుండియు బాధ్యతను వహింపగల పార్లమెంటరీ సభలుగనే పరిగణింపబడుచువచ్చి వాటిపనిని ఆదృక్పథమునుండి పరీక్షించుటయే పరిపాటి యైనది. ప్రభుత్వమువారికిని ప్రజలకును దృక్పథమునందున్న ఈ భేదమునుబట్టియే మొదటి నుండియు ప్రభుత్వాధికారసభ్యులకును, అనధికారసభ్యులకును చాల విషయములందు అభిప్రాయ భేదములును, తగాయిదాలును ప్రబలుచువచ్చెను. అదియే వాటి విఫలత్వమునకు ముఖ్యకారణము.

మార్లేసంస్కరణము లమలునందున్న కొలదికాలమునకే యూరప్ ఖండమందు యుద్ధము ప్రారంభమాయెను. ఆయుద్ధములో హిందూదేశపుసైనికులును ప్రజలును బ్రిటనుకు చేసినసహాయమునకు బదులుగనైననేమి, మింటోమార్లే సంస్కరణములందు కాన్పించిన లోట్లను తీర్చు నుద్దేశ్యముతో నైననేమి, తిరిగి రాజకీయ-మార్పుల విషయమై చర్చ ప్రారంభమాయెను. యుద్ధము జరుగుచున్నసమయమునందును, అది ఆగిపోయినవెనుకను, కొన్ని సంస్కరణముల విధానములు దేశములో కొంతమందిచే తయారుచేయబడి చర్చింపబడుచు వచ్చెను. అప్పటి రాజకీయనాయకులలో ప్రధానుడగు గోఖ్లేమహాశయుడు (Mr. G. K. Gokhale) ఇట్టివిధానము నొకదానిని తయారుచేసెను.* అతడు సూచించినసంస్కరణములలో "రాష్ట్రీయస్వాతంత్ర్యము" (Provincial Autonomy) ను వెంటనే ప్రవేశపెట్టవలె ననునది ముఖ్యమైనది. రాష్ట్రీయస్వాతంత్ర్య మనగా రాష్ట్రీయవిషయము లన్నిటిపైనను రాష్ట్రశాసనసభలకే అధికార ముండవలెనను విషయము గోఖ్లేవిధానములో ప్రధానమైనది. కాని అతడు అప్పటికి అమలునందున్న పరిపాలనావిధానపు పునాదిపై ఆఅధికారము నేర్పాటుచేయుటకు పూనుకొనెనేకాని, పూర్తిగ ప్రజలచే ఎన్నుకొనబడిన రాష్ట్రశాసనసభలకు ప్రభుత్వము బాధ్యతె వహింపవలె నను సూత్రము నాతడు ఆమోదింపలేదు. మరియు అతడు రాష్ట్రశాసనసభలు ప్రజలచే సూటిగ ఎన్నుకొనబడిన (direct-election) ప్రతినిధులుగల సభగాకాక indirect పద్ధతిని ఎన్నుకొనబడిన సభ్యులు గలదిగా నుండవలెనని సూచించెను. కార్యనిర్వాహకవర్గముకూడ, హెచ్చు

* గోఖ్లేగారు ౧౯౧౫-వ సంవత్సరములో మరణించిరి. ఆయన తయారుచేసిన సంస్కరణముల ముసాయిదా ౧౯౧౭ ఆగస్టులో ప్రకటింపబడెను.

చేయబడి ముగ్గురుసభ్యులకుబదులు ఆరుగురుసభ్యు లుండవలెననియు, వారిలో సగముమంది హైందవులై యుండవలెననియు కూడ గోఖలేగారు సూచించిరి. కాని రాష్ట్రీయ శాసనసభలు ఏతీర్మానమునైనను ఆమోదించిన గవర్నరు వీటో (Veto) అధికారము నుపయోగించి దానిని రద్దు చేసిననేకాని ప్రభుత్వమువారు దాని నాచరణయం దుంచవలెను. ఈసిద్ధాంతములో కొంతవిపరీతము గలదని ఒప్పుకొనక తీరదు. ఎందువల్ల ననగా బాధ్యతాయుతసూత్రముపై ఆధారపడియుండని కార్యనిర్వాహకవర్గము (Irremovable Executive) వారు శాసనసభవారు చేసినతీర్మానములను వారు మొదట చర్చలో ఎదిరించినప్పటికిని, వారికి ఇష్టము లేనప్పటికిని ఆమోదింపవలె ననుట రాజకీయసూత్రములకు వ్యతిరేకముగాక మరేమగును? ఇప్పుడు చెప్పునది అట్లు ఆమోదింపకూడదని కాదు, కాని బాధ్యతాయుత ప్రభుత్వపద్ధతి అమలునందున్నప్పుడే ఆమోదింపవలెనని చెప్పుటలో చట్ట-సమ్మతముండును. అసలు కోరవలసినది అట్టి బాధ్యతాయుత ప్రభుత్వము నేర్పాటు చేయవలె ననునది. శాసనసభలకు ప్రభుత్వవర్గమువారిపై అధికారము లేకుండ చేయుటవలన శాసనసభ్యులకు బాధ్యత లేకుండ ప్రభుత్వమును ఖండించుటయలవాటై ప్రభుత్వశాసనసభలమధ్య వైషమ్యములు పెరుగుటయే ఫలమాయెను.

గోఖ్లేగారివిధానముతరువాత మనము గమనింపవలసిన సంస్కరణముల విధానము డ్యూక్ నివేదిక (Duke Memorandam) యనునది. దీనియందలి విధానము "రౌండుటేబిల్" అనుసంఘమునకు ప్రధానుడగు సర్ లయొనెల్ కర్టిస్ (Sir Lionel Curtis) అనువానిసలహా ప్రకారము తయారుచేయబడి ప్రస్తుతము మనదేశమందమలునందున్న "డయార్కి" (Diarchy) లేక ద్వంద్వ ప్రభుత్వవిధానమునకు మూలాధారముగ నున్నది. దీని ప్రకారము రాష్ట్రప్రభుత్వముల అధికారమునందున్న శాఖలలో కొన్నిటిని ప్రజాప్రతినిధులగు మంత్రుల చేతులలోనికిని, తక్కినవాటిని కార్యనిర్వాహకవర్గసభ్యుల చేతులలోనికిని ఈయబడవలెననియు, మంత్రుల చేతులలోనున్న ప్రభుత్వశాఖ లన్నిటిసందర్భములోని మంత్రులు శాసనసభకే బాధ్యతవహించియుండవలెననియు ప్రధాన సూత్రములుగ అంగీకరింపబడవలెను. డ్యూక్ నివేదిక అప్పటికాలములో చాలప్రచారమును పొంది అప్పటి గవర్నరుజనరలగు చెల్మ్స్‌ఫర్డుప్రభువును ద్వంద్వ ప్రభుత్వవిధానమును ఆమోదించునట్లు ప్రేరేచినవాటిలో ప్రధానస్థానము నాక్రమించెను.

తరువాత మన మాలోచింపదగిన విధానము ౧౯౧౬ సెప్టెంబరులో సామ్రాజ్యశాసనసభలోని సభ్యులగు ౧౯ మంది తయారుచేసి ప్రచురించిన నివేదిక (Memorandam of the Nineteen). ఈ నివేదిక ప్రచురింపబడిన కొలదిదినములకే ౧౯౧౬ సం. డిసంబరులో జరిగిన లక్నో కాంగ్రెసు మహాసభవారును, అఖిలభారత ముస్లిములీగువారును కలసి ఒకసంస్కరణముల నివేదికను (Congress-League scheme) తయారుచేసిరి. దీనికిని ౧౯ శాసనసభ్యుల నివేదికకును చాలవిషయములందు పోలిక గలదు. అది వెంటనే హిందూదేశమందు రాజకీయ సంస్కరణములను ప్రవేశపెట్టుటకు గల యావశ్యకతను చూపుచు, రాష్ట్రీయశాసనసభలు "నూటికి" ప్రజలచే ఎన్నుకోబడిన సభ్యుల మెజారిటీ కలిగియుండవలె ననియు, బాధ్యతను వహింపగల శాసనసభ పూర్తియగు ప్రజాప్రతినిధిసభగ ఉండవలెననియు సూచించుటయే.

పైనసూచించిన విషయములలో ఈ సంస్కరణ విధానములు గోఖ్లేగారిచే తయారుచేయబడినదానికంటె ముందంజవేసియున్నవని చెప్పక తప్పదు. కాని గోఖ్లేగారి విధానమునందును, వీటియందును కూడ ఒక్క ముఖ్య లోపము కాన్పించుచున్నది. శాసనసభయొక్క తీర్మానములు ప్రభుత్వవర్గముపై "బైండింగు"గా నుండవలెననియు, అట్లు ప్రభుత్వవర్గమువారు శాసనసభతీర్మానములను ఆచరణయం దుంచలేకపోయినవారు తమ అధికారపదవులను వదలుకొనవలసినదనియు వాటియందు కోరబడియుండలేదు. అనగా ప్రభుత్వబాధ్యతసూత్రము వారామోదించలే దన్నమాట. ఇది యటుండగా అన్ని విధానములందునుకూడ "బాధ్యతలేని ప్రభుత్వవర్గము వారు" (Irremovable Executive) శాసనసభవారి తీర్మానములను గవర్నరు "వీటో" చేసినప్పటికిని ఒప్పు

కాని నాటి ప్రకారము చేయునట్లె నసూపలము పార్లమెంటరీ విధానమునకు వ్యతిరేకమగు సిద్ధాంతము నొప్పింపబడెను. శాసనసభ యొక్క సహాయమును, బలము పైనాధారపడియుండు ప్రభుత్వము పనిచేయవలసిన పద్ధతులకును, శాసనసభవారి సహాయముపై ఏవిధముగను ఆధారపడియుండక స్వతంత్రముగ వ్యవహరించు ప్రభుత్వమువారు పనిచేయవలసిన పద్ధతులకును చాల భేదముగలదని వేరుగ చెప్పనక్కరలేదు.

గవర్నరు జనరలును భారతప్రభుత్వమువారికి రాష్ట్రప్రభుత్వములను విడిచిన కట్టుబాట్లలో నుంచుటకును, భారతశాసనసభవారికి రాష్ట్రవిషయములలో శాసనములను చేయుటకును, తమయధికారము నిచ్చుటకు అవకాశముండునట్లు ఒప్పుకొనియుండెను. కాని కామన్వెల్త్‌స్కీమునందు పెట్టిన అధికారము నిచ్చుటకు దానిని తయారుచేసినవారు ఒప్పుకొనలేదు. రాష్ట్రములకు అధికారమునందు ఉంచబడిన అన్ని విషయములను గురించియు, శాసనములను తయారుచేయు అధికారము రాష్ట్రశాసనసభలకే యీయబడవలెనని వారు సూచించియుండిరి. మరియు కార్యనిర్వాహకవర్గము లోని సభ్యులలో కూడ సగముమంది శాసనసభ్యులలోని, ఎన్నికసభ్యులలోనివారుగా నుండవలెననికూడ వారు సూచించిరి. ఈసూచనకూడ మొట్టమొదటిసారి చదివి నప్పుడు సరియైనదేయని తోచినప్పటికిని నిజముగ లోప భూయిష్ఠమైనదని మనము గ్రహింపవలసియున్నది. బాధ్యతలేని ప్రభుత్వవర్గము పూర్తిగ ఎన్నుకొనబడి సర్వాధికారముగల శాసనసభయొక్కసంయోగమే చాల కష్టమైనదియు, పొందరానిదియు నని ఇదివరలోనే చెప్పి యుంటిమి. ఆప్రభుత్వవర్గములోనే రెండుపక్షము లేర్పాటుచేయబడిన ఇంక ఎంతబాగుగ పనిసాగునో ఆలోచింనుకొనవచ్చును. కాని ఈసూచన చేయుటలో కార్యనిర్వాహకవర్గములో కొంతమంది సభ్యులైనను పూర్తిగ అధికారవ్యామోహముగలవారుగాక ప్రజాభీష్ట ముల ననుసరించియు, తమస్వతంత్రాభిప్రాయముల ననుసరించియు ప్రభుత్వకార్యములను నిర్వహించుదు రనునదియే వారి ప్రధానోద్దేశ్య మైయున్నది.

---

## తొలినుడి

ఉభయభాషాప్రవీణ, శ్రీ. మార్కండేయ శర్మగారు

నాకమునదిగిచినట్టి యిగారా నాఁటి చరిత
మున్ని మహాశ్వాసముల గ్రంథ మెంతరక్తి;
నవరసమరందనిష్యందనముల బాలుచు
నేమహారాజు కైనను నెసఁగఁగలదొ?

ప్రతిరసోదయ భావనాస్పదపదముల
జరుగఁజాలఁ దొక్కించె రసజ్ఞమాళి
ముందునకు, సందనద్రుమామోదమునకుఁ
బికమువోలె, భృంగమువోలె, శుకమువోలె.

ఈ యముద్రితగ్రంథము నెవఁడు చదివి
యలరు రసరాజ్యపాలకుం డతఁడు; నెఱసు
లెన్ని నాదు వ్యామోహము నిజియఁజేయఁ
జరవ దిశ నుద్భవిలు సహస్కరుఁ డెవండొ?

---






శ్రీమతి డాక్టరు మొపలికంటి సుందరీబాయమ్మ గారు

ఈమె పూరీనగరమున స్త్రీలవైద్యశాలలో ప్రధాన వైద్యురాలుగ నియమింపబడెను. విశాఖపట్టణ మునిసిపలి వైద్యకళాశాలయందు వైద్యవిద్య నభ్యసించి ఆంధ్రవిశ్వవిద్యాలయమునందలి పట్టభద్ర యైనది. కరణకమ్మ వేపారి బ్రాహ్మణ కుటుంబమునకు జెందినది. గంజాముమండలమున పేరుగన్న కీ. శే. శ్రీ నాభి రామశాస్త్రి పంతులుగారి కూతునకు కూతురు. ఉత్తరాంధ్రమున నిట్టి యుద్యోగమును పొందిన మొదటి బ్రాహ్మణయువతి యీమె.

---

# మదరాసు గౌరవ స్త్రీ న్యాయాధిపతులు




శ్రీమతి యం. ఏ. లోబో సతిగారు




శ్రీమతి యస్. శివరాజ సతిగారు



శ్రీమతి యాకూబ్ హుసేను సతీగారు

# భల్లటశతకము

చిలకమర్తి లక్ష్మీనరసింహము గారు

[ వెనుకటి సంచిక తరువాయి ]

సన్మణీ! కాంతిగలదు, నీ సద్గుణములు-వెలయు భువి నెంచి చూడ నేవలితి లేదు,
ఎల్లకాలము భవిదొర్లు మీజగత్ప్ర-హాసనమున కీవె యితివృత్త మగుచునుండు.

మహిని జింతామణికిఁ దృణమణికి ధాత-సమముగా నిచ్చె 'మణి' యనుశబ్ద మకట!
అడిగినదియెల్ల నొకటిచ్చు నర్థులకును,-లజ్జపడ దింకొకటి తృణలవముఁ బూని.

సామాన్యశిలకు, శ్రేష్ఠమగుచింతామణికిరయఁ జాలరు భేద మల్పమతులు,
అభిమాని యొరుఁ జేరి యాచింపఁ, డల్పుఁడువేఁడు నల్పమునైన వినయవృత్తి,
నడుగువారికె కాని యర్థంబు లిడనిప్రతినపైకొన్న దివ్యమణి యకట!
జనుల యభిప్రాయ మనుగీటురాతిపై నెంతటినిపుణులు నుంత యేని
దుడిచివేయంగఁ జాలనిదుష్టరేఖ-గలదియై కళాహీనమై గానఁబడెడుఁ;
దత్త్వమెఱిఁగినవారికే తక్క,-నింక-నన్యులకు నారహస్య మెట్లరయనగును?

పరులనిమిత్తమై శ్రమలపా లగువాఁడు తనర్చు భంగముల్
తెలిసినయప్పుడేనియుఁ, దదీయవికారములున్ రుచించెడున్
జెఱకులు పాడుక్షేత్రమునఁ జెచ్చెర వృద్ధిని గాంచకుండినన్
జెఱకుదె దోసమా, చవిటినేలదిగాక యథార్థ మారయన్!

భూర్జవృక్షంబులకు ఫలంబు లిడకుంట-బ్రహ్మదౌర్జన్యమునె బయల్పఱచుచుండు;
వేయికత్తులతోఁ గోసి వెతల నిడిన-నొసఁగుఁ బేదల కది యింక వసనములను.

ఫలభారమున మహీస్థలమంటునటు వంగి మనసురంజించు క్రొమ్మావు లుండఁ,
జల్లనినీడల సౌరభంబుల నిచ్చి హాయిహా యనిపించు ననఁటు లుండఁ,
దావుల వెదఁజల్లు పూవుగుత్తులతోడ బాగైనసంపంగితీఁగ లుండ,
సౌఖ్యంబు నెదఁగోరి సంచార మొనరించు మూఢమానవ! నీకు బుద్ధిలేదె?
అడ్డులేకుండ సంచార మాచరించు-క్రూరకరభంబు లుండు నెడారులందుఁ
దిరుగ నేటికి? గాలియుఁ జొరనితావు - మరణమందుదు విందుఁ గ్రుమ్మరుదువేని.

ఓరి కుజన్మ, ధూళి! భువి నుద్భవమొందినదాదిగాఁగ నె
వ్వారికినైనఁ జేసితె లసింత యుపకారముఁ, జెప్పు సత్యముల్
సారెకుఁ బైకి నెవ్వనలసారథి లేపఁగ లేచి నీవు ని
ష్కారణముం గళంకితముగా నొనరింతువు విశ్వమంతయున్.

ఎండి నిరర్థకంబులయి యేమియు సారములేక తేలికై
ఖండములైన గడ్డిపఱకల్ తమయంతటఁ దన్నుఁ జేర, లో
నుండెడు సార మారయఁగనోపక వానిని జంచలస్వభా
వ్రాపగు గాలి గొప్పదగు వ్యోమపథంబును జేర్చెఁ జూచితే.

అనయము మర్దితంబయి జనాళిపదంబులక్రింద, నెప్డు ధా
త్రి నడఁగి పేరులేక కడుఁ దేలికయౌ నల ధూళిఁ, జంచలుం
డనిలుఁడు యంతరిక్షమున కల్లనఁ దోడ్కొనిపోయెఁ, జూడు ని
ల్చినదది తుంగశైలములశృంగతలంబుల నెంతచిత్రమో!

ఈనయోగ్యుఁడవైన మహేశ్వరుండు - కరుణపెంపున నిన్ను నూపురముఁ జేసె,
గంపసొమ్మైనరొదలట్లు ఘలుఘలుమను - శింజితంబుల నోఫణీ! చేయఁగలవె?

లసమానింపకుమయ్య, యామణుల శైలానీకభేదంబులౌ
భవదుత్త్రాగతరంగమాలలను దెబ్బల్ గొట్టి వార్ధీ! యెటుం
గవె? యిం దొక్కటినైన కౌస్తుభమణిం గాంక్షించి చేసాఁచి మా
ధవుఁడయ్యున్ బురుషోత్తముండును సురల్ దర్శింప యాచించుటల్.

ఘనమగు తోడల్, గుహలఁ గాపుర, మీవియు మేనితోలు, భో
జన మలగాలి, యిట్టి దొకచర్య; తదన్యము భీతి గొల్పెడుల్
గనులు విసంబుగక్కు, పడకల్ కుటిలంబులు, రెండు నాల్క, లే
మనఁగల మింక, నీదు బ్రతుకద్భుత, మేమిది మిత్రమా, ఫణీ!

మొగములు వేయి, భూరిబలముల్ విదితంబ, యతండొకండె మె
చ్చఁగఁదగు నాతఁ డాకద్రువసంతతిలో, నతఁడగ్గ లోకమే
మగునొకదా, జగత్త్రయమహాద్భుతచేష్టలు, శేషభోగి; న
ట్లగుట నతండు పాలికొనె నయ్యహివంశభవాప్రతిష్ఠలన్.

ఈయొక్కదినము శ్లాఘ్యం-బీయేఁటిదినంబులందు నెల్లను, వెనుకం
బోయిన దినములు రాఁగల-యామూఁదినము లిటు వేడ్క నరుగవుగానన్.

మెడకుఁ గృత్రిమసటలు నల్లడలఁ గూర్చి - పెట్టుఁడీ కుక్కను మృగేంద్రసమానుఁ జేసి;
బటుగజేంద్రకుంభస్థలపాటనంబుఁ - జేయఁగలదె? శ్వానంబు గర్జింపఁగలదె?

ఒరుచెవిచెంతఁ జేరి క్షణ మోయలుఁగా! కడుదూరవాసులౌ
పరులను గ్రూరహూంకరణిఁ బైఁబడి చంపుదు ప్రాణఘాతివై
నిరుపమపక్షయుక్తికిని నీగుణసంగతికిన్ ఫలప్రభా
పరిణతికిన్ విశుద్ధికిని బాగుగనున్నవె యిట్టివర్తనల్?

భువి నీచక్కని వస్తుజాత మఖిలంబున్ దృష్టికిం గోచరం
బవునేనిన్, క్షణకాలమైనను నమూల్యంబౌను, బెంజీఁకటుల్
గవియన్ విశ్వము, దృష్టి వ్యర్థమయిపోఁగా, నట్టివేళన్ సమం
బవు నేత్రం బితరేంద్రియంబులకుఁ గా దన్నన్న! హీనంబువౌ!

పులుఁగులఁ బిల్చినన్ మశకముల్ చనుదెంచు నవార్యవైఖరిన్
బొలుచును వార్ధిలోఁ దృణమణుల్ రతనంబులకాంతి దాల్చుచున్,
మెలఁగును జంద్రసూర్యుల సమీపమునందు మిణుంగుఱుల్, మహా
త్ములకడ విఱ్ఱవీఁగుదురు మూర్ఖులు సారము లోన లేకయే!

దుర్లభపదార్థములవెలల్ తూఁచి యరయు-స్వర్ణకారుఁడ! నీకు సంజవి యొసఁగఁ
దులనిడి సువర్ణమును నీవు తూఁచుపట్ల-రాతితో దాని సమముగాఁ జేతు వహహా!

అంధకూపమ! సద్వృత్త మాఘటంబు - నినుఁ బ్రసాదంబునొందింప నేర; దైనఁ
దన్ముఖమునుండి జలకణతతిని నీవు - గోరుచుంటి, వయ్యది చూడ గొప్పతప్పు.

కట్లజెట్టి! పాదశతంబు గల్గునీవు - దాఁటఁజాలవు గోష్పదస్థలమునైనఁ,
గాన నినుఁబట్టి ద్విపదముల్ గలుగు హనుమ-జలధి దాఁటలేదని చెప్పఁగలఁ డెవండు?

ప్రథితవంశపరిగ్రహపటిమ లేదు - లేదు సద్గుణసంగ్రహాణాదరంబు,
ఫలవిధానకథయు లేదు బాణమందు - నేటికిఁ గిరాతబాలకుచింట నునికి?

---

# శ్రీమతి ఎస్. పి. ఎస్. అయ్యరు సతీమణిగారు

బర్మాదేశములో సాంఘికవిషయములలో పాల్గొను స్త్రీలలో ఎస్. పి. యస్. అయ్యరు సతీమణిగారు అగ్రస్థానము వహించుచున్నారు. వీరు మద్రాసులో ౧౮౮౧ సం॥ జన్మించిరి, ౧౯౦౪ సం॥ రంగూనుచేరి అచట స్థిరనివాస మేర్పరచుకొని బాలికల విద్యాభివృద్ధికిని, స్త్రీలసాంఘిక ఆరోగ్యోద్యమములకును తోడ్పడ



శ్రీమతి ఎస్. పి. ఎస్. అయ్యరు సతీమణిగారు

దొడగిరి. వీరు తాము చేయసాగిన ప్రచారముచేతను, దయ యుక్తిసుగుణాదికములచేతను ఆప్రదేశములయందలి వివిధజాతి స్త్రీలను ప్రేమపాత్రమైరి.

వీరు శారదాసదనమను బాలికాపాఠశాలయొక్క కార్యనిర్వాహకసభలో కొన్ని వత్సరములు సభ్యురాలుగానుండిరి. అచట ఇండియన్ రెడ్ క్రాస్ సమాజము నందును కొంతకాలము సభ్యులుగానుండిరి. జాతీయసంఘ మండలి ప్రచారక-ఉపసభ కార్యము కొంతకాలము నిర్వహించిరి.

ఇన్ని పనులున్నను వీరు సమర్థించుకొని హిందూ స్త్రీలసంఘ మొకదానిని స్థాపింపగల్గిరి. దానికి వీరే గౌరవకార్యదర్శిగా నెన్నుకొనబడిరి. ఈసంఘమునకు స్త్రీలను సభ్యురాండ్రనుగా జేర్చుటకు చాలవరకు వృద్ధికి దెచ్చినారు. ఈసంఘము ప్రస్తుతము చక్కగా నేర్పరుపబడినదై సభ్యురాండ్రవృద్ధికి అన్నివిధముల పాటుపడుచు భరతఖండమందలి వివిధజాతి స్త్రీలలో పరస్పరానురాగమును కలిగించుచున్నది. ఇప్పటికిని ఈ సంఘము అయ్యరుగారి సతీమణిగారి ప్రాపుననే జరుగుచున్నది. వీరు రంగూనులో వైఎంపవనాటక సంఘమునకు ఉపాధ్యక్షులుగా నెన్నుకొనబడియున్నారు.

౧౯౨౮ సం. కలకత్తాలో జరిగిన అఖిలభారత మహిళామండలికి వీరిని ఒకసభ్యురాలినిగా నెన్నుకొనిరి. ఆసభలో వీరు స్త్రీలు ఘోషాను వదలవలయుననియు, వివాహములలో వరదక్షిణల కాలింపరాదనియు నుపన్యసించిరి.

పెగూలో ౧౯౩౦ సం. కలిగిన భూకంప సమయమున బీదలకు వస్త్రదానములుచేసి రక్షించినారు.

ఈవిధముగా వీరు బర్మాస్త్రీలలో ఉత్సాహ కారణ మగుచు అందరిచేతను అభిమానింపబడుచున్నారు.

# ఆకాంక్ష

విశ్వనాథ సత్యనారాయణ గారు, యం. ఏ.

నాశరీరము త్రాసుచందాన, నష్ట
లాభములు, పుణ్యపాపముల్, మంచిచెడుగు
లెడమకుడికన్ను లదరి నాయెడద దిగులు
పడి సముత్సాహపడి తూచిపంచిపెట్టు.

నాయెఱుంగక నావెంట నడచివచ్చు
దైవమతని యనుద్దిష్టమై వెలసిన
యేయసత్పథమందు నే నేగుచుంటి
నటఁ బ్రతారించు నన్ను సహస్రవిధుల.

ఇది విచిత్రము నాకు నాకే మహా వి
చిత్రమైనది నన్నుఁ జూచెడు జనాళి
కొకరు నన్న సమర్థుడం చొలసి నవ్వ
నొకరు నే దివ్యప్రకృతినం చూహసేయ.

దేహమున భౌమచిహ్నము లూహలోన
దివ్యచిహ్నమ్ము లుండు నెందేని జనుల
కస్మదీయమనస్సు మహాకలుషిత
మతిపవిత్రమ్ము నస్మదీయమ్ము తనువు.

నాయడుగు పెట్టఁబడినట్టి యేయెడైన
వికృతమై నాయదృష్ట మావిర్భవించె
అన లడుగె పెట్టవలదని యనుకొనినను
ఈవృథాశాబల మ్మిట్లు దేవురించు.

కడగి యేకార్యముననైనఁ గాలుపెట్ట
చూడఁగనె యెట్టయెదురుగఁ జుక్కపొడుపు
కాదు కూడదు గా మొండిగాఁ గడఁగిన
'సీ'కృతుల, నవ్వటాల 'మోచేతిపులుసు.'

ఆశయనునది నూఱుపాళ్లందులోన
పరకొ పాతికొ యనుభూతి పడయు జగము
నావిచిత్రానుభవ మస్తినాస్తివాద
లక్ష్యభూతమ్ము నత మకూలంకషమ్ము.

నాకు దివ్యశక్తు లొసంగి నాఁడు తాను
నన్ననుభవించనీయఁడే నామనస్సు
లోన లేని లోభము మేనిలోనఁ దెచ్చి
మంచికా! చెడ్డకా! సమూహించలేను.

అనుభవించుటయన్న నాయందు నచ్చె
మైన దకలంకమైనది యమ్మాత్రమైన
దాత్మతోడిది బహుముఖమైన దల్లి
దాని కిచ్చోట లక్ష్యభూతమ్ము లేద.

వికలమై పోవుఁ బాంచభౌతికము తనువు
దుఃఖసుఖము లొత్తిడి గాఢ ఘాసనముఁ
ఒక విశిష్టమ్మమైన దీయొత్తిడులకు
నాగునది, దాని దీనమస్తానుభవము.

నాశరీరమ్ము దుఃఖధూనసవికంప
నోగ్రఝంఝలుఁ దాళుకో నోపుపు గలుగ
దానిఁ జేసి దుఃఖపరంపరానివళన
మాచరించి తా నింతలో నతుకు పెట్టు.

ఒకసుగుణ మిందులోన నేదో మహావి
పత్తు కొనితెచ్చిపెట్టును నెత్తిపైకి
అది మునరి ముంచివేయు నన్నంతలోనఁ
దీరముం జేర నేదియో దారి చూపు.

ఈవిలయంబుగూడ గమి
 యింపగఁ జేయున యేని సామి, యీ
త్రోవ ముముక్షువీథి బడి
 తోలినదాక సహాయకారి, లే
దా! విగతాసువై యపగ
 తాత్మపదంబయి వెఱ్ఱిమొఱ్ఱియై
నావెడమేను దీనితుది
 నాటికి నారకభాగియే యగున్.

---

ఒయాం ఇగాను దేవాలయ (పినాంగు) చిత్రములు



౭. పుష్పవాటికలు - బుద్ధ స్తవశిల



౮. ఆచార్యభవనము - త్రిపిటక గ్రంథాలయము



౭. కమర సరస్సు



౮. శుద్ధోదక సరస్సు

# సింగారగంప

## హిందూదేశ సమీపస్థులగు టిబెట్టు దేశస్థులు

### ఆచారవ్యవహారములు

[illegible] టిబెట్టునందు [illegible] [illegible] కలరు. వీరు [illegible] వారికి [illegible] [illegible] ఇచ్చటి స్త్రీలు [illegible] ఇది కాక [illegible] నిర్మితము [illegible] వీరికి [illegible] పాత్రములను [illegible] పాత్రములను [illegible] భుజింతురు. [illegible] కాని [illegible] శుభ్రముగా నుండును. వీరు [illegible] పచ్చిమాంసమునే తిందురు. [illegible] ఎంతమాత్రము [illegible] దానిని పచనముచేయ వలసివచ్చిన [illegible] తిందురు. పంచదారకుగా [illegible] (పటికబెల్లము), [illegible], గుగ్గిలము, మీగడ, [illegible] లడ్డులను ఉపయోగింతురు. [illegible] ఉపయోగింతురు. వీరు [illegible] చేసి [illegible] నాలుగుదినములు పనిచేసి యుందురు. అట్లుచేసినవారికి గుడి ఎక్కడకు [illegible] ఆతర్వాత దానినిఎల్ల వారును భుజింతురు. వీరు ముఖ్యముగా వెన్నను భోజనాదికములకును, మతముల లోను, ఇండ్లలోను దీపములు వెలిగించుకొనుటకును, గోడలపై చిత్రపుపనులు చేయుటకును ఉపయోగింతురు. ఇచ్చటి పాలివాండ్రు వెన్నతో ఉప్పునుచేర్చి యొకవిధమైన పానీయము చేసికొని త్రాగుదురు. పాలు మాత్రము తో [illegible] యని వీరి తలంపు. వేయించిన గోధుమపిండిని, రొట్టెలను ఉపయోగింతురు. యాక్ యొక్క ఆవు మాంసమును గరిటెగా నుపయోగింతురు. మద్యద్రవములను త్రాగుదురు. వీరు గుడిసెలలో నివసింతురు వానిస్థలము లను పశువులకు మేత దొరకు స్థలములకు మార్చుచు వానిని మేపుకొనుచు నుందురు. వారి దుస్తులలో వారికి కావలసిన ఆహారపదార్థములను, చుట్టలు మొదలగువానిని కొనిపోవుచుందురు. చలికి మొగమునందు పగుళ్లేర్పడుటచే వానికి వీరు బెల్లముచే నొకవిధమైన బంక తయారుచేసి పూసికొందురు. ఈకార్యముచే వారి మొగములు ఘోరతరములుగ నుండును. వేనవేలు గొఱ్ఱెలు, మేకలు మొదలైనవి పచ్చిక దొరకని ఈప్రదేశములో బండల మధ్యనుండు పచ్చికను తిని బ్రదుకుట ఆశ్చర్యము. వీరు తుర్కిస్థానపు పంచాంగమును వాడుచున్నారు. వీరికి నాలుగు సంవత్సరముల కొకసారి 'లీపియరు' వచ్చును. కాని యిది చైనీయుల దానికన్న నొక సంవత్సరము వెనుక జరుగుచున్నది. వీరు దినములను లెక్కించుట వింత; నెలదినములలో నేడవదినము రెండుసారులు వచ్చుట, పదియవ దినమువదలి పదునొకండవదానిని లెక్కించుట, శుభదినములను రెండుసారులు లెక్కించుట, అశుభదినములను మానివేయుట మొదలగు పద్ధతులు. వీరు దృఢకాయులు. స్త్రీలును, పురుషులును ఒకేవిధమువస్త్రములను ధరింతురు. అందు

పురుషులు గడ్డములు పెంచనందున వీరికిని, స్త్రీలకును భేదము సులువుగా తెలిసికొనుట క్రొత్తవారికి అసాధ్యము. వీరు కేశములను కత్తిరించుకొనక స్త్రీలవలె చైనీయపద్ధతిని జడవేసికొందురు. వీరిలో నొకస్త్రీకి పలువురు భర్తలుందురు. ఒకయింటి యన్నదమ్ములలో అన్న వివాహముచేసికొనిన కొన్నిదినములకు తమ్ములకు గూడ నాస్త్రీ భార్యయగును. ఇంటియజమానునికి భార్య మృతిజెంది, కోడలున్నచో అదికూడ వాని భార్యయగును. ఎవడేని పురుషుడు ఎదిగిన కొమార్తెలతోడి స్త్రీని (బిడ్డలతల్లిని) వివాహము చేసికొనినచో ఆకొమార్తెలును వాని భార్యలే యగుదురు. ఈపట్టున రోమన్ రోలండుగారు వ్రాసిన స్వామి వివేకానందులవారి జీవిత చరిత్రమునందలి యొక చిన్నియుదంతము స్మరణకు వచ్చుచున్నది. స్వాములవారు హిమాలయములో టిబెట్టు దేశస్థులజాతికి చెందిన ఆఱుగురు సోదరుల యింట నాతిథ్యమందుచుండిరి. ఒకస్త్రీయే వారికందరికిని భార్యగా నుండెను. స్వాములవారు వారికి అది దురాచారమని తెల్ప ప్రయత్నింపగా దానికి ఆసోదరులు 'ఏమి మీ స్వార్థపరత్వము - ఒకస్త్రీని సంపూర్ణముగా నొకరే కాజేయవలయుననీ!' అని ఉత్తర మొసంగిరట. ఇట్లు పర్వతము పాదప్రదేశమున నేది తప్పో, అది శిఖరమున నొప్పుగా గణింపబడుచున్నది.

## గృహములు

కట్టడములు ఈస్థలములో బొంతరాళ్లతోను, కలపతోను నిర్మింపబడుచున్నవి. కొంచెమెత్తైన సమప్రదేశమున వెదుళ్లతో, ఇటికరాళ్లతో చేర్చికట్టుదురు. వీనికి సున్నములేదు. ఇండ్లలో శిల్పపుపనులుకూడ చేయుచున్నారు. టిబెట్టుదేశస్థుడగు గొఱ్ఱెకాపరియిల్లు పదియడుగుల చదరము కలిగి నాలుగడుగులలోతు కలిగి, మట్టిచే అలుకబడియుండును. పైన కప్పు నీరు లోనికి దిగకుండునట్లు దట్టముగా యాక్ మృగముయొక్క రోమములచే కప్పబడియుండును. వీరు మట్టిపొయ్యిలో వంట చేసికొందురు. బుద్ధ విగ్రహమును పేరమందుంచి నిత్యము పూజలు సేయుదురు.

## వీరి నృత్యములు

ఈదేశస్థులు అన్నికర్మలకును లామాపద్ధతి నృత్యముగాని, పిశాచనృత్యముగాని ఆడుదురు. అట్టిసమయములలో పురుషులు మొగములకు మారువేషములు వేసికొని పెద్దయిజారులు ధరించివత్తురు. వారు నాట్యమున తిరుగుటలో ఆ యిజారులనిండుగ గాలి దూరి అవి బూరటించుకొని పెద్దదిగ గన్పడును. స్త్రీలు చుట్టును కుచ్చులను కట్టుకొని గొడుగులవలె నవి లేచుచుండగా గిరగిర తిరుగుచు నృత్యములు సేయుదురు. వీరి వాద్యవిశేషములు తప్పెటయు ఇత్తడిచేతాళములుజత. ఈప్రదర్శనమంతయు చూచుటకు భయంకరముగానుండును. టిబెట్టుదేశస్థులవలెనే యుండు భూటియావారుకూడ అపరకర్మలలో నీచమైన నృత్యము లాడుదురు. మరణించిన తృతీయదినము అందరునుచేరి కట్టెయలు ప్రోవుచేసి దానికి నిప్పంటించి దానిచుట్టును తాము ఎడమచేత గాలును కుడిచేత కత్తిని ధరించి నృత్యము సలుపుదురు. వీరికి బెల్లమును, బియ్యమును చేర్చి యొకనీచమైన సారాయి తయారుచేసి ఒకడు పోయుచుండిన వీరు త్రాగుచు ఒడలు తెలియక పడుదురు.

## భగవదారాధనావిధానము

వీరు గుహలలో బుద్ధుని బొమ్మచెక్కి బుద్ధమంత్రము చెక్కి ప్రతిష్ఠచేసియున్నారు. తమగ్రామమునకు పిశాచములవలని బాధ లేకుండుటకై వీరు సూదులరాళ్లను గ్రామమువెలుపల నుంచుచున్నారు. ఆశిలలు పిశాచములరాకకు అడ్డట. ఇందులకై వీరు పిశాచోచ్చాటనలను గూడ చేయుచుందురు. రోగములు జనులకు పిశాచములచే కలుగునని వీరి తలంపు. రోగములను మంత్రములు వేసియు, నచ్చట దొరకు మొక్కలచే మందులుచేసికొనియు నివారించుకొందురు.

కంచరగాడిదెలను తోలుకొని పోవువారు తమకు దారులలో అపాయములు రాకుండుటకై దేవునికి పర్వతశిఖరములపై కొన్ని బుద్ధమంత్రములు వ్రాసిన జెండాల నుంతురు. అవి ఎన్నిసారులు గాలిలో కదలిన

అన్నిసారులు తాము జపించిన ఫలము నందితిమని వీరు తలంతురు.

ఈప్రదేశములలో ఎరుపురంగు పూసిన రాళ్లను, చిన్నచిన్న మంత్రములు వ్రాసిన జెండాలను పరికింపవచ్చును. కొన్నిరాళ్లమీఁద బౌద్ధమంత్రములను వ్రాసియుంతురు. ఇచ్చట పువ్వులు దొరకని కారణముచేత వీరు దేవునికి చిన్న చిన్న రాళ్లను సమర్పింతురు. ఆనైఋతిపోవు ప్రతివాఁడును దేవునికి ఒకటిరెండు రాళ్లను సమర్పించిపోవును. 'ఓమ్ మని పద్మే హుమ్' అను మంత్రమును గోడలయందును, రాళ్లపైనను, గుళ్లయందును, మంత్రచక్రములయందును (Prayer-wheels), గాలిచే తిరుగు చక్రములపైనను, నీటియంత్రములపైనను వ్రాసి యంత్రములచేతనే దైవప్రార్థనలను జరుపుచుందురు. పలుమార్లు మంత్రమును జపించుటకంటె నాచక్రమును ఒకమాఱు కదిపిన నది పలుమారులు తిరుగునుకదా! సాయంకాలము కాఁగానే పనులను మానివేసి ఖాళీస్థలములలో చేరి భూమిపై సాష్టాంగములుపడి యంత్రములతో భగవత్ప్రార్థనలను చేయుదురు. వసంతకాలమునందు జరుగు వీరి పండుగలకు వీరి లామాసన్న్యాసులు పట్టుబట్టలతో నతిభయంకరములగు వేషములు వేసికొని వత్తురు.

---

## అయర్ ఇటామ్ దేవాలయము, పినాంగు

(సచిత్రము)

(Aier Itam Temple)

సుమారు క్రీ. శ. ౧౽౦౦ కు పూర్వము ఈబౌద్ధ దేవాలయము నిర్మింపబడినది. ఈయాలయమునిర్మాణము పట్టణమునకు సుమారు నాలుగుమైళ్లదూరమున, సుమారు వేయి యడుగుల యెత్తుగల కొండపయిన. ఈకొండ యడుగువరకు పట్టణమునుండి రమణీయములగు పువ్వుతోటలు, నారికేళవనములగుండా ట్రాములు పోవును. క్రీ. శ. ౧౮౮౽-వ సంవత్సరమునాటికి దేవాలయమునకంత వ్యాప్తి యుండినదిలేదు. క్రమముగా పినాంగులో జనసంఖ్య హెచ్చిన కొలది యీ యాలయముకూడ వ్యాప్తి గాంచజొచ్చినది. నేఁడిది వివిధజాతులవారికి ముఖ్యతీర్థముగ పరిణమించినది. ప్రకృతము కానవచ్చు నీయాలయము సుమారు ఇరువది సంవత్సరములకు పూర్వము కొందరు లక్ష్మీపుత్రులు చైనాదేశీయులు కట్టినది. ఈనూతనాలయము ప్రాతదానికి ౩౦౦ అడుగుల ఎత్తున నున్నది. రెంటికిని చేరికగా మనోహరములగు పూలతోటలు, కొలనులు, యాత్రికసౌకర్యమునకయిన గ్రంథాలయములు, విశ్రాంతిభవనములును నెలకొల్పబడియున్నవి. ఈ నూతనాలయమున కేడంతస్తులు. చిట్టచివరి (౨-వ చిత్రములో బాణరేఖగలది) దాని నెక్కి చూచిన పినాంగు అంతయు గానగును. ఆలయప్రాంతముల పెద్దపెద్ద రాళ్లపై చైనాలిపితో బుద్ధస్తోత్రము చెక్కబడియున్నది (౪-వ చిత్రము). ఆలయమందలి తలుపులు, అలమారలు మొదలగువాని శిల్పము మిక్కిలి సుందరము.

ఈయాలయమున నొక విశేషముగలదు. ఏదేని కార్యము నర్థించి, యందువిషయమై జయాపజయములను తెలియగోరువారు ఇందలి బుద్ధవిగ్రహమునెదుట పాచికలను వైతురు. దారవములయిన యాపాచికలు కలాచంద్రాకారములై అయిదంగుళముల పొడవును, ఒకటియునర అంగుళము వెడలుపును గలిగియుండును. ఈ పాచికల పాటునుబట్టి వారు తమకార్యముల సిద్ధ్యసిద్ధులను గుర్తింతురు. ఈసంచికయందు దేవాలయమునకు సంబంధించిన చిత్రములుగలవు. వాని వివరణము:—

౧. అయర్ ఇటామ్ దేవాలయ దృశ్యము (కొండ అడుగునుండి)

౨. ఆలయపు మరియొకదృశ్యము (సమీపమునుండి)

ఇందు కొండ అడుగునుండి ఆలయపు పైభాగమువరకు గల సోపానమార్గము చూడనగును. ఆలయపు ప్రతి అంతస్తు చలువరాయి, దారువు, వెండి, బంగారు మొదలయినవానిచే నిర్మితములయిన బుద్ధప్రతిమలతో నిండియున్నది. అందు పెద్దది మొదటి యంతస్తునగలదు.

౩. శుద్ధోదకసరస్సు

ఇది కమలసరస్సునకుపైన, పుష్పవాటికకు దిగువను కలదు.

౪. బుద్ధస్తవశిల

ఇందు చైనాలిపితో బుద్ధస్తవము చెక్కబడి యున్నది.

౫. మహావిగ్రహము

ఇది ప్రధానాలయమున గలదు. దీనికివెనుక సోపాన మార్గము గలదు.

౬. మహావిగ్రహపాలకులు

౭. కమరసరస్సు

దీని వ్యాసము ఇరువదియైదు అడుగులు. ఇందు లెక్కకుమించిన తాబేళ్లు పెంపబడుచున్నవి. ఈ సరస్సు ప్రధానాలయమునకు వెనుక నున్నది. దీనికి శుద్ధోదకసరోవరమునుండి నీరు పారును.

౮. ఆచార్యభవనములు, త్రిపిటక గ్రంథాలయము, పూర్వాచార్యాలయము, ఆలయోద్ధారకులయు ప్రతిమలు.

---

## ఆశీర్వాదములు

అధికార్ల సూర్యనారాయణరావు గారు, బి. ఏ., బి. యల్.

కష్టముల కోర్చి సఖ్యంబు కాంతుఁ సేయు
భ్రమరములకు దివ్యామృతరసము లిచ్చి
చిన్నిచిన్ని స్వర్గంబుల వన్నెతోడ
పర్వమొనరించు పూల నాశీర్వదింతు !

భావి గూర్చి విచారించు బాధలేక
నెమ్మదిగ నాట సాగించు బొమ్మ లేమొ,
తన కులుకులేమొ, తానేమొ, తల్లియేమొ,
చింతలే లేని బాలు నాశీర్వదింతు!

కన్నులం వసంతరాగ భాగ్యములు గనుచు
చివురుటాకుఁ మేయుచు జెలువు గూడి
వంపుపాటలు గాలిలో వెలుపుచుండు
చిరుతకోయిలకన్నె నాశీర్వదింతు !

కష్టతాపం బెరుంగని కన్నులందు
వలపువెన్నెల గాయంగ ప్రాణనాథు
మోమునీమనె దినమెల్ల ప్రొద్దుపుచ్చు
చిన్నిజానకి ! నిన్నె యాశీర్వదింతు !

---



# విమర్శనము



## అహింస

గ్రంథకర్త:—జాలా రంగస్వామిగారు, డెమ్మీ సైజు, మెరుగుకాగితాలు, ౩౦ పుటలు, కాగితపుబైండు, వెల ౦-౪-౦.

ఇదొక చిన్న కవనపుస్తకం. ఈ పుస్తకంలో రెండుభాగాలున్నాయి. మొదటి భాగమంతా పాటలు, రెండోభాగమంతా గీతపద్యాలు.

అహింసను బోధించడంలో గ్రంథకర్త వొక క్రొత్తపద్ధతి అవలంబించేరు. ఆయాజీవులచేతే ఆయా జీవులు పడేకష్టాలు చెప్పించేరు. ఈపాటలు చదివిన యెవరైనాసరే మనలాంటి జీవమేగల యీ జీవుల్ని యేమాత్రం బాధపెట్టకూడదంటారు. మనస్సులో యింకా కనికరం కలిగి అలాగ బాధించే ప్రజలు మనుష్యులు కారని చెప్తారు. జనులు సామాన్యంగా తమ ఆహారంకోసమే చంపేజీవులచేత వాటిబాధలు చెప్పించబడ్డాయి, పశువులు, మేకలు, గొర్రెలు మొదలైనజీవులు.

ఈపాటల్లో భావాలు చాలాలోతుగా వున్నాయి. కవియొక్క అసామాన్య ప్రజ్ఞ గ్రంథమంతటా కనబడుతూంది. ఈ పుస్తకంలోని రెండోభాగంలోవున్న గీతపద్యాలుకూడా అహింసనే బోధిస్తున్నాయి. గ్రంథకర్తయొక్క కవనశైలి చాలా సరళంగా ఉండి, కిగి కలిగి వుంది. గ్రంథంలో అక్కడక్కడ చిన్నచిన్న తప్పులు కనబడుతున్నాయి. అచ్చుతప్పులని అనుకుంటాను. ఈ గ్రంథాన్ని చదివి గ్రంథకర్తచేసిన బోధను గ్రహించి, అహింసయొక్క వుత్కృష్టతను తెలుసుకుని ప్రజలు ఫాలిస్తారుగాక.

ఈగ్రంథం కావలసినవారు:—గ్రంథకర్త పేర, కంబాల చెరువు, రాజమండ్రీ అని వ్రాయాలి.

శే. కా.

---

## శివతత్త్వరత్నాకరము

గీర్వాణభాషలో వెలయు నొక యపూర్వవిజ్ఞాన కోశమిది. విజ్ఞానకోశము లిప్పటికే యీభాషయందు కొన్ని కలవు. కాని యవియన్నియు పరిమితవిషయములనే బోధింపగలిగినవై యున్నవి. సకలవిషయములు గల కోశ మొకటియు నిప్పటికి లేదనియే యనవలసియున్నది. నేటికి శివతత్త్వరత్నాకర మబ్బినది. ఇది సకలతంత్రముల సారము. అనేకగ్రంథముల—అందు నేటికి కొన్ని ప్రకటితములు, కొన్ని అప్రకటితములు, కొన్ని అసలు వినష్టములు — నుండి యనేకవిషయములిందు సంగ్రహింపబడినవి. ఇట్టి విజ్ఞానకోశమువలన పండితులకును, భాషాపరిశోధకులకును, విద్యార్థులకును, వీరికి వారి కననేల వాఙ్మయాభిమానుల కెల్లరకును ఎంతేని ప్రయోజనము గలదు. చీటికిమాటికి ఆపుస్తకము ఈపుస్తకము వెదుక నక్కరలేకుండ ఇదియే వారికి సకలార్థముల నిచ్చుచుండును.

ఏతత్సంగ్రహీత కెళది బసవరాజు. ఇతనికి హిరియ బసవరాజనియు పేరు గలదు. ఈ కెళదిరాజులు కన్నడ రాష్ట్రములో చాలభాగమును సుమారు ౨౫౦ సంవత్సరములు చక్కగ పాలించి పేరువడసినవారు. వీరు వీరశైవులు. ఈవంశమువారు నేటికిని కర్ణాటదేశమున గలరు. ఈరాజవంశమునకు మూలపురుషుడు కెళది బసవప్ప. అతనికి పదునాలవవాడు మన బసవరాజు. ఇతడు

క్రీ. శ. ౧౬౯౭ మొదలు ౧౭౧౪ వరకు పనిచేసినవత్సరములు రాజ్యము చేసెను. బసవరాజు గొప్పపండితుడు; శివాద్వైత వ్యాఖ్యాతారుడు. ఈయన తండ్రి సోమశేఖరనాయకుడు, తల్లి చెన్నమాంబ; గురువు చెన్నవీరుడు. ఈ పండితుడు లోకోపకారమునకై సకలతంత్రసారభూతమగు నీగ్రంథమును రచించెను. ఇది బహుశః క్రీ. శ. ౧౭౦౯ ప్రాంతమున రచింపబడినదని యూహింపవచ్చును.

గ్రంథరచనయందు బసవరాజు గైకొన్నమార్గ మత్యద్భుతము. ఒకవంక వివిధవిషయవిజ్ఞానమును తెలుపవలయునని, మఱియొకవంక తమ పూర్వుల యప దానముల తెలుపవలయునని యతని తలంపు. తమ పూర్వులచరిత్రనే ప్రధానముగ గొని వ్రాయుచో నాస్తికులు తన గ్రంథము వంకకు బోరేమో అని సందేహము. కావున తనపూర్వులచరిత్రను సందర్భో చితముగ నారంభించి యెంతో విచిత్రముగ సాగించుచు వచ్చినాడు. ప్రతిపిపాదయిషితార్థములకును తనపూర్వుల చరిత్రకును సంబంధము గూర్చినాడు.

ఈ గ్రంథరాజమునకు రావుబహదుర్, హెచ్. కృష్ణశాస్త్రిగారి మున్నుడియు, మానవల్లి రామకృష్ణ కవిగారి కృతివిమర్శయు గ్రంథారంభమున కలవు. ఇవిరెండును ఏతద్గ్రంథముయొక్కయు, సంగృహీత బసవరాజుయొక్కయు పరిచయమున పాఠకులకు మిక్కిలి తోడుపడగలవు.

ఈగ్రంథమున మొత్తము ౯ కల్లోలములు. ఒక్కొక్క కల్లోలమున కొన్నితరంగములు, మొత్తము ౧౦౮ తరంగములు. ప్రతికల్లోలాంతమున సంగృహీత ఆకల్లోలమందు ప్రతిపాదితములైన విషయములకయి తాను పరికించిన గ్రంథములనామముల జేర్కొని యున్నాడు. ఆపట్టికలను జూచినచో నితని యద్భుత పరిశీలనాశక్తి గోచరమగును.

ఇందలి విషయవిభాగము సంగ్రహముగ నిట్లు—

మొదటి కల్లోలము:—

౧. వేదాగమాంతర్గతసకలవిద్యలు, ౨. తత్స్వరూపము, ౩. అనాదిభక్తనిరంజనజంగమస్వరూప సృష్టిక్రమము, ౪. శూన్యలింగమహాలింగాది సృష్టి క్రమము, ౫. ప్రణవలింగస్వరూపతదుత్పన్నవర్ణకలా స్వరూపములు, ౬. నాదతత్త్వత్రయ ద్విపంచాశన్మూర్తి భేదములు, ౭. విరాట్పురుషాది మూర్తిత్రయస్వరూప తత్త్వప్రభేదపంచీకరణవిభాగములు.

రెండవ కల్లోలము:—

౧. బ్రహ్మాండోత్పత్తి, తదంతర్వర్తి లోకములు, తత్ప్రమాణము, నవవిధసర్గలు, ౩౨ నరకములు, ౨. వివిధనరకస్వరూపము (నరకయాతనలు), (౩) దుష్కర్మజన్మరోగములు, తద్ధేతుపాపములు, ౪. సప్తపాతాళ లోకములు, తద్వాస్తవ్యులు, (౫) సప్తద్వీపములు, దేవభూమి, లోకాలోకము, సప్తసముద్రములు, మేరువు, ౬. తత్కేసరాచలవర్ణనము, ౭. జంబూద్వీపమందలి నవ ఖండములు, (౮) తక్కిన ఆరు ద్వీపములు.

మూడవ కల్లోలము:—

౧. మేఘాశ్రయ గ్రహలోకములు — భువర్లోకము, స్వర్లోకము, మహాలోకము, జనలోకము, తపోలోకము, సత్యలోకము, ౨. మేఘగర్భోత్పత్తి ప్రసవములు, విద్యుత్ఫలితములు, నవమహామేఘములు, ౩. గుహ్యకగంధర్వ విద్యాధరాప్సరోలోకములు, సూర్యరథ గతి, ౪. సూర్యగతి జనితకాలభేదము, గ్రహగతి, రాశిచక్రభ్రమణము, ధ్రువలోకము, ౫. భువర్లోక సువర్లోక మహాలోక జనలోకములు, ౬. తపోలోక సత్యలోక వైకుంఠములు, ౭. స్కందపదము, ఉమాపదము, శివపదము (శివలోకములు).

నాలుగవ కల్లోలము:—

౧. భరతవర్షము కన్యాద్వీప సామాన్యనదీ దేశాదులు, ౨. కన్యాద్వీప ప్రసిద్ధశైల తీర్థక్షేత్రములు; ౩. యుగకల్పవ్యవస్థ, శకాధిపతిషోడశ మహారాజాదివర్ణనము, ౪. చాతుర్వర్ణ్యధర్మములు, బ్రహ్మచారిధర్మములు,

౫. గృహస్థాశ్రమము, వివిధవివాహములు, వానప్రస్థాశ్రమము, సన్యాసాశ్రమము, సన్యాసిభేదములు, యజ్ఞసూత్రబ్రహ్మసూత్రములు, ౬. వర్ణాశ్రమ సాధారణ ధర్మములు, అత్యాశ్రమస్వరూపము, పంచాక్షరీ భస్మధారణాదులు, ౭. వివిధపాతకములు, తత్ప్రాయశ్చిత్తములు, ౮. చంద్రవంశరాజులు, వర్ణసంకరము, బసవేశ్వరావతారాదికము, ౯. బసవేశ్వర వృత్తాంతనిరూపణము, ౧౦. కలిధర్మవర్ణనము,౧౧. వివిధోత్పాతములు, ౧౨. విద్యానగరనిర్మాణము, సింహాసనము, అందు సింహాసనము నధిష్ఠించినరాజులు, తత్పరిపాలనకాలము.

అయిదవ కల్లోలము:—

౧. కుటజాద్రివనవసాదేశములనడుమ మల్ల దేశము కుటజాద్రివర్ణనము, వయస్తంభన కాలవంచన మృతజీవన పాదుకాగతి అదృశ్యకరణ పరకాయప్రవేశాది నిరూపణము, ౨. మల్లదేశమున కెళది గ్రామము, అందు కెళది వంశ మూలపురుషుడు బసవప్ప, అతనికొడుకు చౌడప్ప నాయకుడు, చౌడప్ప నాయకునకు రామేశ్వరానుగ్రహము, ౩. శుభాశుభస్వప్నములు, తత్ఫలములు, ౪. నిధిచిహ్నములు, అంజనకరణము, చౌడప్పకు నాయకబిరుదరాజ్యప్రాప్తి, సామాన్యరాజనీతి, సదాశివసింహాసనారోహణము, ౫. సదాశివనృపచరితము, మాయోపాయములు, దొడ్డసంకణ్ణకు రాజ్యప్రాప్తి, ౬. రాజగుణములు, కరాదానము, దుర్గలక్షణములు, బలములు, ౭. శక్తిత్రయము, దొడ్డసంకణ్ణనాయకచరిత్ర, దొడ్డసంకణ్ణరామేశ్వరప్రతిష్ఠాపనము, ౮. శకునములు, వానిఫలములు, ౯. సంకణ్ణతీర్థయాత్రాక్రమము, ఢిల్లీలో అంకుశ ఖానునితో యుద్ధరణము, యుద్ధములు చేయు విధానము, తత్ప్రసాదనోపాయములు, మాహూరిదేశమందలి పటపల్లియందు వీరభద్రవిగ్రహప్రాప్తి, తత్ప్రతిష్ఠ, ౧౦. దేవప్రతిష్ఠాకాలగృహనిర్మాణాది నిరూపణము, చిక్కసంకణ్ణ పట్టాభిషేకము, ౧౧. పట్టాభిషేకవిధి, సంధివిగ్రహయానాసనములు, ౧౨. ఆసనద్వైధీభావసమాశ్రయములు, సామాది చతురుపాయములు, ౧౩. స్వరముహూర్తభూమివర్గ యోగినీ బలములు, ౧౪. యుద్ధయాత్రావిధానము, వ్యూహరచనాక్రమము, ౧౫. చిక్కసంకణ్ణపాలనావిధానము, రాజ్యసప్తాంగ సచివసేనానీ పురోహిత వైద్య గణకనూపి సభాస్తారాంగరక్షక భిషగ్దూతాదిలక్షణములు, వెంకటప్పనాయకుని సింహాసనారోహణము.

ఆరవకల్లోలము:—

౧. వెంకటప్పనాయకుడు ఇక్కేరియందు పురభవననాటకశాలలను, సంగళగ్రామమున నొకతటాకమును కట్టుట, పురభవననిర్మాణవిధానము, ౨. నాటకశాలానిర్మాణక్రమము, వర్ణసంయోజన చిత్రలేఖన ప్రతిమాలక్షణములు, ౩. నాట్యక్రమము, ౪. శిరోభేద దృష్టిభేదాదికము, ౫. వివిధహస్తాభినయములు, ౬. వక్షఃప్రభృత్యంగాభినయములు, స్థానకచారీమండలభేదములు, ౭. నాదశ్రుతిస్వరమూర్ఛనాతానవర్ణకాలంకారగమక నిరూపణము, ౮. జాతిరాగరాగాంగ భాషాభాషాంగ విభాషాంతరభాషోపాంగ క్రియాంగ నిరూపణము, గాయకలక్షణము, ౯. తాలప్రస్తారాది వివిధవాద్యాదిస్వరూపము, ౧౦. ఉపవననిర్మాణము, జలభూమిపరీక్ష, ౧౧. తరుచికిత్సాపోషణ విచిత్రీకరణదోహదవర్ణన, ౧౨. కామశాస్త్రము—జాతి, స్వభావ, గుణ, దేశ, ధర్మ, చేష్టాది వర్ణనము, ౧౩. బాహ్యారతములు, కరణభేదములు, యౌవనస్థిరీకరణము మొదలయినవి, వేంకటప్పనాయక చారిత్రవర్ణనము, ౧౪. రాజోపభోగములు, గృహస్నాన పాదుకాలేపనోపభోగములు, ౧౫. వివిధాంగరాగములు, (గంధయుక్తి), ౧౬. వస్త్రమాల్యభూషణోపభోగములు, ౧౭. రత్నాదిస్వరూపము, ౧౮,౧౯. పాకశాస్త్రము, ౨౦. భోజనక్రమము, తాంబూలభోగము, శయ్యాక్రమము, ౨౧. వైద్యశాస్త్రము—నిదానచికిత్స, ౨౨. ద్రవ్యగుణమహారసాదికము, ౨౩. రసోత్పత్త్యాదికము, ౨౪. రససంస్కారాది నిరూపణము, ౨౫. రసశాలాయంత్రాది నిరూపణము, ౨౬. విషనిరూపణము, సర్పాది భూతాంతవర్ణనము ౨౭. విషచికిత్స—మంత్రచికిత్స, ద్రవ్యవైద్యము, వీరభద్రనాయక చరిత్రము, శివప్పనాయకుని సింహాసనాధిష్ఠానము.

ఏడవకల్లోలము:—

౧. సింహాసనలక్షణము, సభామందిరము, అందు సభ్యులు మెలగవలసిన విధము, అధికారులు, అంతఃపుర

స్త్రీలు, ౨. కుప్రస్త్రీల నిర్మాణప్రదర్శనము, ౩. కావ్య లక్షణ, శిక్షణములు, శ్రుతి శిల్పములు, ధ్వనిభావ ములు, రసములు, ౪. నాయకనాయికాల లక్షణములు, నవరస్ఫూర్తిపాకములు, కావ్యగోచరములు. ౫. అలంకార ములు, ౬. నాటకేతిహాసవ్యాఖ్యానము, శివప్పనాయకునకు పుత్రజననము, ౭. పుంసవనాది వివాహాంతక్రియలు, ౮. కామశాస్త్రము. ౯, ౧౦. స్త్రీసాముద్రిక పురుష సాముద్రికములు, ౧౧. గజలక్షణము, ౧౨. అశ్వ శాస్త్రము, అశ్వోత్పత్తి చేష్టానిరూపణము, ౧౩. విని వేశ స్థానము ... తన్నివేశము, ౧౪. శివప్పనాయకుని బేలూరుకోట స్వాక్రమణము, కోటాపుత్రప్రదానము, వెంకటప్పనాయకునకు యోగ వివాహోత్సవము, ౧౫. యోగవిహాస్యములు.

ఎనిమిదవ కల్లోలము:—

౧. వెంకటప్పనాయకుని పరిపాలన, భద్రప్ప నాయకుని పట్టాభిషేకము, వ్యవహారివిషయములు, ౨. భద్రప్పనాయకుని పరిపాలన, సోమశేఖరునకు ధనుర్వి ద్యోపదేశము, ధనుశ్చక్రగదాకుంతలక్షణ తత్సాధన క్రమము, ౩. మల్లయుద్ధము, ౪. కుక్కుటలావక యుద్ధనాగ కుకకలక్షణము, ౫. సోమశేఖరునిపరిపాలన, సోమశేఖర చెన్నమాంబా వివాహము, చెన్నమాంబకు సోమశేఖరుని యుపదేశము, విభూతిచేయు విధానము, ౬. రుద్రాక్షధారణ జపవిధివర్ణనము, ౭. శివపూజ, దాని మహిమ, ౮. చెన్నమాంబా రాజ్యపాలనము, మహే శ్వరమహిమ తద్దానఫలాతిశయవర్ణనము.

తొమ్మిదవ కల్లోలము:—

౧. పిండాండక్రమము, ౨. సంసారనిరసనము, ౩. శైవతత్త్వప్రతిపాదనము, ౪. శాస్త్రవిభాగమీమాం సావైశేషికన్యాయమత నిరూపణము, సాంఖ్యయోగ వేదాంతమతనిరూపణము, ౬. అవైదిక — జైన బౌద్ధ చార్వాక-మతములు, తత్తన్మతప్రాపృస్థానవర్ణనము, ౭. దీక్షాభేదగురుశిష్యబుత్విక్కాలదేశాది నిరూపణము, ౮. దీక్షావిధానమంటపలక్షణ లింగపూజావిధానాదికము, ౯. షట్స్థలజ్ఞాన నిరూపణము.

అనన్యలభ్యము, పరమోపకారకమునయిన యీ విజ్ఞానసర్వస్వమును ముద్రించివేసిన సంపాదకులు ప్రశంసాపాత్రులు. ఇట్టిగ్రంథములవాఙ్మయాభ్యుదయ మునకు నిదర్శనములు. దేశీయాన్యదేశీయ భాషలందు వలెనే సంస్కృతమునను ఇట్టి విజ్ఞానసర్వస్వములు వెలసి ప్రచారమును గాంచవలసియున్నది. అందులకు పండి తుల చేయూత పరమావశ్యకము.

గ్రాహకసౌలభ్యమునకై దీనివెలను మార్చి నెలకడపటి వరకును తగ్గించినారు. అసలువెల ఇరువదిమూడురూపాయలు. తగ్గించినవెల - తొంబదెంబది పదునాలుగురూపాయలు, క్యాలికోబైండు పదిమూడు రూపాయలు. ఇట్టి యవకాశమును గోలుపోక వాఙ్మయాభిమానులెల్లరు దీనిని కొని యింపగు యర్థములను చూరగొందురుగాక! గ్రంథా లయములును ఇట్టియవకాశమును గోలుపోజనదు.

పుస్తకములను వలయువారు మొత్తము వెలను గాని, ఒకరూపాయ అడ్వాన్సుగాని పంపి గ్రంథములను బడయవచ్చును. మొత్తము వెలను ముందుగ పంపినచో పుస్తకములు రిజిస్టరుద్వారా పంపబడును. కొలది ప్రతులుమాత్రమే మిగిలియున్నవి.

ప్రాప్తిస్థానము—బి. యమ్. నాథ్ అండు కో., భాస్కరవిలాస్, వేపేరి, మదరాసు.

'ఆచార్య.'

---

## ఉత్తర రామచరితము

అనువాదకులు:—జయంతిరామయ్య పంతులు గారు, బి ఏ., బి. యల్., ముక్తీశ్వరము; తొత్తరమూడి పోస్టు, తూర్పుగోదావరి.

ఉత్తరరామచరిత మిప్పటికి పలువురచే అనువ దింపబడినది. దీనియందు తమకుగల యభిరుచి కారణ ముగా జయంతి రామయ్యపంతులుగారు మరల దీనిని తెలిగించిరి. పంతులుగారు తెలుగు నాటికి క్రొత్త వారుకారు. అనువాదమునను వీరు 'మాటకు మాట తెలుగు' పద్ధతిని గాక స్వేచ్ఛానువాదము కావించినట్లు వీరి యుపోద్ఘాతమువలన తెలియుచున్నది. 'మూలములోని భావములకును,రసములకును భంగము కలుగకుండ నాంధ్ర

భాషా సంప్రదాయముల బాటింప' వలయునని వీరి యత్నము. ఈయత్నము కడుంగడు మంచిది. ఒక్కొక్క భాషకును వేర్వేరు సంప్రదాయములు గదా! అట్టిచో మాటకుమాట పెట్టి కూర్చినయనువాదమువలననేమిలాభము, విననెగటుగ నుండును గాని? మూలమును దాటగూడదు. మూలమందలి భావములను, రసములను అనువాదమున జొప్పింపవలయును,-అనుటయే వీరి పరమార్థము. ఇట్టి పరమార్థమే కొనసాగియుండినచో యనువాదము సహృదయరంజకమగు ననుటకు సందేహముండబోదు. రామయ్య పంతులుగారి యత్నములోనే యనువాదమును సాగించుచువచ్చినను యెనటు మూలాతిక్రమణములును, మూలభావ విపర్యాసములును దొరలినవని చెప్పుటకు విచారమగుచున్నది. అందు కొన్నిటిని జూపెదను.—

ప్రస్తావనయందు,—

సూత్ర—తనకుదోసినభంగిని దగును బలుక,
　　నిందలేదన్నమాట తానెందుగలదు.
　　వనితలయొడలను గవులవాక్కులందు
　　దప్పులే లోకమెప్పుడు తలచుచుండు.

నటుడు—ఈవిషయములో జను లతిదుర్జనులనియే చెప్పదగును. (పుట 3)

ఇందు సూత్రధారుని వాక్యమున లోక దౌర్జన్య ప్రసక్తియే లేక నటుని వాక్యమున నా దౌర్జన్యమున కతిత్వము చెప్పబడినది. మూలమున నట్లుగాదు; సూత్రధారుడు జనులు దుర్జనులన నటుడు అతిదుర్జను లనెను.

రాము—ఈమెచెప్పినదెల్ల జేయుచునేయున్నాడను. (పుట ౬)

ఇదిమూలమునకు సరిపడదు. సీత తనకుగల కోర్కెలను దెలుపుచో తప్పక సంపాదింతునని వసిష్ఠునిసందేశమునకు రాముని ప్రతివచన మిది.

'యాగమువలన మేమిటునాగినాము.........'
　　　　　　　　　　　　　　　　　　　　. (పుట ౭)

జామాతృయజ్ఞమని మూలము. 'ఋశ్యశృంగేతి వక్తవ్యే జామాత్రిత్యుక్తిః పూజ్యతాస్ఫోరణాయ. ఏవం చ తదింగితం జ్ఞాత్వైవాస్మాభిస్తత్రాసితవ్యం, కిం పున స్త్రీకృతబహునిర్బంధేసతి' అని వీరరాఘవవ్యాఖ్య. ఇంత యభిప్రాయము గల జామాతృపద మిట వదలబడినది.

సీత—ఇదిగో ఎక్కినదానను. గర్భము దరుచున్నది. మెల్లగా బోనిమ్ము. (పుట ౨౭)

'రథము సిద్ధముగానున్న' దను లక్ష్మణసందేశమును దుర్ముఖుడు విన్నవింపగా వాని కిది ప్రత్యుత్తరము. రథమును దుర్ముఖుడు గొనితేలేదు. అట్టితరి యీ వాక్యమున కన్వయ మెట్లు? మూలము—'ఇయ మారోహామి (ఉత్థాయ పరిక్రమ్య) స్ఫురతి మే గర్భభారః; శనైశ్శనై ర్గచ్ఛావః' అని. దుర్ముఖుడే రథము గొనితెచ్చియుండి, సీత దానినెక్కి మెల్లగ బోనిమ్మని చెప్పియుండిన, తరువాత 'ఇదో దేవి' అని దుర్ముఖుడు దారిజూపుట యెందుకు?

మురల— సఖీ తమస! పూజ్యుడగు నగస్త్యుని భార్య లోపాముద్ర సరిద్వరయగు గోదావరిని బిలిచికొని రమ్మని నన్ను బంపినది. (పుట ౪౭)

గోదావరిని పిలుచుకొని రమ్మనలేదు. సంగతి చెప్పి రమ్మన్నది. 'భగవతి, తమసే! ప్రేషితాస్మి భగవతో గస్త్యస్యపత్న్యాలోపాముద్రయా సరిద్వరాం గోదావరీ మభిధాతుం, జానాస్యేవ యథా......' అని మూలము.

వాసంతిక—దేవ! సత్వరముగ జటాయుశిఖరమునకు దక్షిణముననున్న సీతాతీర్థమునొద్ద గోదావరి దాటి దేవిపుత్రకుని రక్షింతురుగాక! (పుట ౫౮)

గోదావరిని దాటుటయెందుకు? 'గోదావరీ మవతీర్య' అని మూలము. అవతరణము దాటుటకాదు, దిగుట. గోదావరీలోనే కదా సీనుగుగున్న జలకమాడుచుండినది?

కౌసల్య—కంచుకి పిలిచినమీదట నతడు వచ్చునో రాడో మీరేమని తలతురు? (పుట ౯౫)

మూలము—కిం మన్యధ్వే ఏవంభణిత ఆగమిష్యతీతి.

'చెప్పినవెంటనే యతడు వచ్చునని మీ రనుకొందురు' అని దీని యర్థము. దీనికి సమర్థకముగనే జనకుడు 'ఛిద్యతే వాసద్వృత్త మీదృశస్య నిర్మాణస్య' (ఇట్టి నిర్మాణమునకు మంచినడవడి తప్పునా) అని యున్నాడు.

ఒకపురుషుడు—అతడు రాకుండగనే మీరుశీఘ్రముగా బోయి చెట్లచాటున దాగికొనుడు. (పుట ౧౦౪)

'త త్త్వరితతర మనేన తరుగహనే నాపసర్పత' అను మూలమునకు 'శీఘ్రముగా బోయిచెట్లచాటున దాగికొనుడు' అను తెలుగు. మూలములో చెట్లగుబురుదారిన పారిపొమ్మన్నాడుగాని దాగికొన మనలేదు.

ఇట్టి ప్రమాదము లింకను కలవు. అనువాదకులు మొదట ఎత్తినఎత్తుతోనే అనువాదమును సాగించియుండిన యెడల బాగుగ నుండెడిది. కాని నడుమనడుమ నిట్టి ప్రమాదములు వైరస్యాపాదకము లగును.

ఉత్తరరామచరితరసవిషయమున రెండుమతములు—కొందరు విప్రలంభ మని, మరికొందరు కరుణ మని. ఈ విషయమై వాదోపవాదములు ఇప్పటికిని గలవు. కాని యిదమిత్థమని తేలినదిలేదు. రామునకు ప్రత్యాశలేదని కరుణవాదుల మతము. రామయ్యపంతులు గారును తన్మతమువారే. రామునకు సీతాజీవితనిశ్చయము, ప్రత్యాశ లేదనియే వీరు తలంచిరి. దానినే తమ యుపోద్ఘాతమున సాధింప బ్రమాణముల చూపిరి. ప్రమాణవాక్యముల తెలిగించుటలో కూడ నొండు రెండెడల పొరపడిరి. ('శోకస్యపరిపోషః కరుణః, ఆశావిచ్ఛేదేసతి సర్వేంద్రియక్లమోవా' అనురసతరంగిణీ వాక్యమునకు 'శోకముయొక్క పరిపోషణము కరుణమగును. ఆశావిచ్ఛేదమైనచో సర్వేంద్రియములు క్లాంతములగును' అనిరి. శోకముయొక్క పరిపోషణముగాని, ఆశావిచ్ఛేదముగునెడ గలుగు సర్వేంద్రియగ్లానిగాని కరుణము అని మూలమున కర్థము. ఇట్టి పొరపాటే మరియొకచోటను కలదు.) ప్రత్యాశయే లేదని వీరి నిశ్చయమైనచో సీతాపరిత్యాగమందలి 'హా భగవతి వసుంధరే! శ్లాఘ్యాం దుహితర మవేక్షస్వజానకీం' అను రామునివాక్యమున కేమి చెప్పుదురో! ఈరామప్రార్థననేకదా తాను నెరవేర్చినట్లు వసుంధర గర్భాంకమున జెప్పినది.—"పిల్లను విడిచిపెట్టు సమయమున 'భగవతి, వసుంధర! శ్లాఘ్యయగు నీకూతురు జానకిని గనిపట్టు' మని నీవంటివి. ఆ ప్రకారము చేసిన దానన యితిని గదా" యని. ఇది ప్రత్యాశావిషయము కాదా! 'యస్యాభార్యా విదూరస్థా పతితాధ్యూషితాపివా అనిష్టః ప్రతికూలవా తస్య ప్రతికృతా క్రియా' శ్లోకములో 'విదూరస్థా' యనుపద్యములో తప్ప సీత మరి పద్దులో జేరుట కవకాశము లేదనియు, ఇట్టితెరి యీ కము సీతాజీవితనిశ్చయప్రమాణ మెట్లగుననియు విప్రలంభవాదుల కొక ప్రశ్న వైచిరి అనువాదకులు. సీత విదూరస్థ కాదనియు, రసాతలమం దున్నను విదూరస్థయే యైనచో మృతినొందినదానిని గూడ విదూరస్థగా నేల యెంచరాదనియు ననిరి. పశరీరలోకాన్తరగమనమునకును శరీర నాశముతోడి మరణమునకును భేదము లేదా? ఇంత కును ఇంకను ఆ నూపట్టులను సూక్ష్మేక్షికతో జూచిన రామునకు ప్రత్యాశ లేదనక తప్పదు

ఎట్లున్న నేమి? రామయ్యపంతులుగారి యనువాదపద్ధతి మెచ్చదగినది. దీని నెట్టి యాశయముతో ననువదింపబూనిరో అట్టియాశయముతోనే మరికొన్ని నాటకములను తెలిగింపదగుదురు. సంస్కృతవాఙ్మయము పారము. ఒకరు చేకొన్న దానినే మగలమరల నితరులును ననువదించుటలో లాభమేమి? తక్కినవికూడ ఆంధ్రలోకమున కబ్బవలదా?

ఈ పుస్తకమువెల ఒకరూపాయి. వలయువారు గ్రంథకర్తకు వ్రాసి తెప్పించుకొనవచ్చును.

తి. వెం. రం.

---

## దేశభక్తుడు కందన్ (ఆంగ్లనవల)

## Kandan, The Patriot

గ్రంథకర్త: కె. యస్. వెంకటరమణిగారు, బి. ఏ., బి. యల్.

క్రౌనుసైజు, ౨౬౦ పుటలు, మేలుకగితము, అందమయిన సంపుటము, వెల రు. ౨.

ఆంగ్లమున స్వతంత్రరచనలకు దొరకొనిన భారతీయులలో వెంకటరమణిగారొకరు. వీరి మృదుమంజుల భావప్రదర్శనమును, శైలిసౌలభ్యమును పలువుర ప్రశంసల నందినవి. వీరి వ్యాసములందును, నవలలందును భారతీయ సంప్రదాయములును, జాతీయజీవనమును ప్రతిబింబితమైనందున, విదేశీయులైన పాఠకులకు ముఖ్యముగా నాకర్షకములగుటలో నాశ్చర్యము లేదు.

"దేశభక్తుడు కందన్" అను నీనవలలో గ్రంథకర్త ప్రకృతభారత పరివర్తనమును ప్రదర్శింప నుద్యమించెను. దేశాభిమానమును, అహింసా సిద్ధాంతమును ఇందలి పాత్రలకు పునాదియగుచున్నవి. అరవదేశములో పుట్టి, దక్షిణాఫ్రికాలో పెరిగి, ఆంగ్లదేశమున విద్యనభ్యసించి, ఐ. సి. యస్. పరీక్షలో కృతార్థుడై, ఉద్యోగాభిలాషను త్యజించి, దేశారాధకుడై, స్వదేశమునకు వచ్చి జానపదులను మన్ననముతో నాదరించుచు, వారియింటి దైవతమువలె చరించి, దేశసేవకొరకు జీవితము నర్పించినవాడు కందన్ ఇతని హృదయపరివర్తనమునకు కారణముగా స్త్రీవిషయమునందైన మనోరథ వైఫల్యమును గ్రంథకర్త నిర్దేశించినారు. కథలో మాత్రము కందన్ కన్న అతని భావములే ప్రాముఖ్యము వహించినవి. కొన్ని సిద్ధాంతములంగలిపి యీపాత్రను సృష్టించిరాయనునట్లు దోచును. ఇందులకు కారణము శాంతరసమున కీపాత్రము లక్ష్యముగుటయే కావచ్చును. ఇతరపాత్రలు రంగన్, రాజేశ్వరి, సరస్వతి, పొన్నన్, చొక్కలింగ మొదలియారు మున్నగువారలు సందర్భములకు సరిపోవువారే. ఐనను, సామాన్యపాత్రలందు స్వాభావికత నారోపించు యత్నమటనట విస్పష్టముగా నున్నది. ముఖ్యముగా సరస్వతి కెక్కడ లేని ఔన్నత్యమును సంపాదించుటకు గ్రంథకర్తగారు కేవలము మాటలపై నాధారపడి రనవలసివచ్చుచున్నది. పాత్రములందు గాంభీర్యము కొఱతపడియున్నదనుట వెంకటరమణిగారి రచన లోపమే కావచ్చును. కాని వారు ప్రదర్శించు లక్షణములుమాత్రము చిత్తాకర్షకములుగా నుండుట మెచ్చుకొదగదా.

వెంకటరమణిగారి శైలినిగూర్చి తెలుగున ప్రశంసింపబూనుట యుచితము గాదు. ఐనను వారి ప్రశస్తికిదియే ముఖ్యకారణమని చెప్పకప్పదు. అలతియలతి తునియలతో కాహళి సంధించుట వీరికి సహజమైనది. ఉపమలొక్కొకెడ తెచ్చి కోలుగా నున్నను, సామాన్యముగా నతిమంజులములై యుండును. తరుశాఖలనుండి పూవులు రాలునట్లుండును వీరివాక్యములు. ఏకధారగా ప్రవహింపదు. వీరిశబ్దవాహిని. అందువలననే వీరిశైలి వ్యాసములందును, కథానకములందును ప్రశస్తి గాంచునట్లు ఇతర రచనలందు గాంచదు.

గు. వెం. సు.

---

## ప్రేమసుందరి

(ప్రథమ భాగము)

క్రౌను సైజు, ౧౧౭ పుటలు, వెల తెలియదు.

కృష్ణదేవరాయ గ్రంథమాలలో తృతీయపుష్పము. గ్రంథకర్త: హనుమచ్ఛాస్త్రి దేవదాసముగారు. వలయువారు కల్లూరు అహోబలరావుగారు, మేనేజరు, భారతీ భవనము, కౌలుబజారు, బళ్లారి అని వ్రాయవలెను.

ఈ గ్రంథమునకు "క్వెస్టు ఆఫ్ ది హోలీ గ్రెయిలు" అను గ్రంథము మూలమని తోచుచున్నది.

"ప్రేమసుందరి మరణాంతికనాయిక. ఈనిర్మల ప్రేమహృదయ మొట్టమొదట తానేపురుషుని ప్రేమించెనో యాపురుషునే పరిణయమాడగోరి కారణాంతరములచే నతడు దన్ను పరిణయమాడకయుండిన నతనిపై దనకుగల ప్రేమను మరలింపదలచుకొనజాలక దశవిధమదనావస్థలకు లోనై తుదకు సంతాపజ్వరముచే మరణించిన కన్య" యని గ్రంథకర్త తెలియజేసెను.

ప్రథమభాగమున కథ పూర్తికాలేదు. రెండవ భాగమున ప్రేమసుందరి యస్తమయమును గాంచగలము.

ప్రథమభాగమున ప్రేమసుందరి ప్రేమించిన వ్యక్తి ప్రేమసుందరియెడల సోదరీభావమునే జూపుచుండెను.

శైలి కటువు. పదప్రయోగసౌష్ఠవము కొరవడినది. మారుమూలపదములు మెండు. పాఠకులు శబ్దరత్నాకరమును, లక్ష్మీనారాయణీయమును దగ్గర నుంచుకొనవలసియుండును.

మరియు ఆంధ్రమునగాని, సంస్కృతమునగాని గానలు దొరకవో యన్నటుల గ్రంథకర్త పీనాటివాడో అగు టెన్నిసన్ కవిపుంగవుని గీతముల నేల యనుకరింపవలసివచ్చెనో తెలియకున్నది.

ఆంధ్రవాఙ్మయమున విషాదాంతములగు కావ్యములు, నవలలు, రూపకములు విరివిగాలేని కొఱతను

తీర్పు చేసిన గ్రంథకర్త పెన్నిసను నుండి కైకొని ఈనవలను విషాదాంతముగ రచించెను. కష్టములను మానవులు సహనముగ చేయుటకును, ఇతరులకు ఆదర్శప్రాయముగ నుండుటకును వ్రాసితినని గ్రంథకర్త వ్రాసెను. గ్రంథకర్త యొక్క ప్రాయముతో ఏకీభవించజాలనందులకు చింతిల్లుచున్నాను. విషాదాంతకావ్యములు మున్నగునవి భారతసంప్రదాయమునకు విరుద్ధము. హిందువుల కది యమంగళము.

జరుగుమిల్లి సాంబశివరావు, బి. ఏ.,

---

## కావ్యకథావళి

ప్రకాశకులు: ఆర్యపుస్తకాలయమువారు, రాజమహేంద్రవరము. క్రౌనుసైజు, ౯౪ పుటలు.

ఘనగిరి రామకవి ప్రణీతమగు 'యథావాల్మీకము', శేషము రఘునాథాచార్యకృతమగు 'కులశేఖర మహీపాలచరిత్రము,' సుబ్బరాయకవి ప్రణీతమగు 'జయ విజయాభ్యుదయము,' మంచెన కవికృతమగు 'కేయూరబాహు చరిత్రము,' మారనకవికృతమగు 'మార్కండేయపురాణము,' అనంతయ్య రచించిన 'విష్ణు మాయానాటకము' అను ఈ ఆఱు ప్రాచీనకావ్యముల నుండియు ఒక్కొక్కకథ పట్టుగా ఈపుస్తకమున కూర్చబడ్డవి. ఇందు కొన్ని యెల్లరికిని సత్కావ్యములు. అసమగ్రములైనను, దొరకినంతవట్టుకు ఆకావ్యములను ప్రకటించుటకును పుస్తకాలయమువారు పూనుకొనిరెల్లను.

---

## భారతకథాలహరి

రచయిత: ద్రోణంరాజు సీతారామరావుగారు. ప్రకాశకులు: ఆర్యపుస్తకాలయమువారు, రాజమహేంద్రవరము. క్రౌనుసైజు: ౧౪౯ పుటలు. భారతకథ సరళమగు గద్యశైలిని రచితమైనది.

---

## సావిత్రీదేవి

ప్రకాశకులు: నాళం అప్పలనరసింహముగారు, రాజమహేంద్రవరము. క్రౌనుసైజు, ౪౩ పుటలు. వెల ౧౨ అ. సావిత్రిచరిత్రము. సరళశైలి. బాలబాలికలకు ఉపయోగపడును. టెక్స్టుబుక్కు కమిటీవారు దీనిని సిఫారసు చేసిరి.

## భగ్నప్రేమ

రచయిత: నరహరిసెట్టి శేషగిరిరావు గారు, తూర్పువీధి, ఏలూరు. పదోకొండు ధారాళములగు పద్యములు.

---

## పర్బత్ పాకశాస్త్రము

గ్రంథకర్త: తాడి బ్రహ్మానందరావువర్మ గారు, కోరంగి, తూ. గోదావరి. క్రౌను ౧౬ సైజు: ౮౦ పుటలు. వెల: ౮ అ. ఇందు పలురకముల పర్బత్తులు, కొన్ని మురబ్బాలు, పన్నీరు మున్నగు వస్తువులు తయారు చేయువిధములు తెలుపబడ్డవి.

---

## నీతి కథారత్నావళి

రచయిత: దాసరి లక్ష్మణస్వామి గారు, పిఠాపురము, తూర్పుగోదావరి. క్రౌనుసైజు: ౬౦ పుటలు, వెల ౬ అ.

ఇందు మంచనకవి 'కేయూరబాహుచరిత్రము' నుండి పదునాలుగు కథలు సంగ్రహముగ, సులభశైలిని రచింపబడ్డవి. బాలవిద్యార్థుల కిది చదువదగి యున్నది.

---

# గ్రంథస్వీకారము

## ఆంధ్రకవిత్వచరిత్రము

బసవరాజు వేంకట అప్పారావు (బి. ఏ., బి. యల్.) గారిచే విరచితము. ప్రకాశకులు: వావిళ్ల రామస్వామిశాస్త్రులు అండ్ సన్స్, ౨౯౨, ఎస్ప్లనేడ్, చెన్నపురి. క్రౌనుసైజు, ౩౦౪ పుటలు. వెల రు. ౧-౮-౦.

---

## శ్రీ భూలోకశక్తి

దండకము. కర్త: రాచిరాజు కృష్ణమూర్తికవి గారు, అలకనారాయణపురం, గొల్లపాలెంపోస్టు, (Via) చీపురుపల్లి, విశాఖపట్నంజిల్లా. క్రౌనుసైజు: ౧౩ పుటలు, వెల ౨ అ. ౬ పై.

---

తా. క.—భారతియందు ప్రకటితములయిన విమర్శనలకు ప్రతివిమర్శనలు ప్రకటింపబడవు.—భా. సం.


విషయసూచిక

# చిత్రములు

త్రివర్ణచిత్రములు—విప్రోషిత; ఎఱ్ఱగుడిగుట్ట

సాధారణచిత్రములు: జాలరి; ప్రాచీనచిత్రములు ౬; కలకత్తాజైనదేవాలయ చిత్రములు౪; సిడ్నీయందు నవీన నౌకాశ్రయసేతువు; ప్రాచీనవైష్ణవచిత్రములు ౧౬; ఇతర చిత్రములును.

---



వి ప్రో షి త

చిత్రకారుఁడు: కె. అమృతసుగారు, మదరాసు



చెన్నపట్టణము, ఏప్రిల్ ౧౯౩౭

సంపుటము ౯ ఆంగీరస సంవత్సరము చైత్రమాసము సంఖ్య ౪

## మా కవిత

కవిరాజహంస, బాలాంత్రపు వేంకటరాయకవిగారు

శ్రీవారికిఁ గాళిందీ - శ్రీవారికి విష్ణుపదకుశేశయనిలయ
శ్రీవారి కెరఁగి మత్కవి-తావారికిఁ గూర్తు విమలతావిస్ఫూర్తిన్.

వాల్మీకి భాస్కరాహ్వాయగాయకులచేత మ్రోఁగించె నేదేవి ముక్తివీణ
వ్యాసవాక్ఛానవరవదాన్యులచేతఁ బూరించె నేదేవి భుక్తిపాత్ర
బాదరాయణ పోత భద్రనాదికులచేఁ బట్టించె నేదేవి భక్తినౌక
బాణసూర్యప్రతిభాచిత్రకరులచే రచియించె నేదేవి రక్తివల్లి
ఆదికవులకు మున్నె తా నవతరించి - జ్ఞానదానవిజ్ఞానప్రదాన యగుచు
నిత్యసంకీర్తనంబుల నేఁడు నాఁడుఁ - దనరు నాదేవి మా కవితాకుమారి.

చనవిచ్చి పలికెనా చదువుసోమగులైన భారతీకాంతులై తీరవలయు
మనసిచ్చి మసలెనా పునుకవేల్పులై, స్థిరమంగళాంగులై తీరవలయు

కనువిచ్చి మాపైనా కనుపుఁగాఁపరులైన శ్రీరమారమణులై తీరవలయు
తనువిచ్చినని పైనా తనిసితక్కరులైన స్వారాజ్యవిభవులై తీరవలయు
తనకువాయిల్లె మెయిల్లె యనఁగనేల? - తనకు శివమిల్లె దివమిల్లె యనఁగనేల?
తెలిసి జగమిల్లెయని చెప్పతీరవలయు - శ్రీకుమారియె మా కవితాకుమారి.

గండపెండెరమన్న ఘనత సేయదుగాని కవిచంద్రుఁడే వంశకర్తయనును
వందిమాగధులన్న వంక సేయదుగాని సత్యపాలుఁడె మతాచార్యుఁడనును
రణకిణాంకములన్న గణన సేయదుగాని శౌర్యధుర్యుఁడె కులస్వామియనును
దానకంకణమన్నఁ దలఁపు సేయదుగాని త్యాగమూర్తియె సహాధ్యాయియనును
సాధుమణియన్న మెచ్చుకోఁ జనదుగాని - ధర్మరక్షకుఁడే తనదైవమనును
ప్రకృతిపురుష స్వభావతత్త్వములుగన్న - భావమణిపేటి మా కవితావధూటి.

ఎండమావుల నీళు లెత్తనేర్చుటకాదు హృదయేశ్వరున కర్ఘ్యమీయనేర్చు
ఆకాశకుసుమంబు లందనేర్చుటకాదు జీవితేశ్వరుపూజ సేయనేర్చు
నిండువెన్నెలవల్వ నేయనేర్చుటకాదు చిత్తేశుమేనఁ గైసేయనేర్చు
గాలిలో మేడలఁ గట్టనేర్చుటకాదు ప్రాణేశుకొల్వుఁ గూర్పంగనేర్చు
శూన్యమున నంకమన్న నేర్చుటయెకాదు - విశ్వవిభునందు నిల్పి సేవింపనేర్చు
నేర్చునేర్పునఁ బ్రకృతి మన్నించుబోటి - తలఁపుఁ బువుఁదేటి మా కవితావధూటి.

మునుసోగతీగల నొక్కిమీటఁగలేదు జీవంబదేటికే చేతరించు?
పవడంపుఁజివురుల బారుమెట్టఁగలేదు ప్రాణంబదేటికే పట్టుదప్పు?
విరిపూవుగుత్తుల విరియఁజిమ్మఁగలేదు భావంబదేటికే పరువులెత్తు?
కపురంపుఁబలుకులఁ గలయఁగ్రుమ్మఁగలేదు హృదయంబదేటికే కదలఁబాఱు?
పలుకవిదియేమి ప్రకృతి?—నేఁ బలుకకున్నఁ - బలుకరింతువె? పరమేశ?—భ్రాంతి?—కాక!
పలుకుమని నవ్వు పరమేశు ప్రకృతిలీల - మాకవిత పాడుచున్నది మాఘరేపు.—

---

# ఆంధ్రకవిత్వచరిత్రము

భోగరాజు నారాయణమూర్తిగారు

(నాల్గవ భాగము) ప్రాఙ్నన్నయయుగము

(సమకాలిక సంబంధ తెలుగాయి) గాంగరాజులభాష

“తెలుగునకును, కళింగమునకును, ఎట్టి సంబంధములేదు. క్రీ. పూ. ౭ వ శతాబ్దమునుండియు, తత్పూర్వమునుండియు అనగా వేదసూత్రకాలమునుండియు అంగవంగదేశములమార్గమున కళింగము కొట్టకొనదైనను ఆర్యావర్తమునకు జెందిన దేశము. ప్రాచీనార్య వాఙ్మయమున అంగవంగకళింగములందు ముఖ్యముగా వంగకళింగములు నిరసనభావముతో పేర్కొనబడియుండుట సత్యము. దానికి కారణ మాదేశము లప్పుడు పూర్తిగా నార్యులు స్థాన మాక్రమించకపోవుటయే. హిందూదేశమున నార్యదేశమనియు ద్రావిడదేశమనియు జాతీయవిభాగములేదు. ద్రావిడ దేశమునకు సమముగా నార్యావర్తమును ద్రావిడరక్తపూరితమే. కాని విద్యాభాషాసాంప్రదాయ విషయములనే యార్యద్రావిడభేదము కలుగుచున్నది. ఈరీతిని గమనించగా ఆర్యులును కాళింగులును వేర్వేరుజాతులకు చెందినవారు. ఆర్యసాంప్రదాయము కళింగదేశపు దక్షిణసరిహద్దువరకును జయముగాంచి, దక్షిణదేశమున ద్రావిడవిద్యయు భాషయు బలిష్ఠములును, జీవకళోద్భాసితములు నగుటచేత, మొక్కవోయి యేమార్పును కలిగించలేకపోయినవి. ఇప్పటికిని ఆంధ్రకళింగముల విభాగము, ఆంధ్రద్రావిడభాషలుకలియు దేశమే అయియున్నది. మనకు తెలిసినంతవరకు ఆంధ్రులు విద్యావిషయములందును చరిత్రయందును కళింగులకన్న నెక్కుడు ఘనతగాంచినారు. అనేకశతాబ్దముల వారి రాజులు చక్రవర్తి పదవిని పొందిరి. పురాణములందు ఆంధ్రరాజులు భారతవర్షములోని క్షత్రియవంశపురాజులుగా పరిగణింపబడిరి. మహాభారతములో నొకచోట ఆంధ్రదేశ మార్యావర్తదేశములలో నొక్కటిగ లెక్కింపబడినది. కాని యెన్నిచూచినను నాంధ్రవిద్యయు, నాంధ్రభాషయు ద్రావిడములుగా నిలిచినవనియే చెప్పవలెను. వారియూహలకు తోచినరీతిని నాంధ్రమునకును కళింగమునకును సంబంధము కల్పింపనెంచుట చరిత్రశోధకుల కుతగనిపని...”*

ఇదియొక యూహ. కళింగమునం దెనుంగుండెననియు, గాంగరాజులు తెలుంగువారై యుందురనియు మఱియొక యూహ కూడం గలదు. శాసనములయందలి లిపినిబట్టియు,

* కళింగదేశచరిత్రము, పే. ౨౭౬.

గ్రామనామములనుబట్టియు నైదారు శతాబ్దములయందును, దత్పూర్వమునందును గళింగమునఁ దెలుఁగుండవచ్చునని పరిశోధకు లూహించుచున్నారు. ఈయూహ యెంత వఱకు నిలువఁగలదో చూతము. గంజాం మండలమున "కౌటూరక"మను నొక గ్రామముండెను. ఈగ్రామనామము ౫-వ శతాబ్దమునకుఁ బూర్వము సముద్రగుప్తుని శాసనమునందుఁ బేర్కొనఁబడినది.—

"కోసలకమహేంద్ర మహాకాంతారకవ్యాఘ్రరాజ, కౌరాలకమణ్టరాజ పైష్టపురకమహేంద్రగిరి కౌటూరక, స్వామిదత్తైరణ్డపల్లక దమనకాఞ్చేయక విష్ణుగోప......"

ఇందుఁ బేర్కొనఁబడిన రాజులెల్లరు సముద్రగుప్తునిచే జయింపఁబడినవారు. వీరిలో 'కౌటూరక' స్వామిదత్తుఁ డొకఁడు. ఈశాసనమును శోధించిన పరిశోధకులు కౌటూరక మనఁగా "కొత్తూరు" అని వ్రాయుచున్నారు. ఈకొత్తూరు (కొత్త+ఊరు) పదము కేవలము తెనుఁగుగ్రామనామమే. అందుచే కౌటూరకముగాక కొత్తూరేయైనయెడల సముద్రగుప్తుని కాలమందును, దత్పూర్వమునందును గళింగమునఁ దెలుఁగుండెననుకొనుటకు సందియము లేదు. కాని కౌటూరకము కొత్తూరెట్టు లగునో యను విషయము మాత్రమే భాషాతత్త్వవేత్త లూహింపఁదగినది. కౌటూరక ప్రకృతినామమునకు కొత్తూరు తద్భవరూపమని శాసనపరిశోధకుల యభిప్రాయము కావలయు. సంస్కృతభాషాజన్యవైకృతముల మర్యాద ననుసరించి కౌటూరకము కొత్తూరుగా మారఁగూడదు. 'కోడూరి' మని కాని, 'కోడూర' మని కాని, 'కోడూరు' అని కాని తద్భవరూపము లేర్పడవలయును. సంస్కృతపద 'ట' వర్ణము తద్భవరూపమున 'డ' వర్ణమగుట వ్యాకరణమర్యాద. అటవి = అడవి; వాటిక=వాడ; ధాటి = దాడి; చేటి = చేడె; ఘోటిక = గోడిగ; ఇట్లే వందలకొలఁది వైకృతము లేర్పడుచున్నవి. ఇంతేగాక ప్రకృతిపదమైన కౌటూరకము వ్యస్తపదము. వైకృతమైన 'కొత్తూరు' సమాసపదము. మఱియు, కౌటూరకము 'కోటూర' పదమునకుఁ దద్ధితరూపముగాఁ గానవచ్చుచున్నది. ప్రకృతిపదము కోటూరమే యైనయెడల వైకృతము 'కోడూరు' కావలసియున్నది. గంజాంమండలములో నీకోడూరుగ్రామములు రెండున్నవి. కావున సముద్రగుప్తుఁడు జయించిన స్వామిదత్తుని రాజధాని కోడూరేగాని కొత్తూరు కానేరదు. 'మంజూష' 'మందసా' యైనట్లే కోటూరకము కాలక్రమమునఁ గోడూరుగా మాఱియుండును. గంజాంమండలమున నిపుడు 'జిర్జింగి' యని వ్యవహరింపఁబడుచుండిన గ్రామమొకశాసనమునందు 'జిజ్జికా' యని పేర్కొనఁబడినది. ఇట్టి మంజూషా జిజ్జికా కోటూరకాదిక గ్రామనామములు ప్రాచీనకాలమునాటి ప్రకృతిరూపము లనియు, వానికిఁ గాలక్రమమున మందసా జిర్జింగి కోడూరు నను వైకృతరూపము లేర్పడె ననియు నూహింపవలయునే

కాని, నేటి వైకృతి ముఖమునుబట్టి ప్రాచీనకాల భాషానిర్ణయమునకుఁ గడంగుట సాహసమైన పని.

గాంగరాజులు తెనుఁగువారై యుందురని యూహించువారి కాధారముగా, "తిరిలింగము", "కందలివాడ" అను రెండు గ్రామనామములు గాంగశాసనములయందుఁ గానవచ్చుచున్నవి. తిరిలింగపదమున్న శాసనములో, "వ్రాతలో వర్ణక్రమభేదములు కొన్నియున్న" వని పరిశోధకులు వ్రాయుచుండుటచే, 'త్రిలింగ' మనుపేరు శాసనమువ్రాఁతలో "తిరిలింగ" ముగాఁ గానవచ్చుచున్నదేమో యని సంశయము కలుగుచున్నది. రెండవదియగు 'కందలివాడ' యనుపేరు తెనుఁగుమాటయే గాని మఱియొకభాషలోనిపదము కాఁగూడదు. ఇంతకు నీరెండుమాటలును గల గాంగశాసనములు ౭-వ శతాబ్దమునకు మునుపున్నవిగాక తరువాతి వగుటచే నైదారుశతాబ్దములలో నీమాత్రపు తెనుఁగుపోలికలుగూడఁ గళింగమున లేవనియే చెప్పవచ్చును.

తెలుగన్నడలిపి

క్రీ. శ. ౫౩౭-వ సం. ప్రాంతమువాఁడైన గాంగరాజగు మహారాజేంద్రవర్మ యొక్కయు, మఱికొందఱు రాజులయొక్కయు శాసనములయందలి లిపి, తెలుగన్నడలిపి యగుటచే, "వీరిని తెలుగురాజులుగా నెంచవలెను. వీరిదేశమునందలి ప్రజలును తెలుగుభాషను జెందిన కళింగాంధ్రులే కాని వేరు కాదు. కటకమునకు రాజధానిని మార్చి ఓఢ్రదేశీయులపై రాజ్యమేలు సందర్భమున ఓఢ్రభాషను నేర్చినను తెలుగుభాషను కూడ పోషించుచున్నట్లు శ్రీకూర్మమునను ముఖలింగమునను గల వీరి తెలుగుశాసనములే సాక్ష్యములు"*. అని కళింగదేశచరిత్రము చెప్పుచున్నది. ఈతెలుగన్నడలిపి జైనమతబోధకుల మూలమునఁ గర్ణాటమునుండి కళింగమునఁ బ్రవేశించినదే కాని గాంగరాజుల శాసనరచనాసంప్రదాయ లిపియై యుండదు. ఇది వారి సంప్రదాయమే యైయుండినయెడల గాంగరాజులెల్లరుఁ దమశాసనములను దెలుగన్నడలిపియందే వ్రాసికొనియుందురు. కాని వీరిశాసనము లనేకములు ప్రాచీననాగరిలిపియందుఁగూడ వ్రాయఁబడినవి. శాసనలేఖకునకభ్యాసమైన లిపినిబట్టి, తెలుగన్నడలిపియందో, ప్రాచీన నాగరిలిపియందో యీ రాజుల శాసనములు వ్రాయఁబడుచుండెనే కాని వీరి భాషనుబట్టికాని, సంప్రదాయమును బట్టికాని కాదు. వీరి శాసనములన్నియు సంస్కృత భాషయందే వ్రాయఁబడుటచేత నీరాజుల మాతృభాష యేదియో తెలియదు. తెలిసికొనుట కాధారములు లేశమును లేవు.

గాంగరాజగు నింద్రవర్మ జిజ్జికాశాసనము వ్రాసిన లేఖకునిపేరు "దేవసిఙ్ఘదేవు". పేరునుబట్టి యీలేఖకుఁడు డోఢ్రుఁడు కావలయును. దేవసింఘదేవు, విక్రమదేవు, నారా

* కళింగదేశ చరిత్రము, పే. ౭౧౮.

యణదేవు, కృష్ణమణిచంద్రదేవు మున్నగు నిట్టినామము లోఢ్రులకు, నోఢ్రరాజులకు వర్తించునేకాని తెలుఁగువారి కెన్నఁడును జెందినవికావు. కావున నీ శాసన లేఖకుఁ డోఢ్రుఁడనక తప్పదు. ఈతఁడు తనదేశము నకుఁగాని, భాషకుఁగాని సంబంధించని తెలుగన్నడలిపియందు శాసనమును వ్రాసెను. ఓఢ్రభాషయు, లిపియుఁ గ్రీస్తుపూర్వమునుండియుఁ దమకుఁ గలవని యుత్కళపండితులు వ్రాసికొనుచున్నారు. అయిదాఱు శతాబ్దముల యందలి కళింగము జైనమతస్థులైన ప్రజలచే నధికభాగము నిండియుండినకారణమున మాణిసింఘుదేవు శాసనములు వ్రాయుటకుఁ దెనుగన్నడలిపి నేర్చుకొనెననుటకు సందియము లేదు. శాసనములు ప్రజలకొఱకే గావున శాసన లిపియుఁ బ్రజాబాహుళ్యమునకుఁ దెలిసినది గానే యుండవలయును గావున నీతెలుగన్నడ లిపి నాఁటి కళింగము జైనమత ప్రజాక్రాంతమనియే రుజువుచేయును గాని గాంగరాజులు తెలుఁగువారని కాదు. వారు తెలుఁగురాజులైనయెడఁ, గళింగప్రజలుఁగూడ నాంధ్రులైన యెడ గాంగరాజులు తమశాసనము లాంధ్ర భాషయందే వ్రాయించికొనియుందురు. ఒక్క సంస్కృతమునఁదప్ప మఱియొకభాషలో వారు శాసనములు వ్రాయింపలేదు. సర్వకాలముల యందు, సర్వదేశములయందు సర్వసామాన్యమగు నొక్క సంస్కృతమునకు మాత్రమే యిట్టి జాతి మతభేదము లేదు. అందుచేతనే ప్రాచీనకాలమునందలి రాజులు దఱుచుగాఁ నిజశాసనములను సంస్కృతభాషయందే వ్రాసికొనుచుండిరి. ఈభాష యాద్యంతరహితమై సర్వవ్యాప్తిగాంచిన పరబ్రహ్మమువంటిది.

ఇంక శ్రీకూర్మముఖలింగాదిప్రదేశముల యందలి గాంగరాజుల తెలుఁగుశాసనములను బట్టికూడ నీపూర్వగాంగులు తెలుఁగువారే యని చెప్పుట కవాంతరములు కలుగుచున్నవి. గాంగరాజులవని చెప్పఁబడుచున్న తెలుఁగు శాసనములు పదునొకండవశతాబ్దమునుండియు వ్రాయఁబడినవే కాని తత్పూర్వలిఖితములు గానరావు. ఈతెలుఁగుశాసనములకు సంబంధించిన రాజులు పూర్వగాంగులో, గాంగవాడి రాజ్యమునుండి వచ్చిన దక్షిణగంగులో నిర్ణయింపవలసియున్నది. మఱియుఁ బదునొకండవ శతాబ్దాంతమునాఁటి యాంధ్రదేశము, ౫-౬ శతాబ్దములయందలి యాంధ్రదేశము వంటిది గాదు. ౭-వ శతాబ్దములో హ్యూనుత్సాంగువర్ణించిన తక్కువ జనసంఖ్యతోఁ గాక పట్టణము లత్యధికప్రజాబాహుళ్యముతో నొప్పుచుండెను. రాజరాజుమూలమున నాంధ్ర భాష సకలప్రజాభిమానము నొందఁగలిగినది. గ్రామములయందు మతాందోళనముగూడ శాంతించినది. ఈకాలమున నొక్కగాంగ రాజులేగాక చాళుక్యులు, చోళులు, పల్లవులు మున్నగు రాజులెల్లరునుగూడఁ దెలుఁగున శాసనములు వ్రాయింపనారంభించిరి. ఆయా రాజుల తెలుఁగుశాసనములు పండ్రెండవ శతాబ్దమునుండియుఁ గానవచ్చుచున్నవి. శాసనములు ప్రజలకొఱకే కావున నాకాల

మునాటికిఁ దెలుఁగుమీఁఁజేసి ప్రజలకొఱకుఁ దెలుఁగుదేశమునఁ దెలుఁగుననే శాసనములు వ్రాయు నాచారము ప్రబలినదని యూహింప వలయునే కాని, యా తెలుఁగుశాసనములు వ్రాయించిన పల్లవులు, చోడులు, గాంగులు మున్నగు రాజు లాంధ్రు లనియు, నాంధ్ర భాషోద్ధారకు లనియుఁ జెప్పుట చారిత్రకసత్య మునకు భంగమనియే నామనవి. ఇట్లెన్నివిధ ముల నాలోచించినను గళింగ మేలిన గాంగ రాజులు తెలుఁగువా రనుట కెట్టి నిదర్శనము లును గానరావు.

సమన్వయము

ఐదవ శతాబ్దమునుండి యేడవశతాబ్దము వఱకు నాంధ్రదేశ మాంధ్రవాఙ్మయాభావ మైయుండుటకుఁ గారణమేమని యాంధ్ర సాహిత్యవిద్యార్థి ప్రశ్నింపఁబడునెడ నింతవఱ కుఁ జెప్పఁబడిన చారిత్రకాంశములెల్ల సమన్వ యించి సమాధానము వ్రాయవలసియుండును. పదునొకండవ శతాబ్దమునాఁటి రాజనరేంద్రుని వంటి విద్వత్ప్రియులును, విద్వాంసులును నైన మహారాజులచే నాంధ్రదేశము పరిపాలింపఁ బడక పోలేదు. కాని యియ్యేన్నూ ఱేండ్లలో నాంధ్రదేశము నేలిన రాజులకు మనయాంధ్ర భాష మాతృభాషయుఁ గాదు, అభిమాన భాషయుఁ గాదు, ఆరాజులైన పల్లవుల భాష తమిళభాష. అట్లయ్యుఁ బల్లవరాజులు తా మేలుచుండిన దేశములోని ప్రజలభాషను ప్రోత్సహింపవలసిన స్వభావము కలవారనియే తోఁచుచున్నది. క్రీ. శ. ౫౦౦-వ సంవత్సర మునకుఁ బూర్వము—అనఁగా వేఁగీరాజ్యాధి పతులు గాకపూర్వము పల్లవులు కర్ణాటచాళు క్యుల నోడించి వారిరాజ్యమును గొంతకాలము పరిపాలించిరి. ఆకాలములో వారు తమశాస నముల నచ్చటి దేశభాషయైన కన్నడము నందే వ్రాయించిరి. ఆ కాలమునఁ బల్ల వులు కన్నడవాఙ్మయపోషకులై యుండిరని రైసుదొరగారి కన్నడవాఙ్మయ చరిత్రము చెప్పుచున్నది. కాని కర్ణాటకవిచరిత్రయందు మాత్ర మీవిషయము పేర్కొనఁ బడలేదు. కర్ణాటమునుండి వేఁగిదేశమునకు వచ్చినతరు వాత నచ్చటిదేశభాషయగు తెలుఁగున శాస నములు వ్రాయించుటగాని, తెలుఁగును బోషిం చుటగాని పల్లవులు గావింపలేదు. తాము పరి పాలించిన రెండువందలయేండ్లలోఁ గేవల మొక్క మతవిషయమున వారు కృషిసలిపిరి. గాంగవాడినుండి గాంగరాజులును, వారిమిత్రు లైన రాష్ట్రకూటులును, కర్ణాటరాజ్యము నుండి పశ్చిమచాళుక్యులును, పాండ్యదేశము నుండి పాండ్యరాజులును, కళింగమునుండి పూర్వగాంగరాజులును వేఁగీదేశమును గబ ళింప మాటిమాటికి నెత్తివచ్చుచుండుటచేఁ బల్లవరాజు లిందఱితోడను బోరాటములు సలుపవలసిన వారగుచుండిరి. ఈరాజకీయశత్రు వులకుఁ దోడుగ మతశత్రువులైన జైనులు దేశము నాక్రమించియుండుటచేత, వారి బారినుండి బ్రాహ్మణమతమును గాపాడవలసిన కార్య భారముగూడఁ బల్లవులకు విశేషముగా నుం డెను. కావున బాహ్యశత్రువులను, నంతశ్శత్రు

ప్రాచీనసంస్కృతప్రాకృత ప్రయత్నములయందే నిరంతరము నిమగ్నులైయుండిన పల్లవులకు దేశభాషలను బ్రోత్సహింప లేశము నవకాశము లేకపోయెను.

మరి రాజకీయవిప్లవములచే నానాఁటి యాంధ్రదేశప్రజలలో గొప్ప సంచలనమేగాని శాంతియును స్థైర్యము నుండియుండదు. జైనమతావలంబనము వలనను రాజాజ్ఞలు-వానిపైఁ బ్రజలలో భిన్నాభిప్రాయములు-అంతరంగికసభలు - బహిరంగసభలు - వివాదములు మున్నగు విషయములతోడనే నాఁటియాంధ్రదేశప్రజలు కాలమును గడపుచుండిరి. దీనికిఁ దోడుగఁ బ్రభుత్వ మేక్షణమున మాఱి యెట్టి క్రొత్తప్రభుత్వమువచ్చునో యను నాందోళనములు—గంగచాళుక్య పాండ్యచోళాది ప్రభుత్వములలోఁ దమ కెయ్యది మేలుగూర్చునను చర్చలు—ఆనాఁటి వేఁగినాటి తెనుఁగువారిట్టులే కాలముగడపుచుండిరి. ఇట్టి పరిస్థితులలోఁ బ్రజలకుఁగూడ భాషావాఙ్మయములపై శ్రద్ధ లేకపోయినది.

ఈనైదవశతాబ్దమునాఁటికే యవిభక్తభాషాకుటుంబమునుండి మన యాంధ్రభాష విభక్తమై స్వాతంత్ర్యముగా వ్యవహరించుచుండెననుటకుఁ దార్కాణముగా, శాలంకాయన నందివర్మ పెదవేఁగిశాసనమునందు, "ప్రాలూరు", "కంబురాచెఱువు", "చెంచెఱువు" నను శుద్ధాంధ్రపదములు కానవచ్చుచున్నవి. ఈశాసనము క్రీ. శ. ౪౩౬—౪౫౬ వ సంవత్సరముల మధ్య కాలమున రచింపఁబడినదని కీ. శే. కొమర్రాజు లక్ష్మణరావుపంతులుగారును, మ. రా. శ్రీ మల్లంపల్లి సోమశేఖరశర్మగారునుగూడ నిర్ణయించిరి. పైనిజెప్పిన మూఁడుగ్రామనామములు నీశాసనమునందుఁ బేర్కొనఁబడినవి. వీనిలో కంబురాచెఱువు ఏలూరుతాలూకాలోని కమ్మరచెఱువై యుండునని సోమశేఖరశర్మగారూహించుచున్నారు.* 'కంబురా' శబ్దమునకు మాత్ర మర్థ మూహింపఁదగినది. ఇది కమ్మరపదముగా భావింపఁబడకపోయినను, చెఱువుమాత్రము శుద్ధాంధ్రపదము. 'ప్రాలూరు'అను సమస్తపదమందలి ప్రాలు + ఊరు అను రెండుపదములుఁగూడ నిట్టివే. ప్రాలు అనఁగా బియ్యమని యర్థము.

ఆ. వె.—

పూరిపంటప్రాలు నారికబియ్యంబు
జంబువునఫలంబు శ్రాద్ధకృతికిఁ
గావు............ " భార. అను. 3 ఆ.

ప్రాలూ రనునది † బియ్యాలపేట యను నర్థమిచ్చు గ్రామనామము. టాలెమీ యను భూగోళశాస్త్రజ్ఞుఁడు శాలంకాయన రాజ్యములో 'పాలూరా' రను రేవుపట్టణము కలదని తెలిపియున్నాఁడు. ఈప్రాలూరే పాలూరయిన యెడల, పాలు + ఊరు అనికాని, పాలి + ఊరు అనికాని మనము పదవిభాగము చేసి కొనవచ్చును. రాజుల దానాదికవ్యవహారములలో నొకపాలుగా నిర్ణయింపఁబడినయూరు

* భారతి సంపుటము ౧. సం. ౪. పుట ౧౧౬. † ఈగ్రామము విజయనగరమునకు మూఁడుమైళ్లలో నున్నది.

పాలూరు కావచ్చును. లేదా యట్టిపాలు కల వాఁడే పాలి కావున నాపాలియూరు పాలూరైనను గావచ్చును. మూఁడవది యగు చెంచెఱువుగ్రామనామము మొదట చెంచు + చెఱువై యుండి క్రమముగాఁ జెంచెఱువై యుండును. రెండు సమానవర్ణము లొకదాని పై నొకటి యుచ్చరింపవలసి వచ్చినప్పుడు వానిలో నొకటి యుచ్చారణలో లోపించు చుండుట వ్యవహారప్రసిద్ధము. చెన్నప్పపట్టణము చెన్నపట్నమైనట్టులే చెంచుచెఱువు చెంచెఱువు కావచ్చును. లేదా చెన్నుఁడను వానియొక్కగాని, చెన్నఁడను వానియొక్కగాని చెఱువు చెంచెఱువగుటకుఁగూడ నవకాశ మున్నది.

చెన్న + చెఱువు }
చెన్ను + చెఱువు } = చెంచెఱువు.

మన్ను=మంటి, కన్ను=కంటి మున్నగు పదములలో ద్విత్వ నకార మనుస్వారముగా మాఱుచుండుట ప్రసిద్ధము. ద్విత్వ నకారములేగాక, పనిచి = పంచి, అనిచి = అంచి మున్నగుపదములలో నద్విత్వనకారములు గూడ ననుస్వారము లగుచున్నవి. అందుచే చెన్ను చెన్నలచెఱువులలో నేచెఱువునకైనను 'చెంచెఱు'వను రూపమేర్పడుటకు సంశయ ముండదు.

ఈ పెదవేఁగిశాసనమునందలి తెనుఁగుగ్రామనామముల యవయవార్థముల నెట్లెన్ని విధములఁ దర్కించినను గూడ నయ్యవి యచ్చ తెనుఁగుమాటలే యగుచున్నవి. క్రీ. శ. ౪౬౯-వ సంవత్సరప్రాంతమునాఁటికే తెనుఁగు మాటల కిట్టి పరిశ్వహూఁము లేర్పడియుండి నప్పుడు, ౫-వ శతాబ్దమునకు నుఱ్ఱిరెండు మూఁడుశతాబ్దముల పూర్వమునుండియైనను ద్రవిడభాషలలో నాంధ్రభాష స్వతంత్రప్రవృత్తి ప్రారంభించి యుండునని భాషావేత్త లూహింపకపోరు.

తమిళవాఙ్మయము

మత రాజకీయ విప్లవతరంగములు నెదు రీఁదుచుండిన పల్లవరాజులు ప్రజాభాషనే గాక తమ మాతృభాషను గూడ నుపేక్షించిరనియే చెప్పవలసియున్నది. పల్లవపరిపాలనమునఁ దమిళవాఙ్మయ మున్నతిగాంచిన జాడలు గానరావు. తమిళవాఙ్మయచరిత్రములో, క్రీ. శ. ౬-వ శతాబ్దము వఱకు జైనయుగముగాఁ బేర్కొనఁబడినది. క్రీ. శ. ౫౦౦ మొదలు ౯౫౦ వఱకు బ్రాహ్మణయుగము. ఈ కాలములో 'తేవారమ్', 'తిరువాచకమ్', 'తిరువాయ్‌మొళి' మున్నగు భక్తిరసప్రధానము లగు యక్షగానములు వ్రాయఁబడినవి. ఆరేడు శతాబ్దములలోఁ దమిళవాఙ్మయమునఁ జెప్ప వలసినవి వ్యాసములు—కరపత్రములు—చిన్న చిన్న పద్యములు మాత్రమే. (A period of essays, pamphlets and short poems) మఱియు 'నాలడియార్'అను చతుశ్శతపద్యగ్రథిత మగు నొకగ్రంథమును మధురానగరమునఁ బూజ్యపాదశిష్య స్థాపితమైన దిగంబరసంఘమునందలి జైనులు వ్రాసినట్లు వాడుక. కాని యేత ద్గ్రంథకర్తృత్వకాలాదికములు సంశయగ్రస్త

ములు. ఒకప్పుడు మహాక్షామము సంఘటిల్లుటచే నెనిమిదివేలమంది జైనులు పాండ్యరాజుకడకుఁ బోయి వాని నాశ్రయింప, నారాజు వారల నాదరించి స్థానము లిచ్చి పోషించుచుండెనఁట. కొంతకాలమునకుఁ గాటకము తొలంగినంతనె, జైనులు తమతమ స్వస్థానములకుఁబోవ ననుజ్ఞవేఁడ రాజు వారి సాంగత్యమును విడువలేక, వారికిం బోవ సెల వీయనందున జైనులు చేయునది లేక యొక్కొక్కరొక్కొక్క పద్యమును వ్రాసి తమ స్థానములయందుంచి రాజుతోఁ జెప్పకయే వెడలిపోయిరఁట. ఆవార్త పాండ్యరాజు విని జైనులయం దాగ్రహించి, వారు వ్రాసిపెట్టిన పద్యములను, దెప్పించి వానిని వైగైనదిలోఁ బాఱవేయింపనందు నాలుగువందల పద్యములు మాత్రము నదీనాశ మొందక తీరము చేరుకొనెనఁట. ఆపద్యసముదాయమే నాలడియారను గ్రంథము.

పల్లవులే గాక తమిళులైన పాండ్యచోళాదిప్రభువులుఁగూడ నీకాలములోఁ దమ వాఙ్మయమునకుఁ బోషకులైన జాడలు గానరావు. కాని కన్నడాంధ్ర వాఙ్మయములకంటెఁ దమిళవాఙ్మయము మిక్కిలి ప్రాచీనమనియే కొంతకాలమువఱకు భావింపఁబడుచుండెను గాని యిటీవల నీవిషయములో నభిప్రాయభేదములు కలిగినవి.—

"But now it is challenged by critical scholars both Indian and European on the ground that it is full of improbabilities and inconsistancies, and draws too much on the marvellous as it gives an incredible longevity to each poet and prince who had any thing to do with the Sangams. They believe that these Academies must have been the fragments of some poetic imagination akin to that of Vellala Senan in his Bhoga-prabandham".

S. P. P. Tam-Lit.

### కన్నడవాఙ్మయము

ఈకాలమునఁ బ్రసిద్ధులైన రాజులలోఁ బల్లవపాండ్యచోళప్రభువులు తమిళులైయుండఁ జుట్టుప్రక్కలంగల తక్కినరాజ్యములయందైన నాంధ్రభాషను మాటాడునట్టిగాని, మన్నించినట్టిగాని రాజు లుండినజాడలు గానరావు. వాతాపినగరాధీశ్వరులైన పశ్చిమచాళుక్యులు- గాంగవాడిరాజ్య మేలుచుండిన గంగరాజులు- మాల్యకేతనము రాజధానిగ మహారాష్ట్ర మేలిన రాష్ట్రకూటులు-ఈకాలమందే యొకప్పుడు వాతాపిరాజ్యాధీశ్వరులైయుండిన కదంబులు మున్నగు మండలేశ్వరులు కన్నడమును వాడుకొనుచుండినవారేగాని యాంధ్రభాషతో లేశమును సంబంధించినవారు కారు. కన్నడవాఙ్మయచరిత్రలో నీరాజులందఱుఁ గన్నడ వాఙ్మయపోషకులైనట్లు చెప్పఁబడుటయు, దీనికిఁదోడుగ వీరు తమశాసనములను గన్నడభాషయందు వ్రాయించుటయు నీరాజులందఱిభాషయుఁ గన్నడమే యని నిర్ణయించుచున్నవి. మఱియు నీరాజ్యాధీశ్వరులు జైనమతస్థులేయని దక్షిణహిందూదేశ జైనమతచరిత్రము చెప్పుచుండుటకూడ వీరిభాష కన్నడ

భాషయను విషయమును మఱింత బలపఱచుచున్నది.

ఐదారు శతాబ్దములలో రచింపఁబడిన కన్నడగ్రంథ మొక్కటియైన నింతవఱకు లభింపనందున నీరాజ్యాధీశ్వరులు ప్రోత్సహించిన వాఙ్మయమెట్టిదో నేఁటికిని గన్నడవాఙ్మయ చరిత్ర మెఱుఁగదు. గ్రంథములు గానరాకున్నను నిక్కాలమునకుఁ జెందిన కొందఱు పండితకవుల పేరులుమాత్రము వినవచ్చుచున్నవి. అట్టివారిలో ముఖ్యముగాఁ బేర్కొనవలసినవాఁడు గంగరాజైన దుర్వినీతుని యాస్థానకవియగు పూజ్యపాదుఁడు. ఇంతకుమున్నే యీతనింగూర్చి కొంత తెలిసికొంటిమి. శ్రీవర్ధదేవుఁ డను నొక కర్ణాటవిద్వత్కవి 'చూడామణి' యను నొక మహాశాస్త్రగ్రంథమును వ్రాసినట్లును, ఆఱవశతాబ్దమువాఁడైన దండి మహాకవి శ్రీవర్ధదేవకవిని మిక్కిలి శ్లాఘించినట్లును గన్నడశాసనములవలనఁ దెలియుచున్నది. చూడామనియను నీమహాగ్రంథము మూలమున నైదారు శతాబ్దములలోఁ దమ భాష మిక్కిలి యౌన్నత్యము వహించినదని కన్నడచరిత్రకారులు వాకొనుచున్నారు. మఱియుఁ దొమ్మిదవశతాబ్దమున రచింపఁబడిన 'కవిరాజమార్గ'మను లక్షణగ్రంథమునుబట్టి యైదాఱు శతాబ్దములలోఁ గన్నడభాష కావేరీ గోదావరీనదులకు మధ్యనున్న దేశమునందంతటను వ్యాపించియుండెననియు, ననేక కన్నడ గ్రంథములు రచింపఁబడెననియుఁ దెలియుచున్నది. ఒక్క తమిళభాషకుమాత్రమే యగ్రస్థానమిచ్చి తక్కిన ద్రవిడభాష లన్నింటికంటెఁ దమ కన్నడమే మిక్కిలి ప్రాచీనభాషయని కర్ణాటపండితులు వ్రాసికొనుచున్నారు.

## సంస్కృతవాఙ్మయము

ఈ యుగమునందలి సంస్కృతవాఙ్మయములో ముఖ్యముగాఁ బేర్కొనవలసినది భారవి కిరాతార్జునీయము. క్రీ. శ. ౪౭౦ ప్రాంతమువాఁడైన పూజ్యపాదుఁ డిందలి పదునైదవ సర్గకు టీకాకారుఁ డగుటచే నిమ్మహాకావ్యమింతకుముందే రచింపఁబడియుండవలయును. లేదా, భారవిపూజ్యపాదులు సమకాలికులైనఁ గానచ్చును. తననాఁటి కావ్యమునకుఁ దాను టీక వ్రాయుటయే గాక, యయ్యది యొక మహాకార్యముగా భావించి పూజ్యపాదుఁడు శాసనమునందుఁ గూడ వ్రాయించుకొనుటచేఁ గిరాతార్జునీయము పూజ్యపాదునినాఁటికే దక్షిణహిందూదేశమున విశాలకీర్తిమంతమయ్యెనని తెలియుచున్నది. కావ్యము రచింపఁబడిన కాలమునకును, నయ్యది యత్యధిక కీర్తివిశ్రాంతమైన కాలమునకును మధ్యఁగొంత వ్యవధి యుండవలయునని యూహించుటయు సమంజసమే. అట్టియూహంబట్టియైనను భారవి యైదవశతాబ్దము ప్రారంభమువాఁడైనఁగావలయునుగాని నాలవ శతాబ్దములోనివాఁడు మాత్రము కాఁడు. చరిత్రకారులు భారవికవి నైదవ శతాబ్దమునందే యేదోయొక చరణమునఁ జేర్చుచుండిరేగాని నాల్గవశతాబ్దమువాఁడని వ్రాయలేదు.

'భారవే రర్థగౌరవ'మ్మను లోకోక్తికి మూలమైన మహాకావ్యమగు కిరాతార్జునీయ మీకాలమున రచింపఁబడినదేయయ్యె సంస్కృతవాఙ్మయచరిత్రమున నైదారు శతాబ్దముల కాలము గద్యయుగమని చెప్పవలసి యున్నది. అల్పసంఖ్యాకములైన సంస్కృత గద్యకావ్యములలోఁ బ్రథమగద్యకావ్యమని చెప్పఁదగు దశకుమారచరిత్ర మీయుగము ననే రచింపఁబడినది. కవిలోకవిఖ్యాతుఁడగు దండి వ్రాసిన యీదశకుమారచరిత్రము నే పదుమూఁడవ శతాబ్దమునాఁటి యాంధ్రకవి కేతన తెనుఁగునఁ బద్యకావ్యముగా వ్రాసి,

"పరగదశకుమారచరితంబుఁ జెప్పిన
ప్రోడనన్ను వేత పొగడనేల."

అని చెప్పికొని యభినవదండియను ప్రఖ్యాతిఁ గాంచెను. పరిశోధకు లాచార్యదండిని క్రీ. శ. ౫౫౦-౬౫౦ సంవత్సరములమధ్య నుండిన వానిగా నిర్ణయించిరి. ఈతఁడు దక్షిణదేశస్థుఁడు. ఇంతవఱకు సామాన్యభావములతోఁ జిన్నచిన్నవాక్యములనొప్పుచుండిన సంస్కృత గద్య దండిచేత నూతనగౌరవమునొంది దశకుమారచరిత్రమున నుద్భావసంపన్నతయు, ననల్పకల్పనాశిల్పమును, బదలాలిత్యమును, సాహిత్యప్రసిద్ధియుఁ గాంచినది. కావ్యములయందే గాక శాసనములయందుఁగూడ,

"ప్రతాపాతిశయానమిత సమస్త సామన్త చూడామణిప్రభామఞ్జరీపుఞ్జరఞ్జితచరణో..."

అను నిట్టివాక్యములచే సంస్కృతగద్యరచన యొకదశనుండి వేఱొకదశ నొందినతీరు గానవగును. దండినాఁటికి సంస్కృత వచన రచన కొకవిధమైన క్రొత్తమార్పు కలిగిన దనియు, మహాప్రౌఢగద్యకావ్యకారు లైన బాణసుబంధాదులకు దండి పూర్వుఁడై యుండవలయు ననియుఁ బరిశోధకు లీవిధముగ నిర్ణయించుచున్నారు.*

"He appears to have been one of the pioneers who introduced the new style of writing. Of the three romantic prose compositions, the Dasaka, the Kadambari and the Vasavadalta, the Dasaka seems to be the earliest production. The style of Subandhu and Bana is more artificial and elaborate, that of Dandin is not often of a high poetical elevation, as he does not aim to produce a work purely poetical, but to offer an example of classical prose composition written in a language simple elegant and intelligible. Our author belonged to that period of sanskrit literature, when style was in a transitional state, being developed from the simple to the complex and the elaborate. Had Dandin lived after Bana his work could not but have received some tinge from the writings of his predecessor. His description of Rajahamsa, of the hero and heroine of the education of prince Rajahvahana etc. could not have been so tame, terse and unornamental as it is. Hence we consider

* Introduction to Dasakumaracharitram, by M. R. Kale.

that there are reasonable grounds for placing our author before Bana and Subandhu".

దండి వ్రాసిన రెండవగ్రంథము కావ్యాదర్శమను లక్షణశాస్త్రము. ఆచార్యదండి భారవికవికి మనుమఁడనియు, కాంచీపురములోఁ బల్లవరాజుల యాస్థానపండితుఁడైయుండి రాజకుమారులకుఁ బాఠములు చెప్పుచుఁ కావ్యాదర్శము వ్రాసెననియు వాడుక. ఇదియే నిజమైనయెడలఁ బల్లవరాజులు సంస్కృత వాఙ్మయమును బోషించిరని చెప్పవచ్చును.

"According to that work (Avanthisundari katha) Bharavi flourished at about 570 A. D.; so Dandin who was Bharavi's great grandson, who was a court-poet of Pallava kings of Kanchi will have to be placed at about 650 A. D."—M. R. Kale.

---

# అలంకృతి

పండిత శ్రీపాద సుబ్రహ్మణ్య శాస్త్రిగారు

నూనె రాసితి నిగనిగ లీనఁ గురుల
కది పసందు; బులాకి నాసాగ్రమందుఁ
బదిలపఱచితి కళ లీన నది సెబాసు;
శ్రవణయుగ్మ మపూర్వసంపద వహింప
నమరిచితి ముద్దుగా దుద్దు లది బలారె;
కనులఁ గాటుక నిడితి దృగ్బాణములకు
నొదవఁ దరళాక్షి! నైశిత్య మదియు బాగు;
దిద్ది తీరిచి కస్తూరితిలక మిడితి
నుదుటఁ గలకలలాడంగ నదియు మేలు;
కూర్చితి విడెమ్ము రక్తిమ కొసరి కొసరి
రమణి! రుచు లూర బింబాధరమ్మునకును
అది మరీ మేలు;—కాని—అత్యంతనిపుణ
వీవు మండనవిధులఁ—గాని—కపోల
ఫలకముల కిట్లు బంతిలో బాల పత్ర
మేల? అయ్యో! కడుంగడు జాలి వాడము;
అయిన గతము విమర్శించు టనుచితమ్ము;
తిరుగ నీవె కైసేయఁ బ్రతిష్ఠ సెడును;
ఇంతమాత్రపు లోపాని కేమి యనినఁ
జిల్లిగవ్వకుఁ గాదు చేసినది యెల్ల.
పీఁకుచునె యుండు లోపమ్ము విశదపడిన
పిదప సవరించుకొనకున్న హృదయ మెపుడు;
కోరి కన్నులు మన కిష్టె కూర్చినట్టి
మైత్రి పాటింపకుంట ధర్మమును గాదు;
కాన దయ యుంచి, నామైత్రి గారవించి,
చూపు లటె నిల్పి, హృదయమ్ము చూరలిచ్చి,
యింతి! మొగ మోరసేయు మొక్కించుకంత
మురిపె మిగురొత్తఁ గమ్మని ముద్దు లంతు.

---

# విజయవిలాస వ్యాఖ్యాన విధానము

ఆంధ్రవిశారద, తాపీ ధర్మారావుగారు, బి.ఏ.

## ౨

మహీపురాధిపతి యగు మలయధ్వజక్షితీశునికుమారి చిత్రాంగిదను గాంచి, హృదయంబునఁ బొడమిన యనురాగంబున నర్జునుండు తన్ముఖసౌందర్యంబును మెచ్చికొనుచు,

> కన్నె నగుమోముతోడన్
> పున్నమచందురుని సాటిఁబోలుపవచ్చున్
> నెన్నుదురుతోడ మార్కొని
> మున్నందఱుఁజూడ రేకమోవక యున్నన్.

అని వర్ణించెను. జూలూరు అప్పయ్యపంతులుగారు, వేదము వేంకటరాయశాస్త్రిగారు నీపాఠమునే యంగీకరించిరి. నోరి గురులింగశాస్త్రిగారును, తిరుపతి వేంకటేశ్వరకవులును నాల్గవచరణమును

'మున్నందఱుఁ జూడ రేక మోయకయున్నన్.'

అని పఠించిరి. 'మోచు' ధాతువు, 'మోయు' ధాతువు నొక్క యర్థముగలవి గావున పాఠభేదము నంతగఁ బరిగణింప నక్కఱలేదు. (బహుజనపల్లి సీతారామాచార్యుల వారును జూలూరివారిపాఠమునే యంగీకరించిరని ముందుముందు తెలియఁగలదు.)

ఈపద్యమునకు వ్యాఖ్యానము వ్రాయుటయందెల్ల వ్యాఖ్యాతలును బాలకష్టమును గాంచిరనుట సత్యము. కావున విమర్శనవిధానమును, వ్యాఖ్యానసౌష్ఠవమును, నామూలమునఁ, గవిగభీరహృదయమును గరతలామలకముగ నెఱుంగుట కాయావ్యాఖ్యానముల నిట నుదాహరింపవలసియున్నది.

జూలూరు అప్పయ్యపంతులుగారు రచించిన వ్యాఖ్యానమిట్లు గలదు:—

"కన్నె నగుమోముతోడన్ = యీకన్నెపడుచుయొక్క నవ్వుగల ముఖముతోటి, పున్నమచందురుని = పౌర్ణమినాటి చంద్రుణ్ణి, సాటిబోలుపవచ్చున్ = గాఁదుపోలిక సేయవచ్చును: నెన్నుగురుతోడ మార్కొని = శ్రేష్ఠమైన నొసటితోటి యెగుర్దొద్దారించి, మున్ను = మొదటను, అందరు గూడ = సమస్తమైనవారయున్ను చూచేటట్టుగా, రేకమోవకయున్నన్ = రేక యనగా జాబుకమ్మ, అది మోసేపనికి యేర్పడకపోయినట్టయితేను;

అనగా, యీచిన్నదాని నొసటితో ప్రతిఘటించి సమానముకాలేకవోడిజాబులుమోసే'హర్కార' వాడయినాడని యర్థము.

మొదట మాసాదియందు రేఖాకృతి వహించినాడని భావము."

వేదము వేంకటరాయశాస్త్రిగారీపద్యమున కిట్లు వాఖ్యానము నొసంగిరి:—

"కన్నె = కన్యకయొక్క, నెన్నుగురుతోడన్ = శ్రేష్ఠమైన లలాటముతో, మార్కొని=ఒద్దారించి, అందఱున్ చూడన్ = ఎల్లవారియెదుట (అనఁగా బట్టబయలైన యవమానమునకు పాలై) రేక మోవకయున్నన్ = జాబుమోయుపనిని (తపాలానౌకరీని) చేయకున్నయెడల.

నెన్ను...న్నన్ — విదియనాఁడు సాయంకాలమున ఎల్లవారును చంద్రరేఖను అభిముఖముగా చూచుట ప్రసిద్ధము."

ఇంక నోరి గురులింగశాస్త్రిగారన్నచో తక్కిన భాగమునకు దాదాపు పట్టి యర్థమునే యొసంగి,

"రేకమోయక=రచ్చనుపొందక"

అని యర్థమునిచ్చి, తాత్పర్యమున 'పూర్వముఖాలభాగముతో ఎదుర్కొని యెల్లవారును చూచుచుండఁగా రచ్చనుపొందకున్నయెడల చంద్రుఁడు ఆకన్నెయొక్క ముఖముతో సమానమని చెప్పవచ్చును' అని వ్రాసిరి.

రచ్చయను పదమునకు సీతారామాచార్యులవారి శబ్దరత్నాకరమునందు (౧) రాజమార్గము, (౨) మంటపము, (౩) సభ, (౪) గోష్ఠి, (౫) కలకలము, (౬) కలహము అను నర్థములు గలవు. ఇందెద్దియుఁ బద్యమునకనుకూలార్థము నొసంగకుండుట విదితము. గురులింగ శాస్త్రిగారు రచ్చకు అవమానము అను నర్థము నూహించియుందురు. లేదా, కలహము అనుదానివలన స్ఫురించునని తలంచియైన నుందురు. ఎట్టులనయిన 'రేకమోవక యున్నన్' అనుపదము లవమానసూచకములనియే యం దఱు వ్యాఖ్యాతలును భావించుట నిశ్చయము. అయిన నీయవమానార్థము నెట్టు సాధించిరో చూడఁదగును.

ముఖమునందలి యొకభాగమయిన వెన్నుదురుతోడఁ గొన్ని దినంబులకుఁ బూర్వము చంద్రుఁడెదురొడ్డి బహిరంగముగ నవమానము నందెను. ఆ పురాతనపుఁ గొలంత యుండుటచేతఁ బున్నమనాఁటిచంద్రుని చిత్రాంగదనగుమోమునకు సాటి చేయుటకు వలనుగాకున్నదని యని పద్యసారమును గ్రహింపవలయును. అవమానమును సూచించుపదము 'రేకమోవకయున్నన్' అనునది. చేమకూర వేంకటరాజకవి యాచారమునుబట్టిచూడ నీ 'రేకమోవకయున్నన్' అనుపదములయం దానాఁటి చంద్రునికి సహజ సిద్ధమగు గుణమును, నర్థాంతరమువలన తిరస్కారకారణమగు నవమానమును గలుగవలయునుగదా! కొన్నిదినంబులకుఁ బూర్వము, అనఁగా విదియనాఁడు చంద్రుఁడు రేఖాకృతినిఁగాంచి,-రేకమోసి,-యుండును. అప్పటిస్థితిలోనే చంద్రుఁడు వెన్నుదురున కుపమానమగును. ఆవిదియనాఁటి చందురు నందఱుఁ జూచుట (చంద్రునకొక్కనూలుపోఁగు నొసఁగుటయు) యాచారము. కావుననే కవి 'మున్ను' అనియు 'అందఱుఁ జూడ' ననియు సాభిప్రాయముగఁ బ్రయోగించెను. ఆచారబలంబునఁ జిత్రాంగదయు విదియనాఁటిచందురునిఁ గాంచెను. అప్పుడు చందురుఁడు కన్నె వెన్నుదురు నెదుర్కొనెను. ఇయ్యదియే మార్కొనుటయు,నొడ్డారించుటయు. ఈమార్కొనుటయందుఁ జంద్రుఁ డోడిపోయెను; అవమానమును గాంచెను. ఆయవమానమును 'రేకమోవక యున్నన్' అనుపదములయం దర్థాంతరమున సాధింపవలయును. అట్టిపనికిఁ గడంగి జూలూరు అప్పయ్య దీక్షితులవారు రేక అనఁగా జాబు అనియు, దానిని మోయుట హర్కారా పనిచేయుటయనియు సూచించిరి. బహుజనపల్లి సీతారామాచార్యులవారును తమ శబ్దరత్నాకరంబున 'రేక' యను పదమునకు

> (౧) జాబు; "క. ॥కన్నె నగుమోముతోడం, బున్నమ చందురుని సాటిపోలుపవచ్చున్, వెన్నుదురుతోడ మార్కొని, మున్నందఱుఁ జూడ రేక మోవకయున్నన్"

అని విజయవిలాసమునందలి యీపద్యమునే, యీపాఠముతోడనే, ప్రమాణముగ నొసఁగిరి. బ్రౌనుదొరగారు మహాశ్రమనంది సిద్ధముచేయించిన గ్రంథపదసూచికలను చాలవఱ కనుసరించిన సీతారామాచార్యులవారీయర్థమునే యొసఁగుట వింత కానేరదు. అప్పయ్యపండిత వేంకటరాయశాస్త్రిగార్ల వ్యాఖ్యానములయందలి పర్యాయపదసాదృశ్యమును బట్టియు (ఉ. ఒడ్డారించి), వ్యాఖ్యానరచనాకాలోచిత యత్కించిత్పరివర్తనము బట్టియు (ఉ. ౧౨౩౦ లోని హర్కారా...౧౯౧౫ లోని తపాలానౌకరీ) వేంకటరాయశాస్త్రిగారు జూలూరివారివ్యాఖ్యానము నీక్షించియే యుందురనియు, నాకారణమువలనను, సీతారామాచార్యులవారి యంగీకారమువలనను దా మితరయోజనకుఁ బాల్పడకుండిరనియు నెంచుట సమంజసము.

కాని మార్కొనినవారలలో నోడినవారు హర్కారా పనిచేయుటగాని, యట్లుఁ జేయ నియమితులగుటగాని వ్యవహారసారస్వతముల నెంగును గానరాదు. అంతియకాక యోడినవాఁడు శత్రువు; అనేకరాజ్యాంగ రహస్యములతోడి లేఖలతోఁ బనిగలవాఁడు హర్కారా. రాష్ట్రప్రాణములన్నియు నొక్కొకయప్పుడు హర్కారాచేతిలో నుండఁగలవు. అట్టిప్రధానకార్యమును శత్రుని కంటఁగట్టుదురా? అటుగాక నేఁటితపాలనౌకరీలవలె నూరివారిజాబులను మోయ నియమితులగుదు రందుమేని, యప్పటికి లేఖాహరణ మింతప్రాచుర్యము నంద లేదుగదా! కాదు, కలవన్నను జేయించికొనుట కెన్ని

అని రచించెను. 'శశిమీఁదిన్ రేక రానిత్తునే' యని మఱియొక్కపాఠమునుం గలదు. ఏపాఠమయినను గీఱ-అనఁగా, గంటు-అను నర్థము పొసఁగుచున్నయది.

సూరిమిడిబెంకయ్యగారు రచించిన యాంధ్రదీపిక యందు రేకయన గీఱు అని యర్థముగలదు.

బ్రౌనుదొరగారు వ్రాయించిన నిఘంటువునందు

'రేక—line, stripe, streak, రేఖ, గీఱు'

అనియున్నది. దీనినంతటినిఁబట్టి చూడ నాదినములలో రేకమోచుటయనునది యుద్ధవీరుల వ్యవహారమునందుండె నని యూహింపఁదగియున్నది. కావున మనపద్యమునందలి చంద్రుఁడు 'రేకమోపకయున్నన్' అనఁగా, గీఱను—దానికి కారణముగ దెబ్బను, గంటును—పొందకయే యుండిన యెడల సంపూర్ణుఁడయియుండు పున్నమ నాఁడు చిత్రాంగద నగుమోముతోడ సాటిసేయుటకుఁదగియుండ వచ్చును. విదియనాఁడు చంద్రుఁడుండియుండు నాకారమునకును, యుద్ధమునంగు(మార్కొనుటయందు)బొందఁదగిన యవమానమునకును రేకమోచుట యనుగుణముగ నుండి హృదయంగమమగుచున్నది.

అయినంతమాత్రమునఁగలిగిన ప్రయోజనమేమి? కవికిఁగల గభీరభావమేమి? అని ప్రశ్నింపక తప్పునా? యూహింపముగాక. ఒకనాఁడు చిన్నవాని నెదుర్కొని దెబ్బతినినవాఁడావలఁ దా నెంత కృషివికాసము నందినను పెద్దవారితోడ సాటికి రానేరఁడనుట లోకసాధారణము. విదియనాఁ డంపఱు మోచుచుండెఁగా ముఖమునం దొక భాగమునునుదుటితోడ నొడ్డారించి యవమానముపాలయినవాఁడు గావునఁ, బున్నమనాఁటికిఁ దానెంత పరిపూర్ణవికాసముగాంచినవాఁడయినను ఎల్లపుడు నవ్వుచుండునట్లేయుండు సంపూర్ణమగు ముఖముతోడ సామ్యమునందఁ జంద్రుఁడు తగఁడు. లోకధర్మమిదు లిట్టి యవమానదూషితుని నెనగా గణియింపఁజూడరు. ఒకనాఁటినికృష్టావమానము వీరున కామరణమును గొఱంతయే గదా! దీనినిఁ బట్టిచూడఁగవి యీపద్యమున రెండువర్ణనలను గావించిన యట్లు గానవచ్చును ౧. చిత్రాంగదనెన్నుదురు విదియచందురు నవమానముపాలునేయుచున్నది. ౨. కన్నెనగు మోముతోడఁ బున్నమనాఁటి చంద్రుఁడును సాటికానేరఁడు. రెండవవర్ణనల నిట్లుజోడించుటయు నీకవికొకవినోదము. చూడుఁడు:

"రవరవలు నెఱపునీలపు
ఁబగఁగనంబుననుఁ జెలి యరాళకనంబుల్
కవకవనవ్వఁ జలిజ
క్కవకవ కలకంఠకంఠకఠినకుచంబుల్."

చక్కని యనుప్రాసముతోడనే సహృదయుల నానందింపఁదగిన యీపద్యమునఁ దలవెండ్రుకలయందలి వంకరలను (నెఱులనుట), నైల్యమును నను రెండుప్రధానోత్తమగుణములను గవివర్ణించెను. అట్లులనే స్తనములయందు గణనీయములగు వర్తులాకార కాఠిన్యగుణములు వర్ణితములయ్యెను. అంతియకాదు, కచములు అరాళములు, వంకరలుగలవి, కుటిలములు; కావుననే లోచనానందకరమగు నింద్రనీలమణుల ప్రకాశమును గాంచి రవరవలు నెఱపి కంటగించుట. అట్లులనే యనురాగాస్పదములగు జక్కవజంటనుగాంచి కవకవనవ్వి హేళన చేయునట్టి కుచములు కఠినములు (దాక్షిణ్యభావరహితములు) గదా! ముక్కలుచెక్కించికొని రవ్వలయిన యింద్రనీలములను గాంచి యవిచ్ఛిన్నశోభ నలరారు కచములును, సంజలనొండొంటింబాయు చక్రవాకయుగ్మముంగాంచి జంటఁబాయకసతతమునుండు కుచములును నీసడించుటయు సహజమేయగును. ఇట్టుల నొక్కపద్యమున నింతభావము నిముడ్చుకవి'కన్నెనగుమోము' పద్యమున నట్లు చేసెననుట విశేషార్థకల్పనము కానేరదు.

షోడశకళాసంపూర్ణుఁడగు చంద్రుఁడే నగుమొగమున కెన గాకుండుటకుఁ గారణము నాఁడు (విదియనాఁడు) రేకమోచుటయేకదా! చంద్రునందు మచ్చ గలదనియు, నాకారణమునఁ బ్రియాముఖమునకుఁ జంద్రుఁడు సాటిగాఁడనియుఁ గవులు వర్ణించుట చిరపరిచితము. ఒక కవి ముఖవికాసాధిక్యమును గనఁబఱుప నొకచంద్రగహణకాలంబునఁ దనప్రేయసికొసంగిన యుపదేశ మిం దను సంధించిన క్షమింతురుగాక,

"పంకజాక్ష, నేఁటిరేయివినువా
ప్రాచీనభాగంబునన్
శంకాతంకము లేక సాఁదనికనా
సంపూర్ణుఁడౌ చంద్రునిన్
బొంకంబాప్పడఁ జంపు రాహుజెలమిన్
బొంచుండి(డి)యున్నాఁడు; నీ
వింకన్ గస్తురిబొట్టుఁ బెట్టకుము త
ళ్కెంపు, ఫాలభాగంబునన్."

దీనిఁబట్టి నాఁడు జంద్రునిదసనమునకుఁ గారణము కళ్కాంకమని విశదమగును. మాపద్యమునందలి చంద్రుని కానేకవాదములో కలంకమయ్యోనని కవిహృదయము. చంద్రబింబమునందుఁగల మచ్చను గవు లనేకు లనేకవిధముల నుత్ప్రేక్షించియుండుట సారస్వతాభిలాషు లెఱుంగనిదిగాదు. జలనిధిపంకమనుచును, నలవదప్రమింగి నట్టి తమమనుచును, జింకలనేచుపాతకమనుచును దీర్ఘ లీలన్నిను వర్ణించియుండిరి. చేమకూరకవి

'కన్నెత్తమ్ము నరుతోడ మార్కొనిపప్పుడు చంద్రుఁ డగాంచిన దెబ్బ, దినములు గడచినను, మచ్చవలె నంటియున్నది.'

అని యుత్ప్రేక్షించుచున్నాఁడని ధ్వనిత మగుచున్నది. విజయవిలాసకావ్య మిట్టిస్వనములకుఁ బుట్టినిల్లు.

---

# మృతమూర్తి

వేంకట కాళిదాసకవులు (ఆం. గీ. సా. ప.)

బిగిసెడు నీనిశీథమున వెన్నెలరేకయొకండులేదు, చ
క్కఁగఁ దిమిరాలఁ జీల్చికొని కాంతులచూపులఁ దళ్కుతళ్కనగ
మొగుడక యీదరిద్రపథమున్ రుచిరమ్ముగఁ జేయుచున్న చు
క్కగములుతప్ప నా కిచటఁ గన్పడదింతయుఁ గాంతిలేశముగ్.

వింతగఁ దోఁచుచుండెఁ దెలివెల్గుల చిన్నెలులేని యీ నిశీ
కుంతలముల్ వినీలములు గుత్తులుగుత్తులుగా నదీతట
ప్రాంతములన్ గనంబడు విభాతముచూడఁగ నోచుకోక, యీ
గొంతుకకోత మృత్యువునకున్ సమమీ నడిరేయిచీఁకటుల్.

నా కీఁక నీమృషాపథమునన్ ప్రణయార్ద్రవిలోకవాహినుల్
ప్రాకవు నందనప్రసవ వాసిత దివ్యసుగంధమాధురుల్
చేకుర, వంబుదాంతర విలీనతటిల్లతికారుచిప్రభల్
సోకవు కాలమే యిచట స్రుక్కును చీఁకటినీడమూలలన్.

---



జా ల రి

చిత్రకారుడు : శ్రీ జి. హనుమంతరావుగారు, చెన్నపురి.

# పారశీక వాఙ్మయచరిత్ర

మొహమ్మద్ ఖాసిమ్‌ఖాన్ గారు (కవితాసమితి)

## ద్వితీయ ప్రకరణము

### ౧

ఐదవశతాబ్దారంభము నాటికి గజనవీయుల సామ్రాజ్యము పతనోన్ముఖము కాజొచ్చెను. గజనీప్రభువులను తిరస్కరించి సల్జుకీయులు హి. శ. ౪౨౯లో నైషాపురమున తమ పతాకమును నెలకొల్పిరి. సల్జుకీయ ప్రభువులు సర్వామ్నాయులును కళాపోషకులునునై ౧౬౩ ఏండ్లవిచ్ఛిన్నముగ శాంతముగ పరిపాలన మొనర్చిరి.

ఈరాజులకాలమున అన్నికళలతోపాటు కవితయు యౌవనపరిణామమునందెను. సామానీయప్రభువులకును గజనవీయప్రభువులకును బొఖారాగజనీనగరములు రాజధానులు. బొఖారాపౌరులకు తుర్కియు, గజనీపౌరులకు అఫ్ఘనీయు మాతృభాషలు. పారశీ మాతృభాష కాకపోవుటచే అప్పటికవుల శైలి స్వచ్ఛముగను, సహజముగను ఉండక కృత్రిమముగను, కటువుగను ఉన్నది. ఇప్పుడు సల్జుకీయులు పారశీకమునకు హృదయమువలె నున్న నైషాపురమును రాజధానిగా ఏర్పరచుకొనిరి అందుచే ప్రజలకును ప్రభువులకును దగ్గర సంబంధ మేర్పడెను. సల్జుకీయుల కాలములోని కవు లందరకును మాతృభాష పారశీయే అగుటచే వారిశైలి పూర్వపు కవులకన్న మధురతరముగను, సహజముగను, మిక్కిలి జాతీయముగను ఉన్నది.

నాసిర్ ఖుస్రూ, బాబాతాహిర్, అబూసయీద్, అబ్దుల్లాఅన్సారీ, ఉమర్ ఖయ్యామ్, అన్వరీ, నిజామీ—వీరు సల్జుకీయకవులలో ప్రఖ్యాతులు. సనాయీకవి కూడ వీరికి సమకాలికుడు. సనాయీ కొన్నాళ్లు గజనవీయాస్థానము నలంకరించినవా డగుటచే అతనిని సల్జుకీయకవివర్గమున చేర్పనైతిని. సల్జుకీయుల పరిపాలనకాలము పారశీకవాఙ్మయమునకు వసంతోదయము. పారశీకకవితాలతాంగికిశిరోభూషణ మన దగు సూఫీకవిత ఈకాలమందనే ఈభూమి నంకురించి బాగుగ వర్ధిల్లినది. పారశీకవాతావరణము దానిపెంపునకు అనుకూల్యము కల్పించినది.

నాసిర్ఖుస్రూ ఈకాలపు ప్రఖ్యాతకవులలో ప్రథముడు. రాజాస్థానముల నొల్లక ఎనిమిదేండ్లు నిరంతరదేశాటనముచేసి తనజీవితము నంతను మతప్రచారమునకై వినియోగించిన మహాపురుషు డితడు. ఇతడు కొన్నాళ్లు ఖురాసాన్‌పురములో ప్రభుత్వప్రతినిధిగ నుండి, పిదప కేవల కుక్షింభరణజీవితమునెడ నేవకలిగి తన నలుబదవయేట మక్కాయాత్రకు వెడలెను. అక్కడినుండి సిరియా, ఈజిప్టుదేశములు తిరిగి ఎనిమిదేండ్లకు గృహమునకు మరలెను.

కవితవలన ప్రయోజనము కేవలము మనోరంజనము కాదనియు, అది మానవహృదయసంస్కారక మనియు ఇతని ఉద్దేశ్యము. అందుచే ఇతడు స్తుతిపద్యములను, చమత్కారరచనలను, అతిశయోక్తులను తీవ్రముగ ఖండించెను. ఇతనికావ్యములలో రచనాస్వాతంత్ర్యము, అసారసాంకితి గమనింపదగినవి. మతమునందును తన సందేశమునందును ఇతనికి దృఢవిశ్వాసము. తనసందేశమును చెప్పునపుడును, మతమును బోధించునపుడును, ఇతడు నాటిసంఘమును, రాజులను, రాజోద్యోగులను తనకావ్యములలో నిర్భయముగ ఖండించెను. ఇతని దివాన్ (ఖండకావ్యసంపుటి) నిండా ఇట్టి పద్యము లున్నవి.

దివాన్‌కాక మరి ఆరుకృతుల నితడు రచించెను.— ౧. సఫర్ నామా, ౨. రౌషన్ నామా, ౩. సఅదత్ నామా, ౪. జాదుల్ ముసాఫిరీన్, ౫. కౌజుల్ హఖాయఖ్, ౬. అల్ ముస్తాఫీ. ఇవికాక ఖుర్ఆన్‌పై ఒకభాష్యముకూడ ఇతడు రచించెను. పైకావ్యములలో రౌషన్

నామా, కర్నామా అను కావ్యములు నీతిబోధకము లగు ఆఖ్యాయికలు.

ఇతని దివాన్ నుండి ఒకపంక్తిక ఇట ఉదాహృతము:—

"భగవద్వాక్య (ఖురాన్) రత్నములతోను, మెండుగానున్న ముత్యములతోను నిండిన పవిత్రసాగరము.

సముద్రజలమువలె అది పైకి ఉప్పగనున్నను, దాని అంతరంగము జ్ఞానికి అమూల్యాసాత్త్వికము.

కడలిలోతులలో నిగనిగ మెరయు రత్నములును, ముత్యములును ఉన్నవి. నీవు కుశలివగుదేని ఇంకబడ్డుకు తునె చమత్కారమిమ్ము.

నీహృదయ మహాయాద్వేషములచే నిండినదగుటచే నీచేతికి ఉప్పనీరు తప్ప నుదేదియు రాలేదు.

బాహ్యమునుండి అంతర్విశ్వమును చేరుటకు ప్రయత్నింపుము. ఖరమువలె మందబుద్ధివికాక తీవ్రకృషి సల్పుము."

## ౨

సనాయీ, బాబాతాహిర్, అబూసయీద్, అబ్దుల్లా అన్సారీ, నిజామీ, ఉమర్ ఖయ్యామ్ మున్నగు కవులందరును సూఫీలు. ఇప్పటినుండి సాధారణముగ పారసీకకవులందరును సూఫీలే. అందుచే సూఫీమతమును గురించి ఇచ్చట ఇంచుక ప్రసంగించు టుచితము.

'సూఫీ' అన 'కంబళినిధరించువాడు'. ఐహిక భోగములను విసర్జించుమని ప్రవక్తఆదేశము. ప్రవక్త పిదప నూరేండ్లవరకు ప్రజలు నిరాడంబర నిర్మల జీవితముల గడుపుచుండిరి. రెండవఖలీఫాఅగు ఉమర్ కంబళినే జుబ్బాగా కుట్టుకొని ధరించువాడని చరిత్రప్రసిద్ధము. కాని తరువాత తరువాత సంఘమున ఐహికేచ్ఛలుప్రబలి ఆడంబరజీవితమునకు ప్రజ అలవడసాగిరి. ఐహికేచ్ఛలకు లొంగక నిరాడంబరులై చరించువారికి సూఫీలని పేరు వచ్చెను.

ఆదిమసూఫీలనుగురించి జామీ ఇట్లు చెప్పుచున్నాడు:—'సూఫీలలోఅబూహాషిమ్ప్రథముడు.ఈయన అరేబియాలో జన్మించినను తనజీవితకాలము నంతను పారసీకప్రదేశమున గడిపెను. తరువాత 'దున్నూన్', సూఫీమతసిద్ధాంతములను బోధించెను. అతని పిదప బాగ్దాదు పురవాసుడగు 'జునైద్' ఆసిద్ధాంతములను గ్రంథరూపమున వెలువరించెను. షిబ్లీ వానిని బహిరంగముగ ఉపన్యసించెను. ఇబ్రాహీమ్అదిమ్, దావూద్, ఫుదైలిబిన్ ఇయాజ్, మఅరూఫ్, రాబియా—వీరు తొలిప్రఖ్యాత సూఫీకవులు.

ఆదిమసూఫీలు కేవలము వరాగులు. గురుపరంపరాగతములైన ప్రవక్తగుప్తసిద్ధాంతములను వారు తమ శిష్యులకు బోధించుకొనుచు తపోనిరతులై యుండిరి. బహుదైవతారాధనమునకు ప్రతికూలముగ ప్రవక్త ఉపదేశించిన ఏకేశ్వరోపాసనమును, ద్వైతతత్త్వమును నాటిపండితులయందును, ప్రజలయందును దృఢముగ నాదుకొనియుండెను. బహుదైవతారాధనపరులై అజ్ఞానకూపమున పడియున్న నాటి ఆదేశపు ప్రజలకు ప్రవక్త సామాన్యజ్ఞానదుర్గ్రాహ్యమగు అద్వైతతత్త్వమును బహిరంగముగ బోధించలేదు. 'నీవు బోధించువారి మేధాశక్తికి ఉచితమగురీతిని బోధించుము' అని ఆయన ఉపదేశము. ఆయన భావిని గ్రహించెను. పరమేశ్వరైక్యమున ప్రవర్తించిన బుద్ధి క్రమముగా అద్వైతమునకు పరిణమించునని ఆయనకు తెలియును:

> "సర్వాజీవే సర్వసంస్థే బృహంతే తస్మిన్హంసో భ్రామ్యతే బ్రహ్మచక్రే,
> పృథగాత్మానం ప్రేరితారంచ మత్వాజుష్టస్తత స్తేనామృతత్వమేతి."

(ఈశ్వరునకు తాను భిన్నుడననుకొని జీవుడు, ఎన్నిటికి జీవనరూపమును, లయస్థానమును, విస్తారమును అగు ఈబ్రహ్మచక్రమున తిరుగుచున్నాడు. అట్లు ద్వైతభావముతో భగవంతుని సేవించి 'నేనే బ్రహ్మస్వరూపమైతిని' అని తన్నుతాను తెలిసికొని అమృతత్వమును బడయుచున్నాడు.) అని శ్వేతాశ్వతరోపనిషత్తు. ఇట్టి పరిణామమునే ప్రవక్త అభిమతించెను. ఈపరిణామఫలము సూఫీమతము.

ఆత్మ పరమాత్మతత్త్వము దురవ్బోధ మనియు, ఆజ్ఞానము స్వయంకృషిచేగాని లభ్యము కాదనియు ప్రవక్త చెప్పెను. 'ఆత్మయననేమి?' అని ఆయన నొక రడుగగా, 'అది భగవంతుని ఒకఆజ్ఞ' అని ఆయన ప్రత్యుత్తరము. 'సృష్టిప్రకారమును చెప్పుడు' అని మరి యొక రడుగగా 'సఊఖ్లత లోకాన్ను సృజాఇతి,... సఇమాల్లోకానసృజత' అనునట్లే 'కున్‌ఫయకూన్' (సృజించుదునుగాక అని సంకల్పించగా సర్వసృష్టియు నాయెను) అని ఆయన ప్రతివచించెను. మానవుడు సహజముగ జిజ్ఞాసువు. జంతుప్రపంచమున లేని ఈ మహద్గుణము మానవజాతియం దుండుటవలననే మానవ జాతి జంతుజాతికన్న నగ్రగణ్యమైనది. మానవుడు దేని నైనను చూచి ఊరుకొనలేడు. 'ఇది ఏమి' అని తర్కిం చును. అతనిబుద్ధికి అనుగుణమగు సమాధానమే అతనిని తృప్తిపరచును. పైరెండు ప్రశ్నలకును ప్రవక్త యొసగిన ప్రత్యుత్తరములు సమాధానములు కావు; ప్రహేళికలు. ఆప్రశ్నలకు జవాబు "తపసా బ్రహ్మ విజిజ్ఞాసస్వ" అనియే.

ఇట్టితాపసి సూఫీ. 'కోఒహం? ముక్తిః కథం? కేన సంసారం ప్రతిపన్నవాన్?'—వీనిసమాధానముల నతడు అన్వేషించినది. ఈప్రశ్నలకు బాహ్యమతము చెప్పిన సమాధాన మిది:—'నీవు దేవునిచే సృజింపబడిన ఒక వ్యక్తివి. దేవుడు నీప్రభువు. నీ వాతనిసేవకుడవు. ఆ దేవుని మానసికముగ ప్రార్థించి, మతవిధులను నెర వేర్చుచు, నిషిద్ధముల దరిచేరక నీతిమార్గమున చరించిన ముక్తి కలుగును. అట్లు కానిచో నరకమునకు పాల్పడు దువు. ఈప్రపంచము నీకొరకు నిర్మితము. ఋజుమార్గ మున దీని ననుభవింపుము. దీనికి భయపడి సన్యసించ కుము. ధీరుడవై పురుషార్థముల నిర్వర్తించుము'.

సూఫీచెప్పెడి సమాధానము వేరు. వినుడు:

"నాఆత్మా! నేను ఎంతయో గాలించి చూచి తిని. నాప్రియుడు తప్ప మరేదియు నీయందు కాన్పింప లేదు. నీవే అతడవు."—రూమీ.

"అమహాత్తరతేజస్సులో 'నేను', 'మనము', 'నీవు'—ఇవి లేవు. 'నేను', 'నీవు', 'మనము', 'అతడు' అంతయు నొకటే పరమార్థము."—హల్లాజ్.

'నీవు', 'నేను' అనుభేదము నశించినగాని మానవు నకు ముక్తిలేదు. మానవుడు తన అజ్ఞానముచే లోకమును భిన్నముగ చూచుచున్నాడు. ఈ అజ్ఞానము నశించిన ముక్తి సిద్ధించును.

ఈప్రపంచము భిన్నభావమున కాన్పించుచున్న ఒక మాయాజాలము. దీనిభేదింపరాని బయటపడ రమ్ము.

బాహ్యమతస్థు డీసమాధానములను ఏవగించు కొనును. అందుచేతనే బాహ్యమతగురువులను ఖాజీలు సూఫీలను కాఫరులని పిలుచుచు వారిని హింసించుచుండిరి. రాజులుసైతము ఖాజీలప్రోద్బలమున వారిపై వివిధ దండనలను విధించుచుండిరి. మన్సూర్, జునైద్, దున్నూక్, ఉమర్‌ఖయామ్ మున్నగు సూఫీ లందరును వీరి అవజ్ఞలకు పాల్పడినవారే. ఈ దురాత్ములు వారిపుస్త కములను కాల్చియు, తత్పుస్తకపఠనమును నిషేధించియు ఎట్లో సూఫీమతము నణగద్రొక్క ప్రయత్నించిరి.

ఇట్టి పరిస్థితులలో సూఫీలు కవిత నాలంబనముచేసి కొని తమ సందేశమును నిర్వహించుకొనదలచిరి. కవితా ప్రతిభగల సూఫీలు తమ సిద్ధాంతములను ఖండకావ్యాం తస్థమొనర్చి శిష్యులతో తాము భిక్షాటనముచేయుచు ప్రతిగృహద్వారమునను నిలిచి పాడుచుండిరి. ఈవిధముగ సూఫీసిద్ధాంతములు ఇంటింటను ప్రాకిపోయెను. ప్రవక్త అభిలషితార్థము సిద్ధించెను. క్రమముగ ప్రజలు సూఫీల అర్థమును గ్రహించసాగిరి. సూఫీలు ఖుర్‌ఆన్‌లోని అంతరార్థము తీసి ప్రజలకు చూపించిరి. ఈసారి పండి తులుసుహాడ వారిని నిరసించలేదు; మహాత్ములగా వారిని స్వీకరించిరి. ఇప్పుడు సూఫీలు కాఫరులు కారు; మొహమ్మదీయతాపసులు.

ఇంక సూఫీమతచరిత్రము నింతటితో విరమించి, పారశీకమున ఈకవిత ఎట్లు మొలకలెత్తినదియు, ఎట్లు పరివృద్ధి నందినదియు తెలిసికొందము.

## 3

సల్జుకీయులకాలమున గజనవీయాస్థానమున సనా యీకవి మన్ననల బడయుచుండెనని పైన చెప్పి యున్నాను. సూఫీకవితను కాలానుక్రమముగ నెరుగ

గోరుచూ హై సాపురమును వీడి గజనీనగరమున కొకసారి మరలక తప్పను.

హైసాపురమున సల్తనతులు పరిపాలించుచుండె నేగా అప్పటికి కొనయూపిరితోనున్న గజనీప్రభుత్వము బహరామ్‌షాకాలమున ఒకింత తలయెత్తెను. ఈ ప్రభుపుత్రస్థానకవి సనాయీ. బహరామ్‌షాం తనపేరా సుహాయి మహా హాదీకతె కవిపుంగాతి. సనాయీ ఇతనికి ప్రత్యేకము ప్రేమపాత్రుడై తన కొన్నాళ్లే సహా కృతి పాయుదు చేయుచు నని బహరామ్‌షాం ప్రార్థించెను. ఇంతలో సనాయీ సూఫీమతము గ్రహించెను.

సనాయీ సూఫీయైనవృత్తాంతము వింతయైనది. హిందూదేశముపై దండయాత్రకు వెడలనున్న బహరామ్‌షాను పొగడుచు పద్యముల రచించి సనాయీ ఒకనాడు రాజాస్థానమునకు వెళ్లుచుండెను. అదేసమయమున నే రాజప్రాసాదమునకు ద్రాక్షాసవము గొనిపోవుచున్న వాని నొకపిచ్చివాడు మార్గమున నాపి 'అంధుడగు బహరామ్‌షాను పాత్ర నిమ్ము; అంధుడగు సనాయీ పానపాత్ర నిమ్ము' అని కేకలు వైచెను. సాకీ అందుకు కోపించి 'ప్రభువగు బహరామ్‌షాను, కవితిలకుడగు సనాయీని నీ వట్లు నిందించెదవు' అని అడుగగా ఆపిచ్చివాడు, 'క్షీణించి కొనయూపిరితోనున్న గజనీరాజ్యమును చక్కబెట్టుకొనకుండ పరదేశములపై దాడివెడల నిశ్చయించిన బహరామ్ అంధుడుకాడా? పొట్టకూటికై పలుకల్లల నాడి బంటువలె దుష్టులగు రాజులను పొగడెడు సనాయీ అంధుడుకాడా?' అని వెడలిపోయెను. తత్‌క్షణ మాతడు తనచేతనున్న పద్యములను చించివైచి ఇంటికి మరలెను. అబూయూసుఫ్ ఆకాలపు సుప్రసిద్ధయోగి. సనాయీ ఆమహాత్మునియందు శాంతి బడయగోరి ఆయనకు శిష్యుడాయెను. నాటినుండియు సనాయీ సూఫీ.

రాజసేవకరము నొల్లక, సమస్తభోగములకు ఆలవాలమగు రాజాస్థానమును తృణప్రాయముగ నెంచి, సత్యప్రచారణమే తన జీవితవిధిగా గ్రహించిన మహాత్ముడు సనాయీ. ఆయన ప్రతిజ్ఞ వినుడు:

"బాధాదుఃఖములచే పీడితముకాని హృదయము ప్రేమచిహ్నితమెట్లగును?

నీప్రేమనే నే నభిలషించితిని; నాకు సంపద లక్కరలేదు.

సంపదలు ప్రాపంచికములు. ప్రపంచముతో ప్రేమ కలిసి మను టెట్లు?

నా హృదయసీమ నీ వలంకరించినంత కాలము శోకము నన్ను బంధింపజాలదు."

సనాయీ పారశీకమున సుప్రసిద్ధసూఫీకవులలో ప్రథముడు. ఇతని ప్రతిపద్యమునందును నవీనత, భావ గాంభీర్యము, రచనాసౌలభ్యము కాన్పించుచుండును. పెక్కుఖండకావ్యములనేకాక సనాయీ మరి ఆరు కావ్యముల రచించెను: హదీఖతుల్ హఖీఖత్ (సత్యారామము), తారీఖాతహఖీఖ్, సైరుల్ ఇబాద్ ఇలామఆద్ (మానవుని పరలోకయాత్ర), ఇష్కె నామా (ప్రేమ), అక్ల్ నామా (బుద్ధి), కార్ నామా (కర్మ). తుది మూడుకావ్యములు కేవలము తాత్త్వికములు.

ఇతని దివాన్‌నుండి ఒకఖండిక నిట ఉదాహ రింతును:

"ప్రియతమా! నీకు నాహృదయము సమర్పించు కొంటిని. ఈ దీనుని హృదయము ప్రేమపరిపూర్ణమని యెరుగుదువుకదా? సెలవిమ్ము, పోయివచ్చెదను.

నీపునర్దర్శనభాగ్యము మరి కలుగదు. ఈవిడబాటు క్షణమునేని కౌగిలించుకొనెదను. ఇంక సెలవిమ్ము.

ఓ కఠోరమాయామినీ! నీనీలకుంతలములను, నీనిర్మలాస్యమును దివ్యతేజోవిభాసితమగు నాజీవిత మున అంధకారమును, శూన్యమును సమకూర్చినని.

నీయాననము, నీముంగురులు నన్ను సందేహము వలె, భయమువలె వేధించుచున్నవి.

తడిలేక బీటలువారిన పెదవులతోడను, అశ్రు ధారలు కురియు నయనములతోడను నేను జలాగ్నుల మధ్యమున నున్నాను; నన్ను వీక్షింపవా? నెచ్చెలీ! సెలవిమ్ము."

## ౪

౧. నేడు పారశీకమున ఫకీరులు పల్వురు బాబా తాహిర్ పాటలనే పాడుచుందురు ఉత్తరహిందూస్థానమున కబీర్ పాటలకుగల స్థానము పారశీకమున బాబా తాహిర్ పాటలకు కలదు. సర్వజనసుబోధ మగునట్లు సూఫీతత్త్వమును ఇతడు వ్యావహారికభాషను రచించెను. ఈమహాత్ముడు తనజీవితకాలముననే పరమయోగియని పేరువడెను. పల్వురురాజులు అతడు నివసించు కొండకడకు పోయి అతనిని దర్శించుచుండిరి.

హమదాన్ నగరమునకు సమీపమున ఖిదర్ అను కొండపై బాబాతాహిర్ బాబాజాఫర్, హమ్షా అను మరియిద్దరు సూఫీలతో వాసముచేయుచుండెను. ఒకనాడు తుగ్రిల్ బేగ్ చక్రవర్తి వీరిని దర్శించగా బాబాతాహిర్ "ఓయీరాజా! దేవునిప్రజలకు నీవేమి చేయ నెంచితివి?" అని ప్రశ్నించెను. "తమ ఆజ్ఞానువర్తిని" అని రాజు ప్రత్యుత్తరమిచ్చెను. "నాఆజ్ఞానువర్తి వగుటయేల, భగవదాజ్ఞానువర్తి వికమ్ము. క్షేమ భగవంతుని అభిలాషము." అని బాబాతాహిర్ ప్రత్యుత్తర మిచ్చెను.

౨. నాటిసూఫీలలో అబూసయీద్ ఒక ప్రఖ్యాతకవి. ఇతనిపద్యములు ఉమర్ ఖయామ్ పద్యములవలె పాచచమత్కారము కలవియైయుండును. ఇతని ప్రతిభ అసామాన్యము. తత్త్వజ్ఞశిరోమణియగు అబూఅలీసీనాను ఇతడు కలిసినపుడు అబూఅలీసీనా ఈక్రింది భావముగల పద్యమును చెప్పెనట:

"భగవత్కృప మన కాలంబనీయము. ఈశ్వరుడు మనపాపముల నశింపజేయును. అతనికృప కలిగినచో అసంభవము సంభవమగును."

దానికి అబూసయీద్ ఇచ్చిన ప్రత్యుత్తరము చూడుడు:

"ఓపాపీ! నరకమునకు భయపడి నీదుష్కర్మలను మరపింపజూతువా? వ్యర్థముగ భగవత్కృపను ఆలంబనీయముగ గ్రహించుచున్నావు. నీపాపములు నశించు టెట్లు? నీదుష్కర్మలు మంచి వెట్లగును?"

ఉమర్ ఖయామ్ కూడ ఇట్లే నుడివెను:

"నీఅశ్రువులును, నీమతవిధులును నీపాపగ్రంథము నుండి ఒకపంక్తినైనను చెరుపజాలవు."

అబూఅలీసీనా తత్త్వజ్ఞుడు. ఐనను బాహ్యమతవాసన పూర్తిగా అతనిని విడువలేదు. అబూసయీద్ తన్నుతాను తెలిసికొనిన ముక్తజీవుడు; ప్రేమయోగి. అతనిసమాధిపైని ఈక్రిందివాక్యమును చూడుడు:

"ఇట నొకప్రియుని సమాధి విస్తరించినాడు."

'ప్రేమరహస్యము నెరిగిన మరియొకప్రియుడు దేవడేని నాసమాధికడ నాగి నాప్రేమ నభినందించును.' ఇతనిసమాధిపై ఈవాక్యమును చెక్కించుటంపలి ఉద్దేశమిది.

ఇతని మరికొన్ని పద్యములను చూడుడు:—

"'ఎవరిది ఈసౌందర్యము?' అని నేనడిగితిని. 'సర్వమున నేనేకనుక నాయదియే' అని అతడు ప్రత్యుత్తరమిచ్చెను. ప్రేమ, ప్రియుడు, ప్రేమసి—అంతయు నేనే. సౌందర్యము, దర్పణము, నేత్రములు—అంతయు నేనే."

"హృదయాహ్లాదకరమగు చంద్రుని అందమును తిలకించుము. అతని సౌందర్య మత్యంతము. సూర్యప్రభతో కూడిన అతనిముఖమును చూడుము. అతని ముఖముపై జారిపడుచున్న ఆ నల్లని ముంగురులను గాంచుము."

౩. షేక్ అబ్దుల్లాఅన్సారీ ప్రార్థన పద్యములను రచించుటలో అసమానుడు. 'రుబాయీ' లను అధికముగ రచించిన కవులలో ఇతడొకడు. ఇతడు 'హీరటు' నగరమున జనించెను. ఇతని కావ్యములలో 'మనాజిలుత్ సాయెరీన్' (యాత్రికునివశలు), అన్వారెతహకీఖ్ (జ్ఞానదీపిక) అనునవి ప్రసిద్ధములు. ఇతని ఒకపద్యమును చూడుడు:

"నాకు మధువుగాని, మధుపాత్రగాని అక్కరలేదు; నేను నీయందు ప్రమత్తుడను.

ఇతర జాలములనుండి విడువబడిన నీమృగమును నేను.

కాబాయందును, పగోడాయందును నేను నిన్నే గాంచుదును. నాకు కాబాయేమి, పగోడాయేమి?"

హరి రాధాకృష్ణమూర్తి గారు

## ౮. భానుకవి

కళింగదేశమునందు నొకప్పుడు కాటకము సంభవించినది. వర్షములు లేవు. పైరులా పదనునకు నీళ్లు గానక మలమల మాడఁజొచ్చినవి. గోదావరీస్వర్ణోదకములచే నింపఁబడిన అత్తినతటాకమునందు మాత్రము నీరున్నది. గత్యంతరము లేని ప్రజలు భానునియొద్ద కరిగి,—

పైరులు రుగ్మతఁ బడలి వంచిన శీర్షముఁ బైకి నెత్తకే
సొరను గోలుపోయె; నొకసారియుఁ బిల్చిన మారు పల్కవో
ధీర, భిషఙ్మణీ, సుకవిదేశికుఁడ వీ విట మాదుపాల మా
పైరులఁ గాచి మాకుఁ గనుపండువు సేయు శుభంబు లయ్యెడున్.

వర్షము లేదు దైవ మది వంచనఁ జేయఁగఁ జూచెఁ బేదలౌ
కర్షకులన్; మహావిభవ కాముకులం దలపెట్టఁబోఁ డిదే
ధర్షమొ యే మెఱుంగ మిఁక ధార్మికబుద్ధిని బూని యోదయా
వర్ష, యనుగ్రహించి పలుబాముల నొందెడి మమ్ముఁ బ్రోవుమా.

కంటికి మంటికిన్ వ్యవధి గానక యేడ్చుచునుంటి మయ్య, మా
యింటను భార్యలున్ శిశువు లింతకు జీవనవృత్తి లేమి; యే
మంటివి మైన నిన్ను విడనాడము మాదు మొరాలకించి మా
పంటలు మాకు వచ్చు నొకవాక్యముఁ బల్కు శ్రవఃప్రియంబుగాన్.

### భానుకవి

అపలకుఁడు రైతు లపలిన - అపలును దేశంబు మీఱ లడిగిన యర్థం
బాడఁబడెడు గండివడి యా - మడు గది కేదారములను మన్ననఁ జేయున్.

* * * *

### ప్రజలు

దేవ భవత్సమానుఁడగు ధీయుతుఁ డెచ్చటనైన నున్నె? మా
జీవము లన్ని నిల్పితివి జీవనమాదరణంబుచేత నో;
ధీవర, పంచభూతములతేజము నైనఁ గలంచఁగల్గు నీ
భావము నెంచఁగల్గుదుమె పండితశేఖర, సత్కవీశ్వరా!

---

# శ్రీ కం. వీరేశలింగకవి - నవలలు*

కే. కామేశ్వరరావుగారు

తెలుగుభాషలో నాటకాలు, ప్రహసనాలు, నవలలు, వ్యాసాలు మొదలైన వాఙ్మయభాగాలన్నీ నూతనయుగానికి సంబంధించినవే. ఈవాఙ్మయశాఖ లన్నిటిలోను మొదట కృషిచేసినవారు శ్రీ వీరేశలింగకవి.

"........తెలుగులో మొదటి వచనప్రబంధమును నేనే చేసితిని; మొదటి నాటకమును నేనే తెనిగించితిని; మొదటి ప్రకృతిశాస్త్రమును నేనే రచించితిని; మొదటి ప్రహసనమును నేనే వ్రాసితిని; మొదటి చరిత్రమును నేనే విరచించితిని; స్త్రీలకై మొదటి వచన పుస్తకమును నేనే గావించితిని."

(కం. వీ. స్వీ. చ. రెం. ౨౩౨ పుట. †)

ఆదినవలకర్తయైన వీరేశలింగకవి అయిదు వచనప్రబంధాలు రాసేరు. ఆఅయిదు యేవంటే—

౧. రాజశేఖర చరిత్రం—ఇదొక పెద్ద నవల. ౨. సత్యవతీచరిత్రం—ఇదొక నవలిక, అంటే చిన్ననవల. 3. చంద్రమతీచరిత్రం—ఇదొక కథ. ౪. సత్యసంజీవిని—ఇదొక కథ. ౫. సత్యరాజాపూర్వదేశయాత్రలు —ఇది నవల జాతికి చెందిన కావ్యం. ఈవచనప్రబంధాలను రెండుమూడువిధాలుగా విభజించవచ్చు. వాటిలో యేవొక్క పద్ధతైనా అవలంబించి గ్రంథ విమర్శ ప్రారంభించవచ్చు. ఆవిధా లేవంటే- ఒకటి, పెద్దవచనప్రబంధాలను మొదట విమర్శించి తర్వాత చిన్నవాటిని విమర్శించవచ్చు. రెండు, నవలలను మొదట విమర్శించి తర్వాత కథలను విమర్శించవచ్చు. మూడు, గ్రంథాలను వాటి కాలానుక్రమంగా యేర్పరచి విమర్శించవచ్చు. తక్కిన పద్ధతులకంటె ఆఖరు పద్ధతి కొంత మేలైనది. గ్రంథకర్తయొక్క మానసికపరిణామం బాగా విశదంచేస్తూ గ్రంథాలను విమర్శించవచ్చు. ఈపద్ధతినే గ్రహించి విమర్శిస్తాను.

## ౧. రాజశేఖరచరిత్రము ‡

ఈనవలయొక్క ఉత్పత్తిచరిత్ర యేమంటే—

'......కాని యింతలో నాబుద్ధి మాటి యింకొక వంకకు మరలినది. తెలుగులో వచనకావ్యములంతగా లేవు. వచనకావ్యమని చెప్పదగినది చిన్నయసూరి గారి నీతిచంద్రిక యొకటి యున్నది; అదియు పూర్తిగాక యర్ధమే యయియున్నది. విక్రమార్కుని కథలు, పంచతంత్రము, కాశీమజిలీకథలు అను గ్రామ్య గ్రంథములు కొన్ని యున్నను వానిని పామరులే గాని పండితులు చదువకుండిరి. ఈస్థితి విచారింపగా దేనుగులో పద్యకావ్యములకంటె వచనకావ్యములను వ్రాయుట యెక్కువ యుపయోగకరమని నాకు తోచినది.'

(కం. వీ. స్వీ. చ. రెం. ౧౩౭-వ పుట.)

ఈయోచనవల్లే కవి మొదట విగ్రహతంత్రం రాసేడు. కవి అట్టిసంకల్పంలో వుండగా ఎస్. రంగయ్యసెట్టిగారు

---

* ఈవ్యాసము ౨౬-3-౧౯౩౧ నాడు భారతికార్యాలయమును జేరినది. —సం. భా.

† కం. వీ. స్వీ. చ. రెం. అనేది కందుకూరి వీరేశలింగచరిత్ర రెండోభాగాన్ని తెలుపును.

‡ రాజశేఖరచరిత్రము ౧౮౭౮ - వ సం. లో ప్రకటించబడింది.

"తెలుగులో నొక స్వయంకల్పితమైన వచన ప్రబంధమును వ్రాయుటకు మీరు పూనుకొనరాదా."

(కం. వీ. స్వీ. చ. రెం. ౧౮౧-వ పుట.)

అని ఒకప్పుత్తరంలో రాసేరు. కవియొక్క సంకల్పానికి యీసూచన తోడయింది. ఈ సూచనయొక్క ఫలితమే యీనవల. ఇట్టి గ్రంథరచనకు కొంతవరకు కారకులు శ్రీ సెట్టిగారు. అటుతర్వాత వీరేశలింగంగారు తమ యోచనలనుగూర్చి

"తెనుగులో నొకవచనప్రబంధమును వ్రాయుటకు మీరు పూనుకొనరాదా" యని రంగయ్యసెట్టిగారు తమ ప్రథమలేఖలో వ్రాసినప్పుడే యీపనికి పూనుకోవలెనని నా కుద్దేశము కలిగెను. మొట్టమొదట నొక చిన్న యింగ్లీషుప్రబంధమును దేనినైనను తెలిగించి శైలి కుదురుపఱచుకొని తరువాత స్వకపోలకల్పితమైన వచన ప్రబంధమును వ్రాయబూనుకోవలెనని తలచి గోల్డుస్మిత్తనెడి యింగ్లీషుకవి చేసిన "వైకార్ ఆఫ్ వేక్‌ఫీల్డు" అను కథను తెలిగింప నారంభించి రెండుమూడు ప్రకరణములు వ్రాసితిని. విదేశకథయు దాని భాషాంతరమును మనవారి కింపుగా నుండదని తోచి చేసిన భాగము నా మనస్సునకే తృప్తికరముగా నుండకుండిన దానిని మానివేసి రాజశేఖరచరిత్రమును వ్రాయ నారంభించితిని. ఇంగ్లీషుకథకును దీనికిని విశేషసంబంధము లేదు. అది యొకయుద్దేశముతో చేయబడినది; ఇది వేఱొక యుద్దేశముతో జేయబడినది. మనలోగల మూఢవిశ్వాసములను పోగొట్టవలెనన్న ముఖ్యోద్దేశముతో నేను దీనిని వ్రాసితిని. ఇది యించుమించుగా స్వకపోలకల్పితమనియే చెప్పవచ్చును.'

(కం. వీ. స్వీ. చ. రెం. ౧౮౩-వ పుట.)

ఇట్లీనవల ఆంగ్లగ్రంథాన్ని కొంత అనుసరించివుంది. కాని ఆగ్రంథంయొక్క వుద్దేశం వేరు, ఈగ్రంథంయొక్క వుద్దేశం వేరు. ఇంచుమించుగా యిది స్వకపోలకల్పితమే.

రాజశేఖరచరిత్రము ఈనవలయొక్క అసలుపేరు కాదు. ఇది నామాంతరం. ఈ నవలయొక్క అసలుపేరు 'వివేకచంద్రిక'. ఈ వివేకచంద్రికయొక్క గ్రంథపీఠికలో యీ విధంగా రాయబడివుంది:

'ఈవఱకు మన యాంధ్రభాషలో జనుల ఆచారవ్యవహారములను దెలుపుచు నీతిబోధకములుగా నుండు వచనప్రబంధము లేమియు లేకపోవుట యెల్లవారికి విశదమయియున్నదిగదా......అటువంటి లోపమును తొలగింపవలయునని ......నే నీగ్రంథము..... ప్రకటించితిని.'

ఇట్లీగ్రంథం కేవలం నీతులు చెప్పేదిగానే గాక వాడుకలో నున్న ఆచారవ్యవహారముల దెల్పుచు నీతిబోధకంగా వుండేటట్లు గ్రంథకర్తచే నిశ్చయించబడింది. ఇంకా యేమిటంటే

'ఈగ్రంథముయొక్క కథను గల్పించుటలో గోల్డుస్మిత్తను నింగ్లీషుకవీశ్వరుని గ్రంథసహాయమును కొంత బొందినను దానికిని దీనికిని విశేషసంబంధ ముండదనియు, దీనియందు వ్రాయబడిన విషయము లన్నియు నూతనములే యనియుగూడ విన్నవించుచున్నాడను.'

ఈరకంగా యీ గ్రంథ మాంగ్లగ్రంథ సహాయంకొంత పొందిందని తెలుస్తూంది. ఆసహాయ మేయేవిషయాల్లో వుందో ఆగ్రంథాన్ని, యీగ్రంథాన్ని సరిపోల్చి చూద్దాం.

ఈరెండు నవలలకు పోలిక కథాంశాల్లోను, పాత్రల్లోను, కావ్యవస్తువులోనుకూడా వుంది. ఈకథానాయకుడైన రాజశేఖరుడికి మూలగ్రంథ (మూలగ్రంథంపేరు వేక్‌ఫీల్డ్ యొక్క మతగురువు) కథానాయకుడైన డాక్టరుప్రిమ్‌రోజ్‌కు కొన్ని పోలిక లున్నాయి.

ఇద్దరూ ధనం పోగొట్టుకుని దరిద్రస్థితికి వచ్చేరు. కాని ఆధననష్టానికి కారణాలు వేరు వేరు. ఇద్దరూ అప్పు తీర్చలేకపోయి జైలులో పడ్డారు. ఇద్దరూ జైలులోంచి వుత్తరాలు తమ పాలకులకు రాసేరు. ఇద్దరూ అంత మందు నష్టమైన ధనాన్ని పొందేరు.

ఈనవలలోని రామరాజుపాత్ర మూల గ్రంథంలోని బర్ చెల్ పాత్రను పోలివుంది. రామరాజుయొక్క అసలుపేరు శ్రీకృష్ణజగపతిరాజుగారు. బర్ చెల్ యొక్క అసలుపేరు సర్ విలియం తారన్ హిల్. ప్రిమ్రోజ్ తన కొడుకైన జార్జిని వుద్యోగనిమిత్తమై స్థలాంతరానికి పంపుతాడు. అలాగే రాజశేఖరుడు కూడా తన కొడుకైన సుబ్రహ్మణ్యాన్ని పిఠాపురానికి పంపుతాడు. ప్రిమ్రోజ్ కూతురైన సోఫియా యితరులచేత యెత్తుకుపోబడి బర్ చెల్ చేత రక్షింపబడుతుంది. రాజశేఖరుడి కూతురైన సీతకూడ అట్లే యెత్తుకుపోబడి రామరాజుచేత రక్షింపబడుతుంది. లివీ(ప్రిమ్ రోజ్ యొక్క పెద్దకూతురు) చావు, రుక్మిణి చావుకూడ వుత్తుత్తచావులే. ఆదశకు కారణాలు వేరువేరు. ప్రిమ్రోజ్ కు బర్ చెల్ కు ఒకవుత్తరంవిషయమై తగాదా వస్తుంది. కాని నిజస్థితి తెలియగానే ఆతగాదా తీరిపోతుంది. అలాగే రాజశేఖరుడికి రామరాజుకు. మిస్టర్ తారన్ హిల్ వంటివాడు శోభనాద్రిరాజు. వీళ్లిద్దరూ ఆఖరున శిక్షపొందుతారు. జన్ కిన్ సన్ వంటివాడు మంచిరాజు పాపయ్య. ఈమోస్తరుగా కథాంశాల్లోను, పాత్రల్లోను కొన్ని కొన్ని పోలికలున్నాయి. కాని యీసంబంధం మొత్తంమీద విశేషంగా లేదు. ఆనుటనలు కొంతవరకు సమానంగాని వాటికి సంబంధించిన ముందుకథ వెనుకకథ వేరే. ఆమాత్రపు అనుకరణ యెక్కువ లెక్కచేయతగింది కాదు. ఈవచనప్రబంధమందుకంటె మన పూర్వులు రాసిన పద్యప్రబంధాల్లో మూలకథ యించుమించుగా అంతా గ్రహించబడివుండేది. అట్లుగాక యీనవల సాధ్యమైనంతవరకు స్వకపోల కల్పితమై వుంది. మూలకథలో లేని అంశాలు దీనిలో అనేకమున్నాయి.

ఈనవలలో ప్రకరణాలమొదట వున్న పొడిమాటలు మూలగ్రంథాన్ని అనుకరించి రాయబడ్డాయి. కావ్యవస్తువిషయమై యేమిటంటే మూలగ్రంథంలోని కొన్నికొన్ని వాక్యాలే ఈనవలలోకి తర్జుమా చేసుకోబడ్డాయి. ఈనవల మూలనవలలాగే లోకవిషయమైన యెన్నో సాధారణధర్మసూత్రాలతో (Generalizations) నిండివుంది.

ఈగ్రంథనామం వివేకచంద్రిక. అంత మాత్రంచేత యిది కేవలం నైతికరచనఅని తలచ నవసరంలేదు. వినోదంగా చదువుకోవాలనుకునేవాళ్లు అలాగే చదువుకోవచ్చు. నీతిబోధ అడ్డురాదు. కథయొక్క కల్పన అంత ఆకర్షకంగా వుంటుంది. దీనివల్ల నీతిలాభం కూడా పొందుదామనుకునేవాళ్లు వినోదాన్ని నీతినికూడా పొందుతారు. కథలో ఈరెండు గుణాలుకూడా స్ఫుటంగా వున్నాయి.

ఈనవలపేరు వివేకచంద్రికకదా! ఈ వివేకచంద్రికాప్రసరణానికి ముందు సంఘమందు అవివేకధ్వాంతి మూండాలికదా! ఆఅవివేకధ్వాంత మెటువంటిది? అప్పటిసంఘంలో యెటువంటి అజ్ఞాన ముండేది? ఈగ్రంథంలో యెట్టి అవివేక మెత్తిచూపించబడింది? అన్న సంగతులు చూద్దాం.

విపరీతమైన ధర్మశాస్త్రాలయొక్క ఫలితం దురాచారాలు. కథాకాలంనాటి సంఘంలో ఆరకంగా వుండవలసిన దురాచారాలన్నీ వున్నాయి. అప్పటి సంఘంలో జ్యోతిశ్శాస్త్రమందు నమ్మకం; ధనార్జనకు బైరాగివేషం; గ్రహాలు, పిశాచాలు, మంత్రశాస్త్రమందు నమ్మకం, దొంగమంత్రజ్ఞులు; స్త్రీవిద్య లేమి, స్త్రీస్వాతంత్ర్యవిహీనత; వివాహాలయం దధికధనవ్యయం; విగ్రహారాధనయందలి మోసం; స్వాములవారి విపరీతభిక్షులు; నాటు వైద్యంలోని బూటకం; ప్రజలు అసత్యాన్ని, అన్యాయాన్ని గౌరవించడం; ప్రకృతిశాస్త్రములయం దయిష్టం; ప్రతిఅల్పాంశానికీ యేదో ఒక ప్రకృత్యతీతకారణం కల్పించి పూజలు, జాతర్లు చెయ్యడం; దొంగతనాలు, దోపిళ్ళు; ధనవంతులు చేసే దుర్మార్గాలు మొదలైనవన్నీ వుండేవి. అవే అవివేకధ్వాంతం, అజ్ఞానం. ఇట్లన్నివిధాలా కుళ్ళిపోయిన హిందూసంఘం ఈ నవలలో చిత్రించబడింది. ఈఅవివేకధ్వాంతాన్ని భంజించడానికే వివేకచంద్రిక ప్రసరించబడింది.

### కథాభాగం, పాత్రలు

రాజశేఖరుడుగా రనబడే స్థితిపరుడొకడు ధవళేశ్వరంలో వుండేవాడు. సామాన్యంగా స్తుతిపాఠాల నభిలషించే ధనికులందరిలాగ—లోభులుకానివారి సంగతి—ధనం వల్ల కన్నుగానక, ప్రపంచజ్ఞానం లేక, పాత్రాపాత్రతలు విచారించక ధనం వ్యయం చేసేడు. ఆయనయొక్క ధనానికి జలగలై పట్టిన ముఖ్యవ్యక్తు లెవరంటే—సిద్ధాంతి, నంబి రాఘవాచార్యుడు, దామోదరయ్య, నారాయణమూర్తి, నిత్యం యింట్లో వున్న యిద్దరు ముగ్గురు వ్యక్తులు. ఇదిగాక రాజశేఖరుడి గృహం సమస్తజనులకు ఉచితభోజనశాల; దానధర్మాదులకు ఉచితధనాగారం.

'ధనవంతుడు గనుక ఆయన కిల్లవారు మిత్రులుగా నుండిరి. ఆ మిత్రసహస్రములో నొక్కడైనను నిజమైన యాప్తు డున్నాడో, లేడో యన్న సంగతిని మాత్ర మాయనకు ధనలక్ష్మి తెలియనిచ్చినది కాదు.'

రాజశేఖరుడు తన పెద్దకుమార్తె అయిన రుక్మిణికి వివాహం చేసి మాన్యాలమీద కొంత ఋణం చేసేడు; దాని వడ్డి పెరుగుతూంది. సప్తసంతానాల్లో ఒకటైన దేవాలయనిర్మాణం చేయించ నిశ్చయించుకుని ఆంజనేయుడికి గుడి కట్టించ ప్రారంభించేడు. నాలుగేళ్లనుంచి కడుతూన్న పని సగంకంటె యెక్కువ కాలేదు. కాని పనివాళ్లు, ఆశ్రితులు కొంతవరకు భాగ్యవంతు లయ్యేరు. ఒక ఉత్సవ

సమయంలో రుక్మిణికాసులపేరు పోయింది. అది అట్లుండగా రుక్మిణికి వైధవ్యం సంభవించింది. ఆమెకు భూతవైద్యంకూడా చేయించవలసివచ్చింది—నిజంగా రుక్మిణి మొగుడు చచ్చిపోలేదు. కిట్టనివాడొకడు చెప్పిన కబురది. అందుచేత ఆఅంశంతో సంబంధించిన భూతవైద్యం, సోదెలు, పూనడం మొదలైన వన్నీ యెంతనిజమో, మంత్రవేత్తలంతా యెంత ధర్మవర్తనులో మనకురుజువౌతుంది. ఈమోస్తరుగా ఒక మూఢవిశ్వాసం ఖండించబడింది. ఖర్చుకు తగినంత ధనం లేకపోవడంవల్ల, పైగా డబ్బాశ ముదిరిపోయి బైరాగులవద్ద వుండే స్వర్ణవిద్య నేర్చుకోవాలని రాజశేఖరుడు తలచి తన వెండిబంగారాలన్నీ ఒక బైరాగి చేతిలో పెట్టేడు. ఆబైరాగి ఆధనంతోకూడా అదృశ్యుడైపోయేడు. ఈ ఘటనతోకూడా రాజశేఖరుడికి నిజమైన దారిద్ర్యం పట్టుకుంది. బంధుమిత్రుల మునపటి ప్రవర్తన యిప్పటి ప్రవర్తన ఆయన కళ్లారా చూసేడు. ఇంట చిల్లిగవ్వ లేదు. పూ లమ్మినచోట కట్టెలమ్మవలసివస్తూంది. అందుచేత ఆవూళ్లో వుండడానికి మనసొప్పక యిల్లు తాకట్టుపెట్టి బదులుచేసి రాజమహేంద్రవరం ప్రయాణమయేడు.

'రాజమహేంద్రవరములో నున్నకాలములో రాజశేఖరుడుగారు పట్టణములో నుండెడు ప్రజలకును, పల్లెలలో నుండెడి ప్రజలకును నడవడియం దేమి వ్యత్యాస ముండునో చూడవలెనని యెల్లవారియొక్క చర్యలను బరీక్షింపసాగిరి; కాబట్టి యిప్పుడిప్పు డాయనకు నిజమయిన ప్రపంచజ్ఞానము కొంతవరకు గలుగ నారంభించెను.'

ఆరంభించిందికాని పూర్తిగా ప్రవేశం కలుగలేదు. ఆయన కాశీయాత్ర చేయ సమకట్టి కాలినడకమీద కాశీకి పోతేగాని యాత్రాఫలం పూర్తిగా దక్కదని కాలినడకను సకుటుంబంగా కాశీకి బయలుదేరేడు. దారిలో బందిపోటు అడ్డగించి రుక్మిణిని చంపేరు. ఇంతలో దైవవశాత్తు రామరాజు వచ్చి వారిని రక్షించి రాజశేఖరుడికి కాశీయాత్ర మానుకొమ్మని చెప్పి పెద్దాపురంలో వొకవుద్యోగం చూసి పెడతానని బోధించేడు. రాజశేఖరుడు పెద్దాపురంయొక్క దుర్మార్గాలకు జడిసి ఆవూరు విడిచి ఆదగ్గరవున్న భీమవరం జేరేడు. తన కొడుకైన సుబ్రహ్మణ్యాన్ని ఉద్యోగంలో ప్రవేశించి తనకు సహాయం కమ్మని పిఠాపురం పంపి తాను కారాగృహాధిపతి అయిన శోభనాద్రిరాజుగారి దర్శనం చేస్తూవచ్చేడు. శోభనాద్రిరాజుశీలం రాజశేఖరుడికి మొదట్లో తెలియలేదు. శోభనాద్రిరాజు ఒక బందిపోటు గుంపుకు గురువు. ఆదొంగలు కొల్లగొట్టి తెచ్చిన ధనంలో ఆయనకు కొంత వంతు. రాజుగారి అసలు వుద్యోగమే యిది. ఈరాజుగారి అనుచరులే రాజశేఖరుణ్ణి దోవలో అడ్డగించి రుక్మిణిని చంపేరు.

రాజశేఖరుడి రెండవకుమార్తెఅయినసీతకింకా పెళ్లి కాలేదు. శోభనాద్రిరాజు, తనకు ముండలు తార్చువాడైన మంచిరాజు పద్మరాజుకి సీత నిచ్చి పెళ్లిచెయ్యాలని యత్నించేడు. రాజశేఖరుడు, పద్మరాజ శోభనాద్రిరాజుల చరిత్రలు తెలియనందువల్ల వొప్పుకున్నాడు. కాని

రామరాజుయొక్క చతురతవల్ల ఆముహూర్తం తప్పిపోయింది. రామరాజు ముహూర్తాన్ని పాడుచేసేడని రాజశేఖరుడు రామరాజుతో విరోధం పెట్టుకుని పెళ్లికి మళ్లా ముహూర్తం పెట్టించా లనుకున్నాడు. కాని అంతట్లోకి మొదట పెళ్లిముహూర్తం పెట్టిన సిద్ధాంతి చచ్చేటంత భాయిలాండి బంధువుల బలవంతంచేత అతురసన్యాసం పుచ్చుకుని సీత వివాహవిషయమైన కుట్రఅంతా రాజశేఖరుడికి తెలియచేసేడు. అప్పుడు రాజశేఖరుడు రాను రామరాజుతో అవివేకంగా తగవు లాడినందుకు పశ్చాత్తాపపడి శోభనాద్రి రాజుతో జగడమాడేడు. తనకు ఋణమున్నాడన్న మిషమీద శోభనాద్రిరాజు రాజశేఖరుణ్ణి జైలులో పెట్టించి సీత నెత్తుకుపోయే టట్లా చేసేడు. కాని మళ్లా రామరాజే సీతను రక్షించేడు. శోభనాద్రిరాజుయొక్క జట్టంతా కారాగృహంలో పడింది. మంచిరాజు సాహయ్యసహాయంవల్ల రాజశేఖరుడు శ్రీకృష్ణజగపతి రాజుగారికి (ఈయన ప్రచ్ఛన్ననామమే రామరాజు) ఉత్తరం దాఖలుచేసుకోగా రాజుగారు న్యాయం విచారించి రాజశేఖరుణ్ణి ఖైదువిడిపించి శోభనాద్రికి శిక్షవేసేరు. తన స్నేహితుడైన రామరాజే శ్రీకృష్ణజగపతిరాజులుంగారని రాజశేఖరుడు తెలుసుకుని భయసంభ్రమాశ్చర్యాల్లో మునిగి తన తప్పులను క్షమింపమని రాజుగారిని ప్రార్థించేడు.

రుక్మిణి నిజంగా చచ్చిపోలేదు. చచ్చిపోయిందనుకుని ఆమెను అడవిలో విడిచిపెట్టి రాజశేఖరాదులు వెళ్లిపోయేరు. ఆమె కొంత సేపటికి తెలివివచ్చి లేచి యెవ్వరూ లేకపోవడం చూచి తన విద్య తోడుకాగా అనేక మారువేషాలు వేసుకుని తుదకు స్వగృహం చేరింది. విద్యాప్రభావాని కీమెయొక్క జీవితమే నిదర్శనం. స్త్రీవిద్య యెంత అవసరమో యీపాత్ర తెలియజేస్తూంది. అంతటితో రాజశేఖరుడుగారికి శారీరకమైన కష్టాలు తీరేయి. కృష్ణజగపతిరాజుగారి సాహాయ్యంచేత తన మాన్యాలు విడివడ్డాయి. సుబ్రహ్మణ్యం యొక్క బుద్ధివిశేషంవల్ల నష్టమైపోయిన వెండి బంగారాలు దొరికేయి. శంకరయ్యవల్ల కాసుల పేరు తిరిగివచ్చింది. రుక్మిణి మొగుడు యింటికి వచ్చేడు. రాజశేఖరుడి కిప్పటికి వివేకం కలిగింది.

'అదిమొదలుకొని రాజశేఖరుడుగారు వెనుక సిద్ధాంతి మొదలైనవారి చర్యలవలన దెలివి తెచ్చుకుని ముఖస్తుతుల కుబ్బి యెప్పుడును ధనమును పాడుచేసికొనక యు, సమీపమునకు వచ్చి మంచిమాటలు చెప్పువారి నందఱిని మిత్రులని నమ్మకయు మెలగజొచ్చిరి. యోగి వెనుకచేసిన కుతంత్రమువలన నాతనికి యోగు లనువారియం దెల్లను కేవలజఠరపూరకులను నభిప్రాయమును మంత్రములయందును సువర్ణకరణాదివిద్యలయందును దృఢమైన యవిశ్వాసమును గలిగెను రుక్మిణికి వెనుక పట్టిన దయ్యములు, భూతవైద్యము, శకునములు మొదలగువానివలన నెల్లవారికిని వానియందలి నమ్మకము చెడుటంజేసి మఱియెప్పుడును వారియింట నెవ్వరికిని గ్రహబాధకాని ప్రయోగలక్షణముకాని దేవత లావహించుటగాని కలుగలేదు. కుటుంబములోనివారి జాతకములును పెట్టినముహూర్తములును పలుమాఱు విరుద్ధఫలముల నిచ్చుచు వచ్చినందున, రాజశేఖరుడుగారికి తత్సంతతివారికిని జ్యోతిషమందుసహితి మపనమ్మకము

కలిగెను. రుక్మిణీవివాహకాలమున చేసిన ధర్మములకై, చేసిన ఋణములవలని నష్టముల ననుభవించియుండుటం జేసి రాజశేఖరుడుగారిక నెప్పుడును పరులకు ఋణపడ కూడదని నిశ్చయము చేసికొనిరి. అంతటినుండి రాజశేఖరుడుగారు మితవ్యయమునే చేయుచు వ్యర్థదంభమునకై ధనము పాడుచేసుకోక, తమ కీశ్వరుడు దయ చేసినదానితోడనే తృప్తినొందుచు, కలిగొలదిని బీద సాదలకు దానధర్మము చేయుచు, కలలోనసహితము సత్యమును, భూతదయయును దప్పక, "ధర్మోజయతి" యను నీతివాక్యమును సదా హృదయమునం దుంచుకొని సమస్తకార్యములందును నీతిపథమును నీగకాలంతేయు దాటక ఋజువుగా ప్రవర్తించుచు మంచివాడని లోకమున ప్రసిద్ధికెక్కి, పెక్కండ్రు మనుమలను మనుమరాండ్ర నెత్తి సిరియు సంపదయు గలిగి చిరకాలము సుఖింపుచుండిరి.'

ఇంతేగాక

'...కన్నులార జూచి మనసు కరగి యట్టిబాల వితంతువుల దుర్దశను తొలగెంచుట కైన జేయవలయునని పలుప్రయత్నములు చేసియు...రాజశేఖరుడుగారు కొంతకాలమునకు లోకాంతరగతు లయిరి.'

ఆమోస్తరుగా మొదట అవివేకిగా వున్న రాజశేఖరుడు ఒక్క సామాన్యదురాచారాలను గ్రహించడమే కాకుండా సాంఘికదురాచారమైన నిర్బంధవైధవ్యఘోరాన్ని కూడా గ్రహించి రూపుమాపడానికి ప్రయత్నించేడు. అవివేకస్థితి యెట్టిదో, వివేకస్థితి యెట్టిదో వొక్క రాజశేఖరుని జీవితమేకాకుండ తక్కిన కొందరి జీవితాలుకూడా నిరూపిస్తున్నాయి. దామోదరయ్య, తనకు గలిగిన కష్టాలన్నీ తాను భూతవైద్యుడనని వేషం వేసుకోడం వల్ల కలిగిన పాపఫలంకదా అని తెలిసికొని పశ్చాత్తాపపడ్డాడు. నీలాద్రిరాజు తన దౌర్జన్యజీవితాన్ని సంస్మరించుకుని పూర్తిగా పశ్చాత్తాపపడ్డాడు. మంచిరాజు పాపయ్యకూడ అలాగే వగచేడు. ఈమోస్తరుగా అనేక వ్యక్తులు మొదట అవివేకులుగా వుండి క్రమేణ వివేకు లయేరు. ఇట్లు గ్రంథానికి వివేక చంద్రికయన్న నామం సార్థకమయింది.

ఈకథ రెండువందలేళ్ల కిందట జరిగినట్టుగా రాయబడింది. దేశంయొక్క అప్పటిస్థితి చిత్రింపబడిందిగాని యిప్పటిస్థితి చిత్రించబడలేదు. అందుచేత యిప్పటివారమైన మనం ఈగ్రంథంలోంచి నేర్చుకోవలసిన వివేక మేమీ వుండదని యెవరైనా అనవచ్చు. కాని ఆరకమైన సంశయ మక్కర్లేదు. రాజకీయవిషయంలో అప్పటి దశ, యిప్పటిదశ భిన్నంగా వున్నాయి కాని సాంఘికవిషయంలో కథాకాలంనాటిస్థితి గ్రంథరచనాకాలంనాటిస్థితివొక్కలాగేవున్నాయి. అందుచేత యిప్పటివారు బోధచేసికోవలసిన వివేకమే యిందులో లిఖించబడింది. ఈగ్రంథంలోంచి జనులు నేర్చుకోవలసిన విషయాలెన్నో వున్నాయి. ఆచారాలను, ధర్మశాస్త్రాలను గుడ్డిగా గొర్రెలవలె అనుసరించకుండా విమర్శించి వివేకంతో చరించాలి. ప్రపంచజ్ఞానం,ప్రకృతిశాస్త్రజ్ఞానం అలవరుచుకోవాలి. పురుషులకు స్త్రీలకుకూడా విద్య అత్యావసరం. విద్యాప్రభావానికి సుబ్రహ్మణ్యంజీవితం, రుక్మిణిజీవితం నిదర్శనాలు. సంఘంలో గొప్ప సాంఘికపరివర్తన అవసరం. ఇటువంటి వివేకం సంఘంలో పూర్తిగా కలగాలి.

ఈకాలపువారమైన మనకు ఈకథలోని కొన్నికొన్ని అంశాలు విపరీతంగా కనపడవచ్చు. కాని ఆకాలాని కవి సహజాలే. రామరాజుచరిత్రమాత్రం కొంత విపరీతంగా వుంది. చాపలు లేకుండనే ఈతడు సర్వవ్యాపిగా ప్రవర్తించేడు. ఇది విపరీతాంశం.

ఇది నీతిప్రధానమైన గ్రంధంకదా! అందుచేత గ్రంథంలో చదునుపాత్రలు (Flat charac-ters) (చదునుపాత్ర అంటే గ్రంథమంతటా వొక్కటే గుణం కనపరచే పాత్ర) యెక్కువగా వుంటా యనుకొంటాం. కాని నిజమేమంటే దీనిలో చదునుపాత్రలు బహుస్వల్పం. సిద్ధాంతి, హరిశాస్త్రిలు, రామశాస్త్రి మొ.వారుమాత్రమే చదునుపాత్రలు. ఇంచుమించుగా తక్కిన వన్నీ నిండుపాత్రలే (Round characters) (నిండుపాత్రఅంటే ఒకటికంటే యెక్కువగుణాలు కనపరచు పాత్ర). రాజశేఖరుడు, రామరాజు, శోభనాద్రిరాజు, సుబ్రహ్మణ్యం, రుక్మిణి మొదలైనవి నిండుపాత్రలు. గ్రంథమందు స్త్రీపాత్రలు తక్కువ, పురుషపాత్రలు హెచ్చు.

ఈనవల వివిధ-రకములైన పాత్రలతో నిండి యించుమించుగా సంఘంలోని అన్ని రకములైన లోపాలు, అక్రమాలు చుట్టివచ్చు నట్టి కథాభాగంతో అద్భుతమైన ప్రజ్ఞతో రాయబడింది. కావ్యవస్తువందు, శైలియందు విశేషమౌలికత్వ (Originality) ముంది. కథలో అంతటా గ్రంథకర్తయొక్క అద్భుతమైన భావన వ్యక్తమౌతూంది. మనం సాధారణంగా అజ్ఞానంలో యెక్కువసౌఖ్యం, న్యాయం వున్నా యనుకుంటాం. కాని విద్యలేమివల్ల, అజ్ఞానం వల్ల సంఘం యెలాగ వుంటుందో ఈనవల చూపిస్తూంది. సరళజీవనం లేకపోవడమే కాకుండా అంతా కృత్రిమజీవనమే. అజ్ఞానమైన మనస్సు అన్నివిషయాలనుగురించి విపరీతంగాతర్కించి దురాచారాలను స్థాపించుకుంటుంది. ప్రతివస్తువుకూడ లోకాతీతప్రభావం కలిగి యెక్కువబల్లు జాతర్లు కోరుతుంది. ఇట్లు అనాచారాలతోను, అన్యాయాలతోను, వట్టివేషాలతోను నిండిన సంఘం సుఖపడుతుందా ?

ఈనవలలో అనేక గుణాలు కనబడుతున్నాయి. ఇది ఒక్కసాంఘికనైతికనవలే కాదు. నిహూపకత్వం, నిగూఢత్వం (Mystery) గుణాలుకూడా కలిగివుంది. రుక్మిణీనృసింహస్వాములు బతికివున్న సంగతి చదువరికి ఆఖరున తెలుస్తుంది. ఇదే నిగూఢత్వం. నిహూపకగుణాన్నిగురించి వేరే చెప్పనక్కర్లేదు. శోభనాద్రిరాజు, నీలాద్రిరాజు,మంచిరాజుపాపయ్య మొదలైనవా రపరాధులు. రామరాజు, సుబ్రహ్మణ్యం పరిశోధకులు.

ఈనవలశైలి గ్రాంధికం. గ్రంథంయొక్క మొదటిసగంలో శబ్దాలంకారాలు కొంతవరకు కనబడుతున్నాయి. మొత్తంమీద భాష సరళంగా వుంది. జాతీయాలతోను, సామెతలతోను నిండివుంది. తెయునో శైలి

యెక్కువ ప్రశస్తంగా లేదు. ప్రవాహం లేదు. చదువరికి తన్మయత్వం కలిగించదు. కునుకుపాట్ల ఎండిలాగ యెక్కడి కక్కడే నిలిచిపోతుంది. గ్రంథకర్త చెప్పిన ట్లీగ్రంథ శైలి కుదురుపరుచుకోనుమన్నట్లే వుంది. గద్యతిక్కన శైలి దీనిలో కానరాకుండా వుంది. నవలరచన కిది ప్రథమ ప్రయత్నంగదా! కనుక శైలి యీలాగు వుండడం సహజమే. కాకున్నా 'విగ్రహం' వంటి శైలిలో రాయడం అలవాటుపడిన కవికి ఈగ్రంథంవంటి సరళశైలిరచనలోకి దిగడం దుముకడంవంటిది. అలవాటు లేనిపనికదా! బహుకష్టం. ఈరకమైన కష్టాని కీశైలే నిదర్శనం.

గ్రంథమం దక్కడక్కడ లేతపరిహాసం (Irony) కనబడుతూంది. ఈహాస్య మెక్కడా వెగటుగా లేదు; ఆనందదాయకంగా వుంది. సంఘమునుగూర్చిన పర్యాలోచనలతోను (Reflections), సాధారణధర్మసూత్రాలతోను ఈగ్రంథం నిండివుంది.

గ్రంథకళనుగూర్చి యేమంటే — గ్రంథకర్త వివేకబోధను ప్రధానంగా పెట్టుకుని కళనశ్రద్ధ చేసినట్టున్నాడు. కథాకల్పనలో హెచ్చు ప్రజ్ఞ కన్నా కథాక్రమంలోను, సంభాషణల్లోను విశేషచాతుర్యం కనబడదు. కథాంశాలెక్కువ నేర్పుతో అతుకబడలేదు. ఇంకా, ఐక్యంలేని అనేకఅంశాలు ఒకొక్కప్పుడు చేర్చబడ్డాయి. పాత్రలతోగాని కథతోగాని వాటికి విశేషసంబంధం లేదు. ఆఅంశాలయొక్క ఉద్దేశం కేవలం సంఘశీలం తెలియజేయడమే కాని మరేం లేదు. ఉదా:—తొమ్మిదో ప్రకరణంలోని గృహదహనము, గ్రహశాంతి, పదమూడో ప్రకరణంలోని వైష్ణవరాజశేఖరుల సంభాషణ, మొదలైనవి.

సంభాషణల విషయ మేమంటే—ఇందలి పాత్రలు సాధారణంగా స్వతంత్రంగా మాట్లాడవు. వారికి పూర్తిగా వ్యక్తిత్వ ముండదు. గ్రంథకర్త తన కనుకూలంగా వుండేటట్లా వారిచేత మాట్లాడిస్తాడు. ఈరకమైన సంభాషణ ఉత్తమంకాదని వేరే చెప్పనక్కరలేదు. ఈలోటుకు ముఖ్యకారణ మేమిటంటే గ్రంథకర్తయొక్క వ్యక్తిత్వ మధికం. ఈవ్యక్తిత్వంలో తక్కిన వ్యక్తుల వ్యక్తిత్వాలు మునిగిపోతాయి. సంఘసంస్కరణకు పూనుకున్న ఈ కవికి తన ఘోష హెచ్చు; తక్కినవారి ఘోష తక్కువ. అందుచేత వీరిపాత్రలు వీరి చేతిలోని కీలుబొమ్మలు; ప్రత్యేకచిత్తాలున్న వారుకారు. ఇట్లీగ్రంథం కొంత కళారహితంగా వుంది. వీరేశలింగకవి మౌలికప్రధానరచనల్లో యీలోపం సామాన్యంగా కనబడుతూవుంటుంది.

వర్ణించడంలో ఈకవికి గల సామర్థ్యం అసామాన్యం. విచిత్రమైన అల్పాంశాలను కూడా విడిచిపెట్టకుండా మన మాశ్చర్యపడేటట్లా వర్ణిస్తాడు. ఈకావ్యమంతా సహజవర్ణన సంశోభితమై వుంది. ప్రొద్దుటిపూట గోదావరీతీరంయొక్క వర్ణన, రాజశేఖరుడి గృహావర్ణన

ఈయన వర్ణనాసామర్థ్యానికి దృష్టాంతాలు. వీరేశలింగకవి మనుష్యస్వభావం యొక్క మారుమూలలెరిగినవాడు. లోకపరిశీలన, లోకజ్ఞానము అత్యధికం. సంఘసంస్కరణకుపూనుకోడంచేత భావనాజీవితంగాక యథార్థజీవితం లిఖించడమే ఈయన ఆశయం. ఇది యీగ్రంథమంతా జయప్రదంగా నెరవేర్చబడింది. వీరేశలింగంగారి మహత్తరంధీశక్తి కిదొక తార్కాణం.

ఈకావ్యమందు గల ఒకవిశేష మేమంటే—యిది రచింపబడ్డకాలంలో ఈ భాషాశైలిని అంగీకరించేవారు లేరు. ఎంతసేపు అరసున్నలు, బండిరలు, వ్యాకరణంకోసం, శబ్దాడంబరాలకోసం చూసేవారేకాని రసపుష్టికలిగిన సరళశైలి రాయడం వారి ఆశయం కాదు. (చిన్నయసూరిదైన నీతిచంద్రికయందలి మిత్రలాభ మొక్కటే సరళశైలిగల గ్రంథం.) అట్టిస్థితిలో శ్రీ వీరేశలింగకవి అప్పటి సాంప్రదాయాలను త్యజించి తన స్వచ్ఛందతను వెలుపుచు స్వతంత్రశైలిలో రాయ ప్రారంభించేరు. అరసున్నలు, బండిరలు వాడితేమట్టుకేమి, పండితుల కభ్యాసంలేని తేటశైలిలో రాసేరు. ఇట్లు స్వతంత్రించి ప్రత్యేకశైలిలో రాయడం కవియొక్క అపూర్వప్రజ్ఞను తెలియజేస్తూంది. ఈయన సంఘసంస్కరణకు వలెనే భాషాశైలి సంస్కరణకు కూడా పాటుపడ్డాడు. ఈవిశేషాన్ని అప్పటివారే కొంతవరకు గ్రహించి ఆశ్చర్యపడ్డారు.

"చిన్నయసూరియొక్క నీతిచంద్రిక కుత్తర భాగముగా ముద్దేశింపబడిన విగ్రహముయొక్క గ్రంథకర్త తన పూర్వసాహచర్యములను బూర్తిగా విడనాడి తెలుగువాఙ్మయమునందు సంపూర్ణనూతనమార్గము నవలంబింపగలుగునని మేము తలచియుండలేదు. కాబట్టి యిప్పుడు విమర్శనీయములైయున్న రెండు పుస్తకముల యొక్క ఆవిర్భావమువలన మేము మహూహలముగా నాశ్చర్యపడితిమని యొప్పుకొనవలసియున్నది. తెలుగువాఙ్మయము యొక్క చరిత్రమునందు రాజశేఖరచరిత్రము నూతనశకమును ఏర్పఱుచుచున్నదని మేము చక్కగా చెప్పవచ్చును."

(కం. వీ స్వీ. చ. రెం. ౧౫౧-వ పుట.)

రాజశేఖరచరిత్రమును చదివినవారు ముందుముందు ఆంధ్రవాఙ్మయం బంగాళీనవలానువాదాలతో నిండుతుందని వూహించలేరు. ఇట్టి మౌలికత్వరచన కడిఫలితమనీ, స్వతంత్రరచనాంకురం ప్రబలంగా విజృంభించదనీ యెవరనుకుంటారు? తక్కిన ప్రపంచమంతా గొడ్డుపోయినట్టు మన కొక్క బంగాళీభాషే కనబడింది. ఏభాషకైనా మరొకభాషలోని వుత్తమగ్రంథాలను అనువదించుకోడం స్వభావం. కాని మన కలాగుగాక బంగాళీభాషలో వున్న మంచితోపాటు తుక్కు కూడా అనువదించుకోడమే ఆచారమైపోయింది. ఇది మనయొక్క ప్రజ్ఞలేమికంటె మనసోమరితనాన్ని తెలియజేస్తూంది. ఈసోమరితనాన్ని గ్రంథకర్తలు వదలగొట్టుకుని మౌలికప్రధానరచనలను ప్రారంభిస్తే (ఇప్పుడు తెలుగులో స్వతంత్రరచన లేమీ లేవని నాఅభిప్రాయం కాదు) ఆంధ్రవాఙ్మయ మభివృద్ధికాక యేమవుతుంది? అనువాదాల సంగతేమిటంటే, బంగాళీనవలలను కొంతకాలంవరకు తర్జుమా చెయ్యడం చాలించి తక్కిన స్వదేశభాషల్లోను, విదేశభాషల్లోను వున్న అమూల్యమైన నవలలను ఆంధ్రీకరించుకుంటే యెంతో వుత్తమం. ఈప్రకారంగా పాటుపడితే ఆంధ్రవాఙ్మయం కల్పవృక్షంలాగ వితరణ, అమృతత్వం, గౌరవం గలిగి వుంటుందని వేరే చెప్పాలా?

(సశేషము.)

# ప్రాచీన చిత్రములు



౧. దుఃఖరంగము

(పదునారవశతాబ్దపు టుత్తరార్థము చిత్రము)

# ఛందశ్శాస్త్రము—అధ్వభాగప్రత్యయము

గిడుగు వెంకటసీతాపతిగారు

గత ఫాల్గునమాసభారతిసంచికలో దువ్వూరి సూర్యనారాయణమూర్తిగారు ఛందశ్శాస్త్రమునుగూర్చి వ్రాసిన వ్యాసము చూచినాను. అనంతుని ఛందమునకున్ను, అప్పకవీయమునకున్ను నేను వ్రాసిన పీఠికలలో ఈఅధ్వభాగప్రత్యయమునుగూర్చి నేను ఏమీ వ్రాయలేదన్నమాట సత్యమే. అయితే, అనంతుడు అధ్వప్రక్రియగూర్చి చెప్పినవాక్యము సుబోధకముగా ఉన్నందున, ఆవిషయము విస్తరించి వ్రాయవలసిన ప్రసక్తి నాకు కనబడలేదు. అప్పకవి చెప్పిన పద్యముమాత్రము అంత స్పష్టముగా లేదు. దానిక్రింద నున్న టీకలో "కలియఁ గూడి" అన్నమాటలవల్ల అర్థము చెడినది. కనుక, ఈవిషయమును గూర్చి పీఠికలో వ్రాయవలసి ఉండెను; మరచి పోయినాను. అయినా, అప్పకవి వ్రాసిన పద్యములోని భావము అనంతుడు వ్రాసిన పద్యములోని భావమునకు భిన్నమైనది కాదు.

ఈవిషయమును విస్తరించి వ్రాయుటకు నాకు కొన్నికార్యాంతరములవల్ల అవకాశము చాలదు, గనుక అధ్వభాగప్రత్యయమును గూర్చి అనంతుడున్ను, అప్పకవిన్ని చెప్పినది ప్రాచీనమతానుసారముగానే ఉన్నదనిన్ని, లక్షణకర్తలకు ఐక్యము లేకపోలేదనిన్ని మాత్రము తెలియజేస్తున్నాను.

వృత్తప్రస్తారమునకు ఎన్నిఅంగుళముల భూమి కావలెను? ఇది అధ్వభాగప్రత్యయమునకు సంబంధించినప్రశ్న. బియ్యపుగింజపై పెద్దపేరున్ను, పైవిలాసమున్ను ఇమిడ్చి చిత్రించగల ఈదినములలో ఈప్రశ్న తెలివితక్కువప్రశ్నగా కనబడక మానదు. అయితే, లక్షణకర్తలకు ఈప్రశ్న "సాంకేతిక"మాత్రము. గురుచిహ్న[౦]కు గాని, లఘుచిహ్న[।]కు గాని, రెండుచిహ్నలనడుమ నుండవలసిన అంతరమునకు గాని, ఒకచదరపుఅంగుళము-భూమి కావలె నన్న సంకేతము ననుసరించి లక్షణకర్తలు సూత్రములు రచించినారు. అనంతుడు చెప్పినసూత్రము ననుసరించి మూడవ ఛందమునకు వృత్తప్రస్తారము చేసి చూచిన యెడల తేలినవిషయ మేమంటే:

"ఛందోఽక్షరములు" "ద్విగుణములై" "ఒక్కడు తొలఁగఁగ"—మూడవఛందము గనుక ౩ అక్షరములు, ద్విగుణము కాగా ౬, ఒకటి తొలగించగా ౫ గనుక ౫ అంగుళముల భూమి—ఇది వెడల్పు [౧౨౩౪౫]

"వృత్తసంఖ్య" "ద్విగుణములై" "ఒక్కడు తొలఁగఁగ"—మూడవఛందములో పుట్టిన వృత్తములసంఖ్య ౮, ద్విగుణము కాగా ౧౬, ఒకటితొలగించగా ౧౫ గనుక ౧౫ అంగుళముల భూమి—ఇది పొడవు. [౧ ౨ ౩ ౪ ౫ ౬ ౭ ౮ ౯ ౧౦ ౧౧ ౧౨ ౧౩ ౧౪ ౧౫।]

ఈ "పరిశిష్టాంగుళములు" అనగా ౫ (వెడల్పు), ౧౫ (పొడవు) మూడవ ఛందము

నకు సంబంధించిన అర్ధభాగమును తెలియ జేయును అని భావము.

ఈవిధముగానే అప్పకవి చెప్పినది సైతము అర్థము చేసుకోవచ్చును. "ఛందస్సంఖ్యయును వృత్తసంఖ్యయు రెంటఁ(బొందుగ) గుణించి యొక్కటి యందుఁ దిగియ నెన్ని యన్ని యంగుళము లగుఁ" — ఇందులో "పొందుగ" పాదపూరణము; "ఒక్కటి యందు దిగియ" అనుటకు మారుగా అనంతుడు చెప్పినట్లు "ఒక్కొక్కడు దిగియ" అని ఉంటే రెండు సంఖ్యలు వేరువేరుగా చూసుకోవలసినది అని స్పష్టమయి ఉండును. శాస్త్రవిషయము పద్యములో ఇరికించవలసినప్పుడు ఇటువంటి చిక్కులు అప్పుడప్పుడు సంభవిస్తూఉంటవి.

రంగరాట్ ఛందములో అర్ధప్రత్యయమునకు చెప్పినపద్యము అప్పకవి వృత్తసంఖ్యాప్రత్యయమునకు అంగముగా ఉక్తాదిజవృత్త సంఖ్యగురించి చెప్పినదానికిన్ని (౪.౧౩౮), అనంతుడు షట్ప్రత్యయములను వివరించి కడపట "సమవృత్తంబుల వెలసు" గూర్చి చెప్పినదానికిన్ని (3.౭౭) సరిపడి ఉన్నది. అంతే కాని, అందులో తక్కినలాక్షణికులు చెప్పిన అర్ధభాగప్రత్యయమును అనుసరించిన విషయము పద్యయమే లేదు.

---

## వలపుకలిమి

అధికార్ల సూర్యనారాయణ రావుగారు

చదల బక్షినై రెక్కల సాచి సాచి
   యాకసవ్యాప్తి(?) కంతంబు నరయనైతి!
అబ్ధి మీనంబు నై యీదులాడి యాడి
కడలినీటికి పారంబు గాననైతి!
ధరణి జానకీవిభుడ నై తలచి తలచి
వలపుకలిమిని తుది మొదల్ తెలియనైతి!

---

# చింతామణిసూత్ర విమర్శము

అవ్వారి సుబ్రహ్మణ్యశాస్త్రి గారు

'సర్వత్రా జ్వత్కార్యంజ్ఞేయంయస్య ద్రుత ప్రకృతికేభ్యః' అను నన్నయసూత్రముచే 'రాముఁ + యాచించెను' అనుచో 'రాము నాచించెను' అను చెడురూప మేర్పడుచున్నది. కావున నీసూత్రము తత్సమపదాది యకారమునకు సంబంధించినది కాదనుకో వలసివచ్చుచున్నది. అట్లనుకొనిన దీనికి లక్ష్యమే లేదు. తెలుఁగుమాటల మొదట యకారము లేమియే కారణము. కాని "అద్యః క్రియాసు భూతార్థ ద్యోతి సమాద్యగం వినాసర్వః" అను నన్నయసూత్ర మొకటి తెలుఁగుమాటల మొదట యకారమును స్థిర పఱుచుచున్నది. దీనిచేత నజాదులైన వికృతి పదముల (తత్సమతద్భవదేశ్యముల) మొదటి యచ్చులెల్ల యకారపూర్వకములుగనే యుచ్చరింపఁబడెడి యిప్పటి యలవాటే పూర్వకాలమునఁగూడఁ దెలుఁగుదేశమున నుండెడి దనియు, నావాడుకబలమున దుస్సంధులు చేసికొని 'చేయఁ + యితఁడు, కొట్టెఁ + యింద్రుఁడు, ఇత్యాదుల 'చేయన్యితఁడు, కొట్టెన్యింద్రుఁడు' అని యుచ్చరింతురో యను భయమున నన్నయ సర్వత్రాజ్వ దిత్యాది సూత్రమును రచించె ననియు నొకసమన్వయము సంప్రదాయప్రాప్త మగుచున్నది. కాని యింధొక యిబ్బంది లేకపోలేదు. 'వాఁడు + యతఁడు' అనుచో యకారమునకు స్వరదృష్టిని విధింపలేదు.

కాన 'వాఁడతఁడు' అనుటకు సూత్రము లేకపోవుచున్నది. ఇట్టి దోషమును వారించుటకు "సర్వత్రాజ్వత్కార్యం జ్ఞేయం యస్య" అని కొందఱు విభజించి "ద్రుతప్రకృతికేభ్యః లుక్సంశ్లేషౌ నాచి" అను సూత్రమును గూర్చినారు. "ఉభయనిర్దేశే పంచమీనిర్దేశో బలీయాఁ" అను నియమము వ్యాకరణముల నొప్పెడిది కాన 'ఙస్విధుట్' అను చోటవలె 'అచి' అనుదానికి విభక్తివిపరిణామము నొప్పుకొని ద్రుతప్రకృతికములమీఁది యచ్చునకు లుక్సంశ్లేషములు వచ్చునను విపరీతార్థము చేసికొనవలసివచ్చునేమో అనిపించుచున్నది. "న్నమ్మా హ్రస్వాశ్చాదేరమి శసిచ" అను నన్నయసూత్రములోఁగూడ నిట్టి పోకడ కన్పట్టుచున్నది. కాన యీదారి కాకుండ 'వాఁడతఁడు, వాఁడచ్యుతుఁడు' అను నిట్టి సుసంధులకు సూత్రలోపము వాటిలకుండ మార్గాంతరముఁ ద్రొక్కఁదము. 'వాఁడు + యతఁడు, వాఁడు + యింద్రుఁడు' ఇత్యాదుల యత్వదృష్టియే తిరమై యుండిన 'సంధిర్నాచోచ్యనుతః' అను సూత్రము విధానమే వ్యర్థమగును. మఱియు 'నాకుఁ + యిచ్చెను' ఇత్యాదుల యత్వదృష్టియే యుండిఅజ్వద్భావము లేకున్న 'అనాదిషువిభక్తి

షూత్తో వా' అను సూత్రము విధానము విఫల మగును.

కాన సంధిర్నా ఒచో, అనాదిషు=ఇత్యాది సూత్రవిధానసామర్థ్యమునం జేసి "వాఁడేఁడు, వాఁడింద్రుఁడు, నాకిచ్చె" ఇత్యాదుల నుత్తర పదాదివర్ణమున నజ్వద్భావము ప్రాప్త మగుచున్నది. కాన తాదృశస్థలముల నజ్వద్భావ విధానమునకు నన్నయ సూత్రమును నిర్మించి యుండ లేదు. 'కొట్టక+యరుదెంచె, చేరెఁ+యింటికి' ఇత్యాదుల సంధివిధాయక సూత్రములే లేవు కావున విధానసామర్థ్యమునని ట్టెటి యుత్తరపదాది యకారమున నజ్వద్భావము కలుగు ననుకొనుటకు వలనుపడదు. కావున నజ్వద్భావమును "సర్వత్రాజ్వత్కార్యం జ్ఞేయం యస్య ద్రుతప్రకృతికేభ్యః" అను సూత్రమునఁ బ్రత్యేకముగ విధించియే 'వచ్చెనింటికి, చేరునింద్రుఁడు' ఇత్యాదుల 'వచ్చెన్యింటికి, చేరున్యింద్రుఁడు' అను దుస్సంధిరూపము లేర్పడకుండ గ్రాంథికభాషను గాపాడుకొనుచు గ్రామ్యోచ్చారణానుసరణపూర్వకముగ భాషాసంస్కారము నుపదేశించు నన్నయ "సిద్ధిర్లోకాద్ధృశ్యా" అను తన యచంచలసిద్ధాంతమందలి దృష్టిని మనకుఁ గనులఁ గట్టినట్లు చూపుచున్నాఁడు.

---

# ఓ రు గ ల్లు

పాటిబండ మాధవశర్మ గారు

కాకతీదేవిబంగరుపాదుకల ద్రొక్కె నేపట్టణమ్ము ఘంటాపథాల
నడురేల నేపట్టణమువీధివీథుల కాపలా గాయు దుర్గాభవాని
రేలుం బవ ళ్లేపురీదుర్గగర్భాన కోడెత్రాచులు బుసగొట్టుచుండు
మార్కోపోలోమహామహుఁడు స్వప్నభ్రాంతి వెఱ గంది చూచె నేవీటిలక్ష్మి
కంటివ్రేగైన యాయోరుగంటికోట – ఆంధ్రజనముల దౌర్భాగ్య మవతరించి
యేమహాపాపఫలమొ యేహీనజాతి-దృష్టిదోషమ్మొ సోకి జీర్ణించిపోయె.

కాకతీదుర్గతోంగలిరెప్ప లమృతమ్ము గురిసి యేవీట బంగరువు పండు
పనిండుకొల్వు విద్యానాథకవి చక్రవర్తివాణికి ప్రతిధ్వనులు మోసె
సింహాసనమ్ము గైసేసి రుద్రమ్మ యేధర నేలె శాంతి సుస్థిరము గాగ
కోరమీసలు ద్రిప్పుకొనుచు నేవీటిలో సంచరింతురు మహాశౌర్యధనులు

ఈపురాస్మృతికేని చలింప దకట! - అనుకరాగతపారతంత్ర్యపతితమ్ము
నిలువునిలువున నీరయి నీరసించి - యణగిపోయిన యీనాటి యాంధ్రజాతి.

ఇంతింతలేసి వెళ్లెత్తిరో బండలు కోటగోడలు మిన్నుకొమ్ము దాక
కల్పాంతకాలమ్ము గడవ నిల్చునోకో దుర్గద్వారబంధాలు కదలవయ్యో
అతుకు లేకుండ కట్టితి రేల్లాకో మహోన్నతశృంగములతోడ నగళులెన్ని
నూఱేసిపుట్ల యినుంపకత్తళములనెటు మోసిరో సమిత్తటములందు
ఈమహాద్భుతవిషయము లిన్ని దలచి - యొక్కనిట్టూర్పు విడుచుట, కొక్కబాష్ప
కణము రాల్చుట, కొకపరి గళము నెత్తి - యేడ్చుటకు నేని యిచ్చ జనింపదయ్యో.

కను లెత్తి చూచి కాకతిదుర్గ సిగ్గుచే తల వంచుకొన్న రోజుల దలంచి
బారుగట్టిన సార్థవాహులమీదుగా తరలిపోయిన సంపదల దలంచి
ఎండకే కరగి ద్రవించిపోయినది హేమమయమ్ము సింహాసనము దలంచి
ఏముష్కరుని హస్త మెత్తినకత్తికో పొడిమైన విగ్రహమ్ముల దలంచి
ఇంతకన్నీరు విడుచుటకేని బుద్ధి-గలుగ దీమేని రక్తనాళులకు వేడి
పుట్ట దీపారతంత్ర్యవిముగ్ధమైన-తనువు కేతయచేతనత్వము ఘటిల్లె!

ఏప్రాతరారంభ మీయోరుగంటిదుర్గముమీద జేగురు రాచినదియొ
ఏశరచ్చంద్రిక యీయోరుగంటిలో క్రుమ్మరించెనో సుధాకుంభవృష్టి
ఏకిన్నరాంగన లీయోరుగంటి వంశయశమ్ము గానమ్ము సల్పినారొ
ఏస్వర్భువనశిల్పు లీయోరుగంటిలో మెఱయించిరో శిల్పగరిమ మింత
నాటికిన్ నేటికీతెల్గునాట నెచట-కనము విన మిట్టి దివ్యసంఘటనములను;
కఱకుతురక యేనా డిట కాలు పెట్టె-పఱచె నానాడె యాంధ్రసౌభాగ్యలక్ష్మి.

# మరుద్వృధా: కావేరి

శ్రీ బొబ్బరు వెంకటానంద రాఘవరావుగారు, B. A.
(కవితాసమితి)

౧

ప్రజోత్పత్తి సంవత్సర పుష్యమాస భారతిలో ౫౩ పుటలలో మరుద్వృధానదినిగూర్చి శ్రీ కురుగంటి సీతారామయ్య (M. A.) గారు చక్కని వ్యాసము వ్రాసియున్నారు. అందులో వారు యజురారణ్యకమునుండి "ఇమంమే గంగే యమునే సరస్వతి...మరుద్వృధే..." అను మంత్రమును ఎత్తివ్రాసి ఆమంత్రము మహానారాయణోపనిషత్తునందలి స్నానసూక్తమునందు కలదని తెలిపిరి. మఱియు యాస్కాచార్యకృతనిరుక్తమునం దీ మంత్రమునకు చెప్పబడిన అర్థమును, నిరుక్తభాష్యకారులగు దుర్గాచార్యులవారు చేసిన వ్యాఖ్యానమును, పై యజురారణ్యక భాగమునకు శ్రీసాయనాచార్యులవారి భాష్యమును వివరించిరి. కాని యజుస్సంహితా బ్రాహ్మణారణ్యకములందును, ఉపనిషత్తునందును ఋగ్వేదసంహితలోని మంత్రము లనేకములు చేరియున్నవి. యజురారణ్యకములోనిదని సీతారామయ్య గారు వ్రాసిన 'ఇమంమేగంగే...' అను మంత్రము అసలు ఋగ్వేద సంహితలో దశమ మండలములోని ౭౫-వ సూక్తములోనిది. సింధుక్షితి ఋషిప్రోక్తము. నదీదేవతాకము. జగతీఛందము. ఆసూక్తము నిట వ్రాయుచున్నాను. —

"ప్రసువ ఆపో మహిమాన ముత్తమం
కారుర్వోచాతిసదనేవివస్వతః
ప్రసప్తసప్త త్రేధాహి చక్రముః
ప్రసృత్వరీణా మతి సింధురోజసా. ౧

ప్రతేరదద్వరుణో యాతవేపథః
సింధోయద్వాజా అభ్యద్రవస్త్వం
భూమ్యా అధిప్రవతాయాసిసానునా
యదేషామగ్రం జగతామిరజ్యసి. ౨

దివిస్వనోయతతే భూమ్యోపర్యనంతం
శుష్మముదియార్తిభానునా,
అభ్రాదివప్రస్తనయంతివృష్టయః
సింధుర్యదేతి వృషభోనరోరువత్. ౩

అభిత్వాసింధో శిశుమిన్నమాతరో
వాశ్రా అర్షంతిపయసేవ ధేనవః
రాజేవయుధ్వానయసిత్వ మిత్సిచౌ
యదాసామగ్రం ప్రవతామినక్షసి. ౪

ఇమంమే గంగే యమునే సరస్వతి
శుతుద్రి స్తోమం సచతా పరుష్ణ్యా
అసిక్న్యా, మరుద్వృధే వితస్తయా
ర్జీకీయే శృణుహ్యా సుషోమయా. ౫

తృష్టామయా ప్రథమం యాతవేస
జూః సుసర్త్వా రసయా శ్వేత్యాత్యా,
త్వంసింధో కుభయా గోమతీం క్రుమం
మెహత్న్వా సరథం యాభిరీయసే. ౬

ఋజీత్యేనీరు శతీమహిత్వా
పరిజ్రయాంసిభరతే రజాంసి
అదబ్ధాసింధు రపసామపస్తమా,
శ్వానచిత్రావపుషీవదర్శతా. ౭

స్వశ్వాసింధుః సురథాసువాసా
హిరణ్యయీ సుకృతా వాజినీవతీ,
ఊర్ణావతీ యువతిః సీలమావత్యు
తాధి వస్తే సుభగామధువృధం. ౮

సుఖం రథంయుయుజేసింధురశ్వినం
తేనవాజంసనిష దస్మిన్నాజౌ
మహాన్హ్యస్య మహిమాపనస్యతే
దబ్ధస్యస్వయ శసోవిరప్శినః. ౯

ఇందు క్రింద గీతలుంచబడినవానిలో గంగ, యమున సుప్రసిద్ధములు. సరస్వతినిగూర్చి యాదిగువ కొంత వ్రాయవలసియున్నది. శ్రీ సీతారామయ్యపంతులుగారు వ్రాసినట్లు శుతుద్రి సట్లెజ్ (Satlej). అనియును,

పరుష్ణి 'రావి' యనియును, అసిక్ని 'చీనాబ్' అనియును, వితస్త, 'జీలమ్' అనియును, అర్జీకియా 'బియాస్' అనియును నేడు వ్యవహరింపబడుచున్నవి. చీనాబ్ అనబడు అసిక్నియే మన భాగవతాది పురాణములలో చంద్రభాగయని వర్ణింపబడినది. జీలమనబడు వితస్తనే అలెగ్జాండరుతో వచ్చినగ్రీకులు 'హైడాస్పస్' అని వ్యవహరించినట్లు తెలియుచున్నది. సింధునదికే సుషోమ యనిపేరు గలదు. ఇవన్నియు పైని ౫-వ సంఖ్యగల మంత్రములోనివి.

ఇక ౬ వ దానిలో కుభా, గోమతీ, క్రుముసములు పేర్కొనబడినవి. కుభయే నేడు కాబూల్ (Kabul) అని వ్యవహరింపబడునది. గోమతి గంగను చేరుచున్న యుపనదులలో నొకటి. ఇందులోని క్రుమునదియును, ౭-వ దానిలోని ఊర్ణావతీ సీలమావతీనదులును, ౫-వ దానిలో మరుద్వృధానదియును నిశ్చయించుటకు తగు నవకాశములు లేవు. ఇప్పుడు మనము గుఱుతింపజాలని కారణముచేత నా పేరుగల నదు లెప్పుడును లేవనుట యుక్తముగా తోపదు. నిరుక్తము రచింపబడునాటికే మరుద్వృధానామముగల నది అంతరించి యుండును. నిరుక్తకారుడుశబ్దార్థమునుబట్టి 'హేమరుద్వృధేగంగే...' అని ప్రతినదికిని విశేషణముగా వాడిన ట్లగపడుచున్నది. ఋగ్వేదమునందలి దశమమండలములోని ౭౫-వ సూక్తము నదగా నీనదీసూక్తమును ప్రశంసించుచు శౌనకాచార్యులు వ్రాసిన బృహద్దేవత సప్తమాధ్యాయము ౧౧౫-౧౧౬ శ్లోకములలో నిట్లున్నది.—

౧౧౫-త్రత ప్రాచ్యాః ప్రతీచ్యశ్చ
స్రవన్త్యో దక్షిణాశ్చయాః.
౧౧౬-తాఃసప్తసప్త కైర్వర్గై
సంస్తూయన్తే ప్రధానతః.

అనగా నీ నదీసూక్తమునం దాదేశమున తూర్పు' పడమట, దక్షిణమున ప్రవహించుచుండిన నదీజాలము ముఖ్యముగా వర్ణింపబడినదని తెలియుచున్నది. ఈనదీసూక్తముపై వ్యాఖ్యానము చేయుచు మాక్సుముల్లరు పండితుడు ఇట్లు వ్రాసెను:—

"The poet takes in at one swoop three great river systems. North-West, Indus; North-East Ganges and Jumna. How well three armies are determined! But he had nothing of a map! The author had only high Mountains and sharp eyes to carry out his trigonometrical survey. Now I call a man, who for the first time could see those three marching armies of rivers a Poet"

(ఈనదీసూక్తము రచించినకవి ఏకకాలమునందే మూడునదీసమూహములను గమనించుచున్నాడు. ఈశాన్యదిశను గంగా యమునాదిస్రవంతులను, వాయవ్యదిశను కుభాదిస్రవంతులను, నడుమ సింధునది యుపనదులను ఒక్కదృష్టిలో చూచుచున్నాడు. జవమున బలతెంచు సేనలనదగిన యీస్రవంతుల గతు లెంతచక్కగా నిర్ణయింపబడినవి? ఇవి చూచుచు వర్ణించుట కతని యెదుట పట మెవ్వరును వ్రాసిపెట్టలేదే? మహోన్నత పర్వతములును, సహజసూక్ష్మదృష్టియు తప్ప నీయసాధ్యత్రిభుజగణితవ్యవహారమును సాగించుట కతనియొద్ద పరికర మేమియులేదే? అయిననేమి? సేనావాహినుల వంటి యీమూడునదీనదముల సమూహమును మొదట గనిపెట్టి వర్ణించిన యిట్టి మేధాశాలియేకద 'కవి' నామము సార్థకము చేసినవాడు?) అని పొగడియున్నాడు. మఱియు గ్రీకులు హిందూదేశముపై దాడివెడలువఱకు నీనదుల నామములు మార్పులేక యుండుటకు కూడ మాక్సుముల్లరు పండితు డాశ్చర్యమును వెలిబుచ్చెను.

కాని "అంభోధిః స్థలతాం స్థలం జలధితాం..." అన్నట్లు కాలగతిచేతను, భగవంతుని సంకల్పబలముచేతను కొన్ని మార్పులు జరిగినవి.

"ఏకాచేతత్సరస్వతీనదీనాం శుచిర్యతీ గిరిభ్య ఆసముద్రాత్..."

(పర్వతమునుండి సముద్రముతో సంగమించు పర్యంతము సరస్వతీనది యొక్కటే శుచీభూతయై ప్రవహించుచు...) అని ఋగ్వేదము సప్తమమండలము (వసిష్ఠమండలము) ౯౫-వ సూక్తము, ౨-వ మంత్రమునందు స్పష్టముగా చెప్పబడినది. ఆసరస్వతీనది యిప్పు డేదీ? రాజపుటానా ఎడారిలో మాయమైనదని కొందఱును, గంగా యమునలు సంగమించు త్రివేణి అనబడుచోట నంతర్వాహినియై చేరుచున్నదని కొందఱును చెప్పుచున్నారు. అంతేగాని గంగా యమునానదులవలె సరస్వతి మనకు ప్రత్యక్షగోచరముగాలేదు. కారణము భూమ్యుపరిభాగమునందును, భూగర్భమునందును జరుగుచున్న మార్పులని భూగర్భశాస్త్రజ్ఞులు తెలుపుదురు. సప్తసింధుప్రాంతముచుట్టును నాల్గుసముద్రము లుండినట్లు

భూగర్భశాస్త్రజ్ఞులవల్ల ధ్రువపడినట్లు అవినాశచంద్ర దాసుగారు 'ఋగ్వేదకాలమునాటి హిందూదేశ' మను తమగ్రంథమున తెల్పుచున్నారు. (A. B. Das. Rig-Vedic India) సింధునదిగూడ ఎప్పుడు నొక్కరీతినే ప్రవహించుచుండలేదు. అలెగ్జాండరు హిందూదేశము జయించినప్పుడు సింధునదీతీరమున నేడో కొన్ని స్తంభములు నాటించినట్లు ఆతని జీవచరిత్రలో ప్లూటార్కు వ్రాసియుండెను. ఈవాక్యము నాధారము చేసుకొని గవర్నమెంటువారిచే ప్రాచీనవస్తుపరిశోధనమునకు నియమింపబడిన బెనర్జీపండితుడు (A. R. Bannerji) సింధునది పూర్వము ప్రవహించిన యానవాలుగలచోట్ల త్రవ్వించిచూడగా అలెగ్జాండరునాటి స్తంభము లింకను దొరకలేదుగాని అంతకంటె ప్రాచీనములైన కట్టడములు కొన్ని మోహింజోదారో, హరియూపియప్రాంతము లందు దొరికినవి. ఇట్టి సందర్భములు పట్టిచూడగా 'మరుద్వృధా' శబ్దము సమస్తనగులపు విశేషణముగా గ్రహించుటకంటె అయ్యది సింధునదీవదములలో నొకటియైయుండి కాలగతిచేతను, భూగర్భవికారములచేతను మనకు కానరాకున్నదని తలంచుట యుక్తమని తోచుచున్నది.

౨

తరువాత నీ'మరుద్వృధా' నామము కావేరి కెట్లు ముడివెట్టబడినదో దురూహ్యముగానే యున్నది. సీతారామయ్యగారి వ్యాసము చదివిన పిమ్మట నేను అమరమును చూచితిని వారివర్గు-నదీభేదాదినామములలో (౧-౨౪౮) కావేరియనియే యున్నది. "కవేరపర్వతాత్ప్రభవతీతి కావేరీ" యనియు, "కవేరస్యరాజ్ఞో పత్యం స్త్రీ కావేరీ" యనియునున్నది. అమరమటుండ ౧౬-వ శతాబ్దమువాడగు భైరవకవి రచించిన శ్రీరంగమహత్త్వమునుకూడ చదివిచూచితిని. అందు కావేరిమాహాత్మ్యము చక్కగావర్ణింపబడినదిగాని యాగ్రంథములో మరుద్వృధాప్రస్తావన మెచ్చటను కానరాలేదు. ౧౬-వ శతాబ్దాంతమువఱకు కావేరికి మరుద్వృధాయను నామమున్నట్లు గ్రంథస్థమైన సాక్ష్యము ఇంతవఱకు కనుపడదు. ఆపిమ్మట ౧౭-వ శతాబ్దప్రారంభమున, శ్రీ సీతారామయ్యగారు చూపినట్లు తంజావూరి రఘునాథరాయల యాస్థాన కవీశ్వరులలో నొకడగు యజ్ఞనారాయణదీక్షితులు తనసాహిత్యరత్నాకరమున కావేరిని మరుద్వృధాయనునామముతో వర్ణించి నట్లున్నది. ఇంతకుపూర్వమే కావేరి కీనామము రగాఢమై యున్నయెడల శ్రీరంగమహత్త్వమున కావేరిమాహాత్మ్యము వివరించి వర్ణించిన భైరవకవి యీపేరైన సూచించకుండుటకు కారణ మగపడకున్నది. కీ. శే. శ్రీమహామహోపాధ్యాయ పరవస్తు రంగాచార్యులవారు రచించిన సర్వశబ్దసంబోధినియను సంస్కృత తెలుగు నిఘంటువునందు ౬౨౦-వ పుటలో 'మరుద్వృధా' అనగా కావేరీనదియని యర్థము వ్రాసినారు. భైరవకవి క్రీ. శ. ౧౫౪౦ వఱకు నుండెనని శ్రీ మానవల్లి రామకృష్ణకవిగారు శ్రీరంగమహత్త్వపీఠికలో తెలియజేయుచున్నారు. శ్రీనాథుని కాశీఖండ భీమఖండములతరువాత క్షేత్రమహత్త్వ మింత ప్రౌఢముగా తెనిగించిన కవి యన్యుడెవ్వడు కానరాడనికూడ వారు తెలుపుచున్నారు. మఱియు నీ శ్రీరంగమహత్త్వమును ఆరుగురుకవులు తెలిగించినట్లగుపడుచున్నది. కందాళై అప్పలాచార్యులశిష్యుడగు ముకుందయోగి ద్విపదరూపముగను, వరదుల నరసామాత్యుడు కందపద్యరూపముగను, భాగవతుల రామకవి, కట్టా వరదరాజకవి, భైరవకవి చంపూకావ్యరూపముగను శ్రీరంగమహత్త్వము రచించిరి. విజయరంగచొక్కభూపాలుడు వచనకావ్యముగా రచించెను.

సంస్కృతములో గరుడపురాణమున నూరధ్యాయముల గ్రంథముగాను, బ్రహ్మాండపురాణమున తొమ్మిదియధ్యాయములుగాను శ్రీరంగమహాత్త్వము వర్ణింపబడినట్లు తెలియుచున్నది. భాగవతుల రామకవి, ముకుందయోగి బ్రహ్మపురాణాంతర్గత కథ ననువదించినట్లును, తక్కినవారు గరుడపురాణాంతర్గతకథను తెనిగించినట్లును కూడ తెలియుచున్నది. ఈగ్రంథములలో కావేరీప్రశంస యుండకమానదు. ఈగ్రంథములు చెన్నపురి, తంజావూరు గ్రంథ భాండాగారములలో దొరకునుగాని ఇతరచోట్ల దొరకవు. ఆగ్రంథములను పరిశీలించుటకు వలకాశము గల పండితులు పరిశ్రమచేసి మరుద్వృధానామము కావేరి కెపుడెట్లు వచ్చెనో వివరించి యాంధ్ర పాఠకుల కృతజ్ఞతకు పాత్రులయ్యెదరుగాక.

---

# అశోకుఁడు: కళింగయుద్ధము

ది. వెం. అవధానిగారు

"పక్షము దాఁటె నాసుతు లవార్యపరాక్రమవిగ్రహుల్ విప
క్షౌక్షుభితాహవాంతరమహాంబుధి నీదఁగ నేగి నేఁటికిన్
శిక్షితవైరులై తిరిగి చేరరు నన్ను పరిస్ఫురించెడిన్
దక్షిణనేత్ర మాఁగక సదా గన నెట్టివిపత్తు మూఁడునో!

"విందు కళింగయుద్ధమున వేలకు వేలు గతించి రంచు నా
నందను లేటికో తడపినారలు ; రారు వచించినట్లు లా
నందముతోడ; డెందము పునఃపునరుద్భవదార్తిలగ్నమై
కొందల మందు నెట్టు లోఁగూర్చెడినో భగవంతుఁ డక్కటా!

"సంగరభూగతాఖిలవిశాంపతిసైనికు లాత్తశేముషీ
రంగదతిప్రమోదభరలాంఛితులై యరుదెంచి సౌఖ్యవా
స్తుంగతరంగడోలికలఁ దూఁగుచు నుండ మదాత్మజుల్ సమా
లింగితసాంపరాయజయు లేల విలంబనముం బొనర్చిరో?

"పరమస్నేహము పాపశంకి యయి సంభావింపఁగాఁ జేయు ని
ట్లరయ న్నాసుతు లేమి హీనబలులా? అన్యప్రభీతాత్ములా?
పరిపంథిద్విపమస్తకస్రవదసృక్పానాభిలాషాపరా
పరదుచ్చైఃస్వనగర్జదుత్తమమృగస్వాముల్ సుసామాన్యులే!

"తడయక నేఁడొ రేపొ లలితంపుకరాంగుళు లెత్తి పున్నెపుం
బడఁతు లొసంగు నారతుల బంగరుకాంతి ముఖాబ్జశోభకుం
దొడ వయి పెంపు నింప శుభతోయధులై చనుదెంచి న న్ముదం
పడఁగ నొనర్తు రింక వగపాటుకు లోనయి కుంద నేటికిన్?"

అని చింతించుచు వృద్ధ యోర్తు తనయాయానప్రతీక్షాపునః
పునరాబద్ధబహిఃకవాటపథదృక్పుంజీకృతౌత్సుక్యయై
జనితామందరుజావికంపితమనశ్చాంచల్యనిర్దైన్యయ
ఘనవాతాభిహతచ్ఛదాంబురుహసంకాశాస్యయై యుండఁగన్.

తనరాజ్యాంగవిధాన మెల్లరకు సత్యాంతమ్ము సౌఖ్యప్రసా
ధనమై యున్నదో లేదో చూచుటకు నై ధర్మాత్ముఁ డా మాగధా
వనిపాలుండు నిగూఢవేషమున తత్ప్రాంతభూమీపురా
తనరథ్యైకతమానుసారి యయి చింతల్ చూచుచుఁ బోవుచున్.

మూర్తీభవించినయార్తిదేవతవోలె నుస్సురంచును పడియున్నదాని,
ననివార్యవేగనిర్యద్బాష్పధారార్ద్రగండస్థలీవళికములదానిఁ,
బర్యాప్తనైరాశ్యపరితఃప్రదర్శితఘర్మాంబుపూరితాంగంబుదాని,
వాతాయనాయాతవాయ్వల్పనిస్వనభ్రమితైతసుతపదస్వనముదాని,
నందనాంచితసుగుణపునఃపునరను-చింతనాగతదుఃఖమ్ముచేత నుక్త
తదభిధానుగతోచ్చరోదనముదాని-మాయ యెఱుఁగని యా వృద్ధమాతఁ గనియె.

కాంచి యమందశోకపరికంపితచిత్తసరోజుఁడై సమీ
పించి, సమగ్ర మామె వినిపించిన యార్తినిమిత్తముఁ విమ
ర్శించి, తదంతరస్థవిపరీతఫలోద్గమనాపతిష్యదా
తంచననిశ్చలీకృతపదద్వయుఁడై వచియించె నిట్టులన్ :

"అవ్వ ! విచారముఁ విడువు మాహవదర్శితనైజతేజులై
క్రొవ్విన శత్రుసైనికుల గుండెలనెత్తురు నేల వాల్చి, యా
కవ్వడివోలె సద్యశము గాంచి సుఖించెడివారికోస మి
ట్లువ్విళులూరె దేటికి జయోదయ మబ్బుట యన్న మాటలే !

"వీరు లపారపౌరుషగభీరులు పోర నరాతిసైన్యసం
హారముఁ జేసి యారవిశశాంకము సుస్థిరమై వెలుంగు వి
స్ఫారయశస్సమార్జనము సల్పఁగ నెంతురు గాని నారకా
పారరుజావిధాయి తమభాగముపై నభిమాన ముంతురే !

"రణరంగప్రతిగామిసైనికజనవ్రాతంబు దృప్తారిసం
హననమ్ముం బొనరించి వైజయరమాహ్లాదప్రదాలింగనో
న్మనువై వచ్చును గాక ; కీర్తితనువుం బ్రాపించుఁగా కిట్టు లో
జననీ ! నిర్గతధైర్యలై వెఱతురే సర్వజ్ఞులౌ భామినుల్ !

గిడ్రు ॥

"హా త్ప్రత్యర్థినృపాలసైనికరణవ్యాపారు లస్మచ్చమూ
స్థితయోధుల్ సమరావసానదినమందే తత్తదావాసప్ర
స్థితు లైరమ్మ! భవత్కుమారకులు ని జ్జైరంగరా రామరో
న్నతసౌధోపరిలబ్ధభూరిసుఖు లైనా రంచు నూహించెదన్.

"అవ్వ! నే మాగధాధినాయకుఁడ నీదు - కూర్మిబిడ్డల ప్రాణాలు గొన్న పరమ
పాతకుండను; వలయు సేవకులగణము - నంపుకొందును మన్నింపు మమ్మ నన్ను."

అనుపలు కామె కర్ణగత మైనదొ లేదొ, మృగేంద్రభీమగ
ర్జనశ్రవణార్త మయ్యును జరానచలీకృతపాదమా మృగాం
గనవలె నేలఁ గూలి క్షణకాలములో తెలి వొంది బాష్పసం
జనితగళస్థగాద్గదికసంచలితస్వర యాచు నిట్లనెన్:

"బారెఁడునేలకై కడుపు భగ్గున మండఁగఁజేసినాఁడవో
క్రూరుఁడ! కింకరాళి సమకూర్చెద నందువు వార లాదరో
దారమనస్కు లైన నతితత్పరతం బరికింత్రు గాని దు
ర్వారఘురమ్ము నాకడుపుబాధ శమింపఁగఁజేయ నేర్తురే?

"ఎనుబదియేండ్లు నెత్తిపయి కెక్కినదానను, కాలుసేతులన్
మనసుకు వచ్చినట్లు పెఱుమానిసి లేక కదల్పఁజాల నా
తనయులు మాతృభక్తికి నిధానములై నను నేఁటిదాఁక ర
క్షణ మొనరించి రిం కెటులు కాలము తీఱెడి నో నరేశ్వరా!

"భావోత్పన్నసమానరూపులను నాబంగారపుంగొండలన్
హేవాకాబ్ధులఁ బొట్టఁ బెట్టుకొని న న్నేడ్పించుచున్నా విటుల్
నీవాల్లభ్యము భూప్రజాళికి సుఖానీకంబుఁ జేకూర్పనా?
జీవోపద్రవకారిసంగరములన్ సృష్టించి చంపింపనా?

"పూర్వోపార్జితరాజ్య మింత గలుగన్ భోగింపఁగాఁ జాలదే
యుర్వీపాలక! వెంటఁ గట్టుకొనిపో నూహించెదే? శేముషీ
సర్వస్వమ్మును గుత్తగొంట కిదియా సన్మార్గ మి ట్లూరకే
దుర్వారవ్యథ కల్గఁజేసి జనులన్ దూటాడఁగా పాడియే?

తనరాజ్యాంగవిధాన మెల్లరకు సత్యాంతమ్ము సౌఖ్యప్రసా
ధనమై యున్నదొ లేదొ చూచుటకు నై ధర్మాత్ముఁ డా మాగధా
వనిపాలుండు నిగూఢవేషమున తత్ప్రాంతభూమీపురా
తనరథ్యైకతమానుసారి యయి యింతల్ చూచుచుఁ బోవుచున్.

మూర్తీభవించినయార్తిదేవతవోలె నుస్సురంచును పడియున్నదాని,
ననివార్యవేగనిర్యద్బాష్పధారార్ద్రగండస్థలీవళికములదాని,
బర్యాప్తనైరాశ్యపరితఃప్రదర్శితఘర్మాంబుపూరితాంగంబుదాని,
వాతాయనాయాతవాయ్వల్పనిస్వనభ్రమితైతసుతపదస్వనముదాని,
నందనాంచితసుగుణపునఃపునరను-చింతనాగతదుఃఖమ్ము చేత నుక్త
తదభిధానుగతోచ్చరోదనముదాని-మాయ యెఱుఁగని యా వృద్ధమాతఁ గనియె.

కాంచి యమందశోకపరికంపితచిత్తసరోజుఁడై సమీ
పించి, సమగ్ర మామె వినిపించిన యార్తినిమిత్తముఁ విమ
ర్శించి, తదంతరస్థవిపరీతఫలోద్గమనాపతిష్యదా
తంచననిశ్చలీకృతపదద్వయుఁడై వచియించె నిట్టులన్:

"అవ్వ! విచారముఁ విడువు మాహవదర్శితనైజతేజులై
క్రొవ్విన శత్రుసైనికుల గుండెలనెత్తురు నేల రాల్చి, యా
కవ్వడివోలె సద్యశము గాంచి సుఖించెడివారికోస మి
ట్లువ్విళులూరె దేటికి జయోదయ మబ్బుట యన్న మాటలే!

"వీరు లపారపౌరుషగభీరులు పోర నరాతిసైన్యసం
హారముఁ జేసి యారవిశశాంకము సుస్థిరమై వెలుంగు వి
స్ఫారయశస్సమార్జనము సల్పఁగ నెంతురు గాని నారకా
పారరుజావిధాయి తమభాగముపై నభిమాన ముంతురే!

"రణరంగప్రతిగామిసైనికజనవ్రాతంబు దృప్తారిసం
హననమ్ముం బొనరించి వైజయరమాహ్లాదప్రదాలింగనో
న్మనువై వచ్చును గాక; కీర్తితనువుం బ్రాపించుఁగా కిట్టు లో
జననీ! నిర్గతధైర్యలై వెఱ్ఱితురే సర్వజ్ఞులౌ భామినుల్!

గిడ్డు

"హా క్రత్యర్థినృపాలసైనికరణవ్యాపారు లస్మచ్చమూ
స్థితయోధుల్ సమరావసానదినమందే తత్తదావాసప్ర
స్థితు లైరమ్మ! భవత్కుమారకులు ని ర్జేతంగరా రామహో
న్నతసాధోపరిలబ్ధభూరిసుఖు లైనా రంచు నూహించెదన్.

"అవ్వ! నే మాగధాధినాయకుఁడ నీదు - కూర్మిబిడ్డల ప్రాణాలు గొన్న పరమ
పాతకుండను; వలయు సేవకులగణము - నంపుకొందును మన్నింపు మమ్మ నన్ను."

అనుపలు కామె కర్ణగత మైనదో లేదో, మృగేంద్రభీమగ
ర్జనశ్రవణార్త మయ్యును జరానచలీకృతపాదమౌ మృగాం
గనవలె నేలఁ గూలి క్షణకాలములో తెలి వొంది బాష్పసం
జనితగళస్థగాద్గదికసంచలితస్వర యాచు నిట్లనెన్:

"బారెఁడునేలకై కడుపు భగ్గున మండఁగఁజేసినాఁడ వో
క్రూరుఁడ! కింకరాళి సమకూర్చెద నందువు వార లాడవో
దారమనస్కు లైన నతితత్పరతం బరికింత్రు గాని దు
ర్వారఘురమ్ము నాకడుపుబాధ శమింపఁగఁజేయ నేర్తురే?

"ఎనుబదియేండ్లు నెత్తిపయి కెక్కినదానను, కాలుసేతులన్
మనసుకు వచ్చినట్లు పెఱమానిసి లేక కదల్పఁజాల నా
తనయులు మాతృభక్తికి నిధానములై నను నేఁటిదాఁక ర
క్షణ మొనరించి రిం కెటులు కాలము తీఱెడి నో నరేశ్వరా!

"భావోత్పన్నసమానరూపులను నాబంగారపుంగొండలన్
హేవాకాబ్ధులఁ బొట్టఁ బెట్టుకొని న న్నేడ్పించుచున్నా విటుల్
నీవాల్లభ్యము భూప్రజాళికి సుఖానీకంబుఁ జేకూర్చునా?
జీవోపద్రవకారిసంగరములన్ సృష్టించి చంపింపనా?

"పూర్వోపార్జితరాజ్య మింత గలుగన్ భోగింపఁగాఁ జాలదే
యుర్వీపాలక! వెంటఁ గట్టుకొనిపో నూహించెదే? శేముషీ
సర్వస్వమ్మును గుత్తగొంట కిదియా సన్మార్గ మి ట్లూరకే
దుర్వారవ్యథ కల్గఁజేసి జనులన్ దూటాడఁగా పాడియే?

"నావలె నెంద జెట్టులు వినాశ్వతసంపదలై దురంతశోం
తాపితమానసంబులు నిరంతరము న్విలపించుచుండిరో!
ఆవిత తా(శువాస్పుదయంబున రాజ్యము గెల్చుకొంటి నిక
తావకమోద మెంత బహుధాంఘుడో పరికించి చూడుమా!

"పాపము కోరి కోరి పరిపంథుల నొర్చి గడించుకొంటి వా
శాపరిణద్ధగాద్ధవయి పంకప మ్ముక్మ కళంగరాజ్యముక్
పాపమొ పుణ్యమో యిక శుభ(ప్రతికూలపుమాట లేల నో
భూపతి! సత్వర మ్మరిగి భూరిసుఖానుభవమ్ము నందుమా!

"హాతవమూయోధాంగనార్భరోదన(ప్రతినాదములు మింటఁ బరఁగునాఁడు
సుతవియోగానలకృశవిరాశాత్మలై వృద్ధమాతలు మరణించునాఁడు
సతతభోజనవస్తుసంపాదనాశక్తి లేచు భూ(ప్రజ లంగలార్చునాఁడు
ధృతకర్కశాయుధాయతహస్తులై కాలకింకరు ల్మి(మోల కెరలునాఁడు
రాజ్యసంపాదనాశాకళంకితాత్మ-కుండవయి భండనపుమిషఁ గొలిపి (ప్రజల
వేఁడినెత్తురు నేల రాల్పించునాఁటి-ఘోరపాపమ్ము నెఱుఁగెదు ధారుణీశ!"

అని సుతమరణాకర్ణన-జనితానలప్రాప్తివిగతసదసద్జ్ఞాన
(ప్రణిధాన యయి యశోకా-వనిపునకు వచించి యామె (ప్రాణము విడిచెన్.

---

# మా చం దా దా రు ల కు

మా కార్యాలయమునకు (వ్రాయు ఉత్తరములు మొదలయినవానియందు తమ 'చందా దారు' సంఖ్య (వ్రాయవలెను. లేకున్న (ప్రత్యుత్తరములు మొదలయిన పనులను జరుపజాలము. చందాదారుసంఖ్య భారతి కవరుకాగితముపై తమ విలాసమునకు ముం దున్నది. చందా దారులకు భారతి ౧౦-వ తేద లోపల అందకపోయిన యెడల వెంటనే తపాలువారికిన్ని, మా కార్యాలయమునకును తెలుప గోరెదము.

—మేనేజరు, 'భా ర తి.'

# ఓబయ్య

వేలూరి శివరామశాస్త్రిగారు, శతావధాని

[అనువృత్తము]

౫

స్కూల్ ఫైనలు క్లాసు—బాలురు ఆంధ్రోపాధ్యాయునికడ బోధవడయుచుండిరి. క్లాసులోఁ గూరుచున్న బాలు రందఱును నూఱుతలలు గల యొక యల్లరి జంతువు.

నూఱుతలలు గల యొక జంతువునకు బుద్ధుఁ డహింస బోధించెను. అది యతిగించుకొనలేక పలుమాఱులు గమనముచేసికొని తుట్టతుదకు జీర్ణించుకొనెను గాని యీక్లాసు-జంతు వెన్నఁటికిని జీర్ణించుకొనఁజాలదు.

ఈజంతువునకు మిగిలిన క్లాసులన్నియు బందిలిదొడ్లు. తెలుఁగుక్లాసు ముక్తి.'స్వేచ్ఛగా తిరుగుదువా, లేక తెలుఁగుక్లాసులోఁ గూరుచుందువా,' యని యే బాలునడిగినను అతఁడు 'తెలుఁగుబడిలోఁ గూరుచుండుదు' నను. అహోబలుఁడు తెలుఁగుబడిలో నడుమనడుమ నక్షత్రమువలె మినుకుమినుకు మనుచుండును.

ఉపాధ్యాయుఁడు బాలవ్యాకరణమును బోధించుచు అహోబలుని జూచి—'వా టీజ్ కళ ?' అని యడిగెను.

'కళ యనఁగా ఆర్టు' అని అహోబలుఁ డనెను. కొందఱు బాలురు పాదములతో నేల మట్టిరి.

'వెఱ్ఱికళ, పిచ్చికళ'యని యుపాధ్యాయుఁ డనెను. అహోబలున కిపుడు స్మృతి వచ్చెను; తెల్లఁబోయెను.

అహోబలుని ప్రక్కనే పూర్ణచంద్రరావు. అతఁడు వామనమూర్తి. తెలుఁగుపండితుఁ డతనికి కుబ్జ యను పే రిడెను.

ఉపాధ్యాయుఁడు — 'ఏమిరా కుబ్జా! నీవు ?' అనెను.

"'నీవు' అనునది మధ్యమపురుష !" అని పూర్ణచంద్రరా వనెను.

'స్టాం డప్ ఆన్ ది బెంచ్.'

పూర్ణచంద్రరావు బల్లమీఁద నిలువఁబడెను. 'నీవు ప్రతిదినమును ఇటులు బల్లమీఁద నిలువఁబడియుందువేని పొడు గెదుగఁగల' వని ఉపాధ్యాయుఁ డనెను. 'కా దండీ. పాఠముతోపాటు వాఁ డెదుగుట మఱచిపోయెను. గొఱ్ఱె యెంత యెదిగినను తోఁక బెత్తెఁడే! ఇఁక మీకుబ్జను సాఁగఁదీయుటకు భార్యాదేవి శ్రీకృష్ణమూర్తి రావలెను.' అని సుబ్బారా వనెను. 'ఓహోహో! రైలులో నీకు నిండు టిక్కట్టా ? సగము టిక్కట్టా?' అని యుపాధ్యాయుఁ డనెను. అందఱును 'గీ' యని యఱచిరి.

'నేను ఇక టిక్కెట్టు లేకనే వెళ్లుచున్నాను గాని మొన్న హైదరాబాదు వెళ్లినప్పుడు మిగుల పరీక్షచేసిరి. తుదకు పూఁచిరి. ఇది నామూనే యగునో నాలుగురూపాయలు చార్జి అయ్యెనని పెట్టిచార్జి వసూలుచేసిరి.'

'ఏమన్నా! ఏకాంతము పోదుగదా? లేక ప్రాప్తించునా' అని యుపాధ్యాయుఁడు ప్రశ్నించెను.

'ఏకాంతము అనందమునకుమఁ గూడ నున్న కంటే బాగుగు! అదేకంటే చిక్కు! ఎప్పుడేని ప్రేమకలిగినప్పుడు ముద్దు పెట్టుకొనుటకుఁగాని, తిన్నగా సమాధానము చెప్పనప్పుడు లెంపకాయ పుచ్చుకొనుటకుఁగాని యెత్తుబల్ల యొకటి చేయించుకొనవలసి యున్నది.'

'మంచిది. మామగారు కట్నమిచ్చెదరు లే.' తరువాత 'వెంకటరావ్రా! మధ్యమ పురుష యన నేమి?' అని యుపాధ్యాయుఁ డడిగెను.

'అహోబలుఁడును, కుబ్జయు, నేనును నిలువఁబడియుంటిమికదా! కుబ్జగనుక మగ వాఁడగునో మధ్యమపురుష; ఆఁడుది యగునో మధ్యమస్త్రీ' అని వెంకటరావనెను.

'కాపిటల్ పనిష్‌మెంట్' అని తెలుఁగు పండితుఁ డనెను.

ఆంధ్రోపాధ్యాయుల కాపిటల్ పనిష్ మెంటనకు నోరు మూసికొని కూరుచుండుట అర్థము. వెంకటరావు వెంటనే చేతులతో నోరు మూసికొని కూరుచుండెను.

ఉపాధ్యాయుఁ డీమాటలు మొదటికిఁబోయి "'కళ' యన నేమి" యని గోపాలు నడిగెను.

'ప్రత్యక్షప్రకృతులుగాని శబ్దంబులు కళలనంబడు' అని గోపాలుఁడు చెప్పెను. క్లాసం తయును 'ప్రత్యక్షప్రకృతులుగాని శబ్దంబులు కళలనంబడు' అని అఱచెను.

లక్షణము మెల్లగా లక్ష్యములలోనికి దిగెను. ప్రసక్తానుప్రసక్తముగా శ్రీనాథుఁడును, రామలింగఁడును వచ్చిపడిరి. వారి చాటు పుంతోఁ రసపుఁజెలమ బయటఁబడెను. బాలు రందఱును ఒహోహో యని నవ్వుచుండిరి. నవ్వనివాఁ డొక యహోబలుఁడు.

తెలుఁగుపండితుఁ డది కనిపట్టెను. "ఏమోయి 'సరసగుణహారి'" అనెను. బాలు రందఱును 'ఓబయ సరసశౌరి' అని పూరించిరి. అహోబలుఁ డులికిపడెను.

'గోదావరి రెండొడ్లు దఱిసి పాఱుచున్నను నీకుఁ బుడిసెఁడు నీరు దొరకలేదా?' అని యుపాధ్యాయుఁ డనెను.

ప్రక్క నున్న పూర్ణచంద్రరావిటులనెను—'మందార మకరంద మాధుర్యమునఁ దేలు మధుపంబు వోవునే మదనములకు?'

అహోబలున కందఱుచూపులును ముండ్లవలె గ్రుచ్చుకొనెను. ఉపాధ్యాయుఁడు లోఁగడఁ జెప్పుచున్న విషయ మతఁ డేమియు వినలేదు. కావున నతఁడు లేచి నిలుచుండెను.

'ఏల నిలిచితివి?' అని పండితుఁ డనెను.

ఎందులకుఁ దాను నిలువఁబడెనో యహోబలుఁ డెఱుఁగఁడు కావునఁ గూరుచుండెను.

'నిలుచుటయుఁ గూలఁబడుటయు నీ వంతేనా?' అని యుపాధ్యాయుఁ డనెను. అహోబలుఁడు నిలువఁబడియెను. అందఱునునవ్విరి.

'ఏల నిలువఁ బడితివి?'

'తమ యాజ్ఞచేత.'

'ఇపుడు గాదు; లోఁగడ?'

'తాము చెప్పుచున్నది నేను వినలేదు. ఆయపరాధమునకు నేను నిలువఁబడితిని.' అని యిటులు పలుకుచుండఁగా అహోబలుని కనులు తడిసికొనుచువచ్చెను.

ఈగుంజీలనడుమ నహోబలుని జేబునుండి తొంగిచూచుచున్నటు లున్న కవ రొకటి పూర్ణచంద్రరావు కనులఁ బడెను. మగవారి యక్కరము లాకవరుపయి నున్నచో పూర్ణచంద్రరా వంతగా పాటించియుండెడివాఁడు కాఁడు అవి యాఁడువారిచేతినుండి వ్రాలిన ముత్తెములు. పూర్ణచంద్రరావుచేతిలో నిద్రజాలము కలదు. దానిబలమున నతఁ డాచీటిని వశపఱిచికొనియెను.

ఆంధ్రోపాధ్యాయుఁడు బోధించుచున్న విషయ మప్రకృతము. ప్రకృత మాబోధ వినకున్నను ఎవరికిని లోటు లేదు. కాని అహోబలుఁడు నిక్క మొప్పుకొనియెను. అహోబలుని బరిహాసించుటలోఁ దెలుఁగుపండితుఁ డిదివఱకు నరసభూపాలీయము నంతయు కొల్లపెట్టెను గాని నేఁటి యీఘటన యతని చిత్తమును ద్రవింపఁజేసెను. కొంతవడికిఁ దెలుఁగుపండితుఁ డిట్టు లనెను—'నీ వేల విన లేదు?'

'నాకు నేఁ డంపిన యొకయుత్తరమును గురించి యాలోచించుచున్నాను.'

'ఓహో మేఘసందేశము కాఁబోలుఁగదా!'

'పోస్టుసందేశము' అని పూర్ణచంద్రరావనెను.

అహోబలుఁడు జేబు తడుముకొనెను. బాలురందఱును ఓహోహోయని నవ్విరి. అహోబలునిముఖము వాఱిపోయెను. అతఁ డా ముఖముతో ప్రక్కనున్న పూర్ణచంద్రరావును జూచెను. సుబ్బారావుచేతి నుండి యాయుత్తరము క్రమక్రమముగా క్రిందిక్రిందికి జనుచుండెను.

'ఆయుత్తర మిటు లిమ్ము' అని ఆంధ్రోపాధ్యాయుఁ డనెను. ఆపలుకుబడిలో రాజశాసనము గర్జించెను. ప్రక్కప్రక్కనే పుత్రవాత్సల్యము ప్రవహించెను. హాస్యోన్మత్తము లగు బాలుర మోము లన్నియు గంభీరము లాయెను. ఆకవరు ఉపాధ్యాయునిముందఱి బల్లమీఁది కెక్కెను. అతఁ డాకవరుమీఁది యక్కరములఁ జూచి అహోబలుని 'ఇటు రమ్ము' అనెను.

తండ్రికడ కరుగు కుమారునివలె అహోబలుఁ డుపాధ్యాయునికడ కరిగెను.

'ఈయుత్తరమును నేను చదివికొనవచ్చునా?'

'నిస్సంశయముగా చదివికొనవచ్చును.'

'ఏ! చాలవాఁడవులో ముంచితివే! అక్కఱలేదు గాని భద్రముచేసికొనుము.'

అహోబలుఁడు సంతుష్టుఁడాయెను. కవరు తీసికొని జేబునఁ బెట్టుకొని వెనుదిరిగివచ్చి తనతావునఁ గూరుచుండెను. ఒకతూరి కవ రెత్తి చదివెను. ఇంతలో గణగణ మని గంట మ్రోఁగెను.

బాలు రంద ఱహోబలుని జూచుచుండిరి. అతఁడు మఱొకతూరి చదివెను. ఉత్త కవరు!

బాలురందఱును కాళ్లతో నేలను బాఁది, అఱచి యీలలువయిచి నవ్విరి. మఱు నిమిషమున ఆప్రదేశమంతయు అహోబలుని కవరుతోపాటు శూన్యమాయెను.

౬

కొండమీఁద నుండి సెలయేటివలె బాలురబారు స్కూలుననుండి నిర్గమించుచుండెను.

కొంత జట్టును వెనుక వేసికొని పూర్ణచంద్రరావు వడివడిగా నడచివచ్చి అహోబలుని బుజముమీఁద చేయివయిచెను. అహోబలుఁ డొక నిశితకటాక్షమును పూర్ణచంద్రరావు ముఖమున గ్రుచ్చి మెడమెడముగాఁ దొలఁగిపోయెను. పూర్ణచంద్రరావును, పూర్ణచంద్రరావుజట్టులోనివారును ఒకరి మొగము లొకరు చూచుకొనిరి. 'ఓరి ఓబయ్యా! ఇదిగో నీయుత్తరము!' అని పూర్ణచంద్రరా వొక యుత్తరము నెత్తి పట్టుకొనెను.

తీసికొనుటకు దాపునకు వెళ్లినవో అది యొకరి చేతులనుండి యింకొకరి చేతులకుఁ బోయి మాయామృగ మగునని యహోబలుఁ డెఱుఁగును. కావున నతఁ డా ప్రయత్నమును మానుకొని మాటాడక నడివడిగా నడవఁదొడఁగెను.

పూర్ణచంద్రరా వహోబలుని దాపునకుఁ బరువెత్తి 'ఇదిగో నీయుత్తరము' అని విసిరి పాఱవయిచెను.

ఈతూరి యహోబలునకుఁ గొంచెము లోభము కలిగెను. ఒకనిమేష మాఁగెను; అందఱను పరికించెను. ఉత్తర మందుకొనుటకుఁ బరువు లెత్తుకొని రాఁదొడఁగెను. ఆయుత్తరమును దన కందనీయకుండుట కాజట్టులోనివా రెవరును ప్రయత్నము చేయకుండు టతని కక్కఱము కలిగించెను.

అహోబలునకును ఉత్తరమునకును ఇంక నొకగజ మెడ ముండెను. పూర్ణచంద్రరావు మరల నాయుత్తరమును దీసికొనుటకుఁ బోలెఁ బరువెత్తు టభినయించెను. అహోబలుఁడు ప్రాణ పణముగాఁ బరుగెత్తెను. ఉత్తరమును దొరకించుకొనెను. వెను దిరిగి మరల రివ్వునఁ బరువెత్తఁ దొడఁగెను.

పూర్ణచంద్రరావు పరుగిడ నభినయించెనే కాని పరుగిడలేదు.

'పాపము! వాని యుత్తరమును వాని కిమ్ము' అని జట్టులోనివా రందఱును అఱచిరి. అహోబలుఁడు దీర్ఘముగా వచ్చు శ్వాసలను

# ప్రాచీనచిత్రములు



3. హైందవగాయకుడు

( పదునేడవశతాబ్దమునాటిది. )



గ. నీగ్రో గాయకుడు

( పదునేడవశతాబ్దమునాటిది. )

ఒకనిమిషములో నియమించుకొని నిలిచి చేతిలోని కాకితమును జూచుకొనెను. అది చిత్తు కాకితము !

అతనికి క్రోధమును దుఃఖమును వచ్చెను. అతనికి వలసినంత బలము కలదు. ఆబలమును ఉపక్షీణము చేయఁగలిగినంత అధైర్యము కలదు. అతనికి మనుజునకు రాఁగలిగినంత క్రోధము మొదలగు భావములు కలుగును. వానిని వెంటనే వశపఱచికొనఁగలుగునంత ధీరత కలదు. అతఁడు దెబ్బకు జంకఁడు. పరిహాసమునకు లొంగును. అతఁ డొకనిని దెబ్బ కొట్టఁడు. తాను దెబ్బలు తినఁగలఁడు.

అతఁడు వెనుకనున్న వారిమాటలు చెవిఁబడకుండుటకుతూనీఁగవలెఁ బరుగిడఁ జొచ్చెను. పట్టణమునందలి ఘంటాపథమున నిటులు పరుగిడుట అసభ్యమని యతనికిఁ దట్టలేదు. అతఁ డిటులు చాల దవ్వు పగువెత్తి వెనుదిరిగి చూచెను. చూపుమేరలో బాలుఁ డెవఁడును లేఁడు. అతఁడు రోఁజక, యలయక మెల్లగాఁ దనగదిలోఁ బ్రవేశించి తలుపులను మూసికొనెను. అతఁడొక గవాక్షమునయినను దెఱువలేదు. పుస్తకములను అలమరులోఁ బెట్టి రొజాయిమీఁదఁ బడుకొనెను. ఏడుగంటలు ఎనిమిది గంటలు తొమ్మిది గంటలు వినఁబడెను. సద్దు మణఁగెను. కనులు మూసికొనియే యుండెనుగాని యతని మనస్సు తెఱచుకొని యుండెను.

తనతలక్రింది దిండు వేఁడియెక్కియుండుటచే నతఁడు దానిని నేలమీఁదికిఁ ద్రోసివయిచెను. కొంచెముసేపు చెవులు దోరఁబెట్టుకొని యాలకించెను. వాకిట నేమియుఁ జప్పుడు లేదు. పిదప లేచి దీపము వెలిఁగించెను. దాని వెలుఁ గతని కనులకు మొదట ముండ్లవలెఁ, బిదప దుమ్మువలె నాయెను. కనులు నులుముకొని కొంచెముసేపు కూరుచుండెను. మెల్లి మెల్లగా లేచి, యలమరు తెఱచి, కాకితమును కలమును గొనివచ్చి ముందిడుకొని కూరుచుండెను. చాలసే పాలోచించెను.

లోఁగడ నతఁ డుత్తరము వ్రాసి యెఱుఁగఁడు. ఉత్తరములు వ్రాయు టొకకళ యని యతఁడు వినియుండెను. అతఁడు తనకళానైపుణ్యము చూపుట కిదియే మొదలు.

ఆలోచించి యాలోచించి తుద కొక యుత్తరమును తెలుఁగున వ్రాసి పూర్తి చేసెను. తిరిగి చదివికొనెను. చింపివయిచెను.

మరల నాలోచించి యొకయుత్తర మింగ్లీషులో వ్రాసెను. చాల సర్దుబాటులు చేసి దిద్ది తీర్చెను. దాని నొకకవరులో మడఁచి మూసెను. పయిపేరు వ్రాయవలసివచ్చుసరికి తలప్రాణము తోఁకకు వచ్చెను. భార్యపేరు వ్రాయనగునా ?

మామగారి పేరు వ్రాయఁ దలఁచెను. అటులగుచో మామగారీయుత్తరము చదివికొందురు. అత్తగారిపేరు వ్రాయఁదలఁచెను. ఆమెకును ఉత్తరములు చదువుకొనుపాటి భాష వచ్చును.

భార్య భర్తపేరు వ్రాసెఁగదా ! భర్త మాత్రము భార్యపేరేల వ్రాయరాదు ?

కొంచె మాలోచించి యాదృచ్ఛికముగాఁ దలఁపోసి Vasumathi అని వ్రాసెను.

తనకడ బిళ్లలు లేవు. అదియు మంచిదే యనుకొనెను. పిదప 'నల్పేటు'నకు స్పెల్లింగు విచారించి యన్ యు టి=నట్, పి యే టి యి =పేట్ అని నిశ్చయించి Nutpate అని వ్రాసెను. కొంచెమునే పీనల్పేటును పరికించెను.

అహోబలునకుఁ జిన్ననాఁట నింగ్లీషు మీఁద నాదరము మెండు. ఇంగ్లీషు-అక్షరములు వచ్చిన తరువాత తెలుఁగుమాటలన్నిఁటిని అతఁడు ఇంగ్లీషులోనికి తర్జుమా చేయుచుండెడి వాఁడు—'ఎ యే=వా, డి యు=డు; వాఁడు, ఆర్ యే=రా, కె యస్ హెచ్ యే=క్ష, యస్ యు=సు, డి యు=డు; రాక్షసుఁడు=వాఁడు రాక్షసుఁడు.' ఇటులు తర్జుమాచేసి ఇంగ్లీషుభాషాజలధిని తరించితి ననుకొనెడి వాఁడు. ఈ Nutpate పద మాకోటిలోనిదే.

పదముల పుట్టుకనుగురించి ఫైలాలజిస్టులే తాఱుమాఱగుచుందురు! తపాలాభాష యెఱుఁగనివారికి 'Not paid' నల్పేటయినదో, నల్పేటే 'Not Paid' అయినదో యెటులు తెలియఁ గలదు? అహోబలుని తెలుఁగు నల్పేటు ఇంగ్లీషులో Nutpate గా మాఱెను.

అతఁ డీనల్పేటును పరికించి డిక్షనరీ తెఱచిచూచెను. ఆపదము దాన లేదు. అపు డతనికిఁ దనచిన్నతనము నందలి తన యింగ్లీషు తర్జుమా గుఱుతువచ్చెను. దానితోపాటు కొంచెము నవ్వుగూడ వచ్చెను. పుస్తకము మూసి మరలఁ జూచుచుఁ గూరుచుండెను.

'నట్ పేట్--నట్ పేస్--నాట్ పేక్---నాట్ పెయిడ్--ఛీ Notpaid' అని యనుకొనెను. 'ఇట్టి యజ్ఞాన మీకవరులో నెంత యున్నదో' అని యనుకొని చింపి మరలఁ దెలుఁగున వ్రాసెను కవరును అంటించెను. కవరును కలమును జేబునఁ బెట్టుకొనెను. దీపమును తగ్గించెను. మెల్లగా తలుపుతీసి వీధి యంతయుఁ బరికించెను. తలుపు తాళము పెట్టి, తపాలాకచేరికిఁ బోయి, యాయుత్తరమును పెట్టెలోఁ బడవయిచి వెనుదిరిగివచ్చి శయనించెను. పూర్వవృత్తాంత మంతయు నాలోచింపఁ దొడఁగెను.

అతనికనుఱెప్పలు మెల్లగా వ్రాలెను. ఆలోచన క్రమక్రమముగా శూన్యమాయెను. శ్వాసలు సమాంతరాళము లాయెను. ఇంద్రియము లుపరమించెను. నిదుర తల్లియొడి!

రెండుమూఁడు కలలలో పూర్ణచంద్రరావు వచ్చి అల్లరిచేసిపోయెను. అతఁడు నిదుర నుండి లేచువఱకు బారెడు ప్రొద్దెక్కెను. కాలకృత్యములను ముగించుకొని యతఁడు కాఫీహోటలున కేఁగెను.

నాఁడు శనివారము. స్కూలుతొందర లేదు. కాఫీ త్రాగి బల్లమీఁదఁ బడియున్న పత్రిక నందుకొనెను. అది నడవలేదు. అతని లోలోపల పూర్ణచంద్రరావు పని చేయుచుండెను. అతఁ డాపత్రిక నటుఁ బడవైచి వీధి

లోనికి వచ్చి యిటిటు చూచెను. లోని కొక యడుగు వైచెను. పిదపఁ దనగదికి బయలుదేఱెను.

జవానొకఁడు దారిలోఁ గనఁబడి సలాము చేసి 'అయ్యా, ఈయుత్తరముమీఁది పేరు కొంచెము చదివిపెట్టుఁడు' అని యడిగెను. అహోబలుఁడు కొంచె మెడము జరిగి 'ఒకరి చీటిమీఁది యక్షరములు మఱియొకరు చూడరాదు. నేను చదువను పొమ్ము' అనెను. హతభాగ్యుఁడగు ఆజవాను అహోబలుని బెదరిబెదరి చూచుచు పరిక్రమించెను.

అహోబలుఁడు వడివడిగాఁ దనవీథిలోనికిఁ బోయెను. వీథితలనుండి పాఱఁజూచెను. తనగదితలుపుముందు అయిదాఱుగురొక గుంపుగా నిలువఁబడి చూచుచుండిరి. వారి నతఁడు పరికించి చూచెను. వారు స్కూలుబాలురు కారు. ఇతరు లెవరును తనకొఱకు వచ్చు నలవాటు లేదు. నేఁడు తన కీయాహ్వాన మెక్కడనుండి?

అహోబలుఁడు వడివడిగా నడవఁదొడఁగెను. తనకంటె ముందు వెళ్లుచున్న పౌరులొకరొక్కరే తనగదిముందాఁగి తలుపుల కెదురుగా నిలిచి చూచుచుండిరి. తనగది ముందు ఏమి వింత గలదు?

అతఁడు చివాలున వెను దిరిగి, కొంతదవ్వరిగి, యచట నాఁగి వెనుకకుఁ జూచెను. గుంపు క్రమక్రమముగాఁ బెరుఁగుచుండెను. ఆగుంపుననుండి ఒకరిద్దఱు నవ్వుమోములతో వెడలిపోవుచుండిరి. కొందఱ అహోబలుని దెసకు వచ్చుచుండిరి. వారిని జూచి యతఁడు మరల నడకను ముందులకు సాగించెను. కొంతదవ్వరుగుసరికి 'ఇవి కొంటెకుఱ్ఱవాండ్ర పనులు' అనుకొనుచు నవ్వుచు ఇరువురు వచ్చుచుండిరి. అహోబలునిగుండెలు జల్లుమనెను. అతఁడు మాటాడక రివ్వున నడచెను. తనకును ఆగదికిని ఇసుమంతయు సంబంధము లేనటులు తలుపులమీఁద నంటించియున్న బొమ్మను, ఉత్తరమును జూచుచు ముందుంకు నడచి సందుచివరకు వెళ్లి నిలువఁబడెను.

గుం పెక్కువ యగుచుండెను. అతఁడు రివ్వున వెనుదిరిగి వచ్చెను. గుంపును తప్పుకొని గదిమెట్లెక్కి గోళ్లతో కాకితమును చింపఁజూచెను. కాకితము రాలేదు. తాళము తీసి గదిలోనికి వెళ్లి చాకు తెచ్చి కోసివైచెను. తలుపు అరంగుళము లోఁతు గాఁడిపడెను.

గుంపులోనివారిలోఁ గొంతమంది 'మీరేనటండీ ఓబయ్యగారు?' అని అడిగిరి. అహోబలుఁడు గదిలోని కేఁగి తలుపులు మూసికొనెను.

## ౭

ఆదివారమునాఁడు చీఁకటిపడఁగనే బిక్కుబిక్కుమనుచున్న యహోబలుఁడు ధైర్యముఁ బడసి బజారునకు బయలుదేఱెను. ఒకపెద్ద యంగడిలోనికిఁ జని ఒక పడకకుర్చీ, ఒక కాంప్ కాట్, ఒక అలారపుగడియారము

కొనెను. చదువునకు తిలోదకములు విడిచి యింటి కిది ప్రయాణసన్నాహము. పూర్ణచంద్రరావు నిష్కారణముగా నొనరించిన యవమానమున కిది ప్రతిక్రియ! వసుమతి వ్రాసిన జాబున కిది జవాబు!

వసుమతి వ్రాసిన యుత్తరములో విశేషమేమియు లేదు. అం దెన్నియో పఙ్క్తులు లేవు. ప్రేమాలాప మిసుమంతయు లేదు. దాన నున్నవి కడుఁ గొలఁదిపఙ్క్తులు. కార్డుగూడ ఆపఙ్క్తులకు ఎక్కువ. ఆడువారి గౌరవమునకుమాత్రమే కవరు. ఆ కొలఁదిపఙ్క్తులలో నీపఙ్క్తియొకటి—'మీరు ప్యాసయినారా?'

ఈపఙ్క్తికి ప్రతిక్రియ యేది? ఇంటికి మూట కట్టుటయేనా? కాఁబోలు!

తా నీరాత్రిరయిలులో పూర్ణచంద్రరావు కనులలో కారము చల్లి చల్లఁగా నింటికిఁ బోవచ్చును. కాని వసుమతి ప్రత్యుత్తరమునకు వేచియుండవలయును.

తాను కొనిన వస్తువుల నన్నిఁటిని భద్రపఱిచికొనెను. గడియారమునకు కీ పెట్టెను. పూఁటకూలియింటికిఁ బోయి భజించి వచ్చుచుండెను. దారిలో నున్న యొకయింటిచావడిలో ఏసుదాసు ఉపన్యసించుచుండుట వినెను.

ఏసుదాసు కిరస్తానీ; బి. యే. విద్యార్థి. గంధిమెడ నతని కాదరము మెండు. బడిలోని మాడరేట్లలో నతనికి 'జెంటిల్మన్' అని పేరు. ఎక్స్ట్రిమిస్టులలో క్రీస్తునియు, పూఁనియు ఆదరము. పలువురు బాలు రతనికడ ప్రతిరాత్రియు బైబిలుమంత్రములు వినుచుందురు.

మతమునెడ శ్రద్ధగల కొందఱు హైందవ విద్యార్థులు ఒకపఙ్క్తిగా మునిముందు కూరుచుండిరి. వారివెనుక మతము పుచ్చుకొని బోర్డింగులో నున్న బాలురు నాలుగయిదు పఙ్క్తులుగా కూలఁబడియుండిరి. వారిశరీరములన్నియు తారువేయఁబడియున్నటు లుండెను. వారిబల మెల్లయు తేజోరూపముగా చక్షురింద్రియమునుండి పోయియుండును. క్షయ లేకయే వారిశరీరము లాఁతిపోయెను. ఆధ్యాత్మికశక్తిని ప్రవేశపెట్టుటకు ముందు వారిశరీరబలము నెల్ల మెల్లమెల్లగా నచటి బోర్డింగు భవనము జలూకవలె లాఁగికొనుచుండఁబోలు. వారి వస్త్రములు బొచ్చుతో నేయఁబడిన గొంగళ్లు. వారికన్నులు దుఃఖములకు తూములు. వారిమోములు దయనీయములు. ఇట్టిసభలో విచిత్రమగు తెలుఁగుబాసలోఁ బడిన శుద్ధమగు బైబిలు సగ మఱవపలుకుబడితోడను, సగ మింగ్లీషు-ఆక్సెంటుతోడను మిళితమయి యేసుదాసుకంఠనాళమున నొక్కొక్కమాట యొక్కొక్క కీచురాతివలె ధ్వనించుచుండెను.

లోఁగడ పలుమాఱు యేసుదాసుకంఠస్వర మహోబలు నాకర్షించియుండెను. అహోబలునకు రాగజ్ఞానము కలదు. కంఠము శ్రవ్యము. స్వయముగా రాగ మాలపించుకొని యానం దింపఁగలఁడు. అతని శరీరము బలిష్ఠము.

కంకాళసారమయిన యాకిరస్తానీ బాలుర శరీరముగూడ నతని నానావిధముగా నాకర్షించెను.

అహోబలుఁడు కొంచెముసేపు వాకిట నిలిచి వినెను. తన్నెవరును రమ్మనలేదు; పొమ్మనను లేదు. 'పెద్దమనిషి'తనమున కిదియే యొఱపిడిరాయి యని యతని కభిమతము. ఈపరీక్షతో నతఁడు మెల్లగా లోనికేఁగెను. దాపుననున్నవా రతనికిఁ జోటొసఁగిరి.

ఏసుదాసు తెలుఁగుబైబిలునుండి చదువఁ దొడఁగెను: 'కంటికి కన్ను పంటికి పల్లు అని చెప్పఁబడినమాట మీరు విన్నారు.'

'ఎక్కడ విన్నారు?' అని అతఁడు బల్ల గ్రుద్ది సభవారిని జూచి యొకసారి పుస్తకము క్రింది ఫుట్‌నోట్ చూచి, తలయెత్తి 'నిర్గమకాండలో' అని తెలిపి మరల బైబిలు చదువఁ దొడఁగెను.

'అయితే నేను మీతో చెప్పేది ఏమనగా, దుష్టుని ఎదిరించక నిన్ను కుడిచెంపమీద కొట్టువానితట్టు రెండవదికూడ తిప్పుము. నీతో వ్యాజ్యమాడుచు, నీఅంగీ తీసుకొనకోరువానిని నీపైవస్త్రముకూడ తీసుకొననిమ్ము. ఒకడు ఒకమైలుదూరము రమ్మని నిన్ను బలవంతెము చేసితే, వానితో రెండు మైళ్లు వెళ్లుము. నిన్ను అడుగుకొనువానికిమ్ము. నీయొద్ద అప్పు పుచ్చుకొనకోరేవానినుంచి నీముఖము తిప్పుకొనవద్దు.

అనఁగా తెలిసినదా? Turn not thou away సోదరులారా వినుడి! పిమ్మట: మీ శత్రువులను ప్రేమించుడి! మిమ్ము తిఱుము వారికొఱకు ప్రార్థించుడి! మీరు ఆకాశమందున్న మీతండ్రికి కుమారులై యుండునట్లు ఆలాగు చేయుడి'.

'తెలిసినదా? ఆలాగు చేయుడి!' అని అర్థము చెప్పి ఏసుదా సొకతూరి కంటిజోడు సర్దుకొని అందఱను జూచి మరల పుస్తకమెత్తెను.

'ఆయన చెడ్డవారిమీదను మంచివారిమీదను తనసూర్యుని ఉదయింప జేసి, నీతిమంతులమీదను అనీతిమంతులమీదను వర్షము కురిపించును.'

ఏసుదాసు పుస్తకమును బల్లమీఁదనిడి తలయెత్తెను. "ఈవేదము తెలిగిన శాస్త్రులు ఘనము! అందఱకు తెలుసునటులు చేసును. మంచిశాస్త్రులు ఈబైబిలువేదము తెలుగు చెయ్యుటకు నచ్చకపోవుతే ఏమిచేసును? కొత్తశాస్త్రులు ఇటులు తెలుగును—'ఆయన పాడుమీదను మంచిమీదను సూర్యుని లేవుటకు చేసును—He maketh the sun to rise on the evil and on the good, and sendeth rain on the just and on the unjust—సరిమీదను అసరిమీదను వాన పంపును' అని చేసును."

సభవారి నవ్వడఁగినతరువాత ఏసుదాసిటులు ఉపన్యసింపఁదొడఁగెను: 'హిందువులు

మీారలకు మీా పిల్లలకు చదువు చెప్ప నిమ్ముడు. చదువు చీకటికి వెలుగు. నేను చెప్పిన దేమనఁగా మీారు చీకటిని వెలుగుడీ! తొలఁగఁ జేసుడీ! మీారు నచ్చుకొనినదానిలో మీామీా పల్లెలలోనున్న చీకటివారికి వెలుగుడీ! మామతమువారు బడులుపెట్టుదురు. పశువులను కదుపుదురు. మీారును అటులు చేయుడీ! ఆమెన్.'

అనంతరము సభవారిలోఁ గొందఱు మోఁకాళులఁబడి లేచిరి. ఒకొక్కరే నిర్గమించిరి.

అహోబలుఁడు దారిని బోవుచు 'నేను ఏసుదాసు నగుదునా?' అని యనుకొనుచు తనగదిముంగలకు వచ్చెను. తలుపులు పరీక్షించెను. తాళముతీసి లోని కరిగి రోజాయి పఱిచికొని పండుకొనియెను.

అతఁడు బడిని వదలెను. దయ్యా మతనిని వదలెను. ఏసుదాసునుపన్యాస మాలకించెను. అనంతమగు నాకాశమున విహరింపఁజొచ్చెను.

గ్రామములనుండి బస్తీలకు వలసవచ్చి చదువుకొను బాలురను కనిపట్టి నడపించువాఁ డెవఁడును ఉండఁడు. కడుపు నిండెనో, యెండెనో కనుఁగొనుటకు తల్లి యుండదు. చదు వెటులున్నదో, వృత్త మెటులున్నదో యాచార్యుఁడు కనుఁగొనఁడు. తనబుద్ధియే తనకుఁ దిక్కు. పూఁటకూటియిల్లే తల్లి. పూర్వజన్మ వాసనలు చెడిబాలుర సాహచర్యమున వికసించును. బడిలో నీతికి దోహదము లేదు. భగవంతునకు టికాణా లేదు.

ప్రతివాఁడును గొప్పఁదన మభిలషించును. ప్రతిబాలుఁడును ప్యాసగుటకే బడిలోఁ జేరును; లేక చేర్పఁబడును. కాని వాఁడు చేయు ప్రయత్నము సున్న. కాని వాఁడు గొప్ప వాఁడు కావలెను. అహోబలుఁ డీ యఖిలావస్థలోఁ బడెను. లోకములోఁ దనకుఁ బేరక్కఱలేదు. కాని తాను గొప్పవాఁడు కావలెను. ఎటులు? తానొకబడి పెట్టవలెను. బాలుర కుచితముగా చదువు చెప్పవలెను. ఇదియొక గొప్ప పని. దీనిచేఁ దాను గొప్పవాఁ డగును.

నిక్కమున కహోబలుఁ డెన్నఁడును గొప్పఁదన మాసింపలేదు. అతఁడు పెండ్లియయిన క్రొత్తలోమాత్రము కాఫీ నేర్చికొనెను. నేఁటివఱకు బజాఱుమిఠాయి తినియెఱుఁగఁడు. సిగరెటు కాల్చియెఱుఁగఁడు. రైలులో ఇంటర్మీడియేటు టికెట్టు కొనియెఱుఁగఁడు వస్త్రమును ఇస్త్రీ చేయించుకొనుట యెఱుఁగఁడు.

అతఁడు పాఠము నోటికి వచ్చినదాఁక కడు నోపికతో వల్లించును. నిద్రించును. మేలుకనువఱకు మఱచిపోవును.

అతఁ డీబుద్ధిమాంద్యమును పలుమాఱులు ఉపవాసములచే శిక్షించెను. శరీరశోషణమే ఫలించెను. కొన్నాళ్లు కనులు వాచునటులేడ్చెను. ఏడిచి లాభము లేదని తెలిసికొనియెను.

అతఁడు ప్రతిదినమును శరీరపరిశ్రమ మొనరించును. హృష్టపుష్టమగు నతని శరీరము చూడ ముచ్చటగా నుండును. దానికి చొక్కా దిష్టిబొమ్మ.

అతఁడు రోజాయిమీఁదనుండి గబగబ లేచి నాలుగుగంటలకు అలారపు కీ పెట్టి వచ్చి సుఖముగా నిదురించెను.

## ౫

కాలమునకుఁ బ్రతినిధియు, సోమరులకు విరోధియునగు గడియార మాయర్ధరాత్రము యొక్క జాడ్యగర్వమును భేదించి గణగణ లాడెను. అహోబలుఁడు మలికిపడి లేచెను. అతని కింకను కనుఁబమంపు విడలేదు. నాలుగుగంట లయినటులు తలపోసి యతఁడు శరీరపరిశ్రమ చేసి దీపపువత్తి యెక్కించి చూచెను. గడియారపుముల్లు ఒకటిమీఁద, అలారపుముల్లు నాలుగవగంటమీఁద.

అతఁడు మరల ఒంటిగంటమీఁద పదునేను నిమిషములకు అలార మిచ్చి ప్రతీక్షించుచుఁ గూరుచుండెను. పది నిమిషములు దాఁటెను. పదునేను నిమిషములు దాఁటెను. గడియారము సత్యాగ్రహ మొనరించి కూరుచుండెను.

'పదిరూపాయలు పాడుచేసితినే! తిన్నగా నడవనిచో పదిరోజులలోఁ దెచ్చియిచ్చినచో పుచ్చికొందు నన్నాఁడుగదా!' అని యనుకొని యతఁడు నిదురించెను. తెల్లవాఱుజామున లేచి కాల్యకృత్యములు నెఱవేర్చెను. 'ధూసాబుడు తుమ్మార్మల్' అనుకొని మరల పరిశ్రమించెను. చెమట పోఁబెట్టుకొని నగుమొగముతో స్నానము చేసెను. కాఫీ త్రాగి పోస్టాఫీసునకు వెళ్లెను.

యూసీఫానను తోడుకొని సవారు జవానులు చిత్తరంజను సైక్లెకొండను డిరి. వారిముందర పూర్ణచంద్రరావు!

అహోబలుఁడు జంకరించెను. అతఁడు మెల్లగాఁ బోయి పూర్ణచంద్రరావువెనుక నిలిచెను.

పూర్ణచంద్రరావు వెనుదిరిగి చూచెను. తనతలమీఁద బారెఁడెత్తున అహోబలుని ముఖము!

పూర్ణచంద్రరావు ముసిముసినవ్వులు నవ్వుచు రోడ్డుమీఁదికిఁ బోయి నిలువఁబడెను.

సార్టు చేయుట అయిపోయెను. తపాలా వాఁడు తల యెత్తి చూచెను. లోఁగడఁ దాను జూచిన మనుష్యునకును ఈమనుష్యునకును హస్తిమశకాంతరము. అతఁడెంత వామనుఁడో, ఇతఁ డంత బేతాళుఁడు. కావున తపాలావాఁడు తెల్లఁబోయి 'అహోబలుఁడుగా రేరండీ?' అని యడిగెను.

'నేనే'

పూర్ణచంద్రరావు నవ్వెను. అహోబలుఁ డతని కొక చెంపకాయ యీయఁదలఁచెను గాని రాత్రి వినిన యేసుదాసు నుపన్యాసము మనస్సు నంటియుండెను. 'భగవంతుఁడు నిన్ను మంచిదారికిఁ దెచ్చుఁగాక!!' యని లోలోపల

నాశీర్వదించెను. పూర్ణచంద్రరావు సాఱి పోయెను.

'అతనిపేరు పూర్ణచంద్రరావు. నాయుత్తరము దొంగిలుట కతఁడిచటికి నావెనుకనే వచ్చెను' అని అహోబలుఁడు తపాలావానితోఁ జెప్పెను.

'మంచిది నాకు హెచ్చరిక చేసితి'రని తపాలావాఁడు కృతజ్ఞత తెలిపెను. అహోబలుఁడు తనగదికి వెళ్లిపోయెను. అతఁడాంజనేయుని ప్రతిమను ముందిడుకొని రామనామ మొనరించెను. రజస్తమస్సుల దాఁటి యతని మనస్సు సత్త్వప్రవాహమునఁ బడెను. దానికి గుఱుతుగా అశ్రుప్రవాహము కనులనుండి గండస్థలముమీఁదుగాఁ బ్రవహించెను.

భక్తులకును భావుకులకును కన్నీరొక యలంకారము, ఒక యూఱడ. దానితో ఆనాఁడు సార్థకము.

అహోబలుఁడు కనులు తెఱవఁగనే కానిపించినది గడియారము. అతఁడు దానిని విప్పెను. అలారపుచుట్ట వదులుగానుండెను. దాని కతఁడు కీపెట్టెను. అది ముడుచుకొనెను. కాని యది గణగణమని యలారముకొట్టదు. అతఁడు నేర్పుతో చుట్టను వదలించెను. వదలింపఁగనే యది పామువలె లేచి దవుడకుఁ దాఁకెను. దవుడ చీరుకొనిపోయెను. కొంచెము నెత్తురు స్రవింపఁదొడఁగెను. మరలు నెత్తురు చూచును గాఁబోలు!

పాములవాఁడొకక్రొత్త త్రాఁచును స్వాధీనముచేసికొనునటులు అతఁడాయలారపు చుట్టను స్వాధీనముచేసికొని యథాస్థానమున దాని నునిచి మరల మూసివయిచెను. పిదపఁ జెవికడ నిడికొని యాలకించెను. అది టిక్కు టిక్కు మనుచుండెను. సంతసించి యతఁడు దానిని గూఁటిలోనుంచి గాయమును శుభ్రపఱచికొనెను.

అతఁడు చాలసే పాలోచించి గడియారపు షాపువానికి—'గడియారము అలారము కొట్టుటలేదు గాన మీకడనుండి ప్రత్యుత్తరము రాఁగానే ఈగడియారము మీకిచ్చి మఱియొక గడియారము తీసికొనఁదలఁచితిని' అని యొక రిప్లైకార్డు వ్రాసెను. గడియారముదెసఁ జూచెను. పది!

కార్డు జేబులో వేసికొని నడిదారిలో టపాలోఁ బడవయిచి పూఁటకూలియింటికి వెళ్లెను.

సంతవలెనుండు పూఁటకూటియిల్లు పుంతవలె నుండెను. ఎక్కడి వక్కడ సవరించి కొని యందఱును శయ్యలఁబఱచికొనిరి. శయ్యలనఁగా పీఁటలు, విస్తళ్లు, విసరుకఱ్ఱలు, చేఁటలు వగైరాలు. 'పదిగంటలకే యిదేమి చెపుమా!' యని యహోబలుఁ డనుకొనెను.

'ఇదేమండీ పండ్రెండుగంటలకు వచ్చితిరి?' అని పాచకుఁ డనెను. అహోబలుఁడు తెల్లఁబోయి 'నాగడియారమున పదియే యయినది'

అనెను. 'మీ గడియారము స్వదేశీ గడియారమా?' అని పాచకుఁ డనెను.

అహోబలుఁడు పీటమీఁదఁ గూరుచుండి యెదురుగానున్న గడియారమున ఒంటిగంట చూచెను. గడియారములమీఁదను, వాని నమ్మువారిమీఁదను అతనికి కినుక కలిగెను. పనిచేయనిచో వాపసు చేయుమన్నాఁడుగదా అని యనుకొనెను. అతఁ డెటులో భుజించి గదికడకు వెళ్లి తలుపుతాళము తీయఁదొడఁగెను. లోపల గణగణగణగణ! తాళము జాఱి యతని పాదముమీఁదఁ బడెను.

గడియార మొక వింతజంతువు.విశేషించి అలారపుగడియారము. ఒకతూరి గడియారము కొనినవాఁడు 'ఇంకొక గడియారము కొనినచో గాయత్రి సాక్షి' అని శపథముచేయును. గడియార మొక వ్యసనము. ఒట్టుపెట్టుకొన్న వాఁడు కొన్నాళ్లలోనే వెలగల మఱియొక గడియారము కొనును. లేదా ఇబ్బడి డబ్బిచ్చి దానిని బాగుచేయించుకొనును. కొలఁది నాళ్లలోనే యది మూలఁబడును. కానిచో బావమఱఁదికిఁగాని, యల్లునకుఁగాని బహుమతిగా పోవును.

గడియారము బలే మోసగాఁడు. అది టిక్కుటిక్కు మనుచునే యాఁగిపోవును. నడచునో గంట ముందు. పీఁకుచో గంట వెనుక. అది రైలును, పరీక్షలను తప్పించును.

కర్మముచాలక యది పనిచేయఁజొచ్చెనా నమ్మిన బంటు!

అహోబలుఁడు హసన్ముఖముతో లోనికేఁగి గడియారమును జూచెను. దాని శ్వాస లాఁగిపోయెను. అతఁడు కీ యిచ్చెను. ఇచ్చిన కొలఁది తిరుగుచు నేయుండెను. పింగళివారి పేకి. కీ వదు లాయెనా, లేక పోయెనా?

అతఁడు దాని నొకమూల నుంచెను. తలుపుమూసికొని ప్రక్క పఱచుకొని చక్కగా శయనించెను.

కొన్నాళ్లవఱకు వసుమతికడనుండి గడియారపువానికడనుండియు ప్రత్యుత్తరము రాలేదు. అతఁడు గడియారపువానికి మరల నొక యుత్తర మిటులు వ్రాసెను:

"మీకడ నేనుకొన్న అలారపుగడియారమునుగుఱించి మీకు రిప్లైకార్డు వ్రాసికొని యుంటిని. దానికి సమాధానము వ్రాసితిరి కారు. పనిచేయనిచో వాపసుచేయుఁడని కొనునపుడు మీరు మాటయిచ్చియుంటిరి. దీనిని దీసికొని మఱియొకదాని నిచ్చుట మంచిది. కానిచో డబ్బిచ్చినను మంచిదే. ఈరెంటిలో ఏపనిచేయుటకును వీలులేదని మీకు తోఁచిన యెడల గడియారమును పంపుచున్నాను. మీరు తీసికొనుఁడు. 'గడియారము కొనుట యొక తప్పు' అని నాకు, 'ఇట్టిగడియారము లమ్మఁగూడ' దని మీకును ఒక నీతిచిహ్నముగా నిది యుండఁగలదు. దీనిని మీరు శాంతముగా గ్రహింతురుగాక."

అతఁ డీయుత్తరమును గడియారమును పాచిపని చేయువాని కిచ్చి పంపెను. కొలఁది

కాలమునకే యది తిరిగి వచ్చి యొక చీటి యిచ్చెను. అం దిటు లుండెను—"మీరు పంపిన గడియారము మరమ్మతు చేయుటకు రెండురూపాయ లగును. పైకము చెల్లించి నాలుగయిదు రోజులలో గడియారము తీసికొని పోవచ్చును."

ఈయుత్తరమును జూడగనే యొక రోషావేశము విద్యుద్వేగముతో నతని శరీరమున ప్రవహించెను. 'రెండురూపాయలకే యీతూరి క్రొత్తగడియార మొకటి వచ్చును!'

ఆమఱునా డతనికి వసుమతికడనుండి ప్రత్యుత్తరము వచ్చెను. దానితోపాటు పూర్ణచంద్రరావుగూడ వచ్చెను. అత డాయుత్తరమును గడు జాగ్రత్తగా జదివికొనెను. పిమ్మట పూర్ణచంద్రరావును జూచి 'ఈయుత్తరమును జూడవలయునను కోరిక నీకున్న దో తీసికొనిపోవచ్చును' అని యహోబలుడు దాని నతని ముం దుంచెను.

పూర్ణచంద్రరావు తెల్లబోయెను. శుష్కపరిహాసమున కతనికి జిత్తులతో బని లేకపోయెను. జడిపింపబోయి తానే జడిసెను.

అహోబలు డాయుత్తరమును గాని పూర్ణచంద్రరావును గాని చూడక ప్రక్కమీద కనులు మూసికొని పడుకొనెను.

ఉత్తర మున్నపాళముగనే యుండెను. గంభీరమగు ముఖముతో పూర్ణచంద్రరావు మాఱుమాట లేక వెళ్లిపోయెను.

(సశేషము)

---

# మే ఘ దూ త

(ఆంధ్రగ్రంథమాల ౧౪-వ కుసుమము)

కర్త: దీపాల పిచ్చయ్యశాస్త్రిగారు (కళానిధి గ్రంథమాల, నెల్లూరు).

# క్లియోపాత్రా

ముద్దుకృష్ణ గారు

క్లియోపాత్రా ౨,౦౦౦ సం॥ల క్రితం ఈజిప్టు దేశపుమహారాజ్ఞి. ఎంతో సౌందర్యవతి, భోగి తీరని ప్రేమపిపాసి. ఈమె యౌవనం పుష్పించబోవుతూవున్న తొందరవయస్సులో ఇటలీదేశంనుంచి సీజరు దండెత్తి వచ్చినాడు, ఈజిప్టును స్వాధీనపరచుకోవలెనని. సీజరు మహాయోధుడు. రోమునుంచి సాధారణ సేనానిగా బయలుదేరి అప్పుడు యూరపుఖండంలో జయించదగిన దేశాలను, గాలు, బ్రిటనులను (అనగా ఫ్రేన్సు, ఇంగ్లండులను) సంపూర్ణంగా స్వాధీనపరుచుకుని స్వదేశమన్ననకు పాత్రుడై ప్రజలు మూడుసార్లు కిరీటాన్ని పాదాలదగ్గర పెడితే వొద్దని నిరాకరించి మకుటంవినాచక్రవర్తిగా పాలించినాడు.

సీజరు క్లియోపాత్రామీద యుద్ధానికి వచ్చేప్పటికి అతనిజీవితంలో వసంతంమిసిమి తెల్లబారుతూ హేమంతాన్ని చేరుతూవుంది. ఇంత సీజరును, ఆపదహారేళ్లక్లియోపాత్రా, ప్రపంచాన్నంతా జయించిన ప్రతాపశాలిని, మేధాశక్తితో రోమును సామంతరాజ్యాలను ఎదిరింపు యెరగని తీవ్రతతో పాలిస్తూవున్న శక్తిమంతుణ్ణి, సీజరును, క్లియోపాత్రాముగ్ధ విప్పారుతూవున్నా యింకా స్వశక్తినైనాగ్రహించలేనియావనోద్రేకంలో వున్న క్లియోపాత్రా, బాలిక, ఒక్కచూపుతో, ఆసీజరును తనపాదాలదగ్గర కుక్కపిల్లనుగా చేసుకుని ఆసింహంతో చెలగాటలు ఆడుకున్నది. సీజరు, పాపం ఎంత చక్రవర్తియైనా ప్రకృతికి బద్ధుడేగా!. పాపం జీవితభారం మోసుకుని అర్ని గడచి సీతాకాలంవైపు కృశింపుదారి బడుతూవున్న శరీరాన్ని మోసుకుపోతూ వున్నవాడికి క్లియోపాత్రావేడి మొదట హాయి మనిపించినది. వెనకకు తిరిగి తరలిపోయినఆమనిని త్రిప్పకోవలెననే యత్నంతో బ్రతుకు మళ్లించేడు; కాని అనుని మేషాభివృద్ధి పొందుతూవున్న క్లియోపాత్రా వేడికి ఆగలేకపోయినాడు. ఈప్రచండత్వానికి తాళలేక తరిలిపోయాడు.

సీజరుగతించగానే మళ్లీ అంతశక్తితో అంత తీవ్రతతో ఆసామ్రాజ్యానికంతకూ చేయూతనిచ్చి పునః దిగ్విజయంచేసినాడు, ఏంటొనీ. ఏంటొనీమంచియౌవనం పొగరులో వున్నాడు. వీరరసంతో ప్రపంచాన్ని దిగ్భ్రమజేసి తన కీర్తి దిక్కుల పిక్కటిల్లజేశాడు. క్లియోపాత్రా పొగరుబోతుతనం ధిక్కారం అణచవలెనని బయలుదేరినాడు. అప్పటిప్రపంచంలో రెండే మహారాజ్యాలు రోము, ఈజిప్టు. అప్పుడు యిద్దరే ప్రపంచాతీతవ్యక్తులు రోమువీరుడు ఏంటొనీ, ఈజిప్టుమహారాజ్ఞి క్లియోపాత్రా. ఏంటొనీ ఈజిప్టుజయించడానికి బయలుదేరేడు. క్లియోపాత్రాకు చాలాపౌరుషంగా పర్దు

మంగా వార్తనంపేడు, "లొంగుతావా, లొంగ దీయమంటావా ?" అని. నిరసనగా నిశితంగా జవాబుపంపినది. పరస్పరం కలుసుకుని ముఖాముఖిని సంధికియత్నించి సరిపడకపోతే యుద్ధం అనుకున్నారు.

ఏంటొనీ ఈజిప్టునుకూడా లొంగదీసి దాసిగాచేయగలడని అటునుంచి రోమూ సామంతరాజ్యాలూ ఎదురిగి చూస్తూన్నవి; తమ గౌరవాన్ని దేశాన్ని కాపాడుతుంది ఈమహాశక్తిని గెంటివేసి అని ఈజిప్టుసర్వప్రజా ఊపిరి ఆపి చూస్తూవున్నది.

ఏంటొనీ సేనలతో కొంతదూరం వచ్చి అక్కడ వేచివున్నాడు. క్లియోపాత్రా కొంత దూరం ఎదురువెళ్లినది. సేనలతోకాదు. తన సౌందర్యసర్వస్వంతోనూ, తనసమస్తవిలాసంతోనూ, చుక్కలవంటిచెలికతెలతోనూ. సస్యశ్యామల ఫలప్రద రత్నగర్భఅయిన ఈజిప్టుతన అమూల్యాన్నంతా ఆమె అలంకారములకు వెచ్చించివేసినది ఆదినం. ఏంటొనీ, నాగరకప్రపంచాని కంతకూ నడకలునేర్పుతూ వున్న రోములోని యేరినసౌందర్యాలను కాంచినవాడే. కాని ఈమెరుపు చూసి సొలసి పోయాడు.

ఒక్క కనురెప్ప. ప్రపంచం మారిపోయినది.

ఈజిప్టు రోము పాదాలక్రింద సింహాసనములు.

క్లియోపాత్రా, చండశాసనురాలు మహారాజ్ఞి; ఏంటొనీ, వీరాధివీరుడు చక్రవర్తి, కారు, క్లియోపాత్రా సౌందర్యసర్వస్వాన్ని ఒడిగట్టుకునివచ్చిన మహావిలాసిని. ఏంటొనీ ఒడలుసీరుగా మూగవడి మైమరచిన అయోమయం.

ఒక్కత్రుటి.

అటు రోమూసామంతరాజ్యాలూ చూస్తూనేవున్నవి. ఇటు ఈజిప్టు యింకా ఆతురతతోనే వున్నది.

ఏంటొనీ క్లియోపాత్రాను వొళ్లంతా కళ్లుచేసుకుని మూర్ఛతో చూశాడు.

క్లియోపాత్రా వొళ్లంతా సౌందర్యం తెరుచుకుని ఆతన్ని మాయగా కప్పివేసి తానూ తెలిసికోవడంలేదు.

ఒక్కత్రుటిలో, ప్రపంచం అంతా మారిపోయినది. ఏంటొనీ ఏమీతెలియక అన్నాడు "నీయంత సౌందర్యాన్ని చూడలే!" అని.

"ఏమిటీ! ఏంటొనీ ఇంతమెచ్చుకుంటాడా" అన్నది క్లియోపాత్రా.

యుద్ధసన్నద్ధమైన ఆప్రపంచం అంతా మారిపోయినది : పుష్పశయ్యగా ఆప్రేయసీప్రియులకు.

ఆవీరాధివీరుడు ఆబాహులతలో సొమ్మసిల్లిపోయినాడు. ఆవిలాసిని అతనిజీవితంవెన్నెలగా విరిసినది. సంజమబ్బుల రంగులకన్నా తొందరగా వింతవింతగా మారిపోయే క్లియో

పాత్రాచిత్తవృత్తులను అనునిమేషం ఆనందం తో విలోకించడం, వాటిని అనుకూలంగా అనుసరిస్తూవుండడం ఏంటొనీ పని.

రెండుమహారాజ్యాలనూ తమ ప్రేమ కోరిన కోర్కెలకు సాధనసామగ్రిగా వాడుకున్నారు. రెండురాజ్యాలలోనూవున్న విలువనంతా కొల్లగొట్టి తమసయ్యాటలకు ఖర్చుపెట్టేరు. రోమూ, ఈజిప్టూ తహతహలాడిపోయినవి ఈవాళ్లు తెలియని ప్రేమకై పెక్కిన ప్రియులసేవ చేయలేక.

వీరి ఎడతెగనికౌగిలింతలలో నలిగిపోయినవి ఈమహారాజ్యాలు రెండూ.

వీరి ఆనందానికి చేసేసేవలో ఏకొద్దిలోపంకలిగినా కోపాగ్నికితహతహలాడిపోయినవి.

ఈ ఊపిరిసలపని ఆనందాలలో ఆటలలో ఆర్భాటలో అలసిపోయినవి. వీరి కౌగిలింతలలో నలిగిపోయినవి. వీరి అకారణకోపాలకు తహతహలాడిపోయినవి. రెండు రాజ్యాలూ కుములుకుని బాధపడడం ప్రారంభించినవి.

ఇది అదనని ఆక్టేవియానసు ఎంచుకున్నాడు. ఏంటొనీ నిస్సత్తువగా ఉన్నప్పుడే దండెత్తి రెండురాజ్యాలను స్వాధీనంచేసుకుని ఏకఛత్రాధిపత్యం సాగించవలెనని. తగినసమయం చూసుకుని మహాసైన్యాన్ని గొప్పనౌకాదళాన్ని కూర్చుకుని ఈజిప్టుదండయాత్రకు బయలుదేరేడు.

వేగులు ఏంటొనీకి ఈ వార్త తెలిపినారు. ప్రేమపొంగిస్తూ వున్నా రక్తంలోనికి రంయిమని ప్రాతవీరరక్తం ప్రసహించినది. శరీరమంతా నెత్తురుజిమ్మే కెంపులు చెక్కినట్లున్నది. కెంపెక్కిన నేత్రాలతో దిశలంటా సింహావలోకనం చేసి 'ఈజిప్టు, లే యుద్ధానికి ' అన్నాడు.

ప్రేమతో మెత్తనతో తన్నువలయించుకుంటున్న ఏంటొనీనేకాని ఈరుద్రమూర్తిని ఈప్రచండాన్ని చూడలే క్లియోపాత్రా ఇంతవరకు. నిండుగర్వంతో అచ్చుపడేటట్టు చూసుకుంది ఆఏంటొనీని, ఈవీరమూర్తినిజస్వరూపం ఆజిలో తిలకించవలెనని అభిలాష పుట్టినది. "సరే"అన్నది. ఈజిప్టు యావత్తైన్యం, నౌకాదళం, ఏంటొనీ మహాసైన్యం, ఆరితేరి నూరేసి యుద్ధాలు గెలిచిన అతిరథులతో ఏంటొనీ క్లియోపాత్రాలు ఆక్టేవియానసుకు ఎదురువెళ్లేరు.

యుద్ధం ప్రారంభమైనది. ఏంటొనీ వెయ్యికళ్లతో చూస్తున్నాడు. ఆప్రాతవీరుడికితెలుసు తానువిజృంభించేసమయం ఎప్పుడువొచ్చేది. అదనుకోసం వేచిఉన్నాడు. రక్తం వేడియెక్కుతూవుంది. క్లియోపాత్రాఓడదగ్గరగానే వుంది. ఆమె అంతా విలాసంగా చూడబోతూవున్నది.

ఇంతలో విధిలో ఏదో సుడిపుట్టినది. గభీమని క్లియోపాత్రా ఓడను మళ్లించి పారిపోతూంది. ఏంటొనీ ఓడకూడా తిరిగిపోయినది. క్లియోపాత్రావెంటనే పోతూవుంది. ఏంటొనీ ఒక్కడే నిలవగల సమర్థుడే! ఆలోచనలేదు. క్లియోపాత్రా వెళ్లిపోతూవుంది. ఏంటొనీ వెళ్లిపోతూవున్నాడు. క్లియోపాత్రా చుక్కాను. ఏంటొనీ ఓడ.

ఒకదానివెనుక ఒకటి ఆరెండు ఓడలూ ఇంటిదారిపట్టగానే ఆక్టేవియానసు విజృంభించాడు. నౌకాదళాన్ని తుత్తునియలుచేశాడు. ఇక ఎలగ్జాండ్రియాను ముట్టడించినాడు. క్లియోపాత్రాఖంగారుగా కోటలోనికి పారిపోయి ద్వారాలు మూయించివేసినది. ఏంటొనీ వేరే క్లియోపాత్రాభవనంలోనికి వెళ్లిపోయాడు. దెబ్బతినిన సింహం. ఓ రక్తంచిందిపోతూవున్నది. పరాభవం. జీవితంలో యిన్నివందలయుద్ధాలలోనూ యెన్నడూ ఎరగనిది. క్లియోపాత్రా రహస్యంగా ఆక్టేవియానసుతో సంధిచేసుకుని పారిపోయినదని మండిపోతున్నాడు. రగులుతున్న తీవ్రాగ్ని దగ్గర రాలేరు యెవ్వరూ.

క్లియోపాత్రాకు ఏమీ తోచలేదు. భయంకరంగా వున్నది అంతా. ఏంటొనీకి ఏమని కబురు? ఎలాక్షమించుతాడు? ఏమీ తోచలేదు. 'విషంతిని చచ్చిపోయినది' అని కబురుచేసినది. ఈవార్త చెవులబడినది. ఊరికే అటూయిటూ పచారుచేస్తున్నవాడు స్తంభంలా నిలబడిపోయాడు. "క్లియోపాత్రా చచ్చిపోయినదా! ఇంక ఏంటొనీకి ప్రపంచంలేదు. ప్రపంచంలో వున్న ప్రేమా సౌందర్యమూ అన్నీ నశించిపోయినవి. ఐరాస్, నిన్ను ఒక బీదకుటుంబంలోనుంచి తీసి యింతస్థితికి తీసుకునివొచ్చేను. నీవు నీప్రభువు సేవజేసేసమయం వచ్చినది. నీకత్తితీసి నన్ను పొడిచివేయి," అన్నాడు. ఏంటొనీ దృఢసంకల్పం యెరుగును ఐరాస్. కత్తిదూసి తన్ను తానే పొడుచుకున్నాడు. "భలేనౌఖరువు, గొప్పవిశ్వాసం చూపించినావు, నాకు దారిచూపినావు" అని కత్తితీసి గుండెల్లో పొడుచుకుని పడిపోయినాడు. భూమి దద్దరిల్లినది.

క్లియోపాత్రాకు వెంటనే వార్త తెలిసినది. గొల్లుమని ఒక్కటేయేడ్పు. మృత్యువుదరి జేరుతూవున్న ఏంటొనీని తనకోటలోనికి రప్పించుకున్నది. ఈమరణం ఆయేడుపు చూస్తూవున్న ప్రపంచంఅంతా కొయ్యబారి కారిపోతూవున్న కన్నీళ్లు తుడుచుకుంటూవున్నది. ఏంటొనీ అన్నాడు, "ఏడుపుయెందుకు; ఇటురా, పక్కను పడుకో" అని. తొలిసమావేశంలో కలుసుకున్నట్టు అన్నీ మరిచిపోయారు. ఓ ముద్దులు, ఆలింగనములు, ఆరక్తప్రవాహంలో. వాళ్లు మరిచిపోయి చిన్నపిల్లలవలె ఏవో అర్థంలేని మాటలన్నీ చెప్పుకున్నారు. కాలం భూత భవిష్యత్తులు ముడుచుకొని అక్కడ ఒక్క వర్తమానంగా నిలిచిపోయినది. ప్రాతసంగతులుఅన్నీ చెప్పుకుంటున్నారు. ఓ వాళ్లుమరిచిపోతున్నారు. ఆపొంగులో, ఆవొడలు తెలియని ప్రేమలో ఏంటొనీ శిరస్సు క్లియోపాత్రా వొడిలో జారి నిద్రించాడు స్థిరంగా. బ్రహ్మాండంగుండె బ్రద్దలయ్యేటట్టు యేడ్చివేశినది. హఠాత్తుగా ఆపుకున్నది. ఒక్కచిటికలో సునాయాసంగా ప్రాణం హరించేవిషాన్ని తీసుకురమ్మన్నది.

తొలినాడు ఏంటొనీని చూడడానికివెళ్లిన నాటి దుస్తులు అలంకారములు అన్నీతీయించినది. మహావైభవంగా తొలిసమావేశం అంత ఆడంబరంగా అలంకరించుకున్నది.

అద్దంలో చూసుకుని, ఆయపూర్వశోభ ఎక్కడినుంచి వచ్చినదా తనవదనంలోనికి అని ఆశ్చర్యపడినది. తనసౌందర్యానికి తాను యెన్నడూ గర్వపడనట్టు గర్వించినది. ఆసౌందర్యార్చనలో ఒకత్రుటి సర్వం మరిచిపోయినది. ఓ కన్నులుపెద్దజేసుకుంటూ ఎప్పుడూ తిలకించని క్రొత్తకాంతిలో తన్ను తాను చూసుకుంటూవున్నది. ఇంతలో అంతాజ్ఞాపకం వచ్చినది. "ఏంటోనీ, వొస్తున్నా!" అని విషంత్రాగి ఏంటోనీ కౌగిలిలోనికి వొరిగిపోయినది.

సశరీరులై వున్నప్పుడు ఎన్నడూ యెరగని, అణువుఅణువుగా ఆలింగనంలో సజీవకణాలుగా ఒక్కశరీరంగా 'మట్టికౌగిలిలో ఒకరినొకరు అతుక్కొని పోయినారు. భూమి పులకరిస్తూ గర్వంగా అందుకున్నది వాళ్లని. ఆప్రేమ తలుచుకున్నప్పుడల్లా భూమి పువ్వులు పులకరిస్తూవుంటుంది, ఆయపూర్వప్రేమ సౌరభం ప్రపంచం గుండెలు తాకడమునకు.

---

# మా వ్యాసకర్తలకు

వ్యాసములు సంపూర్ణముగ చిన్నసైజు కాగితముంపై ఒకవైపున మాత్రమే విడిఅక్షరములతో బంతులు దూరదూరముగా, దిద్దుబాట్లు లేకుండ, తిన్నగా వ్రాసి, వర్ణక్రమమునను తప్పులు లేకుండ చూచుకొని పంప వేడికోలు. లేకున్న ముద్రణకార్యములయందు మిగుల కష్టము కలుగుటయే కాక తప్పులుకూడ నిలిచిపోవునని మనవి. ప్రకటింపనివ్యాసముల తమకు తిప్పిపంపుటకయితపాలుబిళ్లలు పంపవలయును.

సంపాదకుడు, 'భారతి'

# స్త్రీల నాకర్షించుటకు కొన్ని మార్గములు



వెనుక నద్దమును ప్రేలాడ గట్టిన సౌందర్యమును చూచుకొనుటకు స్త్రీలు వెంబడి రావచ్చును. అద్దము నకు బదులు నగలకేట్లాగు గట్టినను కోరిక ఫలించును



కేట్లాగున కనబడు నగలను ధరించి ప్రయత్నించవచ్చును. వారికి నచ్చినటుల బట్టలను ధరించిన సెబులుండునో?

తలిశెట్టి రామారావు.

# ప్రాచీనచిత్రములు



శ్రీ. శివాజీ చక్రవర్తి
(పదునేడవశతాబ్దమునాటిది.)

# నాకే శాస్తి చేశావా?

కనుపర్తి వరలక్ష్మమ్మ గారు

౧

సత్యవతి పిల్లవాడిని మంచంమీద పడుకోబెట్టి చిచ్చి కొట్టుతూ పడక కుర్చీలో కూర్చున్న పెనిమిటి వంక జూచి, "పిల్లవాడు నిద్రబోయినాడు. లేచి కాళ్లు కడుక్కోండి వడ్డిస్తా" నన్నది.

"ఆకలికాలేదు"

"మళ్లీ క్లబ్బుకు వెళ్లివచ్చారూ."

"లేదు."

"లేకపోతే ఆక లెందుకు కాలేదూ? ఒంట్లో బాగుండలేదా?"

"మాస్నేహితు డొకడు తాలూకాబోర్డులో మెంబరైనాడు. అతనికి మాక్లబ్బుమిత్రు లంతాకూ యివ్వాళ పార్టీ చేశారు. దానికి వెళ్లాను."

"చందా యేమాత్ర మిచ్చారు."

"పదిరూపాయలు."

"అయ్యో, పదిరూపాయలే! నాలుగుగాము, అయిదుగాము, పదిరూపాయలే యిచ్చారూ! మీకు యెన్నివిధాల విన్నవించుకున్నా మీపని మానరుగదా."

"అయితే ఏమిచేయమంటావు. క్లబ్బుమెంబర్లందరూ యిస్తూంటే నేను యెట్లా ఊరుకునేది?"

"అవును, క్లబ్బులో ఉంటే యిటువంటి మొగమాటాలు ఉండేమాటే నిజము. ఆక్లబ్బుతో సంబంధమే వదులుకుంటే యీబాధ ఉండదుగా."

"క్లబ్బు మానడం నాచేత గాదు."

"అవును; ఆమెత్తని సోఫాలమీద, నిగనిగలాడే బల్లలముందు, విద్యుద్దీపాలు వెలుగుతుంటే, విసనకఱ్ఱలు విసురుతుంటే, వెండిప్లేట్లలో ఫలహారాలు, పమిడికప్పులతో పానీయాలూ, గాజుకోపాలతో సీమసారాయిలూ సేవించి కాసేపు ఆడిపాడి వస్తారు. అనుభవించేది పదినిముషాలే అయినా, నిజంగా అది దేవేంద్రభోగమే. ఆకాసేపు సుఖానికి అయ్యే [illegible]ర్చంతో చూడండి. ...ళ్లు పోయినాయి, మాన్యాలు పోయినాయి. తోటలు ...యినాయి, దొడ్లు పోయినాయి. నగలు పోయినాయి, నాణ్యాలు పోయినాయి. మేడలు మిద్దెలు కూడా పోవడానికి సిద్ధమైనాయి. ఇంకా మీకు ...బుద్ధిపుట్టకపోయె. మోటారు దిగరాయె. క్లబ్బు మానరాయె. పైన ఓట్లగో లొకటాయె. వట్టి కోడిపుంజుల ...ట్లాటేగాని ఆతాలూకాబోర్డు మెంబరైనంతమాత్రాన ...నకు ఒరిగేదేమిటి? తలమునిగి తాటిప్రమాణంగా ఉన్న ...నకు గొడవగూడా యెందుకు? ఓడితే పైకేడుపు, ...లిస్తే లోపలయేడుపు. అంతేగాని యీమెంబరుపనుల వల్ల అనుభవించే అధికారా లేమున్నాయి. పైగా నాటికి క్లబ్బువిందులు, తోటవిందులు, ఇవోకర్చా? అయ్యో! పండువంటి సంసారాలు పాడైపోవటానికి ...వ్యాజ్యాలే ఉన్నాయనుకుంటే ఇప్పుడీ వోట్లుగూడా నాటికి తోడైనాయి. ఇదియేమి విలయమో! మనస్థితి ...టుకు మనస్థితి ఆలోచించండి. ఎంతసంసారం ఎంతకు వచ్చిందో! మామగారు ఉండగా మనకాపుర మెట్లా ఉన్నది? ఇంటినిండా ధాన్యము! దొడ్డినిండా పశువులు! పెట్టెలనిండా ధనము! ఎటుచూచినా మహాలక్ష్మి తాండవమాడుతుండేది గదా. మామగారుమాత్రము దానము ధర్మము, అతిథి అభ్యాగతి, చుట్టము పక్కము అనకుండా ఉన్నారా? దేవతార్చన బ్రాహ్మణుడు, పురాణపు శాస్త్రుర్లుగారు, అధ్యయనపు పిల్లకాయలు, అతిథి అభ్యాగతి, చుట్టము పక్కము, జీతగాండ్లు కమతగాండ్లు! ఎంతమంది! ఒకరా యిద్దరా? ఏపూటా పాతికమందికి తక్కువయ్యేవారుకారు. పైగా ద్వాదశి, పునర్వసు, జయంతి, చారసాల, అన్నప్రాశన, కేశఖండనము, వడుగు, పెండ్లి, యేదో సెపము, మూడుమూడు నాళ్లకు గ్రామసమారాధన, నిత్యకల్యాణం పచ్చ తోరణంగా

ఉండేది. ఆవిధంగా జరిగినా ఆయన హయాములో లేదన్న మాట వినలేదు. అటువంటికాపురానికి నేడు యెటు వంటిపాట్లు వచ్చినాయి. పిడికెడు గింజలు బిక్షం పెడ్తే ఆపిడికెడు రాత్రిపంపడవేమో అనిపిస్తున్నది ప్రాణం. ఇదిగో యిటు మాడండి,మీపాదాలు ముట్టి చెప్తున్నా; నామాటవిని ఆమోటారమ్మివేయండి ఆక్లబ్బుకుపోవడం మానివేయండి. నూరురూపాయలౌదా, పిల్లలు మనమూ కడుపునిండా తినవచ్చు. మీరు యేమిచేసిపెట్టమంటే అదిచేసిపెడ్తా. మీరూ పిల్లలూగూడా తినవచ్చు. ఎంత కాళ్లకు చుట్టుకొని యేడ్చినా ఆపసివెధవలకు కాసి మరమరాలు కొనడానికి కటకటలాడుతున్నా. మనకడుపు గట్టుకొని వాళ్లను పోషించాలంటారుగదా, వాళ్లకడుపు గొట్టి మనం తినడం న్యాయమా? ఏమి మాట్లాడరు? నా మీదా బిడ్డలమీదా మీకు నెనరు లేదూ? నామనవి వినరూ." సత్యవతి పెనిమిటిపాదాలమీద పడి భోరున యేడ్చింది. మాధవరావుకుగూడా దుఃఖంవచ్చింది. కన్నీరు ఉత్తరీయపుకొంగుతో తుడుచుకున్నాడు కాని భార్య చెప్పిన హితవుమాత్రం ఆమోదించలేక పోయినాడు. మాధవరావు బస్తీకాపురం మొదలుపెట్టిందిమొదలు అతనికి చాలాప్రియమైంది క్లబ్బే. మొత్తంమీద ఆతని కాపురం యింత దిగదీసింది క్లబ్బే. అయినా ఆతడు క్లబ్బుమీదివ్యామోహం వదులుకోలేక పోయినాడు. సత్యవతికిక యేమని సమాధానం? మాధవరావు నిరుత్తరుడైనాడు.

తాను యెన్నివిధాల చెప్పినా, ఎంత కనికరంగా విలపించినా ఆయనకు జాలిగలుగనందుకు సత్యవతికి మరీ దుఃఖం వచ్చింది. "ఏమి, క్లబ్బుకు వెళ్లడంమానరూ? ఆకటి చిచ్చుతో మలమలమాడే ఈ పిల్లలనూ నన్నూ చూస్తే మీకు దయలేదూ? క్లబ్బుకోసం భార్యాబిడ్డలను క్షోభ పెడ్తారా?" అని యేడుస్తూ సత్యవతి పెనిమిటిపాదాల మీద మళ్లీ పడిపోయింది. మాధవరావు యిక నిబ్బరించుకోలేకపోయినాడు. అసలే హృదయ దౌర్బల్యంచేత హిస్టీరియవ్యాధితో పీడింపబడుచున్న తనభార్యకు మనస్సంక్షోభం పనికిరాదని డాక్టర్లు చెప్పినమాట అతనికి జ్ఞాపకం వచ్చింది. తాను క్లబ్బును వదిలానంటేగాని ఆమెకు మనశ్శాంతి కలుగదని అనుకున్నాడు. "సత్యవతీ! యేడవబోకులే. ఇక క్లబ్బుకుపోనులే. ఏదో అలవాటు చొప్పున దానిని విడవలేక యేడవడమేగాని మనకాపురపుస్థితి నాకుమాత్రం తెలియదా? ఈమోటారుగూడా త్వరలో పోకడబెట్టాలెననే చూస్తున్నా" అన్నాడు. మాధవరావు పలికినపలుకులు సత్యవతి చెవులకు అమృతపు సోనలు వర్షించినట్లు అనిపించింది. మహాసంతోషం జెందింది. "క్లబ్బుకు పోరుగదా. పోరుగదా. అదే నాకు కావలసింది" అని ఆహ్లాదంగా పలికింది. "ఆ ఆర్తరక్షకుడు మీ కీమాత్రం మంచియోచన యిస్తే మనకాపురం మళ్లీ యెప్పటిలాగా కాదా" అన్నది. మరి వివాదంలేకుండా రేయి గడిచిపోయింది.

## ౨

మఱునాడు నాలుగుగంటలైంది. మాధవరావు రాత్రి తనభార్యకిచ్చిన వాగ్దానంప్రకారం క్లబ్బుకు పోకుండా యింట్లోనే ఉన్నాడు. ఇంతలో డాక్టరు గోపాలస్వామినాయుడుగారి జవాను వచ్చి, "అయ్యా! డాక్టరుగారు తమరు క్లబ్బుకు వెళ్లేటప్పుడు తమయింటి మీదుగా దయచేయమనిచెప్పిరమ్మన్నారండీ" అన్నాడు. మాధవరావుకు యేమీ తోచలేదు. రాత్రి భార్యకు క్లబ్బుకు పోనని వాగ్దానంచేసి యీపూట పోవడానికి అతని మనస్సు వెనుకదీసింది. క్లబ్బుపేరు తలుచుకుంటేను, అందులో ప్రియమిత్రుడు రమ్మని కబురుపంపితేను రాననడానికి అతనిమనస్సు తల్లడించిపోయింది. కానేపు నిస్తబ్ధుడై క్లబ్బుకు పోదాము పోదాము అని ఉరుకులుపెట్టే చిత్తాన్ని యెట్లో బిగపట్టుకొని మొఖం వాల్చుకొని, "నేనీదినం క్లబ్బుకురాననిచెప్పు" అని చెప్పి పంపాడు. లోనుండి ఆమాటలు శ్రద్ధతో వినుచున్న సత్యవతి తనపెనిమిటి మనస్సు తిరిగిందని సంతోషంతో పొంగిపోయింది. కాని ఆమె సంతోషం యెంతోసేపు నిలుపలేదు భగవంతుడు. జవానుపోయి చెప్పగనే పాపము మాధవరావుగారికి యేమి అస్వస్థతగా ఉన్నదో క్లబ్బుకురానన్నారుట అని తానే కారు వేసుకొని చూడటానికి వచ్చాడు క్షణంలో డాక్టరునాయుడుగారు. నాయుడుగారు రాగానే 'రాండి రాండి' అని

ఎదురు బోయి చేయిబట్టుకొని కుర్చీలో కూర్చుండజేశాడు మాధవరావు.

"ఓహో! మీరు ఈదినం క్లబ్బుకు రానంటే ఏదో అస్వస్థతగా ఉన్నదని చూడడానికి వస్తే మీరు యెదురొచ్చి స్వాగతాలిస్తున్నారే! అయితే క్లబ్బుకు యెందుకు రారు?" అన్నాడు డాక్టరు.

మాధవరావుకు యేమి చెప్పడానికి తోచలేదు. క్లబ్బుకుపోకపోవడం తనకైనా మనస్ఫూర్తిగా హితకరమైన విషయం కాకపోవడంచేత ఏదో తడుముకుంటూ, "నెలనెలకూ క్లబ్బుకర్చుజాస్తీఅవుతున్నదండీ, అందుచేత" అన్నాడు. "హ! హ! హ! ఆదాలోపడ్డారు. ఏమిటి చెప్పారు? జనానావారి హుకుం గాబోలు"అన్నాడు నాయుడు. మాధవరావు మౌనం అర్థాంగీకార మన్నట్టుగా నిరుత్తరుడైనాడు.

డాక్టరు గోపాలస్వామి నాయుడు ఆబ్కారీ డిపార్టుమెంటును పోషించడానికి పూనుకున్న మహాపురుషులలో ఒకడు. కాబట్టి భార్యామందలింపులు ఆతనికి నిత్యపాఠం. అందువల్ల నిత్యం వేళతప్పకుండా క్లబ్బుకు హాజరయ్యే మాధవరావు క్లబ్బుకు రానందానికి భార్యపోరే కారణమని ఆతని త్రాగుబోతుబుద్ధికి క్షణంలో తోచింది. కాబట్టి మాధవరావు మౌనం తన ఊహను బలపరచినందున "మన ఆడంగులగోలేకాని క్లబ్బుకు పోయినందువల్ల పోయేదేమున్నదండీ. కాసేపు ఖులాసా, కాసేపు ఆనందం, కాసేపు హాయి. ఈ వెధవకొంపలో ఉదయాస్తమానం కూర్చుంటే మనిషికి వెఱ్ఱెత్తిపోదా. అందులో మావంటివాళ్ళకైతే ఏమందు లియ్యడమో, ఏకేసులు చూడడమో ఉంటుంది గనక పోకపోయినా పొద్దు పోతుంది. మీరు యితర వ్యాపారమేమీ లేనివారు గూడాను, పొద్దుపోయేదెట్లా? శ్రోత్రియందారులే. మీరుగూడా యిట్లా క్లబ్బుకర్చులకు వెనుదీస్తే మన దేశంలో సొసైటీలు ఎట్లానిలుస్తాయి? రండి, క్లబ్బుకు పోదాము. సగం కర్చు నేనైనా భరిస్తా"నన్నాడు డాక్టరు.

మంచిదైనా చెడుదైనా ఒక సంఘంతోగాని ఒక మనిషితోగాని ఒక వ్యాపారంతోగాని పరిచయం కలుగచేసుకున్న తర్వాత దానితో శీఘ్రంగా సంబంధం వదులుకోడం మనిషికి సాధ్యమైన పనిగాదు. అందులో క్లబ్బులోని క్రీడా వినోదాలకూ ఆహారవిహారాలకు సాక్వీసుగా అలవాటుబడ్డ మాధవరావు, నాయుడు వంటి ప్రియస్నేహితుడు వచ్చి రమ్మని బలవంత పెడ్తుంటే రాననడానికి యెట్లా సాధ్యమౌతుంది. డాక్టరుగారికి యేమీ బదులుచెప్పకుండానే మెల్లగా పిల్లివలె వంటయింట్లోకి బోయి "యేమి డాక్టరుగారు క్లబ్బుకురమ్మని బలవంత పెడ్తున్నారు. ఒక్కమాటువెళ్లి క్షణంలోవస్తా"నన్నాడు. సత్యవతి యేమీ మాట్లాడలేదు. ఆమె విశాలనేత్రాలు కన్నీటితో తొణికిసలాడుతుండగా ఒక్కమాటు భర్తవంక దీనంగా చూచి తలవంచుకుంది. ఆ సమయంలో సత్యవతిముఖాన ప్రతిబింబించిన విషాదచ్ఛాయలు ఆమె హృదయవేదనను వెల్లడించినవి. కాని మాధవరావు ఆమె ఉమ్మలికం గ్రహించలేదు. నేను క్లబ్బుకు పోతానన్నప్పటల్లా నీముఖం యిట్లాగే మాడుతుంటుం దన్నట్టుగా అసహ్యభావంతో ఆమెవంక చూచి నిర్లక్ష్యంగా డాక్టరుగారితో వెళ్లి కారు యెక్కాడు.

## 3

దుర్వ్యసనలాలసులను లొంగదీయడానికి తల్లిదండ్రులు సమర్థులుగారు; ఉపాధ్యాయులు సమర్థులుగారు; భార్యలు సమర్థులుగారు; బంధుజనులు సమర్థులుగారు. దీనికి భగవదత్తమైన మహౌషధమొక్కటే. అది దారిద్ర్యము. ఔషధమునకు అనుపానం తోడు చేసినట్లుగా భగవంతు డొకప్పుడు యీదారిద్ర్యమునకు రోగమునుగూడ జోడుచేసి మింగిస్తుంటాడు యిట్టివారిచేత. ఇకనేమున్నది? ఈరెండు జోడైతే ఆటకట్టు. మాధవరావు ఒక్కమాటుగా ఈ ఔషధానుపానములకుసరైనాడు. పగలు ఆహారనియమం, రాత్రులు నిద్రానియమం పాటించకుండా చెడతిని చెడతిరగడంచేత అజీర్ణవ్యాధి పట్టుకున్నది. సొమ్మంతా ఇచ్చవచ్చినట్టుగా వెచ్చబెట్టడంచేత చేతిలో చిల్లిగవ్వలేదు. దుర్వ్యసనం, నిర్వ్యాపారం అంటే సామాన్యమా మరి? గొప్పగొప్ప సంస్థానాధిపుల సంస్థానాలుసైతము నిప్పచ్చరమైనాయి. ఇక మాధవరావు ఆస్తి నశించడ మొకలెక్కా? ఇప్పుడు

మాధవరావుకాపురము పసువులపాకలో. అదైనా బుద్ధిదాతలు పిల్లలు గలవాడని అనుగ్రహించి యిచ్చినదే కాపుగం యెత్తుపడటంతోపాటు మాధవరావుగూడా యెత్తుబడ్డాడు. జబ్బుచేతా దిగులుచేతాగూడా అతను బయటికి పోవడంలేదు. దేహరుజ, మనోరుజ లేనివాడికి యింట్లో ఉన్నా ఆనందమే, బయటికిపోయినా ఆనందమే కాని, అన్నివిధాల క్రుంగిపోయినవాడికి సంతోషం యెక్కడినుంచి వస్తుంది? జరుగుబాటు తక్కువైన కొద్దీ చికాకు యెక్కువైంది మాధవరావుకు. భార్యను చూస్తే అసహ్యము, బిడ్డలనుచూస్తే అసహ్యము. పాపం! తండ్రిని చూడగానే భయంతో బల్లులవలె గోడకంటుకుపోతారు పిల్లలు. ఇట్లా ఉన్నా రోజూ యేదోనెపాన వాళ్లకు దెబ్బలుతప్పవు. ఇక సత్యవతి అగచాట్లకు అంతులేదు. డబ్బు లేకపోయినా, ఆరోగ్యం లేకపోయినా యిప్పటికీ దినుసువినుసు తిండ్లమీదా అపేక్ష మాధవరావుకు. ఆకోరిక యేదోవిధంగా కొంచెమైనా తీరిననాడు ఒక మాదిరిగా ఉంటాడు. పూర్తిగా పూర్వానుస్వారం ఆయెనా, ఆరోజున ఉన్నది సత్యవతి దురవస్థ. నరుడికి ఇతరుల తప్పును క్షమించడం కష్టంగాదు. వాళ్లయందు కనికరంగలిగో, తనకు పేరువస్తుందనో, క్షణంలో యితరుల లోపాలను క్షమిస్తాడు. కాబట్టి నిజమైన కష్టం తన తప్పును క్షమించుకోడంలోనే ఉంది. ఇదిగో నేనీతప్పు చేశానంటే, పోనీలే అనడం, ఇదిగో నీవీతప్పుచేశావంటే మండి పడిపోవడం మనుష్యసామాన్యం. ఈ నైజం మాధవరావులో యిప్పుడు ప్రకోపించింది. ఐశ్వర్యంతో తులతూగుతున్న కాపురాన్ని ఇంత నిష్పచ్చరంగా చేసింది తాననీ, తానేమీ సంపాదించకపోయినా కొంచెం మెలకువగా ప్రవర్తించినట్లయితే తనతరంలోనే గాకుండా తన పుత్రపౌత్రులతరంలో గూడా దారిద్ర్యాన్ని కళ్ల చూడవలసిన పనిలేదనీ మాధవరావుకు బాగా తెలుసు. ఈవేదనతో అతనికి నిశలుపవళ్లుగా వేగిపోతున్నాయి. కాబట్టే యితరులవల్లగూడా యీ వేదనాకరములైనమాటలు పడటానికి అతను సహించలేకుండా ఉన్నాడు. ఏమాత్రమైన చనువుగా మాట్లాడితే భార్యనోట యీమాటలువస్తాయేమోనని అతనికి భయం కనుక తానుచేసినలోపం కప్పుకోడానికీ, తన్ను భార్య లాఘవంచేయకుండాఉండటానికే కాకుండా యిట్లాచేశావేమని అడగటానికైనావీలుగాకుండాఉండటానికీ, యింకా యేమేమి ఊహలు మనస్సులో పెట్టుకొనో కసిబోక కారాడుతుంటాడు మాధవరావు సత్యవతిని. సత్యవతి మానవతి. ఏస్థితిలోనైనా భర్తమనస్సు నొప్పించడం ఆమె ఉద్దేశ్యంగాదు. నాభర్తకు మంచిబుద్ధిస్తే మంచిగా ఉండడా? ఇది దైవవిధి. కలిమినాడు అతనితో కాపురం చేసి లేమినాడు లేచిపోతాననడం సాధ్వీధర్మమా అని సత్యవతి ఆస్తి పోయీపోకుండా ఉన్నస్థితిలో నాడు చేయకండని వేడుకొనేదికాని, పూర్తిగా పోయినతరువాత పల్లెత్తలేదు. అతనికి జబ్బుగూడా చేసినతరువాత జొత్తిగా ఆతలంపే మానుకున్నది. కడచిపోయిన సంగతులు ప్రస్తావించి అతని మనస్సు కలంచినచో, అతని వ్యాధి ప్రబలమౌతుందని ఆమెకు భయం. బిడ్డలకైనా తనకైనా మానుకొని ఏదోవిధంగా పెనిమిటికి కావలసిన ఆహారపానీయాలూ, ఔషధాలూసమకూర్చి అతనిమనస్సు సంతృప్తిపరచి దేహమనోవ్యాధులనుండి అతనిని ముక్తి నొందించడమే ఆమెలక్ష్యం. ఈవిధంగా పతిని పరిచరిస్తూ "అఖిలదుఃఖరోగార్తుల కౌషధంబు। భార్యయె చూవె" అన్న భారతమహావాక్యమును సార్థకం జేస్తున్నది సత్యవతి.

## ౪

పగలు మూడుగంటలు దాటింది. సత్యవతి అప్పటికప్పుడే పాలుప్రొయ్యిమీద పెచ్చిబెట్టి కాఫీనీళ్లు వడగట్టుతున్నది. మాధవరావు అప్పుడే పగటినిద్రబోయి లేచి ఆవలించుకుంటూ ఒళ్లు విరుచుకుంటూ వచ్చి 'వట్టి కాఫేనా' అన్నాడు.

"అయితే యేమి చేయను: ఉప్మా చేయనా?"

"థూ; వద్దు."

"పోనీ దోసె వేయనా?"

"తగలెయ్, నేర్చావు పెసరపిండివంటలు?"

"అయితే ఏమిచేయమంటారు?"

"పకోడీలు."

"అయ్యో నెయ్యి లేదే."

"ఇప్పుడూ లేనన్నదేద్పే."

"రాత్రికి పొటాపొటీగా సరిపొయ్యేటట్టున్నది. ఆకాస్తా యిప్పుడు ఖర్చుపెట్టుకుంటే యీరాత్రి యెట్లాగడుస్తుంది? ఇవ్వాళిటి కెట్లాగైనా కాఫీపుచ్చుకోండి; రేపు తప్పకుండా పకోడీలు చేస్తా."

"అయితే రేపే త్రాగుతాలే ఆకాఫీగూడా."

"అయితే యీచేసినకాఫీ యేమిచేయను?"

"నీముఖాన పోసుకో."

సత్యవతికి కళ్లనీళ్లు గిఱ్ఱున దిరిగాయి. అప్రయత్నంగా కొన్నిచుక్కలు నేలమీదగూడాబడ్డవి. మాధవరావు ఆనీళ్లుచూచి మఱింతమండిపడుతూ "ఆయేడుస్తూయిచ్చేకాఫీ నాకక్కర్లేదు" అంటూ దబదబా షర్టుతొడుక్కొని ఉత్తరీయం వేసుకొని యెక్కడికో వెళ్లిపోయినాడు. పెనిమిటి కోపంవచ్చి వెళ్లిపోవడంచూచి "కాఫీత్రాగి మఱీవెళ్లం" డని అడ్డఅడ్డాలువచ్చి బ్రతిమలాడింది సత్యవతి. కాని చేతితో ఆమెను ఒక్కత్రోపుత్రోసి వెళ్లిపోయినాడు మాధవరావు.

భార్యచేసిన వివిధోపచారాలచేత కాస్తరెక్కొచ్చిన్నతరువాత మాధవరావు బజారుకువెళ్లడం యిదే మొదలు. పాపం! మాధవరావుజిహ్వ పసితనంనుండీ చవియైన తిండ్లకు అలవాటుపడ్డది. గుఱగుఱలాడేటట్లువేయించినపూరీ గడ్డపెరుగూ దప్ప ఉడికినపూరీ పిలికిన మజ్జిగా అతడు జిహ్వమీద పెట్టుకొని యెఱుగడు. కాఫీక్లబ్బుల్లో చిఱుతిండ్లు మరగిన తరువాత ఆతని జిహ్వా చాపల్యం మఱీ విస్తరించింది. మనుష్యు లేయింద్రియ చాపల్యమునైనా అరికట్టగలరు గాని జిహ్వేంద్రియ చాపల్యంమాత్రం జయించలేరు. అందులో కొంత కాలం చవిదిన్నవాళ్లు మానుకోడమంటే అది మఱీ అసాధ్యమైన విషయం. కాబట్టి మాధవరావు రోగంతో దారిద్ర్యంతో క్రుంగిపోతూ మంచంలో లేవలేక పడిఉన్నా, అతని చిత్తం క్లబ్బుల్లోని నానావిధ రుచ్యభక్ష్యాలల్లోను విహరిస్తుండేది. కనుకనే ఆతను నేడు భార్యమీద కోపంవచ్చి అడుగు పీథిలో బెట్టగానే సరాసరి నటేశయ్యరు లక్ష్మీవిలాస కాఫీక్లబ్బుకు నడిపించిందతనిని చిత్తం. మాధవరావు సగం ముక్కలుఆస్తి యీక్లబ్బు యజమానికే చెందింది. మాధవరావువంటి శ్రీమంతులు అభిమానించబట్టే మునిసిపలుమాత్ర ద్వితీయుడై వచ్చిన నటేశయ్యరు యెలక్ట్రిక్కు పంకాలతోనూ, పీవనలతోను, దీపాలతోను శోభాయమానంగా వెలిగిపొయ్యే ఒక గొప్ప కాఫీక్లబ్బుకు యజమానియై చేరైనా దిగకుండా శ్రీమంతులతో సల్లాపాలాడుతున్నాడు.

౫

"నటేశయ్యరూ! నాకు యివ్వాళ మీక్లబ్బులో టిఫిన్ యిప్పించూ" అన్నాడు ప్రాధేయపూర్వకంగా మాధవరావు.

"దుడ్డు తెస్తివా."

"లేదు."

"దుడ్డు లేకపోతే టిఫిన్ యెట్లా వస్తుందయ్యా?"

"నీవయ్య, యెట్లా యిచ్చినా సరే."

"అయితే నాక్లబ్బులో నౌకరుగా ఉండు. రోజూ కాఫీ యిడ్లీ పకోడా బూందీ మస్తుగా యిస్తును."

మాధవరావువద్ద వందలువందలకు బిల్లు చేసి ఆతని సొంప దోచేసిన అయ్యరు మాధవరావుకుచేసిన సత్కార మిద్ది. నిజంగా పౌరుషశాలియైన మగవాడికి యింతకంటే అవమానకరమైన సంగతి యింకొకటి లేదు. కాని వివిధ దుర్వ్యసనాలచేత మనుష్యత్వం చచ్చిపోయిన మాధవరావు కీమాటలలోనున్న అవమానం ద్యోతకంకాలేదు. పైగా తనకు కాఫీ ఫలహారం యివ్వకుండా తిప్పలుబెట్టుతున్న భార్య కిది తగినశాస్తి అనుకున్నాడు. "అట్లాగే చేస్తాను అయ్యరూ" అన్నాడు. మాధవరావు తెలివిమాలినతనానికి తాంబూలపుగార పట్టిన పండ్లు కనపడేటట్టుగా ఒక్కవికృతపునవ్వు నవ్వి అయ్యరు "అయితే రేపు ప్రొద్దుటినుంచీ నౌకరీకి రా" అని, 'అరే పయ్యాన్, ఒక కాళ్ శేరు పకోడా, ఒక కప్పు కాఫీ యీయన కియ్యి"మని నౌకరుకు ఉత్తరువుచేశాడు అయ్యరు.

మాధవరావు బ్రహ్మానందభరితుడైనాడు. లక్ష్మీ విలాసక్లబ్బులోని ఘాటుకాఫీ, కమ్మనిపకోడీ రుచి చూచి సంవత్సరమైంది మాధవరావుకు. కనుక నాకకీ పిల్లవాడు తెచ్చిన కాఫీపకోడీలు క్షణంలో మటు మాయంచేసి తృప్తిదీరక పదార్థాలవంకా పయ్యాన్‌వంకా గుటకలు మింగుతూ చూచాడు. కాని ప్రయోజన మేమున్నదీ? మొదట అయ్యారువారి శాంక్షన్ ఎంతో అంతే.

౬

కడచిన దినం మొగుడు కోపంచేత కాఫీ త్రాగ కుండా వెళ్లినందున యీపూట పెందలకడనే కాఫీ పెసరట్టూ చేసిద్దామని రోజూకంటె ముందుగా లేచి సత్యవతి అదేప్రయత్నం చేస్తున్నది. ఆరోజు నటే శయ్యారు హోటల్లో నౌకరీకి వస్తానని చెప్పివచ్చాడు గాన త్వరగా నిద్రలేచాడు మాధవరావు. రోజూ తొమ్మిదిగంటలైనా లేపితేనేగాని నిద్రలేవని పెనిమిటి నాడు అంతప్రొద్దున్నే లేవడం, వేగంగా మొఖం కడు క్కోటం చూచి నేడుగూడా కాఫీ పుచ్చుకోకుండా వెళ్లుతాడేమోనని భయపడి, "కాఫీ దోసేగూడా తయా రైంది; ఒక్కక్షణంలో యిస్తాను, ఎక్కడికీ పోబో కండీ" అన్నది సత్యవతి.

"నీ ముష్టికాఫీ నా కక్కర్లేదు."

"ఏదో ఉన్న కాఫీ యిస్తాను. ఇంతకంటె మంచి కాఫీ యెట్లా వస్తుంది?"

"నేను లక్ష్మీవిలాస్ క్లబులో పుచ్చుకుంటా."

"డబ్బు?"

"డబ్బు అక్కర్లేదు."

"డబ్బు లేకుండానే, ఊరికే యిస్తారా?"

"ఊరికే గాదు."

"కాక?"

"అక్కడ నౌకరీకి కుదిరా."

"ఆఁ ఆఁ, ఏమినౌకరీ?"

"కాఫీ హోటళ్లలో యేమి నౌకరీ లుంటాయో అదే."

"ఏమి, చిప్ప దొప్ప కడిగేనౌకరేనా?"

"ఆ. నీకు శాస్తిచేదామనే యీ నౌకరీకి ఒప్పు కున్నా."

కొట్టకు వోర్చింది. తిట్లకోర్చింది. పస్తులకోర్చింది. దరిద్రానికోర్చింది. యీఅవమానానికి ఓర్చడం దుస్స హమైపోయింది సత్యవతికి. "ఆఁ ఆఁ, పూలమ్మిన ఊళ్లో కట్టె........"మాట పూర్తిగాలేదు. అవమానంతో దుఃఖంతో గుండెలమీద చేయివేసుకొని వెనక్కు విఱు చుకొని పడ్డది సత్యవతి. మాధవరావు ఒళ్లు మండిపో యింది. "ఈహిస్టీరియరోగుల కిదోవేషం! ఏమాట విన్నా కొయ్యలలె బిగుసుకుపోతారు." అని విసుక్కుం టూ కాలితో ఆమె నొకతాపు తన్ని ఆలస్యమైతే అయ్యా రేమంటాడో అనుకుంటూ దొడ్లోకి పోయి చెంబుతో నీళ్లు దెచ్చి మొఖాన కొట్టాడు. తెలివి లేదు. పట్టిచూచాడు; దొర్లించాడు; పొర్లించాడు. ఏముందీ? వట్టికొయ్య!

"అయ్యో! అయ్యో! సత్యవతీ! సత్యవతీ! నాకే శాస్తిచేశావా? నన్ను అభాగ్యుణ్ణి చేసిపోయినావా?" అని గుండెలు బాదుకుంటూ అకట్టిమీదపడి భోరు మన్నాడు మాధవరావు;—అతనితో బాటు పిల్లలు.

---

# "విధికృతమ్మును దప్పింప విధివశంబె"

కొత్తపల్లి సూర్యారావు గారు

(ద్విపదీగీతమాలిక)

ఖ్యాతవంశంబునందునఁ గలిగినట్టి యిద్ద
నాతి గల దామె కమ్మ యన్న లోక
ఉండి రెదురింటిబాలుఁ డొకండు వీరి
దాప నెడఁబాయకుండు భేదంబు లేక
చదువుకొందురు నల్వురు జట్టుగాఁగ
వదలుకొందురు పెఱవారి పరిచయంబు
నాడుకొందురు నలుగురు నఁగి పెనఁగి
వీడుకొందురు దుష్టులతోడి మైత్రి
తల్లి యేమి యొసంగిన దానిఁ గొందు
రల్లరి యొనర్ప రాఁకలి యైనఁ గాని
చిన్నతనమునుండియు శ్రేష్ఠవృత్తి
నెన్నికకు నెక్కి రెల్లర కన్న దనియు.

వయసు పెరిఁగినకొలఁదిని నయగుణములు
బయలుపెఱసెను వారిలోపల నొకండు
లొచ్చనుచు నొక్కఁ డొక్కింత యెచ్చటనుచు
నుచ్చరింపఁగ నెడమీయకుండెనుండి.

తల్లియును గాలవశత నూర్ధ్వగతి గనియెఁ
జెల్లెలే యింటిపనులెల్లఁ జేయఁదొడఁగె
నన్నయును దమ్ముఁడును సహాయంబు నేసి
కొన్నిదినములు గడపిరి కూర్మితోడ
చెలిమికాఁడును వారితోఁ గలసి పనులు
చలుపుచుండును దనయింటఁ జలుపకున్న
వారితో వన్నెవాసుల వంతు కెక్కఁ
గూరిమిని వానిగురువులు కుశలు లగుట,
కడచె నన్యోన్యమైత్రిఁ జక్కఁగ దినంబు
లెడపకుండఁగ—మాతృవిహీను లగుట
ముప్వురును బాటుపడుదురు మొత్తముగను
మవ్వపుంజెలి పాటు సమ్మతిల కంత
విధివశం బిది మాకు మాపీఁటఁ బనులు
విధిగ నొనరింప నీ కేల-వినుము మాను
మనుచు నెన్నెన్ని చెప్పిన నాతఁ డుడుగఁ
డనుగలంబును వారితోడను జరించు
నెయ్యురా! నల్వురము నొక్కనియతి నుండి
యిమ్మెడనుమాత్ర మొక్కతె నింటిపనులు
చేయ నియమించి మన మేల చేయకుండ
న్యాయమా యనువారితో నాసుహృదుఁడు.
కాల మది స్త్రీపురుషభేదకారణమ్ముఁ
దేలఁ జేయఁగఁ జొచ్చె నాతి నొకదాని
బురుషులను ముప్వురను విడిపోవునట్లు
తరుణతావసరంబులఁ దరతరంబు.

అంతరంగికలజ్జ మై నావహిల్లెఁ
గొంత కాంగికసౌష్ఠవగరిమ నంతఁ
బురుషులకు ముప్వురకు నొక్కపోల్కి యయ్యె
నిరతమిత్రత్వగరిమ నన్నింటియందు.
వారిముప్వురలో భేదభావ మాప్తు
నారయఁగఁ దోఁచెఁ గొంత కన్యానురాగ
రూపమున వేత్తలకు నిట్టిరూఢి యూఁడు
వ్యాపృతులు నల్వురందు రహస్య మొందె.
తరుణి యొకయూహ నన్నయుఁ దమ్ముఁ డొక్క
కరణి యూహాయు మిత్రుఁ డొక్కగతి యూహ

నొంద యుండిరి కొన్నినా ళ్లొకరి కొకరు
సందియంబున కేమియు సందు నీక
హితునితో మైత్రి యొక్కింత యెడము సేయ
మతిఁ దలంచిరి భ్రాతలు-మైత్రి వెంప
నతఁడు దలఁచెను గన్యకు నన్నలందు
హితునియందును గౌరవ మతిశయించె.
ఎవరిమాటయు జవదాఁట దెవరిఁ గన్న
నెవము లేనట్టి భక్తియు నిర్మలాత్మ
గలిగి యుండెను భ్రాతృత్వగౌరవమ్ముఁ
జెలిమివలని విశేషంబుఁ జెంగలింప
దాఁప నెవ్వరితరము కాంతాత్వసదృశ
రూప మెవ్వరితరము పురుషవిలోభ
నీయతారుణ్య మొరుమది నిలుపుచేయఁ
జాయఁగా బైలుదేఱెను జాయ లెల్ల
వల దనఁగలేరు మిత్రుని వల దనంగఁ
గలరె చెల్లెలి మ్రింగఁ గ్రక్కంగరాని
దప్పటి యవస్థ వారి నే మనఁగ నేమి
చెప్పఁ గష్టంబు వారల చిత్తవృత్తి
తల్లిదండ్రులు కొంతకొంతగ నదల్చి
చెల్లెఁబో దింక నెదురింటి చెలిమి మాను
మనిరి, యనినంతకంతకు నాఁగకుండఁ
దనయుఁ డొప్పరికించెఁ దద్వాక్యములను
ద్రెంపుకొన నెట్లు వచ్చు సుస్థిరసుహృత్త్వ
మింపుగల మెలఁతను గోరు హృదయబంధ
మప్పుడప్పుడు దలఁచు నాయన్నదమ్ము
లొప్పమి రచింతు రొకొ యంచు నూర్జితముగ.
పొమ్మనఁగలేరు నోటితోఁ బ్రోడ చెల్లె
లెమ్మె పాటించుచుండుట కిష్టపడరు
మనసు నొచ్చునో యని పలుమాఱు నిట్లు
నెనయు చింతాభరమ్ములఁ గనిరి కృశత
కలదు కామిని కంతరంగమునఁ బ్రేమ
కలదు మిత్రున కంతరంగమున వలపు
పలుక నేరరు పరులతోఁ బలుక నేర
రొలసి వారల మది యొక రొకరితోడ
మిత్రుజనకుని మదిఁ బాడమె నొకకొంత
పుత్రుకతమున నవమానము గలుగునొకొ
యంచు సంశయ మది గాన నల్లనల్ల
మంచిమాటల బోధించి మానకున్న
తరుణి భ్రాతలతోడ మిత్రత్వమునను
సరసగతి భాషణమ్ములఁ జలిపె నిట్టు:
లన్నలార! వివాహయోగ్యమగు వయసు
మిన్నకుండెద రేమి మీమీవిషయము
నాదుతమ్ముల బిడ్డ లున్నారు కన్య
లేదొ పెఱచోట వెదకిన నెట్టివారు
వత్తురో యనుచున్నాము వరుల మిమ్ము
మెత్తు రెల్లరుఁ; జెప్పెఁడీ మీతలంపు
బాగుగాఁ జూచికొందు మావాని కీడు
గాఁగఁ దోఁచును మీచెల్లె లీఁగరాదె
కలసినది మైత్రి బంధుత గలదు మనకు
వెలయఁగను బీఱకాయపీఁచులలి గాఁగ
మీరు మీరును మిత్రులు మీరు మీరు
గౌరవంబున సంబంధగౌరవమున
ననఁగి పెనఁగి సుఖించు టత్యంతశుభద
మనుచు నొకనాఁడు పుత్రుఁడు వినకయుండ
సాగలే మనుచును బెద్ద లేఁగి రేమొ
భోగభాగ్యములకు వెల్తిఁ బొందినార
మనుచు మాతులుతో మాటలాడవలయు
ననుచు గీటునఁ బుచ్చి రంతంత కతని-

ఎచటి వచటనె యుండును నెవరు నొక్క
రెచటికిని బోవ నక్కఱ యింత లేదు
స్నేహబంధంబును బిగియించినటు లగు వి
వాహయోగ్యసమయ మిది వత్సలార !
పనులుఁ బాటల మెలఁగెడు వయసు, మీకుఁ
జనుచునున్నది వంటింట సమయమునకుఁ
దగినకార్యమ్ములను జేయఁదగును మఱి యె
దిగిన చెల్లెలి మీయిలు దీర్ప నిలిపి
మీరు నామెకు సాయమై మిన్నకున్నఁ
దీరు గా దిది, మీచెల్లి తీరదేమొ !
ఎదుగుచున్నారు మాబిడ్డ లింక నుంపఁ
బదుగురును నవ్వెదరు మీకుఁ బరిణయంబు
చేయ నున్నాము నిశ్చయించితిమి, మీరు
మీ యనుఁగుఁజెల్లెలికిఁ జేయుఁడీ యిఁకేల
తడవుకొన నక్కఱయు లేదు తాళుకొందు
మెడయ లే దిరువీళ్లకు నేన యెల్లఁ
జక్కఁజేసెద మీమామ సరసుఁ డాతఁ
డొక్కటియుఁ జెప్పఁడే నేఁగి యొప్పుకొనఁగఁ
జేసి వచ్చెద-నన నేమి చెప్పలేక
వీసమంతయు దానికి వేఱు చేయు
కారణము లేక యొప్పుకోక విధి లేక
వారు తమమిత్రు స్నేహభావంబునను గు
మారిమెడ నాచరించు సంభావనముఁగు
మారిహృదయంబు నెఱిఁగి సమ్మతిగొనియును-
భ్రాతృభావంబు నిందాఁకఁ బరిగణించు
నీతఁ డీకన్యపై మోహ మేల నించె
నితనిపైఁ జెల్లె లేల యక్కృత్రిమంపు
మతిని నెలకొల్పె నను నొక్క మాటమీఁద
విరసభావంబు గల్గిరి-వెఱ్ఱి గాదె

విరళలోకానుభవు లౌట వీర లిట్లు
తలఁచెదరు-చక్కఁదనము చిత్రమగు జలము
[illegible]లయు సౌందర్య మది చిత్రజలము పేరు
[illegible]వమే గాని యర్థము గాదు వేఱు
[illegible]దు భిన్నంబు రెండు నొక్కటియె గాఁ
దారసించిన నైక్యమహా దాని వేఱు
గ[illegible] రచనసేయఁ గష్టము నెం[illegible] రొరులు
సహజులకు నైన మన్మథశక్తి యట్టి
ద[illegible]హా సుందరరూపదృశ్యమునఁ గల్గు
[illegible]త యెఱుఁగరు వీరలు పిన్నలగుటఁ
[illegible]ంత నిష్పన్నచో నేతిముంత నద్ది
గ[illegible]ఁగఁ జేయక యుండునే కారణములు
[illegible]బిగా నుండ నేటి కీవెడఁగుఁదనము
తనురె య ట్లుండిరేని సత్యముగ నిల్లె
వి[illegible]తు లగుదురు మిత్రునివిషయమునను
జి[illegible]తన మని వీరి యీచేష్ట దెలుపు
[illegible]న్నదే గద—యిన్నాళ్లు నన్న చెల్లె
ల్టు లుండిరి యిపు డసహ్యముగ యోగ
పొట్టు తలపెట్టిరో వారి యెఱుఁగ రనియు
నొకరు గాకున్న నొకరైన నొప్ప గాద
న[illegible] చరింతురు తెలివి బాలికకు లేదు
[illegible]రుషుఁడై యుండి యెఱుఁగఁడో పోల దనుచుఁ
ద[illegible]శి కెఱిఁగించి మరలింపఁ దగదొ! క్రొమ్మొక్క
[illegible]ందె కచునకు, సాటి చెప్పంగ సిగ్గు
[illegible]ంచుకొనవచ్చునే వానిఁ దలఁచి యిట్టి
[illegible]లఁతిమానవు, నాతనియండ నితఁడు
ని[illegible]వ నష్టుండె యతఁ డెప్డొ నిలిచినట్టి
[illegible]వునను నిల్చుటకు నిష్ఠ దగఁడు—దుష్ట
భావుఁ డీతఁడు, కచుఁడు సద్భావుఁ డఖిల

శాస్త్రవేది—యతం డెట్టిజననికొడుకు
శాస్త్రియే గాని యాతని జనకుఁ డెట్టి
వాఁడు, వంశంబు గాదు సద్భావమునకు
నాడుదురు "వంశమో వాని యాలిత్రోఁకొ"
యనుచు పట్టిది యది వాని యాత్మశుద్ధి-
జనుసకును జాతి మతమును జన్మగౌర
వమును నిల్పికొనందగు, వావి గాదె
రమణి పెదతండ్రికూఁతురు భ్రాతకు యువ
నులకు నన మతసమ్మతి నుసలరాదు
తలఁపవచ్చునె హిందువు తల్లివావి
చెప్పవచ్చునె హిందువు చెల్లివావి
యెప్పుడైనను హిందువు లొప్పుకొంద్రె
కూఁతువావిని, ఇపు డిప్డు కొంతమంది
కూఁతువావిని బెండిలికూఁతువావి
యనుచుఁ, జెల్లెలివావిని నాలిచెలియ
లనెడి వావిని నూహ చాలనికతమునఁ
గక్కటితిపక్షమునను-శాఖ లొకకొన్ని
మిక్కిలిగ జనసంఖ్యను దక్కవగుట
దొరకుటే చాలు, నొకచెంప నరసినట్టి
పురుషుఁడో తరుణియొ లేరు పరులు వెదకఁ
గట్టు దప్పుచునున్నారు కలివుకాల
మిట్టు లెన్నాళ్లు పెంతుము కట్టుబట్ట
కూడు వెట్టుచు నొకతెయో కొంతమంది
తోడఁబుట్టువు లున్నారు తుదకు వారి
కేమిగతి యంచు నెంచఁగా-నింత వలదు
భూమిలో నెందుఁ జూచిన బుట్టపుట్ట
లున్నవారలు మనశాఖ-నున్నవార
మన్నదమ్ముల మిద్దఱ మతివ యొకతె
సమ్మతము గానిచో నీయఁజాల మతఁడు
సమ్మతుఁడు గాకపోఁడును జక్కఁదనము
గలఁడు ధనికుఁడు తల్లిదండ్రులు గలాఁడు
చెలిమికాఁ డేమియును లోటు చెప్పలేదు
వావి యెంచరు వారికి భావ్యమ యగు
నీవిషయ మెంతమాత్రము నేము సమ్మ
తింపఁజాలము-కూర్చిన పెంపు ప్రేమ
దింపవచ్చునె చెల్లెలిది యనరాదు
తప్పుదారిని నడవ దిద్దవలదొక్కొ-
చెప్పఁగా వినకున్న విచేష్ట కొప్పి
సంఘమునఁ దలయెత్తి యేచాయఁ దిరుగ
సంఘటించును మనము నిశ్చయము గాఁగ
సంఘ మంగీకరించునే సత్య మిదియు
సంఘబాహ్యులు ధనత విచ్చలవిడిగను
సంచరింతురు నిర్ధని సాహసింప
సంచలించును ధనము చంచలము సంఘ
మతిదృఢమ్ము స్థిరమ్మును నరయఁగోఁడె
మతిగలయతండు హీనజాతి తనలోన
కులము తప్ప విధింపదే, కూడకున్న
వెలులు వేయదె చదువును విత్తమొక్కొ-
యచట ముఖ్యము, మర్యాద, యట్లు లేని
యచట నిలువదు సిరి నిల్చునైన గౌర
వంబు చూపరు నరు లదే వారి కతిశ
యంబుగా నెంచి తిరిగెడువారు లేరె
యనుచు నిటు లెంచి యేమి చేయఁగను జాల
కనిరి మిత్రునితండ్రితో నల్ల నిట్లు
పెద్దవాఁ డున్నవాఁడు చెప్పెదము మామ
యొద్ద నిది యెల్ల నెంత లే దిదిగొ వత్తు
మత్త యున్నది యడిగెద మామెఁ గూడ
విత్త మొనఁగూర్చుకొందుము వేగ వత్తు

మద్దరికి నేగి యని యొక్క వ్యాజమునను
ముద్దుఁ జెల్లెలి మదిఁ ద్రిప్పఁబోవుపొంటెఁ
జోటు మార్పింగ వెడలిరి సుదతితోడి
మాట దాఁటంగలేక యమ్మగువ వెంట
నంటియును మిత్రురామికి నటుమటించి
యొంటిగా నుండు నిటఁ జెలి యూరు చూచు
వచ్చు మనతోడఁ బిలువరా పని గలయపు
డిచ్చఁ జేసూఁత యన భ్రాత లిట్టు లనిరి:
యెంత లే దెల్లి యెల్లుండి యిటకు వత్తు
మింతదాఁకను మనయింటి నెవరు చూతు
రుండని మ్మని, రామెకు గుండెదిగులు
మెందుకొనియెను, బిలువరు మిత్రు లేల
యడుగవలె నని యాతఁడు నుడిగెఁ గాని
తడవు విడియుండకుండుటఁ దల్లడిల్లె
మేనమామలయూ రొక మెట్టపల్లె
దాని కేగంగ గౌతమి దాఁటవలయు
దానికారణమునను నద్దరి యటంచ్రు—
'పూని నడచిరి బండిపైఁ బోయి రొక్క
కొంతద వ్వాత నది దాఁటు టింతె తడవు
చెంత యని చెప్పుకొనుచు వచ్చిరి పడవల
రేవులోనికి నెక్కిరి కేవు గట్టి
పోవుచున్నది వేగము రేవుపడవ
చైత్రమాసము సమయము చల్లప్రొద్దు
గాత్రసుఖముగ నలలపై గాలి వీచు
చున్నయది యప్పు నట్టేట నున్నవారి
కన్నులకుఁ బర్వమై యుండె—గతివిశేష
మునకుఁ దెరచాఁప యెత్తిరి ముందు చూచు
చును జనం బున్నయంత గొబ్బునను గాలి
రేఁగినది కోటిపలి పాటిరేవుకడను
నూఁగుచున్నది పడవ త్రొట్రిల్లఁగి చాఁప
దింపుచున్నంతలోపల దిమ్ముమనుచుఁ
గొంప ముంచెడు పెనుగాలి గొట్టి ప్రట్టె
ముంచినది యెవ్వ రేమైరొ మునుఁగుచున్న
దంచు "నారాయణా" యని యబలమాత్ర
మింత దలపోసి ప్రియుని రప్పింతలోన
నంత మొందెను-దైవమాయావిధాన
మిట్టు లున్నది-యప్పుడె యింటియొద్దఁ
బుట్టె నారాయణునకు నబ్బురము గాఁగ
నస్తిమితభావ మెరులకు వ్యక్తపఱుపఁ
డస్తమించెను రవి రాత్రి యయ్యెఁ దిండి
తినఁడు తోఁపదు గుట్టుగాఁ జనియెఁ బడుక
కును-దినంబైనఁ గాలేదు కూర్మినకయు
నెట్టు లేఁగెనొ యేగతి నెచట నుండు
నెట్టు గడపునొ దినముల నెన్నినాళ్లు
గడచునో యనుకొంచుండఁ గన్నుమూఁత
వడిన జయలక్ష్మి వచ్చి-నీపడినశ్రమకు
ఫలము లేదయ్యె నిఁక నన్నుఁ దలఁచుకొనకు
మలఘువిధిచెయ్యి నిక్లైతి వలదు చింత
యనుచుఁ జెప్పినయట్లయ్యె- నపుడ లేచి
జనకుతోఁ జెప్పెఁ-గల గాదు సత్య మగును
నిలువఁజాలదు నామేను-నేఁడొ రేపొ
తెలియవచ్చును నిజవార్త సెలవు నాకు
నాయనా! అమ్మ! యని మ్రొక్కి నడునడుగుచు
పోయె నా జయలక్ష్మి నేఁ బోదు ననుచు
మేను ద్రెళ్లంగ భూస్థలిమీఁదఁ బడియెఁ
గానరాదుగదా యెట్లుగా జరగునో
విధివిధానమ్ము-పని లేదు విస్తరింప
"విధికృతమ్మును దప్పింప విధివశంబె."

---

౧

పెయ్యను నాకి మూర్కొనే ఆలకు ప్రేమ తెలుసును. కంఠంలో మేత దాచి కందుకు మేపే కాకికి ప్రేమ తెలుసును. జంట బాయని గువ్వకు ప్రేమ తెలుసును. సంసారం చేస్తూన్న దంపతులకు ప్రేమ తెలుసును. జగత్తులో గల ప్రతిజీవికిని పరమాణువు మొదలనంతపరిణామమువరకునూ తారతమ్యములు సూచించు ప్రేమావేదన యనుభవసే. ఇట్టి ప్రేమను పూలు నిట్టూర్చినట్టు, పున్నమచంద్రుడు నవ్వినట్టు, చిగురాకు పులకించినట్టు, చిఱుగాలి కౌగిలించినట్టు లోకమంతట అనుక్షణమూ, ప్రకృతి ప్రదర్శిస్తూనే ఉంటుంది. ఈప్రేమప్రవాహమున వంతెనల కట్టి, ఆనకట్టుల నమరించి, పడవల నడిపి, చిన్నికాల్వల చీలికల పారించి, చెలమల చూరించి, చెరువుల నిలవరించి మానవుడు సరిచేయుచున్నా నను చున్నాడు; సంతరించుచున్నా ననుచున్నాడు. ప్రేమతత్వ మెఱుగనివారు వంతెన గలచోట లంఘింపబోయి, ఆనకట్టున పడవ నాడింపబోయి, చెరువులో విహరింపబోయి, చెలమల నీదబోయి, కాల్వల నిలుపబోయి కళవళపడుచున్నారు. ప్రేమ అనుభవనీయమయిన ఆపద! విడువదగిన విధి! ఏమి చేయవలయును.? అదియే జగన్నిర్మాణ సూత్రము.

మధుసూదనరావు ప్రేమసూత్రాలలో పెనుచుకుపోయాడు; గాలిపడగలాగు దాని కొన నెగిరేడు; ఆయంతరాళంలో నెన్నో మేడలు కట్టేడు; విహారవనాలు వేయించికొన్నాడు; పూవుటీరాలల్లుకొన్నాడు; చలువ పందిళ్లు కట్టుకున్నాడు; వసంతోదయ మని పలవరించేడు; అజరామరణ మని యానందించేడు; అనంత మని యూదమఱచేడు; నిదురించేడు; అసహాయుడయి విహరించేడు. ఏమయింది? ఒక్కటే గాలివాన పెట్టింది. మేడలు కూలినవి. లీలోద్యానాలు నేల గలసినవి. పూవుటీరాలు తుత్తునియలైనవి. చలువపందిళ్లు మాయమయినవి. మోహావతి పరలోకగతురాలయినది. ఈ ప్రళయంలో, ఈమెడాలిలో, ఈయొంటిదిబ్బమీద, ఈబీభత్సమునడుమ దిస్సమొగముతో, దీనములయిన చూపులతో నిరుపేదమై నిస్సహాయుడయి నిలబడిపోయినాడు మధుసూదనరావు. రెక్కలు తెగిన పక్కివలె గడగడలాడినాడు. గూడు కానని పిట్టవలె గోలపెట్టినాడు. నేల తడవులాడినాడు. నింగి వెదకులాడినాడు. పలవరించినాడు. ప్రాకులాడినాడు. ఈవేదనానలంలో వేగిపోతూన్నవానికి వరలక్ష్మి మూడునెలలబాలిక ఒకతృణం దొరకినది. ఇది పట్టుకొని యీదులాడుటకు ప్రయత్నించవలెను. ప్రయత్నించక తీరుతుందా?

మోహావతి కడసారి కనురెప్పలమూతలో మాటువడిన ప్రేమను పెకలించుకొనివచ్చేడు. ఆపెంతో నుసియై నేల గలసిన ప్రేమను కూడ

బెట్టుకొన్నాడు. అట్లు చిలికి చిందరవందరయిన ప్రేమనుండి అతిప్రయత్నమిూద నొకయణువు గ్రహించినాడు. వరలక్ష్మిలో దానిని నాటుకొన్నాడు. జీవనేచ్ఛ దోహదమిడి దానిని పెంచికొన్నాడు. వెన్న ఫారవైచి వ్రేలు నాకికొన్నాడు. ఆహా, యేమి ప్రేమ తత్త్వము! ఏమి సృష్టినిర్మాణవైచిత్ర్యము!

మధుసూదనరావు ధనము గలవాడు. వానియిల్లూ, దానిచుట్టు ప్రాకారమూ, అందలి చినితోట, నౌఖరులూ, దాదులూ, ఏలోపం లేకుండా ఉన్నాయి. వానినడుమ వరలక్ష్మి దినదినప్రవర్ధమానయగుచున్నదనుట వింతకాదు. ఆమెముద్దునకు హద్దు లేదు. మధుసూదనరావున కానందించుటకంటె వేరుపనియే లేదు. వరలక్ష్మి పదునొకండేండ్ల బాలిక యయినది. ఆమెతో నాడుకొన నిరుగు పొరుగుల నాడుపిల్లలు లేకుండుటచేత నామె చిన్నప్పటి నుండియు మగపిల్లలతో కోతికొమ్మచ్చి, గోడిబిళ్లా, గోలీకాయలూ మొదలయిన మగయాటలకే యలవాటుపడినది. దుస్తులు మగదుస్తులే. జుట్టు గిరజాకత్తిరింపు. ఎప్పుడు చూచినసూ చేతిలో చిన్నకఱ్ఱ; చిన్నయీలపాట—వీనితో తోటలో పచారుచేస్తూంది. తోడిబాలుర నాటలకు రండని పిలుస్తూంది. పరుగెత్తుతూంది. పందెములు వేస్తూంది. మధుసూదనరావుకండ్ల కామే కూతురూ, ఆమే కొడుకూ.

ఆయుదయమున నామె యట్లాడి యాడి ఇంటిచావిటిలో వాలుడుకుర్చీలో కూర్చొని చిఱునవ్వు నవ్వుతూ తనవైపే చూస్తూన్న తండ్రికడకు పరుగుపరుగున వచ్చినది. చేతిలోని కఱ్ఱ క్రింద పారవైచి ఆమట్టిచేతులతోనే తండ్రికంఠము కౌగలించుకొని వానియొడిలో నిమిడి తన చెమట చిందే బుగ్గలు వానిమొగముక కంటించి, ముంగురులు, ముడుతలుపడిన వానినొసలంట తల నటునిటు త్రిప్పుచు వానిని ముద్దుపెట్టుకొనుచు వానిచేయి తీసి తనమెడ చుట్టికొనినది. వానిమొగము తేరి చూచి పెట్టిపెట్టినవ్వు నవ్వినది. ఆమె నట్టె చూస్తూ ఆనందపరవశుడయి మధుసూదనరావలా కూర్చున్నాడు.

వరలక్ష్మి—నాన్నా! నాకు పెండ్లి చేస్తావా?

మధుసూదనరావు—ఔనమ్మా!

వరలక్ష్మి—వద్దు నాన్నా! పెండ్లయితే నేనత్తవారింటికి వెళ్లిపోవాలి కాబోలు!

మధుసూదనరావు— ఇప్పుడప్పుడే అక్కరలేదు. నీవింకా బాగా పెద్దదానవయిన వెనుక.

వర—అప్పుడయినా వెళ్లాలా?......... నీవుకూడా నాతో వస్తావా?

మధు—నే నెలా వస్తానమ్మా?

వర—అయితే నే నెలా వెళతాను నాన్నా? నాకు పెళ్లీ వద్దు, పేరంటం వద్దు. నేను నిన్ను విడిచి నిద్రయినా పోలేనే!

మధు—అలా అనకూడదమ్మా? ఆడుదానికి అత్తవారిల్లే శాశ్వతమయినది.

వరల—నీవు నన్ను వదిలేస్తేకదూ? పెద్దరికానికి నీవు నన్ను విడిచిపెట్టినా, నేను నిన్ను విడిచివెళ్ల లేనుసుమా. నేను నీసొమ్మును గదా నీదగ్గర ఉండడానికి నా కధికారం లేదూ? ఈయిల్లూ తోటా పాటియుగునా చేయనా? అవి నీజీవితకాలమంతా నిన్ను విడువకుండా ఉంటాయిగదా, నే నెందు కలా ఉండకూడదూ?...ఉండవచ్చును నాన్నా! ఊరికే అలా అంటావు—నే నేమంటానో వినాలని—కాదూ?

మధు—నిన్ను విడిచిపెట్టడమంటే నాకూ కష్టంగానే ఉంటుంది. కాని మనసంఘ సూత్రా లలా ఉన్నాయి. అవి అతిక్రమించ డానికి మనకు సాధ్యం కాదు. తాతలనాటి నుండీ వస్తూన్న ఆచారాలు ఒక్కనాటితో మనకొరకు మారుతాయా? ఆడుపిల్ల యెదు గగానే ఆమె నొకఅయ్యకు ధారపోసేయాలి. నాటినుండీ పిల్ల ఆతని సొత్తే. ఆత డాపిల్లను ప్రేమతో పరిగ్రహించాలి. ఆపిల్ల ప్రేమతో వాని ననుసరించాలి. ఆతడు చెప్పినట్లూ నడు చుకోవాలి. ఇందులో ఏది తప్పినా సంఘ సూత్రాలు తెగేయన్న మాటే.

వరల—ఆసూత్రా లేం చేస్తాయి. జారు ముడిపడి బలిమిని మన కంఠాలను బిగిసిపోతా యేమిటి? అలా బిగిసిపీక లుత్తరించేసూత్రాలు తెగితేనేమీ! గుడ్లగూబకోసం గువ్వ నిద్రపో వడంమానేస్తుందా? అది కాక, నాన్నా! బల వంతంగా నీ వీతనిని ప్రేమించాలని ఒకక్రొత్త వాణ్ణి తెచ్చి ఆడుపిల్లను వాని కొప్పకించేస్తే అంతేనా? ఆపిల్లఅంగీకారం అక్కరలేదూ? ఉన్నప్రేమను తుడిచీసుకొని లేనిప్రేమను నటించాలా? ఎందు కీదొంగపనీ, కపట నాటకం! సరే, ఇంతకుముందు ఎవళ్లెవళ్లో అలా చేసేరనుకో, మనమలా యెందుకు చెయ్యాలి? నీజీవితకాల మంతా నిన్ను నేను కనిపెట్టుకొని ఉంటే నీ కెంతసౌఖ్యం! నా కెంత ఆనందం!...ఏపెళ్లీ వద్దూ—ఇలా ఉండనీ నాన్నా!

మధుసూదనరా వామెను హృదయాన పొదివికొన్నాడు. ముందుకు వంగి తల ముద్దు వెట్టుకున్నాడు. వానికన్నులనుండి ఆనంద బాష్పాలు రాలేయి. వరలక్ష్మి కన్నులు గట్టిగా మూసికొని చిఱునవ్వు నవ్వుతూంది.

౨

"నాయనా సుబ్బారావూ, నీవు బుద్ధి మంతుడవు. నీకు విశేష మేమీ చెప్పనక్కర లేదు. తండ్రి నగుటచేత చెప్తాను. నాతల్లి వరలక్ష్మి వట్టిగోల. ఆమె కేమీ తెలియదు. ఆమె నెలా సంరక్షించుకుంటావో నీదే భారముసుమా!" అంటూ అల్లుని దగ్గరగ తీసికొని కౌగిలించుకొని "పోదునా?" యని వెనుకకు చూచినాడు. వరలక్ష్మి అత్తగారి కౌగిటిలో నిలిచి జాలిగ తండ్రివైపు చూస్తూ వలవలా కన్నీ రొలికించేస్తూంది. మధుసూదన రావు గిఱ్ఱున తల త్రిప్పికొని వెళ్లిపోవడానికి ప్రయత్నించేడు. అడుగులు నేలను తాపినట్లు

కదలేయి కావు; ముందుకు పడ్డాయి కావు. నాళము తెగిన ట్లొక్కమాటు వానిగుండె ఝల్లుమన్నది. అతడు గడగడ వడకినాడు. వాడి ముడుతలుపడిన వానికనురెప్పలు కెందామరరేకు లయినాయి. వానికి కుత్తుక బిగిసి పోతూన్న ట్లనిపించింది. కన్నీ రప్రయత్నంగా జారిపోతూంది. జాగు చేసిన కొలది వాని యాతన మితి మీరిపోతూంది. ముందడుగు పెట్టి విద్యాలవారిగుమ్మము దిగినాడు. వానికి పాతాళమున పడిన ట్లనిపించింది. చిమ్మచీకటి లోనికి దూకిన ట్లనిపించింది. శరీరమున గల ప్రతిరక్తనాలము నొక్కటొక్కటి తెగిపో తూన్న ట్లనిపించింది. ఎట్లో జేబురుమాలుతో కన్నీ రొత్తుకుంటూ స్వగృహోన్ముఖు డయి నాడు. ఏమియిల్లు! దిన్నవడి విన్నబోయి దిగులుకొలుపుతూంది. చెట్లకొమ్మ లాతనిని చూచి జాలిగ రహస్యాలు చెప్పుకుంటున్నా యి. తీగకొనలు వడకేయి. పూలు వసివాడి వేడినిట్టూర్పులు విడుస్తున్నాయి. ఆతడు నడు స్తూన్న త్రోవ వన్నెచెడ్డ పటంలాగు వెడ వెడపోయింది. ఇంటిలో ప్రవేశించినాడు. పం జరమున చిలుక "వరలక్ష్మేదీ?" అంది. కట్ట తెగిన ప్రవాహమై వానికి దుఃఖం పొంగిపొరలి వచ్చింది. వాలుడుకుర్చీలో కూలబడి జేబు రుమాలుతో మొగము రెండుచేతులా కప్పు కొని మధుసూదనరావు వెక్కివెక్కి యేడ్చి నాడు.

## 3

ఆగదిలో పూలపాన్పుమీద సుబ్బారావు క్రిందు చూస్తూ కూర్చున్నాడు. కొవ్వువత్తి దీపంకూడా కొంచెం వంగి క్రిందు చూస్తూంది. గోడలపటా లన్నీ క్రిందు చూస్తు న్నాయి. క్రిందను వరలక్ష్మి బోరగిల పడు కొని చేతుల మడతలో మొగం దాచికొంది. వడివడిగ వచ్చేయూర్పులతో నామె చెవు ప్రక్కలు చీనారేకులలాగు జిలజిలలాడుతు న్నాయి. సుబ్బారావు మంచమునుండి దిగ్గన దిగి, "ఏమి టిది? లే! బాగుంది!" అని చేయి పట్టుకొని లేవదీసినాడు. వరలక్ష్మి లేచి యెదు టిగోడవైపు చూచింది. సైరంధ్రిని పైటచెరగు పట్టి లాగుతూన్న కీచకునిపటం కనిపించింది. త్రుళ్లిపడి వరలక్ష్మి కంపించింది. బెదరున ఆమె కనురెప్ప లదరినాయి

సుబ్బారావు—ఎందు కలా భయపడ తావూ? నేను దుష్టుడనా? దుర్మార్గుడనా? నామీద నీ కెందుకు నమ్మకం లేదు? నాప్రవర్తనలో లోటు నీ కెక్కడయినా కను పించిందా? లేక నీ కెవరయిన ప్రేలెత్తి చూపించారా? నీతో సమానుడ నయి కాలం గడుపుటకు నాజీవితసర్వస్వమూ నీకు ధార పోసిన నన్నిలా యెడపెట్టడం నీకు ధర్మమేనా? ఎంతకాల మిలా నన్ను వేధిస్తావు?"

వరలక్ష్మి పెడమొగము త్రిప్పినది. ఆ గోడను తృణము చేత పట్టుకొని రావణుని నిరసిస్తూన్న సీతపటం కనబడినది. వరలక్ష్మికి

కనుబొమలు ముడిపడినవి. ఆమె ఒక్క నిట్టూర్పు పుచ్చి కన్నులు మూసికొన్నది.

సుబ్బారావు—నీ కెందు కింతయలసటా? నీ కెందు కీయాయాసము? నేను త్రికరణ ముగ చెప్పుతున్నాను—నిన్ను కనురెప్పలలో పెట్టుకొని కాపాడుకుంటాను.

వరలక్ష్మి కన్నులు విప్పినది. జారిన పైట సర్దుకోలేదు. అలవాటు తక్కువ. ఎఱ్ఱగ ముఖ చెదరిన ముంగురులు తలమొగుపున సవ రించుకొంది. గద్గదిక పోవునట్లు మెల్లగ వగ వానివలె సకిలించింది. సుబ్బారావువైపు చూడకుండగనే "నే నేం చేసే" నంది.

సుబ్బారావు—ఇంక నేమి చెయ్యాలి? ఇప్పుడు నీవు నాకు కల్పించే వేదన చాలదా? లోకంలో భార్య లందరూ ఇలాగే ప్రవర్తిస్తు న్నారా? ఎన్ని దినము లయినది నీవును నేనును తొలిసారి కలిసికొని? ఎన్ని దినములనుండి నిన్ను మునువ్రేళ్లనయిన నంటకుండ నీవే సమాధానపడుదువని యోర్చికొనియున్నాను. ఎన్ని రాత్రు లడవిమల్లెలలా గనుభవమున కందకుండ విరిసివాడి రాలిపోయినవి? ఎన్ని యుగాతీతములయిన విషపుఘడియల గడపి నాను? ఇదియేనా పత్నీధర్మము?

వరలక్ష్మి "నాదే అధర్మమా? ప్రేమ..."అనేసరికి ఆమెకు తండ్రి జ్ఞాపకము నకు వచ్చినాడు. డగ్గుత్తికపడి నోట మాట కదలినది కాదు.

సుబ్బారావు—ఎందు కీసంకోచం? నీయూహ ఏదో చెప్పు? దాని ననుసరించే పోతాను. నేను చెప్పినట్టు నీవో, నీవు చెప్పి నట్టు నేనో వింటేనే గాని మనజీవితా లెలా సాగుతాయి?

వరలక్ష్మి "అదేమో నాకు తెలి యదు"అని వెక్కి వెక్కి యేడ్చినది. మూసి కొన్న యామెకన్నులలో ఒంటరినైయున్నదని మున వాలుడుకుర్చీలో పడి విలపించే చంద్రలీల కనుపించినది. ఆమెకు వాని కన్నీ రొత్తా లనిపిం చింది. వడకే తన చిన్ని చేతులతో ముడుతలు పడినవాని చెక్కులు తట్టా లనిపించింది. వాని వేడివిచారపు నిట్టూర్పులలో తనసాయంగుస లెగిరించా లనుకొంది. మాటలాడి వానిచే దుఃఖమును మరపించా లనుకుంది. నే నిక్క డనే యున్నానని వానిని విషాదపు కలనుండి మేల్కొలపా లనుకొంది. వానిచేత చిఱునవ్వు నవ్వించా లనుకుంది...కన్నులు విప్పింది. భర్తవైపు చూడలేక తిరిగీ కన్నులు మూసి కొని నేల కొరిగి వెక్కి వెక్కి యేడువడం మొదలుపెట్టింది.

సుబ్బారావు తల యూచి పెదవులు బిగించి "నీకర్మం—నాతప్పు లేదు. లోకంలో నాకంటె మంచిమగ డుంటా డనుకోను. నాది అకల్మషప్రేమ. నిర్మలహృదయం. ఈ రెండును నీకు నచ్చకపోతే నేను దురదృష్టవంతుడ ననుకొంటాను. నీకు బుద్ధి మఱీ మరలదు? అంతేనా? లేచి నాకు జవాబు చెప్తావా? స న్నావలకు పొమ్మన్నావా? ఈవేదన నిక

# జైనదేవాలయములు - కలకత్తా



౧. పార్శ్వనాథ దేవాలయము



౨. పార్శ్వనాథ దేవాలయము మఱొకదృశ్యము







సిడ్నీ (ఆస్ట్రేలియా) యందు నవీన నౌకాశ్రయసేతువు
(ఆకాశయానమునుండి)

P. P. A.

నేను భరించలేనుసుమా ?...ఏమీ ?...సరే! అయితే అలాగు ఒక్కర్తెవూ నేలను పడుకొని నిద్రపోతూవుండు. నే నెక్కడికేనా పోతాను" అని గది విడచినాడు.

* * * *

వరలక్ష్మి లేచి కూర్చుంది. వత్తిసవరింపు లేక దీపం సన్నగిల్లింది. ఆసన్నని వెలుగులో గోడలపటాలన్నీ చిన్నబోయినాయి. పూలపాన్పు మొగం ముడుచుకొన్నట్లున్నది. వరలక్ష్మి కన్నులు విశాలంగా విప్పి నాలుగు దిక్కులూ చూచింది. మనుష్యసంచారమే లేని యేదో లోకంలో తా నొంటరిగా చిక్కుపడిన ట్లనిపించింది దానికి. ఆమె పుట్టినది మొదలు లోకజ్ఞానమైన వంటరిగా నుండి యెరుగదు. లేచింది. ఆమెగుండె ఝల్లుమన్నది. వెన్నెలమాయిలోనూ ఏదో భ్రాంతి ట్లనిపించింది. ఒంటరిగానుండ భరించలేక ఆమె మెల్లగ పూలపాన్పెక్కి అక్కడి కిటికీతలుపు తెరచింది. గాఢమాయిన ఆనిశాహృదయ మొంటరిగ సంచరిస్తూంది. ఆకులేలు చప్పుడయిన వినబడలేదు. చీకటి నిశ్శేమని దిగులు కొట్టుతూంది. దానిని చీల్చుకొని వచ్చి చిన్నగాలిరివ్వు కిటికీలోనుండి వరలక్ష్మిబుగ్గలు వొడిచేసి ట్లామెముఖముపై దూసికొనిపోయింది. ఆమె త్రుల్లిపడి పాన్పు దిగి గదినడుమ నిలిచి అంతటా కలయచూచింది. ఆగదిలో నొక మూల సామాన్యమనుష్యునంతటి యెత్తున నమర్చిన యొకపటమునకు తెర వేయబడి యున్నది. వరలక్ష్మి దానిని నిదానించి చూచినది. ఇట్లు తెరచాటున దాచుట కిందలి విశేష మేమో అని వడకుతూన్న చిన్నిచేతులతో మెల్లగ ఆ తెర తొలగించింది. త్రుల్లిపడి తెర వదలివేసింది. మరొక్కసారి చూడాలని తిరిగీ ఆ తెర తొలగించింది. అందలిపటాన్ని మొగాదిగా చూచింది. ముఖము నిదానించి చూచింది. ఆయొంటరితనంలో ఆపటము స్నేహితునివలె తోచింది. ఆవిశాలమయిన కన్నులలో, ఆచిఱునవ్వు పెదవులలో, ఆచెక్కులనునుపులో, ఆసోగ మెడలో, ఆముంగురులయుంగరాలలో. ఏదో లలితంగా కనబడింది. అలాచూచిందిఏదో అందం అందులో. చిందులాడింది. అలాచూచింది. ఏదో ప్రేమింపదగిన కళయొకటితలచూపింది. ఆమెనిలువలేక పోయింది. "ఏమీ! ఇంతలలితమయిన యీముఖాన్ని చూడడానికి నే నెందుకు వెరచేనూ? నానీడ చూచి నేనే జంకినాను కాబోలు! ఆహా, ఈముఖ మెంత సుకుమారంగా, ఎంత అందంగా, ఎంత లలితంగా, పువ్వులాగు ఎలా కలకలలాడుతూందో! దీని నేయూడువాళ్లు తలనిడికోరు? నే నెంతమూర్ఖురాలను! ఎంతకాల మీాముద్దుమోగా న్నెడపెట్టేను! ఒక్కమాటు దీనిని ముద్దుపెట్టుకుందునా?" అనుకొని వడకుతూన్న పెదవులతో ఆపటము చెక్కిలి వేడిగ ముద్దుపెట్టికొని మోమెడం చేసి కన్నులు మరింతవిశాలంగా విప్పి ఆపటము ముఖ మలా చూచింది. ఆచిఱునవ్వులో ప్రేమ

తరంగాలు దొరలుతున్నాయి. అలా చూచింది. ఆతరంగాలమీదినురుగులాగు జాలిరేకలుజాలు వారుతున్నాయి. అవిచూచి వరలక్ష్మిహృదయం కరగిపోయింది. తన్ను తాను నిందించికొన్నట్టు క్రిందిపెదవి ఇంచుక వంచి కన్నీ రొలికించేసింది. ఆకన్నీటి తెరలో ఆపటంముఖం మరింతజాలి కొల్పుతూన్న ట్టనిపించింది. వరలక్ష్మి ఆజాలి మరి భరించలేక నేలకు మెల్లగ ఒరగి చేతులు జోడించి నొసట కీలించి ఆపటముముంగల సాష్టాంగముగ మ్రొక్కినది. పశ్చాత్తాప సూచకముగ వలవలా యేడ్చింది.

ద్వారముపెలుపల చీకటిలో నిలిచి ఇది అంతయు చూస్తూన్న సుబ్బారావానందపరవశు డయిపోయాడు. నిలువలేకపోయాడు. చప్పుడు చేయకుండ మెల్లగ వెళ్లి తనపటమునంటి ఆచట్టములో నిమిడినట్లు నిలుచున్నాడు.

వరలక్ష్మి దిగ్గనలేచి ఆలస్య మయిపోవునేమోనని భయపడినట్టు కన్ను లొత్తుకోకుండా, మొగాన్న చెదరిపోయిన అలకలు సవరించుకోకుండా అలాగు ముందుకు వంగి ఆపటము చెక్కిలి మరియొకసారి ముద్దుపెట్టుకుంది. ఆమె వడకుతూన్న పెదవు లామెత్తని చెక్కు లంటి మ్రాన్పడ్డాయి. ఏదో ఆమె శరీర మంతటా జిల్లుమని చెలరేగింది. ఆమె పరవశన్యై గాలిలోని లతకూనకొనవలె గడగడలాడి కన్నులుమూసికొంది. సుబ్బారావామెను రెండుచేతుల చెరదీసికొని యామె ముఖము తనహృదయమున కద్దికొని తలవంచి వెచ్చని కమ్మని యామెయూర్పుం దూసికొని ఆమెనొసలు ముద్దు పెట్టుకొన్నాడు. వాని యానందబాష్పము లొకటిరెం డామె చెక్కుల జారినవి.

---

## వ స ం త ము

పెమ్మరాజు లక్ష్మీపతి గారు

నీ కృపావీక్షణంబుల నిఖిలజగతి-నవ్యచైతన్య లక్ష్మి తా నాట్యమాడె;
మానినీ! యేల భావసమాధిఁ బూడ్చి-నను గటాక్షింప వింతయన్యాయ మున్నె?

కష్టసుఖములు పడుగుపేకలుగ, జనన-మరణములె యంచులుగ నేయు, మర్త్యజీవి
తాంబరంబున నను సంవృతాత్ముఁ జేసి-నీ వమర్త్యత నిల్పుటేనియతి చెపుమ!

పూవుల్ పూయు వసంత మిట్లు వృథయై పోవన్ మనఃపాత్రికన్
భావోద్రేక మడంగి పేరుకొనఁగా, బాహ్యాంతరంబుల్ రసా
భావంబున్ భజియింప నిన్ననుసరింపం బోలునే? నీదు లీ
లా వైచిత్ర్యము లిన్ని చూపె దిఁక నేలా కాలహింసాక్రియల్?

క్రొంజిగి సోయగంబు తళుకొత్తఁ జిగిర్చిన గున్నమావిపైఁ
గెంజిగురాకు నోటఁ గొరికెక్, చిలికెక్ పిక మీాజగంబు లె
ల్లం జెఱవెట్టు గానకళలక్; సుముహూర్తము లెంచి చూచి, పు
ష్పాంజలి వట్టి నీకొఱకునై యిటు నిల్చితిఁ బేరుటామనిన్.

తీయని తేనె లూరెడు కృతిక్ ప్రకృతిక్ గృతి యిచ్చినావు; నా
కీ యలరుంబదంబుల లిఖించి, పికస్వనమార నీవు, దే
వీ, యిది నిన్ను నన్ను ముడివెట్టిన యట్టి ప్రబంధబంధనం;
బీ యెనలేని కల్పనల కేమని యర్థముఁ జెప్పుకొందునో!

జాలరు లల్లుచున్నవి పసందుగ పూవులఁ జిట్టి పొట్టి ము
త్యాలసరాలు నాఁ జిగురుటాకుల సందుల వేపచెట్టు; లీ
గాలుల కమ్మతావు లొలుకక్ విడిపోయిన పూలగుత్తులక్
వ్రాలుచుఁ దేనెలాను మధుపంబులు, పచ్చనిమాలతీలతన్.

పూచిన పూలలో పురుడు పోసిన పిందెలు పేలి, తేలి, పై
వీచెడు చల్లగాలి నునువెల్లువ నుయ్యెల లూఁగుచున్న; వ
య్యో! చనుచున్న వీదినము లూరక; నీకొఱ కెంతకాల మీా
వేచుట లీ రసాలతరుబృందముచాయల నేకవాంఛమై.

చక్కని నవ్యజీవన వసంతసుమాసవ మారఁద్రాగి, కై
పెక్కినచిత్తవృత్తి భువి నెవ్వరినిక్ గయికోక తందనాల్
ద్రొక్కుచు, నీవినోదములలో నిలువెల్లను మున్గిపోయి; యే
నొక్కపదంబునక్ భువి, మరొక్కట నాకముఁ ద్రొక్కియాడనే.

అద్దమువోలె నైన హృదయంబున నీరమణీయరూప మే
నద్దితి; నీకు నాకు సరిహద్దులు లే వితరప్రపంచపుక్
సుద్దులు మాని నీప్రణయసూత్రము లేను జపించుచుంటి; నో
ముద్దియ, నేను నీవ యయిపోవుట లేతటి సంభవించునో!

---




## ఉత్తరేణి మహాత్మ్యు

శర్మ

ఒకఊరు వుంది. ఆవూరుబయట ఉత్తరేణిపొదలు విస్తారంగా వ్యాపించి ఉన్నాయి. అక్కడే ఒకచెరువుకూడా ఉంది. చాకలివాడొకడు — చాలా బీదవాడు — అక్కడ బట్టలు వుతుక్కుంటూ ఉండేవాడు. బట్టలు వుతకెయ్యటానికి పుల్లలు దొరక్కపోతే ఉత్తరేణి కంప తీసికొవచ్చి పొయిలో పెట్టేవాడు. ఆబూడిదతోనే ప్రతిరోజూ పలుదోముకొనేవాడు. కూర దొరక్కపోతే ఉత్తరేణాకు తెచ్చుకొని కూరకింద వినియోగించుకుంటూ ఉండేవాడు. బట్టలుకూడా ఆవుత్తరేణి పొదలమీదనే ఆరేస్తూండేవాడు. ఇట్లా వాడిజీవితం వుత్తరేణిమయం అయిపోయింది.

ఒకరోజున వాడు బట్టలు వుతుక్కుంటున్నాడు. ఒకబ్రాహ్మడు శిష్యులకు వేదపనసలు చెప్పుకుంటూ ఆదార్నే పోతున్నాడు. స్వరం తప్పింది. చాకలాడు గ్రహించాడు. "ఏమండోయి! శాస్త్రులుగారూ! స్వరంతప్పింది" అన్నాడు. బ్రాహ్మడు వెనక్కి తిరిగి చూశాడు. చాకిలాడు కనపడ్డాడు. ఆశ్చర్యపడ్డాడు, "వీ డెల్లా గ్రహించాడా వేదం"అని. బ్రాహ్మడు అసాధ్యుడు. "నీజీవితం ఎల్లా గడుపుతున్నా" వని వాణ్ణి అడిగాడు. "ఏముంది బాబూ! పుల్లలు లేవు పొయిలోకి; బువ్వలోకి కూర లేదు. ఉత్తరేణికంపలు పొయిలో పెడుతున్నాను. ఆబూడిదతో పళ్లుతోముకుంటున్నా. ఆఆకే కూరగా వండి తింటున్నాను. వెనవ ముళ్లచెట్టు. బట్టలు ఎండేసి తీసేటప్పటికి చినుగుతున్నాయి" అని బదులుచెప్పాడు. బ్రాహ్మడు "నీపనికూడా అడ్డొస్తున్న ట్టుంది—వెధవకంప. తగలెట్టేసెయ్యి. ఇంకోచోట చూసుకో నీపని"అన్నాడు. "సరే బాబు" అన్నాడు చాకలి. "కాదు. ఇప్పుడే తగలెయ్యి" అన్నాడు బ్రాహ్మడు. చాకలి తగలపెట్టేసి ఆవ్రాల్లో, ఉన్న పెద్ద చెఱువుదగ్గరకు మార్చుకొన్నాడు తననివాసం. బ్రాహ్మడు సంతోషించాడు, ఉత్తరేణి పొదలు తగలడ్డాయని.

మళ్లా కొన్నిరోజులు గడిచాక ఆవూరు వచ్చాడు బ్రాహ్మడు. చాకలాడిదగ్గరకు వచ్చి వేదం, చదవాలని, తప్పుగా చదివాడు. చాకలాడు మాట్టాడలేదు. "నే చదివింది ఎట్లా వుందిరా?"అని అడిగాడు చాకలిని. "బాబూ, నా కేం తెల్చండీ?" అన్నాడు. బ్రాహ్మడు

వెనక్కి తిరిగాడు. "ఏమిటి సంగతి" అని అడిగారు శిష్యులు. "ఉత్తరేణిని వాట్టం మూలాన్ని వీడికి జ్ఞానం కలిగింది. అందుకనే వెనకాల తప్పు పట్టాడు. ఉత్తరేణిని తగలెట్టించా; వాడితెలివి నశించింది. నే తప్పు చదివి కూడా 'తప్పేరా' అని అడిగితే 'నా కేం తెల్చిండీ' అన్నాడు. వెనకాల నే గారే పోతూ చదివిన దాంట్లో ఉన్నతప్పు గ్రహించాడు. ఇది ఉత్తరేణిమహాత్తు" అని అన్నాడు బ్రాహ్మడు.

అందుకనే మనవాళ్లు ఆరునెలలు వుత్తరేణిపుల్లలతోను, ఆర్నెల్లు వుత్తరేణి కాల్చిన బూడిదతోను పళ్లు తోముకోమంటారు. అందువల్ల తెలివి కలుగుతుందని, చదువు వస్తుందని చెప్తారు.

---

## కైలాసానికి వచ్చేం, కళ్లు తెరవండోయి

చల్లా భాస్కరంగారు

అనగనగా ఒకరాజు. ఆతనియొద్ద ఒక కథలుచెప్పే బ్రాహ్మణుడు ఉండెను. ఆతనిని ఒకరోజున రాజుగారు, ఎక్కడా విననిది, ఎక్కడా జరగనిది, వింటే అసహ్యం వేసేది ఒకకథ చెప్పమనెను. అంతట ఆ బ్రాహ్మణుడు ఒకసంవత్సరము గడువు ఇమ్మని చెప్పి వెళ్లి, పెద్దఎద్దు నొకదానిని కొని, దానిమీద రాత్రులందు రోజూ ఎక్కుచూ అలవాటుచేసి, ఒక రోజున కొందరిమిత్రులకు వేషములు వేసి తాను సాంబమూర్తివేషం వేసికొని చేత నొకశూలం పట్టుకొని ఎద్దు నెక్కి శంఖము ఊదుకొనుచు ఆవూరిలో నున్న ఒకపూటకూళ్ల ఇంటికి వచ్చి శంఖం ఊదెను. పూటకూళ్ల పెద్దమ్మ బయటికి వచ్చెను. అంత వారు "నీవు ఇక్కడ నున్నా వేమిటి? నిన్ను తీసుకు రమ్మని పార్వతి రోజూ చంపేస్తోంది; రా, వెడదాము" అనిరి. "కొంచెం చక్కపెట్టుకోవాలి, మళ్లా వారం రాత్రికి తయారవుతాను" అనెను పెద్దమ్మ. అంత వారు "నీవు నీకున్న ఆస్తి అంతా ధర్మంచేసి ఆనాడు రాత్రికి సర్వాంగక్షవరం చేయించుకొని ఉండు వస్తాము" అని వెళ్లిరి. మలిరోజునుంచీ పెద్దమ్మ ఊరినిండా సంతర్పణములు పెట్టి బీదలకు ధనధాన్యము లిచ్చుచుండెను. అంత ఆవూరిరాజుగారు పెద్దమ్మను పిలిపించి, "ఏమిటి పెద్దమ్మా, నీవు ఈలాగున డబ్బు ఖర్చుపెడుతున్నావు" అని అడిగెను. "అయ్యా! నన్ను పార్వతి తీసుకు రమ్మందిట, సాంబమూర్తిగారు వచ్చేరు. ఇంకెందుకు బాబు, నాకు డబ్బు" అనెను పెద్దమ్మ. అంత రాజు "ఆరోజున రాత్రి నేనూ వస్తాను, చూపించుతావా" అనెను. "సరే" అని పెద్దమ్మ చెప్పెను. సోమవారంరాత్రి తిరిగీ సాంబమూర్తివేషం వగైరాలు బయలుదేరి వచ్చిరి. పెద్దమ్మను పిలిచిరి. పెద్దమ్మ వచ్చెను. అంత వారు "సిద్ధంగా ఉన్నావా" అనిరి. పెద్దమ్మ

వెళ్లి, "స్వామీ, రాజుగారుకూడా మీదర్శనానికి వస్తా నన్నారండీ" అనెను. అంత సాంబమూర్తి కోపంతో, "నేను వానికి లొంగు పడతానా" అని, కొంత సేపటికి, "సరే; ఆయనను కూడా ఇట్లే చేయమను, మళ్లావారం రాత్రి వస్తాను" అని చెప్పి వెళ్లెను. రాజుగారు కూడా అట్లే చేసి మళ్లావారంరాత్రికి సిద్ధంగా ఉండిరి. మరల సాంబమూర్తిగారు వేషంతో బయలుదేరి వచ్చారు. సాంబమూర్తిగారు పిలువగా వారిద్దరూ వచ్చిరి. అంతట రాజుతోనూ, పెద్దమ్మతోనూ ఇట్లు చెప్పెను సాంబమూర్తి: రాజు ఎద్దుతోక పట్టుకోవలెను; రాజుకాళ్లు పెద్దమ్మ పట్టుకోవలెను. కళ్లు మూసికొని రావలెను; దారిలో రాళ్లూ ముళ్లూ ఉంటవి. "మీయొక్క నిశ్చయం తెలుసుకోడానికి అనేకమంది వచ్చి వెక్కిరించుదురు, తిట్టెదరు. కానీ మీరు 'కైలాసానికి వచ్చాం, కళ్లు తెరవండోయి' అనేవరకూ కళ్లు తెరవకండి. ఎక్కడ కళ్లు తెరిస్తే అక్కడే అధోలోకంలో పడిపోతారు" అని. అందుకు వారు ఒప్పుకొని వెళ్లిరి. కొంతరాత్రి వారిని అడవులలో త్రిప్పి తుదకు రాజుగారి దేవిడీ వద్దకు వచ్చి దేవిడీయొక్క గుమ్మమునకు ఎద్దును కట్టివేసి కథల బ్రాహ్మణుడు తన యింటికి పారిపోయెను. రాజుగారికీ, పెద్దమ్మకూ బట్టలు చిరిగిపోయినవి. శరీరమంతా దెబ్బలు తగిలి రక్తములు కారుచున్నవి. వచ్చేవారూ పోయేవారూ ఈ చిత్రమును చూచి రాజుగారిని "మహాప్రభో, ఇదేమిటి? యివతలకు రండీ" అని పిలిచిరి. కానీ, ఆయన కదలలేదు. "పెద్దమ్మా, నీ కేమి పోయికాలమే? రాజుగారికాళ్లు వదలు" అనిరి. కాని అదీ వదలలేదు. ఇట్లుండగా, రాజుగారిమంత్రి వచ్చి ఇదంతా కథలుచెప్పే బ్రాహ్మణుడు చేసినాడని కనిపెట్టి అయనను తీసుకువచ్చి బ్రతిమాలగా, అంత ఆతడు "కైలాసానికి వచ్చేం, కళ్లు తెరవండోయి" అని పారిపోయెను. రాజుగారు తనయవస్థను చూచి సిగ్గుపడి ఇంటిలోనికి వెళ్లెను. కథ కంచి కెళ్లింది, మనం ఇంటి కొచ్చాము.

---

## గోపికావస్త్రాపహరణము

శ్రీపాద లక్ష్మీనారాయణమూర్తి గారు

తరళబుద్బుదయుతతరణిసుతాప్రవాహంబు సంసారమార్గంబు గాఁగ
జలకేళిమగ్న హృజ్జలజాతసంవీక్ష్త గోపికాతతి జీవకోటి గాఁగ
తీరస్థితాభీరనారీమణీదుకూలములె యైహికపదార్థములు గాఁగ
తటనికటావనీతలకదంబమహీరుహం బది పరమపదంబు గాఁగ
"వినతుల ననుగ్రహించుచో వేడ్కతోడ - వారిసర్వస్వము హరించువాఁడ" నంచుఁ
చెప్పుచందాన తరుణులచేలములను - దాచియుంటివి గద! సత్ప్రాణశీల!

---




# కమ్మిపని, పూలఉట్టి

కొ. నరసింహాచారిగారు

ఇందు వర్ణించబడియుండు ఉట్టికి మూడు విధములగు కమ్ములు కావలసియుండును. ఉట్టి యొక్క పైయంచునకును, అడుగుభాగమునకును, వాటిని చేర్చియుంచెడు నిలువుకమ్ములకు ను, (చిత్రము 1, 2, 3, 4, 5, 6, 7) లావైన కమ్ములును, తొట్టికి చుట్టుటకు (చిత్రము 9 c) కొంచెము సన్ననికమ్మియు, చుట్టుకమ్మిని నిలువుకమ్ములకు చేర్చి కట్టుటకు మిక్కిలి సన్నని తంతికమ్మియు కావలెను.

పైయంచునకు లావైనకమ్మిని సుమారు రెండడుగుల నిడివిగల తునుకను దీసికొని, దానికొనలను వంచి కమ్మిని వలయముగా చేసికొనవలెను. (చిత్రము 1) ఈవలయముయొక్క వ్యాసము సుమారు 8 అంగుళము లుండును. అటులనే అడుగునకుగాను లావగు కమ్మిని సుమారు అరఅడుగు నిడివికల దానిని దీసికొని, దానికొనలను చిత్రము 5 నందువలె వంచి కాని, చిత్రము 4 నందువలె వంచక కాని, చిన్నవలయముగా జేసికొనవలెను. పిమ్మట నదే లావుగల కమ్మినుండి సుమారు 10 అంగుళములు నిడివికల తునుకలను ఆరింటిని దీసికొని వాటికొనలను వంచుకొని, కమ్ముల నన్నిటిని, 2, 3, 6, 7, చిత్రములందు వలె ఏదైన నొకరూపముగా వంచుకొనవలెను. నిలువు కమ్ములను ఈనాలుగువిధములలో ఒక్కొక్కవిధముగా వంచినయెడల, ఉట్టి యొక్క రూపము ఒక్కొకవిధముగా నుండును (చిత్రము 12). ఇంకను ఇతరరూపములు వచ్చునట్లు మనఇష్టానుసారము నిలువుకమ్ములను వంచుకొనవచ్చును.

తర్వాత, వంచబడిన నిలువుకమ్ములను ఒక్కొక్కదానిని దీసికొని దాని పైకొనను (a) 1 వ చిత్రమునందలి పెద్దవలయమునకును, క్రిందికొనను, 4 వ, లేక 5 వ, చిత్రము నందలి చిన్నవలయమునకును, సమదూరమున బిగించవలెను (చిత్రము 8).

తర్వాత కొంచెము సన్ననికమ్మిని (చుట్టుకమ్మిని) చుట్టగా చుట్టుకొని దానియొక్క ఒకకొనను, కొక్కివలె వంచి, ఆకొనను ముందు సిద్ధపఱచుకొనిన ౮-వ చిత్రపు రూపమునందలి ఏదైన నొక నిలువుకమ్మికి, అడుగున చిన్నవలయమునకు సమీపమున బిగించవలెను. (చిత్రము. 9. c d) తర్వాత చుట్టలోని మిక్కినభాగమును కొంచెము

కొంచెముగా విప్పుచు దానిని ఒక్కొక్క నిలువుకమ్మికి మీదుగా నుంచుచు, అట్లుంచినభాగమును చుట్టు కమ్మిని, నిలువుకమ్మిని చేర్చి సన్నని తంతి కమ్మితో కుట్టుచు రావలెను. తంతికమ్మిని గూడ ఒకే చుట్టగా చుట్టుకొని ఉపయోగించవచ్చును నిలువు కమ్మిని చుట్టుకమ్మిని చేర్చి కట్టునటువంటి తంతికమ్మిని మాటి మాటికి త్రెంచక ఒక కట్టెడు ప్రదేశమునుండి వెంబడినుండు కట్టు ప్రదేశమునకు పోవుటలో చుట్టుకమ్మికి ఊరకే చుట్టుచు పోవలెను. అట్లు చేయుట వలన తంతికమ్మిని ఒకొక్కచోట త్రెంచవలసినయక్కర యుండదు.




ఈవిధమున నిలువుకమ్మిపై చుట్టుకమ్మితో చుట్టుచు, ఈ రెండుకమ్ములు చేరుచోట తంతికమ్మితో కట్టుచు, పైయంచున గల పెద్ద వలయమువరకును రావలెను. తర్వాత చుట్టు కమ్మికొనను కొక్కివలె వంచి దానినిలువు కమ్ములలో నొకదానికి బిగించవలెను.

పిమ్మట ఉట్టిని వ్రేలాడగట్టుటకు మూడు కమ్ములను (చిత్రము ౧౦. m, n, p.) నిలువు కమ్ములనొకటివిడిచియొకదానికి (alternately) పై వలయమునకుసమీపమున p, r, s లవద్ద చూపినవిధమున బిగించవలెను m, n, p అనుకమ్ముల పై కొనలను, చిత్రము ౧౧నం కి విధమగుకొక్కెకి (ముందటివ్యాసమునందు వర్ణించబడినది) బిగించవలెను. పూర్తియయిన ఉట్టిచిత్రము ౧౦యందలిరీతిగ నుండును. 



ఎఱ్ఱగుడిగుట్ట

చిత్రకారుడు: శ్రీ పి. విశ్వనాథనుగారు.

# ప్రణయసమాధి

'వనవాసి'

3

ఈ తొలిశుక్లపక్షనిశ లీఁదెడు నస్ఫుటచంద్రకాంతి, అ
జ్ఞాతప్రవాసజీవితవిషాదరహస్సుఖ మేమొ! పూర్వబా
ధాతమసంపునున్మసకఁ దారెడుకౌతుకరేఖ లారు నా
లేఁతతలంపులై కళవళించెడు నెల్లెడ సన్నవెన్నెలల్.

నాలుగుదిక్కులన్ వెలుఁగునారు పొలాలను నాటి, తళ్కుక్రొం
బూలపిసాళితావు లెగఁబోసెడు నీనెలబాల, ఏరుచి
శ్రీలలితమ్ములైన వనసీమల నేలునొ! తారకాలతాం
తాలయపాళి నేల దరహాససుధల్ తెలినీరుగట్టునో!
నీలవిశాలనందనవనిన్ నెలకొన్ననిశాప్రశాంతి నే
పూలతలంపు లచ్చరలముచ్చటలన్ అరవిచ్చుచున్నవో!
తేలునె తత్సరీమళము దివ్యనదీపులినాల? ఏరుకోఁ
జాలని పేదకోరికలు సాగును వెన్నెలదారులన్ శశీ!

*　　*　　*　　*　　*　　*

ఆ తెలిమబ్బుచాలు సడయాడెడు నేచలిగాలిమేడలో!
చాతిరు లప్సరోంగనలు రాగిలి స్వైరవిహారవాంఛ లు
ఉఱ్ఱూఁతల నూఁప, మందపవనోర్ములఁ దూఁగెద రేమొ! మోహదా
హాతురలై, సముజ్జ్వలసుధాలయవీధుల నందుఁ దేలుచున్.

కను లెలకావికో ప్రణయిగాయని, యేవనకన్య, కందరాం
గణసుమమందిరాంతమున, గాదిలిలేసెలపాట గాటుగా
విన చవి గాని, నీట ప్రతిబింబితుఁ డైనమృగాంకుఁ జూచి యే
చినకినుకన్ కటాక్షసితశీతలనారసముల్ నిగుడ్చునో!

ముసిముసినవ్వులన్ ప్రణయమోహినినై, సుమనోవికాసలా
లస, నవచైత్రయామవతి, లజ్జిలి, లేవలపుందుమారపున్
ముసుఁగుల నీఁగు నేప్రసవముగ్ధలు, హృన్మధుభారమార్దవా
లసలయి సోలిరో, గుసగుసల్ వలుకున్ బసపచ్చితోఁటలన్.

పూవులతావులే ప్రణయబోధలు, వెన్నెలకోవలైన యీ
త్రోవలు భావనాసురభితోరణవీధులు, తేనెక్రోవు లీ
క్రేవలు ప్రేమముల్ తొలకరించు గళద్రసఘట్టముల్, కళా
శ్రీవిశదమ్ము లామని రచించెడు రేలు, రుచిప్రబంధముల్.

పర్వతదుర్గహర్మ్యముల, భారతపౌరుషపాండితీయశో
గర్వకలాపముల్ చదువఁగా రసపుత్రిక, లస్వతంత్రతా
ఖర్వవిషాదమానరసగర్భముగా; నెలుఁగిచ్చు ప్రాంతవ
స్త్యోర్వి, వినూత్నజీవ మెగయున్ చకితేందుకళాపథాలలోన్.

ఉన్నతపర్వతాగ్రముల కూఁకొడుచున్ హృదయమ్ము పొంగ నె
న్నెన్నొవిధాల భారతహృదీప్సితసాధుచరిత్రముల్ సమా
సన్నసమీరబాలకుఁడు సానువులన్ బఠియింప, రాగసం
పన్నము లన్నగాంగములు పాడున వేవొ యవేద్యగీతికల్.

అచలాధీశుల హైందవాభ్యుదయగాధాగాధపాండిత్యముల్
రచియించున్ తెలిపూపవెన్నెలలు మర్త్యాంకాల, తద్వన్యవృ
క్షచయచ్ఛాయల, తద్దరీనిబిడనిశ్వాసమ్ములన్, తఝ్ఝరీ
విచలద్బాలతరంగహాసరుచులన్ విన్నాణముల్ పూయఁగన్.

అపుడపు డీమహీధరపదాంతికపావనభూమి మాదుమూఁ
గపరిచయమ్మునన్ జనవుగా పలవింతును నాసొదల్; నగా
ధిపులును సాదరోదయప్రతిధ్వనులన్ నను నూరడింత్రు; నె
య్యపురుచి నొండొరున్ గనుచు, నల్లలయింతుము పూనయామినుల్

ఈనగపంక్తులం దివతళించెడు బాలసుధాకరప్రభా
లీనవిచిత్రజీవకళ, లీల ఘటించెడు భావదృశ్యసం
ధానము లస్తమించు నతిదారుణనాటకవేదనాంకముల్,
మానవమానితాశయసమాధులఁ బోలెడు రాగవల్లరీ!

---

# గోవిందదీక్షితుడు—౨

కురుగంటి సీతారామయ్యగారు, యమ్. ఏ.

ఈయన కర్ణాటబ్రాహ్మణుడని వెనుక విన్నవించితిని. వారిలో హొశళ కర్ణాటవంశీయుడు.

"కృతవాసో విమలమతిర్హొశళకర్ణాటకస్సుధీః శ్రీమాన్."

"హొశల ఇతి పాఠాంతరం."[1]

మాధవ విద్యారణ్యుడు కూడా యీ హొశళ కర్ణాటవంశమునకు చెందినవాడే. గోవిందునిది వసిష్ఠ గోత్రము.[2] ఈయన దక్షిణదేశమునకువచ్చుటకు పూర్వము విజయనగర రాజ్యమునకూడ గొప్పపదవియం దుండెనోపు. కాని యీయన వచ్చునాటికి విజయనగర సామ్రాజ్య సూర్యు డంబరకోణమున దిగజారెను. తాలికోటయుద్ధానంతరము (క్రీ. శ. ౧౫౬౫) సామ్రాజ్యము భిన్నమై యెచ్చటివారచ్చట తలదాచుకొను నవసరము వాటిల్లెను. గోవిందదీక్షితు డట్లు వెడలినవారిలో నొకడు. ఈయనయొక్క వైదుష్యశేముషీ విశేషముల కనుగుణముగా నీయనకు తంజావూరున మంత్రిత్వము లభించెను. చెవ్వప్ప విజయనగరమునుండివచ్చినవాడగుటచేత నచ్చటి కుటుంబముల నెరిగియుండుటచే నీయన నాకర్షించెను. చెవ్వప్ప తాలికోటయుద్ధమునకు సామ్రాజ్యముపక్షమున వెడలినట్లు తెలియుచున్నది.[3] బహుశః ఆయన మరలి వచ్చునప్పుడు గోవిందుడు మనంబునకు వచ్చియుండవచ్చును. తరువాత కొన్ని వత్సరంబులకు మంత్రిత్వనియామకమై యుండవచ్చును.

ఈనియామ మెట్టిముహూర్తమున జరిగెనోగాని యీయన మంత్రిత్వకాలము తంజాపురాంధ్ర నాయకరాజ్యమున నభ్యుచ్చకాలము. వేదవేదాంగ పారంగతుడును, నధీత సకల శాస్త్రుడును, నిర్వర్తితాగ్నిష్టోముండును, రాజనీతి కోవిదుండును నగు నీయనను మంత్రిగా నియమించుకొనుటచే మాధవవిద్యారణ్యుని మంత్రిత్వముక్రింద విద్యానగరసామ్రాజ్యము శత్రువులకు గర్భనిర్భేదక మెట్లయ్యెనో యట్లె దక్షిణదేశమున తంజావూరురాజ్యము శత్రువులకు దుర్నిరీక్ష్యమయ్యెను. మధురజింజీలకును తంజావూరునకు యుద్ధము తటస్థించునెడ నెల్లపుడును తంజావూరునకే విజయము వాటిల్లుచుండెను.

ఈయన మంత్రిత్వ నియామకమునకు తరువాత చెవ్వప్ప యెక్కువకాలము జీవించియుండలేదు. తరువాతి యిద్దరురాజులును (అచ్యుతరఘునాథులు) నీయనను మంత్రిగాను, గురువుగాను, మార్గదర్శిగాను భావించి యీయనగీటు దాటియుండలేదు. ఎట్టిక్లిష్టసమయమునందును నాయనయొక్క సలహాప్రకారమే చేయుచుండిరి. పెనుగొండనుండి వెంకటపతిరాయలు మహమ్మదీయుల దాడికి భయపడి యచ్యుతుని సాయమడిగెను. అప్పుడు గోవిందుని సలహాపంపున నచ్యుతుడు యువకుడగు కుమారరఘునాథుని ససైన్యముగా సాయమంప నాయనయు మహమ్మదీయుల పారదోలి వెంకటపతిరాయలను సుప్రతిష్ఠితుని గావించి మరలివచ్చెను.

"గురోర్[4]న్ని దేశాద్గురు రాజ్యకార్య
నిర్వాహకో నీతిపరాఙ్వనీనః,
సామంత భూపాలశతానుయాతో
జయప్రయాణాయ సముద్యతోభూత్,
* * * * *
కర్ణాటసింహాసన కార్యభారం
నిర్వర్త్య సర్వం వినివర్తమానం, --

1. భాట్ట చింతామణి ఉపోద్ఘాతము.
2. సాహిత్యరత్నాకరము, ౧ సర్గ; గంగావతరణము, నీలకంఠదీక్షితకృతము. ౧ సర్గ,
3. Kincaid's History of India.
4. గోవిందదీక్షితుడు.

అథాచ్యుత క్ష్మాపతి రాత్మసూనుం
ప్రత్యుజ్జగామ ప్రమదాతిరేకాత్.[1]

అచ్యుతుని తుదిరాజ్యసంవత్సరములలో తంజావూరునకు గొప్ప విపత్తు వాటిల్లుసూచనలు కన్పట్టెను. శత్రుమేఘములు చుట్టు నావరించియుండెను. పోర్చుగీసువారికి రాజ్యసంపాదనకాంక్ష వొడమెను. అందుచే వారు తంజావూరువారికి స్నేహితుడగు జాఫ్నా[2]రాజును పదభ్రష్టునిగావించి తద్రాజ్య మాక్రమించుకొనుటయె గాక చోళసుడను నొక దుండగీని ప్రేరించి వానిచేత చోళదేశప్రజలను పీడింపజేయుచు తాము వానికి సాయము చేయసాగిరి. ఇదిగాక తల్లిరాజ్యము విజయనగర సామ్రాజ్యమున గొబ్బూరి జగ్గరాజను నొక దుండగీని ప్రేరణమున ఖూనీలు గావింపబడెను. ఆజగ్గరాయలు మధురజింజీలను సాయముకోరి, వారందరునుచేరి తంజావూరును ముట్టడివేయుటకు పయనమైరి. తదవసరమున తంజావూరు నామమాత్రావశిష్ట మగునట్లు కన్పట్టెను. అప్పు డచ్యుతరఘునాథులు గోవిందమంత్రిని రావించి కార్యాలోచనసభ యొకటి గావించిరి. అప్పుడు జరిగిన మంత్రాలోచనములు మొదలగు వానినిగూర్చి యజ్ఞనారాయణదీక్షితుడు తన సాహిత్యరత్నాకర కావ్యమున ౧౦-వ సర్గయందు మిక్కిలి రసవంతముగా వర్ణించి యున్నాడు. రెండు శ్లోకములనుమాత్ర మనువదింతును.-

"స సుతో వసుధాసుధాకరోఽ సౌ
సహగోవిందమఖీందునా సభాయాం,
సమగా దథ తత్ర గోత్రభేదీ
స జయంతో గురుణా యథామరాణాం.

ప్రభు రేవ తదాను భద్రపీఠే
సచివే నాత్మభువం సమం నివేశ్య,
అపరాంగ ముపాశ్రితోపబర్హాం
విమతాజ్ఞాత ముపావిశ ద్వితన్వన్.[3]

కుమారునికి మంత్రికిని సమానగౌరవ మిచ్చినట్లు కన్పట్టుచున్నది. తరువాత రఘునాథుడు గోవిందమంత్రికి తనతోపాటు సింహాసనము మీదనే స్థాన మిచ్చినట్లు తెలియును.

"అస్య శ్రీరఘునాథభూబలరిపో
రధ్యాసితార్ధాసనః."[4]

ఈజరిగిన మంత్రాంగమున గోవిందుడు శత్రువులను ప్రత్యేకముగ నొక్కొక్కరిచొప్పున దునుమాడుమనియు, కలసి యుద్ధముచేయవలసినియు సలహో నిచ్చెను. దానికి తండ్రికుమాళ్లు సంతసించి యట్లె కావించిరి.

"నిహతే యుధి చోళగే నృశంసే
నిహతా ఏవ భవంతి పారసీకాః[5]
నరనాథ నిజాశ్రయస్య బాధే
నయసిద్ధో నకి మాశ్రితస్య బాధః."[6]

గోవిందుని రాజనీతి యప్రతిమానము. తుద కచ్యుతుని రాజ్యము వదలి కుమారుని కియ్యమని గోవిందమంత్రి చెప్పినపుడుకూడ ఎట్టి యభ్యంతరము చెప్పకుండ నచ్యుతుడట్లె యొనర్చెను. ఆయన యెట్టి సంతుష్టితో నట్టిపని నొనర్చెనో యీక్రింది శ్లోకములవలన తెలియనగును: —

"నృపధూర్వహతాం నిజే తనూజే
వసుధావాస్తటినీవరావృతాయాః,
వితనుష్వ రణే వ్యసౌ విశంకో
విమతా నాశు వినాశయ త్యజస్రం."

అని గోవిందుడు చెప్పగా నచ్యుతుడు:—

"విజితా బహవో విశా మధీశాః
బహుధాభోజి వసుంధరా ప్యశేషా,

1. రఘునాథాభ్యుదయకావ్యము, స.7.
2. గ్రంథములలో నీపట్టణము 'నేపాళ'మని వాడబడినది.
3. సాహిత్యరత్నాకరము, సర్గ. 10.
4. రఘునాథవిలాసము, అం. 1.
5. పోర్చుగీసువారి కుపయుక్తము.
6. సాహిత్యరత్నాకరము, 10.

విదుషామపిసంభృతం వ్యతారి
ప్రవిణం కిం పర మస్తి మద్విగేయం.
పరమేత దిహావశిష్యతే
పరమేఽస్మిన్ రఘునాథనామ్ని పుత్రే,
అవనీభర మాకలయ్య శత్రూన్
అవినీతా నమునా విజాపయిష్యే."1

రఘునాథుని పట్టాభిషేకమును గోవిందుడే కావించినట్లును, రఘునాథుడు యుద్ధమునకు వెడలు నపుడు యావద్రాజ్య భారమును గోవిందునిపై నుంచు టయు మనమిదివరకే తెలిసికొనియున్నాము. రాజు నకును ప్రజలకును నెంతో రంజకుడు గాకపోయిన నట్లుంచుట తటస్థించునా? మరలివచ్చినవెనుక వారి రాజ్యము వారికిచ్చి తాను తరువాత వృద్ధుడై పోవుటచే విశ్రాంతిగొనెను. మంత్రిత్వమన్న నిట్లుండ వలదా? ఈయాంధ్రనాయకరాజులు విజయనగరరాజ కుటుం బమువారివలెనే స్వయముగా నభినివేశమున వైష్ణవులు. విజయనగరరాజ గురువులగు తాతాచార్యకుటుంబము వారే వీరికిని గురువులుగా నుండిరి.—

"ఆస్థానే రఘునాథ భూబలరిపో
రాచార్య చూడామణిః
శ్రీమత్తాతయదేశికస్య ఫణితి
శ్శృంగార వీరోజ్జ్వలా." 2

అయినను విజయనగర చక్రవర్తులవలెనే గోవిం దుని సలహావలన నీతంజావూరునాయకరాజులును తమ యాస్థానమున నన్నిమతములకును గౌరవ మొసంగిరి. చెవ్వప్పనాయకుని తుది వత్సరములలో విజయీంద్రు డను నొక మధ్వాచార్యుల కాయన యరివిలిమంగలమను నొకగ్రామమును దానముగా నిచ్చెను.3 తరువాత రఘు నాథునికాలమున సుధీంద్రుడను మరియొక మాధ్వాచార్యు నకు కనకాభిషేకము జరిగెను.

"అతుల వివిధవిద్వన్మండలీలాస్యమానః
ప్రభుమణి రఘునాథప్రౌఢభూపాలకేన,
నిహితనిఖిలవిద్వ న్మౌళిపాదస్సుధీంద్రః
పరజనదురవాపం ప్రాప హేమాభిషేకం." 4

తుదకు క్రైస్తవులకుకూడా మతవ్యాపనమున కాటంకములులేక గుళ్లుకట్టుకొనుటకు స్థలాదులుకూడా యొసంగబడెను.5 మత సహిష్ణుత్వము రాజ్యమునకు పునాది. ఇట్టి విషయమున గోవిందదీక్షితుడు రాజులకు మార్గదర్శి. గోవిందునిసలహాపైన శివవిష్ణుభేదము లేకుండ నీరాజులు దేవాలయములకు కైంకర్యములను సల్పినట్లు కన్పట్టును. శ్రీరంగమునందలి రంగనాయకులను, రామే శ్వరమునందలి రామలింగస్వామిని నొకేదృష్టితో చూచి నట్లు తెలియుచున్నది. అచ్యుతనాయకుడు ప్రతిసంవత్స రమును రామేశ్వరము వెళ్లి వచ్చుచుండెడివాడట!

"సందర్శనం కించ స రామసేతోః
అసౌ వకార్షీ దనువర్ష మేవ." 6

గోసాయీ లెందరు వచ్చినను వారికి సదావర్తుల నిచ్చుచుండెడివాడట!

"దినేదినే ఽభోజయ దేవ లక్షాన్
గోసాయికా నచ్యుతభూమిపాలః." 7

"చొక్కే వ్యయం కిం బహునా నరేంద్రః (చెవ్వప్ప)
స్థానేషు సర్వేషు హరే ర్హరస్య,

1. సాహిత్యరత్నాకరము, 10.
2. పారిజాతాపహరణ నాటకము. ఈ కుటుంబమువా రిప్పటికిని కుంభకోణమున పట్టరాచారి వీథిలో కాపురము చేయుచున్నారు.
3. Epig. Indica, Vol. XII. 357; Journal of Oriental Research, Vol. III. 154.
4. రాఘవేంద్ర విజయము, నారాయణ కవికృతము, సర్గ 2.
5. Tanjore Dt. Gazetteer-333.
6. సంగీతసుధ.
7. Ibid.

ప్రాకారసౌధప్రముఖానసేకాన్
నిర్మాయ నగరా న్నముదే నరేంద్రః."1

అప్పటి నాయకరాజోన్నతి కీమతసమత్వమే ము లాధారము. రఘునాథుని యాస్థానము దేవేంద్రసభ ననుకరించుచుండెను.

"చిరంతనై ర్నైగమవృద్ధవర్గైః
అస్త్యైశ్చ ధన్యై ర్నవయౌవనస్థైః,
షడ్దర్శనీసాగరపారగైశ్చ
మహీసురై ర్వ్యాపితపార్శ్వభాగః.

కవిప్రవేకై రపి కాళిదాస
మయూరసౌమిల్లిమురారిదేశ్యైః,
కర్ణాటకాంధ్రద్రమిడ ప్రబంధ
నిర్మాణవిద్యానిపుణైశ్చ కైశ్చిత్.

వాగ్గేయకారప్రముఖై రనేకైః
విచిత్రగీతాదికళాప్రవీణైః,
తథైవ వీణాదిమవాద్యవిద్యా
విచక్షణైః క్వాపి నిషేవ్యమాణః.

నానావిధాశానరపాలవర్గ
సందేశకృద్భి స్సముపాస్యమానః,
ఆస్తే పిభద్రాసన మచ్యుతేంద్ర
తనూభవః శ్రీరఘునాథభూపః."2

గోవిందునికాలముననే తంజాపూరునందలి పెద్ద కోట కట్టబడెను. పుస్తక భాండాగారమునకు పునాది గోవిందునికాలముననే వేయబడినదని నాయాశయము.

"The manuscripts described here are the results perhaps of 300 years collections, firstly by the Nayaks of Tanjore, secondly after about A D. 1675 by the Maharatta Princes". 3

"The earliest beginnings of the library must have been about the end of the 16th century when Tanjore was under the rule of Telugu Nayaks who collected Skt. Mss. written in Telugu character". 4

ఈయన మంత్రిగానున్న కాలమున చోళదేశమందలి ప్రజలు కడుపులోనిచల్ల కదలకుండ సుఖజీవనులై యే యీతిబాధలును లేకుండ యెవ్వరివృత్తులయందు వారుండిరి. ఒకవేళ యెప్పుడైన చోళకాదులను దుండగీండ్రు పెచ్చుపెరిగిన చండశాసనులగు రాజులు వారిని వెంటనే శిక్షించుట తటస్థించెను. పదునాల్గవ శతాబ్దమధ్యమున బుక్కరాయల కుమారుడగు కంపరాయలు మహమ్మదీయులను దక్షిణమునుండి తరిమివేసినదాదిగా మసూరు మరల పదునేడవ శతాబ్దమధ్యమున మహమ్మదీయులకు దారివదలినంతవరకు దాదాపు మూడుశతాబ్దములు దక్షిణదేశ మెట్టికాటకములు మొదలగునవి లేకుండ ప్రజలు సుఖముగా నుండిరి. విజయనగరసామ్రాజ్యము దక్షిణదేశమున కిచ్చిన వర మియ్యదే. అందు చోళదేశము సుభిక్షమై వరలెను. ఏనాడు రాజరాజచోళుడు (క్రీ. శ. ౧౧-వ శతాబ్దము) కావేరీనదికి యానకట్టకట్టి (Grand Anicut) యుండెనో యప్పటినుండి చోళదేశము శాలి పంట కాలవాలమైయుండెను. కావేరీనీరము కుల్యోప కుల్యలద్వారా దేశమంతయు వ్యాపించి చోళమండలమును 'శాలివనీనిచోళము' గావించెను.5 గోవిందుడును వీనిని అప్పుడప్పుడు బాగుచేయించుచుండుటయే గాక కొన్ని క్రొత్తవానిని త్రవ్వించినట్లు కన్పట్టును. వీనిలో నొకకాల్వకు ఆయనపేరుతో సంబంధము కల దని చెప్పుదురు.6 ఈయనకాలమున ననేకనదులకు మెట్లు

1. సంగీతసుధా.
2. Ibid.
3. Dr Burnell's introduction to the Classified Index of Skt. Mss in the Tanjore Library.
4. Prof. P. P. S. Sastri's essay before the III Oriental Conference, Madras.
5. "అస్తి ప్రభావై రతిమాననీయా చోళావనీ శాలివనీనిచోళా,
సహ్యాత్మజా పూర సరస్సమీర సంపర్క-పుణ్యా జనతాశరణ్యా." (రఘునాథాభ్యుదయకావ్యము. ౧.)
6. "అయ్యన్ వైకల్" (కాల్వ)
Annual report of the Madras Archœlogical Survey, 1903-4 .p. 84-85.

కట్టించుటయు, తటాకములు లేనిస్థలముల తటాకములు త్రవ్వించుటయు[1] నదీప్రాంతముల పుణ్యమంటపములు నిర్మించుటయు, దేవపూజకొరకు నందనవనముల నాటుటయు, శిథిలములైన దేవాలయములను జీర్ణోద్ధరణము గావించుటయు మొదలగు ననేకకార్యములు జరిగెను. విద్యావ్యాపనమునకై దేవాలయముల ననుసరింపజేసి వేదశాస్త్రపాఠశాలల నెలకొల్పెను. జాగ్రత్తగా చూచి పన్నుల నివ్వలేనిస్థితి తటస్థించినప్పుడు సమయోచితముగా వానిని రాహితిచేయుట తటస్థించెను. పన్నులను వసూలుచేయుటకు ప్రత్యేకముగా నుద్యోగముల కల్పించక గ్రామసముదాయముపై పెద్దలనునియమించి తత్ప్రాంతపు పన్నులు వారు వసూలుపరచున ట్లేర్పాటుచేసెను. పన్నులు ద్రవ్యరూపమునను ధాన్యరూపమునను కూడ చెల్లింపబడుచున్నట్లు కన్పట్టును.

గోవిందుని కాలమున నిప్పటివలె ప్రభుత్వము శాఖోపశాఖలై ప్రజలను పన్నులకొరకెంత పీడింపవలయునో యన్నివిధముల పీడించుట యాచారముకాలేదు. మరియు ప్రజలవద్ద గొన్నకప్పము తిరిగి రాజుద్వారా ప్రజలకే ప్రవహించుచుండెనేగాని పరదేశములకు గొంపోబడుటలేదు. ముఖ్యప్రభుత్వోద్యోగులునల్గురు.—

1. మంత్రి.
2. దళవాయి (సేనాని).
3. రాయసము (కార్యదర్శి).
4. తోశేఖానా అధికారి (కోశాధ్యక్షుడు).

ఒకప్పుడు మంత్రియు, దళవాయియు నొక్కవ్యక్తిగా నుండెను. గోవిందదీక్షితుడెన్నడును సేనలను నడిపినట్లు తెలియదు. కాని యుద్ధకార్యాలోచనలందును, వ్యూహములు పన్నుటయందును సమర్థుడు. రాజ్యముయొక్క మంచిచెడ్డలు రాజుపైనను, సలహా నిచ్చు మంత్రిపైనను ఆధారపడియుండెను. వారిద్దరును పరాక్రమవంతులై మంచివారైన ప్రజలు సుఖించుచుండిరి; చెడ్డవారైన పీడింపబడుచుండిరి.

విద్యలన్నిజాతులందును నుండెనని చెప్పుటకు శూద్రుడైనను పండితకవియగు రఘునాథుడే సాక్ష్యము. 16, 17-వ శతాబ్దములందు వేదశాస్త్రము లింకను నమ్మబడుచు వర్ణాశ్రమధర్మములు సడలలేదు. అందుచే విద్యలన్నియు పఠింపబడుచుండెను. వానికి రాజాదరణము పట్టుగొమ్మ. విజయనగర సామ్రాజ్యము కవులకును, పండితులకును ఎట్లాకరమయ్యెనో యట్లె దక్షిణమునమండు మధుర తంజావూరు జింజీలు మొదలగు స్థానములు పండితులకును, కవులకును నవలంబనము లయ్యెను. వేలూరున నప్పయ్యదీక్షితులు సభనలంకరించుచుండెను. మధురయందు నీలకంఠాదు లలంకరించిరి. జింజియందు రత్నఖేట శ్రీనివాసదీక్షితు డాస్థానవిద్వాంసుడుగా నుండెను. తంజావూరున కవిపండితశిఖామణియగు గోవిందయజ్వ మంత్రిగానే యుండెను. ఇంక విద్యలకేమికొదువ? ఈ శతాబ్దములకాలము సంస్కృతాంధ్రద్రవిడకర్ణాట విద్యావ్యాపనమున కత్యుచ్చకాలము.[2] వెనుక ననువదించిన రఘునాథసభనుగూర్చిన వచనమువలన తత్కాలమున తంజావూరాస్థానమున "కర్ణాటకాంధ్రద్రమిడప్రబంధనిర్మాణకర్తలు"ను, "కాళిదాససౌమిల్లి మురారిదేశ్యులగు సంస్కృతకవులు"ను కలరని తెల్లమగుచున్నది. అప్పుడీ దక్షిణదేశమున విద్య లెట్లు వ్యాప్తములై యుండెనో తెలియచేయు నీక్రింది శ్లోకము ననువదించుచున్నాను:—

"త్రేతాగ్నిధూమాకులవీథికాంగణే
గృహే గృహే యత్ర వసంతి సూరయః,
అధీతసర్వశ్రుతయః కథాంతరే
వినిర్జితప్రత్యనుమానవేదినః."[3]

1. కుంభకోణమునందలి మహామఖ సరస్సీయన నిర్మించినదే యందురు.

2 "The 16th and 17th centuries in the history of South India witnessed a large number of Sanskrit poets and philosophers. That period to say the least, was the golden age of Sanskrit revival in recent times. Most of the important writers of South India flourished during this period. The names of Appayya Diksita, Nilakantha Diksita, Govindadiksita, Yegnanarayana Diksita, Venkatesvara Diksita, Srinivasa Diksita, and Rajachudamani Diksita, are a few among the most famous." (Introduction to Rukminiparinaya)

3. తత్త్వచూడామణిప్రకాశవివృతి, ధర్మరాజాధ్వరికృతము.

# అభినవాంధ్ర కవితాపితామహుని కవితావినోదములు

మండపాక పార్వతీశ్వర శాస్త్రిగారు

౧

మహారాజుల యాస్థానములలో నున్న మహాకవులు తమ కవితాప్రవాహములను ప్రబంధనిర్మాణములకు మాత్రమే కాక, చిత్రవిచిత్రచతుర్విధకవితానిర్మాణములందును వినియోగించియున్నారు. "శఠకోపతాపసప్రసాదాసాదితచతుర్విధకవితామతల్లికాల్లసానిపెద్దనార్య" యని వ్రాసికొన్న పెద్దనార్యుని కవితా వినోదములు నేడు లభ్యములు కాకుండుట విచారాస్పదమై యున్నది.

అభినవాంధ్రకవితాపితామహులని ప్రఖ్యాతి గాంచి, కీర్తిశేషులైన బ్రహ్మశ్రీ మండపాక పార్వతీశ్వరకవీశ్వరులు శ్రీబొబ్బిలి, వేంకటగిరి ప్రముఖ రాజాస్థానములలోఁ జూపెన కవితావినోదములలోఁ గొన్నికొన్ని మనకు లభ్యములై యున్నవి. వానిని బత్రికాముఖమునఁ బ్రకటించినచోఁ గవిలోకము సంతసించునని క్రమక్రమముగా నొక్కొక్కటియును ప్రకటించుచున్నాను.

అముద్రితగ్రంథచింతామణ్యధిపతులు ప్రకటించిన శ్రీపార్వతీశ్వరుల స్వీయచరిత్రలో నిట్లున్నది :—

'మఱియు నద్ధాతలో వఱపు పెట్టఁగఁ జూచి,
గుఱుతుఁ దప్పక వాన కురియునట్లు,
మంచిపద్యములు గావించి తెండని రంగ
రాయవిభుం డాదరమునఁ బల్క.
నీమీఁద భారంబు నే నుంచి, యమృతగీ
జాక్షరఘటితపద్యంబు లైదు
పంచరత్నము లనఁ బచరించి, నవరత్న
పద్యయుక్తముగఁ దత్ప్రభున కొసఁగఁ
గాక తాళీయనయమున గాలివాన
కురియఁజేసితి వది మాన్పఁ గోర మాన్పి
తౌర, యతివృష్టికష్టహరాష్టకమున
హరిహరేశ్వర దేవ, మహానుభావ!'

దీనినిబట్టి, ధాతృసంవత్సరమున వానలేమిచే లోకము బాధపడుచుండఁగా, బొబ్బిలి పురాధీశ్వరులైన శ్రీ వేంకటశ్వేతాచలపతి రంగారావుబహద్దరువారి యాజ్ఞపై శ్రీపార్వతీశ్వరకవులు పంచరత్నములును, నవరత్నములును రచింపఁగా వెంటనే గాలివాన యారంభించినట్లును, ఆసమయమున నతివృష్టికష్టహరణాష్టకమును శ్రీ శాస్త్రిలవారు రచింపఁగా నాగాలివాన వెంటనే యాఁగిపోయినట్లును గనుపట్టుచున్నది. తమ యాత్మచర్యలో శ్రీశాస్త్రిలవా రసత్యము చెప్పుకొనవలసిన యావశ్యకత లేదు. అంతే కాక, శ్రీశాస్త్రిలవారితో సమకాలికులై, వారి యనంతరము చాలకాలము సజీవులై యుండిన కొందఱితో,

ప్రసంగము చేయఁగా, నది యథార్థమనియే వారును సెలవిచ్చిరి.

మహాకవులనుగూర్చిన యిట్టి వింతలు పెక్కులు వినియేయున్నాము. కావున శ్రీ శాస్త్రులవారి వాక్యములు సత్యములనియే మేమును నమ్ముచున్నాము. ఆపద్యము లీక్రింద వ్రాసియున్నాము.—

## పంచరత్నములు

మందారార్ద్రగుణంబు నీకు సహజ
వ్యాపార మంచుం గదా
మందప్రక్రియ వేదశాస్త్రములు నై
వారింపఁ గావించు మే
ము నిత్యోపార్థులమౌచు వందనశతం
బుల్ చేసి, ప్రార్థించుచు
న్నం బాధ్యుర్యముఁ నిట్ల నేల చెపుమా
సమ్మింపఁ సర్వేశ్వరా!

హిమాంశు శోభమున భవచ్చరిత్ర మయయో
విశ్వంభరాతాప మీ
సింహాసనం దూకింపవైతివి; తులా
వృష్టిం బ్రసంగింతు వా
వగ్నైనన్ మఱి కన్యలోఁ జినుకు లే
దాలస్య మిం కేల, యీ
వంతల్ దీరఁగఁ బండునట్లు ధరలో
వర్షింపు సర్వేశ్వరా!

వంచింపం దొరకొంటి వేల చెపుమా
వర్షంబు హర్షంబునం
గొంచెంబైన ఫలానుకూలముగ మా
కుం దొల్తఁ గల్గించి, యీ
కించిన్మాత్రజలావసేకమునకే
కేల్సాఁచి, యాచించినం
గంచుంగంచు నుపేక్షచేసితివి, యు
క్తం బౌనె, సర్వేశ్వరా!

శ్రీదేవిం గని, దానితండ్రి వసువుల్
చేనంటలే కయ్యయో
భూదేవిం గని, తత్ప్రజల్ తనియఁగా
భూయఃపయోదాన ర
క్షాదక్షత్వముఁ జూపవైతి విది లో
కశ్లాఘ్యధర్మంబె, లే
దే దాక్షిణ్యము పక్షపాత మిది గా
దే నీకు సర్వేశ్వరా!

శ్రీసద్మంబగు పద్మ మంబువులలోఁ
జెన్నొందు, నయ్యంబువుల్
నీసంకల్పమునం జనించు, గృహిణీ
సంతుష్టికైనన్ జగత్
కాసారాదులు నిండుచందమున సద్
వర్షంబు గల్గింప రా
దా, సస్యంబులు పండి భూజనులు మో
దం బంద సర్వేశ్వరా!

## నవరత్నములు

వినయపూర్వకముగా వృష్టిఁ గోరెడువాఁడు
వాన లేదని మది వగచువారు
వర్షంబు రాదని హర్ష మూననివారు
జడి లేమి నలజడిఁ బడెడువారు

సస్యంబు లెసిసి, నష్టము వచ్చె ననువారు
        మనెడు మార్గ మెఱుంగ మనెడువారు
జీవనలోపంబు సిద్ధించె ననువారు
        కనికరింపఁడె దేవుఁ డనెడువారు
నగుచు, ధృతి లేక, వెడవెడ నగుచు మిగుల
దిగులుపడుచున్న మనుజులదిక్కుఁ జూడ
కున్నకత మేమి, జగములఁ గన్నసామి
వయ్యు నో దేవదేవ, మహానుభావ!

వీనులు లేకున్న వినువాఁడవే కదా
        మనవి సేయుచునున్న విన వదేమి?
కన్నులు లేకున్నఁ గనువాఁడవే కదా
        కరుణార్ద్రదృష్టివై కన వదేమి?
యడుగులు లేకున్న నడచువాఁడవు కదా
        జీవనంబు లొసంగ రా వదేమి?
తనువు లేకున్నను గనుపింతువే కదా
        ప్రార్థించుచున్నఁ గన్పడ వదేమి?
యాగ్రహము డింప వేమి, యనుగ్రహింప
వేమి, యీదురవగ్రహం బెడప వేమి?
విడుచుతఱి గాదు, నిగ్రహవేళ గాదు
వానతఱి, దేవదేవ, మహానుభావ!

స్మరియించినంతనే కరి నేలితి వటందు
        రానాఁటి కరుణ యేమయ్యె నేఁడు
తలఁచినయంతనే ధర నేలితి వటందు
        రానాఁటి కరుణ యేమయ్యె నేఁడు
శరణన్న ప్రహ్లాదుఁ గరుణించితి వటందు
        రానాఁటి కరుణ యేమయ్యె నేఁడు
పాహి యటన్న ద్రౌపది నేలితి వటందు
        రానాఁటి కరుణ యేమయ్యె నేఁడు

మానవులు వాన లేక దివానిశంబు
మదిని దహతహపడి బతిమాలుచున్న
వినియు విననట్లు లుంటి వేమనఁగవచ్చె
నయ్యయో, దేవదేవ, మహానుభావ!

జగదంతరాత్మవై నెగడుచుంటివి గదా
        జగదుపద్రవశాంతి సలుపవలదె?
జగదీశ్వరుండ వై నెగడుచుంటివి గదా
        జగదనర్గళరక్ష సలుపవలదె?
జగదాదికర్త వై నెగడుచుంటివి గదా
        జగదభ్యుదయవృద్ధి సలుపవలదె?
జగదేకమూర్తి వై నెగడుచుంటివిగదా
        జగదభిమానంబు సలుపవలదె?
యెప్పుడును లేని కాఠిన్య మిప్పు డూని
కఱవు దీఱంగ వర్షంబు గలుగఁజేయ
కున్నకత మేమి, నేరము లున్న సైఁచు
టపయశమె, దేవదేవ, మహానుభావ!

సూర్యోదయంబున సుడిగొనెఁ దాపంబు
        చంద్రోదయంబునఁ జలువ లేదు
తగు నభ్రకమున వాతము గ్రమ్ముకొనివచ్చె
        ననుపానమునకు నీరైన లేదు
పథ్యంబునకు వరి పండుటయే లేదు
        తృణము లే దావు పా లిచ్చు నెట్టు
లంతకంతకు ఘనం బగుచునున్నది తృష్ణ
        భయకంపములు మనోభ్రమయుఁ బుట్టె
నిట్టిపట్టున దయ పుట్టి యెట్టులయిన
ఘనత వహియించి, యమృతంబు గరుణ నిచ్చి
జగదవగ్రహరోగ శేషం బడంచి
యశము గొను దేవదేవ, మహానుభావ!

ఒకయూర నొకయెూర నొకకొంత వర్షించు
　　నొకయూర నదియు లే కూరకుండు;
నొకయూర వరియాకు లుడుచుట లేదు, వే
　　ఱొకయూర నుడిచిన నుమకుఁ జెందె;
నొకయూర నతివృష్టి నున్ననీరును బోయె
　　నొకయూర మెట్టపంటకుఁ గొఱంత;
యొకయూర గోరంతయును దున్నుటయె లేదు
　　పాటపాటగఁ గొన్ని పండవచ్చు;
సాముదాయికముగ నెల్లగ్రామములకుఁ
బాపుపంటైనఁ బండునో పండకున్నొ
తెలియ దెక్కనైనఁ గలిగింపు దివ్యదృష్టి
ననినిపై, దేవదేవ, మహానుభావ!

సస్యానుకూలవర్షము లేక వారాశి
　　తీరున ఘోషించు నూరు నూరు;
నేయూరఁ జూచిన నెదిరివారలఁ గాంచి
　　వర్షవార్తలు వినవచ్చువారు;
వచ్చువారిమొగంబు లెచ్చుపోవుచునున్న
　　ధరవరి ల్లడిగి మిన్నరయువారు
నరియువారలదృష్టి కగపడు మేఘంబు
　　మటుమాయమైన మైమఱచువారు
వెఱచువారును, దీనులై వఱచువారు
నఱచువారును నైన యీనరుల నరిసి
దొరసి వర్షింప వింతైనఁ గరుణ లేదె
హరిహరీ, దేవదేవ, మహానుభావ!

వరదలువారంగ వర్షించునదివోలె
　　నురుమూర్తియై మేఘ ముఱుముచుండు
ధ్వజహాని యగునని తలఁచునదియుఁ బోలె
　　గాలి యావచ్చు మేఘాలిఁ జిమ్మ
తనదొరమహిమంబుఁ దలఁపించునదివోలె
　　జగమశ్రువర్షంబు జగతి నింపు

*　　*　　*　　*

నింతియే కాని, జనుల కానంతమైన
వంత దీఱంగ వర్షించి వింతయైన
దంతురఖ్యాతి కొడిఁగట్టఁ దలఁపవైతి
వయ్యయో, దేవదేవ, మహానుభావ!

చెరువులు నిండ నచ్చెరువుగ వర్షించి
　　కఱవు దీఱఁగఁ బంటఁ గలుగఁజేసి
నరుల నందఱ ధర్మనిరతులఁ గావించి
　　నతులను సంపదున్నతులఁ జేసి
ప్రజలకు రాజానురాగంబు గలిగించి
　　రాజులకుఁ బ్రజానురాగ మొసఁగి
సూచీమశూచీవిషూచీపిశాచీని
　　శాచరోపద్రవశాంతిఁ జేసి
నిత్యకళ్యాణపూర్ణులై నిన్నుఁ గొలిచి
యిష్టసిద్ధుల నొందున ట్లెల్లవారి
నరసి రక్షింపు మనుచు జోహారు సేతు
నస్వహాము, దేవదేవ, మహానుభావ!

# ధవళే కూర్మనాథశర్మ

శ్రీ రిపి ఆంజనేయులుగారు



ధవళే కూర్మనాథశర్మ

## ౧. ప్రస్తావము

సదభ్యాస దురభ్యాసములలోఁ జేనిఁ గాని మాచినతోడనే తాను నాలాగునఁ జేయ సంకల్పించుటయుఁ, జేయుటయు మానవునకు నిసర్గస్వభావ మగు విషయము. కాని యుత్తమవ్యాసారములపట్టున నక్కఱ గలవారు లోకమునఁ దక్కువ యగుటయు సహజమె.

ఇది సదభ్యాసమని తెలిసి, దాని నుత్సాహాతిశయమున నాచరణమున నునిచి, యానూత్నోత్సాహముచే తుదిదాఁక శ్రద్ధతోడ సాగింపఁబూనువారు మిక్కిలియుఁ దక్కువయనుట పొరపాటుకాదు.

పసితనమున నొకయాచార్యునికడ నేదే నొక కళారహస్యము సూచీముఖప్రాయముగ గ్రహించి, యేకలవ్యునిపగిదిఁ దదేకనిష్ఠతోడ దానిని సాధనమొనర్చుచు, నడుమనడుమఁ గ్రొంగ్రొత్త పరిశోధనలకుఁ గూడఁ దివిరి, తిన్నాళ్లమునఁ దాను గనుంగొనిన యుపయోగముల నా చిన్నివయసుననే ప్రపంచమునకుఁ జాట సాహసించు వారలు చాల నరుదనఁ దగును. సువిశాలమగు యౌవనాంధ్రమండలమున ధ్రువనక్షత్రముఁ బోలు నిట్టివ్యక్తులేయొకరింపఁబోగదా?

దేహమున జిగియు, బిగియు మొలకెత్తుటకు ముందె, మోమున నూనూఁగుమీసము లంకురింపకుండఁగనే, యౌవనప్రాదుర్భావ మింకను దలచూపుటకుఁ బూర్వమే, విసుగువల పరిశ్రమలలో మొపటిది యనంగు వ్యాయామ యోగాభ్యాస నియమమునకుఁ బూని, తదీయయోగాభ్యాసవిశేషమున నూత్నపరిశోధనలకు నొరఁగొని, యందువలనఁ బెక్కుప్రయోజనముల స్వానుభవమున నెఱింగి, నిర్ధనుం డయ్యుఁ దనపరిశ్రమమువలని ఫలములను నిఱుప్రాయముననే భారతప్రపంచమునకుఁ జూపి, మహాజనులవలన వినుతులను, బిరుదసత్కారములను బడసిన యపురూపపు టాంధ్రమూర్తులలో నొక్క వ్యక్తి మన ధవళే కూర్మనాథవీరుఁడు. అట్టి యీతని చిత్రమగు జీవితభాగము, ఆతనివంటి యువకలోకమున కొక్కింతయైన నుపకరింపఁగలదని తలంచి యందును గూర్చి కొన్నిపఙ్క్తు లిట వ్రాయఁ బూనితిని.

## ౨. జన్మము

శ్రీకూర్మనాథునితండ్రి లక్ష్మీనరసింహము; తల్లి నరసమాంబ, కులము కోనసీమ ద్రావిడబ్రాహ్మణసంబంధము; వాధూలసగోత్రము; యజుశ్శాఖాసూత్రము; జన్మము ౧౯౦౮-వ సంవత్సరము నవంబరున; జన్మస్థల మేకతాళ్లపురము (ఒంటితాడి యగ్రహారము). అది విజయనగరమునకు సమీపమున రెండుమైళ్లదూరమునఁ గలదు.

## 3. విద్యాభ్యాసము

బాల్యమున నీకూర్మనాథుఁడు చాల పలుచగఁ బూచికపుడకవలె నుండెను. శరీరదౌర్బల్య మత్యధికమనుట తన్నివారణకయి యాతనియం దట్టిప్రయత్నము మొలకెత్తినది కాదు. ౧౯౧౯ లో విజయనగరకళాశాలయం దితఁడు నాలవఫారము చదువుచుండు సమయమున

నచ్చట సుప్రసిద్ధవ్యాయామకళావిశారదుఁడగు శ్రీ బులుసు రామజోగిరాయని ప్రదర్శనములఁ జూచుట సంభవమైనది. అట్టితఱి రామజోగిరాయని శరీరపాటవము, కండరబలము, దేహసౌందర్యము కూర్మనాథున కాశ్చర్యముఁ గొల్పియుండెను. ఆసమయమున రాయని యంగపుష్టియుఁ జక్కని యారోగ్యబలమును బొందవలయునను కుతూహలము నయితే మీవిద్యార్థిలో మొలకెత్తుటగూడ సహజమే. తోడనే యాతఁడు రాయనికడ శిష్యత్వముఁ బొంది, యనిమిదిమాసములు క్రమపద్ధతిననుసరించు పట్టుదలతో వ్యాయామపరిశ్రమ మొనర్చఁ యుండిరి కాలముననే యుత్కృష్టమగు దేహపటుత్వముఁ బడయఁగల్గెను.

కూర్మనాథశర్మ విద్యార్థిగా నున్నపుడే పదునాఱవయేఁట, ౧౯౦౦ లోఁ దాఁ జదువుచున్న కళాశాలలోఁ గొన్ని బలప్రదర్శనములు గావించి, సహపాఠుల నాశ్చర్యపరవశులనుగ నొనరించుట, వ్యాయామయోగమున నీయనకుఁ గల యత్యంతాభిమానమును, పరిశ్రమమునందలి యీతని యకుంఠితదీక్షను జాటఁగలదు. అయినను ఘోరమగు జగుచున్నపుడు, బాలభటవర్గమునఁ బ్రవేశించి పాటుపడుటతో, జనహితకైంకర్యవిధానము నింగుక నిరువేన సౌభాగ్యము చిఱుప్రాయముననే యీశర్మకి గూర్చిన కొనఁగూడెనది.

౮. వివాహము

కుమారుఁ డింకను జదువుచున్నట్టే (పదునాలవయేఁట), కూర్మనాథునకుఁ దలిదండ్రులు వివాహము గావించిరి; కాఁబట్టి పదునాఱవయేఁడు దాఁటకపూర్వమే ౧౯౦౦ లో, నీతనికి గార్హస్థ్యధర్మ మవలంబింపవలసి వచ్చినది. ౧౯౦౧ లోఁ బ్రవేశపరీక్షకుఁ గాఁబోఁయుఁ జదువుచుండ, నసహాయవాదసిద్ధాంతానుసారము కళాశాలను వదలివెళ్లిన యువకులలో నీకూర్మనాథుఁడు నొకఁడు. ఈతఁడు తనజననీజనకుల సమ్మతిని గోరక, స్వేచ్ఛతో జల్పిన కార్యములలో, సహపాఠులతోఁ దాను విద్యాశాలనుండి బయటకి వచ్చి, సహాయనిరాకరణసిద్ధాంతసూత్రములపైఁ బాటువడ సంకల్పించుట మొట్టమొదటిది.

౯. కాశీయాత్ర

కూర్మనాథుఁడు బాల్యమునుండియు నాకు మఱుఁగుపిందియవలె వర్తించియున్నను, దనలోఁ బొడమిన తాత్కాలికోద్రేక మామఱుఁగును దాఁటఁజేసినది. కాని యిట్టిస్వేచ్ఛానువర్తనము తలిదండ్రులకు నచ్చనేరదు గదా? వారు కోపించి దండింతు రనుభయము నాతని కగ్గలమే. కావున, కార్యాంతరము తోఁపమి నెవరికిని దెలుపకయే యాయువకుఁడు గ్రామాంతరము పరుగిడెను. అప్పట్టునఁ బవిత్రరంగసందర్శనాకాంక్ష యాతనిలోఁ గొనలుసాగినది. చివరకు భారతదేశ పుణ్యక్షేత్రములలో నగ్రస్థానము వహించినదగు కాశీనగరముఁ గాంచుటకు నాతఁడు కృతసంకల్పుఁ డయ్యెను. చేత తొక్కము లవమేని లేదు. కాని యాకొఱంతఁ దీర్చుటకుఁ దాను నేర్చిన వ్యాయామకళ సాధనముగ లేకపోలేదు. మార్గమున నందందుఁ బ్రదర్శనములఁ గావించుచు, నాప్రదర్శనములవలన దొరకెడు ధనమును వ్యయములకు సరిపెట్టుకొనుచుఁ-బోయి పోయి, ౧౯౦౨ లో నీతఁడు వారణాసిఁ బ్రవేశించెను. అచ్చట నెనిమిదిమాసము లుండినను, కూర్మనాథశర్మ తనకాలము నిరుపయోగముగఁ గడపినవాఁడు గాఁడు. ఆప్రాంతమునందలి యువకులు రమారమి నలువదిమంది వ్యాయామయోగకళారహస్యవేదు లగుట, నీతని కాలసద్వినియోగమునకయిన యుచితమగు ఫలము. పిమ్మట నీతఁ డాసంవత్సరాంతమున విజయనగరమునకు వచ్చి పదునెనిమిది మాసములు స్వస్థలముననే యుండెను.

౧౦. ఉత్తరహిందూస్థాన సందర్శనము

౧౯౦౫ వ సంవత్సరము జూనునెల నడుమ, దేశాటనమొనర్చు సంకల్పమున, కూర్మనాథుఁ డుత్తరప్రాంతమువంక బయలుదేఱెను. ఆతఁడు స్వార్జితవిత్తముతోడనే మధ్యపరగణాలలోను, మధ్యహిందూస్థానమునను సంచారముసల్పి, రీవాసంస్థానమునఁ గొంతకాలము వసించెను. చరిత్రప్రపంచమునఁ జిరకాలము క్రిందటినుండి నేఁటిదనుక, మహావీరక్షేత్రమని వినుతిఁ గాంచిన రాజపుత్రస్థానమున, ఉదయపురము, జయపురము, జోధపురము, బన్స్వార, ఇందూరు, బూంది,

భరతపురము, రాయపురము, రాయగడము, గంగాపురము, సోహావత్, శైలాన మున్నగుసంస్థానము లీతఁడు సందర్శించినవి.

## ౭. బిరుద లాభము

హర్మ్యనాథుఁడు చూపిన భౌతికములలో నాతని ప్రదర్శనములకుఁ దాఁ బియనిది కాని, యాతని నభినందింపనిది కాని సంస్థాన మొక్కటియుఁ గలుగలేదు. ఇట్లు జయసిద్ధిగఁ బయనము సాగించుచు, నుదయపురములో నితఁడు బలప్రదర్శనము గావించుచుండె, నా ప్రదర్శనమునకు విచ్చేసిన భారతధర్మమహామండలి యుద్ధాటకులగు జ్ఞానానంద మహారాజులుంగారు, హర్మ్యనాథుని ప్రదర్శనముల కాశ్చర్య మంది, యిట్టి చిఱుతదనమునసే యక్షిమన్యునివలె సామర్థ్యాతిశయము నెలయించుటం బట్టి, యాతనికి 'కలియుగాభిమన్యు' డనుపట్టము నొసఁగిరి. మఱియు "Indian Youngest Sandow", "All India Fame","India Hercules","ఆంధ్రదేశరత్న" మను బిరుదములు సయితి మీతనికొసఁగఁబడినవి. ఈసందర్భమునసే, శ్రీహర్మ్యనాథుఁడు మాళవకాశ్మీర ఘూర్జర దేశములందుఁ గూడ సంచారము గావించి, ౧౯౨౬-వ సంవత్సరమధ్యమున బొంబయినగరము చేరి, యందు నాల్గయిదునెల లుండి, కొన్ని ప్రదర్శనము లొసఁగి యనంతరము జన్మభూమికి మరలెను. తరువాత విజయనగరమున హనుమాన్ వ్యాయామశాల యొకటి నెలకొల్పుట సంభవమైనది.

## ౮. దక్షిణ దేశాటనము

దక్షిణదేశమున సుప్రసిద్ధ స్వతంత్రరాష్ట్రమగు మైసూరికి హర్మ్యనాథశర్మ ౧౯౨౭-వ సంవత్సరమున నెపలి మహారాజుగారిని సందర్శించెను. ఆసమయమున, రాజధానీనగరమునం దాతఁడు గావించిన ప్రదర్శనములు రెండుమాత్రమే. తరుపరి చూచినది చెన్నపట్టణము. అందు ౧౯౨౭—౨౮ సంవత్సరములలో జరిగిన ప్రదర్శనముల కార్యము కొంత యధిక మనఁడగును. ఇది హర్మ్యనాథుని యాచార్యుఁడగు రామజోగిరాయనితోఁ గూడ నైనది. ఈప్రదర్శనములతోపాటు, తిరువళిక్కేణిలో నొకటియు, జ్యార్జిటౌనులో నొకటియు రెండు వ్యాయామశాలలు స్థాపించుట యాగురుశిష్యులకు సాధ్యమైనకార్యము.

## ౯. ఆంధ్ర దేశము

అన్యప్రాంతములలోవలె హర్మ్యనాథున కాంధ్ర భూమిలోఁ జాలినంత ప్రోత్సాహము, గౌరవాదరములు నబ్బినటు లగపడదు. అందులకు హేతు వాంధ్రదేశమున నాతనిఁగూర్చి యంతగఁ దెలిసియుండకపోవుటయే యగునేమొ! రాయలసీమలోఁగూడ, నీశర్మ వ్యాయామ యోగరంగములు నెలకొల్పుటకుఁ బ్రయత్నింపక పోలేదు. అనంతపురము కడప మండలములలో నాతని పూనిక కొంతవఱకు సాగివచ్చినది. వ్యాయామశాలలు నందందు సంస్థాపితము లైనవి. ఇందువలన నాయయి మండలములయందలి యువకులలో, నుత్సాహప్రియుల లోనే కాక తదితరులలోను, వ్యాయామకళాభిమానము, నభిరుచియు హెచ్చె ననఁదగును.

## ౧౦. వివిధప్రదర్శనములు

దక్షిణదేశమున 'దక్కను శాండో' యని ప్రసిద్ధిఁ గాంచిన వేంకటస్వామినాయఁడును, భారతలోకమునందంతట, నొకప్పుడు ప్రపంచమునందల్లడలనుఁగూడఁ బ్రఖ్యాతి నొంది, 'కలియుగభీముఁ'డని వాసికెక్కిన కోడి రామమూర్తినాయఁడును సల్పుచుండిన ప్రదర్శనములలో రమారమి యన్నింటిని హర్మ్యనాథుఁడు నేయఁజాలును. కాని భాగ్యరేఖ చాలమి, నీతని యెన్నఁ దగిన సామర్థ్యము బయలుపడలేదు. మైసూరినగరమునందలి యీతనిప్రదర్శనముల కార్యక్రమప్రణాళికనుబట్టి, యీవీరుని వివిధవిన్యాసవిశేషములు నిందుఁ దెల్పెదము.

౧. వీఁపుపై నిండుబరువు గల మోటారుబస్సును బోనిచ్చుట.

౨. ½ అంగుళము మందముగల తంతితీఁగను త్రెంచుట.

౩. ½ అంగుళము మందముగల యొకయినుప గడారు (iron crow bar)ను మెడమీఁదుగా వంచుట.

౪. రెంటికిఁ బైఁబడి, మూఁడింటికి లోఁబడిన టన్నులబరువుగల రోడ్డురోలర్ (road roller)ల నెదపైఁ బోనిచ్చుట.

౫. ఎనిమిదివందలపౌనులభారమును మెడతో నెత్తుట.

౬. పాతికయంగుళము మందముగల ఎస్ మార్కు గొలుసును భుజములమీఁదుగాఁ ద్రెంచుట.

౭. ముక్కాలంగుళము మందముగల యినుప కడ్డీను వీఁపుమీఁదుగా వంచుట.

౮. కొండ్లముతోడి కొబ్బరకాయను మోఁచేతితో గొంతెల మూడిపోవునట్లు గ్రుద్దుట.

౯. ఎనుబదిపౌనుల బరువును చిటికెనవ్రేలితో శిరోభాగమువఱకు నెత్తుట.

౧౦. కోట్ల పేకలను రెండింటిని నట్టేట్టు కదలనీయక పట్టుకొని, యొక్కసారిగఁ జించివైచుట.

౧౧. తల క్రిందను, పిక్కల దిగువను కురిచీల కొసలు మాత్రమాధారముగఁ జేసికొని పరుండి (Bridge teal) రొమ్ముపై రాతినుంచికొని, సమ్మెటలతోఁ గొట్టించుకొనుట.

౧౨. నేలపైఁబరుండి, నాల్గువేలపౌనులభాగముగల రాతిని రొమ్ముపై నుంచికొని, సమ్మెటలతోఁ గొట్టనిచ్చుట.

౧౩. ఎదపై నేనుఁగును నిల్పుట.

౧౪. ఋరువది యశ్వశక్తులుగల మోటారుబండ్లు, నొకటి ముందు మూఁడింటివఱకు, నొకటొకదాని వెనుక నొకదాని వ్యతిరేకముగాఁ బోవు చుండఁగా నాపుట.

౧౫. ఎస్‌మార్కు గొలుసుచే వక్షమును బంధించియుండఁగా, నడుబలముతో దానిని ద్రెంచుట.

౧౬. ఇరువదిమంది మనుష్యులు కూర్చుండియుండిన బండి నెదపైనను, తొడలమీఁదను బోనిచ్చుట.

౧౭. పాతిక యంగుళముగల 'Iron riem' ను వంచుట.

౧౮. ఒక యంగుళము మందముగల యినుప కడ్డీలను రెంటిని నొకటొకపర్యాయము వంచుట.

౧౯. చేతికండరములపై బలశాలులచే గ్రుద్దించుకొనుట. (ఇట్టి మర్దనకార్యమువలనఁ జేతికండరములను నొప్పించినవారికి మూఁడువందల పారితోషికము.)

౨౦. కండర బలప్రదర్శనము.

## ౧౧. కండరబల ప్రదర్శనము.

శ్రీకూర్మనాథవీరుని ప్రదర్శనములలో నాశ్చర్యకరమైనది కండరబలప్రదర్శనము. తనయొడలియందలి యన్నివిధములగు కండరములు నీతనిమనశ్శక్తికి సంపూర్ణముగ లొంగియున్నవనఁదగును. ప్రాణాయామయోగ కారణమున, నీతఁడు స్వశరీరమునందలి యేకండరముచేనైన, నెప్పుడైన, నిరాటంకముగఁ బనిగొనును. ఏసందర్భమున నేకండరమున కుబ్బును, గాఠిన్యమును, సంచలనమును గల్గింపఁ దలంచినను, దానాలాగునఁ జేయఁగలఁడు. అట్టిచో నీతని వక్షస్థలమునందలియు, దండచేతియందలియు కండరముల నాట్యవిలాసము కడుంగడు గమనార్హము. ఆతని శరీరమునందలి ప్రతికండరము స్వాభావికదశలోఁ జాల మృదులముగ నుండుటయు వృద్ధినొందించినపుడు శిలాకర్కశమయి లోహమువలె దృఢతమముగ నొప్పుటయు, నాలాగు కాఠిన్య మొందించిన కండరభాగము తక్కఁ దక్కిన శరీరమునందలి యేకండరము స్పృశించినను, సహజ కోమలస్థితినే యుండుటయుఁ గలదు. ఇదియే యీతనియందును, ప్రాణాయామ యోగిపరిశ్రమమునందును గల విశేషము. ఇట్టి యీవీరుని కండరబలమును బ్రదర్శించుట కమవైన పటములను గొన్నింటిని, వివరములతో నీదిగువఁ గనఁబఱిచెదము.—

చిత్రము ౧

ఇం దాశ్చర్యపడఁదగిన విశేష మేమియు లేకున్నను, ఈ స్వాభావిక స్థితిలోఁగూడ, చతురాకారముగ నుండు మెడయు, నెఱుభుజములును, బలిష్ఠములైన దండచేతులును, వలయాకృతిని వహించిన ముంజేతులును, నున్నతమగు వక్షమును, మాంసలములై, 'ఉష్ణ'న నూఁదిన నెగిరిపోవు ఫ్రూచికపుడ్కవంటి కృశాంగమునకు, వ్యాయామయోగ మెంతటిపాటవమును, శోభను గొల్పఁజాలినదో యావిషయ మీచిత్రమునుబట్టి, సులభముగ గ్రహింపవచ్చును.



చిత్రము ౧

౧. సర్వసాధారణముగా నుండు స్వాభావికమైన శరీరమును జూపు దృశ్యము.



చిత్రము ౨

౨. కుడిచేతి రెండుకండరములు, నెడమప్రక్క భుజమూలకండరములును,నొకటేపర్యాయము హెచ్చించి చూపిన దృశ్యము.

ఇందు వక్షస్స్థలకండరముల (Pectoralis)యు, నొంతరలుగ నుండు గర్భస్థకండరముల (Rectus Abdomins) యు నాధిక్యముగూడఁ గొంతవఱకుఁ దెలియుచున్నది.



చిత్రము 3

3. ఉభయపార్శ్వపుఁ గండరముల నొకటేపర్యాయము విస్తరింపఁజేసిన దృశ్యము.

ఈయుభయపార్శ్వపుఁగండరములు, భుజమూలను మొదలు నడుమువఱకు వ్యాప్తి నొంది, భుజమూ-



చిత్రము ౪

మునుండి క్రమక్రమముగ సన్నగిలి, నడుమువఱకు వలయము దీర్చినటు లుండును. చిత్రపటమున నీభుజమూల కండరము (Latissimus Dorsi)లు, ప్రక్కలలో నలుదిదురముగల భారపుసంచు లదికించిన విధమునఁ గాన్పించుట చూడనగును.

౪. కుడిచేతి లోపలికండరము, యెడమచేతి పైకండరము, నొక్కపర్యాయము హెచ్చించి చూపినదృశ్యము.

ఇందు, కుడిదండచేతి లోపలికండరములు (Biceps) ఎత్తిపట్టియున్న చేతిపై నొకదృఢమైన బంతి నుంచియున్నవిధమున నున్నతముగఁ జొచ్చఁగట్టుటయు, యెడమచేతి వెలికండరములు (Triceps) నిడుపాటి వలయాకృతిని బొంది యగపడుటయుఁ దెలియఁగలదు. ఇందు యెడమచేతి భుజకండరము (Anterior Deltoid) సయితము వలయముగ దీర్చినటులు గోచరించెడిని.



చిత్రము ౫.

౫. ప్రక్కలు, కుడిచేతి వెనుకకండరములు, మెడ క్రిందికండరములు, వీఁపుకండరములు, నొకేతడవ హెచ్చించుట.

పైనఁ జూపిన ౩, ౪ పటములలోఁ బార్శ్వపుఁ గండరముల (Serratus Magnus) పైభాగపు వృద్ధి మాత్ర మగపడుచున్నది. ఇందుఁ గ్రిందికండరముల యతిశయము చూపఁబడినది.



చిత్రము ౬.

౬. రెండుచేతుల వెలికండరములను, పొత్తికడుపునకు సరిగా నుండు వీఁపుకండరములను, హెచ్చించి చూపుదృశ్యము.

రెండుదండచేతుల వెలుపలికండరములు (Triceps) దండచేతి పైభాగమున నత్యంత దృఢతమముగ నిండుఁ గాన్పించెడిని. దాపలిభాగము వృద్ధినొందుట కంటె వెలుపలికండరము లీవిధమునఁ బెంపువహించుట మిక్కిలి కష్టము. అట్లభివృద్ధి నొందినఁ గాని దండచేయి చదునుగను, సాచుట కందముగను నుండఁజాలదు.

చిత్రపటమున నీకండరభాగమునందు, రెండు దండచేతులపైనను కొన్ని గాయములగుర్తులు పాఠకునకు గోచరింపఁగలవు. అవి యనంతపురమండల కరగ్రాహి కార్యాలయమున నీకూర్మనాథుఁడు వివిధప్రదర్శనముఁ గావించుచు, భారమైన మోటారుబస్సు వీఁపుపైఁ బోనిచ్చుసందర్భమున, శకటనియంత (Driver) దాని సహజగమనముఁ గొంత యడ్డగించుటచేత, బండి వెనుకటిచక్రపు టడుగుదిమ్మెలయొత్తిడివలన నేర్పడిన గాయపుమచ్చలు. ఇవి కుడిచేతి వెలికండరములపై విస్పష్టముగను, యెడమచేతిపై నస్పష్టముగను బొడఁగట్టెడిని. నాభికి సరిగా వెనుకప్రక్కను, వీఁపుకండరములు (Erector Spinac) వెన్ను నడిమిభాగమునుండి క్రింది

వైపునకు విస్తరించుచుఁ బోయియుండుట గాంచవచ్చును.



చిత్రము ౬

౬. భుజములకును మెడకును నడుమ నుండు నుభయపార్శ్వపుఁ గండరములు, ముఖకండరములు నొకటేపర్యాయము వృద్ధినొందించినదృశ్యము.

భుజముల కాధారముగ నుండు రెండుకండరములు (Trapezins), మెడదిగువ వీఁపుపైన రెండువైపుల రెండుముద్ద లుంచినటుల హెచ్చి, తలవఱకు వ్యాపించియున్నవి. చెవివెనకభాగము నుండి యెదురుఱొమ్మువఱకు వ్యాపించిన మెడకండరము (Sterno-Cleido Mostoid) లును, ముఖకండరములును, మిగుల నుప్పొంగి ఆయాయంగముల సహజస్థితిని గప్పిపెట్టునంత యతిశయముగ నుండుట యీ చిత్రమున స్పష్టము కాఁగలదు.



శ్రీపాద కామేశ్వరరావు

విజయనగర వాస్తవ్యుఁడు. కూర్మనాథుని శిష్యబృందములోనివాఁడు. దృఢమగు మోకు నడుమునకును, బలిష్ఠమగు నినుపకాఁడకును బంధించి, కాలితాఁకునఁ ద్రెంపఁబూనిన దృశ్యము.



ప్రొద్దుటూరి వ్యాయామమండలికిఁ జెందిన వైశ్యయువకులు

కూర్మనాథుని శిష్యకోటిలోనివారు. ప్రాణాయామాభ్యాసమువలనిశక్తిచే, బలకరములగుకొన్ని పనులను జేసిచూపునట్టి దృశ్యము. కూర్మనాథుఁడు నిలుచున్నవారిలో నడుము, నల్లనియుడుపులతో నుండుట యిందువ్యక్తమగును.

కూర్మనాథుఁడు విజయనగరమునను, రాయలసీమయందును, మారుతివ్యాయామశాలలఁ గొన్నింటిని నెలకొల్పినట్లు పైనఁ దెల్పియుంటిమి. వానికి సంబంధించిన చిత్రపటములు, లభించినంతవఱకు నొకమూఁడింటి నిందుఁ జేర్చెదము.



ప్రొద్దుటూర్పుర మారుతివ్యాయామమండలి

పీఠములపైఁ గూరుచున్నవారిలోఁ జివర, స్వచ్ఛంపుఁదెల్లని యుడుపులలో కూర్మనాథుఁడు పొడఁగట్టెడిని.

### ౧౨. వ్యాయామక్రీడాసంఘసంస్థాపనోద్దేశము

రెండుమూఁడు సర్కసు కంపెనీలవారు, తమ సంఘమునఁ జేరవలసినదని కోరుచు, కూర్మనాథుని నాహ్వానించినను, తన స్వాతంత్ర్యేచ్ఛను గోల్పోవ వెఱచి, యాతఁ డందుల కామోదింపఁడయ్యెను. ఇంతవఱకుఁ గావించిన సంచారములో, నీతఁడు రాజులను గొందఱిని సందర్శింపఁగల్గినను, యువకుఁ డగుటచేతను స్వతంత్రముగ నొక్క 'సర్కసు' నిర్వహింపవలయునను నభిప్రాయ మప్పుడు లేనివాఁ డగుటవలనను, నందుల కట్టి ప్రయత్నమును గావింపఁడయ్యెను; కాని యీవలఁ గొందఱు మిత్రుల ప్రోత్సాహమునఁ గ్రొత్తగా నొక 'సర్కసుకంపెనీ' ని నెలకొల్పవలయు ననెడు నభిలాష యీయనకుఁ గల్గినటు లున్నది.

వ్యాయామయోగ సాధనముల నొక్కఁడుమాత్రమే చేసి చూపుటకంటె, వివిధవిధములగు వ్యక్తులు పలువురు గల క్రీడావిశేషములఁ గనఁబఱచుట యెక్కుడు జనరంజనమునకును, విస్తారమగు ధనాకర్షణమునకును మార్గము కావచ్చును; కాని యందువలన జనసామాన్యమున కట్టి ప్రయోజనమును గలుగఁజాలదనుట నిక్కువము. వ్యాయామవిద్యాప్రవీణుల గొప్పగొప్పసంఘము లెన్నియో, యీవఱకు బయలుదేఱి, యద్భుతావహములగు ప్రదర్శనముల నెన్నింటినో కనఁబఱచియుంట గలదు. అయ్యవి వినోదములక్రిందఁ బరిణమించుట తక్క, నందువలనఁ బ్రజాసముదాయమున కావంతమేలైన నొదవిన దనరాదు. ఇట్టిచో నవీనసంఘము లింకను లేవఁదీయుట వ్యర్థప్రయాసహేతువుగదా? ఇట్లు సంఘములుగఁ జేరి తన్మూలమున ప్రదర్శనముల నొసంగుచు, ధనము గడింపఁబూనుట, తమకళావైదుష్యము కాసునకు విక్రయించు

వ్యాపారపద్ధతి యనునే కాని, జనహితకర కైంకర్య మదెంతమాత్రమును గాఁజాలదు. కాఁబట్టి యట్టిమార్గమునకంటె, వ్యాయామపరిశ్రమమువలని ప్రయోజనముఁ గూర్చి యారూరఁ బ్రజాసముదాయమునకు చక్కని ప్రబోధము గావించుచు, నాంధ్రదేశమునందలి ముఖ్యపట్టణములయం దంతటను నాపెర్కప్రాయములగు వ్యాయామరంగములను నెలకొల్పి, తత్ప్రియత్నమూలమున నొక్కొక్క గ్రామమున మాసిపోయిన సాముగరిడీలఁ గ్రమ్మఱ రూపొందించి, వాని నుజ్జీవింపఁజేయుట యత్యుత్తమమగు సేవఁగా భావించెను.

## ౧౩. వ్యాయామయోగపద్ధతి

శ్రీకూర్మనాథుని వ్యాయామయోగబోధన విధానమెల్లరకు సులభగ్రాహ్యమైనదని వినికి. వెనుకటివారు తెల్పినవానికంటెను, నీవరలి వ్యాయామకళాబోధకు లెఱింగించిన వానికంటెను, నీతని పద్ధతు లత్యధికఫలప్రదములని తెలిసెడిని. ఈతని సాధనము లన్నియుఁ గొంతకుఁ గొంత ప్రాణాయామయోగసమ్మిళితము లయియుండునఁట. ఇట్టియోగాభ్యాసపద్ధతి నవలంబించుటవలన, శరీరము కండరాతిశయమున భారము వహింపక తేలికనుజెంది, యద్భుత భారవహప్రదర్శనమున కనువిచ్చుచున్నది.

ఈతని వ్యాయామపద్ధతి యొకసంవత్సరపు పాఠముమాత్రమే. అయ్యదియు మూఁడుభాగములు గలది: ౧. దండెములు మున్నగువాని శరీరసాధనము, ౨. ప్రాణాయామనియమము, ౩. కేవలము కుంభకప్రాణాయామము.

సర్వసాధారణముగా కూర్మనాథుఁడు తనశిష్యబృందమున కొసఁగుటు, మొదటి రెండువిధములగు పద్ధతులు మాత్రమే. తగినసామర్థ్య మలవడినఁ గాని మూఁడవ భాగము బోధింప సాహసించుట లేదు. అన్నిట నాహారవిధి మిక్కిలి సామాన్యము. ఒక్కయోగాభ్యాసపద్ధతికిఁ దక్కఁదక్కినవానికిఁ గాలనియతికూడ నంత గమనార్హమయి యుండదు. మానసోల్లాసమునుబట్టి యిచ్చవచ్చినపుడు చేయ వీలగునని యాతనిశిష్యు లనుచుందురు.

స్వానుభవము నాయుర్వేదశాస్త్రానుభవముఁ బట్టి, శీతలోదకస్నానమే శ్రేష్ఠతమమైనదని కూర్మనాథుని యభిప్రాయము. బలము, మీఁదుమిక్కిలి తిండివలననే వచ్చునను భ్రాంతి యాతనికి లేదు. సర్వసాధారణము భోజనమే యీతఁడు కైకొనును. ప్రత్యేకాహారమేర్పాటు, జివరకు భావముపప్పు సయితము మీయన పుచ్చుకొనఁడు. బలము గడించుటకుఁ గేవలము నిశ్చలమానసమే ప్రధానము గాని ప్రత్యేకభోజన మంత ముఖ్యము కాదనుట యీతని దృఢాశయము.

## ౧౪. బోధనపద్ధతి

ప్రకటనాడంబరము గాని, ధనార్జనమే ప్రధానమను భావము గాని, యీయువకునియందుఁ గన్పట్టదు. తన్నాశ్రయించిన యెట్టివ్యక్తికైనను, దగ్గఱ నుండి స్వయముగా సాధనములఁ జేసి చూపి, తత్సాధనోపయోగమును గూర్చి చక్కఁగ బోధించు నుత్సాహమే యీతనియందు హెచ్చుయి కన్పట్టెడిని. కళావిశేషముల నితరులకు బోధించుటలో దాఁపఱిక ముండదు. ఫలాపేక్ష లేక హృదయమే యొసఁగును. వ్యాయామపరిశ్రమ మొనర్పవలయునను కుతూహల మొక్కటె యెదుటివానిలో నుండవలయును గాని, యెప్పు డెవ్వఁ డడిగినను బోధింప సంసిద్ధమే. దేహపటుత్వ మునఁగ, బక్కచిక్కి, వివిధములగు రోగములకు గుఱియగుచుండు దేశజుల నుద్ధరించుటయే యాతని ముఖ్యోద్దేశము.

'ఫైల్వాను'లు చేయు మొదటిసాధనముల నీతఁడు ప్రశంసింపఁబోఁడు. లిఖితపాఠబోధనవిధాన మాచరణయోగ్యము కాదని యాతని తలంపు. అది కేవలము గ్రుడ్డిమార్గ మనియు, పలుసంశయముల కాలవాల మనియు, నపాయకర మనియు నీబోధకుని యభిప్రాయము. రోగార్తులకు వారివారి రుగ్మతను బట్టి ప్రకృతి నియమానుసారముగ, నాయయిరోగికిఁ దగిన పరిశ్రమమే యాతఁ డొసఁగఁజూచును. కేవలబ్రహ్మచర్యము స్వభావవిరుద్ధమనియు, నది యాచరణయోగ్యము కాదనియు నీయువకుని నిశ్చయము.

## ౧౫. వ్యక్తిత్వము

శ్రీకూర్మనాథుని ముఖ మంత యాకర్షకమైనది కాదు. గంభీరమైన వ్యక్తిత్వము నాతనికిఁ గూర్పఁజాలి

యుండెడు గాడు. కాని యాతని తేజ మంతయుఁ గనుల లోనే తాండవించుచుండును. దృష్టి యీతని సునిశ్చల మన స్తత్త్వమునకును, స్వాతంత్ర్యగరిమకును దార్ఢ్యా ణమైనది.

కూర్మనాథుని శరీరము సామాన్యమైన యెత్తు గలది. అంగపరిమితియు నందులకుఁ దగినటు లొప్పి యుండును. దేహకాంతి స్వచ్ఛతమమైనది. అత్యంత ధావళ్యయుక్తముగాన నీతనివిగ్రహము గాజుబొమ్మవలె తళతళలాడును. వక్షస్థలము సువిశాలము. నడుము సింహ మధ్యముఁ దెలుపించును. ఈతనికంటె బలశాలు లుండిన నుండవచ్చును గాని, యీతని కండర సౌష్ఠవము (Symmetry of body) నకు సరిపోలు దేహసౌంద ర్యము గలవార లుండుట యరుదు.

ఉడుపులతో నీతని మూర్తినిఁ జూచిన నీతఁ డేపటి కెట్టి యని భావించుటకు వీలుండదు. అందు లకు ముఖ్యకారణము పెక్కుమల్లురవలె నిరుపయోగ మగు మాంసాధికము, వాతయుక్తము నగు దేహ మీతనికి లేకుండుటయే. బిగువులాఁగు (లంగోటా)తో నుండినపుడే దృఢమైన యీతని కండరసంపద గోచరింపఁగలదు.

కూర్మనాథుని శరీరకండరవృద్ధిలో దండచేతి వెలి కండరములు, గాపలికండరములు, భుజ కండరములు ముఖ్యముగ గణింపఁదగినవి. భుజములు బొంగ్లుముతీసిన నారి కెళ్లలములకుఁ గుల్యము లనిన నతిశయోక్తి కాఁజాలదు. ఈ యభివృద్ధి నడుము పైభాగమునకే చెందియుండును. పిక్కలు, తొడలు మున్నగునవి కేవలముసామాన్యస్థితిలో నుండును. వాని పెంపునకయి యీతఁడు తగినప్రయత్న మొనర్చినటులలేదు. మానవున కన్నికార్యములకుఁ జేతులు, వక్షము, మెడ మొదలగునవియే ముఖ్యోపకరణము లను భావము పెక్కురలోఁ గలదు. ఇట్లని తలంచి, తక్కిన భాగవిషయ మీయునకుఁ డంతగఁ బాటిసేయఁడయ్యె నేమొ! తేలికయగు నీతనినడకచాల నందముఁ గొల్పునది.

కూర్మనాథుఁడు భారమైన వ్యక్తి కాఁడు. ఈయనకు సమానమైన తూనిక గల్గి, యీతనికిఁ దుల్యమగు ప్రదర్శనములు సల్పఁగలవారిలో, నీతఁ డగ్రస్థానము వహించును. ఇంతకును కేవలము ప్రాణాయామాభ్యాసమే మూలము.

## ౧౬. స్వభావ గుణములు

కూర్మనాథశర్మ సనాతనాచార వ్రతానుష్ఠాన నియతిగల కులీనబ్రాహ్మణవర్గమునకుఁ జెందిన పురుషుఁ డయ్యుఁ, బరమ ఛాందసుఁడు గాఁడు. కులవిభేదభావ మీతనికిఁ బ్రియకరమై పొడఁగట్టదు. మానవ సమత్వమే యీతని ముఖ్యలక్ష్యమని నుడువఁదగును. సాహిత్యముగల యేకులమువానితోనైన, సంతుష్టభావమున మైత్రి నెఱపి, యాతనియెడల సమతతో వర్తించుట కేమాత్రము వెనుదీయఁడు.

లౌకికవ్యవహారమునఁ గష్టపరంపర లెన్నిచుట్టి ముట్టాడెనను, వానినెల్ల సమరసభావమున దాటిపోవు చుండును. గతమునకు వగవఁడు. ఎంతటి క్లిష్టసమయమందైన నీధీరమానసున కచంచలవృత్తియే మేర. సర్వకాల సర్వావస్థలయందు నిండుమానసమున నుండఁగల గభీర హృదయుఁ డీతఁడు.

మితభాషివలెను, లజ్జాశీలుని తెఱఁగునను, నెప్పుడు నేకాంతమున నుండు స్వభావ మీతనిది కాదు. స్నేహితులతోఁ గలిసిమెలసి తిరుగాడవలెనాఁ డీతనికి లంఘన దినము. ఎప్పుడుఁ బదిమంది మిత్రులైనఁ దోడ నుండవల యును. ఆశ్రయించినవారిఁ దనవలెఁజూచి, యాదరించు నుదారుఁడు. ఇతరులకు మేలే కాని చెడుగు గోరఁడు. దీనులయెడ నతిశయానురాగము వెలయించును.

బలసంపద యున్నదను గర్వ మీతనికి లేదు. ఆబాలవృద్ధులఁ బ్రేమవాక్యములఁ దనియించును. హాస్య రస ముట్టిపడఁజేయు నుడికార మీతని సొమ్ము.

సంసారలాంపట్యమున కంతగ లొంగని పురుషుఁడు. గృహస్థుఁ డయ్యు నింటికడప దాటిన యుత్తర క్షణమే, తత్సంబంధములగు తగులముల, హృదయవీథిఁ జివరమేరనైన నిలువనీయని వ్యక్తి.

# ఆడువారి కధికార మున్నచో






పి. విశ్వనాథంగారు

నం. ౧.—ఇందొక జటాయువు చిత్రింపబడినది. మొదటి చిత్రమున చుక్కలుంచు తీరును, వానిని చేర్చు విధానమును చూపబడినవి. ఇట్లు చిత్రింపబడిన జటాయువును రెండవ చిత్రమున కానవగును.

నం. ౨.—చతురస్రమున కొకటిగ నిందు నాలుగు గండభేరుండపక్షులు గలవు. తొలి చిత్రమున పదమూడు చుక్కలు పదమూడు వరుసలలో కలవు. చుక్కలు సమాంతరములుగ నుండవలయును. చిత్రము నడుమగల పుష్పములను మొదటను, పక్షిశరీరమును నాలుగుమూలల తరువాతను గీయదగును. ఈరచనకు రెండవ చిత్రమును చక్కగ గమనింపవలసియున్నది.





# ప్రాచీన వైష్ణవ చిత్రములు



చిత్రము ౧.



చిత్రము ౨.

# రాజరాజు

భావరాజు వేంకటకృష్ణరావు గారు, బి. ఏ., బి. యల్,

(వెనుకటి సంచిక తరువాయి)

వేంగీదేశమునకు వాయవ్యదిశనున్న చేదిరాజ్యము (దక్షిణకోసలమును) కలచురివంశజుడైన గాంగేయదేవుడు పరిపాలించుచుండెను. ఇతడు మహాపరాక్రమశాలి. బలవంతుడు. ఇతడు పశ్చిమచాళుక్య రాజ్య పునరుద్ధారకుడైన ఇమ్మడితైలప దేవునికి సహాయముగా నరిగి రాష్ట్రకూట రాజులలో కడపటివానిని ఇమ్మడికర్కరాజును ఓడించి మాన్యఖేటమున పశ్చిమ చాళుక్యరాజ్యము మరల స్థాపించుటకు తోడ్పడెను. అతడు పలుసార్లు పశ్చిమచాళుక్యభూపతులకు సహాయార్థము సైన్యములను దీసుకొని యరుగుచుండెను. అతడు తనశాసనములందు కుంతలరాజ్యమును తద్రాజ్యాధిపతులకు మరల స్వాధీనముచేసితినని గర్వముగా బిరుదు చెప్పుకొనియున్నాడు. కావున గాంగేయదేవుని కాలమునాటినుండి పశ్చిమచాళుక్యులకును, కలచురి వంశీయులకును * మైత్రి నిర్విఘ్నముగా వర్ధిల్లుచుండినట్లు స్పష్టము. పశ్చిమచాళుక్యులకును పూర్వచాళుక్యులకును చోళులసంబంధకారణమున వైరము సాగుచుండినందున కలచురిరాజులు వేంగీశ్వరునకు మిత్రులుకాజాలరు. అదియునుగాక, వేంగీ, చేదిరాజ్యములకు నడుమ త్రికళింగ భూమిగలదు. ఈ త్రికళింగప్రాంతము వేంగీరాజ్యమున చేరియుండెను. దాని నెట్లయిన నపహరింపవలయునని, కళింగాధిపతులతోపాటు కలచురిరాజు లనవరతము అభిలషించుచుండిరి. కావున, వేంగీశులతోడి ప్రబలవైరము సాగుచుండెను. అందువలన పశ్చిమచాళుక్య నృపాలుడగు మల్లసోమేశ్వరునకును చేదిదేశాధీశుడగు గాంగేయదేవునికిని విశేషమైత్రివర్ధిల్లియుండెను. కావున విజయాదిత్యుని తిరుగుబాటునందితడుకూడ కొంతవఱకు తోడ్పడి యుండవచ్చును.

విజయాదిత్యుడు అన్నతో పోరాడుచుండిన నాలుగు సంవత్సరములకాలములో గాంగేయదేవుని తనయుడును యువరాజునగుకర్ణదేవుడు త్రికళింగరాష్ట్రముపై దండెత్తి కబళించియుండెను. అప్పటినుండియు నాతనికి త్రికళింగాధిపతియని బిరుదమువచ్చెను. కావున రాజరాజు వేంగీరాజ్యముతోపాటు త్రికళింగమును గోల్పోయినది క్రీ. శ. ౧౦౩౦-౧౦౩౫ సంవత్సరముల నడుమనని నిర్ణయింపవచ్చును. ఒకవంక తమ్మునితోడి పోరాటము మరియొకవైపు ఉత్తరమునుండి ముమ్మడి వజ్రహస్తదేవ, గాంగేయదేవ, కర్ణదేవాదులతోడి వైరమును రాజరాజునకు మిక్కిలి కష్టసమయములై యుండును. ఈకష్టకాలమున వేంగీరాజ్యమును గోల్పోయెను. త్రికళింగరాజ్యమును కళింగ, చేదిరాజులు స్వాధీనపఱచుకొని విభజించుకొనిరి. ఈయుద్ధములందు జగదేకమల్ల ఇమ్మడిజయసింహుడు క్రీ. శ. (౧౦౧౫-౧౦౪౨) పశ్చిమచాళుక్య సైన్యములనంపి విజయాదిత్య భూపతికి తోడ్పడియుండిన నుండవచ్చును.

కాని, విజయాదిత్యుడు ఇట్లు స్వామిద్రోహము చేసి కష్టపడి సంపాదించుకొనిన వేంగీ సింహాసనమును చాలాకాలము నిలుపుకొన జాలియుండలేదు. అనతికాలమున రాజరాజు మరల విజయాదిత్యుని జయించి అపహృతరాజ్యమును జయించుకొనినట్లు తరువాతి రాజులశాసనములలోని వాక్యములబట్టి స్పష్టమగుచున్నది. ఎవ్వడెట్టి యంతరాయములు, అపజయములు కల్గినను రాజరాజు అవిచ్ఛిన్నముగ నలువదియొక్క సంవత్సరములు భూప్రజను పాలించెనని తరువాతికాలపు శాసనములన్నియు ఘోషించుచున్నవి. ఈ యపహృత వేంగీరాజ్యమును అతడు మరల నెప్పటికి సంపాదించుకొనినాడో వివరముగ నెఱుకపడదు. విజయాదిత్యుడు తన

* ఎపిగ్రాఫియా ఇండికా, సం. ౨, పుట ౧; మరియు సం. ౧౨, పుట ౨౦౫.

యన్న రాజ్యమును సంపాదించుటకు పట్టినంతకాలమయి నను నిలుపుకొనియుండనట్లు తోచుచున్నది. ఆతని యధి కారము రెండుమూడేండ్లకన్న నెక్కువకాలము చెల్లిన ట్లగపడదు. ఆతని పాములవాకశాసనము విజయరాజ్య సంవత్సరము ౨-వ ఏట ఆజ్ఞాపింపబడినది. ఆదానశాసనము చాముడరాజునకు యుద్ధానంతరము, రాజరాజు పూర్తిగ నోడింపబడినాడనుకొనిన తరువాత నొసగబడినది. మరియు పూర్తిగ రాజరాజెపుడును వేంగీదేశమున అధికారమును గోల్పోయినట్లుకూడ కానుపించదు. నిజభుజపరాక్రమముతోడుగా తన బావయైన రాజాధిరాజు (క్రీ. శ. ౧౦౧౮-౧౦౫౨) పంపినసేనల సహాయముచేతనో, విశ్వాసముగల మంత్రి, సేనాపతి, మాండలికప్రభువుల సాహాయ్యమువలననో, రాజరాజు వేంగీమహారాజ్యమును త్వరలో మరల సంపాదించుకొనినాడు. రాజరాజు తమ్మునితో బోరాడుచుండిన నాలు గేండ్లును పిదపను కూడ, విజయాదిత్యుడు వేంగీరాజ్యమును బలాత్కారముగా లాగుకొనియున్నను దేశము నుండి వెడలనడిచితినని బల్కినను, వేంగీ సామ్రాజ్యము అన్నదమ్ము లిరువురినడుమను చీలిపోయిన ట్లూహింపవచ్చును. పూర్తిగా రాజరాజుపరిపాలనమునకు అంతరాయముకలిగినకాలము కడు స్వల్పమేగావచ్చును. ఏలయన: నందమపూండి, కోరుమిల్లి శాసనములు ఇతర శిలాశాసనములును రాజరాజుయొక్క ప్రవర్ధమాన విజయరాజ్యవర్షముల సంఖ్యలను, ఆతనిరాజ్యపాలనమునకు అంతరాయము కలుగనట్లే దెలుపుచున్నవి. మరియు విజయాదిత్యుని కుమారుడైన యిమ్మడిశక్తివర్మకూడ యాతని ఆంధ్రసాహిత్య పరిషచ్ఛాసనము*నందు ఈ విషయమును స్పష్టముగా చెప్పినాడు. రాజరాజు నలుబదియొక్క సంవత్సరములు రాజ్యముచేసినతరువాత నాతని పరోక్షమందు తన తండ్రిరాజ్యము జయించినాడని చెప్పుకొన్నాడు. కావున విజయాదిత్యుని స్వామిద్రోహమువలన రాజరాజునకు విశేషశ్రమయును, త్రికళింగరాజ్యాపహరణమును తటస్థించెను. క్రీ. శ. ౧౦౩౪ తరువాత కొంతకాలమునకు రాజరాజు, నన్నియ వచించినరీతి "ఘోరాజిముఖోపలబ్ధవిజయ ప్రమదాక్రాంతుడై, నిస్తేజితవైరివీరుడై," "నిజభుజవిక్రమ విజితారాతి రాజనివహుండై" వేంగీరాజ్యమును మరల సంపాదించుకొని తమ్ముని దేశమునుండి తరిమివైచియుండెను. విజయాదిత్యుడట్లు నిర్వాసితుడై పరభూపతుల నాశ్రయింపుచు బోయినట్లు కానవచ్చుచున్నది. శత్రునిగ్రహములన ముగుట వలన రాజరాజు అనతికాలమున అపహృత త్రికళింగమును కూడ కళింగ, చేదిభూధవుల నుక్కణగించి మరల జయించుకొనినట్లు ఊహింప నవకాశము గలుగుచున్నది. నన్నియభట్టారకు డందుచేతనే కాబోలు నందమపూండి శాసనమున రాజరాజు నిట్లభివర్ణించియున్నారు. ఈ నందమపూండి తామ్రశాసనము రాజరాజుయొక్క ౩౨-వ ప్రవర్ధమాన విజయరాజ్య సంవత్సరమునాటిది. అందు:-

"యస్య స్ఫార భుజాకృపాణదళితా
రాతీ కుంభస్థల
ప్రోన్ముక్తామల వృత్తమౌక్తికచయ
స్సంగ్రామ రంగాంతరే
ధత్తే వీరరసక్రియాభినయన
ప్రస్తావనాలక్షితాం
వీరశ్రీ రహితాంజలిప్రవిసరత్
పుష్పోపహారశ్రియమ్."

అని రాజరాజును మనోహరముగా ప్రశంసించినారు.

మరల, రాజరాజు త్రికళింగరాజ్యము నెప్పుడు సాధించెనో నిర్ణయించుటకు శాసనాధారములు చాలవు. అయినను క్రీ.శ.౧౦౪౦-౪౫ సంవత్సరముల నడుమనని యూహింపవచ్చును. అప్పటికి చేదిదేశాధీశుడు గాంగేయదేవుడుకూడ మరణించిన ట్లగపడుచున్నది.

రాజరాజునకు విజయాదిత్యునితోడి యుద్ధములందు పరాజయముకలిగిననాటికి అనగా నాతని పండ్రెండవ లేక పదుమూడవ విజయరాజ్యవర్షమగు క్రీ. శ. ౧౦౩౪-౫ నాటికి కుమారుడు రాజేంద్రచోడుడు కలిగి యుండలేదు. కాని అప్పటికి ఆతడు పుత్రసంతానార్థియై యుండినట్లును, రాణియమ్మంగదేవి గర్భవతియైయుండె

* ఆంధ్రదేశీయేతిహాసపరిశోధకమండలి వారి త్రైమాసపత్రిక, సం. ౫.

నట్లును, పుత్రజననము గవని యభిలాషతో నుండినట్లును విజయాదిత్యుని శాసనములనాక శాసనవాక్యములందు ధ్వనింపుచున్నది. నన్నయభట్టు, ఆతడు తన యన్న రాజరాజు నుద్దేశించికాబోలు, "పుత్రీయన్నపి శరణార్థినం జిఘాం సుజ్ఞాతిసూర్యా న్నటవిభుదాంశ్చ సత్క్రియాభిః" (సం క్తు ౬౬–౬౮) అని చెప్పబడినాడు. కావున రాజరాజునకు ఏకకుమారుడైన రాజేంద్రచోడ దేవుడు క్రీ. శ. ౧౦౩౬–౮ వ సంవత్సర ప్రాంతమున జనించి యుండెనని నిర్ణయింపవచ్చును.

రాజరాజు పుత్రోదయమయిననాటినుండి, సుఖముగను నిరాతంకముగను రాజ్యపాలనముచేయుచుండినట్లు కన్పించుచున్నది. తమ్ముని విజయాదిత్యుని దేశమునుండి వెడలనడచి, రాజ్యమును శత్రుజననిశ్శేషముచేసినవైచి మహేంద్రమహేంద్రునిగా బరగుచుండిన ననవరత మహామహీరాజ్యసుఖంబు లనుభవించుచు, విమలమతిం బురాణములు వినుచు, అనేక ధర్మశాస్త్రముల తెఱగు తెలియుచు, మహోత్తరసాత్విక కావ్యనాటక క్రమముల పెక్కు సూచుచు, వగమఖారిపయాలబ్ధ సుస్థిరైశ్వర్య వంతుడై రాజ్యముచేసెను. కావుననే, నన్నయ, తన ప్రభువునుగూర్చి భారతమున "పండితాహితవీర", (ఆది. ఆ. ౩, ప. ౨౧౮) యనియు, "విక్రమోద్వేగితా హితుఁ" (ఆది. ఆ. ౮, ప. ౩౨౨) యనియు, "విరోధి ప్రబల కాంతార"(ఆది. ఆ.౨,ప.౩౫౮) యనియు, "భూరి ప్రతాపసవరిభూత విరోధివర్గా" (ఆది ఆ–౩, ప ౩౯౯) యనియును వర్ణించి రాజరాజుయొక్క సుస్థిరైశ్వర్యమును సూచించినాడు.

రాజరాజు తిరిగివేంగీసామ్రాజ్యమును సంపాదించిననాటినుండి పశ్చిమచాళుక్యులకును, చోళులకును బద్ధవైరము సాగెను. కర్ణాటసీమలను చోళసామ్రాజ్యములో జేర్చుకొని విజృంభించవలెనని చోళులును, చోళ రాజ్యమును కాంచీపురమువఱకు కబళించవలెనని పశ్చిమ చాళుక్యులును అహోరాత్రములు ఎడతెఱపిలేక పోరాడుచుండిరి. రాజరాజునకు బావయు, రాజేంద్రచోడుని యగ్రసుతుండునగు రాజాధిరాజు క్రీ. శ. ౧౦౧౮ మొదలుకొని ౧౦౫౨ వఱకు పరిపాలించి సమరాంగణమునందు ప్రాణములు విడిచెను. అతనికి పుత్రసంతతిలేని కతన ఆతని తమ్ముడు రాజేంద్రదేవుడు చోళమహీ రాజ్యమునకు పట్టముగట్టుకొనెను. ఈతడు క్రీ. శ. ౧౦౬౨ వఱకు పరిపాలించి అన్నవలె యుద్ధరంగమున ప్రాణము లను విడిచెను. వీరికి పశ్చిమచాళుక్యభూపతులలో జగదేకమల్ల ఇమ్మడిజయసింహుడును (క్రీ. శ. ౧౦౧౫—౧౦౪౨,) ఆతనికుమారుడు ఆహవమల్ల ప్రథమసోమేశ్వరుడును (క్రీ. శ.౧౦౪౨—౧౦౬౮)సమకాలికులు. రాజాధిరాజ, రాజేంద్రదేవు లిరువురును పశ్చిమచాళుక్యరాజ్యము అనేకపర్యాయములు దండెత్తిపోయి, నోలంబవాడిరాష్ట్రమునకు రాజధానియైన కంపిలీనగరమును ముట్టడించి దగ్ధము గావించినట్లు చెప్పుకొన్నారు. రాజేంద్రదేవుడు తుంగభద్రదాటి కొల్లిపాకపురమును దహనముగావించి, పశ్చిమచాళుక్యులకు ప్రక్కలో బల్లెమువలె మెలగెనాడు. పశ్చిమచాళుక్యు లిట్లు చోళులతోడి యుద్ధములందు మునిగియుండినకారణమున చోళులసహాయార్థ మరుగుచుండి వేంగీశ్వరునిపై కన్నెత్తిచూడజాలకుండిరి. ఈచోళ-చాళుక్యసంగ్రామములందు రాజరాజు చోళులపక్షమున మరుగుచు తఱచుగా నాహవభూమియందు జీవయాత్ర గడుపుచుండినాడనుటకు సందియములేదు.

ఇట్లు రాజరాజు పగతురకు అజేయుడై సమస్త రాజ్యసుఖము లనుభవించుచు తన యవసానకాలము వఱకు సుఖముగ రాజ్యపాలనముచేసెను. కాని కడపటి దినములలో మరల రాజరాజునకు శత్రువులవలన యొత్తిడి కలిగి విదేశమున మరణము సంభవించెను. ఆవృత్తాంత మిట్లు జరిగియుండవచ్చును. త్రికళింగరాజ్యమును సంపాదించుటకు చేదిదేశాధీశుడు మరల విశ్వప్రయత్నము చేయసాగెను. క్రీ. శ. ౧౦౬౨-వ సంవత్సరప్రాంతమున పశ్చిమచాళుక్యులు చోళులను వెన్నంటి తఱుముచుచోళరాజ్యములోనికి జొచ్చిరి. ఆయుద్ధములందు చోళరాజేంద్రదేవుడు మరణించియుండెను. ప్రాయశః యువరాజు రాజేంద్రచోడుడు మేనమామలకు సహాయార్థము ఆంధ్ర సేనల నడిపించుకొనిపోయియుండును. అప్పటి కాతని వయసు ఇరువదియైదుసంవత్సరము లుండును. వేంగీశ్వ

రునిస్పష్టి చోళ-చాళుక్యులయుద్ధములపై నున్నవేళ కని పెట్టి రాజరాజుయొక్క అవసానకాలమున చేదిరాజగు యశఃకర్ణదేవుఁ డాంధ్రదేశముపై దండెత్తివచ్చెను. ఈ యశఃకర్ణదేవుఁడు పూర్వోదాహృతుఁడయిన గాంగేయ దేవుని పౌత్రుఁడు. ఈదండయాత్రలో రాజరాజుపై పగ బూనియున్న విజయాదిత్యుఁ డేమయిన సాహాయ్యము చేయవచ్చినాఁడేమో తెలియదు. అపుడాంధ్రదేశమున జరిగిన మహాయుద్ధములందు రాజరాజెంతధైర్యసాహస ములతో బోరాడినను, యశఃకర్ణదేవునిచే నోడింపబడి, చివరకు రణరంగమున ప్రాణముల గోల్పోయెను. రాజ మహేంద్రవరమేగాక రాజ్యమంతయు శత్రువులచే జిక్కెను. దేశమంతయు మహాసంక్షోభమున మునిగి పోయెను. యశఃకర్ణదేవుఁడు తాను ఆంధ్రాధీశుని బరి మార్చితిననియు, నాతనిభాండాగారమును కొల్లగొట్టి చేజిక్కిన మాణిక్యాభరణాదిభూషణములను ఆతని కుల దైవతమగు దక్షవాటి భీమేశునికి కానుకగా నర్పించితి ననియు, తనవిజయములను, కీర్తిని సప్తగోదావరస్రవంతి తరంగములతో నృత్యముచేయుచు సప్తస్రవంతుల మధురస్వరములచే మదహంసవలె మనోహరముగ గానము చేయుచున్నదనియు దర్పముగ తనఖైరా తామ్రశాసన మున * వ్రాయించుకొన్నాఁడు. యశఃకర్ణదేవుని వాక్య ములందు అసత్యమేమియును గానరాదు. అందీవిషయవ ర్ణన మిట్లున్నది—

"ఆంధ్రాధీశమరంధ్రదోర్వ్యలసితం
స్వచ్ఛందముచ్ఛిందతా
యేనాభ్యర్చిత భూరిభిః సభగవా
న్భీమేశ్వరో భూషణైః,
యస్యా వర్ణ్య యదాత్తనృత్యలహరీ
భ్రూవల్లి గోదావరీ
కీర్త్యాణ్యన్మదహంసనాద మధురైః
స్రోతస్వరైః సప్తభిః."

ఈశాసనము క్రీ. శ. ౧౦౭౩ నాటిది. ఇందలి విషయములు రాజరాజునకేగాని తరువాతివారైన సప్తమ విజయాదిత్య, యిమ్మడిశక్తివర్మలకు చెందనట్లు నిర్ణ యింపవచ్చును. శక్తివర్మ రాజరాజతనయుఁడగు రాజేంద్ర చోడునిచే యుద్ధమున జంపబడినట్లు సప్తమ విజయా దిత్యు నిర్యాలిశాసనమునందలి వాక్యములు ధ్వనింప జేయుచున్నవి. విజయాదిత్యుఁడు నిర్విచారముగ పరిపాల నము చేయుచు మరణించెననుటకు కులోత్తుంగచోడదే వునియందు గలిగియుండుట తార్కాణము. మరియు నాతఁడు దివంగతుఁడగుటయు, కులోత్తుంగుఁడు వేంగీ రాజ్యమునకు తన రెండవకుమారుఁడు ముమ్మడిచోడు నభిషేకించుటయు క్రీ. శ. ౧౦౭౬ సంవత్సరమున వ్యవధి లేకుండ జరిగెను.

కావున యశఃకర్ణదేవుఁడుదండెత్తుకొనివచ్చి యోడించి పరిమార్చిన ఆంధ్రాధీశుఁడు రాజరాజుకావలయుననుట నిశ్చయము. యశఃకర్ణదేవుఁడు దక్షవాటిభీమేశ్వరుని యాలయమున శిలాశాసన మొంచినాఁడేమో తెలియదు. ఒకవేళనుంచినచో స్వాభిమానియగు రాజరాజతనయుఁడు కుమారరాజేంద్రచోడుఁడు చక్రవర్తియైన పిదప నద్దానిని తొలగించియుండనోపు. కులోత్తుంగ చోడదేవుని కాల మున భీమేశ్వరుని ప్రాసాదముపునర్నిర్మాణము గావింప బడియుండినట్లు ఇచ్చటి శాసనములు సూచించుచున్నవి. కాకున్న వేంగీశ్వరుల కులదైవతమగు భీమదేవుని ప్రాసా దాంతరమున రాజరాజుకాలమునాటివిగాని తత్పూర్వ మేలిన రాజన్యులకాలమునాటివిగాని శాసనమొక్క టియైనను గానరాకుండుటకు మరి ఏమికారణ ముండ వలయును?

యశఃకర్ణదేవుని దండయాత్రవలనను రాజరాజు మరణమువలనను ఆంధ్రభూమి సంక్షోభించిపోయెను. అంతకుబూర్వమారంభింపబడిన యాంధ్రమహాభారతము అంతట మూడు పర్వములతో నాగిపోయెను. నన్న యార్యుఁడును దేశమునకును తన ప్రభువునకును వాటిల్లిన కష్టమునకు తాళజాలక భగ్నహృదయుఁడై తనువు చాలిం చియుండును. రాజరాజుయొక్క అవసానకాలమున పరరాజు లెవ్వరో యాంధ్రదేశముపై దండెత్తివచ్చి

* ఎపిగ్రాఫియా ఇండికా, సం. ౧౨, పు. ౧౦౫.

పనియు, నప్పుడు జరిగిన ఘోర సంగ్రామములందు రాజరాజు మరణించెననియు, నంతట నన్నియభారత రచనసాంతము చేయజాలకపోయెననియు ప్రజలు నేటి వఱకు చెప్పుకొను గాథయందు కొంతసత్యమున్నదని యిపుడొప్పుకొనక తప్పదు.

పైన తెలిపినట్లు రాజరాజుయొక్క అవసాన కాలమున శత్రువులు రాజ్యముపై దండెత్తివచ్చినవేళ యువరాజ రాజేంద్రచోడుడు రాజమహేంద్రవరమున నుండినట్లు ఇంతకుముందే సూచించితిమి. అతడు మేన మామతో గలిసి ఆహవమల్లుని సైన్యముల నెదుర్కొనుచు నోలంబవాడి గాంగవాడిరాష్ట్రములందు పోరాడు చుండెనట్లూహింపవచ్చును. స్వదేశముపైకి శత్రువులు దండెత్తివచ్చినారని వినినతోడనే యాతడు రాజమహేంద్రవరమునకు నొక్కపరుగున వచ్చియుండును. కాని యాతడు స్వదేశోన్ముఖుడై వచ్చుచున్నాడనిన వార్త వినినంతనే యశఃకర్ణదేవుడు ఆంధ్ర దేశమును విడిచి పలాయితు డయ్యెను. రాజేంద్రచోడుడు తండ్రిమరణమునకు బిట్టువగచి శత్రువును శిక్షించుటకై సైన్యాధి త్రికళింగదేశము దాటి చేది దేశమువఱకు యశఃకర్ణదేవునితఱుముచుబోయెను. ఈకాలముననే, యశఃకర్ణదేవునినోడించి, యాతని ప్రసిద్ధ రాజధానిని వైరిపురమును, త్రికళింగరాజధానియగు చక్రకూటమును సాధించి, బలిష్ఠములైన యేనుగుమందలను పట్టుకొని స్వదేశమునకు మరలివచ్చినట్లు గన్పట్టుచున్నది. రాజేంద్రచోడుడు సింహాసన మెక్కినతరువాత మొదటి నాలుగయిదు సంవత్సరములలో వ్రాయించిన శాసనములన్నిటియందును చక్రకూట, వైరిపురముల వృత్తాంతములు ప్రసిద్ధములుగా వర్ణింపబడినవి. కళింగట్టుపరణిగూడ చేదదేశమున విజయములు, యేనుగుల మందలను పట్టుకొనుటయు బాల్యముననే జరిగినట్లు, అనగా యువరాజుగానుండిన వేళనే నిర్వహింపబడినట్లు వాకొనుచున్నది.

యువరాజరాజేంద్రచోడుడు వైరిపుర చక్రకూటములనుండి స్వదేశోన్ముఖుడై రాకమునుపు రాజమహేంద్రవరమున మరల నొక సంక్షోభముకలిగెను. విజయాదిత్యుడు అన్నచే మున్ను ఒకసారి యోటువడి దేశాంతరగతుడై పరరాజుల నాశ్రయించుచు జీవనము గడుపుచుండెనని ముందు తెలిపితిమి. అతడు పరరాజుల నాశ్రయింపబోయి, పశ్చిమ చాళుక్యరాజధానిం జేరుకొని యప్పుడేలుచున్న జగదేకమల్ల యిమ్మడి జయసింహదేవునితో మైత్రిసెఱపి, యాతనికడ కొలువుసంపాదించియుండెను. ఆతనికడనుండి నోలంబవాడి రాష్ట్రమును మాండలికముగా పరిగ్రహించి కంపిలినగరమును రాజధానిగా చేసుకొని పరిపాలింపసాగెను. ఈ విజయాదిత్యుని పేరు* తఱచుగా నిమ్మడి జయసింహుని కుమారుడైన ఆహవమల్ల ప్రథమ సోమేశ్వరుని శాసనములందు ఆతనితనయులతోపాటు గాన్పించుచుండినందున చరిత్రకారు లితనియా సోమేశ్వరుని కుమారునిగా భ్రమపడియుండిరి. ఇమ్మడి జయసింహుడు, వేంగీశ్వరునిపైగల క్రోధము పెంపున నాతని సవతితమ్ముడొక డనూయాపరుడై అసంతృప్తుడై అన్నపై ద్వేషముబూని తన్నాశ్రయింపవచ్చుటజూచి తనకది అనుకూలస్థితిగా నెంచి యా వేంగీశ్వరుడే తనకు సామంత మండలేశ్వరుడని గర్వముగా జెప్పుకొనుటకుగాబోలు అడిగినతత్క్షణము విజయాదిత్యునికి ఆశ్రయమిచ్చి, కొలువిచ్చియుండును. నాటనుండి యతడు పశ్చిమచాళుక్యులతో కలిసిమెలిసియుండుచు వారితోపాటు చోళులతోడి యుద్ధములందు పాల్గొనుచుండెను. యశఃకర్ణదేవుడు ఆంధ్రదేశముపై దండెత్తివచ్చి రాజరాజునకు ఒత్తిడి కలిగించుచుండుటచూచి, యది మంచిసమయముగా నెంచియో, లేక యశఃకర్ణదేవుని ప్రేరేపణచేతనో విజయాదిత్యుడుకూడ రాజమహేంద్రవరముమీదికి వచ్చెను. వేంగీరాజ్యమును మరల స్వాధీనపఱచుకొనుటకు ప్రయత్నముచేసెను. కాని యువరాజు రాజేంద్రచోడుడు కోపించి తన తండ్రిపై నెత్తివచ్చిన యశఃకర్ణదేవుని తరుముకొనిపోయియుండును. విజయాదిత్యుడంతవఱకు సమయముకొఱకు వేచియున్నవాడు గావున వేంగీరాజ్యమును సులభముగ కైవసము చేసికొనియుండును.

* Fleet: Dynasties of the Canarese Districts, p. 440.

ఈవృత్తాంతములన్నియు నిట్లేజరిగియుండెననుట కాధారములు స్పష్టముగ కానరావు గాని, సమకాలీనచారిత్రమును పరిశీలించినపుడును, విజయాదిత్యుని కుమారుడైన ఇమ్మడిశక్తివర్మ ఆంధ్రపరిషచ్ఛాసనమునం దొకవాక్యమును పరిశీలించినపుడును పైయంశము లట్లు జరిగియుండెనని తోచకమానదు. చూడుడు, ఇమ్మడిశక్తి వర్మ జనకుని గూర్చి యిట్లు పలుకుచున్నాడు:—

"విమలాదిత్యా త్పూర్వా
స్వయైకలక్ష్మైశ్చ మేడవ మహాదేవ్యాః,
అజని జయశ్రీ నిత్యో
విజయాదిత్యో నరేశ్వర స్తుత్యః.

పరోక్షే రాజరాజస్య భ్రాతుర్ద్వైమాతురస్య యః,
ప్రత్యగ్రహీన్మహీ రాజ్యం వీర శ్రీయాయుతః."

ఉభయపార్శ్వములందు నొత్తిడి కలుగుటవలన రాజరాజెంత ధైర్యసాహసములతో బోరాడినను విధివశమున ఓడింపబడుటయు చివరకు మరణించుటయు సంభవించెను. విజయాదిత్యుడు రాజరాజుయొక్క రాజ్యమును ఆతని పరోక్షమున లాగుకొనెనని శక్తివర్మ వచించుచున్నాడు. ఆంధ్రేశుని చంపితినని యశఃకర్ణదేవుడు చెప్పుకొనుచున్నాడు. ఉత్తమకులీనుడును, ఉదారుడును గావున యశఃకర్ణదేవుడు ప్రత్యర్థియైన రాజరాజుయొక్క క్షాత్రతేజమును, వీర్యమును, శౌర్యమును ప్రశంసించినాడు. రాజరాజు మరణము, యశఃకర్ణదేవుని దండయాత్ర, విజయాదిత్యుడు రాజ్యమును బలాత్కారముగా ఎవరులేనిసమయమున స్వాధీనము చేసికొనుట-నివియన్నియు నాంధ్రభూమిని సంక్షోభములో ముంచివైచెను.

విజయాదిత్యుని కప్పటికి వయసు గడచిపోవుచుండెను. బాల్యమునుండియు రణరంగమున జీవయాత్ర గడిపినవాడగుటచే నాతనికి రాజ్యమును తా నేలుటకంటె కుమారునిచే నేలింపజేయుట మేలని తోచెను. అంతట తాను జయించిన పైతృకరాజ్యమును, ఇమ్మడిశక్తివర్మకు పట్టముగట్టెను. తాను ఎప్పటియట్ల నోలంబవాడి సామంతరాష్ట్రమును పరిపాలించుటకై పశ్చిమ చాళుక్యరాజ్యమున కరిగెను.

వేంగీరాజ్యమును జయించుటకు సామంతప్రభువులు, దండనాథులు అనేకులు విజయాదిత్యునికి సహాయముచేసిరి. అట్టివారిలో అడపఅప్పనార్యు డొకడు. ఈ అడపఅప్పన శూద్రుడేమో యని సంశయము కలుగుచున్నది. కాని యితడు కాశ్యపగోత్రసంజాతు డనియు, ఆపస్తంబసూత్రు డనియు, పండితజనపారిజాత మనియు, కృతజ్ఞశీ యనియు వర్ణింపబడెను. ఇమ్మడి శక్తివర్మ తన పట్టాభిషేకసమయమున ఈ అడపఅప్పనార్యునికి ప్రోలునాటివిషయములోని నుమియవాడగ్రామమును అగ్రహారముగా నొనరించి సర్వకరపరిహారముగా ధారాదత్తముచేసెను. ఈవిషయము లన్నియు నిమ్మడి శక్తివర్మ ఆంధ్రపరిషచ్ఛాసనమునందు వర్ణింపబడెను. ఇమ్మడి శక్తివర్మ పట్టాభిషేకసమయము, విజయాదిత్యుడు వేంగిని రెండవసారి జయించినకాలమును సూచించుచున్నది. చూడుడు—

"గుణవసునిధి సంఖ్యాం యాతిశాకాబ్దపఙ్క్తౌ
దివసకృతి తులాస్థే యోఘగాద్రాజ్యలక్ష్మీం,
స్థిరతరమన రాధా శుక్లపక్ష ద్వితీయా
యుజి సురగురువారే కుంభలగ్నే భిషిక్తః."

గుణ=౬, వసు=౮, నిధి=౯—అనగా శకవర్షములు ౯౮౬ కాగా, తులయందు రవియుండగా అనగా (సౌరమానకార్తిక లేక) తులామాసమున, శుక్లపక్షవిదియా గురువారము, అనూరాధానక్షత్రమున కుంభలగ్నమున శక్తివర్మపట్టాభిషిక్తు డయ్యెను. ఈశకవర్షములును, తిథియు, మాసమును సరిగా క్రి. శ. ౧౦౬3 వ సంవత్సరమున అక్టోబరు ౨౦ తేది గురువారమునకు సరిపోవుచున్నది. ఈశాసనమునుబట్టి గూడ రాజరాజు నలుబదియొక్క సంవత్సరములు అవిచ్ఛిన్నముగ పరిపాలనము చేసినాడని స్పష్టమగుచున్నది. మరియు, ఇమ్మడి శక్తివర్మ బాలుడైనట్లును, విజయాదిత్యుడు జయించిన రాజ్యమును కుమారునికి ఒప్పగించినట్లును ఈశాసనవాక్యముల వలన దెలియుచున్నది.

"యోరుహ్యాస్వకమాపిరాపతితరా ముత్తుంగసింహాసనం
పిత్రానిర్జితశాత్రవేణ విజయాదిత్యేన నిత్యౌజసా
పుత్రస్నేహప్రపూర్ణ మనసా సామ్రాజ్యపట్టం భువో
యస్మిన్న స్థితిమాయుగంసమవతవ్యాయేనసర్వాప్రజాః."

పై శ్లోకమునుబట్టి విజయాదిత్యుడు పుత్రస్నేహముచేతనే వేంగిరాజ్యమును మరల జయించి దానిని పట్టముగట్టినాడని విదితమగుచున్నది.

విజయాదిత్యుని కీర్తివర్మ హైహయరాజకన్యయగు మాళవమహాదేవియందు జన్మించినాడు. ఈ మాళవదేవి జనకు డేప్రాంతము నేలుచుండిన హైహయ వంశజుడో తెలియరాదు. ఆంధ్రదేశమునందు కూడ కొందరు హైహయులు పరిపాలించుచుండిరి. కోన సీమనేలినవారును, పల్నాటి సీమనేలినవారును హైహయవంశీయులమని చెప్పుకొన్న కలచురిరాజులే. ఈ కలచురిరాజవంశమువారిది తొలుత చేదిదేశము. మాళవమహాదేవి, యిందువలన కలచురివంశజుడైన చేదిభూపాలుడు యశఃకర్ణదేవుని కేమయిన చుట్టమేమో తెలియదు. ఒకవేళ యీమె చేదిదేశాధీశుల యింటి యాడుబిడ్డ యగునో, యశఃకర్ణదేవుడు వేంగిపై దండెత్తివచ్చుటలో నాశ్చర్యమేమియు గనబట్టదు. ఇమ్మడిశక్తివర్మకు సత్యాశ్రయుడనియు, సమరైకభైరవుడనియు బిరుదములు గలవు. సింహాసన మెక్కునాటి కితడు బాలుడైయుండెనని పై నుదాహరించిన శ్లోకములందే సూచితమగుచున్నది.

ఇమ్మడిశక్తివర్మ చిరకాలము రాజ్యసుఖము లనుభవించినట్లగపడదు. ఇతనిని సింహాసన మెక్కించి దేశము పదిలపరచి రాజద్రోహులవలన నెట్టిబాధయు లేకుండ విశ్వాసపాత్రులయిన దండాధీశుల నియమించి విజయాదిత్యుడు మరల నొలంబవాడిరాజ్యమునకు మరలిపోయెను. ఇట్లు ఇతడు వేంగిని విడిచిపోవుటకు ముఖ్యకారణ మొకటి గనబట్టుచున్నది. పశ్చిమచాళుక్యభూపతి ఆహవమల్ల త్రైలోక్యమల్ల ప్రథమసోమేశ్వరునికి చోళవీరరాజేంద్రుని వలన ఒత్తిడి కలుగ నారంభించియుండును. వీరరాజేంద్రుడు రాజరాజుతో వియ్యమందిన రాజేంద్రదేవుని తమ్ముడు. రాజేంద్రదేవుడును రాజరాజువలె క్రీ. శ. ౧౦౬౨-3 వ సంవత్సరమున రణరంగమున శత్రుజన మధ్యమున ప్రాణముల విడిచెను. సమీపమునన్న వీరరాజేంద్రుడు సర్వసైన్యాధిపత్యమును వహించి, అన్న చేయుచుండిన మహాయుద్ధమును కొనసాగింప బూనుకొనెను. రాజేంద్రదేవుని కుమారుడు రాజమహేంద్రుడు బాలుడగుటచేత రాజ్యమును వీరరాజేంద్రు డపహరించెను. రాజేంద్రదేవుడు మరణించునాటికి కుమారరాజేంద్రచోడుడు యశఃకర్ణదేవుని రాజ్యమునందు పోరాడుచుండెను. మొదట తండ్రిమరణమును, తరువాత పిల్లనిచ్చిన మేనమామ మరణమును వరుసగా, తెలవని తలంపుగా సంభవించెను. ఇంతలో నాతడు విజయియై చక్రకూటమునుండి వేంగికి మరలివచ్చెను. అచ్చట రాజ్యమును తన పితృవ్యునకు వశముచేసికొని కుమారుని సింహాసన మెక్కించుట గాంచెను. కాని యెట్లయిన పైతృకరాజ్యమును సంపాదింప నెలచి తమ్మునిపైకి నెదలెను. ఈ యుద్ధమున శక్తివర్మ యొంటరిగ రాజేంద్రచోడునితో బోరి హతుడయ్యెను. రాజమహేంద్రవరము రాజరాజతనూజునికి సులభముగ కైవసమయ్యెను. కుమారునికి కలిగిన యిక్కట్టును విని రాజేంద్రచోడు నెదుర్కొనుటకై విజయాదిత్యుడు వేంగిదేశమునకు మరలివచ్చెను. కాని ఇమ్మడిశక్తివర్మ దుర్మరణము విజయాదిత్యుని కెంత దుఃఖము కలిగించెనో, కుమారరాజేంద్రచోడునకుగూడ నంత మనఃక్లేశము కలిగించెను. మరియు నాతనిహృదయమున చోళరాజ్యాభిలాష మహావృక్షమువలె నాటుకొనియుండెను. పైతృకరాజ్యముతోపాటు మాతామహరాజ్యమునుకూడ చక్రవర్తి బిరుదముతో నేలుకొనవలయునని సంకల్పముకలిగెను. అతడు మహామేధావియు, పరాక్రమశాలియు, రాజనీతిజ్ఞుడును గావున వైరముతలపెట్టివచ్చిన వృద్ధుడైన పితృవ్యునితో యుద్ధము చేయుటకుమారు సంధి నెఱపెను. తమలో తమకు భేదములుండి వైరము లుండవచ్చునుగాని పరులతోడి వివాదములు కలుగుచున్నపుడు పగపెంపుచేయరాదను భావముతో రాజేంద్రచోడుడు పినతండ్రికి దుఃఖోపశమనము చేసి, తమ్ముని బరిమార్చి జయించినరాజ్యమును విజయా

దిత్యునివశముచేసి, దక్షిణమునకు పయనమయ్యెను. రాజరాజుకాలమునుండి వర్ధిల్లిన వైరానలము, కుమారరాజేంద్రచోడుని రాజనీతిచే చల్లారిపోయెను. విజయాదిత్యుఁడును పశ్చాత్తప్తుఁడయ్యెను. ఈవృత్తాంతములు జరిగిన పండ్రెండుసంవత్సరములకు ఒకనాఁడు విజయాదిత్యుఁడు వ్యాలిదానశాసనమును ఆజ్ఞాపించుచు, తనకుమారు డభిమన్యునివలె చిఱుతప్రాయమున దాయాదులను శత్రుమన్యమున అన్యాయముగ దుర్మరణము నొందెననియు, తాను విజయునివలె దుఃఖమును దిగమ్రింగి ధర్మముకొరకు, ప్రజారక్షణకును రాజ్యపాలనమును భరించుచున్నానని మిక్కిలి దుఃఖముతో కుమారుని స్మరించుకొనెను. ఇమ్మడిశక్తివర్మను అభిమన్యుకుమారునితోడను, తన్ను విజయునితోడను బోల్చుకొనుచు నాడినవాక్యములు, శక్తివర్మమరణమునకు రాజేంద్రచోడుఁడు కారణమని తోఁపింపచేయుచున్నవి. విజయాదిత్యుని కీవేంగిరాజ్యము రాజేంద్రచోడుఁడు ప్రసన్నుఁడై వశముచేసినట్లు వీరచోడుని బెల్లూరిశాసనములోని రాజేంద్రచోడుని యీ క్రిందివాక్యములు చాటించుచున్నవి. రాజేంద్రచోడుఁడు కులోత్తుంగ చోళదేవచక్రవర్తి యను పేరుతో చోళరాజ్యమును పరిపాలించుచు, విజయాదిత్యునిమరణానంతరము పైతృకరాజ్యమును పరిపాలించుటకు కుమారవీరచోడుని పంపెంచువేళ నిట్లు పల్కినాఁడు:

"మయా వేంగిమహీరాజ్యం చోడరాజ్యాభిలాషిణా,
మత్పితృవ్యే పురాన్యస్తం విజయాదిత్యభూభుజి.
సచ పంచదశాబ్దాని పంచానన పరాక్రమః,
మహీరక్ష న్మహీనాథో దివం దేవోపగతః."

విజయాదిత్యుఁడు, కుమారుని మరణానంతరము, సత్యాశ్రయబిరుదముతో, పదునైదు సంవత్సరములు వేంగిమహీరాజ్యమును పరిపాలించి క్రీ. శ. ౧౦౭౦ సంవత్సరమున స్వర్గస్థుఁడయ్యెను. ఇతనికి కరవాలభైరవుఁడనియు, కలియుధిష్ఠిరుఁడనియు బిరుదములున్నవి. ఈతనితో పూర్వచాళుక్యాన్వయము వేంగిసింహాపీఠిపై నంతరించెను. రాజమహేంద్రవరమునకు ఇతనితరువాత ప్రసిద్ధియు, ప్రాముఖ్యమును గతించెను.

---

(వెనుకటి పేజీలో ముగిసిన వ్యాసము తరువాయి)

తా. క.

ప్రాయశః యువరాజ రాజేంద్రచోడుడు, తన మేనమామ సహాయార్థము చోళదేశమునకు క్రీ. శ. ౧౧౭౨-వ ప్రాంతమున సేనలను నడిపించుకొని పోయియుండుననియు, రాజరాజు అవసానకాలమున యశఃకర్ణదేవు డాంధ్రదేశముపై దండెత్తివచ్చి యాతని బరిమార్చెననియు వ్రాసి తదూహకు కొన్ని కారణములు చూపితిని. పునర్విమర్శనవలన నాకవి సందర్భములుగా కన్పడుటలేదు. అప్పుడాకాలమున ఏది ఎట్లుజరిగియుండెనో ఎవ్వరును నిశ్చయముగా చెప్పజాలరు. కాని యిట్లు జరిగియుండునని యూహింపవచ్చును అందు శాసనాదులాధారములు. కావున;

౧. క్రీ. శ. ౧౦౬౦—౬౨ సంవత్సరముల ప్రాంతమున చోళరాజేంద్రునకు సహాయముగా రాజరాజే అరిగియుండిన ట్లూహింపవలయును.

౨. అంతకుమున్నే క్రీ. శ. ౧౦౫౮—౧౦౬౦ సంవత్సరముల నడుమ చక్రకూటరాజ్యము (ఇప్పటి బస్తరురాజ్యము. పూర్వపు త్రికలింగరాజ్యభాగము)న ధారావర్ష దేవుడు పూర్వమునుండి వేంగీశ్వరునకు సామంతుడుగానుండి తిరుగు బాటొనరించినందున నాతని శిక్షించుటకై రాజరాజు తనకుమారుని యువరాజ రాజేంద్రచోడుని బంపియుండెను. ' ఇతడు ధారావర్ష దేవుని ఓడించి, చంపి, యాతనిరాజ్యమునుండి విశేషముగ ధనమును, మదించిన ఏనుగులమందలను తర్లించుకొనివచ్చెను. చక్రకూటరాజ్యాపహరణము, ధారావర్ష దేవుని బరిమార్చుటయు, వజ్రగిరిని (వాయిరాగరము—లేక వైరిఘడ్) సాధించుటాది సాహసకృత్యములను రాజేంద్రచోడుడు తాను యువరాజుగానున్న దినములలో గావించియుంటినని పలుసారులు చెప్పుకొనియున్నాడు. కావున ఆతడు దూరదేశమున చక్రకూట, త్రిలింగరాజ్యసీమలందు యుద్ధముసేయుచుండెను. రాజరాజు చోళరాజ్యమున బావకు సాహాయ్యముచేయబోయియుండెను. అట్టితఱి విజయాదిత్యుడు తన సవతి యన్న దేశమున లేనిసమయముజూచి వేంగిపై దండెత్తివచ్చియుండి రాజ్య మాక్రమించుకొనియుండును. ఇమ్మడి శక్తివర్మ ఆంధ్రసాహిత్య పరిషచ్ఛాసనములోని పూర్వోదాహృత "విమలాదిత్యా" అను శ్లోకము ఈయూహను బలపఱచుచున్నది. విజయాదిత్యుడు, కుమారునికి బట్టము గట్టి మరల పశ్చిమచాళుక్యరాజ్యమున కరిగిన వేళ యశఃకర్ణదేవు డాంధ్రదేశముపై దండెత్తివచ్చియుండును. శక్తివర్మ బాలుడును అవివాహితుడును కావుననే యశఃకర్ణదేవు డాంధ్రాధీశుని నిర్మూలముచేసితినని చెప్పుకొనుచు వంశములేకుండ జేసినాడని ధ్వనింపజేసినాడు. శక్తివర్మచావుతో నాతనివంశము గతించినదిగదా! యశఃకర్ణదేవుని దుండగము విని విజయాదిత్యుడును రాజేంద్రచోడుడును వేంగీదేశమున కొక్కుమ్మడి పరుగున వచ్చియుండవలయును. వీరిరాకకు వెఱచి ప్రాయశః యశఃకర్ణుడు ప్రాణములు దక్కించుటకు పారిపోయియుండును.

పుత్రవియోగదుఃఖమున ఘూర్ణిల్లి పోవుచున్న విజయాదిత్యునితో కుమారరాజేంద్రుడు సంధి నెఱపెను. నిజముగా నాతడు తొలుత వేంగిపైదండెత్తివచ్చి తన తండ్రిలేని సమయమున రాజ్యమపహరించినందులకు క్రోధముబూనక క్షమించెను. తనరాజ్యమును మరల విజయాదిత్యునికిచ్చి, చోళరాజ్యాభిలాషియై దక్షిణదేశమునకు వెంటనే బోయెను.

కావున ఇమ్మడిశక్తివర్మ రాజేంద్రచోడునిచేతగాక యశఃకర్ణదేవునిచేత చంపబడియుండిన ట్లూహింపవలయును. న్యాలిశాసన శ్లోకములందిందులకు వ్యతిరేకభావము స్ఫురింపజేయుటలేదు. తనవా రెవ్వరును లేక,

తండ్రియు, సోదరులును మార్గస్థులయియుండినవేళ శక్తి వచ్చ అభిమన్యునివలె మహాతేజశ్శాలియై పోరాడుచు దుర్మరణమువాత బడెననియె స్ఫురించుచున్నది.

సవరణ:—

వెనుకటి సంచికలో ౪౬౪-వ పుటయందు ౩-వ పుటునోటున "విజయాదిత్యునితల్లి మేడవదేవి" యన టకుమారుగా "భార్యమాలవదేవి" యని పొరబాటుపడినది. పాఠకులు సవరించుకొందురుగాక.

—భా. వేం. కృ

---

# విధివిధానము

గున్నేపల్లి రుక్మిణీదేవిగారు

సిరులఁ బొలుపొందు జనకభూవరునియింటఁ
బెరిఁగి సద్గుణరాశి నాఁబరఁగి పతిత
పావనుని నిన్ను భర్తగాఁ బడసి సీత
వగలపాలయ్యెనే! రఘువంశతిలక!

శివధనుర్భంగమునఁ గూఁతుఁ జేకొనంగ
జనకుఁ డెంత యానందనిస్తంద్రుఁ డయ్యెఁ
బౌరులును నెంత సంతోషభరితు లైరి
సఫలములు గావు గాక యాశయము లవుర!

దర్పమునఁ బుత్రమిత్రబాంధవులతోడ
దుర్మతివి రావణుని వానిదోస మెంచి
యేదొసఁగు నెంచి యిట్టె నీయింతి నకట!
దుర్గమారణ్యభూములఁ ద్రోసినావు?

పామరులమాట పాటించి ప్రాణములకుఁ
బ్రాణ మనఁదగు ప్రియురాలిఁ బాయుటనఁగ
జగతి మనుజమాత్రులకెల్ల సాధ్యమగునె
కనికరము లేని నీకు నొక్కనికిఁ దక్క?

ప్రాజ్ఞతముఁడవు 'నాతిచరామి'యనిన
పలుకునకు భిన్నముగ నీవు మెలఁగనగునె?
నీవె యిమ్మెయి వర్తింప నెలఁతలమెడఁ
బ్రియము సల్పెడి ప్రజ్ఞాధురీణు లెవరు?

నీప్రతిజ్ఞ ప్రతిజ్ఞగా నిలుపుకొనఁగ
వనులపాల్చేసితో ధర్మపత్ని నకట!
భవ్యగుణపూత మాసీత పరమసాధ్వి
పలుపలుకు లేమిటికి స్వార్థపరుఁడవైతి.

బుద్ధ్యభిప్రాయములు దేహములు తలంప
ఖ్యాతియే నిత్య మనుచు లోకమున నీదు
జీవితవిశేషమును బ్రదర్శించినావొ?
కాక యెఱుఁగవొ ధర్మార్థకలన మీవు

సర్వజనమాన్యుఁడవు నీకు సాటి కలరె?
యెంతవిజ్ఞానఖని వైన నుంతయేని
సతివియోగాగ్నిఁ జల్లార్పఁ జాలినావె?
విధివిధానము నెవరు తప్పింపఁగలరు?

బాదినప్ప మార్కండేయులుగారు

మొన్న జరిగిన ప్రపంచమహాయుద్ధములో జనులు పడిన మహాదారుణబాధలు, గల్గిన అపారమైన ధననష్టము స్ఫురణకు తెచ్చుకొనినచో ఆమృత్యుదేవత కట్లు వీరవిహారము సల్పుటకు స్వాతంత్ర్య మిచ్చిన పాశ్చాత్యులపై నెవరికి వెగటు పుట్టదు? మతము, నీతి, జ్ఞానము మొదలుగాగల లక్ష్యజీవితముల నట్టేట గలపి ఈపవిత్ర ప్రపంచమును మహాదారుణ సంగ్రామరంగముగా మార్చిన, నాగరికు లనబడు పాశ్చాత్యుల మత జ్ఞానశూన్యతలకు తక్కిన దేశస్థులు వారిపై జాలి చూపుల బరపుటకంటె చేయున దేమియు లేదు. ఆదినుండివారు సోదరదేశస్థుల దారుణసంగ్రామమునకు సరిచేసిన సంఖ్య అపారము. "నాలుగు సెకండ్లకొకొక్క పదిమంది చొప్పున నొకగుర్తును దాట మొదలిడినచో, యుద్ధము చేయుచు నైతే నేమి, యుద్ధకారణములవల్ల నైతే నేమి, హతులైనవా రందరు ఆగుర్తును దాటుటకు ౧౦ దినములు పట్టును!" ఇంక వ్యయమైన ధనము దురూహ్యము.

* "The nations spent in about four years of war an amount equal to £ 194 for every minute which has been ticked off since Jesus Christ was born on this earth 19 centuries ago."

[ప్రపంచములో క్రీస్తు పుట్టినతర్వాత అనగా ౧౯ శతాబ్దములనుండి నిమిషమునకు ౧౯౪ పౌండ్లు ఖర్చు అయినది.] ఈధననష్టము, ఈనాగరికు లనబడు వారి అపలక్షణములు వారిలో కొందరు గ్రహించి ప్రపంచములో యుద్ధములు లేకుండా శాశ్వతశాంతి కూర్చవలయునని ప్రయత్నములు చేయ మొదలిడిరి.

సహజమే గదా, కుక్కను కాలు విరుగునట్లు కొట్టినచో కాలు నయమైనతర్వాత మరల ఇంటిలో జొరబడునటు? మానవుని ప్రకృతియు నంతే. ఎట్లయినను ప్రపంచశాంతి చేకూర్చవలయునని ౨౦ వ శతాబ్దపు రాజకీయవేత్తలు గాఢముగా నభిప్రాయపడిరి. ఇంగ్లాండులో గొప్పరాజకీయవేత్త డేవిడ్ లాయడ్ జార్జి (David Lloyd George) గారు ౧౯౨౬ జూలై ౨౬-వ తారీఖున, "Each generation has its task. The supreme task of the generation that is arising now, and which is commencing its work in life, is to achieve the substitution of organised justice for organised violence." [ప్రస్తుత ప్రపంచజనుల కర్తవ్యము ప్రపంచములో శాశ్వతశాంతి చేకూర్చుటయే] అని పల్కిరి. రాజకీయధురంధరు లిప్పటికైనను గాఢనిద్రలో నప్పుడప్పుడు మెలకువ గల్గు చిహ్నములుగా కనురెప్ప లెగురవేయుట శుభసూచకము. తా నమెరికా ప్రెసిడెంటుగా నుండగనే కాల్విన్ కూలిజ్ (Calvin Coolidge) గా రిట్లభిప్రాయ మిడిరి: "If this generation fails to devise measures for the prevention of war, it will deserve the disaster which surely will be visited upon it." [ఈ ప్రపంచవాసులు శాంతిస్థాపన చేయలేకపోయినచో ఈమాటు గల్గు ప్రళయము ననుభవించుటకు వీ రర్హు లగుదురు.] గ్రేప్రభువు (Viscount Grey) అను ఇంగ్లాండుదేశపు రాజకీయవేత్త "If civilisation cannot destroy armaments, armaments will distroy civilisation." [నాగరకత యుద్ధపరికరముల నాశనము చేసి శాంతి కూర్చలేకపోయినచో, యుద్ధపరికరములు నాగరికతను నాశనముచేయును] అని నుడివిరి.

అట్టి శాంతి కూర్చుటకై పలుపలువిధముల నభిప్రాయముల సూచించిరి. కొందరు అమెరికాసంయుక్త రాష్ట్రములవలె ప్రపంచసంయుక్తరాష్ట్రముల నేర్పరచి యుద్ధములు సంభవించినప్పుడు ప్రెసిడెంటుగారిచేతనో

* John L. Shuller's "Peace or war", page 27.

లేక కమిటీచేతనో రూలింగు నిప్పించినచో శాంతి చేకూరదాయని ప్రశ్నించిరి.—మరికొందరు స్వతంత్ర-అంతర్జాతీయ న్యాయస్థానము (Independent International Judicial Tribunal) ను స్థాపించి దేశదేశములకు మధ్య వచ్చు తగాదాలపై తీర్పులు చేయించినచో శాంతి చేకూరక్షేమి చేయు ననిరి. —ఇంక కొంతమంది అన్ని దేశముల పరిపాలనవిధానములలోను మార్పులు చేసి, యుద్ధములు సంభవింప నున్నప్పుడు ప్రజానాయకులు యుద్ధముచేయుటకు ప్రజాంగీకారము తీసికొనవల యునని రూలు పెట్టినచో యుద్ధభీతిచే ప్రజలు అంగీకరించరు గదా, ఇంక యుద్ధము సంభవించుటకు దోవ ఎక్కడి దనిరి.—ఈ విధముగా చిత్రవిచిత్రగతుల భ్రమలుపడిరి.

వర్సైలిస్‌సంధిప్రకారము జర్మనీ మొదట ఆయుధములను తగ్గించుకొనవల యును, తరువాత తక్కినదేశస్థులు తగ్గించుకొందురని సంతకములు పెట్టిరి. అట్టిసంతకము పెట్టినవారము పెట్టనే పెట్టితిమి గదా, జర్మనీ ఆయుధములను తగ్గించుకొనినది; తక్కినదేశస్థుల మందరముగూడ మనమన ఆయుధములను సముద్రములలో పారవేసి యుద్ధముల మానివేసి ఇండ్లలో శాంతిగీతముల పాడుచు కూర్చుందమనిరి. మొన్న ఫిబ్రవరి ౨-వతారీఖున జినీవాలో ఆర్థర్ హెండెర్సన్ (Arthur Henderson) గారి అధ్యక్షతక్రింద పెద్దసభ చేసిరి. వీరు క్రిందటి లేబరుగవర్న మెంటులో విదేశాంగమంత్రి. ఇప్పుడు వీరికి కామన్సులో సభ్యత్వముగూడ లేదు. ఆ జినీవా ఆయుధవిసర్జనసమావేశములో పలువురు పలువిధముల సూచనల సూచించిరి. అన్ని సూచనలభావము సైన్యము, యుద్ధ విమానములు, విషవాయు ప్రయోగములు తగ్గింపవలయునని గలదు. కాని దేనివంక ప్రపంచ వాసుల దృష్టులు ఆశాపూరితములుగా ప్రసరింపబడినవో, అట్టి మొన్నటి జనీవాసభ చాల విచిత్రముగా జరిగిపోయినది. విప్రవినోదుల మాయవలె గన్పట్టినది. ఇట్టి మహాసభా ఫలితముగా నిర్మింపబోవు శాంతిసౌధము నిత్యకల్యాణము పచ్చ తోరణముగా, దేదీప్యమానముగా నుండుట కవకాశ మున్నదా? అసలు అట్టిసౌధము నిర్మించి శాంతిసౌఖ్య మనుభవించవలయునని ఈపాశ్చాత్యులకు నిజమగు ఉత్సాహము ప్రేమ గల్గినదా? మొన్న మబ్బులు, ఉరుములు, మెరుపులు లేకుండనే పిడుగు పడినట్లు సంభవించిన చీనా-జపానుయుద్ధమునకు మండుచున్న మంట లెగసన త్రోయునట్లుగా వారికి యుద్ధసామగ్రిని పంపుటలో పోటీలుపడి గింజుకొనుచున్నారు. అసలు వ్యాపారపు పోటీలవల్లనే గదా మొన్న ప్రపంచ మహాయుద్ధము జరిగినది. Daily Herald పత్రిక ఇట్లు వ్రాయుచున్నది: *'Even while the nations are seeking the path to disarmament at Genava, millions of pounds worth of war material is pouring from Europe into China and Japan Armament makers in Great Britain, Franch, Germany, Norway, Poland are now engaged in a desperate commercial race to capture the "War" markets. The private manufacture of war material denounced by Dr. Addison in the 'Daily Herald' of the 9th February as one of the greatest obstacles to disarmament has indeed become a world-scandal. Guns of all calibres, ammunition, both small arm and shell, bombs, light rockets and aeroplanes are arriving at Japanese and Chinese ports at the rate of hundreds of pounds worth a month. During the last six months of last year there passed through the port of Shanghai alone £ 353,679 worth of arms and ammunition. Aeroplanes to the value of £ 289,790 were also admitted bringing the total above £600,000. The total amount imported for all China last year was £ 1,557,854 or only about twice what one port has entered during the past six months.'

[ఆయుధవిసర్జనోపాయముల పలువురు పలువిధముల వెదకుచుండగనే యూరపుదేశములు చీనా జపానుదేశముల కెగుమతి చేయుచున్న ఆయుధముల విలువ అపరిమితము. గ్రేటుబ్రిటను, ఫ్రాంసు, జర్మనీ, నార్వే, పోలాండుదేశములు పోటీలుపడి పెద్దవ్యాపారయుద్ధములో మునిగియున్నారు. పెద్దపెద్ద యుద్ధ-తుపా

* Quoted in the "Hindu" of the 8th March, '32.

సులు, బాంబులు, యుద్ధవిమానములు మొదలగు యుద్ధ- ఆయుధములు నెలకు కొన్ని వందలపౌండ్లవిలువకు చీనా జపానురేవులలో దిగుమతియగుచున్నవి. క్రిందటి సంవత్సరపు చివరఆరునెలలలోనే ఒక్క షాంగైలో దిగుమతియైన ఆయుధములవిలువ ౩,౫౩,౬౭౯ పౌనులు. దీనికి ఇంకను యుద్ధవిమానములవిలువ ౨,౮౯,౭౯౦ పౌనులు కలిపినచో ౬,౦౦,౦౦౦ పౌండ్లపైచిల్లర అగుచున్నది. చీనాదేశమంతకు కలిపి ఎగుమతియైన ఆయుధములవిలువ ౧౫,౫౭,౮౫౭ పౌండ్లు.] పిల్లి కండ్లు మూసుకొని పాలు త్రాగిన చూడలేకుండ పోవుటకు మన కెక్కడికి పోయినవి కండ్లు! కాన ఈశాంతిసౌధమునకు నిర్మాతలు పవిత్రమై, నిష్కల్మషమైన హృదయములతో పునాదుల వేసి నిర్మింపబూని రనుమాటలో పలుసందేహములకు తావున్నది. అసూయ, క్రోధము, వ్యాపారపుపోటీలు మొన్న జరిగిన మహాయుద్ధమునకు పూర్వ మున్నటులే యున్నవి. ఒక ప్రఖ్యాతిగడసిన పత్రిక ఇట్లు వ్రాయుచున్నది:

'The whole frame work of civilisation is still creaking under the oppressive weight of armaments and the world is again just like a "Powder magazine" where a chance spark might promote a universal conflagration. The suspicion between nations and the hatred between races are still there. The same old intrigues, the same old international greed and hatred are working their will.'

[ఈ ఆయుధములబరువుక్రింద ప్రపంచనాగరికత యంతయు మరల గజగజ వడకుచున్నది. ఒక్కనిప్పురవ్వతో తుపాకిమందుగుండ యంతయు బ్రద్దలైపోవునట్లే ప్రపంచమంతయు నేడున్నది. వివిధదేశముల మధ్య అనుమానములు, అసూయలు ఇంకను నట్లే యున్నవి. పూర్వ మున్న కుట్రలే, పూర్వ మున్న మాయోపాయములే, పూర్వ మున్న ఆశ, అసూయలే నేడును అడ్డంకులు లేకుండా పనులు చేయుచున్నవి.] ఇంకొకపత్రిక ఇట్లనుచున్నది:

'People have a habit of talking of disarmament, as if all a nation had to do was just to disarm. That is nonsense. No nation is going to disarm as long as it feels itself in danger. Until we reach an era of confidence and security, the world can make up its mind to go on supporting armies and navies.'

[ఆయుధవిసర్జనమోయని ప్రజలు మొత్తుకొనుచుండుట కలవాటుపడిరి. దేశము లన్నియు ఆయుధవిసర్జనము చేయుటకు సిద్ధమైనట్లే! అది చాల పొరపాటు. తన కపాయ మున్న దని తోచినంతవరకు ఏదేశమును ఆయుధవిసర్జనమును చేయబోదు. మనలో మనకు మనస్సులు కుదిరి, భయము లేదు గదా యని తోచినంతవరకు ప్రతిదేశము తన ఇష్టము వచ్చినట్లుగా సైన్యములను, యుద్ధనావలను పెంచుచుండవచ్చును.] తలలు బోడులైన తలపులు బోడులా యన్నట్లు వీరిలో గుణము లెక్కడకు బోయినవి? మానవునిబుద్ధి కుక్కబుద్ధికంటె నీచమైనది. లాయిడుజార్జిగారు "Where are we going" అను పుస్తకములో ఇట్లు నుడివిరి:

'I warn you that it is madness to trust to the hope that mankind after such an experience, will not be so rash as to court another disaster of the same kind. The memory of the terrors, the losses, the sufferings of the war, will not restrain men from precipitating the world into something which is infinitely worse; and those who think so and therefore urge that it is not necessary to engage in a new crusade for peace, have not studied the perverse, the stubborn and the reckless nature of man'.

[అంతంత దారుణబాధ పడినప్పటికి నరబుద్ధిని నమ్మరాదని చెప్పుచున్నాను. ఆబాధలు, ఆధననష్టము మనమునం దుంచుకొనియు మరల అటువంటి యుద్ధము సంభవింపచేయుటకై మానవులు వెనుదీయరు. ఈశాంతికై ప్రయత్నములు వల దనువారు జ్ఞానహీనమైన మానవుని కుక్కబుద్ధిని బోధచేసుకొనలేదని తెల్పుచు

స్థాను.] సూక్ష్మగ్రాహులు, సున్నితులగు రాజకీయ ధురంధరులకు నిజము గ్రహించుట నిమిషముపాటి.

వేటకాడు పావురమును కాలికి గురిపెట్టి బాణము విడిచినచో పావురము వానికి చిక్కునా? గుండెలకు గురిగా తగులవలయును, పిట్ట మెలికలుతిరిగి క్రింద కూలవలయును. తల్లివేరు జబ్బుచూపినప్పుడు వృక్షము పెరుగజాలునా? అట్లే ఆయువుపట్టుకు భంగము గల్గినప్పుడు చేయ తలపెట్టిన కార్యము నెరవేరసాగదు. పట్టవలసినచోటు గుర్తుచూచి పట్టినచో ఏపనియైనను సానుకూలమగును. అట్టిఆయువుపట్టే గుర్తుచూచి ప్రపంచశాంతిపద్ధతికిగూడ పట్టవలయును. ఆఆయువుపట్టు ఈ వాషింగ్టన్—ఆయుధనియమనమహాసభలు గావు; ఈలండను-నౌకామహాసభలు గావు; ఈబూటకపు జనీవా ఆయుధవిసర్జనసమావేశములు గావు. అది మానవప్రకృతి. వివిధదేశస్థులకు పాపభీతి జనించి మతిమురుపడ ప్రేమ కుదురవలయును. అదె ప్రపంచశాంతికి ఆయువుపట్టు గాని ఈబూటకపు సమావేశములు గాజాలవు వీటిద్వారా ప్రపంచశాంతి కుదురు ననుట ఎండమావుల మంచి నీరు తెప్పింపగలమని ప్రగల్భము లాడుటవంటిది. Hague Tribunal for World Peace ౧౮౯౯ లో స్థాపింపబడినది పదునైదు సంవత్సరములలోనే పెళపెళ విరిగి కూలి పడినది. అది స్థాపింపబడిన తర్వాత నాలుగు మహాయుద్ధములు జరిగినవి. బోయరుయుద్ధము, బాల్కనుయుద్ధము, రష్యా-జపానుయుద్ధము, ప్రపంచయుద్ధము. కాన మానవుని ప్రకృతిమార్పే ముఖ్యమని గొప్ప గొప్పవారుకూడ గ్రహించి చెప్పిరి. కాల్విన్ కూలిడ్జిగారు ఇట్లు తెలిపిరి:

*'In nations, individuals have their counrer part. As we can expect some help from domestic laws, so we can expect some help from international covenants while each represents the best that humanity can do at this time, neither in itself is sufficient. As it is necessary to change the heart of the individual so it is necessary to change the heart of nations. This has often been referred to as moral disarmament.'

[దేశములలో ఆయాప్రజలు చేయవలసినపనులు గలవు. ఈప్రపంచమహాసభలవల్ల లాభము లేదనగూడదు. కాని వీటివల్ల ఎంచదగిన లాభము లేదు. మానవప్రకృతులు మారవలయును; దానిద్వారా దేశప్రకృతులు గూడ మారును. ఈమానవప్రకృతిమార్పే ఆయుధవిసర్జనమని చెప్పవచ్చును.] కాబట్టి ఇదివరకు జరిగిన, ముందు జరుగబోవు, సభలు ఫలవంతములు గాజాలవు.

*'No association of nations, no peace conferences, no world court, no referendum vote, no limitation or prohibition of war munitions, no outlawing of war, no arbitration treaties, no security pacts, no abolition of armaments, will ever avail to bring peace to this world. Pin not your hopes on any of these for the establishment of world peace.'

[దేశసంఘములు గాని, శాంతిసభలు గాని, ప్రపంచ-కోర్టులు గాని, యుద్ధపరికరములు చేయగూడదను రూలింగులు గాని, ఆయుధవిసర్జనపద్ధతులు గాని, ఇవేవియు శాశ్వతశాంతిని గూర్చజాలవు]

*'The only way to do away with war is to do away with causes of war, and they are so deeply imbedded in human nature. As long as human nature remains warlike you cannot dream of world peace.'

[యుద్ధము మాన్పించవలయునంటే, అది జరుగబోవు కారణముల మాన్పించవలయును. కాని అవ్వి మానవప్రకృతిలో ఐక్యమైపోయినవి. ఈమానవప్రకృతి యుద్ధప్రకృతిగా నెంతకాల ముండునో అంతకాలము ప్రపంచశాంతి చేకూరజాలదు.] మానవప్రకృతి శాంతియుతమై యుండవలయునని చెప్పితిమి. అదియు గాక జనులలో అట్టిమార్పు గలుగవలయు నంటే గొప్పగొప్ప

* Quoted in the Literary Digest for Jan. 15, 1927.
* John L. Shuller's "Peace or War", page 43.
* John L. Shuller's "Peace or War" page 33.

రాజకీయవేత్త లందరు దేశదేశములు దిరిగి ఉపన్యాస ముల నిచ్చుచు, శాంతియే సాధనముగా గొని వారివారి కార్యము నెరవేర్చుదలచువారి ప్రయత్నముల హిందూ దేశమునందువలె నణగద్రొక్కబడక, అట్టివాటికి చేయూత నిచ్చి సానుభూతి జూపవలయును. అంతియే గాని మెయిన్ స్విచ్ ని నెగటివ్ లో పెట్టుకొని, ఇతర స్విచ్ ల నెంత క్రిందికి మీదికి లాగినను దీపములు వెల్గి కాంతి నిచ్చునా? ఆయుధముల విసర్జించవలయునని మొత్తుకొనుచునే యున్నారు. ఆయుధములపై యుద్ధము నకు పూర్వము తరువాత పెట్టిన పెట్టుబడి చూడుడు.

సైన్యవ్యయము (పెన్షనులుమినహా)

మిల్లియనులపౌనులు (బంగారు) [మిల్లియను=పదిలక్షలు]

| | ౧౯౦౯/౧౩ | '౨౯ | '౩౦ |
|---|---|---|---|
| గ్రేటుబ్రిటను | ౬౮.౦ | ౯౯.౦ | ౯౫.౫ |
| ఫ్రాంసు | ౬౦.౦ | ౯౭.౪ | ౯౮.౦ |
| జర్మనీ | ౪౦.౦ | ౩౩.౭ | ౩౫.౧ |
| ఇటలీ | ౨౫.౦ | ౫౦.౮ | ౫౩.౬ |
| అమెరికా | ౬౧.౪ | ౧౮౬.౨ | ౧౮౫.౮ |
| జపాన్ | ౧౯.౪ | ౮౭.౭ | ౮౭.౦ |

నిజముగా యుద్ధము వద్దో దేవుడా యని ఇంత ఆక్రోశములును ఇదివర కెప్పుడును లేవు. ఆఆక్రోశ ములు పడవలసినకారణములును ఇప్పటికంటె ఇదివర కెప్పుడును లేవు. ఆయుధములు పెంచవద్దని ఇప్పు డున్నంత ప్రబోధమును ఇదివర కెప్పుడు లేదు. ఇప్పుడు ఆయుధములపై పెంచుచున్న పెట్టుబడులు గాని ఇదివర కెప్పుడును లేవు. పూర్వ మెప్పుడును యుద్ధమనిన ఇప్పు డున్నంత భయమును లేదు. ఇప్పుడు కన్పడుచున్న ట్లుగా యుద్ధచిహ్నములు పూర్వ మెప్పుడును లేవు.

ఈమధ్య జర్మనీ బ్రూయినింగ్ గవర్నమెంటు వారు "మేము యుద్ధములో నోడి లోటుకు పడిపోయి నాము. జనులకు తినుటకు తిండి, కట్టుటకు గుడ్డ లేక అల్లాడుచున్నారు. మేము యుద్ధఋణముల నేమాత్రము నివ్వలే" మని ప్రకటించుసరికి ప్రపంచవాసు లందరు ఈశాంతిసాధమున కిన్ని అడ్డంకులు తెసులుచున్న విదే మిరా దేవుడా యని తహతహలాడిరి. ఈఋణముల సమస్య న్యాయదృష్టితో పరిష్కరించనంతవరకు ప్రపంచములో శాంతి యనుమాట అదృశ్యమైపోవును. శాంతికి ముఖ్యమైన పెద్దఅడ్డంకి ఈఋణములసమస్యయే. జర్మనీవారు యుద్ధములో నోడిపోయిరి. ఆదెబ్బతోనే వారు పాతాళలోకమున కంటిరి. ఇంక గంపెడుయుద్ధ ఋణముల వారినెత్తిన వేసినచో వా రెక్కడనుంచి త్రవ్వుకొని రాగల్గుదురు? ఈయుద్ధఋణముల నసలు తీసివేసిననే గాని శాంతిని గూర్చి కలకనుటకైనను మన మర్హులము గామని గొప్పరాజనీతిపరులు చెప్పుచున్నారు.

అంతర్జాతీయ వాణిజ్యాగారపు తాత్కాలి కాధ్యక్షుడు ఫ్రౌసిన్ గారు (Mr. Frowcin, Acting President of theInternational Chamber of Commerce) ఇట్లు తెల్పుచున్నారు:—

* 'There can be no restoration of confidence while the problems of war debts and reparations were unsolved. I believe that complete cancellation of the above is essential.'

[యుద్ధఋణముల సమస్య పరిష్కరింపబడనంత వరకు శాంతి యుండజాలదు. అస లీయుద్ధఋణములు లేకుండ చేయుట ముఖ్యము, తప్పనిసరిగూడను.]

ఇప్పుడు కనిపెట్టబడుచున్న విషవాయువులు కొన్నివేలమంది మనుష్యుల ప్రాణముల నిమిషములలో తీయగలవు. వీటిగుణములు, రకములు అనేకములు చెప్ప వచ్చును గాని వ్యాసవిస్తరభీతిచే మానుచున్నాడను. చివ రకు ముగింపులో, ఈజనీవాసభలలో గాని మరేసభ లలో గాని ఎంచదగిన లాభము గల్గదు. మానవప్రకృతి మార్పుకై అందరును మనఃపూర్తిగా పనిచేయవల యును. రాజకీయవేత్తలు దేశదేశములు తిరిగి ఉపన్యాస ముల నిచ్చి, శాంతియే సాధనముగా గొని తమకార్యముల

* Message of the "Hindu" of the 12thMarch, 32.

నెరవేర్చువారి ప్రయత్నములకు సాయపడి, ఇతరులచే ధైర్యములు చెప్పించి, సానుభూతులు చూపునట్లు చేయ నిచో ఈశాంతిసౌధము పెళపెళ శబ్దములతో కూలు నను టకు సందియము లేదు. పరమేశ్వరు డీపాశ్చాత్యుల కిట్టి యభిప్రాయముల పుట్టించి శాశ్వతప్రపంచశాంతి చేకూరునట్లనుగ్రహించుగాక!

---

## ఒక అంశము

కొడాలి వెంకటసుబ్బారావుగారు, బి. ఏ.

ఒక మహోదుష్టమైన ముహూర్తమందు
ఋజుపథంబును వీడగోరిన మనస్సు
కక్షిగోచరమైన నీహాసమందు
పావనత్వమ్ము లోతుల పాతుకొందు.

ఒకట మేధాపరిశ్రమ నుడికిపోయి
దైహిక మ్మవశత్వమ్ము తవిలి దేని
నాచుకోలేని మనసులో తోచు నీదు
హాస మక్షయబలము నా కలవరించు.

ఒకట ప్రణయాత్మ నాకై నే నూహచేసి
భావముల వేలు వాగ్రూపములు సృజింతు
జీవముల తాల్చి యవ్వి నీచిరునగవుల
పరువులెత్తు యథార్థసంభవములట్లు.

నాయెద నీయురోజములు,
నాతల నీయెద తారుమారుగా
నాయువు పోవుదా కమరి
నట్టిది బంధము ఆత్మలోనె_పో
దూ; యతి నవ్యోదర్క వయసుతో
కృశియించెడి దేహ మిట్టులే
ఈయనుభూతితో నమయ నిమ్ము
పరార్థము చూత మావలన్.

పరు లుండ చెప్పనొప్పని పనేదో కాని
ఒకచిరునవ్వులో నొదిగి తెలియు
పరిహాసమునకునై బావలాడిన తథ్య
మొకచిరునవ్వులో నొదిగి కుట్టు
పరహితార్థము చేయవలయున దేదియో
ఒకచిరునవ్వులో నుత్సహించు
పచ్చడిమెతుకు లేర్పడిన అంధస్సేని
ఒకచిరునవ్వులో నోడ్చు రుచుల
నాతపస్సు ఫలించిన నాదుకోర్కి—
తనువు దాల్చిన నాయాత్మ దాగుకొన్న
ఒకమహస్సు నీచిరునవ్వు నొదిగి పొదిగి
ప్రణయనిగమతత్వము స్పష్టపరచు నాకు.

నీచిరునవ్వు పండును మ
ణి ప్రభలు; అందు సుఖార్థబోధను
శ్రీ చరియించు—అందు నివ
సించు పరాత్పరతైజసంబు వా
చాచలనంబు నాయెద ర
సస్థితి పొందిన నవ్యభావవీ
చీచయముల్ వెలార్చు నొక
సింధువె పొంగును వాని చూంచుచున్.

---



చిత్రము ౭



చిత్రము ౮

# ఖాదీపరిశ్రమ: పరిశోధనావశ్యకత–3

మిస్ మెల్లీ సోలింగర్ (స్విట్జర్లాండు)

(వెనుకటిసంచిక తరువాయి)

## నూలుపరీక్ష

వెనుకటివ్యాసమందు ప్రత్తిని నిడుచువిధానమందును, దూదిని ఏకువిధానమందును మనము జరుపవలసి యున్న పరిశోధనలనుగూర్చి చెప్పబడియున్నది. చరఖావిషయమై చేయవలసినపనినిగూర్చి చర్చించుటకు పూర్వము, ఖద్దరునూలుయొక్క గుణములను



మిస్ మెల్లీ సోలింగర్ (స్విట్జర్లాండు)

గురించియు, ఆగుణములను తెలుసుకొనుటకు ఎట్టిపరిశోధనావిధానములను మనము అవలంబించవలసినదియు– చెప్పవలసియున్నది. వడుకునూలునకును మిల్లునూలునకును అనేకగుణములయందు వ్యత్యాసము గలదు. మిల్లునూలు సన్నమునందును, బలమునందును, పురియందును, సాపునందును హెచ్చుతగ్గులు లేక, ఒక్కేరకము (uniform) గా నుండుటచే, మిల్లునూలుయొక్క గుణములును, ఉత్పత్తివిధానములందు ప్రవర్తనయు, కొన్ని ధర్మముల (laws) చే కట్టుబడియుండును. వడుకునూలునుగురించి మనకు అసలు తెలియకపోవుటచేతను, యంత్రసాహాయ్యముచేత గాక, చేతితో రాట్నముపై వడుకబడుటచేత, హెచ్చుతగ్గులు విస్తారముగా నుండుటవల్లను, వడుకునూలుకూడా గుణవిశేషములందు కొన్ని ధర్మములను అనుసరించునా యని మనకు సందేహము కలుగవచ్చును. ఈసందేహమును నివృత్తిచేసుకొనుట చాలా అవసరము. ఏలయన, వడుకునూలుయొక్క గుణవిశేషములను ఎంతక్షుణ్ణముగా మనము తెలుసు కొంటిమేని, అంతలాభకరముగా మనము నూలును బట్ట ఉత్పత్తియందు వినియోగించుకొనగల్గుదుము. నూలు పరీక్షయందును, నూలుపరిశోధనయందును కీర్తిశేషులైన శ్రీమగనులాల్ జీగారు మనకు మార్గదర్శకులై యుండిరి. వారిమరణానంతరము ఈదృక్పథము పూర్తిగా వెనుక పడినట్లు కాన్పించుచున్నది. ఉత్పత్తిసంస్థలయందు నూలుపరీక్షసూచనలు బొత్తిగా కనబడుట లేదు. ఈస్థితిని ఎంతత్వరలో మార్చిన ఖాదీపరిశ్రమకు అంత శ్రేయోదాయకము. ఈసందర్భమున అఖిల భారతచరఖాసంఘమువారు తమబాధ్యతను గుర్తెరుగుదురుగాక !

## నూలుయొక్క బలము (Tensility)

మనము ఏదైనను నూలును పరీక్షించునపుడు, పోగులు సులభముగా తెగిపోయినయెడల నీరసముగా నున్నట్టును, సులభముగా తెగనియెడల గట్టిగా నున్నట్టును వాడుకభాషలో అనెదము. శాస్త్రప్రకారము 'బలము' అని యీగుణమునకు పేరు. ఒకపోగును త్రెంచుటకు ఎంతసత్తువును, లేక, ఎంతబరువును ఉప

మోయింపవలెనో ఆబరువునకు 'బలము' అని పేరు. ముదుకునూలు సన్ననూలుకంటె హెచ్చుబరువును మోయగలదు. అందుచే ముదుకునూలుకు సన్ననూలు కంటె హెచ్చుబలము గలదు. కాని, నూలుపరీక్ష చేయునపుడు, ఫలానా నెంబరుగల నూలుయొక్క పోగులు ఎంతబరువును మోయగలవో—అనగా, ఆ పోగులయొక్క 'అసలుబలము' (actual tensility) తో మనకు అంతగా ప్రసక్తి లేదు. ఒకఉదాహరణము తీసుకొందము: మనము వడికిన ౨౦ నెంబరు నూలుయొక్క పోగులు ౩౪ తులములబరువును మోయగలవనుకొందము. ఒక పట్టుశాలీస్త్రీ వడికిన ౫౦ నెం. నూలుయొక్క పోగులు ౩౦ తులములబరువును మోయు ననుకొందము. ఈ ఉదాహరణమందు పేర్కొనబడిన సన్ననూలుయొక్క 'అసలుబలము' ముదుకునూలుయొక్క 'అసలుబలము' కంటె తక్కువగా నున్నందున, ఈ సన్ననూలు ఈముదుకునూలుకంటె తక్కువ'బలము' కలిగియున్నదని చెప్పుటకు వీలులేదు. పై చెప్పబడిన ౨౦ నెం. నూలుయొక్క బలాబలములను లెక్కకట్టి చెప్పవలెనన్న, అదేనెంబరు గలిగిన ప్రశస్తమైన నూలుయొక్క 'అసలుబలము'ను నిర్ధారణచేసి, దీనిని ఒక 'పరిమాణము' (standard) గా ఏర్పరచి, యీపరిమాణముతో మన ౨౦ నెం. నూలుయొక్క 'అసలుబలము'ను తైపారవేసి చెప్పవలెను. నెం. ౨౦ రు పరిమాణపునూలు (standard yarn) ౧౭౦ తులములబరువును మోయును. మన ౨౦ నెంబరునూలు ౩౪ తులములను మోయుచున్నది. అందుచే, మన ౨౦ నెంబరు నూలుయొక్క బలము ప్రశస్తమైన ౨౦ నెంబరునూలుయొక్క బలములో ౫-వ వంతే యున్నది (౧౭౦ లో ౩౪ వంతులు = ౧/౫). అనగా ౨౦% బలము (percentage tensility) కలిగియున్నది. ఈవిధముగానే పైన చెప్పిన ౫౦ నెంబరునూలును, ఆనెంబరు కలిగిన పరిమాణపునూలుయొక్క అసలుబలముతో పోల్చిన యెడల, (౩౦ ÷ ౩౬ = ౫/౬) సుమారు ౮౦% నికరము బలము కలిగియున్నదని తేలుచున్నది. దీనినిబట్టి పైన ఉదాహరింపబడిన నూళ్లలో, నెం. ౨౦ రు నూలుకంటె, నెం. ౫౦ రు నూలే హెచ్చు నికరముబలము కలిగియున్నదని తేలుచున్నది. వడుకునూలుయొక్క బలమును నిర్ణయించుటకు శ్రీ మగన్‌లాల్జీగారు మిల్లుపరిమాణములనే (mill standards) ఆధారముగా గైకొనియుంపిరి. వారు సెలవిచ్చినట్టే, ప్రస్తుతము మనము ఖద్దరునూలుబలమును నిర్ణయించుటకు మిల్లునూలుప్రమాణములను ఆధారముగా చేసికొనుచున్నప్పటికి, మనము కృషిసలిపి, ఖద్దరునూలుపై పరిశోధనలను చేసి, ఖద్దరునూలుకు సరిపడెడు ప్రమాణములను త్వరలో నిర్ణయించుట మిక్కిలి అవసరము.

## నూలును బలముప్రకారము విభజించుట

ఖద్దరుఉత్పత్తిదారులు నూలును సంతలలో కొనునపుడు, సన్నము, సాపు ఈరెండుగుణములకే ప్రాముఖ్యము నిచ్చుచున్నారు. ఒకనూలుయొక్క సన్నమును, సాపును సులభముగా కంటితో అంచనాకట్టగలము. కాని నూలు కొనునప్పుడు నూలుయొక్క బలమును గూర్చి, బలముయొక్క సాపును (అనగా నూలు పోగునునా, ఒకచోట హెచ్చుగాను, మరి ఒకచోట తక్కువగా నుండక, అంతటను ఒకటే మాదిరిగ నుండుట: evenness in tensility) గూర్చి గాని యేమాత్రము గమనించుటలేదు. నూలు వడకువారి దృష్టిలోనైతేనేమి, నేతగాండ్రదృష్టిలోనైతేనేమి, ఉత్పత్తిదారుల దృష్టిలోనైతేనేమి, రాటముమీద వడికిననూలు ఎంతబలముగా నున్నను, ఎంతనీరసముగా నున్నను, నేతకు పనికివచ్చుననియే. వారిమతమున మంచినూలు అయిన పడుగు ఉపయోగించెదరు. నూలు బొత్తిగా బాగులేని యెడల పేకకు వాడెదరు. నూలు మగ్గముపై నెక్కినా, లేదా అనువిషయమే వారు చూచుచున్నారు గాని, బట్టను అమ్మినతరువాత ఎంతకాలము మన్నునో, ఎంత కాలములో జీర్ణించునో అనువిషయము వారిదృష్టిపథము లోనికి వచ్చుటలేదు. నీరసపునూలుతోకూడ చక్కని బట్టను నేయగలుగుటయందు ఆంధ్రదేశపునేతగాండ్రు తమ అద్భుతకౌశలమును ప్రదర్శించుచున్నారు. ఇది అటుండగా, మంచి బలము కలిగినటువంటిన్ని, బలము విషయమున హెచ్చుగా సాపు కలిగినటువంటిన్ని,

నూలును నేయుటకు తక్కువకాలమున్ను, తక్కువ ప్రయాసమును పట్టి బట్ట ఎక్కువఅందముగా నుండు ననియు, పుటుకుపుటుకుమని తెగిపోయెడు నూలును నేయుటకు హెచ్చుకాలమును, హెచ్చుప్రయాసమును పట్టుననియు, ఆబట్ట చివరకు అంతఅందముగా నుండ దనియు నేతగాండ్రకు, ఉత్పత్తిదారులకు తెలిసినవిషయమే. దీనినిబట్టియే బలముగల నూలుతో తయారు చేసిన బట్ట చౌకగాను, ఆఉత్పత్తిసంస్థలోనే నీరసము గల నూలుతో నేసి తయారుచేసిన బట్ట ప్రియముగాను ఉండుటయు ఉత్పత్తిదారులకు అనుభవవేద్యము. ఖద్దరు బట్టను—ముగుకుబట్ట అయినను సరే, సన్నబట్ట అయినను సరే—చౌకచేయవలె నన్న, ఎట్టినూలైనను మగ్గముపై నెక్కించగలము అన్న మంత్రమును మరచిపోయి, బలమైన నూలునే వాడుటయు, బలములేని నూలును విసర్జించుటయు ముఖ్యమని ఉత్పత్తిదారులును, నేతగాండ్రును తెలిసికొనుట ముఖ్యము.

ఒకేనంబరు గలిగినటువంటి అనేక-నూలునమూనాలను, వాటివాటి బలము, బలముయొక్క సాపు ప్రకారము తరగతులుగా విభజించుటకు ఉత్పత్తిదారులు ప్రయత్నించవలెను. అట్టివిభాగము (grading) ఏ ప్రమాణములప్రకారము జరుగవలసినదియు, ఆప్రమాణములనిర్ణయమును పరిశోధనవలననే తేలును. నూలు యొక్క బలమును కనిపెట్టుటకు యంత్రసాధనములు (tensile testers) ఉండవలెను. ప్రస్తుతము బలము ననుసరించి నూలును ఎంచకుండుటచే, ఎట్టిఅసందర్భములు ఏర్పడుచున్నవో, నాయనుభవమునకు వచ్చిన యీప్రక్క పుట (౬౬౮) యందలి నూలునమూనాల పరీక్షాపట్టికలవలన తెలియవచ్చును.

పై నూలునమూనాలనూళ్లను, ఆయాకేంద్రములకు సంబంధించిన అంచనాదార్లచే మంచిరకములనియే ఎంచబడియుండెను. బలము బొత్తిగా లేనటువంటివిన్ని, సాపు అసలే సున్న అయినటువంటివిన్ని నూళ్లను, మగ్గములపై నిలువబడగల వన్నంతమాత్రముచే ఉపయోగించుటవలన ఖద్దరుఉత్పత్తి ఎంతమాత్రమును అభివృద్ధి నొంద నేరదు. నూలును ఎంచుటలో బలమువిషయమై బొత్తిగా అశ్రద్ధచేయుటకంటె, ఎంతతక్కువ ప్రమాణముల నైనను (low standards) స్థిరపరిచి, ఆ ప్రమాణములకు అందని నూలును ఉపయోగించకుండుటయు, ప్రమాణములకు విస్తారము మించనినూళ్లను పేకకును, బాగుగా మించినవాటిని పడుగుకును ఉపయోగించుట శ్రేయోదాయకము. ఇట్టి కట్టుబాట్లను స్థిరపరుచుటయందును, వాటిని కఠినముగా ఆచరించుటయందును అఖిలభారత చరఖాసంఘమువారు ముందంజవైచి, మిగిలిన ఉత్పత్తిదారులకు మార్గదర్శకు లగుట భావ్యము.

## బలము—ఇతర విషయములు

నూలుయొక్క బలము అనేక విషయములపై నాధారపడియున్నది. అందులో ముఖ్యమైనవి—

౧. పురి (twist), ౨. వడుకువిధానము (spinning technique), 3. ఏకులు చేయువిధము (preparatory process), ౪. ప్రత్తిజాతి (kind of cotton).

మేలురకముప్రత్తిని వాడినయెడల మంచినూలును వడుకగల మనువిషయము అందరకును తెలిసినదే. ప్రత్తిని జాగ్రత్తగా శుభ్రముచేసి, నలుసులను ఏరి, పింజెపెట్టి, బాగుగా ఏకి, ఏకులుచుట్టుకొనినయెడల, ఈ ఏకులనుండి వడికిన నూలు గట్టిగా నుండునని ప్రతివారికిని తెలియును. వడుకునప్పుడు కదురు మాటిమాటికి "గంతులువేయుచు" వడిదారము వదులు, బిగువు అవుచు, చక్రముపైనుండి జారి పోవుచుండినయెడల వడికిననూలుకూడా గట్టిగా నుండదను సంగతి అందరకు అనుభవము. ప్రత్తియొక్కగుణములన్నింటిలోను—రేచులపొడవు, రేచులపెళసరి, బిరుసుతనము మొదలగునవి—రేచులయొక్క దళసరికిని నూలుయొక్క బలమునకును చాలా సన్నిహితసంబంధము కలదు. ఏలయనగా, నూలుయొక్కబలము, ప్రతిరేచుయొక్క బలముపై నాధారపడక, పోగుయొక్క (cross-section) అడ్డుకొలతలో ఇమిడియున్న రేచుల సంఖ్యపై నాధారపడియుండును. అందువలన రేచులు ఎంత సన్నముగా నుండినయెడల అంత హెచ్చుసంఖ్య రేచులను పోగులో వడుకునప్పుడు ఇముడ్చవచ్చును. అట్లు గాక, రేచులు ఎంతముదుకుగానుండినఅన్ని తక్కువరేచులు

## పట్టిక ౧.

వడికినవారి పేరు.........
పరీక్ష వరుస నెం. ౧౬౪.
గ్రామము : బుడితి. రకము : వెలమ. తేది : ౩-౩-౧౯౩౨.

| సన్నము కౌంటు నెం. | అసలుబలము | నికరము బలము % | ఫ లి త ము లు |
|---|---|---|---|
| | పౌనులు-ఔన్సులు | | |
| ౫౦ | ౦ – ౫ | ౧౯.౭౫ | సగటున సన్నము నెంబరు : ౫౫ |
| ౫౫ | ౦ – ౮.౫ | ౧౫.౮౮ | సన్నముయొక్క సాపు : ౭౧.౭౨% |
| ౫౫ | ౦ – ౦.౫ | ౧.౭౨ | నికరము బలము : ౪.౩౫% (!) |
| ౬౦ | ౦ – ౦.౫ | ౧.౯౭ | |
| ౫౫ | ౦ – ౧ | ౩.౬౮ | బలముయొక్క సాపు : ౦% (!) |
| ౫౦ | ౦ – ౦.౫ | ౧.౪౫ | |

## పట్టిక ౨.

వడికినవారి పేరు.........
పరీక్ష వరుస నెం. ౧౦౪
గ్రామము : బొంతలకోడూరు. రకము : పట్టుశాలి. తేది : ౧౪-౧౦-౧౯౩౧.

| సన్నము కౌంటు నెం. | అసలుబలము | నికరము బలము % | ఫలితములు |
|---|---|---|---|
| | పౌ. ఔ. | | |
| ౫౦ | ౦ – ౫ | ౧౬.౫౮ | సగటున సన్నము నెం. ౬౩ |
| ౬౦ | ౦ – ౮.౫ | ౧౪.౭౫ | సన్నముయొక్క సాపు : ౬౬.౬౪% |
| ౫౫ | ౦ – ౮.౫ | ౧౬.౩౪ | నికరము బలము : ౧౫.౨౫ (!) |
| ౪౦ | ౦ – ౮ | ౧౭.౫౨ | |
| ౪౦ | ౦ – ౨ | ౯.౨౬ | |
| ౪౦ | ౦ – ౨ | ౯.౨౬ | బలముయొక్క సాపు : ౩౯.౮౭ (!) |

## పట్టిక ౩.

వడికినవారి పేరు.........
పరీక్ష వరుస నెం. ౬౨.
గ్రామము : శ్రీకాకుళం. రకము : ముదుకు, ఎర్రసత్తి. తేది : ౧౫-౯-౧౯౩౧.

| సన్నము కౌంటు నెం. | అసలుబలము | నికరము బలము % | ఫ లి త ము లు |
|---|---|---|---|
| | పౌ. ఔ. | | |
| ౧౪ | ౦ – ౧౩ | ౧౮.౬ | సగటున సన్నము నెంబరు : ౧౭ |
| ౧౨ | ౧ – ౦ | ౧౨.౪ | సన్నముయొక్క సాపు : ౩౯% |
| ౧౩ | ౧ – ౦ | ౧౩.౭ | |
| ౨౨ | ౩ – ౦.౫ | ౫.౧ | నికరముబలము : ౧౦.౨౫ (!) |
| ౨౦ | ౦ – ౧౦ | ౧౩.౨ | |
| ౨౫ | ౦ – ౮ | ౬.౬ | బలముయొక్క సాపు : ౦% (!) |

ఇముడును. అందుచే, ఒకే కౌంటుగల రెండు నూలున మోనాలలో సన్నరేచులపత్తినుండి వడికిన నూలు హెచ్చు బలముగాను, ముగుకురేచులు గలిగిన పత్తినుండి (సమానమైన రేచులపొడవు గలిగినప్పటికిన్ని) వడికిననూలు తక్కువబలముగాను ఉండును. అందుచే విస్తారము సన్నమురకముల నూలును వడుకుటకు కుతూహలము గలవారు, వారిచే వడకబడిన నూలునకు సన్నముకు తగినంత బలము ఉండవలెనన్న పొడుగురేచులతోపాటు, సన్నరేచులుగల పత్తినే ఉపయోగించవలసియుండును. లేని యెడల వారు ఎంతప్రయాసపడి సన్నముగా నూలును వడికినను, నూలునకు బలము లేక, నేతకు ఉపయోగపడదు. (ఈ సందర్భములో Maganlal Gandhi: Charkha Sastra, p. 38 చూడనగును.)

గంజాం, విశాఖపట్నంజిల్లాలయందు ఉత్పత్తి యగుచున్న కొన్ని ఖద్దరునూళ్లయొక్క కౌంటువారిగా బలమును (నేను చేసిన నూలుపరీక్షల నాధారముగా చేసికొని) ప్రక్కపుట(౬౭౦)లోని పట్టికయందు పొందు పరుచుచున్నాను.

## పురి

నూలుయొక్క బలమునకును పురికిని చాలా సంబంధ మున్నదని చెప్పియున్నాము. ప్రస్తుతము ఖద్దరుకు గిరాకి (demand) అధికముగా నుండుటచేతను, అందుకు అనుసరించి ఉత్పత్తి అతిత్వరగా జరుగుచుండుట చేతనున్ను, నూలుయొక్క పురిగురించి ఉత్పత్తిదారులున్ను, వడుకువారున్ను తగినంతశ్రద్ధ తీసుకొనుట లేదు. సాలివారు మాత్రము అసంతృప్తిని కనబరుచుట స్వాభావికమైపోవుటచేత ఖద్దరునూలుకు పురితక్కువ అనియు, అందుచే నేత బహు కష్టమనియు గొణుగుకొనుచునే యుందురు. ఈపురివిషయములో మాత్రము ఆతని అసంతృప్తికి తగినకారణము లేకపోలేదు. ముఖ్యముగా ముదుకుఖద్దరు ఉత్పత్తిలో పురివిషయమై అసలే గమనించుటలేదు. ఇందుకు కారణము, వడుకువారియొక్క అశ్రద్ధయో, లేక సంస్థల యజమానులయొక్క అజ్ఞానమో చెప్పుటకు నేను సాహసింపజాలను.

పట్టుశాలి, వెలమ నూళ్లయొక్క ఉత్పత్తికేంద్రములలో మాత్రము పురిప్రకారము నూలును వేరుపరుచుటకు అంత ప్రయత్నములు జరుగుచున్నట్లు కనబడకపోయినను, ఈ విషయమై వారు బొత్తిగా మరచినట్లు కానబడదు. అనుభవశాలులగు నేతగాండ్రు ఇప్పటికిని నూలును వేరుచేయునపుడు, ఇది 'రండి, నూలు—అనగా, హెచ్చుపురిగల నూలు—అనియు, ఇది బుడత 'అరితెంపుడు నూలు'—అనగా, ఒకచోట అతిహెచ్చుపురియు, మరియొకచోట అతి తక్కువ పురియు గలది—అనియు, ఇది 'పురికత్తు' నూలనియు—అనగా, సరియైన పురిని కలిగి మంచి బలముగల నూలు—అనియు, నూలుకు పేర్లుపెట్టుచుందురు. ఇట్లు పోల్చుకొనుట అనుభవముపైననే పూర్తిగా ఆధారపడియుండుటచేతను, ఆయావ్యక్తులయొక్క నేర్పరితనముపైననే ఏర్పడియుండుట వలనను, ఒకరియెంపుడుతో మరియొకరియెంపుడు సరిపడకపోవుటయు, చివరకు ఆవ్యక్తులతోనే ఆజ్ఞానము అంతరించుటయు తటస్థించుచున్నది. ఇట్టియాపద రాకమునుపే ఖాదీఅభిమానులు మేల్కొని, అనుభవముచే సంపాదింపబడిన జ్ఞానమును ప్రత్యక్షములగు పరిశోధనలచేత అన్వయించి, ఆజ్ఞానమువలన లాభమును పొందుటకు ప్రయత్నించవలసియున్నది.

## నూలుపురి-నూలుబలము

ఈనూలుకు హెచ్చుపురి, ఈనూలుకు తక్కువ పురి అని మనము ఎప్పుడైతే వ్యవహరించుచున్నామో, అప్పుడు, నూలుకు ఎంతపురి ఉండినయెడల అది మంచి నూలు అనిపించుకొనునో, నిర్ధారణచేయవలసియుండును. ఒకఅంగుళము పొడుగుగల నూలుపోగులో నున్నటువంటి తిరుగుడులసంఖ్య (number of turns) ఆనూలుయొక్కపురిని తెలుపుడుచేయును—అని పారిశ్రామికశాస్త్రజ్ఞులు చెప్పియున్నారు. ఖద్దరునూలుపై పురిసందర్భమున వట్టిపరిశోధనలైనను ఇంతవరకు జరిగియుండకపోవుటచేతను, ఇకమీద జరుగుట మిక్కిలి అవసరమగుటచేతను, మిల్లునూలువిషయమై, పారిశ్రామికశాస్త్రజ్ఞులు ఎట్టిపరిశోధనలను చేసియున్నారో, ఆవిధానములనే మనము అవలంబించవలసియున్నారము

పట్టిక ౪.

| నూలు రకము | కౌంటువారీబలము%, బలముసాఫు%, కౌంటుసాఫు% | | | | | | | | | | |
|---|---|---|---|---|---|---|---|---|---|---|---|
| | ౧౦-౧౫ | ౧౫-౨౦ | ౨౦-౨౫ | ౨౫-౩౦ | ౩౦-౩౫ | ౩౫-౪౦ | ౪౦-౪౫ | ౪౫-౫౦ | ౫౦-౫౫ | ౫౫-౬౦ | ౬౦-౬౫ |
| ముదుకు | ౪౬ (౬౮) (66) | ౩౧ (౩౨) (72) | ౪౮ (౮౩) (77) | ౧౪ (౦) (67) | ౧౭ (౩౮) (43) | | | | | | |
| వెలమ | | ౪౫ (౪౫) (70) | ౪౪ (౩౯) (83) | ౪౪ (౩౩) (78) | ౩౯ (౧౭) (79) | ౩౫ (౩౨) (౮౧) | ౩౪ (౧౪) (75) | ౩౩ (౦) (81) | ౧౮ (౧౭) (79) | ౮ (౦) (81) | |
| పట్టుశాలి | | | ౪౭ (౩౯) (71) | ౪౬ (౧౧) (72) | ౪౩ (౩౯) (78) | ౫౦ (౩౩) (82) | ౪౫ (౨౧) (81) | ౪౫ (౪౮) (81) | | ౩౪ (౪౮) (66) | ౨౪ (౨౨) (64) |

వరా:—పైనున్న తెనుగుఅంకెలు బలము % తెలుపుచేయును.
మధ్య బ్రాకెట్టులో నున్న తెనుగుఅంకెలు బలముయొక్క సాఫు % తెలుపుచేయును.
చివర బ్రాకెట్టులో నున్న ఇంగ్లీషుఅంకెలు కౌంటుయొక్క సాఫు % తెలుపుచేయును.

గనుకను, మిల్లునూలు పురివిషయమున వారు కనిపెట్టిన విషయములను క్లుప్తముగా దిగువ పొందుపరచుచున్నాను:—

౧. ప్రశస్తమైన నూలురకములలో, నూలుయొక్క కౌంటుకున్ను (సన్నదనము), నూలుయొక్క పురికిని సంబంధము గలదు. ఈసంబంధము గణితశాస్త్రప్రకారము ఇట్లుండును:

$$\frac{\text{అంగుళమునకు తిరుగుడులసంఖ్య}}{\sqrt{\text{కౌంటు}}} = \mathbf{K}\ \textbf{(twist constant)}.$$

౨. నూలును ఏపనికి వినియోగించెదరో దానిని పట్టిని, పత్తిరకమునుపట్టిని, ఈ K యొక్క విలువ 3.౧౮ నుండి ౫ వరకు మారుచుండును.

3. మిల్లులలో నూలును ఉత్పత్తిచేయునపుడు, నూలుయొక్క వినియోగమును, పత్తిరకమును దృష్టియందుంచుకొని, ఈ K యొక్కవిలువను ప్రమాణములనుగా గైకొని, ఎంతపురి ఈయవలసినది ఈక్రిందివిధముగా లెక్కించెదరు:

$\sqrt{\text{కౌంటు}} \times 3.౧౮$ = ఇంగ్లీషు పేకలో అంగుళమునకు తిరుగుడులసంఖ్య

$\sqrt{\text{కౌంటు}} \times 3.౬౦౬$ = ఇంగ్లీషు పడుగు అంగుళమునకు తిరుగుడులసంఖ్య

$\sqrt{\text{కౌంటు}} \times 3.౨౫$ = అమెరికను పేక అంగుళమునకు తిరుగుడులసంఖ్య

$\sqrt{\text{కౌంటు}} \times 3.౭౫$ = అమెరికను పడుగు అంగుళమునకు తిరుగుడులసంఖ్య

$\sqrt{\text{కౌంటు}} \times 3.౨౫$ = హిందూదేశపు పేక అంగుళమునకు తిరుగుడులసంఖ్య

$\sqrt{\text{కౌంటు}} \times 3.౭౫$ = హిందూదేశపు పడుగు అంగుళమునకు తిరుగుడులసంఖ్య

ఇట్లు పురివిషయమై మిల్లులలో ప్రమాణముల నేర్పరచుటచే, మిల్లునూలు ఏస్థలములో తయారుకాబడినను ఒక ప్రత్యేకపు కౌంటుకు ప్రత్యేకపు పురి కలిగియుండి, నూలురకములో తేడాలు లేకుండా, ఎల్లపుడు ఒకేవిధముగ నుండును. ఖద్దరునూలుకు ఇట్లు పురి విషయమై ప్రమాణములు స్థిరపడకపోవుటచే, ఒక గ్రామములో తయారయిన నూలునకును, మరియొకగ్రామమందు తయారయిన నూలునకును తేడాయుండుటయేగాక, ఒకగ్రామములోనే పలువురు ఒకేకౌంటు వడికిన ఒకరినూలుతో ఒకరిది సరిపడక యుండును.

వడుకునూలు చాలా మెత్తనిపురి గలదని ఖద్దరు విముఖులు చెప్పుట వాడుక. ఖద్దరునూలుపై ఎట్టి పరిశోధనలును జరుగకపోవుటచేత ఈనింద సరియైనదని కాని సరికాదని కాని చెప్పుటకు వీలు లేదు. అయినను, అంగుళమునకు తిరుగుడులసంఖ్యను లెక్కించితిమేని, సగటున (3౦ నెంబరుకు తక్కువ) ముదుకునూలునందు ౧౨ నెం. నందు అంగుళమునకు ౧౪ తిరుగుడులును (మిల్లులో అదే నెం.కు ౧౪), నెం. ౨౦ ఖద్దరునూలునందు ౧౮ (మిల్లు నూలు ౧౮), నెం. 3౦ ఖద్దరు నూలునందు ౨౧ (మిల్లు నూలు ౨౨). అనగా మిల్లునూలుతో సరిసమానముగానే యున్నది. సన్నమునూలురకములలో, నెం. ౪౦ ఖద్దరు నూలులో అంగుళమునకు 3౨ ను (మిల్లులో ౨౫ మాత్రమే), నెం. ౬౦ ఖద్దరునూలులో అంగుళమునకు 3౮ న్ని (మిల్లునూలులో ౨౮ మాత్రమే)—అనగా మిల్లునూలు పురికంటె పట్టుశాలీ, వెలమనూలులో పురి హెచ్చుగా నున్నట్లు తేలుచున్నది. (ఈ సంఖ్యలు మాత్రమే శ్రీయుత అమల్‌సాదుగారి "Hand-Loom Weaving", p. 50, Govt Press, Madras, ౧౯3౦-నుండి తీయబడినవి.) అమల్‌సాదుగారి ఫలితములనుండి, పురిప్రమాణములను లెక్కకట్టినయెడల, నెం. 3౦ ముదుకు ఖద్దరునూలుకు మిల్లునూలుతో సమానముగా twist constant (K)=3. ౭౫ ("soft twist") న్ను, సన్న నూలుకు K=౪.౭౬ నుండి ౪. ౮ ("extra hard twist") న్ను ఉన్నటుల కానవచ్చుచున్నది. అయినప్పటికి, ఖద్దరునూలుకు ఇంకా twist constants హెచ్చుచేసినయెడల నూలు ఇంకా బాగుపడగలదని చెప్పుటకు సాహసించవచ్చును. ఇట్లు పరిశోధనలనుచేసి, క్రమక్రమముగా అంతరించిపోవుచున్న పురి-ప్రమాణము

లను పునరుద్ధరించి, వెలమనూలుకు K-విలువ ఎంత ఉండవలెనో, పట్టుశాలినూలుకు K-విలువ ఎంత ఉండవలెనో, ముదుకునూలుకు -విలువ ఎంత ఉండవలెనో, ఫలానా విలువకంటె తగ్గినయెడల పురి తగ్గిపోయి నూలుయొక్క నాణ్యము తగ్గుననియు, ఫలానా విలువకంటె మీరినయెడల పురి జాస్తీఅయి నాణ్యము తగ్గుననియు, 'పురికత్తు' ప్రమాణమునకు ఫలాన తిరుగుడుల-సంఖ్య అంగుళమునకు ఉండవలయుననియు, ఖాదీ అభిమానులును, ఖాదీశాస్త్రజ్ఞులును నిర్ణయించవలసియున్నది.

## నూలుయొక్క సన్నము-కౌంటు

నూలుయొక్క సన్నదనమునకును, బలమునకున్ను పురికిన్ని ఉన్నటువంటి సంబంధమునుగూర్చి వివరించియే యున్నాము. ఈప్రాంతములయందు (గంజాం, విశాఖపట్నంజిల్లాలు) ముదుకునూలు కొనునప్పుడును, నేతకు ఇచ్చునపుడును, ఎంత కౌంటు భేదముతో ఏర్చుచున్నారో నాకు అనుభవము లేదు. పట్టుశాలి, వెలమ నూలు విషయములో అఖిల భారత చరఖా సంఘమువారు ౫ కౌంట్లవారాతో ఏర్చుచున్నారు. ఒకనమోనా నూలుయొక్క కౌంటును ౫ కౌంట్లు ఇటో అటో పోల్చుకొనవచ్చును. అయినను ఇందులో భేదాభిప్రాయమునకు విస్తారము అవకాశము కలుగుచునే యుండును. పట్టుశాలీనూలును ఏర్చునపుడు నెంబరు ౮౦ నూలును ౬౦ అనియు, ౫౦ నూలును ౭౦ అనియు, ౬౦ నెం. నూలును ౭౦, ౧౦౦, ౧౨౦ అనియు కూడా అంచనావేయబడుచున్నది. నూలును ౫ కౌంట్లవారాతో తరగతులను చేయుటయందు, నెం. ౫౦ నూలును ౮౫ నెంబరుగనో, లేక ౫౫ నెంబరుగనో ఏర్చుటకు వీలుండును. అనగా ౨౦% వరకు పొరపాటు జరుగుటకు అవకాశ మేర్పడుచున్నది. నూలు నెం.౫౦ కు పైబడుచున్నప్పుడు ఈపొరపాటు తగ్గుచున్నను, ౧౦% కంటె తగ్గుటలేదు. ఈవిధముగా ఎంచుట ప్రస్తుతమున్న నేతసంప్రదాయమునకు సరిపోవుచున్నను, నేతను సులభము చేయవలె నన్నను, సామాన్యపురకముల యొక్క నేత-కూలి తగ్గించవలె నన్నను, ఇప్పటికంటె ఎక్కుదు జాగ్రత్తగా—అనగా ౩ కౌంట్లవారా మించకుండా, తరగతులను ఏర్పరుపవలసియుండునేమో యని తోచుచున్నది.

నూలుయొక్క సాపు (uniformity of count)ను సరించియు ఈవిధముగానే యున్నది. ముదుకునూలు పరిశ్రమలోను, సన్ననూలుపరిశ్రమలోను సాపును సరించి ఎట్టిప్రమాణములును లేకున్నవి. స్పర్శవల్లను, దృష్టివల్లను పోల్చుకొనుటకు ఎంతవరకు వీలుగా నుండునో అంతవరకైనను ప్రస్తుతము ఎంచుట జరుగుచున్నదో లేదో తెలియుట లేదు. నూలును కొనునప్పుడు, నేతగాండ్రు ధరను తగ్గించుటకు ఏదో యొక సాకు చెప్పుచు, ఈనూలు 'పేల సన్నము'గా నున్నదనియు, ఆనూలు 'తీర్మానము' నూలు కాదనియు పేర్లు పెట్టుట సంభవించుచున్నది. పరిశ్రమయందభిమాన మున్నవారు, ఈపదములకు సూత్రములరూపమునను, పరిశోధనలమూలముగను ప్రమాణముల నేర్పరచవలసి యున్నది.

గంజాం, విశాఖపట్నం జిల్లాలలో సామాన్యముగ ఉత్పత్తియగుచున్న నూలుయొక్క కౌంటువారీ సాపుభేదమును ౮-వ పట్టికయందు పొందుపరచియున్నాను (బ్రాకెట్లలో నున్న ఇంగ్లీషుఅంకెలు)

## రేచుల పొడవు—నూలు సన్నదనము

కురుచపత్తినుండి ముదుకునూలే వడుకవలె ననియు, సన్ననూలు వడుకవలెనన్న పొడుగురేచులు గల పత్తినే వాడవలెననియు అందరకు తెలిసినవిషయమే. అయినను ఆంధ్రదేశమందు నూలు వడికెడువారిలో(భుక్తికైనను సరే, భక్తికైనను సరే) బహు-కొద్దిమంది తాము కొనెడి ఏకులలో నుండెడి రేచులయొక్క పొడవును గూర్చి గాని, పత్తిజాతినిగూర్చి గాని, తాము వడికెడు నూలుయొక్క సన్నము రేచులయొక్క పొడవునకు మించిపోవుచున్నదా యను విషయములను గూర్చి శ్రద్ధ తీసుకొనుచున్నారు. ఈ సన్నము తీయుట ఒకమాదిరి వెఱ్ఱిక్రింద దిగిపోవుచున్నది. గోదావరిజిల్లాలో ఒకానొక

ఉత్పత్తికేంద్రములో మామూలు కురుచరేచులపత్తిని దూదేకులవానిచే ఏకించి, ఆ ఏకులనుండి నెం॥ ౪౦ నూలును వడికించుట నే నెరుగుదును. కైలాసపట్నం ప్రాంతములందు ఇంకా సన్నము వడుకుటకు పత్తిరకము నుబట్టి వీ లున్నదని చెప్పవచ్చును.

ఈ విషయములో మిల్లులవారు మిక్కిలి శ్రద్ధను తీసికొనెదరు. రేచులయొక్క పొడవునకును, ఆపత్తి నుండి తయారుచేయవలసిన నూలుసన్నమునకును పారిశ్రామికశాస్త్రజ్ఞులు ఈక్రింది సంబంధమును కనిపెట్టియున్నారు.—

3√కౌంటు × 0.3౨౫=రేచులపొడవు (అంగుళములు).

ఈలెక్కప్రకారము, ఏరకము పత్తినుండి ఎంత నంబరునూలు వడుకవలసినదియు నిర్ణయించెదరు. Winterbottom's Cotton Spinning Calculations, p. 236 చూడుడు.

ఈరేఖవలన ఈ క్రింది సంబంధ మేర్పడుచున్నది. ౦.౨౬ × 3√కౌంటు=రేచులపొడవు (అంగుళములు).

పై సమీకరణము (equation) లో తప్పులు లేవని చెప్పుటకు సాహసింపను. అనుభవము హెచ్చు అయినకొలదిని పరిశోధనల ఫలితములవలనను, సున్నితములగు పరికరముల నుపయోగించుటవలనను ఇంతకంటె యథార్థమైన సమీకరణము తేల్చుటకు వీలుండునని వేరుగా చెప్ప నవసరము లేదు.

ఈరేఖనుండి ఫలానా పత్తిజాతినుండి ఎంతనంబరునూలును వడుకవలసినదియు సులభముగా తెలియగలదు. ఈ విషయములనే ౫-వ పట్టికయందు వివరించియున్నాను. ఈ పట్టికల చూపబడిన నెంబరులకంటె హెచ్చునంబరు సన్నమును వడికినయెడల నూలుకు బలము తగ్గిపోయి నాణ్యముగా నుండదు. అందుచే చివరకు కిట్టుబడి కాదు. అంతకంటె తక్కువ నంబరు సన్నమును వడికినయెడల, నూలు బలముగా నుండును గాని, ఆపత్తినుండి ఎంతవరకు మనకు లాభము పొందుటకు అవకాశము గలదో అంతలాభమును మనము పొందుటలేదని తేలును. అందుచే, మంచిరకము పత్తినుండి ముదుకనూలును వడుకుటవలన మననూలు ప్రియమగు ధరలో నున్నదని తెలియుచున్నది.




ఈ పటములో పైనున్న రేఖ మిల్లుసంప్రదాయమును, క్రింద నున్న రేఖ Winterbottom, p. 235 నుండి గ్రహించబడినది.

9. 4- 18 ౬23

ఖద్దరు నూలుకు కూడా ఇట్టి లెక్కను నిర్ణయించుట మిక్కిలి అవసరము. ఇందుకుగాను, ఖద్దరు పరిశ్రమలో సామాన్యముగా వాడెడు ప త్తిరకములయొక్క రేచులపొడుగును జాగ్రత్తగా కొలవవలెను. ఒక్కొక్క ప త్తిరకమునుండి మంచినేర్పుతో వడికెడు వారిచేత వేరువేరు సన్నములను కలిగిన నూలును తీయించవలెను. ఈ నమూనాలను బలమునకును, బలముయొక్క సాపునకును పరీక్షించినయెడల, ఏనంబరుగల సన్నమునకు హెచ్చుబలము గలదో ఆనంబరునూలునే ఆ ప్రత్తినుండి వడుకవలయునని స్థిరపరచగలము. నాయనుభవముబట్టియు, నేను చేసిన నూలుపరీక్షల ఫలితములవలనను, ఖద్దరు పరిశ్రమకు ఉపయోగపడుచున్న ప త్తిజాతులయొక్క రేచులపొడవునకును, వాటినుండి వడుకవలసిన నూలుయొక్క సన్నదనమునకును ఉండెడు సంబంధము ఈ దిగువ ప్రదర్శింపబడిన 'రేఖ' (curve) తెలియజేయుచున్నది.—

ఖద్దరుపరిశ్రమసంప్రదాయమును తెలియపరచుచున్నవి. రాట్నము వాడుటవలన ఒకే ప త్తిజాతినుండి మిల్లులలో కంటె హెచ్చుసన్నమునూలును వడుకగలమని వెంటనే తెలియవచ్చుచున్నది. రేచులపొడవు హెచ్చు అగుచున్నకొలది, మరింత హెచ్చుసన్నము నూలును ఉత్పత్తిచేయుటకు అవకాశ ముండుటచేత, రాట్నమే లాభకరమని విశదము కాగలదు.

పట్టిక ౫

| ప్రత్తి పేరు | రేచులపొడవు: అంగుళములు | మామూలుగా వడుకు కౌంటు | ౩√కౌంటు × ౦.౨౬ ప్రకారము వడుకవలసిన కౌంటు |
|---|---|---|---|
| మాడుగుల కొండప త్తి | ౦.౯౯ | ౫౦-౮౦ | ౬౦ |
| కైలాసపట్నం గరువుప త్తి | ౦.౮౬ | ౩౦-౪౫ | ౩౫ |
| అంపోలు వెలమప త్తి | ౦.౭౮ | ౪౦-౫౫ | ౨౭ |
| మాడుగుల ప త్తి | ౦.౫౪ | ౮-౨౦ | ౧౦ |
| బొంతలకోడూరు ప త్తి | ౦.౮౮ | ౨౦-౫౦ | ౪౦ |
| కైలాసపట్నం మిశ్రమంప త్తి | ౦.౭ | ౨౦-౩౦ | ౨౦ |
| శ్రీకాకుళం వెలమప త్తి | ౦.౭౫ | ౩౦-౩౫ | ౨౪ |
| గుణుపురం తెల్లప త్తి | ౦.౫౯ | ౬-౧౫ | ౧౨ |
| గొల్లప్రోలు ప త్తి | ౦.౮౩ | ౨౫-౫౦ | ౩౩ |
| కైలాసపట్నం III తెలుపుప త్తి | ౦.౬౯ | ౨౦-౨౫ | ౨౦ |
| దేవకప్పాస్ ప త్తి | ౧.౨ | | ౧౦౫ |
| సారువాకోట కొండప త్తి | ౦.౯౬ | ౪౦-౮౦ | ౫౨ |



# చిత్రకళ



# ప్రాచీన వైష్ణవచిత్రములు

"ఆచార్య"

ఇటీవల బోస్టను ఫైన్ ఆర్ట్సు మ్యూజియమువారికి పదు నేనవశతాబ్దమునాటి యొక అముద్రితగ్రంథము కాగితములది లభించినది. అందక్కడక్కడ కొన్ని పత్రములయందు నలువది ప్రాచీనవైష్ణవచిత్రము లున్నవి. నాడు కాగితములపై గ్రంథచిత్రణ మెట్లు సాగుచుండినదియు నీసూక్ష్మచిత్రములవలన విశదము కాగలదు. ఏతాదృశచిత్రరచనావిధానమే తరువాత మధ్యయుగపు భారతీయశిల్పమందును, ౧౬ మొదలు ౧౯-వ శతాబ్దమువరకు గల రాజపుత్రసూక్ష్మచిత్రముల యందును నాయాచిత్రకారులచే గైకొనబడినది. కావున నీచిత్రసంచయము భారతీయచిత్రరచనాచరిత్రకు మిక్కిలి తోడ్పడ గలదనుట నిర్వివాదము.

చిత్రితగ్రంథ మసంపూర్ణము. గ్రంథాంతగద్య మెచ్చటను కానరాదు. మ్యూజియమువారికి దొరకిన పుస్తకములో ౫౯-వ పత్రము కానవచ్చుచుండుటవలన పుస్తక మంతకంటె ఎక్కువపత్రములు గలిగిన దనుట స్పష్టము. లభించినంతవరకు ౩౧౭ శ్లోకములు కలవని ౫౯-వ పత్రములోని శ్లోకసంఖ్యవలన తెలియుచున్నది. ఈపత్రములలోకూడ చాలవాటియందు రంధ్రములు పడియున్నవి. కొన్నిటియం దారంధ్రములు మిక్కిలి పెద్దవగుటవలన శ్లోకములే చాలవరకు మరుగుపడిపోయినవి. బాగున్న పదునారుచిత్రము లీసంచికయందు ప్రకటితములైనవి.

ఈగ్రంథమందలి యొకభాగము కర్తృత్వమును గురించి మన కిందు కొంతయాధారము కానవచ్చుచున్నది. ఆరవచిత్రమునగల ౧౦౭-వ శ్లోకమునకు తరువాత,

'ఇతి శ్రీపరమహంసప్రవ్రాజక శ్రీపాదబిల్వమంగళవిరచితా శ్రీబాలగోపాలస్తుతిః, ఇతి మాఘపురాణే భగవద్వాక్యం'

అనికలదు. ఈగద్య మొదటిభాగమువలన దీనికి పూర్వము గల శ్లోకములు బాలగోపాలస్తుతి యనియు, వాటిని రచించినవాడు బిల్వమంగళుడనియుమాత్రము తెలియుచున్నదే కాని యింతవరకు గల ౧౦౭ శ్లోకములును బాలగోపాలస్తుతియో, లేక అందు కొన్నియే అదియో తెలియుట లేదు. కాని గద్యరెండవభాగమును గమనించినచో నింతవరకు గల ౧౦౭ శ్లోకములలో కొన్నిమాత్రమే బాలగోపాలస్తుతి యనియు, ఈకృతితోపాటు మరికొన్ని కలిసి మాఘపురాణములోని భగవద్వాక్య మగుచున్నదనియు తెల్లమగుచున్నది.

మీదు మిక్కిలి యీ యపూర్వగ్రంథము పేరే యీ మాఘపురాణ మని యూహించుటకును ఈగద్య యవకాశ మిచ్చుచున్నది. కాని భగవల్లీలాస్తుతిరూప మగు నీకృతి కీపేరు బెట్టుటలో కవిహృదయ మేమో యెరుగరాదు. ఏది యెట్లున్నను కృష్ణలీలామృతకర్తయే దీనికి కర్తయనుట కేమాత్రమును సందియము లేదు. ఈ నిర్ణయమునకు కర్తృనామసామ్యముతోబాటు కృష్ణలీలామృతములోని శ్లోకములే చాలవర కిం దుద్ధృతము

నైయుండుటయు ప్రబల నిదర్శన మగుచున్నది. కొన్ని యథారూపముగను, మరికొన్ని ఛాయారూపముగను, ఇంకకొన్ని కొన్నిపాఠాంతరములతోను కృష్ణకర్ణామృతము లోనివే కొన్ని శ్లోకము లిందు కనవచ్చుచున్నవి.

ఈబిల్వమంగళుడు సారస్వతలోకమునకు క్రొత్తవాడు కాడు. ఇతనికి కృష్ణలీలాశుకుడని దక్షిణభారతమునను, బిల్వమంగళఠాకూరని ఉత్తరభారతమునను ప్రసిద్ధి. ఇతడు పదునొకొండవ శతాబ్దమువాడని వింటర్నిజ్ పండితుడెంచెను. మానవల్లి రామకృష్ణకవిగారు పదుమూడవశతాబ్దమువాడనిరి. కవిగారి యభిప్రాయమున నితడు ౧౨౫౦-౧౩౫౦ సంవత్సరముల మధ్యకాలమువాడై యుండును. బిల్వమంగళునికి కృష్ణునియందు భక్తి మెండు. ఇతడు పలువిషయముల గ్రంథముల రచించెను.—సంస్కృత ప్రాకృతవ్యాకరణముల గూర్చెను; ఉపనిషత్తులకు వ్యాఖ్యలను వ్రాసెను; తాంత్రికగ్రంథముల రచించెను; కావ్యముల నల్లెను; స్తోత్రముల గ్రథించెను. ఇతని రచనలలో పేరుగన్నది కృష్ణకర్ణామృతము. ఆబాలవృద్ధము నేడు దీనిని కీర్తించుచున్నారు. పురుషకార మని దైవవ్యాకరణమున కొక వ్యాఖ్యానమును, భోజదేవుని సరస్వతీకంఠాభరణమునకు కృష్ణలీలావినోదమని యొక వ్యాఖ్యానమును ఇతడు రచించెను. సుబంతసామ్రాజ్య తిజంతసామ్రాజ్యము లను రెండు వ్యాకరణగ్రంథములు రచననుబట్టి యితనివే యనవలసియున్నది. గోవిందాభిషేకమను ప్రాకృతవ్యాకరణ మితనిదే. దీనికే శ్రీచిహ్నకావ్య మనియు పేరు. ఇది భట్టికావ్యము నించుమించు పోలియుండును. అందు మొదటి యెనిమిదధ్యాయములు మాత్రమే యితనివి. తుదినాలుగును ఇతని శిష్యుడు దుర్గాప్రసాదు రచించినవి. బిల్వమంగళుడు కేనోపనిషత్తునకు శంకరాచార్యులు వ్రాసిన భాష్యమునకు శంకరహృదయంగమమను నొక వ్యాఖ్యను వ్రాసెను. క్రమదీపికయనున దితని తాంత్రికరచన. ఇతని కావ్యములలో కాలవధ యనునదిమాత్రమే ప్రకృత ముపలబ్ధమైయున్నది. ఇతని స్తోత్రములలో గణపతి, కర్కోటక, రామచంద్ర, అభవ, బాలకృష్ణ, బృందావన, కృష్ణ, దక్షిణామూర్తిస్తోత్రము లిపు డుపలభ్యములై యున్నవి. ఇవికాక గోవిందదామోదరస్తోత్రము, గోవిందైకవింశతికయను మరిరెండు స్తోత్రము లితనివి కలవు. ఈరెంటిని కవిగారుగాని, వింటర్నిజ్ పండితుడుగాని పేర్కొనలేదు.

ఈబిల్వమంగళు డేదేశమువాడో తెలియుట లేదు. కాని యితని ఖ్యాతినిగని ప్రతివారును 'మావాడు, మావా' డనజొచ్చిరి. రామకృష్ణకవిగారితడు మలబారుప్రాంతములవాడని నిరూపించిరి.

లీలాశుకుడు సన్న్యాసి. పూర్వాశ్రమమున నితడు చాపమంగల (కోదండమంగల) వంశమువాడు. బిల్వమంగళు డనునది యితని కావంశమునుబట్టి గలిగిన పేరు. విల్వ (బిల్వ) మనగా మలయాళమున ధనుస్సు. ఈవిల్వమే మన విల్లు. విల్వమే ఉత్తరదేశోచ్చారణమున బిల్వమయినది. లీలాశుకుని తండ్రిపేరు దామోదరుడు; తల్లిపేరు నీలి.

లీలాశుకున కీభక్తియు, పాండిత్యమును చింతామణియను నతని యుంపుడుకత్తెవలన గలిగినవని యొక యైతిహ్యము కలదు. ఈచింతామణినే యతడు తన కృష్ణకర్ణామృతమందలి మొదటి శ్లోకమునను, ఈబాలగోపాలస్తుతియందలి ౮౮-వ శ్లోకమునను స్మరించియున్నాడు. ఈచింతామణి జగన్నాథ ప్రాంతమందలి సోమగిరిచెంత నుండినది.

ఈ బాలగోపాలస్తుతి చివరగద్యయందు నిర్దిష్టమైన మాఘపురాణ మనుదాని యర్థమేమో తెలియరాదు. సంస్కృతవాఙ్మయమున మాఘపురాణ మనునది యెచ్చటను కానరాదు. కాని బర్నెలుపండితుడు అట్టిగ్రంథ మొకటి కలదని దానిని మాహాత్మ్యగ్రంథ శీర్షికయందు చేర్చినాడు. మన యీమాఘపురాణ మదికానేరదు. మాహాత్మ్యముయొక్క పోకడలే ఇందు గానరావు. మాఘుడు రచించినందువలన దీనికీపేరు గలిగిన దనుటయు యుక్తియుక్తముగ తోపదు. మాఘుడు బిల్వమంగళునికి చాల పూర్వమువాడు.

గ్రంథమంతయు సంస్కృతశ్లోకాత్మకము. అనేక వృత్తము లిందు వాడబడియున్నవి. ఎక్కువగ ఉపజాతి వసంతతిలకలు. గ్రంథముయొక్క స్థితి యేమాత్రము బాగుగ లేదు. లేఖకుని విషయాపరిజ్ఞానమువలన గలిగిన ప్రమాదములు చాల గలవు. వానిని నార్మన్ బ్రౌనుగారుకూడ పేర్కొనలేదు. వానికితోడు బ్రౌనుగారుకూడ శ్లోకముల నుద్ధరించుటయందున, తప్పులని తోచినవానిని సవరించుటయందును, ఇంగ్లీషునకను వదించుటయందును గొన్నితప్పులను జేర్చిరి. పత్రములం పచ్చట చ్చట రంధ్రములు పడియున్నవి. కొన్నిపత్రము లసలే కానరావు. వేరుప్రతి మంచిది మరియొకటి దొరకినగాని దీని పరిష్కరణము దుస్సాధ్యము.

అక్కడక్కడ ఇతరావతారముల వర్ణనలున్నను దీనియందు చాలవరకు కృష్ణలీలలే వర్ణింపబడియున్నవి. శ్రీకృష్ణుడు లీలామానుషవిగ్రహుడనియు, విశ్వాత్మకుడనియు, నతనియా లీలలన్నియు సామాన్యులకు విపరీతముగ తోచినను వాస్తవమున జ్ఞానోపదేశకములే యనియు నిందలి పరమార్థము.

ఇందలి లిపి దేవనాగరీలిపి. ఈలిపి మధ్యయుగమునను, మొగలుల కాలమునను శాసనముల వ్రాతకును, గ్రంథముల వ్రాతకును వాడబడుచుండెను. చిత్రముల శైలియు పశ్చిమభారతశైలియే. కావున నీగ్రంథము. ఈచిత్రములు కూడ పశ్చిమహిందూదేశమున నెక్కడనో తయారుచేయబడినవని చెప్పవలసియున్నది. గ్రంథలేఖనము బహుశః పదునేనవ శతాబ్దమున జరిగియుండు ననుటకు కొన్ని నిదర్శనములను జూడుడు:—

ప్రాచీనపశ్చిమభారత సూక్ష్మచిత్రరచన ముఖ్యముగ రెండుయుగముల కన్వయించును: ఒకటి తాళపత్రయుగము; రెండు కాగితముల యుగము. తాళపత్రయుగము ౧౧౦౦-వ సంవత్సరము మొదలు ౧౪-వ శతాబ్దము కడపటివరకు. నాటి సూక్ష్మచిత్రము లన్నియు శ్వేతాంబరజైనాముద్రితగ్రంథములయందు కానవచ్చుచున్నవి. పత్రములలో సమకోణముగ కొంతస్థలమును చిత్రములకై వదలి తక్కినభాగమును గ్రంథలేఖనమున కుపయోగించుట యానాటి యలవాటు. చిత్రములకై వదలిన యా భాగములందు తీర్థంకరులయు, సన్న్యాసులయు, రాజులయు, రాణులయు, గ్రంథలేఖనమునకు ద్రవ్యసహాయము చేసినపోషకులయు చిత్రములను, దేవతా చిత్రములను రచించుచుండిరి. నాడు కథలను చిత్రించు నలవాటు లేదు. తరువాతి యుగమునకంటె కొంచెము పెద్దవిగ చిత్రములు రచింపబడుచుండెను. చిత్రములకై వాడబడుచుండిన రంగులును కొన్నిమాత్రమే-ఎరుపు, పసుపు, నీలము, తెలుపు, ఆకుపచ్చ. రచనయందుగూడ విజాతీయవిశేషములు కొన్ని కనపడుచుండెడివి:-చిత్రరేఖలు కోణములు గలిగియుండుట, అవయవసంస్థానములు మూడే యుండుట. (ఒకటి: ముఖమును నేరుగ నుంచి పద్మాసనమున కూర్చుండుట. ఈసంస్థానము తీర్థంకరుల విషయమున వాడబడుచుండెడిది. రెండవది: ముఖమును కొంచె మోరకు త్రిప్పి తుంటి యొక్కయు, చీలమండలయొక్కయు సంధులను వంచి యుండుట. మూడవది: సుఖోపవేశసంస్థానము (మామూలుగ కూర్చొనుట)-దీన ముఖమును కొంచెమోరకు త్రిప్పవలయును. ఈ రెండు సంస్థానములు తీర్థంకరులకుదక్క తక్కిన యందరికిని వినియోగింపబడుచుండెను. ముఖమును ఓరగ ద్రిప్పిన చోట్లనెల్ల ఆవలికన్ను గండరేఖను దాటి ముందు కుబికియుండును.)

౧౪౦౦-వ సంవత్సరమునకు పూర్వము పశ్చిమ హిందూదేశమున కాగితములు వాడుకకు వచ్చెను. తాళపత్రములు అడగంటెను. ౧౫-వ శతాబ్దము ఆరంభము నుండియే శ్వేతాంబర జైనగ్రంథముల యొక్కయు, చిత్రములయొక్కయు లేఖనము కాకితములలో నారంభమైనది. కాగితములు వాడుకకు వచ్చిన వెంటనే సూక్ష్మచిత్రములయందు అభివృద్ధి పొడసూపినది; పత్రముల పరిమాణాకారములు మారినవి; చిత్రవిభాగాదులు మార్పు జెందినవి; పసుపురంగుకు బదులు స్వర్ణము వాడబడుచు వచ్చినది; (ఈ గ్రంథమందు మాత్రము గులాబిరంగు వాడబడినది. కాని యారంగును ఈసంచికయందలి యేక వర్ణచిత్రములలో గుర్తించుట కష్టము.) చిత్రవిషయములు క్రొత్తవి స్వీకరింపబడినవి,

నూతన సంస్థానములు గ్రహింపబడినవి; తీర్థంకరులకు పూర్ణ ముఖావస్థాన సంస్థానమువలె శ్వేతాంబరకాలకాచార్యకథయందలి పర్షి యాసాహీలకు సంపూర్ణ ముఖార్ధ జాన్వవస్థానములు చిత్రింపబడినవి; చిత్ర రచనయందు మిశ్రణము బయలుదేరినది. ఇట్టిమార్పులచే కళ కందము వచ్చినది. శ్వేతాంబర జైనుల కల్పసూత్ర (పర్యూషాణకల్ప మనియు పేరు కలదు.) ములందును, కాలకాచార్యకథయందును ఈచిత్రరచన పెంపొందినది. కాగితముపయి వర్ణముపూసి దానిపై బంగారుసిరాతో గ్రంథమును వ్రాయ మొదలిడిరి. అంచులు చిత్రములతో అలంకరింపబడు చుండినవి.

ఈగ్రంథ, ముకూడ కాగితపుయుగము ఆరంభము నాటిదనియే చెప్పవలెను. వెడలుపు కొంచె మెక్కువ యైనను ఇందలి కాగితములు పొడవున ఇంచుమించు తాళపత్రములతో సమానములే ($\frac{2}{8}'' \times \frac{2}{8}''$).

శైలిలో నీగ్రంథమందలి చిత్రములు సమకాలికములయిన శ్వేతాంబరచిత్రముల చాలవిధముల ననుకరించుచున్నవి. అదే రేఖారచన. కాని ముఖసంస్థానము లంతకంటె తక్కువ. ఇంగుగల ముఖసంస్థాన మొకటే—ముఖము కొంచె మోరగ త్రిప్పబడి యావలి కన్ను ముందున కుబికినట్లుండును. ఆసనమును నొకటే—సింహాసనముపయినిగాని, పీఠముపయినిగాని కూర్చుండినపుడు ఒకకాలు ముందువైపున వ్రేలుచుండును. పద్మాసన మెచ్చటను కానరాదు. అర్ధజాన్వవస్థానముకూడ ఈచిత్రములందు కానవచ్చుచున్నది. శయనస్థితికూడ ఈ చిత్రములలో గానుపించును. కాని యట్టిచిత్రములు అడ్డముగ త్రిప్పబడిన నిలువుచిత్రములే కాని మార్పేమియును లేదు.

ఇందలి కొన్ని విధానములు శ్వేతాంబరరచనలను మిక్కిలి పోలియుండును. గొప్పగొప్ప వ్యక్తుల చిత్రములు దుస్తులందును, లక్షణములందును శ్వేతాంబర చిత్రములలోని హైందవరాజుల చిత్రములనే పోలియుండును. ఇంద్రుని చిత్రము అందలి యింద్రుని చిత్రము వంటిదే. కృష్ణుని చిత్రము ఆయింద్రునిచిత్రమువంటిదే కాని నెమలిపింఛ మెక్కువగా నుండును. రాముడు, మన్మథుడు మొదలగు దేవతలకు దాడీ గలదు. స్త్రీవ్యక్తులును శ్వేతాంబరరచనయందలి స్త్రీవ్యక్తులే. శ్వేతాంబరచిత్రములందువలెనే ఇందును దేవతలు మొదలయిన వారికి పరివేషము తరుచు కాననగును.

ఋషులపట్లను, దేవతలపట్లను ఈచిత్రము లాదరించిన కేశరచన శ్వేతాంబరచిత్రరచనయం దెచ్చటను కానరాదు. కృష్ణుడు, విష్ణువు, ఇంద్రుడు తప్ప తక్కిన దేవత లందరికి సామాన్యముగ కేశపాశము నిడుపయి వ్రేలాడుచుండును. ఈవిషయము నిందలి బ్రహ్మ, కామ, రామ, లక్ష్మణ, శివచిత్రములు విశదముచేయుచున్నవి. ఋషుల కేశపాశముకూడ నిడుపయేకాని యది వ్రేలాడక ఎత్తికట్టబడియుండును. గోపాలుడు తమ కేశములను చుట్టబెట్టుకొనియుందురు.

దుస్తులన్నియు హిందువులవే. మగవారికి ఉత్తరీయమును, అంతరీయమును నుండును. తలపాగ ఎచ్చటను కానరాదు. యుద్ధవీరులు పైజామాలు ధరించియుందురు. హారములు, అంటుజోడులు, కంకణములు, అందెలు మగవారి యాభరణములు; మగవారు నొసట తిలకమును ధరింతురు. కృష్ణుని నొసట రెండు నిలువుగీత లుండును. ఈగీతలు వైష్ణవజాతి చిహ్నము.

శ్వేతాంబర చిత్రములందలి యింద్రాదులవలె ఈచిత్రములయందు విష్ణువు ఒక వవికెయందో, లేక విమానము, రథము వంటి మంటపమునందో కూర్చొని యుండును.

ప్రకృతిచిత్రణమున కొన్ని సంకేతములు కలవు. నదులను చిత్రించుటకు అడ్డగీత లుపయోగింపబడినవి. కొన్నియెడల నదులలో చేపలుగూడ చిత్రింపబడియున్నవి. మేఘములు చిత్రముపైభాగమున అలలవంటి రేఖల యాకారముతో నుండును. అడవులు రెండో, మూడో చెట్లతో నిర్దేశింపబడెను. రచనను పూర్తిచేయుటకై పుష్పములు, తులసి మొక్కలు వాడబడెను, వీని కంతప్రయోజనము కానరాదు. కుసుమములు పెక్కుముల యాకారమున గొప్ప గొప్ప వ్యక్తులతలలపై చిత్రింపబడెను.

విష్ణువు, శివుడు, బ్రహ్మ, ఇంద్రుడు- వీరికి వారి కుండవలసిన యాయాలక్షణములు చిత్రింపబడెను. కృష్ణునికి వేణువు. అతడావేణువు నూదుచున్నను వేణువు మాత్రము అతని మెడ వెనుకనే యుండును. ఇది యీ చిత్రములందుగల విశేషము. శ్రీ కృష్ణుని సుందరవదనము మరుగుపరచకూడదని చిత్రకారుని యభిప్రాయము కానోపును. గోపాలురకు కొసలువంగిన కర్రలు, గోపికలకు పాలకుండలు, వెన్నముద్దలు చిత్రింపబడెను.

ఒక విశేషము—గ్రంథకర్తయు అందందు భగవంతుని నారాధించుచున్నటు లీచిత్రములలో చిత్రింపబడెను. రాజపుత్ర చిత్రరచనయందును ఇట్లు గ్రంథకర్తగూడ చిత్రింపబడియుండుట కానవచ్చుచున్నది: గీతగోవింద సూక్ష్మచిత్రములందు జయదేవుడు చిత్రింపబడెను.

రాజపుత్రచిత్రములందును, పశ్చిమభారతచిత్రములందునువలెనే యిందును రంగముల దృశ్యములు ఆకాశమునుండి చిత్రించినరీతి దూరదృశ్యములుగ నున్నవి. ఒకేకథనుండి ఒకేరచనయందు రెండు మూడు రంగములు చిత్రింపబడుట దాని ఫలితము.

ఈనలువది చిత్రములలోను ముప్పదియేడు చిత్రములు కృష్ణుని యవతారమునకు సంబంధించినవే. కృష్ణుని జీవితములోని వివిధప్రకరణములు వీనియందు చిత్రింపబడెను. తక్కిన మూడు చిత్రములలోను రెండు శ్రీ రామచంద్రుని జీవితమును వివరించునట్టివి. మిగిలినయొకటి ఈశ్వరుని యుద్ధతనృత్యమును చిత్రించునది. ఆపత్రములోని మూలగ్రంథమునకును చిత్రమునకును సంబంధము కానుపించదు. చిత్రకారుడు మూలము నర్థము చేసుకోమివలన నయిన లోప మిది.

శ్వేతాంబరగ్రంథలేఖనమందు చిత్రములకు కొంతచోటు వదలి మిగిలినచోట మూలమును వ్రాయుట యాచారమని యంటిని. ఈవిషయమునగూడ ఈగ్రంథము శ్వేతాంబరులనే యనుసరించినది. పత్రములలో కొంతభాగము చిత్రములకై వదలబడెను. అదిపోను తక్కినభాగమున గ్రంథము వ్రాయబడి తరువాత నా వదలిన భాగమందు చిత్రములు వ్రాయబడినవి. కాని యీనిర్మాణమునకు, శ్వేతాంబరనిర్మాణమునకు కొంత భేదము కలదు. శ్వేతాంబరగ్రంథనిర్మాణమున మూలగ్రంథమునకు ప్రాధాన్య మివ్వబడెను; ఇందు చిత్రములకు. పత్రములయందలి మూలగ్రంథవిభాగమువలన నీవిషయము తెలియగలదు. శ్వేతాంబరగ్రంథములయందు చివరపేజీ తప్ప తక్కిన పేజీలన్నియు మూలగ్రంథముతో నిండియుండును. చిత్రములు, వానికై మూలగ్రంథములో వదలినచోట్ల చేర్చబడినవి. ఈగ్రంథమట్లుకాదు. ఇందొక్కొక్క పేజీయందును ఒక్కొక్క చిత్రము. ఆచిత్రములోని విషయముగల శ్లోకముతో పుట ఆరంభము. తరువాతిశ్లోకములు దానివెంట వ్రాయబడెను. తరువాతి చిత్రమునకు సంబంధించిన శ్లోకముతో మరియొకపుట ఆరంభము. చాలామట్టుకు పత్రముల కావలిప్రక్క మూలగ్రంథము సగమువరకే కలదు. పత్రము లన్నిటియందును ఒక్కొక్కదానియందొక్కొక్క చిత్రమే కలదు. కాని రెండుపత్రములయందుమాత్ర మిరువైపుల చిత్రములు కలవు. శ్వేతాంబర చిత్రములకన్న నీ చిత్రములు పెద్దవి. కాగితపు యుగముయొక్క ఆరంభమునాటి శ్వేతాంబర చిత్రముల పరిమాణము 3″ × 3 ౧/౩″. ఈ గ్రంథమందలి చిత్రముల పరిమాణము ౫″ × ౮″. శ్వేతాంబరగ్రంథములలోని సూత్రరంధ్రము లిందు లేవు. పత్రములకు ప్రక్కలందు ఎర్రమచ్చలు చేయబడి ఆమచ్చలపై నంబర్లు వేయబడినవి.

చిత్రములన్నియు మనోహరములుగ నున్నవి. వర్ణరచన యద్భుతముగ నున్నది. కాని యావర్ణకవిధాన మిందలి యేకవర్ణచిత్రములందు తెలియదు.

ఒక్కొకచో నీచిత్రముల యర్థము మూలము లేనిది గుర్తించుట కష్టము. మూలముగూడ చాలాతప్పులతో నిండియున్నదిగాన కొన్నికొన్ని శ్లోకముల కర్థము చెప్పుటయే కష్టమగుచున్నది. మూలమును చాలవరకు పరిష్కరించవలసియున్నది.

## చిత్రవివరణము *

చిత్రము ౧

౧. విన్యస్య వేణుమధరే వివరాం స్తదీయా
నవ్యాగ్ర మంగుళిభి రంతరయన్ వివృణ్వన్,
గాయన్ కలం శిఖిశిఖండకృతావతంసో
మధ్యే గవాం విజయతే విచర న్ముకుందః.

౨. విన్యస్త (వ్యత్యస్త) పాదమవతంశ (సి)తబర్హి బర్హం
సాచీకృతాననని వేశితవేణునాళం,
తేజః పరం పరమకార (రు) ణికం పురస్తాత్
ప్రాణప్రయాణసమయే మమ సన్నిధత్తామ్.

౧. నెమలిపింఛము నవతంసముగా గలిగిన ముకుందుడు తనపిల్లనగ్రోవిని అధరమున నునిచి దాని రంధ్రములను వ్రేళ్లతో మూయుచు తెరచుచు మధుర మధురముగ పాటలుపాడుచు ఆలమందను నెలయుచున్నాడు.

౨. కాళ్లనువ్యత్యాసముగా నిడికొన్నట్టియు, నెమలి పింఛము నవతంసించినట్టియు, ఓరగ ద్రిప్పిన ముఖమున వేణుదండము నునిచినట్టియు, పరమదయాళువునునైన దివ్యతేజము ప్రాణములు పోవునపుడు నాకు తోచుగాక!

చిత్రమున నెడమవైపున వేణుగానలోలుడు కృష్ణుడు. ధోవతియు, ఉత్తరీయమును అతని ఉడుపులు. అతని తలయందు నెమలిపింఛము, చేత నొక కర్రదోటి కలదు. అతనివేణుదండము మెడకు వెనుక గలదు. అతనికెదుట మరియిద్దరు గోపాలురు అతని గాన రసామృతమును గ్రోలుచు నిలుచుకొనియున్నారు. వారి ప్రక్కను చిత్రముపైనుండి క్రిందికి యమునానది ప్రవహించుచున్నది. ఆనది కావలిగట్టున ఆవులు కృష్ణుని వేణు గానమును వీనులారవినుచున్నవి. గోపాలకృష్ణుడొక చెట్టు నీడ నున్నాడు. అతని తలపై ఎడమవైపున నొక మేఘము కలదు. ఇట్టివేషముతో అవసాన సమయమున దనకు పొడసూపవలయునని కవి ప్రార్థించుచున్నాడు.

పైరెండు శ్లోకములలో మొదటిది వేరొకవిధముగ కృష్ణకర్ణామృతమున నిట్లుగలదు.—

అధరే వినివేశ్య వంశనాళం
వివరా ణ్యస్య సలీల మంగుళీభిః,
ముహు రంతరయన్ వివృణ్వన్
మధురం గాయతి మాధవో వనాంతే.

రెండవశ్లోక మిందున్నటులే కలదు.

చిత్రము ౨

౧. బ్రహ్మాపి చారు శిఖిపింఛకృతావతంసం
తం సంపదాం సదన మర్దితకంసవంశమ్,
గుంజాఫలాభరణభూషితకంఠనాలం
నాలం కి లాకలియతుం (లయితుం) వసుదేవబాలమ్.

౨. చరంత మేకం మనసాపి దుర్గ్రహం
కలిందజాతీరతమాలకాననే,
బబంధ దృక్శృంఖలయా ఒ బలా బలా
న్నిరంకుశం కృష్ణ మహామతంగజమ్.

౧. శిఖిశిఖండుడు, శ్రీనిలయుడు, నాశితకంస వంశుడు, గురువెందల సరముల నలంకరింపబడిన కంఠము గలవాడు నగు వసుదేవబాలుని బ్రహ్మయు గ్రహింప నేరడయ్యెను.

౨. మనస్సునకుగూడ గ్రహింపరాని కృష్ణమహా మతంగజము యమునానదీతీరము తమాలవనమునవొంటిమై చరించుచుండ అబల యొార్తు అంకుశము లేకనే దృక్శృంఖలచేతనే దానిని బంధించెను.

చిత్రమున నెడమవైపున చతుర్ముఖుడు. అతని నాలుగుముఖములలోను మూడే తెలియుచున్నవి. దీర్ఘమైన కేశపాశము. అతడొక యాసనమున కూర్చొనియున్నాడు. కృష్ణు నారాధించుటకై చేతనొక పుష్పమునాతడు పట్టుకొనియున్నాడు. అతనికిపైన కుడిప్రక్క కుసుమములు కలవు. చిత్రమునడుమ శ్రీకృష్ణుడు చతుర్భుజుడైయున్నాడు. అతనికి రెండుచేతుల శంఖ చక్రములు కలవు. అతనికి వెనుక నొక చామరగ్రాహిణి; ఇందు ఇరువురు భక్తులు—ఒకడు చేతులు జోడించియు, మరియొకడు సాగిలపడియు నున్నారు. చిత్రమున కొనను మేఘము లున్నవి.

* వండలీకరణములలోనివి నా సంస్కరణములు.

ప్రాచీన వైష్ణవ చిత్రములు





చిత్రములు ౯, ౧౦

౨. అంగశాలిసకల స్వరోల్లస
ద్వంశకుడ్మలిత కోమలాధరమ్,
పేశలం క్వణిత కింకిణీపదం
శైశవాభరణ మాద్రియే మహః.

౧. పైడికంకణము లల్లన నాడుచుండ జారుచున్న పీతాంబరమును నేల నడ్డగించుచున్నట్టియు, ముఖమున వ్రేలాడు నలకలు సెగద్రోసుకొనుచున్నట్టియు, జారిన నెమలిపింఛము గలట్టియు, మరలమరల బోవ నుద్యోగించి కాంతాబాహువులచే బంధింప బడినట్టియు, మదనకేళిశయ్యోత్థితమునైన తేజము నామానసమున వెలుగుగాక!

౨. వేణువుపై సకలస్వరములను సాంగముగ బాడుటచే వాడిన యధరములు గలిగియు మధురమై, అందెలు రవళించుచుండ నాడుచుండు దివ్యతేజమును నమస్కరింతుము.

ఉయ్యెలపై ఇరువురుగోపికలతో శ్రీ కృష్ణుడు: ఒకతె చామరగ్రాహిణి; మరియొకతె రాధ. కృష్ణుని యొకచేత నొకపాత్ర కలదు. మరియొకచేత నతడు చామరగ్రాహిణి కుచముల నంటుచున్నాడు. ఈచిత్రమునకును శ్లోకములకును సమన్వయ మంతగ కుదురుటలేదు.

మొదటిశ్లోకము కృష్ణకర్ణామృతమున నున్నది.

చిత్రము ౬

౧. నారాయణాయ నమ ఇత్యయమేవ సత్యం
సంసారఘోరవిషసంహరణాయ మంత్రః, [గాత్.
శృ (త్రు) ణ్వంతు సర్వమునయో ముదితా (ః) సురా
ఉచ్చైస్తరా ముపదిశా మ్యహ మూర్ధ్వబాహుః.

౨. ఇతి శ్రీపరమహంస ప్రవ్రాజక శ్రీపాద బిల్వమంగళ విరచితా శ్రీబాలగోపాలస్తుతిః ఇతి మాఘపురాణే భగవద్వాక్యం.

౧. ఓ మునులారా! ప్రీతితో వినుడు, చేయెత్తి చెప్పుచున్నాను. ఈ సంసారమనెడి ఘోరవిషమును నిర్మూలింప 'నారాయణాయ నమః' (నారాయణునకు నమస్కారము) అను మంత్రమే చాలినది., ఇదిసత్యము.

౨. ఇది శ్రీపరమహంస పరివ్రాజక శ్రీపాద బిల్వమంగళ రచితమగు శ్రీబాలగోపాలస్తుతి. ఇది మాఘపురాణమున భగవద్వాక్యము.

మీద ఎడమవైపున శ్రీకృష్ణుడు వేణువు నూదుచు నాట్యము సల్పుచున్నాడు. అతని యొకచేత పిల్లనగ్రోవియు, వేరొకచేత నొక కమలమును, మరియొకచేత కర్రకోలయు గలవు. అతనికి దిగువ నిరువురు గొల్లెత లతనితో గూడ నాట్యమాడుచున్నారు. చిత్రముమీది కుడివైపున మరియిద్దరు గోపిక లున్నారు. అందొకతెతలపై పాల కుండ కలదు. మరియొకతె పెరుగు చిలుకుచున్నది. వారికి క్రిందుగ మరియొక గోపిక యెదుట నొక కుండ నుంచుకొనియున్నది. ఆమె రెండుచేతులలోను రెండు వెన్నముద్దలు కలవు.

చిత్రము ౭

౧. సకృదపి కిల జంతుర్యై రభిధ్యాతమాత్రైః
పరిమృదితకషాయః కల్పతే మోక్షణాయ,
రఘుకులకుముదేందో ర్హాంత తైరేవపుణ్యైః
పదకమలరజోభిర్గౌతమోఽభూత్కుటు(టు)oబీ.

౨. చరణనలినసంగానుగ్రహం తే భజంతీ
భవతు చిర మియం నః శ్రీమతీ ప్రోతపాత్రీ,
ఉపలతనురహి (హ) ల్యా గౌతమస్యేవ శాపా
దియమపి మునిపత్నీ శాపితా కాపి వా స్యాత్.

౧. దేనిని తలంచినంతమాత్రముననే సామాన్య జంతువుకూడ దాని పాపములన్నియు నశించి మోక్షమును పొందగలుగునో, రామచంద్రుని యట్టి పవిత్ర పాదరజమువలన గౌతమముని మరల కుటుంబియైనాడు.

ఇందు రామచంద్రుని యొక యద్భుతచర్య చిత్రింపబడినది. ఇందలిరంగ మొక యడవి. పైన అలలవలె కానవచ్చు నారేఖలు కొండలవరుసయో లేక మేఘమాలయో యయియుండును. శాపవిముక్తయయిన యహల్య రాముసెదుట నిలబడి యతనిని పూలమాల నర్పించుచున్నది. మేఘమాలకు దిగువ,రామున కెగువ మరిరెండు మాలలు కలవు. అవి రాము నభినందింపుటకై దేవతలు

రాల్చినవిగాబోలు! రాముని చెంతనున్న వాడు లక్ష్మణుడు. అతని భుజమునగూడ నొక కోదండము గలదు. చిత్రమున కెడమవైపున గౌతమముని యొక్క పీఠముపై నిలుచుకొని యున్నాడు. అతని యభినయ మతని సంతోషమును చూపుచున్నది. అతనికేశపాశ మెత్తికట్టబడినది.

చిత్రము ౯

౧. మందం మందానుదతి (దంమధుర)
పవనం (నైః) వేణు మాపూరయంతం
బృందం బృందావనభువి గవాం
చారయంతం చరంతమ్,
ఛందోభాగే శతమఖముఖ
ధ్వంసినాం దానవానాం
హంతారం తం కథయ రసనే
గోపకన్యాకిశోరమ్ (భుజంగమ్).

౨. విరణన్మణినూప(ు)రం ప్రజే
చరణాంభోజ ముపాస్య (స్వ)శార్ఙ్గిణః,
సరసే సరసి శ్రియా శ్రితం
కమలంవా కలహంసనాదితమ్.

౧. తియ్యని పవనముల వేణువును నింపుచున్న వాడును, బృందావనమున నాలమందను కాచుచున్న వాడును, వేదాంతసంచారియు, అమరేంద్రుని యాగముల నాశమొనర్చునట్టి రాక్షసుల నుక్కడించువాడును నగు గోపికావల్లభుని ఓ నాలుకా! ఉచ్చరింపుము.

౨. గోకులమున శబ్దించుచున్న మణినూపురములు గలిగి, సరసమయిన కొలనియందు కలహంసనాదముతో గూడిన కమలమువలె నుండు ముకుందుని చరణములను గొలువుము.

ఇవియు కృష్ణకర్ణామృతములోనివే.

ఎడమవైపున కృష్ణుడు వేణుగానమును చేయుచున్నాడు. అతని యెడమచేత కర్రదోటి కలదు. అతని కెదురుగ నిద్దరు గోపాలు రున్నారు. వారికిని చేతులలో కర్రదోటిలు కలవు. వా రానందోన్మత్తులైయున్నారు. దిగువ ఆలమంద కలదు. అవియును కృష్ణుని యావేణుగానమును వీనులార వినుచున్నవి.

చిత్రము ౯

౧. కంఠావసక్త తులసీదల పుణ్యమాలం
వక్షస్థలోల్లసిత కౌ(కౌ)స్తుభకాంతిజాలమ్,
పక్షాంతరాల రజనీకరు (ర) చారుభాలం
వ(ం)దామహే సువదనం పశుపేవబాలమ్.

౨. అలసవిలసన్ముగ్ధ స్నిగ్ధ
స్మితం వ్రజసుందరీ
మదనకదన స్విన్న (ం) ధన్యం
వహత్ వదనాంబుజమ్,
తరుణయాస్నా కృత్స్న
ప్రతిస్న పితాధరం
(తరుణమరుణజ్యోత్స్నా కృత్స్న ప్రతిస్న పితాధరం)
జయతివియతి (జయ) శ్రేణీ రేణీ
దృశా మదయన్ మహః.

౧. కంఠమున తులసిమాలలు, ఉరస్థలమునకౌస్తుభమణి, అర్ధచంద్రుని బోలిన ఫాలము గలిగిన బాలగోపాలునికి నమస్కారములు.

రెండవశ్లోకము కృష్ణకర్ణామృతములోనున్నది.

సింహాసనమున శ్రీవిష్ణువు. అతని యెదుట గరుత్మంతుడు మోకరిలియున్నాడు. ఇరువురికిని తలపైన గొడుగులు కలవు. ఎడమప్రక్క నొక చామరగ్రాహిణి వింజామరములను వీచుచున్నది. కుడిప్రక్క నొక వితానముక్రింద బిల్వమంగళుడే కానోపు, చేత నొక పూలదండను పట్టుకొనియున్నాడు.

చిత్రము ౧౦

౧. కస్తూరీ తిలకం లలాటఫలకే
వక్షస్థలే కౌస్తుభం
నాశా(సా)గ్రే నవమౌక్తికం కరతలే
వేణుంకరే కంకణమ్,
సర్వాంగే హరిచందనంస (చ)
కలయన్ కంఠేచ ముక్తావలిం

గోపస్త్రీ పరివేష్టితో విజయతే
గోపాల చూడామణిః.

౨. ఆయామేనదృశోర్వి శాలతరయో రక్షయ్య
మాద్రిస్థితిః (ర్ధ్ర్సిస్మిత)

ఛాయావర్ష తి(యర్షి త) శారదేందు లలితై (తం)
చాపల్యపాత్రందృశాం (మాత్రంశిశోః), ఆయాసా

౧. లలాటమున కస్తురిబొట్టు, వక్షస్థలమున కౌస్తుభము, నాసాగ్రమున నవమౌక్తికము, చేత పిల్లనగ్రోవి మణిబంధముల కంకణములు, శరీరమంతట శ్రీచందనము, కంఠమున ముత్తెములపేరు గలిగి గోపీజన పరివృతుడైన బాలగోపాలుడు సర్వోత్కృష్టతతో వెలయుచున్నాడు.

౨. శ్లోక మసంపూర్ణము.

ఈరెండును కృష్ణకర్ణామృతమునందలివి.

మొదటి శ్లోకమున వర్ణింపబడిన అలంకారము లన్నియు చిత్రమున గానరావు. కృష్ణుని చుట్టును నున్న గోపికలలోనొకతె చామరమునువీచుచున్నది. మరిమువ్వురు పాలవో, లేక పెరుగువో పాత్రల నతనికి సమర్పించుచున్నారు.

చిత్రము ౧౧

౧. సపాంచజన్యః కరపల్లవాభ్యాం
నివేశితః కృష్ణముఖారవ(వి)ందే,
రరాజ గోక్షీరమృణాలగౌర
స్త్రీపద్మమధ్యస్థ ఇవైవహంసః.

౨. గోధూళిధూమ్రాలకశోభివక్త్రం
గోపాంగనాపాంగవిచిత్రితాంగమ్,
గోపాయతాజ్గోకులగోచరం తత్
గోవర్ధనోద్ధారి పరంపదం నః.

3. గుణాధికో(కా)భూః కిల భూతవర్గతో
గుణాధికోస్యాభవితా(స్మి) సేవయా,
ఇతీవమత్వా మృదుభక్షణే రతం(?)
బా (బ) లానుజం బాల ముపాస్మహే మహః.

౧. కరారవిందములచే ముఖారవిందమున నుంచబడిన కృష్ణుని యాపాంచజన్యము మూడుపద్మములనడుమ నుండు తెల్లనిహంసవలె ప్రకాశించెను.

౨. గోధూళిచేత ధూమ్రములయిన యలకలు గలట్టి ముఖమును, వల్లవీజనాపాంగములచే చిత్రితమయిన యంగములును గలవాడును, గోకులసంచారియు, గోవర్ధనము నెత్తినవాడును నగు పరమపురుషుడు మమ్ములను రక్షించుగాక!

3. భూతవర్గమున భూమి గుణాధికముకదా! అట్టి యాభూమి సేవచేనేనును గుణాధికుడ నయ్యెదనని మృద్భక్షణమునకు బూనిన శ్రీకృష్ణుని ఉపాసింతుము.

రెండవ శ్లోకము కొంతమార్పుతో కృష్ణకర్ణామృతమున నీరీతినున్నది:—

గోధూళిధూసరిత కోమలకుంతలాగ్రం
గోవర్ధనోద్ధరణ కేళికృతప్రయాసమ్,
గోపీజనస్య కుచకుంకుమ ముద్రితాంగం
గోవింద మిందువదనం శరణం భజామః.

అడవి. పైన మేఘములు కానవచ్చుచున్నవి. ఆవు లానందమున నతనిని తిలకించుచున్నవి.

చిత్రము ౧౨

౧. గోపీభి రాస్వాద్య ముఖం విముక్త(ః)
శేతేస్మ రాత్రౌ సుఖమేవ కేశవః,
స్తనాంతరేష్వేవ బభూవ తాసాం
కామీవ కాంతాధరపల్లవం పిబన్.

౨. మధుర మధరబింబం ప్రాప్తు (ప్త) వత్యాం భవత్యాం
కథయ రహసి కర్ణే మద్దశాం నందసూనోః,
అయి మరళి(మురళి) ముకుందస్మేర వక్త్రారవిందాత్
శ్రవణనిచయ ధూమ్రే సాంప్రతం ప్రాణనాథే. (?)

౧. గోపీజనము ముఖము నాస్వాదించి విడువ కేశవుడు కాముకునివలె రాత్రియందు వారి బింబాధరమును గ్రోలుచు వారి స్తనాంతరములనే నిద్రించుచుండెను.

౨. ఓయీ మురళీ! నీవు నందనందనుని అధర బింబముకడ నుందువుగదా! నా యీదశను అతని చెవులలో రహస్యముగ చెప్పుము.

ఈరెండవ శ్లోకము కృష్ణ కర్ణామృతములో— 'అయిమురళి ముకుందస్మేరవక్త్రారవిందశ్వసనమధుర సజ్ఞే త్వాం ప్రణమ్యాద్య యాచే, అధరమణిసమీపం ప్రాప్తవత్యాం భవత్యాం కథయ రహసికర్ణే మద్దశాం నంద సూనోః' అనియున్నది.

కృష్ణు డొకగోపికతో నొక ఉయ్యాలయందు సందుకొనియున్నాడు. మరి యిరువురు గోపిక లాయుయ్యాలను ఊచుచున్నారు. ఉయ్యాలయందు ఒకరిప్రక్క నొకరిని చిత్రించుటలో చిత్రకారుడు మిక్కలి చిక్కుపడినట్లు తోచుచున్నది. కాగితమును నిలువుగత్రిప్పి యీ యిరువురు వ్యక్తులను నిలువుగ చిత్రించి వదలినాడు.

చిత్రము ౧౩

౧. భక్తిః సదా భవతు నః శిశుగోపవేషే
కృష్ణే ఘనద్యుతినిభే సరసీరుహాక్షే,
గోపాదరేణుకృతధూసరసర్వగాత్రే
గోపాంగనావదనపంకజరాజహంసే.

౨. అతామ్రపాణికమలప్రణయప్రతోద
మాలోలహారమణికుండలహేమసూత్రమ్,
అవిశ్రమాంబుకణ మంబుజనాళ(భ)మాద్య
మవ్యాత్ ధనంజయరథాభరణం మహో వః.

౧. నీలమేఘశ్యాముడు, సరోజ లోచనుడు, గోధూళిచే ధూసరితములైన గాత్రములు గలవాడు, గోపాంగనల వదనకమలములకు రాజహంసవంటివాడు నగు బాలకృష్ణునియందు భక్తి మాకెల్లపుడు నుండుగాక!

౨. కరకమలముల కశనుబట్టి, మెడలోని హారములు, చెవులలోని కుండలములు, పైడిమొలనూలు ఆడుచుండ, స్వేదబిందువులుతొలకాడుచుండనర్జునునికిసారథ్యమును నెరపుచున్న పరమపురుషుడు మిమ్ము రక్షించుగాక!

రెండవశ్లోకము కృష్ణకర్ణామృతములోనిది.

కృష్ణు డొకానొక గోపస్త్రీతో నొక యాసనమున గూర్చొనియున్నాడు.

చిత్రము ౧౪

౧. స్వైరం చరంత్యో వవశాద్వలాని
చ్ఛాయాసు బృందావన పాదపానామ్,
పంథాన మాపు ర్నిగమాంతగంధీ
న్యాఘ్రాయ గోవిందపదాని గావః.

౨. బాలం హితం లలితలోచనలాలసాంగం
నీలోత్పలాలిజలదాలితమాలవర్ణమ్,
కాలం కి లాసురకులస్య సుకేలికారం
లక్ష్మ్యాలయం కలిమలఘ్న మహం ప్రపద్యే.

౧. బృందావనమందలి చెట్లనీడల పచ్చికబయళ్లలో నటునిటు తిరుగాడుచు పచ్చికమేయుచుండిన యావులు వేదాంతప్రతిపాద్యములయిన కృష్ణపాదచిహ్నములను గని యాదారిబట్టినవి.

౨. బాలుడు, ప్రియుడు, చక్కని నేత్రములవాడు, నల్లకలువలు, కారుమబ్బులు, చీకటిచెట్లు – వీనిని బోలిన దేహకాంతి గలవాగు, అసురకుల సంహర్త, శ్రీవాసుడు కలిదోషములను పోగొట్టువాడు నగు బాలగోపాలుని ఆశ్రయించెదను.

అడవి. పచ్చికబయళ్ల మేయుచుండినయావులు కృష్ణుని వెంటనంటినవి. ఇందలియర్థ మతిగంభీరము.

చిత్రము ౧౫

౧. అయి పంకజనేత్రమాలిమాలే (మాలిమాలే)
తులసీమంజరి కించి దర్పయామి,
అవబోధయ పార్థసారథే త్వం
చరణాబ్జె శరణాభిలాషిణం మామ్. (?)

౨. పరిపాలయ నః కృపాలయే
త్యసకృత్క్రందిత మార్తబాంధవః,
మురలీ (మురలీ) మృదులస్వనాంతరే
క్వచి దాకర్ణయితా బలానుజః.

3. కటాక్షమాలా కమలాలయా (యాః)
కరోతునః కామదుఘా విభూతిః(మ్),
విభూతిభారావనతా పతంతీ
విశ్రమ్య విశ్రమ్య ముఖే............

౧. తులసీమంజరీ! నీవు ముకుందుని మాలిమాలవు గదా! నావిన్నపమును కొంచె మాలకింపుము. నేనతని శరణుగోరుచుంటినని యాతని కెరుకపరపుము.

౨. 'దయామయా!మమ్ముగాపాడుము' అను నార్త నాదమును ఆర్తబాంధవుడను బలానుజుడు మధుర మధురమగు మురళీనినాదములనడుమ నెట్లాలకించును నో!

3. శ్లోక మసంపూర్ణము.

రెండవశ్లోకము కృష్ణకర్ణామృతములో గాననగును.

విష్ణు వొక చవికెలో నొక యాసనమున శంఖ చక్ర గదాపాణియైయున్నాడు. చవికె యొకకొంత వెను కకు వాలియున్నది. అతనికి ఎదురుగ గరుత్మంతుడు మోకరిలియున్నాడు. ఇద్దరికిని తలపైన గొడుగులు కలవు. విష్ణువున కెదురుగ నొకడు చేతులుజోడించి నిలుచుకొని యున్నాడు. అతడు కవి కానోపును. చిత్రమునకుపైన కుడిప్రక్క నొకతొట్టిలో నొక తులసిమొక్క కలదు. చవికెమీద నొకచిలుక కూర్చొనియున్నది.

చిత్రము ౧౬

౧. శైశవం మనసి శార్ఙ్గిణ శ్చిరం
లంభితా న్నిరుపమం పరాత్పరమ్,
నారదాదిమునిభిశ్చ సేవితం
నందగోపతనయంభజే(జా)మహో (హే).

౨. భక్తాపాయభుజంగగారుడమణి
స్త్రైలోక్యచింతామణి
ర్గోపీలోచన శాంతికారణమణిః
సౌభాగ్యముక్తామణిః,
యఃకాంతామణి రుక్మిణీ కుచమణి
ద్వంద్వైకభూషామణిః
శ్రేయో దేవశిఖామణి ర్దిశతునో
గోపాలచూడామణిః(ః).

రెండవ శ్లోకము కృష్ణకర్ణామృతములో నున్నది.

యమునానదిగట్టు. చిత్రము అడుగున యమునా నది కలదు. అందు చేపలు స్పష్టముగా తెలియుచున్నవి. యమునానదికిపైన చిత్రమున కెడమప్రక్కన నిలిచి యున్న కృష్ణునకు నాలుగుచేతు లున్నవి. శంఖచక్రము లతని రెండుచేతుల గలవు. అతని నర్చించుచు నతని యెదుట ముగ్గురు కలరు. మిక్కిలి దగ్గరగ నున్నవాడు గ్రంథకర్త. మరి యిద్దరు ఋషులు. వారి కేశపాశము లెత్తికట్టబడియున్నవి. అందులో నొకరు నారదముని. చిత్రమున పైభాగము కుడివైపున నొకతొట్టిలో తులసి మొక్క కలదు. యమునకు క్రిందుగ రెండు హంస లున్నవి.

మూలశ్లోకములకు ఇక్కడ ఇచ్చినది ప్రతిపదార్థము గాదు. భావమును దీసికొని వ్రాసినది. కొన్ని శ్లోకములు చాలా తప్పులు గలిగియుండుట వలనను, మరికొన్ని యసంపూర్ణములుగ నుండుటవలనను అర్థము వ్రాయలేదు. చిత్రముల వివరణమును సరిగాచున్నట్లు కానరాదు.

[ఈవ్యాసమునకు ఈస్టర్న్-ఆర్ట్సు, వాల్యూము II, ౧౯3౦ లో డబ్ల్యు. నార్మన్ బ్రౌనుగారు వ్రాసిన 'పశ్చిమ హిందూదేశమందలి ప్రాచీనవైష్ణవసూక్ష్మ చిత్రములు' అనువ్యాస మాధారము. ఈచిత్రములును అం దుండియే తీసికొనబడినవి.]

---



## సంతానినిరోధము

వినుటకే కఠోరముగ నున్న యీ సిద్ధాంతము నేడు మనదేశమున ఆదరణయందే పెట్టబడుచున్నది. పాశ్చాత్యనాగరికతావ్యామోహమువలన మనవారు తెచ్చిపెట్టుకొన్న కొరవులలో నిది చాల పెద్దది. ఇంతకంటె పెద్దది మరియొకటి యుండదు.

ఈ సంతాననిరోధోద్యమము మనదేశమున మొదటి నుండియు గలదనీ, నేడు పాశ్చాత్యులు సప్లయిచేయుచున్న అమానుషసాధనములవలన గాక యిది బ్రహ్మచర్యవ్రతముచే సాధింపబడుచుండెడి దనీ కొందరు చెప్పుచున్నారు; గాని యిది చాల ప్రమాదకరమైన వాదము. ఏమన, బ్రహ్మచర్యవ్రతము శరీరదార్ఢ్యము, చిత్తస్థైర్యము, దీర్ఘాయువు, తన్మూలమున బలిష్ఠమైన సంతానము కలిగించుటకుగాని సంతాననిరోధమునకు గాదు.

ఇంతకే, నేడు మనవారు కొందరు దీనియెడల నింత యుబలాటపడుచుండుటకు కారణ మేమి? ఈ సందర్భమున గమనింపవలసిన విషయ మిదీ: బహుసంతానమువలన స్త్రీలు జీవచ్ఛవములయి పోవుటయు, ఆసంతానమును యుక్తమార్గమున పోషింపలేక పురుషులు సకలయమయాతనలు పడుచుండుటయు. ఇదియే నిజమైనయెడల అట్టివారు సంభోగమునే యేల మానగూడదు?

సంతాననిరోధమును బోధించు పాశ్చాత్యనాగరికత యిట్టిజిజ్ఞాసను రేకెత్తింపజాలదు. ఐహికమే దానికి ప్రాప్యము; పశుకృత్యమే దానికి ప్రవృత్తి; విషయసుఖాభిలాష పెచ్చుపెరుగుటయే దానికి అవధి.

అయితే, యౌవనవిచ్ఛేదకమగు సంతానము దానికి గర్భశత్రువు; కావుననే యీసంతాననిరోధము నెడల పాశ్చాత్యులు నేడింత ముగ్ధులగుచుండుట.

బహుసంతానమువలెనే సంతాననిరోధముకూడ స్త్రీల యారోగ్యమును పూర్తిగా చెరచునని వారు గ్రహింపలేకపోవుచున్నారు. ఎన్నిరసాయనము లుండినను నిత్యయౌవనము మానవులకు సాధ్యముగాదు. యౌవనము కడచినపిదప సంతానవతి కాని స్త్రీముఖమున జీవకళ, వర్చస్సు నుండవు. ఆమెశరీరమున లావణ్యము విలుప్తమైపోవును.

కేవల కాయికసౌఖ్యమునే ప్రధానముగ నెంచుకొనుటవలన నపాయరంగమును సమీపించుచున్న పాశ్చాత్యనాగరికత ప్రస్తావము మన కిప్పుడువలదు. మనసంఘమున కిది అనావశ్యకమే కాదు, అప్రస్తుతమును. మనదేశము ముప్పదిమూడుకోట్ల జనసంఖ్యగూడ తక్కువయే యనిపించునంతటి విశాలముగా నున్నది. ఇందు గర్భితమైయుండని భాగ్య మెచ్చటను లేదు.

కాని మనప్రవర్తన మందుకుతగినట్లులేదు. అలసభావము మనలను పూర్తిగా నావహించియున్నది. అమరియున్న దానిని కొనుటకే మనము సిద్ధపడుదుము; గాని పరిశ్రమచేసి వస్తూత్పాదనముచేయలేము. మన దారిద్ర్యమునకు, మన అగతికతకు కారణమిది.

మనదేశమున సాగుచేయవలసిన భూమి లక్షలకొలది యకరములున్నది; ప్రారంభింపవలసిన పరిశ్రమ లెన్నోయున్నవి; చూపవలసిన పురుషకార మెంతోయున్నది. పైగా మన జీవనపరిమాణము, బిడ్డలెందరుండినా సంసారమును సముద్రమువలె తోపనీయక ఉద్యానవనమువలె కన్పట్టజేయునంత తేలికగా నున్నది. పాశ్చాత్య

నాగరికతలో వేషములలో గల విడంబనములను తగ్గించు కొనగలిగిన గో మనకు సంతానబాహుళ్యము ఉత్తరో త్తరా సుఖప్రదమేగాని ప్రకృతము నదిబంధకగా పర్యవసించునదికాదు.

అయినా సంతాననిరోధము నిమిత్తము మనలో కొందరు అసభ్యసాధనములను పరిచయపరుచుచున్నారు. కొందరు వానిని వాడుచు సంసుమును పెద్దత్రోవకుత్రిప్పుచున్నారు.

ఇది మనము శ్రద్ధగా గమనింపదగినదిగా నున్నది. ఇప్పుడే మనము తగిన ప్రబోధము కలిగించినచో మన దేశమున నీ దురాచారము వృద్ధికాకుండ జేసికొనవచ్చును. —శాస్త్రి.

---

## నాదోపాసన

"శిశు ర్వేత్తి పశుర్వేత్తి వేత్తిగానరసం ఫణీ" యని నానుడి; గాని మన (ఆంధ్రుల)లో దీనికి తగినంత వినియోగము కనబడదు. మనదేశమున సంగీతసభలు జరుగుటయే అరుదు. జరిగిన వానిలోనైన సగమునకు పైగా అరవగాయకులకే ప్రాధాన్యము. ఇట్లనుట అరవలయెడల ద్వేషమువలనగాదు; ఆంధ్రగాయకులకు స్వదేశమునందైన సంపూర్ణాదర సత్కారములు గలుగకున్న వనుటకు.

మనము తరుచు చూడని ద్రావిడదేశము సంగతి యేల? మద్రాసున నెన్ని సంగీతసభ లున్నవో చూడుడు. అవి యెంతవడిగా కచేరీల నేర్పాటుచేయునో గమనింపుడు. అన్నిటను అరవలే యెట్లు ప్రాధాన్యము వహింతురో పరిశీలింపుడు. "సాంబారువాలా" లని అరవలను గేలిసేయుట యొకటే మనవారికి చేత నగును. కాని వారి కార్యవాద మింకను మనకు పట్టుబడలేదు. వాస్తవముగా సకల విషయములయందును అరవలు మన కంటె అగ్రేసరులే అయియున్నారు. అట్లే సంగీతవిషయమున గూడ వారి కగ్రేసరత్వ ముండుటలో నాశ్చర్యమేమి?

ఆంధ్రమే జీవముగాగలిగి, ఆంధ్రునిచేతనే పరిపక్వదశకు గొని రాబడిన కర్ణాటకగానమువిషయమున మన కిపుడు అరవలు ఒరవడిగా నున్నారు. అరవగాయకుల మెప్పువడసినగాని మన గాయకులను గాయకులుగా పరిగణించుటకు మనకు యోగ్యత చాలకున్నది. వ్రేళ్ల మీద లెక్కింపదగియున్న మనగాయకు లైనను సమకూడిన అవకాశములనైన నుపయోగించుకొనుటలో ధైర్యసాహసములు చూపలేక వెనుకబడిపోవుచున్నారు. ఎంత చిన్నియవకాశము లభించినను అరవగాయకుడు చొరుచుకొని పోయి,దృఢదీక్షవలనన్నెల్లర యామోదమును జూరగొని ప్రాముఖ్యము బడయును. మనవారి కట్లుగాక తమ ప్రావీణ్యముజూపి తాము ప్రజల నాకర్షించుటకంటె ముందు ప్రజలే వెదకికొనుచువచ్చి తమ్ము ఆదరింపవలయును. ప్రజలకు తమ యెడల నాత్మీయ్యమును పురికొల్పుకొను ననుసంధానచాతుర్యము మనవారిలో నెంతమాత్రమును కనపడదు.

ఇదియే మనల నన్నిటను వెనుకకు ఈడ్చివేయుచున్న దోషము. ఈ దోషమువలననే ఎంతెంత వైదుష్యము, నెంతెంత సామర్థ్యము నుండినను మన మితరుల కంటె వెనుకబడిపోవుచున్నాము. ఇతరులతో సాహచర్య సంపర్కములు గల మదరాసువంటి ప్రదేశములలో నీదోషమువలని ఫలములు స్ఫుటముగా కాన్పించుచున్నవి.

కర్ణాటకగానము మనకు, అరవలకు, కర్నాటకులకు, మళయాళీలకు సమానమైన హక్కు. ఇట్టి స్థితిలో నితరులకంటె మనము వెనుకబడియున్నామనిన మన హక్కు నితరు లనుభవించుచున్నా రనుట కాదా? ఇది మన గాయకులును, మనమును జాగ్రత్తగా గమనింపవలసిన విషయము. ఇతరుల యెడల మనకు ద్వేషము వలదు; గాని మన హక్కు మనము చెలాయించుకొనవలయును. ఈ కారణమువలన నైన మనగాయకులును, మనమును గూడ శ్రద్ధాభక్తులతో నాదోపాసనము గావించి ఇహపరములను సాధించుకొనవలసియున్నది. —శాస్త్రి.

---




## శ్రీ గాయనాచార్య, దిలీపచంద్ర వేదిగారు



వీరు గురు నానక్ దేవునికుటుంబమువారు. పంజాబు ప్రాంతమున ఆనందపురము వీరిస్వగ్రామము. వీరితండ్రిగారు లక్షాధికారి. వీరు అమృతసరమున విద్యాభ్యాసముతోపాటు చిఱుతప్రాయముననుండియు సంగీతకళాభ్యాసముకూడ సాగించుచువచ్చిరి. సంగీతము కులీనులకు తగని నికృష్టకళ యని వీరిబంధువులు వారించినను వినక, వీరు హిందూస్థానమునకెల్ల ఉత్తమగాయకుడని పేర్వడ్డ మహారాష్ట్రీయుడు, (కీ. శే.) శ్రీ భాస్కరరావుగారియొద్ద బొంబాయినగరమున నుండి, గాంధర్వకళను బాగుగ నభ్యసించిరి. అమృతసరమున పాఠశాలావిద్యార్థిగనున్నప్పుడే వీరు పంజాబునందలి హిందూగాయకులలో నుత్తములై యుండిరి. శ్రీ భాస్కరరావుగారికడ తర్బియతు పొందినది మొదలు వీరు పెక్కుప్రాంతములందు పొగడ్త గనసాగిరి.

తాము లేనపుడు తగవులలో పడిన తమగొప్ప ఆస్తిని తమ్ములకువదలి వీరు కళాదేవతనే సర్వస్వముగ నెంచుకొనిరి. తమ పదియవయేడు మొదలు నేటివఱకిరువదివత్సరములుగా కావించిన కృషి వీరికేకాక సంగీతకళకే అద్భుతమగు నభ్యున్నతిని తెచ్చినది. సంగీతము కేవలము 'శాస్త్రము'గ కాక 'కళ'గా పరిపుష్టి నొందిన వైదుష్యము వీరిది. వీరికి సంగీతకలావిశారద, గాయనాచార్య, సంగీతసుధాకర, సంగీతరత్న- ఇత్యాది బిరుదము లనేకములు కలవు. శ్రీపాటియాలా మహారాజావారు వీరిని ౧౯౨౮ సం. న (అనగా వీరి ఇరువదిరెండు వత్సరముల ప్రాయముననే) తమఆస్థానమున 'Special Musician' (విశిష్టగాయకులు) గా నియమించుకొనిరి.

ఈనడుమ కొన్ని మాసములుగా వీరు దక్షిణదేశమున పర్యటించుచు పెక్కుతావుల తమ ప్రావీణ్యమును ప్రదర్శించి బిరుద, పదకాదిసత్కారములనందుచున్నారు. కడచిన దసరామహోత్సవములందు శ్రీ మైసూరు మహారాజావారు వీరిని ఉత్తమగాయకుల ప్రథమశ్రేణియందు గౌరవించిరి. కన్నడులును, తమిళులునుగూడ వీరిని సంగీతమున ఒక 'ఆదర్శ'మని మెచ్చుకొన్నారు. కళ సృష్ట్యాత్మిక యని వీరిఆశయము. ఇట్టి ఉన్నతాశయములతో కళాతత్త్వపరిశీలనము గావించువారు కనుకనే వీరు కొన్ని క్రొత్తరాగములను సృష్టించి విద్వాంసుల ప్రశంసకు పాత్రులైనారు. అనేకభాషలయందు శాస్త్రగ్రంథముల పఠించుటయే కాక, పెక్కుప్రాంతములరీతు లభ్యసించి, అచ్చటిపామరగేయములు మొదలు శాస్త్రీయరచనలవఱకు యథోచితముగ పాడగలసామర్థ్యము నలవరుచుకొనిరి. పాశ్చాత్యరీతులనుండియు కొన్నిరంజనములు గ్రహించి వీరు తమ రమణీ పద్ధతియందు చొప్పించి మనోహరముగ చూపుచున్నారు. రాబోవు వత్సరము వీరు పాశ్చాత్యదేశముల కేగి, అచట భారతీయ సంగీతముగొప్పతనము సర్వశః ప్రతిష్ఠిత మొనర్చి, వారిరీతులింకను పరిశీలించి, వివిధపద్ధతులందు సామరస్యము నిరూపింప సంకల్పించుచున్నారు. 'నూతనరాగపద్ధతి' యని వీ రొకగ్రంథమును రచించుచున్నారు. విద్వత్తయందును, క్రియయందునుగూడ వీరిది అపూర్వమగు సామర్థ్యమని తజ్జ్ఞులయభిప్రాయము. కళాభిజ్ఞులు కొందఱు 'హిందూ', 'ఆంధ్రపత్రిక' మున్నగు పత్రికల ముఖమున వీరిని సవిమర్శముగ ప్రశంసించినది లోక మెఱిగియేయున్నది.

---

## నివేదన

శ్రీమతి చావలి బంగారమ్మగారు

(గేయము)

ఆదిమధ్యాంతముల అమరిన దేవ!
అతనిహృదయమును నన్ను నమ్మకొనీవ!
అండపిండములలో నుండెడి దేవ!
అతనిగుండెలలో నన్నుండగానీవ?

సమవర్తి వనియేటి స్వామి వీవేగా!
సమముగా నను జూడ స్వామి, సెల వీవ?
ఇంట నన్ను విడిచి తా నొంటిగా బోయి,
జంటకోసము వెతగ ధర్మమంట్రోయి?

ఆకలిబాధచే అవనిలో నేను
అత్తచే జిక్కుటలు అతనికై గాదా?
అన్న పానీయముల కాసించలేదు,
అతనిదయకోసమే ఆసించినాను.

మనసులో భావాలు మణగిపోకుండ,
అరచేత దీయమని అతనితో జెప్పు;
చూపులో భావాలు స్రుక్కిపోకుండ,
చూడ రమ్మని చెప్పు సూర్యుడా, పోయి!

---




## ‘సక్కుబాయి’

‘సక్కుబాయి’ అని ఆంధ్రరంగమున ఒక క్రొత్త నాటకము. ఇది ఏనాటిదో ఒక విష్ణుభక్తురాలి చరిత్రము చెప్పుచున్నది. కాని యీసక్కుబాయి ఇప్పటిదే యేల కాఁగూడదని ప్రశ్నించుటకు, ఒక కొందఱిని ఒకానొక సందర్భము ప్రేరించుచున్నది.

నేఁడు మనసంఘమున కలదనియో, ఇఁక కాఁగలదనియో, మగవారికి ఇంట తిండియైన పెట్టనొల్లని స్త్రీ స్వాతంత్ర్యోద్యమము ఈనాటకమున నిరూపితము. ఇది రెండు ముఖాల పరీక్షింపవచ్చును:—ఔచిత్యమును బట్టి, ఆవశ్యకమునుబట్టి. ఈ సక్కుబాయి ఆనాఁటి దన్నచో, ఈ ఆంగ్ల-ఋతు కలితములైన రోజులు ఈనాటకములో ఇఱుకఁజాలకున్నవి. ఈ మాట తప్పించుకొనుటకుఁగాను సక్కుబాయిని మనలో మెలపింపఁబూనుకురు కొందఱు.

ఉద్యమనాయిక యమునాబాయి తుదకు సక్కుబాయికడ సందిగ్ధములు తీర్చుకొనవచ్చిన రంగమున, మనకు తొలుతనుండియు తెలియనే వచ్చును, ఆమె యేదో ఒకరీతిని సక్కుబాయికి లోఁబడి పోవుటకే వచ్చినదని. ఆమె ఉద్యమమును మనము సహానుభూతితోడనో ఆవేదనతోడనో అనుకరించినవారమైనచో, ఆమెను ఈదౌర్బల్యమునకు; అబలాత్వమునకు,—మనము కూడ ఆమెవలె అబలలమో, అబలులమో కాకున్నచో,—తిట్టి పోయుదుము. ముఖ్యముగ ఇందులకని: అభూషణమును నీ వెట్లు పెట్టెలో దాఁచుకొందువో నిన్ను నీపెనిమిటి అట్లే అంతఃపురమున నుంచి కాపాడుకొనును అనెడి వాదమునకు లొంగి, పురుషునకు భోగసామగ్రిగ స్త్రీత్వమును నిలుపుకొన నొప్పుకొన్నది, యమునాబాయి—తొలుత పరిగా ఇట్టిభావములనే ప్రతిఘటించెడి నిప్పులుకురిసినదై. అదియు కాక, ఉద్యమమునందలి తక్కిన విధవావివాహాది సంస్కార సంకల్పములన్నియు నెట్టులీసంబంధము లేని సమాధానమున తృప్తిపొందఁగలవు? పురుషులంతటి స్వతంత్రవ్యక్తులే స్త్రీలు కావలెనని వీరు తొలుత బయలుదేఱినది. యమునాబాయికి ఈమాత్రము మాట పూర్వాచార పక్షమునుబట్టిన ఒక స్త్రీయైనను చెప్పఁగలదు; దివ్య చైతన్యావిష్ట, నాటకనాయిక, సక్కుబాయివచ్చిచక్కఁబెట్టి తనచరిత్రమున మెఱుఁగుపెట్టికొన్న మహితార్థమేమియు లేదిట. ఇది ప్రధాన సూత్రమును తాఁకనే పోవదు.

సక్కుబాయిచేత సమంజసములగు సమాధానములు చెప్పింపఁబడినను, ఆమె నేఁటిదనియో, (మాటాడిన ఆంగ్లముమాట మఱచిపోయి) ఈ విప్లవకారిణులైన స్త్రీలు నాఁటివారనియో భావించుకొని యితివృత్తమునఐక్యము సమర్థింప వీలీయదు. ఆధునికవృత్తము నేలాగుననో, ప్రాచీనవృత్తము నట్లే, కవి ఒక యాథార్థ్యదృష్టితో కల్పించినారు. అక్కడబయలుదేఱినకల్పన ఇక్కడకు ప్రాఁక లేదు; ఇవి రెండు కల్పనలు, ఏకత్ర కలియకున్నవి. ఆరెంటిని కలియఁగట్టు వృథాయత్నమున సక్కుబాయి నీవలకీడ్చుటకంటె అసమంజసతను స్వీకరించుట మేలు,—తొలగించుకొనైనవచ్చు. మరణించిన సక్కుబాయి పునరుజ్జీవితయగుటవంటి ఘటనలు చూచి, ఈ సక్కుబాయి నేఁటిదియు కావచ్చునని స్వీకరించుటకంటె, ఇట్టి సంఘటనములు ఒక భావములకు చిహ్నములుగ మాత్రము మనము గ్రహింపవలసినట్టి ఒక పుణ్యచరిత్ర మిది యను తలంపున సమాధానపడఁగలము—జైలున పరమపదించినట్టు కైఫియత్తులు వక్కాణించు గోపన్న రామదాసు

మన కథయందును, రంగమునందును సాఁచుకొన్న పరిణామమునకు కన్నిచ్చి యూరకున్నట్లు.

*  *  *  *

ఈ స్త్రీల విప్లవము రంగచరిత్రమునకు కూడ ప్రాఁకి వచ్చినది! సామాన్యుని సంస్కారము ననుసరించి, నాటకమున ఇది ఒకరక్తిసామగ్రి రచించి కళాదృష్టికి కన్నుమూత చూపుచున్నది. ఇది చేకొని, మఱికొన్నిటితోపాటు, నటుల ఏకీభావమును, క్రమశిక్షణమును బెజవాడనాట్యమండలివారి ప్రదర్శనమునకు రంజకత తెచ్చినవి; ధనార్జకత తెచ్చుచున్నవి.

*  *  *  *

## శ్రీ తుంగల చలపతిరావు గారు

ఈయన సక్కుబాయి అనుకరణముతో ఆంధ్ర రంగమున వన్నెకువచ్చిన నటుఁడు. ఈ సందర్భ మింకొక్కనటుని స్ఫురింపఁజేయును. రోషనారతో వీథికుటికిన శ్రీస్థానం నరసింహారావుగారు అప్పుడే ఈదశకములోను (ఇంత కిప్పుడో ముందే) ఉత్తమనటుల ప్రథమ శ్రేణిలో అసందిగ్ధమగు స్థానము కొట్టినాఁడు.

సి. యస్. ఆర్. ఆంజనేయులుగారు రామదాసు పాత్ర మభినయించినప్పుడు, ఆ తెచ్చుకొన్న మెప్పుమీఁదుగ రాఘవాచార్యులుగారు స్ఫురించి తీరినారు. చలపతిరావుగారు రోషనార కాదు, మధురవాణి కాదు, సక్కుబాయి అభినయించినారు. నరసింహారావుగారు సక్కుబాయి అభినయింపలేదు. ఇందు ఏదేని జరిగియుండిన అక్కడ రాఘవాచార్యులుగారితో, ఇక్కడ నరసింహారావుగారిని స్మరించియుండిన స్మరించియుందుమేమో, ఆమాట యిప్పు డెందులకు? వీరి వాచికము, గానమైఖరి మొదలుకొని, సూక్ష్మముగ చూచిన, ఆదర్శము నరసింహారావుగారుగ తోఁచింపఁగలదు కాని, అభినయము సర్వము, తనంత, రంజకమైన దగుటచే, మన మెప్పునకు వ్యభిచార మక్కఱలేదు.

చుఱుకైన అభినయము సక్కుబాయివంటిపాత్రలను నిరూపించుటయం దతిచరించునని చెప్పరాదు. అది ఆపాత్ర అంచులకే నిండుగ చైతన్యము నింపఁగలిగియుండును. కాని శ్రీ చలపతిరావుగారి అభినయమరీతియే సాత్త్వికపుపాకడ కలది. కనుకనే వీరి భావద్యోతనమున మనము పాల్గొత్తిపోము. సక్కుబాయి తన ప్రాపంచికబంధము లన్నిటిని మిగిలి పొంగిన భక్తిసారోన్మత్త కవిచేతి మెలఁకువల మించి వర్ణింపఁగల నటుఁడు ఏ అవకాశమునైనను సక్కుబాయిని పూరించి విసరఁగలఁడు. ఈ ఆశప్రక్కన—శ్రీ చలపతిరావు గారి అభినయము శక్తిమంత మనుటకంటె, సున్నితమైనది అన్న ఒప్పును. అంతియే కాగు, శక్తిహీన మనుటకంటెను గూడ సున్నితమన్ననే ఒప్పును. కనుకనే, వీరియందు స్ఫురించిన, ధ్వనించిన, సక్కుబాయి తన పాదవునకు ప్రేక్షకుని సంస్కారకలితమగు చిత్తమును నడపింపఁజాలును.

*  *  *  *

## శ్రీ జొన్నవిత్తుల సత్యనారాయణగారు

శ్రీజొన్నవిత్తుల సత్యనారాయణగారు నేర్పరియైన నటుఁడు. ఈనాటకమున వీరిని సక్కుభాయిభర్త విశ్వనాథభట్టరు ఆవహించినాఁడు. వీరిని విశ్వనాథభట్టరు ఆవహించినాఁడా, విశ్వనాథభట్టరును వీ రావహించినారా అనెడి సందియము కాఁబోలు, కనఁబడక, ఒక అసంతుష్టిని కొందఱిలోపల కట్టినది. ఎంతటి భావసంఘర్షణము పట్టునసైనను, సామాజికునికి ఈ పాత్రము నెడల సహానుభూతికంటె వీరి అభినయమున నవ్వు ఎక్కువ కలిగినది. 'అందమైన పెళ్లాము, మంచి పెళ్లాము' అని—లక్షసార్లు అట్టిది—యెంతో ప్రేమ విశ్వనాథునికి; అతఁడు ఎంతో మంచి వాఁడు కూడను. ఎంత మంచి వాఁడు కాక పోయిన, కోడలిని రాచి అంపానఁ బెట్టెడి తల్లియెడల '(సక్కును) తాను కొట్టడమే కాక నన్నుకూడా కొట్టమని చంపుకుం దేమి కర్మం?' అని భయము మాత్రము పడి ఊరకుండునా? ఈ సంఘర్షణపు ఇఱుకున తుదివఱకు సాగిన యీ పాత్ర 'నాటకీయప్రకృతి'ని సంతరించుకొన్నది. కాని "మాతృదేవో భవ" అన్నారు కాని "పత్నీదేవో భవ" అనలేదుగదా' అనెడి పురాణ మతితో కార్యనిశ్చయము అంటించుకొను

ప్రవృత్తికి తగిన ప్రకృతి సత్యనారాయణగారి యందు ముఖభంగి, వాచికము మున్నగు విషయాల సహా స్వాభావికముగ అత్తుకొని, ఒకవేళ అస్థాన మునకూడ నవ్వించి, వీరు విశ్వనాథునే పూనినమాటను ఎడనెడ లేవనెత్తినది. ఈస్వయంముద్ర ఏనటునియందో కాని యెల్లపుడు తప్పుకొని యుండదు. విశ్వనాథుని రాపిడిపెట్టిన ఉభయప్రవృత్తులను వెవ్వేఱుగ చూపినంత విపులముగ వానిసంఘర్షణరేఖను గీసి చూపుట లేదన్న సూక్ష్మమైన ఫిర్యాదును, తుదిని, 'నేను కోప్పడుతున్నాను గాని, నువ్వుమాత్రం ఏమీ అనకే అమ్మా' అని భార్యకు హుళక్కి దండన విధించుచు తల్లి ఔద్ధత్యమును తప్పించుకోఁజాలని పట్టున, వీరు తొలఁగించిరి.

కొం. జ.

---






## శ్రీమన్మహోపాధ్యాయ, బ్ర. శ్రీ అయ్యగారి ఉమామహేశ్వరశాస్త్రులవారు



### జననము — వంశము

వీరు సర్వజిన్నామ సంవత్సరమునకు సరియగు ౧౮౪౭-వ సంవత్సరమునఁ బశ్చిమ గోదావరి మండలములోని పెదపూఁడియందు జన్మించిరి. తండ్రి విశ్వేశ్వరశాస్త్రులవారు. తల్లి సూరమాంబగారు. ఆర్వేలనియోగి వంశ్యులు. స్వప్రజ్ఞాబలస్ఫూర్తితో సాంఖ్యయోగాద్వైతశాస్త్రములఁ బారదర్శియై సంస్కృతాంధ్రభాషాసాహిత్యపూర్ణుఁడయి విఖ్యాతిఁ గాంచెను. వీరి ప్రపితామహుఁడగు నయ్యగారి పెదబాపయ్యశాస్త్రులవారు పెద్దాపురసంస్థానమునఁ దత్సంస్థానాధీశులగు శ్రీశ్రీ వత్సవాయ తిమ్మజగత్పతి మహారాజులుంగారి యాస్థానవిద్వాంసులుగ నుండి వారిపయిఁ బంచరత్నములను, సంగీతవర్ణములను జెప్పి యిరువదిపుట్ల యీనాంభూమిని బారితోషికముగఁ బొందిరి. ఆభూమి యిప్పటివఱకును శ్రీమన్మహోపాధ్యాయ, బ్ర. శ్రీ. ఉమామహేశ్వరశాస్త్రులవారి యధీనముననే యున్నది. వీరివంశ్యులెల్లరును బూర్వమునుండి విద్వాంసులై యుండుటచే ననేకులకు విద్యాప్రదానముఁ గావించి మించిరి. అక్కారణమునఁ గాఁబోలు, శైవరత్నాకర మను నాంధ్రగ్రంథమున "ఆరాధ్యవరులెల్ల నయ్యగారని పిల్చుకారణంబున నయ్యగారివా" రనుపద్యమొండు గాన్పించుట సంభవించినది.

### గ్రంథరచనము

శ్రీకృష్ణచరిత మను శృంగార కావ్యమును, గురుస్తవతారావళి యను వేదాంత

గ్రంథమును, వైరాగ్యబోధిని యను నొక గ్రంథమును వీరు రచించిరి.

విద్యాప్రదానము

చిత్తూరుమండలము మొదలు గంజాము మండలమువఱకును విద్యాసముద్రుఁడగు శ్రీ శాస్త్రులవారి శిష్యగణము గలదు. ప్రకృత మనంతపురమందలి కళాశాలాంధ్రపండితులగు బ్ర. శ్రీ. ప్రయాగ వేంకటరామశాస్త్రుల వంటి విద్వద్బృంద మెల్లను వీరిశిష్యపరంపరలోఁ జేరినవారే. వీరు శిష్యులకు బోధింపవలసివచ్చినపుడు శ్రమమనునది యెఱుంగరనుట కొకనిదర్శన మిత్తును. ఒకసారి విషజ్వరపీడితు లయి మిగుల బాధపడుచుఁ దత్ప్రకోపంబున నొడలెఱుంగకుండియు శిష్యు నొకని బిలిచి తర్కవ్యాకరణములఁ బాఠము జెప్పసాగెననియు, వైద్యులిది చూచి వారింప నెంత యత్నించినను బ్రయోజనము గాన్పింపలేదనియు, వారికుమారులు శ్రీవీరభద్రరావు పంతులవారును, శ్రీ క్రొత్తపల్లి సుందరరామయ్యగారును జెప్పినారు.

"శ్రీమన్మహోపాధ్యాయ" బిరుదము

వీరి వైదుష్యమును, విద్యాప్రదానమును గాంచి మెచ్చికొని నరసరాయని పేటయందు శ్రీ ఉయ్యూరు రాజావారి యధ్యక్షతనుజరిగిన యాంధ్రసారస్వతపరిష ద్వార్షికసభయందుఁ బారిషదులు వీరికి "శ్రీమన్మహోపాధ్యాయ" బిరుద మొసంగి సత్కరించిరి. వృద్ధులయ్యును నోపికమెయిఁ బెక్కుర విద్యాపూర్ణులఁ గావించుచున్న శ్రీఉమామహేశ్వరశాస్త్రులవారికిఁ బరమేశ్వరుఁ డితోధికాయురారోగ్యైశ్వర్యంబుల నొసంగి సర్వకాలము మనుచుఁగాక!

—కోన వేంకటరాయశర్మ.




పి. వీరయ్యగారు

రాజమండ్రి కళాశాలలోని 18 ఏండ్ల యువకులు. ఈతపందెములందు ప్రథమబహుమతిని బడసెను.




## ప్రాచీనచిత్రములు

అమెరికా సంయుక్త రాష్ట్రములలోని ఫిలడెల్ఫియాయందు ప్రకటితమయిన "ప్రాచ్యకళ" (Eastern Art) సాంవత్సరికసంచిక (౧౯౩౦) రెండవసంపుటమున "జర్మనువస్తు ప్రదర్శనశాలలయందును, కొందఱుప్రముఖులవద్దను కల భారతీయ సూక్ష్మచిత్రములు" అనుపేర నున్న వ్యాసమున ప్రాచీనచిత్రములు పెక్కు ప్రకటితము లయినవి. ఆచిత్రములలో నాఱు ఈసంచికయందు ప్రకటితములయినవి. వాని వివర మిది.—

౧. దుఃఖరంగము: ప్రసిద్ధమైన అక్బరీవిధానము ననుసరించి పదునాఱవ శతాబ్దపు టుత్తరార్ధమున రచియింపబడిన చిత్రము. ఈచిత్రము తారిఖ్-ఇ-గాషిదీ అను గ్రంథమున పేర్కొనబడిన 'మాబూన్-ఇ నసాన్' అనునాతని మరణమునకు దుఃఖించుచున్నట్లు చిత్రింపబడినది. ఈచిత్రము బెర్లినునగరమున కైజరు వస్తుప్రదర్శనశాలయందు గలదు.

౨. శ్వానదంశ దండము:—ఈచిత్రము కైజరు వస్తు ప్రదర్శనశాలయందు గలదు. పదునాఱవ శతాబ్దారంభమునాటిది. ఇం దపరాధిని కుక్కలచేత తినిపించుచున్నారు. (ఇట్టి పద్ధతి ఆకాలమున నుండెడిది.)

౩. హైందవగాయకుడు:—ఇది 'పరశురామ్-బీక్కార్-ఇ-జహాంగిర్‌షాహి' అను సుప్రసిద్ధగాయకుని రూపచిత్రము. మొగలుచిత్రకళావైఖరి ననుసరించి పదునేడవశతాబ్ద ప్రారంభమున రచియింప బడినది. బెర్లిను నివాసియగు గోల్డుష్మిట్‌గారి చిత్రసంచయము నందలిది.

౪. నీగ్రో గాయకుడు:—ఇది యొక అద్భుతసుందరచిత్రము. దుస్తులు మొరాకో పద్ధతివి. చేత నున్న జంత్రవాద్యము ఆఫ్రికాపద్ధతిది. ఇతడు అహమ్మదునగర మంత్రియగు మాలికాంబరు మతానుచరుడు. ఇది పదునేడవ శతాబ్దము నాటిది; గోల్డుష్మిట్ చిత్ర సంచయము నందలిది.

౫. శివాజీచక్రవర్తి: మహారాష్ట్ర చక్రవర్తి— దక్షిణచిత్రవైఖరిని పదునేడవ శతాబ్దము ప్రాంతమున రచియింపబడినది. బెర్లినునగరమున 'ప్రెషిష్స్ ష్టాట్స్ బిబ్లియోథెక్' సంచయమునందు గలదు.

౬. నిద్రిత:—నిద్రించుచున్న హైందవ యువతి గోలకొండ, హైదరాబాదుల చిత్రములవైఖరి నున్నది. పదునెనిమిదవ శతాబ్దాదియందలిది. ఇది బెర్లిను నగరమున, కైజరువస్తు ప్రదర్శనశాలయందు గలదు.

---



# విమర్శనము



[ఈశీర్షికక్రింద ప్రకటితములయిన విమర్శనలకు ప్రతి విమర్శనలు ప్రకటింపబడవు.—భా. సం.]

## కళింగదేశచరిత్ర

ప్రకాశకులు—ఆంధ్రేతిహాస పరిశోధకమండలి, రాజమహేంద్రవరము, డబిల్ క్రౌను సైజు ౪౮౦ పుటలు. వెల రూ ౭-౮-౦ లు మాత్రమే (తపాలఖర్చు గాక).

ఆంధ్రేతిహాసపరిశోధకమండలి పదునొకండు సంవత్సరముల క్రిందటఁ దొలుత నల్వుర సభ్యులతోఁ బ్రారంభమై ౧౯౧౧-వ సంవత్సరమున శ్రీమదాంధ్ర మహాభారతకృతిభర్తయుఁ జాళుక్యకులాభరణము నగు రాజరాజనరేంద్రుని పట్టాభిషేక వర్ధంత్యుత్సవము ను శ్రీయుత కట్టమంచి రామలింగారెడ్డిగారి యధ్యక్షత క్రిందను మిగుల వైభవముతో జయప్రదముగనట్లుగా జరపుటయేగాక ౧౯౨౨-వ సంవత్సరమున 'శ్రీరాజరాజనరేంద్రపట్టాభిషేకసంచిక' యను శీర్షికతో తద్వంశ చారిత్రపరిశోధనలతోఁ గూడిన యొక గ్రంథసంపుటమునుగూడఁ బ్రకటించి విఖ్యాతిఁ గాంచినది. అటు పిమ్మట సక్రమముగా నాలుగుసంవత్సరములలోఁ బెక్కుమార్పులను దనలోఁ గావించుకొని స్వయంకృషి మూలమున విద్యాధికులయొక్కయు, ధనికులయొక్కయు, మహారాజులయొక్కయుఁ బ్రాపును బడసి దెబ్బదిమంది సభ్యులను జేర్చుకొనఁగలుగుటయేకాక ౧౯౨౬-వ సంవత్సరము జూలై నెలనుండి యాంగ్లమున నొక త్రైమాసికపత్రికనుగూడఁ బ్రకటించుటకుఁ బ్రారంభించి క్రమక్రమాభివృద్ధిఁ గాంచి వందలకొలఁది సభ్యులతోఁ గూడి నేఁడు దేశమునఁ గాలు స్థిరముగా నిలుపుకొన శక్తిగలదై 'కళింగదేశచరిత్ర' అను నామముతో నొప్పెడి యీ పెద్దసంపుటము నాంధ్రదేశమునకై సంపాదింపఁగలిగినది. ఇందుల కాంధ్రదేశము మండలివారికిఁ గృతజ్ఞతఁ జూపఁదగును. ఈమండలి యభివృద్ధి కంతకు ముఖ్యకారకులయినవారు నేఁడు మండలికి గౌరవకార్యదర్శిగ నున్న శ్రీయుత రాళ్లబండి సుబ్బారావుగారని చెప్పవచ్చును. వీరు పట్టభద్రులు, ప్రభుత్వకలాశాలయందు చరిత్రోపన్యాసకులుగ నున్నవారు. వీరి సంపాదకత్వముననే యీయుద్గ్రంథము ప్రకటింపఁబడినది.

ఆంధ్రేతిహాస పరిశోధకమండలిలో నే నొక గౌరవసభ్యుఁడనుగా నుండియుండుటచేతను, చరిత్రపరిశోధనమునందు నాకుఁ గొంత ప్రవేశ ముండుటచేతను కాంబోలు భారతీపత్రికాసంపాదకు లీయుద్గ్రంథమును నాచేతఁ బెట్టి దీనిపై విమర్శ వ్రాయవలసినదని కోరినందున నే నీవిమర్శ చేయుటకు సాహసింపవలసివచ్చినది.

ఆంధ్రదేశమున నితిహాసపరిశోధనలకై యేర్పడిన సంస్థలలో నీమండలియె విద్యాధికబృందముతో నొప్పుచు దేశమున కంతకు గౌరవప్రతిష్ఠలను దెచ్చునట్టిదిగా నున్నది. దీని నిర్వహించు భారము గల కార్యనిర్వాహకసంఘము దేశమున కెప్పుడు నుత్తరవాదిగ నుండక తప్పదు. చరిత్రపరిశోధనవిషయమున నాంధ్రదేశము మిక్కిలి వెనుకఁబడియున్న దనుమాట యెల్లవారికిఁ దెలిసియున్న విషయమే. అందువలన నుత్సాహవంతులును, పట్టభద్రులును నగు యువకులు సవ్యమార్గములఁ గష్టించి స్వయంకృషి సల్పి దేశమునకు గౌరవప్రతిష్ఠలను గల్గించుటమూలముననే తాము 'గౌరవకీర్తులను సంపాదించుకొనుటకుఁ బ్రయత్నించుట వారి విధియై యుండును. అట్లుగాక సులభముగాఁ బేరును సంపాదించుకొనుటకై, తగుశక్తిని సంపాదించుకొనక పూర్వమే కేవలము వేషధారణము గ్రహించి కృత్రిమమార్గములను

ద్రొక్కి- పేరుగల సంస్థల నాధారముగఁ జేసికొని యత్యాశతో నకార్యకరణము లొనర్చి తమలోఁ దామ స్పర్థలను బెంచుకొనియొకరినొకరుమించి ప్రవర్తించుటమూలమునఁ దమకుమాత్రమెగాక దేశమున కంతకు నపకీర్తి గలిగించి యుత్తమసంస్థల వినాశమునకుఁ గారకులగువారు దేశమునకు శత్రువు లనిపించుకొందురు గాని మిత్రు లనిపించుకొనఁజాలరు. వేషధారణ మెప్పటికిని క్షేమకరమైనది గాదు; ప్రతిష్ఠనిచ్చునది కాదు. ఈ చరిత్ర పరిశోధనోద్యమము సులభముగాఁ బేరుదెచ్చుకొనుటకు సాధ్యమగు నితరోద్యమములవంటిది కాదు. ఎంత త్వరగఁ బైకివచ్చిన నంత త్వరగ నేలఁగూల్పఁగలదనుట సత్యము. కొమ్ములుదిరిగిన మనవు జేయుఁగులవంటి పరిశోధకులను సహితము క్రుంగఁదీయునంతటి శక్తిగలది. దీని స్వభావ మిట్టిది. ఎవ్వరును గరువముతోఁ బ్రవర్తింపరాదు. ఈవిషయములను ముఖ్యముగా పట్టభద్రులయిన యువకులు జ్ఞప్తియందుంచుకొని సంస్థల కభివృద్ధి గలుగునట్లు ప్రవర్తింప నేర్చుకొన వలయును.

ఈమండలి కార్యనిర్వాహక సంఘమువారు, అందు ముఖ్యముగా సంపాదకీయ వర్గము వారు కళింగ చరిత్ర సంపాదన భారము సమస్తమును నీముఖ్యసంపాదకునకు విడిచి పెట్టుట కొనిపనియైనది. సంపాదకీయవర్గములోఁ జేరిన ఇవటూరి కనకాచలము పంతులు (ఎమ్. ఏ., ఎల్. టి.) గారు వెంటనే కీర్తిశేషు లగుటవలన వారి కిందేమియు సంబంధము లేదనకతప్పదు. శ్రీయుత డాక్టరు చిలుకూరి నారాయణరావు పంతులు (ఎమ్.ఏ.,ఎల్.టి.) గారు అనంతపురములో దూరమున నుంటచేత నిందుఁ బాల్గొనుట సాధ్యపడకపోయినను 'కాళింగులు, బౌద్ధయుగము నాఁటి కళింగదేశభాష, మతవిషయములు' అను విమర్శతోఁ గూడిన రెండు చక్కనివ్యాసములను పంపి తమ విద్యుక్త ధర్మ మెట్లో నెఱవేర్చుకొన్నారు. ఇంకి మూఁడవ సంపాదకులు శ్రీయుత భావరాజు వేంకట కృష్ణారావు పంతులు (బి.ఏ.,బి.ఎల్.) గారు తా మదివఱకు భారతీపత్రికలోఁ బ్రకటింపించిన 'ముఖలింగము' అను ఠకే పుటలుగల వ్యాసమును 'కళింగసంచిక' లోఁ బ్రకటించియు భారతి పేరెత్తియుండలేదు. భారతిపేరెత్తుట 'కళింగసంచిక కగౌరవ' మని తలంచి యుండఁబోలు. మఱియు వీరు 'రాజకళింగగంగు, సజ్జనగర' మను నొకపుటలో నిమిడిన వ్యాసమునుమాత్రము ప్రకటింపఁ గలిగిరి. ఎందుకొఱకీవ్యాసమును వ్రాసియుందురని చూడఁగా "రాజకళింగగంగు తిరిగి లబ్ధరాజ్యుఁడగుట ఎన్నఁడోకూడ తెలియదు. కళింగగంగుని రాజ్యచ్యుతిని జేసిన శత్రు వెవ్వరు? తిరిగి యాతఁడు జయించి అపహృత రాజ్యమును గైకొనినది యెవరికడనుండి? ఇతఁడు పట్టముగట్టుకొన్న సజ్జనగర మెక్కడ నున్నది? ఈప్రశ్నలకు సమాధాన మింతవఱకు లభింపలేదు" అని వ్రాయుటకొఱకే యని తేలినది.

ఇంక నాలుగవ సంపాదకులు శ్రీయుత వఝ్ఝల అప్పారావుపంతులు (బి. ఏ., బి. ఎల్.) గారు. ఆఖరున వీరు అనుబంధమున కకారాదిసూచికను వ్రాసిపెట్టిరి. హాథిగుంఫాశాసనము తెలిఁగించుటయే గాక శాసనమును తెలుఁగులిపిలో లిఖించిరి. ఇంతకు మినహా వీ రేమియు వ్రాసియుండలేదు. వీరికి తీరిక తక్కువ. అందువలనఁ దటస్థముగా నుండిరి. సుబ్బారావుగారు బ్రతిమాలుటవలనఁ గాఁబోలు అనుబంధమున కకారాదిసూచికను మాత్రము వ్రాసి పెట్టియుందురు.

ప్రధానసంపాదకుని యందే యావద్భారము మోపఁబడినందువలన 'ఈ మహాగ్రంథము' చెత్త చెదారము, దుమ్ము, గులకరాళ్లు మొదలగువానితో నిళితమయిన బరువుతో తయారైనది. ఇందలి రత్నములను కనిపట్టుటకు వేఱుగ రత్నపరీక్షకుఁడు గావలయును. నిర్వాహకులకు ఉబలాట మెక్కువ, సామర్థ్యము తక్కువ. ఇఁక సంచిక ఒడ్డు, పొడుగు, లావు, పటములు చూచుకొని సంతోషింపవచ్చును.

ఈచిత్రము చూడుఁడు. ఏడుగురి చిత్రపటములతోఁ గూడిన యొక దిమ్మ ముద్రింపఁబడి దాని క్రిందను 'ఆంధ్రేతిహాస పరిశోధక మండలి కార్యనిర్వాహక సంఘము, ౧౯౨౬-౧౯౨౭' అని వ్రాయఁబడియున్నది. ఇందలి పేరుల వివరము: ౧. జయంతి రామయ్యపంతులు

గారు (అధ్యక్షులు) ౨. రాళ్లబండి సుబ్బారావుగారు (గౌరవకార్యదర్శి) ౩. భావరాజు వేంకటకృష్ణారావు గారు (గౌరవసహాయకార్యదర్శి) ౪. న్యాపతి కామేశ్వర రావుగారు (కోశాధిపతి) ౫. గొల్లకోట గంగాధరసోమ యాజులుగారు ౬. చిర్రావూరి ఆత్మారామగారు ౭. జయంతి గంగన్నగారు (వీరు మూవురు సభ్యులు). కార్య నిర్వాహకసంఘ మెప్పుడును తొమ్మండుగురుసభ్యులతోఁ గూడియుండునదిగాని యేడుగురుతోఁ గూడియుండునది కాదు. ఇదటుండనిండు. ఈ ౧౯౨౬-౧౯౨౭ వ సంవత్సరమున కార్యనిర్వాహకసంఘ సభ్యులుగా నెన్నుకొనఁబడినవా రెవ్వరో ౧౬-౩-౨౬-వ తేదిని జరిగిన మండలి వారి సాధారణసంఘసభ నిర్ధారణచేసియున్న తీర్మానము నీక్రింద వివరించుచున్నాను.

౧. జయంతి రామయ్యపంతులుగారు (అధ్యక్షులు)

౨. వి. రంగాచారియర్ అవర్గళ్ (ఉపాధ్యక్షులు)

౩. రాళ్లబండి సుబ్బారావుగారు (కార్యదర్శి)

౪. భావరాజు వేంకటకృష్ణరావుగారు (సహాయ కార్యదర్శి)

౫. న్యాపతి కామేశ్వరరావుగారు (కోశాధిపతి)

సభ్యులు

౬. చిలుకూరి నారాయణరావుగారు

౭. చిలుకూరి వీరభద్రరావుగారు

౮. మానవల్లి రామకృష్ణకవిగారు

౯. వడ్డాది అప్పారావుగారు.

ఈపైవారు ౧౯౨౬-౧౯౨౭-వ సంవత్సరమునకు కార్యనిర్వాహక సంఘసభ్యులుగా నుండవలసినదిగా చిలుకూరి నారాయణరావుగారిచే తీర్మానము ప్రతిపాదింపఁబడి యెల్లరిచే నంగీకరింపఁబడినది. (మండలివారి త్రైమాసికపత్రిక సంపుటము ౧, భాగము ౧-చూడుఁడు).

ఈపైవారిలో నల్వురుమాత్రమే పై నుదాహరించిన దిమ్మలోఁ గన్పట్టెదరు. తక్కిన యైదుగురు గన్పట్టరు. రంగాచారిగారికి బదిలీయగుటచేత వారి స్థానమునకు డి. సదాశివరెడ్డిగా రెన్నుకొనఁబడినను వారి పట మైనను గానరాదు. ౨౭-౧-౨౭-వ తేదీని చిలుకూరి నారాయణరావుగారికి బదిలీయైనందున వారి స్థానమునకు ఆత్మారామగారి నెన్నికొనిరి. మఱుసంవత్సరమునఁగా ౧౯౨౭-౧౯౨౮-వ సంవత్సరమునకుఁగూడ సభ్యులుగా నెన్నికొనఁబడిన సదాశివరెడ్డి, రామకృష్ణకవి, అప్పారావు, వీరభద్రరావుగార్లు ౧౯౨౬-౨౭-వ సంవత్సరములో కార్యనిర్వాహకసంఘములో సభ్యులుగా నున్నారనుట మండలిరికార్డువల్ల స్పష్టముగాఁ గన్పట్టుచుండ వారిని లోపింపఁజేసి వారి స్థానమున గంగన్న, గంగాధర సోమయాజులగార్ల నిర్వురను క్రొత్తవారినందుఁ జేర్చి ౧౯౨౬-౨౭-వ సంవత్సరములోని కార్య నిర్వాహకసంఘమని ఏల పటము ప్రదర్శింపవలసివచ్చినదో 'కళింగదేశచరిత్ర' సంపాదకులు సచ్చఁ జెప్పుదురు గాక!

ఇంక సంపాదకీయ విజ్ఞాపన గనుఁడు: "విషయ సూచిక చూచినచో ఏయే వ్యాసవిషయములు ఏయే వ్యాసకర్తలచేత వ్రాయఁబడినవో తెలియఁగలదు". అని వ్రాసిరి. దీనిని సంపాదకులు తెలుపనక్కఱలేదు. పాఠకులే తెలిసికొనఁగలరు. "అట్టివా రందఱును పరిశోధనాశక్తిని చక్కఁగఁజూపిరి. తమ వ్యాసములందు నూతనాంశములను పొందుపఱచిరి" అని వ్రాసిన సంపాదకుఁడే కడపట "గ్రంథమున అనేకరకముల తప్పులు గలవు; పాఠక మహాశయులు దయతో తప్పుల నొప్పులుగ మార్చి చదువుకొనఁ బ్రార్థితు" లనుచున్నారు. ఏవ్యాసకర్తలు పరిశోధనాశక్తిని చక్కఁగాఁ జూపఁగలిగిరో, ఏవ్యాసకర్తలు నూతనాంశములను బొందుపఱచఁగలిగిరో ముందుగాఁ దెలిసికొని తా మొకవ్యాసమును వ్రాసియున్నయెడల నెంత చక్కఁగా నుండును? ఎన్నెన్నిరకముల తప్పు లున్నవో వానినైన తమ ప్రత్యేక వ్యాసమునఁ దెలిపియుండినఁ బాఠకమహాశయుల కెంత ప్రయోజనకరముగా నుండును? ఎనిమిదేండ్లు ప్రాఁకులాడి ప్రాఁకులాడి, యెందఱెందఱు విద్యాధికులనో యాకర్షించి, యెందఱెందఱు ధనికుల కాళ్లు కడుపులో పట్టుకొని యాశ్రయించి, యెంతెంత

సామ్మో యార్జించి తుదకు రాళ్లను ప్రోగుచేసికొని రత్నా లక్షింప మార్చుకొమ్మన్నట్లు 'పాఠకమహాశయులారా! ఈ యుద్గ్రంథములో నెన్నెన్ని రకములతప్పులో గలవు వాని నెల్ల నొప్పులుగ మార్చుకొండి' యని చెప్పుట సంపాదక ధర్మమును నిర్వర్తించుట యగునా!

ఈసంపాదకునికి 'కళింగదేశచరిత్ర' మననేమో, 'ఉత్కళ దేశచరిత్ర' మననేమో భేదము తెలిసియున్నట్లు గన్పట్టదు. కళింగదేశ చరిత్రము ౧౦౬ పుటలలోను, ఉత్కళదేశచరిత్రము ౧౫౦ పుటలలోను ముగించినారు. ఆంధ్రేతిహాస పరిశోధకమండలి వారు 'కళింగసంచిక'ను బ్రకటించుమనినారుగాని తమ్ము 'కళింగదేశచరిత్రము'ను బ్రకటించుమని యుత్తర వొసంగియుండలేదు. వీరు 'కళింగదేశచరిత్ర' మని నామమిడినారు. తాము వ్రాసిన 'కళింగదేశచరిత్రము' కంటె, ఉత్కలదేశ చరిత్రము పెద్దదిగనుక 'ఉత్కలదేశచరిత్ర'మని పేరు పెట్టియుంచిన నెంతో యందముగా నుండియుండును.

ఇయ్యది నిజముగా కళింగదేశచరిత్రమే యైయున్న యెడల విజయనగరము, బొబ్బిలి, పిఠాపురము, పెద్దాపురము మొదలగు చరిత్రప్రఖ్యాతములగు సంస్థానముల యొక్క చరిత్రము లుండియేయుండును. పర్లాకిమిడి, జయపురసంస్థానములయొక్క చరిత్రములను జేర్చిన యీ సంపాదకులకు బైవిజయనగరము, బొబ్బిలి, పిఠాపురము, పెద్దాపుర సంస్థానముల యొక్క చరిత్రములుకూడ జేర్పవలయు నని స్ఫురింపకపోవుట యేలకో, దురూహముగా నున్నది. తాము వ్రాసిన యుత్కల దేశచరిత్రమునందు నుత్తరసర్కారులలోని జమీందారులను నామమాత్ర ప్రశంసలు గావించుచు విడిచిపెట్టినారు. ఈ చరిత్ర మంతయు సరిగా లేదు. ఇది మిక్కిలి సంతాపకరమైన విషయము.

"ఇత్యాది కష్టతరములగు సమస్యలు తీర్పవలసిన పని ముఖ్యమగుటచే ప్రాచీనగ్రీకురోమక చరిత్రకారుల వ్రాతలవల్లను, తామ్రశిలాశాసనములవల్లను తెలియదగ్గ విషయములను క్రోడీకరించి పై సమస్యలను సమాధాన పర్చగలిగితిని. ఇట్టి యాధారములు మొదటలేమి, నా వ్యాసరచనము కడుకష్టమై గ్రంథప్రకటనను గూడ ఆలస్యము చేసెను అయినను కావలసినకార్యము పూర్తియైనగాని విసుపని సంపాదకుని మండలివా రెన్నికొనుటచే ఆలస్యము పూర్తిగా నావల్ల కాలేదని యూహించెదను" అని సంపాదకీయ విజ్ఞాపనమునం గలదు. కాని యిందు వీరు పరిష్కరించిన సమస్యలుకాని, కను గొన్న నూతన విషయములుకాని కానరావు. ఉన్న దొక్కటే యున్నది. అంతియకాక 'కళింగదేశచరిత్ర' యని మొదలుపెట్టి ౧౧౩౫ వ సంవత్సరములో అనంతవర్మ చోడగంగదేవుఁడు ఉత్తరకళింగము, లేక ఓఢ్రదేశము జయించెను గనుక ఈతనియొక్కయు, ఈతని తరువాతిరాజుల యొక్కయు చరిత్ర "ఉత్తరకళింగ లేక ఓఢ్రదేశచరిత్ర" యను వేఱొక వ్యాసమునం దెలిపెద నని యంతటితో కళింగదేశచరిత్రము ముగించి, ఉత్కళదేశచరిత్ర ౩౫ పుటలవఱకు కేసరివంశము, కోసల గుప్తవంశము, కరవంశము, శైలోద్భవవంశము, భంజవంశము మొదలగువానిగుఱించి నేమేమో వ్రాసి పిమ్మట మరల అనంతవర్మ చోడగంగదేవు నెత్తుకొన్నారు. ఎట్లు చరిత్రము ప్రారంభింపవలయునో ఎట్లు ముగింపవలెనో వీరికిం దెలిసినట్లులేదు.

సంపాదకులకు గావలసినది బహువుకాని, గుణముకానట్టు తోఁచును. ఈయూహను సమర్థించుటకుఁగా నొండురెం డుదాహరణములు: కోచులనుగూర్చి శ్రీయుత అవసరాల జగన్నాథరావు పంతులుగారును, సవరలనుగూర్చి శ్రీయుత గిడుగు సీతాపతిరావు పంతులుగారును వివరములతోఁ జక్కని వ్యాసములు వ్రాసియుండఁగా నందునుగూర్చియే మరల ఫాదిరికేయిన్ దొరగారియొక్కయు సీతాపతిరావుగారి యొక్కయు పల్కులనే వ్రాసి తా మొకవ్యాసమును బ్రకటించిరి. తమ వ్యాసమధ్యమున ముద్రింపఁబడినసవరల బొమ్మలు సీతాపతిరావుగారియొద్దనుండి సంగ్రహించిన ఛాయాపటములనుండి దిమ్మెలను తయారుచేయించినవై యుండును. అటులయిన వీనిని సీతాపతిరావుగారి వ్యాసమునడుమఁ బ్రకటింపవలసియుండును. అట్లు చేయక యావ్యాసమును తమ వాక్యములతో సంగ్రహ

వఱచి ప్రకటించుట చూడ తాము వ్యాసమును బొమ్మలకొఱకు వ్రాసినట్లుగా నాకుఁ గన్పట్టుచున్నది వీరి నవరల వ్యాసము. నారాయణరావుగారి కాళింగులవ్యాసమాంధ్రపత్రికసంవత్సరాదిసంచికనుండి సంగ్రహించినారమని తెలిపినవారు శ్రీయుత అడిదము రామారావుగారు వ్రాసిన సరసమైన కళింగాంధ్రకవులనుగూర్చిన వ్యాసమాంధ్రసాహిత్యపరిషత్పత్రికనుండి గ్రహించినారమని తెలుపవలదా? మొదటిది కర్తవ్యముగాఁ దోఁచినది; రెండవది కర్తవ్యముగాఁ దోఁపకపోయినదా! అదివఱకే యీమండలివారి త్రైమాసికపత్త్రికయందుఁ బ్రకటింపఁబడిన డాక్టరు కృష్ణస్వామిఅయ్యంగారియొక్కయు, పండిత నీలకంఠదాసుగారియొక్కయు వ్యాసములలోని సమస్యల వైరుధ్యభావములను సమన్వయించి సమాధానపఱచుటగాని, పరిష్కరించుటగాని జరిగింపనపుడు తెలిఁగించి యిం దెక్కించినారు. ఇది బరువు చేటునకుమాత్రమేకాక చరిత్ర పరిశోధనము చేయువారికిఁ గ్రొత్తచిక్కులను గూడఁ గలిగింపఁ గలదు. వారు సంచికకొఱకు వ్రాసినవానిని ముందుగా మండలివారి త్రైమాసికపత్రికలో నేల ప్రకటింపవలసివచ్చినది? శ్రీయుత జయంతి కృష్ణారావుగారి 'కళింగ సామ్రాజ్యము' అను ౪ పుటలుగల వ్యాస మదివఱకే యాంధ్రపత్రికా సంవత్సరాదిసంచికయందుఁ బ్రకటింపఁబడినది. దానిని సంగ్రహించి యిం దెక్కించిరి.

ఈగ్రంథసంపుటమునందు విద్యాధికులు కొంత వఱకు పరిశ్రమచేసి తమ పరిశోధనలను గనుపఱచుచు నింకను బరిశోధకులకు మార్గములను జూపు చక్కని వ్యాసములు గొన్ని కల వనుటకు సంశయము లేదు. వీనిలోఁ జిరకాలమునుండి పరిశ్రమ చేయుచు నిదివఱకే యిండియాలోని యనేకాంగ్లమాసపత్రికలలోఁ దమ చరిత్ర పరిశోధనల ఫలితముల ననేకవ్యాసముల రూపమునఁ బ్రకటించుచున్న శ్రీయుత గొడవర్తి రామదాసు పంతులుగారీసంచికయందు ప్రకటించిన 'కళిఙ్గ' 'కళిఙ్గశిల్పము', 'కళిఙ్గగాఙ్గేయ ప్రవర్ధమాన విజయరాజ్యశకము' అను వ్యాసములు చరిత్రజ్ఞులకుమాత్రమె కాక చరిత్ర విద్యాభ్యాసకులకు విద్యార్థులకుఁగూడ మిక్కిలి యుపయోగకరములుగా నుండును. ఇయ్యవిగాక వీరు 'జయపురవంశచరిత్ర' మను మఱియొక చక్కని వ్యాసమునుగూడ వ్రాసిరి. గాఙ్గేయవిజయరాజ్యశక నిర్ణయమునుగూర్చి పరిశోధకులలో నొక గొప్ప తగవు గలదు. అది తీర్చుటకై వీ రెంతో శ్రమపడి పైవ్యాసమును వ్రాసినారు. ఈగ్రంథసంపాదకులు పట్టి సొఱకాయ కోఁతలు గోయక కొంతకాలము చరిత్రపరిశోధనయందు తగినకృషి సల్పిననే కాని పరిశోధనమున కావశ్యకమైన జ్ఞానము లభించదు. సవ్యమైన చరిత్ర పరిశోధనమార్గములం బట్టి (అభిప్రాయభేదము లుండిన నుండుఁగాక) మఱి కొన్ని యుపయోగకరములయిన వ్యాసము లింకను గలవు. గ్రంథవిస్తరభీతిచేత వానిపట్టికనుమాత్ర మిం దుదాహరించుచున్నాను.

౧. బౌద్ధయుగమునాటి కళింగదేశభాష - మతవిషయములు. కర్త, చిలుకూరి నారాయణరావుగారు.

౨. కలింగదేశ శాసనమునందలి తెలుఁగుభాష. కర్త, గిడుగు సీతాపతిరావుగారు.

౩. కళింగనగరము. కర్త, గాదె నరసింగరావుగారు.

౪. విజయనగర సామ్రాజ్యాధీశులు- కలింగదేశముతో యుద్ధములు. కర్త, కుందూరి ఈశ్వరదత్తుగారు.

౫. నళవంశపు రాజులు. కర్త, డాక్టరు యన్. వేంకటరమణయ్యగారు.

౬. కాకతీయులు. కళింగము. కర్త, మల్లంపల్లి సోమశేఖరశర్మగారు.

౭. అనంతవర్మ చోడగంగదేవ. కర్త, శ్రీపాద గోపాలకృష్ణమూర్తిగారు.

౮. ప్రాచీనపు ఓఢ్రులు. కర్త, సత్యనారాయణరాజగురుగారు.

౯. కిమిడి గంగవంశము. కర్త, సింహాద్రిపోరిచాగారు.

౧౦. కళింగము-ఎలమంచిలి. కర్త, గొబ్బూరి వేంకటానందరాఘవరావుగారు.

౧౧. ప్రాచీన కళింగదేశచరిత్ర. కర్త, కొరాడ వేంకటరామాచార్యులుగారు.

ఇయ్యదిగాక భాషాసంబంధముగ శ్రీయుత నిడదవోలు వేంకటరమణగారిచే వ్రాయఁబడిన "కళింగదేశపు శతకవాఙ్మయ" మను నొక చక్కని వ్యాసము ప్రకటింపఁబడినది.

శ్రీముఖలింగేశ్వర క్షేత్రమాహాత్మ్యమని శ్రీయుత ముక్కామల వేంకటరెడ్డి శాస్త్రిగారిచేతను, శ్రీ ముఖలింగక్షేత్రమాహాత్మ్య మని శ్రీమాన్ మేడేపల్లి వేంకటరమణాచార్యులుగారిచేతను తెలుఁగులో వ్రాయఁబడిన రెండు మంచివ్యాసములు గలవు.

ఇతర క్షేత్రమాహాత్మ్యములు లేని కొఱంతను శ్రీయుత నిడదవోలు సుందరముపంతులుగారిచేఁ జక్కని తెలుఁగుభాషలో వ్రాయఁబడిన 'కళింగరాజ్యక్షేత్రప్రశంస' యను వ్యాసములోని ప్రథమ ద్వితీయభాగములు వివరములతో సంగ్రహముగా వర్ణింపఁబడుట వలనఁ దీఱిపోవుచున్నది.

మఱియు పెక్కాలి కాదంబరాజవంశేతిహాసమను నొకవ్యాసము శ్రీ శ్రీ శ్రీ లక్ష్మీనారాయణహరిచందన జగద్దేవు రాజాబహద్దరుగారిచేతను, గంగవంశానుచరితమని శ్రీ యాంధ్రభారతీతీర్థప్రధాని బుఱ్ఱా శేషగిరిరావుగారిచేతను వ్రాయఁబడియున్నవి. ఇంకను చిల్లరవ్యాసములు గలవు.

ఈ సంపుటమునఁ బెక్కువ్యాసములలో నొకచోటఁ జెప్పఁబడిన విషయములే మఱియొకచోట మరల మరలఁ జెప్పఁబడుచు విసుగు గొలుపుచుండును. ఇందుఁగల గొప్ప విశేషమే అది. ఇంక కళింగవర్ధంత్యుత్సమునుగూర్చి రెండుమాటలు చెప్పవలసియున్నది.

ఆంధ్రభాషాభిమానులును, పండితకవులును, పండితపక్షపాతులును నేఁడు జయపుర సంస్థానాధీశ్వరులై మహారాజపట్టభద్రులు నైయున్న శ్రీ శ్రీ శ్రీ విక్రమదేవవర్మమహారాజులుంగారు నాఁడాహ్వానసంఘాధ్యక్షులుగ నుండి కళింగదివసోత్సవ సభాసభ్యప్యాగతోపన్యాసము విన్పించిరి. వీరి సౌమ్యస్వభావమున కనుగుణ్యముగానే వీరి యుపన్యాసము సౌమ్యముగాను సగుణముగాను నుండినదని చెప్పవచ్చును.

కళింగవర్ధంత్యుత్సవ సభాధ్యక్షులయిన శ్రీ అన్నెము పరశురామపాత్రోగారు తాము కాళింగులై యుండుటవలన స్వజాత్యభిమానమును సంపూర్ణముగాఁ జెలుపుచు నుపన్యసించిరి. ఎట్లయిననేమి, పాత్రోగారి కోరిక ననుసరించి 'కళింగదేశచరిత్ర' బయల్వెడలినది. ఇయ్యది యనేకములయిన చిత్రపటములతోఁ గూడి యున్నది. సర్. పాత్రోగా రాంధ్రులచే తెలుఁగు వారుగను, ఉత్కలులచే నోఢ్రులుగను పరిగణింపఁబడు చున్నట్లుగనే యీగ్రంథ మాంధ్రులచే 'కళింగసంచిక' గను, ఓఢ్రులచే 'నుత్కలసంచిక'గను బరిగణింపఁబడు చుండునుగాక!

చిలుకూరి వీరభద్రరావు.

---

## దేవి జోన్

'జోన్ ఆఫ్ ఆర్క్' జీవితచరిత్రము.

గ్రంథకర్త:—గద్దె లింగయ్యచౌదరిగారు, ఆంధ్రగ్రంథమండలి సంస్థాపకులు, ఎలమఱ్ఱు, కృష్ణాజిల్లా.

క్రౌనుసైజు ౧౧౨ పుటలు, వెల ౧౮ అ.

ఇట్టి వీరజీవితకథలు ఏనాఁటికైనను మనయువకుల నావశ్యకములు. వస్తుప్రాముఖ్యమునకు తోడు, గ్రంథకర్త వీరారాధనతత్పరమగు మనస్సుతో వ్రాసి యుండుటచే, ఈగ్రంథమున జీవకళ యున్నది. ఇది ఒక హిందీగ్రంథము సాధారముగ తీసికొన్నప్పటికిని, పెక్కు ఆంగ్లగ్రంథములనుండి ప్రమాణము లెత్తఁబడినవై యిందు సంకలితముచేయబడియున్నవి. మంచి కాగితముపై చక్కగ ముద్రితమై ఇది అందముగ నున్నది.

---

## రుక్మిణి

(ద్వితీయముద్రణము.) ఔరంగజేబుకాలమునాటి ఒకక్షత్రియవనితకథ. గ్రంథకర్త: అయుండి వేంకట

గురువులు శిష్యులకు పాఠములబోధించునపుడు శిష్యుల ప్రజ్ఞాపకార్థమో లోకహితార్థమో వ్రాసియుంచిన 'నోట్సును' చూచుటకే అల్పాయువులును అల్పమేధావులును మనకు వీలులేక 'ఆయుర్వేదము పూర్తిగా లేదు' అని చెప్పుకొనుచున్నాము. వారు విపరముగ గురుసహాయ మక్కరలేకుండనే స్వయముగ జదువుకొనుట కనువగునట్లు వ్రాసియుండిన అసలు ఆయుర్వేదమే లేద నెడిమాటల వినవలసిన దుస్థితి ప్రాప్తించియుండవలసినది. త్రిదోషతత్వముపై నాధారపడి ఏరోగమునైనను ఆత్రిదోషములందే యంతర్భావముజేసి తదనుసారముగ చికిత్సనుగూడదెల్పి రుజాపహరణ సామర్థ్యముగల ఆయుర్వేదమున రుగ్వినిశ్చయమునకు నాడీజ్ఞానమే ముఖ్యతమమనియు, లోకసామాన్యమునకంతటికిని (అనగా ధనవంతులకును బీదవారికినిగూడ) నందుబాటులోనున్న సాధనసంపత్తినే వీలైనంతవరకు నెక్కువగ బోధించుచున్న యాయుర్వేదమునకు X-Rayలు మొదలగు శ్రీమంతులకే లభ్యములగునట్టి సాధనము లేమాత్రమును బనిలేదనియు, ఇట్టి(రోగనిదానవిధానమువంటి) గ్రంథములాయుర్వేదము నుద్ధరింపజాలవనియు, 'ప్రస్తుతము మనకు తెలిసియున్న ఆయుర్వేదగ్రంథములు' బూర్తిగ నాయుర్వేద సంప్రదాయానుయాయులును తచ్ఛ్రద్ధాభక్తియుక్తులు నగునట్టి గురువులవద్ద లక్ష్య లక్షణసహితముగ నభ్యసించి యాయుర్వేదమునందలి గొప్పతనమును లోకులకు దెలియబరచుట దక్క వేరొక యుద్ధరణోపాయములేదు పనిలేదనియు, యిప్పటికైన గుర్తెరిగి ఇకమీద ప్రచురింపబోవు నీగ్రంథావశిష్టభాగములందైనను ఆయుర్వేదవైద్యుల వ్యర్థముగ మాపింపక ఇట్టిపాత్రములు ఆయుర్వేదవైద్యవిద్యార్థుల కుపకరించుననెడి భ్రమనుమాని కాలవశమున మూలబడియుండిన యాయుర్వేదము కొద్దిగ తలయెత్తుచున్న యీ కాలమున అమాయికులగు లోకులగూడ భ్రమపడనీయక పాశ్చాత్యవైద్యమందలి విశేషవిషయములను, తత్సంప్రదాయములనుగూడ ఆంధ్రదేశీయులకు దెలియజేయవలయుననెడి యుద్దేశ్యమున్నచో నిట్లనే (రోగనిదానవిధానమువలెనే) విపులముగను సుబోధమగునట్లును వ్రాసి గ్రంథకర్త ఘనతవహించెదరుగాక! 'గ'

---

## హిందువులపండుగలు

గ్రంథకర్త: సురవరము ప్రతాపరెడ్డిగారు, బి. ఏ. బి. యల్. ప్రకాశకులు: గోల్కొండ పత్రికా ముద్రాపకులు, హైదరాబాదు, డక్కన్ వెల ౧-౧౨-౦.

ఈ గ్రంథమును హిందువులపండుగు లన నేమివిశేషమో యేమియు తెలియని మనుజులకై వ్రాయబడినదని గ్రంథకర్త తెలియజేసెను. మనపండుగుల విషయమై విద్యాధికు లనుకొనువారికె చాలమందికి తెలియదు. వారు తెలిసికొనుటకు ప్రయత్నించరు. ఆంగ్లవిద్యాభ్యాసమువలన మన నవనాగరకులు విశ్వసింపరు వానిని. అందులకు కొంతవరకు గ్రంథకర్తయే దృష్టాంతము. తులసీవ్రతమాహాత్మ్య సందర్భమున జలంధరుని వధించుటకు విష్ణువు బృందతో రమించెనను వృత్తాంతమును వీరు శంకించుటయేగాక పరిహసించుచున్నారు. జలంధరునిజంపుటకు విష్ణువు బృంద పాతివ్రత్యమును జెరచుటకు నట్టి స్త్రీయొక చెట్టుగా జన్మించుటకు నాజడపదార్థమును మానవులుపూజించి విష్ణువుతో నైక్యమొందుటను మనము నమ్మవలయునట యని గ్రంథకర్త ఆక్షేపించెను. విష్ణుడే ఇట్టి చర్యను గావించుట సమంజసము కానేరదట. తులసిని బూజించిన నాతనికి ముక్తి కలుగునను దురూహ్యమట. తులసి పూజామహాత్వమును నిర్వచించుట జనులమతమును భక్తిని వంచించుటయగునట.

ఆధ్యాత్మికదృష్టితో యోజించిన ఈ అవిశ్వాసము పటాపంచలగును. మనబుద్ధినిబట్టి భౌతికప్రపంచములో మునిగి తేలుచున్న మనము ఇందలి పరమార్థమును గ్రహింపజాలము.

మరియు జన్మాష్టమినిగూర్చి వ్రాయుచు కృష్ణుని పరమభక్తులే భక్తికొఱకై యాపరమపురుషునిచే చిన్నతనమున దొంగతనము చేయించినారు. వయసున వ్యభిచారము చేయించినారనియు ఇట్లు వర్ణించుటచే శూద్రాదిజనములలో శ్రీకృష్ణుని గౌరవము తగ్గనువచ్చెననియు గ్రంథకర్త వ్రాయదొడంగెను. శ్రీకృష్ణుని గౌరవము శూద్రులలో తగ్గుచున్న దన్న విషయమునకు ఉత్తర

ప్రతివారే గ్రంథకర్తకు తగిన ప్రత్యుత్తర మీయగలరు. భౌతికదృష్టిపరులకు తగ్గనేమోగాని ఆధ్యాత్మికచింతగల వారి కేపాటియు శ్రీకృష్ణునియందు గౌరవము తగ్గలేదు సరికదా మరింత హెచ్చుచున్నది. గౌరవభావ మతిశయించుచున్నది. స్థూలదృష్టితో మానవమాత్రునిగ శ్రీకృష్ణుని తలంచినచో ఆయనలీలలు అటులనే పొడగట్టును. మఱియు శ్రీకృష్ణపదమునుబట్టి శ్రీకృష్ణుడు నీలవర్ణుడని వర్ణించిరనియు అయ్యది తప్పనియు శ్రీకృష్ణపదమునకు నలుపురంగనే అర్థముకాని మరొకటిగాదనియు అందుచే శ్రీకృష్ణుని నీలవర్ణుడనుట సరికాదనియు గ్రంథకర్త వ్రాసెను. కాని శ్రీకృష్ణశబ్దమునకు ఎవరును అట్టియర్థమును కల్పించలేదు.

గ్రహణ సిద్ధాంతమును, రాహు కేతువుల విషయమై, వీరు శంకించుచున్నారు.

గ్రంథకర్త మనపంచాంగుల గాధలను తెలియజేసినందులకెంతయు స్తవనీయులే. కాని సొంతవిమర్శనలను గావింపకున్న బాగుండెడిది.

గ్రంథమును ఉచితముగ ముద్రించినను, గ్రంథముద్రణవ్యయమును దాతలెవరు భరించినను గ్రంథమునెడ అత్యధికముగ నిర్ణయింపబడినది లేనిచో గ్రంథకర్త ఉద్దేశ్యము నెగవేరజాలదు. గ్రంథమునకు పీఠికను సర్, సర్వేపల్లి రాధాకృష్ణయ్య పంతులుగారు వ్రాసిరి.

జరుగుమిల్లి సాంబశివరావు బి. ఏ.

---

## భౌతికశాస్త్రము

పదార్థ విజ్ఞానశాస్త్రము: రసాయనశాస్త్రము

కర్త. వేమూరి శ్రీరాములుగారు బి. ఏ., యల్. టి.

ప్రకాశకులు: యమ్. శేషాచలం అండ్ కంపెనీ, హిందూ ప్రెస్, మచిలీపట్టణము.

క్రౌను సైజు: ౧౭౦ + ౬౧ పుటలు.

పుస్తకములపూర్వ అచ్చుమొదలైనవన్నీ బాగున్నవి. ఆంధ్రభాషలో ఈనాటికి పఠనీయగ్రంథములు బయలుదేరుట శుభావహము. అట్లని ప్రతివారును శాస్త్రజ్ఞులైనంతమాత్రాన గ్రంథములు వ్రాయ వల్లపడదు. తెలుగుభాషాపరిచయము వ్రాతలో కొంత యుండవలెను. లేనియెడల గ్రంథము అడ్డదిడ్డమై పఠనయోగ్యముగానుండదు. శాస్త్రగ్రంథములలోనిభాషకు జిగిలేకున్న చదువరికి దానిని పఠించుట యొక శాస్త్రపరిశోధనాగారమును పరికించినట్లుండును.

రెండు. గ్రంథమొక ప్రవంతివలె చదువరిని చివరకు కొనిపోవలెను. పరిచ్ఛేదములకు సంబంధముండి ఒకదానికొకటి సరములోని ముత్యములవలె తోచ్పడవలెను. శాస్త్రములో ప్రయోగములు, సూత్రములు, లెక్కలు, పథకములు మొదలుగాగల వివిధాంశములుండవలసి వచ్చును. వీటి కొండొంటికి బాంధవ్యముండక పోయినచో గ్రంథమొక 'మ్యూజియ' మగును.

మూడు. పరిభాష, పానకములోని పంచదారవలె గ్రంథమంతయు నిండి, స్థూలదృష్టికి కానరాకుండవలెను. పరిభాషయే బలిసి దానియర్థము లోపించినచో నమరకోశమునకును గ్రంథమునకును భేదముండదు. ఒకసారి 'బిరడ' యని వేరొకమారు 'క్లిప్ప' నీ వ్రాయరాదు. ఇట్లే యొకచోట 'భాగము' లని వేరొకచోట 'డివిజను' లని వ్రాయరాదు. పరిభాషకు గల యర్థము శబ్దరత్నాకరములో నుండున ట్లుండకూడదు. సామాన్యముగా వాడబడు మాటలను వాడవలసి వచ్చినను దానికి శాస్త్రవాతావరణము కల్పించవలెను. సంస్కృతభాషాజ్ఞాన ముండకున్న నిది సాధ్యపడదు. "ఊపు" (Vibration) అనుటకన్న 'లేపన' మనుట మేలు. "విభాగింపబడినజాడీ" యనుటకన్న 'కొలపాత్ర' మన్న మంచిది. మనమొకపదము వాడిన నది వేరొకచోట వాడుటకు వీలుగా నుండవలెను.

Weight అనుటకు 'బరువు' అని వ్రాసినారు గ్రంథకర్తగారు. దీనిని కాదనలేము కాని weight-box కి తూనికపెట్టె యన్నారు. భేదము వచ్చినది. Molecular weight అనుదానికే మనమందురో! "అణువుబరువు" అని కాబోలు. ఇందుకే సంస్కృతము వాడవలెనని నేనంట. అణుభారము, పరమాణుభారము (Atomic weight). భారోష్ణమాపకము (weight Thermometer) అని,

weight అన్నమాట ఎక్కడైన వచ్చినను అక్కడ మాన పదము వాడుటకు కీలుంచవలెను. గ్రంథములో లోపము లుండెరాదు కూడక మన్న నేమో చెప్పకుండ నీటి బింబముయొక్క బరువు కనుక్కొన్నారు గ్రంథకర్త గారు. కాలతవిషయమై చెప్పి "ఇంక మిగిలినది బరువు, కాలము" అన్నారు. 'ఎంక' మిగిలినది? ప్రథమమున "ప్రమాణములు, మానములు" అని మొదలిడినచో నిట్లు వ్రాయుట సబబు. పంపునూనెల పరిమాణమునకు స్థలాంతరపద్ధతి చెప్పినారు. ఇది శుద్ధతప్పు. ఒకగిన్నెవరకు నీరు నింపుటలో ప్రయోగప్రమాదము చాల వచ్చును. వస్తువుయొక్క పరిమాణము ప్రమాదముకంటె చాలా ఎక్కువగా నుండినచో మనప్రయోగము సరియైనదగును. గుండుసూదియొక్క పరిమాణము చాలకొంచెము. "గాజుపాత్ర" లోని గిన్నెవరకు నీరు నింపుటలో ప్రమాదమువల్ల కొంచెము లో హెచ్చో అయినచో ఈనీటిలో ఒక గుండుసూది పరిమాణ మెగిరిపోవును. గోళమున కుపయోగించవలసిన ప్రయోగమును తమ ఉపజ్ఞ నుపయోగించి గుండుసూదికి తగిల్చినారు. వర్నియర్ అన నేమో చెప్పలేదు. 'క్యాలిపర్సు' మాత్రము బొమ్మ వేయించినారు. అది లేక ఇది సరిపడదు. ఇది యన నేల, కొలతలే సరిపడవు. 30-వ పుటలో పార్శ్వపీడనమున కొక ప్రయోగము నిచ్చినారు పార్శ్వపీడనమునకును అధఃపీడనమునకును వ్యత్యాసము పంక్తిలోనే గాని పరిమాణములో లేదు.

'శక్తి' యను పదము pressure, force, energy యను మూడు పదములకును వాడినారు. ఇది శాస్త్రీయవాతావరణమును చెడగొట్టుటయే గాక, కంగారుకూడ పుట్టించును. 'కర్బన' మను పదము calcium కీ carbon కీ, కూడా వాడినారు. దీని నేమనాలో తెలియలేదు.

మొత్తమున క్రీగ్రంథము సరిగా లేదు. ఉపాధ్యాయు లుపయోగించుట కిందు బోధనాపద్ధతులు లేవు. విద్యార్థుల కుపయోగించుటకు జిగి గాని, పఠనీయగ్రంథగమనము గాని లేదు. ప్రపంచజ్ఞానమునకు వలయు వైపుల్యము లేదు. శాస్త్రగ్రంథరచనము సులభము కాదు.

'మూర్తి.'

---

### తొలకరిచినుకులు

క్రౌనుసైజు ౬౦ పుటలు. వెల రు. ౦-౬-౦. కాగితము, ముద్రణము, బైండు ముచ్చటగా నున్నవి. అనంతపురమునందలి రాయలసీమ కవి కుమారసమితివారు ప్రచురించిన సింహపద్యకావ్యముల సంపుటి యిది. అనంతపురమున సాధనపుస్తకాలయమువారికి వ్రాసిన, గ్రంథము లభించును.

---

### ౧. శ్రీ ఆంగీరసనామసంవత్సర సిద్ధాంత పంచాంగము

డిమ్మీసైజు, పుటలు ౫౧. వెల తెలియరాదు. సిద్ధాంతి: విద్వాన్ తొగర్చేటి భాస్కరశాస్త్రిగారు, ఆదోని. ఇందు నిత్యకృత్యములకు వలసిన కేవల పంచాంగము కాక, కొన్ని విశేషకృత్యములకువలసిన జ్యోతిశ్శాస్త్ర, ధర్మశాస్త్రవిషయ విచారాదికముగల మంచి పీఠిక యును గలదు. ఇం దధికభాగము సంస్కృతభాష నున్నది.

### ౨. శ్రీమదంగిర స్సంవత్సర పంచాంగము

డిమ్మీసైజు పు. ౬౦, వెల తెలియదు, సిద్ధాంతి: జనమంచి వేంకటసుబ్రహ్మణ్యశర్మగారు.

ఈ పంచాంగమును గుణమున పైదానియట్టిదే. కాని పీఠికాభాగమంతయు సంస్కృతము. ఇట్లు పంచాంగముపీఠికను సంస్కృతముతో నింపుట గతానుగతికన్యాయము ననుసరించి యనూచానమయినది. జనసామాన్యమునకు దీనియుపయోగము తక్కువ. ఇందలి విషయములను తెలిసికొనుటకు ఒరులను ఆశ్రయించవలసి వచ్చుచున్నది. అక్షరాస్యులను తెలుగువా రందరికిని స్వయముగా నిందలి విషయములు బోధయగునట్లు తెలుగున నుండవలెను కాని శాస్త్రవచనము లక్కరలేదు. సిద్ధాంతులు లెక్కించి నిశ్చయించి తెలిపిన తిథి నక్షత్ర యోగ కరణాదుల పరిమాణములను విశ్వసించుచున్న జనసామాన్యము తక్కిన విషయములయందు వారి సిద్ధాంతమును విశ్వసింపకపోదు. కావున సిద్ధాంతులు పంచాంగములకు పీఠికను తెలుగుభాషలోనే రచియించి ప్రకటించుట మేలు.

# దానిని మీకొరకే వినియోగింపుడు

ఉదారమైన అభిమానులకు

మీరు నిలువచేయగలిగిన స్త్రీధనము—
మీ తండ్రి—సోదరుడు—భర్త—పుత్రుడు—
వీరిలో నెవరివద్ద మీ రుంచినను సరే, దానిని
మీకొరకే వినియోగింపుడు.



ఆధనముతో నగలుకొని వానిని మీరు ధరింపుడు.

పురుషు లెల్లపుడును.........
ఈసంగతి మీకు బాగుగా తెలిసియే యున్నది. కావున మీకు హక్కుగల స్త్రీధనము బాంకిలోను నమ్మకములేని వాటాలక్రిందను నిలువబడి యుండకూడదు.

ఆధనము యెల్లపుడును మీకంటి యెదుటనే మీ వంటిమీదనే యుండ వీలగునట్లు, దానితో మీ కొరకు సొగసైన నగలను కొనుడు.

మేముతయారుచేయించిన నగల విలువ యెన్నటికిని తగ్గిపోదు. నగలను అందముగా చేయించుటయే ప్రత్యేకాభిమతము. ఈవిషయమున మేమే అగ్రగణ్యుల మనికూడ సవినయముగ తెలుపుచున్నాము.

మీరు మొదట మావద్ద కొనుపట్టి అలంకారము మీకు మిక్కిలి సంతృప్తికరముగా నుండుటకే మేము ప్రయత్నించెదము. అటు పిమ్మట మీ రెల్లప్పుడును మావద్దనే కొనుచుందురు. మీ మిత్రులకు గూడ సిఫార్సు చేయుచుందురు.

## ఉమ్మిడి రామయ్యశెట్టి గురుస్వామిశెట్టి కంపెని,

బంగారు వెండి నగలను తయారుచేయువారు,

25, చైనాబజారు రోడ్డు. మదరాసు. 62, గోవిందప్పనాయకవీధి

# భారతి

## సచిత్ర మాసపత్రిక



సంపాదకుడు

గిస్నవరపు సుబ్బరామయ్య

సంపుటము ౯. సంచిక ౬

ఆంధ్రపత్రికా ముద్రాలయము—మద్రాసు

౧౯౩౭



విషయసూచిక

# చిత్రములు



---

# సవరణ

కడచిన (చైత్రమాస)భారతి సంచికయందలి శ్రీబాచినప్ప మార్కండేయులుగారి; 'ప్రపంచశాంతి'అను వ్యాసమున, ౬౫౯-వ పుట ౧౮-వ పఙ్క్తి మొదలు,— 'The nations spent in about four years of war an amount equal to £ 194 for every minute—'. ఇచ్చట '£ 194' అన్నది '194 dollars' అని చదువుకోవలెను. దీనిక్రింది తెలుగు అర్థమునను '౧౯౪ పౌండ్లు' అనుటకు మాఱు '౧౯౪ డాలర్లు' అని చదువుకోవలెను.

---

# క్రీడాభిరామ కర్తృత్వము*

బండారు తమ్మయ్యగారు

ప్రాచీనాంధ్ర వాఙ్మయమునందు రూపకగ్రంథము లపురూపములు. కర్తృత్వము వివాదగ్రస్తమయిన కృతులుగూడ నట్టివే. కాని యీ వైలక్షణ్యములు రెండును క్రీడాభిరామమునం దాశ్రయము నొందినవి. క్రీడాభిరామము పదునాల్గవశతాబ్దియందు వెలసిన యాంధ్రవీథినాటకము. ఇది రావిపాటి త్రిపురాంతకుఁడను కవివతంసుఁడు సంస్కృతభాషలో రచించిన ప్రేమాభిరామమను నాటకము ననుసరించి వీథిరూపకముగా రచింపఁబడినట్లు గ్రంథావతారికలోఁ జెప్పఁబడినది. మూలగ్రంథమగు ప్రేమాభిరామము మనకింతవఱకు లభింపనందున నది కేవలనాటకమో, లేక దీనివలెనే వీథినాటకమో, క్రీడాభిరామము దాని కెంతవఱ కనుకరణమో నిర్ణయింప రాకున్నది. ఈగ్రంథకర్తృత్వవిషయమున భిన్నాభిప్రాయములు పూర్వకాలమునుండియు నెలకొనినట్లు కానవచ్చుచున్నది. పూర్వ లాక్షణికులు కొంద ఱిందలిపద్యములను వల్లభరాయని వీథినాటకములోనివని యుగ్గడింపఁగా మఱికొందఱు శ్రీనాథుని వీథినాటకములోనివని యుగ్గడించిరి. కాని యీ రెండవ పక్షమునకుఁ జేరిన అప్పకవి, కూచిమంచి తిమ్మకవి మున్నగువారు మొదటిపక్షమునకుఁ జేరిన శ్రీధరాదులకంటెఁ జాల నర్వాచీనులై యున్నారు.

ఈగ్రంథమును దొలుదొలుతఁ బ్రకటించిన బ్రహ్మశ్రీ మానవల్లి రామకృష్ణకవిగా రీగ్రంథ కర్తృత్వవిషయమున వల్లభరాయ శ్రీనాథు లిరువురిపక్షమునకు నుపకరింపఁగల యాధారములను సంగ్రహముగవివరించి యుభయపక్షవాదములకుఁగూడఁ బునాదుల నేర్పఱిచి తాము మట్టుకు శ్రీనాథునివైపునకే మొగ్గుచూపిరి. తరువాతి విమర్శకు లాపునాదులపయి విన్నాణముమెయి వాదసౌధములను నిర్మించుచున్నారు. శ్రీ వీరేశలింగము పంతులుగారు తమకవులచరిత్రములో నీగ్రంథమును వల్లభరాయకృతముగఁ బరిగణించి, శ్రీనాథరచితమను వాదము నతిసాహసమని నిరసించిరి. శ్రీ చిలుకూరి వీరభద్రరావుగారు ఆంధ్రులచరిత్ర మూఁడవ భాగములో వల్లభరాయనివర్ణనమిం దతిశయముగా నుండుటచే నిది వల్లభరాయకృతము కానేరదని తలంచి శ్రీనాథుఁడే దీనిని వల్లభరాయనిపేర వ్రాసియుండునను నభిప్రాయమును బ్రకటించిరి. కాని యథార్థముమాత్ర మీ యుభయపక్షములకుఁగూడ మధ్యస్థముగ మఱుఁగుపడియుండెనేమో యని నాయాశయము.

"శ్రీనాథమహాకవి గుణతత్త్వవిచారము" అను నే వ్రాసిన కవిచరిత్రవిమర్శనము (అముద్రితము)లో పయిని బేర్కొన్న మువ్వురు పండితుల యభిప్రాయములందలి బలాబలములను జర్చించుచు "క్రీడాభిరామము— శ్రీనాథునకు దానితోఁగల సంబంధము" అను ఖండ మొకటి వ్రాసి దుందుభిసంవత్సరములో దానిని బ్రత్యేకముగ ఆంధ్రపత్రికాసారస్వతానుబంధములోఁ బ్రకటించియుంటిని. శ్రీనాథున కీగ్రంథముతో సంబంధమసలు లేక పోలేదనియు, అట్లు లేదనినచో వల్లభరాయనికి గ్రంథకర్తృగౌరవముమాట యెట్లున్నను గ్రంథచౌర్యదోష మనివార్యముగ నంటఁగట్టనగుననియు, శ్రీనాథుఁడు గ్రంథమంతయుఁ బూర్తిగఁ దానే వ్రాసి ధనలోభముననో, మఱియొకకారణముననో దానిని వల్లభరాయనిపేరఁ బ్రకటించెనని తలంచుటకుఁ దగినకారణములు కానరావనియుఁ, గావున వల్లభరాయఁడు శ్రీనాథుని సాహాయ్యముతో నీగ్రంథమును రచించియుండుననుట సత్యసమ్మతమై యాయిరువుర గౌరవమునకుఁ గూడ నిర్బాధకమై యుండఁగలదనియు నావ్యాసమునందలి సారాంశమై యున్నది.

శ్రీనాథుని సిద్ధహస్తమిందుఁ బలుతావుల సువ్యక్తమగుచుండ నాతని కీగ్రంథరచనమున నెట్టిసంబంధమును లేదని తత్కవితారసజ్ఞు లెన్నటికి నంగీకరింపఁ జాలరని నాయాశయము. శ్రీనాథుని యితరకృతులం

* ఇది ౨౧-౯-30 తేదీన పెద్దాపురములో జరిగిన ఆంధ్రసాహిత్యపరిషద్వార్షికోత్సవసభలో జదువబడినది.

మును నీగ్రంథమందున్న పద్యఅవాలికలుగల సంవాదములను, రచనాసంవిధానములను, భేదమొకింతయు లేక సరిసమానములుగ వర్ణించినపాదములను, సమాసములను శ్రీనాథుని కవితయందుఁ బ్రత్యేకముగఁ గానవచ్చు నాతని మరికొన్ని బహుప్రయోగములను నాయభిప్రాయానుకూలముగఁ గొంతవఱకు నాస్వాభ్యోక్తవ్యాసమం దుదాహరించియుంటిని. తరువాతఁ గొంతకాలమునకు బ్రహ్మశ్రీ వేటూరి ప్రభాకరశాస్త్రిగారు తాము రచించిన శృంగారశ్రీనాథములో నీ గ్రంథకర్తృత్వమును గూర్చి చర్చించుచు గ్రంథము శ్రీనాథకృతమేయనుట కాతని యితరకృతులందున దీనియందును సామ్యముగల సంవాదాదికములను విపులముగాఁ బ్రకటించి వల్లభరాయపక్షవాదమును బూర్తిగా నిరసించియున్నారు. కాని తమవాదమునకు బాధకముగా శ్రీనాథున కించుమించుగ సమకాలీనుఁడగు శ్రీధరుఁడును, నాతనితరువాతి మఱికొందఱు పూర్వలాక్షణికులు నిందలిపద్యములను వల్లభరాయని వీథినాటకములోనివని తమగ్రంథములం దుదాహరించిన ప్రశంస నెందుచేతనో జాఱవిడిచి యావిషయమై చర్చించుటగాని, నాయభిప్రాయమును బరామర్శించుటగాని జరగింపరైరి. అందుచేత "సారస్వతసర్వస్వము" లోఁ బ్రకటితమయిన నా శృంగారశ్రీనాథ విమర్శనములో నీగ్రంథకర్తృత్వ విషయమునుగూడఁ జేర్కొని పైనిజెప్పిన నాయభిప్రాయమును గూర్చి శాస్త్రిగారి సమాధానములను గోరియుంటిని. పిమ్మట "భారతి" లో నీగ్రంథము కేవలము వల్లభరాయ రచితమేగాని శ్రీనాథకృతముకాదని వాదించు వ్యాసమును బ్రహ్మశ్రీ వేమూరి విశ్వనాథశర్మగారును, దానిపై శ్రీప్రభాకరశాస్త్రిగారి యభిప్రాయానుసరణముగ శ్రీనాథకర్తృత్వమును సాధించువ్యాసమును శ్రీ కిళాంబిరామానుజాచార్యులుగారును, మరల నీనడుమ విశ్వనాథశర్మగారి యభిప్రాయానుసారముగ వల్లభరాయ కర్తృత్వమును సాధించువ్యాసమును శ్రీ చేకుమళ్ల అచ్యుతరావుగారును బ్రకటించియున్నారు. విద్యాధికులయిన విమర్శకాగ్రణు లిట్లు లేదో యొకపక్షమును సమర్థించుటయేగాని శ్రీనాథవల్లభరాయల యిరువురగౌరవమునకుఁగూడ నిర్బాధకమయి నాయియుభయకర్తృత్వము నంగీకరించు నాయభిప్రాయమునుగూర్చి చర్చించి యది సత్యనిర్ణయమున కెంతవఱకు నుపకరించునో నిరూపింపకున్నారు. తెగతెంపులేక యిట్లు తగవులకుఁ దావకమగుచున్న యీవిషయము తగురీతిని బరిష్కారమగు ననుతలంపుతో నీపరిషత్సభాముఖమున మరల నిందుఁ గూర్చి ప్రశంసింప నెంచితిని.

క్రీడాభిరామ మీమధ్య నూతనముగా శృంగార గ్రంథమాలాపక్షమున ప్రభాకరశాస్త్రిగారి పరిష్కరణముతో శృంగారముగఁ బునర్ముద్రణ మందినది. అందు శాస్త్రిగారు సహజమగు తమ సునిశిత ప్రతిభను బ్రకటించుచు విపులమగు నుపోద్ఘాత మొకటి వ్రాసియున్నారు. కాని శృంగార శ్రీనాథములోఁ దడవిన విషయములనే మరల విపులోదాహరణములతో సమర్థించుటయే గాని నాయభిప్రాయవిషయమునఁ దగు సమాధానము లొసంగరయిరి. గ్రంథమందు శ్రీనాథుని సంబంధమును సమ్మతించుచు వల్లభరాయ కర్తృత్వమునుగూడ నంగీకరించు నావాదము మునసబుకరణములు తగవులాడుకొను నిద్దఱి పాలికాపుల వివాదమును దీర్చినట్లున్నదని యసంగతమగు గేలివాక్యముతో సమాధానసంతృప్తి నందిరి. ఈగ్రంథకర్తృత్వవిషయమున శ్రీనాథవల్లభరాయల కెట్టివివాదముసు లేదు. ఉన్నవివాదమంతయుఁ దరువాతి వారమగు మనము తెచ్చిపెట్టుకొన్నదే. కావున శాస్త్రిగారి సమాధానమందలి సామంజస్యమును సహృదయులే గుర్తింతురుగాక. ఇఁకఁ బూర్వలాక్షణికోదాహరణ విషయంబున నేను వ్రాసినసంగతులు బూటకంపు బూకరింపుల బుంగలనియు, దుర్వివేక ధురంధరములనియు నిరంకుశముగ వ్రాసి, యీ గ్రంథమందలిపద్యములను శ్రీనాథుని వీథినాటకములోనివని యుదాహరించిన లాక్షణికులు నేననినట్లు అప్పకవి మున్నగు నొకరిద్దఱుగాక నలుగురైదుగురనియు, నీవిషయమున అప్పకవీయము, లక్షణదీపిక, వీరరాజీయము, లక్షణసారసంగ్రహము మొదలగు గ్రంథములఁ జూడనగుననియు నిందలి పద్యములను వల్లభరాయని వీథినాటకములోనివిగా నుదాహరించిన ప్రాచీన లక్షణ గ్రంథములు తాము చూచినంతవఱకుఁ గానరాలే

దనియు, శ్రీధరచ్ఛందము తమకులభింపలేదనియు, శ్రీధరుఁడు శ్రీనాథునకు సమకాలీనుఁడనుటకుఁగూడ నాధారములు మృగ్యములనియు, ఒక్క పెదపాటి జగన్నాథకవి తక్క నిందలిపద్యములను వల్లభరాయకృతములుగా నుదాహరించిన పూర్వకవి కానరాఁడనియు, జగన్నాథుని ప్రబంధరత్నాకరము సంధాన గ్రంథమేగాని లక్షణ గ్రంథము కాదనియు సమాధాన మొసంగియున్నారు. వల్లభరాయపక్ష సాధకములగు నీపూర్వలాక్షణికోదాహరణముల ప్రశంస తడవినది, సుప్రసిద్ధ పరిశోధకులగు శ్రీరామకృష్ణ కవిగారేగాని నేఁగాదు. క్రీడాభిరామ పీఠికలోని వారి యీక్రింది వాక్యములఁ జిత్తగింపుఁడు: "చిత్రకవి పెద్దన, ముద్దరాజురామన, శ్రీధరుఁడు, గణపవరపు వేంకటకవి, జగన్నాథుఁడు వీరందఱు వల్లభరాయని వీథినాటకములోనివని యుదాహరించినారు. జగన్నాథకవి రత్నాకరములో ౧౦ పద్యములకంటె నెక్కువగా వల్లభరాయనివనియే పేర్కొనెను. అళియ రామరాయల ముత్తాతయగు సోమభూపాలున కంకితమీయఁబడిన శ్రీధరచ్ఛందములో వల్లభరాయని వీథినాటకములోని దని "మంచన వింటివో వినవో" యనుపద్య ముదాహరింపఁబడియున్నది."

అళియరామరాయలు తల్లికోట యుద్ధమున క్రీ. శ. ౧౫౬౫ సంవత్సరమున నిహతుఁడగుట సుప్రసిద్ధ చరిత్రవిషయము. శ్రీధరచ్ఛందఃకృతిపతి యాతని కెట్టి ముత్తాతయో తెలియదు. రామరాయలముత్తాత (తాత తండ్రి) యార్వీటి బుక్కరాయలయినట్లు వసుచరిత్రాదులఁ బట్టి తెలియుచున్నది. శ్రీధరుఁడు అళియరామరాయల ముత్తాతకాలమువాఁడయినయెడలఁ దరమునకు ౩౦ సంవత్సరముల చొప్పున గణింపఁగా క్రీ. శ. ౧౪౫౦, ౧౪౬౦ ప్రాంతమువాఁడగును. అనఁగా శ్రీనాథ వల్లభరాయల కీవలనించుకసమీపకాలములోనివాఁడగును. పైని బేర్కొనిన శ్రీరామకృష్ణకవిగారివాక్యములు టూటకంపు టూకరింపుల బుంగలో, దుర్వివేకధురంధరములో విజ్ఞులు నిర్ణయింతురుగాక! కవిగారి యాప్తవచనములఁబట్టియే యీపూర్వలాక్షణికోదాహరణప్రశంస నేఁగూడఁ బరిగ్రహించితిని. ప్రభాకరశాస్త్రిగారు చూడఁ దాము సరిగఁ గన్నులు తెఱవకముందే తాళపత్రగహన పరిశోధనపరిశ్రమమున కోర్చి యనేకాముల్య గ్రంథముల సేకరించి యీక్రీడాభిరామమును దొలుదొల్తఁ బ్రకటించిన శ్రీరామకృష్ణకవిగారికిఁ దామెంతయు, కృతజ్ఞులమనియు, నీపునర్ముద్రణమునకుఁగూడ వారియనుజ్ఞను గైకొంటిమనియుఁ దమపీఠికలో వ్రాసి కవిగారికి ధన్యవాదముల నర్పించియేయున్నారు.

నేఁజూచినంతవఱకు ముద్రితలక్షణగ్రంథములలో అప్పకవీయము, కూచిమంచి తిమ్మకవి సర్వలక్షణసార సంగ్రహము తప్ప క్రీడాభిరామపద్యములను శ్రీనాథుని వీథినాటకములోనివని యుదాహరించిన యితర గ్రంథముల కానరాలేదు. కూచిమంచి తిమ్మకవి, అప్పకవీయములోని "కుసుమంబద్దిన" అనుపద్యమునే తాను గూడఁ గైకొనినాఁడు. "ఒచ్చెంబింతయులేని యంచనడతో నొయ్యారముంగుల్కుచున్" అను పద్యమొకటి గూడ నాతఁ డుదాహరించినాఁడు గాని యది చాటుపద్యముగాని యీ వీథినాటకములోనిదిగాఁ దోఁపదు. ఈగ్రంథమం దాపద్యము గానరాదు. లక్షణదీపికా(లక్షణ శిరోమణి ?) కారుఁడు గణపవరపు వేంకటకవి కాఁబోలును. ఆతనిగ్రంథము ముద్రితముకాలేదు. రామకృష్ణ కవిగా రిందలిపద్యములను వేంకటకవి వల్లభరాయకృతములుగా నుదాహరించెనని లిఖింపఁగా శాస్త్రిగారందులకు వ్యతిరేకముగ వ్రాయుచున్నారు. కారణము తెలియదు. వీరరాజీయకర్త యుదాహరించిన పద్యము లేవో తెలియదు. ఆతని గ్రంథముకూడ నముద్రితమనియే తోఁచుచున్నది. ఎట్లు చూచినను నీగ్రంథమందలి పద్యములను శ్రీనాథకృతములుగా నుదాహరించినవారొకరిద్దఱు గాక నలుగురైదుగురయినను, వారెల్ల అప్పకవికిఁ దరువాతివారుగనే తోఁచుచున్నారు. వారు కూచిమంచి తిమ్మకవివలె, అప్పకవి పేర్కొనిన పద్యములనే గైకొనిరో, లేక గ్రంథమును వాస్తవముగఁ జదివి మఱి యితరపద్యముల నుదాహరించిరో తెలియదు. అసలు గ్రంథములను జూడకయే పూర్వలక్షణగ్రంథములనుండియే చాలవఱ కుదాహరణ పద్యములను గైకొనుట లక్షణ గ్రంథకర్తలకుఁ బరిపాటియని చెప్పనక్కఱలేదు. శ్రీ

పరిచ్ఛేదమును శాస్త్రిగారు చూడకున్నను శ్రీరామ కృష్ణకవిగారు చూచినట్లు వారివాక్యములవలనఁ దెలియు చున్నది. "మంచనవింటివోవినవో" అను పద్యనిర్దేశ మునుగూడ వారు చేసియున్నారు గదా! పెదపాటి జగ న్నాథుని ప్రబంధరత్నాకరము లక్షణగ్రంథము కాక సంధానగ్రంథమయినను మనవాద విషయమునఁ బ్రత్య నాయ మేమియులేదు. ఆతఁడు అప్పకవి కించుకపూర్వుఁ డో సమకాలీనుఁడో యగును. ఆతఁ డింపెలి పద్యములను వల్లభరాయని వీథినాటకములోనివనియే యుదాహరించి నట్లు శాస్త్రిగారుకూడ నంగీకరించియే యున్నారు. కావునఁ బూర్వలాక్షణికోదాహరణములు వల్లభరాయ కర్తృత్వవిషయమున సాధకములు కావనెడి శాస్త్రిగారి త్రోసివేఁత చెల్లఁదగినది కాదు. ఇఁక లాక్షణికులసాక్ష్య ము నటుంచి గ్రంథస్థసాక్ష్యమునుగూర్చి విచారింతము.

## వల్లభరాయని పాండిత్యాదికము

వల్లభరాయఁడు పండితుఁడు కవియు నగు నను టకు వివాదగ్రస్తమయిన యీగ్రంథముకంటె నితరాధా రము లేదు. అతని యితరగ్రంథము లేమియు మనకు లభింప లేదు. ఈగ్రంథావతారికయందలి—

సీ. మూఁడు గ్రామగ్రాసములతోడఁ గూడంగ
మోపూరుఁ బాలించె మలికి నాట
నాశ్వలాయనశాఖయందు ఋగ్వేదంబు
కరతలామలకంబుగాఁ బఠించెఁ
గౌశికాయనవిశ్వామిత్రగోత్రంబు
వంశగోత్రంబుగా వర్తకెక్కెఁ
బ్రత్యక్షమొనరించి భైరవస్వామిచే
సిద్ధసారస్వత శ్రీ వరించె

గీ. నెవ్వఁ డాత్రిపురాంతకాధీశ్వరునకు
రాయనవరత్నభండార రక్షకునకుఁ
బ్రియతనూజుండు చంద్రమాంబికకు సుతుఁడు
మనుజమాత్రుండె వల్లభామాత్యవరుఁడు.

అను సీసపద్యమునుబట్టి మోపూరుభైరవస్వామి కృప వలన సిద్ధసారస్వతశ్రీని వరించిన పండితవరుండని శ్రీరామకృష్ణకవిగారు మొదలుకొని యిప్పటివఱకీవిష యమై వ్రాసినవిమర్శకులందఱు తలంచుచున్నారు. కాని యీసీసపద్యమం దుదాహృతములయిన విశేషణము లన్నియు వల్లభరాయని తండ్రియగు త్రిపురాంతకునికే (తిప్పన్న) గాని వల్లభరాయనికి వర్తింపనేరవని నా తలంపు. ఎత్తుగీతియందలి, ఎవ్వఁ డనుయచ్ఛబ్ద మానెను వెంటనే "ఆత్రిపురాంతకాధీశ్వరునకు" అని తచ్ఛబ్దనిర్ది ష్టుఁడయిన త్రిపురాంతకునకేగాని గీతముయొక్క నాలవ పాదమునఁ బేర్కొనఁబడిన వల్లభరాయనికి వర్తింప నేరదు. ఈవిషయమును ఆంధ్రపత్రికాసారస్వతాను బంధములోఁ బ్రకటితమయిన నాపూర్వవ్యాసమునఁ బూర్తిగా వివరించియేయుంటిని. ఇట్టిసంగతిలో నీపద్యస్థ విశేషణములను వల్లభరాయపరముగాఁ బూర్వోక్తవిమ ర్శకు లందఱు నన్వయించుట ప్రమాదమని చెప్పక తప్పదు. వల్లభరాయని తాతతండ్రు లిరువురునుగూడ తిప్పనామాంకితులే.

ఉ. గంధవతీప్రతీరపురసుస్మరపాదబిసప్రసూనపు
ష్పంధయచక్రవర్తిశ్రుతి పర్వతిదుర్గమహాప్రధానరా
ట్గంధగజంబు,తిప్పనయఖండితధీనిధిగాంచెఁబుత్రులన్
బాంధవకల్పవృక్షములబైచనమల్లనతిప్పమంత్రులన్.

అనుపద్యమునఁబేర్కొనఁబడినతిప్పన వల్లభరాయలతాత గాని శ్రీ అచ్యుతరావుగారు మున్నుగువారు తలంచినట్లు లాతనితండ్రి గాఁడు.ఈతిప్పన్న పుత్రులు బైచన, మల్లన, తిప్పన అను మూవురలోఁ గడపటివాఁడగు తిప్పన్నయే వల్లభరాయని తండ్రి. వల్లభరాయఁడు కవియనియుఁ, బండితుఁడనియు సమర్థించుట కాతని వాగ్వైభవవితర ణాదికస్తుతిపరముగ నవతారికలోఁ జెప్పఁబడిన కంద పద్యాష్టకమే యాధారమై యున్నది.

వల్లభరాయఁడే వాస్తవముగా నీ గ్రంథమును రచించినచో నింతయు ద్వేలముగాఁ దన్నుఁ దానే వర్ణించు కొనునా యనెడి యాక్షేపణమున కస్మదాదుల మిదివఱకే సమాధాన మొసంగియుంటిమి. ఈ గ్రంథము రూపక మనియుఁ బయి పద్యములును, గ్రంథాంతమున వల్లభ రాయని కాశీర్వచనపరముగ నున్న భరతవాక్యరూపక మగు—

చ. ముదమున ముల్కినాటిపుర
        మోహనశైల సువర్ణకందరా
    సదనుఁడు, కాలభైరవుఁడు
        శంభునిపట్టి సమగ్రవైభవా
    భ్యుదయపరంపరా విభవ
        ముల్ గృపసేయుఁ గవీంద్రకాంక్షిత
    త్రిదశమహీరుహంబునకుఁ
        దిప్పయ వల్లభరాయ మంత్రికిన్.

అను పద్యమును సూత్రధారముఖమున నెలువడిన వగుటచే నిందంతగా ననౌచిత్యము లేదనియు, నాటకములలో సూత్రధారముఖమునఁ బురాతన వర్తమాన కవులు పలువురు చేసికొన్న యాత్మస్తుతులకంటె నివి యెక్కువగావనియు నాపూర్వోక్త వ్యాసమున విన్నవించియుంటిని.

గ్రంథాంతముననున్న భరతవాక్యపద్యము వల్లభరాయఁడే రచించెనన్నచోఁ దుమ్మకొని తానేశతాయువని యనుకొనినట్లు హాస్యాస్పదముగ నుండునని శ్రీ ప్రభాకరశాస్త్రిగారి యాక్షేపము. గ్రంథకర్త శ్రీనాథుఁడేయైనను గ్రంథము వల్లభరాయని పేరఁ బ్రకటిత మయినప్పుడు పైయాక్షేపణ మెట్లును దప్పనిసరియే యగును. భరతవాక్యమునఁ గృతికర్తనుగూర్చి వ్రాయుట శాస్త్రసమ్మతము, సంప్రదాయ సిద్ధము గాదనియు, శ్రీనాథుఁడే గ్రంథకర్తయైనచో నిట్టి యశాస్త్రీయమైన వ్రాఁత నాతఁడు వ్రాసియుండఁడనియుఁ, గావున నిట్టిపనికి శ్రీనాథునికంటె వల్లభరాయఁడే తగియుండుననియు శ్రీ అచ్యుతరావుగారి యభిప్రాయము. భరతవాక్యములందుఁ గేవలము కృతికర్త నాశీర్వదించు నిట్టి సంప్రదాయమున్నను లేకున్నను కృతికర్తయొక్క యాశ్రయులనో పోషకులనో యాశీర్వదించు సంప్రదాయముమాత్రము పూర్వము లేకపోలేదు. భాసనాటకములను జిత్తగించునది. అందలి భరతవాక్యములలో నప్పుడు దేశమేలుచున్న రాజుయొక్క యాశీర్వచనము గలదు. మఱియుఁ బుణ్యక్షేత్రములందలి తిరునాళ్లకేతెంచు భక్తుల వినోదార్థము నాటకములఁ బ్రదర్శించు నాచారము పూర్వముండియున్నట్లు కొన్ని సంస్కృతనాటక ప్రస్తావనల వలన మనకుఁ దెలియుచున్నది. ఆయాచారము చొప్పున రావిపాటి త్రిపురాంతకుఁడు కూడఁ దన ప్రేమాభిరామమును త్రిపురాంతకేశ్వరుని తిరునాళ్లకేతెంచు భక్తుల వినోదార్థము రచించెనేమో? దాని ననుసరించి వల్లభరాయఁడీ క్రీడాభిరామమునుగూడ మోపూరు భైరవస్వామి తిరునాళ్లకేతెంచిన జనులయెదుటఁ బ్రదర్శించుటకయి రచించియుండునని జగన్నాథకవి రత్నాకరమం దుదాహృతమయిన—

సీ. చంద్రఖండములతో సరివచ్చు ననవచ్చు
        విమలదంష్ట్రాప్రరోహములవానిఁ
    బవడంపుఁ దీఁగలతోఁ బ్రతివచ్చు ననవచ్చు
        కుటిలకోమలజటాచ్ఛటలవాని
    నింద్రనీలములతో నెనవచ్చు ననవచ్చు
        కమనీయతరదేహకాంతివాని
    నుడురాజరుచులతో నొఱవచ్చు ననవచ్చు
        వంచన్మదాట్టహాసములవాని
గీ. సిగ్గుమాలినమొలవానిఁ జిఱుతవాని
    నెల్లకాలంబు మురికినాఁ డేలువాని
    నర్థి మోపూర నవతార మైనవాని
    భైరవునిఁ గొల్వ వచ్చిరి భక్తవరులు.

అను పద్యమునుబట్టి యూహింపఁదగియున్నది. కావున నాసమయమునఁ దనపదభక్తుఁడగు వల్లభరాయనికి భైరవస్వామి వైభవాభ్యుదయము లొసంగుఁ గాక యని గ్రంథాంత ప్రయుక్తమయిన యాశీర్వచనము సూత్రధారముఖమునఁ జేయఁబడినదిగాన నాపద్యమును రచించినది శ్రీనాథవల్లభరాయ లిరువురిలో నెవరైనను నంతగా ననౌచిత్యము లేదనియే నాయాశయము. శ్రీనాథున కీగ్రంథముతో నేఁ జెప్పిన సహాయపూర్వక సంబంధ మంగీకరించినపు డిందలి ప్రత్యవాయము చాలవఱకుఁ దొలఁగిపోఁగలదు.

మూలగ్రంథమగు ప్రేమాభిరామమును రచించిన రావిపాటి త్రిపురాంతకుఁడు కర్నూలుజిల్లా త్రిపురాంతక క్షేత్రమందలి త్రిపురాంతకేశ్వరుని పదభక్తుఁడు. అతఁడు రచించిన త్రిపురాంతకోదాహరణమువలన నీవిషయము వ్యక్తముకాఁగలదు. వల్లభరాయనితాత తిప్పన్న

"గంధవతీప్రతీర పురఘుస్మరవాటి శివప్రసూనపుష్పంధయ చక్రవర్తి" అని వర్ణింపఁబడుటచే నాతఁడుకూడ నీ త్రిపురాంతకేశ్వరుని పదభక్తుఁడని స్పష్టమగుచున్నది. కావున వల్లభరాయని పూర్వికులకును రావిపాటి త్రిపురాంతకునకును నొకవిధమయిన సంబంధ ముండియుండెననియు, ఆసంబంధము కలిమిచేతనే యాతనియందలి గౌరవమువలంజేసి వల్లభరాయఁ డాతని ప్రేమాభిరామ మనుసరించి యీ క్రీడాభిరామరచనమునకు బూరకొని యుండెననియుఁ దోఁచుచున్నది. కావున నీసంగతికూడ వల్లభరాయ కర్తృత్వ విషయముఁ దోడ్పడఁగలదని తలంచెదను.

## గ్రంథశైలి

ఈ గ్రంథమందలి శైలివిషయాదికములనుగూర్చి కూడ విమర్శకులు భిన్నాభిప్రాయులై యున్నారు. ఈగ్రంథ మాద్యంతము శ్రీనాథునిశైలినే కలిగి యున్నదనియు, నిందలిప్రతిపదము నాతనిఁ బట్టి యిచ్చుచున్నదనియు శ్రీప్రభాకరశాస్త్రిగారి వాదము. ఇందలి శైలి యనేకస్థలములలో సంస్కృతపద భూయిష్ఠమై బహుక్లిష్టముగా నున్నదనియుఁ, గావున శ్రీనాథునివంటి యుద్దండుఁడుగాక కీర్తికాముఁడగు సామాన్యుఁడు తన భాషాపై పగ్థ్యమును బ్రకటించుటకు నౌచిత్యపరిజ్ఞానము లేకుండఁ బ్రబంధమును క్లిష్టతమముగఁ జేసియుండెననియు, శైలివిషయము శ్రీనాథుని కర్తృత్వమునకు న్యూనత గలిగించువిధముగఁ దోఁచుచున్నది గావున నిట్టి శైలి దోషమునకుఁ గారణభూతుఁడైనవాఁడు వల్లభరాయఁడే యైయుండుననియు శ్రీ అచ్యుతరావు గారి యభిప్రాయము. కాని యీవిషయములోఁగూడ యథార్థము మధ్యస్థముగ నున్నదనియే నాయభిప్రాయము. సంస్కృతపద భూయిష్ఠములయి, క్లిష్టపదబంధములుగల యిందలి పద్యములవంటివి శ్రీనాథునికృతులలోఁగూడ లేకపోలేదు. వల్లభరాయపక్షవాదులగు శ్రీ అచ్యుతరావుగారు కూడ నీవిషయమున—

"(ఇందు) శ్రీనాథునివాక్యములును వర్ణనలు నచ్చుటచ్చుటఁ గానంబడుచున్న వనుటవాస్తవము. కొన్ని పద్యములలో శ్రీనాథుని శైలిధోరణియు ద్యోతిమే. అయిన నాకారణమున శ్రీనాథుఁడే యీగ్రంథమును వ్రాసెనని చెప్పుటమాత్రము సాహసము. శ్రీనాథుని బహుముఖప్రఖ్యాతమహిత శయ్యావిశేషములు పండితకవులను పండితంమన్యమానకవులను నేకరీతిగా ననుకరణోత్సాహపూరితులఁ జేసెననుటకుఁ బినవీరన పెద్దనాది మహాకవులే ప్రబలసాక్ష్యము. అట్లుండ సమకాలికుఁడు బహుశః సహచరుఁడు నగు వల్లభామాత్యుఁడు కవియశోవాంఛితుఁడు గాన శ్రీనాథుని వాగ్లహరీతరంగముల మధురమధురసమును గడుపారఁ గ్రోలి తనకావ్యమున నచ్చుటచ్చుట తదున్మదనసీధువును వెలిగ్రక్కుట యసంభవమా ? బహువ్యాప్తినందిన శ్రీనాథుని జాతివార్తారసస్ఫూర్తి యచ్చటచ్చట నీగ్రంథము నలంకరించుటచేతనే యాకాలపు నాటకప్రేక్షకులను హాస్యరసమగ్నులనుగాఁ జేయఁగలిగియుండెనని యూహించుట యథార్థమునకు దూరముగాదు." అని వ్రాయక తప్పినదికాదు. శ్రీనాథునివర్ణనలును, వాక్యములును, శైలిధోరణియు నిందచ్చటచ్చట స్వల్పముగఁగాక యతిమాత్రముగఁ గానవచ్చుచున్నవి. అందుల కుదాహరణములు గొంతవఱకు నేను నాపూర్వోక్తవ్యాసమున నొసంగియుంటిని. అంతకంటె విపులమగు సామగ్రిని శ్రీప్రభాకరశాస్త్రిగారు, శ్రీ రాఘవాచార్యులుగారు నొసంగియున్నారు. కావునఁ జర్వితచర్వణముగ వాని నిచ్చట నుదాహరించి గ్రంథవిస్తర మొనరింపఁజాలను. పినవీరన, పెద్దనాదుల యనుకరణము లిట్టివిగావు. వారు శ్రీనాథుని రచనాసంవిధానమును, పాదవిన్యాసక్రమము ననుకరించి యాతని పదప్రయోగములను గొన్నింటిని బరిమితముగఁ గయికొనిరే గాని యీగ్రంథమందువలె నాతని పద్యములను, బద్యపాదములను బూర్తిగాఁ బుడికిపుచ్చుకొనలేదు. శ్రీనాథునకీగ్రంథముతో నెట్టిసంబంధమును లేదనినచో వల్లభరాయఁ డొనర్చినది యనుకరణమే యన్నచో నది గ్రంథచౌర్యదోషమునకు గుఱికాఁదగినంతటి పరిపుష్టానుకరణమని చెప్పకతీరదు. అట్లని ప్రభాకరశాస్త్రిగారివలె నిందలి ప్రతిపదమును శ్రీనాథునినే పట్టి యిచ్చుచున్నదని నేనంగీకరింపఁజాలను. ప్రతిపదమనుటకంటెఁ బ్రత్యక్షర

మన్నచో నతిశయోక్త్యలంకార మత్యుచ్ఛ్రియము నంది యుండునేమో! శ్రీనాథునిపద్యములకు శైలికి విలక్షణములగు పద్యములుగూడ నిందుఁ గొన్ని లేకపోలేదు. అచ్యుతరావుగారు చెప్పిన శైలీదోషములు వానిలోఁ గొన్నింటికిఁ బ్రసక్తింపవచ్చును. వల్లభరాయని ప్రత్యేక వ్యక్తిత్వమును బ్రదర్శించు పద్యములను గొన్నిటిని నా మిత్రులు శ్రీవిశ్వనాథశర్మగారు రుదాహరించియేయున్నారు. ఆవిషయమున వారియభిప్రాయములను నేను జాల వఱ కంగీకరింతును.

ఉ. ప్రక్కలు వంచు, వంచి ముని
పండ్లను బండ్లను రాయు, రాచి ఆ
మ్మ్రొక్కలఁజేయుఁ, జేసి తల
యల్లనఁ గాళులు సంగు, సంగి లోఁ
జక్కికి నొక్కు, నొక్కి యిఱు
చంబడ గుమ్మడిమూలుగట్టి పీఁ
పెక్కి దువాళిసేసి చలి
యిక్కడ నక్కడఁ బెట్టు వేసవిన్.

అను పద్యములో సంగుశబ్దమును గ్రియారూపముగా నుపయోగించుటయు, శ్రీనాథుని యితరకృతులలో నంతగాఁ గానరాక, దత్తమండలప్రాంతమున వాడుకలో నున్న పదపరికరము లిందుఁ గొంతవఱకుఁ గానవచ్చుటయు వల్లభరాయఁడే యిందలి పద్యములను జాలవఱకు వ్రాసియుండునని తలంచుటకు సాధకములు కాఁగలవని నాయభిప్రాయము. శ్రీనాథుని గ్రంథమునుండి యిందు మూఁడు పాదములవఱకు మార్పులేకుండఁ గైకొనఁబడిన పద్యము.—

గీ. గార్గ్యసిద్ధాంతమత ముషఃకాలకలన
శకున మానుట యది బృహస్పతిమతంబు
వ్యాసమతము మనఃప్రసాదాతిశయము
విప్రజనవాక్య మరయంగ విష్ణుమతము.

అనునది. శ్రీనాథుని సంబంధమును స్థాపించుట కీపద్య మొక్కటియే చాలునని నాయాశయము. శ్రీవీరేశలింగము పంతులుగారు, వల్లభరాయని దర్శించుట కేఁగి నప్పుడు శ్రీనాథుఁ డాతని క్రీడాభిరామములోని పద్యమును జూచి తరువాతఁ దాను వ్రాసిన భీమఖండములో నిందలి మూఁడుపాదములను నక్లే గ్రహించియుండునని చాల నసంగతముగ వ్రాసిరి. శ్రీనాథుఁడు భీమఖండ కాశీఖండములు వ్రాసినతరువాతనే, క్రీ. శ. ౧౪౪౦ ప్రాంతమున నీక్రీడాభిరామరచనము జరగియుండునని నాపూర్వ వ్యాసమున సకారణముగ నిరూపించియుంటిని. భీమఖండ మొక సంస్కృతపురాణమునకుఁ బరివర్తనము. పై పద్యము ద్రాక్షారామపురోపాంతమున మధ్యాహ్నసమయమున నుపవసించి యగస్త్యుఁడు, వ్యాసుఁడు మున్నగువారు తత్పురప్రవేశమునకయి సుముహూర్త మాలోచించు సందర్భములో నగస్త్యుఁడు వ్యాసునితోఁ బలికినది.

మూలగ్రంథమందలి పాదము లివి:—

శ్లో. ఉషస్సాత్యగార్గ్య సిద్ధాంత శ్శకునంతు బృహస్పతేః,
త్వన్మతంచిత్తనైర్మల్యం విప్రవాక్యం హరేర్మతమ్.
కీర్తనీయోఽభిజిత్కాల స్సర్వసిద్ధాంత సమ్మతః.

ఈ శ్లోకమునకు సరియైన యాంధ్రీకరణముచేయవలయునన్నచోఁ దక్కినపాదములన్నియుఁ బ్రథమపురుషములో నుండఁగాఁ బానకములోని పుడకవలె మధ్యపాదమసంగతముగ మధ్యమపురుషములో "నీదు మత మెన్నఁగ మనఃప్రసాదగరిమ" అను రీతి నాంధ్రీకరింపవలసియుండును. కావున శ్రీనాథుఁ డుచితజ్ఞుం డగుటచేనిందలి యనౌచిత్యము నాలోచించి యాపాదమును విడిచి యప్పటి కా సందర్భమున కనుకూలము, నవసరమునగు నభిజిత్సిద్ధాంతమును నాలుగవ పాదముగా గ్రహించి పద్యము నీక్రిందివిధముగ రచించినాఁడు.—

గీ. గార్గ్యసిద్ధాంతమత ముషఃకాలకలన
శకున మానుట యది బృహస్పతిమతంబు
విప్రజనవాక్య మరయంగ విష్ణుమతము
సర్వసిద్ధాంత మభిజిత్తు సమ్మతమగు.

ఇందు విడిచిన వ్యాసమతమును "వ్యాసమతము మనఃప్రసాదాతిశయము" అని క్రీడాభిరామపద్యములోఁ బ్రథమపురుషమునందే ప్రకటించి భీమఖండపద్యము నాల్గవపాదమునఁ గైకొనిన యభిజిత్సిద్ధాంతము నిచ్చట

విడిచినాఁడు. ఈశ్లోకము శకునశాస్త్రములోనిదనియు, అందలి కాంధ్రీకరణము శ్రీనాథవల్లభరాయలకుఁ బూర్వమే వ్యాప్తిలోనుండియుండవలెననియు, దానినే శ్రీనాథవల్లభరాయ లిరువురును వారి గ్రంథములలోఁ జేర్చుకొని యుందురనియు శ్రీవిశ్వనాథశర్మగారి యభిప్రాయము. క్రీడాభిరామము హాస్యరసోత్పాదకగ్రంథము కావునఁ బరమపవిత్రమగు ద్రాక్షారామ పుణ్యక్షేత్రమునకు భీమనాథేశ్వరసేవకయి వెడలు పావనసమయ నిరీక్షణ సందర్భమునఁ జెప్పఁబడిన యీపద్యమును గోవిందమంచనశర్మ, టిట్టిభశెట్టి యను విలాసపురుషులు క్రీడాపరిశ్రమమహోన్ముఖులై యాంధ్రనగర ప్రవేశమొనర్చు సందర్భమున వల్లభరాయఁడు హాస్యరసోత్పాదనము కొఱకే శ్రీనాథునిగ్రంథమునుండి గైకొని చేర్చియుండునని శ్రీఅచ్యుతరావుగారి యభిప్రాయము. ఈపద్యమునకు మూలశ్లోకము శకునశాస్త్రములోనిదయినను, లేక సంస్కృతభీమఖండమునుండియే శకునశాస్త్రములకెక్కినను దీనిని పైనిజెప్పిన యుచితంపు మార్పులతో వేర్వేఱు స్థలములందనుకీలిని బ్రయోగించుట కవిసార్వభౌముఁడగు శ్రీనాథుని కార్యమే యని విశాలదృష్టితోఁ జూచిన వారికిఁ దోఁపకపోదు. క్రీడాభిరామములో నీశకున సందర్భమున నీపద్యమొక్కటియేగాక మఱి రెండుపద్యములుకూడ నున్నవి. చిత్తగింపుఁడు.—

ఉ. చుక్క మొకంబు నిక్కి బల
  సూచనదిక్కున రాయుచుండుటన్
 జక్కఁగ వేగ దిప్పుడు ని
  శాసమయం బిది ప్రస్ఫుటంబుగా
 ఘుక్కని మాటిమాటికిని
  గోటఁడు వల్కెడు వామదిక్కునన్
 జొక్కటమై ఫలించు మన
  శోభనకార్యము లెల్ల టిట్టిభా!

గీ. గొనకవంగోడి యేట్రింత గొంకవక్క
 నమిలి యీనాలుగిటివర్ణనంబు లెస్స
 పీనివలతీరుఁబఱుకు నుర్వీజనులకుఁ
 గొంగుబంగార మంద్రు శాకునికవరులు.

అప్పుడు కథానాయకు లొనర్చెడి ప్రయాణము ప్రభాత సమయమందలిది కావునఁ దదానుకూల్యమును స్థాపించుటకే "గార్గ్యసిద్ధాంతమత ముహుఃకాలకలన" అను పద్యముకూడ గ్రహింపఁబడినది గాని శ్రీ అచ్యుతరావుగారు సెలవిచ్చినట్లు కేవలము హాస్యరసోత్పాదనముకొఱకేగాదు. హాస్యరససిద్ధికే యని యంగీకరించినను సమస్తానుకూల్యములను జింతించి యుచితంపుమార్పులతో నీపద్యము నచ్చటఁ జేర్చినవాఁడు శ్రీనాథుఁడే యైయుండును. కవులు తా మదివఱకు రచించిన గ్రంథములోని పద్యములను సమానసందర్భములు తటస్థించినప్పుడు తరువాత గ్రంథములలో మార్పులు లేకుండఁ జేర్చుచుండుట క్రొత్తకాదు. తిక్కన నిర్వచనోత్తర రామాయణమునందలి పద్యములను గొన్నిటిని భారతములోనట్లే చేర్చెను. శ్రీనాథుఁడుగూడఁ గాశీఖండములో గుణనిధిచరిత్రమునందు సంస్కృత మూలమునుబట్టి రచించిన—

చ. అరుణగభస్తిబింబ ముద
  యాద్రిపయిం బొడతేర గిన్నెలోఁ
 బెరుఁగును వంటకంబు వడ
  పిండెలునుం గుడువంగఁబెట్టు ని
 ర్భరకరుణాధురీణయగు
  ప్రాణముప్రాణము తల్లి యున్నదే
 హరహర! యెవ్వ రింకఁ గడు
  పారసి పెట్టెద రీప్సితాన్నముల్.

అనుపద్యమును శివరాత్రిమాహాత్మ్యములోనట్టికథ పట్టువచ్చినపుడు మార్పు లేకుండఁ బ్రయోగించెను. కావున నీగ్రంథమందలి శ్రీనాథునిసంబంధమును వ్యక్తమొనర్చుటకుఁ బయి "గార్గ్యసిద్ధాంతమత" మనుపద్యము ప్రబలదృష్టాంతము కాఁగలదని నాయభిప్రాయము. శ్రీనాథునిసంబంధము లేక వల్లభరాయఁడే యీగ్రంథమును రచించెనన్నచో, భావమునుమాత్రము గైకొని వేఱువిధముగ వ్రాసియుండును గాని శ్రీనాథుని గ్రంథములనుండి మార్పు లేకుండఁ బద్యపాదములను గ్రహించియుండఁడు. శ్రీనాథుఁడు శాలివాహనసప్తశతి నాంధ్రీకరించినట్లు "నూనూగుమీసాల నూత్నయౌవనమున శాలివాహనసప్త

శతి నోడివితి" అను నాతని పద్యమునుబట్టి తెలియు చున్నది. సప్తశతిశ్లోకముల కాంధ్రీకరణములో యను వాదములో యనఁదగు పద్యములు రెండు క్రీడాభిరామ మునఁ గాన్పించుచున్నవి. చూడుఁడు.—(శ్రీప్రభాకర శాస్త్రిగారు వీనిని గుర్తించినారు)

శ్లో. ఝంఝూవాతోత్తృణితే
గృహేరుదిత్వా నిస్సహనిమగ్నామ్,
విర్మయతి గతపతికాం
విద్యుదుద్యోతో జలధరాణామ్.

మ. పటుఝంఝూపవనోత్తృణాలయములో భద్రంబుగాఁబట్టి కం
కటిమైముచ్చముడింగి నిర్భరవియో గగ్లాని శోషించి, యొ
క్కటి నిద్రించుచునున్న వాడువనితన్ గర్జావచః ప్రౌఢిమన్
దిటచెదుద్యోతము సూపునట్టినగు రే ధారాధర శ్రేణికిన్.

శ్లో. విక్రీణితే మాఘమాసే
పామరః ప్రావరణం బలీవర్దేన,
నిర్ధూమ ముర్మురనిభే
శ్యామల్యాః స్తనౌ పశ్యన్.

గీ. మాఘమాసంబుపులివలె మలయుచుండఁ
బచ్చడంబమ్మకొన్నాఁడు పణములకును
ముదితచన్నులు పొగలేని ముర్మురములు
చలికినొడిగోయకేలుండు నైరికుండు.

పైని జెప్పినరీతి నీపద్యములనుగూడ శ్రీనాథుఁడే తనశాలి వాహనసప్తశతినుండి యిందుఁ జేర్చియుండునని తలంప వచ్చును. కావునఁ దక్కిన శైలీసామ్యాదికవిషయము లెట్లున్నను నీపద్యములు మూఁడును శ్రీనాథునకీగ్రంథము తోడి సంబంధమును స్థాపించుటకుఁ జాలునని నాయభి ప్రాయము.

మహాశయులారా! పైయంశములనెల్లఁ బర్యా లోచించినచో వల్లభరాయఁడే యసలు క్రీడాభిరామ కర్తయనియు, శ్రీనాథుఁడు ప్రౌఢదేవరాయల యాస్థా నమునకుఁ బోయినపుడు విజయనగరమునందో లేక మధ్యేమార్గమున వినుకొండయందో మోపూరునందో వల్లభరాయని దర్శించినప్పు డాతనివలన నీగ్రంథరచనా ప్రయత్నమును విని యాతని యాదరానురోధమువలన నాతని కందుఁదోడ్పడియుండుననియుఁ దలంచుట సర్వ విధముల సమంజసమని నాయభిప్రాయము. కేవలము వల్లభరాయపక్షమే వహించిన శ్రీఅచ్యుతరావుగారు కూడఁ దుదకుఁ గొంతవఱకు నాయీయాభిప్రాయము తోనే యేకీభవింపవలసినవారయిరి. చూడుఁడు వారి యీక్రిందివాక్యములు.—

"కావున నీగ్రంథము వల్లభరాయని కృతమనియే యంగీకరించుట యెక్కువ న్యాయమని యూహించు చున్నాను. వల్లభరాయఁ డీగ్రంథమును దెనిఁగించి తన స్నేహితుఁడు, కవిసార్వభౌముఁడు నగు శ్రీనాథునిచేఁ గొంతసాయమును బొందియుండవచ్చునుగాని శ్రీనా థుఁడే యీగ్రంథ మామూలాగ్రముగా రచించెనని చెప్పుటమాత్రము కేవల మతిశయోక్తియనియు, నన్యాయ మనియుఁ దలంప సాహసించుచున్నాను."

ఈగ్రంథాంతమున భరతవాక్యమందలి పద్య ములో వల్లభరాయఁడు "కవీంద్రకాంక్షితత్రిదశమహీ రుహం" బనివర్ణింపఁబడియుండుటచే దానినాధారముగాఁ గొని శ్రీ ప్రభాకరశాస్త్రిగారు కవియశోలోభమున వల్లభరాయఁడు శ్రీ నాథునివలన నీ గ్రంథకర్తృ త్వమును దనపై వేయించుకొనెనని వ్రాసియున్నారు. హరవిలాసకృతిపతియగు అవచితిప్పయసెట్టిగూడ "కవి సంఘ మనోరథకల్పకద్రుమా" అని సంబోధింపఁబడి నాఁడు. ఇష్టార్థప్రాప్తినందుట కిట్టి కవికల్పద్రుమము లకుఁ గృతిపతిత్వ మొసంగినఁజాలదా? ఉభయతారక మగునదిమాత్రము గౌరవదాయకముగాదా! ఇంతకుఁ గవి యశోలోభమున వల్లభరాయఁడును, ధనలోభమున శ్రీ నాథుఁడును నిట్టి యకార్యమునకుఁ గడంగి రన్నచో దొంగిలఁబోవ మంగలము దొరకినట్టులు, అందులకు ఏకాంకరూపకమగు నీలఘుకృతియా వారికి దొరకినది? విధముచెడినను ఫలము లభింపనక్కఱలేదా? అట్టి సం కల్పమే వల్లభరాయనికున్నచో భీమఖండ కాశీఖండ

మునువంటిదే యుద్గ్రంథమునకో రచింపంపి తిక్కనకృత్వ మును పదపై నైమిత్తియుండును గాని యిట్టి స్వల్ప కృతితో సంతృప్తిపడియుండరు. కావునఁ బయి సిద్ధాంతము సహృదయులు సమర్థింపఁదగినది కాదు. శ్రీనాథాంశమున కలిమిచే గ్రంథరచనమున మిత్రులకుఁ గోప్యముగా నొసంగు సాహాయ్యము మనకుఁ గ్రొత్తదికాదు. ఆంధ్రశాస్త్రయుగమునకు మూలకందము నన్నయభారతము నాలుగేళ్ళు విచారింపుఁడు "సాయక పాకశాసనికి భారత ఘోరరణంబునందు నారాయణునట్లు" గ్రంథరచనమున నన్నయకు నారాయణభట్టొనరించిన సాహాయ్యమెట్టిదనఁ శ్రీకృష్ణుఁడు శస్త్రము చేతఁబట్టనియట్టి సారథ్యము గంటము చేతఁబట్టనిదియోగా? అయినదో నన్నయ కాతఁ డొనర్చిన సాయ మేమి? నన్నయకు మహదగాధము అయిన సంస్కృత భారత ఘట్టముల కర్థమేమయిన నాతనికిఁ జెప్పియుండునందురా? అట్లూహించి "మత్యమరాచార్యుఁ"డను నన్న పార్యుని న్యూనత పఱచుట యొప్పిదమగునా? కాదు. నారాయణభట్టు గ్రంథరచనమునఁ దనకేసారమయిన సహాయమొనర్చెననెడి భావముతోనే నన్నయ వైశిష్ట్యమును జెప్పియుండును. అతని భారతములో నారాయణభట్టు రచించినపద్యములు లెక్కకు నెక్కువగనే యుండియుండును. అట్లయ్యును గ్రంథమంతయు నన్నయపేరనే వెలసినది. నారాయణభట్టొనరించిన యితరగ్రంథము లేమయిన లభించియున్నచో వానియందలి శైలీసామ్యమునుబట్టి భారతమందలి యాతనిపద్యములను గుర్తించుటకుఁ గొంత యవకాశము గలిగియుండెడిది. శ్రీనాథుని యితరకృతులు కొన్ని లభించుటచేత నేగదా యందలి పోలికలనుబట్టి క్రీడాభిరామమందాతని పేరు గానరాకున్నను దత్కర్తృత్వ మాతని కారోపించుటకు మనవారి కవకాశము దొరకినది. శ్రీనాథుఁ డీగ్రంథమున వల్లభరాయనికిఁ దోడ్పడి యున్నచో నావిషయమును వల్లభరాయఁడేల పేర్కొనఁ డయ్యెననెడి యాక్షేపమును బ్రతిపక్షులు చేయవచ్చును. అందులకు ముందు, శ్రీనాథునిపోకడలను జూచికొని కవితాపక్షమునందాతని యడుగుజాడలలో నడచి యాంధ్ర కవితాపితామహత్వము నందిన పెద్దనామాత్యుఁడు తన మనుచరిత్రమున నాతని పేరయినఁ దడవకుండుటకుఁ గారణమును వారు తెలుపవచ్చెదరుగాక! అయినను రావిపాటి త్రిపురాంతకుని గ్రంథము ననుసరించి తా నీవీథీరూపకము నొనర్చితినని నిష్కల్మషముగఁ బ్రకటించి యాతనియందుఁ దన గౌరవమును బ్రదర్శించిన వల్లభరాయఁడు శ్రీనాథుఁడు తనకొనర్చిన సాయమునుమాత్ర ముగ్గడించియుండఁడాయని నాయనుమానము. ఆతఁడు తప్పక దానిని గ్రంథమునఁ జెప్పియేయుండును. ఈగ్రంథమునకు మనకు దొరకినది తంజావూరి సరస్వతీమహాలునందలి యొక్క ప్రతిమాత్రమే. అదియైనను శిథిలాతిశిథిలమయి గ్రంథపాతములతో నిండియున్నది. అందును నవతారికా భాగము విశేషముగ వినష్టమయియున్నది. ఈవిషయము ప్రభాకరశాస్త్రిగారు కూడ నంగీకరించియే యున్నారు. ఇప్పుడు ప్రకటితమయిన క్రీడాభిరామములోఁ గానరాక జగన్నాథకవి ప్రబంధరత్నాకరములో నుదాహృతమయిన "చంద్రఖండములతో సరివచ్చుననవచ్చు, విమలదంష్ట్రాప్రరోహములవాని" అనుపద్యము వినష్టమయిన యీయవతారికాభాగములోనిదే కావున శ్రీనాథునిఁగూర్చిన ప్రశంస కూడ మనకిప్పుడు లభింపక వినష్టమయిన యవతారికా భాగమున నుండవచ్చునని నాతలంపు. దానిని జూచియే అప్పకవి మున్నగు లాక్షణికులు కొందఱు గ్రంథము వల్లభరాయనిపేరనున్నను బయిప్రశంసనుబట్టియుఁ, బద్యముల శైలీసామ్యాదికమును జూచియుఁ దమయుదాహృతపద్యములను శ్రీనాథుని వీథినాటకములోనివని వ్రాసియుందురని తోఁచుచున్నది. కావునఁ బయివిషయములనెల్ల సవిమర్శముగ నాలోచించి సత్యనిర్ణయ మొనర్తురుగాక యని సహృదయులను బ్రార్థించుచు నీవ్యాసము నింతటితో విరమించుచున్నాను.*

---

*పరిషత్సభలో నే నీవ్యాసమును జదువుచుండఁగా వినిన నామిత్రులు బ్రహ్మశ్రీ నడకుదుటి వీరరాజుపంతులుగారు శైలీసామ్యాదికమునుబట్టి శ్రీనాథున కీగ్రంథముతో సంబంధము నారోపింపరాదనియు, గణపవరపు

వేంకటకవి ప్రబంధరాజ వేంకటేశ్వర విజయవిలాసములోని పద్యములు కొన్ని నరసభూపాలీయ పద్యములకు నకళ్లనియు, అట్లే అల్లమరాజు సుబ్రహ్మణ్యకవి భద్రాపరిణయమందలి పద్యము లనేకములు కాణాదపెద్దన సోమయాజి ముకుందవిలాసములోని పద్యములకుఁ బ్రతి కలనియు సెలవిచ్చిరి. పూర్వకవుల కావ్యములనుండి గ్రంథచౌర్యదోషమునకు సరికాఁదగినంతటి పరిపుష్టానుకరణము లొనర్చినకవులు కొందఱు లేకపోలేదు. వల్లభరాయఁడుగూడ నిట్టిగణములోనివాఁడేయని తలంపరాదని నాయభిప్రాయము. ఏలయన శ్రీనాథవల్లభరాయ లిరువురు సమకాలికులు. అప్పటికే శ్రీనాథుని గ్రంథములకు వ్రాఁతప్రతులు దేశమంతటను నెలకొనుటయు, వానిని జూచి వల్లభరాయఁ డిట్టి యనుకరణము లొనర్చుటయు జరుగుటకుఁ దగిన యవకాశము గానరాదు. మఱియుఁ గేవల శైలీసామ్యాదికమునుబట్టి గాక యీగ్రంథమున శ్రీనాథుని సంబంధమును స్థాపించుటకుఁ గల ప్రబలకారణములను పైని బేర్కొనియే యుంటిని. మఱియు నేనిటీవల శ్రీచిలుకూరి వీరభద్రరావుగారి "శ్రీనాథకవి" అను పుస్తకమును జదువుట తటస్థించినది. అందులో శ్రీపంతులుగారు తమయాంధ్రులచరిత్రములోఁ బ్రతిపాదించిన శ్రీనాథపక్షవాదమును, శ్రీప్రభాకరశాస్త్రిగారును శ్రీరాఘవాచార్యులుగారు నొసంగిన యుదాహరణసామగ్రితో బలపఱచికొని సిద్ధాంతీకరించియున్నారు. కాని తుదకు వీరుకూడ "ఈవీథి నాటకము పైహేతువులచేత వల్లభామాత్య విరచితము కాదేమోయని యెట్టి వానికిని సందియము గలుగక మానదు. ఎట్లయినను, అంతకుఁగాక పోయినను కొంతవఱకయినను, శ్రీనాథునిచేయి యీ రచనమునఁ బాలుగొనియుండకపోదని విశ్వసింపవలసివచ్చుచున్నది." అని లిఖించి యొకవిధముగ నాయభిప్రాయముతో నేకీభవించినవారైరి. ఇట్లు వల్లభరాయపక్షవాదులలో అచ్యుతరావుగారును, శ్రీనాథపక్షవాదులలో శ్రీవీరభద్రరావుగారును ఇంచుమించుగ నాయభిప్రాయమునే గ్రహింపఁగలిగినందులకు సంతసించుచున్నాను.

# భల్లటశతకము

చిలకమర్తి లక్ష్మీనరసింహముగారు

(ప్రజోత్పత్తి ఫాల్గున సంచిక తరువాయి)

తృణమణియు, నది గలిగిన దీననరుఁడుఁ-జూపు నౌదార్యగరిమ మెచ్చుకొనవచ్చు,
గడ్డిపరకలె యామణి కావలె నను-నిచ్చు వాటినే యజమానుఁ డెలమితోడ.

అఱిముఱి నాతృణాగ్రమున నంటిన వారికణంబుఁ జూచి, యె
వ్వరు నిజమైన ముత్యమని భావనసేయుచు మోసపోవ; రె
ట్లరసిన నీటిచుక్క యది, యద్భుతదృక్కు జగంబ శేష; మీ
నరణిని నుండియున్ మనము జ్ఞానులమే యనుకొందు మెప్పుడున్.

భువనభూషణమగు పుత్త్రడివన్నియ-డెలియ రాల్ ప్రమాణములుగఁ గొనెదు
నట్టిబుద్ధియుతుల నెట్టినామములతోఁ - బిలువవలెనో మాకుఁ దెలియలేదు.

పొలముఁ గావఁ దలఁచి కృషీవలుఁడు నిల్పెఁ-బురుషరూపంబుగా గడ్డిబొమ్మ నొండు;
కదల కది మొద్దువలె నుంటఁ గాంచి చేరి-పసులు మృగములు జేన్మొసె భయము విడిచి

అనిమిషలోచనంబు లరయన్ విబుధాళికిఁ దక్క నింక నె
వ్వనికిని లేవు లోకమున, స్పష్టము సుమ్మిది, యోసి మత్స్యమా ?
యనిమిషనేత్రముల్ గలిగి యజ్ఞతఁ జూడవొ, మాంసఖండమున్
దిన వడిఁ బోయి నోర్దెఱచి నీ వట గాలము మ్రింగనేటికిన్.

మగతన ముజ్జగించి, తథమస్థితి నూనితిఁ, జేసినాఁడ నె
న్నఁగఁ దగుమంచిదానమును, నాశము మానిపి యుద్ధరించితిన్
జగ మఖిలంబు, నంచు వరుసన్ దనప్రజ్ఞల నెల్లఁ జాటు, హె
చ్చుగఁ బురుషోత్తముం డొకఁడు చూపరు మిక్కిలి యక్కజంపడన్.

అనయము గాజురాళ్లు గొని యమ్మెడుచెడ్డబెహారి భంగమౌఁ
దనకులవృత్తి కంచును నితాంతము మచ్చర మూని చాల నె
మ్మనమునఁ గుందెఁ, గౌస్తుభసమానమహామణిరాజపుంజగుం
ఫనచణుఁడైన వర్తకునివైభవ మంతయుఁ జూచి కన్నులన్.

ఎలుకలకుం బ్రతిక్రియ యిదేయని పెంచితి పిల్లి, నెంతయున్
బలిసినచో స్వకార్యము నొనర్ప దటంచును మేపవైతి, కా

వలసినస్వేచ్ఛ నీవయితి, బక్కయి మిన్నకయుండె, గేస్తుఁడా!
పలుకుడు లేల? దొంగలటు వర్తిలు మూషికముల్ గృహంబునన్.

సరసస్వభావవైఖరి యున్న దందువా సతతంబు నిటువంటి జాడ్య మేమి?
సరళత సహజమై యిరవొందు నందువా నిలువెల్ల నీగ్రంథి నిచయ మేమి
జననంబు పరిశుద్ధ మని యందువా ధాత్రిఁ బంకజంబను పేరు పరఁగ నేల?
పలుగుణంబులు నాకుఁ గల వందువా నీదు తనువెల్లఁ బెక్కుఛిద్రంబు లేమి?
తరిచిచూచితిమేని యోతమ్మిపూవ! - కానఁబడుచుండె నీదులక్షణము లెల్ల
బుద్ధియుతుల కన్యోన్యవిరుద్ధములుగ - నీదుతత్వ మదెట్టిదో నే నెఱుంగ.

గమనము వక్రమౌ, విషవికారము రూపము, పుట్టలన్ నివా
సము, రసనాద్వయంబు గొని సర్వజగజ్జనహింస వృత్తి, స
ర్పమునకు, నట్టు లుండియును రత్నము లౌదలఁ దాల్చుచుండు,
నేసమయమునందు నేని గుణశాలి తొరంగఁడుసుమ్మి యాచితిన్.

అరరే! యెంతటిక్రూరచిత్తలొకొ యబ్జాస్యల్, త్రిలోకీమనో
హరుఁడౌ చంద్రుఁడు గ్రుంక, నీరముల స్నేహాంతోచితాంత్యక్రియల్
శరధుల్ చేసె, మహాంధకారకబరీసంఘాతమున్ విప్పి త్రి
మ్మరు దీ; వంతియకాని దుష్టనిశి! యాత్మం గుంద వేమాత్రమున్.

స్వస్థానమును బాసి చనకయాత్మస్తుతి స్వీయగృహంబునఁ జేసికొనుచుఁ
బగటిని గెల్వంగవలె నన్న వాంఛాజ్వరముచేత దీపంబు శ్రమల నొంది
వత్తిని జమురును వ్యర్థంబుగాఁ గాల్చి, నఖిలలోకంబుల నాక్రమించు
కారుచీఁకటులమొగంబేని వెఱువక సూటిగా నది తేఱిచూడఁగలదె?

కార్షికుఁడా! నీ వకాలపుష్పంబులు పూచినమామిళ్లు పుడమిఁ గూల్చి
మేలు చేసితి వన్న; యే లన్న దానిచేఁ బెరచెట్లు చెడిపోయెఁ బేరు లేక,
ఇట్టిదుశ్శకునంబు లీక్షించుకష్టంబు నీకతంబునఁ బోయె లోకమునకుఁ,
దప్పుదారిని బడ్డ దమ్మిచూలికరంబు నుండంగఁ దగుచోట నుంచి తీవు.

పొనరిచి వాయుభక్షణము భూజననాశముఁ జేయు సర్పముల్
మునులటు మేఘవారికణముల్ దిని చంపు నెమిళ్లు పాములన్,
దనువున లేడిచర్మములఁ దాల్చి కిరాతులు వానిఁ గూల్త్రు, దు
ర్జను లతిదంభశీలురయి సజ్జనులట్ల నటింత్రు ధాత్రిలోన్.

పరసహాయము లేక బరువు లెంతటివైన మును జిక్కుదారుల మోసె నెద్ది?
తనగోష్ఠమందు నెంతటిదానిఁబాంకెయు నెన్నఁడు విని సహియింప దెద్ది?
తిలకమై గోగణంబుల నెద్ది పేర్వడె? నావెల్లయె ద్దిప్ప డక్కటకట!
ముసలివై పడియుండి పసరంబులయవస్థ యిట్టిదేయని చాటు నీజగమున.

తగనితావ్రసకు యత్నములు సేయుట ముగ్ధశలభమా! మానుము. చాలు నింక
నాకాశసంచార మల్పబలోపేతు లగువారలకు ససాధ్యంబు సుమ్ము,
అతివేగగమనంబు నలవరించెదనందువా యుపద్రవకరం బదియు నీకు,
వైనతేయునిపక్షవాయువు లవలీలఁ బెనుగొండలైనను బెల్లగించి
వెంటఁ గొనిపోయెడును నభోవీథియందు-నవియు దేవునకును దుస్సాహ్యములు సుమ్ము
వానిముందఱ నీ వెంతదాన వౌదు - నీదుజవ మెంత బల మెంత నేరు వెంత?

వననిధి చంద్రుచేత బహుభంగయుతింబయి పొంగి మ్రోయు. జీ
వనములు కొండవాఁగులిడి వార్ధినిఁ బ్రోచెనె? చంద్రుఁ డస్తమిం
చినవెనుకన్ బ్రతిక్రియలు చేయఁగఁజాలక యేళ్లు పాఱుచున్
గినుఁగొనుచుండ సాత్త్వులటు, కంధి క్షయంబును బొంద నేటికిన్.

కపలిజలంబు నొక్కచుళుకంబునఁ గ్రోలెను వాని, వేయివేల్
జలధుల ఘస్మరుం డతఁడు చాలును ద్రావఁగుమాపి యయ్యు; లో
నఁడఁగి ప్రకాశహీన మయినంతనె తేజము లేకపోవునే?
యుడుగక తేజ ముండియును నుండనియట్లగు గొప్పవారిలోన్.

పాడమెం జందురుఁ డిందె,యిందె యమృతంబుం బుట్టె, దాల్చెం గిరుల్
తొడవుల్గా, మరియాదయై యతఁడు నిల్చెన్ ధాత్రి, కిందే వసిం
చెడు నాభీకమలప్రభూతవిబుధజ్యేష్ఠుండు విష్ణుండు, పా
యఁడ యిట్లుండియు వార్ధి, కుక్షిభృతికై యానిమ్నతన్ దుర్విధిన్.

నిముసం బీర్ష్యదొరంగి విన్న వినుతుల్ నే నొక్కపల్కున్, స్వప
క్షముచేఁ గల్గును గాని భీతి, పరపక్షవ్యాప్తిచే రాదు; ది
క్సమితిం జీకటి గ్రమ్మ వెల్గవొకొ నక్షత్రంబు లెన్నో స్వశ
క్తిమహత్వంబున భానుదీప్తి నవి నిస్తేజంబులై యుండవే.

నళినదళంబుపై జలకణంబును జూచి యిదేమి యంచు వెం
గలి యడుగంగ ముత్యమని గట్టిగఁ జెప్పె న కఁడు నమ్మి వెం

గలి యది వ్రేళ్లఁ బట్టుకొనఁగా జలమై వడి జాఱిపోయె, వి
హ్వాలమతియై యతండు నిశలందున నిద్దురపోక వందురెక్ .

ఈసరమందుఁ దృష్టివహియించినహంసము లెన్నొ యుండియున్
శ్రీసతివాసమైన సరసీజముఁ గన్గొన నొక్కసారియే,
నాసరసీజముల్ నిదుర నొందఁగ విచ్చెడుదాఁక సైఁపలే
కేసరణిన్ వెతంబడునొ యీభ్రమరంబులు, చూడు పొట్టకై.

బెక బెకమంచు మండుకము బిట్టలుకన్ వహియించి సర్పమున్
మొకమునఁ గొట్ట సాఁచెఁ గరమున్ భయ మించుకయేని లేక, మి
న్నక కనుదోయి మూసికొనె, నాగము వంచె శిరస్సు, సర్వమాం
త్రికుఁడగు నొక్కపూరుషవరేణ్యుని ప్రజ్ఞసుమీ యిదంతయున్.

ఆవిలు మృత్యువక్త్రమటు లాతత, మల్గులు త్రాఁచుఁబాములో,
నావరశిక్ష గెల్వఁగల దర్జునుచేన్, గతి నిమ్న మెప్డు, క్రౌ
ర్యావిల మాత్మ, నోట మధురం బగు గానము, వేటకాని కా
హా! వనమెల్ల నిర్మృగమె యౌ, నితఁ డీగతి నింక నుండినన్.

దేవ! విజ్ఞాననిధీ! త్రిలోకములందు నద్భుతంబులు సేయుచుంటి నీకు
ధ్వస్త సమస్తచేతనుఁడైన మానవుం డెదురొడ్డి స్పర్థ వహింపఁగలఁడె?
సదసద్వివేకంబు సంప్రాప్త మగుటచేఁ జిత్తంబు నొకరీతిఁ జిక్కఁబట్టి
వ్యర్థప్రయత్నంబు లాచరించుచునుండుఁ దనలోన గిజగిజఁ దన్నుకొనుచు.

పవనా! యీగతి భ్రాంతి యేమి? మనుజుల్ పాదంబులం ద్రొక్కు పాం
సువుఁ దేజస్వుల కున్కిపట్టగు నభస్సుం జేర్చి; తద్దాన మా
నవనేత్రంబుల కౌ ఘనవ్యథ లటుండన్, నీదుమై సంగతం
బవు కాలుష్యము సేయుపాయమునఁ ద్రోయ న్సాధ్యమో చూచుకో.

ధనము న్వేఁడఁదలంచి యాన్నృపగృహద్వారంబులన్ నిల్చి, యా
జనముల్ నిచ్చలు వేత్రహస్తకృతహింసల్ పొందుచు న్నారు; రీ
జనముల్ దుర్విషయోపభోగవిరతిన్ సంసారముల్ పాసి, ది
వ్యనదీతీరమునం జరింతు రహా! బ్రహ్మానందనిష్ఠాత్ములై.

లలితకదంబరేణుశబలంబులు గాడ్పులు వీచుఁగాక, మ
బ్బులు జలభార మూని యుఱుముల్ వెలి బుచ్చునుగాక, నృత్యముల్

సలుపునుగాక నెమ్ములును, సాటిమెలంతవు క్రొమ్మెఱుంగ! నీ
వెలమిని నింతగా మెఱసె దేటికి? కాంతవియోగదుఃఖ మన్
జలనిధి మున్గుదీనవదనన్ ననుఁ గన్గొని నిర్దయాత్మవై.

కైకొనుఁగాక నల్లనగుకాయము, మెక్కెడుఁగాక సత్ఫలా
నీకము, నిల్చుఁగాక రమణీయరసాలవనంబులందుఁ బుం
స్కోకిల మేమి సేయు నవి సూటిగఁ జేసెడుఁగాక, యెట్టులున్
గాకము కాకమే యగును గంఠము నెత్తి యొకింత పాడుచోన్.

శాతనఖనిర్దళితగజవ్రాతమైన-జండతరసింహము వసించుచుండుగుహను
గుక్కపిల్లను గని మూల నక్కినట్టి-నక్క నేఁడు ప్రవేశించె నక్కటకట!

ఎవఁ డాప్రాణము లిచ్చె నీకుఁ గృప, ని న్నెవ్వాఁడు పై కెత్తె, ని
న్నెవఁ డంసంబునఁ బెట్టి మోసె, నెవఁ డెంతే వేఁడె ని, న్నట్టిమం
త్రవిదున్ నవ్వుచునే వధించితివి వేతాళా! త్రుటిం బేరు గాం
తువులే, ప్రత్యుపకారులౌ పురుషులందున్ మేటివంచున్ భువిన్.

ఉరులను నాల్గుదిక్కులను నొగ్గిరి, నీట విసంబు గల్పి, రా
యెరగలి కానఁ గాల్చె, వల లెల్లెడఁ బన్నిరి, నిర్దయాత్ములౌ
నెఱుకులు విండ్లు చేతఁగొని యేగుచునుండిరి, వెంటవెంట, ని
త్తఱి మృగయూథనాయకుఁడు తా నెట కేగఁ దలంచెనో కదా.

అలకులటు పండ్లు శోభిల్లునని తలంచి-యాసఁ జిలుక బూరుగుచెట్టు నాశ్రయించెఁ;
దుదకు నది పండ, నందులో దూది యుండె-నదియు గాలి కెగిరిపోయె నక్కటకట!

నిలయము నీటికంచును మణీనికరంబులతా వటంచు నా
జలనిధి నాశ్రయించితిమి చాల పిపాసను, గాని స్వీయమహా
చులుకమునన్ మహామకరశోభితసాంద్రపయోధిఁ బట్టి ని
శ్చలముగఁ ద్రావు నొక్క మునిసత్తముఁ డంచు నెవం డెఱింగెడున్.

అనయము సర్వలోకహితుఁడౌ పురుషోత్తముఁ డుండుతావు, ది
వ్యనికరవాంఛ లన్నియును బండుపొలంబు, సమస్త లోకమో
హనముగఁ జంద్రమండలికి నచ్చపుఁదేజ మొసంగుదాత, పా
వనుఁడు సుధాబ్ధి, యం దెవఁడు వాసము నీ కిడెఁ గాలకూటమా!

---

శాంపిల్సు ఉచితము.

సహజమైన హెయిర్ టానిక్ తో మీ శిరోజములకు అందమును తెచ్చికొనుడు.

## కా మి ని యా నూ నె (రిజిస్టర్డు)



శిరోజములకును, మెదటికిని, యిది చాలా శ్రేష్ఠమైన నూనె. చలువ నొసగు పదార్థము లందు మిళితమై యున్నవి. కామినియానూనె మాడుపట్టును శుభ్రపఱచి, శిరోజ బీజములకు బలము నిచ్చి, వెంట్రుకలను పట్టువలె బాగుగా పెంచును. మంచి పరిమళ మిందు చేర్చబడినది. దీని నుపయోగించిన ప్రకాశవంతమగు శిరోజము లేర్పడును.

నేడే ఒకబుడ్డిని పరీక్షింపుడు. వెల బుడ్డి రు. 1-0-0, 3 బుడ్లు రు. 2-10-0.

వి. పి. ఛార్జీలు ప్రత్యేకము.

పోస్టేజినిమిత్తం ఒకఅణాస్టాంపునుపంపిన శాంపిలును ఉచితముగా బడయగలరు.

## పరిమళ రాజు ఓ టో దిల్ బ హా ర్ (రిజిస్టర్డు)



OTTO DILBAHAR.

దీనికి సాటియైనది లేదు. దీని పరిమళము యింపుగాను, ఆనందదాయకముగాను యుండును. వాసన బహుకాల ముండును. కొన్ని బొట్లు మీ చేరుమాలుమీద వేసి చూడుడు. మీ చుట్టును అద్భుతమైన పరిమళ మీనుచుండును.

వెల ¼ ఔన్సు రు. 1-4-0. 1 డ్రాము సైజు 0-12-0 అణాలు.

వి. పి. ఛార్జీ ప్రత్యేకము.

పోస్టేజీనిమిత్తం రెండుఅణాల స్టాంపులను పంపి శాంపిలును ఉచితముగా పొందుడు.



ఆసియాలో ప్రధాన సబ్బులు

## కామినియా టాయిలెట్ సబ్బులు

వాడుకలో పోడిమి.

ధరలో పోడిమి.

పరిమళ మానందదాయకము.

రకము అసమానము.

నానావిధ పరిమళములందును దొరకును.

కామినియా ట్రాన్సుపరెంటు గ్లిసరిన్ సబ్బు.

కామినియా లవండరు సబ్బు.

కామినియా చందన సబ్బు.

కామినియా వైట్ రోజ్ సబ్బు.

దిల్ బహార్ సబ్బు.

ఈ సబ్బులు మీకు సంపూర్ణసంతృప్తి నొసగగలవు.3 బిళ్లలుగలపెట్టె 1-కి 0-15-0. వి. పి. ఛార్జీలు ప్రత్యేకము.

మీకు సమీపములోగల దుకాణములో అడిగండి లేక మాకు వ్రాయండి.

కొనునపుడు ప్రతిపెట్టెమీదను కామినియా అను పేరుండుట గమనింపుడు.

ఈపేరు స్వచ్ఛతకును, గుణమునకు గ్యారంటీ నిలచును.

సోల్ ఏజెంట్లు:—ఆంగ్లో-ఇండియన్ డ్రగ్ అండు కెమికల్ కంపెనీ,

నెం. 285, జుమ్మామసీదు, తపాలాపెట్టె 2082, బొంబాయి.

# పురాతన వస్తుప్రదర్శనాలయము-హైదరాబాద్



౧. వస్తుప్రదర్శనాలయ ద్వారము





3. బీబీ-కా-ముఖ్‌బారా

(అమూల్యమగు ఛీనాసామగ్రి దొరకిన స్థలము)



౪. ఆయుధములు



# మలేరియా అనంతరముకలుగు బలహీనతను జయించుడు.

క్వినైను ఉపయోగించుటవలన తాత్కాలికముగ మలేరియాజ్వరము తగ్గినను, బలహీనముపోయి, నూతన బలము, ఆరోగ్యములు చేకూరుటకు రెండుమాసములు పట్టును.

శానటోజన్ ప్రతిదినము సేవించిన, బలహీనత తొలగి నూతనబలము చేకూరును. ఏలనన, శానటోజన్ యందు బలాభివృద్ధిచేయగలపదార్థములు విశేషించిగలవు.

“నేను శానటోజన్ యౌషధమును చాలమంది దుర్బలుల కుపయోగించియుంటిని. దాని ఫలితములు మిగుల సంతృప్తికరముగా నున్నవి.” అని గొప్పఆంగ్లేయ వైద్యులు కలకత్తానుండి వ్రాసియున్నారు.

కాబట్టి, శానటోజన్ యుండగా, మీ రేల దీర్ఘకాలము బలహీనులుగ నుండి బాధల ననుభవింపవలెను నేటినుండియే, శానటోజన్ వాడుటకు ప్రారంభింపుడు.

# SANATOGEN

సరియైన టానిక్—ఆహారము. (1)

అన్ని మందులషాపులలోను దుకాణములందును దొరకును.

శానటోజన్ తయారుచేయునపుడుగాని ప్యాకింగ్ సమయమందుగాని చేతితో తాకబడలేదు.

# రాజమోహన హేరాయిలు



శ్రేష్ఠమయిన సువాసనగల తల నూనె. మెదడుకు చల్లదనమును గలి కలిగించి వెంట్రుకలను అభివృద్ధి చేయుటలో అత్యుత్తమ మయినది.

తలపోటు, మాడుపోటు, శిరోవేడిమి, చుండు మొదలగువాటిని పోగొట్టి కన్నులకు చలవ నొసంగి వెంట్రుకలను మృదువుపరచి, నల్లగా పెంచుటలో అత్యుత్తమ మయినది.

స్త్రీలకు ఆనందమును కలుగ జేయును.

సీసా 1-కి రు. 1-0-0 3 సీసాలు రు. 2-10-0

పోస్టేజి ప్రత్యేకము.

## పి. శి. ఏ. అండు కంపెని,

ఆయుర్వేదసమాజం,

పెరిదేపి, నెల్లూరుజిల్లా.

## కామామృతము

ఆయుర్వేదశాస్త్రి, అష్టావధాని,

కందుకూరి వేంకటసుబ్బారావు,

ఎం. డి. ఎ. గారి

స్వదేశమునందు, అనేకవిదేశములయందుఁ బ్రఖ్యాతిఁజెందిన యౌషధము. రాత్రిపూట యొకమాత్రపుచ్చుకొనిన ఎంతనిస్సారమైన శుక్రమైనను వెంటనే సంసారసౌఖ్యము నీయఁగలదు. 5 దినములలో మూత్రములోఁ గలిసిగాని ముందువెనుకలఁగాని నిద్రలోఁగాని పోయెడి వీర్యమును దృఢముగా నిలిపివేయును. మధ్యవపుంసకులు, నరముల బలహీనముగలవారు ఈ మందునే పైకి పూతగాఁగూడ నుపయోగించిన మిక్కిలి శక్తివంతులు కాఁగలరు. వెంటనే పరీక్షింపుఁడు. ఉత్తరములు రహస్యముగా నుంపఁబడును. మావద్ద మదరాసు గవర్నమెంటువారిచే నిర్ణీతమైన ఆయుర్వేదౌషధములు గూడ పెక్కులు గలవు. యోగ్యతాపత్రములు అనేకములు కావలసినవారు వ్రాయుఁడు.

20 మాత్రల కామామృతము సీసా 1-కి రూ. 2-0-0.

అమృతాశ్రమము, నెం. 2, ఏలూరు, పశ్చిమ గోదావరి.

## చిరకాలమునుండి బాధించుచున్న మూత్రవ్యాధులకును శగ (గనేరియా) వ్యాధికిని క్రొత్తగా కనిపెట్టబడిన దివ్యౌషధము.




# గనోకిల్లర్ (రిజిష్టర్డు)

ఈయౌషధము శ్రేష్ఠతమము. ఇంగ్లీషు మందులను దేశీయములగు ఔషధములను పుచ్చుకొనినను గుణము కలుగనియెడలను, యింజక్షనులవలనను వాక్సినులవలననుగూడ లాభము లేకపోయినయెడలను కడపటి ప్రయత్నముగా మా గనోకిల్లరునుగూడ పుచ్చుకొనిచూడుడు. పెక్కుయేండ్లనుండియున్నను లేక క్రొత్తగా కలిగినను ఏరకము శగసంకటమైనను మరెట్టి మూత్రవ్యాధులనైనను స్త్రీలకైనను పురుషులకైనను గనోకిల్లరు తప్పక కుదుర్చును. మూత్రము ధారాళముగా వెడలును. మూత్రముపోవుచున్నపుడు కలుగుమంట తగ్గిపోవును. మూత్రనాళము నందలి వాపు తీసిపోవును. శగవ్యాధి (గనోకోకసు) వలన మూత్రము బొట్లుగా పడుట, మెహరోగమువలన మూత్రద్వారమునుండిపోవు తెలుపు, యూరెత్రిటిసు, ప్రోస్టాటిటిసు, సిస్టిటిసు, లుకోరియా, మున్నగువ్యాధులన్నియును స్త్రీలకును పురుషులకునుగూడ గనోకిల్లరువలన కుదురును. వీర్యము (సెమను) పోవుట, స్త్రీలు గర్భవతులుగా నున్నపుడు కలుగు మూత్రవ్యాధులు మున్నగునవిగూడ దీనివలన కుదురును. 50 మాత్రలుగల సీసా ఖరీదు రు. 3-0-0 వీ. పీ. చార్జీ ప్రత్యేకము. ఒక్కసారి 3 సీసాలు తెప్పించుకొనిన వీ. పీ. చార్జీ మేమే భరించెదము.

అడ్రసు:—డాక్టర్ డీ. యన్. జస్సాని, 137 కికావీధి, గులాల్‌వాడి, బొంబాయి 4.

Tel. Add. "GONOKILLER" Dr. D. N. JASANI, 137 Kika Street, Gulalvadi, Bomday, 4.

మద్రాసు సిటీ ఏజెంట్లు దాదా అండు కంపెనీ, 52, నైనియప్పనాయకవీధి, మదరాసు.

---

ఆశ్చర్యకర ! ఫల మధికము !! పూర్తి తృప్తి!!!

100 కి 100 గురు సంతృప్తిచెందియున్నారు

# లోకామయహర కస్తూరి మాత్రలు




పిల్లలు మొదలు ముసలివారివరకు అందరి మందము, మలబద్ధము, పడిసెము, దగ్గు, ఉబ్బసము, శీతలముచే కాళ్లులాగుట, కడుపుబ్బరము, కడుపునొప్పి, పక్కలయందునొప్పి, ఆహారజీర్ణకాలమున కలుగు తలనొప్పి, చలిజ్వరము, జ్వరము, ప్లేగు, ఇన్‌ఫ్లూయంజా ఇంకను అనేకవ్యాధులను గుణపరచును. స్త్రీలు ప్రసవించిననాడు, స్నానమునాడు (కస్తూరికి బదులుగా) ఈ మాత్రలు 4-5 ను, 2-3 తమలపాకులలో నమలి మ్రింగవలెను. సాంక్రామికరోగులతో నుండవలసినవారు, దినము 1-2 మాత్రలను సేవించిన ఆరోగ్యదృఢాంగు లగుదురు. ఈమాత్రలసీసాతోగల అనుపానపత్రమును చూడుడు. 300 మాత్రలు గల సీసా 1 కి 4 అణాలచొప్పున ప్రతిషాపులోపలను దొరకును. పోస్టుమూలకముగా 6 సీసాలు రు. 1-8-0, 12 సీసాలు రు. 2-12-0, 25 సీసాలు రు. 5-3-0.

సారస్వతాసవం:—మెదడుకు బలమును కలిగించి, జ్ఞాపకశక్తిని వృద్ధిచేయును గావున, మెదడు దుర్బలమువలన గలిగియుండు సమస్తవ్యాధులను పరిహరించి నరములకు మంచిత్రాణను, రక్తవృద్ధిని కలుగజేయును. సంగీతపాఠకుల కంఠస్వరమునకు మృదుమధురత్వము నిచ్చును. పాడను పాడను ఉత్సాహము నింపును. బలహీనులైన స్త్రీలకు నెత్తినడుము (నెత్తినోరు చాల మెత్తగా వుండుటవలన) మాట్లాడను నడువనుకాని పిల్లలకు సంజీవివంటిది 6 ఔన్సుల సీసా 1-కి రు. 1-0-0. పోస్టుఖర్చులు ప్రత్యేకము

శ్రీ సీతారాఘవ వైద్యశాల, మైసూరు.

# తెలుఁగు లిపియుఁ దత్సంస్కరణమును

జనమంచి శేషాద్రిశర్మగారు

తెలుఁగు లిపి సంస్కరణమునుగుఱించియు, ముద్రాక్షరవిలేఖనమును గుఱించియు మహారాజశ్రీ యం. యస్. వెంకయ్యగారు భారతిపత్రికయందుఁ బ్రకటించిన వ్యాసమును సాంతముగాఁ జదివి యందలి విషయములను బరిశీలించి చూచితిని. సంయుక్తాక్షరలేఖనమునుగుఱించి సప్రపంచముగా వారు నిరూపించిన యుదాహరణములును విమర్శనమును నెల్లరును గమనింపఁదగియున్నవి. ముద్రణమునందలి సౌలభ్యమును గోరి సంయుక్తాక్షర లేఖనపద్ధతిని దీసివైచినచో, భాషకే మొదట స్వస్తి చెప్పవలసివచ్చును. ఈ సంయుక్తాక్షర పద్ధతిని మనపూర్వులు చక్కఁగా నాలోచనసల్పి మన భాషాస్వభావమున కనుగుణముగా నుండునట్టు లేర్పఱిచిరని వారనినది యెల్లరును నంగీకరింపఁదగినవిషయము. ఈపద్ధతిని మాని ద్రావిడాంగ్లలిపులయందలి పద్ధతి ననుసరించి వ్రాయఁ బూనుదురేని, లేఖనమునందును, బఠనమునందును, బెక్కుచిక్కు లేర్పడి భాషకు గొప్పనష్ట మేర్పడును. ఇఁక వర్ణమాలయందలి యక్షరములలోఁ గొన్నిటిని దీసివేయవలయు ననియు, నాంగ్లభాషయందలి నూతనాక్షరములను గల్పించి మనవర్ణమాలలోఁ జేర్పవలయు ననియుఁ దలంచుటుచితము గాదు. ఈవిషయమై శ్రీ వెంకయ్యగారు చక్కనియుదాహరణములతో విమర్శించియున్నారు.

సంస్కృతశబ్దములు ప్రాకృతభాషలోనికి వచ్చునపుడును, సంస్కృతప్రాకృతశబ్దములచ్చ తెనుంగులోనికి వచ్చునపుడును, ప్రాకృతాచ్చాంధ్రవర్ణమాలలకు లొంగియుండునట్టులే విరూపములఁ జెందుచున్నవి. ఉదాహరణము: లక్ష్మీః = లచ్చి, విష్ణుః = వెణ్ణు, పక్షీ=పక్కి, అప్సరాః = అచ్చర, ఇత్యాదులు.

కావున వర్ణమాల నెప్పటియట్టులే యుంచి యన్యభాషాశబ్దముల మన లిపి కనుగుణముగ మార్చి ప్రయోగించుటే యుత్తమమైన పద్ధతి.

ఇట్టులే యితర విషయములను విమర్శించుచు సచిత్రముగా లిపిసంస్కారమును గావించియున్నారు.

ఇట్లు వీరిచే సంస్కరింపఁబడిన యాంధ్ర వర్ణమాల ముద్రణమునందుఁ బెక్కులాభములను గల్గించుచున్నది. ముద్రాక్షరముల సంఖ్యను వీరు తగ్గించినందునఁ బెక్కుతెలుంగులగు ముద్రాక్షరములను నిర్మించుటకును, దన్మూలమున నాంధ్రమున ముద్రణకళ యభివృద్ధిఁ గాంచుటకును, ముద్రాక్షరవిలేఖన యంత్రనిర్మాణమునకును జక్కని మార్గ

మేర్పడినది. వీరు ప్రదర్శించిన తలకట్టు, దీర్ఘము, ఒకార, ఓకారాదులు ప్రాచీనశాసనములం దున్నవియే. ప్రస్తుతము చేతివ్రాఁతయందును బెక్కు రీతీరున వ్రాయుచున్నారు గాన నీలిపిని వ్రాయుట గాని ముద్రింపఁబడిన దానిని జదువుటగాని యొక కష్టమైన పని గాదు. ఇట్లు ముద్రణమునకును, ముద్రాక్షర విలేఖనమునకును ననువుపడునట్లు గావింపఁబడిన యీలిపిసంస్కరణమును విమర్శించి చూడఁగా, శ్రీ యం. యస్. వెంకయ్యగారు తెలుఁగుముద్రణవిషయమునందుఁ జిరకాలానుభవము గలవా రనియుఁ, బ్రాచీనశాసనములను బరిశీలించియున్నా రనియుఁ దెలియుచున్నది. ఇట్లు వీరు ప్రస్తుతాంధ్రవర్ణముల కెట్టిలోటును వాటిల్లకుండులాగున సంస్కరణము గావించినది చూడఁగా నెంతయు సంతసము గల్గుచున్నది. ముద్రణవిధానమునం దితరలిపులకంటె మన తెలుఁగే చాల వెనుకఁబడియుండుట యెల్ల రెఱింగిన విషయమే గాన, భాషాభిమానులును, ముద్రాశాలాధ్యక్షులు నీవిషయమున బద్ధాదరులై వెంకయ్యగారి యుద్యమమునకుఁ దోడ్పడి తెలుఁగు ముద్రణవిధానమును బెంపొందఁజేయుట యవశ్యకర్తవ్య మైయున్నది. భాషాభిమానులు చక్కఁగాఁ దోడ్పడుదురుగాక.

---

## నక్షత్రము

సన్నిధానము సూర్యనారాయణశాస్త్రిగారు

ఎన్ని జన్మంబులం దాఁటి యిట్టిదశకు
వచ్చినావో? యిప్పటికిఁ దెల్పంగఁగలవె?
ఎట్టితప మొనరించితో? యెఱుకపఱతె?
తారకంబ! యీదృశదివ్యతనువుఁ దాల్ప.
యుగయుగంబులనుండియు వ్యోమమందె
కానఁబడెదు; ప్రయాణంబుఁ గట్టివైచి
గమ్యముం బొంద నెట్టిసంకటము లొదవె?
లక్ష్య మింకెంతదూలఁ జెలంగు నీకు?
పగట రవికాంత కాషాయపటముఁ గప్పి
మొగముపైనిఁ దపంబు సల్పుదువుగాక
జలదయువతుల కౌఁగిలింతలకు మఱగి
భ్రష్టుఁ డగుదువు రేల? భద్రంబుసుమ్ము.

---

# మహాభారతము ౪

కేతవరపు వేంకటశాస్త్రిగారు

## ధృతరాష్ట్రాదుల జననము

శాంతనునివలన సత్యవతికిఁ జిత్రాంగద విచిత్ర వీర్యులను నిరువురు పుత్త్రులు జన్మించిరి. తండ్రి యనంతరము చిత్రాంగదుఁడు కౌరవ రాజ్యపరిపాలకుఁ డయ్యెను. కాని యతఁడు చిత్రాంగదుఁ డను గంధర్వునితోఁ గురుక్షేత్రమున ద్వంద్వయుద్ధ మాచరించి కాలధర్మ మందెను. అందుచే విచిత్రవీర్యుఁడు తల్లి సత్యవతి యనుమతిని బడసి కౌరవసింహాసన మెక్కి రాజ్యమును ధర్మయుక్తముగాఁ బాలింపఁదొడంగెను.

ఆసమయముననే భీష్ముఁడు కాశిరాజుకుమారికల నంబికాంబాలిక లనువారలను స్వయంవరమున గెలిచి తెచ్చి తమ్మునకు వివాహ మొనర్చెను.

" అంబికాంబాలికే భర్యే ప్రాదా త్ఫ్రాత్రే యవీయసే,
భీష్మో విచిత్రవీర్యాయ విధిదృష్టేన కర్మణా.
తయోః పాణీ గృహీత్వాతు రూపయౌవన దర్పితః,
విచిత్రవీర్యో ధర్మాత్మా కామాత్మా సమపద్యత.
తేచాపి బృహతీ శ్యామే నీలకుంచితమూర్ధజే,
రక్తతుంగ నఖోపేతే పీనశ్రోణిపయోధరే.
ఆత్మనః ప్రతిరూపోసౌ లబ్ధః పతి రితి స్థితే,
విచిత్రవీర్యం కల్యాణ్యౌ పూజయామాసతు శ్శుభే.
సచాశ్విరూప సదృశో, దేవతుల్య పరాక్రమః,
సర్వాసామేవ నారీణాం చిత్తప్రమథనో రహః.
తాభ్యాంసహ సమా స్సప్త విహరన్ పృథివీపతిః,
విచిత్రవీర్య స్తరుణో యక్ష్మణా సమగృహ్యత.
సుహృదాం యతమానానా మాప్తైస్సహ చికిత్సకైః,
జగా మాస్తమి వాదిత్యః కౌరవ్యోయమసాదనమ్ ".

ఆది. సంభవపర్వ, ౧౦౨ అధ్యాయము.

విచిత్రవీర్యుఁడు తరుణుఁడై యుండియు క్షయ రోగగ్రస్తుఁడై కాలధర్మ మొందెను. ఇతని కిరువురు భార్య లున్నను సంతానము లేదు. కురువంశ మితనితో నంతరించెను. సత్యవతికోర్కు లన్నియు విఫలములయ్యెను. అందుచే సత్యవతి శాంతనువంశమును వర్ధిలఁజేయుట యెట్లని భీష్మాదులతో యోజించెను. ఆకాలమున దేవరన్యాయము నవలంబించి సంతానమును గని వంశమును నిలువఁబెట్టు నాచారము సంఘమం దంతటను గలదు.

" వేత్థ ధర్మం సత్యవతి పరం చాపర మేవచ,
తథా తవ మహాప్రాజ్ఞే ధర్మే ప్రణిహితా మతిః.
తస్మా దహం త్వన్నియోగా ద్ధర్మ ముద్దిశ్య కారణమ్,
ఈప్సితం తే కరిష్యామి దృష్టం హ్యేత త్సనాతనమ్."

" సకలధర్మముల నెఱిఁగిన నీమతి కేవలము ధర్మమందే వర్తించుచున్నది. కావున నీయనుమతి నవలంబించి ధర్మమునే ముఖ్యముగా నెంచి నీకోర్కి ననుసరించి విచిత్రవీర్య క్షేత్రమున సంతానమును గాంతును. ఇట్లు చేయుట సనాతనధర్మమై యున్నది " అని వ్యాసుఁడు సత్యవతితోఁ జెప్పినమాటలను బరిశీలింప నాకాలమున నిది సంఘమందంతట నాచారమై యున్నట్లు స్పష్టము. ఇప్పటివారి కది తప్పుగాఁ గానవచ్చినను, అప్పటిసంఘమునఁ బ్రజలు తప్పుగా భావింపలేదు. కావుననే సత్యవతి యందులకు యత్నించుటయు, ధర్మజ్ఞుఁడయిన వ్యాసుఁ డంగీకరించుటయు సంభవించినది. అది దురాచారమే యైనచో నెంత బలవంతులైనను దానిని నిర్వహింపలేరు. ప్రజాభిప్రాయమునకు విరుద్ధముగా నడువను లేరు. ధర్మసంతానమును గనుట సనాతన ధర్మమని వ్యాసుఁడు చెప్పను లేఁడు.

ఇది దుర్నీతి కాదా యందురేని కాదు. నీతి గాని దుర్నీతి గాని సంఘమంతయు నంగీకరించినచో నది కేవలము నీతియే యగును. యువతీవివాహము కాని విధవా వివాహము గాని సంఘమంతయు నంగీకరించి చేసినచో పైసంఘములవారి కది హేయముగాఁ దోఁచినను నీతియుక్తమే యగును. ప్రస్తుతకాలమున నాగరకశ్రేష్ఠులని

యొంచఁబడు పాశ్చాత్యులు తరుణవయస్కులగు నితరుల భార్యలతోఁ గలిసి నృత్యములు సల్పుచున్నారు. అట్టిది మనదేశమున ననాగరకులగు కొండజాతులలో మాత్రమే కానవచ్చుచున్నది. మనదృష్టి కది నీతిబాహ్యమై యున్నను నారిసంఘమున కట్లు కాదు. అట్లే సంఘ మంతయు సమ్మతించిన దేవరన్యాయము మనవారి దృష్టికి నీతిబాహ్యము కాదు.

ధర్మసంతానమున వంశోద్ధరణము నీతియుక్త మైనను గాకపోయినను నీసట్టమునఁ గొంతభాగము ప్రక్షిప్తమని చెప్పక తీఱదు. పూర్వాపరవిరుద్ధములు ససందిగ్ధములును జెక్కు లున్నవి.

దేవరన్యాయ మనునది కామాభిలాషతోఁ గాక, యింద్రియలోలత్వమునఁ గాక కేవలము ధర్మబుద్ధితో సంతానప్రాప్తివఱకును సంగమించి యనంతర మెట్టి సంబంధమును లేకుండ వర్తించుట. సంతానప్రాప్తి పిమ్మట సాంగత్యమును వ్యజింపవలెను. మఱియు నిది యాపద్ధర్మముగాఁ జెప్పఁబడినది. ఈ విషయము లాలోచింప నెన్ని నిబంధనలు గలవో స్పష్టమగుచున్నది. కేవలము ధర్మబుద్ధి గలవారు మాత్రమే దేవరన్యాయ మవలంబింప నర్హులు. కామేచ్ఛాపరులకుఁ గాదు. సంతానప్రాప్తిపిమ్మట మఱి సంగమింపరాదు. ఇదియు నాపద్ధర్మ మైనప్పుడే యవలంబింపవలెను.

సత్యవతికుమారులు చిత్రాంగద విచిత్రవీర్యులు మరణించుటచే భారతవంశము విచ్ఛిత్తి చెందవలసిన సమయము లభించినది. వంశోద్ధరణమునకై సత్యవతి ధర్మజ్ఞుఁడగు వ్యాసుని రప్పించి దేవరన్యాయమున సంతానమును గని కౌరవవంశమును నిలుపుమని కోరినది. సనాతనధర్మయుతమగు నప్పనికి వ్యాసుఁడు సమ్మతించెను. ఇంతవఱకు సరిగానే యున్నది. తరువాతివిషయ మాలోచింపుఁడు.

సత్యవతి తన పెద్దకోడలగు నంబికను సంతానార్థము వ్యాసునిసన్నిధికిఁ బంపినది. వ్యాసుఁ డామెతో సంగమించి వెడలిపోవునపుడు సత్యవతితో —

"నాగాయుతసమప్రాణో విద్వాన్ రాజర్షి సత్తమః,
మహాభాగో మహావీర్యో మహాబుద్ధి ర్భవిష్యతి.
తస్య చాపి శతం పుత్రా భవిష్యంతి మహాత్మనః,
కింతు మాతుః స వైగుణ్యా దంధ ఏవ భవిష్యతి."

పదివేలయేనుఁగుల బలము గల్గి యదృష్టవంతుఁడు బుద్ధిమంతుఁడు నగుపుత్త్రుఁ డంబికకు జనించును. కాని యతఁడు మాతృదోషమువలన నంధుఁడగునని వ్యాసుఁడు చెప్పెను. ఇట్లు సంతాన ముత్పన్న మగుటవలన నాపద్ధర్మము తొలఁగినది. అతనికి నూఱుగురు పుత్త్రులు గల్గుదురని చెప్పుటచే భారతవంశము నిలిచినది. సత్యవతి

"స త్వం వ్యపేక్షయా భ్రాతు
స్సంతానాయ కులస్య చ"

అని కోరినది. ధృతరాష్ట్రజన్మమువలన విచిత్రవీర్య కులము విస్తరింప నున్నది. సత్యవతి కోర్కె నెఱవేఱినది. ఇట్లు కృతార్థురాలైన సత్యవతి.

"జ్ఞాతివంశస్య గోప్తారం పితౄణాం వంశవర్ధనమ్,
ద్వితీయం కురువంశస్య రాజానం దాతు మర్హసి."

అని పల్కుట ధర్మేతరముగా నున్నది. ధృతరాష్ట్రుఁడు వంశకరుఁ డగుచుండఁగా మఱియొక కుమారు నిమ్మని కోరుట సత్యవతికి యుక్తముగా లేదు. ధృతరాష్ట్రుఁడు జాత్యంధుఁ డైనను వంశకరుఁడు కాలేకపోలేదు. మఱియు

"కింతు మాతు స్స వైగుణ్యా దంధ ఏవ భవిష్యతి"

యని వ్యాసుడు చెప్పినది లోకవిరుద్ధముగా నున్నది. తల్లివైగుణ్యమువలనఁ గొడుకు గ్రుడ్డివాఁ డయ్యెను. వైగుణ్య మేమిటి? తన్ను సమీపించినమునిని

"భయా త్కాశిసుతా తంతు నాశక్నో దభివీక్షితుమ్."

అంబిక భయమువలన నతని చూడఁ జాలకపోవుటయే వైగుణ్య మని చెప్పవలెను. అనఁగా సంగమకాలమున నేత్రనిమీలనమని ఫలితార్థము. సంగమకాలమున కన్నులు మూసినంతమాత్రమున కొడుకు గ్రుడ్డివాఁ డగునా? అట్లయిన వరూథిని మాయాప్రవరునితో సంగమించినపుడు నేత్రనిమీలన మొనర్చినది. ఆమెకొడుకు స్వరోచిషుఁ

పెంగుఁడు గాలేదు. ఈగ్రుడ్డితనము పూర్వజన్మకర్మజనిత పాపఫలముకాని మాతృదోషముకాదు. ధృతరాష్ట్రజన్మముతో సత్యవతికోర్కి సిద్ధించి యుండఁగా ధర్మజ్ఞురాలయినయామె ద్వితీయపుత్త్రునికోరుటయు, సనాతనధర్మవిదుఁడగు వ్యాసుఁ డంగీకరించుటయు సంభవింపదు. ధర్మజ్ఞులైనవా రట్టియధర్మకృత్యము నంగీకరింతురా? సంతానప్రాప్తిపిమ్మట దేవరన్యాయమునకు విషయమే లేదు. అంధుఁడగు కొడుకు రాజ్యానర్హుఁ డయ్యెను గాన యాపద్ధర్మము తొలఁగిపోలేదని చెప్ప వీలు లేదు. సత్యవతి వంశోద్ధరణమునే యపేక్షించినది కాని రాజ్యపాలనము కాదు. ధృతరాష్ట్రుఁ డంధుఁడైనను భీష్మాదుల సాయమున రాజ్యపాలన మొనర్పఁగలఁడు. పాండురాజున్నను, ధృతరాష్ట్రుఁడు తనవారిసాయమునఁ బరిపాలన మొనర్పలేదా? వంశకరుఁడై రాజ్యపాలనము చేయు ధృతరాష్ట్రుఁ డుండఁగా,

"జ్ఞాతి వంశస్య గోప్తారం
పితౄణాం వంశవర్ధనమ్,
ద్వితీయం కురువంశస్య రాజా
నం దాతు మర్హసి"

అనివ్యాసునడుగుటయు, నంగులకతఁ డంగీకరించుటయు నర్హముగా లేదు. అట్టిచో నిఁక పాండురాజు జన్మమునకవకాశమే లేదు. ఇట్టియనుపపత్తి గల్గుచున్నది. కావుననే యీ ఘట్టమునఁ బ్రక్షిప్తభాగము గల దంటిని.

మఱియు సత్యవతి యనుమతిచొప్పున వ్యాసుఁ డంబాలికతో సంగమించి వెడలిపోవుచుఁ దన్నడిగిన సత్యవతితో

"శశంస స పున ర్మాత్రే తస్య బాలస్య పాండుతామ్"

అని చెప్పెను. అది విని సత్యవతి

"తం మాతా పునరే వాన్యం ఏకం పుత్త్రి మయాచత."

మఱియొకపుత్త్రుని కోరినది. ఆలోచింప నిది కేవలము ధర్మవిరుద్ధము. బాలుని తెల్లఁదనమును విని సత్యవతి మఱియొకపుత్త్రుని గోరుట ధర్మ్యము కాదు. ధర్మజ్ఞులగు సత్యవతీవ్యాసు లిట్లు నియమము లేకుండ వర్తింపరు. వారి ధర్మనిష్ఠతను దొలఁగించుటకె యెవ్వరో యిది కల్పించియుందురు. ఇట్లుండ విదురునిజన్మమునకు మఱింతయవకాశము లేదు. కాని విదురునిజన్మమునకు వ్యాసుఁడు కారణమని చెప్పుటకే యిది యంతయుఁ గల్పింపవలసి వచ్చినది. ఏమన,—

విదురుఁడు భారతమందుఁ గల పురుషులందఱిలోను మిక్కిలి యుత్తముఁడు, నీతిమంతుఁడు, రాజనీతిజ్ఞుఁడు, సకలసద్గుణవంతుఁడు, శమదమాదిసంపన్నుఁడు, విజ్ఞాననిధి. అట్టియుత్తముఁడు బ్రాహ్మణులలోఁ గూడ నుండఁ డనుట యతిశయోక్తి గాదు. దైవభక్తియం దతఁ డెంతటి వాఁడో శ్రీకృష్ణుఁడు హస్తినాపురమునఁ గల మహామహుల నెల్లరను విడిచి యతనియింట విందు గుడుచుటవలననే స్పష్టమగుచున్నది. ఉత్తమగుణములకును, కులమునకును సంబంధము లేదు. అది యోజింపక పూర్వము బ్రాహ్మణసంఘము శూద్రుఁడైన విదురుని గుణోత్తమత్వమును సహింపలేక విదురుఁడు వ్యాసవీర్యసముద్భవుఁడు, బ్రాహ్మణవీర్యసంభవుఁడు గనుకనే యంతటివాఁ డైనాఁ డని చెప్పుటకీ ఘట్టమును గల్పించియుండును. ఉత్తమగుణములు గల్గుటకు కులమే ముఖ్యమని వారితలంపు. కాని యది సరికాదు. ఆవిషయములో నవ్యాప్తియు, నతివ్యాప్తియుఁ గూడఁ గలవు. విదురుని కిట్లు బ్రాహ్మణసంబంధము కల్పించి తమ కోర్కి నెఱవేర్చుటకే బ్రాహ్మణులు విచిత్రవీర్యమరణము, ధర్మసంతానప్రయత్నము, మొదలగునవి కల్పించి యుందురు. యథార్థమగుకథ యిట్లుండియుండును.

విచిత్రవీర్యుఁ డేడుసంవత్సరములకాలము కళత్రద్వయముతో సుఖించియున్నాఁడు. అపుడు భార్యలయం దొకొక్కకుమారుని గనియుండును. పూర్వజన్మకర్మవశమున ధృతరాష్ట్రుఁడు జాత్యంధుఁ డయ్యెను. అంబాలికయందుఁ గల్గినబాలుఁడు తెల్లనివాఁ డగుటచే పాండుఁడని పేరుపెట్టిరి. విదురుఁ డుత్తమగుణుఁడై శూద్రవంశమున జన్మించి ధృతరాష్ట్రపాండురాజులను సేవించుచుఁ దనసత్ప్రవర్తనము చేత వారి యనుగ్రహమునకుఁ బాత్రుఁడై రాజగృహమందు వారితో సరిగాఁ

బూజింపఁబడుచుండెను. ఇతఁడు త్తమగుణవంతుఁడగుటచేతనే ధృతరాష్ట్రి పాండురాజు లతనిని సోదర ప్రేమతో మన్నించియుందురు. అందుచే వారు ముగ్గురు సోదరులవలె వర్తించియుందురు. అంతియ కాని వారి కందఱకును వ్యాసుఁడు తండ్రి యగుటచేఁ గాదు. జాత్యంధుఁడగుటచే ధృతరాష్ట్రుఁడు రాజ్యానర్హుఁడగుటచేఁ బాండురాజు కురురాజ్యమున కభిషిక్తుఁడైయుండును. అయినను బాండుఁడు నిష్కల్మష భ్రాతృప్రేమ గలవాఁడగుటచే సోదరుని సింహాసనమునఁ గూర్చుండఁబెట్టి యతనిపేరిట రాజ్యమును బాలింప నారంభించెను.

దురహంకారులగు బ్రాహ్మణు లీసృష్టమునందుఁ గొన్ని మార్పులు చేయ నిశ్చయించి యశ్వరూపుఁడును, దేవతుల్యపరాక్రముఁడగు విచిత్రవీర్యునిక్షయరోగముచేఁ జంపించి పైకథ యంతయుఁ గల్పించియుందురు. కాని పూర్వపు మహారాజులు యుద్ధమరణమో, వానప్రస్థమున యోగమువలన మరణమో యందుట కలగు. కాని రోగగ్రస్తులై మరణించుట కలదా ? అది యటుండనిండు. వ్యాసునివంటి మహాకవి యీ ఘట్టము వ్రాసియుండఁడు. వంశాభివృద్ధి కొకపుత్త్రుఁడు చాలియుండఁగా ననియతముగాఁ బుత్త్రులను గోరుట ధర్మము కాదు.

ధర్మసంతానపద్ధతినే భారత వంశము నిల్చినదని చెప్పినచోఁ బాండునిజన్మమున కవకాశము లేదు. ఏమన ధృతరాష్ట్రి జన్మముతో నాపద్ధర్మము తొలఁగినది. ధృతరాష్ట్రుఁ డుండఁగా మఱియొక పుత్త్రునిఁ గోర నవకాశమే లేదు. పాండురాజే లేకపోవలసివచ్చును. అందుచే నీపద్ధతి కల్పిత మనక తీఱదు.

పాండురాజు పుట్టుకకే యవకాశము లేనప్పుడు విదురునిజన్మ మెట్లు సంభవించును ? ఈయంశము లన్నియు నాలోచింపక, దేవరన్యాయమును పరిశీలింపక, ధర్మసంతానక్రమ మెఱుంగక, యిష్టము వచ్చినట్లు వ్రాసినారు. విదురుని జన్మమందుమాత్రమే బద్ధ-ఏక దృష్టులగువారికిఁ దమ కల్పనయందలి యసందర్భము లవగతము కాలేదు.

ధర్మసంతానము సదాచారమని యంగీకరించినను సత్యవతి ధర్మహీనయై ధర్మవిరుద్ధముగా సంతానములను గోరియుండదు. వంశోద్ధరణమునకు సంతానము పడయవలసియున్నది. గ్రుడ్డివాఁడని మఱొకపుత్త్రుఁడు, తెల్లనివాఁడని మఱియొకపుత్త్రుఁడు కావలయునని యనియతముగా సత్యవతివంటి ధర్మజ్ఞురాలు కోరదు. మఱియు ధర్మజ్ఞుఁడగు వ్యాసుఁడు తల్లి కోరినంతమాత్రమున నధర్మము నవలంబించునా ? మహాతపస్వి యగునతఁ డింద్రియలోలుఁడై తల్లి నియోగించిన ప్రతిస్త్రీతోను సంభోగించునా ? మూఁడవసారి యంబిక తనదాసిని పంపినపుడు వ్యాసుఁడు దానితోఁ గలియుటకు ననుమానమైనను బడవలదా ! కురువంశము నుద్ధరింప యత్నించిన యతఁడు దాసీసంగమము నెట్లంగీకరింపఁగలఁడు ? దానికిఁ బుత్త్రుఁడు పుట్టినను నతఁడు కౌరవరాజ్యపాలకుఁడగునని తలంచునంతటి యవివేకియా ? కురువంశమునకుఁ బనికిరానపుడు తెలిసియు దాసీసంగము చేయుట ఘోరపాపము కదా ? మఱియుఁ దల్లియుద్దేశమునకు విరుద్ధముగా వర్తించునా? ఈసంఘటన లన్నియు ముడిపెట్టి చూడఁగా వ్యాసునివలన విదురుఁ డుత్పన్నుఁడైనాఁడని చెప్పుటకును, సత్యవతీవ్యాసు లధర్మపరులని తెలుపుటకు నిట్లు వ్రాసియుందురని నాతలంపు !

---

# జేబున్నీసా

జి. జాషువ గారు

౧

జీవితేశ్వర ! మనసుధాజీవితంబు - లంతరించెనె యొకకౌఁగిలింతలోన ?
నాథ ! మన వినూతనయౌవనముల కపుడె - వయసు నిండెనె యొక్కచుంబనము
[తోడ ?

౨

ఈసులతానుకూఁతు రొకతే సకలంబున మందభాగ్య ; య
య్యో సఖ ! గుండెలోఁ గడఁగుచున్నవి నీసపుఁగొండ లింక నా
శ్వాసము గల్గనేర్చునె ? ప్రశాంతి వహించిన నీసమాధితో
బాసయొనర్చి చెప్పెదను వద్దిక నాకు సుఖప్రసంగముల్.

౩

తొలఁగె న్నాతలపోఁత లన్నియును నీతోఁ, భస్మమై గంగలోఁ
గలసెన్ భావికుటుంబినీత్వము, మనఃకాంతా ! దురంతవ్యథా
జ్వాలనంబె శరణంబు నాకు నిఁక నీబందీ నిశాంతంబునన్,
బలి గావింతును ప్రాణపంచకము తప్తంబైన నీమూర్తికిన్.

౪

కవితాతూలికతోఁ లిఖించి, నిను శృంగారించి, పూజించి, మా
నవలోకంబున కప్పగింతును మనోనాథా ! వనక్షోణిలో
భవదీయంబగు మేను నాకొఱకునై, భస్మంబుఁ గావించుకొం
టివి, నే నీఋణ మెట్లు దీర్చుకొని, శాంతింతున్ ధరామండలిన్.

౫

మొగలు రాజన్యునిపగడాలమేడలో వసియింప దింక నీప్రణయలక్ష్మి
ఢిల్లీనృపాలుని మల్లెతోఁటలవంక పరికింప దింక నీవలపుచిలుక
పాదుషానగరిలోఁ బట్టుపాన్పులమీఁదఁ బవళింప దింక నీకవికుమారి
ఔరంగజేబుని యపరంజిగిన్నెలోఁ భుజియింప దింక నీముద్దులాఁడి
అక్బరాదిపితామహు లధివసించు - ప్రాంతగోరీలకడ నిన్నుఁ బాడుకొనుచుఁ
దిరుగుచున్నది, నీతరితీపులాఁడి - అగ్నిలో నిన్నుపాసించు త్యాగమూర్తి.

---

# ఊర్మిళా దేవి

శ్రీశ్రీశ్రీ రాజా విక్రమదేవవర్మ మహారాజులుంగారు

సీతారాముల పూతచరితములను వ్రాసి తమ జీవితములను సార్థకములుగాఁ జేసికొనినవారు పెక్కండ్రు గలరు. వారియందు మొదటివాఁడు వాల్మీకిమహర్షి. వారియందే యన నేల? లౌకికచ్ఛందస్సు నాశ్రయించి కవిత చెప్పినవారియందు నతఁడు మొదటివాఁడు. కనుకనే యతని నాదికవియనియు, నతఁడు రచించినరామాయణము నాదికావ్యమనియు నందురు. అతఁడు లౌకికచ్ఛందస్సులలో మనోహరము లగు పెక్కింటి నాశ్రయించి మృదుమధురపదములతోడను, చిత్తాకర్షకము లగు వర్ణనములతోడను రామాయణమును బాడెను. అంతే కాక, జనుల స్వభావ చిత్రణమునందును, చరిత్రసృష్టి యందును, పాత్రపోషణమునందును, ధర్మములను మృదువుగా నుపదేశించుటయందును దత్కవివరుని నేర్పు సాటిలేనిది.

తనకావ్యమునందలి పాత్రముల నుత్కృష్టాదర్శములుగాఁ జిత్రించి యతఁడు సమకాలికులవలనను, దరువాత జనించినవారివలనను మెప్పు నొంది తనశాశ్వతకీర్తిని నిజదేశమునందే కాక, జగమంతటను వ్యాపింపంజేయఁ గలిగెను. అతనికావ్యమునందలి కథానాయికానాయకులయిన సీతారాము లాదర్శ స్త్రీపురుషులుగా వర్ణింపంబడుటయే కాక, కథితసమస్తపాత్రములును మేలునకుఁ గాని కీడునకుఁ గాని యాదర్శరూపులు.

రామాయణపాఠకులెల్లరును సీతారామలక్ష్మణభరతశత్రుఘ్నాంజనేయాదుల మహోత్తమగుణగణములకెల్లను విముగ్ధులగుచు వారియెడ నతమస్తకు లగుదురు. అనేకశతాబ్దములనుండి దాసీభూతు లయియుండుటవలనఁ దను మనోబలములను గోలుపోయిన భారతీయులు మాత్రము వారు దేవత లనియు, వారిచర్యలు లోకోత్తరములనియు భావించి, పుణ్యార్జనముకొఱకే రామాయణ పఠన శ్రవణములను గావించుచుఁ దృప్తి నొందుదురు; కాని పొందఁదగు ఫలములను మాత్రము పొందలేకున్నవారు.

కథితపాత్రములను యథోచితముగా వర్ణించిన వాల్మీకిమహర్షి సాధ్వీశిరోమణి యయిన యూర్మిళాదేవి నుపేక్షించుట యత్యంతశోచనీయము. ఆయమ దేనియందును వినుతగుణగణ యయిన సీతాదేవికిఁ దీసిపోవునది గాదు. ఆమె జనకరాజనందన; దశరథేశ్వరునికోడలు; అద్వితీయవీరుఁడును భ్రాతృభక్తుఁడు నయిన లక్షణస్వామికి సహధర్మిణి; నవయావన; మఱి నూతనవధువు. ఆమెయక్కవనవాసక్లేశముకంటెఁ బతి విరహమె యధికతర బాధాకరమని తలంచి పతి నెడఁబాయఁ

జాలక యతనివెంట వెళ్ళఁగాఁ దాను బతి యానతి శిరమునఁ దాల్చి సకలోపభోగపరిపూర్ణమయిన రాజభవనమునందు సధవలయిన తోడికోడండ్రతోడ నివసించుచుఁ జతుర్దశాబ్దములు పతి విరహదుఃఖమును సహించియుండుట సామాన్యకార్యము గాదుగదా! ఆమె యింద్రియ సంయమమును, మనోదార్ఢ్యమును లోకోత్తరము లనక తప్పదు. అట్టి సాధ్వీలలామ యేకారణమువలననో వాల్మీకిమహర్షి దృష్టికి దూరమయినను, స్వభావవర్ణనప్రియుండయిన కాళిదాస మహాకవి దృష్టికిని, శ్రీకంఠపదలాంఛనుం డయిన భవభూతి దృష్టికిని, దక్కిన కవివరుల దృష్టులకును దట్టకుండుట మిక్కిలి విషాదకరవిషయమే.

ఆమె గుణములను గవివరులు కీర్తింపని హేతువువలన వానికి లోటు గలుగునా? అవి విజ్ఞుల హృదయములకుఁ దట్ట కుండునా? దైవజ్ఞులు దమ పంచాంగములందు గ్రహణమును వ్రాయ మఱచిన, నది గనఁబడకుండునా? నిష్పక్షపాతబుద్ధితోడ రామాయణమును జదువువారు సీతాదేవికంటె నూర్మిలాదేవి యధికతర యని యనక మానరు.

---

## స్వాగతము

కొమరవోలు వెంకటసుబ్బారావుగారు

విరిఁగొమ్మగద్దె కోపెలపేరఁటాలు మంగళగీతికా ప్రబంధములు సదువ,
నన గిన్నెలోనికింజల్కంపుఁబాకాల పెదవుల నిడి తేఁటిపిలుక మ్రోయఁ
గ్రొమ్మొయి ల్మేల్ముసుంగుఁ దెరల్చి శంపాచిరంటీలలామ యారతుల నెత్త
తొలకరిమేఘమాలలఁ దూఁగుదేవుండు పరమహర్షమునఁ జప్పట్లు చఱవ
మాధవుఁడు మోదమతి మధుమాసలక్ష్మి - స్మరప్రతాపాగ్ని సాక్షిగాఁ బరిణయంబు
నాడి యాంగీరసాఖ్యశతాంగ మెక్కి - వచ్చె కవివర! స్వాగతం బిచ్చికొమ్ము.

చిగురుకెంగేలఁ గుంచియ వట్టి మోసాలఁ గసవూడ్చు మలయజశ్వాసను గృహిణి,
పుట్టింట దోయిళ్ల ముంచి తెచ్చిన నీటఁ గలయంపిఁ జిలికించు జలదకన్య,
కమిచి నల్దిశలఁ జీఁకటి మ్రింగుకరముల జలిదివ్వటీ వట్టుఁ జందమామ
తలిరాకుటంగుళంబులతోఁ బుణికిరించి కుసుమాక్షతలు సల్లుఁ గూనతీవ
మాధవుఁడు మోదమతి మధుమాసలక్ష్మి - స్మరప్రతాపాగ్ని సాక్షిగా పరిణయంబు
నాడి యాంగీరసాఖ్య శతాంగ మెక్కి - రాఁగఁ, గవివర యొసఁగుమీ స్వాగతంబు.

---

# శ్రీ కం. వీరేశలింగకవి—నవలలు

కే. కామేశ్వరరావుగారు, బి. ఏ.

## ౨. సత్యవతీచరిత్రము

ఈ 'సత్యవతీచరిత్రము' ౧౮౮౩వ సం.లో ప్రకటించబడింది.

"నాకు స్త్రీవిద్యయందును స్త్రీల యభివృద్ధి యందును విశేషాభిమానము. స్త్రీలకుగల స్థితిని బట్టియు పరిశోధించి వారి సుస్థితి నొలగింప ప్రయత్నింపవలయు ననియు, స్త్రీలను ప్రస్తుతస్థితిలోనే యుంచి తాము పైకి పోవుట పురుషుల కెన్నడును సాధ్యము కాదనియు, తాము బాగుపడవలె నన్నచో వారినిగూడ విద్యావివే కాదులయందు మంచిస్థితిలోనికి దెచ్చి వారితో గలసి యున్నతపదవికి లేవవలయు ననియు, తాము మాత్రమే వృద్ధి నొంది వారిని నిజమైన మైత్రికనర్హమైన దాస్యము నందే యుంచవలచిన పక్షమున దెలియకయే దినదిన క్రమమున దా మున్నతపదవి నారోహించుచు వచ్చుటకు మాఱుగా నొక్కొక్కమెట్టు దిగుచు వచ్చి కడపట వారితోడగూడ నడుగంటుట యనివార్యమనియు నేను దలచుచుండెడువాడను. వారు చదువుటకు తెలుగులో మంచిపుస్తకములు లేకుండుట దలపోసి యాలోపము నాచేత నైనంతవఱకు దొలగింపవలె నని..."

(కం. వీ. స్వీ. చ. రెం. ౧౮౨-వ పుట).

ఈయోచనచేతే కవి 'సతీహితబోధిని' అను మాసపత్రిక ప్రకటించ ప్రారంభించేడు. అటుతర్వాత సత్యవతీచరిత్రాది గ్రంధాలు రాసేడు.

ఇదొక గృహ్యానవలిక (Domestic novellete). ఈనవలయొక్క వుద్దేశం గ్రంథకర్తచే పైనే చెప్పబడింది. స్త్రీల అభివృద్ధికోసమే ఈగ్రంధం రచించబడింది. రాజశేఖరచరిత్రంలో మొగవాడెట్టివివేకం కలిగివుండాలో గ్రంధకర్త రాసేడు. ఆ పెద్ద నవలలో స్త్రీపాత్రలు గాని, ముఖ్యమైన స్త్రీపాత్రలు గాని యెక్కువగా లేవు. అందుచేత కవికి దాంట్లో స్త్రీలకు గలగవలసిన వివేకాన్ని గురించి చెప్పనవకాశం లేకపోయింది. అక్కడ చేయబడని ఆపని యీచిన్ననవలలో చేయబడింది. కనుక యీగ్రంధంకూడా రాజశేఖరచరిత్రలాగే వివేకబోధచేసే గ్రంథమన్నమాట. ఈవిషయాన్నే శ్రీతోలేటి సుబ్బారావుగారు తమ 'శ్రీవీరేశలింగకవి చరిత్రము'లో తమకు తోచినరీతిగా,

"ఈ సత్యవతీచరిత్రమును వివేకదీపిక * యన బరగిన రాజశేఖరచరిత్రమున కొకయుపశాఖయని చెప్ప నొప్పును"

(౨౩౬-వ పుట).

అని రాసేరు. రాజశేఖరచరిత్ర మనే వొకశాఖ కిదొక వుపశాఖట! అటువంటి సంబంధ మేమీ యీరెండుగ్రంధాలకు లేదు. ఈరెండూ వేరువేరునవలలు. కథలసంబంధ మేమీ లేదు. అందుచేత వొకటి ప్రధానం, రెండోది దాంట్లో వొకభాగ మనీ అనడానికి వీలు లేదు. వివేకబోధ అనబడేశాఖకి వీరేశలింగకవి రాసిన వచనప్రబంధా లన్నీ శాఖలే. అంతే గాని రాజశేఖరచరిత్రమనే శాఖకి

* ఈరచయిత పొరపాటుబడ్డాడు. వివేకదీపిక కాదు, వివేకచంద్రిక అని వుండాలి.

తక్కిన దేదీ శాఖ కాదు. వివేకబోధ శాఖకి వీరివచనప్రబంధా లన్నీ శాఖలు. వీటిలో కొన్ని పెద్దశాఖలు, కొన్ని చిన్నశాఖలు వున్నాయి. అంతే వీటికి గలసంబంధం.

ఇదొక గృహ్యానవలిక కదా! ఈ నవలికలో సాధారణంగా అవిభక్తకుటుంబాలలో సంభవించే కలహాలు చిత్రించబడ్డాయి. అంతే గాక అట్టిస్థితిలో ఆదర్శస్త్రీపురుషు లెట్లా మెలగాలోకూడా చెప్పబడింది. అవిభక్త కుటుంబాన్ని గురించి

"………ఇందుచేత హిందూకుటుంబములలో సాధారణముగా తెచ్చిపెట్టువారికి గాని తెచ్చినదాని ననుభవించువారికి గాని తృప్తియు, సంతోషమును కలుగక, ఒకరిమీద నొకరిమనస్సులో అసూయయు, ద్వేషమును కలిగియుండును. ఈకారణముచేతనే యత్యంతైకమత్యమును, దృఢానురాగమును ఉండవలసినయొక్క కడుపున పుట్టినవారిలో సహితము సోదరవాత్సల్యమంతగా లేక ద్వేషమే యధికముగానుండి లోకములో అన్నదమ్ములశత్రుత్వ మన్నసామెత పుట్టవలసినంతగతి సంభవించినది. కాబట్టి మనవా రందఱు ఒక్కచోట గలిసి యుండక యెంతదూరముగా నున్న అంతయనురాగమును, క్షేమము గలవారయి యుందురని నామనస్సునకు తోచుచున్నది" ౪౧-వ పుట.)
అని తన అభిప్రాయం కవివెల్లడిచేసేడు.

ఈగ్రంథం నీతివివేకాలను బోధిస్తూంది. స్త్రీలకు విద్య యెంతఅవసరమో తెలుపుతూంది. స్త్రీజనం సత్యవతివంటి వివేకం కలిగివుండాలని ఈకవియొక్క వుద్దేశం. సత్యవతిని గురించి

""…చూచితిరా యొక్కయుత్తమాంగనవలన నెందఱె కెన్ని విధముల లాభము కలుగుచున్నదో! దీనిని జదువ నదృష్టించిన మీరందఱును సత్యవతివలె ప్రవర్తించుటకు ప్రయత్నపడుడు. ఆవీథియందుండు స్త్రీలకందఱికిని సత్యవతి యన్న ప్రాణముగ నుండును గనుక, ఎవ్వ రేమంచివస్తువు దొరకినను సత్యవతికి దెచ్చి యిచ్చుచుందురు; ఎవ్వ రేక్రొత్తనగ చేయించుకొన్నను సత్యవతికి ముందుగా చూపుచుందురు; వారి కేకష్టము వచ్చినను పరుగెత్తుకొని వచ్చి యామెతో చెప్పుచుందురు; పిల్లలకు కొంచెము జబ్బుగా ఉన్నచో నామెయాలోచన నడిగిపోవుచుందురు. మగడు కాని, అత్త కాని, వదినె కాని, కొట్టినను తిట్టినను వచ్చి ఆమెతో చెప్పుకొని యేడ్చినప్పు డామె వారిని మంచిమాటలతో నోదార్చి బుద్ధి చెప్పి సంతోషపెట్టి మరల పంపివేయుచుండును; ఇరుగుపొరుగువారు జగడమాడి తనతో చెప్పుకొనవచ్చినప్పు డెవ్వరికి చెప్పవలసినట్టు వారికి చెప్పి సమాధానపఱచి వారిని నవ్వుమొగముతో పంపివేయుచుండును. ఎవ్వరయిన దుర్మార్గమున ప్రవేశించినయెడల సాధ్యమైనంతవఱకు ప్రయత్నము చేసి నయమున భయమున వారికి బుద్ధి చెప్పి వారిని మంచిత్రోవకు తెచ్చుచుండును. ఎంతబీదవారికిని రోగములు కాని, యితర కష్టములుగాని వచ్చినప్పుడు వారియిండ్లకు తాను పోయి యాదరించి పథ్యపానములు విచారించి వారిబిడ్డలను తన యింటికి తీసుకొనివచ్చి బుజ్జగించి తిండి పెట్టుచుండును."
(౬౦-వ పుట.)

మొగవారు నారాయణమూర్తి నడవడిక కలిగివుండాలని కూడా యీకవియొక్క వుద్దేశమే. ఇట్లాదర్శభార్యాభర్త లీనవలలో లిఖించపడ్డారు.

"నారాయణమూర్తి జనుల మూర్ఖత్వమును శకునములయందలి పిచ్చినమ్మకమును దలచికొని వారిస్థితి యెన్నడు బాగుపడునా యని ఆలోచించుచుండెను."

నారాయణమూర్తి ఆదర్శగృహయజమాని. ఆదర్శభర్త. అత డాదర్శన్యాయవాది కూడాను! కష్టపరిస్థితులలో ఆదర్శమానవు

డెలాగ ప్రవర్తించాలో ఈకథలో చెప్పబడింది. సహజవివేకి అయిన నారాయణమూర్తి విద్యచేత వర్ణన కందరాని ఘనతకు వచ్చేడు. ఈతనిభార్యలో విద్యాప్రభావం కనబడుతూంది. ఈమె విద్యాప్రయోజన మెరిగివుండడం వల్ల తీరుబడి వున్నప్పుడల్లా తక్కిన స్త్రీలకు విద్య నేర్పేది. ఆవిద్యకు ఫలితంగా వారు తమ అజ్ఞానప్రవర్తన విడిచి జ్ఞానవతులై సత్ప్రవర్తన కలిగివుండేవారు. ఆ మోస్తరుగా కవి ఈభార్యాభర్తలను పరిపూర్ణపాత్రలుగా చిత్రించ తలపెట్టేడు. కాని యీపాత్రలు మనకు కొంత అపరిపూర్ణంగా కనబడుతున్నారు. సత్యవతి తనతండ్రి మరణవార్త విని దుఃఖాన్ని పైకి కనబరచకుండా మనస్సులోనే పెంచి పెద్దచేసి దేహాన్ని కృశించజేసుకుని వ్యాధిగ్రస్తురాలై మృత్యుముఖం నుండి యివతల పడింది. ఇంతకంటే చావుమాట చెవిని పడ్డవెంటనే బావురుమని యేడ్చి అప్పటికప్పుడే మరిచిపోయే సాధారణస్త్రీలే వుత్తములనిపిస్తూంది. పై రెండురకాల విచారాలు శ్రేష్ఠం కావు. దుఃఖాన్ని ఓర్చుకుని వుండడమే శ్రేష్ఠం. నారాయణమూర్తికూడా తన భార్య అనారోగ్యవతిగా వుందని చూసి బెంగపెట్టుకుని జబ్బుపడి చావ సిద్ధమయేడు.

ఇదీ పైదానిలాగే దోషమైనపని. ఆదర్శ స్త్రీపురుషు లిట్లు బెంగపెట్టుకుని తమజీవితాలకే భంగం వచ్చేటట్లా చేసుకోకూడదు. కష్టకాలంలో ఓర్పు కలిగివుండాలి. స్త్రీలు సత్యవతివంటి శీలాన్ని కలిగివుండాలని కవియొక్క వుద్దేశం కనుక,

"పతివ్రతాశిరోమణియైన సత్యవతియందుండవలసిన గౌరవము చేతనైన దీనిని పలుమారు చదివి యీామెవలె ప్రవర్తించుటకు ప్రయత్నపడుడు. ఈచరిత్రమును చదువుటవలన మీలో నొక్కరు బాగుపడినను నాప్రయాసమున కెల్లను అదియే ప్రతిఫలమని సంతోషించెదను."

అని కవి రాస్తున్నాడు.

ఉపోద్ఘాతంలో వుండవలసిన సంగతులు కొన్నిటి నీయన పదిహేనోప్రకరణంలో చదువరులకు బోధిస్తున్నాడు.

"దీనిలో ముందేమి విచిత్రకథ వచ్చునో యను నభిలాషచేతనైన మీలో పలువురు సావధానముగా దీనిని జదివియుందురు. పురాణేతిహాసాదులందువలె హృదయాహ్లాదకరములైన విషయములు దీనియందు మీకు కనబడియుండవు. లోకచరిత్రములయందు కల్పలయందలి వినోద మెప్పుడును కలుగదు. కాని సత్యప్రియులైన వారికి చరిత్రములయందలి సత్యమే సంతోషజనకముగా నుండి సుఖసాధన మగును. సమర్థులయినవారు వ్రాయక పోవుటచేత సత్యము సహితము కొన్నిసమయముల యందు మనోహరముగా నుండకపోవచ్చును. చెప్పవలసినవానిని కొన్నిటిని చెప్పకపోవుటచేత గాని, చెప్పగూడని వానిని కొన్నిటిని చెప్పుటచేత గాని, చెప్పిన వానిని మృదుమధురశైలిని వ్రాయలేకపోవుటచేత గాని యిది మీకు మనోహరముగా కనబడకపోయినయెడల నాలోపమును మన్నించి, ......దీనియందు పురాణములయందలి చిత్రకథ లేమియు లేకపోయినను నీతిబోధయందు మాత్ర మిది యేకథకును తీసిపోవునది కాదని నమ్మెదను." (౨౯-వ పుట.)

ఈకథలో అనేకమైన అంశాలు చూపబడ్డాయి. పూర్వాచారపుకుటుంబానికి విద్యా

వంతులుగల కుటుంబానికి వుండే భేదాలు, పూర్వాచారపుకుటుంబాలలో వుండే లోపాలు చూపబడ్డాయి. ఆలోపాలకు నివారణోపాయాలుకూడా సూచించబడ్డాయి. దీనిలో చూపబడ్డ ముఖ్యమైనఅంశాలేవంటే— కోడండ్రికాలు, ఆడబిడ్డ లన్నదమ్ములభార్యలను పెట్టేకష్టాలు, గణించదగని చిన్నకారణాలపై స్త్రీపురుషులాడే జగడాలు, అన్నదమ్ముల శత్రుత్వం, విద్యావిహీనులైన స్త్రీల ప్రవర్తన, ఆకాలపు స్కూళ్లలోని కొన్ని లోపాలు మొదలైనవిషయా లనేకం లిఖించబడ్డాయి.

ఈనవలలో చేయబడ్డ వివేకబోధ కవిచేత యీలాగు క్రోడీకరించబడింది:

"దీనిం జదివినవారి కందఱికిని పెక్కువిషయములు మనస్సున నాటియుండును. కాని వానిలో స్పష్టముగా కనబడునవి వేంకటేశ్వరులయొక్కయు, సుందరమ్మయొక్క స్థితినిబట్టి విచారింపగా, దంపతులిరువురును చదు వెఱుగని మూఢులయి యున్నపక్షమున వారిలో నప్పు డప్పుడు నిష్కారణముగా కలహములు పొసగుటచేత సంపూర్ణసుఖము కలుగకపోయినను, పరస్పరము నొకరీతిగా గలసి వారొకవిధముగా సుఖజీవనమే చేయుచుందురని తేలుచున్నది; నారాయణమూర్తి యొక్కయు, సత్యవతి యొక్కయు స్థితినిబట్టి విచారింపగా దంపతు లిద్దఱును చదివినవారయి యుక్తాయుక్తవివేకము గలవారయి యున్నయెడల వివేకహీనులైన బంధువులు మొదలైనవారి వలన నిర్హేతుకముగా మనస్తాపము కలిగినప్పుడు తప్ప సాధారణముగా గృహము భూతలస్వర్గమువలె నుండి వారికి సంపూర్ణసుఖము గలిగి వారికి మాత్రమే గాక లోక మంతకును మేలు కలుగునని స్పష్టమగుచున్నది. రామస్వామి యొక్కయు, మహాలక్ష్మి యొక్కయు స్థితినిబట్టి విచారింపగా, చదు వెఱుగని మూఢుడయి భార్య విద్యావతియు గుణవతియు నయి యున్నయెడల పెక్కు కడగండ్లు సంభవించుచు వచ్చినను, మార్దవము గల స్త్రీస్వభావమును బట్టి యుక్తసమయమున జేసిన హితోపదేశముచేత పురుషున కొకానొకప్పుడు బుద్ధి వచ్చి సంసారము బాగుపడునని తెలియుచున్నది; సుబ్రహ్మణ్యము యొక్కయు, సూరమ్మ యొక్కయు స్థితినిబట్టి విచారింపగా భర్త విద్యాధికుడయిన యోగ్యుడుగా నుండి భార్య చదు వెఱుగని గయ్యాళియగుట సంభవించినయెడల స్వప్నావస్థయందును సుఖము గలుగక గృహము మహారణ్యమువలె నుండి దంపతులకు మాత్రమేగాక యిరుగుపొరుగులవారికి సహిత మాయాసము కలుగుచుండునని తేటపడుచున్నది.

కాబట్టి దీనిం జదివి తమబిడ్డలకు వివాహము చేయ నెటస్థించువారు వారిభావిసుఖమును చక్కగా విచారించి, ధనమే ప్రధానముగా జూడక, విద్యయందును, బుద్ధియందును, వయస్సునందును ఎవరికి తగినవారిని వారికి వివాహము చేసి సౌఖ్యమైంతవఱ కనుకూలదాంపత్యము కలుగునట్లు చూతురని కోరుచు దీనిని ముగించుచున్నాను." (౨౦-వ పుట.)

ఈకథాకల్పనలో వీరేశలింగకవికి గల సహజమైన ప్రతిభ కనబడుతూంది. కాని యింతచిన్ననవలకు ఈకథ పెద్దదిగా వుంది. చిన్ననవలకు తగినది చిన్నకథ. ఆలాగుగాక యిది పెద్దకథ అవడంచేత కథ విరివిగాగాక సంగ్రహంగా చెప్పవలసివచ్చింది. ఏ వొక్క అంశం సాంతంగా చర్చించబడడాని కవకాశం లేక బహువేగంతో వొక అంశంనుంచి మరొకఅంశానికి కవి పరుగెత్తవలసివచ్చింది.

ఏ వర్తమానికపురచనలలోను—ఉపన్యాసాల సంగతి కాదు—గ్రంథకర్త తాను బయటపడి అన్నిసంగతులు పాఠకులను సంబోధించి

గాని, లేక సంబోధించక కాని చెప్పగూడదు. కథను చదివి పాఠకులే అసంగతులను గ్రహించాలి. లేక వొకవేళ గ్రంథకర్త చెప్పబూనుకుంటే తాను బైటపడక కళాన్వితంగా చెప్పాలి. కాని ఈకవి అలాగు గాక బయటపడి పాఠకులతో ముఖాముఖిగా నిలిచి సంగతులు చెప్పబోతాడు. ఇది సరియైన పద్ధతి కాదని వేరే చెప్పనక్కర్లేదు.

సత్యవతీచరిత్రంలో వైముషికహాస్యం (Intellectual humour) అధికం. ఈ హాస్యాన్ని విద్యావంతులే గాని పామరులు గ్రహించలేరు. సాధారణంగా వాక్యాల్లోని యేవొక్క శబ్దాన్ని వాడడంలోనో ఈహాస్య ముంటుంది. కథలో అక్కడక్కడ ఘటనాహాస్యంకూడా కనబడుతూంది. సాధారణ ధర్మసూత్రాలు హెచ్చుగానే వున్నాయి.

వీరేశలింగకవియొక్క తక్కిన వచన ప్రబంధాలలో కనబడని వొకవిశేషాంశ మీనవలలో కనబడుతూంది. అదేమిటంటే, పాత్రలసంభాషణలలో ఈకవి వ్యావహారిక భాష వుపయోగించేడు. సాంఘికరచనలలో సంభాషణలయందు వ్యావహారికం వాడితే మంచిదని యీకవి అభిప్రాయం. ఆ అంశ మీక్రిందివాక్యాలలో కొంత తెల్లమౌతూంది:

"గ్రంథములను సాధారణముగా సలక్షణమైన సులభశైలిని రచియింపవలెననియే నాయభిప్రాయమైనను విషయానుగుణముగా తత్తదుచితరీతిని గ్రామ్యభాషయందు సహితము గ్రంథములను వ్రాయవచ్చు నని కూడ నాయభిప్రాయము. పూర్వవ్యాకరణములన్నియు బహుకావ్యరచనకొఱకే. వచనకావ్యములు లేనికాలములో పుట్టినవగుటచేత నందలిలక్షణము లనేకములు వచన కావ్యాభివృద్ధికి తగవనియు, నిప్పటి కాలమునను దగినట్లుగా వ్యాకరణమును మార్చుకొనవలయుననియు నేననుకొని యీకాలమునకు వచనరచనాభివృద్ధికిని తగినట్టుగా నొకనూతనవ్యాకరణమును వ్రాసి దానికి లక్ష్యముగా నొకవచనకావ్యమును జేయవలెనని పలుమాఱు తలపోసితిని. అయినను వృద్ధుడను, దుర్బలశరీరుడను నగుటచేత నట్టిపని నా కిప్పుడు సాధ్యము కాదేమో! కావున నేల? ఈశ్వరానుగ్రహ మున్నయెడల సాధ్యము కానువచ్చును." (కం. వీ. స్వీ. చ. రెం. ౧౫౮-వ పుం.)

గ్రామ్యమని వీరు వాడినమాటకు మన మిప్పుడుపయోగించే గ్రామ్యవ్యావహారికాలని అర్థం. పైన పొందించబడ్డ రచనాభాగంయొక్క అర్థం యెక్కువ విస్పష్టంగా లేదు. అయినా వీరు వ్యావహారికానికికూడా లక్షణం రాయదలంచేరనీ దానికి లక్ష్యంగా ఒకవచనకావ్యం రాయదలచేరనీ మనం భావించవచ్చు. సత్యవతీచరిత్రకు మూడేళ్లకిందటే ప్రకటించబడ్డ 'బ్రాహ్మవివాహం', 'వ్యవహారధర్మబోధిని' అనునాటకాలు కవిచేత గ్రాంథికేతరభాషలోనే రాయబడ్డాయి. ఆమోస్తరుగా వీరేశలింగకవి ఆనాటిసంప్రదాయాలను తెగడి గ్రంథాలను గ్రాంథికేతరభాషలో కొంతవరకూ రాసేడు.

"ఏవిషయమును నే నితరులు చూపినదారినే పోవువాడను గాక మనసు తిరిగినప్పుడు నాదారినే నేను నడచువాడ నగుటచేత సులభవచనరచనావిషయమై ఇతరులమాటలను పాటిచేయక నా నూతనమార్గానుసారము ...ప్రకటించితిని." (కం.వీ.స్వీ.చ. రెం. ౧౫౮-వ పుట.)

అని కవి తనయొక్క స్వచ్ఛందతను సమంజసగా తెల్పుకున్నాడు. వీరేశలింగం

గారు తమ గ్రంథాలను సులభ శైలిలో రాయడానికి కారణం లేకపోలేదు. ఈయన జీవితాశయం సంఘసంస్కరణ కదా. సంఘములోని లోపాలను, చెయ్యవలసిన మార్పులను జనులకు బోధించాలంటే, సులభ శైలిలో గ్రంథాలను రాయక తప్పదు. లేకుంటే జనులకు వారిరాతలు బోధపడవు. కనుక వీరు సులభశైలిని వాడేరు. ఆకారణం చేతే వీరు సులభశైలిని ఆమోదించవలసి వచ్చిందని మన మనుకోవచ్చు. అట్టిశైలినే రాయదలచుకొన్నప్పుడీకవిసులభభాషనే లేక సహజగ్రాంథికభాషనే వుపయోగించివుండాలి గాని వ్యావహారికభాష నుపయోగించడానికి కారణం లేదు. అట్లు గాక, ఈకవి గ్రామ్య వ్యావహారికాలను కూడా వుపయోగించేడు. ఇట్టిప్రయోగానికి కారణం యిప్పుడు అధిక ప్రాముఖ్యములోకి వచ్చిన ప్రాకృతికోద్యమం లేక యధార్థత్వోద్యమమే అని మనం వూహించవచ్చు. వీరేశలింగంగారు తమఅద్వితీయ ధీశక్తిచేత యీవిషయాన్ని ఆకాలంలోనే గ్రహించగలిగేరు. వారే మనవుద్యమానికి శంకుస్థాపన చేసినవారు. పై కారణంచేత వీరు యీనవలలోని సంభాషణలలో యధార్థభాష వుపయోగించేరు. అంతమట్టుకే వీరు సాహసించగలిగేరు. కథాపాత్రలు గాక తాము చెప్పేది కూడా వ్యావహారికభాషలోనే రాయగలిగినంత ధైర్యమో లేక కారణసహిత నిశ్చయమో కలుగక, వ్యావహారికభాషను తమకు మట్టుకు వాడుకోలేదు. తాము చెప్పేదంతా కూడా సులభ లేక సహజ గ్రాంథికంలో రాసి పాత్రలుమాట్లాడేదంతా వ్యావహారికంలోను, గ్రామ్యంలోను రాసేరు. ఈమోస్తరుగా శైలి విషయమైన పరిణామ మీగ్రంథంలో కనబడుతూంది. కాని వీరి తక్కినవచనప్రబంధాల్లో మళ్లా యీవ్యావహారికభాషాప్రయోగ మధికంగా లేదు.

ఈనవలశైలిలో వేగం కనబడదు. ఎక్కడికక్కడే ఆగిపోతూవుంటుంది. భాష సరళమైనది.

సత్యవతీచరిత్ర మాకాలంలో యెంత జనామోదకరంగా వుండేదో ఈకింది విశేషం తెలుపుతూంది:

"...దానిని స్త్రీలుమాత్రమేగాక పురుషులు సహిత మత్యాసక్తితో జదువసాగిరి. దానిని చదివి యానందించినవారనేకులు తమకు బుట్టిన స్త్రీశిశువుల కంపలికథానాయకురాలయిన సత్యవతిపేరు పెట్టిరి." (కం. వీ. స్వీ. చ. రెం. ౧౮౩-వ పుట.)

---



పారసీక యువతి

చిత్రకారుఁడు: చేమకూర సత్యనారాయణ రావుగారు.

(నల్ల ముతకకాగితముపై చాకుతో చిత్రించిన చిత్రము.)

తంతివిలాసము: "లీవర్ క్యూర్" టెలిఫోను నెం. 8139

# లివరు, స్ప్లీన్ వ్యాధులకు

## డాక్టరు వెంకటరమణయ్యగారి సుప్రసిద్ధౌషధమును వాడుడు.



ప్రతివారొక్కరిచే అద్వితీయమైన దనియు, శ్రేష్ఠతమమైన దనియు ఆమోదించబడినది. అనేక సుప్రసిద్ధవైద్యులచే దృఢపరచబడినది. పసిపిల్లలకు యీవ్యాధిని రానీయక అటుంకపరచుటకై యీ అద్వితీయమైన ఔషధమును వాడుడు.

షరా:—మా ఔషధమును చూచి అనేక మాదిరిఔషధములు బయలుదేరినవి, గాన మోసపోకుండగలందులకై ప్రజలను హెచ్చరించుచున్నాము.

## డాక్టర్ జమ్మి వెంకట రమణయ్యగారు,

లివరు అండ్ స్ప్లీను వ్యాధులకు ప్రత్యేకవైద్యులు.

8, సాలెవీధి, మైలాపూరు, మదరాసు.

---

## క్షీరసముద్రం

ఈ దివ్యరసాయన సేవనవలన పాలుచాలని తల్లులు సేవించినపాలు సమృద్ధియగును. భగవంతుడు ఏ జీవియొక్క జనమునకు తగినట్లు ఆ జీవికి పాలు ఆహారము సృజించియున్నాడు. మనుష్యశిశువులు మరియే యితర పాలు త్రావినను జనమునకు సరిపడక అనేక రోగముల పాలగుచున్నారు. మాతాశిశువులకు ఆరోగ్యమునిచ్చును. ఈ మందును వాడిన మరుసటిదినముననే పిల్లకుపాలు సమృద్ధిగనుండును. పథ్యము లేదు. 4 సీసాలు వాడిన ఆ తల్లికివలసినన్ని పాలుకలుగును.

సీసా 1-కి 1-4-0 అంచెకూలి ప్రత్యేకము.

500 ఆయుర్వేదౌషధముల కేటలాగుపుచితం.

క్షీరసముద్రం ఆయుర్వేదఫార్మసీ,

గుమ్మలూరు,

(Via) పాలకొల్లు, పశ్చిమగోదావరిజిల్లా.

## కేసరి రత్నత్రయము

"లోధ్ర"

వనితల ఋతుదోషాది రోగములకు.

"అమృత"

రక్తశుద్ధి ద్రావకము.

"అర్క"

సర్వ జ్వరములను హరించును.

అన్ని మందుల షాపులలో దొరకును.

## కేసరికుటీరం,

ఆయుర్వేద ఔషధశాల,

ఎగ్మూరు, మదరాసు.

# విజయవిలాసవ్యాఖ్యానవిధానము

ఆంధ్రవిశారద, తాపీ ధర్మారావుగారు, బి.ఏ.

## ౩

వ్యాఖ్యానరచనయం దత్యంతావశ్యకము (౧) పాఠనిర్ణయపరిక్లేశమునకు దృష్టాంతముగ మొదటివ్యాసమున ‘కోఁదుకపోవుశంఖము నహో గళరేఖ...’ యనుపద్యమును, (౨) పదముల కుద్దిష్టములగు నర్థవిశేషంబుల నిర్ణయించు శ్రద్ధ కుదాహరణంబుగ ‘కన్నె నగుమోముతోడఁ బున్నమచందురుని సాటిఁ బోలుపవచ్చున్’ అనుపద్యమును రెండవవ్యాసమునందును సహృదయులకు నివేదించియుంటిని. ఈవ్యాసమునందు భావవికసనమును మనఃపరిణామమును తెలుపు పద్యములలో నొక్కదానిఁగూర్చి యొక్కింత వ్రాయఁబూనినాఁడను. ఇట్టివర్ణనల నాంగ్లమున ‘సైకాలొజీ’కి సంబంధించిన వందురనుట విదితమే. ఇట్టి భావవికాసవర్ణనలయందు భారతీయకవీశులు, అందున నాంధ్రకవులు, చాలఁ గొఱవడియున్నారను నొక్కయపవాద కలదుగదా? ఈవాదము కేవలము నిరాధారమని సవిమర్శముగ నాంధ్రగ్రంథముల నారయఁజాలిన విపశ్చిద్వరేణ్యు లంగీకరించియే యున్నారు. ఇంక నెట్టివారికైన నించుక సంశయంబుండిన నయ్యది, చేమకూరకవి విరచితమగు నీ క్రిందిపద్యమువలన, నిర్మూలము గాఁగల దని విశ్వసించుచున్నాఁడను.

గాంగసైకతమునందుఁ బాండవమధ్యార్పితహృదయయగు నులూచి మన్మథాకారుం డగు నొక్కనింగాంచి, కాంచినంతన నెనరు దగులుటంజేసి, యాతని నర్జుననిగా నెఱిఁగెను. ఇంతకుఁబూర్వము తా నురగీవరగీతికలవలన నర్జుననిరూపగుణాదికముల వినియున్నదిగానఁ దమకము మనమునఁ బెనఁగొనెను.

మును ద్రౌపదీస్వయంవర
మున కేగిన కామరూపభోగులవలనన్
వినియున్నకతనఁ దమకము
మనమునఁ బెనఁగొనఁగఁ జేరి మాయాన్వితయై.

గుట్టసియాడ, గబ్బిచను
గుట్టలపైఁ బులకాంకురావళుల్
తెట్టువగట్టఁ, గోరికలు
దేటలువెట్టఁగ, వేడుకల్ మదిన్
దొట్టికొనంగ, నచ్చెరువు
తొంగలిఱెప్పల వీఁగ నొత్తఁగాఁ,
బెట్టిన దండదీయక వి
భీతమృగేక్షణ సూచె నాతనిన్.

అని యులూచి యర్జుననిఁ జూచినవిధానము వర్ణితమయి యున్నది.

తిరుపతి వేంకటేశ్వరకవులును, వేదము వేంకటరాయ శాస్త్రిగారును నీ పాఠము నంగీకరించిరి. జూలూరు అప్పయ్యపంతులుగారును, నోరి గురులింగ శాస్త్రిగారును నీపద్య ప్రథమపాదమును మాత్రము

గుట్టసియాడ గబ్బిచను
గుబ్బలపై బులకాంకురావళుల్

అని యించుక భిన్నముగఁ బఠించిరి. అందు జూలూరు అప్పయ్యగా రిట్లు తమవ్యాఖ్యానము నొసఁగిరి.

“గుట్టసియాడ – గుట్టనగా మర్మస్థానము అది అసియాడననగా లోగా చలించగానున్న, గబ్బిచను గుబ్బలపై – చలించనటువంటిన్నీ గుబ్బలవంటిన్నీ చన్నులమీదను, పులకాంకురావళుల్ – గగుర్పొడుచుటయొక్క పంక్తులు, తెట్టువగట్ట – తెట్టెతెట్టెలుగా నేర్పడుచునుండగానున్నః కోరికలు తేటలువెట్టగ—వాంఛలు పైకి తేరుతూనుండగా, వేడుకల్ – ఉల్లాసములు, మదిందొట్టికొనంగను – మనస్సునందు హత్తుకొనుచుండగానున్న, అచ్చెరువు అబ్బురపాటు, తొంగలిరెప్పల వీగనొత్తగా–విప్పుకలిగినకనురెప్పలను త్రోళగ్రద్

యుమందగానున్నా, పెట్టినదండ దీయక-మోపు దలచేసినది చేసినట్టుగానే, విభీతమృగేక్షణ-భయ పెట్టబడిన లేడిచూపులవంటి చూపులు గలిగిన యులూచి, చూచెనిన్-ఆయర్జునుణ్ణి, చూచిన దాయెను."

నోరి నరసింహశాస్త్రిగారు దాదాపుగ నిట్టి యర్థమునే చెప్పిరి గాని వీరివ్యాఖ్యానమందు

'సట్టు-ధ్యానము, అసియాడన్-చలింపగా', యనియు, 'తేటలు-ప్రకటనలు' అనియు, 'తొట్టికొనంగన్-అతిశయించునట్లుగా' అనియు, 'అచ్చెరువు-ఆశ్చర్యము, తొంగలి-అతిశయించి, ఱెప్పలు-కనుఱెప్పలు, వీగనొత్తఁగాఁ బెట్టినదండ-మూతపడకుండునట్లుగా పెట్టిన లక్ష్యము, తియ్యక-తీయక' అనియుఁ గలదు.

ఇంకనీపద్యమునకు వేదము వేంకటరాయశాస్త్రిగారు వ్రాసిన వ్యాఖ్యానమును జూతుము.

"సట్టు=మర్మస్థానము, అసియాడన్=చలింపఁగా; పులక అంకుర ఆవళుల్=పులకల మొలకలవరుసలు, తెట్టువగట్టన్=తెట్టెతెట్టెలుగా నేర్పడఁగా; తేటలు పెట్టఁగన్ తేరుచుండఁగా; తొట్టి కొనంగన్=హత్తుకొనుచుండఁగా; అచ్చెరువు=అబ్బురపాటు, తొంగలిఱెప్పలన్=వాలుకనుఱెప్పలను, వీఁగనొత్తఁగాన్=తోలఁగఁ ద్రోయుచుండఁగా; పెట్టినదండన్=నడుముపై మోపిన బాహువును; విభీతమృగేక్షణ=బెదరిన లేడిచూపులవంటి చూపులు గలదైన యులూపి."

అని చెప్పియున్నారు.

పైఁజూపిన జూలూరు అప్పయ్యగారి వ్యాఖ్యానమునకును, శాస్త్రిగారు వ్రాసఁగినదానికిని గల సాదృశ్యమెంతయున్నను, 'పెట్టిన దండదీయక' యను మాటలకు 'మోపుదల చేసినది చేసినట్టుగానే' యని పంతులుగారివలె నగోచరముగ నుంచక 'నడుముపై మోపిన బాహువును తీయక' యని చక్కని వివరణమును వ్రాసి శాస్త్రిగారాంధ్రజన కృతజ్ఞతకుఁ బాత్రులయిరి.

ఈపద్యమునందుఁ గవి యర్జునునిఁ జూచునప్పుడులూచికిఁ గలిగిన మనఃపరిణామములు వర్ణించెను. పై వ్యాఖ్యానమును బట్టి చూచిన నులూచి కర్జునునిఁ జూచినప్పుడు "మర్మస్థానము చలించెను; వక్షమునందు పులకల మొలకలు తెట్టెలు తెట్టెలుగా నేర్పడెను; కోరికలు తేరుచుండెను; మనస్సునందు వేడుకలుహత్తుకొనుచుండెను; అబ్బురపాటు వాలుకనుఱెప్పలను దొలఁగఁ ద్రోయుచుండెను; బెదరిన లేడిచూపులతో నులూచి నడుముపై మోపిన బాహువును దీయకుండ నాతనిఁ జూచుచుండెను" అని వ్యాఖ్యాతలు తలంచిరని తేటయగును. ఇందు వర్ణితములయి రోమాంచము, స్తంభము లోనగు సాత్త్వికభావము లుండుటంబట్టి 'సట్టసియాడ' ననుటయందు కంపమను మఱియొక సాత్త్వికభావము నాలంకారికులగు వ్యాఖ్యాతలు గనుఁగొనిరనుట సమంజసము.

స్తంభః ప్రళయరోమాంచౌ
స్వేదో వైవర్ణ్యవేపథూ,
అశ్రు వైస్వర్యమిత్యష్టౌ
సాత్త్వికాఃపరికీర్తితాః. (ప్రతాపరుద్రీయము).

అనెడు లక్షణమునే ప్రధానమొనరించి వ్యాఖ్యానమున కుపక్రమించి రని తేటపడును. కాని సన్నివేశమునకీ వ్యాఖ్యాన మెంతవఱకనుగుణముగ నున్నది యని విమర్శించినయట్లు గానరాదు. ఇట్టి సందర్భములయందు వారు వ్యాఖ్యానముచేసినట్టి 'సట్టసియాడుట' యెంతవఱకు స్వాభావికమని యెంచకుండిరి. ఈ 'సట్టసియాడుట' సాహిత్యమునం దత్యంతమృగ్యమని యూహింపరైరి. కంపమను సాత్త్వికభావమును గూడఁ జూపవలయునను తలఁపే బలమయినది. లాక్షణికుల పగ్గము లెంత యగ్గలములు!

ఈ యర్థమునందలి యస్వాభావికతను గుర్తించియే అప్పయ్యపండితులుగారు 'లోగాచలించు' అని యొకయవ్యయీపదమును గలిపిరి. దీనివలన వారు దల పెట్టిన కంపమను సాత్త్వికభావ మంతరించినదని యైన గుర్తింపరైరి. చూడుఁడు;

రాగరోషభయాదిభ్యో
వేపథుర్గాత్రకంపనమ్. (ప్రతాపరుద్రీయము)

ఈ రసకార్యంబునకు నరసభూపాలీయమునఁగల లక్ష్యమును గాంచినను దీని నెఱుఁగనగును.

చెన్నగు శ్రీనృసింహవిభుఁ
జిత్రపటంబున వ్రాసి బింకపుఁ
జన్నులమీఁదఁ జేర్చికొని
చాలవడంకఁ దొడంగె బాల దాఁ
గన్నులవింటివాఁడు త్రిజ
గంబు జయించెదనంచుఁ గోరి చే
నున్న కృపాణవల్లిక మ
హోజ్జ్వలతన్ జళిపించెనో యనన్.

ఈయర్థము ననుసంధించికొని పద్యమును బట్టి యులూచియవస్థ నెఱుఁగుటకుఁ బ్రయత్నమొనరించినచో నీపద్యమునందలివర్ణనము క్రమారోహణావరోహణములకు లొంగక 'తీర్థమునకుఁ దీర్థము ప్రసాదమునకుఁ బ్రసాదము' నవఁదగియుండును. 'గుట్టు' తనయంతటఁ దానసియాడెను. గబ్బిచనుగుట్టలపైఁ బులకాంకురావళుల్ తెట్టువఁగట్టెను.. ...ఏవర్ణనకావర్ణనయే స్వతంత్రమగును. అంతియగాని, గుట్టసియాడుటవలన గుబ్బలు పులకించెనని యొకక్రమము నూహింపఁజాలము. అట్టి పరస్పరసంబంధమును గాంచనేరకయే కొందఱు మన కవులు మనఃపరిణామవర్ణనల (సైకలోజికల్ వర్ణనల) యందు చాల వెనుకఁబడియున్నారని నిర్ణయించిరి.

అయినచో గుట్టసియాడ నవఁగా సరియగునర్థమేమి యగును? ఆయర్థము నొసంగినందునఁ గలుగు ప్రయోజనమేమి? గుట్టు అనుపదమునకు సీతారామాచార్యులవారు తమశబ్దరత్నాకరమున మర్మము అని వ్రాసి దానిపై నొకతారను (*) ముద్రింపించిరి. ప్రకృతి కించుకభిన్నముగనున్న యర్థమును సూచించుపట్ల నీ (*) గుఱుతును సంకేతముగ వా రుపయోగింతురు. దీనివలన వారు జాలూరువారియర్థమునే మనసునం దుంచికొనిరని తలంప ననువు గలుగుచున్నది. గోప్యాంగార్థమునకు బ్రయోగములు లేక పోలేదు. చేమకూర వేంకటకవియే సారంగధరచరిత్రయందు చిత్రాంగి సారంగధరునకుఁ దనమేడయందలి కృష్ణలీలాపటమును జూపుచు గంభీరాభిప్రాయముతో

...చూడుచిత్రమిది;
నెమ్మది వేడుక నోలలాడు న
మ్మక్కల గుట్టు బట్టబయ
లై గనిపింపఁగ...

ననినయట్లు రచించెను. అంతమాత్రమున మన మీయర్థమునే పరిగణింపవలయుననుట సమంజసముగానేరదు.

'ఎచటి గాఁపులఁ బుట్టువిచికిలామోదంబు శబర కాంతలగుట్టు సడలఁబెట్టు' ననుచోట నీయర్థమును జెప్పఁ దగునా? కావున గురులింగశాస్త్రిగారును నిఘంటువులును జూపిన 'రహస్యము' అను నర్థమునే యంగీకరించుట యొప్పును. ఈయర్థమునే చెప్పవలయుననుటకుఁ బ్రబలమయిన మఱియొక్క కారణముగలదు. చేమకూర కవి గుట్టసియాడుటకు సారంగధరచరిత్రయం దనేక పర్యాయములు ప్రయోగించెను. వాని సన్నివేశమును బట్టి కవి కీపదములయందుఁగల సుస్థిరార్థమును గుర్తింప నవకాశము గలుగును. విరాళిగొనిన రాజనరేంద్రుఁడు

"అత్తఱిఁ జిత్తజేల్లి చిట్టాడిన గుట్టున..."

సుప్రలాపవిప్రలాపంబులకుఁ బూనెనని వర్ణించెను. సారంగధరచరిత్రకు వ్యాఖ్యానము చేయుచు వేంకటరాయశాస్త్రిగారు

"చిట్టాడినగుట్టునన్ = చంచలహృదయముచేత"

అని వ్రాసిరి. గుట్టు అనిన హృదయము (మర్మము, రహస్యము ననునవి) గా నంగీకరించిరి. ఇందునను గూడ గోప్యాంగసూచన మున్నదందురోటు! మఱియొకయెడ: సారంగధరచరిత్రయందు రాజ నరేంద్రుఁడు సచివులతోఁ జిత్రాంగికడకుఁ బోయి 'బెదరించి కినుక నీవంకనె తప్పిదిగట్టిగఁ జెప్పు' మని యడుగఁగా నాయింతి

'కందోయి (=కనుగవ) చల్లఁగా నిటు
గందోయి(=చూడవోయి)నృపాల లెస్సగా నిఁక నొకమా
ఱందఱు ముందఱు నీ' వని
చిందఱవందఱయి గుట్టు చిట్టాడంగన్.

తన పయ్యెదకొంగును 'బయారబయలుగఁజేసె' నని కవి రచించెను. ఇట సట్టు అనుటకు రహస్యమను నర్థమునేగదా చెప్పికొనవలయును. ఈ రెండుస్థలముల యందును 'సట్టు' చలనార్థముగల 'అసియాడు' 'చిట్టాడు' అను పదములతోఁ గూడియుండుటయు భావసా దృశ్యమును దెలుపుచున్నది. అసియాడుట యన చిట్టాడుటయే. చిఱు+ఆడు. చిఱునడుఁ గలుగు నీ రూపముగూడఁ గవికిష్టమే.

.........పేరెలుంగునను

-ట్టుకొంకుంగనుచేరు సోనరై చినుకఁగనేర్చి...

ఈ మూఁడుస్థలములయందును గవి యొకేయర్థము నూహించెనుగాని భిన్నార్థములను గాదని యెంచుట సమంజసము. ఈయూహను సహృదయు లంగీకరించినచో నాలూరు అప్పయ్యపంతులుగారు వేంకటరాయ శాస్త్రిగారు నొసఁగిన యర్థ మాకవి యూహించిన యర్థము గానేర దని నిర్ధారణ చేయవచ్చును.

కావున "సట్టు=రహస్యము, అసియాడు=చిట్టాడు =కొంచెముచలించు=ముందువెనుకలగుఁగు"నని యర్థము చేసికొనుట భావ్యము. దీనివలనఁ బద్యస్వారస్యమునకుఁ గలుగు ప్రయోజనం బేమియన్న నించుక పద్యమును బరికింపవలయును.

ఉలూచి యర్జునునిఁ బ్రేమించుట యింతవఱకును రహస్యముగనున్నది. నేఁడు తా నేకతము యాకస్మికముగ నాతని గాంగసైకతమునఁ గాంచెను; తనలోకమే కాని వేఱొకలోకము. చేయునదియేమి? రహస్యముగ నింతవఱకుఁ దనకున్న ప్రేమను బ్రకటించుటయా, లేక తన మర్మమును బోషించికొనుచు తాను నాగలోకమునకు మరలుటయా? రహస్యప్రకటన మనిన నెవ్వ రేమనుకొందురో? (ఉలూచి విజయవిలాసమునఁ గులకాంతయుఁ బాండవమధ్యమునికి ధర్మపత్ని గాఁదగిన కన్యయేగాని వేఱుగాదు సుఁడీ.) ఎవ్వరేమనుకొనిన నీయర్జునునకుఁ దన మాటలయందు విశ్వాసము గలుగునా? నిదర్శనము లేమి నూపఁగలుగును?

...నినున్ వరియింప మనంబుగల్గి, నీ

చెలువము వ్రాసి చూతు నది

చిత్తరువందు ననేక లీలలన్.

అని చూపుట కాగంగానదీపులినభూమి నేమిగలుగు?... తగదు. రహస్యసంపోషణమే యుచితమందుమా? ఇన్ని దినములు క్షణంబులు యుగంబులుగఁ గడపెయు నీ మహాతరుణమును గోల్పోవు టెట్లు? ఇప్పుడుగాకున్న మఱలఁ దన కితనిఁ గాంచుభాగ్య మబ్బుట యెన్నఁడు? అంతవఱకున్ నిలుపోవుటయెట్లు? ఈరీతి మహాందోళన ములూచి హృదయమునఁ గలుగును. రహస్యప్రకటన సంపోషణములమధ్య నసియాడుచుండును. ఈ గతి 'సట్టసియాడె' నను నీరెండు పదములయందు

'ప్రమదారత్నము తార చంద్రుసెనయన్

భావించుఁ, దోడ్తోన న్యా

యము గాదంచుఁ దలంచుఁ, దాళఁగలనా

యంచున్ వితర్కించు...'

అనుపద్యమునఁ గల భావమువంటి భావమంతయుఁ గలదు. ఈయసియాడుట తర్కఫలము. ఈతర్కమునందు తానేమి చేయవలయునో తెలియక కోరికలు చిందఱవందఱగాఁ గనఁబడుచుండును. తర్కవిచక్షణయందు రహస్యప్రకటనమే కర్తవ్యమని యొక్కొకసారి తేలుచుండు; నప్పుడెల్ల బుద్ధిబలమునకు శారీరకబలము (యౌవనోష్ణరక్తబలము) తోడయి 'అవును; ప్రకటనమే కర్తవ్యము' అని యనుకరించునట్టుల నుద్రేకించును. అట్టిరక్తోద్రేకంబు స్తనాదిప్రదేశంబుల రోమాంచరూపమునఁ బ్రత్యక్షమగును. ఇయ్యది మానవస్వభావము. వాంఛ లూహారూపంబున నున్న యంతవట్టు నెట్టి యుద్రేకమునకు నవకాశముండదు. ఊహాబలమునకు శారీరకబలము జోడయిననే ఫలము దృగ్గోచరమగును. ఇయ్యది మానవస్వభావ మర్మమును, ధర్మమును. ఇది నాఁటికిని నేఁటికిని నట్టులనే యుండును. సుప్రసిద్ధాంగ్లేయవిపశ్చిద్వరేణ్యుఁడు, ప్రాపంచికచరిత్రను వ్రాసి జగద్విఖ్యాతిఁ గాంచిన శేముషీధురీణుఁడు, హెచ్. జి. వెల్సు అను కవిశిఖామణి తన వినూతనగ్రంథమగు (Love and Lewisham) 'లవ్ అండ్ లూయిషామ్' అను గ్రంథమునం దీయభిప్రాయమునే వ్యక్తముచేసెను. తర్కబల

మునకు రక్తబలము కలిగిన యప్పుడే కార్యవిధానము నిశ్చితమగునని వ్రాసెను. మేదస్సునకు రక్తబలము గలుగుట పరిణామమునకుఁ గీలకము.

(Youthful blood took up the suggestion.)

The thoughtof Bonover (the obstacle) arose only to be dismissed. And besides—

Yes, he would go out and find her and speak to her. Nothing could stop him.

Once that suggestion was taken, his imagination became riotous with things he might say, attitudes he might strike and a multitude of vague fine dreams about her. He would say this, he would say that, his mind would do nothing but circle round this wonderful pose of lover.

What a cur he had been to hide from her so long! What could he have been thinking about?.........".

ఆంధ్రానువాదము

"[యౌవనరక్తము (ఆకాంతతోడ మాటలాడవలయునను) ఆయూహ నంకించికొనెను].

(ఇంతవఱకవాంతరప్రాయముగ నుండిన) బోనోవర్ ఒక్కసారి స్ఫురణకు వచ్చెను; కాని యాస్ఫురణతోడ్తోడన నిర్మూలిత మయ్యెను. ఇంతియగాక,—

అవును, తాను దప్పక బయలువెడలి, యామెను గాంచి, యామెతో మాటలాడవలయును.ఆతని వారించున దేదియు నుండనేరదు.

ఈనిశ్చయము గలుగఁగానే యాతనిభావమంతయు నల్లకల్లోలమాయెను. అనఁదలఁచిన మాటలును, జేయఁదగిన కార్యములును నాభావమున నిండిపోయెను. ఆమెను గూర్చి, యపరిస్ఫుటములు నానందదాయకములు నగు (స్వప్న)వినోదసహస్రములతో భావమంతయు నిబిడీకృతమయ్యెను. ఇది చెప్పుదు నది పల్కుదు నని యారక యాతనిమానసము మహాద్భుతమగు నీయనురాగలక్షణము చుట్టును వలయరేఖలఁ బరిభ్రమించుచున్నది.

ఇన్ని దినములు నామెతోఁ జెప్పకుండుట యెంత తెలివిమాలినపని! తా నేమని యాలోచించుకొనుచుండెను?......"

దీనియందును హృదయమునందలి యాందోళనమును, యౌవనరక్తసహకారమును తోలుతఁ గానవచ్చును. తరువాత 'తప్పక మాటలాడవలయును, వారించున దెద్దియు లేదు' అను తేటయగు కోర్కె బయల్పడెను. ఈనిశ్చయము కలుగగానే యాతనిభావమంతయు భవిష్యద్వినోదములతో నిండి 'వేడుకల్ మదిన్ దొట్టికొనంగఁ' జేసెను. ఈయనురాగ వ్యవస్థ యందుగల యద్భుత మాతనిమానసమును గిఱ్ఱునఁ ద్రిప్పఁజాలి 'అచ్చెరువు తొంగలి ఱెప్పల వీఁగనొత్తు' నట్టు లొనరించెను. నేఁటి హెచ్. జి. వెల్సునకు నాఁటి చేమకూర వేంకటరాజునకును గల భావసాదృశ్యము నారయుట ముదావహముగాదా!

ఇంతకన్న నీవాదమునకుఁ బ్రబలనిదర్శనమక్కఱయుండదు. ఆరక్తసాహాయ్యోద్రేకమే పులకాంకురములకు మూలము. ఈ సాయముకలిగిన కొలందిని రహస్యసంభాషణచింత సన్నగిల్లుచు తుదకదృశ్యమగును. బుద్ధి యొక్కలక్ష్యమునందే నిలుచును గావునఁ దొలుతటి చిందఱవందఱ యేమియు లేక కోరికలు నిర్మలములుగఁ గాన్పించును. కర్తవ్య మొక్కటియే, రహస్యప్రకటనము: అర్జునుని తనవానిఁగాఁ జేసికొనుటయే కార్యము. ఆభావమునే చేమకూర కవి

'కోరికలు తేటలు వెట్టఁగ' నని నిరూపించెను.

ఇట్లు కర్తవ్యతా నిర్ణయము జరిగిన నింకనేమి కలదు? ఉలూచికి తా ననుభవింపఁబోవు వినోదములు, సుఖములు, సంతోషములు, క్రీడలు నొకదానిని నెట్టుకొనుచు నొక్కటిగఁ గంటికిఁ గట్టినట్లగపడుట వింతయా? కావుననే కవి

'వేడుకల్ మదిన్ దొట్టికొనంగ'

నని మానసికావస్థను మిగులఁ జక్కఁగ వర్ణించెను.

ఆరీతి నూహావీథిని, మనోదృష్టినిఁ, జరిగినవేడుకలెన్ని, యానందములెన్ని, విహారము లెన్ని, వినోదము

చెప్పె? లెక్కకుమిక్కిలియయి చూపుమేరపూరమువలె కను గాన్పించుచునుగదా! 'ఆహా! యెంత యానందము!' అని యా ముద్దరాలు మహోత్సుకతంబున తెప్పలల్లార్ప వట్టుకొనే చూచుచుండును యెంత సహజమో యోజింపఁ దగును.

'అచ్చెరువు తొంగలి తెప్పల వీఁగ నొత్తఁగా' నని వ్రాసిన కవిశిఖామణి మానవహృదయ మర్మముల నెఱింగినవాఁ డగాకయుండునా? ఈ మహాప్రపంచమున దాననుభవించుచున్న యా యపరిమితానందమును, ప్రత్యక్షముగఁ బ్రకాశించుచున్న యా యద్భుతదృశ్యమును, నలుసరిని చెప్పటకే తగ నొనరింపఁజాలకుండునా! కావుననే

వెట్టెనపెంచె దీయక వి
ఘేతమ్మురెప్పల జూచె నాతనిన్.

మన్మనోపరిశోధనము నింతసమంజసముగఁ, గన్నచ్చునఁ గనిపించి, ట్టింతయథార్థస్వభావముగ వర్ణింపఁ గలిగిన కవితల్లజులుండగ నాంధ్రప్రబంధకారులకు మానవస్వభావాదివర్ణనలు చేతఁగావని తలంచుట పాడియగునా? ఈయర్థనిరూపణవలనఁ 'దీర్ఘమును బ్రసాదమును' గాక, మూలసూత్రమునఁ గ్రుచ్చిన ముక్తామణులవలె నావిధిన వర్ణనలు విరాజిల్లుచున్నయవి. ఈ యులూచి విజయునిఁ జూచినట్లే పరూధిని ప్రవరాఖ్యునిఁ జూచినపట్టున 'నాంధ్రకవితాపితామహు' డిట్లు వ్రాసెనుగదా!

మనమున్ బుట్టెడుకొంకు లౌల్యమునిడన్,
మోహంబు విస్తీర్ణతన్
గోనపన్, గోర్కులు గ్రేళ్లుద్రిప్ప, మదిమె
చ్చుల్ తెప్పలల్లార్ప, న
త్యనుషంగస్థితి జెచ్చవాటొనఁగ, నొ
య్యారంబునన్ చంద్రికల్
దనుకన్ జూచె లతాంగి భూసురుఁ బ్రఫు
ల్లస్నేత్రపద్మంబులన్.

దీనంగలపూర్వాపర సంబంధమును, గవిగభీరాశయమును, వర్ణితమానవస్వభావమర్మమును సహృదయులు పరిశీలింతురు గాక!

ఎట్టికవికయిన, నెట్టిపాఠకునకయిన నపారప్రమదమును గలిగించు నింతయర్థ మిందుండుటయే చాలునంగుముగదా! ఇంతటితో మనకవి సంతృప్తిగాంచెనా? లేదనియే నాయభిప్రాయము. ఇంచుక సావధానతనారయుఁడు. ఈ పద్యమునందు నాదృష్టి నాకర్షించిన వొంకురెండు పదంబులు గలవు. తెట్టువగట్టుట యను పదము నీటిని దృగ్గోచర మొనరించెను. తేలువెట్టఁగ నను యందును నీరేకనఁబడెను. తొట్టుకొనుటయందును నీరే ప్రవహించెను. తొట్టుధాతువునకు మొదటియర్థము ప్రవహించుట. భారతారణ్యపర్వమున

'......శత్రువీరవ్రజంబున్
దునుమన్ దచ్ఛోణితంబుల్
దొరఁగి మడువులై తొట్టె నయ్యుద్ధభూమిన్'

అనుపద్య మీయర్థమును స్థిరమొనరింపఁగలదు. దాని నుండియే 'వ్యాపించు, నిండు'లోనగు నర్థము లుత్పన్నములయ్యెను. "తొట్టు అనఁగా తాఁకు" అని తమిళము నను దెనుఁగునను గలదు. అయ్యది యుఁ బైయర్థము ననుసరించియే కానోపును. ఇంక తొట్టు అను పదము విశేష్యముగవో దీనికి 'చెఱువులోపలి పొలము' అను నర్థము శబ్దరత్నాకర మొసఁగుచున్నది. ఇట్టుల నీపద్యమున నుదకము నిన్నిసారులు గవిదోఁపింపఁజేసెనుగగా, యుద్దిష్ట మేదేని కలుగునా యని యారయఁ దగదా!

పులకలంకురములనెను. అంకురశబ్దమువలన తృణసస్యాదికములు స్ఫురణకువచ్చును. ఇయ్యవి తెట్టువగట్టుట యెచ్చట? 'చనుగట్టలపై'. సాధారణముగ జలమునఁ గేలుచుండు తృణాద్యంకురములు, గాలిలోనగు వానివలనఁ గలుగు చలనముచేతఁ బోయిపోయి నడుమనుండు కొయ్యకో జాతికో యేదియు లేనియెడల నొద్దనకో యంటికొని తెట్టువగట్టుట స్వభావమును నిత్యదృశ్యమును. కావుననే యిట 'గట్టు' యని కవిసాభిప్రాయముగఁ బ్రయోగించి యీ పులకాంకురములు తెట్టువగట్టుట కాలంబనమును గలిగించెను. అసియాడుటను సూచించి యంకురములను గట్టలచుట్టును తెట్టువ గట్టనిచ్చెను. ఇయ్యది కాకతాళీయమగునా?

జలము నాచ్ఛాదించియున్న యంకురాదికములు కించిచ్చలనమున గట్టలకడ తెట్టువగట్టఁగా, నీరు తేటగఁ

గాన్పించునుగదా! 'కోరికలు తేటలువెట్టఁగ' నని కవి తేటవెట్టుటనుగూడఁ బ్రయోగించెను. ఇట్లు తేటయయిన నీటియందు ప్రవాహసూచకములగు నలలులేనగునవి ప్రత్యక్షమగును గావున వేఁడుకల్ మదిం 'దొట్టుకొనినవి'. వేడుకల్ అని బహువచనము గలదు గావున 'ప్రవాహములు' అనక, 'తరంగములు' అయ్యె ననుట సమంజసము. కావున నీటితలంపు కవికి లేకపోలేదని యంగీకరింపవలయును. ఇంకను సంశయ మున్నవారలకు సందేహనివారణ మొనరింపఁ గవియే యొక్కసాయము నొనరించెను.

వేడుకల్ మదిన్
దొట్టికొనంగ, నచ్చెరువు తోంగలి......

అని యీపద్యమునం దాశ్చర్యమునకు 'అబ్బురము' అనక, (అట్లనిన ఛందస్సున కెట్టిభంగమును గలుగదని పాఠకు లెఱుంగఁగలరు), 'అచ్చెరువు' అని చెఱువును జూపెను. జలాశయమగు చెఱువున శకటరేఫ మనియు నచ్చెరువున లఘురేఫమనియు శంకింపఁబనిలేదు. రెండర్థముల సొగసుగలట్టి పట్టుల నర్థానుస్వార శకటరేఫలు ప్రతిబంధకములు గానేరవని లాక్షణికు లనుమతించిరి. ఈచెఱువు కవిసృష్టి నీపద్యరచనాకాలమునం దున్నదనియే పై నిదర్శనములవలన నిశ్చయమగుచున్నది. ఇట్టులవ్రాసిన నియ్యది వ్యాఖ్యాతృ చమత్కారము తప్ప వేఱుగాదని కొందఱు కడఁద్రోయ నుంకింతురు. కవికీయూహ తోఁచునో లేదో యని కొంద ఱనాదరణము చేయనెంతురు. కాని, చిత్తగింపుఁడు మన చేమకూరవాని తీయందనపు గడుసుపోకడలును, పాఠకులకుఁ జేయూఁత లొసఁగు చమత్కారరీతులును! సుభద్రావర్ణనయందు

ప్రాయపుఁడెక్కునన్ జెలువ
పల్కులు చిల్కల గారవించుఁ, గన్
దోయి చకోరవాళి దయ
తోఁ బెనుచున్, జనుకట్టు మచ్చికల్
సేయు సదారథాంగయుగ
ళిన్, నడలంచల బుజ్జగించు; నా
నేయొడ నింపుగావు గణి
యింప నవీనవయోవిలాసముల్.

అని కవి వర్ణించెను. ఇయ్యది సుభద్ర నవీన వయోవిలాసమున కెంతయుఁ జక్కఁగ నున్నయది. కాని పద్యమునం జిల్లడ చిల్కలు, చకోరములు, జక్కవలు, అంచలు నని పక్షులు గలవు. ఈ కవ్యుద్దేశమును పాఠకు లేమరుదు రను భయమునఁబోలు, కవి వయః అను పదమునఁగల మఱియొకయర్థమునూఁతగాఁ గొని 'నవీన వయః విలాసముల్ = క్రొత్తలయిన పక్షుల యొక్క విలాసములు' అను నర్థమునుగూడ స్ఫురింపఁ జేసెను. ఇట్లు పాఠకసహాయములకుఁ గేలూఁత నొసఁగు నేర్పు మనకవికిఁ జాలఁగలదు అట్టి యభ్యాసమునే గుట్టసియాడె...అను పద్యమునందును గన్పఱచి తన హృదయమునన్న జలదృశ్యమును పాఠకు లేమరకుండ నుండుటకే యబ్బురమునకు 'అచ్చెరువు' అను పదమును ప్రయోగించి మేలొనర్చెను. అట వయఃశబ్దార్థమును గాననివారును, నిచట నీ చెఱువునుజూడనివారును, గవిని సంపూర్ణముగ నెఱుంగలేకపోయిరనియే చెప్పఁదగును. కావున నియ్యది కవికిలేనియూహ వ్యాఖ్యాత కల్పించునదిగా భావింపకుందురుగాక.

మఱియొక్కమాట, అచ్చెరువునకును చెఱువునకును నిట్టి సన్నిహిత సంబంధచమత్కారము కవిదృష్టినిఁ గలుగుట యీపద్యము వ్రాయు సమయముననే కాదు. అంతకుఁ బూర్వ మనేకదినములనుండి యీతనిమనసున కెక్కియున్నది. ఇట్లనుటకు నాకు బలము సారంగధర చరిత్రయందు సారంగధరుని నిష్కారణముగ దండించితిని గదా యని చింతిలి వెదకి యాత్మజునిఁ గాంచలేక,

... ... ... ... ...

"పడు చవి యని తిన నింకఁ గూడునొక్కొ!
తనువు త్యజియింతు"— ననుచు వింతనువువిరాలి
సంపుమెడఁగట్టి భూభుజంసుండు నిండు
చెఱువులోఁ బడఁబోగ నచ్చెరువుగాఁగ.

నాలుగుపాదములయందుఁ గల యమకమునకు నాఁడు పనికివచ్చిన యీ పదద్వయము నేఁ డులూచీమానసిక పరిణామ వర్ణనావసరమున శ్లేషయం దొక్కటియయ్యెను. కావున నీ యర్థము తెచ్చిపెట్టినదిగాక కవికి హృదయమున బుట్టినదియ కా దలంతురుగాక,

# రామచంద్రుని హంపీయాత్ర విమర్శనము

విద్వాన్ కట్టి వేంకటసుబ్బారావుగారు

మ. రా. రా. శ్రీ, విద్వాన్ గంటి జోగి సోమయాజి (యమ్.ఏ. యల్.టి.) గారిచే రచింపంబడిన "రామచంద్రుని హంపీయాత్ర" యను చిన్ని పొత్తము నే నీనడుమఁ జూడఁగల్గితిని. అది యాకారమునఁ జిన్నదైయైనను యందలివిషయములంబట్టి గొప్పదనియేచెప్పనొప్పును. గ్రంథకర్తహంపీశిథిలముల నొక్కసమయంబునంజూచి దానివలన దనమనంబునం బొడమిన భావంబుల ఛందోబద్ధములగు వాక్యంబులందు జొందుపఱిచి యున్నవారు. లోకకావ్యశాస్త్రావ్యవేక్షణమునం గలిగినమనోగతభావంబులనే కవి కావ్యమందు నిబద్ధము గావించును. కావుననే కావ్యమనుపదము రూఢంబయి యున్నది. కవియన నపరసృష్టికర్తయనియు, నాతని సృష్టి కెదురు లేదనియు బండితలోక మంగీకరించినదే? ఒకప్పు డాతనిభావములు లోకవిరుద్ధములై యుండి పాఠకులకు రుచింపకుండును. ఒకప్పు డుత్తమంబులై యెల్లరయాదరంబునకుఁ బాత్రంబులై యుండును. ఏది యెట్లున్నను గావ్యమునందలి విశేషములనెల్ల విమర్శించి పాఠకులకు వానిమంచిచెడ్డల నెఱుకపఱుచుట విమర్శకుని విధి. కావ్యమునందు గూఢంబుగ నడంగియున్న భావములను, గుణదోషములను విమర్శకుఁడు ప్రకటింపకున్నచో నవి మరుఁగుపడి గ్రంథమునకు గల గౌరవాగౌరవముల జేకూర్పఁజాలకుండును. కావుననే కావ్యములకు విమర్శము లావశ్యకములయ్యె.

కవి నోట వచించినదెల్లం గావ్యము గాఁజాలదు. శాస్త్రకావ్యాదిపరిశీలనమువలనను, లోకానుభవమువలనను గలిగినమానసికభావములను సరసమగురీతిని మృదులములగుపదములతో భావకులహృదయములు గఱఁగి యానందమొందురీతిని దెల్పుటయే కవిత్వము. మనప్రాచీనులు కావ్యాంగములుగా శ్లేషప్రసాదమాధుర్యసౌకుమార్యాది గుణములను, గ్రామ్యాదిదోషములను, శైథిల్యాదిదోషములను, ఉపమోత్ప్రేక్షాద్యలంకారములను గల్పించి రసము కావ్యజీవితమని నిర్ణయించియుండిరి. దోషంబులను బెక్కువిధంబులుగ నిర్ణయించి దోషమేదియైనను గావ్యమున నుండరాదనిరి. అట్లు ప్రాచీనులు నిర్ణయించిన లక్షణములనెల్ల మనము పాటించి కవిత్వము సాగించితిమేని దానివలనం బాఠకులకు నానందాపరపర్యాయంబగు రసానుభవంబు గలుగును. ప్రాచీనులు చెప్పినలక్షణంబులందేవేని కొన్నికొఱవడినను చమత్కారాతిశయమున నానందమునుగల్పింపఁగలిగిన నది శ్లాఘ్యకవితయే యగును. గుణాలంకారాదికావ్యాంగము లేవియుఁ బాటింపక కేవలము తమయిచ్ఛవచ్చినరీతిని జెప్పువాక్యములు ఛందోనిబద్ధంబులగుటచేఁ గావ్యంబు లనుపేర బరగినను పాఠకుల గారవమున కెడసియుండును.

కవిత్వము ననుసరించి యే గ్రంథముగూడ మూఁడువిధముల నొప్పుచుండును. గుణాలంకారాదిసర్వాంగములు గలిగి రసవంతమగునది యుత్తమము, రసము గానఁగనుండి గుణాలంకారాదులు కొంచెము కొఱవడినను నది మధ్యమము, రసము లేక కేవలచిత్రములుమాత్రమే కలిగియున్నది యధమము. గుణాలంకారాదులును రసమును గూడ లేక కేవలము నేదేనొకపదము లోకరీతిని ఛందోబద్ధములయియుండుటయు నొకకావ్యమనియు నది యధమాధమమనియు నాధునికు లింకొక్కకావ్యభేదలక్షణమును గల్పించియున్నవారు. ఈ చిన్నికావ్య మేతరగతిలోఁ జేరునో పాఠకు లీక్రిందివిమర్శవలన దెలిసికొందురుగాక!

౧. గ్రంథరచనాప్రణాళిక:— ఈ గ్రంథము "బైరన్" అనుమహాకవి యాంగ్లభాషలో రచించిన "చైల్డు హారోల్డుస్ పిల్గ్రిమేజ్" అను నాంగ్లగ్రంథము ననుసరించి రచింపబడినదనియు నిట్టిగ్రంథము మనయాంధ్రభాషలో

నింతవఱకు లేదనియుఁ గవి వాకొనియున్నవాఁడు. కాని యొక్క యాంగ్లభాషలోనేకాక సంస్కృతభాష యందు నిట్టికావ్యము లేదని చెప్పవచ్చును. కావున మన ప్రాచ్యు లేర్పఱిచిన కావ్యలక్షణము లిందువెదకుట వ్యర్థము. ఐనను నించుమించుగానైన నేలక్షణము లేని గొన్నియైన దీనం బట్టునేమో చూతము: సంస్కృతాలంకారికులు కావ్యములు దృశ్యశ్రవ్య భేదముల ద్వివిధంబు లనియు, నందు దృశ్యంబు లష్టాదశవిధంబులనియు వాకొనియున్నారు. ఇయ్యది లాక్షణికులు నిర్ణయించిన శ్రవ్యకావ్య లక్షణంబులకు దూరంబగుటచే శ్రవ్యంబు గాకున్నయది. దృశ్యకావ్యలక్షణంబులకుం దూరంబగుటచే నదియుంగాజాలదు. కావున నిది యెల్ల భంగుల మనయాంగ్లభాషయం దపురూపముగా నవతరించిన గ్రంథమనియే చెప్పవలసును.

౨. గ్రంథవిషయము:—ఈ గ్రంథము జీర్ణవిజయనగరౌన్నత్యమును దెలుపునదియని కవియే నిర్దేశించియున్నాఁడు. రామచంద్రుఁడను తరుణవయస్కుఁడు; ఇంగ్లీషున పట్టభద్రుఁడై తరువాత గొన్ని సంస్కృత గ్రంథములు చదివి యుద్యోగమున బ్రవేశించి యందధికారులు చేయు నన్యాయములకు గోసి సెలవుపెట్టి విజయనగరశిథిలముల జూడనేగి త్రోవలో గనబడినవిషయంబులను, విజయనగర శిథిలములను జూచినందున జనించిన మనోభావములను ఎవ్వరికో చెప్పుచున్నట్లుఇందు వర్ణింపబడినది. విజయనగర పూర్వ (?) చరిత్రమును బ్రకటించుటయే గ్రంథపరమోద్దేశ్యము కావలెను.

ఆంగ్లాదివిదేశీయభాషలందు గొందఱు కవులు తా మనుభవించిన విషయములనెల్ల నొక్కపాత్రను నిర్మించి యాపాత్రముఖమున లోకమున బ్రకటించుట యాచారమైయున్నది. ఈ గ్రంథమున గూడ గ్రంథికర్త యాదినుండి యంతమువఱకును దన యనుభవమునే ప్రకటించియుండవచ్చునని తలంపనగును. తమయనుభూతవిషయంబుల గావ్యంబులందు జొప్పించుట మనపూర్వకవులకును సమ్మతమే. కాళిదాసు తన యేలికవిజయంబులనే రఘువంశమున రఘురాజు దిగ్విజయములుగా వర్ణించె. శ్రీనాథకవి తనశృంగారప్రియత్వము శివునకునుగూడ నంటగట్టినాఁడు. ఆతనిభోజనప్రియత్వ మాతనిగ్రంథములం దెల్లెడల గోచరించుచునేయుండును. కాని కేవలము తనయనుభవములను మాత్రమే కావ్యముగా రచించునాచారముమాత్రము మనయందు గానరాదు. ఒక్కపింగళిసూరనార్యుకుమాత్రమే శ్రీకృష్ణదేవరాయనిచరిత్రమెల్ల గళాపూర్ణోదయమున నిగూఢముగ వర్ణించియున్నవాఁడు. ఎవ్వరేని దమయనుభవము లోకమున కాదర్శప్రాయ మగునని తలంపున నట్లు రచించుట యుచితము. ప్రస్తుతగ్రంథమునందున్నదో మనము దిద్దుకొని యనుసరింపవగినవిషయ మేదే నున్నట్లు పాఠకులబుద్ధికి గోచరించినం దప్పక దాని ననుసరింపఁదగును.

3. గ్రంథాభిధేయము—ఈగ్రంథమున బ్రధానాభిధేయము జీర్ణవిజయనగరౌన్నత్యమును దెలుపుట యని కవి వ్రాసినదానివలననే తెలుపఁబడినది. ఈనిర్వచనము క్లిష్టముగానుండి సరిగ నర్థముకాకయున్నది. పూర్వము మహావైభవ మనుభవించి యిపుడుజీర్ణమైయున్న విజయనగరముయొక్క యౌన్నత్యము నెఱింగించుట కవియుద్దేశ్యము. ఇప్పటియౌన్నత్యమో, పూర్వౌన్నత్యమో యీనిర్వచనమువలన బాగుగ దెలియలేదు. కాని పూర్వౌన్నత్యమనునర్థము రాదు; ఇపుడౌన్నత్యము లేదు. కావున నీనిర్వచనముసంగతముగ గానరాదు. వాస్తవమున విజయనగరపతనమును దెలుపునని యోగ్యముగ నుండును. ఐనను కవితలంచినట్లే గ్రంథమున బూర్వవైభవము దిఙ్మాత్రమున దెలియుచున్నదేకాని సమగ్రముగ దెలియరాదు. గ్రంథము అటనట గొన్నిచారిత్రకాంశములనుమాత్రముతడవుచున్నది. విజయనగరరాజులచరిత్రముల జదివి విజయనగరశిథిలముల నాలోకించినపుడు తాత్కాలికభావోద్రేకమున బొడమినకవిత్వ మిదియనియు, దీనికి కావ్యమని పేరిడుటకంటె చాటుపద్యములని పేరిడుట యసమంజసమగును.

౪. గ్రంథస్వభావము:—సామాన్యముగా నాకస్మికానుభవమువలన బొడమినకవిత చదువరులకు భావోద్రేకము గలిగించుచుండుట సహజము. చాటుకృతులం దీలక్షణ మగపడుచునేయుండును. ఈగ్రంథమందును "ఇంకనైన జేపట్టవలెం గదా పరమపావనసంస్కృత

గ్రంథజాలముల్ " "విజయనగరాన వెలసినవిజయలక్ష్మి" "నాథుఁడే లేనిదీమహానవమిదిబ్బ," మొదలగువాక్యములు ద్రేకంబు జనింపజేయునని కలవు. కాని యీయుద్రేకము ప్రధానముగా రచింపబడుకృతులందు గ్రంథచిరస్థాయిత కనుకూలములగు లక్షణములు లోపించి యొకపరిచదివిన మరలముట్టుట కిచ్ఛపోకయుండును. అపరాధపరిశోధకనవలలు, యెంకిపాటలు మొదలగునవియెల్ల నాకోటిలోనే చేరినవి. ఇకనీగ్రంథమెట్టిదో పాఠకులేనిర్ణయించుకొందురుగాక!

౫. అపూర్వములు:—ఈకవి యాంగ్లగీర్వాణభాషలనెఱింగినవాఁడగుటచే సాధారణముగ నాంధ్రులకుఁ దెలియని కొన్ని విషయము లిందుఁ దెలిపియున్నాఁడు. వాల్మీకిశక్తి, హోమరు దివ్యశక్తి, షేక్స్పియర్ జీవశక్తి, నయాగరాజలపాతము, రామాయణాబ్ధి యొడిసియస్ వింత చరిత బైరనుకావ్యసరణి, వేగానక్షత్రము, శాకుంతలకథావిధానము, బైబిలుపలుకులు, నీరోయను రోముదేశచక్రవర్తికథ మొదలగు నవ్యభాషాజ్ఞానజన్యములగు విషయములనేకము లిందుఁ దెలిపెను. ఇట్టి విషయము లితరులును గొందఱు తెల్పియున్నారు కాని ఇంత చిన్న గ్రంథమునం దిన్ని విషయములం దెల్పుట యీకవికిగలనైపుణినిఁ దెలుపుచున్నది. ఇది గాక, కవి యాంగ్లభాషలోని భావములను ఆంగ్లపదములనువిచ్చలవిడిగా ప్రయోగించెను.

౬. వింతరచనలు:—ఈ మహాగ్రంథము రచనంబున గవికొన్ని వింతలుకావించెను. సామాన్యముగానొక్కప్రకరణమందున్న నాలుగయిదుపద్యముల కయినను బరస్పరసంబంధముండును. పద్యము లొకదానికంటె నొకటి భిన్నవిషయములం దెలుపుచుండును. ముచ్చటకై చూడుఁడు: విజయనగర పూర్వోన్నత్యము నిప్పటిస్థితియు ననుశీర్షికతో గొన్ని సీసపద్యములు గలవు. ఆ పద్యములన్నింటిచివరను 'విజయనగరాన వెలసిన విజయలక్ష్మి' యనుమకుటము న్నది. ఈమకుటమునకును, పద్యములలోని వర్ణ్యాంశమునకును నొక్కపద్యమందైన సంబంధము గానరాలేదు. ఆ పద్యములు పైకి మనోహరములుగనే యున్నవి. భావోద్రేకమున నాపద్యములు రచింపఁబడినవికావలయు. ఇట్టివింక ననేకములు గలవు.

౭. రామాయణమున పిడకలవేట:—

" కవిరాణ్మండల సార్వభౌమురచనల్
 జ్ఞానమ్ముపక్వమ్ముకా
నివయఃకాలమునందు బాలకులచే
 నిత్యంబువల్లించుటన్
జవిచచ్చు న్మఱి గాళిదాసుడ వద్ది
 ష్టంబొప్ప రాముండు త
త్కవి సంకల్పిత కావ్యరాజముల సం
 తత్ సేర్వఁడా రీతిగా."

ఇది యీకావ్యమునకెల్లఁ దిలకమానికమైనపద్యము. రాముడు రైలెక్కి వెడలుచున్నపుడు కర్నూలు ఫారెస్టులో రయిలురోడ్డుప్రక్కలందు లేళ్లు భయములేకనిలిచియున్నవని వర్ణించి తరువాత కాళిదాసుడు శాకుంతలమున వర్ణించిన "విశ్వాసోపగమా దభిన్నగతయ శ్శబ్దం సహంతే మృగాః." అని వర్ణించుటచే నాతనిని, దరువాత కవుల ప్రతిభను వర్ణించినాఁడు. ఇంతవఱకును చక్కగనేయున్నది. తరువాత నీపద్యమున్నది. ఈ పద్యమునకిక్కడ సంబంధముకాని, ప్రసక్తి కాని యేమికలిగెను? రాముని బుద్ధిచాతురి వర్ణించుటయే కవికి వర్ణ్యమగునేనింతకంటెవింతవేఱొండుండదు. రాముడు రఘువంశాదికావ్యముల వల్లెవేయమి యాతనికిన్యూనతకాని గౌరవముకాదు. వల్లెవేసినవారికికాళిదాసుడన చవిచచ్చునట! ఎంత సత్యము! కవికాని రాముడుకాని సంస్కృతభాష నెఱుఁగ లేదనియేకాక సంస్కృతము చదువువారితో బరిచయమైన చేయలేదని యీపద్యము రుజువుచేయుచున్నది. "కవిసార్వభౌముఁ" డనుటకు "కవిరాణ్మండలసార్వభౌము"డనుట, "కావ్యములు"అనుటకు "రచనల్" అనుట "బాలకులు వల్లించుటచే"ననుటకు "బాలకులచే వల్లించుటన్"అనుట, "కాళిదాసునికావ్యముల పేరుచెప్పిన జవిచచ్చు"ననుటకు "కాళిదాసుడనజవిచచ్చు"ననుట "తత్కవికృతకావ్యమ్ముల"నుటకు "తత్కవిసంకల్పిత కావ్యరాజము"లనుట, అర్థములేని "సంతత్ సేర్వ"డనుటయు నీరాముడు తక్క మఱియెవ్వడును గావింప నోపఁడు. కవి రసానందపరవశుఁడై చెప్పినపద్యమని దీనిని మెచ్చుక తీఱదు. ఇట్టిపద్యము లీపొత్తమునఁ బుట్ట

కొక్కొటివంతుననే నుండును. సంకల్పితకల్పితశబ్దముల కిటు దక్క మరెక్కడ నేకార్థతగల్పింపబడలేదు. దీనినే 'రామాయణమున పిడుకలవేట' యని యార్యు లందురు. ఇంక నిట్టివిషయంబులు గ్రంథమున సర్వతోముఖంబుగ నున్నవికాని వానినెల్ల బేర్కొనుటచే గ్రంథము పెరుగును. ఇక గ్రంథమందలి భాషాస్వరూపమును కల్పనావిశేషములను నించుక చర్చింతము. తొలుత సూక్ష్మబుద్ధిగ్రాహ్యముల దెలిపి పిదప స్థూలదృష్టిగోచరముల దెలిపెదను.

1. ప్రత్యేకప్రత్యేకసంసర్గము:— ఏదో యొక విషయము ప్రథమపురుషమున జెప్పనారంభించినంటనే మధ్యమ పురుషము నుపయోగించుట యీగ్రంథమున బెక్కుతావులం గలదు. ప్రథమాశ్వాసాంతము ప్రథమ పురుషమున ముగింపబడి ద్వితీయాశ్వాసాంత ముత్తమ పురుషమున నారంభింపంబడినది. 3. ఆశ్వాసము ౨3. పద్యము ప్రథమపురుషమునను దరువాతిపద్య ముత్తమపురుషమునను నున్నది. ఇట్టి వింక ననేకము లున్నవి.

౨. అయుక్తరూపకము:— ఆర్యకల్పనాకట్టిమ పంక్తులు. ఇందలిరూపకమునకుం బ్రయోజనమేమి? పద్యపూరణము, నర్థానాలోచనము దీనివలన బ్రస్ఫుటమగుచున్నవి.

3. అనన్వితము, ౨ ఆ. ౭౪ పద్యమున నన్వయములేదు. ఇట్టిపద్యములు పెక్కులు గలవు.

౪. కుసంధి "అక్కడక్కడెపుడేన్" ఆ. ౫౮ పద్యము. అక్కడక్కడకాత్రేడితసంధికలదుకాని ఎపుడుతో సంధి యెట్లు? అక్కడక్కడ ఇకాదులందలిది కాదుకదా? ఇట్టివి పూర్వకవిప్రయోగములు కొన్నియుండుటచే నిది కుసంధియని వ్యవహరింపబడును.

౫. అనవసరప్రసంగము—ఆ. 3-౫౨ పద్యమున రాజమంత్రుల యన్యోన్యానురాగ ముండవలయునని చెప్పుతలంపున మంచిమంత్రి లేమిచే బృథ్వీరాజును సరియైనప్రభువులేమి మంత్రియు నశించిరని తెలిపి వెంటనే తనలాభ మెఱుగక జయచంద్రుడును, తంత్ర మ్మెఱుంగక దర్పించుటచే రాజపుత్రులును నశించిరని చెప్పి మరల మీరలు మంత్రిరాజు లిరువురు నానుకూల్యమున విజయ మందితిరని వర్ణించెను. ఇందు జయచంద్రరాజ పుత్రులప్రసంగ మేమియు బ్రయోజనములేనిది. అనవసరము—వ్యర్థము. 3. ఆ. 3౨ పద్యమందు నిట్లే తొలి మూడుపాదమ్ములందు నాంధ్రుల వర్ణించి నాలవపాదమున నాంధ్రులవిడచి మరల గీతమ్మున నాంధ్రుల వర్ణించె. నాల్గవపాద మసమర్థము.

౬. అర్థపునరుక్తి—"అన్నిగుణములు నిన్నెట్టు లాశ్రయించె కూడియుండని గుణములు కూడెనౌర!" మొదటిపాదమున జెప్పిన యర్థమే యీపెవరొనగూడ జెప్పబడియె. "మలినమ్ము వీడి కాంత్యాలయమగుటచే నమలమైకనుపట్టె" ౨. ఆ. ౧౦ పద్యము. అమలమగుటకు మలినమ్మువీడుటకు నర్థభేదము లేదుగదా? ఇట్టిది ౨. ఆ. ౬. పద్యమునను 'విద్యారణ్యుడె.....విద్యారణ్యసమాఖ్యతో' అనుచోగూడగలదు. ఇంకను బెక్కు లిట్టివి కలవు.

౭. అసమర్థము—'కనకసింహాసనమున గాంతితతి నించు నుపలముల్ హృదయంబు లుబ్బజేయ;' రత్నములనుటకు కాంతినించుఱాలనుట యసమర్థము. ఇట్టివియు ననేకము లున్నవి.

౮. చ్యుతసంస్కారము:— రాజికి న్ననువగు, 3. ఆ. 3౮ ప. ఖడ్గాళికి న్నరయై ౨. ఆ. ౮. ౯. ప. ఈనకారద్విత్వము వైయాకరణు లంగీకరింపరు. కవిప్రయోగములుమాత్రము కొన్నియున్నవి. వ్యాకరణవిరుద్ధముకావున నిది చ్యుతసంస్కారమగును.

౯. ౨. ఆ. ౨ పద్యమున సంబోధ్యు డెవ్వడో, యెందున్నవాడో కనబడండు. దీని నున్మత్తవచన మనదగును.

౧౦. ౨. ఆ. ౮౮. పద్యము నస్పష్టార్థముగ నుండుటచే నపుష్టార్థము, నేయార్థము మొదలగు దోషముల కాకరమై వ్యర్థముగనున్నది.

౧౧ 'భావిశుభోదయంబుసంధిల్లెడుచోన్.' ఆ.౧ ప. ౧౦ కాలవిరోధము. భావి శుభోదయము సంధిల్లుట యెట్లు? భావికాలము సంధిల్లుకాలమును విరుద్ధములు కావా?

౧౨. అజ్ఞాతోపమ:—"చెలికిల్లుకాలాన" "మగ ధ్వనుకాలమందు" "ఎలిజబెత్ పాలనమున" ఈ యుపమా నము లాంగ్లభాషఁ జెనియాంధ్రులకు జ్ఞాతము లెట్లగును.?

౧౩. అసంబద్ధము:— "విశీర్ణ పట్టణవిలీనమహత్త్వము వీడిరమ్మ" మహత్త్వమునేనిది? విశీర్ణపట్టణముదా? పూర్వపట్టణముదా? లేక రాముదా? ఆమహత్త్వమునకు దేనితో సంబంధమో తెలియదు.

౧౪. అప్రయుక్తము:— "జీవమ్మును నాహవమ్మున" జీవమనగా ప్రాణము, జీవనమనగా బ్రతుకుట. ఇట జీవశబ్దము బ్రతుకుట యనునర్థమున నప్రయుక్త మగును.

౧౫. భాషాసంకరము. విశ్రుతవర్తకుల్:— వణిజు లనుటకు వర్తకులనుపదము సంస్కృతముగాదు. విశ్రుతశబ్దము సంస్కృతము; వర్తకశబ్దము దేశ్యము. రెంటికి మిశ్రణము. ఇంక నిట్టివే స్థూలదృష్టికిం దోచు దోషములును మిగులగలవు. వానిని గొన్నింటిని మాత్ర మిందు జేర్కొనియెద. "ముగురును మూడురత్నముల మూల్యాలు" శీర్షికపద్యము. మనుజులకు మూల్యమా? "హూణవిద్యలందు?" ఆ. ౧. ౭ ప. ఎన్ని విద్యలందు? ఒక యింగిలీషుభాషయందే కాదా? "తాతయుతండ్రితాతయు... విజ్ఞాతలునయ్యు" ౧-ఆ. ౭. ప. దీనిలో కర్త యేది? విజ్ఞాత లెవరు? చేసినవా రెవరు? చేయుటకుఁ గర్త లేకుండుట, తండ్రివిద్యోద్యోగములు దెల్పకపోవుట క్రొత్తదోషములు.

"సంస్కృతగ్రంథజాలముల్" ౧ ఆ. ౧౩ ప.
"తద్వ్యగ్రప్రాభవమున" ౧ ఆ. ౪౭ ప.
"సార్వభౌమపదప్రాప్తి" ౧ ఆ. ౯౧ ప.
"మలయానిలపోతప్రచోదితాత్మమై" ౧ ఆ. ౭౪ ప.

ఈ స్థలములందు శేషవిశిష్టములను దేల్చిపలుకకున్న గణభంగమును, దేల్చి పలుకుట సంప్రదాయవిరుద్ధమును నై యున్నది. కొందఱుకవు లగతికముగా నిట్టి ప్రయోగముల నంగీకరించినను నిట్టివానిని బహుళముగఁ బ్రయోగించుట దోష మనకతీఱదు. "ఎల్ల బాసలకును దల్లిని చెప్పోచ్చట నర్పించె దోలుదోల్త నాంధ్రవనిత." ఆ ౧. ప. ౧౧. ఇందాంధ్రవనితయన నర్థమేమో దురూహ్యము. ఏవనిత యర్పించెనో కథ తెలిపిన బాగగును. విద్యాభ్యాసమనుటకు విద్యాటనమనుట సరియా? వృక్షములు పాంథులశ్రమమపహరింపనే యుద్భవిల్లెననుట క్రొత్తవింత "కోడెకన్నియల్" ౧ ఆ. ౫౩ ప. ఆఁడుపడుచునకు కన్నియ యనియు, మగబిడ్డనికిఁ గోడెకాడనియు వ్యవహారసిద్ధములు. పురుషధర్మము స్త్రీలకారోపితము. "వజ్రపుం దునుకలతాళ్ళతోడ" వజ్రములనుట కంతయనర్థపద మేల ప్రయోగించుట. రత్నములన్నియు నిందు రాళ్లేయగుట లోకమునకు క్రొత్త సూచన. "బైలుబో" ఆ.౧-౭౧ ప. ఔపవిభక్తికమిట్లు లయినది. శబ్దస్వరూప మిచ్చవచ్చినట్లు మార్చుట తప్పు. "ఉదయమరీచికావికసితోగ్రథసమమ్ములవాసనాపహుక్" ౧-ఆ. ౭౪ ప. ఇందర్థము మధ్యాహ్నార్కమరీచి కాజలప్రాయము. "పాలునాకృతులబట్టెడు లేఖకులు" ఆకారమును లేఖకులు పట్టుట కనివినియుండము. ఆకారముల యంత్రమున గ్రహించువారు ఛాయారూపగ్రాహకులగు శిల్పులు. వారు లేఖకు లెన్నండును గానోపరు. చిత్రకారులన నించుక బాగుగ నుండును. "గార్హస్థ్యమునఁ బవిత్రీ, విలనీ తేజము శాశ్వతమ్ముగనిధిన్ వెల్గుంగదే" ఆ ౨. ప. ౭ ఇలకు వెల్గుకు యతిదుష్టము. కవిమతమున నిదియు నఖండయతి గానోపునేమో? "సంధ్యాంగతమైన" ప్రాంశుకోసమేసిన యూసు ప్రయోగము సంధ్యాంగతపదము. సంధ్యాగతయని యేనిసంధ్యాంగతయనియేని ప్రయోగించిన లగ్గగును. ఐంద్రజాలికు డనుట క్రిందజాలికు డనుటసరికాదు.

ఇంక నిట్టి దోషోదాహరణంబులు నూఱులకొలది గలవన్న సాహసము కానేఱదు. విస్తరభీతినివిరమింపబడెను.

ఈచిన్నగ్రంథము ముందువత్సరము ఇంటరు మీడియేటుపరీక్షకు పాఠ్యగ్రంథముగా ఆంధ్రవిశ్వవిద్యాలయమువారు నిర్ణయించిరి. విశ్వవిద్యాలయమువారీగ్రంథమును స్థాలీపులాకన్యాయముననైన బరిశీలించిరా యని సంశయమగుచున్నది. వారు పరిశీలించినను వారినిర్ణయమున భాషకును విద్యార్థులకును గలుగులాభము లేవియో పాఠకులు లూహించుకొనగలరు.

# వ్యోషశబ్ద విచారము

వి. వి. సుబ్బారాయశాస్త్రిగారు

పాఠకమహాశయుల్లారా!

వ్యోషశబ్దమును జూచి యేమిటి యీ శబ్దార్థమని భయపడకుడు. ఏ నిఘంటువులో జూచినా త్రికటుపర్యాయపదముగా చూస్తున్నాముగదా? రోగమువల్ల బాధపడు వారికి గాని, అరోచకులకు గాని త్రికటువు లెంత ఉపయోగకారులు? అవి కాకున్న సమస్థితికి తీసుకవచ్చుటకు మరేవి సమర్థత కలిగియున్నవి? అది యటుండనిండు. "పిండ ఖర్జురములచే నుద్వేజితులకు తింత్రిణియం దభిలాష మెం" డనువిధమున, నెల్లకాలము సితశర్కరాద్యశన జడీకృతమైన మీా రసనను త్రికటుపర్యాయపదవ్యోషశబ్ద విచారమున సంతృప్తిని పొందించెదరు గాక.—

వ్యాకరణనిబంధనములయొక్కయు, నభిధానకోశములయొక్కయు టీకలయం దుదాహరణప్రసంగముచే సముద్ధృతము లైన యనేకశ్లోకములు వ్యోషకవికృతములని గాని, వ్యోషకావ్యగతములని గాని తిరోహితవిషయము కాదు. ఆవిషయమున విచారించు పండితు లందరు ననేకవిధములుగ విరుద్ధాభిప్రాయము గలిగియున్నారు. అందు ననేకులు లేఖకప్రమాదమువలన ఘోషశబ్దమే వ్యోషగా పరిణమించిన దనియు, ఘోషశబ్దము "నామైకదేశే నామగ్రహణం సత్యభామా భామేతివత్" అనేన్యాయముచే అశ్వఘోషపర మని వ్రాసిరి. సాహసవంతులైన కొందఱు వ్యోష అన్నదానిస్థానమున ఘోష అనియే ముద్రించుచున్నారు. పురుషోత్తమదేవకృతభాషావృత్తియొక్క ఉపోద్ఘాతమున కీర్తిశేషులైన పండితప్రకాండులు శ్రీశచంద్రచక్రవర్తిగారు వ్రాసియున్నారు. ఘోషశబ్దమే వ్యోషశబ్దముగా పరివర్తితమై యుండ వచ్చును. అశ్వఘోషప్రణీత బుద్ధచరితలో "వ్యోష" అని సముద్ధృతశ్లోకములు కనుపింపకుండుటకు ప్రస్తుతము లభించిన బుద్ధచరితగ్రంథముయొక్క త్రుటితమే కారణము. సమగ్రగ్రంథము లభించిన ఈశ్లోకము లచ్చట నుండవచ్చును అని సుగృహీతనామధేయులగు టి. గణపతిశాస్త్రిగారు తి. వాన్కూరు రాజకీయపుస్తకవిభాగమునుండి ప్రచారితమైన దుర్ఘటవృత్తిగ్రంథముయొక్క సూచీపత్రమున (దుర్ఘటవృత్తౌ స్మృతాః గ్రంథకారాః అన్నచోట) వ్యోషశబ్దమును గాక ఘోషశబ్దమునే వ్రాసి (అశ్వఘోషః బుద్ధచరితకర్తా) అని యున్నారు. అశ్వఘోషప్రణీతశ్లోకములకు వ్యోషశ్లోకములకు నొకేపేరుతో సముల్లేఖము చేసిరి.

"ఇదం పురం తేన విసర్జితం వనం
వనంచ తత్తేన సమన్వితం పురమ్,
ప్రశోభతే తేన హి నో వినా పురం,
మరుత్వతా వృత్రవధే యథా దివమ్.—

తత్యశ్వఘోషప్రయోగాత్" అనుదానిని, "న సంకష్పచ్ఛే గమనాయసత్వరా — ఇతి ఘోషః" అనుదానిని ౭, ౯౭ పేజీలలో సిహూపించుమ వ్యోష అనుదానిని ఘోషచేసి చూపయున్నారు. ఇట్లే మరి కొన్ని స్థలములలో ఘోష వ్యోషశబ్దములు విపర్యాసమువలన కోపజ్ఞులైన పండితుల స్వాంతములు విశకలము లగుటచే వ్యోషస్వరూపనిర్ణయము చేయవలసివచ్చెను. శ్రీ తీశచంద్రచాటర్జీ మున్నగువా రీవిషయమునుగూర్చి వ్రాసియున్నారు. ఆంగ్లమునననుసరించు సంస్కృతము నూతగొని వ్రాయ సమకట్టితిని.

వ్యోషకావ్యసముద్ధృత శ్లోకముల చూడగా నీశ్లోకములు వ్యాకరణసూత్రోదాహరణార్థమై ప్రవృత్తము లైనవని ప్రతీయమానము లగును. అందుచేతనే వ్యోషకావ్యముకూడ భట్టికావ్యద్వ్యాశ్రయకావ్యములరీతిగ శాస్త్రకావ్యము, లేక కావ్యశాస్త్రము కావచ్చును. అట్టివాని పర్యాలోచనసమయమున రావణార్జునీయము, (కాక) అర్జునరావణీయము అను కావ్యము మహాకవి, వైయాకరణవరభట్ట భీమ ప్రణీతము స్ఫురించును. ఆకావ్యమున వ్యోషసముద్ధృతశ్లోకములు చాలభాగము కాన్పించుచున్నవి. అందువలన రావణార్జునీయమే వ్యోషశబ్దవాచ్యము. దీని కీపేరు యెందులకు వచ్చినదో విచారణీయము. కాని దీనికి ఘోషతో యత్కించి ల్లేశసంబంధము కూడ లేదని నిర్ణీతమైనది.

ఇక వ్యోషకావ్యమందు నున్న శ్లోక శ్లోకాంశములు ఆయాశాబ్దికులచే నుదాహృతముల కొద్దిగ చూపి, వానిని రావణార్జునీయమున చూపవలసియున్నది.

౧. ఊర్యాదిచ్విడాచశ్చ — తంత్రప్రదీపంలో "తదాచ వ్యోషః ఊరీకృత్య త్వామ్భృతి స్తస్యపాతం" అని చెప్పబడియున్నది. ఇది ౧౯౦౦ సం.రమున అచ్చుపడిన రావణార్జునీయమున మూడవసర్గలో ౩౭ శ్లోకపాదము. "ఊరీకృత్యత్వామ్భృతా తస్యపాతమ్" అని.

౨. వ్రాతేన జీవతి — భాషావృత్తిలో "వ్రాతినసంఘాః ప్రకటం నరేన్ద్రైః తే రాక్షసాః సంకట మాశునీతాః" ఇతి వ్యోషః, అని యున్నది. రావణార్జునీయంలో ౧౬-వ సర్గలోని ౧౮ శ్లోకార్థము. కాని సంఘాః అను చోట సంగాః అని యున్నది.

3. రజఃకృష్యాది...—భాషావృత్తిలో "యా సంప్రతి ప్రాక్పరిష ద్బలానామ్—ఇతి వ్యోషః" అని యున్నది. ఈ సూత్రము దగ్గరే దుర్ఘటవృత్తిలో "యా సంప్రతి పరిష ద్బలానామ్" అని నామనిర్దేశపురస్సరముగ ౮౬-వ పుటలో వ్యోషకావ్యమునుండి సముద్ధృతమై యున్నది. రావణార్జునీయమున ౧౬-వ సర్గ ౬౫ శ్లోకంలో "ప్రాజ్ఞాత్మనాయాం పరిష ద్బలానాం" అని యున్నది.

౪. ఓజః సహోంభ స్తమస స్తృతీయాయాః—భాషావృత్తిలో "ఇహ తమఃశబ్దః తప ఇతి కేచి దూచిరే-తథాచ వ్యోషః—తమోజ

సా నిర్జిత దేవరాజం దృష్ట్వా రథస్థం తపసాప్త సిద్ధిం, జగ్రాహ రాజా సహసాత్తకోపః చాపాని చారూణిస (శా) సాయకాని" అని యున్నది. కాతంత్రపరిశిష్టంలోకూడ చెప్పబడియున్నది, "అమీస్థానే తిపః పఠన్తిశాక్యాః, వ్యోషకావ్యే ప్యలుకితచేవప్రయుక్తం" అనియు, గోపీనాథ కృతటీకలో "తథాచ వ్యోషేతి, తమోజసా నిర్జిత దేవరాజం దృష్ట్వా రథస్థం తపసాప్తసిద్ధిం" అనియు నున్నది. రావణార్జునీయమున ఈ శ్లోకము ౧౯ సర్గలో ౨ శ్లోకమున "తమోజసా నిర్జిత దేవరాజం దృష్ట్వా.............ద్ధిమ్, జగ్రాహ రాజా సహసాత్త కోపశ్చాపాని చారూణి ససాయకాని" అని యున్నది. అనేకోదాహరణము లున్నను గ్రంథవిస్తరభీతిచే చూపలేదు. రావణార్జునీయమున ఇటుల అనేక సముద్ధరణశ్లోకములు కన్పించుటచేతను, ఘోషకృతిలో నొక్కటేని గాన్పింపకుండుటచేతను రావణార్జునీయమే వ్యోషశబ్దవాచ్యము అని గాని, తత్కర్త వ్యోషశబ్దవాచ్యుడని కాని తేలినది. బహుశః కర్తయే కావచ్చును. కావ్యము కర్తపేర వ్యవహృతము కావచ్చును—భట్టికావ్యముర్తీతిగ.

రావణార్జునీయకర్తనుగూర్చి కొంత తెలిసికొని దీనిని ముగింపవలసియున్నది. దర్ఘటవృత్తిలో శరణదేవుడు క్రీ. శ. ౧౨ శతాబ్దపువాడు వ్యోషశబ్దము పేర్కొనియుండుటచే అంతకు పూర్వ మనవలయును.

ఏతద్గ్రంథకర్తపేరు భట్టభౌమ, లేక భట్టభీమ అని అయియుండవచ్చును. ఇతనికే వ్యోషఅని నామాంతరమో లేక ఇతని కృతియగు రావణార్జునీయమునకు నామాన్తరమో అని అనుకొనవలసియున్నది. ౧౦౨౦ నుండి ౧౦౮౦ వరకు నున్న అనన్తరాజరాజ్య సమయమున కాశ్మీరమున నివసించియున్న వ్యాసదాసను నామాంతరముగల క్షేమేంద్రుడు తన 'సువృత్తతిలకము'న తృతీయ విన్యాసారంభమున—

"శాస్త్రం కావ్యం శాస్త్రకావ్యం
కావ్యశాస్త్రంచ భేదతః,
చతుష్ప్రకారః ప్రసరః
సతాం సారస్వతో మతః.
శాస్త్రం కావ్య విదః ప్రాహుః
సర్వకావ్యాంగలక్షణమ్,
కావ్యం విశిష్టశబ్దార్థ
సాహిత్యసదలంకృతి!
శాస్త్రకావ్యం చతుర్వర్గ
ప్రాయం సర్వోప దేశకృత్,
భట్టి భౌమకకావ్యాది
కావ్యశాస్త్రం ప్రచక్షతే."

భౌమకుని పేర్కొనియున్నాడు. బహుశః అతను. నితను పేర్కొనిన యతను నొక్కడేమైయుండవచ్చును. ఎందుచేత ననగా—"భౌమక కావ్యాది కావ్యశాస్త్రం"అని చెప్పియున్నాడు క్షేమేంద్రుడు. ప్రకృత రావణార్జునీయమున కూడ అష్టాధ్యాయి సూత్రోదాహరణలు యథాక్రమముగ నుండుటచే కావ్యశాస్త్రత్వము స్ఫుటమే.(యుద్ధకథావర్ణనాత్మకముగాన

కావ్యము, క్రమముగ సూత్రోదాహరణాత్మకము గాన కాశికాదులవలె శాస్త్రము). కాగా క్రీ. శ. ౧౧-వ శతాబ్దమునకు పూర్వమే అని తోచుచున్నది.

కవి యెప్పటివాడో సరిగా నిర్ణయించలేము. సరియగు నాధారము లేవియు కానరావు. కాని కొందఱు కాశికకన్న పూర్వమనిరి. ఆహేతువును గ్రహించినచో భాష్యముకన్న పూర్వ మనవలసివవచ్చును. అది సంభవించు విషయము కాదు. కాన కాశికకంటె నవీన మనవచ్చును అని పల్కుచున్నారు.

భట్టభౌముడు కాశ్మీరదేశస్థునివలె గాన్పించుచున్నాడు. కాశ్మీరదేశములలో నితనిని పేర్కొని యుండుటచేతను, ఈతని కావ్యమచ్చట దొరకుటచేతను, "కాశ్మీరిక భట్ట భీమవిరచితే........" అని సర్గాన్తమున నుండుట చేతను, పైయూహ సరియైనదే కావచ్చును. కాని సర్గాన్తములలో ననేకవిధములుగా కనిపించుచున్నది. "మహాకవి భట్ట భీమకృతే", "కాశ్మీరిక భట్ట భీమవిరచితే", "శ్రీరావణార్జునీయే కావ్యే", "ఇత్యర్జునరావణీయే మహాకావ్యే మహాకవి భట్ట భీమకృతే", "ఇత్యర్జునరావణీయే మహాకావ్యే వైయాకరణవర భట్టభీమకృతే" అనువిధముగా నున్నవి. ఏది యెట్లున్నను కావ్యము రావణార్జునీయము, లేక అర్జునరావణీయము అనుపేరు గల్గియున్నది. గ్రంధకర్త భట్టభౌమ, లేక భట్టభీమ అను నామము కలిగియున్నాడు. ఈ గ్రంధమునకు గాని లేక గ్రంధకర్తకు గాని ఘోషశబ్దవాచ్యత్వ ముండవలయును. ఎందువల్లనో యాపేరు నశించినది. నిజస్థితి మాత్రము తెలియకున్నది. కాని ఘోషశబ్దమునకు ఘోషశబ్దమునకు యత్నించి లేశసంబంధము కూడ లేదని తిరుగ మనవిచేసి విరమింతును

---

## మా చందాదారులకు

మా కార్యాలయమునకు వ్రాయు ఉత్తరములు మొదలయినవానియందు తమ 'చందాదారు' సంఖ్య వ్రాయవలెను. లేకున్న ప్రత్యుత్తరములు మొదలయిన పనులను జరుపజాలము. చందాదారుసంఖ్య భారతి కవరుకాగితముపై తమ విలాసమునకు ముందున్నది. చందాదారులకు భారతి ౧౨-వ తేద లోపల అందకపోయిన యెడల వెంటనే తపాలువారికిని, మా కార్యాలయమునకును తెలుపగోరెదము.

— మేనేజరు, 'భారతి.'



౫. బీద్రిసామానులు

అ



ఆ



౬. అ. బౌద్ధ ధర్మచక్రము
ఆ. పర్షియను లిపి

అ ఆ



౭. అ. రాతిగొడుగు
ఆ. గాంధార శిల్పచిత్రము



ఏకచక్రయానము

ప్రకృత మములున నున్న మోటారుకారును, ఏకచక్రికయును నిందు గలవు.

డా. జె. ఎ. పర్‌వెస్‌గారు క్రొత్తగ తయారుచేసిన ఈయానము గంటకు ముప్పదిమైళ్లు పోగలదు. G. S. A.

# ఓ బయ్యా

వేలూరి శివరామశాస్త్రిగారు, శతావధాని

[అనువృత్తము]

౬

వసుమతి చీటిలో రెండే వాక్యములు:—

ఒకటి, నేను చదువు మానను. రెండు—, మీరు మానుటకును వీలు లేదు.

అహోబలుఁ డీరెండు వాక్యములను రెండుగంటలసే పాలోచించెను. తాను వేసికొనిన పునాదు లూఁగి వడిసివచ్చెనని నిర్ధారించుకొనెను.

ఈపాటి కేఁబండ్రు అఱువండ్రు బాలుర సమము సింహాసనమయి యుండవలసిన కుర్చీ ఆగదిలో దండ్యునివలె గోడకు నిలువఁబడి యుండెను. పల్లెటూరివా రందఱకును ఆశ్చర్యమును కలిగింపవలసిన స్టవ్ మొద్దమ్మాయి వలె మూలఁ గూరుచుండెను.

అం దొకసాయంకాలమున గడియారపు దుకాణముకడకు వెళ్లెను. దుకాణాదారు అతనిని జూచి చిఱునగవుతో 'ఇదిగో మీగడియారము సిద్ధముగా నున్నది' అని చేతి కందిచ్చెను. అహోబలుఁడు గడియారము చెవికడ నిడికొనెను. 'ఇది యంతయు టక్కు—' అను నటు లది టక్కు—టక్కు— మనుచుండెను.

'అలారము సరిగా నున్నదా?'

'గడియార మొకటి, చాకిమడత యొకటి, విప్పినచో సరిగా పెట్టుట కష్టతరము. మీరు విప్పక సూటిగా మాకడకుఁ గొనిరండు! బాగుపడును. ఇపుడు పరీక్షించి చూచికొనుఁడు.

'మీరు చెప్పినచో మరలఁ జూచుకొనవలసిన పని యుండదు.

దుకాణాదారు మాటాడలేదు. అహోబలుఁడు రెండుమూఁక లొసఁగి గడియారముఁ గైకొని ఆయంగడి నవమానమునుబలె దాఁటి పోయెను. గడియారము గూఁటి నలంకరించెను.

అతఁడు మంచిరోజు చూచుకొని స్కూలునఁ బ్రవేశించెను. 'ఫ్రెంచ్ లీవ్' అని యొకఁడును, 'స్కాట్ ఫ్రీ' అని యొకఁడును, 'మేఘసందేశ' మని యొకఁడును అతనిని గేలిచేసిరి. అతఁడు వాని నన్నిటిని నూతనానుభవములక్రిందఁ జమకట్టుకొనెను.

సెలవులలో నతఁ డింటి కేఁగెను. వీరవెంకమ్మ క్రొత్తపిండివంటలకు నంకురార్పణము చేసెను. దక్షిణాది-చీరలు కొనెను. పట్టంచులబట్టలు విలిచెను. ఈసంరంభ మంతయుఁ జూచి యహోబలుఁడు 'ఇది యంతయు నెందులకు?' అని ప్రశ్నించెను.

'కోడలు రాఁగలదు.'

'తానే వచ్చునా? లేక నీవు కబురంపితివా?'

'తనంతట తాను రాఁగూడదా? లేక నేను కబురంపఁగూడదా? రెండును జరుగవచ్చును. సరి కాని, యీ యాఁడుగోడంతయు నీ కేల?'

'ఎపుడు వచ్చును?'

'ఎల్లుండి.'

'అమ్మా! దానిని కెసికొని రావలదు' అని కుమారుఁడు పలికి ప్రత్యుత్తరము విననోల్లక యచటినుండి వెళ్లిపోయెను. ఈ మాటలో నెంత వంత యున్నదో, యీ వెళ్లిపోవుటలో నెంత యశాంతి యున్నదో యాతల్లి గమనింప లేదు. 'నేఁటి కుఱ్ఱవాండ్రతీరంతయు వింతయే. వారి పుస్తకము లేమో వారి బడి యేమో కాని యిల్లు వాకిలి తల్లి పెండ్లాము ఈ మొదలగు విషయములు వారిమది కెక్కవు. పూర్వులందఱును 'పెండ్లా మెపుడింటికి వచ్చునా?' యని బెంగపడిపోయెడివారు. ఈకాలపువారికి పెండ్లామే యక్కఱలేదు. ఆకాలపుప్రేమ లెక్కడ? యీకాలపు ప్రేమ లెక్కడ? అంతయురైలుబండి. ఒకటే గబగబ! ఒకటే తొందర!' అనుకొనుచు తనపనికిఁ దాఁ బోయెను.

ఆమఱునాఁడు వసుమతికొఱకు పురోహితుఁడు పూర్ణయ్యసిద్ధాంతి వెళ్లెను. కూఁతునత్తింటికిఁ బంపుటలో సోమమ్మకును కైలాసరావునకును వాదప్రతివాదము లాయెను. క్రొత్తగా ఈడేఱిన వసుమతితో వెళ్లుట కాఁడుతోడెవరును లేరు గావున నిపుడుపంపరాదని సోమమ్మ వాదము. 'నీవు వెళ్లఁగూడదా?' అని కైలాసరావువాదము.

పదియేండ్లవెనుక నిమ్మళించిన క్షయ కైలాసరావున కిపుడు బయలుచూపెను. 'ఇట్టి స్థితిలో నే నెటులు వెళ్లఁగల నని సోమమ్మ వాదము.

వసుమతి యీవాదప్రతివాదముల నాలకించెను. వారినడుమకు వచ్చి, 'నాకు తోడెవరక్కఱలేదు. నేనే వెళ్లి వచ్చెదను' అనెను. కైలాసరావుముఖము కలకలలాడెను. సోమమ్మ ముఖము దుమదుమలాడెను. వాదప్రతివాదములు ముగిసిపోయెను. పూర్ణయ్యసిద్ధాంతితో వసుమతి యత్తిల్లు మెట్టెను. వసుమతి రైలు దిగఁగనే అహోబలుఁ డింకొక రైలుమీఁద గ్రామాంతర మేఁగెను.

గ్రామములోనికి క్రొత్తకోడలు వచ్చినను మోటారుబండి వచ్చినను ఒకటే సందడి. బూరా యూఁదువాఁ డొకఁడు, చక్రము లొత్తువాఁ డొకఁడు. బండి యెక్కువాఁ డొకఁడు, బాటరీ త్రిప్పువాఁ డొకఁడు. క్రొత్త కోడలి కన్నుచూచువా రొకరు, ముక్కు చూచువా రొకరు. మొగము చూచువా రొకరు మూతిచూచువా రొకరు. వస్తువు నందఱును నాణెముచేసిరి. పద్మము లేకున్నను లక్ష్మి నివసించిన దనిరి. ఇది ప్రధానాభిప్రాయము.

పిదప లేఁతమాటలు రాలేకపోలేదు. ఇంగ్లీషు చదువునఁ బడఁగనే ఆఁడుదానికి మీసకట్టు వచ్చునని యొక యమ్మ యనుకొనెను. పెండ్లి కాకమునుపే ఒకస్నానము చేసినదఁట యని యొకతె యనెను. కాలు పొడుగు గాని చిన్నదే యని యొకయామె యనెను. చిన్నదఁట, ఏమిచిన్నది? కార్యము చేయుచో ఈపాటి కొడికనిండ బిడ్డ లుండవలసినదని యొకయామె యనెను.

నీలకంఠావధానులు రెప్పవాల్పక చూచి చూచి, 'వీరవెంకూ! నీకొఁఅంత తీరినదమ్మా' యని ప్రశంసించెను. పేరిశాస్త్రిచూచి, 'పిల్ల లగ్గమునకు మొగము వాచుకొన్నది' అని చెవిలో చెప్పెను. రామసోమయాజులు చూచి గుండె బాఁదుకొని, 'పిల్ల కాదురా, ఫైల్మాన్' అనుకొనెను.

క్రొత్తకోడలు బజాఱున అమ్మకమునకుఁ బెట్టిన వస్తువు. విమర్శనీయమగు నూతన కావ్యమో లేక నాటకమో! ఎవరికిఁ దోఁచిన మాటలు వా రాడిపోవుటలో నెవరికిని సంకోచము లేదు.

ప్రదర్శనశాలలోని క్రొక్రొత్త జంతువు వచ్చినపుడు మనుజులు గుమిగూడి చూచిపోయిన చందము వసుమతికి గుఱుతు వచ్చెను. వసుమతి పల్లెటూరి పిల్లయే కావున ఈ చూడవచ్చినవారి వ్యాఖ్యానములను టీకలను శాంతముగనే గ్రహించెను. వసుమతికి తన యత్తింటి సంగతు లన్నియు బోధపడెను. ఆమఱునాఁడు వసుమతి తనయత్తగారి పను లన్నియుఁ దానే నవరింపఁదొడఁగెను.

'తలపాగ పెట్టుకొని ఆఫీసుకు వెళ్లుదు వనుకొంటిని గాని గరిటెగూడ చేతఁ దొడగఁ గలవటమ్మా? ఇవి నేర్చుకొనుటకు నీకు తీరిక యేదది తల్లీ?' యని అత్తగారు కోడలిని ప్రశ్నించెను. వసుమతి మాటాడక తనపనులు తాను జూచుకొనుచుండెను. వీరవెంకమ్మ కోడలికరకౌశలమును అబ్బురముగాఁ జూచుచు నిలువఁబడెను. తా నీ యింటికి క్రొత్తగా కాఁపురమునకు వచ్చిననాఁటిముచ్చటలన్నియు వీరవెంకమ్మ మనోదర్పణమున బింబితము లగుచుండెను. ఆమె యాపాదమస్తకము గగురు పొడిచెను. కనులలో బాష్పము లుదయించెను. ఆమె వెనుదిరిగి కన్నీరు తుడిచికొనెను. ఈలోపుగావసుమతిచాలఁ బనులుచేసివైచెను. వీరవెంకమ్మ కోడలిని జూచి, 'కోడ లత్తయయినది. అత్త కోడలయినది' అనెను, వసుమతి చిఱునవ్వుతో 'ఈ పూఁట నేను వంట చేయుదు' ననెను. అత్త పక్కున నవ్వి, 'నాకును నీ చేతిపాకము రుచి చూడవలయునని తొందరగనే యున్నది; కాని, ఇదిగో వసుమతీ! ఇంగ్లీషు బడులలోఁ జదువువారికి మనకు ఆచారములని కొన్ని యున్నవనియే తెలియదు. కాని నీకు తెలియుట కెంతకాలమో పట్టదులే! కన్నె చెఱ నెంత వదలించుకొనిన అంత వడిగా నీవు నాకు రుచి చూపఁగలవు' అనెను.

అత్తగారు వంటయింటిపెత్తనము వహించి కోడలికి గది చూపెను. వసుమతి గదిలోఁ గూరుచుండెను. తాను రాఁగనే భర్త తఱలి పోవుట అపుడు వసుమతికి లెస్సగా నాటెను.

సంసారము, బడిచదువు, 'తండ్రిశిక్ష యీ మూఁడును వసుమతిమానసమున ఆవర్తముల వలెఁ దిరుగఁజొచ్చెను. సంసారము సాపేక్షము. బడిచదువు ఉదరపూరకము. తండ్రి శిక్షణము శాంతి కపౌష్టికము.

విసంవాదముతో గృహప్రవేశము. గృహప్రవేశముతో పతివివాసము. ఈయపశ్రుతిలో అత్తగారి ప్రేమాలాపము జీవగఱ్ఱ.

వసుమతి ప్రకృతవిషమస్థితిలో నొక్కొక్క విషయమునే వేఱువేఱుగా నాలోచింపఁ గడఁగెను. ఎంత యాలోచించినను ఆదియే గాని యంతము లేదు. ఒక్కొక్కవిషయ మొక్కొక్క రస్తా. ఆరస్తా బ్రహ్మాండమంతయుఁ జుట్టఁబెట్టి మఱల మొదటికే వచ్చి కలియుచుండెను.

వీరవెంకమ్మ వసుమతిని భోజనమునకుఁ బిలిచెను. అత్తయుఁ గోడలును భుజింపఁ గూరుచుండిరి. అత్త యిటులనెను—'అమ్మాయీ! నేను పెద్దదాన నయితిని. ఇఁక ఈయింటిభారమంతయు నీది. నేను గృహదేవతను, మీరు ఉత్సవవిగ్రహములరు. మీ నాయనగారా క్షయకు గుఱియయిరి. మావాఁ డాయిఁకవ్యవసాయము వేదాయము చూచుకొనవలయును. నీ వింకను బడి నంటిపెట్టుకొనియుంట తగదు. ఇప్పటికే నిన్నందఱును అనరానిమాట లను చున్నారు. ఏమందు వమ్మా? నామాటకు మాఱుమాట చెప్పవని నాకుఁ దెలియును.'

కోడలు మాఱుమాట చెప్పలేదు. 'సమాధానము లేదా' యని యత్త యడిగెను. కోడలు మాటాడలేదు. అత్తగారిముఖము గంభీరమాయెను. ఆమె చేయి విదిల్చి అన్నము విడనాడి లేచెను. కోడలును లేచెను. లేచి పను లన్నియుఁ జక్కఁబెట్టెను. వీరవెంకమ్మ ఆపసోపాలుపడుచు వంటయింటనే పయఁట పఱచెను. వసుమతి గదిలో శయనించెను. అచట నున్న ప్రతివస్తువును పరికించెను. కుంకుమాలంకృతమయిన వీరాంజనేయవిగ్రహ మొకటి వసుమతి నాకర్షించెను. ఆంజనేయుని గాథలఁ దలఁచికొనుచు నట నిదురించెను.

ఉన్న మూఁడురోజులును అత్తకోడండ్రకు మఱి సంభాషణ లేదు. తెచ్చిన వస్త్రములు తెచ్చినటులనే యుండెను. వసుమతి వచ్చిన చందముగా వెళ్లిపోయెను. అత్తగారు చూచుచుండఁగా వీరాంజనేయ విగ్రహమును వసుమతి తనపెట్టెలోఁ బెట్టుకొనెను.

వసుమతి యిటు వెళ్లఁగనే అహోబలుఁడటు వచ్చెను. అహోబలుఁడు రాఁగనే వీరవెంకమ్మ 'నాయనా! కోడలు నీ వీరాంజనేయము చూచి చాల మెచ్చుకొన్నది. తీసికొని వెళ్లు' మని ఇచ్చితి ననెను.

అతఁ డీమాట కిష్టానిష్టము లేమియుఁ గనఁబడనీయలేదు. తల్లికిఁగూడ దాఁపఁదగిన

వింత యొకటి కుమారుని మనస్సునఁ దూఱిన దని వీరవెంకమ్మ యనుకొనెను.

౧౦

అమ్మవారిని ఓలలాడించి యింటికి వచ్చు ముత్తైదువులవలెను, పీరులను బంపి వచ్చు ముసలమానులవలెను బాలు రందఱును బడులకు వచ్చిరి.

అహోబలుఁ డితూరి మిగుల నోపికతో వ్యాసంగము చేయఁదొడఁగెను. 'పాఠము రావలయును; కడుపు నిండవలయును' అని యతఁడు శపథము చేసికొనెను. అతఁడు వల్లింపఁ గూరుచున్నచో టఱిగిపోఁ దొడఁగెను. చెమటకుఁ దడిసి కాకితము చినుఁగఁ బాఱును. అప్పటికి పాఠము వచ్చును. పిదప నన్నము తినును. చేయి కడుగుకొనఁగనే ధారణయు తూష్ఖీత మయినటు లగును. అతఁడు క్రమ్మఱఁ జదువును. వల్లించుచునే బడికిఁ బోవును. పాఠము నెటులనో యప్పగించును. ఉపాధ్యాయుఁ డుపన్యసించున దతని కయోమయము. అవమాన మనుకొనక అతఁడు ప్రశ్నించును. చివాట్లు తినితిని బోధపఱుచుకొనును. బడినుండి పోవుచు మననము చేయును. గదిమెట్లు ఎక్కఁగనే యదియంతయు వమనమయిపోయినటుల గును. దుర్బలమగు నెద్దును గానుగకు కట్టినచో నెటులీడ్చు నని యతఁడు లోలోపల ననుకొనెను.

ఉపన్యాసరంగములం దహోబలుఁడు పలుమాఱులు ప్రాణాయామ పరాక్రమము వినియుండెను. తెలవారుజామున నేసాము చేసిన పిదప స్నానమొనరించి యతఁ డిపుడు ప్రాణాయామమునకుఁ గూరుచుండును. నీటివేళ దాఁటినపిదప నల్లీని త్రిప్పినచో నది యొక ధ్వనిచేయును. గుడుగుడు పీల్చుచో నొకకలరవముదయమగును. అతఁడట్టిధ్వనితో గాలిని లోనికిఁ బీల్చును. పొట్టపడునటులు ముక్కు మూసికొనును. ఊపిరితిత్తులు క్రిందట్టు మీఁదట్టగును: గుడ్లు ప్రత్తికాయ లగును. ఉబ్బిన నీళ్ళు గట్టుత్రెంచుకొని పాఱినటులు శ్వాసలు గుండెలతోఁగూడ బయటఁబడును

ఇటు లొక యరగంట గాలితో గరిడీ చేసి యతఁడు పుస్తకము చేతఁబట్టును. అక్షరములన్నియు నతని కేకాకారముగా గానిపించును; సొక్కువచ్చును. అప్రయత్నముగా నిదిరించును. పిదప గాలి లోనికివచ్చుట యొకయెత్తు; బయటి కేఁగుట యొకయెత్తు. అతఁడు లేచి దగ్గును. ఈరీతిగా ప్రాణాయామముచే పుస్తకము విడనాడుట యటుండఁగా శరీరమును గూడ విడనాడవలసినపని పట్టె నని యతఁడు తెలిసికొనెను. ఆనాఁడే ప్రాణాయామమునకతఁడు తిలోదకములు విడుచుకొనెను.

ఆఁడు దని సరస్వతి నహోబలుఁడు పూజింపఁడు. గణపతి గజ మని కాసునకుఁ గొనఁడు. హయగ్రీవునిది గుఱ్ఱపుఁ జదువని పెదవి విఱుచును. బ్రహ్మ యతనికి విద్యాపతి. అతఁడు తన మొట్టమొదటిగోడకు నలువ చిత్తరువును నిలువఁదీసెను. అతఁ డర్పించు గంధమాల్యములతో చిత్తరువు లోపించెను.

ఈప్రాజులచే కాలమునందు వ్యయము మాత్రము అతనికిఁ గానిపించుచుండెను గాని విద్యలో మాత్రము ఆయము కానిపించుచుండుటలేదు. గ్రుడ్డివాఁడు కావున మిల్టను విద్యాదేవతను కొండపుకొనెనని యతఁడు తెగడెను. సరస్వతిని స్తవ మొనరించిన విట్‌మన్ అతనికి వెర్రివాఁడు. మఱునాఁడా చిత్తు రుప్ప ముక్కలుముక్కలయి మునిసిపాలిటీ ఖజానాలో నిలువ పోయెను.

ఒకనాఁ డతఁడు యతుల కొఱకును, ప్రాసములకొఱకును అప్పకవీయము నవలోకించుచుండఁగా కర్మము చాలక కవితారసాయనములు కంటఁబడెను. బాగుగా పరిశీలించి దినుసులపేరులు వ్రాసికొని ఒకరూపాయ డబ్బులు జేబుఁ వేసికొని బజారునకుఁ బోయి వసయుఁ దేనెయు బెల్లమును గొని గదికి వచ్చి మెత్తగా నూఱి తాల్చి వస్త్రగాళిత మొనరించి కలిపి రెండు పెద్ద పారణ-ముద్దలు చేసెను. దీపము జేగంటవలె నుండెను. పుస్తకముల నిటులు నమిలి మ్రింగవలయు ననునటులు అతఁడు పుటలు విప్పి చదువుకొనుచు వస ముద్ద విఱిచి నమిలి మ్రింగఁదొడఁగెను.

'అబ్బా! బెల్లము తక్కువ యయినది' అని యతఁడు మఱి కొంచెము బెల్లము కలిపి మరల మ్రింగెను. ముఖద్వారము మూసికొనెను. ఇంత తేనె కలిపెను. ముద్ద పలుచబడెను. కొంచెము వసయు బెల్లమును గలిపి ముద్దకట్టు సరిగాఁ జేసెను. పిదప పుస్తకము చూచుచు వసముద్ద మ్రింగుచు, వసముద్ద మ్రింగుచు పుస్తకము చూచుచు, ఓకరించుచు సహ్యాము చేసికొనుచు, సహ్యాము చేసికొనుచు ఓకరించుచు, గూర్ఖ్రించుచు అడఁచుకొనుచు, అడఁచుకొనుచు గూర్ఖ్రించుచు రెండుజాములగునఱకు రెండు ముద్దలను మ్రింగి కూరుచుండెను అటుపైని పుస్తకము భూమ్యాకాశములు చీఁకటివెలుఁగులు ఏకమయి పోయెను. చేతితో నెవరో అంత్రమును దేవినటులుండెను. హఠాత్తుగా వాంతి సూచిత మాయెను. అతఁడు దమించుకొనెను. అతఁడు చాలసేపు జీర్ణకోశముతో పోరాడెను. వస నైనసము కాలేదు. తుద కతఁడా విద్యారసాయనము నంతయు వెడలఁద్రోలవలసివచ్చెను. బొడ్డు నుండి నోటిదాఁక నొకటే వసకంపు. అహో బలుఁ డంతయు వసాగంధుఁడయిపోయెను. అతనికి గ్లాని హెచ్చెను. కనులు లోనికిఁ బోయెను. ముఖము చెమట చెలమయాయెను. శయ్యాపయిఁ బడెను. వస యంతయు బయటఁ బడినపిదప నతఁడు నిదురఁబడెను.

అతఁడు పదిగంటలకు లేచెను. వస గుఱుతువచ్చెను. బుద్ధి బరువాయెను. విద్యారసాయనమున కుపవాసమే విఱుగుడని నిశ్చయించెను. కోలుకొనుటకు కొన్నాళ్లు పట్టెను.

అతఁడు వసుమతిమీఁద కారములు మిరియములు నూఱెను. చిన్ననాఁటఁ దనకుఁ దిన్నగా వసపోయలేదని తల్లిని తిట్టుకొనెను. వసుమతికి మరల నొకలేఖ వ్రాసెను. దాని

కెన్నాళ్లకును ప్రత్యుత్తరము రాలేదు. దాన వసుమతి బడి మానియుండు నని కొంచెము నిశ్చయించెను. సందేహముమాత్రము సమయలేదు. గడియారమును గాంచెను. పది. రైలుకు బయలు దేఱెను.

ప్లాట్ఫారముమీఁద నొకపిట్టయేని లేదు. రైళ్లుమాఱినవేమో యనుకొని స్టేషనులోని కేఁగి గడియారము చూచెను. పండ్రెండు. అతనియొడలు మండుకొనిపోయెను. వెనుదిరిగి వచ్చెను. గడియారమును గోతవయిచెను.

ఆమఱునాఁడు కాకినాడకు రవాణా యాయెను. స్కూలుగోడలప్రక్క నక్కినక్కి కూరుచుండెను. ఒంటియెద్దుబండి యొకటి వచ్చుచుండెను. దాన నలుగురు బాలికలు కలరు. వారు గేటుగడ దిగి పుస్తకహస్తములతో లోనికిఁ బోవుచుండిరి. అహోబలుని హృదయమున నొక సుడిగుండము గిర్రునఁ దిరిగెను. అహోబలుఁ డచటనే కూరుచుండి దుఃఖించుచు ఆలోచించుచు, ఆలోచించుచు దుఃఖించుచు నుండెను.

అహోబలుఁ డిటులు దుఃఖించి యాలోచించి, యాలోచించి దుఃఖించి యత్తెత్తిచూచు వఱకు బడినుండి బాలురందఱును వెళ్లిపోవు చుండిరి. తుట్టతుదకు పదిమంది బాలికలలో రాణివలె వసుమతి నడచిపోవుచుండెను. ఒక సౌందర్య తరంగ మాకాశమును ముంచి గాలిలోఁ బోయెను. దాన నహోబలుఁడు ముగ్ధుఁడై పిదప శాంతుఁడై తిరుగురై లెక్కెను.

అతఁ డొకనాఁ డిటులనుకొనెను.— మన చదువు వేదము కాదు, శాస్త్రము కాదు, భూగోళము, చరిత్రము. వీని నెందులకు కంఠపాఠ మొనరింపవలయును?

అతఁడు వల్లన మానివయిచెను. గుఱుతిడికొను టలవాటు చేసికొనెను: దానితో బుద్ధిపయి శ్రద్ధ కలిగెను. అతఁడిపుడు మఱపు గుఱుతులనడుమఁ బడెను. క్రమక్రమముగా గుఱుతుమడి యండెను. మఱపు దోటున గుఱుతు ఆదిష్టమాయెను. ఇపుడు ప్రవాహము నందు కొంచెము కొంచెము కాలూనఁదొడఁగెను.

లోఁగడ ఆంధ్రోపాధ్యాయునిమొదలు ఆంగ్లోపాధ్యాయునివఱకును అహోబలున కెద్దు ముద్దు చూపిరి. ఆంధ్రోపాధ్యాయుఁడు మహిష శతక మంతయును వినిపించెను. ఇతఁ డీకఁ బనికిరావచ్చు నని ఆంగ్లోపాధ్యాయుఁడుకూడ ననుకొనెను.

విద్యార్థులలో పెద్ద కలరవ మొకటి బయలుదేఱెను. అహోబలుఁడు పరీక్షకుఁ బంపఁబడియెను. నాయకుఁడు హాజరుకాలేదు గాని బాడ్మింటన్ కోర్టుముందు టీపార్టీ యొకటి అహోబలునిపేర బాలురు జరిపిరి.

పరీక్షలు సమీపించెను. సగము బెదురు తోడను సగము ధైర్యముతోడను అతఁడు పరీక్షకుఁ గూరుచుండెను. కంగారను మాట అహోబలుఁ డెఱుఁగఁడు. చేతినుండి కాకితములు లాగుకొనువఱకును మెలమెల్లగా నాలో

చించి వ్రాయుచు 'ఈయవలసివచ్చెనే' యని యతఁడు పరీక్షాపత్రము లిచ్చెను.

## ౧౧

అహోబలున కెఱుక లేకుండ వీరవెంకమ్మ గ్రామమునందు నలుగురిని విందునకుఁ బిలిచి వచ్చెను. బడిపంతు లహోబలుని జూచి వెనుక వెనుక కొనియాడెను. 'మీరు మాకు కలకట్ట రయి రావాలి' అని పెద్దరయితు రామయ్య ప్రశంసించెను. బడిపిల్ల లందఱును అహో బలుని చుట్టు మూఁగిరి. అహోబలుఁడు ప్యాసాయెను!

ప్యాసయినవాఁడు జుట్టు క్షూరించును. వానికి బంధము లుండవు. వాఁ డొక భావ విహంగము. లా అండ్ ఆర్డరులకు అతఁ డతీ తుఁడు. అతఁ డొక జీవన్ముక్తుఁడు.

అహోబలునిసంగతి వేఱు. అతఁడు చెమరోడ్చియోడ్చి రోఁజిరోఁజి యేడ్చియేడ్చి తా నీబరువును బాఱువయిచెను. కర్మము చాలక ఆబరువు సరియగుచోటునఁ బడెను. దీనితో మరల నొక క్రొత్తబరువు తయారు!

వసుమతి తప్ప దని యతనికి నమ్మకము. పిదప నామె చదువు మానకపోవుట శిలా క్షరము. దానితోఁ దన కిఁకఁ జదువు నిర్బంధము. అందఱును పరీక్షలు తప్పి యేడ్తురు. అహోబలుఁడు పరీక్ష యిచ్చి యేడ్చెను. 'వసుమతికి మఱల చీటి వ్రాయుచో చండాలుఁడు!' అని యతఁ డొట్టిడుకొనెను.

ఈసెలవులలో మంచిరోజు చూచి ముహూర్తము పెట్టింపుఁడని వీరవెంకమ్మ స్వయముగా వెళ్లి కైలాసరావు నింటికడ రేవిణీవేసెను.

'మా అమ్మాయి స్కూల్ఫైనల్ పరీక్ష యిచ్చిన తరువాత' నని కైలాసరా వనెను.

అల్లుఁడు ప్యాసగుటచే సోమమ్మ కైలాస రావులకు రాజీకుదిరిపోయెను గాని ముహూర్త మూఁపుటచే దొడ్డకలఁత యేర్పడెను. కైలాస రావు క్షయపీడితుఁడయియుండుటచే వియ్యపు రాలు మూకీభావముతోడనే తనపక్షమును సమర్థించుకొని వెళ్లిపోయెనుగాని సోమమ్మ మాత్రము వ్యాధి చేయవలసియున్న పను లన్నిఁటికిని తిట్లతోడను తిమ్ములతోడను దాను పూఁటపడెను.

వసుమతి డబుల్ ప్రమోషను బడసి స్కూలుఫైనలులోఁ జేరెను; అహోబలుఁ డింటర్మీడియేటులో.

ఇపు డిచట నతనికి దిగ్భ్రమ కలిగెను. ఈయడవిలో దారియు లేదు; డొంకయు లేదు. దొర యుపన్యసించుచుఁబోవు నింగ్లీషు-ఉచ్చారణ మతనికి గొంతుక దిగలేదు. ఇదివఱకుఁ దనకు వచ్చిన పదజాలమునం దెచటను అట్టి పద మొకటియు లేదు. ఇదంతయు నొక గొలుసుకట్టు. ఒకవేదారణ్యము. కాసుపాసు!

హిందూప్రొఫెసర్లసంగతిగూడఁ దక్కువగా లేదు. తుదకుఁ దోడిబాలురసంగతియు నీడుజోడే. తుదకు హోటలులోఁగూడ

గల్లంతే. ఇది లండనా? తెలుఁగుపండితుఁడు కూడ నింగ్లీషే. ఇట్టి యీయింగ్లీషుగుర్ర ముతోఁ దా బరుగులెత్తు టెటులు?

హైస్కూలులో తెలిసీతెలియని స్థితి. అచట విచారపడుటకుఁగాని వల్లించుటకుఁ గాని కొంచె మవకాశము కలదు. ఇచట విచార మొకటియే శరణ్యమే. అహోబలుఁడు మరల నహోబలుఁ డాయెనని యతఁడు తెలిసి కొనియెను. ఒక్కొక్కరోజు గతించినకొలఁదియు నతని కధీరత మెండు కాఁదొడఁగెను. అతని కనుల కంధకారము కానిపించెను. క్రమముగా ఆచీఁకటి అభేద్య మగు గోడ యయిపోయెను.

అహోబలునకు మాటిమాటికి వసుమతి గుఱుతువచ్చును. పుస్తకములు చేతఁ దాల్చి తల యెత్తుకొని సూటిగాఁ బోవుచున్నటు లుండును.

ఆఁడుది. విశేషించి యొకని భార్య. దాసను రూపము. ఈరూపపరిమళముతో పలువురు బాలురలో నిత్యనివాసము. తన మాట వినమి. ప్రత్యుత్తరముగూడ పంపని అవినయము. ఇది యంతయు నతనిగోరుచుట్టు నకు రోకఁటిపోటు.

ఇట్టి దుస్థితిలో నతనిపాలిట కృతయుగ మారంభమాయెను. 'ఇంగ్లీషు బడులను బహిష్కరింపుఁ డ'ని గాంధి శంఖము పూరించెను.

ఈశంఖధ్వని ముమ్మొదట నహోబలు నకు వినఁబడెను. వెంటనే బడిని బహిష్కరించి కూరుచుండెను.

బడిని బహిష్కరించినవారి నామావళిలో అహోబలుని పేరు ఆద్యము. ప్రతి పత్రికయు నతనికి జయవెట్టెను. ప్రతివిద్యార్థియు నతనిని సందర్శించెను. అతఁడు తొల్లి ప్యాసయిన దసత్యము; ఇపుడు నిజము.

మెడికల్ కాలేజీలోఁ జదువుచున్న వాసుదేవరావు అహోబలుని జూడవచ్చి 'తలకుఁ దగనిపని చేసితివోయీ!' అనెను. అహోబలుఁ డటనుండి యోసరిల్లెను.

మంగలకత్తియొకటి, ట్రంకుపెట్టె యొకటి కిట్‌బ్యాగొకటి కొని యతఁడు రైలెక్కెను. అహోబలుఁ డీ బలువుతో నింట దిగఁగనే తల్లి చూచి—'పరీక్ష గెలిచి వచ్చితివా నాయనా?' అని యడిగెను.

గెలుపును ఓటమిని దాఁటియే యతఁడు వచ్చెను గాన 'లేదమ్మా! గాంధిగారిహుకుము చొప్పున బడిని బహిష్కరించివచ్చితిని'అనెను.

'వసుమతిగూడ మానుకొనెనా?'

అహోబలుఁ డీమాటకు బదులాడలేదు. తాను దెచ్చినవస్తువుల నన్నిటిని అచటనచట సర్దుకొనుచుఁ గూరుచుండెను.

వీరవెంకమ్మ దాని యర్థమును గమనించెను. ఆమె హృదయము కంటకితమాయెను. ఆమె చాల వాచాల. కాని యపుడు మూకీభావము వహించి మస్మితముగా నిటు లనెను.— నీ కింకొక పెండ్లి చేయుదును.'

అహోబలుఁడు తల్లిని జూచెను. తల్లి యహోబలుని జూచెను. కుమారుని కనులలో

రెండు బాష్పబిందువులు. తల్లికనులలో రెండు స్ఫులింగములు. ఇటు లొకరిమొగము లొకరు చూచుకొని యెవరిపనులకు వారేగిరి.

ఆ మఱునాఁటినుండియు అహోబలుఁడు తన పూర్వసంకల్పములు కొనసాగుటకుఁ గావలసిన పరికరముల నన్నిఁటిని సమకూరుచు కొనఁదొడఁగెను. వీరవెంకమ్మ సంబంధమును వెతుకఁజొచ్చెను.

అహోబలునకు ప్రకృతోద్యమమున నచ్చిన దొక్కటియే. అది పాఠశాలా బహిష్కరణము ఈ విషయమున మహాత్మునితో నతనికి సంపూర్ణైకమత్యము. విదేశవస్త్ర బహిష్కరణ మతనికి గిట్టదు. అహింస యొకటి యతని కభిమతము. మిగిలిన విషయములయెడ నతఁడు జాత్యంధుఁడు. ఇపుడే వార్తాపత్రిక తెప్పింపఁదొడఁగెను.

వీరవెంకమ్మ బంధుసముద్రమునందలి కన్యారత్నములఁ జాలవఱ కేఱెనుగాని గుణమునను, రూపమునను, చదువునను గృహనిర్వాహకత్వమునను వసుమతి కీడయిన దిం కొకతె కలదని యనుకొనలేదు. వసుమతి యున్న మూఁడు రోజులును మూఁడునెలలై, మూఁడేఁడులై, మూఁడుశతాబ్దులై యామెకుఁ గానిపించెను. ప్రతిపనిమీఁదను వసుమతి కర శిల్పము రూపముతాల్చి కానిపించెను. ఇట్టి కోడలిని విడనాడి మఱియొకకోడలిని వెతుకుటలో నామెకు కష్టము లేకపోలేదు. అయినను తప్పని సరి.

దగ్గఱ బంధుగులలోఁ దనకుమారునకు పిల్ల నిచ్చుటకు ముం దడుగువేసినవా రొకరును లేరు. ఆస్థితిచూచి కైలాసరావు టోపి పడిపోయినాఁడని చాటుటలోఁగూడ వారు వెనుదీసినవారు కారు. అట్టిచుట్టములు పెండ్లి మీఁదిపెండ్లి యయినను ఇపుడు పిల్ల నిచ్చుటకు సందేహింపరని యామె నమ్మకము. ఏల? చుట్టములే మోసపడిపోయిరి. అహోబలుఁడు ప్యాసయి కూర్చున్నాఁడు!

ఇంటివెనుక నున్న రెండెకరములదొడ్డిని అహోబలుఁ డాశ్రమముగాఁ జేయ సంకల్పించుకొనెను. నూయి యుండనేయుండెను. కొన్ని మావి ళ్లున్నవి. కొన్ని మొక్కలు, పాకలు మాత్రమే తరవాయి. పాకలనియు, పర్ణశాలలనియు, ఆశ్రమము లనియు పేరులోమాత్రము దారిద్ర్యము కాని అవి రాతికట్టడములే కావలయును.

అతఁ డెన్నఁడేని యేపనినేని చేయించి యుండలేదు. ఇదియే మొదలు. 'ఇల్లు కట్టి చూడు; పెండ్లి చేసి చూడు' అను సామెతను గూడ వినియుండలేదు. బస్తీనుండి పనివాండ్ర రావింపఁ దలఁచుకొనెను గాని గ్రామమునందలి కొందఱ సలహావలన ఊరిపని వారిచేతనే పనిచేయింపఁదలఁచెను. స్వదేశాభిమానములో స్వగ్రామాభిమాన మున్న దని యతఁడు సులువుగనే గ్రహింపఁగలిగెను.

దావీదు వచ్చి సలాము చేసెను. అహోబలుఁడు తల వంచుకొని 'మన

యూరిలో వడ్రంగ మెవరు బాగుగాఁ జేయుదురు ? 'అని యడిగెను.

'హుణ్ణాడ్‌గాఅండీ షుబ్బణ్ణాసారి !'

ఇంతలో సుబ్బన్నాచారి వచ్చి నమస్కరించెను. అహోబలుఁడు తల వంచుకొని 'మన యూరిలో గోడ లెవరు బాగుగాఁ గట్టుదురు ? ' అని యడిగెను.

'దావీదువంటి మేస్త్రీ మఱి దొరకఁడు' అని సుబ్బన్నాచారి యనెను.

అహోబలుఁడు తలయెత్తి దావీదును జూచి 'రోజుకూలి యెంత ? ' అని యడిగెను.

ఈప్రశ్న వినినతోడనే దావీదు కను లెఱ్ఱబాఱెను. 'మేం ఖూలి సేస్తాం ? రోజ్‌నామా బోలో సర్కార్ ! రోజ్‌నామా ! రోజీనా బోలో సర్కార్ ! ఆ ఘంతుల్‌గారు వుండాదే హూల్ ఖాంతంగారు !' అని యాదావీదు దూరముగానున్న పూలకాంతమ్మయిల్లు చూసి 'ఆరు యిచ్చార్‌గాహండీ రెండో రూఫాయకు ఫావల్ తక్వా ' అని యనెను.

'రెండురూపాయలకు పావలాతక్కువా?

'హాఁ సర్కార్.'

'కాదు రూపాయన్నర.'

'అట్లాగయితే అన్నం పెట్టింఛండీ' అని సుబ్బన్నాచారి యనెను.

అహోబలుఁడు కొంచె మాలోచించి అంగీకరించెను. దావీదును సుబ్బన్నాచారియు బజానా తీసికొని వెళ్లిరి.

## ౧౨

వేయి రూకలు చాటుగా నిచ్చినచో పిల్ల నిత్తుమని దగ్గఱ చుట్టములలో నొకరు వీరవెంకమ్మకు వార్తనంపిరి. వీరవెంకమ్మయే వేయి నూటపదార్ల కట్నమున కాసపడియుండఁగా ఈవార్త. దీనితో నామెయొడలు మండుకొని పోయెను.

'మేము రెండవపెండ్లి చేసికొనుచున్నా మ'ని వీరవెంకమ్మ యీసందడిలో సోమమ్మకు కబురు పంపకుండ నూరకుండలేదు. 'మా పిల్లకు మేమును రెండవపెండ్లి చేయఁగలమ'ని వియ్యపురాలికి సమాధాన మిడుటలో సోమమ్మయు వెనుకాడలేదు. ఈవార్త లన్నియు విని శయ్యాగతుఁడగు కైలాసరావు చెవులు మూసికొనియెను. వసుమతి నవ్వెను.

అహోబలుఁడు బడిని బహిష్కరించి నటులును ఆశ్రమమొకటి స్థాపించుచున్నటులును ఇంగ్లీషు పత్రికలలోను, తెలుఁగుపత్రికల లోను కైలాసరావు చదివియుండెను. బడి మానుకొనుట అంత యపాయము కాదుగాని ఈ యాశ్రమస్థాపనము మించిన పని యని యతఁ డనుకొనెను. ఊరక సోమరిపోతయి తిరుగుటకన్న నిది మంచిదే యని యతఁ డెంచెను.

వసుమతి యత్తింటి కొంటిగా వెళ్లినపుడు అహోబలుఁడు గ్రామాంతర మేఁగుటయు తన జబ్బులో నొకమాటేని రాకుండుటయుఁ జూడ నతనిమనమునఁ గలఁకపుట్టెను. కూఁతు నిపు

పత్త్రింటికిఁ బంపఁ దలఁచెను గాని పరీక్షలు సమీపించెను దినదినమును దనకు నూట రెండు డిగ్రీలకుఁ దక్కువ లేదు. అల్లుఁడు తన కడకు రానిచోఁ దానే పోవలసిన స్థితి పట్టెను. మఱియు రెండవ పెండ్లికి ఏర్పాటులు జరుగు చున్న యీసమయమున తా నచటికి వెళ్లుట చెల్లదు. ఈచిక్కులచే నతనిజ్వరమునకు మనోజ్వరము తోడాయెను.

వసుమతి తండ్రిస్థితిని గుఱుతించెను. తన మీఁది ప్రేమచేతనే యిరువాగులవారును ఇక్కట్టులపా లగుచున్నారని తనకుఁ దెలి యును. కావునఁ దండ్రితో నిటు లనెను.— 'తమ యాజ్ఞ యగుచో నే నత్తింటి కేఁగెదను'.

నిక్కమున కత్తవారియింటి కేఁగుట కొకరియాజ్ఞానుజ్ఞ లక్కఱలేదు. తలిదండ్రులు పంపు టనున దాచారము. మగనికడ కరుగు టకు మనస్సే గురువు. వాంఛ కలుగుచో కాలభూము లడ్డమూఁకలు గావు.

కూఁతుమాట నాలకించి తండ్రి యిటు లనెను.—'అమ్మా! ఈ యాజ్ఞ యను కళ్లె మును నాచేతులలో నుంచుకొనలేదు.'

కూఁతు రిటు లనెను.—'తమ శిక్షవలన నామెఱిఁగినమాట మనవిచేయుచున్నాను. పుట్టినతరువాత ఆఁడుదానికి మగనితోఁ గాఁపు రము చేయుటయే పనికాదు.'

తండ్రియిటులనెను.—'అదియు ఒక మకామము.'

కూఁతు రిటు లనెను.—'ఆ మకామము చేరుటకు బాట బాగుచేసికొనవలయుఁగదా!'

'అగును. అట్టిధీరత యున్నచో నా కిఁకఁ జింత లేదు.

'మీ రధైర్యపడకుఁడు! తమ యనుగ్ర హమువలన నా కట్టిధీరతలోఁ గొఱంత లేదు.'

కైలాసరావు ముఖము వికసించెను. కొంచెము సే పూరకుండి—' అతఁడు తొందర పడి రెండవపెండ్లి,—అనిఆవాక్యమును పూర్తి చేయఁజాలక పోయెను.

'నాయనా! దానికిఁజింత వలదు. అట్టిది జఱుగదు. జఱిగెనా ఆ రెండవయామె నాబరు వులోఁ జాలభాగము వహింపఁగలదు.'

కైలాసరా వాకసము చూచి 'సంసార మెఱుఁగని బాలికమాటలేనా యివి?' అని యనుకొనియెను.

దినములు గతించుచున్నకొలఁదిని వీర వెంకమ్మ కశాంతి యెక్కుడాయెను. బెండ కాయ ముదిరినను, బ్రహ్మచారి ముదిరినను పనికిరా రని యామెకుఁ దెలియును. ఎన్ని సంబంధములు వచ్చినను శుల్కబలి గోరు చునే యుండెను. దీనితో నామెకు తనస్థితి బాగుగాఁ దెలిసివచ్చెను.

అహోబలునకు రెండవపెండ్లి యెందు లకో నిక్కముగా నెవరికిని దెలియదు. కర్మము చాలకయో దిద్దువారి పొరపాటుననో అహో బలుఁడు ప్యాసాయె ననియు నిపుడు చదువు

మానుకొని కూరుచుండుటచే వసుమతి యతని నవహేళ చేసె ననియు సందఱును అనుకొనిరి. 'ఆఁడువారు చదువులు చదివినచో మానమర్యాద లుండునా? అహోబలుఁడు అహోబలమ్మయు, వసుమతి వసుమయ్యయు నయిపోయి ర'ని కొంద అనుకొనిరి. వంటింటి కప్పగించి గొడ్డుచాకిరి చేయించు మగవారి బయిసి బయటఁబడిన దని కొంద అనుకొనిరి. వీరవెంకమ్మ లోలోపల కోడలిగుణముల కాక క్షోభఁబడకపోలేదు. ఆయాకర్షణమే ప్రకృతి మీసుగా పరిణమించెను.

వీరవెంకమ్మ యిక్ష్వాకులకాలమునాఁటి దని వేఱుగా నిర్వచింపఁ బనిలేదు. ఆమెకు చదువుసంచెలు రావు. చదువుసంచెలు నేర్చిన కుటుంబమున కేని కోడలుగా రాలేదు. పుట్టినింట నేడుతరములవారిలోను, మెట్టినింట నేడుతరములవారిలోను విద్యాదేవతా కటాక్షము లేదు. పెట్టిపెంచినవారి చెప్పుచేతల వలనఁ గలిగిన యనుభవమే యామె చదువు. కులగౌరవ కుటుంబగౌరవములే యామెకు పరమావధి. ఆపరమావధికి ప్రాఁకులాడుటయే నిత్యకర్మ. దాని కిపుడు భంగము కలుగఁ జొచ్చెను. కోడ లెంత గుణవతి యయినను ఈడేఱినపిదప చదువులబడిలోనికి వెళ్లుట ప్రాయశ్చిత్తము లేని యధర్మము. అదిగాక చదివి పరీక్ష లిచ్చి పాగబెట్టుకొని ఆఫీసుకు వెళ్లునా? కొడుకు గరిటె బట్టుకొని వంట యింటఁ గూరుచుండునా? తా నిది యంత యుఁ జూచుచుఁ జూచుచు నెటులు సహింపఁగలదు? కావున శుల్కము నొసఁగి యయినను ఎవతనో యొకతెను దెచ్చి ముడి పెట్టవలయును. వియ్యపురాలి ధిమాకును చూర్ణము చేయవలయును. కోడలి యవినయమునకు జవా బొసఁగి తీఱవలయును.

వీరవెంకమ్మ శుల్క మిచ్చెద నని వంగి వచ్చినను దగ్గఱచుట్టము లిపు డెవరును ముందులకు రాలేదు. భరణమునకు వసుమతి దావా తెచ్చితీఱునని వారికి బెదురు. భరణము లెన్నగా నిప్పించుచున్న హైకోర్టు తీర్పులు వారి కోదార్పులుగా లేవు. అహోబలునిలో నుద్యోగసద్యోగములు చేయు సందర్భములా కానరావు. 'పిల్లవాని కేమి? బంగారుపిచ్చుక. ఒకరిజోలి యతని కక్కఱ లేదు. ఇచ్చుటయే కాని పుచ్చికొను టెఱుఁగఁడు. ఉపకారమే కాని యపకారము లేదు. కొట్టిన దులుపుకొనిపోవును; తిట్టిన తుడిచికొని పోవును. ఉండవలసిన 'మనిషి.' ఈభరణముసంగతి చూచినతరువాత పిల్ల నిచ్చు విషయ మాలోచింత మ'ని యెవరికి వారు లోలోపల ననుకొనిరి.

వసుమతికి పరీక్షలయి పదినాళ్లాయెను. కైలాసరా వెముకల గూఁడై పోయెను. అతని శరీర మొక తెల్ల మడత. ముడుతలు లేని యతనిమోమున బ్రహ్మవర్చసము ఘటపిహిత మగు దీపకళికవలె చూపఱ కక్కఱము గొలుపును. అతఁడమ్మా యనఁ డబ్బా యనఁడు. ఓరిమి యతనిని అతఁ డోరిమిని పన్నిదము

చఱచి పరీక్షించుచుండిరని వసుమతి యను కొనెను. రేయింబవలు తండ్రిశయ్యకడఁ గూరుచుండి కనిపట్టుచున్న వసుమతికి ఆస్థితి యంతయు తన యదృష్టమును తొంగిచూచు చున్నయటు లుండెను.

రోగికి రోగ మొక యనుభూతి. మృత్యు వొక ద్వారము. ద్రష్టకు రోగ మొక పారము. మృత్యు వొక పరీక్ష.

కైలాసరావు కష్టముతో కనులెత్తి చూచెను. లక్ష్యసిద్ధుఁడగు యోగివలె వసుమతి యతనిని జూచెను. పరస్పరాలోకనము లాముష్మికమును గుఱించి యాలోచించు కొను చుండెను.

సెలవులలో వాసుదేవరావు రైలు దిగి వచ్చి కైలాసరావునకుఁ బ్రణమిల్లెను. కైలాసరా వాశీర్వదించి 'నాయనా నీకు సెలవులు లేవు. ఇచటఁ గూడ నీవు చదువుకొనుట కొక క్రొత్త కాలేజి కలదు' అనెను. ఈమాటకు చిఱునగవే ప్రత్యుత్తరముగా వాసుదేవరావు కైలాసరావును కనుఁగొనుచు నిలువఁబడియెను. గాలితో నతఁడు పోరాడు కొలకొ యెత్తుగను, అతనిమొగమున వెలుఁగొక యెత్తుగను ఉండుటచే వాసుదేవరావు సంభ్రమాశ్చర్యములతో కైలాసరావునం దొక యపూర్వమగు వ్యాధి సాధకుల సమ్మేళన మును కనుఁగొనుచు నిలువఁబడిపోయెను.

ఇంతలో సోమమ్మ దర్భలతో నచటికి వచ్చెను. వాసుదేవరా వామెకు నమస్కరించి యాశీర్వాదము బడసెను. వాసుదేవరావు సోమమ్మకేసి చూచెను. ఆమె మొగమున రూకంత కుంకుమబొట్టు కలకలలాడు చుండెనుగాని అధైర్య మొక బొట్టయినను లేదు. ఈకుటుంబము కాలప్రవాహమున కనుకూలముగా గతి గలుపుకొనఁగల దని యతఁ డనుకొనియెను.

సోమమ్మ తెచ్చిన దర్భలను కైలాసరావు చూచి—'అచట పఱపుము' అనెను. సోమమ్మ పఱచెను. నడుమనడుమ నెడముండుటచే మరల లోనికేఁగి కొంతదర్భ తెచ్చి చక్కఁగాఁ బఱచెను.

కైలాసరావు మెల్లగా మంచముమీఁది నుండి లేచి యాదర్భశయ్యపై నొఱగి నాతో మీరంఱును నంత్యప్రార్థన చేయుఁడని కనులు మూసికొనెను. అందఱును ప్రక్కఁగాఁ గూరుచుండి ప్రార్థింపఁగడఁగిరి. కైలాసరావు ముఖము గంభీరమయి లలాటమున తేజస్సు పుంజీభవించెను

---

'ఓబయ్య' సవరణ (వెనుకటి సంచికలో)

| పుట | కాలం | బంతి | తప్పు | ఒప్పు |
|---|---|---|---|---|
| ౫౮౧ | ౧ | ౮ | గమనము | పమనము |
| ౫౮౮ | ౨ | ౧౫ | నేయఁబడిన | నేయఁబడని |
| ,, | ,, | ౧౬ | తూములు | తెన్నులు |
| ,, | ,, | ౧౭ | దయనీయములు | వగపుతూములు |
| ౫౮౯ | ౨ | ౧౯ | నచ్చుకపోవుతే | వచ్చుకపోవుతే |

---

# గ్రుక్కెడు నీళ్లు

బందా కనకలింగేశ్వరరావుగారు, బి. ఏ.

'దూరంగా ఉండరా, కళ్లు కనపడటంల్లేదు?'

'..................'

'నిన్నే; మాట వినిపించుకోవేమిరా, స్వరాజ్యం వచ్చిందని మండిపడిపోతున్నావేం?'

'..................'

'దూరంగా పోరా' అని మనసబు వెంకటస్వామి మండలించగానే వెంకటప్ప తప్పుకున్నాడు. మహాలక్ష్మమ్మగారు మడినీళ్లు పట్టుకుని వెళ్లింది.

ఇల్లు చేరగానే మహాలక్ష్మమ్మ, మడినీళ్ల బిందె దింపి, అరుగుమీద పెద్దమనుష్యులతో మాట్లాడే భర్తను 'ఒకమాటిలా రండి' అని లోపలికి పిలిచింది.

పూరసంగతి కనుక్కోటానికి గావును లోపలికి రమ్మన్నదనుకొని లోపలికి వెళ్లాడు బ్రహ్మయ్య.

'చూడండి! వెంకటప్ప కంత పొయ్యేకాలం వచ్చిందేం, దారి తప్పుకోరా అంటే తలతిక్కతనంగా వినిపించుకోడు, కాస్త కనుక్కోకపోతే ఆడవాళ్లం మడినీళ్లు తేలేం' అని కసిరింది మహాలక్ష్మమ్మ.

'కనుక్కుంటాగా లే' అంటూ కరణం బ్రహ్మయ్య వాకిట్లోకి వచ్చి కబురంపేడు వెంకటప్పకు.

వెంకటప్ప ఊరు వెట్టి. ఆఊళ్లో వాడొక్కడే మాల. తల్లిదండ్రులు చిన్నతనంలో పోవటంచేత గాలికి పెరిగి ధూళికి ఎదిగి కన్నంగట్టుమీద చుట్టుగుడిసె వేసుకుని కాపురం ఉంటున్నాడు వెంకటప్ప. పుట్టుకతక్కువైనా బుద్ధిమంతుడు. అందువల్ల ఊళ్లోవాళ్లు బట్టలు పాతలు ఇస్తూ అంత పచ్చడిరవ్వ, ఇంత పప్పుచారు పెడుతూ ఆదరంగా చూస్తుండేవారు.

కరణంగారి కోపానికి కాకైనా అదురుతుంది. అలాంటప్పుడు వెట్టిపని చేసే వెంకటప్పకు చెప్పాలా! వెంటనే కరణం బ్రహ్మయ్యగారింటి కెళ్లి దణ్ణం పెట్టేడు.

బ్రహ్మయ్యగారు వెంకటప్పను చూడగానే మనుష్యునకు రావలసినంత కోపం తెప్పించుకొని ఎడమకాలి పాతచెప్పు తీసి వెంకటప్ప మొగానకొట్టేడు. అది చాలక బండబూతులు తిట్టి బొండకొయ్య వేయించాడు. ఏం చేస్తాడు వెంకటప్ప? తల వంచుకొని దండన భరించాడు. ఇంతకు వెంకటప్ప చేసిన తప్పేమిటో!

బ్రహ్మయ్యగారు బ్రాహ్మణులు. ఊరికరణం. రామవరంలో వారంటే మంచిపలుకుబడి ఉంది. వ్యాజ్యాలలో మధ్యవర్తిత్వం చేయాలన్నా, అన్నదమ్ముల పాలుపంపుళ్లు పెట్టాలన్నా, కవులుకత్తులు వీళ్లు గాని వ్రాయాలన్నా, లక్షాధికారి లక్ష్మణస్వామైనా ఆయనకే కబురంపాలి. ఏభైవేలరూపాయిల నగదు, పాతికఎకర ములభూమి, పురాతనపు ఇల్లు, ఆయన కున్న ఆస్తి. కాని ఎన్నుంటేనేం, బిడ్డలు లేరు. ఎలాగైనా ఒక్కకాయ కాస్తుందేమో యని తాయత్తులమీద తాయత్తులూ, జపాలమీద జపాలు, తపాలుమీద తపాలు, ఇక యేమిటి! సూర్యనమస్కారాలే కాదు సుందరకాండపారాయణాలే కాదు, పుత్రకామేష్టివ్రతాలే కాదు, పుణ్యతీర్థాల మునగటమే కాదు, గోసాయీలవేరుముక్కలే కాదు, గోకులబృందావనదర్శనాలే కాదు, ఎన్ని చేసినా ఒక్క పిల్లడు గాని, పోనీ, పిల్లయినా కలుగలేదు. భోగేశ్వరం దేవుడికి మొక్కేరు. మొక్కటమే కాదు, స్నానం చేసి తడిగుడ్డతో తెల్లవార్లు సాగిలపడ్డది మహాలక్ష్మమ్మ గుడివెనుక: అబ్బే! మాటవరసకైనా నెల తప్పలేదు.

కాలం ఒక్కమాదిరిగా ఉండదు. రామవరంలో కొంచెం కలరా తటస్థించింది. కొంచెంగా ఉన్నదల్లా కొద్దిరోజుల్లో గొప్పదైనది. రోజూ నాలుగైదుపీనుగలు వెడుతున్నాయి. ప్రొద్దు క్రుంకితే తలుపు తీయటంలేదు. వీధులలో సంచారం కనపడటంల్లేదు. మునసబు వెంకటస్వామి ముడుపు గట్టించాడు. మొక్కేదేవతలకు

బ్రొక్కుతున్నారు. చేసేపూజలు చేస్తున్నారు. గణాచార్లమీద గణాచార్లు. మంగలితిర్పతిగాని భార్యకు మారెమ్మ పూనింది. గవళ్లగంగులు చెల్లెలుకు గంగానమ్మ పూనింది. చాకలిపేరాయ మరదలుకు చల్లలమ్మ, బోలిసాని ఆడబడుచుకు పోలేరమ్మ పూనింది. 'అయ్యో నా అక్కయ్య, నే వస్తున్నానే' అంటూ వచ్చాడు గాలి వీరయ్య. 'ఎవరు నువ్వన్నాడు వెంకటస్వామి. సమయం దొరికినప్పుడే తిట్టాలనుకొని వీరయ్య 'ఎవ్వరో ఎరుగవ్రా గాడిద! నేపోతరాజునురా అన్నాడు.' ఈ ప్రకారంగా వారివెనుక వీరు, వీరివెనుక వారు, చల్లాలమ్మ, గొడ్లమ్మ, మారెమ్మ, మహాలక్ష్మమ్మ, పోలేరమ్మ, పెద్దింటమ్మ, కామాక్షమ్మ, గంగానమ్మ, కనకదుర్గమ్మ, గావుళమ్మ, దిబ్బమ్మ తీర్థమమ్మ—'ఓ', స్నానాలు చేసి బండెడువేపమండలు చేత బట్టుకొని గెంతి తాండవమాడుతున్నారు వీధులవెంబడి. డప్పులు తడవతడవకూ కాచి మరీ కొడుతున్నారు. వీరయ్య సిస్తు ఇవ్వలేదనే కోపంచేత కరణం బ్రహ్మయ్య కేకలువేతా మనుకొని వచ్చేటప్పటికి వీరయ్య పోతరాజురూపాన కరణంగారి పీక పట్టుకున్నాడు. పదిమంది కుమిగూడి విడిపించారు. పెద్ద కాపు రాఘవయ్య విడదీసి వీరయ్యను మందలించాడు. బ్రహ్మయ్యగారి ఒళ్లు ఝల్లుమన్నది. పదిమంది ఇంటికి చేర్చారు. దేవతలంతా ఈదెబ్బలాటలో బాగుండదని ఊరుకున్నారు. ఏం గావాలో చెప్పి చేయించుకోవాలి గాని మనుష్యులను చంపితే ఎలా గన్నాడు రాఘవయ్య దేవతల్తోటి. దేవతలకు మనభాష బాగా తెలుసుట!

'ఓ! నరుడ నరుడ నరుడ నరుడో! నాకు పదివేలెట్టి గుడి కట్టించరో! లేకపోతే నెత్తురు తాగేస్తారో అంది గంగానమ్మ.

'నాకు కొత్తది తోపురంగు పెడనసేత జరీచీర పెడితే గాని మింగుతా' నంది పోలేరమ్మ.

'ఇంటికి కుంచెడుచొప్పున వసూలుచేసి నాకిస్తే గాని ఊరు నాశనంచేస్తా' నంది పల్లాలమ్మ.

'వాళ్లందరకన్న నేతీసిపోయినానా! ధోవతుల్చాపు మంచిది ఇవ్వండి, మొగదేవుడినికూడా'నన్నాడు పోతరాజు. ఇవి వీరి కోరికలు.

'మావల్ల ఏం గావు! మీయిష్ట మెచ్చినట్లు చెయ్యండి; మర్యాదగా కావాలంటేజాతరచేస్తాం, లేకపోతేమీపెద్దదేవత కాళెమ్మదగ్గర్నుంచి తిరుగుటపాలో ఏసంగతి కనుక్కోం' డన్నాడు మునసబు.

'చద్దివణ్ణాల కెల్లాలని డప్పులవాళ్లు దారిపట్టేరు ఆనాటికథ అలా ముగిసింది.

ఇంటికొచ్చిన కరణం బ్రహ్మయ్యకు స్పృహా లేదు. వాంతులు ప్రారంభించి కలరాలోనికి దింపినవి. మందు లేదు, మాకు లేదు. పాపం తోడునీడ లేరు. మహాలక్ష్మమ్మ ఉపచారం చేస్తోంది. ఏం చెయ్యగలదు ఒక్కతి? కంటికి మంటి కేకధారగా ఏడ్చింది, పాపం, పసుపు కుంకుమ పోయేరోజు వచ్చిందని. చూస్తూ చూస్తూ ఉండగానే పెనిమిటి కాళ్లు చేతులు చల్లబడినవి. గొల్లుమన్నది ఇల్లాలు. తిరిగి మాసేవారైనా లేరు. ఓదార్చేవారు లేరు. లంకంతకొంప. పిట్టచప్పుడైనా లేదు. గ్రుడ్లగూబమాత్రం నేనున్నా నన్నట్లుగా దూరాన్నుంచి కూసింది. భర్తశవంమీద పడి రోదనం చేసి చేసి మూర్ఛపోయింది మహాలక్ష్మమ్మ.

తెల్లవారింది. సూర్యుడుదయించాడు. పశువుల చప్పుడు తప్ప వీధిలో సంచారం లేదు. ఊరంతా గొడ్డుపోయినట్లుంది. మహాలక్ష్మమ్మ దుఃఖానికి మేర లేదు. కర్తవ్యంకూడా మరచింది. బిడ్డలేని లోపం కనపడింది. చుట్టుప్రక్కలవాళ్లు గాని తనవాళ్లు గాని ఎవరూ రాలేదు. కలరా అంటువ్యాధి. అందుచేతనే గావును ఎవ్వరూ తునకు ఊళ్లో ఉన్న అన్నగారైనా తొంగిచూడలేదు. నెమ్మదిగా లేచి, వస్తున్న దుఃఖమును ఆపుకొని, శవం తీసుకెళ్లేప్రయత్నంకోసంబయలుదేరింది. వెనుకవీథిలోని పుట్టింటివారింటికెళ్లింది. మారాన్నుంచి ఈమెను చూచి కామయ్య దొడ్లోకెళ్లేడు. ఒదినగారిని చూచి బావురుమని ఏడ్చింది మహాలక్ష్మమ్మ. 'ఎంత ఆపద ఒదినా' అంటూ గుడ్డ

నీరు గ్రుక్కుకొన్నది మరదలు. కామయ్య ఇంట్లోకి వచ్చి చెల్లెలును జూచి కౌగలించుకొని ఏడ్చేడు కాస్సేపు. 'చెల్లీ, శవంమాట ఎల్లాగే' అన్నాడు కామయ్య. 'అన్నిటికి నువ్వే చూడాలి అన్నయ్యా' అన్నది చెల్లెలు. 'నేనూ అదే చూస్తున్నాను. మీవదినెకు ఏడో నెల! పోనీ, పదిరూపాయిలు పారేదామంటే పట్టెటూరు' అన్నాడు కామయ్య. మహాలక్ష్మమ్మ కాసంగతి వింతగా తోచింది. ఒదినే తను క్రిందటి ఏకాదసి నాడే స్నానం చేశారు. పెదవి విరచింది. సంగతి గ్రహించింది. తనమరదైన సూరయ్యగారింటికి త్రోవ పట్టింది. తోడికోడలు వాకిట్లోకి వచ్చి ఊరడిస్తో 'మరది లేరమ్మా, మారులే కెళ్లా' రండి. మహాలక్ష్మమ్మ తెల్లబోయింది. తాను వీథివాకిలిగుండా వస్తే బాగుండదని దొడ్డిత్రోవగుండా వస్తుంటే సూరయ్యగారు చుట్ట కాల్చుకుంటూ బయిటి కెళ్లటం చూచింది. ఇదంతా కాలమహత్యం అనుకుంది. కలరాగాలి కింత భయం గావు ననుకున్నది. పోనిమ్మని పెరటివీధిని ఆడపడుచుగారింటి కెళ్లింది. 'పుట్టెడుదుఃఖంతో మాచమ్మా, నీ కెంతచిక్కు వచ్చిందే; అన్నయ్య దాటిపోయి నాడటే' అని బావురు మన్నది సుందరమ్మ. కళ్ల నీళ్లు తుడుచుకుంటూ 'రాత్రి వస్తా మనుకొన్నా నమ్మా! మీ అన్నయ్య జ్వరంతో మూల్గుతుంటే ఎలా విడిచి రాను' అని చక్రం అడ్డువేసింది సుందరమ్మ. మహాలక్ష్మమ్మ వెనుతిరిగి వస్తున్న దుఃఖాన్ని దిగమ్రింగుకుంటు, వస్తున్నది. ఊరట చెందట మేలాగు? శవాన్ని తీసికెళ్లేవారైనా లేరు. ఆమెరోదనమును విని ప్రకృతి కూడా విలపిస్తూంది. ఆవులమందలు తప్ప మానవపురుగులే డాపీఛని. "మేము మనుష్యులమైనా కాకపోతిమే శవాన్ని తీసుకొని వెళ్లేటందు" కని గావును, తలలు పంకిస్తున్నవి గోవులు. మానవవిశ్వాసమును తిరస్కరిస్తూ కావును, యింటికుక్క కంట నీరు పెట్టింది. కష్టవేళ వచ్చినప్పుడే కావాలి బంధువులు. తల వంచుకొని వస్తూంది మహాలక్ష్మమ్మ. దారిలో వీథిబడిదగ్గిర కనపడ్డాడు వెంకటప్ప. తల వంచుకున్నది మహాలక్ష్మమ్మ. "అమ్మగారూ, మాగొప్పఆపద సంభవించిందండీ" అన్నాడు వెంకటప్ప. పయిటకొంగుతో కళ్లు తుడుచుకొన్నది.

"ఊరుకోండమ్మ, తక్కినపని చూడం"డన్నాడు.

గద్గదస్వరముతో "వెంకటప్పా! కరణంగారి శవము తీసుకవెళ్లుదాము వస్తావా" అన్నది.

"అయ్యో! మాలోండ్లమం"డన్నాడు.

"పరవా లేదు, వస్తావట్రా? ఈసహాయం చెయ్యి నీకడుపున పుడతా" నన్నది.

"మీరు లేకపోతే నాకు భయంటే" దన్నాడు వెంకటప్ప.

"అయ్యో మీవాం డ్లేమైనా అంటారేమో, అమ్మ వారిజాడ్యం, అంటుజాడ్యముకూడాను."

"నా కెవరండీ యేడ్చేవాండ్లు.కన్నవాండ్లు గంగ కలిసిపోయేరు" అంటూనే పాడె తయారుచేసేడు వెంకటప్ప.

వెంకటప్ప, మహాలక్ష్మమ్మ చెరొకవైపు పట్టుకొని శవమును తీసికెళ్లారు.

పురోహితుడు లేడు పుణ్యపురుషుడు లేడు. మహాలక్ష్మమ్మ హృదయం శాంతి పడ్డది. ఎల్లా తను వాడిఋణం తీర్చవలెనా అనుకొన్నది. ............

*    *    *    *    *

వెంకటప్ప తిరిగి యింటికి వస్తున్నాడు. కొంచెం కడుపులో బాధగా వుంది. కళ్లు తిరుగటం మొదలుపెట్టినవి. కొంచెముసేపటిలో కాళ్లు చేతులు లాక్కొనిపోవటం మొదలుపెట్టినవి. వాంతులు ప్రారంభించి అవయవపటుత్వం తప్పి స్పృహలేకుండా మునసబు వెంకటస్వామి యింటియొద్ద పడిపోయినాడువెంకటప్ప. వెంకటప్పకు కలరా తగిలిం దన్నమాట ప్రాకింది వూరంతా. వెంటనే మున్సబు వూళ్లో కలరాటీకాలు వేస్తున్న కలరా డాక్టరుకు కబురంపేడు. వెంకటప్పకు 'నా' అన్నవారు లేరు. బట్టలు మలమూత్రములతో నిండిపోయినవి. చూస్తూ వూరుకున్నారు చుట్టుప్రక్కలవారు, గారడివాడిని

చూచినట్లు. ఇంతటిలో ఒక పూర్వసువాసినీదేవత కుడి భుజముమీద తడివస్త్రాలు యెడమభుజముమీద మడి నీళ్లు పట్టుకొని తను త్రొక్కబొయ్యే దారిపొడుగున నీళ్లు చల్లుచు తులసిపాటో లేక గోవిందరామపాటో గొణుకుకుంటూ వస్తూంది. వెంకటప్పను చూడలేదు. దాహం దాహం అని మూల్గుతున్నాడు. 'పాపం యెవడైనా పొయ్యండిరా' అని ఒకరు, 'యేంచెయ్యగలం భగవత్‌యత్నం' అని ఒకరు, 'దిక్కు లేనివానికి దేవుడే దిక్కని ఒకరు, కంటితో లేకపోయినా నోటితో యేడుస్తున్నారు. వినలేదు, యీసంగతి, మడినీళ్లవిధవావిడ. చూడలేదు, యెదుట నున్న వెంకటప్పను, దగ్గిర కొచ్చినదాక. వెంకటప్పకు గజందగ్గర కొచ్చి, "అయ్యో, నీయమ్మకడుపుకాల. వెధవవాళ్ళం, బ్రాహ్మణులం, మడి నీళ్లు తెస్తుంటె చెప్పనక్కరలేదురా? కొంప తీసేవు" అని బిందెడునీళ్లు మయిలపడినవని తిట్టుతూ వెంకటప్ప మీద పోసింది. వెంకటప్పకు స్పృహ లేదు. ఆమె కోపంతో పోసిననీళ్లు అతనిదాహం తీర్చినవి. ఆయాసంతో మూల్గుతు కొంచెముప్రక్కకు దొల్లినాడు, వెంకటప్ప, బ్రాహ్మణుల త్రోవ మయిలపర్చట మెందుకని. ఇంతటిలోనే కలరాడాక్టరు వచ్చి నాడి చూచి మించిపోలే దనుకున్నాడు. గొంతుకలో మాత్రలు వేసి నల్లనిచుక్కలు నీళ్లలో కలిపి పోశాడు మహానుభావుడు. మునసబు వెంకటసామికొంచెము అసహ్యించుకున్నాడు, డాక్టరు తనకులమువాడు అనగా తెలగ మాలవానిని ముట్టుకొని కాళ్లు పిసుకుతున్నాడని. ఈతెలగ యీ వెంకటస్వామినాయుడు పెద్దకాపు వెనుక బ్రాహ్మణులు భోజనం చేస్తుంటె తనని రానివ్వకపోవట మేమిటని డెబ్బలాడిన పెద్దమనిషి; ఈనాడు డాక్టరును కొంచెము కోరచూపుతో చూచాడు.

వెంకటప్పసంగతి మహాలక్ష్మమ్మగారు విన్నది, రోడ్డుమీద స్పృహ లేకుండా పడిపోయినాడని. కర్తవ్యం గ్రహించి వెంటనే నిట్టూర్పు విడిచి, వెలివేసినా సరే అనుకుంది. తొందరతొందరగా వీథిలోనికి పోయి వెంకటప్పను చూచింది. కన్నతల్లి లాగున కంట తడిపెట్టినది. చుట్టు వున్నవాళ్లు మండలిస్తూనే వున్నారు. నెమ్మదిగా లేవతీసినది. తన మెడమీద అతనిచెయ్యి వేసుకొని నెమ్మదిగా నడిపించుకుంటూ తనయింటికి తీసికొని వచ్చి పడుకుండబెట్టినది. పాపము ఆమెమాతృప్రేమ యెటువంటిదో యెరుగడు. కాని నేటికి ఆమె కడుపులోని తల్లి పేగు తరుగుకొని పోవుచున్నది. దుఃఖం దిగమ్రింగుకుంటూ ఉపచారం చేస్తున్నది. మాడుకు పట్టు వేస్తూ వెంకటప్ప మొగంవంక చూచింది. దైవము అనుకూలంగా ఉండటంవల్ల గావును వెంకటప్ప కన్నులు తెరచి చూచాడు. కళ్లవెంట నీళ్లు యేకధారగా కారుచున్నవి. దిక్కుమొగముతో వెక్కివెక్కి యేడవటం మొదలు పెట్టాడు. తన పయిటకొంగుతో మహాలక్ష్మమ్మ వెంకటప్పకంటినీళ్లు అద్దినది.

"ఎందుకు యేడుస్తావు వెంకటప్పా" అని చెంపలు నిమిరింది తల్లిప్రేమతో. "నేనుమాలవాడిని అమ్మా" అన్నాడు వెంకటప్ప. అంటూనే చిన్నపిల్లవాని లాగున యేడ్చాడు.

"అయ్యో, అంతమాత్రముకు యేడుస్తావు యెందుకూ?"

"మీరు బ్రాహ్మణులు నేను కడజాతివాడను."

"కావు, కావు; నీవు నాకు కొడుకువు. సందేహం లేదు. కాక పోతే నాగర్భం యెన్నడూ యీమాదిరిగా దుఃఖించలేదు. నాయనా, యీజన్మలో కాకపోయినా పూర్వజన్మలోనైన అయివుంటావు. అందువల్లనే తండ్రిగారి ఋణం తీర్చగలిగావు."

* * *

వారం తిరిగింది. మహాలక్ష్మమ్మను కులంవారు వెలివైచినారు. ఆబాలగోపాలం ఆమె యింటివంకనైనా తిరిగి చూడలేదు. మునసబు వెంకటసామిగారి ఆజ్ఞప్రకారం చాకలిమంగళ్లుకూడా కట్టుకట్టినారు. వెంకటప్ప మలినవస్త్రముల సయితము మహాలక్ష్మమ్మ వుతుకుతున్నది. దైవానుగ్రహంవల్ల, వెంకటప్ప తేరుకున్నాడు. కొంచెము యిటూ అటూ తిరుగుతున్నాడు. మహాలక్ష్మమ్మతల్లి పత్యం పెట్టింది. నీరసంగా వుండటంవల్ల ఆబిడేకలిపి పెట్టుతూవుంది. ఇంటి

కోమటి వంటకర్చులుగూడ అమ్మటం లేదు. మహాలక్ష్మమ్మకు బెంగ పడిపోయింది. కాని ధైర్యవంతురాలవడంవల్ల సమస్తచాకిరీ చేస్తున్నది. అతనిపాలిటికి ఆమెయే మాతృదేవత యైనది. నిర్భాగ్యుడు వెంకటప్ప. "అమ్మా" అని పిలుచుకునే యోగ్యత లేదు. ఇతని పరిచర్య చెయ్యటంవల్ల ఆమెకు కొంచెము జ్వరం తటస్థించింది. నెమ్మదిగా మంచము పట్టించింది. ఇప్పుడు ఆమెకు సేవ చెయ్యటం వెంకటప్పవంతు అయినది. మందుమాకులు లేనిదే జ్వరం తగ్గట మేలాగు? వైద్యమహాశయులుకూడా వెలివైచారు, మునసబు వేంకటస్వామిగారి తీవ్రశాసనంచేత. వీరిశాసనం వైస్రాయిగారి ఆర్డినెన్సులకన్న బలమైనవి. ఆర్డినెన్సులనైన తిరస్కరిస్తారు గాని ప్రజలు, మునసబు వెంకటసామిగారి ముక్కోపితనానికి జడవని ముసలిదైనా లేదు. వారే పల్లెటూరి ప్రభువులు. ... ... ...

* * * *

రాత్రి తొమ్మిదిగంట లయినది. జ్వరం మిక్కుటముగా వుంది. మైకం తల కెక్కుతున్నది. తనకాలం ఘడియలమీద వుందని గ్రహించింది. కాళ్లు పిసుకుతున్న వెంకటప్పను దగ్గరకు తీసుకున్నది. ఆలుమారు తాళంచెవులు తెమ్మని ఆయాసంతో చెప్పింది. అందులోని తాను ఆశ్రితంగోజునే వెంకటప్పకు తెలియకుండా వ్రాసిన వీలు చదివింది. యావదాస్తి అతనిపేర వ్రాసింది. ఇనుపపెట్టెలోని లెక్కగా యాబదివేలరూపాయిలనోట్లు అతనికిచ్చి, "నాయనా, నాకుపుత్రులు లేరనే లోపంతీర్చావు. మాతాపితరులరుణం తీర్చటం నీకుఅందువల్లనే గలిగింది. ఇందులో సగం నీవు తీసుకొని తక్కిన సగం అస్పృశ్యతానివారణకోసం ప్రచారం చేసి వారలకు గృహములు సత్రములు కట్టించవలెను. వారలకై చెరువులు బావులు త్రవ్వించు. ఈపుణ్యకర్తవ్యం నీకు అప్పగించుతున్నాను. మాఋణం యెల్లా తీర్చావో మాకోర్కెకూడా అలాగుననే నెరవేర్చు. నీవే ముందు జన్మంలోకూడా నాకు పుత్రుడవుకావాలని సర్వేశ్వరుడిని ప్రార్థిస్తున్నాను."అంది. ఆయాసం యెక్కువైంది మహాలక్ష్మమ్మకు. వెంకటప్పను దొడ్డిలోని తులసియాకు తెచ్చి నీటిలో కలపమన్నది. ఆనీళ్లు గొంతుకలో పొయ్యమన్నది. సందేహించాడు వెంకటప్ప మరణకాలమందున మహాలక్ష్మమ్మతల్లికి మాలవానిచేతి నీరా అని. ఆయాసం యెక్కువవటంవల్ల చెప్పలేక చెప్పలేక, "గ్రుక్కెడు నీళ్లు" అన్నది. వెంకటప్పసందేహం నివారణమయినది. వెంటనే తులసితీర్థం గొంతుకలో పోసి తల్లిరుణం తీర్చుకున్నాడు. కాళ్లు చేతులు చల్లబడినవి మహాలక్ష్మమ్మకు. కడసారివందనం చెబుతా మనుకున్నాడు. కాని కాలం చేసింది కన్నతల్లి. దుఃఖముతో చిన్నపిల్లవానిలాగున యేడుస్తూ ఆమెశరీరంమీద పడి మూర్ఛపోయాడు వెంకటప్ప.

"కర్రలే చుట్టాలు కట్టెలే బంధువులు
కన్నతల్లెవ్వరే చిలుకా."

అని పాడుతూ ఉదయం దాసరి లేపేనదాకా ప్రపంచం యెరుగడు వెంకటప్ప.

---




పిశిపాటి వెంకటరమణయ్యగారు

## అలవాటు

ఒకవూళ్లో వోపేదబ్రాహ్మడు వుండేవాడు. చాలారోజులు వూరూరు తిరిగి అతి కష్టంమీదపదిరూపాయలుసంపాదించుకొన్నాడు. తిరిగి యింటికివస్తూంటే దారిలోనలుగురు దొంగలు యెదురుపడి ఆరూపాయలు అక్కడ పెట్టమన్నారు. బ్రాహ్మడికి గత్యంతరం లేక పోయింది. దొంగలు నలుగురు ఆడబ్బును సంతోషంగా పంచుకొని పోవడం చూచి బ్రాహ్మడి కోఆలోచన తట్టింది? వాండ్లను పిలిచి ఇట్లా అన్నాడు. "ఓఅన్నలారా! నేను రెండుమూడు మాసాలు, ఎండనక, వాననక వూరూరు తిరిగితే కాని పదిరూపాయలు సంపాదించుకోలేక పోయినాను. మీరో నిమిషంలో పదిరూపాయలు సంపాదించుకో కలిగారు. మీ వృత్తే అన్నివృత్తులలోకి శ్రేష్ఠంగా కనిపిస్తుంది. నేను పిల్లలు గలవాణ్ణి. నన్నుకూడా మీతో చేర్చుకొంటే మీకు పుణ్యం వస్తుంది. నా భార్యాపిల్లలు సుఖంగా బ్రతుకుతారు." అనేటప్పటికి దొంగలకు గూడ జాలివేసింది. "సరే అలాగే చేర్చుకొంటాము. కాని జాగ్రత్తగా మేము చెప్పినట్లుచేస్తూండు. నీకుగూడమాతో పాటు కావలసినంత డబ్బు దొరుకుతుంది" అన్నారు.

ఆరాత్రి ప్రక్కవూళ్లో ఓవ్యాపారి పంతులింటికి కందంవేశారు. పాతదొంగలు నలుగురు బయట నిలబడి బ్రాహ్మడిని కందంలో నుంచి లోపలికి తోశారు. లోపలి సామానంతా ఒక్కొకటే బయటకి, చప్పుడు కాకుండా అందించమన్నారు. ఆరోజు ఏకాదశి అవడంచేత దినమంత భోజనంకూడా చెయ్యలేదు బ్రాహ్మడు. లోపలికి వెళ్లి చూచేటప్పటికి వ్యాపారి పంతులింట్లో తెల్లవారి ద్వాదశి పారణకు, కూరలన్నీ తరిగి పొయిలంతా శుభ్రపరిచి, వంట కన్నీ సిద్ధంచేసి పెట్టివుండడం చూచి బ్రాహ్మడికి నోరూరింది. ముందు వంటచేసికొని చెవుల్లో వున్న ప్రాణాల్ని చిక్కబట్టుకొని అటుతరువాత వోపిగ్గా కావలసినంత సామా నందివ్వవచ్చునుకొన్నాడు. నూతివద్ద చప్పుడు గాకుండా స్నానంచేసి, నాలుగుపొయిలూ అంటబెట్టి వంట ప్రారంభించాడు. అది తయారయ్యేలోపల వూరికేచూస్తూ కూర్చోడమెందుకు దేవతార్చనగూడ ముగించుకొందామనుకొన్నాడు. బయట దొంగలు యింకా బ్రాహ్మడు సాధించుకొని తెస్తాడని, ఆదుర్దాగా కందంవంక చూస్తూ కూలబడివున్నారు. ఇంత వరకు బ్రాహ్మడు చప్పుడయితే అందరు లేస్తా

రన్నమాట మరవకుండానే తింటూలుబద్దాడు. దేవతార్చనముందు కూర్చొన్నప్పుడుమాత్రం ప్రపంచమే మరిచిపోయినట్టు గంట చేతికి తీసికొని "ఆగమార్థంతు" అనే మంత్రం చదువుతూ, త్రిప్పడం మొదలుపెట్టాడు గంటశబ్దం విని అంతా యిదేమిటా అనిఆశ్చర్యంగా లేచి చూచారు. పంతులవారు సంగతంతా తెలుసుకొని, బ్రాహ్మడికి సంతుష్టిగా భోజనంపెట్టి, నిండుగా దక్షిణతాంబూలాలిచ్చి, కథను కాశీకి, బ్రాహ్మడిని యింటికి పంపించారు.

---

## నాలుగేండ్ల ముసలివాడు

గొబ్బూరు వేంకటానంద రాఘవరావుగారు, బి. ఎ.

అతడు శతవృద్ధు. తల ఏకులబుట్టవలె నున్నది. గడ్డము, మీసము పూర్తిగ తెల్లబడినవి. శరీరము ముడుతలు పడినది. కాటికి కాళ్లు చాచుకొనియున్న ముదుసలి; అయినను మానక ఆ వృద్ధుడు రాజమార్గమున కటునిటు తొల్లికతో త్రవ్వుచున్నాడు. మంచి మంచి మామిడిటెంకలను పాతుచున్నాడు; నీళ్లు బోయుచున్నాడు.

రాజుగారు మంత్రి సామంతాదులతో సాయంకాల విహారముచేయుచు అక్కడకు వచ్చినారు. శరీర మోపిక తప్పినను ఆవృద్ధుడట్లు లేని బలము తెచ్చుకొని శ్రమపడుచుండుట గమనించినారు. 'వీని వయ స్సెంత యుండు'నని యొక సామంతుని ప్రశ్నించినారు.

"వీనికి తొంబయి యేళ్లుంటవి. మహాప్రభూ! అయినను ముసలివాళ్లకు కాపీర్ణ మెక్కువ. ఈ టెంకలు మొక్కలై పెరిగి పెద్దవై కాయలుకాచువఱకు వీడు బ్రతికియుండి పండ్లు తినగలననే వీనియాలోచన!" అని యాసామంతుడు జవాబుచెప్పుచు వ్యాఖ్యానముచేసినాడు.

"తాతా! నీ కెన్ని సంవత్సరములు" అని మంత్రి యావృద్ధుని పలుకరించి బిగ్గరగా ప్రశ్నచేసెను. ముసలివాడు తిరిగిచూచి, తన కాలిచెప్పు లచట విడిచి, తొల్లిక క్రిందపెట్టి, చేతులుజోడించి, సవినయముగా నమస్కరించి "మహాప్రభూ! నావయస్సు నాలుగు సంవత్సరములు" అని మారుపలికెను. రాజుగారు పక్కున నవ్వినారు. "ఛీ! ఛీ! ముసలివాడా, చావగూరుచున్నవాడవు, ఇంకనూ అబద్ధములేనా? నీకు నాలుగేళ్లు వయస్సన్న నెవరైన నమ్ముదురా? ఆతురాభ్యాసముకాని కుట్టువాడవా? చిన్నకూచమ్మవా?" అని కోపపడి మందలించినారు.

వృద్ధుడు—"మహాప్రభూ! ఏట్లో కొట్టుకొనిపోయిన దెంతైతే నేమండి? దక్కినదే లెక్క—" అని యింకనుఏమేమో చెప్పబోవుచుండగా సామంతుడడ్డమువచ్చి "ఈకాయలూ పళ్లూ నీకు దక్కుతా యనీ- నువ్వు తిందా మనీ అనుకునే పాతుతున్నావాయీటెంకలు? తాతా" అని సహేళనముగా ప్రశ్నించెను.

వృద్ధుడు—"అదే-బాబూ- మనవిచేసుకుంటున్నాను. కాకిలాగ నాతిండి, నాకడుపు, నాసుఖము నేను చూచుకుంటువుండగా చాలా కాలం చెల్లిపోయిందండి. స్వార్థవిషయంలో

ఎప్పటికైనా, ఎవరికైనా, ఎంతైనా అంతేనని నాకు తుదకు బోధపడిందండి. మన తాతలు, తండ్రులు వేసిన చెట్లఫలం మనం తిన్నాము కామా? అలాగే మనం పాతిన చెట్లఫలితం మనపిల్లలు మనమలు తింటారు మనకడుపున పుట్టినవాళ్లేకాదు. లోకమే కుటుంబము. మానవు లెవరు సంతోషించినా సంతోషము. చెట్టుపెట్టి నీళ్లుపోసి పెంచువాడు ఒకడు; దాని ఫలము అనుభవించువాడు మరియొకడు. పనిచెయ్యడానికే మనకు అధికార మున్నది. దానిఫలితం మనమే అనుభవించవలెనని ఆశ పడుటకు మన కెవరికి అధికారం లేదండి. భగవంతుడు ఎక్కడో వున్నాడా? నరలోక మాయన విభూతికాదా? మన పనివల్ల నలుగురు సంతోషించి సుఖించడమే కార్యసిద్ధి. స్వలాభం ఆశించని మానవసేవ భగవత్సేవయే నని నాకు తెలిసి నాలుగేళ్లేఅయింది. అందుచేతనే తమ రడిగితే నావయస్సు నాలుగేళ్లని యధార్థం మనవిచేశాను. అంతకుముందు నా స్వార్థమనే రేట్లో కొట్టుకొనిపోయినదంతా ఎంతైతే నేమండి. అదంతా లెక్కలోకి వస్తుందాండి? రాదు. నా బదుకులో నికరంగా లెక్కవచ్చేది యీనాలుగేళ్లేనండి" అని వివరించి తెలిపెను. రాజుగారు సంతోషాశ్చర్యములతో "మేలు, మేలు. వృద్ధుడా, కర్మయోగ భావము బాగా ఉపన్యసించినావు" అనిమెచ్చుకొనిరి. ప్రభువువారు మేలనిమెచ్చుకొనినపుడు వేయివరహాల సంచి బహుమాన మిచ్చుట ఆయాస్థానములో నాచారము. కనుక మంత్రి వెంటనే వేయివరాల సంచి ముదుసలి కిచ్చి గౌరవించెను. అప్పు డావృద్ధుడు రాజుగారికి మరల నమస్కారముచేసి "మహాప్రభూ! చిత్తగించినారా? ఇతరులుపాతిన మామిడిటెంకలు నాటి, మొక్కలై పెరిగి, పెద్దవై కాయలు కాచి పండ్లు పండుసరికి ఎన్నో సంవత్సరములు పట్టును. కాని దైవకృపవలనను, ఏలినవారి కటాక్షమువలనను నా టెంకలు పాతుచుండగనే ఫలించినవి. ఆపరాత్పరునిచర్య లద్భుతములు కదా?" అని విన్నవించెను. ఆ వాక్యముల సారస్యముగ్రహించి దేశాధిపుడు మందహాసముతో తలయూచి "మేలు, భళీ; వృద్ధుడా! చక్కగా చెప్పినావు" అని శ్లాఘించెను. వెంటనే మంత్రి మరియొకసంచి వేయివరహాలతో వృద్ధుని చేతబెట్టెను.

వృద్ధు డానందముతో "మహాప్రభూ! ఈచిత్రము చూచితిరా! ఇతరుల మామిడి చెట్లు ఫలోన్ముఖములైనను ఏడాది ఒకమారే కాయలుకాచి పండ్లు పండును. నాచెట్లు అర గడియలో రెండుసారులు ఫలించినవి. ఇది కూడ పరమేశ్వరుని సంకల్పమే" అనెను.

ఆప్రసంగమునకు రాజుమరల ముదితుడై "బలే ముసలివాడా! మంచి సొగసుగా చమత్కరించినావు" అనెను. మంత్రియు వెంటనే మూడవమారు ఇంకొకవేయివరాల సంచినిచ్చి ముసలివానిని సన్మానించెను. వృద్ధుడు మరల ప్రసంగ మారంభింపకపూర్వమే రాజు తొందరగా గుఱ్ఱమెక్కి "మహానుభావుడా! నీవు మరల మాటలాడితివేని నిన్ను సత్కరించుటకిపు డిక నావద్ద ద్రవ్యము చాలదు. స్వార్థరహితమైన మానవసేవచేయుచు, నీవంటికర్మయోగులను తయారుచేయుచు సుఖింపుము" అనిపలికి గృహోన్ముఖుడై రివ్వున పోయెను. స్వార్థరహితుడగు నాకర్మయోగి ఆద్రవ్యమునుమానవసేవయందే వినియోగముచేసెను.




# కమ్మిపని, జాబులతొట్టి
(Letter Tray)

కో. నరసింహాచారిగారు

జాబులతొట్టిని చేయుటకు మూడువిధము లగు కమ్మీలుండుట యావశ్యకము. తొట్టి యొక్క పైయంచునకు లావగు కమ్మియు, కట్టుటకు సన్నని తంతికమ్మియు కావలెను.

సుమారు 30 అంగుళముల నిడివికల లావు కమ్మిని గీసికొని దానికొనలను వంచుకొనవలెను. పిమ్మట ఆకమ్మిని, 8 అంగుళములు నిడివియు, 6 అంగుళముల వెడల్పును గల దీర్ఘచతురాకారము (Rectangle) గా వంచుకొని కొనలను చేర్చి బిగించవలెను.

(చిత్రము A). తర్వాత కొంచెము సన్నని కమ్మినుండి సుమారు 13 అంగుళముల నిడివి కల తునుకలను ఆఱింటినిన్ని (చిత్రము B), 11 అంగుళముల నిడివికల తునుకలను ఆఱింటి నిన్ని (చిత్రము C) తీసికొనవలసినది. అన్ని తునుకల కొనలనుకొక్కెములవలె వంచుకొనవలసినది. 13 అంగుళముల తునుకలను ఒక్కొక్కదానిని కొనలనుండి 3 అంగుళముల వఱకు ఏటవాలుగా వంచి మధ్య 7 అంగుళముల నిడివి యుండునట్లు చేయవలెను (చిత్రము B), అదేరీతిని 11 అంగుళముల తునుకలను కూడ కొనలనుండి 3 అంగుళముల వఱకును వంచి మధ్య 5 అంగుళముల నిడివి యుండునట్లు చేయవలెను. (చిత్రము C). పిమ్మట B తునుకలను చిత్రము A యందలి దీర్ఘచతురములోని X X X అను గుర్తులవద్ద సమదూరమున బిగించవలెను. (చిత్రము D). తర్వాత C తునుకలను దీర్ఘచతురమునందలి పొడుగు ప్రక్కన YYY గుర్తులవద్ద బిగించవలెను. C తునుకల మధ్యభాగము, B తునుకల మధ్య భాగమునకు క్రిందుగా నుండవలెను. (చి. E). తొట్టియొక్క అడుగుభాగమునమాత్రము పొడవునను అడ్డమునను కమ్మీలు పోవుటవలన అది వలవలె నుండును. పొడవుకమ్మీల కడ్డముగా అడ్డకమ్మీలు పోవు చోటులందు (Crosses) తంతికమ్మితో చుట్టవలెను. తంతికమ్మితో కట్టునపుడు సాధ్యమయినంతవఱకు ఒకే కమ్మిని మాటిమాటికి త్రెంచక ఉపయోగించవలెను. ఒకక్రాసువద్ద తంతికమ్మితో కట్టుట ప్రారంభించి చిత్రము J వద్ద చూపిన

రీతిని తక్కిన క్రాసుల నన్నిటిని కట్టుచుపోవలెను.

ఇప్పుడు తొట్టి యొక్క ప్రక్కలందు పై యంచునుండి అడుగు అంచువఱకు మాత్రము పెద్దసందులుగా నుండును. (చి. E.) వాటినిమూయుటకు మఱికొన్ని కమ్ములు కావలెను. చిత్రము F నందలి విధమున మూడు కమ్ములు ఒక నిలువు ప్రక్కకును, అట్టివే మఱిమూడుకమ్ములు రెండవ నిలువుప్రక్కకును, చిత్రము G యందలి విధమున రెండువెడల్పుప్రక్కలకును మూడేసి కమ్ములనుకావలెను. అన్నిటి యొక్క కొనలనువంచుకొనవలెను. F తునుకలను తొట్టి యొక్క నిలువుప్రక్కలందు a b అను మూలలందును, c d అను మూలలందును చిత్రము H యందు చూపబడినరీతిని బిగించవలెను. G తునుకలను వెడల్పు ప్రక్కలందు e f,— g h అను మూలలందును బిగించవలెను. తర్వాత సన్నని తంతికమ్మితో H యందలి రీతిగ కట్టవలెను. అటుపిమ్మట చిత్రము D లో h గుర్తుగల రెండుకమ్ములను వంచుకొని తొట్టియొక్క వెడల్పుప్రక్కలందు అంచులకు బిగించినయెడల తొట్టిని ఎత్తుటకు పట్టుకమ్ములగును. ఇందు వర్ణించబడినతొట్టిని మనకు కావలసినంత పెద్దదిగా చేసికొనవలెనన్న దానికి తగినట్లు కొలతలను మార్చుకొనవలెను.




LETTER TRAY

# రూమీనిగూర్చి—కొంచెం

పి. సీతాదేవిగారు

జలాలుద్దీన్ రూమీ క్రీ. శ. ౧౨౦౭ వ సంవత్సరమున 'బలఖ్'లో జన్మించి క్రీ. శ. ౧౨౭౩ లో దివంగతు డైనాడు. పారసీక భాషలో సుమారు ముప్పై, నలభైవేల పద్యాలు(Couplets) రచించి అమరకీర్తిని గడించాడు.

'సూఫీ' మత ప్రచారకులలో ప్రథమస్థాన మాక్రమిస్తాడు రూమీ. సూఫీమతమునకు ప్రేమయే ప్రధానము. ప్రేమయే కర్మ, ప్రేమయే ధర్మము, ప్రేమయే సర్వస్వము. సూఫీమతము ప్రేమతో ఓతప్రోతమై వుంటుంది. నిస్స్వార్థప్రేమయే ఆమతానికి ప్రాణము. పారసీకవాణిలో గానముచేసిన సూఫీకవు లందరూ తమకవితాకన్యను ప్రేమగంగలో జలకము లాడించారు. అట్లాంటికవులలో జలాలుద్దీన్ రూమీ ముఖ్యుడు.

సూఫీకవులు ఈశ్వరుని స్త్రీరూపంలో ఆరాధిస్తారు. ఆ దేవికి ప్రసన్నత కలుగజేయడం వారిపరాకాష్ఠ. ఆమె పావనకరకమలాల నుండి ద్రాక్షారసాన్ని పానం జేయడానికి పరితపిస్తారు. ఆమెదేహళీప్రదేశమున నిలిచి ప్రేమభిక్షను యాచిస్తారు.

ఆత్మ పరమాత్మను పొందడానికి పవిత్రత ఆవశ్యకము. పరమాత్మను పొందడానికి ఉత్కృష్టమైన ఆకాంక్ష, దందహ్యమానమైన ప్రేమ వున్నప్పటికీ పవిత్రత లేనియెడల పరమాత్మను పొందజాలదు ఆత్మ. పరాకాష్ఠను పొందిన ఆకాంక్ష అయినా పవిత్రతకు తులతూగజాలదు. వాసన, ఛలము, కురుచి, అస్తేయము మొదలగు వ్యభిచారభావాలను పారద్రోలినయెడల పవిత్రాలోకంతో వెలిగిపోతుంది ఆత్మ. అట్టి ఆత్మ అద్దమువలె తళతళ మెరుస్తుంది. ఆ ఆత్మకు దైవికగుణాలు అబ్బుతవి. ఆ పవిత్రాత్మ పరమాత్మకు నివాసస్థాన మవుతుంది. ఈవిషయాన్నే జలాలుద్దీన్ రూమీ కథారూపంలో చిత్రించాడు.

చైనావారు—మేము మంచి కళానిపుణులము.

గ్రీకులు—మాయం దెక్కువ ఉత్కృష్టత, శక్తీ ఉన్నది.

రాజు—ఇందు మిమ్ముల నిద్దరినీ పరీక్షిస్తాను. అప్పుడు మీలో ఎవ రెక్కువో తెలుస్తుంది.

చైనావారు, గ్రీకులు వాదానికి దిగారు, గ్రీకులు వివాదమునుండి తొలగిపోయారు.

చైనావారు అప్పు డిట్లు పలికారు—మా కొక గది నివ్వండి; మీరు కూడ ఒక గదిని తీసికోండి.

ఎదురుగుమ్మములు గల రెండుగదులు ఉన్నవి. చైనావా రొకగదీ, గ్రీకులు మరియొకటీ తీసికొన్నారు.

'మాకు నూరురంగుల నిప్పింపు' డని రాజుగారిని వేడికొన్నారు చైనావారు. చైనా వారు తమ కిచ్చవచ్చిన వస్తువులను గైకొన డానికి రాజుగారు తమఖజానాలను తెర పించారు.

రాజుగారి ఔదార్యంవల్ల చైనావారికి ప్రతిదినం ఖజానాలనుంచి రంగు లొసంగబడు తున్నవి.

గ్రీకులు చెప్పారు—మాపనికోసం ఎట్టి రంగులూ అక్కరలేదు; త్రుప్పును మాత్రమే తొలగించాలి.

వారు ద్వారాలను బంధించి పరిశుభ్రము చేయదొడగారు. గదిలోని వస్తువు లన్నీ ఆకా శంవలె స్వచ్ఛంగాను, పవిత్రంగాను అయి పోయినవి.

శూన్యవర్ణమువైపు వివిధవర్ణప్రగతి ఉం టుంది. రంగు మేఘమువలెను, శూన్యవర్ణము చంద్రుని వగిది ఉంటుంది. మేఘమండలిలో దృగ్గోచరమయ్యే వైభవము, ప్రకాశము నక్ష త్రములనుండీ, చంద్రునినుండీ, సూర్యునినుండీ వస్తవి.

చైనావారు తమపని ముగియగానే ప్రస న్నతాదూంకుభలను ప్రయోయింపసాగారు.

రాజుగారు వచ్చారు. అచ్చటి చిత్రపటా లను జూచి ఆశ్చర్యభరితు లైపోయినారు.

పిమ్మట గ్రీకులగదివైపునకు వెళ్లారు: ద్వారమందలి యవనికను తొలగించారు.

చైనావారి చిత్రపటాలు తళతళ మెరసి పోవుచున్న గోడలపై ప్రతిబింబించాయి.

చైనావారిగదిలో చూచిన చిత్రపటాలే ఇచ్చట ఇంకా సుందరంగా కనుపడుతున్నవి. రాజుగారికళ్లు మెరసిపోయినవి.

అద్దమందలి స్వచ్ఛతయే హృదయము; అదియే అనేకచిత్రాలను గ్రహిస్తుంది.

---

# దేవుడు చేసిన అన్యాయం

పిలకా గణపతిగారు

[ఏకాంకరూపకము]

౧-వ దృశ్యం

[ఓమహాపట్టణంలో ఓచిన్నవీధి. రాత్రి సుమారు ౧౦ గంట లవుతుంది. గాఢాంధకారం అయినా మెఱుపులవెలుతురుచేత దారి అప్పుడప్పుడు కనిపిస్తుంది. భయంకరమైన ఉరుములూ, గాలీ, అప్పుడప్పుడు వర్షం. అంధురాలైన ఓముసలిది-చింకిగుడ్డలు కట్టుగున్నది. ఆమెను, మనుమడు కఱ్ఱపట్టుగుని వీధుల్లో నడిపిస్తూంటాడు. ఆమె "అన్నం అమ్మా" అని అరిచినప్పుడల్లా ఆశబ్దం వీధుల్లో ప్రతిధ్వనిస్తుంది.]

ముసలిది—మాదాకబళ మమ్మా......

...................................

ము—ముసలిదాన్ని, ఆకలి ప్రాణం పోతోంది. ఓకబళం పెట్టించం డమ్మా......

[తలుపుతీసికొని ఒకబ్రాహ్మణీ, ఎనిమిది ఏండ్ల ఆమెకూతురూ అన్నంతో ఇవతలికి వస్తారు.]

బ్రాహ్మణి—అమ్మా, ఇల్లా రా, ఇదుగో అన్నం పట్టు.

ము—అమ్మా, నీకడుపు చల్లగా ప్రాణాలు నిలబెట్టావు తల్లీ!

బాలిక—అమ్మా, చీకట్లో అన్నానికి వచ్చింది. ముసలిదానికి భయమెయ్యదూ పాపం?

బ్రా—[వినిపించుగోకుండా] ఏమే, ఈవేళ అన్నం ఎవరూ పెట్టలేదూ?

ముసలిది—లేదమ్మా. ఈ ఉరుముల్లోనూ, మెఱుపుల్లోనూ, నాకేక వినేవా రెవరు తల్లీ!

బా—[తల్లిచేయి ఆడిస్తూ] అమ్మా, అమ్మా.

బ్రా—ఏమిటో, ఎందుకూ?

బా—చీకట్లో అన్నానికివచ్చింది ముసలిదానికి భయమెయ్యదూ, పాపం?

బ్రా—[నిట్టూర్పు విడిచి] భయమేస్తే ఎల్లాగమ్మా, ఆకలికాదూ పాపం! [ముసలిదానితో] ఆఅబ్బాయి నీమనమడేనా?

ము—అవునమ్మా. [గద్గదికతో] తల్లి చిన్నప్పుడే చనిపోయింది. అప్పటినుంచీ నేనే పెంచి పెద్దవాణ్ణి చేశాను. ఇప్పుడు కొంచెము పెద్దవాడై కఱ్ఱపట్టుగు నడిపిస్తున్నాడు తల్లీ.

[ఆమె అంధనేత్రాలమీది కన్నీళ్లు, మెఱుపు వెలుతురులో బ్రాహ్మణి చూస్తుంది.]

బ్రా—ఏడవకు. కొంచెము పెద్దవాడయితే నిన్ను సుఖపెడతాడులే.

బా—అమ్మా, ముసలిదానికి వాళ్లింట్లో అన్నం లేదూ?

బ్రా—లేదమ్మా పాపం.

బా—ఏం?

బ్రాహ్మ—[నిట్టూర్పుతో] వెనకజన్మంలో చేసిన పాపం.

బా—[తల్లిని కదుపుతూ] అమ్మా, వెనకజన్మంలో పాపం ఎందుకు చేసింది?

బ్రా—[విసుగుతో] అబ్బా నీ కెందుకు ఆ ప్రశ్న లన్నీని, పోయి పడుకోక.

బా—[మారుమాట్లాడక. ఏదో తనలో ఆలోచిస్తుంది.]

బ్రా—పెంద్రాళ్లే మీ గుడిసెకి వెళ్లిపోండి; వర్షంకూడా వస్తోంది పాపం.

[తల్లీ, కూతురూ ఇంట్లోకి వెళ్లిపోతారు.]

ము—[మనమడితో, దారిలో] నాయనా, రంగన్నా!

రం—ఆఁ. నేను నడిపిస్తున్నానులే. భయములేదు మామ్మా.

[కొంచెము సేపుండి]

రం—మామ్మా వెనకజన్మంలో మనము పాపంచేశామా?

ము—చేశాముకాబోలు నాయనా!

రం—ఎందుకు చేశాము?

ము—[కొంచెం ఆలోచించి] మనము చేసేదేమిటినాయనా. [ఆకాశంకేసి చూపించి] అన్నీ ఆతండ్రి చేయిస్తున్నాడు.

రం—అయితే మనకి అన్నం లేకుండా ఎందుకు చేశాడు?

ము—ఏమో ఈ అన్యాయం, నాకు తెలియదు నాయనా.

[గట్టిగా] మాదాకబళం అమ్మా.

[అంటూ ఇద్దరూ నిష్క్రమిస్తారు.]

౨-వ దృశ్యం

[మధ్యాహ్నం ఒంటిగంట అవుతుంది. ఎండ మిక్కిలి తీక్ష్ణంగా ఉంది. అక్కడక్కడ చెట్లమీద కాకులు కా, కా, అనికూస్తాయి. ఓపెద్ద మేడదగ్గర జోలితో రంగన్న ప్రవేశిస్తాడు.]

రం—[గట్టిగా] బిచ్చం పెట్టండమ్మా.

[నౌకరు—ప్రవేశించి] కేకలు పెట్టకు పెద్దషాహుకారు నిద్రపోతున్నారు. మరో యింటికి వెళ్లు.

రం—ఒక్కపిడచ పెట్టించండి. చాలు. మా ముసలమ్మ ఆకలిచేత శోషొచ్చి పడిపోయిందండి. మీ పాదాలకి దణ్ణం పెడతాను. కొంచెము—

[లోపల] ఏమిటాగొడవ. ఆముష్టివాణ్ణి పొమ్మను.

నౌ—అదుగో చూచావా? పెద్దషాహుకారు చూచారంటే, నిన్నూ, నన్నూ బతకనివ్వరు. ఇంకోచోటికి ఎక్కడికైనా పో.

రం—ఊరంతా తిరిగానండి.ఎక్కడా—

షాహుకారు—[కళ్లు నులుముకుంటూ లేచివచ్చి] ఏవీగానివేళ ఇప్పుడు ముష్టేమిటి? మెడపట్టుకు గెంటివెయ్యి. పోతులాగున్నాడు. కూలిపని చేసుగోకూడదూ?

రం—కూలికోసం ఊరంతాతిరిగానండి. రేపటినుంచి తమదగ్గిరకి కూలికి వస్తానండి. ఏం పని చెప్పినా చేస్తానండి. ఈవేళ మా ముసలమ్మకి ఒక్కపిడచ పెట్టించండి. ఒక్క పిడచ—

షా—ఛా, నాకు సమాధానం చెపుతావు? ముష్టిమరిగినవాడికి నీకు కూలిష నెందుకు? పెంకిఘటం. నిద్రపట్టకుండా ఒకటే గోడవ! [నౌకరుతో] చూస్తావేం? గెంటెయ్యకుండా.

నౌ—వెళ్లిపో. షాహుకారు కోప్పడుతున్నారు. నేను చెప్పలేదూ? [చేతితో నెట్టుతాడు.]

రం—నేనే వెళ్లిపోతానండి [కళ్లమ్మట నీళ్లతో వెళ్లిపోతాడు.] [తెరపడును.]

3-వ దృశ్యం

[సాహుకారు ఇంట్లో. అర్ధరాత్రివేళ. ర, శి, గురు సాయుధులైన అనుచరులతో, రంగన్న ప్రవేశిస్తాడు. అతడుకూడా ఆయుధాలు ధరించి సైనికవేషంతో ఉంటాడు. ఆయిల్లంతా నిష్పొముట్టుగున్నట్టు ఒక్కసారి గందరగోళంతో నిండిపోతుంది.]

షా—దొంగలు!! — బందిపోటు! పట్టుకో! అయ్యో! నాయిల్లంతా గుల్లచేసేస్తున్నారు.

రం—[కత్తి చూపించి] మాట్లాడకు. నోరు కదిపితే ప్రాణాలు దక్కవు. [అనుచరులతో] ఆపెట్టెలన్నీ విడగొట్టండి.

షా—[మాట్లాడకుండా గుండె బాదుకుంటాడు.]

నౌ—[కళ్లు నులుముకుంటూ ప్రవేశించి] దొంగలు - దొంగలు - అయ్యో బందిపోటు! [రంగన్న కేసి చూసి] ఓరిదుర్మార్గుడా; చివరకి దొంగతనాల్లోకి దిగావూ? [కత్తిచూసి మాట్లాడకుండా పారిపోతాడు.]

రం—[అనుచరులతో] పట్టుగోండి! పట్టుగోండి! వీధులోకి పోనివ్వకండి ఆనౌకరుని. [ఒకడు నౌకరువెంట బడతాడు.]

రం—[షాహుకారుతో] ఇం కెక్కడన్నా దాచిన ధనముందా? ప్రాణాలమీద ఆశ ఉంటే అబద్ధాలాడకు!

షా—ఛీ దొంగా, నాదగ్గర ఒక్కపైస కూడా లేదు. ఉన్నా నా ప్రాణం పోయినా నేను చెప్పను.

రంగన్న—నువ్వా, నేనా దొంగని? చూడు. ఎంతమంది బీదల్ని మాడ్చి డబ్బు పెట్టెల్లో మూలగబెట్టావో. త్వరగా చెబుతావా? చెప్పించమన్నావా? చూస్తావేం శీతన్నా? [శీతన్న కత్తితో పొడవబోతాడు.]

షా—అయ్యో చంపెయ్యకు; చంపెయ్యకు. అదిగో ఆమూల పాతిపెట్టాను. నీ కడుపునపెట్టుకో. అయ్యో నాడబ్బు-నాడబ్బు.

రం — అరవకు - ఇదిగో చూశావా? [కత్తిమొన గుండెకు గురిపెట్టును.]

షా—[మాట్లాడకుండా గుండె బాదుకుంటాడు.]

[అనుచరులు డబ్బుమూటలుకట్టి తెస్తారు.]

రం—నడవండి పక్క ఇంటికి. కొంచెము భాగ్యవంతుల్లాగున్నారు.

[పూర్వం వెళ్లినఅనుచరుడు రొజుకుంటూవచ్చి]

అను—ఆనౌకరు ఎక్కడికు వెళ్లాడో, కనబడలేదు.

రం—మరేమీభయములేదు. ఎక్కడో దాక్కొని ఉంటాడు. నడవండి ప్రక్క ఇంటికి. [అనుచరులతో వెళ్లిపోతాడు.]

నౌకరు—[రొజుకుంటూ వచ్చి కోమటితో] పోలీసులకి, వాళ్లు వెళ్లేదోవచూపించి వచ్చాను. బహుశా దొంగలు దొరకచ్చు.

షా—అయ్యా! ఈ పోలీసులు కూడా నాకొంప గుల్లచేస్తారు కాబోలు దేవుడా!

నౌ—[తనలో] ఆవేళ వాడికి ఒక్క పిడచపెడితే, ఇంత పుట్టకపోనుగా. అనుభవించు! [పైకి] భయములేదు లెండి.

[తెరపడును.]

౪-వ దృశ్యం

[ఒక సామాన్య సంసారిఇల్లు. రంగన్న అనుచరులతో ఆ యింట్లో ప్రవేశిస్తాడు. ఇల్లంతా గందరగోళము. పిల్లల ఏడ్పులు.]

రం—ఎవర్నీ ఇల్లుకదిలి ఆవతలకి వెళ్లనీయకండి. త్వరగా వెళ్లండి. [తను కూడా అటూఇటూ తిరుగుతూంటాడు.]

ఇంటియజమాని—దొంగలు. దొంగలు. సహాయం చెయ్యండి. బాబూ!

[వీధులోకి వెళుతూంటే అనుచరులు పట్టుకుని స్తంభానికి కట్టుతారు.]

౧-వ అనుచరుడు—మాట్లాడకు.డబ్బు ఎక్కడుందో చెప్పు. లేకపోతే చూచావా?

[కత్తి చూపిస్తాడు.]

ఇంటి యజమాని— అయ్యా, నన్ను చంపినాసరే. [దీనభావంతో] డబ్బు ఎక్కడా లేనిదే ఎట్లు ఉందని చెప్పడం? ఏరోజుకష్టపడి సంపాయించేది ఆరోజుకే సరిపోవడం లేదు. కూడికకూడానా?

అతనిభార్య—రక్షించం డయ్యలారా; చంపెయ్యకండి. ఇల్లంతా చూసుగోండి. ఏం దొరికితే అది పట్టుకుపొండి.

[రంగన్న కాళ్లమీద పడుతుంది. పక్కనే ఆమె 3 ఏళ్లబిడ్డ ఏడుస్తూంటాడు.]

రం—[తనలో] ఛీ, అన్యాయం. ఒకడు లోభి అయినా — అతని సొమ్ము మాత్రం, అపహరించడం ఏమిన్యాయం? ఆ సొమ్ము బీదలకి పంచిపెట్టినా అదీ పాపమే. [కొంతసేపుండి] వీళ్లని దయతలచకూడదు—వీళ్లు ఎంత మందిని ఇల్లా ఏడిపిస్తున్నారో.

ఒక అనుచరుడు—[వచ్చి రంగన్న చెవిలో] పాపం, వీళ్లూ మనలాంటివాళ్లే. మనం మొదట సందేహించినట్లే అయింది. ఇంట్లో ఎంత వెతికినా, ఒక్కపైసకూడా లేదు.

రం—అలాగా. నేనింకా ఏమో అనుకున్నాను. [అనుచరులతో] వీళ్లందరినీ వదలి

వెయ్యండి. వాళ్ళధనమంతా వాళ్ల కిచ్చి వెయ్యండి. [ఆమెతో] అమ్మా! మేము తెలియక మీయింటికి వచ్చాము. పాపం మీరు చాలా బీదల్లాగున్నారు. ఇదిగో ఈధనం తీసుకోండి. [అని ౧, ౨ సంచులు ఇస్తాడు.]

ఆమె —[ఆనందంతో] నాయనా, నీవు మాయవేషాన్ని వచ్చిన ఈశ్వరుడవుకావుగదా!

[అనుచరులు ఆమెభర్తని వదిలేస్తారు. ఇద్దరూ రంగన్నకి సమస్కరిస్తారు.]

[తెరలో]

ఇదుగో! ఈ ఇంట్లో ఉన్నట్టున్నారు. త్వరగా పరిగెత్తండి. పట్టుకోండి పోనివ్వకండి.

ఒక అనుచరుడు—[భయముతో] పోలీసులు వస్తున్న ట్టున్నారు. అనుకున్నట్లే అయింది. ఇప్పుడేం చేతాము?

రం—భయములేదు. ధైర్యంతో పోరాడండి. ఒకళ్లిద్దరి ప్రాణాలుపోయినా, మిగిలినవాళ్లు బ్రతికి మనకార్యం నెరవేర్చవచ్చు.

అనుచరులు—వాళ్ల దగ్గర తుపాకులున్నాయి. పారిపోదాం, రా, లేకపోతే మేం పోతాము. [పారిపోతారు.]

రం—ఛీ, పిరికిపందలు!!

[హఠాత్తుగా వెనుకనుంచి పోలీసులు రంగన్నమీద పడతారు. రంగన్న ఒకపోలీసుని గాయపరుస్తాడు. అతడు పడిపోతాడు. కాని రంగన్న దొరకిపోతాడు.]

పోలీసులు—[రంగన్న చేతులు వెనక్కి విరిచి] నడు దొంగా!

ఇంటియజమానిభార్య—[పోలీసుల కాళ్ల మీదపడి] అయ్యో, అతడు దొంగకాడు. అతన్ని వదలివేయండి. అసలు దొంగలు పారిపోయారు.

ఒకపోలీసు—[కోపంతో నెట్టివేసి] ఛీ! రాక్షసీ! వీడే మావాణ్ణిడొక్కలో పొడిచాడు. నీవుకూడా దొంగలాగేఉన్నావు. [రంగన్నతోనూ మిగతా భటులతోనూ వెళ్లిపోతాడు.]

[తెర పడును.]

## ౨-వ దృశ్యం

[న్యాయస్థానము. రంగన్నకీ, అతనిఅనుచరులకీ, చేతులకి సంకెళ్లువేసి న్యాయాధికారి ఎదుట పెడతారు. అనుచరులంతా తలవంచుకుంటారు. రంగన్న ధైర్యంగా నిలబడతాడు.]

న్యాయాధికారి—వీళ్లందరికీ భాగ్యవంతుల్ని దోచుకోవచ్చునని బోధించింది నీవేనా?

రం—ఔను నేనే. కాని ఆ ధనం నా స్వార్థానికి కాదు.

ఆకలిచేత మలమల మాడిపోతూన్న బీదలకి, పంచి—

న్యా—అది నిన్నడగలేదు. ఆ పోలీసుని పొడిచింది నువ్వేనా?

రం—ఔను నేనే—కాని ఆతన్ని చంపాలని ఉద్దేశం నాకులేదు. దైవవశాత్తు అత

నికి అంత దెబ్బ తగిలి ఉండవచ్చు. నేను నా ప్రాణాలు రక్షించు——

నా——చాలు. నీవు ఈతప్పునకు పశ్చాత్తాపపడతావా? పశ్చాత్తాపపడితే శిక్ష తగ్గుతుంది. ఆలోచించుగో.

రం——నేను పడను. నేను చేసింది తప్పు కాదు. నేను మీదగ్గర ప్రాణభిక్ష రాలేదు. నేను నాకోటి బీదల దుస్థితి చూడలేక ——

న్యా——నీకు ఉరిశిక్ష — నీ అనుచరులకి యావజ్జీవ ద్వీపాంతరవాసమూ విధిస్తున్నాను. నీవు చేసిన అపరాధానికి పశ్చాత్తాపపడి, భగవంతుణ్ణి ప్రార్థించుగో.

రం——నన్ను ఈశ్వరుడు మనస్ఫూర్తిగా అభినందిస్తాడు. నేను చేసింది తప్పు అనుకొనే ఈశ్వరుడు నన్ను క్షమించక పోయినా, విచారంలేదు.——

[న్యాయాధికారి వినకుండా లేచిపోతాడు కోర్టు చాలించి; రక్షకభటులు రంగన్నని మాట్లాడనియ్యకుండా ఈడ్చుకుపోతారు.]

[తెరలో ఒకస్త్రీ ఆర్తనాదము]

అతన్ని విడిచిపెట్టండి. అతడు దొంగ కాదు; దేవుడు!!

[తెర పడును.]

---

# మా వ్యాసకర్తలకు

వ్యాసములు సంపూర్ణముగ చిన్నసైజు కాగితములపై ఒకవైపున మాత్రమే విడిఅక్షరములతో బంతులు దూరదూరముగా, దిద్దుబాట్లు లేకుండ, తిన్నగా వ్రాసి, వర్ణక్రమమునను తప్పులు లేకుండ చూచుకొని పంప వేడికోలు. లేకున్న ముద్రణకార్యములయందు మిగుల కష్టము కలుగుటయే కాక తప్పులుకూడ నిలిచిపోవునని మనవి. ప్రకటింపనివ్యాసముల తమకు తిప్పిపంపుటకయి తపాలుబిళ్లలు పంపవలయును.

సంపాదకుడు, 'భారతి'.



చల్లని కిడుపు

చిత్రకారుడు: శ్రీ అనిశెట్టి సుబ్బారావుగారు, శారదానికేతనము, గుంటూరు

# దక్షిణభారతదేశ విజ్ఞానము

తేకుమళ్ల రామచంద్రరావుగారు, ఎమ్.ఎ.,బి.యల్.

(సం॥ క్రీ. పూ. ౨౦౦౦ మొదలు ౩౦౦౦ వఱకు)

## ఉపక్రమణిక

ప్రాచీన విజ్ఞానమునుగూర్చి గతచిన యేబది సంవత్సరములనుండియు ఇంగ్లీషు, అమెరికన్, జర్మన్, ఫ్రెంచివారనేక పరిశోధనలను గావించియున్నారు. ఇన్ని పరిశోధనలను చేసియు,చేయుచును వారు కనిపెట్టిన యంశము లేవనఁగా: రాజకీయ విజ్ఞానమునకు గ్రీస్, రోమన్ దేశస్థులు పితామహులనియు, తక్కుంగల విజ్ఞానసర్వస్వమునకు ఈజిప్టుదేశస్థులు పితామహులనియు వారు కనిపెట్టిరి.

ప్రపంచములో గంగా, యమున, సింధు, గోదావరీ, కృష్ణమున్నగు నదీప్రాంతముల నివసించిన భారతీయు లుండగా, యూఫ్రెటీస్, టైగ్రిస్ నదీప్రాంతముల నివసించిన సిధియను లుండఁగా, యాంగ్‌ట్సీకియాంగ్ నదీప్రాంతముల నివసించిన మంగోలు లుండఁగా, అమెజాన్, ఆరినాకో మున్నగు నదీప్రాంతముల నివసించిన ఇంకాలు, అజ్టెక్‌లు మొదలైనవా రుండఁగా నైల్‌నదీప్రాంతముల నివసించిన ఈజిప్టువాసులదే యావత్ప్రాచీన విజ్ఞానధనము నని నేఁటి పాశ్చాత్య పరిశోధకులలో ననేకు లభిప్రాయపడుట యితర దేశములందలి సుప్రసిద్ధ పరిశోధకులకు మిక్కిలి అక్కజము గలిగించు విషయమై యున్నది. ఆర్యుల యాదిమవాసము ఆస్ట్రియా ప్రాంతభూమి యనియు, ప్రపంచమున సరియగు రాజకీయ విజ్ఞాన పితామహత్వము గ్రీకులదనియు మొదలగుకొన్ని కొన్ని వ్రాఁతలను వ్రాయుపాశ్చాత్యపరిశోధకు లేకారణమున పప్పులోఁ గాలువైచుచున్నారని మనము ప్రశ్నించినచో మనకొక్కటియే సరియగుసమాధానము రాఁగలదు. అదియేదన, యీపాశ్చాత్యపరిశోధకులు తమ పరిశోధన నారంభించునప్పుడును, అటుతరువాతను, మెడిటరేనియన్ (మధ్యధరా) సముద్రప్రాంతభూములే మొట్టమొదట నన్నివిషయములందును ప్రపంచమునకుఁ గేంద్రత్వము వహించియుండె నను నొక యారోపణా సమన్వితమగు నమ్మకముతో పనిచేయుచున్నారు. ఇంతేగాక పాశ్చాత్యుల క్రైస్తవమతగ్రంథమగు బైబిలులో నెచ్చటఁ జూచినను ఈజిప్టుయొక్క ప్రశంస విస్తారముగా కానవచ్చుచున్నది. పాశ్చాత్యులకు తక్కిన దేశము లన్నిటి కంటె ఈజిప్టు మిక్కిలి సమీపమున నుండుటచే ప్రయాణము చేయుటకును, పరిశోధనకు ప్రధానమగు వస్తుజాలమును సేకరించుటకును వారి కక్కడ నెక్కువ వీలు గలదు. ఈజిప్టునుగూర్చిన పరిశోధనాంశములు విరివిగ పత్రికలలో ప్రచురితములై యుండుటయు తటస్థించినది. ఈ కారణములచేత పాశ్చాత్యుల పరిశోధనలు చాల వఱకు ఈజిప్టుప్రాచీనతచే నావృతములై యున్నవి.

ప్రాచీనవిజ్ఞాన పరిశోధకాగ్రేసరులలో నొకఁడగు డాక్టరు గ్రాఫ్టన్‌ఎలియట్‌స్మిత్ అను నతఁ డిటీవల (అనఁగా ౧౯౨౯ వ సంవత్సరమున) 'ప్రాచీనవిజ్ఞాన ప్రయాణము'* అనునొక గ్రంథమును రచించెను. ఈ గ్రంథమున మొదటినుండి తుదివఱకును ఈజిప్టుదేశమే ప్రపంచవిజ్ఞానమునకు మాతృభూమియనునంశము తీక్ష్ణముగ ప్రతిపాదించఁబడియున్నది. ఈవిషయము నుచ్చరించునప్పుడు ముఖ్యముగ 'హీలియోలితిక్' (అనఁగా సూర్యారాధన సమన్వితమైన) విజ్ఞానము ఈజిప్టులో క్రీ. పూ. ౪౦౦౦ మొదలు ౧౦౦ సంవత్సరమువఱకు నిలిచియుండెననియు, ఆసూర్యారాధన సమన్వితమగు విజ్ఞానము ఈజిప్టునుండియే యావత్ప్రపంచమునకును ప్రయాణము సాగించినదనియు నాతఁడు ఘంటాపథముగ చెప్పుచున్నాఁడు.

---

* Migrations of Early Culture by Dr G. E. Smith; Manchester University Press (1929).

అయినను సూర్యారాధనసమన్వితమైన యీవిజ్ఞానము నంతటినిగూర్చి యాతఁడు పూర్తిగ పరిశోధించలేదు; పరిశోధించఁదలఁచను లేదు. ఏతద్విజ్ఞానములో నొక యంశమగు 'భద్రపరుపఁబడిన శవము'లను (Mummies) గూర్చియే యాతఁడు పరిశోధన విరివిగ సాగించెను. తత్పరిశోధనఫలితముగ ఈజిప్టుదేశమే యీశవభద్రత కాటపట్టని యతఁడు తలపోసెను. తలపోసి, అచ్చట నుండి భారతదేశమునకును, భారతదేశమునుండి చీనా, జపాన్, ఇండొనీసియా, మెలనీసియా, ఆస్ట్రేలియా, పాలినీసియా, అమెరికాలకును ఈవిజ్ఞానము వ్యాపించెననియు అతఁడు పైగ్రంథరూపమున ప్రపంచమునందలి పరిశోధకులకును, విద్యార్థులకును, తక్కినవారికిని చాట నారంభించెను. ఈపరిశోధనఫలితముగ సూర్యారాధన సమన్వితమగు యావద్విజ్ఞానముకూడ 'శవభద్రత'తో పాటు ఈజిప్టునుండియే యితరదేశములకు వ్యాపించెనని యాతఁడు నదురుబెదురులేక చెప్పుటకు సాహసించెను.

డాక్టర్ గ్రాఫ్టన్ ఎలియట్ స్మిత్ పండితుని పరిశోధనలఫలితము లతఁ డనుకొనునంత దృఢమైనవి కావనియు, నేను ప్రస్తుతవ్యాసమున చూపఁబోవు తార్కాణముల ననుసరించి యాతఁడు తన యభిప్రాయములను మార్చుకొనవలసివచ్చుననియు మనవిచేయుచున్నాను.

## 'సూర్యారాధనసమన్వితమగు విజ్ఞాన' మనఁగా నేమి?

'హేలియోలితిక్' అను పదమునకు ఎలియట్ స్మిత్ పండితుఁ డీక్రిందిప్రకార మర్థము చెప్పుచున్నాఁడు:— ఏవిజ్ఞానమునందు సూర్యారాధనకూడ ఒకయంగముగ నుండెనో అది 'హేలియోలితిక్' విజ్ఞానము. ఈ విజ్ఞానమునందలి యితరాంగములు కొన్ని గలవు. రాతి కట్టడములు, సూర్యారాధనతోపాటు సర్పముల నారాధించుట, చెవులకు చిల్లులు పొడుచుట, పచ్చ పొడిపించుకొనుట, సుంతీ, భార్య ప్రసవించినప్పుడు భార్యకు ఎదుట భర్తయే మంచమెక్కుట, దేహమును మాలీసు చేయించుకొనుట, మానవులను రాళ్లనుగా చేయుట, శవములను చెడిపోకుండ భద్రపరచుట, ప్రళయమునందు నమ్మకము, రాజులు దేవునినుండి ప్రభవించిరను విశ్వాసము, వావివరుసలు లేని స్త్రీపురుషసంబంధముల వలన దేవునకు ప్రియతములైన మానవశ్రేష్ఠు లుద్భవించిరను నమ్మిక, స్వస్తిక, తలయొక్క స్వరూపమును మార్చుట మొదలగు ననేకాంగములు గలసి 'సూర్యారాధన సమన్వితమగు విజ్ఞాన' మైనదని ఎలియట్ స్మిత్ వాదము.

ఈవిజ్ఞానము ఈజిప్టునుండి యావత్ప్రపంచమునకు వ్యాపించినదని ఎలియట్ స్మిత్ చాటుచున్నాఁడు. అతని యభిప్రాయముప్రకారము పైన పేర్కొనఁబడిన అన్ని అంగములును యావత్ప్రపంచమునను గనుపించ నక్కరలేదు. అందు కొన్ని కనపడకపోయినను బాధ లేదు. ప్రపంచమున కొన్ని భాగములలో కొన్ని యంగములును, మఱికొన్ని భాగములలో మొదటిభాగములందు గనుపించినవానిలో కొన్ని యంగములును, పైన పేర్కొనఁబడిన 'హేలియోలితిక్' విజ్ఞానాంగములలో మరికొన్నియు కనఁబడిన చాలును. కాని యీ యంగములలో చాలమటు కన్నిచోట్లను గానఁబడవలెను.

స్మిత్ పండితుని పైనిర్వచనము సమంజసముగనే యున్నది. శవములను చెడిపోకుండ భద్రపరచు నాచారమును, సూర్యుని, సర్పములను ఆరాధించు నాచారమును, మానవులనురాళ్లనుచేయు నాచారమునుమాత్రము ముఖ్యముగా నాతఁడు ప్రపంచమునం దంతట నున్నట్లు కనఁబరచినాఁడు. ఇంతవఱకు మనకాతనితో నేవిధమగు తగాదాయును లేదు. కాని ఈజిప్టు ఈ విజ్ఞానమునకు మాతృభూమి యనుటలో నాతఁడు పొరపడినాఁడు.

## ఈజిప్టు-'హేలియోలితిక్' విజ్ఞానము

స్మిత్ పండితుఁడు శవములను చెడిపోకుండ భద్రపరచు విధానమును ముఖ్యముగ నాలోచించినాఁడు; కావున మనమును దానినే ముఖ్యముగ తీసికొని యాలోచన సాగింతము. ఈశవములను భద్రపరుచు విధానము ప్రపంచములో నొకచోటనే పుట్టినదని ఎందు కభిప్రాయపడవలెను? ప్రపంచములో రెండుమూఁడు చోట్ల

నీవిధాన మెందుకు ప్రభవించి ఏకోన్ముఖముగ నభివృద్ధి నందియుండకూడదు? తమ పెద్ద లెల్లప్పుడును తమకండ్ల యెదుట కనపడున ట్లుంచుటకు ప్రయత్నించుటకంటె స్వభావసిద్ధమగు నంశ మేమున్నది? అని కొందఱు మానవశాస్త్రజ్ఞులు ప్రశ్నించుచున్నారు. ఈ ప్రశ్నల కన్నిటికిని నొక్కటే సదుత్తరము గలదు. ఇట్టి ప్రశ్నలు వైచువారికి మన స్తత్వశాస్త్ర మేమాత్రమును తెలియదు. ఒకవేళ తమ పెద్దల శవములను భద్రపరచవలెనను నభిలాష వివిధదేశములందును పుట్టినదని మాటవరుసకు నునమొప్పుకొన్నను అన్నిచోట్లను కొంచెపు భేదములతోఁ గనఁబడుచున్నందున వీని కన్నిటికి నొకవిధమగు సామరస్య ముండకతప్పదు. కాఁబట్టి ఈ విజ్ఞానాంగము వేర్వేరుచోట్ల పుట్టినదను నభిప్రాయమును విసర్జించి,ఏదో యొకచోటనే యిది పుట్టినదని మనము నిర్ధారణచేయుట సమంజసమైయున్నది. ఆచోటు ఈజిప్టు దేశమేనా? అనునదియే సమస్య.

ఈయభ్యాసము ప్రపంచమున నేయే భాగములందు గనఁబడుచున్నదో ముందాలోచింతము. ఈజిప్టు, న్యూగినీ, దక్షిణఅరేబియా, గ్రీస్, పశ్చిమయూరోపు, ఎథియోపియా, తూర్పుఆఫ్రికా, మెడగాస్కర్, బాబిలోనియా, పర్షియా, ఇండియా, బర్మా,ఇండో-చీనా, చీనా, జపాన్, ఇండొనీసియా, పాలినీసియా, ఆస్ట్రేలియా, పెరూ, మెక్సికో, బొలీవియా, ఈక్వెడార్, అలాస్కా మొదలగు ప్రదేశములలో శవములను భద్రపరచు నభ్యాస మున్నట్లు పాశ్చాత్యుల పరిశోధనఫలితముగ మనకు దెలియవచ్చినది.

ఎలియట్‌స్మిత్ చెప్పున దేమనఁగా ఈజిప్టు మాతృభూమిగ నీయాచార ముద్భవించి అచ్చటినుండి ౧. ఆఫ్రికా యుత్తరభాగమును చుట్టిపశ్చిమాఫ్రికాకును, ౨. మధ్యధరా సముద్రమునుండ యూరోపునకును, 3. దక్షిణముగ ఎథియోపియా; తూర్పు ఆఫ్రికాలకును, ౪. తూర్పుగ బాబిలోనియా, పర్షియా, ఇండియాలకును, ౫. దక్షిణ అరేబియాకును, ప్రవహించెనని. ఈజిప్టుతరువాత నీయాచారము రెండుప్రదేశములనుండి పునఃప్రవహించెను. ఈరెండు ప్రదేశములలో నొకటి దక్షిణ అరేబియా, రెండవది ఇండియా. దక్షిణ అరేబియా అంతముఖ్యమైనది కాదు. అచ్చటినుం యీ యాచారమొక్క మెడగాస్కరు ద్వీపమునకే ప్రవహించెను. ఇంకెక్కడికిని ప్రవహించలేదు. కాని ఇండియానుండియే తక్కుంగల యావత్ప్రపంచకమునకును నీయాచారము భారతీయులచేతనే గొంపోఁబడెను. అనఁగా ఇండియాకు తూర్పున నున్న అన్నిప్రదేశములకును భారతీయులే యీయభ్యాసమును తీసికొనిపోయిరి. ఈ పైవంతయు ఎలియట్‌స్మిత్ పండితుని సిద్ధాంతము.

## ఇండియా యొక కేంద్రముమాత్రమేనా?

ఇండియాలో హేలియోలితిక్ అను సూర్యారాధనసమన్వితమగు విజ్ఞానము విజృంభించియుండెననుటకు గొన్ని నిదర్శనములు గలవని మన పండితుఁడు చెప్పుచున్నాఁడు.

(౧) నేఁటికిని బైరాగులు చాలమంది చనిపోయిన తమబైరాగివారిని ఉప్పులో పాతిపెట్టుచున్నారు.[౧]

(౨) ఇండియాలో ప్రాచీనులు చనిపోయినవారి శవములకు పవిత్రములగు మాలికలను, నేతిని రాచియుంచెడువారు.[౨]

(3) ఇండియాలో ప్రాచీనులు చనిపోయినవారి శవములకడుపులలోనుండి మెత్తనిభాగముల నీవలకులాగి పారవైచి,శవముకడుపునిండ నేతినిపోసియుంచెడివారు.[3]

(౪) హిమాలయప్రాంతవాసులలో ఖాసియాలను వారు కొందఱు గలరు. వీరు తమలో చనిపోయినవారిని దహనముగావించకముందు వారి శవములను తేనెతోఁ దడుపుచున్నారు.[౪]

---

౧ క్రూక్ అను పరిశోధకుఁ డిట్లు చెప్పెయున్నాఁడు.

౨ J. A. S. Bombay, Vol. I. (1886), p. 39.

3 Mitra : Indo - Aryans (1881), Vol. I. p. 135.

౪ Sir Joseph Hooker : Himalayan Journal.

శవములను భద్రపరచు విషయమేగాక తక్కిన సూర్యారాధనసమన్వితమగు విజ్ఞానాంగములును భారతదేశమున నున్నవి. రాతికట్టడములలో చాల ప్రాచీన కాలమునందే భారతదేశస్థులు నిపుణులైయుండిరి. నీలగిరులప్రాంతములందలి ప్రప్రథమాంకురము లనఁదగు కట్టడములనుండి జగద్విఖ్యాతములగు దేవాలయనిర్మాణములవఱకు దక్షిణభారతదేశము పేరువడసియున్నది. ఈదేవాలయముల గోపురములకును ఈజిప్టుదేశపు ప్రాచీనాలయములకును గల పోలికను ఫెర్గ్యుసన్ చాలకాలము క్రితమే గుర్తించియున్నాఁడు. ఈరాతికట్టడములలో ప్రప్రథమమున నమర్చఁబడినవి వట్టిశిలలే. వీనిని నిలువుగ పాతుట ఎక్కువవాడుకలో నుండినపద్ధతి. ఇట్టిరాళ్లు గుంపులు గుంపులుగ దక్షిణభారతదేశమునఁ గానవచ్చుచుండును. ఈరాళ్లు చనిపోయినవారికి ప్రత్యామ్నాయముగ నమర్చఁబడిన వనుట నిస్సందేహము. ఇట్టివే ఈజిప్టులోగూడ గలవు. ఈ 'హేలిమోలితిక్' విజ్ఞానము వ్యాపించిన దేశములలో చాల చోట్లయం దివిగూడ కానవచ్చుచున్నవి.

సూర్యవంశము, సూర్యారాధనము, చెవులు పొడిపించుకొనుట, పచ్చ పొడిపించుకొనుట మొదలగున వన్నియుఁగూడ భారతదేశమున నున్నవని ఎలియట్ స్మిత్ పండితుఁడు వ్రాయుచు చెవులకు చిల్లులు పొడిపించుకొనుట బహుశః భారతదేశముననే తొలుదొల్త ఆరంభమయ్యెననికూడ అంగీకరించుచున్నాఁడు. ఇంతేగాక దక్షిణభారతదేశమున, అందు ముఖ్యముగ ఆంధ్రదేశమున నివసించిన నాగులను జాతివారు పాములను సూర్యునికూడ ఆరాధించుచుండిరి. సూర్యుని వంగడమున నుద్భవించి, సూర్యుఁడే గురుతుగ గల జనులలో నాగులనువారు ప్రప్రథములని ఓల్డుహాం అను నాంగ్ల పండితుఁడు వ్రాసియున్నాఁడు.

ఈ పైయంశములనుబట్టి 'హేలిమోలితిక్' విజ్ఞానము భారతభూమియందు చాల ప్రాచీనకాలమున నుండెనను విషయము తేటతెల్లమగుచున్నది. ఈ విజ్ఞానమును మనదేశమునుండి మనకు తూర్పున నున్న బర్మా, చీనా, ఇండోనీసియా మొదలగు దేశముల కెవ్వరు తీసికొనిపోయిరనునది తరువాతి ప్రశ్న. ఆంధ్రదేశమున ప్రాచీనకాలమున నివాస మేర్పరుచుకొన్న నాగు లనుజాతివారే యీవిజ్ఞానమును సముద్రములమీదుగా తూర్పుదేశములకు గొనిపోయినట్లు పాశ్చాత్యపరిశోధకు లభిప్రాయపడుచున్నారు. ఈయభిప్రాయము సకారణమైనదిగనే కానఁబడుచున్నది.

మహాభారతమునందలి ఆదిపర్వమునందు సముద్రము నాగుల నివాసస్థానమని చెప్పఁబడియున్నది. మహాభారతమునందే మఱియొకచోట కద్రువ తనకుమారులైన నాగులను సముద్రతీరమునందలి యొకానొక సుంరగముగు దేశమునకు తీసికొనిపొమ్మని గరుడుని నిర్బంధించినట్లును, గరుడుఁడును వల్లెయని నాగులను రమణీయకమను దేశమునకు తీసికొని పోయినట్లును, త్రోవలో గొప్ప తుపాను కలిగినట్లును కలదు. ఇంతేగాక నాగులు సముద్రముక్రిందనున్న దేశముల నేలు రాజులైనట్లు పురాణాది గ్రంథములందు కానవగును. ప్రాచీన సంస్కృతగ్రంథములయందు నాగులు జ్యోతిశ్శాస్త్రపారంగతు లైనట్లు వర్ణించఁబడినది. దీని నన్నిటినిబట్టి చూచినచో నాగులు నావికులును, సముద్రయానమునకు చక్కఁగ నలవాటుపడినవారును, వాణిజ్యాదులయందు నిపుణులును నగుసంగతులు వెల్లడి యగుచున్నవి.

బర్మాయందలి నాగరకతావిశేషమును, ఇండో-చీనా ఇండోనీసియాలయందలి నాగరకతావిశేషమును చక్కఁగ పఠించినచో నాగు లనుజాతివారు తమ నాగరకత నచ్చట వెదఁజల్లినట్లు మనకు కానవగును. ఆయా దేశముల చరిత్రకారులుగూడ నాగులవలన తమకు నాగరకత కలిగినట్లు వ్రాసియున్నారు.

ఈ పైవిషయములు నిర్వివాదాంశములు. వీనిని బట్టి ఈజిప్టునుండి భారతగేశమునకు వచ్చిన సూర్యారాధన సమన్వితమగు విజ్ఞానము భారతభూమినుండి నాగు లనుజాతివారిచే తూర్పుదేశములకును, అందుండి పెరూ, మెక్సికో మున్నగు దేశములకును కొంపోఁబడెనని పాశ్చాత్యపరిశోధకుల వాదన.

## ఈ విజ్ఞానకాల మేది?

ఎలియట్ పండితుఁడీ ఈజిప్టు-ఇండియా ప్రయాణము క్రీస్తుపూర్వము సుమారు ౯౦౦ సంవత్సరముల క్రింద జరిగినట్లభిప్రాయపడుచున్నాఁడు. ఇండియా కీవిజ్ఞానము వచ్చియుండక ముందే అనఁగా క్రీ. పూ. ౮౦౦ సంవత్సర ప్రాంతములందే నాగులచేత నది ప్రాగ్దేశములకు గొంపో బడెననియు, ఇండియాలో మాత్రము శవముల భద్రత యనునంగము నశించిపోయెననియు ఎలియట్‌స్మిత్ పండితుఁ డభిప్రాయమిచ్చినాఁడు. ఇండియానుండి యేప్రాగ్దేశముల కీవిజ్ఞానము ప్రవహించెనో ఆ ప్రాగ్దేశములందు మాత్రము శవముల భద్రత యను నంగము వ్యాప్తమై విజృంభించెనట.

ఇట్టి యభిప్రాయము నాగులెల్లరకును చాల యసమంజసముగఁ దోఁచకమానదు. ఎచ్చటనుండియో మన దేశమునకువచ్చిన యాచారమును జీర్ణముచేసికొనకుండనే మనదేశవాసు లితరదేశములకు తీసికొనిపోయి యచ్చట దానిని నాటఁజేసినారనుట పరిశోధనసూత్రముల కన్నిటికిని మిక్కిలి దూరమైన యంశము; అసంభవములగు విషయములం దన్నిటను ప్రథమమున నిలచియుండు నంశము. కావున క్రీ. పూ. ౮౦౦ లేక ౯౦౦ సంవత్సర ప్రాంతములలో నీయాచారము ఈజిప్టునుండి మనదేశమునకు వచ్చినదనుట హాస్యాస్పదము.

కాని, మనదేశమునుండి యీ యాచారము ప్రాగ్దేశములకు వ్యాపించినమాటమాత్రము నిశ్చయము. పైన పేర్కొనఁబడిన విషయజాలమును పరిశీలించినచో నాగులు ప్రాగ్దేశముల కీయాచారమును గొంపోనట్లు కనఁబడుచున్నది. ఇది నిర్వివాదాంశము. ప్రాగ్దేశములందలి శవభద్రతయొక్క లక్షణములకును, ఇండియాయందున్నట్లు కనఁబడు శవభద్రతయొక్క లక్షణములకును గలసామీప్యమును బట్టియు ఈజిప్టునందలి శవభద్రతయొక్క లక్షణములకును, ఇండియాయందును, ఇండియాకు ప్రాగ్దేశములందునున్న శవభద్రతయొక్క లక్షణములకును గల వ్యతిరేకతనుబట్టియు పాశ్చాత్యపండితులును, పరిశోధకులును ఈజిప్టునుండిగాక ఇండియానుండియే యిది ప్రాగ్దేశములకు వ్యాపించెనని సిద్ధాంతీకరించిరి. ఇది మనము కాదనజాలము.

ఈ పై నిర్ణయములనుండి తేలఁదగునంశ మేమనఁగా:—శవభద్రతయును, యియ్యది యేసూర్యారాధన సమన్వితమగు విజ్ఞానమున నొక యంగమో యా విజ్ఞానమును క్రీ. పూ. ౮౦౦ లేక ౯౦౦ సంవత్సర ప్రాంతములందుగాక అంతకు పూర్వమో, అంతకుతరువాతనో భారతదేశమున స్థావర మేర్పరచికొని యిచ్చటనుండి ప్రాగ్దేశములకు వ్యాపించెననుట సరియగు పథమైయున్నది. క్రీ. పూ. ౮౦౦ లేక ౯౦౦ సంవత్సర ప్రాంతములకు తరువాత భారతదేశమున సూర్యారాధన సమన్వితమగు విజ్ఞానముగాని, శవభద్రతయను నంగముగాని మన కగుపడదు. చరిత్రములను, శాసనాదులకు సంబంధించిన నివేదికలను, పరిశోధనకు సంబంధించిన పత్రికలను వెదకి వేసారినను మచ్చున కొక్కటైనను క్రీ. పూ. ౮౦౦ లేక ౯౦౦ సంవత్సరప్రాంతములందు గాని, అటుతరువాతగాని మన కగుపడజాలదు. అది యేతత్ప్రాంతములలో నున్న యెడల యేబౌద్ధవాఙ్మయముననో, యే యావసరచనలందో యీవఱకే బయలుపడియుండును. కావున పైని పేర్కొనఁబడిన కాలమునకు చాలపూర్వమే యీవిజ్ఞానము మన దేశమున వ్యాపించియుండవలెను. అట్టి నిదర్శనము లేవైన కలవేమో చూతము.

## ఆంధ్రవేణుఁడు

మాతండ్రిగారగు మ. రా. శ్రీ. తేకుమళ్ల రాజగోపాలరావుగారు ౧౯౧౪-వ సంవత్సరమున శుద్ధాంధ్రజాతుల కులగౌరవములను దెలుపు కథలను 'ఆంధ్రదేశీయ కథావలి' యనుపేర ప్రచురించియున్నారు. అందలి మూఁడవకథ మన కీవిషయమున కొంతసాహాయ్యము చేయఁగలదు.

"బ్రహ్మదేవుని గోత్రముననే సాక్షాత్తుగా నుద్భవించిన యాంధ్రవేణుఁడు భూలోకమును బరిపాలించిన కాలములో, లోకమున క్షామములు రోగములు లేక జనులెల్లరును భాగ్యభోగ్యసంపన్నులై సుఖముగా నుండిరి.

కాని యెన్ని జపములు తపములు చేసినను వేనునికి పుత్రులు కలుగనందున అపుత్రకుఁడై ప్రథమాంధ్రచక్రవర్తి దివి కరిగెను. వేనుని మరణానంతరమున లోకపాలకుఁడు లేక ప్రపంచక మరాజకముగా నున్నందున జనులతని కళేబరమైన రాజరూపమున నిలిచియుండునని తలఁచి యాదేహమునకు దహనాదిసంస్కారములు చేయరైరి. వేనుని యధికారమునకు లోఁబడి లోకము నేలుచుండిన సూర్యచంద్రాదిగ్రహసప్తకము రాజులేమికి వగచి యొకచోట చేరి మంత్రాలోచనము చేసి, వేనుని శరీరమునుండియే నూతనపురుషుని నొక్కని సృజించి భూమికి పట్టభద్రత్వ మీయ నిశ్చయించిరి. వేనుని కుడికాలినుండి విరూపియైన పురుషుఁ డొక్కఁడు సృజింపఁబడెను. నొఱవశరీరము గల యావిరూపికి నిషాదుఁడని పేరు పెట్టఁబడెను. హాస్యరసము రూపము నొందినదో యనునట్లు వికృతాకారుఁడై పుట్టిన యీనిషాదునకు రాజ్య మీయ నిచ్చగింపక యీసప్తగ్రహములును మఱల మంత్రాలోచనము చేసి వేనుని కుడిభుజమునుండి మఱియొక పురుషుని బుట్టించిరి. విశాలమైన వక్షమును, దీర్ఘములైన బాహువులును, ఉన్నతమైన యాకారమును గల యీసుందరపురుషుఁడు చక్రవర్తి యనునామమును దాల్చి లోకనాయకుఁ డయ్యెను. అప్పుడు నిషాదుఁడు వేనుని ప్రథమపుత్రుఁడగు తా నుండఁగా తన తమ్మునికి అన్యాయముగా రాజ్య మొసగిన దుష్టగ్రహసప్తకము యొక్క చేఁతలకు వగచి యొక ఘోరమగు నరణ్యము చేరి ఉగ్రతప మొనరించెను. దేవత లీతపస్సునకు మెచ్చి వరము లడుగుమని నిషాదుని నడిగిరి. అన్న యుండఁగా తమ్మునికి రాజ్యమిచ్చుట అన్యాయము. కాఁబట్టి నారాజ్యము నా కిప్పింపుఁడని యాతఁడు దేవతలను వేఁడెను. భూరాజ్యభారమునుండి చక్రవర్తిని తప్పించుట కిష్టము లేనివారై దేవతలు నిషాదునికి సగమురాజ్యము నిత్తుమనియు, భూమిని చక్రవర్తి యేలుచుండెనుగాన, అరణ్యములన్నిటికిని నిషాదుఁడే యికమీఁద సర్వాధికారియగునని యు ననుగ్రహపూర్వకముగా వాక్రుచ్చిరి. దండక నైమిశాది మహారణ్యములన్నిటికిని నాయకుఁడై నిషాదుఁడు రాజ్యపరిపాలనము చేయుచుండెను. కొఱవలు, చెంచులు, ఏనాదులు, బోయలు, వేనుని కుమారుఁడగు నిషాదుఁడు కన్నబిడ్డలే."

ఈ పైకథయందు ఆంధ్రవేనుని శరీరమునకు దహనాది సంస్కారములు గావించక ఆకళేబరమునే నిలిపియుంచినట్లు మనకు తెలియుచున్నది గదా! ఇట్టి విషయమునుగూర్చియే మఱొక కథ కలదు. అది యీ దిగువను పొందుపరచెదను.

## బేతాళరెడ్డి

"పంటపదునాలుగు కులముల కాఁపులును పూర్వకాలమునందు అయోధ్యానగరమున నివసించుచుండెడివారు. రామవనవాస కాలమున భరతుఁడు అయోధ్య నేలునప్పుడు పిల్లలమఱ్ఱి బేతాళరెడ్డి తనకు పండిన ధాన్యము నంతను దాఁచుకొని పట్టిగడ్డిని గొనిపోయి భరతునికి సుంకము చెల్లించుచుండెను. అతనినిఁ జూచి కాఁపు పొలమువా రందఱును నట్లే చేయసాగిరి. ఇట్లు భరతుని పట్టము 'రామ' రాజ్యముగా పంద్రెండేండ్లు కడచినవెనుక శ్రీరాముఁడు పట్టభద్రుఁడై పంటకాఁపుల మోసమును గనిపెట్టి, తరువాత రాఁబోవు దశరథుని శ్రాద్ధదినమునాఁటికి కొక్కొక్కకాఁపు యొక్కొక్క పెద్ద గుమ్మడికాయను దెచ్చునట్లు శాసించెను. కాఁపులందఱును దమ పొలములలో గుమ్మడి విత్తనములను జల్లుకొనిరి. కాని యింతలో రామభక్తుఁడగు హనుమంతుఁ డీ పొలములపైఁ బడి పాదుల నన్నింటిని నిర్మూల మొనరించెను. ఇందువలన శ్రాద్ధదినమునాఁటికి గుమ్మడికాయలు దొరుకనందున నీ పంట కాఁపులందఱును శ్రీరాముని సన్నిధికిఁ జేరి గుమ్మడికాయకు బదులుగా నాకాయయెత్తు బంగారమును గానుక నిత్తుమని విన్నవించుకొనిరి. శ్రీరాముఁ డిందులకు సమ్మతించెను. అది ధర్మపరిపాలన మగుటచే నొక్కొక్క కాఁపు భరతుని కాలమునందు దా నన్యాయముగా నార్జించిన యావద్ధనమును తులయందుంచువఱకును తూనిక సరి రాకపోవుచుండెను. బేతాళరెడ్డి వంశమువారు తమ భార్యల మెడలయందు పసుపుబొట్టు కట్టి మంగళసూత్రములనుగూడ త్రాసులోఁ బెట్టవలసివచ్చెను." అందువల

నసే యాతని వంశపుకాఁపు లిప్పటికిని మెడయందు బంగారు తాళిని గట్టుకొనక పసుపుదారముతో నొక పసుపుకొమ్మును మాత్రమే మంగళసూత్రముగా ధరింతురు.

"ఇట్లు తన మోసము బట్టబయలైనందున భేతాళరెడ్డి యయోధ్యాపురిలోఁ దలయెత్తుకొని తిరుగలేక యొక భార్యతోను, డెబ్బదియేడుగురు పుత్రులతోను నాయూరు వెడలి దక్షిణమునకు వచ్చెను. ఆతని తక్కిన పదుమూఁడురు భార్యలును అయోధ్యయందే నిలిచిపోయిరి. ఇట్లు వారు ప్రయాణమై పోవుచుండఁగా మార్గమధ్యమున శిలానది యడ్డమయ్యెను. అందు దిగినవారు తాళ్లు యిపోదురని యెఱిఁగి యాపంటకాఁపు దారితప్పించి యాప్రాంతములలోని ఘనకొండవైపున కరిగి యచ్చట గంగమ్మతల్లిని అర్చించి యొకవిగ్రహముతల నఱికి యాప్రవాహమునఁ బడవైచెను. తోడనే ఆనది పాయవిచ్చెను. ఇట్లు గంగాభవాని తమ కొనర్చిన సాయముమూలమున నానదినిదాఁటి యాదేవిని తమకు కులదైవతముగా చేసికొని యాతఁడు దక్షిణాభిముఖుఁడై పోయిపోయి తుదకు మల్లికార్జునక్షేత్రమగు బెజవాడ చేరెను." వివాహసమయములందు కాఁపు లిప్పటికిని గంగపూజ చేయుట కిదియే కారణము.

"మల్లికార్జునక్షేత్ర మాకాలమున జంగముల స్వాధీనమందుండెను. భేతాళరెడ్డి (సూర్యోపాసకుఁడయ్యును) దేవపూజోపచారములం దచ్చటిజంగముల కత్యంతసాహాయ్యమొనర్చుచుండెను. ఒకసమయమునం దాజంగములు బైటియూరి కరుగుచు నాదేవాలయమును బేతాళరెడ్డి స్వాధీనమునం దుంచిరి. జంగములు తిరిగివచ్చినతరువాత కాఁపు లాదేవళమును వారి కొసఁగనందున నీయుభయ జాతులవారికిని చాలతర్కములు జరిగెను. నాగలోకమునందు నాగమల్లి కలదనియు, దాని నెవరు తెత్తురో వారా మల్లికార్జునాలయమున కధికారులనియు వారిలో వారు నిర్ణయించుకొనిరి. యంత్రతంత్రరహస్యవేత్తలయిన జంగము లాపనిని దాము చేయఁగలమని చెప్పి వెంటనే తమ ప్రాణములను బొందినుండి వెలికిదీసి వారు పాతాళమున కరిగిరి. వా రట్లు వెడలఁగానే బేతాళరెడ్డి వారి కళేబరముల నన్నింటిని దెప్పించి భస్మముచేయించెను. జంగములు నాగమల్లిని గొని తిరిగి వచ్చి తమ శరీరములను గానక పరితపింపసాగిరి. తన కిష్టమగు పుష్పమును తెచ్చిన యా పూర్వభక్తుల కీభేతాళరెడ్డి యొనరించిన మోసమునకుఁ గోపించి మల్లికార్జునుఁ డాజంగముల ప్రాణములను కాకుల శరీరములలోఁ బ్రవేశపెట్టెను.........". *

ఈ పై కథయందు జంగములు ప్రాణములంపోయి నను కళేబరములు చెడిపోక మిగిలియున్నట్లును, బేతాళరెడ్డి వానినిదెప్పించి దహనముచేసినట్లును తెలియుచున్నది. ఈజంగములు నాగలోకమునుండి నాగమల్లి తెచ్చుచుట్టమునుగూర్చి యించుక యోచించినచో నాగులకును జంగములకును గల దగ్గరిసంబంధముకూడ మనకు ద్యోతకమగుచున్నదికదా! మఱొకవిశేష మేమనఁగా: మనుష్యుని బదులు శిలానదియందు విగ్రహముతలను నఱికిపడవేయుట. ఈజిప్టు పశ్చిమయూరోపు మొదలగు దేశములందు కూడ ఇండియాలోవలెనే చనిపోయిన మనుష్యుల బదులు శిలలను నిలువుగ నిలుపుటయు మనకు తెలిసినయంశమేకదా?

ఈ పై కథలనుఁబట్టి మన మాలోచించితిమేని భారతదేశమున చాల పురాతనకాలమున శవముల భద్రతయను కళ యొకటి యున్నట్లు నిస్సందేహముగ మనము చెప్పఁగలుగుచున్నాము. ఇఁక నాంధ్రవేణుని కాలమును, బేతాళరెడ్డికాలమును నిర్ణయింతము.

## కాలనిర్ణయము

కలియుగము క్రీ. పూ. ౩౦౦౦ సంవత్సరప్రాంతములం దారంభమయ్యెను. అప్పుడు పాండవుల వంశస్థుఁడగు బ్రహ్మక్షత్రుఁడు భూమి పాలించుచుండెను. ఈ బ్రహ్మక్షత్రుఁడు పాండవుల తరువాత ముప్పదిరెండవ వాఁడు. ఒక్కొక్కరాజు సగటున ఇరువది సంవత్సరములు రాజ్యముచేసినట్లు చరిత్రకారులు లెక్కవేయు

* ఆంధ్రదేశీయ కథావళి, మ-రా-శ్రీ తేకుమళ్ల రాజగోపాలరావుగారు.

గూరు. ఈ లెక్కనుబట్టి చూచినచో పాండవులు క్రీ. పూ. ౩౭౨౦ ప్రాంతములలో నుండినట్లు స్పష్టపడుచున్నది. కుంతికుమారుడగు కర్ణుని అతిరథుఁడు పెంచుకొన్నట్లు పురాణేతిహాసములవలన తెలియుచున్నది. ఈ అతిరథుఁడు పురూరవునితరువాత నిరువదితొమ్మిదవవాఁడు కావున పురూరవుఁడు క్రీ. పూ. ౩౭౨౦ + ౫౮౦ = ౪౩౦౦ సంవత్సర ప్రాంతములందు రాజ్యముచేసెను. పురూరవుని తరువాత పదునాల్గవతరము విశ్వామిత్రునిది. విశ్వామిత్రునకన్న శ్రీరాముఁ డొకతరము చిన్నవాఁడు. కాఁబట్టి శ్రీరాముఁడు క్రీ. పూ. ౪౩౦౦ - ౨౮౦ = ౪౦౨౦-౨౦ = ౪౦౦౦ సంవత్సర ప్రాంతములందు రాజ్యముచేసెను. శ్రీరాముఁడు వైవస్వతమనువు తరువాత ఏఁబదియేడవరాజు. కావున వైవస్వతుఁడు క్రీ. పూ. ౪౦౨౦ + ౧౦౪౦ = ౫౦౬౦ ప్రాంతములం దుండెను. నిషాదునకు వైవస్వతునకు ఎనిమిదితరములు కావున నిషాదుని కాలము క్రీ. పూ. ౫౦౬౦ + ౧౬౦ = ౫౨౨౦ అగుచున్నది. నిషాదుని తండ్రి ఆంధ్రవేణుఁడు. కాఁబట్టి భారతదేశమున శవముల భద్రతయను కళ క్రీ. పూ. ౫౦౦౦ సంవత్సరప్రాంతములం దుండెననియు, క్రీ.పూ. ౪౦౦౦ సంవత్సరప్రాంతములందుఁ గూడ కనఁబడుచున్నదనియు మనము సంటూపథముగ చెప్పవచ్చును. కాని యిది వింధ్యపర్వతములకు దక్షిణముననే కనఁబడుచున్నది. కాని ఉత్తరదేశమున కనఁబడుటలేదు. బేతాళరెడ్డి కథలోఁగూడ దక్షిణదేశపు జంగములు కళేబరములుంచుకొనిరిగాని అయోధ్యనుండి వచ్చిన బేతాళరెడ్డి యుంచుకున్నట్లు కనఁబడదు.

హేలియోలితిక్ విజ్ఞానము - ఇండియా

ఏతత్సంవత్సర ప్రాంతములందే సూర్యారాధన సమన్వితమగు విజ్ఞానమునందలి తక్కిన యంగములుగూడ ప్రాముఖ్యము వహించియున్నట్లు మనకు కానవచ్చును. ఇట్టి యంగములలో ముఖ్యమైనది సూర్యవంశము. సూర్యవంశపు రాజులీప్రాంతములందే రాజ్యము చేసిరిగదా? పైన పేర్కొనఁబడిన లెక్కప్రకారము సూర్యవంశోద్భవుఁడగు శ్రీరాముఁడు క్రీ. పూ. ౪౦౦౦ సంవత్సర ప్రాంతములందు రాజ్యముచేసినట్లు ధ్రువపడుచున్నది. సూర్యుని కుమారుఁడగు సుగ్రీవుఁ డానాఁటివాఁడే గదా? ఆతఁడు దక్షిణదేశమునందలి ఋష్యమూక పర్వతప్రాంతవాసి. అంతే కింకను కొన్నిసంవత్సరముల పిమ్మట సూర్యసుతుఁడగు కర్ణుఁడును భూమిపై విలసిల్లియుండెనని ఇతిహాసములు తెలుపుచున్నవి.

సూర్యారాధనముకూడ అప్పటిలో ప్రబలియుండెను. బేతాళరెడ్డి సూర్యోపాసకుఁడని పై కథలో చెప్పఁబడియున్నది. ఇంతేగాక, నెల్లూరుమండలమునందలి ఉదయగిరి పూర్వము సూర్యునకు ప్రియతమమగు క్షేత్రమైనట్లును, సూర్యునికుమార్తెయగు భద్రావతి భావనమహర్షిని వివాహమాడుటకచ్చట తపము గావించెననియు నీక్రింది భావనమహర్షి కథవలన మనకు తెలియుచున్నది.

“ప్రపంచోత్పత్తి యయినప్పుడు దేవమానవులు దిగంబరులై చరించుచున్నందున, పదునాలుగేండ్ల బాలుఁడగు మార్కండేయుఁడు వస్త్రములు చేయుటకు నియమింపఁబడెను. ఆబాలుఁడు వలసిన పరికరములకై యుగ్రతప మాచరింపఁగా నాతని హోమకుండమునుండి విష్ణువునాభికమలములోని నారను దీసియుంచుకొన్న భావనమహర్షి యుదయించెను. ఆతఁడు వస్త్రములనుఁ జేసి దేవతల కొసఁగి, తుదిబట్టను భైరవున కిచ్చెను. అది భైరవునికి పనికిరానందున కోపించి భైరవుఁడు నేయఁబడు బట్టలన్నియు ఆఱుమాసములనాఁటికే చినిగి పోవునట్లు శపించెను. అందువలన శివునికి మేలైన వస్త్రములు లేకపోయెను. అందుచే నాతఁడు తన కొక పులిచర్మమును వస్త్రముగా నొసఁగుమని భావనమహర్షిని కోరుకొనెను. పులితోలు నెట్లు తెత్తునాయని భావనుఁడు ఆలోచించుచుండఁగా నారదుఁ డాతనికి గానఁబడి ‘ఓయీ, ఉదయగిరి క్షేత్రమునందు సూర్యుని కూఁతురగు భద్రావతి నిన్నుఁ బెండ్లియాడుటకై తప మాచరించుచున్నది. నీ వామెకోరికను దీర్చితివేని యామెయే నీకు వ్యాఘ్రాజినము నీయఁగల' దని చెప్పెను. అంత నాతఁడు ఉదయగిరికిఁ బోయి భద్రావతిని వివాహమాడెను. ఆమె యొకపులి నిచ్చెను. భావన భద్రావతులాపులిపై నెక్కి కైలాసమునకు వచ్చుచుండఁ

గా దారిలో నొక రాక్షసుఁడు వీరి నడ్డగించెను. వానితోఁ బోరి జయించి ఆయాసముతోఁ జెమ్మటలు గార నీతఁడు తన ప్రియసఖితో వ్యాఘ్రవాహనుఁడై మఱల బయలుదేరెను. ఆసమయమున నాతనిశరీరమునుండి క్రిందఁబడిన చెమ్మటబొట్లవలన ఆదిగాఁడును పాడిగాఁడును బాలుఁడును నుద్భవించి పద్మసాలెకులమునకు ఆదిపూరుషులైరి. భావనుఁడు కైలాసము చేరఁగానే శివుఁ డాతని వాహనముపై నింత విభూతిని జల్లెను. తోడనే యాపులి సామ కుబుసమును విడుచునట్లు తన చర్మపు పొరను విడిచెను. అదియే శివునికి వ్యాఘ్రాజిన మయ్యెను. *

ఆంధ్రవేణునికథయందు సూర్యుఁ డాదిగఁగల గ్రహాకూట మారాజేంద్రుని సామంతబృందమైనట్లు చెప్పఁబడినది. ఆంధ్రవేణుఁడు సూర్యారాధకులకు పెట్టనికోటయై యుండినట్లు దీనివలన మనకు బోధపడుచున్నది. నిషాదుఁడు సూర్యారాధకులకు శత్రువును, చక్రవర్తిమిత్రుఁడును నైన కారణముచే సూర్యాదిగ్రహారాధకులు చక్రవర్తిని రాజునుగా చేసి నిషాదుని పారద్రోలుట తటస్థించెను.

సూర్యారాధనతోపాటు సర్పారాధనమును ప్రబలమైయుండెననుట ఈవఱకే చరిత్రకారు లంగీకరించిన విషయమైయున్నది. జంగములు నాగులతో సంబంధముగలిగి నాగమల్లి తెచ్చుటయు పైసంవత్సరప్రాంతములందు జరిగిన యంశమేగదా ?

చెవులు పొడిపించుకొనుటగూడ అప్పటికాలమునం దుండెనని మనకు తెలియుచున్నది. కర్ణుఁడు చెవులకు కుండలములను ధరించెను. ఆకుండలముల నింద్రునకు దాన మిచ్చెననియు కథ మహాభారతమున నున్నది.

నాగులలో పేరెన్నిక గలవాఁడు మయుఁడు. అర్జునుఁడు ఖాండవదహనసమయమున నాగులందెల్ల మయుని సంరక్షించెను. మయుఁడు పాండవులకు చక్కని యద్భుతభవనమును నిర్మించియిచ్చెను.

రాతికట్టడములుగూడ సూర్యారాధన సమన్వితమగు విజ్ఞానమున నంగముగ నున్నవిగదా ? నాగులలో నొకఁడగు మయుఁ డీభవననిర్మాణమున ప్రశస్తిగాంచినవాఁడగుట స్వభావానుగుణ్యముగ నున్నది.

మనుష్యులను రాళ్లనుగా మార్చు విషయమున మన కహల్యాకథయు, మంగలికొలమునకు తల్లియగు బ్రాహ్మణాంగన కథయు, నింక నిట్టి వనేకకథలును తార్కాణములుగ నున్నవి.

ఈ 'హేలియోలితిక్' విజ్ఞానము భారతదేశమున నెప్పుడు నశించినదో మాత్రము. ధర్మరాజు భీముఁడు చనిపోయినప్పుడు భీముని కళేబరమును మోసికొని పోవుచుండెను. అప్పుడు నారదుఁడెదురై 'ఏమిపిచ్చి'యని వేదాంతముపదేశించి ధర్మజుని యారాటమును బాపెను. దీనివలన మనకు తెలియఁదగు నంశమేమనఁగా ఆర్యుల నాగరకత భారతదేశమున పూర్తిగ వ్యాపించుచున్న దినములలో పాతనాగరకత లన్నియు నడుగంటవలసి వచ్చినది. ఆర్యుల వేదాంతమువలన కాయ మస్థిరమనియు శవముల భద్రత వట్టిపిచ్చిపనియనియు నామోదింపఁబడినది. ఈ యార్యుల విజ్ఞానమే ధర్మరాజును పూర్వపు త్రోవనుండి మార్చివైచినది.

ఆప్రాంతములందే మరికొన్ని నిదర్శనములు మనకు కానఁబడుచున్నవి. శ్రీకృష్ణునిపై చాలసార్లు జరాసంధుఁడు దండెత్తివచ్చెను. అందొకసారి శ్రీకృష్ణుఁడు పలాయితుఁ డగుటయు జరాసంధుఁడు వెంబడించుటయు తటస్థించెను. శ్రీకృష్ణుఁ డప్పు డొకగుహలో దూరెను. అచ్చట నెన్నివేల యేండ్లనుండియో ముచికుందుఁడు నిద్రించుచుండెను. జరాసంధుఁ డాతఁడే శ్రీకృష్ణుఁడని యాతని గొట్టెను. అతఁడు లేచి జరాసంధుని శపించెను. ఆగుహలో నన్నివేలయేండ్లు ముచికుందుఁడు నిద్రించలేదనియు, నాతని మృతకళేబరమందు భద్రపరుపఁబడియుండెననియు పాఠకులు గ్రహించియుందురు.

ఆరోజులలోనే అగ్నియు నర్జునుఁడును ఖాండవవనముతోపాటు నాగులనుగూడ తుదముట్టించిరి. సూర్యా

* ఆంధ్రదేశీయకథావళి—మ-రా-రా-శ్రీ శేషమల్ల రాజగోపాలరావుగారు.

రాధన సమన్వితమగు జ్ఞానముయొక్క చరమవేళ యిది. ఆతరువాత కొలఁది సంవత్సరములకే జనమేజయుని సర్పయాగము. నాగకేతనుఁడగు దుర్యోధనుఁడు రణరంగమున నిహతుఁడైన వప్పుడేయని చదువరు లెఱుంగుదురు. సూర్యవంశపురాజుల గొప్పకాల మప్పటికే గతించినది.

పైయంశములనుబట్టి యాలోచించిన చో క్రీ. పూ. ౫౦౦౦, ౪౦౦౦ సంవత్సరప్రాంతములందు ప్రబలముగ నున్న సూర్యారాధనసమన్విత మగు (హేలియోలిథిక్) విజ్ఞానము క్రీ. పూ. 3000 సంవత్సర ప్రాంతములకు పూర్తిగ నాశనమైపోయెనని మనకు తెలియుచున్నది. భారతదేశము 'శవభద్రత'ను విసర్జించుచున్న కాలమున ఈజిప్టుయొక్క నాగరకత యారంభమయ్యెను. అప్పుడు మనదేశ మించుమించుగ విసర్జించిన యీయాచారమును ఈజిప్టు అందుకొనెను. శవములను భద్రపరచు కళను దేశానుగుణముగ ఈజిప్టు మార్చుకొనవలసివచ్చెను. ఇండియాయందలివా రప్పటికప్పుడే దీనిని వదలినందున ఈజిప్టు కెక్కుడు సాహాయ్యము లభింపలేదు. తుద కెట్లో ఈజిప్టుదేశము తన 'తంటాలు' తాను పడెను. ప్రాగ్దేశముల కప్పటికప్పుడే ఇండియానుండి ఈయాచారము ప్రాఁకియుండుటచేతనే ప్రాగ్దేశముల 'శవభద్రత' కును, ఈజిప్టుశవభద్రతకును తారతమ్యము కనఁబడుచున్నది. అమెరికా మొదలగు ప్రాగ్దేశములందు దార్యుల నాగరకత వ్యాపించుటకు ఇండియాకంటె రెండుమూఁడువేల సంవత్సరములైనను ఆలస్యమైనందున యీదేశములలో 'శవభద్రత' నశించలేదు.

కాఁబట్టి ఇండియా ఈజిప్టునుండి 'శవభద్రత' నేర్చుకొన్నదనియు, దీనికిని సూర్యారాధన సమన్వితమగు విజ్ఞానమునకును ఈజిప్టు కేంద్రమనియు వాదించు ఎలియట్‌స్మిత్ పండితుని వాదము కేవలము నిరాధారమైయున్నది. నేటికైనను విజ్ఞానవిషయములందు పాశ్చాత్యపరిశోధకులు సంకుచిత దృష్టిని విసర్జించుట ప్రపంచమునకు శ్రేయోదాయకము.

---

# మే ఘ దూ త

(ఆంధ్రగ్రంథమాల ౧౬-వ కుసుమము)

కర్త: దీపాల పిచ్చయ్యశాస్త్రిగారు (కళానిధి గ్రంథమాల, నెల్లూరు).

కాళిదాసుని మూలమునందలి భావసంపద కోలుపోవని స్వతంత్ర పద్యరచనము. పదముల కూరుపు, నుడికారము సొంపు, జాతీయముల పెంపు, అన్వయసారళ్యము గలిగి, రచనము తేటతేనెవలె నూటలూరించును. సహృదయు లగు పలువు రాంధ్రకవిపండితవర్యులచే 'మేలు మేలు' అని మెప్పు గన్నది. వెల రు. ౦-౧౨-౦.

మేనేజరు: **ఆంధ్ర గ్రంథమాల**, నెం. 7, తంబుశెట్టివీథి, జి. టి, మద్రాసు.

# హిందూదేశ పరిపాలనావిధానము

(నాల్గవ భాగము)   చావలి వెంకట హనుమంతరావుగారు, యమ్.ఏ., బి.ఇ.డి.

౧

౧౯౧౭-వ సం. ఆగష్టు 20-వ తేదీ హిందూదేశ పరిపాలనా విధానపు చరిత్రలో చాల ముఖ్యమైన దినము. ఆ రోజున పార్లమెంటుసభలో హిందూదేశ రాజ్యాంగమంత్రియగు ఎడ్విన్ సామ్యూల్ మాంటేగ్యూ గారు (Mr. E. S. Montagu, Secretary of state for India) మనదేశపు భావిపరిపాలనాపద్ధతిని గురించి ఒక ప్రకటన చేసియుంచిరి. దానిసారాంశ మీక్రింద పొందుపర్చబడినది :—

"హిందూదేశపు ప్రభుత్వవిషయములలో బ్రిటిష్ పార్లమెంటువారి విధానము ప్రభుత్వవిషయములలో హిందూదేశస్థుల కెక్కువ యగు స్థానము నిచ్చుటయు, స్వపరిపాలనాసంస్థలను దేశమునందు క్రమముగ ప్రవేశపెట్టుచు వాటిద్వారా హిందూదేశమును బ్రిటిష్ సామ్రాజ్యములో అంతర్భాగముగ పూర్తియగుబాధ్యతాయుత స్వపరిపాలనావిధానము నేర్పాటుచేయుటయునై యున్నది. ఈవిధానము నేర్పరుచుటలో భారతప్రభుత్వమువారు పూర్తిగ పార్లమెంటువారితో ఏకీభవించుచున్నారు. కాని ఈ విధానమును ఒక్కసారిగా గాక క్రమముగ ప్రవేశపెట్టుట ముఖ్యకర్తవ్యమని నేను చెప్పవలసి యున్నది. దానిని ప్రవేశపెట్టుటలో ఎప్పుడెప్పుడు ఎంతెంతవరకు మార్పుచేయవలసియుండునో నిర్ణయించు నధికారము, హిందూదేశప్రజల భాగ్యోదయములకు బాధ్యత కలిగియున్న ఇండియా గవర్నమెంటువారి యొక్కయు, బ్రిటిష్ గవర్నమెంటువారియొక్కయు చేతులలో నుండవలెను. మరియు హిందూదేశప్రజలు ఎంతవరకు బ్రిటిష్ గవర్నమెంటువారి యుద్దేశ్యములను ఆచరణయం దుంచుటయందు సహకారము సల్పుదురో దానిపైనను, వారికి బాధ్యతాసూత్రము నాచరణయందు పెట్టుట కెంతవరకు సమర్థత కలదో దానిపైనను, ఈ చేయబడు మార్పులు ఆధారపడియుండును."

౨

ఈప్రకటనయందు కొన్ని ప్రధానవిషయములను గురించిన లోపములు కలవని చెప్పక తప్పదు. ముఖ్యముగ హిందూదేశమున కెప్పుడెప్పుడు ఎంతెంత స్వపరిపాలన నీయవలయునో నిర్ణయించుటకు హైందవులకు గాక బ్రిటిష్‌పార్లమెంటువారి కధికారము నిచ్చుట చాల ఆక్షేపణీయము అసంతృప్తికరమునగు విషయము నై యున్నది. మరియు తత్క్షణమే బ్రిటిష్‌పార్లమెంటువారీయదలంచిన సంస్కరణములు, వారిలక్ష్యము (అనగా సంపూర్ణస్వపరిపాలనము) దృక్పథమునుండి చూచిన చాల తక్కువగా నుండెను. అయినప్పటికిని హిందూదేశపరిపాలనవిషయమునుగూర్చి బ్రిటిష్‌వారి అభిప్రాయములను అధికారరీతిని తెల్పుటలో ఈ ప్రకటన ప్రథమమును ప్రధానమునై యున్నదని చెప్పవచ్చును. ఇదివరలో ఏ బాధ్యతగల ఇంగ్లీషురాజకీయవేత్తయు హిందూదేశమునకు స్వపరిపాలన నిచ్చుటనుగూర్చి ఇట్టిప్రకటన చేయుటగాని, అభిప్రాయమును వెలిపుచ్చుటగాని చేసియుండలేదు. మార్లేప్రభువు తనపేరుతో ఏర్పాటు కాబడిన సంస్కరణములను పార్లమెంటులో ప్రవేశపెట్టునపుడు అవి "పార్లమెంటరీపద్ధతులపై బాధ్యతాయుతప్రభుత్వము నేర్పాటుచేయుట కెంతమాత్ర ముద్దేశింపబడలే"దని ఖండితముగ చెప్పియుండెను. తరువాత 1911 లో హార్డింజిప్రభువు * (Lord Hardinge) ఒక సందర్భములో "హిందూదేశములో రాష్ట్రములకు కొద్దికొద్దిగా స్వాతంత్ర్యము నిచ్చుటయు, కొంతకాలమునకు పూర్తియగు రాష్ట్రీయస్వాతంత్ర్యమును నేర్పాటుచేయు

* హిందూదేశపు రాజప్రతినిధి.

టయునే బ్రిటిష్‌విధానముయొక్క ప్రధానలక్ష్యమని వ్రాసియుండినప్పుడు చాలమంది ఇంగ్లీషుఉద్యోగస్థులు తీవ్రముగ తమఅసమ్మతిని వెలిపుచ్చియుండిరి. ఈవిధముగ మాంటేగ్యూగారు తమపార్లమెంటరీప్రకటనచేయువరకు చాలకొద్దిమంది హిందూదేశ పరిపాలనకు సంబంధించిన వారు మనదేశపు భావి రాజకీయసంస్కరణములను గూర్చి అనుకూలాభిప్రాయములను వెలిపుచ్చియుండలేదు. మాంటేగ్యూగారి ప్రకటనకుకూడ కొంతమంది పెద్ద ఇంగ్లీషు అధికారులు మొదలగువారు ప్రతికూలురుగా నుండకపోలేదు. కాని 1909 లోను, 1911 లోను ప్రబలిన వ్యతిరేక భావమునకును, 1917 లో వెలిబుచ్చబడిన వ్యతిరేకాభిప్రాయమునకును భేదము కలదు. 1917 లో ఐరోపామహాసంగ్రామము జరుగుచుండెను; హైందవ సేనలు చాల ధైర్యముగ బ్రిటిష్ సామ్రాజ్య రక్షణమునకు సహాయపడెను. హైందవుల ద్రవ్యము చాల విరివిగ యుద్ధపుఖర్చుకై చెల్లించబడెను. దానివలన బ్రిటిష్ సామ్రాజ్యమునందలి ప్రతివారును హిందూదేశరాజకీయ సంస్కరణముల సందర్భములో చాల అనుకూలురుగ నుండవలసిన ఆవశ్యకత కలిగినది. 1916 సం॥పు సెప్టెంబరు నెలలో హిందూదేశపు రాజకీయనాయకులు చేసిన ప్రకటనలో వారు వ్రాసినటుల, "హిందూదేశము తనయొక్క రాజభక్తికి ఏమియు పారితోషికము కోరుటలేదు. కాని ఆమె యుద్ధములో చేసిన సహాయమునకు బదులుగ తన బానిసతనమునకు బదులుగ స్వాతంత్ర్యము నిచ్చు సంస్కరణములు కావలెనని కోరుటకు తగిన కారణము లున్నవి. హిందూదేశమునకు ముఖ్యముగ కావలసినది "మంచి ప్రభుత్వముగాదు; ప్రజాభిప్రాయముపై నాధారపడియుండు స్వపరిపాలనపద్ధతి." ఈ అభిప్రాయము ననుసరించి రాజకీయ-మార్పులు చేయుటకు యుద్ధసమయములో అనుకూలవాతావరణ మేర్పడినది; మాంటేగ్యూగారిప్రకటనకూడ అప్పుడే చేయబడెను. కాన ఇతరులు ఎంతమంది వ్యతిరేకాభిప్రాయులై యున్నను ఏదోవిధముగ సంస్కరణములు ప్రవేశపెట్టుట తప్పనిసరి యైనది.

## 3

ఇంక మాంటేగ్యూగారి ప్రకటనలోని ప్రధానవిషయములను గూర్చి కొంత విచారింతము. దానివలన మొదట, పార్లమెంటుసభవారు హిందూదేశస్థులకు ప్రభుత్వవిషయములలో ఎక్కువగ పాల్గొనుటకు తగు నవకాశములు కలుగజేయుటకు సాభిప్రాయులై యున్నట్లు స్పష్టమైనది. హైందవీయులకు ప్రభుత్వోద్యోగములలో పెద్దవికూడ ఇచ్చుటకు బ్రిటిష్‌ప్రభుత్వమువారును, ఇండియాప్రభుత్వమువారును కూడ అంగీకరించిరని ఆప్రకటన సారాంశము.

రెండవవిషయము:— పార్లమెంటు సభవారుగ ఇండియాలో క్రమముగ పార్లమెంటరీవిధానము ననుసరించి స్వపరిపాలనపద్ధతుల నేర్పాటుచేయుట కియ్యకొనిరి. ఇది కేవలము క్రొత్తపద్ధతికాదు. ఇదివరలో సూచించినటుల ౧౯౨౧ సం॥ లో మొట్టమొదటిసారి హైందవులను (అధికారులను, అనధికారులనుకూడ) శాసనసభలలో సభ్యులుగా నియమించుట మొదలుపెట్టినప్పటినుండియు ఈపద్ధతికి పునాదివేయబడి క్రమక్రమముగా అది పెంపొందింపబడినది కాని "స్వపరిపాలన" సూత్రమునకు వ్రాతమూలకముగ నేర్పాటుమాత్రము ౧౯౧౯ సం॥ లో జరిగినది. "హిందూదేశపరిపాలనావిధానము బాధ్యత పూర్తిగ హైందవుల చేతులలో నుండుట ముఖ్యావసరముకాని బ్రిటిష్‌వారితోపాటు వారుకూడ ప్రభుత్వవిషయములలో భాగస్వాములుగా నుండుటమాత్రమేకాదు" అను ప్రధానసూత్రము ఈ ప్రకటనవలన అంగీకరింపబడెను.

మూడవవిషయము:—పార్లమెంటువారు తమ లక్ష్యమును అమలునందుంచుటకు వీలైనంతత్వరలో తగిన చర్య తీసుకొనుటకు కృతనిశ్చయులై యుండిరనికూడా దానివలన స్పష్టమైనది. ఆ చర్య సరియైనదా కాదా, ప్రజాభిప్రాయమునకు సరిపోవునదా కాదా యను విషయములనుగూర్చి భేదాభిప్రాయము లుండవచ్చును. కాని అప్పటికి మాత్రము ఏవో కొన్ని సంస్కరణము

లను ప్రవేశపెట్టుటకు పార్లమెంటువా రభిప్రాయపడి యుండిరని చెప్పక తీరదు.

## ౪

పైన సూచింపబడినట్లు మాంటేగ్యూగారి ప్రకటన మనదేశమునకు కొంతకాలమునకైనను స్వపరిపాలన నిచ్చుట కియ్యకొని నప్పటికిని అది ప్రసాదింపదలచుకొనిన స్వపరిపాలన కొన్ని కట్టుబాట్లకు లోనై యుండునట్లు మాత్రమే ఏర్పాటు చేయబడదలచుకొనిన దని మనము జ్ఞాపక ముంచుకొనుట ముఖ్యము. ఆ కట్టుబాట్లు ఎంతప్రధానములుగ బ్రిటిష్ గవర్నమెంటువారిచేత పరిగణింపబడెనో తెలిసికొనుటకు ఆ ప్రకటనలోని భాగములు ౧౯౧౯-వ సం. పు ఇండియా ప్రభుత్వచట్టము (Government of India Act of 1919) లో ఉపోద్ఘాతము (Premble) గ చేర్చబడిన వని చెప్పిన చాలును. అందు మొదటికట్టుబాటు ఏమన: బాధ్యతాయుత స్వపరిపాలనను ప్రవేశపెట్టుట ఒక్కమారుగా కాక క్రమముగ ప్రవేశపెట్టబడవలెను. రెండవది: అట్లు ప్రవేశపెట్టబడు సంస్కరణములు అప్పటప్పట పార్లమెంటువారి అనుమతిపైననే ప్రవేశపెట్టవలసి యుండును. అనగా ప్రతిమార్పు జరుగునప్పుడును పార్లమెంటు ఆమోదమును బడయవలసియుండును. మరియు ప్రతిమార్పు ప్రవేశపెట్టుటకును ముందు ఎంతవరకు హిందూదేశస్థులు అంతకుముందు ప్రవేశపెట్టబడిన సంస్కరణములను జయప్రదముగ కొనసాగించుటకు తోడ్పడిరో పార్లమెంటువారు విచారించి ఆ తోడ్పాటుపైననే క్రొత్తసంస్కరణము లాధారపడియుండునట్లు చేయుదురు. మూడవది: స్వపరిపాలన గల్గియుండు బ్రిటిష్ ఇండియా బ్రిటిష్‌సామ్రాజ్యములో అంతర్భాగముగ మాత్ర ముండవలెను. అనగా ఇండియా ప్రభుత్వపు చట్టము ప్రకారము హిందూ దేశము యొక్క రాజకీయలక్ష్యము అధినివేశస్వపరిపాలన (Dominion Status) కాని సంపూర్ణస్వాతంత్ర్యము (Complete Independence outside the British Empire) ఎంతమాత్రము కాదు.

## ౫

మాంటేగ్యూగారి ప్రకటన చేయబడిన కొలదికాలమునకే దేశమందలి వివిధపక్షనాయకులచేతను అన్ని శాఖలకుచెందిన ప్రముఖులచేతను సంతకము చేయబడిన ఒకపత్రము రాజప్రతినిధికి పంపబడెను. దానిలోని విషయములనుగూర్చి ఆలోచించి తగువిధానము నేర్పాటు చేయుటకు కలకత్తాయందు సమావేశ మొకటి కూడి ఒకనివేదిక తయారుచేయబడెను. దానిప్రకారము: (I) ప్రతిరాష్ట్రమును కొన్ని చిన్నరాజ్యభాగములుగ విభజింపబడవలెను. (II) ఈరాజ్యభాగములలో బాధ్యతాయుతస్వపరిపాలనయు, శాసనసభవారివోట్లపై ఆధారపడి యుండు కార్యనిర్వాహకవర్గమును ఏర్పాటుచేయబడవలెను. (III) ప్రతిరాజ్యభాగమునకును రాజకీయాధికారిగ ఒక చీఫ్‌కమీషనరు (Chief Commissioner) ఉండవలెను. (IV) ౭ సంవత్సరము లైనతరువాత ఈవిధానమెట్లు పనిచేయుచున్నది విచారించుట కొకకమీషను ఏర్పాటు కాబడవలెను. (V) ప్రస్తుతమున్న రాష్ట్రప్రభుత్వములు రిజర్వుచేయబడిన కొన్ని ప్రభుత్వశాఖలపై అధికారము కలిగియుండవలెను. మిగిలినశాఖలన్నియు (ముఖ్యముగ విద్యాశాఖ, వ్యవసాయశాఖ, స్థానికస్వపరిపాలనశాఖ మొదలగునవి) పైన చెప్పబడిన రాజ్యభాగముల అధికారముక్రిందకు మార్చవలెను. కొంతకాల మైనపిదప రిజర్వుశాఖలుకూడ వాటియధికారముక్రిందకు మార్చుటయు, మరికొంతకాలమునకు కేంద్రప్రభుత్వమునందుకూడ బాధ్యతాయుత స్వపరిపాలనాసూత్రమును ప్రవేశపెట్టుటయు జరుగవలెను.

పైన చెప్పబడిన విషయములనుబట్టి ఇదివరలో ప్రచురింపబడిన సంస్కరణ నివేదికలకును, ప్రముఖుల నివేదికకును రాష్ట్రములందు ద్వంద్వప్రభుత్వము (Diarchy) ను ప్రవేశపెట్టు ముఖ్యవిషయములో భేదాభిప్రాయ మున్నట్లు గమనింపదగును. అది ఏదన, మొదటిదానిలో ఇప్పుడున్న రాష్ట్రప్రభుత్వములలోనే ద్వంద్వప్రభుత్వవిధానము ప్రవేశపెట్టవలెనని యుండగా రెండవదానియందు ఆరాష్ట్రములను చిన్న

భాగముల క్రింద విభజించి వాటియందా విధానము నేర్పాటు చేయవలెనని యున్నది. కాని స్వపరిపాలనా పద్ధతి మొట్టమొదట రాష్ట్రములలో ప్రవేశపెట్టవలెనని అభిప్రాయపడుటలో రెండును ఏకీభవించెనని చెప్పవచ్చును.

ప్రముఖుల నివేదిక కొన్ని కొన్ని విషయములలో సంతృప్తికరముగనే యున్నది కాని దానియందు కూడ కొన్ని లోపములు కలవు. దానిలోని విధానము ననుసరించిన ప్రస్తుతమున్న హిందూదేశ రాజకీయవిధాన మనేకు కట్టడమును పూర్తిగ మార్చి వేయుట అవసర మగును. రాష్ట్రములను చినచిన్న భాగములుగా చేయుట కొన్నిచోట్ల ప్రజాభిప్రాయమునకు వ్యతిరేకముగ నుండి రాజకీయాందోళనకు కారణము కావచ్చును; కాని భాషా ప్రయుక్తముగ రాష్ట్రములను విభజించిన దానివలన చాల లాభముకల్గి ఆయా భాషలను వాడు ప్రజలు తమ రాజకీయ, ఆర్థిక, సాంఘిక జీవితములను పెంపొందించుకొనుటకు అవకాశములు కూడ ఏర్పాటగును.

౬

ఈ లోటుపాట్లను గమనించియే మాంటేగ్యూ చెల్మ్స్‌ఫర్డు రిపోర్టు (Mantag-Cuhelmsford Report) నందు దానిని గూర్చి చర్చించి అది ఆచరణ యోగ్యము కాదని త్రోసివేయబడెను. కాని దానిలో సూచించిన ప్రకారము ప్రస్తుతమున్న రాష్ట్రములను చిన్న రాజ్యభాగములుగ విభజించుట యొక్క అవసరమును గూర్చియు, ఉపయోగమును గూర్చియు ఇంకను ఎక్కువగ ఆలోచించి రాష్ట్రప్రభుత్వములు రిపోర్టు చేయవలెనని దానియందు వ్రాయబడెను. కాన భాషాప్రయుక్త రాష్ట్రసూత్రమునకు మాంటేగ్యూ-ఛెల్మ్స్‌ఫర్డు రిపోర్టు బలమొసంగుచున్నదని మనము గ్రహింపనగును.

ఇంక ఆ రిపోర్టునందలి ఇతర విషయములను గూర్చి ఇచ్చట వివరించుట అనవసరము. దానియందు వ్రాయబడిన సూచనలలో చాలవరకు తరువాత మాంటేగ్యూగారు పార్లమెంటులో ప్రవేశపెట్టిన ఇండియా ప్రభుత్వపు బిల్లునందు చేర్చబడియే యున్నవి. ఆ రిపోర్టు గ్రంథకర్తలు ద్వంద్వప్రభుత్వవిధాన సూత్రము నామోదించుటయేకాక, రాష్ట్రీయశాసనసభలు పూర్తియగు స్వతంత్రాధికారము కల్గియుండవలెననియు, ట్రాన్సుఫరు చేయుటకు నిశ్చయింపబడిన ప్రభుత్వశాఖలలో (Transferred subjects) ఇండియను మంత్రులకు వీలైనంతవరకు పూర్తియగు స్వేచ్ఛయుండవలెననియు, ఆ శాఖలవిషయములో వారు శాసనసభవారి వోట్లపై ఆధారపడియుండవలెననియు వారు సూచించి యుండిరి. వారు కూడ పూర్తిగ మార్లేసంస్కరణముల వాసననుండి తప్పించుకొనలేకపోయినప్పటికిని జాతీయవాగులును జాతీయమహాసభయు కోరినట్లు దేశమందు వీలైనంతవరకు పార్లమెంటరీ విధానము మనదేశమందు ప్రవేశపెట్టుటకు అనుకూలాభిప్రాయము కలవారయి యున్నట్లు పైన సూచించిన విషయములనుబట్టి విదితము. మార్లే సంస్కరణములను వారు పూర్తిగ విడనాడలేదని చూపుటకు రాష్ట్రశాసనసభలందు గల సభ్యులనుండి నియమిత సభ్యుల సంఖ్య ఎక్కువగా గల గ్రాండుకమిటీల (Grand Committees)ను వాటిని ఏర్పాటు చేయవలెనని సూచించి రని వ్రాసిన విశద మగును. కాని గవర్నమెంటు ఆఫ్ ఇండియా బిల్లు పార్లమెంటుసభల సెలెక్టుకమిటీ (Joint Select Committee of Parliament) వారి ఎదుటకు వెళ్లినప్పుడు ఆ గ్రాండుకమిటీల సూచనను రాష్ట్రప్రభుత్వ విషయములో నిరాకరించి, కేంద్రప్రభుత్వములో కౌన్సిల్ ఆఫ్ స్టేటు (Council of State) అను పేరుతో శాసనసభాభాగముగను, క్రింది శాసనసభ లేక లెజిస్లేటివ్ అసెంబ్లీ (Legislative Assembly or the Lower Chamber of the Central Legislature) వారి తీర్మానములను పునర్విచారణచేయు అధికారము (Revising powers) తో ఏర్పాటుచేయబడవలెనని సూచించిరి. దానితోబాటు గవర్నరులకును, గవర్నరు జనరలుకును శాసనసభవారి తీర్మానములను "వీటో" చేయుటకు అధికార ముండవలెనని వారు వ్రాసిరి. వారుచేసిన ఇతర ముఖ్య-మార్పు లేవన (i) శాసనసభలు మొదటి నాలుగుసంవత్సరములు పనిచేసిన పిదప వాటికి అధ్యక్షులనెన్నుకొను అధికార మీయబడవలెను. (ii) కేంద్రశాసనసభలలో క్రిందసభయగు లెజిస్లేటివ్

ఎసెంబ్లీకి ప్రభుత్వ ఆదాయ వ్యయములను నిర్ణయించు సందర్భములో కొన్ని అధికారములు చెలాయించుటకు వీల్లు కల్పింపవలెను.

## ౭

జాయింటు రిపోర్టునందలి విధానము హిందూదేశములో ప్రచురింపబడినప్పుడు దానిలోని కేంద్ర విషయముల ద్వంద్వప్రభుత్వపద్ధతినిగూర్చి చర్చ తీవ్రముగ ప్రబలి అది జయప్రదముగా కొనసాగునా యను అనుమానము చాలమంది వెలిబుచ్చిరి. కొంతమంది మితవాదులు మాత్రము దేశమందు బాధ్యతాయుత ప్రభుత్వమును ప్రవేశపెట్టుట కిదియే సరియగు మార్గమని తలంచిరి. కాని భారత కేంద్రప్రభుత్వమునకు సంబంధించిన సంస్కరణములు చాల అసంతృప్తికరములుగ నున్నవని అందరును—ముఖ్యముగ జాతీయవాదులు తెల్పిరి. రాష్ట్రములలో ఎట్టి బాధ్యతాయుత ప్రభుత్వసూత్రము ప్రవేశపెట్టబడెనో ఆవిధమైనపద్ధతినే కేంద్రమందుకూడ ప్రవేశపెట్టవలెనని వారు సూచించిరి. అదే కాక ఇండియామంత్రి సలహాసంఘమును రద్దుచేయవలెననియు, దానిని తీసివేయుపర్యంతము హిందూదేశప్రభుత్వవిషయములలో ఇంగ్లండునందలి అధికారవర్గముయొక్క పలుకుబడితగ్గి మనదేశములో నిజమగు స్వపరిపాలన పద్ధతి నేర్పాటుచేయబడుట జరుగదనియు వారుచెప్పిరి.

పార్లమెంటు విచారణసంఘము (Joint Select Committee) వారియభిప్రాయములను తిరిగి విమర్శించిరి. కేంద్రప్రభుత్వములో ద్వంద్వవిధానము నేర్పాటు చేయవలెనను విషయముపై అనుకూలముగకాని ప్రతికూలముగకాని వారభిప్రాయ మొసంగలేదు. ఇండియా మంత్రిసలహాసంఘమును తొలగించవలెనను విషయమును గూర్చి వారీక్రిందియభిప్రాయము నొసగిరి. "ఇండియా మంత్రిసంఘమును తీసివేయవలెనను విషయమునుగూర్చి కమిటీవా రనుకూలురుగలేరు. వారిఉద్దేశ్యములో కొంత కాలమువరకైనను ఇండియామంత్రికి హిందూదేశానుభవముకల యధికారులసలహా పొందుట కవకాశము లుండుటకు ఆవశ్యకత కలదు. ఈసంఘమును రద్దుచేసిన ఆతడితరమార్గములలో సలహాదారులకొరకై అన్వేషింపవలసిన అవసరము కల్గును. ఈసందర్భములలో కమిటీవారు ఇదివరలో చాలకాలమునుండి పనిచేయుచున్న సంఘమును తొలగించి క్రొత్తసంస్థ నొకదాని నేర్పాటుచేయుట అంతమంచిది కాదని తలంచుచున్నారు."

పైవిషయములుగాక ఇతరములనుగురించి హిందూదేశములో భేదాభిప్రాయములు హెచ్చుగ పెరిగెను. సంస్కరణముల నామోదించుటయా నిరాకరించుటయా యనుప్రశ్న తీవ్రరూపమునుదాల్చి అతివాదములు ఇరుపక్షములను ప్రబలెను అఖిలభారత కాంగ్రెసుసభవారు బొంబాయిలో ప్రత్యేక కాంగ్రెసును ఏర్పాటు చేసి కేంద్రమందు పూర్తియగు బాధ్యతాయుతప్రభుత్వము ౧౫ సంవత్సరములలోపున ప్రవేశపెట్టబడవలెననియు, రాష్ట్రములందు ౬ సంవత్సరములలో అట్టి ప్రభుత్వపద్ధతియే ఏర్పాటుచేయబడవలెననియు తీర్మానము నామోదింపజేసిరి. తరువాత ఢిల్లీలో జరిగిన కాంగ్రెసుమహాసభయందు పై తీర్మానములను మార్చి రాష్ట్రములందు వెంటనే స్వపరిపాలనపద్ధతిని ప్రవేశపెట్టి భారతరాజ్యాంగ ప్రణాళికయందు హక్కుల నిరూపణసూత్రము (Declaration of Rights) ప్రవేశపెట్టబడవలెనని యు సూచించుచు తీర్మానము లామోదింపబడెను.

హరి రాధా కృష్ణమూర్తిగారు

# బడబానలభట్టు

[త్రిపురాంతకమునుండి శ్రీశైలమున కరుగు బడబానలభట్టు మార్గంబునందుఁ దెనుఁగు రాయని చెరువులో సూర్యుని కర్ఘ్యం బొసఁగుచుండఁ గుడిచే యుంగరము జారి నీటం బడియె. దానిఁ బడయ నతఁడు చెరువునీళ్లినుక శాపం బిడె. తదుపరి నా యుంగరము గ్రైకొన చనియె.]

అదియే నూ జలమందుఁ జూచుచును నీ హస్తంబులం జూచెదో
సదిమారుల్ రవియే స్వయంబుగ ఘనాంభఃశ్రేణిలోఁ జొచ్చి నీ
ప్రహవమం దెక్కడు భక్తి సీయిడిన యర్ఘ్యం బెత్తుకొన్నాఁడో లే
క దయన్ మాలిన జంతు వేదయిన వీఁక న్నిన్ను బాధించెనో.

జాఱిపోయెనె యేమైన సరసిలోన-సలిలపూరంబుఁ గాన కష్టమ్ము సుమ్ము
నీకు దక్కుట; నీటిలో నిలువకయ్య-క్రూర జలచరములు బాధఁ గూర్చునేమొ.

* * * * * *

ఇంతకు ముందుగా నిట యహీనజలంబులతోడ నీ హ్రదం
బెంతయు కాంతి నించినది; యెక్కడి కేగిన దీజలంబు? ర
వ్వంతటిలోన నీ కవి పదాహతిఁ జెందినదేమొ లేక నా
ధ్వాంతహరాగమంబునను దర్పము వాసినదేమొ చూడఁగా.

దివ్యమా సూర్యకాంతి దీధితుల నీను-నంగుళీయక మెచటి దీ హస్తమునను
దెలిసినది నీనిఁ గోల్పోయి ధీయుతుండు-మరలఁ గైకొన శాపంబు మడుగు కిడెను.

# వ్యాయామవిద్య

తోట సుబ్బరామయ్యగారు

వ్యాయామవిద్య అనేమాట కొంచెం కొత్తగానే కనబడుతుంది. అనేకవిధాలుగా దీన్ని చెప్పుకొంటారు. డ్రిల్లని, గేమ్సని, స్పోర్ట్సని, బాక్సింగని, రెజిలింగని, తాలింఖానాసనని, కత్తిపసని, కస్రపసని ఇలాగా యెవరి కనుకూలమైనట్లు వారర్థం చేస్తారు. కాని ఇందేదో ఒక్కటి మాత్రమే చేరి సరియైన వ్యాయామవిద్య కాలేదు. అన్ని చేరితే ఒకమోస్తరు అర్థం రావచ్చును.

మనదేశంలో చదువు సంధ్య లేని డ్రిల్లు టీచర్లే చాలాకాలాన్నుంచి వ్యాయామవిద్యా పరిశ్రమలను నడుపుతూవచ్చారు. డ్రిల్లును వదిలి మరోదాని జోలికి పోవడం వారికి గిట్టదు. ఆటలంటే అసలే అసహ్యం. అంచేత వ్యాయామవిద్యమాట అనగానే దరిద్రపు డ్రిల్లొకటి మనకు జ్ఞాపకాని కొస్తుంది. కేవలం చెమటపుట్టించే సాధనం కాని మృగబలంతో సమానమైన పరిశ్రమ కాని చేరి వ్యాయామవిద్య అనిపించుకోలేదు. దీన్ని దేహపరిశ్రమ



వ్యాయామమండలి

లయొక్క విద్య అని యెంచడం గొప్ప పొరపాటు. దేహపరిశ్రమలద్వారా, ముఖ్యంగా ఆటలు మున్నగువాని ద్వారా లభ్యపడే విద్యయే వ్యాయామవిద్య అవుతుంది.

ఈ విద్య సాధారణవిద్యలో ఒక ముఖ్యాంగం. ఈ పరిశ్రమలు ముఖ్యంగా శరీరశాస్త్ర, ఆరోగ్యశాస్త్రసూత్రాలపై ఆధారపడి ఉంటవి. స్వాభావికమై, చాలాయుగాలుగా వచ్చేటివై పెద్ద మనస్సు-కండరాలకు, ముఖ్యంగా హృదయం శ్వాసకోశాలు జీర్ణకోశాలు మున్నగు ముఖ్యాంగాలకు, పని యిచ్చేటివై ఉంటవి; మరిన్ని పాల్గొనేవాళ్లకు ఇష్టమైనవై, వాళ్లకు తృప్తిని సంతోషాన్ని చేకూర్చజాలినవైకూడా ఉంటవి. పరిశ్రమలను ఏర్పఱచుకోవడంలో ఆటలకు ప్రథమస్థానాన్ని డ్రిల్లుకు అంత్యస్థానాన్ని యివ్వాలి. కండరాభివృద్ధిమాత్రమే ప్రధానంగాఉండే పరిశ్రమలకు ప్రోత్సాహ మివ్వడం మానెయ్యాలి. నిత్యం జీవితంలో ఉపయోగపడే నేర్పులను, అలవాటులను అభివృద్ధిచేసేవాటికి ప్రాముఖ్యం యివ్వాలి. కాబట్టి ఎవరుకాని యే ఒక్క ఆటమీదనో పరిశ్రమమీందనో కాలాన్నంతా గడపకూడదు. వీలైనంతవఱకూ ఎక్కువ ఆటలలోను పరిశ్రమలలోను పాల్గొనాలి, యెక్కువ నేర్పులు అభ్యాసపడేటందుకు.

వ్యాయామవిద్యలో యీక్రింది ఉద్దేశ్యాలున్నవి.

(1) అవయవపటుత్వాన్ని ఆరోగ్యాన్ని వృద్ధిచేయడం.

(2) వ్యాయామపరిశ్రమలయందు ముఖ్యంగా ఆటలయందు అభిలాషను ఇష్టాన్ని వృద్ధిచేయడం.

(3) జీవితంలో పనికొచ్చే నేర్పులను, అభ్యాసాలను, నడవడికలను వృద్ధిచేయడం.

(4) జీవితాంతంవఱకు కుండే ఆట అలవాటుల, ఆరోగ్యపు అలవాటుల వృద్ధి చేయడం. ఆరోగ్య మనేది శరీరరీత్యా మాత్రము ఉంటే సరిపోదు; మనోరీత్యా, నైతికరీత్యా, సాంఘికరీత్యా, ఉత్సాహరీత్యాకూడా ఉండాలి.

పై వన్నీ విద్యాశాస్త్రసూత్ర సమ్మతాలు కాబట్టి వానిని సాధారణ విద్యోద్దేశాలతో చేర్చవచ్చును. ఇంతకు విద్య అనేది మనిషిని యెక్కువకాలం బ్రతికించి యెక్కువసేవ చేయించేటందుకు సహాయ మయ్యేదిగా ఉండాలి.

వ్యాయామ విద్యకు ఆరోగ్య విద్యకు చాలా దగ్గర సంబంధం. ప్రతి పాఠశాలలోను, ప్రతికళాశాలలోను రెండును ఉండవలయును. ఆరోగ్యవిద్యకు రెండుభాగాలు. 'ఆరోగ్య బోధన'యని, 'ఆరోగ్యసేవ'యని. 'బోధనను' సాధారణపు టీచర్లే జరుపవచ్చును. 'ఆరోగ్య సేవను'మాత్రము డాక్టరులు చేయవలసియుంటుంది. వారు యీపనికి ఉపయోగపడడానికి ప్రత్యేకశిక్షణ పొందియుండడం మంచిది. విద్యా

ష్ఠులకు డాక్టరులు వైద్యపరీక్షచేసి, తద్ద్వారా తేలిన లోపాలను వాళ్ళకును వాళ్ల పెద్దలకును తెలియజేయాలి. పరీక్షచేసిన మాత్రంతోనే ప్రయోజనము లేదు. ఆ లోపాలను పోగొట్ట డమునకు తగినకృషి చెయ్యాలి, మంచి సలహా నివ్వాలి. ఈవిషయంలో ఫిజికలు డైరక్టరు డాక్టరుకు తోడుపడుచుండాలి.

ఆయాస్థలాల పరిస్థితులను, వాతావర ణాన్ని, కాలాన్ని, పాల్గొనేవాళ్లయొక్క యిష్టాలను, ఆవశ్యకాలను, సామర్థ్యాలను, ఉండే అవకాశాలను లెక్కలోకి తీసికొని, పరి శ్రమలను ఏర్పఱచి ప్రోత్సహించడానికి మంచి తెలివితేటలు, నేర్పు, ఆకర్షణశక్తిమాత్రమే కాక ప్రత్యేకశిక్షణంవల్ల లభింపబడిన శాస్త్ర జ్ఞానముకూడా కావాలి. పూర్వకాలంనాటి డ్రిల్లు టీచర్లుంటే, ఆ ఫలితాలుకూడా అంత మాత్రమే యేడుస్తాయి. వ్యాయామ విద్యా విధానం జయప్రదంగా జరగాలంటే ప్రత్యేక శిక్షణపొందిన వ్యాయామ విద్యాడైరక్టరు లుం డాలి. ఈవిషయాన్ని అట్టేనొక్కి చెప్పనిలేదు.

ఇట్టి ప్రత్యేకశిక్షణ మిచ్చే సంస్థ యావ ద్భారతము, బర్మా, సింహళ దేశాలకంతా ఒక్కటే ఉన్నది, మద్రాసులో. ఈ పుణ్యం వై. యం. సి. యే. వారు కట్టుకొన్నారు. ఈ వ్యాయామవిద్యాకళాశాల పుట్టి పదిపన్నెం డేండ్లయినను, యిలాటి దొకటున్న సంగతి మద్రాసులో ఉన్నవాళ్ల కే చాలామందికి తెలి యదు. ఇది చాలా విచారకరమైన విష యమే; విచిత్రమైనదిగూడాను. మన దేశంలో యీవిద్యావ్యాప్తికై చాలా పాటుపడుచున్న 'బక్కు' గారు యెంతయు ప్రశంసనీయులు. రానురాను ప్రభుత్వాలు, విద్యాసంస్థలు యీ విద్యకు ప్రాముఖ్యం యివ్వ మొదలెట్టి నవి. మద్రాసు అన్నామలే విద్యాపీఠాలలో నిర్బంధ వ్యాయామవిద్యావిధానం ప్రారంభ మయి చాలాకాల మయింది. ఆంధ్రవిశ్వకళా పరిషత్తువారుకూడా వచ్చేసంవత్సరాన్నుంచి నిర్బంధానికి మొదలిడుతారట. ఈ శిక్షణ పొందినవారికి మంచి జీతాలే దొరుకుతు న్నాయి. దీనికి ఉత్తరహిందూస్థానంవారే, ముఖ్యంగా పంజాబీలే, వచ్చుచున్నారు. అన్ని విషయాల అందరితో సమానంగా ఉండే ఆంధ్రులు దీనికికూడా తగిన ప్రాముఖ్యం ఇవ్వడం మంచిది.

---

# వసంతము

కోటమిల్లి వీరసోమ సత్యనారాయణరావు

కాంతవిసూత్న పల్లవనికాయవికస్వర పుష్పకోరకా
క్రాంతలతానికుంజతరు రమ్యవనాంతము, కీరకోకిలా
త్యంతకలస్వనాంకిత దిగంతము, సమ్ముదితాఖిల ప్రజా
స్వాంతము, మందమారుతనిశాంతము తోఁచె వసంత మంతటన్.

మందసమీరబాలకుఁ డమందసుగంధము లందియీయ, మా
కందపు మేడ లెక్కి కలకంఠులు స్వాగతగాన మీయ, నం
దంపులఁ బూలవాన గురియంగ లతాలలితాంగు లెంతయుం
సందడి నొప్ప మాధవుఁడు చారువనాంతరపుణ్యవీధులన్.

నిరుపమాఖిల కళానిపుణుఁడౌ సర్వేశ రచితచిత్రప్రదర్శనమనంగ
ప్రకటభూలోకనాటకసముద్ద్యోతమౌ రమణీయ సంతోషరంగమనగ
సకలమోహనలీలఁ బ్రకృతికామిని తాల్చు సరసశృంగార వేషంబనంగ
ప్రతివత్సరక్రమాగత కాలచక్ర విరాజితాఖిల సౌఖ్యరాశియనగ
సద్భుతాపాదియై మనోహరము నగుచు - నేత్రపర్వంబునై వాంఛనీయమగుచు
సర్వఋతువులయందుఁ బ్రశస్తమగుచు - నెంతయును మించె భవ్యవసంతమౌర.

నిండుచెంగావి క్రొన్నిగ్గు లేర్పడఁ జిల్కుఁగాని పూఁతమెఱుంగు లూనఁబోవు
నిద్దంపుఁగడాల నిగనిగల్ దులకించుఁగాని కాఠిన్యంబుఁ గాంచఁబోవు
తొలిసంజలేఁతచాయల వెలార్చుచునుండుఁగాని కాఁకల నించుకేనిఁ గనవు
గొనబు నున్నెంపు తళుకుల నోలి వెదచల్లుఁగాని సోనలరాపు గానఁబోవు
నవనవస్ఫూర్తి లొప్ప మార్దవము బెరర - సరసరుచిరాకృతుల మించి సహజకాంతి
భాసురములైన సుందరపల్లవములు - హాళి దైవార వాసంతవేళయందు.

నవకోమలైక పల్లవసంతతుల చేత రమణీయనీరాజనములు పట్టి
మలయసుగంధ నిర్మలవాయువుల చేత కమనీయతర చామరములు వీచి
మకరందసిక్త కమ్రపరాగముల చేత ప్రవిమలగంధచర్చలను గూర్చి
అలిగీతపికకీర కలనాదముల చేత శ్రుతిహితగాన సన్నుతు లొనర్చి

రాజితలతాంతములచేతఁ బూజసేసి - విమలఫలములచేత నైవేద్య మొసఁగి
ప్రకృతిభామిని పరమేశునకు సపర్య-సలుపునట్లుండె వాసంతసమయమందు.

ఎలతీగలందు నుయ్యేల లింపుగా నూఁగి పొదరిండ్ల దాఁగుడుమూఁతలాడి
సుడిమీఱఁ దిరిగి పుష్పాడిదూళి విరజల్లి తారి యందందు సందడు లొనర్చి
క్రొత్తావిసిరులఁ జేకొని పర్వులనుబెట్టి తలిరాకు చేతు లందముగ నార్చి
విరిపాత్రలను జేరి వెసఁ దేనె లొలికించి కొదమతుమ్మెద నల్లగుండ్లఁ జిమ్మి
కడఁగి దక్షిణదిక్కాంత కడుపు చలువ-వలనఁబుట్టిన ముద్దులపట్టి యనిల
బాలకుం డాడుకొను వనప్రాంగణముల - సంతతామోదపరత స్వేచ్ఛానుసరణి.

కలికరాచిల్కపచ్చల తోరణంబులు కకుబంతవీథులఁ గదలియాడ
తలిరాకుమావిని ర్మలకోపకళికలు తరుకింబములయందుఁ దళ్కులీన
గందంపుకొంప "పంకా" చల్లగాలులు తమయంత కమ్మ నెత్తావు లొలయ
తెలిపూవు నిగ్గుసప్పుల్లఁ గ్రాలు లతికూన లలితనాట్యముల నింపులు ఘటింప
సమదకలకంఠు లెలమిఁ బంచమనినాద-విమలగానామృతంబుల విందుసేయ
వసరమామాధవులు పూర్ణవైభవంబు - లలరఁ గనుపట్టె నతులకల్యాణలీల.

చిగురుసంగ్రాసము చొప్పడన్ ప్రతిఫలస్వీకారమున్ మాని మా
ధవు భ్రామ్యత్ మాధురీవిమల గీతాసార సంవ్యాప్తిచే
శ్రవణానందము సేయు చాగమశిఖాసంప్రాప్తిచే కోకిలం
బహురా ! మించె వనప్రియాఖ్య తన కన్వర్థంబుగాఁ బాటలన్.

ప్రసన్న వ్యవికాసయుక్త సుమనో విస్ఫూర్తి సంధిల్లఁ ద
ద్గళితామందమరందధార లకలంకస్ఫూర్తిఁ జెన్నొందఁ మం
జులతాశ్లేషితపాదపాళి మిగులన్ శోభిల్లఁ గావ్యాకృతిన్
జెలఁగన్ గూర్చెను కాలసత్కవి వసంత్రీమాధవం బిమ్ములన్.

---

# పురాతన వస్తుప్రదర్శనాలయము, హైదరాబాదు

కొమాండూరి వెంకటచారిగారు, బి. ఎ.

నిజాంరాష్ట్రము హిందూ మహమ్మదీయ ప్రభువుల యాధీనమందు చరిత్రాంశములలో మహోన్నతదశను పొందింది. దానికి నిదర్శనము ప్రతిపల్లెలోను, పట్టణములలోను, కీకారణ్యాలమధ్యా, ఏదో ఒకగుహో, బురుజో, దేవాలయమో, మసీదో, సగం భూమిలో కప్పడిపోయిన శిలాశాసనమో కనబడుతూనే వుంటుంది. ప్రస్తుతం వున్న నైజాముగారి ధర్మమాంటో, పూర్వపుప్రసన్నత్యమును శోభాయమానంగా వెలుగొందించు జీవకళికలను, శిల్పకళ విన్నాణముం జాటు విగ్రహములు, శిలాశాసనములు ఇత్యాదిపరిశోధనాంశములు సేకరింపబడి, పూర్వవస్తుప్రదర్శనశాల నలంకరింపబడినవి.

ప్రపంచంలోకెల్లా పొగడ్త గన్న, ఎల్లోరా, అజంతాగుహాలయము లీరాజ్యములోనివే. అలంకృతము లగు చిత్తరువులతోను, తేజోవంతమయిన శిల్పరాజితోను అలరారినఈగుహాలయముల నేటేటదేశాంతరములనుండి యాత్రికు లరుదెంచి దర్శించి, ధన్యులై పోతూవుంటారు. సావయవమైన నైతికధర్మాన్ని చాటుతూన్న ఈగుహాలు కాలవారిధిలో శిథిలమయినవి. వేలకొలది రూప్యముల వెచ్చించి నిజాముప్రభుత్వముతిరిగి వాటిని జీవనోద్ధారణ చేసింది.

పూజ్యమైన శ్రీ అక్బరు హైదరీగారి నామము పురాతనవస్తుపరిశోధనవిభాగము స్థాపితమైనప్పటినుంచీ దానితోసంయోగపడివుంది. వారి అపూర్వమైన శ్రద్ధయే ప్రదర్శనశాల నింతప్రాముఖ్యములోకి తేవటానికి కారణమైంది. గులాం యాజ్దానీగారు ఈశాఖకు అధిపతి. వారు ఉత్సాహపూరితులయిన కొందరియువకుల సాహాయ్యంచే మహత్తరమయిన కార్యముల చేయగలిగారు. జ్ఞానోత్తేజమునకు సాధనమైన యీశాఖకు ఔదార్యవంతుడగు ప్రభువు చేయూత నిచ్చి ప్రోత్సాహపరుచుట యెంతయు కొనియాడదగినది.

## ప్రదర్శనశాల (Muscum)

స్థలము, చల్లనిచెట్లనీడల్లో మునగలాయి కట్టడముల నిర్మాణాన్నే మరిపించేటట్టు. సమకోణపుగత్తురము, రెండంతస్థులు కలిగి, చూచుటకు అతిరమణీయంగా కట్టబడిన దీ ప్రదర్శనశాల. దానిమీద ఆకాశాన్ని పొడుస్తున్నాయా అన్నట్టు మీనారుస్తంభము లొకవిశేషము. రోజూ మ్యూజియము, నారిగట్టినట్టు ప్రేక్షకజనసమూహముతో నిండియుంటుంది.

## రాతివిగ్రహములు (Sculptures)

మ్యూజియము ప్రవేశమున కిరుప్రక్కల లోపలిగోడల నానుకొని, అర్ధచంద్రాకృతిగా వరండాలున్నాయి. వీట్లలో పురాతనసౌందర్యాన్ని వెలుగొందించే బౌద్ధ, జైన, బ్రాహ్మణమతములకు సంబంధించిన రాతివిగ్రహము లమర్చబడివున్నాయి. ఇందున్న బౌద్ధదరజాలు, పలకలు చాలాభాగము అమరావతిశిల్పమును బోలియున్నవి. గాంధారశిల్పము ననుసరించిన మీసకట్టు, వల్లెవాటు వస్త్రధారణ గల్గిన బుద్ధదేవుని ప్రతిమలు కాననగును. కొన్ని పలకలమీద స్తూపచిహ్నములు, వాటి కిరువంకల సేవాతత్పరులగు భక్తపరేశ్యులు తన్మయులైయున్నారు. పద్మాసనాసీనుడై ధ్యానముద్రలో నున్న బుద్ధభగవానుని, యితరములగు విగ్రహముల కాననగును. ఆరడుగుల చుట్టుకైవారము గలిగి, లోపలిభాగము వికసించిన కమలముతో నలరారిన రాతిగొడు గొకటి వుంది. కాని దానియందు భావగర్భితములగు చిహ్నము లేవీ లేవు. లెక్కలేనన్ని ధర్మచక్రాలు చూపరులకు విందొసగుతున్నాయి.

కాకతీయుల సమాదరణక్రింద శైవమతము రాజ్యమంతా ప్రాకిపోయింది. దీనికి ఫలితంగా గొప్పగొప్ప గుడులు పాలంపేట,రామప్ప,పానుగల్లులందలి దేవాలయ

ములు వరంగల్లులోని శ్రీస్వయంభూదేవాలయము, ఇంకా ఇతరములగు దేవాలయము లవతరించి విగ్రహాని ర్మాతలకుల కోపానలజ్వాలకు గురియై విధ్వంసమునొం దినవి. పోగా మిగిలిన శృంగారశిల్పసముదాయ మింగు ప్రదర్శింపబడినది

బ్రహ్మాండమైన ప్రతిమలు, ఆశ్చర్యచకితులను చేసే అందంతో, అతిలాఘవంగా ఒకేరాయిమీద మల్చిన జైనతీర్థంకరుల విగ్రహాములు, పట్టంచెర్వు మొద లగు ప్రదేశములనుంచి కొనిరాబడినవి.

ఈవిగ్రహము లెక్కడ దొరికాయో, ఎన్నిసంవ త్సరములకు పూర్వపువో, గీతలు (Labels) లేనికార ణముచేత సవిస్తరముగా తెలిసికొనుట దుస్తరముగావుంది.

## శిలాశాసనములు

ముక్తాఫలములవంటి అక్షరములతో పారశీకభా షలోని సుందరములైన వాక్యములు గల నలువురంగు నిగనిగలాడే రాళ్లు గోడల నమర్చబడియున్నవి పడమటి చాళుక్యుల, కాకతీయుల, శౌర్యపరాక్రమాదుల జాటు ఆంధ్రశిలాశాసనములు (తెలుగువి) మ్యూజియమందు గానరాకుండుట యెంతయు విషాదకరము. వీటినిరాష్ట్రి మందున్న తెలుగు జిల్లాల, ననేకప్రదేశముల శ్రీశేషాద్రి రమణకవులచే కనుగొనబడినవి.

## నాణెములు

బహమనీ, గోల్కొండ, బిజాపూరుసుల్తానుల యు, పశ్చిమచాళుక్యులయు, బంగారు, రాగినాణెము లనేకములైన యెత్తుల ననుసరించినవి, సంవత్సర క్రమ ముగా సరిచూడబడి పొంగుగా నమర్చబడినవి.

## ఫ్రెస్కో-చిత్తరవులు

మ్యూజియములోపలిగోడలమీద చక్కని అజంతా ఎల్లోరా చిత్తరువుల నకళ్లు అందముగా వ్రేలాడగట్టబడి నవి. వాటిని నిపుణులగు సయ్యదు అహమ్మదు, జలాలు ద్దీనుగార్లు, అతిరమణీయముగా చిత్రించియున్నారు. అపూర్వమైన స్వాదుత్వమునకును, సున్నితమునకును ప్రసిద్ధిగాంచిన మొగలు, దక్కని, రాజపుత్రకళల ననుసరించివ్రాయబడిన చిన్న చిత్తరువులం చూడ కన్నుల కానందమిచ్చును.

కలియుగ సాదీ యను ౧౩ వ శతాబ్దపు పార శీకకవిపుంగవుని పద్యకావ్యము(బొమ్మలతో నిండి యున్న గ్రంథము)ను, అనేకరకముల పూర్వు చెందిన షా-నామా ప్రతులను చూడ, పూర్వుల ఓర్పును, పనితన మును మిక్కిలి శ్లాఘనీయమై కన్పట్టును

## లోహప్రతిమలు

కంచు, రాగి మొదలగు లోహములతో హిందూ సంప్రదాయా న్ననుసరించి చేయబడిన విష్ణు, రుద్ర, ఉమామహేశ్వర మొదలగు చిన్నవిగ్రహములు నతిసుందర ముగ బీరువాలలో ప్రదర్శింపబడినవి.

రాష్ట్రిమందంతటను శిథిలరూపమున నున్నకోట లు, ప్రాకారములు, దేవాలయములు, మసీదులు మొద లగు కట్టడముల ఛాయాచిత్రముల చూడ, పూర్వుల శిల్ప కళాకౌశలమున కబ్బురపడవలసియుంటుంది.

## చైనాపాత్రలు

హిందూదేశము పూర్వమునుండి విదేశములతో సంబంధము కలిగివుంది అనటానికి దృష్టాంతము, మ్యూజి యమునందున్న చైనాపళ్లెరములు, గిన్నెలు సాక్షి. ఇవి క్రీస్తువనంతరము ఒకటి రెండు శతాబ్దములకు చెందినవి. వీటిని ఔరంగాబాదునందున్న బీబీకా ముఖ్బారా (Bibi-Ka-Moqubara)యను సమాధి (ఔరంగజేబు సార్వభౌముని భార్యది) నుండి సేకరింపబడినవి. పైగా వీటిని ఔరంగజేబు కుటుంబము అంతా వాడియుండు రని తోస్తుంది. ఇంతకాలము మరుగుపడియుండి కూడా వీటిమీద రంగులు చెక్కుచెదర లేదు.

## వృత్తిపనులు

మ్యూజియము మధ్యహాలులోకి రాగానే బీద్రీ (Bidri) వస్తువులు ప్రేక్షకుల కాతిథ్య మిచ్చి మన్నన చేస్తాయి. భామినీరాజ్యమున కొకానొకప్పుడు ముఖ్యనగర మై తనరారిన, బీదరుపట్టణమున బీద్రీ యన పరిశ్రమ అనుశ్రుతంగా జరుగుతోంది. పంచలోహముల మిశ్రముచే

వివిధములను పాత్రలచేసి వాటిమీద పుష్పసంబంధమైన లతలు వెండితో స్థగితమయి వుంటాయి. ఇది కూడా పోవటాలేక ఇతర పరిశ్రమలతోపాటు అంతరిస్తోంది.

బంగారుమలామాచే నగిషీ చేయబడిన, శ్రీరంగం సైనికుల అస్త్రశస్త్రములు మిగిలినవి.

ముగింపు

మ్యూజియముకోసమని సర్కారువారు. రు ౨౦౦౦/- సంవత్సరమునకు ఖర్చుపెడతారు దీనిలో నౌకర్ల బత్తె ఖర్చులు మొదలుకొని ఉద్యోగీయుల జీతములవరకు సరి పెట్టుకోవాలి. ఈ మ్యూజియముయొక్క ఆవశ్యకత, చేస్తూన్న పనిమాత్ర మాలోచిస్తే ఇప్పు డిస్తూన్న డబ్బు చాలదు. ముందునుంచి ఈ సంస్థయొక్క అభివృద్ధికి గాను సర్కారువారు ఎక్కువగా తోడ్పడుదురని నాయాశయము.

---

## ప్రతిగీత

కొంపిల్ల జనార్దనరావుగారు

'నేన—పాటసోనల నెఱనిగ్గు లెల్ల
దూసికొని నీకు నిచ్చు మాధుర్య రుచిని;
సృష్టిమెద ప్రోంగు లయకట్టు చిక్కణించి
గుండె తేటల మోహఁ గల్గుదును—నేన.'—

* * * *

'దగ్ధిగంతాలు గిలిగింతఁ దేఱి మఱచు
నీపిలుపుచందు మది కిరణించుకొన్న,
నా వలపు వెచ్చనలకు నీనాట్యపటిమ
తలఁపులో రేకరేకలు తారసిల్లు.
అది పురాణించుకొనుచు, నృత్యావతార
కృత్రిమ్న మూర్తిని నిను సంతరించి యుంచను:
ఏను కొండలుపడ్డ కుంభితుండ నగుచు
లోంతుదూరాల తనివి పోలుపుల భూషింతు.
నీకు కళలోన కళ దేఱు నేర్పు మెఱపు
మంతనము లాకళింతకు మనక పెట్టి,
నాయెద వెలుంగు లోకమ్మునకు నగవ్వు,
బత్తికాన్కలు నీకేల బహిరిల్లు.
ఇట రసాకృతివడ్డ వాంఛితము లోంటిసి
ఒక అణుత్వముపుక్కిలింతకు నడంగు:
ఇట పరంజ్యోతి ప్రణయ సంక్లిష్టగుచుంటి
చుంబితము లయి అద్దమ్ము చూంచికొనును.'

---



కురుల కూర్పు

పదునారవ లూయీ (1754 మొదలు 1793 వఱకు ఫ్రాన్సుదేశమును పరిపాలించిన రాజు) నాటిది.
పదునాల్గవశతాబ్దము మొదలు నేటివరకు గల కురులకూర్పుల ప్రదర్శనము లండనున ఇటీవల జరిగినది.



ప్రాణదాన యంత్రము

సర్వప్రయత్నములు వ్యర్థములయి, ఉచ్ఛ్వాస నిశ్శ్వాసములుకూడ తగ్గి మరణశయ్యపై చావ సిద్ధముగా బడియున్న రోగి నుజ్జీవింపజేయుట కేకైకసాధన మీ యంత్రము. ఇది లండను బార్థలామియో వైద్యాలయమున నున్నది. అమెరికా సంయుక్తరాష్ట్రములనుండి పంపబడినది. అమెరికాదేశమున దీని యుపయోగము చాల గలిగెను. పై వైద్యాలయమున నొకరోగిని యంత్రమునవుంచి పరీక్షించుచున్నట్లులు పైచిత్రమున చూడనగును. దీనివలన నద్భుతఫలములను పొందనగు నను ఆశ కలదు.

# గోవిందదీక్షితులు-3

కురుగంటి సీతారామయ్యగారు, ఎం. ఏ.

ఈయనది వసిష్ఠగోత్రమని వెనుక విన్నవించితిని. ఈ క్రింది చూడుడు.—

నటః. అస్తి శ్రూయతే.

నాట్యాచార్యః. సఖే నటకేసరిన్! అత్యాశ్చర్యకరీ ఖలు బుద్ధిమత్తా భవతః. యదహం వాసిష్ఠకుల సౌష్ఠవకృతే కృతావతారం గోవిందమఖీంద్రం నిర్దిశ్య తస్య తనుజోఽయమితిపార్శ్వవర్తిన మేనం కవీంద్రం యావన్న నిర్దిశామి. తతః ప్రాగేవ దేశాంతరేషు తత్ప్రసిద్ధి మాకర్ణితవతా భవతా ప్రకృతే వివిక్త మనుక్తేఽపి వాయం యజ్ఞనారాయణయాయజూకో విజ్ఞకులశేఖరః పాదాంగదాది నృపసాధారణభూషణ విభూషితః సదసి స ఏవాయమితి ప్రత్యభిజ్ఞాతః కవయితా౧.

ఈగోవిందమఖి దక్షిణదేశమునకు వచ్చినవెనుక నేప్రదేశమును తనకు నివాసముగా నేర్పరుచుకొనె నను విషయమై యనేకభిన్నాభిప్రాయములు కలవు. పట్టీశ్వరమని కొందరును, తిరునాగేశ్వరమని కొందరును, పాపనాశమువద్ద నున్న తిరుప్పాళత్తురై యని మరికొందరును చెప్పుచున్నారు. ఈప్రదేశములన్నియు తంజావూరునకు నాతిదూరముననుండి ప్రతిదినమునురాకపోకలకవకాశము కలవై యున్నవి. అట్లు తనగ్రామమునుండి పల్లకి బోయీలసహాయమున ప్రతిదినమునుతంజావూరువచ్చి రాజకార్యములునిర్వర్తించుచుండెడివారని ప్రతీతి కలదు గాని యది నిజమని గట్టిగా చెప్పజాలము. ప్రతిదినమును రాచకార్యముగల మంత్రి యట్లు వచ్చుచుండుట కష్టమును, రాచకార్యముల కభ్యంతరమునై యుండునని చెప్పక తప్పదు. ఏదో యొక విశ్రాంతిదాయకమగు సెలవునకు విశ్రాంతి యవసర మగునపుడు వెళ్లుచుండె ననియు మామూలుగా సెల్లపుడు తంజావూరుననే యుండెననియు చెప్పుట సమంజసము. రాజుమాత్ర మెల్లపుడును తంజావూరుననే నివసించి యుండెను. ఈయన వార్ధక్యము బాగుగా వచ్చువరకు మంత్రిగానే యుండెనని వెనుక తెలిసికొనియున్నాము. అందుచే మరణమునకు పూర్వ మెక్కువకాలము విశ్రాంతి తీర్చుకొన్నట్లుకూడా కన్పట్టదు. పట్టీశ్వరగ్రామమున నాయనగృహ మున్నతావును తద్గృహస్తంభములను చూపుదురు. మరియు నచ్చటి దేవాలయమున రెండువిగ్రహము లున్నట్లును నవి గోవిందమఖియొక్కయు, భార్యయొక్కయు విగ్రహము లగునట్లును చెప్పుచున్నారు. ఇట్టివిగ్రహములు దక్షిణదేశమున ననేకదేవాలయములందు గలవు. తంజావూరుననే యనేకదేవాలయముల నిట్టివి గలవు. వీనిని ఫలానివారివని నిర్దేశించుట కెంతమాత్రమును వలనుపడదు. శ్రీయుత వేంకటేశన్‌గారు పట్టీశ్వరగ్రామము కావేరీతీరమై, సర్వదా నదీప్రవాహయుక్తమై బ్రాహ్మణవాసమునకు మిక్కిలి యోగ్యమై యున్నది గాన తత్ప్రదేశమే యాయన నివాసముగా నెంచనగునని సెలవిచ్చుచున్నారు. కాని యింతకంటె ప్రబలసాక్ష్యము దొరకువరకు నిద మిత్థమని చెప్పుట కాధారము చాలదు. దక్షిణదేశచరిత్రమున నిట్టి సంప్రదాయము లనేకస్థలముల కలవు. తంజావూరు సరస్వతీ మహలున నున్న రామపట్టాభిషేకపటమున నొక విగ్రహము నాల్గవనాయకరాజగు విజయరాఘవునిది యని చూపుదురు. కాని యాబొమ్మ యాఖరు మహారాష్ట్రరాజై క్రీ. శ. ౧౮౫౫ సంవత్సరములో మృతినొందిన శివాజి మహారాజుకాలమున చిత్రింపబడినది యనుట స్పష్టము. పందొమ్మిదవశతాబ్ది మధ్యమున నున్న చిత్రకారుడు క్రీ. శ. ౧౮౩౦ ప్రాంతమున

౧ రఘునాథవిలాసము, యజ్ఞనారాయణదీక్షితకృతము, ప్రస్తావన.

"అరుంధతీజానికులావతంసః కథంను వర్ణ్యస్స కవిప్రవేకః,
యదుక్తిగుంభా వ్యతయో యథావత్ విదుః పరం తత్వ మతీవ వేద్యమ్". (సాహిత్యరత్నాకరము, స. ౧.)

నున్న విజయరాఘవనాయకుని ప్రతిమ నెట్లు చిత్రించ గలడు ? కాని సామాన్యప్రేక్షకుడు లిది యంతయు తెలియకపోవుటచే పహరాజవాసు చెప్పినది నిజముగా గ్రహింతురు. ౧ కావున పట్టీశ్వరప్రసంగ మిది ; మిగిలిన ప్రదేశముల విషయమై యీ మాత్రము ప్రబలమైన యాధారములును గానరావు. ఈయన కుంభకోణమున మంగళాంబికాసన్నిధిని చనిపోయెనని యొక గాథయు పట్టీశ్వరముననే చనిపోయెనని మరియొకటియు కలదు. కుంభకోణమున కుంభేశ్వరాలయమున నొకలింగము గోవింద దీక్షితలింగమని నైవేద్యదీపారాధనముల బడయుచున్నది. ఇట్లే పంచనదక్షేత్రమని నామాంతరము గల తిరువాదియందు కూడ గోవిందదీక్షితలింగ మని యర్చింపబడుచున్నది.౨ ఈరెండు క్షేత్రములును నాయకరాజులచే పరమపవిత్రములుగా భావింపబడుచుండెననియు, తత్ప్రదేశములందలి దేవతాకైంకర్యమునువారు బహుభక్తితో నొనరించుచుండిరనియు ప్రసిద్ధము. మరియు నాయకరాజు లీ రెండు దేవాలయములకును వసతులను కల్పించిరి. అట్టియెడ వారిమంత్రియై వసతుల గల్పించుటయు, ముఖ్యుడైన గోవిందదీక్షితున కీ రెండు ప్రదేశములలో నట్టిగౌరవ మొసంగబడుట సహజమే.3 కాని, తంజావూరున నుద్యోగము ! పట్టీశ్వరమున నివాసము ! కుంభకోణమున మృతి ! ఇట్లుండునా? ఈయననుండి సాక్షాత్తుగా వచ్చు పురుషసంతతి గానరాదు. ఈయన మనుమరాలినుంచి వచ్చు కుటుంబము మాత్రము కలదు. ఎవ్వరును పట్టీశ్వర మనుట తప్ప అధికారముతో చెప్పజాలకున్నారు. ఒకవేళ నీయన కుమాళ్లు వ్రాసినగ్రంథములవలన నైనను నివాసము తెలియునేమో యని చూచినవారును నా విషయమై యెచ్చటను చెప్పుచుండ లేదు. మరియు వారిలో చాలమందితంజావూరునే పేర్కొనుచున్నారు. రెండవ కుమారుడగు వెంకటమఖిమాత్రము తనకు కుంభకోణము నివాసముగా నుండెనని యొకకీర్తనలో చెప్పుచున్నాడు.౪ దీనివలన గోవిందుడు కుంభకోణము తన కప్పుడప్పుడు నివాసముగా నుంచుకొన్నట్లును వెంకటమఖికి నిత్యనివాస మైనట్లును స్ఫురించుచున్నది. ఇది నిజమై యుండవచ్చును. కుంభకోణమందలి మహామఖసరస్సునకు గోవిందుడు సోపానపరంపరను నిర్మించి బాగుచేసెనని చెప్పుదురు. తంజావూరువలెనే కుంభకోణమందును వీథులకు "అయ్యన్" అనుపదసాన్నిధ్యము కలదు. శ్రీ వెంకటేశన్ గారి యూహ ననుసరించి, కుంభకోణము కావేరీతీర మగుటచేతను, బహుబ్రాహ్మణనివాస మగుటచేతను, నచ్చట గోవిందదీక్షితలింగ ముండి యర్చింపబడుచుండుటచేతను, మంగళాంబికాసన్నిధిని గోవిందుడు ప్రాణముల విడిచె ననువాడుకవలనను నిది నిజము కావచ్చును. వేంకటమఖివ్రాత పై యూహలకు బలకర మైనందున మన మిట్లనుటకు సావకాశము కలదు.

ఈయన సర్వతంత్రస్వతంత్రుడు. యజ్ఞనారాయణదీక్షితుడు తనయన్ని గ్రంథాంత గద్యలయందును గోవిందుడు "శ్రీపదవాక్యప్రమాణపారావారపారీణు"డని తెల్పినాడు.౫ ఈ వచనమునందలి "యద్వైతవిద్యాచార్య"పద మీయననుగూర్చి యనేక కవీశ్వరులు తెల్పుచున్నారు. అందు కవిశిఖామణియగు రాజచూడామణిదీక్షితుడు తన తంత్రశిఖామణియందు "శ్రీమదద్వైతవిద్యాచార్య సర్వతంత్ర స్వతంత్ర సాగ్నిచిత్య సర్వతో

---

౧ ఆంధ్రవాఙ్మయచరిత్రసంగ్రహము, ౨౧౨.

౨ J. A. H. R. S. Vol. II. 221.

3 సంగీతసుధా, 3౮-౪౮; రుక్మిణీపరిణయము, రాజచూడామణి దీక్షితకృతము: Journal of the Music Academy, 62.

౪ సంగీతసంప్రదాయప్రదర్శిని, J. A. H. R. S. Part II. 235.

౫ "ఇతి శ్రీపదవాక్యప్రమాణపారావారపారీణ శ్రీమదద్వైతవిద్యాచార్య సాగ్నిచిత్య సర్వతోముఖాతిరాత్రసాగ్నిచిత్యాప్తవాజపేయయాజీ గోవిందదీక్షితవరనందనస్య"—అంకాంతగద్యము, రఘునాథవిలాస నాటకము. సాహిత్యరత్నాకరసర్గాంతగద్యము నిట్లే యున్నది.

ముఖ సాగ్నిచిత్యాప్తవాజపేయయాజి గోవిందదీక్షిత ..." యని చెప్పియున్నాడు.౧ వెంకటమఖికూడా తన చతుర్దండి ప్రకాశికాంత్యగద్యమునందు, "శ్రీమదద్వైత విద్యాచార్య" యనుపదమును వాడియున్నాడు. ఈపద మప్పయ్యదీక్షితుడు తన తండ్రియగు రంగరాజాధ్వరిని గూర్చికూడా వాడుచున్నాడు. "ఇతి శ్రీమద్భారద్వాజకుల జలధికౌస్తుభ శ్రీమదద్వైతవిద్యాచార్య శ్రీవిశ్వజిద్యాజి రంగరాజాధ్వరివరసూనోః......"౨ గోవిందు పట్టి యాచార్యుడని చెప్పుట కెట్టి సందియమును లేదు. ఈయన తన రాజకార్యములతోపాటు తనవిద్యను ఇతరులకు ప్రవచనము చేయించుటలోకూడ మిక్కిలి శ్రద్ధ వహించెనని తెలియుట యాయనయొక్క గొప్పదనమును హెచ్చించుచున్నది. ౩ ఈయన పూర్వ మీమాంసాశాస్త్రములలో గ్రంథములు వ్రాసినట్లు యజ్ఞనారాయణుడు తెల్పుచున్నాడు. ౪ పూర్వోత్తర మీమాంసల రెంటియందును నీయనకు ప్రజ్ఞ యున్నట్లు స్పష్టము. ౫ కాని యీ శాస్త్రములయందు గోవిందుడు వ్రాసిన గ్రంథము లెవ్వియును గానవచ్చుట లేదు. ఈయన కుమారుడగు వేంకటమఖి కుమారిలుడు వ్రాసిన "టుప్టీకా" వార్తికమునకు వార్తికాభరణ మను వ్యాఖ్యానమును రచియించెను. ఇయ్యదియు నముద్రితము. రాజచూడామణి దీనికే తంత్రశిఖామణియనువ్యాఖ్యను రచియించెను. ఇయ్యదియు నముద్రితమే!

ఈయన గొప్పదాత. ౧౬ తెగులకు పదునార గ్రహారము లిచ్చెననియు, తంజాపూరుజిల్లాయందలి "ఇచ్చాంగుడి" యను నేకాదశియగ్రహార మట్టివానిలో నొకటియనియు తెల్పుచున్నారు. దీక్షితసముద్రము, గోవిందపురము నను రెండుగ్రామము లీయనతో సంబంధము కలవనియు, వెంకటసముద్ర మనుగ్రామ మీయన కుమారునితో సంబంధము కలదనియు చెప్పుదురు. ఇవి యన్నియు నీతంజాపూరుమండలమున నుండుట యీయూహకు బలకరము.

ఈయన బహుకుటుంబి. ఈయనకు ఎనమండ్రు కుమాళ్లును, నొక్కకుమార్తెయును కలరనియు, వారిలో నొకకుమారుడు గొప్పసంగీతపాఠకుడై రాజును సభలో మెప్పించి రాజదృష్టికి పాత్రుడై చనిపోయెననియు, కుమార్తెయు రాజు గోవిందునింటికి వచ్చినప్పుడు హారతి యొసగు నవసరమున రాజదృష్టికి పాత్రురాలై మృతి నొందెననియు చెప్పుదురు. వీని కన్నిటికిని తగు నాధారములు కానరావు. కాని యొకకుమారుడు మరణించెనని మాత్రము ప్రతీతి ప్రబలము. ఈయనకుమాళ్లలో యజ్ఞనారాయణదీక్షితుడు జ్యేష్ఠుడనియు, వెంకటమఖి రెండవవాడనియు నామతము. ఏలన, వెంకటమఖి తన చతుర్దండి ప్రకాశాంత్యగద్యమున తాను రెండవ కుమారుడననియు, యజ్ఞనారాయణ కవ్యవహితానుజుడ ననియు తెల్పియున్నాడు౬. యజ్ఞనారాయణదీక్షితుడు

౧ వెంకటమఖరచితమగు వార్తికాభరణ మను టుప్టీకావ్యాఖ్యానమున కిది వ్యాఖ్యానము.

౨ హరివంశసారచరిత వ్యాఖ్యానము. ఇందే గాక తన గ్రంథము లన్నిటనిట్లే వ్రాసినాడు.

3 "నిర్మథ్య వస్తర్కనయీరధీన్ యే ధియైవ సారాణ్ దదతే బుధేభ్యః." (సాహిత్య రత్నాకరము.)

"అద్వైతవిద్యా సామ్రాజ్యధురంధర మహంభజే, అధ్యాపితా స్సమస్తాని యేన శాస్త్రాణి కోవిదాః."

(శివసహస్రనామ భాష్యము, లింగాధ్వరీంద్రకృతము.)

౪ "కుర్వన్ వ్యాక్రియ యాతివిస్రు తతరం కౌమారిలం దర్శనం." (రఘునాథవిలాసము.)

౫ "స్థాపితో వైదికో మార్గో మీమాంసాద్వయచక్షుసా." (శివసహస్రనామభాష్యము.)

"శంకరముని మతప్రతిష్ఠాపనకోవిదు, గోవిందాధ్వరి నాగాంబికసుత." (సంప్రదాయప్రదర్శిని.)

౬ "......గోవిందదీక్షిత నాగమాంబికా వరద్వితీయనందనస్య సాగ్నిచిత్య సర్వక్రతుయాజి యజ్ఞనారాయణదీక్షితావ్యవహితానుజస్య......వేంకటేశ్వరదీక్షితస్య కృతౌ........."

(చతుర్దండి ప్రకాశిక; డాక్టరు సూక్తంకరుగారిచే పూనాపట్టణమున ప్రకాశితము; క్రి. స. ౧౯౧౮ సంవత్సరమున ముద్రితము.)

తాను కుమారుడనని మాత్రమే తప్ప ఇన్నవకుమారుడనని చెప్పుకొనలేదు[1]. ఇచ్చట నొకవిప్రతిపత్తి కలదు. శ్రీయుత వెంకటేశన్గారు తమవ్యాసమున ననువదించిన చతుర్దండి ప్రకాశికాంత్యగద్యమున "యజ్ఞనారాయణ దీక్షితావ్యవహితానుజస్య" యని యున్నది గాని "గోవిందదీక్షిత నాగమాంబా తృతీయనందనస్య" యని మాత్రము కలదు. దీనివలన యజ్ఞనారాయణునికంటె పెద్దవాడొక డుండెనా యని యనుమానము పొడముచున్నది. నేను ముద్రితగ్రంథమును చూచుటయే గాక తంజాపురనివాసులును, నేతద్విషయమున మిక్కిలి పరిశ్రమ చేసినట్టియు, "సంగీతసుధా" గ్రంథమును ప్రచురించుచున్నట్టియు శ్రీయుతులు పి. యస్. సుందరం ఐయ్యర్, బి.ఏ., యల్.టి., పండిత యస్. సుబ్రహ్మణ్యశాస్త్రిగార్లతో చర్చించితిని. వారిద్దరును వెంకటముఖి ద్వితీయపుత్రుడని నిస్సృష్టముగా చెప్పుటయే గాక శ్రీ వెంకటేశన్గారి పాఠము ప్రమాదమని చెప్పిరి. ముద్రితగ్రంథపాఠ మీయూహకు బలదాయకము.[2] శ్రీ వెంకటేశన్గారి వ్యాసమునకు చాలకాలము క్రిందటనే యీపుస్తకము ముద్రితమగుటచేతను, శ్రీవారు తత్పాఠమును గ్రహించి విమర్శింపకపోవుటచేతను ముద్రితపాఠము సమంజసమని చెప్పవలసివచ్చుచున్నది. కావున ప్రథమద్వితీయపుత్రులనుగూర్చి స్పష్టము. శ్రీవెంకటేశన్గారితరపుత్రులనుగూర్చి యెట్టి సంగతి వ్రాసియుండలేదు. నాకు లభించిన యితరాధారములనుబట్టి కొన్ని విషయములను మనవిచేయుచున్నాను.

లింగాధ్వరి యనునొక పండిత ప్రకాండుడు శివసహస్రనామములకు భాష్యము నొకదానిని, మరియొక వేదార్థతత్త్వనిర్ణయ మనుగ్రంథమును రచియించెను. ఈ రెండిటియందును తాను గోవిందదీక్షితుని కుమారుడనని చెప్పుకొనెను.

"అద్వైతవిద్యాసామ్రాజ్యధురంధర మహం భజే,
అధ్యాపితా స్సమస్తాని యేన శాస్త్రాణి కోవిదాః.
స్థాపితో వైదికో మార్గో మీమాంసాద్వయ చక్షుషా,
యథావిధికృతా స్తద్వ ద్వాజపేయముఖా మఖాః;
తం వందే పితరం భక్త్యా గోవిందాధ్వరిశేఖరం
లింగాధ్వరీంద్ర స్తనుతే శివతత్త్వప్రకాశికాం,
శివనామసహస్రస్య వ్యాఖ్యాం విద్వన్మనోరమాం."
(శివసహస్రనామవ్యాఖ్యా.)

"ఇతి శ్రీమదద్వైతవిద్యాచార్య సాగ్నిచిత్యసర్వతోముఖాతిరాత్రసాగ్నిచిత్యాప్తవాజపేయయాజి గోవిందాధ్వరీంద్రతనయ లింగాధ్వరీంద్ర విరచితే వేదార్థతత్త్వనిర్ణయే........."
(వేదార్థ తత్త్వనిర్ణయము.)

ఈరెండుగ్రంథములు నముద్రితములు. తంజావూరు పుస్తకాలయమున ప్రతులు కలవు.

పై రెండిటియందలి క్రతువులవివరములను బట్టియు, "నద్వైతవిద్యాచార్య" బిరుదమును బట్టియు నందుల్లేఖింపబడినది గోవిందాధ్వరియే యనియు, లింగాధ్వరి యాయనకుమారుడనియు విస్పష్టము. కాని యీయన యెన్నవకుమారుడో తెలియదు. మూడవవాడై యుండవచ్చునని నాయూహ. ఈయన శివసహస్రనామభాష్యము వ్రాయునాటికి వీరికుటుంబము తంజావూరులోనే యున్నట్లీయనగ్రంథమునందలి యీక్రింది శ్లోకమువలన తెలియును:

"సర్వవిద్యాధిపం దేవం సోమాస్కందం మహేశ్వరం,
సురాసురగురుదేవం వందేహం బృహదీశ్వరం.[3]"
(శివసహస్రనామభాష్యము.)

---

౧ "....... గోవిందదీక్షితవరనందనస్య. శ్రీయజ్ఞనారాయణయజ్వనః........."(రఘునాథవిలాసము.)
"ప్రౌఢశ్రీరఘునాథభూపతి కృపాస్ఫారీభవత్సాహితీ సామ్రాజ్యో నిగమాగమార్థనిపుణః శ్రీయజ్ఞనారాయణః, గోవిందాధ్వరిసూనుః ............"
(సాహిత్యరత్నాకరము, స. ౧.)

౨ ఒక తెనుగుప్రతి నాధారము చేసుకొని ముద్రించినట్లు ప్రకాశకులు తెలుపుచున్నారు.

3 బృహదీశ్వరనామము తంజావూరునందలి పెద్దదేవాలయములోని స్వామిపేరు.

ఇప్పటికి ముగ్గురుకుమాళ్లను గురించి తెల్పియున్నాను. గణేశదీక్షితు డనునొక తార్కికకవి కేశవమిశ్రుని తర్కభాషాగ్రంథమునకు తత్త్వప్రబోధిని యను టీకను వ్రాయుచు నుపోద్ఘాతమున నీక్రిందిశ్లోకము వ్రాసినాడు:

"గోవింద దీక్షితం తాత ముమాం సత్త్వద మాతరం,
క్రియతే తర్కభాషాయా ష్టీకా తత్త్వప్రబోధినీ."
(తత్త్వప్రబోధిని ౧)

ఈతత్త్వప్రబోధినికి విశ్వనాథభట్టారకు డను తార్కికుడు న్యాయవిలాస మనువ్యాఖ్యానమును వ్రాసెను౨. ఈగణేశదీక్షితునికాలమునుబట్టి మాచిన నీయన ౧౭-వశతాబ్దపూర్వార్ధమున నున్నట్లు తెలియుచున్నది3. కాలమునుబట్టియు తండ్రిపేరునుబట్టియు మాచిన నీయనయు గోవిందునికుమారుడని తోపక మానదు. కాని తల్లిపేరువద్ద కొంచె మనుమానము గాననగును. ఏలన, వెంకటమఖి మొదలైనవారు తల్లిపేరు "నాగమాంబ" యని యిచ్చియున్నారు ౪. కాని యీ గణేశదీక్షితుడు "ఉమాం" అని చెప్పుచున్నాడు. అనగా పార్వతి యనియో మరియొక తత్పర్యాయనామమో తెలియకున్నది. రెండువిధములై యుండవలెను. నాగమాంబకే "ఉమా" పదమునకు సమానార్థకమగు పదము మరియొకనామమై యుండవచ్చును. లేదా గోవిందదీక్షితునకు ద్వితీయకళత్ర ముండియుండవలెను. ఆయనకు రెండువివాహములైన ట్లొకవార్త కలదు. దాని కాధారములు గ్రంథతః కానరావు. బహువిధముల నట్లే యుండుననియు, నీగణేశదీక్షితుడు తత్కళత్ర పుత్రుడనియు తోచుచున్నది. ప్రబలమైన ప్రమాణము తత్సుతు డీయన కాడని తెల్పువర కీయనయు గోవిందపుత్రుడే నని మన మనుకొనవలెను. ఇప్పటి కీయనయొక్క నల్గురు పుత్రులు లెక్కకు వచ్చుచున్నారు. ఒక్కరు చనిపోయెనని మనవిచేసియుంటిని. మిగిలిన ముగ్గురుని గూర్చి మన కెంతమాత్రమును తెలియదు. ఈయనకుమాత్రె సంతతి యెచ్చటను గానరాదు. ఈయన పుత్రసంతానము యొక్క పుత్రసంతతినిగూర్చియు మన మెరుగము. శ్రీ వేంకటేశక్ష్గారు చెప్పినట్టియు, మైసూరున నుద్యోగమున నున్నట్టియు నృసింహశాస్త్రిగా రీయన మనుమరాలిసంతతికి చెందినవారు కే. శే. మహామహోపాధ్యాయ రామ సుబ్బాశాస్త్రిగారును, ప్రస్తుతపు కాంచి కామకోటి పీఠాధిపతులునుతత్సంతతివారే. నాకులభ్యమైనంత వరకువంశవృక్షమునిచ్చుచున్నాను.(చూ. ప్రక్కపుట).౫ ఈవంశవృక్షములోని వారినిగూర్చి కొంచెముగ చెప్పుదును. మొదటివాంఛేశ్వరయజ్వ గొప్ప పండితుడై తంజావూరున పదునెమిదియవ శతాబ్దారంభమున నేలిన శాహజీయను మహారాష్ట్రరాజుసభ నలంకరించెను. ఈయన శ్లేషకవి సార్వభౌముడు. ఈయనకు కుట్టికవి యని నామాంతర ముండెను. శాహజీరాజపుర మను నామాంతరము గల 'తిరువీశలూ' రనుగ్రామము వీరికాపురము. ఈయనతండ్రిపే రేమియో తెలియలేదు. ఈయన మూడుశతకములను వ్రాసెను.

౧. మహిమశతకము

౨. ధాటీశతకము

౩. ఆశీశ్శతకము.

---

౧ అముద్రితము; తంజావూరు భాండాగారమునప్రతులు కలవు.

౨ ఇదియు నముద్రితమె.

3 Tanjore Sanskrit Catalague, Vol. XI.,XXVIII. & XXIX.

౪ "........గోవిందదీక్షితనాగమాంబికావరద్వితీయనందనస్య......" (చతుర్దండిప్రకాశిక.)

"అస్తి గోవిందయజ్వేంద్రనాగమాంబాతపః ఫలం, శ్రీవేంకటేశ్వరమఖీ సర్వతంత్రస్వతంత్రధీః". (తంత్రశిఖామణి.)

"శంకరఅవతార గోవిందాధ్వరిరడె నాగమాంబారే." (సంప్రదాయప్రదర్శిని.)

౫. వాంఛేశ్వరయజ్వకృత భట్టచింతామణిటీక.




మూడును శ్లేషతో నిండియున్నవి.౧ ఈయన మనుమడగు నరసింహపండితుడు సమస్తశాస్త్రప్రవీణుడైనను ఆయన రచియించిన గ్రంథము లెవ్వియు గానరావయ్యె. నరసింహపండితుని కుమారుడగు రెండవవాంఛేశ్వరయజ్వ మహారాష్ట్రరాజగు రెండవ శరభోజిచే పోషింపబడుచు తరువాత కాశికి వెడలి తిరిగివచ్చు మార్గంబున మైసూరుమహారాజావారిచే నభ్యర్థింపబడి యచ్చటనే నిలిచిపోయి క్రతువుల నొనర్చి సంతానవంతు డయ్యెను.౨ ఈయన ద్వితీయకుమారుడే శ్రీ వెంకటేశన్ గారు చెప్పు నృసింహశాస్త్రిగారు. ఈ ద్వితీయ వాంఛేశ్వర యజ్వ బహుగ్రంథనిర్మాతయు, సర్వతంత్రస్వతంత్రుడునై యుండెను. ఈయన రచియించిన గ్రంథముల నిట కొన్నిటిని జేర్కొందును.

౧. హిరణ్యకేశి శ్రౌతసూత్రవ్యాఖ్యానము

౨. భాట్టచింతామణి3 (భాట్టదీపికా వ్యాఖ్యానము)

---

౧ "చక్రే మాహిషశతకం ధాటీశతకం తథాఽశిషాం శతకం,
శ్లేషకవిసార్వభౌమః శ్రీమాన్ వాంఛేశ్వరస్స్వతంత్రోఽసౌ." (భట్టచింతామణి.)

౨ భాట్ట చింతామణి, పీఠిక.

3 గాగాభట్టకృతమగు నీపేరుగల మరియొక మీమాంసాగ్రంథము కలదు.

3. శ్రాద్ధ చింతామణి

౪. దత్త చింతామణి

౫. అద్వైతచింతామణి

౬. ధూర్గానచంద్రిక

౭. మహిమశతకవ్యాఖ్యానము

౮. శ్లేషార్థచంద్రిక.

వీనిలో దాదాపన్నియు నముద్రితములే గాని భాట్టచింతామణిమాత్రము కుంభకోణ శ్రీరామన్యాసులు లచ్చొత్తించుచున్నారు. ఈయన పెద్దకుమారుడుకూడా పండితుడై యున్నదమ్మి లిరువురును మైసూరునందే యుండిపోయిరి. ఈ నృసింహశాస్త్రిగారి మేనల్లుడగు శ్రీ. శే. వెంకటసుబ్బాశాస్త్రిగారు గొప్పమీమాంసకులై మైలాపూరునందలి కళాశాలాధ్యక్షత వహించి బహుశిష్యప్రవర్తులై యిటీవలనే పరమపదించిరి.

గోవిందదీక్షితులు రచియించిన గ్రంథములగూర్చి చర్చ కలదు. కాన యాయన కుమార్ల గ్రంథములను గూర్చి ముందు ముచ్చటింతును. పెద్దవాడగు యజ్ఞనారాయణకూడా షడ్దర్శనీపారగుడు.[1] రఘునాథునికి శిష్యుడు. ఈయన రచియించిన గ్రంథములలో నీక్రిందివి మాత్రము కన్పట్టుచున్నవి.

౧. సాహిత్యరత్నాకరము [2]

౨. రఘునాథవిలాస నాటకము

3. అలంకారరత్నాకరము (ప్రతాపరుద్రీయము వంటిది). ఇవి గాక శుల్బసూత్రవ్యాఖ్యానము వ్రాసినట్లు కంఠోక్తిగా నారాయణకవి తన రాఘువేంద్ర విజయ కావ్యమున చెప్పుచున్నాడు.[3] మరియు రఘునాథవిలాస నాటకమునకు పూర్వము సాహిత్య రత్నాకరమునే గాక రఘునాథభూవిజయ మనుకావ్యమును కూడాతాను వ్రాసినట్లు తన్నాటకమున తానే చెప్పుకొనియున్నాడు.

"నటః.—తత్రభవతా రఘునాథ భూభృతా శిక్షితఇ త్యనేనైవ తావ దస్యాపి కవయితా యజ్ఞనారాయణాఖ్యయజ్వేతి జానామి యోహా రఘునాథ భూవిజయసాహిత్యరత్నాకరయోః కావ్యయోః కర్తా".

(రఘునాథవిలాసము: ప్రస్తావన.)

ఈరెండుగ్రంథములు నిప్పు డెచ్చటను లభించలేదు. కాలము బయటకు తీయునని నమ్ముచున్నాను. రెండవవాడగు వెంకటేశ్వరమఖి యీక్రిందిగ్రంథములు వ్రాసినట్లు తచ్ఛిష్యుడగు రాజచూడామణిదీక్షితుడు తనతంత్రశిఖామణియందు వ్రాసియున్నాడు.

"అస్తి గోవిందయజ్వేంద్రనాగమాంబాతపఃఫలం,
శ్రీవేంకటేశ్వరమఖీ సర్వతంత్రస్వతంత్రధీః.

యేనేష్టం సాగ్నిచిత్యాప్తవాజపేయాదిభి ర్మఖైః,
కృతం సాహిత్యసామ్రాజ్యంనామకావ్యమనుత్తమం.

వ్యతాని శుల్బమీమాంసా తథా కర్మాంతవార్తికం,
టుప్టీకాయాః కృతా టీకా వార్తికాభరణాభిధా.

ప్రతిష్ఠాపిత గోశమ్మాజానే స్తస్య నియోగతః,
చూడామణి ర్వితనుతే యజ్వా తంత్రశిఖామణిం.

(తంత్రశిఖామణిః.)

వీనిలో మొదటి మూడుగ్రంథములును కానవచ్చుటలేదు. నాల్గవదిమాత్ర మసంపూర్తిగా తంజాపూరు భాండాగారమున నున్నది. ఇవ్వియే గాక వెనుక చతుర్దండిప్రకాశిక యను సంగీతగ్రంథమును వ్రాసినట్లు

---

౧ "పాతంజలం భాట్టమతంచ తర్కమద్వైతరాద్ధాంత మహైమి కీర్తేః,
ప్రబంధ సందర్భ భరైః కవిత్వ విద్యా మిదానీం ప్రకటీకరోమి." (సాహిత్యరత్నాకరము.)

౨ టి. ఆర్. చింతామణిగారు దీనిని "మద్రాసు విశ్వవిద్యాలయపత్రిక" లో ప్రకటించుచున్నారు. మిగిలిన రెండును నముద్రితములె. 3-వ గ్రంథము మిక్కిలి శిథిలమై యున్నది.

3 "తంజాపుర్యా మన్వథా శుల్బసూత్ర వ్యాఖ్యాతారంవావదూకం యజంతం." (రాఘువేంద్రవిజయము,స.౪.)

౪ (౧) సాహిత్యసామ్రాజ్యకావ్యము. (౨) శుల్బమీమాంస. (3) కర్మాంతవార్తికము. (౪)వార్తికాభరణము.

చూచియున్నాము. ఈయనయు నిజముగా సర్వతంత్ర స్వతంత్రుడే. ఈయనకూడ మంత్రిత్వము చేసినట్లు తెలియుచున్నది. మూడవవాడగు లింగాధ్వరి వ్రాసిన శివ సహస్రనామభాష్యమునుగూర్చియు, వేదార్థతత్త్వనిర్ణయమునుగూర్చియు, గణేశదీక్షిత రచితమగు తత్త్వప్రబోధినిని గూర్చియు వెనుకనే ముచ్చటించితిని.

---

# ఆతిథ్యము

పండిత చర్ల నగరాజకుమారి

ఆలసితివేమొ ఘోరవిపినాంతరసీమల పాదచారివై
కలయ దిరుంగుటన్ మొగము గందెను మేనున ఘర్మబిందువుల్
పొలిచెను పాదపద్మముల బొబ్బలు గానగనయ్యె గాన నీ
వలయక గొమ్ము మాయతిథివై పరిచర్యల సంతసంబునన్.

అల్లదె కొండయేటిదరి నంచితచారుమనోజ్ఞ మాధవీ
వల్లరిపొంత మల్లికల పార్శ్వమునన్ సురసాలజాలస
త్పల్లవకాంతిదిక్కులను బర్విన చెంతను పర్ణశాలలో
చల్లగ విశ్రమించి మరి సాగుము పైనముసేయ నింటికిన్.

ఇమ్ముగ రమ్యహర్మ్యముల నిందు శిలామయవేదికావితా
నమ్ముల భర్మడోలికల నంచితలీల మెలంగి వానిసౌ
ఖ్యమ్ము నెరింగి తీవు గహనాంతర పర్ణకుటీరమందు వా
సమ్మొనరించి యొక్క త్రుటి సమ్మతి దాని సుఖమ్ము గాంచుమీ.

వనజములెల్ల భీతిగొన భాస్వరతేజముతోడ వైరిభే
దన మొనరించుచున్ దినము దాకడు దవ్వుల కేగి యెంతయున్
జనసముదాయమున్ విడిచి సంస్థితి జూచుచు డస్సి యొంటివై
వనముల జేరె నీపగిది భాస్కరు డల్లదె చూడు మిత్రమా!

---

# బౌద్ధభిక్షుసంఘము

ఆర్. రంగనాథశాస్త్రిగారు

బుద్ధం జ్ఞాన మనంతంహి ఆకాశవిపులం సమమ్,
క్షపయే త్కల్పశాయం తం నచ బుద్ధగుణక్షయః. (లలితవిస్తరము).

ఆకాశ సమ విపులమును ఆనందము నగుజ్ఞానమున కాధారుడు బుద్ధుడు. క్రమక్రమముగ కల్పములు క్షయమొందుచుండును. కాని బుద్ధభగవానుని సుగుణసంకీర్తనమునకు మాత్రము క్షయము లేదు.

ధర్మము త్రివిధము. ప్రవృత్తిమూలకము, నివృత్తిమూలకము, ప్రవృత్తినివృత్తిమూలకమని. నిరంతరము చిత్తవృత్తుల చరితార్థతకొరకు ప్రయత్నించుచుండుటను ప్రవృత్తిమూలకధర్మ మందురు. ఆర్యావర్తమందు దార్శనికులలో నొకడగు చార్వాకుడును, పశ్చిమఖండములయందు 'యెపిక్యూరస్' అనువార లిర్వురు బోధించినమతము ప్రవృత్తిధర్మాంతర్గతమై యున్నది. మరియు వర్తమానకాలమందు 'స్రికాపార్టి'వా రుపదేశించు మతముగూడ ప్రవృత్తిమూలకధర్మమునకు సంబంధించియున్నది. చార్వాకు డిట్లు నుడివియున్నాడు:

యావజ్జీవే త్సుఖం జీవేత్ ఋణంకృత్వా ఘృతంపిబేత్,
భస్మీభూతస్య దేహస్య పున రాగమనం కుతః.

(బ్రతికియున్నంతకాలము సుఖముగ జీవితమును గడపుము. ధనము లేనియెడల అప్పుచేసియైనను ఘృతమును త్రాగుము. దేహము భస్మమైనతర్వాత తిరిగిరాదని నమ్ముము.)

చార్వాకునిసిద్ధాంతానుసారము దుఃఖమును బరిత్యజించి నిరంతరము సుఖానుసంధాన మొనర్చుచుండుటయే పరమపురుషార్థము. సుఖానుధావన మొనర్చునపుడు స్వల్పదుఃఖము కలిగినను కలుగవచ్చును. అట్టి దుఃఖమును సంతోషముగ ననుభవించుము. కాని యెప్పుడును మానవుడు సుఖాన్వేషణమునుండి విరమింపదగదని శిష్యమండలికి ఉపదేశించియుండెను.

త్యాజ్యం సుఖం విషయసంగమజన్మ పుంసాం
దుఃఖోపసృష్టమితి మూర్ఖవిచారణైషా,
వ్రీహీన్ జిహాసతి సితోత్తమతండులాఢ్యాన్
కో నామ భోస్తుషకణోపహితాన్ హితార్థీ."

(రూపరసాదివిషయములనుండి యుత్పన్నమగు సుఖము దుఃఖమిశ్రితమై యుండును. అందువలన నట్టి సుఖమును బరిత్యజింపవలయునని వదువువాడు పరమమూర్ఖుడు. ఉత్కృష్టశ్వేతతండులపూర్ణమగు ధాన్యము తుషావృత మగుటవలన హితార్థియగువా డెవ్వడైనను దానిని త్యజించవలయునని నుడువునా!)

చార్వాకుడు, యెపిక్యూరస్ మొదలగు వారి సిద్ధాంతానుసారము సుఖమును బొందుచుండు నప్పుడు కలుగుదుఃఖముకూడ సుఖపదవాచ్యమేయని తేలుచున్నది. పశువులు మొదలగు జంతుజాలము స్వీయనైసర్గికవృత్తుల ననుసరించి ప్రవర్తింపుచు సంతృప్తి నొందుచుండు విధమున మానవుడు స్వీయచిత్తవృత్తుల ననుసరించి ప్రవర్తించుటయే పరమపురుషార్థ మగుచున్నది. కావున నీధర్మమందు నియమనిష్ఠలకు తావు పూజ్యమని గ్రహించవలయును.

ప్రవృత్తిధర్మమునకు సంపూర్ణముగ విపరీతమై చిత్తవృత్తుల నిరోధము ముఖ్యాంగముగ గలిగినదానిని నివృత్తిధర్మ మందురు. 'యోగ శ్చిత్తవృత్తినిరోధః' అని పతంజలిమహర్షి నుడివియున్నాడు. మనుసంహితయందు "ప్రవృత్తి రేషా భూతానాం నివృత్తిస్తు మహాఫలా" అను వాక్యము నివృత్తిధర్మము నుపదేశించుచున్నది.

మానవుని చిత్తవృత్తులయందు సత్యమగువానిని ననుసరించుచు, అసత్యములగువానిని త్యజించుచుండుటను ప్రవృత్తినివృత్తిమూలకధర్మ మందురు. యూరపుఖండ

నందు నైతికవిజ్ఞానవిదులు ఈర్ష్య, హింస, మాత్సర్యము మొదలగు నీచతమవృత్తులను, భక్తి, దయ మొదలగు సద్వృత్తులను విశ్లేషణంబొనర్చి, చిత్తవృత్తులయందు స్వీకావతగినవి కొన్నియు, పరిత్యజింపవలసినవి కొన్నియు గలవని నిరూపించియున్నారు. వారి మతానుసారము దయ, దాక్షిణ్యము మొదలగు సద్వృత్తులయందు ప్రవృత్తియు, మదమాత్సర్యాది గుణములయందు నివృత్తియు గలిగి ప్రవర్తించుటయే మానవునకు పరమధర్మమని తేలుచున్నది.

ఆర్యావర్తమందలి స్మృతులు, పురాణములు మొదలగున వన్నియు ప్రవృత్తినివృత్తిధర్మములను పునాదిగా గలిగియున్నవి. వ్యాసభగవాను డిట్లు నుడివియున్నాడు.

> ద్వావిమావథ పంథానౌ యత్ర వేదాః ప్రతిష్ఠితాః,
> ప్రవృత్తిలక్షణో ధర్మో నివృత్తౌచ విభావితః.

(ద్విపథములుమాత్రము విరాజిల్లుచున్నవి. ఈద్విపథములమీదనే వేదము ప్రతిష్ఠింపబడినది. ఆరెంటింటి యం దొకదానిని ప్రవృత్తిధర్మమనియు, రెండవదానిని నివృత్తిధర్మమనియు నుడువుదురు.) హిందువుల ధర్మశాస్త్రములన్నియు విధినిషేధములతోడ గూడియున్నవి. అందువలననే విధినిషేధములను నిర్ణయించు గ్రంథములను ధర్మశాస్త్రము లనుచున్నారు.

ఈ త్రివిధధర్మములయందును నివృత్తిధర్మమునే సర్వశ్రేష్ఠముగ దలంపవలయును. చార్వాకుడు మొదలగు వారిమతములు హేయములని నుడువుట కంతగా మతభేదము గన్పట్టదు. ప్రవృత్తినివృత్తులతోగూడిన ధర్మము గృహస్థుల కత్యుత్కృష్టమగు ధర్మమనుటకు సందియము లేదు.కానిముముక్షువుల కిదిపనికిరాదు. సుకృతదుష్కృత కర్మలవలన మానవుడు తిరిగి సంసారమందు బుట్టి వాని ఫలభోగముల ననుభవించును. అనగా, సత్కర్మ మొనర్చు మానవుడు తిరిగి భూమండలమందు ఉచ్చతరయోని యందు జన్మించి యత్యధిక సుఖముల ననుభవించును. దుష్కృతకర్మల నొనర్చువాడు నీచతరమగు యోనియం దుజన్మించి యత్యధికదుఃఖముల బొందును. కావున మానవుడు సుకృతదుష్కృతికర్మల నొనర్చుటవలన పునర్జన్మ మెత్తి సంసారమందు పరిభ్రమింపక తప్పదు. అందువలననే

> యథాలోహమయైః పాశైః పాశైః స్వర్ణమయైరపి,
> తావత్ ద్వంద్వోభవేజ్జీవః కర్మభిశ్చ శుభాశుభైః.

లోహనిర్మితశృంఖలముచేతనైనను, సువర్ణశృంఖలములచేతనైనను మానవుడు బద్ధుడగునటులనే జీవుడు శుభాశుభకర్మలద్వారమున సంసారమున బంధింపబడుచున్నాడు. సంసారబంధనచ్ఛేదమైనగాని జీవునకు ముక్తి లభింపదు. ముక్తిని వాంఛించు మానవునకు ప్రవృత్తినివృత్తులతో గూడిన ధర్మము శ్రేయస్కరముకాదు. కావున నివృత్తి ధర్మము ముముక్షుల కవలంబనీయము.

భారతవర్షమందలి దార్శనికులందరు నివృత్తిధర్మమునే యత్యుత్కృష్టమని నిరూపించి యున్నారు. ఒక్క పతంజలిదర్శనమందే కాక మిగిలినదర్శనము లన్నియు మానవులకునివృత్తిధర్మమే పరమాశ్రయమనినుడువుచున్నవి. వేదాంతదర్శనమం దిట్లు చెప్పబడియున్నది: అవిద్యాధ్వంసమువలన సమస్తవాసనలును క్షయమగును. ప్రవృత్తి కట్టుబడును. చిత్తవృత్తులు నిరోధింపబడును. బంధనవిముక్తి గలిగినంతనే ముముక్షుత్వములభించును. తైత్తిరీయోపనిషత్తునందు క్రియాపథము,సన్న్యాసమునను రెంటియందునను సన్న్యాసము సర్వోత్కృష్టమైనదని వర్ణింపబడియున్నది.మరియుసన్న్యాసమనగా, త్యాగము లేక వాసనానివృత్తియని నిర్వచింపబడినది.

కావున భారతీయదర్శనములును, ఉపనిషత్తులును, పురాణములు మొదలగు గ్రంథము లన్నిటియందునను నివృత్తిమార్గ మత్యుత్కృష్టమగ ప్రశంసించబడియున్నది. మోక్షమును, లేక నిర్వాణమును వాంఛించు మానవుడు నివృత్తిధర్మము ననుష్ఠించి తీరవలయును.

భారతవర్షమందు దర్శనగ్రంథము లన్నియు నివృత్తిధర్మమును బోధించుచుండినను, యోగులు నిష్కామభావమున నివృత్తిమార్గమున నిర్గమించుచుండినను, నివృత్తిమార్గానుష్ఠానమందు బుద్ధభగవానునితోఁ బోల్ప తగినవారు కానరారనుట యత్యంతసాహసము కాదు.

సాక్షాత్ భగవానుడు నివృత్తిధర్మమును మానవులకు ప్రత్యక్షగోచర మొనర్చుటకు గౌతమబుద్ధరూపమున మానవమండలియం దవతరించి దైనిక క్రియాకలాపముల యందును, ఉపదేశములయందును నివృత్తిధర్మమును ప్రస్ఫుట మొనర్చియున్నాడు.

బుద్ధత్వము లభించుటకు పూర్వము శాక్యసింహు డొకదినమున కపిలవస్తునగరమందలి స్వీయమందిరమందు శయనించియుండెను. ఆతనిని నిద్దుర మేల్కొలుపుటకు తెల్లవారుజామున సుందరీమణులు మంగళగీతములు పాడ జొచ్చిరి. సుమధురవేణునినాదమున శ్రుతి గలిపి పాడు రమణీమణుల మృదుమధుర కంఠస్వరముతో గూడిన ప్రాతఃకాల గీతములు శాక్యసింహుని కర్ణకుహరముల బ్రవేశించి యాతని కీక్రిందివిధమున వినబడజొచ్చెను.

"జరావ్యాధిదుఃఖమరణములతో గూడిన ఘోరా నలమువలన త్రిభువనములు నిరంతరము దగ్ధమగుచున్నవి. కుంభమందు దగుల్కొనియుండు భ్రమరము రోదనము చేయుచు నందే తిరుగుచుండువిధమున త్రిభువనములును నిష్కృతిని గాంచజాలక నిరంతరము దగ్ధమగుచు చుట్టి చుట్టి తిరుగుచున్నవి. శరత్కాలమందలి మేఘసదృశ మగు త్రిభువనములు అధ్రువములు; రంగభూమి. వీని యందు నిరంతరము జననమరణములు నాట్యము చేయు చున్నవి. పర్వతిములనుండి యత్యంత వేగమున బ్రవ హించు సెలయేరులబోలిన తీవ్రగామియగు ఆయువు మెరుపు తీగవలె లోపించుచున్నది. పృథ్వియందును దేవలోకము మొదలగువానియం దంతటనుండు మానవులు తృష్ణ అవిద్యలకు లోనై భ్రమణశీలమగు కుంభకారుని చక్రమును బోలి పంచవిధములగు గతులకు లోనై మూఢ భావమున దిరుగుచున్నారు. లోభవశమున మృగములు వ్యాధుని జాలమందు దగుల్కొను విధమున మానవుడు జగత్తునందలి సుందరవస్తువులు, మనోహర శబ్దములు, సుగంధము రసములు మొదలగువాని స్పర్శసుఖ మనుభ వించుచు పాపపాశమున బద్ధుడగుచున్నాడు. మానవున కత్యంతభీతిజనకమగు పరమశత్రువు మరణము. వివిధోప ద్రవములకును, అనంతశోకమునకును మూలము వాసన. అసిధారాతుల్యములగు భోగ విషయములు విషయంత్ర సదృశములు. కావున వీని నన్నిటిని ఆర్యజనులు అమేధ్య ఘటమును త్యజించు నటులు పరిత్యజించవలయును. కామ నము మిక్కిలి భయంకరమైనది. సమస్తదుఃఖములకు మూలము నైయున్నది.

అది మనమునకు దట్టినంతనే దుఃఖము పొంగి పొరలును. మోహము మేల్కొనును; భవతృష్ణాలత కాశ్రయమును, పంకతుల్యమును, మధులిప్తక్షురధారా తుల్యమగు వాసనను ఆర్యజనులు ప్రజ్వలితాగ్నికుండమని తలచి భయకంపితు లగుచుందురు." (లలితవిస్తరము)

బుద్ధత్వము లభించిన పరమముహూర్తముననే శాక్య సింహుడు ప్రవృత్తినిగూర్చి యీ క్రిందిభావముగల గీత మును పాడియుండెను.

"నే నీదేహరూప గృహనిర్మాణకారిణి యగు తృష్ణనుగూర్చి యన్వేషణం బొనర్చుచు పలుజన్మము లెత్తి జగత్తునం దనేకవిధముల పరిభ్రమించి యుంటిని. అయ్యో, తిరిగి తిరిగి జన్మములెత్తుచుండుట యెంతటి దుఃఖ కరవిషయము. ఓ దేహరూప గృహనిర్మాణకారిణీ, నేటికి గదా నిన్ను గాంచ గలిగితిని. ఇక నీవు తిరిగి గృహ మును నిర్మింపజాలవు. గృహస్తంభములను, పార్శ్వదండ నిచయమును సంపూర్ణముగ భగ్న మొనర్చితిని. వాసనా విహీనమగు నాచిత్తము తృష్ణాక్షయసాధనకు గడంగినది."

(ధర్మపదము)

బుద్ధభగవానుడు ధర్మప్రచార మొనర్చునప్పుడు వాసనాక్షయమును గూర్చియే మిక్కుటముగ బోధించు చుండెను. ఒకప్పుడు బుద్ధుడు శిష్యులతోడ గయాధామ మందలి హస్తిశీర్ష మను పర్వతముమీద నివసించియుండ, ఒకదినమున నాకస్మికముగ నాపర్వతమునకు తూర్పు దిక్కున నుండు పర్వతముమీద దవానలము ప్రజ్వలింప జొచ్చెను. అప్పుడు బుద్ధభగవానుడు శిష్యబృందమున కిట్లుపదేశించెను :

"సమస్తబ్రహ్మాండములయం దెట్టి ఘోరాగ్ని ప్రజ్వలింపుచున్నదో కాంచుడు. ఆదిత్యునినుండి బహిర్గ తమగుచుండు మహాగ్నివలననే మననేత్రములు ప్రజ్వలిం పుచున్నవి. జగత్తంతటను నగ్నివృష్టి గురియుచున్నది.

రూపరసగంధశబ్దస్పర్శలు మొదలగునవి యీయగ్ని యం దింధనములై మానవులఇంద్రియములను దహించుచున్నవి. రాగద్వేషమోహాదులనుండి నిరంతరము బయల్వెడలు చుండు మహాదవానలము మానవమండలిని పరితపింప జేయుచున్నది. జన్మజరామరణశోకదుఃఖాదులయందు ప్రజ్వలితమగు దవానల మాయగ్నినుండియే యుత్పన్న మైనవి కదా! ఇంద్రియములు, ఇంద్రియవిషయములు, దేహము, మనస్సు మొదలగువానిని అత్యంతవిశాలమగు అగ్నికుండమని భావించుము. ఈమహాగ్నికుండమందుండు వాసనానలముచేత జీవులు నిరంతరము దగ్ధమగుచుండు టనుగాంచుడు. ఈయనివార్యజ్వాలలను గాంచి జ్ఞానులు సంయతులై విషజ్వాలలను ప్రశమితమొనర్చుట కుపాయ మునుగూర్చి నిరంతరము చింతింపుచుందురు. మరియు వారు బ్రహ్మచర్యసాధనద్వారమున వాసనలనుండి విముక్తి నొంది నిర్వాణరాజ్యమును చేరగలుగుచున్నారు.

బుద్ధభగవానుడు వాసనానివృత్తినిగూర్చి యనేక మార్గములను శిష్యమండలికి చూపించి రాగద్వేషమోహా దులనుండి యుత్పన్నమగు మహత్తరాగ్నిని సంపూర్ణ ముగ నిర్వాపితమొనర్చుకుని మహాపరినిర్వాణమును బొందియుండెను. ఆమహాపురుషుడు నివృత్తిమార్గమున నిర్గమించుడని మానవమండలికి బోధించుచు స్వీయదైని కానుష్ఠానమందు నివృత్తిమార్గమును జూపించుటతోడ సంతృప్తిని జెందక మానవమండలికి త్రోవ జూపుటకు గాను సన్న్యాసులసంఘమును నిర్మించెను. దానినే భిక్షు సంఘ మందురు భిక్షుసంఘమున ప్రవేశించినవాడు వినీత భావమున జీవితమును గడపవలయును. దారిద్ర్యమును వరించవలయును. స్వార్థత్యాగము నభ్యసించుచు నిరంత రము బ్రహ్మచర్యానుష్ఠాన మొనర్చుచుండవలెను.

భగవానుడగు మనువు భిక్షుసంఘమును మిక్కుట ముగ ప్రశంసించియున్నాడు. బ్రహ్మచర్యగృహస్థ వాన ప్రస్థసన్న్యాసాశ్రమముల యందు సన్న్యాసాశ్రమమే పరమోత్కృష్టమైనది. బ్రాహ్మణ క్షత్రియవైశ్యశూద్రు లను చాతుర్వర్ణ్యములవారియందును బ్రాహ్మణుడే మిక్కిలి సన్న్యాసార్హుడని నుడువుచుందురు. మనువు బ్రాహ్మణ జీవితమును గూర్చి యిట్లు నుడివియున్నాడు.

"బ్రాహ్మణుడు సృష్టియందలి యేజీవికిని హింస గలుగకుండు వృత్తి నవలంబించి నిరాడంబరముగ జీవిత మును గడపవలయును. గర్హింపబడని కర్మలద్వారమున జీవితయాత్రకు కావలసినంతమాత్రమే ధనమును సమ కూర్చుకొనవలయును. శరీరమును క్లిష్టపెట్టి సంపాదించుకొనుట తగదు. బ్రాహ్మణు డవలంబింపవలసిన ముఖ్యవృత్తి ఉంఛవృత్తి. అది సాగనిచో దానగ్రహణము చేయు వచ్చును. ఇదియు సాధ్యముకానిచో భిక్ష, కృషి, వాణి జ్యముల నొనర్పవలయును. కాని యెప్పుడును కుక్కుర వృత్తి (పరసేవ) నవలంబింప గూడదు. సేవింపుటకు గాను మానవులు సాధారణముగ నవలంబించువృత్తులను బ్రాహ్మ ణుడు గ్రహించుకొనరాదు. శఠత్వము మొదలగు దుర్గుణములు వీడి విశుద్ధముగ జీవితమును గడపవలయును. ఇంద్రియ విషయములగు రూపరసాదులయందు గాఢాసక్తి గలిగి వర్తింపజనదు. చిత్తమునుండి విషయాసక్తినిగు రీ కృత మొనర్చుకొనవలయును. పరుల కపకారము గలుగుకార్యమును గూర్చి చింతింపవలదు. లోకుల కాగ్ర హము గలుగువాక్యము నెప్పుడును మోమునుండి బహిర్గ తము కానీయకూడదు. మానవులు విషమును కోరగనట్లు లనే బ్రాహ్మణు డెప్పుడును సన్మానమును వాంఛింప జనదు. మానవు లమృతమును గోరుచుండు విధమున బ్రాహ్మణుడు నిరంతరము అవమానమును కాంక్షింపు చుండవలయును. పరులచే నవమానింపబడిన మానవుడు సుఖముగ నిద్రించును. ఆనందముగ దిరుగుచుండును. కాని బ్రాహ్మణుని అవమాన మొనర్చినవానికి వినాశము తప్పదు."

బ్రాహ్మణులును, బౌద్ధులును గూడ నేక గ్రీవ ముగ జీవుడు ముక్తినొందుటకు వాసనానివృత్తియే ముఖ్య సాధన మని నుడివియున్నారు. ఇక్కాలమున గూడ భారతవర్షమందు ముక్తిని గోరువారున్నారు కాని వాస నానివృత్తికై ప్రయత్నించు వారత్యల్పమని నుడువ వచ్చును. కొందరు సన్న్యసించెదరు. కాని ప్రయోజనం బేమి? వారియాహార పానీయములయందు, వేషభావాల యందెచ్చటను వాసనానివృత్తికొరకు చేయుప్రయత్నము కాన్పింపదు.

బుద్ధభగవానుడు స్థాపించిన సన్న్యాస సంప్రదాయమును భిక్షుసంఘ మందురు. ఎనిమిదిసంవత్సరముల వయసుకు లోబడినవాడెవ్వడను బౌద్ధధర్మదీక్షితు డగుటకు వీలులేదు. ఇరువదిసంవత్సరములు దాటినవారుమాత్రమే భిక్షుసంఘమున ప్రవేశించుటకర్హులు. గృహస్థధర్మమును త్యజించుటను ప్రవ్రజ్యమందురు. భిక్షుసంఘమునజేరుటను 'ఉపసంపద'యని తెలియనగును.

ప్రవ్రజ్యము=ప్రవ్రజ్యాధర్మము నవలంబింపదలచిన వ్యక్తి కాషాయవస్త్రమును సంపాదించుకొని యేభిక్షువునైనను ఉపాధ్యాయునిగవరించి యాతనికడ కేగి నమస్కరించి యిట్లు నుడువవలయును:—

'మహాశయా! సంసారమందలి సమస్తదుఃఖముల నివారించుకొనుటకును నిర్వాణసాక్షాత్కారము కొరకును నేను ప్రవ్రజ్యాధర్మమును స్వీకరింప దలచితిని. అనుగ్రహపూర్వకముగ నీకాషాయవస్త్రమును స్వీకరించుడు. అని ముమ్మారు ప్రార్థింపవలయును. అప్పుడు ప్రార్థించుచున్న శిష్యునిహస్తమందు కాషాయవస్త్రమును ఉపాధ్యాయుడు గైకొనును.

ప్రవ్రజ్యగ్రహణేచ్ఛతో గూడుకొని యుండిన శిష్యుడు గురువును గాంచి ముమ్మారు నీక్రిందివాక్యముల నుచ్చరించును. "సంసారమందు సమస్తదుఃఖముల నివృత్తికిని నిర్వాణసాక్షాత్కారముకొరకును ప్రవ్రజ్యధర్మము నవలంబింపదలచితిని. అనుగ్రహపూర్వకముగ కాషాయవస్త్రమును నాహస్తమం దిడుడు." ఉపాధ్యాయుడు తనచేత నున్న కాషాయాంబరమును శిష్యుని హస్తములయం దిడి ధరింపవలయునని నుడువును. శిష్యుడావస్త్రమును కట్టుకొని హస్తములు ముకుళించుకొని "మహాశయా నేను త్రిశరణములతో గూడిన దశశీల ధర్మమును గోరుచున్నాను. అనుగ్రహముతోడ నాకు శీలదానం బొసంగుడు." అని ముమ్మారు ప్రార్థించును. తదనంతరము ఉపాధ్యాయుడు 'నేను నుడువు వాక్యములను తిరిగి నుడువుము' అన శిష్యుడు 'ఆజ్ఞ, మహాశయా!' అని యంగీకారమును దెలుపును.

నమస్కారము

'భగవానునకు అనగా సమ్యక్సంబుద్ధునకు నమస్కారము.' అని గురువు నుడువుదానిని శిష్యుడు వరుసగా ముమ్మారు స్మరించును.

త్రిశరణములు

బుద్ధం శరణం గచ్ఛామి
నేను బుద్ధుని నాశ్రయించుచున్నాను.
ధర్మం శరణం గచ్ఛామి
నేను ధర్మము నాశ్రయించుచున్నాను.
సంఘం శరణం గచ్ఛామి
నేను సంఘము నాశ్రయించుచున్నాను.

అను నీత్రిశరణములను గురువు చెప్పుచుండ శిష్యుడు ముమ్మారు నుడువును.

దశశీలములు

౧. ఏప్రాణినైనను వధింపను.

౨. పరద్రవ్యమును హరింపను.

3. వ్యభిచారము చేయను.

౪. అబద్ధము లాడను.

౫. ప్రమోదముకొరకు సుర మొదలగువానిని త్రాగను.

౬. అపరాహ్ణములోగా భుజింపను.

౭. నృత్యగీత వాద్యములతో గూడిన యుత్సవములను సందర్శింపను.

౮. అలంకారముకొరకు మాలలను ధరింపను. సుగంధమును బూసికొనను.

౯. బంగారును గాని, వెండిని గాని దానముగ గైకొనను.

౧౦. ఉన్నతాసనము, ఉచ్చశయ్య మొదలగు వానిమీద గూర్చుండను; శయనింపను.

అని ముమ్మారు నుడివినపిమ్మట ఉపాధ్యాయు డిట్లనును: "త్రిశరణములతో గూడిన దశశీలధర్మమును నుత్తమ రూపమున రక్షించుకొనుచు అప్రమోదముగ కాలము గడుపుచుండవలయును." అను వాక్యములకు శిష్యు డంగీకారమును దెల్పును.

ప్రవ్రజ్యగ్రహణ మొనర్చిన మానవుడు ప్రభాత సంధ్యా కాలములయందును, రాత్రిప్రథమయామమునను చతుర్విధ ప్రత్యావేక్షణవిధులను మననము చేయుచుండవలయును. చీవర ప్రత్యావేక్షణము, పిండు ప్రత్యావేక్షణము, శయనాసనప్రత్యావేక్షణము, భైషజ్యప్రత్యావేక్షణము అనువానిని చతుర్విధప్రత్యావేక్షణము లందురు.

## చీవరప్రత్యావేక్షణము

శీతగ్రీష్మతాపనివారణకొరకు నేను వస్త్రమును ధరించుచున్నాను. కాని యహంకారముకొరకు కాదు.

---

* భారతీయులు పరమ పవిత్రముగ భావించు మనుస్మృతియందు దశవిధ ధర్మములు పేర్కొనబడి యున్నవి. వాని నీ క్రింద నుదాహరించుచున్నాను.

ధృతిః క్షమా దమో౽స్తేయం శౌచ మింద్రియనిగ్రహః
ధీ ర్విద్యా సత్య మక్రోధో దశకం ధర్మలక్షణం'
దశలక్షణాని ధర్మస్య యే విప్రాః సమధీయతే,
అధీత్య చానువర్తంతే తే యాంతిపరమాంగతిమ్.

—మనుసంహిత.

ధృతిః (సంతోషము), క్షమా (పరులుచేయు అపరాధములను క్షమించుట, సహించుట) దమః అస్తేయమ్ (దొంగతనము చేయకుండుట), శౌచమ్, ఇంద్రియనిగ్రహమ్, ధీః (జ్ఞానము), విద్యా (ఆత్మజ్ఞానము), సత్యం, అక్రోధః అను నీపదియును ధర్మలక్షణములు. ఈ దశలక్షణములతో గూడిన ధర్మము నధ్యయనము చేయుచు వాని ననుసరించు బ్రాహ్మణునకు పరమపదము కలుగును. మనుస్మృతియం దుల్లేఖింపబడిన దశధర్మము లను బ్రహ్మచర్యగార్హస్థ్యవానప్రస్థసన్న్యాసాశ్రమముల యందుండువా రెల్లరును నాచరించుచుండవలయును. మనుస్మృతియందలి ద్వాదశాధ్యాయమందు దశవిధపాపము లుల్లేఖింపబడియున్నవి.

పరద్రవ్యే ష్వభిధ్యానం మనసా౽నిష్టచింతనమ్,
వితథాభినివేశశ్చ త్రివిధం కర్మ మానసమ్.
పారుష్య మనృతం చైవ పైశున్యఞ్చాపి సర్వశః,
అసంబద్ధప్రలాపశ్చవాఙ్మయం స్యాచ్చతుర్విధమ్.
అదత్తానా ముపాదానం హింసా చైవావిధానతః
పరదారోపసేవాచ శారీరం త్రివిధం స్మృతమ్.

పరద్రవ్యాభిలాష, మనమునం దనిష్టచింతనము, మిథ్యాభినివేశము (మిథ్యాదృష్టి) పారుష్యము, అనృతము, పైశున్యము (పరులసుఖమును భంగపరచుట,) అసంబద్ధ ప్రలాపము, పరద్రవ్యాపహరణము, జీవహత్య, పరదార గమనమును దశవిధ పాపకార్యముల వలన మానవుడు స్థావరతిర్యక్జంతువులయందో, అంత్య యోనియందో జన్మించి పాపఫల మనుభవించుచుండును. మనుస్మృతి యం దుల్లేఖింపబడిన దశవిధపాపములను, బౌద్ధధర్మ గ్రంథములయందు దశశీలము లని పేర్కొనియున్నారు. క్రైస్తవమతమందుగూడ దశశీలములు గలవు. బైబిలు మతానుసారము వానిని ఈశ్వరాజ్ఞ లనుచుందురు.

౧. ఒక ఈశ్వరునిమాత్రమే విశ్వసించవలయును.

౨. ప్రతిమల నిర్మించి పూజ లొనర్పవలదు.

౩. ఈశ్వరనామమును వృథాగా నుచ్చరింప వలదు.

౪. వారముదినములలో చివరదినమున విశ్రాంతి గైకొనుము.

౫. తలిదండ్రుల యెడల భక్తి గలిగియుండుము.

౬. నరహత్య యొనర్పరాదు.

౭. వ్యభిచరింప జనదు.

౮. పరద్రవ్యము నపహరింపకుము.

౯. అబద్ధపుసాక్ష్యమొసంగకుము.

౧౦. నీ పొరుగువారి సజీవ నిర్జీవవస్తువులయందు లోభ ముంచకుము.

సూర్యోత్తాపము, వాయువీజనము మశక వృశ్చికసర్పముల స్పర్శనివారణకొరకు వస్త్రమును దాల్చుచున్నాను.

## పిండప్రత్యావేక్షణము

విలాసము, మత్తత, సౌందర్యాభివృద్ధికొరకు నేను భుజించుటలేదు. శరీరధారణము, జీవనరక్షణము, క్షుత్పిపాసానివృత్తులకొరకు భుజించుచున్నాను. బ్రహ్మచర్యమునకు ప్రతిబంధకము గాక బ్రహ్మచర్యసాధనను పుష్టి గలుగుటకును, పురాతనవేదనలు నశింపజేసికొని నూతనవేదనలు కలుగకుండుటకును నేను తినుచున్నాను మరియు నిర్నిందితభావమున జీవయాత్ర గడచుటకు భుజించుచున్నాను.

## శయనాసనప్రత్యావేక్షణము

నేను గ్రీష్మశీతాదుల తాపాదినివారణకొరకు శయనించుచున్నాను; ఉపవేశనం బొనర్చుచున్నాను. సూర్యోత్తాపము, వాయువు, సర్పవృశ్చికాదుల స్పర్శనివారణకొరకు శయనించుచున్నాను; ఉపవేశనం బొనర్చుచున్నాను.

## భైషజ్యప్రత్యావేక్షణము

పిపాసానివారణకొరకు జలమును, రోగనివారణకొరకు ఔషధమును పగలు మూడవయామమున త్రావుచున్నాను.

ప్రవ్రజ్యగ్రహణానంతరము ప్రవ్రజితుడు క్రింది పదిప్రశ్నలకు ప్రత్యుత్తర మీయవలయును. ఒకటి యని దేని నందురు: సర్వజీవఆహారార్థిని. (ఆహారము= ధ్యానాహారము, కబలీకారాహార, ప్రత్యాహార, స్పర్శాహార సంచేతనికాహారము లని)

రెండవ నేమి? నామరూపములు.

మూడవ నేమి? త్రివిధవేదనలు (సుఖదుఃఖములు, అదుఃఖాసుఖములు).

నాల్గింటిని నుడువుము? చతురార్యసత్యములు (దుఃఖము, దుఃఖోత్పత్తి, దుఃఖధ్వంసము, దుఃఖధ్వంసోపాయము).

అయిదింటిని చెప్పుము. పంచస్కంధములు. (రూపస్కంధము, వేదనాస్కంధము, సంజ్ఞాస్కంధము, సంస్కారస్కంధము, విజ్ఞానస్కంధము).

ఆరింటిని వివరించుము. షడాయతనములు (చక్షుః, కర్ణ, నాసికా, జిహ్వా, త్వక్, మనస్సులు).

ఏడింటిని నుడువుము. సప్తబోధ్యంగములు (స్మృతి, ధర్మవిచారము, వీర్యము, ప్రీతి, ప్రశ్రబ్ధి, సమాధి, ఉపేక్ష).

ఎనిమిది యన నేమి? అష్టవిధములగు ఆర్యమార్గములు (సమ్యక్ దృష్టి, సమ్యక్ సంకల్పము, సమ్యక్ వాక్కు, సమ్యక్ కర్మాంతము, సమ్యక్ జీవనము, సమ్యక్ వ్యాయామము, సమ్యక్ స్మృతి, సమ్యక్ సమాధి).

తొమ్మిదిటినిగూర్చి చెప్పుము. నవసత్త్వావాసములు.

పదియని దేని నందురు? దశశీలములు.

పిమ్మట ప్రవ్రజితున కుపాధ్యాయుడు దేహతత్త్వశిక్ష నొసంగును.

## ఉపసంపద

భిక్షుసంఘమున చేరదలచిన ప్రవ్రజితుడు భిక్షుమండలియం దొకని నుపాధ్యాయునిగ నిర్ణయించుకొని భిక్షాపాత్రను, కాషాయము మొదలగువానిని దీసికొని యుపాధ్యాయునికడ కేగవలయును. ఉపాధ్యాయుడు వానిని గాంచి యిట్లనును:—

'ఇదియే నా నీభిక్షాపాత్రము?' 'అవును మహాశయా.'

' ,, బహిర్వాసము?' 'అవును.'

' ,, ఉత్తరీయము?' 'అవును.'

' ,, అంతర్వాసము?' 'అవును.'

ఇట్లు ప్రశ్నించి యుపాధ్యాయుడు భిక్షుసంఘమున బ్రవేశించి వారియనుజ్ఞ నొంది ప్రవ్రజితుని సమీపించి, 'నీవు భిక్షుసంఘమున జేరుటకు కాల మాసన్న

మైనది. నే నడుగు ప్రశ్నలకు అవును, కాదని స్పష్టముగ ప్రత్యుత్తరం బొసంగుము.' అని యిట్లు పలుకును:—

నీకు కుష్ఠు, శ్వేతకుష్ఠు, పిచ్చి మొదలగు వ్యాధులు గలవా? 'లేవు మహాశయా!'

'నీవు మనుష్యుడవేనా?' 'అవును మహాశయా'

'పురుషుడవా?' 'అవును.'

'స్వాధీనుడవా?' 'అవును.'

'ఋణబాధ లేనివాడవేనా?' అవును.

'రాజభృత్యుడవా?' 'కాదు'.

'తలిదండ్రుల యనుమతిని గైకొంటివా?' 'అవును.'

'ఇరువదివత్సరములు నిండినవా?' 'అవును'.

ప్రవ్రజితునికడనుండి ప్రశ్నలకు ప్రత్యుత్తరము గైకొనినపిమ్మట నాతడు భిక్షుబృందమును సమీపించి 'నాగు డనువాడు ఉపసంపదను వాంఛింపుచున్నాడు. ఆజ్ఞ యొసంగినయెడల నాతనిని మీసమ్ముఖమునకు దీసి కొనివచ్చెదను.' అని ప్రార్థింప వారంగీకారమును దెలుపుదురు.

అప్పుడు వెలుపల నున్న నాగుని వెంట నిడుకొని యుపాధ్యాయుడు సంఘమున ప్రవేశించును. అప్పుడు భిక్షుబృందమును గాంచి నాగు డిట్లు ప్రార్థించును. "మహాశయులారా! అనుగ్రహము మంచి యుపసంపదను నాకొసంగుడు." అని ముమ్మారు ప్రార్థించును. ఉపాధ్యాయుడు పైన వివరించినప్రశ్నల నడిగి ప్రత్యుత్తరమును బడయును.

ఉపాధ్యాయుడు: మాననీయులగు భిక్షుసంఘీయులారా! మీ యంగీకారముతోడ నీవ్యక్తికి యుపసంపద నొసంగుచున్నాను. మీకు సమ్మతమైనచో మౌనము ద్వారమున అంగీకారమును సూచింపుడు. అభ్యంతర మేదైన నుండినయెడల నుడువుడు. అని ముమ్మారు రడుగును. ఒకింతవడి యూరకుండి 'భిక్షుమహాశయుల అంగీకారము మౌనభావమువలన దెలియుచున్నదని తలచుచున్నాను.' అని నుడివి నాగునిచూచి కాలమును చెప్పమనును. అప్పుడు నాగుడు ఋతువు-మాసము-తిథి-గంటలు ఇన్ని గడియలని నుడువును.

అప్పుడు నాగుని చూచి యుపాధ్యాయుడిట్లు బోధింపును. 'భిక్షాలబ్ధమగు అన్నమువలననే జీవించుచు శీర్ణవస్త్రమును ధరించుచుండుము. వృక్షతలమే నీనివాసగృహము. ఔషధము గోమూత్రము. ఉల్లాసముగ జీవితమును గడుపుచుండుము. స్త్రీసంపర్కము కూడదు. చౌర్యము చేయరాదు. సామాన్యతమ ప్రాణినిగూడ చంపరాదు. నీ కలౌకికశక్తులు గలవని లోకు లెప్పుడును తలంపజనదు.' అని నుడివి కాపీనమును, మొలగట్టుకొను అంగవస్త్రమును, ఉత్తరీయము నొసంగును. నాగుడు వానిని ధరించి 'ధర్మవంశ, ధర్మపాల, ధర్మరక్షిత' మొదలగు నామములయం దేదియో యొక నామమున పిలువబడును.

---



బట్టకట్టు నేర్చుట
(ఫ్రెంచి యువతి)



తిల్లకుసతి
(భారతీయశాఖలోని ఒకానొక నటి, లండను)



పట్టణము-పల్లె
(కాలిఫోర్నియా, అమెరికా)



ఏలింగ్టన్ మెమోరియల్ వంతెన
వాషింగ్టన్, అమెరికా
విమానమునుండి తీసిన ఛాయాచిత్రము. G. S.

# అన్నప్రాశనము

బొడ్డు బాపిరాజుగారు

ఓమ్మ పసిపాప! ఏల జాలమ్మసేయ - రంగవల్లిక లెలమి నలంకరించి
పీఠమున నన్నివస్తువుల్ పేర్చినారు - ముందుగా నీవు దేనినిముట్టుకొందొ.

అనుచును జుట్టాలందఱుఁ - గనుబండువుగాఁ గనంగఁ గాంక్షించుచు చు
ట్టును నిలువంబడి రలహా - రిని గని లేఁతనగవులను రేఁపెదవేలా ?

చిగురుపాదాల నాడించి సెలవివాఱ - బోసినోటినవ్వులఁ బ్రొద్దుఁబుచ్చుకొనుచు
కులుకుకాటుకకన్నులఁ దళుకుఁజూపు - లన్నిగడలకుఁ జిమ్మెదే చిన్నిపాప!

కాసులపేరుమున్నగునగల్ గననొల్లవు, మల్లెపూవులం
బోసినపల్లెరమ్ము నటు ముట్టవు, పెట్టినయట్టిగ్రంథముల్ (?)
కోసమువోవు, కుంకుమపు క్రొంబరణిన్ మనసుంచవమ్మ పై
పే సొలపారఁజూపు నిగిడించెద వేటికి చిట్టిపాపఁడా!

ఎత్తుకనిన్ను లాలించువేళలయందు, సొగసుఁజేతులఁ జిక్కునగలు సుమ్మి
భుజముపై నినునిద్రఁబుచ్చ జోలలుపాడ, మోమెత్తిగనుఁ గొప్పుపూలుసుమ్మి
పొర్వెట్టి యేడ్చునప్పుడు బుజ్జగింపగ, బొమ్మలుసూపు పొత్తమ్ముసుమ్మి
మోము మోమునఁజేర్చి ముద్దాడునప్పుడు, బుడుత నీనొసలంటు బొట్టుసుమ్మి
క్రొత్తగావు నీకు గొనబుచేతులతోడఁ - దెచ్చియిమ్మ మాకు బుచ్చితండ్రి!
యనుచుఁ దల్లిదండ్రు లాడెడుమాటల - వినియును జిరునవ్వుకొనెదె బాబు!

ముందుగా భూషణమ్ములు ముట్టుకొన్నచో, కొలమించు ధనధాన్యములు సెలంగు
ప్రథమమ్మునం బేర్మి ప్రసవముల్ గ్రహియింప, తతవిలాసప్రియస్థితి సుఖింతు
పొత్తముల్ దొలువొత్త నెత్తినవిద్యల, జాణవై మేటి యశమ్ముఁగాంతు
వాదినిఁ గుంకుమం బంటినమొన లేని, సౌభాగ్యగరిమ ప్రశస్తి గలుగు
నయ్య! వేవేగఁ బోయి నీకందినట్టి - దానిఁ గైకొని తెచ్చియీదగు నటంచు
మదుల వాత్సల్య ముప్పొంగఁ గుదురఁబలుకు - నాప్తజనములవాక్యంబు లాలకించి.

అల్లనఁ బ్రాఁకిపోయి యవియంట కరమ్ములు ముందుత్రోయుచున్
దల్లిని జూచినంత వదనమ్మును నావలిప్రక్కఁ ద్రిప్పి య
ల్లల్లనఁ జేరి వస్తువులనన్నిటిఁ జేతులఁ జిమ్మి గ్రంథముల్
మెల్లననంటె నవ్వులకు మీఁగడబుగ్గలు సొట్టవోవఁగాన్.

---




## అజంత కళాలయములు

తలిశెట్టి రామారావుగారు, బి. ఎ., బి. యల్

### ౨

### చిత్రములు

సుప్రసిద్ధ శిల్పరాజము లనేకములు హిందూదేశమున గానవచ్చుచున్నను సనాతనచిత్రములు విశేషముగ లేవు బౌద్ధులచే రచింపబడిన చిత్రములు బాఘ్, సింహగిరులందు కానవచ్చినను అజంతయందు గల చిత్రములంతటి సనాతనములు కావు. ఇప్పటిచిత్రకారులకు చిత్తోన్మేషణము గలుగజేసి, మనపూర్వులు చూపిన వింతశైలిని ప్రపంచమునకు జాటుచున్నవి కనుక వీటివిలువకు పరిమితి లేదు. కాని యాధునికుల కివి మరల వెలసినపిమ్మటగూడ చాలవరకు నశించుట మన దౌర్భాగ్యమే కాని వేరు కాదు.

జేమ్సు ఫెర్గుసనుగారు ౧౮౪౩ వ సంవత్సరమున నీచిత్రములప్రతులను కాగితముపై వ్రాయించమని ఈస్టు ఇండియాకంపెనీవారిని ప్రోద్బలముచేయ వా రీపనిని నిర్వహించుటకు చెన్నపురిసైనికదళమున నుద్యోగిగ నుండిన మేజరు గిల్లు (Majar Gill) గారిని నియమించిరి. ఆ యిరువది సంవత్సరములు అనగా ౧౮౫౭ వ సంవత్సరమున సిపాయీలును, తదితరదేశభక్తులును ప్రభుత్వమువారిపై తిరుగుబాటు చేసినవరకు కష్టపడి వారికి ముఖ్యమని తోచిన ముప్పది చిత్రములప్రతులను వ్రాసిరి. వీటియం దైదు తప్ప తక్కినవన్నియు ౧౮౬౦ వ సంవత్సరమున క్రిస్టలు భవనప్రదర్శనము (Crystal Palace Exhibition) న గాలిపోయినవి. కాని యాచిత్రముల జూచి రేఖామాత్రములుగ వ్రాయబడినప్రతులు ౧౮౫౬ వ సంవత్సరమున స్పియరు దొరసాని (Mrs Spier) గారును, ఆమెయే మారుపేరుతో ౧౮౬౬ వ సంవత్సరమునను ౧౮౭౯ వ సంవత్సరమున డాక్టరు బర్గెసు (Dr. Burgess) గారును రచించిన గ్రంథము లందు ప్రచురితములైనవి. మిగిలిన యైదు నిప్పుడు సౌతు కెన్సింగ్టన్ ప్రదర్శనశాలలోని హిందూదేశపుశాఖ (Indian Section of South Kensington Museum) యందు జూడనగును.

బొంబాయి చిత్రకళాశాలాధికారిగ నుండిన గ్రిఫిత్సు (Grifiths) గారు తమ శిష్యవర్గముయొక్క సహాయముతో మేజరు గిల్లుగారు చేయుచుండిన పనిని కొనసాగించుటకు ౧౮౭౨ వ సంవత్సరమున బూనుకొని సుమారు పదిసంవత్సరములు పాటుపడి నూటయిరువదియైదు చిత్రములను సౌతుకెన్సింగ్టను ప్రదర్శనమునకు బంపిరి. కాని యధికారుల ప్రమత్తతవలననో మరేకారణమువలననో వీటియందు నెనుబదియేడు కాలిపోయినవి. ఏబదియేడు విక్టోరియాఆల్బర్టు ప్రదర్శనశాల (Victoria and Albert Museum) యం దిప్పుడు కలవు. రెండు బొంబాయి చిత్రకళాశాలయం దున్నవి. కాలగా మిగిలినవానిని గ్రిఫిత్సుగారు ౧౮౯౬ వ సంవత్సరమున ప్రచురించిన "అజంతయందలి బౌద్ధగుహలలోని చిత్ర

ములు" (The Paintings in the Buddhist Caves at Ajanta) యను సంపుటములందు లోకమున కర్పించిరి. ప్రదర్శనమున గలప్రతుల రంగులు వాడుటచే నంత బాగుగ కానరాకున్నవి.

౧౯౧౧-వ సంవత్సరమున హెర్రింఘాము సతి (Lady Herringham) యు, మరికొందరు చిత్రకారులు నీచిత్రముల ప్రతులను వ్రాసిరి. వీటిని విక్టోరియా ఆల్బర్టు ప్రదర్శనశాలయందు చూడవచ్చును. ఆమె వ్రాసిన "అజంత కుడ్యచిత్రములు" (Ajanta Frescoes) అను గ్రంథమున నివి ప్రచురింపబడెను. ముకుళదేవుగారు వ్రాసిన ప్రతులు బొంబాయియందు కళ్యాంజీ కర్మసేగారివద్ద నున్నవి. దేవుగారు "అజంతా బాఘులకు నా యాత్ర" (My Pilgrimage to Ajanta and Bagh) అను గ్రంథమును కూడ ప్రచురించిరి. సయ్యదు అహమదు గారు వ్రాసినప్రతులు ప్రిన్సు ఆఫ్ వేల్సు ప్రదర్శనమున ప్రదర్శింపబడెను.

ఇప్పుడు బొంబాయి చిత్రకళాశాలాధ్యక్షులుగ నున్న కెప్టెను గ్లాడ్‌స్టను సోలోమను (Captain Gladstone Solomon) గారు అజంతకు తమశిష్యవర్గముతో వెళ్లి, చూచి, "అజంతగుహాలస్త్రీలు" (Women of the Ajanta Caves), "జాటింగ్సు ఎట్ అజంత" (Jottings at Ajanta) అను చక్కని రెండుచిన్న గ్రంథములను వ్రాసిరి. కన్యాలాలు వకీలుగారు "అజంతవద్ద" (At Ajanta) యను చక్కని చిన్నగ్రంథమును ప్రచురించిరి. ఫ్రెంచిపండితుడగు ము. ఫౌచర్ (M. Foucher) గారి సహాయమున నజంతగుహల, వాటియందలి శిల్పముల చిత్రముల సమగ్రవర్ణనమును త్రివర్ణచిత్రములతో రెండు సంపుటములుగ నైజాముప్రభుత్వమువారు ప్రచురింప బూనుకొనియున్నారు. ఈగ్రంథములు వెలువడినపిమ్మట అజంతఘనత లోకమునకు పూర్తిగ వెల్లడి కాగలదు.

ఆధునిక ప్రపంచమున కివి తెలియక పూర్వము "నరసంచారము విశేషముగ లేనప్పు డచ్చట చేరిన గబ్బిలములు, పక్షులు, గూడులను కట్టు పురుగులు మొదలగువాటివలనను, వీటిఘనత నెరుగని యాత్రికులు గోడలపై వ్రాయుటవలనను, సన్యాసుల యగ్నిహోత్రముల పొగవలనను వీటిరూపు చాలావరకు చెడెను." ప్రతులను వ్రాయుటకు చిత్రములు బాగుగ కనబడవలెననియో, లేక నివి చెడక యుండవలెననియో మేజరు గిల్లుగారో, గ్రిఫిత్సుగారో వార్నీషును బూయుటవలన నది మాసి, పసుపువర్ణముగ మారి వాటిరూపును మరి కొంత చెరిపినది. హైదరాబాదు ప్రభుత్వమువారిచే "గుహలపై నధికారులుగ నియమింపబడినవారును వాటిని చూడ వచ్చినకళాభిమానులగు యాత్రికుల నానందపరచుటకు చిత్తరువులందలి వ్యక్తుల శిరస్సు లుండు భాగమును బిళ్లలుగ గోసి బహుమతులుగ నర్పింపసాగిరి. బొంబాయియందలి ప్రదర్శనమందిరముకొరకు డాక్టరు బర్డుగారు నిటులనే చేసిరి. సహజముగ నిట్టిబిళ్లలన్నియు కొలదికాలమునకు చితికి ముక్కలైపోయినవి." ఈకారణములవలన "౧౮౧౯-వ సంవత్సరమున నుండిన చిత్తరువులలో కొన్ని ౧౮౪౯-న కానరాలేదు. ౧౮౪౯-న బర్గెస్సుగారు పేర్కొనిన విప్పుడు కానవచ్చుటలేదు."

ఇటుల చెడగా మిగిలిన చిత్తరువులను గాపాడుటకు నైజాముప్రభుత్వమువారు ధనమును వెచ్చించి ౧౯౦౩-౦౪-వ సంవత్సరమున నీగోడలను శుభ్రపరచి వాటిముందు తీగలవలల నమర్చిరి. బాగుగవీటిని కాపాడుటకు ౧౯౧౪-వ సంవత్సరమున వీరు సర్ జాన్ మార్షలు (Sir John Marshall) గారి సహాయముతో నొక ఆర్కియాలజికలుడిపార్టుమెంటు నేర్పరచి, కుడ్యచిత్రములవిషయమై బాగుగ నెరిగిన ఇటలీపండితుడగు లొరెంజో సెక్కొని (Lorenzo Cecconi) గారిని నియమించిరి. వీరిసలహా ననుసరించి కాపాడుచుండిన యెడల మిగిలిన చిత్రములు చాలకాలమువరకు మన కన్నుల నానందపరుపగలవను నాశ కలదు.

మిగిలియు రూపుమాసియున్న చిత్రములు సగము చెడిన చిత్రములు, చిత్రములలో నొకమూల చేయి మరి యొకమూలకన్ను కనబడుచున్నవియు మాచి యానిరుపమానమైన చిత్రముల సౌందర్యము నూహింపవలసి వచ్చెను. ఈమిగిలినవైనను మనలను దేవునిసన్నిధానమును జేర్పజాలినవై, ధనమునే దేవునిగ భావించెడి

యీకాలమున మరల మనోజ్ఞకళలను సింహాసనమున గూర్చుండ జేయజాలునవై యున్నవి.

"గుహలు" నిర్మింపబడిన కాలముననే చిత్రములను వ్రాయబడెనని చెప్పుటకు ప్రబలాధారములు లేవు. నాల్గవకంపరము పూర్తికానప్పటికిని దానియందు చిత్రములు కానవచ్చుటచేత నొకవంక శిల్పులు పనిచేయుచుండ వేరొకవంక చిత్రకారులు చిత్రించుచుండిరని కొందరనుచున్నారు. కాని కందరనిర్మాణమును విడనాడిన కొన్ని సంవత్సరములకు చిత్రములను వ్రాయబూనరాదా? ఒక చైత్యము నలంకరించినపిమ్మట దానిని జూచి, సంతసించి, తక్కిన చైత్యములను, ఆతరువాత విహారములను వర్ణములతో మండనముజేయుట కాయాలయాధికారు లాజ్ఞనిచ్చుటయు సంభవము. తొలుదొలుత, సుమారు క్రీ. పూ. రెండవ శతాబ్దమున నిర్మింపబడిన గుహలందు చిత్రము లెవ్వియు లేవు. ఆశతాబ్దములందు విగ్రహారాధన, విగ్రహముల వినియోగము బౌద్ధమతమున లేనందువలనను, మతమున నలంకారములును సౌఖ్యములును నిషేధములగుటవలనను, కందరములందు చిత్రములను వారు వ్రాయలేకపోవుటయు, విగ్రహములును చిత్రములును మతప్రచారమునకు ప్రబలమైన యాధారములైన నాటినుండియు చిత్రములను వ్రాయించుటయు సంభవించెను. ఏయాధారమువలననో కందర నిర్మాణకాలమును నిశ్చయించి యాకాలముననే చిత్రములు వ్రాయబడెననుటకు వీలు లేదు. కాని కందరనిర్మాణకాలము తెలిసినయెడల నీచరచనకాలము నిర్ణయించుట సులభమగును.

"౧,౨,౪,౬,౯,౧౦,౧౧,౧౫,౧౬,౧౭,౧౯,౨౦,౨౧,౨౨,౨౬ సంఖ్యల గుహలందు చిత్తరువు లుండినటుల నిదర్శనములు కలవు. ఇప్పుడు ౧,౨,౯,౧౦,౧౧,౧౬,౧౭,౧౯,౨౧-వ గుహలుమాత్రము సచిత్రితములుగ నున్నవి." కాని వీటియందు ౧,౨,౯,౧౦,౧౬,౧౭-వ గుహలు ముఖ్యమైనవి. కొన్ని కందరములందు కప్పులపైని, స్తంభములపైని చిత్తరువులు కలవు. ఒకానొకప్పు డీవిహారములు, చైత్యములు మనోహరములగు రంగులతో వింత ప్రపంచములవలె, భూలోకస్వర్గములవలె విరాజిల్లుచుండె ననుటయం దతిశయోక్తి లేదు.

ఈచిత్రములను జూచునప్పు డజంతవిహారములు బౌద్ధమతావలంబకుల నిర్మాణములని జ్ఞాపకముంచుకొనవలెను. బుద్ధునిజన్మమును గూర్చియే కాక యామహాత్ముని పూర్వజన్మములనుగూర్చి జాతకకథల చిత్రములిందు విశేషముగ గానవచ్చును. బుద్ధుని నిర్యాణము తరువాత బౌద్ధమతమున ప్రవేశించిన యవలోకితేశ్వరుని మొదలగుదేవుళ్ల చిత్రములు, జీవితచక్రాదిమతవిషయక చిత్రములును కలవు. వీటితోపాటు "పర్షియా రాయబారము" వంటి చారిత్రాత్మక చిత్రములు, అనుదినము గానవచ్చు మనోహరదృశ్యములు చూడగలము. కాని నీ చిత్రములవలన మత, చారిత్రిక, సాంఘికాదివిషయము లనేకములు మనకు దెలియవచ్చుచున్నవి.

౯,౧౦ సంఖ్యలుకల కందరములు క్రీ. పూ. మొదటిశతాబ్దమున దొలువబడెననియు, నిందలి చిత్రములు క్రీ.శ. మూడవశతాబ్దమువరకు చిత్రింపబడెననియు పండితులు బరుహూతు, అమరావతి, సాంచీస్తూపములందలి శిల్పములతో సరిపోల్చినిర్ణయించిరి. ఆంధ్రులా కాలమున దక్షిణహిందూదేశమున ప్రబలరాజ్యమున కధిపతులుగ నుండుటవలనను, వీరు బౌద్ధమునందు సానుభూతిని జూపుచుండుటవలనను వీరిప్రోత్సాహమువలన గాకపోయినను ఆటంకము లేక నిర్విఘ్నముగ నీరచనలు సాగెను.

౯-వ గుహయందు చిత్రములు చాలవరకు చెడినవి. నేవకురాండ్ర ఏనుగులచిత్రములు చక్కగ నున్నవి. పశువు లానందముగ బరుగిడుచుండ వానివెన్నంటె పోవు కాపరిచిత్ర మతిసహజముగ, సుందరముగ నున్నది. రేఖలు దృఢముగ నుండుటవలనను, స్వల్పప్రయత్నముతో వర్ణములలావణ్యము కనుగుటవలనను ఆచిత్రకారు డతిప్రవీణుడై యుండవలెనని తోచును. అప్పటికే యెన్నివేల సంవత్సరములో నాగరికత యున్నతదశయందుండి చిత్రరచనను బోషింపకపోయినయెడల నిట్టిసుందరచిత్రముల నొక్కపరి చిత్రింపబూనుట సాధ్యము కాదు. స్తంభములపై నున్న బుద్ధునిచిత్రములును, తక్కినచిత్రములును ఆకాలపు చిత్రకారుల వివిధములైన రుచులను తెలియజేయుచున్నవి. పూర్వ . మాగోడలం దుండిన

సుర పురోతు, బల్లెపుబంటులు, స్త్రీలు కల చిత్తరువు లిప్పుడు కానరాకున్నవి.

౧౦-వ సంఖ్యకల చైత్యమున చిత్రితులైన వ్యక్తు లిప్పటిభిల్లులు, బింజారివారివలె నున్నారు. ఆచిత్ర కారులు తమచుట్టు గానవచ్చెడి జనుల నచ్చట చిత్రించి నటు లున్నది. ఒకరాజును, రాణియు సపరివారముగ నున్నటుల నొకచిత్రము కలదు కాని చాలావరకు చెడి పోయినది.

ఈకందరముయొక్క స్తంభములపై నున్న చిత్త రువులు నాల్గవ శతాబ్దినాటివి. అప్పటికి మనదేశమున గొంత వ్యాపించిన గాంధార శిల్పరీతు లీచిత్రముల గల గుస్తులంగును, కాంతిమకుటములందు కానవచ్చుచున్నవి.

"౧౬, ౧౭-వ గుహ" లందు చిత్రములు విశేష ముగ గలవు. క్రీ. శ. ఆరవశతాబ్దమున చాళుక్యులు దక్షిణమున కధిపతులుగ నున్నకాలమున నీ చిత్రములు వ్రాయబడెను.

"౧౬ వ గుహ" చాళుక్యుల యమాత్యునియాజ్ఞ వలన నిర్మింపబడెనని సగము శిథిలమైయున్న యొకశాస నమువలన తెలియుచున్నది. ఇందలి బొమ్మలును విశేషము చెడియున్నను పూర్వ మీగోడలన్నియు చిత్రములతో నిండియుండినటుల కాననగును. మిగిలియున్న చిత్రము లతి సుందరముగ నున్నవి. ఇచ్చట కల బుద్ధునిజాతక కథ లాచిత్రకారులమతమును, గుహానిర్మాణోద్దేశములను చక్కగ జూపుచున్నవి. ఈచిత్రము లేయేకథలనుగూర్చి నవియో పూర్తిగ నింకను తెలియరాకయున్నది. కనుక నీపనిని నిర్వహించుటకు నైజాము ప్రభుత్వమువారు ఘోషరుగారిని నియమించియున్నారు.

ఇంద్రప్రస్థపు రాజును, బోధిసత్త్వుడును అగు సుతోస్సముడు పద్మతటాకమున స్నానముచేసి మరలివచ్చు చుండ నొక నరాశనుడను దొంగకు పట్టువడెను. ఒక బ్రాహ్మణుడు పవిత్రగీతములను బఠింప విని,బుద్ధు నారా ధించి,సూర్యోదయముకాకమును క్షేమరలివచ్చెదననివాగ్దా నము చేయ రాజును దొంగ విడిచిపెట్టెను. వాగ్దానము నేమరక సుతోస్సము డాదొంగయొద్దకు మరలెను. తుద కానరుడు బౌద్ధమతమును స్వీకరించెను. ఈజాతకకథను జూపు చిత్ర మొక చైత్యమున గలదు.

బుద్ధునిసోదరుడగు నందుడు బౌద్ధమతమును స్వీక రించుటను జూపుచిత్ర మొకటి కలదు. బుద్ధునిజన్మము, అసితు డను ఋషి జాతకపరీక్ష జేయుట, బుద్ధునివిద్యా భ్యాసము, పురమున నాతడు నాల్గుమారులు సంచారము చేసి రోగము, దారిద్ర్యము, వృద్ధాప్యము, మరణముల గూర్చి చూచుట, తపస్సు, రాజగృహమునకు మొదట వచ్చుట, సుజాత్రతపుస్నభల్లికు లాతని నాదరించుట చిత్రితములై యున్నవి.

అన్నిటికిని మించినది "మరణించుచున్న రాకు మార్తె" యను చిత్ర మని పేరు పొందినది. దీనిని గ్రిఫి త్సుగా రిటుల వర్ణించిరి:—

"ఒకయుత్తమవంశజాత తలగడపై నెడమచేతి నూతిగనుంచి పరిచారికయొక్క సాహాయ్యమున మంచ ముపై గూర్చుండియున్నది. వెనుకనుండి యొకబాలిక తనరొమ్ముపై చేతి నుంచి యామెను చూచుచున్నది. రొమ్ముపై వస్త్రబంధనము కల పరిచారిక యొకతె వింజామరముతో నామెకు విసరుచుండ నింకొకతె స్తంభమునొద్ద గూర్చొనియున్నది. ముందిరువురు స్త్రీలు కూర్చొనియున్నారు. ప్రక్కగదియం దిరువు రున్నారు. అం దొకడు పర్షియాదేశపు అంగరకాను ధరించి కలశ మును, గిన్నెను పట్టుకొని నిలువబడియుండ నీగ్రోజాతి శిరోజములతో నున్న యితరవ్యక్తి యేమియో యాతని నడుగుచున్నాడు. మరియొకగదియం దిరువురు సేవకు రాండ్రు కూర్చొనియున్నారు."

కొనయూపిరితో కండ్లను మూసివేయుచున్న యీరాజతనయను జూచుచు, నింతటివిపత్తు సంభవించు చున్నది కదా యనువిచారమున నున్న పరిచారిక, తమ్ముల నాదరించుచుండినయామె బ్రతుకునను నాశతో నుపచారములు చేయుచుండిన సేవకులు, ఇక లాభము లేదని నిస్పృహతో గూర్చొనియున్నవారు, ఏడ్చువారు నీవిషాదభావమును వేయిరెట్లధికముచేయుచున్నారు. విచారభావప్రదర్శనమునందును, కథను స్ఫుటముగ

జెప్పుటయగును దీనికి మించిన చిత్రమిం కెచ్చటను లేదని గ్రిఫిత్సుగారు వ్రాసిరి.

పరిచారిక శిరోజములయేర్పాటునకు వ్యతిరేకముగ రాజతనయయొక్క శిరోజము లామెయొక్క భుజములపై వ్రేలాడియుండుట యామె బలహీనతను బాగుగ తెలియజేయుచున్నదియు, నిందు చిత్రకారుని ప్రవీణత బోధపడుచున్నదియు, సుందరమైన స్త్రీయొక్క మరణము విచారములలో గొప్పది కాన నామెముఖమున గోగచిహ్నములను జూపజాలక దేహవిన్యాసమున నాభావమును చిత్రకారుడు చూపెననియు బొంబాయి చిత్రకళాధ్యక్షులగు గ్లాడ్‌స్టన్ సోలోమనుగారు వ్రాసియున్నారు.

ఈవిహారచిత్రములంగు పర్షియావారిటోపిలు కనబడుచుండుటచే నాదేశపుచిత్రరచన కొంత యిందు కలదా యని కొందర రూహించుచున్నారు కాని యంతకు ముందు రచింపబడిన చిత్తరువులను, వారిరచనయందు గల జాతీయవ్యక్తిత్వమును జూచినవో నీయూహ సరికాదని తెలియును. ఆకాలమున పర్షియావా రిచ్చటికి వచ్చుచుండిరనియు, గొప్పకుటుంబములలో వీరు సేవకులుగ నుండిరనియు నీదుస్తులవలన స్పష్టమగుచున్నది.

"౧౬-వ గుహ" ను చిత్రించినపిమ్మట "౧౭-వ గుహ" ను చిత్రించినటుల నున్నది. ఈవిహారమున గల శ్రీవదియొక్క చిత్రములను డాక్టరు బర్గెస్సు గారు [illegible]ంచిరి. ఈ చిత్రాగార మతి విలువయైన దగుటచే [illegible]ము నాకర్షించుచున్నది. ప్రాంగణమునగల "సంసారచక్రము" బౌద్ధమత పరివర్తనమును తెలియజేయుచున్నది. ఇప్పటికిని తిబెత్తునం దుపయోగమున నున్న పతాకములపై నిట్టిచిత్రములను వ్రాయుట కలదు. ఆకాలమునకే బౌద్ధమతము క్షీణదశకు వచ్చుటచే చిత్రరూపముగ ప్రజల నాకర్షించుట కీవిహారము నిటుల చిత్రించిరని కొందరి యభిప్రాయము. దీనిద్వార మతిసుందరముగ నున్నదనియు, చిత్రములు శిల్పములు చిత్రరచనావిధానములను బోధించుచున్న వనియు పలువురు పొగడుచున్నారు.

హెర్రింఘాముసతి యిటుల నీ చిత్రములగూర్చి వ్రాసెను:—

"సింహము కణుతుల వేటాడుట, ఏనుగులపోరు, రాజదర్బారున నేనుగు సంగ్రామము చేయుట యను మూడు చిత్రములు పదునేడవగుహాయం దున్నవి. తక్కినవానికిని వీటికిని భేదము కలదు. ఈచిత్రములు చాయనలుతురుల యేర్పాటున పదునేడవశతాబ్దమునకు పూర్వపు ఇటలీ చిత్తరువులకు మించియున్నవి. పచ్చిక, ఆకులయొక్క తేజోహీనమైన యాకుపచ్చరంగు తప్ప, చిత్రములు లేతరంగులతో గలవు. పొందిక, యేర్పాటులంగు నవీనములుగను, స్వాభావికములుగను, వ్రాతయంగు స్వేచ్ఛతోను.....వర్ణ లేపనమున స్పష్టముగను...... ఉన్నవి. మృగములు—గుఱ్ఱములు, ఏనుగులు, కుక్కలు కణుతులు—చక్కగ వ్రాయబడెనవి."

ఒక గోడపైని రాజును, రాణియు గూర్చొనియున్నటుల గలదు. భార్యాభర్తల యనురాగ మింగు బాగుగ ప్రదర్శింపబడెను. ఆప్రక్కనే పరివారము చుట్టయుండ నొకరాణి ఠీవితో నిలువబడియున్నది. రాణియును, ఛత్రమును బట్టియున్న పరిచారికయు, వెనుక నిలువబడియున్న యామెయు చక్కగ నున్నారు. అజంతయందలి స్త్రీలందరు మనోహరమూర్తులే యన నీరుసాత్రమన్యముగ నుందురా? వారిమీదినైపున నొకగవాక్షము వద్ద నిరువురు స్త్రీ లేమియో యాలోచించుచున్నటుల గలదు.

ఈదగ్గరనే యొక యద్భుతమైన చిత్రము కలదు. ఇందు గంధర్వులును, అప్సరసలును పాడుచు నాకాశమున నెగురుచున్నటుల గలదు. గంధర్వు డభినయము చేయుచు, బహుశః పాడుచు, తన్మయుడై యున్నాడు. సేవకు డొక డాయుధపాణుడై వెన్నంటియున్నాడు. గంధర్వునిప్రక్క నిరువురు సుందరులైన స్త్రీలు తాళములు వాయించుచున్నారు. దిగువభాగమున నొకతె మద్దెల వాయించుచున్నది. మరియొకతె మురళిని బట్టియున్నది. వ్యక్తులకూటమియం దేమి, రేఖారచనయం దేమి యిది చక్కగ నున్నదనియు, మీది కెగురునటుల

వ్రాయుటయందు నిరుపమానమైనదనియు డాక్టరు బర్గెస్సుగారు తమ "సైంపపగుహాలయము"లను గ్రంథ



మున వ్రాసియున్నారు. నగలు, శిరోజములు నొకప్రక్క కేగురుచున్నటుల నుండుటచే వీరాకాశమున నెగుగు నటుల స్పష్టముగ గానవచ్చును. అజంతయందుగల చిన్న చిత్రములలో నిది సేరుగాంచినది.

ప్రాంగణమున కుడివైపుగోడమీద బుద్ధునినాశనము గోరి దేవదత్తుడు పంపిన పిచ్చియేనుగుయొక్క చిత్రము కలదు. లోపల షడ్దంతజాతకచిత్రము కలదు. కాశీదేశపురాణి తనపూర్వజన్మమున నిష్టు డేనుగుల రాజుగ నున్నవానిచే నవమానముచేయబడెనని యను కొని యా యేనుగును బట్టితెమ్మని యాజ్ఞాపించెను. మృగయు లీయేనుగును బట్టిరి. కాని దానిదంతములను బెరుక లేకపోయిరి. బోధిసత్వుడగు గజరాజు తనదంతములను తానే తీసి యిచ్చుటకు బూనుకొనెను. రాణి తుదకు తనతప్పిదమును గ్రహించి విషాదముతో మరణించెను. అజంతయందలి సుప్రసిద్ధచిత్రములలో నిద్ది యొకటి. బోధిసత్వుడు శాంతముతో దంతమును తీయుచుండుట, ఆతనివెన్నంటి వచ్చిన గజముల విషాదము చాల చక్కగ రచింపబడెను. మృగయులు దంతములను బట్టియున్నారు. సుందరమైన యా రాణితనభర్తపై చేరబడియున్నది. పరిచారికలు పరిచర్యలను జేయుచున్నారు. వ్యక్తులయేర్పాటు, వారిసౌందర్యము, భావప్రదర్శనము అతినిపుణముగ వ్రాయబడెను. పదునారవ కందరమున గల చిత్తరువునందువలె నిచ్చటను రాణియొక్క ముఖమున విషాదచిహ్నములు కానరావు కాని యీభావ మామెయంగములయేర్పాటునందు స్పష్టముగ గానవచ్చుచున్నది.

"మహాకపిజాతకము"ను తెలియజేయుచిత్రమున బోధిసత్త్వుడగు మర్కటము దానియనుచరులగు మర్కటములను కాశీరాజ్యాధిపతినుండి సంరక్షించుచున్నటులగలదు.

"విశ్వంతరజాతక" చిత్రము చక్కగ నున్నది. శిబిచక్రవర్తిబంధువగు విశ్వంతరుడు మహాదాత. అడిగినవానికి లేదనక తన సర్వస్వమును ధారవోయుచుండెను. తనకుగల మహత్తువలన సంపాదించి, కళింగరాజ్యమునకు వర్షమును బ్రసాదించిన గజరాజమునుగూడ దానము చేయ నాదేశపు ప్రజలకు జలము చాలనందున కోపము వచ్చెను. రాజు విశ్వంతరుని, ఆతనిభార్యయైన మాద్రిని, బిడ్డలను దేశమునుండి వెడలగొట్టెను. తన్నితరదేశములకు గొనిపోనున్న యశ్వములనుగూడ ఇచ్చివేసెను. జూజాతుడను బ్రాహ్మణుడడుగ



తన బిడ్డలను గూడ సమర్పించెను. ఈ చిత్రమున గల బ్రాహ్మణునిముఖమున ఆశ, క్రౌర్యము మొదలగు భావములు బాగుగ కానవచ్చుచున్నవి. విశ్వంతరుని కిచ్చుటను నగలు లేకపోవుటయు, ఆతనిముఖభావమును రాణియొక్క గాత్రమును జూడతగ్గవి.

పదునారవగుహాయందుగల "సుతోసోమజాతక" కథ యిచ్చటను కలదు.

బుద్ధునియుపదేశములను సారిపుత్రుడును, తక్కిన వారును వినుచున్నటుల నొకచిత్రము కలదు. జ్ఞానియగు సారిపుత్రునకు బుద్ధుడు ప్రశ్నల నడిగి తక్కినవారికి జ్ఞానము నుపదేశించెను.

"తల్లియు, పిల్లయు బుద్ధు నారాధించునటుల నీ విహారముఖ మొకచిత్రము కలదు. కుమార్తెముఖమున నానందమును,



బుద్ధదేవుని జీవితాదర్శములను గ్రహింప జాలిన తల్లియొక్క వదనమున గౌరవభావము, భక్తి తాండవమాడుచున్నవి. తల్లియొక్క హస్తములు కుమారిక భుజముపై నుండుటవలన నామె తనయనుంగుబిడ్డను బుద్ధదేవు నారాధించి పవిత్రురాలవు కమ్మని ప్రోత్సాహ పరచుచున్నటులు తోచును." జావాయందలిబోరోబుదరు శిల్పరాజములతో నీచిత్రము సరిపోలుననియు, భావప్రదర్శన మత్యద్భుతముగ నున్నదనియు సుప్రసిద్ధహైందవ చిత్రకళాభిమానియగు హేవెలుగారి యభిప్రాయము. తలలయొక్క రచన సుందరముగ నున్నదనియు, తల్లియొక్క నోరును, కండ్లును, చేతులును, వ్రేళ్లును చూడ నాచిత్రకారు డతిప్రజ్ఞావంతుడుగ గనబడుననియు లోరెంజో సెకొక్కని పండితుడు వ్రాసియున్నాడు. అజంతచిత్రములలో మరువరాని చిత్ర మిది యొకటని లారెన్సు బిని యనుగారు వ్రాసిరి.

లోతైన గోతినుండి కాశీరాజును బోధిసత్త్వుడగు నొకసింక సంరక్షించుచున్నటుల "శరభజాతక" కథా చిత్రము కుడివైపుగోడకు కలదు.

"మాతృపోషకజాతక" చిత్రము సుందరమైనది. చంద్రోనపర్వతమున బోధిసత్త్వుడగు నొకగజము వృద్ధురాలైన తనతల్లిని రక్షించుచుండెను. ఒకమృగయు నాయేనుగు ప్రాణాపాయమునుండి రక్షింప నాతడు దుర్మార్గుడగుటవలన కాశీదేశాధిపతియగు బ్రహ్మదత్తున కాయేనుగును బట్టి యిచ్చెను. ఆరాజేయేనుగు నెంత యలంకరించినను, ఎన్నియాహారపదార్థముల నిచ్చినను దుఃఖించుచు తల్లి లేనిది యాహారమును భుజింపనని చెప్పి యుపవాసములను చేయుచుండెను. రాజు కనికరించి యాహస్తిని విడిచిపెట్ట తనతల్లిదగ్గరకు మరలి వచ్చెను. సంతోషముతో నీయేనుగు మరలుట యతి చిత్రముగ నిచ్చట చిత్రితమై యున్నది.

వర్షము లేక చేపలు బాధపడుచుండ బోధిసత్త్వుడగు నొకచేప దేవుని ప్రార్థించి వర్షమును గురిపించి యామత్స్యములను రక్షించెను. ఈ "మత్స్యజాతక" కథ యాప్రక్కనే చిత్రింపబడెను.

మృగయుని కుమారుడును, బోధిసత్త్వుడును నగు శ్యాము డంధులగు తన తల్లిదండ్రులను పోషించుచుండెను. ఈతడు దగ్గర నున్న కొలనుకు నీళ్లకై పోవ కాశీరాజు లేడి యని యనుకొని యాతనిని కొట్టెను. తన తల్లిదండ్రు లేమైపోయెదరో యని విచారించుచున్న యాతని నొకదేవత కాపాడెను. ఈకథకు "శ్యామజాతక" మనెదరు. మత్స్యజాతక చిత్రము దగ్గరనే యీ చిత్రమును గలదు.

కుడివైపుగోడయందు వ్రాయబడిన "సింహళావదానము" మహాచిత్రము. విజయుడు సింహళమున బ్రవేశించుటను జూపుచిత్ర మిది యని కొంతకాలము పండితు లభిప్రాయపడిరి. సింహళుని పరాక్రమము, పడవ

భగ్నమగుట, రాక్షసస్త్రీలతో నాతఁ డానందించుచుఁ గాలమును గడపుట, కారాగృహవాసము, బలాహుఁడను తెల్లని గుఱ్ఱముపై నాతఁడు తప్పించుకొని వచ్చుట, రాక్షస స్త్రీయాతని వెంబడించుట, సింహకల్ప రాజుయొక్క మరణము, ఎంపుయాత్ర, తిరిగి వచ్చుట మొదలైన వన్నియు నిచ్చట నతినిపుణముగ వ్రాయబడెను. ఈ చిత్రమును వర్ణచిత్ర సాహాయ్యమువలన గాక యక్షరములతో సమగ్రముగ వర్ణించుట దుర్లభము. ఉత్సవమునగల నటులు ఏనుగులు, రౌతులు, రాజు, పతాకములు, పడవలు మొదలగున వన్నియు, నతిమనోహరముగ నున్నవి. వ్యక్తుల యేర్పాటు, చిత్రముయొక్క మధ్యభాగమునకు బోయెడి యేనుగుల స్వాభావికగమన చక్కఁగ నున్నవని సెక్కాని పండితుఁడు ప్రశంసించెను. పర్షియాలో తక్ తైబోస్తానున గల శిల్పచిత్రమును బోలియున్నదని గ్రిఫిత్తుగారు వ్రాసిరి. ముఖ్యవిషయమగు యుద్ధమును మధ్యను రచించి చిత్రకారుఁడు భావకేంద్రీకరణమును బాగుగ జేసెననియు, రాక్షసస్త్రీలు మీఁది కెగురుట చాల అద్భుతముగ నున్నదనియు గ్లాడ్‌స్టన్ సోలొమనుగారు పొగడిరి.

భిక్షుకుఁడుగ వచ్చిన శక్రునకు బోధిసత్త్వుఁడగు శిబిచక్రవర్తి తనకంటిని దానమిచ్చుటను గూర్చి తెలియజేయు "శిబిజాతక" చిత్ర మొకటి కలదు.

బోధిసత్త్వుఁడు లేడిగను, ఎలుగుబంటిగను అవతరించి చేసిన మహాకార్యములను తెలియజేయు చిత్రము లిచ్చటనే కలవు.

ఈవిహారముననే యున్న యీచిత్రము నెగురుచున్న యప్సరసలతో బోల్చి చూచినయెడలనీచిత్రకారులెట్టిభిన్నరుచుల నోకవిధమగుచిత్రమున జూపగలిగిరో బాగుగ దెలియును.

ఒకరాజతనయ యద్దమున తనముఖమును జూచుకొని యలంకరించుకొనుచుండ నొకవైపున నామె బడలిక తీరుటకు విసరుచున్న పరిచారికయు, మరియొకవైపున చందనాదివస్తువులను పళ్లెముతో బట్టుకొని యున్నటుల మరియొక పరిచారికయు గలరు. ఈచిత్రమున రాజతనయయొక్క "ఒయ్యారము, ఠీవి బాగుగ



కానవచ్చుచున్నవి. ఇందు పరిచారికయొక్క పొందిక చాల నింపుగ నున్నది. నిలువబడిన తీరు, విసరువిధానము స్వేచ్ఛతో వ్రాయబడెను. ముఖమున గౌరవభావము, సంతోషము, వినమ్రత మూర్తీభవించియున్నవి."

శిల్పమునకు బ్రసిద్ధి బడసిన పందొమ్మిదవ సంఖ్య కల విహారమున "బుద్ధునకు తల్లియు, ఆమె శిశువును భిక్షమిచ్చుచు గౌరవించుచున్నటు లొకచిత్తరువు కలదు. ఇది పదునేడవగుహయందలి చిత్తరువును పోలియున్నది. బుద్ధదేవుని విగ్రహము, గౌరవముతో తనశిశువుచే భిక్షమిప్పించుచున్న మాతృప్రేమభరితయు, నలంకృతయు నగు స్త్రీరూపము, భయభక్తులు తాండవమాడు హృదయము కల బాలుఁ డెట్టి వారినైన నాకర్షింపక మానరు."

౧, ౨ సంఖ్యలుకల కందరములు క్రీ. శ. ఏడవ శతాబ్దమున చెక్కఁబడినవి. అప్పటికి బౌద్ధ మతము హిందూదేశమున తన పూర్వస్థానమును గోల్పోయెను. కాని యజంతయం దప్పటికి నెక్కువవిహారములు కావలసివచ్చుటచే నాసంస్థ ప్రాముఖ్యమును గలిగియుండెనన్ని

తోచును. బౌద్ధసన్యాసులు మతప్రచారమునకై చైనా మొదలగు దేశములకు వెళ్ళివచ్చుటయు, పర్షియాదేశీ



యులు మన దేశమునకు వచ్చుచుండుటయు కలుగుటచే నాయా దేశముల చిత్రరచనావిధానము లజంతయందు కానవచ్చుచున్నవని పండితులు చెప్పుచున్నారు.

"ఒకటవ గుహాయం దలంకార ప్రాయముగ చిత్రింపబడిన చిత్తరువు లాహ్లాదకరములు. ఈగుహాచిత్తరువులు పేరుమ్రోగుట కివియే చాలును. ఎద్దులు రెండు పౌరుషముతో పోరాడుచున్నటుల గల చిత్తరువున నిజముగు జీవచలన చిహ్నము లద్భుతముగ నున్నవి."

బోధిసత్త్వుడగు శిబిచక్రవర్తి యొకపావురమును సంరక్షించుటకు డేగకు తనదేహమునుండి మాంసమును కోసి యిచ్చెను. ఈ "శిబిజాతక" చిత్ర మతిమనోహరమైన దిచ్చట గలదు.

బోధిసత్త్వునిచిత్రము, జగద్విఖ్యాతి కన్నది, ఇందు గలదు. "ఇందు కనబడు విచారము, కనికరము

మహాద్భుతములు. ఇది చూచువారికి విచారకరమగు గొప్పకార్యమును జేయ సిద్ధమైన మహాపురుషునియొక్క



నిలువబడినట్టుల గోచును. ప్రాపంచికసుఖమును విడనాడు విచారమును, దానివలన ముందు గలుగబోవు శాంతియు నిందు మేళవించి యున్నవి. చిత్తరువు పెద్దదగుటవలన నీభావములు ద్విగుణీకృతము లగుచున్నవి." రచన యతిసుందరముగ నున్నది దేహవర్ణ మతిసహజముగను, ఛాయ సున్నితముగను ఉన్నవి. హస్తముల సౌందర్య మాహ్లాదకరముగ నున్నది.



ఈ చెంతనే యున్న స్త్రీ చిత్రము నిటులనే చిత్రరచనను బోధించుచున్నది. పుష్పమున బట్టుకొన్న యీచేయియే చాలును— దీని గొప్పతనమునకు. ఈ చిత్రముయొక్క యర్థ మింకను నిర్ణయింపబడలేదు.

బుద్ధుడు తపస్సును చాలించి మహాబోధివృక్షముక్రింద గూర్చొని యాలోచనయందు నిమగ్నుడై యున్నప్పుడా మహాత్మునకు మనశ్చాంచల్యమును గలుగ

జేయుటకు నాగు డనేకయత్నములను జేసెను. ఈవిషయమును తెలుపుచిత్ర మతిచిత్రముగ నున్నది.

మీద జెప్పిన బోధిసత్త్వనిలో బోల్ప వాలు చిత్ర మొకటి యీప్రక్కనే కలదు. చిన్నదైనను రచన యందు దానికి తీసిపోదు.

బుద్ధభగవాను డోకేకాలమున ననేక స్థలములందు కానవచ్చుట మొదలగు నద్భుతములను శ్రావస్తినృపునకు ప్రసేనజిత్తు జూపెను. దీనినిగూర్చి యొకచిత్రము కలదు.

ప్రాంగణముయొక్క కప్పుపై "పర్షియారాయబారి" మని పిలువబడు చిత్ర మొకటి కలదు. "ఖుస్రు రాజు సుప్రసిద్ధురాలైన తన షిరీన్‌రాణితో గూర్చుని మద్యపానము చేయుచున్నటుల గలదు. ఇందలిరూపము లత్యద్భుతముగ మొగలాయీలను బోలియున్నవి."

ఒక చిత్తరువున రాణియు, నామెపరిచారికలును భిక్ష మిడుచున్నటుల గలదు.

రెండవసంఖ్యాకల కందరములోని చిత్తరువులును సుప్రసిద్ధములు.



"స్త్రీలయొ సౌందర్యము నీకాలపుచిత్రకారులతివిపులముగ బ్రదర్శింపగలిగిరి. అలంకృతయై యాతురతతోను, సిగ్గుతోను, ప్రేమతోను స్తంభమునకు జేరబడియున్న యీ యౌవనవతిని జూడుడు. ప్రియుడెంతకు రాకపోవుటచే నేమియుదోచక యామె యెటుల తన గోటిని మీటుచున్నదో చూడుడు. "ముద్ర" యందజంతచిత్రకారులకుగల ప్రవీణత యందు మనకు కొంత యగపడును. చిత్రకారుడు తన ప్రియురాలినే యిటుల చిత్రించెనేమో! ఈమె కిట్టి సొగసైన నగ లుండుట కిదియే కారణమేమో!"

బోధిసత్త్వు డొకబ్రాహ్మణ సన్యాసిరూపమున శాంతమును బోధింప నాతని కొరడాలతో గొట్టిరి. ఆతని చేతులు, పాదములు, చెవులు, ముక్కు కోసివేయవలె నని యాజ్ఞయయ్యెను. కాని యాతడు చలింపక తాను బోధించువిషయమును సమర్థించెను. ఈకథకు "క్షాంతివాది జాతక" మందురు. దీనిగూర్చి యొక చిత్రము విహారప్రాంగణమున గలదు.

హంసజాతకమునుగూర్చి పెర్సీబ్రౌనుగారు తమ "హైందవ వర్ణ లేపన" మను గ్రంథమున నిటుల వ్రాసిరి: "పదునేడవగుహా (?) యందు మహా హంసజాతకమును గూర్చి చెప్పు కుడ్యచిత్రమున చిత్రకారుని వర్ణజ్ఞానము చూడదగును. ఖేమరాణి బంగారుహంసలను కలయందు జూచి యట్టిదాని నొకటి తనకు తెప్పింపుమని సంయమ నృపుని బ్రతిమాలెను. తనపాలితులచే త్యజింపబడిన హంసరాజును, తన్ను విడువక యుండిన సుముఖుడను మంత్రిని రాజమృగయుడు పట్టి సంయముని యొద్దకు దేగా నాతడు వాటిని విశేషముగ గౌరవించెను. హంసరా జాతనికి నీతిని బోధింపవానిని వాసమునకు చిత్రకూట సానువులకు బొమ్మని విడిచిపెట్టెను. ................ ఒక సేవకుడు ఛత్రమును బట్టియుండ, రెండవ సేవకుడు వింజామరమును వీచుచుండ, పరివార మాజ్ఞకై వేచియుండ, రాజు సింహాసనారూఢుడై యున్నాడు. మూడవసేవకునిముఖము నల్లగ నున్నది. ఈతడు బహుశః నీగ్రో కావచ్చును. తీవ్రమైనయెరుపుచాయకలవాడు రాజు పాదములయొద్ద నున్నాడు. ఈతడు తనకథను చెప్పు రాజమృగయుడు కావలెను. కాని మధ్య నున్న హంసల నందరు నేకాగ్రచిత్తముతో జూచుచున్నారు. మీద నున్న చాందినీని రాజు బహుశః ఈపక్షులను గౌరవించుటకు కట్టించినటుల కనబడును. వెనుకభాగమున వ్రేలాడుచు నలంకారముతో నున్న 'కణాతు' (తెర) యీసభ బహిరంగము కాదని తెలియజేయును. ఈహంసలను బట్టిన విధానము నిజమని చెప్పుచు కాబోలు నొక

హీనకులజుడు రాజుయొక్క పాదములచెంత గూర్చొని యున్నాడు. ముందుభాగమున నెత్తనిపద్మములతోను, నీటిమొక్కలతోను నిండియున్న జలాశయము కలదు. ఇం దాడుచున్న జలపక్షులకు, నడవిపక్షులకు గల స్వేచ్ఛను తెలియజేయును.

... ... ... ...ఈచిత్తరువున తేలికరంగులతో నున్న మానవులకు గాఢమైన యూకుపచ్చరంగులతో నున్న వెనకభాగము వ్యతిరేకముగ వ్రాయబడెను. ఈ యూకుపచ్చరంగు దినుచ నలుపుగ బరిణమించెను. చిత్రముయొక్క క్రిందిభాగమున పసుపు పచ్చయు, మధ్యమధ్యగల తెలుపును, లేతయెరుపును మనోహరముగ సంతర్లీనమై యున్నవి."

బుద్ధుని తల్లియగు మాయాదేవి కాఱుదంతముల యేనుగు కలలో కనబడెను. ముప్పదిరెండుశుభచిహ్నములు కల కుమారు డామెకు కలుగునని యాస్థానము నాశ్రయించియుండిన బ్రాహ్మణులాకలకర్థము జెప్పిరి. అటులనే లంబినియారామమున బుద్ధుడు జన్మింప బ్రహ్మయు, నింద్రుడు నాతని నాహ్వానము చేసిరి. ఇంద్రుడు ఛత్రమును ధరింప నారాజకుమారు డేడడుగులను వేసెను. తూర్పునకు బోయి, "నేను నిర్వాణమును బొందెద"ననియు, పశ్చిమమునకు బోయి "ఇది నాతుది జన్మ" యనియు, దక్షిణమునకు బోయి "నేను జీవాత్మలలో మొదటివాడ" ననియు, ఉత్తరమునకు బోయి "సంసారసాగరమును దాటెద" ననియు బలికెను. ఈవిషయములను దెలియజేయుచిత్రమాలిక యిచ్చట గలదు.

"శ్రావస్తిమహిమల" గూర్చి యిచ్చటను చిత్రము కలదు.

పురన్న, భావిల యను నిరువురుసోదరులకు సముద్రమున నాపత్తు కలుగ బుద్ధభగవానుని ధ్యానించి, యపాయమునుండి తప్పించుకొనిరి. కృతజ్ఞతతో వీ రా మహాత్మునకు చందనదారువులతో నొకయాలయమును గట్టిరి. ఈవిషయము చిత్రితమైయున్నది.

ముసలివాని, స్త్రీల చిత్రములు ప్రసిద్ధి గన్నవి.

పాపము చేయుచున్న దనుకారణమున నొక సానిని జంప రా జాజ్ఞాపించెను. ఈవిషయమును జూపు చిత్ర మతిరమ్యముగ నున్నది. దీనిని గ్లాడ్ స్టను సోలో మనుగా రిటుల వర్ణించిరి:—

"ఒకటవ (?)గుహాయందలి ఫలకమునగుఃఖముతో నున్న స్త్రీచిత్రమొకటి కలదు. .................... చంప నుద్దేశించి ఖడ్గపాణి యైయున్న రాజునెదుట



యామె వినమ్రమై యున్నది. చిత్రలేఖనము మనోహరము; నల్లనిరేఖలు ఇంగ్రెసుగారి రచనను పోలును. ఇంతటి మహాసమయమున నామె ముఖ సౌందర్యమును దాచినటులు చేసినకళ యద్భుత మనదగును. తన్ను నశింప జేయుటకు దృఢసంకల్పముతో నున్నవాని పాదములను సోకుటకు వెరచుచు, వణకుతో సాచియున్న హస్తముల మధ్య శిరముమాత్రము కానవచ్చుచున్నది. రాజున్న శిక్ష న్యాయ్యమైనది; కాని యెంత యద్భుతముగ కరుణారసమును చిత్రకారుడు ప్రదర్శించెను! నాశనమునకు సిద్ధముగ నున్న యామహాసౌందర్యము పాపియొక్క పాపమును మరుగుపరచుచున్నది.... ... ... ..."

అజంతకందరములందు పెక్కుచోటుల జంతువులయు, పక్షులయు చిత్రము లనేకములు కలవు. సకల



జీవరాసులయెడల వీరికి గౌరవ మధికముగుటచే నన్నిటి నతిభక్తితోను, ప్రేమతోను రచించిరి. నాల్గవ గుహ యందు గల యీ యేనుగుల గుంపు చాల చిత్రముగ చిత్రింపబడెను. అజంతగుహల దిగువనున్న యడవులందు పూర్వ మిటుల గజము లాడుకొనుచుండెను కాబోలు!



రచన యెంత సహజముగ, సౌందర్యవంతముగ నున్నదో చూడవలసినవిషయము.

పండ్లను, పుష్పములను, పత్రములనుకూడ చిత్రములకు చుట్టును, ఆలయముల కప్పులపైన నలంకారముగ వ్రాసిరి. ఇట్టి వనేకములు కలవు. ఈ మామిడిపండ్ల గుత్తి యెంతయు బాగుగ నున్నది. ఏజంతువును బోలని కొన్ని జంతువుల నాచిత్రకారులు సృజించి చిత్రబ్రహ్మ లైరి.



ఇట్టిరచన కీచిత్ర మొకనిదర్శనము. ముఖములు జంతువులవైనను వెనుకభాగములు చిత్రముగ లతలుగ మారిపోయినవి.

---

# చీకటిరేయి

వేంకట కాళిదాస కవులు

చీఁకటిరేయి, లేనిదుర సెందనివేదుఱు కన్నురెప్ప, ల
త్త్యాకులవృత్తి, గమ్యపద మారయనేరని సంభ్రమమ్ము, స్వే
చ్ఛాకలనాస్వయంగమన సక్తపదద్వయ, మీయనంతబం
ధీకృతతామసిఁ గలయఁద్రిప్పిన రాగపరీతతారకల్.

ఆకనుదోయి సోయగపుటంచుల కాటుకపూఁత నీలిపూ
రేకులు, మూగవౌ పలుకరింతలనవ్వుల లేమెరుంగు; లీ
చీఁకటిగ్రుడ్డివోయిన నిశీథపథమ్మునరో, తళత్తళల్
సోఁకఁగ సైఁగసేయు నునుజుక్కల చక్కఁదనమ్ములోననో.

ఆరమణీయముగ్ధ నయనాంచలకోమల వీక్షణమ్ములఁ
దీరనియర్థసంశయగతిఁ స్ఫురియించు నిగూఢభావముల్
కూరుచుకొందునా యిపుడు కూర్కువహించిన యీగభీరకా
సారతమోవినిశ్చల విశాలజలమ్ముల యంతరమ్ములఁ.

చాటుగ, నోరగా, నెదురుసాగినరీతిగ, లేఁతమోప్పుగా,
మాటలులేని ప్రేమమయమంత్రములన్ బఠియించి నన్ను నా
నాఁటికి ముగ్ధమూర్తిగ నొనర్చిన యామధువీక్షలీనిశా
వాటిక నెంతగాఁ గనులువాల్పకచూచినఁ గానరావుగా.

ఈయెడ రోదసిన్ బెరసి హెచ్చినచీఁకటిమూఁకలందు నీ
లేయెడఁదన్ బిగించి నొగిలించిన మామకవిప్రయోగ బా
ధాయత పాశబంధములె, యూపలునల్లదనంపురాసులే,
పాయలుపాయలై విరియఁబారిన నాచెలికుంతలంబులే.

అల్లికసొంపునింప వదులై జఘనమ్ముల నంటువాల్జడన్
మల్లియపూలు నవ్వినవి నాఁడు మనోజశిలీముఖమ్ములై;
నల్లనిచీఁకటిన్ నిలిచినన్ బరిహాస మొనర్చు నేఁడు, సం
ఫుల్లములైన తారకలమొత్తము, లుల్లము వేగిపోవఁగన్.

మృదుపదనూపురమ్ము లొనరించిన చప్పుడు; మెల్లమెల్లఁగాఁ
గదలిన జాళువాపసిఁడిగాజు లొనర్చిన మ్రోఁత; యేదయా
హృదయము, లేసుధామయము, లేనవశీతమృణాళనాళముల్
వదలని ప్రేమపాశ మురివైచునొ నాగళసీమ కియ్యెడన్.

ఆచివురాకుచేతులు రహస్యముగా నిడు కౌఁగిలింతకున్
వాఁచిననామెడన్ వెనుకప్రక్కకుఁద్రిప్పి తమస్సులోనికిన్
జూచెద వెఱ్ఱినైయిపుడు శుష్కమతిన్ విరహాశ్రుబిందుపుల్
తోఁచిన లోచనమ్ముల నెదుర్కొని శూన్యమె గోచరింపఁగన్.

నావలెఁగాక చీఁకటిపెనంగిన యీనడిరేయి పాన్పునన్
స్థావరజంగమప్రకృతి సర్వమువిశ్వ మభంగగాఢని
ద్రావివశత్వ మందినకతమ్మున భావనసేయలేదుగా,
జీవితఖేదమోదములఁ జీఁకటివెల్గులఁ గల్గుభేదమున్.

ఆమధుమాసవాసరము లాత్మఁదలంచి యెటుల్సహింతునో,
ప్రేమవతీవియుక్తిఁ బలవింపుచు నిద్దురరాని రాగరే
ఖామయవీక్షలన్ బరపి కార్తికమాసవిశాలయామినీ
శ్యామలయామముల్ పవనసంకుల శైత్యభరాభిరామముల్.

---

చెన్నరాజధానియందు ౧౯౫౯-వ సంవత్సరము జనవరి ప్రారంభము మొదలు మార్చి తుదవరకు గల మూడునెలల కాలమున ముద్రితములయి ప్రకటితములయిన

# ఆంధ్ర గ్రంథముల పట్టిక*

ఆంధ్రవాఙ్మయ మీ క్రింద పేర్కొనిన వివిధశాఖలతో వెలసియుండుటచేత నీపట్టికయం దాయాశాఖల నుత్పన్నములగు గ్రంథము లాయా శాఖలకే చేర్పబడును. గ్రంథముల నామములన్నియు నకారాదిక్రమమున నుండును.

1. అర్థశాస్త్రము, 2. అలంకారశాస్త్రము-నాట్యకళకు సంబంధించిన గ్రంథములు సయిత మీ శీర్షిక క్రిందనే చేర్పబడును, 3. ఆయుధధనుశ్శాస్త్రములు, 4. ఆరోగ్యశాస్త్రము, 5. ఇతిహాసములు-ఇతిహాసములలోని భాగములు, కథలు, మార్పుచేయక ప్రత్యేకముగ ముద్రింపబడునవి - యీశీర్షిక క్రిందనే చేర్పబడును, 6. కథలు—ఐతిహాసికములు, పౌరాణికములు, 7.—కల్పితములు, 8.—చారిత్రకములు, 9. కల్పము, 10. కామశాస్త్రము, 11. కావ్యములు, 12. గణితశాస్త్రము, 13. గేయములు, 14. చరిత్ర(దేశ), 15. చిత్రలేఖనము, 16. చట్టము(Law), 17. ఛందశ్శాస్త్రము, 18. జంతుశాస్త్రము, 19. జీవితములు, 20. జ్యోతిషశాస్త్రము, 21. తర్కశాస్త్రము, 22. దండకములు, 23. ధర్మశాస్త్రము, 24. నవలలు, 25. నాటకములు, 26. నాట్యశాస్త్రము, 27. నిఘంటువులు, 28. నీతి- నీతికథలుకూడ యీ శీర్షిక క్రిందనే వచ్చును, 29. పరిశిష్టము, 30. పాకశాస్త్రము, 31. పారిశ్రామికము, 32. పురాణములు- ప్రత్యేకముగ ముద్రింపబడి ప్రకటింపబడు పురాణములలోని భాగములు సయిత మీ శీర్షిక క్రిందనే చేర్పబడును, 33. ప్రకృతిశాస్త్రము, 34. ప్రబంధములు- ఆంధ్రసారస్వతమునందు ప్రసిద్ధములగు 'హరివంశము', 'ఆంధ్రచంపూభారతము', 'అచ్చతెలుగు రామాయణము'వంటి పురాణేతిహాసకావ్యములకు సంబంధించినవి, 'పాండురంగమాహాత్మ్యము' వంటి మాహాత్మ్యములు, 'ఆంధ్రమేఘసందేశము'వంటి అనువాదములు, రంగనాథరామాయణము'వంటి ద్విపద గ్రంథములు మొదలయినవి యీశీర్షిక క్రిందవచ్చును, 35. ప్రహసనములు, 36. భూగోళశాస్త్రము, 37. భౌతికశాస్త్రము, 38. మంత్రశాస్త్రము, 39. మతము - హిందు, 40.— ఇతరములు (బౌద్ధ, జైన, క్రైస్తవాదిమతములు)- ఇతరమతములకు సంబంధించిన గ్రంథములు— ఏ విషయ విభాగమునకు సంబంధించిన వయినను- ఈశీర్షిక క్రిందనే చేర్పబడును, 41. మాహాత్మ్యములు, 42. మీమాంసాశాస్త్రము, 43. యక్షగానములు, 44 యోగశాస్త్రము, 45. రత్నశాస్త్రము, 46. రాజకీయములు, 47. వాస్తుశాస్త్రము, 48. విమర్శనము- ఇందు సారస్వతమునకు సంబంధించిన విమర్శనలు మాత్రముండును, 49. వృక్షశాస్త్రము, 50. వేదవాఙ్మయము- ఉపనిషత్తులు,ఇతర వైదిక గ్రంథములుసయిత మిందే చేర్పబడును, 51. వేదాంతము - భక్తి జ్ఞానవైరాగ్య విషయక గ్రంథము లీశీర్షిక క్రింద వచ్చును, 52. వైద్యశాస్త్రము, 53. వ్యవసాయశాస్త్రము, 54. వ్యాకరణ శాస్త్రము, 55. వ్యాపారము, 56. వ్యాయామము, 57. శకునశాస్త్రము, 58. శతకములు 59. సంగీతశాస్త్రము, 60. సాంఘికములు, 61. సాముద్రికశాస్త్రము, 62. సారస్వతము- భాష, 63. స్తోత్రములు, 64. హరికథలు.

* ఈ పట్టికయందుగల సంకేతపదముల వివరణము: అ.—అధ్యాయము; అను.—అనువాదము; అనువాదకులు. ప.—పద్యము. ప్ర.—ప్రకాశకులు. భా.—భాగము. వ.—వచనము. సం.—సంపాదకులు. సటీ.—సటీకము.

## ఆరోగ్యశాస్త్రము

అనారోగ్యసంహారము—పి. శ్రీనివాసరావు.

## కథలు—ఐతిహాసికములు, పౌరాణికములు

ఆంధ్రవచనభారతము, భా. ౧—(ప్ర.) వి. రామస్వామిశాస్త్రి అండ్ సన్స్, మదరాసు
ద్రౌపతీచరిత్ర—భ. పలనరాజు.
భారతకథాసారము—డి. లక్ష్మీనరసమ్మ.
మాధవదాసునిచరిత్రము—యన్. వీరరాఘవదాసు.
శ్రీదంతిరాజుచరిత్రము—యన్. వీరరాఘవదాసు.
శ్రీమదుపనిషత్కథలు—పి. మల్లయ్యశాస్త్రి.

## —కల్పితములు

తిన్నడు, గుణనిధి—వి. లక్ష్మీనరసింహశాస్త్రి.
నవీనచిత్రకథలు—(ప్ర.) కె. మునిసామినాయుడు అండ్ కో, మదరాసు.
స్త్రీచరిత్రకదంబము—టి. రాజగోపాలరావు

## —చారిత్రకము

రుద్రమదేవి—యం. వెంకటరత్నం.

## కల్పము

బుధాష్టమీవ్రతకల్పము—కె. సుబ్బరాయుడు.

## గణితశాస్త్రము

గణితచంద్రిక, తరగతులు ౧, ౨—యస్. రంగరావు.
గణితదీపిక, తరగతి ౩—జె. సీతారామసోమయాజులు.
బాలబోధగణితశాస్త్రము—ఏ. జె. ఎడ్వర్డ్స్వామికన్.
మారుతిగణితబోధిని. తరగతులు, ౧, ౨, ౩, ౪, ౫—జి. రంగరావునాయుడు, పి. సత్యనారాయణ నాయుడు.

## గేయములు

బాలికాభూషణము—టి. అప్పలస్వామి.
మానసబోధయనుతత్వములు—కే. చలమయ్యదాసు.
శోభనపాట—యం. వి. పాపయ్యనాయుడు.
శ్రీకృష్ణతులాభారము నాటకమునందలికీర్తనలు—సి. కేశవదాసు.
శ్రీకృష్ణసంకీర్తనము—జి. ఆంజనేయులు.
శ్రీగౌరీశ్వరనక్షత్రమాల—జి అనంతలక్ష్మణాచారి.
శ్రీమద్రామాయణకీర్తనలు—కె. చలమయ్యదాసు.
శ్రీరాధాకృష్ణ నాటకమునందలి కీర్తనలు—సి. కేశవదాసు.
హరినామసంకీర్తనలు—కె. చలమయ్యదాసు.

## చరిత్ర

అనంతపురము జిల్లాచరిత్ర—కె. జయరామరావు.
కర్నూలు జిల్లాచరిత్ర—కె. జయరామరావు.
కృష్ణాజిల్లాచరిత్ర—కె. జయరామరావు.
గంజాంజిల్లాచరిత్ర—కె. జయరామరావు.
గుంటూరుజిల్లాచరిత్ర—కె. జయరామరావు.
గోదావరిజిల్లాచరిత్ర—కె. జయరామరావు.
చిత్తూరుజిల్లాచరిత్ర—కె. జయరామరావు.
నెల్లూరుజిల్లాచరిత్ర—కె. జయరామరావు.
బళ్లారిజిల్లాచరిత్ర—కె. జయరామరావు.
విశాఖపట్టణముజిల్లాచరిత్ర—కె. జయరామరావు.
హిందూదేశచరిత్రము, భా. ౧, ౨—(ప్ర.) క్రిస్టియన్ లిటరేచర్ సొసైటి, మదరాసు.

## చిత్రలేఖనము

శతశిల్పి డ్రాయింగుబుక్కు—యన్. నరసింహం.

## చట్టము

సివిల్, క్రిమినల్, రివిన్యూవ్యవహారమతలబి—(ప్ర.) జి. నేతుమాధవరావు, గుంటూరు.

## జంతుశాస్త్రము

సర్పశాస్త్రము—కే. కామేశ్వరరావు, జే. రాధాకృష్ణయ్య.

## జీవితములు

నృసింహాచార్యస్వామివారిజీవితము—యం. వెంకట్రాఘవాచారి.

మధ్వాచారిజీవితము—యల్. వీరభద్రరావు.
శంకరజీవితచరిత్రము—బి. రంగస్వామిరెడ్డి.
శ్రీస్వామిదయానందసరస్వతిజీవితము—యల్. వీరభద్రరావు.

## జ్యోతిషశాస్త్రము

ఉడుదశాప్రదీపిక—యస్. వి. రామానుజాచారి.
నక్షత్రదశాంతర్దశాపరిమాణ ప్రకాశిక—వై. లక్ష్మీనరసింహశాస్త్రి.
స్త్రీజాతకము—వి. సీతారామయ్య.

## దండకములు

శ్రీ విరూపాక్షదండకము, శ్రీ వీరభద్రదండకము—యస్. సత్యనారాయణరావు.

## ధర్మశాస్త్రము

వృద్ధపారాశరస్మృతి—(ప్ర.) వి. రామస్వామి శాస్త్రి అండ్ సన్స్, మదరాసు.

## నవలలు

అల్లాహో అక్బర్—భ. నారాయణమూర్తి.
అంతఃపురము, భా. ౨—(ప్ర.) ఏ. లక్ష్మణస్వామి నాయుడు, రాజమహేంద్రవరము.
గూఢహత్యలు—జి. శ్రీరామశర్మ
చాందసుల్తానా—డి. వెంకటరమణయ్య.
చోరాబహద్దూర్—పి. సీతారామయ్య.
ఛత్రసాలుడు, భా. ౨ — కొంపెల్ల జనార్దనరావు, ప్రతివాదిభయంకరం రంగాచార్యులు
పాతాళగృహము—యం. రామరావు.
మాయామయి, భా. ౧—కె. రంగయ్య.
వీరవిలాసిని—జి. సత్యగోదావరిశర్మ.
సతీసోనారాణి—పి. వి. రాజు.

## నాటకములు

ఒకపెగ్—(అను) యం. దుర్గశంకరామాత్యుడు.
ఉత్తమవంచకుడు—కె. సుందరరామమూర్తి.
తగినశాస్తి—(అను) యస్. కామేశ్వరరావు.
పలునాటివీరచరిత్రము—కె. ప్రభులింగాచార్యులు.
పునర్వివాహము—(అను) యస్. కామేశ్వరరావు.
భీమప్రతిజ్ఞ—కె. కోదండరామయ్య.
విజయప్రతిజ్ఞ—టి. జగన్నాథశాస్త్రి.
శ్రీసత్యహరిశ్చంద్రనాటకము—జి. రాజవర్ధన్.

## నీతి

నీతిబోధిని, భా. ౧, ౨—సి. వెంకటరమణయ్య.
మానసోల్లాసినీ నీతికథలు—యస్. రాధాకృష్ణయ్య.
మిత్రభేదము—బి. వెంకటరామయ్య.
సతిహితోపదేశము—లక్ష్మీదేవమ్మ.

## పరిశిష్టము

అంగవిద్య అను ప్రశ్నశాస్త్రము—(ప్ర.) బి. త్యాగరాయశాస్త్రి అండ్ సన్స్, మద్రాసు.
అచ్చయ్యమ్మ—ఏ. మృత్యుంజయశాస్త్రి.
అయిదవ వైశ్యమహాసభ అధ్యక్షోపన్యాసము—(ప్ర.) టి. సాంబమూర్తి, తెక్కలి.
ఆంధ్రనవీనవాచకములు ౨, ౩, ౪, ౫—సి. సూర్యప్రకాశరావు, హెచ్. పేరయ్యశాస్త్రి, ము.
ఆంధ్రవాచకము, తరగతులు, ౪, ౫, ౬, ౭—ఏ. జయరామరావు, డి. జగన్నాథశాస్త్రి, కె. హెచ్. వి. యస్. నారాయణ.
ఆస్తినిసంపాదించి కాపాడుకొనుట—జె. యం. బేకర్.
ఉపాధ్యాయసహాయిని—యస్. భూషణం.
ఎప్పుడు వైద్యుని సహాయముకోరవలసినది—(ప్ర.) ఆరోగ్యసంఘము, మదనపల్లి.
కలియుగమాహాత్మ్యము—భ. అమరయ్యశాస్త్రి.
కుస్తీ, మల్లయుద్ధబోధిని—బి. లక్ష్మీపతిశాస్త్రి.
ఖద్దరుప్రదర్శనము—(ప్ర.) కే. నాగేశ్వరరావు, మదరాసు.
గర్భిణిస్త్రీచేయకూడనిపనులు—(ప్ర.) ఆరోగ్యసంఘము, మదనపల్లి.
గర్భిణిస్త్రీ చూలాలుపోషణ—(ప్ర.) ఆరోగ్యసంఘము, మదనపల్లి.

గర్భిణీస్త్రీ నడచుకొనవలసినవిధులు—(ప్ర.) ఆరోగ్య సంఘము, మదనపల్లి.

గురుశిష్యసంవాదము—యన్. నరసింహరాజు, డి. చెన్న కృష్ణదాసు.

గోవిందనామామృతము—రంగదాసు.

చిలుకూరి వీరభద్రరావుగారి దుండగము—ఆర్. నరసింహరాజు.

తల్లి యనగా నేమి—(ప్ర) ఆరోగ్యసంఘము, మదనపల్లి.

నివాళి—వెంకటకాళిదాసకవులు.

నీతికథావాచకము, తరగతులు ౧, ౩—యన్. వెంకటప్పయ్యశాస్త్రి.

నూతనశిశువు—(ప్ర) ఆరోగ్యసంఘము, మదనపల్లి.

నూరేండ్లు జీవించుమార్గము—వి. దుర్గశర్మ.

పడకటింటిముచ్చటలు—బి. తిరుమలనరసింహాచారి.

పడకటింటిరహస్యాలు—కే. కామేశ్వరరావు, జే. వి. రాధాకృష్ణయ్య.

పతివ్రతావిభవము — యన్. కూరత్తాళ్వార్ అయ్యంగారు.

పరమభాగవతులు—యం. వెంకటశాస్త్రి.

పరిసరములు—(ప్ర.)ఆరోగ్యసంఘము, మదనపల్లి.

పశ్చిమగోదావరిజిల్లా ప్రాథమికోపాధ్యాయమహాసభ—(ప్ర.) బి. వియ్యన్న, ఏలూరు.

పేరిమిబిరులు—డి. రామచంద్రరావు.

ప్రధమవర్తమండల సమావేశము—(ప్ర.) కె. కోటిరెడ్డి, కడప.

ప్రమాణమెద్ది?—కృష్ణాజిస్వామి.

బాలవితంతువిలాపము—యం. వెంకటశర్మ.

బింబవర్శిని—యన్. గోపాలనాయుడు.

భద్రాద్రి శ్రీమత్కనకవల్లి తాయారు ప్రతిష్ఠ—టి. సీతారామయ్య.

మాక్మిలన్ తెనుగు మొదటివాచకపుస్తకము—కె. వీరేశలింగం.

మూడవతరగతి పుస్తకము—(ప్ర.) క్రిశ్చియన్ లిటరేచర్ సొసైటి, మదరాసు.

మొదటితరగతి క్రొత్తతెనుగువాచకపుస్తకము—యస్. భూషణం.

రహస్య శాస్త్రరత్నావళి—పి. వెంకటాచలదాసు.

రామన్నచరిత్రము—యం. రాజాశాస్త్రి.

రామావాచకము, తరగతులు ౩, ౪, ౫—ౕ. దామోదరముదలియార్, పి. యస్. రామశర్మ.

వటుబోధ కల్యాణగీతము—ఏ. హనుమంతరాయ శర్మ పాకయాజి.

వర్ణనరత్నాకరము—(ప్ర.) డి. లక్ష్మణస్వామి, పిఠాపురము.

వశీకరణతంత్రము—ప్రేమానందస్వామి.

వివేక వర్ధనీపాఠశాల ప్రారంభోత్సవము—(ప్ర.) సి. కోటయ్య, మునిపల్లి.

వేణుగానము—ఆర్. చంగనార్యకవి.

శయ్యాగృహరహస్యములు—సారథి

శారదాపద్యవాచకములు నెం. ౭ (7) టి. గంగాగోపాలరావు.

శృంగవరపు బసయ్యగారి అత్యద్భుతచరిత్ర— (ప్ర.) పంచాననబుక్ డిపో, సోంపేట.

శ్రీకృష్ణరాసక్రీడాభివర్ణనము—టి. అన్నపూర్ణమ్మ.

శ్రీరామపట్టాభిషేకము—కె. గురులింగదాసు.

శ్రీవైష్ణవ తిరుమాళిగ—కూరత్తాళ్వార్ అయ్యంగార్.

సంగ్రహచరిత్ర—యన్. సత్యనారాయణ.

సంఘకార్యదర్శుల మూడవసమావేశము—(ప్ర.) యన్. సత్యనారాయణ, ఆలమూరు.

సహకారదీపిక—(ప్ర.) తూర్పుగోదావరిజిల్లా సహకార సంఘము, ఆలమూరు.

సహకారసంఘసభ్యత్వము— (ప్ర.) తూర్పుగోదావరి సహకారసమ్మేళనము, ఆలమూరు.

సావిత్రిపరిణయము, భా. ౧—పి. రామదాసు.

సౌజన్యము—యస్. కృష్ణయ్యశాస్త్రి.

స్మృతి—యం. సత్యానందరావు.

స్వప్నచింతామణి—యస్. శేషాచలశాస్త్రి.

హంసలదీవిప్రభావము—సి. పిచ్చయ్యశాస్త్రి.

హరిహరాదికీర్తనామృతసారము—ఆర్. సోమయాజికవి.

## ప్రకృతిశాస్త్రము

శాస్త్రనాగరికము, తరగతులు. ౧, ౩—౫. యస్. ప్రకాశరావు, కె. హెచ్. వి. యస్. నారాయణ.

## ప్రబంధములు

అచ్చతెలుగు ఋతుసంహారము—(అను) సి. రామకృష్ణమూర్తిశాస్త్రి.
శృంగారసత్యభామాసాంత్వనము—కామేశ్వరకవి.

## భూగోళశాస్త్రము

కృష్ణాజిల్లా భూగోళము—కె. సత్యనారాయణమూర్తి.
చంద్రగిరితాలూకా భూగోళశాస్త్రము—ఆర్. కె. నారాయణఅయ్యంగార్.
మారుతిభూగోళశాస్త్రము—ఏ. నారాయణమూర్తి.

## మతము—హిందు

ఋగ్వేదసంధ్యావందనము—(ప్ర.) వి. రామస్వామిశాస్త్రి. అండ్ సన్స్, మదరాసు.
ముముక్షుప్పడి—కె. రామానుజాచారి.
శ్రీరామతత్త్వము—. కృష్ణదాసు.
సత్యరామవ్రతకథ—(ప్ర.)మహారాణి ఆదిలక్ష్మీదేవమ్మ, గద్వాల.

## — ఇతరములు

ఆదికాండము—ఆర్. హెచ్. మిస్. సాసర్.
ఆనందనామామృతము—. సామ్యూల్.
కృష్ణామండల కనెడియన్ బాప్టిస్టుమిషన్ సునాదవత్సరపు విశేషములు—ఒ. గాబ్రియల్.
సుడ్డిబర్తిమయుకథ—(ప్ర)క్రిస్టియన్ లిటరేచర్ సొసైటి, మదరాసు
గ్రామప్రసంగదీపిక—జె.మాక్నైర్ జేమ్స్.
చిన్నప్రవక్తలు—(ప్ర.) యస్. పి. సి. కె. డిపాజిటరి మదరాసు.
దేవునిసంఘము ఏమి నమ్ముచున్నది? ఎందుచేత—ఏ. యస్. దుగ్గర్.
నిర్గమకాండము—ఆర్. హెచ్. మిస్. సాసర్.
పడిపోయినగింజ—యఫ్. యం. మిస్. బార్.
పారిపోయినమేక—యఫ్. యం. మిస్. బార్.
మొదటి కొరింథిపత్రిక—వి. యస్. అజరయ్య.
మోక్షవాకిలి—(ప్ర.) జె. ఆలన్, నెల్లూరు.
శాంతినిలయము—జె. యస్. బెన్ని.

## మాహాత్మ్యములు

బ్రహ్మనామ మాహాత్మ్యము, గురు మహాత్మ్యము—ఏ. షణ్ముఖశాస్త్రి.
యల్లమందకోటేశ్వరమాహాత్మ్యము—కె. రామలింగాచారి.
శ్రీబుగ్గరామేశ్వరస్వామి మాహాత్మ్యము — (ప్ర.) పి. రామచంద్రయ్య, కర్నూలు.
శ్రీశైలమాహాత్మ్యము—పి. రామచంద్రయ్య.

## రాజకీయములు

అఖిలపక్షమహాసభ—(ప్ర.) కే. నాగేశ్వరరావుపంతులు, మదరాసు.

## వాస్తుశాస్త్రము

శ్రీకృష్ణవాస్తుశాస్త్రము — (ప్ర.) బి. త్యాగరాయశాస్త్రిఅండ్ సన్స్, మదరాసు.

## విమర్శనము

శబ్దతత్త్వశాస్త్రము— (ప్ర.) ఆంధ్రరిసర్చ్ యూనివర్సిటి, విజయనగరము.

## వృక్షశాస్త్రము

బాలురస్థావరశాస్త్రము—యం. సి. రాజు.

## వేదాంతశాస్త్రము

అచలబోధశిఖామణి—శివానందస్వామి.
అద్వైతబ్రహ్మవాదము—యం. రామకృష్ణచయనులు.
అపరోక్షానుభూతి—(ప్ర.) వి. రామస్వామిశాస్త్రి అండ్ సన్స్, మదరాసు.
అయంగ్రాహిని—ఏ. పుండరీకాక్షుడు.

వేదజ్ఞానసారము—యం. శ్రీరాములు.
శ్రీఅష్టావక్రగీత—పి. సుబ్రహ్మణ్యశాస్త్రి.
శ్రీమదాంధ్రభగవద్గీతము—సి. లక్ష్మణదాసు.
శ్రీశుష్క వేదాంత తమోభాస్కరము—శ్రీ. మలయాలస్వామి.

## వైద్యశాస్త్రము

ఓషధీగుణపంచభాషి—కె. బుచ్చయ్యశర్మ.
కలరా—(ప్ర.) క్రిశ్చియన్ లిటరేచర్ సొసైటి, మదరాసు.
కుష్ఠరోగము—(ప్ర.) క్రిశ్చియన్ లిటరేచర్ సొసైటీ, మదరాసు.
ప్రమేహచికిత్స—కె. అనంతాచారి.
మాధవనిదానము—మాధవకవి.
వస్తుగుణమహోదధి—పి. ఆదినారాయణశాస్త్రి.
శిశువ్యాధులు—ఇ. సత్యనారాయణశర్మ.

## వ్యాకరణశాస్త్రము

ఆరంభవ్యాకరణము—ఏ. పరబ్రహ్మశాస్త్రి, ఏ. వ్యాసశర్మ.
విభక్తిచంద్రిక—కె. సుబ్బరాయులునాయుడు.

## వ్యాపారము

వర్తకమర్మములు—పి. పిచ్చయ్యశాస్త్రి.

## శతకములు

వి చొడప్పశతకము—(ప్ర.) వి. కుప్పుసామి ముదలి, మదరాసు.
కుమారశతకము—డి. వీరబ్రహ్మం.
గౌరీపతిశతకము—యం. కృష్ణమూర్తి.
తర్తూరు రంగనాయకశతకము—వి. పిచ్చయ్యశాస్త్రి.
బాలనీతిశతకము—టి. శేషయ్య.
భద్రాద్రిరామశతకము—పి. నరసింహదాసు.
రామదేవశతకము—టి. వెంకటనరసనూరి.
శ్రీవేంకటేశశతకము—శి. వెంకటరామకవి.
శ్రీసకలేశశతకము—వి. సోమసుందరావధాని.

## సంగీతశాస్త్రము

సంగీతవిద్యాదర్పణము—యు. వెంకటస్వామి నాయుడు.

## స్తోత్రములు

శ్రీకన్యకాపరమేశ్వరీస్తవనక్షత్రమాల— ఏ. వేంకటేశ్వరగుప్త.
శ్రీకాళహస్తీశ్వర శివస్తోత్రం—పి. వెంకటరంగయ్య.
శ్రీగజాననస్తోత్రమాలిక, శివలీలలు—వి. శేగయ్యలింగం.
శ్రీమాతృలక్ష్మాంబతారావళి—వి. రామయ్య.
శ్రీరామనక్షత్రమాల—యం. వీరరాఘవదాసు.
శ్రీ వెంకటేశ్వరవింశతిక—యం. నారిభూషణం నాయుడు.

## హరికథలు

శ్రీచిత్రసేన దేవదాసులచరిత్రము—యన్. వీరరాఘవదాసు.
శ్రీరామజననము—పి. ఏ వి. యల్. యన్. యస్. దీక్షితదాసు.
సత్యభామగర్వభంగము—పి. రామదాసు.

---

# రేడియో (Wireless)

శంకర వేంకటరావుగారు



"రేడియో" యంత్రసంబంధమగు జ్ఞానము మనకుగ్రొత్తది కన్పించుచున్నది. అట్టిదియని మనలో చాలమంది తలంచుచున్నారు. అట్టిదియని పైకిఁ గాన్పించుచున్నను, "రేడియో" యంత్రముఁ బనిచేయుట దుష్కరమైన పని గాదు. అది కేవలము విద్యుచ్ఛక్తి (Electricity) తో సంప్రవర్తింపఁబడుచున్నది. అట్టి విద్యుచ్ఛక్తివిధానము మనకు సుబోధమయ్యెనేని దీనిని మిక్కిలి సులభముగా గ్రహింపఁగలుగుదుము.

ఇప్పుడు మనవారనేకులు "రేడియో సమాకర్షణయంత్రము" (Radio Receiving Set) ను దమతమ యిండ్లలో నెలకొల్పుకొని ప్రపంచమునం దచ్చటచ్చట జరుగుచున్న సంగీతాదివాద్యధ్వనులను ఇంటనే యుండి విని యానందించుచున్నారు. కనుక సర్వజనులకు సుబోధమగునటుల సమాకర్షణయంత్రము (Receiving Sets) లకును, విక్షేపకయంత్రము (Broad Casting Sets) లకును గల సంబంధమును గొంతవఱకుఁ దెలిసికొనుట మన కిప్పు డావశ్యకము.

"రేడియో" యంత్రము నడుచుటకుఁ గావలసిన ముఖ్యపదార్థములు మూఁడు.

౧. రేడియోవిక్షేపక యంత్రసామగ్రి (Radio Broad Casting apparatus).

౨. రాయబారపు సాధనము—"ఈథరు—" (Conducting Medium—Ether)

3. రేడియో సమాకర్షణయంత్రసామగ్రి Radio Receiving Apparatus) పైని జెప్పిన మూఁడింటివలననే ధ్వనియొక్క ప్రసారణము (Transmission), వహనము (Conduction) ప్రతిగ్రహణము (Reception) జరుగుచున్నవి.

అయిన నిట్టిధ్వనులు వందలకొలఁది మైళ్లు ప్రసరించుచున్న వన, నంతరాళ (Space) మూలముననే యని కానుపించుచున్నది. అంతరాళమునఁ దరంగచలనమువంటి చలనము (Wave motion) వలన నీపని జరుగుచున్నది. ఆచలన మెట్టిదో మనకుఁ దెలియవలసి యున్నది. అది సులభముగా బోధపడుట కుదాహరణ మొకటి చెప్పుచున్నాము. ఒక చిన్న తాతిని నిశ్చలముగానున్న తటాకజలమునఁ బడవేసిన నారాయి పడినచోటి నుండి చక్రాకారముగా నీటి కెరటములు చుట్టును బ్రసరింప నారంభించును. ఈరీతినే యొకదారమునకుఁ గట్టి నీటిని దాఁకునట్లు పదే పదే విడుచుచు లాగుచు నుండిన యెడల దానిచుట్టును జక్రాకారముగ నెడతెరపి లేకుండఁ గెరటము లుద్భవిల్లుచుండి వ్యాప్తిని జెందుచుండును. దీనినే కెరటములసంచలన (Wavemotion) మందురు. అట్టిసంచలనము గల నీటిపైభాగమం దెక్కడనయిన నొక బెండుముక్క (Cork float)ను గాని, మఱి యేద

యైన నొక తేలికపదార్థమును గాని పడవేసిన నది క్రిందికి మీఁదికిఁ బడుచు లేచుచు నుండుటను జూడఁగలము. నుజేయు నా బెండుముక్క స్థానాంతరమును బొందక యే క్రిందికి మీఁదికిఁ గదలుచుండును, జలము గదలమి యును కెరటముల సంఘర్షణమే సుప్తమై యుండి బెండు నాడించుటయును గ్రహించఁగలుగుదుము. ఆ సంఘర్షణ మెన్నిమారులు గలుగునో యన్నిమారు లీబెండు క్రిందికి మీఁదికిఁ గదల్పఁబడుచుండును. అవి సులభ మయ్యు బహువిభ్రమము గొల్పు నీవిశేషమును మనస్సున నాటించుకొనినయెడల నీ "రేడియో" యంత్రముల మూలమంత్రమును మనము గ్రహింప ననువగును.

ఇదివరకుఁ జెప్పిన "రేడియో" యంత్రసామగ్రి యందలి ప్రధానాంగమగు విక్షేపకస్థానము (Broad Casting Station) నీటిమట్టముపై వ్రేలాడఁగట్టి క్రిందికి మీఁదికి దించుచు నెత్తుచునుండిన జాతివంటిది. రెండవ యంగమగు రాయబారపు సాధనము పై నుదాహరించిన సంచలనక్షోభమునకు లోనగిన నీటివంటిది. దీనినే "ఈథరు" (Ether) అని చెప్పుదుము. మూఁడవయంగము సమాకర్షణయంత్రము నీటిపైఁ దేలియాడు బెండు వంటిది.

## విక్షేపకయంత్రసామగ్రి
## (Broadcasting Apparatus)

మొదటిదియు, ముఖ్యమైనదియు నగు ధ్వనివిక్షేపకయంత్రనిర్మాణమునకు నలలవంటి సంచలనము గలిగించు సాధనసామగ్రి యావశ్యకము. ఆసంచలనమును నభోంతరాళమునఁ బ్రసరింపఁజేయు సామర్థ్యము దానికుండవలెను. అట్టిసామర్థ్యము విద్యుచ్ఛక్తితోఁ గూడి యుండిన లోహతంత్రుల యవిచ్ఛిన్నస్పందనమువలనఁ గలుగఁగలదని పెద్దలు గ్రహించిరి. తద్ద్వారమున నీసంచలనము వాహకపదార్థమును జేర నిర్మింపఁబడినట్టియు, గాలిలో నెత్తుగాఁ గట్టఁబడినట్టియు, విక్షేపక యంత్రమునకుఁ దగుల్పఁబడినట్టియు, "ఆంటినా" Antenna or Aerial) అని చెప్పఁబడు నొకలోహపుతీఁగను గాని తీగలను గాని చేరును. పిమ్మటఁ దన్మూలమున "ఈథరు" నంగు సంక్రమించి సర్వవ్యాప్తి నొందును. ఇట్లు ధ్వని విక్షేపకయంత్రమునుండి సర్వవ్యాప్తిని బొందుట (to Radiate) బట్టియే దీనికి "రేడియో" (Radio) యని పేరిడిరి. ఈ "ఆంటినా" యనునది విద్యుద్దీపము (Electric Lamp) లో నమర్చఁబడి ప్రబలకాంతిని బ్రసరింపఁజేయు సన్నని లోహపుతీఁగ (Filament) వంటిది.

## రాయబార పదార్థము
## (Conducting medium)

"ఆంటినా" తీఁగనుండి యావంగలసంచలనము నిరంతరముగా పృథ్వి, పృథ్వేతర ప్రత్యక్షమైనము లేక సమస్తపదార్థముల సర్వత్ర కొనిపోవుట కొక యాధారముండి తీరవలెను. అట్టిది వాయువు కానేరదు. కాన సర్వవ్యాప్తి గల "ఈథరు" దానికి సరిపడినదిగా నాలోచింపఁబడినది. దానిమూలమున నీసంచలనము సర్వత్ర ప్రసరింపఁ జేయనగును. ఇట్టి దృశ్యాదృశ్యపదార్థమును వివక్షించుట కాధారములు లేకపోయినను నేగో యొక సర్వవ్యాప్తి గల ద్రవ్య ముండితీరవలెను. అదియే "ఈథరు". "ఈథరు" అను నీవహనసాధనములోని తరంగ సంచలనము తదితరద్రవ్యములలోని తరంగసంచలనము వలెనే సర్వవ్యాప్తిని బొంది క్షణములో ౧౮౬,౦౦౦ మైళ్ళదూరము పోఁగలుగుచున్నది. ఇచ్చటఁ గలిగిన స్పందనమెట్టి మహావేగముతోఁ బ్రసరించి ౧/౮ క్షణములో భూమి చుట్టును దిరిగివచ్చును. విద్యుచ్ఛక్తివలనఁ గదల్పఁబడు నీ సంచలనమును గూర్చి యిదివరకే చెప్పియున్నాను. ఈసంచలన మెంత సున్నితమైనదైనను "ఆంటినా" నుండి "ఈథరు"ను జేరి మహావేగముతో సర్వవ్యాప్తిని గాంచుచున్నది.

## సమాకర్షణ యంత్రసామగ్రి
## (Receiving apparatus)

ఇదియే మనము తప్పక తెలుసుకోఁదగిన మూఁడవది యగు ముఖ్యపదార్థము. విక్షేపకయంత్రము నుండి బయలుదేఱు సంచలనము, "ఆంటినా"కును, దానినుండి, "ఈథరు"నకును, నందుండి తిరిగి సమాకర్ష

యంత్రముయొక్క "ఆంటినా"యను పేరున్నది. ఆ సంచలన మతిశీఘ్రకాలములో నెన్నిపెన్నట సమాకర్షణ యంత్రము లమర్పఁబడి యున్నవో యవ్వియన్నియుఁ గలుగుచున్నవి. ఇప్పటికి నొక చోటునుండి మరియొక చోటునకు నెంతదూరమైనను లక్ష్యము చేయక యతి వేగముతో సంచలన మోటుల ననుభవయోగ్య మగుచున్నదో తెలిసికొంటిమి. ఇఁక సంగీతము మొదలగు నాద శబ్దాదిక మెట్లు గ్రహింపఁబడునో విచారింతము. ఇంతి యకాక యితరసంచలనముల యాతంక మీసమాకర్షణ యంత్రముల చేత యడ్డుతగులునో యను నొకవిశేషాంశము తెలిసికోవలసియున్నది. సంగీతము గాని, మరి యేయితరధ్వని గాని సమీపమునఁ బ్రాదుర్భవింపఁగానే యది విశ్లేషకయంత్రమున కమర్పఁబడి యుండు "మైక్రోఫోను" (Microphone)వలన నాకర్షింపఁబడి విద్యుచ్ఛక్తి ప్రవాహమువలన నతిశీఘ్రముగా "ఆంటినా"ను జేరును. "ఆంటినా"నుండి "ఈథరు" మార్గమునఁ బ్రసరించును. ఈధ్వనికి శేషము సమాకర్షణయంత్రమార్గమున సంగ్రహింపఁబడి దానిలో నమర్పఁబడియుండు సాధనముల మూలమున విజృంభింపఁ జేయఁబడును. ఈసాధనము లేరకే గలసపులను గ్రహింపవలెనో (Tuning), దేనిని సాధింపవలెనో యట్టియేర్పాటులపైననే నిర్మింపఁబడి యుండును. కాని యేకకాలమునందుఁ గలుగు సంచలనముల యాతంకము గలుగకుండఁ జేయఁబడినను, విద్యుచ్ఛక్తివలన నతిశీఘ్రముగాఁ(At Radio frequencies) బ్రసారింపఁబడునట్టియు, నాకర్షింపఁబడునట్టియు ధ్వనుల స్థూలములు మన శ్రుతివ్యాపారమున కనుగుణముగా నుండనేరవు. కనుక సమాకర్షణయంత్రములలో నుండు మరికొన్ని సాధనముల మూలమున నాధ్వనులు శ్రవణానుకూలముగా నుండునట్లు వానిశీఘ్రగతి తగ్గింపఁబడి (At Andio frequencies) సముచితములగు ధ్వనులును, శబ్దములును యథారూపమున మనకుఁ గర్ణగోచరము లగుచుండును.

"రేడియో"విధానమును సమగ్రముగాఁ దెలియఁ గోరువారలు మున్ముందుఁ బ్రతిభాగముయొక్క నిర్మాణమును, దాని యుపయోగమును బూర్తిగాఁ బ్రత్యేకించి తెలిసికొనవలసియుండును.

[ఈ 'రేడియో' విధానమును సమగ్రముగా నాంధ్రలోకమునకు భారతీద్వారమున దెలుప ఈవ్యాసమును రచియించిన శ్రీ శంకర వెంకటరావుగారిని వేడెదము. —సం. భారతి.]

---

# అతివృష్టికష్టహరణాష్టకము

కీ. శే. మండపాక పార్వతీశ్వరశాస్త్రి గారు

ప్రాశస్త్యంబె దయామారసంబునకు సర్వజ్ఞుండవయ్యున్ భళీ,
ధీశీలంబు లెఱుంగన ట్లతిమరుద్వ్యాప్తింబొసంగించి, నీ
యీశత్వాతిశయంబుఁజూపితివి; నీవే యిట్లు పీడించినన్,
దేశోపద్రవమార్పువారు గలరే, దేవా, కటాక్షింపవే!
మునుపే ముక్కిడి, దానిమీఁదఁ బడిసెంబుం బట్టె నన్నట్లు, జీ
వనలోపంబునఁ గుందువారికి మహావాయుప్రసారంబుతో

సనివార్యంబగు ఘోరవర్షమున నూత్నాయాత తత్పూర్వ జీ
వనలోపంబునఁ గుందఁగావలసె; దేవా, చూచి రక్షింపవే.

గోడల్ వీడఁ దొడంగె; నర్ణవములై ఘూర్ణిల్లుచుం జెర్వులుం
దోడందోడనె చేలుగూలు కరణిం దోయప్రవాహత్వరా
పీడం బీటలువారఁ జొచ్చెఁ బ్రజయుం భీతిల్లుచుండెం గటా
నేఁ డీ వి య్యతివృష్టి మాన్పి కరుణన్ దేవా కటాక్షింపవే.

జిగిలేనట్టి గృహంబులన్ మెలఁగుచున్ జీవించుచే దుర్ఘటం
బగునట్లుండిన బీదసాదు లతివాతాయాతవర్షప్రపా
తగళజ్జీర్ణకుటీరులై చెడిన వోఁ దద్రక్షగావించువాఁ
డగపింపం డతివృష్టి మాన్చి, యిఁక దేవా, మమ్ము రక్షింపవే.

అతి సర్వత్ర పరిత్యజింపఁదగునం డ్రాత్మజ్ఞు లీవేలమా
కతివర్షం బతిమారుత ప్రసరణం బత్యంత మత్యాహితం
బతికోపంబునఁ గల్గఁజేసితివి; నాయంబే, జగద్రక్షణ
వ్రతదీక్షన్ వహియించి, యింతపయి, దేవా, మమ్ము రక్షింపవే.

పశువుల్, పక్షులు, కీటముల్ మొదలుగాఁ బ్రాణుల్ ప్రపంచంబునం
దు శతంబుల్ మఱివేలు లక్షలును, గోటుల్ నీటిచే గాలిచేఁ
గృశతం జెందునటుల్ ఘటించుటిది కీర్తిం దెచ్చునే నీకు స
ర్వశరీరుల్ సుఖియించునట్లు లిఁక దేవా, పూని రక్షింపవే.

తరువుల్ వ్రైఁబడునో, గృహంబు వడునో, తత్తత్తటాకాపగల్
వరుజుల్ మీరుచుఁ బారి వచ్చిపడునో, వారించువా రెవ్వ రీ
దురవస్థన్ మన కంచు నిట్లు బహుగా దుఃఖించు లోకంబు; తీ
వ్రరయం బొప్పఁగ గాలివాన నిఁక దేవా, మాన్పి రక్షింపవే.

వృష్టిం బంటలుపండున ట్లొనఁగుచున్ హృష్టిన్ సమస్తప్రజా
పుష్టింగూర్పు మటంచు వేడుకొనినం బూర్ణాతివృష్టిం గ్రియా
నష్టిం గూర్పఁ దొడంగినాఁడ విది యన్యాయంబుగాదే, దయా
దృష్టిన్ విష్టపకష్ట మార్పి యిటపై దేవా, కటాక్షింపవే.

---




## బుగ్గ దేవాలయము



ఇది నగరికిచెంత కుశస్థలినది తీరమున నున్నది. ఇచట బుగ్గ అగ్రహారము అను గ్రామము గలదు.

ఈదేవాలయమును నెలకొనియున్న సరోవరములోనికి భూగర్భమునుండి యైదుధారలుగా జలము ప్రవహించుచుండును. గంగానదియే యంతర్వాహినిగా ప్రవహించి యిట్లు పంచధారలుగా నీసరోవరమున గలియుచున్నదని ప్రతీతి. కావున దీనిని దక్షిణకాశియనిగూడ నందురు. మూడుధారలు మాత్రము చిత్రమున గానవచ్చుచున్నవి. ఇది తత్ప్రాంతీయులచేత దివ్యక్షేత్రముగా పరిగణింపబడుచున్నది. ఇచట దేవాలయము శిథిలముగా నున్నది. పునరుద్ధరణ మావశ్యకము. తత్ప్రయత్నము జరుగుచున్నదట మెచ్చదగినది. ఆస్తికులగు తత్ప్రాంతీయు లీసత్కార్యమునకు తోడ్పడుదురుగాక!



అణ్ణామలై విశ్వవిద్యాలయమునందలి యాంధ్రవిద్యార్థులు



చూడా నాగేశ్వరస్వామికొండ, దేవాలయము

ఉన్నత తలమున నుండినదై బెంగుళూరు ఇంపైన శీతోష్ణస్థితికి పోయి యెనుకుంటారు. బెంగుళూరునకు నవీ పయుగ, ఇరువదినాలుగు మైళ్ళదూరమున మాత్రముండి యు, నచ్చట కడుచాకగ గడిపివోవును. అసలే ప్రసిద్ధి కెక్కిన బెంగుళూరుకంటెను ఇది ఆరోగ్యకరమై గాలికి పేరుపడినది; హిందూదేశమంతటికి మిక్కిలి ఆరోగ్యానుకూలములైన ప్రదేశములలో నిది యొకటి.

బి. యస్.

---

## ఇలా చెబితే...?

శృంగారనైషధం నాలుగో ఆశ్వాసంలో యీ పద్యం వుంది:

స్థాణునిలోచనాంచలము
దాపురఁ దీవ్రతరార్చులన్ నిజ
ప్రాణముఁ గొన్ననాఁటిపగ
యాత్మఁ దలంచి మొ నీకటాక్ష వృ
త్కోణము ప్రాపున స్మరుఁడు
గోల్కొని పంత మెలర్పఁగాఁ గొనెన్
బాణదశార్ధపాతమునఁ
బావకు భూరిమనోభిమానమున్.

ఇక్కడ "బాణదశార్ధ" అన్నచోట అనేకమంది పండితులు అయిదుబాణాలని చెప్పగా విన్నాను. మహోపాధ్యాయ, కళాప్రపూర్ణ వేదము వేంకటరాయశాస్త్రిగారున్ను అలాగే రాశారు. అయితే "దశార్ధ" అనడంలో ఏం విశేషంవుందీ? అయిదని చెప్పగూడదూ? నేనుక అగ్నిహోత్రుడు మన్మథుణ్ణి పదింటితో కొట్టివుంటే ఇప్పుడు మన్మథుడు అగ్నిహోత్రుణ్ణి అయిదింటితోటే—అనగా అందులో సగంతోటే కొట్టేశాడని చెప్పడానికి సందర్భం వుండేను. అలాంటి దేమీ జరగలేదు. అలాంటిభావమేనా సూచించాడేమో అంటే యేమీ కనపడదు. అగ్ని హస్తాగ్ని గాని దశార్చి కాదు. కనక దశశస్త్రగోలు అంటా (కోలు) అని చెబితే ఎలావుంటుందీ? ఒక్కబాణంయొక్క సగం కొస దిగేసరికే అగ్ని హోరిమనోభిమానం పోయిందంటే బాగా వుంటుందా? పండితు లాలోచించవలెను.

శ్రీపాద సుబ్రహ్మణ్యశాస్త్రి.

---

## శ్రీశైలయాత్ర (భీమునికొలను)



కృ. వెం. నరసింహం, కోవెలకుంట్ల.

## కొంగ గూడు



శ్రీ యన్. సంకటగావుగారు, (శ్రీకాకుళము–గంజాముజిల్లా.) ఒక్క కఱ్ఱబొమ్మపై చెక్కిన సుందర శిల్పము యొక్క నమూనాచిత్రము.

---

## ఇటలీ రైతుసంఘపు విద్యావ్యాప్తి

౨౫ సంవత్సరముల క్రితము 'ఏంజెలో సెల్లీ' అను వైద్యుడు ఇటలీదేశములో మలేరియా జ్వరమూలమును గూర్చి కొన్ని పుంతలయొద్ద శోధన చేయుచుండెను. శోధనమున నిమగ్నుడై యున్నతఱి, వానికి, ఆయా ప్రాంతముల గల బీదరైతుల విషాదస్థితిని గూర్చి విస్మయము జనించినది. రైతులు గుడిసెలలో నివసించుచుండిరి. వారికి విద్యాగంధము లేదు. వారు నాగరకప్రపంచమునకు దూరులగుటమూలమున వారి కప్పటిజ్ఞానోదయమును కలుగ లేదు.

తగుపరి 'సెల్లీ' వైద్యుడును 'గయోవన్ని సెనా' అను కవియుకూడి, "రైతుపాఠశాలలు" అనుపేర విద్యాశాలలు స్థాపించిరి. ఇటలీదేశములో రైతుపాఠశాలల యభివృద్ధిని నేను గమనించినచో వీ రిరువురు ఎట్టి వ్యయప్రయాసలను బొందిరో తేటతెల్లమగును. ఈయభివృద్ధిని కన్నులార గాంచుటకు వారిప్పుడు జీవించియుండలేదు. వారు గతించినను పాఠశాలోద్యమము జయప్రదముగనే కొనసాగుచున్నది. దీనికి మూలాధారము 'అలెస్సాండ్రో మర్కుస్సీ'. ఇతడు చిత్రకారుడు. మొత్తముమీద కవి, చిత్రకారుడు, వైద్యుడు రైతుపాఠశాలోద్యమమును స్థాపించిరి. 'రోము'నగర ప్రాంతమునగల పల్లెలలో నేటికి ౧,౮౦౦ పాఠశాలలు కలవు. నెయ్యేల? ఇటలీదేశమంతయు ఈ ఉద్యమవ్యాప్తి అయినది. దేశములో ౨౫,౩౦౦ పాఠశాలలు కలవు.

### పాఠశాలల యాదర్శము

ఈపాఠశాలలను గమనించినవారు వానిని బహువిధముల ప్రశంసించిరి. 'టైమ్సు'పత్రిక విలేఖకుడు స్వయముగ వానిని పరీక్షించి, "వర్ణింప నలవికాని యందము ఈపాఠశాలలయందున్న"దని నుడివెను. పాఠశాలలన్నియు వేరువేరుగ నున్నవి. ప్రతిపాఠశాలయు, హాయినిచ్చు పిల్లగాలులతో, పుష్పములతో, చిన్నచిన్న జలపాతములతో, ఉద్యానవనములతో అలరారుచున్నది. రైతుపాఠశాలయొక్క ముఖ్యోద్దేశము: రైతుబిడ్డకు ఇంపుగ నుండునట్టివియు, జ్ఞానబోధచేయునట్టివియు, అను విషయములను గఱపుటయే.

### బోధన పద్ధతులు

పాఠశాలలో ఉద్యానవనము ప్రధానము. ప్రతి విద్యార్థికి ఒక ఉద్యానవనము. దానిలో వాడు తన యిష్టము వచ్చినవానిని పెంచుకొనును. ఉద్యానవనములో నాతడు చేయుపనులను పుస్తకములలో వ్రాయును. ఎవరియిష్టము వచ్చినట్లు వారు ఈపుస్తకములలో వ్రాయుదురు. ఈపుస్తకములకు కట్టుబాట్లు లేవు. కావుననే, పిల్లలు వారివారి యిష్టానుసారము తోటలపెంపును గూర్చి వ్రాసికొందురు. ఒకపిల్లవాడు ఇట్లు వ్రాసెను:

"నాతోటలో మొలకెత్తినమొక్కలను నెఘనపల్లి త్రొక్కివేసినది." తోటపనితోపాటు, విద్యార్థులు తేనెటీగలు, కోడిపెట్టలు, పట్టుపురుగులు మొదలైన క్షుద్రజంతువులను పెంచుదురు.

వారికి కేవలము తోటపనితోనే సరిపోదు. ప్రాథమిక విద్యాతరగతులలో నేర్పు వ్రాత, చదువు, గణితము, భూగోళము మున్నగునవి కూడ వారు నేర్చుకొందురు. బడికి బోవునప్పుడు పిల్లలు అడవిపువ్వులను ఏటివానిరంగులను పుస్తకములపై రచియింతురు. ఇట్టి చిత్రరచనవలన బాలబాలికలు బాల్యదశలోనే చిత్రకళను నేర్చుకొనుచున్నారు.

విద్యార్థులు 'గ్రామఫోను' ఆధారము చేసికొని సంగీతము నేర్చుకొనుచున్నారు. ప్రతివారును వారివారి తోటల నమూనాలను గీయుదురు. పిదప పాఠశాలలను, ఆయుస్థలమును నిరూపింతురు. ఆపిమ్మట చుట్టుప్రక్కల ఇండ్లను చిత్రింతురు. ఇట్టినిర్మాణమువలన భూగోళము వారు క్రమపద్ధతిని నేర్చుకొందురు. రైతుపాఠశాలలయందు మతబోధ కూడ కలదు. ఇంతేకాదు. పుష్పముల నలంకరించు పళ్లెములను వారు మట్టితోచేసి దానికి 'వార్నిషు' వేయుదురు. ప్రాచీనశిల్పమును ఇందు నిరూపింప వారు ప్రయత్నింతురు.

ఈపాఠశాలలయందు గమనించవలసిన విషయములు రెండుకలవు. విద్యార్థులు వారివారి యిష్టానుసారము, ఏవిషయము నేర్చుకోవలెనని కుతూహలము కలదో అదియే నేర్చుకొందురు. సంగీతము, తరువాత చిత్రకళ, పిమ్మట భూగోళము, ఆపిదప లెక్కలు, తుదకు వ్యాయామము అను నియమములేదు. బడిలో ఉన్నప్పుడు వారు శుభ్రమైన గుడ్డలను ధరింతురు. వీరి ఆరోగ్యమును కాపాడు వైద్యసామగ్రికూడ పాఠశాలలోనే అమర్చబడి యుండును. ఉపాధ్యాయులుకూడ శుచి, శుభ్రతలనుగూర్చి తెలిసికొనిన వారే.

## విద్యార్థుల వయస్సు

ఇటలీదేశమందలి రైతుపాఠశాలలు 3-వ యేటనుండి మొదలు ౧౦-వ యేటువరకు చదువుకొనువారికి నియమింపబడినవి. పైవయస్సు పిల్లలకుగల విద్యాశాలలు మిక్కుటము. ౬ సంవత్సరముల వారికి గలవి స్వల్పము. ఈఉద్యమబాధ్యత ప్రభుత్వము వారిపై, విద్యాధికారులపై గలదు. వీరే ఆర్థికసాహాయ్యులు.

హిందూదేశమునకు నిట్టి యుద్యమము నుత్తమోపయోగకరమని వేరె చెప్పవలయునా?

[illegible]

ఆడుదా? మగవాడా?






**శ్రీమతి తెన్నేటి వేంకటరామణమ్మగారు**



విశాఖపట్టణము తాలూకాబోర్డు సభ్యురాలుగ నియమింపబడిరి. ఈమె శ్రీయుత తెన్నేటి వేంకటరామమూర్తి (B. A., B. Ed.) గారి సతీమణి. విద్యావతి. గతవత్సరము అంతశ్శాఖా ప్రౌఢావివాహము చేసికొనియుండిరి.

**శ్రీమతి గున్నేపల్లి రుక్మిణీదేవిగారు**



ఈమె కృష్ణాజిల్లా, గుడివాడతాలూకా కపిలేశ్వరపురము బోర్డు సెకండరీస్కూలులో ఆంధ్రోపాధ్యాయులుగా నున్న శ్రీగున్నేపల్లి అక్షయలింగముగారి భార్య. ఈమె చిన్ననాటనే సంగీతసాహిత్యముల నభ్యసించెను. తెలుగున కవనమును చెప్పగలదు. ఈమె రచించిన 'విధివిధానము' అను పద్యఖండకావ్యము చైత్రమాస భారతి సంచికయందు ప్రకటితమయినది.

---

## నేటి వివాహములు






## శ్రీ అహోబలాచారిగారు, యమ్. ఏ.

వీరు నిపుణులైన నటులు. వీరి స్వస్థలము బెంగుళూరు. వీరు కన్నడులు. నాట్యకళాదేవతను దీక్షమై సేవించుచున్నవారు. మాతృభాషయందే కాక ఆంగ్లమునను అభినయ కౌశలమును వెలయింపఁగలవారు. శ్రీ హరీంద్రనాథ చట్టోపాధ్యాయునికి వీరు ప్రియశిష్యులు. హరీంద్రుని ప్రోద్బలమున, ఆయన సిఫారసుతో, త్వరలో వీరు నాట్యకళా వికాసము ముందడుగిడ్డ రష్యాదేశమునకేఁగి,



శ్రీ అహోబలాచారిగారు, యమ్. ఏ.,

అచట తత్కళా రహస్యముల పరిజ్ఞానము నార్జించి రా సంకల్పించియున్నారు. రష్యాప్రయత్నముల ననుసరించి భారతదేశమున వీరు 'శిశునాట్యశాల'యు (Children's Theatre), 'కార్మికనాట్యశాల' యు (Workmen's Theatre) సంస్థాపింప ప్రయత్నింతురట. (ఇట్టి పనులు హరీంద్రుఁడుకూడ తలపెట్టినట్లు చదివియుంటిమి.) వీరికి ఆంధ్రము బాగుగ తెలియును. ఆంధ్రులయెడ వీరి కమిత గౌరవము. ఇటీవల కొంతకాలముగ వీ రాంధ్రదేశమున వసించి, స్వానుభవమున ఆంధ్రులపై ఒక వాక్యార్థమును కట్టినారు: Scratch an Andhra, you will find a poet (ప్రతి ఆంధ్రుఁడును నివుఱుగప్పిన నిప్పయిన కవి) అని. కడచిన ఆంధ్రమహాసభలకు (గుంటూరు పురమున) నాట్యకళా పరిషత్సమావేశమునందు వీరు తమ ప్రదర్శనమును గావించి ఆంధ్రుల ప్రశంసకు పాత్రులైరి. అభినేతయే కాక, హరీంద్రునివలె వీరు స్వయముగ గ్రంథకర్త. కన్నడభాషయందు వీరివి మూఁడునాటకములు ప్రకటితములై వ్యాప్తియందున్నవట. ఆంగ్లమునను వీరు సాకో వాంజెటీల కథవంటివి ఖండరూపకములుగ రచించి ప్రదర్శించుచుందురు.

### సాకో, వాంజెటీలు

సాకో అని, వాంజెటీ అని అమెరికాయందు ఇద్దఱు కార్మికనాయకులు; సాంఘికవాదులు (సోషలిస్టులు). వీ రిరువురు ఇటలీదేశీయులు. కార్మికుల మానమునకు పూఁటకాఁపులైన వీరి జగత్క్షేమంకర, మహాధార్మికమానసము తళతళ అప్పుడప్పుడు 'పెద్దల కళ్లు మిఱుమిట్లు కొల్పుచునే వచ్చినది. ఒకానొక

హత్యాప్రార్వకము బందిపోటున పాల్గొన్నవారని వీరు ప్రభుత్వమువారి అనుమానమునకును, లేక అనుమానము వంటి యిష్టమునకును, దండనమునకును పాల్పడిరి. ఈ సంఘటనము జరగినపుడు వారు స్థలాంతరముల నుండి చిన్నది సూర్యతేజమువలె ప్రకటితమైన దయ్యు, పిదప వారి కథావిస్తరమున చెప్పుకోఁబడుటకు మాత్రమే నోఁచుకొన్న సత్యము. ఆ నేరము గావించిన నిజమైన అపరాధియే ఒకఁడు సాక్షో, వాన్‌జెటీలు నిర్దోషులని అక్షరాలా ఇచ్చిన వాఙ్మూలము 'వారు చచ్చియే తీరవలె' నన్న ప్రాడ్వివాకుల సంకల్పమును జాలినివలె కొట్టి, ఆహంతకుని క్రూరమానసమున సహా ఒకధర్మధీరతను లేపెను. సాకో వాన్‌జెటీల ఏడువత్సరముల కారావాస సామ్రాజ్యపు చీఁకటి యేలుబడికి చుక్కపెట్టి, వారికి మృత్యుదేవతాపదసన్నిధికి పట్టభంగము కట్టినారు ప్రభుత్వమువారు.

ఇది మొన్న మున్న ౧౯౩౭-వ సం. న ముగిసిన క్రొత్తకథ. ఆస్థతో గమనించిన ప్రపంచవాసుల స్మృతి యింకను మసకవడని పెద్దఅభూతమున తరఁగెత్తినట్టిది.

ఇట్టి మననాఁటి కథ లెత్తి యితివృత్తము పన్ని లోకులకుండె మహదాశయపరిపాకమునకు కదపవలెనని శ్రీ ఆచార్యులుగారి సంకల్పము.

ఈ కథతో వీరు 'Before his Execution' (ఉరితీసేముందు) అని రంగము వ్రాసిరి. అందు వాన్‌జెటీ ఒక్కనిదే వచ్చు పాత్ర.

మరణము వచ్చి మీఁద విఱుచుక పడుచున్నప్పటి వాన్‌జెటీ ఆక్రందనమును, ఆక్రోశమును యథారూపముగ తీర్పవలెనను సంకల్పమును శ్రీ ఆచార్యులుగారు పొల్లుగ నిర్వహింతురు. మానవుని చేతఁకు లొంగనొల్లని ప్రకృతి విప్లవములు సైతము వీరిమనసు నాధిపత్యమును స్వీకరించి వీరి అభినయమున ప్రవాహిల్లఁగలవు. ఉపాధిపరిమితులు త్రెంచు ఆగామి మృత్యువు ఆనదంష్ట్రిపదను మెఱపులతో తొలుతనే వాన్‌జెటీని అలౌకిక వేదనావిషాదములకు లేపిపెంచినది.

ఇట ఒక్క సంగతి మఱవరానిది. వాన్‌జెటీ మన కిపుడెందులకు కావలసివచ్చెను? ఎందుల కాతఁడు పునఃపునర్జీవితుఁడై మన యెదుట మరణమునకై సమకట్టుచుండును? ఆతఁడు కేవలము మరణించినవాఁడని కాదు, ఒక ధర్మమునకై మరణించిన వాఁడు కనుక. ఎందరో మరణించిరి. ఇంతకాలపు స్మృతి యందు దెప్పటకైన, ఏకీభవించి పదుగలవారైన వచ్చి ముం దృష్టి నటునిభావితరూపమున పట్టవలసినంతటిగి కాదు. ఆతఁడు ధర్మబలి అన్న యీభావరాజమును, సిలువను బడ్డ యేసుక్రీస్తు ముద్రవంటిది సంజ్ఞపఱచి శ్రీ ఆచార్యులుగారు అద్భుతముగ సూచించిరి. ఇది యెంతయు భావుకమగు కౌశల మనవలెను.

కాని యీపాత్ర తుదివఱకుఁ గడచి ఒక్కటిగా మన మనసునందలి ముద్రను తడవి చూచినచో, ధర్మబలి యను వీరునికంటె మరణోన్ముఖుఁడగు జీవి వ్యాపార మెక్కువగ తనలో వ్రాసిపెట్టినది. 'ఆతఁడు మానవమాత్రుఁడు: బ్రతికియుండఁగ ఎంత ధైర్యమునకైన వర్తించి యుండవచ్చును; ఆసన్నమృతి యైనపుడు మాత్రము, నొకపకు దుర్బలుఁడే కావచ్చును., కాని ఆతఁడుమాత్రము మరణము ఇష్టముతో స్వీకరింపనివాఁడా? నీ వెపుడైన ఆ అవస్థయం దెవ్వరినైన చూచియుంటివా?' అని ఒకవాదము. తాను చిన్ననాఁట ప్రేమించిన ఇటలీయింటి పూవులు మొదలు కొనియుస్మృతులు విప్పుకొని యేడ్చినాఁడు వాన్‌జెటీ. కాని అతఁడు తన దేశమునకయినను, తనతోడి కార్మికుల అవస్థకయినను ఏడ్చినాఁడు. 'కథాపరిణామమునుబట్టి, ఆతఁడు ప్రాణమిచ్చినాఁడన్న మాటనుబట్టియే, ఆతని మహదాశయము గుర్తింపఁబడును' అనియు ఒకవాదము.

భగత్‌సింగు ప్రభృతులు ఒక అవస్థయందు ఏడ్చియుందురన్న సాధ్యకల్పనకంటె, వారు (చూచినంతమట్టుకు) చాల ధైర్యముతో నుండిరన్నవార్త యెక్కుడు బలము కలదై, ఇట్టినాటకముల ప్రేరించు ప్రధానాశయమునకు చిక్కన యిచ్చుచుండ, వీరి ప్రదర్శనమున అట్టి అవకాశము తన ఉల్బణతను దుర్బలతకు మిక్కిలి లొంగనిచ్చినది.

Long live anarchy (అరాజకము చిరస్థాయి యగుఁగాక) అన్న వాక్యమే అంత్య సందేశము వీరి నోట నుండి చూచినచో అది దీక్షామంత్రత్వముకంటె ఉద్వేగప్రలాపత్వముపా లెక్కువ చూపఁగలదు.

అస్పృశ్యమైన పరమాశయమును, ప్రకృతికార్యవాహినులను ఒక్కబిందువున కెత్తిచూపును కళ. ఆ అవస్థయందు దాతఁ డేమేమి చేయునో చూచి యథాతథముగ నిరూపించుటతో తీఱదు కళ. అది సూక్ష్మప్రకృతిని గవేషించుకొనును. సర్వసంచారిభావములు స్థాయిమెఱపు గీతలలో లీనమై, ఇతివృత్తతత్త్వమునుగూర్చి కృత్స్నమగు భావమును మిసల్చును కళ. ఈనాటకమున ఇట్టి సిద్ధి చూపలేనన్న, విపాదము పాలుపలయందు దిగనెడకవలెను.

వీరి సాత్త్వికాభినయమునను ఒక విశమగు ఆంగికత యున్న సందేహము. ముఖమున భావములు మెలఁగుటయే కాక, ఆభావముల నెంబడిని హస్తచలనాదులవలె, ముఖమున కండలు ప్రయత్నవశమున విస్ఫుటమగు నడవడికలు చూపుచుండును.

షేక్స్పియరుకవి తననాటకములు, ఒక్క అడుగు ముందిడినచో, తమకు తామే వక్రచిత్రములు కాఁగలుగు నంతటి సౌష్ఠవపరాకాష్ఠకు రచియించినాఁ డన్నారు. ఒక విధముగ వీరి అభినయము నిర్వహణము (రీతిమాట అటుంచి) అట్లు సాధ్యపరసీమలకంట పొటకరించుచుండును.

ఇందుల కొక్కనిదర్శనము. నేటి భారతదేశపు సినీమానటుని అభినయశక్తికలను వీరు వక్రనిరూపణము కావించి చూపినవెనుక, వీరి అభినయముమాత్ర మట్లు లేదా అని కొందఱు ప్రశ్నించుకొన్నారు. కాని, రసావేశముమాట మఱవనపుడు, అది యంతయు వైదగ్ధ్యమునే నుడువుచున్న దని స్వీకరింపవలెను. వీరి అభినయము ఒక్కనిమిషమే ప్రవర్తించినను, మనసును లాగివైచు నంతటి పటిష్ఠమైనది.

కొం. జ.

---

# బసవపురాణము వెల 2-8-0

గ్రంథకర్త:—పాల్కురికి సోమనాథకవి పరిష్కర్త:— వేటూరి ప్రభాకరశాస్త్రి గారు

పంద్రెండవ శతాబ్దమున వెలసిన శైవమతప్రతిపాదకమగు ద్విపదకావ్యము. ఇందు శైవమతోద్ధారకు డగు బసవేశ్వరునియు, తత్పూర్వులు, తత్సమకాలీనులు నగు శివభక్తులయు చరిత్రములను సరసముగను, పాఠకులు మనసుకరగి తన్మయులగునట్లుగను కవి వర్ణించినాడు. గ్రంథమున మృదుమధురము లగు జానుదెనుగు పలుకుల జాలువార్చి రచనమున ముద్దులు గురిపించినాడు. గ్రంథము భిన్నభిన్నమండలములకు జెందిన పెక్కు తాళపత్రమాతృకలతో సరిచూచి పరిష్కరింపబడినది. పాఠాంతరములు సూచింపబడినవి. పరిష్కర్త రచియించిన అమూల్యమగు పీఠిక (129 పుటలు) ఇందుగలదు. ఆకాలపుటపూర్వసారస్వతచారిత్రకవిశేషముల లెక్కకు మిక్కిలిగ నందు పరిష్కర్త యేర్చికూర్చినారు. విద్యార్థిలోకమునకు, ఆధునికకవికుమారులకు నిది యత్యంతోపకారకము.

మేనేజరు: ఆంధ్రగ్రంథమాల, 6-7, తంబుశెట్టివీథి, జార్జిటవున్, చెన్నపురి.



## మదరాసులో ఆంధ్రుడు

మదరాసు ఆంధ్రరాజ్యములోనిది. అది యాంధ్ర రాజువలన ఆంగ్లేయుల కీయబడినది.

మదరాసు నేడు, అరవదేశమున కెంతసమీపమో, ఆంధ్రదేశమునకును అంతసమీపమే. మఱియు నది అరవల కెట్టి గమ్యస్థానమో ఆంధ్రులకును అట్టి గమ్యస్థానమే; గాని 'మద్రాసీ' అనిన అరవ గాని ఆంధ్రుడు కాడు.

మదరాసున ఆంధ్రులసంఖ్యయే యధికము. వర్తకముగూడ హెచ్చుభాగము ఆంధ్రుల చేతిలోనే యున్నది; గాని యచ్చట అరవమునకు గల చెల్లుబడి ఆంధ్రమునకు లేదు. అరవలకు గల పలుకుబడి ఆంధ్రులకు లేదు.

మదరాసున ఆంధ్రభోజనము అందని పండు. ఆంధ్రు లెవరును అక్కడ హోటలు పెట్టి నెగ్గలేదు; గాని గోకవరమువంటి మన్యప్రముఖమున, బరంపురము వంటి తూర్పుసరిహద్దునగూడ అరవభోజనము సమృద్ధి.

మదరాసున అరవ స్వదేశీయునివలె స్వేచ్ఛగ సంచరించును. ఆంధ్రుడు విదేశీయునివలె జంకుచు పరిభ్రమించును.

మదరాసున పాఠశాలలలో ఆంధ్రమునకు చోటు లేదు.

ఏల?

మదరాసున స్థిరపడియున్న ఆంధ్రులలో జాత్యభిమానము తక్కువ. ఆంధ్రోద్యమజనకుడనని చెప్పుకొనుచు ఉత్తరాదినుండి వెళ్లిన ఆంధ్రుడు ఎత్తెత్తి కాళ్లు వేసికొనుచు వారికి దవ్వుదవ్వుల నిలుచును; గాని వారితో గలసిమెలసి కూడగట్టుకొని ఆంధ్రత్వమునకు పురి యెక్కింపడు.

ఆంధ్రునకు ఉత్సాహశక్తి యధికమే; గాని అరవకుగల ఓపిక లేదు. ఆంధ్రునకు ప్రభుశక్తి మిక్కుటమే; గాని అరవకుగల పురుషకారము లేదు. ఆంధ్రునకు మంత్రశక్తియు హెచ్చే; గాని అరవకుగల ప్రయోగకౌశలము లేదు.

ఆంధ్రునకు తెలివి యున్నది; గాని అరవకు గల శ్రద్ధ లేదు. ఆంధ్రునకు ప్రతిభ యున్నది; గాని అరవకు గల దీక్ష లేదు. ఆంధ్రునకు ఆసక్తి యున్నది; గాని అరవకు గల ఏకాగ్రత లేదు. ఆంధ్రునకు స్థైర్య మున్నది; గాని అరవకు గల సాహసము లేదు.

ఆంధ్రున కలసభావ మధికము. నేటిపని రేపటికి నిలువచేయును. అరవకు చురుకుపా లధికము. రేపటి పనిగూడ నేడే ప్రారంభించును.

ఆంధ్రుడు శుష్కవాది. నిత్యశంకితుడు. అరవ కార్యవాది. పట్టినపట్టు విడువడు. ఆంధ్రుడు దారిగను కొనిపోడు. పోయి కాలు నిలువద్రొక్కుకొనడు. అరవ శరవేగమున బోవును. పోయి స్థిరపడును.

అరవ ఎస్కిమోల నడుమకు గూడ పోయి వ్యాపారము చేయును. ఆంధ్రుడు మద్రాసున గూడ నుండలేడు.

అరవ క్రియాసిద్ధికి చేయరానివియు చేయును. ఆంధ్రుడు కార్యము చెడుచున్నను చేయవలసినవియు చేయడు.

అరవ స్వస్థానదేశభాషాభిమాని. ఆంధ్రుడు అనుకరణపరాయణుడు.

ఉభయుల తత్త్వమున నింత వ్యత్యాస మున్నది. ఈ వ్యత్యాసము ప్రవృత్తిలో నంకితమై పర్యవసానమునగూడ ప్రతిఫలించుటలో నాశ్చర్య మేమున్నది?

ఇట్టిస్థితిలో ఆంధ్రుడు మదరాసున తనసంఖ్యకు తగిన ప్రాబల్యమును, తనయైశ్వర్యమునకు తగినపలుకుబడిని, తనప్రతిభకు తగిన పదవిని యెట్లు పొందగలడు?

ఇరువదియేండ్లనుండి ఆంధ్రోద్యమము నడచుచున్నది; కాని ఆంధ్రుని ప్రవృత్తిలో మార్పు కనబడదు. మద్రాసులో ఇప్పటికిని "నేనున్నాను" అని ఆంధ్రుడు తలయెత్తగల స్థితిలో లేడు.

* * * * *

## దేవాలయ ప్రవేశము

అస్పృశ్యులు దేవాలయములలో ప్రవేశింపబోవుచుండుటయు, వారికి అగ్రజాతులవారడ్డు తగులుచుండుటయు, అంతట సత్యాగ్రహము ప్రారంభమగుచుండుటయు, దానిమీద పోలీసులు కలుగజేసికొనుచుండుట — నేడిట్టి సంఘటనలు దేశమునందన్నివైపులను జరుగుచున్నవి.

అగ్రజాతులు నిమ్నజాతులవారిని ఆలయప్రాకారములలోనికిగూడ రానీయకుండుట నిజమే; అయితే దేవాలయముల సందర్భమున ఈ అస్పృశ్యత అగ్రజాతులకు — తుదకు బ్రాహ్మణులకుగూడ నున్నది.

శివాలయములలో బ్రాహ్మణేతరులు గర్భాలయములు ప్రవేశింపగూడదు. వైష్ణవులు శివాలయములకు రానేరారు. ఇది యిట్లుండ విష్ణ్వాలయములలో బ్రాహ్మణేతరులకే గాదు స్మార్తులకుగూడ గర్భాలయములలో ప్రవేశము లేదు.

మానవులు తనవిశ్వరూపమును గ్రహింపజాలరని కరుణించి పరమేశ్వరుడు సగుణుడై విగ్రహరూపమున నెలయుచుండ మన ధర్మశాస్త్రకర్తలు ఆవిగ్రహములను మనకిట్లు అందకుండ జేసినారు.

అందరును మసీదులో నమాజుచేయుచుండవలయునని మాహమ్మదీయమతమును, చర్చిలో ప్రార్థనలు చేయుచుండవలయునని క్రైస్తవమతమును, ఇంక నిట్లే ఆయా పద్ధతుల ననుసరించి ఈశ్వరుని సేవింపవలయునని యితరమతములును ప్రజలను ప్రోత్సహించుచుండ మనమతము "మీరు దేవాలయములలో ప్రవేశింపకూడ"దని మనలను నిరుత్సాహపరుచుచున్నది.

వాస్తవముగా నిది ఈశ్వరనిర్ణయమగునా? ఇది యీశ్వరనిర్ణయమే యగునెడల ఈశ్వరునకు సర్వాంతర్యామిత్వము సిద్ధించునా?

భారతీయ ధర్మనిర్మాతలు పూర్వ మెట్టి పరిస్థితులలో నిట్టిధర్మనిర్ణయము గావించిరో గాని, నేడిది పూర్తిగా విషమించినది.

మనదేశమున మతాంతరులు మనకంటె చాల స్వల్పసంఖ్యాకులై యున్నారు. ఆ స్వల్ప సంఖ్యాకులలోను కొందరు — కొందరుమాత్రమే — మనదేవతల యుత్సవములను చెదరగొట్టుచున్నారు. మన దేవాలయముల నపవిత్రము చేయుచున్నారు. కూలగొట్టుచున్నారు. కాని బహుళ సంఖ్యాకులైయున్న మనవారు ఆదిక్కులను తొలగించుకొనకున్నారు.

కారణ మేమి?

మన దేవాలయముల విషయమున సమగ్రాధికారులైయున్న బ్రాహ్మణుల సంఖ్య చాల స్వల్పము. పైగా బ్రాహ్మణులు యోధజాతివారు కారు. వంశకర్తలైన మహర్షులకాలమునుండియు బ్రాహ్మణులు ఇతరులచే పీడింపబడుట, ప్రభువులు ఆపీడను తొలగించుట జరుగుచువచ్చినది; గాని బ్రాహ్మణులు తామై యెప్పుడును వానికి ప్రతిక్రియ చేసికొనియుండలేదు. నేటిబ్రాహ్మణులు చేసికొనదలచినను సత్తా చాలనివారగుటవలన నేమియు లాభము లేదు.

అయితే బ్రాహ్మణేతరులు లేరా అనిన, ఉన్నారు వారధికసంఖ్యాకులగుట నిజమే. ఈ దేశముయొక్క బంధమోక్షములకు నేడు వారే కర్తలై యుండుటయు నిజమే. కాని వారికి మన దేవాలయములలో ప్రవేశము లేదు. వారికి మన దేవాలయములయెడల 'నాది' అను మమకారము లేదు.

మన దేవాలయములను నిర్మింపించినవారు దేశీయులు బ్రాహ్మణేతరులే; కాని బ్రాహ్మణుల స్వాధీనముచేయుటకే వారు వాటిని నిర్మించినారు. ముఖమంటపమున నుంచుటకు మాత్రమే వారి కర్హత.

మన దేవాలయములను ఎవరు నిర్మించినారో, ఎవరు నిర్మింపించినారో వారు వాటిలో ప్రవేశింపగూడదు. మన ధర్మ నిర్ణయ మట్లున్నది.

మనము క్రైస్తవుల చర్చిలో ప్రవేశింపవచ్చును; మహమ్మదీయుల మసీదులో ప్రవేశింపవచ్చును; గాని వాటిలో క్రైస్తవులకు మహమ్మదీయులకు నుండు స్వాతంత్ర్యము మనకు లేదు. వాటిలో వారి కనుసన్నల ననుసరించియే మనము మెలంగవలయును.

మన దేవాలయములలో మన తోడిహిందువులే యగు మన బ్రాహ్మణేతరుల స్థితికూడ అట్టిదే.

చిరకాలము దేశమునకు ప్రభువులైయుండిన బ్రాహ్మణేతరుల గతియే యిట్లున్నపుడు మొదటినుండియు ఊరినడుమ నివసించుటకే గాదు, సంచరించుటకు గూడ అధికారము లేని అస్పృశ్యులు దేవాలయ ప్రాకారముల లోనికి గూడ రానీయకపోవుటలో ఆశ్చర్య మేమున్నది?

కాని బ్రాహ్మణేతరులును అస్పృశ్యులునే శూరులును, యోధులును. బాహుబలము, రక్షణము — వీటి ప్రసక్తి వచ్చినప్పుడు వారికే గాని ప్రాజాపత్యము బ్రాహ్మణులకు లేదు.

బ్రాహ్మణేతరులకు మన దేవాలయముల యెడల మమకారము లేదని చెప్పియున్నాము; కాని జరుగుచున్నంతవరకైన రక్షణము వారివలననె జరుగుచున్నది.

"అయితే పూర్తిరక్షణమే వా రెందుకు చేయరు" అనిన, "ఎందుకు చేయుటలేదు?"

ఈ యుద్దేశముతోడనే వారు కొంతవరకును తొలగియుంటున్నా రని నేను చెప్పను. మన మతధర్మములు వారి రక్తమున ఎంతవరకు జీర్ణమైనవో అంతవరకే వారు వాటి నాచరించుచున్నారు. అంతవరకే వాటిని కాపాడుచున్నారు.

క్రైస్తవధర్మము, ఇస్లాముధర్మము క్రైస్తవులకు, మహమ్మదీయులకు చక్రవర్తి మొదలు గులాము వరకును సమానములు. సమగ్రధర్మాచరణము వారిలో కొందరికి నిషిద్ధము కాలేదు. చర్చిలోను, మసీదులోను వారి కందరికిని సమానమైన అధికారమే యున్నది. చక్రవర్తి వాటిలో నెంతవరకు పోగలుగునో, ఏమి చేయగలుగునో క్షుద్రకార్మికుడు గూడ అంతవరకును పోగలడు, అది చేయగలడు.

కావుననే వారి కందరికిని మత మనిన సమానభక్తి, సమానశ్రద్ధ, సమాన మమకారము, సమానాభిమానము. మతధర్మసూత్రములచే సమానముగ బంధింపబడి యుండుటవలన ఆత్మరక్షణ మనిన వారికి మతరక్షణమే.

మన కట్టి యదృష్ట మేది?

సాటిమతములు 'అసంపూర్ణములు', 'అసభ్యములు' అని నిరసించుచున్న మనయొక్క మతము ఎంత సంపూర్ణముగ నున్నది? ఎంత సభ్యముగ నున్నది?

నేడు కాల మంతయు పునర్నిర్మాణము పొందియున్నది. మతములు — ముఖ్యముగా మన మతము గూడ పునర్నిర్మాణము పొందవలసియున్నది.

ఈ కారణమువలననే నేడు హిందూమహాసభ మన మతమును సంఘమును సంస్కరింప బూనుకొనియున్నది. ఈ కారణమువలననే హిందూమహాసభా ప్రవర్తకులలో ప్రముఖులగు డాక్టరు మూంజీగారు "అస్పృశ్యులు దేవాలయములలో ప్రవేశించి ఆరాధన చేయుటవలన దేవాలయములకును, దేవతావిగ్రహములకును ఎట్టి అపవిత్రతయు కలుగదని పూర్వాచార పరాయణులు అందరును గోపురాగ్రముల నధిష్ఠించి గంభీర ఘోషణములొనరింపవలయు"నని యాదేశించుచున్నారు.

దీనిని అనుసరింపనిచో మనకు అధఃపతనమే; గాని వికాసము కలుగదు. —శాస్త్రి.




# గ్రంథస్వీకారము

## శ్రీమదాంధ్రచంపూరామాయణము

గ్రంథకర్త: కొన్నాడ కృష్ణమూర్తిగారు, రానోలు, తూర్పు గోదావరిజిల్లా. క్రౌను సైజు: ౨౨౦ పుటలు. వెల రు ౧-౪-౦.

---

## గురుబోధామృత రాజయోగసారము

కర్త: అల్లూరి వెంకట్రామ రాజయోగిగారు. డెమ్మీసైజు: ౧౪౧ పుటలు. వెల ౧౨ అణాలు. నివాసము: వేలూరి వేణుగోపాలమూర్తిగారు, గునుపూడి భీమవరం, ప. గోదావరి.

---

## ఠాకూర్ దుర్గాదాస్

గ్రంథకర్త: యస్. ఆర్. రావుగారు. సరస్వతీ గ్రంథమాల (౨౭-౨౯), కాకరపర్రు, తణుకు తా. ప. గోదావరి. డెమ్మీసైజు: ౧౫౨ పుటలు. వెల రు౧-౮-౦.

---

## (౧) కవిజనరంజనము

అడిదము సూరకవి ప్రణీతము. సంపాదకులు: గంటి సూర్యనారాయణశాస్త్రిగారు. క్రౌనుసైజు: ౬౨ పుటలు (యాంటిక్ కాకితము). వెల రు ౧.

## (౨) విష్ణుపురాణము

గద్యకావ్యము: తుపాకుల అనంతభూపాలకవి ప్రణీతము. క్రౌనుసైజు: ౧౨౧ పుటలు. వెల ౧౨ అ.

## (౩) మాతృపూజ

ఆధునికకవుల ఖండకావ్యములు కొన్ని ఏర్చి కూర్చిన చిన్న సంపుటము: 'ఆంధ్రరత్న దుగ్గిరాల గోపాలకృష్ణయ్యగారి జ్ఞాపకార్థము'. క్రౌను సైజు: ౪౦ పుటలు. వెల ౪ అ.

పై మూడుగ్రంథములకు ప్రకాశకులు: రామ్ జెయ్ అండు కో., ౧౩ తంబుచెట్టివీధి, మదరాసు.

---

## అడిదము సూరకవి

కృతికర్త: అడిదము రామారావుగారు, సీనియర్ తెనుగుపండితుడు, మహారాజావారికాలేజీ, విజయనగరం. క్రౌనుసైజు: ౧౩౩ పుటలు. వెల రు ౧.

---

## (౧) సూచీముఖి దర్పణము

డెమ్మీసైజు: ౧౧౭ పుటలు. వెల రు ౨-౭-౦.

## (౨) మృత్యునాడి

డెమ్మీసైజు: ౬౩ పుటలు. వెల రు ౧.

పై రెండుగ్రంథములకు కర్త: వైద్యరత్న డా॥ పండ్రంగి సుబ్బారావుగారు, కాకినాడ.

---

## సాధనప్రసంగము

అనువాదకుడు: తిపిర్నేని సుబ్రహ్మణ్యముగారు, గుడివాడ, కృష్ణాజిల్లా. (వంగభాషాగ్రంథమునుండి అనువాదము.) క్రౌనుసైజు: ౭౨ పుటలు. వెల ౭ అణాలు.

---

## శ్రీమచ్ఛంకరాచార్య చరిత్రము

సంపాదకులు: కనుపర్తి మార్కండేయ శర్మగారు, స్వార్థప్రకాశినీ సంపాదకులు, బృందావనం, కీలుపాకు, మదరాసు. డెమ్మీసైజు: ౪౦ పుటలు. వెల తెలియదు.

---

## హజరత్ రాబి అహ్వారి చరిత్రము

ఉర్దూనుండి అనువాదము. అను: యస్. ఇస్మాయిల్ షా గారు, చిన్నమసీదు, రాజమహేంద్రవరము. క్రౌనుసైజు: 30 పుటలు. వెల ౨ అణాలు.

---

## నీతిశ్లోక రత్నావళి

పదవిభాగ టీకాతాత్పర్యసహితము. రచయిత: వేదము సూర్యనారాయణశాస్త్రిగారు, వెంకటగిరి మహారాజావారి కాలేజి హైస్కూలుసహాయోపాధ్యాయులు, నెల్లూరు. క్రౌనుసైజు: ౧౦౬ పుటలు. వెల ౧౦ అ.

---

## సుదతీసుభాషితము

రచయిత: ఎడ్లపల్లి దేవయ్యచౌదరిగారు, పచ్చలతాడిపర్రు, పొన్నూరుపోస్టు, గుంటూరుజిల్లా. క్రౌనుసైజు: ౧౬ పుటలు. వెల ౨ అణాలు.

---

## దేవుడు

గీతమాలిక. జ్ఞానాంబా విరచితము. ప్రకాశకులు: పడమటలంక సాధనాశ్రమ పరిపాలకులు. చిన్నిసైజు: ౨౧ పుటలు.

---

## ఆర్యవైశ్య సిద్ధాంత పంచాంగము

ఆంగీరస. ప్రణేత: జవ్వాజి సుబ్బారాయగుప్త సిద్ధాంతిగారు, వైశ్యసేవాసంఘ కార్యదర్శి, అనంతపురం.

---

## ప్రకీర్ణాఽధికారః

సంస్కృతము. శ్రీ వైఖానసభగవచ్ఛాస్త్రే, భగవద్భృగుమహర్షి ప్రోక్తాసు, సంహితాసు: క్రియాపాదః ప్రథమాది సప్తత్రింశ పటలాన్తః. ప్రకాశకులు: పె. అ. శ్రీశైలనాథులు అండు సన్సు, శ్రీ వైఖానస సంప్రదాయ గ్రంథాలయము, నెం. 8 రామలింగ మొదలివీధి, మింట్ బిల్డింగ్సు పోస్టు, మదరాసు. డెమ్మీసైజు: ౫3౬ పుటలు. వెల రు ౫ లు.

---

## ఈశావాస్యోపనిషత్

సంస్కృతము. శ్రీ శాంకరభాష్య సంయుత. సంపాదకులు: వై. సుబ్రహ్మణ్య శర్మగారు, అధ్యాత్మ ప్రచార కార్యాలయము, చామరాజపేట, బెంగుళూరు సిటీ. క్రౌనుసైజు: ౪౨ పుటలు. వెల ౬ అణాలు.

---

## ఆయుర్దాయ యోగము

(జ్యోతిష జాతక గ్రంథము.) గ్రంథకర్త: విద్వాన్ తొగర్చేటి భాస్కరశాస్త్రిగారు, ప్రకాశకులు: మిస్. వి. నరసింహముగారు, c/o వి. అచ్యుతంగారు, డిప్యూటీ కలెక్టరు, ఆదవాని.

---

# పత్రికాస్వీకారము

## ఆంధ్రజ్యోతి

తెలుగుమాసపత్రిక. సంపాదకులు: కె. గురుబ్రహ్మ రావుగారు, మోల్మేన్ (బర్మా). సంపుటము ౧, సంచికలు ౧, ౨ (మార్చి, ఏప్రిల్ ౧౯౩౨). డబిల్ క్రౌనుసైజు; ఇరువదేసి పుటలు. సాలు చందా రు 3; విడిప్రతిక వెల ౪ అ; ఇది బర్మాఆంధ్రులవిషయములకెక్కువ వినియోగపడుచున్నది. నడుమనడుమ పద్య వ్యాసములును, ఛాయాచిత్రములునుగూడ కలవు.

---




ఆంధ్రుల చరిత్ర—

శ్రీ చిలుకూరి వీరభద్రరావుగారు

ప్రపంచమున నెల్ల వస్తువులు పరమాణుమయములు. అణువులగుణస్వభావానుసారము తన్మయములగు వస్తువుల గుణస్వభావము లేర్పడును. తేజస్సునందలి పరమాణువు లల్పతేజస్కములయ్యును స్వయంప్రకాశమానములు, పరప్రకాశనశీలములు. వాని సముదాయము, అధిక తేజస్కమయి స్వయంప్రకాశమానము, పరప్రకాశనశీలము నగును. అట్లే దేశమునందలి వ్యక్తులు పరమాణువులు. తత్సముదాయమే దేశము. వ్యక్తులచరిత్రమే దేశచరిత్రము. ఏ దేశమున కేని తచ్చరిత్రము మరుగుపడి యున్నంతకాలము సాటి దేశములతో సమానమగు గౌరవము కలుగజాలదు. తన దేశము నౌన్నత్యమే తన యౌన్నత్యము. తన దేశపు గౌరవమే తనగౌరవము. తన దేశము చరిత్రను దెలియనివాడు తన యౌన్నత్యమును తెలియనివాడు. కావున సర్వవిధముల ప్రతివ్యక్తియు తన పూర్వులయొక్కయు, తన సంఘముయొక్కయు, తన దేశముయొక్కయు, పూర్వపుచరిత్రను దెలిసి,తన దేశము నౌన్నత్యమును సాటి దేశములకుచాటి తన దేశపు గౌరవమును నిలుపుకొను టవశ్యకర్తవ్యము. శ్రీయుతులు చిలుకూరి వీరభద్రరావుగారీకర్తవ్యమును గుర్తించి, తమధర్మమును నిర్వహించి తమనామము నాంధ్రులకేకాక, ఇతర దేశముల చరిత్ర కారులకును చిరస్మరణీయముగా నొనర్చుకొనినారు.



శ్రీయుత చిలుకూరి వీరభద్రరావుగారు

ఆంధ్రులు తమయొక్కయు, తమ దేశముయొక్కయు చరిత్రమునకయి తడవులాడుకొను చుండినాడు తొలుదొలుత తచ్చరిత్రమును రచియించి వారి కరముల నిడి ఆంధ్రులయు,

ఆంధ్రదేశము యొక్కయు ప్రశస్తిని, తద్ద్వారమున తన్నును, వెలయజేసిన సుకృతి వీరభద్రరావుగారు. చిరుతుకప్రాయముననే వీరు తదేకదీక్షతో చరిత్రపరిశోధనమునకు దొడగిరి. చిరకాలము వీరొనర్చినయపారపరిశోధనలఫలము లాంధ్రులచరిత్రసంపుటములు. వీరిబుద్ధి సత్యాన్వేషణపరాయణము, పక్షపాతరహితము నయినది. పరిశోధనమువలన తేలిన సిద్ధాంతములు తమకు సత్యమని తోచినయెడల నొరులయిష్టానిష్టముల లెక్కింపక వానిని ప్రకటించు స్వభావము వీరికి గలదు. సత్యము వెల్లడియగుటకు సమ్మతింపని కొందరు తరుచు దూషించుచున్నను జంకక సత్యమార్గమునే యనుగమించిన ధైర్యశాలి వీరు. చరిత్రనిర్మాణవిషయమున నిట్టిదీక్ష, ఇట్టి సత్యైకదృష్టి, ఇట్టి ధైర్యము కలవా రాంధ్రదేశమున నింకొకరు గానరా రన్న సాహసము కాజాలదు. నాటివరకు కుపలబ్ధములయిన పరికరములతో చరిత్ర నిర్మాణమును గావించి తమ యున్నతిని తమకును, లోకమునకును ఎరుకపరిచిన యీప్రథమాంధ్ర చరిత్రకారుని ఋణము నాంధ్రు లెట్లును తీర్చుకొనజాలరన్న వింతకాదు. తరువాతి చరిత్రపరిశోధకులకు వీరి యానాటి పరిశోధనము మార్గదర్శకము, ప్రోత్సాహకము నయినది. ఆంధ్రుల హృదయసీమల చరిత్రజిజ్ఞాసను, చరిత్రాభిమానమును మొలకెత్తించినది. చిక్రోడసికతాన్యాయము ననుసరించి శ్రీ ఆంధ్రమహాసభ వీరభద్రరావుగారిని 'చరిత్ర చతురానన' బిరుదముతో బహూకరించి తన్నుదాను గౌరవించుకొనినది. వీరు చరిత్ర గ్రంథనిర్మాతలు మాత్రము కారు; చరిత్రా సిద్ధాంతముల నూతగాగొని కొన్ని సాహిత్య గ్రంథములనుకూడ రచియించి వాఙ్మయమును పెంపొందించినవారు.

వీరభద్రరావుగారి యాంధ్రుల చరిత్ర సంపుటములు వెలువడి పెక్కుసంవత్సరము లయ్యెను. వీరిబడి ననేకులు బుద్ధిమంతులు చరిత్ర పరిశోధనమునకు గడగిరి.* వారి పరిశోధనములవలన ఎన్నియో నూత్న విషయములు బహిర్గతము లయినవి. వానివలన పూర్వసిద్ధాంతములు పెక్కులు తారుమారయినవి. కావున నాంధ్రుల చరిత్ర సంపుటములకు పునస్సంస్కరణ ముద్రణము లావశ్యకము లయ్యెను. వెనుకటి ముద్రణము గ్రంథములు చిరకాలము క్రిందటనే చెల్లిపోయినను పునర్ముద్రణము నీ చరిత్ర గ్రంథము లిప్పటికిని గాంచజాలకపోయినవి. వీరభద్రరావుగా రిపుడు, నేటివరకును చారిత్రక ప్రపంచమున వెలువడిన క్రొత్తసిద్ధాంతములనెల్ల సమన్వయించి ఆంధ్రులచరిత్ర సంపుటములను సంస్కరింప నున్నారనియు, గ్రంథము మునుపటికంటె రెండింత లధికముగా పెరుగుననియు

* అట్టివారిలో పేర్కొనదగినవారు శ్రీ మల్లంపల్లి సోమశేఖరశర్మ ప్రభృతులు కొందరు. వారు తగిన ప్రోత్సాహములేక ప్రఖ్యాతిని గనజాలకున్నారు. శ్రీశర్మగారొనరించిన అమూల్య పరిశోధనములయొక్క విలువ భారతి మూలమునను, ఇతరపత్రికలమూలమునను, ఆంధ్రలోకమునకు దెలిసియేయున్నది.

తెలియవచ్చెడిని. ఈ వార్త యాంధ్రలోక మున కత్యంతానందసంధాయకము.

వీరభద్రరావుగారిపుడు సప్తతివర్ష పరిమిత వయస్కులు. శరీరముపలితశ్మశ్రు కేశయుతము. కాని ముఖమున కార్యదీక్ష ప్రతిఫలించుచు న్నది. వీరియందు నవయువజనోత్సాహము నిండారియున్నది. వీరికార్యదీక్ష కిపుడు వీరు పతిత్ గ్రంథసంస్కరణార్థము తమ నివాస మును చెన్నపురమున నేరుపరుచుకొని కావిం చుచున్న కృషియే నిదర్శనము. వీరు గ్రంథము నచిరకాలమున ముద్రణమునకు సిద్ధముచేయ గలరు. కాని, పెక్కుసంపుటములుగా పెరుగ నున్న యీగ్రంథముయొక్క ముద్రణము బహుళవ్యయ మూలకము; వీరు స్వయముగ భరింపశక్యముకానిది. దీనికిచరిత్రాభిమానులు, దేశాభ్యుదయాకాంక్షులు నగు నాంధ్రులు పూనుకొనవలయును. ఈ యవకాశము పోగొ ట్టుకొనినచో తమకు లభింపనున్న అమూల్య మగు తమ చరిత్రను కోలుపోవువారగుట నిక్కము. ఇట్టి పరిష్కరణ కార్యమును నిర్వ హించు సామర్థ్యముగల సిద్ధహస్తు లింకొక రాంధ్రదేశమున నిప్పటికి కానరారు. కావున సులభమగు నీయవకాశము నాంధ్రులెట్లును పోగొట్టకొనజనదు. 'శుభస్యశీఘ్రమ్'అన్నారు పెద్దలు. మీదు మిక్కిలి ఎంత యుత్సాహ వంతులయినను, కార్యదీక్షాపరాయణు లయి నను శ్రీ వీరభద్రరావుగారు వయోవృద్ధు లను విషయము నాంధ్రులు మరువజనదు. ఇక నాంధ్రలోక మీకార్యము నెంతశీఘ్రముగ నిర్వహించి తన వ్యక్తిత్వమును నిలువబెట్టికొన గలదో చూతముగాక!

* * * *

**చిన్నతరగతుల పాఠ్యగ్రంథములు :**

తద్రచయితలు

ప్రైమరి, సెకండరి పాఠశాలలలో చదువు బాలురకు ప్రకృతము పాఠ్యములుగా నుపయోగింపబడుచున్న తెలుగుగ్రంథముల యందధికసంఖ్య కేవలము పనికిమాలినవయి యుండుట అత్యంతము శోచనీయము. వానిని చదువు చిన్నిబాలురకు సౌష్ఠవమగు భాష, విజ్ఞానము లభించుటకు మారుగా దుష్టమగు భాష, విపరీతజ్ఞానము లభించుచున్నది. ఈ విషయము విద్యాధికులగువారెల్లరకు దెలిసి నదియే. తరుచు పత్రికలయందట్టిపుస్తకము లనుగూర్చి వెలువడుచున్న విమర్శనలును దీనినే యుద్ఘోషించుచున్నవి.

గ్రంథరచయిత లసమర్థు లగుటచేతనే గ్రంథము లిట్టివగుచున్నవి. వారు ప్రైమరీ పాఠశాలయందో, సెకండరీపాఠశాలయందో, హైస్కూలునందో ఉపాధ్యాయులయియుండు టయో, విద్యాశాఖోద్యోగులగుటయో, లేక పై యుభయవిధములవారికి, బంధువులుగాని మిత్రులుగాని యగుటయో వారికి గ్రంథ రచనాసామర్థ్యము గల దనుటకు పరమ ప్రమాణముగా భావింపబడుచున్నట్లున్నది. కాని విషయౌచిత్యము, లోకజ్ఞత, భాషా పాండిత్యము, బాలకుల మనస్తత్త్వవివేకము,

రచనాసామర్థ్యము నావశ్యకములుగా భావింపబడునట్లు కానరాదు. నిష్ప్రయోజకము లగుటయేకాక దుష్ప్రయోజకము లగు నీగ్రంథముల యుత్పాదనసాహసమునకు ధనార్జనాసక్తి, కవియశఃకాంక్ష కారణములు కాదగును. ఈపుస్తకములను తప్పులకుప్పలుగా ముద్రించి ప్రకటించుప్రకాశకు లీసాహసమును ద్విగుణీకరించుచున్నారు. పాఠశాలలయందు పాఠ్యములుగా నిర్ణయింపబడుచున్న యీగ్రంథములే పాఠ్యగ్రంథ నిర్ణాయక సంఘమువారికి గల పాండిత్యమును, భాషాభిమానమును, ధర్మనిర్వహణ పరాయణతను బహు ముఖముల చాటుచున్నవి. ఇట్టి గ్రంథములు పాఠ్యములుగా నంగీకరింపబడుటకు గ్రంథకర్తలయు, ప్రకాశకులయు పలుకుబడియే కారణ మనుటకు వెనుదీయబనిలేదు. ఈపాఠ్యగ్రంథ నిర్ణాయకసంఘమునందలి సభ్యులుకూడ కొందఱు గ్రంథరచయితలు గలరు. వారి గ్రంథములు గుణదోషవిచారాతీతములు. అవి యన్నియు పాఠ్యగ్రంథములే. పాఠ్యగ్రంథ నిర్ణాయకసంఘము నేరుపాటుచేయు విధులు, తత్సంఘసభ్యుల కుండవలసిన విశేషలక్షణములు, ఆ సంఘము నధికారము, ధర్మనిర్వహణక్రమము మున్నగు విషయములు విశేషవిమర్శకు అవకాశమును గలిగించునవి. దానిస్థానము కొండొక్కచోట.

పైన పేర్కొనినవారు కాక యింకొక కోటికిచేరిన గ్రంథకర్తలును గలరు. ప్రకాశకులు తమ సామర్థ్యము ననుసరించి యల్పమాత్రధనము నొసంగి, విధిలేక దానిని స్వీకరించి, తమ యూరుపేరులను ప్రకటింప మానుకొని, గ్రంథములను రచియించి వారి కిచ్చువారలాకోటికి చెందినవారు. అట్టి గ్రంథములకు, విద్యాశాఖాధికారులు, కళాశాలోపాధ్యాయులు నేవో కొన్ని కారణములనగ తమ నామములను ఎరవిచ్చి వాని నమూల్యములుగ జేయుచున్నారు. కావున నవి శీఘ్రముగ చెల్లిపోవుట కవకాశము గలుగుచున్నది. ఈ పేరుల నెరవిచ్చువారికి గ్రంథముల గుణదోషములు మాటతో పనిలేనట్లు తోచును. వానిని కంటనైన చూడరేమో?

ఎవ్వరేని ఈ గ్రంథములను విమర్శించి వానిపసను బయలుపెట్టినచో వారిని ద్వేషైకదృక్కులనియు, రంధ్రాన్వేషణతత్పరులనియు దూషింతురు కాని గ్రంథకర్తలు తమ యనభిజ్ఞతను దెలిసికొనజాలకున్నారు. తమ గ్రంథములలోని దోషములను చేటలోని చెరిగ కాయలవలె స్పష్టముగా వివరించిచూపిన ను తెలిసికొనజాలనివారు గ్రంథరచయిత లగుట ఆంధ్రసారస్వతమున కీనాడుపట్టిన పీడ యైనది. ఈపీడ నివర్తియగుటకు మార్గములను సత్వరముగ జూచుకొను టాంధ్రుల కవశ్య కర్తవ్యము. కాదేని ఈతరమువారి మాట ఎట్లున్నను ముందుతరమువారిక లభింపగల యాంధ్రవాఙ్మయము కేవలము కృశీభూతమయి వికార స్వరూపమును జెందగలదు. ముందు రానున్న చేటును తప్పించుకొనజూచుట కిపుడే ప్రయత్నించుట సర్వథా శ్రేయము.

యూర.

బాలురు భావికాలమున విద్యాధికులయి వాఙ్మయమునభివృద్ధిగావించుట కుపకరించు గట్టిపునాదిని వేయుట విద్యాలయముల విధి. కాని అమలుననున్న విద్యావిధానమున నట్టిది మృగ్యము.

నేటి విద్యావిధానము లోపభూయిష్ఠము. ఇందు విద్యార్థుల సాహిత్యాభివృద్ధికిని, విజ్ఞాన సముపార్జనమునకును నవకాశము కానరాద నుట సాహసము కాదు. దీనివలన ఉపజ్ఞా సంపన్నమయిన నిశితబుద్ధి సైతము మొక్క వారిపోవుట సహజము. ఇక కేవలము సమూనాలకు ప్రతికలను తయారుచేయుటకయినను చాలిన జ్ఞానము లభించుచున్న నాశ్చర్యమును జెంద బనిలేదు. ఇది సర్వజన సువిదితము.

బాలురకు చక్కగా విద్యను బోధించుట కుపాధ్యాయులు ప్రాటకాపులు. కావుననే విద్యాదాతయగు నాచార్యుడు పితృతుల్యుడని యార్యోక్తి ఏర్పడినది. ఆత డేతీరున నెట్టి విద్యను బోధించునో ఆతీరున నట్టివిద్యయే బాలురకు పట్టుపడును. అదియే బాలుర భావి విద్యాభివృద్ధికి మూలము. అట్టివిద్యాబోధకు ప్రాటకాపులైనయుపాధ్యాయులు రచియించిన గ్రంథములు నికృష్టము లగుట న్యాయ్యేతర మని చెప్పనక్కరలేదు. ఇట్టి గ్రంథములే యధిక ముగా వెలువడుచుండుటవలన నన్ని పాఠశాల లలోను వానికి ప్రవేశము గలుగుచున్నది. ఒక్కపాఠశాలలో, ఒక్కయేడు, ఒక్కతరగతి బాలురు చదువు పుస్తకమును ఆ పాఠశాల యందే, మరుసంవత్సరమున, ఆతరగతికి వచ్చు బాలురకే చదువు భాగ్యము లభింపకుండును. గ్రంథముల గుణదోషవివేచన యక్కరలేకయే యీమార్పు జరుగుచుండును. ఇది గ్రంథకర్త లకు, గ్రంథప్రకాశకులకు, పాఠశాలాధికారు లకుమాత్రము చెందిన యొక రహస్య విశేషము. ఇది అపట్కర్ణము కాదు గాన నభేద్యము కాదు కాని అవాచ్యము, అప్రసక్తము నగును.

ఈ బాధకు లోనయినవి భాషాగ్రంథ ములు (వాచకములు) మాత్రమే కావు. ఆంగ్లమున రచియింపబడిన ఇతరశాస్త్ర— ప్రకృతి శాస్త్రము, భౌతికశాస్త్రము, రసాయనశాస్త్రము, చరిత్ర, భూగోళశాస్త్రము మొదలగునవి—గ్రంథము లన్నియును.

మొత్తమున తేలినది: నేటి పాఠశాలలు సంతలు; పాఠశాలాధికారులు తరుగరులు; గ్రంథకర్తలు, ప్రకాశకులు దుకాణదారులు; విద్యార్థులు అత్యధికముగ వెలనిచ్చి సరకు లనుకొని తలపయి తగులవేసికొని మోసి కొనిపోవువారు. వీనికి సొమ్మునిచ్చువారు వారిపోషకులు. ఈ సరకు వలని ఫలము పైన వివరింపబడినది. ఇది స్థితి. ఇక ఆంధ్ర మహాజనులు మున్ముందీ బాధ తొలగి తమ బాలురు విద్యావంతులయి వెలయుటకును, వాఙ్మయము వికాసమునొందుటకును వలసిన మార్పులు ప్రకృత విద్యావిధానమున జరుగు నట్లు సత్వరముగ ప్రయత్నింతురు గాక!

* * * *

## తెలుగు 'టాకీలు'

పాశ్చాత్యనాటకప్రదర్శనముల కవకాశములేని భారతదేశమునకు తన్నాటక ప్రదర్శన మానప్రతికృతులు (Cinemas) కొన్ని ఏండ్లకు పూర్వమే దిగబారినవి. నాటకప్రదర్శన ప్రతికృతులేయయ్యును, నాటకాంగమగు వాచికాభినయము వానియం దభావమగుటచే నవి ప్రేక్షకులకు రసానందానుభూతిని గలిగింపజాలకుండును. ఆంగికాభినయముకూడ తక్కువయన్న దోషముండదు. ప్రదర్శింపబడుచున్న నాటకరచనములు కళాసంపదతో నొప్పి సజీవములుగనున్నను ఈప్రతికృతులు కళాహీనములై నిర్జీవములుగ పొడకట్టుచుండును. ఇట్టి వానిని సచిత్రము లగు నవలలనుట సమంజసము. మంచినాటకమును చదివిననే చాలును, పాఠకు లందలివివిధపాత్రములతో నైక్యమును జెంది అందలి ఎల్లరసములను చూరగొని పరమానందమును జెందగలరు. షేక్స్పియరు మహాకవికృతము లగు నాంగ్లనాటకములు, శాకుంతలము, ఉత్తరరామచరిత్ర మున్నగు సంస్కృతనాటకములు నిట్టివిశిష్టగుణములతో విరాజిల్లుచుండుట సహృదయజనసువిదితము. క్రమముగ నీపాశ్చాత్యనాటకప్రదర్శన ప్రతికృతులవలె భారతీయ నాటకప్రదర్శనములకుగూడ ప్రతికృతులు తయారయినవి. వీనికయి పెల్లుగా సమకూర్పబడుచున్న ప్రకృతిరంగములతోపాటు అద్భుత, బీభత్స, భయానక రసముల ప్రవృత్తిగల క్రొత్తక్రొత్తరంగములు సృష్టింపబడి తదనుగుణము లగు కథాభాగములును కల్పితము లగుచున్నవి. పాశ్చాత్య నాటకప్రదర్శన ప్రతికృతులు తాత్కాలికముగ జనసామాన్యము నాకర్షించు స్వభావము గలవగుటచే వానికిని, క్రొత్త వెలువడిన భారతీయ నాటకప్రదర్శనప్రతికృతులకును బింబప్రతిబింబ భావము విరిగా సంప్రాప్తమయినది. కాని, పాశ్చాత్య ప్రదర్శనములయందలి మెఱుగు భారతీయ ప్రదర్శనములయందు కానరాదు. చివర కిట్టిమానప్రదర్శనము లోకవస్తకముగా మారిపోయినవి.

అంతట నాగక, లోపించిన వాచికము యంత్రములసాహాయ్యమున పాశ్చాత్యప్రదర్శనములకు తొలుత సమకూర్పబడెను. లోహమయ యంత్రముఖమున జనియించిన యీ వాచికాభినయము భిన్నభిన్నపాత్రకృతములునను, వైవిధ్యము స్పష్టముగా గానరాక, ఏకపాత్రకృతమువలెను, శ్రుతికటువుగను బరిణమించెను. వాచికాభినయ మేకపాత్రకృతమయ్యును అవస్థాభేదము ననుసరించి కంఠధ్వనితెఱంగుమారుచు తత్తదవస్థాజన్యములగు రసములను స్ఫురింపజేయుచు నాటకములకు సమగ్రతను సమకూర్చును. కాని బహుపాత్రములు వాచికాభినయము, ఆయాపాత్రములు వివిధావస్థలమాట యటుంచి, ఏకపాత్రకృతమువలె నున్నచో ప్రదర్శనము హృదయంగమముగ నెట్లు లుండగలదు? ఇంతియకాదు; ప్రదర్శనములయందు ఆంగిక వాచికాభినయము లైకకాలికములు కాక చాలభాగము ఒకదానికంటె నింకొకటి ముందుగనో వెనుకగనో జరుగుచుండును. ఇట్టి

వానికన్న మూకప్రదర్శనములే యింపుగ నుండును. ఇట్టిల్లల లోపబహుళ మగు నీ నూతనకల్పనము 'అయ్యవారిని జేయబోవ కోతిపిల్ల యయి కూర్చుండె' ననుసామెతకు గురియాయినది. ఇంతలోననే నీ నూతనకల్పనము భాగతీయప్రదర్శకప్రతికృతులకును ఎగ ప్రాకినది. ఈ ప్రదర్శనములయందు పై నుడివిన లోపములు బహుగుణితములుగ నున్నవి.

కళాకోవిదులగు ప్రాచీనులు నాట్యకళను సర్వాంగసుందరముగను, సంపూర్ణముగను, సహృదయహృదయరంజకముగను సమకూర్చి భారతీయుల కనుగ్రహించియున్నారు. కాని కళానభిజ్ఞులగు నటకులమూలమున నాటకప్రదర్శనములు జీవకళను కోలుపోయి ఆనందసంధాయకములు కాజాలకున్నవి. ఉత్తరహిందూస్థానమునందలి వివిధరాష్ట్రముల నాటకరంగములమాట యటుండ దక్షిణహిందూస్థానమునందలి ద్రావిడాంధ్ర కర్ణాటకాది నాటకరంగములలో నాంధ్రనాటకరంగమున ప్రకృతము కళ కొంకింతస్థానము క్రమముగ లభించుచుండుట కానవచ్చుచున్నది. సమర్థులగు నటకులుగాని, కాలదేశములకు సరిపడి ప్రజలకు ప్రబోధమును గావించుచు తదభివృద్ధి కుపకరించు నాటకములుగాని అధికముగా లేకుండుటచే కళావికాసమునకు నవకాశము వలసినంత దొరకకున్నది. ఇట్టి మార్పుసమయమున నాంధ్రనాటకరంగమునుకూడ 'టాకీ' పిశాచము పట్టినది. చిరకాలముననుండి సరియైన పోషణములేక కృశించి కృశించి శల్యావశిష్టమయి యున్న యాంధ్రనాటకరంగము మందమందగతి నొకింతపుష్టినిగనుపరుచుచున్న శుభసమయమున నీయంత్రోత్పన్నపిశాచము మరల దానిని కళాశూన్యమును, నిర్జీవమును గావింపగల దనుభీతి సహృదయులకు గలుగుట సహజము. కళ అనంతముఖముల వికసించు స్వభావము గలది. అల్పమాత్రావకాశముగల యంత్రములయందు బంధించినయెడల నద్దానికి వికాసము గలుగుటెట్లు?

హార్మోనియమువలన శ్రుతిస్వరూపజ్ఞానమును, గ్రామొఫోనువలన గాత్రమాధుర్యజ్ఞానమును మాపుమాసినవి. ఇంకను ఎన్నియో కళ లిట్లు యంత్రములపుట్టువువలన నామావశేషములు కావలసినస్థితికి వచ్చినవి; వచ్చుచున్నవి. యంత్రములవలన పొసగుచున్న ఈ కళాకార్శ్యమును కళాభిజ్ఞులు సహింపజాలరు.

యంత్రసృష్టి నంటబెట్టికొనియున్న అర్థవ్యయము, దారిద్ర్యము, నిరుద్యోగత, అనారోగ్యము మొదలగు నుపద్రవములు గీనివలనను గలుగగలవని వేఱుగ చెప్పబనిలేదు.

జనసామాన్యమునకు తాత్కాలికముగ వినోదకరము లయినను, విశిష్టోపద్రవకరములగు నీటాకీలను, సామర్థ్యము కొరవడినను దేశస్వాతంత్ర్యము, సంఘస్వాతంత్ర్యము, వ్యక్తిస్వాతంత్ర్యము నాకాంక్షించు నాంధ్రులు, ఆత్మహితము నెరుగజాలని పామరులవలె నిప్పుడే నెత్తిపయికి దెచ్చిపెట్టుకొన్నా రేల?

*     *     *     *

## శ్రీరామనవమి – శివరాత్రి

హిందువులకు శ్రీరామనవమి, శివరాత్రి తక్కిన యెల్లవ్రతములతోపాటు పవిత్రము లయినవి. శ్రీరామనవమిని స్మార్తులు, వైష్ణవులుకూడ భక్తిప్రపత్తులతో నాచరింతురు. శివరాత్రిని స్మార్తు లాచరింతురు కాని వైష్ణవు లాచరింపరు. ఇది జరుగుచున్న పద్ధతి. ఈ వ్రతదినములందు సెలవొసంగుపట్ల ప్రభుత్వము వైఖరి భిన్నరీతిని దాల్చినది. శ్రీరామనవమినాడు వైష్ణవులకుమాత్రమే సెలవుకలదు కాని వ్రతము నాచరించువారగు వైష్ణవేతరులకు సెలవులేదు. శివరాత్రినాడు వ్రతాచరణ పరాయణు లగు శైవ స్మార్తజనులతోపాటు వ్రతాచరణవిముఖులగు వైష్ణవులకును సెలవు గలదు. ఇది విపరీతవిధాన మనక తప్పదు. ఇందులకు కారణ ముండకపోదు. కాని యా కారణముతో నిపుడు పనిలేదు. ఏపుడైన, ఏకారణముననేని, ఏదేని లోపము కలుగునేని అది యట్లే నిలిచియుండుట యుచితముకాదు. లోపమని తెలిసినపిదప నద్దానిని తొలగించుట న్యాయ్యము. కావున ప్రభుత్వము శ్రీరామనవమినాడు మతవిభేదమును పాటింపక యెల్లరకు సెలవొసంగు నేరుపాటుచేయుట ధర్మము. శ్రీకృష్ణజయంతి (శ్రీజయంతి) నాడు ఎల్లరకును సెలవుగలదు. అట్టిదే శ్రీరామ నవమియును. కావున ఈవిషయమున వైష్ణవభిన్నులగు ప్రభుత్వోద్యోగులందరు తగినరీతిని కృషి చేసి రాబోవు సంవత్సరము మొదలు ఏటేట శ్రీరామనవమినాడు తమకును సెలవు లభించులాగున జేసికొనదగుదురు.

* * * *

### కీ. శే. కొప్పరపు వేంకటసుబ్బరాయకవిగారు

కొన్ని యేండ్లక్రిందట ఆంధ్రదేశము శతావధానములతో, ఆశుకవనములతో మారుమ్రోగిననాడు మొనకలెత్తినవారు కొప్పరపు సోదరకవులు. ఆకాలమున శతావధానాదులకన్న తత్కర్తలయొక్క ఆర్భాటములు, దెబ్బలాటలు దేశమున ప్రఖ్యాతములయినవి. అదియంతయు నొక మహాగ్రంథము. ఆ గ్రంథమున పెక్కధ్యాయములయందు కొప్పరపు కవుల గాథ మిక్కుటముగా వ్రాయబడినది. ఇదియంతయు నాంధ్రలోకమునకు లెస్సగా దెలిసినవిషయము. ఇపుడా శతావధానములు ఆ యాశుకవనములు ఆ యార్భాటములు అత్తిపూతలయినవి.

కొప్పరపుకవులు గంటకు నాలుగైదునందల పద్యముల నాశువుగా చెప్పగలవారు; బహుబిరుదముల బడసినవారు. వీరిలో జ్యేష్ఠులు వేంకటసుబ్బరాయకవిగారు. వీరు ప్రాయము చక్కనగమయినను చెల్లకమున్నే దివంగతులగుట మిగుల విషాదమును గలిగించుచున్నది. నేడు కొంచెముగా మిగిలియున్న అవధానిలోకమున నీ ఆశుకవిపుంగవుని లేమి యెన్నటికిని తీరని లేమి.

---

Printed and Published by C. Seshagiri Rao, B.A., at the Andhra Patrika Press, No. 7, Thambu Chetty St., Madras.
Editor, G. Subbaramayya

# భారతి

## సచిత్ర మాస పత్రిక



సంపాదకుడు

గన్నవరపు సుబ్బరామయ్య

సంపుటము ౯. సంచిక ౬.

ఆంధ్రపత్రికా ముద్రాలయము–మద్రాసు.

౧౯౩౨

# భారతి — నవమ సంపుటము — భా. ౧.

## వ్యాసముల అకారాది సూచి

## క

## న

## భ

# భారతి — నవమ సంపుటము — భా. ౧.

## వ్యాసకర్తల అకారాది సూచి

ప

# భారతి – నవమసంపుటము – భా. ౧.

## త్రివర్ణచిత్రముల అకారాది సూచి


విషయసూచిక

# చిత్రములు



---



ధర్మ విజయము

చిత్రకారుడు: చేమకూర సత్యనారాయణరావుగారు.

బ్లాకులు చేసినవారు: శ్రీ వేదుల వేంకటశాస్త్రిగారు, ఆంధ్రపత్రికా కార్యాలయము, చెన్నపురి.




చెన్నపట్టణము, జూన్ ౧౯౩౨

సంపుటము ౯   ఆంగీరస సంవత్సరము జ్యేష్ఠమాసము   సంఖ్య ౬


# తల్లికోటయుద్ధము


పాటిబండ మాధవశర్మ గారు


## పూ ర్వ రం గ ము

[* తల్లికోట యుద్ధము విజయనగర మహాసామ్రాజ్య పతనమునకు తొలిమెట్టు. ఈ మహాయుద్ధము క్రీ. శ. 1565-వ సం. జనవరి 20-వ తారీఖున జరిగినది. ఒకతెగ బహామనీ సుల్తానులు: ఇంకొకతెగ విజయనగర ప్రభువులు. అప్పటి రామరాయలు 96 ఏండ్ల వృద్ధు. రెండు యామములలో లయిదులక్షలమంది యాంధ్రవీరులు దివంగతులైన యీ పుణ్య ముహూర్తము మనకు చిరస్మరణీయము.]

నాంది

ఒక మహారాజ్యరక్షణోద్యోగమందు – తేజము ధరించి పోరి యదృష్టభాతి
కాకృతులు రయినట్టి మహాత్ములైన – యాంధ్రవీరకుమారుల కంజలింతు!

* గాళికసతిగిస్ యని పీరాగాసుస్వామినామము.

అనుభూతవాణి

మాపురాణమహాంధ్రసామ్రాజ్యశిఖరి - నేల కొరగిన గాధాప్రణాళిక యిది !
ఈ విషాదచరిత్ర పఠించి యింత - యశ్రువుల రాల్చి పోయెద రాంధ్రజనులు !

రామరాయలు

అందఱ జూళము, నందకున్నెడలఁ గా ళ్లన్నట్టు లేసంతయో
సందైనన్ దల యెత్తఁ జూచెదరు; ఆసన్నార్తిమై వచ్చి మా
కందాలోఁ బడి మేసి పోయిన కృతజ్ఞత్వమ్మునున్ బ్రాతకున్
జందానన్ మముఁ జొచ్చి మన్న యొక విశ్వాసమ్మునున్ వీడుచున్.

తుమ్మిన నూడు నేస్తములు, త్రోసినఁ దొంబది-చోట్లఁ గూలు వీ
ర్యమ్ములతోడ నీతురక రాజులు బారెఁడు బారెఁడేసి గ
డ్డమ్ములతోడ గిల్లి జగడమ్మును వైకొని తిన్న యింటివా
సమ్ములు లెక్కవెట్టుటకు సాగిరి ; ఎంతటి చేటుకాలమో !

ఆడి తొలంగ నోడని మహాపతితాత్ములు; లేఁతలేఁతయాఁ
దూడలపచ్చినెత్తురులతోఁ దడియారని రాతిగుండెకున్
గూడదు వో కృతజ్ఞత; కరుప్రకరమ్ముల మ్రోఁగిపోయె నీ
మ్రోడుల మాపదార్చనలు; త్రొక్కమి దోసమ యయ్యె మా దెసన్.

మీసలు ద్రిప్పి నిల్చిన సమీపమునేనియుఁ జేరలేని స
న్నాసులు పెద్దయోధు లయినారఁటొ తమ్ముఁడ ! వెఱ్ఱివెఱ్ఱియా
వేసము లేమి మాకడన వేయుదురో ? స్మరియింపరో గతా
శాసమవాయగహ్వరపిచండము మామకచండతేజమున్.

తిరుమల రాయలు

తొంబదియాఱువర్షములఁ దోఁగిన యీమహనీయమూర్తి క
య్యంబుల డయ్యఁగా వలవ దన్న ! పురానముపార్జితేద్ధతే
జంబున కన్ను మూసికొని శాంతి భజింపుము ! మ్లేచ్ఛభూభృదం
గంబుల నాజిలో నెదురఁగాఁ దిగ వీ జరఠానతాంగముల్.

లలితక్రోధము లుగ్రసాహసములున్ రోషోన్మదంబుల్ కృత
చ్ఛలముల్ భూతవిరోధమూఢములు నిన్ సాధింప నేతెంచె; పొ

త్తులలో నిద్దురవోవ నర్హుఁడగు వృద్ధుం డీవు; గర్జించు శ
త్రుల యొత్తిళ్లకు తాళఁజాల వనిలో త్రొక్కిళ్లు సైరింతువే?

రామరాయలు

తమ్ముఁడా! యిది పెద్ద యుద్ధమ్మఁటోయి! - రామరాయల ఖడ్గధారాక్షతములు
రుచిమెఱుంగని బ్రాహ్మతురుష్కుఁ డెవఁడు?- చెనఁటితనమున తిరిగి వచ్చెదరు గాక!

విన్నా మెన్నటిపచ్చిగాయములు మానీమానకుండంగనే
సన్నాహించిన మొండిజాతి యిది, విశ్వాసఘ్నతాదుష్టము; ఆ
పన్నుండై మనపాదముల్ గొలిచి నిల్వంబెట్టుకొన్నట్టి సం
పన్నత్వమ్మును పట్టువీఁగెదరు, వహ్వా! ఎంత దౌర్జన్యమో!

వేంకటాద్రి

వల దన్నా! అనిసేఁతకుం దొడర; అశ్వంబేని దూఁకించలే
వలయంగా వలదన్న! ఇందఱము నున్నారే గదా మేము త
మ్ములమున్, పల్వురు దండనాథులు, అరిగాఁపుల్ పల్వురున్; నీవునున్
వలెనే యింతటిదొడ్డసంగర మొనర్పన్? మాను మిప్పాటికిన్.

విజయనగరసామ్రాజ్యభూప్రజల కెల్ల-ప్రాణపదమైన పండువిగ్రహము; దీని
రక్ష మునుముస్న; మీఁద సామ్రాజ్యరక్ష-కృత్యములు; మాను మన్న, పో రేల నీకు?

చంపను జాల నుంటిమి విశ్రాంతి లేమును; వీరి నంపి చే
యింపుము వైరిసంహననకృత్యము; నీ చనఁదగ్గ యంతమా
త్రింపు దురమ్ము గా దిది; వృథాశ్రమ యేటికి? సైఁప లేవు యు
ద్ధంపుధురమ్ము నీ ముదిమి దాఁకినమూఁపులు, తేలుచూపులున్.

రామరాయలు

అండలు మీరు నా భుజములై యిరుదండల నిండియుండఁగా
గుండెలు చాలునే తురకకున్ మనదిక్కునఁ దేఱి చూడ? మీ
రెండుతటమ్ము లాదాక భరింపుఁడు; నాకత యేల? రెండు! చే
కొండు కటారులున్, దలఁచికొం డెదలోపల మామనామమున్.

సలకమతిమ్మరాజు యమసన్నిధి కంపితి; రెండుచేతులన్
దల మకుటమ్ము వెట్టితి సదాశివరాయలకు; ఆంధ్రభూమియా

దల వెలయించితీ విజయతాండవనృత్యము; మ్లేచ్ఛభూమిభ
ర్తలయెదలోన బల్లెమయి తాఁకితి ద్వాదశసంగరమ్ములన్.
తొడరినశత్రుభూపతులఁ ద్రొక్కితి మ్రొక్కిన కాచిపుచ్చితీ
గుడిపితి సత్కవీశ్వరులకున్ మడిమాన్యము లిష్టసిద్ధిగన్
కడ కొక లాఁతిసంగరమునన్ ముది ముట్టిన కారణమ్మునన్
జడిసిన భట్టుమూర్తికవిచంద్రుఁడు నవ్వఁడటోయి తమ్ముఁడా!
అమలస్వాంతుఁడు దివ్యవిప్రుఁడట విద్యారణ్యదేవుండు; పూ
ర్వము నిర్మించినదంట యీప్రబలసామ్రాజ్యమ్ము! ఇద్దాని భ
గ్నముగావించితి మన్న వాదు మనకున్ రా నేల? మీమీప్రయ
త్నముపై నుండుఁడు; పొండు; నన్గణిచి సంతాపంపడంబోకుఁడీ!.
శృంగేరీగురుదివ్యదర్శనము వర్షించున్ మహాశీస్సు లు
త్తుంగోత్తుంగవిజృంభితాంగములపైఁ; దూఁటాడుఁడీ శత్రుసే
నాంగంబుల్; రుధిరప్రవాహముల కృష్ణాంభస్వినీభంగముల్
మ్రింగుం గావుత బహ్మనీకుటిలభూభృద్భూమిభాగంబులన్.
కవితాపట్టము గట్టుకొన్న సుకవీడ్గంధేభహార్యత్వముల్
ప్రవచించున్ మధురాశిషంబులు; నభఃపంథా (?) వినిర్యన్మహా
దివిషచ్ఛైవలినీనిరర్గళఝరీ దేశీయముల్, వేదమం
త్రవరిష్ఠమ్ములు; మిమ్ముఁ గాచును తనుత్రాణమ్ములై రక్షలై.

భట్టుమూర్తి

అణఁచున్ గావుత మ్లేచ్ఛభూపతులశౌర్యశ్రీ భవచ్ఛక్తి! దా
రుణయుష్మత్కరవాలవహ్నిశిఖ లారోహించుతన్ మ్లేచ్ఛధా
రుణిభృత్కంధరముల్! కవీశ్వరులు సుశ్లోకమ్ములన్ గూర్చి బ్రా
హ్మణిసుల్తానుల మీజయమ్ము శశితారార్కమ్ము గావించుతన్!

అనుభూతవాణి

మందేహాదికక్రవ్యభుజ్నికరసంహారక్రియల్ జీవితం
బందుం దైనికలీల లైనవి వివస్వన్మూర్తికిన్; నాఁడ దే
చందంబో! బయలంబడండు రవి; దీక్షాబద్ధనిశ్శ్రేయులై
పంథా (?) బంధ మొనర్తురో రిపులు, సంబాధింతురో, నొంతురో!

ప్రళయోగ్రాభ్రభ్రమదభ్రమధ్యయక్రూరద్రశ్రేణి ఘూర్ణిల్లి ఘూ
ర్ణిల్లి కించిత్ స్ఫుటత్ప్రసేకమున శీర్ణీభూత మయ్యెన్; పెళత్
పెళగర్జా గ్రథితీకృతాఖిలములై వీచెన్ మహోల్కల్; తళ
త్తళదుర్గ్రోగ్రభరముల్ వెలింగె ఘటికార్ధం బుగ్రశంపాలతల్.

## ఉత్తరరంగము

[మ్లేచ్ఛబలములు కృష్ణను దాటినవి. యుద్ధము జరిగిన పద్ధతి యిది. రామరాయల కెదిరి హుస్సేన్ నిజాంషా. రామరాయల కుడితట్టు తిరుమలరాయలు, కొడుకు రఘునాథ రాయనింగో. వారియెదుట ఇబ్రహీం కుతుబ్ షా. ఎడమప్రక్క వెంకటాద్రి. ఎదుట అలీ అదిల్ షా. సుల్తానులకు ఫిరంగుబలయండ మెండు.]

రామరాయలు

జయ! మూర్తిత్రయమూర్తి! పూష! త్రిజగచ్ఛక్షూ! తమస్తస్కరా!
జయ! మందేహాముఖద్విషద్దళనదక్షా! లోకరక్షామయా!
జయ! మందానిల భాఙ్నియుక్తహరిదశ్వక్షుణ్ణఖప్రాంగణా!
జయ! విశ్వప్రతిపాదనావన వినాశం కారణా! భానుమన్!

జని సాహస్రజ కిల్బిషోల్బణతమిస్రస్రగ్విధాదక్షలో
చన! బ్రాహ్మిష్ఠ పరాత్పరస్వరూప! త్రిజగ చ్చైతన్యహేతూ! సనా
తన! వేదత్రితయాదతాకృతీ! అనంతా! కాలసంకేతకా
రణ! సౌసన్నతినూ! మహాప్రణవమంత్రవ్యక్తతేజోమహాన్!

అధిగమనాశురుగ్ణము, రణౌఘభరగ్లపితమ్ము, మజ్జరా
శిథిలవపుస్సమానికి పయిం జిల్కుము దివ్యసుధాప్లుతక్కుముల్;
ప్రథితమనీయవార్ధకభరమ్మును గైకొని నీదు పావనా
భ్యుదయము నా కొసంగుము; ప్రభూ! వెలయింతు సమిద్విహారమున్.

ఇది యొక దుష్కరమ్ము గుహరీశ! ద్విషద్దళకర్తనక్రియన్
బడసయినట్టి మామక కృపాణతనూస్థుఁడవై విపత్ప్రహా
ణదమన యోగదీక్షితుఁడ నా కుపదర్శన మాచరింపుము; ఈ
పృథులమహాంధ్రరాజ్యము భరింపుము త్రుంపుము శత్రుకంఠముల్.

తిరుమల రాయలు

ప్రళయాంభోధర శుంభదార్భటి యనన్ ప్రారంభమై రోదసీ
బిలమం దెల్ల ప్రతిధ్వనించెడి నదో, భేరీవిరావమ్ము! ని
శ్చల దీక్షాళువులై చరింపుఁడు విపక్షక్షోణిభృత్ భృత్యవి
గ్గళ గర్తోద్గత శోణిత స్నపిత ఖడ్గగ్రస్తతేజస్కులై!

వెంకటాద్రి

కండలక్రొవ్వునన్ మదము కన్నులపై కెగఁదట్టె నేమి! మీ
గుండెలలో శయింతు ననుకొందు! ఇతఁ డెవ్వఁడుగాఁ దలంతువో
గుండెలు దుస్సిపోఁ దగులుకొన్నవి నిన్నట మొన్నటన్ మదు
చ్చండతరాగ్ని వర్ధమానశాలి శితేషులు లేవా సాక్షులై.

*　　*　　*　　*　　*

*　　*　　*　　*　　*

యుద్ధము

చక్కఁగ మింటి నన్నడిమిచక్కి వెలింగెడు తీవ్రభానుతో
నెక్కిన రామరాయధరణీంద్రుని భీషణశౌర్యతాపముల్
వెక్కసమై కడింది వెత వెట్టిన నెట్టన మ్లేచ్ఛభూపతుల్
స్రుక్కిరి చొక్కి రార్తులయి సోలిరి తూలిరి నేల రాలిరిన్.

*　　*　　*　　*　　*

రూమీఖానుని ఘోరకూటఘుటికా హేతిప్రవర్షంబులో
నామూలాగ్రము నాంధ్రభూమిపతి సైన్యశ్రేణి భ్రమం దెన్; ప్రజా
క్షేమాశంకిరణావనిన్ దొలఁగి వచ్చెన్ తిర్మలక్ష్మాపుఁ డా
భీమాయోధనకేళినే పడియె నుర్విన్ వెంకటోర్వీశుఁడున్.

*　　*　　*　　*　　*

జరసాఘూర్ణిత రామరాయమహీభృచ్చంద్రోత్తమాంగంబు ము
ష్కరభూపాలుఁడు పాపి హస్తముల ఖడ్గం బూని ఖండించి, త

చ్ఛిరమున్ ద్రొక్కి నటించె నున్మదపిశాచీమూర్తియై తన్మహో
గ్రోగ్ర హల్లీసక మారసాతలమునున్ దూగించె నాంధ్రశ్రియున్.

* * * * *

అనుఘాతవాణి

మా ప్రభూత్తము పూజ్యజరాప్రచలిత
శీర్ష ముత్తరింపఁగ సాహసించినావు!
కత్తి దూసిన నీచేయి కాలిపోను
ఓయి! హుస్సేన్ నిజాముషా! ఓమహోగ్ర
కలుషహాతిజన్మ! నీ కెట్టి గతులు గలవో!

ఉపసంహృతి

పడగత్తి సాంధ్యాతపద్యుతిచ్ఛటలలో నగరిపై నర్తించె నల్లత్రాచు
రత్నపంజరములో రాజిల్లు రాచిల్క యోగపద్ధతిని ఆయుస్సు దొఱఁగె
సాఁగించి కూసె హజారరామస్వామి కోవెలకొమ్ముపై గుడ్లగూబ
గుత్తులు గుత్తులై గుదిగూర్చినది రామరాయలపేరు తారాగణమ్ము
జన్మలో ఒక్కొకతయున్ దపశ్శక్తి లేని - శ్లేషకవిచక్రవర్తి యాశీర్బలమ్ము
రతు ఘటియింపలేని సామ్రాజ్యలక్ష్మి - ముష్కరులకత్తి కెరయయి పోవువేళ!

* * * * *

బగ్గరితిగా స్రుక్కిపై భవిష్యత్తులోన - జీవితాశయములను చర్చించుకొనుచు
తిరుగుచుండగ మన తిరుపతివారికి - భగ్నవిక్షిప్తహర్మ్యసంభరితమైన
విజయనగరమ్ము నగరవీథులలోన - తగులఁబడిపోవుచున్న చందాసఁ దోఁచె!——



# బిచ్చకత్తె

మున్నఁగి లక్ష్మీనరసింహ శర్మ గారు



కాఁపురము చెట్టునీడ; మగండు రోగి;
పాలు చేఁపమిఁ బోరిడు పాప చంక;
కూటికొఱ కెడపిల్లలగోల్లు వెంట;
నెత్తిపైఁ బ్రొద్దు; నడువీధి; ఉత్తజోలె;
పస్తు; ప్రేఁకటి; సాగదు బాట;—దవ్వు;
వాడవారల కసరులు; వేఁడి యూర్పు;—
పెట్టిపుట్టని బ్రతుకని పెదవు లార్తు;
బుజ్జగింపుల బుడుతల బొజ్జ నింతు;
వాకులతఁ జూప; వింత చిరాకుపడవు!—
పేదఱిక మెంతయోర్పు నేర్పినదె తల్లి!

---

# ఆంధ్రలిపిసంస్కారము

సూరి రామసుబ్బరాయశాస్త్రిగారు

ఆంధ్రలిపియందుఁ జేయఁదగిన సంస్కారములను నిర్ణయించుటకు ముందుగా లిపియొక్క ప్రయోజనలక్షణములను గూర్చి కొన్ని యంశములు గమనింపఁదగి యున్నవి. లిపి యనఁగా నుచ్చరించు ధ్వనిని గుర్తించుట కేర్పడిన సంకేతములు. ఒక్కొక్క యక్షర మొక్కొక్క ధ్వనిని గుర్తింపఁజేయుటచే నక్షరములఁ గలుపుట యందు యక్షరము లనేకముల నగుచున వ్రాయవలసి యున్నది. ఇట్లు వ్రాయుటలో నెంత యధికముగా వేగము నుపయోగింపఁగల్గిన, లిపి యంత సౌకర్యాధిక్యము కల దని యూహింపవలసి యున్నది. శీఘ్ర త్వరగతికి సహాయభూతము లగునట్టి లిపికి నుండవలసిన లక్షణముల వివరించుచున్నాము.

౧. అక్షరము సాధ్యమగునంత లఘురూపమున నుండవలయును. అనఁగా నెక్కువ వంకరటింకరలతో వెనుకకును ముందుకును పైకిని క్రిందికిని ననేక తిరుగుడులు లేనటుల నుండవలయును. 'గ' కారము 'g' అను సంకేతమున నింగ్లీషులిపియందుఁ దెలుపఁబడు చున్నది. ఇదియే ఒక అడ్డుగీత (—)చే హ్రస్వలిపి (Short-hand) యందుఁ దెలుపఁబడుటచే నెంత శీఘ్రగతికిఁ గారణ మగుచున్నదో తెలిసికొనఁదగి యున్నది.

౨. ఒకయక్షరమును వ్రాసి తరువాతి యక్షరమును వ్రాయుటకై కలమును కాగితముపైనుండి తీసి మరల నుంచుటలోఁ గాలము వ్యయమగుచున్నది. ఈకారణముననే గొలుసుకట్టుతో నక్షరములఁ గలిపి వ్రాయుచున్నాము. అందుఁ దలకట్టులఁ గలుపకుండఁగ వ్రాయవలసిన 'స' 'ప' లను దలకట్టులఁ గలిపి వ్రాసి పిమ్మట కలము నెత్తవలసివచ్చినపుడు మరల వెనుకకు వచ్చి యా యక్షరముల గుర్తు తెలియుటకై వాని నెత్తిపై బొట్టులఁ బెట్టుచున్నాము. 'డ'అను నక్షరమునుగూడఁ గొందఱు 'ఢ' అని కలిపి వ్రాయుదురు. ఆరంభించిన యక్షరము స్వరసంయోగ సంకేతముతోఁగూడఁ బూర్తియగులోపలఁ గలము నెత్తి మరలఁ బెట్టవలసిన యగత్యము లేకుండిన యెడల నతిలాఘవముగా నుండును. 'క' అను నక్షరమును 'క' అను రూపాంతరమునఁ దఱచు వ్రాయుటకు నిదియే కారణము. ఈవిషయమై నాగరలిపి బహులోప భూయిష్ఠముగా నున్నది.

3. అక్షర మెడమనుండి యారంభమై కుడివైపున నంతమగునెడలఁ దరువాతి యక్షరమునకు సమీపమగుటచేఁ గాలము కూడివచ్చును. 'మ' అను నక్షరమును వ్రాయవలసి వచ్చినపుడు "వి" అని వ్రాయుటలో నక్షర మెడమవైపునకుఁ బోయినను దలకట్టును వ్రాయుటలో మరలఁ గుడివైపునకు వచ్చుచున్నది. పిమ్మట దానికిఁ గొమ్మును వ్రాయుట సుకర మగుచున్నది. 'మ' అను నక్షరమును వ్రాయునపుడును నిటులనే తలకట్టు వ్రాయుటచే కొమ్ము నందుకొనుట వీలగుచున్నది. కావుననే 'ఉ'కారస్వరప్రయుక్తమైనను నీయక్షరమునకుఁ దలకట్టునుగూడ వ్రాయుట యవసరమగుచున్నది.

౪. అక్షర మెల్లపుడును నపసవ్యక్రమముగా (Anti-clock-wise motion) వ్రాయుట సులభమగును గాని సవ్యముగా (Clock-wise motion) వ్రాయుట సులభము కానేరదు. 'ఇ' అను నక్షరమును సవ్యముగా వ్రాయుచున్ననుఁ దుదకుఁ గుడివైపునకుఁ జేరుటచే సుకరముగాఁ దోఁచుచున్నది. కాని 'ఐ' అను నక్షరము సవ్యక్రమములఁ దుద నెడమవైపున నంత మగుటచే బహుక్లిష్టముగా నున్నది. ఇట్లు సవ్యక్రమమున వ్రాయు 'నురుదు' లిపియందు వ్రాత కెట్టి సౌకర్యమును గాన్పింపదు.

౫. ఎడమనుండి కుడివైపున నంతమగునపు డక్షరమునకుఁ దుదిని కొమ్ములు తలకట్లవంటి యగ్ర

ము లుండినఁ దరువాతి యక్షరమును గలుపుటకు వీలుపడుండును. ఇంగ్లీషు వ్రాఁతలిపియందు b, p, l, i మొదలగు నక్షరములకు (వ్రాఁతయందు) రెండువైపులను గొన లుండుటచే వెనుకముందులనుండు నక్షరముల వానితోఁ గలిపి వ్రాయ వీలగుచున్నది. అట్లు గాక రెండువైపులఁ గాని, ఒకవైపునఁ గాని యిట్టియగ్రము లుండని o, c, q, g మొదలగు నక్షరముల నితరాక్షరములతోఁ గలిపి వ్రాయుటలోఁ గలకష్ట మనుభవమునఁ గాన్పించుచునే యున్నది.

౬. సూక్ష్మీకరింపఁబడిన స్వరవర్ణ సంకేతముల హల్వర్ణములతోఁ గలిపి వ్రాయఁగల్గుట లిపియొక్క మహోత్కృష్ట సులక్షణము. ఇంగ్లీషు వ్రాఁతలిపియం దక్షరముల యాద్యంతములందుండు నగ్రరూపలక్షణము వలనఁగల్గు ప్రయోజన మాంధ్రలిపియందు స్వరవర్ణ సంయోగరూపములగు ˇ ా మొదలగు వానివలనఁ గల్గుటయేగాక "ఏకక్రియా ద్వ్యర్థకరీ" అనునట్లుగా రెండక్షరములను వ్రాయుటయు నవుచున్నది. 'రామ' అను శబ్దమునందు రేఫము, ఆకారము, మకారము, అకారము, అను నాల్గక్షరము లవుచున్నను, ఆకార అకారముల సూక్ష్మాకృతుల వలన రెండక్షరములవలెనే తోఁచుచున్నవి. తోఁచు టేల! వృత్తాక్షర గణనాదులందు నిది రెండక్షరములనియే పరిగణింపఁబడుచున్నవి. కావున స్వరయుత వ్యంజనాక్షరము నక్షరమనుట ప్రమాదము కాఁజాలదు. ఈపరిగణనము స్థూలమైనను సూక్ష్మమైనను తెలుఁగు లిపియందు 'రామ' అనురెండక్షరముల వ్రాయుకాలములో నవుకార్య మాంగ్లలిపియందు 'Rama' అను నాల్గక్షరముల వ్రాయుకాలమునఁ గాని జరుగుటలేదు. ఇట్లాంగ్లలిపియందు నధికశ్రమచేఁ గల్గు కార్య మాంధ్రలిపియందు సులభముగా జరుగుచున్నదని యొప్పుకొనక తప్పదు. పదమునందు స్వరసాహాయ్యమున విడఁదీయఁగల్గుభాగ మాంగ్లమున సిలబిల్ (Syllable) అనఁబడుచున్నది. ఈవిభాగము వృత్తాదికములందు గణ గణనమువంటిది. అందు ద్విత్వ సంయుక్తాక్షరము లుండినను స్వరప్రాధాన్యమున నీవిభాగము జరుగుచున్నది. Through అను నింగ్లీషుపదమొక్క సిలబిల్ కలదియే, దీని నాంధ్రమున 'త్రు' అని యొక్క యక్షరమున త్రుటికాలములో వ్రాయఁగలుగుచున్నాము. ఇంగ్లీషునందలి సిలబిల్ నునయక్షరములో వ్రాయ మనుటలో నెట్టి యాక్షేపణయును లేదు. ఇంగ్లీషులిపిలో వ్రాయుటకంటెఁ బదముల నాంధ్రమున వ్రాయుట బహుసులభమని నిరూపించుటకిది ప్రియం. గిడుగు వెంకయ్యగారు సూచించిన యుదాహరణములు దోషారోపణకై శ్రీ పి. పార్థసారథిగారు యొనర్చిన ప్రసంగము యుక్తియుక్తముగాఁ గాన్పించుట లేదు. ఇంగ్లీషునందు సిలబిల్లను విడఁదీయుటలోఁ గల యనియమము 'రాములతో కదవదుని' గా చూపిరి వనుచున్నారు. సిలబిల్ అనఁగా స్వరసంయుక్తవ్యంజనము గావునను, తెలుఁగున నీస్వరము వ్యంజనముతోఁ గలసి యైక్యమగుచుండుటచేతను విడఁదీయుటలో శ్రమ కాన్పింపదు గాని యింగ్లీషునం దట్లు కానేరదు. ఇంతియ గాక ఒకపదములోని యక్షరముల వేర్వేరుగా విరిచి చదువుటచే సభంగశ్లేషాదివిశేషములు కల్గుచున్నవనిరి. కాని యింగ్లీషుసిలబిల్ల నెట్లు విడఁదీసినను నిట్టి యుపయోగము కాన్పించుట లేదు. నిరపేక్షముగను తెలుఁగునకును నింగ్లీషునకును వారు గల్పిన సామ్యము సరిపడదు. ఇంతియ గాక యింగ్లీషు హ్రస్వలిపియందు నిమిషమునకు ౧౪౦, ౧౬౧ మాటలను వ్రాయుచు చేవ్రాఁతలిపికంటె నే డెనిమిదిరెట్లువేగము కల్గించుచున్నది. ఆ హ్రస్వలిపియందే నిమిషమునకు ౭౦, ౮౦ మాటలకంటె నెక్కువ వేగమునఁ దెలుఁగున వ్రాయుటకేరికి వీలగుటకుఁ గారణ మిం దక్షరము లాంగ్లములోని సిలబిల్లకు సరిపోవుటయే.

౭. అక్షరసౌందర్య మనంతరలక్షణమై యున్నది. ఈ సౌందర్యము నపేక్షించియే యాంగ్లమునందు వ్రాఁతలిపిని విడిచి ముద్రణమునఁ బ్రత్యేకముగా లిప్యంతరముల గ్రహించిరి. కాని యీ లక్షణమున నాంధ్రలిపితో నేయన్యలిపియు సాటి గానేరదు. అందమునకై యిం దనేక నియమములు పాటింపఁబడుచున్నవి. అక్షరములు గుండ్రముగా నుండుటవలన నందము నెంపొందుటయె గాక ధారాళముగా వ్రాయ వీలగుచున్నది. ఇట్లు గాక చతురశ్రాకారమున నక్షరము

(Type-writing) నందును రెండేసి యక్షరముల సంయోగ మవసరమగుటచేఁ గాలప్రయాసము లధికమగుచున్నవియే గాని సదుపాయకర మగుట లేదు.

'క్ష' అను నక్షరము కకార షకార సంయోగమని విశద మగుచునే యున్నది. కాని మంత్రశాస్త్రమున నిది యొక బీజాక్షరముగాఁ దెలియుచున్నది. దీని ప్రయోజన మథర్వవేదమునఁ గలదని చెప్పుదురు. ఇట్టి కారణములచే నాగరలిపియందు సహితము క్షకారమునకుఁ బ్రత్యేకముగా సంకేత మేర్పరచిరి గాని నిష్ప్రయోజకముగా నక్షరమాలను బెంచుకొనఁ జూచియుండరు. ఒక యక్షరమువలన నేసమయమందైనను బ్రయోజన ముండినంత మాత్రమున దానిని గదల్పకుండుటయే యుక్తము. ఇందులకే గదా యన్యభాషాపదరచనమునకును ననుకూలమగు కొన్ని యక్షరముల నిర్మింపఁ జూచుట. ఇంతియ గాక ప్రస్తుతవిధానమున నీ క్ష కారము నొక్క యక్షరముగా గ్రహించుటవలన ముద్రణమున నొక సౌకర్యముగూడఁ గాన్పించుచున్నది. "తార్క్ష్యుడు" అను పదమును గూర్చునపుడు రేఫముక్రింద క్ష కారమును ప్రక్కన యకారమును గనుపించుచున్నది. అట్లు గాక రేఫము క్రింద క కారమును మాత్రము గూర్చినయెడల దాని ప్రక్కన షకారమును యకారమునుగూడఁ జేర్పవలసివచ్చుటచే నొక్క యక్షరముక్రింద మూఁడక్షరముల బంతిని జేర్చుట కష్టమగుచున్నది.

వర్గయుక్కులలో ఖ, ఘ, అను నక్షరములఁ దెల్పుటకై క గ లకుఁ బ్రక్కనఁ గంబముల నిడిన బాగుండు ననుచున్నారు. కాని యాకంబముల నిడునక్షరములకుఁ బొక్కిలి యుండినఁ గాని యవి కలసియుండనేరవు. ఇంతియ గాక ఈ "క గ"లు రెండును నే యన్యాక్షరములను బోలియుండకుండుటచే వీనినే దొలఁగించి పొక్కిలి యుండు నక్కరములను నిర్మించిన వానికిఁ గంబము లీయవచ్చును.

౯. అనుస్వారములు:—పూర్ణానుస్వారము వలన నాంధ్రభాషయందుఁ బ్రత్యేకప్రయోజనము కాన్పించుచున్నది. "ను వర్ణకంబు పరం బగునపు డన్యాదుల కత్వ లోపం జేని, నుస్థానంబున బిందువేని విభాష నగు. ఉదా. అనుచున్నాఁడు, అన్చున్నాఁడు, అంచున్నాఁడు." అనెడు బాలవ్యాకరణక్రియాపరిచ్ఛేదమునందలి ౫౧వ సూత్రమువలన బిందువు కేవల మనునాసికావర్ణమే గాక తద్భిన్న మగుచున్నదని తెలియుచున్నది. అట్లు గాక వర్గ పంచమాక్షరమునే గ్రహింపవలయునెడలఁ [illegible] దంత్యమగు చకారము పరమగుటచే నకారమును గ్రహించి "అన్చు" అని యొనరింపవలసి యున్నది. సంస్కృతంబున నీ చకారము తాలవ్య మగుటచే ఞ కారమును గ్రహింపవలసియున్నది. అట్టిచో "ప్రాంచద్బాహుమూలరుచితో" ననెడు నిత్యాది ప్రయోగములందు "ప్రాఞ్చత్", "అఞ్చత్" అను [illegible] క్షరములు ప్రాస స్థానమున గ్రహింపఁబడినవని సోపారోపణ చేయుచు లిపిసంస్కరణముతో భాషాసంస్కారమునకుఁగూడఁ గడంగవలసివచ్చుచున్నది. కావున నట్టి యాటంకము లేక యనునాసికవర్ణము [illegible] కార్యమును నిర్వర్తించుచున్న పూర్ణానుస్వారమును [illegible] యాంధ్రమున లేని ఙ, ఞ లను క్రొత్తగాఁ దెచ్చి చేర్చుకొనవలసిన యగత్యము లేదు. ఇంతియ గాక ముద్రాక్షర యంత్రమునందు సంఖ్యావాచకముగ నేర్పడిన '౦' సున్నయే యీపూర్ణానుస్వారముగఁ గూడ నుపయోగింప వీలగుచుండఁగా, నితరాక్షరములఁ దెచ్చి చేర్చి యక్షర సంఖ్యను బెంచఁదగదు. ఇంగ్లీషునందు గ, హ మున్నగు కొన్ని హల్లులఁ దెల్పుటకు రెండేసియక్షరముల సమ్మేళన మవసరమగుచున్నది. కొన్ని యక్షరములు రెండేసి హల్లులఁ దెలుపుచున్నవి. ఇట్లుండుటచే వర్ణక్రమము (Spelling) నం దత్యంతక్లేశము కల్గుచున్నది. గావున నొక్కధ్వనిని గుర్తించుట కొక్కయక్షర మే యుండవలయుననియు, నొక్కయక్షర మొక్కధ్వనినే తెలుపవలయుఁ గాని బహుధ్వనులఁ దెలుప రాదనియు నియమ ముండవలసివచ్చుచున్నది. అంతియ గాని నిరంకుశరాజ శాసనమువలె నీ నియమమును శిరసావహించి బహుప్రయోజనకారి యగుచు నైదక్షరముల కార్యమును నెరవేర్చుచు నిష్కళంకముగా వెలుఁగుచున్న యీ పూర్ణచంద్రాకృతిని నిర్హేతుకముగా నక్షరమాలనుండి తొలఁగింపఁ జూచుట యన్యాయము.

# కవిత

మండపాక పార్వతీశ్వరశాస్త్రిగారు

ప్రకృతిసౌందర్యంబు పరమేశు మహిమ
పరికించువేళ, నాప్రక్క నిల్చుండి,
యాశ్చర్య మానంద మనుభవింపంగ
నాకుఁ దోడయి నిల్చి, ననుఁ బ్రోచినావు;
నా తోఁడునీడవై ననుఁ గూడినావు;
నీకు నాకును వేఱు లేక యేవేళ
నీవె నేనయి, నేనె నీవయి యుండి,
యద్వైతభావంబు నందియున్నాము;
తండ్రికాలంబునఁ దాతకాలమునఁ
దండ్రితాతల తాత తాతల వారి
తండ్రులకాలానఁ దరతరంబులను
మాయింట నీ వుండి మముఁ గాచినావు,
మాయింటి వేల్పువై మముఁ బ్రోచినావు,
మాయింటి రాణివై మ మ్మేలినావు,
ఏతరంబందైన, నేవేళనైన
నిను మేము కొల్వని నిముసంబు లేదు,
నీవు మ మ్మరయని నిముసంబు లేదు;
బాల్యంబుననె, తండ్రిఁ బాసి యున్నపుడు,
మాకు దిక్కయి నీవె మముఁ బెంచినావు,
చదువు సాములు నేర్పి ముద మిచ్చినావు;
అల్లారుముద్దుగా నరసి, యేవేళ
తల్లివై పోషించి, తనివోందినావు;
మాకన్న ముందుగా మాయింటఁ బుట్టి,
పెద్దక్కవై మాకుఁ బ్రియ మిచ్చినావు;
ఆటలఁ బాటల, నలరుఁ దోఁటలను,
జెల్లెలవై ముద్దు చెల్లించినావు;
మనసున మనసును, దనువునఁ దనువు
నాత్మ నాత్మయుఁ జేర్చి, యర్ధాంగి వౌచుఁ,
గష్టంబులందు, సుఖంబులయందు,
నను విడనాడక, నాప్రోల నిల్చి,
యానంద దుఃఖ దుఃఖానందములను
ననుఁ గూడి భరియించి, తనివోందినావు;
ముద్దులు గురియుచు, మురియుచు వచ్చి,
నాముద్దుబిడ్డవై ననుఁ గాచినావు;
నాగృహలక్ష్మిరో, నాయింటిరాణి,
నాముద్దుఁజెల్లెలా, నాముద్దు బిడ్డ,
నావేల్పు, నాయక్క, ననుఁ గన్నతల్లి,
కవితామతల్లి, న న్గాపాడు తల్లి,
నాకల్పవల్లిరో, నీకు జేజేలు.

## ౩. చంద్రమతీ చరిత్రము

ఇదొక కథ. ఇదికూడా స్త్రీల అభివృద్ధి కోసమే వ్రాయబడింది. ఇది మన మెరిగిన పురాణకథే. విచిత్రంగా వ్రాయబడింది. వీరేశలింగకవిగారు

"౧౮౭౫-వ సంవత్సరమున స్త్రీల నిమిత్తమయి చంద్రమతీ చరిత్రమును వ్రాసితిని. ఇందు హరిశ్చంద్రుని పతివ్రతయైన చంద్రమతి తన బాల్యావస్థయందు చదువు చెప్పించుకొన్నదగుటచే మహావిపత్సమయమునను నీతిపరాయణయయి ప్రాణములకు తెగించియును అలుపడకయుండెనని. కడపటి భాగమునందు చంద్రమతి యొక్కయు హరిశ్చంద్రుని యొక్కయు కష్టములు కొన్ని సంగ్రహముగా చెప్పబడెను."

(కం. గ్రం. స్వీ. చ., ౧౦., ౧౮౩-వ పుట)

అని వ్రాస్తున్నారు.

ఈకథ చంద్రమతి తన బాల్యావస్థలో నెటువంటివిద్య నేర్చుకోడంవల్ల పెద్దవాడైనతరువాత జ్ఞానవంతురాలై భర్తను తోడుపడుతూ వానితో పాటు సమంగా కష్టా లనుభవించగలిగిందో బోధిస్తూంది. కనుక బాలికలుకూడ మేలైన విద్య నేర్చుకుంటే ఉత్తమురాళ్లు కాకపోతారా! ప్రపంచక జీవనంలో మనుష్యులు జయసిద్ధులు కావాలంటే విద్య ప్రధానం. స్త్రీలకుకూడ పురుషులకులాగే విద్య అత్యవసరం.

అయితే బాలిక లెటువంటి విద్య నేర్చుకోవాలి. మొగవాళ్లు నేర్చుకునే విద్యే స్త్రీలకుకూడ పనికి వస్తుందా — మొదలైన ప్రశ్నలు వస్తాయి. ఆప్రశ్నలకు సమాధానా లీ కథలోనే చెప్పబడ్డాయి. ఈ గ్రంథంలోని విద్యాబోధభాగం చంద్రమతీహరిశ్చంద్రుల కథకు అతిగించబడింది. ఇటువంటికథ యేదో వొకటి విద్యాబోధ భాగానికి అతికించకపోతే చదువరులు గ్రంథాన్ని వుత్సాహంగా చదవరని, పైగా విద్యాభ్యాసానికి ఫలిత మెలాగ వుంటుందో నిరూపించడానికి యీ పురాణకథ అతిగించబడింది. ఈ గ్రంథంలో విద్యాబోధ భావ మెక్కువ ముఖ్యం గాని కథ యెక్కువ ముఖ్యం గాదు. ఈ భాగానికి చంద్రమతీ కథే గాకుండా సావిత్రికథ గాని, లేక దమయంతి కథ గాని, లేక మరేదేనా యిలాంటి పురాణకథ గాని అతికించవచ్చు. పతివ్రత లంతాగూడా తాము విద్యావతు లవడంచేత ఎన్నికష్టాలు గలిగినా మనోనిశ్చయం విడవని వా రయేరు. ఈ నారీమణు లంతాకూడా సామాన్యస్త్రీలలాగే చదువు రానివారయి వుంటే తమ భర్తలకు సహాయభూతులుగా వుండక దుఃఖకారకులుగా వుండేవారు. ఆలాగు గాక, వారు చెందిన స్థితికి ముఖ్యంగా విద్యే కారణం. ఈమోస్తరుగా కథలో రెండు ముఖ్యాంశాలు స్పష్టం చెయ్యబడ్డాయి. ఒకటి, బాలికలు నేర్వవలసిన విద్య. రెండు, ఆలాంటివిద్యవల్ల కలిగే ఫలితం.

ఈ కథయొక్క ప్రారంభం పంచతంత్ర కథ ననుకరించింది. పంచతంత్రంలో సుదర్శనుడనే రాజు విష్ణుశర్మచేత విద్యయొక్క ప్రయోజన మెరిగి తనపుత్రుల్ని విష్ణుశర్మ కప్పగించి విద్య నభ్యసింపచేస్తాడు. అలాగే యీకథలోకూడా చంద్రమతి తండ్రియయిన ఉశీనరుడు విద్యాప్రయోజనం తెలుసుకొని తనకూతురైన చంద్రమతిని విద్యాసముద్రుని కప్పగించి విద్య నభ్యసింపచేస్తాడు. పంచతంత్రంలో ముఖ్యంగా రాజపుత్రులు నేర్చుకోవలసిన విద్య చెప్పబడింది. ఈకథలో బాలికలు నేర్వవలసినవిద్య చెప్పబడింది. పంచతంత్రములోని కథలపద్ధతి యీకథలో ననుసరింపబడ లేదు. కాని విద్యాసముద్రుడు యథార్థవిషయాలలోంచి యెటువంటిజ్ఞానం సేకరించాలో చెప్తాడు. ఈగురువు చంద్రమతికి నేర్పిన అంశాలేమంటే—

"మన మనుసరింపవలసిన ధర్మము లన్నియు నాలుగువిధము లైనవని చెప్పవచ్చును. మొదటివి సృష్టికర్తయైన పరమేశ్వరుని విషయమున నడుచుకోవలసినవి; రెండవవి మనదేహరక్షణాదులనిమిత్తము; స్వవిషయమున నడుచుకోవలసినవి; మూడవవి భగవత్కుటుంబములో జేరి మనకు సోదరసములుగా నుండు మానవకోటి విషయమున నడుచుకోవలసినవి; నాలవవి జీవదయాపరుడైన ఈశ్వరునిచేత జేయబడిన యితరజంతువుల విషయమున నడుచుకోవలసినవి."

సృష్టికర్త అయిన పరమేశ్వరుడి విషయంలో నేర్చుకోవలసిన ధర్మాలలో యీకవి తన విచిత్రతాత్త్వికవిషయాలను జొప్పింపక అన్ని మతాలకు సమ్మతమైన అంశాలను రాసేడు.

ఈ కథలో అనేకచోట్ల జనులయొక్క మూఢత్వం, నిత్యోపవాసాలు, నోములు, వ్రతాలు మొదలైనవి తెలుపబడి, చంద్రమతి అటువంటివాటి నభ్యసించకూడదని బోధించబడింది. స్త్రీలు ఒక్కనీతివిద్యే గాక శాస్త్రజ్ఞానంకూడా కొంత గలిగివుండాలన్న సంగతి యీరచనాభాగంలో చెప్పబడింది.

"పురుషులకువలె మీకును పుస్తకావలోకనము సల్పుటకును ... చెప్పుచున్న ప్రకారముగా భాషాజ్ఞానముయొక్క జ్ఞానమును వృద్ధిపఱుచు వ్యాకరణము, సాహిత్యము, వస్తువివేచనశక్తిని గలిగించు గణితమును, దేశకాలవర్తమానములను తెలుపు చరిత్రములను గూడ నభ్యసింపవలెను. ......ఇవిగాక స్త్రీలే ప్రత్యేకముగా నేర్చుకోవలసిన విషయములును గొన్ని కలవు. మీరు కుట్టుపనిని, పాకముచేయు విధమును, శిశుపోషణము మొదలైనవానిని అవశ్యము నభ్యసింపవలయును.......సంగీతశాస్త్రము నభ్యసించ......"

విద్యాభ్యాస మయిపోగానే చంద్రమతి గురువుతో

"మీయనుగ్రహమువలన నా కిప్పుడు సమస్త ధర్మములు తెలిసినవి. ఏవిషయమున నెట్లు ప్రవర్తింపవలయునో లేశమైనను దెలియక గ్రుడ్డిదానివలె నున్న నాకు జ్ఞానోపదేశమును జేసి నన్ను కన్నుదెరపి రక్షించినారు."

అంటూంది. విద్యాసముద్రుడు చంద్రమతిచేత వాక్క పాఠపుస్తకాలను కంఠతా పట్టించడమే గాక ప్రకృతిలోని అంశాలను చూపి జ్ఞానం బోధించేడు. మన స్తత్వాన్ని అనుసరించి చదువు చెప్పేడు. ఈవిధంగా యిప్పటి వుపాధ్యాయులు లక్ష్యంచెయ్యాని పద్ధతులను తా నవలంబించేడు.

---

విద్యాసముద్రుడు చెప్పినవాటిలో మనస్తత్వానికి వ్యతిరేకంగా వొకఅంశ ముంది. చంద్రమతి తనప్రియమైన దాసియొక్క మరణానికి విలపిస్తూవుంటే, విద్యాసముద్రు డా దాసిచావుమీద శాస్త్రోపన్యాసం చేస్తాడు. ఇది అన్యాయం. మనస్తత్వం గణించబడలేదు.

ఈకథలో వొక ముఖ్యాంశ మేమంటే— ఈకథ మూలకథనుంచి భేదిస్తూంది. మూలకథలో అనేక లోకాతీతవిషయాలు వున్నాయి. ఈకథలో అట్టివి తీసివేయబడ్డాయి. పురాణాలలోని లోకాతీతంవల్ల కలిగేనష్టా లేమంటే,— కథాపాత్రలు అమానుషశక్తియుతు లవడంచేత ఆరీతిగా ప్రవర్తించగలిగేరు కాని, మనలాంటి మనుష్యులైతే ప్రవర్తించగలరా అనే సందేహం కలిగి మనం మెప్పుడూ వారిలాగ వుండ ప్రయత్నించం. అందుచేత ఆ కథలు చదవడంవల్ల మనకు కలిగే లాభం శూన్యం. అలాగాక మనవంటి పురుషులే అట్టి విషమావస్థల్లో నీతిమంతులై ప్రవర్తించే రని తెలియడంవల్లనే యిట్టి ప్రమాదావస్థలోను మనం మన ఆదర్శాన్ని సాధించగలమని, అది మానవాతీతం కాదని మనకు బోధపడి అలాగు ప్రవర్తించ ప్రయత్నిస్తాం. ఇది గాక మరొక ముఖ్యవిషయం. పురాణకథలలో రాయబడ్డ వన్నీ జరిగినవి జరిగినట్టుగా రాయబడలేదు. అసలు అంశాలను మార్చి కొన్నిటిని విడిచి, కొన్నిమహత్తులు కల్పించి, యింకా మోస్తరుగా యథార్థం కాక కల్పన రాయబడింది. యథార్థాన్ని అట్లే చిత్రించక మాహాత్మ్యములతో చేర్చి రాయడం పూర్వజనుల ప్రకృతి. దీనికి ఉదాహరణం హరిశ్చంద్ర కథే.

"హరిశ్చంద్రకథ లనేకగ్రంథములం దనేకరీతుల నున్నవి. వానిలోనెల్ల ఋగ్వేదభాగ మగు నైతరేయ బ్రాహ్మణస్థకథయే యనదగును. అట్లయినను నా హరిశ్చంద్రునికథ సత్యవ్రతోపస్తుతియోగ్యముగ మార్కండేయ పురాణమున సవరింపబడినది. అట్లు సవరించుటలో నైతరేయబ్రాహ్మణస్థ కథాసారమును మాత్రము సూచించి యా కథను వర్ణింపక వేఱొక కథను గల్పించియున్నాడు. అట్టి మార్కండేయపురాణమున వర్ణింపని యైతరేయబ్రాహ్మణకథ యయితము వర్ణింపబడెను."

ఈరీతిగా నింకా యెన్నో సవరణలు జరగ్గా జరగ్గా యిప్పటి హరిశ్చంద్రకథ యేర్పడింది.

(పైభాగం శ్రీ వజ్ఝల చినసీతారామస్వామిశాస్త్రిగారి హరిశ్చంద్రనలోపాఖ్యాన విమర్శనములోనుండి యెత్తి రాయబడింది. శ్రీశాస్త్రిగారుకూడ పైకథయొక్క పరిణామాన్ని కొంతమట్టుకే చెప్పి వూరుకున్నారు. ఆమూలాగ్రంగా చెప్పివుండలేదు. అట్లు గాక, ఆపరిణామాన్ని సంపూర్తిగా పరిశోధించి ప్రకటిస్తారని తలుస్తున్నాను.) అట్టి సందర్భంలో మనం పురాణకథలలో చెప్పబడిన మహత్తులలో వొక్కటీ నమ్మలేం. కొంతవరకు వాటి యథార్థాన్ని తెలుసుకోవాలంటే వాటి మాహాత్మ్యాన్ని తీసివేసి అర్థంచేసుకోవాలి. అన్ని పురాణకథలను వైరీతిగా మార్చుకోవచ్చునే నిదంతా వొక్క పురాణ కథలను గురించి మాత్రమే చెప్తున్నాను. వీరేశ

లింగంగారే పైపద్ధతి కనిపెట్టేరు. అందుచేత ఈ గ్రంథంలోని కథకు పురాణకథకు కొన్ని భేదాలున్నాయి. ఆభేదా లేవంటే—పురాణ కథలో దేవేంద్రసభలో దేవేంద్రుడు వేసిన ప్రశ్నపై వశిష్ఠ విశ్వామిత్రులు వివాదపడి, ఆవాదనకు ఫలితంగా విశ్వామిత్రుడు హరిశ్చంద్రుణ్ణి పరీక్షిస్తాడు. కాని యీ కథలో దేవేంద్రసభమాట విడిచివేయబడింది. మహర్షులంతా ఒకనాడు సభచేసి వుండగా యీప్రశ్న వస్తుంది. దానిపై వివాదం సంభవించి విశ్వామిత్రుడు హరిశ్చంద్రుణ్ణి పరిశోధిస్తాడు. పురాణకథలో మాతంగకన్యలు విశ్వామిత్రుడిచే సృజించబడి విశ్వామిత్రుడిపంపున హరిశ్చంద్రుడిదగ్గరకు వెళ్లినట్టుగా వుంది. కాని యీ కథలో మాలకన్నెలు విశ్వామిత్రుని వనపాలకురాండ్రుగా వుండి, హరిశ్చంద్రుడు వచ్చే డన్న వార్త విని ఆ మహారాజును దర్శించి కానుకలు తెచ్చుకో వెళుతారు. పురాణకథలో విశ్వామిత్రునిచేత నక్షత్రకుడు సృష్టించబడ్డట్టుగా వుంది. ఈ కథలో నక్షత్రకుడు విశ్వామిత్రుడివద్ద శిష్యుడుగా ఉన్న చిన్నవాఁడు, విశ్వామిత్రునిచే సృజించబడ్డవాడు కాదు. మూలకథలో విశ్వామిత్రునిచే పంపబడి భేతాళాదులు హరిశ్చంద్రుని బాధించ వచ్చి వోడిపోయి సంహరించబడతారు. ఈ కథలో భేతాళవట మనబడే గొప్ప మర్రి కింద హరిశ్చంద్రాదులు విశ్రమించి వుండగా కొందరు దొంగలు దోచుకోవస్తారు. వాళ్లను హరిశ్చంద్రుడు వోడించి చెదరకొడతాడు. కాలకౌశికుడు, వీరబాహుడు విశ్వామిత్రునిచే సృష్టించబడ్డట్టు మూలకథలో వుంది. ఈ కథలో అలాగు లేదు. వీళ్లంతాకూడా స్వతంత్రవ్యక్తులే. చంద్రమతియొక్క మాంగల్యం ఒరులకు కనబడదనీ, వీరదాసుఁడు 'నీమాంగల్యాన్ని విక్రయించి డబ్బుతెచ్చి యియ్యి' అని చంద్రమతితో అన్నప్పుడు వీరదాసుడే తనభర్త అని చంద్రమతి గ్రహిస్తుందనీ మూలకథలో వుంది. ఈ కథలో మాంగల్యాని కట్టి ప్రభావం లేదు. ఇలాగు చాలావిధాలుగా ఈకథలో మూలకథలోని దివ్యప్రభావాలు లోకాతీతం యేమీ కనబడవు. మానవశక్తియుతులే విద్యావంతులై, ఆ విద్యను ఆచరణలో పెట్టి సత్యమార్గంలో విజయులయేరు.

వీరేశలింగంగారు హరిశ్చంద్రనాటకాన్ని కూడా రాసి వున్నారు. కాని సామాజికుల ప్రార్థనపై పుస్తకంలో వున్న కథాక్రమాన్ననుసరించి కథ నెంతమాత్రం విడువక హరిశ్చంద్రనాటకాన్ని రాసేరు. అందుచేత ఆకథావిధానం వేరు, ఈకథావిధానం వేరు.

ఈకథలో విద్యాబోధ భాగానికి అసలు కథకు సరియైన వ్యవకలనం లేదు. తక్కిన దేహమంతా తలయొక్క పొడుగులో మూడోవంతు వున్నట్టుగా కథవిద్యాబోధభాగంలో మూడోవంతు వుంది. ఈవ్యవకలనలోపానికి కారణం లేకపోలేదు. విద్యాబోధ ముఖ్యమవడంచేత తక్కినకథ అంతా సంగ్రహంగా చెప్పబడింది. అందుచేత యీలోపం వచ్చింది.

ఈకథలో పెద్దలే గాని చిన్న లానందించలేని హైమమికహాస్య ముంది. శైలి సులభంగా వుంది.

ర. స త్య సం జీ వి ని

"౧౮౮౩-వ సంవత్సరమున శ్రీలక్ష్మీబాయి 'సత్యసంజీవిని' యను నీతి బోధకమయిన యొక పుస్తకమును రచించితిని. దీనియందలి కథను నేనొక యింగ్లీషు పుస్తకమునుండి గ్రహించితిని గాని యేపుస్తకము నుండి గ్రహించితినో నాకిప్పుడు స్మరణకు రాలేదు. ఈపుస్తకము సత్యసంధతావలని యనర్థములు నిపుణముగా నాటుకొనునట్లు చెప్పబడినది."

—కం. వీ. స్వీ. చ, ౧౦, ౧౮౩-వ పుట.

అని వీరేశలింగకవి చెప్పేరు.

పైన చెప్పబడ్డ వాక్యాలవల్ల ఇదేదో యింగ్లీషు గ్రంథంయొక్క అనువాద మని తెలుస్తూంది. ఆ మూలగ్రంథ మేదో మనకు తెలియదు. మూలకథ కిది సరియైన అనువాదమో, లేక కొన్ని మూలాంశాలు లింగకవిలో చేర్చబడ్డాయో మనకు తెలియదు.

ఈ అనువాదంలో మూలకథలోని పేర్లు గాక మన దేశపు పేర్లు పెట్టబడ్డాయి కనుక యిది అనుకరణానువాదం. స్వతంత్రానువాద మౌనో కాదో తెలియదని ముందే చెప్పేను. ఈకథను శ్లాఘించేటప్పుడు, దూషించేటప్పుడు (ఆమూలాంశాలు లేకవిచేసిన మార్పులు కాకపోతే) మూలకథను గురించే అని అనుకోవాలి.

ఈకథ యెప్పుడూ నిజమే పలకాలి అనే నీతిని బోధిస్తూంది. అబద్ధాలాడడంవల్ల కలిగే నష్టాలు, నిజం పలకడంవల్ల కలిగే లాభాలు ఈకథలో విశద పరాతున్నాయి. బాలబాలికల కీ కథ అత్యంత ప్రయోజనకర మైనది.

నిజం పలకాలని వొక్కమాట చెప్పితే బాలబాలికలకు గాని పెద్దలకు గాని దాని యొక్క లాభాలాభాలు బోధపడవు. అలాగు గాక ఒక కథను కల్పించి దానిలో సత్యమాడ నందువల్ల కలిగే నష్టాలు, సత్యమాడినందువల్ల కలిగే లాభాలు వివరిస్తే యెవరికైనా ఆనీతి మనస్సులో నాటుతుంది. అలాగు మనస్సులో నాటజేయడానికే యీకథ కల్పించబడింది. ఇట్లు ఆకర్షకవిధానంతో నీతులు బోధించడం ఆదినుండి కవుల కలవాటే. పంచతంత్ర గ్రంథంయొక్క వుద్దేశమే అది.

"మనస్సు నాయాసపెట్టి క్రొత్తగా నొకదానిని కల్పించి చెప్పుటకంటె నాలుక దిగరనుండి తనంతట తానే యప్రయత్నంగా వెలువడి సిద్ధముగా నుండు సత్యమును పలుకుట కష్టమన్న నెవ్వరు నమ్మెదరు"

అని చంద్రమతీచరిత్రంలో సత్యాన్ని గురించి కవిచే చెప్పబడివుంది. ఆ వాక్యానికే యీ కథ నిదర్శనం.

ఈకథ యెంతో సహజంగా వుంది. ఎక్కడా కృతకంగా లేదు. మాణిక్యం వంటి అబద్ధికురాలు తుదకు సత్యవంతురాలవడానికి కారణా లక్ష్మీబాయమ్మయొక్క విశాలహృదయమే. అందరు తల్లిదండ్రులు లక్ష్మీబాయమ్మలాగ వుంటే పిల్లలు కొంతకాలానికేనా

పశ్చాత్తాపము లవక మానుతారా! అలాగు గాక అబద్ధం చెప్పినప్పటికంటె నిజం చెప్పినప్పుడే శిక్ష యెక్కువైతే పిల్లలు సహజంగా నిజంకంటే అబద్ధం చెప్పడమే తొందరగా నేర్చుకుని అదే యెక్కువ లాభకరమని గ్రహిస్తారు. ఈవిధంగా పెద్దలు పిన్నల కిచ్చే అభ్యాసనలోనే కొంతవరకు శీలనిర్మాణ మిమిడి వుంది. మాణిక్యం మొదట తనఅంతరాత్మ మొర ఆలకించి నిజం చెప్పలేదు. కాని ఆఖరికి నిజం బైట పడింది. దాచినా దాచబడలేదు. అది బహిరంగ మైపోయేక అవమానమే ఆమె పాలయింది. అంతటితో శాశ్వతంగా చెడిపోయిం దేమీ లేదు. తన మంచిప్రవర్తనచేత మాణిక్యం మళ్లా మర్యాదను నిలుపోగలిగింది.

మాణిక్యంయొక్క మనస్తత్వం అద్భుతమైన ధీశక్తితో రచయితచేత నిర్వహించబడింది. అబద్ధమాడేవారు పడేపాట్లన్నీ దీంట్లో చూపబడ్డాయి.

ఈగ్రంథశైలి—దీని ముందున్న రెండు గ్రంథాలకంటె దీంట్లో శైలి హెచ్చు లేదు, తగ్గు లేదు.

"శైలియందు సత్యవతీచరిత్రమునకును, చంద్రమతీ చరిత్రమునకును (ఈకథ) దీసిపోవుచున్నదని చెప్పవలసి యున్నది" (౨౯౬-వ పుట)

అని తోలేటి సుబ్బారావుగారిచే (శ్రీ) వీరేశలింగకవి చరిత్రలో చెప్పబడింది. ఈ రకమైన భేద మేమీ నాకీ మూడుగ్రంథాలలోను కనబడడంలేదు. ఏవొక్కటీ తక్కినవాటికంటె మెరుగ్గా లేదు. అన్నీ వాకే మోస్తరుగా సాధారణ శైలిలో వున్నాయి. ఎక్కువ మెచ్చదగిన శైలి గల దేదీ వీటిలో లేదు.

ఈ కథలో యేవొక్కలోపమైనా వుందంటే అది యీ కథయొక్క పేరులోనే వుంది. గ్రంథాని కీరకమైన నీతినామం పెట్టడంవల్ల ఒక అనర్థముంది. ఈపేరును చూసి పాఠకులు ఇది నీతికి నిదర్శనంగా వుండేటట్టు కల్పించబడిన కథ అనీ, అట్టిస్థితిలో యీకథ వుండవలసినంత కృతకంగానూ వుటుం దనీ అభిప్రాయపడతారు. అలాగు అభిప్రాయం పడడంవల్ల కథను చదవవలసినంత వుత్సాహంతో చదవరు. కాని యేవాఙ్మయంలోనైనా మేలైన పద్ధతిగా యెంచబడే దేమంటే, నీతికి కథ పర్యవసానంగా కనబడకూడదని, కథకు నీతే పర్యవసానంగా కనబడాలనీ. అలాగు చెయ్యడంవల్ల చదువరులు తగ్గనివుత్సాహంతో కథ నాస్వాదిస్తారు. కథను, నీతినికూడా ఆస్వాదిస్తారు. కథయందు మన కెంత యనురాగం కలుగుతుందో అది బోధించే నీతియందు కూడ మన కంత అనురాగమే కలుగుతుంది. కవియొక్క ఆశయం ఫలిస్తుంది. కథావాఙ్మయ మంతలోకి యిటువంటివే వుత్తమ కథలుగా యెంచబడుతున్నాయి. ఈరచనలో యీ చిన్నలోపం కనబడుతూంది.

ఈగ్రంథంలో వున్న అసమానభావనా శక్తిని గురించి మొదటే చెప్పేను.

# రాజ్యలక్ష్మి

కవిరాజహంస బాలాంత్రపు వేంకటరావు గారు

శ్రీసూక్తముగా నిది తల-పోసితినా, పురుషసూక్తముగఁ జేసితినా,
వ్రాసితి నాకృతి నీ వెటు-సేసిన సరె యింక నీదుచిత్తము శ్రీశా!

కలుములచెలికిఁ బురస్కృతి - మఱి రాయనికన్నియకు నమస్కృతి, పలుకుం
జెలువకు సత్కృతి యనఁగా - నిల మత్కృతి వెలయుఁగాక యిష్టార్థములన్.

కథలు కథలు గాక కావ్యరూపములుగాఁ-బలుకుచుంటఁ గలదు భావసరణి,
కావ్యరూపములను గథలుగాఁ గథలుగాఁ-గావ్యసరణిఁ బలుక ఘనత గాదె!

తేలికయును వాలికయును-పోలికయును జూపు పలుకుపొందిక తలపైఁ
జీలిక తాలిక లెడఁగాఁ-గాలికముగఁ గథలు చెప్పఁగలుగుట యనదే!

తేలికమాటలు మెచ్చే-బాలకులకుఁ గాక మాకుఁ బస లేదనుచో
చాలును, జవి లేదనుచో-చాలును సరసు లగువారు చదువరు మొదలన్.

పుణ్యులు శౌనకాదులును, పూతుఁడు సూతుఁడు, ధన్య నైమిశా
రణ్యము లేకయుండఁగఁ బురాతనగాథ యొకండు సెప్పఁగా
గణ్యత యుండునే యనరుగా కథునాతను లైన మీరు సా
ద్గుణ్యము మీఱ నా ఁబుషఁగోరిన సత్కథ నాలకింపరే!

## అనుక్రమణిక

కల దరణ్యమందు కాసార మొక్కండు-నిర్మలాంబువులను నిండియుండు
పథముఁ దప్పి యొక్క-పథికుం డచటఁ జేరి-శీతలాంబువులను సేదదేఱె.

సలిలవీచి నూఁచి, చలువలు గొని లేచి-లలితవాతపోతములు సెలంగు
గున్నపొన్ననీడఁ గోరిక లూనఁగూడఁ-బథికుఁ డధివసించి ప్రకృతిఁ గాంచి.

చిత్తమున నేమి యెంచెనో, చిత్రమునకొ ?-అడవి గృహముని యెంచెనో, ఆటకొఱకొ?
కూడఁ బాడంగ నెంచెనో, తోడుకొఱకొ?-అతఁడు రచియించె మంటిచే నాఁడుబొమ్మ.

మాటలే లేని యొకకొన్ని ఘంటనములఁ-బ్రొద్దుపోవంగఁ బాంధుఁడు వోయెఁ గాని
చిత్రముగఁ దన్నుఁ జేసిన సృష్టికర్త-మాటలాడింప నెఱుఁగ దామంటిబొమ్మ.

కంప డెండకుఁ, జీఁకటి డిందువడదు-గాలి కెగురదు, వానకుఁ గరఁగఁబోదు,
అడవిలో నొంటి నుండుట కడలఁబోదు-చెక్కు-చెదరంగఁబోవ దాచిత్ర మేమొ!

మానవప్రాణి లేని యాకాననమున-నెన్నినా ళ్లుండినను దన కేమిభయము?
బొమ్మ యెఱుఁగదు తనచెంతఁ బులులు పాము-లంతరాళంబునను బక్షు లాడుచుంట.

చూడంగాఁ లేడులు, నడ-యాడంగాఁ గరులు, మాటలాడఁగ శుకముల్
పాడంగాఁ గోకిలములు-వీడంగా లేవు బొమ్మవేడుక గనుచున్.

భువనమోహనమైన యాబొమ్మఁ జూచి-క్రూరమృగములుఁ బక్షులు గుంపుగిట్టి
అనయమును జుట్టుఁ దిరుగాడు నంతె కాని - వెగటుఁదనమునఁ గీడు గావింపఁబోవు.

ఇట్టులు జరుగుచునుండఁగ - బట్టలవర్తకుఁ డొకండు పథ మెఱుఁగక, యా
నట్టడవిఁ బట్టిపోవుచు - నట్టే యాబొమ్మఁ జూచి యాశ్చర్యమునన్.

అమ్మా! త్రిలోకసుందరి! - యిమ్మాదిరి నగ్న వైతి వేమిటి కమ్మా!
కొమ్మా చీనాంబరమని - యమ్ముగుదకుఁ గట్టె నొక్క-యంబర మొప్పన్.

కట్టి చూచె నతఁడు కన్నులు చల్లఁగా - మొదటికంటె హెచ్చె సుదతిచెన్ను
వాఁడు మరలఁ జూచి వనలక్ష్మి గాఁబోలు-నంచు నెంచి మ్రొక్కి యరిగె నెటకొ!.

తనమానముఁ గాపాడిన - మనుజునకుఁ గృతజ్ఞతానమస్కృతి దెలుపన్
మన మెఱుఁగదు జడముక్రియన్ - మనుపుట్టువు జడము గాక మఱియేమి యగున్.

అంబరధారిణి నవహర్‌-షంబున కచ్చెరువు నంది పక్షులు మృగముల్
సంబరముఁ దక్కి యార్భా-టంబులు సేయంగ మాని, డాయు వెఱవమిన్.

కొన్నాళ్లకు విధివశమున - సొన్నారి యొకండు కాసఁ బొరఁబడి రాఁగాఁ
గన్నులఁ బడె నాసుందరి-తన్నాతఁడు మఱచి కొంతతడ వటు లుండన్.

ఆతఁ డామూర్తియందంబు నరసి యరసి - స్వర్ణమణిభూషణంబులు సంతరించి
లలితమోహనరీతి నలంకరించి - అంగసౌందర్యలక్ష్మి యింపాఱఁ జేసె.

అంగరక్ష యయ్యె నాభూషణం బయ్యె-స్వర్ణకారుఁ డింత సాయ మయ్యె
సాధు సాధు వనుచుఁ జన విచ్చి పలుకదు-సిగ్గు గలిగెనేమొ! చిత్ర మేమొ!

జడమై పుట్టిన నేమీ - మడుగులు గట్టినది స్వర్ణమణివల్లరిచే
నొడ లలవరించుకొన్నది - పడఁతుక వనలక్ష్మి యనుచుఁ బలుకం దగదే!

నడయాడదు, పలుకాడదు - గడెగడె కొకవింతసొబగు గలుగు నదేమో!
విడిచియు విడువనిపువ్వులు - ముడిచియు నల్దెసలఁ దావి ముట్టినరీతిన్.

వాసరము లిట్లు చనఁగా - మాసంబులు చనఁగ వర్షమాసము చనఁగా
భూసురుఁ డొక్కఁడు మాంత్రికుఁ - డాసీమకు వచ్చి దాని యబ్రము గనుచున్.

భూపతిం బంతియు నెఱిఁగిన - యాతం డీవర్తమాన మరయఁడె భావిన్
జీత్రోపిఁ దలంపఁడె - ధాతకుఁ బ్రతి, బ్రాహ్మణుండు దక్కువవాఁడే!

తనువు నిచ్చినవాఁడె, తనమాన మిచ్చిన - యతఁడె యంగరక్ష యరసినతఁడె
ప్రాణ మిచ్చినాఁడె, పలికించుకోరె! పాలించుశక్తి తమకు లేదు గాక!

సుగుణుం డతఁ డిట్లు లెంచుచుఁ - ద్రిగుణాత్మకుఁడైన యాదిదేవుని క్రియ, న
మ్మగువ జననాదికంబున - కగుపురుషార్థము గ్రహించి యాదరమతియై.

చేసినట్టివాని చేఁతకు మెచ్చి, కై-సేసినట్టివారి వాసి మెచ్చి,
బ్రహ్మజడత మాన్పఁ బూనిక మంత్రించి-ధరణిసురుఁడు ప్రాణదాన మొసఁగె.

పుట్టినపుఁడు, పుట్టంబును - జుట్టినపుఁడు, కాంచనంపుసొమ్ములు మేనం
బెట్టినపు డలుఁగఁగలో దా-పట్టి యిపుడు పలుకఁజొచ్చెఁ బ్రాణము చేరన్.

మంత్రమహిమఁ గంటి, మనుజుంగఁ గంటిని-భూతవృత్త మెల్లఁ బోల్చుకొంటి
గ్రామమృగము లెల్లఁ జేరువవారైరి-అడవి పూజ్యరాజ్య మయ్యె నాకు.

తండ్రి యయ్యె నొకఁడు తనుధారణ మొసంగి-భ్రాత యయ్యె నొకఁడు బట్ట లిచ్చి
ఆత్మబంధుఁ డయ్యె సంగరక్ష నొకండు-పరమగురుఁడ వైతి ప్రాణ మిచ్చి.

వందనము సద్ద్విజుండా! - వందన మఖిలేశమంత్రవర్ధిష్ణుండా!
వందనము కృపాళుండా! - వందన మని లేమ విప్రవరుఁ బూజించెన్.

*  *  *  *  *  *

మాంత్రికాశీర్వాదము

లక్ష్మీకాసారం బిది - లక్ష్మివి నీ విచటిరాజ్యలక్ష్మివి గానన్
లక్ష్మీశునికృపఁ గాంతువు - సూక్ష్మంబు గ్రహించి పొందు శుభముల నిందున్.

*  *  *  *  *  *

పలుకులఁ జేతల భక్తిన్ - దలకొనుచిత్తమున నిట్లు ధాత్రీసురు న
వ్వేలఁది వివిధార్చనంబుల - నెలమింపఁగఁ జేసి మఱియు నిట్లని పలికెన్.

కదలు టెఱుఁగని వెనుకటి కాలమాయెఁ - బొదలు టెఱుఁగని మునుపటిబొమ్మ వోయె
వంకయును జంకు లేకుండ నింకమీఁద - జీవయాత్ర నే నేరీతిఁ జేయుదాన !

అసువుల నీనిచో యుగయుగాంతర మట్టులె యుందుఁ గాని నా
కసువుల నిచ్చి మర్త్యగణమం దొకదానిగ నుండఁజేసి, మా
నసమున లేనిపోనిజతనంబులు గూర్చితి వార్య! నాకు నీ
వసుమతి యేల? పాలనము వచ్చిన, వచ్చినచావు దప్పునే?

ఆఁడుదానిచేతియర్థంబు, మగవాని - చేతిబిడ్డ మనుట భ్రాంతి యంద్రు ;
అర్థసిద్ధి లేని యాయువు నా కేల? - నిండుగ్రుడ్డి కేల నెలవెలుంగు ?

ఇయ్యెడఁ బాలనంబునకు నెంతయు నూహ జనింపకున్న దే
యయ్యల కిత్తు నన్న నది యందెడివారును గానరారు, మా
యయ్యలు లేరు, నీ వొకఁడ వయ్యవు గానఁ బరిగ్రహింతు రా
వయ్య! పరోపకారి వగు మయ్య! ధరామర! నేఁడు క్రమ్మఱన్.

నావుఁడు ధాత్రీసురవరుఁ - డావెలఁదుకఁ జూచినవ్వి యఖిలాత్మక నో
దేవీ! నీ విటు లాడిన - భూవలయంబునకె లోటు పుట్టును గాదే!

సింగపురొద బెదరెదవా? వి - హంగార్భటి కులికిపడెదో? యనిలోద్ధతికిన్
గ్రుంగెదో? పర్జన్యాంభో - భంగంబుల భయముపడెదొ, పలుకుము దేవీ!

కరికుంభములమీఁది కొరవడి నుఱుకు కేసరికి నీ విచ్చిన శక్తి గాక!
ఆశీవిషంబుల నలమి పైకొను తార్క్ష్యపతికి నీ విచ్చిన బలము గాక!
ఘనతరువ్రాతంబుఁ బెనిచి కూలుచుమహాబలున కీ విచ్చిన యలవు గాక!
యఖిలభూమండలం బంతలో ముంచుమేఘునకు నీ విచ్చిన పెనుపు గాక!
వేఱె యెక్కడి దమ్మ యీ విశ్వమందు - ఆత్మశక్తి తలంప కిట్లంటి గాక
నీబలము నీ వెఱుంగని నిన్నటివలె - నేఁడుఁ గూడ వచింపఁగాఁ జూడ కమ్మ!

అయ్యలయ్యల కెల్ల నమ్మమ్మ వగుదు - వయ్యలే లేరఁటంచు నీ వాడ నేల?
భువనములు నీదుబొజ్జనే పుట్టె నన్న - దేవి! యీవిశ్వమాతవు నీవు గావె!

ఈవు చేయఁజనని దెవ్వరు చేయుదు - రర్థసిద్ధు లెల్ల నాశ లెల్ల
నిఖిలరక్ష సేయు నీయాజ్ఞలో నుండ - నాజ్ఞ లేని పరున కగునఁటమ్మ!

# రూపలేఖ చిత్రావళి



౧. అలంగీరు



౨. బుద్ధదేవుని మ్రోల మృతశిశు సహితయగు మాత

అసువుల నిచ్చితి నంటివె! - యసువుల నీఁగలుగువార లవనిం గలరే!
అసువులు నచ్చెను గర్మా-వసరోపాధులను బట్టి వాలాయముగన్.

పుట్టినవారికి గిట్టుటయె పోలు! జగంబులు పుట్ట గిట్టనుం
బెట్టినయట్టినీకుఁ, బొరపెట్టి పరాత్పరు నాత్మశక్తిచేఁ
గట్టినయట్టి నీకు, నవుఁ గా దననేరను గాని, నాకుఁ గ
న్పట్టుట పుట్టువయ్యెనె? సనాతనశక్తికిఁ బుట్టు వున్నదే?

ఆకృతిఁ గూర్చిన యనఘాత్ముఁ డెఱుఁగునే నీయనంతాకృతి నిఖిలమాత!
పుట్టంబు లిచ్చిన పుణ్యాత్ముఁ డెఱుఁగునే నీమహామహిమంబు నిఖిలజనని!
సొమ్ములు పెట్టిన శుచిమంతుఁ డెఱుఁగునే నీ దివ్యతేజంబు నిఖిలశక్తి!
పట్టంబుఁ గట్టిన ప్రకృతి యెఱుంగునే నీజగన్నుతకీర్తి నిఖిలమూర్తి!
కలసి యేనాఁడుఁ బరుఁగుఁ గానరాక - తిరిగి యేనాఁడుఁ బెఱవారి కెఱుఁగరాక
నిగమమంత్రార్థసంసిద్ధి నేఁడు నాకు - నాదరంబునఁ బ్రత్యక్షమైతి గాక!—
అఖిలలోకమహేశ్వరివైన నిన్ను - నే నుపాసించి కొలిచిన నియతి మెచ్చి
నాకుఁ బ్రత్యక్షమైతివి లోకమాత!-వర మొసఁగు మమ్మ! నీవ యీ వసుధ నేల.

నీవు సనాతన శక్తివి- దేవీ! నీ యాజ్ఞ కెందు తిరుగున్నదె! నీ
సేవకులె యందఱు గానీ - నావశమా రాజ్యపాలనం బొనరింపన్—

గద్దెపైన వసించి పెద్దాడఁగలఁ గాని రాజ్యంబుసేయఁగా రాదు నాకు,
తేగచింత వసించి తీరాడఁగలఁ గాని కయ్యంబుసేయఁగాఁ గాదు నాకు,
ఓలగంబున నుండి మేలాడఁగలఁ గాని కట్టడసేయఁగాఁ గాదు నాకు,
చౌకంబునం దుండి చదురాడఁగలఁ గాని కానుకబిరు దీయఁ గాదు నాకు,
వలయు నుపదేశ మీయఁగాఁ గలను గాని - ప్రాభవము లేని నా కేల పాలనంబు
రాజరాజేశ్వరివి నీవె తేజ మెసఁగ-నీభువనపూజ్యరాజ్యంబు నేలు మమ్మ!
నా విని మానినీమణి యనంతగుణానుభవప్రపూర్ణయై
జీవగణప్రకీర్ణమగు సిద్ధజగం బఖిలంబు నైజమా
యావరణంబులోని దగు టాత్మ నెఱింగి, ప్రసన్నచిత్తయై
యావసుధామరప్రవరు నారసి ప్రాభవ మొప్ప నిట్లనున్—

తెలిసిన దార్యవర్య! భవదీయసమంచితసత్యబోధ; నీ
పలికినప ల్కమోఘ మని ప్రస్తుతి సేయఁగ నేల? మున్న ధీ
బలమునఁ బ్రాభవంబునకు భావిచరిత్ర శుభోదయంబుగాఁ
బలికిన దైవవాణుల కుపాయనమే గద నీ మృదూక్తియుల్.

నిజమున కొప్పకున్న నవినీతి యగుల్. మఱి యొప్పుకొన్న దోఁ
బ్రజ కది తోఁచు గర్వ మను భావముగా, నటు గాన సత్క్రియా
విజయముచేతఁ బ్రాభవము వెల్లడి సేయుట ధర్మమంచు నా
ర్యజనులు పల్కుచుందు రది యాదరణీయము గాదె యెవ్వెఁడల్.

అతఁడే సచివుం డగుహితుఁ-డతఁడే యగు నాత్మబంధుఁ డాతండే యగుల్
మతిమంతుండై గురుఁడై - పతికిఁ బురోహితుఁడునైన పండితుఁ డనఘా!

దివ్యులగు గురుభార్గవదివిజమునులు - భవ్యులైన వసిష్ఠాది పరమమునులు
సచ్చరితులైన ధౌమ్యాది సాధుజనులు - పతికి హితబంధు గురుపురోహితులు కారె!

యోగనిద్ర నున్న యోగేశ్వరిని నన్ను-మేలుకొలుపుఁ బాడి మేలుకొలిపి
జ్ఞానముద్రలోన సర్వంసహాభార-భరణ మొసఁగినావు భవ్యమూర్తి!

నీకంటెను హితు లెవ్వరు-నీకంటెను సచివు లెవరు, నీకంటె గురుల్
నీకంటె నాత్మబంధులు-మా కెవ్వరు గలరు భువనమండలి ననఘా!

మాకుఁ బురోహితుండవయి మాయవనీభర భారకార్యముల్
చేకొని నేఁటినుండి పనిసేయుదు గాక! మదీయశాసన
శ్రీకరమూర్తివై ప్రజల సేమమె నిత్యముఁ జూతుగాక! స్వా
ఖ్యాకర మౌను గాక వసుధామరనందన! నీకు నెల్లెడల్.

వృత్తియుఁ, గలిమియు, ధనమును - బెత్తనమును దీనఁ బేరువెంపులు గలవం
చెత్తెఱఁగునఁ బలుకుదు! లోకోత్తరచరితునకు నీకు నుర్వి సుపర్వా!

అసిధారావ్రతశక్తిల్-మసలం గలవాఁడ వౌట, మాహితమునకై
వసుధావనమున నీకుల్-బసదన మీవలయు ననుట భావ్యము గాదే!

నా విని మందస్మితుఁడై-యావిప్రుం డిట్టు లనియె, నమ్మా! నీయా
జ్ఞావర్తి నగుదు నైనన్-నావిన్నప మున్న దది వినందగు మొదలన్—

ఆర్తి యెఱుంగని విభవ-స్ఫూర్తిం బ్రాపించి శాంతిశోభావిలస
న్మూర్తి యగు ప్రభ గొని చెడి-కీర్తియె పసదనము మా కకల్పిత చరితా!

సంయమీంద్రునకైన సంసారికైనఁ - గీర్తిధన మిందు నందును గ్రిందువడక
శాశ్వతం బగు పుష్టి నొసంగుఁ గానఁ - జిరయశోధన మొకఁడె వాంఛితము మాకు.

ఉన్నది పుష్టి మనుజునకుఁ-దిన్నది పుష్టి పసి కనెడి దేశపునుడి ము
న్నున్నది గాదా విన్నది,-కన్నది గాదమ్మ! పలుకు కందువ సుమ్మా!

శుద్ధసువర్ణాత్మసుకృతి యున్నది మాకు నెత్త నేమిటి కమ్మ వృత్తిమాట,
పరమపావనపదభాగ్య మున్నది మాకుఁ దలఁప నేమిటి కమ్మ కలిమిమాట,
అన్యాపహార్యభాసురసు కీర్తి యున్నది మాకుఁ దడవ నేమిటి కమ్మ ధనముమాట,
మాన్యంపు నగప్రాసంపత్తి యున్నది మాకుఁ బలుక నేమిటి కమ్మ పదవిమాట,
ఉన్నదని చెప్పుకొంట గర్వోక్తి గాక-అమ్మదయ యున్న దనుటకే యర్థ మమ్మ!
జనని! నీ సత్కృపాప్రసాదమహిమఁ-గన్న మా కొండుకొదవ యే మున్న దమ్మ!

ప్రాభవం బున్నది పాలింపఁగా మీకుఁ బలు కున్నయది మాకు బలముఁ గొలుప
దౌరశాసనం బున్నది బిరుదు వల్కఁగ మీకుఁ గళయున్నయది మాకుఁ గాలు నిలుప
భూతంబు గున్నది ప్రోటసేయఁగ మీకుఁ దల మున్నయది మాకు దళము గూర్ప
అభిమాన మున్నది యాదరింపఁగ మీకుఁ జన వున్నయది మాకు సంతరింప:
ఉన్నదని చెప్పుకొంట గర్వోక్తి గాక - తరతమవిభాగ మొనరించుసరణి గాక
పాలసం బనుబంగారుబండి నడుపఁ - బ్రాణచక్రంబులను ద్రిప్పు పగిది గాదె!

నీవు మహాలక్ష్మీమణి-వై విశ్వము నేలుచుండ నర్హమె కాదా
మావంటివారు కొలువున-జీవించుచు నుండి సదుపదేశము లొసఁగన్.

గురుపదమును మ మ్మొంచిన-గురుమతి నీ వెఱుఁగనట్టి గుణధర్మము లే
దరయఁగ నంచితు నైనన్-బరమకరుణ వినుమటంచు బ్రాహ్మణుఁ డనియెన్.

నీతోడునీడగా నిలిచియున్నది గదా మృగరాజు బోనులో నిడకుమమ్మ!
అడుగు దాఁటకయుండ నడయాడినది గదా కరిరాజుఁ గంబానఁ గట్టకమ్మ!
ఉక్కు సోఁకకయుండ తెక్కార్చినది గదా విహగరాజును గూఁట వేయకమ్మ!
మిడిమిడియెండకుఁ బడగెత్తినది గదా ఫణిరాజుఁ బుట్టలో నణఁపకమ్మ

తెలిసిన దార్యవర్య! భవదీయసమంచితసత్యబోధ; నీ
పలికినపల్కు మోఘ మని ప్రస్తుతి సేయఁగ నేల? మున్ను ధీ
బలమునఁ బ్రాభవంబునకు భావిచరిత్ర శుభోదయంబుగాఁ
బలికిన దైవవాణుల కుపాయనమే గద నీ మృదూక్తియున్.

నిజమున కొప్పకున్న నవినీతి యగున్. మఱి యొప్పుకొన్న దోఁ
ప్రజ కది తోఁచు గర్వ మను భావముగా, నటు గాన సత్క్రియా
విజయముచేతఁ బ్రాభవము వెల్లడి సేయుట ధర్మమంచు నా
ర్యజనులు పల్కుచుందు రది యాదరణీయము గాదె యెయ్యెడన్.

అతఁడే సచివుం డగుహితుఁ-డతఁడే యగు నాత్మబంధుఁ డాతండె యగున్
మతిమంతుండై గురుఁడై - పతికిఁ బురోహితుఁడునైన పండితుఁ డనఘా!

దివ్యులగు గురుభార్గవదివిజమునులు - భవ్యులైన వసిష్ఠాది పరమమునులు
సచ్చరితులైన ధౌమ్యాది సాధుజనులు - పతికి హితబంధు గురుపురోహితులు కారె!

యోగనిద్ర నున్న యోగేశ్వరిని నన్ను-మేలుకొలుపుఁ బాడి మేలుకొలిపి
జ్ఞానముద్రలోన సర్వంసహాభార-భరణ మొసఁగినావు భవ్యమూర్తి!

నీకంటెను హితు లెవ్వరు-నీకంటెను సచివు లెవరు, నీకంటె గురుల్
నీకంటె నాత్మబంధులు-మా కెవ్వరు గలరు భువనమండలి ననఘా!

మాకుఁ బురోహితుండవయి మాయవనీభర భారకార్యముల్
చేకొని నేటినుండి పనిసేయుదు గాక! మదీయశాసన
శ్రీకరమూర్తివై ప్రజల సేమమె నిత్యముఁ జూతుగాక! సా
ఖ్యాకర మౌను గాక వసుధామరనందన! నీకు నెల్లెడన్.

వృత్తియుఁ, గలిమియు, ధనమును - బెత్తనమును దీనఁ బేరుపెంపులు గలవాఁ
చెత్తెఱఁగునఁ బలుకుదు! లో-కోత్తరచరితునకు నీకు నుర్వి సుహర్షా!

అసిధారావ్రతశక్తిన్-మసలం గలవాఁడ వౌట, మాహితమునకై
వసుధావనమున నీకున్-బసదన మీవలయు ననుట భావ్యము గాదే!

నా విని మందస్మితుఁడై-యావిప్రుం డిట్టు లనియె, నమ్మా! నీయా
జ్ఞావర్తి నగుదు నైనన్-నావిన్నప మున్న దది విన దగు మొదలన్—

ఆర్తి యెఱుంగని విభవ-స్ఫూర్తిం బ్రాపించి శాంతిశోభాపిలన
స్మ్మార్తి బగు ప్రభుః గొలిచెడి-కీర్తియె పసదనము మా కకల్పితచరితా!

సంయమీంద్రునకైన సంసారికైనం - గీర్తిధన మిందు నందును గ్రిందువడక
శాశ్వతం బగు పుష్టి నొసంగుం గానం - జిరయశోధన మొకండె వాంఛితము మాకు.

ఉన్నది పుష్టి మనుజునకుం-దిన్నది పుష్టి పసి కనెడి దేశపునుడి ము
న్నున్నది గాదా విన్నది,-కన్నది గాదమ్మ! పలుకుకందువసుమ్మా!

శుద్ధసువర్ణాన్మసుస్మృతి యున్నది మాకు నెత్త నేమిటి కమ్మ వృత్తిమాట,
పరమపావనపదభాగ్య మున్నది మాకుం దలంప నేమిటి కమ్మ కలిమిమాట,
అన్యాపహార్యభూపరమార్థ మున్నది మాకుం దడవ నేమిటి కమ్మ ధనముమాట,
మాన్యంపుంగవులసంపత్తి యున్నది మాకుం బలుక నేమిటి కమ్మ పదవిమాట,
ఉన్నదని చెప్పికొంట గర్వోక్తి గాక-అమ్మదయ యున్న దనుటకే యర్థ మమ్మ!
జనని! నీయక్కటికప్రసారమహిమం-గన్న మా కొందుకొదవ యే మున్న దమ్మ!

ప్రాభవం బున్నది పాలింపంగా మీకుం బలు కున్నయది మాకు బలముం గొలుప
దొరతనం బున్నది బిరుదు వక్కంగ మీకుం గళయున్నయది మాకుం గాలు నిలుప
భూతలం బున్నది ప్రోదిసేయంగ మీకుం దల మున్నయది మాకు దళము గూర్ప
అభిమాన మున్నది యాదరింపంగ మీకుం జన మున్నయది మాకు సంతరింప:
ఉన్నదని చెప్పికొంట గర్వోక్తి గాక - తరతమవిభాగ మొనరించుసరణి గాక
పాలనం బనుబంగారుబండి నడుపం - బ్రాణచక్రంబులను ద్రిప్పు పగిది గాదె!

నీవు మహారాజ్ఞీమణి-వై విశ్వము నేలుచుండ నర్హమె కాదా
మావంటివారు కొలువున-జీవించుచు నుండి సదుపదేశము లొసంగన్.

గురుపదమునం దమర్చిన-గురుమతి వీ వెఱుంగనట్టి గుణధర్మము లే
దరయంగ నంచితు నైనన్-బరమకరుణ వినుమటంచు బ్రాహ్మణుం డనియెన్.

నీతోడునీడగా నిలిచియున్నది గదా మృగరాజు బోనులో నిడకుమమ్మ!
అడుగు దాటకయుండ నడయాడినది గదా కరిరాజుం గంబానం గట్టకమ్మ!
ఉక్కు సోకకయుండ ఱెక్కార్చినది గదా విహగరాజును గూంట వేయకమ్మ!
మిడిమిడిమెండకుం బడగెత్తినది గదా ఫణిరాజుం బుట్టలో నణంపకమ్మ

ప్రాభవవినోదములమాట పాటిగొనక - యుపకృతిఁ దలంచి జీవుల కుపచరించి
విశ్వజననయిత్రి వనుమాట విస్మరింప - కీభువనపూజ్యరాజ్యంబు నేలుమమ్మ !
కారంబు మ్రింగ నోంకారం బెఱుంగునే గౌరవంకమాటలఁ గొనకుమమ్మ !
పంచమసిద్ధిఁ బ్రపంచ మెఱుంగునే కలకంఠిపాటల దలఁపకమ్మ !
ఫల సమాహారతఁ బరమార్థ మెఱుఁగునే చిలుకప్రానుడి పాటిసేయకమ్మ !
అమలతావిస్ఫూర్తి నాత్మ యెఱుంగునే కలహంసనడవడిఁ బలుకకమ్మ !
ప్రభులు చారచక్షువులను పలుకె కొనక - స్వాత్మచక్షువులను మాట సార్థకముగ
విమలధర్మాభిరతుఁ గావించుపొంకె - నీభువనపూజ్యరాజ్యంబు నేలుమమ్మ !
సాగరేశ్వరి రత్నసౌధంబుఁ గట్టించెఁ బ్రియము మీఱ సమాదరింతు గాక !
పర్వతేశ్వరి మణిప్రాకార మెత్తించెఁ గృప మీఱ నంగీకరింతు గాక !
క్షితితలేశ్వరి స్వర్ణసింహాసనముఁ గూర్చెఁ బ్రేమ మీఱఁగ స్వీకరింతు గాక !
భూతీశ్వరి విహారపుష్పకం బొనరించె నెలమి మీఱఁ బరిగ్రహింతు గాక !
స్వాంశుమంతు లెల్ల సామంతులై యిట్లి - ప్రాభవంబుఁ గూర్చి భక్తి మీఱఁ
జిత్త మెఱిఁగి నిన్ను సేవింపఁగాఁ బ్రజా - రక్షఁ గూర్తుఁ గాక రాజ్యలక్ష్మి !
కాసారలక్ష్మియే కదలి వచ్చిన దమ్మ సర్వేశ్వరున కర్ఘ్యసమయ మనుచు,
ఆరామలక్ష్మియే చేరవచ్చిన దమ్మ విశ్వేశ్వరునిపూజవేళ యనుచు,
కేదారలక్ష్మియే కేరి వచ్చిన దమ్మ భువనేశు నర్చించుప్రొద్దటంచు,
గోకులలక్ష్మియే కోరి వచ్చిన దమ్మ పరమేశు సేవించుతరుణ మనుచు,
భువనలక్ష్మియె చాటింపఁ బూనెనమ్మ - నిఖిలరక్షకుఁ గీర్తించునిమిష మనుచు
శుభసమయ మయ్యె నఖిలేశు శ్రుతిహితముగ,-భక్తిఁ బ్రణుతింతు రావమ్మ భాగ్యలక్ష్మి !

* * * *

మఱుపడినది కొఱపడినది - తెరపడినది ముందు నీకుఁ దెలుపఁగవలెనా
యెఱుఁగవె? నను మన్నింపఁగ - నెఱుఁగవె? నావలన వినుట కెఱుఁగవె శ్రీశా ?

# ఆంధ్రధ్వని విమర్శనము

కాశీభట్ల రామకృష్ణశాస్త్రిగారు

సుప్రసిద్ధులగు సవ్వారిసుబ్రహ్మణ్య శాస్త్రి గారి "ఆంధ్రధ్వని" యను గ్రంథముఁ జూచితి. అది కేవల మాంధ్రముఁ జదివినవారికి బోధగాదు. సంస్కృతమున, అందులో నలంకారశాస్త్రమున నిష్ణాతులైనవారి కీ గ్రంథ మంతగా రుచింపకున్నది. కనుక వారు బోధించుట కంగీకరింపరు. దీని, నేపరీక్షకయినఁ బఠనీయముగ నుంచిరా, విద్యార్థులు ధ్వని విషయమున తెలిసితెలియనివార లౌదురు. తెలిసితెలియనివారితో మాట్లాడు టెంత కష్టము? వారియొద్దఁ జదువువిద్యార్థుల కెంత విసుగు?

ఇతరశాస్త్రములకు వలె సధికప్రవచన పరంపరలేని యీయలంకారశాస్త్రమున కిపు డిపుడు కొంచె మంకురదశ గల్గుచున్నది. ఇట్టి దశలో నీలాటి యాంధ్రీకరణములు బయలు దేరి, సంప్రదాయ సిద్ధములగు సహజ శోభ లను రూపుమాపి, విద్యార్థులకు వైదుష్య మును గల్గించుటకు మారు విపరీత జ్ఞానమును కలుగఁజేయుచున్నవి. గ్రంథకర్తల యశశ్చంద్రికకు కళంకముఁ దెచ్చుచున్నవి. విమర్శకుల కలమునకు పనిఁగల్గించుచున్నవి.

సంస్కృతభాష చదువనివారి కందులోని రుచి తెలియుట కాంధ్రీకరణము సహాయకరమే. కాని యాయాశయముల దేశభాషలోఁ బ్రతిఫలింపఁ జేయు టెట్లు? ఎంతటిసామర్థ్య ముండవలయు? మీ "డు,ము, వు,లు" మీరు తీసు కొని మా ప్రాతిపదికముల మాకు ప్రసాదింపుఁ డని దేవతలు వేడుకొనుచున్నను, 'దేవతల సొమ్ము' నియైన వెఱువక మనముపయోగించు కొనవలసినదే కదా? కథలవలె నుండు కావ్య ములఁ దెనిఁగింప జంకెడు ప్రకృతకాలమున లక్షణ గ్రంథములఁ దెనిఁగించుటయా? అం దులో ధ్వనికారికలనా? సాహస కార్య మున కుపక్రమించుట వీరునిలక్షణము గనుక పాండిత్య వీర్యముగల విపశ్చిదగ్రేసరు లుపక్ర మింతురు గాక, కార్యమును సరిగ నిర్వహింప వలదా? ధ్వనికారికలు గంభీరములై, కుశలు లకు మాత్రమే గ్రాహ్యములుగ నున్నవి. వాటిని పామరులకు గూడ గోచర మగునట్లుఁ చేయు కుతూహలముచే గ్రంథకర్త యాంధ్రీక రించి యుండవచ్చును. కాని ప్రయత్న మెట్లు పరిణమించినదో కనుఁగొందము.

ధ్వనికారికలకు మంగళశ్లోకమున కాంధ్రీకరణముఁ బరీక్షింతము :

సంస్కృతము :

స్వేచ్ఛాకేసరిణ స్స్వచ్ఛ
స్వచ్ఛాయాయాసితేందవః,
త్రాయంతాం వో మధురిపోః
ప్రపన్నార్తిచ్ఛిదో నఖాః.

ఆంధ్రము :

"క. శ్రీమధుసూదనుఁడగు స్వే
చ్ఛామృగనాథుని ప్రపన్న సౌఖ్యకరంబుల్,
సోమస్వచ్ఛస్వచ్ఛా
యామయనఖరములు శరణ మయ్యెడినాకున్.,

మాతృకలోని సంపూర్ణార్థము తెలుఁగు పద్యమునఁ గాన రాకున్నది. ఉన్నదున్నట్లు పద్యమునఁ బ్రతిఫలింపఁజేయక, మనయాంధ్రీకర్తగారు స్వాతంత్ర్య మవలంబించుటయేటికి? అదేమంటిరేని సాక్షాత్కరింపుఁడు. "స్వచ్ఛాయాయాసితేందవః" (౨) "ప్రపన్నార్తిచ్ఛిదః" ఈరెండు పదములును "నఖాః" అనుదానికి విశేషణములు. అందులో మొదటివిశేషణమునకు "నిజకాంతిచే ఖేదముఁ గల్గించఁబడిన చంద్రుఁడు గలవి" (నఖములు) అని యర్థము. రెండవవిశేషణమునకు "భక్తుల పీడలను తెగఁగొట్టునటువంటివి" (నఖములు) అనియర్థము. పై రెండు విశేషణములకు వీరి యాంధ్రీకరణము (౧)"సోమస్వచ్ఛ స్వచ్ఛాయామయనఖరములు" (౨)"ప్రపన్నసౌఖ్య కరంబుల్" అని. ఇది పొసఁగదు. "ఆయాసిత" అను సంస్కృతమునకు భాషాంతరీకరణముఁ గావింపలేదు. ప్రతిపదమునకు ననువాదముఁ జేయనవసరము లేదని యడుగవచ్చును. శ్లోకమంతటికిని రామణీయకహేతువగు నా పదమునకు ప్రతిపదమాంధ్రమున గానరాకుండుట వివక్షితార్థమునకు భంగముఁ దెచ్చుచున్నది. సర్వాలంకారశోభితయగు గీర్వాణవాణికి ఫాలమున తిలకముఁ దుడిచినట్లయినది. "యథాస్త్రీణాం తథా వాచాం సాధుత్వే దుర్జనో జనః" అని నన్ను పాఠకులు దూరెదరేమో. ఆపైన మాంధ్రీకరణమున నుండు కొంతటి యపశ్యమో, గ్రంథమును వ్యాఖ్యానముచేయు లోచనకారుని వాక్యములఁ జదువు మీకిపుడే తెలియఁగలదు.

లోచనము :

"స్వచ్ఛాయయా వక్రస్పృహ్యయోపహాసా౽౽కృత్యా౽౽యాసితః, ఖేదిత ఇందుర్యైః । అత్రార్థశక్త్యనురణనరూపేణ ధ్వనినా బాలచంద్రత్వం ధ్వన్యతే । ఆయాసనేన (ఆకర్షణేన) తత్సంనిధౌ చంద్రస్యనిచ్ఛాయత్వప్రతీతి రహృద్యత్వ ప్రతీతిశ్చ ధ్వన్యతే। ఆయాసకారిత్వంచ నఖానాం సుప్రసిద్ధం। నరహరినఖానాం తచ్చ లోకోత్తరేణ రూపేణ ప్రతిపాదితం। కించ తదీయాం, స్వచ్ఛతాం కుటిలిమానం చావలోక్య బాలచంద్రస్స్వాత్మని ఖేదమనుభవతి. తుల్యే౽పి స్వచ్ఛకుటిలాకారయోగే౽మీ ప్రపన్నార్తినివారణకుశలాః, నత్వహ మితి వ్యతిరేకాలంకారధ్వనిః । కించాహం ధ్రువ మేక ఏవాసాధారణవైశద్యహృద్యాకార యోగాత్సమస్తజనాభిలషణీయతాభాజన మభవం । అస్య ఘనరేఖం విధనఖాదశ బాలచంద్రాకారా స్సంతాపార్తిచ్ఛేద కుశలాశ్చేతి తానేవ లోకో బహుమానేన, పశ్యతి, నచ మామిత్యాకలయన్, బాలేందు రవిరత మాయాస మనుభవతీత్యుత్ప్రేక్షాధ్వనిరపి."

"ఆయాసిత" అనుపద ముత్ప్రేక్షాధ్వనికిని, వ్యతిరేకాలంకారధ్వనికిని వ్యంజకము. వ్యంజకము లేక, తదభివ్యంగ్య మగునలంకారధ్వని ఈ"యాంధ్రధ్వని" జదువు సహృదయులకు హృదయగోచరమగు టెట్లు? 'ధ్వనిరాత్మా' యని యొక వంకబోధించుచు మాతృకలోని యమూల్యధ్వని వ్యంజకమగు పదము నేల వదలిరో తెలియ రాకున్నది.

ఉండతగిన పదము లేకపోగా, సొంత కల్పనము వాక్యార్థమునకు వికృతిఁ గల్పించు

చున్నది. "స్వచ్ఛాయామయనఖరములు" అను సమస్తపదముఁ జూడుఁడు : నఖము లిందుచ్ఛాయామయములైనట్లు వ్రాసినారు. ఇది నాకయోమయముగఁ జూపట్టెడి. ఈ 'ఛాయా' శబ్దము పైని ఉంచబడిన 'మయట్' ప్రత్యయమువికారార్థకమా? ప్రాచుర్యార్థకమా? లేక స్వార్థే ప్రత్యయమా? అబ్బ, ఎంతయోచించినను దురూహముగనున్నదే!

ఇక "ప్రపన్నార్తిచ్ఛిదః" అను విశేషణమున కనువాదమేరీతిగనున్నదో పరిశీలింతము. "ప్రపన్నసౌఖ్యకరంబుల్" అని యాంధ్రమున నున్నది. "శరణాగతులకు క్షేమముఁగలుగఁజేయునవి" అని దీనియర్థము. భక్తులకు భగవంతుఁడు, దుఃఖములఁ బోఁగొట్టుటవలన క్షేమంకరుఁడగుట నిజము. అయినను, మూలమున "ప్రపన్నార్తిచ్ఛిదః" (శరణాగతుల దుఃఖములఁబోగొట్టునవి) అని యుండ "ప్రపన్నసౌఖ్యకరంబుల్" అనునాంధ్రీకరణ మెట్లు పొసఁగును? నఖముల కాయాసకారిత్వము, ఛేదనసాధనత్వముఁ బ్రసిద్ధములుకదా? "తాత్పర్యార్థము రెంటికినొకటియే కదా" యనుప్రశ్నతగదు. ఫలితార్థకథనము వ్యాఖ్యానశైలిఁ గాని, భాషాంతరీకరణ పక్కి గాదు.

చిన్న నెఱసు మఱియొకటి.

ఈపద్యమున 'వః' అనుసర్వనామమునకు 'నాకుఁ' అనునర్థము కల్పించుట సాహసము. శ్లోకమున 'వః' అని లేదు. నాయొద్దనున్న పుస్తకములో 'నః' అనియున్నదనుటకు వీలు లేదు. ఆపదవ్యాఖ్యాన సందర్భమున "వః= యుష్మాన్ వ్యాఖ్యా(తౄ)శ్రోతౄన్" అని లోచనకారుడు వివరించి యున్నాఁడు. "నాకుఁ" అనుస్థలమున 'మీకుఁ' అనియుండఁదగును.

మరికొన్ని దోషములు యత్నసిద్ధముగనే కాననగుచున్నవి. చూడుఁడు, రెండవకారిక కాంధ్రీకరణ మే తీరుననున్నదో!

సంస్కృతము :

అర్థ స్సహృదయశ్లాఘ్యః కావ్యాత్మా యో వ్యవస్థితః,
వాచ్యప్రతీయమానాఖ్యౌ తస్య భేదా వుభౌ స్మృతౌ.

ఆంధ్రము :

సహృదయహృదయములకెల్ల శ్లాఘ్యమైన
యర్థమెయ్యది సత్కావ్యమందు వెలయు
దాని భేదముల్ రెండు ప్రోక్తంబులయ్యె
నవని వాచ్యార్థమనియు వ్యంగ్యార్థమనియు.

ఇచట, సంస్కృతమున 'స్మృతౌ' అను పద మున్నస్థానమున, 'ప్రోక్తంబు లయ్యె, అని యున్నది. ఈసొంతకల్పనవల్ల (౧)"స్మృతావిత్యనేన యస్సమామ్నాత పూర్వ ఇతి ప్రథయతి" అనుధ్వనికారుని యాశయ మడుగంటినది.

ప్రథమోద్ద్యోతమున ౨ నుండి ౯వఱకు పద్యసంఖ్య వేసి వ్రాసిన ఛందోబద్ధములగు వాక్యము లేకారికలకు భాషాంతరీకరణమో తెలియరాకున్నది.

"సోऽర్థ స్తద్వ్యక్తిసామర్థ్యయోగీ శబ్దశ్చ కశ్చన,
యత్నతః ప్రత్యభిజ్ఞేయౌ తౌ శబ్దార్థౌ మహాకవేః"

(౧) లోచనము, పు. ౧౩. పం. ౧.

అను సంస్కృతమాతృకకు భాషాంతరీకరణముఁ గనుఁడు:

> వ్యంగ్యము నొకానొకపదంబ వ్యక్తపఱుచు
> వాచ్యములుఁ గొన్నియేయగుఁ బ్యంజకములు,
> తెలివితో మహాకవి సరుతింపవలయు
> యత్నమొనరించి యట్టిశబ్దార్థములను.

ఇచట 'తెలివితో' యనునది యధికము. ఇదెంతతప్పు! దివ్విటీముందు దీపమువంటిది. ఇట మరియొక పెద్ద దోషము కానవచ్చుచున్నది. "వాచ్యములు గొన్నియే యగుఁ బ్యంజకములు" అనుద్వితీయ పాదమందలి "వాచ్యములు" అనుపదము "సోఽర్థః" అనుదాని కనువాదముఁ గాబోలు! ఎంత సమంజసముగ నున్నది! అచటియర్థశబ్దమునకు "వ్యంగ్య" మనియర్థము. దీని నాలోకకారుఁడును,లోచనకారుఁడును స్వవాక్యములచే స్పష్టముగఁ దెల్పినారు. ధ్వనికారునికి సమ్మతమైన యర్థమిది. "మహాకవి గావలెనను నిచ్ఛగలవానికి, వ్యంగ్యార్థము,తదభివ్యంజన సమర్థమగు శబ్దమును ప్రయత్నమువల్ల తెలియఁ దగినవి." ఈసూక్ష్మాశయము, తెలుఁగు పద్యమున లోచనమున కంజనము వేసికొని చూచినను దొరకదు. పద్యమున ఛందోనియమము లుండుటవల్ల నైసర్గికాశయము నిముడ్చుట కంతరాయము కలిగెనేమొ?

> "కొన్ని శబ్దములును, కొన్ని యర్థములును మాత్రమే తెల్పు వ్యంగ్య మెల్లశబ్దముల చెప్ప వాచ్యము కాదనుట."

యని, యీపద్యమున కవతారిక నిచ్చియున్నారు. అవతారిక కర్థములేదు. పద్యప్రతిపాద్య విషయమునకు, దీనికి నేమాత్రము సంబంధము లేదు. సంబధపు మాట యటుండనిచ్చి యీవాక్యమున కేమియర్థమో విచారింతము: "కొన్ని శబ్దములును" "కొన్ని యర్థములును" అను ప్రథమాంతముల కన్వయ మెట్లు. ఒకవేళ యచ్చుపొరపా టని, ద్వితీయాంతము లని యనుకొన్నను, వ్యంగ్యము శబ్దముల నెట్లుతెల్పును. ప్రకృతకారిక కాలోకకారుఁ డవతారికనిచ్చియుండ దానినివదలి స్వయముగ నెందుకుఁ బ్రయత్నించిరో? ఆ! ఇప్పుడు కొంచెము స్ఫురించుచున్నది. కారికార్థమునకును, తదనువాదమగు పద్యార్థమునకును సంబంధమున్నఁ గదా యవతరణికలకు సాంగత్యము కుదురుట! ఈకారికలో "తద్వ్యక్తిసామర్థ్యయోగీ" యనువిశేషణము ముఖ్యమైయుండ, యది తెలుఁగుకారికలోఁ గానరాదు. ఆయర్థముఁ జెప్పుమాదిరి కొన్నిమాట లగుపడుచున్నను, సంపూర్ణార్థము నివ్వక"ఆంధ్రధ్వనిగ్రంథము"ను మాత్రముఁ జదువుప్రవృత్తిగల్గువారి కెంతమాత్ర ముపయోగపడవు.

ధ్వనికారికలలో నైదవదగు దాని కనువాద మెట్లున్నదో బయల్పఱచెద:—

> కావ్యస్యాత్మా సఏవార్థ స్తథా చాదికవేః పురా,
> క్రౌంచద్వంద్వవియోగోత్థః శోకః శ్లోకత్వ మాగతః.

అనువాదము:

> అర్థమదియ, కావ్యంబున కాత్మయగును
> అట్లగుటఁ బూర్వకాలమం దాదకవికిఁ
> గ్రౌంచవిహగయుగళ వియోగమున నాత్మ
> లో జనించిన శోకంబు శ్లోకమయ్యె.

"వాల్మీకియొక్క యాత్మలో జనించిన శోకమే శ్లోకమాయెనా ? " ఇది లోచనకారుని యాశయమునకు చాలవిరోధముగ నున్నది.

౨౫౧ న పుటలో ధ్వన్యాలోకలోచనవ్యాఖ్యానమున ౯౩ పం క్తిలో నిట్లుకానగుచున్నది.

"నను మునే శ్శ్లోక ఇతిమంతవ్యం. ఏవం హి సతి తద్దుఃఖేన సోఽపి దుఃఖిత ఇతి కృత్వా రసస్యాత్మేతి నిరవకాశం భవేత్ । నతు గుఃఖ సంత ప్తస్యైషాదశా."

చూచితిరా, ప్రత్యక్షముగ నెట్టి దోషముగనుపడుచున్నదో. లోచనకారుఁడొకవంక శిక్షించుచున్నను, దాని సరకుఁ జేయక స్వతంత్రించు టెంతసాహసము ? అయ్యను ! లోచనకారుఁడే యిపుడు వచ్చి యనువాదకుల కలమును నిలిపివేయఁగలఁడా? కారిక కాపాతముగ ననువాదమున నున్నరీతిగనే పాఠకుల కర్థమగును. సంప్రదాయార్థములు చెడకుండుటకై కదా ప్రాచీనవ్యాఖ్యానములు బయలుదేరినవి. అలంకారశాస్త్రపరమసిద్ధాంతమునకు భంగము రాఁగూడదని లోచనకారుఁడు మంచి మాటలతో విద్యార్థులయందు దయగలవాఁడై 'మునేశ్శ్లోకఇతినమ స్తవ్యం' అని యాజ్ఞాపించినాఁడు. ధ్వనికారికల కర్థముఁ దెలిసికొను వారలకు లోచనకారుఁడు గురువుకదా? గురునాజ్ఞ మీఱవచ్చునా ? గడ్డపార మ్రింగ శక్య మా? సహృదయులే నిర్ణయింప నర్హులు.

గుణములు

ప్రథమోద్ద్యోతము :

ఆలోకార్థీ యథా దీపశిఖాయాం యత్నవాన్ జనః,
తదుపాయతయా త ద్వ దర్థే వాచ్యే తదాదృతః.

అనువాదము :

తెలుతురు కా వలసినవా
రలు దీపజ్వాలకై కరంబు జతనమున్,
సలుపుదు రటు వ్యంగ్యార్థికి
వలయున్ వాచ్యంబు వ్యంగ్య పరికర మగుటన్.

ఈయనువాద మెంతయోతగియున్నది. వ్యర్థపద మొకటియు లేదు. మూలమున లేని పదములు కల్పింపఁబడలేదు. కారికలోని సంపూర్ణార్థము పద్యమున ప్రతిఫలించినది. ఇట్లాశయములు బయల్పఱచుటకు కించిత్ జ్ఞుల కసాధ్యము.

ఇంక నెన్నియోగుణము లందందు కానఁబడుచున్నవి. మొగలిపూవులలో నన్నింటిలో ముం డ్లుండుట సహజమే. యాముండ్లేలేకున్న కేతకిసౌభాగ్య మెట్లుండునో కొంత యోచింపుఁడు. మొగలిలోని ముండ్లఁ దీసివేయుటకు బ్రహ్మచేత గాదు గాని గ్రంథములలోని దోసఁగుల రూపుమాపుటకు కవిబ్రహ్మలకు సాధ్యమైన దే.

"ఆపరితోషా ద్విదుషాం
నసాధు మన్యే ప్రయోగవిజ్ఞానమ్,
బలవదపి శిక్షితానా
మాత్మ న్యప్రత్యయం చేతః."

---

# ప్రభూ!

అడవి రాఘవరావు గారు

బహుగా నోత్తురువచ్చు ఈప్రచలదవ్యాంభస్సులన్ గల్గు భీ
తహతాశాగ్నిని చల్లగించుతెఱవుల్ దాగుండు నెన్నే ముహు
ర్ముహురుచ్చైస్స్వరమంటు వేణువులు కల్లోలంబు ఈసంద్రపుం
గుహారమ్మందున మంచిముత్తెములు గల్గున్ దివ్యరత్నమ్ములున్.

అని నను నొంటి నిల్పి జనునప్పటిధీజవ మింత లేదు వ్రే
గునహృదయమ్ము క్రుంగు నతిగుప్తము నీయుపదేశ మూది చెం
గున జలముబ్బ పైపయికి గుంచుకుపోవుచు పుక్కిలింతలై
నను నిలువెల్లఁజల్లనయినన్ జలిగొంకులు వారిపోయినన్.

ఈరొదలందు మోక్షము ధ్వనించునొ యేమొ వినంగవచ్చు నో
హో రమణీయకార్తిక మహోదయరోచుల చూడవచ్చునే
మో, రతనాలగుట్ట పదమున్ దపుదవ్వుల తాకునేమొ, స
వ్యారుణధీనితుల్ మెఱయ నభ్యుదయమ్ములు తోచునో పయిన్.

అనుచు తలచుచు నిన్నాళ్లుగా భరించి - పట్టియుంచితి ప్రాణాలు పంటికొసను
లేను కాదన నిన్ను ఎట్టు లీయగాధ - భయదచలదూర్మికాప్రభాపటిను పైపను.

ఆకసమంటుకొన్నది మహార్ణవ మిట్టిప్రకోపచిత్త మిం
కేకడ శాంతిలున్? భయద మీవిలయార్భటి ఆగునేడ? ర
త్నాకర మింకునా! దొరకునా రతనాలును మంచిముత్తెముల్
శ్రీకరవేణునాదము కృశించెడి నాచెవి సోకునా ప్రభూ!



ప్రాచీనులు, నర్వాచీనులునని ఆలంకారికు లిరు తెగలు. మొదటివారు గుణా లంకారములకుఁ బ్రాధాన్యమిచ్చిరి. రెండవ వారు వ్యంగమునకుఁ బ్రాధాన్యమొసంగిరి. కావున నే ప్రాచీనులగ్రంథములు—"కావ్యాలంకారః, కావ్యాలంకారసంగ్రహః" అని అలంకారపదఘటితనామములు చెందియున్నవి. ఇరు తెగలవారిలో — కావ్యమున కాత్మవిషయమగు యభిప్రాయభేదములు కలవు. రసప్రధానవాదులు కొందఱు; అలంకార ప్రధానవాదులు మఱికొందఱు. గుణప్రధాన వాదు లింకఁ గొందఱు, వ్యంగ్యప్రధానవాదులు వేఱొకకొందఱు.

## రసాత్మత్వవాదులు

రసాత్మత్వ సిద్ధాంతమును దొలుత భరత మహర్షి నిరూపించినాఁడు. రసరూపాత్మకమే కావ్య మనియు, లాఁతిది కాదనియు వీని యాశయము. గుణదోషాదు లీతని మతమం దుప సర్జనములు; రసము ప్రధానము.

"వాగ్వైదగ్ధ్యప్రధానేఽపి రస ఏవాత్ర జీవితమ్" అని అగ్నిపురాణము;

"కావ్యస్యాత్మని సంగిని రసాదిరూపే నకస్యచి ద్విమతిః" అని, వ్యక్తివివేకము నిరూపించుచున్నయవి. ఈమతమునే, శృంగార తిలకము; రుద్రటుని కావ్యాలంకారము; రాజశేఖరుని కావ్యమీమాంస; భోజుని సరస్వతీ కంఠాభరణము పరిపోషించినవి. కాన వీరందఱు 'రసాత్మత్వవాదులు.'

## అలంకారాత్మత్వవాదులు

వీరియం దగ్రగణ్యుఁడు భామహుఁడు. చమత్కారియగు వాక్యమే 'వక్రోక్తి' యనియు; చమత్కారమున్నపుడే అలంకారత్వము సిద్ధించుననియు; అది ప్రధానముగాఁగల దియే కావ్యమనియు నీతని నిర్ణయము. ఇది గయికొనియే జగన్నాథపండితుఁ డిటులు విమర్శించినాఁడు.

"కావ్యజీవితం చమత్కారిత్వంచ అవి శిష్టమేవ. యత్తు రసవదేవ కావ్యమితి సాహిత్యదర్పణే నిర్ణీతం తన్న. వస్త్వలంకారప్రధానానాం కావ్యానాం అకావ్య త్వాపత్తేః. నచేష్టాపత్తిః; మహాకవిసంప్రదాయస్య ఆకులీభావప్రసంగాత్."

భామహుఁడు — "శబ్దార్థౌ సహితౌ కావ్యం యుక్తం వక్రస్వభావోక్త్యా" అని కావ్యలక్షణమును నిర్వచించెను. వక్రోక్తికారుఁడగు కుంతకుఁడు నయితము భామహు ననుసరించి యథాసంఖ్యము మున్నగువానికి అలంకారత్వము శూన్యమని వచించె. "వక్రోక్తిః కావ్యజీవితమ్" అని యీతని నిర్వచనము.

## గుణాత్మత్వవాదులు

కావ్యమునకు గుణములు ప్రధానమని వీరిమతము. అనఁగా, అవి సాక్షాత్తుగ ఉపస్కారకములు కావనియు, "విశిష్టా పదరచనా రీతిః, విశేషోగుణాత్మా" అని చెప్పినటులు వైదర్భి మున్నగు రీతులద్వారమునఁ గావ్యోపస్కారములనియుఁ జెప్పవలయును. రీతిప్రవర్తకులలో దండివామనులు ముఖ్యులు. "విపంచీస్వరసౌభాగ్యా వైదర్భీ రీతి రిష్యతే" అని దండి వచించినాఁడు. వైదర్భియందు 'కాంతి'యను గుణముండునని అతని యాశయము. దండి భామహుల మతములకు మిక్కిలియు భేదము కలదు.

"వక్రోక్తిరూపమగు అలంకారమే కావ్యమునకు ఆత్మ—" అని భామహుఁడు.

"ఔచిత్యయుక్తమగు వక్రోక్తిని కాంతి రూపమగు గుణముగ నంగీకరింప వలయు; తద్విశిష్టమగు రీతియే కావ్యమునకు ఆత్మ—" అని దండి.

మఱియు నీతఁడు సమాధిగుణమును కావ్యశోభాసర్వస్వమని పేర్కొనినాఁడు. ఈతని మతమునే వామనుఁడు బాగుగ వివరించెను.

"రీతి రాత్మా కావ్యస్య,
విశిష్టాపదరచనా రీతిః
విశేషో గుణాత్మా"

అని వామనుఁడు గుణయోగ మంగీకరించి నాఁడు.

## వ్యంగ్యప్రధానవాదులు

చాలవఱకు అర్వాచీను లీతెగకే చేరిరి.

"కావ్యస్యాత్మా ధ్వని రితి బుధై ర్యః సమామ్నాతపూర్వః"—అని ఆనందవర్ధనుఁడు.

"శబ్దార్థౌ మూర్తి రాఖ్యాతౌ, జీవితం వ్యంగ్యవైభవమ్"—అని విద్యానాథుఁడు.

ఇటులు పెక్కుమంది పూర్వమతము ను నిరసించి వ్యంగ్యమునకే ప్రాధాన్యమొసంగిరి. ఈమతమునకు రీతివాదమునకుఁ గల భేద మియ్యది—

"రీతివాదమున— రీతియే కావ్యమున కాత్మ. గుణములు తద్వ్యవహార ప్రయోజకములు.

రెండవమతమున—ఆత్మ ధ్వని. ధ్వనియే తద్వ్యవహార ప్రయోజకము.

ఉభయత్ర — గుణములు ఆత్మనిష్ఠములు. శబ్దార్థముల జంట శరీరము. తన్నిష్ఠములు అలంకారములు."

తుదివారి వాదమే అత్యంత రమణీయమని లాక్షణికులు కొందఱిసిద్ధాంతము. కావుననే కాళిదాస కవిసార్వభౌమునికవిత హృద్యమని పేర్కొంట సుసంగతము.

---

# విజయవిలాస వ్యాఖ్యానవిధానము

ఆంధ్రవిశారద తాపీ ధర్మారావుగారు

## ౪

తెనుఁగు పదముల నల్లనల్లన కూర్చియు విఱిచియు నల్లలితములను నర్థవిశేషంబులఁ బాఠకుల కుల్లాసము గల్పించుటనేర్పు చేమకూరవేంకటరాజ కవివర్యున కలవడినట్టుల నింకొక్క యాంధ్రకవిశిఖామణి కలవడలేదని విమర్శకవరేణ్యులందఱు నంగీకరించి యేయున్నారు. శబ్దార్థతత్త్వపరిజ్ఞానము, శ్లేషరచనానైపుణియుఁ గలిగిన యాంధ్రకవిశిరోమణులలో ననేకు లీయంశమునఁ జేమకూరవానికి తమకుఁ బాఠవలసినవార లే యనుట యతిశయోక్తి కానేరదు. కందుకూరి వీరేశలింగము పంతులుగారీకవినిఁ గూర్చి వ్రాయుచు "నచ్చతెనుఁగు పదములను గొందికగాఁ గూర్చి కవనముచెప్పనేర్పీకవికి కుదిరినట్లు మఱియొకకవికి కుదిరినదని చెప్ప వలనుపడదు. పింగళి సూరనార్యుని ప్రభావతీప్రద్యుమ్నమునకుఁ బిదప నీతని విజయవిలాసమే సర్వవిధములచేతను తెలుఁగులో శ్లాఘ్యకావ్యముగ నున్నది. జాతీయాదిచమత్కృతినిబట్టి విజయవిలాసమే శ్లాఘ్యతరమయినదని యనేకు లభిప్రాయపడుచున్నారు." అని ప్రస్తుతించిరి. ఈపలుకులయం దెంతయేని సత్యమున్నదనియు, మనోహరంబులగు నీతని పోకడలు మఱియొక్కనికి రాఁజాలవనియుఁ జేమకూర కవిత్వరుచిని గ్రహించినవారికందఱికిని దెలియఁగలదు. చూడుఁడు:

అరనంపసుమ నేలిన
దొరగా నెన్నుదురు నెన్నుదురు బిత్తరికిన్;
బరువంపు మొల్లమొగ్గల
దొరగాఁ బల్కుదురుఁ బల్కుదురు జవ్వనికిన్.

అచ్చతెనుఁగుపద్దెమున నామాటల విఱుచువిధాన మెంతహృదయంగమము! ఈకవియే సారంగధరయందు చెప్పినట్లు

"...వాక్యములెల్ల వేఱె యర్థములుగా నే
ర్పున విఱిచి మాటలా..."

డనుటయం దీతఁ డాఱితేఱినజాణ. కావుననే సుభద్రాసఖీజనులు వివాహసమయంబున

మంచి మగఁడు వలయునంచుఁ గోరుచునుండె
మంచిమగఁడుగల్గె మనువసుతుఁడు;
మనసుభద్ర సుకృతమహిమ యేమనవచ్చు!
మనసు భద్రమయ్యె మనకు నెల్ల.

యని తమలోఁ దా మానందించి యాంధ్రపాఠకలోకమున కెల్ల నానందమును గూర్పఁజాలిరి. మాటలు మన కవియెదుటఁ బడినప్పుడు తమంత దాము విఱిగి వివిధ సమ్మేళనంబుల నాతనికిఁ గాన్పించుచుండు ననుట యొప్పు. అబ్బురంబగు నిట్టిసుగుణంబు తనకున్నను వేంకటరాజకవి యౌచితికి దవ్వుగఁ బోవువాఁడు గాఁడు. పదము విఱిగినదిగదా యని పదసువాఁడి ప్రకృతమును బరిత్యజించువాఁడును గాఁడు. అక్షరసమ్మేళనాంతరము లెన్ని కంటికిఁ గట్టినట్టు లుండినను వర్ణనావసరయోగ్యత నిసుమంతయయిన విస్మరింపఁడు. కావుననే యీ విఱుపులు నీ కూర్పులును మంతుకెక్కి సహృదయుల మన్ననలను గాంచుచున్నవి.

అట్టి విఱుపులలో నెన్నికఁగనఁదగిన యీక్రింది పద్యము, విజయవిలాసప్రబంధ మొక్కసారియయినఁ బఠించుభాగ్యమబ్బినవారి కందఱికిని కంఠగతముగ నుండకమానదు.

కమ్మనిజాళువా నొరయఁ
గల్గిన చెక్కుల టెక్కువాఁడు, చొ
క్కమ్మగు జాతికెంపు వెల
గాఁ గొనుమోవి మెఱుంగువాఁడు, స

త్యమ్మగు రూపసంపద ధ
నాధిపసూనుని ధిక్కరించువాఁ
డమ్మకచెల్ల ! నాహృదయ
మమ్మకచెల్లదు వీని కియ్యెడన్.

ఉలూచి గంగానదీపులినస్థలంబున నర్జునునిఁ గాంచి తనలో వితర్కించికొనుచు నావిధమ్ము నిట్లు మెచ్చికొనినది. ఈపద్యమునందలి ప్రథమచతుర్థపాదా రంభములనుబట్టి చూచినఁ జేమకూరవాని కీపద్యరచనా సమయంబున నల్లసాని పెద్దనామాత్యుని

కమ్మనికుందనంబు కసు
గందనిమే, నెలతేఁటిదాఁటులన్
బమ్మెరపోవఁ దోలు తెగ
బారెడువెండ్రుక, లిందుబింబమున్
గిమ్మన నీమెమోము, గిరి
క్రేపులు మూపులు, కౌను గానరా
దమ్మకచెల్ల ! వాని వికా
చాంబకముల్ శతపత్రజైత్రముల్.

అనుపద్యము స్మరణయందుండిన నుండ నోపును. కాని, 'అమ్మకచెల్ల' యను నాశ్చర్యార్థకము కంటఁబడినంత, నయ్యది రెండుతునియలయి 'యమ్మక చెల్లదు' అను వింతమేళనమునకుఁ గవి కవకాశము నొసఁగెననుట లెస్స. ఈవిఱుపుంగాంచియే యపారముగ నానందించువా రనేకులుగలరు. ఒకపద్యమున కిట్టి చమత్కార మొక్కటియుండినఁ జాలదాయని సంతసించు వారునుం గలరు. కాని, మనకవి యర్థవిశేషంబుల నలం తులఁ దనియునట్టివాఁడు గాఁడని పాఠకమహాశయు లిప్పటికే గుర్తించియుందురు. అట్టి యీకవి సందు దొరకినదిగదా యని యీవిఱుపునందలి చమత్కార మును జూపి, యంతమాత్రమునఁ దృప్తినందునా యను సందేహము గలుగకమానదు. పదములకు వశంవదుఁడై ప్రకృతమును విడిచి ప్రక్కలకుఁ బోవునట్టి కవి ప్రశంసాపాత్రుఁడు గానేరఁడు గదా ! అట్టియెడ నాతఁ డధమకవులలోఁ జేర్పఁదగినవాఁడ యగును. కావున యాథా ర్థ్యము నెఱుంగవలయుననిన నీపద్యము నింకను పరిశీలింపవలయును !

పద్యపాఠగ్రహణమునందు కలాప్రపూర్ణ చేపూరు వేంకటరాయశాస్త్రిగారును తిరుపతి వేంకటేశ్వర కవి వర్యులును బయినిఁ జూపినపాఠమునే గ్రహించిరి. జూలూరు అప్పయ్యపంతులుగారు

........................స
త్యమ్మగ రూపసంపద ధ
నాధిపసూనుని ధిక్కరించినాఁ
డమ్మకచెల్ల ! నాహృదయ
మమ్మకచెల్లదు వీని కియ్యెడన్.

అని యుత్తరార్థమును భిన్నముగఁ బఠించిరి. నోరి గురులింగశాస్త్రిగారును కొంచెము భేదముతోడ జూలూరివారి పాఠమునే యంగీకరించిరి.

వ్యాఖ్యాన విమర్శనమున కనువుగలుగునట్లు జూలూరివారి వ్యాఖ్యానము, వేంకటరాయశాస్త్రిగారి వ్యాఖ్యానము నిందు నివేదించుచున్నాఁడను. జూలూరి వారి వ్యాఖ్యానమున

"కమ్మనిజాళువాను = చక్కని మేలిమి బంగారు మును, ఒరయగల్గిన చెక్కుల సొక్కువాఁడు = రాపాడడమునకు తగినటువంటి చెక్కుల యొక్క సొగసుగలవాడున్ను, చొక్కమ్మగు = పరిశుద్ధమయినట్టు వంటిన్ని, జాతి=కృత్రిమము గానటువంటిన్ని, కెంపు = పద్మరాగమణిని, నెలగొను = కొనిసేయ జాలినట్టు వంటి అనగా తన అధికారములో వుండగలిగినటువంటి, మోవి మెరుంగువాడు = అధరోష్ఠముయొక్క కాంతి గలిగినవాడున్ను, సత్యమ్మగ = నిజముగాను, రూపసంపద = చక్కదనముయొక్క సమృద్ధిచేతను, ధనాధిపసూనుని = ధనాధిప = కుబేరునియొక్క, సూనుని కుమారుడైన నలకూబరుని, ధిక్కరించినాడు = తిరస్కరించినాడు, అమ్మకచెల్ల-అమ్మనేచెల్ల అనగా భళా యనుట, నాహృదయము=నామనస్సు, వీనికి=యీ యర్జునునికి, అమ్మకచెల్లదు=అమ్మివేస్తేనేగాని వొప్పదు, యెయ్యెడన్=యేస్థలమందున్ను" అని కలదు.

ఇంక వేదము వేంకటరాయశాస్త్రిగా రన్ననో, యీపద్యమునకు వ్యాఖ్యానరూపముగ నిట్లు వ్రాసిరి: "కమ్మని జాళువాకన్=గొప్ప యైన మేల్మిబంగారమును, ఒరయఁగల్గిన=రాపాడఁగలిగినట్టి, చెక్కుల మెక్కువాఁడు=చెక్కిళ్ల యందముగలవాఁడును, గొక్కెమ్ము=పరిశుద్ధము, జాతికెంపున్ - పద్మరాగమాణిక్యమును, వెలగాన్ = (తనకు...అనఁగా మోవికి) మూల్యముగా, మోవి=పెదవి; ధనాధిపసూనునిన్ = నలకూబరుని, రూపసంపదన్ = రూపముతోఁగూడుకొన్న సంపదచేతను - అనఁగా రూపముచేతను, ధనముచేతను, ధిక్కరించువాఁడు=తిరస్కరించుచున్నాఁడు; నాహృదయము = నామనస్సును, అమ్మక చెల్లదు=అమ్మకయే తప్పదు; అమ్మక చెల్ల=ఆశ్చర్యము."

పైవ్యాఖ్యానములను బరిశీలించిన నీపద్యమునకు బూర్వవ్యాఖ్యాతలందఱు నీక్రిందిరీతి తాత్పర్యము నూహించియుండిరనుట స్పష్టమగును.

"గొప్పయైన మేలిమిబంగారమును రాపాడఁగలిగినట్టి చెక్కిళ్లయందముగలవాఁడును, పరిశుద్ధమగు పద్మరాగమును దనకు మూల్యముగాఁ గొనఁగలిగిన పెదవి మెఱుఁగు గలవాఁడును, రూపముతోఁ గూడుకొన్న సంపదచేత (లేక, చక్కఁదనముయొక్క సమృద్ధిచేత) నలకూబరుని ధిక్కరించువాఁడును నగు నీతని (అర్జునుని) కీస్థలమందు నామనస్సును విక్రయింపక తప్పదు; బళా!" అని యాలోచితులందఱనియే నా గూహించియుండిరి. ఇందు మేల్మిబంగారమును రాపాడఁగలిగినట్టియనుటలో నా ద్వితీయకు సమన్వయ మెట్టులఁ గుదురునో? బంగారముతో రాపాడఁగలిగినట్టి యనుభావమా? ఎట్లయినను వర్ణితమగు చెక్కిళ్లగుణ మెయ్యది? యను ప్రశ్నలు కలుగును. పద్మరాగమును దనకు (మోవికి) మూల్యముగాఁ గొనఁగలిగిన మోవియన నర్థమేమి? ఈతావున మాలూరు అప్పయ్యగా రనినట్టుల పద్మరాగమణిని కొనివేయఁగలిగిన మోవియనుటయే సమంజసముగ నుండునా? అను సందేహములు రెండవ వర్ణనయందుఁ బొడకట్టును. ఇంక మూఁడవవర్ణనయందు వేంకటరాయశాస్త్రిగా రంగీకరించిన 'సత్యమ్మగు రూపసంపద' యను పాఠమందలి 'సత్యమ్మగు' అనుపదమున కర్థము నొసఁగకుండుటచేత నిజమగురూపసంపదయని గాని శాశ్వతమగురూపసంపద యనిగాని యర్థము చెప్పవలసివచ్చునా? అట్లయిన నీపదములవలనఁ గలిగినప్రయోజన మేమి? కాక, యిద్ది 'ప్రాసకోస ముంచిన పసుమాట'యే యగునా? 'సత్యమ్మగ' నను పాఠ మింతకన్న నన్వయసౌలభ్యము గలిగియుండునా? యను ప్రశ్నలు పరంపరముగ వచ్చుచుండును.

మొదటి మూఁడుచరణములయందును గల ప్రక్రమమును బట్టియు నుపమాననిరాకరణవాచకములను బట్టియుఁ జూచినచో నర్జునుఁడు రూపసంపదయందు నలకూబరుని కన్న మిన్న యనియు, నాతనిమోవి జాతి కెంపుకంటె నెక్కువయయి మెఱుఁగెక్కియున్నదనియు, నాతనిచెక్కిళ్లు కమ్మనిజాళువాకన్న పసిమిమిగిలి ప్రకాశించుచున్నవనియు నాలోచి గ్రహించి "ఆహా! యీతని కిచ్చట నేను నాహృదయము నమ్మక తప్పదు" అని నిశ్చయించికొనె నని పైవ్యాఖ్యాత లుద్దేశించి రనుట ప్రస్ఫుటముగదా! వేఱొట్టి ప్రతిబంధకము లేకున్నను బయినిఁ గల మూఁడుచరణములయందలి వర్ణన నాలుగవపాదమునఁ గలనిశ్చయమున కెట్లు దారినిఁ గలుగఁజేసెను? ఈనిశ్చయమునందు తనహృదయము నమ్ముతలంపేల యులూచికిఁ గలుగవలయును? 'వీనికియ్యోపన్' అనునంతటి యగత్య మేమిసమకూరెను? అని శంకింపక తీఱదుగదా! అయిన నిట్టిశంకలవంక నాపూర్వవ్యాఖ్యాతలు పోరైరి. పద్యమును బఠించుచుఁ దుదిచరణముకడకువచ్చి

అమ్మకచెల్ల! నాహృదయ
మమ్మకచెల్లదు వీని కియ్యోపన్.

అని చదివినంతన 'నయ్యారే! మాటవిఱుచునే' ర్పని యానందించి యంతటితో నీపద్యముయొక్క విచారమును వ్యాఖ్యాతలును, పాఠకులును ద్యజించిరనియే యనవలయును. పెండ్లికొడుకుగ నలంకృతుఁడయిన యర్జునుని యందముం గాంచి సుభద్రాసఖు లాశ్చర్యమున

'ఓమగువలార, మును విన
మా? మన్మథు నతని మేనమామన్ మధునిన్'

అని యనినయప్పుడు సుప్రసిద్ధసుందరాకారులగు మన్మథుని వసంతునిఁ జెప్పుచు నీమాటలవిఱుపుతోఁ జమత్కారముఁగూడ పెనుగాన సంతసించితిమి. ఆయెడ నెట్టియాక్షేపణయు నుండఁజాలదు. కాని మనపద్యమునం దమ్మకొ మేల యావశ్యకమయ్యెనో చూపకున్న నీ పదచ్ఛేద చమత్కార మంతయు విరసమగునుగదా!

ఇచ్చట నొకమాట చెప్పవలెను. జూలూరి వారు, వేంకటరాయశాస్త్రిగారు నొసఁగిన వ్యాఖ్యానమున సంతృప్తినంది యెట్టి శంకకును బొల్పడనివారనేకు లుందు రనుట నిక్కము. అది యట్లులగుట మన విమర్శనారాహిత్య మనుటకన్నఁ గవిచమత్కారాధిక్యమనుటయే మేలు. చేమకూరవాఁడు పండితపామరుల నొక్కరీతిని రంజించు నేర్పుఁ గలిగి 'ప్రసన్న గంభీర గతిన్ రచించు' సామర్థ్యము గలవాఁడు గాని సామాన్యుఁడు గాఁడు. ఎంతయాఁకటి కంతయాహార మిడు నీవిమానుఁ బోలినవాఁడు.

ఇంక పదచ్ఛేద చమత్కారము నారయుదము గాక! ఈ విమర్శనమునకుఁ బూర్వోక్తములగు ప్రశ్నములు చాల నుపకరించును. అందు మొదటిది:

కమ్మని జాళువా నొరయఁ
గల్గిన చెక్కుల బెక్కువాఁడు

అను వర్ణనను గుఱించి. చక్కని మేల్మిబంగారమును (తో?) రాపాడఁగలిగినట్టి చెక్కిళ్ల యందము గలవాఁడనికదా! యర్థము నొసఁగిరి. అనఁగా నర్జునుని చెక్కిళ్లు పదియార్వన్నె పసిండిచాయ గలిగియున్నదని యావ్యాఖ్యమగుచు. కాని, యిట్లు వర్ణించుటకు మహా ప్రతిబంధకమొక్కటి గలదు. అర్జునుఁడు విజయవిలాసకావ్యమునందు—తక్కినకావ్యములయందునుగూడ కృష్ణవర్ణము గలవాఁడు. అర్జున నామధేయమున కాధారభూత మగు 'దుర్లభమగు నవదాతవర్ణము' పాండవమధ్యయోధాగ్రణి వర్ణనలయందు చాలమృగ్యము. ఈగ్రంథరాజమునందీతఁడు

'కమ్మనికుందనంబు కసు .
గందని మేను, ..'

గల్గవాఁడు గాని,

'ఆరకుటచ్ఛాయ నవఘళించు...
శరీరముగలవాఁడుగాని కాఁడు. ఊలూచి నాఁగాగాంగ
సైకతమునఁ గాంచినయాతఁడు

..............., ...కలక
లకా నగుచుండెడినవ్యసాంద్ర, నిం
ద్రోపలరోచిఁ గాంచి, తల
యూచి యులూచి రసోనితంబుగన్.

అనుపద్యమునుబట్టి 'ఇంద్రోపలరోచి' యింద్రనీల మణులకాంతివంటి దేహచ్ఛాయఁ గల్గినదియేగాని

'మెఱుఁగుబంగరుచాయ మించువానికాము వాఁడు'
కాఁడు. ఆవల యతివేషంబునున్న కిరీటితో ముచ్చటించుచు సుభద్ర వర్ణించిన యర్జునుఁడును

'ఎనబుజంబులవాఁడు, మృగరాజమధ్యమువాఁ
బుడికిపుచ్చికొను నెన్నడుము వాఁడు,
నెఱివెంద్రుకలవాఁడు, నీలంపునికరంపు
మెఱుఁగుచామనచాయ మేనివాఁడు'
.........................

చామనచాయయన శ్యామలచ్ఛాయ యని సప్రాంతయు తెలియంగునదియ. కావునఁ, జేమకూర వేంకటరాజకవి యర్జునుఁడు నల్లనివాఁడే యనుటకు సందేహము లేదు. ఇట్లనేకస్థలంబుల నల్లనివానిగ భావించి వర్ణించిన యాతఁడు మనపద్యమునందు స్వర్ణవర్ణునిగ నభివర్ణించె ననుట సాహసము గాకమానదు.

'భక్తివిశ్వాసంబుల్ నీసొమ్ము'

లన శ్రద్ధాభక్తులకుఁ బేరుఁగాంచిన వేంకటరాజెట్టి యనౌచిత్యమునకుఁ బాల్పడెనని నిర్ధారణ చేయుటకుఁ బూర్వ మెంతయేని యోజింపవలయుఁగదా!

అట్లయినచో నీ 'కమ్మనిజాళువా...'గతి యేమి కావలయును? ఒక్కించుక పరికింపుఁడు: పూర్వ వ్యాఖ్యాతలందఱును జాళువావును, చెక్కులకును వర్ణసాదృశ్య మున్నయదిగాఁ దలంచి ప్రమాదమునకు లోనయిరి. ఒరయుధాతువు సకర్మకము, రాచు, పరీక్షించు లోనగు నర్థములఁ గలయది. దాని నకర్మకక్రియగా భావించి

ప్రాపాయినను నర్థమును చెప్పిరి. కావుననే 'చక్కని మేలిమిబంగారమును, అను ద్వితీయార్థము పొసఁగక వారు తృతీయార్థము (బంగారముతో) నూహించిరా యను సందేహమునకుఁ గారణము కలిగెను. ఇప్పుడు సకర్మక క్రియార్థమునే చెప్పినచో,

కమ్మని జాళువా నాణెముఁ
గల్గిన చెక్కుల టెక్కులాఁడు

అనఁ "ప్రశస్తమగు జాళువాదేశపుబంగారమును (పదియారువన్నె పసిఁడిని) రాచుటకు సమర్థమయిన చెక్కిళ్లయందముగలవాఁడు" అని యగును. బంగారమును రాచునది (ఒరపెట్టునది) యొరగల్లు లేక నికషోపలము. ఇయ్యది నల్లనయి కాల నునుపుఁగలిగి నిగనిగలాడునది యని యందఱు నెఱుంగుదురు. నైగనిగ్యమునందే నల్లని చెక్కిళ్లు జాళువాదేశపు బంగారమును రాచుటకుఁ దగిన యొరగండ్లవలె యున్నవని వర్ణనము. ఈ యర్థమువలన నర్జున దేహచ్ఛాయగూడ విశదప యంతిరించును. ఒరయు ధాతువునకుఁ బంచితకవిసమ్మతమగు సకర్మకార్థము పొసఁగును, కమ్మని జాళువా నాణెమ్ అను ద్వితీయకు తృతీయార్థము జెప్పికొను కష్టము తప్పును.

(చో) క్రమ్మను జాతికెంపు వెల
గాఁ గొను మోవి మెఱుంగు వాఁడు

అను ద్వితీయవర్ణనయందు 'వెలగాఁగొను' అను స్థలమునఁ బండితులు కొంత వ్యాఖ్యానాపేక్షను గనఁబఱచిరి. చూడుఁడు; జూలూరివారు 'వెలగాఁగొను — కొని వేయజాలునటువంటి అనగా, తన అధికారములో వుండగలిగినటువంటి' యని ప్రత్యేకవివరణమును వ్రాసిరి. ఇంక వేంకటరాయశాస్త్రిగారన్నచో, 'వెలగాన్ = (తనకు...అనఁగా మోవికి) మూల్యముగా' వని పుంజీకరణరూపమున నొకవివరణము నొసంగిరి. ఇట్టివర్ణనయందింత ప్రత్యేకవివరణములకుఁబూనుట యర్థ (లేక, యన్వయ) సౌలభ్యము గానరామిం జేసి యనియేగదా యూహింపవలయును. జూలూరివారివిధమున 'వర్ణ్యుని మోవి జాతికెంపుఁ గొని తనకు లోఁబడిన దానినిగ నుంచికొనఁ జాలియున్నది' యని తెల్లముఁ గలదు. కాని, వేంకటరాయశాస్త్రిగారి యర్థ మింకను క్లిష్టముగనే యున్న దనకతప్పదు. అంగడియందు మనము తీసికొను వస్తువుకొఱకు మన మిచ్చుధనమునకు మూల్యమని యందుము. వస్త్రమునకు మూల్యము పది రూకలన సన్నివేశమెట్టిదో తెలియును గదా! ఇంక 'పద్మరాగమాణిక్యమును తనకు (అనఁగా మోవికి) మూల్యముగాఁ దీసికొనఁగలుగు మోవి మెఱుంగువాఁడు' అనిన మోవి తాను జాతికెంపు అనుమూల్యమున కమ్ముఁగువోవు నని భావము తేలును. ఇం దాధిక్య ముపమానమునందు (జాతి కెంపునందు) నిల్చును. తక్కినరెండుచరణముల యందును గుణాధిక్య ముపమేయములఁగలదు. కావున నీయర్థమున రెండవచరణమునందు ప్రక్రమభంగము వాటిల్లును. కావున 'వెలగాన్' అనిన 'మూల్యనిర్ణయము కాఁగా' నని యర్థము జెప్పికొనవలయును.

ఈవర్ణనయం దింకొక్కచమత్కారము నారయుట ముదావహముగనుండఁగలదు. చేమకూరవేంకటకవి సాధారణముగ కెంపుగుణము నుగ్గడించునప్పుడు వెల యనుపదమును బ్రయోగించుచుండును. సాభిప్రాయపదములతో నలరారుచు సహృదయాహ్లాదకరముగనుండు సీసపద్యమున నింద్రప్రస్థపురంబునందలి విటులు వారకాంతాగుణగణములను వర్ణించుపట్టున

* * *

నేలలేని పొందిక విడివడ మెఱయు నీ
కెంపులబొగడల కీరవాణి

యని వర్ణించెను. (ఈసీసపద్యమునందుఁగూడ వేంకటకవి పదప్రయోగ సౌష్ఠవమును, రత్నగుణ పరిజ్ఞానమును నెంతయేని గాంచనగును. కాని శృంగారరసప్రాధాన్య మా సీసమున నెంతయేని యుండుట నిట నానివేదనమున కడ్డంకి యగుచున్నయది). ఈపద్యమునందును కెంపు వెల లేనిదయి పొందికయందు (కట్టడపుఁ బనితనమునందు) విడి (యెఱ్ఱదనము) వ్యాపించునట్లుగాఁ బ్రకాశించుచున్నది. ఈ 'వెల లేని' యనుటకు అమూల్య మనునర్థము కీరవాణి వేశ్యాపరముగఁ జెప్పుదుము గాన 'కెంపు' పరార్థమున నర్థాంతరము నారయవలయును. అట్లులనే మన పద్యమునందును 'జాతికెంపు వెలగాఁగొనుట' సంప్రాప్తించి

నది. 'వెల' యనునది వెల్లయొక్క రూపాంతరము. ఇయ్యది యామ్రేడితంబువ వెలవెల యను రూపమున సుప్రసిద్ధము. తెల తెల యను రూపాంతరములు సాధారణముగ నామ్రేడితమున నే గాన నగుచున్నవి. బహుజనపల్లి సీతారామాచార్యులవారు 'తెల' యనునది తెల్లకు రూపాంతరమనియు నామ్రేడితమున 'తెలతెల' అని ప్రయుక్తమనియు వివరణము వ్రాసి, 'వెల' రూపమున కట్టి వివరణము నొసఁగరయిరి. ఇయ్యది ప్రమాదమే కావలయును. ఏలయనిన వారే 'వెలవెల' పదమున వెల + వెల అని విభజనను జూపెరి. కావున 'తెల' వలెనే 'వెల' రూపమునుగూడ వీరంగీకరించిరి. ఈ వెల=తెల్ల అనునర్థము వేంకటకవిదృష్టిని గలదనుటకు నిదర్శనము లింకనుజూపఁ గలవు. ఆ యర్థము ననుసంధించి యీచరణమునకు

"చొక్కమ్మగు — దోషరహితమయి పరిశుద్ధమయిన, జాతికెంపుక్ — పద్మరాగమనుజాతినామమునఁ బరఁగు (సింహళదేశజము) రక్తవర్ణముగల కెంపును, వెలగాక్ — తెల్లగా అనఁగా, చాలినంతయొత్తిదనము లేనియట్లుగా, కొను — పరిగణించు, మోనివెఱుంగువాఁడు" అని యూహింపఁదగును.

తక్కుంగలసంశయములనుగూడ నిట్లులనే యారయఁదగునని వానిని విడిచి, నాలుగవచరణమునందలి పదవిభజన చమత్కారము నించుక నివేదింతును. చేమకూరకవి కడుంగడు శ్రద్ధాళువు. సందుదొరకినది గదా యని మందిమేలములకుఁ బూనువాఁడుగాఁడని యంగీకరించితిమిగదా! కావునఁ బైపాదములలోఁ జాలినంతసందర్భముమఁ గల్పింపకయే యీపాదమునందమ్మకమునకు దిగఁడని నావిశ్వాసము. ఆవిశ్వాసముతోడఁ బద్యమును బరిశీలింప మొదటిచరణమునందు బంగారము నొరయఁగల్గుట కలదు. ఒరయుటయనఁ బరీక్షించుట యుఁ గూడఁ గాన నీచరణమునందు స్వర్ణపరీక్షయున్నది. రెండవచరణమునందు జాతికెంపు 'వెలగాఁగొనుట యను' మూల్యనిర్ణయము కలదు. ఇద్ది రత్నపరీక్ష. మూఁడవచరణమున 'రూపసంపద' గలయాతఁ డున్నవాఁడు. జాతరూపము, రౌప్యము లోనగుపదములను బట్టియు 'రూప, రూప్య' యను నామములకుఁగల సంస్కృతపదములను బట్టియుఁ జూపి నిచ్చునట్టి గొంతధనము గలవాఁడును గలఁడు. కవి యీచరణమునఁ గల ధనదృష్టియే ధనాధిపగూను సుపమానముగఁ గొనిపోని వచ్చెను.

పాఠక మహాశయులారా, మనకు విక్రయము కొఱకు నొకరత్నాభరణ మున్నదని భావించినయెడ దాని విక్రయమునకు మనము చూడఁదగిన విషయములు ఏవిగదా! మొదటు: నగయందుఁగల బంగారమువన్నెను, ధరను నిర్ణయించుట. దీనికై స్వర్ణపరీక్షకుఁడు బంగారము నొరగంటిపై గీఁచిపెట్టి యిన్నివన్నెలబంగారమనియు, నింతధరఁగల బంగారమనియు నిర్ణయించి 'ఉల్లాకు' నొసఁగును. ఇంతవఱకుఁ గేవల స్వర్ణవిషయము. తరువాత నాయాభరణమునందలి మాణిక్యముల వెల నిర్ణయము గావలయును. దీనికి రత్నపరీక్షకుఁడు; అయ్యదియే రెండవచరణమునందలి విషయము. స్వర్ణపరీక్షయు, మాణిక్యపరీక్షయు నయిన యనంతరము క్రయకుని (కొనువానిని) వెదకవలయును. అప్పుడుగాని విక్రయకార్యము పరిసమాప్తి నందదు. సునకనికాలము నాఁటికిఁ గలవిపణి ప్రవర్తన మిట్టిదియ. ఈ సూఁడుం శములును, అనఁగా మనకడనున్న యమూల్యమాణిక్యాభరణమునందలి పసిండిపసదనంబు నెఱుంగఁగలవాఁడును, నందలి కెంపుల సొంపును గుర్తింపఁగలవాఁడును, నంత విలువయయినను నర్హమనితోఁచిన నిచ్చఁజాలినంత ధనముగలవాఁడును, ఒక్కచోటనే, యొక్కవ్యక్తియందే లభించినయెడల నా యుత్తమాభరణము నాచోటనే యాతనికే యమ్మివేయుదుము గదా! లేకయున్న నింకొకచోట నయ్యది చెల్లునా? గుణాగుణముల నెఱుంగఁ జాలి యర్హమూల్యము నొసఁగఁగల యైశ్వర్యమున్నవాని కన్న మిన్నయగు క్రయకుఁ డెవ్వనికి నెప్పుడును లభింపజాలఁడు. కావుననే యా చక్కనివెలగల రత్నాభరణము నాతనికే యాక్షణముననే యమ్మివైచును. ఈ పద్యమునందులాచీహృదయవిక్రయమునకుఁగూడ నట్టి పరిస్థితులే యేర్పడెను.

ఈ చెక్కుల చెక్కువాఁడు (అందములను చెక్కిళ్లుగలవాఁడు) బాహువానోరయఁగల్గినవాఁడు.

ఈ మోవి మెఱుంగువాఁడు (మెఱుఁగుగలమోవి గల యర్జునుఁడు) జాతి కెంపులకు (జాత్యేకవచనము) మూల్యనిర్ణయము నొనరింప సమర్థుఁడు.

ఈ సుందరాకారుఁడు అర్థపతికుమారుని సైతము తిరస్కరింపఁజాలెనంత ధనముగలవాఁడు. (అర్థపతివలె తనధనము సంతతమని నొకచూలనుంచి ప్రాణమిత్రునికి సైతము భిక్షిడనము నొన్నఁజాలనివాఁడు గాఁడు. సాధారణధనికపుత్రులవలె విచ్చలవిడిగ వెచ్చించి కళాసృష్టిని జీవనమును గడపువాఁడు. ఇట్టి గుణత్రయమును గలవాఁడుగావుననే 'అమ్మకచెల్ల (ఎంత యానందము!) నాహృదయమమ్మకచెల్లగు వీనికియ్యెదన్'.

ఉలూచి విక్రయింపనున్నది తన హృదయము. పైవివరణమునుబట్టి చూడ నాహృదయము అపరిమిత మూల్యమునకుఁ బాత్రమగు పద్మరాగఖచితస్వర్ణవిభూషయని ధ్వనింపకమానదు. ఎంతయుత్తమధ్వని! ఇట్టి యుత్తమధ్వనుల నన్నిటినేని గలిగియున్న విజయవిలాసకావ్య ముత్తమకావ్యవతంసము గాకుండునే! అనురాగభరితంబగు హృదయమును పద్మరాగమణిమయాభరణముఁ గని యూహించుట యాతని ప్రతిభావమును వేయినోళ్లఁ జాటుచున్నది. హృదయాకారవర్ణముల నెరింగినవారు దీని కానందింపకపోరు. నిష్కల్మషమగు తన హృదయమునందలి గుణగణములను బాగుగ గుర్తించి వానికిఁ దగిన యట్టి ప్రత్యనురాగమూల్యము నొసంగఁ గలయాతఁ డొక్కఁ డన్యుంగికిఁ జిక్కఁడేని యాతని కాళ్ళణంబున నా యంగన తన హృదయము నర్పింపక మిన్నకుండునా, ఉలూచి తన హృదయము నమ్ముటయా యని కొందఱు స్థూలదృష్టి నారసి హాహాకారములకుఁ బూనుదురు. కన్యాజనవరగ్రహణంబు నిక్కముగ నమ్ముటయే; కాని యేమూల్యమునకు? అనంత మతిపవిత్ర మనుదినప్రవర్ధమానము నగు ప్రత్యనురాగమూల్యమునకు మానవులు విక్రీతులగుచున్నారు. భగవంతుఁడుగూడ నట్టి ప్రణయమూల్యమునకు విక్రీతుఁ డగుననిగదా యుదారాశయు లుపదేశింతురు! కావున నీవిషయమున నిర్వేఱ నందఁ బనిలేదు. ఉలూచియుఁ దనహృదయము నర్పణచేసి యాతని హృదయమును కైవసమొనరించికొనును. ఇంతకన్న నన్యోన్య ప్రేమ మేమియుండును?

'అమ్మకచెల్ల' యనుదానఁ బదవిభజనప్రౌఢి నింత సందర్భశుద్ధితోఁ బ్రయోగించి, కావ్యమునకు జీవంబగు ధ్వనిని పోషించి, తనకావ్యమునకు నులూచీ పాత్రకు నొక్కరీతి నౌన్నత్యమును గూర్చిన మన చేమకూరవానికిఁ జేమోడ్పు లనఁ జెల్లదే.

---

# మా చందాదారులకు

మా కార్యాలయమునకు వ్రాయు ఉత్తరములు మొదలయినవానియందు తమ 'చందాదారు' సంఖ్య వ్రాయవలెను. లేకున్న ప్రత్యుత్తరములు మొదలయిన పనులను జరుపజాలము. చందాదారుసంఖ్య భారతి కవరుకాగితముపై తమ విలాసమునకు ముందున్నది. చందాదారులకు భారతి ౧౦-వ తేదీ లోపల అందకపోయిన యెడల వెంటనే తపాలువారికిని, మా కార్యాలయమునకును తెలుపగోరెదము.

—మేనేజరు, 'భారతి.'

# అస్పృశ్యుడు (ఒక 'భావ' కథ)



# విమానము

తంగిరాల రాధాకృష్ణయ్యగారు, బీ. ఏ., బీ. యల్.

(ఏకాంకరూపకము)

రంగము ౧.

[ప్రవేశము: మనోహరి-మహారాజరావు.]

మనోహరి: ఈరోజుశలవా?

మహారాజరావు: ఆఁ.

మనో: కోర్టు లేదూ?

మహా: ఆఁ హాఁ.

మనో: ఎందుకని? (మహారాజరావు పలక్కుండా వేసి చప్పరించుకుంటుంటాడు.) క్లబ్బులో టీపార్టీ అనా? (మహారాజరావు దగ్గినట్టు నటిస్తాడు.) ఇవ్వాళ భోజనప్రాప్తిలేదా మాకు!

మహా: ఏమో?

మనో: ఏమిటి ఏమో?

మహా: ఆ.

మనో: భోజనానికి రారూ.

మహా: ఆ.

మనో: అబ్బా.

మహా: చూచావా? ఇవ్వాళ క్లబ్బు మీటింగుకు పండ్లవనం జమీందారు వస్తాడుట.

మనో: గొప్పసంగతే.

మహా: కాదేంమరి! ఎవరేనా వచ్చారా విమానంలో మనముష్టిక్లబ్బుకి.

మనో: ఆలాగేం. విమానంలోనేం రావడం - అరే, ఏమిటి-పండ్లవిమానమా?

మహా: నవ్వులు కాదు; వస్తాడట మరి. త్వరగా భోంచేసుకొని వెళ్లాలి క్లబ్బుకి.

మనో: ధన్యురాలని. శలవుకదా అని దిగులు పడిపోతిని. (నిష్క్ర.)

(మోటారుసైకిల్ శబ్దమవుతుంది.)

మహా: మనో, మనో, ఇలారా: (ప్ర: మనోహరి) ఎవరో స్నేహితులు వస్తున్నారులా వుంది—ఏమి టాశబ్దం.!—

మనో: శబ్దం బాగా వినబడుతున్నా, దూరం నుంచి వస్తున్నది: కాదూ?

మహా: డాక్టరు సాహేబుకాదా ఏం?

మనో: కాదు.

మహా: ఎవరంటావు మరి?

మనో: గంధర్వుడు.

మహా: ఆఁ—ఎవరు?

మనో: పండ్లగంధర్వుడు.

మహా: (ఆలోచించి) మనో, నీవు కుశాగ్రబుద్ధివే.

మనో: మీరు ముసలాగ్రబుద్ధులా?

మహా: నీకంటికప్పుడే ముసలినైనానా?

[ప్ర: వాకిటినుండి రాముడు]

రాముడు: చూచే బాబాయి, విమానం?

మనో: అవునండీ మీరు పేపర్లో చదివేదే. ఆ పండ్లవిమానమా అదేమిటి—

మహా: ఒకపేరుపెట్టేవు: పాపమాయన వింటే ఏమనుకుంటాడు? రాముడూ, ఏమిట్రా అది.

రా: అదా? తుమ్మెదల్లె వచ్చి గద్దల్లె వాల్తున్నది.

మహా: దాన్నేమంటార్రా?

రా: విమాన మంటారట.

మహా: వాండ్లేమంటే ఏంలే: నీవేంమంటావు?

రా: అబ్బే నేననేదేమిటి—నేను: విమానం గదూ!

మహా: మరి—ఆకాశంలో ఎల్లా ఎగురుతుందిరా?

రా: ఎగురుతుందయ్యా.

మహా: ఎల్లా ఎగురుతుందిరా?

రా: ఎల్లా ఎగిరేదేమిటి మహా అడిగేవు. పక్షులు ఎగరడంలే?—

మహా: నీ వెగరగలవటరా?

రా: ఓ.

మహా: మరి ఎగురు చూస్తాను.

రా: ఊరికెనే ఎగరమంటే ఎగురుతానేం? కాణీ యిస్తే ఎగురుతా.

మనో: ఆవిమానంలో ఏముంటయిరా?

రా: ఆఁ. ఏముంటయ్యా—ఆఁ—ఏమో.

మహా: ఇంతేనా నీకు తెలిసింది? ఏముంటయ్యోగూడా తెలేదు.

రా. ఏ పోదూ.

మహా: మరీ—ఎట్లా ఎగురుతొందిరా అది.

రా: ఎగురుతుందంటుంటే — ఎట్లా ఎగిరేదేమిటి మహా అడిగేవు—మరీమరీ—

(మనోహరమ్మగారిని మహాలక్షుమ్మగారు లోపలినుంచి కేకవేసి పిలుస్తుంది.)

మనో: ఆఁ. వచ్చా మహాలక్షుమ్మగారూ.

రంగము ౨.

[ప్ర: మహాలక్షుమ్మ-మనోహరి.]

మహాలక్షుమ్మ: మనోహరమ్మగారూ, అదేమిటండీ విమానముట—చూచారా?

మనో: చూచానండీ: దానిసంగతే అనుకుంటున్నాము.

మహా: ఏమిటి దాన్లో దేవత లుంటారా? మరెట్లా ఎగురుతాయి? మావారు దేవతలు ఏమైనా భూలోకంలోకి షికారు వచ్చినారేమో ననుకొని చూచి దణ్ణాలు పెట్టడం మొదలెట్టారు.

మనో: కాదండీ: మనలాగనే మనుష్యులుంటారు.

మహా: మనుషు లెల్లా గుంటారండీ; మనుషు లెగర గలరా?

మనో: ఎగరడం కాదండమ్మా విమానంలో పోతారు.

మహా: అంటేఏమిటి! — ఎగరడ మన్నమాటేకా.

మనో: ఎగిరేది విమానం: దాన్లో మనుషులు ఊరికె కూర్చుంటారు. మోటారుపోతుంటే చూడలేదూ?-గుర్రం గిర్రం ఏమీలేకుండా ఎలాపోతున్నది—అలాగే నేల మీంద పొయ్యేబదులు ఆకాశంలో ఎగిరి పోతుంది. అందుకనే విమానం అన్నారు. అంతే.

మహా: అంతేనా!—పండువలిచినట్లుచెప్పేరు! నేలమీద పోవడమంటే అర్థమవుతుంది గాని ఆకాశంలో పోవడమంటే ఎలాగండీ? అసెట్ల సాధ్యమవుతుంది?

మనో: అంత చిత్రంగా వుందా? పక్షులెళ్లడం లేదండీ ఆకాశంలో—అలాగే.

మహా: పక్షులంటే రెక్కలున్నాయి గాబట్టి ఎగురుతవి. మనకున్నాయా?

మనో: మీకదంతా అర్థంకాదులెండి. మీరు పెద్దవారు. ఈకాలపుచిత్రాలు యంత్రాలు, యివేవి మీకు అర్థంకావు. దేవతలో దయ్యములో అంటేనేకాని మీ చెవి కెక్కవు. మనం చూడనిదంతా అసాధ్యం అంటారు. ఫలానా అనిచెపితే ఊహించుకోలేరు. మోటారెల్లాపోతుందో మీకంతా తెలుసునేం?—ఏదీ చెప్పండీ చేతయితే! గుర్రాలులాగవు కదా; ఎడ్లులాగవు కదా; మనుషులుపట్టినెట్టరు కదా; ఆకాశంనుంచి దేవతలు మంత్రబలిమిచేత తోలడంలేదుకదా; మరి అదెల్లా పోతున్నది? ప్రతినిత్యా వాకిట్లో కూర్చుంటే వందలకొలది మోటార్లు చూస్తారు కదా-మరి అవెల్లాపోతాయా అని ఎప్పుడైనా అనుకొన్నారూ? చెప్పండీ?

మహా: నిత్యా చూస్తూ నమ్మకపోవడమేం?

మనో: అదే నేననడం. ఇందాకటినుంచిన్నీ మనం చూచిందేమో మనమూర్ఖత్వం చేత నమ్మడం; మనంచూడనిదంతా ఏత న్మూర్ఖత్వం చేతనే ఏగంధర్వులకో రాక్షసులకో కట్టిపెట్టడం. మోటారుపొయ్యే సంగతిచూస్తూ విమానం సంగతి ఎందుకు నమ్మకూడదు?—ఇదేనండీ మనకొచ్చిన ప్రారబ్ధం. మనకు దృగ్గోచరంకాని దాన్ని మన మూఢభక్తి మూఢవిశ్వాసములతో ఒప్పుకొంటున్నాము— తెలిసికొన్నారా: ఆవిమానంలో ఒక జమీందారు వస్తున్నాడు. ఆయనగారు మీటింగుకు రావలసి రైళ్లమీదవస్తే కాలయాపన అవుతుందని విమానంచేసికొని వస్తున్నాడు. అది కూడా ఒకగుర్రబ్బండి, మోటారు, రైలు, వలె ఒక వాహనము. వింటిరా;భుంయ్‌మని యామోత: త్వరగా భోంచేయండి వెళ్లి చూస్తాము. వూరిబయట ఆగుతుందనుకుంటాను. (నిష్క్ర.)

రంగము 3.

[ప్రవేశము: మహారాజరావు - కేశవరావు-రాముడు.]

రాముడు: బాబాయ్—బాబాయ్!

కేశవరావు: ఏమిటింకా తూగుతున్నావు. లే, క్లబ్బుకెళ్లుదాం. మీటింగుకి రాదలచుకోలా?

మహా: ఇదిగో వస్తున్నాను. మనో కూడా వస్తానంటున్నాది.

కేశవ: విమానం చూడ్డానికా. తిరునాళ్లప్రజ వెళ్లుచున్నదిగా: ఆతొంబలో నెట్టేశెయ్యకపోయినావా?

మహా: ఆలాకాదట. నేను స్వయముగా తీసికెళ్లి చూపాలట. తానుకూడా క్లబ్బు మీటింగుకి వస్తుందట.

కేశవ: ఏమిటి; ఆవిమానం పండ్లవనం జమీందారుది కాదటోయి! ఆయనగారు ఢిల్లీకి వెళ్లాడట, కౌన్సిల్ మీటింగుకి.

మహా: మరి యిదెక్కడిదంటావు.

కేశవ: ఇవ్వాళప్రొద్దున ఎవరో దొర మద్రాసులో ఢిల్లీకి బయలుదేరితే ఎక్స్ప్రెసు తప్పిందట. అమాయన ఎకాఎకి విమానం రు. ౫౦౦ కి బాడుగకి తీసికొని యిక్కడ ఎక్స్ప్రెస్ క్యాచ్ చేయడానికిగాను వచ్చాడు. నీవేమో మహాసర్దాగా వున్నావు మీటింగుకి వస్తుందని.

మహా: రాముడూ,చీటీయిస్తానుగాని, తీసికెళ్లి క్లబ్బులో చూపెంచిరా, విమానం వచ్చిందో లేదో తెలేవాలి. మనో చాలా ఆతుర్దాగా వుందికూడాను. మనో, మనో-హరీ, ఇల్లారా, మాట.

(ప్ర: మనోహారి.)

విన్నావా, ఈవిమానం పండ్లవనంవారిది కాదట!

మనో: ఎవరన్నారు?

మహా: కేశవరావుగారన్నది విన లేదూ?

మనో: ఏమిటి ఎక్స్ప్రెస్ తప్పిన సంగతేనా! ఏమండీ మీరుకూడా యీలాంటి పోచికోలు కబుర్లు నమ్ముతారనుకోలేదు సుమండీ! విమానం నెంబరుకూడా చూడకుండా మీరు యిల్లాంటికథలు నమ్మితే ఎల్లా? పండ్లవనంవారిదే 3 ౨౫ అని మీకు గమనం లేదేమో? కేశవరావుగారూ, ఎక్కడ సృష్టించారు యీకట్టుకథ?

మహా: అవును మరి ఎక్స్ప్రెస్ తప్పితే స్పెషల్ ట్రెయిన్లో పోవలెగాని, యీ కుంటివిమానంమీద ప్రాణాలు పోగొట్టుకోవడమెందుకు?

రంగము ర.

[ప్ర: భుజంగరావు-మహారాజరావు కేశవరావు-మనోహారి]

మహా: ఏమోయ్ భుజంగరావు, క్లబ్బుకేనా బయలుదేరావు!

కేశవ: మాబాగా.

మహా: మనో మార్చినా కూడా తృప్తి చెంది నట్లు లేదే.

కేశవ: కాగితాల్లో చూస్తాంగా: ఏమోయ్ భుజంగం, ఈవిమానం సంగతేమైనా ఆలో చించారా ?

మనో: ఆలోచించేదంతా మీరే ఆలోచిం చారుగా.

భుజం: మనవారికి యికమీద గొప్ప ప్రాము ఖ్యం రాబోతున్నది.

మహా: ఏలాగంటావోయి ?

భుజం: మనదక్షిణదేశంలో నొక్కమద్రాసు లోనేగా విమానాలు వాలడానికి దరి ఏర్పడి యున్నది. ఇప్పుడు యిచ్చట కూడా దరి ఏర్పాటు చేస్తున్నారు. ఇక విమా నాలు మనవారినిండా కందరికీగల్లాగ బీభత్స చేస్తుంటాయి.

మహా: మరి విశాఖపట్నంగా యిప్పుడు గవ ర్నమెంటువారికి పెట్టిపుట్టింది. అక్కడ ఏర్పాటుచేయక ఇక్కడెందుకు తలుచు కొన్నారో ?

భుజం: మనవారుగూడా ఆంధ్రయూనివర్సిటీ కావాలని పోట్లాడారుగా పేపర్లల్లో కొన్నాళ్లు! ఇప్పుడు అదిలేకున్నా ఇవన్నా మనకండ్ల నీళ్లు తుడిచేటందుకు ఆలోచిస్తు న్నారు. అదీగాక, ఆమినిస్టరెవడో వాడికి మనవోట్లు కావలశివచ్చాయనుకుంటాను.

*     *     *     *     *

*     *     *     *     *

*     *     *     *     *

*     *     *     *     *

మహా: లేవోయి, క్లబ్బుకెళదాము; వేళమించి పోతుంది. కేశవా, కొంచెం అల్లావెళ్లి దాని నిజ మేమిటో కనుక్కొని రాలేవు. ఇంతలో నేను డ్రెస్సు చేసికొంటాను. (కేశవరావు నిష్క్రమిస్తాడు.)

ఒట్టిపోచి కోలురాయిడు !

భుజం: కానీ, చెప్పే దాన్లో స్వారశ్యం పెట తాడు.

మనో: అదే వచ్చినగోల. అందువల్ల నే నిజం అనుకుంటారు.

(ప్ర: కేశవరావు—కోదండరావు.)

కేశవ: వార్తలు వస్తున్నాయి: విమానం బాడుగకి వస్తున్నది.

మహా: ఏదో పెట్టావే.

కేశవ: ఇద్దరుమనుషుల నెక్కించుకొని పూరం తాటిప్పితే రూ. ౧౦౦; నేలమీాద వున్న

ప్పుడు వారికె కూర్చోడానికి రు. ౨౦; తాకడానికి రు. ౧౦; చూడడానికి రు. ౫—ఇవి రేట్లు. తీర్థప్రజ బయలు దేరింది—లే పోదాం.

మనో: కేశవరావుగారూ, మరొక్కసారి వెళ్లి రండీ; మరీ క్రొత్తవార్తలుకలుగుతాయి.

కేశవ: మీరు తయారుకాండి విమానారోహణానికి.

(ప్ర: రాముడు.)

రాముడు: క్లబ్బు మేనేజరుగారు యీ చీటీ యిచ్చారు మీ కియ్యమని.

మహా: ఏమన్నాడురా?

రా: అసలు విమానం ఇక్కడిది కానే కాదట.

మహా: (చీటీచదివి) కేశవరావుగారూ, అంతా తేలిపోయింది — చూచారా విమానం Royal Air Force వారిదట. ఢిల్లీనుంచి మద్రాసు వెళ్లుతుంటే మనకు కనుపడ్డది. ఏమోగాని బలే బాగుంది.

మనో: లేండి, అంతా కాఫీ పుచ్చుకుందురు. ప్రయాణం అబద్ధం—ప్రసాదం నిబద్ధం—అన్నారు.

[తెర]

---

## ఖండశశి

శ్రీరంగం శ్రీనివాసరావుగారు, బి. ఏ.

ఆ పశ్చిమాశా నిశాబలాంత కావ్యమై
వ్యాపించు కాలమేఘాళిలో పొడచూపి,
ఖండేందుమూర్తి! ఆకాశకర్పరమెల్ల
నిండు నీగుడ్డివెన్నెల ధూమధూపమై!
వలదు దయలేని ఆజిలుగు వెలుగెందేని
కలిపివేయుము పల్లటీలు వార్ధికెరటాల-
సంపెంగ విరిపైడిచాయల్లో నాకేమొ.

వంపుతేరిన కత్తివలె నుంటి వీరేయి!
ఖండేందుమూర్తి! లోకముపై కుపితసృష్టి
మండించు ఈసమున్మాదనాట్య మిదేమి?
ఓసుధాహృదయ! నిట్టూర్పులై ప్రసరించు
వికలమామకభావశకలముల్ నీవంక-
కురియింపు మింక నిష్ఠురవృత్తి పోనాడి
హరజటాజూట గంగాంబు శీతలదృష్టి!

---

"అమ్మాయీ, చంటిపిల్ల ఏడుస్తూ ఉంది. కొంచెం ఎత్తుకో అమ్మా" అని కేక వేశాను. మా అమ్మాయి గదిలో కూర్చుని తదేకధ్యానంగా చదువుతూ మాట్లాడలేదు ఏమి చదువుతూ ఉందో అని జాగ్రత్తగా విన్నాను. ఈవిధముగా చదువు వినిపించింది.

"వంగకాయకూర నాలుగు విధంబులు. వంగకాయకూర నాలుగు విధంబులు. పులుసుకూర, ఇగురుకూర, పప్పుకూర, కారపుగూర - పులుసుకూర, ఇగురుకూర, పప్పుకూర, కారపుగూర. కారపుగూరకు నెండుమిరపకాయ లైనను బచ్చిమిరపకాయ లైన నుపయోగింపదగు"

మళ్లీ మా అమ్మాయిని పిలిచాను.

"తీరుబడి లేదు నాన్నా. ఈవేళ పరీక్ష" అంది.

"ఏం పరీక్షమ్మా" అన్నాను.

"పాకశాస్త్రపరీక్ష - చదువుకొంటున్నాను, నాన్నా" అంది.

మారోజుల్లో పాకశాస్త్రపరీక్షలు లేవు. కనుక్కోగా తేలినవిషయం ఏమిటంటే: ఈ కాలంలో పాకశాస్త్రంమీద శాస్త్రపరీక్షే కాకుండా ప్రత్యక్షంగా వంటచేసే పరీక్షకూడా ఉందని తేలింది. నిజంగా ఈకాలములో ఇదొక కొత్తలాభం మనకు చేకూరిందని సంతోషిస్తూ మా అమ్మాయి పాకశాస్త్రపారీణతను వినియోగపరిపించాలని ఆలోచించినాను. పూర్వకాలపు ఆడవాళ్లు — అంటే పాకశాస్త్రాదులు బళ్లల్లో చదవని రకంవాళ్లు—వంట చేస్తే మనముపడే అవస్థలు వేరే బహిరంగంగా చెప్పడము వివేకము కాదు. ఇక పాకశాస్త్ర పరీక్షలో ఉత్తీర్ణులైన యీకాలపు ఆడవాళ్లు నిజముగా వంటంటూ చేస్తే—అది నలపాక భీమపాకములను మించి ఉంటుందని వేరే చెప్పక్కర్లేదు గదా! ఇంతే కాకుండా ఇంకోవిశేషం. ఇదివరదాకా అడ్డమైనవాళ్లూ వంటచెయ్యడమే! ఆడదై పుట్టిందీ అంటే పెళ్లి చేసుకోవడం ఎంత సహజమని భావిస్తున్నారో వంటచెయ్యడము కూడా అంత సహజమని భావిస్తున్నారు. నిజానికి వంట అనేది ఒక 'లలితకళ' అనే విషయం ఇంతవరకూ ఎవరూ కనిపెట్టలేదు.

ఇప్పుడు పాకశాస్త్రపరీక్షలుచేసి కృతార్థులైనవాళ్లకి తగిన సర్టిఫికెట్లు ఇచ్చి, 'ఇటువంటి సర్టిఫికెట్లు ఉన్నవాళ్లే వంటచేయడమునకు అర్హులు మిగిలినవాళ్లు కారు, అర్హులు కానివాళ్లు వంటచేసినట్లయితే పీనల్‌కోడు (నూతన ముద్రణము) ప్రకారము శిక్షాపాత్రులు' అని నిర్ణయము చేయడమువల్ల పాకశాస్త్రమునకు మిగిలిన శాస్త్రములకు

వలెనే గౌరవస్థానం లభించిందని ఊహించవచ్చు.

ఈవిధంగానే ముగ్గులశాస్త్రం, అలుకు శాస్త్రం మొదలైన శాస్త్రాలలో పరీక్షలు పెట్టి అందులో నెగ్గినవారే ముగ్గులు పెట్టడానికీ, ఇళ్లూ, వాకళ్లూ, గోడలూ అలకడానికీ అర్హులని ఏర్పాటు చేసినట్లయితే—ఈ విధంగా కొంతవరకు భరత దేశానికి శ్రేయస్సు కలగవచ్చును.

పాకశాస్త్రానికివలెనే ముగ్గులశాస్త్రానికీ, అలుకుశాస్త్రానికి కూడా తెల్లదొరలే తగిన పుస్తకాలు వ్రాసినట్లయితే మరీ భేషుగ్గా ఉంటుంది.

ఇక మా అమ్మాయి సంగతి—

పాకశాస్త్రపరీక్ష కని మా అమ్మాయి ఇంట్లో పనులు ఏమీ ముట్టుకోకుండా రాత్రి ఒంటిగంటదాకాను, పగలు పగలంతాను కష్టపడి చదివి చదివి ఎలాగైతేనేమి పరీక్షకు వెళ్లింది.

పరీక్షలో ఏమి వ్రాసిందో ఏమి మానిందో గాని ఇంటికిమాత్రం ముఖమంతా చిరునగవులతో వచ్చింది.

"అమ్మాయీ, పరీక్ష లెలాగ వ్రాశావు" అన్నాను.

"చాలా బాగా వ్రాశాను నాన్నా" అంది.

"శాస్త్రపరీక్షలో ఇచ్చిన ప్రశ్న లన్నింటికీ సమాధానం వ్రాశావా" అన్నాను.

"వ్రాశాను — కాని ధనిగూరించి పాక శాస్త్రములో ఉన్న స్థానమును వ్రాయమన్నారు — అదిమాత్రం వ్రాయలేదు. నాన్నా — తెలిసిందికాదూ."

"ప్రాక్టికల్ పరీక్ష" అన్నాను.

"అల్లం పెసరట్టు వెయ్యమని ప్రశ్న యిచ్చారు నాన్నా. కొంచెం మాడిందిగాని "మినిమం" పరీక్షమార్కులు వస్తాయి నాన్నా" అంది.

"ఒక్క పెసరట్టేనా, ఇంకా ఏమైనా వండమన్నారా" అన్నాను.

"ఛాయస్ ఇచ్చారు నాన్నా. అల్లం పెసరట్టేనా సరే, లేకుంటే అరటికాయబజ్జీ అయినా సరే."

మా అమ్మాయి శాస్త్ర పరీక్ష ప్రశ్నలు నాచేతిలో పెట్టింది.

పాఠకులుకూడా కుతూహలంతో ఉంటారు కాబట్టి వాటిని వారికకూడా చూపిస్తాను.

శా స్త్ర ప రీ క్ష లు

౧. పాకశాస్త్రపరీక్ష (శాస్త్రభాగము)

మూడు గంటలు

౧. వంగకాయ పులుసు ఇగురుకూరలకు భేదమేమి? వంగకాయతోగూడ నేయేకాయ గూరలను నాకుగూరలనుజేర్చి వండవచ్చును?

౨. (అ) మనము సాధారణముగా నుపయోగించు వానిలో నేకాయగూరలు, నే

పరీక్షపత్రాలు చదువుకోన్నాను. సంతోషించాను.

కొన్నాళ్లవరకూ మా అమ్మాయి పరీక్ష పత్రములు దిద్దేవాళ్ల ఇళ్లకు తిరగడముతో సరిపోయింది. చివరకు ప్రాక్టికల్ పరీక్షలో పోయినట్లూ శాస్త్రపరీక్షలో బాగా మార్కులు వచ్చినట్లూ — మొత్తంమీద ఎలాగైతేనేమి పరీక్ష ప్యాసైనట్లూ తెలిసింది.

"ప్రాక్టికల్లో ఎందుకు పోయిందమ్మా" అని మా అమ్మాయిని అడిగాను.

"అయిదుగురు జడ్జీలకి అయిదు పెసరట్లు వేయించుకొన్నారు.—"

"అయిదుగురు జడ్జీలేమిటి ?"

"మరి ప్రాక్టికల్ పరీక్షలో సరిగా వ్రాసిందీ లేనిదీ చూడడానికీ, వండిన పదార్థాలు రుచిగా ఉన్నదో లేదో చూడ్డానికీ జడ్జిలక్కరలేదు నాన్నా ?"

"ఈ అయిదుగురూ రుచిచూచి మార్కులిస్తే వాటినిబట్టి పరీక్షాఫలం నిర్ణయిస్తారా?"

అయిదుగురు యిచ్చిన మార్కులూ కలిపి సరాసరిచేసి అప్పుడు నిర్ణయిస్తారు నాన్నా."

"సరే ఏమి జరిగింది ?"

"అయిదుగురూ కూర్చుని అయిదు పెసరట్లూ తినడానికి మొదలెట్టారుట."

"ఏం జరిగింది."

"తినలేక పోయారట."

"ఏంచేత ?"

మా అమ్మాయి సందేహంగా చెప్పింది, "కారం ఎక్కువై తినలేక అరిగంటదాకా నోరు స్వాధీనం అయింది కాదట."

"అంతకారం ఎందుకు వేశావమ్మా."

మిరపకాయలు తూచడంలో పొరపాటు వచ్చింది నాన్నా — ఒక ఔన్సు పచ్చిమిరపకాయలూ, పాతిక ఔన్సు ఎండు మిరపకాయలూ వెయ్యడానికి బదులు సన్నితూనిక రాయి తీసుకోవడంవల్ల ఎక్కువకారం పడింది నాన్నా."

"ఎన్ని ఔన్సులు వేశావు."

"ఎనిమిది ఔన్సులు పచ్చిమిరపకాయలూ, రెండు ఔన్సులు ఎండు మిరపకాయలూ వేశాను."

"పోనీలే — ఎలాగో ప్యాసయ్యావు అదీ కావలసింది" అన్నాను.

"పొరపాటు వచ్చింది కాని — అసలు చాలా బాగా వండుతాను. నాన్నా" అంది మా అమ్మాయి.

"సరే, ఒకమాటు నీవంట చూపెద్దువు గాని" అన్నాను.

"ఎప్పుడు, నాన్నా, ఎప్పుడు."

"చెప్తాతాలే" అన్నాను.

ఇంట్లో పొయ్యిమీద మామూలుగా వండుతుం దనుకొన్నాను మా అమ్మాయి. కాని ఆవిధంగా తాను తరిఫీతు కాలేదనీ

తాను పరీక్షించిన విధంగా వంటచేయడాని కనీ పాతికరూపాయిలు నాచేత ఖర్చు పెట్టించింది.

మిరపకాయలూ, ఉప్పూ, ఆవాలూ మెంతులూ, కరివేపాకు మొదలైనవి తూచ డానికి ఒక సున్నితమైన తులామానమూ, "గ్రాము" మానికరాళ్లు ఉండే పెట్టె కొన్నాను. బియ్యములోనూ, పప్పులోనూ, కూరల లోనూ, పచ్చళ్లలోనూ, ఉప్మా మొదలైన వాటిల్లోనూ పొయ్యడానికి నీళ్లు కొలవడానికి రెండు మూడు రకాల గాజుకొలతపాత్రలు కొన్నాను.

పోపులకు నూనె, నెయ్యి కొలవ డానికి చిన్న ఔన్సుగ్లాసు కొన్నాను.

చిన్నగిన్నె, పెద్దగిన్నె, పెనము, బూర్లమూకుడు మొదలైనవి పెట్టుకోవడానికి నాలుగైదు రకాల పెట్టెలు కొన్నాను.

ఉష్ణోగ్రత తెలుసుకోడానికి రెండు మూడు రకాల థర్మామీటర్లు కొన్నాను.

ఇంకా మా అమ్మాయి చెప్పిన చిల్లర వస్తువు లేవేవో కొన్నాను.

ఈసాధనసామగ్రి సంపాదించుకొని మా అమ్మాయి తనవంటనేర్పు నాకు చూపించ వలెనని తగిన సమయముకోసం వేచి ఉంది.

తగిన తరుణంకూడా త్వరలోనే వచ్చింది.

*          *          *

తాను బి. యల్. పరీక్ష చదవడానికి నేను డబ్బు ఇస్తానేమో నని కనుక్కోడానికి వచ్చాడు మా అల్లుడు. మొట్టమొదట ఈ విధంగా సామోపాయంవల్ల ప్రయత్నం చేసి, నెగ్గకపోయినట్లయితే భేద, దండములు ప్రయోగించవలెనని అతగాడి అభిప్రాయ మైనట్లు నేను గ్రహించాను.

అల్లుడు వచ్చిన ఇటువంటి తరుణం ఊరికే పోనివ్వడ మెందుకని ఆరోజున మా అమ్మాయిని వంటచెయ్యమన్నాను. మా ఆవిడను చూస్తూ ఉండమన్నాను. మా అల్లుడికి ఇష్టమైన పిండివంట గారెలు వండమన్నాను. మా అమ్మాయి వంటచెయ్యడం ప్రారంభించింది. రెండుస్టవులు వెలిగించింది. బర్రుమని శబ్దం చేస్తున్నాయి. తులామానంతో బియ్యం తూచింది. గాజుపాత్రతో నీళ్లు కొలిచిపోసింది. తను కొలిచిన మినప్పప్పు నానేసి తల్లిని రుబ్బమంది. నన్ను ఆవాలూ, జీలకర్రా, మెంతులూ రెండేసి గ్రాముల చొప్పున కొంచెం తూచిపెట్టమంది.

"అమ్మాయీ, పప్పులో నీళ్లు చాలవే" అని తల్లి అంటే.

"నీకు తెలియదు ఊరుకో అమ్మా; ౨౫౦ గ్రాముల కందిపప్పుకి ౨౦౦ క్యూబిక్ సెంటిమీటర్ల నీళ్ల చొప్పున పోశాను. తక్కువలేదు" అంది మా అమ్మాయి.

బియ్యంలో నీళ్లు ఎక్కువ అయ్యాయనీ, కూరలో ఎక్కువ మెంతులు పడ్డాయనీ, పులుసులో ధనియా లక్కర్లేదనీ తల్లి చెప్పితే తల్లితో ఘర్షణ పడింది. దాని ఇష్టము వచ్చి

నట్లు చెయ్యనివ్వమనీ, ఏమీ అడ్డు చెప్పవద్దనీ తల్లిని నేను మందలించాను. ఎలాగైతే నేమి ఒక గాజుపాత్రా, రెండు థెర్మామీటర్లూ బద్దలుకొట్టి అయిదారు గంటలలో మా అమ్మాయి వంటచేసి ఒగుర్చుకొంటూ వెళ్లి తనగదిలో కుర్చీలో కూర్చుని పాకశాస్త్ర గ్రంథము తిరుగవేస్తూ తాను సరిగా వండినదీ లేనిదీ సరిచూచుకొంటోంది. మా ఆవిడ వడ్డించింది, మా అల్లుడికీ, నాకూ.

అంతవరకూ ఉత్సాహంగా మాట్లాడు తున్న మాఅల్లుడు మొదటిముద్ద నోటిలో పెట్టుకొన్నది మొదలు చివరదాకా ధుమధుమ లాడుతున్నాడు.

తనభార్య పాకశాస్త్రపరీక్ష ప్యాసయిం దనీ, అదే ఆరోజున వంటచేసిందనీ నేను చెప్పినా అతడు సుముఖుడు కాలేదు.

అర్ధాకలిగా లేచిపోయి, బి. యల్. చదువుకు డబ్బు అడగకుండానే అతగాడు సాయంత్రం బండిమీద ఇంటికి వెళ్లిపోయాడు.

"అతనికేం కోపం వచ్చిందో గారె ముక్కైనా ముట్టుకొన్నాడు కాదు. ఎందుకో కనుక్కోండి" అంది మా ఆవిడ.

"ఎందుకు కోపం?" అన్నాను.

"అన్నం చిమిడింది, పప్పు ఉడకలేదు, కూర చేదుగా ఉంది, గారెలు కొన్ని మాడా యి, కొన్ని అసలు ఉడకనేలేదు — అసలు ఏమనుకొన్నాడో, పాపం" అంది.

"భార్యవంటే నచ్చకపోతే—పాకశాస్త్ర పరీక్ష ప్యాసయిన భార్యవంటే నచ్చకపోతే అతనికి ఎవరివంట నచ్చును" అన్నాను.

మా అమ్మాయి మా మాటలు విన్నది. తనభర్త ఏమీ అననిదే మేమే అతనికి అన్ని మాటలూ ఆరోపిస్తున్నామని భావించింది. కోపం వచ్చి అన్నదికదా "ఇలాగ పరీక్షలో వండి ఉన్నట్లయితే తప్పకుండా ఫస్టుక్లాసులో ప్యాసై ఉందును. ఎంత బాగా వండినా బాగాలేదంటున్నారు—పోనీ, లెండి" అని కంట తడిపెట్టి ఏడ్చింది. అనలేదు కాని తన భర్త తిండి తినకుండా లేచిపోవడానికి మేమే కారణమని మా అమ్మాయి ఊహించినట్లు స్పష్టము.



3. అర్జున తపశ్చర్య—మహాబలిపుర శిల్పచిత్రము



౪. పేలుచూచుకొనుచున్న కోతులు—మహాబలిపుర శిల్పచిత్రము

# క్రొత్త మురుగులు

శ్రీమతి వంగల వాణీబాయిగారు

(శ్రీమతి స్వర్ణకుమారి దేవిగారు ఆంగ్లమున చెప్పిన కథకు తెనుగు)

బృహదత్తుగారు మంచికుటుంబమునకు చెందినవారు. ఆయన గుమాస్తాగా పనిచేయుచుండెడివారు. తానింత చిన్నపనిలో నున్నవాడై నప్పటికిని, ఆయనకు తన ఏకపుత్రుడైన సీతాపతిని ఇంగ్లాండుకు పంపి చదివించి ప్రఖ్యాతునిగా జేయవలెనను కోరిక మాత్ర ముండెడిది. ఈ ఉద్దేశ్యము కలవాడై నందున ఎట్లో అప్పుచేసి సీతాపతిని ఐ. సి. యస్. (కలెక్టరు పరీక్ష) చదివించుటకు ఇంగ్లాండుకు పంపెను.

అబ్బాయి ఇంగ్లాండు వెళ్లినది మొదలు బృహదత్తుగారు చాల అప్పులు చేయవలసివచ్చెను. దానికి తోడు ఇప్పుడు సీతాపతివద్దనుంచి యింకా ౧,౦౦౦ రూపాయిలు పంపవలెననిన్ని, పంపనిచో వల పరీక్షకు వెళ్లుటకు వీలు లేదనిన్ని ఉత్తరమువచ్చినది. పాపము ఈదీనబ్రాహ్మణునకు ఇప్పటికే అప్పులపాలాయెగదా? ఇప్పుడు మరి వెయ్యిరూపాయలు ఎచ్చటనుంచి తేగలడు? అయిననూ వెళ్లి ఎవరినైన అడిగి చూదామని బృహదత్తుగారు ఇంటింటికి వెళ్లి అడిగెను. అనేకదినము లట్లు తిరిగెను. విసుగెత్తుచున్నది. ఇచ్చువారు లేరు. ఈ విధముగా ఎరిగినవారిని, ఎరగనివారిని బ్రతిమాలి ఎట్టకేలకు ౫౦౦ మాత్రము సంపాదించినాడు. కాని మిగిలిన ౫౦౦ ఎచ్చటనుంచి వచ్చును? ఇంట్లో ఉన్న కాసినినగలు, ఇల్లు ఇదివరకే తాకట్టు పెట్టినాడు.

అప్పటికే సూర్యాస్తమయమాయెను. ఇంటివద్ద భార్య ఆయనకొరకు ఎదురుచూచుచుండెను. పిల్ల కమలకు జ్వరముగానున్నది. ఆ సమయానికి బృహదత్తుగారు ఆ ౫౦౦ చేత పట్టుకొని అలసినవాడై ఇల్లుచేరెను. ఇల్లు చేరినతోడనే భార్య మగనితో "ఏమండీ మన కమలకు జ్వర మింత హెచ్చుగా నున్నదికదా, డాక్టరును పిలిపించరూ?" అన్నది. పాపము, అసలే డబ్బులేక ఏడ్చుచున్న ఆయనను డాక్టరును పిలిచి మరింత ఖర్చుపెట్టమనిన ఎట్లుండును? కొంతతడవాగి, ఆయన "ప్రస్తుతము మనయింట్లో ఉన్న జ్వరమునూత్రలే ఇయ్యావచ్చు. జ్వరమంత హెచ్చుగా లేదు లే" అనెను. ఆమెయు అర్థము చేసుకుని ఊరకున్నది. బృహదత్తుగారు విచారముతో నేమిచేయుటకునూ తోచక ఒక కుర్చీ ముందుకు ఈడ్చుకొని జార్లపడెను.

అప్పుడు భార్య, దగ్గరకువెళ్లి "ఇదిగో ఈనేళ ప్రసాదుదగ్గరనుంచి ఉత్తరము వచ్చినది. ౫౦౦ రూప్యములు పంపినాడు. ఇదిగో" నని తనపమిట కొంగున కట్టబడిన రూపాయిలునూ, జాబునూ తీసి భర్తకందిచ్చెను. ఆజాబులో ఈ క్రిందివిధముగా నుండెను:—

"శ్రీ బావగారికి నమస్కారములు. మీకు పెద్దతనములో బహుశః మతి చెడివుండును. సీతాపతిని, మీకు తినుటకే డబ్బులేని స్థితిలో ఇంగ్లాండుకు ఎందుకు పంపితిరి? నాకు పెండ్లాము, పిల్లలు ఉన్నారు. వాళ్లను పోషించుటకే చాలనిస్థితిలో మీకు ఎంతమట్టుకు పంపగలను? నన్ను మీరు చిన్నప్పటినుంచి పెంచి పెద్దవానిని గాజేసి, నాపొట్ట నేను పోసుకొనగలవానిగా చేసినారను విశ్వాసము గలవాడను కాబట్టి ఈ ౫౦౦ రూపాయిలున్ను పంపుచున్నాను. ఇకముందు నన్ను బాధపెట్టక ఈ ౫౦౦ లతోనే తృప్తిచెంది ఉండగోరెదను.

యిట్లు;
ప్రసాదరావు."

ఈ ప్రసాదరావుగారు బృహదత్తుగారి బావమరది. అయినను చిన్నతనమునుంచీ ఈయనే పెంచి పెద్దవానిని చేసి సాధ్యమయినంతమట్టుకు ఖర్చుపెట్టి చదువుకూడ చెప్పించి పెండ్లిచేసెను. కొద్ది సంవత్సరములనుంచే ప్రసాదరావుగారు సంపాదన మొదలుపెట్టెను. బృహదత్తు

గారు ఇంతవరకు ప్రసాదరావును సాహాయ్యము చేయమని కోరనేలేదు. ఇప్పుడైననూ చాల చిక్కులలో నున్నవాడై కొద్ది సాహాయ్యమును కోరెను. ఇన్నిదినములు పెంచి అతని చదువుకొరకు, పెండ్లికొరకు, ఇంత ఖర్చుపెట్టినందు కిదియా కష్టకాలమందు సాహాయ్యము? ఇట్లా జాబుచదివి క్రిందపడవేసి విచారమునూ, కోపమునూ కూడినవాడై, కొంతతడవాగి భార్యనుచూచి, "ఈ డబ్బును తిర్గి అతనికే పంపివేయుము. నా కవసరము లే"దనెను. భార్యయు కొంచెమాలోచించి, మనకష్టకాలములో ఇటువంటి వన్నియు మనసులో పెట్టుకుని ఈడబ్బును తిర్గి పంపివేసినయెడల మన అబ్బాయిని అంతదూరము పంపినది వ్యర్థముగదా? ఇంతవరకును మనముచేసిన అప్పులన్నియు వృధాకాదా? అని యెన్నో విధముల హితవుచెప్పెను. ఈమె హితవాక్యములన్నియు బృహదత్తుగారు విని ప్రస్తుతపుస్థితినిబట్టి ఆమె చెప్పినదే నిజమని తెలుసుకుని వెంటనే లేచి తానుతెచ్చిన ౫౦౦ లున్ను, బావమరది పంపిన ౫౦౦ న్ను కలిపి ౧,౦౦౦ రూప్యములను కుమారునికి పంపెను.

సీతాపతి ప్యాసు అయినయెడల మనకష్టములన్నియు తీరునుగదా! అని భార్యాభర్తలు భగవంతుని ప్రార్థించుకొనుచు, జ్వరముతో పడిఉన్న కమలను చూచుకొనుచుండిరి.

ఇట్లు కొన్నిదినములు గడచినవి. కమలకు జ్వరమెక్కువయినది. పాపము స్పృహలేక పడిఉన్నది. వైద్యుని పిలిపించుటకు డబ్బులేదు. ఈ స్థితిలో పోస్టుబంట్రోతు ఒకజాబు బృహదత్తుగారికిచ్చి వెడలిపోయెను.

ఆ జాబు సీతాపతి వ్రాసినది. "పరీక్షలో కృతార్థుడనయితిని. ఇంకొక చిన్న పరీక్షవున్నది అది కూడ అయినతోడనే మాతృదేశముకు పయనమయ్యెదను" అని వ్రాసినాడు. ఇక నీ తలిదండ్రుల సంతోషమునకు మేరలేదు. ఇంతఖర్చు పెట్టినందుకు సీతాపతి పైకివచ్చినాడుగదా, మనకష్టము లిక తీరుగదా. అని అనుకొనుచున్నారు. పాపము, తల్లి సంతోషమును పట్టలేక జ్వరముతో పడిఉన్న కమలవద్దకు వెళ్లి "అమ్మాయీ, అన్నయ్య ప్యాసు అయినాడంటే, ఇదిగో ఉత్తరము వచ్చినది" అనెను. కాని ఆ అమ్మాయికి ఇప్పుడేమి తెలుసును? అట్లే రెండు మూడు తడవలు చెప్పగా విని బడి కళ్లుతెరచిచూచెను. పాపము ౧౨ యేండ్ల బాలిక, ఎన్నో దినములుగా జ్వరముతో బాధపడుచూ నిద్రాహారములు లేక మంచము పట్టియున్నది. ఇప్పుడు అన్న ప్యాసుఅయినాడనివిని కళ్లుతెరచి హీనస్వరముతో "ఎప్పుడువచ్చునమ్మా" అని అడిగినది. "త్వరలోనే" అని తల్లి జవాబిచ్చెను. "అమ్మా నేను చూడగలనా?" అని తిర్గి అడిగెను. ఈమాటలు వినినతోడనే తల్లి, కమలకు చేరికగా కూర్చుండి నుదుటిమీద తనచెయ్యివేసి, "భగవంతునికృప ఉంటే తప్పక చూచెదవు తల్లీ!" అనెను.

కాని ఈమారు ఈమె ప్రార్థనము వ్యర్థమాయెను. తల్లితండ్రులు కుమారుడు ప్యాసు అయినాడను శుభవార్తవిన్న కొద్దిదినములకే కమల నిజప్రాణములను విడిచెను.

ఇప్పుడు తల్లితండ్రుల విచారమింతింతయనుటకు వీలులేదు. పాపము వారికి భగవంతుడిచ్చిన బిడ్డలిద్దరు. అందులో అమ్మాయిని దైవము తనయింటికి పిలుచుకు పోయెనుగదా! ఇక వీరి ఆశలన్నియును ఒక్కకుమారుని యందుంచుకు కాలము గడుపవలెను.

చుట్టుప్రక్కల వీరిని తెలిసినవారు ఈమెను ఓదార్చుటకు వస్తే వారితో ఈమె తనకూతురు చనిపోయినప్పటి సంగతులు మాట్లాడిన విచార మెక్కువగునని అవి మాట్లాడక ఎప్పుడునూ కొడుకు సంగతులే మాట్లాడుచుండెడిది. ఈమెను చూచుటకు వచ్చెడివారిలో హేమప్రభ, ఆమెతల్లి కూడ వుండిరి.

హేమప్రభ పండ్రెండేండ్లబాలిక. మిక్కిలి అందమైనది. కమలతో ఆడుకొనుచుండెడిది. పాపము బృహదత్తుగారి భార్యకు హేమప్రభను చూచినప్పుడెల్ల కమల జ్ఞాపకమువచ్చి దుఃఖము మరింత అయ్యెడిది. హేమప్రభకూడ తన స్నేహితురాలిని తలచుకు విచారపడుచుండెడిది. అప్పుడీమె ఆపిల్లను దగ్గరకు తీసుకొని, "ఏడవకమ్మా. యిక నీవే నన్ను సుఖపెట్టగలిగినదాన"వనెడిది.

బృహస్పతిగారి భార్యకు ఈపిల్లను సీతాపతి కిచ్చి పెండ్లిచేయవలెనని యున్నది. ఈ ఉద్దేశ్యముకలదై హేమ ప్రభను ప్రతిదినమును తనయింటికి పిలుచుకవచ్చి ఆపిల్ల తోనే కాలము పుచ్చుచుండెడిది. ఆపిల్లతలితండ్రులు కూడ అంత గొప్పవారు కాకపోయినా, అల్లుడు గొప్పవాడు కావలెనని తలంచుచుండెడివారు.

బృహస్పతిగారు మంత్రము కొంతవరకు ఆలోచించి గాని సంబంధము కుదుర్చరాదని తలచి, భార్య తో నిట్లనెను. "వారి అమ్మాయిని మన సీతాపతికిచ్చి పెండ్లిచేయుటకు నీ వప్పుడే నిశ్చయించితివిగదా; ఒక వేళ మన అబ్బాయికి ఆ పిల్ల నచ్చకున్న దేమో? కావున మనము నాలుగు నెలలు ఆగి వాడు వచ్చేవరకు కాని వాని అభిప్రాయమును తెలుసుకొని నిశ్చయముచేసిన బాగుండునని నా అభిప్రాయము."

కాని ఆమె, ఆయనమాటలు లెక్క సేయక, "మన సీతాపతి నేను చెప్పినమాట కాదనడు" అనెను.

తరువాత హేమప్రభ తరుచుగా వీరి యింటివద్దనే యుండెడిది. ఒకనాడు వీరి పొరుగింటి ఆమె, ఆమెకుమార్తె ఇద్దరునూ వీరిని చూచుటకు వచ్చిరి. ఆమె కూతురికి క్రొత్తరకముగా జుట్టు కట్టబడినది. అది బృహస్పతిగారి భార్య చూచి వచ్చినవారితో "ఏమండీ, మీ అమ్మాయికి మీరు తలయెట్లు ఏవిధముగా దువ్వినారు? నాకును నేర్పుదురా? మా అబ్బాయికోసం కొత్తఫాషనుల జుట్టు వేసెదనని"యనెను. ఆమెయు, "అయ్యో, దానిదేమి భాగ్యము" అని నేర్పి వెళ్లెను. ఈ విధముగా గూడ ఎవరేమి క్రొత్తరకముపనులు చేసిన నవి వారివద్దనే నేర్చుకొని ప్రభకు చేసెడిది. మరి ఐ. సి. యస్.గారి భార్యకు క్రొత్త ఫేషనులు కావద్దా? ఈ విధముగా నాలుగేండ్లు గడచినవి. హేమప్రభకు పదునారేండ్లు వచ్చినవి. తన తోడి పిల్లలందరికి పెండ్లిండ్లు అయినవి. వారంతా ఒకరికొకరు తమ తమ పెండ్లిండ్లను గురించి, వారివారి ప్రేమలను గురించి చెప్పుకొనుచున్నప్పుడు హేమప్రభ ధ్యానాలన్నియు సీతాపతివద్దకు వెళ్లెడివి. సీతాపతి ఇంగ్లాండుకు వెళ్లకమునుపు తాను, అతను, ఆడిన ఆటలు జ్ఞప్తికి వచ్చెడివి. "ఇదివరకంటే ఆడుకొన్నాను గాని, ఇప్పుడు పెద్దదానినైతిని, సిగ్గుపడవద్దా" అనుకొనేది. ఈవిధముగా నందరు సీతాపతికొరకు యెదురుచూచుచున్నారు. ఎట్లయితే నేమి, దినములు గడచినవి.

సీతాపతి అన్ని పరీక్షలు ప్యాసుఅయి మాతృదేశముకు వచ్చుచున్నాడు. ఈదినమే చేరును. బృహదత్తుగారు అబ్బాయిని కలుసుకుని తీసుకువచ్చుటకు ఓడదగ్గరకు వెళ్లినాడు. ఆయనభార్య యింటివద్ద హేమప్రభను శృంగారించుచున్నది. క్రొత్తచీరలు, వస్తువులు కొని పెట్టినది. హేమప్రభ మేడమీద గదిలో నిలువుటద్దమునకు ఎదురుగా నుంచుని సవరించుకొను చున్నది. మధ్యమధ్య ఎవరో వచ్చుచున్నారా, అనునట్లు ఉలికి పడుచుండెడిది. ఇంట్లో ఉన్నవా రంతా క్రిందగేటువద్దనే సీతాపతిని కలుసుకొనుటకు వెళ్లిరి. హేమప్రభ మాత్రము మేడమీద గదికిటికీలోనుంచి చూచుచున్నది. సీతాపతి చేరినాడు. ఇక తల్లితండ్రులసంతోషముకు మేర లేదు. హేమప్రభతల్లితండ్రులు, అన్న కూడ చూచుటకు వచ్చిరి. మేడమీద హేమప్రభ సంతోషమును భయమునూ కూడినదై ఇటునటు చూచుచుండెను.

ఇంతలోనే హేమ అన్న రామారావు వచ్చి హేమతో, "నిన్ను నీఅత్తమామలు పిలుచుచున్నారు. రమ్మ"ని చిరునగవుతో ననెను. హేమకు భయమున వంటినిండ చెమటలు పోసెను. వీరిద్దరును కలసి క్రింద వారంతా కూర్చునియున్న హాలులోనికి వెళ్లిరి. వెంటనే బృహదత్తుగారి భార్య హేమను కనిపెట్టి, కుమారునితో, "అబ్బాయీ, ఈపిల్ల ఎవరో తెలుసునా? నీవు ఇంగ్లాండుకు వెళ్లకపూర్వము నీతోను, మన కమలతోను ఆడుకొనుచుండెడిది" అనెను. కాని సీతాపతి గుర్తించలేదు. "ఎవరో నాకు తెలియ" దనెను. అప్పుడు హేమఅన్న రామారావు సీతాపతితో, "ఏమి, నీకు తెలియదా? హేమప్రభకదా?" అనెను.

అప్పుడు సీతాపతి గుర్తించినవాడై, హేమప్రభతో, "ఓహో, నీవా? ఎంత పెద్దదానవైనావు! కులాసాగా నున్నావా?" అని ఇంగ్లీషుతో ననెను. పాపము

హేమప్రభకు ఇంగ్లీషు రాదు. అతను అడిగినది అర్థమైనప్పటికినీ జవాబు చెప్పుటకు రాక సిగ్గుపడెను.

సీతాపతితో తల్లి, "నీవెప్పుడైన ఇంత చక్కని పిల్లను ఇంగ్లాండులో చూచితివా? నీవు ఈపిల్లనే పెండ్లి చేసుకొనవలెను. పెండ్లిపను లన్నియు నయినవి. ముహూర్తము నిశ్చయించి శుభలేఖలు పంపుట మాత్రమే బాకీ ఉన్నది" అనెను. అంత, కుమారుడు చిరునగవు నవ్వి చిన్నదగ్గు దగ్గెను. సీతాపతికి ఏమి చెప్పుటకునూ తోచుటలేదు. అది బృహదత్తుగారు గ్రహించినవారై, "తొందర లేదులే. కొన్ని దినములు పోయిన పిదప నిదానంమీదనే జరుపవచ్చునులే." అని కుమారునితో ననెను. కాని, భార్య, "అట్లెప్పటికినీ కాదు. ముందు ఆదివారము మంచిరోజు. ఆ దినమే లగ్నము పెట్టిపము" అనెను. సీతాపతి మిక్కిలి భయముతో. "అమ్మా, అయితే—అయితే—అప్పుడే వద్దు" అనెను. హేమ అన్న రామారావు హాస్యముగా సీతాపతితో, "ఏమి అన్నీ 'అయితే'లు పెట్టితివి? నీ కప్పుడే ఒక పెండ్లా మున్నదా?" అనెను. సీతాపతిముఖము తెల్లబారెను. భయము వేయుచున్నది. తల్లి రామారావుని "అట్లనకూడ" దని చీవాట్లు పెట్టి, కొడుకుతో "నేను తాకట్టుకు పెట్టినవస్తువు లన్నియు వచ్చినపిదప కోడలికిచ్చెదను. దానితల్లితండ్రులుకూడ కొన్నినగలు ఇచ్చెదమనుచున్నారు. మనము అన్ని ప్రాతనగలే పెట్టిన బాగుండదని, నేను ఎరుగున్న ఆమెవద్ద మూడువందల రూపాయిలు అప్పుచేసి రెండుజతల బంగారుమురుగులు క్రొత్తరకముగా చేయించితిని. నీకు ఇప్పుడే తీసుకువచ్చి చూపించెద" నని చెప్పి లోనికి వెళ్లెను. ఇంతలో బృహదత్తుగారు కొడుకును చూచి, "అబ్బాయీ, నీకు ఇప్పుడు పెండ్లి చేసికొనుట ఇష్టము లేదా?" అనెను. అందుకు సీతాపతి రెండుతడవలు దగ్గి, అటు నిటు చూచి "లేదు" అనెను. తిరిగి రామారావు హాస్యముగా "ఏ మామా, పెండ్లి చేసుకునే ఇంటికి వచ్చినానా?" అనెను. అందుకు, సీతాపతి "ఊరుకో, మాట్లాడకు" అనెను.

దూరముగా కూర్చునియున్న బృహదత్తుగారికి వినబడలేదు గాని, రామారావు మరల అనెను, "ఏమిటే, ఎప్పుడూ, ఎక్కడా, ఎవరినీ, పెళ్లాడను కాను గదా?" అని బిగ్గరగా అనెను. పాపము బృహదత్తుగారు ఈమాటలు వినేటప్పటికి నోట మాట లేక, స్పృహ తప్పి సోఫామీద పడిపోయినారు. హాలంతయు నిశ్శబ్దముగా నుండెను. ఇంటి లోనికి వెళ్లిన తల్లి సంతోషముతో రెండుజతల మురుగులు తీసుకువచ్చి సీతాపతిచేతిలో పెట్టి, "అబ్బాయీ చూడు, ఎంత బాగున్నవో! హేమప్రభకు నీవే ఇప్పుడే చేతికి తగిలింపుము" అని ఇటు అటు హేమకొరకు చూచెను. కాని హేమప్రభ అక్కడ లేదు. తల్లి ఆశ్చర్యముతో "ఏమిటది? ఎక్కడ?" అనెను. అప్పటికే హేమప్రభ తల్లిదండ్రులు ఈ సంగతంతయు తెలుసుకొని పిల్లను తీసుకుని వెళ్లిపోయిరి. తర్వాత కొన్ని దినములకు హేమప్రభ ఒకజమీందారుగారి కుమారుని పెండ్లి చేసుకొన్నప్పుడు, వీరు క్రొత్తమురుగులు ఆ అమ్మాయికి బహుమాన మొసగిరి. ఇట్లు ఆమురుగులుమాత్ర మెవరికైతే చేయబడినవో వారికే ఇవ్వబడినవి. కాని పాపము, ఈ ముసలితలితండ్రులు కుమారునిమీద నెన్నియో ఆశలు పెట్టుకున్నందుకు అన్నియు బూడిదలో పోసిన పన్నీ రాయెను. ఇంగ్లీషుది హింగువులకు కోడలు కాజాలదుకదా!

---

# బిచ్చమెత్తిన రాచబిడ్డ

పి. సీతాదేవిగారు

[ఖ్వాజా హసన్ నిజామీ ఉర్దూలో వాసిగాంచిన వ్రాతకాడు. భాషలో జిగీ, భావాలలో లోతూ, పాత్రచిత్రణంలో చమత్కృతీ, వస్తుప్రదర్శనంలో వైచిత్ర్యమూ ఇతనిసొత్తు. ౧౮౫౭ లో భారత స్వాతంత్ర్యయుద్ధమైనపిమ్మట మొగలాయి రాజవంశజులకు సంప్రాప్తించిన కష్టకథలను పెక్కింటిని రచించినాడు హసన్ నిజామీ. అందులో ఇదియొకచిన్నకథ కనువాదము.]

నేను బహాదుర్ షాహ్ కుమార్తె కరీషా బేగమునకు గారాబు బిడ్డను. బాల్యమున 'సాహెబ్ ఆలం మిర్జా కమర్ సుల్తాన్ బహాదుర్' అని నన్ను పిలిచేవారు; కాని, ఇప్పుడో — అల్పుడను నగు బిచ్చగాడను. పూర్వంకూడా ప్రసన్నుడనే: ఇప్పుడుకూడ సంతుష్టుడనే. పరివర్తనాని కేమి?

రాజప్రాసాదాలలో జన్మించాను. కనులు విచ్చి చూచినప్పుడు ప్రపంచమంతా చేతులు జోడించికొని శిరమువంచి నిలచియుండడం చూచాను. ఊహ వచ్చినప్పుడు మరియొక దృశ్యం చూచాను. గొప్ప గొప్ప సరదారులు కనుసైగ మాత్రానే ఆజ్ఞాపాలనం చేస్తుండే వారు. అల్లారు ముద్దుగ పెరుగడంకోసమే జన్మించినట్లు భావించాను. ప్రపంచంలో మరియొక విధమైన జీవితం వుంటుందని నే నెరుగనైతిని. కాని, ప్రకృతి తనగారడీలను చూపించింది. ఉత్థానమూ చూచాను; పతనమూ చూచాను. రాజకుటుంబంలో నున్న ఆనందమూ చూచాను; ఇప్పుడిదీ చవిచూచాను. రెండూ అద్వితీయము లైనవే. నాస్థితి ఇంత హీనంగాలేదు మొదట. దయామయు లైన ఆంగ్లేయులు దయతో నెలకు అయిదు రూపాయలు పింఛను ఏర్పాటు చేశారు.

ఇంకేమి? నాలుగునాళ్లు ఆ రాచఠీవియే సాగింది. ఋణం పెరిగిపోవడంవల్ల ఋణదాతలు పింఛను జప్తుచేశారు. ఇక కూలి నాలి చేసి పొట్టపోసికోవాలి; అంతకంటె మరేం చేయడం? కాని, అభిమానం పట్టి పీకుతుండేది. ఇంతలోనే చూపు మందగించింది; అంధుడనైపోయాను. ఏమిచేయడానికి తోచలేదు. తుదకు జోలి చంక నిడికొని బిచ్చమెత్తుకోవడానికి నిశ్చయించాను. రాత్రి అయిన పిమ్మట చీకటిలో బయలుదేరి బిచ్చమెత్తుకొంటాను. 'మిర్జా' నీవు పగటిపూట బిచ్చమున కేలవెళ్ల' వని నన్నెవరైనా అడిగితే 'సిగ్గుచేత' అని చెపుతాను. నాకు ప్రణామాలు అర్పింపబడే నగరవీథులలో బిచ్చానికి పట్టపగలు వెలుతురులో చేయి చాపడానికి మనసొప్పదు. నాకథ ఇంతే — నాదుఃఖాలను ఇంతకంటె ఏమి చెప్పతాను?

* * *

ఇది కల్పితకథ కాదు; ఉపదేశప్రద మగు నిజమైన కథ. కరీషా బేగంయొక్క కుమారుడు ప్రతిరాత్రీ ఢిల్లీనగరవీధులలో బిచ్చం కోసం అరుస్తూ తిరుగుతుంటాడు. కాని, ఎక్కడా ఆగడు; ఎవరినీ సంబోధించి అడుగడు. 'ఓ అల్లా, పిడికెడు గింజలను ఇప్పింపుము' అని అరుపుమాత్రం వినబడుతుంది.

వాడవాడలూ తిరిగి తుదకు తనసంచ జేరికొంటాడు.

గమనిక — కొన్ని సంవత్సరాల క్రిందట ఈ రాకొమారుడు పరలోకగతుడైనాడు.

---

## మధురశ్రుతి

పూడిపెద్ది వెంకటరమణయ్యగారు

తీవియలు రాగాలు
 తీసి కులికెడువేళ
క్రొన్ననలు జావళ్లు
కొసరి పాడెడువేళ
సందెకెంబెదవి వ
సంత మూఁదెడువేళ
ప్రియురాలి మోహంపు
వీణ మ్రోగెడివేళ

సారము నిల్పిన శ్రుతికి
జోహారు! జోహారు!

తల్లియొడి పసినవ్వు
తానమ్ముతిలకించి
క్రీడించు లేఁబాప
కృతికూర్పు గుర్తించి
పడుచుచెక్కిట దూఁకు
వర్ణమ్ము లక్షించి
వలపుచిత్తడి జల్లు
పల్లవిని లెక్కించి

సారము నిల్పిన శ్రుతికి
జోహారు! జోహారు!

ముద్దుముద్దుగ జారి
పూదండ పడువేళ
సిగ్గుసిగ్గుగఁ బడఁతి
చేయి చుట్టినవేళ
కఱకుకఱకుగ పగర
కత్తిదూసినవేళ
కంఠాళిఁ దులకించు
కళలభేద మెఱింగి

సారము నిల్పిన శ్రుతికి
జోహారు! జోహారు!

---




## నరజన్మము

చల్లా భాస్కరంగారు

బ్రహ్మ దేవుడుగారు సృష్టికర్తృత్వాం వచ్చిన తరువాత చాలా జంతువులను సృష్టి చేశాడు. ఒకనాడు మనిషిని, గాడిదను, కుక్కను, కోతిని పుట్టించాడు. ఈ నాలుగు జంతువులు, ఏమిపనిచేస్తూ, ఏలాగు, ఎన్నాళ్లు బ్రతకాలో, బ్రహ్మగారిని కనుక్కో నాలని సమయంకోసం కనిపెట్టుకొని కుక్క తిరుగుతోంది; కోతి పేలుచూసుకుంటోంది; మనిషి అదివరకు పుట్టిన సృష్టిజాలమును చూస్తున్నాడు; గాడిద గుమ్మమునద్ద కని పెట్టుకొని వుంది. సమయం కాగానే గాడిదె బ్రహ్మనద్దకు వెళ్లి దణ్ణం పెట్టింది. 'ఎందుకు వచ్చావు' అని అడిగినాడు బ్రహ్మ. 'అయ్యా! నన్ను పుట్టించారు. నేను ఏంపని చేయాలి? ఏలాగ, ఎంతకాలం, బ్రతకాలి, చెప్పండి?' అన్నది గాడిద. 'నీవు చాకలి మూటలు మోస్తూ గ్రామముల బయళ్ల తిరుగుతూ ౪౦ సంవత్సరములు బ్రతకా' అన్నాడు. 'అయ్యో! నీచమైన పనిచేస్తూ అంతకాలం బ్రతుకలేను; నా ఆయుర్దాయము తగ్గించండి' అన్నది గాడిద. 'అయితే నీకు ౨౦ సంవత్సరములు తగ్గించాను పొ'మ్మన్నాడు. తరువాత కుక్క వెళ్లి అడిగింది. 'నీవు ఒక మనిషిని ఆశ్రయించుకొని వాడి ఇల్లు కాస్తూ వాడు పోసే గంజి త్రాగి ౪౦ యేళ్లు బ్రతుకు' అన్నాడు. 'మహాప్రభూ! యీ వెధవ బ్రతుకుకు అంత విస్తారపు ఆయుర్దాయము భరించలేను' అన్నది. 'గాడిదవలెనే నీకు ౨౦ యేళ్లు తగ్గించాను పొ'మ్మన్నాడు. అంతట కోతి వెళ్లి అడిగితే 'నీవు చెట్లమీద తిరుగుతూ, పళ్లు, కాయలు, ఆకులు తింటూ, దారివెంబడి పోయేవాళ్లను వెక్కిరిస్తూ వాళ్లచేత దెబ్బలు తింటూ ౪౦ యేళ్లు జీవించు' అన్నాడ 'బాబో! నిరాధారమైన ఈ బ్రతుకుకు అం ఆయుర్దాయము వద్ద'ని మొర పెట్టగా ౨ యేళ్లు తగ్గించి 'పో' అన్నాడు. తరువా మనిషి వెళ్లి 'స్వామీ, నా ఆయుర్దాయమ యెంత' అని అడిగాడు. 'నీవు బ్రహ్మచర్యమ చేసి విద్య నేర్చుకొని, తర్వాత పెళ్లాడి ధనమ సంపాదించి, సంతానము కలిగిన తరువాత వాళ్లకు వివాహాదులు చేసి అతిథి అభ్యాగత లను ఆదరించి, అనంతరం వానప్రస్థుడవై భగవద్ధ్యానము చేస్తూ, ఆ పిదప యతివై మోక్షమును పొందుము. నీకు ౪౦ సంవత

రములు ఆయుపు' అని చెప్పాడు. 'ఓ భగవంతుడా! ఇన్నిపనులూ యీ స్వల్పజీవితములో జరుగగలవా? విద్యాప్రాప్తి అయ్యేసరికే చాలా కాల మవుతుంది. తర్వాత పెళ్లాడి సుఖించడానికి కాలం లేదే, శక్తి-నఆశ్రమాలు యేలాగు నిర్వహించగలను?' అనగా 'గాడిద విడచిపెట్టిన ౨౦ యేళ్లు తీసుకో' మన్నాడు. 'గృహస్థాశ్రమానికి సరిపోతాయి; తర్వాత గతి యేమి' అన్నాడు. 'కుక్క తాలూకు ౨౦ యేళ్లు తీసుకో' మన్నాడు. 'అవిమాత్రం చాలుతాయా? గృహస్థాశ్రమం తర్వాత వానప్రస్థానికి చాలుతుంది' అన్నాడు. 'అయితే, కోతివికూడా తీసుకో' అన్నాడు. అంతతో మనిషి తృప్తి పడిపోయేడు అందుచేతనే మనిషి ౪౦ యేళ్లవరకూ కులాసాగా వుంటాడు. పిదప ౬౦ వరకూ సంపాదన చేస్తూ గాడిదవలెనే శ్రమపడతాడు. తర్వాత ౮౦ వరకూ కుక్కలాగు ఇల్లు కనిపెట్టికుంటాడు. అనంతరం ౧౦౦ వరకూ కోతిలాగ పళ్లూడి, బోడిబుర్ర అయి, అందరూ వెక్కిరిస్తూ వుంటే కోతిలాగే చీకాకుపడుతూ వుంటాడు. కథ కంచికీ, మనం ఇంటికీ.

---

## 'జోగివచ్చె, జొన్నలుతినె, వెళ్లిపోయె'

గోపరాజు రాజన్నగారు

### ౧

ఒక ఊళ్లో రైతు ఒక డుండేవాడు. కస్బాపుమేఱ వాడి కొక జొన్నచేను ఉండేది. దానిలో మంచె వేసికొని రోజూ పిట్టలను తఱుముతూ ఉండేవాడు రైతు.

ఒకనాడు సాయంకాలం జోగి ఒకడు రైతుదగ్గరకు వచ్చి, 'అయ్యా, నాకు కడుపుమంట యెక్కువగా ఉంది. తిండానికి యేమైనా యివ్వండి' అని వేడుకున్నాడు. రైతు జాలిపడి 'నీకు కావలసినన్ని జొన్నవెన్నులు కోసికొని తిను' అని సెలవిచ్చాడు. జోగి కడుపునిండా తిని రైతువద్ద సెలవుతీసికొని వెళ్లిపోయాడు. మరునాడు మళ్లీ జోగివచ్చాడు. రైతు ఎప్పటి మోస్తరుగా జోగికి జొన్నవెన్నులు పెట్టి సాగనంపాడు.

### ౨

ఈమోస్తరుగా కొన్ని నెలలు గడిచాయి. రైతూ జోగీ ప్రాణస్నేహితు లయారు. ఒకనాడు సాయంకాలం రైతు, జోగిని దగ్గరకు పిలిచి 'జోగీ నీవు దేశద్రిమ్మరివి. ప్రపంచజ్ఞానం నీకు చాల ఉంది. పిట్టలాగ యెక్కడికి బడితే అక్కడికి వెళ్లగలవు. నాకు పొయ్యికాడ ఆకుమడి తప్ప వేరేసంగతులు తెలియవు. రైతు

కుటుంబంలో పుట్టి, పాడీ పంటా చేస్తున్నా, పామంటే కొంచెం భయం ఉంది. కనుక నాకు పాముమంత్రం నేర్పవలసింది,' అని వినయంతో అడిగాడు. జోగి మంత్రగాడు కాడు. పామంటే జోగి ఆమడ పరుగెడ్తాడు. కాని తన అజ్ఞానాన్ని వెలిబుచ్చడానికి సిగ్గుపడి, 'అలాగేలే, సూర్యగ్రహణం పట్టిన రోజున చెపుతాను,' అని ధైర్యంగా పలికాడు.

సరిగ్గా ఆరోజు మొదలు నెలరోజులకి సూర్యగ్రహణం పట్టింది. తను చెప్పబోయే మంత్రం ఇంకెవ్వరికీ చెప్పకూడదని దృఢంగా చెప్పి, జోగి రైతునుదగ్గరకు పిలిచి మెల్లిగా చెవిలో బీజాక్షరాలు ఉచ్చరించినట్లు యిలా అన్నాడు: 'జోగివచ్చె, జొన్నలుతినె, వెళ్లిపోయె!' 'పాముమంత్రం పఠించాలంటే పొట్లకాయలు తినడం మానుకోవాలి,' అని జోగి రైతుకి ఆజ్ఞాపించాడు.

## 3

పాముమంత్రం చెప్పిన తర్వాత నెలరోజులకి జోగి పరలోకగతుడయ్యాడు. యథాప్రకారంగా రైతు, మంచమీద నిల్చుని పిట్టలను తోలుతూ అప్పుడప్పుడు పాముమంత్రం తనలోతాను పఠించుకుంటూ, ఉప్పొంగిపోతూ ఉండేవాడు. ఇలాగ పఠించుకుంటూ ఉన్న సమయంలో రైతుదృష్టికి గడ్డిపరక కూడా పాముమోస్తరుగా గోచరమయేది. ఒకనాడు రైతు ఉన్న ఊళ్లో ఒకడికి పాముకుట్టింది. రైతువెళ్లి మంత్రంవేసిన చిటికలో వాడు బతికాడు. రైతుకు మరింత హెచ్చరిక కలిగింది. ఎక్కడ ఎవరికి పాముకుట్టినా రైతుకు కబురు వెళ్లేది. రైతువెళ్లడం తడువు, మంత్రం వెయ్యడం తడువు పాముకాటుకి చనిపోయిన వాడల్లా నిద్రనుండి లేచినట్టు లేచి కూర్చునేవాడు. రైతుకీర్తి నలుదిక్కులా వ్యాపించింది. 'ఇలాంటి రైతులు పదిమందుంటే చాలు, మృత్యుదేవత పటాపంచలై పారిపోతుంది, ప్రపంచకంలో పుట్టడమేగాని చావడం ఉండదు' అని వాడుక బయలుదేరింది.

## ౪

రాజుగారి కూతురికి పాముకుట్టింది. రాజుగారి కొలువులో ఉన్న మంత్రవేత్తలందరూ వచ్చారు. కాని లాభం లేకపోయింది. రాజుగారి కూతుర్ని కుట్టగలిగిన పాము సామాన్యమైన పామయి వుండదు అని అనుకున్నారు. దానికాటుకు తిరుగుండదని మంత్రవేత్తలందరూ మూతివిరిచారు. అప్పుడు రాజు దుఃఖసముద్రంలో మునిగిపోగూడదు. కూతురుమీద ప్రేమమట్టుకు పోలేదు. అందువల్ల యింకా బ్రతకడానికి అవకాశం ఉందని అనుకున్నాడు. రాజ్యంలో ఉన్న ఎక్కడెక్కడి పాము మంత్రగాడినీ గాలించి, వెతికి, తక్షణం తనదగ్గరకి తీసుకరావలసిందని మంత్రులకి ఆజ్ఞ యిచ్చాడు.

మంత్రులు రైతుని పిలిపించారు. లేడిమోస్తరుగా చెంగున గెంతు వేసుకుంటూ ఇంటిదగ్గరనుంచీ, 'జోగివచ్చె, జొన్నలుతినె,

వెళ్లిపోమ్మె,' అని ధూమశకటంలాగ యే కరువుపెట్టుకుంటూ రాజుగారి కొలువులో ప్రత్యక్ష మయాడు రైతు. రాజుగారికూతురు అప్పుడే లేచి కూర్చుంది. రైతు కాసంగతి తెలియక, 'ఎవరికి కుట్టింది?' అని ఆతురతతో అడిగి, తనధోరణిని తాను 'జోగివచ్చె, జొన్నలుతినె, వెళ్లిపోమ్మె,' అని బిగ్గఱగా గొంతెత్తి మంత్రంవేస్తున్నాడు. రైతుకి పిచ్చ పట్టిం దనుకొని రాజు, 'జోగియెవరు? జొన్న లు యెవరు?' అని రైతుని అడిగాడు. అదే పాముమంత్రం అని రైతు బదులుచెప్పాడు. 'జోగివచ్చి, జొన్నలుతిని, వెళ్లిపోతే పాము మంత్రం యెలా ఐం' దని రాజు పకపకా నవ్వాడు రైతు 'ఔను' అని తన వెఱ్ఱితనానికి తానే తెల్లపోయాడు.

౫

మర్నాడు పండువంటి ముసలమ్మకి పాము కుట్టింది. రైతు మంత్రంవేసాడు కాని ముసలమ్మ బ్రతుకలేదు. ఆరోజునుంచీ రైతుకి పాముమంత్రం పఠించడం తప్పిపోయింది. రైతు యెప్పటిరైతు ఐనాడు.

---

## పాతపాటలు

నేనూరి గంగాధరంగారు

౧

చేతినిండాగాజు లెవరి కందమ్మ?
చేమెత్తిపోసొట్టు చెలియ కందమ్మ;
అందెలు కడియాలు యెవరి కందమ్మ?
అడుగుదీసడుగెట్టు అక్క కందమ్మ.

౨

పదంపదం పాడుకో
పరమేశు నేలుకో
కొడుకుపుడితే యెత్తుకో
కోడలువస్తే మొత్తుకో.

౩

కాకరపాదుకు కాయలందమ్మ
శ్రీకృష్ణతమ్ముడికి తిరుమణందమ్మ
మల్లెపందిరికి మొల్లలందమ్మ
గౌరిదేవప్పకు గర్భిణందమ్మ
బీరపాదులకు పువ్వులందమ్మ
ఆడాళ్లముక్కులకు పుడకలందమ్మ.

౪

"కోడలా! కోడలా! కొడుకుపెళ్లామా!
పచ్చిపాలమీద మీగడయేది?
వేడిపాలమీది వెన్నలుయేవి?

నా నెముంగరముమీద నురగలు ఏమి?”
“అత్తరోనోయత్త! ఆరత్తి అత్త!
పచ్చిపాలమీద మీగడేలుంటుందా?
వేడిపాలమీద వెన్నెలుంటుందా?
నా నెముంగరముమీద నురగలుంటాయా?
ఇరుగుపొరుగులార! ఓ చెలియలార!
అత్తగారింట్లో చిత్తగించండి
పెత్తనాలంగేస్తె పేదలైపోను.”

౫

అక్కమ్మగారింట్లో పెసరట్టి
పెదబాబుగారింట్లో పెసర్యదూష
పక్షైపోయినా రామచిలుక
ఎంతపనిచేసెను గోరింక.

౬

ఆలింకాలింకోయి
చంద్రబాలింకోయి
గుళ్లో మొంతమందోయి
గుళ్లో పదిమందోయి.

౭

అల్లనేరుడుపండు అల్లునివోళ్లు
అరగంధకస్తూరి కూతురివోళ్లు.

౮

నీలలకడియాలు చిక్కులుకాబోలు
శ్రీరామునిభార్య సీతకాబోలు,
బంగారుకడియాలు బరువుకాబోలు
బలభద్రునిభార్య భామకాబోలు.

౯

ఉప్పుళ్లబియ్యాలు అప్పాలుగావు
చుప్పనాతిఆడవారు చుట్టాలుగారు.

౧౦

పండుగవచ్చింది పర్వతంలాగ
యశోదమ్మతల్లి కెవరుచెప్పలేదు
చుప్పనాతివదినలు చెప్పరుగాబోలు
వెర్రిమాఅన్నలు యెరుగరుకాబోలు.

౧౧

ఒంటిరోకటిపోటు చూడదోపమ్మ
వడిగట్టిమల్లెలు కోయదోపమ్మ.

౧౨

చిక్కుడుకాయలు లెక్కెట్టలేము
సీతగన్నవారి కుర్గోయ్యలేము.

౧౩

అడవిలోసీతమ్మ ఆకలిగొంది
మాదఫలములుపంపు మరిదిలక్ష్మణ్ణ.

౧౪

సుబ్బారాయిడి సష్ఠి
చూసొద్దాము రండి
అమ్మనాకు బువ్వ
అరచేతిలో గవ్వ
బోగందాని కొప్పు
ఇంటివెనక చెప్పు
నీళ్లమీద తెప్ప.




# కదలెడి బొమ్మలు

కో. నరసింహాచారిగారు

(Moving Toys)

కదలెడి బొమ్మలు ఆడుకొనుట కెంతసంతోషముగ నుండునో చేయుటకును అంత సంతోషముగలుగును. ప్రస్తుతము ఒక ఆడెడి గుఱ్ఱమును చేయుటనుగుఱించి చెప్పెదను.

గుఱ్ఱమును అట్టతో చేయవలెను. తలను, తోకను వేర్వేరు అట్టముక్కలతోను, తక్కిన శరీరమును ఒకముక్కతోను చేయవలసియున్నది. (చిత్రము 1.) ABCD అను 10″ పొడవును, 5″ వెడల్పును గల అట్టముక్కను దీసికొని దానిపై EF అను మధ్య గీతను గుర్తించవలెను. (చిత్రము 2.) EF గీత వీపును తెలుపును. పిమ్మట EFCD యందు 1, 4 అను రెండుకాళ్లను, ABEF నందు 2, 3 కాళ్లను ఉండునట్లు పటమున చూపిన రీతిని చిత్రించవలెను. నాలుగు గిట్టలక్రిందను అతికించుటకు ముక్కల (flaps) ను వదలి చిత్రమునకు వెలుపలిభాగమునంతయు కత్తిరించి తీసివేయవలెను. పిమ్మట EF రేఖ వెంబడి అట్టను మడిచిన యెడల 2, 3 కాళ్లు 1, 4 కాళ్లకు సరిగావచ్చును. (చిత్రము 2 నందు 2a 3b.) పిమ్మట E కి సమీపమున తలను అమర్చుటకును, F కు సమీపమున తోకను




అమర్చుటకును h,h, అను రంధ్రములను చేయవలెను. పిమ్మట చిత్రము 3 నందలి విధముగ తలను, చిత్రము 4 నందలి విధముగ

తోకను పేర్వేసి అట్టముక్కలలో కత్తిరించవలెను. కాని, తోకను మాకూడ h అను రంధ్రమును చేయవలెను.

పెమ్మూ కల్పములకు ఒకబండియు, దానికి నాలుగు చక్రములను చేయవలెను. చక్రములకుగాను నాలుగు దారపుబండ్లు (Reels) కావలెను. దారపుబండ్లయొక్క రంధ్రములలో వేసి పేర్వేసి యను సూనుకలను చిత్రము 6 n నందలి విధముగ గిట్టిగ బిగించవలెను. దారపుబండ్లు తిరుగునపుడు పేము సూనుకలుకూడ తిరుగునట్లుండవలెను. ఒక ఇనుపకమ్మిని తీసికొని దానిని చిత్రము 6 m నందలి విధముగ వంచుకొని దానికొనలను కూచిగా వంచుకొని చిత్రము 6 m నందలి రీతిగ పేముసూనుకల కొనలలోనికి (n n వద్ద) గ్రుచ్చి బిగించవలెను. ఇపుడు దారపుబండ్లు తిరుగునపుడు కమ్మియందలి వంపు క్రిందికిని మీదికిని తిరుగును.

తక్కిన రెండుదారపుబండ్లను బండికి వెనుకటి చక్రములుగా . సమర్చుకొనవలెను. వీటికి ఒకే పేముసూనుక ఇరుసుగానుండిన చాలును. కుడి, ఎడమ చక్రముల మధ్య $2\frac{1}{2}$ అంగుళములు దూరముండవలెను.

పెమ్మట తలను ఆడించుటకు ఒకపొడవైనకమ్మిని చిత్రము 6 P యందలి రీతిగ వంచుకొని దానియొక్క క్రిందికొనను m అను కమ్మికి చుట్టి బిగించవలెను. P యొక్క పొడవు గిట్టలనుండి, తలను బిగించుటకై చేయబడిన h అను రంధ్రమునకు గల దూరమునకన్న కొంత ఎక్కువగానుండవలెను. అనుభవముమీద ఈకొలతను నిర్ణయించవచ్చును. తలను తోకను శరీరమునకు అమర్చుటకుగాను q వంటి కమ్ములను రెంటిని వంచుకొనవలెను.

## గుఱ్ఱమునకు బండి

9″ పొడవును 4″ వెడల్పును గల మందియొకఅట్టను దీసికొని దాని అంచుమట్టను, ఒక అంగుళము వెడల్పుప్రదేశమును గుర్తించవలెను (చిత్రము 5). దానియందు మూలలలో






చిత్రమునందలి విధముగ కత్తిరించవలెను. తర్వాత r. s. t. u. అను ప్రదేశములందలి విధముగ ఇరుసును ఉంచుటకు కత్తిరించ

వలెను. తర్వాత ముందుభాగమున ముందటి కాళ్లకు సమీపమున f అను సందును చేయవలెను. పిమ్మట అట్టయొక్క నాలుగు అంచులను క్రిందికి మడిచి మూలలందు అతికించవలెను. అప్పుడది బోరగిలవేసిన తొట్టివలె నుండును. తొట్టిపైన 1, 2, 3, 4 చోటులందు గుఱ్ఱముయొక్క నాలుగుకాళ్లు వచ్చునట్లు పెట్టి అతికించవలెను. పిమ్మట తలను తోకను శరీరమునకు చిత్రము 7 నందలి విధముగ అమర్చి h.h. అను రంధ్రములగుండా q అను కమ్ములనుదూర్చి వాటికొనలను వంచివేయవలెను. పిమ్మట తల, తోకలను x అను గుర్తువద్దచేర్చి వదులుగా కట్టవలెను. తర్వాత చిత్రము 6 నందు జూపబడిన p అను కమ్మియొక్క పైకొనను బండియందలి f అనుసందుగుండా పైకిదీసికొని, దానిని తలయందలి y గుర్తువద్ద బిగించవలెను. బండికి ముందొక దారమునుకట్టి లాగినయెడల, ముందుచక్రములమధ్యనుండు ఇరుసుకమ్మియందలి వంపు క్రిందికిని పైకిని ఆడుటవలన p అను కమ్మియు తలను క్రిందికిని మీదికిని ఆడించును. తల ఆడునపుడు దానికొనకు కట్టబడిన తోకయు ఆడును.




---

# చందమామ

స్థానాపతి రుక్మిణమ్మగారు

నెలకు పదునైదురోజులు నెయ్యమలర
దినదినమ్మును తూరుపుదిక్కునుండి
చిమ్మచీకటితెరలను చీల్చుకొనుచు
పాలవెన్నెలనిగ్గుల బయలువెడలి
వెండిమేఘాల మేడల వీథు లంటి
అమృతవర్షమ్ము కురియుచు నరుగు నిన్ను
"దాయి! దాయి! జాబిలి రావె! రా"యటంచు
చనవుగా కరయుగమును చాచి చాచి
దవ్వులన్ నిల్చి నా చెల్లి నవ్వి పిలువ
"దాగురుణామూర్త" లాడుచు తరుణకిరణ
కరముల నెత్తి ముద్దాడి కౌగిలించి
చుక్కలే తప్ప యితరులు జోడులేక.
మల్లెపూతోట తిరుగాడు మాలిపోలె
చల్లగా నెటు పోదువో చందమామ!

# చదరంగపు మహిమ

(ఒక ఆంగ్ల చిత్రమున కనువాదము)



# హార్మోనియము

"వసంతమూర్తి"

పిల్లలకి సంగీతము చెప్పించాలని అనుకునే ప్రతి తండ్రీ, హార్మోనియమే సంగీతసాధనమని ఎంచుతున్నాడు. "సంగీతము చెప్పించుట" యనుటకు మాఱు "హార్మోనియము చెప్పించుట" యనుపదములే వాడబడుతున్నాయి. కారణము చాలామంది హార్మోనియమునే వాడడమే. దీనికి కారణములు మూడువలెను. ముందు తక్కెడి హార్మోనియముయొక్క చౌకదర. ఇది సబబుకాదు. కళావిషయములో చౌకలక్కై చూచినచో కళ పట్టుపడదు. పిల్లనగ్రోవి లేదా మురళి హార్మోనియముకన్న చౌక. దాని నేల నేర్పించరు? చౌకయని కళాస్వరూపమును జీవరహితశబ్దరాశిగా చేసినైను నీ హార్మోనియమును వాడుట ధర్మము కాదు.

రెండోకారణము: హార్మోనియముమీద రెండు నెలల కృషివల్లనే చాలాపాటలను వాయించడము నేర్వ వచ్చును. ఇది పెండ్లి సంగీతము చెప్పించి "మా అమ్మాయికి సంగీతము వచ్చును. ముప్పయిపాటలు దాకా వాయించేస్తుం" దని చెప్పి వరులకళ్లు మూయ చేసే తాతలకి పనికివచ్చును గాని, "సంగీతము విద్య, సుఖములో దివ్యస్వప్నము. దుఃఖమున కరుణామయుని దయాకిరణము. భావపూరితహృదయము స్వేచ్ఛగా తద్భావమును ప్రవహింపజేయుట కనువైన సమృతపథము. సద్గృహిణికి కొంగుబంగారము, ఐశ్వర్యమువలె క్షణస్థాయికాదు. భక్ష్యమువలె తాత్కాలికానందదాయికాదు. యౌవనమువలె శీఘ్రగామి కాదు." అని యెంచే రసికుల కక్కరకురాదు. కళాభ్యాసమున ప్రావీణ్య సంపాదనము గాని సౌలభ్య మాదర్శము కాకూడదు. అయినచో కళాదర్శము మాఱిపోవును.

మూడు: హార్మోనియము నేర్పేవారు పెక్కురు. వీణ, ఫిడేలు చెప్పేవారు సంఖ్యలో తక్కువే. దీనికి కారణము సంగీతాభ్యాసకులు సామాన్యముగా గాత్రపాట నలవరుచుకొందురనుట. దీనికి శ్రుతి యవసరము. ఏ మెట్టు నొక్కినా "బాగ" మని పలికెడి హార్మోనియము మంచి శ్రుతిసాధనము. తంబుర మీటిన శ్రుతికిను క్కజాతి వేరు. సాధారణము తంబురశ్రుతితో గొంతు కలపలేరు. బండివాడుకూడా హార్మోనియముమీద పాడుచున్నాడు. గాయకులు ముఖ్యముగా హార్మోనియము మీద నేర్చుకుంటారు పాడడము. గురువు గారు ఏపాతిక కృతులనో పాడను చెప్పగానే శిష్యులు గారు "ఇక చాలు" ననుకొని మానివేస్తారు [illegible]. పిల్లలకి పాఠముచెప్పడమే ముఖ్యోద్దేశముగా పెట్టుకున్న ఈగాయకగురువులు నాలుగో పది పాటలను వాయించడము నేర్చుకొని సంతోషపడుతున్నారు. వీరికి సంగీతమంటే నేర్చుకొన్న పాటలను పిల్లలనోళ్లకు పట్టించడమే కాని రాగస్వరూపమును భావయుతముగా కనుగుణముగా మేళవించు నాశక్తి నభివృద్ధిచేయుటయు కాదు. "హార్మనీ" నేర్చుకున్న పిల్లలందరికీ ఇదే లోపము. వారు దైవకృపవల్ల గానము దాక్షిణ్యశక్తి కలిగి పెద్దవారైన తర్వాత కూడా సాధకము చేయవలెనంటే, హార్మనీసన్యాస మవశ్య కర్తవ్యము. కాబట్టి "సానివాళ్లలాగ సంగీత మెందుకండీ" అనే ఛాందసపు అవధానికీ, "పిల్ల హార్మనీ పాడినదే" నని సొమ్ము ఖర్చుచేసే 'నవనాగరికునికి' లేదా ఆరంభమునా అంత్యమందూ లేదు. సంగీత మాంధ్రజాతీయకళ కావలెనంటే ప్రతి హార్మోనియమునుంచి మెట్లహార్మోనియమును బహిష్కరించవలెను.

హార్మోనియముమీద సంగీతకళకు తళుకులైన గమకములు పడవు. గమక మనగా స్వరములకదలిక. ఈకంపము మలేరియాజ్వరబాధితుడైన రోగి వణకుల లాగు కాక ప్రవాహరీతిని హెచ్చి తగ్గుతూండాలి. ఈ 'ప్రవాహరీతి' హార్మోనియముమీద రాదు. ఒక్కొక్క మెట్టు ఒకస్వరమునే పలుకుతుంది. స్వరానికీ స్వరానికీ గల ఎడ మెంత తక్కువైనా మనచేతి కందని

దేశమే. అందువల్ల [illegible] గాయి
గాని సంగీతం [illegible] ముఖ్యముగా
సంపన్న. [illegible] గా నుండి [illegible]
[illegible]. "శ్రీ[illegible] సంపూర్ణ
[illegible]" అని [illegible], "[illegible]
లకుమి[illegible]" [illegible] హార్మోనియము "[illegible],
బో, [illegible]" అని [illegible] ఉంది
కాని "[illegible]" [illegible]. ఇది వీణ
యి [illegible] "[illegible]
[illegible]" [illegible]
[illegible]. "[illegible]..."
అని [illegible]
వీణమీద [illegible]. కాబట్టి హార్మోని
యము [illegible].
హార్మోనియము [illegible] ప్రధానమైన [illegible]
[illegible] (orchestra) గాని ఆలాపన
మునే [illegible] సంగీతము [illegible]
[illegible] సామాన్యముగా
తెలిసే [illegible]. హార్మోని[illegible] చెప్పు
తూన్నప్పు [illegible]
[illegible] ఉంది
హార్మోని[illegible]. [illegible] లేవు. [illegible]
గము [illegible] పడుతుంది. ఈ
సంగతి [illegible] శబ్ద
శాస్త్ర[illegible]. [illegible] పాఠకులకూ
పరిచయము కలిగింప [illegible]. పాఠకులుకూడా
అప్రమత్తులై [illegible] మనవి.

శబ్దము వేపనాలవల్ల పుట్టుతుంది. అంటే శబ్దించేవస్తువు [illegible] అతివేగముగా నూగుటవల్ల శబ్దము పుట్టుతోంది. ఇత్తడిపళ్లెము మీద రెండునీటిచుక్కలు వేసి పళ్లెమును మ్రోగించితే ఈ చుక్కలు పళ్లెము చేసే వేపనాలవల్ల కుంపరలై అటు నిటు చెదిరిపోతాయి; తంబూరాతీగ మీటి దానిపైపే చూస్తే తీగ బద్దిలాగ కనపడుతుంది. ఎందుచేత? వేప నాలు చెయ్యడమువల్లనే. తీగని వ్రేలితో తాకితే శబ్దము ఆగిపోతుంది. అంటే వేపనాలు లేకుంటే శబ్దము లేద న్నమాట. వేర్వేరు వస్తువులు వేర్వేరు విధముగా శబ్దించు తాయి. అలాగే వేర్వేరు జంతువులుకూడాను. మనము మాట్లాడడమువల్ల గాలిలో వేపనాలు పుట్టిస్తున్నాము. అలాగే జంతువులున్ను. కొన్ని కూతలు వినడానికి బాగుం టాయి; కొన్ని బాగుండవు. ఈ శబ్దాలలో కీచుదనము కూడా మారుతూంటుంది. కీచుదనానికి స్థాయి అన్నారు సంగీతభాషలో. తమంతటకి తామే రంజించగల శబ్దాలని స్వరాలన్నారు. జంతువుల కూతలలో మానవులకు నచ్చిన స్వరాలులాగ కనపడినవి ఆ బోతురంకె, మేక అఱుపు, క్రౌంచపక్షి సంగీతము, కోయిలకూత, [illegible] కిలింపు, ఏనుగు ఘీంకారము, నెమలి [illegible]ంకారము అనేవి. వీటికి ఋషభము, గాంధారము, మధ్యమము, పంచమము, ధైవ తము, నిషాదము, షడ్జము అని పేర్లు పెట్టినారు. వీటిని [illegible]వాద్యాలమీద పెక్కించి వీటికిగల తేడా వీటిని శబ్దించే వస్తువు సెకనుకు చేసే వేపనాలను బట్టి యుంటుందని గ్ర హించినాడు. నెమలికూతకు సరిపోవు స్వరములో సగము స్థాయిగల స్వరమును ఋషభగాంధారాది షట్స్వరములను బయలుపరించే ఆధారషడ్జముగా గ్రహించినారు. తరు వాత సాధారషడ్జముకి తక్కిన స్వరాలకి గల వేపనాం తర మెట్లుంటుంది అనే సమస్య బయలుదేరింది. 'స'కు వేపనములు 24 అయితే, తక్కినవాటికి క్రమముగా 27, 30, 32, 36, 40, 45, అయి యుండవలెను. తరువాత వచ్చే 48, ఆధారషడ్జమైన 24కి రెట్టింపు కాబట్టి పైష డ్జ మనబడుతుంది. హార్మోనియములోని ('స') మొదటి మెట్టుకి లోపలనుండే లోహపుస్ప్రింగు 256 వేపనాలు చేస్తుంది. దీనినిబట్టి తక్కిన స్వరాలికి వేపనాలు క్రమ ముగా 576, 640, 683, 768, 864, 960 యై యుండ వలెను. హార్మోనియములో నీస్వరాలు మాత్రమే ఉండి దాని నుపయోగించే ప్రతిగాయకుడు 512 వేపనాలున్న స్వరమునే ఆధారషడ్జము చేసుకున్నట్లయితే స్వరమాల లోని సప్తస్వరాలూ—పై యంకెలవంటి సంబంధ ముండ డమువల్ల—శుద్ధస్వరాలే అవుతాయి. గొంతుకలు అందరు గాయకులకీ ఒకటేస్థాయిగా నుండవు. ఎవరి కేస్వరము సులభముగా పలికితే దాన్ని వారు ఆధారషడ్జముగా

ఎత్తుకుంటారు. ఒక గాయకునికి 512 అనుకూలమైతే మరొకరికి 768 వేపనాలు చేసేస్వరము నాధారముగా తీసుకోడానికి వీలు. ఈ రెండోవారికి ఇంతకు ముందు చెప్పిన స్వరమాలా సంబంధాన్ని బట్టి 768 (స), 864 (రి), 960, 1024, 1152, 1280, 1440 వేపనములను కలిగిన స్వరమాల అవసరమై యుండును. హార్మోనియములో 512 గాని, ఆధారషడ్జ మైతే స్వరమాల 512, 576, 640, 683, 768, 864, 960, అయి యుండవలెను. రెండురకాలవారికీ హార్మోనియము పనికిరావాలంటే ఈ 512, మొదలుగాగల స్వరమాలను రెట్టించవలెను. అప్పుడు మొత్తము పదహారు మెట్లవుతాయి. వాటిగతి 512, 576, 640, 683, 768, 864, 960, 1024, 1152, 1280, 1366, 1536,......అయి యుంటుంది. ఇది మరే మార్పులు లేకుండాగాని 768 నాధారముచేసిన స్వరమాలకికూడా పనికివచ్చినట్లయితే హార్మోనియము ఇద్దరికి పనికివస్తుంది పక్కవాద్యములాగ. కాని 768 తో మొదలు పెట్టిన శుద్ధస్వరమాల 768, 864, 960, 1024, 1152, 1280, 1440, అవవలెను. పైన రెట్టించిన మాలలో ఈశుద్ధ స్వరమాలలోని 1440 లేదు. కాబట్టి ఇద్దరు గాయకులకీ పనికిరావలెనంటే ఈ 1440ని పైస్వరమాలలో చేర్చాలి. సరి, 768 ఆధారషడ్జము చేసుకున్నవానికొరకు 1440, మరొకరికోసము మరియొకటి; ఇలాగ అందరికీ ఉపయోగించవలెనంటే హార్మోనియములో 100 కన్న ఎక్కువ మెట్లుండాలి. ఇలాగు చేయడము మాట అటుంచి అట్టి హార్మోనియము వాయించడ మెంతకష్టమో ఆలోచించండి. కాబట్టి హార్మోనియము ఎలా చేసినా విశుద్ధముగా నుండదు.

అయితే నామాలు హార్మోనియములో నేమి చేస్తున్నారు? అని పాఠకు లడుగుతారు. క్రిందిషడ్జము నుండి పైషడ్జమునకు సమానవేపనాంతరము గల పన్నెండు స్వరాలదారి నెక్కుతున్నారు. దానిలో సరిగా నామాలు హార్మోనియాలలో స్వరమాల ఈక్రిందివిధముగా నుంటుంది.

| | | | | | | | | |
|---|---|---|---|---|---|---|---|---|
| | | రి | | గ | | | మ | |
| | స | 542.4 | రి | 608.9 | గ | మ | 724.1 | స |
| 512, | | 574.7, | | 645.1, | 683 4 | | | 767.2 |

| | |
|---|---|
| ధ | ని |
| 812.8 | 912.3 |

| | | |
|---|---|---|
| ధ | ని | సే |
| 861.0 | 966.5 | 1024 |

వీటిలో క్రింది పంక్తిలోనివి మన సప్తస్వరాలని అనుకోవాలి. 512 తో మొదలుపెట్టేస్వరమాల గతి యిది-

512, 576, 640, 683, 768, 864, 960; మన హార్మోనియములోనో, 512, 574.7, 645.1, 683.4, 767.2, 861, 966.5 ఈస్వరాలూ ఆస్వరాలూ సరిగా లేవు. వాడుకలో స 767.2 కనుక, 768 చేసేస్తారు. అప్పుడు స ప స లు మాత్రం సరియైన వౌతాయి. తక్కినవన్నీ తప్పులే. ఇవి సంగీతజ్ఞాన మున్నవారికి కటువుగా కనబడతాయి. ఇందుకే శాస్త్రప్రకారముగా సంగీతము నభ్యసించేవారు హార్మోనియము నంటరు. సంగీతోపకరణాలలో నిదే అధమము. దీనిని శ్రుతికోసమే ఉపయోగించాలి. పక్కవాద్యముగా పనికిరాదు. కాబట్టి సంగీతాభిమానులు దీనిని బహిష్కరించవలెను.

---

# భౌతికశాస్త్రమందలి నూతనవిషయములు

([illegible]) విస్సా అప్పారావుపంతులుగారు, యం. ఏ.

## ౧

## ద్రవ్యనిర్మాణము

## (STRUCTURE OF MATTER)

ద్రవ్యమునకు [illegible] ఎలెక్ట్రానులు, ప్రోటానులు అని [illegible]! రసాయనశాస్త్రజ్ఞులు ఎలిమెంట్లు [illegible] చెప్పుచున్నారు. ఈ ఎలిమెంట్లు [illegible] రసాయనశాస్త్రానుసారము సమ్మేళనములకు [illegible] కారణములగుచున్నవి. సోడియము అను ఎలిమెంటు, క్లోరీను అను ఎలిమెంటుతో కలసి సులభముగా సమ్మేళనమునొంది ఉప్పును పుట్టించుచున్నది. ఇది రసాయనశాస్త్రమువలన తేలిన సారాంశము. ఎలిమెంటును భాగించగా భాగించగా మరి భాగించుటకు వీలులేనిదియును, రసాయనసమ్మేళనము (Chemical Combination) నందు పాల్గొను నట్టిదియు నగు అణువు గోచరించును. రెండో, మూడో, నాలుగు అణువులు చేరుటవలన మాలిక్యూలు ఏర్పడును. సోడియము-అణువు క్లోరీను-అణువు చేరిన ఉప్పుమాలిక్యూలు అగును. ఈ ఉప్పుమాలిక్యూలులు అనేకములు చేరి ఒకపద్ధతిని అనుసరించి సన్నివేశమంది స్ఫటికాకృతిని బొందును. ఎన్నిమార్లు [illegible] సూక్ష్మదర్శిని (Microscope) తో చూచినను అన్నిటియందును గోచరించు ఆకార మొక్కటియే. జాగ్రత్తతో ప్రయోగములను సలిపినచో ఉప్పును పెద్ద స్ఫటికాకృతిగలదానిగా పెంచి పెద్దదానిని చేయవచ్చును. అప్పుడు సూక్ష్మదర్శిని యవసరము లేకుండగనే రూపము కంటి కగపడగలదు.

అణువు, మాలిక్యూలు, స్ఫటికము అనుమూడు వేరు విషయము లేర్పడినవి. అణువులు ౯౨ మాత్రమే. మాలిక్యూలులు, స్ఫటికములు అనేకములు. వీటి యాకృతులు, నిర్మాణములు బహువిచిత్రములని నేటి భౌతికశాస్త్రజ్ఞులు తేటపరచియున్నారు. ప్రపంచము నందు, స్వాభావికముగా తీర్చినట్లు, అద్భుతముగ ముగ్గులు పెట్టినట్లు, ఏభాగమును చూచినను సరే, ఏకరీతిగ నమూన జేసినట్లుగా, నానావిధస్ఫటికాకృతు లేర్పడియున్న వని తీర్మానింపబడినది. అద్భుతమగు వ్యక్తిగల ఒక శిల్పకారుడు ఈవివిధాకృతులను జేసెనా యని భ్రమ చెందునట్టి వింతలు శాస్త్రమువలన, గణితము వలన, ప్రయోగముల నాధారముచేసికొని, వ్యక్తము చేయబడుచున్నవి. వీటిని క్రమముగా కొద్దికొద్దిగా పరిశీలింతము.

### (౧) అణునిర్మాణము

### (Atomic Structure)

ఒక్కొక్క ఎలిమెంటుకు ఒక్కొక్క అణువు చొప్పున ౯౨ అణువు లున్నవి. ఇంతకు మించి లేవు. ఏ అణువైనను ప్రోటానులతోను, ఎలక్ట్రానులతోను నిర్మింపబడియుండును. కాన ౯౨ వేరువేరుగుణములుగల యణువులు ఈ ఎలక్ట్రాను ప్రోటానులచేతనే ౯౨ విధములుగా నిర్మింపబడియుండవలెనుగదా. ఈవివిధ అణునిర్మాణపద్ధతి ఇటీవల ౧౫ సంవత్సరముల నుండి బాగుగా విమర్శింపబడి ఇదమిత్థమని యేర్పాటుచేయబడినది. ఇందు పాల్గొనినవారిలో ముఖ్యులు, ప్రముఖులు, రూథరుఫోర్డు, బోహరు, సోమర్ ఫెల్డుగారులు. ఈనిర్మాణక్రమమున గుర్తింపవలసిన కొన్నిముఖ్యాంశములు ఏవనగా—



ఇ. రూథర్ ఫర్డు

(౧) సూర్యునిచుట్టు తిరుగు గ్రహమండలము వలె ప్రతి అణువునందును న్యూక్లియసు అనుదానిని చుట్టు

కొని ఎలక్ట్రానులు తిరుగుచుండును. ప్రతియణువున్ను సూర్యకుటుంబమునకు సరిపోల్పదగియున్నది.

(౨) ఉదజని ఎలిమెంట్లలో తేలికయైనది, మొదటిది. అణుమాలికయందు యురేనియము చివరది, ౯౨-వది. బంగారము ౭౯-వది. ఈ ౭౯, ౯౨ వీటికి అణుసంఖ్యలని పేరు,

ప్రతియణువునందును న్యూక్లియసును చుట్టి తిరుగు ఎలక్ట్రానులసంఖ్యయు, అణుసంఖ్యయు సమానములే. హైడ్రజను అణువులో ఒక ఎలక్ట్రానుమాత్రమే తిరుగుచుండును; బంగారు అణువులో ౭౯ ఎలక్ట్రానులు చుట్టుచుండును. ఇట్లే ప్రతి అణువుకును ఏర్పాటు.

(౩) న్యూక్లియసు అనగా ఏమి? హైడ్రజను న్యూక్లియసు, ౨ × ౧ ప్రోటానులు, ౧ ఎలక్ట్రాను చేరిన ముద్ద. బంగారు అణువులోని న్యూక్లియసు ౨ × ౭౯ ప్రోటానులు ౭౯ ఎలక్ట్రానులు చేరిన ముద్ద. ఇట్లే ప్రతి అణువుయొక్క న్యూక్లియసు నిర్మింపబడుచున్నది.

(౪) న్యూక్లియసును చుట్టి తిరుగు ఎలక్ట్రానులు అన్నియును ఒకవలయములోనే తిరుగునా? తిరుగవు. చుట్టితిరుగు ఎలక్ట్రానుల సంఖ్య ౨, ౧౦, ౧౮, ౩౬, ౫౪, ౮౬ లకంటె హెచ్చినప్పుడెల్లను ఒక్కొక్క వలయమే క్రొత్తగా నిర్మింపబడుచుండును. అనగా ౨, ౩, ౪, ౫, ౬, ౭ ఆర్బిట్లు వరుసగా ఏర్పడును. ఇట్లు ఎలక్ట్రానులసంఖ్య పెరిగినకొలది వలయములసంఖ్య పెరుగుచు వచ్చును. అన్నింటికంటె పైనున్న వలయములో ౧ కంటె తక్కువ లేకుండగను, ౮ కంటె ఎక్కువ లేకుండగను ఏర్పాటగును.

## STRUCTURE OF ATOMS (Diagramatic)



1. (Hydrogen Atom) ఉదజని అణువు




2. హీలియము అణువు




3. లిథియము అణువు




8. ప్రాణవాయువు అణువు (Oxygen Atom)




11. సోడియము అణువు

○ ఎలక్ట్రాను.
N. న్యూ. న్యూక్లియసు
† ప్రోటానుకు గుర్తు
- ఎలక్ట్రానుకు గుర్తు



† 2. హీలియము
రెండు ఎలక్ట్రానులు సమానములును, వేరువేరును అగు కోడిగ్రుడ్డు ఆకారముగల వలయములలో సంచరించుచున్నట్లు చూపబడినది.
N న్యూక్లియసు.
ఎలక్ట్రాను.



† 3. లిథియము
లోపల రెండు ఎలక్ట్రానులును హీలియములోవలెనే యుండి మూడవది పెద్దవలయము లో తిరుగుచుండును.
† ఈగుర్తుగల పటములయందు చూపబడినది నూతనశాస్త్రీయముల ననుసరించి.

కేంద్రయణునిర్మాణవిషయము బాగుగ విస్తరించి వ్రాసినగాని తెల్లముగ కానేరదు. విషయవిస్తరభీతిచేత కొద్దిగా [illegible] వివరింపబడినది. [illegible] అణువుల ఆకృతులను ఒక్కొక్కదాని పరిశీలించి చూచినయెడల ఒకదానికంటె ఒకటి [illegible] విస్తరించగా [illegible] అద్భుతములు శిల్పములుగా [illegible] కనబడగలవు. ఇవి యన్నియు [illegible] నిర్మింపబడినవి గాని యంత్రసహాయముచే [illegible] వ్రాసిన శిల్పములు కావు. అంతేగాక [illegible] దృగ్గోచరములు కావని చెప్పవలెను. [illegible] కనిపెట్టుటలో [illegible] ప్రమాణము [illegible].

## (౧) మాలిక్యూలుల - నిర్మాణము (Molecular Structure)

[illegible] ప్రసంగమునందు [illegible] ఆయన [illegible] మాలిక్యూలులు కలవు. [illegible] మాలిక్యూలులో [illegible] ఒకటియు, [illegible] రెండున్ను చేరి యున్నవి. [illegible] $CO_2$ అని ఆమాలిక్యూలును వ్రాసెదరు. C అనగా కార్బను (carbon) కు గుర్తు. O అనునది ఆక్సిజను (oxygen) కు గుర్తు. O రెండు, C ఒకటి చేరి, $CO_2$ [illegible] యొక్క స్వభావ [illegible] క్రింద [illegible] యుండవచ్చు




(i) (ii)

ను. కాని [illegible] పద్ధతి [illegible] మాలిక్యూలునందు మూడు అణువులమాత్రమే కలవు. ౧౧, ౧౨, [illegible] వచ్చును. అట్టి మాలిక్యూలుల నిర్మాణమింకను నిశ్చయింపబడలేదు. ఈనడుమ ఇంకను బాల్యదశయందే యున్నది. ఈ విషయమందలి గణితము మిక్కిలి క్లిష్టము. అందుచేత విషయము త్వరగా వృద్ధి అగుటలేదు. మరియు ను ఈవిషయ నిర్ణయమునకు కావలసిన పరిశోధనమార్గము లు ప్రయోగమూలకములు, ఇదివరలో అంతగా తెగినవి, కానరాలేదు. కాని ౧౯౨౮-వ సంవత్సరమందు సుప్రసిద్ధ భారతీయ భౌతికశాస్త్రజ్ఞుడు సర్ సి. వి. రామను గారు, వారి శిష్యవర్గము ఒక అద్భుతమగు విషయమును కనిపెట్టిరి. దానిపేరు రామను ఇఫెక్టు (The Raman Effect). ఇది గొప్పవిషయము. దేశదేశముల కు మెరుపువలె వ్యాపించినది. మాలిక్యూలుయొక్క నిర్మాణక్రమ పరిశోధనయందు రామను ఇఫెక్టు గొప్ప సాధనముగా ఏర్పడినది. విదేశీయులెందరో దీనిని సాధించుచున్నారు. కొలదికాలములోనే ఈమాలిక్యూలు నిర్మాణవిషయము వృద్ధిపొందగలదను ఆశ పుట్టుచున్నది.

## (3) స్ఫటిక నిర్మాణము (Crystal Structure)

అణువులోని శిల్పచిత్రములను గురించియు, మాలిక్యూలుయొక్క నిర్మాణమును గురించియు వ్రాసియున్నాను. ఈ అణువులు, మాలిక్యూలులు చేరి ద్రవ్యరూపమును పొల్చుచున్నవి. అవి మూలద్రవ్యములు (elements) కానీ, మిశ్రద్రవ్యములు (compounds) కానీ, ఏవైనను సరే, చివరకు అణు సముదాయముచేతనే నిర్మింపబడుచున్న వనుట స్పష్టముగదా. ఈ నిర్మాణములు స్ఫటికాకార ములను దాల్చి యుండును. అణువులు, మాలిక్యూలులు దృగ్గోచరములు కావు. బుద్ధికిమాత్రమే గోచరించును. అట్లుగాక ఈ స్ఫటికాకృతులను దాల్చు ద్రవ్యవిశే షములు కంటికి గోచరించునవి. మిక్కిలి చిన్నవైన నో మైక్రాస్కోపువలన చూడవలెను. ఉప్పు అనుద్రవ్యము క్యూబు (cube) ఆకారము దాల్చియుండును. చిన్నదైన చిన్నక్యూబు, పెద్దముక్క ఐన పెద్దక్యూబుగాను ఉండును. సముద్రపునీటినుండి ఉప్పు పుట్టునప్పుడు ఈ ఆకారములోనే పుట్టును; ఈఆకారములోనే పెరుగును. ఇట్లే ఒక్కొక్కద్రవ్యము ఒక్కొకయాకారమును స్వభావముగా దాల్చుచుండును. అట్టివి కొన్ని యాకృతులు పటమునందు చూపబడినవి.



1. NaCl Crystal Structure-ఉప్పురాయి కట్టడము
○ సోడియము అణువు. ◉ క్లోరీను అణువు.



2. మెగ్నీషియమ్ అను లోహముయొక్క కట్టడము
● మెగ్నీషియము అణువు.



3. Structure of Diamond వజ్రముయొక్క కట్టడము
● (కార్బను) బొగ్గు అణువు.

స్ఫటికాకారము లనేకములు. ఒక్కొక్కటియు ఒక్కొక్క చిత్రమైన పద్ధతి ననుసరించి కట్టబడిన స్వాభావికపు చిత్రములని నిశ్చయింపవచ్చును. వాని ఆకారములయొక్క సొగసు, తీరు, శిల్పము ఒకదానిని మించి ఒకటి యుండును. అట్టివి అద్భుతమును పుట్టించక మానవు. ఎవరు ఇంత విచిత్రముగా ఏర్పాటుచేసిన కట్టడి యను ప్రశ్న తప్పక కలుగగలదు. ఎవరో యద్భుతమును తెలివిగలిగిన రేఖాశాస్త్రజ్ఞుడు కల్పించియుండవలెను అని తప్పక తోచును. ఈ ఆకారములు ఏర్పాటు మిట్టిది యని (structure - కట్టడము) ఈమధ్యనే నిశ్చయింపబడినది. ఎక్సుకిరణము (X-ray) లని ప్రసిద్ధి సాధారణముగా వైద్యములో సహాయపడు కిరణములు గొప్ప జర్మనీ ప్రాంతమున రాంట్జను అను జర్మను భౌతికశాస్త్రజ్ఞుడు కనిపెట్టినాడు. అవి సూర్యకిరణముల వంటి స్వభావముగలవే కాని కంటికి గోచరింపవు. ఏ పదార్థము లోనికైనను కొంతవరకు చొరగలవు. కఱ్ఱ, కాగితము, మాంసము మొదలగు వాటిలో సులభముగా ప్రవేశింపగలవు. ఎముక, సీసము, ఉక్కు వంటి వాటిలో అంతగా ప్రవేశింపలేవు. ఈ ఎక్సు-కిరణములచేత పలు విధము లగుసాధనలు, ప్రయోగములు జరిగినవి. వాటి యాధారముచేత, గణితముచేత, ద్రవ్యభేదములయందు గలుగు స్ఫటికాకృతుల విశేషములు, కట్టడములు ఏర్పాటుచేయబడినవి. ఈ ఏర్పాటునకు మూలమును నిర్మించి చాల పరిశ్రమ సలిపినవారు సర్ విలియము బ్రాగ్ గారున్ను, వారికుమారుడున్ను.



విల్హెల్ము కానార్డ్ రాంజను

## 3
## ద్రవ్యము - శక్తి
## (MATTER-ENERGY)

ద్రవ్యభేదము లెన్నియో స్థూలదృష్టికి కనిపించినను పరిశీలన చేయగా అవి ఎలక్ట్రాన్లు, ప్రోటాను అను విద్యు

న్న్యయనుసరెంటికితో కూర్చబడిన అద్భుతశిల్పము లని పైన చెప్పియుంటిని ఇంకను ద్రవ్యము వలెనే అద్భుతమగు గుణములు కల 'శక్తి' నిగురించి కొంత వివరించెదను. రాయిని రువ్వుటకు శక్తికావలెను; బరువును లాగుటకు శక్తి కావలెను. ఇది సర్వసాధారణముగా మనకందరకును తెలిసిన శక్తినిశేషము. ఇదికాక ఇంకను శక్తి యనేక వికారములను పొల్చవలెను. ఎండుకట్టెలు రెండింటిని రాపాడించి అగ్నిని పుట్టించుట తెలిసినవిషయమే. చెకుముకిరాతితో నిప్పును పుట్టించుటయు అట్టిదే. ఈ అగ్నియొక్క శక్తి వికారము. ఇట్లే వెలుగు, విద్యుత్తు, అయస్కాంత శక్తియును కూడ శక్తి వికారములే; ఒకదానినుండి యింకొకటిని పుట్టించవచ్చును. వీటిలో ఇవి ఏమార్పులను చెందినను మూలశక్తిలో ఏమియును మార్పు రాదు. అనగా ఈ ప్రపంచమందు ఉన్న శక్తి పుంజము ఎప్పుడును హెచ్చదు, తగ్గదు. అందలి భాగముల స్వరూపము మారిన మారవచ్చును గాని అన్నింటియొక్క మొత్తపు పరిమాణము మాత్ర మెన్నడును మారదు. ఇది శాస్త్రసమ్మతము. ప్రయోగనిదర్శితము. ఈ సూత్రమును 'Conservation of Energy' అని అందురు. దీనిని శక్తినిత్యత్వసూత్ర మని వ్రాయుదము. ఇట్లే ప్రపంచమందలి ద్రవ్యసముదాయము కూడ ఎప్పుడును ఎక్కువ తక్కువలు లేకుండ ఏకపరిమాణమునే కలిగియుండును. ఇది ఇంకొక గొప్ప సూత్రము. దీనిని 'Conservation of Matter' అని అందురు. దీనిని ద్రవ్యనిత్యత్వమని వ్రాయుదము. శక్తి గాని ద్రవ్యము గాని ఉన్నదానికంటె వృద్ధి కానేరవు; నశింపవు. ఈ ద్రవ్యము, శక్తి రెండును నిత్యములు.

౧౯-వ శతాబ్దారంభమందు అగ్ని, వేడి, వెలుతురు, విద్యుత్తు ఇవి యన్నియు వేఱువేఱు శక్తులనియు, ఒకదానికిని, మఱియొకదానికిని సంబంధము లేదనియు నభిప్రాయము ప్రబలియుండెను కాని ఆ శతాబ్దాంతము కాబోవునాటికి ఇవియన్నియు ఒక మూలశక్తియొక్క వికారము లనియు, అన్నింటియొక్క మొత్తము ఎప్పుడు ఒకటే యనియును శాస్త్రజ్ఞులు కనిపెట్టగలిగిరి. అట్లే ద్రవ్యమునుగురించికూడ అంతకుపూర్వమే నిర్ధారణచేయబడినది. కాని ద్రవ్యమునకును, శక్తికిని పరస్పరసంబంధము లేదని నిశ్చయింపబడినది. శక్తి ద్రవ్యముగా గాని, ద్రవ్యము శక్తిగా గాని మారుట కెంతమాత్రము వీలు లేదు; అట్లు ఆలోచించుట కేవలము హాస్యాస్పదము అనికూడ నిశ్చయాభిప్రాయము సుమారు ౩౫ సంవత్సరముల క్రిందటివరకు ప్రబలియుండెను.

## Mass - మాసు

ఒకపదార్థము కదలకుండ ఒకచోట ఉన్నప్పుడు దానియందలి వస్తువును ద్రవ్యమని (Matter) చెప్పుదురు. కాని అది కారణాంతరములచేత వేగముగా పోవుచున్నప్పుడు ఈద్రవ్యమందు వేగమువలన ఇంకొక గుణము పుట్టును. దానిని Mass (మాసు) అని అందురు. ౧౯౦౦ సంవత్సరము ప్రాంతమువరకును పదార్థమందలి ద్రవ్యమునకును, దానిమాసునకును భేదము లేదని ఆరెంటను ఒకటి కొకటి పర్యాయము లని, శాస్త్రము చెప్పుచువచ్చెను. కాని అంతకు ౧౧ ఏండ్ల క్రిందటనే జే. జే. థామ్సను గారు రెండింటికి భేద మున్న



సర్ జోసఫ్ థాంప్సను

దని గణితమువలన సూచించిరి. ద్రవ్యమునకు వేగము అధికమగుకొలదిని దానిమాసు ద్రవ్యముకంటె పెరుగుచు

వచ్చును—అని ఆయన సూచనచేసినారు. కాని ఈవిషయము ప్రయోగప్రత్యక్షము కాకుండుటచేత నమ్మికను పుట్టించలేకపోయినది. కాని కొంతకాలము గతించగా అతిసూక్ష్మప్రమాణముగు ఎలక్ట్రాన్ అను ద్రవ్యవిశేషము కనిపెట్టబడినది. దీనినిగురించి యిదివరలో చెప్పియే యుంటిని. ఈ ఎలక్ట్రానులు కేతోడునుండి అతివేగముతో పరంపరలగా వెలువడుననిన్ని, ఈ పరంపరనే కేతోడుకిరణము లందురనిన్ని చెప్పియున్నాను. సాధారణముగా సెకనుకు ౧౦,౦౦౦ మైళ్లు వేగముతో ఎలక్ట్రానులు కేతోడునుండి వెలువడుచుండును. ఇంతవేగము గల ద్రవ్యశకలములు సందర్భమగుటచేత—వాటియొక్క మాసులో మార్పు గలదా లేదా యనుసమస్య ప్రయోగసాధనమైనది. అట్టి ప్రయోగములను సలిపి, వేగమువలన మాసు తప్పక హెచ్చుచున్నది యని నిశ్చయింపబడినది. దీనినిబట్టి, చలనమువలన మాసుకు గలిగిన వృద్ధికి మూల మేమను విషయము చర్చకు వచ్చినది. గమనముగల ద్రవ్యమునకు గమనశక్తి (Energy of motion) గలదుగదా. అది ద్రవ్యముతో చేరుటచేత మాసునకు వృద్ధి కలుగుచున్నదని సిద్ధాంతము చేయబడినది. గమనవేగముగల పదార్థముయొక్క మాసు రెండుభాగములుగా భావింపవచ్చును.

(౧) గమనము లేనప్పుడు గల మాసు; దీనినే ద్రవ్య మందుము (Matter);

(౨) గమనమువలన దాని నాశ్రయించియున్న శక్తి. ఈశక్తికారణముననే గమనమువలన మాసు హెచ్చుచున్నది. ఈ శక్తికిని, ఈ మాసులోని వృద్ధికిని సంబంధమేమియని సందేహము కలుగకమానదు. దీనికి ఐన్‌స్టయిను అను గొప్ప భౌతికశాస్త్రజ్ఞుడు అద్భుతమగు జవాబు గుర్తించెను. ఈ రెండింటికిని అవినాభావము గలదు. గమశక్తియొక్క వికారమే మాసులోనివృద్ధి. అందుచేతనే మాసు గమనవేగమువలన వృద్ధిజెందుచున్నది. ద్రవ్యము (Matter), శక్తి (Energy) రెండుచేరిన దాని పేరే మాసు (Mass) అని గొప్ప వ్యాఖ్యానమును కల్పించెను. వీనినిబట్టి ఏవిధమగుశక్తితో కూడినను ద్రవ్యముయొక్క మాసు వృద్ధికాగలదని యేర్పడినది. చల్లనియినుపగుండుయొక్క మాసు ఎఱ్ఱగా కాలిన ఆగుండుయొక్క మాసుకంటె తక్కువ. ఆభేదము దానియందుగల ఉష్ణశక్తితో సమానము. ఇట్లే వెలిగెడివస్తువుయొక్క మాసునకును, వెలుగని అవస్థవుయొక్క మాసునకును భేదము గలదు. ఇట్లే అన్నియును.

## ద్రవ్యనాశనము-తేజస్సుయొక్క ఉత్పత్తి

## (Annihilation of Matter)

ఐతే సూర్యుడు సర్వదా వేడిని, వెలుతురును వెదజల్లుచున్నాడే! సూర్యునికి ఈ శక్తి ఎచ్చటనుండి వచ్చుచున్నది? అను సందేహము పుట్టుట న్యాయము కదా. పైని చెప్పినదానినిబట్టి మన మూహించవలసినదేమంటే, సూర్యుడు నిరంతరము వెదజల్లు వేడికిని, వెలుతురునకును సమానమగు ద్రవ్యము సూర్యమండలమునుండి హరించుచున్నది యని. అనగా సూర్యమండలములోని ద్రవ్యము క్రమక్రమముగా రూపును మారి వేడిక్రింద కొంత, వెలుతురుక్రింద కొంత వికారములను పొందుచున్నది.



ఆల్బర్టు ఐన్‌స్టయిన్

## రూపలేఖ చిత్రావళి



౫. పేదరికము

ఇట్లు రాగా రాగా సూర్యమండలమునందలి ద్రవ్యము క్రమముగ హరించుచువచ్చును. ఇట్లే ఆకాశమునందు ప్రజ్వలించు అసంఖ్యాకములగు నక్షత్రములందు కూడ ద్రవ్యము నశించి వేడి, వెలుతురు అను శక్తివికారములు పుట్టుచున్నవి. దీనిని బట్టి చూడగా, ద్రవ్యము శక్తియును నని రెండుకావనిన్ని, ఏకవస్తువుయొక్క వికారములేయని నిశ్చయింపబడుచున్నది. ఐతే ద్రవ్యముశక్తివికారములుగా మారునని చెప్పియుంటిరే, శక్తివికారములు ద్రవ్యము క్రింద మార నవసరము లేదా? అట్టి నిదర్శనములు ఉన్నవా? అప్పుడు గదా ద్రవ్యమునకును, శక్తికిని అవినాభావము మిక్కిలి స్పష్టముగా ఏర్పడును—అని ప్రశ్న పుట్టవచ్చును. అట్టిప్రశ్న న్యాయ్యమైనదే. అట్టి యభిప్రాయములుకూడ నిశ్చయమనుటకు కొన్ని కొన్ని కారణములు సంశయాస్పదముగా నున్నవి గాని యింకను స్థిరపరుపబడలేదు. అటెక్కిన్సను, హౌటరుమన్సుగార్లు అట్టివాదము నొకదానిని ౧౯౨౯ సం॥న ఆరంభించిరి. కాని ఇటీవల (౧౯౩౧) ఆవాదమునకు భంగకరములగు అభిప్రాయములు మిల్నె (Prof. Milne) గారు వ్యక్తపరచుటచేత, ఏదియును నిశ్చయించుటకు ఏమియును వీలులేకున్నది. ముందేమి కాగలదో చెప్పుట కష్టము. ఏది ఎట్లయినను, ద్రవ్యము, శక్తి యనునవి రెండు కావనియు, రెండూచేరి ఏకవస్తువుయొక్క వికారములే యనియు నిశ్చయించుటకు సందేహముపడ నవసరము లేదు.

## ౪

## తేజస్సు: తేజఃకిరణములు
## (ENERGY—RADIATION—WAVES)
## ద్రవ్యము: ఎలక్ట్రానులు - ప్రోటానులు
## (Matter—Particles: Electrons, Protons)

ఇదివరలో శక్తి, ద్రవ్యము అను రెండింటిని గురించి చర్చించి రెంటికిని భేదము లేదు అని చూపితిని గదా. శక్తి యనునది తేజోరూపముగ గాని, వేడిరూపముగా గాని వ్యాపించుచుండును గదా. ఈ వ్యాప్తియొక్క క్రమ మేమి? ఈవ్యాప్తికి ఏదైన ఒక ఆధారముండి దానిని ఆశ్రయించుకొని శక్తి వ్యాపించుచున్నదా, లేక ఇంక ఏమార్గమున శక్తి వ్యాపించుచున్నది యని శంకలు చాలకాలమునుండియు కలుగుచు వచ్చినవి. ౧౯ వ శతాబ్దమందు ఈసందేహమునకు నిశ్చయమగు జవాబొకటి నిర్ధారణ చేయబడినది. ఆసిద్ధాంతమునుబట్టి సర్వవ్యాపకమైన 'ఈథరు' అను ఒకటి అన్నిచోట్లను నిండియున్నదనిన్ని, తేజశ్శక్తి, విద్యుచ్ఛక్తి మొదలైన శక్తివికారములు ఈ ఈథరునందు తరంగరూపమును దాల్చి అన్నిదిక్కులకు వ్యాపించుచుండుననిన్ని ఏర్పాటుచేయబడినది. శక్తివికారములగు తేజస్సు మొదలైనవాటితో అనేకప్రయోగములు సల్పబడినవి. ఆప్రయోగములయొక్క ఫలితములు పైన చెప్పిన సిద్ధాంతమును బలపరచుచువచ్చినవి. ఒకఉదాహరణము నిచ్చెదను: సూర్యునిచుట్టును, చంద్రునిచుట్టును గుడి యని పిలువబడు రంగురంగుల వలయాకారమును మనము తరుచు చూచుచుందుము. ఈరంగులవలయము తెల్లని సూర్యతేజస్సునకు మబ్బులోని చిన్నచిన్న నీటిబిందువులు అడ్డము వచ్చుటచే ఏర్పడునని పైసిద్ధాంతమువలన గణితముచేత చూపించవచ్చును. ఇట్టిరంగురంగులవలయములు ఇంకను అనేకసందర్భములయందును కానవచ్చును, వీటిని డైఫ్రాక్షను దృశ్యములు (Diffraction patterns) అని చెప్పుదురు. ఇట్లే నూనెబొట్టు నీటిమీద పడి వ్యాపించినప్పుడు, ఆనీటిపైభాగమున సూర్యరశ్మి పడి ప్రతిఫలించినప్పుడు నీటిపైభాగమున పంచరంగులుగల సన్నని రేకు పరచినట్లు కనుపించును. ఇట్టిదానిని ఇంటర్ఫెరెన్సు దృశ్యము లందురు. అనగా తేజస్సు తేజస్సుతో చేరి ఒక్కొకసారి తేజస్సును, ఒక్కొకసారి చీకటిని పుట్టించుటయే (Interference of light). వెలుతురు వెలుతురును జేరినప్పుడు చీకటి ఎట్లు పుట్టును అనుసందేహము కలుగక మానదు. వెలుతురు తరంగరూపమే యైనచో అట్టిది సందర్భమే; అసందర్భముకాదు. కనుకనే ఇంటరుఫెరెన్సుదృశ్యములు, డైఫ్రాక్షను దృశ్యములు ఈ ఈథరుతరంగవాదమునకు ముఖ్యాధారములు. ఇట్టిదృశ్యములు ప్రపంచమందు

స్వాభావికములై యనేకమున్నవి. వాటికన్నింటికిని ఈ తరంగవాదము ఉపపత్తిని కల్పించగలిగెను.

ఇట్లుండగా రానురాను భౌతికశాస్త్రము వృద్ధి పొందుచు రాగా కొన్ని కొన్ని విషయములకు కారణము (ఉపపత్తి) ఏర్పాటుచేయ బూనినపుడు, ఈతరంగవాద మంతగా అనుకూలించ లేకపోయినది. కొన్ని సందర్భము లందు ప్రత్యక్షమగువిషయమునకును, తరంగవాదమునకును కేవలవైరుద్ధ్య మేర్పడుటయును తటస్థించినది. ఇట్టివిరుద్ధములు రానురాను పెక్కులు కనిపెట్టబడినవి. వాటికి తగినఉపపత్తిని కల్పించుటకు గొప్పప్రయత్నములు జరిగి విజయము నొందినవి. ఈనూతనమార్గమునకు మూల సూత్రమును కల్పించినవారు మేక్సుప్లేంకుగారు (Max Planck). దీనిని ఐన్‌స్టయినును, బోహరుగార్లు (Einstein, Bohr) చాలా వృద్ధిలోనికి తీసికొనివచ్చిరి. ఈనూతనవాదమున తేజస్సు తరంగపరంపర కాదనిన్ని, కణరూపమును దాల్చియున్నదనిన్ని, ఆతేజఃకణము (Quantum) తుపాకిగుండు వలె తేజఃపదార్థము నుండి బయటకు వెలువడుననిన్ని సిద్ధాంతముచేయబడినది. ఇదివరలోని తరంగవాదము (Wave theory) పోయి, నూతనముగ (Quantum theory) తేజఃకణవాద ముత్పత్తిచేయబడినది. కాని తరంగవాదమునకు మూలాధారములగు ఇంటరుఫిరెన్సు, డైఫ్రాక్షను దృశ్యములు తేజఃకణవాదమువలన సాధింపబడకుండెను. దాని వలన కొన్ని సందర్భములందు తేజస్సు తరంగముల వలెను, మరికొన్ని సందర్భములయందు కణములవలెను గోచరించుచున్నదని మనము గ్రహించవలసివచ్చుచున్నది. రెండువాదములును నిజమే. ఏదియును పూర్తిగా, నిజము గాదు అని చెప్పవలసివచ్చుచున్నది. అందుచేత ఈతేజశ్శక్తి తరంగములవలెను, కణములవలెను మనలను భ్రమింపజేయుచున్న మరియొకటి యని నిశ్చయింపబడినది. ఆవింతపదార్థముయొక్క వికారములే ఈతరంగరూపములు, ఈ కణరూపములు అని ప్రస్తుతమందు శాస్త్రవేత్తలు నిశ్చయించుకొనుచున్నారు. దీనినిబట్టి ఏమి తేలినది? శక్తియే (Energy) - వెలుతురు (Radiation). అది ఒకప్పుడు తరంగముల (Waves) వలెను ఇంకొకప్పుడు తేజఃకణముల (Quantum) వలెను మనలను భ్రమింపజేయుచున్నది. ఈ రెండును ఏకవస్తువు యొక్క వికారములు అని పర్యవసానము.

ఇట్లే ద్రవ్యమును ఆధారముచేసికొని మన మాలోచించినయెడల తుట్టతుదకు ఎలక్ట్రానులు, ప్రోటానులు అను సూక్ష్మరూపములు తేలును. ఇదివరలో వీనినిగురించి చెప్పియే యున్నాను. ఇవి ద్రవ్యములు, అతిసూక్ష్మములగుద్రవ్యకణములు (Particles) అనిమనమనుకొనవచ్చును. మూడునాలుగేండ్లక్రిందట ఈద్రవ్యకణములయొక్క గుణములను కనుగొనుటకై యనేకప్రయోగములు జరుపబడినవి. కేథోడుకిరణములగు ఎలక్ట్రానుపరంపరలను కేథోడునుండి అతివేగముగా పంపవచ్చునని ఇదివరలో చెప్పియుంటిని. ఆ ఎలక్ట్రానులు ద్రవ్యకణములే గదా. ఆద్రవ్యకణపరంపరకు అడ్డముగా ఒక అతిపల్చనైన బంగారురేకు నొకదాని నుంచగా, ఆరేకును ఛేదించుకొని ఈ ఎలక్ట్రానులను ద్రవ్యకణములు రెండవప్రక్కకు రాగలవనిన్ని, అట్లు వచ్చినకణములను పరీక్షించగా చంద్రునిచుట్టు కట్టిన గుడివలె నుండు వలయాకారములుగ అవి గుంపుకూడియున్నట్లున్ను ప్రయోగములవలన తేలినది. ఆటంకమును అతిక్రమించి తేజఃకిరణములు రంగురంగులవలయాకారముల నెట్లు పొందుచున్నవో, అట్లే ద్రవ్యకణములగు ఎలక్ట్రానులుకూడ డైఫ్రాక్షను దృశ్యములను కలిగింప గలవని ఈప్రయోగములవలన తేలినది. అనగా, డైఫ్రాక్షనుదృశ్యములు తరంగపరంపరలవలననే కాకుండ ద్రవ్యకణములవలనకూడ కలుగ గలవు అని తేలినది. అనగా తేజస్సే ద్రవ్యము, తరంగమే కణము; తేజఃకణమే తేజస్తరంగము; ద్రవ్యకణమే తేజస్తరంగమును; తేజఃకణమునుగూడ అని వెల్లడి అగుచున్నది. తేజస్సు, ద్రవ్యము, తరంగము, కణము ఇవి యన్నియును అవినాభావములు; ఒక మూలపదార్థము యొక్క లీలలు, వికారములు, విలాసములు అని ముఖ్యముగ తెలిసికొనదగిన విషయము. అనేకత్వమునుండి ద్వైతమునకు చేరి తుదకు ఏకత్వమును చేరుచున్నాము,

ఇట్టిసిద్ధాంతము భౌతికశాస్త్రరీత్యా ఏర్పాటుచేయగలుగుట మిక్కిలి యాశ్చర్యమైన, అద్భుతమైన విశేషము. అన్నిమార్గములకు గమ్యస్థాన మొక్కటియే గదా యని మనము దృఢముగ నమ్ముటకు ఇది గొప్పయుదాహరణగా నెన్నవచ్చును. ఇదియే భౌతికశాస్త్రతత్త్వజ్ఞుల యొక్క అద్వైతవాదము.

---

# నా యాత్ర

భారతుల మార్కండేయశర్మగారు

తరుణమాధవి యాత్రామహాస్తంబు సోఁక
ముగ్ధపల్లవమై గగుర్పొడిచె; మురిసె;
మలయపవనుండు మృదులవంగలతఁ గౌఁగి
లించి కోమలుఁడై విహరించెఁ గడల;
శీతలచ్ఛాయ వీవు నా చిత్ప్రసన్న!
మనమిథశ్లేషమునఁ గాక తనివి సనునె;
చిగురుటాకులు కస్తూరిచెలువమునకుఁ
దవ్వులుకొన్నవి, యవశలైనవియుఁ గూడఁ;
దోఁస నవమల్లికలు సుగంధానిలమున
కోడులుగట్టి స్వీయమటంచు నొలసినవియు;
తరఁగలసముద్రమునఁ గంట దక్క నుదధి
తరఁగలజనించునే! యేల తలఁప నిట్లు?
కుడియడుగుఁ బూని దాఁపటి యడుగు నూని
యీ యనంతయాత్రను సాగుటే భవంబు;
తిరుగుదును, బాడుదును నేడ్తు దేవురింతు
బ్రతుకుదును జీవితమ్ముఁ గావ్య మనిపింతు;
నాయెడందయే మూర్తిఁ గొన్నదియుఁ బోలె
విరహసంయోగముల నాలపింతు నిన్నె;—

---

# ఖాదీపరిశ్రమ - పరిశోధనావశ్యకత : ౪.

మిస్ మెల్లీ సోలింగరు (స్విట్జర్లాండు)

## రాట్నము పరిశోధన

వెనుకటి వ్యాసమందు ఖద్దరునూలుయొక్క గుణములను గురించియు, తత్సంబంధమున మనము గావింపవలసిన పరిశోధనలను గురించియు చెప్పియుంటిమి. మనము వడికిన నూలు నాణ్యముగా నుండవలెనన్న మన ముపయోగించెడి రాట్నముకూడ చక్కని పద్ధతులపై నిర్మింపబడియుండవలెను. రాట్నముకూడ ఒక యంత్రమనియే మనము గమనించవలసియున్నది. మిల్లులు మొదలగు యంత్రములు బహుప్రయాసముపైన స్థిరపరచబడినటువంటి శాస్త్రీయ సంప్రదాయముల ప్రకారము ఎంత జాగ్రత్తగా నిర్మింపబడుచున్నవో, రాట్నములు కూడా చక్కగా పనిచేయవలెనన్న అంతటి శాస్త్రయుక్తముగాను, అంతటి జాగ్రత్తతోను తయారుచేయబడవలెను. ప్రస్తుత మట్లు చేయబడుటలేదని వేరుగ చెప్పనక్కరలేదు. ఖద్దరు పరిశ్రమయొక్క ప్రస్తుతపు దుస్థితికి దేశమందు వాడబడుచుండెడు చెడురాట్నములే చాలవరకు కారణమని నిస్సందేహముగా చెప్పవచ్చును. ఈస్థితిని రూపుమాపవలెనన్న చక్కని రాట్నములను తయారుచేయుట ఎట్లో మనము కనుగొనవలెను. అట్లు కనుగొనుటకు పరిశోధన చేయుటతప్ప వేరొక్క మార్గము లేదు.

## మొదటి ప్రయత్నములు

హిందూదేశమందు వివిధప్రాంతములందు వాడుకలోనున్న రాట్నములను ఒకచోట జమచేసి, వాటియొక్క కొలతలను, ప్రమాణములను, వడుకుటయందు ప్రాశస్త్యమును పరీక్షచేసి, ఏయేరకముల రాట్నములు తృప్తికరములో వాటిప్రకారమే ఇకమీదట రాట్నములను తయారుచేయుటకు కీ. శే. మగన్‌లాల్‌జీగారు పదిపేను సంవత్సరముల క్రిందట ప్రారంభించిరి. అట్లు ప్రారంభించిన నాలుగైదు సంవత్సరముల తరువాత శ్రీ రవిశంకర్ జగజ్జీవన్ ఘూవేరీగారు దేశీయరాట్నములన్నిటికంటె నాలుగైదింతలు నూలును వడకగల రాట్నమును కనిపెట్టువారికి ౫౦౦౦ రూపాయిల బహుమానమునిచ్చెదమని ప్రకటించియుండిరి. బహుమానమును బడయుటకు తగినరాట్నమప్పటిలో వెలువడినప్పటికిని బహుమానప్రకటనమువల్ల రాట్నపరిశోధనకు మిక్కిలి ప్రోత్సాహము కల్గెను. తదుపరి అఖిలభారత చరఖా సంఘమువారు పరిశోధనశాఖ నొకదానిని యేర్పరచి ఆ శాఖను శ్రీ మగన్‌లాల్‌జీగారి ఆధిపత్యముక్రింద సబర్మతీ ఆశ్రమమునందు నెలకొల్పిరి. ఈ శాఖకు అనుబంధముగా ఆశ్రమమునందు చరఖాపాఠశాలను స్థాపించిరి. చరఖాపరిశ్రమను శాస్త్రీయముగా నేర్పరులగు నాచార్యులక్రింద పరించుటకున్ను, పరిశోధనలను గావించుటకున్ను ఇదియే ప్రథమప్రయత్నమని చెప్పవలెను. ఈ పరిశోధనశాఖ స్థాపింపబడిన కొలది సంవత్సరములలోనే మగన్‌లాల్‌జీ స్వర్గస్థులయిరి. వారి నిర్యాణమువలన హిందూదేశమంతకును అందు ముఖ్యముగా ఖాదీ ఉద్యమమునకున్ను తీరని కొరంత వాటిల్లినది. వారిమరణముతో రాట్నపరిశోధన స్తంభించినదనియే చెప్పవచ్చును. అయినను ఈ లోపమును కొంతవరకైనను తీర్చుటకు బంగాళాదేశమందు శ్రీ సతీశబాబుగారును, బార్డోలీయందు శ్రీ లక్ష్మీదాస్ పురుషోత్తముగారును, సబర్మతీయందు మగన్‌లాల్‌జీగారి కొమారులు శ్రీ కేశవభాయిగారును, మహాత్ముని తమ్మునికుమారులు శ్రీ ప్రభుదాస్‌గారును పాటుపడుచున్నారు.

## మగన్‌లాల్‌జీగారి పరిశోధనలు

రాట్నపరిశోధనగూర్చి చెప్పునపుడు మంగళాచరణముగా మగన్‌లాల్‌జీగారిని మనము స్మరించవలెను. ఈ పరిశోధనకు వారువేసిన పునాదులపైననే ఇకమీదట వారిదేశీయులు భవనమును నిర్మింపవలసియున్నది. చర

ఖాదీమయమై వారిచే స్థిరపరచబడిన విషయములను సంగ్రహముగా ఈ క్రింద వివరించుచున్నాను. రాట్నముయొక్క చక్రముయొక్క నడిమి కొలత ౨ అంగుళముల కెంతమాత్రమును తగ్గియుండకూడదు. ఎంత సన్నటి నూలు వడకవలెనన్న చక్రముయొక్క నడిమికొలతకూడ నంత హెచ్చింపవలెను. నెం. ౩౦ వరకు తీయుటకు చక్రము ౨౭ అంగుళములు నడిమికొలతయు, నెం. ౪౦ నూలు తీయుటకు ౩౦ అంగుళములు నడిమికొలతయు ఉండవలెను. చక్రము నేలికగానుండి “మద్దిల” బరువుగలదిగా నుండవలెను. చక్రముయొక్క మొత్తము బరువు ఎంత హెచ్చుగానుండిన రాట్నమును త్రిప్పుట అంతసులువుగానుండి నూలంత సన్నముగానుండును. ఉక్కుతో చేయబడిన కదుళ్లు ప్రశస్తమైనవి. కదురుకు మధ్యనుండు దిండు (లేక గిలక) కూడా ఉక్కుతోనే చేయబడవలెను. కదురు సన్నముగానుండిన నూలుకూడా సన్నముగానుండును. దిండుయొక్క నడిమికొలత కదురుయొక్క సన్నముకంటె ఒకటిన్నర రెట్లుండవలెను. కొబ్బరిపేచు, చేకు, దంతము, కర్ర, వెదురు నరములతో చేయబడిన “చెవుల” కంటె తోలుతో చేయబడిన “చెవులు”, కదురుతో తక్కువ రాపిడిని కలిగి తృప్తికరముగా పనిచేయును. కదురు సరళముగా తిరుగుటకుగాను వారిచే చేయబడిన “ముఖము బల్ల”(Spindle bearing) మిక్కిలి ప్రశస్తమైనవని చెప్పవచ్చును. ఆంధ్రదేశములో ఈ ముఖము బల్లలయొక్క వాడుక బొత్తిగా లేకపోవుట మిక్కిలి విచారకరము. ఈ ముఖము బల్లను రాట్నమున కమర్చి వాడుకచేసితిమేని రాట్నముయొక్క దిగుబడి (Output) నూటికి సుమారు ౨౦ వంతులు వృద్ధియగునని నిశ్చయముగా చెప్పవచ్చును. రాట్నమును తయారుచేయుటనుగూర్చి వారెన్నో నూతనవిషయములను చెప్పియున్నారు. (మగన్‌లాల్ జీగారిచే గుజరాతీయందు రచింపబడి హిందీలోనికి తర్జుమా చేయబడిన “చరఖాశాస్త్ర”ము పుటలు ౧౧–౧౯ చూడవగును).

## నూతన పరిశోధనావశ్యకత

పైన పేర్కొనబడిన సిద్ధాంతముల ననుసరించి సబర్మతీయందు రాట్నములు చేయబడుచున్నవి. దేశీయరాట్నము లన్నిటికంటె సబర్మతీరాట్నములు హెచ్చుగా పనినిచ్చును మిక్కిలి సంతృప్తికరముగా నున్నవి. ఈ రాట్నమును తయారుచేయుటకు పది సంవత్సరముల పరిశోధనకాలమును, కొన్ని వేల రూప్యములును అవసరములయ్యెను. ఇంత వ్యయప్రయాసములకు ఫలితముగా నిర్మింపబడిన యీరాటము ఎంత చక్కగా పనిచేయుచున్నను మన మింతటితో తృప్తి పడుటకు వీలులేదు. పరిశ్రమాభివృద్ధికి పరిశోధనదృష్టి మూలాధారము. మిల్లుపరిశ్రమతో ఖాదీ జయప్రదముగా పోటీని సలుపవలెనన్న నిరంతరము కృషిచేసి ఎప్పటికప్పుడు రాట్ననిర్మాణమునందు మార్పులను చేయుచునే యుండవలెను. మనము వడుకుచుండునపుడు రాట్నమునకుండు లోపములమూలమున ఎన్నో అంతరాయములును, చీకాకులును సంభవించుచుండును. అందులో కొన్ని—అనగా, వేగము తక్కువగలిగి యుండుట, కదురును ఎప్పటికప్పుడు మార్చవలసియుండుట, నూలును కదురకు చుట్టుటకుగాను రాటమును ఆపి తరువాత చుట్టుట, ఇందువలనను, నూలును ఆసుపోయుట, అందుకుగాను కాలము వృథాయగుట ఇత్యాదులు—రాటమునకు సహజముగా నుండులోపములు. పరిశోధనవలన యీలోపములను కొంతవరకైనను తగ్గింపగలము. తక్కిన లోపములు—అనగా, వడిదారము తర్చుజారిపోవుట, తరుచు తెగిపోవుట, కదురు వంగిపోవుట, కదురు గెంతుట, చెవులు ఏకసూత్రమందుండక పోవుట, కదురునకు నూలును చుట్టునపుడు తరుచు తెగుట, కొలది కాలము వడికినంతనే అలసిపోవుట, త్వరగా వడుక లేకపోవుట, ఇత్యాదులను పరిశోధనలచే సంపాదించెడి జ్ఞానమువలన పూర్తిగానైనను, హెచ్చుపాలైనను వారింపగలము. ఇట్టిలోపములను పూర్తిచేయగల్గుదుమేని రాట్నమును మరింత ఉపయోగకారిగాచేసినవారమయ్యెదము. ఈ ఉద్దేశముతో మాచే చేయబడిన కొన్ని ప్రయోగముల నీక్రింద వివరించుచున్నాను.

## కదురుయొక్క తిరుగుడులసంఖ్య

రాట్నము నుపయోగించునపుడు, ఆరాట్నము వలన నూలు త్వరగా వడుకగల్గునని లేనిది (వడుకువారి యొక్క నేర్పరితనమును మినహాయించితిమేని) కదురు యొక్క తిరుగుడుల సంఖ్యపైన (Numbur of revolutions) నాధారపడియుండును. అనగా, ఒకసారి చక్రమును పూర్తిగా త్రిప్పినయెడల ఎన్నిసారులు కదురు తిరుగునో ఆసంఖ్యపై నాధారపడియుండును. ఒకసారి చక్రమును త్రిప్పినయెడల, అనేకసార్లు కదురు తిరుగునేని ఆరాట్నముపైన హెచ్చు త్వరగా నూలును తీయగల్గుదుము. కదురుయొక్క తిరుగుడులసంఖ్య తక్కువగా నుండినయెడల ఆరాట్నము త్వరగా పనిచేయలేదు. కదురుయొక్క తిరుగుడులసంఖ్యను మనము సులభముగా లెక్కకట్టవచ్చును. చక్రముయొక్క నడిమికొలతను కదురునున్న దిండుయొక్క నడిమి కొలతచే భాగించితిమేని తిరుగుడులసంఖ్య లభించును. ఇందు కుదాహరణము: పట్టుశాలీరాట్నముయొక్క చక్రము నడిమికొలత ౨౭ అంగుళములు. పట్టుశాలీలు ఉపయోగించెడి కదురుయొక్క నడిమికొలత ౧/౮ అంగుళము.

∴ కదురు తిరుగుడులసంఖ్య = ౨౭ × ౮ = ౨౧౬.

ఈవిధముగానే వెలమరాట్నమునందు చక్రము నడిమికొలత ౨౬ అంగుళములును, వెలమనూలు వడికెడువా రుపయోగించు కదురుయొక్క నడిమికొలత ౧/౪ అంగుళము. అందుచేత కదురుయొక్క తిరుగుడులసంఖ్య = ౨౬ × ౪ = ౧౦౪.

## తిరుగుడుల సంఖ్యలో నష్టము

మనము నిజముగా కదురుయొక్క తిరుగుడులను లెక్కించితిమేని లెక్కించిన సంఖ్యకును లెక్కకట్టిన సంఖ్యకును చాలా వ్యత్యాసముండును. మాచే లెక్కింపబడిన సంఖ్యల నుదాహరించుచున్నాము. పట్టుశాలీరాట్నమునందు నిజముగా తిరుగుడులసంఖ్య (అనేక ప్రయోగములనుండి సగటున) ౧౬౨ వుండును. అనగా ఉండవలసిన తిరుగుడులకంటె ౫౪ తక్కువగానున్నవి, ఈ వ్యత్యాసము ౫౪ తిరుగుడులును మనకు నష్టము అగుచున్నవన్నమాట. ౨౧౬ తిరుగుడులకు ౫౪ తిరుగుడులు నష్టమగుచున్నప్పుడు ౧౦౦ కి ౨౫ వంతులు నష్టమవుచున్నట్లు తేలుచున్నది. అనగా మనము చక్రమును త్రిప్పుచున్నప్పు డుపయోగింపుచున్న బలమునకు పూర్తిగా మనము ప్రతిఫలమును పొందక ౩ వంతులకే ప్రతిఫలమును పొందుచు, ఒకవంతు నష్టపోవుచున్నారము. ఇది మనము పట్టుశాలీరాట్నపై వడుకునపుడు పొందెడి నష్టము. ఈవిధముగానే మరికొన్ని రకముల రాట్నములను త్రిప్పునపుడు సంభవించుచున్న కదురుయొక్క తిరుగుడుల సంఖ్యలో నష్టమును (మాచే చేయబడిన ప్రయోగములయొక్క ఫలితముల వివరములు) యీక్రింది పట్టికయందు వివరించుచున్నాను.

ఈ పట్టికనుబట్టి ఏరాట్నము ఎంత పొదుపుగా పనిచేయుచున్నదియు తెలియుచున్నది. పట్టుశాలీరాట్నములో అన్నిరాట్నములకంటెను కదురుయొక్క తిరుగుడులసంఖ్య హెచ్చుగా నున్నప్పటికిని, నష్టముకూడా ఈరాట్నమందే హెచ్చుగానున్నది. అందువలననే ఈ రాట్నమును వాడెడువారు మిక్కిలి సన్నకదురునే వాడి సన్ననూలునే వడుకవలెను. మందమైన కదురును వాడుకచేసినయెడల సన్ననూలును తీయుట మిక్కిలి కష్టమవును. చక్రమును హెచ్చుసారులు త్రిప్పననే కాని పురి సరిగాపట్టదు. కదురు తిరుగుడులసంఖ్య ఎంత హెచ్చుగానుండిన నూలును అంత త్వరగా వడుకుటకు వీలుండునుగనుక త్వరితమవు గలితో వడుకగోరువారు సన్నపాటికదుళ్లు నుపయోగించి తక్కువనష్టము కలిగియుండునటువంటి రాట్నములపైననే వడుకవలయును.

## నష్టమునకు కారణములు

ఒక చక్రము వేరొకచక్రమునుగాని, గిలకను లేక దిండునుగాని త్రిప్పునపుడు, రెండవచక్రముయొక్క తిరుగుడుల సంఖ్యలో వచ్చునష్టమునకు "జారుట" లేక "Slippage" అందురు. చక్రములను ఎంత జాగ్రత్తగా అమర్చినను కొద్దిగానైనను ఈ జారుట సంభవింపక మానదు. చక్రములను అశాస్త్రీయముగా నమర్చినయెడల ఈ జారుట విస్తారముగానుండి, తిరుగుడులసంఖ్యలో

పట్టిక ౧.

| రాట్నము పేరు | చక్రము నడిమి కొలత | దింపు నడిమి కొలత | కదురు ఎన్నిసార్లు తిరుగవలసినది | కదురు ఎన్నిసార్లు తిరుగుచున్నది | తిరుగుడుల నష్టము | నష్టము |
|---|---|---|---|---|---|---|
| పట్టుశాలీ | ౨౮ | ౧½ | ౨౨౪ | ౧౭౨ | ౫౨ | ౨౩% |
| వెలమ | ౨౬ | ౧½ | ౧౦౪ | ౮౩ | ౨౧ | ౨౦% |
| బరంపురం | ౨౫ | ౧½ | ౧౦౦ | ౮౨ | ౧౮ | ౧౮% |
| నెల్లూరు | ౨౪ | ౧½ | ౯౬ | ౭౨ | ౨౪ | ౨౫% |
| సబర్మతి - చిన్నది | ౨౪ | ౧½ | ౧౨౦ | ౧౦౧ | ౧౯ | ౧౬% |
| సబర్మతి - పెద్దది | ౨౮ | ౧½ | ౧౪౦ | ౧౧౯ | ౨౧ | ౧౫% |
| "ఆంధ్ర"* | ౩౦ | ౧ | ౧౫౦ | ౧౩౦ | ౨౦ | ౧౩% |

నష్టము హెచ్చుగానుండును. పడుకురాట్నమందు ఈ జారుట యెట్లు సంభవించుచున్నదో నిశ్చయముగా చెప్ప లేకున్నప్పటికిని, చక్రమును త్రిప్పుచున్నప్పుడు, వడిదారము కదురుయొక్క దింపుపైనుండి కదురును త్రిప్పక యే కొంతవరకు జారిపోవుచున్న ట్లూహింపవచ్చును. చక్రమును మనము త్రిప్పుచున్నప్పుడు, వడిదారము కొద్ది కొద్దిగా చక్రముమీదనుండి జారుచుండుటవలనకూడా తటస్థించుననికూడా ఊహింపవచ్చును. (Creeping over) వడిదారముచేత ఒకచక్రము మరి ఒక చిన్నచక్రమును త్రిప్పునపుడు ఈ జారుట ఎల్లప్పుడును సంభవించును ("Loss due to transmission").

ఈ జారుటయనునది ఎటువంటి రాట్నముల యందు ఏయేపరిస్థితులలో హెచ్చుగానుండునో, యేయే పరిస్థితులయందు తక్కువగానుండునో మనము కనుగొనవలసియున్నది. ఇది మనము తెలుసుకొనినయెడల, రాట్నములనిర్మాణమునందు తగినమార్పులను గావించుకొని ఈజారుటవలన సంభవించెడు నష్టమును మనము చాల వరకు నివారించుకొనవచ్చును. ఈ జారుటవలన కదురు యొక్క తిరుగుడులో కలిగెడునష్టము యేయే హంశములపై నాధారపడునదియు ఈక్రిందఖ్యాతముగా వివరించుచున్నాను

## చక్రముకొలత-రాట్నముపొడవు

రాట్ననిర్మాణములో, చక్రముయొక్క నడిమి కొలతకును, రాట్నముయొక్క పొడవునకును గల సంబంధము చాలా ముఖ్యమైనవిషయము. ప్రస్తుత మీ దేశమందలి వడ్రంగులు ఈవిషయమును పూర్తిగా నిర్లక్ష్యమును చేయుచున్నారు. రాట్నములోని చక్రమునకును, కదురునకును వడిదారమును బిగించి సంబంధమును కలుగజేయునపుడు, కదురువద్ద వడిదారము ఒకకోణమును చేయుచున్నది.

(ప్రక్క పటమును చూడుడు.)

* ఈరాట్నములనే మా పరిశోధనాప్రయోగములందు వాడుచున్నాము. ప్రయోగములకు వీలుగానుండుటకు చక్రముల నడిమికొలత, రాటముపొడుగు హెచ్చుగాపెట్టించి, బాల్ బేరింగ్సుతో మాకోరికపైని శ్రీ దంతులూరి లక్ష్మీనరసింహరాజు బి. యే; బి. ఎస్. సి. (లండన్) వారిచే ఆంధ్ర ఇంజినీరింగు కంపెనీ లిమిటెడ్ నందు తయారుచేయబడినవి.



పటము ౧

చక్రమునకును కదురునకును దూరము హెచ్చించినకొలదిని యీకోణము చిన్నదవుననియు, తగ్గించిన కొలదిని యీకోణము పెద్దదవుననియు మనకు పటము నుండి తెలియగలదు. మరియు కదురును చక్రమునుండి కొంతదూరమున అమర్చిన తరువాత, పెద్దచక్రమును అమర్చినయెడల యీకోణము పెద్దదవుననియు, చిన్న చక్రము నమర్చినయెడల యీకోణము చిన్నదవుననియు కూడా పటమునుండి బోధపడును. వడిదారము కదురుపై నుండి బిగించుటవలననే యీకోణము ఏర్పడుచున్నది. కాబట్టి, యీకోణము ఎంతపెద్దదయినయెడల అంత తేలికగా కదురుయొక్కదిండును పట్టియుండునని. యీ కోణము ఎంత చిన్నదైనయెడల, వడిదారము దిండు నంత హెచ్చుగా పట్టియుండును. (వడిదారము బిగువుగా కట్టియుండుటనుగూర్చిగాని, వదులుగా కట్టియుండుట గూర్చిగాని మన కిచ్చట ప్రసక్తిలేదు. దిండుయొక్క ఉపరిభాగములో ఎంతభాగమును వడిదారము తాకుచున్నదో అదియే మనకు కావలసినవిషయము. యీ కోణము పెద్దదిగానున్నయెడల వడిదారము తక్కువ ఉపరిభాగమునే తాకును. కోణము చిన్నదిగానున్న యెడల, వడిదారము కదురుయొక్క ఎక్కువ ఉపరి భాగమును తాకును.) ఈకోణము తక్కువగా నున్నపుడు, కదురును వడిదారము బాగుగా తాకుచుండుట వలన, చక్రమును త్రిప్పునపుడు కదురుపై వడిదారము జారక నడచుచుండును. అందుచే కదురుయొక్క తిరుగుడులలో నష్టము తక్కువగా నుండును. ఇట్లుకాక, కోణము పెద్దదిగానున్నపుడు కదురును వడిదారము బాగుగా తాకకపోవుటవలన చక్రము తిరుగునపుడు వడిదారము కదురుపైనుండి జారిపోవుచు నడచుచుండును. అందువలన కదురుయొక్క తిరుగుడులలో నష్టము హెచ్చుగా నుండును. చక్రముయొక్క నడిమికొలతకంటె రాట్నముయొక్క పొడుగు (సరిగా చెప్పవలసినయెడల, చక్రముయొక్క మధ్యబిందువునకును, కదురుదిండుయొక్క మధ్యబిందువునకును ఉండుదూరము) ఎన్నిరెట్లు హెచ్చుగానుండిన కోణము అంత చిన్నదిగానుండి కదురుయొక్క తిరుగుడుల సంఖ్యలో అంతతక్కువ నష్టము సంభవించును. దీనినిబట్టి రాట్నవిర్మాణమందు ఈ కొలతవిషయమై గమనించుట ఎంతముఖ్యమో ఇపుడు తెలియుచున్నది. ఈక్రింది పట్టికయందు మాచే పరిశోధింపబడిన రాట్నములందు యీకోణములయొక్క విలువయును, చక్రముయొక్క నడిమికొలతకును, రాట్నము పొడవునకును గల సంబంధమును పొందుపరచియున్నాను.

పట్టిక ౨.

| రాట్నము పేరు | చక్రము నడిమికొలత (అంగుళములు) | రాట్నము పొడవు (అంగుళములు) | చక్రము నడిమికొలత – రాట్నము పొడవు నిష్పత్తి | కోణము విలువ డిగ్రీలు |
|---|---|---|---|---|
| పట్టుశాలీ | ౨౮ | ౩౩ | ౧.౨ | ౪౨° |
| వెలమ | ౨౬ | ౩౩ | ౧.౩ | ౩౯° |
| బరంపురం | ౨౫ | ౩౬ | ౧.౪ | ౩౭° |
| నెల్లూరు | ౨౪ | ౨౬ | ౧.౧ | ౪౩° |
| సబర్మతీ | ౨౮ | ౩౯ | ౧.౪ | ౩౭° |
| "ఆంధ్ర" | ౩౦ | ౪౫ | ౧.౫ | ౩౫° |

రాట్నమునకు సంబంధించిన మిగతవిషయము లన్నియు సమానముగా నుండునపుడు హెచ్చుకోణము గలిగిన రాట్నమునందుకంటె తక్కువకోణము గలిగిన రాట్నమునందు జారుట (=కదురుయొక్క తిరుగుడుల సంఖ్యయందు నష్టము) తక్కువయని స్థిరపరచుటకు మాచేత మాపరిశోధనరాట్నముపైచేసిన ప్రయోగముల యొక్క ఫలితములను 3 వ పట్టికయందు చేర్చియున్నాను. రాట్నముయొక్క చక్రము నడిమికొలత అన్ని

ప్రయోగములందును ౨౯ అంగుళములే ఉంచబడెను. చక్రమునుండి కదురునకుండెడి దూరముమాత్రము ఒకసారి ౪౨ అంగుళములును—అనగా కోణము విలువ సుమారు ౩౫°; మరియొకసారి ౭౨ అంగుళములును—కోణమువిలువ సుమారు ౪౨°—మార్చినపుడు తిరుగుడులలోని నష్టము ప్రతిప్రయోగమునందును హెచ్చువుచునే యున్నట్లు తెలియుచున్నది. పాఠకులిచ్చట గమనించవలసిన దేమనగా: ౧. చక్రముయొక్క నడిమి కొలతకంటె రాటముయొక్క పొడవును ఒకటిన్నరింతలుంచితిమేని, తిరుగుడుల సంఖ్యయందు నష్టము తక్కువై, మనకెక్కుడు లాభముగానుండును. ౨. ప్రస్తుతము వాడుకలోనుండు రాటములన్నియు పొడుగు తక్కువగానే యున్నవి. ఈపొడుగును హెచ్చించుటకు తగిన సాధనమును చేసినయెడల రాటముపై చురుకుగా వడుకుటకు చాలా వీలుగానుండును.

### వడిదారపు దళము

తిరుగుడులసంఖ్యలో నష్టము వడిదారపుదళముపై కూడా చాలావరకాధారపడియున్నది. ఈవిషయమై కూడా తంతుకారు లేమియు శ్రద్ధతీసుకొనుటలేదు. ఇంత స్వల్పవిషయము వడుకుపై ఎట్టి ఫలితమును కలుగజేయునని మన మనుకొనుట సహజమే అయినను, ౩ వ పట్టికయందలి ఫలితములవలన యీవిషయ మెంతముఖ్యమైనదియు తెలియుచున్నది.

పట్టిక 3.

(లెక్కప్రకారముండవలసిన కదురు తిరుగుడులసంఖ్య = ౧౫౭)

| వడిదారపు | వడకు | కోణము ౩౫° | | కోణము ౪౨° | |
|---|---|---|---|---|---|
| దళము | వేగము | వడిదారపు ఒత్తిడి | తిరుగుడుల సంఖ్య | వడిదారపు ఒత్తిడి | తిరుగుడుల సంఖ్య |
| | | గ్రాములు (Grams) | | | |
| ౧/౩౨ అంగుళము | మెల్లగా<br>మామూలు<br>త్వరగా | ౧౧౫<br>౧౧౫<br>౧౧౫ | ౧౪౧<br>నష్టము = ౧౦% | ౯౫<br>౮౫<br>౧౧౫ | ౧౩౨<br>నష్టము = ౧౬% |
| ౩/౬౪ అంగుళము | మెల్లగా<br>మామూలు<br>త్వరగా | ౧౩౦<br>౧౨౫<br>౧౩౦ | ౧౩౪<br>నష్టము. ౧౩-౩% | ౧౧౦<br>౧౧౦<br>౮౦ | ౧౨౯<br>నష్టము = ౧౯% |
| ౧/౧౬ అంగుళము | మెల్లగా<br>మామూలు<br>త్వరగా | ౨౦౦<br>౧౯౫<br>౧౪౫ | ౧౧౬<br>నష్టము = ౨౬% | ౧౯౦<br>౧౫౦<br>౧౫౦ | ౧౧౫<br>నష్టము = ౨౭% |

ఎటువంటి రాట్నమందైనను వడిదారముయొక్క దళము హెచ్చైన కొలదీ తిరుగుడులలో నష్టము హెచ్చగుచున్నట్లు ఈ ప్రయోగములవలన తేలుచున్నది. సామాన్యముగా వాడుకలో నున్నటువంటి వడిదారముల దళము సుమారు 3/౮ అంగుళములకంటెను కొద్దిగా సన్నముగా నుండును. ఇంతకంటెను సన్నటిదారమును వాడుటయే లాభకరము.

## వడిదారపు ఒత్తిడి (Tension)

పై పట్టికయం దుదాహరించిన ప్రయోగములందు వడిదారపు ఒత్తిడిని నిర్ధారణచేయుటకు ప్రయత్నముచేయబడెను. రాట్నమునకును, కదురుకును వడిదారమును పూనిన తరువాత చక్రమును త్రిప్పుటకు పూర్వము కదురు చివరకు ఒకదారము ముడివేయబడెను. యీ దారముయొక్క రెండవచివర ఒక "స్ప్రింగుత్రాసు" (Spring balance) యొక్క కొక్కెమునకు ముడివేయబడెను. ఇట్టి స్థితిలో రాట్నము త్రిప్పునపుడు మొదట కొంతవరకుతిరిగి, దారమునూలముగా త్రాసుకు తగిలించబడి యుండుటచేత, కదురు తిరుగక ఆగిపోవును. ఆగిపోయిన కదురుమీదనుండి మాత్రము వడిదారము తిరుగుచుండుటచేత, స్ప్రింగుత్రాసుమాత్రము కొంతభారమును చూపుచుండును. ఈ ఒత్తిడికిని,రాట్న వేగమునకును తిరుగుడులలోని నష్టమునకుగాని పై పట్టిక సరిగా చూపుట లేదు. ఈ ఒత్తిడియొక్క లక్షణములను తేటపరచుటకు మరికొన్ని ప్రయోగములను గావించుట యవసరమగును.

## చరఖాయొక్క వేగము

కదురుయొక్క తిరుగుడుల సంఖ్యలో నష్టము మనమెంత వేగముగా వడికెదమో—అనగా ఎంతత్వరగా చక్రమును త్రిప్పెదమో—దానిపైకూడా కొంతవర కాధారపడియుండును. చరఖాయొక్క వేగము హెచ్చగుచున్న కొలది జారుటకూడా హెచ్చుఅయి తిరుగుడుల నష్టముకూడా హెచ్చగును. వ్యాసవిస్తరభీతిచే యీసందర్భమున చేయబడిన ప్రయోగములయొక్క ఫలితములను ఇచ్చుట వివరించుటలేదు.

## రాట్నము త్రిప్పుటకు వలయుశక్తి

రాట్నము సరళముగా తిరుగుచున్నదియు లేనిదియు తెలుసుకొనుటకును, రాట్నముయొక్క ఇరుసును, కదురును వాటివాటియొక్క "బేరింగుల" పై నుండునట్లుగా "తిరుగుచున్నదియు లేనిదియు తెలిసికొనుటకును, ఒక "బేరింగు" కంటె మరియొక "బేరింగు" మంచిదో కాదో నిర్ణయించుటకును, రాట్నమును త్రిప్పుటకు మన మెంత శక్తిని (driving power) వినియోగించవలసి యుండును నది ప్రయోగములవలన తెలుసుకొనగలము. అంతేకాక, వడుకుటకు నుపయోగింపవలసిన శక్తికొరకు మనము మన స్వంత భుజబలముపైననే ఆధారపడవలసియున్నదికాని, మిల్లుయంత్రములలోవలె ఆవిరిశక్తిపైనగాని, విద్యుచ్ఛక్తిపైనగాని ఆధారపడుటకు వీలులేదు. మనుష్యుడు తన భుజబలములందుండు యావచ్ఛక్తిని వినియోగించినను, ఆశక్తి ఒక గుఱ్ఱముశక్తిలో పదవవంతుకు మించదు (1/10 H. P). అది అయినను స్వల్పకాలమునకే-అనగా కొన్ని నిమిషములకే-వినియోగించగలము. అటుతరువాత నిస్పృహచెందును. (శ్రీ ఆర్ గ్రెగ్గుగారి "Khadi Economics" చూడుడు.) అందువలన మన చేతులయందు కొలదిశక్తిని ఎంతతక్కువ ఖర్చుచేసి ఎంతత్వరితగతితో ఎన్ని హెచ్చుగంటలకాలము రాట్నమును త్రిప్పగలుగుదుమేని అంత మనకు లాభము.

రాట్నముయొక్క ఇరుసు, కదురు ఎంత సరళముగాతిరిగినయెడల వడుకువారి కంత సునాయాసముగా నుండి, అంత తక్కువశక్తితో త్రిప్పుటకు వీలుండును. అందుచే త్వరలో అలసిపోక, హెచ్చు త్వరితగతితో చాలాకాలము వడుకుటకు వీలుండును. ఇరుసు కదురు సరిగా అమర్చబడక సరళముగా తిరుగనియెడల, వివిధభాగములయందు రాపిడి సంభవించి, రాట్నమును త్రిప్పుటకు విస్తారముశక్తిని వినియోగించ వలసియుండును. అందుచే త్వరగా అలసట వచ్చి, విశేషకాలము గాని, త్వరగా కాని వడుకుటకు వీలుండదు.

ఈవిషయ మందరకును అనుభవమయ్యెడు,చాలమంది దీనిని పాటింపరు. ఇందుకొక ఉదాహరణము; రాటము

సుళువుగా తిరుగుచుండినయెడల, చాలామందికి రాట్నము వదలుటకు ఇష్టముండదు. అందుచే వారు కదురుపై రెండున్నర మూడు తులములనూలున్నను, కండె పెద్దదగుచున్నను సరకుచేయక వడుకుచునే యుందురు. చివరకు కదురు బరువుచే మరితిరగక ఎప్పుడు ఆగిపోవునో అప్పుడు వడుకుటకు మానివేయుదురు. కదురుయొక్క బరువు హెచ్చగుచున్నప్పుడు, మనము వినియోగించుశక్తికూడా అధికమగుచునే యుండును. అందువలన ఏనిమిషమున కానిమిషము మనము వినియోగించు శక్తిని అధికము చేయుచునే యుండవలెను. అందుకు ఫలితముగా నూలువడుకుటయొక్క దిసబడి తగ్గిపోవుచుండును.

రాట్నమును త్రిప్పుట కెంతశక్తిని వినియోగించవలసినదియు, కదురుబరువు వృద్ధిఅగుచున్నకొలది ఎంత అధికశక్తిని వినియోగించవలసి యుండునదియు యీ క్రింది పట్టికయందు చేర్చిన ప్రయోగపు ఫలితములవలన తెలియవచ్చును.

పట్టిక ౪

"ఆంధ్ర" రాట్నము: చక్రము = ౩౦ అంగుళములు. పొడవు = ౪౫. మాల = ౧/౩౨

| కదురు భారము | త్రిప్పుటకు వలయుశక్తి | ప్రతి ½ తులము భారమునకు వలయు హెచ్చుశక్తి |
|---|---|---|
| ఖాళీ కదురు | ౧౭ తులము | |
| ½ తులము | ౧౯ ,, | ౧ తులము |
| ౧ ,, | ౨౧ ,, | ౨ ,, |
| ౧½ ,, | ౨౩ ,, | ౨ ,, |
| ౨ ,, | ౨౬ ,, | ౩ ,, |
| ౨½ ,, | ౨౯ ,, | ౩ ,, |
| ౩ ,, | ౩౨ ,, | ౩ ,, |
| ౩½ ,, | ౩౬ ,, | ౪ ,, |
| ౪ ,, | ౪౧ ,, | ౫ ,, |
| ౪½ ,, | ౪౭ ,, | ౬ ,, |
| ౫ ,, | ౫౭ ,, | ౧౦ ,, |

పై ప్రయోగమందు కదురుపై ౫ తులముల నూలుండునదునపుడు చక్రము త్రిప్పుట కెంతశక్తిని ఉపయోగించవలసినదియు చూపబడినది. సాధారణముగా ౫ తులములనూలు ఒక్క పాలకదురుమీద ఎవ్వరునుతీయరు ఇది కేవలము ప్రయోగముకొరకే చూపబడినదికాని వేరుకాదు.

ఈ ఫలితములవలన మూడువిషయములు గమనింపదగియున్నవి. ౧. నూలును వడుకునపుడు రాట్నమును మాటిమాటికిని ఆపుచు వెనుకకు త్రిప్పుచు తిరిగి ముందుకు నడుపుచుండుట జరుగుచుండును. మిగతాయంత్రములవలె ఆగక తిరుగునదికాదు. అంతేకాకుండా వెనుకకుకూడా త్రిప్పవలసిన అవసరమున్నది. అందుచే ఆగక తిరుగుచుండెడి యంత్రములలో జనితమగు విసురు (momentum) వలని లాభము మనరాట్నములలో చాలా తక్కువ. అందుచే రెండుతులముల భారముగల కండెను కొన్నిగంటలు త్రిప్పుటకు వలయుశక్తి పట్టికలో చూపిన శక్తికంటె కొంచె మెక్కువయే అవసరము. ఈ ప్రయోగమున కుపయోగింపబడిన రాట్నముపై వడుకుటకు సామాన్యముగా ౩౦ తులముల శక్తిఅని మనము అంచనా వేయవచ్చును.

౨. ఈ అంచనానుండి యీరాట్నముపై వడుకుటకు వలయు (horse power) అశ్వపుశక్తి లెక్కకట్టినయెడల (౧/౧౦౧ H. P.) వచ్చును.

౩. పై రాట్నముయొక్క ఇరుసు "బాల్ బేరింగ్సు" పై తిరుగుచున్నదిగాన దీనిని ఉపయోగించుటకు చాలాతక్కువశక్తి మాత్రమే అవసరము. మామూలు దేశీయరాట్నములకు సామాన్యమైన ఇరుసులును చేకుచెవులును మాత్రమేఅమర్చబడియుండును. గావున వానిపై వడుకుటకు మించిన శక్తి అవసరముండునని ఊహింపవచ్చును. దేశీయరాట్నములపై వడుకుట కెంతశక్తికావలసినదియు, కదురు భారము హెచ్చగుచున్నప్పుడు ఎంత హెచ్చు శక్తి వినియోగింపవలసినదియు తెలుసుకొనుటకు పైన వివరించిన ప్రయోగములను అవసరములగు మార్పులతో చేయవలసియుండును. - పై పట్టికయందు

చూపబడిన ఫలితములు ౨-వ పటమందు రేఖ (Curve) రూపమున చూపబడియున్నది.



పటము ౨

## కండెయొక్క బరువు-వడిదారపు ఒత్తిడి

రాట్నము వడుకుచున్నప్పుడు కదురుయొక్క భారము హెచ్చుచుండుటచే వడిదారపు ఒత్తిడి (Tension) కూడా మారుచుండునా అను విషయమును తెలుసుకొనుటకుగాను కొన్ని పరిశోధనలు చేయబడెను. ఈ ఫలితములు ౫ వ పట్టికయందు చూపబడియున్నవి. వడిదారపు ఒత్తిడినిగురించి ఇదివర కుదాహరింపబడిన ప్రయోగములబట్టియు, ఈప్రయోగములబట్టియు నిస్సందేహముగా యేదియు చెప్పుటకు వీలులేనప్పటికిని ఈ క్రింద వివరింపబడిన ఫలితములనుబట్టి కదురుపైనుండు నూలుయొక్క భారము హెచ్చుచున్నప్పుడు వడిదారముయొక్క ఒత్తిడి తగ్గుచున్నదని తోచుచున్నది. కదురు బాగుగా బరువెక్కినపుడు చక్రమును త్రిప్పుట కెక్కుడు శక్తిని వినియోగించు టవసరమేకాకుండా వడిదారము కూడా కదురును త్రిప్పక దిండుపైనుండి జారిపోవుచుండును. ఈ అనుభవమునుబట్టి కదురు బరువెక్కుచుండు నపుడు వడిదారముయొక్క ఒత్తిడితగ్గిపోవుచు ఇందువలన వడిత్రాడు ఎక్కువగా జారిపోవు తిరుగుడులయందు నష్టము (Slipping) సంభవించునను ఊహ సరియైన దనియే తోచుచున్నది. అయినను ఇది నిర్ధారణచేయుటకు వడిదారముయొక్క ఒత్తిడితోపాటు కదురుయొక్క తిరుగుడులసంఖ్యకూడ లెక్కించుట యవసరము.

### ౫ వ పట్టిక

| కదురు భారము | వడిదారము ఒత్తిడి |
|---|---|
| ఖాళీ కదురు | ౯.౨ తులములు |
| ౦.౫ తులము | ౯ ౦ ,, |
| ౧.౦ ,, | ౮.౪ ,, |
| ౧.౫ ,, | ౮.౦ ,, |
| ౨.౦ ,, | ౬.౬ ,, |
| ౨.౫ ,, | ౬.౦ ,, |
| ౩.౦ ,, | ౫.౮ ,, |
| ౩.౫ ,, | ౫.౪ ,, |
| ౪.౦ ,, | ౫ ౦ ,, |
| ౪.౫ ,, | ౪.౩ ,, |
| ౫.౦ ,, | ౩.౯ ,, |

ఈఫలితము లీక్రిందిరేఖయందు చూపింపబడియున్నవి.




పటము ౩

హిందూదేశపు ఆర్థికదుస్థితిని రాటమువలన రూపుమాపవలెనన్న, రాటముయొక్క మహాశక్తిని సంపూర్ణముగా గ్రహించుటకు ఇట్టివింకనెన్నియో పరిశోధనలను సలుపవలసి యున్నది.

---

# శ్రీ॥ శే॥ గంటి లక్ష్మీనరసింహాం పంతులుగారు

గంటి లక్ష్మీనారాయణగారు

శ్రీ నరసింహాంగారు 1873-వ సంవత్సరములో ద్రావిడులకు ముఖ్యావాసముగ నుండిన పేరూరుగ్రామములో జన్మించిరి. వీరి దొక సంసారపక్షపు కుటుంబము. వీరి తండ్రిగా రగు శ్రీ॥ శే॥ రామచంద్రశాస్త్రిగారు గొప్ప మంత్ర శాస్త్రవేత్త. వీరికి బరోడా మున్నగు స్వదేశ సంస్థానములలో వార్షికము లుండెనని చెప్పుట నాకుక. శ్రీ రామచంద్రశాస్త్రిగారికి ముప్వురు తనయులు గలరు. అందు శ్రీ నరసింహాంగారు కడపటివారు.

నరసింహాంగారు చిన్ననాటినుండియు మిగుల చురుకుగనుండి విద్యయం దత్యంత బుద్ధి కుశలత గన్పరుచుచుండిరి. మెట్రిక్యులేషన్ తరగతివరకు అమలాపురం బోర్డుపాఠశాలలో తన సోదరుల సాహాయ్యమువలనను, ప్రభుత్వ విద్యార్థి వేతనమువలనను జదివిరి. పిదప నీయన యున్నత విద్యకొఱకై రాజమహేంద్రవరమున కేగి, ప్రభుత్వకళాశాలలో ఇంటర్మీడియేటు తరగతి రెండుసంవత్సరములు పూర్తిచేసి విశ్వవిద్యాలయ పరీక్షయందు 1891-వ సం॥లో ప్రథమతరగతియం దుత్తీర్ణులైరి.

శ్రీయుత గంటి లక్ష్మన్నపంతులు, శ్రీ॥ శే॥ పేరి నారాయణమూర్తిగార్లు, నరసింహాంగారి సహాధ్యాయులే.



శ్రీ॥ శే॥ గంటి లక్ష్మీనరసింహం పంతులుగారు

నరసింహాంగారు ఇంటర్మీడియేటు తరగతి చదువుచుండగనే (అనగా 1890-వ సం॥లో ద్వితీయసహోదరుడును, తండ్రిగారునుగూడ స్వర్గస్థులైరి. ఈకారణముచే విద్యకు స్వస్తిచెప్పవలసియున్న సమయమున ప్రభుత్వ కళాశాలాధ్యక్షులగు మెట్కాఫ్ (Metcalf) దొరగారు నరసింహాంగారి విద్యాబుద్ధుల చక్కగా నెరింగినవా రగుటచే గడుప్రేమతో నాయనను బిలిచి విజయనగర కళాశాలాధ్యక్షున కొక యోగ్యతాలేఖ (Letter of introduction) నిచ్చి పంపిరి. దొరగారిసలహా ననుసరించి నరసింహాంగారు విజయనగరంవచ్చిరి. ఆయన

యదృష్టమువలనను, దైవకృపచేతను, ఉదారాశయప్రూరితులగు శ్రీ విజయనగర సంస్థానాధీశ్వరులు నరసింహంగారికి అన్నివిధములైన సౌకర్యముల నేర్పాటు గావించుటకై యనుమతి నొసగిరి. పూర్తిగా సంస్థానసాహాయ్యముతోడనే నరసింహంగారు పట్టపరీక్షనిచ్చి 1893-వ సం॥లో నత్యున్నతముగా విజయమునొంది పట్టభద్రులైరి.

కళాశాలాధ్యక్షులగు కీ॥ శే॥ శ్రీ కిడాంబి రామానుజాచార్యులుగారికి నరసింహంగారననిన వాత్సల్యము మెండు. వారి ప్రోత్సాహమువలన సంస్థానాధీశ్వరుల కృపకుపాత్రులై సహాయ్యంపడను బడసి చెన్నపురి ఇంజనీరింగు కళాశాలయందు నాలుగు వత్సరములు బి. సి. ఇ. తరగతి జదివి 1896-వ సం॥లో చెన్నపురి విశ్వవిద్యాలయ బిరుదమును బడసిరి.

డిగ్రీని బడసిన వెంటనే యేకారణముచేతనోగాని నరసింహంగారు పూనానగరమువెళ్లి యచ్చట నెలకొల్పబడిన శ్రీ పండిత రామాబాయిశరణాలయములో నున్న బొంబాయి సుప్రసిద్ధ సంఘసంస్కర్తయగు కీ॥ శే॥ గంగాధరపంతు గద్రేగారి కుమార్తెను 1897-వ సం॥లో వివాహము చేసికొనిరి. పిమ్మట ననుభవ విద్యాసంపాదనార్థమై (for practical course) బరోడా సంస్థానమునకేగి యచ్చట నొక వత్సరము మాత్రమే ఇంజినీరుగ బనిజేసిరి. 1898-లో నరసింహంగారు బొంబాయి పురపాలక సంఘములో అసిస్టెంటు ఇంజనీరు (Assistant Engineer) గా బ్రవేశించిరి. ఈ సంవత్సరములోనే నరసింహంగారి ప్రథమభార్య కాలధర్మమునొందెను.

కొలదిమాసములలోనే నరసింహంగారు గౌరవనీయులగు జస్టిస్ శ్రీ నారాయణ్ జి. చందవర్కార్ గారి స్నేహము చొప్పునను, ప్రోద్బలముచేతను, కలకత్తా మతసాంఘిక సంస్కర్తయగు కీ॥ శే॥ శశిపద బెనర్జీగారి కుమార్తెను మరల వివాహము జేసికొనిరి. ద్వితీయధర్మపత్నివలన నరసింహంగారి కొక పుత్రుడును, పుత్రికయును గలిగిరి.

1899-వ సం॥లో శ్రీ నరసింహంగారు "మాణిక్‌లాల్" అను నొక గుజరాతీసంపన్నునితో గలసి యొక కార్యాలయము నేర్పరచుకొని 1915-వ సం॥రం వరకు బనిచేసిరి. ఈ సొంత యుద్యోగము మూలమున నరసింహంగారి తెలివితేటలును, కార్యనైపుణ్య శక్తియును వెల్లడియయ్యెను. తాతాకంపెనీవారి యొకకేసులో శ్రీ నరసింహంగారు కనుపరచిన మేధాశక్తుల కబ్బురపడి విజయము చేకూరుటంజేసి తాతాకంపెనీ యజమానులగు శేటు రతన్‌లాల్ తాతాగారు రూ. 40,000 లను బహుమతిగ నొసంగిరి.

1902 వ సం॥లో శ్రీ నరసింహంగారు విదుషీమణియగు రెండవభార్యనుగూడ గోల్పోయిరి. తదుపరి యొకటి రెండు వత్సరములు వివాహముమాటయే తలపలేదు. కాని కీ॥ శే॥ శశిపద బెనర్జీగారి ప్రోత్సాహమువలన 1904-వ సం॥లో బ్రహ్మసామాజికులును సంఘసంస్కర్తలు నయిన కీ॥ శే॥ రమేష్‌చంద్రఘోష్‌గారి పుత్రికారత్నమగు "కుముదిని" గారిని నరసింహంగారు పరిణయమాడిరి. శ్రీమతి కుముదినీగారు ఇంటర్మీడియేటు తరగతి వరకును విద్యసాగించిరి. ఈమెకు సంగీతసాహిత్యములందు ప్రవేశము మెండు.

బొంబాయిలో స్వకీయ కార్యాలయము నేర్పరచుకొని 16 సంవత్సరముల యనుభవము గడించిన తదుపరి యనగా 1916-వ సం॥లో కలకత్తాలో స్వకీయ కార్యాలయమును నెలకొల్పి నగరాభివృద్ధి సంఘము (City Improvement Trust) తరఫున పనిచేయు నభిప్రాయములో నరసింహంగారు కలకత్తాకు వెళ్లిరి గాని యాయనకు మిక్కిలి జబ్బుచేయుటచే నా ప్రయత్నములు కొనసాగలేదు.

ఇట్లుండగా శ్రీ విజయనగరం సంస్థానములో చీఫ్ ఇంజినీరుస్థానము ఖాళీయయ్యెను. శ్రీ శ్రీ శ్రీ మహారాజావారు సదుద్దేశ్యముతోడను నరసింహంగారియందలి యభిమానముతోడను నాపదవికి నరసింహంగారిని నియమింపదలచి వారికి దెలియజేయ, నాయనయును దనకృతజ్ఞతను జూప నిదియే తరుణమని యెంచి

యంగీకరించి అయిదు సంవత్సరములు పనిచేయ నంగీకారపత్రముపైని (bond of agreement) 1916-వ సం॥రం అక్టోబరునెలలో విజయనగరం విచ్చేసి ఛార్జి తీసికొనిరి. కాని కారణాంతరములచే నట్లు జరుగలేదు. మూడు సంవత్సరములు మాత్రమేయుండి యొకవిషయమున ట్రస్టీగారికిని ఈయనకును మాటపట్టుదలపైని ఆత్మగౌరవార్థమై ఛీఫ్ ఇంజనీరు పదవిని బరిత్యజించి బొంబాయి కేగిరి.

తదుత్తరక్షణముననే ప్రభుత్వమువారు నరసింహంగారిని నగరాభివృద్ధి సంఘములో సహాయసర్వం సహాయాజమాన్య పదవికి నియమించిరి. (as a deputy Land-Manager in the City Improvement Trust). నరసింహంగారు జీవితాంతమువరకు నాపదవియందే యుండిరి. 1927-వ సం॥లో వీరు విజయనగర సంస్థానపు దివానుగ నియమింపబడినటుల వార్త బయలుదేరెను. కాని యది తుదకు నిరాధారమయ్యెను.

నరసింహంగారు పలుమారులు మోటారుసైకిలు పందెములలో విజయముగాంచి యనేక బహుమానముల బడసినట్లుగా తెలియవచ్చినది. వీరికి 1916-వ సం॥రం నుండియు "అతిమూత్ర"వ్యాధి కలదు. ఆవ్యాధియే నరసింహంగారి మరణమునకు గారణము.

నరసింహంగారు 1927-వ సం॥రం జూన్ నెల 28 వ తేది మంగళవారమునాడు బొంబాయిలో బైకుల్లాలో స్వగృహమున మృతినొందిరి.

వీరు వేదాంతతత్త్వజ్ఞానులు. రెండు సంవత్సరములు సుమారు వీ రుద్యోగమునం దంత యిచ్చకనుప రచక శ్రీ "నూర్ మహారాజ్" అను నొక మహమ్మదీయ ప్రవక్తయొక్క యుపదేశముల ననుసరించి భగవద్భక్తులయిరి. మతసాంఘిక సంస్కరణములగూర్చి వీరు చాల శ్రద్ధగా బనిచేసిరి. ఏసుక్రీస్తునందు నరసింహంగారికి చాల భక్తియుండెను. అందువలన నాయన క్రైస్తవమతమును స్వీకరించెనని గూడ చాలమంది నమ్మించిరి. అందువలననే కాబోలు బొంబాయిలో భారతక్రైస్తవ సంఘమువారు తమసంఘమున కధ్యక్షులుగా నుండవలెనని నరసింహంగారిని గోరిరి. ఏసుక్రీస్తుపట్లను నాతనియుపదేశములపట్లను దన కధికమగు గౌరవముకలదు. గాని తాను క్రైస్తవమతమును స్వీకరింపలేదని నరసింహంగారు స్పష్టముగ జెప్పిరి.

ఆంధ్రదేశమునుండి పనికొఱకు బొంబాయి కేగుచుండిన యువకులకు నరసింహంగారు సర్వవిధముల సహాయపడుచుండెడివారు.

వీరు సంఘసంస్కర్తలు. వీ రన్యరాష్ట్రపు యువతిని బరిణయమాడుటయేగాక వీరిపుత్రికను హిందూస్థానీ జమీందారుని కిచ్చి వివాహము గావించిరి. తనయునకు వంగదేశపు యువతిని బెండ్లిచేసిరి. ఇట్లు సంస్కారము క్రియారూపమున నాచరించిరి. వీరు సరళహృదయులనియు, దైవభక్తులనియు జెప్పెదరు. అన్యరాష్ట్రములందు బ్రసిద్ధివడసి యాంధ్రదేశపు కీర్తిని విస్తరింపజేసిన వారిలో వీరొకరు. అట్టి శ్రీ నరసింహంగారి జీవితచరిత్రము ఆంధ్రదేశపు యువకులకు మార్గదర్శకముగను నుద్రేకపూరితముగను నుండుగాక!



స్కందుడు శివునకు ప్రణవతత్త్వము నుపదేశించుట

చిత్రకారుడు: శ్రీ వైద్యనాథ శర్మగారు.

బ్లాకులు చేసినవారు: శ్రీ పెనుమూడి రాఘవరావుగారు, ఆంధ్రపత్రికా కార్యాలయము, చెన్నపురి.

ఈయన క్రతువులు గాలవరకు రఘునాథునికాలములోనే చేసినట్లు కానవచ్చును. సమస్తఋత్విగ్దక్షిణలు రఘునాథుడే స్వయముగా నిచ్చినట్లును, తత్క్రతువులలో వాజపేయక్రతువును తాను స్వయముగా నుండి నిర్వర్తించినట్లును యజ్ఞనారాయణుడు తెల్పుచున్నాడు.

"తత్కృతౌ హిరణ్యగర్భతులాపురుషాది మహాదానప్రవృత్తి నిరర్గళవిభవ గగనమనుదివస ప్రశంసనాదాప్త వాజపేయ నామ్ని సప్తతంతు వరే నిరంతరోత్సవ కుతూహలినా రఘునాథభూతలబలభిద్యా సహస్రేష్టకచిత శ్యేనచయన స్వప్రతిష్టక మన్వర్థ్యవే సకలాధ్వర క్రమవిదే విన్యస్తా దక్షిణాదాపి తేతి."

శ్లో. "రథ్యాహోస్తికశైనుకాశ్వ గజతా
ముఖ్యా సదాద్దక్షిణాం
పర్యాదాప్త పయోత్తరం క్రతువరం
తం వాజపేయాభిధమ్,
యేనాహార్య కిమ ప్యహార్యవిభవం
సామ్రాజ్యలక్ష్మీపదం
సంప్రాప్తో రఘునాథభూ శతమఖో
జేజీయతే సాంప్రతం."

(రఘునాథవిలాసము : ప్రస్తావన)

సర్వతోముఖ సత్రయాగము నొనర్చినపుడు తత్పూర్తిసూచనార్థము కావేరీతీరమున నాల్గు శిలాస్తంభములను స్థాపించినట్లు వ్రాయబడినది గాని యట్టిస్తంభము లెచ్చటను గానరావు.

శ్లో. "చత్వారః కృత సర్వతోముఖమహా
సత్రేణ గాఢం శిలా
యూపా యేన నిఖానితాః ప్రతిదిశం
యుక్తం చిరావస్థితేః,
సౌరాజ్యం రఘునాథభూమిపతినా
సంప్రాపితే క్ష్మాతలే
పారే సహ్యసుతం వృషేణ వసతా
పాదా ఇవ స్థాపితాః."

(రఘునాథ విలాసము.)

ఈయన మంత్రిత్వకాలములో నచ్యుతరాజ్యకాల మెక్కుడగుటచే నీయిద్దరిని కలిపి రచియించిన యొక చాటుధార నీక్రింద ఇచ్చుచున్నాను :

"త్రినామాద్యంత[1] నామానా మహీక్షిద్దీక్షితా వుభౌ,
శస్త్రే శాస్త్రే చ కుశలా ఆహవేషు హవేషుచ."

ఈయన రచియించినట్లు చెప్పు గ్రంథములలో "సంగీతసుధా", "సాహిత్యసుధా" యను రెండు గ్రంథములు కలవు. వీతద్రచనవిషయమై యనుమానములు కలవు. రెండవదియగు "సాహిత్యసుధా" గ్రంథము శ్రీ కృష్ణస్వామయ్యంగారు తమగ్రంథములో నిచ్చుటచే[2] తెలియుటతప్ప యట్టిగ్రంథ మెద్దియు నాకు లభింపలేదు. ఏపుస్తకభాండాగారపు పుస్తకపట్టి వెదకినను నాకది కనుపడలేదు. తంజావూరు శాస్త్రవ్యులచే రచియింపబడిన యనేకగ్రంథము లీభాండాగారమందు లేకపోవుట శోచనీయము.[3] శ్రీ కృష్ణస్వామయ్యంగా

౧. అచ్యుత, అనంత, గోవింద అను నామత్రయములో రాజు మొదటినామము గలవాడు. మంత్రి తృతీయ నామము గలవాడు.

౨ Sources of Vizianagar History, S. K. Iyengar, 267.

3. వెనుకటి సంచికయందు వేంకటేశమఖి "కర్మాంతవార్తికము" లభ్యముకాదని వ్రాసితిని. తరువాత "అడయారు లైబ్రరి"యం దొక ప్రతియున్నట్లును అది యీక్రిందివిధముగా ప్రారంభింపబడినట్లును తెలియవచ్చినది. "ఉమాపతిం రమానాథం బోధాయన మునీశ్వరం, గోవిందాధ్వరిణం తాతం వందే సర్వార్థసిద్ధయే." (Introduction to Rukmini Parinaya, Adyar Edition.)

9. 6- 13 ౯౦౫

రీగ్రంథములోనిది యని చేసిన యనువాదము మొత్తము "సంగీతసుధా" గ్రంథమున గానవచ్చుచున్నది. అందది యుపోద్ఘాతప్రకరణముగా నున్నది. "సంగీతసుధా" గ్రంథము నెవరు రచియించిన విషయముకూడా వివాదాస్పదముగానే యున్నది. ఇప్పుడు ప్రచురింపబడుచున్న దానియందు ఉపోద్ఘాతమున తద్గ్రంథమును పండితసమాజముయొక్క కోరికపైన రఘునాథుడే రచియించినట్లు చెప్పబడియున్నది. తద్గ్రంథభాగములు మిక్కిలి రసవంతములుగా నున్నందున వానిని నుద్ధరించినందులకు పాఠకులు మన్నింతురుగాక.

"విలోక్య దూరే విబుధాన్ ప్రణమ్య
మంత్రాక్షతాన్ మూర్ధ్ని ముదా నిధాయ,

* * *

న్యవేశయ త్తా నుచితాసనేషు."

* * *

ఆస్థానేష్వాస్థం విబుధా స్సమస్తాః".

* * *

క్షోణీకుశాం వః కుశలాని కచ్చిత్
దారేషు పుత్రేషు తపోభరేషు,

* * *

ఆతన్వతో రక్షణ మాదరేణ
తస్యైవ రాజ్యే వసతాం చిరం నః,
భవత్కటాక్షై రభిరక్షితానాం
క్షేమం సమస్తీతి కి మత్ర చిత్రం." ౧

తరువాత—

"సంగీతశాస్త్రాంబునిధిం విమథ్య
ధీమందరేణాకృత పక్షపాతః,
ప్రదేహి సంగీతసుధా మత స్తే
శ్రేయాంసి భూయాంసి భవంతి నిత్యం." ౨

అని పండితులు కోరగా రఘునాథు డిట్లనెనట:

"ఆకర్ణ్య తద్వాక్య మతీవ హర్షాత్
కృతాంజలిః శ్రీ రఘునాథభూపః,
శ్రేయస్కరేష్వేవ నియుంజతే మాం
భవాదృశా ఇత్యభిధాయ భక్త్యా." ౩

అంతట గ్రంథమును రచించెనట:

"సీతాసహాయం హృది రామచంద్రం
భక్త్యా కులస్వామిన మాకలయ్య,
కీర్త్యైచ సర్వాభ్యుదయాయ శాశ్వతాయ
తనోతి సంగీతసుధాం లఘుగ్రే." ౪

ఇందు కంఠోక్తిగా రఘునాథుడు రచియించినట్లు చెప్పబడియున్నది. రఘునాథుఁ డట్టి గ్రంథరచనకు తగినవాడు కాడందమా! వీలు లేదు. సాహిత్యమున యజ్ఞనారాయణదీక్షితునంతటివానికి గురువు కాదగినవాడని చూచినాము. సంగీతమున నూతనరాగతాళనిర్మాత.

"జయంతసేనాదిమరాగరామా
నందాదితాళా న్రచయ న్విశేషాన్,
సంగీతవిద్యాం సముపాదిశ త్త్వం
విపంచికావాదవిచక్షణానాం."

"కించ త్వ మంచ ద్భవదీయనామ
మేళాంతరం సంప్రతి కల్పయిత్వా,
మేళాంతరే తత్ర సమస్తరాగాన్
ప్రకాశయోగ్యాన్ సులభే కరోషి." ౫

జయంతసేనాది రాగములను, రామానందాది తాళములను కనిపెట్టుటయె గాక తన నామాంకితము మేళాంతరమును కనిపెట్టి వీణావాద్యమునకు క్రొత్తవికాసమును తెచ్చెను. ఈరఘునాథ మేళవీణను గూర్చి ప్రసంగవశమున కొంచెము ముచ్చటింతును. ఈ మేళమును కనిపెట్టకపూర్వము వీణను వాయించవలెనన్న నేరాగమును పాడవలెనో తద్రాగమున కనుగుణముగా తంత్రుల సర్దవలసివచ్చుచుండెను. అట్లు చేయ

౧. సంగీతసుధా, ౧. ౫౦-౬౦.
౨. Ibid. ౧. ౬౩.
౩. Ibid. ౧. ౬౪.
౪. Ibid. ౧. ౬౫.
౫. సంగీతసుధా, ౧. ౬౪, ౬౫.

వలసివచ్చుచుండుటకు తార్కాణముగా నీక్రింది మను చరిత్రలోని పద్యమును చూడుడు :

శా. వాలారుం గొనగోళ్ల నీ వలసతో
    వాయించుచో నాటతో
  మేళం బైనవిపంచి నిన్న మొదలు
    న్నీవంటమిం జేసి యా
  యాలాపంబె యవేళఁ బల్కెడు ప్రభా
    తాయాతవాతాహతా
  లోల త్తంత్రుల మేళవింపఁగదవే
    లోలాక్షి, దేశాక్షికిన్."[౧]

వెనుక 'నాట' రాగమునకు తంత్రులు మేళవింప బడియుండ దానిని మార్చి 'దేశాక్షి' రాగమున కనువుగా తంత్రుల మేళవింపవలసినదిగా చెలికత్తె వరూథినిని కోరుచున్నది! ఇందువలన నందురాగములకు వేర్వేరు తంత్రీమేళన మున్నట్లు తెలియుచున్నది. దీనికి క్రింది సాక్ష్యమును చూడుడు.

"ఆజాబిల్లి వెలుంగువెల్లువల దాయన్ లేక రాకానిశా
రాజశ్రీసఖ మైనమోమునఁ బరాగం బెత్తి యెత్తియా
రాజీవానన యేఁచెఁ గిన్నరవధూరాజత్కరాంభోజకాం
భోజీ మేళవిపంచికారవసుధాపూరంబుతోరంబుగన్."[౨]

కావున మనువసుచరిత్ర రచనాకాలమునాటికిట్టే ప్రతి రాగమునకును ప్రత్యేకతంత్రీమేళనముద్వారా వీణావాద్యము నడచుచుండెను. పైన చెప్పిన "రఘునాథ మేళ వీణ" యట్లు గాక యెట్టిమార్పు లేకనే యన్నిరాగములు నొకే తంత్రీమేళనమున వాయించునట్టి నూతన పరివర్తన మొనర్చెను.

"మేళాంతరే తత్ర సమస్తరాగాన్
  ప్రకాశయోగ్యాన్ సులభీకరోషి."

ఈవాక్యము లిప్పుడు సార్థకము లగుచున్నవి.

ఇట్టిశక్తిగల రఘునాథుడు తద్గ్రంథమును రచించుట సమంజసమే కాని నిజముగా రచియించెనా యను విషయము మన మిప్పుడు చర్చించుచున్నాము.[౩] గ్రంథమున రఘునాథుడే రచియించిన ట్లున్నను యీక్రింది వెంకటమఖివాక్యమును చూడుడు :

"తతోను రఘునాథేంద్ర మేళవీణా నిరూప్యతే,
తల్లక్షణంతు సంగీతసుధానిధి రీతి శ్రుతే,
చెవ్వయాచ్యుతభూపాల రఘునాథనృపాంకితే,
అస్మత్తాతకృతే గ్రంథే ప్రోక్తాన్ శ్లోకాన్ లిఖా
  [మితాన్."
(చతుర్దండి ప్రకాశిక.)[౪]

ఇందు తనతండ్రి యొకసంగీతగ్రంథమును రఘునాథాంకితముగా రచియించినట్లును, అందలిశ్లోకములను తా ననువదించుచున్నట్లును చెప్పబడియున్నది. అదియే 'సంగీత సుధ' యైయుండునా యని యాలోచించవలసి యున్నది. కాని గ్రంథనామము "సంగీతసుధానిధి" యని యొసంగబడినది. తన్నామము కల గ్రంథ మెద్దియు కానరాదు. వెనుకటి 'సంగీత సుధ' యందలి యనువాదమున "సంగీతసుధాం" అని యున్నది. ఈనామభిన్నతకూడా యనుమానమునకు బల మొసంగుచున్నది. కాని యొకవిషయ మిచ్చట గమనింపవలయును. వెనుక రెండింటియందలి[౫] యుపోద్ఘాతభాగము సమానమని విన్నవించియుంటిని. అది యీసందేహమును చాలవరకు తీర్చుచున్నది. రెండును "సుధ" లని పేరు

౧. మనుచరిత్రము, ౩. ౫౭.

౨. వసుచరిత్రము.

౩. రఘునాథుడు రచియించిన యితర భారతసంగ్రహ రామాయణసంగ్రహాది గ్రంథముల శైలినిబట్టి చూచుటయు నిష్కృష్టముగా తెల్పజాలదు.

౪. చతుర్దండిప్రకాశికయందలి యీ మొదటిభాగము ముద్రితము కాలేదు.

౫. "సంగీతసుధా", "సాహిత్యసుధా"

గలవి యగుటచేతను, రెండును గోవిందుడే రచియించి నట్లు ప్రతీతిచేతను, రెండిటియందలి భాగము లేకముగా నుండుటచేతను, వెంకటమఖి "తాతకృత" మని చెప్పు గ్రంథము మరియొకటి లేకపోవుటచేతను నీగ్రంథమే యద్ది యనియు, నది గోవిందకృత మనియు, రఘునాథుడు వ్రాసినట్లు గోవిందుడే రాజున కంకితము చేసెననియు, వెంకటమఖి యిచ్చిన పేరు శ్లోకపాదపూరణమునకో పొరబాటుగానో యిచ్చెననియు నంతమాత్రముచే ఇంతకంటె ప్రబలనిదర్శనము కన్పట్టువరకు దీనిని గోవిందుడు రచియింపలేదని చెప్పజాలమనియు నేను నిర్ధారణము చేయుచున్నాను.[1] ఈగ్రంథ మత్యుత్తమకవిత్వధోరణిలో వ్రాయబడినది. ఉపోద్ఘాతమైన తరువాత నాదబ్రహ్మము నవతరింపజేయు సందర్భమున గ్రంథకర్త వేదాంతము నుద్ఘాటించి పరతత్త్వమును బోధించి తుదకు నాదమే బ్రహ్మమని నిరూపించుటలో చూపిన చాకచక్య మప్రతిమానము.[2] గొప్పవిషయముల నెట్టి మందబుద్ధులకును తెలియునట్లు సులభమైన ప్రవాహశైలిలో వ్రాయుటయం దీయనశక్తి నిరాఘాటము. ఎట్టి క్లిష్టవిషయము నైనను కైశికీవృత్తిలో ద్రాక్షాపాకములలో చెప్పు నీయనసామర్థ్యమును చూపుటకై కొలది శ్లోకముల నిట నుదహరింతును—

[3] "గీతంచ నాదాత్మక మిత్యుపేతం
వాద్యంచ నాదానుగతం భవే త్తత్,
ఏతద్ద్వయే నానుగతంచ నృత్తం
నాద త్రయాణా మపి హేతు రస్మాత్.

న కేవలం తత్త్రితయంచ నాద
మపేక్షతే కింతు జగచ్చ సర్వమ్,
నాదేన వర్ణాః స్ఫుటతాం ప్రయాంతి
వర్ణైః పదం తేనచ వాక్య మేవ.
వాక్యేన సర్వో వ్యవహార ఏవ
నాదేశితం తేన జగచ్చ సర్వం.

* * *

స నాదరూపో హి భవే ద్విరించిః
సదాశివశ్చైవ జనార్దనశ్చ,
స ఏవ శక్తిశ్చ పరా జగత్యాం
తదేవ సర్వాత్మక ఏవ నాదః.

ద్వేధా హతానాహత భేదత స్స
త్వనాహతో యోగిభి రేవ గమ్యః,
స్యా దాహత స్సర్వశరీరవర్తి
త్యత శ్శరీరం పురతో నిరూప్యం.

నాదోపలబ్ధిస్తు యత శ్శరీరా
త్తస్యాభిమానీ ఖలు జీవ ఉక్తః,
తస్యాపి తత్త్వం పరమాత్మరూపం
అతో భవే ద్బ్రహ్మ నిరూపణీయం.

శరీరరూపేచ విచార్యమాణే
చత్వారి భూతాని వినా న చాన్యత్,
తదేవ చాత్మేతి వదంతి కేచిత్
చార్వాకముఖ్యా స్సకలానుభూత్యా.

మానాంతరస్వీకరణేన కేచిత్
విజ్ఞానమాత్రం (క్ష)ణికం వదంతి,
సంతానపత్యాదిచ లోకయాత్రా
నీలాదికం సంవిదభిన్న మాహుః.

---

[1] ప్రకాశకులుకూడ ఇట్లే యభిప్రాయపడిన ట్లీ క్రిందివ్రాత సాక్ష్యము:
"Sangita Sudha of Raghunatha Nayak of the Tanjore Nayak dynasty is now to be placed before the public, in har.. The author is Govinda Dikshita his minister and the father of Venkatamakhi of 72 'Melakartas' fame as propounded in his 'Chaturdandi prakasika,' well known to the music world." (Journal of the Music Acabemy, Vol.I. 57.) ఇట్లు మంత్రులు వ్రాసి రాజున కాపాదింపజేయుట మన మెరుంగనిది కాదు.

[2] తన మద్దర్శనీపాండిత్యమును చూపినాడు.

[3] తంజావూరు భాండాగారములోని వ్రాతప్రతినుండి యెత్తితిని. నేను పరిష్కరింప యత్నింపలేదు.

తేష్వేవ కేచి త్ప్రివదంతి సూక్ష్మ
తత్త్వం పరే మాధ్యమికా సమస్తం,
స్యాదస్తి నాస్తీతి చ వాదినోఽన్యే
తాం సప్తభంగీం ప్రతిపాదయామః.

ఆమ్నాయమార్గప్రతిగోచరేషు
సౌత్రాంతికాద్యప్రముఖేషు సత్సు,
జాగ్రత్సు జీవో భవతో మహిష్ఠః
కథం తథా బ్రహ్మని పంచ సిద్ధ్యేత్.

అత్రోచ్యతే కిన్ను కుమారిలేన
నిర్జిత్య సర్వానపి బౌద్ధముఖ్యాన్,
ప్రామాణ్య మామ్నాయగిరాం నిరూప్య
తదర్థజాతాని విచారితాని.

వేదాంతవిద్భిశ్చ కుతర్కమార్గో
నిరాకృత శ్చాపి సమగ్రనిష్ఠైః,
నానామతస్థై రనుమానతర్క
సమన్వితై స్సాధిత ఈశ్వరశ్చ.

ఏవం కణాదేన చ గౌతమేన
గంగేశముఖ్యై రపి శాస్త్రనిష్ఠైః,
నిరాకృతా ఏవ కుయుక్తయ స్తత్
కౌమారిలోక్తి ర్జయదుందుభి స్స్యాత్.

అతశ్చ సిద్ధే సతి వేదమార్గే
జీవ స్తిరోభూతచతుష్టయాన్యః,
స ఏవ జీవో వ్యవహారకాలే
భవే జ్జనై ర్విశ్వ ఇతి ప్రతీతః.

*　　*　　*　　*

జీవస్య తత్త్వప్రతిపాదనాయ
బ్రహ్మస్వరూపం ప్రతిపాదయామః,
సత్యం చిదానందమయం విశుద్ధం
స్వబోధసంపాదితలోకతంత్రం.

*　　*　　*　　*

ప్రాయుక్త సూత్రే భగవా నథాతో
బ్రహ్మేతి యత్సత్యవతీతనూజః,
చరాచరస్యాస్యతు నామరూప
ద్వయేనతు వ్యాకృతరూపభాజః.

*　　*　　*　　*

సదేవ సర్వం ప్రతిభాతి యత్ర
బ్రహ్మాత్మకం తం ప్రణమామి నాదం,
ఏకోహి నాదో బహుధా ప్రభిన్నో,
దీప్తాది సామాన్యవిశేషభేదాత్."

(సంగీతసుధా, II.) ౧

పై యనువాద మసమగ్రమైనను కర్తయొక్క సర్వశాస్త్రజ్ఞాన మంచు తెలియగలదు. శైలి యతిమధురము.

"హరివంశసార చరిత"మను నొక కావ్యము౨ కలదు. దీనిని గోవిందమంత్రి రచియించినట్లు సర్గాంతశ్లోకమున చెప్పబడియున్నట్లు చెప్పుచు దీని గోవిందదీక్షితుడు రచియించినట్లు "ఆరవీటి కుటుంబచరిత్రము"ను వ్రాసిన హీరాసుఫాదరీగారు వ్రాయుచున్నారు.3 అప్పయ్య దీక్షితులు దీనికి వ్యాఖ్యను రచియించెను. అప్పయ్య దీక్షితునకును గోవిందదీక్షితునకును స్నేహ మున్నట్టు చరిత్రప్రసిద్ధము. "పరిమళ" గోవిందదీక్షితుని యభ్యర్థనముపైన అప్పయ్య రచియించిన ట్లైతిహ్యము కలదు.౪ అప్పయ్య దీనికి వ్యాఖ్యను రచియించుట 'హరివంశసార చరితము' గోవిందదీక్షితకృత మను నూహకు బలమొసంగును. శ్రీ చింతామణి పండితుడుకూడ ఇట్టి యభిప్రా

౧. నే నీ శ్లోకములను వ్రాతగ్రంథమునుండి యనువదించితిని. కావున తప్పు లుండియుండునని మనవి.

౨. అముద్రితము.

3. Aravidu Dynasty of Vizianagara, Prof. Heras, S. J. p, 522.
ఈయన తన గ్రంథమున నాంధ్రనాయకరాజులగూర్చి యనేకవిషయములను వ్రాసెను. వానిని నా "తంజాపురాంధ్రనాయక చరిత్రము"న విమర్శించియున్నాను.

౪. J. A. H. S., 236.

యమునే వెలిబుచ్చుచు తత్కావ్యము హీరాసుగారు చెప్పినట్లు మూడుసర్గలు కలది గాక ముప్పది సర్గలు కలదని హీరాసుగారి యభిప్రాయమును దిద్దుచున్నారు.౧ అప్పయ్య వ్యాఖ్యానమును రచియించినంత మాత్రమున మరియొక కవి రచియించిన గ్రంథము గోవిందదీక్షితునిది కానేరదు.౨ నామసామ్యముకూడ ఈ పొరపాటుకు సాయ మొనర్చినది. కాని లోతుకు దిగిన నీ యూహ పొరపాటని స్పష్టము. గోవిందదీక్షితునిది వాసిష్ఠగోత్రమని వెనుక మనవిచేసియున్నాను. ఈక్రింది యితరసాక్ష్యము వెనుకటిమాటను దృఢీకరించుచున్నది:

"శాస్త్రైకవిధే విధేయమతయ
స్సామర్థ్య మవ్యాహత
వ్యాహారేష్వపి తే సమం విదధతే
వాసిష్ఠవంశోద్భవాః."౩

ఈయన యచ్యుతరఘునాథులవద్ద మంత్రియని మనకు తెలియును. కాని యీ "హరివంశసారచరిత కావ్య" కర్త మరియొక గోత్రజుడనియు, మరియొక రాజువద్ద మంత్రిగా నుండెననియు నీక్రిందియాధారముల వలన తెలియనగును:

"శాండిల్యాన్వయ హీరనాయకమణిః
శ్రీవల్లిమంత్రీ పితా
మాతా యస్య పతివ్రతైకమహిమా
కల్యాచ కుప్పాంబికా,
తస్య శ్రీహరివంశసారచరితే
గోవిందమంత్రిప్రభోః
సర్గః పూర్తి మగా న్ని సర్గలలితః
కావ్యే మహత్యాదిమః.'౪

"కొండపక్ష్మాపపురందరామరగురోః."౫

"కొండనాయకాఖ్యోభూపతిరేవపురందరః తస్య [అమరగురుః బృహస్పతిః."౬

పైయాధారములవలన నీగోవిందమంత్రి శాండిల్యగోత్రోద్భవుడనియు, కొండమనాయకు నను రాజునొద్ద మంత్రియనియు స్పష్టము.౭ మరియు నీయన తనతల్లిదండ్రులనామముల నిచ్చియున్నాడు. కావున నీసాక్ష్యము ఇద్దరును నొకవ్యక్తి కానేరరని చాటును. మరియు నీగ్రంథమున తంజావూరునందలి వ్రాతప్రతియందు ౨౩ సర్గలు కలవు.౮ వ్యాఖ్యానముల పరికించిన కావ్యము ముగించినట్లు కన్పట్టును. ఇందువలన నీకావ్యము త్రింశత్సర్గాత్మకమేయని నాయభిప్రాయము. కావున హీరాసుగారును, చింతామణిగారును నీవిషయమున కూడ పొరపాటుపడినట్లు తెలుచున్నది. పైవిషయము లకుపబలముగ శ్రీతంజావూరు లైబ్రరీయందు సంశోధకుడుగా నుండిన కే. శే. రామస్వామిశాస్త్రిగారు లైబ్రరీయందలి యీకావ్యముయొక్క వ్రాతప్రతియం దీక్రింది విధముగా వ్రాసియుంచినారు:

"గోవిందదీక్షితా దన్యః,
భిన్నగోత్రాత్, మాతాపిత్రో

౧. Introduction to Rukmini parinaya, XXIV.

౨. "ఇతి భరద్వాజకులజలధి కౌస్తుభ శ్రీమదద్వైతవిద్యాచార్య శ్రీ విశ్వజిద్యాజి రంగరాజాధ్వరివర సూనోః అప్పయ్యదీక్షితస్య కృతౌ హరివంశసారచరితవ్యాఖ్యాయాం........."
(వ్యాఖ్యాంతగద్యము. హరివంశసారచరిత వ్యాఖ్యానము.)

౩. రఘునాథవిలాసము, ప్రస్తావన.

౪. హరివంశసారచరితము, ప్రథమసర్గాంత శ్లోకము.

౫. Ibid ౩. ౫౨.

౬. Ibid. వ్యాఖ్యానము.

౭. ఈకొండపనాయకు డెవ్వరో తెలియకున్నది. అవంక పరిశోధన మొనర్చుచున్నాను. ఫలమును తరువాత మనవి చేతును.

౮. Tanjore Sanskrit Catalogue, 2683.

ర్భిన్న నామధేయాన్చ.[౧]
వాసిష్ఠా దన్యః;
శాండిల్యః గల్లిమంత్రీకుప్పాంబికాసుతః.
మంత్రీ కొండపనాయకస్య."

ఇది గాక తంజాపుర సంస్కృతపుస్తకపట్టికయందు క్రింది విధముగా చెప్పబడియున్నది:—

"The author of the Harivamsasaracarita is Govinda Mantrin and he ought not to be confused with the famous Govinda Diksita, the Minister of Nayak Kings. As a matter of fact some scholars have made this confusion."[౨]

ఈయన సుందరకాండవ్యాఖ్యానము నొకదానిని, మరియొక జ్యోతిషగ్రంథమును కూడ రచియించినట్లు శ్రీ సేంకటేశ్వరగారు వ్రాయుచున్నారు.[౩] అవి నాకిచ్చట లభింపలేదు. మిగిలినవానివలెనే యవికూడ నశించి యుండవచ్చును. ఈయన యనేక కవులకు పట్టుకొమ్మగా నుండెను. ఆంధ్రద్రవిడభాషలయందుకూడ కవులకు ప్రోత్సాహ మొసంగెను. "చేమకూరవా"డీయనకాలమునందలివాడే! ఈయన పంచనదమాహాత్మ్యమును ద్రావిడభాషలోనికి పరివర్తింపజేసెను.[౪] ఈవిధమున నితరులను తరియింపజేసి తాను తరించెను. ఈకవి పండితమంత్రి చరిత్రము నిక ముగింతును. చోళమండల భాగ్యముగా నీరాజమంత్రి సంయోగము సంభవించి మెరపువలె నీమండలమును వెలుగజేసెను. మెరుపు తరువాతి కటికచీకటివలె నీనాయకరాజ్య మంతరించెను. మరల నీమండలము మొదటి మహారాష్ట్రరాజులక్రింద వెలుగు నొందెను. తరువాత నంతయు నంధకారమయ్యెను.[౫]

ఈ వ్యాసావళియందలి విషయములన్నియు నాతోచినమట్టుకు చారిత్రకదృష్టితో పరిశీలించితిని. ఈ చరిత్రమంతయు పరిశోధనపై నాధారపడియున్నందున ముందు చేయబోవుపరిశోధనముపై సిద్ధాంతములను మార్చవచ్చును. ఏతద్విషయమున నిష్కృష్టసిద్ధాంత మిదియని చెప్పుటకు వలనుపడదు. నాపరిశోధనఫలితముగా మార్పు చెందవలసియున్న నేనే యామార్పునుకూడ తప్పక ప్రకటింతును. సత్యాన్వేషణమే నా కర్తవ్యము. నే నెంతవరకు సిద్ధసంకల్పుడ నైతినో పాఠకులు చెప్పవలెను. ఇందలి విషయములనుగూర్చి యెవ్వరికైన తెలిసినయెడల నాకు తెల్పిన మిక్కిలి కృతజ్ఞుడ నగుదును.

యజనాదిషట్కర్మనిరతుడై బ్రాహ్మణధర్మమును నిర్వర్తించుచు యథాశాస్త్రముగా నీ మంత్రిశేఖరుడు జీవితమును గడపెనని చెప్పుచు సెలవు గైకొనెద.

"బ్రాహ్మణా స్సంతు నిర్భయాః."

---

౧. ఈశాస్త్రిగారు రిటీవలనే మరణించిరి. ఈపుస్తకాలయమునందలి విషయము లాయనకు తెలిసిన ట్లితరులకు తెలియవని యందురు. అవి యన్నియు బయటబెట్టకపూర్వమే గతించిరి. గోవిందదీక్షిత మాతాపితృనామధేయములు నాకు లభింపలేదు.

౨. Tanjore Sanskrit Catalogue, 2686.

౩. J. A. H. R. S., 237.

౪. Ibid. 225.

౫. ఈయన విద్యారణ్యతుల్యుడని చెప్పిన నతిశయోక్తి కాదు.

# ఆమెకు అంకితము

మల్లవరపు విశ్వేశ్వరరావు గారు

శోకమేఘాలందె స్రుక్కుదొ, నీకు
ఆటపట్టో యిప్పు డానందవాటి ?
నాగుండెలం దొకనాడు నీమూర్తి,
నీవ్యక్తి, నీశక్తి నిలిపిపోతి వహా!

ఆనాటి నీమందహాసము లన్ని
నిట్టూర్పుసెగలచే నిరసిత మయ్యె
ఆనాడు నీకన్నులందుండు తళ్కు-
బెళ్కులు బాష్పాల బేలపోయినవి.

పూతగౌతమిమాత గీతిల్లి యేడ్చె
నీహృదంతికములోని వనట నెరిగి,
నాటినీయభిమాన నష్ట మీక్షించి
క్రుంకెడితరణికే గ్రుడ్లెర్రబారె!

ముక్తకేశ, విముగ్ధ, మూర్ఛితచిత్త,
అవమానభరవినమ్రాత్మ, బాష్పార్ద్రి,
ఆమూర్తె నాయెద హత్తితి వపుడు
గౌతమీతటినె యాగౌరార్కద్యుతిని!

కాలగాంగఝరమ్ము కట్టయి నిల్చి
నీలకంఠునివలె కరాళవిషాగ్ని
నాగళమ్మున నాచినాడ నిన్నాళ్లు
నీకే శుభముల నన్నియు నివ్వజేసి.

నాప్రాంగణమ్మున నడుగిడ లేదు,
అడుగనే లేదు నాయెదలో తావు;
ఎదనెద స్మృతివీథి నడి సాగునాటి
మంచుకన్నీటి తామర, నీవదనము.

ఎన్ని తలపులో నీమున్నన గోరె,
ఎన్ని పిలుపులో నీవెన్నంటి చేరె,
నీసుఖశోకాల నిర్మగ్నవైతి
పోకన్నె నాతెన్ను నీకన్నె లేదు.

లోకాల నెల్ల నీకయి తంత్రి గూర్చి
శోకాల విజయగీతి కలగాన
మేకాలకాలాలనే ప్రపంచింతు,
నాకథానకము నీ స్వీకృతమేని!

# శ్రీకృష్ణునకు మీసములు లేవా?

గో. రామదాసుగారు

1927 సం. ఆగస్టు భారతి సంచికలో మ-రా శ్రీ బెల్లంకొండ సుబ్బారావుగారు శ్రీకృష్ణునివేషముతో నున్న తమ ఛాయాపటమును ప్రకటించిరి. వీరి నటకులవలె వారు సహజముగా నున్న మీసములు గొరిగించుకొనలేదు. మీసములతోనే వారు శ్రీ కృష్ణవేషమును ధరించిరి. ఆమరుసటి భారతిసంచికలో 'శ్రీ కృష్ణునకు మీసములు గలవా?' యను శీర్షికతో నొక యాక్షేపణ యచ్చుపడినది. ఈయాక్షేపణ కారకులకు ఆధారము శ్రీ రవివర్మగారి చిత్రపటములు!

ఆక్షేపణ చేయుటకు తగినదే యనుకుంటే అనేకము లున్నవి. శ్రీ కృష్ణుని వేషమందు చొక్కాయి తొడిగిన ట్లున్నది. శ్రీకృష్ణుని కాలమందు చొక్కాయిలు తొడిగికొనేవారా? శ్రీ కృష్ణుడు చొక్కాయి తొడిగికొనినట్లు గ్రంథమందైన జెప్పియున్నదా?

శ్రీ కృష్ణవేషము వేసేవారందరు వేషమంటు ఫాలమునకు తిరుమణి శ్రీచూర్ణములతో చక్కని పట్టెవర్ధనములు ధరింతురు. ఇంతేకాదు; శ్రీ రంగనాథస్వామివారికి తిరుపతి వెంకటేశ్వరస్వామివారికి ఇంక ఇతర స్థలములందున్న విష్ణువిగ్రహములకు ముఖమందు పట్టెవర్ధనములు పెట్టెదరు. ఇది శాస్త్రీయమా? ఇందులో నేమైన యర్థ ముపయోగించియున్నారా? తిరుమణితో బెట్టు రెండూర్ధ్వరేఖలు శ్రీ విష్ణుని రెండుపాదములని గదా విశ్వాసము! శ్రీ విష్ణువుయొక్క రెండుపాదములను నతనిముఖముపై వ్రాయుట యెంతసబబో చూడుడు! ఎవ్వడైనా తనపాదములను తనముఖముపై బెట్టుకొనునా?

ఇంతేగాక శ్రీ బెల్లంకొండ సుబ్బారావుగారు శ్రీ కృష్ణవేషములో చేతియందు పిల్లనగ్రోవిని ధరించియున్నారు. ఇందు కాక్షేపణలేదు. ఏమంటే శ్రీ కృష్ణుడు పుట్టినదిమొదలు నిర్యాణానంతరము పిల్లనగ్రోవినే పట్టియున్నాడని జనసామాన్యవిశ్వాసము. జనులనమ్మకమునకు వ్యతిరేకమైన పనిగాదు గాన నశాస్త్రీయమైనప్పటికి నాక్షేపించలేదు. అటువలెనే చిత్తరువులుగూడ అశాస్త్రీయమైనప్పటికి జనులనమ్మకమున కనుగుణ్యముగానుండిన మెప్పుబడయుచున్నవి. శాస్త్ర మెవ్వరికిగావలె; దాని నెవ్వరు చూచుచున్నారు? మురళి చేతిలో బెట్టి యొకబొమ్మ వ్రాస్తే యది కృష్ణుడు! కోతిమొగము తోకపెట్టి బొమ్మవ్రాస్తే ఆంజనేయులు! పదితలలుపెట్టి యొకమనిషినివ్రాస్తే వాడు రావణుడు! ఇలాగు కొన్ని నమ్మకములు జనుల హృదయముల నాటియున్నవి. అలాగు లేకపోతే వెంటనే యాక్షేపణలు బైలుదేరుతవి. నిజముగా నివి యిట్లున్నవా లేవా యని గ్రంథపరిశీలన జేసి యథార్థమును గనుగొనేవారు మహాతక్కువ!

అందుచే 'శ్రీ కృష్ణునకు మీసములుగలవా?' యను వ్యాసమును జూచినవెంటనే యందు విషయమై పరిశీలన చేయదలంచితిని గాని యది యంత ముఖ్యమైన హంశముగా దోపక యశ్రద్ధజేసి యూరకుంటిని. ఆ సంవత్సరం డిసెంబరుమాసమందు వెలువడిన భారతీ పత్రికలో నొకదానిలో ఖడ్గపురమందు ప్రదర్శింపబడిన శ్రీకృష్ణతులాభారనాటకమందలి పాత్రలను విమర్శించుటలో శ్రీకృష్ణపాత్రను ధరించిన వారివిషయములో 'మీసాలకృష్ణునివలె గాక' యని ప్రయోగించిరి. దీనివలన పూర్వపుభారతిలోని యాక్షేపణ జ్ఞప్తికి వచ్చి 'శ్రీకృష్ణుని మీసములు యథాలాభముగా బోలేదు. వీటివిషయమై గట్టిసంశయమే లోకములో, ముఖ్యముగా నాంధ్రలోకమున వ్యాపించియున్న' దని నాకు గోచరమైనది. అందుచే నీసంశయనివారణార్థమై చర్చ ప్రారంభించితిని.

శ్రీమద్భాగవతము, హరివంశము, విష్ణుపురాణము, శ్రీమహాభారతము మొదలైన గ్రంథములలో శ్రీకృష్ణ చరితామృతమును శ్లోకించిన భాగములను బరిశీలించి

చూచితిని. వీరియం దెచ్చటను గూడ శ్రీకృష్ణునకు మీసము లున్నవని గాని, లేవని గాని చెప్పియుండలేదు. శ్రీకృష్ణునికే గాదు; ఏ పురుష వ్యక్తికిగూడ మీసము లున్నట్లుగాని, లేనట్లుగాని చెప్పలేదు. జరాసంఘుడు, శిశుపాలుడు, బాణాసురుడు, నరకాసురుడు మొదలైనవారికైనను మీసములవిషయమై యెత్తుకోనేలేదు. గ్రంథములలో జెప్పలేదుగదా యని పురుషవ్యక్తులకు మీసములు లేవనుకొనుట యుక్తమా? చిత్తరువులలో జరాసంఘుడు మొదలైనవారికి మీసములు చూపించియున్నవి గదాయని మీసము లున్నట్లు భావించుట యుచితమా? పూర్వపు గ్రంథములకంటె నవీనచిత్తరువులను ప్రమాణముగా భావించనొప్పునా? శ్రీకృష్ణుని మీసములవిషయమై పూర్వగ్రంథము లేవియు ఎవ్విధమైన సహాయము జేయలేదు గదా, యీసంశయ మెట్లు తీరగలదు?

సృష్టియందు పశుపక్షికీటకాదులలో పురుషజాతి స్త్రీజాతికంటె ఎక్కువ సుందరముగా గన్పించుచున్నది. ఆడుపక్షికంటె మగపక్షికే సుందరచిహ్నము లున్నవి:—కోళ్లలో పెట్ట నిర్వికారమైన యేకరంగుతో నున్నది. పుంజునకు రంగురంగుల యీకెలు, సొగసై వంగినతోక, తలపై ఎఱ్ఱనివర్ణము గల కిరీటము ఉన్నవి. చిలుకలలో ఆడుచిలుకకు లేని సుందరకంఠము మగదాని కున్నది. మగనెమలికి మెరయుచున్న కంఠము, తోకయందు పెద్దపించెములు నున్నవి. ఇంత యేల? సామాన్యముగా మనయిండ్లలో తరచుగా దిరిగెడు పిచ్చుకలలో మగపిచ్చుకకు చొక్కాకేటురంగు మెడక్రింద ఆనల్లనిమచ్చ యెంత యందము నిచ్చుచున్నదో చూడుడు. ఇటువలెనే మృగములందు మగసింగమునకు కేసరములు, మగపులికి చంపగడ్డాలు, మగయేనుగునకు తెల్లనిదంతములు, మగలేడికి దుప్పికి కణుపులకు కొమ్ములు, మగమేకకు, గొఱ్ఱెకు కొమ్ములు, ఆబోతుకు రెంటము సుందరచిహ్నములే. ఆలాగుననే మనుష్యజాతిలో మీసము గడ్డము పురుషచిహ్నములు. వీటిని దీసివేయుట గాని, యుంచుట గాని దేశకాలభేదములను బట్టి కలుగుచున్నది. పంజాబు, కాశ్మీరము మొదలైన చల్లనిప్రదేశములందు చలిశిరస్సునకు తాకకుండుటకై శిరోజములను, మీసములను, గడ్డమును బెంచుదురు. ప్రకృతిలోగూడ పశుపక్షికీటకాదుల శరీరమందున్న రోమములు శీతకాలములో ఒత్తుగను, ఉష్ణదేశములందు పంని గడ్డములు క్షౌరముచేయించుకోవలెను. లేకున్న చాలా చికాకుగా నుండును. ఈదేశములందున్నవిం నివసించువారు ఆదేశముల శీతోష్ణస్థితి కనుగుణ్యముగానే శిరోజశ్మశ్రువపనములవిషయమై శాసించియున్నవి. కావున శ్రీకృష్ణునికి మీసములున్నవా లేవా యని నిర్ధారణచేయునపుడు మన మిన్ని అంశములను బరిశీలించి యాని మీద సంశయ నివారణజేసికొనవలెను.

శ్రీకృష్ణుడు పురుషసింహుడని సర్వగ్రంథములు జెప్పియున్నది. కవుల వర్ణనయే కాదు. శ్రీకృష్ణునిచర్యలలో గూడ నా పురుషశ్రేష్ఠత్వమును వ్యక్తపరచియే యున్నారు. కంసవధాదిగా నిర్యాణమువరకు శ్రీకృష్ణుడు జేసిన కార్యములలో నేది పౌరుషమైనది గాదు? అనేకమంది శూరరాజులమధ్యనున్న రుక్మిణిని ఎత్తుకువచ్చి రాజులనందరిని బారదోలి యామెను బెండ్లియాడుట పౌరుషముగాదా? తనయందు మోపిననిందను బాపుకొనుటకై వెళ్లి యిరువదియొక్కదినము జాంబవంతునితో మల్లయుద్ధముచేసి వానినోడించి శ్యమంతకమణిని దెచ్చుట పౌరుషముగాదా? ఏడు ప్రహారములను ఆబోతులకు నొక్కసారి రంకెవేసి వాటిని బట్టి త్రిప్పుట యాతనిశక్తిని వెల్లడిజేయదా? నరకాసురవధ, బాణాసురవధ మొదలయినవి శ్రీకృష్ణుని పరాక్రమమును, కుచేలుని దారిద్ర్యమును బాపుట త్యాగశీల పౌరుషములను వ్యక్తపరచుచున్నవి. అన్ని గుణములయందును పౌరుషమును వెల్లడిచేయు స్వామిని పురుషసింహుడనుట విమిటంత? అట్టి పురుషసింహమునకు మీసములు లేకపోవుట యెందువలన? మీసములు గొరిగించుకునే యాచారము నవలంబించిరేమో యనియా?

ఆకాలమున మీసములు గొరిగించుట యవమానము. రుక్మిణిని ఎత్తుకపోవుచున్న శ్రీకృష్ణుని రథముపై కురికిన రుక్మిని గట్టి చంప నుద్యుక్తుడైన శ్రీకృష్ణుని రుక్మిణి వేడుకొనినది. అందుపై వానింజంపక 'గడ్డం

గాన మీసంబును పెరయును రేవులు వారగొరిగి విరూ పించెను. అందుపై బలభద్రుండు వారినిజూచి,

'పలమును ఘాతియను గొరుగుట
తలమొలుచుట కంటె గుచ్ఛతరము మహాత్మా!'

యని చెప్పెను. దీనిని బట్టి యాలోచించగా రుక్మికి మీస మంటేనని, ఆమీసమును గొరుగుటచే వానికి శిరచ్ఛే దనముకంటె నెక్కుడగా నవమానము గలిగెనని కన్పించు చున్నది. అందుచే నాకాలపు పురుషుల కెల్ల మీసము లుండెవని, అవి తీయించుట యవమానాస్పదమని వ్యక్తమ గుచున్నది అట్టి యవమానాస్పదమైన శ్మశ్రువపనమును పురుషసింహుడైన కృష్ణుం డేల యవలంబించును?

పోనీ, శ్రీ కృష్ణునకు గొంపెరివలె ముఖముపై వెంట్రుకలు పుట్టలే దనుకొందము. ముఖముపై వెంట్రుకలు లేని పురుషుని పేడివాడని యందురు. అట్టివాని ననాదరణ చేయుదురు. వానినే షండుడని కూడా నందురు. షండులు స్త్రీల యంతఃపురములలో పరిచారకులుగా నియోగింపబడెడివారు. రాజ సభలయందు వారికి గౌరవములేదు. అర్జునుడు ఇంద్రలోకమం దుండగా నూర్వశి యతని 'షండుడవు' కమ్మని శపించెను. అజ్ఞాతవాస సమయమున నర్జునుడు తాను వేయబోవు వేషము నిట్లు వర్ణించెను:—

'ఇమౌ కిణీకృతౌ బాహూ జ్యాఘాతతలపేడనాత్,
నిత్యం కంచుకసంఛన్నౌ నాన్యథా గోప్తు ముత్సహే.'

* * * * *

'ఊర్ణే కంబూ ప్రతీముచ్య కుండలే పరిపాతుకే,
వేణీ కృత శిరా భూత్వా భవిష్యామి బృహన్నలా.'

రవిక తొడిగికొని తలజుట్టు జడవేసికొని చెవులకు గుండలములు పెట్టికొని బృహన్నల నగుదు నన్నాడు. ఇచ్చట తనమీసము గడ్డముల విషయమై చెప్పలేదు గాని స్త్రీవేషధారణమును జేయుచున్నప్పుడు మీసములు గడ్డములు తీయించెదనని ప్రత్యేకముగా జెప్ప నవసరము లేదు. అయినను దెనుగుభారతమం దీవిషయమై స్పష్టముగా వక్కాణింపబడి యున్నది.—

'చనుదెంచి పేడితనమును,
వనితారూపంబు నమర వాసవసుతుఁ డా
మనుజాధీశునకు సభా
జనులకు దనుఁ జూపి మందసంచారమునన్.'

పేడితనమనగా మీసము గడ్డములు లేకపోవుటయే. తరువాత నాడుదానివేషము. ఇట్టివారు నేటికిని మా జయపురమందున్నారు. వీరికి బెజ్జువాండ్రందురు. వీరు ఘోషాగల యాడువాండ్రకు తలదువ్వుట, పువ్వులు ముడుచుట మొదలైనపనులు చేయుదురు. వీరుగూడ నిత్యము స్త్రీలవలె నలంకరించుకుని పువ్వులు ముడచుకుని కన్పించుచుందురు. ఆడువారు గాని మగవారు గాని వీరికి గౌరవముజేయరు. చాల న్యూనతతో జూచెదరు. బృహన్నల వేషధారులు గౌరవార్హులుగారని మనగ్రంథములందు గూడ నున్నది. పేడివానిజూడరాదట. మార్కండేయపురాణము, సదాచారాధ్యాయములో,

'అభోజ్య సూతికాషండ
మార్జారాఖూశ్చ కుక్కుటాన్,
సంస్పృశ్య శుద్ధ్యతే స్నానా
దుదక్యాగ్రామసూకరౌ.'

షండులను జూచిన భోజనముచేయక స్నానముచేయవలెనట. అప్పుడాదోషము తొలగునట. అందుచేతనే యుత్తరుడు నేను పేడివాని జూడ నంటాడు.

'సైరంధ్రి జానామి మమ వ్రతం వా
క్లీబేన పుంసా నహి సంవదా మ్యహమ్.'

ముఖమందు వెండ్రుకలు పుట్టకపోతే మగవానికి గౌరవములేదు, వాని మొగము జూడగూడదు, వానితో మాట్లాడగూడదు. ఆడుదానికి మీసముంటే యెంత యాక్షేపణయో మగవానికి మీసములేకపోతే యంతయాక్షేపణయే. అకాలమందు శ్రీమన్నారాయణుడని యందరివలనను గౌరవమునుబొందిన శ్రీకృష్ణుడు పేడివాడెట్లు యియుండును? పౌరుషచిహ్న మొక్కటియైన లోపమున్న అంతగౌరవము బడయగల్గునా!

అర్జునుడు బృహన్నలవేషమందు పేడివాడైయుండెనని చెప్పుటచే సహజముగా నతనికి మీసము లుండెడివనియే స్ఫురించుచున్నది. కృష్ణార్జును లిద్దరు సమానరూపసులని, నరనారాయణులని చెప్పుట యందరకు దెలిసినదే. అర్జునునకున్న పురుషచిహ్నములు శ్రీకృష్ణునకు గూడ నుండవలెగదా? నరునియందు చిహ్నమైన మీసము నారాయణునకుగూడ నుండవలె. ఇట్లు సమకాలికులైన యితరపురుషులతో సరిపోల్చి చూచినను, మీసము లుండుటచే గౌరవా గౌరవములను తర్కించి చూచినను శ్రీకృష్ణునకు మీసము లుండెడివనియే తేలినది. ఇక మీసము లుంచుటచే గలిగే లాభములను జూతము.

దానధర్మమనే గ్రంథములో,

"...కేశశ్మశ్రుధారయతా మగ్ర్యాభవతి సంతతిః."

క్షౌరముచేయించుకోకుండా ఉండువారికి వేగము సంతతి గలుగునట. భార్య గర్భవతియై యుండగా భర్తలు వపనకర్మ చేయించుకోరు కొంతమంది. రుక్మిణియందు సంతానమును బడయగోరిన శ్రీ కృష్ణులవారు మీసములు జుత్తుతీయించియుందురా? మీసము దీయించవలెనంటె యొక్కశిఖ తప్ప తలంతయు గొరిగించవలెను. ఇందువిషయమై గోభిలు డిట్లనుచున్నాడు:

'కేశశ్మశ్రులోమనఖాని వాపయీత శిఖావర్జం' అని. శ్రీకృష్ణుడు మీసములను దీయించినాడే యనుకొందము. అందుచే శిఖయొక్కటి వదలి తలయంతయు గొరిగించుకొని యుండవలెగదా! అట్లయిన శ్రీకృష్ణునకు ముంగురు లెట్లుండును? శ్రీ కృష్ణుని విగ్రహములకు తలనిండ జుత్తు, ముంగురులు జూపెదరు. తలనిండ జుత్తు, ముంగురు లుంచుకొని మీసములు గొరిగించుట యశాస్త్రీయమని పైని జూపియేయున్నాము. ఇది అనగా శ్రీ కృష్ణునకు మీసములుండెడివని శాస్త్రపరిశీలనమున దేలినది.

లేవను వాదన జేయువారి కీశాస్త్రము పనికిరాదట. రవివర్మగారు చిత్రించిన పటములలో శ్రీ కృష్ణునకు మీసము లుంచలేదట. ఇదే వారివాదనకు ముఖ్యప్రమాణము! రవివర్మగారి చిత్తరువు లెంతవరకు నిందువిషయమై ప్రమాణములు కాగలవో పరిశీలింతము. శ్రీరామాయణ కథను ప్రదర్శించు చిత్తరువులు కొన్ని రవివర్మగారు చిత్రించియున్నారు. [illegible] శ్రీరాముని యరణ్యవాసమును జూపు చిత్తరువులు కొన్ని [illegible]. శ్రీరామలక్ష్మణులను జటలతో [illegible]యున్నారే గాని మీసములు గడ్డములతో [illegible]. [illegible] గున్న పదునాలుగేండ్లు [illegible] ణసంహారము చేసి తిరిగి స్వగ్రామమునకు [illegible] మునకు ముందు వలుపు [illegible] యించుకొనినట్లు రామాయణమునం దున్నది.

"తతః శత్రుఘ్న వచనాన్నిపుణాః [illegible], సుఖహస్తాః సుశీఘ్రాశ్చ [illegible]."

యుద్ధకాండము, సర్గ ౧౩, శ్లో. ౧౩.

అయినప్పటికి వనవాసదినములలో [illegible] రవివర్మగారు మీసములు, గడ్డములు [illegible] వాక్కు ప్రమాణమా, లేక రవివర్మగారి చిత్తరువులు ప్రమాణమా? ఇటువలెనె రవివర్మగారి చిత్తరువులను, శాస్త్రమునకును, గ్రంథములలోని వర్ణనలకును [illegible] చూపవచ్చును. క్రీ. శ. ౧౯-వ శతాబ్దాంతిమమున వ్రాయబడిన చిత్తరువులు క్రీ. పూ. ని ౩౦౦౦ సంవత్సరములలోనో యుండియున్న వారి రూపములను వారు ధరించిన బట్టలను మొదలైనవాటిని యథార్థముగా ప్రదర్శింపగలవా?

క్రీ. పూ. ౨౦౦ సంవత్సరమునకు పరిమితముగాను బౌద్ధ జైనాది మతప్రచారములవలనజనుల యాహారవిహారములందు మార్పులు రావలసివచ్చెను. అంతకు పూర్వము గృహస్థాశ్రమమును త్యజించదలచువారు జటావల్కలములు ధరించి వనవాసమునకు బోవు నాచార ముండెడిది. బౌద్ధమతప్రచారము గలిగిన తర్వాత సర్వసంగపరిత్యాగులు ముండనము చేయించుకొని కాషాయవస్త్రములు ధరించి చిప్ప చేత బట్టుకు పర్యటన మొనరించు టాచారమైనది. మతాచారములు గూడ దేశకాలములనుబట్టియే యేర్పాటగుచుండెను. ఉష్ణదేశములందున్నవారు తల మొగములనిండ జుత్తుపెంచి ఒంటెనిండ బట్టగట్టుట జేయలేరు. శరీరమందు రోమములున్నను గూడ వారికి చికాకే,

అందుచే పిషిషాదిని పంచశిఖావిషనము ఆచారమైనది. చలిప్రదేశముందున్నవారు శరీరమును ముఖ్యముగా శిరస్సును, చలినుండి కాపాడుకొనుటకై తలపైబెట్టు, ముఖమున్నను మీసములను, గడ్డము పెంచుదురు. ఇది ప్రకృతిస్వభావము. నానా దేశముల వారిలోనున్న రోమనయము కన్న శకాలమునందు హెచ్చుగ యున్నది. అపవిత్రప్రదేశము లందున్నవారు యాపిడిజంతువుల శరీరములపైనున్న వెంట్రుకల నిక్కగినబట్టి యోగానంవత్సరపు శీతకాలములో గలి మంచుగానుండునో లేక తక్కువగానుండునో తెలిసికొనగలుగుదురు. అందుచే నుత్తమాంగమును చలినుండి ముఖ్యముగా గాపాడవలెను. ఉష్ణదేశములందున్నవారు తలను బోడిగాచేసుకొని, సీమ మొదలయిన దేశములు పై వచ్చినపుడే చుట్టగా అంగుగల టోపీలు ధరించుట మొదలగునవి దేశకాలములబట్టి వచ్చిన యాచారములు. పంజాబు, కాశ్మీరము మొదలయిన యుత్తరహిందూదేశములందున్నవారు జుత్తును, మీసములను, గడ్డమును పెంచుకొనుటయేకాక తలనిండ చెవులను గప్పి పాగా చుట్టుకొందురు. ఈయంశముల నాలోచించి చూచినను మధుర, బృందావనము మొదలయిన ప్రాంతనివాసులకు మీసములు,తలనిండ జుత్తుఉండుట యవసరముగా గన్పించుచున్నది. ఆప్రాంతనివాసియైన శ్రీ కృష్ణునికిమాత్ర మెందులకుండవని యూహించవలెను?

గరుడపురాణము ౬౬ అధ్యాయమున "నిమ్నాంవ క్త్రి మపుత్రాణాం కృపణంచ హ్రస్వకం, సంపూర్ణం భోగినాం కాంతం శ్మశ్రుస్నిగ్ధం శుభం మృదుః" అని మీసములను బట్టి పురుషలక్షణములు చెప్పబడియున్నవి. మన తెలుగులో సహేతుకము ముఖమందుద్భవించే వెంట్రుకల జ్యోతిష్యపలవనలకు చేర్చున్నవి. ఒక్కమూతి మీదను, గడ్డముపైన మాత్రమే పలచగా వెంట్రుకలు మొలచిన నది పిల్లిగడ్డమని, తాతారతూతియని యందురు. కొంచెము చెంపలపైనగూడ పలచపలాచగా రోమము లున్న నది దాడారనూదియట. సంపూర్ణముగా చెంపలనుండి దిగువకు దట్టముగా మూతిమీదనుగూడ వెంట్రుకలు మొలచిన నది బవిరిగడ్డమట లేక శృంగారవేణియట. ముఖమున కందమిచ్చునది బవిరిగడ్డమేగాన దానికి శృంగారవేణియని సార్థకనామము. పురుషునికి శృంగారమిచ్చున దిదియే. శ్రీ కృష్ణుడు మహాభోగి; శృంగార పురుషులలో నగ్రేసరుడు. స్త్రీలు అతని మోహించి పడేవారు. అట్టిపురుషునకు మీసములు లేవని ఎట్టులూహించవలెను? శ్రీ కృష్ణునకు దట్టమై, మృదువై, శృంగారమునిచ్చు మీసమున్నదనియే నిశ్చయము. శ్రీ కృష్ణస్వామికి మీసములు లేవని వాదించుట కేమీ నాకు ఆధారములు గన్పించలేదు.

ఇంతకీ, మీసములు, అంగరఖా, లాంగుకోటు, మేజోళ్లు, ఇవిగావు వేషమునకు గౌరవమునుగాని, యగౌరవమునుగాని దెచ్చునవి. ఏవేషమును వేసినవారా పాత్రయొక్క భావములను సరిగా, యుక్తముగా ప్రదర్శించిన నాపాత్రకు మెప్పు, గౌరవము వచ్చును. నవరత్నఖచితమైన యలంకారములు ధరించి చీని చీనాంబరములు గట్టి వోయిలుబట్ట మేలిముసుగువేసి రంగస్థలమునకు వచ్చిన సత్యభామగాని మరి యేయితర స్త్రీవేషముగాని పురుషునివలె ఛాతీవిరుచుకుని నడుస్తూయుంటే ప్రేక్షకులకు ఏమితోచును? అందువలన వేషముయొక్క లాభములేదు. పాత్రపోషణవలన లాభము, గౌరవము, మెండు. అందుకు దోడు ఆకాలమున కనుగుణ్యమైన యలంకారములు, బట్టలు ధరించుటవలన పాత్రకు గౌరవము హెచ్చుగుటయేకాక ప్రేక్షకులకు ఆకాలమందున్నట్లే తోచును. ఆలాగునని యజంతా మొదలైన గుహలలోని చిత్తరువులవలె నిప్పుడు స్త్రీవేషములను తయారుచేయుట యుక్తముగాదు; మర్యాదగాదు. వేషమును ధరించువారు వారు ప్రదర్శించు పాత్రయొక్క వయసునుగూడ వారివేషమునందు జూపవలెను. శ్రీ కృష్ణుని చరిత్రయందు దనేకక్రీడలు నాటకములుగాను, యక్షగానములుగాను వ్రాసియున్నవి. వాటినే రంగస్థలములయందు ప్రదర్శించుచున్నారు. రాసక్రీడ, గోపికావస్త్రాపహరణము, కాళీయమర్దనము, కంసవధ మొదలైనవి శ్రీ కృష్ణునకు యుక్తవయస్సు రానికాలములోని చర్యలు. ఈ నాటకము లాడునప్పుడు శ్రీ కృష్ణవేషధారి మీసములతో రంగస్థలమునకు వచ్చిన ఆక్షేపణీయము. చేతిలో శంఖ, చక్ర గదా శార్ఙ్గములలో నేదైన

బట్టుకువచ్చిన అక్షేపణీయము. రుక్మిణీకల్యాణము, గయోపాఖ్యానము, శ్రీకృష్ణ తులాభారము, నరకాసురవ్యాయోగము మొదలైనవి శ్రీకృష్ణునకు వివాహయోగ్యవయస్సు మొదలు వయస్సు వృద్ధిజెందు కాలము నాటిచర్యలు. ఈ నాటకములను ప్రదర్శించునప్పుడు శ్రీకృష్ణుడు పోకముడి, శిఖిపింఛము, చేతిలో పిల్లనగ్రోవితో గన్పించిన దూష్యము. వెనుకటికి గయోపాఖ్యాప్రదర్శనముకు నే వెళ్లవలసివచ్చె. శ్రీకృష్ణవేషధారి శబరివానివలె జుత్తంతయు నడినెత్తిని ముడివేసి దానిపై నెమలిపింఛమును బెట్టి, యాముడిచుట్టు పువ్వులుచుట్టికొని చేతిలో చక్రముబట్టుకొని రంగస్థలమునకు వచ్చెను. వేషము ఎంత పొందుకగా నుండెనో చదువరులే గ్రహించవచ్చును. నేనుమాత్రము శబరివేషమునకు న్నాను. ఇట్లు మనయూహలనుబట్టి శ్రీ కృష్ణవేషమే గాదు, ఏవేషమునైన వేయరాదు. గ్రంథములు మూచి యందు జెప్పినట్లు గ్రహించి వేషమును వేసిన బాగా నొక్కగా నుండును. ఆక్షేపణజేయువారుకూడ శాస్త్రము ననుసరించి యాక్షేపణజేసిన ఆయాక్షేపణ మాననీయ మగును.

---

# కుంతి కృష్ణునితో

పానుగంటి విజయరాఘవరావుగారు

వందనము కృష్ణ! పాండవ పక్షపాతి

*    *    *    *    *

*    *    *    *    *

*    *    *    *    *

ఆడుగునగత్య మే మదిని
నంతగ లే దయినన్, మురాంతకా!
అడవుల నెవ్వరుం బడని
యాపదలన్ దుదముట్టఁ గాంచి, నా
కొడుకులు, కోడలున్, మగిడి
కూడును గుడ్డను, మెక్కఁ గట్టఁగాఁ
బుడమి సగంబు కోరి, నిను
పొమ్మన—వచ్చితే రాయబారిగన్?
కురుసభలోన నాఁడు తమ
కూరిమి నెచ్చెలి జ్ఞాతిచే దిగం
బర యయె, నయ్యొ! నానుతులు
పౌరుష హీనులె కాకయున్న, ని
త్తరి శరమే శరణ్య మని
ధర్మ మధర్మము పీటఁబుచ్చి, సం
గరమునఁ బుచ్చుకోరె ధర?
కంసవిమర్దన! దేవుఁ డుండఁడే?
దారసోదరసహితుఁడై తా నడవిఁ జ
రించుకష్టచయంబు నటుంచు—కృష్ణ
తలఁచునే ధర్మసుతుఁడు నే తలను దాఁచు
కొన్న నాబావగృహమున నున్న తెఱఁగు?
గాండివము గదయును కాల్చి కటకటా! వి
జయుఁడు, భీముఁడుం బాలుచంద మంది
వేఁడ పొమ్మనిరె నిను పృథ్విని సగంబు?
చెప్పలే తడవనుచు వచ్చితివె నీవు—
ఈసుయోధనుఁ డతి లోభి, యెంతో గర్వి;
ఈఁడు నివ్వరిముల్లంత యేని ధరణి:
ఏల వానిని వేఁడగా నేగుదయ్య?
ఇందు నందఱు మనవారె—యేమిఫలము?

నాయు వేళకు నొక్కఁడు పలుకఁ డప్పు
డాసభను చూచితివి కాదె? అంద ఱుండి
ఒక్కవిదురుఁడు తక్క వే రొక్కఁడైన
నోరు విప్పెనె? యెఱుఁగవే వీరిఁ గృష్ణ?
ఒక్కఁడవు నీవుపోక కే నొప్పుకొనను-
దేవుఁడవు నీవు, నా వెఱ్ఱి దేవులాట
కాని, నినుఁ గాక నెవ్వరు కలరు కృష్ణ!
ఈ మహాత్ములఁ గావంగ నెవరు కలరు?
వారి దైవాంశమే వారి పట్టుఁగొమ్మ.

*    *    *    *    *

గాండివము చెదపట్టి పోకుండ, భీము
బాహువులశక్తి మార్వడిపట్టకుండ,
నేఁడిరక్తాలతో పొంగు వాఁడిమగలు
కనలు నిస్పృహాపడకుండ, కడకు ధర్మ
పుత్త్రుధర్మము మసలిదై పోవకుండ,—
అబలయాజ్ఞసేని ఘోరాభవాగ్ని తమక
నోర్ణరక్తనాళాల నొక్కొక్కమాఱు
తన్నుచున్నప్పుడే, రాజ్యతృష్ణ తమ్ముఁ
బాయనప్పుడే రమ్మను బావ ననికి.

రాచరవి పశ్చిమాంభోధికి రాకమున్నె
పౌరుషాగ్నిపై నివురు కప్పకయె మున్ను
అనికి రమ్మని బావతో ననుము కృష్ణ!-
'ఈ నెలఁత యింతలాడునే యెంత వింత'
అనుచు భీముఁడి నేయఁగాఁ జనదు; వీర
మాత నేఁ గాన! స్త్రీలె యీ పూతమైన
భరతదేశాన సౌభాగ్యభరిత లయ్య!

కలము కత్తులు గరిటెతోఁ గలియఁగట్టి
కవులసభలందు, ధర్మసంగరములందు
పురుషుచేతిని చేఁగల్పు పొలఁతుకలు జ
నింత్రుగాక! భారతమాత నింగి పొంగ.

*    *    *    *    *

ఇంతదూరము నే నాడు తెందు కనిన-
అబలయే యుద్ధ మాసింప- నకట! పరిభ
వంపు బరువునఁ గ్రుంగిన పాండవులకు
ప్రథనమే ముందుటడుగని పలుకుటకును-

అయిన మనలోన మనమాట- అబలఁ బలువి
ధంబులఁ జెఱచు పాతకధరణిపతుల
కపజయం బనుమాట నే ననఁగ నేల?
పరుని నేదో విధంబున చెఱచి, రాజ్య
రమును బలిమిమై పొందు నారాజవరుల
కపజయం బనుమాట నే ననఁగ నేల?

పరుని దేశసౌభాగ్యసంపద హరించి
వానిసంపద వాఁ డనుభవము పొంద
కుండ నంతయు తననోటఁ గ్రుక్కుకొనెడు
వాని కపజయంబని నేను పల్క నేల?

*    *    *    *    *

ధర్మమును సత్యమా నీవు ధర్మరాజు
పక్షమైతివి-జయముకై భయ మదేల?
దేవుఁడవు ధర్మమవు నీవు తేరు నడప
పార్థు జయఘంట యాకాశపథములందు
గోళముల గానరుతిలోన మేళవించు—

# ఆఱువణ్ణెళుజ్గణ్ణాడ మన్ధ్రముకాదా? అది యాంధ్రముకాలేదా?

ఆంధ్రచరిత్రచతురానన చిలుకూరి వీరభద్రరావుగారు

౧

" తెలుఁగెఱుఁగఁడు సంస్కృతంబు తెన్నె మెఱుఁగున్?"

అత్యంతప్రాచీనకాలమునుండియు అంద్రులును అంధ్రులును, జంటతెగలుగ నొక్కచోటనే నివసింపుచు వచ్చిరని సంస్కృతవాఙ్మయమునుబట్టియు, బౌద్ధజైనవాఙ్మయములను బట్టియు, పౌరాణికవాఙ్మయమును బట్టియు, విదేశీయచరిత్రకారుల వ్రాతలనుబట్టియు గన్పట్టగలదు. అంద్రులా? అంధ్రులా? ఎవరు ప్రాచీనులని ప్రశ్నించినప్పుడు ప్రాచీనమన్వంతరములచరిత్రము తెలియనప్పుడెవ్వరు ప్రత్యుత్తర మీయఁగలరు? ఆర్యులకు బూర్వమర్యు లున్నట్లుగానే యాంధ్రులకు బూర్వ మంధ్రులున్నారనుట సత్యమునకు దూరము కాదు. ఏవ్యాకరణ సూత్రము ననుసరించి సంస్కృతభాషలో నర్యశబ్దమార్యశబ్ద మగుచున్నదో యాసూత్రము ననుసరించియే యంధ్రశబ్ద మాంధ్రశబ్ద మగుచున్నది. అర్య, అంధ్రశబ్దములు సంస్కృతశబ్దములుగా గన్పట్టుటచేత సంస్కృతమునకు జేరకపూర్వ మేస్వరూపముతో నుండెడివని ప్రశ్న పుట్టకమానదు. ఈరెండుశబ్దములలోను రేఫ మెట్లువచ్చినదను మఱియొక ప్రశ్నయుగూడ బుట్టగలదు. అరియశబ్దము అర్యయైనది. అందరశబ్దము అంద్రయైనది. అంధరశబ్దము అందరశబ్దముయొక్క రూపాంతరము. అంద్రశబ్దము అంద్రశబ్దమునకు రూపాంతరము. అంధరశబ్దము అంధ్ర యగుచున్నది. అసురజాతులవారు అంద్రశబ్దమును అర్యశబ్దముగ మార్ప దేవజాతులవారు ఆర్యశబ్దమును దెచ్చి అర్యశబ్దమును అంధ్రశబ్దముగ మార్చిరి. అసురదేవజాతుల మిశ్రణమువలన నేర్పడిన బలాఢ్యులగు బ్రాహ్మణక్షత్రియులగు తెగలవా రాంధ్రశబ్దమును లేవదీసిరి. అరియకు బూర్వరూపము అఱియ. ఈ అఱియ యెట్లేర్పడినదో దీనిసమూలవృత్తాంతము దెలిసికొనవలసి యున్నది. దేశభాషాప్రత్యయములగు అణ్ణ్, అణ్, అళ్, అఙ్ఙ్ లేక అఙ్ప్రత్యయను లొకదానికంటె నొకటి యుత్తరకాలము నందేర్పడినవైనను అఙ్ప్రత్యయమునకు నెక్కువ గౌరవము గలదు. అఱ + అణ్ణ అను రెండుశబ్దముల సంయోగమువలన అఱణ్ణశబ్ద మేర్పడుచున్నది. అసురభూతజాతి అణ్ణభూతజాతి సంయోగమువలన అఱణ్ణభూతజాతి యేర్పడినట్లుగా దెలియవలెను. అందువలన అఱణ్ణు లయినారు. అఱవోట్టులు వీరే. అఱణ్ణి, అఱట్టి, అఱవట్ట శబ్దములను పరిశీలింపుము. అఙ్ఙ్, అణ్, అన్, అళ్, అను ప్రత్యయముల పరిణామము ననుసరించియు అఙ్ఙ్వారు లణ్వారులై, అన్వారులై, అళ్వారులైరి. అణ్ణుభూతములనుండి అణ్ణుభూతములు పుట్టినవి గనుక పైసూత్రము ననుసరించి అఙ్ఙ్వారు లణ్వారులై, అన్వారులై, అళ్వారు లనుచున్నారు. అఱియ అర్యయైనట్లుగానే అఱియ ఆర్యయైనది. పూర్వము నసురులు వారలు అఙ్ఙ వారనికూడ వ్యవహరింపబడు చుండెడివారు. అఙ్ఙి, అణ్ణశబ్దము లసురజాతివారి యుచ్చారణమున అజ్జి, అజ్జ శబ్దములుగ నుచ్చరింపబడు చుండెడివి. అసురజాతుల వారు తమ దేవుని 'అష్షర్'అని వచించిరి. అఙ్ఙర్ శబ్దము అజ్జర్, అష్షర్ అనికూడ వ్యవహరింపబడినది. ఈ అష్షర్ శబ్దమె వేదములలో అసురశబ్దముగా నున్నది. ఈ అష్షర్ శబ్దమె మఱికొన్ని తెగలవారి యుచ్చారణమున ఈష్షరయి యయ్యది ఈశ్వరశబ్దముగా సంస్కరింపబడి వైదికభాషలోనికి జేర్చబడినది. ఆంగ్లభాషలో ass (గాడ్దె) అనుపదమును, ash (బూడ్దె) అనుపదమును ఈ అష్ పదముయొక్క రూపాంతరములో అన్నట్లు గన్పట్టును. చిరకాలార్జితమైన యీ యసుర విజ్ఞానమును మఱచిపోకుండుటకై యీశ్వరారాధనా నిమగ్నులగు వారు తచ్చిహ్నముగా తమమోముల నిప్పటికిని విభూతి రేఖలతో నలంకరించు కొనుచున్నారు. విభూతి (బూడ్దె) యైశ్వర్యప్రదమైన దనుట కిదియె కారణము. కొన్ని వేదమంత్రములలో నింద్రునకు, నశ్వినీదేవతలకు గాడ్దెలను

సాహసములనుగా జేయుట కిదియొ కారణమై యుండవ లయును గాని యన్యము గాదు. వారు గాంధారులను కారు; వీరు పర్వతీయులు గారు. వారును వీరును మనుష్యులే. అసు రజాతులవారు గొలుకొల్ల శాస్త్రియులుగ నుండిరి. శాస్త్రే యులను బ్రాహ్మణులను ఆచార్యు లనిరి. తెలుగులో ఆచాది సాంప్రదాయము. ఈశబ్దమునకు 'అక్' ప్రత్యయమును జేర్ప గా ఆసాంపియక్, ఆసాగియక్, ఆచారియక్, ఆచార్యః అని కాలక్రమముగా మార్పులు కలిగినవి. 'ఆచారియ' అను వ్యావహారికపదమె 'ఆచార్యః' అని సంస్కరింప బడి వైదికభాషయందు చేర్చబడి నేడు ముఖ్యముగా వైష్ణ వగురుపరంపరకు నామముల ప్రఖ్యాతమగుచున్నది. తమిజ్జిశబ్దము తమిష్షి శబ్దముగను వ్రాయబడినది. చోణ్ణి చోష్షిగను, కోణ్ణి కోష్షిగను నుచ్చరింపబడుటకు నిదె చెప్పి నదే కారణము. ఈ 'తమిజ్జి' శబ్దమే దేశభాషలలో 'తమిళ్'గాను, 'దమిళ్'గాను మారినది. తమిళ్ భాష యఱవలచే సంస్కరింపబడినదైనను నఱవభాష కాదు. అఱవభాష పైశాచిప్రాకృతము. అఱవపదము తమిళ పదమునకు బర్యాయపదము కాదు ఆంధ్రకర్ణాటకులు తమిళము నఱవమనుట తెలిసికొనుకొనుటయిది కాదు. తమిళ భాషాశాస్త్రులు తమభాష నఱవమనుట యొప్పుకొనరు. ఒక్క సింహళదేశముననే కాక ప్రాచీనపుకాల్డియా, మిశిరూ, సుమేరియా మొదలగు దేశములలోగూడ తంపు, మింబు, నూతజాతుల కలయికవలన నేర్పడిన తమిజ్జీనూతజాతివారివలన తమిజ్జీనూత నారాధింప బడుచుండెడిది. అసురజాతివారిచే అజ్జీయని యుచ్చ రింపబడెడి అజ్జిశబ్దము అవేస్థాభాషలో అఝి (ajhi) అనియు, వైదికభాషలో (వేదము) అహి అనియు వ్యవహరింపబడినట్లు గన్పట్టుచున్నది. అహి అనగా వృత్రాసురుడనికూడ జెప్పబడుచున్నది.

ఇంక 'అణ్డర' శబ్దమునుగూర్చి పరిశీలింతము. దీనిపూర్వరూపము 'అణ్డర' యనునది. అణ్డ + అరశబ్దము లను గలిపిన 'అణ్డర' శబ్ద మగుచున్నది. అణ్డర, అణ్డార, ఆణ్డర, ఆణ్డార శబ్దము లేకార్థమును దెలుపునవియై యున్నవి. 'అణ్డర్' (ander) శబ్దమునకు గ్రీకుభాషలో మనుష్యుడని యర్థము చెప్పబడినది. అణ్డార, ఆణ్డార శబ్దములకు తెలుగు, కన్నడ, తమిళభాషలలో దేవుడు, గురువు, ప్రభువు, యజమాని యనునర్థములు గలవు. ఆహా! ఈశ్వరసృష్టిలో మానవప్రతిభ యిట్టిదని యేమా నవుడు వ్యక్తీకరింప నేర్చును? నేను నాబాల్యములో నొకప్పుడు తోడిబాలురతో గూడి బంతులాట లాడు చుండగా నేదో యభిప్రాయభేద ముదయించి బాలు రెల్లరును వాగ్వాదనలకు దిగి చేతులు కలుపుకొనువఱకు వచ్చినపు డొకబాలుడు మఱియొకబాలునిపైబడి 'ఐసర్ మజ్దా' యని యఱచి తనపిడికిలితో నొకగ్రుద్దు బలి మితో గ్రుద్దుటను నేను గండ్లార జూచితిని "ఐసర్ మజ్దా అన్నావే, యేమిటది" యని నేను తరువాత వానిని ప్రశ్నించితిని గాని దానియంతట నది తననోటనుండి వెడలెనే గాని దానియర్థము తన కేమియు దెలియదని చెప్పినాడు. తరువాత నెందఱుపండితులనో యడిగి చూచితిని గాని యెవ్వరును తృప్తికరముగ బ్రత్యుత్త రము చెప్పజాలకుండిరి. ఇప్పుడు దానియర్థము నాకు జక్కగా బోధపడినది.

ఇప్పటికి రెండువేల యేనూఱు సంవత్సరములకు బూర్వమె అరియణ్ణులను నర్యజాతులవారు 'అసురమగాం ద్రుని' తమ ప్రియదైవమునుగా నారాధించుచుండిరి. ఈ యసురమగాంద్రునే అవేస్థాభాషలో 'అహుర్ మజ్దాః' యని ప్రశంసించిరి. అచ (అక) మీనియన్ సామ్రాజ్యా ధిపతియగు దరియవసు (Darius - దర్వసు) ఈ యసు రమగాంద్రుని భక్తుడే. ఇతడీయొక్క దేవునే నమ్మి భక్తి విశ్వాసములతో గొల్చినవాడగుటచేత దన జీవిత కాలములో నఖండ దిగ్విజయమును గాంచెనట. నేను 'అహుర్ మజ్దాః' యని ప్రశంసింపబడిన దేవుని (విశిష్టా ద్వైతము లేక ద్వైతము ప్రకారము పరమాత్మను) అసు రమగాంద్ర యని నేటతెలుగులో ప్రశంసించుట కొంచెఱ కాగ్రహకారణము కావచ్చును. కొందఱు పరిశోధకుల పరిశోధనలలో మాత్రమే కాక దరియవసు పహ్లవీశాసనములలో అర్మజ్దా (Ormazda) అని ప్రశం సింపబడుచుండలేదా? 'మగాంద్ర' అని నేను ప్రశంసిం చుటకు నాకు కొన్ని కారణము లగపడుచున్నవి. ఐరేని యన్ తెగలలో (అఱియణ్ణులు) ప్రముఖులయిన మిడులు

లిచ్ఛవులతో (శ్రీ) లక్ష్మీ భరతఖండమున నవతరించినదను మాట సత్యమున కంతదూరమైనది కాదు. ఈలిచ్ఛవు లెక్కడివారో తెలిసికొనవలయునని భారతీపత్రికయం దిదివరకే కొన్నాళ్లు వివరముగా చర్చించియే యున్నాను. (భారతీసంపుటము ౧, సంచిక ౪ చూచుకొనుఁడు.) లక్ష్మీశబ్దమున కనేకపర్యాయపదములు సంస్కృతమున గాంచబడియుండుటచేత నేని మంటిలో యేది వెను కటికిలో నిరూపింప సాధ్యముకాదు. ఈలిచ్ఛవులయొక్క జన్మస్థానము సుస్యాసిలాఖండములోని చీవన్ లేక షీయిగన్, అనగా మంగోలియా ప్రదేశమై యుండునని కొందఱును, దానికి బహుదూరగా ప్రాచీనపారసీక మనగా నిసిబీసు (Nisibis) అను ప్రదేశమై యుండునని కొందఱును పరిశోధకులు వక్కాణించియుండుటచేత క్షీర సాగరమనగా ఆ ప్రాంతములనె పుట్టియుండవల యును. అదియును గాక, ఋగ్వేదములోని ఋక్కులును, పారసీలఅవేస్థాలోని యశ్నలును (ప్రశ్నములు లేక పన్నములు) రచింపబడుటకు పూర్వమె యీ అసురమహాం ప్రతత్త్వము నెలకొత్తియుండవలయును.

ఇప్పటిపారశీకము, ఆఫగనిస్థానము, బెలూచిస్థానము, బొఖారా, పామీరుపీఠభూమి, సింధు, కాశ్మీరము, పంజాబుదేశములు పూర్వము అరియన్ దేశముగా నుండెను. ఈ మహాంప్రతత్త్వమును మిథులనుండియు, పరిషియణ్ణుల (Perchioung) నుండియు గ్రహించి అసురమహాంగ్రుని పరమాత్మనుగా గ్రహించి యారాధింపసాగిరి. మిథులయొక్కయు, పరిషియణ్ణులయొక్కయు గురువులనే మహాలని మగీలని వ్యవహరించుచుండిరి. ఈమహాంప్రతత్త్వమును తొలుత ప్రతిష్ఠాపించిన దీసరువులే. అసురజాతులవారిసంపర్కము పణిపాంగులకు, దేవజాతులవారిసంపర్కము మిథులకు నెక్కువగా సంభవించుటచేత వీరిలో వీరికి భేదము లెక్కువగా పొడసూపినవి. ఇచ్చటనే వేర్వేఱుతెగలవారు వేర్వేఱు నామములతో నీ విజ్ఞానమును చదరంగపుటెత్తుల వలె వ్యూహముల బన్నుచు విజృంభింపజేసినారు. వాని వివరమునంతయు నీ చిన్నవ్యాసములో సుఘటించుట సాధ్యపడునది కాదు. అరియణ్ణులు నివసించుదేశమే అరియణదేశము. దీని పశ్చిమభాగము 'ఇరాన్' దేశమైనది. అఱవజాతివారు అ కారమును ఇ కారముగం బల్కుటపాటె గలదు గనుక అరాను ఇరానయినది. అణ్డ్-ఇణ్డ్, అంన్-ఇంన్, హంన్-హింద్, మొదలగు శబ్దముల యుచ్చారణ మార్పులను దెలిసికొనుఁడు. ఇరాన్ దేశములోని ప్రజలు ఐరేనియనులనియు, ఇరానునకు పూర్వభాగమున నరియణ దేశమున నుండువా రర్యులనియు భేదించినారు. ఈభేదము ఋగ్వేదములోని ఋక్కులు బయల్పడుటకు ముందే యేర్పడినది. హిందూదేశ మత్యంత ప్రాచీనమైన విజ్ఞానముతో నొప్పుచున్నది. ఆఱు మన్వంతరములను గడపినది. ఇప్పుడు వైవస్వత మన్వంతరము జరగుచున్నది. మిడిమిడి జ్ఞానముతో నుండు వారి కీవిషయములు బోధపడవు. వారు మేధులు కావలయును. నిమి మిథి యైనట్లుగా మిడి మేధి కావలయును. మిడి, మిథి, మిథిల, మైథిలి మొదలగునవి ప్రాచీనత్వమును సూచించునవియై యున్నవి. మైథిలి భూపుత్రి యగుటవలన సీత యని ప్రశంసింపబడియెను. మగవేషమును దాల్చిన యాండువాడగు రాముడు సీతను బెండ్లిచేసికొనుట 'సీతాకల్యాణ' మను పేరిట నేటేట మనయాంధ్రదేశమున మిగుల వైభవముతో మహోత్సవము జరుపబడుచున్నను ఇంకను వానిభావమును గ్రహించి దేశకాలపరిస్థితుల ననుసరించి సంస్కరించుకొని యెట్లు జరుపుకొనవలయునో యెఱుగక యంధప్రాయముగానే జరుపుకొనుచున్నందుకు విచారము కలుగుచున్నది.

దేశమును వీర్యవంతముగ జేసినట్టి యవతారపురుషుడు శ్రీరాముడు. ఈయవతారసృష్టి మహాంద్రసృష్టి. ఆర్యపుత్రుడైనవాడు. జ్ఞానశూన్యమగు ఛాందసత్వమహాంబుధిలో మునింగిపోయిన పూర్వాచారపరాయణులగు నాస్తికుల భావములకును, పాశ్చాత్యవిద్యామహిమాన్ధ్యులైన నాస్తికుల భావములకును నడుమను జిక్కి భారతదేశము నేఁడు నిర్వీర్యమగుచున్నది. ఇట్టి దుర్దశ భరింపరానిది. ౧ మమంత్రము మహాంద్రులకు నిజముగా తారకమంత్రమే. ఈమహాంప్రతత్త్వముయొక్క తేజస్సే హైందవ విజ్ఞానమునకు చిరకాల జీవనము ప్రసాదింపుచున్నది.

పూర్వము విమతస్థులయిన కొన్ని తెగలవారిచే 'మరాడరు'లని యపహసింపబడిన మరాండారులే కాదా మనవేదములలో మరుద్దేవతలని వర్ణింపబడిరి? ఈ మరాండులు, ఈ మరాట్టులు, ఈ మరాఠులు, ఈ దాసరతులు, మహారథులై మహారాష్ట్రులై సమ్రాట్టు లగుట యీ తేజః ప్రభావము వలనకాదా సంభవించెను? మీరుపురాణములలో మరుద్రాట్చరిత్రమును జదివియుందురుకదా. అత్యంత ప్రాచీనకాలమున (చరిత్రమునకు, మనవిజ్ఞానమునకు నందనికాలము) కాళీభూతశక్తి యీ మనఖండమునకధిదేవతగ నుండెనని తోచుచున్నది ఈ విషయము మన మెన్నడును మఱవరాదు. పరమహంస రామకృష్ణునివంటి తత్త్వవేత్తయు సహితము మఱవలేదు. ఈ కర్మ్యాంశి యీ భూఖండమును బరిపాలించుచు నఱవదినాల్గుకళలకు నాకరమై సకలకల్యాణస్వరూపుడయిన యాదిదేవున కంకితముచేసి కల్యాణభూమిగ మార్చివైచినది. జగన్నివాసుండగు నాదిదేవుండీ కల్యాణభూమి నిరంతరకర్మభూమిగ నుండి లోకకల్యాణమునకు దోడ్పడవలసినదిగా శాసించియున్నాడు. కర్మ యనగా నయ్యో కలికాలము వచ్చినదని యేడ్చుచు భక్తిజ్ఞానశూన్యములగు కర్మలు చేయుటకాదు. 'ఈగడ్డ నాపుట్టుగడ్డ' యని యుత్సాహపూరితుడై మాతృదేవతయందు భక్తివిశ్వాసములతో సర్వసమర్పణము గావించి లోకకళ్యాణముకొఱకు నిరంతరము మానవులు నిష్కామకర్మలు చేయుచుండవలసినదనియే యాదేవదేవుని శాసనము. అతని యాజ్ఞలు నెఱవేర్చుటకు మానవునకీ కర్మభూమియందు జన్మపరంపరలు దప్పవు.

పాశ్చాత్యపరిశోధకులు కొందఱీదేశమునకు కాళేదియా యనునది ప్రాచీననామమని చెప్పెదరు కాని 'కాళిండియా' యని చెప్పదగునేమో. కాళాండులు లేక కాళిండులు ప్రాచీనమన్వంతరకాలములో నెప్పుడో యిచ్చటనుండియే కొందఱు ఆసియాఖండముయొక్క పశ్చిమభాగమునకు బోయి యచట నాగరికులై క్రమముగా స్థిరనివాసులై కాల్డియాసామ్రాజ్యమును స్థాపించుకొనియుందురు. కాళిండియా కాల్డియా యగుటలో నాశ్చర్య మేమియు లేదు. ఇచ్చటనుండియే మాగాంద్రములు కొందఱు పోయి యచట మిడియారాజ్యమును స్థాపించియుందురు. మిడియాదేశమును బరిపాలించు రాజులను మాంద లేక మాంతెగ యని వ్యవహరించిరి. ఆంధ్రకర్ణాటదేశములలో మాదిగకుల మొకటి గలదు. మాంతెగ మాదిగయొక్క ప్రత్యపభ్రంశము. అగుటయే గాక మళయాళభాషలో సేనాపతులను 'మాంతెగ' అని వ్యవహరించిరి. మాదిగయన సేనాపతియని యర్థము. చీనావారు తమసేనానులను, సామంతులను మంతారిణు లందురు. ఇంతియ గాక క్రీస్తుయొక్క పుట్టుకకు శతాబ్దిలో మిడియాదేశమునకు పశ్చిమభాగమున నున్న పార్థియాదేశమును బరిపాలించినవారిలో నొకటివాని (Madigan I.), రెండవమాదిగ (Madigan II.) యను పేర్లు గల రాజులు గన్పట్టుచున్నారు. ఆదేశపురాజులు మాదిగలయ్యాయను నాతని 'ఎమ్మెలు' అను దేవతను పూజించుచుండెనని చెప్పబడియెను. ఆ దేవతను పూజించువారు రైతెను ఎమ్మెవాండ్రని వ్యవహరించిరి. ఎమ్మెవాండ్రు మాదిగలలో నొకశాఖవారుగ నున్నారు. ఎమ్మెశబ్దము వేదభాషలో యమశబ్దముగాను, అవెస్థాభాషలో జమశబ్దముగాను నగుచున్నది. ఎమ్మెకాపన గుంపులో సుందరుడని యర్థము తెలుపబడుచున్నది. ఎమ్మె యెనుము యొక్క వికృతము. ఎనుమనగా బఱ్ఱె (మహిషి). వీరు తమదేవతకు దున్నపోతును బలి యిచ్చి తలకాయను పూజించు నాచారము గలవారు. పౌరాణికులు దున్నపోతును యమునకు వాహనముగ జేసినది సుప్రసిద్ధముగదా. నేటికాలమున నీ తెగవారీదురాచారములను విడిచిపెట్టకయుండుటచేతనే కాబోలు వీరిని నస్పృశ్యులుగ బరిగణించుచున్నారు. అనేకమన్వంతరములు గడచినను, తమతొంటిహైశవావస్థ నుండి తప్పించుకొనలేక హైందవసంఘములో నడుగున మడ్డివలె బడియుండుట విచారకరమైన విషయము మనకు సందియము లేదు. స్వయంసహాయముచేతనే యుత్తమసంస్కారములబొంది దురాచారములనుబోవిడిచి పవిత్రత నొనగూర్చుకొని స్వయంకృషి గాఢముగా సల్పినయెడల హైందవసంఘము తప్పక తోడ్పడ గలదు. ఇట్టికార్యము హైందవసంఘమును ధిక్కరించుటమూల

మున గాక సారిస్రేమును సంపాదించుటమూలముగానే నెలవేర్పుకొనుటకు మార్గములు కలవు గాని లేకపోలేదు. అష్టమార్గములను గాంధీమహాత్ములు సూచించియే యున్నారు. వీరిని కేంద్రులవులు గారనుట గొప్ప యస త్యము. ఇయ్యది పరిపంథులు స్వలాభముకొఱకు చెప్పె డివారలు.

కుయిగాంగ్రులే యుత్తరకురుభూములకు బోయి పాంచాల దేశమునుండి (పాంచాలము, పంజాబు) కుయి షాన్ లేక కుశాన్ జ్యమును (Kuei Shuang లేక Kuei-Choang) సామ్రాజ్యముగ మార్పించినది వీరేయని తెలంపవలయును. మగాంగ్రులు మంత్రము లయం దాసక్తిగల మాంత్రికు లని 'బాబిలోనియా', 'అస్సీరియా' దేశములలో ప్రసిద్ధిగాంచినవారట. ఈ మంత్రితంత్రిశబ్దము లెట్లు పుట్టినవో యొకింత తేటపఱుప నగును. 'మన్త్సర్, మన్త్వర్, మన్త్రర్, మంత్రః' అని సంస్కరింపబడెనవి గావున మన్త్రభూతజాతులనుండి పరి ణామమును గాంచిన గురువులను మాంత్రికులనుట యొప్పి దముగానే యున్నది. 'తన్త్సర్, తన్త్వర్, తన్త్రర్, తంత్రః' అని సంస్కరింపబడినది గావున తన్త్రభూతజాతులనుండి పరిణామమును గాంచినగురువులకు తాంత్రికులని పేరు వచ్చెను. మంత్రతంత్రములతో గూడుకొనియున్న యాథర్వణవేద మాంగ్రవేద మె. సుమేరియనుభాషలో మన తెలుగుభాషలోవలెనే మగాంగ్రునకు గొప్పవా డనియు, శక్తిగలవా డనియు, ప్రకాశవంతు డనియు, ప్రభువనియు నర్థములు గలవని టీలె యనుపరిశోధకుడు వ్రాయుచున్నాడు. ఈ విషయమునుగూర్చి యిదివఱ కొకమాఱు భారతీపత్రికలో చర్చించియున్నాను. (భారతిసంపుటము ౨. సంచిక ౬. చూడుడు.)

గోదావరీతీరస్థము లగు నరణ్యభూములలో నివ సించు కోయిలలో కుయిప్రుది (Kuei Pruthe) కుయి సస్సి (Kuei Sassi) అని రెండు తెగలశాఖలు గలవు. వీనిలో మొదటిశాఖవారు నాలుగువేల సం. ముల క్రింద టనే యూఫ్రటేసు నదీతీరములకు బోయిన ట్లొకచిహ్న ము గన్పట్టుచున్నది. బఘాజ్ కుయి (Baghaz Kuei) అను ప్రదేశమున గనుగొనబడిన యొక శాసనములో మిత్తానీదేశప్రభువుచే జేయబడిన యొక సంధిపత్రమున ఇంద్రుడు, వరుణుడు, మిత్రుడు, నాసత్యులు సాక్షు లుగ నుదాహరింపంబడియుండుటచేతను, ఈ శాసనము క్రీ. పూర్వము పదునేనవ శతాబ్దిలోనిదిగ బరిశోధకు లచే నిర్ణయింపబడియుండుటచేతను, అవేస్తాగ్రంథమున ఇంద్రుని అంగ్రునిగ బ్రశంసించియుండుటచేతను, అందు 'కోయిరా' ప్రదేశమును ప్రశంసించుటనుబట్టి యీ కోయి లప్పటికె కొండలు నివాసము లేర్పఱుచుకొన్నట్టు తలం పవలసివచ్చుచున్నది. వీరిలో మొదటివారయిన కుయి ప్రుది శాఖవారీ మగాంగ్రుల మాంత్రిక కర్మలచేత పార్థియనులుగ మాఱి పార్థియారాజ్యమును స్థాపించి నట్లు తలంపనగుచున్నది. అట్లే కుయిసస్సియను శాఖ వారు శశ్శానియనులుగ మాఱి శశానియను రాజ్యమును స్థాపించియుండిరని యూహింప నవకాశ మిచ్చుచున్నది. దీనిని బలపఱచునట్టిగాథ మహాభారతమున గలదు. ఇంద్రు నికొడుకు పార్థుడు. కుంతికి పృథ యని నామాంతరము గలదు. ఈ కోయిలలో గొంతిశాఖ కలదు. కుండల, కుం దల, కుంతల శబ్దస్వరూపములనుబట్టియు, కుంతి కుంతి భోజునికూతురని చెప్పుటయు, కాంభోజులకు గాంబోయలని నామాంతరము గలిగియుండుటయు, పార్థుడు ఖాండవ వనమును దహించి గాండీవమును బొందుటయు, ఖాండులు, గాండులు నీదేశమువా రగుటయు, దండకా రణ్యమునకు బూర్వము గాండ్వానా లేక గాండువన మని పేరుండుటయు, పార్థుడు విలువిద్యయం దసమాన ప్రజ్ఞావంతుడని చెప్పబడుటయు, కోయలు గాండులు కూడ విలువిద్యయం దత్యంతనైపుణ్యము చూపువారని మనవారిచే బ్రశంసింపబడుటయు, అచ్చటిపార్థియనులు కూడ విలువిద్యయం దసమానప్రజ్ఞాధురంధరులని చరిత్ర కారులచే బ్రస్తావింపబడుచుండుటయు, అరణ్యావాసము చేయునపుడు పార్థుడు దివ్యాస్త్రములకొఱకు స్వర్గభూ ములకు (ఉత్తరకురుభూములకు) నేగుటయు, అచటి యూర్వశి యాతని కామించుటయు, అతడు మాతృ భావమును జూపి యామెకోరికను దిరస్కరించుటయు, ఆమె వానిని నాడుదానివై పేడిరూపమున నుండువని

శపించుటయు, తరువాత నజ్ఞాతవాసకాలమునమాత్రము నపుంసకత్వమున నుండి బాలికలకు నృత్యగీతగానములు నేర్పుచుండి తరువాత యథారూపమును దాల్చి ననుగ్రహింపబడుటయు, పిమ్మట బ్రహ్మాస్త్రాదిదివ్యాస్త్రములను బొంది యింద్రునిచే నర్ధసింహాసనమున గూర్చుండ బెట్టబడుటయు మొదలుగాగల చరిత్రమంతయు దొల్త బార్ధియనులు హిందూదేశములో నేర్పడినతెగ వారే యనియు, వీ రాయుధగురుశుశ్రూషలకు బోయి పార్ధియాయనుప్రదేశమును పార్ధియనురాజ్యమును సంపాదించి పార్థుడు మరల హిందూదేశమునకు వచ్చినట్లు తేటపడుచున్నది.

---

# విషాదమూర్తి

పురిపండా అప్పలస్వామిగారు, (కవితాసమితి)

ఏల నిశాతపస్విని, కృశించెద వీ రజతాద్రికౌముదుల్
వ్రాలెడుచోట, తారల విపంచిక మీటు సుధాంశుగీతికా
జాలములే రుచింపవో! విషాదభరమ్మున మూగబాష్పముల్
రాలిచె దీ శుభోత్సవ శరన్నవమంగళవేళ నూర్చుచున్.

ఏ కటురాగశాలి శపియించెనో నిన్ హసియింప నీక ప్రే
మాకులమైన నీయెద రహఃపరివేదనలన్ రగిల్చి, బా
లా, కల లెన్ని యెన్ని శిథిలమ్మయిపోయెనొ స్వాదు లేర్చి; మా
లాకమనీయ మీ కుసుమరాజి విదల్చెదు రేకురేకులన్.

శైశిరశర్వరీచికురజాలములన్ దెగి పడ్డ తారకా
శ్రీ శిథిలంపుజీవనమరీచిక లేయెదలన్ దహించు? కాం
తా, శకలమ్ములైన హృదయాలకు జాలి వహింతు రెవ్వ రం
చీ శరదంగణావధి కృశింతువు జీవితభారకాంక్షలన్.

ఆసల వేగిపోవు ప్రణయాతిథిపాత్రిక నెన్నడేని ప్రే
మాసవ మింత నించిరటె! స్వార్థమలీమస మీ జగమ్ములో
రాసులు రాసులై సుమదళమ్ములు రాలి నశించె నెన్ని! సం
ధ్యాసుషిమమ్ములన్ మధునిశాంతహిమాంబుతుషారశయ్యలన్.

---

# స్వదేశసంస్థానములు – నూతనరాజ్యాంగ విధానము

నార్ల వెంకటేశ్వరరావుగారు

భారతదేశమున మొత్తము ౫౬౩ స్వదేశ సంస్థానము లున్నవి. వీని విస్తీర్ణము ౬, ౪౫, ౨౬౪ చదరపు మైళ్లు[౧]. వీని జనసంఖ్య ౬, ౮౬, ౫౭, ౯౪౭. (౧౯౨౧-౨ సం. పు జనాభా లెక్కల ప్రకారము.) అనగా భారతదేశపు జనసంఖ్యలో నైదవవంతు, బ్రిటిషు ఇండియా జనసంఖ్యకు దాదాపు రెట్టింపు. వీని సాంవత్సరికపు ఆదాయము ౩,౪౫,౦౦,౦౦౦ పౌనులు.

సంస్థానము లన్నియు రెండుతరగతులక్రింద విభజింపబడినవి. మొదటి తరగతిలో ౧౧౮ సంస్థానము లున్నవి; తక్కినవి రెండవదానిలో నున్నవి. ప్రథమ శ్రేణిలో చేరిన సంస్థానముల పరిపాలకుల గౌరవార్థము శతఘ్నులను కాల్చవచ్చును; ద్వితీయ శ్రేణిలోని పరిపాలకుల కట్టిగౌరవము లేదు.

ఈసంస్థానముల వైశాల్యములోను, జనసంఖ్యలోను, ఆదాయములోను, అధికారములోను చాల తారతమ్యము లున్నవి. అన్నిటిలోను పెద్దదైన హైదరాబాదు సంస్థానము దాదాపు ఇటలీదేశమంతటి విస్తీర్ణము గలిగియున్నది. దీని జనసంఖ్య ౪౦ లక్షలు. సాంవత్సరికపు ఆదాయము ౮౫ కోట్లు హాలీరూపాయలు. ఈసంస్థానమునకు ప్రత్యేకపు నాణ్యములే కాక ప్రత్యేకపు తపాలాబిళ్లలు వగైరాకూడ కలవు. దీనికి ౧౯,౪౦౫ సైనికులుకూడ కలరు. ఇది యిట్లుండ సిమ్లా ప్రాంతములలో నతిచిన్నవైన కొన్ని సంస్థానము లున్నవి. వీని విస్తీర్ణము మూడు నాలుగు చదరపు మైళ్లకు మించియుండదు. వీని ఆదాయముకూడ రు. ౧, ౧౦౦ కన్న యెక్కువగా నుండదు. ఇక అధికారములగూర్చి విచారింతమన్న, కొన్నిసంస్థానముల కాంతరంగిక పరిపాలనలో సర్వాధికారము లున్నవి. మరికొన్నిటికి పన్నులు వసూలుచేసుకొనుటకన్న వేరేమియు అధికారములు లేవు. ఇది స్వదేశసంస్థానముల సంగ్రహచరిత్ర.

సర్వసాధారణముగ సంస్థానములకన్న సంస్థానాధిపతులే ప్రజాదృష్టి నెక్కువగ నాకర్షించుచుందురు. అందుచే వారి జీవితవిధానమును, పరిపాలనక్రమమును కొంత చర్చింపవలసి యున్నది.

సంస్థానాధీశుని బాల్యదశ అంతఃపురములోనే గడచును. అతనికి సామాన్యముగ పెక్కుమంది సవతితల్లు లుందురు. అందుచే నతడు కడు భద్రముగ కాపాడబడుచుండును. ఏమాత్రము మేమరినను అతనికి ప్రాణభయము కలిగితీరును. సవతితల్లుల ఈర్ష్యకుబలియై అప్పుడప్పుడు రాజకుమారు లసువులను గోల్పోవుటగూడ సంభవించుచుండును. కాని సరియగు నిదర్శనములు లేకపోవుటచే నట్టివిషయములు బయల్పడవు.

కొంచెము యుక్తాయుక్తజ్ఞాన ముదయించినది మొదలు రాకుమారుడు కోరినకోర్కెలెల్ల నెరవేర్పబడుచుండును. దాసదాసీజనమెల్లరు అతనిని "ప్రభూ" యనుచును, "తండ్రీ" యనుచును సంబోధించుచు, కడు వినమ్రతతో నుందురు. అత డెల్లప్పుడును నీచసేవకుల మధ్యమున నుండుటయే గాని, సాటివారితో తిరుగుట సంభవింపదు. దీనివలన సంస్థానాధీశులు బాల్యము నుండియు, దుర్వ్యయము, నిరంకుశవర్తనము మున్నగువాని నలవరచుకొందురు.

ఏడవయేట నతడు ప్రత్యేకముగ సంస్థానాధీశుల కేర్పడిన పాఠశాలలలో నేదైన నొకదానిలో జేరును. అట్టి ప్రత్యేక విద్యాలయములు ప్రస్తుతము నాలుగున్నవి. మొదటిది రాజకోటలోని రాజకుమార కళాశాల.

---

౧. Indian Year Book, 1930.

ఇది ౧౮౭౦-వ సం. లో స్థాపింపబడినది. ఇది బొంబాయిరాష్ట్రములోని రాకుమారుల విద్యకై యేర్పాటు చేయబడినది. రెండవది అజ్మీరులోని మేయో కళాశాల ఇది ౧౮౭౨-వ సం. లో స్థాపింపబడినది. దీనిలో రాజపుత్రస్థానపు రాకుమారులు చదువుకొందురు. మూడవది మధ్య భారతవర్షపు రాకుమారులకొరకై ౧౮౮౧-వ స. లో కట్టబడిన డాలీ కళాశాల. నాల్గవది పంజాబు రాకుమారుల నిమిత్తము ౧౮౮౬-వ సం. లో లాహోరులో నిర్మింపబడిన అట్చింసన్ కళాశాల. ఇవికాక, చిన్నచిన్న సంస్థానముల రాకుమారులకొరకై ప్రత్యేకముగ వేర్వేరు పాఠశాల లున్నవి. ఈపాఠశాలలలో పరీక్షలులేవు. కాని ప్రతివిద్యార్థికి పట్టములు, యోగ్యతాపత్రములుమాత్రము విరివిగా లభించును. ఈపాఠశాలలో పదేండ్లు చదివినపిమ్మట నచ్చటి విద్యార్థులు భారతీయవిశ్వవిద్యాలయముల సాధారణపు ప్రవేశపరీక్ష (Entrance Examination) లో నుత్తీర్ణులగుట దుస్సాధ్యము. తమవిద్యార్థులు మహారాజపదవి నలంకరించిన పిదప తమకు లాభముచేయుదురన్న యుద్దేశముతో నీపాఠశాలలలోని ఆచార్యులు వారిని "ఇంద్రులు, చంద్రులు" అని పొగడుచుందురు. ఈనీచ ముఖస్తోత్రములవలన వారి కోమలహృదయసీమల నదివరకే యంకురించిన నిరంకుశవర్తన బీజములు వేరుదన్ని మరింత వృద్ధిచెందును. వీనిలో చదువుటవలన రాకుమారుల ప్రవర్తన మరింత చెడునేగాని యేమాత్రము బాగుపడదు.[౨]

ఈమధ్య రాకుమారులను విద్యాభ్యాసమునకై పాశ్చాత్యదేశములకు (ముఖ్యముగ ఇంగ్లండునకు) పంపుట అచారమైనది. దీనివలనకూడ నెట్టిలాభమును కలుగుట లేదు. ఒకానొకదినమున ౧,౫౦,౦౦౦ ప్రజలను పాలింపవలసిన యొకరాకుమారుడు కొలదిదినముల క్రిందటనే విద్యాభ్యాసమునకై యింగ్లండునకు వెళ్లెను. అతడక్కడ మూడువత్సరము లుండెను. ఆ మూడువత్సరములలోను పరీక్ష లన్నిటియందును తప్పెను. దుస్సహవాసము చేసి త్రాగుబోతుగాను తయారయ్యెను. అతని దుష్ప్రవర్తనను చూచి విసిగి, అతని ... విద్యాభ్యాసము ... తాను ... భరింపజాలనని స్పష్టముగ తెలిపెను ... ... భారతదేశమునుండి ప్రత్యేకముగ నొకరు వెళ్లవలసివచ్చెను. మరొక రాకుమారుడు విద్యార్జనకై విదేశములకు వెళ్లి ... నొక హోటలులో ... 

ఇట్లు విద్యాభ్యాసము ముగిసిన పిమ్మట నొక పెద్ద దర్బారు జరుగును. దానికి పొలిటికలు ఏజెంటుగాని, గవర్నరుగాని రాజప్రతినిధి యొద్దనుండి రాకుమారుని యథావరాజ్యపట్టాభిషిక్తుని గావించుటకు ... వచ్చును. దర్బారులో నతని నాశీర్వదించుటయు, నీతిని గరపుటయు, కొన్ని యుపన్యాసములు గావింపబడును. అతనియొక్క నానికన్నిటికిని ... ప్రత్యుత్తరము లొసగును. తరువాత విందులు వినోదములు మొదలగు ముచ్చటలు జరుగును.

ఈ తంతు జరిగినపిమ్మట రాకుమారుని వివాహ ప్రయత్నములు జరుగును. వివాహమహోత్సవదినమునకు కొన్ని మాసముల పూర్వమునుండియు ప్రయత్నములు ప్రారంభము లగును. సంస్థానములోని ... ... మును వివాహయత్నములలో పాల్గొనవలసినదే! దాని యెడల వారు కఠినశిక్షలకు పాల్పడవలసి వచ్చును. ఈ విధముగ పనిచేసినందుకు వారికి ... ప్రతిఫలముమాత్రము ముట్టదు. ప్రజలందరును కేవలము పనిపాటలు చేయుటతోనే సరిపోదు. వారు తమయొద్దనున్న బండ్లను, ఆవులను, మేడలను, ... దప్పెలను సహితము సంస్థానమునకై ఉపయోగించవలెను. అట్లెవరయినను ఉపయోగించుటకు సంకోచించిన బలముపయోగించి వానిని లాగుకొనుటకు సంస్థానోద్యోగులు శంకింపరు. ఈ వెట్టిచాకిరినంతయు చేయుటయే కాక ప్రజలందరును "వివాహపు సుంకము" అను ప్రత్యేకపుపన్నును చెల్లించుకొనవలెను.

---

౨. "These Princes' Colleges have more often than not been a source of vice and wickedness.—'Indian Princes under British protection' by P. L. Chudgar, p. 13.



బాలనటకుడు

జాకీకూపరు అను పేరు గల ఎనిమిదేండ్ల బాలుడు సినీమా ప్రపంచమున నీ చిన్నవయసుననే మిక్కిలి ప్రఖ్యాతి గాంచినాడు. ఈ బాలునికి నెలకు ౫౦౦౦ డాలరుల ఆదాయము; ౧౬౦౦ డాలర్లు వ్యయము.

G. S. A.



విత్తు యంత్రము

వార్వికుషయరునందలి స్టడ్లీకాలేజి పొలమున యంత్రముతో విత్తుచున్న యువతి. ఇచట వివిధ వ్యవసాయశాఖల కార్యములను స్త్రీలకు నేర్పుచున్నారు.

G. S. A,

వివాహప్రయత్నములు ప్రారంభమైనప్పటినుండియు న్యాయస్థానములు, పాఠశాలలు, ప్రభుత్వకార్యాలయములు మొదలుగాగలవన్నియు మూసివేయబడును. ఉద్యోగస్థులందరును వివాహమహోత్సవాహ్వానపత్రికల గైకొని వివిధసంస్థానములకు వెళ్లుదురు. ఆహ్వానపత్రికల తోపాటు బహుమూల్యములైన కానుకలు సహితము పంపబడును.

ఈరీతిగ బ్రహ్మాండములగు ప్రయత్నములు జరిగిన పిమ్మట వివాహము జరుగును. వివాహములలో రెండువిధములున్నవి. మొదటిది రాకుమారుడు స్వయముగ వెళ్లి వివాహము గావించుకొనుట. రెండవది అతడు తనకత్తిని పంపి వివాహముగావించుకొనుట. ఈరెండువిధముల వివాహములలోను వేలకొలదిపెద్దలు పెండ్లికై తరలి వెళ్లుదురు. నాగరీకులకు ప్రత్యేకముగ కొన్నిరైళ్లు ఎడతెరపిలేకుండ నడుపబడును. ఇక వివాహమునకు ముందును, తర్వాతను జరుగు వైభవములకు లెక్కయుండదు. ఆ మేళతాళములు, ఆవేశ్యకాంతానృత్యగానాదులు, ఆబాణసంచాప్రదర్శనములు, ఆవిందులు, ఆవేడుకలు—వానిని వర్ణింప బ్రహ్మకైనను తరముకాదు.

సాధారణముగ పరిణయమైన సంవత్సరములోనే రాకుమారుడు తనప్రేమ కళత్రమన్న యేవగించుకొన నారంభించును. మహారాణికి కోడలన్న యిష్టములేక పోవచ్చును. లేకనూత్నవధువే సరిగ వర్తింపకపోవచ్చును. ఏకారణముచేనైననేమి సంవత్సరము గడవకమున్నే నూత్నవధూవరుల ప్రణయజీవితములో భేదభావములు పొడసూప నారంభించును. అప్పుడు తిరిగి బ్రహ్మాండములగు వివాహయత్నములు, తిరిగి నిరుపమాన వైభవోజ్వలత, తిరిగి దారుణదుర్వ్యయము జరుగును.

నూతన వధువుయొక్క ఆగమనముతో ప్రథమ కళత్రముల జీవితము దుర్భరమైపోవును. వారిదిక్కెవ్వరును కనుగొనువారుండరు. బందీలవలె రాజాంతఃపురములలో వారేదియో యొకమూలపడియుందురు. మృత్యుదేవత ప్రసన్నమగువరకు వారు శవచ్ఛవములవలె కాలము గడుపుకొనుచుండవలెను.

ఇట్టి దుస్సహజీవితములో విసిగి కొంతకాలము క్రిందట నొకమహారాణి బాంబేక్రానికలు పత్రికకు లేఖ నొకదానిని వ్రాసెను. ఆలేఖనుగాంచిన కఠినపాషాణహృదయము సహితము కరిగితీరును. నిక్కువముగ ఆ లేఖనంతటి నిచట సంక్షిప్తపరుపవలెను. కానిస్థలాభావముచే నట్లుచేయ వలనుపడదు. ఐనను దానినుండి కొన్ని వాక్యముల నుల్లేఖించుచున్నాను: “మా జీవితములు శూన్యములు. మేమెట్టివిషయమందును శ్రద్ధవహించుటకు వీలులేదు. మేము మాయేలికచేతిలోని ఆటవస్తువులము. ఆతడు మమ్ము శృంగారింపవచ్చును. లేదా వివస్త్రలను గావింపవచ్చును. మాస్థితి బానిసలకంటె హీనమైనది......మీరందరును దక్షిణాఫ్రికాలోని భారతీయుల దుస్థితికై వగచుచున్నారు. కాని మీరు మీయభాగ్యసోదరీమణుల కరుణాక్రందమును వినరా ?”

స్వదేశసంస్థానముల సమస్యనుగూర్చి సాంగోపాంగముగ కృషిసల్పిన చడ్డరుగారు తమగ్రంథములో నిట్లు వ్రాయుచున్నారు: “పెక్కుమంది సామాన్యమానవులను వివాహము సద్వర్తనావలంబనమునకును, సన్మార్గగమనమునకును ప్రోత్సహించును. కాని విధివశముచే నది సంస్థానాధీశుని వక్రజీవనవాహినిని తప్పనిసరిగ మరింత వక్రగతిని పెట్టును”.[౩]

ఇంతవరకు మేము కేవలము సంస్థానాధిపతుల సాధారణజీవితక్రమమునే వర్ణించితిమి. ఇకముందు వారి విలాసయుత జీవితమునుగూర్చి కొంత చర్చింపవలసియున్నది. కొంతకాలముక్రింద అలహాబాదునుండి వెలువడు ఒక సుప్రసిద్ధమాసపత్రిక (Chand, Edited by

౩. “Marriage in the life of many an individual is an inspiration for good and an impetus in the right direction. It is Fate's irony that in the case of a Prince it is invariably an added jolt to the already unevenly running and ill-geared machinery of his life.” Ibid. p. 21.

R. Saigal, circulation exceeds 20,000.) సంస్థానాధీశుల విలాసయుత జీవితమునుగూర్చి యొక హృదయవిదారకవ్యాసమును వ్రాసెను. ఆసంపాదకీయ మునుండి మేము క్రింద కొన్ని భాగముల నిచ్చుచున్నాము:—

“వంశ పారంపర్యాను గతమైన పెక్కుదుర్గుణముల ఫలితముగ చాలమంది సంస్థానాధీశులు నపుంసకులు, ప్రకృతి విరుద్ధవ్యభిచారలోలురునై యుందురు. కాని పేరు ప్రతిష్ఠలకు భంగము వాటిల్లకుండ లోకమును మోసపుచ్చుటకై వీరు పది లేక యిరువది వివాహములు గావించుకొందురు. వీరి పాలబడిన దౌర్భాగ్య వనితలు తన్త్రా(ప్రా?)సవుల రాల్చుచు స్వీయపైశాచిక జీవనమును శపించుకొనుచుందురు. ఇంతేకాదు. వారు గడుపు లజ్జాపూర్ణజీవనము కడు అసహ్యమైనది; అమానుషికమైనది; హృదయవిదారకమైనది. సర్వసాధారణముగ రాజేంద్రుడు మధుపానమును గావించి మత్తిల్లును. తదుపరి తన సంస్థానోద్యోగులనే ద్రాగించి వారినికూడ మత్తిల్లజేయును. ఇట్లందరును మధుపాన పిశాచగ్రస్తులై యున్నప్పుడు అతడొకరిద్దరు రాణులను పిలిపించి వారిని తన యిష్టమిత్రుల కామలిప్సను శాంతింపజేయ నమజ్ఞాపించును. తాను స్వయముగ నొక యున్నత పీఠము నధిష్ఠించి ఈ యమానుషిక దృశ్యమును ఆశాపూర్ణ నేత్రములతో దిలకించుచు, ఆనందించుచుండును. కొన్ని దినములక్రింద నిట్టి నీచజీవనమునుగాంచి దుఃఖమునుపొంది యొక హతభాగినియైన రాణి విలాసభవనమును ప్రవేశించుటయే తడవుగ తన్ను కౌగిట జేర్చుకొనవచ్చిన యుద్యోగిని పిస్తోలుతో కాల్చివైచెను. పిమ్మట దానిని రాజాసాహెబుగారికి నరిచేసి యిట్లుపలికెను: ‘నే నెల్లప్పుడును మీకృపాదృష్టివలన జీవించియుంటిని. కాని ప్రస్తుతము మీ జీవితము నాకృపాదృష్టిపై నాధారపడి యున్నది. కోరినచో నేను మిమ్ములను వధించి భూభారమును తగ్గింపగలను. కాని నేనట్లు చేయదలచుటలేదు. మీ సౌభాగ్యవశమున నేను హింసావనిత నైపోతిని. నేను పుట్టిపెరిగిన వాతావరణము నన్నిట్టి కార్యమును చేయనిచ్చుటలేదు. కాని నేనుమాత్రము నాపైశాచిక జీవనమునంత మొందించుకొన లేపము గానుంటిని.’ ఇట్లు పలుకుటయే తడవుగ నాఁడు తన వక్షస్థలముపై నాఘాతమొనర్చుకొని [illegible] లీలను ముగించెను. స్వేచ్ఛా[illegible] [illegible] అభిప్రాయులందరును [illegible] గనుండెడి. [illegible] లో నెవరికిని నోరెత్తు సాహసము కలుగలేదు. [illegible] పానమత్తిర తగ్గినవసుఁడు [illegible] పతిపై మునుగూర్చి విచారింపవలెను. [illegible] ‘[illegible] వ్యాధియు గవున మాకస్మికముగ నాడిపట్టు (Heart-failure) చే మరణించెనని వార్తలు వ్యాపింపజేయబడెను”.

“రాజపుత్రస్థానమునం[illegible] [illegible] [illegible] లీల చరమసీమ నతిక్రమించెను. [illegible] నా సంస్థానాధీశు డిప్పుడు [illegible] [illegible] నిచ్చెను, దానివలన భూభారము కొంత తగ్గెను. కాని యన్యమార్గములచే నాతనిసంతృప్తి [illegible] [illegible] యున్నది. ఆమహారాజు జీవితకాలమున—అతఁడు మరణించియిప్పుడు చాలకాలము కాలేదు—జరిగిన యమానుషిక వ్యభిచారలీలయొక్క నొక ఉదాహరణమును వినుడు. దీనిని మాకొక ప్రతిష్ఠితమిత్రుడు చెప్పెను. మహారాజు నపుంసకుడు. కాని యాతడు సమస్తగంహార [illegible] ననుభవింప గోరుచుండెను. తన నపుంసకత్వమును జయించుటకతడు కనిపెట్టినయంత్ర మతని యుపయోగించును. ఆయంత్రముపేరు ఆమోదచక్రము. దాని నిర్మాణ మిది: అత్యంతసుందరమైన విలాసభవనము—దానిలో వలయాకారముగ నిరువది హంసతూలికాతల్పములు—వాని మధ్య రత్నఖచితసింహాసనము...దానిపయి మహారాజు గారు...ప్రతితల్పముమీద వివిధవర్ణ విద్యుద్దీపతతి. మహారాజునకు కామేచ్ఛ గలిగినప్పుడు సేవకులకు సూచన గావించును. వెంటనే యిరువదియుండి స్త్రీ పురుషులు విలాసమందిరములో ప్రవేశింతురు. మహారాజు మధ్యమధ్య విద్యుద్దీపములనార్పుచు, వెలిగించుచు ఆనందలాభము నందుచుండును..................”

ఇట్టి పైశాచికకృత్యములగూర్చి ప్రపంచవిఖ్యాత గ్రంథకర్తలైన కన్నయ్యలాలుగాబాగారు సహితము

వివరముగ [illegible] నిన్నిటిని ఇట వివరింప నిచ్చగింపలేను. ఏలయనగా నట్టివిషయముల గూర్చి [illegible] బయల్పడినవి కొన్ని మనకు తెలియవలసియున్నవి. "[illegible] సంస్థానాధీశులు [illegible] యుస్సోరికొండల పైన "పుంస్త్వ [illegible]" (Virility contest) ను జరిపి [illegible] బహుమానము [illegible]!"

[illegible] సంస్థానాధీశుల [illegible] దుర్వ్యయమును గూర్చి [illegible] చర్చింపవలసియున్నది. వీరు [illegible] యున్నను [illegible] ఉన్నతోద్యోగులను సంతోష [illegible] మితముండదు. [illegible] గారిని తీసుకొ [illegible]. [illegible] ప్రభుత్వోద్యోగులను సత్కరించుటకై క్రిందివిధముగ ఖర్చుపెట్టెను:—

| | లక్షలు |
|---|---|
| [illegible] ప్రభువు | ౭ |
| [illegible] ప్రభువు | ౧౦ |
| [illegible] ప్రభువు | ౫ |
| [illegible] ప్రభువు | ౫ |
| [illegible] ప్రభువు | ౨౫ |

ఇట్లే తక్కిన సంస్థానాధీశులు ప్రజలను పీల్చి పిప్పిచేసి కూడబెట్టిన ధనమును తగులబేయుచుందురు.

సంస్థానాధిపతు లిక కుక్కలకును, పిల్లులకును, స్త్రీ బానిసలకును, మోటారుకార్లకును, యిట్లే తదితర వివిధ భోగవిలాస వస్తువులకు ధనమును వెచ్చించు ధనమునకు మేరయుండదు. పాటియాలా మహారాజుగారికి కుక్కలపైగల ప్రేమ జగద్విదితమే. క్రిందటిసారి వీరు విదేశసంచారము గావించినప్పుడు కుక్కలను కొనుటకై కొన్నిలక్షల రూపాయలను వ్యయపరచిరి. దీనిని చూచి కుక్కలనెక్కుడుగ ప్రేమించు ఆంగ్లేయజాతి సహితము మెచ్చెరువందెను. ఈ మహారాజుగారే రౌండుటేబులు సమావేశమునుండి స్వదేశమునకు మరలివచ్చునప్పుడు ౫౦ వేలరూప్యముల విలువగల బనియనులు, డ్రాయర్లు (Under-wear) కొన్నట్లు మాకెక్కడనో చదివినజ్ఞాపకమున్నది! పెక్కుమంది సంస్థానాధీశులవద్ద పరుల కంటబడకుండ స్త్రీలతో సరససల్లాపము లాడుటకు తగినట్లు నిర్మింపబడిన "రోల్సురాయిస్" కారులు మూడు నాలుగుచొప్పున నుండునని గాబాగారు వ్రాసిరి!!

పూర్వము భారతదేశమునకు సెక్రటరీఆఫ్‌స్టేటుగానుండిన మాంటేగుగారొక సంస్థానాధీశుని దివ్యహర్మ్యములో గూర్చిండి తమ 'భారతదేశములో దినచర్య' (Indian Diary) అను గ్రంథమునం దిట్లు వ్రాసిరి: "ఎక్కడచూచినను సిగరెటుపెట్టెలు మోటారుకార్లు, వాయువిమానములు మున్నగువాని ఆకారములతో నున్నవి. సిగరెట్లను పైకితీసి యిచ్చుటకుకూడ తగిన ఏర్పాటు లున్నవి. నగరవీధులలో నిట్టి విపరీతవస్తుతతినిగాంచినప్పుడు వీనినన్నిటిని యెవరు కొందురాయని నేనాశ్చర్యపడితిని. ఇప్పు డట్లాశ్చర్యపడనక్కరలేదు. వానినన్నిటిని భారతదేశసంస్థానాధీశులే. కొందురు"[౪] మాంటేగుగారే సంస్థానాధిపతుల కిట్టి యోగ్యతాపత్రమిచ్చినప్పుడు వేరుగ చెప్పవలసిన దేమున్నది!

ఇంతదనుక సంస్థానాధిపతుల జీవితక్రమమును గూర్చి ముచ్చటించితిమి. ఇక వారి పరిపాలనా విధానమును గూర్చి కొంత చర్చింపవలసియున్నది. మైసూరు, తిరువాన్కూరు, కొచ్చినుసంస్థానములలోదక్క తక్కిన వానిలో ప్రజాభిప్రాయమును వెల్లడించుటకును, ప్రజాభీష్టసిద్ధిని గావించుటకును తగిన శాసనసభలు లేనేలేవు. సంస్థానాధీశుడే శాసనముల గావించి ప్రచురించును. ఈ శాసనముల కొకదారియు, డొంకయు నుండదు. అట్టి

౪. 'Everywhere are cigarette boxes in the form of motor-cars or aeroplanes, or a stork to lift the cigarettes out * * * One has often been inclined to wonder what becomes of this sort of ingenuity when one sees them at jewellers or bazaars * * * and so forth, and the answer seems to be that they all go to the Indian Princes.'

శాసనములకూడ నతడు ఇచ్చవచ్చినప్పుడు రద్దుపరచ వచ్చును; లేదా మార్చవచ్చును. సంస్థానాధీశుడు తన కిచ్చవచ్చిన వానిని ప్రవాసమునకు పంపవచ్చును; లేదా సాక్ష్యవిచారణలు లేకుండ నిర్బంధింపవచ్చును. ఎట్టి యల్పసంస్థానోద్యోగియైనను, వ్యక్తిగతముగ నతడు ఘోరాపరాధము సల్పినను, వానిపైన సంస్థానాధిపతి యొక్క యనుజ్ఞలేనిదే చర్యజరుపుటకు వీలులేదు. సభలను జరుపుటను, పత్రికలను నడపుటను, సంఘము లను స్థాపించుటను నిషేధించుచు శాసనము లేవియు లేక పోయినను, అట్టికార్యముల నెవ్వరును చేయ వీలులేదు. దీనికిభిన్నముగ వర్తింప నెవ్వరైన సాహసించినవారు తప్పక సంస్థానాధీశుని దురాగ్రహమునకు బలికావలసి యుందురు.

పైన మేము కేవలము మైసూరు, తిరువాన్కూరు, కొచ్చిను సంస్థానములలో శాసనసభలు కలవనివ్రాసితిమి. దీనినిబట్టి తక్కిన సంస్థానములలో నట్టిసభలు లేవని భావింపరాదు. ప్రథమశ్రేణికిచెందిన ౧౧౮ సంస్థానము లలో ౩౦ సంస్థానములు శాసనసభలను స్థాపించినవి. కాని యివి కేవలము లోకమును మోసపుచ్చుట కేర్పాటు చేయబడినవి; ఉదాహరణగ బికనీరు సంస్థానపు శాసనసభను గైకొనుడు: ౧౯౩౧-౨ సంవత్సరము ఏప్రియలు ౧౫, ౧౬ తేదీలలో నీసభ యొకసారికూడి నది. ఆరెండురోజులలోనే సంవత్సరపు సమస్యలన్నియు చర్చింపబడుటయేకాక, బడ్జెటుకూడ అంగీకరింపబడినది. బికనీరు సంస్థానపు మొత్తము వార్షికాదాయము ౧౦,౦౦,౦౦౦ పౌనులు. ఈయాదాయమునుండి శాసన సభ ౧౫,౦౦౦ పౌనులు విద్యాశాఖకును, ౧౨,౦౦౦ పౌనులు వైద్యశాఖకును, ౨,౦౦౦ పౌనులు పబ్లికు వర్క్సుశాఖకును, మంజూరుచేసినది. అనగా ప్రజోప యోగశాఖలన్నిటికిని కలిపి ఆదాయములో నూటికి ౩౧ వంతుల చొప్పున మంజూరుచేయబడినది. దీనికి భిన్నముగ ౧,౦౦,౦౦౦ పౌనులు దివాణపు ఖర్చులకును ౬,౦౦౦ పౌనులు రాకుమారుని వివాహమునకై ప్రవాసపు ఖర్చుల కును, ౨౦,౦౦౦ పౌనులు ఢిల్లీలో "బికనీరుహౌసు"ను నిర్మించుటకును, ౫౦,౦౦౦ పౌనులు మరొకరాజమంది రమును పెద్దదిగా చేయుటకును, ౧,౭౦,౦౦౦ పౌనులు మహారాజాగారికుటుంబపు ఖర్చులకును మంజూరుచేయ బడినది. అనగా నేదోయొకరూపమున మహారాజాగారి స్వంతఖర్చులక్రింద వార్షికాదాయములో నూటికి ౨౨ వంతులు మంజూరుచేయబడినది! ఇట్టి శాసనసభలు లోకమును మోసపుచ్చుట కేర్పడినవన్న తప్పేమి?

సంస్థానములో చాలబాధ్యతగల యుద్యోగి దివాను. ఇతని నియామకమునుగూర్చి చడ్గరుగారిట్లు వ్రాయుచు న్నారు.—"సాధారణముగ విద్యనుగాని, అనుభవమును గాని, సామర్థ్యమునుగాని విచారించకయే సిఫారసులమీద దివాను నియమింపబడుచుండును. అతనికి విద్యగాని పరి పాలనానుభవముగాని ముఖ్యావసరమని యెంచబడదు."[౫]

ఈరీతిగ నియమింపబడిన దివాను తననుగూర్చియే గనే వర్తించుచుండును. ఆతని వర్తననుగూర్చి చడ్గరు గారే యిట్లు వ్రాసిరి: "దివాను దీపముండగనే యిల్లు చక్కబెట్టుకొనుటయందు నిమగ్నుడై యుండును. అందుచే నతడు భట్రాజువలె ప్రవర్తింపవలసి వచ్చును. అతడు మహారాజును విలాసములకు, డాంబికమునకు విచ్చలవిడిగ ధనమును వెచ్చింపనీయుటయేగాక సంస్థానా ధీశుని విశృంఖల వ్యభిచారపథమునుండి తప్పించుటకై నను యత్నింపడు."[౬] దివానుయొక్క ప్రవర్తనయే

౫. "The Dewan is generally appointed on some recommendation, without proper and full inquiry into his education, experience or abilties. No educational qualification or experience in administration is considered necessary." Chudgar, p. 59.

౬. " The whole attention of the Diwan is concentrated in making hay while his own particular sun is shining. The result is that in such circumstances he had to adopt the usual methods of a servile flatterer. He gives the prince full power and sanction to spend vast sums of money on luxury and display, and hardly ever attempts to prevent His Highness from leading a life of un-bridled vice and self-indulgence." Ibid. p. 60.

యున్నంతవరకు తక్కిన సంస్థానోద్యోగులసంగతి వేరుగ చెప్పవలెనా? సంస్థానములలో నేదైన యుద్యోగము కావలసియున్న దానిని సంపాదించుటకు సులభమార్గము సంస్థానాధిపతునికి గాని, అతని దివానునకుగాని, సుందరాంగి నొకదానిని తార్పుసేయుటయే యని కన్నయలాలుగారు తమగ్రంథమున స్పష్టముగా వ్రాసిరి!

చిస్తీగారు తక్కిన సంస్థానోద్యోగులను గూర్చి కూడ విస్తారముగ వ్రాసిరి. కాని స్థలాభావముచే వారి యభిప్రాయము లన్నిటిని నిట వేర్కొనవీలులేదు. ఐనను వారు సంస్థానముల పోలీసుశాఖనుగూర్చి వ్రాసిన వాక్యముల నిట వేర్కొనవలసియున్నది:—"సంస్థానాధిపతులు తమ ప్రజలను భయోత్పాతస్థితిలో నుంచుట శ్రేయమను సిద్ధాంతమునందు నమ్మకము కలిగియున్నారు. అందుచేత ప్రజలను భీతిల్లజేయుటకై పోలీసుశాఖ ఉద్దేశింపబడినది. పోలీసువారు ప్రజానీకమునకు జైలర్లవలె నుందురు. సాధారణపు రక్షకభటులందరును అతి హీనకుల సంజాతులుగా నుందురు. వీరిలో నూటికొకనికైనను చదువుట వ్రాయుట చేతగాదు. కేవలము నిరక్షరకుక్షులగుటయేగాక రక్షకభటునికి కావలసిన జ్ఞానము శిక్షణ కూడ వారికుండదు. ... ... ... ... దాదాపు నూటికి ౫౦ నేరములు అగపడనే తీయబడవు. చోరీసొత్తులో నూటికి ౩౦ వంతులయినను పట్టుకొనబడదు. హత్యానేరములలో కనీసమొక నిజమయిన నేరస్థుడైనను శిక్షింపబడడు. పాపపుణ్యము లెరుగనివారు తప్పుడు సాక్ష్యముమీద శిక్షింపబడుచుందురు. * * * * పెక్కుసందర్భములలో పోలీసువారే నేరములను పురికొల్పుచుందురు. పేరెన్నికగన్న నేరగాండ్రను నేరముల గావింప నియమించి చోరీసొత్తులో వారు భాగము పంచుకొనుచుందురు. * * * గ్రామములలో సుందరమైన మహిళామణుల మానరక్షణ జరుగుట కష్టసాధ్యము."[౨] ఇట్టిశాఖను ప్రజారక్షణశాఖ యనుటకంటె ప్రజాభక్షణశాఖయనుట సమంజసముగ నుండును గదా!

ఇకముందు సంస్థానములలోని విద్యాసౌకర్యములు, వైద్యసహాయము మున్నగువానినిగూర్చి క్లుప్తముగ చర్చింపవలసి యున్నది. తక్కిన స్వతంత్రదేశములతో పోల్చిచూచిన భారతవర్షములోనే విద్యతక్కువ. స్వదేశసంస్థానములలో నంతకంటెతక్కువ! స్వదేశసంస్థానాధిపతులు విద్యాశాఖకై ధనముపయోగించుట కేవలము నిరుపయోగమని భావింతురు విధిలేక ప్రదర్శనము కొరకుమాత్రము వారు కొన్ని పాఠశాలలనుమాత్రము నడిపించుచుందురు. మొత్తముమీద సంస్థానములలో విద్యయెంత కొరవడియున్నదియు క్రిందియంకెలవలన విదితము కాగలదు:—

| | చదువనేర్చిన వారి సంఖ్య | చదువనేర్చిన వారు నూటికి |
|---|---|---|
| ఆళ్వారు | ౨౨,౫౦౦ | ౩.౧ |
| బికనీరు | ౨౩,౮౮౮ | ౩.౬ |

౨. "Our princes believe in keeping their people always in a state of dependence and fear, and our Police are merely a force intended to promote terror on all hands. They act as jailers to the entire population. The ordinary constables, the rank and file of the force, are drawn from the very scum of the population, and hardly one in a hundred of these knows how to read or write. In addition to being illiterate they are entirely without the knowledge and training necessary for their work. * * * Nearly 50 percent of crimes committed are never detected. Scarcely 30 per cent of stolen property ever recovered, and in murder cases *scarcely one geniun culprit* is brought to book. Innocent persons are often convicted on faked evidence. * * * In many instances the police themselves are the originators of the crimes. They employ well known criminals to perpetrate the offences and act accomplices in exchange for a share in the booty. * * * In the villages no attractive woman's honour is safe." I bid. pp. 81—82.

| | | |
|---|---|---|
| జోధపూరు | ౬౬,౯౧౦ | 3.౬ |
| జయపూరు | ౮౨,౧౨౮ | 3.౫ |

సంస్థానములకువచ్చు సాంవత్సరిక పుటాదాయము నుండి సంస్థానాధీశుడు స్వయముగ వెచ్చించుకొను మొత్తమును, విద్యాశాఖకై ఖర్చుపెట్టుమొత్తమును సరి పోల్చిచూచిన, మనసంస్థానాధిపతులకు విద్యపైగల యభిమానము తేటతెల్లము కాగలదు. అట్టియంకెలు కొన్ని క్రింద పేర్కొనబడినవి:—

| | సంస్థానాధీశుని స్వంతఖర్చు | విద్యాశాఖకై ఖర్చు |
|---|---|---|
| బికనీరు | ౧౧% | ౧.౫% |
| జోధపూరు | ౧౬% | 3% |
| ఆళ్వారు | ౫౦% | ౧% |

మొన్న మొన్నటియంకెల ప్రకారము ఆళ్వారులో ౪,౦౧౧ వ్యక్తులకు, లేక 3౧ చదరపుమైళ్లకు, లేక ౧౪ గ్రామముల కొకపాఠశాలచొప్పునను, జోధపూరులో ౧౨,౧౧౬ వ్యక్తులకు, లేక ౨3౦ చదరపు మైళ్లకు, లేక ౨౪ గ్రామముల కొక పాఠశాలచొప్పునను, బికనీరులో ౧౦,3౦౪ వ్యక్తులకు, లేక 3౬౮ చదరపుమైళ్లకు, లేక 3౨ గ్రామముల కొక పాఠశాలచొప్పున నున్నట్టు తెలియుచున్నది. దీనినిబట్టి సంస్థానాధిపతులకు గల విద్యాభిమానము వెల్లడియగుటలేదా?

స్వదేశ సంస్థానాధీశులకు విద్యయన్న యెంత ప్రేమయో వైద్యసహాయమన్న నంత ప్రేమయే! సంస్థానపు ముఖ్యనగరములోను, తదితర పట్టణములలోనేగాని గ్రామములలో వైద్యాలయములే యుండవు. అందుచేత ప్రతివత్సరము వేలకొలది జనులు మృత్యుముఖమున బడుచుందురు. మొత్తముమీద సంస్థానములలో గల వైద్యసహాయము క్రింది యంకెలవలన స్పష్టపడగలదు.

| | జోధపూరు | ఆళ్వారు | బికనీరు |
|---|---|---|---|
| వైద్యాలయముల సంఖ్య | ౨౪ | ౧౦ | ౧౪ |
| వ్యక్తుల ప్రకారము | ౪౫,౦౦౦ మందికొకటి | ౪౦,౧౧౫ మందికొకటి | ౯౪,౧౨౦ మందికొకటి |
| వైశాల్యము ప్రకారము | ౧,౪౦౦ చ. మైళ్లకొకటి | 3౧౪ చ. మైళ్లకొకటి | ౧,౬౬౫ చ. మైళ్లకొకటి |
| గ్రామములు, పట్టణములు వారీగా | ౮౧ కి ఒకటి | ౧౭౪ కి ఒకటి | ౧౫౮ కి ఒకటి |

| | సంస్థానాధీశుని స్వంతఖర్చు | వైద్యసహాయమునకు ఖర్చు |
|---|---|---|
| జోధపూరు | ౧౬ % | ౧.౨౫ % |
| ఆళ్వారు | ౫౦ % | .3 % |
| బికనీరు | ౧౧ % | ౧.౮ % |

ఇంతేగాక పెక్కు సంస్థానములలో బానిసత్వమున్నది. ఈ బానిసలు పడుబాధలకు మితముండదు. పూర్వకాలపు నీగ్రోబానిసల స్థితికి వారిస్థితి తీసిపోదు. వీరి హృదయ విదారకస్థితిని వర్ణించుచు యెన్ని పుటలనైనను నింపవచ్చును. కాని యిప్పటికే వ్యాసమతి దీర్ఘమైనది. కనుక నీ సమస్యను వదలివేయవలసి వచ్చినది.

సంస్థానాధీశుల జీవితక్రమమును, పరిపాలన విధానమును మే మింతవరకు వివరముగ చర్చించితిమి. దీనినిబట్టి నూతన రాజ్యాంగవిధానములో వీరి కెట్టిస్థానమిచ్చుట పాడియొ పాఠకులే నిర్ణయించుకొనవచ్చును!

---

# సముద్రతీరము

(సాయంసమయము)

కోరిమిల్లి వీరసోమ సత్యనారాయణ, బి. ఏ.

కనుఁగొన నేటవాలుగను గ్రాలుచుఁ జూపుల కందునంతద
వ్వాస నల పశ్చాకృతిన్ చదలు ముద్దులు పెట్టుచు నింద్రనీలపుం
గాసులువెంపద నిగ్గులురుఁగుల్ సరిపోలఁగ వార్ధితీరమం
దున నెలరాలమెట్లగతిఁ దోఁచును గా తెలివీచు లింపుగన్.

సురుచిరనీలకాంతిపరిశోభితవార్ధిని మందమారుత
స్పందనతరంగబృందములు పైపయిఁ గ్రొన్నురుఁగుల్ సెలంగ నం
దందున నవారవిందముల యందము నొందె ధరాపురంధ్రి సొం
పొందఁగఁ దాల్చు నీలిజిగి పుట్టముపైని జరీబుటా లనన్.

బాలసమీరలోలతర పాండురచారుతరంగమాలికా
డోలికలందు నూఁగుచుఁ గడుంగడు సొంపుగ తెక్కలార్చుచున్
గ్రాలును లీల వారివిహాగంబులు మీనముఖాంబుసంచర
జ్జాలములం గ్రసించుచును సారెకుఁ బైపయిఁ దేలియాడుచున్.

ఇరవుగ నుబ్బి మీఁదికి నొకించుక మేరఁ బయఃప్రకాండముల్
విరుగుచుఁ బిల్లగాలులకు ఫేనసమగ్రసృపత్కదంబముల్
చెరలుగ రేఁగ నొండొకటి డీకొని వీచికలై తటంబునం
దొరగుచు వెల్లువల్ మఱలు చుండును లోనికి నేత్రపర్వమై.

హరిసరయోధివీచికల నల్లన డిగ్గుచు మందమందసం
చారము లొప్ప సర్వజనజాలసమాదరణం బొనర్చి వి
స్తారపరిశ్రమాపనయతత్పరతన్ జెలువారు శీకరో
దారమనోజ్ఞసాంధ్యసమయాగతశీతసమీరవారముల్.

ఉరుతరకార్యభారజనితోత్కటతాపనివారణార్థులై
నరగున వచ్చు నెల్లరను సైకతపీఠములందుఁ జేర్చుచున్
దరళతరంగశీకరవితానములన్ బయిఁ జిల్కి చల్లతె
మ్మెరసురఁటుల్ శ్రమం బడఁగ మెల్లన వీచు సముద్రుఁ డింపుగ:

[illegible]

చండకరుండు తేజ ముపసంహృతిసేయఁగ సాంధ్యవేళ నీ
రెండలు మేడలందుఁ బ్రసరించి తరువ్రజశాఖ లెక్కి పై
న్గొండలఁ బ్రాఁకి వింతరుచి గొల్పుచుఁ జూపఱ కెంతయేనిఁ గ
న్పండువు సేయుచున్ వెనుకఁ బారి యదృశ్యము లౌఁ గ్రమంబునన్.

ఆరోగ్యసంగ్రహణార్థంబు చేకఱ్ఱ లూని యిట్టటు నేఁగు చుండువారు
పై నున్న వలువలఁ బఱచి మేనులు వాల్చి చల్లగాలికి నుల్లసిల్లువారు
వలయంబులను దీర్చి పులినభాగములందు హాస్యతోఁ జేట్లాట లాడువారు
ఎలమి వార్తాపత్రికలఁ గేలఁ గీలించి చదువుకొంచును బ్రొద్దు బుచ్చువారు
గుములుగాఁ గూరుచుండి సంకోచ మెడలి-యిష్టగోష్ఠులు సలుపుచు నెసఁగువారు
శరధితీరంబునను సాంధ్యసమయమందు-జనము లిటు గానవచ్చు దృశ్యమై మెండుగ్ర.

కేరుచు బంతులాడుచును కేకలు వైచుచుఁ బర్వులెత్తుచున్
నీరము లల్లఁ జిమ్ముచును నెమ్మిగ సైకతపాళి దొర్లుచున్
గోరిక నొండొరుల్ జఱచుకొంచును మేలములాడుకొంచు స్వే
చ్ఛారతి బాలు రొప్పెదరు సాగరతీరమునందు సంజలన్.

తెలినునుపాలబుగ్గలును తేటమెఱుంగుఁబిల్లికన్నులున్
దళుకుఁ బిశంగకేశములు దవ్వులఁ బోలెడు కాలుసేతులున్
వలపుమడుంగుదుస్తులును భాసిల నాంగ్లశిశుప్రతానముల్
దలిమపుఁదోట్ల నాడుదురు దాదులు లాలనసేయ నత్తఱిన్.

తోయధితీరమం దనతిదూరమునన్ జెలువారు మేడలన్
సాయపువేళలందున "షచారు" లొనర్తురు చిత్తసమ్మదో
పాయత భాగ్యసంయుతులు వాఃకణసమ్మిళితైకశైత్యవ
ద్వాయువు లల్లఁ బైకొనుచుఁ బాయఁగఁ జేయఁగ మేనిచెమ్మటల్.

అలరుపెన్నెఱితుమ్మెదలమధ్య నిరవైన యొంటిగొజ్జఁగిపూవు సొంపు లమర
అవదాతవదనతోయజమునందున సిరుల్ జిలుకు కుంకుమచుక్క చెలువు లమర
అరుదునెమ్మెనిక్రొమ్మెఱుంగుతీఁగలఁ గప్పు మబ్బుచీరలసొంపు మహిమ లమర
అరుణైకకోమలాధరపల్లవంబుల మఱుఁగున మొగ్గప ల్వరుస లమర
అందముల గొప్ప కన్నుల విందుసేయు - పరిమితంబగు భూషణప్రకర మమర
నాంధ్రయువతీవతంసంబు లబ్ధితీర - పాళి విహరించుదురు సాంధ్యవేళలందు.

జడ లల్లి కురులసాం పడర వింతగఁ గూర్చు కొనురంగుగుడ్డల గోముతోడ
నునుపారు తెలిఁ జెక్కు-లను నీటుగా నద్దుకొను గులాబిరజంబు కోమరుతోడ
వలిపంపునెఱికల పైని దాల్చిన పట్టు రకపుగౌనుల చోకారంబుతోడ
మేజోళ్ల పై జోళ్లు మేకొల్పి యిట్టట్టు నడయాడునడకల బెడఁగుతోడ
కేలు కే ల్వట్టి ప్రియులతో లీలఁ గలిసి - హాళి విహరించు చాకచక్యములతోడ
నాంగ్లయువతివతంసంబు లబ్ధితీర - పాళిఁ జూపట్టుదురు సాంధ్యవేళయందు.

నునుపార "క్రాపింగు"లను దువ్వి మడుఁగుదుస్తుల నొయారంబుగా నెలమిఁ దాల్చి
కనుల కద్దములు చక్కఁగఁ బెట్టి ముంజేతులను గడియారంబు లనువుపఱిచి
లీలగా బెత్తముల్ కేలఁ దాలిచి పదంబుల జాఱుచెప్పులు నెలవుకొల్పి
వలపుచేతిరుమాళ్లఁ బలుమాఱు విదలించు చొగి నెమ్మొగంబుల నొత్తుకొనుచు
పెదవులందున సిగరెట్లు బిగియఁబట్టి-చకచకలు మీఱ నవనాగరకత లలర
యువకు లోకకొంతమంది పయోధితీర-మందుఁ గనుపట్టుదురు సంజలందుఁ జూడ.

జనములసంఖ్యఁ జెప్పఁగ నశక్యము "మోటరుకారు" లెన్నియో
కనుఁగొన హద్దు లేదు దరి గానము త్రొక్కుడుబండ్ల లెక్కకే
యనువును లేదు తక్కుశకటావళి నెన్నఁగ సాంధ్యవేళలన్
వననిధితీరసంగతవిభాసురరాజపథంబునందునన్.

వితతాబ్ధితీరనిర్మితసౌధపరిసరోద్యానమంటపసమాసీను లగుచు
కృతపయస్సేచనాంచితవికస్వరపుష్పమయలతాతరుకాంతి మహిమ గనుచు
లలితసుగంధసమ్మిళితపర్యాలోల మలయాబాలసమీరముల కలరుచు
సంకీర్ణశీతలాసారసంతతవర్ష జలయంత్రములఁ గాంచి సంతసిలుచు
ప్రియవధూసంతతులఁ గూడి వేడ్క మీఱ - గానలీలావిధుల సాంధ్యకాలమందుఁ
దేలి యాడుదు రల భాగ్యశాలులైన - ధన్యతము లుత్తమాన్వయోద్భవులు చూడ.

ఆనీరాకరనీలకాంతివిభవం బాఫేనభాస్వత్తరం
గానీకంబులచెల్వ, మాజలకణవ్యామిశ్రబాలానిలం
బానవ్యాయతసైకతోపరిజనవ్యాపారకోలాహలం
బానందంబయి యాదినాంతసమయంబం దొప్పు నెంతేనియున్.

చెన్నరాజధానియందు [illegible]-వ సంవత్సరము ఏప్రిల్ ప్రారంభము మొదలు [illegible] జూన్ వరకు గల మూడు నెలల కాలమున ముద్రితములయి ప్రకటితములయిన

# ఆంధ్ర గ్రంథముల పట్టిక*

ఆంధ్ర వాఙ్మయ మీ క్రింద పేర్కొనిన శాఖలక్రింద విభజింపబడియుండుటచేత ఈపట్టికయం దాయా శాఖల సముత్పన్నములగు గ్రంథము లాయా శాఖలకే చేర్చబడును. గ్రంథముల నా మములు [illegible] అకారాదిక్రమమున నుంచును.

1. అర్థశాస్త్రము, 2. అలంకారశాస్త్రము-వాఙ్మయమునకు సంబంధించిన గ్రంథములు సయితము ఈ శీర్షిక క్రిందనే చేర్చబడును, 3. ఆయుర్వేదశాస్త్రములు, 4. ఆరోగ్యశాస్త్రము, 5. ఇతిహాసములు-ఇతిహాసములలోని భాగములు, కథలు, మార్పుచేయక ప్రత్యేకముగ ముద్రింపబడినవి యీశీర్షికక్రిందనే చేర్చబడును, 6. కథలు—ఐతిహాసికములు,పౌరాణికములు, 7.—-కల్పితములు, 8.—-చారిత్రకములు, 9.కల్పము, 10.కామశాస్త్రము, 11.కావ్యములు, 12. గణితశాస్త్రము, 13. గేయములు, 14.చరిత్ర(దేశ-), 15. చిత్రలేఖనము,16. చట్టము(Law), 17. ఛందశ్శాస్త్రము, 18. జంతుశాస్త్రము, 19. జీవితములు, 20. జ్యోతిషశాస్త్రము, 21. తర్కశాస్త్రము, 22. దండకములు, 23. ధర్మశాస్త్రము, 24. నవలలు, 25. నాటకములు, 26. నాట్యశాస్త్రము, 27. నిఘంటువులు, 28. నీతి- నీతికథలుకూడ యీ శీర్షికక్రిందనే వచ్చును, 29. పరిశిష్టము, 30. పాకశాస్త్రము, 31. పారిశ్రామికము, 32. పురాణములు- ప్రత్యేకముగ ముద్రింపబడి ప్రకటింపబడు పురాణములలోని భాగములు సయిత మీ శీర్షికక్రిందనే చేర్చబడును, 33. ప్రకృతిశాస్త్రము, 34. ప్రబంధములు- ఆంధ్ర సారస్వతమునందు ప్రసిద్ధములగు 'హరివంశము', 'ఆంధ్రచంపూభారతము', 'అచ్చతెలుగు రామాయణము'వంటి పురాణేతిహాస కావ్యములకు సంబంధించినవి, 'పాండురంగ మాహాత్మ్యము' వంటి మాహాత్మ్యములు, 'ఆంధ్రమేఘసందేశము'వంటి అనువాదములు, 'రంగనాథరామాయణము'వంటి ద్విపదగ్రంథములు మొదలయినవి యీశీర్షికక్రిందవచ్చును, 35. ప్రహసనములు, 36. భూగోళశాస్త్రము, 37. భౌతికశాస్త్రము, 38. మంత్రశాస్త్రము, 39. మతము - హిందు, 40.—— ఇతరములు (బౌద్ధ, జైన, క్రైస్తవాదిమతములు)- ఇతరమతములకు సంబంధించిన గ్రంథములు—— ఏ విషయ విభాగమునకు సంబంధించిన వయినను- ఈశీర్షికక్రిందనే చేర్చబడును, 41. మాహాత్మ్యములు, 42. మీమాంసాశాస్త్రము, 43. యక్షగానములు, 44 యోగశాస్త్రము, 45. రత్నశాస్త్రము, 46. రాజకీయములు, 47. వాస్తుశాస్త్రము, 48. విమర్శనము- ఇందు సారస్వతమునకు సంబంధించిన విమర్శనలు మాత్రముంచును, 49. వృక్షశాస్త్రము, 50. వేదవాఙ్మయము- ఉపనిషత్తులు,ఇతర వైదికగ్రంథములుసయిత మిందే చేర్చబడును, 51. వేదాంతము - భక్తి జ్ఞానవైరాగ్య విషయకగ్రంథములీశీర్షికక్రింద వచ్చును, 52. వైద్యశాస్త్రము, 53. వ్యవసాయశాస్త్రము, 54. వ్యాకరణ శాస్త్రము, 55. వ్యాపారము, 56. వ్యాయామము, 57. శకునశాస్త్రము, 58. శతకములు 59. సంగీతశాస్త్రము, 60. సాంఘికములు, 61. సాముద్రికశాస్త్రము, 62. సారస్వతము-భాష, 63. స్తోత్రములు, 64. హరికథలు.

* ఈ పట్టికయందుగల సంకేతపదముల వివరణము: అ.—అధ్యాయము; అను.—అనువాదము. అనువాదకులు. ప.—పద్యము. ప్ర.—ప్రకాశకులు. భా.—భాగము. వ.—వచనము. సం.—సంపాదకులు. సటీ.—సటీకము.

## జీవితములు

ఆత్మకథ—(అను) వి. శివరామశాస్త్రి
శ్రీవీరబ్రహ్మముగారి జీవితచరిత్రము—సి. సుబ్బయ్య

## జ్యోతిషశాస్త్రము

కాలచంద్రిక—యం. రామయ్య
జ్యోతిషచక్రప్రదర్శిని—సి. లక్ష్మీనరసింహశాస్త్రి

## దండకములు

ఆంజనేయదండకము—డి. రామకృష్ణరావు
ఆంజనేయదండకము; హనుమద్దండకము మొ.—(ప్ర) వి. రామస్వామిశాస్త్రులు అండ్ సన్స్, మదరాసు.

## నవలలు

ఇందిర—యం. శ్రీరామమూర్తి
తపోవనము—యస్. రామానుజరావు
దొంగలనాయకుడు—కె. కోటయ్య
పెనుభూతము! జాగ్రత!—జి. శ్రీరామశర్మ
ప్రణయసామ్రాజ్యము—కె. కృష్ణరావు
మాయావి—వేంకటపార్వతీశ్వరకవులు
రెండువందల అఱువదినాలుగు, భా. ౧, ౨—కె. నాగభూషణరావు
వనదుర్గము—యస్. రామానుజరావు
వీరాబాయి—ఇ. భావ్యకాచారి
శిశుహత్య, భా. ౧, ౨—యస్. రామానుజరావు
సువర్ణపతకము—పి. వి. లక్ష్మీనరసింహం

## నాటకములు

అభిజ్ఞానశాకుంతలము—(అను) కె. కనకమ్మ
చూడామణి—పి. లక్ష్మీనరసింహరావు
పద్మవ్యూహము—యం. వెంకటనరసింహాచారి
పద్మవ్యూహము—యస్. పురుషోత్తమరావు
ప్రసన్నరాఘవము—(అను) కె. కొండలరావు
రత్నమంజరి—పి. జోసఫ్
రోషనార—బి. కోటీశ్వరరావు
విక్రమార్కనాటకము—వి. శ్రీనివాసరాఘవాచారి
విష్ణులీలలు—యస్. రామానుజరావు
శృంగారమాధవము—రామకోటీశ్వరకవులు
శ్రీయాళమహారాజు నాటకము—మహమ్మదు కాసిం సాహెబ్
సంపూర్ణరామాయణము—బి. కోటీశ్వరరావు
సీతాకల్యాణము—సి. వీరభద్రరావు

## నీతి

పుత్రీహితబోధిని—యం. కామేశ్వరశాస్త్రి
బాలురనీతికథలు—వి. లక్ష్మీనారాయణశాస్త్రి

## పరిశిష్టము

అంకితము—బి. యస్. నారాయణరావు
అత్యద్భుతరహస్యరత్నాకరము — టి. సూర్యప్రకాశరావు
అద్భుతభవిష్యత్ ఫలదర్శిని—టి. సూర్యప్రకాశరావు
అక్షరాభ్యాసము—కె. రామయ్య
ఆంధ్రనవీనవాచకము, ౧, ౬ — సి. సూర్యప్రకాశరావు, హెచ్. పేరయ్యశాస్త్రి మొ.
ఆంధ్రరాష్ట్రీయ నాయీమహాజనసంఘ ప్రబోధము—(ప్ర) టి. లక్ష్మయ్య, పచ్చలలతిపత్రు
ఆంధ్రవాచకము, తరగతి. ౬—పీ. జయరామరావు, డి. జగన్నాథశాస్త్రి మొ.
ఇండియాలో గొప్పపనిచేసిన విదేశమిషనరీలు—రెవరెండ్ జె. యం. బేకర్
ఇరువదవసంవత్సరాదిసంచిక—(ప్ర) కె. నాగేశ్వరరావు మదరాసు.
కరణీకతంత్రము—టి. వి. రాఘవాచారి
కులలక్ష్మి, భా. ౨—వి. వెంకటరత్నం
కులాచారపరీక్ష—సి. పురుషోత్తం
కొరుకుపుండ్లనుగూర్చి—(ప్ర) క్రిశ్చియన్ లిటరేచర్ సొసైటి, మదరాసు.
క్రొత్తతెలుగుబాలశిక్ష—డి. రామమూర్తి
గాంధిమహాత్ముని ఆగమనము—(ప్ర) ఒ. సుబ్రహ్మణ్యం
గ్రామమునసఫ్ మణియగార్ల స్పెషల్ టెస్టు పరీక్ష ప్రశ్నోత్తరములు—పి. యస్. రంగస్వామిరావు

గ్రామమునసబుల పరీక్షాప్రవర్శిని, భా. ౨—బి. లక్ష్మీ నరసింహం

గ్రామపాఠశాలలపై విచారణకర్తల సమావేశనివేదిక—(ప్ర) రెవరెండ్, జి. ఎ. ఠామ్లై, తర్లపాడు.

చాకిరేవు—కే. ధర్మరావు

తరణము—యస్. అప్పరావు

తునితాండవవనదీప్రళయము—కె. సత్యనారాయణ దాసు

దీపావళి—కి. వంకటేశ్వరరావు

నంబివంశప్రదీపిక—యం. రామస్వామి

నల్లమందుసేపు—(ప్ర) క్రిశ్చియన్ లిటరేచరుసొసైటి, మదరాసు

నీలిప్రూలు—యస్. ఒ. ఆచార్య

నెలవంక—ఏ. వంకటరంగారావు

పంచమహాపాతకనిషేధము — జే. సూర్యనారాయణ రాజు

పరీక్షావిజ్ఞానచంద్రిక, తరగతి 3—జి. రంగరావు నాయుడు

పాండవానందము—పి. వి. సుబ్బరావు

పురాణవాచకము—కి. సోమన్న

పువ్వులతోట—యస్. సూర్యనారాయణశాస్త్రి

పోలురాజుచరిత్రము—పి. వెంకటాచలదాసు

ప్రజామిత్రమండలి నిబంధనలు—(ప్ర) ప్రజామిత్రమండలిసంఘము, ఏలూరు

ప్రత్యక్షబాలబోధ—కె. సుందరరామయ్య

ప్రపంచజ్ఞానము, తరగతి ౨—జి. వి. రామమూర్తి

ప్లేగుజాడ్యము—(ప్ర) క్రిశ్చియన్ లిటరేచర్ సొసైటి, మదరాసు

బాలవాచకము—యం. సుబ్రహ్మణ్యం, పి. వెంకటరామశాస్త్రి

బాలసత్కారసభ—క. నరసింహం

బైలాస్ అఫ్ ది ఇండియన్ అగ్రికల్చరల్ బ్యాంకు లిమిటెడ్—(ప్ర) క. జయరామరావు, విశాఖపట్టణము

భక్తిరసాయనము—జి. బలరామస్వామి

భారతనారీమణులు, తరగతి ౬, ౭—కె. కృష్ణవేణమ్మ

మణిభూషణము—టి. రాజగోపాలరావు

మాయోపాయమారణము, భా. ౧—బి. నాగభూషణం

మారుతివాచకము, తరగతి ౨—జి. రంగరావునాయుడు, పి. సత్యనారాయణనాయుడు

ముద్దు—యస్. కృష్ణరావు

మెట్టవేదాంతము—యస్. కృష్ణరావు

రంగూక్ తమాషా—యస్. మీరయ్య

రతిరహస్యము—సి. ప్రభావతీకుమారి

రాజశేఖరుడు-గోపాలుడు—వి. వెంకటేశ్వరశాస్త్రి

రెండవతరగతి క్రొత్తతెలుగువాచకపుస్తకము—యస్. భూషణం

లద్దగిరి రామదాసుగారిలీల—యల్. వెంకోబరావు

శ్రీకాశీయాత్ర—(ప్ర) వేంకటేశ్వరశాస్త్రి, తెనాలి

శ్రీకాశీయాత్రారైలుమార్గదర్శిని—పి. రామచంద్రయ్య

శ్రీమదాంధ్రగురుపరంపరాప్రభావము — ఏ. శ్రీరాములుశెట్టి

శ్రీమద్గోదాకల్యాణము—జే. సుబ్రహ్మణ్యశాస్త్రి

శ్రీమద్భద్రగిరి సీతారామచంద్ర పట్టాభిషేకకల్యాణోత్సవాభివర్ణనము—టి. సీతారామదాసు

శ్రీమహాలక్ష్మీ—కె. లక్ష్మయ్య

శ్రీరాజగీతరత్నావళి—పి. పేరరాజు

శ్రీవిష్ణుపారమ్యవైభవము—(ప్ర) కె. రామానుజాచారి, మదరాసు.

శ్రీవైకుంఠదీర్ఘసత్రయాగాభివర్ణనము — జి. వెంకటకృష్ణకవి

సంస్కృతభారతము—(అను) కె. కృష్ణసోమయాజి

## పురాణము

శివపురాణము (వ) భా. ౬—(ప్ర) యస్. వీరరాజు, పిఠాపురము.

## ప్రకృతిశాస్త్రము

శాస్త్రవాచకము తరగతి, ౩, ౪, ౫. ౬—సి. యస్. ప్రకాశరావు, కె. హెచ్. వి. యస్. నారాయణ

## భూగోళశాస్త్రము

కర్నూలుజిల్లా జాగ్రఫీ—(ప్ర) వెంకటరాం అండ్ కో., ఏలూరు.

గుంటూరుజిల్లా భూగోళము—పి. ప్రకాశరావు

గుంటూరుజిల్లా భూగోళము—(ప్ర) వెంకటరాం అండు కో., ఏలూరు

చెన్నపురిరాజధాని భూగోళము—డి. సత్యనారాయణ మూర్తి

నూతనగంజాంజిల్లా భూగోళము—పి. సత్యనారాయణ శర్మ

పశ్చిమగోదావరిజిల్లా భూగోళము—వి. పురుషోత్తము

భూగోళము—శి. వి. సీతాపతి

భూగోళము—వి. సత్యనారాయణ సి. దీక్షితులు

మచిలీపట్టణభూగోళము—సి. సుందరరామయ్య

## మతము—హిందు

అవతారరహస్యము — (ప్ర) హౌఉన్ అండు కో., మదరాసు

బుక్సంగ్రహః మొక్కుబడి—ఏ. నారాయణదాసు

జీవాదేశము—కె. నరసింహం

దాసబోధ—(అను) కె. చక్రధరరావు

పాపారణ్యకుఠారము—కె. నరసింహం

శ్రీపులివిందుల రంగనాయకస్వామివారి చరిత్రము—యల్. వెంకటరమణయ్య

## —— ఇతరములు

ఆశ్లాశీర్వాదములు—చ. జోషువ

గృహనిర్వాహకత్వము—ఆర్. జి. కోర్ట్‌లింగ్

పాతనిబంధనగ్రంథములోని కథలు—(ప్ర) క్రిశ్చియన్ లిటరేచర్ సొసైటి, మదరాసు

భక్తిమార్గము—కె. సుందరరాముడు

భక్తిమార్గము—సి. రామేశ్వరశర్మ

సువార్త అభినయపాటలు—(ప్ర) క్రిశ్చియన్ లిటరేచర్ సొసైటి, మదరాసు.

నేబస్తు అను పట్టణములోని నలుబదిమంది హతసాక్షులు—(ప్ర) క్రిశ్చియన్ లిటరేచర్ సొసైటి, మదరాసు.

## మాహాత్మ్యములు

ఉపమాకాక్షేత్రమాహాత్మ్యము—(అను) బి. పాపయ్య

కాంచీమాహాత్మ్యసంగ్రహము—వి. వెంకటసుబ్బయ్య

శ్రీశివరాత్రిమాహాత్మ్యము—వి. గుర్నశర్మ

హంసద్వీపతీర్థమాహాత్మ్యమ్—(ప్ర) సి. లక్ష్మీనృసింహ శాస్త్రి, మచిలీపట్టణము

## మీమాంసాశాస్త్రము

ఆంధ్రమీమాంసపరిభాష—ి. గోపాలకృష్ణమ్మ

## యక్షగానములు

శ్రీమత్సంపూర్ణ రామాయణము, భా. ౧—ఏ. వీరభద్రరావు

శ్రీహరిశ్చంద్రజననము—ఐ. రామకోటయ్య

## వేదాంతశాస్త్రము

అధ్యాత్మరామాయణము, వచనకావ్యము—ఐ. వెంకటకృష్ణశాస్త్రి

అనుభవజ్ఞానార్థప్రబోధిని—స్వామి ఆత్మానందఘన్

ఆత్మవిజయము—డి. బలరామకృష్ణయ్య

గీతాధర్మోపదేశము — ప్ర. బాలసాహిత్య మండలి, నెల్లూరు

జ్ఞానామృతము — (ప్ర) యస్. సూర్యనారాయణ, యేర్పేడు.

జ్ఞానామృతబోధిని—(ప్ర) ఆర్. సోమసింగు, ప్రొద్దుటూరు

దైవభక్తి—కె. సోమనాథశాస్త్రి

నారదపురూరవస్సంవాదము—కే. అబ్బయామాత్య

భక్తిబాలబోధ—కె. సుందరరామయ్య

మోక్షసోపానములు—వి. ఏ. రామేశ్వరశర్మ

శ్రీభగవద్గీతావచనము—(ప్ర) కణ్ణన్ శెట్టి అండ్ కో., మదరాసు.

శ్రీమన్మహిమ్నస్తోత్రభాష్యము, భా. 3—(ప్ర) కే. శ్రీనివాసరావు, విజయనగరము

## వైద్యశాస్త్రము

వైద్యసారసంగ్రహము—బి. రఘువదాసు

## వ్యవసాయశాస్త్రము

వ్యవసాయశాస్త్రము—ఏ. వెంకటసుబ్బరావు

## వ్యాకరణశాస్త్రము

ఆంధ్రవ్యాకరణపాఠములు—యన్. వెంకటరామానుజాచారి

సుప్తార్థప్రకాశిక—కే. వెంకటరామశాస్త్రి

వ్యాకరణపాఠములు, తరగతి 4, 5—యం. నరసింహం

## శతకములు

ఆంజనేయశతకము—కే. రామచంద్రరావు

చంద్రవరాళీశ్వరశతకము—యన్. వెంకటఅప్పరావు

భాస్కరశతకము—సి. రామలింగారెడ్డి

మానవర శ్రీరామశతకము—కే. లక్ష్మయ్య

రామశతకము—పి. రామమ్మ

రామశతకము—బి. కంబయ్య

విజ్ఞానకంపశతకము—యం. రాజారావు

శ్రీ బాలగోపాలశతకము—పి. సోమరాజామాత్యకవి

శ్రీరుక్మిణీపతిశతకము—యస్. అయ్యమ చారి

శ్రీవేణుగోపాలశతకము—యం. వెంకటేశ్వరరాయశర్మ

శ్రీసుబ్బయార్యశతకము—కే. రామన్న

సానుసంజీవనశతకము—యం. వెంకటశర్మ

సీతారామస్వామిశతకము—భ. పాలన్‌రాజు

స్తోత్రశతకోపాఖ్యానసంపుటి—సి. రామచంద్రయ్య

## సారస్వతము-భాష

తెలుగుకావ్యాదర్శము—(అ) అవ్వారి సుబ్రహ్మణ్యశాస్త్రి

## స్తోత్రములు

ఆంధ్రముకుందమాల—ఏ. సోమనాథరావు

కందకుసుమములు, శివస్తోత్రము—ఎ. నృసింహకవి

కేకావళి—ఆర్. వెంకటరామసోమయాజులు

మంగళాద్రి లక్ష్మీనృసింహస్తవం—యం. శేషాచలం

శ్యామలాపుష్పమాలిక—యన్. వి. అప్పారావు

శ్రీరామకర్ణామృతము—(ప్ర) ఏ. కణ్ణన్‌శెట్టి, మద్రాసు

స్తోత్రరత్నములు—జే. యజ్ఞనారాయణ

## హరికథలు

చంద్రాంగదచరిత్ర—యన్. గోపాలకృష్ణకవి

పుత్రకామేష్టి—యం. జగన్నాథదాసు

భగవన్నామప్రభావము—ఏ. రామచంద్రశర్మ

శ్రీవైదర్భీపరిణయహరికథ—శే. శేషాచలం

---

# మా వ్యాసకర్తలకు

వ్యాసములు సంపూర్ణముగ చిన్నసైజు కాగితములపై ఒకవైపున మాత్రమే విడిఅక్షరములతో బంతులు దూరదూరముగా, దిద్దుబాట్లు లేకుండ, తిన్నగా వ్రాసి, వర్ణక్రమమునను తప్పులు లేకుండ చూచుకొని పంప వేడికోలు. లేకున్న ముద్రణకార్యములయందు మిగుల కష్టము కలుగుటయే కాక తప్పులుకూడ నిలిచిపోవునని మనవి. ప్రకటింపనివ్యాసముల తమకు తిప్పిపంపుటకయి తపాలుబిళ్లలు పంపవలయును.

సంపాదకుడు, 'భారతి'.

## రోడ్ల మరామత్తు


ఒకరోడ్డు మరామత్తు అయేటప్పుడు —— ఆప్రక్కరోడ్డు
మొదటి రోడ్డు —— ఆ ప్రక్కరోడ్డు మరామత్తు అయేటప్పుడు
రెండురోడ్లూ మరమ్మతు ఐనపిమ్మట
తలిశెట్టి
రామారావు

---

బి. సుబ్రహ్మణ్యముగారు

౧

మణిపూరు ఉన్నతపర్వతపంక్తుల నడుమ సారవంతమగు సమప్రదేశమున గలదు. ఆదిమజాతులగు నాగులు, తంకులులు, కూకీలు అనువారల కది నివాసస్థానము. ప్రౌఢిగా పెరిగిన చెట్టుచేమలు, ఫలవృక్షములు, తోటలు, సమృద్ధములగు పంటచేలు మున్నగువానితో నలరారి ప్రకృతిలక్ష్మికి క్రీడామందిరమయి యొప్పుచుండును. పర్వతశిఖరముల నావరించిన తెల్లని



మణిపూరు మహారాజా, శూరచంద్రసింగు.

మేఘశకలములు పురసౌందర్యమును పెంపొందించుచుండును. ఈలోయయందు ప్రవహించుచున్న చిన్న చిన్న నదులు పెక్కులు, దక్షిణభాగముననున్న 'లోక్‌టాక్' అనుసరోవరము ఈ పురమును ఆపాతరమణీయమునుగా జేయుచున్నవి. సముద్రరేఖకన్న రెండువేల అడుగుల యౌన్నత్యముగల స్థలమున నుండుట చేతను, పరిమితశీతోష్ణస్థితి గల దగుటచేతను ఈప్రదేశ మారోగ్యవంతమయినది.



మహారాజ ప్రాసాదము.

మణిపుర ప్రజలు హిందువులు; మిక్కిలి వినయవంతులు; ఉల్లాసము గలవారు; మితమయిన పొడవుగల సుందరశరీరము గలవారు; డాంబికము లేనివారు; మితవ్యయమున కలవడినవారు; దరిద్రు లయ్యును నిత్యసంతృప్తులు; మలబారునందలి జనులవలె పరిశుభ్రముగ నుందురు; కొండజాతులతో కలసిమెలసి మెలగుచున్నను నాగరికతగలవారు. వీరు చైతన్యమతానుయాయు లగు వైష్ణవులు. స్త్రీలకంటె పురుషులు సోమరులు. స్త్రీలు కష్టించి పనిపాటులు చేయుదురు. వీరియందు నేటి నాగరతకు ప్రవేశము లేదనియే చెప్పవచ్చును. వీరిభాష ఆచుట్టుపట్టులవారు మాటలాడుభాషలకన్న భిన్నమయినది. మంగోలియను-భాషతో దీనికి సంబంధ మున్నట్లు కానవచ్చును. వీరి ఆకారమునగూడ మంగోలియను-సంబంధచిహ్నములు గలవు. ఇచట బ్రాహ్మణులు సంస్కృతమును జదువుదురు.

ఇచట వరిబియ్యము, ఎండుచేపలు ముఖ్యాహారము. కావున వరిపంట మిక్కుటముగా పండును.

ఎంగుచేపలు కొంతవరకు పైదేశములనుండి దిగుమతి యగుచుండును.



మహారాజప్రాసాదము - పశ్చాద్భాగము.

## ౨

ఈప్రదేశము అర్జునపుత్రుడగు బభ్రువాహనుని రాజ్యములోనిదని ప్రతీతి. క్రీ. శ. ౩౩ సం. కు పూర్వపు మణిపురిచరిత్రమునుగూర్చి ఏమియు తెలియరాదు. కాని అపుడు ప్రజలు కేవలము దీనస్థితియందుండిరట.



పట్టాభిషేక భవనము.
మణిపురరాజులకు ప్రాతకాలమునుండి యిచ్చట పట్టాభిషేకము జరుగుచుండుటాచారము.

తరువాత ఏనూరంపల సం. లు కాలము ఇచట నివసించు ఎల్లబాహులవారును 'మీతీ'రాజులపరిపాలనమున నుండెడి వారట. ౧౪౬౭-వ సం. న మణిపుర రాజు తన రాజ్యమును విస్తరింపజేసికొనెను. పిమ్మట క్రీ. శ. ౧౭౧౪ సం. 'గరీబ్‌నవాజ్' అను బిరుదము గల 'పమీబా' అను మణిపురరాజు తనతండ్రిని కాల్చి చంపి తాను రాజయ్యెను. ఇతనికాలమున నిచట హిందూమతము ప్రవేశమునుగాంచి క్రమముగ వ్యాప్తినొందినది. ఇతడు బర్మాపై పెక్కుమారులు దాడివెడలెను గాని యింతగాయైన లాభము లేకపోయెను. కుమారులలో నొక డితనిని జంపి రాజ్యమునకు రాగా వానిని వాని తమ్ములలో నొకడు రాజ్య



కార్యనిర్వాహకసభా భవనము.

మునుండి తరిమివేసెను. ఆవల పదునెనిమిదవశతాబ్ది చివరను, పందొమ్మిదవ శతాబ్ది ఆరంభమునను ఈరాజ్యమును బర్మావారు పెక్కుమారులు వచ్చిపడి పాడుచేసిరి. పెక్కురను బందీలనుగా గొనిపోయిరి. తక్కిన వారిని చుట్టుపట్టుల నున్న కొండలలోనికి తరిమివైచిరి. క్రీ. శ. ౧౮౨౪-వ సంవత్సరమున మొదటిబర్మాయుద్ధము ప్రారంభమయ్యెను. బర్మావారు 'కచరు'ను ముట్టడించిరి. అపుడు కుంఫిణీవారు మణిపురరాజగు గంభీరసింగుతో చెలిమిచేసికొని మూడువేలసేనను అతని వద్దనుండి కైకొని బర్మావారిని చాలదూరము వెనుకకు

పారిపోయిరి. దీనిచేత మణిపురమునకు కంపెనీవారి వలన కొంతలాభము కలిగెను. గంభీరసింగు కంపెనీ వారిసాయమువలన స్వతంత్రరాజయ్యెను.



కోటప్రక్కనున్న దర్బారుభవన ముఖ్యద్వారము.
ఈద్వారమువద్దనే బ్రిటిషుద్యోగులు వధింపబడిరని ప్రతీతి.



గోవిందజీ దేవాలయము.
మహారాజప్రాసాదముచేరువ నున్నది.

చంద్రకీర్తి కంపెనీవారితో మైత్రికలిగి యుండెను. వారికి ప్రాప్తించిన ఇక్కట్టులయందు రెండుమారులు వారికి సేనలను పంపి మిక్కిలి సాయము చేసెను. ఈకారణమున నీతనికి కె. సి. ఐ. ఇ. బిరుదము లభించెను.

క్రీ. శ. ౧౮౩౪-వ సంవత్సరమున గంభీరసింగు కీర్తిశేషుడు కాగా, అతని జ్ఞాతి నరసింగు, గంభీరసింగు కుమారుని చంద్రకీర్తిని గద్దెపయి నెక్కించి, అతడు మైనరగుటవలన తానే రాజప్రతినిధి యటులు పరిపాలన మొనరించుచుండెను. దీనిని సహింపక గంభీరసింగు భార్య నరసింగును చంపుటకై యత్నించెను. అది సఫలము కాకపోవుటచే, కుమారుని చంద్రకీర్తిని దోడ్కొని పురమునుండి యామె పారిపోయెను. అంత నరసింగే రాజయ్యెను. అతడు ౧౮౫౦-వ సంవత్సరమున మృతుడయ్యెను. అనంతరము మరల చంద్రకీర్తి రాజ్యమునకు వచ్చెను.



గోవిందజీ ప్రాతదేవాలయము.
ప్రకృతము బ్రిటిషుసేన తాలూకు మందుగుండు వగైరాలకు కొట్టిడిగా నున్నది.



పాతకోట-ప్రక్క-వాకిలి.

## 3

చంద్రకీర్తికుమారుడు శూరచంద్రసింగుకాలమున (౧౮౮౬–౧౮౯౦) రాజ్యమున తిరుగుబాటు సంప్రాప్తమయ్యెను. దీని మూలముగ గంభీరసింగు సంతతిరాజ్యమును కోలుపోయెను. శూరచంద్రసింగు రాజ్యపరిపాలనమున శ్రద్ధవహింపక, నిరంతరము, దైవచింతానిమగ్నుడై యుండెను. ఇదియు, మరికొన్ని విషయములు తిరుగుబాటునకు కారణము లయినవి. శూరచంద్రసింగు రాజ్యము కులచంద్రధ్వజున కొసంగి దైవచింతనమున తన మిగిలిన జీవితము గడపుకొనుటకయి బృందావనమునకు బయలుదేరెను. కాని కలకత్తాకు చేరునప్పటి కతనికి బుద్ధి మారిపోయినది. వైరాగ్యస్థానమును రాజ్యకాంక్ష యాక్రమించుకొనెను.

అంత నతడు మరల తన్ను రాజుగా జేయ అచ్చటి బ్రిటిషుప్రభుత్వమునకు అర్జీ పంపుకొనెను. కాని లాభము లేకపోయెను.

క్రీ. శ. ౧౮౯౧-వ సంవత్సరమున కులచంద్రధ్వజసింగును, అతనిసోదరుని, సేనానాయకుడును తిరుగుబాటునకు కారకుడును అగు తికేంద్రజిత్తుసింగును దేశమునుండి పారదోలకయే ఇండియాప్రభుత్వము తీరుమానము మేరకు రాజును జేయుటకు, అస్సాముకమిషనరు నాలుగువందలు తుపాకిసేనను తీసికొని మణిపురమునకు పోయెను. తికేంద్రజిత్తు అతనికి లొంగకపోయెను; వానిని బలాత్కారముగ నిర్బంధించుటకును సాధ్యము కామిని కమిషనరు సేనలతో తిరుగుముఖ మయ్యెను.

తరువాత ప్రధాన-కమిషనరు రెసిడెన్సిలో దర్బారు ఏరుపాటు చేసి మహారాజు మొదలుకొని, సంస్థానపు ఉద్యోగుల నెల్లను ఆదర్బారునకు రాగోరెను. తన్నచ్చట నిర్బంధింతురని, తికేంద్రజిత్తు ఆదర్బారునకు పోవ నిరాకరించెను. కమిషన రందుకు మిక్కిలి కుపితుడై తికేంద్రజిత్తును కోటలోపలనే పట్టుకొన నిశ్చయించి మరి ఆర్గురు బ్రిటిషు ఉద్యోగులతో కోటలో ప్రవేశించెను.

తికేంద్రజిత్తు తనకు రానున్న యుపద్రవమును గుర్తించి రాజును, తానును, సంస్థానమునందలి ప్రముఖు



బస్సులు నిలుచు స్టేషను.

'నాగ' కొండలనడుమ దినపూరు రైలుస్టేషనునుండి 'ఇంఫల్'కు పోవుమార్గమున సముద్రరేఖకు ఆరువేలఅడుగుల ఎత్తున నున్న ఈ ప్రదేశమునుండి కానవగు కొండలదృశ్యము మనోహరముగనుండును.

లును తాము ప్రశేషించేయవలయునో నిశ్చయింప సభగూడిరి. ఆసమయమున తికేంద్రజిత్తును పట్టుకొనవచ్చిన బ్రిటిషు ఉద్యోగులు సభాభవనములోనికి ప్రవేశింపగోరిరి. సభాద్వారమువద్ద కొంతపోరాటము జరిగినవెనుక నా యేపుగురు నచ్చట చంపబడిరట. తికేంద్రజిత్తున కిది సమ్మతము కాదు. అతడు వీరినిపట్టి నిర్బంధములో నుంచి వీరి అక్రమచర్యను రాజప్రతినిధికి తెలుపగోరెను. కాని అన్యథా జరిగిపోయెను.

తరువాత కొన్నాళ్లకు కొంతసైన్యముతో కర్నల్ జాన్‌స్టను అక్కడకు పోయి, రాజును, తికేంద్రజిత్తును, దుండగీంద్రను పట్టుకొనెను. వారిలో తికేంద్రజిత్తు మొదలగువారికి కొందరికి మరణదండనమును, తక్కినవారికి ద్వీపాంతరవాసశిక్షయును విధింపబడెను. కులచంద్ర ధ్వజసింగు ప్రభుత్వపుకైదీగా నిర్బంధింపబడెను. అతడిపుడు బృందావనమున నుంపబడియున్నాడు. అతనికి మాసమునకు వందరూపాయలు జీవనాంశ మొసగబడుచున్నది. ఈదురంతముతో గంభీరసింగు సంతతి రాజ్యభ్రష్టము కావింపబడెను. నరసింగు సంతతివాడగు శూరచంద్రసింగిపుడు రాజుగ నున్నాడు. ఇతనికి అధికారము లన్నియు తగ్గింపబడినవి.



'నాగ' జాతివారి గ్రామము.
దీనిపేరు 'మాయో.' మణిపురసంస్థానపు సరిహద్దున
సముద్రరేఖకు ఆరువేల అడుగుల ఎత్తున నున్నది.

పైన రగు శూరచంద్రసింగును ౧౮౯౧-వ సంవత్సరమున రాజునుగా నియమించి ప్రభుత్వ ప్రతినిధి సంస్థానమును పాలించుచుండెను.

శూరచంద్రసింగు మేయోకళాశాలలో విద్యార్జనము కావించి తరువాత సైనికశిక్షను బొందెను. మైనరుతీరినపిదప ౧౯౦౭-వ సంవత్సరమున ఇతనికి పట్టాభిషేకము చేయబడెను. ఇతని పరిపాలనమున రాజ్యమున శాంతి నెలకొనెను.



భనసరి నదిపైని ఇనుపవంతెన. 'ఇంఫల్' తుపోవు రోడ్డున నున్నది. ఇచ్చట చుట్టునున్న తోటల రమణీయదృశ్యము దర్శనీయము.

నేడు సంస్థానము విస్తీర్ణము ౮౪౫౬ చ. మైళ్లు, అందు ౭౩౫౦ చ. మైళ్లు పర్వతప్రదేశములు. అచ్చట నాగులు, కూకీలు అనబడువారు నివసింతురు. సమతలమగు ౭౦౦ మైళ్ల విస్తీర్ణమున మితీ లనబడు మణిపురీలు నివసింతురు.

౧౯౨౧-వ సంవత్సరపు జనాభా ప్రకారము జనసంఖ్య ౩,౮౪,౦౧౬. ఇందు ౨,౫౯,౬౧౮ మణిపురీలు. తక్కినవారు కొండజాతులు.

సంస్థానపు రాబడి సాలునకు రు ౭,౭౫,౦౦౦. ఇండియా ప్రభుత్వమునకు చెల్లింపబడు నజరానా రు ౫౦౦౦.



మణిపురి యువతి, ఆమె చంటిబిడ్డ.

సంస్థానపరిపాలనమును ప్రభుత్వకార్యనిర్వాహక సభ నెరవుచుండును. ఇండియను సివిల్ సర్వీసు ఉద్యోగి అధ్యక్షుడు. సభ్యులు ౪ రాజకుటుంబములో నివారుందురు. రాజకీయార్థిక శాఖలు కేవలము అధ్యక్షుని యధీనములు. తక్కినశాఖలలో నొక్కొక్కటి యొక్కొక్క సభ్యునివశమున నుండును. కాని అధ్యక్షుని



రాసక్రీడకొరకు వేషముల దాల్చినవారు.



నాగజాతి యువకుడు.

యనుమతి ననుసరించియే కార్యక్రమము జరుగుచుండవలెను. భూమిశిస్తునిర్ణయము పూర్వము సరిగా లేకుండెడిది. ఇపుడు భూములను కొలతచేసి సరిగా శిస్తు నిర్ణయించుట కొక యుద్యోగి నియమింపబడియున్నాడు. కొండజాతులవారు భూమిశిస్తు చెల్లింపరు. భూమి



నాగజాతి యోధులు.

పయి నంశుకమను నానాధికారముగల వని కీర్తి నిశ్చయమగు. రెగు లంటిపన్నును చెల్లింతురు. అది ఒక ఏడాది కొక గుంటికి అయిదు పావులాలు.

గామ ధార్మికము పరిపాలనవిష యములు దేశమంత్రుల ప్రమేయ; మతవిషయ ములగు సర్వాధికారములు రాజువే. అతని యనుమతిలేక వివాహము సైతము జరుగనేరదు. ఒకవేళ జరుగునేని దానికి సంబంధించినవా రెల్లరు రాజునాజ్ఞ మెయి వెలివేయబడుదురు. చెప్ప శక్యముకాని దిక్కులకు సైతము పొలయుదురు. వెనుక ఏకారణముచేత ఇటు లేరుపడెనో, కాని ఇప్పుడను ప్రభువులకు ఇట్లు తమ ప్రజల మత విషయములయందు స్వాతంత్ర్యముండుట చాల విచారకరము, అనుచితము.



సంత.



బాలురు.

బ్రిటిషుప్రజల క్రిమినలు, సివిలువ్యవహారము లన్నియు 'పొలిటికల్ ఏజంటు'చే పరిష్కరింపబడు చుండును. అట్లే కొండజాతులవారి వ్యవహారములను, మణిపురీల వ్యవహారములను 'చెరపు' కోర్టులు పరిష్కరిం చును. అప్పీళ్లు విచారించు నధికారము ప్రభుత్వ కార్య నిర్వాహకసభకు గలదు. చివరకు మహారాజు విచారణ, తీరుమానములతో వ్యవహారము ముగిసిపోవుచుండును. మరణదండనముమాత్రము అస్సాముగవర్నరు అనుమతిని పొందనిదే జరుపకూడదు.

విద్యాభివృద్ధికి వలసిన సదుపాయము లిక్కడ చాల తక్కువ. హైస్కూలు ఒక్కటిమాత్రమే సంస్థా నపు రాజధానియగు 'ఇంఫల్' అను నగరమునందున్నది. మూడు మిడిలిస్కూలు లున్నవి. ప్రైమరి పాఠశాలలు ౧౧౨ గలవు. వానిలో ౬౮ క్రీస్తుమిషనువి. తక్కి నవి సంస్థానమునకు జెందినవి.

రాజధానికి 'ఇంఫల్' లేక 'మణిపూరు' అను పేరు గలదు. అది ఎత్తయిన ప్రదేశమున నున్నది. అచట శీతోష్ణస్థితి మిగుల ననుకూలముగ నుండును. పాతపట్ట ణము కొన్ని చిన్నపల్లెల ప్రోగు. అది చాల అసహ్యా ముగ నుండును. బ్రిటిషు రెసిడెన్సీమాత్రము చక్కగ నిర్మింపబడినది. బ్రిటిషు రెసిడెన్సి లోనిభాగము పుర పాలకసంఘము నధికారమున నున్నది. దీనికిని బ్రిటిషు రెసిడెంటే అధ్యక్షుడు.

చక్కని రోడ్లు, తోటలు, సామాన్యము లయ్యును సుందరములగు గృహములు, పుష్టియగు నీటివసతి, విద్యుచ్ఛక్తి మున్నగు నేటినాగరికతాసంస్కారములు గలిగి 'ఇంఫల్' చాల రమణీయముగ నుండుటయేకాక చక్కని విశ్రాంతిస్థానమును నయి యలరారుచున్నది.

ప్రతిదినము మధ్యాహ్నము రెండు ఘంటలనుండి రాత్రి యెనిమిది ఘంటలవఱకు ఇచ్చట గొప్పసంత జరుగును. ఆసాములో ఇంతకంటె పెద్దసంత మరెక్కడ జరుగదని ప్రతీతి. అమ్ముటకును, కొనుటకును పలువురు ప్రాంతప్రదేశములనుండి ఇచ్చటకు చేరుదురు. ప్రత్తి, పట్టుబట్టలు, రాగి, ఇత్తడిపాత్రలు మున్నగునవి ఇచ్చటి విశేషము. అవి చాల సరసమయిన వెలకు లభించును.

---

# ఉత్తుత్త పెళ్లి

బసవరాజు అప్పారావుగారు

పెళ్లిపందిట్లోన పెద్దలంతాను
వేంచేసివున్నారు పెళ్లికొడుకేడీ?
ముత్యాలముంగిళ్లొ ముత్తైదులంతా
కూచునుండిరి పెళ్లికూతురేమాయె?
బాజాభజంత్రీలు పల్లకీవాళ్లు
కచ్చేరిసావిళ్లొ కాచుకున్నారు!
వీధివీధుల ప్రజ వేలాదివేలు
వేచివున్నా, రైతె పెళ్లుత్తదేనా?

---

ఉప్పలూరి సీతారామస్వామి గారు, బి. ఏ., బి. యల్.

శ్రీ[illegible]లో నొకదాని కొకటి సంబంధము [illegible] నొక[illegible]లో మార్పు గలిగిన [illegible], [illegible]లో గూడ నీ మార్పు ఫలి[illegible] [illegible] యున్నది. [illegible] నిచ్చుటయే [illegible] శ్వాసను [illegible] [illegible] నూతన నాగరికుల [illegible] గాని, మన భరతఖండము [illegible] గాకపోయిన మరియొక [illegible] [illegible]. దాని [illegible] [illegible] చదువరులకు [illegible].

[illegible] గాక సూర్యచంద్ర గతులబట్టి [illegible], [illegible], ముక్కులు [illegible] వృద్ధిక్షయ [illegible]. శరీరములోని నుచ్ఛ్వాసములు [illegible], అనగా కుడి, [illegible], సుషుమ్న [illegible] కార్యముల [illegible]. ఈ శ్వాసను [illegible] కొందరు ప్రశ్నించిన నా ప్రశ్న లకు [illegible] సమాధాన మిచ్చుటయు [illegible] నచ్చెరు [illegible].

## ౧. త్రివిధ నాడులు

[illegible] నాసారంధ్రములనుండి, [illegible] నిస్సృహ గాని ప్రవహించును. ఒకప్పు డొకముక్కు నుండియు మరి యొకప్పుడు మరి యొక ముక్కునుండియు ప్రవహించుననియు, నట్టి ప్రవాహవేగమందుగూడ భేద ము లున్నవనియు, స్వల్పముగ గని పెట్టినను మనము కను గొనగలము. అప్పుడప్పుడు వారు, ముక్కుకడ వ్రేలు పెట్టకనే దీనిం గ్రహింతురు. మానవ శరీరమందు ౭౨,౦౦౦ (డెబ్బదిరెండువేల) నాడులు గలవని ప్రతీతి.

ఆ సంగతి యనేకగ్రంథములందు గలదు. ఆనాడు లెవ్వియో వాటికిని నరముల కట్టి సంబంధము గలదో వివరముగ నవనాగరికులకు తెలియవు, గాని, మూడు నాడులుమాత్రము ముఖ్యమై పలువురకు తెలిసియున్నవి. అవి ఇడ (యెడమముక్కునుండి ప్రవహించునది), పింగళ (కుడిముక్కునుండి ప్రవహించునది), **సుషుమ్న** (రెండుముక్కుల నుండి సమముగ ప్రవ హించునది)

ఇడా నాడికి, వామనాడి, చంద్రనాడి యని యు నందురు. దానికి చంద్రు డధిష్ఠానదేవత. పింగళ నాడిని దక్షిణనాడియనియు, సూర్యనాడి యనియుగూడ పిలుతురు.

ఒకనాసాపుటమునుండి మరియొక నాసాపుటము నకు గాలి మారుటకు ముందు, రెండు పుటములనుండియు (కుడి యెడమ ముక్కులనుండి) సమమగు వేగముతో కొంతతడవు ప్రవహించును. తరువాత రెండవ పుటము నకు మారును. సమానవేగముతో కొంతదనుక రెండు పుటములనుండి ప్రవహించునదియే **సుషుమ్న** నాడి యందురు.

ఒక్కొక్కపుడు, కుడినుండి యెడమకు గాని, యెడమనుండి కుడికి గాని, శ్వాసము మారునపుడు ఒక నాసాపుటమునుండి కొన్ని శ్వాసములును, రెండవనాసా పుటమునుండి మరికొన్ని శ్వాసములును నడచి, తుద కైదు మొదలు పదునైదునిమిషములలో నొకే నాసాపుట మున స్థిరపడును. ఇది **సుషుమ్నానాడి రూపాంతరము.** దీని విశేష మేమన, నాసమయమం దిచ్చిన యాశీర్వాదము గాని, శాపము గాని యమోఘ ముగ జరుగును.

## ౨. నాడీవివరణ

నాసారంధ్రమునుండి పోవుగాలి, వెన్నెముక వరకును ప్రవహించును. వెన్నెముక కిరుప్రక్కలనుండియుగూడ గాలి నడుచును. వెన్నెముక కెడమప్రక్కనుండి ప్రవహించునది ఇడానాడి, లేక చంద్రనాడి. వెన్నెముకకు కుడిభాగమునుండ పింగళనాడి ప్రవహించును. స్వరశాస్త్రవేత్తలు, సూర్యునికిని దీనికిని సంబంధము గలదందురు.

సుషుమ్నా నాడి, వెన్నెముకలో నిమిడియున్నది. ఇది యాపదలకు నపజయములకు కారణము. అగ్నికిని మృత్యువునకును సంబంధించియున్నది.

మంచిపనుల కుపయోగించునది ఇడానాడి యనియు, చెడ్డపనులకు పింగళనాడి యనియు గ్రహించవలెను. ఉత్తరతూర్పుదిశల కధిష్ఠానము ఇడా నాడియు, దక్షిణపశ్చిమ దిక్కుల కధిష్ఠానము పింగళనాడియు నైయున్నవి.

## 3. (ఇడా) చంద్రనాడిలో చేయతగిన పనులు

జయమునందుటకును, సుఫలముల నిచ్చుటకు నీ క్రిందిపనుల నిడానాడి ప్రవహించునపుడు చేయవలెను—

(1) దూరదేశముల కేగుట
(2) ఆశ్రమస్వీకారము జేయుట
(3) కోటలు, భవంతులు కట్టుట
(4) సామగ్రుల సమకూర్చుట
(5) ఆరామ కూపతటాకాదులు నిర్మించుట
(6) దానములు చేయుట
(7) వివాహము
(8) నూతనవస్త్రధారణము
(9) రసాయనముల దీసికొనుట
(10) గొప్పవారిని ప్రభువులను జూచుట
(11) వివాదలు, యుద్ధములలో సంధియగుట
(12) మంచిస్నేహములు సంప్రాప్తమగుట
(13) వ్యాపారము నారంభించుట
(14) బాకీలు వసూలుచేయుట
(15) క్రొత్తయిండ్లలో ప్రవేశించుట
(16) విత్తనముల జల్లుట, సమకూర్చుట
(17) అక్షరాభ్యాసము జేయుట
(18) తీర్థయాత్రలకు బయలుదేరుట
(19) శరీరమునుండి విషమును దీసివేయుట
(20) అశ్వారోహణము
(21) క్రొత్తగ్రామము ప్రవేశించుట
(22) పంట యింటికి దెచ్చుకొనుట
(23) గురువుల బ్రార్థించుట
(24) యోగసాధనము

ఇంక నితరసత్కార్యములన్నియు.

ఇడానాడి ప్రవహించునపుడు చేసిన జయమును సుఖమును గలుగును. అపుడైన నాకాశ, వాయు, అగ్ని తత్త్వ ప్రకోపము లేకుండ జేయవలెను. అందులకు సాధనము తపస్సు, ఏకాగ్రత. ఇవి గలిగిన నిడానాడియందలి ప్రయత్నములు కోరినఫల మిచ్చును.

జ్వరము, పిశాచమూర్ఛ, యింకను ఒడలు మరచు రోగములచికిత్స ఇడానాడియందే మొదలిడ యుక్తము.

అలసట, విచారము, విషము పైకొనినపుడును, ఉష్ణము, మూర్ఛ గ్రమ్మినపుడును, ఇతరుల నోదార్చునపుడును ఇడానాడినే నడుపవలెను. అందువలన దుర్గుణము లన్నియు నశించి సుఫలమగును.

## ౪. (పింగళ) సూర్యనాడిలో చేయతగినపనులు

జయమునకు, సత్ఫలమునకు, స్వలాభమున కీదిగువ కర్మలు పింగళనాడికి తగియుండును—

(1) దుశ్శాస్త్రముల జదువుట, బోధించుట
(2) మద్యము త్రాగుట, చెడుపనుల నారంభించుట
(3) దేశములు పాడుచేయుట, శత్రువుల సంహరించుట
(4) శాస్త్రపఠనము, పరోపకారము




## స్థాణుని లోచనాంచలము

భారతి వైశాఖమాస పత్రికయందు శృంగార నైషధమునందలి (ఆ 4-31) పైపద్యమున నాల్గవ పాదమున 'బాణదశార్ధపాతమున' అనుచో 'దశ' యనిన నంచుగ నర్థము జేసికొనినచో సమంజసముగ నుండునని శ్రీపాద సుబ్రహ్మణ్యశాస్త్రిగారు వ్రాసియున్నారు. పై పద్యమునకు మూలశ్లోక మిట్లున్నది:

అదాహి యస్తేన దశార్ధబాణః
పురా పురారేర్నయనాలయేన;
న నిర్దహంస్తం భవదక్షివాసీ
నవైరశుద్ధే రఘునా సమర్థః. (నై. 8-73)

ఆంధ్రీకరణమున 'బావకు భూరిమనోభిమానమును గొనె' నని కవిచే జేర్పబడినది. తీవ్రతరార్చుల నగ్ని తన ప్రాణముల కన్న పగను దలంచి, బాణదశార్ధపాతమున నాతని భూరిమనోభిమానమును మరుడు పంత మెలర్ప గైకొనెను. 'తీవ్రతరార్చుల' ననుచో మూలమును మించియున్నది. అగ్ని సప్తజిహ్వుడు. ఆతడు సప్తార్చులతో దన్ను దహించెను గాన నాతని పంచబాణముల మన్మథుడు జయించె ననుటయే కవియభిప్రాయము. అగ్ని స్థాణుని లోచనాంచల మండగా గొనియెను. మరుడన్నో స్త్రీకటాక్షదృక్కోణము నాశ్రయించెను. 'స్త్రీయం శ్రితస్య కామస్య మహత్ప్రభుత్వం సూచిత'మ్మని నారాయణీయవ్యాఖ్య. మఱియు 'అన్యనయనాలయస్థస్య ఆత్మదాహకస్య అన్యనయనాలయేనైవ ఆత్మనైవదాహో వైరిలక్షణమ్ప్రుగంతేన అపాకృత'మ్మని మఱియొక విశేషము. వీనికి శ్రీనాథుని యాంధ్రీకరణమున మఱి రెండు విశేషములు చేర్పబడినవి. అందు మొదటిది తన ప్రాణముల కన్న నాథుని ప్రాణమునకన్న మిన్నయగు మానమును గొనుట బంత మెలర్చుటయేగదా. 'ప్రాణానపి పరిత్యజ్య మానమేవాభిరక్షతు' అని కదా పెద్దలు వచింతురు. అందును సప్తార్చులచే నాతడు తన్ను దహింప, పంచబాణముల నాతని నిర్జించుట పెన యాధిక్యము సూచించుటయే. మూలమున 'దశార్ధబాణః' యనుచో నిట్టి విశేషము సూచింపబడలేదు. ఆంధ్రీకరణమున 'తీవ్రతరార్చుల' నగ్ని మరుని దహించెననుటచే, బాణదశార్ధపాతమున అనుదానికి స్వారస్య మాపాదింపబడినది. దశశబ్దమునకు అంచు అని గైకొనినచో నట్టిది సిద్ధింపదు. వేంకటరాయశాస్త్రిగారి వ్యాఖ్యానమును పైవిషయమును స్పష్టీకరించుచున్నది. సహృదయు లాలోచింతురుగాక!

కిడాంబి రాఘవాచార్యులు.



## నిర్వ్యాపారత

మన బాలురవిద్యల కిది అదృష్టపూర్వము. పారిశ్రామికులకు అత్యంతపూర్వము. వైదికవిద్యావంతులకు బాలుల అతీతమైనది.

మనకిది విదేశీయము గాని స్వదేశీయము కాదు. కావున ఆంగ్ల భాషాప్రవీణులయందుమాత్రమే యిది వృద్ధియగుచేయుచున్నది.

ఆంగ్లభాష మన కన్నులకు నూత్నప్రకాశము కలిగించినది నిజమే; గాని నేడమలులో నున్న విద్యావిధానము మన ప్రవృత్తికి సూర్కమరుగా నున్నది. అందుచే నాంగ్లభాషవలన మనకు మేలుకంటె కీడే యధికముగా కలిగినది.

నేటి మనవిద్యావిధానమెంత నికృష్టమైయున్నదనిన? ఇకనీ కాపురుషులక్షణ మని యది గ్రహింపనిచ్చుటలేదు. పైగా మన బాలురవృష్టినది నౌకరీయందే లగ్నము చేయుచున్నది. అందుకే వారిని అర్థ్యులను చేయుచున్నది.

నేడు దేశమునవిద్యాధికులై—విద్యావంతులైయున్నవారందరును నౌకరీనిమిత్తమే తన్నుకొనుచున్నారు.

ఈవిద్యావిధానమునకు తోడు మనకు పాశ్చాత్యనాగరికత యొకటి. ఇది గోరుచుట్టుమీద రోకటిపోటు.

ఆర్జనలేకపోవుట యొకటియు, దుర్వ్యయముల తప్పకపోవుట యొకటియును, నిర్వ్యాపారత, పాశ్చాత్యనాగరికత జోడించుటవలన కలిగిన ఫలితములు.

అసలు నిర్వ్యాపారతయే సర్వనాశకము. అగ్నికి గాలివలె దానికి పాశ్చాత్యనాగరికతతోడు. పైగా మనకు దారిద్ర్య మొకటియు, పారతంత్ర్య మొకటియును.

పాశ్చాత్యఖండములవారు తమ దేశములలో పరమావధినే పొందియున్న నిర్వ్యాపారతను తొలగించుకొనుటకు తప్పుత్రోవలయందైనను స్వేచ్ఛగా సంచరింపగలుగుచున్నారు. మనదేశమున మన సలహాలకైనను ఆదరము లేదు.

దీనికి ప్రతిక్రియ యేమి?

మనలో కొందరి కీయావేదన కలుగకపోలేదు; గాని కలిగినది చాలదు. కలుగవలసినంతమందికి గూడ కలుగలేదు.

మన రాజకీయములు నేడు సంక్షుభితములై, యిదమిత్థమని నిరూపించుటకు అయిలిగాని స్థితిలో నున్నవి. కావున్నను ఒక్కరాజకీయములవలన మాత్రమే యిది చక్కబడదు.

రాజకీయములు దీని కెంత దవ్వుల నుండిన నంత మేలు కూడును.

ఈసందర్భమున "స్వదేశీయవస్తువులను మాత్రమే మనము వాడవలయును. మన కవసరములైన వాటి నన్నిటిని మనమే తయారుచేసికొనవలయు" నని యొక యుపదేశము కలదు.

ఇందు కొంత సత్యమున్నది; గాని సత్యముకంటె చెడుగు మిక్కుటముగా నున్నది.

పాశ్చాత్యనాగరికతయెడల మన నిశ్చయమేమి? అంధప్రాయముగ దానిని పూర్తిగా స్వీకరించుటా? అందు ధారావాహికమగు మనజీవితమునకు అనురూపములైన పద్ధతులను మాత్రమే స్వీకరించుటా?

పాశ్చాత్యనాగరికతను యథాస్థితముగ స్వీకరించుటయే యైనచో నిక మన యవసరములకు అవధియుండదు; తన్మూలమున నిర్వ్యాపారతకు అంతమును ఉండబోదు.

కావున ముందు మనము వ్యామోహమును తగ్గించుకొనవలయును. ఇది సాంఘికధర్మములవలన నెరవేరును గాని కుమ్కు రాజకీయములవలన గాదు.

జర్జరితములైయున్న మన సాంఘికధర్మములను సవరించుకొంటిమా నిర్వ్యాపారత తొలగుటయేగాదు. జాతి యంతయు అన్నపూర్ణ యగును.

—శాస్త్రి.

## వరశుల్కము

మొన్నటివరకు కన్యాశుల్కము చెలరేగినది. ఇప్పుడాపదని వరశుల్కమునకు సంక్రమించినది.

ఇది తప్పని ఇచ్చేవారికిని, పుచ్చుకొనేవారికిని గూడ తెలియును; గాని కొడుకులతండ్రి దయాదాక్షిణ్యములు మాని లాగుమనేయున్నాడు. కూతుళ్లతండ్రి కంట తడిపెట్టుచు సమర్పించుచునేయున్నాడు.

దీని కనిష్ఠప్రమాణము నూటపదహార్లు. గరిష్ఠప్రమాణము కన్యాదాతశరీరమున నెంత రక్తముండిన అంత.

దీని పట్టెంత బిగువుగా నున్నదనిన? కొన్నిసందర్భములలో ఇది చెల్లింపబడువరకు మంగళసూత్రములు ముడిపడుటలేదు. కొన్ని సందర్భములలో మంగళస్నానములయినపిదపగూడ మగపెళ్లివారుమరలిపోవుచున్నారు.

ఇది వరుని సంపన్నతకు కానుక కాదు; ముందు ముందు వధువు నాదరించుటకు భృతి కాదు; కన్యాదానసాద్గుణ్యార్థకమగు దక్షిణయు కాదు; ఆడుపిల్లను కన్నందుకు కన్యాదాతకు జరిమానా.

రౌరవాది నరకములను విధించు వైదికవిద్యలును దీనిని నిషేధింపలేకున్నవి. సభ్యత చేకూర్చునన్న ఆంగ్లవిద్యయు దీనిని తిరస్కరింపలేకున్నది. సర్వోత్కృష్టమైన మానవజన్మయే దీనియెదుట దిగదుడుపు అయిపోవుచున్నది.

వరుని అర్హతలలో కొన్నాళ్లు సాంప్రదాయము ప్రాధాన్యము వహించినది. కొన్నాళ్లు ఆస్తి, కొన్నాళ్లు విద్య ఉత్కర్ష వహించినవి. ఇప్పుడు వరుని—అథవా అతనితండ్రి—రాతిగుండెకు ఆధిక్యము వచ్చినది.

వరుని కోతిమొగము గీనికి ప్రతిబంధకము కాదు. కొంగకాళ్లు, మోరచేతులు, గార్దభస్వరము గీనికి అడ్డంకులు కావు. అతడు మగవాడైనను చాలును. ఇదితప్పదు.

కూతుళ్లు పుట్టుట యిప్పుడు ఇటువంటి, అటువంటి తరములు తరించుటకుగాదు. ఉన్నది ఊడ్చిపెట్టుకొని పోవుటకు. కొడుకులు పుట్టుట వంశము విస్తరించుటకు గాదు. కడుపులో చల్లకదలకుండ సొమ్ము సంపాదించుటకు.

ఆడుపిల్ల పుట్టునేవారి యిప్పుడు గర్భవతి పెజారై పోవుచున్నది. ఆమెభర్త గంగగంగ గాడిపోవుచున్నాడు.

వియ్యంకులు మనుష్య బొమ్మలగుటలు. ఇప్పుడు వాదియు, ప్రతివాదియును. పెండ్లికొడుకు సరోత్ర దీయు, ముద్దాయియును.

అయితే యిది యెట్లు తొలగును?

బాల్యవివాహాచారము పోవలెనని కొందరను న్నారు. శాఖాంతరవివాహములు జరుగవలెనని మరికొంద రనుచున్నారు. వర్ణాంతరవివాహములు ప్రారంభము కావలెనని ఇంకొకకొందరనుచున్నారు. స్వయంవరములు మొదలు కావలెనని వేరొకకొందరనుచున్నారు.

కాని దేశీయుల అంతఃకరణప్రవృత్తులు మారినగాని యీ యాచారములు సాగునా? అంతఃకరణప్రవృత్తులు మారుటయే తటస్థించినచో ఈదురాచారములు ప్రారంభము కాకపూర్వమే యిది తొలగిపోదా?

అంతఃకరణ ప్రవృత్తులు మారుటకు మతాభినిరతి కలుగవలెను. గాని మతాభినిరతిని పత్రికలు కలిగింపలేవు. ఉపన్యాసకులు, గ్రంథకర్తలు కలిగింపజాలరు. సంస్కరణసభలు ఏమియు చేయజాలవు. రాజశాసనము ను ఈవిషయమున పనిచేయజాలదు.

కాని నలువైపులనుముంచుకొనివచ్చుచున్న మతాంతరుల దాడి యీయుత్కృష్టఫలమును కలిగింపవచ్చును.

ఎట్లయినను ఈదురాచారము నశించుకాలము సమీపమున లేదు. ఇంక నెన్నో కుటుంబములు కూలిపోవలెను. ఎందరో కన్యలు ఘోష పెట్టవలెను.

—శాస్త్రి.




# రూపలేఖ చిత్రావళి*

౧, ౨ చిత్రములు. ఇవి శారదాఉకీలు (ఢిల్లీ) గారు రచియించిన వర్ణచిత్రములకు ప్రతిబింబములు. వీరిచిత్రము లెనుబదియేడు లండను నగరమునందలి ఇండియాభవనమున లండను ఇండియాసంఘమువారిచే ప్రదర్శింపబడినవి. ౧౯౩౨ వ సం. జనవరినెలలో ఈప్రదర్శనము జరిగినది. ఈచిత్రములయందు ముప్పదియైదు వర్ణచిత్రములు, ఏబదిరెండు సాధారణచిత్రములు. ప్రదర్శనము చిన్నదయ్యును, చిత్రకారుని నేర్పుమాత్రమే తెలుపునవికాక, పాశ్చాత్యులకు, భారతీయచిత్రకళయందలి నవీన వంగీయ చిత్రరచనావిధానముయొక్క లక్ష్యములను, ఆదర్శములను బోధింపజాలినవిగకూడ నున్నవి. చిత్రములన్నియు పలువురు పాశ్చాత్య చిత్రకళాకోవిదులప్రశంసకు పాత్రము లయినవి. వానిలోనివే 'ఆలంగీరు', 'బుద్ధదేవుని ప్రేమాలమృతశిశుసహితయగుమాత' అనుచిత్రములు అందు మొదటిది ౧౯౩౧ వ సం. ఢిల్లీ పురమున జరిగిన చిత్రకళాప్రదర్శనమున సత్యుత్తమచిత్రార్హ మగు రాజప్రతినిధిగారి రజత పాత్రబహుమతిని బడసెను. రెండవది ఆసంవత్సరముననే మైసూరుపురమున జరిగిన చిత్రప్రదర్శనమున ఉత్తమచిత్రోచితమగు బహుమతిని పొందినది.

౩, ౪ మహాబలిపుర శిల్పచిత్రములు: మొదటిచిత్రము 'అర్జున తపశ్చర్య' అనుటకు తగిన కారణములు కనిపించవనియు, శిల్పసన్నివేశమునుబట్టి అయ్యది గంగావతరణోత్సుకుడయిన భగీరథునితపశ్చర్య కానోపుననియు శ్రీ జి. వెంకటాచలముగారు రూపలేఖయందు వ్రాయుచున్నారు.

౫, ౬ శ్రీ బి. వి. తాలిం (బొంబాయి) గారిచిత్రములు: శ్రీతాలింగారు, బంకమన్ను, చలువరాయి, లోహము మున్నగువానితో ప్రతిమలను చేయుటయందు మిక్కిలి నైపుణ్యముగలవారు: వీరిశిల్పము జీవకళతో నొప్పుచుండును.

'పేదరికము,' 'పాములవాడు' అను రెండుచిత్రములు లోహమయవిగ్రహములవి: 'పాములవాడు' వెంబ్లీ ప్రదర్శనమున కళావేత్తల మెప్పును గాంచినది. భావపుష్టి, జీవకళ, నిండారుచున్న యీతనిశిల్పచిత్రముల కుత్కృష్ట శిల్పసంచయమున స్థానము గలదు.

---

*'రూపలేఖ' యను చిత్ర, శిల్ప త్రైమాసికపత్రిక సంపుటము ౩, సంచిక (వరుస సంఖ్య) ౯ నుండి.






తేకుమళ్ల రామారావుగారు, యం. ఏ., బి. ఈ డి.

వీరు మద్రాసు యూనివర్సిటీలో లిటరేచరులో యం. ఏ. పరీక్షయందును, ఆంధ్రయూనివర్సిటీలో బి. ఈ డి. పరీక్షయందును, కృతార్థులైనపిమ్మట లండనుపట్టణమున కేగి లండను యూనివర్సిటీలో నూతనవిధాన సహితమగు భూగోళశాస్త్రము (జాగ్రఫీ) నందు డిప్లోమా కోర్సు నంది భారతదేశమునకు తిరిగివచ్చినారు. ఆంధ్రులయందేమి, మద్రాసీయులయందేమి ప్రప్రథమమున నిట్టి పరీక్షయందుత్తీర్ణులైనవారు వీరే. వీరు విశాఖపట్టణమునందు కొంతకాలము యింటర్మీడియట్ విద్యార్థులకుగాను ట్యుటోరియల్ కాలేజీని నడిపినారు. ఈ నూతన విధానము ననుసరించి భూగోళశాస్త్రమును బోధించుటకు మద్రాసు యూనివర్సిటీవారొక బోధకుని నియమించు ఏర్పాటులు చేయుచున్నారు.

---







శ్రీమతి పి. గౌరీఅమ్మాళ్ గారు

తిరుచూరి నివాసి. ఇంగ్లాండులోను, డబ్లినులోను వైద్యమున ఉన్నతవిద్య ౘదివి తిరిగి స్వస్థానమును చేరకొనెను. కొచిను ప్రభుత్వమువారిచే మెరుఉపకారవేతన మొసంగిరి.




శ్రీమతి సురవి సింహకుమారి, బి.ఏ.,బి.యల్.

రంగూను విశ్వవిద్యాలయమున న్యాయశాస్త్రమునందుత్తీర్ణయైన వంగదేశకన్య.



శ్రీమతి జి. డి. సోంధిసతిగారు

ఇండియన్ ఒలింపిక్-సంఘము ప్రతినిధి. లాస్ ఏంజలిసునందు జరుగు అంతర్జాతీయవ్యాయామములందు పాలుగొన పోవుచున్నారు.



శ్రీమతి మేరీ పుష్పనాధనుగారు

దక్షిణ ఆర్కాడుజిల్లా సెకండరీ విద్యాసంఘమునకు అధ్యక్షురాలుగా నియమింపబడిన ప్రథమ యువతి.

---

బడతనద బాళు

(కన్నడము—మూతుకథలు.) గ్రంథకర్త: ఆనంద కంద. జయకర్నాటకగ్రంథమాల, ధారవాడ. క్రౌను సైజు: ౮౮ పుటలు. వెల ౮ అ.

---

పెమ్మసాని తిమ్మానాయడు - గండికోటముట్టడి

కమ్మచారిత్రక పరిశోధనమండలి ప్రచురణము 1.

రచయిత: గూడవల్లి రామబ్రహ్మంగారు, 'సమదర్శిని' కార్యాలయం, సర్ త్యాగరాయ మెమోరియల్ బిల్డింగ్స్, 14, మౌంట్‌రోడ్డు, చెన్నపురి.

"ఈ వ్యాసం 'సమదర్శిని' ఆంగీరస సంచిక కోసం ఉద్దేశింపబడింది." ఆ వ్యాసాని కిది ముందుగా సిద్ధపడిన పుస్తకరూపము. క్రౌనుసైజు: ౩౨ పుటలు (అనుబంధముతో సహా).

---

# పత్రికా స్వీకారము

## THE MADRAS

### ది మెడ్రాస్

ఆంగ్ల మాసపత్రిక. ప్రప్రథమసంచిక మే, ౧౯౩౨. క్రౌనుసైజు సుమారు ౩౦ పుటలు.

సంపాదకులు: కె. ఆర్. యస్. అయ్యంగారు, రామకోటి భవనము, రాటల్‌బజారురోడ్డు పోస్టుఆఫీసు,

సం. చందా ౨ రు. విడిసంచిక ౨ అ.

---



# విమర్శనము



## 1. శ్రీ హరనాథలీల-2. ఉపదేశామృతము

1. ప్రథమభాగము. క్రౌను సైజు: ౮౪ పుటలు. వెల నాలుగణాలు.

2. ప్రథమభాగము. తర్జుమా. చింతా దీక్షితులు గారిది. క్రౌను సైజు: ౧౦౧ పుటలు. వెల ఎనిమిదణాలు.

మనుష్యశక్తికి, సామాన్యమానవుల కతీతములైన అద్భుతకార్యములు చేయువారు అప్పుడప్పుడు పుడమిపై పొడముచుందురని కొందఱును, ప్రకృతి కతీతమైన కార్యములుచేయుట యసాధ్యము, అట్టివెవ్వరొనరించిరని విన్నను విశ్వసింపుట యసాధ్యమని తలచువారు కొందఱును ప్రపంచపు సంఘములలో గలరు. ఆధునిక శాస్త్రీయ జ్ఞానాభివృద్ధి యగుచున్నప్పటినుండియు క్రీస్తు మొదలగువారు విపరీతమగు కార్యములేవియు చేయలేదనియు, మాహాత్మ్యము లెవ్వరో వారి కట్టి యారోపణము నొనర్చిరనియు క్రైస్తవులలో ఒకశాఖవారు తలంచుచున్నారు. ఇట్టికల్లలు పాఠశాలలోని పిల్లలకు నేర్పరాదనియు నేర్పినచో వారికి హేతుపూర్వకమగు వివేచనాశక్తి నశించుననియు అధునాతన నాగరికతాభిలాషు లనుచుందురు. బాల్యమునుండియు పిల్లలఒంటికి పట్టించవలసిన భావములే యట్టివి. అట్టి భక్తి సంస్కారములేని విద్య వారికి కొంత కృత్రిమజ్ఞానమునిచ్చి చెడుత్రోవలపట్టించి వ్యర్థజీవనుల జేయునని పురాతనభావములలో దొర్లువారు తలంచుచుందురు. ప్రకృతి కతీతమగు కార్యముల నెవ్వరయిన చేసిరా, చేయగలరా యని మనము ముందు చర్చించవలెను. ఆధునిక ప్రకృతిశాస్త్రజ్ఞులు వారి లేబరేటరీలలో చేసెడి ఎక్స్పెరిమెంటులవల్లను వచ్చిన నిర్ణయ మేమనగా మానవుడు విపరీతకృత్యములను చేయలేడని.

కనుక వారట్టి సంగతులు విన్నను నమ్మరు. కన్నను నమ్ముదురో నమ్మరో ఆలోచనీయము. ఇక తక్కిన వారు తామట్టికార్యములను మహానుభావులు చేయుచుండగా కన్నామని వ్రాయుచుందురు. వీరిలో ఏ కొందరినో అబద్ధాలకోరులుగా కొట్టివేసినను అనేకవిద్వాంసులు,నిస్స్వార్థబుద్ధులు,సత్యరతులు, లోకహితులువచించెడి పలుకులను మనము అబద్ధములని కొట్టివేయుట దుస్సాధ్యము. రామకృష్ణ పరమహంస మొదలగువారినిగూర్చి యట్టి ప్రశంసలు చేయబడినవి క్రీ. వె. 1865-1927లో



శ్రీ హరనాథ బాబా దంపతులు

జీవించి ఆంగ్ల విద్యా వైదగ్ధ్యము కలిగి మనవలె ఉద్యోగములు మొదలగునవికూడ కొన్నాళ్లుచేసి పరమపదించిన శ్రీ హరనాథబాబా గారినిగూర్చికూడ అట్టిసంగతు లింకను చెప్పుకొనుచున్నారు. వారి నసత్యవాక్కు లనిగాని వారిమాటలను నమ్మమని కాని మనము వచించినచో అదియునుకూడ నొకరీతి మూర్ఖ్యముకాదాయని సందేహముకలుగకమానదు. అది సత్యమే, అయినప్పుడు వారి చరిత్ర పఠించుటవలన మనభక్తి విజ్ఞానములు వర్ధిల్లవలెనే కాని మనము మూర్ఖుల మయిపోదుమని భయపడరాదు. ఏదియెట్లున్నను హరనాథబాబాగారు నిష్కళంక జీవి ప్రజాహితాభిలాషి భక్తజనాగ్రేసరుడు. అతనిచరిత్రమును చర్యలును కేవల మతని శిష్యకోటికేకాక తదితరులకు గూడ సంస్మరణీయములు. హరనాథబాబాగారు శ్రీ గౌరాంగునియొక్కయు తన్మూలకముగా శ్రీ కృష్ణుని యొక్కయు అపరావతారమని ఈ గ్రంథములు చెప్పుచున్నవి. కాకినాడ శ్రీ హరనాథతత్త్వప్రచారిణీ సభవారీ గ్రంథములను ప్రచురించినారు. వీరిలో రెండవ గ్రంథమును శ్రీ తల్లావఝ్ఝుల శివశంకర శాస్త్రిగారివద్ద కొంత సహాయమునుగొని చింతా దీక్షితులుగారు తర్జుమాచేసినట్లు పీఠికవలన తెలియగలదు. శైలి వ్యవహారసిద్ధమగు సంప్రదాయ భాషలో సాఫుగానున్నది.

గ. స.

---

జగన్మాత

అనువాదకులు: స్వామి శుద్ధానంద భారతి, చింతా దీక్షితులుగారు. భారతశక్తి నిలయము, వీరభద్రపురము, రాజమండ్రి.

డెమ్మీ ౧౬ పు. ౧౩౭ పుటలు, వెల రు ౦-౬-౦.

ఈగ్రంథము అరవిందయోగి ఆంగ్లభాషలో రచించిన "Mother" అను గ్రంథమున కాంధ్రానువాదము. మానవున కాధ్యాత్మిక భావము లభించుటకు వలయు ఆకాంక్ష, ఈశ్వరకృపలను గూర్చియు, ఈశ్వర కృపలభించుటకు వలయు సంపూర్ణ మగు ఆత్మసమర్పణము, ఆత్మసమర్పణకు వలయు సాధకుని సాధనప్రయత్నములు, జగన్మాతయొక్క అనుగ్రహము, అనుగ్రహసిద్ధి, తరువాత భక్తుని కార్యతత్పరత్వమునకును తత్పూర్వపు కార్యశీలమునకును గలభేదము, జగన్మాతకొనర్చె సమస్తకార్యములను నెరవేర్చుటలోఁ గల ఐక్యానుభూతి, ఐక్యానుభూతి లభించిన తరువాత నున్న కనుపడుచుండు ఆతల్లియొక్క త్రివ్యక్తిదర్శనములు లేక అవతారములు, మహేశ్వరి, మహాకాళి, మహాలక్ష్మి, మహాసరస్వతీ దర్శనముల విభేదము మొదలగు వివిధవిషయములను గూర్చియు, తేటతెనుగుతో, సుందరమగుశైలితో నిందు సమస్తవిషయములును పొందుపరచబడెను. తెలియని వారందఱును నీశక్తులను హిందువుల మూఢదేవతలనియు, వీటియందు విశ్వాసమువల్లనే వారు పాశ్చాత్యులవలె నవీననాగరికతలో నభివృద్ధి పొందలేకున్నారనియు, ఈతుచ్ఛ శృంఖలములను త్రెంచుకొననిచో వారికి జాతీయైక్యముకాని, ప్రపంచములో గౌరవముకాని సిద్ధింపదని యు చాటుచుందురు. ఈ గ్రంథమును పఠించినవారికి పైవిషయములెల్ల నెంత సహజములు, సహేతుకములు, ఆత్మోన్నత్యదాయకములో, వాటిని నిరాకరించుట యెంతటి అజ్ఞానమును తామసప్రకృతియై యున్నదో సులభముగ తెలియగలదు. హిందువులలో కూడ ఈశక్తులయొక్క ఔచితి నేమాత్రము నెఱుంగక, అవి యొక్కెడో స్వర్గలోకములో విహరించెడి కరచరణాద్యవయవోపేతములగు దేవతామూర్తులనియు, మనము చేసే పూజాపురస్కారముల కుప్పొంగి వరముల నిచ్చుచుండు ఉదారప్రకృతి కలవనియు, వాటి నీవిధములుగా ఇచ్చకములాడి వశముచేసుకొన్నచో, ఎట్టిలుబ్ధత, క్షుద్రత, స్వార్థపరత్వము, పరశ్రేయోసహిష్ణుతాది గుణములతో కూడిన పను లొనర్చుచున్నను పరవాలేదనియు తలచువారునుకలరు. ఇటువంటివారి క్షుద్రజ్ఞానము లేక మూర్ఖమగు నజ్ఞానమును గూడ ఈగ్రంథము పారద్రోలి, జ్ఞానచక్షువులుగను, సత్కర్మరతులుగను, నిజమైన మానవులుగను మార్చునని మేము నమ్ముచున్నాము.

గ. స.

---

## మాతృపూజ

నవీనకవికుమారులు వ్రాసిన పదిపదునైదు పద్యమాలికలును, గీతములును గల యొక మనోహరగ్రంథము. శ్రీమంత్రిప్రగడ భుజంగరాల గోపాలకృష్ణయ్యగారి జ్ఞాపకార్థము మీ పద్యములు ఏర్చి ప్రకటింపబడినవగుటచేతను, విశ్వనాథ సత్యనారాయణగారు, అబ్బూరి రామకృష్ణారావుగారు, గుఱ్ఱపువారి రామిరెడ్డిగారు, రాయప్రోలు సుబ్బారావుగారు, వెంకటపార్వతీశ్వరకవులు, బసవరాజు వేంకటప్పారావుగారు మొదలగు యువకవిశిరోమణులు రచించినవగుటచేతను ఆంధ్రపౌరుషప్రతాపములను గ్రక్కుచు దేశభక్తిని తొలుకుచు, శాంతిరసంబు చిలుకుచు, కవితావైచిత్ర్యములతో కళలుదేరి యలరారుచున్నదని చెప్ప నక్కరలేదు. ఈపద్యము లెవ్వియును నాంధ్రులకు క్రొత్తవి కావు. కొంపెల్లి జనార్దనరావుగారి ప్రతాపపు పొగలమబ్బులు, సత్యనారాయణగారు రచించిన ముక్తకంఠముతో ననేకసభలలో, పాటములలో, సంతర్పణములలో, విందులలో నినదించిన పద్యముల సటుత్వమహిమవలన, నేటికిని యువకులవదనములపై మేనుము లనుమిషను సంచరించుచున్నట్లే గోచరించుచుండును. అసంఖ్యాకగీతికారచయితలగు కవికొండల వెంకటరావుగారు నిచ్చలును వర్ధిల్లుచుండు జనముల సభలలో తూరుపారబోసినట్లు విరజల్లిన కవితాసామగ్రినుండి “భారత నవజీవనబాల” యొక్క పురిటిముచ్చటలు, ఉయ్యాలలో పెట్టుటలు, గుజ్జనగూళ్లు, తలంబ్రాలు మొదలగు వేడుకలన్నియు కనిపించుచునే యున్నవి. భరతమాతృమందిరమున దివ్వెలమైయూ, పాలపూజలచే వాడిన పూవులమైయూ, విపంచికరవళించు తంత్రులమైయూ, శౌర్యసౌరభ్యములు జల్లుగీతలమైయూ, వీరకష్టనారలలోని మెరుపులమైయూ మన మెట్లుండవలెనను ప్రశ్నలకు నాంధ్రయువకులు, ఏది విడిచిపెట్టుటకును నోపక సర్వమునైయుందామని సమాధానము చెప్ప నిప్పటికిని కుతూహలులైయే యున్నారు. బసవరాజువారి బ్రహ్మర్షి ప్రతిబాలుని నాలుకపయిని పాటరూపమున నాట్యమాడుచునేయున్నాడు. దారుణక్రియలముందర భారతీయులు చూపించెడి శాంతి దౌర్బల్యసూచకము కాక గోరుముద్దలతో నారగించిన ఓరుపని వెంకటపార్వతీశ్వరకవులదుందుభి చాటుచున్నది. ఇవియన్నియు ప్రాతవేయైనను ఆంధ్రపాఠకులకు పరీక్షకుకూడ క్రొత్తది కాదని గుర్తించియైతేనేమి, పుణ్యపురుషుని సంస్మరణసందర్భమున జ్ఞప్తికి తెచ్చుకొనుటకు యోగ్యమైనవని భావించియైతేనేమి నవీనాంధ్రకవికుమారాశయ సంగ్రహ మనదగు ఈచిన్నిగ్రంథము ప్రచురించినందుకు ప్రకాశకు లెంతయు నభినందనీయులు. వెల రు. ౦-౪-౦. ప్రకాశకులు రామ్‌జయ్ అండుకంపెనీ, ౧౩ తంబుచెట్టివీథి, మదరాసు.

గ. స.

---

## శ్రీ మహనీయమండలి

గ్రంథకర్త: మొలుగు వేంకటకృష్ణమాచార్యులుగారు, జాతీయోన్నతపాఠశాల, రామచంద్రపురము, తూర్పుగోదావరిజిల్లా. క్రౌనుసైజు: ౨౧ పుటలు. వెల ౨ అణాలు. గోపాలకృష్ణ గోఖలే, దయానందస్వామి, రామకృష్ణ పరమహంస, రామమోహనరాయలు, రంగాచార్యులు (?)—ఈ అయిదుగురు మహనీయుల సంగ్రహచరిత్రము లిందు గలవు. ‘బాలురభావ్యభివృద్ధికి అట్టివారల జీవితచరిత్రములు పలువిధములఁ దోడ్పడు’నను ఉద్దేశముతో నిది రచింపఁబడినది. ఈఆశయము నెఱవేఱుటకు ఇందలి శైలి యింకను సరళముగను, భావనిర్దుష్టముగను ఉండవలెను. ‘గోఖలేజన్మస్థానము రత్నగిరిమండలములోని చిర్లనుతాలూకా క్రీ. శ. 1866 సంవత్సరమున జననమొందెను’ (౩). తొలివాక్యమునందలి కర్త రెండవవాక్యమున అనువృత్తము కాఁగలదు. కావలసినది. గోఖలే కాని, అతని జన్మస్థానము కాదు. ఇట్లే: ‘...... ఆతనితండ్రి......వగచి యూరకుండెను. అది మొదలు విగ్రహారాధనము తనజన్మముతోఁ జేయనని స్థిరపఱచుకొనెను’ (౩౪). మఱియు: ‘అధ్యాపకులనాదరణంబు’, ‘వినయవిధేయములతో’ మొ. ఒక వాక్యమున రెండుపార్లు కర్తృపదము: “ఆతఁడింటికి వచ్చి...ఆతఁడు వ్రతఫలమును బోఁగొట్టుకొనెను.” బాలురకు విషయముతోపాటు భావమును, శైలియు చక్కనివి చేయుటకు తగుయత్న

ములు పండితులు సాగించుట ఉచితము. ఆంగ్లమున చిన్ని పుస్తకము, శిశువులకై వ్రాయునపుడును నిర్దుష్టమై రంజకమైన పలుకుబడి ప్రయుక్తమగుట మనకు ఎంత కాలము పాఠము నేర్పవలెనో మఱియింకను,—శిశువులకు వలె! ఈమాట నేటి 'మన అచ్చు వాఙ్మయము'న చాల భాగము తడవి వైచెడిని.

ఇందు తుది వ్యాస మంత విఖ్యాతవిషయకము కాకున్నను, మొత్తముమీద గ్రంథవిషయము మిక్కిలి యోగ్యమైనది. కథనమును మంచి నడకగలదై ఆసక్తి గొలుపుచున్నది.

కొం. జ.

---

### భక్త కథావళి

గ్రంథకర్త్రి: నఱ్ఱా రాజరత్నమ్మగారు, C/o నఱ్ఱా సత్యనారాయణమూర్తిగారు, తాలూకాబోర్డు ఆఫీసు, నూజవీడు, కృష్ణాజిల్లా. క్రౌను సైజు: ౭౧ పుటలు. వెల ౧౨ అ. ఇందు ౧౬ భక్తులకథలు గలవు. లలితమైన శైలితో ఈచిన్నికథలు ఎంతయు ఇంపుగ నున్నవి. చిన్నతరగతి విద్యార్థులకు ఇట్టి పుస్తకములు పఠన యోగ్యములు.

---

## గ్రంథస్వీకారము

### మల్లికార్జునరావు

సాంఘికనవల. గ్రంథకర్త: విద్వాన్ కంభంపాటి అప్పన్నశాస్త్రిగారు. పూలతోట గ్రంథమాల, హనుమకొండ, నైజామ్, ౧౯౩౨. క్రౌను సైజు: ౧౧౭ పుటలు. వెల ౧౨ అ.

---

### పుష్పగిరి మాహాత్మ్యము

గ్రంథకర్త: విద్వాన్ జనమంచి వేంకటసుబ్రహ్మణ్యశర్మగారు, తెలుగుపండితుడు, కడప. క్రౌను సైజు: ౪౪ పుటలు. వెల ౪ అ.

---

### నీలిరత్నాలు

ఖండకావ్యములు. కర్త: శ్రీ [illegible] అప్పారావుగారు, [illegible]. క్రౌను సైజు: ౧౨౬ పుటలు (ఫెదర్ వేటు కాగితము). వెల ౧ [illegible].

---

### మైరావణ చరిత్రము

(పౌరాణికము.) గ్రంథకర్త: [illegible] శేషగిరి రావుగారు, శ్రీసోదరసమితి, [illegible]. క్రౌను సైజు: ౬౮ పుటలు. వెల తెలియదు.

---

### యయాతి చరిత్ర

(శ్రీమదాంధ్రవ్యాసభారత నవనీతమునుండి గ్రహింపబడినది.) కర్త: [illegible] వ్యాసమూర్తి శాస్త్రిలుగారు. ప్రకాశకులు: వావిళ్ల రామస్వామి శాస్త్రులు అండ్ సన్స్‌వారు, [illegible], ఎస్ప్లనేడ్, చెన్నపురి. క్రౌను సైజు: ౨౪ పుటలు. వెల తెలియదు.

---

### జీవన సందేశం

(టాల్‌స్టాయికృతము.) అనువాదకుడు: తల్లాప్రగడ ప్రకాశరావుగారు, 'ఆనందనికేతనం', [illegible]గల్లు పోస్టు, పశ్చిమగోదావరి. క్రౌను సైజు: ౧౪౬ పుటలు. వెల ౬ అ.

---

### గౌతమీపుష్కర కృత్యానుక్రమణికా

రచయిత: సాగిరామశాస్త్రిలుగారు. పెద్దపర్తి కృష్ణమూర్తిశాస్త్రిగారు రచించిన తెలుగుతాత్పర్యముతోసహా. ప్రకాశకులు: మాడేటి సత్యాసయ్యా అండ్ సన్స్‌వారు, రాజమహేంద్రవరము. డెమ్మీ సైజు: ౫౧ పుటలు. వెల ౭ అ.

---




హిందూ మహమ్మదీయ కలహములు,

బొంబాయి.

ఇటీవల కొన్ని యేండ్లనుండి భారతదేశము నెక్కడనో యొకచోట భిన్నజాతిమత ములు ప్రజులలో పరస్పరము కలహములు తరుచు జరుగుచున్నవి. విశేషించి హిందూ మహమ్మదీయులలో కలహములు తీవ్రరూపమును దాల్చి అత్యధికమగు ధనజననష్టమును గలిగించుచున్నవి. మొన్న మోహరము పండుగదినములలో (మేనెల ౧౪ మొదలు ౨౦ తేదులవఱకు) బొంబాయినగరమున జరిగిన హిందూమహమ్మదీయ కలహము కేవలము హృదయవిదారకముగ పరిణమించినది ఉభయ మతములవారును చూచినవారిని చూచి సట్టులు రాల రువ్విరి; కఱ్ఱల మోదిరి; కత్తుల పొడిచిరి; తుపాకుల గాల్చిరి; దుకాణములను, ఇండ్లను దోచుకొనిరి: కొల్లగొట్టిరి: తగుల బెట్టిరి; ట్రాముబండ్లపయి రాళ్లను, సోడా బుడ్లను రువ్విరి; కాల్చిరి; మసీదులను, దేవాలయములను పడగొట్టిరి; అగ్నికాహుతిచేసిరి. నగరము బీభత్సభయానకదృశ్యములతో నిండి శిశాచక్రీడారంగ మయినది. మృత్యుదేవత తాండవమాడినది. పురజనులు భయాకులులై ధనప్రాణములపయి నాశను వదలి ప్రాణరక్షణార్థము నలుమొగముల పరువిడిరి. వీధులు జనసంచారశూన్యము లయినవి. ఇంచుమించుగ నైదువందలమంది ఘోరమరణముపాలయిరి. ఆరువేలమంది గట్టిదెబ్బలకు, కత్తిపోటులకు గురియయిరి. లక్షలకొలది ధనము నష్టమయినది. ఈయాపదకు గురియయినవారిలో హిందువు లధికసంఖ్యాకులు. దెబ్బలుతిన్నవారిలో నింకనెందరు ప్రాణముల గోలుపోవనున్నవారో? అభూతపూర్వమగు నీకలహము మాట తలపునకువచ్చిన గుండె బ్రద్దలగుచున్నది. ఈకలహము లోకమారుకన్న నింకొకమారు భయంకరరూపమును పొందుట దేశదౌర్భాగ్య మనకతప్పదు. ఈకలహమునకు ధనికుడగు నొకహైందవునిసేవకులు మోహరముపండుగునాళ్లలో చలిపందిరిని పెట్టుటకయి సొమ్మును యాచింపవచ్చిన మహమ్మదీయ బాలురను బెదరించి తరుమగొట్టుట కారణమట! ఎంతగొప్పకారణమున కెంత ప్రాణనష్టము!! ఎంత ధననష్టము!!!



అల్లరులలో కొల్లపెట్టబడిన, [illegible] వస్తువుల [illegible].

అల్లరు లారంభమయినదినము మొదలు రక్షకశాఖవారు—కమిషనరులు మొదలు కనిస్టేబిలులవరకు—కలహారంగములను కాచుచుండిరి; దుండగీండ్రను తరుముచుండిరి; వారిపయి తుపాకులను పేల్చుచుండిరి. మందుమార్బందితో సైనికులు రంగమున కురికిరి. గవర్నరుగారును రెక్కలు కట్టుకొని వచ్చియక్కడవ్రాలిరి. 'కర్ఫ్యూఆర్డరు' అమలునకు వచ్చినది. వందలకొలది దుండగీండ్రు అరెస్టు చేయబడిరి. కాని అచటి ఘోరనాటకము మాత్రము ఏడుదినములవఱకును సమాప్తమయినది కాదు.

పోలీసువారు [illegible] అల్లరుల నణచుటకు [illegible] మార్గము వహించుటచేతనే అల్లరులు [illegible] జరిగినవనియు, ఇట్టి భయం[illegible] పరిణామమును జెందినవనియు [illegible] శ్యామాదాసు ఠాకూర్ దాసుగారి వంటి నాయకప్రముఖులు ప్రకటించిరి. వారి విషయమును [illegible] నాడు గవర్నరుగారికని తెలిసెకదా. కంటిని రెప్పవలె అప్రమత్తముగ ప్రజలను సంరక్షింపవలసినదికదా ప్రభుత్వము!

అల్లరులు ప్రారంభమయినది మొదలు ఉభయమతములనాయకులును కలహాముల

కావుమూపి శాంతిని నెలకొల్పుటకయి చాల ప్రయత్నించిరి. శాంతిసంఘములు, రక్షణసంఘములు స్థాపితములయినవి మౌలానా షౌకతాలీ ప్రభృతులు, మహమ్మదీయనాయకులు పలువురు [illegible] సంఘములయందు సభ్యులయిరి. వారిలో కొందరు శాంతికొరకుపవాసములును చేసిరి. ఇటీవల షౌకతాలీగారు ఉద్రేకపూరితులయి యీ క్రింది ప్రకటనము గావించిరి:

"ముసల్మానులు అల్లరుల నారంభింపలేదు. హిందువులే వాటిని మొదలుపెట్టిరి. హిందువులే అల్లరులను సాగించుచున్నారు. ఈ అల్లరులను మేము కుదురుపరచుకొనుటకు [illegible]దేండ్లు మాకు సంపూర్ణమయిన శాంతి కావలెను. ఎటులో మమ్ము శాంతముగానుండనిండు. హిందువులు మాపయిబడి అల్లరుల నారంభించిరి. హిందూపత్రికలు ముసల్మానులపయి నేరము మోపుచున్నవి. ముసల్మాననాయకులు రాత్రింబవళ్లు శాంతికొరకు పాటుపడుచున్నారు. దీనివలన ముసల్మానుల కాగ్రహము పెరుగదా! హిందూదేశమున నావలె శాంతికొరకు పాటుపడుచున్నవా రెవరును లేరని దృఢముగా చెప్పుచున్నాను. కాని ముసల్మానుల నితరులు త్రొక్కివేయుట నేను సహింపజాలను. ముసల్మానులు పరాజితులనుభావముతో నుండరాదు."

ఏమి ప్రగల్భములు! మఱియు వీరు:

"శాంతియా? మీరు కోరుశాంతి నాకక్కరలేదు. బయటకు బోయి నే చేయగలదేమో చేతును" అని బెదరించుచు శాంతిసభలోన నుండి లేచిపోయిరి. దురావేశభూయిష్ఠము లగు వీరి పలుకుల కర్థమేమి?

దేశక్షేమమునకయి పలువురు హైందవ మహమ్మదీయనాయకులు పెక్కేండ్లనుండి ఇరుతెగలవారికిని మతవిషయమున సామరస్యమును గలిగించి, యైకమత్యమును కుదుర్ప నెన్నియోవిధముల తమయావచ్ఛక్తిని వినియోగించుచున్నారు. కొందరు జీవితముల నయితము కోలుపోయినారు. వారి యమూల్య ప్రయత్నములు చాలమట్టునకు సఫలములగుచున్నవి. షౌకతాలీగారును అట్టినాయకులలోనివారే. ఈశుభసమయమున విద్వేషమును పురికొలుపు వీరిదురాగ్రహమునకు, పరాస్య దృష్టికి సంతోషము జనింపకపోదు. అసలే మానవస్వభావ మడుగంట పైకుబికిన పశువృత్తితో చరించుచున్న దుండగీండ్రకు షౌకతాలీగారి పలుకులు మరింత ప్రోత్సాహమును గలిగించి కలహములను పెరుగజేయగలవు; ఇదివరకు నిర్మితమయిన ఐకమత్యమును భగ్నము చేయగలవు; భారతజాతియెడ ద్వేషముగల వారు 'భారతదేశమున వారికి స్వరాజ్యనిర్వహణసామర్థ్య మింకను జాల' దని ప్రకటించు అర్థశూన్యమగు నపనిందకు మరింత యవకాశము నొసగగలవు.

పార్లమెంటునందు బొంబాయియల్లరుల నణచి, 'శాంతిని నెలకొలుపుటకు కాంగ్రెస్సు వాలంటీరులు తోడ్పడిరా' యని వార్డులా మిల్నీగా రడుగగా ఇండియామంత్రి హోరుగారు 'వాలంటీరులుసహాయముమాట.యటుం

డగా కొన్నిచోట్ల ఇబ్బంది గలిగించువారు నయి యుండిరి' అని జవాబిడిరి.

అల్లరులలో ధనమును ప్రాణములను కోలుపోయినవారిలోను, దెబ్బలుతినినవారిలోను అధికసంఖ్యాకులు హిందువులని ప్రభుత్వ ప్రకటనము తెలుపుచున్నది. ఇట్లగుటకు కాంగ్రెసుతత్త్వమగు నహింస హైందవప్రజల హృదయములలో లెస్సగా నాటుకొనుటయే కారణమని హోరుగారు ఎరుగజాలరు కాబోలు! కాంగ్రెసునట్ల వైముఖ్యముగలవారు నత్యమును ప్రకటింపనొల్లమి సహజము; కాంగ్రెసును, కాంగ్రెసువాలంటీరులను దూషించుటయు సహజము.

ఇపు డీకలహములు మతవిద్వేషమును పురస్కరించుకొనియే ప్రవర్తిల్లిన వను నపవాదు బయలుదేరినది. అయిన, పోలీసువారి మాంద్యమును, షౌకతాలిగారి దురావేశపూరితములగు పలుకులను, హోరుగారి కాంగ్రెసు దూషణమును ఎట్లు సమన్వయింపవలెను? కేవలము మతసంబంధమయినవేయయిన పరువిచిత్రచర్యల కవకాశమెట్లు? కావున, ఈకలహములకును రాజకీయ వ్యవహారములకును సంబంధము గలదని స్ఫురింపకపోదు.

ప్రభుత్వవైఖరి మాట యటుండుగాక! షౌకతాలీగారు భారతీయులు, గొప్పనాయకులు. ఇట్టివారు స్వార్థపరులయి దేశమునకంతకును మహాపకారముకలుగునట్లు ప్రవర్తించుట సమంజసముకాదు. వీరింతటనైన దేశముయొక్క దుస్థితిని గుర్తించి వీరు ప్రహస్వదృష్టిమూలకమయిన తమపొరపాటును దిద్దుకొని, స్వార్థదూరులయి ఇతర దేశీయనాయకులతో పాటు భారతదేశమునకు నాటిదేశములతో సమానమగుప్రతిష్ఠను గడించు తమయావచ్ఛక్తిని వినియోగించుట విధేయము.

దైవసృష్టియందు జాతిమతవిభేదములు లేవు. అవి మానవులు తెచ్చిపెట్టుకొనినవి. ఎల్లజాతులవారును, ఎల్లమతములవారును ఒక మనుష్యసృష్టికి చెందినవారు. వారికి ఎల్లవిషయములను సమానస్వాతంత్ర్యము గలదు. దీనిని గుర్తించి భారతీయులెల్లరు ఐకమత్యముతో కలసి మెలసి మెలగి భారతదేశమునకును, తమకును క్షేమమును సమకూర్చుకొనుట ధర్మము.

---

ఆంధ్రసారస్వతసంఘము, చెన్నపురి

పూర్వ మాంధ్రదేశమున ప్రభువులు, సంస్థానాధీశులు, శ్రీమంతులు, విద్యాధికులు, విద్యాభిమానులు నుండియుండిరి. వారొక్కరొక్కరు పెక్కుగురు కవులను నాగరకులను సత్కరించి పోషించుచుండెడివారు. వారి ప్రాపున వాఙ్మయము పుష్టినిజెంది అనంతముఖముల నభివృద్ధిని గాంచుచుండెను. ఇది ప్రాచీనసారస్వతచరిత్రమువలన వ్యక్తమగుచున్నది. కాలక్రమమున నాపద్ధతి మారజొచ్చినది. తరువాతిసంస్థానాధీశ్వరులకు, శ్రీమంతులకు పాండిత్యము, పండితాభిమానము తగ్గుచు వచ్చినది. రానురాను వారికి దేశాభిమానము, తుదకు ఆత్మాభిమానముకూడ సన్నగిల్లజొచ్చెనన్న దోషములేదు. పూర్వ

ము వారిసంపద ఎల్లవిధముల దేశౌన్నత్యమునకు వినియోగింపబడుచుండెడిది. ఈకాలమున నది ఎల్లవిధముల విదేశౌన్నత్యమునకు [illegible]గుచున్నది. ఇట్లు కాకుండుట [illegible]. [illegible] నాటివలెనే పండితాదరణము, విద్యా[illegible] నిట్లు సరిగా జరుగగలదు?

పండితులకు ఆదరణపోషణములు అభావముగుటచేత వాఙ్మయమునకు వికాసము లేకపోయెను. అందు దానిని యథాశక్తి పోషించి రక్షించుకొనుట ప్రజల కావశ్యకము [illegible]. పందొమ్మిదవశతాబ్ది చివరభాగమున ప్రజ లుత్సాహముతో విద్యాపోషణమునకు బూనుకొనిరి. శ్రీవీరేశలింగము పంతులుగారు మున్నగువిద్యాధికులు ప్రజల సాహాయ్యప్రోత్సాహములను గాంచి అప్పటికి [illegible] వాడిపోయియున్న ఆంధ్రవాఙ్మయవల్లరిని మరల సంకురింపజేసిరి. అట్లంకురించిన వల్లరి ప్రజల యాదరమున నే నానాట మందమందగతి నటునిటు ప్రాకజొచ్చినది. తరువాత దరువాత ప్రజాసంస్థలు కొన్ని బయలుదేరి చందాలను ప్రోగుచేసి పండితులను, వారిగ్రంథముల ముద్రించి యొసంగి యాదరించినవి. గ్రంథకర్తలకు ఎక్కుడు లాభకరములు గాకున్నను వారిగ్రంథములను కొన్నిటినేని ప్రకటించి దేశమున వ్యాపింపజేయునవి కావున 'గ్రంథమాల' లను పేరబరగునవియు, వర్తకసంస్థలయ్యును వాఙ్మయవికాసమున కుపకరించినవేయగును. ఇట్లు వాఙ్మయాభివృద్ధిని, తద్ద్వారమున యథాశక్తి పండితపోషణమును గావించుసంస్థలు ఆంధ్రదేశమున నతివిరళముగనేయున్నవి. వాఙ్మయము చక్కగా పెంపొందవలయునన్న నట్టి సంస్థ లెన్నియేని కావలెను. ఎందరో పండితులు మంచిగ్రంథములను రచియించి యున్నారు. వారికి తగిన యాదరణము చూపి వారిగ్రంథములను పైకివెచ్చువారు లేరు. ఆగ్రంథముల మాతృకలు కట్టలలో చివికిపోవుచున్నవి. ప్రకృత మేరుపాటుసనున్న విద్యావిధానాదులను బట్టి నేటిప్రభుత్వమువలన గాగల వాఙ్మయాభివృద్ధిని గుర్తింపవచ్చును.

ఇటీవలనే చెన్నపురమున 'ఆంధ్రసారస్వతసంఘము' అనుపేరున నొకసారస్వతసంఘము నెలకొనినది. దానియుద్దేశములు: "ఆంధ్రసారస్వతాభివృద్ధికయి నిరంతరము పాటుపడుచుండు పండితులు, కవులు మొదలగువారిని తగువిధమున సత్కరించి వారి ప్రయత్నములకు చేతనయినంతవఱకు తోడ్పడుటయు, నూతనగ్రంథములు, పురాతనగ్రంథములు, పత్రికలు, మొదలగువానిని ప్రచురించుటమూలముగ ఆంధ్రసారస్వతాభివృద్ధికి సర్వవిధముల స్వాయముగ పాటుపడుటయు." ఈసంఘము నుద్దేశములు చాలనున్నతములయినవి. వాఙ్మయవికాసమునకు మిగుల నుపకరించునవి. నేటికీచెన్నపురమున నిట్టి అనిదంపూర్వమగు సంఘ మొకటి యుత్పన్నమగుట సమ్మోదావహము. ఈసంఘము తనయుద్దేశము ననుసరించి వాఙ్మయసేవ ననల్పముగ గావించుచు చిరకాలము వెలయునుగాక!

---

## దేశీయపరిశ్రమాభివృద్ధి

"సర్వే గుణాః కాంచన మాశ్రయంతి"

అని యనుభవజ్ఞులగు ప్రాచీనులు చెప్పిరి. ధనము లేనియెడల వ్యక్తికిగాని, దేశమునకుగాని గౌరవము లేదు; సౌఖ్యము లేదు, అవమానము

దుఃఖము నిరంతరము దాని నంటబెట్టికొని యుండును. భారతదేశము ప్రాచీనకాలమున ప్రపంచమునందలి నాగరకదేశములకు దళమానికముగ నుండెననియు, సకలసంపదలతో దులదూగుచుండె ననియు చరిత్ర చాటుచున్నది. నాడేకాదు; నేడును భారతదేశ మట్టిదే యగుటకు సంశయము లేదు. కాని నిర్బంధదాస్యమునదగుల్కొని సాటిదేశములగొన్నిటి యవమతికి నేడు లక్ష్యమయినది. వెనుకటి సంపదలన్నియు క్రమముగ విదేశీయులపాలు కాగా దారిద్ర్యము దేశీయులకు మిగిలినది. చివరకు నిలువతాకిన యీదారిద్ర్యముతోపాటు దాస్యమును 'భారతీయులు పనికిమాలినవా' రనుస్థితికి దెచ్చిపెట్టినది. ఒరులు వీరితలలపయి బెట్టినవి కొన్ని, తామే తెచ్చిపెట్టికొనినవి కొన్ని, ఈరెండిటివలన తమంతసంప్రాప్తము లయినవి మఱికొన్ని దీనికి గారణములు. ఇపుడు వానిచర్చ యప్రస్తుతము; దారిద్ర్యమును, దాస్యమును తొలగించుకొనుటయే వాంఛనీయము. దీనికి తొలుత దేశాంతరముల పాలగుచున్న సంపదను అరికట్టవలెను. దేశీయ పరిశ్రమాభివృద్ధి వలన నది నెరవేరవలెను. ప్రకృతమున భారతదేశ మొకవిధముగ పరిశ్రమల నిర్వహింపగల సామర్థ్యమును గడించుకొనినది. కాని వానికి తగిన ప్రోత్సాహము మాత్రము లేదు. ఒకవంక అనాగరకుల అవివేకము, ఇంకొకవంక నాగరకులవైదేశిక వ్యామోహము స్వదేశపరిశ్రమలను తలయెత్తనీయకున్నవి.

'స్వదేశీదీక్ష' అనుపేరున సమదర్శిని (౨౫-౫-౧౯౩౪) పత్రికయందు గుంటూరు సేవాసమితివారు ప్రకటించిన వ్యాసమొక్కటి ప్రజలకు చక్కని ప్రబోధమును గావించుచున్నది. అందు దేశీయులకు స్వాతంత్ర్యమును, ఆత్మశక్తి, తొలుత నెరుగవలెను. అంత ప్రకృతము భారతదేశమును ముట్టడించియున్న దారిద్ర్యస్థితి చక్కగా వివరింపబడి దానిని దొలగించుటకు ధనము నార్జింపవలెనని యిట్లు చె[illegible]బడెను:

"సర్వసౌఖ్యముల కాధారము [illegible] దైవభక్తిని తిరస్కరించి కేవలము ప్రకృతిప్రసాదము మీదను, మానవప్రతిభమీదను ఆధారపడియున్న నేటి ప్రపంచములో ద్రవ్యము లేనివాని ప్రాణమునకు విలువ కొరకదు. పెల్చుటకు గాలి దొరకదు.

"కులము గలుగువారు గోత్రంబు గలవారు
విద్యచేత విర్రవీగువారు
పసిడిగల్గువాని బానిసకొడుకులు..." (వేమన)

ఆ ద్రవ్యమువలననే నేడున్న మొన్న [illegible] కా సర్వప్రపంచములకు ఋణదాతయై [illegible] శాలినియై తేజరిల్లుచున్నది. ద్రవ్యలాభము కూర్చుండి తపస్సుచేసిన రాదు. వేదములు వల్లెవేసిన రాదు. కష్టపడి చేయవలెను. దేహమనశ్శక్తులను వ్యయము చేయవలెను; శ్రమపడవలయును; పరిశ్రమలు వృద్ధిచేయవలెను. డొక్కలు పడిపోవునట్లు తోడిన రెండుగుక్కలు నీళ్లు రావే. "పరిశ్రమ" చేయనిది ప్రపంచాధారమగు లక్ష్మీకటాక్షము లభించునా?"

తరువాత భారతీయుల సోమరితనమునకు దృష్టాంతముగ

"సృష్ట్యాదినుండియు వస్త్రధారణము ప్రకృతియాజ్ఞవలన తప్పనిదిగదా? తమచేతితో నాటిన విత్తునుండి తమచేలలో పండినప్రత్తిని బట్టగా నేసికొనుటకు బద్ధకించి పరులచేతులలో పోరవైచినారు. తమప్రత్తిలో నేసహస్రాంశమునో విదేశీయులు వస్త్రరూపమున సిద్ధము చేసి యీయగా— ఉన్నసొత్తంతయు నూడ్చియిచ్చి

పూది కొని కట్టుకొని కులికెడివారు. ఆహా! తమపదార్థమునే యేపైసకో పరులుకొట్టుకొనిపోయి తిరిగి తమచేతులే వేయిరూప్యములకో విక్రయింపగా తలవాల్చుకొని గ్రహించుటకు సిద్ధమయ్యెడివారు."

అని దేశీయ నిరూపణము చూపబడెను.

స్వదేశమున నుత్పత్తిచెందినవస్తువులను ప్రజలెల్లరు వాడుకొనునట్లు పురికొల్పి పరిశ్రమలను పైకితెచ్చు తలంపున దేశముసంతటను 'హై ఇండియనులీగులు', 'స్వదేశీవస్తు ప్రదర్శనములు' కొల్లలుగా బయలుదేరినవి. ప్రముఖులు ఉపన్యాసములతో దిక్కులు మారుమ్రోగించుచు ప్రచారము చేయుచున్నారు. ఏతన్మాత్రమున పరిశ్రమలు అభివృద్ధి నందజాలవు; దేశదారిద్ర్య మంతరింపబోదు.

"శోభనపత్రముల అర్థము చేసికొని, స్వదేశపరిశ్రమల అభివృద్ధివలన దేశమునందలి నిరుద్యోగుల సంఖ్య యెంతగా తగ్గిపోవునో దేశదారిద్ర్య మెంతగా క్షీణించునో సంతృప్తి సౌఖ్యము లెట్లభివృద్ధి జెందునో యోచించి ప్రత్యేక నిర్బంధముగ నిత్యవ్రతముగ అకలంకదీక్షతో స్వదేశవస్తువులనే కొని ఉపయోగించుచు కొనిపించి ఉపయోగింపజేయువాడే నిజమైన విజ్ఞానశాలి— నిజమయిన దేశబంధువు— నిజమైన మానవుడు."

ఈ మాటలయందలి సత్యమును ప్రతిభారతీయుడును గుర్తింపవలెను. తదనుసారము నడుచుకొనవలెను. అట్లెల్లరు గట్టిదీక్షను బూనిననాడు భారతదేశము భాగ్యవంతమగుటకు సందియము లేదు. ఇందువలన

"స్వదేశవస్తువుల అమ్మకము వృద్ధిజెందినచో నిర్మాణశాలలును యంత్రాగారములు నభివృద్ధి జెందును గదా? వానితోపాటు అచ్చటి పనివారల ఉద్యోగులసంఖ్యయు పెరిగిపోవును గదా— అంతట నిరుద్యోగ పిశాచము పారిపోయి భిక్షుకవ్యాపారము పేరులేకుండబోయి ముప్పదిమూడుకోట్ల భారతీయులును చేతినిండ పనియు, పొట్టనిండ తిండియు, హృదయమునిండ సంతృప్తియు గలిగి కడుపు చల్లగా జీవింతురు.

యంత్రాగారములు మిల్లులు మొదలగువానియందలి పనివారుగాక మఱి వేనవేలమందికి ఎక్కువగా పని గల్పించెడి చేతిపను లెన్నో యున్నవి. రాటము, చేతిమగ్గములు, నెమలి అల్లికలు, కుట్టుపనులు, చాపనేతలు, వీనివలన మనదేశములో పేదరిక మనుమాటకు చోటే లేదు."

ఈవాక్యములు సత్యసంబద్ధములు.

ప్రకృతము దేశమున సాగుచున్న పరిశ్రమలు భారతీయుల నిత్యజీవనమున కావశ్యకములగు పరికరములను సమకూర్చుచున్నవి. కొనువారు లేకపోవుటచేత వానిలో కొన్నింటివెల ప్రజాసామాన్యమున కందుబాటు గాకున్నది. వస్తువుల వాడుక ఎక్కువయినకొలది ఉత్పత్తిఎక్కువకాగలదు. అపుడవి చౌకగా లభింపగలవు. ఉన్నవాని విశేషప్రచారము క్రొత్తవాని పుట్టుపునకు దారితీయును. ఈవిషయములను సవిమర్శముగా కొంతమేర చర్చించిన పిదప పైవ్యాసమున ప్రకృతము పరిశ్రమలవలన లభించువస్తువులిట్లు పేర్కొనబడెను:

"వస్త్రమును-రాటములపై చేతిమగ్గములపై తయారగుదానిని - ఖద్దరును - యెరుగని భారతీయుడు లేడు. దానితోపాటు, అది కొనుటకు శక్తిలేని నిరుపేదలగు కూలివారు మొదలగువారికొరకు స్వదేశీమిల్లులనుండి వస్త్రము తయారగుచున్నది.— ఈ రాటపుదారమే మన దేశపు భాగ్యలక్ష్మికి ప్రాణతంతువు. మన యొడలిమీదను యింటిలోను మన దేశమునందేమూల నయినను ఆ వస్త్రముమాత్రమే బ్రతికియుండవలెను. వస్త్రము తరువాత వివిధవస్తువులు చూడుడు. పేరెక్కిన "స్టార్ ఆఫ్ ఇండియా" వారి పెన్సిళ్లు దేశమంతయు తెలిసినవి. కలములు, కత్తులు, లాంతరులు, చిమ్నీలు మొద

లనునవన్నియు ఆగ్రాలోని "దయల్‌బాగు"నా [illegible]ముగ తయారు చేయుచున్నారు. సబ్బులకు మైసూరు ప్రపంచప్రసిద్ధి గాంచుచున్నది. కాగితము కావలసినంత కలకత్తా, రాజమండ్రి మొదలగుచోట్ల [illegible] లేకుండ దొరకుచున్నది. సిరాలు మన తెలుగు దేశపు తెనాలిలోనే [illegible]వంతములై వెలువడుచున్నవి.

గొడుగులు, చెప్పులు, గ్లాసులు, సీసాలు, [illegible]లు, తాళాలు, అద్దములు, దువ్వెనలు, తలగూడెలు, [illegible]లు, బిస్కట్లు, సెంట్లు, సంఖ్లపొడులు, బూట్ల లేసులు, ఆఖరుకు, ఫేస్‌పౌడర్లు, అన్ని మీకేది కావలసిన అవి, స్వచ్ఛముగ స్వదేశపు పనివాండ్రచే స్వదేశములో స్వదేశి వస్తువులతో తయారైనవి ప్రతినగరమునందును ఇప్పుడు లభించుచున్నవి. స్వదేశపదార్థమే కొనితీరెదమని ప్రతిజ్ఞ దాల్చినవారికి వస్తువులకు లోపము లేనే లేదు."

ఇవియే కావు. ఇంకను ఎన్నియో వస్తువులు తయారగుచున్నవి. దేశదారిద్ర్యమును తరిమివేయుటకయి యిక కావలసినదేమి ?

"స్వదేశపరిశ్రమలను ప్రోత్సహించి స్వదేశవస్తువులను కొని వాని యుపయోగమునుగూర్చి తెలియని గ్రామవాసులకు బోధించి— స్వదేశీయుల కడుపునింపి కూడుబెట్టి మన ప్రకృతస్థితి నభివృద్ధి చేసికొనుట మన మిపుడిప్పుడు చేయవలసిన పని. అది మన వ్యక్తి ధర్మము. క్షణమైనను విడిచియుండదగినది కాదు. స్వదేశీ దీక్షాబద్ధకంకణులై నేటినుండి నడుముకట్టవలెను."

---

## మృతజీవి

సార్థక్యములేని సంపద ప్రాణములేని శరీరము. తమ సంపద నిహపరముల రెండింట వినియోగించువా రుత్తములు; ఐహికవిలాసములమాత్రము వినియోగించువారు మధ్యములు; లుబ్ధాగ్రేసరులయి దాని నిహపర దూరము గావించువా రధములు. ఇం దుత్తములు మరల నిరుతెరగుల బరగుదురు. తాము చేయు సత్కార్యములు [illegible] [illegible] కాని [illegible] కాలమునకు [illegible] జరుగునట్లు [illegible] చేసికొనుట [illegible]. [illegible] కము, [illegible]. [illegible] [illegible] [illegible] కొన్ని [illegible] శాశ్వతత్వమును [illegible] కాలమున [illegible] [illegible] చేసికొనుట [illegible]. ఇది నిదర్శనము; [illegible]. సత్కార్యప్రవర్తకులగు శ్రీ [illegible] సంపన్నులు [illegible] [illegible] [illegible]పవలయును.

కీ. శే. నేలటూరి [illegible] శాస్త్రిలుగా రీపద్ధతి నవలంబించినారు. శ్రీ శాస్త్రిగారు రాజమహేంద్రవరవాసులగు గొప్ప శ్రీమంతులు. [illegible] తేండ్లవయసుననే కీర్తిశేషు లయినారు. వీరు తమ జీవితకాలమును సుఖముగ గడుపుకొని తమ సంపదకు సద్వినియోగమును గల్పించి వానికి శాశ్వతత్వమును సమకూర్చి సార్థకముగ కీర్తిశేషులయిరి. వీరు కావించిన సత్కార్యములు యనుక్రమము వీరి [illegible] నిదర్శనము.

తొలుత మానవునకు ప్రాణాధారమయినది [illegible] కావశ్యకమయినది యన్నము. అన్నపానా[illegible] నార్థము ధర్మసత్రము నొకదానిని స్థాపించి దాని జరుగుదలకు సుమారు నూరు ఎకరములు భూమి నొసగినారు. తరువాత మానవుని సుఖజీవనమున కారోగ్య మావశ్యకము. దీనిని

[illegible]నుకూలపడుటకయి సుమారు ఇరువదియైదు [illegible]ములు భూమి నొసగి రాజమహేంద్రవర [illegible]లయమున నాసౌకర్యమును కల్పింప [illegible]టుచేసినారు. పిమ్మట ఉత్తమజీవనము [illegible]కు మనుజునకు విజ్ఞాన మావశ్యకము. దానిని [illegible] డుగునది విద్య. తదర్థము సుమారు [illegible] ఎకరముల భూమి నిచ్చి ఆకార్యనిర్వహ[illegible]మును ఆంధ్రవిశ్వవిద్యాలయమువశము కా[illegible]. ఇవి లోకోద్ధరణకార్యములు. ఆత్మో[illegible]నమునకయి దేవాలయముల నిర్వహణము [illegible]కు సుమారిరువది ఎకరములభూమి నర్పిం[illegible]. [illegible]శేషము ఆత్మీయులకు పంచిపెట్టిరి. [illegible]మునుచేయువారు పెక్కు రుందురు. [illegible] యుక్తి గలిగి దానికి శాశ్వతత్వమును గలిగించు శాస్త్రినంటివా రరిది. ఈయుత్తముని [illegible] యాంధ్రదేశము ధన్యము. ధన్య[illegible]నుజీయు[illegible]ము. ఈయుత్తముడే మృతజీవి.

[illegible]మూలమున నీయేరుపాటును భగ్నముగావించు ప్రయత్నము గలదనువార్త [illegible]. అది ధర్మద్రోహము, దేశద్రోహము, ఆత్మద్రోహము.

"స్వదత్తాం పరదత్తాంవా
యో హరేత వసుంధరామ్;
షష్టిర్వర్ష సహస్రాణి
విష్ఠాయాం జాయతే క్రిమిః."

అన్నారుకూడ పెద్దలు.

---

**ఆంధ్రవిశ్వకళాపరిషత్తు**

ఆంధ్రవిశ్వకళాపరిషత్తు సిండికేటు సభ్యులగు శ్రీమాగంటి బాపినీడుగారు పత్రికావిలేఖకునితో మొనమొన్న విశ్వకళాపరిషత్తు పరిస్థితులనుగూర్చి సంభాషించిరి. అందు

"ఈ విశ్వవిద్యాలయము ప్రజలలోని ఏకొలదిమందికో మాత్రమే ఉపయోగపడుచున్నది. సామాన్యజనులలో నూటికి తొంబదిఎనిమిదిమందికి దానితో నెట్టిసంబంధమును లేకున్నది. అందుచే దానిని జనసామాన్యమునకు ఉపయోగపడుచున్నట్లు చేయుటయేకాక మనోరంజకమయిన యుపన్యాసములను వ్యవసాయశాస్త్రాభివృద్ధికిని, తెలుగుభాషను అభివృద్ధిలోనికిదెచ్చుటకును ఏర్పాటులు చేయుచుండవలెను. అన్నిటికంటె ముఖ్యముగా తెలుగుభాషలోనే విద్యగరపు ఏర్పాటులను చేయవలెను." అను నీవాక్యము లేక దేశము. ఆంధ్రజనులలో నూటికి తొంబదఎనమండుగుర కుపకరింపని ఆంధ్రవిశ్వకళాపరిషత్తువలన ప్రయోజన మత్యల్పమే యగును. వ్యవసాయము ప్రధానజీవనోపాయమయిన యాంధ్రదేశమున ప్రజాసామాన్యమునకు వ్యవసాయశాస్త్రమునుగురించి మంచిపరిచయము గలుగుటకయి తచ్ఛాస్త్రమున సమర్థులగువారిచేత నుపన్యాసముల నిప్పించవలసియుండు టావశ్యకము.

ఇక ఆంధ్రమున విద్యను గరపునేర్పాటు కావలెనను నుపపాదనము వెనుక నొకమారు సిండికేటులో రాగా దానిపయి పెద్దచర్చ జరిగి తుదకు దానిని సిండికేటు అంగీకరింపకపోయెను. ఎపుడేని ఆంగ్లభాష నానుషంగికముగా నొనరించి, ఆంధ్రమునకు ప్రాధాన్యము నొసంగి, బోధనము నాంధ్రమున గావించునాడు ఆంధ్రవిశ్వకళాపరిషత్తు నాంధ్రత సార్థకము కాగలదు. విదేశముల విశ్వవిద్యాలయములయందు తత్తద్దేశముల మాతృభాషకే ప్రాధాన్యము

గాదా. భారతదేశమునకుమాత్ర మట్టి భాగ్యము [illegible] నావరించియున్న దాస్యమహిమ!

కావున విశ్వకళాపరిషత్తు శ్రీ బాపినీడు గారి సలహాల ననుసరించి పై రెండు విషయములకు తగినట్లు విద్యాప్రణాళిక గుదుర్చుకొని దేశాభివృద్ధిని, భాషాభివృద్ధిని గావించునుగాక!

---

## 'ఆంధ్రచరిత్రచతురానన' సమ్మానము

—ఆంధ్రులచరిత్ర

చిరకాలముక్రిందటనే ఆంధ్రులచరిత్రను రచియించి దేశమునకు కన్నులను దెరపించి మిగుల ప్రసిద్ధినిగన్న వారు శ్రీయుతులు చిలుకూరివీరభద్రరావుగారు. [illegible] ఆంధ్రులచరిత్ర సకలాంధ్రజనామోద[illegible] [illegible] ఆంధ్రమహా[illegible] ఆంధ్ర[illegible] గౌరవబిరుద[illegible] నొసగి [illegible] సన్మానించినది. [illegible] 'ఆంధ్ర[illegible] సభ నుగూర్చి [illegible] సన్మానించినది. ఈసమ్మానమువలన సంఘోద్దేశము నెరవేరుటయేకాక, చెన్నగరమునాంధ్రులకు, చెన్నగరమునకు నూతనప్రతిష్ఠయు లభించినది. ఈసమ్మానము యీసంఘమొనరించిన ప్రప్రథమమగు నుత్తమకార్యము. దీనిని చక్కగా నిర్వహించిన యీతత్సంఘకార్యనిర్వాహకసంఘమువా రత్యంతము నభినందనార్హులు. 'ఆంధ్రసారస్వతసంఘము' పూనిన ఈసమ్మానకార్యకరణపరిశ్రమ సార్థకముగా శ్రీవీరభద్రరావుగారి యాంధ్రులచరిత్ర పునర్ముద్రణము కానున్నది. ఇప్పుడు వెనుకటి నాలుగు సంపుటముల సంస్కరణ, విషయవికాసములవలన పదిసంపుటములు కానున్నవి. ధనబాహుళ్యముచేత కావలసిన వీని ముద్రణప్రచురణముల కొఱకు యుపసంఘ మాంధ్రసారస్వతసంఘము సంఘటింపజేసినది. దీని పేరు 'ఆంధ్రచరిత్రప్రచురణసంఘము.' దీనికి సమ్మానసంఘమున కధ్యక్షతవహించిన శ్రీపిఠాపుర సంస్థానాధీశ్వరు లధ్యక్షులు; శ్రీన్యాయమూర్తి వేపారామేశముగారు ఉపాధ్యక్షులు; చెన్నపురనివాసులగు నాంధ్రప్రముఖులు. పెక్కండ్రు సభ్యులు. ఇట్టివారు పూనిన యీమహాకార్యము తప్పక నెరవేరగలదు. మరల నతికాలమున నాంధ్రులకు తమచరిత్ర సమగ్రముగ లభింపగలదు. దీనివలన చరిత్రచతురాననుల నామమును, ప్రచురణసంఘము నామమును భావిచరిత్రపత్త్రములను సువర్ణమయములను చేయగలవు. ఈవిధముగ దేశమునకు, వాఙ్మయమునకు నుపకృతి గావింప దొరకొనిన ఆంధ్రసారస్వతసంఘము సర్వాంధ్రలోకాదరణపాత్రమయి ఇతోధిక దేశ, వాఙ్మయ సేవ కావించుచు చిరకాలము వెలయునుగాక!

---

Printed and Published by C. Seshagiri Rao, B.A., at the Andhra Patrika Press, No 7, Thambu Chetty St., Madras
Editor: G. Subbaramayya.